ఉస్మానియా విశ్వవిద్యాలయ
పిహెచ్ డి పరిశోధన గ్రంథం

# కరీంనగర్ జిల్లా తెలుగు సాహిత్య చరిత్ర

(క్రీ॥ శ॥ 0950 - 1995)

డా॥ మలయశ్రీ

సత్యార్థి పబ్లికేషన్స్,
కరీంనగర్ - 505001, ఆంధ్రప్రదేశ్

నవ్య సాహిత్య పరిషత్ ప్రచురణ

నవ్యసాహిత్య పరిషత్ కరీంనగర్ బుక్ నం 5

# కరీంనగర్ జిల్లా తెలుగు సాహిత్య చరిత్ర

రచయిత
**డాక్టర్ మలయశ్రీ**, ఎం ఏ ఎం ఓ ఎల్ పిహెచ్ డి

రచన కాలం **1990-95**

మొదటి ప్రచురణ **డిసెంబర్ 1997**

ప్రతులు **1000**

**వెల రూ 295-00**

ప్రతుల కోసం
**1 విశాలాంధ్ర, పబ్లిషింగ్ హౌజ్, హైద్రాబాద్, మరియు ఇతర శాఖలు**

**2 డాక్టర్ మలయశ్రీ**, రచయిత
ఇ నెం 5-1-301 ఎల్ ఐ సి బిల్డింగ్ కోరుట్ల - 505 326 ఫోన్ 52161

**3 ఎస్ హర్షవర్ధన్**, బి కాం, బి ఇడి
ఇ నెం 3-4-31, కె కె హాస్పిటల్ ఎదురుగా
సివిల్ హాస్పిటల్ రోడ్డు, కరీంనగర్ - 505 001

**(ఈ పుస్తక ముద్రణకు తె వి వి హైద్రాబాద్ విస్తరణ సేవావిభాగం వారిచే 1995-96 సంవత్సరంలో రూ 7500 (ఏడువేల అయిదువందల రూపాయీల సహకారం లభించింది )**

కవర్ డిజైన్ **జయశ్రీ గ్రాఫిక్స్**, జగిత్యాల ఫోన్ 22357

డి టి పి **ఫాంట్ లైన్ గ్రాఫిక్స్**, బాగ్‌లింగంపల్లి హైద్రాబాద్ ఫోన్ 7660000

ప్రింటర్స్ **అనుపమ ఆఫ్‌సెట్ ప్రింటర్స్**
శాంతినగర్, హైద్రాబాద్ - 28 ఫోన్ 3391364



Artist Mr P T Reddy



# అంకితం

అనుపమ విదుషీమణి సాహితీ రంగ యశస్విని
శ్రీమతి (డాక్టర్) పి యశోదారెడ్డి
అమర శిల్పి - చిత్రలేఖన లలిత కళా తపస్వి
శ్రీయుతులు (కీ॥శే॥) పాకాల తిరుమల రెడ్డి
ఆదర్శ దంపతులు - మా 'పిన్నిబాబాయ్' గారలకు
అభిమానంతో అనురాగంతో ఈ గ్రంథాన్ని
అంకితం ఇస్తున్నాను !

— రచయిత

**ఆమె !**

పుట్టినది మహబూబ్‌నగర్ జిల్లా బిజినేపల్లిలో
మెట్టినది కరీంనగర్ జిల్లా అన్నారంలో
రెండూ పల్లెటూళ్ళే కాని,
ఆమె చదివినది ఉద్యోగం చేసినది -
ప్రస్తుతం నివసిస్తున్నది - మన రాష్ట్రరాజదానిలో అయినా -
పల్లెసీమల-పరిసరాల, ప్రకృతి అందాలను-పలుకు చందాలను
పల్లెటూళ్ళ శ్రమజీవన సౌందర్య సౌబాగ్యాలను
పల్లెవాళ్ళ అమాయకతా ఆప్యాయతలను రీతినీతులను
ఆ అనుబవాల అనుభూతులను ఎదలోపదిలపరచుకొని
అపూర్వంగా రాసి రాశిపోసి వాసి గాంచారు
పడతులకు పరదాలువేసి, వంటింటి కుందేళ్ళను చేసి
చదువులు పదవులు వద్దని, ఆంక్షలు విధించి
అదుపు ఆజ్ఞల పంజరాల్లో బందీలుగా ఉంచిన కాలంలో
ఆ అడ్డంకులన్నింటినీ అదిగమించి
బాల్యాన పల్లె బడికెళ్ళి, తర్వాత పట్నాన చదివి,
బాగ్యనగరం కాలేజీలో చేరి, అంతటితో చాలనుకోక
ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఆమె
ఎం ఏ తెలుగులోనే కాక సంస్కృతంలోనూ సాదించి
పిహెచ్ డి పరిశోధన గ్రంధరచన కావించి
అదే యూనివర్సిటీలో ఉపన్యాసకురాలై రీడరై
ప్రొఫెసర్ కావటం వరకు ప్రొఫెషనల్ టాలెంట్ !
ఇది ఒక కోణం, మరో కోణంలో
ఆమె రచయిత్రి కవయిత్రి-వక్త-వేత్త
అకాడెమీలకు సలహాదారు సెమినార్లకు అధ్యక్షురాలు
ప్రౌఢ ప్రబంధాల సమీక్షల నుండి
ప్రాచీన కావ్యాల పరిష్కారాల నుండి
పెద్దలకు విజ్ఞాన ప్రసంగాలు - రేడియో ప్రసంగాలు
(మాలచ్చిమి-ఎచ్చెక్క కథలు, ఊరబావి ముచ్చట్లు)
పిల్లలకు చక్కని కథలు (నక్కబావ, బడిపెద్ద మొ వి)
విద్యావంతులకు కథలు వ్యాసాలు
విద్వాంసులకు సాహిత్య విమర్శలు-సమీక్షా గ్రంధాలు
విలువగా పలువెలయించిన-వెలువరించిన విదుషీమణి,
అన్నింటికి మిన్నగా, ఆంధ్రప్రదేశ్
అధికార భాషాసంఘానికి అధ్యక్షురాలిగా రాణించారు,
ఆమె డాక్టర్ పి యశోదారెడ్డి గారు !

**అతడు !**

చిత్రలేఖనంలో మేటి
శిల్పకళలో తనకు తానే సాటి
రైతింట పుట్టినా హలం ముట్టలేదు, కలం పట్టలేదు,

ముట్టింది కుంచెను, పట్టింది ఉలిని,
చిత్రించింది ప్రకృతిని, శిల్పించింది విశ్వ ఆకృతిని
ఎన్ని చిత్రాలు-ఎన్ని శిల్పాలు, ఎన్ని రంగులు-ఎన్ని హొరంగులు
సంప్రదాయానికి ఆదునికతకు
సంగమస్థానం ఆయన కళాహృదయం!
సకల విధ కళాకృతులకు నిలయం ఆయన గృహం
తైల జల బహువర్ణ-ఏకవర్ణ రేఖాచిత్రాలు
శిలా మృత్తికా సిమెంట్ దారుశిల్పాలు వారి బవనంలో
వందలు వేలు - నభూతో న బవిష్యతి!
ఆయన ఆంధ్రప్రదేశ్ లలితకళల అకాడెమీ అద్యక్షులు
అంతేనా- ఆలిండియా ఆర్టిస్ట్స ఫోరం ప్రెసిడెంట్
దేశవిదేశాల్లో చిత్రశిల్ప కళా ప్రదర్శనలతో ప్రఖ్యాతిగన్న
ఆధునిక అపర (బారత) పికాసో
ఆ మహనీయ కళామూర్తి కీర్తిశేషులు
ఆయనపేరు పాకాల తిరుమలరెడ్డి !
ఆమె+ఆయన = వారు !
డా యశోదా పి టి రెడ్డి గారల పరిణయం
సాహిత్య శిల్పచిత్రకళారంగాల సంగమం !
అరువదేండ్లకు పైబడిన కాలం వారు
అన్యోన్యానురాగంతో జీవించారు ఆనందించారు
ఆయన కీర్తిశేషులు 1996లో
ఆమె శ్వాసిస్తున్నారు ఆయన స్మృతులను
ఆమె జీవిస్తున్నారు సఫలం చేయడానికి పతి ఆశయాలను-
అందుకే హైదరాబాద్ నారాయణగూడా, దీపక్‌మహల్ ఎదురుగా
అందమైన మూడంతస్తుల విశాలమైన వారి నివాస భవనం
ఆర్ట్‌గ్యాలరీ 'సుధర్మ కళాక్షేత్రం' మ్యూజియంగా అవతరిస్తున్నది!
లలిత కళలైదింటిలో వారింట లేనివి రెండు-నాట్యం-సంగీతం,
అక్షరాలు యశోదగారి నాలుకపై నాట్యంచేశాయి!
వర్ణాలు తిరుమలరెడ్డి గారి కుంచెలో సరిగమల సరాగాల రాగాలు తీశాయి
ఆ దంపతుల జీవితం సంపూర్ణ లలితకళల సంగమం
వారి 'అన్నారం' మా 'చెంజర్ల'కు సమీప గ్రామం
రెంటిదీ ఒకే మండలం 'మానాకొండూరు'
ఉభయులమూ కర్షక కుటుంబాల వాళ్ళం
సాహిత్య కళా సాహిత్యమార్గాల్లో సాగుతున్న వాళ్ళం
మాన్యులు డా పి యశోదా తిరుమలరెడ్డి గారలకు- అంటే
మా పిన్ని బాబాయి గారలకు
సామాన్యుడనైన నేను అసామాన్యమైన అభిమానంతో
సానురాగ పురస్సరంగా ఈ సాహితీ గ్రంధాన్ని
సమర్పించుకుంటున్నాను

డా॥ మలయశ్రీ

డాక్టర్ (శ్రీమతి) పి యశోదారెడ్డి,
'సుదర్మ' 3 4 574, నారాయణగూడ,
హైదరాబాద్-500 029 (అం ప్ర )
ఫోన్ 7561866

తేది 27-11 1997

# శుభాశీస్సులు

మలయశ్రీ మంచివాడు మంచి మనస్సున్నవాడు మానవతావాది 'కలడు కలండన్నవాడు కలడో లేదో?' ఆ కలతలేల? కళ్ల ఎదుట వున్నవాడి కన్నీరు తుడువు! అనే సిద్ధాంతాన్ని జీర్ణించుకునే ప్రయత్నంలో వున్నవాడు వృత్తితో, ప్రవృత్తితో, సాహిత్యపు పొత్తు తప్పనివాడు ఆ క్షేత్రంలో, నిత్యశ్రామికుడు, పంటమీ ముందున్నది 'ముంజేతి కంకణానికి అద్దమెందుకు?'

అనుబవం నేర్పిన పారం చదివినవాడు లోకపు పోకడలు తెలిసి నడువనేర్చిన వాడు వరుసలు కలిపి అందరినీ ఆప్యాయంగా పలుకరించే చొరవ కలవాడు అందుకే అందరికీ దగ్గరివాడు "స్వేస్వే కర్మణ్యభిరత సంసిద్ధిం లబతే నర "

మలయశ్రీగారితో మాకున్న పరిచయం మొన్న మొన్నటిదే, అయినా - ఆయనకు మా దంపతులపై వున్న అభిమానం యింతంత అనరానిది బహుశ అది 'మా జిల్లా' అనే అనుబంధం కావచ్చు, మట్టి వాసన బలీయం కదా! ఉన్నట్టుండి ఒకనాడు మా యింటికి వచ్చి 'అమ్మా! యశోదారెడ్డి గారూ! మీ యిల్లు ఎటు చూసినా సాక్షాత్కరించిన కళావైభవంలా కనువిందు చేస్తూ నాకు ఆనందాన్ని కలిగిస్తున్నది నిరాడంబరులు ఆ కళాతపస్వి శ్రీ పి టి రెడ్డి గారిని, సంపూర్ణ సరస్వతీమూర్తిని మిమ్ము, ఈ సర్వకళా నిలయాన్ని చూసిన తర్వాత నా "కరీంనగరు జిల్లా సాహిత్యచరిత్ర"ను మీ దంపతులకు అంకితం చేయాలనిపించింది ఇస్తున్నాను, కాదనవద్దన్నాడు ఆ మాట విని కొంత సందేహించాను చిన్నగా నవ్వుతూ 'మలయశ్రీ గారూ! అలంకృతమైన ప్రాసాదంలా కనిపించే యీ సుధర్మబవనాన్ని చూచి, మీరు పొరపడి వుండవచ్చు, ఈ కళానిలయం, కాబోయే మ్యూజియం, మా యావదాస్తినీ, సంపాదనా సర్వస్వాన్ని పొదుగా చేసి, అజస్రమైన కృషిరూపంలో స్రవించే ఆయనరక్తాన్ని నీళ్లుగా పోసిపెంచుతున్న పెరిటికల్పకం దీని సంరక్షణ కోసం మేమే భిక్షాపాత్రపట్ట వలసివుంది మీకేమి ఇవ్వగలం? ఎవరైనా మంత్రివర్యులూ, సంపన్నులూ, హోదాలో వున్న వారికి గానీ, ఇంకెవ్వరికైనా గానీ యిస్తే ఆర్థికంగా మీకు కలసి వస్తుంది, ప్రచారం లభిస్తుంది, ఇది మీ శ్రేయస్సుకోరి చెబుతున్నాను' అంటూ చెప్పి, వారి మెత్తని మనస్సును నొప్పించినట్లున్నాను !

వెంటనే వారు స్పందిస్తూ "అమ్మా! మీరు నన్ను తప్పుగా అర్థం చేసుకుంటున్నారు ఏదో లబ్ధి కోసం నేనా మాట అనలేదు కళాసాహిత్యాలు రెండూ ఒకే ఊపిరిగా జీవిస్తున్న మీ ఆదర్శ దంపతులకు అభినందన రూపంలో యిచ్చే అక్షరబహుమతి ఈ కృతి" అన్నారు దాంతో తప్పిదాన్ని మన్నించుమన్నంత భావం ముఖంలో ప్రకటిస్తూ 'సరే! మీ యిష్టం' అన్నాను చుట్టరికానికి గట్టిముడి పడింది మలయశ్రీ నన్ను 'చిన్నమ్మా!' అంటాడు నేను 'బాబూ!' అంటాను అందుకే ఈ ఏకవచన ప్రయోగం తప్పలేదు

ఈ కృతి స్వీకృతికి ఆమోదించి ఆ కళామూర్తి సౌభాగ్యవతిగా పేరు మోసిన నన్ను పరమ దయనీయ స్థితిలో ముంచుతూ ఇప్పుడు నాకు తెలియనిలోకాలకు వెళ్లిపోయారు అయినా ఎక్కడ చూసినా తనమయంగా వెలుగుతూన్న కళాఖండాలు మోడులాంటి నన్ను తిరిగి ప్రాణవంతం చేస్తూవుంటే ఏవో రెండు మాటలు వ్రాయడానికి సాహసిస్తున్నాను

మలయశ్రీ రచనల రాశిపెద్దది ఆ రచనలు వివిద ప్రక్రియల్లో వివిధ రూపాల్లో సాగినవి ఆ సాహిత్యాన్ని అంతా చదివి విశ్లేషించి, ఆచి, తూచి అంచనా చేసి విలువలు కట్టడం యిప్పుడు నేను చేయవలసిన

పనికాదు బహుభాషావేత్తలూ, విద్వాంసులూ, వ్యుత్పన్నులూ, సాహితీ విద్యారహస్య వేదులైన విమర్శకులు చేయవలసిన పని చివరకు పారకులే ప్రమాణం !

ఈ 'కరీంనగర్ జిల్లా వెయ్యేండ్ల తెలుగు సాహిత్య చరిత్ర'ను పరిశీలిస్తే విషయ సేకరణకు రచయిత చూపిన శ్రద్ధాసక్తులూ, పడిన శ్రమంతా అవగతమౌతుంది ఈర్ష్యాసూయలు విడిచి, వ్యయప్రయాసలకు వోర్చి, మారుమూల ప్రాంతమైనా సరే, జిల్లాలోని ప్రతివూరూ, ప్రతి కడప త్రొక్కి, సాహిత్యక్షేత్రంలో ప్రథిత యశస్కులైన వారినే కాకుండా, ప్రచార సాధనాలు లేక మరుగుపడిన వారినీ, అప్పుడప్పుడే కలంపట్టిన వారినీ, పట్టభద్రులనూ, వారూ వీరని ఎంచక అందరి సమాచారం సేకరించి ఫోటోలతో సహా పొందుపరచడం విశేషం ఈ గుణమే యీ గ్రంథ ప్రాచుర్యానికి మూలకారణంగా వుపకరిస్తుందనడంలో సందేహం లేదు

నా పుట్టిల్లు మహబూబ్‌నగరు, నా మెట్టినిల్లు కరీంనగరు జిల్లా అందుకే ఈ రెండు జిల్లాల సాహితీచరిత్ర సంపుటాలు పోరానిచుట్టంగా నన్ను సంభావించి, బహుమాన పూర్వకమైన స్థానాన్ని కల్పించాయి అది నా పురాకృత పుణ్యవిశేషం అరమరికలు లేని రచయితల విశాల హృదయోన్నతికిది తార్కాణం !

కేవలం గౌరవాభిమానాలు ప్రేరేచగా నిండు హృదయంతో మా దంపతులకు కృతిని యిచ్చిన మలయశ్రీకి కృతజ్ఞతలు చెప్పకతప్పదు అయినా మాతృహృదయంతో శుభాశీస్సులందిస్తున్నాను

**పి యశోదారెడ్డి**



రాష్ట్ర ఉత్తమ ఉపాధ్యాయ అవార్డ్ (1991) స్వీకరిస్తున్న రచయిత

## ఈ గ్రంథ ముద్రణ సహాయకులు

### (ఉదార దాతలు)

- ★ తెలుగు విశ్వవిద్యాలయం హైదరాబాద్
- ★ డా పి యశోదా తిరుమల్‌రెడ్డి - 'సుధర్మ' నారాయణగూడ, హైదరాబాద్ - 29
- ★ శ్రీమతి వి నిర్మల, ఎం ఎస్సి &
  డా ఎస్ లక్ష్మినారాయణ, ఎం కాం ,పిహెచ్ డి ప్రగతికాలనీ, రామంతాపూర్-హైద్రాబాద్-13
- ★ శ్రీమతి కంది అన్నపూర్ణ శ్రీకైలాసం ఎం ఎస్సి, గౌతమ ఆశ్రమ ఉన్నతపాఠశాల - గోవిందుపల్లె, జగిత్యాల, జిౌకరీంనగర్, పిన్ - 505455
- ★ శ్రీ బి ఎస్ రాములు, తత్త్వవేత్త, 'దరకమే' వ్యవస్థాపక రాష్ట్ర గౌరవ అధ్యక్షులు, శ్రీమతి శ్యామల పబ్లిషర్, 'విశాలసాహితి' జగిత్యాల 505327
- ★ శ్రీమతి వనజ, శ్రీ వి భూపతిరెడ్డి, ఎం ఏ , బి ఎస్సి ,ఎల్ ఎల్ బి ,ఎం ఇడి , కరీంనగర్

### (రూ 1000/- ఇచ్చిన దాతలు)

### డాక్టర్లు

- ★ డా బి విద్యాసాగర్ & డా శశికళ, ప్రవీణ్ నర్సింగ్ హోం, కోరుట్ల
- ★ డా వి ప్రభాకర్ & డా అరుణ, శ్రీనివాస నర్సింగ్‌హోం, కోరుట్ల
- ★ డా ఏ రామచంద్రారెడ్డి, సంఘం నర్సింగ్‌హోం, మెట్టుపల్లి
- ★ డా సంజయ్‌కుమార్, పావని కంటివైద్యశాల, మెట్టుపల్లి

### అడ్వకేట్స్

- ★ శ్రీ గులాబీల మల్లారెడ్డి, బి ఎస్సి, ఎల్ ఎల్ బి (పోతారం-సర్పంచ్) కరీంనగర్
- ★ శ్రీ కె విజయనరసింహరావు, ఎం ఏ ,బి ఇడి , ఎల్ ఎల్ బి (గుండి) కరీంనగర్
  (శారదానికేతన్ ఉన్నతపాఠశాల - కరీంనగర్)

### స్కూల్స్ - కాలేజీలు

- ★ శ్రీ వై తిరుపతిరావు మహతి జూనియర్ కళాశాల-కరీంనగర్
- ★ శ్రీ టి కష్ణమూర్తి - విశ్వభారతి ఇంగ్లీషు మీడియం హైస్కూల్ - కోరుట్ల

★ శ్రీ ఎన్ నరసింహారెడ్డి ఎం ఏ , రామకృష్ణ (ఇంగ్లీషు & తెలుగు మీడియం) హైస్కూల్ కరీంనగర్

★ శ్రీ అయోధ్య రామారావు ఎం ఏ - వాణీనికేతన్ ఉన్నతపాఠశాల, మరియు జూనియర్ కాలేజి, కరీంనగర్

★ శ్రీ సిహెచ్ కిషన్, చైతన్య జూనియర్ కళాశాల & హైస్కూల్ - జగిత్యాల

★ ప్రగతి సెకండరీ పాఠశాల - కలువచెర్ల (ఇంగ్లీషు- తెలుగు మీడియం) సెంటనరీ కాలనీ, బేగంపేట 'X రోడ్డు

★ శ్రీ ఎస్ సంపత్కుమారాచార్యులు, బి ఎస్సి, బి ఇడి శ్రీనివాస గురుకుల విద్యాలయం - మెట్‌పల్లి

★ శ్రీ కె సుధాకర్‌రావు - వాణి ఉన్నత పాఠశాల మరియు జూనియర్ కాలేజి - జగిత్యాల

★ శ్రీ మర్రి శంకరయ్య - శ్రీ వివేకానంద గురుకుల విద్యాలయం - మారుతీనగర్

## ఫైనాన్సులు

★ సుధాఫైనాన్స్ లిమిటెడ్ - కోరుట్ల

★ జగత్‌ప్రియ హైర్‌పర్చేజ్ ఫైనాన్స్ కోరుట్ల

★ శ్రీ కొత్త సురేశ్ - క్రాంతి హైర్‌పర్చేజ్ ఫైనాన్స్ లిమిటెడ్- కోరుట్ల

★ శ్రీ క్యాతం దశరథ్‌రెడ్డి (సర్పంచ్-మేడిపల్లి) ఓం శ్రీవిష్ణు ఫైనాన్స్ - కోరుట్ల

★ శ్రీ జి రవీందర్‌రావ్ - శ్రీలక్ష్మినరసింహ ఫైనాన్సియర్స్ మరియు టెంట్‌హౌజ్, రుద్రంగి, మం॥మల్యాల

★ SAP చిట్‌ఫండ్స్ - కోరుట్ల (కొత్త విద్యాసాగర్, వి అశోక్, అందె రాజేంద్రప్రసాద్)

## ఇతర సంస్థలు

★ శ్రీ కోటగిరి వెంకటయ్య - అధ్యక్షులు వాసవి నిత్యాన్నదాన సత్రం - వేములవాడ

★ టీచర్స్ క్లబ్ - కోరుట్ల (ప్రెసిడెంట్ బి కాంతారావు, సెక్రటరి ఐ గోవిందు, మరియు కార్యవర్గసభ్యులు)

★ శ్రీ డి గంగారాం, హిందీపండిత్ - శ్రీరాజరాజేశ్వర విద్యార్థి వసతి గృహం - మెట్‌పల్లి

## సాహితీమిత్రులు

★ డా ఎం సుజాతారెడ్డి, ఎం ఏ ,పిహెచ్ డి (పొత్కపల్లి), ప్రొఫెసర్ ముదుగంటి గోపాల్‌రెడ్డి, ఎం ఏ ,పిహెచ్ డి (సం) హైద్రాబాద్

★ డా॥ జైశెట్టి రమణయ్య, ఎం ఏ ,పిహెచ్ డి , జగిత్యాల

★ శ్రీ బి రాజారెడ్డి, బి ఇ గుండారెడ్డిపల్లి,

★ శ్రీ ముదుగంటి పాపిరెడ్డి, ఎం ఏ ,బి కాం ,బి ఇడి నామాపూర్

★ శ్రీ బి మల్లారెడ్డి బి ఓ ఎల్ ,బి ఏ తేలుకుంట

★ శ్రీ రజనిశ్రీ, ఎం ఏ , బి ఇడి హుస్నాబాద్

★ శ్రీ కె ఆత్మారాం, విద్వాన్ - గోవిందుపల్లె - జగిత్యాల

★ శ్రీ డి మురళీమోహనాచార్యులు, ఎం ఏ ,బి ఓ ఎల్, - మెట్టుపల్లి

★ శ్రీ పి వి శ్రీనివాసరావు, ఎం ఆర్ ఓ ఆఫీసు - మెట్టుపల్లి

★ శ్రీ అంకతి కిషన్‌బాబు (గూడూరు) - హన్మకొండ

★ డా ఎం మురళయ్య, ఎం ఎస్సి ,పిహెచ్ డి (కనుకుల) - హన్మకొండ

★ శ్రీ పోతని చంద్రశేఖర్, బి ఎస్సి ,ఎం ఇడి కోరుట్ల

★ శ్రీమతి వేదాంతం లక్ష్మిబాయి (కీ శే వి కాశీనాధంగారి భార్య) వేములవాడ

★ శ్రీ ముద్దసాని రాంరెడ్డి, ఎం ఏ (ఊటూరు) కరీంనగర్

★ శ్రీ వై నరేందర్‌రావు, బి ఏ కంట్రాక్టర్ (కొడిమ్యాల) - కరీంనగర్

★ డా బి లక్ష్మయ్య, ఎం ఏ ,ఎం ఫిల్ , పిహెచ్ డి (తేలుకుంట) కరీంనగర్



నవ్య సాహిత్య పరిషత్, కరీంనగర్ జూలై 1996

## అప్పుడప్పుడు అక్కడక్కడ -

★ "శ్రీ మలయశ్రీగారు సరససరళ మృదుమధుర పదబంధ మొనర్చి కావ్యకన్యకను దిద్ది తీర్చుట జేసి ఈ పొత్తమునకు 'కావ్యసుందరి' యను అన్వర్థనామ ధేయము నొసంగిరి ఇది ఖండ కావ్యము ప్రతి శీర్షికపై కవికొన్ని వినూత్న బావములు సమకాలీన సమాజ విమర్శలు ప్రకటించినారు కోమల భావబంధురములైన ఈ కావ్యఖండికలు పండిత పామర రంజకములై యొప్పారు చున్నవి కుంటుపడని ధారాళమగు శైలిలో నొక అవ్యక్తమగు మధురమగు సంగీతమేదోయున్నట్లు పాఠకుల మనమ్ములు మధురానుబూతి నొందును '

'అభినవ పోతన' వానమామలై వరదాచార్యులు, చెన్నూరు తేది 30-1-1968

★ "ఈ కవికి ఉజ్వల బవిష్యత్తు కలదనుటకు వీరి కావ్యసుందరియే నిదర్శనము"
- మహాకవి వానమామలై జగన్నాధాచార్యులు - పోతురెడ్డిపేట 31-12 1967

★ "మీ 'అమృతమూర్తి' సాహిత్యలోకమున నమృతమూర్తి"

- 'కవిశేఖర' చెప్యాల రామకృష్ణారావు 1969

★ "ఈ కావ్యం (అమృతమూర్తి) ఆయన (గాంధీ)తత్వాన్ని ఆదర్శాన్ని ఆరాధించేమధురగ్రందం'
- డా కోవెల సుప్రసన్నాచార్యులు వరంగల్, 8-8-1969

★ "మలయశ్రీ 'పల్లెసీమ'లోని పాటలన్నీ తెలంగాణా మాండలికములో రచితమైనవి రసార్ద్ర హృదయులకు ఆహ్లాదకరమైన ఈ పాటలు మంచిశైలిలో పాడుటకు అనువుగా విరచితమైనవి"
దేవులపల్లి రామానుజరావు, హైదరాబాద్, 14-4-1974

★ "నేను బోధించిన నాటకాలన్నింటిలో మీ 'శాంతి పధము' (ఇంటర్ తెలుగు నాన్‌డిటేల్డ్ పాఠ్యపుస్తకం) నాకు చాలా నచ్చింది" - డా సి ఆనందారామం, హైదరాబాద్,1978

★ "మీ 'విచిత్రప్రేమ' చదివాను ఇది చక్కని కథాసంవిధానంతో సామాజిక స్పృహకలిగిన మంచి నవల" - డా ఆచార్యబావన్, విజయనగరం,1980

★ "కవిలేఖిని నుండి అప్రయత్న సిద్ధముగ జాలువారిన మధుర బావగీతులతి గంభీరములు హృదయంగమములునై యీ కధాకృతిని (రాగశిఖ) నేడు వెలువడు మధురకవితా మణిహారమున తరళమణిగా నిలిపినవి 'శిలాక్షరి' డా తంగిరాల, హైదరాబాద్,10-8-1971

★ "మలయశ్రీ లబ్ధ ప్రతిష్టుడైన గొప్పకవి బహుగ్రంధకర్త, సాహిత్యంలో వివిధ ప్రక్రియలను చేపట్టి అన్నింటిలోను సిద్ధహస్తుడనిపించుకొన్న సుప్రసిద్ధ కవివతంసుడు ఈయన రచించిన 'రాగశిఖ' ప్రేమ కావ్యమే కాక మృదుమధురమైన గేయకావ్యం కూడా మలయశ్రీ దర్శనంలో తత్త్వద్రష్ట, వర్ణనంలో శబ్దస్రష్ట అనిపించుకొన్న ఘట్టాలు ఈ కావ్యంలో అనేకమున్నాయి శబ్దార్థాలు పొంది పొసగిన రసమయ కావ్యమిది అనాకులమైన భాష, అగమ్యంకాని అర్థబోధ, కటుత్వం లేని కమ్మనిశైలి గల ఈ కావ్యం చూడగానే చదివింప జేస్తుంది, ఆనందపరుస్తుంది, హృదయాన్ని రసార్ద్రం చేస్తుంది
-మహాకవి ఉత్పల సత్యనారాయణాచార్య, హైదరాబాద్, 1991

★ "శ్రీమలయశ్రీ 'యక్షసందేశము' ఆంధ్ర పద్యానువాదమురసవంతమై కాళిదాసు భావముల కదలనీయక మృదుమధుర శైలితోగలదు అలంకారముల యందము చెడలేదు విప్రలంబ శృంగార రసముట్టిపడునట్లుగా నున్నది అనుచితములంట లేదు వ్యాసుని భారతమును తెనిగించిన నన్నయాది

కవిత్రయము వ్యాసునికి వన్నెపెట్టినయట్లు కాళిదాసు కవితకు గౌరవము గూర్చిన వారు మలయశ్రీగారు నిజమునకు మలయశ్రీ ఒక వ్యక్తికాదు - ఒక మహత్తరశక్తి సనాతన సంప్రదాయములు తెలిసిన ఆధునికవాది లలిత కళల సమాహారము అష్టబాషల ప్రవీణుడు నిరంతర సాహితీ వ్యాసంగశీలుడైన మలయశ్రీ రచనలు అతి సమీప భవిష్యత్తులో శతాదికముకాగలవని నా విశ్వాసము వారికి నా శుభాశీస్సులు శతావధాని ఎస్ కృష్ణమాచార్యులు కోరుట్ల, 25-12 91

★ "అసూయపడేవాళ్ళు ఏడుస్తూనే ఉండండి, మలయశ్రీ సాహిత్యరంగంలో మీతలదన్ని ముందుకు వెళ్ళి ఉన్నతోన్నత శిఖరాలనధిరోహిస్తూనే ఉంటాడు" సర్వోదయనాయకులు, స్వాతంత్ర్య సమరయోధులు - బోయినపల్లి వెంకటరామారావు కరీంనగర్, 1975

★ "మలయశ్రీ గారు తెలంగాణా విశ్వనాధ సత్యనారాయణగారు, వారి వలెనే వీరు బహుప్రక్రియలలో బహుగ్రంధకర్త వారు ఆస్తికులు - వీరు నాస్తికులు, అంతే తేడా" -డా ఎస్సెలెన్ బాబు 1979

★ MalayaSrı has preffered freeverse styled and posed the problem ın a dramatıc dıctıon, the message and realıty behınd myth by hım Sometımes ın a phılosophıcal mood and sometımes ın a humorous way I congratulate hım on the productıon of 'Aıtrı matam' probably first of ıts kınd ın Telugu lıterature "Amarabharatı" - Tagore Rajaram Sıng Advocate, Peddapally 1-10-83

★ "మా మలయశ్రీ మంచి మనసున్న వాడు - మహాకవి !"
'రాజవైద్య' డా పింగళి లింబాద్రిరెడ్డి, నెమిలికొండ

★ "మలయశ్రీ గుండి కేశవరావుగారి (సాహిత్య) మీసం"
- దేవస్థానకవి, మామిడిపల్లి సాంబశివశర్మ, వేములవాడ

★ "డా మలయశ్రీ నడుస్తున్న విజ్ఞాన సర్వస్వం" - కె వి నరేందర్ చిల్వాకోడూర్ 3-3-1996

★ "మీరు అనేక ప్రక్రయలు చేపట్టి నష్టపోయారు రావల్సినంత పేరురాలేదు ఏ ఒక్క ప్రక్రియలోనే కృషిచేసి వుంటే మీపేరు ఇంకా చాల వ్యాప్తి అయి ఉండేది"
- డా తుమ్మల రామకృష్ణ (తిరుపతి)పి జి సెంటర్ - కర్నూలు, 1993

★ "జీవితంలో దాదాపు అన్ని పార్శాలపై డా మలయశ్రీ రాశారు ఆయన విషయంలో ఆసక్తికరమైన విషయం ఏమంటే బ్రాహ్మణ బనియా తాత్త్విక ఆర్థిక దోపిడీపై పాటలురాసి 1978లోనే పుస్తకంగా ప్రచురించడం" 1996 ఆం ప్ర దళితపాటలు పీఠికనుండి
- రాష్ట్రదరకమే అధ్యక్షుడు, బి ఎస్ రాములు- జగిత్యాల

★ "సంస్థకు మీరు పంపిన 100 రూ అందినవి దళితపదంపై వాదోపవాదాలు జరుగుచున్నవి సమావేశం డిసెంబర్‌లో ఉండవచ్చు మీసూచనలు సలహాలు మాకు ఎల్లవేళలా అవసరము"
- ప్రజాకవి గూడఅంజయ్య, ఆదిలాబాద్, 27-10-1992

★ "మీ వంటి ప్రతిభావంతులైన రచయితలు నిరుత్సాహపడకూడదు వ్రాస్తూనే పోతుండాలి దానితో సమాజానికి ప్రయోజనం" - డా కేతవరపు రామకోటిశాస్త్రి - హన్మకొండ

★ "నేను ఆంధ్రప్రదేశ్ అంతటా తిరిగాను ఎన్నో సమావేశాల్లో పాల్గొన్నాను మీవంటి స్కాలర్‌ని మాత్రం చూడలేదు" హేతువాద రచయిత - సుజనె, అనంతపురం, అక్టో-96

★ "మీ దిషణకు, దీక్షకు ఆశ్చర్యపడుతున్నాను మీరు ఇచ్చిన పుస్తకాలు చదువుతున్నాను
- డా రావూరిభరద్వాజ, హైదరాబాద్, మే 1997

★ "భాషా సాహిత్యాలు ఏదో ఒక వర్ణానికో, వర్గానికో మాత్రమే చెందినవి కావు, బహుశా ఈ చరిత్ర తెలిసిన డా మలయశ్రీ గుడ్డిగా సంస్కృత భాషను తిరస్కరించకుండా, ఆ బాషా సాహిత్యాలను అధ్యయనం చేసి సంస్కృతబాషలో హేతువాద మానవవాద కవిత్వాన్ని రాస్తున్నారు (నాకు తెలిసినంత వరకు మనదేశంలో సంస్కృత భాషలో ఈ కోణంలో రాస్తున్న వారిలో వీరే మొదటి వారనుకుంటాను) ఆయనకు మించిన విద్యావంతులు ఉండవచ్చు కాని, చేసే పని మీద ఇంత గొప్ప శ్రద్ధగల వారు మాత్రం చాలా అరుదుగా ఉంటారు మేము కోరినంతనే అశ్వఘోషుని 'వజ్రసూచి'ని కేవలం రెండు రోజుల్లో అనువదించి పంపారు" వజ్రసూచి కవిపరిచయం -97 రవిచంద్ టి గుంటూర్

★ I have read your Rhymes, some of them are really interesting They will be use ful for our Little children — డా పి యశోదారెడ్డి, సుధర్మ - హైద్రాబాద్ 1997

★ 'Singing Bells en Dancing Dolls" మీ రైమ్స్ బాగున్నాయి ఇలాంటి బాలసాహిత్యం ఆంగ్లంలోనూ మనదేశంలో రావల్సి వుంది
-ప్రొఫెసర్ ఎస్ ఎస్ ప్రభాకర్‌రావు, జె ఎన్ టి యు - హైద్రాబాద్ అక్టో-97

★ "నా ఆంగ్లవ్యాసాన్ని మీలాంటి మంచి రచయిత తెనిగించుటకు అంగీకరించటం చాలా ఆనందాన్నిస్తుంది నాకు మీరచన 'మానవగీత' లో ముఖ్యమైన శ్లోకాలు ఆంగ్లంలో అనువదించి పంపండి The Age of Atheism లో ప్రచురించుదాము Humanist poet గా ఆంగ్లపాఠకుల మధ్య మీరు popular కావాలి" - జయగోపాల్, విశాఖ 6-4-97

★ మలయశ్రీ మామయ్య గారికి -'వేసవి' అక్కయ్య పెళ్ళికోసం సహృదయతతో మీరు పంపిన 500 రూ లు అందినవి అమ్మ, అన్నయ్య (విప్లవదత్) మీకు కృతజ్ఞతలు చెప్పుతున్నారు పెళ్ళికి తప్పకుండా రావాలి - వెన్నెల (కీ శే సురమౌళి గారి కూతురు), హైద్రాబాద్ మార్చి 97

★ 'సత్యసూక్తం' చదివాను విస్తృత భావాలను సవిమర్శనాత్మకంగా సంగ్రహించి చక్కగా పొందుపరిచారు మీకు నా అభినందనలు - నెల్సన్ రష్దీ నాస్తిక్, బెల్లంపల్లి మార్చి-97

★ గురువర్యులు డా మలయశ్రీ గారికి - నమస్కృతులు! 'రావిశాస్త్రి అవార్డు' నాకు వచ్చినందుకు దినం ఎన్నో లేఖలు వస్తున్నాయి కాని, మీరు పంపిన అభినందనల లేఖను నేను చాలా విలువైందిగా భావిస్తున్నాను - కాలువ మల్లయ్య, ఫెర్టిలైజర్ సిటీ జూలై-97

★ ప్రముఖ రచయిత డా మలయశ్రీ గారికి - నమస్కారములు నా 'శిలాఘోషపై ఏవేవో సమీక్షా లేఖలు ఎందరెందరో రాశారు అయినా, ఆ పుస్తకాన్ని, అది రాయడం లోని నా ధ్యేయాన్ని మీ అంత లోతుగా చక్కగా ఎవరూ అర్థం చేసుకోలేకపోయారు' 'విశ్వ ప్రాదుర్భావం, పురా మానవ చరిత్ర, దాని వికాస క్రమాన్ని వివరించ పూనుకున్న మీవంటి రచయితకు, ఈనాటి కులమత, దళిత, స్త్రీవాద సిద్ధాంతాలు ఓ లెక్కలోనివి కావు' అన్న మీ మాట నాకు కొండంత ధైర్యాన్నిచ్చింది

- యెన్నం సత్యం, సిరిసిల్ల ఆగష్టు-97

★ డా మలయశ్రీ గారికి - నమస్తే కామ్రేడ్ జి మల్లేశం గారి పాటలు మీరు సవరించి సూచనలు ఇచ్చిన ప్రకారం ముద్రిస్తున్నాం సెప్టెంబర్‌లో పుస్తకావిష్కరణ ఉంటుంది మిమ్మల్ని, తాడిగిరి పోతరాజు గారిని తప్పక అహ్వానించాలని మల్లేశం గారు చెప్పారు

- అన్నవరం దేవేందర్, హుస్నాబాద్ ఆగష్టు 97

(పుస్తకం చూసినా, ఆవిష్కరణ సభ జరగకముందే మిత్రులు మల్లేశం గారు మృతి చెందినారు వారి స్మృతి సమావేశం 29-8 97 నాడు ఆ పుస్తకాన్ని అంతకపేటలో నేనే ఆవిష్కరించాను )

★ "నా 'అధిక్షేపణ' పద్యకావ్యానికి 'నాస్తికయుగం'లో చక్కని సమీక్ష రాసినందుకు కృతజ్ఞతలు" - వెంపో కలవపూడి, కృష్ణా జిల్లా 1997

★ "కరీంనగర్ జిల్లా వర్తమాన కవులకు రచయితలకు మీరు అందిస్తున్న సహకారానికి అభినందనలు'' డా జె బాపురెడ్డి, ఐ ఏ ఎస్ హైద్రాబాద్ అక్టో - 1997

★ 'కాకతీయుల కాలం నాటి సామాజిక జీవితం'ను సామాజిక చరిత్ర రచయితలందరూ అనుసరించదగిన శీర్షికా విభాగం విషయ వివరణ కలిగి ఉందని పత్రికలు ప్రశంసించాయి

★ ఇంకా నా బాల సాహిత్య పుస్తకాలు, విప్లవ వీర చరిత్రలు విజ్ఞుల మన్ననలందాయి

★ ముప్పదేండ్ల నా సాహితీ మహాప్రస్థానంలో ఎన్నెన్నో అవిస్మృత మధురానుభూతులు అందులో ఇవి కొన్ని మాత్రమే - కళాప్రపూర్ణ కే శే లత, రంగనాయకమ్మ, వాసిరెడ్డి సీతాదేవి, గజ్జెల మల్లారెడ్డి, పెద్దిబొట్ల సుబ్బరామయ్య, నవీన్ ఇలా ఎందరెందరి సాహితీ స్నేహ సుగంధాలో నావైపు ప్రసరించాయి

## ఇప్పుడు ఇక్కడ

★ "చాల విలువైన పుస్తకం రాశారు" పద్మభూషణ్ డా సి నారాయణరెడ్డి, 3-12 97

★ "మీకేమిటండీ మీరేది రాసినా బాగా రాస్తారు" ప్రొఫెసర్ ఎన్ గోపి - 1995 జనవరి

★ "మలయశ్రీగారూ! మీ థీసిస్ చూస్తుంటే మేం కరీంనగర్ జిల్లాలో ఎందుకు పుట్టక పోతిమా అని విచారం కలుగుతున్నది మీ జిల్లా వాళ్ళం అయివుంటే ఈ సాహితీ ఉద్గ్రంథంలో చేరి ఉండేవాళ్ళంకదా!''

- ప్రొ ఎల్లూరి శివారెడ్డి, ఉస్మానియా విశ్వవిద్యాలయం

★ "మన జిల్లా సాహిత్యచరిత్రను ఒక సాహితీ సర్వస్వంగా రూపొందించారు అందుకు మిమ్మ అభినందిస్తున్నాను" రీడర్ - డా కె రాజన్నశాస్త్రి (నా గైడ్)

★ "కుసుమా! ఈ కాలంలో ఇంతపెద్ద థీసిస్ గ్రంథాన్ని (రెండు సంపుటాలు టైపులో 1050 పుటలు) చూడలేదు కదూ" ! (అన్నారు ఆశ్చర్యంగా రీడర్ డా కె కుసుమాబాయి గారితో నా ఈ గ్రంథ సమర్పణ సందర్భంలో చూసి) రీడర్ - డా సుమతీ నరేంద్ర, 1995

★ "మీరు ఒక రచయితపైనో, ఒక పుస్తకంపైనో థీసిస్ రాయటం వద్దండి మీరీ డిగ్రీ ప్రయోజనాన్ని ఆశించి పరిశోధనకు పూనుకోలేదు మీ వంటి సాహితీ కృషీవలుల ద్వారా సమాజానికి మేలు జరగాలి మీ జిల్లా సాహిత్య చరిత్ర రాయండి అది ఇతర జిల్లాల సాహిత్య చరిత్రలు రావడానికి మార్గదర్శకమౌతుంది అప్పుడు మనరాష్ట్రసమగ్ర సాహిత్య చరిత్రరాయడానికి వీలవుతుంది"

- ప్రొఫెసర్ ఎం కులశేఖరరావు ఆగస్టు 1989 ఉస్మానియా

★ "ఈ సాహిత్య సమీక్ష అంతా కరీంనగర్ జిల్లాకు పరిమితమై ఉండటం గమనార్హం విషయ

సేకరణ విషయంలోనూ, విషయాన్ని పొందుపరచిన విషయంలోనూ పరిశోదక విద్యార్థి చేసిన కృషి అభినందనీయం నాకు తెలిసినంత మేరకు ఒక జిల్లాకు పరిమితమై సాహిత్య సమీక్ష చేసిన మొదటి ప్రయత్నంగా ఈ సిద్ధాంత గ్రంధాన్ని నేను పరిగణిస్తున్నాను"

- ప్రొ ఎస్ జి డి చంద్రశేఖర్ - శ్రీ వెంకటేశ్వర యూనివర్సిటీ - తిరుపతి 517502 తేది 16-6-95

★ "ఇంతవరకు తెలుగులోని సాహిత్యపరిశోదన కవులకు, సాహిత్య ప్రక్రియలకు పరిమితమై కొనసాగింది ఈ సిద్ధాంత వ్యాసంలో ఒక అడుగుముందుకు వెళ్ళి ఒక జిల్లాకు సంబంధించిన వెయ్యేళ్ళ తెలుగు సాహిత్య చరిత్రను పరిశోధించడం జరిగింది ఇది ఎంతైనా ముదావహమేగాదు ప్రశంసనీయం ఇందులో పరిశోదకుని ప్రజ్ఞతోపాటు పరిశ్రమ మెచ్చదగ్గది క్షేత్రపర్యటన, అనేకులతో ముఖాముఖి పరిచయమూ, తద్వారా విషయసేకరణ (గ్రంధరచన) పరిశోధకుని కష్టాన్ని తెలిపే అంశాలు, ఈ రచయిత, పర్యవేక్షకులు డా కె రాజన్నశాస్త్రి అభినందనీయులు"

"ఇరవై శతాబ్ది పూర్వార్థం సాహిత్యం వరకు విపులంగా పరిశీలించి విశ్లేషించి వివరించారు ఈ శతాబ్ది ఉత్తరార్థంలో వెలిగిన సాహిత్య ప్రక్రియలతోపాటు ప్రముఖ కవుల రచయితల గూర్చిన విశ్లేషణ ప్రాముఖ్యం వహించంది "

'అధునిక యుగంలో ప్రముఖకవి ఆచార్య సి నారాయణరెడ్డి మొదలు రాజకీయాల్లో ఉన్నా ఎంతో సాహిత్య సేవచేసిన మన ప్రధాని శ్రీ పి వి నరసింహరావుతోపాటు అతి స్వల్పకాలంలోనే నూరేళ్ళు నిండిన విప్లవకవులు అలిశెట్టి ప్రబాకర్, సాహుల గురించి గూడా వివరించడం ఈ సిద్ధాంత వ్యాస విశిష్టతను వివరిస్తుంది"

- ప్రొఫెసర్, ఎస్ గంగప్ప, నాగార్జున యూనివర్సిటీ - గుంటూర్ - 522006 తేది 7 8 95

★ "ఈ పరిశోదన గ్రంధంలో పరిచయం చేసిన కవులగూర్చి ఒక్కొక్కరిపై పిహెచ్ డి చేయదగిన రచనలున్నవి మొత్తం కరీంనగర్ సాహిత్యాన్ని కట్టకట్టి ఒక్క దగ్గరగా చేర్చిన కృషి ప్రశంసనీయం శాసనాల దగ్గరి నుండి మొదలుపెట్టి నేటి అధునిక కవుల రచనలను పరిచయం చేయడం వలన ఈ పరిశోధన ఉద్గంధంగా తయారైనది ఎంతోమంది వెలుగు చూడనివారు చూసిన వారు వీరి పరిశోధనలో చోటుచేసుకోవడం ముదావహం సమగ్ర పరిశోధనకు ఇది తార్కాణం"

- డా బి రుక్మిణి, రీడర్ కాకతీయ -యూనివర్సిటీ, వరంగల్ తేది 17 8 95

★ "మీ సిద్ధాంత గ్రంధం చదివాను కరీంనగర్ జిల్లా వాసులకే కాదు ఏ జిల్లా తెలుగుసాహిత్య చరిత్రపైనైనా పరిశోధన చేసే విద్యార్థులకు అది కరదీపికలా ఉంటుంది అభినందనలతో"

-రీడర్ - టి కిషన్‌రావు 5 8-97

★ "మీ థీసిస్ చదివాను అద్భుతంగా రాశారు" పత్తిపాక మోహన్ (పిహెచ్ డి స్కాలర్) సిరిసిల్ల (నవంబర్ 97)

★ "నేను ఎన్నో గ్రంధాలకు పీఠికలు వ్రాశాను మీ గ్రంధానికి వ్రాసే పీఠికవేరు నాకు ఆలోచనము అంటే మిక్కిలి ప్రీతి ఆలోచనా శీలి అయిన మిమ్ము కలుసుకోవటం నా జీవితచరిత్రలో ఒక విశేషం మీ సంభాషణలు నా మెదడులో చెరగని ముద్రలువేశాయి మీరు వ్రాసిన బృహద్గ్రంధం కరీంనగర్ సాహిత్యచరిత్ర నన్ను - అంతగా ఆకర్షించలేదు మీ వ్యక్తిత్వం నన్ను 77 ఏండ్ల వృద్ధ సాహితీ తపస్విని - ఎంతగానో ఆకర్శించింది మీతో కలిగిన పరిచయం నాకు యావజ్జీవిత పాథేయం సమకూర్చింది" డా నండూరి రామకృష్ణమాచార్య తేది 28-11-97

**ఎందరో సాహితీ సౌజన్యమూర్తులు - అందరికీ నా వందనాలు !**

# ANDHRA PRADESH PARISHATH

Tilak Road, HYDERABAD - 500 001

అధ్యక్షులు

జ్ఞాన పీఠ పురస్కార గ్రహీత, పద్మభూషణ్

**డా॥ సి. నారాయణ రెడ్డి,** ఎం పి

ఎం ఏ , పిహెచ్ డి , డి లిట్


తేది 3-12-1997

## అభినందన

పరిశోధనకు సమాచారాన్ని సేకరించడం ఎంత ప్రధానాంశమో ఆ సమాచారాన్ని సత్య సమ్మతంగా విశ్లేషించి చూపటం అంతే ముఖ్యమైంది అసలైన పరిశోధకుడు అలుపెరుగని పథికుడు రాగద్వేషాలకు అతీతంగా నిలిచే మౌలిక తత్వాన్వేషి అందిన సామగ్రిని సమీక్షించడంలో చూపే ఉత్సాహంతో పాటు అందని విషయముల గురించి తెలియజేసే నిజాయితి పరిశోధకుని వ్యక్తిత్వానికి ప్రమాణాలు

ఈ మంచి లక్షణాలన్నీ వున్న పరిశోధకుడు డా॥ మలయశ్రీ క్రీ॥ శ॥ 250 నుంచి 1995 వరకున్న కరీంనగర్ జిల్లా తెలుగు సాహిత్య చరిత్రను ఏళ్ల తరబడిగా పరిశీలించి ఈ గ్రంధంగా రూపొందించాడు డా॥ మలయశ్రీ క్రీ॥ శ॥ 946 లో వెలువడిన జనవల్లభుని శాసనంలోని కంద పద్యాలతో తెలుగు పద్య కవిత తలిరులెత్తిందని మలయశ్రీ ప్రతిపాదన ఆ మూడు కంద పద్యాలను ఇందులో పొందు పరిచాడు అక్కడి నుండి ప్రాచీనాంధ్ర సాహిత్యంలోని ఎందరెందరో తెలుగు కవులను ప్రస్తావించి 20వ శతాబ్ది ప్రధమార్ధ పూర్వార్ధ భాగాల్లోని రచయితను గురించి, వారి రచనలను గురించి విపులంగా సమీక్షించాడు అన్ని రకాల సాహితీ ప్రక్రియలకు సంబంధించిన వారిని ఈ గ్రంధ పరిధిలో చేర్చుకోవడం గణనీయమైన విషయం

డా॥ మలయశ్రీ రచయితల జీవిత వివరాలను రచనా విశేషాలను ఎంత శ్రద్ధగా సేకరించాడో వాటిని అంత నిశితంగా సమీక్షించాడు మా జిల్లాలో ఇందరు ఉద్దండ రచయితలుండేవారా, ఉన్నారా అని సాహితీ ప్రియులు నివ్వెర పడేంత వస్తు నిర్భర పరిశోధన చేసిన మిత్రుడు డా॥ మలయశ్రీ శతథా అభినందనీయుడు విషయ విశ్లేషణతో పాటు వచన శైలి కూడా ఆకర్షణీయంగా ఉండడం వల్ల ఈ పరిశోధన గ్రంథం సర్వజనపఠనీయంగా రూపొందింది

డా॥ సి నారాయణ రెడ్డి

పి జి రోడ్డు - 35,
ఇ నం 420,
జవాహర్ నగర్, సికింద్రాబాద్ - 3
ఫోన్ 817397

రచయిత **నండూరి రామకృష్ణమాచార్య**

# బహిరంగ స్వాగతము

## I

ఒకనాడు - ఆకస్మికంగా - నింగినుండి చుక్కనేలపై పడిన వడపున ఒక అపరిచిత వ్యక్తి మా యింటిముందు ఊడిపడి సాక్షాత్కరించాడు! పలువురు అపరిచితులు మా యింటిరి రావటం నాకు పరిపాటియే నా సహజ ధోరణిలో ఆభ్యాగతునకు స్వాగతం పలికినాను ప్రసంగవశాత్తు నాకు తెలిసిన అంశాలు ఆ ఆగంతకుడు కవి బహుగ్రంధకర్త ఆయన డాక్టర్ మలయశ్రీగారు మహాభారతంలో మొట్టమొదటిసారి ద్రోణున్ని కలసి కొన్నపుడు భీష్ముడాతనిని "వినినట్లు కనియెన్" అని నన్నయ వర్ణన నేను డాక్టర్ మలయశ్రీగారికి గూర్చి ఎన్నోసారులు వినియున్నాను ఆయననూ - "వినినట్లు" కన్నాను డాక్టర్ మలయశ్రీ గారిని చూడాలనే చిరకాలవాంచ నాకు యాదృచ్ఛికంగా ఈడేరింది ఆయన నాకు - ఆయన వ్రాసిన కొన్ని పుస్తకాలు అచ్చయినవి బహూకరించారు ఆనాడు నా ఎయస్సు 76 సంవత్సరాలు డా మలయశ్రీ గారు ఒక వింత-విశిష్టవ్యక్తిగా నాకు కన్పించారు వయోవృద్ధుడనైన నాకు ఆయన నమస్కరించలేదని నేను గ్రహించలేదు ఆయన వ్యాఖ్యానించేవరకు ఆయన అన్నమాట - "నమస్కారం బానిస లక్షణం" అని నా అభిప్రాయం వేరు నమస్కారముద్ర - భరతనాట్య కళలో మాత్రమేగాక వ్యావహారిక కర్మజగత్తులో గూడ - "విద్యా వినయ చిహ్నం"

**ఓరస భావుక ప్రియమహోదయ - సత్కవి శేఖరా - నమ**
**స్కారము దాస్యచిహ్నమని చాటిగనేల? స్వతంత్ర మాధురీ**
**పూరిత దుందుభి స్వనము పొంపిరి వోవ - పవిత్ర చిత్త సం**
**స్కార పరీత సౌహృదయ చర్యకపార్థము చెప్పబోకుమా -**

**అయిదు పదినిచేసి అంజలించిన వేళ - నరశరీర రక్తనాడులందు**
**ఆయురభ్యుదయ సుధానంద ఝరిపొంగి - పృథివి కననివెలుగు వెల్లివిరియు**

డా మలయశ్రీగారు - హేతువాది - నాస్తికుడు, అని ఆయన సంభాషణ వల్ల నేను ఊహించినాను అయితే "బ్రతుకుఅనిన - హేతువాదమ్ము మాత్రమే" కాదని, ఆస్తిక్యం అంటే హేతువాదమునకు అతీతమైనది అనుబవైకవేద్యమైనది, అని నా అభిప్రాయం ఆయనకు చెప్పి "సహనమే సంస్కృతి" - అన్నాను ఆస్తికుడైన వివేకానందయోగి అమెరికా వెళ్ళినపుడు పరమనాస్తికుడుగా పేరుకెక్కిన ఇంగర్‌సోల్ మనీషి ఇంటిలో అతిధిగా ఉన్నాడని చెప్పినారు దానికి డా మలయశ్రీ గారి సమాధానం నను నిదిధ్యాసలో ముంచియెత్తింది - ఆయన అన్నమాట "వివేకానందుడు నాస్తికుడే గురువు రామకృష్ణ పరమహంస శిష్యుని మెస్మరైజ్ చేశాడు"

**గొంతుక రణదుందుభి - ఆ శాంతము మార్మ్రోగగ - మలయశ్రీ చెప్పన్**
**స్వాంతములు ప్పొంగ - రసనిరం తరవాక్కులు ప్రవాహ రమణీయముగన్**

అప్పుడు డాక్టరు మలయశ్రీ గారితో నేను స్వామిన్ ! మీరు అభ్యాగవతులుగా విచ్చేసి మా గృహం పావనం చేశారు తమకు నేను చేయగల తగిన ఉపచారం ఏదైనా ఉంటే దయచేసి సెలవివ్వండి

అన్నాను ఆయన అన్నమాట - "నేను వ్రాసిన గ్రంధం - "కరీంనగర్ తెలుగు సాహిత్య చరిత్ర" (క్రీ శ 950 నుండి 1995) దానికి మీరు పీరిక వ్రాయాలి !" మలయశ్రీ కోరిన వరం నేను సులువుగా ఇచ్చాను "మీ గ్రంధానికి నేను సముచిత పీరిక వ్రాయగలను" అన్నాను కరుణశ్రీ కృతులకు నేను పీరికలు వ్రాయటం చేతనాకు మిత్రులు "పీరికా ప్రబంధ పరమేశ్వరుడు" అనే వ్యాజబిరుదు ఇచ్చారు నాకు పీరికారచన వినోద విద్యా వ్యసనమైంది ఏ తత్ ఫలితమే నాయీ - "బహిరంగ స్వగతం" - కరీంనగర్ జిల్లా తెలుగుసాహిత్య చరిత్రకు పీరిక

## II

"కరీంనగర్ జిల్లా తెలుగుసాహిత్య చరిత్ర" - అచ్చులో ఇంచుమించు వేయి పుటల (మించిన) ఒక బృహద్ గ్రంథం ఇది పెక్కు కవుల గ్రంథాలపై సాహితీ సమీక్ష ఇది ఒక సాహితీ చరిత్ర నిఘంటుకోశం

ఇటువంటి సర్వతోముఖ సమగ్ర గ్రంథం వ్రాయడానికి - ప్రతిభ మాత్రమే చాలదు యుగ యుగాంతరముల చరిత్ర సాహిత్యంపరిశీలించి - బహుళ ప్రయాసలకు ఓర్చి రచయిత ఈ గ్రంథం నిర్మించాడు ఇంత కృషిచేసే ఓపిక - అతిమానుశం అయితే ఒక గొప్ప ప్రేరణఉన్నది - అది విశ్వకళా పరిషత్తు వారి డాక్టరేటు పట్టం సంపాదించాలనే ప్రగాఢవాంఛ నిజానికి డాక్టరేట్ పట్టం మలయశ్రీ కవికి పప్పుమీది పులగం అక్కరలేదు సమకాలీన జగత్తులో విశ్వవిద్యాలయ డిగ్రీలపై గల వ్యామోహం మన అందరకూ అనుభవామ్రేడితమే నేను ఎన్నో డాక్టరేట్ పట్టాలకోసం విద్వాంసులు వ్రాసిన సిద్ధాంత గ్రంథాలు చదివాను డాక్టర్ మలయశ్రీగారు వ్రాసిన ఈ సిద్ధాంతవ్యాసం - కరీంనగర్ జిల్లా తెలుగు సాహిత్య చరిత్ర - అట్టి గ్రంథాలలో తలమానికం

ఒకమాట చెప్పాలి విశ్వకళా పరిషత్తు తరచు మాణిక్యాలను మసిబొగ్గులుగా, గులకరాళ్ళను ఆభాసరత్నాలుగా తీర్చి దిద్దగలవు కవి మలయశ్రీ - డాక్టర్ మలయశ్రీ కంటె గొప్పవాడు మలయశ్రీ ఇంతకు ముందే వ్రాసిన పద్యాలు - రచనలు - శ్లోకాలు కొన్నినేను చదివియున్నాను "మలయశ్రీ కవిశ్లోక - శత్‌ప్రబంధ శతాయతే" అనిపించింది అది విషయాంతరం

**వేడివాడిగల కవి మలయశ్రీ వాక్కు - కదిపి ప్రజలగుండె కుదుప గలదు ,**
**వ్రాయగలడు గొప్ప గేయాలు వచనాలు - కల్కి కత్తి వంటి కలము పట్టి**

డాక్టరు మలయశ్రీ వ్రాసిన సాహిత్యంపై సమగ్ర సమీక్ష చేసే అదను ఇది కాదు గద అలమతి విస్తరేణ "వాక్యం రసాత్మకం కావ్యం" అన్న ఆలంకారిక ప్రవచనంలో లేశమాత్రం సత్యం ఉంటే - శ్రీ మలయశ్రీ సంభాషణలో వెల్లివిరిసే ప్రతివాక్యం ఒక కావ్యమే మలయశ్రీ సంభాషణలో విసిరే వాక్యాలు వేయిపడగలు విప్పి నాట్యం చేయగలవు అర్థవాద రూపంలో భంగ్యంతరంగా చెప్పవలెనంటే మలయశ్రీ సహస్రఫణి సమావృతుడైన నవీన వాల్మీకి

అసలు మలయశ్రీ వ్రాసిన కరీంనగర్ జిల్లా సాహితీచరిత్రకు పీరిక అనవసరం నా వాగ్దాన భంగం కాకుండా నేనీ బహిరంగ స్వగతం కూర్చుచున్నాను ఏ గ్రంధమునకైనా నిజంగా పీరిక అవసరమా, పీరిక ఒక నవీన సాహితీ సంప్రదాయం

**తొడిమ యున్న యెడల విడిపోదు పుష్పమ్ము - గ్రంధమునకు పీఠిక అవసరము**
**లలిత దృక్కులగు - "సులోచన ద్వయి గూర్చు - పీఠికా రచయితపేర్మితోడ**

## III

ఈ గ్రంథం కరీంనగర్ జిల్లా సాహిత్య చరిత్రను ముఖ్యమైన మూడు విభాగాలుగా విభజించవచ్చు 1) క్రీస్తుశకం 950 నుండి పూర్వకవుల సాహిత్య సమీక్ష - చరిత్ర డాక్టరేట్ పట్టం ఆ భాగమునకే ఇవ్వవచ్చు ఇక రెండవ భాగం - అర్వాచీన రచయితల చరిత్ర - సాహిత్యం అందు కరీంనగర్ జిల్లా వాస్తవ్యులే గాక, కరీంనగర్ జిల్లాలో స్థిరపడిన (ఇతరప్రాంతాల) వాస్తవ్యులు కూడా చేరినారు ఇక చివరి భాగంలో కవితలు - గేయాలు - నాటకాలు నవలలు - కథలు సర్వప్రక్రియలు చేరాయి ప్రతి రచయితకు - నాణెమునకు వలె బొమ్మ బొరుసులుంటాయి కవికి బొమ్మ ప్రతిభ, వ్యుత్పత్తి బొరుసు ఈ గ్రంథం కరీంనగర్ జిల్లా తెలుగు సాహిత్య చరిత్ర మలయశ్రీ గారి బొరుసు

ఈ గ్రంథం సర్వ సమగ్రమైనది ఇందు వందలు కాదు వేల కొలది కవుల చరిత్రలు ఉన్నవి పద్యకవులే అధిక సంఖ్యాకులు, అయితే - ఇతర ప్రక్రియలకు కూడ సముచిత న్యాయం చేకూర్చినారు మలయశ్రీ ఈ గ్రంథంలోని విశేషాంశాలు కొన్ని సమీక్షించటం మంచిది అది పీఠికా కర్త నిర్వహించవలసిన బాధ్యత

1 "కందం పుట్టుక కరీంనగరంలో" అని పంపకవి తమ్ముడు జినవల్లభుని శాసనం ఉదాహృతం కందం కరీంనగరంలో పరిణామ వికాసం చెందిన మాట చారిత్రక సత్యం ఆంతర్యంలో వసుధైక ప్రేముడయిన డాక్టర్ మలయశ్రీగారికి జన్మభూమిపై గల మమకారం ముదావహం కందం ఎప్పుడో ఎక్కడో ప్రాకృత బాష నుండి జన్మించింది జన్మస్థానం ఇతమిత్థముగా నిర్ణయించుట అనవసరం అని నా అభిప్రాయం

2 "వేములవాడ భీమకవి కరీంనగర్ వేములవాడ వాడు కాడు" అన్నారు మలయశ్రీ గారు వారు ప్రాంతీయ దురభిమానం చూపించలేదు ద్రాక్షారామ సమీప రామచంద్రపురం తాలూకాలో వేములవాడ ఇప్పటికి బయల్పడలేదు ఈ విషయంలో భవిష్యత్ కాలంలో మరికొంత పరిశోధన జరగాలి తెలుగుసాహిత్య చరిత్రలో అత్యద్భుత విశేష పరిశ్రమ సల్పిన ఆచార్య శ్రీకొర్లపాటి శ్రీరామూర్తిగారు కూడ - భీమకవి దక్షారామ సమీప వేములవాడ వాస్తవ్యుడే అన్నారు ఆనాడు గోదావరిలో ప్రతిష్ఠానం వరకు - ముఖద్వారం నుండి పడవలలో విరివిగా రాకపోకలు జరిగేవి కరీంనగర్‌లోని వేములవాడ కోటిపల్లిని ఆనాడు గోదావరి పడవలు కలిపివేసేవి

3 ఇంత సమగ్రంగా ఒక జిల్లా సాహిత్యచరిత్ర తెలుగులో వెలువడలేదు ప్రకాశం జిల్లా మినహాయించి ఇతర జిల్లాల సాహిత్య చరిత్రలకు శ్రీ మలయశ్రీ గారి గ్రంథం - ఒరవడికాగలదని నా అభిప్రాయం

4 ఈ గ్రంథంలో పలువురు కవుల ఛాయాచిత్రాలు ఉన్నవి పుస్తకం చివర కవినామసూచిక ఉన్నది శ్రీమలయశ్రీ గారి ప్రణాళిక ఉగ్గడించదగినది

5 చరిగొండ ధర్మన - అష్టదిగ్గజాలకు పూర్వీకుడు అని చక్కగ శ్రీమలయశ్రీ గారు ఆకవి కరీంనగర్ ధర్మపురి వాడని నిరూపించారు ఈ పరిశోధనాంశం మలయశ్రీ పరిశోధనకు కలికితురాయి

6 రాగద్వేషాతీతుడుగా శ్రీమలయశ్రీ యుగముగాంతరములలోని కవుల చరిత్రలు వివరించారు

కవుల సాహిత్య సమీక్ష చేశారు సోదాహరణముగా వేదాంతులు భగవంతుని గూర్చి "ఇందుగల డందులేడని, సందేహము వలదు - సర్వోపగతుండని అభివర్ణించి, 'కలడు కలండనెడు వాడు కలడో లేడో' అన్నారు

శ్రీమలయశ్రీ గారు ఈ పుస్తకములో సర్వాంతర్యామి అయితే ఎక్కడ గూడా తన 'ముక్కు' - ఝుళిపించలేదు శ్రీ మలయశ్రీ నిష్పక్షపాత నిగ్రహము నాకు మిక్కిలి నచ్చిన అంశం వెలిగందల నారయ గూర్చి శ్రీమలయశ్రీ విపుల పరిశోధన చేశారు నారాయణ శతకకర్త అతడే అనే ప్రతిపాదన బాగా ఉన్నది

కరీంనగర్ జిల్లాలో అవిర్భవించిన కవితలు ఆ జిల్లా సరిహద్దులు దాటి బహుళాంధ్రోక్తిమయ ప్రపంచంలో విహరించినవి - దుష్టసంహార దురిత దూర - నరసింహశతకం వంటివి నారాయణ శతకం వంటివి చాలా ఉన్నాయి

కరీంనగర్ జిల్లాలో వెలువడిన పత్రికలు - డాక్టరేట్ పట్టభద్రులు - సాహితీ సేవచేసిన సహృదయుల వివరాలు ఈ గ్రంథంలో హృదయంగమంగా కన్పిస్తాయి యావదాంధ్రంలో సాహితీ మూర్ధన్యుడయిన అచార్య శ్రీనారాయణరెడ్డి - సుగృహీత నామధేయుడైన డా తిరుమల శ్రీనివాసాచార్య - డా అనుమాండ్ల భూమయ్య, జువ్వాడి గౌతమరావు, డా యశోదారెడ్డి, కేశవరావు గారు, ప్రస్తుత గ్రంధకర్త డాక్టరు మలయశ్రీ, ఉడయవర్లు - డాక్టరు బాపురెడ్డి, అందె వేంకటరాజం ఎందరో మహానుభావులు అందరకు అభినందన - చందనము సమర్పించారు రచయిత

ఈ బృహద్గ్రంథం అనుశీలించిన పిమ్మట కరీంనగర్ జిల్లా - సాహితీ సస్యశ్యామలమైన సుక్షేత్రం - "అచట పుట్టిన చిగురుకొమ్మైన చేవ" - అనిపిస్తుంది

## IV

శ్రీ మలయశ్రీ - బహుళ వ్యయ ప్రయాసలకోర్చి - బృహద్గ్రంథం వ్రాసి - అచ్చువేయగలిగినారు ఈ రచనలో సనాతన విద్వాంసులను మించిన వ్యుత్పత్తి, నవీన పరిశోధకులను మించిన శ్రమ ఒకచోట కన్పించుచున్నది ఈ సాహితీ క్షేత్రంలో - కొన్ని పిరమిడ్లు - కోవెలలు - ఒయాసిసులు - గోపురాలు - పర్వతశిఖరాలు - నదులు సరోవరాలు - సెలయేళ్ళు ఎన్నెన్నో రమణీయ సాహితీ దృశ్యాలు కన్పించుచున్నవి

డా మలయశ్రీకి నా అభినందనములు

**హేతువాద నవ్యహేవాక దీధితుల్ - కానుపించు అతని కనులలోన**
**చిత్తశుద్ధియున్న శ్రీమలయశ్రీని - అభినుతింతు నేను హార్దికముగ**

యుగయుగాంతరాల తెలుగువెలుగు గుండెలో పండించుకొన్న శ్రీ మలయశ్రీ - ఇక కొన్ని స్వతంత్ర రచనలు చేసి తెలుగుసాహిత్య చరిత్రలో చిరస్థాయి అయిన యశస్వీ కాగలరని ఆశించుచున్నాను

**మెరుపు తీగ అతడు - మేధావి తేజస్వి - నింగి నేల వెలుగు నింపగలడు**
**మెరుపు వెంటనంటి - మేఘగర్జన వ్రోగు - అతని పలుకుబడులయందు తరచు**

పైగా, ఈ గ్రంథాన్ని మలయశ్రీగారు సరస్వతీ స్వరూపిణి అయిన డా యశోదారెడ్డి గారికి అంకితం ఇవ్వడంలో ఔచిత్యం మాత్రమే కాక సాహితీ సమారాధన కూడా ఇమిడి ఉంది

— కం ఠారి రామ కృష్ణ మూర్తి

చేకూరి రామారావు
ప్రొఫెసర్, భాషాశాస్త్ర శాఖ
ఉస్మానియా విశ్వవిద్యాలయం

ప్లాట్ 22, వీధి 7
హబ్సిగూడా
హైదరాబాదు - 500 007

డిసెంబరు 17, 1997

మలయశ్రీ గారికి,

మీ పుస్తకాలు, ఆదేశం అందాయి ఇవాళే మిమ్మల్ని గురించి ఆలోచిస్తున్నాను ఇంత లోనే మీ ఉత్తరం

నన్ను చాలావాటికి క్షమించాలి ప్రతి పీఠికారచన ప్రతి ఉపన్యాసం నాకో పరీక్ష ఏదో ఆశించి నన్ను అడుగుతారు నాకు అది ఒక అగ్నిపరీక్ష అవుతుంది వాళ్లకు సమయానికి అందించలేకపోతున్నాను బేతవోలు రామబ్రహ్మం గారికి ప్రతి పీఠిక ఆరునెల్లకు తక్కువకాలేదు ఆయన పద్యకవితా పరిచయానికే తొందరగా ఇవ్వగలిగాను అదీ వారింట్లో కూర్చొనిరాయటం వల్ల శివసాగర్ 'ఉద్యమం నెలబాలుడు', కి బాలగోపాల్ గారి 'రూపం-సారం' పుస్తకాలకి ఇంకా ఎక్కువ ఆలస్యమయింది వాళ్లు నామీద దయతో క్షమించారు

అయినా ఇంత పరిశోధన చేసిన వారు మీకు ఒకరి సర్టిఫికేటు ఎందుకండీ నాకు ఈ డిసెంబరు నుఠీ ఊపిరాడనియ్యటం లేదు బుద్ధి తక్కువయి రకరకాల కమిట్మెంట్సు నెత్తి మీద పెట్టుకున్నాను జనవరి 6కి కాని తెరిపిన పడను అందాకా మిమ్మల్ని ఆగమనే నేరం చెయ్యలేను ఏ క్షణానయినా మీకు ఆలస్యమవుతున్నదనుకుంటే నాపేరిట ఒక కార్డుముక్క రాసి మీ పనికా నిచ్చేసెయ్యండి తప్పించుకోటానికి అంటున్న మాట కాదు ఇది మిమ్మల్ని ఇబ్బంది పెట్టటం ఇష్టం లేక ఇది ఎంత విలువైన పరిశోధనో గ్రహించాను విలువైన పుస్తకానికి తగిన పీఠిక రాయాలిగదా ! కరీంనగర్ జిల్లా లాంటి చైతన్య వంతమైన జిల్లాలో ప్రతిభావంతులైన కవులు రచయితలు ఉండటంలో అబ్బురంలేదు వాళ్లశక్తి కొద్దిగానైనా అనుభవించి రాస్తేనే ప్రయోజనం

ఓపికుంటే కాస్త ఓపిక పట్టండి మీకు వత్తిళ్లుంట go ahead and proceed నేనేమీ అనుకోను ఒక ఉత్తరం మాత్రం రాయండి సరేనా ?

చేరా

సంస్కృత సాహిత్యరత్న, విద్యాప్రవీణ
**డా కె రాజన్నశాస్త్రి,** ఎం ఏ , ఎం ఓ ఎల్ , పిహెచ్ డి
(రిటైర్డ్ తెలుగురీడర్ - ఉస్మానియా విశ్వవిద్యాలయం)
12-12-92, రవీంద్రనగర్
సీతాఫల్‌మండి, సికింద్రాబాద్ - 61

# అభినందన

కరీంనగర్ జిల్లా తెలుగు సాహిత్యచరిత్ర అను ఈ గ్రంధము నా పర్యవేక్షణలో ఉస్మానియా విశ్వవిద్యాలయము నుండి పిహెచ్ డి పట్టా పొందినది దీని రచయిత డా మలయశ్రీగారు భావనాపటిమగల కవులు, విమర్శకులు, వివిధ సాహిత్య ప్రక్రియలలో బహుగ్రంధరచన కావించిన లబ్ధప్రతిష్టులు ముఖస్తుతినెరుగని స్వభావము స్వాభిమానము మూర్తీభవించిన వారు నిష్టుర సత్యమునైనను నిబ్బరముగా చెప్పుదిట్ట వీరు ఇంతకు పూర్వమే 'కరీంనగర్ జిల్లా రచయితల చరిత్ర' అను గ్రంధరచన చేసినవారు కావున ఈ పరిశోధనాంశము వీరికి తగినదిగా భావించి యూనివర్శిటీ వారు అనుమతించి పరిశోధనకు తగిన న్యాయం చేకూర్చినారు

సాహిత్య చరిత్రలు వ్రాయుటయనగా అంత సులభమైన పనికాదు అందులో యిది విశ్వవిద్యాలయ పరిశోధనము ఏ గ్రంధాలయమందో కూర్చుని పది గ్రంధములు ముందుంచుకొని చదివి పరిశోధనపేర మరో గ్రంధమును వ్రాయుట సులభము కాని, ఇది అటులకాదు పలు ప్రదేశములకు తిరుగుట, కవులతో సంభాషించుట, వారి రచనలను సేకరించుట ఎంతో కష్టమైన పని వ్యయ ప్రయాసలకోర్చి, ముద్రిత - అముద్రిత గ్రంధముల సేకరించి, విషయ సంగ్రహమున వీరు చూపిన దృఢదీక్ష మెచ్చుకోదగినది డా మలయశ్రీ ఈ కరీంనగర్ జిల్లాలోని మినీకవితలు వ్రాసిన వారిని మొదలుకొని, ప్రౌఢ ప్రబంధరచనము కావించిన కవులనందరినీ ఈ సాహిత్యచరిత్రలో పొందుపరచినారు మార్గకవిత్వమునకు తోడుగా దేశికవితలకు జానపద వాఙ్మయమునకును తగిన స్థానం ఇచ్చినారు

ఈ గ్రంధము 0950 నుండి 1995 వరకు అనగా ఒక వేయి నలుబదియైదు సంవత్సరముల ఈ మండల సాహిత్యచరిత్ర ఇది పూర్వకాలం, ఈ శతాబ్ది పూర్వోత్తర భాగములని ముఖ్యంగా మూడు భాగములు అధ్యాయములు ఏడు శీర్షికలు, ఉపశీర్షికలు అదనం

విశేషమేమన 950 నుండి 1950 వరకు ఆయా కవుల పరిచయం వారి రచనలపై సమగ్ర సమాలోచన చేయబడినది ఇది రచయితకు గల సునిశిత పరిశీలనా పటిమను చాటుచున్నది వెలిగందుల నారయ 'నారాయణశతకకర్త' యని సోపపత్తికముగా నిరూపించుట, కృష్ణశతకకర్త నరసింహదాసు స్వస్థలం ధర్మపురి అని ఇదమిత్థముగా నిర్ణయించుట,ఎంతో యుక్తి యుక్తముగా నున్నవి ఇట్లెన్నో విషయములను వెలికిదీసి తమ పరిశోధనాంశమునకు వీరు పుష్టి చేకూర్చినారు ఆయా కవుల రచనల ముద్రితాముద్రితములను కూడ ఎంతో ఓపికతో పరిశీలించి వానిలోని వైశిష్ట్యమును చాటిచెప్పినారు రచయిత తాను స్వయముగా కవియగుటచే రచనకు వన్నెతెచ్చినది

కాని, దర్మపురి శేషాచలదాసు 'త్రిశతి'ని ముద్రించిన వీరు శ్రీ శ్యామసుందర శాస్త్రిగారు అయినా శేషప్పపూర్వ ముద్రిత శతకాల్లో కనిపించని పదహారు కొత్త పద్యాలను కనుగొన్న వారు శ్రీ ఇందవరపు నర్సింగరావు గారు

ఇక 1951 నుండి 95 వరకు గల రచయితల పరిచయము వ్యక్తిగతముగా కాక సాహిత్య ప్రక్రియా పరముగా చేయబడినది కావున ప్రతి సాహిత్య ప్రక్రియలోను ఆయా రచయితల పేర్లు పేర్కొనబడుటచే రెండు మూడు ప్రక్రియలు వెలయించిన వారి పేర్లు ప్రతి సందర్భములోను ఉదహరించవలసి వచ్చినది కావున కరీంనగర్ జిల్లా సాహిత్య చరిత్ర అను ఈ గ్రంధమును కరీంనగర్ జిల్లా సాహిత్య విజ్ఞాన సర్వస్వముగా నెంచవచ్చును

మరియొక విశేషము - ఈ గ్రంధ రచయిత, పర్యవేక్షకుడనగు నేను కృతి స్వీకర్త డా యశోదారెడ్డి గారు ముప్వురమును కరీంనగర్ జిల్లా వారమగుట ముదావహము

ఇట్టి మహోర్షమైన కరీంనగర్ జిల్లా సాహిత్యచరిత్ర అను గ్రంధమును నా పర్యవేక్షణలో రచించి కరీంనగర్ జిల్లా తెలుగుసాహిత్య సేవను అజరామరముచేసిన డా॥ మలయశ్రీ గారిని హృదయపూర్వకముగా అభినందించుచున్నాను

శ్లో॥ మలయశ్రీ సాహిత్యం ।మలయజమివ సురభిళంచ హృదయజ్ఞమ్ ।
ఆహ్లాదయతుచ భూయో । భూయోప్యాబాల వృద్ధ హృదయాని ॥

సికిందరాబాద్
26-12-97



డా॥ మలయశ్రీ - భారతీదేవి దంపతులకు మౌక్తిక ప్రవాళాభిశేఖ సన్మానము
తేది 3-3-96 కోరుట్ల

# నా మాట

ఈ గ్రంథ రచనకు అయిదేండ్లు, ముద్రణకు రెండేండ్లు మొత్తం ఇది నా ఏడేండ్ల కాలాన్ని తీసుకుంది డాక్టర్ డిగ్రీపొందాలనే నా కోరిక ఇరవైయేడేండ్ల నాటిది 1970లో పి జి చేశాను ఉద్యోగ విరమణకు (1998 అక్టోబర్) మూడేండ్లు ముందుగా దీన్ని సాధించి, ఏడాది సర్వీస్ ఉండగా ఇలా దీన్ని పుస్తకరూపంలో చూడగలుగుతున్నాను ఉద్యోగపరంగా దీనివల్ల ఒక్క రూపాయికూడ నాకు లాభం కలుగలేదు అయినా - 'చదువులలో సారమెల్ల చదివితి తండ్రీ !' అని పోతన భాగవతంలో ప్రహ్లాదుడన్నట్లుగా ఏదో సంతృప్తి ఏ ఒక్క రచయితనో పుస్తకాన్నో కాక, అన్ని రకాల రచయితల - అన్ని ప్రక్రియల పుస్తకాల, అదీ నా జిల్లా వారిని లబ్ధప్రతిష్ఠులను, వర్ధమానులను, ప్రావేశికులను ఒక్కచోట చేర్చి సాహిత్యాభిమానులకు అనిదం పూర్వకంగా పరిచయం చేసే మహదవకాశం నాకు లభించింది అందుకు ఆనందిస్తున్నాను వ్యాపారదృష్టిగల ఈనాటి పత్రికలు, పబ్లిషర్లు, సినిమాలు, టి వి లు మన సాహిత్యాన్ని ఎటు తీసుకుపోతున్నాయో అందరికీ తెలిసిన విషయమే రేపటి కాలాన మన సాహిత్యానికి ఆదరణ ఎంత లభిస్తుందో తెలువదు కాని, మంచి సాహిత్యానికి ఏమాత్రమైనా విలువంటూ ఉంటే, ఈ నా కృషితప్పక గుర్తింపు పొందుతుందనే విశ్వాసం నాకుంది

1981లో 'కరీంనగర్ జిల్లా రచయితల చరిత్ర' ను 320 పుటల్లో కీ శే వెలిచాల కేశవరావు (గుండి) గారి ప్రోత్సాహంవల్ల రచించి ప్రచురించాను ముందుగా రిజిస్ట్రేషన్ అయివుంటే దానికి డాక్టర్ డిగ్రీ తప్పకవచ్చి ఉండేది - అని ప్రశంసించారు కీ శే డాక్టర్ కేతవరపు రామకోటి శాస్త్రి కాకతీయ యూనివర్సిటీ ప్రొఫెసర్‌గారు నిజానికి అప్పటికీ ఇప్పటికీ ఆ మాత్రపు జిల్లా సాహిత్యచరిత్ర ఏ జిల్లాలోనూ రాలేదు ఇప్పుడిది యునివర్సిటీస్థాయిలో వెలువడిన మొట్టమొదటి ఒక జిల్లా సమగ్ర సాహిత్య చరిత్ర కావడం నా భాగ్యం

నాకు 'తెలుగులో లేఖా సాహిత్యం' అనే అంశంపై పరిశోధన చేయాలని ఉండేది గ్రంథరచన కూడా చేశాను కాని, ఆ అంశం ఉస్మానియాలో అంతకుముందే మరొకరికి కెటాయించబడింది నా పుస్తకాన్ని తెలుగు అకాడెమి పుస్తకంగా 1992లో ప్రచురించింది

నా మొదటి 'క జి ర చరిత్ర' ను చూసి 'క జి తెలుగు సాహిత్య చరిత్ర' అను ఈ అంశంపై సమగ్ర పరిశీలన చేయండని ప్రోత్సహించినవారు డా ఎం కులశేఖరరావు గారు సరే అని అంగీకరించి 1989లో యునివర్సిటీలో చేరాను నా సొంతడబ్బు, సొంత సెలవులు వినియోగించుకొని అయిదేండ్లు పరిశ్రమించి ఈ గ్రంథ రచన కావించాను కాలేజీ లెక్చరర్లకు పూర్తి వేతనంతో పిహెచ్ డి పరిశోధనకు పూర్తికాలపు సెలవు లభిస్తుంది ఫ్రెష్ రిసెర్చి స్కాలర్స్‌కు స్కాలర్‌షిప్‌లు లభిస్తాయి ఈ లెక్కన ఒక పిహెచ్ డి గ్రంథరచనకు ఒకటి - రెండు లక్షలు మన ప్రభుత్వం వారు ఖర్చుపెడుతున్నారు అయినా ఏ మాత్రం విలువగల పుస్తకాలు వస్తున్నాయనేది వేరే విషయం "మన యునివర్సిటీల్లో నేర్పరు - నేర్పరు" అన్నారు ప్రముఖ జర్నలిస్టు జి కృష్ణగారు అందులో కొంత నిజం లేకపోలేదు పనికిరాని కాలదోషం పట్టిన అంశాలపై పరిశోధనలు కావించడం మనవాళ్ళు మానుకుంటే బాగుంటుంది పీఠాధిపతులు వారి గురువులవో బంధువులవో కాక సత్తాగల సామాన్యస్థాయి రచయితల పుస్తకాలపై పరిశోధనలకు అనుమతించితేనే సమకాలీన సమాజానికి ప్రయోజనం

నేను ఈ పరిశోధనకు ప్రవేశించే ముందు సీటుకోసం జరిగిన ఇంటర్వ్యూలో డా నాయనికృష్ణకుమారి, డా ఎం కులశేఖరరావు, డా ఎస్వీ రామారావుగారలు ఉన్నారు పరీక్షకులుగా అప్లికేషన్ ఫాంపై సంతకం పెట్టినవారు డా అమరేశం రాజేశ్వర శర్మగారు పరిశోధనలో చేరింది

డా కులశేఖరరావు గారికాలంలో పరిశోదన ఆరంభించింది డా వేటూరి ఆనందమూర్తి గారి కాలంలో డా సీతాకల్యాణి, డా ఎస్వీ రామారావు గారలు తెలుగుశాఖాధ్యక్షులుగా ఉండగా రచనసాగింది ఈ థీసిస్ సమర్పించి వైవా జరిగి 1995లో డిగ్రీ పొందింది డా ఎన్ గోపి గారి హయాంలో ఈ సిద్ధాంత గ్రంధ ప్రచురణకు అనుమతి పొందింది డా ఎల్లూరి శివారెడ్డి గారి కాలంలో పేరు ప్రతిష్టలుగల ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగు విబ గంలోని ప్రొఫెసర్లు, రీడర్లు, లెక్చరర్లు అందరూ నన్ను ఆదరంతో చూశారు వారేకాక అక్కడి తమిళ, కన్నడ, సంస్కృత శాఖల అద్యాపకులు కూడా అడిగిన అనుమానాలను తీర్చి సహకరించారు వారందరికీ కృతజ్ఞతలు అర్పించుకోవడం వినా నేనేమిచ్చుకోగలను

'దీపము వలననొండొక దీపము ప్రబవించినట్లు తేజంబెసగన్' (నన్నయ భారతం) సంతాన వృద్ధిలోనే కాక విద్యా సాహిత్య విజ్ఞానాల అభివృద్ధి - వ్యాప్తి అలా జరిగితేనే సమాజానికి ప్రయోజనం కదా !

ఈ గ్రంధ విషయసేకరణ కోసం, రచన కోసం నేను ఎన్నెన్ని ఊళ్ళు తిరిగానో ఎన్ని గ్రంధాలయాలు చూశానో, ఎందరు వ్యక్తులతో సంభాషించానో ఎంత శ్రమపడ్డానో వివరించలేను 'ఆ బాధల్ హృదయైక సాక్షికములేమన్నన్ వృధాయిత్తరిన్ !' మన రచయితలు అలసులు - అశ్రద్ధాపరులు, అంతగా రాయరు రాసినవి అచ్చేయరు అచ్చేసినవైనా చక్కగా భద్రపరచుకోరు వారి సొంత రచనల విషయమే ఇట్లా ఉంటే, ఇక వారి పూర్వీకులవో ఇతరులవో సాహిత్య వివరాలు ఏం చెప్పగలరు 'కాళరాత్రి అంధయాత్ర' గా సాగిన నా పరిశోధన - రచన ఎన్ని ప్రయాసలు ఎదురైనా వాటినన్నింటిని అధిగమించి గమ్యాన్ని చేరినందుకు సంతోషంగా వుంది

ఈ సిద్ధాంత రచన పర్యవేక్షకులు రీడర్ డా కె రాజన్నశాస్త్రి గారు సంస్కృతంలో దిట్ట - కవి వారిది మా కరీంనగర్ జిల్లాలోని ధర్మపురి నేను ఈ పరిశోధనకు పూనుకునే నాటికి ఏబది పుస్తకాలు అచ్చయిన రచయితను (నా 'శాంతిపధం' నాటకం, 'తిరుగుబాటు' నవల, కాకతీయుల కాలంనాటి సామాజిక జీవితం, డా బి ఆర్ అంబేద్కర్ జీవితచరిత్ర పుస్తకాలు తెలుగు అకాడెమీ, విశాలాంధ్ర, తెలుగు విశ్వవిద్యాలయం, ఆంధ్రప్రదేశ్ వయోజన విద్యాశాఖ మొ॥ ప్రముఖ సంస్థల గుర్తింపుగల రాష్ట్రస్థాయి పోటీ బహుమతులు తెలుచుకున్నవి ) శాస్త్రిగారు సంప్రదాయ ప్రియులు నేను ఆదునిక బౌతిక భావాభిమాన మానవతావాదిని వారు తూర్పు - నేను పడమర మా చర్చలు రసవత్తరంగా సాగేవి జవనాశ్వంలా పరుగెత్తే నా కలానికి వారు కళ్ళెం మూడుసార్లు తిప్పి రాశాను మా పరస్పర భావ అవగాహన, సామరస్య ధోరణి ఈ రచన పరిపుష్టికి కారణమైనవి

రచన చేయడం ఒక యెత్తు దాన్ని అచ్చువేయడం మరో యెత్తు అమ్ముకోవడంలోని ప్రయాస రచయితలందరికీ అనుభవంలోనిదే దీని ముద్రణకు ఒక లక్ష రూపాయలు అంచనా వ్యయం ఈ పరిశోధనకే నలభైవేలవరకు ఖర్చయినాయి గ్రంధముద్రణకు ఉదార హృదయులైన సాహితీమిత్రులు సహకరించడం వల్లనే ఇప్పుడిది వెలుగుచూసింది వారందరికీ వినమ్రుడను

ఇక - "ఇత్తు మనుచు తిప్పించుకు దత్తమ్మున సగమెయిచ్చు దాతలు" అనేకులు అక్కడికి మేలే కాని, ఇవ్వగలిగీ ఏమీ ఇవ్వనివారు, ఇస్తామని చెప్పి తిప్పితిప్పి ముఖం చాటుచేసుకొని తప్పించుకున్నవారు నాకు పలువురు తారసిల్లారు పుచ్చుకోవం తప్ప ఇచ్చుకోవటం తెలువని 'పుచ్చుబుద్ధుల' కుక్షింభర స్వార్ధ ధూర్త ధన ప్రలోభ లోభ నీచ ప్రవృత్తుల ప్రసక్తి మనకెందుకు లెండి నిరసనేవారికి తగిన ప్రతిఫలం ! మూఢ విశ్వాసాలకు, అనవసర ఆడంబరాలకు, దురాశా దుర్వ్యవహారాలకు డబ్బు వెచ్చించే ఈ జనానికి, ప్రజాహిత కార్యక్రమాలకు సహకరించే సద్బుద్ధి ఎన్నడు కలుగుతుందో ఇంకా నేను చందాలకు తిరుగుతున్న కాలంలోనే - పర్వాలు, ఉప్పెనలు,

ఎన్నికలు, ఇతర కవుల సొంత సన్మానాల సంచికల చందాల పోటీలు, అచ్చయిన పుస్తకాలకూ యాచనలు ఎదురైనాయి కులం, తలం, మోమోటం బలీయమైనవి కదా అయినా నాకు ఈ సహాయం లభించడం విశేషం ! నాపై కల అభిమానానికి తోడుగా ఈ రచన వస్తుగౌరవం దీన్ని సాధ్యం చేసింది

ఈ గ్రంధం కేవలం నా ఒక్కని "చేతిరచన" వేతనం ఇస్తానన్నా రాతపూతలకైనా ఎవరూ సహాయకులు లభించలేదు పల్లెలు పట్టణాలు తిరిగి తిరిగి, వందల మందిని సంప్రదించి, వేల పుస్తకాలు సేకరించి - చదివి, విషయసేకరణ కావించి ఈ రచన చేయడం జరిగింది కొన్నిసార్లు ఒక్కొక్క రచయిత వివరాల కోసం పలుగ్రామాలు తిరగడమే కాక, పొరుగు జిల్లాలకు సైతం వెళ్ళవలసి వచ్చింది పూర్వం వలె కాక ఉన్నత విద్య ఉద్యోగాల కారణంగా ఈనాటి వాళ్ళు ఉన్నూళ్ళు వదలి పొరుగు ప్రాంతాల్లో ఉంటున్నారు కదా కాల నిర్ణయ కవివంశ పరిశీలనల్లో చాగంటి శేషయ్యగారిని, సాహిత్య సమీక్షల్లో ఆరుద్ర విధానాన్ని అనుసరించినా రచనా ప్రణాళిక, విషయ సమాలోకను నా సొంతం

1990 వరకే ఇందలి విషయం ఉంచాలనుకున్నా, గ్రంధ సమర్పణ 1995 వరకు ఇక్కడ నూతనంగా వచ్చిన సాహిత్యాన్ని సేకరిస్తూ ఇందులో చేరుస్తూనే ఉన్నాను డిగ్రీ వచ్చిన తర్వాతకూడా యిది అచ్చయ్యే దాకా (డిసెంబర్ - 1997) ఇక్కడ వెలువడిన ప్రతి పుస్తకాన్నీ ఇందులో చేరుస్తూనే వచ్చాను ఈ పరిశోధన కాలంలోనే నావో పది పుస్తకాలు వచ్చాయి డా సి నారాయణరెడ్డి గారివో అయిదారు, రేగులపాటి వారివో నాలుగు పుస్తకాలు ముద్రణ పొందాయి ఈ గ్రంధంలో చేరడానికే వచ్చినాయో అన్నట్లు నాకు డిగ్రీ వచ్చిన తర్వాత ఇది అచ్చవుతున్న కాలంలో ఇక్కడి రచయితల ఈ క్రింది పుస్తకాలు వచ్చాయి అవి ఖబర్దార్, కన్నీటిగాధలు, యుద్ధలేఖ, సుదీర్ఘజ్ఞాపకం, శిలాఘోష, సమతాగీతాలు, సత్యవాణి శతకం, మేర మల్లేశం పాటలు, మట్టిస్పర్శ, ప్రతిస్పందన, అశ్రుగీతి, అభినవ సూక్తులు, వింతలోకం, నీతిశాస్త్రం, లోకం పోకడ, వర్తమాన చిత్రం, కె రామలక్ష్మణ్ దళితపాటలు, కోతిగీతాలు, బాలవాక్కు, నాలుగు దృశ్యాలు, చుక్కల లోకం, ఉప్పెన మొదలైనవి ఇందులో అధికాంశం నా ప్రమేయం కలవి కావడం విశేషం

నా పరిశోధన గ్రంధ రచనకు ఆనందించి, నా విజయాన్ని వినకముందే, ఈ గ్రంధాన్ని కనక ముందే కీర్తిశేషులైన సాహితీనిధులు నా సాహితీమిత్రులు వీరు 1 వెలిచాల కేశవరావు 2 పింగళి లింబాద్రిరెడ్డి 3 శతావధాని కృష్ణమాచార్య 4 ఎస్ కె పిళ్ళె 5 వెంకటరాజన్న అవధాని 6 వానమామలై జగన్నాధాచార్యులు 7 కాకుత్సం అనంతస్వామి 8 జి సురమౌళి 9 అలిశెట్టి ప్రభాకర్ 10 సి ప్రభాకర్ 11 సాహు 12 జి మల్లేశం - వారికి నా బాష్పాంజలి !

నేను ఈ రచనకోసం సేకరించిన విషయం ఎక్కువ - గ్రంధస్థం చేసింది తక్కువ గ్రంధ ముద్రణ కాలంలో మరింత తగ్గించాను కంప్యూటర్ల ముద్రణలోని యిబ్బందుల కారణంగా పాదపీఠికలను సైతం సగం తగ్గించాను అయినా విషయ స్పష్టతకు లోటురాకుండా ఉండేవిధంగా జాగ్రత్త వహించాను ఇది బృహత్కార్యం కాబట్టి, అనుద్దేశ్యపూర్వకంగా ఇందులో ఏవైనా తప్పులు దొర్లితే క్షంతవ్యుడను (ఉదా డా సి నారాయణరెడ్డిగారు జన్మ సంవత్సరం 1931 వారు ఎం పి కావడానికి ముందు నిర్వహిస్తున్న ప్రభుత్వశాఖ పదవి పేరు - ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సాంస్కృతిక మండలి అధ్యక్షులు 1997 జూలైలో వెలువడిన వారి 'మట్టీ మనిషీ ఆకాశం' దీర్ఘకావ్యం ఇవి నా రచనలో తప్పిన సంగతి వారు స్వయంగా తేది 3/112/97 లేఖలో తెలిపేవరకు నా దృష్టికి రాలేదు ఇలాగే ఒకచోట కృతిపతి - కృతిసతి అయ్యింది ఇలాగే ఇంకెన్నో ! ) అయినా అంత ప్రమాదకరమైన స్ఖాలిత్యాలు లేవనే నా విశ్వాసం స్వయంగా ప్రూఫ్స్ సరిచూసినప్పటికీ, కొన్నిసార్లు అందుకు తగిన వ్యవధి లభించక,

కరెంటుకోత కారణంగా కొవ్వొత్తి వెలుగులోనూ చదువవలసి వచ్చినందువల్లనూ కొన్ని పదాల అక్షరాలు తప్పిపోవచ్చు ప్రమాదో ధీమాతా మపి ! నేను సామాన్యుడను

జ్ఞానపీఠ అవార్డుగ్రహీత, పద్మభూషణ్, డా సి నారాయణరెడ్డి ఎం పి గారి 'రాజశాసనం' ఆశీరభివందన, పీఠికా ప్రబంధ పరమేశ్వరులైన డా నండూరి రామకృష్ణమాచార్యుల 'హితవాక్కు' అని 'బహిరంగ స్వగతం' సంస్కృతాంధ్రోభయభాషలవిదుషీమణి డా యశోదారెడ్డి గారి 'మాతృవచనం' , ఆధునిక సాహిత్య విమర్శకాగ్రేసరులైన డా చేకూరి రామారావు గారి 'సుహృల్లేఖ', డా కె రాజన్నశాస్త్రి గారి మైత్రీ 'అభినందన' ఈ గ్రంధానికి అలంకారాలుగా నిలిచాయి వారికి మనసా వాచా కర్మణా నమోవాకాలు అర్పించుకుంటున్నాను

ఈ కృతిని ఆదరంతో స్వీకరించిన కళామూర్తి కీ శే పాకాల తిరుమల్‌రెడ్డి గారికి, సంస్కృతాంధ్రో బయబాషల సమపాండిత్య యశోవిరాజిత అభినవ సరస్వతి ప్రొఫెసర్ పి యశోదారెడ్డి గారికీ నా కృతజ్ఞతా పూర్వక అభివాదాలు నా సాహితీ సంచారయాత్రలో తగిన సమాచార మందిచ్చి, ఆతిధ్యమిచ్చి సహకరించిన సహృదయ సాహితీ మిత్రులకందరికీ కృతజ్ఞతా వందనాలు

పిహెచ్ డి పరిశోధన కాలంలో గ్రంధ ముద్రణ కాలంలోనూ భాగ్యనగరంలో నాకు ఆతిధ్యమిచ్చి ఆదరంతో చూసిన నా సొంతతమ్ములు ఎస్ రామయ్య, అసిస్టెంట్ మేనేజర్ బి డి ఎల్, ఆయన బార్య ఇందిర, పిల్లలు వీణవాణిలకు (వైశాలీనగర్ - న్యూచంపాపేట), డా ఎస్ లక్ష్మినారాయణ, ఎం కాం ,ఎం ఫిల్ , పిహెచ్ డి ఆయన భార్య నిర్మల, ఎం ఎస్సి సెక్రటేరియెట్, వారి పిల్లలు రాజీవ్, కార్తీక్‌లకు - నా ప్రీతివచన శుభాకాంక్షలు !

జీతాన్ని - జీవితాన్ని మొత్తం సాహిత్యానికే వెచ్చిస్తూ సంపాదించినదేమీ మిగిల్చుకున్నా, నన్నూ నా సాహిత్యాన్ని గౌరవప్రేమభావంతో చూస్తూ ఆనందిస్తున్న నా పిల్లలు - కుమారుడు ఎస్ హర్షవర్ధన్, బి కాం ,బి ఇడి , కోడలు దీనాదేవి, పౌత్రులు విక్రమాదిత్య, విజయాదిత్యలకు, కుమార్తె జ్యోత్స్నరాణి, అల్లుడు టి వి సాల్మన్‌రాజు, బి ఏ ,దౌహిత్రి స్వప్న దౌహిత్రుడు మణిపాల్‌లకు - అభ్యుదయ పరంపరాభివృద్ధిగా శుభాకాంక్షలు !

"ఆకలెరుగను దాహమెరుగను నీవుతోడుంటే" అన్నట్లు ఆమెనుకాక సాహిత్యాన్నే ఆరాధిస్తున్న నన్ను ఓ పసివాడుగా భరించి ఆలనా పాలనా చూస్తున్న నాసతిభారతీ దేవికి ధన్యవాదాలు !!

ఈ కృతిని అందంగా ముద్రించిన అనుపమ ప్రింటర్స్, శాంతినగర్ హైదరాబాద్ - 28 వారికి, డి టి పి సహకారం అందిచ్చిన ఫాంటేలైన్ గ్రాఫిక్స్, బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్ వారికి, పుస్తకం ముందు వెనుక పుటలతో సహా ముఖపత్ర చిత్రరచన సమకూర్చిన జయశ్రీగ్రాఫిక్స్ జగిత్యాల కరీంనగర్ జిల్లా వారికీ నా కృతజ్ఞతలు

ఈ గ్రంధ రచన అలంకరణ ప్రచురణ విషయాల్లో సహకరించిన సహృదయులకందరికీ పేరుపేరునా నా ధన్యవాదాలు సెలవిప్పటికీ, స్నేహమెప్పటికి !

సాహితీ మిత్రుడు

డా॥ మలయశ్రీ

(చంజర్ల - 505 469)

5 1-301, LIC బిల్డింగ్,
కోరుట్ల - 505 326,
జి॥ కరీంనగర్ ఆంధ్రప్రదేశ్

# విషయసూచిక



## మొదటి భాగం 950 - 1900

## రెండవ భాగం 1901 - 1950



## మూడవ భాగం 1951 - 1995




గ్రంధా ఆవిష్కరణ

# కరీంనగర్ జిల్లా చారిత్రక శాసన ప్రదేశాలు



కురిక్యాల కొండన్నపల్లి శాసన స్థలం



రాయికల్ శాసనం



ఉప్పరపల్లి - గొడిశాల



చంద్రవల్లి గృహాలు


ధూళికట్ట - నాగముచికుంద


కాళేశ్వరం


పోలాస


ధర్మపురి


శనిగరం


నగునూరు

# కరీంనగర్ జిల్లా తెలుగు సాహిత్య చరిత్ర

## ప్రవేశిక

వెయ్యేండ్లది తెలుగు సాహిత్యం
ఇంచుమించు రెండు వేలేండ్లది తెలుగు భాష

భారతదేశంలో జనసంఖ్య రీత్యా తెలుగు వారిది రెండవ స్థానం భాషా సాహిత్యాల విషయంలోనూ అంతే

సంస్కృత ప్రాకృత భాషా సాహిత్యాలు క్రీస్తుకు పూర్వ కాలపువి వాటి ప్రభావం ఇతర భారతీయ భాషలపై వలెనేతెలుగుపై కూడా ప్రసరించింది తెలుగు ద్రవిడ భాషా కుటుంబానికి చెందిన భాష అయినా మనవాళ్ళు మత సంస్కృతుల - రాజకీయాల కారణంగా సంస్కృత ప్రాకృతాలను అమితంగా ఆదరించారు వాటిని తమ మాతృభాషగా అభిమానించి అధ్యయనం చేసి పాండిత్యం సముపార్జించారు ఆ భాషల్లో ఉద్గ్రంధ రచనలు చేశారు అయినా

మన పూర్వులు తమ మాతృభాష అయిన ఆంధ్రాన్ని నిరాదరణపాలు చేయలేదు దీనిని ప్రేమిస్తూ పెంపొందించుతూనే ఉన్నారు సంస్కృత ప్రాకృతాలతో దీనికి పుష్టిని చేకూర్చారు తెలుగు సాహిత్యాన్ని వెలయించారు

క్రీ శ 5 6 శతాబ్దాల నుండే తెలుగు కవిత వ్యాప్తి పొంద సాగిందనడానికి నిదర్శనం 9వ శతాబ్దిలోని అద్దంకి బెజవాడల తెలుగు పద్యశాసనాలు

క్రీ శ 1050 సుమారుగా నన్నయభట్టు తీరాంధ్ర దేశంలో భారతాంధ్రీకరణం కావించి, ఆదికవి బిరుదుకు పాత్రుడైనాడు తదాదిగా ఎన్నో సంస్కృత పురాణ కావ్య నాటకేతిహాసాలు తెలుగు సేయబడ్డాయి స్వతంత్ర కథా కావ్యాలు వర్ణనా ప్రబంధాలు కూడా వచ్చాయి ఆ కాలంలో పద్యానిదే పై చేయిగా ఉండేది అయినా అప్పుడు ఆ మార్గ కవితకు సమాంతరంగా, దేశి కవితా ప్రక్రియలైన యక్షగాన గేయ వచన రచనలు, కొంత ఆలస్యంగానైనా గణనీయంగా వెలువడ్డాయి

జానపద గేయకథా వాఙ్మయానిదొక ప్రత్యేక శాఖ మానవులకు మాటతోపాటే పాట పుట్టింది అది నాడు నాగరికుల ప్రశంసలకు నోచుకోకున్నా జానపదుల, స్త్రీల, బాల బాలికల హృదయాలను దోచుకొని నాటి నుంచి నేటి వరకు అవిచ్ఛిన్నంగా సాగి వస్తున్నది ఈనాడు పండిత పామరుల అందరినీ రంజింపజేస్తున్నది

ఆధునిక యుగంలో ఆంగ్ల సాహిత్య పరిచయం వలన కథ, నవల, నాటిక, వ్యాసం, ఆత్మకథ వంటి వివిధ నూతన ప్రక్రియలతో తెలుగు సాహిత్యం బహుముఖమై విలసిల్లింది ఉర్దూ అరబ్బీ సాహిత్యాల వలన ఎంతో కొంత మన భాష మారిందే తప్ప సాహిత్యం మారలేదు అప్పుడు నూతన సాహితీ ప్రక్రియలు అవతరించలేదు

ఇప్పుడు ఈ తెలుగు సాహిత్యం మన భారత దేశంలోని ఏ ఇతర బాషా సాహిత్యానికి కానీ, రాశిలోనూ వాసిలోనూ తీసిపోని సమున్నత స్థానాన్ని అధిష్టించింది వెయ్యేండ్ల ఆంధ్ర సాహితీ మహాస్రవంతిలో ఈ కరీంనగర్ జిల్లా సబ్బి రాష్ట్రం తెలుగు సాహిత్యం ఒక ఉపనది ఈ మండలం మొదటి నుండి కవి పండితులకు నిలయం కన్నడ ఆది కావ్య సృష్టి పంప మహాకవి చేత ఇక్కడి వేములవాడలో జరిగింది కథా సరిత్సాగరం రచించిన సోమదేవ ప్రభు ఇక్కడి వాడు సంస్కృతంలో నాడూ నేడూ ఈ ప్రాంతంలో ఉద్దండ పండితులు మహాకవులున్నారు

ఈ జిల్లాలో వందల సంఖ్యలో తెలుగు కవులు అసంఖ్యాక కావ్యాలను రచించారు నేటి కరీంనగర్ జిల్లా పరిధిలోని నాటి సబ్బిసాయిర మండలంలో వేముల వాడ రామగిరి, నగునూరు, పొలాస, వెలిగందుల, ధర్మపురి, శనిగరం, మొలంగూరు, మొదలైనవి సామంత రాజధానులు

కాళేశ్వరం, వేములవాడ, ధర్మపురి ప్రముఖ యాత్రా స్థలాలు

రాచరిక కాలాల్లో ఇక్కడి పాలకులు తెలుగు కవుల పోషించి చక్కని పద్య కావ్యాల విరచింప చేశారు మాతృభాషాభిమానంతో ఈ ప్రాంతంలోపలువురు కవులు స్వతంత్రంగానూ గ్రంధ రచన కావించారు కరీంనగర్ జిల్లా (సబ్బివాడు)లో తొలి తెలుగు పద్య కవిత వేముల వాడ జినవల్లభుని కంద పద్యాలతో క్రీ శ 946 సం లో ఆరంభమైంది ఆ తర్వాత కాకతి యుగం వరకు దాదాపు రెండు వందలేండ్లు కన్నడ సంస్కృత భాషల్లో శాసన - కావ్య సాహిత్యం వచ్చింది తప్ప తెలుగు కావ్యాలు రాలేదు ఆ కాలంలో మితంగా తెలుగు వచనం శాసనాల్లో చోటు చేసుకున్నది ఈ జిల్లాలో కాకతీయుల పరిపాలనా కాలమైన 12, 13వ, శతాబ్దాల్లోనూ సంస్కృతాంధ్ర పద్యగద్య శాసనాలు తప్ప ప్రత్యేకంగా కావ్య సృష్టి జరిగిన ఆధారాలు లేవు

14వ, శతాబ్దిలో మడికి సింగన కవి, 15వ శతాబ్ది వెలిగందుల నారన 16వ శతాబ్దివాడైన చరికొండ ధర్మన తెలుగు కావ్య నిర్మాతలు వేముల వాడ భీమకవి ఇక్కడి వాడనే ప్రతీతి

16 నుండి 19 వరకు నాలుగు శతాబ్దాల్లో నరసింహ శతక కర్త శేషప్ప వసుచరిత్ర ప్రబంధ వ్యాఖ్యాత సోమనాధుడు తప్ప ఇక్కడి మరే రచయిత పేరూ వ్యాప్తి పొందలేదు అయినా ఆ కాలంలో ఇక్కడ కొందరైనా కావ్య కర్తలు లేక పోలేదు కృష్ణ శతక కర్త నరసింహదాసు కూడా ఈ జిల్లావాడు పద్య కావ్యాలతోపాటు యక్షగాన వాఙ్మయం కూడా నాడు ఈ మండలంలో పుష్కలంగా వెలువడింది ఇక్కడి కవులు 19వ శతాబ్దిలో కూడా గత సంప్రదాయ పద్ధతిలోనే రచనలు చేస్తూ వచ్చారు 20వ, శతాబ్ది పూర్వార్థం వరకూ అంతే

ఈ ఇరువదవ శతాబ్దిలో ఈ కరీంనగరం జిల్లాలో అపారంగా సాహితీ సృష్టి జరిగింది జరుగుతున్నది అఖిలాంధ్ర - భారత ఖ్యాతిని ఆర్జించిన కవులు - రచయిత(త్రు)లు ఇక్కడి వారు అనేకులున్నారు

ఈ జిల్లాలో వివిధ ప్రక్రియల్లో రచనలు చేసి చేస్తూ రాణించిన వారిలో కొందరు ముఖ్యులు వీరు -

సర్వశ్రీ మన దేశ ప్రధాని ఎ వి నరసింహారావు జ్ఞాన పీఠ అవార్డు గ్రహీత ప్రొఫెసర్ పద్మశ్రీ డాక్టర్॥ సి నారాయణ రెడ్డి అధికార భాషా సంఘాధ్యక్షురాలు ప్రొ డా॥ పి యశోదా తిరుమల్‌రెడ్డి తెలుగు అకాడమి కులపతి డా॥ వి కొండల్ రావు కలెక్టర్ కవి డా॥ జె బాపురెడ్డి కీ శే మామిడి పల్లి సాంబశివ శర్మ కీ శే శతావధాని సిరిశినహాల్ కృష్ణమాచార్యులు కీ శే వానమామలై జగనాధాచార్యులు కీ శే వేంకట రాజన్న అవధాని కీ శే సేనాపతి రామాచార్య కీ శే పింగళి లింబాద్రి రెడ్డి కీ శే వెలిచాల కేశవరావు జువ్వాడి గౌతమరావు డా॥ కె రాజన్న శాస్త్రి ముద్దసాని రాంరెడ్డి కీ శే గట్టెపల్లి సత్యనారాయణ రాజు కె మల్లికార్జున్ కనపర్తి కీ శే మహ్మదలీ కవి, తాడిగిరి పోతరాజు కీ శే జి సురమౌళి డా॥ మలయశ్రీ వడ్డేపల్లి కృష్ణ కీ శే దశరథ్, కీ శే ఆధివేంకటాచార్యులు డా॥ అందె వేంకటరాజము నల్లాన్ చక్రవర్తుల వేదాంతాచార్యులు పార్వేల గోపాలకృష్ణ దూడం నాంపల్లి చొప్పకట్ల చంద్రమౌళి, శ్రీగాదె శంకరకవి కవి గణపతి రామచంద్రరావు డా॥ ముదుగంటి సుజాతా గోపాల్ రెడ్డి డా॥ తిరుమల శ్రీనివాసాచార్య డా॥ అనుమాన్ల భూమయ్య, డా॥ రావికంటి వసునందన్ అల్లం రాజయ్య కీ శే అలిశెట్టి ప్రభాకర్ కీ శే సాహు వెంకటేశ్వర్లు బి ఎన్ రాములు డా॥ కాలువ మల్లయ్య కే వి నరేందర్ సుద్దాల అశోక్ మొదలగు వారు వివిధ సాహితీ రంగాల్లో పేరు పొందిన వారు

ఇంకా చిక్కని పద్య కావ్య కవులు, చక్కని గేయకవులు వందల్లో ఉన్నారు యక్షగాన కవులు పదుల సంఖ్యలో ఉన్నారు వచన రచయితలు నవలా - కథా రచయితలు గణనీయంగా ఉన్నారు రచయిత్రులు మాత్రం తక్కువ

ఈ శతాబ్దిలోనే కొన్ని వందల మంది కవులు సంప్రదాయ అభ్యుదయ మార్గాల్లో రచనలు కావించినా అందులో పలువురి రచనలు పుస్తకాల రూపంలో రాలేదు ప్రచురిత గ్రంధాల్లో అనేకం ఈ జిల్లాను దాటి వ్యాప్తి పొందలేదు అది ప్రావేశిక కవులకు రచయితలకు మాత్రమే పరిమితం కాక పండిత కవుల విషయంలోనూ జరిగింది పుస్తక ప్రచురణ విక్రయ సంస్థలు తెలంగాణాలో అదీ ముఖ్యంగా ఈ కరీంనగర్ జిల్లాలో తక్కువ దానితో ఈ ప్రాంతపు మంచి కవులు కూడా ఇతర ప్రాంతాలకు తెలియకుండా మరుగున పడిపోయారు

క్రీశ 942 నుండి 1995 వరకు, ఇంచుమించుగా కరీంనగర్ జిల్లాలో వర్ధిల్లిన, వెయ్యేండ్ల కాలపు తెలుగు సాహిత్యం ఈ పరిశోధన వ్యాసంలో సంగ్రహంలోనే సమగ్రంగా పరిచయం పరామర్శ కావించబడుతున్నది

ఇంతవరకు సాహిత్య చరిత్రకారులు ప్రముఖ కవుల పేర, రాజుల పేర, శతాబ్దాల కాలం పేర, సాహితీ ప్రక్రియల పేర రకరకాలుగా తమ గ్రంధాలలో శీర్షికా విభాగం కావించుకున్నారు

ఈ గ్రంథంలో ఈ జిల్లాలో వెలువడిన సాహిత్యాన్ని బట్టి, విషయ వివరణకు అనుకూలంగా అధ్యాయాల విభజన జరిగింది గ్రంథం మూడు భాగాలు వానిలోని శీర్షికలు ఇవి

**మొదటి భాగం** - క్రీ శ 942 1900 అధ్యాయాలు నాలుగు

I తెలుగు శాసన సాహిత్యం, II రాజుల కాలంలో వర్ధిల్లిన తెలుగు సాహిత్యం,

III అనంతర కాల సాహిత్యం, IV పందొమ్మిదవ శతాబ్ది తెలుగు సాహిత్యం,

**రెండవ భాగం** - 1901 - 1950, అధ్యాయం ఒకటి

V 20వ శతాబ్ది పూర్వార్ధ తెలుగు సాహిత్యం,

**మూడవ భాగం** - 1951 - 1995 అధ్యాయాలు రెండు

VI 20 వ శతాబ్ది ఉత్తరార్ధ సాహిత్యం, VII జానపద సాహిత్యం పత్రికలు అభినందన సంచికలు

విషయ విస్తృతిని బట్టి ఈ శతాబ్ది సాహిత్యాన్ని వివిధ సాహితీ ప్రక్రియల వారిగా ఆయా శీర్షికల క్రింద వివరించడం జరిగింది ఈ కాలపు విప్లవ సాహిత్యానికి ఒక ప్రత్యేక శీర్షిక కేటాయించాలని అనుకున్నా వీలు కాలేదు అది ఆయా సాహిత్య ప్రక్రియా విభాగాలలోనే ప్రచురణ కాలక్రమాన్ని బట్టి చేర్చి వివరించబడింది

ఇరువదవ శతాబ్దిపూర్వార్ధ సాహిత్యం పద్య గద్య యక్షగానాది ప్రముఖమైన మూడు నాలుగు విభాగాల్లో చూపబడింది 1934 నాటి 'గోలకొండ కవుల సంచిక లోని ఈ జిల్లా కవులను ఒక ప్రత్యేక శీర్షికలో చూపడం జరిగింది

ఇరువదవ శతాబ్ది ఉత్తరార్ధ సాహిత్యం నేడు వ్యాప్తిలో ఉన్న సాహితీ ప్రక్రియలను బట్టి దశాధిక శీర్షికలలో పరిచయం చేయడమైంది ఒక్కొక్క పక్రియలో ఉపశీర్షికలు సైతమున్నవి ఈ కాలపు ఒక కవి - రచయిత రచనల పూర్తి పరిచయంకోసం వివిధ శీర్షికలను చూడవలసిన అవసరం ఉంది ఇది పాఠకులకు కొంత అసౌకర్యంగా ఉన్నా, ఈ గ్రంధాన్ని 'కవుల చరిత్ర గా కాక 'సాహిత్య చరిత్ర గా వ్రాయడం వలన, ఈ ప్రక్రియా విభాగం అనివార్యమైంది అయినా ఒక రచయితను మొదటిసారిగా పరిచయం చేసినప్పుడు ఆ రచయిత ఏయే ప్రక్రియలలో రచనలు చేసింది వివరించబడింది తర్వాతి రచనలు పరిచయం చేసే సందర్భంలో మొదట పరిచయం చేసిన విషయం సూచించబడింది

కొందరు కవులు రచయితలపై వారి రచనలపై ఎంతగా అభిమానమున్నా గ్రంధ ప్రణాళిక - పర్యవేక్షణ నిబంధనలు విధించిన హద్దుల పరిధిలోనే ఎంతో మనో నిగ్రహంతో ఈ కరీంనగర్ జిల్లా సాహిత్య పరిశీలన వ్యాసరచన కావించబడింది

వీలైనంత వరకు కలం పట్టినవారిని అందరినీ సంతృప్తి పరచే ప్రయత్నం చేశాను ఇది బృహత్కార్యం ఏక హస్త కృతం కనుక ఏవైనా అనాలోచితంగా పొరపాట్లు జరిగినా క్షంతవ్యాలు విద్వానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమం।



# కరీంనగర్ జిల్లా తెలుగు సాహిత్య చరిత్ర

## మొదటి బాగము

## I తెలుగు శాసన సాహిత్యం (క్రీశ 946 నుండి 1325 వరకు)

కరీంనగర్ జిల్లాలో తెలుగు కావ్యసాహిత్యం కంటె ముందుగా శిలా శాసన సాహిత్యం కనిపించుతున్నది అవి పద్య గద్యాత్మకాలుగా ఉన్నాయి

రాతియుగ, లోహయుగ ఆంధ్ర శాతవాహన చక్రవర్తుల సంస్కృతుల అనంతరం, ఇక్కడి తొలి ప్రభువులు వేములవాడ చాళుక్యులు ఆ తర్వాత కల్యాణి చాళుక్యులు - కాకతీయ చక్రవర్తులు, వారి ప్రతినిధులు సామంతులు ఇక్కడ పరిపాలన సాగించారు అందుకే ఈ ప్రాంత శాసన సాహిత్యం పై మూడు రాచరిక కాలాల వారీగా విభజించి మూడు శీర్షికలలో చూపబడుతున్నది

1 వేములవాడ చాళుక్యుల కాలంనాటి శాసన సాహిత్యం

2 కల్యాణి చాళుక్యుల కాలం నాటి శాసన సాహిత్యం

3 కాకతీయుల కాలం నాటి శాసన సాహిత్యం

ఆయా రాజుల కాలం నాటి శాసన సాహిత్య వివరాలివి

### 1 వేములవాడ చాళుక్యుల కాలం నాటి శాసన సాహిత్యం

వినయాదిత్య యుద్ధమల్లుడు (క్రీ శ 750-775) ఈ రాజవంశ మూల పురుషుడు చివరి రాజు మూడవ అరికేసరి 966 వరకు పాలించాడు ఈ వంశ రాజులు మొత్తం పదిమంది [1] వీరు రాష్ట్ర కూటులకు సామంతులు వేంగి చాళుక్యులకు ప్రత్యర్థులు వీరి మొదటి రాజధాని బోధన్ పోతన నగరం ఇది నిజామాబాద్ జిల్లాలో ఉంది రెండవ అరికేసరి (క్రీ శ 930 955) బోధన్ నుండి తమ రాజధానిని కరీంనగర్ జిల్లా సిరిసిల్ల తాలూకాలోని వేములవాడ - లేంబుల వాటికకు మార్చాడు [2]

ఈ ప్రభువుల శాసనాలు ఈ జిల్లాలో లభించిన అయిదూ సంస్కృత కర్ణాట భాషల్లోనే ఉన్నాయి వీరి పాలనా కాలంలో కేవలం ఒకే ఒక్క శాసనంలో తెలుగు పద్యాలు కనిపించాయి ఈ శాసనం దాని వివరాలు ఈ క్రింద చూపబడుతున్నవి

**అ జిన వల్లభుని కురిక్యాల శాసనం [3]**

కన్నడ లిపిలో ఉన్న ఆ శాసనం ఇది

'ఓం నమ సిద్ధేభ్య (1) స్వస్తి సమస్త సకళ కళా కళాప ప్రవీణం భవ్యరత్నాకరం గుణపక్షపాతి బెంగినాడ సప్త గ్రామ గళొళ గణ వంగిపఱ్ఱు కమ్మె బ్రాహ్మణం జమదగ్ని పంచార్షేయం శ్రీవత్స గోత్రం గుణ్డికఱ్ఱు నిడుం గొణ్డె యభిమాన చన్ద్రన మర్మ్మం భీమపయ్యన బెళ్వొల దణ్ణిగెఱెయ జోయిస సింఘన మర్మ్మ ళబ్బ ఇబ్బెయ మగం కొణ్డకున్దెయ దేసిగ గణదపొత్థగెయ బఱియ పణ్డరంగ వల్లియ జయణన్ది సిద్ధాన్త భటారర గుడ్డం జినవల్లభం సబ్బినాడ నట్ట నడువణ ధర్మపురదుత్తర దిగ్భాగద వృషభగిరి యెంబనాది సంసిద్ధ తీర్థద దక్షిణ దిశాభాగదే సిద్ధ శిలె యొళ్తమ్మ కుల దైవమాద్యన్త జిన బింబంగళుమం చక్రేశ్వరియుమం పెఱవుం జిన ప్రతి మెగళుమం త్రిభువన తిలకమెంబ బసదియుమం కవితా గుణార్ణవమెంబ కెఱె యుమం మదన విళాసమెంబ బనముమం మాడిసిదం [4]

వృత్తం॥5 భ్రాతర్ధర్మ పురం ప్రయామ కిమతో జైనాభిషేకోత్సవ
క్షీర ప్లావిత తుంగ శృంగ వృషభక్షోణీర్ధ్ర మీక్షామహే
యాత్రా యాత సమస్త భవ్యజనతా సన్మానదానోద్యతం
పంపార్యానుజ మత్రభీమ తనుజం సమ్యక్త్వ రత్నాకరం (1)

గీతంగాతు మనేక భేద సుభగం క్రావ్యాని సోచ్చావచం
వాచా వాచయితుం ప్రియాణి వదితుం సాధూపకర్తుం సతాం
భోగాన్సేవితు మంగనా రమయితుం పూజాంవిధాతుంజినే
జానీతే జిన వల్లభ త్పురమిదం పంపాభిధానానుజ (2)

6 అజస్రజిన వన్దనాగత మునీశ్వర శ్రావక ప్రజాస్తవరవ
ప్రతిధ్వనిత శబ్ద కోళాహళై ( )
అధిష్ఠిత దిగంబరోవృషభశైల ఏష స్వయంపరాం
వదతి వాచకాభరణ కీర్తి మాకల్పత (3)

7 బగెయలళుంబమీ బగెయ నార్పగె వొబ్బగె గాసె యల్తు ది
ట్టగె పాలనల్తు నీళ్దసతియోళ్జిన బింబము నీత నీ గళె
న్తగళిసి దప్పెనెన్దు బగె వన్నెవరం జినబింబ మల్లి తొ
ట్టగె నెగళ్ది ఱ్దవేం చరిత మచ్చరియో జినవల్లభేన్ద్రనం (4)

ఇదు కవితా గుణార్ణవన కీర్తియ మూర్తి వొలాగి దక్షిణా
ర్ధద వృషభాద్రియక్కె వృషభేశ్వర బింబ సనాధ మెంబలం
పొడవె నిజ ద్విజావ సధ పర్వతమం జినచైత్యమాగె మా
డిద జినవల్లభంగె జినవల్లభు నప్పుదు మొన్ద చోద్యమో (5)

చదుర మయ్యొమ్మయ సత్కవిత్వద సన్ద పంపన తమ్మనో
ర్వదె పొగత్తెయె బాజి సల్బరెయల్కవిత్వద తత్వదొ
ళ్పుదిదునే ర్వడె పేళలుర్వగ పూర్వమాగిరె బల్లొన
ప్పుదళి నొర్వనె వాగ్వధూవర వల్లభం జినవల్లభం (6)

వినుత చళుక్య వంశపతి మిక్కరి కేసరి సన్ద విక్రమా
ర్జున విజయక్కె ధర్మపురం మెన్దు మదేయ మిదెన్దు కీర్తి శా
సన మెనెకొట్ట శాసనద పంపన నంబిదు దొన్దు జైన శా
సనద నెగత్తెయం వృషభపర్వత మన్తదు తానె పేళదే (7)

ఎసగెల్గాళి పు గల్ప తంగ కిరణం సారల్మిగం పాఱలా
గసదొళ్పక్కిగళల్లి సల్ల వెనిసి త్రన్యోదయం ధర్మ దొ
ళ్జసమం పొంపుళి మాడె మెచ్చి హరిగం పంపంగె గొట్టొ ద్విజా
వ సధ గ్రామ మదేన్నెగత్తెయ కళాప గ్రామ మంపొల్తుదో (8)

బరదుదె తాంబ్రశాసన మదేయమె ధర్మపురం నెగత్తెవె
త్తరిగన కొట్టుదే నెగళ్ద పంపన పెత్తుదె పేళి మెన్దునీ

మ్మరుళె పలర్మె యుంపలబరం బెసగొళ్ళదె పొగినోడసు
న్దర వృషభాచళోన్నత శిళాతళ దొళ్బరె దక్కరంగళం (9)

కన్దం॥జిన భవనంబు లెత్తించుట
జిన పూజల్సేయు చున్కి జినమునులకు న
త్తిన యన్న దానం బీవుట
జిన వల్లభు బోలంగలరె జిన ధమ్మా్ పరుల్ (1)

దిన కరు సరి వెల్గుదు మని
జినవల్ల భు నొట్ట నెత్తు జితకవి ననసుం
మను జుల్గలరే ధాత్రిం
విని తిచ్చిదు ననియ వృత్త విబుధ కవీన్ద్రుల్ (2)

ఒక్కొక్కొ గుణంబ కల్గుదు
రొక్కొణ్డిగా కొక్కలక్కలేవెవ్వరికిం
లెక్కింప నొక్కొ లక్కకు
మిక్కిలి గుణ పక్షపాతి గుణమణి గణంబుల్ (3)

(1 2 3 నం కల ఈ మూడు తెలుగు కంద పద్యాలు )

ఎన్డు లోక మెల్లం పొగళెనె గళ్ది జినవల్లభన సుధర్మ నంతతి యొళ్తొట్ట గుణావళియ నీ వృషభ గిరియ సిద్ధ శిలెయొళెణెయమ్మం టంక్కోత్కీర్ణం మాడిదం॥ (కన్నడవచనం)

చివరి తెలుగు పద్యాన్ని ఇప్పటి విధానంలో వ్రాస్తే ఇట్లుంటుంది

ఒక్కొక్క గుణమ గల్గుదు రొక్కొడుగా నొక్క లెక్క లేవెవ్వరికిన్
లెక్కింప నొక్క లెక్కకు మిక్కిలి గుణ పక్షపాతి గుణ మణి గుణముల్

**శాసన విశేషాంశాలు**

**శాసనకాలం** - అరికేసరి 2(933 955) ఈ శాసనం క్రీ శ 946 అని అంచనా తేది వేసి లేదు

**శాసనకర్త**- జిన వల్లభుడు శాసనకవి - జిన వల్లభుడు పంపకవి సోదరుడు

నాడు ఈ వృషభాద్రి (కురిక్యాల దగ్గరి కొండన్నపల్లి బొమ్మలమ్మ గుట్ట) సుప్రసిద్ధ జైన క్షేత్రం (1) సదా జినవంద నాగత మునీశ్వరుల శ్రావకుల జనుల రవాల ప్రతిధ్వనులతో మహాకోలాహలంగా ఉండేది ఇది దిగంబర సంప్రదాయ జైన మఠం (3)

'సబ్బినాడు నట్ట నడుమ, ధర్మపురికి ఉత్తర భాగాన వృషభగిరి అను సంసిద్ధ తీర్థమునకు దక్షిణ దిశా భాగమందున్న ఈ సిద్ధ శిలపై తమ కులదైవములైన మొదటి చివరి తీర్థంకరుల ప్రతిబింబాలను, చక్రేశ్వరి అను పేరిటి జివదేవతా విగ్రహమును, త్రిభువన తిలకమనే మఠం (వసతి), కవితా గుణార్ణవ మనే కొలను, మదన విలాసమను వనాన్ని ఏర్పరిచాడు"8 జిన వల్లభుడు

ధర్మపురికి ఉత్తరాన 'జైన అనే గ్రామ ముంది దానికి ఈ శాసన విషయానికి ఏమైనా సంబంధ ముండవచ్చు అదే పంపకవి దానము పొందిన అగ్రహార వసతి కాబోలు

**జిన వల్లభుని గుణ గణాలు** - అతడు సంగీత పరుడు, ప్రియభాషణుడు, సాధువులకు ఉపకరించువాడు మొదలైన సుగుణాలు కలవాడని 2వ శ్లోకంలో ఉంది జిన వల్లభుడు జిన

చైత్య - మఠ స్థాపకుడు మత గురువు కన్నడ మహాకవి పంపనకు తమ్ముడైన జినవల్లభుడు 'వాగ్వధూవర వల్లభుడు' 'చతుర కవిత్వ విశారదుడు' అని 6వ కన్నడ పద్యంలో వర్ణింపబడ్డాడు

ఈ శాసనమందలి 1 7 9 పద్యాలలోని పంపకవి వివరాలు కన్నడ సాహిత్య చరిత్ర రచయితలకు చాల ఉపకరించాయి తెలుగులో నన్నయవలె కన్నడంలో పంపన ఆదికవి ఆయనకు రెండవ అరికేసరి రాజు ధర్మపురి అగ్రహారాన్ని ఇచ్చిన విషయం ఈ శాసన కన్నడ వచనంలోను ఏడవ పద్యంలోనూ వివరింపబడింది ఆయన విక్రమార్జున విజయం రచించిన విషయంకూడా ఈ ఏడవ పద్యంలోనే ఉంది రాజును పేర్కొన్నా రాజాస్థాన కవిని పేర్కొన్నా రాజధాని నగరం పేరు మాత్రం ఈ శాసనంలో ఉల్లేఖింపబడలేదు!

**వంశ వివరాలు** - వంగి పఱ్ఱు కమ్మె బ్రాహ్మణులు పంచార్షేయ శ్రీవత్స గోత్రులైన ఌబ్బణబ్బె భీమపయ్య జినవల్లభుని జననీజనకులు [9] ఈ జైన బ్రాహ్మణ కవి సోదరులు లేంబుల వాటిక [10] రాజాశ్రయం పొంది సన్మానాలందుకొన్నారు ఇక్కడే జీవించారు

**సాహిత్య విశేషాలు** - ఈ శాసనంలో కన్నడ సంస్కృత భాషల్లో వృత్త పద్యాలున్నవి తెలుగు భాషలో కేవలం మూడే మూడు కందపద్యాలు శాసనం చివరగా ఉన్నవి అప్పటికి కందం తెలుగులో కొత్త కాని కన్నడంలో జిన వల్లభుని అన్న పంపన 'విక్రమార్జున విజయం'లో వాటిని వ్రాశాడు ఆ కావ్యంలోని 4 కంద పద్యాలు । ఉత్పలం రెండవ అరికేసరి వేములవాడ శాసనం మొదట ఉన్నాయి [11]

అంతకు పూర్వం తెలుగులో గద్య పద్య శాసనాలున్నాయి 6వ, శతాబ్ది నుండి రేనాటి చోళుల తెలుగు గద్య శాసనాలు 30కి పైగా లభించాయి 9వ శతాబ్ది గుణగ విజయాదిత్యుని శాసనాలలో తరువోజ (అద్దంకి) సీసం (ధర్మవరం కందుకూరు) మధ్యాక్కర (బెజవాడ) తెలుగు పద్యాలు కనిపించాయి [12]

కందం పుట్టుక కరీంనగర్ జిల్లాలోనే అదీ నన్నయ గారి మహాభారత రచనకు వందేండ్లు ముందుగా అనేది విశేషాంశం!

నన్నయభట్టు భారతాంధ్రీకరణం క్రీ శ 1051 తర్వాత [13] పంపకవి కన్నడ భారత రచన కీ శ 941లో [14]

రెండవ యుద్ధమల్లుని కుమారుడైన బాదప రాజు ఆరుంబాక శాసనంలో తెలుగు కంద పద్య లక్షణాలు కలిగిన సంస్కృత కందం కనిపించినా దాని రచనా కాలం క్రీ శ 980వ సంవత్సరం 15

"కన్నడ మందు ప్రచారమందున్నా ఆ కందము యొక్క ప్రభావము వలన ఈ పద్యము వ్రాయబడిన దనుటకు వీలు లేదు కన్నడమందలి కందమునకు ప్రాసనియతి యున్నను యతి నియమము, సరూపాక్షర యతి నియమము లేదు ఆ నియమము తెలుగు నందేయున్నది ఈ కారణములచే తెలుగునందు ప్రసిద్ధమైన కంద ప్రభావమే పై సంస్కృత కందమునకు కారణమని చెప్పవలెను " అని కె సంపత్కుమార గారు 'తెలుగు ఛందో వికాసం'లో తమ అభిప్రాయం వెలిబుచ్చారు కాని, సంస్కృతానువాదంలో మూల శ్లోకాల్లో లేని యతి ప్రాసలు కూర్చుకున్న మన కవులు, కన్నడ పద్యాలకు కేవలం యతి కూర్చుకోలేరా? యతి ప్రాసలు మన భాషా సాహితికి సహజాలంకారాలు!

కన్నడ కవులు ప్రాకృతం నుండి రగడ, కందం, తెలుగు నుండి ద్విపద సీసం, గీతం ఛందస్సులను తీసుకున్నారని పండితుల అభిప్రాయం కందం కన్నడం నుండి తెలుగులోనికి వచ్చింది అదీ కన్నడ ఆది కావ్యం పుట్టిన కరీంనగర్ జిల్లాలో జినవల్లభుని ద్వారా

కందానికి మూలం ప్రాకృత గాథా ఛందంలోని ఏడు రూపాలలో ఒకటైన 'ఖంధ ఆ' అనటం సత్యదూరం కాదు సంస్కృతంలోని ఆర్యావృత్తం ప్రాకృత గాథా ప్రభావంతో రూపొందినదనే లాక్షణికులు అంటారు

**శాసన తెలుగు పద్యాల భావం** - జిన భవనాలు (మఠాలు) కట్టించుట, జిన సాధువుల పూజలు చేయుట, జిన మునులకు నచ్చిన భోజనములు పెట్టుటలో ఇతర జైనులెవ్వరూ జిన వల్లభునితో సరిపోలజాలరు (1)

సూర్యునితో సమానముగా వెలుగు వారును జినవల్లభునితో సరి తూగు మరే కవులునూ లేరు (2)

ఒక్కొక్కరు ఒక్కొక సుగుణం కలవారుగా ఉంటారు ఆలోచించి చూడగా జినవల్లభుడు గుణమణి పైగా అతడు గుణపక్ష పాతి (3)

**బాషా ఛందో విషయాలు** - ఈ శాసన పద్యాల్లోని తెలుగు భాష పరిణతి చెందినదిగా లేదు

నత్తిన అత్తిన = నచ్చిన ఈవుట = ఇచ్చుట (1)

నొట్టనెత్తు = నోట నెత్తు వినుతిచ్చి = వినుతించి (2)

ఒక్కొండిగా = ఒక్కండుగా లక్క = లెక్క గణన (3)

ఇట్లా ఇందలి పదాలు పాత రూపాలలో ఉన్నాయి

శాసనాలలోనే కాక తాళపత్ర ప్రతుల్లోనూ సర్వ సాధారణంగా కనిపించే లేఖనా విశేషాలు కొన్ని ఈ శాసనంలో ఉన్నాయి వానిలో మొదటిది అర్థానుస్వారం వాడవలసిన చోట పూర్ణానుస్వారం (సున్న) వాడటం పందొమ్మిదవ శతాబ్దికి పూర్వం అర్థానుస్వార వ్యాప్తి లేదుకదా! బిందువును అర్థాను స్వారంగా బిందువుకు పై అక్షరం ద్విత్వంగా ఉంటే అది పూర్ణానుస్వారంగా గుర్తించేవారు

రెండవది క్రావడి ఇప్పటి వలె కాక నాడు అక్షరానికి కుడివైపున న్ వంటి పొల్లుగా వ్రాసేవారు వర్షము, వష ్ము వలె ఉండేది ఈ రకారానికి పై అక్షరం ద్విత్వంగా ఉండడం కూడా జరిగేది దీనికి ఉదాహరణం ఈ శాసనంలోని తెలుగు పద్యాల్లో లేకున్నా కన్నడ పద్యాల్లో చూడవచ్చు

మూడవది ప్రథమా విభక్తి 'ము ప్రత్యయాంత తెలుగు పదాలు మొదట ంబు బులు కలిగి ఉండేవనడానికి నిదర్శనంగా ఈ పద్యాల్లో పదాలు ఉన్నాయి ఉ॥ భవనంబు దానంబు గుణంబ గణంబుల్ 'ము' ప్రత్యయాంతంగా ఏ ఒక్క శబ్దమూ వాడబడలేదు ఈ పదరూపం ఇంతకు చాలా ప్రాచీనమైనదనడానికి నిదర్శనం అమరావతి స్తూప ఫలకం మీది 'నాగబు అనే వ్రాత [16] ఆంధ్ర వాఙ్మయ చరిత్రములో డా॥ దివాకర్ల వేంకటావధాని గారు కూడా ఈ విషయచర్చ కావించారు [17]

ఛందస్సు విషయంలో ఇప్పటి కంద పద్య లక్షణాలకు పై శాసనంలోని మూడు తెలుగు పద్యాలకు ఎటువంటి తేడా లేదు సంస్కృతంలో లేని ప్రాస నిబంధనను కర్ణాటాంధ్ర భాషలు పాటించాయి కన్నడ పద్యాల్లో లేని యతి నియమాన్ని అక్షర మైత్రిని తెలుగు కవులు సమకూర్చుకున్నారు

జిన వల్లభుడు కన్నడ కవి తెలుగులో రచన కొత్త అందుకే నేమో మూడవ పద్యం రెండు పాదాల్లోనూ యతులు తప్పినవి గణయతి ప్రాస లక్షణాలు మిగితా రెండు పద్యాల్లో చక్కగా ఉన్నాయి మూడవ పద్యంలోనూ కేవలం యతిభంగం తప్ప మరే ఛందో దోషమూ కానరాదు

భాష అప్పటిది అది కావ్య రచనా స్థాయికి ఎదుగుతున్న దశ

'తెలుగు కంద పద్యానికి తెలుగు నాట ఇంత ప్రాచీన సంప్రదాయమున్నా ఏ తెలుగు శాసనంలోనూ ఇప్పటి దాకా ఇది కనబడదు" అని ఆరుద్ర సమగ్రాంధ్ర సాహిత్యం' సం 1 పుట 3, 6 అనటం సరికాదు వారి దృష్టికి ఈ కురిక్యాల శాసనం రానట్టుంది

జన్మస్థానం మాతృభాష, మతం ఏది ఏమయినా జినవల్లభుడు కరీంనగర్ జిల్లా వేములవాడ రాజ సన్మానిత కవి అతడు తన అగ్రజుడైన పంపమహాకవి వలె ఇక్కడే స్థిరనివాసం ఏర్పరచుకొన్నాడు జైన మఠాధిపతిగా సాధు జీవితం' గడిపాడు శాంతిధర్మ ప్రబోధంతోపాటు త్రిభాషా సాహిత్యాన్ని వెలయించాడు ఈ జిల్లా ప్రథమాంధ్ర కవిగానే కాక అఖిలాంధ్ర దేశంలోనే మొట్టమొదట తెలుగులో కందపద్య రచన కావించిన ప్రయోగశీలిగా జినవల్లభుడు సంస్మరణీయుడు!

**ఆ) అడవి సోమనపల్లి శాసనాలు**[17] (ఏ నం 345 1968)

మంథని తాలూకా మానేరునది ఒడ్డున సోమనపల్లి గుహాలయాలున్నవి అక్కడ రామేశ్వర గుహాలయం చెంత ఈక్రింది శాసన మున్నది ఇది గద్యం కేవలం మూడే పంక్తులు

'శ్రీ ఎక్క(టె)(వి) మున ప్రతిట్ట శేసినది ( ) గజు కొడుకు కెంపెన (వ)డి పని శెసెణె (ధ ద) బగవతి (రామిా (శ్వర) వడి '

**శాసనకాలం** 10వ శతాబ్ది[18]

**శాసన బావం** - ఈ రామేశ్వర దేవుని ప్రతిష్ఠించిన వ్యక్తి పేరు ఎక్కటె విమున వడ్డెపని చేసిన శిల్పి లేదా శాసన శిలపై అక్షరాలు గండరించినది (రా) గజు కొడుకు కెంపెన అని తెలుస్తున్నది

**అదే స్థలంలోని రెండవ శాసనం** నం 41 (ఏ నం 29 1969)

**శాసన మూలం** -

స్వస్తి శ్రీమతు (పె) నుగంటి ముచ్చిరడ్డి యీ రామిాశ్వర దేవరకు నెవేద్యానకూ దీపానకూ ముగ్గున కూ విడిచిన (పన్నస) దీనికెవ్వరు దప్పినాను గంగ కఱుత కవిల (పా) డిచినంత్త (దో) సము (యింత వట్టు) ఏమిా ద (ప్పి) నాను అ దోసానత (పోవు) వాడు [19]

**శాసన కాలం** - 11వ శతాబ్ది **శాసన కర్త**- వెనుగంటి ముచ్చిరెడ్డి

**భావం** - పెనుగంటి ముచ్చిరెడ్డి ఈ రామేశ్వర దేవరకు దీప (ధూప) నైవేద్యానికి ముగ్గుల అలంకారానికీ విడిచిన పన్నస (ఇచ్చిన దానం) దీనిని ఎవరు తప్పినా (భంగ పరచినా) గంగలో కపిల గోవును చంపినంతటి దోషము దీనికి తప్పినవారు ఆ దోషాన (నశించి) పోతారు

**శాసనాల బాషా విశేషాలు** - ఈ రెండు శాసనాలు ప్రత్యేకంగా కవులో పండితులో వ్రాసినవి కావు అప్పటి వ్యవహారంలోని తెలుగు భాష వాడబడింది

మొదటి శాసనంలోని ఎక్కటె విమున కెంపెన వ్యక్తుల పేర్లు ఎక్కటీలు వీరులు ఆ పదం ఇదే సంపుటంలోని రుద్రమదేవి కాలపు హుస్నాబాదు శాసనంలో వాడబడింది ప్రతిష్ఠ చేసినది కెంపన ఒడ్డెపని భగవతి అనునని సరియైన పద రూపాలు రామ+ఈశ్వర = రామేశ్వర అని గుణ సంధి అది రామిాశ్వర అని వాడబడడం, అప్పటి జన వ్యవహారంలోని వినికిడి పదరూపం అనుకోవాలి

రెండవ శాసనం భాష కొంత మారింది రట్టగుడి, రడ్డి, రెడ్డి అని ఆ పదం పరివర్తనా క్రమం, దీపానకూ (కున్ను అని వ్యావహారికం, కూడా అని భావం) తప్పినాను (తప్పినట్టయితే అని) వ్యావహారిక పద రూపాలు దోసాస అంటే చాలు అదనంగా త' వాడటం మరో విశేష పదరూపం దోషముతో అని దాని భావం నాడు ఆలయాలలో ఇటువంటి దాన శాసనాలు సర్వసామాన్యం వాటిని భంగపరచకుండా రాజులు శాసనాలు చేస్తూనే గోహత్యాది పాప భయాలు చూపేవారు

రాజులు, రాజబంధువులు వివిధ హోదాల ప్రభుత్వాధికారులు, ధనిక వదాన్యులు భక్తిభావంతో ఆలయ నిర్మాణం కావించి, దైవ విగ్రహాలను ప్రతిష్ఠించి, పూజా నైవేద్యాదులకు కట్టడి నేర్పాటు కావించి ఇట్లా దానాలు కావించి శాసనాలు వేసే వారు అవే నేటి జిజ్ఞాసువులకు నాటి చరిత్రను తెలిపే శిలాక్షరాలు!

**పాద పీఠికలు** -

1 యుద్ధమల్ల, మొదటి అరికేసరి నరసింహ రెండవయుద్ధమల్ల, బద్దెగ, మూడవ యుద్ధమల్ల రెండవ నరసింహ రెండవ అరికేసరి వాగరాజ మూడవ అరికేసరి

2 Inscriptions of Andhra Pradesh, Karimnagar Dist Hyderabad, published by Andhra Pradesh Government, Archaeology and museums, 1974

3 కరీంనగర్ జిల్లా శాసనములు శా సం 3, పుటలు 10,11

4 ఇంతవరకు శాసనం కన్నడభాష, వచనం తర్వాత వరుసగా సంస్కృత కన్నడ తెలుగు పద్యాలున్నవి

5 1 2 ఇవి సంస్కృత శ్లోకాలు శార్దూల విక్రీడిత వృత్తాలు, 6 వచనమో శ్లోకమో తెలియలేదు

7 4 5 7,9 నం కల కన్నడ పద్యాలు చంపక మాలలు 6 నం పద్యం తరలం 8వది మత్తేభం

8 కన్నడ శాసన భాగ వచనానువాదం - 3వ, పేరా, 9 శాసనంలోని వచనం మొదటి పేరా

10 వేములవాడ కళ్యాణ చాళుక్య చక్రవర్తుల కాలశాసనాల్లో 12వ శతాబ్ది వరకు లేంబులవాడ - వాటి (క) అనే ఉంది
11 విక్రమార్జున విజయం (కన్నడం) ఆశ్వాసం 1 పద్యాలు 15 31 41 42, 50
12 నిడుదవోలు వెంకటరావు గారి ఆంధ్ర వచన వాఙ్మయం లోని వివరాలు ఆరుద్ర సమగ్రాంధ సాహిత్యం సం 1 పుటలు 62 66 78-84
13 తెలుగు భాషా సమితి వారి విజ్ఞాన సర్వస్వము 3వ సంపుటి పుట - 165
14 డా॥ పల్లాదుర్గయ్య గారి ప్రబంధ వాఙ్మయ వికాసము మొ సంపుటి పుట 145
15 ఆరుద్ర సమగ్రాంధ్ర సావాత్యం సం 1 పుట 92
16 ఆరుద్ర సమగ్రాంధ్ర సాహిత్యం సంపుటాల ముఖ చిత్రం వివరణ 6వ పుట ఆంధ్ర వాఙ్మయ చరిత్రము పుట 9 తొలి ముద్రణ 1958 పన్నెండవ ముద్రణ 1988
17 కరీంనగర్ జిల్లా శాసనములు సం 40 41 18 కరీంనగర్ జిల్లా శాసనములు పుట 112
19 ఈ శాసనాల్లో చెదరిన అక్షరాలను పురావస్తుశాఖ వారు పూరించినవి కుండలీకరణాలలో చూపబడినవి వాటికి క్రీగీతలు కలవి ఈ గ్రంధ రచయిత పూరించినవి

## 2 కల్యాణి చాళుక్యులు కాలపు తెలుగు శాసనాలు

బాదామి పశ్చిమ చాళుక్యుల అనంతరం కర్ణాటాంధ్ర సామ్రాట్టులయిన రాష్ట్ర కూటులను ఓడించి కళ్యాణి కటకం రాజధానిగా ఈ ప్రాంతాలను పరిపాలించిన కర్ణాటక చాళుక్యులను సైతం చరిత్రకారులు పశ్చిమ చాళుక్యులుగానే వ్యవహరించారు రాష్ట్రకూటుల పతనంతో వారి బంధువులు సామంతులు అయిన వేములవాడ చాళుక్యరాజులు కూడా పదవీచ్యుతి పొందారు కల్యాణి చాళుక్యరాజు ప్రతినిధులు మహామండలాధిపతులుగా కరీంనగర్ జిల్లాలోని శనిగరం పొలాస వేములవాడ నగునూరు రామగుండం మంధని కేంద్రాలుగా ఈ నేల నేలారు కాకతీయులు మొదటి నాలుగు తరాల వరకు ఈ కల్యాణి చక్రవర్తులకు సామంతులే అప్పుడు వారు కరీంనగర్‌జిల్లా హైదరాబాద్ మార్గంలోని శనిగరం నుండి హన్మకొండ ప్రాంతం వరకు ఏలికలు

క్రీ శ 992 నుండి ఈ జిల్లాలో కల్యాణి చక్రవర్తుల కాలం నాటి 21 శాసనాలు లభించాయి [1] అవన్నీ కన్నడ భాషలోనే ఉన్నాయి ప్రాంతమేదైనా పాలకుల బట్టి రాజ భాష కదా!

ఆ కాలపు తెలుగు శాసనాలు గంగపురం నగునూరులలో కనిపించాయి అవి ఇక్కడ చూపబడుతున్నవి

**అ గంగపుర శాసనం**[2] - మంధని తాలూకా ఇది తెలుగు గద్య శాసనం

**మొదటి ప్రక్క -**

మండళీక చక్రతారాధీశ్వర (అ) రి బిరుద మండళిక మదన మహేశ్వరం (చ) కూర కులహ వార్ధి వ ర్ధన సుధాకరం శివ పాద శేఖరం (చా) ళు క్య రాజ్య మూళ స్తంభం శ్రీమద్భూలోక మల్ల దేవపాద పంకజ భ్ర మరం శ్రీమతు గుండె రాజులు శీ సురే శ్వర దేవర (కు) నిచ్చిన

**రెండవ ప్రక్క -**

( ) పంచమ ర స్థానముల వా రు నెఱుంగ నిల్పి న కంభము దీని కి నెవ్వరేని దప్పి న వారు చణ్డీశ్వ రుని నిర్మాల్యం బు దిన్నవారు వారణాశిలోని వేవురు బ్రా(హ్మ) (ణు) లకు వేవురు తపోధనులు

**మూడవ ప్రక్క -**

సర్వానేతాన్భావి, న పార్థివేంద్రా, న్భూయో భూయో యాచ, తే రామ చంద్ర

(శాసనంలోని కామాలు శిలపైగల పంక్తులకు సంకేతాలుగా ఉంచబడినవి )

**శాసన భావం** - మొదటి శ్లోకంలో చెదరిన పదాలు శాసనకర్త బిరుదాలకు సంబంధించినవి (కల్యాణి) చాళుక్య రాజ్యానికి మూల స్తంభమైన భూలోక మల్లదేవుని పాద పద్మ భ్రమరమైన శ్రీ గుండరాజు సూరేశ్వర దేవరకు ఇచ్చిన దానము - పంచ మఠ స్థానముల వారు చూడగా నిల్పిన కుంబము దీనికి తప్పిని వారికి శివుని నిర్మాల్యము (దొంగిలించి) తిన్నంత దోషము కాశిలో వేయిమంది విప్రులను వేయి మంది మునులను (చంపినంతటి పాపము)

**శాసనకాలం** - భూలోక మల్లదేవుని కాలం, క్రీ శ 1126-37

**శాసనకర్త** - మంథని కూరకుల గుండె రాజు [3] శాసన రచయిత లేఖకుని పేర్లు తెలియవు

భాషా విశేషాలు మండలి మూల కంబం ఇప్పటి పదరూపాలు అప్పుడు మండళి, మూళ కుంభం అని వాడబడినవి ఇవి తెలుగు పదరూపాలు స్పష్టంగా ఏర్పడని లేదా సరియైన రూపాలు తెలియని దశ తబ్బిబ్బులు శాసన వాక్యాల్లోని వ్యావహారిక భాషా ప్రయోగాలు గమనార్హం

కూర కులహ వార్ధివర్ధన సుధాకరం పాద పంకజ భ్రమరం చక్కని అర్థాలంకారాలు దీనిని బట్టి శాసన కవులు సంస్కృత పండితులైనా తెలుగులో వ్యావహారిక పదప్రయోగాలు చేసినట్లు భావించవచ్చు

**చారిత్రక విషయాలు** కాకతి రెండవ ప్రోల రాజుతో ఓడిన మంథిని గుండరాజు ఇతడే ఈయన పాలాస రెండవ మేడ రాజునకు తమ్ముడు

ఇంచుమించు ఇదే కాలానికి చెందినది రామగుండం ఏడె రాజు శాసనం అది స్థానిక వంకేశ్వర దేవునికి సమర్పించిన దాన శాసనం [4] అది తెలుగు వచనంలో ఉన్నా చాలా భాగం శిధిలం

**ఆ నగునూరు శాసనాలు**[5] కరీంనగర్ తాలూకా

ఇవి మూడు వేర్వేరు వీరగల్లులపై గల వ్రాతలు

| | | |
|---|---|---|
| 1 శ్రీమతు మహా దొమె | 2 శ్రీమతు మహ దొమె | 3 శ్రీమతు మహ దొమె |
| రజు ముంధట పాడిచి | రజు ముందట పాడిచి | రజు ముందట ర్మత్యోభ |
| గెలిచె కెలన్ | గెలిచె నారప్పతి | యల పాడిచి గెలిచె సంగమ |

పై శాసనాల భావం

శ్రీమతు దొమ్మె రాజు ముందర శత్రు సైనికులను పాడచి గెలచిన వాడు కెలన రెండవ వీరుడు నారప్పతి మూడవ వాడు సంగమ మత్తేభాల పాడిచి గెలిచాడట

కాలం కల్యాణి కటక కలచూసి బిజ్జలుని కాలం, క్రీ శ 1159

**శాసనకర్త - నగునూరి దొమ్మరాజు**

**శాసన భాషా విశేషాలు** వీనిలోనిది అప్పటి వ్యవహారంలోని తెలుగు భాష అది రాజభాషగా కన్నడం వ్యాప్తిలో ఉన్నకాలం "కెలన నారప్పతి, సంగమ"వీరుల పేర్లు దొమ్మరాజు మత్తేభముల (మత్తే భోభయుల కానోపు) గుణింతం గమనింపదగినవి ఇవి పండిత వ్రాతలు కావు సామాన్య చదుపరులు కూర్చిన మాటలు

**చారిత్రకాంశములు** - కల్యాణి చాళుక్యుల సామంతులైన పాలవాస మేడరాజు నగునూరి దొమ్మరాజు మంధిని గుండరాజు, రామగుండం ఏడెరాజు చక్రవర్తిపై తిరుగుబాటు కావించారు అప్పుడు వారిని కల్యాణి రాజ ప్రతినిధియైన కాకతి రెండవ ప్రోల రాజు ఓడించాడు [6]

చాళుక్యుల తర్వాత కల్యాణికి చక్రవర్తియైన బిజ్జలుని ప్రతినిధి మైలగి దేవుడు కాకతి రుద్రదేవునిపై దండెత్తి వచ్చాడు సామంతులైన మేడరాజు దొమ్మరాజు అతనికి సహాయంగా వచ్చారు వారిని రుద్రదేవుడు కరీంనగర్ జిల్లాలోని ఆకునూరు నగునూరు పాలాస ప్రాంతాల్లో

చిత్తుగా ఓడించి 1159-60 లో స్వతంత్రించాడు [7] ఆ యుద్ధ వీరులవి ఈ వీరగల్లులు వీరగల్లులనగా మృతవీరుల స్మృతిగా నిలిపిన శిలా విగ్రహాలు వ్రాతలు

'కరీంనగర్ జిల్లా శాసనములు' పేరుతో ఆంధ్ర ప్రదేశ్ పురావస్తుశాఖ వారు ప్రచురించిన ఆంగ్ల పుస్తకంలోని 74 నం లోని పై మూడు శాసనాలు తర్వాతి 4వ కన్నడ శాసనంలో 'ప్రమాది సంవత్సర వైశాఖ బహుళ శుక్రవారము నాడు దొమ్మరాజు, జగదేవుడు (శత్రువుల పదివేలు) ఎనబైవేలు పొడచి గెలిచి నట్లున్నది [8] ఆ శాసనం ఇది

స్వస్తి సమస్త ప్రశస్తి సహితం/శ్రీమతు మహామండళేస్వరం/దొమ్మెరాజులు శ్రీ మచ్చాళుక్య విక్రమ గా(ల)ద/ ఉత్తమ విస్యనాక్కెనెయ/ ప్రమాది సంవత్సర దవై/సక ధంపళ భధివేలు/ వెలుతో పాడిచి గెలి/చె-

ఈ వీరులు కన్నడ సామంతుల సేనలలోని వారు కాకతీయాంధ్ర రుద్రదేవ మహారాజును ఎదిరించి వీర మరణం పొందినవారు ఈ యుద్ధ విజయంతోనే ఈ భూభాగంపై కర్ణాట చక్రవర్తుల అధిపత్యం తుడిచి పెట్టబడి స్వతంత్ర కాకతీయాంధ్ర సామ్రాజ్యం ప్రప్రధమంగా ఆవిర్భవించింది

**పాద పీఠికలు**

1 కరీంనగర్ జిల్లా శాసనములు - ఉపోద్ఘాతం పుట - 14
2 కరీంనగర్ జిల్లా శాసనములు నం 23 పుటలు 58, 59, 60
3 ఈ మంతెన గుండరాజు పేరు కాకతీయుల కాలంనాటి పాలంపేట, హన్మకొండ వరంగల్ జిల్లా శాసనాల్లో కనిపిస్తున్నది
4 కరీంనగర్ జిల్లా శాసనములు నం 76 5 కరీంనగర్ జిల్లా శాసనములు నం 74
6 కల్యాణి జగదేక మల్లుని కాలం క్రీ శ 1138 7 పి వి పరబ్రహ్మశాస్త్రి కాకతీయుల చరిత్ర 1977 పు 25 8 కరీంనగర్ జిల్లా శాసనములు పుట 139

## 3 కాకతీయుల కాలం నాటి తెలుగు శాసనాలు

ప్రప్రధమంగా మహాంధ్ర సామ్రాజ్య స్థాపన కావించి మహావైభవంగా రెండువందల సంవత్సరాలు తెలుగు నేల నేలిన తెలుగు సామ్రాట్టులు కాకతీయులు

ఆ వంశంలోని మొదటి నలుగురైదుగురు గుండరాజు, ఎఱ్ఱ భూపతి, బేతరాజు పిడి గుండరాజు తూర్పు చాళుక్యుల నోడించిన రాష్ట్ర కూటులకు సామంతులై కొరవి (వరంగల్ జిల్లా) మండలాధిపతులై స్థిరపడిన వారు

తర్వాత ఆ వంశం వారు కల్యాణి చాళుక్య సామంతులైనారు గరుడ బేతరాజు 1 ప్రోలరాజు 1 బేతరాజు -2, ప్రోలరాజు -2, కాకతీయుల తొలితరంలో ప్రసిద్ధులైన ఈ నలుగురు కూడా కల్యాణి చాళుక్య చక్రవర్తులకు విశ్వాసపాత్రులైన సేనాపతులు వారికి సామంత మండలాధిపతులుగా వీరు అనుమకొండ మండలాన్ని సబ్బిరాష్ట్రాన్ని పరిపాలించారు కరీంనగర్ జిల్లాలోని ప్రాగ్దక్షిణ భాగాలు అప్పుడు ఈ సబ్బిమండలంలోనివే

ఆ కాలంలో ఈ జిల్లాలోని వేములవాడ పొలాస, నగునూరు, రామగుండం, మంథని కేంద్రాలుగా కల్యాణి చాళుక్య మండలాధిపతులు వేర్వేరుగా ఉండేవారు

కరీంనగర్ జిల్లా దక్షిణ భాగంలోని శనిగరం అప్పుడు కల్యాణి చక్రవర్తులకు తెలంగాణా సైనిక కేంద్రం ఈ శనిగరంలో పై నలుగురు కాకతి ప్రభువులవి అయిదు శాసనాలు లభించాయి కాని అవన్నీ, చక్రవర్తుల మాతృభాష అయిన కన్నడంలోనే ఉన్నాయి వేములవాడ చాళుక్యుల కాలంలోని 'సబ్బినాడు' కాకతీయులకాలంలో 'సబ్బి సహస్రం' అని పిలువబడింది

రెండవ ప్రోలరాజు కల్యాణి చక్రవర్తికి తిరుగబడిన ఈ జిల్లాలోని వారి సామంత మండలాధిపతుల నోడించాడు మంథని గుండరాజును సంహరించాడు

కాకతి రుద్రమదేవుడు కల్యాణి బిజ్జలుని దండనాధుడైన మైలగి దేవుని నగునూరు దొమ్మరాజును పొలాస రెండవ మేడరాజును ససైన్యంగా హతమార్చి ఈ జిల్లా ప్రాంతాన్ని కాకతి సామంత రాజ్యమైన అనుమకొండ విషయంలో కలుపుకుని స్వతంత్రించాడు అది సుమారుగా క్రీ శ 1150 కాలం ఆ తర్వాత దక్షిణ పశ్చిమ కోస్తాంధ్రలను జయించాడు ఆయన రారాజు

అదే మార్గంలో గణపతి దేవుడు రుద్రమదేవి, ప్రతాపరుద్రుడు ఏకచ్ఛత్రాధిపత్యంగా ఓరుగల్లు ఏకశిలానగర రాజధానిగా ఈ కాకతీయ మహాంధ్ర సామ్రాజ్యాన్ని పరిపాలించారు క్రీ శ 1323లో ఈ కాకతీయ సామ్రాజ్య అంతరించింది ఆంధ్ర దేశం ఢిల్లీ ముస్లిం పాలకుల వశమైంది

కాకతి చక్రవర్తులు సమరాంగణ సార్వభౌములు ప్రజానురంజక పరిపాలనాదక్షులు కళా సాహిత్య పోషకులు వీరి కాలంలో కన్నడ భాషా ప్రాబల్యం తగ్గి సంస్కృతాంధ్రాల ప్రాచుర్యం హెచ్చింది ముఖ్యంగా తెలుగు విలువ పెరిగింది

ఈ జిల్లాలో పై నలుగురు కాకతి చక్రవర్తుల శాసనాలున్నాయి పైగా రుద్రదేవునికి తమ్ముడు గణపతి దేవునికి తండ్రి అయిన మహాదేవరాజు కాలపు ఏకైక శాసనం మంథని సమీపంలోని సుందిళ్ళలో లభించింది (కరీంనగర్ జిల్లా శాసనములు నం 27)

ఈ కాలపు శాసనాలు వివరాలు కరీంనగర్ జిల్లాలోనివి

| రాజు పేరు | కాలం | సంస్కృతం | తెలుగు శాసనాలు |
|---|---|---|---|
| రుద్రమదేవుని కాలం | క్రీ శ 1158 95 | | 2 |
| మహదేవుని కాలం | ' 1196 98 | | 1 |
| గణపతిదేవుని కాలం | 1199 1262 | 5 | 3 |
| రుద్రమదేవి కాలం | 1262-1289 | 1 | 1 |
| ప్రతాపరుద్రుని కాలం | 1289 1323 | | 3 |

కాకతి చక్రవర్తుల కాలంలో ఈ జిల్లాలో లభించిన 10 తెలుగు శాసనాల్లో వచన రచన కలవి ఎక్కువ పద్యశాసనాలు రెండే అయినా ప్రముఖమైనవి అవి రుద్రమదేవుని కాలపు నగునూరు శాసనం గణపతి దేవుని కాలపు ఉప్పరపల్లి శాసనం ఈ రెండు పద్యశాసనాలతో పాటు ఆ కాలంనాటి మరికొన్ని గద్యశాసనాలు ఈ క్రింద చూపబడుతున్నవి

**అ నగునూరు శాసనం -** కరీంనగర్ సమీప గ్రామం

కాకతి రుద్రదేవుని మంత్రి, నగునూరు రాజధానిగా సబ్బిసహస్ర మండలం సామంతపాలకుడునైన వెల్లంకి గంగాధర మంత్రి వేయించిన 172 పంక్తుల 32 పద్యాల సంపూర్ణ ఆంధ్ర భాషా శాసనం కాలం క్రీ శ 1171 జనవరి 13 (శా శ 1092 వికృతి మాఘ శు - 5)

శాసన భాగం-

శ్రీరామాధిపుడింద్ర నీల నిభ శారీరుండుదారుండు గౌ
రీ రామాధిపుండుజ్వల స్ఫటిక శారీరుండు ధీరుండు భా
షా రామాధిపుండబ్జ కేసర లసచ్ఛారీరుండు నుం
గారుణ్యంబున మాకు నీవుత సదా కాలంబుంగామ్యార్థములు[1] (1)

(ఇది శార్దూల విక్రీడితం గణయతి ప్రాసలు చక్కగా కుదిరాయి అర్థ బిందువు ఉండవలసిన తావుల కూడా పూర్ణబిందువులే వాడబడినవి అవి మొదటి పద్యంలో క్రీగీతలు కలవి సాధారణంగా

పూర్వపు వ్రాతలో కనిపించే బిందు పూర్వాక్షర ద్విత్వం ఇందులో లేదు పద్యాంత హల్లు అచ్చుగా వాడబడింది పాదాంతంలోనే గాక పాద మధ్యంలోనూ పొల్లు న కారం 'ను'గా తర్వాతి పద్యాల్లో ఉంది )

వెలయంగ వేంగి దేశంబులోన నాత్రేయ గోత్ర పుంగవులు మహాత్ములు వెల్లకీ (వెల్లంకి) పురంబున బల వన్తులు పుట్టి పెరిగి పాలించి చననుః2 (2)

(ఇది వచనంగా వ్రాయబడినా నిజానికి కంద పద్యం )

వెలయంగ వేంగి దేశంబులోన నాత్రేయ గోత్ర పుంగవులు మహా
త్ములు వెల్లకీ పురంబున బలవంతులు పుట్టి పెరిగి పాలించి చనన్

మను చరితుం డఖిల జగ జ్జన పూజితుండైన యత్రి సంతానమునను (న్)
జనియించి కొమ్మనార్యుండు, వినుత శ్రీ శుభ సమృద్ధి వెలయంగం బ్రభతోన్ (3)

ఆయత యశుండతనికి నా త్రేయాన్వయ భూషణుండతి స్థిరమతి నా
రాయనుం డుదియించె వచ (ణుండుదయించె)
శ్రీ యుతుండై సుకవి బన్ధు చిన్తామణియై (4)

వ్రిత్త ॥ అతుల శ్రీయుతుండై సమస్త జన చిత్తానంద సంజాత వి
స్ఫృత నానా గుణియైన యాతనికి నీరేజాత పత్రి ప్రకా (స్ఫృ)
శిత లోలేక్షణి యయ్తమాంబికకు లక్ష్మీనాధుండై పుట్టెను
న్నతి గోవిందుడు నిర్మల ప్రధిత విజ్ఞానంబులో నిమ్మహినిః (5) (న్)

కంః వితత యశుండైన యతనికిం బతివ్రతా గుణ విభాసి భాగ్యవతి మహా
సతియైన తురుక మాంబకు, నుత చరితుండ బంధుజన మనోముద కరుండను (6)

(6వ, పద్యంలో గంగాధరుని తల్లి తురక మాంబ అని ఉంది అప్పటికి దక్షిణ భారతదేశంలో తురుష్కుల వ్యాప్తి లేదు అది తుక్కాంబ పద రూపం కాబోలు )

వ్రిత్తః భూధర ధైర్యునత్యధిక పుణ్య చరితుండపార కీర్తి ల (త్రు)
క్ష్మీధర మూర్తి శిష్టజన మిత్రుండు గోత్ర పవిత్రుండచ్యుతా
రాధన తత్పరుండు సురరాజ గురుండు మతి ప్రభాతిగం
గాధరుండిద్ధరిత్రి ననంగా నుదియించి శుభోదయంబునన్ః (7) (ద)

(7వ ఎద్యంలోని విశేషణాలు చరితుడు మిత్రుడు అని ప్రధమా విభక్తిలో వాడి మొదటిఎదం ధైర్యున్ అని ద్వితీయలో వాడడం కంటె ధైర్యుడు అని ప్రధమలో ఉంటేనే అర్ధవంతంగా ఉండేది భూధర ధైర్యునన్నధిక అన్నా సరిపోయేది మూడవ పాదంలో మతి ప్రభాతి సురరాజ గురుండు అని అన్వయం )

కం ॥ మాతా పిత్రు (తృ) వర్గము సం ప్రీతిం జదివించి మన్చి పెన్చి లసద్వి
ద్యాతిశయ కుశలుం జేసి వి భూతిం బరిణయము సేసి పోషింపం గాను ॥ (8) (న్)

వ్రిత్త ॥ సకల కలా విధిజ్ఞుండనం జాలి సమస్త జనా (లి) సద్గుణ
ప్రకరము నెప్పుడును బుధ సభం బ్రణుతింపంగ నున్న యట్టి ననుం
బ్రకటిత కీర్తి వ్రోల జనపాలుండు ఘోరతరాజి లోలుండ
త్యకుటిల చిత్తుండీతండని యాదరికం బిల్పించి పంపంగాన్ ॥ (9)

(9వ పద్యం చివరి పాదంలో ఆదరికం పదం ఆదరణంబున అనే భావంలో ప్రయుక్తం, తర్వాతి

బిల్పించి పదం పిలిపించి అంటేనే చంపకమాల పద్యంలో గణం పొసగుతుంది ఇది లేఖక దోషం కాకపోదు )

కం॥ చనవు మెయి నగరిలోం దగు, పనులెల్లనుం బెంపు మెఱసి పరికించుచు నే
ర్పున భక్తి యుక్తి నతి ముద, మునం జేయుచుం దత్పరోక్షమున మఱియుం బ్రభను ॥ 10 (న్)

(రెండవ ప్రక్క)

శ్రీకాన్తా కాన్తుచే నాశ్రిత విబుధ జనాళి స్థిర ప్రాజ్య రాజ్య
శ్రీకాన్తా కాన్తుచే విస్త్రిత నిజభుజ నిస్త్రింశ నీత్యాన్యరాజ
శ్రీకాన్తా కాన్తుచే దిక్షితి గగన సమాశ్లిష్ట విస్పష్ట కీర్తి
శ్రీకాన్తా కాన్తుచే నూర్జిత రిపు మ్రిగరాజీ మ్రిగారాతి చేతన్॥ (11)

(11వ పద్యం స్రగ్ధర, మరభన యయయ గణాలు 8, 16 అక్షరాలు యతులు)

ఒ॥ పర నర పాల మౌలి మణి భాసుర దీప్తిలతా వితానవి (ళి)
స్ఫురిత పదాబ్జుచే నహిత భూతల నాథ వరూధినీ సరో
వర మధన ప్రభూత మదవ ద్విరదాధిపుచే విరోధి భూ
ధర శిఖర ప్రభిన్న విదిత త్రిదశేంద్ర నిశాత హేతిచేన్ ॥ 12

(ఈ చంపకమాల పద్యంలో తృతీయా విభక్తి ప్రత్యయాలైన రెండు 'చే'లు, ఒక 'చేన్' తప్ప మిగితాదంతా సంస్కృతమే )

కం॥ సుర కరిపరి (తి) మ్రిగపతి హరి, సుర సతి దమల సరసీరుహ శుక్తిరుహ సదృకే (శుచే)
సురు చిర విశద యశోభా, సుర నిధిచే సుకవి ధరణీ సుర నిధి చేతన్ ॥ (13)

(ఈ పద్యంలో సుర సరిదమల సరసిరుహ, సదృక్, ధరణి సుర అంటే గణభంగాలు కావు పైగా సరియైన రూపాలు)

కం॥ సరనిధి పరీత ధాత్రీ (శరనిధి) పరిపాలిత దక్షిణ ప్రభాసి భుజవి (జా)
స్తరు చేత నన్మకుండా (అనుమకొండ!) పురనాథుండైన రుద్ర భూపతి చేతను ॥ (14)
(శరనిధి = సముద్రం)

వ్రిత్త॥ వెలయ నమాత్య సంపదయు విశ్రుతమైన నియోగ వ్రిత్తులం
దలము శితాత పత్రముల - తర్క్య విభూషణ లేపనాంబరం
బులుం దగువ్రిత్తులుం బడసి భూసుర వర్గము బ్రోచి దేవతా
నియలము లర్థిం బెక్కొనర నిల్పుచుం బూజలు ప్రీతిం జల్పుచున్ ॥ (15)

కం॥ జననాథు కరుణం దిండోం, డనంగాం బరగిన మహాగ్రహారము విద్వ
జ్జనములకు నిచ్చి యజ్ఞము లొనరంగ జేయించినా మహోన్నతి వెలయను॥ 16
(దిండోడు గ్రామం ఎక్కడుందో తెలియదు)

వ్రిత్త ॥ అందుం ద్రికూట నిర్మిత శివాలయమును విలసత్తటాకమును
సుందర పు ప వాటికలుం జుట్టిన లుంగ లవంగ తాల మా (పుష్ప)
కంద వనంబులును జనసుఖప్రద(మై) వెలయంగం జేసి శ్రీ
నందన మూర్తి రుద్ర జన నాథు దయను మఱి యన్మకొండలోను ॥ (17)

(మూడవ ప్రక్క)

కం॥ శ్రీ విభుం బ్రసన్న కేశవ, దేవుం బుర మధ్యమున నతి స్థిరముగ స
ద్భావన నా రుద్రేశ్వర దేవు సమీపమున నిల్పితిం గడు భక్తిని॥ (18)

పున్నేశ్వర దేవాలయ, సాన్నిధ్యము నందు కడు బ్రసన్నుతముగన
ప్పన్నగ భూషణునకు న, త్యున్నతి గుడి నిల్పితిని మహోత్సవమునను (న్)॥ (19)

పుర్ష నిధి వుర్ష రత్నము, వుర్షోత్తమ మూర్తి యన్చు బొగడంగ జనులు
ద్దర్షమతి వెలయంగా బ్రై, పుర్షులం జేసితిం బ్రతిష్ఠ పూజార్హముగాను॥ (20)

(ఈ 20వ పద్యం, తర్వాతి కాలపు బమ్మెర పోతన భాగవత పద్యాలను తలపించేదిగా ఉంది పురుష శబ్దం పుర్షఅని వాడుట వింత పురుషగా మార్చినా పద్యం గణభంగం కాదు ఇది లేఖక దోషం అనడానకి 22వ పద్యం చివరి పాదం సాక్ష్యం అక్కడ 'బురుషోత్తమున్' అంటేనే గణాలు సరిపోతాయి )

గంగాచియ చెఱువున యొ, ద్దం గేశవదేపు గుడియు ధర్మస్థితి త
త్సంగతి విప్రులకుం సం, ధ్యాంగన గొలువంగ జనాశ్రయము సేసితినేన్ (21)

(చెరువున యొద్దం ప్రాచీన రూపం, సంధ్యాంగన = గాయత్రి)

వ్రిత్త ॥ అంబుధి వేష్టితావనికి నాభరణంబగు నాహిడంబ తీ
ర్థంబునం బా(o)డవోత్తములు దాత్త మతులు మును భీమ నాథగె
హంబు మొదల్గం బెక్కు దివిజాలయములు సృజియించిరేను భ
క్తిం బుర్షోత్తమును హరిబ్రతిష్ఠతుంజేసితి వాని సన్నిధిని ॥ (22)

కం॥ పరమేశుండు హరి బుద్ధ, స్వరూపుండై యసుర వరుల వంచించుట నా
హరి యనియ పట్టశాలం, జిరముగ బుద్ధ ప్రతిష్ఠ సేసితి భక్తిని॥ (23)

వ్రిత్త॥ ధర నత్యుతమమైన తీర్థము శివస్థానంబు సంవర్తకే
శ్వర మంచును శశిఖండ శేఖరుని విశ్వస్తుత్యుం బూజించి సు
స్థిరమై యుండం దటాకమును గుడియు నర్థిం జేసి చేయించి యీ
శ్వరు సద్భక్తిం బ్రతిష్ఠ సేసితి జగద్వంద్యును భవానీ పతిని॥ (24)

కం॥ ఎన్నంగం గోటి భవంబులం (ఎన్నగ గోటి భవంబుల)
దన్నుం బ్రాపించు దు( ) క్రితము లెల్లం జెడున్ (దుష్కృత)
భిన్నా సంగమ మాడినం (పెన్నాసంగమం)
బన్నగ భూషణునిం జూడ బడసిన మాత్రను॥ (25)

కం॥ అనునాది మునుల వచనము, విని కాకతి రుద్రదేవ వీరుండు విద్వ,
జ్జనముల యనుగ్ర ధర్మవు నిల్ప దలంచిద ॥ (26)

వ్రిత్త॥ ఆ (కా) లేశ్వర దే (వె) న్త తేజో (మ) యంబై కైలా
మగు దేవాగారముం నిల్పి ం డొప్పం బ్రతిష్ఠ సేసెం
బరమేశును (త్తం- -) బు రుద్రేశ్వరును
శ్రీ కంఠును దశకంఠ పూజిత నిజశ్రీ పాత వంకరుహును॥ (27) (కే)

(నాలుగవ ప్రక్క)

కం॥ ఆ రుద్రేశ్వర దేవా గార సమీపంబున (o) దు గమనియ్య సురా (కమనీయ)
గారంబు సేసి నిల్పితి గౌరీ వల్లభుం ద్రిణేత్రు గామాంగ హరున్॥ (29) (త్రినేత్రు)

కం॥ తత్సన్ని ధానమున శ్రీ వత్సాంకుం బ్రతిష్ఠ సేసి వఱలంగ జెఱువం
దుత్సవము తోడం బెట్టి జ గత్సుందర కీర్తి వెలయంగాం బరగి మహిని ॥ (29) (న్)

కం॥ వర మన్త్రకూట పురమున, వరదునకు జగజ్జనాభి వందిత చరణాం
బురుహున కాచంద్రార్క, స్థిరముగ గుడి వ్రిత్తి నిల్పితిం త్రిణయునకును॥ (30)

వ్రిత్త॥ శంకిత భక్తి యుక్తి ననిష(శ)ంబు నిజాంఘ్రులు గొల్చు నబ్జ భూ (శంశిత)
వంశము ఖాఖిల ప్రజన వాంఛిత పుణ్య ఫల ప్రదును సురా
ర్యంశజ వంశ దర్ప హరు నచ్యుతు నీ నగరూరనం జతు
ర్వింశతి మూర్తి యుక్తముగవిశ్వమయాత్ముం బ్రతిష్ఠ జేసితిని॥ (31)

కం॥ తన పెంచిన సన్తానముం, దన సన్తానంబుం గ్రితియుం దన నల్లిల్లును
వనముం జెఱువును గుడియునుం, జనవినుతములైన సప్త సంతానంబులు॥ (32)

స్వస్తి శ్రీ శక వర్షములు 1092 విక్రితి సంవత్సర మాఘశుద్ధ పంచమి బుధవారమున శ్రీమన్మహామండలేశ్వర కాకతియ రుద్రదేవ రాజులు నగరూరెక్కించి నగరూరు (-) పలుగాను సబ్బినాండెల్లా (ను) సముద్ధ (రింపు మని గంగ) రాజున కిచ్చె మంగళ హా శ్రీశ్రీ ॥

(32వ పద్యంలో మన పూర్వులు పుణ్యంగా భావించిన సప్త సంతానములు పేర్కొనబడ్డాయి 12వ, శతాబ్దిలో గంగాధర మంత్రి పేర్కొన్న ఆ పుణ్య కార్యాలివి 1 పెంచిన సంతానం 2 తన సంతానం 3 కావ్య నిర్మాణం 4 అల్లుని ఇల్లు 5 తోట పెట్టుట 6 చెరువు త్రవ్వించుట 7 ఆలయ నిర్మాణం 16వ శతాబ్ది ధూర్జటి కవి 'శ్రీకాళహస్తీశ్వరా' శతకంలో సప్త సంతానముల గూర్చి చెప్పిన పద్యం చూడండి

మ॥ తనయుంగాంచి, ధనంబు వాతి, దివిజ స్థానంబు గట్టించి, వి
ప్రున కుద్వాహము జేసి, సత్కృతికి పాత్రుండై, తటాకంబునే
ర్పున ద్రవ్వించి, వనంబుబెట్టి మననీ పోలేడు నీ సేవజే
సిన పుణ్యాత్ముడు పోవులోకమునకున్ శ్రీకాళహస్తీశ్వరా

పుత్ర ప్రాప్తి, నిధి నిక్షేపము, దేవాలయం, బ్రాహ్మణునికి పెండ్లి, కృతి స్వీకృతి, వనము, చెరువు - నిర్మాణాలు, నాలుగు వందలేండ్లలో వచ్చిన భావాల మార్పును గమనించవచ్చు )

**శాసనకాలం** క్రీ శ 1171, కాకతి రుద్రదేవుని కాలం శాసనకర్త - వెల్లంకి గంగాధర మంత్రి

**శాసన భావం** ఇందులో నగునూరు కేంద్రంగా సబ్బిసీమను పరిపాలించిన వెల్లంకి గంగాధర మంత్రి బాల్య, వంశ విశేషాలు వర్ణించబడినవి ఆయన విద్వాంసుడు, వీరుడు, రాజనీతి నిపుణుడు అతడు రెండవ ప్రోలరాజు కాలంలో కాకతీయ చక్రవర్తుల కొలువులో చేరాడు మొదట హన్మకొండ నగరామాత్యుడు ఆ కాలంలో తటాకాలు తవ్వించాడు, ఆలయాలు నిర్మించాడు

కాకతి రుద్రదేవునిచే సబ్బిరాష్ట్ర (కరీంనగర్ మండలం) పాలకుడై నగునూరు (నగరూరు అని శాసన నామం) లో నివసించాడు నగునూరులో కేశవాలయాన్ని ఇరువది నాల్గుమూర్తులతో సహా నిర్మింపజేసి, ఈ శాసనం స్వయంగా వ్రాసి వేయించాడు రుద్రదేవ చక్రవర్తి స్వయంగా నగునూరుకు వచ్చి వెళ్ళాడట ఆఆలయ ఉత్సవ సందర్శనానికి కాబోలు

**చారిత్రక విశేషాలు** గంగాధర మంత్రి రుద్రదేవునికి, కల్యాణి బిజ్జలుని దండనాధుడైన మైలగి దేవునితో జరిగిన యుద్ధంలో అమితంగా సాయపడ్డాడు మైలగి దేవునితో రుద్రదేవుడు కరీంనగర్ జిల్లాలోని ఆకునూరు వద్ద తలపడి ఓడించగా, గంగాధర మంత్రి మరో వైపున వెళ్ళి నగునూరు దొమ్మరాజును ఓడించాడు చక్రవర్తితో కలిసి వెళ్ళి పొలాస మేదరాజును ఓడించి పట్టణాన్ని

నిర్ధూమధామం చేశాడు 1 వారు కల్యాణి చక్రవర్తికి సామంతులు కాకతీయులకు ప్రత్యర్థులు ఆ తర్వాతనే అతడు సబ్బినాటికి పాలకుడయ్యింది

రాజ సన్మానితుడైన ఈ గంగధరామాత్యుడు సామంత రాజుల కాచి విద్వాంసుల బ్రోచినవాడు (15-16) విద్వజ్జనానికి దిండోడు అగ్రహారంగా ఇచ్చి, అచ్చట యజ్ఞం చేయించి, త్రికూటాలయం నిర్మించి, చెఱువును తవ్వించి, ఫల పుష్ప వనాలను వెలయించాడు (16-17) హన్మకొండలో రుద్రేశ్వర దేవుని సమీపంలో ప్రసన్న కేశవుని నిలిపాడు అది వేయిస్తంభాల గుడిలో కానోపును

పున్నేశ్వర దేవాలయ సాన్నిధ్యంలో గొప్ప శివాలయం నిర్మించాడు (19) గంగాచియ చెరువు వద్ద విష్ణ్వాలయం నిర్మింపజేసి ఆ చెరువును బ్రాహ్మణులు స్నాన సంధ్యలు చేసుకోవడానికి ధారాదత్తం చేశాడు (21) ఇది హన్మకొండ లోనిదే ఏదో ఓ తటాకం (మంథనిలోని తమ్మి చెరువు కూడా ఇలాగే విప్రులకు కేటాయించబడింది నాడు అన్యజాతులవారు దాని నీరు ముట్టరాదని నియమం) హిడింబ తీర్థంలో పాండవుల గుళ్లున్నాయి అక్కడ గంగాధరుడు కేశవాలయం నిర్మింపజేశాడు (22) అది మడికొండ గ్రామం కొండ పట్టశాలలో (పట్టిసం)లో బుద్ధ విగ్రహ ప్రతిష్ట కావించాడు కాని, అది శాక్య గౌతమ బుద్ధుని పై గల భక్తితో కాదు హరిని బుద్ధమూర్తిగా (త్రిపురాసుర సంహార సందర్భంలో శివునకు సహకరించిన వాడని) భావించి హిందూపురాణ భక్తి తోనే (23) ఇంకా సంవర్తకేశ్వరంలో ఒక తటాకం, శివాలయం, కాళేశ్వరంలో శివలింగ ప్రతిష్ఠతోపాటు శివకేశవాలయాలను మంథనిలో ఒక శివాలయం నిర్మించాడు (24-30)

ఈ నగునూరులో చతుర్వింశతి మూర్తి యుక్తంగా అచ్యుతాలయం నిర్మింపజేశాడు 31 నగునూరులో ఆలయాలెక్కువ అక్కడి కీర్తి శిలాస్తంభాలు ఆంధ్రుల శిల్పకళా చరిత్రకే తలమాణికాలు అక్కడ త్రికూటాలయం కాకతి కాలాని దున్నది అదో దాని ప్రక్కనున్న ఆలయమో గంగాధర మంత్రి నిర్మాణం కావాలి ఆ ఆలయాలు గోధుమరంగు నునుపురాలతో శిల్పాలంకృతమై అర్థశిథిలావస్థలో ఉన్ననూ ఇప్పటికీ కళాప్రియుల హృదయాలను ఆకట్టుకొంటున్నాయి

**భాష** అర్థ బిందువుకు, పూర్ణబిందువు, వలవల గిలకవంటి క్రావడి, ఋత్వం ఇకార ధ్వనిగా వాడబడినవి తత్సమ పదప్రయోగం రమణీయం ళ, ఱల ప్రయోగం ఇప్పటి పదాలలో వలె లేదు

ఆదరికం, ప్రసన్నుతముగ, ఉద్దర్షమతి, చెరువున యొద్దం వంటి కొన్ని పద ప్రయోగాలు మ్రింగుడుపడవు పుర్వ, పు ప, దు క్రితము, ప్రాపించు - లేఖక దోషాలు అనొచ్చు

**సాహిత్యం** ఇందలి 32 పద్యాలలో 20 కందాలు మిగితా 12 సంస్కృత వృత్తాలు 4 ఉత్పల మాలలు, 3 చంపకమాలలు, 2 మత్తేభాలు, 2 శార్దూలాలు, 1 స్రగ్ధర పద్యాలు ఛందోబద్ధాలు శైలి రమ్యం స్రగర్థ (11) శ్లేషచే ఒప్పారి కవి ప్రతిభకు పట్టం కట్టింది శ్రీరామాధిపుడు (1)పరనరపాల (12) తత్సమ పద సమాస బాహుళ్య, సహజరూపక అలంకార భూయిష్ట పద్యాలు కవి పాండిత్యం కవన నైపుణ్యం అపారం

గంగాధర మంత్రి తిక్కనకు పూర్వుడు ఇవి తిక్కనకు పూర్వ శాసనాల పద్యాలనేకాక నన్నయ వాడిన గీతం, ఆటవెలది వ్రాయకపోవడం గమనార్హం ఇది ఈ జిల్లాలో లభించిన మొట్టమొదటి శిలా శాసన రూప తెలుగు పద్యకావ్యం!

**ఆ) మేడారం శాసనం [2] - పెద్దపల్లి తాలూకా**

ఈ గ్రామాన్ని ఇప్పుడు నందిమేడారం అని పిలుస్తున్నారు గ్రామ మధ్యంలో శిథిలాలయ వేదికపై కాకతీయ శిల్పంతో ఒక అందమైన నంది విగ్రహామున్నది అదే ఈ ఊరుపేరుకు జతపడింది అక్కడిదే ఈ శిలాశాసనం శాసన మూలం ఇది

' (విక్రమ) కేశవ దేవరకు/ వెలి (చేను) ఖ (-)

స్వస్తి శ్రీమతు బండి బ్రమ్మె నాయకు (డు)/ ముతూ" (అసంపూర్ణం)
"శ్రీ శక వర్షములు 10 (98) (అ) గు దుర్ముఖి
సంవత్సర (ము) (నా)డు మేడరా (జు) ప్రతిష్ట సేసి
త్రికూటము (శ్రీమే) " (అసంపూర్ణం)/
(సుక మూ) " స్వస్తి సమస్త ప్రశస్తి సహితం శ్రీమన్మహా/ మణ్డళేశ్వరం కాకెత రుద్రదేవ రాజులు ధర్మ ప్రతి పాలితుండై అనాది /ప్రోలేశ్వర దేవరకు మతు /లక్ష్మీశ్వర దేవ "

**శాసన కాలం** - శా శ 1098, క్రీ శ 1175, శాసన కర్త - బండి బ్రహ్మనాయకుడు

**శాసన విశేషాంశాలు** శాసనం మొదటి భాగంలో బండి బ్రహ్మనాయకుడు కేశవ దేవుని పూజకోసం వెలిచేను దానం చేయడమున్నది రెండవ భాగంలో మేడరాజు త్రికూటాలయం నిర్మించిన లేదా సముద్ధరించిన విషయమున్నది మూడవ భాగం కాకతి రుద్రదేవుడు ప్రోలేశ్వర లక్ష్మీశ్వర దేవరలకు దానం కావించినది

రుద్ర దేవుని చేత పరాజితుడైన పొలాస మేడరాజు ఈ శాసనంలోని మేడరాజు ఒకే వ్యక్తి కారు క్రీ శ 1156 నుండి ఈ ప్రాంతం రుద్రదేవుని పాలనలోనికి వెళ్ళింది శాసన కాలం 1175 కావున ఈ మేడరాజు వేరే వ్యక్తి కాకతీయుల సామంతుడు పైగా త్రికూటాలయాలు కాకతీయుల కాలంలోనే నిర్మింపబడ్డాయి

బండి బ్రహ్మనాయుడు పేర్కొన్న కేశవ దేవుడే రుద్రదేవుడు పేర్కొన్న లక్ష్మీశ్వరుడు అయి ఉంటాడు ఇక్కడి శివుడు ప్రోలేశ్వరుడు ఈ జిల్లా మొదటి విజేత ప్రోలరాజు మంథని గుండరాజును యుద్ధంలో చంపినది ఈ రెండవ ప్రోలుడే తండ్రి మీది గౌరవంతో రుద్రుడు మేడారం శివలింగమూర్తిని ప్రోలేశ్వర నామాంకితం చేసి ఉంటాడు శాసనంలో అధిక భాగం ఖిలమై దాన వివరాలు సరిగా తెలియటం లేదు బ్రహ్మనాయుడు స్థానిక పాలకుడు

**ఇ) గొడిశాల శాసనం [4] - హుజూరాబాద్ తాలూకా**

కాకతి గణపతి దేవుని దండనాయకుడు కాటయ వేయించిన దాన శాసనం ఇది చక్కటి తెలుగు గద్య పద్యాలతోనూ, చివర భూదాన వివరాల విలువైన సమాచారంతోనూ చారిత్రక ప్రాధాన్యత గలది శిలా శాసన హృద్య పద్య సాహిత్య చక్కని చంపూ కావ్యం

శాసనం -

"శ్రీమదనూన - జలసేవకుం బాయక మ్రోయు షట్పద
స్తోమ నినాదమున్వినుచు సూరెలనెప్పుడుం బ్రస్తుతించు సి
ద్ధామర కోటికి న్వరదుండైన గణేశుండు సుస్థిర స్థితిం
గామ సమానమూర్తి యగు కాటయ కీపుత5 మిష్ట సంపదల్॥

చరణ సరోరుహ రాగ, స్ఫురణ న్మహిషుని శిరంబు వాలుపుగ సంధ్యా
భ్రరుచి నెనయ మెట్టిన స త్కరుణాన్విత దుర్గి వరము కాటయకొసంగున్ (దుర్గ)

ఉరగేంద్ర దిగ్గజముల కుం, బరమోత్సాహముగ నాత పత్రము వోలె
న్ధర యెత్తిన కిరివరుండగు (కిటి), హరి గాటయ కీవుతము, దయామతి శుభముల్

దేవాధి దేవుం డమిత, స్థావర జంగమ మయుండు సర్వేశుండు (న్)
గౌరీశుండనవర తంబును6 నీవుతం గాటయకు దయనభీష్ట ఫలంబుల్

హరి దశ్వం డజాచ్యుత శం కర మూర్తి ద్రయీ మయుండు గమలాప్తుండు భా
స్కరుండు దయంగాచు చుండెడుం గరుణా రస పూర్ణ హృదయు ంగాటయ బ్రీతిని॥ (హ్యా న్)

స్వస్తి శ్రీమదపార పారావార పరివృత మహీతలంబున సకల జనవినుతంబగు నంధ్ర దేశంబునకు విభూషణంబైన యనుమకొండ యను పుర వరంబు నిజరాజధానిగా నొప్పుచుంన కాకతె భూపాల క్రమంబున జన వినుత యశో విలాసుండును విజయలక్ష్మీ నివాసుండును నైన రుద్ర నరేంద్ర సుపుత్రుండును సదారాధిత త్రినేత్రుండును విబుధ జనవన వసంతుండును రమణియ్య సీమంతినీ జయంతుండును సకల జనమనోరంజనుండును నరాతి రాజమద భంజనుండును శరణాగత రాజ శరణ్యుండును వినుతాఖిల రాజ వరేణ్యుండును ధైర్యామర సానుమంతుండునుం తురగరేవంతుండును సత్యహరిశ్చంద్రుండును విభవామ రేంద్రుండును నైన గణపతి దేవ మహీనాధునకు బ్రధానియై, (ఇది గణపతిదేవ చక్రవర్తి వర్ణన)

కం॥ కనకాచల ధీరుండు జన, వినుత చరిత్రుండు గార్యవిదుండిన తేజుం
డన ఘుండు గుణనిధి బెజ్జమ, తనయుండు బుధ దీన భాను తనయుండనగాంన్ ॥

ప్రి॥ ప్రతి పక్ష క్షితిపాల కుంజర మద ప్రారంభ సంరంభ ము
ద్ధత బాహో నిహిత ప్రచండ నిశితోద్యత్ఖడ్గ ధారా నఖా
హతి భేదించి యఖర్వ గర్వ బల శౌర్య స్ఫూర్తిం గంఠీరవా
కృతియై సన్నుత వృత్తి దాల్చి వెలసెను రేచెర్ల రుద్రుండిలన్॥

సకల జన వినుత యశుండును గుణగణాలంకారుండును నైన కాట్రెడ్డికి సౌభాగ్య సౌందర్య చాతుర్యంబులం గలిగి పరగిన పతివ్రత యైన బెజ్జమాంబకుం బ్రియ నందనుండును ననవరత ధర్మ సమేతుండును పతి హితా చరణుండును గాకెత రాజ్యభార ధౌరేయుండును సద్గుణ ప్రఖ్యాతుండును నతుల బల పరాక్రమ సమన్వితుండును నైన రేచెర్ల రుద్రునకుం బ్రధాని॥ (ఈ వచనం పై రెండు పద్యాలు రేచెర్ల రుద్రుని వర్ణన)

కం॥ కుల తిలకుండు వసుధామర, జలధి సుధాకరుం డశేష జన నుత చరిత్రుం (తు)
దలఘుండు రిపు తరు దావా, నలుండనంగాం బరగె రాజె నాయకుండుర్విని॥ (న్)

బొక్కెరలోని వీరభటావలి వధించి గో (ధు) మఱాతిం తలదెంచి ఉదగిరి సాధించి పడిరాయనిందోలి దాక్షా రామ భీమేశ్వర దేవర కక్షయ దీపంబులు నిలిపి ధర్మ సమేతుండైన రాజెనాయంకునికి ధర్మ పత్నియు సుచారిత్రయు వనితా లలామయునైన రవ్వమాంబకు సుపుత్రుండు॥ (ఈ వచనం దీనిపై పద్యంలోనూ రాజనాయకుని వర్ణించాడు కవి ఈతడు రేచెర్ల రుద్రుని మంత్రి ఈ శాసన కర్త కాటయనాయకునికి తండ్రి - బ్రాహ్మణుడు)

సరనిధి గంభీరుండు సు (శరనిధి), స్థిర తర తేజుండు వంశ శేఖరుండు దయా
కరుండు బుధాంబుజ దశ శత, కరుండని వర్ణింప నొప్పుం గాటయ ధాత్రిని॥
(ఈ కందంలోనిది కాటయ వర్ణన)

విశద యశుండైన గణపతి దేవ భూపాలునకుం బరమ భక్తుండై తన్మహీనాధు కారుణ్యంబున నతుల విభవ సమేతుండై వనంబులొప్పం బెట్టె తటాకంబులు శివాలయంబులు నిలిపి వినయ వివేక సత్యశౌచ త్యాగ భోగ బల పరాక్రమంబుల జన వినుతుండై యభీష్టార్థ ప్రదుండగు చుంనత్రిలోకారాధ్యుండైన పరమేశ్వరునకంగ భోగార్థంబు దనయిచ్చిన వృత్తులు శాశ్వతంబై ప్రవర్తిల్లు చుండని నిల్పిన సంవత్సర సంఖ్య శకవర్షములు 1157 మన్మధ సంవత్సర శుద్ధ 15 గురువారము నందు పంచలింగాలకూను పించఱపల్లిని దేవ బ్రాహ్మణ వృత్తులు గాక సర్వ సమస్యముగా నిచ్చె పెంజెఱ్ఱున మీంది కాల్వను కొంతపు గాల్వ దక్షిణమూను ఆవాంక అడ్డాను చింతన మిట్టలూను రవ్వసాని ఆనకిందూను యింత వట్టు గూడనుర్ 13॥ ప్రోలకంమ కాల్వనుర్1

చోలు బాడె కాల్వను చుట్టుర్ 1 కాట్ర్యాయుని చెఱ్వున బ్రాహ్మణ వ్రిత్తులు గాక సర్వమూంను రవ్వసాని చెఱ్వాను రవ్వసాని మామిడి తోంట పడమటి ఆనాను రాజెనాయంకుని చెఱ్వునర్ 7 వెలిపొలము యేరువోక గుబ్బలి జగదేవ త్రోవ దక్షిణమునర్ 20 దీని దక్షిణమున పెద్ద రేగటి లోనర్ 40 బొమ్మకంటి తెర్వు పడుమట నుండి పూరివెనె తీగవెనె నడ్మర్ 60 యేటి మడ మామిడి వనమూను ఆ వనములోని చింతవనమూను ఊరి దక్షిణము తాటి వనమూను అంగడి సుంకమూను ఇంతపట్టు కాట్ర్యాయుండు దేవడ్లకు అంగభోగ రంగభోగధూప దీపనైవేద్య తాంబూలాలకు సూర్యచంద్రులు కలంత గాలము ఇచ్చిన ఈవి కాదంన్న వారు గంగ కఱ్ఱం గవిలం బొడిచిన దోషానం బోదురు॥ కింది కాల్వనుర్ 10 (పది)। = ఇచ్చితిమి యింతవట్టు గణపతి దేవ మహారాజు విడిచిన దత్తి " (సర్వసమర్పణంబుగా పోలకమ్మ పోలేరమ్మ పోచమ్మ ఒక్కటే )

**శాసన కర్త** - కాటయ నాయకుడు, శాసన కాలం - క్రీశ 1236,

**కాకతి గణపతిదేవ చక్రవర్తి** పాలనా కాలం 1199-1260 (62 సం॥)

**భావం** కాటయ తండ్రి రాజనాయకుడు, తల్లి రవ్వమాంబ ఇది వారి పేరుగా గొడిశాల (ఉప్పరపల్లి) దేవాలయాల అంగరంగ భోగార్థం ఇచ్చిన భూముల వివరాలు తెలిపే దాన శాసనం గణపతి దేవ చక్రవర్తి పేరుగానే దానమిచ్చినట్లు శాసనం చివర పేర్కొనబడింది రాజనాయకుడు రేచెర్ల రుద్రునకు ప్రధాని రేచెర్ల రుద్రుని తల్లి దండ్రీ బెజ్జమాంబ కాట్రెడ్డి అని ఈ శాసనం ద్వారా తెలుస్తున్నది ఈ రుద్రుడే గణపతి దేవ చక్రవర్తి దేవగిరి రాజులకు బందీగా ఉన్న కాలంలో ఓరుగల్లు రాజ్యాన్ని కాపాడినవాడు రామప్ప దేవాలయ నిర్మాణం కావించినదీ ఇతడే

**చారిత్రక విశేషాలు** ఇందులో శాసనకర్త తండ్రి రాజనాయకుని, అతని అధికారి రేచెర్ల రుద్రుని యుద్ధ విజయాలు వర్ణించబడినవి గణపతిదేవున్ని కాకతి రుద్రదేవుని పుత్రునిగా చెప్పటం విశేషం ఏకామ్రనాధుని 'ప్రతాపరుద్ర చరిత్ర'లోనూ ఇలాగే చెప్పబడింది నిజానికి గణపతి దేవుడు రుద్రదేవుని తమ్ముడైన మహాదేవరాజు పుత్రుడు రుద్రునకు పుత్రులు లేరు గణపతి దేవుడు రుద్రదేవునకు దత్తపుత్రుడు అనుకోవచ్చు

**భాషా సాహిత్యాలు** సంస్కృత పదప్రయోగ బాహుళ్యం చిక్కని సమాసాల కూర్పు, చక్కని ఛందోబద్ధ కవిత్వం, నాడు వ్యాప్తిలో ఉంది అని ఈ శాసనం వలన భావించవచ్చు శ్రీమదసూన బలసేవకుం, చరణ సరోరుహ రాగ స్ఫురణ, దేవాధి దేవుడమిత స్థావర జంగమ మయుండు, హరిదశ్వడ జాద్భుత శంకర మూర్తి, బుధాంబుజదశ శత కరుండు మొ॥వి

తెలుగు పద ప్రయోగంలో తడబాటు దశ దాటి పోలేదు ఈవుతము, రాజెనాయకుడు కాట్ర్యాయుడు, వ్రిత్తి, వర్నింప, హృదయుం కాకెత, ఏరువోక, కాదంన్న, దేవుడ్లకు, పడమటి ఆన, పూరివెనె, కొంతపు కాల్వ మొ॥వి కొన్ని పదాలకు అర్థాలు సరిగా తెలువవు

గణపతి దేవుని వర్ణన సందర్భవచనం తత్సమ పదములతో శయ్యా సౌభాగ్యం కలిగి ఉంది దాన వివరాల భాగంలో తెలుగు పదాలెక్కువ వనమూను, మిట్టలూను అని వ్యావహారికాంధ్ర భాషా పదాలు ప్రయోగించబడటం విశేషం

ఆలయ నిర్మాణాలు, దేవుళ్ళకు అంగరంగ భోగాలు, పూజా నిర్వహణకు భూవన దానాలు నాటి రాచవారి ధర్మకార్యాలు అంగడిలో వస్తువుల క్రయ విక్రయ సుంకాలుండేవనే విషయం కూడా ఈ శాసనం ద్వారా తెలుస్తున్నది

పద్యాల శైలి రమణీయంగా ఉంది ఛందోభంగం లేదు ఇందలి తొమ్మిది పద్యాల్లో కేవలం రెండే రెండు వృత్త పద్యాలు మొదటిది చంపకమాల, మధ్య ఒక మత్తేభం మిగితా ఏడు పద్యాలు కందాలు కందానికి కరీంనగర్ ప్రాంతంలో కల ప్రాచుర్యానికి ఇది మరో సాక్ష్యం అది తిక్కన కవి కాలం

శాసనకవి పేరు లేదు ఆయన చక్కని ప్రతిభావ్యుత్పత్తులు కలవాడనడానికి ఇందలి వర్ణనలు సాక్ష్యమిస్తాయి మొదటి అయిదు పద్యాలలో వరుసగా నుతింపబడిన దేవతలు గణపతి, దుర్గ, వరాహమూర్తి, శివుడు, సూర్యుడు

శ్రీకారంతో పద్యారంభం కావించి ఉత్పలమాలతో గణపతిని మొదటపూజించడం కవి సాంప్రదాయక ప్రీతిని తెల్పుతుంది దుర్గ కాకతీయుల కుల దైవం ఏకవీరాదేవి వారు ఆదివరాహ లాంఛనులు శివభక్తులు సూర్యుడు నాటి త్రికూటాలయాలలో శివకేశవులతో పాటు స్థానం పొందిన ప్రధాన దైవం

ఇందలి వర్ణనలు హృదయరంజకంగా ఉన్నాయి సూర్యవర్ణన కందంలో 'హరి దశ్వడ జాచ్యుత శంకరమూర్తి త్రయీమయుండు కమలాప్తుడు భాస్కరుండు' అన్నాడు అంటే 'పచ్చని గుఱ్ఱాలవాడు, బ్రహ్మ విష్ణు మహేశ్వరుల స్వరూపుడు, వేద రూపుడు తామరల చుట్టం, సూర్యుడు అని భావం

ప్రతిపక్ష క్షితిపాల కుంజరాల మద ప్రారంభ సంరంభాలను ఉద్ధత బాహా నిహిత ప్రచండ నిశితోద్యత్ఖడ్గ ధారా నఖాహతి భేదించిన అఖర్వ గర్వబలశౌర్య స్ఫూర్తిగల కంఠీరవం అని రేచెర్ల రుద్రుని వర్ణించిన పద్యం భాషా ప్రౌఢిమభావ గాంభీర్యం కలది వీరరసం మత్తేభ విక్రీడితమై పరుగుదీసింది

బుధ దీన భానుతనయుడు (దాన కర్ణుడు) వసుధామర జలధి సుధాకరుడు - మొదలగునవి రసవదలాంకారాలు మొదటి పద్యంలోని షట్పద (తుమ్మెద - శివ మంత్రం) సిద్ధామరకోటి శబ్దాలు శ్లేషలో ప్రయోగించి ఉండవచ్చు కాకతీయుల కాలంలోని ఒక ప్రతిభావంతుడైన కవి కావ్యం ఈ కరీంనగర్ జిల్లా గొడిశాల (ఉప్పరపల్లి) శాసనం

**ఈ) కరీంనగర్ రాగి రేకుల శాసనం[7] క్రీ. శ. 1246 డి 15 శనివారం**

ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ పురావస్తు శాఖ వస్తు ప్రదర్శనశాల విభాగంఅధికారులు శ్రీ సంజీవరావు, లెక్చరర్ ప్రభుత్వ ఆర్ట్స్ అండ్ సైన్స్ కళాశాల కరీంనగర్ గారి నుండి సేకరించినది ఇది రెండు రాగి రేకులపై నాలుగు ప్రక్కల దేవనాగరి లిపిలో వ్రాయబడిన శాసనం రెండు రేకుల ఎడమ చివర నడుమ రంధ్రాలున్నవి కాని వాటిని కలిపి ఉంచినరింగ్ ఏదీ లేదు శాసనం 35 పంక్తుల్లోని మొదటి 22 పంక్తులు సంస్కృత గద్యం చివరి 13 వరుసలు తెలుగు వచనం దేవనాగరి లిపిలో ఉంది ఇది చామన పల్లిలోని 'గొనుగు కాలువ' నీటి పంపకం తగాదా విషయంలోని తీర్పు పత్రం కాకతి గణపతి దేవ చక్రవర్తి కాలం చామన్‌పల్లి కరీంనగర్ జిల్లాలోని నగునూరు చొప్పదండి గ్రామాలకు మధ్య ఉంది

శాసనంలోని తెలుగు భాగం ఇది -

॥క॥ చామనపల్లి గొనుగు కాలవ వివాదనిర్ణయార్థమై అక్షయ చందని వారు చామెన పల్లి మహాజనాలును అధివాస గ్రామాలవారి సాక్షి గోరినను కుమ్మరి కుంటలను మడికారకెరెడ్డిన్ని దావని నామి నాయుడును రవపకసివి రెడ్డిన్ని వామ జీయ కొడుకు మల్లజీయాను మంగడ మల్లాడు దేవనపల్లిని సోవకుల అన్నపరెడ్డిన్ని (మి)ట్టపల్లి మదిరెడ్డిని గట్టవెల్లి నామినాయెడును వేరమ కేసి రెడ్డిన్ని (మంగ --) చిసెటిన్ని మాసకమ్మ మైలి పెద్దిన్ని పడకంటి మైలార పెద్దిగారును తెత్రమ్మ వెన్నగారును కట్యకాలపల్లిని సోమప్పయ నాగదేవ కూచిగారును తమ్మడి పోన రాశీని దోవతుల గుండ్రెడిని మద్దిరెడ్డి ప్రోలిరెడ్డిని విండుల మాదనాను మేడపురము గట్టుమల్లి నాయుడున్ను ఇంతవట్టి వారి పలికిన పదకమేమన కాలు(వ) మహాజనాలదే నీండ్ల పంచి పెట్టులేక లోలి రెడ్డి మల్లి రడ్డి నాండు కాలువ వివాదమున్ను ఎంనడు లేదు ఈ కాలువను పదు నొకం (డ) మడి పోలయ పదికొం(డ) ఉత్తరాన గల్ల వల్లముందాంకా (మా(డి(కుం) ట తూరుపెల్లా మహాజనాలదే అనిరి "మంగల మహాశ్రీ '

ఇది దేవనాగరి లిపిలో ఉన్న తెలుగు శాసనం అనువాదం కాదు కేవలం మూలం తెలుగు లిపిలో చూపడమైంది దీని పద దోషాలు సవరించుకొని వాక్య విరమణ చిహ్నాలు పెట్టుకుంటేనే

కాని పూర్తి భావం అర్థం కాదు నాటి వ్యవహారంలోని తెలుగు భాషా స్వరూపం మాత్రం ఇట్లా ఉండేదని తెలిసింది నాటి వ్యక్తుల పేర్లు, నేటి కొన్ని గ్రామాల ఆనాటి ఉనికికి, ఈ శాసనం సజీవ సాక్ష్యం

**శాసన సంస్కృత బాగ సారాంశం** - కాకతీయ గణపతి దేవుని పాలనాకాలంలో నేఢపురం[8] గ్రామంలో రవిదత్త, వాఘదేవ,[9] హింగదేవ స్థానిక పాలకులుగా ఉన్న కాలంలో, జాయపనాయకుని[10] మంత్రి మంచిరాజు[11] చక్రవర్తి ఆజ్ఞలో చామనపల్లి గొనుగు కాలువ వివాద పరిష్కార విషయ సేకరణకు విక్రమశక 1303 సం॥ పరాభవ కార్తీకంలో చామనపల్లికి వచ్చాడు కుమ్మరి కుంట, దేవనపల్లి, కట్యకోలపల్లి గ్రామాల పెద్దల కాలువ చెంత సమావేశపరిచాడు వారి అభిప్రాయాలు సేకరించి చామనపల్లి బ్రాహ్మణులతో పాటు ఓరుగల్లుకు వెళ్లి చక్రవర్తికి నివేదించాడు అప్పుడు రాజాజ్ఞతో శ్రీపారకుని అన్న కుమారులైన అకయ చంద్రదేవ నారాయణలు మరియు మహరూక అధికారులు చామనపల్లికి వచ్చి చక్రవర్తి నిర్ణయాన్ని స్థానికాధికారులకు తెలిపారు దామయ అబ్బయ్య, పోచిరాజు, వొల్లమరాజ, కారపాక రుద్ర మొ॥ పెద్దల మరియు చామనపల్లి బ్రాహ్మణుల సమక్షంలో తిరిగి విచారణ జరిపి గొనుగు కాలువ పై హక్కు విప్రులదే అని నిర్ణయించారు

ఆ తీర్పు శాసనమే ఈ తామ్ర పత్రాలపై లిఖించబడింది ఇది నాటి ప్రజా జీవిత రీతిని రాజుల పరిపాలనా నీతిని తెలిపే శాసనాధారం

**ఉ) హుస్నాబాద్ శాసనం[12] -**

చెరువుకట్ట చెంతకలది, ఇది తెలుగు వచనంలో ఉన్న చిన్న దాన శాసనం అది ఇది
"స్వస్తి శ్రీమతు మహామండలేశ్వర రుద్రదేవని ముఖు సం(టి)
ఎక్కటీలు రుద్రేస్వర పత్ర భోగానకు విడిచిన దత్తి
తాడ్ల పయిడి గుడ్డలి చిన్నాలు రా(ట్ట) చేను, నాలుగు పుట్టు వడ్లు దేవర ఆయము"

**కాలం** పేర్కొనబడలేదు రుద్రమదేవి పాలన నాటిది క్రీ శ 1260-96
దానకర్తలు - ముగ్గురు ఎక్కటీలు (వీరులు)

**శాసన భావం** - కాకతి రుద్రమాంబ పరిపాలనా కాలంలో ముగ్గురు వీరులు రుద్రేశ్వరుని పత్రభోగానికి (పూజకు పూలు పత్రి) సమర్పించే వారికి ధారాదత్తం చేసినది తాళ్ల పయిని గుడ్డాలు (చేలు) ఇంకా రాట్నం చేను పొలం అంతా నాలుగు పుట్లు వడ్లు ఏటా దేవుని పేర వచ్చే ఆదాయం

**భాష** - ఇందలి భాష సామాన్య జన వ్యావహారికం శాసనం మొత్తం ఒకే ఒక వాక్యం మండలేస్వర, రుద్రదేవని, ముఖు, రుద్రేస్వర, తాడ్లు, గుడ్డలి, రాట్టచేను అప్పటి పలుకుబడులు ఇప్పుడా పదాలు మండలేశ్వర, రుద్రదేవుని, మూడు, రుద్రేశ్వర, తాళ్ళు, గుడ్డాలు, రాట్నం చేను అని పలుక బడుతున్నాయి శివుని రుద్రేశ్వరుడనడం ఆ రాణిపేరనో ఆమె తాత గారి పేరనో నెలకొల్పిన లింగమూర్తి కాబోలు పూజ పూలు అనక పత్ర భోగానికి అనటం శంకరునికి మారేడు దళములతో పూజ చేయటం ఆచారం పంట చేనుతో పాటు నీటిపారుదలకు (చెరువు వాగు కాలువ లేనప్పుడు) రాట్నం (బొక్కెనల గొలుసు మోట) దానం చేయడం కల్యాణి చాళుక్యుల కన్నడ శాసనాల్లోను ఉంది ఆయం = రాబడి

**ఊ) ఎలిగేడు శాసనం[13] పెద్దపల్లి తాలూకా**

చెరువు కట్ట చెంత శివాలయ ప్రాంగణంలో ఉన్నది

**శాసన భాగం**

1 "స్వస్తి శ్రీమన్మహా,మండలేశ్వర కాక, తియ్యప్రతాపరు,
ద్ర దేవ మహా రా, జులు సుఖ సం, కథా వినోదం,
బులం బ్రిథ్వీ రాజ్య ంబు సేయుచు ంగాను ప్లవస ,
ంవత్సర ఆషా(ఢ), శు॥ 15 గు ప్రతా, పరుద్రదేవ మ(హా),
రాజుల దేవులు, లక్మాదేవంమంగా, రు తమ తండ్రి,

2 (పా)ల్దేవ నా ఇనింగారికిం, బుణ్యము గాను శ్రీర, మ నాథదే, వరకు వ్రిత్తి,
కి (వెంను), పంను కాని కి కట్నం క (ణీ), రా (ల్బు) ఆత (నాప)రుల,

3 (ంఢ్ల) వీడుం బ, ట్టు సూ(డుండు) పాడి పసులకు
(బు)లెరి లేదు ఇం, త వట్టూ చంద్రసూ, ర్యులు గలంత,
గాలము చె (ల్లేది), దీ (న్కి) ఎవ్వరు లేద,

4 ంనాను గం, గి (మొదవు), ను సురియ ంబొడిచిన, దోషా (న)బో, దురు (తప్పి),
అడ్గిన వా, రినోరు, తొంక ఫ్రు, వులు తొలు చు మంగ,ళ మహా, శ్రీ శ్రీశ్రీ' 14
ఈ శాసనాన్ని ఇప్పటి భాషలో వ్రాస్తే ఇట్లుంటుంది

"స్వస్తి శ్రీమన్మహా మండలేశ్వర కాకతీయ ప్రతాపరుద్ర దేవ మహారాజులు సుఖ సంకథా వినోదంబులం బృథ్వీరాజ్యంబు సేయుచుండగాను, ప్లవ సంవత్సర ఆషాఢ శు॥ 15 గు ప్రతాప రుద్రమహారాజుల దేవేరి లకుమా దేవమ్మ గారు తమ తండ్రి పాల్దేవ నాయునిం గారికిం బుణ్యమునకు గాను శ్రీ రామ నాథ దేవరకు వృత్తికి వెన్ను పన్ను, కానికి కట్నం కణీ రాల్బు ఆతనా పరుల వీడుంబట్టు సూడుడు పాడి పశువులకు పుల్లరి లేదు ఇంతవట్టు చంద్ర సూర్యులు గలంత కాలము చెల్లేది దీనికి ఎవ్వరు లేదన్నను గంగి మొదవు (గోవు)ను సురియం (కత్తితో) బొడిచిన దోషాన బోదురు (దీనికి) తప్పి పలికిన వారి నోరును తోక పురుగులు తొలుచును మంగళ మహా శ్రీశ్రీశ్రీ'

**శాసన కాలం** - కాకతి ప్రతాపరుద్రదేవుని కాలం క్రీ శ 1296 - 1323

**శాసన కర్త్రి** - ప్రతాపరుద్ర చక్రవర్తి భార్యలకుమాదేవి

**శాసన విశేషాలు** ఇందలి భాష నాటి వ్యావహారిక వచనం రచన సామాన్యం పండిత విరచిత శాసనం కాదు శాసన రచయిత పేరు కానీ, శిల్పి పేరు కానీ లేవు కాకతీయ చక్రవర్తి ప్రతాపరుద్రుని భార్య లకుమాదేవికి ఈ ఎలిగేడు ప్రాంతంతో గల సంబంధ మేమిటో తెలియదు ఆమె తండ్రి పాల్దేవ నాయుడు ఈ ప్రాంతం వాడు కాబోలు

ఆ రామనాథేశ్వరాలయం చిన్నది అందమైనది ఇప్పటికీ అది పూజా పురస్కారాలతో ఊరి ముందు చెరువు కట్ట చివర చెక్కు చెదరకుండా ఉంది

ఇది దాన శాసనం మధ్యలో కొంత భాగం ఖిలం కొన్ని పదాలకు ఇప్పుడు అర్థాలు తెలియవు తెలిసినంతలో బండి కాని (కాడి) పన్ను దేవర భోగానికి నిర్ణయించబడింది పాడి పసులకు పుల్లరి (అడవిలో గడ్డి మేపుకుంటే ప్రభుత్వం వారికి చెల్లించే పన్ను) ఉదారంగా తొలగించబడింది

ఇది నాటి ప్రభువుల రాజ బంధువుల దైవ భక్తికి, పాడిపంటల అభివృద్ధికి, ఉదారంగా వ్యవహరించిన, దాన ధర్మాలు కావించిన తీరుకు నిదర్శనం

**పాదపీఠికలు**

1 పి వాసుదేవ పరబ్రహ్మశాస్త్రి గారి 'కాకతీయుల చరిత్ర 1977 పు 25
2 కరీంనగర్ జిల్లా శాసనములు నం 26
3 ఈ శాసనాల్లోని తెలుగు అంకెల ఈ అరబిక్ అంకెలుగా మార్చి చూపబడుతున్నవి
4 కరీంనగర్ జిల్లా శాసనములు నం 30
5 ఈవుత పదం ద్రుతాంతం కావచ్చు కాని కవి 'ము' ప్రత్యయంతో ఈ మొదటి పద్యంలోనేకాక మూడవ పద్యంలోనూ వాడినాడు నాల్గవ పద్యంతో ఈవుతన్ అనే ఉంది
6 నాల్గవ కందపద్యం రెండవ పాదం చివరి గణం మూడవ పాదం ప్రాస లేఖకుని పొరపాటున కాబోలు తప్పినవి ఆ పాదాన్ని సర్వేశుడుగొ రీవరు డనవరతంబును అంటే సరిపోతుంది
7 కరీంనగర్ జిల్లా శాసనాలు అనుబంధం 1 పుట 146 8 ఈ గ్రామం ఎక్కడ వుందో తెలియదు

9 శాసనంలో 'వాసుదేవ' అని ఉన్న పేరును ఎందుకో కానిఆంగ్లభాషలో శాసన వివరాలు తెలుపుతూ పుస్తక సంపాదకులు 'నాధదేవ' అని వ్రాశారు
10 గణపతి దేవ చక్రవర్తి బావమరిది ఈజాయపనేనాని నృత్త రత్నాకర కర్త
11 కాకతీయ సామంతుడుగా చెన్నూరు మండలాన్ని పాలించిన అల్లం ప్రోలరాజు చేత 1199లో భూదానంపొందిన మంచి భట్టోపాధ్యాయుడు గణపతిదేవ చక్రవర్తి పురోహితుడు ఈ మంచి రాజు వేరే వ్యక్తి
12 కరీంనగర్ జిల్లా శాసనములు నం 36, పుటలు 103, 104
13 కరీంనగర్ జిల్లా శాసనములు నం 37
14 ఈ శాసనంలోని కామాలు శాసన పంక్తులను చూపుటకు ఉద్దేశింపబడినవి ఇది స్తంభశాసనం పై అంకెలు శాసన శిలనాలుగు ప్రక్కలు

## (శాసన) సాహిత్య సమాలోకనం - I

**చరిత్ర** కరీంనగర్ జిల్లా గోదావరీ నదీ తీరంలో రాతియుగపు ఆదిమ మానవ నివాస స్థావరాలు, వారు వాడిన రాతి పనిముట్లు లభించాయి

కదంబాపూర్, సింగాపూర్,బిజిగిరి షరీఫ్, తొగర్ఱాయి, కనగర్తి, నాంపల్లి, బొడిగపల్లి మొ॥ ప్రదేశాలలో బృహచ్ఛిలా యుగ సమాధులు ఉన్నాయి [1] ఈ కైరన్నును గ్రామీణులురాకాసిగుళ్ళు అని వ్యవహరిస్తున్నారు ఇవి క్రీ పూ 600 నుండి 200 సంవత్సరాల కాలానివి రామాయణంతో దండకారణ్యంలోని ఈ ప్రాంతం బౌద్ధ సాహిత్యంలో అంధా పథంగా పేర్కొనబడింది ఇది అశ్మక రాజ్యం లోనిది నాగులు, ఆంధ్రులు, శాతవాహనులు ఇక్కడి పూర్వపాలకులు తెలింగులు ముదిబాలు స్థానికులు

క్రీ పూ 3వ శతాబ్దిలో మౌర్యుల పాలన ఈ ప్రాంతంలోనూ సాగింది క్రీ పూ 2వ శతాబ్ది నుండి, క్రీ శ 2వ, శతాబ్ది వరకు శాతవాహనుల పరిపాలనలో ఈ మండలం కూడా ఉంది శాతవాహనులకు పూర్వం ఆంధ్రరాజులు పరిపాలించారు

పెద్ద బొంకూరు, కోటిలింగాల, ధూళికట్ట, వేంనూరు, శాతవాహన - పూర్వశాతవాహనాంధ్ర నగరాలు చివరి మూడు బలమైన కోటలు మొదటి మూడుప్రాంతాలలో ఆంధ్రుల కాలపు (క్రీ పూ 400-200) పంచ్‌మార్క్ సామగోపనాణాలు లభించాయి ఆంధ్రులకు బలమైన 30 కోటలు కలవని మెగస్తనీస్ వ్రాసిన వానిలో మూడు ఈ జిల్లాలోనివే శాతవాహనులు ఈ ప్రాంతం నుండే పశ్చిమ కోస్తాకు వెళ్ళి అటు నుండి తూర్పు కోస్తా మీదుగా ఉత్తర భారతానికి విస్తరించారని చరిత్ర పరిశోధకుల అభిప్రాయం [2]

ఇక్కడి ధూళికట్ట - వడ్కాపూర్ సమీపాన ఒక బౌద్ధస్తూపం వెలువడింది ఇది అమరావతి స్తూపం కాలానిది దీని నాగముచికుంద తదితర శిల్ప శిలా ఫలకాలు కరీంనగరం పురావస్తు పరిశోధన శాలలో ఉన్నాయి ఈ స్తూప ఫలకాలమీది దాతల పేర్లు, కదంబాపూర్ సమాధి పేటిక ముద్ర, కోటిలింగాల నాణేల రాజుల నామాలు ఇక్కడి తొలివ్రాతలు అవి అన్నీ బ్రహ్మీలిపిలో ఉన్న ప్రాకృత పదాలు

శాతవాహనులు మగధను కూడా జయించి పాలించారు

శాతవాహనుల తర్వాత 3, 6 శతాబ్దాల మధ్యకాలంలో ఆంధ్ర దేశంలో చిన్నరాజ్యాలు అనేకం పుట్టుకు వచ్చాయి వాటిలో వేంగి సాలంకాయనుల, కీసర గుట్ట విష్ణుకుండినుల ఏలుబడిలో కరీంనగర్ మండలం కూడా ఉంది 7, 8 శతాబ్దుల్లో బాదామి చాళుక్యుల, 9, 10 శతాబ్దుల్లో మాన్యఖేట రాష్ట్రకూటుల సామంతులైన బోధన్ వేములవాడ చాళుక్యుల పరిపాలన ఈ ప్రాంతంపై సాగింది

10వ, శతాబ్ది చివరి నుండి కల్యాణి చాళుక్యుల సామంతులు, 12వ శతాబ్ది మధ్య కాలం నుండి కాకతీయాంధ్ర చక్రవర్తులు ఈ నేల నేలారు [3]

**సాహిత్యం** 10వ, శతాబ్ది వేముల వాడ చాళుక్య రాజుల శాసనాలు 11వ, శతాబ్దిలోని కల్యాణి చాళుక్యుల సామంతుల శాసనాలు 12, 13 శతాబ్దులలోని ఓరుగంటి కాకతీయ చక్రవర్తుల కాలం నాటి శాసనాలు సంస్కృత కన్నడ తెలుగు భాషల్లో ఈ జిల్లాలో లభించాయి ఆ నాలుగు శతాబ్దాల తెలుగు శాసనాలు ఈ అధ్యాయంలో చర్చించబడ్డాయి

తర్వాతి కాలంలో 17, 18 శతాబ్దాల వరకు ఇక్కడి ఆలయాల - కోటల చెంత అనేక శాసనాలున్నాయి వానిలో వచనాలవి ఎక్కువ అప్పటికి ఈ జిల్లాలో కావ్య సాహిత్యం వ్యాప్తికి వచ్చింది కనుక, ఆ శాసనాల ప్రస్తావనకు పోలేదు ఈ తెలుగు శాసన సాహిత్యం' సమీక్ష, ఒక విధంగా ఆంధ్ర సాహిత్య చరిత్రలో ప్రాఙ్నన్నయ యుగ వాఙ్మయం వలె కరీంనగర్ జిల్లాలో ఆంధ్ర కావ్య ప్రాదుర్భావానికి పూర్వకాల సాహిత్య పరామర్శ అనుకోవచ్చు

10, 11 శతాబ్దాల తెలుగు శాసనాలు పూర్తిగా, 12 13 శతాబ్దాల కాకతీయుల కాలం నాటి తెలుగు శాసనాలలో కొన్ని ప్రముఖమైనవి మాత్రమే ఈ శీర్షికలో చూపబడినవి

**శాసన సాహిత్య సమీక్ష** పదవ శతాబ్ది మధ్య వేములవాడ చాళుక్యుల కాలంలో ఈ కరీంనగర్ జిల్లాలో పద్యకవిత ఆరంభమైంది అది ఆది కవి నన్నయ భట్టారకునికి వందేండ్లు పూర్వం కందం తప్ప మరే తెలుగు పద్యం కానీ అప్పుడు ఈ జిల్లాలో కనిపించలేదు ఆ కాలంలో కందపద్యం ఈ జిల్లాలో తప్ప మరే ప్రాంతపు తెలుగు శాసనంలోనూ లేదు

ఆంధ్ర ప్రదేశంలో మొట్ట మొదట కందం కనిపించింది కరీంనగర్ జిల్లాలోనే అనటం నిర్వివాదాంశం

ఇదే శతాబ్దిలో రెండవ అరికేసరి కాలంలో కురిక్యాల శాసనానికి కొంచెం ముందుగా జినవల్లభుని అన్న పంపమహాకవి కన్నడ భాషలో విక్రమార్జున విజయం అదిపురాణం ఇక్కడి వేములవాడలో రచించాడు కన్నడ (941) సాహిత్యంలో పంపన ఆదికవి అదిపురాణం తెలుగులో రచించినరన్న కవి (953) ఈ మండలంవాడు కాడు ఎంపకవికి కొంత తర్వాతి వాడైన కాశ్మీరకవి సోమదేవ సూరి (959) మూడవ అరికేసరి కాలంలో ఇదే వేముల వాడలో యశస్తిలక చంపువు, కథా సరిత్సాగరం, నీతి సూక్తి ముక్తావళి, అనే గ్రంథాలు సంస్కృతంలో రచించాడు పంప సోమదేవ కవులిద్దరూ జైనులు కల్యాణి చాళుక్యులు కర్ణాటక భాషనే ఆదరించారు శిలాశాసనాలు తప్ప ఆ కాలంలో తెలుగు కన్నడ సంస్కృత భాషల్లో ఏ ఒక్క కావ్య రచన కానీ ఇక్కడ జరిగిన ఆధారాలు లేవు

కాకతీయుల కాలంలో మంథని కాళేశ్వర ప్రాంతాల్లో ఉద్దండ సంస్కృత పండితులుండేవారు వారు చక్రవర్తుల ప్రాపునందారు, సన్మానాలు అగ్రహారాలు పొందారు కాని, వారు ఏ భాషలోనూ కావ్యాలు రచించిన ఆధారాలు లేవు కాకతి రాజన్యుల పేర ఈ జిల్లాలో పోలవరం, రుద్రారం, మహదేవ పురం మొ॥ అనేక గ్రామాలున్నాయి గణపతి రుద్రమ ప్రతాపరుద్రుల మంత్రి శివదేవయ్య గారు మంథని ప్రాంత చంద్రవల్లిలో శైవ మఠం స్థాపించాడు

కాకతీయుల పాలనాకాలంలో 14వ, శతాబ్ది ప్రథమపాదం వరకు ఈ జిల్లాలో శిల్ప శోభాలం కృతాలైన అనేక దేవాలయాల నిర్మాణం సాగిందే తప్ప ఏ ఒక్క కావ్య సృష్టి కానీ ఈ ప్రాంతంలో జరుగకపోవడం చిత్రం సాహితీలోకంలో స్థలకాల రచనల విషయాల్లో వివాస్పదుడైన వేములవాడ భీమకవి మాత్రంఈ కాలంవాడు

కావ్యాలు కాకున్నా కావ్యాలనదగిన రెండు పద్యశాసనాలు ఈ మండలంలో కాకతియుగంలో లభించాయి గద్య శాసనాలు కేవలం భాషా స్వరూప చారిత్రక విషయాల అవగాహనకు ఉపకరించేవి పద్య శాసనాలలో వెల్లంకి గంగాధర మంత్రి నగునూరు శాసనం, మహాకవి తిక్కన సోమయాజికి 60, 70 ఏండ్లు పూర్వపుది గొడిశాల చంపూ శాసనం ఇంచుమించు తిక్కన కవి కాలపుది కటుకూరు, మంథని కాళేశ్వర శాసనాలు చక్కని సాహితీ మూల్యాలు కలవైనా అవి సంస్కృతంలో ఉన్నాయి

మన తెలుగు కవులు సంస్కృత భాషా సాహిత్యాలలో సముచిత వైదుష్యం ప్రతిభావ్యుత్పత్తులు కలవారనడానికి పై శాసనాల సాహిత్యాన్ని నిదర్శనంగా చూపవచ్చు నాడే కాదు ఈనాడు కూడా సంస్కృతాంధ్రోభయ భాషల్లో సమాన పాండిత్యం - కవిత్వం ఈ జిల్లాలో ఉన్నాయి ఇక్కడి విద్యావంతులకు సంస్కృతమందే గౌరవం, ఆంధ్రమంటే ప్రేమ!

**భాషా ఛందో విశేషాలు** ఈ శాసన యుగంలో తెలుగు లిపి స్థిర రూపాన్ని సంతరించుకున్నా తెలుగు పదాలు మాత్రం స్థిరత పొందలేదు నన్నయకు పూర్వకాలంలోనే కాదు, తర్వాతి కాకతీయుల కాలంలోనూ ఒకే పదం పలు రూపాలలో పలుకబడింది ఉదాహరణకు 'కాకతీయ' వంశ నామాన్నే తీసుకోవచ్చు కాకతీయ, కాకెత, కాకిత అని అది అనేక విధాలుగా ఈ శాసనాల్లో ఉంది హనుమకొండపురం పేరు కూడా అంతే తత్సమ పదాలు కూడా (ఉదియించు, రమణియ్య అని) కొన్ని స్థిర రూపం పొందలేదు

అర సున్న ఉండవలసిన చోట పూర్ణ బిందువునే వ్రాసేవారు బిందు పూర్వాక్షర ద్విత్వం చాళుక్యుల కాల శాసనాల్లో ఉన్నా, కాకతీయుల శాసనాల్లో అదీ లేదు ఛందస్సు పరిచయం లేని వాళ్లు ఈ పద్యాలను సరిగా చదవడం కష్టం

వ్రావడి వలపల గిలక,పొల్లునకారం వలె చూపారు ధమ్మ్ము ఇట్లా రేఫ సంయుక్తాక్షరం తప్పక ద్విత్వంగా ఉంది ఈ శాసనాలన్నింటిలో ఇటువంటి వ్రాతే ఉన్నా, ముద్రణా సౌకర్యం లేక వానిని 'ధర్మము' అని ఇప్పటి రూపాలలోనే ఈ వ్యాసంలో వ్రాయుట జరిగింది

ఱ, ఴ, ' ' అనే మూల ద్రవిడ అక్షరం వాఴైపఴమ్ వంటి పదాల్లో తమిళ భాషలో ఇప్పటికీ సజీవంగా ఉంది ఈ శాసనాలలోని కన్నడ పద్యాల్లో కొన్ని పదాల్లో ఉన్నా అది తెలుగులో మాత్రం పదవ శతాబ్ది వరకే అంతరించిపోయింది ఆ అక్షరం ళ, డ, ఱ లుగా మన భాషలో మారింది

న్, ల్, ర్ లుగా ఉండవలసిన హలంత పదాలు, ను లు రు అని అజంతాలుగా వ్రాశారు పద్యాల్లో వానిని పొల్లులుగా చదివితేనే గణభంగం తప్పుతుంది కాకతీయుల కాలంలో నకారం హలంతంగానూ కొన్ని పద్య పాదాంతాల్లో కన్పిస్తున్నది

ఆ కాలం నాటి వ్రాతలో ఋత్వాన్ని (ృ) రేఫ ఇకారాల సంయుక్తంగా వ్రాశారు ఉ॥ వృత్తం - వ్రిత్తం, కృతి - క్రితి, మృగం - మ్రిగం అది వ్యవహారంలోని ధ్వనికి అనుకరణ మాత్రమే ఋత్వం ఆ అక్షర ధ్వని విశేషతను తెలుపుతుంది

ఈ జిల్లా శాసనాల తెలుగు సాహిత్యంలో అయిదారురకాల వృత్త పద్యాలు కందాలు చక్కని శైలీ రామణీయకతతో చిక్కని బావవిన్యాసంతో ఛందోబద్ధంగా కనిపిస్తున్నాయి

పాఙ్నన్నయ కాలపు కోస్తాంధ్ర శాసనాలలోని మధ్యాక్కర, తరువోజ, సీస పద్యాలు ఇక్కడి శాసనాల్లో లేవు నన్నయకు తర్వాతి కాలంలో కూడా ఇక్కడి కాకతి యుగ శాసనాల్లో పై పద్యాలే కాక తేటగీతి, ఆటవెలది పద్యాలు వాడబడలేదు ఇక్కడ కందపద్యం వాడకం అధికం

ఇది కరీంనగర్ ప్రాంతపు నాటి కవుల ప్రత్యేకతను చాటించే అంశం

**పాదపీఠికలు**

1 ఇలాంటి దాక్షసి గుళ్లు నాగపూర్ నుండి కేరళ వరకు ఉన్నాయని ఠాకూర్ రాజారాం సింగ్ కరీంనగర్ మండల చరిత్ర' పుట - 17లో పేర్కొన్నారు

2 డా కృష్ణశాస్త్రి, ఆంధ్ర ప్రదేశ్ పురావస్తు పరిశోధన శాఖ డిప్యూటి డైరెక్టర్ గారి అభిప్రాయం

3 ఈ మండల పూర్వ చరిత్ర వ్రాయుటకు తోడ్పడిన గ్రంధాలు

1 రాకూర్ రాజారాం సింగ్ గారి వ్యాసం 'కరీంనగర్ మండల చరిత్ర 1981
2 ఎం సంజీవరావు గారి వ్యాసం 'మానేర్' ఉర్దూ మాసపత్రిక సె అక్టో 1968
3 ఏ బాపురావు గారి రామగిరి చరిత్ర' 1982
4 డా॥ జె రమణయ్య గారి 'దక్షిణ భారతదేశ ఆలయాలు' ఆంగ్ల గ్రంథం
5 కీ శే జి సి కొండయ్య గారి 'ఆంధ్రుల ప్రాచీన చరిత్ర' 1992
6 మల్లాది సూర్యనారాయణ శాస్త్రి గారి 'సంస్కృత వాఙ్మయ చరిత్ర' 2వ, భాగం

# II. రాజుల కాలంలో వర్ధిల్లిన తెలుగు సాహిత్యం

## (14 - 15 శతాబ్దులు)

ఏ చక్రవర్తుల రాజధాని నగరం కానీ ఈ కరీంనగర్ జిల్లాలో లేదు ఇక్కడ కాకతీయ, రాచకొండ పద్మనాయక, రాజమహేంద్రవర రెడ్డి రాజన్యుల కాలాల్లో సామంతరాజుల పరిపాలన సాగింది అనేక గిరి స్థల దుర్గాలు ఈ జిల్లాలో ఉన్నాయి రామగిరి, వెలిగందుల, ధర్మపురి మొదలైన దుర్గాల నేలిన సామంత ప్రభువులు రాజ ప్రతినిధులు తెలుగు కవులను పోషించి కావ్య సృష్టికి దోహదం చేశారు

14వ శతాబ్ది నుండి 16వ, శతాబ్ది వరకు ఈ మూడు వందలేండ్ల కాలంలో ఈ జిల్లాలో ప్రధానంగా కనిపించిన తెలుగు కవులు వీరు

| | |
|---|---|
| 1 మడికి సింగన | రామగిరి |
| 2 కందనామాత్యుడు | వెలిగందుల |
| 3 వెలిగందుల నారయ | వెలిగందుల |
| 4 చరికొండ ధర్మన | ధర్మపురి |
| అనుశ్రుత కవులు అలబ్ధ సాహిత్యం | |
| 1 వేములవాడ భీమకవి | వేములవాడ |
| 2 శరభాంక కవి | వేములవాడ |
| 3 ఎడపాటి ఎఱ్ఱయ | రామగిరి |
| 4 చుండి కాళయ్య | సుందిల్ల |

### 1 మడికి సింగన - రామగిరి 14వ శతాబ్ది

మడికి సింగన కవి1 కరీంనగర్ జిల్లా రామగిరి నివాసి కరీంనగర్ జిల్లాలో పెద్దపల్లికిఅనతి దూరంలో గోదావరినదికి దక్షిణంగా ఉన్న గిరిదుర్గ పట్టణం రామగిరి 2 పౌరాణిక గాథల నుండి చారిత్రక కాలం వరకు దీనికి చాల ప్రశస్తి ఉంది 3

14వ, శతాబ్దిలో రామగిరిని పాలించిన గురిజాల ముప్ప భూపతి ఆస్థాన కవి సింగన శేషాద్రి రమణ కవులు తమ "నైజాము రాష్ట్ర ప్రశంస" గ్రంథంలో ఇట్లా పేర్కొన్నారు "ఈ కవి ఏలూరు చెంతనున్న పెద్దమడికి నివాసియయ్యు గోదావరి తీరమున గరీంనగరమునకు జేరువన నున్న నబ్బినాటి రాష్ట్రములోని రామగిరిని బరిపాలించు ముప్పనాయకుని వద్ద కందమంత్రి వద్ద నాస్థాన కవిగ నుండి గౌరవములనంది యచటనే వృత్తుల నంపాదించుకొని నిలిచిపోయెను [4]

ఈ కవి రచనలు నాలుగు పద్య కావ్యాలు అవి ఇవి 5

1 పద్మపురాణోత్తర ఖండము 2 భాగవత దశమ స్కంధము

3 వాసిష్ఠరామాయణము, 4 సకల నీతి సమ్మతము

**కవి వంశ వివరాలు** సింగనకవి తాత అల్లాడ మంత్రి ఆయన తిక్కన సోమయాజి మనుమరాలైన చిట్టాంబికను పెళ్లాడినాడు అల్లాడ మంత్రి కృష్ణానది దక్షిణ తీరాన గల కోట భూమిలోని రావెల అనుగ్రామాన్ని అగ్రహారంగా పొంది గుడి గోపురాలు నిర్మింపజేసి వైభవంగా జీవించాడు 6

ఆ అల్లాడ మంత్రి పుత్రుడు అయ్యల మంత్రి ఇతని భార్య సింగాంబ అయ్యల మంత్రి రామహేంద్రవర పాలకుడైన తొయ్యేటి అనపోత భూపతికి అమాత్యుడు ఈ అయ్యన గౌతమీ నదికి ఉత్తర తీరానగల పెద్దమడికిలో స్థిరచరాస్తులు గలిగి సుఖంగా జీవించాడు (వా రా 1 33)

సింగాంబ అయ్యలార్యుల పుత్రుడు మడికి సింగన కవి తమ కుటుంబాన్ని వాసిష్ఠరామాయణ అవతారికలో వర్ణించిన పద్యం ఇది

చం ఒనరగ నవ్వధూ వరులహోబలదేవుని గొల్చి తద్వరం
బున నొగి సింగనార్యుని నమోఘ గుణాఢ్యు ననంతుని న్మహీ
జననుతు గోపయాంబ బుధ నన్నుతి పాత్రుని నారయాహ్వయుం
గని నరసింహ నామములు గారవమారగబెట్టిరందరున్

అయ్యల మంత్రికి భార్యలిద్దరు అందులో సింగాంబికకు సింగన, అనంతుడు, గోపయాంబకు నారయ కుమారులు అహోబల నరసింహుడు వారి కుల దైవం కాబట్టి అయ్యలామాత్యుడు ముగ్గురు పుత్రులకూ నరసింహ నామాలనుంచాడు

కం వారలలో నగ్రజుడను, వారిజదళ నయన చరణ వారిజ సేవా - శ్రీ రచనా
చతురమతిని సింగాహ్వయుడన్,

అని సింగన తన హరిభక్తిని కవన శక్తిని చాటుకున్నాడు

**వంశ గోత్రాదులు** మడికి సింగన పూర్వీకుల గృహనామమేమై ఉండునో కాని అయన మాత్రంజన్మగ్రామమైన 'మడికి' పేరనే వ్యాప్తి పొందాడు సింగనది భారద్వాజ గోత్రం

కం నరస కవితా విలాసుడ గురు భారద్వాజ రమ్య గోత్రాబ్ధి సుధా
కిరణయ్యలార్య తనయుడ, హరి దాసుడ మడికి సింగయాఖ్యుడధాత్రిన్
(స నీ సమ్మతం 1-3)

సింగన తన గురువుగా తిరుమలయ్యను పేర్కొన్నాడు ఇహపరాలకు సహకరించేవి గురు చరణాలే కాబట్టి, పరవాదులైన మదపుటేనుగులకు సింహం వంటి వాడైన తిరుమలయ్య గారిని సేవించానన్నాడు (పద్మపురాణోత్తర ఖండం, 1-11) ఇంకా, వేంకటేశ్వరుని పాద పద్మాల భ్రమరం, అన్ని మతాల సారం తెలిసినవాడు, మంత్ర రహస్యాల నెరిగినవాడు, పాప విధ్వంసకుడు తన గురువని సంస్తుతించాడు (వాసిష్ఠ రామాయణం, 1-8)

సింగన నియోగి బ్రాహ్మణుడు హరి భక్తి సంయుతుడు

**కవి కాలం** సింగన కవి కాల నిర్ణయానికి అతనికి ఆశ్రయమిచ్చిన ముప్ప భూపతి కాల నిర్ణయం దోహదకారి కాకతీయుల చక్రవర్తులలో చివరి వాడైన ప్రతాపరుద్రుని పతనానంతరం (క్రీ శ 1325) ఓరుగల్లు ఆంధ్ర సామ్రాజ్యం కొన్నేండ్లు ఢిల్లీ ముస్లిం పాలకుల వశమైంది

కాపయనాయకుడు అను ఆంధ్రవీరుడు కాకతి కాల సేనానులను సమీకరించి ముస్లిం సేనల నెదిరించి ఓడించి పారద్రోలి, ఏకాశిలానగరం రాజధానిగా తిరిగి మహాంధ్ర సామ్రాజ్యాన్ని నెల కొల్పాడు 7 అతని పాలనా కాలం క్రీ శ 1345 69 అని చరిత్ర కారుల నిర్ణయం8 కాపయ నాయకునిచే రామగిరి యందు సామంతరాజుగా నియుక్తుడైన గురిజాల ముప్ప భూపతి కాలం కూడా అదే అని భావించవచ్చు

మరో కోణంలో కవి తండ్రి అయ్యల మంత్రి కాలాన్ని బట్టి కూడా సింగనకవి కాల నిర్ణయం చేయడానికి వీలున్నది తొయ్యేటి అనపోత నాయుని ఆశ్రితుడు అయ్యల మంత్రి అతడు కాపయనాయకుని పినతల్లి కుమారుడు ఏకశిలానగర సామ్రాజ్యంలోని రాజమహేంద్రవర సామంతపాలకుడు అనపోతనాయకుడు అనపోతనాయుని ద్రాక్షారామ శాసనం క్రీ శ 1347 సంవత్సరపుది ఉంది అతనిని చోడభక్తిరాజు 1355లో వధించినట్లుగా9 మద్రాసు మ్యూజియం శాసనాలు తెల్పుతున్నవి

అనపోతనాయుని మరణం తర్వాత తండ్రి నిరాశ్రయుడు కాగా సింగన రామగిరిని చేరి ఉంటాడు అది 1355 తర్వాతనే 1369 వరకే రామగిరిలో ముప్పభూపాలుని పాలన కాబట్టి క్రీ శ 1355 -69 మధ్య ఇంచుమించు ఓ పదిహేనేండ్ల కాలం సింగన రామగిరి రాజాశ్రయంలో ఉన్నాడు ఆ కాలంలోనే సింగన తన నాలుగు కావ్యాలను రచించాడు

రామగిరిని చేరిన కాలంలో సింగన 25 30 ఏండ్ల వాడనుకుంటే అతని జననం 1325 ప్రాంతం 70, 75 ఏండ్లు అతని జీవిత కాలమనుకుంటే 1400 వరకు జీవించి ఉంటాడు కాని, 1369 తర్వాత సింగన ఎక్కడ ఉన్నది, ఏం చేసిందీ తెలువదు తాను ముప్పభూపతి చేత దానంపొందిన గ్రామాల్లో కాలక్షేపం చేసి ఉంటాడు రామగిరికి ఉత్తరాన మడికి గ్రామం ఉంది

సింగన కాలం క్రీ శ 1325 1390 లేదా 1400

**సింగన కృతులు - కృతిపతులు** 1 పద్మపురాణోత్తర ఖండము - కందన మంత్రికి అంకితం 2 భాగవత దశమస్కంధము కందన (వెలిగందలామాత్యుడు) 3 వాసిష్ఠరామాయణము - అహోబల నరసింహస్వామి 4 సకల నీతి సమ్మతము రామగిరి కేశవ స్వామి

పై నాలుగు కావ్యాలు ముద్రితమైనవి వాటి అవతారికలను బట్టి కృతిపతుల గురించిస్పష్టంగా తెలుస్తున్నది సింగన తన మొదటి రెండు కావ్యాలను ముప్పభూపతికి మంత్రియు, వెలిగందుల దుర్గ పాలకుడును, తనకు మిత్రుడును అయిన కందనామాత్యునికి కృతి ఇచ్చాడు మూడవది తన ఇష్ట దైవానికి, నాలుగవది స్థానిక దేవునికి అంకితం కావించాడు

సింగన కాలనిర్ణయ విషయంలో సాహిత్య చరిత్రకారులు కాస్త ముందుకు (1420) లాగే ప్రయత్నాలు చేశారు కాని, అతని నివాస స్థల విషయంలో రచనల విషయంలో మాత్రం విభేదించలేదు ప్రతిభా వంతుడైన సింగన కవికి ఆశ్రయ మిచ్చి ముప్ప నరపతి, అతని మంత్రులు కేసన కందనలు (వీరిద్దరు సోదరులు) ఆంధ్ర సాహితీలోకంలో శాశ్వత యశము నార్జించారు ముప్ప భూపాలుని పరాక్రమౌదార్యాది గుణ సంపత్తినే కాక, అతని సౌందర్యాన్ని సైతం చక్కగా వర్ణించాడు సింగనకవి ఆ పద్యం ఇది,

సీ॥ సంపెంగ విరులతో జాజులుం గురువేరు, కొమరారు నునుసేస కొప్పు పెట్టి
మృగమద కర్పూర మిళితమౌ పన్నీరు, తను పార మేన జందన మలంది
యుదయ భాను ప్రభనుల్లసం బాడెడు, మణి భూషణ స్ఫూర్తి మాఱుమలసి
పరపైన వెన్నెల నురువుల పోలిక దనరారు ధవళ వస్త్రములు గట్టి,
తే గీ॥ మానినీ కర చామర మరుత చలిత, కుంతలుండయి తగినిండు కొలువునందు
దనువు గీర్తిఘ్యు గల పుష్ప ధన్వుడనగ, జూడ నొప్పారు ముప్పయ క్షోణి విభుడు
వా రా 1-38

ముప్ప భూపతి తమ్ముడైన ముత్తయ నేనానిని కూడ సింగన తన కావ్యంలో ఒక సీసపద్యంలో వర్ణించాడు (వా రా, 1-19) కందన మంత్రి వర్ణన విస్తారంగా ఉంది [10]

**సింగన కావ్యాల విశేషాలు**

**అ) పద్మపురాణోత్తర ఖండము** అష్టాదశ పురాణాలలో సాత్త్విక భక్తి పురాణ షట్కము లోనిది పద్మ పురాణం పద్దెనిమిది పురాణాలు[11] సంస్కృతంలో వ్యాస విరచితాలుగానే చెప్పబడుతున్నవి సింగనకు పూర్వం తిక్కనకవి శిష్యుడైన మారనచే మార్కండేయ పురాణం అనువదింపబడింది సింగనకు సమకాలికుడో, ఇంచుక పూర్వుడో అయిన ఎఱ్ఱనచే నృసింహ పురాణం ఆంధ్రీకరింపబడింది ఇదే పద్మ పురాణాన్ని శ్రీనాధుని తాత కమలనాభామాత్యుడు అనువదించాడట [12] కాని, అది

లభించలేదు నాచన సోముడు ఉత్తర హరివంశం వ్రాసినట్లుగా, తిక్కన ఉత్తర రామాయణం రచించినట్లుగా కమల నాభామాత్యుడు పద్మపురాణం పూర్వార్ధాన్నే ఆంధ్రీకరించిన కారణంగానేమో సింగన పద్మపురాణోత్తర ఖండాన్ని మాత్రమే విరచించాడు

సృష్టి, భూమి, స్వర్గ, పాతాళ ఉత్తర ఖండాలు అనేవి పద్మపురాణంలోని అయిదు భాగాలు[13] అందులో ఉత్తర ఖండం ఉత్తమమైందని ఖ్యాతి గడించింది

గీ అవని పద్మంబు ఖండత్రయంబునందు[14], సర్వసారాంశమై పుణ్య జనక మగుచు
మండితంబైన యుత్తర ఖండమీవు, తెలుగు గావింపు నాపేర ననఘ చరిత (పద్మ, 1-60)

అని కృతిపతి కందనామాత్యుడు కోరడంతో సింగన ఈ గ్రంథ రచన కావించాడు పద్మపురాణం ఉత్తర ఖండం మూలంలో 2445 శ్లోకాలుండగా సింగన కవి ఆంధ్రానువాదం 11 ఆశ్వాసాలు, 2534 పద్యాలు కలది

బ్రహ్మ ఆదేశించగా వశిష్ఠుడు స్వాయంభువ మనువునకు, లోకపాలన, ధర్మరక్షణ కావించు సామర్థ్యం కలుగుటకై వినిపించినది ఈ పద్మ పురాణం తిరిగి దానిని వైవస్వత మన్వంతరమున దిలీప మహారాజునకు ఆ మహర్షి వినిపించినదట విష్ణు నాభికమల మహాత్మ్య ప్రతిపాదకం సర్గ, ప్రతిసర్గ, వంశ, మన్వంతర, రాజర్షి వంశకీర్తనం, భూవిస్తారం, సకల వర్ణాశ్రమ దీక్షా నియమాలు, సకల దేవతా స్వరూప భేదాలు, సకల మంత్ర రహస్యాలు ఇట్లా అనేక వేదాంత విషయాలు, ఉపాఖ్యానాలు పద్మపురాణంలో ఉన్నాయి ఈ పురాణ ఉత్తర ఖండంలో మాఘమాహాత్మ్యం తెలిపే ఇతివృత్తాన్ని, దాన్ని విపులీకరించే సన్నివేశాలను, కథలను మాత్రమే సింగన తన రచనకు ఎన్నుకున్నాడు అందుకే ఆయన పునరుక్తిగా భావించిన కొన్ని కథలను, అనవసరం అనుకొన్న వర్ణనలను వదలి ఔచిత్యాన్ని పోషించి రచన కావించాడు

పద్య రచనలో సింగన సిద్ధహస్తుడు తర్వాతి తరం మహాకవులైన భక్త పోతన, అల్లసాని పెద్దన వంటి వారు సైతం ఈ కవి భావాలను పద్యాలను అనుసరించారు

ఆ వె సత్యనిరతుడైన సాత్యవతేయుండు, చెప్పినట్టిదెల్ల తప్పకుండ
తెలుగు సేయరాదు నలువ కైనను భక్తి కారణంబుగాగ గథరచింతు (1-64)

'భాగవతము తెలిసి పలుకుట కష్టంబు" అని పోతన పద్యం ఉంది

చ॥ చని చని కాంచెనంత ముని సత్తముడున్నత శృంగజాలమున్ (1 137)
కనియె శృతి స్మృతి ప్రకర గాథతరార్థ వరిష్ఠు, దివ్యబో
ధన పదవీ మహత్త్వ సముదగ్ర గరిష్ఠు, దపో విశేషసం
జనిత నితాంత పుణ్యగణ సంచయ సువ్రత నిష్ఠు, నయ్యెడన్ (1-128)

"అట చని కాంచె భూమి సురు డంబర చుంబిశిర" అని పెద్దన మను చరిత్రలోని పద్యం ఇటువంటి అలంకార సహితమైన, మహా కవులకే మార్గ దర్శకమైన కవిత సింగనది భృగు విద్యాధర సమాగమం, పురూరవ వృత్తాంతం, ఋక్షక చరిత్రం, వామనావతారం మొదలగునవి సింగన పద్మపురాణంలోని రమ్య కథలు పురూరవ కథలోని ఊర్వశి ప్రణయ ఘట్టం, ఋక్షక చరిత్రలోని సుందోపసుందుల పోరాటం, వామనావతార గాథలో బలిచక్రవర్తిని విష్ణువు ప్రశంసించటం మొదలైన ఘట్టాలను అదనంగా పెంచి రసోచితంగా వర్ణించి సింగన తన కవితా ప్రతిభను చాటుకున్నాడు

వేదాంత విషయాలను సూటిగా స్పష్టంగా క్లుప్తంగా వివరిస్తూ కథా గమనంపై ధ్యాసనుంచి సింగన "నైమిషారణ్యము వంటి పద్మపురాణమును నందన వనము వలె"[15] తీర్చిదిద్దాడు అతను క్లిష్ట వేదాంతాన్ని సులభ సాధ్యం చేశాడు స్త్రీల వర్ణనలో సింగన ఔచిత్యాన్ని తెలుగు తనాన్ని ప్రదర్శించాడు

కం వెన్నెల నీనెడి నవ్వును గన్నుల జెలువంబు జన్నుగవ యొప్పిదయున్
వెన్నడుము బడుపు దనమును బున్నమి నెల దెగడు మోము పొలుపును మెఱయన్ 1 159

భావాలను సూటిగా సరసంగా సరళంగా చెప్పడమే తప్ప వర్ణనా జటిలత సింగన కవితలో లేదు దనుజుల దౌష్ట్యాల వర్ణన చూడండి

కం సుందోప సుంద దైత్యుల, మంద పరాక్రములు పుట్టి మదమున సేనా
బృందముల గూడి జగముల, వందురగా జేసె కడు నవారణ శక్తిన్ 2-3

అమంద పరాక్రములు మదమున జగముల వందురగా జేసిరని మిత పద ప్రయోగంతోనే చెప్పవలసిన దంతయు చెప్పినాడు తర్వాతి ప్రబంధ కవులకు నడకలు నేర్చిన సింగన కవి సూర్యోదయ వర్ణనమిట్లున్నది

సీ కమలినీ ముఖ పద్మ కాంతి నివాళింప, నేపార నెత్తిన దీపమనగ,
బూర్వ పర్వత శిరో భూషా విశేషమై, చెలువారు గైరిక శిలయనంగ
ప్రాచీ దిశావధూ ఫాలదేశంబున లలినొప్పు సింధూర తిలక మనగ
జంభారి వారణ కుంభ మధ్యంబున, భాసిల్లు జెంగల్వ బంతి యనగ
గీ మెఱసి చీకటి విరియించి మిన్ను ముట్టి, చక్రవాకాళి తాపము సంహరించి
యళుల మేల్కొల్పి కొలకుల దెలువు లొసగి, తరణి యుదయాద్రి బొడదెంచె దక్షణంబ
(పద్మ 1-117)

పోతనామాత్యుడు, లలితస్కంధము కృష్ణమూలము అని కావ్యాన్ని కల్పతరువుగా చెప్పిన ప్రఖ్యాత భాగవత పద్యానికి మూలమనదగిన సింగన పద్మపురాణం పద్యమిది

సీ ధర్మబోధై శ్వర్య తతి మూల నికరంబు, విమలాది శక్తులు వెలయస్కంధ
మామ్నాయ శాస్త్రంబు లనుపమశాఖలు, బహుకథా సూక్తులు పల్లవంబు
లుపనిషద్వాక్యంబులురు పుష్ప సంఘంబు, పొలుపారు హరిభక్తి పుష్ప రసము
వరయోగి వైష్ణవ వరులు భృంగంబులు, పరమ సౌఖ్యాసక్తి పరిమళంబు
గీ బాదరాయణ వాక్సుధా ప్రౌఢి బెరిగి, నిఖిల ధర్మములకు నిల్వ నీడయగుచు
విష్ణురూపంబు దానయై వెలసి సౌమ్య, రసికమై యొప్పు బద్మపురాణ తరువు (పద్మ 1-67)

ధర్మబోధ వేళ్ళుగా, పవిత్రత బోదెగా, వేదశాస్త్రాలు కొమ్మలుగా కథలు చిగుళ్లుగా, ఉపనిషత్తుల సూక్తులు పూలుగా, హరిభక్తి తేనెగా, మునులు విష్ణు భక్తులు తుమ్మెదలుగా, మోక్షా సక్తి పరిమళంబుగా కలది పద్మ పురాణం అనే వృక్షం అది వ్యాసుని వాక్కులు అనే అమృత ప్రవాహంతో పెరిగి సకల ధర్మాలకు నిలయమై, తానే విష్ణురూపంగా వెలసి, సౌమ్య రసికమై, భాసించినదని భావం ఈ హరిరూప పురాణ తరువు కవి అనకున్నా కల్పవృక్షమే!

**అ) భాగవత దశమస్కంధము** ఇది ద్విపద కావ్యం పోతన భాగవతం కంటే ముందే **విరచితమైంది**

సింగనభాగవతాన్ని మొదటి నుండి అరంభించక ఒక్క దశమ స్కంధాన్ని ఎన్నుకోవటానికి కారణం, ఈతని విష్ణుభక్తికి ఆ స్కంధంలోని శ్రీకృష్ణ కథ ఆకట్టుకోవడం అనుకోవచ్చు

సింగన మొదటి కృతి పద్య కావ్యం ఈ రెండవది ద్విపద అంతవరకు ద్విపద కావ్యాలైన పాల్కురికి సోమనాథుని బసవపురాణం, పండితా రాధ్య చరిత్రము మరియు గోనబుద్ధారెడ్డి రంగనాథ రామాయణము సామాన్య జనాదరణ పొంది యుండుట చూసి, సింగన ఈ ద్విపద కావ్య రచనకు పూనుకొని ఉంటాడు సింగనకు పూర్వం భారతం, భాస్కర రంగనాథ రామాయణాలు విరచితాలైనవి

సింగన తన భాగవత దశమస్కంధ ద్విపద కావ్యాన్ని రామాయణం వలె కొన్ని కాండములుగా విభజించుకున్నాడు అవి 1 కల్యాణ కాండ 2 మధుర కాండ, 3 జగదభి రక్షకాండ

ఈ మూడు కాండములలోని కథ అక్రూరుడు శ్రీకృష్ణుని మధురకు తీసికొని పోవుట నుండి శిశుపాలవధ వరకున్నది [18] కథ అసంపూర్ణం కనుక ఈ మూడు కాండలకు ముందుగా ఒకటి (బాలకాండ) చివరగా ఒకటి (?) మరి రెండు కాండలు సింగన ఈ కావ్యంలో రచించి ఉండవచ్చునవి సాహితీ విమర్శకుల అభిప్రాయం [19]

సంస్కృతాంధ్రోభయ భాషల పాండిత్యం, ప్రసన్నమైన శైలి, సింగన కవిత్వానికి వన్నె తెచ్చాయి తెలుగు పదాల పోహళింపు, అవసరమైనంత వర్ణన, సముచిత రసపోషణ అతని సుగుణాలు మూలాన్ని యధాతధంగా కాక, నచ్చిన భాగాల నెంచుకొని కుదించి, కొన్నిచోట్ల మితంగా పెంచి స్వతంత్ర కావ్య ఫక్కీలో కవి ఈ గ్రంథరచన కావించాడు

సింగన కవితా శైలికి, వర్ణనా వైదగ్ధికి ఒక ఉదాహరణ

మేలైన కృష్ణుని మేచాయ బోలె, నెఱినొప్పు గాళింది నీరంబు వోలె
తఱచైన తేటుల దాటుల వోలె, పెనుపైన నీలాల పేరులవోలె
లలినొప్పు నీలోత్పలంబులు వోలె, దొలుకారు కాంతుల తుఱుముల వోలె
దల మీరి చీకటి దట్టమై పేర్చె - (జగదభిరక్షకాండ)

ఎఱ్ఱన భారతంలో సరస్వతిని తెల్లని వస్తువులతో పోల్చినట్లు, ఈ కవి నల్లని రూపాలతో చీకటిని ఉపమించాడు ఇందలి తెలుగు పదాల ప్రయోగం రమణీయం

కథా కథన విధానానికి ఒక ఉదాహరణ

నరకాహ్వయుండు దానవ కులేశ్వరుడు, వరశక్తి మహిమ దుర్వార సత్త్వమున
ధరణిపై గల రాజ తతినెల్ల నోర్చి, తన శాసనంబుల దగ నిల్పి, యంత
దని వోక యతిబలోదగ్రుడై నడచి, యమరాధిపుంగెల్చి, యగ్ని నోడించి,
శమనుని గెల్చి, రాక్షసు బారద్రోలి (కల్యాణ కాండ )

సుదీర్ఘ వర్ణనలు లేక సూటిగా కథ నడుపుట సింగన ప్రత్యేకత దీర్ఘసమాసాలు లేక పాదాంతమున పదములు ముగిసి అర్థగ్రహణకు కష్టం లేకుండ గాన యోగ్యంగా ఈ రచన సాగింది గోపికల వేదన ఇట్లుంది -

కట కటా! మమ్మేల కమలాక్షు డడుగు, అడిగెడి వాడైన నరుదేడె, యిట్లు
విడుచునే మమ్ము నీ విరహాగ్ని నడమ? (మధురకాండ)

ఇట్లా రసోచిత వర్ణన, ఔచిత్య పోషణ, భావమాధుర్యం సింగన కవన ప్రత్యేకతలు

పద్మపురాణంలో కానీ, ఈ భాగవత దశమస్కంధంలో కానీ, నరకాసుర వధ సందర్భంలో సత్యభామ యుద్ధం చేసినట్టు సింగన చెప్పలేదు ఈ ద్విపద భాగవతంలో, పోతన భాగవతంలో వలెనే రుక్మిణీ కల్యాణ ఘట్టంలో విప్రరాయబారమున్నది పోతన చంపూ భాగవత కావ్య వ్యాప్తి కారణంగా నేమో, సింగన ద్విపద కావ్యం బహుళ ప్రచారం పొందలేదు అయినా సింగన 'భాగవత దశమస్కంధం' రసవత్కావ్యం

**ఖ) వాసిష్ఠ రామాయణము :** సంస్కృత యోగవాసిష్ఠం (జ్ఞానవాసిష్ఠం) సింగన వాసిష్ఠ రామాయణ కావ్యానికి మాతృక ఇందలి ఇతి వృత్తం రఘువంశ రాజగురువైన వసిష్ఠుడు శ్రీరామ చంద్రునకు కావించిన ధర్మబోధ ఇందులో వేదాంత ధర్మబోధకములైన అనేక ఉపకథలున్నవి

విశ్వామిత్రుడు తన యాగ సంరక్షణార్థం రామలక్ష్మణులను గొంపోవుటకు అయోధ్యకు వచ్చిన సందర్భంలోనే,శ్రీరాముడు తీర్థయాత్ర కావించికొని అప్పుడే తిరిగి వచ్చాడు అతడు లోకంలోని దు ఖాన్ని చూసి ఖిన్నుడై వైరాగ్య భావానికి లోనుకాగా, కులగురువు వసిష్ఠుడు ఈ జ్ఞానబోధ కావించినాడట ఇది బుద్ధుని కథను పోలిన సన్నివేశం

"జగమ్మిథ్య అత్మసత్యం" అని ధర్మదీక్షా కర్తవ్యంతో కార్యోన్ముఖుని చేయుతలంపుతో రాజసభలో రామునికి వసిష్ఠుడు ఈ జ్ఞానబోధ ఇరువదినాలుగు దినాలు చేశాడు ధర్మజిజ్ఞాసువులైన రాజులతో మునులతో ఖేచరులతో సభక్రిక్కిరిసి పోయినదట

ఉ చిత్త సమాకులీకరణ శీల మనోరమ దైన్య సాధ్య ని
స్పత్త మహాభుజంగ కుల సంశ్రయగర్త సమృద్ధవల్లి దు
ర్వృత్త గృహాంత వాసిని నవీన విలాసిని లక్ష్మి యిట్టి సం
పత్తి సమస్త దోష భవ భావ భయప్రద గాక సౌఖ్యమే! (వా రా 1-55)

అని మొదట సకల దు ఖములకు కారణమైన సంపదలను, సంసార సౌఖ్యాన్ని నిరసించిన శ్రీరాముడు వసిష్ఠబోధ శ్రవణానంతరం అన్నాడిలా

నష్టోమోహ పదం ప్రాప్త త్వత్ప్రసాదాన్మునీశ్వర
సంపన్నోహ మహం సత్యమత్యన్త మవదా తధీ
స్థితో స్మి గత సందేహ స్వభావే బ్రహ్మ రూపిణి
నిరావరణ విజ్ఞాన కరిష్యే వచనం తవ॥ (యో వా VI శ్లో - 14, 15)

నాకు అజ్ఞానం తొలగింది, విజ్ఞానం కలిగింది, మీ ఆదేశాన్ని ఆచరిస్తాను, అని భావం ఈ శ్లోకాలు భగవద్గీతలోని చివరి అర్జున వాక్యాలను పోలి ఉండుట గమనార్హం పైగా భావికాలంలో మహాభారత రణరంగంలో ఇదేవిధంగా ఖిన్నుడైన అర్జునునకు శ్రీకృష్ణుడు ధర్మాన్ని ఉపదేశించిధైర్యాన్ని ప్రసాదిస్తాడని భగవద్గీత సారాన్ని సైతం వసిష్ఠుడు ఈ గ్రంథంలో వివరించాడు నిజానికి రామాయణం, మహాభారతం కంటె మొదటి దైనా, ఈ యోగవాసిష్ఠగ్రంథ రచన మాత్రం భగవద్గీతకు తర్వాతి కాలంలోనే జరిగి ఉండవచ్చు ఈ కావ్యం రాముని ఉద్దేశించి వసిష్ఠబోధగా సృష్టింప బడినదైనా, సమస్త జన సంతరణోద్దిష్టమైనది అందుకు నిదర్శనంగా మూలగ్రంథంలోని ప్రతిసర్గ చివర "ఇతి శ్రీ వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే మోక్షోపాయే " అని గద్యాలున్నవి

భగవద్గీత వలె ఉపనిషత్సార సంభూతమైన యోగ వాసిష్ఠం ఉద్గ్రంథం 14వ, శతాబ్దిలో 'యోగవాసిష్ఠ సారసంగ్రహం' అనే గ్రంథాన్ని విద్యారాయణ కవి రచించాడు కొన్ని ఉపనిషత్తులు, పంచదశి,జీవన్ముక్తి వివేకం, రామగీత మొదలైన వేదాంత గ్రంథాలు యోగ వాసిష్ఠంలోని శ్లోకాలను ఉదహరించడం ఈ కావ్య విశిష్ఠతకు నిదర్శనం

యోగ వాసిష్ఠం 32వేల శ్లోకాల కావ్యం దానిని కేవలం 12 వందల గద్య పద్యాలతో సింగన 'వాసిష్ఠ రామాయణము' పేర వేదాంత సార సంగ్రహ అనువాద కావ్యంగా రూపొందించాడు మూల గ్రంథంలో వలెనే సింగన కావ్యంలోనూ వైరాగ్య, ముముక్ష, ఉత్పత్తి, స్థితి, ఉపశమన, నిర్మాణములు అనే ఆరు ప్రకరణాలున్నాయి ఇందులో అనేక శాస్త్ర విషయాల ప్రస్తావనమున్నా ప్రధాన కథకు భంగకరములని సింగన వానిని అనువదింపక వదిలివేశాడు మూలంలో కథలు ఎక్కువ సందర్భోచితంగా ఒకటి రెండు కథలను మాత్రమే సింగన స్వీకరించాడు

గురజాడ 'ముత్యాల సరాలు' లోని 'లవణరాజుకల'కు మూలమనదగిన కథ ఇందులో ఉంది అందలి బోయకుటుంబ వర్ణన నాటి శ్రామిక జన స్థితిగతికి సజీవ చిత్రణ

చ కడవలు కావడందునిడి గ్రక్కున మూపున మోచి బిడ్డనిన్
దడయక వీపు నందునిచి, తక్కిన మువ్వుర దోడుకొంచు, నా
పడతియు గంపమోచికొని పల్మరు దిట్టుచు వెంట గూడిరా
నడవికి నేగి పెక్కిడుములందితి నయ్యెడ నేమి చెప్పదున్ (వా రా 2-234)

అనాతి తిట్టింది పతినో, తన దుర్గతినో కాని, ఇది శ్రామిక స్త్రీజన సహజ చిత్తవృత్తి ప్రదర్శన సింగన కావ్యంలోని మరో రసవత్తర గాథ 'చూడకెల శిఖి ధ్వజోపాఖ్యానము' ఇందలి నాయకుని స్థిత ప్రజ్ఞత్వం ప్రశంసనీయంగా వర్ణితం వేదాంత గ్రంధమైనా అద్భుత కథాగుచ్ఛం యోగవాసిష్ఠం సింగన అనువాదం దానికి న్యాయం చేకూర్చింది సింగన అనువాద వైఖరి నైపుణికి ఒక మూలశ్లోకం, దాని అనువాద పద్యం ఇట ఉదహరింపబడుతున్నవి

శ్లో॥ కోహం కథమిదం జాతం కథం శామ్యతి చేతి భో
రాజన్నావేక్షసే కస్మాత్కిమజ్ఞ ఇవ తిష్ఠసి (యో వా ప్ర 6 స 87 శ్లో 30)

కం ఏ నెవ్వడ? నెట్టీ సు, జ్ఞానంబగు? నెట్లు చిత్తశమమగు? ననియ
జ్ఞానత నేల నలందుర?, భూనుత! యన, నతడు విప్ర పుత్రుని తోడన్ (వా రా 5 13)

ఈ జ్ఞాన వాసిష్ఠ రామాయణ కావ్యాన్ని పఠించడానికి ఆజ్ఞుడు కానీ, విజ్ఞుడు కానీ కాక, భవపాశ బద్ధుడు మోక్షార్థియైన అర్హుడే అధికారి! (వా రా 1-58)

**ఈ) సకల నీతి సమ్మతము** సకల నీతి సమ్మతము సింగన చివరి కృతి ఇది అయిదు ఆశ్వాసాల పద్య సంకలన గ్రంథం21 కాని, లభించినవి మూడు ఆశ్వాసాలు వానిలో 988 పద్యాలున్నవి పూర్వకవుల గ్రంధాల నుండి సేకరించినవి 948 పద్యాలు ఈ కవివి కేవలం 40 పద్యాలు తన పద్మపురాణోత్తర ఖండం నుండి తీసుకున్న ఒక పద్యం పోగా సింగన ఈ కావ్యం కూర్పు సందర్భంలో రచించినవి కేవలం 39 పద్యాలు

దుర్గ రక్షణ,వేట, రాజనీతి, దండన మొదలైన 43 వర్గు (శీర్షిక)లలో కవి తాను సేకరించిన పద్యాలను వింగడించి పొందుపరచాడు మరి రెండు అలబ్ధ ఆశ్వాసాలలో లోకోక్తి, సంగీత నాట్య విషయాలను, పూజా ప్రతిష్ఠాదుల ప్రశంసలను కూర్చియుండవచ్చునని కవి రచనా ప్రణాళిక ననుసరించి సాహితీ సమీక్షకుల తలంపు 22

సకలనీతి సమ్మతంలోని మూడు ఆశ్వాసాలలోని దాదాపు వేయి పద్యాలు రాజనీతికి సంబంధించినవే కాకతీయాంధ్రయుగంలో రాజనీతి కావ్యాలు చాలా వెలువడ్డాయి సింగన రాజాస్థానకవి అతని తండ్రి తాతలు కూడా సామంత రాజులకు సచివులు అందుకేనేమో రాజనీతి ప్రబంధాన్ని కూర్చాడు ఈ అపూర్వ మహత్తర ప్రయోజనాత్మక నవ్య కావ్య సృష్టి కాకతి యుగాంతంలో, రాచకొండ కొండవీడు విజయనగరాంధ్ర సామ్రాజ్యాలకు ముందుకాలంలో కరీంనగర్ జిల్లాలోని రామగిరి పట్టణంలో జరిగింది!

సకల నీతి సమ్మతంలో సింగన పేర్కొన్న కవులు, వారి కావ్యాలు, వాటి నుండి గ్రహించిన పద్యాల సంఖ్య23 ఈ దిగువ చూపబడుతున్నవి

| | |
|---|---|
| నన్నయ భట్టు - భారతం నుండి | 23 పద్యాలు |
| నన్నెచోడకవి - కుమార సంభవం నుండి | 02 పద్యాలు |
| తిక్కన సోమయాజి - భారతంనుండి | 37 పద్యాలు |
| - కామందకం నుండి | 308 పద్యాలు |
| పంచతంత్రం నుండి | 176 పద్యాలు |

| | |
|---|---|
| అజ్ఞాత రచయితలవి | 47 పద్యాలు |
| చాటువులు | 17 పద్యాలు |
| అప్పన - చారుచర్య నుండి | 01 పద్యం |
| మారన - మార్కండేయ పురాణం నుండి | 03 పద్యాలు |
| మంచన - కేయూర బాహుచరిత్ర నుండి | 02 పద్యాలు |
| కందన - నీతి తారావళి నుండి | 12 పద్యాలు |
| ఆంధ్రభోజుడు - నీతి భూషణం నుండి | 25 పద్యాలు |
| శివదేవయ్య - పురుషార్థసారం నుండి | 92 పద్యాలు |
| బద్దెన నీతి నుండి | 37 పద్యాలు |
| క్షేమంద్రుడు (లక్కాభట్టు) ముద్రామాత్యం నుండి | 39 పద్యాలు |
| - శాలిహోత్రము నుండి | 01 పద్యం |
| - శ్రీగిరి శతకము నుండి | 02 పద్యాలు |
| - శ్రీరామాయణము నుండి | 01 పద్యం |

ఈ విధంగా కాకతికాల ఏతత్పూర్వయుగ ఆంధ్ర కావ్యాల నీతి పద్యాలను సంకలనం చేశాడు సింగన ఆ కాలపు ఎందరో అజ్ఞాతకవులను ఈ కృతి ద్వారా సింగన సాహితీలోకంలో అమరజీవులను చేశాడు సకల నీతి సమ్మతం ఆ కాలానికి ఒక వినూత్న ప్రయోజనాత్మక ప్రయోగం కొన్ని కావ్యాలు కేవలం ఇందలి పద్యాల మూలంగానే తెలిసి వచ్చాయి - గుర్తింపు పొందాయి

ఈ కావ్యంలో శ్రీ రామాయణంలోనిదని చెప్పిన పద్యం ఎవ్వరిదో తెలువదు ఆ పద్యం ఇది

కం బలియునకు దనకు నడుమై, నిలిచియు సామంతు జెరుపనేరమి వచ్చున్
పులిబోను తలుపు తెరచిన, బొలియింపదె మీద నుఱికి బురుష నిధానా (స నీ స, 3 806)

తెలుగులో ఇదే మొదటి ఆకరగ్రంథం సంస్కృత భాషలోనూ11వ శతాబ్ది వరకు ఇట్టి రచనలు రాలేదు సింగన ఈ సకలనీతి సమ్మత గ్రంథ నిర్మాణ ప్రయోజనాన్ని గురించి ఇట్లా వివరించాడు

తే గీ॥ కృతులు మును సెప్పినట్టి సత్కృతులు ద్రవ్వి, కాంచు కంటెను నొకచోట గాన బడఁగ
సకల నయశాస్త్ర మతములు సంగ్రహించి, గ్రంథ మొనరింతు లోకోప కారముగను
(స నీ స 1-14)

విమర్శకుల ఆక్షేపణలను సైతం ముందుగానే ఊహించి జవాబిచ్చాడు

చ మునుకవు లెల్ల జెప్పినది మున్కొని చర్విత చర్వణంబుగా
బని వడి వ్రాయనేల కవి ప్రాజ్ఞులు చిత్తములందు జూడు డా
ఘనుడగు ప్రౌఢ మాలకరి కమ్మని పువ్వులు గూర్చి దండగ
ట్టిన క్రియ నీతి ధామము ఘటింపుదు మీరలు మెచ్చునట్లుగన్ (స నీ , 1 14)

అని తన యీ కృతి నిర్మాణం నేర్పరియైన మాలకరి కృత్యమని చెప్పుకున్నాడు

పూర్వకవి స్తుతులతో సింగన కేవలం నన్నయ తిక్కనలను మాత్రం పేర్కొన్నాడు 24 తొలిరెండు కృతులలో కుకవుల ప్రస్తావన లేదు మూడవ కావ్యమైన వాసిష్ఠ రామాయణంలో కుకవుల నిట్లా నిందించాడు

చ కదిసిన నోరవోయి, యొరుకబ్బపు దొంతుల సత్పదార్థముల్
గదుకుచు, నెట్టివారి బొడగన్నను గుఱ్ఱని, స్నేహ సౌఖ్యముల్
మదికి నసహ్యమై, శునక మార్గమునం జరియించుచున్న దు
ష్పద కవులెల్ల మత్కవిత దప్పులు పట్టక విండ్రుగావుతన్ (1-7)

పూర్వ కవుల కవిత్వ సారంబెరిగి, అనంతర కాల మహాకవులకు సైతం మార్గదర్శియై ఒకటి రెండు కాదు, కమనీయ కావ్య చతుష్కయాన్ని రచించిన మహాకవి మడికి సింగన

ఈ మండలంలోని మడక గ్రామం మడికి సింగన కవి దానం పొందినది కాబోలు ఆ కవికి ఆశ్రయమిచ్చిన ముప్ప భూపతి అతని బంధువుల పేర్లతో వెలసిన ముప్పారం ముత్తారం, కూనారం మొ॥ గ్రామాలు పెద్దపల్లి తాలూకాలో ఉన్నవి మడికి సింగన సాహిత్యం కారణంగా సబ్బి రాష్ట్రంలోని కరీంనగర్ మండలం - రామగిరి సీమ ధన్యమైనవి!

**పాద పీఠికలు**

1 'మడికి సింగన కవి' పేరుతో డా॥ కె కుసుమాబాయి గారి పిహెచ్ డి పరిశోధన గ్రంథం1988లో ప్రచురింపబడింది

2 ఆ పట్టణ అవశేషాలపై ఇప్పుడు బేగం పేట (పెద్దపల్లి తాలూకా) అనే గ్రామం ఉంది

3 చూడుడు, ఎరబాటి బాపురావు గారి 'రామగిరిచరిత్ర' ముద్రణ - 1978

4 నైజాము రాష్ట్ర ప్రశంస, పుట - 102, ముద్రణ 1926

5 డా॥ దివాకర్ల వెంకటావధాని గారి 'ఆంధ్ర వాఙ్మయ చరిత్రము" ముద్రణ 1958

6 వాసిష్ఠ రామాయణము 1-29

7 తేరాల సత్యనారాయణ శర్మ "ఓరుగంటి చరిత్రము" పుట 5-6

8 'ఆంధ్రకవి తరంగిణి 4వ సంపుటిలో 1345 67 అని, చాగంటి శేషయ్యగారన్నారు కాని, 1369 వరకు కాపయపాలన మున్నట్లు అయ్యనప్రోలు శాసనాధారమున్నది

9 డా కె కుసుమాబాయి గారి 'మడికి సింగనకవి' పుట 27

10 పద్మపురాణ అవతారిక, భాగవత దశమస్కంధ కాండాంత ద్విపదలు

11 బ్రహ్మం పాద్మం వైష్ణవంచ శైవం లైంగం స గారుడమ్
నారదీయం భాగవత మాగ్నేయం స్కాంద సంజ్ఞితమ్।
భవిష్యం బ్రహ్మవైవర్తంమార్కండేయం సవామనమ్
వరాహం మాత్స్యం కౌర్మంచ బ్రహ్మాండాఖ్యమితి త్రిషట్॥
- సంస్కృత భాగవతమ్, స్కం 12, అధ్యా 7, శ్లో 23, 24

12 శ్రీనాథకవి 'భీమేశ్వర పురాణం' 1-10, 13 పద్మపురాణం, సృష్టిఖండం అధ్యా 1 శ్లో 54 55

14 పద్మపురాణం అయిదు ఖండాలు కలది ఈ పద్యంలో ఖండత్రయం అనటం ముల్లోకములందు అనే భావంతో కాబోలు

15 డా॥ కె కుసుమాబాయి "మడికి సింగన కవి" పుట 66

16 పద్మ పురాణాన్ని క్రీ శ 1953లో పిసుపాటి చిదంబర శాస్త్రిగారు సంపూర్ణంగా ఆంధ్రీకరించారు

17 పోతన కవికాలం 15వ శతాబ్ది

18 తంజావూరి సరస్వతీమహల్ గ్రంథాలయ ఏకైక తాళపత్ర ప్రతి నం 157 తొలిముద్రణ 1950

19 డా॥ కె కుసుమాబాయి 'మడికి సింగన కవి' పుట 68

20 యోగవాసిష్ఠమ్ నిర్మాణ ప్రకరణములో అర్జునోపాఖ్యానమున్నది

21 దీనిని క్రీ శ 1923 లో మానపల్లి రామకృష్ణ కవిగారు 1970లో 'ఆంధ్ర సాహిత్యఅకాడమీ హైదరాబాదు' వారు ప్రచురించారు

22 డా॥ కె కుసుమాబాయి 'మడికి సింగన కవి పుట 145

23 ఆరుద్ర 'సమగ్రాంధ్ర సాహిత్యం' నం 4 లోని పట్టిక

24 పద్మపురాణం, 1-9 వాసిష్టరామాయణ 1-5

## 2 కందనామాత్యుడు - వెలిగందల 14వ శతాబ్ది

కందనకు వెలిగందలామాత్యుడు అని వ్యవహారనామం అది అతని హోదాను బట్టి వచ్చిన పేరు

పదునాలుగవ శతాబ్ది ఉత్తర భాగంలో రామగిరి నేలిన గురిజాల ముప్ప భూపాలునికి ఈ కందన, అతని అన్న కేసన మంత్రులు కందన మంత్రి కృతి కర్త - కృతి భర్త కందన వ్రాసిన కృతి "నీతి తారావళి" మడికి సింగన కవి రచించిన తొలి రెండు కావ్యాలైన పద్మపురాణోత్తర ఖండము, భాగవత దశమ స్కంధములను వెలిగందుల కందనామాత్యుడు అంకితం పొందాడు [1]

**వంశ చరిత్ర** సింగన పద్మపురాణంలో కందన మంత్రి వంశ వివరాలున్నవి వీరిది వాణస వంశం 'పాయక పాక శాసనికి భారత ఘోర రణంబులోన నారాయణునట్లు' నన్నయ భట్టారకునికి మహాభారత రచనలో తోడ్పడిన నారాయణ భట్టుది కూడా వాణస వంశమే [2] నారాయణ భట్టుకు వీరికి బంధుత్వం ఉందో లేదో తెలియదు కందన మంత్రిది కాశ్యపగోత్రం [3] నియోగిబ్రాహ్మణుడు- భట్టు శబ్దం నేటివలె కులవాచకం కాక, నాడు బ్రాహ్మణ పండితులకు సైతం వాడబడింది

కందన తాత ముత్తాతలు నాలుగైదు తరాల నుండి కరీంనగర్ జిల్లా - సబ్బిసాయిర మండంలోని మొలంగూరు (మూలంగూరు, మొలగూరు అని శాసన నామాలు) పాలకులు కాకతీయ చక్రవర్తులకు విధేయ సామంత మండలాధీశులు

ఈ వంశ మూల పురుషుడు రుద్రమంత్రి మొలంగూరు పాలకుడు [4] రుద్రమంత్రి కుమారుడు గన్నయ మంత్రి గణపతి దేవుని మన్ననలందినవాడు గన్నయ కొడకు మల్లన అతని కొడుకు గణపతి గణపతి మంత్రి కుమారుడైన అబ్బయ (ఓబలయ్య) పుత్రులు కేసన కందనా మాత్యులు

**కందనామాత్యుడు** కందనమంత్రి ముప్ప భూపతిచే సన్మానితుడై వెలిగందలా మాత్యుడైనాడు పేరుకు సామంత మండలాధిపతి అయినా ఆయన స్వతంత్ర రాజువలె సకల వైభవోపేతంగా జీవించాడు, జనరంజకంగా రాజ్య పాలన కావించాడు సింగన కవి కందనామాత్యుని 21 విశేషణాలతో పొగిడాడు [5] కందన మంత్రికి మడికి సింగన కవి మిత్రుడు

"నీ సహవాసం కారణంగా విద్యాసుఖకేళి బేర్చి శిష్ట జనులలో బంధువర్గంలో భాసురమైన కీర్తిని పొందగలిగాను" అని కందన మంత్రి సింగనను అభినందించాడు - ఆనందించాడు (పద్మ 1-56) ఇంకా "కృతి పతుల కీర్తి సదా లోకంలో వ్యాపించి ఉంటుంది కావున నన్ను కృతిపతినిజేసి కీర్తి వెలయింపజేయు" మని కోరినాడు (పద్మ - 1-58)

సింగన కవి కందనామాత్యుని గుణగణాలను ఈ విధంగా వర్ణించాడు

సీ ఈ ధర్మ చారిత్రునే ధాత్రి పతి యేలు, నా ధాత్రి పతియేలు నఖిల జగము
నీ కామినీ కాము నేకామినిలుచూతు, రా కామినులు చూడరన్య పురుష
నీ యర్కసుత తుల్యునేయర్థి గొనియాడు, నా మంత్రి విముఖాత్మ డఖిలమునకు
ఆ వె నన బ్రగల్భరూప ఘనదాన నయ మార్గ, ముల నుతింప నొప్పు ముజ్జగముల
దారహార హీర ధవళాంశు సమకీర్తి, కళితు డౌ బళార్య కంద విభుడు (పద్మ, 1-46)

అంతే కాక కందన "అపూర్వ వచన రచనా బంధుర కావ్య రసాభిజ్ఞుడు" అని సింగన పేర్కొన్నాడు [6]

**నీతి తారావళి** కందనామాత్యుడు 'నీతితారావళి' అనే పద్యకృతి వ్రాసినట్లు,సింగన రచించిన 'సకలనీతి సమ్మతం' అనే పద్య సంకలన గ్రంధం వల్లనే తెలిసింది సాహిత్య చరిత్రకారులు కొందరు నీతి తారావళిని మడికి సింగన, కందన మంత్రి పేర చెప్పినట్లు భ్రమించారు కాని, సింగన తన కావ్యంలో కందనామాత్యుని నీతితారావళిలోని వని స్పష్టంగా పేర్కొని 12 కంద పద్యాలను క్రోడీకరించాడు

నీతి తారావళి కృతి లభించలేదు లభించిన పై పద్యాలను బట్టి కందన పద్యకవిత్వ శైలినిభావ సౌందర్యాన్ని కొంతవరకైనా గమనించవచ్చు

కం అమరగ వేల్పులచే గ, బ్బము చెప్పియు కాదె వరము వడసిరి మునుబా
ణమయూ రాదులు సత్కా, వ్యము చెప్పిన బడయరాని వస్తువు గలదే [7]

ఈ పద్యం కందనకు గల పూర్వ కవుల పరిచయాన్ని సంప్రదాయ ప్రీతిని తెలుపుతున్నది మరో పద్యంలో సప్త సంతానములలో శాశ్వతమై నిలిచేది, కీర్తిని కలిగించేది సత్కావ్యమే అని అన్నాడు (స నీ స పద్యం 23) ప్రతిభ చాలని కవుల నీ విధంగా అభిశంసించాడు

తెలుగని చెప్పి సంస్కృతపు తీపును నారడి బుచ్చి శబ్దముల్
తెలుగును గాక యేసభల దెల్పగరాని యప ప్రయోగముల్
పలుమరు గ్రుచ్చివాదడున బాడుచు గబ్బపు దబ్బముండ్లచే
బెలుచన కర్ణముల్ పొడుచు బేలకవిం గవిగా దలంతురే (27వ, పద్యం)

కుకవులకు ఏ కాలంలోనూ కొరత లేదు కదా అందులో వారు పదముల చెరచు పాడుకవులు! సాహితీ ప్రతిభ లేకున్నా ఏదో వ్రాసి సంగీత పరిచయంతో రాగాలు తీస్తూ రాణించే కవిభ్రువులు నాడూ ఉండిరేమో! కుకవుల నింద నన్నె చోడుని తోనే ఆరంభమైంది

కందన ఇట్ల అన్నాడు

చ పలుకులు కొన్ని పేర్చి వడి బ్రాసము [8] నందుల దోపనేర్చుభం
గుల నెటువంటి పద్యములు గూర్చిన గూర్పగ వచ్చుకాక, తద్
జ్ఞులు పొగడం బ్రబంధములు చోద్యము పుట్టి రచింప వచ్చునే?
చెలిమలు ద్రవ్వినట్లగునె చెర్వులు గట్టుట భూతలంబునన్!

కవి అనుభవాలను బట్టి ఉపమానములు రూపొందుతాయి, అనడానికి పై పద్యంలోని చివరి పాదం దృష్టాంతం ఈ వానస వంశీయులు ఆలయతటాకాదులు నిర్మించినవారు

'అంతా కవులము కామా? అంతింతో పద్య సమితి నల్లగ లేమా?' [9] అన్నట్లుగా 'నాలుక గుల తీర్చుకొనడం కోసం కాక' [10] కవిత్వం ఈ ప్రకారంగా 'చెలువపు ప్రియురాలి తీపి పలుకుల సరసం' వలె ఉండాలన్నాడు

కం॥ పలుకుల తీపును సరసము, చెలువము నడబెడగు బంధ చిత్రము వెంపున్
గల కలన జూపవలదే, కలకంఠియు బోలె కవిత కందనమంత్రీ (28వ పద్యం)

ప్రజా కవి వేమన పద్యాలలోవలె ఇది ఆత్మ సంబోధన

శ్లో॥ కావ్యం యనసే అర్థకృతే వ్యవహారవిదేశివేతర క్షతయే
సద్య పర నివృతయే కాంతా సమ్మిత తయోపదేశయుజే

అని పూర్వ ఆలంకారికులు చెప్పిన కవితా ప్రయోజనాలలో కందన కేవలం కవితా రూపభావ సౌందర్యాలకే విలువిచ్చాడు కవితను కలకంఠితో పోల్చడమే కాక, ఈ కందం పూర్వార్థంలోని పలుకుల తీపి, సరసము, చెలువము, నడబెడగు, బంధ చిత్రము పెంపు పదాలలో, యువతికి కవిత్వానికి భావం సరిపోయే విధంగా శ్లేషను సమకూర్చడం గమనార్హం!

సకల నీతి సమ్మతంలోని కందన కందాలు మరికొన్ని

అమలమగు సప్త సంతా, నములందనిశంబు యశమునకు గుదురైనా
శము లేక నెగడు సత్కా వ్యము ధారుణిలోన నౌబళార్యుని కందా
ధరనొప్పు నీతి మార్గము, పరికింపక దిరుగుమంత్రి పని మంత్రములే
కురు విష భుజగము పట్టిన కరణి సుమీ యౌబలార్య కందన మంత్రీ

బలవంతుడు మన్నించిన బలహీనుడు బలియు డనఁగ బడుధారుణిలో
వలరాయడు చేపట్టిన, యలరులు బాణములుగావె యౌబళ కందా
తన్నని నమ్మినఁ బ్రోవక, పొన్నాకుల మీద తేనె బూసిన భంగిన్
నున్నని మాటల యన్నల, మన్నన లేమందు మబ్బ మంత్రియ కందా

వీనిలో రెండవ నాలుగవ పద్యాలలోని ఉపమాలంకారాలు మూడవ పద్యంలోని అర్థాంతరన్యాసం, కవి భావుకతకు నిదర్శనాలు మరి రెండు హృద్యాలైన కందనామాత్యుని కందపద్యాల భావాలివి "కళాకోవిదత్వము, వినయము, దానగుణము, యుద్ధవిజయము లేని రాజును స్త్రీయు కీర్తియును పొందనేరవు ' "చెడ్డవాని సంగతిచే మంచి వాడును చెడ్డవాడగును, కర్పూరము కలిసిన నూనె విషమగును కదా "

కందన తన 'నీతితారావళి' పద్యాలలో చక్కని నీతులు చెప్పి, వానిని సరియైన దృష్టాంతములతో బలపరిచాడు ఈ పద్ధతి తర్వాతి కాలపు భాస్కర వేమన శతక పద్యాల్లోనూ ప్రముఖంగా కనిపిస్తున్నది మంచి వారి స్నేహంతో మంచి వాడైన మాన్యుడు కందన మడికి సింగనమహా కవి సాంగత్యంతో ఆయన చిరయశస్కుడైనాడు

వాణన కందన వెలిగందలామాత్యుడు రాజనీతి విశారదుడు, భోగి-త్యాగి కందనమంత్రి సాహిత్యారాధకుడు కవిపోషకుడు మాత్రమే కాక, కృతి స్వీకర్త - కృతి కర్త!

"విద్యానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమం"

**పాద పీఠికలు**

1 మడికి సింగన కవి కావ్యావతారికలు, 2 నన్నయభారతఅవతారిక పద్య భావం, 1-25
3 డా కె కుసుమాబాయి "మడికి సింగన కవి" పుట 8
4 పద్మపురాణోత్తర ఖండము - 1 24, 5 పద్మపురాణోత్తర ఖండము - 1-43
6 వాసిష్ఠ రామాయణము 1-10, 7 సకలనీతి సమ్మతము 24వ, పద్యం
8 వడిప్రాసము = యతిప్రాసలు, వళి, విరతి, విరామము, విశ్రాంతి, యతికి పేర్లు
9 ఇటీవలి చాటువు 10 జిహ్వాకండువు పొంటె కవిరాట్ఛిల్పంబులల్పంబులే అని కందన ప్రయోగం సకలనీతి సమ్మతం - ప 25

## 3. వెలిగందుల నారయ - వెలిగందుల, 15వ శతాబ్ది

రామాయణ మహాభారతాలవలె ఆంధ్రులకు అత్యంత ప్రీతి పాత్రమైనది శ్రీ మదాంధ్ర మహాభాగవతం మొదటి రెండు ఇతిహాసాలు, భాగవతం పురాణం!

భాగవత పురాణ[1] ఫలరసాస్వాదన పదవి గనుడు రసిక భావ విదులు - అన్నాడు పోతన

భారతం కవిత్రయం చేతను, భాస్కర రామాయణం కవి చతుష్టయం[2] చేతను ఆంధ్రీకృతమైనట్లే - భాగవతం కూడా ఏకకవి విరచితంకాక నైక కవులచేత తెలుగు సేయబడింది

శ్రీమదాంధ్ర మహాభాగవత కర్త బమ్మెర పోతనామాత్యుడు ఆ మహాకవి అనుమతితోనే గంగన సింగన నారనలు అందలి 12 స్కంధాలలో నాలుగు స్కంధాలను అనువదించారు భాగవతం తెలుగులో నలువురు కవుల రచన పోతన భాగవతాంధ్రీకరణమునకు పూనుకొని, అందలి 1, 2, 3, 4 మరియు 7, 8, 9, 10 మొత్తం ఎనిమిది స్కంధాలను అమోఘంగా అనితర సాధ్యంగా రచించాడు మిగతా నాలుగు స్కంధాల అనువాదకులు వీరు -

1 బొప్పరాజు గంగన - పంచమ స్కంధం, 2 ఏర్చూరి సింగన - షష్ఠస్కంధం,
3 వెలిగందల నారయ ఏకదశ ద్వాదశ స్కంధాలు

**వెలిగందల నారయ** ఈ నారయ కవిని నారన అని కూడా వ్యవహరిస్తున్నారు నారాయణ అనే తత్సమ పదానికి వికృతినామం నారన భాగవత ఏకాదశ ద్వాదశ స్కంధాంత గద్యలలో మాత్రం నారయ అనే ఉంది [3]

వెలిగందల అనేది నారయ గృహనామమా! స్వగ్రామమా? వెలిగందుల నారన స్వగ్రామమే ఆయన ఇంటి పేరు తెలియదు ఎందుకంటే నారయకు గురువైన బమ్మెర పోతన, అంతకు పూర్వుడైన శివకవి పాల్కురికి సోమనలవలె ఇతడు కూడా స్వగ్రామనామంతోనే వ్యవహరింపబడి ఉంటాడు భాగవత స్కంధాంత గద్యలిట్లున్నవి

"ఇది శ్రీ పరమేశ్వర కరుణా కలిత కవితా విచిత్ర, కేననమంత్రి పుత్ర సహజపాండిత్య పోతనామాత్య ప్రియ శిష్య వెలిగందల నారయ ప్రణీతంబైన శ్రీమహా భాగవతమునందు ఏకాదశ స్కంధము " ద్వాదశ స్కంధ గద్య కూడా ఇదే విధంగా ఉంది

**స్వస్థలం** వెలిగందల కాకతీయుల కాలం నుండి చారిత్రక పట్టణం వెలిగందుల అని వ్యవహారనామం ముస్లింల పాలనలో ఎల్గందల్ అని పిలువబడింది క్రీ శ 1905 వరకు ఇదే కరీంనగర్ జిల్లాకు కేంద్రం ఈ ప్రాంతాన్ని పూర్వం వెలిగందల మండలం అని వ్యవహరించేవారు [4] రామగిరి సామంత రాజ్యంలో ఈ వెలిగందల ఒక మండలం నేటి జిల్లా కేంద్రమైన కరీంనగరుకు వేములవాడ రహదారిలో 7,8 మైళ్ళ దూరంలో ఉన్న గిరి దుర్గ పట్టణం వెలిగందల ఇప్పుడిదొక పెద్ద గ్రామం

కరీంనగర్ జిల్లాలోని ఈ గ్రామం తప్ప ఆంధ్ర దేశంలో మరెచ్చట కానీ మరో వెలిగందల లేదు అందుచేత నారయ కవి కరీంనగర్ మండలంలోని వెలిగందుల వాడనటం నిశ్చయాంశం

నారయకవికి ఇంచుమించు వందేండ్ల పూర్వం కందనమంత్రి, రామగిరి ముప్ప భూపతికి సామంతుడుగా ఇదే వెలిగందల పాలకుడై వెలిగందలామాత్యుడని పిలువబడ్డాడు [5] అనాటి మట్టికోట శిథిలమైనా రాతికోట, కోటలో శిథిలాలయాలు రాతికట్టు దిగుడుబావులు ఇప్పటికీ ఉన్నాయి

**కాలం** పోతన కాలం క్రీ శ 1400 - 1450 పోతన కంటె పదిరువదేండ్లు నారన పిన్నవయస్కుడు కావచ్చును కావున నారన పదునైదవ శతాబ్ది వాడనుట స్పష్టం

**వంశ వివరాలు** భాగవత రచనలో నారయ తల్లిదండ్రుల పేర్లు కాని, వంశ పూర్వీకుల వివరాలు కానీ తెలుపలేదు ఆయన ఆడంబరాలనెరుగని భాగవతుడు

**నారయ రచనలు** 1 భాగవత ఏకాదశ ద్వాదశ స్కంధములు 2 భాగవతఖిల భాగ పూరణము 3 నారాయణ శతకము [6]

**1 ఏకాదశ ద్వాదశస్కంధాలు** ఆంధ్రమహాభాగవతంలో ఏకాదశ ద్వాదశస్కంధాలు చాలా చిన్నవి సింగన గంగనలు ఒక్కొక్క స్కంధానువాదం కావించినా, అవి ఒక్కొక్కటి ఈ రెండు స్కంధాల మొత్తము కంటె పెద్దవి

ఏకాదశ స్కంధం - 127 గద్య పద్యాలు, ద్వాదశ స్కంధం - 54 గద్య పద్యాలు

అందులో మొదటి పద్యం, చివరి గద్యం, అశ్వాసాంత పద్యాలు రెండేసి వదలితే రెండు స్కంధాల్లోని మొత్తం కథా భాగం 123+50 = 173 గద్య పద్యాలు మాత్రమే [7]

సంస్కృత మూల భాగవతంలోని కథా పరిమాణమిట్లున్నది [8]

| | | | |
|---|---|---|---|
| ఏకాదశస్కంధం | - | 31 అధ్యాయములు | 1347 శ్లోకాలు |
| ద్వాదశస్కంధం | - | 13 అధ్యాయాలు | 558 శ్లోకాలు |
| మొత్తం | - | 44 అధ్యాయాలు | 1905 శ్లోకాలు |

పోతనా మాత్యుడు భాగవతాన్ని మూలంకంటె పెంచి వ్రాశాడు దశమస్కంధం రెట్టింపు పెరిగింది సింగన గంగనలు కూడా కథను పెంచి వ్రాశారు నారన మాత్రం కుదించి వ్రాశాడు

నారన భాగవత మూలాన్ని తన గురువు వలె పెంచక కుదించి వ్రాయడానికి కారణమేమిటి? అందుకు ఆరుద్రగారి సమాలోకనం అంగీకార యోగ్య సమాధానం అది ఇది [9]

వెలిగందల నారయ ఆశ్రయించిన కాలం నాటికి పోతన వృద్ధుడు గంగన సింగనలు అప్పటికే ఏ కారణం చేతనో పోతనను వదలి వెళ్లిపోయి వుండాలి పోతన మహాకవికి భాగవత గ్రంధానువాదం పూర్తి చేయాలని ఉత్కంఠగా ఉంది అప్పుడాయన దశమస్కంధ రచనలో మునిగిపోయి ఉన్నాడు మిగితా రెండు స్కంధాల అనువాదం పూర్తి చేయటం తనచేత కానిపని అని గుర్తించాడు అటువంటి సమయములో తన భాగ్యంగా చేరవచ్చిన నారయకు మిగిలిన చివరి రెండు స్కంధాల అనువాద కార్యం ఒప్పగించాడు అదీ సంగతి

మొదటే గ్రంధ ప్రణాళిక నేర్పరచుకొని, స్కంధాలను పంచుకొని ఆ నలుగురు కవులు ఈ భాగవత గ్రంధానువాదం కావించి యుండవచ్చును కదా - అనే సందేహం కొందరికి కలుగకపోదు ఆ విధంగానూ జరగడానికి ఆస్కారమున్నది, కాని భాగవత రచన మాత్రం అట్లా జరుగలేదనడానికి ఈ క్రింది అంశాలు బలంగా నిలుస్తాయి

1 మొదటనే నలుగురు కవులు కలిసి వ్రాస్తే, పోతన గారు సింగన గంగనలకు చెరి ఒక స్కంధం ఇచ్చిన మాదిరిగానే నారనకు కూడా ఒక స్కంధం మొదటనే ఇచ్చేవారు

2 ఆ వరుసలో చతుర్థం లేదా సప్తమస్కంధం నారనకు వచ్చి ఉండేది

3 నారన వెళ్లే సరికి సింగన గంగనలు లేరనడానికి నిదర్శనం పోతన ఎనిమిది స్కంధాలు రచించినా వారు మరో స్కంధానువాదానికి పూనుకోకపోవడం

4 పోతన అప్పటికి అశక్తుడై ఉన్నాడనడానికి సాక్ష్యం, అన్ని వేల పద్యాలు వ్రాసిన మహాకవి ఈ రెండు చిన్న స్కంధాలు కేవలం 2, 3 వందల పద్యాల భాగాన్ని వదలుకోవడం పైగా ఏకాదశ ద్వాదశ స్కంధాలు భక్తి వేదాంత భావాలు కలవి పోతనకు భక్తి అంటే ప్రాణం ఎంతో బలమైన కారణం లేనిదే ఆయన వాటిని వదులుకోలేడు గదా!

భాగవత దశమస్కంధంలోని బాలకృష్ణుని లీలలు గోపికల బృందావన క్రీడలు వృద్ధుని వర్ణనలుగా లేవు - అనే ఆక్షేపణ కొందరికి రావచ్చు సమర్థుడైన కవి శృంగారాన్నే కాదు ఏ రసాన్నైనా ఏ వయస్సులోనైనా చక్కగా పోషించగలడు విజ్ఞుడు రసజ్ఞుడైనపోతన కలానికి వయస్సు ప్రతిబంధకం అనుకోలేం

5 నారయ కవిత్వం పోతన మెచ్చదగినంత గొప్పగా లేదు అయినా భాగవత స్కంధద్వయ అనువాద కార్యాన్ని ఒప్పించాడంటే, ఆయనకు సంపూర్ణ భాగవతాంధ్రీకరణం చూడాలనే తపనవలననే

6 నారయ తన అనువాదం మూలానికంటె కుదించి వ్రాయడం త్వరగా గ్రంధ రచన పూర్తిచేయటానికే

7 నారయ ఈ రెండు స్కంధాలలో పద్యాలకంటె గద్యాలను ఎక్కువగా వాడటం అనువాదం త్వరగా పూర్తి చేయటానికే

8 పోతన తర్వాత నారయ ఈ శేషస్కంధాలను రచించి ఉండకూడదా? అంటే - ఆయన పోతనను తన గురువుగా చెప్పుకున్నాడు అది ఏకలవ్యశిష్యరికం కాదనడానికి నిదర్శనం భాగవత ఏకాదశ ద్వాదశ స్కంధాల గద్యలలో "పోతనా మాత్య ప్రియశిష్య వెలిగందల నారయ ప్రణీతంబైన" అని చెప్పుకొన్నాడు ప్రత్యక్ష సంబంధం లేనిదే ఆ పదం వాడుట జరుగదు పైగా గురువుగారిపై ఎంతో అభిమానం ఉంది కనుగనే నారన తాను అనువదించిన గ్రంధ భాగ స్కంధాంత గద్యలలో పోతనగారి జనకుని, కవితా ప్రశస్తిని పేర్కొని తనను గురించి ఏమీ చెప్పుకోక పోవడం పోతన గారికి తాను శిష్యుడు కావడమే అన్నిటికంటె గొప్పగా భావించి ఆయన ఆ ఒక్క అంశాన్నే తెలుపుకున్నాడు

ఇన్ని హేతువుల వలన ఆరుద్రగారి ఊహ సరియైనదే అనక తప్పదు ఇక నారన అనువాదం భాగవత భాగకథా వివరాలు చూద్దాం

**ఏకాదశ స్కంధంలోని అంశాలు** విశ్వామిత్ర వసిష్ఠ నారదాది మహర్షులు శ్రీకృష్ణ దర్శనం కోసం వచ్చుట, వసుదేవునికి నారదుడు పురాతనమైన విదేహర్షభ సంవాదం తెలుపుట, బ్రహ్మాది దేవతలు శ్రీకృష్ణుని వైకుంఠమునకు పిలువ వచ్చుట, కృష్ణుడు దుర్నిమిత్తములగని యాదవుల నెల్ల ప్రభాస తీర్థమునకు బంపుట, కృష్ణుడు ఉద్ధవునకు పరమోపదేశము చేయుట, అవధూత యదుసంవాదము, శ్రీకృష్ణబలరాములు వైకుంఠమునకేగుట

**ద్వాదశ స్కంధంలోని అంశాలు** శుకయోగి పరీక్షిత్తునకు భావి కాలగతులు సెప్పుట, యుగధర్మ ప్రాకృతాది ప్రళయ చతుష్టయ నివేదన, పరీక్షిత్తు తక్షకునిచేత దష్టుడై మృతినొందగా అతని కొడుకు జనమేజయుడు సర్పయాగము చేయుట, వేద వ్యాసుడు వేదములను పురాణములను భూలోకమున బ్రవర్తింపచేయుట మార్కండేయో పాఖ్యానము చైత్రాది మాసంబుల సంచరించెడు, ద్వాదశాదిత్యుల క్రమము తెలుపుట, పురాణముల గ్రంథసంఖ్య, భాగవత పురాణ ప్రశస్తి

**అనువాద విశేషాలు** నారయ అనువదించిన భాగవత ఏకాదశ ద్వాదశ స్కంధాలు సంస్కృత మూలం కంటె చాలా కుదించబడ్డాయి

కథను వర్ణనలను అతడు సంక్షేపించిన విధానాన్ని తెలుసుకోవడానికి ఒకటి రెండు ఉదాహరణలు సంస్కృత భాగవతంలోని[10] 11వ స్కంధ 2వ అధ్యాయంలో

శ్లో॥ సర్వ భూతేషుయ పశ్యేద్భగవద్భావమాత్మన
భూతాని భగవత్యాత్మన్యేష భాగవతోత్తమ (45)

దీనికి నారయ అనువాదం ఇది

తే గీ నర్వభూతమయుండైన సరసిజాక్షు, డతడె తనయాత్మ యందుండు ననెడు వాడు
శంఖ చక్రధరుండంచు జనెడు వాడు, భక్తి భావాభిరతుడువో భాగవతుడు (11 46)

తర్వాతి శ్లోకాలు ఈశ్వరే దదధే, అర్చాయామేవతు, గృహీత్వా, దేహేంద్రియ ప్రాణ, సకామ కర్మబీజానాం - ఈ అయిదు (46-60) శ్లోకాలను వదిలి 51వ, శ్లోకాన్ని అనువదించాడు అది ఇది

నయస్య జన్మ కర్మాభ్యాం న వర్ణాశ్రమ జాతిభి
సజ్జతే స్మిన్నహం భావో దేహేవైన హరే ప్రియ (51)

కం వర్ణాశ్రమ ధర్మంబుల, నిర్ణయ కర్మముల జెడక నిఖిల జగత్సం
పూర్ణుడు హరియను నాతడె, వర్ణింపగ భాగవతుడు వసుధా ధీశా (11-47)

ఇది నారన భాగవతానువాదాన్ని సంక్షేపించిన వైఖరికి ఒక ఉదాహరణ

సంస్కృత మూలంలోని ఏకాదశ స్కంధంలో 6వ, అధ్యాయం చివర ఆరంభమైన శ్రీకృష్ణ ఉద్ధవుల సంభాషణ 31వ, స్కంధం వరకు సాగింది ఈ 22 స్కంధాలను నారన అతి సంగ్రహంగా కేవలం 32 గద్య పద్యాల్లో చెప్పాడు గద్యాలు పెద్దవి ద్వాదశ స్కంధంలోని శుకమహర్షి ప్రసంగం కూడా అనువాదంలో సంక్షేపించబడింది ఇంకా మూలంలోని సూతునికి శౌనకాదిమునులకు మధ్య నడిచిన సంభాషణ నారన వదిలాడు చివర స్కంధాంతంలో వివరంగా వర్ణించబడిన భాగవత ప్రశస్తిని[11] తగ్గించి విష్ణువర్ణన పద్యం[12]తో కథా పరిసమాప్తి కావించాడు

మూలాన్ని ఎంత కుదించినా నారయ కొన్ని చోట్ల కథను పెంచాడు కూడా

ఏకాదశ స్కంధారంభంలో భారత మౌసల పర్వం కథ ఉంది భాగవత మూలంలో విశ్వామిత్ర

కణ్వనారద వసిష్ఠాదిమునులు ద్వారకకు రాగా, యదుకుమారులు సాంబుని గర్భిణి స్త్రీ వేషంలో వారికి చూపి సంతాన విషయం ప్రశ్నించి శాపగ్రస్తులైనారు (11 1 13, 14 శ్లో)

నారయ అనువాదంలో మునులు మొదట శ్రీకృష్ణుని సందర్శించి, సపర్యలు పొంది (11-13) సుఖాసీనులై శ్రీహరిని సంస్తుతించారు జనములు నిను సేవింపని, తరణంబులు భవజలధికి, ఒక్కవేళను సూక్ష్మరూపము, శ్రీనాయక నీనామము ఈ నాలుగు పద్యాలు (14-17) నారయ కల్పన ఈ భక్తి తాదాత్మ్య స్వతంత్ర వర్ణనలు పోతనకు అనుసరణ ఇంకా మూలంలో "అంతరిక్ష ఉవాచ" అను ఏకాదశస్కంధ తృతీయాధ్యాయ వాక్యాన్ని నారన అనువాదంలో "అనిన అంతరిక్షుండను ఋషి శ్రేష్ఠుడిట్లనియె (11-50) అని, పాఠకులకు అంతరిక్ష పద ప్రయోగాన్ని సందర్భోచితంగా స్పష్టంగా విపులీకరించాడు

నారన మూల విధేయతతోపాటు అనుసరించిన స్వతంత్ర వైఖరికి మరొక ఉదాహరణ

శ్లో ॥ యోవా అనంతస్య గుణానంతా నను క్రమిష్యన్సతు బాల బుద్ధి ।
రజాంసి భూమేర్గణ యే త్కథంచిత్కాలే నైవాఖిల శక్తి ధామ్న ॥ (11 4-2)

దీనికి అనువాదం పద్యం చూడండి

కం॥ తారల నెన్నగ వచ్చును, భూరేణుల లెక్క పెట్ట బోలును ధాత్రిన్
నారాయణ గుణ కథనము లారయ వర్ణింపలేరు హరిబ్రహ్మాదుల్ (11-6)

భూరేణువుల లెక్కించడం మూలంలోనిదే కాని, తారల లెక్కించటం మూలంలో లేనిది అది కవి స్వయం కల్పన ఇందుకు "అమలిన తారకా సముదయంబుల నెన్నగవచ్చు"[13] అను నన్నయ భారత పద్యభావం కవి స్మృతిలో మెదలి ఉంటుందనుకోవడం అసంగతం కాదు

యాదవులకు మృత్యుకాలం సమీపించగా ప్రకృతి ఉత్పాతాలు కలిగినాయని ఒకే ఒక పదంతో ఆ అరిష్టాన్ని మూలంలో సూచించగా, దానిని పెంచి నారన ఒక సీసపద్యం (11-87)లో దుశ్శకునాల వర్ణించాడు ఇంకా -

ఈ రీతి శ్రీకృష్ణుడేపార బూతనా, శకట తృణావర్త సాళ్వ వత్స
చాణూర ముష్టిక ధేను ప్రలంబక, దైత్యాఘ శిశుపాల దంతవక్త్ర
కంస పౌండ్రాదిక ఖండనంబొనరించి (11-3)

ఇందలి పేర్లు మూలంలో లేనివి నారన వీనిని సందర్భోచితంగా చేర్చి విషయ వివరణ కావించాడు అదీ అతని కవన ప్రత్యేకత

**కవితా సమీక్ష:** వ్యక్తుల వృక్షాల పేర్లు నారయకు ఛందస్సులో చక్కగా ఒదిగిపోతాయి వచనాలశైలి రమ్యం గహన వేదాంత విషయాలను సైతం గద్యాల్లో పద్యాల్లో నిరాయాసంగా వర్ణించాడు నారన కవిత్వంలో ప్రబంధాలలో వలె అలంకార పుష్టిలేదు ఆయనది పురాణాల రచనా ధోరణి! అర్థ దృష్టి! అలంకారాలు తక్కువైనా ఉన్నవి కవి నేర్పరి తనానికి నిదర్శనంగా నిలిచాయి

కం శ్రీనాయక నీ నామము, నానా భవరోగ కర్మనాశమునకు వి
జ్ఞానంబగు నౌషధమిది, కానరు దుష్టాత్ములకట కంజదళాక్షా! (11 17)

నానా భవ రోగ కర్మ అనేక జన్మలెత్తే రుగ్మత విజ్ఞానంబగు నౌషధము - విజ్ఞానమనేమందు, ఇందరి రూపకాలంకారాలు స్పష్టం శబ్దాలంకార శోభితమైన ఈ క్రింది చతుష్ప్రాస కందం అందం కందాం

తరణంబులు భవ జలధికి, హరణంబులు దురితలతల, కాగమములకా
భరణంబు, లార్త జనులకు శరణంబులు నీదు దివ్య చరణంబులిలన్ (11-15)

మత్తకోకిల (11-16) మాలిని (11-126, 12 33) విశేషవృత్తాలతోపాటు సర్వలఘుసీసము (11 72) వంటి కవితా చమత్కృతులు కూడా చూపాడు ఈ కవి ఇందులో కొన్ని రమ్యమైన పద్యాలు లేకపోలేదు

చ నరవర తొంటి భూపతుల నామగుణంబులు వృత్త చిహ్నముల్
సిరియును రూపసంపదలు జెన్నగు రాజ్యములాత్మ విత్తముల్
వరుసనడంగె గాని యట వారల కీర్తులు నిర్మలంబులై
యురవడి భూమిలో నిలిచియున్నవి నేడును రాజశేఖరా (12 - 14)

ఇది పోతనగారి 'వామనావతార కథ' లోని 'లేరే రాజులు రాజ్యముల్ కలుగవే' అను పద్యాన్ని తలపించే భావం మరో శైలీ ప్రసన్న భక్తి భావ రమ్య పద్యం చూడండి

మ బలభిన్ముఖ్య దిశాధినాధ వరులున్ ఫాలాక్ష బ్రహ్మాదులున్
జలజాతాక్ష పురందరాది సురులుం జర్చించి నీమాయలం
దెలియన్‌లేరట నా వశంబె తెలియన్ దీనార్తి నిర్మూలయు
జ్వల పంకేరుహ పత్రలోచన గదా చక్రాంబు జాద్యంకితా! (12-36)

అయితే నారన భాగవత భాగంలోని శైలీ భావరమ్య పద్యాలు హరిభట్టువని ఆరుద్రగారి వాదం [14] హరిభట్టు (1530) మత్స్య వరాహ నరసింహ పురాణాలనే కాక భాగవతంలోని 6,11,12 స్కంధాలను అనువదించాడు [15]

కాని, నారన రచనలో పద్యాలకంటె గద్యాలెక్కువ ఆ పద్యాలైనా కథాగమనానికి సరిపడి ఉన్నవి ఎరవు తెచ్చు కొన్నవిగా కనిపించవు తర్వాతి కాలపు లేఖకులు హరిభట్టుకవనానికి మురిసి ఆయన పద్యాలను నారయ భాగవతంలో చేర్చుకొని ఉండవచ్చునని కొందరి తలంపు కాని అది అసంగత మనడానికి ఒక సాక్ష్యం ఏ పద్యాన్ని అనుమానించినా ఆశ్వాసాంత (స్కంధాంత) పద్యాలను మాత్రం గ్రంథకర్తవి కావని అనలేం కదా నారన ఏకాదశ స్కంధాంత పద్యం (11 124) ఇది

చ నగుమొగమున్ సుమధ్యమును నల్లని మేనును లచ్చికాట ప
ట్టగు నురమున్ మహాభుజములంచిత కుండల కర్ణముల్ మదే
భగతియు, నీలవేణియు గృపారస దృష్టియు గల్గువెన్ను డి
మ్ముగబొడ సూపు గాత గనుమూసిన యప్పుడు విచ్చినప్పుడున్

నారయ పద్యాల్లో అక్కడక్కడ పాదపూరణ (వ్యర్థ) పదాలుంటాయి అవి సాధారణంగా యతి ప్రాసల స్థానాల్లో చోటు చేసుకుంటాయి తరచుగా చివరి పాదం ప్రాస స్థానంలో కనిపిస్తాయి

పై పద్యంలో ఇమ్ముగ వలెవే, ఇందులో అంతకు మొదట చూపిన రెండు పద్యాల చతుర్థ చరణాల్లో ఉరవడి, ఉజ్జ్వల పదాలున్నాయి ఇది నారయ పద్యాల గుర్తించడానికి ఒక పద్ధతిగా భావించవచ్చు

భాగవతంలో పోతన తరువాత సింగన కవిత్వమే బాగుందని కవి చరిత్రకారుల అభిప్రాయం16 కాని ఎక్కిరాల కృష్ణమాచార్య గారి అభిప్రాయం ఇట్లున్నది "గ్రంథమెక్కువ భాగం పోతన రచనయే మిగిలిన వారి రచనలు పోతన రచనల యంత బాగుండవని కొందరి పండితుల యూహ ఈ యూహలో అభిమానముతో బాటు అసత్యము గూడా నున్నట్టు కనిపించును "[17] ఆ మాట కొంతైనా సత్యమే

నారన సంస్కృతాంధ్ర భాషల వైదుష్యం కలవాడు ఏకాదశ స్కంధ ప్రారంభపద్యం

కం శ్రీ సీతాపతి లంకే, శాసుర సంహార చతుర శాశ్వత నుత వా
ణీసత్యధి భూధవవ్ప, త్రాసుర రిపు దేవజాల రామ నృపాలా!

వచనాలు శైలీ భావ రమ్యాలు

'ఇవ్విధంబున భూమి వలన సైరణయు, గంధవహుని వలన బంధురంబగు పరోపకారంబును, విష్ణుపదంబు వలన గాల సృష్టిగుణ సాంగత్యంబు లేమియు, నుదకంబు వలన నిత్య శుచిత్వంబును, నసితపధుని వలన నిర్మలత్వంబును " 11-99 భాషా ఛందో దోషాలు కవివే అనలేం

సీ॥ సంతతంబును గృష్ణ సంకీర్తనంబును, వీనులకింపుగా వినగవలయు
హర్షంబుతోడుత హరినామ కథనంబు, పాటల నాటలం బరగ వలయు
నారాయణుని దివ్య నామాక్షరంబులు, హృద్వీధి సతతంబు నిలుపవలయు 11 44

ఇంత సరళంగా సాగిన పద్యంలో మూడవ చరణంలోని యతి భంగం కవి కలానిదికాదు నెమ్మది (నెఱ+మది) అని కవిప్రయోగం అయ్యుంటుంది ఛంద పరిజ్ఞానం లేని అనంతరకాల లేఖకుడు అందమైన పదమని హృద్వీధిని చేర్చి ఉంటాడు [18]

సైన్యమున్నడచె = సైన్యమున్ + అడచె (11-3) వంటి ఒప్పని సంధులు నారన వాడినా, అన్నిష్టసఖి అని అవి పోతన కవితలోనూ ఉన్నాయి సంస్కృత తమిళ భాషల్లో ఉన్న ఈ సంధులను ప్రౌఢ వ్యాకరణకర్త బహుజనవల్లి వారు గుర్తించి అంగీకరించారు

నారయ రచన మూలానికి భిన్నంగా పోతన కవిత్వంలో పొత్తు కుదురక పోవుటచేతనే ఏకాదశ ద్వాదశ స్కంధాలను పలువురు కవులు అనువదించారని నిడుదవోలు గారి అభిప్రాయం [19]

భక్తిలోనూ కవిత్వంలోనూ గురుమార్గాన్ని అనుసరించాడు నారన కవితా లాలిత్య భావ పటుత్వాలతో ఆయన పోతనకు సమ ఉజ్జీకాకపోయినా శిష్యస్థాన సంభావ్యుడు పోతన అద్వైతి, నారన విశిష్టాద్వైతి [20]

ఏది ఏమైనా భాగవత కవులలో పోతన శిష్యునిగా వెలిగందుల నారయది గౌరవస్థానం

## బాగవత ఖిలభాగ పూరణం

పోతన భాగవతంలో కొన్ని భాగాలు క్రిమిదష్టమై ఖిలమైపోగా వానిని ఇతర కవులు పూరించినట్లు ఆంధ్రసాహితీలోకంలో ప్రచారంలో ఉన్న అంశం ఖిల భాగ పూరణంలో వెలిగందల నారయ పేరు ప్రముఖంగా చెప్పబడుతున్నది డా॥ దివాకర్ల వేంకటావధాని గారి అభిప్రాయం "తృతీయ చతుర్థ దశమ స్కంధోత్తర భాగములందు గూడా నచ్చటచ్చట నారయ రచనమున్నదని చెప్పుదురు "[21] పింగళి లక్ష్మీకాంతంగారు తమ 'ఆంధ్రసాహిత్య చరిత్ర' లోనూ అదే మాట అన్నారు [22] దశమ స్కంధోత్తర భాగంలో చివరి 1100 పద్యాలు నారయ రచించినట్లుగా శేషాద్రి రమణ కవులు భావించారు[23] కాని, భాగవతం అచ్చు పుస్తకాలలో మాత్రం ఆ విషయం పేర్కొనబడలేదు ఒక ద్వితీయస్కంధం మధ్యనే నారయ పేరు కనిపించుతున్నది [24]

పోతరాజు రచించిన గ్రంధమున కొంత భాగము శిధిలమై పోవుటచే నా శిధిలభాగముల నితరులు పూరించిరి అన్నారు డా॥ దివాకర్ల పోతన పూర్తి భాగవతమును ఆంధ్రీకరింపగా ఖిల భాగపూరణమును మాత్రమే ఇతర కవులు కావించినారని, వారు స్వయంగా పూర్తి స్కంధాలను రచింపలేదని కొందరు అభిప్రాయపడ్డారు కాని, ఆ వాదన సరికాదని, ఆంధ్ర భాగవతంలోని 5, 6, 11, 12 నాలుగు స్కంధాలను గంగన సింగన నారనలు సంపూర్ణంగా తామే రచించినారని చాగంటి శేషయ్య ఆరుద్ర గారలు నిర్ద్వంద్వంగా తేల్చి చెప్పారు [25]

భాగవతం అచ్చు ప్రతులలో ద్వితీయ స్కంధం నందలి 93వ, పద్యానికి ముందు 'ఇక్కడి నుండి నారయ కవిత్వం' అని ఉంది ఈ ద్వితీయ స్కంధంలో మొత్తం 289 గద్య పద్యాలున్నాయి వానిలో మొదటి 92 పోతన రచన మిగిలిన 197 గద్యపద్యాలు నారయ రచన స్కంధాంత గద్యమాత్రం పోతనామాత్యుని పేరనే ఉంది నారయ ప్రసక్తి లేదు ఇది ఖిలభాగ పూరణమే తప్ప నారయ స్వంత రచన కాదు, కనుక గురుభక్తి కారణంగా గద్యలో తనపేరు చేర్చుకొనలేదంటారు

సాహితీసమీక్షకులు ద్వితీయ స్కంధంలోని నారయ కవిత్వం మాత్రం పటుత్వంగా ఉంది అందులో గురువుగారి రచనమెంతో శిష్యుని భాగ స్వామ్యమెంతో తేల్చి చెప్పటం కష్టం కాబట్టి ఆ భాగ సాహిత్య సమీక్ష వదలివేయబడుతున్నది

**నారాయణ శతకము - కర్తృత్వపరిశీలన** తెలుగు సాహిత్యంలో కవిపేరు లేని నారాయణ శతకము' ఒకటి వ్యాప్తిలో ఉన్నది [26] అది పోతనామాత్యుని రచనగానే చలామణి అవుతున్నది

సాహిత్య అకాడెమీ వారి శతక సంపుటము ద్వితీయ భాగములో 'నారాయణ శతకము' నకు ముందు వివరణలో స్వామీ శివశంకర స్వామి గారి అభిప్రాయం ఇట్లున్నది

'నారాయణ శతకమును బమ్మెర పోతన రచించెనని ప్రతీతి చిన్నతనమున గురుని అనురోధమున వీరభద్ర విజయ కావ్యమును రచించెనట ఆవల సింగను నాయని పేర భోగినీ దండకము రచించినారట తుదకు భాగవతము నాంధ్రీకరించి జగత్ప్రసిద్ధుడయ్యెను నారాయణ శతకము, దండక రచనానంతరము చెప్పెనని కొందరి యభిప్రాయము"[27]

భాగవతానికి బీజప్రాయాలైన భావాలు ఈ శతకంలో ఉన్నందున పోతన కృతమని అనజాలమని, భాగవతం చదివిన మరే కవి కానీ అందలి భావాల సంక్షేపించి ఇట్లా వ్రాయవచ్చునన్నారు, చాగంటి శేషయ్య గారు ఇంకా ధర్మపురి ప్రాంత కవి మరియెవరో దీనిని రచించి యుండవచ్చును కర్తృత్వము నిర్ణయమగు వరకు "ఈ శతకమును కవి పేరు తెలియని శతకములలో జేర్చుట మంచిదని నా యభిప్రాయము" అన్నారు [28]

ఈ శతకం పోతన విరచితం కాదని చాగంటి శేషయ్య గారు 'ఆంధ్ర కవితరంగిణి'లో చర్చించి తీర్మానించిన అంశాన్ని ప్రస్తావించి ఆరుద్ర గారు కూడా అదే నిర్ణయాన్ని ఆమోదించారు అందుకు వారు చూపిన కారణాలివి [29]

అపరాధమ్ములు నిన్ను నమ్మి వినుమే నాజన్మ పర్యంతమున్
విపరీతంబుగ జేసినాడ నిక నీవే దిక్కు నాలోనికిన్
గపటంబింతయు లేక దండధరుకుం గట్టీక రక్షింపుమీ
కృపకున్ బాత్రుడనయ్య ధర్మపురి లక్ష్మీనాథ నారాయణా [30]

విను, అనేది పోతనకు ఊత పదమే కాని, అపరాధంబులు పెక్కు చేసితి అనటం ఆ మహాకవి స్వభావానికి విరుద్ధం మరో పద్యం,

నీ మూర్తుల్గన నీ కథల్ విన దుదిన్, నీ పాద నిర్మాల్య ని
ష్కామోదంబు నెరుంగ నీ చరణ తోయంబాడ నైవేద్యముల్
నేమంబొప్ప భ(భు) జింప నీజపము వర్ణింపన్ గృపం జేయవే
శ్రీమించన్ బహు జన్మజన్మములకున్ శ్రీ యాది నారాయణా! - 05

ఇది పోతన భాగవతంలోని 'నీ పద్యావళులాలకించు చెవులున్' అనే పద్యం శైలిలోనే ఉంది కాని, 'శ్రీకైవల్య పదంబు జేరుటకునై పునర్జన్మంబు లేకుండగన్' చింతించు, పోతన కవి నోటికి బహు జన్మల ప్రసక్తి వస్తుందా? ఇది ఆ భక్త కవి స్వభావానికి, మోక్షాసక్తికి విరుద్ధం అపరాధాలు చేసితిననటం, బహుజన్మల ప్రసక్తి - ఉండటంతో ఈ నారాయణ శతకం పోతనకవి రచనకాదని, ధర్మపురిని పేర్కొనుట వలన కరీంనగర మండలంలోని మరో కవి ఎవరో రచించి ఉంటాడని ఆరుద్ర గారు అభిప్రాయపడ్డారు

స్వామీ శివశంకర స్వామి గారు కూడా తమ పీఠికలో "ఈ శతకమున కవి నారాయణ పారమ్యమును ప్రతిపాదింప దలచిన వాడగుటచే వైష్ణవు డయినను, కాక పోయినను, విష్ణుభక్తుడు

మాత్రమగును కొన్ని కొన్ని ఉపపత్తులు స్థూలముగా కానవచ్చుచున్నను ఈ కవి పోతనా మాత్యుడు కాడనిపించును''[31] అని అన్నారు

అవును, ఆ మాట నిజం నారాయణ శతకం పోతన కృతి కాదు ఎందుకంటే -

పోతన ధర్మపురికి సమీపం వాడు కాడు బమ్మెర కరీంనగర్‌కు దక్షిణంగా వరంగల్ జిల్లా జనగాం తాలూకాలో ఉంటే, ధర్మపురి కరీంనగర్‌కు ఉత్తరంగా గోదావరి తీరంలో ఆదిలాబాద్ జిల్లాకు సమీపంలో ఉంది నారాయణ శతక పద్యాల స్థాయి సామాన్యంగా ఉంది ఈ శతకంలో పోతనకు ఇష్టమైన వృత్త్యను ప్రాస, అంత్యానుప్రాస, లాటానుప్రాస, యమకాది శబ్దాలంకారాలు లేవు మరో విషయం ఈ శతకం పోతన రచన అయితే తప్పక తనపేరు చెప్పుకునేవాడే ఎందుకంటే ఆయన యువ వయస్సులో వ్రాసిన మామూలు భోగినీ దండకానికి కూడా తన పేరు చేర్చుకున్నాడు కదా ఏ విధంగా ఆలోచించినా ఇది పోతన మహాకవి రచించినది కాదు

ఆరుద్ర గారు ఆశంకించినట్లుగా నారాయణ శతకాన్ని కరీంనగర్ మండలంలోని ఎవరో ఓ అజ్ఞాతకవి రచించి ఉంటాడు ఎవరా కవి? నారాయణ శతక పద్యాలు వెల్లంకితాతం భట్టు, (1480-1520) కస్తూరి రంగకవి (1750) తమ లక్షణ గ్రంథాలలో ఉదహరించారు కనుక ఈ కవి వారిద్దరికి పూర్వుడై ఉండాలి

అది 15వ శతాబ్ది ఉత్తరార్థం ఆ కాలంలో కరీంనగర్ జిల్లాలో ఈ శతక కవి ఎవరు?

ఈ నారాయణ శతకం విష్ణుభక్తి కలది కవిత ప్రారంభ దశలోనిది ప్రౌఢ రచన కాదు ధర్మపురి లక్ష్మీనాథ నారాయణా! అనే పదబంధం కూడా ప్రతి పద్యంలో లేదు కేవలం రెండు పర్యాయాలే వాడాడు కవి 'నారాయణా' అనేది శతక పద్యమకుటం అది ప్రతి పద్యం చివర ఉంది కృతి ముందుకాని, చివరకాని, మధ్యకాని, ఎక్కడా కవి పేరు ఉటంకించబడిలేదు

దీనిని బట్టి చూడ నారాయణ నామధేయుడైన కవి యెవరో తనపేరు తన యిష్టదైవం పేరు కలిసి వచ్చేరీతిగా ఈ మకుటాన్ని ఎంచుకొని శతక రచన కావించినట్లు భావించవచ్చు అదే నిజం! ఎందుకంటే ధర్మపురిలో వెలసిన దైవం నరసింహుడు అది ఆది నారాయణమూర్తి అవతారమే తన పేరు నారాయణ కాబట్టి నరసింహునికి కూడా ఆ పదం సరిపోతుంది కదా! అని ఆలోచించి కవి ఈ శతకమకుటాన్ని ఎన్నుకొనటం జరిగి ఉంటుంది

ఇక నారాయణ శబ్ద వాచ్యకవులు ప్రసిద్ధులో అప్రసిద్ధులో ఆ కాలంలో ఈ ప్రాంతంలో ఎవరూ లేరు పోతనకు కొంతముందు కాలం వాడైన రామగిరి మడికి సింగన కవికి నారాయణ పేర ఒక సవతి తమ్ముడున్నాడు కాని, అతడు కవి అని కానీ, అన్నతోపాటు రామగిరిలో ఉన్నాడని అనడానికి కానీ ఎటువంటి ఆధారం లేదు

కావున, ఈ నారాయణ శతకం వెలిగందల నారాయణ రచనే అయి ఉంటుంది నారాయణ అను తత్సమ పదానికి తద్భవ రూపం నారన

ఈ కవి పేరు లేని శతకం నారయది కావడమేమిటి? అది పోతన కవిదిగా ప్రచారానికి రావడమేమిటి? అనే ప్రశ్నలకు సమాధానంగా ఈక్రింది సంఘటనలు జరిగి ఉండవచ్చు

పోతన భాగవతం32 చదివిన భక్తి ఊపులో కవితా ప్రీతితో వెలిగందుల నారన, నారాయణ శతకం వ్రాసి ఉంటాడు అప్పటికే ఈ జిల్లాలో వేములవాడ, ధర్మపురి, కాళేశ్వరం సుప్రసిద్ధ దైవ క్షేత్రాలు ఆ తదుపరి మహాకవి పోతన సందర్శనార్థం నారయ బమ్మెరకుపోయి ఉంటాడు గురువు మెచ్చుకో తనకే నచ్చుకో నారన తన నారాయణ శతకాన్ని అక్కడే వదలి ఉంటాడు ఏ పూర్వ కవితా పరిశ్రమను చూడనిదే పోతన గారు నారనకు భాగవత అనువాద కార్యం ఒప్పగించలేడు కదా! భాగవత మహాకావ్య రచనలో భాగస్వామి అయిన నారనకు తన మొదటి కృతి అయిన ఈ నారాయణ శతకంపై ధ్యాస - ప్రేమ ఉండకపోవడం ఈ ఉపేక్షకు కారణం అనుకోవచ్చు

అటు గురువు ఇటు శిష్యుడు గతించిన తర్వాత చాలా కాలానికి పోతన గృహంలో నారాయణ శతక తాళపత్ర ప్రతి లభించడంతో నాటి వారు అది పోతన రచనగానే భావించి ఉంటారు అది పోతన కృతం మాత్రం కాదు పోతన వంశీయులలో మరెవరూ ఈ శతకం తమదని చెప్పుకోలేదు

నారాయణ శతకం నారన కవి విరచితమే నారన పేరు కూడా ఆ శతకంలో లేదు కదా, అంటే - శతక మకుటంలోనే కవి పేరు ఇమిడి ఉంది అది 'విశ్వదాభిరామ వినురవేమ' అనే మార్గం

ఏ విధంగా చూసినా నారాయణ శతకం వెలిగందల నారన కృతం అనుట ఆమోదయోగ్యం

**పాద పీఠికలు**

1 బ్రహ్మం పాద్మం వైష్ణవంచ శైవం లైంగం సగారుడమ్
నారదీయం భాగవతమాగ్నేయం స్కాంద సంజ్ఞితమ్॥ అని, వ్యాస విరచిత మనబడుతున్న అష్టాదశ పురాణాలలో భాగవతం ఎనిమిదవది

2 భాస్కర రామాయణ కవులు - హుళక్కిభాస్కరుడు, మల్లికార్జునభట్టు, కుమార రుద్రదేవుడు, అయ్యలార్యుడు కవిత్రయం- నన్నయభట్టు, తిక్కన సోమయాజి, ఎర్రాపెగ్గడ

3 వావిళ్లవారి ప్రతి, ముద్రణ సంవత్సరం లేదు,

4 కరీంనగరం మండల చరిత్ర, 1981, పుట-22

5 మడికి సింగన కవి - "పద్మపురాణోత్తరఖండం" భాగవత దశమస్కంధం" పీఠికలు

6 ఈ శతక కర్తృత్యచర్చ ఇదే శీర్షిక చివర ఉంది

7 శ్రీమదాంధ్ర మహాభాగవతము వావిళ్లవారి ప్రతి

8 గోరఖ్‌పూర్ వారి ప్రతి (దేవనాగరి లిపి)

9 ఆరుద్ర "సమగ్రాంధ సాహిత్యం" 5వ సంపుటి

10 నారాయణభట్ల కృష్ణమూర్తిగారిచే పరిష్కృత ప్రచురణ (తెలుగు లిపి ప్రతి), హైదరాబాదు - 1974 ముద్రణ 11 ద్వాదశ స్కంధం - ద్వాదశత్రయోదశాధ్యాయాలు

12 సకల గుణాతీతు సర్వేశు లోకేశు సీసం భాగవతం - 12-50

13 మహాభారతము - అవతారిక, 19వ పద్యం

14 చాగంటి శేషయ్య గారు నారన భాగవతంలోని హరిభట్టు పద్యాల లిస్టు ఇచ్చారు - ఆంధ్రకవితరంగిణి, సం, పు 208

15 దివాకర్ల గారి 'ఆంధ్రవాఙ్మయ చరిత్రము,' పుట-58

16 పింగళి లక్ష్మీకాంతంగారి 'ఆంధ్ర సాహిత్యచరిత్ర", డా దివాకర్ల 'ఆంధ్రవాఙ్మయ చరిత్ర' పుట-31, శేషాద్రి రమణకవులు, వావిళ్లవారి 'భాగవతం' పీఠిక

17 ఎక్కిరాల భాగవతము' రహస్యప్రకాశం' పుట 10, దివరల్లు,టీచర్స్ ట్రస్టు ప్రచురణ, ద్వి ము 1978

18 నిడుదవోలు వేంకటరావు గారి 'పోతన' పుట - 185, నేషనల్ బుక్ ట్రస్టు వారి ప్రచురణ

19 నిడుదవోలు వేంకటరావు గారి 'పోతన' పుట-185 నేషనల్ బుక్‌ట్రస్టు వారి ప్రచురణ

20 ఆరుద్రగారి 'సమగ్రాంధ్రం సాహిత్యం' సం 6, పుట 39

21 ఆంధ్రవాఙ్మయ చరిత్రము - పుట - 30 22 ఆంధ్ర సాహిత్య చరిత్ర - పుట - 55

23 వావిళ్ల ప్రతి పీఠిక 24 వావిళ్ల ప్రతి, ఎక్కరాల వారి ప్రతి

25 ఆంధ్రకవితరంగిణి, సమగ్రాంధ్ర సాహిత్యం

26 శతక సంపుటము (ద్వితీయ భాగము) - ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి ప్రచురణ-1968

27 శతక సంపుటము (ద్వితీయ భాగము) ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి ప్రచురణ - 1968, పుట 1

28 ఆంధ్రకవి తరంగిణి 6వ, సంపుటి, పుట 217, ద్వి ముద్రణ 1961

29 సమగ్రాంధ్ర సాహిత్యం, 5వ, సం పు 240, 30 నారాయణ శతకము - 97వ, పద్యం
31 శతక సంపుటము, రెండవ భాగము ప్రస్తావన పుట-11
32 ఆంధ్రీకృతమైన స్కంధాల మారు ప్రతులు వ్యాప్తి పొంది ఉంటాయి

## 4 చరికొండ ధర్మన - ధర్మపురి, 16వ శతాబ్ది

చరికొండ ధర్మన కవి కరీంనగర్ జిల్లాలోని ధర్మపురి వాడు ధర్మన 'చిత్రభారతము' అను కావ్యాన్ని రచించాడు ఏకశిలానగరాంధ్ర రాజయిన సీతాపతికి సామంత మండలాధిపతిగా ధర్మపురి పాలకుడైన ఎనుములపల్లి పెద్దనామాత్యునికి ధర్మన తన చిత్రభారత కావ్యాన్ని అంకితమిచ్చాడు

**స్వస్థలం** ధర్మన చిత్రభారతంలో తన ఊరు పేరుకానీ, తల్లిదండ్రుల పేర్లు కానీ, వంశ వివరాలు కానీ చెప్పుకోలేదు ఆ కవి పేరుకు ముందు గృహనామంగా ఉన్న చరికొండ పదాన్ని అతని గ్రామనామంగా కవి చరిత్రకారులు ఊహించారు చరికొండ గ్రామం మహబూబ్‌నగర్ (పాలమూరు) జిల్లాలో ఉంది [1]

ఈ కరీంనగర్ జిల్లాలో రెండు సిరికొండలు, రెండు నల్లగొండలు ఇంకా తడగొండ, వాలుగొండ, వరిశకొండ, రేకొండ, దీకొండ, నెమిలికొండ, కొత్తకొండ మొ॥ కొండ పదాంత గ్రామాలున్నవి గట్టు, గిరి చివరగల ఊళ్లు కూడా ఉన్నవి చరికొండ మాత్రం లేదు [2]

ధర్మన పేరును బట్టి చూడ అతడు ధర్మపురి వాడే అనవచ్చు అతని పూర్వీకులు చరికొండ సీమ నుండి వచ్చి ధర్మపురిలో స్థిరపడి ఉండవచ్చు చరికొండ అనేది ఈ కవి గృహనామం ధర్మన నివసించింది తన కావ్యాన్ని రచించినది ఈ ధర్మపురిలోనే

**కాలం** ధర్మన కాలం క్రీ శ 1560-1620 అని 'ఆంధ్రకవుల చరిత్ర'లో కందుకూరి వీరేశలింగం పంతులుగారు, 1480-1530 అని ఆంధ్రకవి తరంగిణి'లో చాగంటి శేషయ్యగారు పేర్కొన్నారు [3] ఆరుద్ర చేసిన కాలనిర్ణయం క్రీ శ 1510 ప్రాంతం

చరికొండ ధర్మన కవికి ఆశ్రయమిచ్చిన ఎనుములపల్లి పెద్దనామాత్యుడు ఓరుగంటి పాలకుడైన సీతాపతికి (చిత్తాపుఖాను బిరుదనామం) సామంత మండలాధీశుడు సీతాపతి రాజు మొదట ఖమ్మం మెట్టు పాలకుడై (1450-85) తన వీరత్వంతో ముస్లిం సేనలను ఓడించి 1903లో ఓరుగల్లును కూడా జయించాడు గజపతులకు సాయంగా నిలిచిఒక పర్యాయం విజయనగరాంధ్ర చక్రవర్తియైన శ్రీకృష్ణదేవరాయల సైన్యాలను సైతం ఎదిరించాడు 1512లో గోలకొండ కుతుబ్‌షాకు ఓడి పదవీచ్యుతుడైనాడు సీతాపతి ఓరుగల్లు పాలన 1503-12 కాబట్టి ఎనుములపల్లి పెద్దనామాత్యుని ధర్మపురి పాలన కాలం కూడా అదే పెద్దన రాజాస్థాన కవియైన చరికొండ ధర్మన కాలం కూడా అదే [4]

ధర్మన 15వ శతాబ్ది ఉత్తరార్థంలో జన్మించి, 16 వ శతాబ్ది ప్రథమ దశకంలో చిత్రభారత రచన కావించి ఉంటాడు ధర్మన జీవితకాలం సుమారుగా క్రీ శ 1470-1520 అనుకోవచ్చు

చిత్ర భారతం 1510లో విరచింపబడి ఉంటుంది

**కావ్య విశేషాలు** చిత్ర భారతం శ్రీకృష్ణార్జున యుద్ధకథా ప్రబంధం ఇందులో 8 ఆశ్వాసాల్లో 1304 గద్య పద్యాలున్నాయి తర్వాతి ప్రబంధాలలో వలె అష్టాదశ వర్ణనలున్నాయి కవి 'అలంకార సరణిమీర, రసములు చిప్పిల, మెచ్చులొలుక ఈ కావ్యాన్ని రచింప సంకల్పించినట్లు తన కావ్య పీఠికలో చెప్పుకున్నాడు చెప్పిన విధంగా రసవత్తరంగా కావ్య రచన కావించాడు

ధర్మన పూర్వకవి నుతి ఇట్లా సాగింది

"ఘను నన్నపార్యు, దిక్కన సోమయాజుల, వర్ణించి వేముల వాడ భీము
గీ నాచనా మాత్యు, సోము, శ్రీనాథు, చిమ్మపూడి యమరేశు, బమ్మెర పోతరాజు,
శంభుదాసు, హుళక్కి భాస్కరుడు నాదియైన సుకవుల నెల్ల నెయ్యమున నెరగి "[5]

సుకవుల స్తుతించాడే తప్ప కుకవుల నిందించలేదు

ఈ చిత్రభారత కావ్య మూల కథ 'బహ్మాండపురాణం లోనిదట

**కథా సంగ్రహం** తుల్యుడనే మునికి తపోభంగం కావించడానికి ఇంద్రుడు రంభను పంపిస్తాడు ఆమె ఇతర అచ్చరలతోపాటు ముని ఉన్న వనానికి చేరుకుంటుంది అప్పుడు వసంత ఋతువర్ణన, పుష్పాపచయం, జలకేళి మొ॥ వారి విలాసాల సందర్భోచిత వర్ణనలతో కథ సాగింది

నీనీ మోక్షము కోరి నేనురాగా, నీవీ మోక్షము కోరి ఏల తపంబొనరించెదవు? అంది యమకాలంకార సహితంగా ప్రణయ తమకంతో ముని సమక్షాన రంభ ఇంకా అందరాని ఆ అమృతాన్ని గూర్చి ఎందుకు ఆలోచిస్తావు? నా మోవిపై ఉన్న ఈ అమృతం చాలదా! అని ఊరించింది ఆ విచ్చలవిడి శృంగార ప్రసంగానికి కినిసి ముని, రంభను గుఱ్ఱానివి కమ్మని శపించాడు ఆమె వేడికోలుకు కరిగి చతుర్ధనుడనే రాజుచేత శాపనివృత్తి కలిగేలా అనుగ్రహించాడు ముని

ఆ రాజు అశ్వరూపంలో ఉన్న ఈ అప్సరోభామినిని గ్రహించడం, కారణాంతరములచే అతడు శ్రీకృష్ణుని కోపానికి గురికావడం, అతడు అర్జునుని శరణువేడుకోవడం, కృష్ణార్జునులకు యుద్ధం విధ్వంసం లేకుండా ముగింపు, ఈ విధంగా రమణీయంగా నడిచింది కథ మహాభారతంలో కృష్ణార్జునులు మంచి మిత్రులు, ఈ కావ్యంలో వారిద్దరికి శత్రుత్వం సంఘటిల్లింది కనుక, ఇది చిత్రభారతం!

తర్వాతి కాలంలో ఇటువంటి ఓ కథ 'డాంగేయో పాఖ్యానం' పేరుతో యక్షగాన నాటకంగా బహుళ ప్రచారం పొందింది గయోపాఖ్యానం[6] కృష్ణార్జునుల యుద్ధమే అయినా రంభ పాత్రలేదు, కలహకారణం వేరు శ్రీరామాంజనేయుద్ధం[7] కూడా అంతే వీటి అన్నింటికి మూలం ధర్మన చిత్ర భారతం!

**కవితా విశేషాలు** ధర్మన ప్రౌఢకవి అనడానికి చిత్రభారతంలోని పలుపద్యాలు భావాలు నిదర్శనంగా నిలుస్తాయి ముని శాపకారణంగా రంభ అశ్వంగా మారినదని ఎట్లా వర్ణించాడో కవి చూడండి

కం పదముల చొప్పును వడి యొ, ప్పిదము నలంకార లక్ష్మి పేర్మియు ధారా
స్పద భావము గల్గి శుభ, ప్రదమై హయమమరె సత్ప్రబంధము రీతిన్ చి భా 3 160

ఈ పద్యంలో మంచి అశ్వానికి మంచి కావ్యానికి, సరిపోయే విధంగా పదాలన్నీ శ్లేషలో కూర్చబడ్డాయి పదాలు, వడి వళి-యతి, అలంకారాలు, శైలి, భావం అన్ని చక్కగా అమరిన సత్కావ్యం వలె, పాదాలు, వడి-బలం లేదా సుడి, అలంకారాలు, ధారాస్పదభావం (అశ్వగతి భేదం) - వేగం, మొ॥ మంచి లక్షణాలతో ఆ హయం ఉందని భావం

నన్నెచోడుని కుమార సంభవంలో వలె ధర్మన యుద్ధాన్ని విపులంగా వర్ణించాడు అల్లసాని పెద్దన మనుచరిత్ర కంటె ముందే చిత్రభారతంలో వేటను 32 పద్యాల్లో వర్ణించాడు విజయనగరాంధ్ర ప్రబంధాలు ధర్మన చిత్ర భారతానికి - 1510, ఇంచుక తర్వాతి కాలపువి శ్రీకృష్ణ దేవరాయల పాలనా కాలం 1509-29 విజయ నగర ప్రబంధ కవులు ధర్మన కావ్యాన్ని చూసి ఉంటారనడానికి నిదర్శనంగా ముక్కు తిమ్మన పారిజాతాపహరణంలోని ఈ క్రింది పద్యం చూపవచ్చు

ఈనున బుట్టి డెందమున హెచ్చిన శోక దవానలంబుచే
గాసిలి యేడ్చె బ్రాణవిభు కట్టెదుటన్లలితాంగి పంకజ
శ్రీ సఖమైన మోమువయి జేల చెఱంగిడి బాలపల్లవ
గ్రాస కషాయకంఠ కలకంఠ వధూ కల కాకలీ ధ్వనిన్ (పారి, 1-133)

దీనికి మొదటి చిత్రభారతంలోని ధర్మన పద్యమిది

ఈసును కోపమున్ మది వహించి పులోమజ వేడిమూటకై
గాసిలి మేని సొమ్ముడిపి కన్నుల గ్రమ్మెడు నీట జందనం
బోసరిలంగ జేసి శిరమొయ్యన వంచి కపోల పాళిపై
జేసయ(?) కొల్పి యొక్కయెడ జింతిలు చుండెడు నంతలోపలన్ (చిత్రభా 1 81)

ఈ రెండూ సత్యభామ దు ఖాన్ని వర్ణించేవే సన్నివేశాలు వేరైనా పారిజాతాపహరణ కథా ఘట్టంలోనివే నారదుడిచ్చిన పారిజాత ప్రమూనాన్ని పతి తనకీయక సవతికిస్తే అసూయతో తిమ్మనగారి సత్యభామ అట్లా యేడ్చింది అమరావతి నందనవనంలో పారిజాతాపహరణ సందర్భంలో శచీదేవి చేసిన హేళనకు అవమానభారంతో ధర్మన గారి సత్య ఇట్లా వాపోయింది అంతే తేడా! ఈ రెండూ ఉత్పలమాల పద్యాలే సకార ప్రాస మాత్రమే కాక ఈసు, గాసిలి పదాలు రెంటిలోనూ ఉన్నాయి పైగా ధర్మన పద్యభావాన్ని నంది తిమ్మన ఒకే పద్యంలో వ్రాసి తృప్తిపడక, అదే కావ్యంలో అదే సందర్భంలో అదే సకార ప్రాసతో మరో ఉత్పలమాల పద్యాన్ని ‘వాసెన కట్టు గట్టి నిడువాలిన కస్తురి బొట్టు పెట్టి ’ అని కావ్యనాయికను ‘చీకటింటిలోని కంకటిపైకి’ పంపించాడు రామాయణ కైకలా!

ఇట్లా మహా ప్రబంధ కవులకే మార్గదర్శకుడై నడకలు నేర్పిన ధర్మన చిత్రభారతంలోని పద్యాలు ఓ నాలుగు కాకునూరి అప్పకవి తన లక్షణ గ్రంధంలో ఉదహరించాడు 8

చరికొండ ధర్మనకు పది ఇరవై యేండ్లు తర్వాతి వాడైన నాదెండ్ల గోపన ఈ చిత్ర భారత కథను ‘గయోపాఖ్యానము’ పేర ద్విపద కావ్యంగా రచించాడు 9 ఆ గోప మంత్రి తిమ్మరుసుకు మేనల్లుడు, శ్రీకృష్ణ దేవరాయల కాలంలో కొండవీటి దుర్గ పాలకుడు

భువన విజయ కవి దిగ్గజాలు ధర్మన కావ్యాన్ని చదివి అనుసరించింది ఎంత వరకు సత్యమో ఖచ్చితంగా నిర్ణయించజాలము కాని, వారికి ఓ పదేండ్లు ముందుగనే ఈ కవి ప్రబంధ వర్ణనలతో కమనీయాంధ్ర కావ్యంగా చిత్ర భారతాన్ని రచించిన ప్రతిభాశాలి అనటం మాత్రం నిజం

ధర్మనకు ఆశ్రయమిచ్చి ‘చిత్రభారత’ కృతిని అంకితం పొందిన ఎనుముల పల్లి పెద్దన మంత్రి కవిని ఇట్లా ప్రశంసించాడు చిత్ర భారత కావ్య పీఠికలోని 18వ పద్యం -

శత లేఖి న్యవధాన పద్యరచనా సంధా సురత్రాణ చి
హ్నిత నామా! చరికొండ ధర్మసుకవీ! నీ వాగ్విలాసంబులా
శితికంఠోజ్జ్వల జూటకోటర కుటీ శీతాంశు రేఖాసుధా
న్విత గంగా కనకాబ్జ నిర్భర రసా విర్భూత మాధుర్యముల్

ధర్మన మాటలు శివుని జడల ముడిలో ఒదిగిన చంద్రుని అమృతంకలిసిన మందాకినిలోని బంగారు తామరల మకరందం వంటి మాధుర్యం కలవట! మరి పద్యాలో, వాని శైలీ శిల్ప భావ సౌందర్యాలు అనుభవైక వేద్యాలు, అవి రస హృదయులకు షడ్రసోపేత నైవేద్యాలు హృద్య పద్య మహా కావ్యకవి నిరవద్య శేముషీ విభూషితుడు చరికొండ - ధర్మపురి ధర్మన!

**పాదపీఠికలు**

1 చరికొండ హొన్నయ్య, నృసింహకవి మహబూబ్‌నగర్ మండలం వారే
2 వి కేశవరావుగారు ‘ కరీంనగర్ మండల చరిత్ర’ 1981 చివర ఈ జిల్లా గ్రామనామాల పట్టిక ఇచ్చారు
3 పల్లాదుర్గయ్యగారి ‘ ప్రబంధవాఙ్మయ వికాసం’ నం 1, పుట-284
4 ఆరుద్ర ‘సమగ్రాంధ్ర సాహిత్యం’ నం 7 5 చిత్రభారతము పీఠిక 8వ పద్యం
6 ఈ శతాబ్ది పూర్వార్థంలోని చిలకమర్తి ‘గయోపాఖ్యానం’ కథ చిత్రభారతం లోనిదే
7 దీనిని పలువురు కవులు స్టేజినాటకంగా వ్రాశారు
8 ‘చిత్రభారతం’లోని 0-16, 1-12, 2-80, 8-94 పద్యాలు వరుసగా ‘అప్పకవీయం’లో 2-276, 2-170, 2-228, 3-65 గా ఉన్నాయి
9 ఆరుద్ర ‘సమగ్రాంధ్ర సాహిత్యం’ స 7, పుట - 175

## అనుశ్రుత కవులు - అలబ్ధ సాహిత్యం

ఈ మండల కవులుగా చెప్పబడుతున్నా కొందరు కవుల జన్మస్థల కాల విషయాల్లో అనుమానాలు

విభిన్నాభిప్రాయాలున్నవి వీరిలో కొందరి రచనల పేర్లు వినటమే తప్ప ఆకావ్యాల ప్రతులు లభించలేదు అటువంటి కవుల కావ్యాల వివరాలు అందినంతమేరకు ఈ విభాగంలో వరుసగా చూపబడుతున్నవి

## 1 వేములవాడ భీమకవి - వేముల వాడ, 12వ శతాబ్ది

ఉద్గ్రంథ రచనా ధురీణుడుగా, ఉద్దండ కవితా సంపన్నుడుగా భీమకవి పేరు విశేష వ్యాప్తిలో ఉంది ఇతడు శాపానుగ్రహ సమర్థుడని ప్రతీతి కాని, భీమన జన్మస్థలం, కాలం, రచనలు అన్నీ ఇప్పటికీ వివాదగ్రస్తంగానే ఉన్నాయి భీమకవి రచనలుగా చెప్పబడుతున్న గ్రంధాలుఇవి[1] -

1 కవి జనాశ్రయము (ఛందోగ్రంధము), 2 రాఘవ పాండవీయము (ద్వ్యర్థి కావ్యము) 3 హరవిలాసము (?), 4 నృసింహ పురాణము 5 శతకంఠ (కంధర) రామాయణము[2] 6 జ్యోతిశ్శాస్త్రము 7 బసవ పురాణము (కన్నడము), 8 చాటు పద్యములు

ఇందులో 'కవి జనాశ్రయము' మాత్రం లభ్యం అది రేచన రచనగావిమర్శకుల అభిప్రాయం [3] "కవి జనాశ్రయము దప్ప నీతని యితర గ్రంథము లేవియు నింత వరకు లభింపలేదు అదియు మల్లియ రేచడు రచించి నటులున్నది" అని శేషాద్రిరమణ కవులన్నారు [4]

చాటు పద్యములు, లక్షణ కర్తలు చూపిన కొన్ని పద్యాల కారణంగా భీమనపై కావ్యాలు రచించినట్లుగా వానిపేర్లు మాత్రం తెలుస్తున్నవి ఈ కవి సంపూర్ణ కృతులేవీ లభించలేదు కన్నడ బసవ పురాణం ఉన్నా అది ఈ భీమకవి రచన కాదు ఆ వివరాలు తర్వాత చూపబడుతాయి

భీమనను పొగడిన పూర్వకవులు వీరు [5]

**శ్రీనాథ మహాకవి (1380-1450)**

సీ వచియింతు వేములవాడ భీమన భంగి, ఉద్దండ లీల నొక్కొక్క మాటు,

**కొరవి గోపరాజు (1430-1490)**

కం వేముల వాడక సుఖియై, వేములవాడం జరించి వేములవాడన్
దామెరిసిన భీముని నుత, భీముని బల భీము విమత భీముదలంతున్

**ఆంధ్రకవి రామయ్య (1450)**

సీ ఛందోనిబంధన చాతురీ ధౌరేయు, వాగ్ధాము వేములవాడ భీము [6]

**వెల్లంకి తాతం భట్టు (1480-1520)**

"భీమన అఖండంబు మొదలైన కొన్ని వళులకు లక్షణ లక్ష్యంబులు చెప్పడు" -

"ప్రజ్ఞాలవ దుర్విదగ్ధులసంగతంబుగా బెనచి తగిలించినా, రతని యంకితంబులు లేవు గావున వానినిం బ్రమాణింప దగదు " - కవి చింతామణి

**మొల్ల (1500-1550)** రామాయణము "స్తుత గుణోద్ధాము నాచన సోము భీము"

**చరికొండ ధర్మన (1510)**

"ఘను నన్న పార్యు దిక్కన సోమయాజుల, వర్ణించి వేములవాడ భీము
నాచనా మాత్యు సోము శ్రీనాథు "[7]

**పింగళి సూరన (1550)**

ఉ॥ భీమన తొల్లి చెప్పెనను పెద్దల మాటయె కాని, యందునుం
దేమియు నేయెడన్నిలు చుటెవ్వరు గానరు -" (రాఘవ పాండవీయము)

**పెదపాటి సోమనాథుడు (1500)** "వాక్ప్రదోషిత, దక్షవాటీ మహాస్థాన భీము "

**చిత్ర కవి పెద్దన (1550)** "త్ర్యక్షవర ప్రసాదకవితాఢ్యుని వేములవాడ భీమునిన్'

**లింగము గుంట తిమ్మకవి (1550) సులక్షణసారము**

గీ॥ భీమనయు ననంతనయును బెద్దనయును, తాతనయు జెప్పినట్టి ఛందములు గూర్చి
ప్రకరణములొప్ప జేసెను బ్రహ్మ సంఖ్య, నొనర లింగమగుంట తిమ్మన యను కవి

**కాకునూరి అప్పకవి (1650) అప్పకవీయము**

ఆ వె॥ వికట కవులు కొన్ని వింతలు గల్పించి, కవి జనాశ్రయమున కలిపి నారు
వాని గైకొనంగ వలదప్రయుక్తంబు, లేల సెప్ప భీముడెరిగి యెరిగి?

**పట్టపు సరస్వతి సోమయాజి (1670)**

కం భీమేశ్వరు డీతడు మా నామము వాడనుచు వ్రాసె నాలుకతుద వా
గ్భామిని బీజాక్షర మా, భీమన దలచినను గలవభీష్టఫలంబుల్ (పృథు చరిత్రము)

**ఓరుగంటి రామయకవి (1710)** "వ॥ భీమేశ్వర లబ్ధ కవితా వాచా సిద్ధిగల వేములవాడ
భీమనార్యుడొనరించిన కవిజనాశ్రయంబను ఛందంబు ' (కవితా లక్షణ సారం)

**కూచిమంచితిమ్మకవి (1715)** భీమనదని (కవిజనాశ్రయంలోని) పది యతుల పద్యం వ్రాసుకొన్నాడు

**కస్తూరి రంగ కవి (1750** "వ॥ ఆదిమ కవి భీమన రేచన మీద నంకితంబుగా జెప్పినాడు"

**కట్టమూరి కామేశ్వర కవి (?)** "రమణీయ పాకాభిరాము భీము"

భీమనను మొట్టమొదట పేర్కొన్నది కాశీఖండము (పీఠికలోని 13వ పద్యం)లో శ్రీనాథకవి ఆ తర్వాతనే పలువురు కవులు, లక్షణ కర్తలు, తమ కావ్యాల పూర్వకవి స్తుతుల్లో భీమనను చేర్చడం జరిగింది పై కవులు భీమనను భీము, వేములవాడ భీము అని పేర్కొనగా ఒక్క సోమనాథుడు మాత్రం 'దక్షవాటీ మహాస్థాన భీము'డన్నాడు కొరవి గోపరాజు భీమనకు చాల విశేషణాలు వాడినాడు అదే కాలపు అనంతుడు 'కవిజనాశ్రయం' లోని సూత్రాలు వాడుకొన్నా భీమన పేరెత్త లేదు వెల్లంకి తాతంభట్టు భీమనను మొట్టమొదట లక్షణకర్తగా పేర్కొన్నాడు పింగళి సూరన వరకే భీమన రచనల గురించి పెద్దల వలన వినటమే తప్ప అవి లేవు

శ్రీనాథుడు భీమన వలె గొప్పగా కవిత్వం చెప్పుతానని మాత్రమే అన్నాడు కాని, ఆయన కావ్యాల ఊసులేదు నిజానికి భీమకవి ప్రసక్తి శ్రీనాథునితో అల్లయ వేమ భూపతి తెచ్చాడు కాశీఖండంలో

రాను రాను కవులు భీమన మహిమలనూ వర్ణించారు కాకు నూరి అప్పకవి (1650) నన్నయ (1050)కు భీమనను సమకాలికునిచేసి వారి మధ్య వైరాన్ని పెంచి కథ అల్లాడు [8] అప్పకవికి తర్వాతి వాడయిన కస్తూరి రంగకవి (1750) భీమన కవిజనాశ్రయాన్ని రేచనకు అంకితంగా చెప్పాడన్నాడు ఈ పూర్వకవి స్తుతుల వలన భీమకవి శ్రీనాథునికి పూర్వుడు, ఆయన వేములవాడ దక్షవాటివాడు, అని మాత్రం తెలుస్తున్నది

**భీమకవి కాలం** భీమన రచనలను పట్టి చూస్తే, 'రాఘవ పాండవీయము' అనే ద్వ్యర్థి కావ్యం రావటానికి ముందే తెలుగులో కావ్యరచన పరిపుష్టినొంది ఉండాలి [9] కావున భీమన రాఘవ పాండవీయ ద్వ్యర్థి కావ్య రచన చేసి వుంటే నన్నయకు పూర్వుడు కాజాలడు

భీమన భారతాన్ని నన్నయ్య, నన్నయ ఆంధ్ర శబ్ద చింతామణిని భీమన గోదావరిలో కలిపారని 'అప్పకవి' చెప్పిన అప్పకవీయ అవతారికలోని కథను పండితులు అంగీకరించరు ఆ యిద్దరు మహాకవులు అసూయాగ్రస్తులనటం తగనిది

'నృసింహ పురాణం'[10] భీమన కృతి అంటే ఆయన తిక్కన శిష్యుడైన మారనకు కొంత వెనుకోముందో ఉండాలి మారన మార్కండేయ పురాణమే ఆంధ్రీకృత ప్రథమ పురాణంగా పండితులు పరిగణించారు అది 13వ, శతాబ్ది రచన

'శతకంఠ రామాయణం భీమనదైతే అంతకు పూర్వం దశకంఠ రామాయణం వచ్చి ఉండాలి

ఎందుకంటే రామాయణ యుద్ధకాండలోని మైరావణ కల్పిత కథే శతకంఠ రామాయణము, తాత భాస్కరుడు పూర్వ రామాయణం వ్రాసిన తర్వాతనే తిక్కన ఉత్తర రామాయణం రచించాడు అట్లే రామాయణం రానిదే మైరావణ కథ రాదు కదా తెలుగులో భాస్కర మంత్రి, గోనబుద్ధారెడ్డి, హుళక్కి భాస్కరుడు వరుసగా 12, 13,14 శతాబ్దులలో రామాయణ కర్తలు మొల్ల రామాయణం 16వ శతాబ్దానిది

కన్నడ భాషలో 'బసవ పురాణము భీమన రచిస్తే ఆయన సోమనాధునికి తర్వాతి వాడు కావాలి కన్నడ బసవపురాణము పాల్కురికి సోమన కృతికి అనువాదము సోమనది కాకతి రుద్రదేవుని కాలం 12వ, శతాబ్ది, కన్నడ బ పు కర్త, భీమన కాలం 1369 గా నికరంగా తెలుస్తున్నది [11] ఆ కావ్యంలో కవి స్వయంగా శా శ 1291లో రచన కావించానన్నాడు

రచనల ఆధారంగా భీమకవి కాల నిర్ణయం చేయడం కష్టం

సాహిత్య చరిత్రకారుల అభిప్రాయాలు కూడా భిన్నంగా ఉన్నాయి అప్పకవి భీమనను నన్నయ కాలం 1950 వాడంటే, కందుకూరి వీరేశలింగం పంతులుగారు కవుల చరిత్ర'లో భీమనను 1340-50 ప్రాంత కవిగా పేర్కొన్నారు ఉభయుల సిద్ధాంతాల మధ్య తేడా 300 సంవత్సరాలు

భీమన చెప్పిన చాటు పద్యములలోని వ్యక్తులు వీరు [12]

తెలుగు రాయడు, కళింగ గంగు, చొక్కనాధుడు, మైలను భీముడు, సాహిణిమారడు వీరందరూ 11, 12 శతాబ్దాల మధ్య కాలంవారు

భీమన చెప్పినదని వ్యాప్తిలో ఉన్న 'ఘడియలోపల' సీస పద్యంలోని తిట్టుకవులైన మేధావి భట్టు, కవి మల్లు, కవి భానుడు, బడబానల భట్టు 14వ, శతాబ్ది తర్వాతి వారు భీమకవి అంతటి అర్వాచీనుడు కాజాలడు ఆ పద్యం ప్రక్షిప్త మనుకోవాలి

రాజ కళింగ గంగును శపించిన, శాపాన్ని ఉపసంహరించిన పద్యాలు ఇవి -

"వేములవాడ భీమకవి, వేగమ చూచి కళింగగంగుతా
సామముమాని కోపమున సందడి దీరిన రమ్ముపొమ్మనెన్
మోమును జూడ దోషమిక ముప్పది రెండు దినంబులావలన్
జామున కర్థమందతని సంపద శత్రుల జేరు గావుతన్"

"వేయి గజంబులుండ పదివేల తురంగములుండ నాజిలో
రాయల గెల్చి సజ్జ నగరంబున బట్టముకట్టుకోవడిన్
రాయ కళింగ గంగ! కవి రాజు భయంకర మూర్తి తిట్టు దా
బోయిన మీన మాసమున బున్నమ పోయిన షష్టినాటికిన్"

చొక్కనాధుని పందిరి కంబాన్ని చెట్టుగా మార్చిన పద్యాలు

"ఆనీతాభ్యుపదాన శృంఖల పదాభ్యాలంబిత స్తంభమా
నేనే వేములవాడ భీమకవి నేనిం జిత్ర కూటంబులో
భూన వ్యాపిత పల్లవోత్భవ మహా పుష్పోప గుచ్ఛంబులన్
నానా పక్వఫల ప్రదాయివగుమా యాకల్ప వృక్షాకృతిన్"

"శంభువర ప్రసాద కవి సంఘవరేణ్యుడనైన నా వచో
గుంభన చేయనెంతొ యను కూలత నొందితనూన భావనన్
గుంభిని జొక్కనామ నృపకుంజరు పందిటి మల్లె సాలకున్
స్తంభము రీతి నీతనువు దాలిచి యెప్పటి యట్ల యుండుమా!"

సాహిణి మారని తిట్టిన పద్యం-

"చక్కదనంబు దీవి యగు సాహిణి మారడు మారుకైవడిన్
జొక్కి పడంగలందు చలమున్ బలమున్ గల యీ చళుక్యపుం
జొక్క నృపాలు డుగ్రుడయి చూడ్కుల మంటలు రాలజూచినన్
మిక్కిలి రాజశేఖరుని మీదికి వచ్చిన రిత్తబోవునే "

ఈ మాయలు గారడీల అద్భుతాలు నిజమని విశ్వసించలేం ఇక మిగిలినవి తెలుగురాయలు, మైలమ భీమునిపై చెప్పిన పద్యాలు

"ఘనుడన్ వేముల వాడ వంశజుడ, ద్రా(ద)క్షారామ భీమేశ నం
దనుడన్, దివ్యవిషామృత ప్రకట నానా కావ్య ధుర్యుండ, భీ
మన నాపేరు, వినంగ జెప్పితి, దెలుంగాధీశ! కస్తూరికా
ఘన సారాది సుగంధ వస్తువులు వేగం దెచ్చి లాలింపురా!"

ఈ పద్యమందలి అభిమానంతోనే కాబోలు శ్రీనాధుడు ఇట్లాంటిదే మరో చాటువు చెప్పాడు అది ఇది

"అక్షయ్యంబుగ సాంపరాయని తెలుంగాధీశ! కస్తూరికా
భిక్షాదానము చేయురా సుకవి రాడ్బృందారక శ్రేణికిన్,
ద్రా(ద)క్షారామ పురీ విహార వర గంధర్వాప్సరో భామినీ
వక్షోజద్వయకుంభి కుంభములపై వాసించు దద్వాసనల్"

తెలుంగురాయ, దాక్షారామ, కస్తూరికా పదాలు రెండు పద్యాల్లోనూ ఉండడం, ఆ ఇద్దరు కవులూ మడులో మాన్యములోకాక సుగంధ ద్రవ్యాల దాన మడుగుతూ రాజులనే 'రా' కొట్టడం గమనార్హం పైగా మత్తేభ శార్దూల పద్యాల నడక ఒక్కటి కాని, ఈ పద్యాల్లోని తెలుగు రాజులు ఎవరో చెప్పలేం ఇద్దరు వేర్వేరు వ్యక్తులు ఆంధ్ర దేశంలో తెలుగు రాయళ్లు అనేకులు భీమన రచనగా ఏ పద్యాన్ని అనుమానించినా మైలమ భీముని 'ఖడ్గ సృష్టిని గూర్చిన పద్యాన్ని మాత్రం అనుమానించలేం అది ఇది

'గరళపు ముద్దలోహ, మవగాఢ మహాశనికోట్లు సమ్మెటల్,
హరునయనాగ్ని కొల్మి, యురగాధిపు కోరలు పట్టుకార్లు, ది
క్కరటి శిరంబు దాయ, లయకారుడు కమ్మరి, వైరి వీరసం
హరణ గుణాభిరాముడగు మైలమ భీమన ఖడ్గ సృష్టికిన్ " (అప్పకవీయం 3-77)

"రామునమోఘ బాణమును, రాజ శిఖామణి కంటిమంటయున్,
దామర చూలి వ్రాతయును, దారకవిద్విషు ఘోర శక్తియున్,
భీమగదా విజృంభణ, మహేంద్రుని చక్రము, వజ్రివజ్రమున్,
వేములవాడ భీమకవి వీరుని తిట్టును రిత్త పోవునే"[13]

పైగా అదే మైలమ భీముని మృతికి విచారిస్తూ భీమకవి చెప్పిన [14] వృత్త పద్యాలు 14 శైలీ భావస్ఫూర్తిని బట్టి భీమకవివని అంగీకరించక తప్పదు

ఈ మైలమ భీముని ఏరువ భీముడని భావించి భీమకవి కాలం (1100-1180) అని, నిడుదవోలు వేంకటరావుగారు నిర్ణయం చేశారు[15] కాని, మైలమ భీముని కాలం క్రీ శ 1121 గా ఆరుద్రగారు సహేతుక నిర్ణయం కావించారు [16]

ఏవిధంగా చూసినా భీమకవి నన్నయ తిక్కనలకు నడిమి కాలంవాడు అది క్రీ శ 1100-1160 కి నడిమి కాలం అప్పుడు కాకతి రుద్రదేవుడు ఆంధ్రదేశ చక్రవర్తి

**జన్మస్థల సమాలోచన** భీమకవి కాలంకంటె జన్మస్థల విషయంలోనే పెద్ద వివాదం ఉంది

భీమన వేములవాడ భీమకవి పేరుతో ప్రసిద్ధుడు వేములవాడ అనే పదం కవి ఇంటిపేరు గ్రామనామం ఏదైనా కావచ్చు వేములవాడలు ఆంధ్రప్రదేశ్‌లో రెండున్నాయి తూర్పు గోదావరి జిల్లా రామచంద్రపురం తాలూకాలో ఒకటి కరీంనగర్ జిల్లాలోని సిరిసిల్లా తాలూకాలో ఒకటి కోస్తాది సామాన్యగ్రామం - తెలంగాణాలోనిది సుప్రసిద్ధ జైన-శైవ యాత్రా స్థలం

కందుకూరి వీరేశలింగం పంతులు గారు భీమకవిది గోదావరి మండలంలోని వేములవాడ అంటే, జయంతి రామయ్య పంతులుగారు కరీంనగర్‌లోని వేములవాడ అన్నారు [17] విజ్ఞానాంధ్ర కోశంలో పి వి కుటుంబరావు గారు కందుకూరిని బలపరిస్తే, నిజాం రాష్ట్ర ప్రశంసలో శేషాద్రి రమణకవులు జయంతి వారి వాదాన్ని ఆమోదించారు [18] డా॥ దివాకర్ల వేంకటావధాని గారు అటో ఇటో తేల్చ లేదు [19] ఆరుద్ర 'సమగ్రాంధ్ర సాహిత్యం' లో కవి కాలచర్చ, సాహితీ సమీక్ష సాగించారే తప్ప స్థలనిర్ణయానికి పూనుకోలేదు [20] డా॥ సంగనభట్ల నరసయ్య ధర్మపురి గారు విజ్ఞానసర్వస్వము 3వ, సంపుటిలో భీమన "జీవిత సత్యాంశములు భావికాల పరిశోధనలో తేలగలవేమో" అన్నారు[21]

"కరీంనగర్ మండల చరిత్ర' 1981లో ఈ జిల్లావారైన గట్టిపల్లి సత్యనారాయణ రాజు, కవిగణపతి రామచంద్రరావు, బోయినపల్లి వేంకట రామారావు గారలు భీమకవిది కరీంనగర్ జిల్లాగా పేర్కొన్నారు కాని వారు మరే వివరాలు ఇవ్వలేదు

"వేములవాడ చరిత్ర" పుస్తక రచయిత చొప్పకట్ల చంద్రమౌళి గారు భీమకవిది కరీంనగర్ వేములవాడని 'వేములవాడను వెలసిన ' అనే కవిజనాశ్రయ పద్యం 'వేములవాడక శుచియై ' అను కొరవి గోపన పద్యాన్ని, ఇంకా వేములవాడ భీమ భళిరే కవిశేఖర, అనుచాటువును తమ వాదానికి ఆధారాలుగా చూపించారు [22]

భీమకవి శాపం కథ 'అప్పాలు కప్పలైన పాట'కు నిదర్శనంగా ఈ వేములవాడలో అప్పాల వారున్నారంటారు ఈ ప్రాంతంలో అప్పాల వారేకాదు రొట్టెవారు, పప్పువారు అని కూడా గృహనామాలుగల విప్రులున్నారు అతీంద్రియశక్తుల బలపరచు కథలు కల్పనలు, పైగా భీమన ప్రౌఢ పద్యకవి, గేయకవి కాదు ఎరబాటి బాపురావు గారు తమ 'రామగిరి చరిత్ర'లో 'హయమది సీత పోత వసుధాధిపుడారయ రావణుండు[23] అను చాటువులోని ప్రదేశాలను వ్యక్తులను రామగిరి ప్రాంతానికి అన్వయించి భీమనది ఇదే ప్రాంతమన్నారు [24]

కరీంనగర్ జిల్లా రచయితలందరూ శేషాద్రిరమణ కవుల నిర్ణయంపై ఆధారపడినవారు వారు "లేములవాడను వెలసిన భీమేశ్వర కరుణగల్గు భీమ కవిని" అనుపద్యము వలన, నీకవి భీమేశ్వరాలయము గల లేములవాడ నివాసియని నిర్ణయింపవీలు గలిగినది" అన్నారు [25] కాని వారే అదే పుటలో "కవిజనాశ్రయము దప్ప నీతని యితర గ్రంథములేవియు నింతవరకు లభించలేదు అదియు మల్లియరేచడు రచించి నట్లున్నది" అని అన్నారు

కవి జనాశ్రయం భీమన రచన కానప్పుడు భీమన స్థల నిర్ణయానికి శేషాద్రిరమణకవులు ఆధారపడిన పై పద్యం నిలువదు కదా ఎందుకంటే కవిజనాశ్రయ కర్త భీమన అని నిరూపించుటకు పుట్టిన పద్యాల లోనిది ఆ పద్యం చూడండి

వేముల వాడను వెలసిన, భీమేశ్వర కరుణ గల్గు భీమ సుకవినే
కోమటి రేచన మీదను, నీ మహి కవులెన్న ఛంద మెలిమి రచింతున్
నిను నీవె పొగడు వైఖరి, నొనరించెద దెలుగు బాస నొప్పగ ఛందం
బును గనక కవిత చెప్పిన వినవే లచ్చనము వాడు వెంగలి రేచా!

ఆంధ్ర సాహిత్య పరిషత్ప్రచురణ కవిజనాశ్రయప్రతిలో ఈ పద్యాలు అవతారికలో ఉన్నాయి

కవిగా భీమన పేరు వేశారు కాని, వావిళ్ళ ప్రతిలో పై పద్యాలు లేవు రేచన కృత పద్యాలైదు మాత్రమే దీని అవతారికలో ఉన్నాయి

పరహిత చరితుడు జినేంద్రపద భక్తి మెయిన్ (2వ, పద్యం)

పరగిన విమల యశోభా, సుర చరితుడు భీమనాగ్ర సుతు డఖిల కళా
పరిణతుడును సద్భాసుర, వర ప్రసాదోదిత ధ్రువ శ్రీయుతుడై (3)

అనమాన దాన రవి తన, య సమమనోన్నతుడు వాచకాభరణుడు ప్రా
ణ సమాన మిత్రుడీ కృతికి సహాయుడుగా సుదాత్త కీర్తి ప్రీతిన్ (4)

అనవద్య కావ్యలక్షణ, మొనరంగా గవి జనాశ్రయుడు మల్లియరే
చన సుకవి జనాశ్రయ, మను ఛందము తెలుగు బాస నరుదుగ జెప్పెన్ (5)

అని రేచన రచనగా స్పష్టంగా ఉంది కావ్యం చివర రేచన తన కవి జనాశ్రయమును జయదేవఛందం ఆధారంగా వ్రాశానని చెప్పాడు

ఈ కావ్యంలోని దశ పరిచ్ఛేదాల చివరి గద్యల్లోనూ 'ఇది శ్రీవాదీంద్ర చూడామణి చరణ సరసీరుహ మధుకరాయమాన కవి జనాశ్రయ శ్రావకాభరణ విరచితంబైన కవి జనాశ్రయంబను ఛందంబునందు" అనే ఉంది భీమన ఛందోగ్రంథం పేర ఏదైనా ఉండేదో తెలియదు పై పద్యాలలో భీమన అగ్రసుతుడైన వాచకాభరణుడు మల్లియరేచనకు కవిజనాశ్రయ రచనలో సహకరించాడని తెలుస్తున్నది భీమన సుతుడు అనే పదం మారి భీమన పేరు వ్యాప్తిలోనికి వచ్చిందేమో!

జైనుడు వైశ్యుడు అయిన రేచనను లక్షణ గ్రంధకర్తగా అంగీకరింపనొల్లక నాటి పండితులు, వైదికుడు బ్రాహ్మణుడు అయిన భీమకవికి కవిజనాశ్రయ కర్తృత్వాన్ని అంటగట్టారని ఆరుద్ర భావం గ్రంథస్థ సమాచారం మాత్రం రేచన కర్తృత్వాన్ని బలపరుస్తున్నది

అయినప్పుడు 'వేముల వాడను' 'నినునీవెపొగడు' పద్యాలు ప్రక్షిప్తాలనక తప్పదు దానితో శేషాద్రి రమణ కవుల వాదం నిలువదు వేములవాడ భీమ భళిరే కవి శేఖర - పద్యంలో లేములవాడ అని ఆరంభిస్తేనే యతి పొసగుతుందని మరోవాదం కాని ర - ల, అభేదయతిని అప్పకవి అంగీకరించడు పైగా ఈ పద్యం ఏకాలానిదో

భీమకవి పేర్కొన్న తెలుగు రాజు రామగిరివాడని మరో వాదం మడికి సింగనకు ఆశ్రయమిచ్చిన ముప్ప భూపతి తండ్రి తెలుగు రాజు కాని అతడు రామగిరిని పాలించినట్లు ఆధారంలేదు ఈ తెలుగు నృపతి శాసనం ఒకటి 1335 త్రిపురాంతకంలో లభించింది అతని తండ్రి ముప్పభూపతి ప్రతాపరుద్రుని సేనా నాయకుడని నెల్లూరు శాసనం 1314 తెల్పుతున్నది తెలుగు రాజు అన్న రుద్రదేవుని శాసనం ద్రాక్షారామంలో లభించింది వారు కోస్తా పాలకులు [26] కాపయ నాయకుని కాలంలోనే ముప్పయ రామగిరి పాలకుడుగా వచ్చాడు ఈ తెలుగు రాజు కాలం కూడా భీమనకవి కాలానికి సరిపోదు అంతరం వందేండ్లు

ఈ జిల్లా మంథని తాలూకా ప్రతాపగిరి కోట కట్టించిన ముచ్చనాయకునికి కూడా తెలుగు రాయల బిరుదమున్నది [27] కాని అది ఇంకా తర్వాతి కాలపుది

కొరవి గోపన 'సింహాసనద్వాత్రింశిక'లో పొగడినది, భీమన అను బిరుదనామం కల తన తాత కొరవి సత్యనారననే కాని ఈ భీమకవిని కాదని ఆరుద్ర అభిప్రాయం

భీమకవి స్థల నిర్ణయానికి ప్రధానాధారం 'ఘనుడన్' అనే కవి చాటువు

"ఘనుడన్ వేములవాడ వంశజుడ దక్షారామ భీమేశనందనుడన్" అని కవి చెప్పుకున్నాడు

అతని వంశనామం వేములవాడ అదే స్వగ్రామం కూడానేమో అతడు మాత్రం దాక్షారామ

భీమేశ్వరుని వర ప్రసాది వేములవాడ భీమేశనందనుడు కాదు! వేములవాడ ప్రధానదైవం రాజేశ్వరుడు దాక్షారామ ప్రధాన దైవం భీమేశ్వరుడు ఈ వేములవాడ రాజేశ్వరాలయం కల్యాణి చాళుక్యుల కాలపు నిర్మాణం దాక్షారామ భీమేశ్వరాలయం అంతకు పూర్వపు వేంగి చాళుక్యులది

పై పద్యంలోనిది దక్షారామం, గోదావరి జిల్లాది దాక్షారామం అనీ వాదించే పండితులు సైతమున్నారు దక్షవాటి కరీంనగర్ వేములవాడకే మారు పేరని భవిష్యోత్తర పురాణంలోని 'రాజేశ్వర మహాత్మ్యం'లోని "రాజేశ్వర సమాశ్లిష్య దక్షవాట్యాం ప్రవర్తతే" అను వాక్యం ఉపపత్తిగా కొందరిచే చూపబడుతున్నది [28] కాని, దక్షవాటి, దక్షపురి, దక్షారామం, దాక్షారామం, ద్రాక్షారామం, మొ॥ పలురూపాలను శ్రీనాథుడు 'భీమేశ్వర పురాణ' కాశీఖండ' కావ్యాల్లో అభేదంగా ప్రయోగించాడు

పై పద్యంలో దక్షారామ లేదా దాక్షారామ పద ప్రయోగం కవి ప్రధానోద్దేశ్యం కాబట్టి, దాన్ని యతి స్థానంలో నిలిపి, ఘనుడన్ అని ఆరంభించాడు అది అతని రాజసానికి తగిన విశేషణమే దాక్షారామ శబ్దం ఒక్క కందంలో, విరిచి వాడితే సీసంలో తప్ప, మరే ప్రసిద్ధ తెలుగు పద్యంలోనూ ఇముడదు దక్షవాటి పదాన్ని ఏ పద్యంలోనైనా సులభంగా ప్రయోగింపవచ్చు

అయినా పై పురాణం వేములవాడనే దక్షవాటిక అన్నది జన ప్రచారంలో ఉన్న భీమకవి జన్మకథ ప్రకారం వేములవాడ దక్షారామం వేరు గ్రామాలు [29] ఈ వేములవాడ సమీపంలో దక్షవాటి నగరం ఉండేదని డా॥ సంగనభట్ల నరసయ్యగారు విజ్ఞాన సర్వస్వంలో అనటం అసంగతం

ఇక్కడి వేములవాడ వ్యక్తి అక్కడి దాక్షారామ వర ప్రసాది కాగూడదా? ఇక్కడి వ్యక్తి ఆ ప్రాంతానికి పోగూడదా? అనే ప్రశ్నలూ వస్తాయి కాని మరో ముఖ్య విషయమేమంటే -

కరీంనగర్ వేములవాడ పూర్వనామం లేములవాడ కాకతీయుల శాసనాలు ఈ క్షేత్రంలో లేవు కాని, వారికి పూర్వపు స్థానిక - కల్యాణి చాళుక్య సంస్కృత కన్నడ శాసనాలన్నింటిలో లేంబుల వాటిక, లేంబుళ్లవాడ, లేంబ్లవాడ అనే పదాలే ఉన్నాయి [30]

వేములవాడ పదం శ్రీనాథునికి - 14వ, శతాబ్దికి పూర్వం ఇక్కడి ఏ శాసనంలోనూ కావ్యంలోనూ లేదు వసు చరిత్ర వ్యాఖ్యాత సోమనాథుడు క్రీ శ 1650లో ఈ పట్టణాన్ని లేములవాడ అనే వ్యవహరించాడు ఈ శతాబ్ది మామిడిపల్లి సాంబశివ శర్మగారు తమ రాజేశ్వర సుప్రభాతంలో 'లేంబాళవాటిక విభో' అనే ప్రయోగించారు వేములవాడ నాగరికజన ప్రయోగంలోనే ఉంది జానపదులు ఎములాడ లేంలాడ అంటున్నారు ఈ లేములవాడకు వేములవాడ అనే పేరు ఎప్పటి నుండి రూఢిలోనికి వచ్చిందో తెలువదు ఇన్ని విధాల పరిశీలించి చూస్తే భీమకవి గోదావరి జిల్లా ప్రాంతమందలి వేములవాడ వాడే కావచ్చుననే వాదానికి బలమున్నది స్వభావాన్ని కవిత్వపటుత్వాన్ని చూసే కాక, సమీప గ్రామవాసి అనే భావం కూడా భీమనపై శ్రీనాథునికి అంత అభిమానం ఏర్పడడానికి హేతువు అనవచ్చు

ఆ కవి ఆశ్రయించిన చాటువులలోని వ్యక్తులు కూడా కోస్తా వారే కళింగ గంగుది బస్తరు జయపురం ప్రాంతం చొక్కనాథ కులోత్తుంగ చోళుడు వేంగి - కంచి పాలకుడు అతడు మొదటి కులోత్తుంగుడని చాగంటి - మూడవ రాజన్యుడని ఆరుద్ర అభిప్రాయ పడ్డారు సాహిణి మారడు ప్రతాపరుద్రుని కాలపువాడు కాక అంతకు పూర్వపు మరో వ్యక్తి అయి ఉండాలి 'వాండిమి నల్ల సిద్ధి' రాజుది నెల్లూరి సీమ భీమన అతిగా అభిమానించిన మైలమ భీమునిది కృష్ణా మండలం

రెండు ప్రాంతాల సాహిత్యాభిమానులు భీమకవిని తమ ప్రాంతపు వ్యక్తిగా అభిమానిస్తూ వాదిస్తున్నారు బి ఏ తెలుగు స్పెషల్ పార్యగంథం తెలుగు సాహిత్య చరిత్ర[31]లో భీమకవిది గోదావరి వేములవాడగనే పేర్కొన్నారు "ఆంధ్రప్రదేశ్" ఆగష్టు 1991 పుట 63లో భీమకవిది కరీంనగర్ వేములవాడ అన్నారు ఈ రెండు వాదాలలో దేనినీ నిరాక్షేపణీయంగా తృణీకరించలేం [32] స్థిర నిర్ణయానికి ఇంకా పరిశోధన కావాలి

"భీమకవి లేములవాడ నివాసియను పక్షమే బలవత్తరము ఈ వాదముతో జ రామయ్య మా రామకృష్ణకవి, వే ప్రభాకర శాస్త్రి, శేషాద్రి రమణ కవులు సిద్ధాంతములు గావించిరి కాన విశ్వసనీయము"[33] శేషాద్రిరమణ కవులు శేషాద్రి రమణకవుల నిర్ణయం ఎంతబలహీనమైనదో ఇంత వరకు చూపబడింది భీమనది కరీంనగర్ జిల్లా వేములవాడ - లేముల వాడ కాదనే వాదమేబలమైనదని ఈ చర్చవల్ల తెలుస్తున్నది

**భీమన రచనల వివరాలు** కవిజనాశ్రయము - ఇది మల్లియ రేచన కృతమనుటే సత్యాంశం

15వ శతాబ్ది వారైన ఆంధ్రకవి రామయ్య, వెల్లంకి తాతంభట్టు, భీమనను ఛందో గ్రంథరచయితగా పేర్కొన్నారు వారిద్దరికి కొంత ముందు కాలపు వాడైన అనంతుని లక్షణగ్రంథంలో భీమన పేరు లేనే లేదు 1650 అప్పకవికి నూరేండ్లు తర్వాతి వాడైన కస్తూరి రంగకవి 'భీమన రేచనపేర' ఆ కావ్యం చెప్పినాడన్నాడు ఇది కేవలం ప్రమాదం ప్రవాదం కావ్యంలోని అంశాలు రేచన కర్తృత్వాన్నే బలపరుస్తున్నవి

2 రాఘవ పాండవీయము- భీమన పై కృతి వ్రాసినాడని పెద్దల వలన పింగళిసూరన విన్నాడు ఆకృతిని చూడలేదు ఎట్లుంటుంది? అప్పకవి కథను బట్టి దాన్ని నన్నయ భట్టు గోదావరిలో కలిపేశాడు [34] అది అలభ్య ప్రతి-అబద్ధకృతి

3 హరవిలాసము కస్తూరి రంగకవి 'ఆనందరంగరాట్ఛందము'లో హరవిలాసము భీమనకవి కృతంగా పేర్కొని ఆకృతిలోనివని రెండు పద్యాలు ఉదహరించాడు "ఈభీమన వేములవాడ భీమనో కాదో స్పష్టంగా తెలియదు" [35]

4 నృసింహ పురాణము-ఈకృతి వేములవాడ భీమకవి కృతంగా ఆంధ్రప్రయోగ రత్నాకరంలోనూ, ఆనందరంగరాట్ఛందంలోనూ పేర్కొనబడింది ఈ కావ్యం లోనివిగా ప్రస్తుతానికి లభ్యమైన పద్యాలు తొమ్మిది (తె అ వా-పు 55)

నృసింహ పురాణం లోనిదిగా కస్తూరి రంగకవి పేర్కొన్న పద్యం ఇది -

కం మానవనాథుడు గంగా, స్నానానంతరము సకల దానములు మహా
దీనులగు విప్రకోటికి, సేనాదయతోడ నిచ్చె శివు సేవింపన్

ఆరుద్ర 'సేనాదయ' ను ఎందుకో తప్పు పట్టారు కాని, అది శిష్టసమాసం ఇంకా వారు రెండవ చరణంలో స్నద లకు యతి చెల్లదని తమిళంలోని 'సగరం-తగరం' సూత్రంతో సరిపెట్టారు కాని అది తద్భవ వ్యాజ విశ్రామం - ఒప్పు స్నానం=తానం

5 శతకంఠ రామాయణము - ఆంధ్రకౌముది అనే వ్యాకరణ గ్రంథంలో 'భీమకవి కృతే శతకంఠ రామాయణే ' అని ఉంది మూడు పద్యాలు మాత్రం లభ్యం (తె అ వా పు 109)

6 జ్యోతిశ్శాస్త్రము - "వేములవాడ భీమకవి కృతలకోటా ప్రశ్న శాస్త్రము " పేరుతో పండిత ఏలూరి శివరాం గారు గ్రంథకర్తగా ఒక చిరుపొత్తం ఉంది 36 అదే ఇది అనుకోవచ్చు మూలం సంస్కృతం, వ్యాఖ్యానం శివరాం గారిది

7 బసవ పురాణము - ఈకన్నడ కావ్యం పాల్కురికి సోమనాథుని ఆంధ్రకృతికి అనువాదం కన్నడ బసవ పురాణం భామినీషట్పది ఛందస్సులో వ్రాయబడిన పద్దెనిమిది ఆశ్వాసాల మహాకావ్యం దీనికర్త 'శివదేవ పుత్రుడైన భీమన' అనే ఆరాధ్య బ్రాహ్మణుడని 'కర్ణాటక కవి చరిత్ర'లో ఉంది కవి గృహనామం వేములవాడ అని లేదు ఆయన మన భీమకవి కాడు కన్నడ బసవ పురాణ రచన శా శ 1291 (+78 క్రీ శ 1369) అని ఆ కావ్యంలో ఉంది వేములవాడ భీమకవిది 14వ శతాబ్ది కాదు అతడు 12వ, శతాబ్దిలో జీవించినవాడు

ఇంకా 'క బ పురాణం' లోని ' సమయ వార్ధి వివర్ధ నోల్వజ హిమగు శివకవి దేవనాత్మజ సుమతి భీమ నుభయ కవిత్వ సమర్థను నురువడె'అను మాటను పట్టి కాబోలు, కూచి మంచి తిమ్మకవి 'సర్వలక్షణ సారసంగ్రహం'లో 'ఏరకుమీ కసుగాయలు' అను సుమతి శతక పద్యం భీమకవి కృతమన్నాడు కన్నడ భీమకవికి ముందు సుమతి విశేషణం ఉండటం గమనార్హం

8 చాటువులు-జనవ్యాప్తిలో ఉన్నవి, పరిశోధకులు సేకరించి ప్రచురించినవి, లక్షణకర్తలు ఉదహరించినవి భీమకవి పేరుతో ఉన్న చాటువులలో అన్ని కాక పోయినా, కొన్నయినా తప్పక వేములవాడ భీమకవి చెప్పినవని ఒప్పుకోక తప్పదు [37] మైలమ భీముని మరణసందర్భంలో వేములవాడ భీమకవి చెప్పిన పద్యాల్లో 3 కందాలు 11 వృత్తాలు ఉన్నాయి ఆ కవి కవన ప్రతిభా నిదర్శనకు వానిలో నుండి కేవలం మూడు పద్యాలు ఇచట చూపబడుచున్నవి [38]

యాచక శేఖరుండు సుగుణాంబుధి మైలమ భీముడీల్గినన్
జూచి వరించె రంభ, యెడ జొచ్చె దిలోత్తమ, వారి నిద్దరిన్
ద్రోచె ఘృతాచి, ముగ్గురకు దొడ్డడి కయ్యము పుట్టె, నంతలో
నాచుకు పోయె ముక్తి సతి, నవ్విరి యద్దశ జూచి నిర్జరుల్ (2)

నేరువు బ్రహ్మజేరె, నిజ నిర్మల తేజము సూర్యుజేరె, నా
కారము కాము జేరె, నధికంబగు లక్ష్మియనంతుజేరె గం,
భీరత వార్ధి జేరె, గల పెంపు కులాద్రుల జేరె, గీర్తి దా
నూఱట లేక త్రిమ్మరుచు నున్నది మైలమ భీము డీల్గినన్ (6)

భండన భీమ! నీ యెదుర బారక నిల్చిన శాత్రవుల్ బృహ
న్మండల పుండరీక పురనాక నివాసులు, నోర్చినన్ బృహ
న్మండల పుండరీక పురనాక నివాసులు, చచ్చినన్ బృహ
న్మండల పుండరీక పురనాక నివాసులు, చిత్రమిద్ధరన్! (11)

శాపానుగ్రహ పుటువు, రాపాడెడి కవులనెత్తి రంపం, భూపాల సభల పూజ్యుడు వేములవాడ భీమకవి![39]

**పాదపీఠికలు**

1 దివాకర్ల గారి "ఆంధ్రవాఙ్మయ చరిత్రము" పుట 25, శేషాద్రి రమణ కవుల 'నైజాము రాష్ట్ర ప్రశంస' పు 101

2 శత ఘంట రామాయణము, అని శేషాద్రి రమణకవులు "నైజాము రాష్ట్ర ప్రశంస"లో అన్నారు

3 ఆరుద్ర 'సమగ్రాంధ్ర సాహిత్యం' సం 1 4 నైజాము రాష్ట్ర ప్రశంస, పుట 101

5 ఆరుద్ర 'సమగ్రాంధ్ర సాహిత్యం' సం 1, పు - 210, 11, 12

6 ప్రబంధ రత్నావళి, పుట-124, పద్యం-422

7 శ్రీనాధుని నుండి శేషధర్మం లక్ష్మణకవి వరకు (1380-1850) దాదాపు 5 వందలేండ్లలోని 19 గురు కవుల భీమనను పేర్కొన్న వారిని గూర్చి చెప్పినా ఆరుద్రగారు ఈ ధర్మన పేరు చెప్పలేదు

8 అప్పకవీయము - అవతారికలోని కథ పద్యాలు, 3-42, 43

9 తెలుగులో భట్టుమూర్తి 'హరిశ్చంద్ర నలోపాఖ్యానము' పింగళి సూరన 'రాఘవ పాండవీయము' తొలి ద్వ్యర్థి కావ్యాలు అవి 16వ శతాబ్ది రచనలు

10 ఎఱ్ఱన 'నృసింహ పురాణము' 14వ శతాబ్ది

11 డా॥ జి ఎస్ మోహన్ 'తెలుగు కన్నడ బసవ పురాణములు - పరిశీలన' వ్యాసం 'తెలుగు' తె అకాడెమీ హైద్రాబాద్ వారి మాసపత్రిక, జనవరి- 1993 పుట 110

12 భీమనచాటు పద్యాలు అప్పకవీయము, సమగ్రాంధ్ర సాహిత్యం సం 1, నుండి తీసుకోబడినవి
13 పారాంతర పద్యం అప్పకవీయము - 3-89
బిసరుహగర్భు వ్రాతయును విష్ణుని చక్రము వజ్రి పజ్రమున్
దెసలను రామబాణము యుధిష్ఠిరు కోపము మౌనిశాపమున్
మసకపు పాముకాటును కుమారుని శక్తియు గాలు దండమున్
బశుపతి కంటి మంటలును బండిత వాక్యము రిత్తవోవునే?
14 చాటు పద్యమణి మంజరి పుటలు, 178-180
15 తెలుగు కవుల చరిత్ర, మద్రాసు వి వి ప్రచురణ, భారతి సం 26, సంచిక-3
16 ఆరుద్ర 'సమగ్రాంధ్ర సాహిత్యం' సం 1, పుట 209
17 'కరీంనగర్ జిల్లా రచయితల చరిత్ర' పుట 1 ముద్రణ 1981
18 'నైజాము రాష్ట్ర ప్రశంస' పుట 101 19 ఆంధ్ర వాఙ్మయ చరిత్రము - పు 25
20 సమగ్రాంధ్ర సాహిత్యం, సం 1, శీర్షిక 6 21 వి స 1988 ముద్రణ, పుట 426
22 వేములవాడ చరిత్ర - ము 1981, పు 18, 19
23 ఈ చాటువు నెల్లూరు తిరుమలయ్యదని అప్పకవి చెప్పినా, భీమన్నది అయి ఉండాలని ఆరుద్ర అన్నారు స ఆ సా సం 1, పుట 198
24 రామగిరి చరిత్ర ము 1988, పుట 19 25 నైజాము రాష్ట్ర ప్రశంస పు 101
26 డా॥ కె కుసుమాబాయి 'మడికి సింగన కవి' పుట 28
27 కరీంనగర్ జిల్లా శాసనాలు, నం 69 పుట 135
28 చొ చంద్రమౌళి 'వేములవాడ చరిత్ర' పుట 19
29 వేములవాడ విప్రుడైన సోమన కూతురు బాల వితంతువు ఆమె తండ్రి పోషణలో ఉండేది ఒకసారి యాత్రికులతో కలిసి ద్రాక్షారామం వెళ్ళింది తిరిగి వచ్చేసరికి గర్భిణి ఆమె పుత్రుడే భీమకవి భీమేశ్వర వర ప్రసాది ఆ అమాయకురాలు ఇతర స్త్రీలవలె తనకు సంతానం కావాలని దేవుని వేడుకోవడం వలన ఇంత జరిగిందని ఐతిహ్యం
సోమన భార్య వితంతువు ఆమె సంతానం భీమన, అని పై కథ మార్చి 'వే భీ కవి కృతల కోటా ప్రశ్న శాస్త్రము' పీరకలో ఏలూరి శివరాం గారు వ్రాశారు
30 Inscriptions of A P Karimnagar Dist 1974 p 1-60
31 తెలుగు అకాడమీ హైదరాబాదు ప్రచురణ - 1986 పుట 35
32 published by the commissioner of Information and Public relations Hyd 1
33 గోలకొండ కవుల సంచిక - పుట - 404 34 అప్పకవీయం, 1-90
35 డా॥ రవ్వా శ్రీహరి 'తెలుగులో అలబ్ధవాఙ్మయం" 1993, పు 129
36 లక్ష్మినారాయణ బుక్ డిపో రాజమండ్రి ప్రచురణ - 1988
37 ఈ వ్యాసంలో ఉదహరించిన చాటువులు, అప్పకవీయం, ఆంధ్రకవి తరంగణి సం 3, సమగ్రాంధ్ర సాహిత్యం సం 1 లోనివి
38 చాటుపద్యమణి మంజరి పు 178-186 39 భీమకవి చాటువు భావం

## 2 శరభాంక కవి - వేములవాడ, 14వ శతాబ్ది

శరభాంకుని రచనలు రెండుగా చెప్పబడుతున్నాయి కాని, ఒక్క శతకమే అతని కృతి
1 శరభాంక లింగ శతకము[1] 2 చెన్న బసవ పురాణము[2]

తన తల్లిదండ్రుల పేర్లు కానీ, కులగోత్రాదులను కానీ ఈ కవి చెప్పలేదు కాని, అతని వంశపు మరోకవి 'లింగదారణ చంద్రిక' ఆశ్వాసాంత గద్యలో తనను గూర్చి ఇట్లా చెప్పుకున్నాడు

'శ్రీమద్యజుశ్శాఖాపస్తంభ సూత్ర కౌశిక గోత్ర పవిత్రవాది వీరశైవ భక్త త్రయాంత ర్భూతాయ ప్రతాపరుద్ర పృధివీశ్వర సంస్థాన మంత్రి శేఖర శరభాంక వంశ సంభూతాయ"[3] దీనిని బట్టి ఈ కవి ఆరాధ్య బ్రాహ్మణుడు అని మాత్రం తెలుస్తున్నది

**స్థల నిర్ణయం:** శరభాంక కవిది వరంగల్లు అని గోలకొండ కవుల సంచికలోని నం 15 పూర్వ కవుల పరిచయాల్లో ఉంది ఇంకా "ఈయిన ప్రతాపరుద్రుని మంత్రి యని లింగధారణ చంద్రికలో గలదు వేములవాడ నుండి ఒకానొకరు మాకు ఈ కవి తమ వంశమునకు మూల పురుషుడని వ్రాసిరి" అని శేషాద్రి రమణ కవులు తెలిపారు [4]

వేములవాడ శివలింగమూర్తికి రాజేశ్వరుడనే తప్ప శరభాంకుడనే పేరు లేదు ఓరుగల్లు శివుడు - శంభుడు! శరభ పదం వీరశైవుల -శైవుల (జంగం, బలిజ, పెరిక, బుక్క, వైశ్యుల) పెళ్లి సందర్భాలలో ఖడ్గాలు అనబడే వీరకొలుపుల్లో వినిపించుతుంది శరభాంకుడని ఏ ప్రదేశంలోని శివుని పిలుస్తున్నారో తెలువదు ఇక్కడ కవి తన పేరుతో చేర్చి శివుని 'శరభాంకలింగమా' అని సంబోధించాడనుకోవాలి శరభాంక నామం కూడా కవి మారుపేరు కావచ్చు ఈ కవి ప్రతాపరుద్రుని కాలంలో ఉన్నవాడని ప్రతీతి

శివ దేవయ్య, శరభాంకుడు, మల్లికార్జున భట్టు, రంగనాథుండును మొదలగువారు ఇన్నూరును ప్రతాపరుద్ర చక్రవర్తి సమ్ముఖమునకు వచ్చుట ప్రతాప చరిత్ర'లో వర్ణింపబడినట్లు 'సిద్ధేశ్వర చరిత్ర' పీఠికలో ఖండవల్లి లక్ష్మిరంజనంగారు పేర్కొన్నారు [5] దీనికి మూల గ్రంధమైన ఏకామ్రనాధుని " ప్రతాపరుద్ర చరిత్రము"లో శరభాంకుని పేరు రెండు పర్యాయాలు వచ్చింది

1 కాకతి ప్రతాపరుద్రుని కొలువు కూటాన్ని వర్ణించే సందర్భాన "శివదేవయ్యయు శరభాంకుండును మల్లికార్జునుండును పాలకుర్తి సూరప్ప మొదలుగా గల ప్రధాని వర్గంబులతో ముచ్చటలాడు -"[6] విషయాల వర్ణించాడు

2 ఢిల్లీ సుల్తానునకు యుద్ధమునందోడి పట్టుబడి రామగిరి సమీపాన గోదావరీ తీరంలో సేనలతోపాటు విడిసి యున్న ప్రతాపరుద్రుని, ఏకశిలా నగర ప్రముఖులు ప్రభుత్యోద్యోగులు చూడ వెళ్ళారని, వారిలో "శివదేవయ్యయు శరభాంకుండును మల్లికార్జునుండును రంగనాథుండును మొదలుగా గలవారు" ఉన్నట్లు వర్ణితం [7]

వావిళ్ళవారి శతక సంపుటి పీఠికలో "శరభాంకుడు, శివదేవయ్య, విశ్వేశ్వర దేశికుల సోదరులనియు నీ ముచ్చురు ప్రతాపరుద్రుని మంత్రులనియు జెప్పుచున్నారు కాని, కాకతీయ సామ్రాజ్యమునకు సంబంధించిన చరిత్ర గ్రంధములందు మా చూచినంతలో శరభాంకుని పేరు కానరాదు "[8] అని పరిష్కర్తలన్నారు లింగధారణ చరిత్రను పట్టి శరభాంకునిది కౌశిక గోత్రం విశ్వేశ్వర దేశికులది శ్రీవత్స గోత్రం కాబట్టి వారు సోదరులు కారని శేషాద్రి రమణ కవులన్నారు [9] నిజానికి శివదేవయ్య, విశ్వేశ్వర శివదేశికులు ఇద్దరు కారు ఒకే వ్యక్తి రెండు పేర్లు!

శరభాంకుడు కాకతి ప్రతాపరుద్రుని ఆస్థానంలో ఉన్నట్లు ఖచ్చితంగా చెప్పలేం కాని, ఆ చక్రవర్తి ఢిల్లీ పాదుషాకు బందీ అయిన సందర్భంలో ఆరింట హకారాన్ని ఉంచి శరభాంకుడు ఒక పద్యం చెప్పాడని లింగమగుంట తిమ్మకవి 'సులక్షణ సారము' లో చూపాడు ఆచాటు పద్యమిది

ఉ చాపముగా నహార్యమును జక్రిని బాణము గాగ నారిగం
బాపదొరం బొనర్చి తలపం త్రిపురంబుల గాల్పవేమహో
ద్దీపతతీవ్రకోపమున దేవత లెల్ల నుతింప నాటి -
త్పాపపు డిల్లి మీద నెగబాపగదే శరభాంక లింగమా

ఈ కవిది ఓరుగల్లు ప్రాంతమో కరీంనగర్ మండలమో అయి ఉంటుంది ఈ జిల్లాలోని 16వ, శతాబ్ది కవులైన ఎడపాటి ఎఱ్ఱయ, రామగిరి(?) కూర్మపురాణ కర్త రాజలింగకవి కోరుట్ల గారలు శరభాంకుని తమ కావ్యాల్లో స్తుతించడం వలన కూడా ఈ కవి కరీంనగర్ జిల్లా వాడనుకోవచ్చు అందుకు గోలకొండ కవుల సంచిక సాక్ష్యం కూడా కొంత ఉంది

**కవికాలం** శరభాంక లింగ శతకములో 'కూడలి సంగమేశ్వర' ప్రసక్తి ఉంది [10] కూడలి బసవేశ్వరుడు 12వ, శతాబ్దివాడు ఈ కవిది 13వ, శతాబ్ది అని గోలకొండ కవుల సంచికలో ఉంది పుట 412

ఇతన్ని ప్రతాపరుద్రుని మంత్రిగా అనంతర కాల కవులు కొందరు పేర్కొన్నా అది నిజమనడానికి ఆధారంలేదు ఈ శతక పద్యాల భావాలను చూసినా వానిలో రాజమంత్రి రాజసం లేదు, చాపముగా - అనే చాటువు ప్రతాపరుద్రుని కాలపు విషయమైనా దానిని ఉదహరించిన తిమ్మకవి 1560 కాలంవాడు

శరభాంకుడు ప్రతాపరుద్రునికి 1323, లింగమగుంట తిమ్మకవికి 1560 మధ్యకాలంవాడు కావాలి శరభాంకుని నుతించిన ఎడపాటి ఎఱ్ఱాప్రెగడది కూడా తిమ్మకవి కాలమే కాబట్టి శరభాంకుడు 15వ, శతాబ్ది వాడు కావాలి కాని, కవి వాడిన భాషను బట్టి 14వ, శతాబ్ది కవిగా చాగంటి శేషయ్య గారు భావించారు

శరభాంకుని 14వ, శతాబ్ది ఉత్తరార్ధకవిగా పేర్కొనడం సముచితం

**రచనా విశేషాలు** శరభాంక లింగశతకము లోనివి అయిదు పద్యాలు మొట్ట మొదట వేటూరి ప్రభాకర శాస్త్రిగారు 'చాటు పద్యమణి మంజరి'లో ప్రచురించారు [11]

ఆ తర్వాత 'వావిళ్ల రామస్వామి అండ్ సన్స్ - మద్రాసు' వారు, శేషాద్రి రమణకవుల పీఠికతో 1928 'నీతి శతక సంపుటము'లో ఈ శతకాన్ని ముద్రించారు విద్వాన్ చిన్ని కృష్ణశర్మ గారి 'శతక వాఙ్మయ సర్వస్వము'లో ఈ శతకం లేదు

ఇది శతకమే అయినా వంద పద్యాలు లేవు లభించినవి 89 మాత్రమే మరో విశేషం ఏమంటే ఈ పద్యాలకు మకుట నియమం విధిగా పాటించినా పాదనియమం పాటించబడలేదు అయిదారు చరణాల పద్యాలు 60 మొదటి భాగం, నాలుగు పాదాల పద్యాలు 29 రెండవ భాగం కవిత్వం కూడా పూర్వభాగం కంటె ఉత్తర భాగమే ఉత్కృష్టంగా ఉందని పరిశీలకుల తలంపు

వ్యావహారిక పదాలను నాటి శతక కవులు స్వేచ్ఛగా వాడేవారు వ్యాకరణవేత్తలకు అవి తప్పులుగా కనిపించడం సహజం నిజానికి ఈ కవి రచన బాగుంది భావాలు సమకాలీనాలు భక్తి శైవం భావ ప్రకటనలో పదాల కూర్పులో కొంత సంయమనం పాటించి ఉంటే శిల్పరీత్యా ఈ కవిపద్యాలు మరీ రాణించేవి

వేమన, కవి చౌడప్పల పద్యాల భావాలను[12] తలపించే ఈ దానగుణ ప్రస్తుతి పద్యం చూడండి

వగచెడి దేహికైన పరవానికి నైనను నర్థికైననుం
దగిన ధనంబునైన నది దప్పిన నించుక నన్నమైన నుం
దెగువను దక్రమైన మఱిదీనత గల్గిన నంబలైనని
మ్మగు దయనివ్వలేని నరమాత్రులు చచ్చిన నున్న నొక్కటే
తగ నిహతాంగ జాత భవదండన యోశరభాంక లింగమా - 41

తక్రం = చల్ల, మజ్జిగ, అంగజాతుడైన మన్మథుని నిహతం కావించినవాడు శివుడని ప్రౌఢ ప్రయోగం భవుల లేదా భవాన్ని దండించేవాడు శివుడని కవి భావం [13]

అంధవిశ్వాసాలైన శకునాలనిట్లా ఖండించాడు

కలలకు జింతయేల, తనకడ్డము వచ్చిన పిల్లి కోసమై
యలమట యేల తుమ్మెనని యాపద యేల, యనేక కీడులే

దొలగక కంటి మంచు మది దోచక నిల్చి కృశింపనేలపో,
తెలియగలేరు మానవులు, తిక్కకు వేరొక మందు కల్గనా,
వెలయగ వ్రాయు బ్రహ్మ లిపి మిథ్యయె, యో శరభాంక లింగమా - 21

కందుకూరి వీరేశలింగం పంతులు గారు ముహూర్త జాతక ఫలాలను వేటూరి ప్రభాకర శాస్త్రిగారు శకున పరిగణనమునూ ఇట్లే నిరసించారు పామరులను ఈ విధంగా వెక్కిరించాడు కవి

ఈనె కపీశుడంట, యిక నింతకు బత్తుడు పుట్టడంటనో
స్నానము జేయునంట, మరి సందె జపంబులు వార్చునంటరో,
గానము1 జెప్పునంట మన గాలియు పారగ గూడదంటరో,
మానవుడీడు కాడ, మన మాతని2 కంటెను తక్కువైతిమా,
కాని యటంచ్రు మూర్ఖజన గణ్యులయా - శ 68

1 జ్ఞానమునకు గ్రామ్యపదం 2 అఖండవళి - మా ఆ వ్యావహారిక భాషను వాడినందుకు రామలింగేశ్వర కుక్కుటేశ్వర శతక కర్తలకు ఆ తర్వాతి కాలంలో భాషావిషయంగా మంచి పేరు వచ్చింది మధుర తంజావూరి యక్షగాన కవులు భాషను యథేచ్ఛగా వాడినా, కొన్ని వచన కావ్యాలో పదకృతుల్లో తప్ప, మన పండితకవులు పందొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్థం వరకు గాంధికానికే పట్టంకట్టారు 14వ శతాబ్దిలో శరభాంకుడు తన కవిత్వంలో క్వాచిత్కంగా నిందకైనా గ్రామ్యం వాడటం విశేషమే పద్యాల్లో ఇప్పటికీ గ్రాంధికమే ప్రయోగింపబడుతున్నది కదా! గ్రాంధికాంధ్ర భాషావాది అయిన అప్పకవి కూడా నిందా సందర్భాల్లో గ్రామ్యం వాడవచ్చునని మినహాయింపునిచ్చాడు [14] నిజానికి శరభాంకుని వంటి పూర్వకవుల ప్రయోగాలు లక్ష్యాలు వానిని చూసే అప్పకవి లక్షణం - సూత్రం పుట్టింది

తర్వాతి కాలపు 'పెమ్మయ సింగధీమణీ 'పద్యాల బోలిన ఈ కవి పద్యం ఇది

పెట్టక కీర్తిలేదు, వలపించక యింతికి నింపులేదు, తా
దిట్టక వాదులేదు, మరి ధీరత వైరుల సంగరంబులో
గొట్టక పేరు లేదు, కొడుకొక్కడులేక పరంబు లేదు, నా
పట్టపు రాజుకైన నిది పద్ధతి, శ్రీ శరభాంక - 60

ఈ శివకవి భక్తి యోగాన్ని ఇట్లా అభివర్ణించాడు

"వాలిన యింద్రియమ్ముల కవాటములన్నియు మూసి నెమ్మదిన్
దాళము బెట్టిలోని పరతత్త్వమహత్త్వ త్రికోణ మందిరా
లాలిత నాగకన్యను పలాలన జేసిన యోగిగాక వై
మాళపు వేషముల్ యముని మార్కొనునా శరభాంకలింగమా - 82

ఈ కవి పండితుడు, సదాచారి, యోగసాధకుడు

చెన్నబసవ పురాణం శరభాంకుడు రచించినట్లుగా కవి చరిత్రకారులెవరూ చెప్పలేదు ఆ పేరుతో గోపతి లింగకవి, పామనాధుడు[15] మొ॥ కవులు మాత్రం పద్యకావ్యాలు వ్రాశారు శరభాంకుడు 'చె బ పు' రచించినట్లుగా పేర్కొన్నా వారు 'కరీంనగరం మండల చరిత్ర'లో ఈ జిల్లా కవి గత్తిపల్లి సత్యనారాయణ గారు మాత్రమే వీరు 'గోలకొండ కవుల సంచిక' లోని శేషాద్రి రమణ కవుల పూర్వ కవి పరిచయ వివరాల చూసి పొరపడినట్లున్నారు అందిట్లున్నది ఆత్తలూరు విశ్వనాథ కవి పరిచయంలో "వీరి వంశమూల పురుషుడు శరభాంకుడు ఆత్తలూరి పాపకవి మొ॥ కవులు శరభాంకలింగశతకము చెన్నబసవ పురాణము కర్త"[16] అనుపై సంచికలోని అస్పష్టవాక్యార్థము

- శరభాంకుడు శ లిం శతకము, పాపకవి చెన్నబసవపురాణం వ్రాశారని కాని, గ స రాజు గారు శరభాంకుడే కావ్యద్వయకర్త అనటం పొరపాటు

శరభాంకుడు శరభాంకలింగ శతకాన్ని మాత్రమే రచించాడు చెన్నబసవ పురాణానికి శరభాంకునికి సంబంధంలేదు 'అరిది విలుకాడ వౌదువు శరభలింగ' అను మకుటంతో మరో తేటగీతి శతకం ఉంది కాని, అది శరభాంకుని రచన కాదు ఎవరిదో తెలియదు

శరభాంకుని శతకం భక్తులకే కాక సాహితీ పిపాసులకు కూడా పఠనయోగ్య కావ్యం

**పాద పీఠికలు**

1 వావిళ్ళవారి 'నీతిశతక సంపుటము' 1928, పు 175
2 గఱ్ఱెపల్లి సత్యనారాయణ రాజు 'కరీంనగర మండల చరిత్ర' 1981, పు-14
3 చాగంటివారి 'ఆంధ్రకవి తరంగిణి' సం 3, పు 197
4 గోలకొండ కవుల సంచిక, 1934, పుట 412
5 సిద్ధేశ్వర చరిత్రము పీఠిక, పుట 169 ఇది కాసె సర్వప్ప రచన
6 ప్రతాపరుద్రుని చరిత్రము సాహిత్య అకాడమీ ప్రచురణ 1984 పు 4
7 ప్రతాపరుద్రుని చరిత్రము పుట 64 8 ఆరుద్ర 'సమగ్రాంధ్ర సాహిత్యం సం 3
9 వావిళ్ళవారి 'నీతి శతక సంపుటము ' పీఠిక ము 1928
10 కూడలి సంగమేశ్వరుని గొల్చిన భక్తుని బంటు బంటులో - అని శ లిం శతకంలోని 59వ, పద్యపాదం 11 చాటు పద్య మణి మంజరి, మొదటి భాగం - పు 208, 209
12 పెట్టి పోయలేని - వేమన, దేవుడు దేవుండనగా - కవిచౌడప్ప
13 శివకవులు శైవులు కాని అన్యుల భవులనేవారు భవము అనగా జన్మ, భవదండనుడు జన్మరాహిత్యం చేసేవాడు
14 చులకగా గ్రామ జనములు పలుకు నట్టి, తెనుగు మాటలు గ్రామ్యంబులనగ బడియె వర్ణలోపంబు నొంది కావ్యముల జొరవు, పరుల దెగడెడుచో నొప్పు బాలదొంగ - అప్పకవీయుము, 1-123, వావిళ్ళప్రతి, ము 1970
15 డా॥ రవ్వాశ్రీహరి 'తెలుగులో అలబ్ధవాఙ్మయం' పుట - 38
16 గో క సంచిక - 1934, పు 355

## 3 ఎడపాటి ఎఱ్ఱయ - 16 17 శతాబ్దాలు రామగిరి

## 4 చుండి కాశయమంత్రి - దుండి (సుందిల్ల)

ఎడపాటి ఎఱ్ఱయ కవి రచనలు రెండు శృంగార ప్రబంధాలు

1 మలహణ చరిత్ర (ముద్రితం) 2 కుమార నైషధము (అలభ్యం)

మల్హణ చరిత్రమును శృంగార కావ్య మండలి మచిలీ పట్టణము వారు 1940లో ముద్రిస్తూ దీనిని 1937లో గంటి సూర్యనారాయణ శాస్త్రి గారు గ్రంధ సాతములతో ప్రచురించినట్లు తమ పీఠికలో తెలిపారు పు 4

కుమార నైషధము, ఎఱ్ఱయ రచనగా ప్రబంధ రత్నావళి (పెదపాటి జగన్నాధకవి సంకలనం) లో ఉంది మల్హణ చరిత్ర, కుమార నైషధం వీరి రచనలుగా డా పల్లా దుర్గయ్య గారు 'ప్రబంధ వాఙ్మయ వికాసము'లో పేర్కొన్నారు (సంపుటి - 1, పుట 284)

మలహణ చరిత్ర పీఠికలో పరిష్కర్త చోడవరపు జానకి రామయ్య బందరు గారు ఈ రెండు రచనలను పేర్కొన్నారు మల్హణ చరిత్రలో కుమార నైషధం ప్రసక్తి లేకపోవడానికి కారణం అది

కవి గారి మలికృతి కావడమే అని భావించారు మల్హణ చరిత్ర కంటే కుమార నైషధ కావ్య రచన ప్రౌఢంగా ఉండటం వారి వాదాన్ని బలపరుస్తున్నది

**స్థలకాల నిర్ణయాలు** ఎడపాటి ఎఱ్ఱయ్య గారి మల్హణ కావ్యాన్ని అంకితం పొందిన చుండి కాళయమంత్రి ఇట్లా సంబోధించాడు

పాటిగలట్టి మేటి యెడపాటి పురాధిప, యెఱ్ఱనార్యనీ సాటిగ జెప్పినట్టి కృతి సాటువయై విలసిల్లు గాకిటన్ మ చ పు 5

ప్రబంధరత్నావళిలో పెదపాటి జగన్నాధ కవి ఈ కవికి ఎఱపాటి ఎఱ్ఱనగా పేర్కొన్నాడు ఇంటి పేరు తప్పినదని 'తెలుగు అలబ్ధ సాహిత్యం' పుస్తకంలో డా రవ్వా శ్రీహరి గారు 'ఎడపాటి' అనే అన్నారు కానీ, చుండి కాళయ 'ఎడపాటి పురాధిప!' అన్నాడే తప్ప ఎడపాటి ఎఱ్ఱయ అని అనలేదు

పెద పాటి నివాసి ప్రబంధ రత్నావళి సంకలన కర్త జగ్గకవి సత్యాన్ని తెలిసి వచించి ఉండవచ్చునని జానకి రామయ్య గారు అభిప్రాయపడ్డారు పెదపాటిఎఱ్ఱయ ఎడపాటి గ్రామకరణంగా ఉండవచ్చుననే భావం సహేతుకంగా ఉంది పెదపాడు ఎలూరు సమీప గ్రామం కాళయమంత్రి అధికారం నెరపిన "చుండి యనునది నెల్లూరు మండలముక నందలి యొక చిన్న సంస్థానము" (మల్హణ చరిత్ర పీఠిక - పు 13)

కవి కాలాన్ని నిర్ణయం చేయటానికి అతని పూర్వ కవి సుతిలోని తెలుగు కవులను ఆధారంగా తీసుకోవచ్చు

వినుతులొనర్తు నాంధ్ర సుకవి ప్రభు నన్నయ భట్టు దిక్కయ, జ్వను శివదేవు భాస్కరుని జక్కన నాచన సోము సర్వదేవుని శరభాంకు వీరకవిధూర్జటి గేతన భట్టు భానునిన్

వీరిలో కాలాన్ని బట్టి కృష్ణదేవరాయల ప్రబంధ యుగంలోని ధూర్జటి కవి చివరి వాడు వేమకవి 'విశ్వదాభి రామ' శతక కర్త అవునోకాదో వీరకవి ఎవరో తెలువదు

ధూర్జటి కవి 16వ, శతాబ్దివాడు కవి కాల నిర్ణయానికి మరో ముఖ్యాధారం 'మలహణ చరిత్ర' ప్రబంధంలోనే ఉంది కాళయమంత్రి కావ్యాన్ని తనకంకితమిమ్మని కోరగా కవి ఈ విధంగా అన్నాడు

ఇట్టి మహా ప్రధాన పరమేశ్వర మూర్తివి గాన నీవు చే
పట్టితి మేలు చుండి పురపాలక కాళన మంత్రి చంద్రమున్
గట్టిగ గృష్ణరాయ జనకాంతున కీయకదాచినట్టి యా
గట్టిడి యైన యెఱ్ఱకవి రాజిత మల్హణ కావ్య కన్యకన్ పు 5

కృష్ణరాయలకీయక దాచి ఉంచుకొన్న తన కావ్యాన్ని ఇతనికి అంకితమిస్తానన్నాడు కవి ఈ కృష్ణరాయలు విజయనగర చక్రవర్తి కావచ్చునా?

"ఇందలి కృష్ణరాయ జనకాంతుడన నంద్యాల కృష్ణ విభుడని చెప్పవచ్చునేమో విచార్యము ఎట్లైనను ఇందలి చుండి కాళుడు పదునారవ శతాబ్దమునకు చెందినవాడు మాత్రము కాదు 17వ శతాబ్దమున నుండి యుండవచ్చును " (మ చ పీఠిక పు 13 )

పదహారవ శతాబ్ది చివరి పాదంలోనో పదిహేడవ శతాబ్ది పూర్వాపాదంలోనో ఎఱ్ఱయకవి ఈ కావ్యరచన చేసి ఉంటాడు పై సమాచారమును బట్టి ఎఱ్ఱయకవి కోస్తామండల సంబంధం కలవాడుగా నిర్ణయం కలుగకమానదు కాని - యరబాటి బాబురావు మంగపేట గారు తమ 'రామగిరి చరిత్ర'లో ఈ క్రింది విషయాలు పేర్కొన్నారు

క్రీ శ 1652 ప్రాంతంలో గోలకొండ ఇబ్రాహీం కుతుబ్‌షా పాలనలో ఎడపాటి నారాయణరావ్ గోలకొండలో ముఖ్యోద్యోగిగా ఉండి జగదేకరావు మొ॥ మహారాష్ట్రుల తిరుగుబాటును అణచివేసినందున పాదుషాచే రామగిరిదుర్గ సామంత పాలనాధికారాన్ని పొందాడు పు 32

"ఈ యడపాటి వంశీయుడైన ఎఱ్ఱాప్రగడ రామగిరి ప్రాంతోద్యోగి కవి కూడా వీరికి ఎడపాడను గ్రామనామమే వంశ నామముగా మారి నిలిచినది ఈ మండలోద్యోగిగా పనిచేస్తూ వీరికి బంధువైన కాళయమంత్రి ఢిల్లీ ప్రాంతము నుండి వచ్చిన వారగుట అతనికి ఢిల్లీవారను వాడుక నామమే గృహనామమై వంశనామమై నిలిచినది యీ కాళయమంత్రి రామగిరి కారు క్రోసులలోనే చుండి యను గ్రామములో నివాస మేర్పరచుకొని యుండెను చుండి గ్రామము మహ్మదీయుల యుచ్చారణలో చుండిల్ యని యను చుండినారు ఇప్పటికి కూడా మహ్మదీయులటులనే యందురు నేటికిన్ యట్టి చుండి 'చుండిల్ల'లో వారి వంశీయులే కావచ్చు ఢిల్లీ వారనువారు యలరారుచున్నారు" అని ఎఱ్ఱమంత్రి కాళయకు వ్రాసిన జాబుగా మల్హణ చరిత్ర ప్రథమాశ్వాసంలో కృతిపతి కావ్యాంకితం కోరిన శివభక్తి నిధిని, పాటి గలట్టి మలహరు భక్తులలోపల - అను మూడు పద్యాలను 'ఆంధ్ర కవి తరంగిణి' 9వ, సంపుటిలోనివిగా పేర్కొన్నారు (రామగిరి చరిత్ర 1982, పు 33, 34 )

దీన్ని బట్టి ఎఱ్ఱయ కాళయమంత్రులు తెలంగాణా కరీంనగర్ మండల రామగిరి ప్రాంత నివాసులనే భావించవలసి ఉంది కాని అంతకుముందుగా బాబురావు గారి వాదనలోని ఔచిత్యాన్ని పరిశీలించడం అవసరం

1 ఈ కీ శే బాబురావు మంగపేట గారిది ఎరపాటి గృహనామం ఎడపాటి ఎరపాటి అభేదాలు వీరిది రామగిరి పాలకుడైన నారాయణరావు గారి వంశం వీరి జ్ఞాతులు కవులు ఎరబాటి ఉమాపతిరావు వెన్నెంపల్లి, మరో కవి ఎరపాటి బాబురావు గంగారం గారలు ఎఱ్ఱయకవి తమకు తెలియదన్నారు

2 రామగిరి చరిత్ర రచయిత బాబురావు గారు 'ఆంధ్ర కవి తరంగిణి'ని చూశారు తప్ప 'మల్హణ చరిత్ర' కావ్యాన్ని చూడలేదు మచిలీ పట్టంప్రతిలో కవి నామం పెద్దపాటి ఎఱ్ఱయామాత్యుడ్డ అనే ఉన్నది

3 కాళయ మంత్రిని నెల్లూరు జిల్లా 'చుండి'గా సాహిత్యకారులు అభిప్రాయపడ్డారు రామగిరి మంథని ప్రాంతంలో సుందిల్ల ఉంది దానీ పాలకుడుగా కాళయ్య ఉందీ లేందీ చెప్పలేం ఉంటే ఏ కాలమనే చరిత్రక ఆధారాలు లేవు

4 సుందిల్ల ఉర్దూ ఉచ్చారణలో చుండిల్ కావచ్చు కాని చుండి కాదు ఉర్దూలో "ద" కారం వ్రాయడానికి 'దోయ్' అనే అక్షరం ఉంది హైదరాబాద్, సికిందరాబాద్ మొ॥ పదాల్లో ద, డ గా మారింది ఆంగ్ల భాషా ప్రభావంగానే హైదరాబాడ్ అనే కదా ఇంగ్లీషులో వ్రాయడం

5 సుందిల్లలోని నియోగులు ఢిల్లివారు అయితే, కాళయ్యమంత్రి చుండి' పాలకుడే తప్ప ఢిల్లీ గృహనామంగా మల్హణ చరిత్రలో లేదు

ఇట్లా చూస్తే ఎడబాటి ఎఱ్ఱయకవి రామగిరి వాడు అనలేం ఖచ్చితంగా కాదనలేం

**కావ్య విశేషాలు** 'మలహణ చరిత్ర' - పాల్కూరికి సోముని 'పండితారాధ్య చరిత్ర'లో శివభక్త కవి మలహణుని కథ ఈ మల్హణ చరిత్ర మూడు ఆశ్వాసాల ప్రబంధం

మల్హణుడు సంస్కృతకవి వేశ్యాలోలుడు అయినా శివభక్తి కారణంగా మోక్షాన్ని పొందిన కథ ఇది శ్రీనాథుని 'గుణనిధి'కథను పోలి ఉంటుంది ఈ మల్హణ కథను అనుకరించే వైష్ణవ భక్తితో విప్రనారాయణ కథ వచ్చి ఉంటుంది

మల్హణుని అటువంటి మరో వ్యక్తి శ్వేతుని కథ, పండితారాధ్య చరిత్ర నుండి గ్రహించి ఎఱ్ఱయ తన కావ్య రచన కావించాడు పేరుకే భక్తి కావ్యం కాని, ఇది అచ్చగా శృంగార ప్రబంధం కవి సంగీత, నాట్య, కామాది శాస్త్ర వైదుష్యం కలవాడు కవితా శైలి చక్కగా ఉంది సంస్కృత భాషా పరిజ్ఞానం అపారం విమర్శకులకు కొన్ని వ్యాకరణ సూత్ర విధేయాలు కానీ పదప్రయోగాలు కనిపించినా అవి తెలుగు సంధులకు సంబంధించినవి - గణనీయాలు కావు జన వ్యవహారంలో ఉన్న భాషలో రూప భేదాలు సహజం

ఎఱ్ఱయ మంత్రి కవనవైఖరికి ఒకటి రెండు ఉదాహరణలు -కృత్యాది పద్యం -

శ్రీలలితంబు అనునయ శిత గుణంబును జారుపాద రే
ఖా లనసంబు జన్నుగవ గట్టితనంబు నితంబ శోభయున్
బోలును గౌరి తండ్రి బడి బుట్టిన దంచు హసించు శంభుడే
వేళను జుండి కాళునకుక వేడుక నీవుత గామితార్థముల్

ఈ పద్యం మొదటి రెండు పాదాలు హిమవంతుఇకి పార్వతికి సరిపడే విధంగా శ్లేష సమకూర్చబడింది ఆ తార్వత,

"శ్రీరమణీ మనోహరు డ శేష సురస్తవ నీయమూర్తి శృం
గార రసాధి నాయకుడు కామినులం బదియాఱు వేలని
చ్ఛారతి నేలు కృష్ణు"చే కృతి స్వీకర్త రామయకాళనకు కవి శుభాలిప్పించాడు।

ఈ కవి పోతన భక్తి వర్ణను 'కమలాక్షు నర్పించు' ప్రహ్లాదపద్యాఇ్ను అనుసరిస్తూ ఎలా మార్చాడో చూడండి

సీ పటు మోహన స్ఫూర్తి పాలిండ్లు పాలిండ్లు - నుడురాజ వైభవ మోము మోము
పంకజంబుల తుది పదములు పదములు కొదమ తేటులకును గురులు గురులు
రసం స్పష్టం పాదాంత యమకాలు మనోహరం

పెద్దన గారి మను చరిత్ర 'కెలకులనున్న తంగెటి జున్ను' - ఇది
ముక్కంటి భక్తుల ముక్కంటి వెన్నిధి - చిత్తజువైరి సంజీవి కరణి
పురదైత్యలోక సంహరుడు సిద్ధరసంబు, బాల చంద్ర ధరుండు పరుసవేది

కథ ఏమైనా, వర్ణనలు ఎట్లున్నా, ఇందలి భాషాభావాలు నాటి సాంఘిక చరిత్రకు దర్పణాలు శయ్యా గృహ వర్ణన ఒక పద్యం చూడండి

సీ పగడంపు గంబాల పచ్చటోవరియును, అపరంజి కాళంజియలరు బాన్పు
బంగారు సకినెల పట్టెమంచంబును, వజ్రాల నును జాల వల్లికలును
కుంకుమ తలగడ గొజ్జంగి పూదెఱల్, తరమైన చంద్రకాంతపుగిండి
చౌశితి రతముల సవరణి మేల్కట్లు, దీపించు మాణిక్య దీప కళిక

గీ వాసగ కస్తురి చేది కప్పురపు సురటి, నిలువుటద్దంపు రత్నంపు నెత్తుపలక
తళుకు దంతపు బావలు కలికి చిలుక, గలిగి యొప్పారు చవిక లోపలికినపుడు

ఈ కవి 'కుమార నైషధం'2 శ్రీనాధుని శృంగారనైషధాన్ని అనుసరించింది పెద్దన శ్రీనాధుల పద్యాలను అనుసరించినా ఎఱ్ఱయ వారిని స్మరించకపోవడం గమనార్హం 3

ఒక మాట - "నవరస భావ బంధురంబుగా నొక్క ప్రబంధంబు రచియింపదలంచి యున్న సమయంబున'

ఓ దినం కొలువు కూటంలో కాళయ "మలహణు కథ నా పేరిట జెలువుగ నంకితము జేసి చెప్పగవలయున్" అన్నాడు అప్పుడు రాయభూపతి కీయక దాచిన ఈ కావ్యం కొనుమన్నాడు మొద్దటి ఇద్దరి సంభాషణల్లో రచనారంభమే కాలేదు చివరి మాటలో ఇది అంతకు ముందే విరచితమైందని తెలుస్తున్నది ఇది ఎట్లా పొసగుతుంది? ఏది ఏమైనా ఎఱ్ఱయామాత్యుడు

"శంభు జటాటవీ తట విశంకట సింధుతల ప్రఘుమంఘుమా
రంభ విజృంభిత ధ్వని ధురంధర భూరి తర ప్రబంధ వా
గ్గుంభుల నాత్మలో2 - తలచు శృంగార కవి

**పాదపీఠికలు**

1 కల్హణ, బిల్హన, జల్హనల పేర్లు తప్ప మల్హణకవి పేరు నేను చూసిన సంస్కృత సాహిత్య చరిత్రలలో లేదు
2 లభించిన పద్యాలు
3 ఈ కవి మల్ల కాళిదాస మయూర మాఘ దండి - సంస్కృత కవుల స్మరించిన పద్యం

## సాహితీ సమాలోకనం - 2

ఈ కరీంనగర్ జిల్లా వేయేండ్ల తెలుగు సాహిత్య చరిత్రలో ఇదే ప్రముఖ కాలం ఈ కాలంలోనే ప్రతిభ గల కవులు విలసిల్లి మహాకావ్యాలను వ్రాయగలిగారు తిరిగి ఇరువదవ శతాబ్దంలోనే ఇక్కడ ఆంధ్ర సాహిత్యం అందలమెక్కింది అదీ పూర్వార్ధంలో-ఉభయభాషా విశారదులైన పలువురు కవులున్నా అంతగా కావ్యాలు రచించలేదు ఉత్తరార్ధంలోనే వివిధ ప్రక్రియలలో అసంఖ్యాకంగా సత్తాగల పుస్తకాలు వచ్చాయి ఈ మధ్య కాలం 17-19 శతాబ్దాల్లో యక్షగానాలు శతకాలు వచ్చాయి కాని, కావ్యాలు చెప్పుకోదగినంతగా రాలేదు

కాకతీయ చక్రవర్తుల కాలం (రుద్రదేవుడు క్రీ శ 1150) నుండి ఈ జిల్లాలో తెలుగు వారి పరిపా లన ఆరంభమైంది వారి కాలంలో ఈ ప్రాంతంలో అసంఖ్యాకంగా శిల్ప కళాలంకృతాలైన ఆలయాలు నిర్మింపబడ్డాయి కాని ఎందుకో తెలుగు సాహిత్యం వృద్ధి పొందలేదు ఇక్కడి పండితులు ఈ చక్రవర్తుల వారి సామంతుల సన్మానాలు - అగ్రహారాలు అందుకొన్నట్లు శాసనాల వల్ల తెలుస్తున్నది కాని, ఒక్క తెలుగు కవి కానీ చరిత్ర కెక్కలేదు ఆ కాలంలోని ఈ ప్రాంతపు ఏ ఒక్క కావ్యం కానీ లభించలేదు - లేదు

కాకతీయుల అనంతరం 1325 తర్వాతనే 14వ, శతాబ్ది ఉత్తరార్ధంలో మడికి సింగనకవి రామగిరిలో నాలుగు మహా గ్రంథాల రచన కావించాడు 15వశతాబ్దిలో వెలిగందుల నారన పోతన భాగవతంలోని చివరి రెండు స్కంధాలను అనువదించాడు 16వ శతాబ్దారంభంలో చరికొండ ధర్మన ధర్మపురిలో చిత్రభారత కావ్య ప్రబంధాన్ని రచించాడు రాశికి పదులసంఖ్యలో లేకున్నా పదికాలాలపాటు నిలువగల విలువగల కావ్యాలు కరీంనగర్ జిల్లా ప్రాంతంలో ఈ కాలంలోనే వచ్చాయి

భీమ కవి, ఎఱ్ఱయ కవి జన్మ స్థలాదికాల గురించి ఇదువరకే చర్చించబడింది వారిని గురించి పరిశోధనలు జరుగవల్సి ఉంది వేములవాడ భీమకవి, ఎడపాటి ఎఱ్ఱయ్య కరీంనగర్ జిల్లావారు కారనే నా అభిప్రాయం సత్యనిరూపణకోసమే పై సమీక్ష సాగింది

ఈ కాలంలోని భాష స్థిర రూపాన్ని సంతరించుకుంది తెలుగు సాహిత్యాన్ని శాసించిన మహా భారత కవిత్రయం మడికి సింగనకు పూర్వులే అయినా, బాగవతం సింగనకు తర్వాతి కాలంలోనే రూపొందినది శ్రీనాథుని కంటె పూర్వుడు సింగన

దూపాటి వేంకట రమణా చార్యుల 'నైజాం రాష్ట్ర ప్రశంస' 1923, సురవరం ప్రతాపరెడ్డి గారి 'గోలకొండ కవుల సంచిక' - 1934, వచ్చేంత వరకు ఇక్కడికవుల పేర్ల వ్యాప్తి లేదు

ఇదే వ్యాసంలో తర్వాతి ప్రకరణంలో చూపబడిన పరాంకుశం గోపాలకృష్ణ కవి గారి శ్రీరంగ మహాత్మ్యం కావ్యాన్ని వ్రాసుకొన్న గఱ్ఱెపల్లి గ్రామ వాస్తవ్యులైన కందాడై అచార్యులు, ఆ ప్రతి చివర వ్రాసుకొని ఉంచుకున్న భాగవత ఏకాదశ స్కంధం చివర 'పోతన కృత' మనే వ్రాసుకున్నారు దీన్ని బట్టి వెలిగందుల నారయ మన జిల్లా వాడు అనే స్వస్థలాభిమానంతో కాకున్నా కనీసం సత్య దృష్టి తోనైనా, నారనను చేర్పక పోవడం విస్మరించడం నాటి ఈనాటి పండితుల ఉదాసీనవైఖరికి ఒక ప్రబల నిదర్శనం

కాకతీయుల కాపయనాయకుని అనంతరం 15వ, శతాబ్దిలో కొన్నేండ్లు రాచకొండ పద్మనాయకుల పాలన ఈ ప్రాంతంలో సాగినా కావ్య సృష్టి జరుగలేదు ఆ తర్వాత ముస్లింల పాలనలో స్వస్థాన వేష భాషా మత సంస్కృతులను సంరక్షించు కోవడంలోనే సతమతమై పోయిన ఆనాటి పండితులు ఆంధ్ర భాషా కావ్య రచనకు అంతగా పూనుకోలేదు జనం ఆదరించలేదు

కవులు, తరుణులు లతలు ఆశ్రయం లేనిదే పెంపొంద జాలవనే పూర్వోక్తిని ఈ మధ్య కాలం నిజమని నిరూపించింది

ఈ మండలంలో తెలుగు సాహిత్యం వికాసానికి 14-16 శతాబ్దాల మధ్య కాలం స్వర్ణయుగం!

# III. అనంతర కాల తెలుగు సాహిత్యం

## (17, 18 శతాబ్దులు)

పదిహేడు పద్దెనిమిది శతాబ్దులలో కరీంనగర్ జిల్లాలో వెలువడిన సాహిత్య పరిచయం ఈ అధ్యాయంలో చేయబడుతుంది

పదహారో శతాబ్దంలోనే తెలంగాణా పూర్తిగా ముస్లింల పాలనలోకి వెళ్ళింది గోలకొండ కుతుబ్‌షాహీ నవాబులచే నియుక్తులైన మండలాధిపతులు ప్రభుత్వాధికారులు ఈ ప్రాంతంలో పరిపాలన సాగించేవారు ఆ కాలంలో ఈ ప్రాంతంలో రాజులు కవులను పోషించుట పోయింది రాజులే లేరు కొందరు కవులు స్వేచ్ఛగా గ్రంథాలు రచించారు కొందరు వలసవెళ్ళి సాహిత్య పోషణ కలచోట గ్రంథరచన కావించి రాణించారు కొందరు స్థానిక హిందూ ప్రభుత్వాధికారుల ఆదరం వల్ల రచనలు చేశారు

ఈ రెండు వందలేండ్ల కాలంలో పట్టుమని పది మంది కవులైనా ఇక్కడ లేరు లెక్కకు చిక్కిన వారి సాహిత్యం కూడా అధిక భాగం లభించలేదు అది విదేశీయుల పరిపాలనా కాలం నూతన మత, పరభాషా ప్రభావాల ఆ అంధకార యుగంలో చిరు దివ్వెలుగానైనా కరీంనగర మండలంలో తెలుగు వెలుగులు విరజిమ్మిన కవులు వీరు

1 శేషప్ప - ధర్మపురి, 2 ముద్దుబాలం భట్టు - మంథని,

3 కుందావజ్జల గోపాలకృష్ణకవి ముల్కనూరు, 4 పరాంకుశం గోపాలకృష్ణయ్య

అనుశ్రుతకవులు - అలబ్ధ సాహిత్యం

1 రాజలింగ కవి కొరుట్ల, 2 సోమనాధుడు వేముల వాడ, 3 కోడూరి వేంకటాచలపతి కొరుట్ల, 4 అత్తలూరి పాపయ్య శాస్త్రి - వేములవాడ, 5 సముద్రాల రామానుజాచార్యులు - కోరుట్ల

### 1 శేషప్ప - ధర్మపురి, 1750

శేషప్ప అని వ్యవహారనామం కల శేషాచలదాసు కవి కరీంనగర్ జిల్లాలోని ధర్మపురి వాస్తవ్యుడు పద్దెనిమిదవ శతాబ్ది పూర్వార్ధంలో జీవించినవాడు ఇతని నరసింహ శతకం యావదాంధ్రదేశ వ్యాప్తి పొందినది ఈ కవి పేరు కవుల చరిత్రకెక్కింది

ఈ కవి మూడు శతకాలు ఒక్క యక్షగానం రచించాడు [1] శేషప్ప రచనలు ఇవి 1 నరసింహ శతకము, 2 నరహరి శతకము, 3 నృకేసరి శతకము, 4 ధర్మపురి రామాయణము (యక్షగానము) **స్థలము** కరీంనగర్ జిల్లాలోని ధర్మపురి, అనంతపురంలోని ధర్మవరం, తమిళదేశంలోని ధర్మపురి మూడు ప్రాంతాలను పరిశీలించి శేషప్ప 'కరీంనగర్ జిల్లా' ధర్మపురి వాస్తవ్యుడే అని విద్వాన్ చిన్నికృష్ణ శర్మగారు తమ 'శతక వాఙ్మయ సర్వస్వము'లో (పుట - 240) అభిప్రాయపడ్డారు 1 శేషాద్రి రమణ కవులు కూడా మడికి సింగన పద్మపురాణంలోని

అతులిత లీల గేశ సచివాగ్రణి ధర్మపురంబునందు నం
చితముగ, నన్నసత్రమిడి శ్రీనరసింహున కుత్సవంబులన్
సతత మహోపహారములు సల్పుచు రామగిరీంద్ర మందు సు
స్థితి గుడి కట్టి విష్ణుని బ్రతిష్ట యొనర్చె నుదాత్త సంపదన్

అనే పద్యాన్ని బట్టి "ఇందు పేర్కొనబడిన రామగిరియు నిజాము దేశములోని ధర్మపురి చెంతనే గలదు ధర్మపురి నృసింహ క్షేత్రము ప్రసిద్ధమైనదని ద్యోతక మగుచున్నది - ఇతర

స్థానములలో గల ధర్మపురికీ ప్రశస్తి కానరాదు' అని అంగీకరించారు, అని విద్వాన్ చిన్ని కృష్ణశర్మగారు వ్రాశారు (పుట - 204)

శేషాద్రి రమణ కవులలోని దూపాటి వేంకటరమణాచార్యులు 1940-50 ప్రాంతంలో కరీంనగరంలో ఉపాధ్యాయులుగా పనిచేసిన సందర్భంలో స్వయంగా ధర్మపురిని దర్శించినారు ఈ కాలంలో రచించిన తమ వ్యాసంలో శేషప్ప ఈ ధర్మపురివారని పేర్కొన్నారు[2]

దూర ప్రాంతీయులకు శేషప్ప జన్మస్థల విషయంలో సమాలోచన అవసరం కావచ్చును కాని, ఈ జిల్లా వారికి ఈ చర్చ ముంజేతి కంకణమును అద్దములో చూచుట' వంటిది శేషప్ప బంధువులు ఇప్పటికి ఈ ధర్మపురిలో ఉన్నారు ఈ విషయాలన్నీ, ధర్మపురి వారు ముద్రించిన శేషప్ప 'త్రిశతి' పుస్తక పీఠికల్లో ఉన్నాయి [3]

**కుల నిర్ణయం** విద్వాన్ దండేపల్లి వేంకట సుబ్బాశాస్త్రి గారిచే టీకా తాత్పర్యాలు వ్రాయబడిన నరసింహ శతక ముద్రిత ప్రతిలో[4] కవి జీవిత విశేషాలను ఇట్లా వ్రాశారు

"ఈ నరసింహ శతకము వ్రాసిన కవి నైజాం ప్రాంతములో ఉన్న ధర్మపురి నివాసి నందకులంవాడు ఇతని పేరు శేషప్ప కవి ఇతడు క్రీ శ 1800 సం కు పూర్వుడని, కొందరు చరిత్ర కారులూహించుచున్నారు కవిత్వము ఎంతయు మధురమైనది భాషాదోషములగు పడుచున్నవి బాలురకు నీతి కొఱకు, పెద్దలకు భక్తికి నిది యవశ్య పఠనీయము"

వారు ఏ ఆధారంతో కవిని యాదవ కులజునిగా భావించినారో తెలువదు

కలియుగ మందు విప్రుడను గాను, నృపాలుడ గాను మేటి వై
శ్యుల జత వాడగాను బలు శూద్రుడ గాను5 సమస్తమైన జా
తుల నొకరుండగాను భువి, దుర్దనుజాంతక! నీ పదాబ్జముల్
దలచెడి వారి దాసులకు దాసుడ ధర్మపురీ నృకేసరీ॥

అను శేషప్ప గారి 'నృకేసరి' శతక పద్యాన్ని ఉదహరించి విద్వాన్ చిన్నికృష్ణ శర్మ గారు "(నృసింహుని) పదాబ్జముల్ దలచెడి వారి దాసులకు దాసుడ" నని కవి హృదయము కావున నిస్సందేహముగా నతడు నాల్గవ వర్ణజుడే యని నిర్ణయ మగుచున్నది అగ్రవర్ణము వాడయిన, గోత్ర నామాదికములతో బాహాటముగా నేయమాత్య పదమునో, కవీంద్ర పదమునో తన పేరుతో గూడ చేర్చి, వ్రాసి కొనియుండువాడు పాండిత్యము, కవిత్వము తమ సొమ్మని భావించి, "శూద్ర మక్షర సంయుక్తం దూరత పరివర్జయే 'త్తని మిడిసి పడుచున్న యగ్రజాతి వారి హేళనకు జడిసి, కవి యిట్లు చెప్పుకొని యుండుననుట సహేతుకముగా దోచుచున్నది లేదా - ప్రకటించుకొనదగని కులములో వాడుగనైన నుండవచ్చును " అని వ్రాశారు [6] ఇవి కేవలం ఊహలు మాత్రమే

శేషప్ప కవి చాత్తాద వైష్ణవుడని ధర్మపురి వాస్తవ్యులైన శ్యామసుందర శాస్త్రిగారు 'ధర్మపురి - నాడు - నేడు' అనే గ్రంథంలో స్పష్టంగా తెలిపారు [7] శేషప్పది కాకుత్స్థవంశం భారద్వాజస గోత్రం, అని బంధువులు చెప్పారు [8]

**కాల చర్చ** ఈ కవి 17,18 శతాబ్దాలలో జీవించిన వ్యక్తిగా కవి చరిత్రకారులు పలురకాలుగా భావించారు ధర్మపురి వారు మాత్రం దాదాపు రెండు వందలేండ్లకు పూర్వుడన్నారు శేషప్ప పూజించిన సీతారామలక్ష్మణ విగ్రహాలు కూడా ఆ కవి వంశీయుల వద్ద ఉన్నవట [9] కాలం వ్రాసిలేదు

శేషప్ప శతకాలలోని ఆంతరంగిక సాక్ష్యాలను బట్టి చూడగా,ఈ కవి బమ్మెర పోతన భాగవత పద్యాలను నరసింహ శతకంలో, భక్త రామదాసు దాశరథి శతక పద్యాలను నృకేసరి శతకంలో అనుసరించాడు పోతరాజుకంటె రామదాసు అర్వాచీనుడు కాబట్టి శేషప్ప కవి రామ దాసుకంటె

ఇంచుక తర్వాతి కాలం వాడనటమే సమంజసం కవితా స్థాయిని శతక వ్యాప్తిని పట్టి చూసినా, శేషప్ప రామదాసును అనుసరించాడే తప్ప, రామదాసు శేషప్పను అనుకరించినట్లు తోపదు ఇంకా - నరసింహ శతకంలో శేషప్ప అని చెప్పుకున్న తన పేరును ఈ కవి నృకేసరి శతకంలో శేషాచలదాసు అని చెప్పుకోవడం, రామదాసు నామవ్యాప్తి ప్రభావంతోనే అనుకోవచ్చు మొదటి రెండు సీసపద్యశతకాలకు భిన్నంగా మూడవది వృత్త పద్యశతకం వ్రాయడం 'ధర్మపురీ నృకేసరీ' అనే మకుటం ఈ విషయాలన్ని బలపరచేవిగా ఉన్నాయి

చాగంటి శేషయ్య గారు కూడా రామదాసుకంటె శేషప్ప కొంత తరువాతి వాడనే అన్నారు

తానాషా పరిపాలనా కాలమే రామదాసు కాలం 1687లో మొగల్ పాదుషా ఔరంగాజేబు గోలకొండను జయించాడు రామదాసు 17వ, శతాబ్ది ఉత్తరార్ధంవాడు

శేషప్ప 18వ, శతాబ్ది పూర్వార్ధం వాడు కావాలి కాని, ఈ నృసింహ శతకంపై వేమన శతకం, కానుల పురుషోత్తమకవి ఆంధ్రనాయక శతకం, అడిదం సూరకవి రామలింగేశ్వర శతకం, లింగమగుంట తిమ్మకవి కుక్కుటేశ్వర శతకం పద్యాల ప్రభావం ఉందని పరిశీలకుల అభిప్రాయం పై శతకాలలోని భావాలు కొన్ని నరసింహ శతకంలో ఉన్నమాట నిజం అయితే ఆంధ్రనాయక శతకంలోని తురుష్కుల నింద కానీ కుక్కుటేశ్వర శతకంలోవలె పామరుల హేళన కానీ, శేషప్ప కృతిలో లేవు 'జలతారు కుల్లాయి' అనే ఒక్కమాట తప్ప ఉర్దూపదాలు లేవు శేషప్ప ఒక వేళ వారిని నిజంగా అనుసరించినాడన్నా ఈ శతక రచన పద్దెనిమిదవ శతాబ్దపు ఉత్తరార్ధపుది అవుతుంది తప్ప అంతకు దిగిరాదు

**కృతుల పరిచయం** తెలుగులో మొట్టమొదట 'శతక కవుల చరిత్రము' వ్రాసిన వంగూరి సుబ్బారావు గారు ఒక్క 'నరసింహ' శతకమునే శేషప్ప పేర తెలిపారు వావిళ్ళవారి భక్తి శతక సంపుటి మూడవ భాగంలో నృకేసరి శతకం కూడా పేర్కొనబడింది [10] దానిని శేషాద్రిరమణకవులు సంపాదించారన్నారు విద్వాన్ చిన్ని కృష్ణ శర్మ గారు కూడా 'శతక వాఙ్మయి సర్వసము'లో నరసింహ, నృకేసరి రెండు శతకాలనే సమీక్షించారు [11] వారికి నరహరి శతకం ఉన్నట్టు తెలియదేమో!

ధర్మపురి వారే తొలిసారిగా శేషప్పగారి మూడు శతకాలను ఒకే సంపుటముగా ముద్రించారు [12]

**నరసింహ శతకము** ఇది ఈ కవి కృతులలో మొదటిది సీస పద్య శతకం అఖిలాంధ్ర వ్యాప్తి పొందింది అచ్చు ప్రతులలో 100 పద్యాలుంటున్నాయి ముద్రిత ప్రతులలోలేని 16 పద్యాలు ఎం శ్యామసుందర శాస్త్రిగారు, శేషప్ప కవి కుటుంబీకుల వ్రాత ప్రతిలో కనుగొన్నారు అందులో ఒకటి కవి పరిచయ పద్యం శేషాచలదాసు పేరుతో ఉంది ముద్రిత ప్రతి శతకాంత పద్యం శేషప్ప పేరుతో ఉంది అది పోను 15 కొత్త పద్యాలతో ఈ నరసింహ శతకం 115 పద్యాలది అవుతుంది [13]

"భూషణ వికాస శ్రీధర్మ పురనివాస దుష్ట సంహార నరసింహ దురిత దూర!" అని దీని మకుటం "నరసింహ నీ దివ్యనామ మంత్రము చేత బలువైన రోగముల్ బాపవచ్చు" వంటి ఇందలి పద్యాలు భక్తులకు విద్యార్థులకు కంఠస్థం (నరసింహ నీ దివ్య నామ మహిమ చేత, అని పాఠాంతరం ) శేషప్ప విష్ణు భక్తితోపాటు సామాజిక నీతులు ఈ పద్యాల్లో కుప్పలు పోశాడు ఎడనెడ తన స్వభావాన్ని కూడా తెలుపుకున్నాడు ఆయన సాత్వికుడు

"గణయతి ప్రాస లక్షణము జూడగ లేదు, పంచ కావ్యశ్లోక పఠనలేదు,
అమరకాండ త్రయంబరసి చూడగలేదు, శాస్త్రీయ గ్రంథముల్ చదువ లేదు,
నీ కటాక్షంబున నేరచించెద గాని, ప్రజ్ఞనాయది గాదు ప్రస్తుతింప" (నరసింహ శతకం ప 2)

అని వినయంగా మనవి చేసుకున్నాడు తనకు పాండిత్యం లేదంటూనే సంస్కృత గ్రంథాల పరిచయాన్ని తెలుపుకున్నాడు యతి ప్రాసలు తెలియవంటూనే సలక్షణంగా ఛందోబద్ధపద్య శతక

రచన కావించాడు అయన ఈ జిల్లా వ్యావహారిక మాండలిక పదాలను స్వేచ్ఛగా ప్రయోగించాడు అవి వ్యాకర్తలకు తప్పులుగా కనిపించి ఉండవచ్చు పరిష్కర్తలు చేయిపెట్టకముందు పరకవుల[14] కవితలో వలె అతని కొన్ని పద్యాల్లో ఛందోభంగాలు ఉంటే ఉండవచ్చు

కవి విద్యావంతుడనడానికి మరో నిదర్శనం ఇదేశతకంలోని భావాలు

'నిన్ను బొగడ విద్య నేర్చితినే గాని కుక్షి నింపెడు కూటి కొఱకు కాదు'[15] తనకు ఐశ్వర్యము, సొమ్ములు, బలములు వలదట, "చయ్యన మోక్ష మిచ్చిన చాలు" నన్నాడు (5వ పద్యం) "ధరణిలో వారెంత దండి వార్తైనను నిన్ను గానని వారినే స్మరింప" (4) ఇట్లా హరిభక్తిని చాటుకున్నాడు ఇంకా భాగవతులతో స్నేహాన్ని కోరుకున్నాడు

"పసరంబు వంజైన పసుల కాపరి తప్పు, ప్రజలు దుర్జనులైన ప్రభుని తప్పు,
భార్య గయ్యాళైన బ్రాణనాధుని తప్పు, తనయుడు దుష్టైన తండ్రి తప్పు,
అశ్వంబు చెడుగైన నారోహకుని తప్పు, దంతి దుష్టయిన మావంతు తప్పు, (మావటి) -
ఇట్టి తప్పు లెఱుంగక యిచ్చవచ్చి, నటుల మెలగుదు రిప్పుడీ యవనిజనులు
భూషణ వికాస శ్రీధర్మపురి నివాస, దుష్ట సంహార నరసింహ దురిత దూర (12)

ఇందులోని సైన్య బలాలలో కాల్బలము, అశ్వాలు, ఏనుగులు మాత్రమే పేర్కొనబడ్డాయి కవి తన కాలపరిస్థితులను తన కావ్యంలో ప్రతిబింబింప జేస్తాడు కాబట్టి పురాణకాలం నాటి రధాలను వదలి వేశాడు ఈ కాలం నాటి ట్రక్కులు, స్టీమర్లు విమానాలు నాటి కవుల ఊహకు కూడా రానివి భర్తృహరి నీతి శ్లోకానికి అనువాదమైన "దానము భోగము నాశము పూనికతో మూడు గతులు భువి ధనమునకున్" అను ఏనుగు లక్ష్మణకవి నీతి పద్యానికి వన్నెలు దిద్దిన శేషప్ప పద్యం ఇది

సీ తల్లి గర్భము నుండి ధనము తేడెవ్వడు, వెళ్ళిపోయెడు నాడు వెంటరాదు,
లక్షాధికారైన లవణ మన్నమె కాని, మెఱుగు బంగారంబు మ్రింగబోడు,
విత్తమార్జన చేసి విఱ్ఱవీగుటె కాని, కూడ బెట్టిన సొమ్ము తోడరాదు,
పొందుగా మరుగైన భూమిలోపల బెట్టి, దాన ధర్మములేక దాచి దాచి,
గీ తుదకు దొంగలకిత్తురో దొరలకేనొ, తేనె జుంటీగ లీయవా తెరవరులకు ॥భూ॥ (15)

ఇందులో కవి ధన దాన నాశాలను వర్ణిస్తూ ధన భోగాలను నిరసించడం గమనార్హం వేమన ఆశను ఈగతో పోలిస్తే, ఈ కవి లోభత్వాన్ని తేనెటీగతో ఉపమించాడు జున్నుటీగ = జుంటీగ

ఈ శతకంలో పూర్వకవుల భావాలను తలపించే పద్యాలు కూడా ఉన్నాయి

'బ్రతికి నన్నాళ్లు నీ భజన తప్పదు కాని, మరణ కాలమునందు మరతు నేమొ" (19)

ఇది దాశరధి శతకంలోని భావం ఇంకా 'ప్రాణ ప్రయాణ సమయే' అని ముకుందమాలలోనూ ఈ భావంతో ఓ శ్లోకముంది[16] ఇదే భావం 'ఉత్తతోలుతిత్తి' అనే పద్యంగా వేమన శతకంలో 'పచ్చిచర్మపు తిత్తి పసలేదు దేహంబు," అని నరసింహ శతకం (50) పద్యం లోనూ ఉంది

'గడియల్ రెంటికొ మూటికో గడియకో కాదేని నేడెల్లియో" అనే ధూర్జటి కాళహస్తీశ్వర శతక పద్యభావం ఈ నరసింహశతకంలోని 20వ పద్యంలో ఉంది ఇలా

"పాంచ భౌతికము దుర్బలమైన కాయంబి, దెప్పుడు విడుచుటో యెఱుక లేదు"

పై సీస పాదంలోని చివరి పదాన్ని 'ఏ క్షణంబొ' అనీ కొందరు చదువుతున్నారు కాని, అది అర్థవంతం కాదు తాళ్ళపాక పెద తిరుమలాచార్యుని 'శ్రీవేంకటేశ్వర వచనములు' లోని భావానికి సన్నిహితమైన మరో పద్యం చూడండి

"ఇభరాజ వరద నిన్నెంత పిల్చినగాని, మాఱుపల్కవిదేమి మౌని తనమొ?" (22)

పోతన భాగవత పద్యాల అనుసరణ అధికం,

"ఇభకుంభముల మీది కెగిరెడి సింగంబు, ముట్టునే కురుచైన మూషకమును
నవచూత పత్రముల్ నమలుచున్న పికంబు గొరుకునే జిల్లేడు కొనలు నోట" (76)

ఇది "ప్రహ్లాద చరిత్ర" లోని ప్రసిద్ధ పద్యం "మందార మకరంద" సీసానికి అనుసరణం ఇంకా

"భువన రక్షక నిన్ను బొగడ నేరని నోరు, ప్రజ కగోచరమైన పాడు బొంద
సురవరార్చిత నిన్ను చూడగోరని కనుల్, జలము లోపలి నెల్లిసరపు గుండ్లు" (3)

నెల్లిసరపు గుండ్లు అంటే నీటి బుడగలు కావచ్చు నన్నాడు - రాజమండ్రి ప్రతి టీకా కారుడు అది ముద్రారాక్షసం వల్ల మారిన పదం కావాలి నల్లసరపు గుండ్లు సరియైన రూపం నల్లటి గుండ్రటి గట్టి రాళ్ళు అని ఆ పద భావం

"భుజబలంబున బెద్ద పులుల జంపగవచ్చు, పాము కంఠము చేత బట్టవచ్చు
పుడమిలో దుష్టులకు జ్ఞాన బోధ తెలిపి, సజ్జనుల చేయడెంతటి చతురుడైన" 27

పైది ' మకర ముఖాంతరస్థమగు మానికమున్ బెకిలింప వచ్చు - "నీతిపద్య భావ ప్రభావంగా రూపొందినది "కేయూరా న విభూషయంతి" - భూషలు కావు మర్త్యులకు, అనుపద్యానికి అనుసరణ పద్యం కూడా ఈ నరసింహ శతకంలో ఉంది

'కర్ణయుగ్మమున నీ కథలు సోకిన జాలు, పెద్ద పోగుల జోళ్ళు పెట్టినట్లు"(29)

షేక్స్పియర్ 'టైర్డ్ విత్ ఆల్ దీజ్' సానెట్‌లో వలె శేషప్ప కూడా ఇలా వాపోయాడు

"అధిక విద్యావంతుల ప్రయోజకులైరి, పూర్ణ శుంఠలు సభాపూజ్యులైరి,
సత్యవంతుల మాట జనవిరోధంబాయె, వదరు బోతుల మాట వాసికెక్కె" (26)

దేశములు దూరమైనా భాషలువేరైనా కవుల భావాలు కలుస్తూనే ఉంటాయి కదా!

"ఇటువంటి దుర్బుద్ధులెన్నొనాకున్నవి" అని ఒప్పుకున్నాడు (3), అది వినయం

సుమతి వేమన శతకాల వలె నరసింహ కృష్ణ శతకాలు రెండూ ఈ ప్రాంతంలోని వీధి బళ్ళలో నిన్న మొన్నటి వరకు అవశ్యపఠనీయాలుగా ఉండేవి

ఈ శతక రచనకు కారణమైనదని ఓ కథ ప్రచారంలో ఉంది అది ఇది

శేషప్ప ధర్మపురి నివాసి విష్ణు భక్తుడు అక్షయపాత్రను నమ్మి జీవించువాడు అయినా ఆయన మృదంగ వాద్య నిపుణుడు ఆపురితో ఒకసారి ఒకసాని నృత్యమొనరించుటకు రాగా మృదంగవాద్యగాడు లేక శేషప్పను పిలిచారట హరిభక్తి ప్రియుడైన శేషప్ప భోగం మేళానికి వాద్యసహకారం అందివ్వడానికి ఒప్పుకోలేదు దానికి ఆ ఊరి నాట్యకళారాధక రసిక యువకులు ఆయనను తూలనాడారు దానికి బాధ దు ఖం కలుగగా శేషప్ప గోదావరి నదీ స్నానమాచరించి వచ్చి నృసింహాలయంలో నిష్ఠగా కూర్చుని ఈ నరసింహశతకం చెప్పినాడట

తురుష్కుల దండయాత్రలో ఈ శతకం వ్రాసినట్లు మరో కథ.[17]

మొదటి కథే సరియైనది ఎందుకంటే రెండవది నిజమైతే ఆ కాలపు కోస్తామండల శతకాల్లో వలె తురుష్కనింద ఈ పద్యాల్లో ఉండేది "దుష్ట సంహార" అనటం కవి కోపానికి నిదర్శనం పై సన్నివేశం కారణంగానే కాబోలు ఇందులో భక్తి రహితుల నింద అధికంగానే ఉంది

నరసింహ నీవంటి దొరను సంపాదించి కుమతి మానవులనే గొల్వజాల (69) సాధుజనుల తోడ జగడమాడిన కీడు కవులతో వైరంబు గాంచకీడు, పరమ దీనుల జిక్క బట్టి గొట్టిన గీడు బిచ్చగాండ్రను దు ఖపెట్టగీడు (53) హరిదాసులను నిందలాడకుండిన జాలు సకల గ్రంథమ్ములు చదివినట్లు, భిక్షమింగ్యంగ దప్పించ కుండిన జాలు నింపుగా బహుమాన మిచ్చినట్టు (79)

నిందతోపాటు హితబోధ కూడా చేశాడు నూరవ పద్యంలో తన పరిచయం తన శతక ప్రశస్తిని, ఫల శ్రుతిని వివరించాడు

ఈ శతకంలో లోక విమర్శ హరిభక్తి సామాజిక నీతి ఉన్నాయే తప్ప 'సింహాద్రి నారసింహ' శతకంలోవలె ముస్లింపాలకుల ఉద్యోగుల దుండగాల వర్ణన లేక పోవడం విశేషం! దైవాన్ని నిలదీసి ప్రశ్నించక దాసుడుగానే మనవి చేసుకున్నాడు శేషప్ప ఈ శతక రచన కావించేసరికి ధర్మపురిలో మారి చెలరేగిందట దానితో కవిని నిందించిన వారు పశ్చాత్తాప పడి వచ్చి క్షమించుమని వేడుకున్నారట

అప్పుడు శేషప్ప 'నరహరి' పేర మరో సీస పద్య శతకం చెప్పగా రోగం తగ్గుముఖం పట్టిందంటారు

**నరహరి శతకం** ఈ శతకాన్ని ఏ కవి చరిత్రకారుడు పేర్కొనలేదు శేషాద్రి రమణకవులు మాత్రం గో క సం పుట 413 లో నరసింహ నరహరి శతకాలను పేర్కొన్నారు నరహరి శతక మకుటం ఇట్లుంది, "చక్రధర ధర్మ పుర ధామ సార్వభౌమ, నరహరీ! భక్తజన కల్ప! నాగతల్ప!"

మొదటి నరసింహ శతకంలోని దుష్టసంహార నరసింహుడు ఈ రెండవ శతకంలో భక్త జన కల్ప తరువైనాడు! నరహరి శతక పద్యాల నడక భావాలు నరసింహ శతకాన్నే అనుసరించాయి అచ్చుపొందినా ఆ శతకానికి వచ్చినంత ప్రచారం దీనికి రాలేదు ధర్మపురి వారికి కవి కుటుంబీకుల వద్ద ఈ శతకం ఒకే ఒక వ్రాత ప్రతి లభించింది అచ్చు ప్రతిలోని 75 పద్యాలకు తోడుగా వారికి వ్రాత ప్రతిలో మరి 20 పద్యాలు దొరికాయట వానితో నరహరి శతక పద్యాలు 95 అవుతాయి కాని వానిలో కవి పరిచయం పద్యం లేదు వ్రాత ప్రతి చివర కొన్ని పద్యాలు శిథిలమైనాయన్నారు 18

**నృకేసరి శతకం** ఇది శేషప్ప రచించిన మూడవ శతకం

వావిళ్ళ వారి భక్తి శతక సంపుటి - 1926, విద్వాన్ వేదం చిన్ని కృష్ణశర్మగారు10 డా ॥ దివాకర్ల వేంకటావధాని గారు20 నరసింహ శతకంతో పాటు నృకేసరి శతకాన్నికూడా పేర్కొన్నారు

నృకేసరి వృత్త పద్య శతకం శేషాద్రి రమణ కవుల పీఠికతో 1926లో వావిళ్ళ వారి ప్రతి మద్రాసునుండి వెలువడింది ఇందలి పద్యాలు చంపకోత్పలాలు 'నృకేసరీ' అని మకుటం ఇది భావాల్లో కవి పూర్వ సీస పద్య శతకాల మార్గంలోనే సాగినా భక్తి ప్రపత్తులు అధికం

మచ్చునకు ఒక పద్యం -

శ్రీకమలాలయా రమణ! శీఘ్రముగా దయజూచి నామనో
వ్యాకుల మెల్ల దీర్చుమిక, వారిజలోచన! నమ్మినాడ, నే
లోకుల గొల్వజేర భువిలో నను వంచన జేయబోకుమీ
నీకు నమస్కరించెదను నేర్పుగ, ధర్మపురీ నృకేసరీ!

ఇటువంటి సాదా సీదా రచన నృకేసరి శతకం

ఏనుగు బోవ జూచి ధ్వను లెత్తుచు కుక్కలు కూయసాగు (72)
తల్లి విషంబు పెట్టినను, తండ్రి ధనాఢ్యున కమ్ముకొన్న, భూ
వల్లభుడిల్లు దోచినను వద్దని పల్కెడి వారలుందురా? (80)

ఇట్లా చక్కని సామెతలతో సజీవ సాంఘిక నీతులతో పౌరాణిక దృష్టాంతాలతో నృకేసరి శతక పద్యాలున్నాయి ఈ నృకేసరి శతకంలో కేవలం రెండు పర్యాయములు మాత్రమే అన్యమత ప్రస్తావన వచ్చింది గోవధ చేయు మ్లేచ్ఛులకు గొబ్బున లేచి సలాము చేతురున్ (నృ శ 93)

ఏసు మంత్రముపదేశములిత్తురు (నృ.శ 94)

ధర్మపురి పాత నృసింహాయం మసీదుగా మారి నేటికీ కనిపించుచున్నది అది ఔరంగజేబు కాలం చర్య అంటారు కవిది సామరస్య ధోరణి

ఈ శతకంలో శేషాచల దాసు, భద్రాచల రామదాసు గారి దాశరథీ శతకాన్ని అడుగడుగన అనుసరించాడు అందుకు కొన్ని ఉదాహరణలు ఈ దిగువ చూపబడుతున్నవి

దైవము తల్లిదండ్రి తగు దాత గురుండు సఖుండు నిన్నెకా - దాశరథీ శతకం,
తల్లివి దండ్రి వాప్తుడవు దాతవు భ్రాతవు నీవె - నృకేసరి శతకం,

కంటి నదీతలంబు పొడగంటిని భద్రనగాధి వాసమున్ - దాశరథి,
చూచితి నీ కిరీటమును, జూచితి కుండలముల్ ముఖంబునే - నృకేసరి

చక్కెర లప్పముల్ మిగుల జవ్వని కెంజిగురాకు మోవులున్ - దాశరథీ
మామిడి పండ్ల పానకము మంచి మధూదక మిశ్రభక్షముల్ - నృకేసరి

ముప్పున కాల కింకరులు ముంగిట వచ్చినవేళ - దాశరథి,
బొందిని బ్రాణముల్ వెడలి పోయెడు నాటికి వాసుదేవగో
విందముకుంద యంచు నిను వింతగ నెంతునొ యెంచలేనొ - నృకేసరి

ఈ భావానికి మూలం 'ముకుందమాల' శ్లోకం - కఫవాత పిత్తై
కంఠావరోధన విధౌస్మరణం కుతస్తే - అనవచ్చు

భక్త పోతన భాగవతంలోని "బాలరసాల సాల నవపల్లవ కోమల కావ్య కన్యకన్' అనే ప్రసిద్ధ పద్యాన్నిఈ యిద్దరు కవులు అనుకరించిన వైనం చూడండి

మసగొని రేగు బండ్లకును మౌక్తికముల్వెల బోసి నట్లు దు
ర్వ్యసనము జెంది కావ్యము దురాత్ములకిచ్చితి మోసమయ్యెనా
రసనకు బూత వృత్తి సుకరంబుగ జేకురునట్లు వాక్సుధా
రసముల జిల్క బద్యముఖ రంగమునందు నటింపవయ్య21 - దాశరథీ

రవికుల! రేగు కాయలకు రత్నములన్ వెలబోసినట్లు దు
ష్కవి జనులంత బుద్ధిచెడి కాసులకోసము తుచ్ఛమైన మా
నవులను బ్రస్తు తించుచు ఘనంబుగ బద్యములమ్ము కొంద్రు మా
ధవ నిను గాన జాలరు మదంబున ధర్మపురీ నృకేసరీ -

దాశరథి శతకకర్త తప్పుచేసి పశ్చాత్తాపపడినట్లుంది కాని, నృకేసరి శతక కవి ముందే జాగ్రత్తపడడం విశేషం! మరో పద్యం చూడండి!

ఉ॥ భండన భీముడార్తజన బాంధవుడుజ్జ్వల బాణతూణకో
దండకళా ప్రచండ భుజతాండవ కీర్తికి రామమూర్తికిన్
రెండవ సాటి దైవమిక లేడనుచున్ గడకట్టి భేరికా
దాండ దదాండ దాండ నినదంబులజాండము నిండ మత్తవే
దండము నెక్కిచాటెదను దాశరథీ కరుణాపయోనిధీ" (34)

అని రామదాసు అనగా శేషాచలదాసు ఇట్లన్నాడు

ఉ కంటిని నీ కృపారసము కష్టములొందుచు నిన్ను వేడగా
వెంటనె మేలు జేసితివి వేల్పులు భూమినినెందరైన నీ
దంటకు సాటిరారనుచు దండిగ బొబ్బలుపెట్టి చేత జే
గంటను కొట్టి సాటెదను గట్టిగ, ధర్మపురీ నృకేసరీ (18)

భావాలు ఒక్కటి, పద్యాల ఛందం శైలి ఒక్కటి అతడు గడకట్టి ఏనుగు నెక్కి చెప్పుతానంటే, ఇతడు గంటకొట్టి బొబ్బలు పెట్టి చెప్పుతానన్నాడు రామదాసు తహసీల్‌దారు శేషప్ప హరిదాసు అంత పాటిదే ఇద్దరి కంతరంబు!

## యక్షగానము (లు)

శేషప్ప ధర్మపురి రామాయణము, అవనిజా చరిత్రము అనే యక్షగానాలు రచించాడని తెలుస్తున్నది అతని రామకథ 'ధర్మపురి రామాయణం' పేర చాల కాలం క్రితమే ముద్రణ పొందింది కవి తన రామాయణ యక్షగాన కావ్యానికి అవనిజా చరిత్రము (సీతా చరిత్ర) అని పేరు పెట్టి ఉండవచ్చు [22] ఒకే రామకథను రెండు పేర్లతో వ్రాయవలసిన అవసరం కవికి ఏమొచ్చింది? ఒక వేళ సీతాదేవి (పూర్వ) జన్మవృత్తాంతంతో రచించినా కవి అవనిజా చరిత్రం మాత్రం దొరుకలేదు

యక్షగానం దేశీయ సాహితీ ప్రక్రియా దృశ్యరూపకం

"యక్షగానము నందలి వృత్త మెట్టిదైన గావచ్చును రచనా ప్రక్రియ శ్రవ్యముగానీ దృశ్యము గాని కావచ్చును ఏ ప్రక్రియ యందైనను గీతి ధర్మము విహితము" అని డా॥ ఎస్వీ జోగారావు గారు "ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర"పు 215 లో అన్నారు

తెలుగులో తొలి యక్షగానమైన కందుకూరి రుద్రకవి 'సుగ్రీవ విజయము' ఇంకా, అంతకు పూర్వపు వినుకొండ వల్లభరాయుని 'క్రీడాభిరామము' వీధి రూపకం వలెనే శేషప్ప 'ధర్మపురి రామాయణము' శ్రవ్య రూపకం నిత్యదాసర్లు వకుళాభరణం అనబడు చిట్టి వీణపై శేషప్ప రామాయణాన్ని పాడుతూకథాకాలక్షేపం కావించేవారట [23] భాగ్యనగరంలోని ప్రముఖ పుస్తక ప్రచురణ సంస్థలు ముద్రించిన ఈ పుస్తకాన్ని పుట్‌పాత్ షాపుల వారు పాతిక ముప్పది సంవత్సరాల క్రితం వరకు అమ్మేవారమన్నారు పుస్తకం కోసం ఎంత ప్రయత్నించినా దొరుకలేదు ఇక్కడి చిందుభాగొతపు ప్రదర్శకులను విచారించగా వారు ఆడేది కూచికొండ రామాయణం అని తెల్పింది అది మెదకు జిల్లా ఎల్లదానకవి విరచితం [24]

ఈ ప్రాంతంలో విశేష వ్యాప్తి కల యక్షగాన రామాయణాలలో కూచికొండ మోక్షగుండ రామాయణాలు ఇక్కడివి కావు ఈ మండలపువైన ధర్మపురి రామాయణంతోపాటు ఇల్లంతకుంట రామాయణం కూడా కనుమరుగైపోయింది

(పైన వ్రాసిన విషయాలు ఈ థీసిస్ రచనా కాలానివి 1990-95 95 అక్టోబర్‌లో నాకు డాక్టర్ డిగ్రీ వచ్చింది అయినా అలబ్ధ గ్రంథాల వేట మానలేదు కీ శే అనంతవరం సిద్ధప్ప వరకవి గారి విగ్రహావిష్కరణ సందర్భసాహిత్య సభకు అధ్యక్షునిగా 20 నవంబర్ 1996 నాడు గుండారెడ్డి పల్లెకు వెళ్ళడం జరిగింది ఆ సభకు వక్తగా వచ్చిన డా॥ దాశరథుల బాలయ్య, లెక్చరర్ - సిద్ధిపేట గారు 'రామాయణ యక్షగానాలు' అను అంశంపై పిహెచ్ డి చేశారని తెలిసింది మాటల సందర్భంలో శేషప్ప రామాయణం తమకు లభించిందన్నారు కాని, కృష్ణశతకకర్త ధర్మపురి నరసింహదాసు మైరావణ చరిత్ర లభించలేదన్నారు ఇది నా వద్ద ఉంది వారికి ఇస్తానన్నాను వెళ్ళి శేషప్ప రామాయణం తెచ్చుకున్నాను డా డి బాలయ్య గారిచ్చిన అపురూప ప్రతిలోనివే ఈ క్రింది వివరాలు - రచయిత, ఫిబ్రవరి 97)

శేషప్ప రామాయణం సంపూర్ణ యక్షగానం ఇది వాల్మీకి రామాయణం వలెనే (బాల, అయోధ్య, అరణ్య, కిష్కింధ, సుందర, యుద్ధ) ఆరు కాండముల్లో ఉంది

ఏలూరు నుండి, కుప్పుస్వామి మొదలారి వారిచే 1942లో ప్రకటితమైన ఈ కృతి మొదటి ముద్రణ 1889 అని తెలిసింది (కవర్ లేదు ఇన్నర్ టైటిల్ కూడా సగం చినిగింది ఉన్నంతలో) 'శేషాచలదాసు గారిచే రచియింపబడిన' - "శ్రీమద్ధర్మపురిరామాయణము' షట్కాండములు - యక్షగానము" అని ముద్రితమై ఉంది

కవి మొదటి పాటలో ధర్మపురి రామాంకితము రామాయణము అన్నాడు బాలకాండము చివర గీత పద్యంలో కవి పేరు ఇలా వుంది

గీ లోక ప్రకటరామాయణమున బాలకాండ లాలితముగ శేషాచలయ్య జెప్పె
వ్రాసిన పఠియించిన విన్న వారికెల్ల మోక్ష పదవిచ్చు శ్రీరామ మూర్తి మెచ్చి।

మొదటి రెండు పాదాల్లోని గణ భంగాలు గమనించ వచ్చు పైగా ఇది పండితులచే పరిష్కృతం' అనీ ముద్రణలో ఉంది ఈ రామాయణంలో పాత్రల ప్రవేశ నిష్క్రమణాదులు లేవు తెరచాటు దర్వులు కూడా లేవు సంస్కృత నాటకాలకు వలె నాంది ప్రస్తావన విష్కంభాదులు లేవు

పాటలు పద్యాలు కొన్ని వచనాలు కూడా వ్రాసి కవి కథ నడిపించాడు మధ్య మధ్య వర్ణనాంశాలు సైతం పాటలుగానో పద్యాలుగానో ఉన్నాయి కథలో వేగం ఎక్కువ కవిత్వ రమ్యత తక్కువ యతులు ప్రాసలు కూడా కొన్ని చోట్ల తప్పాయి భాషాపాండిత్యం కథనం మాత్రం సహజ సుందరంగా ఉంది

ఇందలి పాటలు మొత్తం 252, పద్యాలు 503 యేలలు ద్విపదలు కూడాపై వానిలోనే జమ (ఈ లెక్క డా డి బాలయ్య గారిది) పుస్తకం చిన్న అచ్చులో 1/8 డెమ్మీ 126 పుటలు పద్యాలకు పేర్ల గుర్తులున్నాయి కాని, పాటలను కీర్తన - దర్వు అని ఏ పేరుతోనూ పేర్కొనలేదు ప్రతి పాటకు ముందు రాగతాళాల మాత్రం సూచించారు నారాయణగౌళ, హుసేన్ రాగం అనీ ఉన్నవి వాటిలో సీత పెండ్లి ఒప్పగింతల పాట "జనకుండు నప్పుడు తన సతితోడ గూడి " అనేది, ఇంకా సీతను తల్లి సాగనంపుతూ సుద్దులు చెప్పేపాట - "అత్త వారింటికి " అనేది బహువ్యాప్తి పొందాయి ఈ రెండూ కించిత్ పాఠభేదాలతో ఇప్పటికీ "స్త్రీల పాటలు" పెండ్లి పద్యములు' అనే పుస్తకాల్లో చేర్చబడి అఖిలాంధ్ర వ్యాప్తిలో ఉన్నాయి శేషాచలదాసు 'ధర్మపురి రామాయణము కందుకూరి రుద్రకవి సుగ్రీవ విజయం వంటి తొలితరం శ్రవ్య రూపకం అందుకు నిదర్శనంగా కవి చెప్పిన ఫలశ్రుతిని చూడవచ్చు

ఈ గ్రంథము వ్రాసినా పఠన చేసినా (సుందర కాండ) పుణ్యం ఫలంకలుగుతుందని చెప్పాడే తప్ప, ఈ ప్రదర్శన చేస్తే అని చెప్పలేదు

శేషప్ప ధర్మపురి రామాయణం శ్రవ్యనాటకం - దేశిరూపకం యక్షగానం।

అధిక జనాదరణ పొందిన కృతి శేషాచలదాసు గారి ధర్మపురి రామాయణ యక్షగానం ఈ నాలుగు కృతులనేకాక శేషాచలదాసు కొన్ని భజనకీర్తనలు కూడా రచించాడు "నరహరి భజన నోటనురా! నోటనురా! నోటనురా! నోటనకున్న వినురా" మొ॥ శేషప్ప కీర్తనలు భక్తలోకంలో బహుళ ప్రచారంలో ఉన్నవి, రామదాసు భజనల వలెనే నృసింహ శతక త్రయాన్ని, రామాయణ యక్షగానాన్ని రచించి శేషప్పకవి విష్ణుభక్తినే కాక, తన నామాన్ని - జన్మగ్రామాన్ని సాహితీ క్షేత్రంలో శాశ్వతం చేసుకున్నాడు।

**పాద పీఠికలు**

1 'ధర్మపురి నాడు -నేడు' 1970, అధ్యాయం - 3, పుట - 56
2 'సారస్వతీ జ్యోతి' సాహిత్య త్రైమాసిక పత్రిక - సం 2, 1954
3 ఇందవరపు నర్సింగరావు గారి పీఠిక
4 బాల సరస్వతి బుక్ డిపో మద్రాసు 8వ ముద్రణ - 1977, మొ ము 1947
5 శూరుడగాను - అని పాఠాంతరం 6 శతక వాఙ్మయ సర్వస్వము - పు 239, 240
7 పుట 43, ముద్రణ 1970 8 కాకుత్సం అనంతయ్య గారు 1991లో నాతో అన్నారు
9 ధర్మపురి వారి 'త్రిశతి' 1979లో ఇందవరం నర్సింగరావుగారి వ్యాసం 'ధర్మపురి నాడు నేడు' 1970, పుట - 56 నుండి 8-9 అధ్యాయాలు

10 మద్రాసు ప్రచురణ - 1926, 11 జయ సం - మద్రాసు ప్రచురణ
12 త్రిశతి - 1979, 13 ధర్మపురి నాడు - నేడు 1970, పుటలు 50 - 52
14 పెద్దగా చదువు లేకున్నా పూర్వకావ్యాల శ్రుత పఠన అభ్యాసాలవల్ల స్వేచ్ఛగా కవిత్వం చెప్పేవారు వరకవులు
15 7వ, పద్యం ఈ చరణ భావానికి ఈ శతక ఆవిర్భావగాథకూ సంబంధం ఉంది
16 ఈ విషయాన్ని డా కె రాజన్న శాస్త్రిగారు తెలిపారు
17 మృదంగ వాద్య కథ చెప్పినది కవివంశ వైష్ణవుడు, రెండవది దండయాత్ర కథ చెప్పినది ధర్మపురి మిత్రుడు - విప్రుడు
18 ఎం శ్యామసుందర శాస్త్రిగారి వ్యాసం - 'ధర్మపురి నాడు నేడు' 1970, పు 51
19 శతక వాఙ్మయ సర్వస్వము - పు 238, 20 ఆంధ్ర వాఙ్మయ చరిత్రము - 1956, పు 118
21 ఈ పద్యం 5 పాదాలది రామదాసు తనకవితను నరాంకితం చేసిందెక్కడ? ఈ పద్యం ప్రక్షిప్తం కావాలి లేదా కర్తృత్వంలో అనుమానం రావాలి
22 కాళిదాసు - మేఘదూతమ్, పెద్దన - స్వారోచిష మను సంభవము కవులు పెట్టిన పేర్లు మారి ప్రచారమైనట్లే ఇదీ కావచ్చును
23 రంగస్థల నటులు గోధూరి సుందరా చార్యులు 1992 ఏప్రిల్‌లో చెప్పారు
24 దేవీ ప్రసాద్ గారి 'మెదకు మండల సాహిత్య చరిత్ర'ము 1969, పు 64

## 2 ముద్దుబాలంబట్టు - మంథని, 18వ శతాబ్ది ఉత్తరార్థం

మంథని వాస్తవ్యులైన ముద్దు బాలంభట్టు విరచించిన కృతులు రెండు యక్షగానాలు
1 శివపురాణము (యక్షగానం) 2 మంథెన రామాయణము (యక్షగానం)

**కవి వంశాదులు** రామాయణ బాలకాండము 1978లో ముద్రణ పొందింది దీని ద్వితీయ శ్లోకంలోని[1] కవి వివరణను బట్టి ఆయన గౌతమీ సమీప మంత్రాఖ్యనగర వాసి హరితస గోత్ర ద్విజుడు ముద్దు రాజేశ్వర సుతుడు ముద్దు అనేది గృహనామం ఆశ్వాసాంత గద్యలు ఇట్లున్నవి

"ఇతి శ్రీ సీతారామ సరస్వతీ శిష్యేణ ముద్దు రాజేశ్వర సూనునా బాలంబట్టేన విరచితాయాం శ్రీమదుమామహేశ్వర సంవాదే రామాయణ యక్షగాయనే రామాయణ కథాయాం సుందరాకాండ సమాప్తి" ము 1988

**కాలం** "అయోధ్యాకాండము"2 పీఠికలలో బాలంభట్టు కవి సుమారు మూడువందల సంవత్సరముల క్రితం వారని ప్రకాశకులు తెలిపారు 'సుందరకాండ' పీఠికలలో కవిరచన 200 సంవత్సరములకు పూర్వపుదని గంగా రాజేశ్వరరావు గారు, సుమారు 300 క్రితపుదని రేవెళ్ళ మురళీధర శర్మగారు పేర్కొన్నారు వారందరు మంథని వాస్తవ్యులు ముద్దు బాలంభట్టు వంశంవారు ఆదిలాబాద్‌లోని అచ్చులాపురం అగ్రహారానికి వెళ్ళినారు అందులో అయిదవ తరం ముద్దు నరహరి గారు ఆస్తిలో తొమ్మిదవ పాలు అనుభవిస్తున్నారట (సుందరకాండ పీఠిక)

దాదాపు రెండు వందలేండ్లకు పూర్వుడు కవి (1980-200) 1780 ప్రాంతంలో కవి జీవించి ఉండాలి ఈ రచనలు 18వ, శతాబ్ది ఉత్తరార్థకాలపువి అనుకోవచ్చు

**కవి జీవితం - కావ్యరచనా విశేషాలు** బాలంభట్టు గారి వ్యవహార నామం ముద్దు బాయన్న ఆయనకు ముద్దయ్య అని ఒక సోదరుడున్నాడు బాలంభట్టు నిష్ఠాగరిష్ఠుడైన వైదికుడు నిత్యం ఉషోదయానికి పూర్వమే లేచి గోదావరి నదికి వెళ్ళి (మంథని పట్టణానికి నది మూడుమైళ్ళ దూరం) స్నానమాచరించి, నదీ తీరస్థ గౌతమేశ్వరాలయం (కాకతి గణపతి దేవుని కాలపు నిర్మాణం) లో పూజచేసి ఇంటికి వచ్చే వారు ఓ దినం ఒక యతి వారిని ఈ కావ్యరచన చేయవలిసిందిగా

ఆదేశించారట కవితా సాధనలేని తనచేత ఈ కావ్యరచన కాగలదా? అని మొదట వెనుకాడినా ఆ సాధువు అజ్ఞను కాదనలేక సకుటుంబంగా వెళ్ళి గ్రామసమీప ఓంకారేశ్వరాలయంలో నివసిస్తూ బాయన్న ఆ రెండు యక్షగానాలు రచించారని స్థానికుల కథనం

బాలంభట్టు వరకవి ఛందోగ్రంధాలు చూసికాక అభ్యాస పాటవంచేత భక్త్యావేశం వలన కవిత చెప్పేవారు వరకవులు ఛందోభంగాలను శబ్దసాధుత్వాలను గురించి వారు అంతగా పట్టించుకోరు పలికెడిదంతా భగవంతుడు పలికించేదే అనే భావం చెరకునకు వంక బోతేమి తీపి చెడునె, అనే రీతిలో వారి రచనలు సైతం జనాదరణ చూరగొంటూనే ఉన్నాయి!

**కావ్యపరిచయం** మంథని రామాయణ యక్షగానం ఆ ప్రాంతంలో చాలా వ్యాప్తి పొందింది మంథనిలోని సంప్రదాయ కుటుంబాల స్త్రీలు, పురుషులు ఇందలి కీర్తనలు పాడుకుంటున్నారు అవి స్త్రీలకు జోల పాటలు, పురుషులకు భజన కీర్తనలు!

బాలం భట్టు గారు తమ రామాయణాన్ని వాల్మీకి రామాయణం వలెనే ఆరుకాండలుగా రచించినారు అందులో బాల, అయోధ్య, సుందరకాండలు మాత్రమే ముద్రితమైనవి అరణ్యకిష్కింద యుద్ధకాండలు అముద్రితాలు

బాలకాండ పీఠికలో డా॥ దివాకర్లగారు ఇట్లా అన్నారు తేది 23-3-78,

"ఈ రామాయణము యక్షగానముగా వ్రాయబడినది కాండాంత గద్యములలో 'శ్రీమదుమా మహేశ్వర సంవాదే శ్రీమద్రామాయణ యక్షగాయనే" అని వ్రాయబడినది ఇందు శ్లోకములు, వచనములు, మత్తేభ, శార్దూలాది వృత్తములు, రాగతాళ సూచనలతో గూడిన కీర్తనలు గీతములు, ద్విపదలు, దరువులు కలవు చూర్ణికలు సమాన భూయిష్టములైయున్నవి 3 అధ్యాత్మరామాయణము ననుసరించి, కథను చక్కగా నడిపి యున్నాడు కవి పండితుడు వలె కనిపించుచున్నాడు వీర శృంగార కరుణారసములు చక్కగా పోషింపబడినవి ఇది చాలా ప్రశస్తమైన గ్రంధవాసి "

ఈ రామాయణ యక్షగాన రచన ప్రత్యేక పద్ధతిలో ఉంది పాత్రల ప్రవేశ నిష్క్రమణాదులు, సంవాదములు లేవు కవి కథనం మధ్య మధ్య సాగుతూ, పాటలు పద్యాలు వచనాలతో కథ నడిచింది దీనిలో దృశ్యకావ్యం కంటే శ్రవ్యకావ్య లక్షణమే అధికం అందుకేనేమో దీనిని యక్షగాన నాటకం - రూపకం అనక "యక్షగాయనం' అన్నాడు కవి తెలుగు తొలి యక్షగానమైన సుగ్రీవ విజయం కూడా శ్రవ్యకావ్యమే బాలంభట్టు అదే పద్ధతిని అనుసరించాడు 4 ఈ కవి తన రామాయణాన్ని శివుడు పార్వతికి వినిపించినట్లుగా రచించాడు5 కావ్యారంభ శ్లోకంలో త్రిమూర్తుల ధ్యానించి, రెండవ శ్లోకంలో స్వవిషయాలు తెలిపి మూడవదైన మొదటి తెలుగు పద్యంలో రామకథా ప్రభావాన్నిలా వివరించాడు

ఉ ధర్మము యాగమున్ తపము దానము లింద్రియ నిగ్రహంబు స
త్కర్మయు నార్యసేవయును గ్రంధ విచార వివేక శూన్యులై
దుర్మతి చేత నీ కలిని దుష్కృతములనొనరించు6 వారలన్
నిర్మలమంద జేయుచు బునీతము జేయును రామగీతముల్ బా కాం పుట - 1

ఇందలి మూడవ పాదంలో 'దుష్కృతముల్ పొనరించువారలన్' అంటే గణభంగం వచ్చేదికాదు మొదటి కీర్తన ఇష్టదేవతల ఆరాధన దాని నాలుగు చరణాలలో రెండు ఈ దిగువ చూపబడుతున్నవి

ధీర్తి నొందిన సాంబా మూర్తి యింటను బుట్టి, కీర్తి వెలసిన దేవుడై
అర్తులై తమ భక్తులమతి కొల్వను గామ్య
పూర్తీ సేయు నాది పూజ్యునకు నే, మ్రొక్కెదా మ్రొక్కెదా గణాధిపా ॥మ్రొ॥"

చందమామను బోలు   సకల విద్యల తల్లి సత్యలోకము రాణికి
నందారు మునిజాన - మందారు తరువూన, కందామైన శారదాంబాకునే ॥మొ॥

ధీర్తి = ధృతి, జాన = జన   పదాలకు లేని దీర్ఘాలు రావటం జానపద యక్షగాన కవుల రచనల్లో సర్వసామాన్యం అది రాగతాళాల కోసం పండిత కవుల వలె కాదు, వరకవులు స్వేచ్ఛా విహంగాలు! గర్భిణులైన దశరథ పతుల వర్ణన - ద్విపదలు –

కనకాంగులకు మేను కళలు దీపిల్ల, తనువున నీరెక్కి దార్ఢ్యంబునంది
కుచములు గొప్పలై కోర్కెలు మించ, సు చిరంబుగా నిద్ర సొక్కులింపొంద
కొమర నాహారంబు కొద్దిగా నైన, క్రమముగా నుదరముల్ కడువృద్ధి కాగ
నాట పాటల బ్రొద్దులటు గడుపగాను   బా కాం పుట 5

శ్రీరామ జననం కేవలం రెండే రెండు చరణాలు

"నవమాసములు నిండి నారాయణుండు   నవతరించె నయోధ్యయందు రాముండు!"

రాముని తన యాగ సంరక్షణకు పంపుమని విశ్వామిత్రుడు కోరడం ఈ శ్లోకంలో ఉంది

శ్లో॥  యాచంతం వై కౌశికం శాప భీత్యా, దృష్ట్వా రాజా సందిహానో బభూవ।
తస్మిన్ కాలే తేన సంజ్ఞామవ్యాప్య ప్రాహై కాంతే భూపతిం శ్రీవసిష్ఠ ॥

తర్వాత ఓ పదం, కన్నడ గౌళ రాగం ఆది తాళంలో,

దేవా శ్రీరాముల కనుగొని - నావా! మాధవుడని తెలియగ - లేవా
దేవ జనక రఘుతిలకుని గనుసతి। ఆవిధమున కశ్యపుడవు నీవె సుమి॥
కోరీ - నర రూపము దాల్చె మురారి। సుతుడై మన గృహమును జేరి,
మీరీ - బహు భాగ్యము వలన నీ సారి। ప్రభవించెను శ్రీ యువ తారి
-క్షీరజలధి సుత - సిరి వరకన్యక। భోరున జనకుని - పురమున వెలసె
వీరుడనంతుడు - వెలది సుమిత్రకు। గారణమునల - క్ష్మణుడనగలిగెను ॥దేవా॥ బాల పుట 8

ఇలా రామకథ సంక్షిప్తంగా నడిపినాడు  కవి వాల్మీకి మూలాన్నే అనుసరించాడు

యాగ సంరక్షణానంతరం విశ్వామిత్రుడు రాముని స్తుతించిన కీర్తన సంస్కృత భూయిష్ఠంగానే కాక కవి పాండిత్యానికి, కమనీయ కవితా శిల్పానికి నిదర్శనంగా ఉంది  అందలి తొమ్మిది చరణాల్లో ఇవి రెండు  బా  కా  పు  12,13 (ముఖారి   ఏకతాళం)

1 శ్రీమదనంతని - యామక  భవహర। నామ - సమర రిపు-భీమ, మధుర గుణ
సీమ - పరాత్పర   ధామ, విబుధ జన । కామ సఫలపద   కోమల జయ జయ ॥రామ పాహీ॥

2 కుంభజ పద పరి   రంభణ, జగదభి ।  జృంభణ సురధుని - సంభవ పద, బలి
దంభ దమన, హత   జంభ సహోదర । కుంభిని పతివర   డింబక జయ జయ ॥రామపాహీ॥

ఇందులో కందార్థముల వలె కందమాలలు వృత్త పద్య మాలలు సీసమాలలు ఉన్నాయి  ఇవి పద్యాంత పదంతో గేయమారంభమై వినూతనంగా ఉంటాయి

కవి సందర్భోచితంగా ఏలలు, చూర్ణికలు కూడా రచించారు  ఒకయాల - (ఏల) బా కా  పుట  33

మీరు మా చెంతకు రావడము మేలాయెనెంతో యీ వేళ
కోరిన దానము నడుగవే - భార్గవరామా! కొదువలేకా నిచ్చేమో దేవా!

అహల్యా దేవేంద్ర ఘట్టంలో మూడు పాటలున్నాయి (17-19)

సీతారామా కళ్యాణం, పాటలోనే వర్ణితం  సీత ఒప్పగింతల పాట మనోహరంగా ఉంది

శ్రీరామ భార్గవరాముల మధ్య ఏలల సంవాదం ఉన్నది ఇట్లా సంగ్రహంగా బాలకాండ కథ ముగిసింది అచ్చులో ఇది కేవలం 35 పుటలు

చూర్ణిక - (సంస్కృతం) అయోధ్యాకాండము, పుట - 18 లోనిది

"అహో! మదీయ జననీ! భవ జనిత సర్వదు ఖ ప్రశమనీ! ఇదానీం మజ్జనకో రాజా దశరథ శ్రీమాన్, వర ప్రదానవశాదనృత భయేన నవపంచ వర్షాణ్యరణ్య వాసం గచ్ఛేతి మామను శాసితవాన్, స్వధర్మ నిరతవాన్ అతో ఒ హమిహా గతో ఒ స్మికారుణ్యతయా క్షిప్రం బ్రూహి, మహాజ్ఞాందేహి "

వెంటనే ఆ మాటలు విని కౌసల్య రామపట్టాభిషేకానంద భగ్నమనోరథయై ఇట్లా విలపించింది

ఎన్ని తలతునో రామ నిన్నెడ బాసి యేల తాళుదునో
పున్నమి చందురుని - పొడను గేరు నీ మోము
కన్నుల నిను జూడ గలిగే దెన్నటి కౌనో (అ కా పు 19)

వనవాస గమన సందర్భాన సీతారాముల మధ్య ఏలలతో సంవాదమున్నది (అ కా 25 పుట) రావణాంజనేయ సంవాదం ఏలలే (సు కా 39,40) గంగాతరణ సందర్భంలో గుహుని కనికరించి, చిత్రకూటంలో వాల్మీకిని సీతారామలక్ష్మణులు సందర్శించినట్లున్నది (అ కా 30,31)

సుందరకాండ కృతి ఈ కృతులలో పెద్దది 54 పుటలు ఇందులో దర్వులు కీర్తనలు మిగతా ఈకవితా ప్రక్రియలెక్కువ వచనాలు మరీ తక్కువ

రామదూత చెలరేగెను వాలాగ్నితోను! లంక గాలబెట్టసాగెను
భూమియాకాశంబులదరగ। పురహరుని చందంబు నార్చును
భీమరూపము దాల్చి యసురులు। బెదరగా నపరాత్రి వేళను ॥రామదూత॥ సు కా పుట 46

రాముని కృతజ్ఞత వాక్యాలు ఈ తీరుగా ఉన్నవి

నను బోషించితి వాంజనేయా కీర్తి। నెనసితి నీచేతానెంతో మేలాయా ॥నను॥
కలికీ చల్లని దానవాలు నేనీ। వలన జూచితినయ్యా వనజాక్షి మేలు
నిలలోనెన్నటికి నన్నేలు గోరి। తలచెడి మా పాలిటి దైవముగాబోలు ॥నను॥ పు 53

సుందరకాండలో సీతాదేవిని 'సీయా' అనటం, పార్వతికి శివుడు వినిపించినట్లుగా కథ నడపటం వలన, ఈ కవి తులసీ రామాయణాన్ని విశ్వామిత్ర అధ్యాత్మరామాయణాన్ని, చదివాడనుకోవచ్చు

బాలంభట్టు గారి రామాయణ యక్షగానానికి మంథనిలో చాల ఆదరమున్నది ధర్మపురి రామాయణం, మంథని రామాయణం, ఇల్లంతకుంట రామాయణం ఈ జిల్లాలో బహుళ వ్యాప్తి పొందిన యక్షగానాలని కీ శే గత్తెపల్లి సత్యనారాయణ రాజు గారు 'కరీంనగర్ మండల చరిత్ర' లో 'ప్రాచీన సాహిత్యము - కళలు' అనే వ్యాసంలో పేర్కొన్నారు పు 20

ఈ కావ్యంపై ఉన్న అభిమానంతో శీలప్ప గారి అనంతరాజం గారు స్వయంగా 46 ప్రతులు వ్రాసి అభిమానులకు పంచారని అయోధ్య కాండ పీఠికలో ఉంది

ముద్దు బాలంభట్టు రావణ వధ వరకే ఈ యక్షగానం వ్రాసి ఏలనో విరమించగా, ఆయన తమ్ముడు ముద్దయ్య రామ పట్టాభిషేకాన్ని రచించాడు [6]

బాలంభట్టు భక్తి కవితా శక్తిని గూర్చి భక్త పోతనకు వలెనే కొన్ని మహిమోపేతమైన కథలు ప్రచారంలో ఉన్నాయి ఓ పాటను కవి అసంపూర్ణంగా వదలి గోదావరి స్నానానికి వెళ్ళి వచ్చేసరికి, రామలక్ష్మణులు మారురూపాలతో వచ్చి పూరించి వెళ్ళారట ఇది పోతన గజేంద్రమోక్షంలోని, అల వైకుంఠ పురంబులో - పద్యం పూరణ గాథ వంటిది లక్ష్మణ మూర్ఛ సందర్భంలో 'హాముద్దు

తమ్ముడా!' అని రాముని విలాపం వ్రాసే సందర్భంలో కవి సోదరుడు ముద్దయ్య మరణించి, తిరిగి అచరణం మార్చి దైవాన్ని నుతించగా మేలుకున్నాడట ఇది పోతన రుక్మిణీకల్యాణ ఘట్టంలోని 'బాలకమరె కథకు ప్రతి బింబం

శ్రీనాధుని ఒడ్డెరాజులు భూమిశిస్తుకోసం హింసించినట్లుగా బాలంభట్టును కూడా నాటి గ్రామకరణం హింసిస్తే, వరదరాజ స్వామిని కవి వేడుకోగా శిస్తుమాఫీ అయి, ఆ కరణం ఉద్యోగం ఊడిపోయిందట ఈ విషయాలు సుందర కాండ పీఠికలో గంగా రాజేశ్వరరావుగారు వ్రాశారు

**శివలీలలు - యక్షగానం** బాలంభట్టు ఈ యక్షగానాన్ని మూడు భాగాలుగా రచించాడు అవి 1 దక్షయాగం, 2 పార్వతీకల్యాణం, 3 కుమార సంభవము వీనిలో మొదటి రెండు భాగాలు ఒక సంపుటిగా ముద్రించబడినా మూడవ భాగం వెలువడలేదు [7] రామాయణ కృతి రీతిలోనే ఈ యక్షగాన రచన సాగింది ఇదే కవి మొదటి రచనమట

కావ్యారంభం మహదేవ ఉవాచ -

శ్రీవైరాజిత మంత్రకూట నగరే సౌందర్యవంశార్ణవే
శ్రీ రాజేశ్వర మౌని సూనురిద మాఖ్యానం కరోత్వద్భుతం
సంక్షేపేణ సుయక్షగాయనతయా సత్ప్రకృతే నోదితే
శ్రీ శంభో జన రక్షదక్ష నిరతాం రక్షానిశం సర్వశం

ఈ శ్లోకానంతరం గణపతి ప్రార్థన చేసి కవి కథారంభం కావించాడు బాలంభట్టు వరకవి ఇది వరకవిత ఇందలి కొన్ని పదాలు లాక్షణికులకు మింగుడు పడవు వ్యావహారిక పదరూపాలే కాక భాగోతపు బాణీలో పదాలకు లేని దీర్ఘాలు వచ్చాయి ఇది ఒక విధంగా సమకాలీన సజీవభాష

ఇందులోనూ బాయన్న రామాయణంలో వలెనే పద్యమాలికలు, కీర్తనలు, ఏలలు, ద్విపదలు, పద్యాలు, వచనాలు ఉన్నాయి రామక్రియలు అని జంపెతాళంలో కొన్ని కొత్తరకం గేయాలున్నవి

ఉదా కదిసి యగ్నిని మూటగట్టు చందముగాను
యిది మహాత్ముల నింద యేమి మేలౌనె (40 పుట)

పనివాడు యితగాని బ్రతికించవే యనుచూ
మునిపుంగవుని యొక్క మొండెమును జూపెను
జల వ్రతము గాను జాయు మీ క్రతువులు (చేయు)
ఘనుడవు నీవుద్ధరణ గావించు మనెనూ (41)

యాలలు (ఏలలు)

యెక్కువైన బలవంతులై యింద్రాది దేవదేవతలు,
మిక్కిలి వుల్లాసా మెందూచు - ఓ మౌనులారా - మేనులెల్ల పుణుకులాడిరీ॥
మక్కువాతో ముని కాంతలు మంచి వస్త్రా భూషణములతో
మెక్కుచు గంధ పుష్పములాను - ఓ మౌనులారా - సొంపుగా నెగజల్లూ చుండీరీ॥ (26)

అరుసుకో బొంగ, యాపాని శాయవలె = ఏ పని చేయవలె, రబ్బుకొల్పు, రావగ, పామరాము=పావురము=ప్రేమ, యాది - యాద్ ఉర్దూపదం, జ్ఞాపకం, జోలి వంటి మాండలిక పదాలు నిస్సంకోచంగా కవి ప్రయోగించాడు

**కావ్యాంత గద్య** " ఇతి శ్రీసీతారామ సరస్వతి శిష్య ముద్దు రాజేశ్వర సూనునా బాయన్న భట్టేన విరచితాయాం శ్రీమదుమా మహేశ్వర యక్షగాయన (దక్షయజ్ఞ) వీరభద్ర విజయోపాఖ్యాన నామ ప్రధమాశ్వాస "- "శ్రీ సాంబ శివార్పణమస్తు శ్రీ సీతారామ చంద్రార్పణమస్తు '

కవి వీరశైవ భావావేశికాక, స్మార్తుడు కనుక శివకేశవుల ఇరువురినీ స్మరించడం, దక్ష యజ్ఞధ్వంస సందర్భంతో సంయమనంతో కథ నడిపించడం జరిగింది ఈ కృతిని 'శివలీలు' అని వ్యవహరిస్తున్నా కవి మాత్రం "ఉమామహేశ్వర యక్షగాయనం" అనే అన్నారు

బాయన్న శివపురాణ రామాయణ యక్షగానాలు రెంటిలోనూ ఇతివృత్తాన్ని మూలవిధేయంగా సంగ్రహంగా రచించాడు లేఖక దోషాలు ముద్రారాక్షసాలు సవరించి, కావ్యాల చక్కగా పరిష్కరించి, సంపూర్ణంగా ముద్రిస్తే, రెండు రసవత్తర పూర్వయక్షగాన గ్రంథాలు పాఠకులకు అంది అలరిస్తాయి

**పాదపీఠికలు**

1 సమీపే గౌతమ్యాం ముని నిలయ మంత్రాఖ్యనగరే
ద్విజ పుణ్యోధీమాన్ వారితస మునేర్గోత్ర జలధౌ
కులే ముద్దేతద్వర జనిత రాజేశ్వర సుత
సమాసే నాంధ్రేతాం విరచయతి రామాయణ కథా॥

2 ముద్రణ సంవత్సరం వేసి లేదు 3 ఇందలి చూర్ణికలు సంస్కృత భాషలో ఉన్నవి

4 యక్షగాన పాత్రలకువచనాలుండవు కవి కథనముంటుంది సందర్భాన్నిబట్టి నటులే పాటల మధ్య మాటలు చేర్చుకుంటారు వచనాలు తర్వాతి స్వదేశి నాటకాల్లో ఉన్నాయి - అని 'కొండలరాయుడు' యక్షగాన రచయిత ఆడెపు గురువదాసు సిరిసిల్లగారు 1993 నవంబర్‌లో నాతో అన్నారు

5 శ్రుణుదేవి ప్రక్ష్యామి గుహ్యాత్ గుహ్యతరం మహత్
అధ్యాత్మ రామ రచితం రామేణోక్తం పురా మమ - అని కథారంభ శ్లోకం

6 'గోలకొండకవుల చరిత్ర'లో బాలం భట్టు పేరు వదలి ముద్దయ్యనే ఈ యక్షగానకర్తగా పేర్కొనటం పొరపాటు పు 405

7 నాకు లభించిన అచ్చుప్రతిలో కావ్యభాగం తప్ప ముందు పుటలు లేనిది మరో ప్రతి దొరుకలేదు ముద్రణ సంవత్సరం తెలియదు

### 3. కుందావజ్జల గోపాలకృష్ణకవి. ములకనూరు 18వ శతాబ్ది

కుందావజ్జల గోపాలకృష్ణ కవి హుజూరాబాద్ తాలూకా వంగర గ్రామ సమీపమందలి ముల్కనూరు నివాసి ఈ కవి సంస్కృతాంధ్రోభయ భాషలలో విద్వాంసులు వీరి రచనలు రెండు

1 శ్రీకృష్ణ జన్మఖండము (అముద్రితం)

2 సంవరణ చరిత్రము (ఏకాశ్వాసం మాత్రం లభ్యం)

సంస్కృతాంధ్ర పండితుడైన గోపాలకృష్ణయ్య మహారాష్ట్ర ప్రభువైన సర్వాజీ మాధవరావుగారి ఆస్థాన కవి రాజా వారిచే వీరు ఏటా పన్నెండు వందల రూపాయలు కాశ్మీరు షాలువా సన్మానంగా పొందేవారట! ఈ కవి కరీంనగర్ జిల్లాలోని దేవకీపల్లి (డ్యాగపల్లి)ని అగ్రహారంగా పొందాడు

**కాలం:** గోలకొండ కవుల సంచిక, లోని పూర్వకవుల పరిచయాలలో గోపాలకృష్ణ కవిని గురించి వ్రాస్తూ, ఈ కవి అప్పటికి 120 సంవత్సరాలకు పూర్వుడన్నారు 2 అంటే, గోపాలకృష్ణ కవి కాలం 1934 - 120=1814 అన్నమాట కవి వంశవృక్షాన్ని బట్టి చూస్తే (ఇందుర్తి వేంకట నరసయ్య గారి కాగితం)

నాగశాస్త్రి (కవి తాత గారు), వెంకటశాస్త్రి (కవిగారి తండ్రి) గోపాల కృష్ణ కవి (కృష్ణ జన్మఖండ అనువాద కర్త) దుర్వాస శాస్త్రి కవి పుత్రుడు (మొదటి తరం), భోళానాధశాస్త్రి (రెండవ తరం) రాజేశ్వర శాస్త్రి (మూ త) నరహరి (నా త) అయిదవ తరంలో 1 వెంకటనరసయ్య, 2 రామచంద్రయ్య

కవి గారికి అయిదవ తరం వారైన రామ చంద్రయ్య గారికి ఇప్పుడు 80 ఏండ్ల వయస్సు అంటే వారి జననం 1993-80=1913 అట్లాగే తరానికి 30 ఏండ్లు తగ్గించుతూ పోతే 5×30=150, 1913

150=1763 గోపాల కృష్ణ కవి జననం అవుతుంది కవి 1750 సుమారుగా జన్మించి ఉంటారు 70 ఏండ్లు జీవితకాలమనుకున్నా 1820 వరకు ఉంటారు ఇది గోలకొండ కవుల సంచిక చూపిన కాలానికి సరిపోతుంది

డా॥ బి రామారాజు గారు 'వివేచన' డిసెంబర్ 1978 సంచికలో ఇట్లా వ్రాసినారు

మడికొండ " మోతుకూరి వారింట నున్న శ్రీకృష్ణ జన్మ ఖండమును నేను రెండు దశాబ్దముల క్రింద చూచితిని మోతుకూరి కోదండ రామారావు గారి జ్యేష్ఠ పుత్రులు శ్రీ వేంకటేశ్వరరావుగారు (80 ఏండ్లు) తమ ప్రపితా మహులు పండరి నాథరావు గారు రచించిన పండరినాథ రామాయాణముతో పాటు కుందావజ్జల గోపాలకృష్ణసూరి రచించిన శ్రీకృష్ణ జన్మఖండమును నాకు చూపించిరి గోపాలసూరి, పండరి నాథరావు గారికి సమకాలీనులగుట (19వ శతాబ్ది ప్రారంభము) వారిరువురికి పరిచయముండి యుండును"[3]

దీని ప్రకారము వేంకటేశ్వరావు గారికి 1958 లో 80 ఏండ్లు వారి జననం 1878 వారి తండ్రి జననం 1848, తాతగారి జననం 1818 అది పండరినాథరావు, గోపాలకృష్ణకవి జీవించి ఉన్నకాలం ఈమూడు అంశాల బట్టి గోపాలకృష్ణ కవి కాలం క్రీ శ 1750 నుండి 1820 ని నిర్ణయించవచ్చు

**వంశం** శ్రీకృష్ణ జన్మ ఖండములోని ఆశ్వాసాంత గద్యలిట్లున్నవి [4]

"శ్రీవేంకటేశ్వర ప్రసాద లబ్ధోభయ భాషా కవితా విఖ్యాత చరిత్ర శ్రీమత్కుందోర్ఝులాన్వయాంభోజ పద్మ మిత్ర శ్రీనాగశాస్త్రి పౌత్ర వేంకటశాస్త్రి పుత్ర విద్వజ్జన కృపానుసారి గోపాలసూరి ప్రణీతంబైన బ్రహ్మపురాణాంతర్గతంబగు కృష్ణ జన్మ ఖండంబునందు తృతీయాశ్వాసము సంపూర్ణము" మిగితా కావ్యగద్యలన్నీ ఇంతే 'సంవరణ చరిత్రము' ఆశ్వాసాంత గద్య ఇట్లుంది -

"ఇది శ్రీమద్వేంకటేశ్వర వర ప్రసాద లబ్ధోభయ భాషా కవితా ధార కాండిన్య గోత్రాలంకార శ్రీకుందోజ్జలాన్వయ పారావార కైరవ మిత్ర నాగశాస్త్రి పౌత్ర వెంకటశాస్త్రి పుత్ర నిఖిల విద్వజ్జన కృపానుసారి గోపాల సూరి ప్రణీతంబైన సంవరణ చరిత్రంబను మహాప్రబంధంబునందు ప్రథమాశ్వాసము [5]

కవిది కాండిన్య గోత్రం కుందావజ్జల గృహనామం వైదిక బ్రాహ్మణులు తాత నాగశాస్త్రి తండ్రి వెంకటశాస్త్రి కవి మొదటి కావ్యంలో 'అన్వయాంభోజ పద్మమిత్రుడు' - సూర్యుడు రెండవ ప్రబంధంలో ' అన్వయ పారావారకైరవమిత్రుడు' - చంద్రుడు రెండు కృతుల గద్యల్లోనూ కవినామం గోపాలసూరి అనే ఉంది సూరి పండితవాచి, గోపాలశాస్త్రి అని కవి నిజనామం శ్రీకృష్ణజన్మఖండరచనతో 'గోపాలకృష్ణకవి' అనే పేరు వ్యాప్తికి వచ్చి ఉంటుంది

**కావ్య విశేషాలుః**

**1. శ్రీకృష్ణ జన్మఖండము** చంపూ కావ్యం ఇది సంస్కృత పురాణానువాదం

సంస్కృతంలోని అష్టాదశ పురాణంలో 'బ్రహ్మవైవర్త పురాణమ్' ఒకటి అందులో నాలుగు ఖండాలు ఉన్నాయి అవి - బ్రహ్మఖండము, ప్రకృతి ఖండము, గణేశఖండము, శ్రీకృష్ణ జన్మఖండము మొదటి మూడు ఖండాలు పూర్వ భాగంగా, చివరి శ్రీకృష్ణ జన్మఖండం ఉత్తర భాగంగా వ్యవహరిస్తున్నారు బ్రహ్మపురాణోత్తర భాగ శ్రీకృష్ణ జన్మఖండమ్'[6] అనువాదమే కుందావజ్జల గోపాలకృష్ణ కవి గారి కావ్యం

బ్రహ్మవైవర్త పురాణం సంస్కృతంలో 911 పుటలు అందులో 432 పుటలు మొదటి మూడు ఖండాలు కాగా ఒక్క శ్రీకృష్ణ జన్మఖండం 479 పుటలు ఏక ఖండానువాదం కావించినా గోపాలకృష్ణకవి ఆ పురాణంలో సగభాగాన్నిమించి ఆంధ్రీకరించాడన్నమాట

గోపాలకృష్ణ కవి 'శ్రీ కృష్ణజన్మఖండము' వ్రాత ప్రతి 496 పెద్ద పుటలు పుటకు సగటున 13 చొప్పున చూసినా ఈ కావ్యంలోని గద్యపద్యాలు 6000 (ఆరు వేలు) కు పై చిలుకు వ్రాత ప్రతిలో పద్య సంఖ్యలు వేసిలేవు ఆశ్వాసాలు పన్నెండు

ఇతి వృత్తం భాగవత దశమస్కంధంలోనిది రాధ ఈ కావ్యనాయిక నాయకుడు శ్రీకృష్ణుడు పురాణేతివృత్తం అనువాద కావ్యమైనా రచన స్వతంత్ర కావ్యం వలె సాఫీగా సాగింది కవి ఉభయ భాషావైదుష్యాలతో పాటు కవన నైపుణ్యం కలవాడు ఈ కావ్యాన్ని కవి శ్రీరామచంద్రునకు అంకితం కావించాడు ఆరు పద్యాల్లో ఇష్టదేవతానుతి కావించాడు పూర్వకవుల్లో వ్యాస వాల్మీక కాళిదాస సంస్కృత కవులను, ఆంధ్రకవుల్లో "నన్నయ ప్రముఖసూరి కవీంద్రుల" అని మాత్రమే నన్నుతించాడు (1-7)

మన్నన లేక యున్న నవమానము జేయుచు చూడకున్న సంపన్నుల యింద్లకున్ జనుచు పండితవర్యుల ధిక్కరించి నై జోన్నతికిన్ పరోపకృతి యుక్తులు దొంగిలి మత్కవిత్వమిట్లున్నది వింటిరే యనుచు నుబ్బెడు కాకవులెంత ధన్యులో (1-8) అని కుకవుల నర్మగర్భితంగా నిందించాడు

ఇక్కడ కవి వాక్యాలనే చూద్దాం - అవతారిక నుండి, వ॥ అని యివ్విధంబున నభీష్ట దేవతా ప్రణామంబును సుకవి స్తవంబును, దుష్ట విజనోపాలంబంబునుంగావించి, యేదేనియు నొక్క త్రిలింగ భాషా గ్రంధంబు నిర్మింపన్ దలంచి మనంబున నిట్లు వితర్కించితి - 9

ఉ ఆర్త శరణ్యుడై వెలయు వ్యాస మునీంద్రుడు దుర్ఘటాటవీ
వర్తనులైన మానవులవశ్యము సౌఖ్యము నొందగా త్రిశా
వర్తిత షట్పురాణములు వత్సలుడై రచియించె, బహ్మావై
వర్త పురాణమందు వినువారికి మేలు ఘటించునెంతయున్ 10

చ అమృత రసంబు పూర్ణమయి యంతట నుండుట కృష్ణజన్మ ఖం
డము వినుచుందరింపగ దృఢంబగు భక్తి భజింపగా సమ
గ్రములగు నైహికంబులు వరంబులు గల్గగ జేయు మెచ్చిని
క్కము హరి బ్రోచు నెప్పుడది గావున దాని తెలుంగు జెప్పెదన్ - 11

గీ ఆంధ్ర దేశ నివాసులై యమర భాష, పరిచయము లేక మోక్షంబు పధము దెలియ
నభిలషించు మహా ప్రాజ్ఞులలర కృష్ణ, జన్మఖండంబు తెనిగింతు సరస ఫణితి - 12

మోక్షార్థులైన విజ్ఞులకోసం కవి ఈ కావ్యం వ్రాశానన్నాడు

శా నా భాగ్యంబున మున్ను సత్కవులు నానా గ్రంథ నిర్మాణ స
త్త్వాభా సద్యశులై వెలింగి రయినం2 తద్గ్రంధ మాంధ్రింపగా
శ్రీభామా పతి కూర్మిచే ఒకనికిన్ జిత్తంబు రాదయ్యె దే
వాభీష్టంబటులుండుటన్ కృతికి నేనారంభమున్ జేసెదన్ 13

(1 సత్త్వాభాసద్యశులై, 2 అయినంతం - వ్రాతప్రతిలో గణభంగాలుగా ఉన్న ఈ పదాలను సవరించడమైంది) ఇది పోతన భాగవత పద్యాన్ని తలపించేది [7] కవి ఆశయం స్పష్టం

కధారంభం ఇది,

కం శ్రీవిలసిత సాకేత పు, రావాస నృపాల సోమ యభినుత రామా,
కేవల పరత్వధామా, సేవక భృతి వితత కామ సీతా రామా

వ॥ దేవా యవధరింపుము

ఉ॥ శ్రీవిలసిల్లు నైమిష విశిష్ట వనంబున శౌనకాదులు
ద్భావిత కీర్తివంతులు, తప పరిణాహ వివృద్ధ తేజులా
శావిదిత ప్రభావులు, నిశాచర వైరి పవిత్ర సత్కధా
జీవనులైన మౌనులు వసింపగ సూతుడు జేర వచ్చినన్

(ఆ మునులు సంతోషించి సూతునికి పర్యలు చేసి సుఖా సీనుంగావించి ఆస్తిక్యబుద్ధితో ఇట్లా అన్నారట )

ఉ॥ మాధవు సద్గుణంబులు సమంజస రీతి ననేకమున్ సుధా
మాధురి మించ జెప్పితిరి, మా హృదయంబుల యందు సంతసం
బేదితమై చెలంగ జగదీశ్వరుడైన సరోజ నేత్రుడా
రాధికతో విహార మొనరన్ రచియించుట వింటిమెంతయున్

(మునులు తమ సంశయ నివృత్తి కోసం ఇట్లా ప్రశ్నించారు )

తే గీ రాధ యెవ్వరి కన్య యా రామ తోడ, కృష్ణుడేలోకమున గూడి కేళి సలిపె?
లచ్చియే కాక మరివేరె మచ్చెకంటి, యొక్కొ సకలంబు వివరింపు ముచిత సరణి

సూతుడు వారి కోరికకు హర్షించి విష్ణుగాధా శ్రవణాసక్తిని ప్రశంసించి రాధామాధవ కథను వినిపించాడు నారదుడొక దినమున నరనారాయణులున్న బదరీ కేదార తీర్థమునకు వెళ్లి నారాయణునితోనే యీ కథ విన్నాడట వెళ్ళునప్పుడు ఆ దేవర్షి 'జీవుల ప్రళయంబులు శోకహర్షముల్ నారకనాక వాసములనారతమున్ బరికించి ఘోర సంసార విహారమెంతయు నసారమటంచు మదిన్ దలంచి" విచారమనస్కుడై ఉన్నాడు ఇంతకు ముందు బ్రహ్మమాటగా వెళ్ళి నారాయణ మునిచేత బ్రహ్మఖండ పూర్వభాగం విన్నాడట నారదుని ముఖంగా కవి బ్రహ్మ వైవర్త పురాణ ప్రశంస నీవిధంగా కావించాడు

గీ "బ్రహ్మఖండంబు చిత్త హర్షప్రదంబు, అఖిల జగముల కది విస్మయ ప్రదంబు"

గీ "అమృత ఖండంబుతో సాటియైన ప్రకృతి, ఖండమున ఖండ దుర్భర ఖండనంబు
జేయు గణపతి ఖండంబు చిత్తమలర, తేట పడనీవు వినిపించితివి మహాత్మ"

అది గతం ప్రస్తుతం విననెంచింది కృష్ణజన్మఖండం

ఆ వె గోకులమ్మునందు గోపవేషము బూని, యాత వెట్టి వింత లాచరించె
అలది యచట గొల్ల యలనాగలను గూడి యెట్లు సలిపె కేళి నీశ్వరుండు?

యాత = వ్యధకు వికృతి పదం, ఎలనాగ = యెలనాగ గ్రామ్యం, యలనాగ లేఖక దోషం

భాగవతంలో రాధ ప్రస్తావన తక్కువ కృష్ణుని మేనత్తగా ఉంది హరివంశంలోనూ ఆమె గాధ ఉన్నట్లు లేదు [8] ఈ కృష్ణ జన్మఖండంలోనే రాధా చరిత్ర వివరంగా ఉంది

తెలుగు సాహిత్యంలో శ్రీనాధుడే మొట్టమొదటిసారిగా భీమఖండ కావ్యావతారికలో రాధాకృష్ణుల ప్రణయవర్ణనతో ప్రస్తుతించాడు [9] పదహారవ శతాబ్ది శ్రీకృష్ణదేవరాయల ప్రబంధయుగంలోని చింతలపూడి ఎల్లన రాధామాధవం తర్వాతి దక్షిణాంధ్రయుగ రాధికాసాంత్వనాది కావ్యాలు - యక్షగానాలు రాధను కావ్యనాయికగా వర్ణించాయి ఈ 20వ శతాబ్దిలో పానుగంటి లక్ష్మీనరసింహరావు, 'రాధాకృష్ణనాటకము' అమలిన శృంగార రూపకంగా బహుళ ప్రచారం పొందినది సంస్కృత పురాణాలే కాక జయదేవుని 'గీతాగోవిందము' అష్టపదులు రాధాకృష్ణుల భక్తి శృంగారాల వ్యాప్తి కావించాయి

శ్రీకృష్ణ జన్మఖండం మూలంలో 173 శీర్షికలతో పూర్వోత్తర భాగాలుగా ఉంది పూర్వభాగంలో 54 ఉత్తర భాగంలో 119 శీర్షికలున్నాయి

కథా వివరాలు - విష్ణుగుణ ప్రశంస గోలోకవర్ణనంతో కథారంభం రాధాదేవి గోకులానికి, విష్ణు మధురానగరానికి వెళ్లారు

దేవకీ వసుదేవుల కల్యాణం ఈ పురాణంలో లేదు కాని, భాగవత దశమస్కంధ పూర్వభాగం

శ్రీకృష్ణ చరితమే కృష్ణ జన్మఖండ పూర్వభాగం కృష్ణుని బాల క్రీడలు భాగవతంలోనివే పూతన తృణావర్త శకటాసురుల భంజనానంతరం ఇందులో రాధాకృష్ణుల వివాహం ఒరిగింది

బక ధేనుక ప్రలంబాసుర వధలు, కాళీయ మర్దనం, ఇంద్రయాగ భంగం, గోపికావస్త్రాపహరణం, ఇవి రాధాకృష్ణుల వివాహం తర్వాత జరిగాయి రాస క్రీడకు ఈ కావ్యంలో ప్రత్యేక స్థానమున్నది

జాహ్నవి జననం, పార్వతి కల్యాణం, ఇంద్ర, సూర్య, అగ్ని, దుర్వాస,ధన్వంతరి మొ॥వారల గర్వభంగాలు ఈ కావ్య పూర్వ భాగంలోనే ఉన్నాయి

ఉత్తర భాగంలో శ్రీరామచరిత, కంసవధ, వృందోపాఖ్యానం, రుక్మిణీ కల్యాణం ప్రద్యుమ్న జననం, ఉషానిరుద్ధుల ప్రణయం, నారద సంసారం వ్రతాలు, స్తోత్రాలు, గృహస్థధర్మాలు ఇట్లా అనేక విషయాల వివరణలున్నాయి ఇందులో రాధాదేవి యశోదకు, ఉద్ధవునికి జ్ఞానోపదేశం చేయటం ప్రధాన ఘట్టాలు శంకర, గణేశ, జాహ్నవి, గౌరి, మోహిని మొ॥ స్తోత్రాలు పూజలు భక్తిభావ పూరిత సన్నివేశాలు కవి మూలకధకు విధేయుడై ఆంధ్రానువాదం కావించాడు ఇది బృహత్కావ్యం రచన సాఫీగా ఉంది కాని, లేఖక దోషాలు అనేకం చోటు చేసుకున్నాయి

రాసం నుండి రాధిక పుట్టినట్లు, అమె రోమకూపాల నుండి ఇతర గోపికలు జన్మించినట్లు, ఇంకా - ఇంద్రపత్ని శచీదేవి విష్ణుమూర్తిపై ప్రేమనుచూపగా ఆ దేవదేవుడు ఆమెను రాధగా గోకులంలో పుట్టుమని చెప్పి తాను కృష్ణుడుగా అవతరించాడని 'పూర్వగాధాలహరి' లో ఉంది అది ఏకావ్యంలోనిదో వారు తెలుపలేదు

శ్రీకృష్ణ జన్మఖండంలో రాధాకృష్ణుల కథ వివరంగా ఉంది ఒక్క రుక్మిణీదేవి తప్ప కృష్ణుని ఇతర పత్నుల ప్రస్తావన దీనిలో లేదు రాధ అతనికి మొదటి భార్య!

**కావ్యం చివర**

అపుడు కృష్ణుండు రాధకు నాత్మ తత్త్వ, మెరుగ జెప్పుచు తన వృత్తమెల్ల దెలిపి
ప్రకృతి రూపిణివంగనా వికృతి యెల్ల, నీదురూప మటంచు నన్నెలత బొగడె

అమ్మలగన్న యమ్మ ముగురమ్మల మూలపుటమ్మ - అని శివ భక్తులు దుర్గను ప్రస్తుతించినట్లే ఈ విష్ణుభక్తి కావ్యంలో రాధాదేవిది ప్రథమ స్థానం

ఉ॥ అంత సరోరుహాక్షుడు మృగాక్షిని గౌంగిట జేర్చి, రాధ! యా
క్రాంత దయామతిన్ మదపరాధములెల్ల సహించు మంచున
త్యంతము నూరడించిన యధా విధి రాధిక సంతసించెన
య్యంతులు మించి మోదము వహించి రహిం బ్రణ మిల్లిరెంతయున్

రాధాదేవిదివ్య లోక గమన వర్ణనమిట్లున్నది

సీ గోలోక వాసులు కోరి వెంబడి రాగ, చెలువ గోలోకంబు జేరబోయి
విరజానదీ తీర విభవంబు జూచుచు, శత శృంగ గిరి వనస్థలులు గనుచు
మణిరమ్యమను రాస మండల మీక్షించి బృందావన స్ఫూర్తి ప్రీతి గాంచి
శత యోజనాయుత శ్రిత శాఖియై యొప్పు , నక్షయవట వృక్ష మధిగమించి

గీ కోటి గోపీ సహస్రముల్ గొలువ బృంద, యెదురుగా వచ్చి సస్మితవదన యగుచు
ప్రణుతి జేసిన సల్లాప పటిమ దనర, తన గృహంబున కేగె రాధా వధూటి!

గోపాలకృష్ణ కవి గారి శ్రీకృష్ణ జన్మఖండం యధామూలానువాదం సరస రీతిలో వ్రాసెదనని కావ్యాతారికలో తాను చెప్పిన మాటను కవి రచనలో నిలబెట్టుకున్నాడు [10]

కవి - కావ్య నీతి ఇట్లాగున్నది కృష్ణ జన్మఖండము - పుట 322

బోధములేని బూరుషుడు బోడిమి దూలి స్వకర్మ బద్ధుడై
బాధల నొందుచుండు గత పాపము బోధము గల్గి సజ్జనుం
డేధిత సర్వదోషముల నింధన జాలములగ్నిబోలి తే
జోధికుడై దహించునత డార్తి వహించునె కర్మకోటిచేన్

కవికి తన కవనంపై ఎంత విశ్వాసమున్నా విమర్శక జనంపై భయం ఉండనే ఉంది అది రెండవ కావ్యంలో వ్యక్తీకరించాడీవిధంగా

ఆవె॥ కడుపు నిండ కాన్పు గన్న వానికి నొకరి, కాన్పు మీద కరుణ కలిగినట్టు
తాను కావ్యకర్త యైన వాడితరుల, కావ్యమరసి బ్రోచు గాదజగతి!"
నహి వంధ్యా విజానాతి! నిజమే కదా! (సంవరణ చరిత్రము)

**2 సంవరణ చరిత్రము.** 'తపతీ సంవరణోపాఖ్యానం పేర పురాణ ప్రసిద్ధమైన కథను కుందావజ్జుల గోపాలకృష్ణ కవి ప్రబంధంగా రచించారు చాలా కాలం వరకు ఇది అలభ్యం

డా బి రామరాజుగారు 'వివేచన' డిసెంబర్ 1978లో మొట్టమొదట ఈ ప్రబంధంలోని కేవలం ఒకే ఒక ప్రథమాశ్వాన్ని తాము మడికొండలో చూసినట్లు తెలిపారు దానితో అలభ్యమనుకున్న ఈ కవి రెండవ కృతి ఈ మాత్రమైనా వెలుగులోనికి వచ్చి సాహితీపిపాసువులను అలరించింది

'సంవరణ చరిత్రము' శృంగార ప్రబంధం, ఇది శ్రీ వేంకటేశ్వర స్వామికి అంకితం

లభించిన ప్రథమాశ్వాసంలో 233 గద్యపద్యాలున్నవి వ్యాసకర్త కేవలం పది పద్యాలను మాత్రం ఉదహరించారు ఈ శృంగార ప్రబంధాన్ని సైతం నైమిషారణ్యంలో సూతుడు శౌనకాది మహామునులకు వినిపించినట్లుగానే విరచితం ఈ ప్రబంధంలో ఇష్టదేవతానుతి షష్ఠ్యంతముల అనంతరం హస్తినాపుర వర్ణన, చాతుర్వర్ణముల, చతురంగ బలాల, పుష్పలావికల వర్ణనల తర్వాత కథానాయకుడైన సంవరణుని గుణరూప వర్ణన సాగింది

సూర్య పుత్రికయైన తపతిపై సంవరణుడు మోహం పెంచుకుంటాడు స్వర్భామినులు సంవరణు ప్రశంసా గీతాలు పాడగా విని తపతి అతనిపై మరులు కొంటుంది నారదుని వలన తపతి వివరాలు సంవరణుడు వింటాడు సంవరణుని మృగయా వినోదం ప్రేయసి స్మరణ మోహావస్థలు చెలుల ద్వారా విని తపతి ప్రియునిపై అనురాగం పెంచుకొని విరహతపనకు లోనవుతుంది అంతటితో ఆశ్వాసాంతం

కవి దీనిని మహా ప్రబంధం అని పేర్కొన్నారు కనుక మరి నాలుగైదు ఆశ్వాసాల కథ ఉండి ఉంటుంది కవి రచన ఒక అశ్వాసంతోనే ఆగిందో, మిగితాభాగం వ్రాసినా లభించలేదోతెలియదు

**ఆశ్వాసాది పద్యం -**

శా శ్రీరంజిల్ల మనోజ్ఞ సౌధమున లక్ష్మీ భూవధూటుల్ ప్రియో
దార స్వాను రతాను రాగ గరిమల్ తర్కింపగా గూఢ సం
చారుండై చని భూమిదేవి నయనాబ్జాతంబులన్ మూసి శ్రీ
నారిన్ చుంబన కేలి దేల్చు విభునిన్ భావింతు భావంబునన్

అది దక్షిణా నాయకుని శృంగార కేళి! బహు భార్యలున్న పురుషోత్తముని పాట్లు!
శివ పార్వతుల నుతి ఇట్లుంది -

సీ ఎక్కకోడెల మిన్న మెక్కగా విసమెన్న, జడముడిపై పాల కడలి వెన్న,

ఈ పద్య చరణాలన్నీ ఇలాగే అంత్యాను ప్రాస శోభితాలు

రాయల కాలపు ప్రబంధయుగ వర్ణనలకు సమతూకం కలిగిన ఈ కవి వర్ణనలు మధుర భావగర్భితాలు, మనోహర పదబంధ ప్రసన్న శైలీవిలసితాలు నాయకుని వనవిహారంలో ఒక లతాకన్య ఇలా ప్రణయ ప్రియాపరిరంభణ భావాన్ని సూచించిందట!

చ వికసిత పుష్పవక్త్రయయి విహ్వాల భావగతాళి నేత్రయై
యొకలతికా హిమాంశుముఖి యొక్క ధరారుహ యౌవనాఢ్యున
ల్కుకొని నృపాల మౌళి కటముంగటగా గల పద్మ మిత్ర పు
త్రిక పరిరంభ కేళులను దెల్పె ప్రమోద విధాన దక్షయై

విరబూసినపూలమోముతో,కల్లోలంపొందిచలించేతుమ్మెదలకన్నులతో,ఓచంద్రవదయైనతీగె,ఒక బలమైన వృక్షాన్నికౌగిలించుకొని,నాయకునికినాయికాపరిరంభనసూచననునేర్పుగా చేసినదట

ఇది కవి భావ ప్రౌఢిమకు వర్ణనా దక్షతకు నిదర్శనం వసు చరిత్రలోని భట్టుమూర్తి వర్ణనలకు సమ ఉజ్జీననిపించుకొనేదీ సరోవర వర్ణన సీసం

సీ హేలా చరత్కీర బాలా గరుత్వాత, ఖేలా పతత్సూన కీలితంబు
ధారాళ సుమవారి పూరానుగ మిళింద, నారీ రితారావ చారుతరము
వేలా తటీ సంభవైలా లతోత్తాల, తాలాను చరకోకిలాలి యుతము
కేళీ గృహీభూత నాళీక సంఘాత, పాళీ సమంచన్మరాళ యుగము
గీ నిఖిల యువజన జన కలా నిరత సరసి, జాళుగా దీర్ఘ సింహనాదాను కారి
బర్హినినదంబు తత్సర పరిసరంబు, జగదధీశుండు సూచి యుత్సవము నొందె

భట్టుమూర్తి, తెనాలి రామకృష్ణుల పద్యాల తలపించే శైలీ పరిపాకం గోపాలకృష్ణకవి కలానిది ఆయన సంస్కృతాంధ్రోభయ భాషల సముచిత పాండిత్యం కలవాడు ప్రతిభకల కవి

కృష్ణ జన్మఖండం పురాణానువాదం భావావేశవర్ణనలు కవితా చమత్కృతులు అంతగా లేనిది అది మూల విధేయంగా సాగిన అనువాద పురాణం - భక్తి కావ్యం కాబట్టి, కవి రసిక పండిత పాఠకులను అనురంజింపజేయటానికి, తన కవిత్వపు సత్తాను చాటుకోవటానికి శృంగార ప్రబంధముగా సంవరణ చరిత్రమును రచించి ఉంటాడు

లభించినది ఏకాశ్వాసం రచన రసవత్తరం పూర్తి ప్రబంధం దొరికి ఉంటే కృష్ణరాయల భువన విజయ సభాభవన ప్రముఖ కవుల ప్రబంధాల సరసన నిలువజాలిన ప్రౌఢ ప్రబంధాన్ని అందించిన ఖ్యాతి ఈ కరీంనగర్ జిల్లాకు దక్కి ఉండేది నాడు విదేశీయుల పాలన కాలంలో ఆంధ్రభారతి తమిళదేశ నాయక రాజుల ప్రాపులో పోషింపబడుతున్న అంధకార యుగంలో, తెలంగాణాలో వెండి వెన్నెల తెలుగు వెలుగు వెదజల్లిన పున్నమి చంద్రుడు గోపాలకృష్ణకవి

పేటికలోపలి రత్నాలు వారి కృతులు ముద్రణా భాగం పొందితే కదా ప్రభా వ్యాప్తి!

**పాదపీఠికలు**

1 కు గోపాలకృష్ణ కవి వంశంలో అయిదవ తరం వారైన కీ శే వెంకట నరసయ్య ఇందుర్తి గారు వ్రాసి ఉంచిన కాగితంపై ఈ విషయాలున్నవి
2 గోలకొండ కవుల సంచిక - 1934, పు 398 3 వవేచన - డిసెంబర్ 1978, పుట - 61
4 గోపాలకృష్ణకవి వంశంలో అయిదవ తరం వెంకట నరసయ్య గారి తమ్ముడు రామచంద్రయ్య గారి అల్లుని తమ్ముడైన ప్రవీణ్ రావు (కొహెడ) గారి వద్ద కృజ ఖం వ్రాతప్రతి ఉంది వారు ఈ గ్రంథంపై బెనారస్ యునివర్సిటీలో పిహెచ్ డి చేస్తున్నారు
5 డా బి రాయరాజు గారు 'వివేచన' డి-75 సంచిక వ్యాసంలో చూపించింది 6 సంస్కృత ప్రతి ముద్రణ 1935, బ్ర వై పు ఉత్తర భాగం 433-911 పుటలు
7 యొనరన్ నన్నయ తిక్కనాది కవులీ యుర్విన్ బురాణావళుల్
తెలుగుంజేయుచు మత్సురాకృత శుభాధిక్యంబు తానెట్టిదో

తెలుగుం జేయరు మున్ను భాగవతముం దీనిన్ దెఇంగించినా
జననంబున్ సఫలంబు జేసెద పునర్జన్మంబు లేకుండగన్

8 డా॥పి యశోదా రెడ్డి "తెలుగులో హరి వంశములు" 1973,లో (రాసక్రీడ' విషయం తప్ప వేరే ప్రస్తావన లేదు పు 66,515, 9 శ్రీనాథుడు 'భీవేశ్వర పురాణము' 1-3

ఉ బాలిక మోము మత్తనవ బర్హి కిశోర కలాస్య లీల బై
వాలిచిపచ్చ కప్పురపు వాసనతోడి ముఖారవిం దతాం
బూలపు మోవిమోవిపయిమోపుచు రాధకు నిచ్చు ధూర్తగో
పాలుడు ప్రోచుగావుతమపార కృపామతి మంత్రియన్ననిన్
ఇందలి కావుతము పదం గమనార్హం

10 కె ప్రవీణ్ రావు లెక్చరర్ గారు సైతం ఇదే మాట అన్నారు 11 వివేచన డిసెంబర్ 1978 పు 63

## 4 పరాంకుశం గోపాలకృష్ణయ్య

ఈ కవి కాలం, జన్మ గ్రామం ఇదమిత్థమని ఖచ్చితంగా నిర్ణయించగల ఆధారాలు లేవు అయినా ఈ కవి కరీంనగర్ జిల్లా వారే అని విశ్వాసం

గోపాల కృష్ణ కవి కావ్యం ఒకే ఒక్కటి అది "శ్రీరంగ మహాత్మ్యము" అముద్రితం ఇది మూడాశ్వాసాల చంపూ కావ్యం ఈ విష్ణుభక్తి ప్రబంధంలో దాదాపు 500 గద్య పద్యాలున్నాయి [2]

**కవి వంశం:** ఇందులో కవి పరిచయ పద్యం ఏదీ లేదు అశ్వాసాంత గద్యలు మాత్రం ఇట్లున్నవి

"ఇది శ్రీ వేణుగోపాల వర ప్రసాద లబ్ధ కవితా విలాస శ్రీమద్రామానుజ గోత్ర పరాంకుశ సూత్ర గోవిందార్య పౌత్ర, రామానుజార్య పుత్ర,పరాంకుశ సుధీవరానుజ, సజ్జన విధేయ గోపాలకృష్ణయ నామధేయ ప్రణీతంబైన శ్రీరంగ మహాత్మ్యంబు నందు తృతీయాశ్వాసము"

ప్రథమాశ్వాస గద్య ఇంతే అందులో గ్రంథాన్ని మహాపుణ్యక్షేత్రమన్నాడు అన్నగారికి సుధీ విశేషణం లేదు ద్వితీయాశ్వాస గద్య చిన్నది కవి పేరు తప్ప ఇతర వివరాలు లేవు

ఈ కావ్య గద్యలను బట్టి గోపాలకృష్ణ కవి వంశ వృక్షం ఇట్లుంటుంది




కవికాలం కాలాన్ని చూపే పద్యం ఈ కావ్యంలో లేదు వ్రాత మాత్రం అచ్చు కాలానికి పూర్వపుది క్రిష్ణ, అంత్యా, పద్య పాధాంతాల్లో లఘువు ఉండవలసిన చోట గురువు, ఇలా శాసనకాలాలను తలపిస్తుంది కాని, జన సామాన్యంలో ఇటువంటి వ్రాతే ఈ శతాబ్దారంభం వరకున్నట్లు పెద్దలు అంటారు వ్రాత ప్రతి చివర శ్రీగిరి లింబాద్రి, గర్రెపల్లి కందాళ రామయ్య గారి ప్రతి చూసి వంగలి రాజయ్య వ్రాసుకున్నాడు తప్పులుంటే పెద్దలైన వారు తిట్టక దిద్దవలెను - అని ఉన్నది

కందాళ (డై) వారు శ్రీవైష్ణవులు రామయ్య గారి పుత్రులు కూడా గతించారు వంగళవారు వైశ్యులు మానకొండూరులో ఉన్నారు విచారించితే రామయ్య గారు కీర్తి శేషులు వారి పుత్రులకీ విషయం తెలియదు కాని, ఈ కావ్య ప్రతి లభించిన చిగురు మామిడి వైశ్యులతో వీరికి బంధుత్వం ఉందని మాత్రం తెలిసింది వీరందరూ ఈ శతాబ్దివారే

కావ్యాంతంలో మాత్రం బహుధాన్య జ్యేష్ట బహుళ చతుర్దశి లక్ష్మీవారం[3] నాడు ఈ కావ్య రచన ముగించినట్లుంది గత బహుధాన్య 1938లో పై తిధినాడు ఆదివారం అది పై వ్రాత ప్రతి తిరుగవ్రాసుకున్నవారి తేది అయి ఉండదు 1878లోనో 1818,1758లోనో ఈ కావ్యరచన జరిగి ఉంటుంది

ఈకావ్యంలో శర్కర పదం ఒకే ఒకసారి వాడబడింది శ్రీనాధుడు మొదట ఆ పదాన్ని వాడాడు కవి కాలానికి ఆపదమేమైనా ఉపయోగిస్తుందా అంటే యజుర్వేదంలోనూ శర్కర పదం ఉందట అది తీపికి పర్యాయ వాచి కాబోలు, ఈ కవి పూర్వ కవుల్లో "వాల్మీకి వ్యాస శుక సూతుల" పొగడి భగవద్భక్తిని చాటుకున్నాడే తప్ప మరే తెలుగు కవినీ పేర్కొనలేదు

**కథా సంగ్రహం -** ప్రథమాశ్వాసంలో - కైలాస వర్ణన, శివుడు కొలువుదీరుట, నారదుడు బ్రహ్మలోకం నుండి కైలాసం వచ్చుట, మునుల సంస్తుతి, శివుని వలన నారదుడు శ్రీరంగ మహత్వం వినగోరుట, శ్రీరంగ క్షేత్రవర్ణనతో ఆశ్వాసాంతం

ద్వితీయాశ్వాసం - శ్రీరంగ విమానం బ్రహ్మపుష్కరిణి ఆవిర్భావం, ప్రళయజలధిలో వటపత్ర శాయి యోగనిద్ర, బ్రహ్మజననం, నలువ తపస్సు, హరి తన సుతునకు సృష్టి అధిపత్యము నొసంగుట, మధుకైటభులు వేదములను దొంగిలించుట, విష్ణుమూర్తి మత్స్యావతార మెత్తి రాక్షస సంహారం కావించుట, గరుడునిచే శ్రీరంగ విమానం తెప్పించి బ్రహ్మకు ఇవ్వగా అతడు దానిని మానస సరోవరమున ప్రతిష్ఠించుట

తృతీయాశ్వాసం సూర్యవంశ వర్ణన ఆ చక్రవర్తుల ఇలవేల్పు శ్రీరంగధాముడు ఏక పద్యంలో రామాయణం రాముడు విభీషణునకు రంగ విమానమును దయసేయుట, దానినాతడు కావేరి మధ్య తీరమున నిలుపుట, చోళరాజు ఉత్సవాలు నిర్వహించుట, క్షేత్ర మహిమావర్ణనతో కావ్య పరిసమాప్తి

**కవితా విశేషాలు** కావ్యారంభ పద్యం శార్దూలం

శ్రీశేషాహి ఫణావళీ మణి ఘృణీ(న్) జేగీయ మానోరు తే
జస్ఫూర్తి నివానునిన్ బుధ మనశ్శుద్ధాంతరంగోర్విపే
లా సంపూర్ణ కృపాభిరాముని జగద్రక్షాను సంధానుల
క్ష్మీ సంభావుని నాత్మమూలుని హరిం జింతింతు నశ్రాంతమున్

ఈ కృతిలో లేఖక దోషాలున్నాయి రెండవ పాదంలో యతి ప్రాస రెండూ తప్పాయి ఈ పాదారంభ కవి ప్రయోగ పదమేదో తెలియదు

తర్వాత లక్ష్మీ బ్రహ్మసరస్వతుల, గణనాయక కాళికాస్తుతులు కావించాడు

సరస్వతీ స్తోత్రం ఉత్పల మాలతో ఉంది

మానిత భక్తి యుక్తిని నమంచిత కార్యవిభూతికై బుధ
త్రాణిని మంత్ర పూర్తిని పురాణిని సంతత చారు వల్లకీ
పాణిని భవ్యరూపిణిని పద్మజు రాణిని సేవ్యమాన గీ
ర్వాణిని కీర సన్మధుర వాణిని వాణిని సన్నుతించెదన్

ఇందలి తత్సమాలు కొన్ని వ్యాకరణవేత్తలు ఒప్పరు అవిచ్యుత సంస్కృత పద రూపాలు

పరాంకుశం గోపాలకృష్ణకవి గురువు శ్రీమత్తిరుకోవెలూరి రామానుజులు గురువు గారి గురువు ఆసూరి శ్రీనివాసాచార్యులు (శ్రీరంగంలో) ఈ కవిని పిలిచి ఈ కావ్యరచన చేయుమని ఆదేశించాడట[4]

కం నను జీరి దాసవాంఛను, జన కాత్మజ రమణు పేర నదమల గతి వే
డ్కను రంగనాథ చరితము తెనిగించు మటంచు నాన తిచ్చిన నియతిన్

చివరి పాదంలో అఖండ యతి వాడబడింది రంగనాథ చరితమును ఆంధ్రీకరించు మనటమే కాక శ్రీరామునికి అంకితం ఇమ్మని కూడా శ్రీనివాసయ్య గారే కోరినారు మూలం సంస్కృతమే అయ్యుంటుంది కాని, ఏ తత్కావ్య కవి నామాన్ని మాత్రం పేర్కొనలేదు నా రచియింపబూనిన శ్రీరంగ మహాత్మ్యంబను మహా పుణ్య చరిత్రమునకు కథాక్రమం బెట్టి దనిన ' అని కవి వాకృచ్చాడు ఇందలి శ్రీరంగ వర్ణన ఇట్లున్నది

సీ శ్రీధరు నిజ పదా శ్రిత జనామర భూజ, కందంబు శ్రీరంగ మందిరంబు
ఘన తత్వ మార్గైక సనకాది మునిజనా నందంబు శ్రీరంగ మందిరంబు
భాసమాన రమా నివాస సౌవర్ణార, విందంబు శ్రీరంగ మందిరంబు
దివ్య సంచయ సదా సేవ్యమాన ముముక్షు, బృందంబు శ్రీరంగ మందిరంబు
గీ వుభయ కావేరి మధ్య మందొనర చంద్ర, పుష్కరిణి తీరమున మహాద్భుత విరాజ
మాన సంపత్సమృద్ధి నమంద ధామ, సుందరంబగు శ్రీరంగ మందిరంబు

ఈ సీసంపై శ్రీనాథ పోతనల ముద్ర చక్కగా పడింది ఈ పద్యమందలి ధారాస్పద పద పాదశైలీ ప్రసన్నత, అంత్యానుప్రాస కవి కవన శక్తికి నిదర్శనాలు - మనోహరాలు

శివుని వాక్యం -

గీ దేవతలలోన శ్రీవిష్ణు దేవు కరణి, వేదములోన ప్రణవంబు వెలశినట్లు
వైష్ణవులలోన నావలె వసుధ దివ్య మందిరములలో శ్రీరంగ మందిరంబు!

శివుడే విష్ణుభక్తుడైన ఇక శైవ విభేదమెక్కడిది? సర్వదేవ నమస్కారం కేశవం ప్రతి గచ్ఛతి అన్నట్లు, ఇది సర్వం జగన్నాథం అనే హరిభక్తి సిద్ధాంత ప్రతిపాదనం

దేవతల పూజా మహిమలు, ఆచారాల వివరణ, వాటి వలన కలిగే ఫలితాల ప్రకటన ఈ కావ్యంలో ఉన్నాయి కథ తక్కువ, వర్ణన లెక్కువ నాయకీ నాయకులు, అష్టాదశ వర్ణనలు లేవు, కనుక ఈ గ్రంథాన్ని ప్రబంధం అనలేం - ఇది భక్తి కావ్యం! ఈ కావ్యం నాటి అనేక వ్యావహారిక ఆంధ్ర పద రూపాలను తెలియజేస్తుంది లేఖక దోషాలు లేకుంటే బాగుండేది ఉ॥ జెయము, చెంద్రుడు వంటి పదరూపాలున్నా, వాటికి యతి అత్వ హల్లులతోనే విధించబడింది జ్ఞను గ్నఅని వ్రాశారు కొన్ని వ్యాకరణ విరుద్ధ ప్రయోగాలు సైతమున్నాయి 'యజ్ఞేశు డెజ్ఞ మయుడును' భాగవతంలోని నడక గల ఈ కంద పద్యం అందమైన దైనా యజ్ఞ, శబ్దాన్ని ఎజ్ఞ అని సంధి కూర్చడం పొసగనిది ఇలాగే మరికొన్ని భాగవత దశమ స్కంధోత్తర భాగంలోనూ ఎశోద వంటి కొన్ని ఒప్పని పదాలు ఉన్నాయి

కవి ఒకసారి వెంకటనాథుని పేర్కొనడాన్ని బట్టి ఇది విజయనగర కాలానంతర రచన అని చెప్పవచ్చు కాకతి యుగంలో తిరుపతి వ్యాప్తి లేదు ఇందులో భద్రాచల ప్రసక్తి కూడ లేదు కనుక మూల కావ్యం పెద్దనకు రామదాసుకు 16-17 శతాబ్దాలకు మధ్య కాలపుది అయి ఉండవచ్చు

ఈ కావ్యంలోని మరిరెండు విశేషాలు, ఉర్దూ పదం ఏ ఒక్కటి ఇందులో లేదు ఇంకా ఇది ద్రవిడ దేశంలోని శ్రీరంగంలో విరచితమైనా పైగా తమిళ భాషాప్రియుల వైష్ణవ గాథ అయినా తమిళ శబ్దం ఒక్కటి కూడా కవి ప్రయోగించలేదు

ఈ జిల్లాలో పలు గ్రామాల్లో[5] పరాంకుశ గృహనామ సంకేత చాత్తాద వైష్ణవులున్నారు ఎవరిని అడిగినా ఈ కవిని గూర్చి వారికి తెలియదు ఈ కావ్యాన్ని వ్రాసుకున్న గఱ్ఱెపల్లి శ్రీ వైష్ణవులు భాగవత ఏకాదశ స్కంధంతో పాటుగా దీన్ని కలిపి వ్రాసుకున్నారు ఇది వైష్ణవ భక్తికి ఈ జిల్లా కవులపై కల ఆసక్తికి నిదర్శనం అనుకోవచ్చు

స్వస్థలం, కాలం స్పష్టంగా తెలువకున్నా పరాంకుశం గోపాలకృష్ణకవి ఈ జిల్లా వాడే అనటం అసంగతం కాదు శ్రీరంగ మహాత్మ్యంభక్తులనలరించే కావ్యం అముద్రితం

**పాదపీఠికలు**

1 ఎం సత్తెయ్య, బి ఓ ఎల్ 'గోలి వెంకన్న పల్లి' గారి వద్ద ఈ కృతి వ్రాతప్రతి ఉంది
2 వ్రాత ప్రతి 49 డెమ్మీ 1/8 పుటలు మందాపు కాగితంపై నల్ల సిరా పలక కలం వ్రాత పుటకు సగటున 10 పద్యాలు లెక్కిస్తే 490 ఉంటాయి 450 కంటె తగ్గవు
3 కరీంనగర్ ప్రాంతంలో శుక్రవారం లక్ష్మీవారం ఖమ్మం నుంది కోస్తాంధ్రలో లక్ష్మీకారం అంటే గురువారం
4 ఈ జిల్లాలో పరాంకుశం, తిరుక్కోవెలూరి, పరవస్తు, గృమనామాలతో చాత్తాద వైష్ణవులున్నారు ఆసూరి మరిగంటి వారు శ్రీవైష్ణవులు
5 రేకొండ, కొడిమ్యాల, రాయికల్, కొరుట్ల మొ॥వి

## అనుశ్రుత - అలబ్ధ సాహిత్యం

ఈ 17, 18 శతాబ్దాల రెండువందలేండ్ల కాలంలో కరీంనగర్ జిల్లాలో కావ్య కర్తలైనవారి గ్రంథాలు లభించని కవులు అయిదుగురు వారిలో ముగ్గురు గోలకొండ కవుల సంచికలో కనిపించారు ఇద్దరు చాగంటివారి ఆంధ్రకవి తరంగణికెక్కారు నలుగురి పరిచయాలు కరీంనగర్ మండల చరిత్రలో ఉన్నాయి ఒక కవి పరిచయం కరీంనగర్ జిల్లా రచయితల చరిత్రలోనిది ఈ కవుల పేర్లు ఇవి

1 రాజలింగ కవి, 2 సోమనాథ కవి, 3 కోడూరు వెంకటాచలపతి, 4 ఆత్తలూరు పాపకవి, 5 సముద్రాల రామానుజా చార్యులు ఈ కవులవారి రచనల వివరాలు వరుసగా చూపబడుతున్నాయి

## I. రాజలింగ కవి - కోరుట్ల, 1600

రాజలింగ కవిది కోరుట్ల ఆరాధ్య బ్రాహ్మణుడు చెఱకు లక్ష్మణ మంత్రి ప్రేరణచే 'కూర్మపురాణము'ను అనువదించి శ్రీశైలమల్లికార్జునునికి అంకితం కావించాడు

**కాలం** చెఱకు లక్ష్మణ మంత్రి కాలమేదో తెలియదు కోరుట్లలో రాజలింగకవిని గురించి తెలిసిన వారులేరు కాని, చెఱుకు వారి ఇంటి స్థలాన్ని మాత్రం గడికోటకు పడమర వీధిలో చూపించారు రాజలింగకవి కూర్మ పురాణకావ్య పూర్వ కవి స్తుతి పద్యంలోని కవుల కాలాలు ఈ కవి కాల నిర్ణయానికి కొంత వరకు ఉపయుక్తాలు, ఆ పద్యం ఇది

సీ నన్నయ భట్టు దిక్కన్నను నెఱ్ఱయ, కవిని భీమనను భాస్కరుని బోత
రాజును శ్రీనాధరామలింగయ్యను, రంగనాధుని రామలింగకవిని
సూరప రాజును గౌరపాహ్వయు ప్రౌఢ, కవి మల్లును కవి భైరవిని బెద్ద
నార్యుని ముక్కు తిమ్మన్నను జిన్నన్న, యాదిగా రసికులౌ యాంధ్ర కవుల-

వీరిలో కవిత్రం 11-14 శతాబ్దాల మధ్య వారు భాస్కర రంగనాధులది కాకతీయ యుగం 12 13 శతాబ్దాల మధ్య కాలం శ్రీనాధ పోతన గౌరనలు 15వ శతాబ్ది కవులు ముక్కు తిమ్మన, తాళ్ళపాక చిన్నన్న తెనాలి రామలింగయ్య, పింగళి సూరన 16వ శతాబ్దివారు కవి మల్లు భైరవి కవుల కాలాలు స్పష్టంగా చెప్పలేం ఈ పద్యంలో రామలింగ కవులిద్దరున్నారు మొదటి కవి, రాయల కాలపు తెనాలి రామకృష్ణుడు రెండవ వ్యక్తి 'ధీర జన మనోభిరామం' రచించిన గోలకొండ విశ్వబ్రాహ్మణ రామలింగ కవి, 1784 కాలం వాడని గోలకొండ కవుల చరిత్రలో ఉంది [1] బ్రాహ్మణ నిందతో (శష్ప విజయం అనే ఇతని కృతి ఆనందం బ్రహ్మానందం అనే పేరుతో గుజిలీ ప్రతుల్లో లభిస్తున్నది) పద్య కావ్యం వ్రాసిన ఆ రామలింగన్ని ఈ భక్త కవి రాజలింగశాస్త్రి స్మరిస్తాడా? ఒకవేళ అతనినే పేర్కొన్నట్టయితే ఆ రామలింగ కవి మరో వందేండ్లు పూర్వుడు కావాలి ఎందుకంటే అప్ప

కవి తన కావ్యంలో కూర్మ పురాణ పద్యాన్ని ఉదాహరించాడు [2] ఆప్పకవి కావ్య రచనారంభం 1656 అని ఆ కావ్య అవతారికలో ఉంది [3] అప్పకవి ఉదాహరించిన కృతి కర్త రామ లింగ కవి అతనికి యేబదేండ్లయనా పూర్వుడు కావాలి కవులిద్దరు తెలంగాణావారు [4] దీనిని బట్టి రాజలింగ కవి కావ్యం క్రీ శ 1600 సుమారుగా పుట్టి ఉంటుంది కవి 16వ శతాబ్ది ఉత్తరార్థంలో జన్మించి 17వ, శతాబ్ది పూర్వార్ధంలోనూ జీవించి ఉంటాడు కూర్మ పురాణం వ్రాసిన రాజలింగ కవి స్తుతించిన సూరపరాజు ప్రబంధకవి సూరననా?[5] లేక, మరో పురాణానువాదకర్తయైన వెన్నెలగంటి సూరన్ననా?[5] వెన్నెల గంటి సూరన పింగళి సూరన కంటె మరో నూరేండ్లు పూర్వుడు కాబట్టి రాజలింగ కవి స్మరించినది ఏ సూరననైనా అతని కాల నిర్ణయంలో భేదం రాదు

**స్వస్థలం** -"కోరువుట్ల పట్టణమాంధ్ర మండలములో గన్పట్టలేదు నిజాము రాష్ట్రములో నుండెనేమో కవియు నచ్చటి వాడైయుండును" అని చాగంటి శేషయ్య గారు కావ్య పీఠికలోని పద్యాన్ని బట్టి పేర్కొన్నారు [6] అప్పటి నైజాం - హైద్రాబాద్ సంస్థానంలోనిదే ఇప్పటి ఆంధ్రప్రదేశ్‌లోని తెలంగాణా కరీంనగర్ జిల్లా నుంచి నిజామాబాద్ వెళ్ళు బస్సు మార్గంలో జగిత్యాల - మెట్టుపల్లి పట్టణాలకు మధ్య కోరుట్ల పట్టణం ఉంది వేములవాడ చాళుక్యుల కాలం నాటి దీని శాసన నామం కొరువుట్ల ఆ చారిత్రక గ్రామమే జనవ్యవహారంలో కొరుట్లగా మారింది రాజలింగకవి కరీంనగర్ జిల్లా కొరుట్ల వాడు

**కవి వంశ వివరాలు** - కూర్మ పురాణ కావ్య గద్య ఇది ' ఇది శ్రీగిరీశ్వర వర ప్రసాద లబ్ధ కవితా విలాస అశ్వలాయన సూత్ర వసిష్ఠస గోత్ర పవిత్ర నరేశ్వర పుత్ర సకల విద్యా ప్రసంగాను షంగ రాజలింగ ప్రణీతంబైన శ్రీ కూర్మ పురాణంబను మహా ప్రబంధంబు నందు సర్వంబును షష్ఠాశ్వాసము "

కవి బ్రాహ్మణుడు అతనిది వసిష్ఠ గోత్రం - అశ్వలాయన సూత్రం కవి తండ్రి పేరు నరేంద్రుడు ఇప్పుడు కోరుట్లలో నాలుగైదు బ్రాహ్మణ కుటుంబాలున్నా, వారిలో పాలెం వారిది కాశ్యప గోత్రం, వజ్జల వారిది హరితస గోత్రం వసిష్ఠ గోత్రీకులు మాత్రం లేరు ఆరాధ్య బ్రాహ్మణులున్నా వారు కేవలం ఒక తరానికి ముందు ఈ పట్టణానికి వచ్చినవారు కవి ఆరాధ్య బ్రాహ్మణుడనడానికి నిదర్శనం అతడు వీరశైవ కవుల ప్రత్యేకంగా ఒక పద్యంలో స్తుతించడం

గీ పండితారాధ్య దేశికు బాలకురికి, సోమనాయకు బిడుపర్తి సోము బసవ
దేవు శరభాంకు ఘటిక సిద్ధేశు నాత్మ, లోన సన్నుతి సేయు దనూన భక్తి

ఇంకా స్వీయ పరిచయ పద్యంలో "వీర శైవశాస్త్రాగమ మార్గ నిర్ణయ రిరంసుడ"నని పేర్కొన్నాడు

**కావ్య వివరాలు** వ్యాస ప్రోక్త కూర్మ పురాణానికి అనువాద చంపూ కావ్యం రాజలింగకవి విరచిత శ్రీ కూర్మ పురాణం కవి దీని ఆశ్వాసాంత గద్యలలో మహా ప్రబంధమని పేర్కొన్నాడు ఇందలి అశ్వాసాలు ఆరు చాగంటివారు కూర్మపురాణ ప్రతి తమకు ఎక్కడ లభించిందో తెలుపలేదు "ఇతని కవిత్వము సరళమై ధారాశుద్ధిగలిగి మనోహరముగా నున్నది" అని మాత్రం ఒప్పుకున్నారు [7] ఆంధ్రకవి తరంగిణిలో ఉదాహృతాలైన కూర్మపురాణ అవతారిక పద్యాలను బట్టి కవి కవన ప్రశస్తిని గమనించవచ్చు కృతి పతి వర్ణన -

శ్రీ పరమేశ పాద సరసీరుహ చింతను డగ్రజన్మ సం
స్థాపనుడ ప్రమత్తు డరి సంచయ భంజను డుత్తముండు ధా
త్రీపరిపాలన ప్రియ వితీర్ణుడు చెర్కు కులావతంసుడే
భూపతి మించె గీర్తి పరిపూరిత సర్వదిగంత రాళుడై

కృతి పతి లక్ష్మణ మంత్రి తల్లి గాజుబాయి, తండ్రి సంగన మంత్రి [8] వీరు మహారాష్ట్ర బ్రాహ్మణులు మహారాష్ట్ర విప్రులకు గృహనామాలుండవు చెరుకు అనే ఇంటిపేరు ఈ వంశం వారికి తెలంగాణాలో సంక్రమించి ఉంటుంది చెరుకు వారు ప్రస్తుతం జగిత్యాలలో ఉన్నారు

కవి తనను గురించి చెప్పుకున్న వివరాలు,

అతనికి మేలు వాడనయి యాప్తుడనై సచివుండనై మహా
హితవరినై సఖుండనయి యెల్లెడలన్ బెడబాయకుండియున్
తతము మృదూక్తులన్ శివ కథా కథనంబుల బ్రొద్దు పుచ్చుచున్
కుతుకముతో వసించెదనకుంరితవృత్తి గవుల్ను తింపగన్

శ్రీగిరి నాథ పాద సరసీరుహ చింతన వీరశైవ శా
స్త్రాగమ మార్గ నిర్ణయ రిరంసు నిరంతర ధీజనౌఘ సం
యోగ మనస్కునుత్తమ గుణోచిత సంగ్రహ ధర్మవర్తనా
భోగుని రాజలింగకవి పుంగవు మంజుల భాషు నన్నొగిన్

అటువంటి మంత్రి ఇటువంటి కవిని సన్మానించి కావ్య రచనమునకాదేశించాడు కోరుట్ల పుర వర్ణన

గీ హయ మద ద్విరద స్యందనా న్వితంబు - సాధు పుణ్యాంగనా జన సంశ్రయంబు
మహిత ధన ధాన్య రత్న సమంచితంబు - భూరి నికరంబు కొరువుట్ల పురవరంబు [9]

అప్పకవి అభేద ప్రాసకు నిదర్శనముగా చూపిన కూర్మపురాణ పద్యం
తోటకము తాలిమి దూలిన తాపస పత్నుల్ - వ్రీడ మనంబున వీడ్కొని బాఅన్
లోల మదాలస లోచన పఙ్క్తిన్ (పంక్తిన్) జాల దలిర్చిరి శంకరు లీలన్ (అప్ప కవీయం, 3 371)

అప్పకవి ఈ పద్యాన్ని కూర్మ పురాణంలోనిదన్నాడే తప్ప రాజలింగకవిని పేర్కొనలేదు మరో కూర్మపురాణ కవి పోటీకి లేనప్పుడు ఇది రాజలింగకవి కృత మనకతప్పదు వ్రాత ప్రతిలోనూ ఈ పద్యం ఉండి ఉంటుంది

"ఇతని పుస్తక మిప్పుడు తంజావూరి సరస్వతీ మహలు పుస్తక భాండాగారములో నున్నట్లు సాహిత్య చరిత్రకారులు వ్రాసియున్నారు" అని కవిగణపతి రామచంద్రారావు ఇబ్రహీంపట్నం కరీంనగర్ జిల్లా వారన్నారు ఆరుద్ర సమగ్రాంధ సాహిత్యంలో, సురవరం ప్రతాపరెడ్డిగారు కూర్చిన 'గోలకొండ కవుల సంచిక' లోని శేషాద్రి రమణ కవుల సాహిత్య వ్యాసంలో ఈ కవి విస్మృతుడు

అప్పకవి ఈ కవి కూర్మపురాణ కావ్యాన్ని ఉదహరించినమాట నిజం కాని, రాజలింగకవిని పూర్వకవుల్లో స్తుతించాడని అనడం[10] అసంగతం అప్పకవి రాజయోగ కవిని పేర్కొన్నాడు కాని రాజలింగ కవిని పేర్కొనలేదు [11] ఆ రాజయోగి ఎవరనేది అప్పకవికే తెలియాలి

శ్రీశైలనాథుని భక్తుడు, వీరశైవ శాస్త్రాగమ వేది, ధీజనౌఘ స్నేహ మనస్కుడు, ఉత్తమ గుణోచిత సంగ్రహ(ణ) ధర్మవర్తనుడు, మంజుల భాషణుడు అయిన శివకవి రాజలింగ యోగి రచించిన (విష్ణు)భక్తి కావ్యం శ్రీ కూర్మపురాణం

**పాదపీఠికలు**

1 గోలకొండ కవుల సంచిక పూర్వ కవుల పరిచయంలో ఈ కవి 250 సం ల పూర్వుడని ఉది అట్లా ఈతని కాలం 1934 - 250 = 1784 క్రీ శ అవుతుంది 2 అప్పకవీయం 3-371

3 అప్పకవీయం అవతారిక 33వ, పద్యం (1x33) శాలివాహన నామాంక శకమున గజ, శైల, శర, సుధాకిరణుల సంఖ్య అ క పద్య పాదం అష్టగజములు, సప్తకుల పర్వతములు, మన్మథుని పంచబాణములు, చంద్రుడు అని ఆ సంఖ్య 8751 అవుతుంది దాని తలకిందులు చేయాలి 1578 శాలివాహన శకానికి 78 చేరిస్తే క్రీస్తుశకం అంటే అది 1578+78 = 1656

4 రాజలింగకవిది కోరుట్ల కరీంనగర్ జిల్లా, అప్పకవిది మహబూబ్‌నగర్

5 వెన్నెలగంటి సూరన ఆంధ్ర విష్ణు పురాణకర్త - దివాకర్ల 'ఆంధ్ర వాఙ్మయచరిత్ర' పు 36

6 ఆంధ్రకవి తరంగిణి 1954, సంపుటి 11, పుట 253

7 ఆంధ్రకవి తరంగణి సం-11, పుట 254 8 ఆంధ్ర కవితరంగణి సం 11, పుట - 253
9 కూర్మపురాణము అవతారిక, ఆం క తరంగణి - సం 11, పు 253
10 కరీంనగరం మండల చరిత్ర -1981, పు 25
11 తే గీ స్మార్తకర్మంబు లెరిగించి సభల బూజ్యు, జేయునల కొలిచలమల్ల సింగనార్యు నాగమములుపదేశించి నట్టి రాజ, యోగివర్యుని దలతు విద్యా గురులను - అ క 1-31

## 2 సోమనాథ కవి - లేములవాడ, 1650

వసుచరిత్ర వ్యాఖ్యాతగా లబ్ధ ప్రతిష్ఠుడైన విద్వత్కని సోమనాథుని కృతులు అయిదు

1 చతుర్భుజాభిషేకము, 2 ధ్రువచరిత్ర, 3 మరుత్సందేశము, 4 ముద్రాలాభము, 5 గంగాగౌరి సంవాదము, 6 వసు చరిత్ర 'విద్వన్మనో రంజనీవ్యాఖ్య'

**కాలము** ఆ కవి కాలం క్రీ శ 1750 ప్రాంతమని బ్రౌను నిర్ణయం ఇది సరికాదని ఈ సోమనాథుడు 1650 వాడని శేషాద్రిరమణ కవులు 'గోలకొండ కవుల సంచిక'లో పేర్కొన్నారు [1] 17వ శతాబ్ది అనుటే ఆమోదయోగ్యం బ్రౌను కోస్తా రాయలసీమ ప్రాంతాల్లో సంచరించారు లేములవాడకు వెళ్ళినవారు కారు ముఖ్యంగా రమణకవి ధూపాటి వేంకటరమణాచార్యులు కొన్నాళ్ళు కరీంనగర్‌లో ప్రభుత్వో పాధ్యాయులుగా పనిచేశారు వారు వేములవాడను సందర్శించారు ఓరుగల్లు ఆయన స్థిరనివాసం

**స్థలము** కవి తనది లేములవాడ అని స్పష్టంగా చెప్పినాడు

ఉ శ్రీ మెఱయన్ సమస్తముని సేవితమై విలసిల్లుచున్న యా
లేములవాడలో వివిధ లీలలు చూపి జగంబు బ్రోచు నా
సామికి రాజలింగమను చక్కని నామము గల్గు వానికిన్
గామిత దాయికర్పితముగా నొనరించెద నీ నిబంధమున్ [2]

**వంశ వివరాలు** సోమనాథ కవి నియోగి బ్రాహ్మణుడు ఆత్రేయ గోత్రము కవి తాతగారు సోమ మంత్రి, తండ్రి సిద్ధేశ్వర మంత్రి, అన్న హేమాద్రి ఈ విషయాలన్నీ వసు చరిత్ర వ్యాఖ్యాన గ్రంథ గద్యలోనివి ఇది తెలుగు గ్రంథమైనా ఆశ్వాసాంత గద్యలు సంస్కృతంలో ఉన్నాయి ఉదాహరణకు ఒక గద్య చూడండి గద్య॥ శ్రీమదాత్రేయకుల కలశాంభోనిధి సంపూర్ణ సోమ,సోమ కులాభి ధాన మంత్రివర పౌత్రేణ, సోమసుత సిద్ధేశ్వరమంత్రీశ్వరస్య పుత్రేణ, శ్రీ మత్పార్వతీ రాజేశ్వర ప్రసాద సమాసాదిత హృద్యానవద్య నిఖిల విద్యా విశారదేన, సోమనాథ నామ్నా విరిచితాయాం వసుచరిత్ర వ్యాఖ్యాయాం విద్వజ్జన రంజనీ సమాఖ్యాయాం ప్రథమా శ్వాస స్సంపూర్ణ [3]

**రచనల వివరాలు** "సోమన గ్రంథాలలో విద్వజ్జన రంజని తప్ప తక్కినవన్నీ అలబ్ధమే" అన్నాడు డా॥ రవ్వా శ్రీహరిగారు తమ "తెలుగులో అలబ్ధ సాహిత్యం' గ్రంథంలో [4]

రామరాజ భూషణునికి "సమీప కాలము వాడైన వసుచరిత్ర వ్యాఖ్యాత సోమకవి" 'కారణజన్ముడై' యన్న పద్యమున వసుచరిత్రకారుడు భట్టుమూర్తి యని పేర్కొనెను "[5]

"తెలుగు భాషలో వసుచరిత్రమునకు ఎన్నియో వ్యాఖ్యలున్నవి వీనిలో సోమకవి వ్యాఖ్య సుప్రసిద్ధమైనది ఈతడు కరీంనగరము మండలములోని లేములవాడ వాస్తవ్యుడు" అన్నారు శ్రీ కె సుప్రసన్నాచార్యులు 'వసుచరిత్ర' పీఠికలో [5]

శేషాద్రి రమణ కవులు వసుచరిత్ర వావిళ్ళవారి ప్రతిలో సోమనాథుని వ్యాఖ్యను ప్రశంసించారు ` సోమనాథుడు "దానియందు వ్యాఖ్యానించని వానిని మేము వ్యాఖ్యానించినా మని వసుచరిత్ర వాఖ్యానమునందు శేషాద్రి రమణ కవులు పేర్కొనిరి ' అని జి రాంరెడ్డి 'కరీంనగర్ జిల్లా కవులు' అనే వ్యాసంలో పేర్కొన్నారు [6]

సోమనాధకవి తన రచనల గూర్చి వసుచరిత్ర వ్యాఖ్యలో వ్రాసుకొన్న అవతారికా పద్యాల బట్టి ఆయన వ్రాసిన కావ్యాల పేర్లు తెలుస్తున్నవి

ఉ సాంబశివాంఘ్రి పద్మములు సన్మతి మ్రొక్కి చతుర్భుజాభిషే
కంబను సత్ప్రబంధము జగద్విదితంబుగ జెప్పితిన్, మురా
రింబస గొల్చి యా ధ్రువచరిత్ర రచించితి నీప్రబంధముల్
సాంబ మురారి హృద్య బహుళార్థ చమత్కృతి శబ్దచిత్రముల్

ఇందలి కృతులు 1 చతుర్భుజాభిషేకము, 2 ధ్రువ చరిత్రము

క పేశల గంభీర సదా, వేశ మనోహరము గాగ వెలసె మరుత్సం
దేశము ముద్రాలాభం, బీ శార్వణ బుద్ధిచే మదీరిత మగుచున్

3 మరుత్సందేశము, 4 ముద్రాలాభము

ఉ గంగయు గౌరి యిద్ధరన యొప్పగ సేయువాదముల్
రంగులు మీఱ సెప్పితి నిలా తలవాసి కలా కలాపు లె
ల్లంగడు మెచ్చ నీశ్వర వరంబున నన్ను భజించునట్టివి
ద్యాంగన హావ భావములుదార గతింగను పట్టుచూడగన్

5 గంగా గౌరి సంవాదము

శా ఈ రీతిన్ గవితా వితాన వృత గౌరీశాన మౌళి స్థలో
దారోద్దేశుడ నైన నాకు వెస విద్యావంతులెల్లన్మనో
హారి ప్రక్రియ మూర్తి చే విరచితంబై విశ్రుతంబీవసు
క్ష్మారాట్చిత్ర చరిత్ర టీక కటు యుత్సాహంబు పుట్టించినన్

6 వసుచరిత్రటీక

లేములవాడ రాజేశ్వరున కంకితముగా తానీ వ్యాఖ్యానం రచించానని చెప్పుకున్నాడు వసుచరిత్ర వ్యాఖ్యాన గ్రంధాలలో సోమనాధుని వ్యాఖ్య మొదటిది

శేషాద్రి రమణ కవులు గో క సం లో సోమనాధునివిగా పేర్కొన్న నాలుగు గ్రంధాలలో యావన చరిత్రము మూడవది వసుచరిత్ర వ్యాఖ్యనుండి కవి రచనల పేర్లు ఉధృతములన్నా ధ్రువచరిత్ర మరుత్సందేశ ముద్రాలాభాల వారు చెప్పనేలేదు (పుట 415) గజ్జెపల్లి సత్యనారాయణ రాజు గారు కూడా క మం చ లో వసుచరిత్ర వ్యాఖ్య చతుర్భుజాభిషేకం, యావనచరిత్ర, గంగాగౌరి సంవాదములనే పేర్కొన్నారు (పు 14) యావన చరిత్ర ఎక్కడిదో తెలియదు సోమనాధుడు ఆ పేరుతో తాను కృతి నిర్మించినట్లు చెప్పుకోలేదు వసుచరిత్ర ప్రబంధాన్ని, ఆ కావ్యకర్తయైన భట్టు మూర్తిని సోమనాధకవి ఘనంగా సంస్తుతించాడు ఆ పద్యాలివి

ఉ కారణ జన్ముడై కవినికాయము మెచ్చగ గావ్య కర్తయై
భూరికళా కలాపుడయి పొల్పు వహించెడు భట్టుమూర్తిచే
నీరితమై ఘనార్థ పదహీన పదాస్పదమైన యా వసు
క్ష్మారమణ ప్రవృత్తము సుసాధ్యముగాదు తలంచి చూడగన్

శా నానా సూన రసాళి నేగు తలమై నానార్థ సౌరభ్య (ము)
న్నానా మ్లాన పద ప్రసూనములకున్నా కేశ్వరావాసమై
నానా శాస్త్ర రహస్య రత్నములకున్ రత్నాద్రియై యొప్పునా
నానాలంకృత పేటి టీకకయి పూనన్ శక్యమే యేరికిన్

అసాధ్యమైన కార్యమంటూనే దాన్ని సుసాధ్యంచేసి చూపిన విద్వచ్ఛిఖామణి సోమనాథుడు ఈ పండితుని వసుచరిత్ర వ్యాఖ్య అముద్రితం ఈ విద్వత్కవి విరచితపంచపద్య కావ్యాలలో ఏ ఒక్కటీ లభించకపోవడం బాధాకరం

**పాదపీఠికలు**

1 గోలకొండకవుల సంచిక - 1934, పు 415 2 వసుచరిత్ర వాఖ్యాన గ్రంధావతారిక నుండి
3 చాగంటి శేషయ్య - 'కవి తరంగణి' - సం 12, పు 96
4 డా॥ రవ్వా శ్రీహరి 'తెలుగులో అలబ్ధ వాఙ్మయము' - 1993, పు 29
5 కె సుప్రసన్నాచార్యులు - 'వసుచరిత్ర' - తెలుగు విజ్ఞాన పీఠ ప్రచురణ హైదరాబాద్, పీఠిక పు 4, 33 6 'ఆంధ్రభూమి' దినపత్రిక - ఆదివారము తేది 9 5 1976

## 3 కోడూరి వెంకటాచలపతి - కోరుట్ల 1700

వేంకటాచలపతి కోరుట్ల ములగనాగ ప్రభుని అస్థాన కవి ఆ రాజు కోరికవై ఈ కవి సాంకదపురాణము'ను అనువదించాడు అని ఇక్కడి సాహిత్య కారులన్నారు

**కాలం** కోడూరి వెంకటాచలపతి రచించిన 'శివరహస్యఖండము' లేనిదిగా డా॥ రవ్వా శ్రీహరిగారు ఈ క్రింది పద్యాన్ని చూపారు [1]

అతని నభిరామ వాసుదేవాది కా - వ్యముల రచియించి ప్రఖ్యాతినంది నట్టి
ఘనునినెడవల్లి వేంకట కవి వరేణ్యు - నస్మదీయ విద్యా గురు నభినుతింతు

ఇది కవిగారి గురు ప్రసక్తి అంతే కాని వెంకటాచలపతి స్థల కాల సూచనలేవీ శ్రీహరి గారు 'తెలుగులో అలబ్ధ వాఙ్మయం'లో చూపలేదు శివ రహస్యఖండము ప్రతి మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారంలో నం డి 322 గా ఉందని మాత్రం తెలిపారు శివరహస్యఖండం స్కాంద పురాణంలోని భాగం కావాలి

కోడూరి వెంకటాచలపతి మేనమామ గునుగుటూరి వేంకటకృష్ణకవి శ్లేషకవితా పితామహుడట ఆయన 'నలయాదవ రాఘవ పాండవీయము' అనే పేర నాలుగర్థాల శ్లేష కావ్యాన్ని రచించినాడు [2] వేంకటకృష్ణకవి స్వస్థలం ఈ మండలం అగునో కాదో కాని, ఆయన కాలం క్రీ శ 1650 కాబట్టి మామకంటె అల్లుడు ఓ ఇరవై, ముప్పై యేండ్లు పిన్నవాడై ఉంటాడు అందుచేత వెంకటాచల కవి 17వ శతాబ్ది ఉత్తరార్థం వాడు వేంకట నామాలు కాకతీయుగంలో కానరావు విజయనగర చక్రవర్తుల కాలంలోనే తిరుపతి ఖ్యాతి రాయల యుగానికి తర్వాతి వాడు ఈ కవి కవి వంశవివరాలు తెలియలేదు వెంకటాచలం వైష్ణవ నామం శివకుమార చరిత స్కాందం కవి స్మార్తుడో - నియోగి బ్రాహ్మణుడో అయి ఉండవచ్చు

**కావ్య వివరాలు** స్కాంద పురాణం పద్యకావ్యం అందులో కొంత భాగం మాత్రమే ముద్రితమైందని మిగితా భాగం నష్టమై పోయిందని, కవిత మనోహరంగా ఉందని శేషాద్రి రమణ కవులు 'సారస్వత జ్యోతి'లో 'కరీంనగర్ మండలము' అనే వ్యాసంలో చారిత్రక సాహిత్య విశేషాలు తెలుపుతూ వ్రాశారు [3]

నిజానికి 'శివరహస్య ఖండము' ముద్రిత గ్రంధాలు 2 సంపుటాలు కరీంనగర్ జిల్లా కథలాపురం (మండల కేంద్రంలో యక్షగాన రచయిత కీర్తి శేషులు పులికాంత గంగాధరయ్య గారి అనుజుడు చిన్న రాజయ్య గారి కుమారుడు) అధ్యాపకులు పి విద్యాసాగర్ కవి గారింట లభించాయి 1996 ) స్కాందపురాణాంతర్గత 'శివరహస్య ఖండం' మొత్తము ఏడు కాండలు అందులో

1 సంభవ 2 అసుర, కాండద్వయం (ప్రథమ సంపుటి)

3 వీరమహేంద్ర 4 యుద్ధ 5 దేవ (రెం సం ) 6 దక్ష (3వ సం ) 7 ఉపదేశ(4వ, సం)

మొదటి 2 సంపుటాలు కనిపించాయి శ్రీశుకశ్యామలా రామలింగేశ్వర గ్రంథమాల ప్రకటితముగా వీర భద్రేశ్వరారాధ్యులచే (నందిగామ కృష్ణా జిల్లా) ప్రచురింపబడింది బెజవాడలో ముద్రితం,

ప్రథమ సంపుటి - 1933 - 3రూ॥ ద్వితీయ సంపుటి 1931 - 3రూ॥

గ్రంథప్రకాశకులు ఇట్లా తెలిపారు

"ఏ తత్కృతి ప్రణేత కోడూరి వేంకటాచల కవీంద్రుడు ఇతడు బాలసరస్వతీ బిరుదాంకితుడు ఆరువేలని యోగి బ్రాహ్మణుడు కాశ్యపగోత్రుడు, ఆపస్తంభసూత్రుడు శివ భక్తుడు, యల్లనామాత్య పౌత్రుడు, లక్ష్యంబికా శంకరామాత్యుల యాత్మజుడు, యడవల్లి వేంకట కవివరేణ్యుని శిష్యుడు ఇతడు 17వ, శతాబ్ది తుదిని ఉండెనని చరిత్రాన్వేషకులు, తలంచుచున్నారు

ఈ కవయిత అఖండ పాండితీ ధురంధరుండు నిరర్గళ కవితాధారా పరిపాటి పరితోషితో భయభాషాకవి ప్రకాండుండు పురాణోచిత రసవన్మృదుల పద భూయిష్ట రచనా ధురంధరుండని విద్వత్క వీంద్రాశ్రయమునెల్లెడ నాకర్షించుచున్నాము

ఏ తత్కృతి పతి ముళువాగళు ప్రభుండు ఈతడు వీరశైవుడు, బళ్ళారి ప్రాంతవాసి, జమీందారుడునై యుండునని శోధకులనుచున్నారు కృతి పతి-కృతి ప్రణేతల విశేషము లెరుంగ గోరుచున్నారము కృతి ప్రతి-కృతి ప్రణేతల విశేషము లెరుంగ గోరువారు కందుకూరి వీరేశలింగము గారి ఆంధ్ర కవుల చరిత్రము తృతీయ భాగము 52వ పుటలో 19 కవి యను శీర్షిక క్రింద జదువవగునని

వేడికోలు 12 నందిగామ-9-6-33

ఆశ్వాశాంత కావ్యగద్య ఇట్లుంది-

"ఇది శ్రీమదిందు ధర సుందర పాదార విందార్పిత హృచ్ఛృత పత్ర సకల సుకవి జనాను గ్రహ పాత్ర సుగుణ స్తోత్ర పవిత్ర చరిత్ర కాశ్యప గోత్ర కోడూరి యెల్లనామార్య పౌత్ర శంకరామాత్య లక్ష్యంబికా తనయ వినయ విధేయ బాలసరస్వతీ నామాంక వేంకటాచల కవి ప్రణీతంబైన స్కాంద పురాణాంతర్గత శ్రీశంకర సంహిత యందలి శివరహస్య ఖండంబున సంభవ కాండంబునందు బ్రథమాశ్వాసము సంపూర్ణము"-

కృతికర్త స్వీయపరిచయపద్యం-

13 నను జంద్రార్ధ కిరీట సేవనరతున్ నానా కళాభిజ్ఞు స
ద్వినయున్గాశ్యప గోత్రు గోడురి పురాధిష్ఠాను నెల్లార్య నం
దనుడౌ శంకర మంత్రి పుత్రు గవితా ధారా గరిష్ఠుం బ్రియం
బున రావించి సభా స్థలిం బలికె విస్ఫూర్జద్వచో మాధురిన్

ఈకవి ఇంటి పేరే సొంతూరి పేరు అది కోడూరి అని పై పద్యం తెల్పుతున్నది కవిది బళ్ళారి ప్రాంతమని గ్రంథ ప్రకాశకులు తెలిపారు కృతి స్వీకర్త ములువాగలు ప్రభువు పేరేమో గాని, మళువాగలూరి కోట కట్టించినాడని అవతారిక 25వ, కంద పద్యంలో ఉంది ఇంకా కృతి పతి వంశ పూర్వులు మధుర (35వ, మత్తేభం) కంచి (23వ, వచనం) జయించినారని ఉంది ఇక ఈ వేంకటాచల కవికి అతని కృతి ప్రతికి కొరుట్లకు సంబంధమేముందో తెలియదు కొరుట్లలో కోడూరి వారున్నారు కాని వారు పద్మశాలీలు ఈ కవిని గూర్చి చెప్పుకోరు మళువాగళు ముచ్చటైనా ఇక్కడి వారికి తెలియదు కోడూరి వేంకటాచల కవి కొరుట్ల వారుగా కనుపట్టుట లేదని (ఇక్కడి వాడని ప్రచారం చేసిన వారి వాదం అసంగతం అని ) తెలుపుటకే ఇంత కావ్య-చరిత్ర సమాలోచనం చేయడమైనది

అలభ్యమనుకున్న కావ్యం ముద్రితం లభ్యం అనే సమాచారం తెలిసింది పైగా ఈ స్కాంద పురాణాంతర్గత 'శివరహస్య ఖండము'ను కోడూరు వేంకటాచలకవి మాత్రమే కాక, వంకాయల పాటి వీర భద్ర కవి, రేవూరి అనుంతయజ్వ సైతం అనువదించారని కోడూరి వేంకటాచల కవి కావ్య ప్రథమ సంపుటిలో ప్రకాశకులు తెలిపారు

**పాదపీఠికలు**

1 డా॥ రవ్వా శ్రీహరి - 'తెలుగులో అలబ్ధ వాఙ్మయం' - 1993, పు - 6
2 గఠ్ఠెపల్లి - 'కరీంనగరం మండల చరిత్ర' పు 14
3 సారస్వత జ్యోతి - (త్రైమాసిక పత్రిక) కరీంనగరం, ఫిబ్రవరి 1954
సం బోయినపల్లి వేంకటరామారావు

## 4 అత్తలూరి పాపకవి - వేములవాడ 1650-1700

అత్తలూరి పాపయ్య కవి ఆరాధ్య బ్రాహ్మణుడు చెన్న బసవ పురాణం ఈతని కృతి

కవి స్వస్థలం వేములవాడ ఆ పట్టణంలో ఇప్పటికీ అత్తలూరి వారున్నారు ఇదే వంశములో అత్తలూరి విశ్వనాథ శాస్త్రికవి ఈ ఇరువదవ శతాబ్ది పూర్వార్ధంలో ఉండేవారు [1] గో క సంచిక 1934 నాటికి వారు 26 ఏండ్ల వయస్సువారు

ఈ పాపయ్య కవి గారిని ఏ కవి చరిత్రకారుడూ పేర్కొనలేదు ఒక్క 'కరీంనగర్ జిల్లా రచయితల చరిత్ర'లోనే వీరి పరిచయం చేయబడింది [2] విశ్వనాథశాస్త్రి వంశ పూర్వీకులుగా శరభాంకుని పాపకవిని గో క సం కవి పరిచయంతో పేర్కొన్నారు

ఏ సాహిత్య గ్రంథంలోనూ చెప్పని చెన్నబసవ పురాణం శరభాంకకవి రెండవ రచనగా ఒక్క గఠ్ఠెపల్లి సత్యనారాయణ గారు మాత్రమే చెప్పటం జరిగింది అది వ్యాసకర్త పొరపాటువల్ల జరిగి ఉంటుంది ఎందుకంటే చెన్నబసవ పురాణం ఈ పాపయ్య శాస్త్రిగారి కావ్యంగా వినికిడి శరభాంకుడు వ్రాసినట్లు వ్యాప్తి లేదు పైగా పాపయ్య శాస్త్రి పేర మరోకవి ఈ జిల్లాలో విక్రమార్కీయం రచించాడు అతనిది కొరుట్ల ఈ ఇద్దరు పాపయ్య కవుల మధ్య ఒకరి పేరు ఎగిరిపోయి ఆ రచన శరభాంకుని చేరి ఉంటుందని అనుమానం ఇది నిజమే గో క నం లోని ఈ వాక్యం చూడండి

"మా వంశముల పురుషుడు (లు) శరభాంకుడు అత్తలూరి పాపకవి మొ॥ కవులు శరభాంకలింగ (శతక) ము చెన్నబసవ పురాణ(ము) కర్త(లు)[3] పై గజిబిజి వాక్యం గఠ్ఠెపల్లి వారిని తప్పుదారి పట్టించి ఉంటుంది కవులిద్దరు కావ్యాలు రెండు క్రమాలంకారంతో చూస్తే ఏ పేచీరాదు

అత్తలూరి పాపయ్య గారి 'చెన్నబసవ పురాణం' అలబ్ధకృతి

**పాదపీఠికలు**

1 గోలకొండ కవుల సంచిక - 1934, నం 26
2 మలయశ్రీ 'కరీంనగర్ జిల్లా రచయితల చరిత్ర' - 1981, పు 6
3 గో క సం పు - 355

## 5 సముద్రాల రామానుజాచార్యులు - కోరుట్ల 1784

రామానుజాచార్యులు రచించిన అముద్రిత కావ్యం "సుశీలోపాఖ్యానము"

కాలం - గోలకొండ కవుల సంచిక, పుట 407లో ఈ కవి 150 సం పూర్వుడన్నారు 1934 150=1784 కవి 18వ శతాబ్ది ఉత్తరార్ధంవారు

వంశం - వంశ వివరాలు గో క సం లో ఇవ్వలేదు కాని ఈ కవి "కోరుట్ల ప్రాంతమున గల సముద్రాలవారను వైష్ణవ కుటుంబమునకు చెందినవాడు" అని వ్రాశారు కోరుట్లలోని శ్రీ వైష్ణవులలో సముద్రాల గృహనామంవారున్నారు

గోలకొండ కవుల సంచికలోని నం 59 కవి, మరో సముద్రాల రామానుజాచార్యులు కోరుట్ల వారే ఆ కవి తమ పరిచయం "వాధులాన్వయజాతేన శ్రీరామానుజ ధీమతా" అని గో క సం 54వ పుట శ్లోకంలో, "గోత్రమా విమల చారిత్ర శ్రీవైష్ణవ సన్నుత వాధూలసాన్వయంబు" అని 358వ పుట పద్యంలో పేర్కొన్నారు

సుశీలోపాఖ్యాన కర్తది సైతం వాధూల వంశం - గోత్రం, విశిష్టాద్వైత మతం

**కావ్య పరిచయం** - సుశీలోపాఖ్యానం అలభ్యకృతి

"ఈకవి కృత గ్రంధము కొరుట్లలో లక్ష్మణరాయ గ్రంధాలయములో గలదు" అని గో క సం లో వ్రాశారు కాని, ఇప్పుడా గ్రంధాలయంలేదు కవి కృతి వ్రాత ప్రతి సైతం లభించలేదు ఆ పేరుతో ఏ గ్రంధాలయం కోరుట్లలో ఉన్నట్టు వినరాలేదు

పై రెండవ స రామానుజాచార్యుల భ్రాతృపుత్రులైన సముద్రాల వేంకటనరసింహాచార్యుల వారిని (80 సం వయస్సు) సంప్రదించితే సుశీలో పాఖ్యానకర్త రామానుజాచార్యుల గూర్చి తాము వినలేదన్నారు ఉభయులు ఏక వంశీయులే కాని, రెండవ రామానుజాచార్యుల పుత్రులు రఘునాధాచార్యులు సుశీలో పాఖ్యాన కర్తను గురించి తమ తండ్రి చెప్పేవారన్నారు

పద్దెనిమిదవ శతాబ్ది సముద్రాల రామానుజాచార్యుల 'సుశీలోపాఖ్యానం' అలబ్ధకృతి

## సాహిత్య సమాలోకనం - 3

**చరిత్ర** ఈ రెండు వందలేండ్ల (1600-1800) కాలంలో కరీంనగర్ జిల్లా ప్రాంతం అచ్చంగా గోలకొండ ముస్లింల పాలనలో ఉంది 17వ శతాబ్దిలో కుతుబ్‌షాహీల పాలన సాగింది 1687లో ఢిల్లీ చక్రవర్తి ఔరంగజేబు తానీషానోడించి గోల్కొండను జయించడంతో కుతుబ్‌షాహీల పాలన అంతరించి తెలంగాణా ప్రాంతం ఢిల్లీ మొఘలు పాలనలోకి వెళ్లింది తానీషా మామ అబ్దుల్లా 1626-72 తన మరో కూతురును ఔరంగజేబు కుమారునికిచ్చి పెళ్లి చేసినా గోలకొండ పతనం తప్పలేదు

తానీషా సేనాని మహా మంత్రి, అక్కన్న మాదన్నలు వారి మేనల్లుడు భద్రాచలరామదాసు అది మరాఠా ఛత్రపతి శివాజీ కాలం 1707లో ఔరంగజేబు మరణంతో గోల్కొండ సుబేదారుగా ఉన్న నిజాం ఉల్ ముల్క్ ఆసఫ్‌జా 1713-48 స్వతంత్రించాడు అప్పటి నుండి భారత స్వాతంత్ర్య లబ్ధి-తెలంగాణా విముక్తి 1947 8 వరకు కరీంనగర్ ప్రాంతం హైదరాబాద్ ఆసఫ్జాహీల పాలనలో ఉంది

ఈ జిల్లా వెలిగందుల కేంద్రంగా హైద్రాబాద్ ముస్లిం పాదుషాల బంధువుల సర్దారుల పరిపాలన ఇక్కడ సాగింది వారిలో 'ధంసా' 1747 పేరు చాలా వ్యాప్తిలో ఉండేది అతడే జాక్ టేల్ అనే ఫ్రెంచి ఇంజనీర్లతో జగిత్యాల కోట కట్టించాడు ఈ కాలంలో అనేక ముస్లిం జాగీర్లు వచ్చాయి

హిందూ సంస్థానాధి పతులు వేషభాషా నాగరికతల్లో ముస్లిం ప్రభువులను అనుసరించేవారు అయినా తమ కుల, మత సంస్కృతీ సంప్రదాయాలను నిష్ఠగా కాపాడుకున్నారు నయాన్నో భయాన్నో మతాంతరీకరణ పొందినవారి విషయం వేరు

కుతుబ్ షాహీల కాలంలోని రాజభాష అరబ్బీ ఆ స్థానాన్ని ఆసఫ్జాహీల కాలంలో ఉర్దూ ఆక్రమించింది అది ఒక రీతిగా తెలుగు వారికి కష్టకాలం, తెలుగుభాషా సాహిత్యాలకు చీకటి కాలం

**సాహిత్యం** ఈ రెండు శతాబ్దాలలో తొమ్మండుగు కవులు మాత్రం లెక్కకు వచ్చినా వారిలో ఒక్కరు

ఇక్కడి వారేనా అనేది అనుమానం, ఆరుగురు కవులు కావ్య కర్తలైనా వారి గ్రంధాలు లభించలేదు - ముద్రింపబడలేదు

ఈ కాలపు విద్యత్కవి సోమనాధుని వసుచరిత్ర వ్యాఖ్య ఈ జిల్లాలోని తొలివచన గ్రంధం అది లభ్యమై చక్కనిదని పండిత ప్రశంసలు పొందినా ఇతర వ్యాఖ్యానాలవలె వ్యాప్తి లేకపోవడం విచార్యం వరకవి బాలభట్టు మంధని రామాయణం శివలీలలు యక్షగానాలు ఈ మధ్యనే ప్రచురింప బడినవి

అప్పటికి ఇప్పటికి వ్యాప్తిలో ఉండి ఈ జిల్లాకు గర్వకారణంగా ఉన్న నరసింహాశతకర్త శేషాచలదాసు - శేషప్ప ధర్మపురి వారు ఆయన మూడు శతకాల ధర్మపురి రామాయణం పేరుతో ఒక యక్షగానం రచించాడు శతకాలు ఒకటి రెండు శేషప్పకు ముందు కాలంలో ఇక్కడ వచ్చినా వ్యాప్తి పొందినది మాత్రం ఈతని నరసింహ శతకమే అలాగే యక్షగాన రచనకు సైతం జిల్లాలో వీరే ఆద్యులు

వ్రాత ప్రతులు లభించిన ఇద్దరు కావ్య కవుల్లో పరాంకుశం గోపాలకృష్ణయ్య గారు సరసకవి కాని, స్థలం నిర్ణయం చేయలేం

కుందావజ్జల గోపాలకృష్ణ కవిగారు మాత్రం 'కృష్ణజన్మ ఖండ' కావ్యం, సంవరణ చరిత్ర ప్రబంధ రచనలతో మహాకవిగా నిలిచారు

ఈ మధ్య యుగం తెలుగు కట్టు బొట్టు ఆచార వ్యవహార సంస్కృతీ సంప్రదాయాలకు కష్టకాలం అయినా ఈ యుగంలో హిందూమత సంరక్షణతోపాటు తెలుగు భాషా సాహిత్యాల పోషణ కావించిన వారు ఉదారులైన సంస్థానాధీశులు - ఉదాత్తాశయాలుకల మన తెలుగుకవులు

# IV పందొమ్మిదవ శతాబ్ది తెలుగు సాహిత్యం

పందొమ్మిదవ శతాబ్దిలో కరీంనగర్ జిల్లాలో గణనీయమైన కావ్యసృష్టి జరగలేదు

అది హైదరాబాద్ ఆసఫ్‌జాహీ నిజాం ప్రభువుల పరిపాలన కాలం అరబ్బీ పార్సీ ఉర్దూ భాషలు ప్రాముఖ్యానికి వచ్చాయి ఇక్కడి హిందువులు కూడ రాజకీయ ప్రభావం వలన ఆ నూతన భాషలను నేర్చుకొని వానిలో పాండిత్యం సంపాదించి కవులుగా సైతం రాణించసాగారు

వెలిగందుల ఆనాటి ఈ మండల కేంద్రం నేటి జిల్లా కేంద్రమైన కరీంనగరం నాడు ఓ సామాన్య గ్రామం

హిందువుల జాత్యభిమాన మతాభినివేశాలు బలమైనవి అందుకే విదేశీ భాషలను అభిమానించినా, వారి నాగరికతను అనుసరించినా, పర మతాలను మాత్రం ద్వేషించారు నయాన్నో భయాన్నో కొందరు మతాంతరీకరణ పొందడం జరిగినా, అధిక సంఖ్యాకులు ఎన్ని ఒత్తిడి లెదురైనా తమ జాతి-మత సంస్కృతి సాహిత్యాలను ప్రేమిస్తూనే వచ్చారు అట్లా స్వదేశీయుల జాత్యభిమానం కారణంగానే పూర్వసాహిత్యం ఈ మాత్రంగానైనా భద్రపరుచబడి లభ్యమైంది ఎంతో కొంత నూతన కావ్య రచన సైతం మాతృభాషలో జరిగింది

ఈ కాలంలో ఇంచుమించు ఇరువది మంది కవుల పేర్లు ఈ జిల్లాల్లో లెక్కకు చిక్కాయి వారిలో అయిదుగురు సంస్కృత కవులే పది మంది వరకు యక్షగాన మధుర కవితలు వెలయించిన వారు పద్యకవులు కేవలం అయిదుగురు అందులో ముగ్గురు శతక కవులు కావ్యనిర్మాతలు ఇద్దరే ఈ యిరువురి కావ్యాలు అలభ్యాలు పేర్లు మాత్రమే వినవస్తున్నవి

ఈ క్రింది వారు సంస్కృత కవులు -

1 వాసుదేవ శాస్త్రి 2 గోవిందుల నింబగిరి, 3 గోవర్ధనం యామునాచార్యులు, 4 కృష్ణగిరి కవి కృష్ణరాయలు, 5 తేరాల వేంకటాద్రిశాస్త్రి,

**1. తెలుగు పద్య సాహిత్యం**

1 పాత పాపయ్యశాస్త్రి, 2 కాకుత్సం నరసింహదాసు, 3 కృష్ణగిరి వేంకటరమణయ్య, 4 ఖండేరావు రామారావు, 5 పరవస్తుముని నాధకవి

**2 యక్షగానాలు**

1 చెర్లపల్లి కాశీనాధ శాస్త్రి, 2 నారంభట్ల రమణయ్య, 3 నారంభట్ల నరహరి, 4 చతుర్వేదుల తులసీరాం, 5 న్యాలకొండ కిషన్‌రావు, 6 రాజారామానంద కవి, 7 రుద్ర ఎల్లయ్య

**3 మధుర కవితలు**

1 సిరిశివహళ్ శీనయ్య, 2 సీతారామయతీంద్రులు 3 జైశెట్టి రాజయ్య

ఈ జిల్లాలో వెయ్యేండ్లకు పూర్వం నుండే సంస్కృత భాషాపండితులు కవులు ఉన్నారు తెలుగుతోపాటుగా సంస్కృత కావ్యాలు కూడా ఈ ప్రాంతంలో రచింపబడ్డాయి వేములవాడ చాళుక్యుల కాలంలో జైన కవులు కన్నడ సంస్కృత కావ్యాలు రచించారు కల్యాణి చాళుక్యుల, కాకతీయుల కాలంలో వైదిక,శైవ మతాభిమానులైన సంస్కృత విద్వాంసుల పేర్లు నాటి శాసనాల్లో కన్పిస్తున్నాయి

మధ్య కాలంలో ఆంధ్ర కవితకు ఆదరం హెచ్చి సంస్కృత కావ్య రచన ఉపేక్షింపబడి నట్లున్నది తిరిగి పందొమ్మిదవ శతాబ్దిలో సంస్కృత కవులు కన్పిస్తున్నారు ఇరువదవ శతాబ్దిలోనైతే సంస్కృతాంధ్ర సాహిత్యాలు ఈ కరీంనగర్ జిల్లాలో ఉన్నతస్థాయిలో ఉన్నాయి

ఈ అధ్యాయంలో పేర్కొన్న సంస్కృత కవుల పేర్లు తెలుగు కవులతో కలిపి మా వ్యాసకర్తలు

వ్రాస్తున్నారు వీరు తెలుగు కవులు కారని సూచించుటకే వారి పరిచయం మితంగా ఇప్పుడు ఇందులో చేయబడుతున్నది

## 1 వాసుదేవశాస్త్రి - ధర్మపురి, 1830

వాసుదేవశాస్త్రి గారు దైవస్తుత్యాత్మకాలైన అనేక శ్లోకాలను, మరాఠీ భాషలో భజనకీర్తనలను వ్రాశారు కవి గారి అముద్రిత రచనలు వారి వంశపు రొట్టె విశ్వనాథశాస్త్రి ధర్మపురి గారివద్ద ఉన్నట్లు తెలిపారు

## 2 గోవిందుల నింబగిరి శాస్త్రి - కోరుట్ల (మోర్తాడు)- 19వ శతాబ్ది

నింబగిరి గారు సంస్కృతంలో ఒక ప్రహసనం రచించారని అది సేనాపతి రామానుజాచార్యుల వద్ద ఉందని, గో క సం పుట 402లో వ్రాశారు వారి కాలం 1750 అన్నారు కాని, నింబగిరి శాస్త్రిగారు 1850 తర్వాతివారు

శాస్త్రిగారు వ్రాసిన సంస్కృత రూపకం నింబగిరి ప్రహసనం' అది లింబాద్రి నరసింహ క్షేత్రయాత్రా వర్ణన, కోరుట్లలో సేనాపతి వంశంలో రామానుజాచార్యులు ఎవరూ లేదు అది సేనాపతి నరసింహాచార్యులు (గో క సం కవి నం 308) లేదా సముద్రాల రామానుజాచార్యులు (గో క సం నం 59) అని ఉండాలి

నింబగిరి శాస్త్రి శ్రీవైష్ణవ అచార్యులు వారి స్వగ్రామం మోర్తాడు నిజామాబాదు జిల్లా లోనిది పై సంచిక వెలువడిన కాలంలో ఆయన కోరుట్లలో సోదరి ఇంట ఉండి ఉంటారు ఈ ప్రహసనం చక్కని హాస్య రచనమని, దాని ప్రతి వ్రాసి ఉంచుకొన్నామని, కీ శే సిరిశెనహళ్ కృష్ణమాచార్య శతావధాని, కోరుట్ల గారు (గో క సం నం 171) అన్నారు వారి "స్వీయ కవితాను జీవనము" ఆత్మకథ పుట - 11లో 'నింబగిరి ప్రహసనము' వ్రాత ప్రతి కలదు అని ఉంది కాని, వారి ఇంటిలో వెదకితే వ్రాతప్రతి ఇంకా లభించలేదు శాస్త్రిగారి బంధువులైన కలకుంట్ల వారింటిలోనూ లేదు ముఖ్యంగా నింబగిరికవి ఈ జిల్లావారు కారు గో కం సం లో కోరుట్ల అని వ్రాసిన కారణాన ఈ వివరాలు వ్రాయవలసి వచ్చింది

## 3 గోవర్ధనం యామునాచార్యులు - కోరుట్ల

యామునాచార్యులు గీర్వాణభాషా కవి వీరి రచన 'నగర చంపూ' అను సంస్కృత కావ్యం వీరు హైద్రాబాద్ నిజాం గారికి ప్రధానామాత్యులైన చందూలాల్ గారి ఆస్థాన పండితులు ఆ మంత్రిచే 'పురాణశాస్త్ర బహద్దూర్ జంగ్' అనే బిరుదాన్ని గ్రహించడమే కాక ఆచార్యులు కోరుట్ల సమీప గ్రామమైన రామోజీపేటను అగ్రహారంగా పొందారట ఇరువదవ శతాబ్ది ఉస్మాన్ పాదుషా గారి సచివులైన కిషన్‌ప్రసాద్ గారి పితామహుడు చందూలాల్ కాబట్టి గోవర్ధనం యామునాచార్యులు 19వ, శతాబ్ది మధ్య కాలంవారు అనుకోవచ్చు

## 4 కృష్ణగిరి కవి కృష్ణరాయులు - ధర్మపురి 1875

కర్ణాటాంధ్ర కవి కృష్ణగిరి వేంకటరమణయ్య గారికి ఈతడు తమ్ముడు పేరు తెలియదు సంస్కృతంలో గొప్ప విద్వాంసుడు కృష్ణరాయలు అనేది బిరుదనామం కాశ్మీర పండితుడు వ్రాసిన జ్ఞాన వాసిష్ఠ రామాయణ కృతికి 'సారసముచ్చయమ్' అను వ్యాఖ్యను ఈ కృష్ణగిరి కవి సంస్కృతంలో రచించాడు 1 శృంగేరి పీఠాధిపతి శ్రీనృసింహభారతి చే 'కలియుగ జనకుడు' అను బిరుదమును సైతం ఈ కవి పొందినాడు [2]

**పాదపీఠికలు**

1 సారస్వత జ్యోతి - కరీంనగర్, ఫిబ్రవరి 1954

2 గర్షెపల్లి సత్యనారాయణరాజు - 'కరీంనగర్ మండల చరిత్ర' - పు 14

## 5 తేరాల వేంకటాద్రి శాస్త్రి - మహాదేవపురం

వేంకటాద్రి గారు సంస్కృతంలో ఆశుకవి వారు ఏ కావ్యాన్ని రచించలేదు కాని భక్తిప్రదమైన అనేక శ్లోకాలు కీర్తనలు చెప్పారు వెంకట్రాది గారు లోకసంచారి పురాణాలు చెప్పేవారట వారి కవితలు వారు భద్రపరచలేదు కాని భక్తులు వ్రాసుకొని దాచుకున్నారు నిజానికి అభిమానుల కోరికగానే ఆయన ఆశువుగా చెప్పిన కవితలే ఎక్కువట

ఈ విషయాలు 1981లో 'కరీంనగర్ జిల్లా రచయితల చరిత్ర' రచనా సందర్భంలో కాళేశ్వరం వేంకటేశ్వర రావు గారు చెప్పారు విశ్వామిత్ర మురారిగారు కరీంనగర్ 'గౌతమి' 1969లో విస్మృత కవి వేంకట్రాది' అనే పేర ఈ కవి జీవన కవన విశేషాలను వివరించారు

1 గ స రాజు సంపాదకులుగా కరీంనగర్ నుండి వెలువడిన త్రైమాసిక సాహిత్య పత్రిక 'గౌతమి'

**తెలుగు పద్య సాహిత్యం-**

## 1 పాత పాపయ్య శాస్త్రి - కోరుట్ల, 1820

పాపయ్య శాస్త్రిని గూర్చి ఈ క్రింది పరిచయం గోలకొండ కవుల సంచికలో చేయబడింది 1

"రచన - విక్రమార్కీయము నివాసము కోరుట్ల, కాలము క్రీ శ 1820 గ్రంథము దొరుకలేదనియు ప్రయత్నింతుమనియు కోరుట్ల నుండి సే రామానుజాచార్యులు తెలిపిరి" 2 ఇది 1934 నాటి వివరాలు అంతకు మించిన సమాచారం ఈ కవిని గురించి తెలియరాలేదు

శతావధాని సిరిశెనహళ్ కృష్ణమాచార్యులు కొరుట్ల గారు తమ 'కళాశాలాభ్యుదయము' 24వ పుటలో "కొరువుట్ల పురంబల దక్షిణేతర, శ్రీనగరంబనంగను బ్రసిద్ధిని గాంచెను లోకమందునన్[3] అని ఆపురం

'విక్రమోర్వశియను బిరుద కావ్య విధాన - చతుర పాపయశాస్త్రి చరిత భూమి"3 అన్నారు

వీరే తమ 'స్వీయ కవితాను జీవనం' తొలిపలుకులో "పాత పాపయ్యశాస్త్రి విక్రమోర్వశీయ కావ్య నిర్మాతలు వారి కావ్యములదృశ్యమైనవి" అన్నారు [4] పండిత లోకంలో ప్రచారమందున్న విక్రమోర్వశీయం చక్కని చిక్కని పద్య ప్రబంధకావ్యం

**పాదపీఠికలు**

1 గోలకొండ కవుల సంచిక పూర్వకవి పరిచయం నం 73, 1పు 402

2 సేనాపతి నరసింహాచార్యులు లేదా సముద్రాల రామానుజాచార్యులు అని ఉండాలి

3 కళాశాలాభ్యుదయము - 1929, పద్యం 2-9-, 2-10

4 ఎన్ కృష్ణమాచార్య - 'స్వీయకవితాను జీవనం' - 1986, పు 11

## 2. కాకుత్థ్సం నరసింహదాసు - ధర్మపురి, కాలం 1820-1880 సుమారు.

అత్యధిక జనవ్యాప్తిలో ఉన్న శ్రీకృష్ణ శతక కవి నరసింహదాసు అతని ఊరుపేరు, ఇంటిపేరు ముద్రిత కృష్ణశతక ప్రతులలో లేదు కవి చరిత్ర కారులు కూడా కవి కాలం, వంశ వివరాలు చూపలేకపోయారు

నరసింహదాసుది కరీంనగర్ జిల్లాలోని ధర్మపురి చాత్తాద వైష్ణవుడు కాకుత్థ్సం గృహనామం 1857-60 మధ్య ఈ శతక రచన కావించాడు ఈ విషయాలు తర్వాత సహేతుకంగా వివరించబడుతాయి

**ఈ కవి రచనలు** 1 శ్రీకృష్ణశతకము - ముద్రితం, 2 మైరావణచరిత్ర - యక్షగానం, అముద్రితం, 3 గంగపాట, 4 పిండారీల దండు దోపిడిపాట, 5 మిశ్రిత రామాయణము అలభ్యాలు

**కవి వంశం** కృష్ణ శతక ముద్రిత ప్రతిలో[1] నూటా ఒక్క పద్యాలున్నాయి అందలి చివరి పద్యంలో కవి పరిచయమిట్లున్నది

భారధ్వాజస గోత్రుడ గారవమున[2] గంగమాంబ కరుణాసుతుడన్
పేరు నృసింహాహ్వాయుడను, శ్రీరమయుత నన్నుగావు సృష్టిని కృష్ణా!

ఈ పద్యంలో కవి పేరు తల్లిపేరు గోత్రనామం తప్ప మరే వివరాలు లేవు

తల్లిపేరు సైతం సరిగాదు కవి పేరు నృసింహదాసు రచన కృష్ణశతకం ఈవైష్ణవ కవి జనని నామం శివపరమైన గంగ కాజాలదు స్మార్తులకు శివకేశవ భేదంలేదు కాని, వైష్ణవులకు ఆ పట్టింపు ఉంది విద్వాన్ చిన్ని కృష్ణశర్మగారు ఈ శతక కర్తను గోలకొండ వ్యాపారి-నియోగి బ్రాహ్మణునిగా ఊహించారు[3] ఈ కవి వంశ జన్మగ్రామాదిక వివరాలను తెలుసుకోవడానికి కాకుత్థ్సం అనంతయ్య జగిత్యాల, గారి 'వేణుగోపాల కృతి కదంబము'4లోని ఈ క్రింది పద్యాలు సజీవ సాక్ష్యాలు కృష్ణశతక కర్త నరసింహదాసు తమవంశ పూర్వీకులని అనంతయ్యగారు ఈ వివరాలు ఇచ్చారు

శ్రీరమేశ! యవధరింపు మా వంశపు పెద్దలెల్లరు నుడివిన విధంబు
వెలువరింతునాత్మ విశ్వాస యుతుడనై, కల్పితంబు గాదు కనుక కృష్ణ!

రంగమాంబ సుతుని గంగమాంబ సుతుగ, జెలగ తారు మారు జేసి కృష్ణ
శతకకర్త నన్య సంతుగా జిత్రింప న్యాయ్య మగునె? తీర్చవయ్య, కృష్ణ!

తరతరాల వరుస నరయ మాతండ్రికి, పెద్ద తాత యతడు, పేర్మి భక్తి
గృష్ణ శతకమున్ లిఖించెను, కాకుత్థ్స, వంశజుండు, మతము వైష్ణవంబు!

'ర' అక్షరం 'గ'గా మారటం చాల తేలిక అయితే ఈ శతకం అష్టోత్తరశతమని, దానిలో ఏడు పద్యాలను ఏలనో వదలి ఏకోత్తర శతిగానే ముద్రిస్తున్నారని, ఆ వదిలివేయబడిన పద్యాల్లో కవి తండ్రి పేరు, ఊరిపేరు మొ॥వి తప్పక ఉండి ఉంటాయన్నారు అనంతయ్యగారు తమకు స్వయంగా తెలిసిన నృసింహకవి విషయాలను ఇంకా వారు తమ కావ్యంలో ఇట్లా చెప్పినారు[5]

రంగమాంబ జనని రామయ్య జనకుండు, వారికేకైక కుమారుడతడు
పుణ్యభాగుడు ధర్మపురియందు జన్మించె, అనఘాత్మ లింబమ్మ6 యతని గృహిణి
నారసింహాహ్వాయుండై హరికథకుడై నరసింహదాసుగా వరలియుండె

ఇది బహిరంగ వర్తమాన సాక్ష్యం కృష్ణ శతక అంతరంగాన్ని పరిశీలిస్తే ఒక్క కృష్ణుని మినహాయిస్తే నరసింహుని మాత్రమే ఈ కవి ఎక్కువ పద్యాల్లో అభివర్ణించాడు అందుకు ఉదాహరణలు

1 కెరలియరచేత గంబము నరహరి రూపావతార - 40వ, పద్యం, 2 దిక్కెవ్వరు ప్రహ్లాదుకు 53, 3 స్తంభమున వెడలి - 57, 4 శరణన ప్రహ్లాదకుండు - 68, 5 ఎటువలె బ్రహ్లాదు కభయ మిచ్చితి - 70, 6 ఏ తండ్రి కనక కశ్యపు, ఘాతుకుడై యతని సుతుని గాచె 73

ధర్మ పురి ప్రసిద్ధి నందిన నృసింహ క్షేత్రం

నరసింహకవి జన్మస్థలం ధర్మపురి అనడానికి మరో బలమైన నిదర్శనం మైరావణ చరిత్ర వ్రాత ప్రతి[7] అందులో కవి స్వయంగా తన వంశ సమాచారాన్ని ఈ విధంగా వివరించుకున్నాడు

శ్రీకరంబైనట్టి శ్రీధర్మపురి యందు - వెలసిన నరహరి వేడ్కదలచి,
హరినామ కథలోన ఆనందముననుమై - రావణ చారిత్ర రమ్యముగను
నరసింహదాసుడ నయముగా నీయక్షగానము జేసితి ఘనులు మెచ్చ

మైరావణ చరిత్రలోని పద్యరచన శ్రీకృష్ణశతకంలోని పద్యాలకు సన్నిహితంగా ఉండటం విశేషం మై చ యక్షగానంలోని మొదటి పద్యం ఇది -

కం శ్రీరమ వల్లభ కేశవ, వారిజదళ నయన దేవ వాసవ వినుతా
ధారుణి ధర్మపురీ వర, శూరా నరసింహకోటి సూర్య ప్రకాశా

శ్రీకృష్ణ శతకారంభ పద్యాన్ని చూడండి,

కం శ్రీరుక్మిణీశ కేశవ, నారద సంగీతలోల నగధర శౌరీ
ద్వారక నిలయ జనార్దన, కారుణ్యము తోడ మమ్ముగావుము కృష్ణా!

ఈ రెండు పద్యాలు కందాలే రెంటి నడక ఒక్కటి ఇవి ఏక కవి విరచితాలు అనక తప్పదు

పై నిదర్శనాలను బట్టి కృష్ణ శతక కర్తయైన నరసింహ దాసు కవిగారిది ధర్మపురి అనడం నిర్వివాదాంశం

**కవి కాల నిర్ణయం** కవి చరిత్రకారుల అంచనాలను బట్టి కాక, ఈ కవి కాల నిర్ణయానికి ప్రత్యక్ష సాక్ష్యమున్నది కాకుత్థం ఆనంతయ్య జగిత్యాల గారి తండ్రికి పెద్ద తాతగారు నరసింహదాసు ఆనంతయ్య గారి జననం 1920లో 1920-30 వీరి తండ్రి జననం 1890 తాతగారి జననం 1860లో తాత తండ్రి 1830 అతనికి అన్న నరసింహదాసు మరో అయిదు పదేండ్లు పెద్దవాడై ఉంటాడు

మైరావణ చరిత్రను నరసింహదాసు పింగళ సంవత్సరంలో పూర్తి చేసినట్లు వ్రాసుకున్నారు అది 1857, అప్పటికి దాదాపు 40 ఏండ్ల వాడనుకుంటే నరసింహదాసు జననం క్రీ శ 1820లో మై చ లో కృష్ణశతక ప్రసక్తి లేదు కాబట్టి అది మొదటి రచన అనుకోవాలి కృష్ణశతక రచనాకాలం 1858-60 మధ్య అయి ఉంటుంది

**కృతుల పరిచయం** ఈ శతకంలో విష్ణుభక్తి అధికం అన్యమత నిందకానీ, లోక విమర్శకానీ లేవు

నీవే తల్లివి తండ్రివి, నీవే నా తోడు నీడ నీవే సఖుడౌ
నీవే గురుడవు దైవము, నీవే నా పతివి గతివి నిజముగ కృష్ణా 2

పోతన వలె నరసింహదాసుది మధుర భక్తి పై పద్యం 'త్వమేవ మాతాచ పితా త్వమేవ' శ్లోకభావ సంజనితం భగవద్గీత భావం కల ఈ పద్యం చూడండి,

గిరులందు మేరు వౌదువు, సురు(ర) లందున నింద్రుడవౌదు, చుక్కలలోనన్
బరమాత్మ చంద్రుడవౌదువు, నరులందున నృపతి వౌదు నయముగ కృష్ణా 22

మరో ప్రసిద్ధ హరిభక్తి పద్యం

హరి యను రెండక్షరములు, హరియించును పాతకంబు నంబుజనాభా,
హరినీ నామ మహత్త్వము, హరి హరి! పొగడంగ వశమె హరి శ్రీకృష్ణా 5

భారత భాగవత రామాయణ విష్ణుగాధలను కవి ఈ శతకంలో సందర్భోచితంగా భక్తితో స్మరించాడు ఉదా

శక్ర సుతుగాచు కొరకై చక్రము చేపట్టి భీష్ముజంపగ జనునీ విక్రమ మేమని పొగడుదు - (29) అని భారత కధను, అంగన పనుపున దోవతి, కొంగున నటుకులను ముడుచుకొని వచ్చిననీ (కుచేలుని) సంగతి విని దయనొసగితి (వి) రంగుగ సంపదలు (24) అని భాగవత కధను వర్ణించాడు బాలకృష్ణ లీలలు (12-23) భారత యుద్ధ గాధలు (26-30), ద్రౌపదీ మాన సంరక్షణ (25), పరీక్షిత్తు ప్రాణ రక్షణ (31), దశావతారాల వర్ణన (36-46) ఇట్లా కృష్ణ శతక పద్యాలు భక్తి గాధాతోరణాలు మనోహరాలు! కవి భావ చమత్కృతికి నిదర్శనంగా ఉంది ఈ క్రింది 30వ పద్యం

దివిజేంద్ర సుతుని జంపియు, రవి సుతు రక్షించినావు రఘు రాముడవై,
దివిజేంద్ర సుతుని గాచియు, రవి సుతు బరిమార్చితౌర రణమున కృష్ణా!

రామావతారంలో ఇంద్రనందనుడైన వాలిని చంపి సూర్య సుతుడైన సుగ్రీవుని కాపాడినవాడే, కృష్ణావతారాన సూర్యపుత్రుడైన కర్ణుని పరిమార్చి ఇంద్రనందనుడైన అర్జునుని కాచినాడని భావం

ఈ శతకంలో కొండిక పని, వావిరిగా, పటపటలు, వంటి అరుదైన పదాలు, కంటికి రెప్ప విధంబున, పరుసము సోకిన యినుము బంగారమైనట్లు, వంటి, సూక్తులు వాడబడ్డాయి

ఆంధ్ర దేశంలో అతి ప్రసిద్ధి కల శతకాలలో నరసింహదాసు శ్రీకృష్ణశతకం ఒకటి

## 2 మైరావణ చరిత్ర (యక్షగానం)[9] అముద్రితం [10]

రామాయణం భారత దేశంలో అబాల గోపాలం వ్యాప్తిలో ఉన్న కథ[11] రామాయణం సీతారాముల కథ రావణవధ రామ పట్టాభిషేకం వరకు పూర్వరామాయణం లవకుశుల కథరామాశ్వమేధం సీతాదేవి భూ ప్రవేశం వరకు కలది ఉత్తర రామాయణం మైరావణ కథ పూర్వ రామాయణం లోనిదే రావణుడు దశకంఠుడు ఆ ఊపులో శతకంఠ సహస్రకంఠ మహిరావణ అహిరావణ కథలు జానపదుల అద్భుత సృష్టి వారు రావణ బాంధవులు వైరం రామునితోనే ఇవి అవాల్మీకియ గాథలు

మహిరావణుడు - మైరావణుడు ఇతడు రావణుని మేనమామ రామరావణ యుద్ధ సందర్భంలో రాక్షస సేనలు విధ్వంసం కావడంతో పూర్వ వైరాన్ని మరచి రావణాసురుడు పాతాళ లంకకు వెళ్ళి మేనమామ సహాయాన్ని అర్థించాడు మైరావణుడు రామలక్ష్మణులను మాయోపాయంతో ఎత్తుకొనిపోయి కాళికాదేవికి బలి ఇవ్వనెంచాడు ఆంజనేయుని శక్తి యుక్తుల వలన శత్రువు మృతి చెంది రామలక్ష్మణులు విముక్తులౌతారు

ఇది క్లుప్తంగా కథ ఇందులో హనుమంతుని తోక కోట వర్ణన, మైరావణ సోదరి దోర్దండి కరుణ కథ, హనుమని మానస పుత్రుడైన మత్స్యవల్లభుని పరాక్రమం అద్భుత కల్పనలు, అతి మనోహర ఘట్టాలు యక్షగానాలుగా, హరికథలుగా ఈ కథ చాలా వ్యాప్తి పొందింది మాడయ్య అనేకవి దీన్ని పద్యకావ్యంగా మలిచాడు [12] తోలు బొమ్మలాటలవాళ్లు తప్పక ప్రదర్శించే కథ మైరావణ చరిత్ర ఇది తెలుగు చలనచిత్రంగానూ రూపొందింది

తమ వంశ పూర్వీకుడైన శేషాచలదాసు గారి పూర్వ రామాయణ యక్షగానం, ఈ నరసింహకవి మైరావణ చరిత్ర రచనలకు ప్రేరణ కలిగించి ఉంటుంది ఈ యక్షగానం కూడ శేషప్ప ధర్మపురి రామాయణం వలె పాత్రల ప్రవేశ నిష్క్రమణాదులు లేనిది గాన యోగ్యం ప్రదర్శన సౌలభ్యం తక్కువ

ఈ మైరావణ చరిత్రలో కథను చూస్తే, పాతాళ హోమం భంగమైన తర్వాత రావణుని విచారం ఇట్లా వర్ణించబడింది (వ్రాతప్రతికి యథాతథం)

ఉ మానసమందు చింత్తలును మానక చెంచెల మొంద్ది కుంద్దుచున్
దీనత నొంద్దియున్ వగలు దీరెను పెక్కు విచార మంతుడై
నేనెటు గెల్తునంచ్చు మది నిద్దుర కంట్టికి రాక శెయ్యపై
పూనుచు లేచుచున్ మగుడ బొర్లుచు నత్తరి నవ్వి యేడ్చుచున్ పుట - 2

ఇందు కవి వర్ణనలు పాత్ర పోషణ సహజ సుందరంగా ఉన్నాయి లంకేశ్వరుడు తన దర్ప ప్రదర్శనకు మేనమామ మహిరావణుని పట్టి వెయ్యేండ్లు చెరసాలలో బంధించి వదలినాడు ఇప్పుడు పాత వైరాన్ని తన అభిమానాన్ని వదలి పాతాళలంకకు వెళ్ళిసహాయాన్ని అర్థించాడు

ఆక్రోశపడక ఆపదలో ఉన్న మేనల్లుని ఆదరించి తన పెత్తనం నిలుపుకొన్నాడు మైరావణుడు రావణుని వినతి ఈ కీర్తన రూపంగా ఉంది

రామూ మహిమా మామ వినుమా!
సామాన్య ప్లవగూలా దీమూచే1 చనుదెంచి రామాలక్ష్మణులాచే రంజాన2 చెడెలంక ॥రా॥
వారాధి గిరులాచే కేరూచూ బందించి - వారూ సువేలాద్రి జేరీ హెచ్చిరి వేగా ॥రా॥
వశముగాను నగరి విశదంబుగను జుట్టి - అసహాయశూరుల హతమొనరించిరి ॥రా॥
ఘట కర్ణ మొదలైన కుటిలేంద్ర జిత్తూల నూ । హట మూన3 దనుజుల అటు ద్రుంచి వైచిరి ॥రా॥
శంకారు వరములబింకాము సాగావు4 - లంకాకు బాధాయ5 యింకేముపాయము ॥రా॥

1 సహాయం 2 రంజన 3 హటము-పంతం 4 బింకముసాగి అవు 5 బాధ ఆయె

రామాయణంలోని రావణ, మండోదరి, విభీషణ, లంకిణి పాత్రలకు, మైరావణ చరిత్రలోని మైరావణ, మాతంగి, దోర్దండి, మత్స్యవల్లభ పాత్రలు స్వభావాల్లో ప్రతిబింబాలు

శబ్ద సాధుత్వ విషయానికి పోకపోతే నృసింహదాసు యక్షగానం శేషప్ప, ముద్దుబాలంభట్టు యక్షగానాల వంటి రసవద్రచన కవి హరిదాసు కావడం కావ్యానికి మరింత మేలు చేకూర్చింది

కృష్ణ శతకకర్త నరసింహదాసు పరితులకు తెలిసినా స్థల కాల నిర్ణయం ఇంత వరకు సరిగా కావించబడలేదు ఈ కవిని కాకుత్థ్స గృహనామునిగా ధర్మపురి నివాసిగా, 19వ శతాబ్ది మధ్యకాలపు వ్యక్తిగా ఇందు సోపపత్తికంగా నిరూపించబడింది

గంగవరద (గోదావరి పొంగు) పాట, పిండారీల దోపిడి పాట, వ్రాత ప్రతులు లేవు మిశ్రిత రామాయణ వివరాలు కూడా తెలియవు నరసింహదాసు పేరు ఇప్పటికీ ధర్మపురిలో వ్యాప్తిలో ఉంది ఆ కవి కృష్ణ శతకం అఖిలాంధ్ర వ్యాప్తిలో ఉంది

**పాదపీఠికలు**

1 గొల్లపూడి వీరాసామి అండ్ సన్స్, రాజమండ్రి ముద్రణ, దీనిలో 102 పద్యాలున్నాయి పరిశీలిస్తే 58 నం తప్పింది మొత్తం 101 పద్యాలే
2 గౌరన కుసు అని పాఠాంతరం 3 శతక వాఙ్మయ సర్వస్వము - పు 247
4 రచన 1986 - 89, ముద్రణ 1990, పుటలు - 94,951
5 అనంతయ్యగారు తమ కావ్యంలోవ్రాయడమే కాక, నాకు కలిసి స్వయంగా ఈ విషయాలన్నీ ముచ్చటించారు - -1989లో
6 లింబగిరి (నింబాద్రి) నిజామాబాద్ జిల్లాలో భీంగల్లు సమీపంలోని నృసింహక్షేత్రం కరీంనగర్ జిల్లా మెట్టుపల్లి, జగిత్యాల తాలూకాలలో అనేకులకు లింబాద్రి స్వామి' ఇలవేల్పు
7 మైరావణ చరిత్ర వ్రాతప్రతిని జిరాక్స్ కాపీ చేయించి కా అనంతయ్యగారు నాకు పంపించారు
8 హరిహరులకు బొగడవశమె - అని పాఠాంతరం ఇంద్రశంకరులని భావం
9 వ్రాతప్రతి 68 పుటలు పేజీకి సగటున 20 పంక్తులు మొత్తం గ్రంధం 1360 పంక్తుల రచన అది అచ్చులో 100 పు కావచ్చు
10 నరసింహదాసు పింగళ 1857 లో రచించాడు దానికి మారు ప్రతి 1915 రాక్షసలో వచ్చింది ఈ రెండవ ప్రతిని చూసి నృసింహ కవి తమ్ముని పౌత్రుడు కాకుత్సం నారాయణ అక్షయ 1926లో ప్రతి రాసుకున్నారు ఈ 1926 ప్రతి జిరాక్స్ చేయించి అనంతయ్యగారు నాకు పంపించారు
11 సయాం, కాంబోడియా మొ॥ విదేశాల్లో సైతం రామకథ కొద్ది మార్పులతో ఉందని ఆరుద్ర ‘రాముడుకి సీతేమౌతుంది?’ అనే తమ పుస్తకంలో తెలిపారు
12 మాడయ్య కవిది గుడివాడ 3 ఆశ్వాసాల ప్రబంధం, తులువ వీరనరసింహ రాయలకాలం 1485 - 1508

## 3 కృష్ణగిరి వేంకటరమణయ్య - ధర్మపురి 1870

కృష్ణగిరి వేంకటరమణయ్య గారు ధర్మపురి వాస్తవ్యులు గత శతాబ్ది ఉత్తరార్ధం వారు సంస్కృతాంధ్ర కర్ణాటక భాషలలో విద్వాంసులు ఈ కవి కృత గ్రంథములు నాలుగు

1 వాసిష్ఠ రామాయణము (ముద్రితం) 2 అధ్యాత్మ రామాయణము (అలభ్యము) 3 గయోపాఖ్యానము (కన్నడము) 4 వాసిష్ఠ రామాయణ వ్యాఖ్య పై వివరాలన్నీ గో క సం పుట 411 లోనివి ఇంకా వేంకటరమణ కవి రచనల వివరాలు ఆ సంచికలో ఇట్లు తెలిపారు

"మొదటిది (వాసిష్ఠరామాయణము) మదరాసు పూర్వ ముద్రిత ప్రతులలో లభించినది రెండవది అలభ్యము మూడవది ఓరియంటలు లైబ్రరీ క్యాటలాగు నుండి ఉద్ధృతము "

నాలుగవ గ్రంథ విషయం తెలుపలేదు ఇప్పటికి అదీ అలబ్ధమే కృ వే రమణయ్య గారి సోదరుడు కృష్ణరాయలు వాసిష్ఠరామాయణానికి సంస్కృత వ్యాఖ్య వ్రాసినవారు కావున ఈ రమణకవి వ్యాఖ్య తెలుగు గ్రంథం అయి ఉంటుంది ధర్మపురిలో విచారిస్తే ఈ కవిని గూర్చి తెలుసునన్న వారే లేరు ఇంక అతని కావ్యాల ప్రసక్తి ఎక్కడ? ఇంతగా విస్మృతిలో పడినాడంటే ఈ కవి ఇంకా ప్రాచీనుడై ఉండాలి

## 4 ఖండేరావు రామారావు - కరీంనగరం

జననం - 1844, మరణం 1935 సుమారు

ఖండేరావు వారు మహారాష్ట్ర కరణాలు నైజాం నవాబుల కాలంలో వారి పూర్వీకులు సర్కారీ ఉద్యోగులుగా వచ్చి ఈ ప్రాంతంలో స్థిరపడి ఉంటారు గో క సం నాటికి రామారావు గారు 90 సం వారని ఉంది "వీరి తండ్రి (కూడ) కవులు చాలా గ్రంథములు రచించినారు అన్నియు అముద్రితములు" అని పరిచయం చేశారు పు 360

కరీంనగర్ పాతబస్తీ బ్రాహ్మణ వీధిలో ఖండేరావు వంశం వారి గృహాలున్నవి వృద్ధులను సంప్రదిస్తే కవిని గూర్చి వినలేదన్నారు (కవి పౌత్రులో ప్రపౌత్రులో అయిన శ్రీనివాస రావు గారి కోసం ఎన్ని పర్యాయాలు వెళ్లినా కలువ లేదు వారు ప్రభుత్వోద్యోగి దూర ప్రాంతమందున్నారట)

గోలకొండ కవుల సంచిక నం 78 పుట 71, లో రామారావు గారి కవిత ఉంది

శీర్షిక - చూడికుడుత్త దేవి,

మ దనుజారిప్రియ దివ్య పుష్పతులసీ దామార్చనై కాంత దా
స్యనిరూఢాశయ భట్టనాయక సుధీ సంవర్ధితాత్యంత పా
వన భాస్వత్తులసీ వనాంతరమునన్ వైదేహి రీతిన్ జనిం
చిన మా తల్లిని విష్ణు చిత్తతనయన్ సేవింతు నశ్రాంతమున్

కలితాత్మీయ వచస్సుధా రస ఝరీ కల్లోల మగ్నాత్ములై
ఫలమందన్ హరిమోదమొందగ తిరుప్పావై ప్రబంధంబు భూ
స్థలిలో నానతి యిచ్చి దాస జనతా దౌర్గత్యముంబాపి భా
సిలు మా తల్లిని విష్ణు చిత్తతనయన్ సేవింతు నశ్రాంతమున్

ఘన నీలాశ్మ సమాత్మ కమ్రకబరీ గంధాంకితోత్సృష్ట మా
ల్య నవీనోజ్జ్వల సౌరభానుభవ లౌల్యంబొప్ప ధన్యోహమం
చును దన్మాలిక గృష్ణుడందుకొనుటన్ చూడిక్కుడుత్తాఖ్యగాం
చిన మా తల్లిని

తనయందే దురితక్రియా చరణుడై దౌర్గత్యమున్ బొంది వ
చ్చిన కాకాసురునాత్మ నాధు పదరాజీవంబులన్ జేర్చి ప్రో
చిన కారుణ్య సతీమ తల్లిని జగత్క్షే మావహాపాంగ రా
శిని మాతల్లిని

మూడవ పద్య పదబంధం - భావం రమ్యాతి రమ్యం రామారావు గారు సంస్కృత భాషావైదుష్యం కల ప్రౌఢ కవి అనడానికి పై పద్యాలు నిదర్శనం ఆయన విష్ణు భక్తుడు ఈ పద్యాలు నాలుగూ మత్తేభాలే ఏకవృత్తం గోదా చరితం చూడ "మా తల్లిని ఆశ్రాంతమున్' అనే మకుటంతో ఈ కవి 'ఆండాళ్ శతకం' వ్రాసిరేమో అని అనుమానం చివరి పద్యంలోని కాకాసుర వృత్తాంతం రామాయణం లోనిది సీతాదేవియే గోదాదేవి అని కవి భావం ఖండేరావు రామారావు గారి కృతులు లభించి ప్రచురింపబడితే దిట్టకవిగా వారి ప్రతిభ వ్యాప్తమయ్యేది రామారావు గారి తండ్రి కూడా కవితా విభూషితులట! చూడికుడుత్త దేవి తమిళ పదం దాని అర్థం ఆముక్తమాల్యద

## 5 పరవస్తు మునినాధ కవి - కేశవ పట్టణం 1896

పరవస్తు మునినాధస్వామి శతక కవి వీరి రచనల పేర్లివి

1 లక్ష్మీశతకము, 2 లలితా శతకము 3 పరవస్తు శతకము

కవి స్వగ్రామమైన కేశవ పట్టణం కరీంనగర్ నుండి హన్మకొండ మార్గలో హుజూరాబాద్ తాలూకాలో ఉన్నది ఇప్పుడది మండల కేంద్రం ఈ మధ్యనే తీవ్రవాదులచే హతుడైన మండలాధ్యక్షుడు శంకరయ్య గారి స్మృతిగా ఇప్పుడది శంకరపట్నం పేర వ్యవహరించబడుతున్నది

కేశవ పట్టణంలో 1531లో స్థాపితమైన పరవస్తు జియ్యరు స్వామి మఠమున్నది ఇప్పటికీ దీపధూప నైవేద్యాదులతో నిత్యారాధన, వైశాఖ శు॥ తదియనాడు రథోత్సవంతో అది అలరారుతున్నది

దక్షిణ దేశం నుండి వచ్చి విశ్రాంతిగా పుర బాహ్యగిరి చెంత కూర్చున్న జియ్యరు స్వామి పాదాన్ని కబళించే కొండ చిలువ, స్వామి చూపుతో శాప విమోచనమై కందాశై తోడప్పర్‌గా మారిందట ఆ జియ్యరు స్వామి ఈ అజగర సర్పం సమాధులు ఒకే చోట ఉన్నాయి అదే ఆలయం శఠారిదేశికుల వారే ఈ శేషమఠం పూజారులు [1]

ఆ పరవస్తు వంశానికి చెందినవారే మన మునినాథ కవి మునినాధకవి లక్ష్మీలలితా శతక ద్వయం ముద్రితమైనవి గో క సం పుట 406 పూర్వకవి పరిచయం నం 98లో "కవిత్వము ప్రౌఢము ముద్రితములగు నీ శతకములు మదరాసు వావిళ్ళ వారికడ లభించును శేషమఠ పీఠాధీశులకు జియ్యరు శిష్యుడగు నిక్కవి వృత్తాంతము స్పష్టముగ దెలియదు " అని శేషాద్రి రమణ కవులు వ్రాసినారు

స్థానికులకు కూడ మునినాధ కవిని గురించి తెలియదు శతక ప్రతులు లభించలేదు

శతక వాఙ్మయ సర్వస్వములో ఈ కవి పేరు లేదు

డా॥ దివాకర్ల వేంకటావధాని గారు 'ఆంధ్ర వాఙ్మయ చరిత్రము' లో ఇట్లా అన్నారు [2]

"లక్ష్మీ శతకము కందపద్యమయమైన శతకము దీనిని రచించిన వాడు పరవస్తుముని నాథ కవి యను సాతానివైష్ణవుడు అతడు లలితా శతకమును గూడా రచించి యుండెను ఇతని కవిత శబ్దాలంకార మయమై నిర్దుష్టమై ద్రాక్షాపాకముగ నున్నది లక్ష్మీస్తుతిపరమైన శతక మాంధ్రమున నిది యొకటే " - పు 118

ఈ 20వ, శతాబ్దిలో మంథని వేంకటరాజన్న అవధాని గారు కూడ మరో 'లక్ష్మీశతకము' రచించారు అది కూడా కందపద్యాలదే అముద్రితం

ముని నాథకవి లక్ష్మీశతకం కంద పద్యాలది లలితాశతకం వృత్త పద్యాలదో? 1960 సుమారుగా ఒకానొక లలితా శతకం కనిపించింది 'లలితారమ్మిక కాలయాపనము లేలా రాజబింబాననా!" అని దాని మకుటం ఏకాక్షర 'ల ప్రాసతో మత్తేభ విక్రీడిత వృత్త పద్యాలతో విరచితమైన ఆ శతకం ఈ కవిది అవునో కాదో తెలియదు ఆ పుస్తకం కోసం ఎంత ప్రయత్నించినా తిరిగి దొరుకలేదు

పరవస్తు శతకం వ్రాత ప్రతి కేశవ పట్టణంలో శేషమర ఆర్చకులింట 1993లో కనిపించింది దానిలో కవిపేరు లేదు అది 'పరవస్తునాయకా' అను మకుటంతో చంపకోత్పల పద్యపుష్పాలగురు పూజా శతకం స్థానిక భక్తకవిచే విరచితమైన ఆ శతకానికి కర్తయెవ్వరో తెలియదని శరగోపాచార్యులన్నారు అది పరవస్తుముని నాథ కవి విరచితం కానోపునని ఈ గ్రంథకర్త (నా) అనుమానం లక్ష్మీ లలితల స్తుతికి పూర్వమే మునినాథ కవి గురు స్తుతి రూపంగా పరవస్తు శతకం వ్రాసి ఉంటాడనుకోవడం అసంగతం కాదు పరవస్తు గురునామం పైగా అదే ఈకవి గృహనామం

ఈ అష్టోత్తర శత పద్యశతక రచన, ఖర నామ సంవత్సర కార్తీక శు 7 భానువారం అని వ్రాసి ఉంది మచ్చునకు 'పరవస్తు శతకం' లోని ఒక పద్యం

శ్రీరమణీశ పాద సరసీరుహ హంస, పరాంకుశాంఘ్రి నీ
రేరుహ భృంగ సంయమి వరేణ్య పద ద్వయ దాస్యతత్సుధా
వారిధి పూర్ణ చంద్ర మణవాళ మహాముని సంప్రదాయ మం
దారక భృత్య మోక్ష ఫలదాయక శ్రీ పరవస్తునాయకా 1

ఓ పరవస్తు గురూత్తమా? నీవు శ్రీపతి పాద పద్మాల నాశ్రయించిన హంసవు పరాంకుశ గురు చరణ కమలముల విహరించే తుమ్మెదవు, యోగీశ్వరుల పాదాలకు దాసుడవు ఆ సుధా సముద్ర సంపూర్ణ చంద్రు (డవు లేదా) డైన మణవాళ యతి సంప్రదాయ కల్ప వృక్షానివి దాసులకు మోక్ష ప్రదాతవు మునినాథ కవి కవిత్వం ముగ్ధ మోహనం!

**పాదపీఠికలు**

1 ఈ ఐతిహ్యం కేశవ పట్టణ శేషమర పరవస్తు పీఠం పూజారి పరవస్తు శరగోపాచార్యులు 3-9-93 నాడు వారింటిలో నాకు తెలిపారు

2 డా॥ దివాకర్ల "ఆంధ్రవాఙ్మయ చరిత్రము" 12వ ముద్రణ - 1985

## యక్షగానాలు

**1 చెర్లపల్లి కాశీనాథశాస్త్రి - దుంపెట, 19వ,** శతాబ్దిపూర్వార్ధం 2 3 ఇతర యక్షగాన కవులు

చెర్లపల్లి కాశీనాథ శాస్త్రి[1] విద్వత్కవి రంగస్థల నటుడు ఆయన రచించి ప్రదర్శించిన యక్షగాన నాటకాలు నాలుగు అవి అముద్రితాలు శాస్త్రిగారి రచనల పేర్లివి

1 వామన చరిత్రము - యక్షగానం, 2 గయోపాఖ్యానము, 3 లక్ష్మణా పరిణయము 4 రుక్మిణీ కల్యాణము

**కవి కాలం - జన్మస్థలం** నాటి జగిత్యాల మెట్‌పల్లి తాలూకా, నేటి కథలాపుర మండలంలోని 'దుంపెట'2 గ్రామంసమీపాన కొండపై నరసింహస్వామి దేవాలయం ఉంది ఆ విష్ణ్వాలయ పూజారులు వైదిక బ్రాహ్మణులు ఆ కోవెల తొలి పూజారి నారంభట్ల (నాదంభట్ల!) మహాదేవు గారు అయన వంశంలోని వ్యక్తి ఈ కాశీనాథకవి ఆ పూజారులు ప్రతి సంవత్సరం వైశాఖ పూర్ణిమ (ఆలయరథోత్సవ) దినాల్లో నాటకాలు ప్రదర్శించడం ఎన్నో యేండ్లుగా ఆనవాయితిగా వస్తున్నది ఆ ప్రదర్శనల కోసం రచించినవే కాశీనాథశాస్త్రి గారి యక్షగానాలు ఈ కవి ఆరేడు తరాలకు పూర్వుడన్నారే కాని ఆ కుటుంబం వారు ఖచ్చితంగా కవి కాలం ఫలానా అని చెప్పలేకపోయారు

దుంపెట నృసింహాలయార్చకుల వంశవృక్షం ఇది
1 నారంభట్ల మహదేవు - కోవెల తొలి పూజారి
2 రాజంభట్టు 3, నీలకంఠం
4 లక్ష్మయ్య 5 నరసింహులు కవి
4 రమణయ్య కవి 5 నరసింహులు 6 నరహరి 7 లక్ష్మినరసయ్య వ 45 సం
5 నరహరి కవి
5 మోనయ్య 6 దుంపెటాద్రి 7 లక్ష్మినారాయణ శాస్త్రి కవి (గుండయ్య) వ 55 సం

వీరిలో నాలుగవ తరం రమణయ్య గారి సమకాలికుడుచెర్లపల్లి కాశీనాథ శాస్త్రి వీరు మూడవ తరం నీలకంఠం గారి సోదరి పుత్రులై ఉంటారు రమణయ్య గారు యువదశలో మొదట కొన్నాళ్ళు సన్యాసిగా ఇల్లు విడిచి వెళ్ళారట ఆ కాలంలో నీలకంఠం బావగారి కుటుంబాన్ని పిలుచుకొని ఉంటారు లక్ష్మయ్య గారి వివరాలు తెలియవు లక్ష్మయ్య రమణయ్యలు సోదరులు వారికి కాశీనాథం మేనబావ చెర్లపల్లి వారు ఇప్పుడు మల్యాల చెందుర్తిలో ఉన్నారు

నారంభట్ల గుండయ్య గారి తండ్రి దుంపెటాద్రి గారి జననం క్రీ శ 1900 సంవత్సరం వారి తండ్రి మోనయ్య 1870, తాత రమణయ్య 1840లో జన్మించి ఉంటారు రమణయ్యకంటె కాశీనాథ శాస్త్రి ఓ పది సంవత్సరాలైనా పెద్దకావాలి ఎందుకంటే కాశీనాథ కవి ప్రభావం వలననే రమణయ్య యక్షగాన రచన కావించాడు కాబట్టి చెర్లపల్లి కాశీనాథ శాస్త్రి కాలం సుమారుగా 1830 90 వారి రచనాకాలం 1855 60

**రచనల విశేషాలు** కాశీనాథశాస్త్రి యక్షగానాలు నాలుగూ ప్రదర్శనల్లో చాల రక్తి కట్టేవట అయినా వామన చరిత్రం అద్భుతమైన రచనా విన్యాసంతో కవికి కీర్తిని తెచ్చిపెట్టిందని వినికిడి ఎంత ప్రయత్నించినా నాలుగైదు పర్యాయాలు కవివంశీయులున్న దుంపెట సిరికొండ, కట్లకుంట గ్రామాలకు వెళ్ళినా ఈ నాటకాల వ్రాతప్రతులు లభించలేదు [3]

సిరికొండ లక్ష్మీనరసయ్య పట్వారీ కొరుట్ల గారు[4] కవిని గూర్చిన కొన్ని విశేషాలు తెలిపారు వీరు పూజారి వంశంలో ఏడవ తరం వారు వారి తాత నం [5] నరసింహులు వ్రాసుకొన్న దొడ్డు కాగితముల వ్రాతప్రతిలో పైన చూచిన వంశ వృక్షం వ్రాసి ఉంది ఈ నరసింహులు గారి తమ్ముని మనుమడు నారంభట్ల లక్ష్మినారాయణ శాస్త్రి (గుండయ్య) దుంపెట గారు5 రచించిన "దుంపెట క్షేత్ర చరిత్ర' ' వ్రాతప్రతి కట్లకుంటలో లభించింది లక్ష్మినారాయణ గారు కవి నటులు, గాయకులు వారు కాశీనాథ శాస్త్రి గారి యక్షగానాలలో వేషాలు వేసినవారు ఆ నాటకాల కీర్తనలు పాడి వినిపించడమే కాక ఆ పూర్వకవుల రచనల వివరాలు తెలిసినంతలో వివరంగా తెలియజేశారు అవి తమ అముద్రిత 'దుంపెట క్షేత్ర చరిత్ర'లో పొందుపరిచారు కూడా అవే ఈ వివరాలు వ్రాయడానికి సహకరించాయి

కాశీనాథ శాస్త్రి గారి వామనచరిత్రకు మూలకథ భాగవతంలోనిదే అయినా వీరు వేదాంత విషయాలను ఈ రూపకంలో చాల చక్కగా పొందుపరిచారట ఈ యక్షగానంలోని విష్ణుమూర్తి పాత్ర ప్రవేశ కీర్తన ఇట్లున్నది

"అట్టి నారాయణ మూర్తిని నేను సృష్టిలో జనుల పట్టి బ్రోచుటకై వచ్చినాను"
నిష్టతోడ సురనివహము గొలువగ । గట్టిగ అదితికి పుట్టితి వినరా ॥అ॥
భాసూర మగు శ్రీ దుంపెట గిరి ని । వాసూదనయ్యా పోషింతు భువిలో జనులందరిని
దోసిలొగ్గి బహుయాచన జేసెటి । కాశినాథ దాసుని రక్షించిన ॥అ॥"

ఇట్లా గేయాలను కవులు తమ నామాంకితం చేయడం జయదేవ, సూరదాసు, మీరాబాయి త్యాగరాజు మొ॥ వాగ్గేయకారుల్లో కానవస్తుంది కాశీనాథ శాస్త్రి గారు వారి యక్షగాన రూపకాలలో

ఒక్క వామన చరిత్రలోని కీర్తనలను మాత్రమే స్వీయ నామ ముద్రతో రచించారు మిగితా నాటకాల కీర్తనలలో కవి తన పేరు చేర్చలేదట రాను రాను యక్షగాన కవులు ఈ పద్ధతిని విధిగా అనుసరించారు వారు కృతిభర్త గ్రామాన్ని, ఆ గ్రామ దైవాన్ని, కృతి నామాన్ని పాట చివరి చరణంలో తప్పనిసరిగా పొందుపరిచారు

ముద్దు బాలంభట్టు- మంథని, నరసింహదాసు - ధర్మపురి6 గారల యక్షగానాలకు దుంపెట శాస్త్రుల యక్షగానాలకు ఒక ప్రధాన భేదం కానవస్తుంది అది పాత్రలు మొట్టమొదట రంగ ప్రవేశం చేస్తున్నప్పుడు స్వీయ పరిచయ దర్వులు పాడడం ఇది భాగోతం పద్ధతి దీన్ని ఈ ప్రాంతంలో దుంపెట వారే ఆరంభించారు నిత్యదాసర్ల రాత్రి నాటకాలలోను, చిందు బాగోతుల పగటి వీధి నాటకాల్లోనూ ఈ పద్ధతి ఇప్పటికీ సజీవంగా ఉంది కూచిపూడి వారిలో, తెలంగాణా చిందు భాగవతులలో, అది తెరచాటు పాటగానూ వుంది నాటి క్రీడాభి రామ వీధి రూపకంలో పద్యాలే తప్ప పాటలు లేవు అది సంస్కృత రూపకానువాదం సుగ్రీవ విజయం పద్యాలతోపాటు పాటలు కలది సుగ్రీవ విజయం, మంథని రామాయణం మున్నగు ప్రాచీన యక్షగానాలలో పాత్రల స్పష్టత లేదు దుంపెట కవుల7 రూపక రచనలు పాత్రలకు ప్రవేశ నిష్క్రమణాది సూచనలు, వచన సంభాషణలు కలిగి ప్రదర్శన సౌలభ్యాన్ని చేకూర్చిన ఈ ప్రాంతపు తొలి యక్షగానాలు అంతకు పూర్వ యక్షగానాలలో సంధి వాక్యాలు కవి కథనంగానే ఉండేవి ఈ భాగాన్ని నాడు మంత్రి వేషధారి నిర్వహించే వాడనుకోవచ్చు వీధి భాగవతాల్లో ఇప్పటికీ అదే విధానముంది నృత్య ప్రధానాలైన కూచిపూడి యక్షగానాలలో ఆ పాత్ర సూత్రధారుడు నిర్వహిస్తున్నాడు

తంజావూరి విజయరాఘవుడు8 యక్షగాన నాటకాలలో కొత్తగా రగడలకు మారుగా దర్వు పదాలను, పాత్రల సంభాషణలను ప్రవేశపెట్టినాడని డా॥ దివాకర్ల వేంకటావధాని గారు తెలిపారు 9 నాంది ప్రస్తావనలు కావ్యంలో వలె కవిచేకాక నటులచే నిర్వహింపజేయటం కూడా విజయరాఘవుడే ఆరంభించాడట అవి సంస్కృత నాటకాల విధానం

కాశీనాథ శాస్త్రిగారి వామన చరిత్రలో వామనుని రంగప్రవేశ కీర్తన చూడండి

"వినరోరి ద్వార పాలకా నన్నడిగిన మాట। మనసూలో నుంచి వేడుకా,
మునుగొని దనుజుల దునుముట కొర్కై। వన జాసను (డు) నను ఘనముగ బిలిచెను ॥వి॥
ఉక్కు స్తంభములో బుట్టితీ - రక్కసూని బట్టి। వొక్క క్షణములో ద్రుంచితీ,
పెక్కు విధంబుల దిక్కులు బెదరగ। మక్కువ బాలుని చక్కగ నేలితి ॥వి॥

కాశీనాథశాస్త్రి అన్నగారు చెర్లపల్లి నరసింహులు కూడా కవి ఆయన నాటకాలేవీ వ్రాయలేదు కాని - సోదరుని యక్షగానాలకు కొన్ని పాటలు మాత్రం వ్రాసి సహకరించారు నరసింహులు కీర్తనలు పదజటిలత కలవి ప్రేక్షకులను అవి బాగా ఆకట్టుకునేవట నరసింహులు గారికి సంస్కృత భాషా సాహిత్యాల పాండిత్యం అధికం అని వారి కీర్తనలు తెలియజేస్తాయి చెర్లపల్లి నరసింహులు గారు కాశీనాథశాస్త్రి గయోపాఖ్యానం యక్షగానం కోసం రచించిన ఒక గేయ భాగం ఈ దిగువ చూపబడుతున్నది

శ్రీ కృష్ణపాత్ర రంగస్థల ప్రవేశ స్వీయ పరిచయ గానం -

"యదువంశాంబుధీ పూర్ణచంద్రుడా। నే। ముదితా రాధికా హృదయ సాంద్రూడా [10]
ఉదధిసదనబల్ మధుకైటభ వధ। సదశన ॥ పదవిధి హృది భరితుడ - నే ॥యదు॥

1 శుండాల తుండ దోర్దండుడా వైరీ। పాండిత్య తిమిర శత మార్తాండుడా 12
చండ ప్రచండ విఖండన బండనో। ద్దండ తుండయని గండ యుగాంచిత ॥
అండ పిండ బ్రహ్మాండ భాండ వే। దండ రక్ష అఖండ (ల) వినుతుడను ॥యదు॥

2 జంబారి మణిహారా13 విజృంభుడా - సురా। శంబార వైరి రివు హత్ స్తంభుడా
కుంభ సంభవ నిశుంభ శుంభది । కుంభి కుంభ సంరంభ దంభదో
స్తంభ జృంభిత హిడంబిడింబ వర । శంభు పుత్ర హేరంభ వినుతుడను ॥యదు॥"

పద జటిలత కలిగినా శబ్దాలంకార శోభితాలు ఆఖండలుడు ఇంద్రుడు, హేరంభుడు వినాయకుడు వారిద్దరిచేత పొగడబడిన వాడనని పై పాట రెండు చరణాల భావం కొన్ని పదాలు నటుల పరనలో మారినట్లున్నాయి అర్థం తెలిసినా తెలియకపోయినా ఆ శబ్దాలంకార లయమాధురికి శ్రోతలు ఆనంద తన్మయులయ్యేవారనుకోవచ్చు నరసింహకవిదే గయోపాఖ్యానంలోని మరో పాట ఇది భజన కీర్తన

"భజ లక్ష్మీపతి నరసింహం - అను। భజ దుంపెట భూధర సోమం
సజల జలజ నీరజ భవ సన్నుత । భుజగాధిప జయ విజయాశ్రిత స
ద్విజ వర పూజిత గజరక్షక - (హే) సుజనా భరణా! సుందర చరణా! "

మొదటి వీరరస కీర్తనలోని శబ్దాడంబరానికి ఈ రెండవ భక్తి గేయంలోని ప్రసన్న శైలి పదసారళ్యానికి మధ్య గల అంతరాన్ని గ్రహించవచ్చు చెర్లపల్లి నరసింహులు గారు రసోచితంగా కవనం చెప్పగల నైపుణ్యం కలవారు

కాశీనాథ శాస్త్రి భక్తుడు, కవి, గాయకుడు, నటుడు, నాటక ప్రయోక్త వారి కాలంలో జరిగిన ఒక సంఘటన ఇప్పటికీ వారి వంశీకులు చెప్పుకుంటారు అది వారి వామనచరిత్ర యక్షగాన ప్రదర్శనకు సంబంధించిన విషయం

ఒక పర్యాయం శంకరాచార్య గారు (కంచి - శృంగేరి) తమ సంచారంలో కోరుట్లకు వేంచేశారు [14] ఈ వైదిక బ్రాహ్మణులు నట గాయక కళారాధకులు అని, వారు విని, కవిని, దుంపెట పూజారి కుటుంబం వారిని జాతి నుండి వెలివేశారు అది తెలిసి కాశీనాథ శాస్త్రి వెళ్ళి, శంకరాచార్యులను కలుసుకొని, తమ నాటక ప్రదర్శనను చూసిన తర్వాత ఏ నిర్ణయమైనా తీసుకొండని అభ్యర్థించి ఆహ్వానించాడు శంకర పీఠాధిపతి 'అంగీకరించి దుంపెటకు వెళ్ళి పూజారి వారి వామనచరిత్ర యక్షగాన ప్రదర్శనను తిలకించారు ఆ రచనా పాండిత్యానికి, భక్తి తత్వానికి, నటనా ప్రావీణ్యానికి, గాన మాధుర్యానికి ముగ్ధులై వెలిమాట వదలి ఆశీర్వదించి వెళ్ళారట!

కాశీనాథ శాస్త్రి యక్షగానాలు స్థానిక దేవాలయ వార్షికోత్సవ ప్రదర్శనల కోసం వ్రాసినవే అభిమానులు కోరినా ఇతర గ్రామాల్లో ప్రదర్శించేవారు కారట కోరుట్లలో నాటక ప్రదర్శనను శంకరాచార్యకోరినా వారు ఒప్పుకోకపోతే ఆచార్యులు దుంపెటకే వెళ్ళి చూశారట ఇతర పర్వాల్లో నాటకాలు వేసినా స్వగ్రామంలో ఆ దేవాలయ ప్రాంగణంలోనే అటువంటిది వారి కళా తృష్ణ భక్తినిష్ఠ

శాస్త్రి గారి నాలుగు నాటకాలు చక్కని రచనలే గయో పాఖ్యాన యక్షగాన రచన మాత్రం మరో కవి పొత్తుతో సాగింది [15] కాశీనాథ శాస్త్రి గయోపాఖ్యాన సహరచయిత నారంభట్ల రాజన్న శాస్త్రి సిరికొండ గారు ఆయన ఇటికాలకు మారారు ఇటికాల రాయికల్ మండలంలో ఉంది రాజయ్య శాస్త్రిగారు కాశీనాథ శాస్త్రి గారికి బంధువులు నట మిత్రుడు కూడానేమో! ఆయన మరే రచన చేసినట్లు లేదు

దుంపెట నృసింహాలయ పూజారి మహదేవు గారి వంశంలో యక్షగాన రచన 4వ తరంలో కాశీనాథ శాస్త్రితోనే ఆరంభమైనా అది అతనితో ఆగిపోలేదు పారంపర్యంగా ఆ వంశంలో పలువురు కవులు యక్షగానాలు రచించారు ప్రదర్శించారు తెలియ వచ్చినంతలో దుంపెట గ్రామ యక్షగానకర్తల వివరాలివి

నారంభట్ల రమణయ్య గారి రచన16 (4వ తరం) 1 శ్రీవేంకటేశ్వర మహాత్మ్యము

నారంభట్ల నరహరి గారు17 (5వ తరం) 1 పట్టాభిరామాయణము

నారంభట్ల లక్ష్మీనరసింహులు - 1 ఉత్తూరు లచ్చయ్య భాగోతం

తత్త్వాది రామయ్య (ఇటికాల)18- 19వ శతాబ్ది, 1 సీతా కల్యాణము

రామయ్య గారు దుంపెట వారికి బంధువో నాటక మిత్రుడో అయ్యుంటారు

నారంభట్ల దుంపెటాద్రి19 (6వ తరం) 20వ శతాబ్ది ఆరంభం 1 పరకాల చరిత్ర, 2 చెంచులక్ష్మి, దుంపెటాద్రి గారివి 20 వ శతాబ్ది రచనలు

చెర్లపల్లి - నారంభట్ల వారి యక్షగానాల కథలన్నీ పౌరాణికాలు వీటిలో "ఉత్తూరి లచ్చయ్య భాగోతం" మాత్రం విలక్షణమైనది అది సమకాలీన సాంఘికేతివృత్తం

దుంపెటపూజారి మహదేవు వంశంలోని నాలుగవ తరం రమణయ్య సోదరుడు లక్ష్మయ్యగారి కుమారుడైన నా నరసింహులు ఇతర నటబంధు మిత్రులతో కలిసి ఈ భాగోతంరచించి ప్రదర్శించారు ఇది 19వశతాబ్ది చివర లేదా 20వ శతాబ్ది ఆరంభంలో జరిగిన కథగా వ్యాప్తి ఆ కథ ఇది దుంపెట బ్రాహ్మణులు ఓ సారి భూమిశిస్తు డబ్బు సకాలంలో చెల్లించలేదని ముస్లిం అధికారులు శిక్షించారట అందుకు వారిని ప్రేరేపించింది కోరుట్ల శెట్టి అని తెల్సి ఆ ఉత్తూరు లచ్చయ్య గారిని తూలనాడుతూ ఈ యక్షగానం రచించి కోరుట్లలోనే ప్రదర్శించారు

ఆ రూపకంలోని కొన్ని పాటలు చూడండి

తాంద్ర భద్రయ్య షర్మానా - యింత। గాంద్ర తన మిది గుదిరె శానా

ఉంద్రాలు నీ మనసు గుంద్రాయి వలె నిన్ను। తంద్రాలు బెంచేరా మొంద్రాయి చెట్టువలె॥

వారు నాటి గ్రామ్య పదరూపాలను ఈ బాగోతంలో యథేచ్ఛగా వాడారు మరో గేయ చరణం ఇది

శాస్తుర్లను నేను శాస్తుర్లను॥

వెల్లుల్ల సీమలో మల్లగౌణి యింట। నల్లకల్లూ తాగే శాస్తుర్లను

ఆ భద్రయ్య, ఈ శాస్త్రులు దుంపెట వారిపై విరోధంతో ఉత్తూరి లచ్చయ్యకు సహకరించినవారు ఈ వైశ్యుడు స్థానిక సర్కారీ పాలనతో ఎలాంటి సంబంధం కలవాడో కాని ఆయన సలహావలన దుంపెట అయ్యవార్లకు శిక్ష గట్టిగా పడినట్లుంది కోపం నసాళానికి ఎక్కింది కలం సిరాను కక్కింది కవిత కదం తొక్కింది

"ఉత్తూరు లచ్చా భళిరా - బ్రాహ్మ। ణోత్తముల మొత్తించితివిరా।"

ఈ తగాదా భూమిపన్ను విషయంగా ఆరంభమైనా అంతటితో ఆగలేదనడానికి నిదర్శనం ఈ క్రింది పద్య పాదం -

"కం నీ పాప లగ్న మనుచును, బావనయల్ రాగ నీవు బాదెద వటరా।"

అందుకే గేయాలిట్టున్నవి। "ఇట్లేల జేసితిని లచ్చా - నీ । నొట్లె పెద్ద గాడిద ఉచ్చా।"

ఇది నిందా రూపక భాగోతం ముఖాముఖి ప్రదర్శన తిట్లు ఘాటుగా ఉన్నా బూతు లేకపోవడం విశేషం ఇందులోని పాత్రలు లచ్చయ్యగారి బంధుమిత్రులు, సర్కారీ ఉద్యోగులు పరాయి ముష్కర పాలనలో స్వదేశీకర్కశ ధనిక వర్గాన్ని ఎదిరించి ఇటువంటి యక్షగానం వ్రాయుటం పైగా అధికారుల సమక్షంలోనే ప్రదర్శించడం అతి సాహసం కవులు అక్షర ధనులు అభిమాన గుణులు ఈ భాగోత ప్రదర్శన వలన కథానాయకునికి గుణపాఠం కలిగి మరునాడు వచ్చి కళాకారుల క్షమాపణ కోరుకున్నాడట [20]

దుంపెట వారి యక్షగానాలు పౌరాణికాలు, అముద్రితాలు భాషాజటిలత కారణంగా ప్రతులు కూడా వ్యాప్తి పొందలేదు నామ వ్యాప్తి అధికంగా కాకున్నా చెర్లపల్లి కాశీనాథ శాస్త్రి ఈ జిల్లా తొలి తరం సలక్షణ యక్షగాన రచయిత నారంభట్ల కవులు వారి అడుగు జాడలను అనుసరించారు దుంపెట పూజారి వంశం వారు ఉద్యోగాల కారణంగా స్వగ్రామాన్ని వదిలారు దుంపెటాద్రి గారితో ఈ 20వ శతాబ్ది పూర్వార్ధంలో యక్షగాన రచన ఆగింది ఉత్తరార్ధంలో ఓ పదేండ్లుగా వారి

యక్షగాన ప్రదర్శనలు కూడా ఆగిపోయినవి కాలం తెచ్చిన మార్పు!

**పాదపీఠికలు**

1 కరీంనగర్ మండల చరిత్ర- 1981లోని 'ప్రాచీన సాహిత్యం - కళలు' లను వ్యాసంలో గజ్జెపల్లి సత్యనారాయణ గారు వీరిని కవిగా పేర్కొన్నారు
2 ఇది 'దుమ్ముపేట' మారిన పదం కావాలి ఆ గ్రామానికి దగ్గరలోనే ధూళూరు (దూళి ఊరు దూలూరు) కూడ ఉంది
3 కాలం మారి ప్రదర్శనలు ఆగి, కవి కుటుంబీకులు ప్రభుత్వోద్యోగాలలో చేరి వేరు వేరు ప్రదేశాలలో ఉంటున్నారు నాటి నాటక సామాను పెట్టెలు వ్రాత ప్రతులు ఎక్కడ చిక్కుపడి ఉన్నాయో వారికే తెలువకుండా ఉంది
4 లక్ష్మినరసయ్యగారు కొరుట్లలో ఉంటూ మెట్టుపల్లి రెవిన్యూ కార్యాలయంలో స్టాంప్ వెండర్‌గా కాలం గడుపుతున్నారు
5 లక్ష్మీనారాయణ శాస్త్రి గారు జిల్లా ప్రజాపరిషత్ కట్లకుంట, మేడిపల్లి మండలంలో ప్రథమశ్రేణి తెలుగు పండితులు
6 ఈ గ్రంథంలోని మూడవ ప్రకణంలో బాలంభట్టు, ఇదే ప్రకరణంలో నరసింహదాసు ధర్మపురి గారి రచనలు చూపబడినవి
7 కాశీనాథశాస్త్రి మరియు ఆ కుటుంబపు ఇతర యక్షగాన కర్తలు
8 రఘునాథ భూపాలుని పుత్రుడు, 17వ శతాబ్ది 9 ఆంధ్రవాఙ్మయ చరిత్రము పుట 66
10 నారంభట్ల ల నా శాస్త్రి గారు పాడి వినిపించారు 11 సుదర్శన - కాబోలు
12 ఇక్కడ కవి కథా విషయంతో సరిపెట్టుకోక, పోటీ కవులను గెలిచే ప్రతిభగల వాడనని తెల్పుతున్న ధ్వని ఉందనిపించుతున్నది 13 ఇంద్రనీల మణిహారం
14 ఈ కథ సిరికొండ లక్ష్మినరసయ్యగారు, నారంభట్ల లక్ష్మినారాయణగారు ఇద్దరూ వినిపించారు
15 నారంభట్లవారి దుంపెట క్షేత్ర చరిత్ర' అముద్రితం'
16 లక్ష్మయ్యగారికి ఎన్నవ తరమో తెలియదు 17 రమణయ్యగారి రెండవ కుమారుడు
18 ఇప్పటకి నూరేండ్ల పూర్వులు,
19 నా ల నారాయణ 'దుంపెట క్షేత్ర చరిత్ర' రచయిత గారికి తండ్రి ఈ దుంపెటాద్రి గారు
20 నా ల నారాయణ గారి 'దుంపెట క్షేత్ర చరిత్ర' నుండి –

## 4 చతుర్వేదుల తులసీరాం - బొమ్మెనపల్లి

తులసీరాం గారు వైదిక విప్రులు పందొమ్మిదవ శతాబ్దికి చెందినవారు చతుర్వేదుల తులసీరాం 'శుకరంభాసంవాదము' అను యక్షగానం రచించినట్టు 'కరీంనగర్ జిల్లా రచయితల చరిత్ర' 1981 ముద్రణ, పుట 8లో ఉంది

ఇప్పుడు బొమ్మెనపల్లిలో రామక వారున్నారు గాని చతుర్వేదుల వారు లేరు కవి వివరాలు తెలియలేదు పై రచన అముద్రితం, అలభ్యం

## 5 న్యాలకొండ కిషన్‌రావు - రాఘంపేట

న్యాలకొండ కిషన్‌రావు గారు రాఘంపేట వాస్తవ్యులు రాఘంపేట ప్రస్తుతం చొప్పదండి మండంలోని గ్రామం కిషన్‌రావు గారు 'భ్రమరవేణి'' అనే పేరుతో ఒక యక్షగానం రచించినారు

కవి 19వ, శతాబ్దివారు ఇతర వివరాలు తెలియవు న్యాలకొండ వారు రెడ్లు గంగాధర, నెమిలికొండలో ఉన్నారు రెడ్లు అయినా 'రావు' అని వారి పేర్లుండడం అది నిజాం రాణుల కాలంనాటి బిరుదు వారు దేశాయ్‌లు

'అనసూయ'మరి కొన్ని నాటకాలు రావుగారు రచించినవి ఆగ్రామంలో ప్రదర్శించేవారని కరీంనగర్ జైలు పోలీసు (రాఘంపేట వ్యక్తి) తెలిపారు 1996లో అవి అముద్రితాలు వారి కుటుంబీకుల వద్ద ఉండి ఉంటాయి కవి 20వ, శతాబ్ది పూర్వార్థంలో కీర్తి శేషులు

## 6 రాజారామానందకవి - పెద్దపల్లి 1850-1920

ఈ కవి పూర్తిపేరు రాకూర్ రాజారాం సింగ్ ప్రఖ్యాత పురాచరిత్రవస్తు పరిశోధకులు అడ్వొకేట్, రచయిత అయిన 'అమరభారతి' రాకూర్ రాజారాం సింగ్ వీరికి పౌత్రులు

**రామానంద కవి రచనలు** - 1 సుభద్రా పరిణయము - యక్షగానము, 2 మంగళ హారతులు

**కాల స్థలాదులు** 19వ, శతాబ్ది మధ్యకాలంలో పుట్టి ఈ శతాబ్దిఇరవైలో కీర్తి శేషులైనట్లు అమరభారతి గారు చెప్పారు 1 కవి పూర్వీకులు పెద్దపల్లిలో స్థిరపడిన ఔత్తరాహులు బొందిలీ వర్ణస్థులు

**రచనా విశేషాలు** రాజారామానంద కవి మాతృభాష హిందీ అయినా ఆంధ్రభాషా కవితాభినివేశం కల వ్యక్తి పాటలు, మంగళహారతులు వ్రాశారు ఆయన 'సుభద్రా పరిణయము' అనే యక్షగానం రచించి స్థానిక వణిక్ప్రముఖునికి అంకితం కావించారు ఆ శ్రేష్ఠి ప్రతియేటా ఈ నాటకాన్ని ప్రదర్శింపజేసి, నాయికా పాత్రధారికి చీరెసారెలిచ్చి సన్మానించేవారట సుభద్రాదేవి తమయింటి అడకూతురని సంతసించేవారట [2] ఇప్పుడు ఆ కృతి కర్త, కృతి భర్త నటులు ఎవరూ లేరు ఆ కావ్యమూ లేదు ఆ విషయాలు తెలిసినవారు కథగా కాలక్షేపానికి చెప్పుకుంటారు

రాజారామానంద కవి భద్రంగా దాచుకున్న పింగళి సూరన కళాపూర్ణోదయము తొలిముద్రణ అచ్చు ప్రతి వారింట దొరికింది దాని ఒక పుటపై పెన్సిల్‌తో పెద్దన మనుచరిత్ర పద్యం వ్రాసి ఉంది కవి పండితుడనడానికి ఇది నిదర్శనం

రామానంద కవి కృత హారతిలోని కొంత భాగం ఇది

హరి ప్రియా జయమంగళం । శ్రీహరి ప్రియా జయమంగళం
హరి ప్రియా శ్రీహరి ప్రియా। సుర వర ప్రియా బుధ జనార్చిత ॥హరి॥

కవి పూర్వ ప్రబంధ పరనమును బట్టి అతని 'సుభద్రాపరిణయం' చేమకూర వేంకటకవి విజయ విలాసమును అనుకరించి ఉంటుందని భావించవచ్చు రామానంద కవి సుభద్రా పరిణయము యక్షగానం అముద్రితం - అలభ్యం

**పాదపీఠికలు**

1 తాతగారి వివరాలు చెప్తూ అమరభారతిగారు ఎంత వెదకినా కవి గారి రచనలు వ్రాతప్రతులు లభించలేదు 2 ఈ విషయాలు మల్లా వజ్జల రామచంద్ర శర్మ పెద్దపల్లి గారు తెలిపారు

## 7 రుద్ర ఎల్లయ్య - కోరుట్ల

జననం 1860 సుమారు, మరణం 1937 క్రీ శ

రుద్ర ఎల్లయ్య గారు కోరుట్ల వాస్తవ్యులు పద్మశాలి కులజులు ఆయన ఆయుర్వేద వైద్యం, చేనేత కవిత్వం చేపట్టిన రాజయోగి హఠయోగ సాధన చేశారు మంత్రవేత్తగా పురోహితులుగా వారు రాణించారు మెట్టుపల్లి తాలూకాలోని రంగారావుపేట గ్రామవాసి రాజయోగి అగు దత్తాద్రి అప్పయ్య అను ముస్లిం ఎల్లయ గారికి వేదాంత గురువు

వైద్య వరుడు కవి గాయకుడైన ఈ ఎల్లయ గారు యక్షగానాలు రచించారు ఔత్సాహికులకు వాటిని నేర్పి ప్రదర్శింపజేసినారు పలు పాటలు రాశారు

**ఎల్లయ కవి రచనలు.** మూడు యక్షగానాలు

1 చిరుతొండ మహరాజు, 2 మణి భద్ర విలాసము 3 శివకుమారుడు

ఈ 3వ నాటకం ఒక్కటి మాత్రం కోరుట్ల ఆళ్వారయ్య గారితో కలిసి రచించారు

4 పాటలు తత్త్వకీర్తనలు 150 వరకున్నవి

5 బసవ రాజీయము - పద్యానువాదం పద్యాలు వెయ్యికి పైగా

స్ఫురద్రూపి హుందాతనం వాక్సమత్కృతి కల కవి ఎల్లయ్య కోరుట్ల ఆ పరిసర గ్రామాలలో వీరంటే చాల గౌరవం ఉండేది మిట్టపల్లి రాజయ్య, ఎక్కల దేవి లక్ష్మణ, శ్రీకరానంద పిన్నంశెట్టి చెన్నయ రాజయోగి, డా॥ అందె వేంకటరాజం మొదలైన కొరుట్ల కవులకు మొదటి సాహిత్య కవిత్వ ప్రేరణ రుద్ర ఎల్లయ గారి కవితలే అనటం నిజం

**రచనల వివరాలు** నాటి యక్షగాన నాటకాలు పాటలు పద్యాలు ఎల్లయ్య సునాయాసంగా వ్రాశారు వారికి పెద్ద చదువులు లేవు శ్రుత పాండిత్యం వరకవి స్వయంకృషితో విద్యావంతుడై కవిగా వేదాంతిగా కళాకోవిదుడుగా రాణించారు విచారించదగిన విషయమేమంటే వారి రచనలు ఏవీ ముద్రణ పొందలేదు లభించలేదు డా॥ అందె వేంకట రాజం గారు అతి శ్రమకోర్చి ఎల్లయ గారివి 42 పాటలు సేకరింప గలిగారు ఎల్లయ్య గారి బంధువులయిన డా॥ వి ప్రభాకర్ గారల సాయంతో వాటిని ముద్రించే తలంపులో ఉన్నారు వ్రాత ప్రతిలోని కొన్ని పాటలు – చరణాలు, ఎల్లయ గారి కవితా మాధుర్యాన్ని భావ తత్త్వాన్ని స్థాలీపులాకంగా తెలుసుకోవడానికి ఉపకరిస్తాయని ఈ దిగువ చూపుతున్నాను

ఏల(లు) -

1 యాల దిరిగెదవే ఓ మనసా। ఇలా పింగల మీద మేలున్నది చూడు మనసా॥
యాల దిరిగెదవు బోలు బొంగరమ (బోలు = లోన ఖాళీ స్థలం కలది)
కీలు దెలిసి జపమాలను దింపియు (తింపి = త్రిప్పి)
ఫాల భాగమున చాలగ శ్రీగురు (శ్రీగురుడు) బాల రూపమై వెలుగుచు నున్నడు

2 పాంచ భౌతిక దేహము - చూచుక మురిసి। పెంచ నివ్వకు మోహము
పంచ బూతములణచి పట్టి - ఎంచరాని పదవి దెలిసి
కొంచెపు దుర్గుణములన్ని - కొట్టి వేసి గుట్టు దెలిసి ॥పాంచ॥

3 కాశి కెందుకు బోతరే - చేసిన బొమ్మల - చూసి మురిసేటందుకే,
కాశికి బోకాను నీలో కాశి ఈశుని నమ్ముకోని
దాసివయ్యి శ్వాసనడిపి శేషులోదెలుసుకొని॥

అండబాయక సాదుల- సేవల జేసి - నిండుకోని మదిల
రెండు కొండల మీద నిలిచి - బండ మీది తోవ దెలిసి
పండు వెన్నెల లోపల ఆ - ఖండ జ్యోతిని గలిసి నీవు ॥

4 చిత్ర గుప్తులున్నరు - నీ చేష్టలైతే - నిత్యముగని పెడుతున్నరు
చిత్రగుప్తుల జాడ తెలసి మాత్రమైన హవా నింపి (హవా = గాలి)
సూత్రమైన నెగుర జిమ్మి - సత్యమైన పదవి దెలిసి ॥

అద్యంత్య ప్రాసలు ఈ గేయాలకు అలంకారాలు వరకవులు పద ప్రయోగంలో స్వేచ్ఛా ప్రియులు వారి వేదాంతం ఆత్మవాదం అది అనుభవైక వేద్యం విద్యావంతులు మార్గకవిత్వాన్ని ఆదరిస్తే జానపదులు ఈ దేశి కవిత్వాన్ని అభిమానించి ఆరాధించి పోషించారు

సామాజిక విషయాలను కూడా ఎల్లయ కవి వదలలేదు

రంకుల భార్య శంఖిని రా – బొంకు వంకలతొొటి లెంకు కయ్యమురా -
లెంకిన భార్య దయ్యమురా దయ్యమురా, దయ్యమురా, దయ్యమురా॥
వాడ వాడల దిరుగుచుండు - కోడెగాండ్ల నెప్పుడు - యెడ తెగక కూడుండు
మొగడత్తె మరి బూతు బండు దుడుకు - మాటలాడి కింద బడి పొర్లు చుండు
అత్తమామల గొట్ట లేచు పుస్తె గట్టిన మొగని నెత్తికి ముంచురాచు

ఇల్లు దోచడం, ముల్లె తల్లింటికి జేర్చడం, పల్లెను వదలి పట్టంలో ఉండే మోజు మొ॥ విషయాలున్నవిందులో సంతానం కోసం తల్లడిల్లే మరో గేయం కరుణ రస స్ఫోరకంగా ఉంది గురుభక్తి ప్రధానమైనవి వీరి పాటలు బసవరాజీయం పద్యానువాదం వ్రాతప్రతి ఉందట కాని నాకు లభించలేదు

19వ, శతాబ్ది చివర పదేండ్ల నుండి 20వ శతాబ్ది తొలి పాతిక సంవత్సరాలు వీరి కలం సాగింది, గళం మ్రోగింది, జనాన్ని అలరించింది నాటి వరకవుల కవితలు నేటి తిరుగుబాటు రచయితల కవితలు - కథలే, తెలంగాణా కరీంనగర్ మాండలిక తెలుగు భాషను ప్రచారం చేయగలిగాయి

**మధుర కవితలు**

## 1 సిరిశెనహాళ్ శీనయ్య పెద్దపల్లి: 19వ శతాబ్ది పూర్వార్ధం

శీనయ్య గారు శ్రీవైష్ణవులు వారిది కౌండిన్య గోత్రం శీనయ్య గారి తండ్రి వరదమయ్య మంథని వాస్తవ్యులు శీనయ్య గారు పెద్దపల్లి రాజావారి ఆస్థానకవి పండితులై మంథని నుండి పెద్దపల్లికి మకాం మార్చారు శీనయ్య గారు కవి పౌరాణికులు, ఆయన కొన్ని యక్షగానాలు జావళీలు రచించారు **కాలం** శతావధాని కొరుట్ల కృష్ణమాచార్యులకు తాత గారి తాత శీనయ్య గారు కృష్ణమాచార్యుల జననం క్రీ శ 1905లో నాలుగు తరాలకు 4×30=120 సం లు 1905 నుండి తీసివేస్తే వచ్చేది 1785 శీనయ్య గారి జన్మవత్సరం శీనయ్య రచనలు 19వ శతాబ్ది పూర్వార్ధానివి

**వంశ వివరాలు** ఈ కవి పూర్వీకులు మంథని వారు శీనయ్య గారు పెద్ద పల్లికి చేరుకున్నారు తర్వాత వారి కుటుంబాలు ఆదిలాబాద్‌లోని నిర్మల్ వెళ్లి అక్కడి నుండి నిజామాబాద్ జిల్లాలోని మోర్తాడుకు మారినారు మోర్తాడు నుండే కృష్ణమాచార్యులు కొరుట్లకు వచ్చారు మొదట వీరి గృహనామం సిరిశెనగండ్ల వారు మెతుకు సీమ కావ్యం రచించిన సిరుసనగండ్ల శ్రీనివాసాచార్యులు, గుమ్లాపూర్, మండలం చొప్పదండి గారు వీరికి జ్ఞాతులే కృష్ణమాచార్యుల అన్న వరదాచార్యులు మోర్తాడు వారు తమ ఇంటి పేరును సిరిశెనహాళ్ అని తమిళ పదంగా మార్చారు అదే ఈ తరంలో వారి సోదరులు అనుసరించారు

**రచనల వివరాలు** "వారు కవులు ఆ కాలమునాటి యక్షగానములు, జావళీలు వ్రాసేవారు కృష్ణభక్తి శృంగారపరమైన ఆ జావళీలను పెద్దపల్లి భోగస్త్రీలు పాడుచు నాట్యమాడేవారు ఆ కాలమున కృష్ణభక్తి శృంగారపరమైన వారి జావళీలు మరింగంటివారి తిరునామములు ప్రసిద్ధికెక్కినవి" అని శీనయ్య గారి కవిత్వాన్ని గూర్చి శతావధాని కృష్ణమాచార్యులు తెలిపారు (స్వీయకవితాను జీవనము - 1986, పు 5)

ఆ రచనలు అముద్రితములు, వ్రాత ప్రతులు కూడా లేవు అయినా శీనయ్య గారు కరీంనగర్ జిల్లాలో మొట్టమొదటి శృంగార గేయాలు వ్రాసిన కవి "కౌండిన్య గోత్రుల కవిత సరస ' అనే వాడుక ఈ ప్రాంతంలో శీనయ్య గారితోనే ఆరంభమైంది

## 2 సీతారామయతీంద్రులు, వేములవాడ. 1820-1890 సుమారు

వీరి రచన - శ్రీసీతారామ యోగీంద్రుల వారి ఆధ్యాత్మిక "భజన కీర్తనలు" - 1968 శ్రీసీతారామ యోగి జన్మస్థలం గోకర్ణక్షేత్రం బాల్యముననే వీరికి పితృవియోగం సంభవించింది విద్యావిహీనుడు అన్నగారి పోషణయందుండి పని పాటులు లేక బాధ్యతారహితంగా తిరిగేవాడు వదిన చులకన చేసి మాట్లాడితే స్వాభిమానంతో ఇల్లు వదిలాడు నాసిక్, వారణాశి తీర్థ ప్రదేశాల్లో కొన్నాళ్ళుండి వేములవాడ చేరుకున్నాడు అక్కడే యతి నియతితో జీవిస్తూ, ఆధ్యాత్మిక భజన కీర్తనలు రచిస్తూ, భక్తిభావ ప్రచారం కావిస్తూ జీవతశేషం గడిపారు వీరి సమాధి కేశవులుగారి రామయ్య వీధిలో ఉంది ప్రతియేటా అక్కడ భక్త సమారాధనలు కేశవుల వారింట బ్రాహ్మణ

సంతర్పణలు జరుగుతున్నాయి కేశవులుగారి భూమయ్యగారు స్వాముల వారి కీర్తనలను సేకరించి, వజ్జల చంద్రమౌళిగారి పీఠికతో పై పుస్తకాన్ని ప్రచురించారు

140 పుటల ఈ పుస్తకంలో యోగీంద్రుల జీవిత చరిత్ర సంగ్రహంతోపాటు 74 కీర్తనలున్నాయి చివర ఉత్తర కాండతో సహా మూడు పుటల్లో ఏడు కాండలుగా సంక్షిప్త రామాయణ గేయం ఆ తర్వాత ఒక మంగళహారతితో గ్రంధ పరిసమాప్తి అయింది

శివ-శ్రీరాజరాజేశ్వర, శ్రీరామ గురు భక్తితో కూడిన ఈ భజన పాటలకు చాల వరకు రాగ తాళ సూచన ఉంది మొదటిది రామ మానస పూజావిధి రెండవది 'ద్విపద' అని చూపిన చరణాలిట్లున్నవి

భూషణములు మన మలంకరింతాము। దాశరధి రాములకు ।

మణి మాణిక్యహేమ। నవరత్నసుహిత కిరీటమును కోరి - (ఇదిపాటే)

74వ కీర్తన - ముఖారిరాగం - ఆటతాళం

హరిహరి యెంతానర్థపు జీవులంత । నిన్నెరుగాక చెడిరీ గదా వోరామా

పరమా పూరుషవారీ నరహరినెన్నాడు । కరుణాతో దరి చేర్చేవూ వోరామా (ఇది 49 పంక్తుల గేయం)

69వ, కీర్తన-బిళహరి, ఆటతాళం (ఇదే 16వ, కీర్తన కూడా)

వొత్తూదమ హరి పాదామూలు। అతిమెత్తాని శ్రీదివ్యాపాదామూలు

మిధ్యాసంసార సాగరము దాటించియు । ముక్తి మార్గము దెలిపే పాదములు

50వ కీర్తన-ఆనందభైరవి, ఆదితాళం – అతడె బ్రహ్మవేత్తా। సద్గురుడే పరమ పవిత్రా

దేవసేవ రాజయోగ, మానస బోధ భక్తి పాటలివి కొన్నింటిలో భద్రాచల రామదాసు ఆర్తి ఉంది సీతారామయోగీంద్రుల వారి భక్తిని ఎవరూ శంకించపనిలేదు వారు సంగీత సాధకులూ కావచ్చు నిరంతర భక్తి కవిత్వారాధకులైనా వారిది జానపద ధోరణి వర కవిత్వమే మాతృభాష మరాఠీ తెలుగును పట్టుపట్టి నేర్చినట్లు లేదు మాట్లాడ్డం మాత్రం నేర్చి ఉంటారు వ్యావహారిక-గ్రామ్య తెలుగు పదాలతో పాటు విలక్షణ తత్సమ పదాలు వారి పాటల్లో ఉన్నాయి వీరి జీవిత చరిత్ర పరిచయంలో "నాసిక నుండి మార్గం బట్టి కాశికాపురిని చేరెను", "పూర్వము వాల్మీకి సప్తరుషుల యుపదేశమునొంది నిరంతరము రామమంత్రము నుచ్చరింపుచు దుర్యోధనుని సంకటము దొలంగి" వ్యాఖ్యల భావాలు ఆలోచనీయాలు!

సాధారణంగా దైవ భక్తుల జీవిత కధల్లోని దైవ సాక్షాత్కారాలు, మునుల వరాలు, భక్త కవుల జీవిత కధలతోనూ ముడిపడి ఉన్నాయి ఏది ఏమైనా బ్రహ్మచారి, భక్తకవి, వాగ్గేయకారుడు శ్రీసీతారామ యతీంద్రులు!

## 3 జైశెట్టి రాజయ్య - జగిత్యాల, 1848 - 1922

జైశెట్టి రాజయ్య గారిది జగిత్యాల వారు వైశ్యులు శైవ మతాభిమానం కలవారు వరకవి రాజయ్య గారి రచనలు రెండు గ్రంధాలుగా అచ్చులో వచ్చాయి

1 శ్రీ వేములవాడ రాజరాజేశ్వర శతకము 2 మనస్సంబోధ కీర్తవలు

ఈ రెండు రచనలు 1933లో కవి గారి కుమారునిచే తొలిముద్రణ పొందినవి మనుమనిచే 1992లో ఒకే పుస్తకంగా మలిముద్రణ పొందాయి1

అయన "1888 1921 వరకు 33 సంవత్సరములు అనర్ఘళముగా తన గళము విప్పి ఆశువుగా జెప్పిన రచనలు కోకొల్లలు ఆనాటి ప్రజలను మంత్ర ముగ్ధులను గావించెను వారి వద్ద ఒక లేఖకుడు ఇరువురు గాయకులుండిరి"[2] అన్నారు డా॥జె వి రమణయ్య కవి గారి పౌత్రులు, రాజయ్యగారి రచనల రెండవ ముద్రణ పుస్తకం ముందు మాటలో

రాజయ్య గారు వ్యాపారవృత్తితో జీవించారు వాస్తు జ్యోతిష్య యోగ హస్త సాముద్రికాది శాస్త్రాలు తెలిసినవారు పురాణ కావ్య శ్రవణ పఠన పాండిత్యంతో తమ ఏబదవయేటి నుండి (1892) ఆశుకవిగా విజృంభించారు వీరి పాటలు పద్యాలు జగిత్యాల మెట్టుపల్లి ప్రాంతాల్లో బహుళ జనవ్యాప్తి పొందాయి

**గ్రంథ సమీక్ష** 1 శ్రీ వేములవాడ రాజరాజేశ్వర శతకము

ఈ కవి శైవ మతాభిమాని లేముల వాడలోని అత్తలూరి లింగమూర్తి వీరి ఆరాధ్యగురువు శివభక్తితో ఈ శతక రచన చేశారు వేములవాడకు కాకతీయుల కంటె పూర్వపు నామం లేంబులవాడ అదే జన వ్యవహారంలో లేములవాడ లేంలాడ అయింది ఇది 125 సీస పద్యాల శతకం

'వ్యాస వందిత వేములవాడ వాస పాప సంహార పరమేశ పార్వతీశ ' శతక మకుటం

ఇది శేషప్ప 'నరసింహశతకం' మకుటాన్ని పోలి ఉండటం గమనార్హం ఈ రాజేశ్వర శతకంలో శివభక్తి ఉన్నా వీరశైవ కవుల పద్యాలలో వలె అన్యమత నిందలేదు భక్తి కంటె ఇందులో సామాజిక నీతులే ఎక్కువ ఈ శతకంలోని కవి భావాలిట్లున్నాయి

శంకరా నేను నీ కొడుకును నన్ను రక్షించు 1 వ, పద్యం, తీర్థయాత్రలకు తిరుగలేను నిన్నే నమ్మియుంటి - 2 నీవే గొప్ప దొరవు నీ భక్తులకే నేను సమస్కరిస్తాను నిను గనుగొన్న వారికి నిఖిల సుఖములు 5 కవుల నడుగక నిన్ను నమ్మికవన మిట్లు చెప్పితి - 6 కాసుల నాశించి కృతి నీయను నీకిది సమర్పించినందుకు నన్ను కాపాడు 8 శివభక్తి మహిమ లోకనీతి రీతులు ఇందులో చక్కగా వర్ణించబడినవి వర్ణవ్యవస్థను అద్వైత భావనతో చెప్పాడిలా

"ఒక్క జన్మంబునకు నాల్గు నిక్కమయ్యె, నిక్కమైనట్టి జన్మంబు నొక్కటయ్యె (122)
కవి కవన శైలికి గూఢ వేదాంత వివరణకు నిదర్శనమీక్రింది పద్యం
మూటిని గూడియు మూటిని విడనాడి మూటలో మురియదా మనమునందు
నాల్గిటి గూడుక నాల్గింటి విడనాడి నాల్గు ధర్మంబుల నడక తెలిసి
ఐదునైదును గూడి యైదునైదును విడ్చి, ఐదిటి గూడుట అనువుదెలిసి
ఆరిటి గూడుక ఆరిట విడనాడి, ఆరిటి మీదను హరుని గలిసి
గురుడు పరమాత్ముడితనిని గుర్తెరింగి, ముక్తి బొందు మహాత్ముల మూలమిదియె
వ్యాస వందిత వేముల వాడ యీశ, పాప సంహార పరమేశ పార్వతీశ - 113

**2 మనస్సంబోధ కీర్తనలు** - ఇవి నూటా అయిదు

ఇవి మనస్సు మీద చెప్పినవి కావు వివిధ దేవీ దేవతల సంస్తుతి గేయాలు రామదాసు భజన కీర్తనల వంటివి మతమే మంచిదిరా (57) కులమే దండిదిరా (58) దేవుడు ఒకడేరా (59), ఎరుకే దండిదిరా (60), ఇటువంటివి ఇందలి కీర్తనల శీర్షికలు - పాటల పల్లవులు

జైశెట్టి రాజయ్య కవి గారి కీర్తనల శైలీ భావ విన్యాస దర్శనానికి నిదర్శనంగా మొదటి కీర్తన గణపతి ప్రార్థనను చూడవచ్చు పుట 67

గణపతి నీ కిదిగొ వందానం - నిత్య ఘనముగ బ్రోవవె సుందరం।
పనిబూని సర్వంబు దినమానమే ప్రొద్దు - ఘన విద్యాది మొదలు గుణశ్రేష్ట జరిపెదవు॥
చంద్రార్క నేత్రుని పుత్రా - దేవ - సాంద్ర కర్ముని బొజ్జగాత్రా,
ఇంద్ర చంద్రులకైనా ఇలలో నెవ్వరికైన - ఆంధ్ర గీర్వాణములన్ని కృప జేసితివి॥
ఏకదంతుడు యెంతో నీవూ - విద్య - ప్రకటించి పలికించె దావూ
నిఖిలంబులో నీవే సకల విద్యల గురువు ఇక నన్ను రక్షించు సకల జన పూజిత ॥

ఇందలి పదాలకు లేని దీర్ఘాలు రావడం సంగీతం కోసం ఈ గేయ భాగంలో మానస సంబోధన కీర్తనలు అయిదారున్నాయి అందులో జానపదబాణీలవి కొన్ని జాజిరి పాట - కళికోత్కళికలవలె చాల బాగుంది అది ఇది - పుట 140

జాజిరి జాజిరి జాజిరి బాజా - బెదిరించేటి బెరుగులు బేజా
ఎచ్చుగదేవుని కెప్పుడు పూజా - మచ్చరి తనముకు మందులు బేజా ॥

పరమాత్ముండనె పద్ధతి పట్టి - కవటత్వంబనె కాలుని గొట్టి
మర్యాదెరిగిన మార్గం బట్టి - దుర్మదాంధులను దూరం గొట్టి ॥జా॥

గురుమంత్రంబనె గొడ్డలి బట్టి - అజ్ఞానంబనె అడవిని గొట్టి
సుజ్ఞానంబనె సురియనుబట్టి దోషంబనియెడి దొంగల గొట్టి ॥జా॥
వరజైశెట్టి మరి రాజన్నా - శ్రీ గురుమూర్తికి సేవకుడన్నా
సారవిచారుల సంగతిగన్న చేసిన పాపము మొదటికి సున్నా ॥జా॥

ఈ పాటలో యతి నియతి కాక అంత్యప్రాస కూర్చబడింది ఇటువంటి పాటలను ఖడ్గాలు అనే పేర వీర శైవుల వివాహాలలో పాడేవారు వరకవులు భావావేశపరులు శబ్ద సాధుత్వాన్ని పట్టించుకోరు, వారు భాషా పండితులు కారు భావాలకు ప్రాధాన్యతనిచ్చేవారు

అల్లోనేరడల్లో (142 పుట) పాట

ఆల్లోనేరడల్లో - అల్లదు గో చూడండి ఆనంద గురుని॥
అల్లి బిల్లి మాటలల్లుకోకండి - ఆల్లోనేరడల్లో
కల్లలాడేమాట కడకు జిమ్మండి అల్లోనేరడల్లో
ముల్లె కన్నముక్తి మంచి దనుకొండి అల్లోనేరడల్లో
ఎల్లకాలము ముక్తి కెదిరి చూడండి అల్లోనేరడల్లో
తల్లిదండ్రిమాట తప్పబోకండి అల్లోనేరడల్లో

భరత ఖండానికి జంబూద్వీపం అని పూర్వ వైదిక నామం జాంబూనదం అంటే బంగారం జంబూ వృక్షం నేరెడి చెట్టు అదే అల్లనేరడి పదం జానపద గీతాలకెక్కింది వీరివి జానపద కీర్తనలు, తత్త్వాలు ఇందులో సగానికి మించి ఈ క్రింది పాట బాణీలోనే ఉన్నాయి

నిలువదురా దేహం - ఎన్నడో నిమిషములో మాయం
నిలిచి నిలిచి (అది) నిమిషంబు లోపల గాలము మ్రింగి (న) మీనము గతి సుమి॥

నిలువదు నిలువదు కాయం, ఇది, నిముషము లోపల మాయం - వంటి పూర్వతత్త్వాల నితడు అనుసరిస్తే - నిన్నేమంటినో జ్వరమా! వంటి ఈ కవి పాటలను ఇతరులు అనుసరించారు నిన్నేమంటినో చలిజ్వరమా, అనే పాట ఇదే జిల్లాలోని మరో వరకవి దురిశేటి ఈశ్వరయ్య గారిది అది ఇదే సంపుటిలో మరో చోట చూపబడుతుంది

నమ్మదగని కాలం (105 పుట) మనదే తప్పు కదా (126) మొ॥ వి సామాజిక సమీక్షాగేయాలు ఈ సంపుటిలో చివరగా మరికొన్ని సామాజిక చారిత్రక విశేషాల వివరణ గేయాలు, పద్యాలూ ఉన్నాయి

కీలక (1908)లో ముచికుంద (మూసీనది) వరదల గురించి 132 పంక్తుల ఉయ్యాల పాట ఉంది దుర్ముఖి (1886) హేవలంబి (1897) అనావృష్టికరువులలో పెరిగిన దినుసుల ధరలు జనం పడిన పాట్లు వర్ణింపబడ్డవి హేవలంబిలోని మారి రోగ వ్యాప్తి, నందన (1893) అతివృష్టి నష్టాలు, 1921 కాటకం ఇవన్నీ సీసమాలికలు 1897 కు 1921కి ధాన్యం ధర రెట్టింపు అయిందట

కవి తమ వైశ్యకుల గోత్రాలను రాశికూటాల వివరాలను 223 -30, ఎనిమిది పుటల్లో తెలిపారు వికృతి (1890) భాద్రపద శుద్ధ సప్తమి భానువారం నాడు రాజన్నకవి గారి కవిత్వపరీక్ష గావించి పెద్దలు విని మెచ్చారట కొందరు గిట్టనివారు కవియింటిపైకి ముస్లిం ఉద్యోగుల ఉసికొలిపి హింసించారని వారిని పేరు పేరున గాడు పద ప్రయోగంతో తిట్టాడు ఈ సీసమాలిక (231-36 పుటలు) కులాల పేర్లు తెలుసుకోవడానికి చక్కగా పనికి వస్తుంది

జగిత్యాల తాలూకాలోని గ్రామనామాల సీసమాలిక (60 పంక్తులు రచన తేది 23 సెప్టెంబర్ 1903) ఈ ప్రాంత వృద్ధులకు పలువురికి కంఠస్థం 1905కు పూర్వం కరీంనగర్ జిల్లాకు వెలిగందుల కేంద్ర పట్టణం

జగిత్యాల యును మోతె జాప్తాపురంబును, తిప్పన్న ప్యాట తిప్పాయ వల్లి (236)
సంగె మెకిలి పురము సారంగ పురమును సూరడాపేట సర్వాపురంబు (237)2

యతి గణ ప్రాస భంగాలు ఈ కవి పద్యాల్లో కనిపిస్తున్నవి వరకవులు అక్షర గణనతో కాక మాత్రానిబద్ధ గణాలు వాడినట్లు తోస్తుంది వారు ఛందస్సు నేర్చుకోక పదాల లయను బట్టి భావావేశంతో పద్యాలు వ్రాసిన భక్తకవులు జైశెట్టి రాజయ్య గారి పద్య గేయకృతులు గత శతాబ్ది చతుర్థపాదపు ఈ జిల్లా సాంఘిక చరిత్ర సర్వస్వాలు

**పాదపీఠికలు**

1 ఈ పుస్తకం రెండవ ముద్రణ అవిష్కరణ సభ జగిత్యాల్లో తేది 12 5 92 నాడు ఘనంగా జరిగింది

2 ఇంద్రగణములారు ఇనగణంబులు రెండు, పాదపాదమునను బరగుచుండు, ఆటవెలది గాని తేటగీతముగాని, చెప్పవలయు మీద సీసమునకు - అని సీసపద్య లక్షణం

## సాహిత్య సమాలోకనం - 4

**చరిత్ర** మొదటి అసఫ్జా 1713 -48 స్వతంత్ర పాలనలోనికి వెళ్ళిన తెలంగాణా, 1948 స్వతంత్ర భారత పోలీసు ఆక్షన్ వరకు దాదాపు 250 సంవత్సరాల కాలం హైదరాబాద్ ముస్లిం నవాబుల పాలనలో ఉంది (15, ఆగస్టు 1947 నాడు ఇండియాకు బ్రిటిష్ పాలన నుండి విముక్తి స్వాతంత్ర్యం లభించాయి అప్పుడు హైదరాబాద్ స్టేట్‌లోని తెలంగాణా ప్రాంతం నిజాం పాలనలోనే ఉంది ముస్లిం రజాకార్ల అల్లరులు అప్పటివే స్వతంత్ర భారతప్రభుత్వ పోలీసు చర్యతో 17 సెప్టెంబర్ 1948 రోజున నైజాం తెలంగాణా స్వేచ్ఛ పొంది భారత దేశంలో విలీనమైంది )

ఆ కాలంలో ఉర్దూ విద్యావ్యాప్తి పెరిగింది తెలుగు వాళ్లు కూడా పరభాషా సంస్కృతుల ప్రభావాలకు లోను కాక తప్పలేదు వారిలో కొందరు ఉర్దూ సాహిత్యకారులుగానూ రాణించారు ఆలయాల నిర్మాణం ఇంచుమించు ఆగిపోయింది మజ్జిదుల నిర్మాణం పెరిగింది ఆంధ్రుల హిందూ మతాభిమానం - భాషాభిమానం గొప్పవి కాబట్టి ఆ ముస్లిం పాలనలోనూ తమ జాతి వర్ణాచార ధర్మాలను నిలబెట్టుకొని ఎంతో కొంత మాతృభాషా సాహిత్యాలను అభిమానించి సృజించుకోగలిగారు

పరభాషా సంస్కృతుల ప్రభావం అనుసరణం ఎప్పుడైనా విద్యావంతులలోనే అధికం అప్పటి చదువరుల శాతం తక్కువ అందుకే అవిద్యావంతులైన జానపదులనలరించే యక్షగాన మధుర కవితల రచన వ్యాప్తి సైతం ఈ కాలంలో గణనీయంగా పెరిగింది కాని, విరచితమైన సాహిత్యమంతా భద్రపరుచబడక చాల వరకు నష్టమైపోయి లభించలేదు

**సాహిత్యం** ఈ శతాబ్దిలో కరీంనగర్ జిల్లాలో చెప్పుకోదగిన ఆంధ్ర పద్యగద్యకావ్యాలు ఏవీ రాలేదు కొందరు సంస్కృతంలో పండితులై రాణించారు వారు కావ్యరచన కూడ కావించారు కాని గ్రంథాలేవీ లభించలేదు

తెలుగులో పద్యకావ్యాలు రచించిన ఒకరిద్దరి పేర్లు వినవచ్చినా అది అలబ్ధ సాహిత్యమే ఈ కాలంలో ఇద్దరు శతక కర్తలు మాత్రం ప్రముఖంగా కనిపిస్తున్నారు వారిలో శ్రీకృష్ణశతకం చాల వ్యాప్తిని పొందినా, ఆ కృతికర్త నరసింహదాసు కరీంనగర్ జిల్లా వారని కవి చరిత్రకారులకు తెలియదు ఈ కవిది కరీంనగర్ జిల్లాలోని ధర్మపురి అని ఈ వ్యాసంలో సోపపత్తికంగా నిరూపించబడింది రెండవ వ్యక్తి పరవస్తు మునినాథ కవి వీరి లక్ష్మీలలితా శతకాలు ముద్రితమై సాహిత్య చరిత్రకారుల దృష్టికి వచ్చినా, అవి సామాన్య జనాదరాన్ని నోచుకోని కారణంగా పుస్తకాలు ప్రస్తుతం వ్యాప్తిలో లేవు ఈ కవిది కరీంనగర్ జిల్లాలోని కేశవ పట్టణం ఈ శతాబ్దిలోనే ఈ జిల్లాలో అయిదారుగురు కవులు యక్షగానాలు రచించారు వాటిలో కొన్ని ప్రదర్శింపబడినా జనాదరం పొందినా ఏ ఒక్కటీ ముద్రణ పొందలేదు

మధుర కవితలు వ్రాసిన శిష్ట వరకవులు కూడ ఈ కాలంలో రాణించారు

గత శతాబ్ది రచనా ప్రక్రియలనే కుడి యెడమలుగా రచించారే తప్ప ఈ కాలంలో (19వ, శతాబ్ది) కోస్తాంధ్రలో వలె నూతన సాహిత్య ప్రక్రియలేవీ ఈ జిల్లాలో ఆరంభం కాలేదు వచన రచనలు రానేలేదు కోస్తాలో వలె ఆంగ్ల విద్యావ్యాప్తి ఈ ప్రాంతంలో లేకపోవడమే అందుకు కారణం అనవచ్చు ఉర్దూ రాజభాషగా రాణిస్తున్న హైదరాబాద్ ముస్లిం నవాబుల ఆ పాలనలో ఈ మాత్రమైనా ఇక్కడ ఈ కరీంనగర్ జిల్లాలో మాతృభాషాభిమానం తెలుగు సాహిత్య సృజన జరిగినందుకు ఆనందించాలి ఇక ఈ జిల్లా ఇరువదవ శతాబ్ది సాహిత్యాన్ని చూద్దాం

# కరీంనగర్ జిల్లా తెలుగు సాహిత్య చరిత్ర

## రెండవ బాగము

## V ఇరువదవ శతాబ్ది ప్రధమార్ధ సాహిత్యం : 1901 - 1950

కరీంనగర్ జిల్లా నైజాం రాష్ట్రంలోనిది మూడు, నాలుగు వందలేండ్లుగా ముస్లిం పాలనలో ఉన్నది ఈ శతాబ్ది పూర్వార్ధంలో ప్రభుత్వ పాఠశాలలు ఏర్పడడం, అచ్చుపుస్తకాలు వ్యాప్తిలోనికి రావటం, పత్రికలు ఆరంభంకావటం మూలాన కొంతవరకు సాహితీ వ్యాసంగం ఎక్కువయింది అయినా పాఠశాలల్లో విద్యామాధ్యమం ఉర్దూ అచ్చు యంత్రాలు విరళం అవి పెద్ద పట్టణాలకే పరిమితమై ఉన్నా కొంతవరకు రచయితలకు ఉపకరించాయి ధనిక కవులు, లక్ష్మీ కటాక్షం లేని సరస్వతీ పుత్రులు కొందరు వదాన్యుల సహకారంతోనూ తమ పుస్తకాలను అచ్చులో చూసుకోగలిగారు

ఈ శతాబ్ది ప్రథమ పాదంలోని రచనలు అంతగా వెలుగు చూడకున్నా కవులు మాత్రమున్నారు ద్వితీయ పాదం (1926 50)లో చెప్పుకోదగిన పుస్తకాలు వచ్చాయి 1922లో వా లక్ష్మణాచార్యుల 'తత్త్వం' పద్యకావ్యం వెలువడింది ఈ కావ్యం 'ఇనుగుర్తి' ప్రచురణ కవిది కుందనపల్లి

శ్రీమాన్ శతావధాని సిరిశినహళ్ కృష్ణమాచార్యుల, 'కళాశాలాభ్యుదయము' పద్యకావ్యము 1929 లో రాజమండ్రిలో అచ్చయింది వీరిది కొరుట్ల

రాజవైద్య డా॥ పింగళి లింబాద్రి రెడ్డి గారు వారి స్వగ్రామమైన నెమిలికొండలో ముద్రణాయంత్రం నెలకొల్పి 'విజ్ఞాన ప్రచారణీ గ్రంధమాల' అనే పేరుతో ఓ ప్రచురణ సంస్థను 1922-44 స్థాపించి ఆ మధ్య కాలంలో 21 పుస్తకాలను వెలువరించారు

కమాన్‌పూర్ వాస్తవ్యులయిన మాధవరావు బలరామదాసు గారి 'రామగిరి మహాత్మ్యం' ప్రబంధం 1928లోనే ప్రచురింపబడింది

వరకవులు బహుగ్రంధకర్తలు అయిన ఘటబ్రహ్మ అనంతవరపు సిద్ధప్ప (గుండారెడ్డి పల్లి), పరమారాధ్యుల రాజయ్యకవి (చెలుపూరు), రామసింహకవి (రాఘవ పట్టణం), పద్యపుస్తకాలు కొన్ని ఓరుగల్లు సికిందరాబాదు వంటి నగరాల్లో ముద్రణ పొందాయి

ఆ కాలంలో ప్రదర్శన వ్యాప్తిని పొందిన ఈ ప్రాంత యక్షగానాలు కొన్ని సికిందరాబాద్, హైదరాబాద్ పాపులర్ పబ్లిషర్స్ చేత ముద్రింపబడినా ముద్రణ నంబరు కాలం పేర్కొనక అవి ఎప్పటివో గుర్తించుట కష్టంగా ఉంది

ఈ ప్రాంతపు ఏకైక కవయిత్రి, ఆనందమాంబ (కొడిమ్యాల) 1934లో 12 ఏండ్ల బాల్యప్రాయంలోనే 'సతీలలామ' అనే కావ్యం వ్రాశారు - ప్రచురించారు

వి కేశవరావు, వానమామలై జగన్నాధాచార్యులు, వేంకటరాజన్న అవధాని, మునుగోటి లక్ష్మణాచార్యులు, గంగారాజేశ్వరరావు, మామిడిపల్లి సాంబశివశర్మ మొ॥ పండితకవులు పలువురు అప్పటికే కవితా వ్యవసాయం సాగిస్తున్నవారు కవిత్వమంటే అప్పుడు పద్యరచన అనేభావం గేయ రచనలకు ఇప్పుడున్నంత ప్రాచుర్యం లేదు గేయకవులకు ఇంతటి గౌరవం కూడా ఆ దినాలలో లేదు వచన రచనలు మరీ తక్కువ

అప్పటి కవులలో ఇప్పుడు ఏ కొందరో తప్ప మిగితావారందరూ కీర్తిశేషులైనారు అప్పటి రచనల వివరాలు తర్వాతి శీర్షికలలో ప్రక్రియల వారిగా వివరంగా చూపబడుతాయి

ఇందలి శీర్షికలు౹ **1 పద్యకావ్యాలు 2 యక్షగానాలు 3 వరకవులు - మధుర కవితలు 4 వచన వాఙ్మయం** ముందుగా తెలంగాణాకు గర్వకారణంగా నిలిచిన 'గోల్కొండ కవుల సంచిక'లోని ఈ జిల్లా కవుల వివరాలు అవశ్యపఠనీయం

**గోలకొండ కవుల సంచిక** - కోస్తా ఆంధ్ర పండితులు ఏదో సాహితీప్రసంగ సందర్భంలో "నైజాం రాష్ట్రంలో ఉర్దూ భాషా ప్రభావం తప్ప తెలుగునకు విలువలేదు తెలుగు కవులు లేరు" - అన్నారట

ఆ మాట 'గోలకొండ పత్రికా సంపాదకులు' ఆంధ్రుల సాంఘిక చరిత్ర, రామాయణ విశేషాలు, మన పండుగలు ఇత్యాతి బహువిశేషగ్రంధాల రచయిత అయిన సురవరం ప్రతాపరెడ్డి గారి చెవిన పడింది ఆయన దేశాభిమాని మాతృభాషాభిమాని అందుకు ఏకాస్త ఆత్మగౌరవ భంగం కలిగినా సహించలేకపోయేవారు అలాగా ఇదుగో చూడండి మా తెలంగాణా కవులం ఎందరం ఉన్నామో! అని ఈ ప్రాంత రచయితల వివరాలు సేకరించి ఒక్కొక్క కవిత చొప్పున కవుల పరిచయాలతో సహా ఒక ఉద్గ్రంధాన్ని ప్రచురించారు అదే 'గోలకొండ కవుల సంచిక 1934 సం దీపావళి ప్రచురణ అందలి కవుల సంఖ్య 354 అందులో ఇంచుమించు 40 మంది ఈ కరీంనగర్ జిల్లా వారున్నారు వీరు అప్పటి వర్తమాన కవులు పూర్వకవి పరిచయాలలో సైతం ఈ జిల్లా కవులు 14రు ఆ గ్రంధంలో చోటు చేసుకున్నారు

## గోలకొండ కవుల సంచికలోని కరీంనగర్ జిల్లా కవుల సాహిత్య విశేషాలు

1 **ఆచి రాఘవాచార్య శాస్త్రులు గారు - అవునూరు,** తా॥ సిరిసిల్ల గో క సం నం 5 బహుధాన్యలో జననం వయస్సు 56 సంవత్సరాలు, 1934లో బిరుదు ఆంధ్రగీర్వాణ వాణీప్రవీణ అముద్రిత రచనలు 1 శ్రీనివాస ప్రసాదము, 2 ప్రపత్తి పారిజాతము, 3 అధ్యాత్మ తారావళి సంచికలోని కవిత 'శ్రీమచ్ఛేషాచల వేంకటేశస్తుతి' సంస్కృతం ఇందలి అయిదు శ్లోకాలలో మొదటిదిది

శ్రీశేషాచల శృంగదేశ విలసద్గాంగేయ హర్మ్యాంగణో
దివ్యోద్యాన విరాజమాన సరసీమాలాభి రా శోభిత
శృంగారాంచిత వీధికా యుత మహా శృంగాటకైర్భాసిత
శ్రీశ్రీనివాస నివాసపత్తనవరో జేజేయతే సర్వదా

వీరి రచనలు మరేవీ లభించలేదు ఇదే సంచికలోని నం 96 ఆచి వేంకటనృసింహాచార్యకవి వీరి పుత్రులు

2 **ఆత్తలూరి విశ్వనాధ శాస్త్రి - వేములవాడ** తా॥ సిరిసిల్ల గో క సం నం 26 వ 26 సం శరభాంకుడు, ఆత్తలూరి పాపకవి మొ॥ వారు వీరి వంశపు పూర్వకవులు

సంచికలోని వీరి 'పార్వతీస్తవం' లోని శ్లోకత్రయంలో మొదటి రెండు శ్లోకాలు ఇవి
దుర్గే త్వదీయ మహిమా నర్గల తాం సంతతం నివేదయతి।
స్వర్గేవ సదమర స్త్రీవర్గ కృతానంత పుష్పతతి పూజా॥
చింతా కులితం స్వాంతం, సంతత సంసార సాగరేమగ్నం।
భ్రాంతిం హరమే పార్వతి, చింతిత చింతామణి ప్రపంచేస్మిన్॥

**3 దప్పూరి సత్యనారాయణాచార్యులు - బిజవెంకి** ఎల్లందుల టప్పా నం 38, అష్టావధాని, విద్వాన్, వయస్సు సూచించలేదు అప్పుడు వీరు బెజ్జంకి నృసింహాలయార్చకులుగా ఉండేవారు స్థిర నివాసం 'కోట్ల' గ్రామం గంగాధర మండలంలో ఉంది వీరు బహుగ్రంథకర్త వివరాలు తర్వాత చూపబడుతాయి గో క సం లోని 'భద్ర సంధాయకా' వీరి కవిత

శ్రీనాయకాయ భాసిత శుభాకారాయ, పద్మనాభాయ తుభ్యం నమోస్తు !

వీరి ఈ తెలుగు సీస పద్యం పూర్తిగా సంస్కృతభాషలో ఉంది రెండవది ఈ క్రింది మత్తేభ పద్యం

సకలాధారుడు, వేదవంద్యుడు మహాశాంతుండు, మౌనీంద్ర ర
క్షకు, డజ్ఞాన మహాంధకార పటలీ సప్తాశ్వు, డబ్జాక్షు, డ
త్యకళంకస్తవనీయ నామకుడు, నిత్యానందకైవల్యదా
యకు, డా శ్రీరమణీ మనోహర మహత్త్వంబెన్నగన్ సాధ్యమే

పద్యం చివరి పాదం యతి స్థానంలోని పదం"మహాత్మ్యం" కావాలి అయితేనే యతి కుదురుతుంది

**4 శ్రీ ముడుంబ రామానుజాచార్యులు - అంబాల,** తా॥ హుజూరాబాద్ గో క సం నం 45 కవి వయస్సు 40 సం లు అముద్రిత రచనలు నాలుగు

1 వేంకటేశ్వర శతకము, 2 కదంబిని 3 ప్రేమ చాంచల్యము, 4 రమానంద స్మృతి పద్యములు

(కా) కదంబిని, ప్రేమ చాంచల్యము నవలలు వీరి రచనలేవీ లభించలేదు సంచికలోని "వేంకటేశ్వర స్తుతి" లోని మూడు పద్యాలు ఈ దిగువ చూపబడుతున్నవి

శ్రీ దుగ్ధాంబుధి కన్యకా హృదయ నీరేజాబ్జమిత్రా, ముకుం
దా ! దేవాహిత వారకా వన కురారా ! భీష్మబీభత్స ప్ర
హ్లాద వ్యాస పరాశరాది సుజనాహ్లాద ప్రదా ! పూజితో
మాదామోదర దేవ దేవ యలమేల్మంగా మనోనాయకా !

వరదా సర్వజగన్నియామక సదా వాత్సల్య సింధూ పరా
త్పర దీనా వన యో విపన్న జన సద్బంధూ ముకుందా చరా
చర లోక ప్రతి పాలనైక చతురా సర్వజ్ఞ లోకైకసు
స్మరణీయానుగుణ ప్రభావ యలమేల్మంగా మనోనాయకా

చతురత్వంబు పద ప్రయోగ రచనా సామర్థ్యమున్ లేమిచే
యతికిన్ బ్రాసకు నెన్నొపాట్లుపడి మాయయ్యా నినున్ గూర్చి నే
నతుకుల్ వెట్టితి మూడు పద్దెముల నందందున్న లోపమ్ములన్
మతిలోనెంచకను గ్రహింపుమలమేల్ మంగా మనోనాయకా

కవి అప్పడికి ఈ మూడు పద్యాలు రచించినట్లు చెప్పుకున్నా ప్రజ్ఞచాలని వాడనన్నా, ఇవి ఆయన 'వేంకటేశ్వర శతకం' లోని వనుట స్పష్టం కవి చతురుడు !

**5 ఐల్నేని గోపాలరాయుడు - మూడేపల్లి,** తా॥ సిరిసిల్ల గో క సం నం 54 వయస్సు 64 మరణం - దుర్మతిలో జాతి - వెలమవారు

ముద్రిత రచనలు 1 శ్రీరామశతకము, 2 రఘువీరశతకము*

ఇవి రెండూ వృత్త పద్య శతకాలు గో క సం లో 'మనసా' అను శీర్షిక క్రింద వీరి రెండు శతకాల రెండు పద్యాలున్నవి వీరి పద్యాల భావాలు, అంత్యప్రాసలు రమణీయం

దురితాళుల్ దెగి దూరు గొందుల, విపత్తుల్ దూరమున్ బారు, దు
ర్ధర సంసార దవాగ్నులారు, విషయ వ్యాపారముల్ మీరు, నీ
స్మరణన్ సంపదలెల్ల మీరు, మదినీ సాన్నిధ్యమున్ గోరు, ని
ర్జర సంస్తుత్య పదారవింద యుగళా ! రామాకృపన్ బ్రోవరా !

కలశ పయోధిబుట్టి, హరి గోత్రమునన్ బసగట్టి, లోకమిం
పలరగ బ్రోచినట్టి సిరి యంఘ్రుల నెన్నుదురంట బెట్టి, స
త్ఫలములొసంగు మంటి, నిను బాయక యుండగ మ్రొక్కుచుంటి, నో
జలజ దళాక్ష ! యంచు, మనసా ! రఘువీరు మరుంగు జేరుమా

జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి శతావధాని గారి పరిష్కరణమును పొంది వీరి శతకాలు 1930 సుమారుగా ముద్రణ నొందినవి ద్వితీయ ముద్రణ కోసం కవి దౌహిత్రులు కీ శే వెలిచాల శ్రీధరరావు షా నగర్ గారు వ్రాత ప్రతి 1977లో నెమిలికొండకు తెచ్చి చూపారు లేఖక దోషాలున్నా చక్కని కవిత శతకాలు తిరిగి అచ్చుకాలేదు మొదటి అచ్చుప్రతులు వ్యాప్తిలో లేవు - లభించలేదు

6 **సముద్రాల రామానుజాచార్యులు - కోరుట్ల,** గో క సం నం 59, వయస్సు 50 సం లు సుమారు కవి తమ పరిచయాన్ని సీస పద్యంలో (గో నం 358 పుట) వ్రాసుకున్నారు

ప్రాయమా శ్రీచిత్రభాను వర్షా దిగా భవవర్షమునకు నేబదయ్యె అని ఉంది ఆరవ గణం, రెండవ యతి తప్పినవి 'భవవర్షమునకు నేబదియు నయ్యె' అని ఆ కవి భావం కాబోలు భవ భావవత్సరం ముద్రా రాక్షసం ! సంచికలోని 'శ్రీకృష్ణసంస్తుతి' సంస్కృత కవిత వీరి తెలుగు కవిత తర్వాత

7 **నెమిలికొండ శ్రీరంగాచార్య శాస్త్రి - జాగీరు నారాయణ పురం,** తా॥ సిరిసిల్ల గో క సం నం 65 అష్టావధాని కృతులు లేవు కవి స్వపరిచయ పద్యం గో క సం పుట-359 లోనిది ఇది

సీ వాసమా - రాఘ్భగవాన్ దాసు జాగీరు నారాయణ పురంబు నయ యుతంబు,
పాండిత్యమా బుధ వర్య సన్మాన్యమౌ- నాటకాలంకార పాటవంబు,
కవనమా పద్యములవలీలగా గూర్చు- నష్టావధాన విశిష్టతంబు,
వాక్చయమా-సభా భవనములందు ప-న్యాసోక్తి వైభవ భాసురంబు,
గీ గోత్రమా భరద్వాజ పవిత్రతంబు, ప్రాయమా యిరువది యొక్క వత్సరంబు,
ఆఖ్యయా - శ్రీరంగాచార్యులంద్రు భువిని, బర్హిగిరి గృహనామమో ప్రాజ్ఞులార

గీత పద్యం మూడవ పాదం గణభంగం, లేఖకుల అజాగ్రత్త కాబోలు కవి ప్రయోగమేదో తెలియదు నెమిలికొండ అను తను ఇంటిపేరును సంస్కృతీకరించి బర్హిగిరి అన్నారు కవి !

సంచికలోని 'భక్తి ప్రభావము' రెండు శ్లోకాల తర్వాతి, రెండు పద్యాలివి
సీతారామ పదారవింద ధృత సచ్చిత్తుండు సౌమిత్రి సం
జాతానందముతో జనెన్ విపిన సంచారంబుకై ప్రేమతో
భ్రాత కాలమునందు యోగ్యఫల సంపాద్యంబు గావించి సా
కేతేశున్ ముద మొందజేసె గురుభక్తిన్ దాసుడై నిత్యమున్

భరతుడు రాజ్య భారమునుపాయముగా బదునాలుగేండ్లు శ్రీ
కరమగు రామపాదుకలకై నెతిగించి మనంబునందు దా (యె)
శరధి పదారవిందయుగ సన్నుతి జేసి తదాగమంబుకై (ఆ గమనం)
మురిసెను గానలోకమున బూజ్యము భక్తియె సౌఖ్యదంబగున్

**8 పదిరె లక్ష్మణ శాస్త్రి - పదిరె, తా॥ సిరిసిల్ల,** గో క సం నం 68,

వీరి రచిత గ్రంధములు వీరి కుమారులగు టి కృష్ణశాస్త్రి వారి వద్ద నున్నవి - అన్నారే కాని వాటి పేర్లు లేవు పదిర ఊరిపేరు, కవి ఇంటి పేరు తిగుళ్లవారు దుర్మతిలో మృతిచెందారు "రామచంద్ర శతకము" వీరి అముద్రితకృతి సంచికలోని నాలుగు సీస పద్యాలలో రెండు ఇక్కడ చూపబడుతున్నది శీర్షిక 'రామచంద్ర'

సీ శేషుని శిరముల భూషించు నీ పంట, పంటవెలంది నీ పాన్పుదంట,
దంట గౌతమునాలు తరియించె కాలంట, కాలంట బోరు నీ కరుణ వెంట,
వెంట రాదిహ భోగ వేష మెన్నగ పెంట, నగ పెంట రాచూలి మగని దంట,
దంటారు మేనుల దయ్యమా వలకంట, వలకంట మాౖనెతి వార్ధి గుంట,
గీ గుంట చిక్కుల బెట్టకు కుజనుడంట, నంట నానోట నీపేరు హరి వికుంఠ !
పదిరె పుర సద్మ పావన పాద పద్మ, పద్మ జాధిప రామ సద్భావ సీమ

పంట, దంట, కాలంట, వెంట, నగపెంట, దంట, వలకంట, గుంట, అంట పదాల ముక్తపద గ్రస్తాలంకారాలు మనోహరం, మరో పద్యం పై దానివలెనే ముక్తపదగ్రస్తంతోపాటుగా అంత్యప్రాసాలంకార శోభితంగా ఎలా ఉందో చూడండి

సీ బ్రహ్మహత్యాది పాపము బాపు పద ధూళి, దూలించు చక్రంబు దుర్జనాళి,
నళిపంక్తి నదరించు నసిత కుంతల పాళి, పాలించురదము మొల్లలను వ్రాలి,
వాలిక చూపులు వాలుగలను బోలి, బోలు శంఖము మెడ బొంద జాలి,
జాలి చప్పని దొండ చవుకు పెదవుల గూలి, కూలి ముక్కుకు నువఇ గోలి
గీ గోలి భవరోగ వనికి గోపాల కీలి, కీలెరిగి నిన్ను గను శూలి కీర్తిశాలి ॥పదిరె॥
రదము = దంతము, వాలుగ = ఒక రకం చేప 2వ, పాదంలో ప్రాస, 4లో యతి తప్పినై

మిగతా రెండు పద్యాలు కూడా ఇదేవిధంగా ఉన్నవి శతక పద్యాలన్నీ ఆద్యంతాలంకార శోభితాలయి ఉండవచ్చు ప్రతిభ కలిగిన కవి పదిరె లక్ష్మణశాస్త్రి గారు

**9 చక్రహరి అచ్యుత రాజు - సిరిసిల్ల** నం 76 వయస్సు 60, మరణం దుందుభిసంవత్సరములో, ముద్రిత పుస్తకము శిరిశాల శతకము ఇందలి చివరి పద్యంలో కవి వంశ వివరాలున్నవి కవిది భట్రాజకులం చక్రహరి వంశం అచ్యుతరాజు నామం తండ్రి మూర్తి రాజు, తాత వేంకటరామ రాజు 'వేంకటేశ్వరా' శీర్షికతో సంచిక నలంకరించినవి వీరివి మూడు పద్యాలు

ఉ శ్రీపతి ! వాసుదేవ, సరసీరుహలోచన, చక్రపాణి, స
ద్రూప, విరించి శంకర శిరోమణి మండిత పాద పద్మ ! తా
రాపతి భాను నేత్రయుగ రాజిత ! చెన్నమనేని వేంకట
క్ష్మాపతి నేలునట్టి శిరిశాల పురీశ్వర వేంకటేశ్వరా
ఉ కొంకక యుష్మదంకితము గూర్చి రచించితి, జక్కజేయు నా
వంకలు, భట్టు చక్రహరి వంశ్యుడ, నచ్యుత రాట్కవీంద్రుడన్,
వేంకటరామపౌత్రుడ, వివేక సులక్షణ మూర్తి పుత్రుడన్ (లక్ష్మణ?)
సంకట దైత్యనాశ ! శిరిశాల పురీశ్వర
చ లలియతి కర్తృకర్మక్రియలన్ భువినీకృతి సంస్కృతాంధ్ర సం
ధుల గల తప్పులన్ని విడద్రోచి సలక్షణమయ్యె గాదె, భూ
జలమది గంగలో గలసి నన్నుత మౌక్రియ నీ సమాఖ్యచే,
జలధర నీల దేహ ! శిరిశాలపురీశ్వర

సలక్షణ సరస కవిత వీరి శతకం పేరు 'సిరిశాల వేంకటేశ్వర శతకం' అనుకోవచ్చు పై మూడు పద్యాలు దానిలోనివే ఈ శతకం తర్వాతి కాలంలో ముద్రితమైనా ప్రస్తుతం అలభ్యం

10 **ఖండేరావు రామారావు - కరీంనగరం,** వీరి నం 78 వయస్సు 90 సం లు 'బహుగ్రంధకర్త' అన్నారు అవి అముద్రితాలు అలభ్యాలు సంచికలోని కవిత 'చూడికుడుత్త దేవి' లోనివి అయిదు మత్తేభ విక్రీడిత వృత్త పద్యాలు 19వ, శతాబ్ది కవులలో ఈ కవి పరిచయం చేయబడింది

11 **బట్టు అచ్యుతరాజు - బండలింగాపురం,** గో క సం నం 84 వయస్సు - 40 సం, బిరుదు చిత్ర బంధాంత పద్య కవి కేసరి ముద్రిత రచనలు 1 బంధగర్భపద్య శతకము, 2 జగన్మోహినీ నాటకము 3 అనంత శతకము గో క సం లోని 'శ్రీవేంకటేశ్వరా' పద్యాలు ఇవి

అటమదియేను భిక్షమునకై చరియించుటకున్ బ్రయాణమె
చ్చటికి దలంచుకొన్న గొన సాగగ నీయవు నిన్ను గూర్చియే
మిట నపరాధినైతినొ క్షమించగ బూని ఫణీశ్వరాద్రి వేం
కట రమణ ప్రభోయికను గావుము లింగపురాచ్యుతాఖ్యునిన్
తటుకున సత్కృపారసము దాలిచి నీ హృదయంబునందునే
కుటిలము లేక యెప్పుడును గోరికలన్ ఘనభోగ భాగ్యముల్
ఘటనము గాగ జేసి కలకాలము మానక గారుడాద్రి వేం
కట రమణప్రభో యికను గావుము

పై మూడు పుస్తకాలు ముద్రితమైనా ఏ ఒక్క పుస్తక ప్రతికానీ లభ్యం కాలేదు

12 **ఆచి వేంకట నృసింహాచార్యులు - ఆవునూరు,** తా॥ సిరిసిల్ల, నం 96 జననం కీలక ఆశ్వీజ శుద్ధనవమి బిరుదులు కవి కేసరి కిశోర, అవధాన కుశల, అష్టావధాని సంస్కృతాంధ్ర భాషల పాండిత్యంతో పాటు కవి తన పరిచయ సీస పద్యం ఎత్తుగీతిలో ఇట్లా పేర్కొన్నారు గో క సం పు 362

గీ యవనభాషా విశేష మభ్యస్తమేను, ఆంగ్ల మవసర పూర్తి, మాదావునూరు,
ఆఖ్యయా వేంకటనరసింహార్యుడంద్రు, ఆచి మాగృహనామమో యార్యులార

నరసింహాచార్యులు విద్వత్కవి అయినా గ్రంథాలేవీ రచించలేదు వీరి కవన విశేషాలు తర్వాత చూపబడుతాయి గో క సంచికలో 'శ్రీకర్మచంద్రోదయము' అను పేర గూర్చిన నాలుగు పద్యాలున్నవి పు 86, 87 వానిలో రెండు చూడండి

సీ న్యాయవాదాన్త విద్యాభ్యాస మొనరించి - కృతకృత్యుడౌ రాజ కీయవేత్త,
కరినోపవాస దీక్షలచేత నాత్మీయ యౌవనంబును గన్న యౌగికుండు
హరిజనాభ్యుదయ పుణ్యాంభోజ పుంజ వి కాసంబు సేసిన కర్మసాక్షి,
పత్నీ సుతాలయ పశుధనాదికమును దాసీనతగ జూచు త్యాగ యుతుడు
గీ భూరి భూమి మాతృాణ విముక్తి కొఱకు, బంధనాలయావాసియౌ భాగ్యశాలి,
ధన్యమోహన దాస చైతన్యమూర్తి, కర్మచంద్రుడు బొడిచె లోకము సుఖింప
సీ తల్లి దండ్రులకు వితంతు పుత్రీ పరి, తాపంబు గాంచుటే ధర్మ సరళి,
జాతి మతాధి వైషమ్య వివాదముల్, వృద్ధిగావించుటే విద్య మహిమ,
దీన జనాళి విహీన పరిస్థితుల్, గనుచుండుటే యధికార విధియు
నంగనా మణులు విద్యావ్యాప్తి, ప్రతిబంధ, కోపాయ చింతయే యుక్తి ఫలమ

గీ. టంచు జనులను వంచించి హాయిగాను, వాసి గాంచితి విందాక నో సనాత
నాంధకారమా ! యిపుడె నీ యంత్య కర్మ, చంద్రుడుదయించె దిన్నగా జూచికొనుము. 2

తర్వాత బాపూజీ కట్టుబొట్టు ఆచార వ్యవహారాలు విశిష్టతాంతర్యాలు రెండు పద్యాల్లో ప్రతిభావంతంగా వర్ణింపబడినవి. ఈ జిల్లాలో భారత జాతీయ భావాలకు స్పందించి కవిత్వం చెప్పిన మొదటి కవిగా ఆఛి వేంకటనృసింహాచార్యులను సంభావించవచ్చు.

## 13. గోవర్ధనం నారాయణా చార్యులు - బండలింగాపురం.

గో.క.సం.నం. 100. వయస్సు 51 సం. అముద్రిత కృతి - రామానుజాశ్వధాటీ కావ్యము. సంచికలోని కవిత "రామానుజ ప్రశంస" అయిదు శ్లోకాలు.

శ్లో॥ తవపాదాంబుజం తత్వ దర్శనం, భవ మహాంబుధేర్భద్ర తారకం
భువన సుందరం భూరి దానదం, భవతునోయతేర్భావుక ప్రదం. ॥

శ్లో॥ కనక కుండలం కాయ వాసనం, జనక కేశవం జైన శాసనం
ఘన కమండలుం ఘూత సౌగతం, వన రుహేక్షణం వచ్మ్యహం యతిం ॥ 3

భాష సంస్కృతమైనా తెలుగు పద్యాల్లోని యతి ప్రాసలు పాటించి వ్రాయడం విశేషం. కవి ఆంధ్రకృతులు ఏవి రచించినట్లు తెలియరాలేదు.

## 14. సిద్ధప్ప రాజయోగి - గుండారెడ్డిపల్లి.

నం. 105, కులము కుమ్మరి, వయస్సు 25 సం. ముద్రితరచన - సిద్దప వరకవి విజ్ఞాన బోధిని.

"ఈ వరకవి మహాయోగి. చదువు సంధ్యలెరిగిన వాడు కాడు. ఆశువుగా చెప్పనేర్చినవాడు. మంచి భావములు కావున శైలిదోషములున్నను అట్లే ప్రకటించినాము" అని గో.క.సం. 364 పుటలో అన్నారు. సిద్ధప్పవరకవి అనే మాట నిజం. కవిత్వంలో భాషా ఛందోలంకార దోషాలున్నా ఆయన పద్యాలు చాలా వ్యాప్తి పొందాయి. ఈ కవి విద్యావంతుడు. ఉపాధ్యాయుడు. కవిత మాత్రం స్వేచ్ఛగా ప్రవహించింది. సిద్దప్ప గారు బహుగ్రంధకర్త. 1980 వరకు వ్రాశారు. వివరాలు తర్వాత. ప్రస్తుతం గో.క. సంచిక 'ఘటబ్రహ్మ' శీర్షికలోని రెండు పద్యాల్లో ఒకటి చూడండి.

సీ. వేమనార్యుని బోలు విజ్ఞానియును లేడు, కాళిదాసును బోలు కవియు లేడు
పోతులూరయ్యంత బోధకుండును లేడు, సిద్ధప్ప యంత శిష్యుడును లేడు (యతి?)
ఘన కబీరునుబోలు కనిన దాసుడు లేడు, సుమతితో సరిబోలు సుమతి లేడు
రామదాసును బోలు రాజయోగియులేడు, తల్లి దండ్రుల బోలు ధనము లేదు.

గీ. ఘటము కంటెను వేఱైన మఠము లేదు, ఆత్మకంటెను వేఱైన హరియు లేడు
వినుడి మాయప్ప సిద్దప్ప విహితుడప్ప, కనుడి కరమొప్ప కవికుప్ప కనకమప్ప.

బ్రహ్మం గారి కుమారుడు పోతులూరయ్య. ఈ కవి ఆ పేరు వీర బ్రహ్మం గారికే ఉద్దేశించినట్లున్నారు. సుమతి పేరు సుమతి శతక కర్త అని కవిగారి భావం.

## 15. నేరెళ్ల వేంకటాచార్యులు - బండలింగాపురం

గో.కం.సం.నం. 110. శతావధాని, అముద్రితరచనలు - అవధానములు.

కవి పేరు వేంకట రంగాచార్యులు సంచికలో పేరు తప్పింది. వారు కవి అయినా కవిత్వంలో కాక సంగీతంలో అందులో విశేషించి వాద్య సంగీతంలో అవధాన కుశలురు. వీణ, మురళి, మృదంగం, హార్మోనియం జంత్రవాద్యాల్లో నిపుణులని వినికిడి. వారు కవి కూడా అనడానికి గో.క.సం.లోని 'ఆచార్య

ప్రశంస' పద్యాలు నిదర్శనం అవి ఇవి

క కారి మహనీయునకు సుకు, మారుండై చింతతొరిటె మధ్యంబందున్
గూరిమితో తిరువాయ్‌మొడి, సారంబును దెలిపినట్టి శఠరిపు* దలతున్

సీ పూర్వము నందు సంపూర్ణ ఫణీంద్రులై, శ్రీహరి శయ్యగా జెలగినారు,
త్రేతాయుగంబున ఖ్యాతిగా రామ సోదరులయి వైరుల దరిమినారు,
ద్వాపరమున హలధరులయి శ్రీకృష్ణ పూర్వజులన కీర్తి బొందినారు,
కలియుగంబున మహాత్కాషాయ వసనత్రి దండ యతీంద్రులై దనరి నారు

గీ సకల పాషండులను ద్రోయ జాలినారు, నియతి వైష్ణవ మతముల నిలిపినారు,
శ్రుతి తతులకు సదర్థముల్ సూపినారు, స్వామి రామానుజా నీకు ప్రణతి శతము

1 ఆదిశేషుడు, 2 లక్ష్మణుడు, 3 బలరాముడు, 4 రామానుజుడు - ఒక్కరే అని శ్రీవైష్ణవమత సిద్ధాంతం

## 16 యం వై జీవరత్నం, రెవరెండు - కొడిమ్యాల

గో క సం నం 113, జన్మస్థలం తిరుమలగిరి, నల్గొండ జిల్లా

వీరు క్రైస్తవ మత బోధకులుగా కరీంనగర్ జిల్లా జగిత్యాల తాలుకాలోని కొడిమ్యాలలో స్థిరనివాసమున్నారు జన్మ సం 1898 చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు జీవరత్నం గారి కవితా గురువు ముద్రిత రచన - 1 (యోహోవా) యోవా చరిత్ర రెండవ పుస్తకం క్రైస్తవ భక్తిగీతాలు కూడా అచ్చుపొందినట్లు కవిగారి కుమారుడు తెలిపారు కవి పూర్తిపేరు మకా యేసు జీవరత్నం సలక్షణాంధ్రకవితలో జీవరత్నకవి 'ఏసుకీస్తు' నిట్లా స్తుతించారు గో క సం పుట 103

క శ్రీమన్నామా సుగుణ స్తోమా యేసూ ! పవిత్ర శోభిత నామా !
భూమీ జన రక్షక సన్నామా విస్ఫురిత భూషణస్థిత ప్రేమా !

క భువి గగనంబులు శశిమణి, రవి తారలు మారుతంబు రాత్రింబవళుల్
అవిరతముగ నడిపించునదెవడా త్రయ్యాత్మక మగు దేవున్ గొలుతున్ 2
ఉత్సాహ మంగళంబు దేవదేవ మహిత ధర్మపోషణా 3

క నిరతము నీదయ బడయుచు, బరమ కృపాలబ్ధ విభవ భాగ్యాత్ముడ గాన్
శరణంటిని భవ భయహర, కరుణించవె యేసుదేవ కలుషాత్ముడనన్ 4

అయిదవ పద్యం కూడా కందం రెండవ పద్యం చివరి పాదంలో అఖండ యతి పడింది సలక్షణాంధ్ర కవి యేసురత్నం గారు

**17 చిలుకమర్తి వేంకట నృసింహాచార్యులు - ముత్తా నారాయణపురం** గో క సం నం 116, జన్మతిథి రుధిరోద్గారి కార్తీక బహుళాష్టమి అముద్రిత రచన వేణుగోపాల శతకము, అది అచ్చతెలుగు పద్య శతకమట ఈ సంచికలోని కవిత 'శ్రీమద్రామానుజ ప్రశంస' పద్యాలు ఇవి పు 105

ఒకనాడైన భవత్పదాబ్జరజము న్మొక్కింత గ్రోలించి మీ
యకళంకోజ్వల దివ్యదేహరుచి భుక్తాసక్తు గావించి దా

---

* వైష్ణవ భక్తి స్తోత్ర గ్రంధం నాలాయిర ప్రబంధంలోని అధిక భాగం రచించిన నమ్మాళ్వారు శఠకోపయతి

స కదంబాఖిల దాస దాస పద దాస్యంబైన నేమించి ధా
రకము న్పోషక భోగ్యసిద్ధికి గృపన్ రానిమ్ము రామానుజా
ప్రకటంబైన భవద్గుణానుభవము ప్రాభ్జల్ వినందెల్ప మా
మక చిత్తంబున జేరదింత యయినన్ మాంద్య స్వభావంబుచే
నకటా కర్మవిపాక మీ విధము భాగ్యచ్ఛత్ర సంపన్నుగా
బ్రకటించెన్గద త్వత్కృపారసము నాపై నుంచు రామానుజా
మొదటి చరణంలో రజమున్ + ఒక్కింత = అన్విష్టసఖి వంటి సంధి

భక్తిరస పూరితం నృసింహాచార్య కవనం

18 **అమరవాది వేంకట నృసింహాచార్యులు - ముస్తాబాదు,** తా సిరిసిల్ల, గో క సం నం 130, జన్మదినం - శుభకృత్ మాఘశుద్ధ పంచమి మరణం 1924 (గో క సం 1934 నాటికి 10 ఏండ్ల క్రితం) "మదన" (గో సం పుట 121) వీరి కవిత

మలయ పవన యుక్తం మాధవీ కుంజ సక్తం। మిధున జన విలాసం మీనకేతోర్నివాసం।
సురభి సుమ విభక్తం సుందరాంగోప భుక్తం। వనమిద మతి భాసం వల్లరీ భిర్వికాసం॥
ధనురతి మృదు పుష్పం ధీర హృద్భేద బాణం। పటుమధుకర పంక్తిర్జ్యా ముహుశ్శోక కారీ।
సుమశర ఇతి సంజ్ఞా ధీర వీర ప్రతిజ్ఞా। మదన తవ సమస్తం మానినాం మాన విఘ్నం॥

మొదటి శ్లోకంలో ప్రాస లేకున్నా తెలుగు పద్యాల్లో వలె నాలుగు పాదాల్లో యతి పాటించబడింది ఆంగ్ల కవితలో వలె రైం కుదిరింది వీరి తెలుగు కవితలు తెలియరాలేదు

19 **పండిత బావి కృష్ణశాస్త్రి - నారాయణపురం,** తా॥ సిరిసిల్ల, సం నం 139, వయసు - సప్తవింశతి, 27 ఏండ్లు భావిపదం కవి గృహనామం కవి పరిచయ పద్యం గో క సం పుట 367

సీ రాడ్భగవాన్ దాస రక్షిత నారాయణపురంబు మన్నివాస పురవరము
సరస విద్వన్నుత సద్భావి వంశ సాగరము మజ్జన్మకాకరము వరము
ఆంధ్రగీర్వాణ ప్రబంధ కారక పరిచయము మద్వాక్సుధాచయము నయము
నవరసాలంకృత నాటక కావ్యాది పరిశీలనోక్తి మత్పరిత శక్తి

గీ సప్త వింశతి వత్సర సమము వయము, సలలితంబైన మద్విప్ర కులమమలము
మాధవాంఘ్ర్యర్పితంబు మన్మనము ఘనము, సరసమౌ కృష్ణ నామమో సరసులార

కృష్ణశాస్త్రిగారు నం 96 ఆచి వే నృసింహాచార్యులతో కలిసి జంట కవిత్వం చెప్పేవారని 'ఆచి నృసింహాచార్యుల స్మారక సంచిక' 1985లో ఉంది నం 286 ఆచి వేంకటాచార్యుల కవిత్వ వ్యాసంగానికి ప్రేరకులు కృష్ణశాస్త్రి గారని వేంకటాచార్యుల, రాగమాల ఖండకావ్య పీఠికలో వేదాంతాచార్యులు వ్రాశారు శాస్త్రిగారి కావ్యాలేవీ లేవు నం 279 కవయిత్రి అనందమాంబగారి 'సతీలలామ' 1934 కావ్యంలో వీరి అభినందన పద్యమొకటి కనిపించింది ఆ పద్యమిది

చ అతివల మిన్న వయ్యిబుధులందరిలన్ దలలూపజాలు నీ
చతుర కవిత్వమాధురికి సంతసమొంది ప్రియంబుచే భవ
న్మతి నెపుడుందలంచగను మంజుల పద్యము నొక్కదాని నం
దిత హృదయుండనై యొసగితిన్ గయికొమ్మిది బాలికామణీ

గో క సంచికలోని 'సత్యము' శీర్షికలోని అయిదు పద్యాలలో ఒకటిది
ధరలో శాశ్వత కీర్తి నొందుటకుపాదానంబు గోవింద స

త్కరుణా పూరము నట్టి సర్వవిధ సౌఖ్య ప్రాప్తికిన్ గల్ప భూ
తరువత్యంత విపత్తరంగ మిష వాతక్షుభ్య దుగ్రారి సా
గరమున్ దాటగ నావయన్నిటికి ముఖ్యత్వంబు సత్యత్వమే

తర్వాతి నాలుగు మత్తేభ వృత్తాల్లో మున్నుపలికి బొంకని పురాణ పురుషులైన దశరథ, బలిచక్రవర్తి, విశ్వామిత్ర, ధర్మరాజుల సత్యసంధతను తద్వారా వారు పొందిన కీర్తిసంపదను ప్రశంసించారు

**20 ఆర్తి కిష్టయ్య - కరీంనగరం,** నం 140 వివరాలేవీ లేవు గో క సం లో ఇందలి 'విశ్వరూప' శీర్షికనుబట్టి విశ్వబ్రాహ్మణకవి అనుకోవచ్చు పద్యాల భావాలూ అదే ధోరణిలో ఉన్నాయి సంచికలోనివి రెండే సీసాలు కాని, గో క సంచిక నం 90 ఆర్తినమ్మాళ్వారు కవి, జీడికల్లుగారిది చాత్తాదవైష్ణవ కులం కిష్టయ్యగారు అదే జాతివారు కావచ్చునేమో

పాడుమంత్రాలచే ప్రజలను బోధించబట్టి పండ్లూడగా గొట్టవచ్చు
బాటి వంపులజేరి పసుల భక్షించెడి, పులినైన గూల్చియు గెలువవచ్చు
వసుధ పాలన సేయవచ్చు మానవులను, దిట్టసాగిన వాని మొట్టవచ్చు
బొక్కలోపల నిల్చి నిక్కిజనుల గర్చు, సర్పంబునైనను జంపవచ్చు
కవి వరుని నోటి తిట్టును గడుపరాదు, ధర కళింగాధిపతి ముష్ఠి కరుగకున్నె
సత్యగుణసీమ హితసోమ సార్వభౌమ, వీర గిరివాస రఘువీర విశ్వరూప

ఏనుగు లక్ష్మణకవి 'మకరముఖాంతరస్థమగు మానికమున్ బెకలింపవచ్చు' అను పద్యాన్ని భావంలో అనుసరించినా పద్యం చివర కవి వాక్కు ప్రభావాన్ని చాటించాడు కవి గీత పద్య పూర్వార్థంలో శాపానుగ్రహ సమర్థుడనబడు వేములవాడ భీమకవి ప్రస్తావన తెచ్చాడు కళింగ గంగు భిక్షుకుడైంది భీమకవి శాపం వల్లనే అని చాటు పద్య వ్యాప్తి ఉంది కదా గీత పద్య ఉత్తరార్థంలోని 'వీరగిరి' ఏదో తెలియరాలేదు కరీంనగర్‌లో వీరభద్రుడన్న కొత్తకొండ క్షేత్రమున్నది కాని, ఇందులో కవి రాముని స్మరిస్తున్నాడు వీరగిరి రఘువీర శతకం వీరి కృతి కాబోలు రెండవ పద్యంలోనూ ఇదే విధంగా రెండు చరణాలు పద్యమకుటం

ఏ వర్ణికుండైన నిల ధర్మపద్ధతి, బాలింపుచుండెనా ప్రభువతండె,
సత్యమందుననిల్చి సంసారులను బ్రోచి, పరమేలు మెచ్చిన ప్రభువతండె
పూర్వులిచ్చిన వృత్తి బోనీక మన్నించి, బాధింపకుండెనా ప్రభువతండె
సంగీతసాహిత్య సకలవిద్యలయందు భ్రాంతుడైయుండెనా ప్రభువతండె
యేమి యెరుగక తిని క్రొవ్వి కాముకతను బరగు నాకొంటె కొడుకెట్లు ప్రభువటయ్య ॥

పరమేలు దుష్ట సమాసం కవి భావాలు కొంత తీవ్రంగా కనిపించినా సాంప్రదాయక వాది తానయితే సాంఘిక విమర్శకుడు

**21 శిరిసినహాళ్ కృష్ణమాచార్యులు - కోరుట్ల,** గో క సం నం 171 వయస్సు 30 బిరుదులు - అష్టావధాని, దైవజ్ఞశిఖామణి జన్మస్థానం మోర్తాడు, నిజామాబాద్ జిల్లా

ముద్రిత రచనలు 1 కళాశాలాభ్యుదయము 2 కొరువుట్ల జగతాల అవధానములు 3 పద్మావతీ పరిణయము 4 రుక్మిణీ కల్యాణము 5 మనోజ విజయ బాణము 6 గీతాతత్త్వమీమాంసా గ్రంథము పుట 370 వీరు ఉభయ భాషా కవి బహు గ్రంథకర్త వివరాలు తర్వాత చూపబడతాయి ప్రస్తుత సంచిక 'దీపావళి పుష్పము'లో వీరివి రెండు శ్లోకాలు మూడు తెలుగు పద్యాలున్నాయి మచ్చునకు అందుండి ఒక శ్లోకం ఒక పద్యం ఇక్కడ ఉదహరించబడుతున్నవి

శ్లో ॥కతి చిన్నధు మాధురీ దురీణా ॰ కతిచానర్థ తరార్థభావ బంధా
నిజదేశ కవీంద్ర సాంద్ర వాదః ప్రకటంయాంత్యనిశం భవత్ప్ర భావాత్ ॥

మ అలగీతాదుల జూపుచున్ మృదుపదన్యాసంబు గావించిని
ర్మల భావోదయ మబ్బజేనెడు నిజాం రాష్ట్రాంధ్ర విద్వత్కవీం
ద్రుల హృద్యత్కవితామతల్లి నిపుడుం దూరస్థులౌ వారికిం
దిలకింపంగను జేయుచుంటివి గదా దీపావళీ పుష్పమా !

ఆ దీపావళి పుష్పం ఈనాటికీ వసివాడని 1934 నాటి గోలకొండ కవుల సంచిక !

22 **టి కృష్ణశాస్త్రి - పదిరె,** తా॥ సిరిసిల్ల, గో సం నం 173, జన్మదినం శుభకృత్ ఆషాఢశు 5 బిరుదు అష్టావధాని వీరు ఈ సంచికలోని కవి, నం 68, లక్ష్మణశాస్త్రి గారి పుత్రులు తిగుళ్ళ ఇంటి పేరు ఈ కృష్ణశాస్త్రిగారు భవభూతి 'ఉత్తర రామచరితం' అనువదించారని న చ వేదాంతాచార్యులు ముస్తాబాద్ గారు 'రాగమాల' కావ్య పీఠికలో తెలిపారు గో క సంచికలో వీరి కవితా శీర్షిక 'దీపావళి పుష్పాభినందనము' అయిదు పద్యాలు

"ఆంధ్ర గీర్వాణ పాండితి నాదరించు కాలమెపుడేగుదెంచని గాంచుచుండ", ఈ సంచిక వచ్చింది కాబట్టి

గీ "తమ నిజాంలోన కవులు పూజ్యమను ప్రాజ్ఞులంత నతి శ్రద్ధ నూని సేవింతురమ్మ
అఖిల భారతియాంధ్ర భాగ్యాలకొమ్మ, మహిత దీపావళీ కుసుమాభిధమ్మ" 3 అన్నారు

కవి ఆనందం ఇట్లా ఉప్పొంగింది

సీ నేడుగా సుకవీంద్రనిబిడ యశశ్చంద్రి కావళి దశదిశలాక్రమించె
నేడుగా పండిత నివహంబునకగణ్య ఘన మానితోల్లాస గరిమ కలిగె
నేడుగా సద్విద్య నేర్చినందుకు ఫల మిదియే యటంచు నూహింపనయ్యె
నేడుగా విబుధాళి నిజవంశ నామముల్ సకలోర్వినతి చిరస్థాయి గాంచె

గీ నేడుగా మహా ఘనత నిర్నిద్ర కీర్తి బ్రభువరేణ్యుల సత్కృపా పరవశమున
నలరి గోల్కొండ కవి సంచికాఖ్యతోడ నిలను దీపావళీ పుష్పమేగు దెంచె

కాళిదాసునకు వలె అక్షర లక్షలులేవు శ్రీనాధునకువలె కనకాభిషేకాలు లేవు తమ కవితల ప్రచురిస్తామని అడిగినందుకే ఇంతటి ఆనందాభినందనలు ! ఎంతటి అల్పసంతోషులు - పసిహృదయులు ఈనాటి ఆనాటి తెలుగుకవులు !

23 **నేరెళ్ళ వేంకటాచార్యులు - బండలింగాపురము,** నం 174, వయస్సు 23 సం అముద్రిత కావ్యం అతిసుందర విలాసము నం 110 కవి నేరెళ్ళ రంగాచార్యులు వీరికి జనకులు గో కం సం లో 'దీపావళి పుష్పము' వీరి కవిత మొదటిది సీసపద్యం రెండవది ఈ క్రింది ఉత్పలము

తావక సద్వచస్తతి సుధారస బిందువు లుప్పతిల్ల దీ
పావళి పుష్పమా తమకమార యశోమణిహార వాసివై
పావన సజ్జన భ్రమర పంక్తులు నీదరి నాశ్రయించగా
నీవు జగత్ప్రసిద్ధి బడుదేయను వారి కొకింత వింతయే

24 **పరవస్తు నెంబెరుమాళ్ళు గూడెం** తా॥ సిరిసిల్ల సం 175 వయసు 40 సం లు అముద్రిత రచనలు - 1 యోగభూషణ చరిత్ర 2 నరహరిదాసు చరిత్ర 3 తిరుప్పావు వీరి రచనలు అలభ్యాలు గో క సం లోని వీరి కవిత "దీపావళి ప్రసవము" పుట - 165 చంపకమాలిక

"చెదరు గదా నిజాం కవుల జెందిన దుర్యశమింతలోన గాం
చెదరు గదా యశోరమనశేషకృపన్ గవిరాజులిందు మిం
చెదరు గదా విదేశ కవి సింహుల వాక్పటిమంబుకంటెబు
చ్చెదరు గదా స్వకీయముగ జెప్పిన పద్యము లెల్ల మీరు గూ
ర్చెదరు గదా సుమోపమ సువృత్త సరంబులు దేశమాతకి
చ్చెదరు గదా ధరింప బర సీమల వారు భ్రమింపగా లిఖిం
చెదరు గదా స్వదేశ కవిశేఖరులిందరటంచు నప్డు మె
చ్చెదరు గదా నిజామున విశేష కవీశ్వరులుంటచే నుతిం
చెదరు గదా నవీనముగ జేరి పఠింప గడంగుచుండ దీ
ర్చెదరు గదా తదీప్సితము రేబవలున్ గడు శ్రద్ధతో గణిం
చెదరు గదా యశోధనము శ్రేయము పండిత నామమున్ నుతిం
చెదరు గదా విదేశ నిజసీమల వారలు మీ సహాయ మెం
చెదరు గదా నిరంతర మశేష భవత్కరుణా రసత్వమున్"
మెచ్చెదరు గదా రసజ్ఞులు వశీకృత సత్కవితా విలాసులన్ !

**25 ఆవునూరు వేణుగోపాలరావు - ఆవునూరు** నం 177 జననం కీలక సంవత్సరం, పుష్యమాసం అముద్రిత రచన జొహరాబాయి, (నవల) కవి పరిచయం - సం పు 371

గోలకొండ కవుల సంచికలో 'గోలకొండ' శీర్షికలోని వీరి రెండు పద్యాలలో రెండవదిది

శ్రీరాజిల్లు నిజాము రాష్ట్రమున సంశ్రేయంబుగా నాంధ్ర భా
షా రామామణి వృద్ధి చెంద నిజదేశంబందు వార్తావళిన్
ధారాళంబున దెల్పగా వెలసె, నీ దక్కన్ యదృష్టంబె యా
కారాంబై యలవార పత్రిక యనంగా 'గోలకొండా' ఖ్యతోన్

**26 గోవర్ధన సింగరాచార్యులు - బండలింగాపురం,**

నం 184, వయస్సు - 60 సం మృతి - 1940 సుమారు జన్మస్థలం - బెముగల్లు (ని బాద్) నివాసం - బండలింగాపురం వీరు కావ్యరచన కావించినట్లు లేదు రాజాస్థాన కవి గో క సం లోని 'శ్రీభాష్యం' పంచ శ్లోకాలలో ఒకటిది

శ్రీరామానుజ సూక్తి సార సరణిర్విష్ణో పదస్యానఘా
సంసారాగ్ని విదీపన ప్రశమనీ శ్రీవిష్ణు దీ పోజ్వలా
శ్రీనాధస్య పరస్యచాంధ తమసో దుర్వాదిగర్వాపహా
సర్వాఘౌఘ విఘట్టనీ సుసరణిర్దివ్యార్చిరాదిర్నృణాం

**27 రామసింహము - రాఘవ పట్టణం,** తా॥ జగిత్యాల నం 204 సిక్కు మతస్థుడు ఆశుకవి వీరి పద్యగేయవచన గ్రంథాలు అనేకం ముద్రితం ఈ సంచిక నాటికి ముద్రితైక కృతి విశ్వకర్మ శతకము విశ్వకర్మ శీర్షికతో అందులోనివే రెండు పద్యాలు గో క సం పుట 196లో చూపబడినవి వానిలో మొదటి పద్యమిది గో క సం లో కవిది రాఘవనగరం, నల్లగొండజిల్లా అనడం పొరపాటు

సీ ఆదరించిన వారి కపకార మొనరించి ప్రజ్ఞదెల్పుట మహా పాతకంబు
ఆపద దొలగించి యాప్తులౌ వారితో బగ బూనుటయు మహా పాతకంబు
నిజమేదొ తెలియక నిర్నిమిత్తంబుగా బరనింద జేయుట పాతకంబు
నావంటి పరిపూర్ణుదేవంక లేడని భావించుకొనుటయు బాతకంబు
గీ తగని పాపిష్టి గురుని పాదమును బట్టి భక్తులై మ్రొక్కుటయు మహా పాతకంబు
భక్త జననిందనము మహా పాతకంబు, విశ్వపాలన ధర్మ శ్రీ విశ్వకర్మ

ఈ కవి కావ్యాల వివరాలు తర్వాత చూపబడుతాయి

**28 జి రాదాకిషన్ రావు - బుట్టారెడ్డి గూడెం,** తా॥ హుజురాబాద్ నం 222 జననం తేదీ లేదు అముద్రిత రచన ఋతుసంహారము తెలుగు నేత గో క సం లోని వీరి తెలుగు కవిత అయిదు గీతాలు పు 210 "వసంత ఋతువు" కాళిదాసు ఋతుసంహారము అనువాద పద్యం ఒకటి చూడండి

గీ కొదమ తుమ్మెద గమి ధనుర్గుణము చేసి, ఫుల్ల చూతాంకురముల నమ్ములుగ జేసి
కాముకుల దెందముల జీల్పగా దలంచి, చాన ! చనుదెంచె యోజ వసంతుడదిగొ !

జి రాధాకృష్ణారావు గారు ప్రభుత్వోపాధ్యాయులుగా కరీంనగర్, ఆదిలాబాద్, వరంగల్ జిల్లాలలో పని చేశారు వీరి ముద్రిత రచనలు 1 రంగనాయక శతకము 2 శ్రీశైల మల్లేశ్వర తారావళి, 3 ఋతుసంహారము (కాళిదాసు కావ్యానికి అనువాదం), 4 సంపన్ను గృహస్థుడు (ఖండకావ్యం) ఈ వివరాలు 'క జి రచయితల చరిత్ర' లోనివి పుట 237 - వివరాలు తర్వాత

**29 గంగా లక్ష్మన్న - మంధని ,** కాలం 1900 1919, నం 230

ఇతర వివరాలు గో క సంచికలో లేవు ఈ సంకలనం 1934లో ప్రచురితమైనా లక్ష్మణకవి అంతకు ముందు వారి 20వ ఏటనే కీర్తిశేషులు పూర్తిపేరు గంగా లక్ష్మణరావు ఓవర్సీర్ ఉద్యోగం సుప్రసిద్ధ కవి గంగా రాజేశ్వరరావు గారికి ఈ కవి తండ్రి ఈ కవి వివరాలు తర్వాత

గంగా లక్ష్మణరావుగారి గో క సం లో 'మాతృభాష' పద్యాలు ఇవి
మనమీరీతిగ మాతృభాషలను సన్మానింపుచున్ వేడ్కమై
మనుపం జాలక మూల ద్రోసిన ఘనంబా యంచు జాత్యేతరుల్
మనమందక్కటికంబు దక్కి కడు పెల్చన్వారలెగ్గా డనే
మన జాలంగలనయ్య మానములు పోనై యుండగా నీయెడన్
ఆంధ్రులే తప్ప నితరులేరైన గాని, మాతృభాషను గాదని మారు భాష
నభ్యసించిరే భూలోకమందు నెందు? మానధనులార భాషాభిమానులార!
కరుణాసార పరంపరల్ చిలుకుచున్ గౌతూహలంబొప్ప శ్రీ
కరులారా ! మతి మీరు నాదరమునన్ గన్గొంచు సొంపారగా
గరమున్మాతృక యైన యాంధ్ర సుకలా కాంతామణిం బ్రోవగా
నరుదా మాతృక కీర్తికై బరగదే యాచంద్ర తారార్కమున్
మానసమునందు కడునభిమానముంచి, మనుపుడీ మీరు దయతోడ నాంధ్రభాష (యతి?)
దాన మీ గౌరవములేమి తగ్గిపోవు, కులము వెలిగాదు కీర్తియు గోలు పోదు
"మనుపుడీ మీరు దయతోడ మాతృభాష" అని కవి అని ఉండవచ్చు, ఎలాగో మారింది

**30 తిరువరంగం పాపయ్య శాస్త్రి - మంథని,** నం 238 వయస్సు 51 సం॥లు బిరుదు అష్టావధాని శ్రీ వైష్ణవులు వీరు వానమామలై జగన్నాథ వరదాచార్యుల సోదరి భర్త మంథని ప్రాంతంలో జ్యోతిష్యపండితుల సిద్ధాంతి అని, పురాణ ప్రవచనం కావించేవారిని శాస్త్రులు అనీ అంటారు అందుకే ఆచార్యులని కాక ఈ కవి పేరు చివర శాస్త్రి పదం జత చేరింది "మంథెన ద్విజులు" వీరి శీర్షిక

సీ నేపాల దేశావనీపాల సభలలో, నగ్రతాంబూలంబులందినారు
ఆదరంబొంది ఒరోడాధిపుని చేత, వర్షాశన భృతుల బడసినారు
పూనా నగర రాజధాని రారాజుచే, నగ్రహారాదుల నందినారు
గద్వాల సంస్థాన విద్వత్పరీక్షలో, మనవారలదియె పెట్టినది భిక్ష
గీ అరయ నిట్లు స్వదేశ దేశాంతరముల, స్థిర తరంబైన కీర్తినార్జించి రట్టి
వారలొకరిప్ప లేకున్కివలన కనుల, నీరు రాదొకో మంథెన్న వాసులార (యతి?)

మంథెన తమ్మి చెరువు, గోదావరీతీర గౌతమేశ్వరాలయాదుల వర్ణించిన వీరి మరొక సీసపద్యం బహుళ వ్యాప్తి పొందింది కవిత్వం చాల తక్కువ వ్రాశారు కావ్యరచన కావించలేదు వారు ప్రధానంగా పౌరాణికులు "పాపయ్యశాస్త్రి పూనా, నేపాల్, కాశ్మీరములలో సత్కారములు వడసెనని చెప్పుదురు" అని గ స రాజు 'కరీంనగర్ మండల చరిత్ర' పుట 18లో తెలిపారు

**31 చక్రహరి నారాయణ బట్టుమూర్తి - లింగంపేట,** తా॥ జగిత్యాల , నం 246 వయస్సు 20 సం లు భట్రాజు సంచికలోని వీరి కవితా శీర్షిక 'విద్య' ఒకే ఒక సీస పద్యం

సీ రారాజ చంద్రుడై రంజిల్లినను గాని విద్యాధికునె గారవించు చుంద్రు
నీచుడైనను గాని నిరుపమ పాండిత్యమునగదా సభలోన ముఖ్యుడగును
వికటరూపుండైన విద్వాంసుడగుటచే, పలువిధంబుల శ్రీల గులుకు చుండు
ధనవంతుడైలోక ధన్యుడైనను గాని, శాస్త్రజ్ఞులను చాల సన్నుతించు
గీ లౌకికంబెల్ల విద్యచే లభ్యమగును దుదకు మోక్షంబునకు నిదే తోడు పడును
విద్యయే మానవాళికి వినయమిచ్చు గాన దీనికి సాటియే గాన మెచట
అవును కదా విద్య చేతనే జనులకు విలువ హెచ్చు, ధనములన్ని విద్యాధనమునకు తచ్చు !

**32 వానమామలై జగన్నాథాచార్యులు - పోతురెడ్డిపేట,** తా॥ హుజూరాబాద్ , నం 247 జన్మస్థలం మడికొండ అముద్రిత కావ్యం - కార్పాసలక్ష్మి నాటకము

సీ తలదాచుకొనుటకై తగు నీడయును లేక, యొక చిన్న గుడిసె వారుండు వసతి
యాదాయమది ఆోళ్ళ యడుగున బడియున్న నొక కొన్ని గింజల నూడ్చి కొనుటె
భార్యయా తానొక పరమ సాధ్వీమణి, యిలు దాటి పొరుగిల్లు నెఱుగ దెపుడు
మానమ్ము గాపాడు మాత్రపు జినుగుడు, పేలికే వారికి చాల కరువు
గీ ఇట్టి కష్ట జీవనమున నేని నాథు ననదు పల్లెత్తుమాటయున్నైన నెపుడు
పతి పదార విందములె శ్రీపతి పదారవిందములటంచు లక్ష్మినా వెలసెభువిని
వరద గురు గృహలక్ష్మికార్పాస లక్ష్మి

వీరు 'రైతు రామాయణ' మహా కావ్యకర్త కార్పాసలక్ష్మి - అముద్రితం, అలభ్యం వీరి కావ్య పరిచయం తర్వాత చేయబడుతుంది (సంచికలో 'వానమామల' అన్నారు )

**33 రాజవైద్య డాక్టరు పింగళి లింబాద్రి రెడ్డి - నెమలికొండ**, నం 250, విజ్ఞాన ప్రచారిణీ గ్రంథమాల సంపాదకులు గోలకొండ కవుల సంచికలోని వీరి కవిత 'ఉష కాలము' గేయం

పరభృతావళి నదిగొ చూడుము, నిరతమును గొంతెత్తి పాడగ
తరతరంబుల రవము నొలుక, బరగుచుండె పికముల్
మెకములప్పుడు బయలు వెడలెను, మెరక చాటున డాగుకొనుచును
మెదవుగను దమయడుగు లిడుచు, మేత జాడ బట్టి
తెమ్మెరలు తమ నేర్పు జూపగ, నెమ్మితోడుత సాగదొడగెను
కమ్మగాడ్పుల కలువదప్ప, తమ్మి గానదుగా
వేడి వేలుపు జాడ కొఱకై , వేడ్కగా నా తోయరుహము
వెడలెనో యనునట్లు దోపగ, వేగుచుక్క పొడచెన్

తెలియవచ్చినంతలో ఇది ఈ జిల్లాలోని తొలి తెలుగు గేయం గురజాడ ముత్యాల సరాలు ప్రభావం ఈ కవితపై పడింది సంచికలోని మొత్తము 354 కవులలో గేయకవులిద్దరే వారిలో వీరొక్కరు రెడ్డి గారు కృతికర్త - కృతిభర్త పుస్తక ప్రచురణ కర్త వైద్య వ్యవసాయ సంబంధమైన వీరి గ్రంథాల పరిచయం ఈ అధ్యాయంలోని వచన రచయితల విభాగంలో చేయబడుతుంది

**34 వేంకటరాజన్న అవదాని - మంథని** నం 271 బిరుదు వైద్యవర వయస్సు 28 సం గో క సం లోని వీరి శీర్షిక 'నేటి ద్విజులు' రెండు పద్యాలు

సీ స్వాధ్యాయ నిరతులైవరల గాంచినవార, లక్షర శత్రువులైరి భువిని,
నిత్యాగ్ని హోత్ర సన్నిధి నుండువారలు, ధూమపానాగ్ని సంతుష్టులైరి
త్రైలోక్య గురువులై రాణ మించెడివారు, గురుమంత్రమును దామె మరపుగొనిరి
అఖిల వేదార్థ విద్యావిభూషితులిప్డు, వేద నామమునకవేద్యులైరి ॥
గీ పరహితార్థ సంపాదనా పరులు నేడు స్వార్థ సిద్ధ్యేక కార్య తత్పరులువైరి
'ఆత్మవత్సర్వ భూతాని' యనెడి వారు జనుల బీడింప నమకట్టి రనుదినంబు

తర్వాతి సీసం వీర ప్రశస్తి, బీరనింద వీరు బహుభాషావేత్త సంస్కృతాంధ్రోభయ భాషల కవి ఆంగ్ల హిందూస్థానీ భాషలరచయిత అయిన అవధాని గారి రచనల పరిచయం తర్వాత ఉంది

**35 పులిగోటి ఆనందమాంబ - కొడిమ్యాల** - తా ॥ జగిత్యాల, నం 279 వయస్సు 12 సం అష్టావధాని జాతి వెలమ గో క సం లో "స్త్రీ విద్య" వీరి కవిత

గీ విద్యయన్నను స్త్రీలకు వెగటుగల్గ, వనితలజ్ఞానులనుచును వాడుకొనుట
యబ్బురంబేమి దీపంబు నవల ద్రోయ, నున్న యింటిలో జీకటి యుండ కున్నె
ఉ కాంతలు మాతృభాష పయి గౌరవ ముంచక నన్యభాష న
శ్రాంతము నేర్చినంతటను సారము లేదిక, గొప్పయైన శ్రీ
మంతము గల్గియున్నదని మంగళ సూత్రము బారవైచి య
త్యంత సుభూషణంబులను దాల్చిన రీతిని యెంచి చూడగన్

స్త్రీ విద్యా వ్యాప్తి ఆవశ్యకతను నాటి ఘరానా స్త్రీల అన్యభాషా సంస్కృతుల వ్యామోహాన్ని ఈ బాలిక చక్కగా నిరసించారు ఈ రెండు పద్యాలలోని అలంకారాలు కవయిత్రి భావసంపత్తికి

దృష్టాంతాలు అదే సంవత్సరం 1934లో ఆనందమాంబ గారి 'సతీలలామ' పద్యకావ్యం ప్రచురింపబడింది తర్వాత మరే రచనలూ రాలేదు వరకట్న దురాచారం గురించి ఒక కావ్యం వ్రాయాలని ఉందని 92లో తెలిపారు కావ్య సమీక్ష తర్వాత ఉంది

**36 అచి వేంకటాచార్యులు - ఆవునూరు,** సం 286 జననం ఆనంద ఆషాఢశుద్ధ దశమి 1985 సుమారుగా కవి మృతి చెందారు

ఈ కవి గారి "నిజాం రాష్ట్ర విజయం" పద్యద్వయంలో మొదటిది (గో క సం 297 పుట)

శా శ్రీరంజిల్లెడు నాంధ్ర రాజ్యముల వీక్షింపంగ స్వాతంత్ర్య వి
స్తారంబందున నైక మత్యమున విద్యాభాషలందున్మహా
సారంబై యిల నన్ని రాజ్యముల మించన్ జాలు సత్సీమ యౌ
నీరాజ్యంబె యటంచు బేరుగొనె నెంతేనిం బ్రభాశాలియై

తర్వాతి పద్యంలో నిజాము రాష్ట్ర ప్రజల ప్రభుభక్తిని ఐకమత్య బంధుభావాన్ని కవి ప్రశంసించారు రాగమాల, మా ఊరు - వీరి ముద్రిత పద్యకావ్యాలు కవి వివరాలు తర్వాత చూపబడుతున్నవి

**37 గిరిధర రావు - హుజూరాబాదు** గో క స సం 299 ఆ సంచికలో వీరి ఇతర వివరాలు లేవు కవి స్వగ్రామం గుండేడు విష్ణుదాసు గిరిధర కవి పేరుతో 'వీర భద్రస్తవము' అను పద్యకావ్యం వీరిది 1931లో ముద్రణ పొందింది అందలి ఒక పద్యం ఇది

చ సుజన మనోంబుజా భువన సుందర విగ్రహవీర భద్ర ! నీ
రజదళ లోచన ద్వయ నిరంజన పండిత రంజనా , వృష
ధ్వజ, పరిపూర్ణ శక్తి మహితాయ హితా విహితా విశారదా !
నిజముగ నిన్ను నమ్మితిని నిర్మల భక్తిని నన్నుబ్రోవరా !

ఈ కవి "రాష్ట్రమాత" పద్యాలు, గో క సం పుట 310 , నుండి,

తే గీ రాజితంబగు మానిజాం రాష్ట్రమందు, నక్కడక్కడ దేశ భాషాభివృద్ధి
గాంచ గల్గెడి దివసముల్ గాననయ్యె, సాంధ్య గృహ దీపికలు వెల్గుచందముననను

గీ జీర్ణ వస్త్రంబుతోడ సజీవ మగుచు బుత్ర గర్వితవై చాల బొక్కుచకట
ఈ నిజాం రాష్ట్రమందతి హీనమగుచు, దిరుగకుమురోత నీవింక దేశమాత

శా నీ పుత్రుల్ బలవంతులాఢ్యులు మహానీతిజ్ఞులైనార లే
లోపంబున్నను దీర్చునేర్పరులు బొల్పున్ దు ఖమున్ జెందినా
పాపంబంచు దలంపబోకు జననీ భద్రంబు చేకూరు నీ
ప్రాపేమాకని నమ్మియుంటిమిక నీ భాగ్యంబు సామాన్యమే

**38 గోవిందుల కృష్ణమాచార్యులు - బండలింగాపురం** సం 307 వయస్సు 18 సంవత్సరాలు వారి పుత్రులు కూడా నలుబదేండ్ల క్రితమే కీర్తిశేషులైనారని కవి పౌత్రిభర్త చిలుకమర్తి లక్ష్మణాచార్యులు (కొరుట్ల) తక్కళ్ళపెల్లి, వ 60, చెప్పారు కవి రచనలేవీ లభించలేదు కృష్ణమాచార్యులు 1970 సుమారుగా కీర్తిశేషులైనారు గో క సం కవిత "కవిత" రెండే శ్లోకాలు అవి ఇవి

శ్లో సుదతీవ రతి ప్రవర్ధనే కమలేవార్థచయ ప్రదాయినీ
విమలా సురనిమ్నగా యథా భవతీయం కవితామ తల్లికా

శ్లో సుకవితా వశగాయది సర్వదా వితమతే తను సౌఖ్యమివాబలా
నవశగా యదిమారభవాందశాం దిశతి జాగర తాకృశతాదికాం

**39 సేనాపతి నరసింహాచార్యులు - కోరుట్ల** నం 308 జననం చిత్రభాను విశిష్టాద్వైతమతం

సేనాపతి నరసింహాచార్యులు రామాజుల జన్మస్థానమైన శ్రీ పెరుంబుదూరులో తర్కవ్యాకరణ వేదాంతములు చదువుకున్నారు అక్కడి ప్ర ఉ కుండలం వేంకట నరసింహాచార్యులు గారి ఆనతిచే కొరుట్లలో 1923 రుధిరోద్గారి సం॥ వైశాఖమున వేదాంతద్వయవర్ధినీ సంస్కృత పాఠశాలను స్థాపించి వేణుగోపాలాలయమును నిర్మించి బడిని గుడిని ఉత్సవాదులతో వైభవంగా నడిపారు పిఠాపురం రాజాస్థాన పండిత సన్మానము పొందారు వీరు సంస్కృత పండితులు కవి , రాజయోగి కీర్తిశేషులు

వారి 'ఆంధ్రము' (గో క సంచిక) శీర్షిక మూడు పద్యాల్లో రెండు పద్యాలు చూడండి

ప్రకృతి జగంబునందఖిల భాషలకెల్లను సంస్కృతంబు త
ద్వికృతియు నాంధ్రభాష కడువీనుల విందగు దాని కన్న ని
ర్వికృతిక నున్న పైడి జన విశ్రుతలత కీర్తి దిగంత మొందినన్
సుకృత సుభూషణావళుల జూచిన సంతస మొందరే జనుల్ 1

సదయ హృదబ్జ సంస్కృతమ సర్వ కళాంచితురాలవుండ ద్వ
త్పద యుగళాశ్రితాంధ్రకృతి పండిత పామర రంజనీయమౌ
నది హితమయ్యె బార్వణ సుధాకరునిన్ నుతియింప రెప్పుడున్
విదియన బుట్టు చంద్రికకు వేయి జనంబులు మ్రొక్కుకుందురే 3

సంస్కృతం ప్రకృతి ఆంధ్రము దానికి వికృతి అని కవిభావం శ్రీ వైష్ణవులకు తమిళభాష ప్రియమైనా తెలుగు ద్రవిడ భాషాజన్యమనువాదం ఈ కవి గారు వినలేదో విన్నా ఒప్పుకొనలేదో చివరి పద్యంలో సంస్కృతం పూర్ణిమా చంద్రుడు, తెలుగు విదియ చంద్రరేఖ అన్నారు పున్నమి రేవెలుగు కంటే కొత్త నెలవంక ఆరాధనీయమైన దనడం కవిగారికి మాతృభాషపై కల అభిమానానికి నిదర్శనం వీరు సంస్కృత గ్రంథత్రయ కర్తలు

**40 కొండపాక నారాయణచార్యులు - దేశాయిపేట,** తా॥ హుజురాబాద్ నం 322 మరణం - 1336 ఫసలీ, విశ్వబ్రాహ్మణులు వీరి కృతి "బ్రహ్మానంద లీలాకరము" వివిధ దేవీ దేవతల స్తుతి కీర్తనల సంపుటి ముద్రితం ఈ సంచికలోని 'నుతి' పద్యములివి

శా ఓంకారాలయునిన్ జగజ్జరునిన్ వ్యోమాది భూతాంగునిన్
సంకాశస్థితి లీన రూపుని సదా సచ్చిత్కళా భాసునిన్
సంకల్పాది వికార శూన్యుని విలక్ష్యబ్రహ్మము న్నిర్గతా
హంకారాత్ముడనై స్మరించెదను సోహం సోహమంచక్షరుల్

ఉ భావమునందునీదు పద భక్తి వహించిన ధన్యులెల్ల స
త్పావనులైరటంచు మును బ్రాజ్ఞులు దెల్ప గ్రహించి నిత్య సం
జీవుడవంచునమ్మి, నుతి జేయుచునుంటి ననంత వేదనన్
సేవిత నిశ్చలాత్మ దయజేసి నను నుద్ధరి జేర్పరాగదే

**41 వటపురి వేంకటాచార్యులు - కంది కట్కూరు,** తా ॥ సిరిసిల్ల, నం 329, మరే వివరాలు లేవు ఈ దిగువ పద్యాలు 'గో క సం 'శ్రీరామ చంద్రప్రభో' లోనివి పుట 335

భూనాథోత్తమ వార్ధిబంధన లసద్భోగీశ పర్యంక య
జ్ఞానాంభోనిధి హవ్యవాహన విభాస్వత్కీర్తి ధౌరేయ వి
జ్ఞానోపేత దశాస్యభంజన సదా శాంతాత్మ కంజాక్ష బ్ర
హ్మానందాబ్ధి విహార కంబుగళదేవా రామచంద్రప్రభో

పతి శాపంబున నాతి రాతిగతి దుర్వారోగ్ర కాంతార మం
దతి శోసిల్లుచు వేల వర్షములు దు ఖాక్రాంత చిత్తంబుతో
గతి లేకన్ బడియుండ జూచి మదిలో గారుణ్యతన్ బూనుటన్
మతి నూహింపగ జోద్యమున్ గలిగె దేవారామచంద్ర ప్రభో

వీరి ముద్రితా ముద్రిత పుస్తకాల పరిచయం తర్వాత చేయబడుతుంది

**42 వానమామలై లక్ష్మణాచార్యులు - కుందనపల్లి,** తా॥ పెద్దపల్లి నం 349 జన్మస్థలం మడికొండ ముద్రిత రచన ప్రణయాభిజ్ఞానము గో క సం కవిత 'చెలీ' రెండు పద్యాల్లో మొదటిది చూడండి

కొమ్మను వంచెదేలనె నికుంజము నందలి ముండ్లు గ్రుచ్చగా
గొమ్మరొ పూవు దేనియల గ్రోలెడు తుమ్మెద ఝుమ్ము ఝుమ్మనన్
గమ్మని వాసనల్గొనగ గాంక్ష యొకించుక గల్గుగాకదా
నిమ్మఫలంబు జీల్చు శుకనిష్ఠను గాంచరుచించునే చెలీ !

లక్ష్మణాచార్యులు సంస్కృతాంధ్ర కవి వీరి కృతుల వివరాలు తర్వాత చూపబడుతాయి గోలకొండ సంచికలోని కవులను సంపాదకులు జిల్లాలవారీగా, కులాల మతాలవారీగా లెక్కించి చూపారు అది సామాజిక విద్యాస్థాయి తెలుసుకోవడానికి చేసిన ప్రయత్నం అది ప్రస్తుతం అత్యవసరమనిపించదు కాని, నాటి ఈ మండల విద్యాసాహిత్య వ్యాప్తి ఏయే వర్గాల్లో ఏ స్థాయిలో జరిగిందో తెలుసుకోవడానికి ఉపకరిస్తుంది కనుక, ఆ సంచికలోని ఈ జిల్లా కవుల కులమత వివరాలు ఇక్కడ చూపబడుతున్నవి

గో క సం లోని కరీంనగర్ జిల్లా కవుల మొత్తము 42 వారి జాతి మత వివరాలివి

| | | | |
|---|---|---|---|
| శ్రీ వైష్ణవ కవులు - 21, | నియోగులు 3 | బ్రాహ్మణులు 5 | |
| ఆరాధ్యవిప్రులు 1 | సాతానులు 1 | భట్రాజులు 3 | |
| వెలమలు - 2 | రెడ్లు - 1 | విశ్వబ్రాహ్మణులు 1 | |
| కుమ్మరి 1 | సిఖ్ఖు - 1 | క్రైస్తవ - 1 | కులం? 1 |

శ్రీ వైష్ణవులు, సాతానులు, భట్రాజులు, రెడ్లు, రావులు శ్రీ వైష్ణవ మతాభిమానులే కాబట్టి అప్పుడు విష్ణుభక్తి ఉచ్ఛదశలో ఉందని భావించవచ్చు ఒకే ఒక ఆరాధ్య విప్ర కవి ఉండడం శైవం తగ్గుముఖంలో ఉందనడానికి నిదర్శనం బ్రాహ్మణులు శివకేశవ భేదం పాటించని స్మార్తులైనా వారిని శివభక్తులుగానే పరిగణించవచ్చు

బ్రాహ్మణులో భట్టులో పురోహిత జాతి వర్గం వారు, ఇంకా పెత్తందార్లు నాడు విద్యా వైదుష్యాలు సంపాదించి కవిత్వ రచన కావించారనుకోవాలి ముస్లింలు తెలుగు భాషాసాహిత్యాల ఆదరించలేదు క్రైస్తవ కవి మతాంతరీకరణ పొందిన హిందువు అదీ ఇతర జిల్లా నుండి మతప్రచారకునిగా వచ్చిన వ్యక్తి సిఖ్ఖు కవిది క్షత్రియజాతి ఇక మిగిలిన ముగ్గురిలో ఒకరు విశ్వబ్రాహ్మణకవి, ఒక శాలివాహనకవి కేవలం ముగ్గురు మాత్రమే శ్రామికవర్గం కవులు వారు సైతం పండితులు కారు వర కవులు

గో క సం లో ఉన్నా లేకున్నా ముందు సూచించినట్లుగా ఈ అర్ధ శతాబ్ది రచయితలు పద్య యక్ష గాన మధుర వేదాంత - వచన వాఙ్మయ విభాగాలలో చూపబడుతున్నారు

పద్య సాహిత్యం సృజించిన కవులు ఈ క్రింది వారు ఈ గ్రంధ రచనారంభ కాలంలో (1990)
* గుర్తుగల 5 గురు సజీవులు ముద్రణ కాలం (1997)లో అందరూ కీర్తిశేషులే

## I పద్య సాహిత్యం :

1 గంగా లక్ష్మణరావు, 2 వానమామలై లక్ష్మణాచార్యులు, 3 రామసింహకవి, 4 పరమారాధ్యుల రాజయ్య, 5 ఘటబ్రహ్మ సిద్ధప్ప వరకవి, 6 మాధవరావు బలరామదాసు, 7 సిరిశెనహళ్ కృష్ణమాచార్య శతావధాని *, 8 దివిలె భట్టు నరసింహరాజు, 9 విష్ణుదాస గిరిధర కవి, 10 ఎదులాపురం నరసింహాచార్యులు, 11 ఆనందమాంబ *, 12 కమరం వేంకట రామానుజం, 13 ఆనందయ్య, 14 సముద్రాల రామానుజాచార్యులు, 15 గడియారం విశ్వనాథశర్మ, 16 వానమామలై వేంకటాచార్యులు *, 17 వేంకట రాజన్న అవధాని *, 18 వానమామలై జగన్నాథాచార్యులు, 19 ధప్పూరి సత్యనారాయణాచార్యులు , 20 గొట్టుముక్కల రాధాకృష్ణరావు, 21 ఆధి వేంకటాచార్యులు, 22 వటపురి వేంకట నృసింహాచార్యులు, 23 వెలిచాల కేశవరావు, 24 వి రాం గోపాలరావు, 25 ఆధి వేంకట నరసింహాచార్య, 26 మామిడిపల్లి సాంబశివశర్మ, 27 గాలిపల్లి సుబ్బయాచారి, 28 మాదాపురం రామమూర్తి, 29 జంగిడి నారాయణ *, 30 రావుల దశరధం 31 తిరునగరి వేంకటేశ్వర్లు, 32 పురుషోత్తమ దాసు, 33 చె జగన్నాధ రావు

### I **గంగా లక్ష్మణరావు[1] - మంథని,** 1900 - 1919

గంగా లక్ష్మన్న అని గోలకొండ కవుల సంచికలో (నం 230) పేర్కొనబడిన విద్వత్కవి మంథని వాస్తవ్యులైన గంగా లక్ష్మణరావు గారు వీరి పుత్రుడే గంగా రాజేశ్వర కవి లక్ష్మణరావు గారు జీవించింది కేవలం ఇరువదేండ్లు చదివింది ఆంగ్లమాధ్యమంలో మిడిల్ క్లాసు చేపట్టింది ఓవర్సీర్ ప్రభుత్వోద్యోగం అత్యల్ప జీవిత కాలంలోనే సంస్కృతాంధ్ర భాషల్లో పాండిత్యాన్ని సముపార్జించుకున్నారు గద్య పద్య నాటక రచనలతో విశేష ఖ్యాతిని గడించారు లక్ష్మణరాయ కవి

వీరి రచనలు 1 రత్నకాంత నాటకము (ముద్రితం), 2 కుచేలు చరిత్రము హరికధ (ముద్రితం) 3 దండకారణ్య చరిత్ర కావ్యము 4 శ్రీకృష్ణదేవరాయ చరిత్ర నాటకము (అలభ్యాలు)

**కవి పరిచయం** గంగా రాజేశ్వరరావు గారు రత్నకాంత నాటకం మున్నుడిలో తమ తండ్రి గారిని గూర్చి ఇట్లా వ్రాశారు [2] "వారు నాటకములు రచించుటయే గాక కంపెనీ నాటకములలో స్త్రీ పాత్రలు ధరించేవారు 'ఇంపు మీరగను హిందూ థియేటర్ కంపనికిని శుభకరమైతివి' అని కుచేలు చరిత్ర హరికధలో సరస్వతీ ప్రార్థనా కీర్తనలోని వాక్యము వారు హరి కథా రచనతో పాటు కథా కధనము గూడా చేసెడివారు సాహిత్య సంగీతములందేగాక చిత్ర కళాది హస్త కళలలో సిద్ధహస్తులు వీరి వ్రాత యింపులు సొంపులు గులుకుచు ముత్యాలు గూర్చినట్లు పొంకముగా నుండును"

ఈ కొడుకు పుట్టిన సంవత్సరమే కవి కన్ను మూశారు ఇవి కర్ణాకర్ణిగా విని, వ్రాత ప్రతులు కనీ, రాసిన అంశములు ఇరువదేండ్ల ప్రాయములోనే వారు ఇంతటి కళాసాహిత్య వైదుష్యాలు సాధించడం విశేషం లక్ష్మణరావు గారి ప్రాథమిక విద్యాభ్యాసం మంథనిలో మాధ్యమిక విద్య కరీంనగర్‌లో జరిగింది ఓవర్సియర్ కోర్సు భాగ్యనగరంలో చదివారు ఆ కాలంలో శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయ గ్రంథాలయ కార్యక్రమాల్లో వీరు చురుకుగా పాల్గొనేవారు అక్కడ సురవరం, మాడపాటి మొ॥ పెద్దల సాంగత్యంలో ఆయన సాహిత్యం ప్రవర్ధమానమైంది

---

1 ఈ కవి వివరాలన్నీ వారి పుత్రులు గంగారాజేశ్వరరావుగారు రత్నకాంత నాటక పీఠికలో పొందుపరిచారు సెప్టెంబర్ 92లో వారు మంథనిలో నాతో స్వయంగా ముచ్చటించారు

2 రత్నాకాంత నాటకము - 1988 పీఠిక-పుట 19

**రచనల విశేషాలు** **రత్నకాంత నాటకం** ఇది పూర్తి ఆలంకారికుల నాటక లక్షణాల ననుసరించి రచింపబడిన నాటక రాజం అంకములు ఆరు ప్రతి అంకం నాలుగైదు రంగాలుగా పునర్విభక్తమైంది భాష గ్రాంధికం ఇతివృత్తం కాల్పనికం రాజుల కథ సంస్కృత రూపకాలలో వలె ఇది పద్య గద్య సంకలితం ఇందులో కేవలం నాలుగు అంకములే లక్ష్మణరాయ కవిచే విరచితం మిగతా రెండు అంకాలను కవి కుమారుడైన రాజేశ్వరరావు గారు పూరించి 1988లో దానిని పుస్తకంగా ప్రచురించారు పుటలు 208 ప్రతులు 500 మాత్రమే

నాటక నాంది పద్యం

చ ఒకట గవీంద్రులున్ రసికులొక్కట గానకళా ధురీణులొం
డొకట మనీషు లొక్కట మరొక్కట నీశ్వర భక్తియుక్తులిం
కొకట వణిక్కులొక్కట సమార్జిత విక్రమ చక్రవర్తులు
త్సుకత గృపా రసాంచితపు చూపులు నాపయి జూపు చుండగన్

మచ్చునకు గద్యం "నవలా ! ఈ నవరస రసిక శిఖామణులు సుఖాసీనులై వినోదార్థంబు మనోహరంబుగా మదికి ముదము గదుర జేయ మహనీయ శృంగార రసరంగద్రంగ సంగ పాటవంబగు నొక నవీన నాటకంబు నుద్యమించి, హృద్యానవద్యంబు నొందింపుమని, రెండుమాటలన్న నోటాడి యెరుంగని నన్నిందులో నొక మేటిగా భావించి యానతిచ్చినారు " ఈ నాటకం ప్రదర్శింపబడలేదు ఇందలి భాషా సాహిత్య కథానిర్వహణములు ఆసక్తిగా చదివించేవిగా ఉన్నాయి

**కుచేలు చరిత్రము** కుచేలుడు శ్రీకృష్ణుని బాల్యసఖుడు సంసార జీవితంలో ధనదరిద్రుడు కనుక కుచేలుడు కృష్ణకరుణ పొందిన పిదప సుధాముడైన వాడు ! హరికథల ప్రాదుర్భావ వికాసాలు పందొమ్మిదవ శతాబ్దిలోనే లక్ష్మణరావు గారి కుచేలు చరిత్ర ఇరువదవ శతాబ్ది మొదటి పాదం లోనిది 1915 సుమారుగా కవి దీనిని రచించి ఉంటారు ఈ కవి పన్నెండేండ్ల వయసులోనే పద్య రచన కావించినారనడానికి ధర్మవరం వారికి సమర్పించిన ప్రశంసాపద్యాలు సాక్ష్యం అవి తర్వాత చూపబడతాయి ఈ కుచేలు చరిత్ర పూర్వ హరికథల వలె గద్య పద్యాలు దరువులు తొహరలు కలిగిఉంది వచనాలు పెద్దవి పుటలు 21 ఇది రత్నకాంత నాటకంతో చేర్చి 1988లో ముద్రింపబడింది

మిగతా రెండు కృతులు లభించలేదు ఈ రచనల గూర్చి మంధని వాస్తవ్యులు ప్రముఖ రచయిత వేంకట రాజన్న అవధాని గారు ఇట్లా అన్నారు " కీ శే లక్ష్మణకవి గారు రచించిన శ్రీకృష్ణదేవరాయల నాటకము, దండకారణ్య చరిత్ర వ్రాత ప్రతులు శ్రీ మాడపాటి హనుమంతరావుగారికి ముద్రణ కొరకు సమర్పింపగా అవి ముద్రణకు నోచుకోకపోగా, అసలు లభ్యమే కాకుండా పోవడం[3] " జరిగింది రచనా విశేషాలు అడిగితే అవధాని గారు స్మృతిలో లేవన్నారు ఆ వ్రాత ప్రతులు ఇచ్చిన తిరువరంగం పాపయ్య శాస్త్రి కీర్తిశేషులు గంగా రాజేశ్వర కవి వాటిని చూడనైనా లేదట అవి అలభ్యములైనా రచనల పేర్లయినా లభించినందుకు సంతృప్తిపడాలి

లక్ష్మణరాయ విరచితాలైన మరి రెండు పద్య ఖండికలు రత్నకాంత నాటకాంతమున అనుబంధములో కనిపించుతున్నవి ఒకటి 'శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయం - భాగ్యనగరం' వారి వార్షికోత్సవ సభలో ధర్మవరం కృష్ణమాచార్యుల సన్మాన సందర్భంలో చదివిన 'స్వాగత పంచరత్నములు' రెండు - గోలకొండ కవుల సంచికలో 'మాతృభాష' శీర్షికతో ప్రచురించబడిన నాలుగు పద్యాలు అవి

3 రత్నకాంత నాటకము పీఠిక పుట 15 16

ముందే చూపబడినవి కవి నం 29 'ఆంధ్ర నాటక పితామహ' ధర్మవరం రామకృష్ణమాచార్యులకు సమర్పించిన పంచరత్నాలలో రెండు పద్యాలివి [4]

మ సరసీజాత సుగంధవాయువులు ప్రాంచన్మల్లి కానేకపు
స్ఫురజో జృంభిత మారుతంబులు లసత్ సత్యాది చంద్రాననా
కర చామీకర చామరాకరము లేకంబై తనుం గారవిం
పరహిన్ బత్నుల తోడ గూడి యమునా ప్రాంతోజ్జ్వలారామమం
దిర సంచారములం బొనర్చు హరి శ్రీదేవుండు మిమ్మేలుతన్
నిరవద్యప్రతిభాప్త చారుతర వాణీ రామకృష్ణాగ్రణీ

ఉ ఆర్యుడు సత్కవిత్వ మహిమాంచితుడిద్ధ యశో విశాలుడా
చార్య సమేతు డాఢ్యుడల ధర్మవరాన్వయ రామకృష్ణమా
చార్యుడనంగ గర్ణముల జల్లగ వింటిమి చూడ మెప్ప ధీ
వర్య ! మిముం గనం గలుగు భాగ్యమునున్ లభియించె నిత్తరిన్

శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయ స్థాపన 1901లో [5] అప్పటికి లక్ష్మణరావు గారికి ఒక్క ఏడాది వయసు ధర్మవరం రామకృష్ణమాచార్యుల జీవిత కాలం 1853 - 1912 [6] కవి విద్యార్థి దశ 11, 12 సం వయస్సులో రచించినవీ పద్యాలు అల్పవయస్కులు కాకపోతే తమ అనల్పకవితా శక్తితో మరెన్ని మంచి కావ్యాలు వెలయించే వారో లక్ష్మణరాయ కవి గారు !

**2 వానమామలై లక్ష్మణాచార్యులు - కుందనపల్లి,** తా॥ పెద్దపల్లి, 1902 1964 సుమారు

వానమామలై కవి సోదరులలో లక్ష్మణాచార్యులు ద్వితీయులు సంస్కృతాంధ్ర తమిళ విద్యా వైదుష్యాలలో అద్వితీయులు ఆయన తండ్రి బక్కయ్య శాస్త్రి తల్లి సీతమ్మ తమ్ములు జగన్నాథ వరదాచార్య కవులు అన్న వేంకటాచార్యులు జన్మస్థానం మడికొండ కరీంనగర్ జిల్లా పెద్దపల్లి తాలూకాలో వైష్ణవాగ్రహార గ్రామమైన కుందనపల్లిలో స్థిరపడ్డారు మహారాష్ట్ర సిరివంచ ప్రాంతపు ఆహిరి రాజాస్థాన పండితులుగా లక్ష్మణాచార్యులు సన్మానాలందారు కోయభాషకు లిపి సాహిత్యాల రూపొందించారు సంస్కృత కౌన్సిల్ ఏర్పాటు చేసిన పెద్దపల్లి విద్యాలయంలో అధ్యాపకులుగా 1960 సుమారుగా పని చేశారు ఆ గురువుగారిని శిష్యులు ఇప్పటికీ ఘనంగా చెప్పుకుంటారు తర్కవ్యాకరణ పండితులైన ఈ కవి అష్టావధాని శ్రీపాద కృష్ణమూర్తి గారితో కలిసి కొంతకాలం దేశ సంచారం కావించారు

**కవి వంశ వంశాదులు :** నారాయణప్ప, సింగారార్యుడు, లక్ష్మణాచార్యుడు, వెంకయ్యశాస్త్రి, బక్కయ్య శాస్త్రి వరుసగా వీరి వంశపూర్వులు బక్కయ గారి సంతానం 1 వేంకటాచార్యులు 2 కృష్ణమ్మ 3 లక్ష్మణాచార్యులు 4 అండమ్మ 5 జగన్నాథాచార్యులు 6 వరదాచార్యులు [7]

వీరిది కవి పండిత వంశం కవి గారి తండ్రి బక్కయ్య శాస్త్రి పేరుమోసిన పౌరాణికులు తాత తర్కవ్యాకరణ పండితులు వీరు మొదట వైదిక బ్రాహ్మణులు అప్పటి గృహనామం వాసాలమఱ్ఱి వారు నారాయణప్ప గారు శ్రీ వైష్ణవ మతం స్వీకరించి వానమామలై వారైనారు వీరిది భరద్వాజ గోత్రం

---

4 రత్నకాంత నాటకము అనుబంధము-పుట-22

5 రేపాల నరసింహరాయలుగారి 'సజీవ కిరణాలు' 1993 పుట-15

6 శ్రీనివాస చక్రవర్తిగారి 'తెలుగు నాటక కవులు' 1966 శీర్షిక-4

7 వానమామలై వరదాచార్యులు 'పోతన చరిత్రము' 1966, పీఠిక 77 వ పద్యం

అపస్తంభసూత్రం వీరి పూర్వులు ఆదిలాబాద్ జిల్లాలోని చెన్నూరు వారు అప్పుడది కరీంనగరం మండలంలోనిదే బక్కయ్యశాస్త్రి వరంగల్ జిల్లాలోని మడికొండకు వెళ్ళారు ఆ తర్వాత వారి పెద్ద కొడుకులు ముగ్గురు కరీంనగర్ జిల్లాలోనే స్థిరపడినారు

లక్ష్మణాచార్యుల వయస్సు ఎవరూ సరిగా చెప్పలేకపోయారు వారు 1964 - 65 సం లో కీర్తిశేషులు 1920 సుమారుగా రచనలు కావించిన, వెలువరించిన ఆధారాలున్నవి వారి జననం వారి సోదరుల జన్మతేదీని బట్టి అంచనా వేయబడింది లక్ష్మణాచార్యుల కనిష్ట సోదరులైన వరదాచార్యుల జన్మ సంవత్సరం 1912 వారికీ వీరికీ నడుమ ఒక సోదరి ఒక సోదరుడున్నారు [1] కావున లక్ష్మణాచార్యులు వరదాచార్యులకంటే ఓ పదేండ్లు పెద్దవారై ఉంటారు అందుచేత కవి జన్మ సంవత్సరం దాదాపు 1902 అనుకోవచ్చు ఉభయ భాషా కవితా విశారదులైన లక్ష్మణాచార్యుల రచనలివి

**తెలుగులో** 1 భక్తితత్వము (ఖండకావ్యం), 2 విరహ ప్రేమ (ఖండకావ్యం), 3 ప్రకృతి రాగం (ఖండకావ్యం), 4 ప్రణయాభిజ్ఞానం (ఖండకావ్యం),5 సతీ అనసూయ (పద్యకావ్యం), 6 తిక్కన చరిత్ర (పద్యకావ్యం)

7 ఆత్మసౌఖ్యం (1921)

**సంస్కృతంలో** 1 స్తుతిత్రయీ, 2 సంస్కృతి (నవల), 3 పతిసంజీవని (నాటకం) 4 రామాశ్వమేధం (నాటకం), 6 ఆముక్తమాల్యద (నాటకం), 7 లౌకిక శిక్ష (వ్యాకరణ సూత్ర గ్రంధం)

**హిందీలో** 1 రామాయణ్‌కే భక్తి (ఖండ కావ్యం)

పై పుస్తకాలలో లిస్టు 'తెలుగు అకాడమీ' హైదరాబాద్ వారు ప్రచురించిన 'తెలుగు సాహిత్యకోశం' లోనివి [2] కవి గారి శిష్యులు చెప్పిన వానిలో విరహ ప్రేమ, ఆత్మసౌఖ్యం, సూత్రత్రయీ, రామాశ్వమేధ ఆముక్తమాల్యద నాటకాల పేర్లు లేవు [3] కవి సోదరులు జగన్నాధాచార్యులు ఇందులో సగం పేర్లే చెప్పగలిగారు గో క సం కవి సం 349 వీరి పరిచయంలో కేవలం 'ప్రణయాభిజ్ఞానం' ఒక్క కృతినే ముద్రిత రచనగా పేర్కొన్నారు పు 386

**రచనల వివరాలు :** తెలుగు పుస్తకాలలో ఖండకావ్యాలు ముద్రితమైనాయని కవి శిష్యులున్నారు [4] కాని, ఏ ఒక్క కృతినీ వారు దాటి ఉంచలేదు గురువు గారి కవిత్వాన్ని ప్రశంసించినా కనీసం ఒక పద్యమైనా పూర్తిగా వినిపించలేకపోయారు కవి వివరాలు అభిరుచులు మాత్రం భక్తిగా ఆసక్తిగా తెలియజేశారు లక్ష్మణాచార్యులకు చిరుకావ్యాలంటే ఇష్టమట వారివన్నీ లఘుకృతులే మానవ ప్రకృతి సంబంధమైనవి అనసూయ ఒక్కటే పురాణ కథ 'తిక్కనకవి' 1500 పద్యాల మహాకావ్యం ఇది ఒక్కటే అముద్రితమన్నారు దాని వ్రాత ప్రతి లభించలేదు

అయిదారు ఆంధ్ర కావ్యాలు ముద్రించినా లభించినది కేవలం ఒకే ఒక్క లఘుపద్య కృతి 'తత్వం'[5] దీనిని 1922లో ఇనుగుర్తి వారు ప్రచురించారు క్రౌను 1/32 సైజులో 32 పుటలు అందులో

---

1 డా॥ అందె వేంకటరాజము 'వానమామలై వరదాచార్యులవారి కృతులు అనుశీలనము' 1986, పు 3

2 తెలుగు సాహిత్య కోశం 1986 ముద్రణ, పుట 825

3 చెప్యాల రామకృష్ణారావు, మేడిపల్లి, మల్లావజ్జల రామచంద్రశర్మ, మ బాలకృష్ణారావు పెద్దపల్లి

4 సుప్రసిద్ధ పురాచరిత్ర పరిశోధకులు రచయిత రాకూరు రాజారాంసింగ్ పెద్దపల్లిగారు వారి తండ్రి కీ శే నారాయణసింగ్‌గారు భద్రపరచిన ఈ పుస్తకాన్నిచ్చారు

5 కందుకూరి వారి బ్రహ్మసమాజ ప్రభావమా అనిపించుతుంది కాని, కాదు

11 పుటలు కృతిపతి వర్ణన మిగిలిన 21 పుటల్లో 72 గీత పద్యపాదాలలో 'తత్వం' కావ్యేతి వృత్తం నిబద్ధింపబడింది ఇదే కవి రచనల పట్టికలోని భక్తితత్వ ఖండ కావ్యం కాబోలు [6] ఇది కధ కాదు కవి భావ ప్రవంతి మత సమైక్యతావాదం ఈ ప్రాంత రచనలలో ఇది వినూతన మార్గం ప్రయోజనకర కార్యం కావ్యం ఈ జిల్లా ముద్రిత పుస్తకాలలో వానమామలై లక్ష్మణాచార్యుల తత్వం మొట్టమొదటిది ఇది 1922 ప్రచురణ 1921లో ముద్రించబడినదని పైన చూపబడిన ఆత్మసౌఖ్యం కూడా ఈ కవి విరచితము కాని దాని ప్రతి లభించలేదు 'తత్వం' కృతిని కవి ఏ ఆశయంతో రచించారో అనేది దాని 'మున్నుడి' లోని కవి అభిప్రాయాలు తెలియజేస్తాయి

"అధునాతన ప్రాపంచిక మత వైషమ్యం వలన నరులొండొరులకు సహాయము జేసికొనకున్నను సరియే కాని వృధా శాత్రవంబు బూసికొని సాంఘిక కార్యముల జెడగొట్టు కొనుట జూడ కడుంగడు విస్మయావహంబు కాన బ్రహ్మారాధనంబున విశ్వరూప బ్రహ్మారాధనంబనియు [6] భవభూతి కవి 'లోకస్యారాధన వ్రతం, తత్పూజితం హితా తేన మాంచ ప్రాణముంచతా' అని రామునిచేత చెప్పించినట్లు [7]మహాపురుషుల కెల్లరకును నిది పవిత్ర కరంబును నీశ్వర ప్రీతికరంబును నగు వ్రతము ఈ వ్రతంబు సర్వంబును అనగా ప్రాణముల గూడా విడిచి యాచరించదగిన దగును కార్య ఘాతుకంబులు, ద్వేషము పరమదోషము కాన వీనిని విడువవలయును పరశ్రేయోభిలాషులై మనుచు పరమ పదంబును గాంచుటయే ననవచ్చును "ఇది కవి ఆకాంక్ష ఇక్కడ గ్రంధ కర్త అనుటకు బదులుగా గ్రంధప్రమాత అను నూతన పదాన్ని ప్రయోగించారు రచయిత ఈ కృతి ముఖపత్రనామం Tatwam అని లోపలి పుటలలో Preface, Dedication అని ఆంగ్ల పదాలుండడం విశేషం

వివిధ ఛందోభావ విన్యాసంతో సాగిన గుండవరం నర్సింగారావు కావ్య స్వీకర్త వర్ణనం ఉన్నతంగా ఉంది కావ్య భాగవంతా తేటగీతాలు తత్వం కావ్య కవితారసా స్వాదనమునకు అందలి కొన్ని పంక్తులు చూపబడుతున్నవి

"తర్కమను భవ సిద్ధమో ? తర్క సిద్ధ, మనుభవమొ ? యుభయాధారమైన దేదొ ?
శబ్దమునకు ప్రవృత్తి పంచ విషయములు, నట్లుగాని నద్దాని నేమన వలయునొ ?
సత్పదార్థమునకు భావ నరణి కలదొ ? యెన్నడు నసత్తునకు భావమున్నె ? కాని,
కాల గతి నామ, రూప, గుణాలు మాటి, తత్వ నిశ్చయంబెవ్వరి తరముగాదు "

కవి శాస్త్రవైదుష్యానికి నిదర్శనంగా ఇట్లా వేదాంత విషయ వివరణ సాగింది
"అస్తి యెన్నాళ్ళనుండి ? యంచడుగ వలదు " అని కవి వాక్కు
"శ్రుతి విడిచియు ప్రత్యక్ష శూన్యమైన బ్రహ్మ లేదని నాస్తిక వాది పలుక"
"లేని దానికి నామమే లీల గలుగు?" అని అస్తికవాది ప్రశ్న

నాస్తిక వాది ఖండన, ఆస్తిక వాది సమర్థన, ఇట్లా వైదిక, అద్వైత, విశిష్టాద్వైత, హరిహర, శాక్తేయ, సారస్వతేయ, వాదాల చర్చలు నడిచాయి ఇది గహన వేదాంత విషయ విశ్లేషణ లోతుగా ఆలోచిస్తే కాని అర్థం కాదు కవి ప్రతిభ, పదసారళ్యం, కవన చాతురి పరితులకు మేలు చేశాయి

ఈ కావ్యంలో యజ్ఞకర్మలను ప్రశంసించే బ్రాహ్మణులకు, ఆ జీవహింసను నిరసించే బౌద్ధుల మధ్య వాదం ఉంది అందులో నాస్తిక భావ ప్రవేశం అంతటితో ఆగక క్రైస్తవ సిఖ్ఖు ముస్లిం పాత్రల ప్రవేశం జరిగింది వారి పరస్పర విజిగీష వితండ వాదాలు ఒక తీరాన్ని చేరక ముందే కవి రంగప్రవేశం కావించి ఇట్లా సందేశాన్ని అందించారు

---

6 గో క సం 1934, పు 346

"ప్రకృతి నానా ప్రకారమై పరగు చుంట, యరయ నొకడు గమ్యస్థాన మగుట వేష
భాషలును నట్టులే మత భావములును, భిన్నములయిన నొక్కటే భావమగును (యతి ?)
పర సమృద్ధియు మఱి పరోపకృతి యటులె, భూత తృప్తి శాంతి యహింస బుద్ధి యోగ
మే రుచింపని దరయనేదేని వృధయ, సమత దేశ భక్తి యు లేని జనుని యట్లు "
కవి విశాల భావం స్పష్టం ఇంకా వారు తమ ఆకాంక్షనిట్లా వాకృచ్చారు
"స్వార్థపరతా పరిత్యాగి సంఘ శక్తి, ననుసరించి జాతీయ శాసన సభలను
నాయకుల ధర్మములను ఉపన్యాసములను, విశ్వసించి కార్యములు నెరవేర్చవలయు "

అది 1920 గాంధీజీ సహాయ నిరాకరణోద్యమ కాలం అప్పుడు కేంద్రంలో ఆంగ్లేయుల ప్రభుత్వం నైజాం రాష్ట్రంలో ముస్లిం పాలన కవిపై నాటి జాతీయ నాయకుల స్వాతంత్ర్య పోరాట ప్రభావం పడింది మత సామరస్యం నాడే కాదు నేడు కూడా అవశ్యాచరణీయ ధర్మమార్గం కదా ఈ చిన్న కృతినే ఇంత మిన్నగా మలచిన ఆచార్యుల వారి ఇతర కావ్యాలు లభిస్తే వారి ఉదాత్త భావ సంపదకు మరెంతగా ఆనందించేవారమో గోలకొండ కవుల సంచికలోని వీరి కవిత నం 349 'చెలీ' లోని రెండు పద్యాల్లో ఒకటి చూపబడింది రెండవదిది

గాలిం దూలుచు లేగొమల్ గదలి మూకల్ మూకలై జారుచున్
వ్రాలన్ బూవులగుత్తులల్లవె యటన్ వ్రాలెన్ దలల్ క్రిందుగాన్
జాలింబొందదె నీ యెడంద కనుచున్ సంతోషముం జెందెదో
పూలంగోయగ నుద్యమించి తివె యబ్బో ! యెంతయున్ ధీరవే !

కరుణశ్రీ 'పుష్పవిలాపము'నకు మొదటిదీ కవి భావం వీరి 'అనసూయ' కావ్యంలోని ఒకే ఒక పద్యం సేనాపతి రామాచార్య గారి 'అక్కడక్కడ' ఖండ కావ్య పీఠికలో కనిపించింది - చూడండి

"కవి పరబ్రహ్మ కావ్యలోకాల దమిని, బత్యణువున వ్యాపించి లోబయట గూడ
ధర్మ జ్ఞాన రస సృష్టి దనర లీల, దాన సర్వమై యక్షర త్వాన మెరయు "

తాను నిర్వచించిన కవి బ్రహ్మ లక్షణాలకు లక్ష్యమైన సలక్షణకవి వానమామలై లక్ష్మణాచార్యులు !

**3) రామసింహ కవి - రాఘువ పట్టణం,** తా॥ జగిత్యాల 1857 1962

వీరు కరీంనగర్ జిల్లా జగిత్యాల తాలూకాలోని రాఘువపట్టం నివాసులు [1]

రామ సింహ కవి సిఖ్ఖు మతస్థులు వారి మాతృభాష పంజాబీలో ఆయన పేరు రాంసింగ్ కాని, వారు ఊరిపేరుతో కలిపి రాఘువపట్ణం రామసింహకవి పేరుతో వ్యవహృతులు తెలుగులో పండితులు కారు అయినా అసాధారణ కవితాధార పట్టుపడింది వారి కవితలో సంస్కృత పదాలు, ఉర్దూ వాక్యాలు అధికం మాండలిక పదాలు కొల్లలు వ్యాకరణ సూత్రాలకు లొంగని పదాలను కవి యధేచ్ఛగా ప్రయోగించారు కొన్ని పద్యాల్లో ఛందోభంగాలు సైతమున్నది ఆయన వరకవినని స్వయంగా చెప్పుకున్నారు రామ సింహం పద్యం, పాట, వచనం మూడు రకాలైన రచనలు చేశారు దైవభక్తి, సామాజిక విమర్శ ఆయన కావ్య వస్తువులు

రామసింహము నిజంగా కవి సింహమే ఆయనంటే కుహనా సంస్కారులకు హడలు లోభులపై అనాచారులపై దురాచారులపై ఆయనకలం కొరడాను ఝుళిపించాడు జడిపించాడు

1 'గోలకొండ కవుల సంచిక' నం 204 రామసింహము కవి పరిచయంలో కులం బొందిలిగా, గ్రామం నల్గొండ జిల్లాలోని రాఘువనగరంగా పేర్కొనడం సంపాదకుల పొరపాటు పుట-373

నైజాం పాలకులకు ఆయన బెదరలేదు ఏ కారణంగానో ఒక వ్యక్తిని హత్యకావించి కొన్నాళ్ళు జైలు శిక్ష ననుభవించాడు రామసింహం కారాగారంలో ఒక సంస్కృతపండితుని సాహచర్యం లభించి శ్రుతపాండిత్య సముపేతుడైనాడు శిక్షా నివృత్తి కాగానే కవితలు వెలయించాడు జైలులోనూ పద్యాలు వ్రాశారట

వీరి జననం క్రీ శ 1857, పింగళ చైత్ర శు॥ నవమి, శా శ 1779

మరణం - 1962, శుభకృత్ శ్రావణ శు॥ చతుర్దశి - 1884

తెలుగు పంచాంగ కాలగణనం ప్రకారం రామసింహ కవి 105 సం 5 మాసాల 5 రోజులు జీవించారు [2] నలుబదేండ్ల తర్వాతనే వారు కవిగా మారింది అరువదేండ్ల కాలం కవితావీరవిహారం కావించారు సాహితీలోకంలో ఇది అదుదైన విషయం గోలకొండ కవుల సంచికలో వీరి 'విశ్వకర్మ శతక' కృతి మాత్రమే పేర్కొనబడింది వరకవి రామసింహం గారి రచనలు ఇవి

**పద్య కావ్యాలు**[3] 1 విశ్వకర్మ శతకము, 2 విశ్వకర్మ ప్రకాశ మండనము, 3 శ్రీరామ లక్ష్మణ ప్రబోధము 1965

**గేయ కృతులు** 1 కలియుగ వర్ణాశ్రమ ధర్మములు, 2 దుష్ట ప్రపంచ వర్ణనము, 3 భజన కీర్తనలు 5 భాగాలు, 4 నారాయణమాల

**వచన గ్రంథాలు** 1 యధార్థ రామాయణము, 2 యధార్థ భారతము, 3 యధార్థ భాగవతము దశమస్కంధము

## పద్య రచనల పరిచయం

1 **విశ్వకర్మ శతకం** - ఇది కవి సకల కర్మ సాక్షియైన సర్వేశ్వరుని స్తుతిస్తూ వ్రాసినది ఆయన సహజ స్వభావమైన సామాజిక విమర్శ సైతం దీనిలో చోటుచేసుకున్నది ఇది సీస పద్య శతకం గీత పద్యం చివరి పాదం మకుటం మచ్చునకు ఒక పద్యం

సీ శూద్రుడై పుట్టిన శిశును బ్రాహ్మణుడనన్, సిద్ధాంతమెవరైన చేయలేరు
కర్మార్థమయి ద్విజాఖ్యను జెల్లు గాని బ్రాహ్మణ నామధేయ మర్హంబు గాదు
వేద పారగుడైన విప్రనామము జెల్లు, బ్రాహ్మణుండనిన నబద్ధమౌను
అచల బ్రహ్మజ్ఞాని యైన బ్రాహ్మణుడౌను, ద్విజ విప్రనామము ల్దీరు నంత
గీ॥ ఇట్టి పదవికి సజ్జను లెల్లవార, లర్హులేకద, గాకున్న నాది ఋషులు
కులము తక్కువ వారెట్లు గొప్పనయిరి ? విశ్వపాలక ధర్మ శ్రీ విశ్వకర్మ !

జన్మనా జాయతే శూద్రః కర్మణా జాయతే ద్విజః, అను శ్లోక భావాను సరణమైనా కవి ధోరణి దానికి కొంత భిన్నం ఈ శతక రచనకు ప్రేరణకలిగించిన అంశాన్ని కవిగారే యీ విధంగా తెలిపినారు "కుమతులగు కొందరు సత్యదూరంబులగు విషయంబులెల్ల బ్రోగు చేసి, కుకవిశాసనమను పేర నొక పత్రికను వ్రాసి నాపేర టపా ద్వారా పంపియుండిరి నేనద్దానినెల్ల బరికించి సత్యసమన్వితమును శాస్త్ర నిశ్చితములునగు విషయంబుల నెల్ల సమకూర్చి విశ్వకర్మశబ్దముచే నేనా భగవానుని సంబోధించుట భావ్యమని నిశ్చయించి విశ్వకర్మ శతకమును వ్రాసియుంటిని "[4]

---

2 రామసింహకవి కుమారుడైన నారాయణసింగ్‌గారి ద్వారా ఈ తేదీలు జగిత్యాలకవి కాకుత్సం అనంతయ్యగారు సేకరించి 15 9 90న, లేఖలో నాకు తెలిపారు

3 వీరి పుస్తకాల తొలిముద్రణ ప్రతులు లభ్యంకాలేదు అనంతర ముద్రణ కాలాలువేసినా అవి ఎన్నవ ముద్రణలో తెలుపలేదు తొలిముద్రణ కాలం వేయలేదు

4 రామసింహకవి 'విశ్వప్రకాశమండనము' పీఠిక నుండి

2 **విశ్వ కర్మ ప్రకాశమండనము** ఇది విశ్వకర్మ శతక ఖండన కావ్య ఖండనం స్వీయ శతక భావ మండనం ఇందు నలబై సీస పద్యాలున్నవి ఇది పై విశ్వకర్మ శతక ఖండన కృతికి ప్రతి ఖండనము ఈ కృతి పీఠికలో రామసింహకవి స్వయంగా ఇట్లు చెప్పుకున్నారు "ఇట్లుండ కొంత కాలమునకు జగిత్యాల యందలి కొందరు విప్రులు తాము ఆంధ్రవైదిక సంఘమను పేరిడుకొని విశ్వకర్మ శతక ఖండన మండలమును వ్రాయించి యుండినందున నేనీ విశ్వప్రకాశ మండనమును అనగా విశ్వకర్మశతక ఖండన ఖండన మండలమును, దురుత్తర వాద ఖండన మండలమును రచించితిని " మండనము = అలంకారము, మండలము = నలుబది, జిల్లాకూడా ఇందలి పద్యాలలో విమర్శ అధికం "శాశ్వతపదాఖిలేశ విశ్వప్రకాశ" అని మకుటం కవి విమర్శన రీతిని తెలిపే కొన్ని పద్య పంక్తులు ఈ దిగువ చూపబడుతున్నవి

శ్రీ విశ్వకర్మ నీ సృష్టిని వర్ణించి మొక్కని వారెంత మూర్ఖమతులు 1వ, పద్యం
అంతటి శత్రుండునౌ వ్యాసుడైనను, పంచములని మమ్ము తిట్టలేదు 3వ, ప
స్వర్ణ తస్కరులని వదరు దురాత్ములే, వర్ణ తస్కరులైరి నిర్ణయముగ - 5
విశ్వంబునందు మా వృత్తులక్కర లేని, వారు లేరు సమస్త కారణముల 11
యావద్విధముల మాయా వాదులేవారు, తమకంటె దొంగలితరులు గారు 15
సభకు రాలేడు వాగ్విభవుండు గాడు బ్రత్యక్ష దృష్టాంత సామ్యము లెరుగడు
తప్పొప్పుల నరసి మెప్పింపగా లేడు, పేరు జెప్పిన వెరచు పిరికివాడు - 27
విశ్వకర్మయు మేము వేరు వేరే నష, మాదుగుల్ తన మేన మామలష్ష
పంచ వృత్తులు మావి బానిస పనులష, దండి భిక్షపు వృత్తి తమరి దుష్ష
దాసి యూర్వశి తమ తొల్లి తల్లి యష్ష, వీడు లౌకిక మెరగని వె - వ యష్ష 32

ఇందులో విశ్వబ్రాహ్మల కర్మకారుల ప్రశస్తి బ్రాహ్మణ నింద ఖచ్చితంగా ఉంది దానికి కారణం కవినోటి నుండే వినవచ్చు

నోరు కొవ్వియు మమ్ముల నొవ్వబలికి, ప్రతిభ గాంతురె తగు ప్రతి ఫలమె గాని
తిట్టునకు తిట్టు కొట్టుకు కొట్టు గలదు, శాశ్వత పదాఖిలేశ విశ్వప్రకాశ - 3వ, పద్యగీతం

రామసింహ కవి విశ్వ కర్మ శతక ఖండన పద్యాలను వ్రాసి ప్రచురించి యింతటి కోపమునకు కారణమైనవారెవ్వరో ? జగిత్యాలలో ఈ కవి కాలంలో విప్రులున్నా వారిలో కవులు లేరు సమీప గ్రామాలైన పొలాన, ధర్మపురి కవులీ కృతి రచించినట్లు కనిపించలేదు అన్వేషించగా ఆ కృతి రచయిత పేరు 'స్వీయ కవితాను జీవనం'[5]లో కనిపించింది అందలి ఈ గ్రంథ సంబంధ వాక్యాలివి "జగిత్యాల సమీపమున, రాఘవ పట్టణమను గ్రామమున సిఖ్ఖుల కులస్థుడు రామసింహమను కవి యుండెను అతడు పాటలను, పద్యాలను వ్రాసి చదువుచు ద్రవ్యార్జన మొనరించువాడు రామసింహమన్న మహాకవి యని ప్రాంతీయులకందరికభిమానము విశ్వకర్మలు, జగిత్యాలలో బ్రాహ్మణ సంఘము వారికి విశ్వకర్మలకు వివాదము కలిగి విశ్వకర్మ శతకమును వ్రాయించిరి దానిలో నాకవి బ్రాహ్మణులను ఋష్యాదులను నిందించి వ్రాసెను దాని సహింపక బ్రాహ్మణులు నా దగ్గరికి వచ్చి, దాని ఖండన వ్రాయుడని కోరిరి అప్పుడు నేను "విశ్వకర్మ శతక ఖండన మండలమ" ని నలుబది సీస పద్యముల వ్రాసి యిచ్చితిని దాని వారు వరంగల్లులో ముద్రించి ప్రకటించిరి దాని తోటి విశ్వకర్మల విజృంభణము తగ్గినది " 1928 సం పుటలు 32, 33 ఈ ఖండన మండల కృతితో విశ్వకర్మల విజృంభనము తగ్గెనేమో కాని విశ్వకర్మ శతక కర్త కవిత మాత్రం ప్రభంజనమై 'విశ్వప్రకాశ మండన' పుస్తకరూపంలో వచ్చింది

---

5 కృష్ణమాచార్య శతావధాని 'స్వీయకవితాను జీవనం' 1986

రామసింహకవి విశ్వకర్మ శతకం ముద్రణ పొందక ముందే వ్రాత ప్రతుల రూపేణా వ్యాప్తి నొంద సాగిందట నిర్మల వాస్తవ్యులైన మారుకొండ నరసింహులుగారు ఈ శతకాన్ని కవికి చెప్పకుండా ముద్రించడమే కాక దానిని విశ్వకర్మజుల కోరికగా వ్రాసినట్లు ఉటంకించినారట [6] అందుకు కవి విచారించినా దాని కారణంగా ఇంత కథ నడిచింది రామ సింహకవి గుణ పక్షపాతి, కుల దురభిమానం అతనికి లేదు ఆయన అస్తికుడు హిందూ మతమంటే గౌరవం సిఖ్ఖుమతం విగ్రహారాధనలను ఒప్పనిది గురువునే దైవంగా భావించే ఆస్తిక మతం ఈ కవి ప్రతి కులంలో ఉన్న దురాచారాలను దుయ్యబట్టాడు వారికి విశ్వకర్మ కులాభిమానం లేదనడానికి నిదర్శనం వారి 'కలియుగ వర్ణాశ్రమ ధర్మములు' లోని ఈ క్రింది కవితా పంక్తులు

19 పంచానన సంభవులట విశ్వ బ్రాహ్మణోత్తములటా
పంచదాయ విశ్వకర్మలట ప్రఖ్యాతార్యులటా
మంచి శీలములు మానిరి కేవల పంచములవలె బరగిరి కోళ్ళను
బెంచిరి కల్లును ప్రియముజేసి మత వంచనులై మండ్వలలో తాగిరి [7]

వర్ణాశ్రమ ధర్మాలను జాతి విహిత ఆచారాలను వారు ఆమోదించారు తదితరాలను ఖండించారు

3 **శ్రీరామ ప్రబోధము లక్ష్మణ నీతి శాస్త్రము** - 1965 ముద్రణ ఇది 'లక్ష్మణా'అను శబ్ద మకుట వృత్త పద్య శతకం కవి ఏలనో కాని దీనిని శతక మనలేదు

శ్రీకృష్ణుడు అర్జునునకు కావించిన ప్రబోధం భగవద్గీత శ్రీరాముడు లక్ష్మణునికి కావించిన ప్రబోధమీ నీతిశాస్త్ర శతకం రాముడెప్పుడు లక్ష్మణునికి హితోప దేశం కావించాడనే సందేహం అక్కరలేదు ఇది రామాయణ కథ కాదు ఈ రామలక్ష్మణులు రామాయణేతిహాస పాత్రలు కారు కవి రామసింహము తమకు శిష్యుడును తెలుకుంట గ్రామ నివాసియునైన కత్తెర్ల లక్ష్మయ్య యాదవ గారి కోరికగా ఈ నీతిశాస్త్ర రచన కావించారు [8] ఈ వంద పద్యాలలో సామాజిక నీతులతోపాటు పారమార్థిక ధర్మప్రబోధమున్నది ఆరంభ పద్యం కవి ఆశీర్వాదం

శ్రీయును సౌఖ్య జీవనము జీవదయానిజ దేశ సేవయున్
ధీయుత విద్యయున్ బుధ విధేయ మనంబున దాన ధర్మ ధౌ
రేయుడవైలసద్గుణ గరిష్ఠుడవై గురుభక్తి వల్న (చేత) దీ
ర్ఘాయువు గాను వర్థిలు మనంత యశ స్థితి గల్గి లక్ష్మణా

ప్రబోధ పద్యాలలో ఒకటి చూడండి

బంధ విమోచనంబనుట భ్రాంతియె కాని మరేమీలేదు దు
ర్బంధములన్ని మానవుల పాపములే యలవాటు కట్టులే
గ్రంధములన్నియున్ జదివి జ్ఞాన విహీనులెరుంగ లేరుయే
బంధము లెట్టుబాయు అలవాటులుదప్పరు తామె లక్ష్మణా 63

రామ సింహకవి 105 సంవత్సరములు బ్రతికిన పూర్ణాయుష్కుడు చివరి దశలోనూ సాహిత్యారాధన మానలేదు 1959లో కవిగారు తమ 103వ, ఏట శ్రీ విశ్వానంద స్వామి, మొగుల్ఖుపాలెం గారి 'శ్రీవీర భోగ వసంత రాయ శతకము'ను పరిష్కరించి పీఠిక సమకూర్చటం అందుకు నిదర్శనం

6 విశ్వప్రకాశ మండనము - పీఠిక నుండి

7 రామసింహకవి 'కలియుగ వర్ణాశ్రమ ధర్మములు' పుట 4 గేయం 19

8 ఈ పుస్తకంలోని యాంసాని వేంకటయ్యగారి పీఠిక నుండి

తెలుకుంట వాస్తవ్యులు జానపద కవి యాంసాని వేంకటయ్య గారు గురుభక్తితో రామసింహం గారి కృతులను పునర్ముద్రణ కావిస్తూ ప్రచారంచేస్తున్నారు రామసింహం గారి వచన రచనలు తప్ప పద్యగేయ కృతులన్నీ చిన్నవి కాని, వాటి ప్రభావం మిన్నది అతి సాహసికుడు సామాజిక విమర్శకుడు రామసింహకవి అయన కలం కత్తికంటె పదునైనది గళం కాహళం రామసింహ కవిది వేమన మార్గం ఆట వెలదిని ముట్టలేదు? అంతే భేదం !

'తెలుగు సాహిత్య కోశం' [9]లో ఈ జిల్లా కవులు (1851 1950) ఏడుగురిలో వీరొక్కరు అందు రామసింహ కవి రచనలు రామాయణ భారత విశ్వకర్మ మూడు మాత్రమే పేర్కొనబడినవి వారు కవి పరిచయంలో వ్రాసినట్లు "సాంప్రదాయ వాదులకూ, లౌకిక కవులకూ పట్టుబడని ప్రత్యేక ధోరణి వీరిది' ' రామసింహకవి వచన రచనల గేయకృతుల పరిచయం తర్వాతి ప్రకరణంలో చేయబడుతుంది

**4) పరమారాధ్యుల రాజయ్య - చెలుపూరు** 1895 1980 సుమారు

రాజయ్య గారు వీరశైవ జంగమ కవి హుజూరాబాద్ తాలూకాలోని చెలుపూరు గ్రామస్థులు కవి తమ గ్రామాన్ని చెరుకూరు అని వ్యవహరించారు ఈ శతాబ్ది ప్రథమార్ధంలో దేశగురువుగా హరిదాసుగా కవిగా వీరు పేరుపొందారు కరీంనగరం వరంగల్ మెదకు జిల్లాలలో వీరు శిష్య సంచారం చేశారు వీరి కాలికి వెండి అందె ఉండేది అది బిరుద ప్రదానమట కాళీ ఉపాసకులుగా మంత్రవేత్తగా వారికి ప్రచారం గౌరవం ఉండేవి ఆయన వరకవి (వారిని 1953లో మావూరిలో చూశాను)

రాజయ్య గారు పద్యాలు పాటలు వ్రాశారు వారి రచనల పేర్లు ఇవి

1 చంద్రశేఖర స్వామి శతకము - 1926, 2 శ్రీమహంకాళి శతకము - 1926 3 మల్లికార్జున జన్మ చరితము హరికథ, 4 వీరభద్ర విజయ నాటకము (ముద్రితములు) 5 గౌరమ్మ పాటలు (ముద్రితము), 6 పరశురామ విజయము (అముద్రితం) 7 చంద్రశేఖర భజన కీర్తనలు 1926

**వంశ వివరాలు** చంద్రశేఖర శతక గద్యంలో కవి గారి తల్లిదండ్రుల పేర్లు, కుల మతాల వివరాలున్నవి ఆ గద్య ఇది "శ్రీ వీర శైవలింగి బ్రాహ్మణ మతోద్భవ శ్రీమత్పరమారాధ్య వంశపయ పారావార రాకా సుధాకర మల్లికార్జున పత్ని నాగమాంబిక గర్భశుక్తి ముక్తాఫల వినయ విధేయ రాజయాఖ్య నామధేయ ప్రణీతంబైన చంద్రశేఖర శతకము "

**కావ్య పరిచయం** వీరి రచనలు రెండు శతకాలు, భజన కీర్తనలు ఈ మూడు పుస్తకాలు 1926లో ప్రచురణ పొందాయి మిగతావి తర్వాతి కాలపువి, ముద్రణ తేదీలు లభించలేదు కాళీ శతకంలోని ఒక పద్యం -

సీ నిన్ను గొల్వని మహా నీచాత్ములనుబట్టి, బహువిధ కష్టముల్ బడగ జేసి
మాటలాడింతువె బాట లెరిగింతువే, దమ్ములేపింతువె దగ్గుజేసి
గుండె బట్టింతువె కొండలెక్కింతువె, దమ్ములేపింతువె దుమ్ము జేసి
డొక్కలు జీల్తువే వెక్కిళ్ళు బట్టించి, వేకి బుట్టింతువె ప్రాకటముగ
గీ కాళ్ళు చేతులు తీపులు గలుగ జేసి, బాధలెప్పుడు జేతువె పాపిజనుల
భువన సంచారి చరుకూరు పురవిహారి, పరమహంకాళి శత్రు సంగర సుకేళి

ఈ సీస పద్యశతకంలో గీత పద్యపాద ద్వయం మకుటం మహంకాళి - మహాన్కాళి - మహాకాళి! చంద్రశేఖర స్వామి శతకంలోని ఒక పద్యం చూడండి

9 'తెలుగు సాహిత్య కోశము' 1950 51, తెలుగు అకాడెమి, హైద్రాబాద్వారి ప్రచురణ 1986, పు 792

శ్రీరజితాద్రివాస మునిసేవిత భక్తదయా సముద్ర శృం
గార శరీర సత్ప్రమధకాండ సమర్పిత పాద పద్మ కే
యూర భుజంగ నాథ మహిమోజ్వల చంద్రకిరీటి నాధునిన్
కోరితినయ్య నిన్ను చరుకూరు పురీశ్వర చంద్రశేఖరా-

చరుకూరు పురీశ్వర చంద్రశేఖరా అని ఈ శతక పద్యాల మకుటం పై పద్యం చివరి పాదంలో అఖండవళి వాడబడింది ఈ శతకంలో 116 పద్యాలున్నవి ఈ పుస్తకంలో చంద్రశేఖర షోడశోత్తర పద్యాలతో పాటు ఇతర దేవుళ్ళ స్తుతి పద్యాలు సైతమున్నాయి అవి శ్రీ చరుకూరు నర్సింహస్వామి పంచరత్నములు, లేములవాడ రాజేశ్వర పంచరత్నములు, కొరవి వీరభద్ర పంచరత్నములు మొదలైనవి కవి వీరశైవ మతస్థుడైనా, కేశవ పరమైన స్తుతి పద్యాలువ్రాయడం ఆయన మతసామరస్య వైఖరికి ఉదాహరణం నరసింహ స్తుతి పంచరత్నాలలో ఒకటిది

మ కరి రాజేంద్ర సుపోషణుండు మురళీ గాన వినోదుండు శ్రీ (గణం ?)
ధరుడున్ గోపిక మానసాబ్జ మకరందా స్వాద భృంగుండు తా
స్థిరతన్ శ్రీ చరకూరు మందిరుడు లక్ష్మీనారశింహుండు శ్రీ
కర సత్పాడి అనంతరెడ్డి ధరణీ కాంతున్ సదాబ్రోవుతన్

లేములవాడ రాజేశ్వర స్తుతి సీస పద్యాలు అయిదూ ఏకమకుటంతో ఉన్నాయి ఆ మకుటం ఇది "వర మనోల్లాస లేముల వాడ వాస, రమ్య గోరాట్తురంగ శ్రీరాజలింగ" ఇంకా శివ స్తుతి ద్విపదలో కావించాడిట్లా -

శ్రీ పార్వతీలోల శ్రితజనపాల, తాపస గణపోష దానవ శోష
బాలచంద్ర కిరీట బ్రహ్మకరోట, కాలాహి భూష శ్రీ కంఠ మహేశ

మల్లికార్జున విజయం బృహత్కావ్యం చంద్రశేఖర భజన కీర్తనలు, గౌరమ్మ పాటలు తర్వాతి ప్రకరణంలో చూపబడుతాయి వీర భద్ర విజయనాటక కధ దక్షయజ్ఞ ధ్వంసం ఇది యక్షగానాలకు తర్వాతికాలంలో వచ్చిన స్వదేశీనాటకాల రూపానికి చెందిన రూపకం ప్రదర్శన పొందెనో లేదో కాని పఠనయోగ్య శ్రవ్య దృశ్య కావ్యం వ్రాత ప్రతులు చెలుపూరులో వారి యింటిలోనే అజ్ఞాతవాసం చేస్తున్నవి పరిశోధకులకు కూడా అవి అందుబాటులో లేవు రాజయ్య కవి కవితలో అక్కడక్కడ ఛందోభంగాలు వ్యాకరణానికి లొంగని పదరూపాలు ఉన్నాయి ఆయన వరకవి

**5 'ఘటబ్రహ్మ 'సిద్దప్ప వరకవి' - గుండారెడ్డిపల్లె,** మ॥ కొహెడ 1903-1984



సిద్దప్ప వరకవి, కులం కుమ్మరి వృత్తి అంటే అభిమానం కాని ఆయన వేదాంతపరంగా కుండలసేతను అభివర్ణించారే తప్ప కులవృత్తి చేసి యెరుగరు ప్రైవేటు ఉపాధ్యాయులుగా కాలం గడిపారు వేదాంత బోధకులుగా వరకవిగా రాణించారు వీరికి ఇద్దరు భార్యలు, రాజయోగి వీరేశలింగం మాణిక్యలింగం పుత్రులు ఇంటిపేరు అనంతవరం పేరు సిద్దప్ప ప్రసిద్ధి రామప్ప అనే కవి తనను చెప్పుకున్నారు సిద్ధరామయ్య మొదటి పేరు కాబోలు

సిద్దప్ప ఆశుకవి బహుగ్రంధకర్త ఈ ప్రాంతపు మరే విద్వత్కవికి గానీ సాధ్యంకాని రీతిలో వీరి పుస్తకాలు రాజధానిలోని ప్రఖ్యాత పుస్తక ప్రచురణకర్తలు బహు ముద్రణలు కావించి విక్రయించుకుంటున్నారు వీరి పద్యాలు 'గో క సం ' నం 105లో ఉన్నాయి కాని, తెలుగు

అకాడమీవారి 'తెలుగు సాహిత్య కోశం' 1851 1950, ముద్రణ 1986లో ఈ జిల్లా కవులలో ఈ కవి పేరు లేదు సిద్ధప్ప గారి ముద్రిత రచనలు[1]

1 4 సిద్ధప్ప వరకవి జ్ఞానబోధిని [2], 4 - భాగాలు, 5 సువర్ణమాల శివస్తుతి, 6 సువర్ణమాల విష్ణుస్తుతి, 7 సింగరాయ నృసింహస్వామి వర్ణమాల, 8 షోడశ కందార్థములు, 9 భగవన్ స్తుతి, 10 హంసోహం జగదీశ్వర శతకం, 11 ఆత్మ ప్రపంచ విలక్షణము, 12 శ్రీరాజరాజేశ్వర సువర్ణమాలిక, 13 శ్రీభరతాంజనేయ వర్ణమాల, 14 శ్రీరామ భజనమాల, 15 అశోక సామ్రాజ్యము యక్షగానము, 16 కాకి హంసోపాఖ్యానము డ్రామా, 17 జీవ నరేంద్ర - డ్రామా, 18 శ్రీ వర్ణమాల కందార్థములు భగవన్నుతి [3] 1981 ద్వి ము 19 నక్షత్ర ఫలప్రబోధిని మొ ము 1954 ద్వి ము 1995

పద్యాలు, కందార్థాలనబడే విలక్షణ పద్యగేయాలు, తత్వాలు వీరు వ్రాశారు సిద్ధప్పగారి సీస పద్యాలకే వ్యాప్తి ఎక్కువ ఇవి శేషప్ప పద్యాలవలె నీతిపద్యాలు, వేదాంత భావ ప్రబోధకాలు మకుటం "వినుడి మాయప్ప సిద్ధప్ప విహితుడప్ప కనుడి కరమొప్ప కవి కుప్ప కనకమప్ప!" అని ఉంది

**కవి జన్మస్థాన వంశ వివరాలు** 'సిద్ధప్ప వరకవి జ్ఞాన బోధిని'లో వారే తమ వివరములు చెప్పుకున్నారు నైజాం రాష్ట్రం, వరంగల్ సుభా, కరీంనగర్ జిల్లా, శనిగరం పరగణాలోని గుండ్రెడ్డి పల్లె కవి జన్మస్థలం తండ్రి రాజయ్య తల్లి లక్ష్మమ్మ [4] ఇతర వివరాలు ఈ క్రింది పద్యంలో ఉన్నాయి

సీ శ్రీకరంబుగ వినుడు చిన్నబాలురకు నే, విద్యనేర్పుచునుంటి వివిధముగను
పిదప జ్యోతిష్యంబు ప్రియమంద జెప్పితి, హస్త సాముద్రికం బమరగంటి
సంగీత విద్యలు నంగీకరించితి, మంత్రయంత్రంబులు మదినిగంటి
వైద్యంబు జేసితి వసుధలోనే పెక్కు, కవనంబు చేసితి ఘనులు పొగడ
గీ ఇన్నిటిని బట్టి తుదకన్ని విడిచి పెట్టి, యోగములు నభ్య సించితి నూహ చేత
నంతటను గంటి నచలమై నాత్మ గురుని, జేసి సంసార యోగినై జెయము గంటి [5]

**కావ్య పరిచయము** సిద్ధప్ప వరకవి కాబట్టి వారి కవితా భావాలను ప్రశంసించవలసినదే కాని వారి పద్యాలలోని ఛందోభంగాన్ని వ్యాకరణ విరుద్ధ పదప్రయోగాల్ని ప్రశ్నించవీలులేదు, వానిని పరిశీలించి ప్రయోజనంలేదు [6]

1 **సిద్ధప్ప వరకవి జ్ఞాన బోధిని** 5 భాగాలు మొదటి భాగం 1918లో వచ్చింది [7] పుటలు 50 కవి తమ 15వ ఏట దీనిని రచించినట్లు చెప్పుకున్నారు ఇందలి సామాజిక నీతులు జనాన్ని

---

1 ఈ కవి 17 పుస్తకాల పట్టికవారి 'జగదీశ్వర శతకము' శ్రీవాణీ బుక్‌డిపో సిరిసిల్లవారి ప్రచురణ 1983 నుండి గ్రహించబడినవి

2 వీనిలో 2 భాగముల వేర్వేరు ప్రతులు, దాచేపల్లి కిష్టయ్య అండ్ సన్స్ హైదరాబాద్‌వారు 1988లో ముద్రించిన పుస్తకాలు మాత్రం లభించినవి ఎన్నవ ముద్రణో తెలుపలేదు

3 ఈ పుస్తకాన్ని సిద్ధప్పకవి కుమారుడు మాణిక్యలింగం 1981లో ఇచ్చారు మిగితా వానిలో ఒకటి రెండు పుస్తకాలు బాల్యంలో చదివాను, కాని ఈ మధ్య లభించలేదు 19వది, 96లో దొరికింది

4 రెండవ భాగము-1988 ముద్రణ, పు 7, సీసపద్య భావం

5 శిద్ధప్ప వరకవి జ్ఞానబోధిని-2వ భాగము, 1975 ముద్రణ, పు 5

6 సిద్ధప్ప అనువారి పేరునే శిద్ధప్ప అనివ్రాసుకున్నారు, కవి సాధారణంగా వరకవుల పద్యాల్లోని గణాలు మాత్రా నిబద్ధాలు ఇంద్రగణాలు ఆరింటిలో నగ,సల,ర,త అయిదేసి మాత్రల గణాలు నల, భ నాలుగేసి మాత్రలవి కదా వరకవులు, జానపద గేయకవులు సాధారణంగా అన్నీ అయిదేసి మాత్రల గణాలుగా వాడుతారు నల, భ వాడినా నలల, భల అనే రూపంలోనే అది లయ కోసం

7 "ఈనాడు" కరీంనగర్ జిల్లా ప్రత్యేక అనుబంధం డిసెంబర్ 1993, పుట-20

ఆకట్టుకున్నాయి నాటి వీధిబళ్ళలో సిద్ధప్ప శతకాన్ని తప్పక బోధించేవారు పెద్దలు కూడా వేమన సుమతి నరసింహ కృష్ణ శతకాల వలె సిద్ధప్ప వరకవి పద్యాలు కంఠస్థంచేసి తమ సంభాషణల మధ్య ఉదహరించేవారు వీటికప్పుడు అంత వ్యాప్తి ఉండేది

లోకరీతి, రాజయోగ ప్రశంస, వేద పురాణాల విమర్శ జాతి విభేద నిరసన, నీతిబోధ మొదలైన విషయాలు సిద్ధప్పగారి జ్ఞానబోధ పద్యాల్లో ప్రధానంగా ఉన్నాయి

లోకరీతి

సీ విత్తంబు గల వారి కిత్తురే కుర్చీలు, పేదవారల కివరు పీట చెక్క
కాలంబు నొకరీతి గడవ దెల్లప్పుడు, యేనుగు దోమచే యెత్తబడద
నేనె బలియుడ నని నిక్కుచు నుంటేమి, చలి జీమలును ఫణుల జంపలేద
నిడివి పొడవు దొడ్డు నెఱ్ఱగ నుంటేమి, గొడ్డలిచే మ్రాకు కోలు పోద
గీ బుద్ధిమంతులు పుణ్యపురుషార్థులైన, వారు పదిమందిలో ప్రజ్ఞ పలుకబోరు
వినుడి మాయప్ప శిద్దప్ప విహితుడప్ప, కనుడి కరమొప్పు కవి కుప్ప కనక మప్ప [8]

యోగ ప్రసక్తి

కాళ్ళు దగ్గర నుంచి కనురెప్పలను మూసి, లో జూపు జూచిలోకేశు నెరిగి మొ భా, పు 16
పాదముల్ తొడలపై పరగంగ వేసికొని, నాసికా రంధ్రమ్ము నణగ బట్టి - రెం భా, పు 32
నరులార వినరయ్య నాసికాగ్రమునందు, నడుచుచున్నవి మూడు నాగ ఫణులు మొ భా 33

వేద పురాణ విమర్శ -

జాతి గొప్పది యంచు జనులతో జెప్పియు, వేదంబు జదివినా బోధ నున్న - మొ భా, పు 9
శిరమందు విప్రుడు జన్మించగా లేదు,భుజమందు క్షత్రియుల్ బుట్టలేదు - రెం భా, పు 22
తొలి జన్మము లేదు మళ్ళి జన్మమురాదు, ఇపుడు జన్మము నెత్తి యిచటలేను మొ భా, పు 47

**జాతిభేద నిరసన -**

కులము మాయకులంబు కులము యేమనియందు,అనువుగా నాకులం బను కులంబు -
ఈ కులం పంచభూతాల్లో లేదని - చివరికి ఇట్లా అన్నాడు
మూర్ఖులకు దెలియదీ కులము మొనసి ధరలో, గురు కటాక్షముచే కులము గుర్తుదెలియు,
- రెం భా, పు 35

**నీతిబోధ** ఇది సామాజిక నీతి, వేదాంత రీతి ప్రబోధంతో రెండు విధాలా సాగింది నీతి ప్రబోధంలో పురాణేతిహాసాల ఉదహరించాడు కవి మెచ్చిన వేదాంతం అచలాద్వైత రాజయోగం

సత్యము జయమిచ్చు, కోపంబుచే నధిక పాపంబులు, రెం భా, పు 31
కైకేయ, చిత్రాంగి, శూర్పణఖ, కుంతిని బట్టి గాంధారి, యేమి
ఘనతకెక్కినారని ప్రశ్నిస్తూ సత్ప్రవర్తనను ప్రబోధించాడు - మొ భా 36

జంధ్యంబు లేకున్న జరుగదా శివపూజ, పుట్టు జంధ్యము లేదు పూజ్యులార -
కడుపు మాడ్చుక నుండ కడునొక్క పొద్దులు, బట్టు మనుచు చెప్పు పాపి నరులు భా 1, పు 12
నమ్మరాదీ ఘటము నవరంధ్రముల కొంప, బతుకమ్మవలె నీళ్ళ బడును యెపుడో - భా 1, పు 22
విష్ణుబ్రహ్మలు సున్న విశ్వేశ్వరుడు సున్న, నేను నీవును సున్న నిహము సున్న భా 1, పు 10
ఇంటిలోనను మాయ యింటి ప్రక్కను మాయ,యింటి వెనుకను మాయ నడిమింటి మాయ
- భా 1, పు 35

8 శిద్దప్ప వరకవి జ్ఞానబోధిని-1988 మొ భా , పుట 21

పంచాక్షరీ నిజము పంచబ్రహ్మలు నిజము, పంచేంద్రియాల్నిజము పలుకు నిజము భా 1, పు 37
కాశిలో గనరాడు గంగ యొడ్డున లేడు హృదయ మందున నిలిచి యుండలేడు భా 1, పు 8
కలడు లేడయ్య పృథ్విలో గానరాడు, నాద బిందును గళలన్ని నాత్మ యొకడె - భా 1, పు 8
పూర్వాచార పరాయణులకు హిత బోధ ఇట్లుంది బూటకులు వీరు అచల పరిపూర్ణులైతె వారికే కర్మలును లేవు వసుధలోన - భా 1, పు 10

కట్నాల కాశించి ఉపదేశాలిచ్చే బోధ గురువులను, వ్యభిచరించుదొంగగురువులను నిందించి, ఆశారహితంగా ఆత్మజ్ఞానము తెలియజేసి శిష్యుల కడతేర్చే సద్గురువుల ప్రస్తుతించాడు సిద్దప్ప కవనంపై పాల్కురికి సోమన, వేమన, బ్రహ్మం శేషప్ప రచనల ప్రభావముంది విమర్శ సోమువేములది వేదాంతం వేమన బ్రహంలది సీసాల నడక శేషప్పది విషయాలు స్వంతం

సిద్దప్ప వరకవి జ్ఞానబోధిని రెండవ భాగంలోని చివరి 18 పుటల్లోనే జ్ఞానబోధ సీసాలు 40 వరకున్నాయి మొదటి 21 పుటలు సరస్వతీ స్తుతి పద్యాలు కందార్ధాలున్నవి సీసపద్యమకుటం

"శ్రీ సరస్వతి వాసర స్థిరభవాని, దాస హృదయేశ్వరీ నిన్ను దలతుజనని "

ఒక వృత్త పద్యం చూడండి ఇది ఏ ఛందమో చెప్పలేం చంపకమాల అనుసరణ

జనని భవాని వాణి ఘనవాణి శుభాన ప్రతాప గాత్రి హ్రీం
ప్రణవ వినోది కింకిణి భవాని కృపాణి ప్రమోదివమ్మ హాం
జ్ఞానసరాది హృత్కమల శ్యామలవాణి స్వరూపి రావె వే
శ్రీహము సోహగాత్రి వాసర పురవాణి సరస్వతీ నమో పు 9

సిద్దప్ప అమరకోశం, కాళిదాసు పేర్లు పేర్కొన్నాడు నీతి శాస్త్ర శ్లోకాల అనుసరించాడు కాని వీరి కవితలో తెలుగు భాషలో మరే భాషలోనూ లేని వింత పదాలు చోటు చేసుకున్నాయి

2 **హంసోహం - వేదాంత రహస్యము, జగదీశ్వర శతకము** పుటలు 24 ము 85

పై పదాలన్నీ ఒకే పుస్తక నామం ఇందులో కొన్ని పాటలు, దండకం, సోహం ఆత్మరామాయణ వచనం ఉన్నాయి ఈ కృతి శుక్ల నామ సంవత్సరంలో రచింపబడినట్లు కవి శతకాంత గద్యలో చెప్పుకున్నారు శుక్లకు మరో శుక్ల దాటింది ఈ క్రీ శ 1993 భవ సంవత్సరానికి 65 యేండ్ల పూర్వపు దీరచన అంటే 1993 65 = 1928లో కవి దీనిని రచించారు అయినా గోలకొండ కవుల సంచిక 1 నం 105, లో ఈ శతకం పేర్కొనబడలేదు జ్ఞానబోధ ఒక్కటే సిద్దప్ప కృతిగా చెప్పారు పు 363 అందులో 25 ఏండ్లని వయస్సు తప్పింది బ్రహంగారి శిష్యుడు సిద్దప్ప వేరు ఈ సిద్దప్ప వేరు

సీ వేమరెడ్డిని బోలు యోగనాధుడులేదు కాళిదాసునుబోలు కవియులేడు
పోతులూరయ్యంత బోధకుండును లేడు - సిద్దప్పయంత శిష్యుడును లేడు

అన్న పద్యం ఈ కరీంనగరం సిద్దప్ప చెప్పిందే - జ్ఞానబోధ 1, పు 46

వరకవులు హిందూ వైదిక సాంప్రదాయ వాదులకు, గ్రామ దేవతారాధకులైన జానపదులకు మధ్యమార్గం వారు కర్మకాండల విగ్రహారాధనల నిరసించి వారు ఆత్మజ్ఞానం ముఖ్యమని ప్రబోధించారు ఆదిశంకరాచార్య అద్వైతానికి ఇది గ్రామీణ రూపం అచలాద్వైతం ఇంకాస్త ముందుకెళ్ళింది సిద్దప్ప వంటి వరకవుల కవితల్లో ఛందో భంగాల చూసి పండితులు మెచ్చుకోక పోవచ్చు కవి అటువంటి వారికి ముందే జవాబు చెప్పాడు పైగా తానే నిందించాడీ విధంగా జ్ఞా బో 2, పు 36

వంట చెరకు మీద కవనము జెప్పి (యు) చెరువు క్రిందను క్షేత్రమడిగినట్లు
భ్రష్ట లోకుల మీద భట్రాజు జెప్పియు, కట్నంబు లడిగెను కడుపు కొరకు
పరుల సొమ్ముల కాశపడి లొంగి కృతి జెప్పి, బ్రతుకు చుండిన నేమి ఫలము గాదు

సిద్ధప్ప సద్భోధ శుద్ధంగా లేదని హేయపరచే బ్రహ్మవేత్తలారా! చాటు కూతలు కాదు ఎదుటికి వచ్చి తప్పులేవో చెప్పండి వర కవీంద్రుల బోధ తెలియ మీ వశము కాదు ప్రాస గణములు తెలిసిన పండితుడనని భక్తవరులకు అవి చెరుప (తెలుప?) భావ్యం కాదు అన్నాడు - రెం భా పు 39, ఇంకా తానే ఇట్లన్నాడు

ఆంధ్ర పండితులంత ఆశ్చర్యులే గాని, భక్తి కందరు వట్టి భ్రమల కృతులె
పండిత వాక్యముల్ బహు మంచివే గాని, నడుప జాలరు దుష్ట నరులు భువిలొ
యెందుకీ ఆంధ్ర కావ్యముల్వేదికి చూడ, పక్షివలె పల్కుచుందురు ఫలము లేదు - పు 29
తాను మెచ్చే కవితను కూడా వివరించాడు "పదవి జేర్చిన మంచి పద్యమొక్కటి చాలు"
ఆ పదవి సద్గురుని సేవించి ఆత్మను గుర్తించి సోహమయ్యేది

వ్యాకరణ దోషాల విషయం సామాన్యజనానికి పట్టదు వారు వరకవుల భావాలకు మెచ్చి అభిమానించారు విద్యా గంధంలేని వారికి, గహన వేదాంతం గుర్తెరుగని వారికి, ఎంతో కొంత నీతిబోధ చిత్తశాంతి కలుగజేశాయి వరకవితలు సిద్దప్ప శిష్య బలగం పేరు ప్రఖ్యాతులు కల వరకవి

**6 మాదవరావు బలరామదాసు - కమాన్‌పూర్,** 1880 1950 సుమారు

బలరామదాసుగారు విద్వత్కవి ఈ శతాబ్ది పూర్వార్థంలో జీవించారు దాసుగారి ఏకైక పద్య ప్రబంధం 'రామగిరి మహాత్మ్యం' ఇది 1928లో తొలి ముద్రణ 1985లో మలి ముద్రణ పొందింది

గడియారం విశ్వనాథ శర్మ, బలరామదాసు ఏక గ్రామవాసులు - సమకాలీనులు అయినా ఒకరి పుస్తకంలో మరొకరి ప్రస్తావనలేదు శర్మగారి కావ్యమే మొదటిదని పెద్దపల్లి బాలకిషన్‌రావుగారన్నారు [1] బలరామదాసును 1940 45 మధ్య తమ బాల్యంలో చూసినట్లు కల్వచెర్ల పట్వారి కుసుంబ రంగారావు గారన్నారు [2] రామగిరి మహాత్మ్యం కావ్యానికి చక్కని వ్యాఖ్యానం వ్రాసిన మల్లావజ్ఝల రామచంద్రశర్మగారు తాము బలరామదాసు గారిని చూడలేదన్నారు కవి ఈ 20వ, శతాబ్ది పూర్వార్థంలో జీవించినవారు

**కవి వంశ పరిచయం** "ఇది శ్రీరామ చంద్రాపరావతారాయమాన శ్రీమత్తిరుమల కృష్ణ దేశిక పాద సరోజ సేవనా ప్రాప్త కవితా చాతురీ - చిత్ర మాధవరావు వంశ పవిత్ర రామనామాఖ్య పౌత్ర రామయపుత్ర బలరామ దాస ప్రణీతంబైన రామగిరి మహాత్మ్యంబు నందు తృతీయాశ్వాసము సమాప్తము" కవిగారి తాత తండ్రి ఇద్దరూ రామనాములే కవి పేరు బలరాం అయితే పూర్వ కవులవలె దాస శబ్దం చేర్చుకొని ఉంటాడు మాధవరావు వీరి వంశంలోని ప్రఖ్యాత వ్యక్తి కావాలి అతని పేరే వారి వంశ - గృహనామమై ఉంటుంది కవి నియోగి బ్రాహ్మణుడు

**కావ్య విశేషాలు** రామగిరి మహాత్మ్యం చంపూ ప్రబంధం మూడు ఆశ్వాసాలు 133 పుటలు (రెండవ ముద్రణ) ఈ అచ్చు పుస్తకంలో దాదాపు 400 గద్య పద్యాలున్నాయి ఇది చక్కని కవిత కవి ప్రతిభాశాలి "అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా యొనరింపబూనిన శ్రీ ప్రతాప రుద్రీయంబును మహా ప్రబంధాంతర్గత శ్రీరామగిరి మహాత్మ్యంబునకు కథా క్రమంబెట్టి దనిన" అని కావ్యారంభం కావించాడు ప్రతాపరుద్రీయం[3]

---

1 ఎం బాలకిషన్‌రావు, మ రామచంద్రశర్మగారలను పెద్దపల్లిలో 1991లో కలిశాను వారిద్దరూ తెలుగు పండితులు-కవులు దాదాపు 60 ఏండ్ల వయసువారు

2 రంగారావుగారు 1992లో కోరుట్లకు వచ్చినప్పుడు నాతో ముచ్చటించారు అప్పటివారి వయస్సు 59 సంవత్సరములు

3 విద్యానాథుని 'ప్రతాపరుద్రీయం' అలంకార శాస్త్ర గ్రంథం-13వ శతాబ్దిలో ఓరుగల్లులో వెలసింది అది వేరు ఇది వేరు

పేర కవి ఒక మహాకావ్యరచన చేయనెంచాడు రచించినది మాత్రం ఈ మూడాశ్వాసాల ప్రబంధం రామగిరి మహాత్మ్యం కావ్యాన్ని ఒక ప్రబంధం - చరిత్ర కావ్యం స్థల మహాత్మ్యం అని చెప్పవచ్చు ఈ కథను సైతం బదరికావనంలో శౌనకాది మునులకు వ్యాసశిష్యుడైన సూతుడు వినిపించినట్లుగానే ఉంది

రామగిరి మడికి సింగన కవి నివసించనదే బలరామదాసుగారు పూర్వ కవుల్లో వ్యాస వాల్మీకి భారవి కాళిదాస మల్హణ బిల్హణాది సంస్కృత కవుల, తిక్కన, పెద్దన, నన్నయ్య ఎఱ్ఱయ, ముక్కుతిమ్మన, రామకృష్ణుడు మున్నగు తెలుగు కవుల ఇదే వరుసలో స్తుతించాడు కాని, స్థానికుడైన మడికి సింగనను పేర్కొనకపోవడం ఆ కవి కావ్య పరిచయం లేక కాబోలు ఇంకా తాను వారిని అనుసరించినా శ్రీనాథ పోతనల, మొల్ల, భట్టుమూర్తి, చేమకూర వేంకట కవుల కూడా ఈ కవి స్మరించలేదు 'కావ్యావతారిక'లో

ఈ కావ్యంలో కవి రామగిరి వర్ణన పలుసార్లు చేశాడు మొదటి మూడు పద్యాల్లో ఒకటి (ఇందులో పద్యాలకు నంబర్లు లేవు కాబట్టి పుటల నంబర్లు చూపబడుతున్నవి)

ధరణి మహా మహీధ్ర సముదాయ వతంసమునై జెలంగి సుం
దర తర కుంజ పుంజ ప్రమదావన పూరితమై సురాసురా
ప్సరసల నూత్నలీలలకు సౌధమునై విలసిల్లువాడు రామ భూ
ధర మది గౌతమీ నదికి దక్షిణ దిక్ఫల పంచకంబనన్ (రా మ పుట 6)

పుర వర్ణనలోని ఒక పద్యం -

గోపురపు నవ్వజాలెడు గోపురములు, చంద్రశాలలు చుంబిత శశ ధరములు
దేవ కాంతల బోలు సతీ జనములు, మార శృంగారు లచటి కుమారవరులు (పుట 6)

దానిని 'మించు అలకాపురంబని యెంచవచ్చు'నట! అష్టాదశ ప్రబంధ వర్ణన లీకావ్యంలో చక్కగా చోటుచేసుకున్నాయి గిరి పుర వర్ణనల తర్వాత పుష్పలావికల శృంగార చేష్టల వివరించి చాతుర్వర్ణాలవారిని విశేషంగా వర్ణించాడు కవి

స్నానము సంధ్యయున్ జపము సత్యము శ్రీనివాస పద పూజలు గలిగి బ్రహ్మతత్త్వమసి, యను రహస్యముల శోధించువారు అచటి బ్రాహ్మణులట శివునే కాక శ్రీనివాసుని, బ్రాహ్మలతో పాటుగా స్వాములను పేర్కొనడం కవి వైష్ణవ మత ప్రీతికి నిదర్శనం

**క్షత్రియ వర్ణన ఇది**

చ తపన సమాన తేజులు నుదారులు ధీరులు యుద్ధరంగమం
దపరిమిత ప్రతాప సుబలాఢ్యులు యోగ్యులు భోగ్యులుత్తముల్
నిపుణులు సుందరాంగులును నేతలు భూతల మేలుచున్న యా
నృపకుల నాథులుందు రల నీటగు పట్టణమందు నెప్పుడున్ పు 8

కోటికి లెక్కచే పడిగె కొంకక నెత్తెడు కుబేరులచటి వైశ్యులు! శూద్రుల వర్ణన చూడండి

చ ద్విజులకు సేవ చేసి ధర వింతగు పంటలు బండజేయుచున్
ప్రజలకు నన్న వస్త్రములు బాల్పడనిచ్చి నిజోరు భక్తి గో
వ్రజముల నేలు వారి గుణవర్యుల శూద్రుల నెంచ శక్యమే
భుజబల శాలురై హలిని బోలి వసించెద రప్పురంబునన్ పు 9

హలి = హలధరుడు, బలరాముడు ఆ తర్వాత కవి నియోగుల - కరణాల ప్రత్యేకంగా వర్ణించి స్వజాత్యభిమానం చూపించుకున్నాడు

ఉ శూరులు సత్యవాక్య పరిశుద్ధులుదారులు శత్రు సంఘసం
హారులు తప్త హేమ మణిధారులు చిత్రవిచిత్ర లేఖ కా
ధారులు ధీరు లానన సుధాకర వైఖరి నొప్పుచున్న వ్యా
పారులు[4] నుందురప్పురిని బాయక కాయజ సుందరాంగులై పు 9

సుమతీ శతక పద్యంతో కరణాల నింద జన వ్యాప్తిలోనికి వచ్చినా మన పూర్వ కవుల్లో కవిత్రయం శ్రీనాధ పోతనాది అనేకురు నియోగి కులాలంకారులే ఇంకావారు అమాత్యదండనాధాది రాజకీయ ప్రముఖ పదవుల్లో రాణించినవారు

ఈ రామగిరి నగరం ప్రతాపరుద్ర చక్రవర్తిచే ఏకారాత్ర వినిర్మితమట! (14వ, పుట పద్యం ) రామగిరి నగర విశేషాలు కల వచనంలో కొంతభాగం ఇది "అతి విశాలంబైన శైలంబున యున్నతోన్నత శిఖరంబులును కుసుమ విలసిత తరు విశేషంబులును, సకల ముని నికర పరివృత సరోవర విలసితంబును గంధర్వాది శేచర విమాన పటలీ పరివేష్టిత సానుతటీ శోభితంబును శ్రీ సీతారామ లక్ష్మణ సమేత శ్రీరామచంద్ర నిత్యనివాస మంది రాయమానకందర కలితమును కర్మబంధ నిర్మోచన కూర్మ గుండంబును బ్రహ్మనివాస విశేషంబగు బ్రహ్మగుండంబును గౌరీ విలాసా స్పదంబగు గౌరీ గుండంబును మొదలుగాగల యఖిల చిత్రంబులున్ గలిగియుండె " 15వ, పుట ఖేచర విమానాల వంటి పురాణ వర్ణనల వదలితే మిగతా విశేష ప్రదేశాలన్నీ ఇప్పటికీ రామగిరిపై కనిపించేవే

ఆ తరువాత ప్రాకార వర్ణన (16, 17 పుటలు) అద్భుతంగా సాగింది ఈ కావ్యంలో సూర్యాస్తమయ (24) చంద్రోదయ (25) చంద్ర దూషణ (27) మారనింద (28 - 32) సూర్యోదయ (33 - 34) వర్ణనలు వివరంగా నడిపి నాయికకు నాయకుని చూపించాడు విజయ విలాసాన్ని తలిపించేది నాయక వర్ణన పద్యం -

సీ ఘన దీర్ఘబాహుని ననవిల్తు సమరూపు, సమరూపు విలసిత స్వస్వరూపు
గమన చాతుర్యాన ఘననాగ విజగీషు, విజగీషు దేవేంద్ర విభవమునను
మందహాసము మోమునందు జిల్కెడు వాని, నందు జిల్కెడు మాటలందు సుధయు
మోమందమేమందు నా యిందుని హసించు, నా యిందు నిరసించి యలరు వాని పు 35

ఇందలి అందమైన పదాల పొందిక ముక్తపద గ్రస్థాలంకారం గమనార్హం అప్పటి నాయిక స్థితి ఇట్లున్నదట ఆమె పేరు హేమ

కం హేమ తనుద్యుతి విజిత సు, హేమ, ముఖాప హసితాగ్ర్య హిమధామ, లస
త్కామ శరజాల పీడిత, నేమ, మహామోహభార నిశ్చలమతియై

భావం హేమ శరీర కాంతి చొక్కపు బంగారాన్ని జయించేది ముఖం చంద్రుని అపహసించగలది మన్మధ బాణాలతో పీడింపబడుతున్నది అప్పుడు ఆమె మహా మోహావస్థతో నిశ్చలంగా నిలిచింది నాయకుడు హేమాంగుడు గంధర్వుడు స్వజాతి సుందరి హేమను చూచిన పద్యం మనుచరిత్రలో పెద్దన హిమాలయాన్ని, భాగవతంలో పోతన సరోవరాన్ని వర్ణించిన విధంగా రమ్యంగా ఉంది విశేషణ పదాంత్యాను ప్రాస మనోహరంగా కూర్చబడింది ఆ పద్యం చూడండి

---

4 వ్యాపారులు బేపారులు కాని, ఈ పద్యంలోని వారు గోలకొండ వ్యాపారులనబడే నియోగులు కరణబ్రాహ్మణులు

అట గంధర్వుడు గాంచె కాంచన శరీరాభన్ ద్విరేఫాలకన్
నట దిందీవర పత్రనేత్ర యుగ నానా దిక్షమాలోకినిన్
పటు హేమాంచిత నాసికన్ వికచ సత్పద్మాస్య సౌందర్య సు
స్ఫటిక క్లుప్త వితర్ది వాసిని శుకీ సంభాషిణీన్ తోషిణిన్ పు 37

ఇందలి సంస్కృత పద భూయిష్ట సమాస విన్యాసం అంత్యాను ప్రాస పరితులనాకట్టుకుంటాయి దృశ్య వర్ణన సైతం రమ్యం నాయకుని మనస్థితి వర్ణన

సీ మించి నా దృష్టికి మిరిమిట్లు గొలిపెడు, తొలు కరి మెరుపని తోచు మదికి
తొలుకరి మెరుపుకీ తోరంపు కళలున్నె, కళలొప్పు వెన్నెల కాంతి యేమొ
వెన్నెల కాంతికీ చిన్నెలు గల్గునె, రంగైన మరుని తురంగ మేమొ

ఈ పద్యం శిల్పంలో భావంలో తిక్కన విరాట పర్వంలోని సైరంధ్రి వర్ణనను తలపించుతుంది నన్నయ భారతంలోని శంతనుడు గంగను వలె ఎవ్వరిదానవే రమణీ యెయ్యది పేరు వచింపు మింపుగన్, అని ప్రశ్నించాడు మాటలు మనసులు కలిసి గాంధర్వ వివాహమై సంభోగా నందాల తనిసి చతురుడనే కొడుకును కన్నారు (పు 43 44) ఈ ద్వితీయాశ్వాస కథ ఓ ప్రత్యేక శృంగార ప్రబంధం అనొచ్చు తృతీయాశ్వాసంలో శ్రీరామ కథ మూలవిధేయంగా క్లుప్తంగా నడిచింది సీతాదేవి ఆంజనేయుని చేత రామ ముద్రికనందుకొని ఈ విధంగా అనుకొన్నది

మ జల జాక్షుండు త్రిలోకవంద్యుడు లసచ్చారిత్రుడత్యంత కో
మల నీలాంగుడు దీర్ఘబాహుడతుల కానందకం
దలి తాంత కరణుండునై వెలయునాదైత్యారి శ్రీహస్త మం
దల చెన్నొందెడు ముద్రికా కుశలమా యర్కాన్వయాధీశుకున్ పు 121

చారిత్రక విషయాలు "శ్రమించు నవరత్న సింహాసనంబున ప్రతాపరుద్రుడు వివిధాసనంబుల వేర్వేరు మంత్రులుండగా, భట్లు గాయకులూగి ప్రస్తుతుల్ సేయగా, భటులు ఆజ్ఞాకృత కార్యాలొనర్చే వారలు, మొకద్దంలు కరణాలు వారివారి పనులు చేసేవారు" - ద్వితీయాశ్వాసం విషయం పన్నెండవ శతాబ్ది కాకతీయ కాలపుదైనా, వర్ణనలు పదహారవ శతాబ్ది ప్రబంధ యుగానివి ఈ రాజకీయ పరిపాలనా వివరాలు 18, 19 శతాబ్దుల నాటి నైజాం నవాబుల కాలానివి!

గీ రామగిరి నేలె తాను విరాజ మెందు, చుండ జగతి ప్రతాప రుద్రుండనంగ
శరధి వసువేద చంద్రుల సంఖ్య నగర, సంఘములు ముప్పది(యు)మూడు సముతులలర-54 పు

శరధి - 4, వసు 8, వేద 4, చంద్ర - 1, తలక్రిందులుగా 1484 ఇది శక, హూణ ఏ సంవత్సరానికీ సరిపోదు కాకతి సామ్రాజ్యం క్రీ శ 1325కు ముగిసింది రామగిరి సామ్రాజ్యం 1484 గ్రామ సంఘాలు 33 సముతులుగా పరిపాలన సౌలభ్యంకోసం విభజింపబడింది అని భావం

రామగిరి తక్తా సింహాసనం పరిధిలో 31 టప్పాలు, 1119 గ్రామలు ఉండేవి 55 పుట

రామగిరి క్రింద రామగిరి ఖస్బా - పట్టణం ఉంది దానికి అయిదు సముతులు వివరాలు పెద్దపల్లి సమితి 42 గ్రామాలు, ఓదెల 67, కలువచెర్ల 52, పారుపెల్లి - 21, వడ్కాపురం - 19 ఇవి మొత్తము 201 గ్రామాలు కవి వీనిని 202 అన్నాడు ఇంకా 56వ, పుట సీసంలో పేర్కొన్న గ్రామాలు ఇవి చల్లూరు 7, కొండ గూడూరు - 39, మొర్యూరు - 25, మంథని - 43, ఆరెండ - 26, కాపవరం - 45, రాపల్లె 14, కాళేశ్వరం - 28, ఎర్రనేని కాపవరం 45, సువర్ణ (వైడి) పాక - 13, ప్రతాపగిరి 33 జాజిపూలవరం - 13, తిప్పనపల్లె ఎక్కెల - 26, ముక్కలగిరి 38, ఇప్పగిరి - 14, 57వ, పుటలోనివి మరుమడుగు - 43, అఖిలాస్‌పురం 12, ఇంద్రగూడెం 27, నంనూరు - 20, నన్నూరు 27,

లేమూరు 20, చన్నూరు 99, తూర్పుపల్లె 28, నూగూరు 66, నెంచచెర్ల - 23, కల త్రయోద్రక నలబాక 40, జాఫరాబాద - 41, ఇదీ సముతుల గ్రామాల లెక్క పై సమితి కేంద్ర గ్రామాలు 32, వాటి పరిధిలోని మొత్తం గ్రామాలు 1044 ఉన్నవి ఒక సమితి 440 గ్రామాలు ఎట్లాగో కవి లెక్క నుండి జారుకున్నాయి

'ఇట్లు కాకతీంద్ర యశోభూషణాయ మానచండ మార్తాండ కోటి విలసిత ప్రతాపరుద్రుండగు ప్రతాపరుద్రుండు తత్తద్విచిత్ర దివ్య ప్రదేశంబులందు హరిశివాలయంబులు నిర్మింపజేసి యఖండ మహీ మండల మండనాయత రామగిరి దుర్గ సమాశ్రయలబ్ధ యశోవిరాజితుండగుచు రామగిరి యను సర్కారులో నుండి కొనిన పూర్వోక్త సమ్తులు చతురశీత్యుత్తర చతుర్దశ శత (1484)[5] గ్రామ మండలంబునేకచ్ఛత్రంబుగ పరిపాలించుటయే గాక నేకశిలానగర రాజధానీ శ్వర్యుండగుచు సర్కారు వొరంగల్లను పేరుగల మహీమండలంబునుంగూడ పరిపాలనంబుజేసె" - పుట 58

కరీంనగర్ జిల్లాలో రామగిరి, వెలిగందల దుర్గాల వ్యాప్తి కాకతీయులకు తర్వాత 14వ, శతాబ్ది నుండి ఆరంభమైంది మొలంగూరు కాకతీయుల కాలపుది శనిగరం, నగునూరు, పాలాస, వేములవాడ అంతకు పూర్వపువి ఈ పేర్లేవీ పై లెక్కలో రాకపోవడానికి కారణం అవి రామగిరి రాజ్యపరిధిలోనివి కాకపోవచ్చు కవి చూపిన సముతుల గ్రామలన్నీ నేటి కరీంనగర్ పట్టణానికి ఉత్తరం వైపువే కావడం గమనార్హం

ఈ గ్రామ నామాలు కొన్ని మారినవి ఉర్దూ పేర్ల ఊర్లు కాకతి కాలంలో లేవు వర్ణన గోలకొండ హైదరాబాద్ ముస్లిం పాలకుల కాలపునాటిదైనా రామగిరి దుర్గసీమ పరిధిలోని గ్రామాల వివరాలు బలరామదాసు వలన తెలుస్తున్నాయి ఆయన భారత స్వాతంత్ర్యానికి పూర్వం నైజాం నవాబుకాలంలో గ్రామకరణంగా పనిచేశారు తన కాలంనాటి విషయాలను పూర్వకాలానికి జత చేశారు

ఈ కావ్యంలో వివిధ దర్శనీయ ప్రదేశాల వివరణ చక్కగా ఉంది జైన హిందూ ముస్లిం నిర్మాణాల వివరాలున్నవి అరణ్యవాస కాలంలో పాండవులు కొంతకాలం రామగిరిపై ఉన్నారన్నారు (87వ, పుట) రావణ సంహారానికి సీతాపహరణానికి ముందు సీతారామ లక్ష్మణులు ఈ గిరిపై పదిహేడు దినాలు ఉన్నారన్నారు కవి (58వ, పుట) ఇంకా పాండవుల దగ్గరికి నారదుడు రావడం, సుమతుడనే బ్రాహ్మణ భక్తుని కథ ద్వితీయాశ్వాసంలోనే ఉన్నాయి

సంస్కృతాంధ్ర భాషల్లో చక్కని పాండిత్యం, చిక్కని కవన నైపుణ్యం కల కవి బలరామదాసు గారు కాని, కథా కల్పనాశక్తి కొంత తక్కువ మూడు ఆశ్వాసాల్లో వర్ణించిన విషయాలకు పరస్పర సంబంధంలేదు ఆయా సంఘటనల కన్నింటికీ పీటముడి కేంద్రం రామగిరి!

గిరిస్థల నగర వర్ణనలో కవి పురాణ కవుల మార్గాన్ని అనుసరించారు కొన్ని వ్యావహారిక పదాలు, మితంగానైనా తిలగుమ్ములు వంటి కూడని సమాసాలున్నాయి అలతి లోపాల నస పెట్టుకోకపోతే మంచి పసగల పద్య కావ్యం ఈ రామగిరి మహాత్మ్యం ఇది రసవత్కవిత్వంతో ఒక శృంగార కథ, సంక్షిప్త రామాయణంతో పాటు చరిత్రను వర్ణించిన స్థల పురాణం

మ రామచంద్ర శర్మగారి వ్యాఖ్య మూల విధేయంగా సాగింది రెండు తరాల క్రితపు ఈ కృతి ప్రతిని భద్రంగా కాపాడి మలి ముద్రణకందిచ్చిన వారు కలువచెర్ల పట్వారీ కుసుంబ రంగారావుగారు సేకరించి ముద్రించిన వారు రాయబాల ప్రసాద్‌గారు

---

5 ఇంతకు ముందు చూసిన 'రామగిరి నేలే' అనుపద్యంలోని శరధి పదానికి (సప్త సముద్రాలను కాక) చతుస్సాగరాలని కవి అభిప్రాయమని ఈ గ్రామాల సంఖ్య వలన తెలుస్తున్నది కాలగణనంలో సప్త సంఖ్యకు కులపర్వతాలను సూచిస్తారు

రాయల ప్రబంధ యుగానంతర కాలంలో కరీంనగర మండలంలో కుందావజ్జల గోపాల కృష్ణకవి గారి ఏకాశ్వాసమాత్ర లభ్య 'సంవరణ చరిత్రము'ను మినహాయిస్తే మాధవరావు బలదాందాసుగారి 'రామగిరి మహాత్మ్యం' ఏకైక పద్య ప్రబంధం!

**7 సిరిశినహళ్ కృష్ణమాచార్య శతావధాని[1] - కోరుట్ల**, 1905 1992



శతావధాని కృష్ణమాచార్యులు సంస్కృతాంధ్ర తమిళ భాషలలో పండితులు వారు ఉభయ భాషాకవి సంస్కృతంలో గద్య పద్య గ్రంథాలు రచించారు సంస్కృతానువాదాలు, స్వతంత్ర కావ్యాలు మొత్తం ఇరువదికి మించి తెలుగులో వెలయించారు కాళిదాసు కావ్యత్రయానికి మారుగా సంస్కృతంలో గురువంశ సంపత్కుమార సంభవ మనస్సందేశ కావ్యాలను రచించి అభినవ కాళిదాస బిరుదాంకితులైనారు అష్టావధాన శతావధానాలు చేశారు నైజాం రాష్ట్రాద్య శతావధాని బిరుదాన్ని గ్రహించారు వారు శ్రీవైష్ణవ మతాభిమానం కలిగిన వారైనా అన్యమత ద్వేషం లేదు కొరుట్ల సంస్కృత పాఠశాలలో ప్రధానాచార్యులుగా ఉద్యోగం చేశారు కృష్ణమాచార్యులది గంభీర స్ఫురద్రూపం శాంత ప్రసన్న వదనం శతావధానిగారు ప్రంభావ సరస్వతి!

**వంశ చరిత్ర** గో క సం నం 171లో కృష్ణమాచార్యుల జన్మస్థలం మోర్తాడుగా ఉంది అది నిజమే కృష్ణమాచార్యులు నవ యువ వయస్సులో ఉపాధ్యాయులుగా వచ్చి కొరుట్లలో స్థిరనివాసం ఏర్పరచుకున్నారు కాని, వీరి పూర్వులలో మొదటి తరంవారైన వరదమయ్యగారిది కరీంనగర్ జిల్లాలోని మంథని ఆ వంశంవారు కవి పండితులుగా హరిదాసులుగా ఆదిలాబాద్ వెళ్లారు మూడవ తరం సింగరాచార్యులు మోర్తాడుకు మారినారు ఈ సింగరయ్యగారి కుమారులైన వెంకటాచార్యుల ద్వితీయ పుత్రులే కృష్ణమాచార్య శతావధానిగారు కృష్ణమాచార్యుల నలుగురు సోదరులలో చిన్నన్న వరదాచార్యులు, తమ్ములు పెరుమాళ్ళాచార్యులు దేశికాచార్యులు కవులు కాని వారు ఈ జిల్లాలో లేరు కృష్ణమాచార్యుల ఇంటిపేరు మొదట సిరిసెనగండ్లవారు వీరి అన్నగారైన వరదాచార్యులే తమిళ శబ్దధ్వనిలో దానిని సిరిశెనహళ్‌గా మార్చినారు వీరిది శ్రీవైష్ణవ మతం, కౌండిన్యగోత్రం, ఆపస్తంభ సూత్రం

కృష్ణమాచార్యుల జనవం 13-8-1905, మృతి దినం 15 4-1992 ఎనభై రెండుసంవత్సరాలు జీవించారు[1] అరవై యేండ్లకు మించిన కాలం సంస్కృతాంధ్ర సాహిత్యారాధనలో గడిపారు

**కృష్ణమాచార్యుల సంస్కృత రచనలు** కావ్యాలు 1 మనస్సందేశ కావ్యం, 2 సంపత్కుమార సంభవమ్, 3 గురువంశ మహాకావ్యం, 4 మనోజ విజయ భాణమ్, 5 ధర్మపురి సుప్రభాతాని 6 జియ్యరు స్వామి చరిత్రం

**గద్య కావ్యాలు** 1 తత్వార్థ ప్రకాశికా, 2 అర్చిరాది మార్గం, 3 శ్రీవచన భూషణం, 4 రహస్యత్రయం, 5 వేదాంత దీపం, 6 పూర్వపక్ష సిద్ధాంత సంయోజనం

**తెలుగు రచనలు - ముద్రిత పద్యకావ్యాలు** 1 కాళాశాలాభ్యుదయము 1929, 2 మనస్సందేశకావ్యం 1952, 3 ఆంధ్ర మహానాటకము - 1973, 4 రామానుజ చరిత్ర 1981

**స్తుతి ప్రబంధములు - అవధానములు - అనువాదములు అచ్చయినవి**

---

1 కృష్ణమాచార్యుల 'స్వీయ కవితాను జీవనం' 1986 పుట 4లో వారి జన్మతేది ఉంది వారు కీర్తిశేషులైనప్పుడు నేను వారి గృహమందే ఉన్నాను మాది ఎనిమిదేండ్లుగా ఏకగ్రామ ఏకగృహవాస సాంగత్యం

1 జయతాల, కోరుట్ల శతావధానములు 1930, 2 మనోజ విజయ భాణము 1961, 3 5 స్తుతి గీతములు, 3 భాగములు (2వ భా ముద్రణ 1967), 6 గాంధీ తాత నీతి శతకము - 1975, 7 నంబులాద్రి, ధర్మపురి, చేగుర్తి, రేకుర్తి, మెట్టుపల్లి, కొరుట్ల సుప్రభాతములు

**వచన రచనలు**

1 విశాష్టాద్వైత మత సంగ్రహము - 1972, 2 స్వీయ కవితాను జీవనం - 1986

**ముద్రితాలభ్య రచనలు** 1 విశ్వకర్మ శతక ఖండన మండలము 1928, 2 గీతాచార్య మత ప్రభావ శతకము 1940

**అలబ్ధ రచనలు - అముద్రిత హరికథలు**, (1930 - 40) 1 పద్మావతీ పరిణయము, 2 రుక్మిణీ కల్యాణము, 3 గరుడ గర్వాపహరణము, 4 కృష్ణ గారడి, 5 ఆధ్యాత్మ భారత హరికథ, 6 గాంధీ జీవిత చరిత్ర, 7 ప్రజాస్వామ్యము, 8 అభినవ కుచేలోపాఖ్యానము పద్యకావ్యం

**అముద్రితలభ్య రచనలు** 1 రత్నమాల (ఖండ కావ్యం), 2 శతవిధబంధ పద్య శతకము, 3 శృంగార పంచ బాణ విజయ భాణం (వాధూల రంగకవి సంస్కృత రూపక కావ్యానువాదం)

ఉభయ వేదాంత విద్వాన్, ఉభయ భాషాకవి శతావధాని కృష్ణమాచార్యుల సంస్కృత గ్రంథాలు ఓ పది, ఆంధ్ర కావ్యాలు ఓ ఇరవై వరకు ముద్రితాలు సంస్కృతాంధ్ర కవిత్వంలో వీరు దిట్టకవి ఓ నలభై వరకు అష్టావధానాలు, నాలుగైదు శతావధానాలు దిగ్విజయంగా నిర్వహించి, శతవిధ బంధ కవిత్వం వ్రాసి, చిత్రకవితకు స్వస్తి చెప్పి, మత-హిత రసవత్కావ్యరచనతో జీవితం గడిపిన సార్థక జన్ములు కృష్ణమాచార్యులు ఆచార్యులవారు పొందిన సన్మానాలు అనేకాలు వాని వివరాలివి

1 సేనాపతి నరసింహాచార్యులచే విద్యాభూషణ బిరుద, స్వర్ణపతక ప్రదానం - హైదరాబాదులో - 1940
2 ఆంధ్రసారస్వత పరిషత్ నల్లగొండ మహాసభ కవి సమ్మేళానానికి అధ్యక్షస్థానం 1944
3 హెబ్బార్ మైసూరు వైష్ణవ సభా సన్మానము - 1944
4 తిరుమల తిరుపతి దేవస్థాన కవి పండిత సన్మానం 1955
5 తిరుపతిలో అఖిల భారత విద్వత్సభా సన్మానము - 1960
6 ఉభయ వేదాంత బిరుద ప్రదానం విజయవాడ - 1965
7 ఉభయ వేదాంతాచార్య బిరుదం జియ్యరు స్వామి ఢిల్లీ పీఠం వారిచే - 1973
8 ప్రపంచ తెలుగు మహాసభల కవి సన్మానం, హైదరాబాద్ 1975
9 కరీంనగర్ 1981, 10 కోరుట్ల కవి పండిత పౌర మహాసన్మానం - 1991
11 తెలుగు విశ్వవిద్యాలయ సన్మానం హైదరాబాద్ - 1992 మొదలగునవి [2]

**కవిత్వ పరిచయం** భక్తి తాదాత్మ్యంలో వీరి గీర్వాణవాణి ఎట్లా వీణా నిక్వాణ గాన మొనరించుతుందో చూడండి

సురవందిత సుందర పాదయుగం, వరదం మురదంభహరం హృదయే
దర దివ్య రథాంగ ధరం మధురం, వర ధర్మపురీ నరసింహమయే - సుప్రభాతం నుండి,
తెలుగు తనానికి మచ్చుగా ఒక పద్యం వీరి స్వీయ కవితాను జీవనం నుండి -

---

2 ఈ వివరాలన్ని కృష్ణమాచార్యుల 'స్వీయ కవితాను జీవనం' లోనివి చివరి సన్మానం వారు కీర్తిశేషులైన తర్వాత 5 డిసెంబర్ 1992న లభించింది కవిగారి భార్య విజయమ్మగారు, కొడుకు కోడలు - మంగ నరసింహాచారి ఆ బహుమతులు తీసుకున్నారు భాగ్యనగరంలో

ఇటుల యెందరో నిను జూడ నెంచిరంట, పుడమి కానుపు జంట యెక్కడను కంట
నెందు కనరాని బంట యిల్లంత కుంట, యందు నీవుంట నా పున్నియముల పంట!

సమకాలీన భావ స్పందనకు కవితా నైపుణికి నిదర్శనం అముద్రిత 'రత్నమాల ఖండకావ్యంలోని పద్యాలు వరుసగా 'హోటలు', 'నిరుద్యోగివేదన' నుండి రెండు సీస పద్యాలు

శతముఖోచ్ఛిష్ట సుస్వాదు వారాంగనాధర బింబమును బోలు త్రాగు పాత్ర
లోన కల్మషమైన పైన తియ్యని మోసగాని మాటల వంటి కాఫి నీరు
ప్రాచీన తరములై రగరగ యను గిలేట్, హారంబు పోల్పలహార చయము
వచ్చిపోయెడి వేళ పైకంబు లాగెడు, ప్లీడరు వంటి నిర్భీక విభుడు
అంటువ్యాధుల కిదియ విహార భూమి । భాగ్యవంతుల కొక ప్రక్క బందిపోటు
బీదసాదల ప్రాణాలు పీల్చుతావు । హోటలునకింక వేరేమిలోటు గలదు

పనిచేసి స్వాతంత్ర్యమున బ్రతుకుదమన్న, వెలయించినది వృత్తి విద్యకాదు,
కవినయిలోక విఖ్యాతి చెందుదమన్న, సాహితీ గ్రంధముల్ చదువలేదు,
వాణిజ్యమునను జీవనము పుచ్చుదమన్న, చేతిలోనొక కాసు చిక్కలేదు,
సన్యాసినై జ్ఞాన సరణి దెల్పుదమన్న, వేద వేదాంత సద్విద్యకాదు,
ఇంతవరకును చదివిన దంత గొర్ర । మెంటు కొలువచ్చి పుడమిలో మెలగ వలయు
లేనిచో సౌఖ్యమందాశ లేక యిల్లు । వెడలి బలిమిని ప్రాణముల్ విడువలయు

సంప్రదాయ కుటుంబాల్లోని మార్పుల వర్ణన "తాత మనువడు" శీర్షిక నుండి,

ముందు పూజించిన సుందర ప్రతిమలు నవగృహ చిత్ర చిహ్నంబు లిపుడు
లలతలింగములు సాలగ్రామ శిలలవి పేపర్ల బరువుకు మోపురాళ్లు
అర్ఘ్యపాద్యాదుల కనువైన పాత్రలు కాఫి తాగుటకు నక్కరకు వచ్చు
తాతలనాటి యా తాటాకు పొత్తముల్ తుక్కు మోసెటి బండి నెక్కి తరలు
జట్టు పెంటరై మోమున సాబగు లొలుకు । బొట్టు శ్రీరంగ కాశిగోపురములెక్కి
సంధ్య బదిరిలో తపమును సలుపు చుండి । నాటి విప్రుడు హరిజన నాధుడిపుడు

**కావ్యపరిచయము**

**కళాశాలాభ్యుదయము** - ఈ జిల్లాలో అచ్చయిన తొలితరం కావ్యం ఇది మూడాశ్వాలలో 234 పద్యాలతో సమకాలీన ఇతివృత్తం కలది శ్రీవైష్ణవ మతాభినివేశంతో రామానుజాచార్యుల వారి జన్మస్థలమైన శ్రీ పెరుంబుదూరులో ఉభయ వేదాంత పాఠశాల స్థాపించి అచ్చటే నివసించిన కుండలం - మాకులూరి వేంకట నరసింహాచార్యుల[3] జీవిత విశేషాలున్నూ, వారి ఆదేశం చేత కొరుట్ల పట్టణంలో ఉ వె సంస్కృత పాఠశాల, వేణుగోపాల మందిరం, విద్యార్థి వసతి గృహం, వాణీ విలాస గ్రంథాలయం, నాటి ఉదారుల సహకారాలతో స్థాపించి, భవనాలు నిర్మింపజేసి, వైభవంగా నడిపించిన సేనాపతి వేం నరసింహాచార్యుల జీవిత విశేషాలు కలది, ఈ కళాశాలాభ్యుదయం! ప్రబంధ వర్ణనల పొంత పోక కవిత సూటిగా కథా వివరణతో సాగిపోయింది కవి ధ్యాస విషయ వివరణపైనే కేంద్రీకృతమైంది ఇందులో ఉభయనాయకుల జనన బాల్య విద్యాభ్యాసాది వివరాలున్నవి ఇంకా కొరుట్ల సంస్కృత విద్యాలయ కృష్ణమందిర నిర్వహణోత్సవాది విశేషాలు రమణీయంగా వర్ణించారు

3 వే నృసింహాచార్యుల స్వగ్రామము 'మోర్తాడు' నిజామాబాద్ జిల్లా

కృష్ణమాచార్యుల జన్మస్థలం మోర్తాడు నివాస గ్రామం కొరుట్ల శ్రీపెరుంబుదూరులో విద్యాభ్యాసం కావించినవారు ఉ వే సంస్కృత పాఠశాలలో ప్రధానాచార్యులుగా పనిచేశారు ఇంకేం ? ఇష్ట పదార్థ మృష్టాన్న భోజనంవలె కావ్యం కమనీయమైంది సంస్కృత కవి పండితులైన ఆచార్యుల వారి తెలుగు కవిత అలతి అలతి జాను తెలుగు మృదుమధుర పదాలతో రసభావ నాదశయ్యా శోభితమై ఉండటం విశేషం ఈ కావ్యంలోని గోదావరి వర్ణన 1 41,

ఉ తుంగ తరంగ భంగముల దోరపు మీలు చలించు చుండ సా
రంగ విహంగ రాజములు రంజిలు మంజుల మంజరీ సమా
లింగిత భృంగరావ వికలీకృత పాంథ నిజాంత రంగము
ప్పొంగ మతంగ యానల వపుస్మృతి జేయునదీ విచిత్రముల్

శిశువర్ణన 1 42,

సీ ఈ చిన్న పాపని జూచితిరే తొల్లి దేవకి కొమరుని భావమడరు
ఈ ముద్దు బాలుని మోమును గాంచరే పున్నమి రేవెల్గు సన్నగిల్లు
పుర వర్ణన ఎంతటి భావ రంజక శబ్దాలంకార మంజులమో!

సీ తోటలా రతనంపు కోటలా వలినీటి యూటలాయీపురిన్ నీటు కొలుపు
పాఱులా సాముల బారులా శ్రితసుమందారులాదారులా తనువు గొల్పు
గోవులా చెంగల్వబావులా చిత్రంపు తావులా మావులా తాల్మిదాల్చు
యేరులా యెనయకుబేరులా రాచకుమారులా మారులా మహిమకెక్క

గీ గోపురంబుకు సాటి యా గోపురంబు, ఆ పురంబెన్న యతిపతి కాపురంబు
భూత పూర్వర మనగ నభూత పూర్వ, వైభవంబున దనరారి వసుధ మీతె 1 - 63

ఆ సంస్కృత పాఠశాల కరీంనగర్‌కు తరలిపోయినా, వాణీవిలాస గ్రంథాలయ పుస్తకాలు చెల్లాచెదరయి దాగినా, కోవెల మాత్రం నిత్యపూజాధూపదీప నైవేద్యాదులతో శోభాయమానంగా ఉంది గత వైభవాలకు ఈ కావ్యం భద్రపేటిక

**మనస్సందేశ కావ్యం** కాళిదాసు మహాకవి 'మేఘ దూతమ్' కావ్యరీతిలో విరచితమైన స్వతంత్ర కావ్యమిది జీవుడు దేవుని చేరుకొను పరితపన వేదాంత మార్గవర్ణన దీని కావ్య వస్తువు ఆత్మ పరమాత్మ సమైక్యం పొందటం సర్వధారి 1942 లో రచింపబడిన ఈ సంస్కృత కావ్యం జనప్రయోజనాన్ని అనుసరించి[4] ముద్రణా కాలంలో ప్రతి శ్లోకానికొక పద్యంగా ఆంధ్రానువాదం కావించారు సంస్కృతాంధ్ర కావ్యద్వయాన్ని ఒకే పుస్తకంగా ప్రచురించారు ఈ కృతి పరిమాణంలో మేఘసందేశం వంటిదే [5] రెండు ఉచ్ఛ్వాసాలు కశ్చిత్కాంతా-వలె ఆరంభ శ్లోకమిది

కాచిత్కాన్తా ప్రకృతి విమలా జీవ భూతా ప్రియస్వ
త్యక్త్వానాదేర్నిజ సహచరం కర్మయోగాద్భ్రమంతీ
సంసారాఖ్యే మహతి విపినే కామితానామ్ ఫలానామ్
పాత్రం క్షేత్రం సకల సుమనశ్చిత్ర మేకం ప్రసేదే

రెండవశ్లోకానువాదం చూడండి

---

4 ఆంధ్రీకరించ వలసినదిగా శతావధానిగారికి తామే సూచించినట్లు ఉత్పల సత్యనారాయణాచార్య మహాకవిగారు నాతో అన్నారు

5 మనస్సందేశ కావ్యం 52 పుటలు అందులో 130 పద్యాలు, 130 శ్లోకాలు, 52×5=260

ఆనారీ మణి సద్విజ ప్రవరుచే నచ్చోట హృన్నాయకున్
జ్ఞానానంద మయున్విదోషు బరమ స్థాన స్థితుం పించుత
ధ్యానోత్కంఠితయై గనె న్బుధుల హృత్పంకేజ సంచారలీ
లానైపుణ్యము మీరు సార హరణోల్లాసున్మనో హంసునిన్
ఇది క్లిష్ట వేదాంతానికి కమనీయ కావ్యరూపం

**ఆంధ్ర మహానాటకము** ఇది సంస్కృత హనుమన్నాటక చంపూకావ్యానువాదం ఇందులో మూలంలోవలెనే 14 అంకాలున్నాయి గద్యపద్యాలు 1500 వరకున్నాయి కవి ఈ మహాకావ్యాన్ని మందమఱ్ఱి మాధవరావు గారికి కృతియిచ్చారు నాటకమన్నా ఇది కావ్యం ఆశ్వాసాలను అంకాలనడం, కొన్నిచోట్ల పాత్రల చేష్టలు స్వభావాలు ప్రవేశ నిష్క్రమణాదులు సూచించడం వలన ఇది సంస్కృత రూపకాలకు తొలిరూపమేమో అనిపించుతుంది

హనుమంతుడు ఈ రామాయణాన్ని వ్రాసి వాల్మీకికి చూపగా అతడు అమృతబుద్ధితో దాన్ని శిలానిబద్ధం కావించి సముద్రంలో పడవేయించాడట [6] ఆ శిలాఫలకం ఒకటి భోజరాజుకు లభించగా దానిపై కల శ్లోకాలు చదివి మిగతా కావ్యశిలలను తీయించగా మిశ్ర దామోదర పండితుడు వానిని కావ్యంగా కూర్చాడట

దీనిని కృష్ణమాచార్యులు యథామూలముగా తెనిగించినారు "శతావధానులు గారి పలుకుబడి సులభము సుబోధకమునైనది ఈ కావ్యరచనయంతయు సరళమైనరీతిలో సాగినది మూలమునందలి శ్లేషలను గూడా చక్కగా తెలుగులోనికి తెచ్చినారు" వేముగంటి నరసింహచార్యులు ఈ కవి "పద్యాలు సహజాంధ్ర రచన వలె తెలుగు దనముట్టిబడ చేయుచున్నవే గాని అనువాదముల వలె లేవు "వా వారదాచార్యులు అన్నారు పీఠికలలో ఆచార్యులవారి కావ్యావతారికారంభ పద్యమిది

శ్రీరామున్హరి దశ్వ వంశతిలకున్ సీతాపతిన్ సుందరా
కారున్ లక్ష్మణ సేవితాంఘ్రియుగళున్ కారుణ్య రత్నాకరున్
శూరున్ వాలి హరున్ విరాధదమనున్ సుగ్రీవ సంసేవితున్
స్వైరావాప్త విభీషణున్దశముఖ ప్రధ్వంసకున్ గొల్చెదన్

దీనిలో ఒక పదం కూడా మార్చకుండా కేవలం ప్రత్యయాలు మాత్రం మార్చి "శ్రీరామం హరిదశ్వ వంశ తిలకం సీతాపతిం షుందరా కారం వాలి హరం" అని కవి స్వయం శ్లోకంగా మార్చారు తత్సమ పద సరస విహారం కావించినా వీరి కవితలో తెలుగు పద విన్యాసం తక్కువగాలేదు

గీ బాటలో బాటసారుల వనిత లెల్ల, తరుణి కువలయ నీలు డీతండు నీకు
నేమిగావలె నన సీత మోము వంచి, నోట జెప్పక లజ్జతో తేట పరచె - 3-40

'పథిపథిక వధూభిస్సాదరం పృచ్ఛమానా' అను మూలశ్లోకంలోని భావాన్ని ఇంత సహజంగా తెలుగు చేసినా, స్మిత వికసిత గండం వ్రీడ విభ్రాంత నేత్రం' అను తృతీయ పాద భావాన్ని వదలివేశారు కొన్ని తావుల కథా భాగాలను మితంగానైనా తగ్గించడం, కొన్న తావుల ముఖ్యంగా వర్ణనలలో కొంత పెంచడం జరిగింది స్వీయ కల్పిత పద్యాలను కవి పువ్వు గుర్తులతో సూచించారు

ఇందలి కథ సీతారామ కల్యాణం నుండి రావణ వధ, శ్రీరామ పట్టాభిషేకం వరకుంది

ఇందులో మొదటి పద్యంలో దశరథుని పరిచయం, రెండవ పద్యంలో అతని ముగ్గురు దేవేరులకు నలుగురు పుత్రులు జన్మించడం, మూడవ పద్యంలో విశ్వామిత్రయాగ సంరక్షణార్థం రామలక్ష్మణులు వెళ్ళడం ఇదీ కథా వేగం తర్వాతి కథా మధ్య వర్ణనలతో పాత్రల స్వభావ చిత్రణలతో కొంత నిదానంగా

---

6 ఎస్ కృష్ణమాచార్యుల 'ఆంధ్రమహానాటకము' 1973, 14 24, పుట-194

సాగింది పూర్వకావ్యమే తిరిగి వ్రాయడానికి కారణంగా 'లోకంలో అపూర్వమైంది ఏదీలేదు బ్రహ్మ 'యథాపూర్వం'గా సృష్టి నిర్మాణం కావించినా నిత్యనూతనం కాదా' అన్నారు ఇంకా 'రామకథ ఎందరు వ్రాసినా నవ్యమే - రామాయణం కొంతైనా వ్రాయని కవి కవికాడు కావ్యం కావ్యం కాద'న్నారు కావ్య పీఠికలో చివరి పద్యంలో ఇలా వాకృచ్చారు

కొందరు ప్రౌఢ కావ్యములు గ్రోలుచు సంతస మొందుచుండగా
కొందరు భావ గేయముల గూర్చి ప్రశంసలు జేతురందు చే
నందటి మెప్పు లంబడుట యాశకు మించిన కార్యమిప్పు నా
యందనురాగముంచగల యార్యులనెంచి నమస్కరించెదన్ 24

ఈ సరస కావ్యానువాదంలో సంభాషణలు సహజంగా ఉన్నాయి మచ్చునకొక పద్యం -

నేనొక వాయునందనుడ నీవొక రాక్షస కోటి రాజు వ
ట్లైనను నిన్ జయించి జనకాత్మజ దోడ్కొని పోసమర్థుడన్
గాని, కపీంద్ర రాజ్యమొసగన్ రఘురాముడు సత్యసంధుడై
దానవ నాధ! నీవధను దానె ప్రతిజ్ఞను జేసె నప్పుడే 6 73

కవి స్వతంత్ర కల్పనల నుండి ఒక పద్యం

కొత్త కోడలు గండాల కత్తె యేమొ, అత్తవారిల్లు సొచ్చిన యంతలోన
బుడమి నంతటనుత్పాతములు చెలంగె, శాంతికై దీని నడవికి సాగనంపు॥ 3 13

ఈ కవి కవనం మొల్ల రామాయణంవలె సరళం సహజం - సుందరం

**రామానుజ చరితము** అయిదాశ్వాసాల ఈ నిర్వచన పద్యకావ్యంలో 814 పద్యాలున్నాయి

మొదటి పద్యంలో శ్రీరంగేశుని స్మరించిన కృష్ణమాచార్యులు నాలుగవ పద్యంలో వినతానందనుడౌ వినాయకుని నుతించారు! గరుత్మంతుడని కవిభావం, విహగనాధుడు వినాయకుడే మరి శ్లేష! ఇది వైష్ణవ యుక్తి కల్పన, గణపతి శివ పుత్రుడయ్యె!

శతావధానాలు చేశాను పెక్కు కావ్యాలు సంస్కృతాంధ్రాల్లో వ్రాశాను (21) అనువాద కావ్యాల గౌరవం మూల గ్రంథకర్తకు పోతుంది కాబట్టి ఈ స్వతంత్ర కావ్యరచనకు పూనుకున్నాను - (28) అన్నారు కవి ఈ కావ్యాన్ని కవితమ వృద్ధాప్యంలో నవనవ గజ శశి శకమున (5 173) రచించారు అంటే నవ-9, నవ - 9, గజ 8, శశి 1, అంకానాం వామతో గతి , అని ఈ 9981ని తలక్రిందులు చేస్తే 1899 శాలివాహన శకం దీనికి 78 చేరిస్తే క్రీస్తు శకం = 1977 ఈ గ్రంథ రచన కాలం, ముద్రణ - 1981లో జగద్గురు రామానుజాచార్యులకు అంకితముగా ఈ కావ్యాన్ని వెదిర గ్రామస్థులు కృష్ణమాచార్యుల శిష్యులు చీటి రత్నమ్మ బాబురావుగారలు ప్రచురించారు

త్రిమతాచార్యుల పేర్లు హిందూమత పునరుజ్జీవకులుగా ప్రఖ్యాతం రామానుజులు 12వ శతాబ్దివారు వారి విశిష్టాద్వైత మత సిద్ధాంతం, శ్రీభాష్యాది రచనలు వ్యాప్తిలో ఉన్నా వారి జీవితచరిత్ర ప్రత్యేక గ్రంథంగా రాలేదు ఆ లోటు పూరించడానికి కృష్ణమాచార్య కవి ద్రావిడ భాషలోని 'గురుపరంపరా ప్రభావము', సంస్కృతం ప్రపన్నామృతమ్, ఆంధ్రమందలి 'ఆచార్య శ్రీ సూక్తి ముక్తావళి' గ్రంథాల్లో ఉన్న రామానుజ జీవితాంశాలను, రాజగోపాలనాయుడు గారి 'రామానుజుని ప్రతిజ్ఞ' నవలలోని కంచీపుర చారిత్రక విశేషాలతో మేళవించి, ఈ కావ్యేతి వృత్తాన్ని స్వయంగా రూపొందించుకున్నారు ఇది రామానుజుని మత ప్రచారకుని గానే గాక, అతని బాల్యం, విద్యాభ్యాసం, సంసార జీవితం, సన్యాస స్వీకరణం, స్వీయ మతోద్ధరణం, దేశ సంచారం, పరమత ఖండనం, వైష్ణవాలయాల పునరుద్ధరణం,

గ్రంధరచనం మున్నగు అంశాలతో ఆసక్తిగా వినగల కథ వైష్ణవ భక్తులకు ఈ కావ్యం పవిత్ర గురుమూర్తి చరిత్ర ఆదిశేషుడే మొదట లక్ష్మణుడుగా, బలరాముడుగా తర్వాతి జన్మలో రామానుజస్వామిగా జన్మించాడని శ్రీవైష్ణవుల విశ్వాసం రామానుజాచార్యులను ఈ కవి వర్ణించిన విధానం ఇది , 4 6

సీ పాషండ తరుషండ పావకా! చార్వాక పర్వత ఖండన వజ్రదండ!
బౌద్ధాంధకార విపాటన భాస్కర! జైన మత్తేభ పంచాననేంద్ర!
కాపీల తూల సంఘాత ప్రభంజన ! ప్రచ్ఛన్న బౌద్ధాహి వైనతేయ!
కాణాద వాద సాగర కుంభసంభవ! నిగమాంత సిద్ధాంత నియమరక్ష!
గీ అనుచు బిరుదాళి బాడుచుననుగు వైష్ణ వప్రకాండులు వెనువెంట వచ్చుచుండ
భటులు మున్నాడి చని బరా బరులొనర్ప వెడలె రామానుజార్యుండు విజయయాత్ర

అందులో రామానుజుడు ఖండించిన మతాలు పాషండం, చార్వాకం, బౌద్ధం, జైనం, కపిల సాంఖ్యం, ప్రచ్ఛన్న బౌద్ధమనబడే అద్వైతం, ఇంకా కణాదుని అణువాదం ప్రతిపాదించినది వేద ప్రతిపాదకమని శ్రీవైష్ణవ విశిష్టాద్వైతం పరమత ఖండనం స్వమత మండనం అన్ని మతాల్లో ఉన్నదే కాని, ముఖ్యంగా ఇందులో వాడిన రూపకాలంకార ఉపమానాలు కవి పాండిత్యానికి ఉదాహరణలు

ఈ కావ్యంలో రామానుజుల తండ్రి కేశావాచార్యులు "భాగవతోత్తముల్ వచ్చినారని విన్న నెదురెగి తోడ్కొని యేగుడెంచు 1-12 ఆ అతిథి సేవ, తృతీయాశ్వాసంలో యతిరాజు రామానుజుడు శ్రీరంగంలో వేకువతోడనే వెడలి కావేరిలో నఘ ఘర్షణ స్నానమాచరించి" (3 88) అను వర్ణనలు పెద్దన మనుచరిత్ర ప్రథమాశ్వాసంలోని ప్రవరుని తలపించేవిగా ఉన్నాయి వివిధ పుణ్యక్షేత్రాల్లో విష్ణుమూర్తిని స్తుతించు సందర్భాల్లో కవి కావ్యనాయకునికంటె ముందుగా పోతన భాగవతంలో వలెనే నిండు భక్తితో పద్యరచన కావించారు

నిరుపమ పాండితీ విభవనిర్జిత పండిత మండలుండు శ్రీ
ధర కరుణా కటాక్ష పరిధావిత దుర్మత భూత సంఘుడా
దరమున సంయమీంద్రుడు శ్రిత ప్రకరంబును గూడి మ్రొక్కెదా
నురుతర కాంతి విస్ఫుర దహోబలనాధుని శ్రీ సనాధునిన్ - 4 91

శైవ వైష్ణవుల తగాదాల్లో విష్ణుమూర్తిగా మారిన తిరుమలేశుని రామానుజులు స్తుతించిన వైనమిది

యతిపతి వేంకటేశ్వరుని యద్భుత చర్యను గాంచి మ్రొక్కి సం
స్తుతి నొనరించె కారిసుత సూక్తులచే నిగమాంత వేద్యునిన్
శ్రితజన కల్పకల్పుని సరీసృప భూషణ శోభితాంగునిన్
పతగ కులేశ కేతనుని పాపవిభంజను భక్త రంజనున్ 4 99

వీరి రచనలు వైష్ణవభక్తి సంబంధమైనవి

**స్తుతి గీతములు** ఇవి పూర్వాచార్యుల సంస్కృత స్తుతి ప్రబంధాలకు తెలుగు పద్యానువాదాలు తేటగీతాలు

**మనోజ విజయ భాణము** సంఘ సంస్కరణాత్మక రూపకం అచార్యులు మొదట సంస్కృత గద్య పద్యాత్మకంగా వ్రాసిన ఈ దృశ్య ప్రబంధాన్ని తిరిగి తామే తెలుగు చేశారు రెంటిని ఒకే పుస్తకంగా ముద్రించారు భాణం సంస్కృత దశరూపకాల్లోని ఒకానొక దృశ్యకావ్య ప్రక్రియ

శతకాలలో 'శతవిధ బంధపద్యశతకం' వీరి అపూర్వ అద్భుత చిత్ర కవిత పైభాణం ఈ బంధ పద్య శతకం కవితమ ఇష్టదైవమైన నిమ్మనపల్లి - నంబులాద్రి స్వామి ఉత్సవ ఔన్నత్యవర్ణనలతో

రచించారు తమ గురుతుల్యులైన కోరుట్ల సేనాపతి నరసింహాచార్యుల "యోగ భాస్కరమ్' సంస్కృత కావ్యానువాదమే కృష్ణమాచార్యుల **గీతాచార్య మత ప్రభావ శతకము'**

**గాంధీతాత నీతిశతకం** - గాంధీజీ శతజయంతి, 1969లో దీనిని వ్రాసినా 1973లో ముద్రణ పొందినది కందపద్య బాలనీతి శతకం గాంధీజీ జీవితాంశాలు స్వభావాలతోపాటు ఇందులో నీతి వాక్యాలు కొల్లలుగా ఉన్నాయి ఇందలి రెండు పద్యాలివి

పరదేశీయుల పాలై - వరుసన్ పసజెడిన యట్టి భారతమాతన్
పరిపోషింపదలంచెను సరిగన్ మన గాంధి తాత సద్గుణ జాతా!
పరుడొకడు పైన బడగా - పురుషుండయి తాను పారిపోవుట కంటెన్
మరలుచు కొట్టుట మేలనె స్మరణీయుడు గాంధి తాత సద్గుణ జాతా!

ఇట్లా సంస్కృతాంధ్రాల్లో అనేక కావ్యాలను ఇహపరసాధనంగా రమణీయంగా రచించిన మహాకవి సిరిశెనహళ్ కృష్ణమాచార్య శతావధాని

పదములు సంగతార్థములు భావ వికాస విలాస సంపదా
స్పదములు, వాక్యముల్ నయవిచక్షణ దక్షతలజ్ఞజాల కం
పదములు, వేయు బల్కులను బల్కగ నేటికి తెల్పబూన నా
స్పదములుగావు దీనగల భక్తి విరక్తి సుముక్తి బోధముల్

అని ఈ కవి 1977లో శ్రీరంగ శరగోపాచార్యుల "మానస శతకం"ను ప్రశంసిస్తూ చెప్పిన పద్య విశేషణాలలోని విశేషాలన్నీ శతావధాని కృష్ణమాచార్యుల కవిత్వానికి చక్కగా అన్వయిస్తాయి

8 **దివిలె బట్టు నరసింహరాజు - శనిగరం**, 20వ, శతాబ్ది పూర్వార్ధం

నరసింహరాజు గారు హైదరాబాద్ మార్గంలోని కల్యాణి చాళుక్యుల ఏలుబడినాటి చారిత్రక పట్టణమైన శనిగరం గ్రామ వాస్తవ్యులు భట్రాజు సలక్షణంగా తెలుగుపద్య కవిత చెప్పినవారు వీరి ఏకైక పద్యకృతి పేరు "శ్రీవేంకటేశ్వర శతకము" 1929లో ముద్రితం [1] జన్మతేది తెలియలేదు 1950 సుమారుగా కీర్తిశేషులని వారి అన్నకుమారులు డి శ్రీహరి (ఆంగ్లకవి)కరీంనగర్ గారు తెలిపారు [2]

ఈ జిల్లాలో ముద్రణ పొందిన తొలి తరం పుస్తకాలలో నరసింహరాజు గారి శ్రీవేంకటేశ్వర శతకమొకటి ఇది కంద పద్యశతకం మకుటం 'సుందరాద్రి భవన విహారా !', ఇది కొన్ని పద్యాల్లో మారింది హుస్నాబాద్ మార్గంలోని సుందరగిరి వేంకటేశ్వర క్షేత్రం ఆ గ్రామం సమీపాన ఒకటి, అలతి దూరంలోని కొండపై ఒకటి వేంకటేశ్వరాలయాలున్నవి సుందరగిరినే సుందరాద్రిగా పేర్కొని, అక్కడి దైవాన్ని సంబోధిస్తూ, కవి ఈ శతకాన్ని చెప్పారు కవిత్వ పరిచయం

శ్రీలక్ష్మీ హృదయేశ్వర, నీలాంబుదవర్ణ స్వర్గనేతృస్తోత్రా (స్వర్గనేత = ఇంద్రుడు)
కాలస్వరూప చిన్మయ, పాలింపుము సుందరాద్రి భవన విహారా ! 9 ప
క్షీరాబ్ధి శయన సంగర, శూరా విబుధప్రశస్త శోభిత గాత్రా
వైరి కుల వినాశన సుమ, శర సుమశర సుందరాద్రి శరణ శరణ్యా ! [3] 80

---

1 ఈ శతక పుస్తకం రేకొండ గ్రామంలో దేవత వేంకటరాజం కవిగారి పుత్రుడు డి శ్రీనివాస్ వద్ద లభించింది 1991

2 శ్రీహరిగారు రిటైర్డ్ ఇన్స్పెక్టర్ ఆఫ్ స్కూల్స్ అనేక పర్యాయాలు కలిశారు

3 చివరి చరణం మొదటి అక్షరం దీర్ఘంగా ఉండాలి కంద పద్యంలో నాలుగు పంక్తుల ఆద్యక్షరాలు లఘువులో, గురువులో అయి ఉండాలని ఛందోనియమం

పై పద్యంలోని యమకాలంకారం గమనార్హం సుమశర సుమశర మన్మథ మన్మథుడని భావం సాక్షాన్మన్మథ మన్మథ అని శ్రీమద్భాగవత ప్రయోగం భక్తి భావ సంభరితమైన ఈ శతకంలోని మరో పద్యం ఇది

నీవు వినా తలిదండ్రులు, నీవు వివాబాంధవాళినిన్ నమ్మనునే
భావమున నన్ను బ్రోవగ, భావించుము సుందరాద్రి భవన విహారా ! 8

ఈ కవి భాష - భావాలు సరళం ఈ పద్యాలపై శ్రీకృష్ణ శతక ప్రభావముంది దివిలె నరసింహరాజు గారు భక్త కవి

**9 విష్ణుదాస గిరిధర కవి - గుండేడు** తా హుజూరాబాద్ మృతి 1942

గిరిధర రావు పేరుతో గోలకొండ కవుల సంచికలో 'రాష్ట్రమాత' పద్యాలున్నాయి [1] అందులో కవి స్వగ్రామనామం తప్ప ఇతర వివరాలు లేవు విష్ణుదాస గిరిధర కవి పేరుగా 'వీరభద్ర విజయం' కావ్యం లభించింది [2] వీరిద్దరు ఒక్కరే గిరిధర రావు గారి స్వగ్రామం గుండేడు జన్మగ్రామం చల్లగరిగె. ఇది పర్కాల తాలూకాలోనిది ఇప్పుడు వరంగల్ జిల్లాలో ఉన్నా ఆంధ్రప్రదేశ్ అవతరణకు పూర్వం కరీంనగర్ జిల్లాలోనిది విష్ణుదాస గిరిధరరావు గారి అన్న గారు లక్ష్మీకాంతరావు ప్రముఖ కవి బహు గ్రంధకర్త గార్లపాటి రాఘవరెడ్డి గారికి విద్యాగురువు తర్వాత రెడ్డి గారితో కలిసి జంట కవిత్వం చెప్పి ఉభయులు రాణించినవారు వీరి తండ్రి శ్రీధరుడు గిరిధర రావు చల్లగరిగె నుండి గుండేడుకు దత్తు వచ్చారు [3] వీరు నియోగులు - కరణ బ్రాహ్మలు గిరిధర రావు గారి భార్య మధురాబాయమ్మ గారు కూడా భక్తిపాటలు వ్రాశారు ఈమె 1969లో కన్నుమూశారు గిరిధర రావు గారి రచనలు ఈ రెండు పుస్తకాలుగా వచ్చినవి **1 వీర భద్రస్తవము** - 1931 ప్రచురణ 2 శ్రీదుర్గేశ్వర భజనకీర్తనలు - ముద్రితం

వీరు పెక్కు రచనలు చేసినా, అవి అప్పుడు అముద్రితాలు, ఇప్పుడు అలభ్యాలు శ్రీ దుర్గేశ్వర భజన కీర్తనలు హన్మకొండలోని కనకదుర్గ స్తుతిగా వ్రాసినవి శాస్త్రీయ సంగీతం జోడించి వ్రాయబడినవి అక్కడి భక్తులు వీటిని పుస్తకంగా ముద్రించారు, భజనలకు పాడుకున్నారు

వీరభద్రస్తవము - కవి గారి భార్యమధురాబాయి, గ్రహబాధాపీడితురాలైనప్పుడు, ఆ దుష్టగ్రహబాధా నివారణార్థం ఈ వీరభద్ర కావ్యరచన కావించినట్లు పీఠికలో తెలిపారు ఈ స్తుతి ప్రబంధం ముప్పది పుటలు పద్యశైలి ప్రసన్నంగా ఉంది సలక్షణ కవిత మకుటం పాటించి ఉంటే ఇది శతకం అయి ఉండేది కవి స్వంత తాలూకా హుజూరాబాదులో కొత్తకొండ అనే వీరభద్ర క్షేత్రమున్నది ప్రతియేటా మకరసంక్రాంతి పర్వసందర్భాన మూడుదివాలు అక్కడ జాతర జరుగుతుంది వీరభద్రుడు ప్రమథ గణముఖ్యుడైనా శివపుత్రుడుగానే జానపదుల విశ్వాసం కరీంనగర్ జిల్లాలోని కొత్తకొండ వీరభద్రస్వామి స్తుతి కావ్యం గిరిధర రావు గారి ఈ పద్యస్తవ కృతి వీరభద్ర జన్మవృత్తాంతము, మహత్వము ప్రధాన వర్ణనాంశాలుగా సాగిన ఈ కావ్యారంభ పద్యమిది

శ్రీ దుర్గేశుని తత్సతీ మణిని నా చిత్తంబులో నెంచి యా
మీదన్ దంతి ముఖున్నుతించి పిదపన్ మేధోబలోద్ధామునిన్
ఆ దక్షాధ్వర నాశనార్థ జనితో ద్యద్బాహు సాహస్రునిన్
వేదాతీతుని వీరభద్రుని మహావీరున్ బ్రశంసించెదన్

---

1 గోలకొండ కవుల సంచిక-1934 కవి నం 299, పు-310

2 ఈ పుస్తకం కమలాపూర్ మండలంలోని గూడూరు వాస్తవ్యులు కీ శే గంగురామకృష్ణయ్యగారి గృహ గ్రంథాలయంలో ఉంది 1993

3 ఈ కవి జీవితవిశేషాలు వీరి దత్తపుత్రులు వి సాంబశివరావుకవిగారు, తేది 23 3 94 లేఖలో తెలిసినవి

సుకవిస్తుత్యనంతరం కుకవులనిట్లా అభిశంసించారు

వ్రణము గని యీగ చప్పున వ్రాలునట్లు, వికృత వృత్తిని రంధ్రముల్ వెదకునట్టి
కుకవి జనులను ప్రార్థింతు కొమరు మీర, మంచి జూచియు మది సంతసించుడనుచు - 10

కవి తనను గూర్చి వినయంగా ఈ విధంగా మనవి చేసుకున్నారు

లలిత పదార్థ గుంభన సలక్షణ వృత్తములన్ రచింప శ
క్తులగు కవీంద్ర బృందములతో దులదూగు కవిత్వసారము
న్నల వడ నేరదైనను బుధాళి మనంబున నెంత్రుగాక నా
పలుకులు పాలితాత్మ శుక వాక్యములంబలె నిండు ప్రేమతో 4

ఇందులోని సారమున్నలవడ అన్నిష్టసఖివంటి సంధి శుక వాక్యములోని శ్లేష గమనార్హం శుక = చిలుక, శుకమహర్షి

వీరభద్రస్తవం సంపూర్ణ శివభక్తి కావ్యం ఇందలి వీర భద్ర స్తుతి పద్యమొకటి "సుమన మనోంబుజా' అనేది ఇదే ప్రకరణంలోని గో క సం కవుల వరుస నం 37లో చూపబడింది పద్యం 102లో శరభ సాళ్వావతార ప్రసక్తి ఉంది గో క సం లోని వీరి 'రాష్ట్రమాత' పద్యాలు కవి జన్మదేశ మాతృభాషాభిమానాలను చాటేవిగా ఉన్నాయి గిరిధర రావు గారు పండిత కవి

**10) ఎదులాపురం బ్రహ్మానంద వేంకట నరసింహాచార్యులు, మొగిలిపాలెం,** మండలం కేశవ (శంకర) పట్టణం

నరసింహాచార్యులు విశ్వబ్రాహ్మణులు మొగిలి పాలెం వాస్తవ్యులు ఈ ఇరువదవ శతాబ్ది పూర్వార్థంలో జీవించినవారు ఈ వరకవి రచించిన ఏకైక కృతి 'కంచి కామాక్షి శతకము' 1931లో ముద్రణ పొందింది కవి పరిచయం శతకాంత గద్యలో ఇట్లా ఉంది

"శ్రీమత్ పోతులూరు వీరబ్రహ్మేంద్ర స్వాముల వారి మఠాధ్యక్షులైన శ్రీమత్ నుమనుము (?) గోవిందస్వాముల ప్రియశిష్యుండగు మొగులుపాలెం పురవాస్తవ్యులు నగు శ్రీమద్రాజరాజేశ్వరి వరప్రసాద కుడగు బ్రహ్మశ్రీ యెదులాపురం బ్రహ్మానంద వేంకట నరసింహాచార్యులచే రచింపబడి ' దీనిలో తల్లిదండ్రుల పేర్లు లేవు

వీరి కవితలో గణభంగ పాదాలు, జెయము, బంగురు వంటి గ్రామ్య పదాలున్నవి వరకవులలో ఇది సహజం శతక మకుటంలోని 'ఘనముఖుల' ఈ జిల్లాలోని ఘన ముక్కుల గ్రామ దేవతను సంబోధించి ఈ శతకరచన కావించి ఉండవచ్చు ఘనముఖల అంటేగణభంగం కూడా కాదు కవి ఇంటిపేరు 'యెదులాపురం' అని అన్నారు అది ఏదులపురం అనుకోవచ్చు అది నేటి హుజూరాబాద్ పట్టణానికి పూర్వనామం

కంచి కామాక్షి శతకంలో 125 సీస పద్యాలున్నాయి మకుటం గీత పద్యం చివరి రెండు చరణాలు కవి కవన పరిచయానికి ఒక పద్యం ఇట చూపబడుతున్నది

సీ శ్రీ విరాడ్బ్రహ్మయౌ చిద్రూపు రాణివి, భావంబు నను నేను ప్రణుతి జేతు
శ్రీ స్వరాడ్బ్రహ్మ స్వచిత్స దా నందు (ను), కేవలంబునయే (కే)ను కేల్మొగింతు (కేల్మొగిచెద)
శ్రీవిశ్వ బ్రహ్మ సంశ్రిత పంచముఖజు చేమన్వాది బ్రహ్మల మదిదలంతు
జీవేశ్వరుల గురుజననియౌ గాయిత్రి (య) దేవి నెమ్మదిని సదేవ దలతు (సదైవ)

గీ పంచ వేద సమాత్మకన్ బ్రస్తుతింతు, పంచ పంచీకరణము ప్రపంచ మెంతు
కంచి కామాక్షి ఘనముఖుల కమల జాక్షి, పంచ బ్రహ్మల పాలించు బ్రహ్మ సాక్షి

కంచి కామాక్షి, మధుర మీనాక్షి, బెజవాడ కనకదుర్గ, చాందా సికిందరాబాదు మహంకాళి శక్తి మూర్తులను ఈ ప్రాంతపు జానపదులు తలిచేవారు హన్మకొండ పద్మాక్షిని పార్వతీ దేవిగానే చెప్పుతున్నా ఆపేరు అంతగా వ్యాప్తిలో లేదిక్కడ ఈ కవి కాళిని కమలాక్షి అని సంబోధించారు అంటే పద్మాక్షి అనే అర్థం ఇది భక్తి శతకం !

**II) ఆనందమాంబ - కొడిమ్యాల**, జననం 1922 మృతి 1994

ఆనందమాంబ చిన్నవయసులోనే సంస్కృతాంధ్ర భాషలలో పాండిత్యం సముపార్జించి పన్నెండవ ఏటనే తెలుగు కావ్యము రచించిన కవయిత్రి ఈమె అష్టావధాని గోలకొండ కవుల సంచికలోని నలుగురు కవయిత్రులలో ఈమె ఒకరు [1] కరీంనగర్ జిల్లా వెయ్యేండ్ల తెలుగు సాహిత్య చరిత్రలో మొట్టమొదటి కవయిత్రి ఆనందమాంబ

**ఈ కవయిత్రి రచనలు**

1 వెలమ వీర, 2 మాధవ పంచాశత్, 3 సతీలలామ 1934లో ముద్రితం

మొదటి రెండు కృతులు అలభ్యాలు వాటిని గూర్చి కవయిత్రి కూడా చెప్పలేదు కాని, శతావధాని సిరిశినహళ్ కృష్ణమాచార్యులు గారు తమ స్వీయ చరిత్రలో ' ఈరెండు పుస్తకములు కవయిత్రి వ్రాసినట్లు చెప్పినారు [2] కాని ఇప్పుడవి లేవు 'సతీలలామ' ఏకాశ్వాస పద్యకావ్యం మాత్రం ముద్రితం [3]

**వంశ వివరాలు** ఆనందమాంబ ఆనందబాయి అని సతీలలామ కావ్యంలోని ఆచి వేంకట నృసింహాచార్య శాస్త్రి గారి పీఠిక వలన తెలుస్తున్నది [4] జగిత్యాల తాలుకాలోని కొడిమ్యాల స్వగ్రామం పునుగోటి బుచ్చమ్మ మంగారావు గారలు కవయిత్రి జననీ జనకులు స్త్రీ విద్యకు ఆదరణలేని ఆ కాలంలో తండ్రి ప్రోత్సాహం లభించి ఆనందమాంబ విద్యాభ్యాసం జరిగింది ఒక భట్టు మూర్తి ఆంధ్రభాషా సాహిత్యాలు నేర్పగా, శతావధాని కృష్ణమాచార్యుల వద్ద మూడేండ్లు సంస్కృత పంచకావ్యాలు, శాకుంతలం, ఉత్తరరామచరిత నాటకాలు చదివారు [5]

అమె మేనమామ బండలింగాపూర్ సంస్థానాధీశులైన అనంత కిషన్ రావు గారు తమ అధ్యక్షతలో ఆనందమాంబ గారిచే అష్టావధానం చేయించి సంతసించి 'కవయిత్రి బాలసరస్వతి' అను బిరుదాన్ని ఇచ్చారు [6] ఆ తర్వాత ఈ రాజా వారి మేనల్లుడైన భూమారావు బి ఏ గారితో ఆనందమాంబ వివాహం జరిగింది వారిది మెట్టుపల్లి తాలూకాలోని వేములకుర్తి ఆనందమాంబ గారు హైదరాబాద్‌లో ఇటీవల కీర్తిశేషులైనారు

**కావ్య విశేషాలు**

ఆనందమాంబ గారి 'సతీలలామ' ముప్పది పుటల చిరుపొత్తం ఇది ఏబది పద్యాల ఏకాశ్వాస నిర్వచన పద్య కావ్యం చివర నీతిశాస్త్ర శ్లోకాలను కొన్ని (9) ఆంధ్రీకరించారు స్తుతి గీతములు పేర 'అఖిల గుణభూష యానందమాంబ పోష' అనుమకుటంతో విష్ణుప్రశంసగా బాలకృష్ణ లీలలను వర్ణిస్తూ భక్తి ప్రపత్తులతో పది తేటగీతి పద్యాలను వ్రాశారు (పు 25 27) కవయిత్రి కావ్యారంభం శ్రీదేవి స్తుతి ఇది

---

1 గోలకొండ కవుల సంచిక 1934, కవిత నం 279

2 స్వీయ కవితాను జీవనమ్ 1986, పుట-44

3 కవయిత్రి దగ్గర కూడా లేని ఈ కావ్యం అచ్చుప్రతి ఎక్కలదేవి లక్ష్మణకవి కోరుట్లగారి వద్ద లభించింది 4 సతీలలామ-1934, ఉపోద్ఘాతాము పు-3

5 ఏస్ కృష్ణమాచార్యగారి 'స్వీయ కవితాను జీవనం' పు 44

6 ఎస్ కృష్ణమాచార్య గారి 'స్వీయ కవితాను జీవనం' పు 45

ఉ శ్రీలలనా మనోహరుడు జెన్నుగ ముజ్జగ మేలుచుండగన్
లీలగ సూకరంబయిన నీరచరంబయి యున్న బాయకన్
స్త్రీ లకు లోకమందు పతి సేవయె ధర్మమటంచు దెల్పు మా
పాలిటి దైవ మైన సిరి పాలన జేయును గాత నిత్యమున్

పతి ఏ రూపంలో ఉన్నా అతని వెన్నంటియున్న లక్ష్మీ సతీలలామ తమను పాలించాలని కవయిత్రి వేడికోలు స్త్రీ రచించిన కావ్యం స్త్రీలకు సంబంధించిన విషయం కనుక ఆమె స్త్రీ దేవతనే కావ్యారంభ పద్యంలో స్మరించి ఔచిత్యాన్ని పోషించారు కావ్యేతివృత్తం కూడా ఈ పద్య భావంలో ధ్వనించడం విశేషం ఈ బాల కవయిత్రి కావ్య ద్వితీయ పద్యంలో శారదాదేవిని ఇట్లా నుతించారు

సీ వెలిదమ్మి పువ్వున విలసిల్లి యొక కేల, వీణ వాయించెడు వెలది యెవరు
పొత్తంబు నొక చేత పొసగ ధరించియు, తొలిపల్కులను బాడు కలికి యెవరు
రాయంచ పైనను రమ్యంబుగా నెక్కి, ముజ్జగంబుల దిర్గు ముదిత యెవరు
తలచిన వారికి దయతొ విద్య నొసంగు, నలుమొగంబుల ప్రోడ నాతి యెవరు
గీ అట్టి నీవును నా మనంబందు నిలిచి, ప్రేమమును నిల్పి పుడమిలో పేరు మించు
కబ్బముల గూర్చగా శక్తి గలుగ జేము, మమ్మ మాయమ్మ నినుదలతు నమ్మవాణి

వెలి దమ్మి, కేలు, వెలది, పొత్తము, రాయంచ, ముదిత, కబ్బము అచ్చ తెలుగు పదాల ప్రయోగం కవయిత్రి తెలుగు భాషా ప్రీతికి, తొలి పల్కులు - వేదములు, నలుమొగంబుల ప్రోడ బ్రహ్మ పదాల ప్రయోగం పాండిత్యానికి నిదర్శనం ఇందలి దయతొ, చే చేతన్ తో తోడన్ తృతీయా విభక్తి ప్రత్యయాలు దీర్ఘంగా ఉండవలసిన వానిని హ్రస్వంగా వాడడం బాల కవయిత్రి ప్రయోగంగా సరిపెట్టుకోవచ్చు నినుదలతు గణభంగం నినుదల్తు పదం ముద్రారాక్షసం కారణంగా మారవచ్చు

శతావధాని కృష్ణమాచార్య గురువరులకు వందన మాచరించి,

కం కవులన్ మ్రొక్కుచు మది దు, ష్కవులన్ విడనాడి యొక్క కబ్బంబును నే
భువి గూర్చు చుంటి నందున, చవి గొని తప్పులను దిద్ద జాలుదురు బుధుల్ - 4

అని తర్వాతి పద్యంలో పతి భక్తి ప్రభావాన్ని వర్ణించి సతీలలామ కావ్య కథారంభం కావించారు కవయిత్రి సీత, సావిత్రి దమయంతి, చంద్రమతి (18), అనసూయ (19) ల పాతివ్రత్యమహిమల పొగిడారు పతివ్రత శాపం పొంది దాని నివృత్తికోసం ధర్మవ్యాధుని దగ్గరికి వెళ్ళిన కౌశికుని కథ (23 30) ఎనిమిది పద్యాల్లో వివరింపబడింది ఇంగ్లీషు చదువుల మిడిమేలపు చేష్టల ఆధునిక యువతులు, పతుల అగౌరవ పరుస్తూ ఏ విధంగా దిగ జారిపోతున్నారో వర్ణించారు (30 34) కులహీన విద్య, మాతృభాషాభిమానరాహిత్యం అందుకు కారణమంటూ ఇట్లా హితోపదేశం చేశారు ఉ॥ స్త్రీలకు నన్ని ధర్మములు చిన్నతనంబున నేర్పి బుద్ధి సంచాలన మొందజేయగను సాధ్విని జేయగ మాతృభాషయే మూలము దానినే చదువ బూనిన వారలు లోకమందు సచ్ఛీలురు లేనిచో సుదతి జీవన మంతయు నిష్ఫలంబగున్ - 36 కవయిత్రి మాతృభాషాభిమానం ఆదర్శ ప్రాయమైనది ఇంకా బాల్యవివాహాల నిరసిస్తూ, స్త్రీ విద్యావ్యాప్తిని ప్రశంసిస్తూ దేశాభ్యుదయాన్ని ఆకాంక్షించారు (39-40)

గీ విద్య గల వారె జగతిలో వీర వరులు, విద్య లేనట్టి వారలు వెఱ్ఱివారు - 44

అని జనానికి హితాన్ని ప్రబోధించారు ఈ కృతి చిన్నదైనా ఆశయంలో మిన్నది

**12 కమరం వేంకట రామానుజం - మన్నెంపల్లి** జీవితకాలం 1910 80 సుమారు

కమరం రామానుజంగారు చాత్తాద వైష్ణవులు కరీంనగర్ జిల్లాలోని నాటి మొలంగూరి పరగణా నేటి తిమ్మాపూర్ మండలంలో మన్నెంపల్లి వాస్తవ్యులు ఆయన వైద్యవృత్తిలో జీవించిన వైష్ణవభక్తుడు,

కవి వేంకట రామానుజంగారి తల్లి రామాంబ, తండ్రి రామానుజంగారు తన పేరు కావ్యగద్యలలో రామానుజ దాసుగా చెప్పుకున్నారు కవి ధర్మపత్ని శేషాంబ వేంకట రామానుజంగారు బహుగ్రంధకర్త[1]

**ఈ కవి ముద్రిత గ్రంథాలు** 1 శ్రీమనోహర శతకము 1942, 2 శ్రీకమలాక్షి పతివ్రత కథ - (పద్యకావ్యం) 1946, 1355 ఫసలీ, 3 సీతా కల్యాణము బుఱ్ఱకథ, 1959, 4 గజేంద్రమోక్షం బుఱ్ఱకథ 1961, 5 శ్రీ సీతారామ చరిత్ర - పద్యకావ్యం 1965

**అముద్రిత రచనలు** 1 శ్రీరామాయణ గీతలు, 2 తందనాన పరకాల బుఱ్ఱకథ, 3 తిరుమంగయాళ్వారు బుఱ్ఱకథ, 4 చంద్రహాస చరిత్ర, 5 ఉత్తర కాండము ద్విపద, 6 శ్రీ భద్రాద్రి సీతారామస్తోత్రమ్, 7 తొండరప్పొడి యాళ్వారుల వైభవము బుఱ్ఱకథ (విప్రనారాయణ కథ)

కవి 'గజేంద్ర మోక్ష బుఱ్ఱకథ' కావ్య గద్య ఇట్లున్నది

"ఇది శ్రీమాన్ తిరుమల ధర్మాచార్య పాదరాజీవ షట్చరణమాన శ్రీకమరం వంశ పయ పారావార రాకాసుధాకర రామానుజధర్మపత్ని రామాంబ గర్భశుక్తి ముక్తాఫల శ్రీ భాగవత విధేయ వేంకట రామానుజ దాస ప్రణీతంబైన గజేంద్రమోక్షణ కథ సమాప్తము" 1961

**కావ్య పరిచయం**

1 **శ్రీమనోహరశతకం** 1942 ముద్రణ ఇది విష్ణుభక్తి మయం 'శ్రీమనోహరా' అను మకుటంతో చంపకాలు వ్రాసే వీలున్నా కవి కేవలం ఉత్పలమాలతోనే శ్రీపతిని అర్చించారు శతాకారాంభ పద్యం

ఉ శ్రీ రమణీ మణీ రమణ సింధు కృపాకర భక్తలోల వి
స్తార దురంత పాతక వితాన విదార సమస్త దేవతో
ద్ధార పరాశరాది ముని తత్వ విచార పదార్థ ఘోర సం
సార విచారణా నిరత సౌఖ్య శుభప్రద శ్రీ మనోహరా

ఈ పద్యంలో ఒక్క తెలుగుపదం కూడా లేదు అన్నీ సంస్కృత పదాలే

చూడగలేదు శాస్త్ర గుణ సూక్తులు తల్లియుదండ్రి నీవె దీనుడ దుష్టమానువుడ ఏరిని గొల్వ పోనెరుగ ఇటువంటి ఎత్తుగడలతో హరిభక్తితో రచించిన ఈ శతక పద్యాలలో ఈ కవి దుష్టమానవ నింద తక్కువగా చేయలేదు రామాయణ గాధను స్మరించారు

2 **కమలాక్షి పతివ్రత కథ** ఈ చంపూ కావ్యం 1946లో ముద్రింపబడింది ఈ కావ్యంలో నాటకం వలె కొన్నిచోట్ల పాత్రల ప్రవేశం సూచింపబడింది పురాణ కావ్యగాధలలో వలె సన్నివేశ వివరణ వాక్యాలు కూడా ఉన్నాయి తొహరలు, కీర్తనలు దర్వులు, పద్యాలు, వచనాలు ఉన్నవి ఈ కావ్యాన్ని హరికథగా చెప్పవచ్చు కాని, కవి అట్లా కావ్యాన్ని నామాంకితం చేయలేదు ఈ కావ్యంలోని వచన భాగాలు బాలకవి జి లక్ష్మారెడ్డి వ్రాసినట్లు కవి చెప్పుకున్నారు

ఇందలి కథ కల్పితం దూర్వాసుడు నారదునితో పంతమాడి పోయి కాశీపురిలోని కమలాక్షి అను సాధ్విని ఆమె భర్త నారాయణ శాస్త్రి రూపాన భంగపరుచ ప్రయత్నించడం ఉంది ఇది అహల్యను చెరచుటకు మాయా గౌతమ రూపుడైన సురేంద్రుని, తులసిని భంగపరచిన మాయా జలంధర రూపధారియైన విష్ణుమూర్తి గాధలను అనుసరించిన కథ ఈ కావ్యనాయిక శీలమునకు ప్రమాదం వాటిల్లకపోవడం విశేషం ముని ఆమె పాతివ్రత్యానికి వెరచి ఆత్మగతంగా వాపోయిన పద్యం ఇది

సీ నారదుచే నేను నాడిన శపథంబు, బూదిలో నాజ్యంబు బోసినట్లు
నాయె నికేమి యీ నాతి బతివ్రత, శెపియించెనా నాకు చేటు గల్గు

---

1 కవిగారి ముద్రిత పుస్తకాలను అముద్రిత రచనల వ్రాత ప్రతులను వారి దౌహిత్రులు నరసయ్య తెలుగు పండిట్ గరిశెకుర్తిగారు అందించారు

నని చాల చింతించి తానాననంబెత్తి, సురరాజు సభకెట్లు సొచ్చువాడ
సొచ్చితి బో మౌని సూరి జనంబుల, ముందర నేనెట్లు ముచ్చటింతు
గీ కాన ప్రస్తుత మీమెను గారవించి, పాదముల కెరగి మన్ననల్ బడయమేల
టంచు మదినెంచి దనరూపు దాల్చి ననియె, తల్లి నీబోటి సాధ్వినీ ధరణి గాన

ఇది కరుణశ్రీ కుంతీవిలాపాన్ని, సూరన కళాపూర్ణోదయ రంభ పరాభవ వేదనను తలపించే భావం ఈ కవికి భావంపై ఉన్న దృష్టి శబ్దాల పొందిక అలంకారాల కూర్పుపై లేదు యతిగణాలు కూడా కొన్నిచోట్ల తప్పడం గ్రామ్యపదాల ప్రయోగం కవి విద్వాంసులు కారనడానికి నిదర్శనం

3 **సీతారామ కల్యాణం** ఇది బుఱ్ఱకథ 1959లో ముద్రితం పూర్వ కావ్యద్వయంలో రామానుజ విరచితం అని పేర్కొన్న కవి స్వీయనామాన్ని ఈ కృతిలో రామానుజదాసుగా వ్రాసుకున్నారు

ఇందులో పాటలు పెద్దవి వచనాలు తక్కువ కథకునికే కాక వంతకులకు కూడా గ్రాంధిక భాష ప్రయోగింపబడింది కోస్తాంధ్ర క్రియా పదాలతోపాటు పాలించినరు వంటి తెలంగాణా మాండలిక పదాలు సైతమున్నవి తందాన, రామరామ, అరే-వంత పదాలు విషయం ప్రఖ్యాతమైనది పౌరాణికం

4 **గజేంద్రమోక్షం బుఱ్ఱకథ** (కరి రక్ష మకరి శిక్ష) 1961

ఇది బాగవతంలోని కథ కథారంభమిట్లుంది
వినుండయ మీరు వినుండయ, గజరాజు చరితాము వినుండయ
గజరాజు చరితాము కర్ణాన బడినంత, గజిబిజి వ్రయమౌను కమలాక్షు కరుణించు

పద సాధుత్వం తప్పినా పాట లయ మాత్రం తప్ప లేదు మచ్చునకొక పద్యం

కం॥ యిద్దరు తల్లుల కీవతి, ముద్దుల బిడ్డండవైన ముక్కంటి సుతా
పెద్దోదర దేవర నా, పద్దెములను దిద్ద మిమ్ము ప్రార్థింతుమదిన్

ఈ పద్దెంలో యతిగణ ప్రాసలు చక్కగా అమరినా పద్యాదిపద అచ్చుకు యకారం పెద్దోదర దుస్సంధి వ్యాకరణ భంగాలు ఈనాటి వస్తూంది, వస్తోంది, వాణ్ని దుష్టసంధులే

ఒక వచనం "వంతకుడు గజిబిజి యేంటి గజరాజేంటి మేం వినేదేంటి? వింటే మాకు వచ్చేదేంటి? వూర్కే వొర్లుతావేంటి?" ఒఱ్రు - ఒర్లు = అరచు పదానికి ఇవి ఈ ప్రాంత మాండలికాలు వూర్కే, యడాగమం వలె, వడాగమం మన వ్యావహారికంలో ఉందే ఏవూరు? రావమ్మ! లో తమిళ కన్నడ భాషలలోవలె [2] కాని, మన తెలుగు వ్యాకరణవేత్తలు ఇంకా దీన్ని సరియనలేదు ఈ నాటి వస్తూంది, వస్తోంది, వాణ్ని దుష్టసంధులే

సిరికింజెప్పడు, భాగవత పద్యాన్ని గేయంగానూ, అలవైకుంఠపురంబులో పద్యాన్ని యధాతథంగానూ కవి ఇందులో వాడుకున్నారు పై నాలుగు పుస్తకాలు 20 30 పుటల చిరు కృతులు

5 **శ్రీ సీతారామ చరిత్ర** - ఇది రామాయణ గాథ చంపూ కావ్యం అధ్యాయాలు లేవు కాని, రచన పెద్దది పద్య సంఖ్య లేదు దాదాపు వెయ్యి గద్యపద్యాలుంటాయి [3] 1965లో ముద్రింపబడింది ఈ కావ్యంలో కవికి రామునిపై గల భక్తి అపారం

శ్రీరాముని దయగలదో, నారాముని చరిత మమృత సార సముద్రం (యతి? పైగా నా యా!)
వేరేతి గ్రోలగలనిక నేరీతియు శక్తి గలదికేమనువాడన్

---

2 మాలా+ఐ = మాలావై (తమిళం) మాలను అని తెలుగు, మూరు+అరె = మూరు వరె (కన్నడం) మూడున్నర అని తెలుగు

3 107 పుటలు × 9 సగటున గద్యపద్యాలు = 956 మొత్తం

పైది ఆరంభ పద్యం రెండవ పద్యంలోని వినయ ప్రదర్శనమిది

పోతననుగాను రాముని ప్రోత్సహించ, భాస్కరుడ గాను రాముని బ్రస్తుతించ
ఆంధ్రవాల్మీకినా రామునను భవింప, యెంతవాడను రామునే నెరుగుటకును

ఇది 'పుట్టంబుట్ట శరంబునన్ మొలువ' - పోతన పద్యానికి అనుసరణం ఆంధ్రవాల్మీకి వావిలికొలను సుబ్బారావుగారు - 1937 మృతి కథాగమనం ఈ విధంగా ఉంది ఆంజనేయుడు లంకాదహనం కావించిన తరవాత,

మరల సీతను గనుకొని మాటలాడి, సెలవు బొందియు రాముని జేర నరిగి
కంటి సీతను మీ దేవి కరుణ వలన, మిమ్ము జేరితి, కుశలమా మీకురామ !

రామానుజంగారు వరకవి వీరి పుస్తకాలు ఓరుగల్లులో ముద్రితమై, సికిందరాబాద్‌లోని ప్రముఖ పుస్తక వ్యాపారులచే విక్రయింపబడ్డవి ప్రతులు అయిదారు వందలే వెల అణాల్లో - మించితే ఒక రూపాయి సీతా చరిత్ర కావ్యం వ్రాసిన వటపురి వేంకటాచార్యులతో ఈ కవికి పరిచయమున్నది వారి కావ్యం 1961 లో వెలువడింది దాని ఒక ఆశ్వాస ముద్రణకు ద్రవ్యసహాయంచేసి మిగిలిన రెండు ఆశ్వాసాలకు దాతల చూపిన ఉదారుడు రామానుజకవి వేంకటాచార్యుల సీతా చరిత్ర ప్రేరణతోనే రామానుజంగారు ఈ రామకథ వ్రాసినట్లున్నారు వారి వ్రాత ప్రతులలో 'శ్రీరామచరిత్ర' అనే ఉంది అచ్చులోనే శ్రీ సీతా రామచరిత్రమని వెలువడింది

**అముద్రిత రచనలు**

1 **శ్రీరామాయణ గీతలు** ఇది తేటగీతి పద్యాలలో ఉంది ఆరు కాండలలో మొత్తం 69+54+156+166+232+327 కృత్యాది 5 కాండాంత వృత్తాలు 7 సంక్షిప్త రామాయణం 29 మొత్తం 1045 పద్యాలున్నాయి ఇది నిర్వచన పద్యకావం వ్రాసిన కావ్యమే తిరిగి వ్రాయడం కవి రామభక్తికి నిదర్శనం కవిత ముద్రిత కావ్యాలకంటె దీనిలో కొంత మెరుగైంది

2 **పరకాల బుర్రకథ** తమిళ వైష్ణవ భక్తులైన పన్నిద్దరాళ్వారులలో ఒకరైన తిరుమంగైయాళ్వారు చరిత్ర అతడు పరులకు కాలుని (యముడు) వంటి వాడు విష్ణుభక్తులకు కొంగు బంగారం!

3 **తొండరప్పొడియాళ్వారు** విప్రనారాయణ చరిత్ర శైవుల మల్హణుని పోలిన వాడీ విప్రనారాయణ ఇద్దరూ వేశ్యాప్రియులు శివకేశవులచేత రక్షితులు దీనిని కవి బుఱ్ఱకథగా రచించాడు

4 **చంద్రహాస** - చంపూ ప్రబంధం కమలాక్షి కథవలెనే ఉంది ఇందులో పాటలు లేవు కృతి చిన్నది ఈ జైమినీ భారత మూల కథ యక్షగాన రూపాన బహుళజన ప్రచారం పొందింది

5 **ఉత్తర కాండము** - ద్విపద కావ్యం గాన యోగ్యం ఈ దేశిచ్ఛంద కావ్యం అసంపూర్ణం రచింపబడిన 82 పుటల్లో రావణ కథే అధికం అప్పటికి కుశలవులు రంగప్రవేశం కావించలేదు పూర్తి అయితే ఇది పెద్ద కావ్యమే

6 **శ్రీ భద్రాద్రి సీతారామ స్తోత్రమ్** - ఈ చిరుకృతి ఉత్సాహ వృత్తాల్లో ఉంది

రామానుజదాసు గారు మిత విద్యా పరిజ్ఞానంతోనే నాటి మహాపండిత కవులకే సాధ్యంకాని రీతిలో దశాధిక గ్రంథాలు వివిధ ప్రక్రియలలో రచించిన భక్తకవి శ్రుత పాండిత్యం హరిభక్తి ఈ కవిగారికి తోడు నీడలై సహకరించాయి ధారణాశక్తి కవితాధార ఈ కవిగారికి అపారమని వినికిడి దానికితోడు వ్యాకరణ ఛందోలంకార గ్రంథాల పఠించి ఉంటే కవి కావ్యాలు బంగారానికి తావి అబ్బినట్లుగా ఉండేవి

13 **ఆనందయ్య - వడ్లూరి బేగంపేట,** 1940 సుమారు ఆనందయ్యగారు శివయోగి

వీరి రచన - 1 నందుల మరానంద గురుబోధ, ముద్రితం ఆనందయ్యగారి ఊరేదో పేరేదో కులమేదో వయస్సెంతో ఎవరికీ తెలియదు బెజ్జంకి సమీపంలోని బేగంపేటలో 'నందులమరం' స్థాపించి అక్కడే నివసించేవారు శిష్యబలగం బాగానే ఉండేది దాదాపు ఏబదేండ్ల క్రితం అక్కడే తనువుచాలించారు వారి సమాధి ఇప్పటికి భక్తులకు ఆరాధనీయ స్థలంగా ఉంది

ఆనందయ్యగారు వీర శైవ మతాభిమాని - వరకవి వారు శివభక్తి ప్రబోధం కావించేవారు శిష్యులకు ఉపయుక్తంగా ఉండే విధంగా పాటలు పద్యాలు రచించారు గురువుగారి రచనలను (అదే పుస్తకం మొదటి కమ్మలు చినిగిపోయి ముద్రణ తేది కనిపించలేదు గురుబోధ గ్రంధం) బొంబాయిలోని శిష్యులు పుస్తకంగా ముద్రించారు

ఇందులో పాటలు, తత్వాలు, పద్యాలు, సరళంగా ఉన్నాయి ఈ వృత్తం చూడండి

సగుణ నిర్గుణ విచారా! సమరసానంద ధీరా! విమల లోకోపకారా! విషయ సంసార ధీరా!
భరత పాప విభంగా! భక్తి యోగాను సంగా! శరణు శ్రీ బసవ లింగా! శమద మధ్యాంతరంగా!

అందులోనిదే మరో పద్యం -

కం ఈ మాలిక పరియించిన, యేమానవుడైన గాని యేర్పడ మదిలో
భామామణి పరకాంతకు, ప్రేమాతిశయంబు మీర పెనిమిటి యౌరా!

ఈ పరకాంత మోక్ష కాంతయే ఇది ఫల శ్రుతి పద్యం ఈ ఇరువదవ శతాబ్ది తొలిపాదంలో ఆనందయ్యగారి తత్వాలు పద్యాలు కరీంనగర్ పరిసర గ్రామాల భక్తజనంలో బాగా ప్రచారంలో ఉండేవి 1948 సుమారుగా కవి తనువు చాలించారు తిరిగి సజీవులౌతారని గురువు శవాన్ని మూడురోజులు ఉంచి విధిలేక సమాధి చేశారు వారి శిష్యులు శివకవి ఆనందయ్య

14 **సముద్రాల రామానుజాచార్యులు - కోరుట్ల,** 1982 - 1950

సముద్రాల రామానుజాచార్యులు గోలకొండ కవుల సంచికలో చేరిన కవి నం 59, అప్పటికి వీరి వయస్సు 50 సంవత్సరాలు ఇదే పేరుతో మరోకవి సుశీలోపాఖ్యాన కావ్యకర్త గో క సం పూర్వకవులలో పేర్కొనబడ్డారు పూర్వ కవి వివరాలు తెలువవు ఈ రెండవ కవి రామానుజాచార్యుల నెరిగినవారు కోరుట్ల యందున్నారు ఈ కవి భ్రాతృపుత్రులు వేంకట నరసింహాచార్యులు తమ చిన్నాన్న విశేషాలు తెలిపారు కవి 1950 సుమారుగా కీర్తిశేషులు

స రామానుజాచార్యుల ఏకైక ముద్రిత కృతి, "శ్రీరామానుజ కందార్థ కోశ"

పుస్తకం తెలుగుదైనా పేరు సంస్కృతంలో ఉంది వేరు రచనలు వ్రాత ప్రతులేవీ లేవు ఈ చిరుపొత్తంపై ముద్రణ సంవత్సరంలేదు కాని కవి తనకు 65 సం వయస్సన్నారు కనుక, ఈ కావ్యం 1947లో ముద్రణ పొంది ఉంటుంది

**వంశ వివరాలు :** రామానుజా చార్యులది శ్రీవైష్ణవ మతము వాధూలస వంశము కోరుట్లపురము వీరి తండ్రి పరాంకుశ దేశికులు తాత శ్రీనివాసయ్య వీరి గురునామం నరసింహ సూరి

**కావ్య విశేషాలు :** సముద్రాల రామానుజాచార్యులు సంస్కృతాంధ్రోభయ భాషల కవి అనడానికి నిదర్శనంగా కావ్య ముఖ పత్రంపై శ్లోకాలున్నావి ఇంకా గో క సంచిక నం 59, ఈ రామానుజ కవిగారి రచన 'శ్రీకృష్ణ సంస్తుతి' సంస్కృత శ్లోకాలే

వీరి కందార్థ కోశంలోనివన్నీ కందార్థాలు కృతి పతి వర్ణన పద్యాల్లో ఉంది కవి అవతారిక పద్యాలలో కందార్థాలను కందమాలికలన్నారు సాధారణంగా కందార్థాలు శివకవుల్లో కానవస్తాయి పాల్కురికి సోమనాథుని ద్విపద కావ్యాల తర్వాత రంగనాధ రామాయణం, భగవద్గీతకు శంకర భాష్యానంతరమే శ్రీభాష్యం వచ్చినట్లు, శైవ తత్వాల ఒరవడిలో వైష్ణవ భక్తి తత్వాలూ వచ్చినవి అట్లాగే రామానుజకవి ఈ కావ్యం రామానుజ భక్తితో వచ్చింది

కందార్థం ఓ విలక్షణ ఛంద ప్రక్రియ కంద పద్యం చతుర్థ పాదం యతి స్థానం నుండి పాటగా మారి తత్త్వ కీర్తనగా వ్రాయబడుతుంది పద్యాన్ని వచనం వలె చదివి గేయభాగాన్ని రాగతాళాల్లో భక్తులు పాడుకొంటారు ఈ కందార్థాలు జానపద వర కవుల సృష్టి ఇవి దేశి కవితలు

శ్రీరమణీ పద ద్వయ, సారస విద్యామృతంబు చవి గొనుచు నత (గణం?)
త్సూరి (?) జనంబులు బొగడగ, జేరియు శేషాంశమొకటి శ్రీవరదు డనియు
అజ్ఞ శిరసావహిం చీయు। ధరలోనావి ర్భావ మొందియు।
కేవాల సకలాత్మో। జ్జీవనార్థము శ్రీ। కేశావ మతులై స్వీయ మతా సం।
స్థాపనం బొనరించు మనియు॥ పుట 13

మాయావాద దురభిప్రాయమును ఖండించిన భాష్యకారుల ప్రశంస (5 కం) శైవుల ముద్రాషట్కము వివరణంతోపాటు నింద (9) ఇట్లా విష్ణుభక్తి రామానుజ మత ప్రపత్తిగల ఈ 24 కందార్థాల కావ్యంలో 7వది ఇది

తత్త్వము గాదట సత్తున, సత్తునను గాదు గావు సదసత్తువులున్
సత్త్వాసత్త్వ విలక్షణ, తత్త్వంబా యనుచు నడుగ। తదభావ మనెరు
విధి నిషేధ। మదిదెల్యలేరు। నల్గురునొక్క। విధి జెందీ నారు
వదరూ చుందురు తత్త్వ। మిదియని దెలియాక
మదగజంబుల జూచికుక్కలు। రొదలు జేసిన రీతి బౌద్ధులు॥

త్రిమతాచార్యులలోని రామానుజుల కాలంలో కానీ, ఈ కవి రామానుజాచార్యుల కాలంలో కానీ, వైష్ణవులనెదిరించినవారు శైవులు ఇంకా అద్వైతులు జైన బౌద్ధులు వీరినెదిరించిన వారు కారు ఈ కవి కాలంలో వారు పోటీకి లేనే లేరు ఈ బౌద్ధ పదం కేవలం నిందావాచకంగా ప్రయోగింపబడింది

లక్ష్మీస్తోత్ర శ్లోకాల చివర కవి పరిశయ శ్లోకమున్నది అది ఇది

శ్లో॥ వాధూలాన్వయ జాతేన శ్రీరామానుజ ధీమతా
కృతైషా స్తుతి రార్యాస్తాం సంస్కృత్యక్షంతు మర్హథ॥

కృత్యాదిలోని కృతిపతి వంశ వర్ణన అయిదు పద్యాలు అందులోని రెండవది

గీ॥ శోభితోభయ కుల దీప్తి సూనృతోక్తి, వైష్ణవాచార సద్భక్తి వాంఛితార్తి
ధన్య సద్వృత్తి రంగరాడ్ధర్మ పత్ని, బుచ్చ మాంబకు సరిసతుల్ లక్ష కొకరు

ఈ పద్యంలోని మొదటి మూడు పాదాల్లో సంస్కృత పదాలే తెలుగు పదాలున్నది కేవలం చివర చరణంలోనే దీనిలో యతి తప్పింది సంస్కృత కవితా ప్రభావం కాబోలు! సంస్కృతంలో పద విరమణం తప్ప సజాత్యక్షర యతి లేదు కదా స రామానజాచార్యులు ఈ కందార్థ కోశంలో గహనవేదాంత చర్చ కావిస్తూ జానపద కవులవలె వ్యావహారిక భాషాపదాలు ప్రయోగించారు పండితుడనని చెప్పుకున్నా ఈ కవి వరకవుల సరస నిలిచేవారే

### 15) గడియారం విశ్వనాథ శర్మ - కమాన్‌పురం తా॥పెద్దపల్లి, 1963

విశ్వనాథ శర్మగారు 'భారతరణకథా సంగ్రహము' అను చంపూ కావ్యాన్ని రచించారు ఈ గ్రంథం తారణ శుద్ధ 15 కలియుగాబ్దం - 5045న ముద్రింపబడినట్లు అచ్చుప్రతిలో ఉంది ఆది క్రీ శ 1943 వ సంవత్సరం 121 పుటల ఈ పుస్తకాన్ని కేవలం ఒక వంద ప్రతులు ముద్రించడం విశేషం కావ్య ముద్రణానంతరం కవి గారు ఇరువదేండ్ల వరకు జీవించారు [1]

**వంశ వివరాలు** విశ్వనాథ శర్మగారి భారత రణ కథా సంగ్రహంలో కేవలం పంచమాశ్వాసానికి

1 ఈ అపురూప పుస్తకాన్ని చూపటంతో పాటు కవిగారి వివరాలు తెల్పినది మల్లావజ్జల బాలకిషన్ రావు , పెద్దపల్లి గారు

మాత్రమే చివరి గద్య ఉంది అది ఇది "ఇతి శ్రీ వేణుగోపాల కరుణ కటాక్షపాత్ర కౌండిన్య సగోత్ర శ్రీ సీతారత్నమాంబ పుత్ర విశ్వనాధశర్మ ప్రణీతంబైన శ్రీ మహాభారత రణకధా సంగ్రహము పంచమా శ్వాసము సంపూర్ణము" కవి ఏలనోకాని తండ్రి పేరు తెలుపలేదు వారు వైదిక విప్రులు

**కావ్య విశేషాలు :** శర్మగారికి వ్యాకరణ ఛందోలంకార శాస్త్ర దృష్టి, కవన పుష్టి తక్కువ భారత కథ యందలి ప్రీతిచే ఈ కావ్యరచన కావించారు ఈ కావ్యారంభ కంద పద్యం చూడండి

కం శ్రీపతి దేవ సువిక్రమ, భూప సుజన శిక్ష సకల భువనాధ్యక్షా
గోపతి వందిత పదయుగ తాప హరణ ఘనశరీర తము భజియింతున్

**చివరి పద్యం**

గీ కాళి దాస మయూరాది కవులకైన, గలవు తప్పులనంగ నన్యులకు లేవె
దిద్దగల పట్ల దిద్దుడి దిద్ద రాని యెడల నానేరములు క్షమియించు టొప్పు

ఇందలి కథ కురుపాండవ సంగ్రామం శ్రీకృష్ణ రాయబారం కేవలం పది పంక్తుల ఉత్పల మాలిక భగవద్గీత ప్రస్తావన ఇట్లుంది

"వ॥ అందు ఉభయ సైన్యంబులు కురుక్షేత్రంబున సంగరంబు కొరకు సన్నిహితంబైన సమయంబునందు,

కం॥ ధర్మజుడు ననికి పూర్వము, నిర్మల మతి భీష్మ గురుని నిక కృపు ప్రణుతిన్
మర్మమెరిగి ననుజ్ఞచరణ, కర్మమూనె కృష్ణు మహిమ కారుణ్యమునన్"

దుష్కర ప్రాసను సునాయసంగా ప్రయోగించినా రెండవ పాదంలో అఖండ యతి మూడవ నాలుగవ చరణాల్లో గణభంగాలు పండితుల బాధిస్తాయి మరొక చిన్న వచనంతో ఈ ఘట్టం ముగిసింది భీష్ముని యుద్ధవర్ణన ఇది .

శా॥ భీష్ముండప్పుడు సంగరాంగణమునన్ భీమాదులన్ మీరుచున్
గ్రీష్మాదిత్యుని బోల సైన్య సమితిన్ గ్రీడొప్పగా గూల్చగన్
శ్లేష్మంబొందె నరుండు దానిగని సంసేవ్యుండు గృష్ణుండు తా
భీషువమ్మన్నిల్పగ చక్రమున్ గొని చనెన్ బీభత్సుడున్ జూడగన్

కవి ఈ కావ్యంలో ఛందో వైవిధ్యం కనబరిచారు ద్వితీయాశ్వాసం చివరి మత్తకోకిల ఇది

విద్యమాన నరేంద్ర సేవిత వేద వేద్య సుపూజితా
సద్యశస్కర వంశపాలన శాస్త్రధర్మ సుభావితా
చోద్యమయ్యె భవచ్చరిత్రము శుభ్రకీర్తి ప్రకాశితా
హృద్య శ్రీపతి సంస్థితాశ్రిత లోల ధార్మిక శ్రీపతీ (యతి?)

ఈ కావ్యస్థాయి ఎట్లున్నా మధ్యయుగం తర్వాత యక్షగాన రచనలతో కవన వ్యాసంగం కావించే ఈ జిల్లా కవులను తిరిగి కావ్యరచన వైపు దృష్టి మరల్చిన వారు శర్మగారు, రామాయణ భాగవతాది పురాణాలను తప్ప భారత కథను అప్పటికీ ఇక్కడి ఏ కవీ ముట్టుకోలేదు అది విశ్వనాధ శర్మగారి భావ విశిష్టత!

**16) వానమామలై వేంకటాచార్యులు - గట్ల నర్సింగాపురం, తా॥ హుజూరాబాద్**

ప్రఖ్యాత పౌరాణికులగు బక్కయ్య శాస్త్రి, సీతమ్మగారల విద్వత్కవులైన నలువురు పుత్రులలో వేంకటాచార్యులు మొదటివారు లక్ష్మణాచార్యులు రెండవ వారు జగన్నాధ వరదాచార్యులు తర్వాతి

వారు వీరి జన్మగ్రామం వరంగల్ జిల్లాలోని మడికొండ వరదాచార్యులు చెన్నూరుకు వెళ్ళగా మిగతా ముగ్గురు కరీంనగర్ జిల్లాలో స్థిరపడ్డారు

వేంకటాచార్యులు హుజూరాబాద్ తాలూకలోని వంగర గ్రామ సమీపమందున్న గట్లనర్సింగాపూర్ సంస్థాన పండితులుగా ఉండేవారు వేంకటాచార్యుల తమ్ములు ముప్వురూ ప్రఖ్యాతకవులు వారికి ఈ పెద్దన్నగారే తొలి విద్యా గురువు వేంకటాచార్యులు సంస్కృతాంధ్ర విద్వాంసులు తర్కవ్యాకరణ పండితులు - ప్రసిద్ధ సిద్ధాంతి కవిగా వారి పేరు వ్యాప్తి కాలేదు అయినా వారు కొన్ని గద్య పద్య రచనలు కావించారు వేంకటాచార్యుల రచనలివి ★

1 జ్ఞానేశ్వరీ భగవద్గీత - వచనాను వాదం, 2 వ్యాస భగవద్గీత శుద్ధాంధ్ర పద్యానువాదం 3 భండార్కర్ సంస్కృత వ్యాకరణము ఆంధ్రానువాదం ఇవి అముద్రితాలు

వ్యాకరణం నాటి విద్యార్థులకు ఎంతగానో ఉపకరించేదట 1985 సుమారుగా ఇంచుమించు 90 ఏళ్ళ వృద్ధాప్యంలో వీరు గతాయువులైనారు వీరి రచనల వ్రాత ప్రతులు వారి పుత్రులు రిటైర్డ్ తెలుగు పండిత్, వి కృష్ణమాచార్యులు ముల్కనూరుగారి వద్ద కూడా లభించలేదు

### 17) వేంకట రాజన్న అవదాని - మంథని, జననం - 1909 మృతి 1995

అసాధారణ ప్రజ్ఞాధురంధరులు వేంకటరాజన్న అవధాని గారు వీరు మంథని వాస్తవ్యులు వైదిక బ్రాహ్మణులు ఇంటిపేరు అవధానుల వారు వీరు 1909లో జన్మించారు [2]

రాజన్న అవధాని వైద్యవరులు సాహిత్యంలో సవ్యసాచి, కవి - రచయిత, ఉభయ కవి మిత్రుడు సంస్కృతాంధ్రాలతోపాటు ఇంగ్లీషు, ఉర్దూ భాషలేకాక పార్సీ, అరబ్బీ, మరాఠీ, హిందీ, కన్నడ భాషలలో పండితులు ఏక సంథాగ్రాహి అష్టావధానం చేశారు సహస్రావధాని జంధ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రిగారి శిష్యుడనని చెప్పుకున్నారు వృత్తిరీత్యా రాజన్న అవధాని అడ్వొకేట్ ప్రవృత్తి రీత్యా సంఘ సేవకుడు నాయకుడు! వీరు స్వాతంత్ర్య సమరయోధులు తెలంగాణా గ్రంథాలయోద్యమంలో పాల్గొన్నారు ఆంధ్ర జాతీయ మహాసభను అభిమానించారు కాంగ్రెసులో చేరి సత్యాగ్రహాలు చేశారు భారత స్వాతంత్ర్యోద్యమ కాలంలో 10 1 1947 నుండి 6 నెలల 2 దినాలు జైలు శిక్షననుభవించారు విడుదల పొందిన మాసం రోజులకు దేశానికి స్వాతంత్ర్యం లభించినా, నైజాంలో రజాకర్ల అలజడి కారణంగా నిజాం చేతులెత్తి స్వతంత్ర భారత దేశంలో విలీనం అయ్యేవరకు 17 9 1948 దేశ విముక్తి పోరాటంలోనే ఉన్నారు ఆయన అస్పృశ్యతా నివారణ కొరకు, హిందూ ముస్లింల సామరస్యం కొరకు అమితంగా కృషి చేశారు



సాహిత్యంలో పలురచనలు చేసినా ముద్రించుకున్నవి స్వల్పం గోలకొండ కవుల సంచికలో నం 271 'నేటి ద్విజులు' వీరి కవిత గోలకొండ పత్రికకు సహాయసంపాదకులుగా పనిచేయడమే కాక ఆంధ్రభూమి సహాయ సంపాదకులుగా కొన్నాళ్ళున్నారు కాళోజీ, వెల్దుర్తి మాణిక్యరావు, వే రా ఆవధానిగారు ముగ్గురు కలిసి హైదరాబాద్‌లో 1950లో 'వైతాళిక సమితి'గా ఏర్పాడ్డారు అవధానిగారు

---

★ డా॥ అందె వేంకటరాజం గారి "వానమామలై వరదాచార్యుల కృతులు - అనుశీలనము"' 1982, పుటలు - 5,6

1 గో క సం 1934 పుట 380 వీరి వయస్సు 28 సం అని ఉంది అది 3 సం॥ ఎక్కువ

తొలి దినాల్లో 'ప్రబోధచంద్రిక' అను లిఖిత మాస పత్రికకు సంపాదకుడై మంథనిలో వెలువరించారు వీరి పెద్దకుమారులు ప్రభాకర అవధానిగారు ఆదర్శోపాధ్యాయులుగా రాష్ట్రబహుమతి నందుకున్నారు పెద్దకూతురు ప్రతిభారాణి పట్టభద్రురాలు రచయిత్రి

**వేంకటరాజన్న అవధాని గారి రచనలు** - 1 అగ్నిశబ్ద మహాత్మ్యం (సంస్కృతం), 2 పతిపత్ని (తెలుగు నవల), 3 మంథెన చరిత్ర (సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశంలోని వ్యాసం)

**అముద్రితరచనలు** 1 లక్ష్మీ శతకము, 2 కుంభకర్ణ నిద్ర, 3 దేశబంధు జన్మ రహస్యం (వచనానువాదం), 4 భారత స్వాతంత్ర విజయం, 5 కామకళ ఇంకా - వింత గీతాలు, జైలు గీతాలు మొ॥వి

**రచనల వివరాలు** : పతిపత్ని నవల 1930లో ముద్రణ పొందినదన్నారు కాని దాని ప్రతి లభించలేదు అది ఆదర్శ దంపతుల జీవితం ఇతివృత్తంగా కలదట

మంథెన చరిత్ర వ్యాసం చారిత్రక ప్రాదేశిక ప్రాధాన్యత కలది ఇది సమగ్రాంధ్ర విజ్ఞానకోశంలో ప్రచురించబడింది [2] ముద్రిత సాహిత్యం ఈ ఒక వ్యాసం తప్ప మరేదీ లభించలేదు

అవధానిగారి అముద్రిత పద్య సాహిత్యమే వారి కృషికి సాక్ష్యంగా మిగిలింది 'కలగూర గంప' పేరుతో తమ రచనలను కొన్నింటిని అవధాని గారు ఓ రిజిస్టరు నోటు బుక్కులో వ్రాసుకున్నారు అందులో వారి విడి కవితలున్నాయి [3]

1 **లక్ష్మీశతకము** ఇది కంద పద్యాలది 74 పద్యాలే వ్రాశారు ప్రతి పద్యం శ్లేషతో రచించారు ఈ శతక పద్యాలకు ముగ్ధులై కవిసమ్రాట్ విశ్వనాధ సత్యనారాయణగారు 1958లో తాము వ్యాఖ్య వ్రాస్తామన్నారట అందులోని ఒక పద్యం

ముగురమ్మలు ముగురయ్యలు, జగతిని పుట్టించి పెంచి చంపుదు రనుచున్
తెగ బలుకును ప్రాబలుకులు, జగతిని మూలమ్మ నీవె సత్యము లక్ష్మీ

2 **కుంభకర్ణ నిద్ర** దేశ ప్రజలను జాగృత పరచే ఉద్దేశ్యంతో కావించిన రచన ప్రతి అలభ్యం

3 **దేశబంధు జన్మ రహస్యం** ఇది వినాయక సావర్కార్ గారి 'మోప్లాంచే బండ్' (మోపలా ఘాతుకాలు) అను మరాఠీ పుస్తకానికి తెలుగు సేత దీనిని వైదిక ధర్మ గ్రంధమండలి హైదరాబాద్ వారు ప్రచురిస్తామని తీసుకున్నారట ప్రచురించలేదు ప్రతిని తిరిగి ఇవ్వలేదు

4 **భారత స్వాతంత్ర్య విజయం** పద్యకావ్యం ఇది అసంపూర్ణం దీని రచన 1953లో ఆరంభించారు

గీ కన్నులున్నవి కాని నే కనుట లేదు, కండ్లు లేకయె స్వరమున్ గనెదు నీవు
చెవులు గల్గియు వినము మానవుల మేము, చెవులు లేకయె వినెద(దీ)వు భవుల వాక్కు

5 **కామకళ** ఇది వాత్సాయన కామ సూత్రాలకు అనువాదం అవధానిగారు వారి యువదశలో దీన్ని రచించారు నాలుగు వందల పద్యాల గ్రంధం కాని, ముద్రించలేదు

6 **వింత గీతాలు** ఇవి కొన్నే ఛందోబద్ధ తేట గీతాలనే కవి వచన కవితలుగా పదాలు విరిచి వ్రాశారు అందులో రెండు ఇవి

నిన్న కలవాడు లేడాయె
నేటి కిచట ఉండు నెవ్వ
డు పోకుండ నుండు నెద్ది
రాక పోకలు సహజ ధర్మములు గానె
పోయి వచ్చుట వచ్చి
పోవుటయు నిజము

ఆత్మ యొక్కటి స్థిరము
తదన్య మెల్ల జన్మమొంది గతించును
జగతి యగుట గమన శీలియై జగము
యోగంబనంగ
తొలగి జీవత్వ భావ
మాత్మలయ మగుటె

---

2 స వి కో సంపుటి 7 సాహిత్య అకాడెమీ హైద్రాబాద్ వారి ప్రచురణ 1970 పుట 101

3 9-8-92 నాడు మంథనిలో అవధాని గారిని కలుసుకొని మాట్లాడాను వ్రాత ప్రతులు చూశాను

7 **జైలు గీతాలు** - 1947లో జైలులో వ్రాసినవి ఇవి ఇరవైకి తక్కువే చూడండి
దొంగ తొత్తు కొడుకు(లు) లంగలు చాచుచు, గడు పిశాచ వృత్తి బడి చెలంగ
ఇత్తెహాదు మంత్రులిది పంది యందురు, దీని భావమేమి తిరుమలేశ! - 10వ పద్యం
వీరి 'కలగూర గంప'లో అప్పుడుప్పుడు వ్రాసుకున్న కవితలున్నాయి

సాహితీమిత్రులు వెల్దుర్తి మాణిక్యరావుగారి కూతురు 'ఆంధ్రప్రభ' శిశువుగానే మరణించినప్పుడు వ్రాసిన పద్యాల్లో ఒకటిది

తెలుగులో నవ్వియితర భాషలకు నేడ్చు, తెలుగుకై యేడ్చి యితర భాషలకు నవ్వు
తెల్గు సీమను తెల్గు దీధితులముంచు, నట్టి సుఖదమాంధ్ర ప్రభ యస్తమించె

ఆ అమ్మాయి పేరు ఆంధ్రప్రభ అటువంటిది నాటి మనవారి మాతృదేశ-భాషాభిమానం!

రాజన్న అవధానిగారికి తేటగీతి ప్రియాతి ప్రియం కందంలో శతకాన్ని రచించారు ఇతర ఛందాలను విరళంగానైనా స్పృశించకపోలేదు సరస్వతీ నుతి పద్యం ఈ ఉత్పలమాల చూడండి

వాణి మదీయ పార్శ్వ వశవర్తినివై నిరతాశ్రయంబునన్
రాణువ మించి నా హృదయ రమ్యమణీ స్థగితాభ్ర పీఠిపై
రాణిగ నన్ని నాళ్ళు స్మర రాజ్యము నేలిన నీకు నీ తెలం
గాణపు గాలి సోకినదె కాక మరెయ్యదొ తెల్పు తొయ్యలీ [4]

శ్లేష, యమకం అవధాని గారి సాహిత్యంలోనేకాదు, సంభాషణలోనూ అప్రయత్నంగా చోటు చేసుకుంటాయి వారు అనుభవ జ్ఞాన వృద్ధులు పక్షవాతంతో పదిరవై యేండ్లుగా మంచం మీదే కాలక్షేపం చేసి 1995లో కాలధర్మం చెందారు

శారీరక మానసిక బలసంపన్నులు అవధాని గారు క్రికెట్, ఫుట్‌బాల్ వంటి విదేశి క్రీడలలోనేకాక, కబడ్డీ, కఱ్ఱసామువంటి స్వదేశీ క్రీడలలోనూమేటి అపారమైన పాండిత్యం, అమోఘమైన కవిత్వం, అంచంచలమైన కార్యదీక్ష - ప్రజాసేవ చూసినవారికి వీరు కారణజన్ములు అని అనిపించక మానదు సాహిత్య ప్రేమికులు, సంఘసేవకులు, రాజకీయ నాయకులు, కళాకారులు ఎవరిలో కాని ఏ మాత్రం సుగుణం కనిపించినా హృదయపూర్వకంగా అభినందించే మెత్తని మనస్సు అవధాని వారిది విమర్శలో దక్షుడు మనస్సులో మెదలితే పిన్నాపెద్ద తారతమ్యమెరుగడు ప్రముఖ రచయిత సురవరం ప్రతాపరెడ్డి గారి 'హిందువుల పండుగలు' గ్రంథంపై 'భారతి' మాసపత్రికలో విమర్శనాత్మక సమీక్షవ్రాసి రచయిత జవాబును తెప్పించుకున్నారు ప్రముఖ సాహిత్యకారులలో వీరికి మొదటి నుండీ గౌరవం ఉంది

కాళోజీ 'నాగొడవ' నాలుగవ కవితా సంపుటిని పరాభవ శ్రావణంలో (19 7 1966) వె రా అవధాని గారు ఆవిష్కరించారు నేను మొదటిసారి 1981లో చూసినప్పటివలెనే 1993లోనూ శయ్యాగ్రస్థులై మరింత వృద్ధులై చిరునవ్వే భూషణంగా కనిపించారే తప్ప వారి పుస్తకాలేవీ వెలుగు చూడలేదు వేంకటరాజన్న కవిగారి అముద్రిత సాహిత్యంలో ముఖ్యమైన రచనలైనా ముద్రింపబడితే బాగుండేది

**18) వానమామలై జగన్నాథా చార్యులు - పోతురెడ్డిపేట,** తా॥ హుజూరాబాద్, వయస్సు 90 సం॥లు 1993లో [1] 1995లో మృతిచెందారు

జగన్నాథాచార్యులు గోలకొండ కవుల సంచిక కెక్కిన కవి [2] సంస్కృతాంధ్ర ద్రవిడ భాషలలో పండితులు జన్మగ్రామం వరంగల్ జిల్లాలోని మడికొండ కరీంనగర్ జిల్లాలోని పోతురెడ్డి పేటలో స్థిర నివాసులైనారు వానమామలై కవిసోదరులలో వీరు మూడవవారు ఈ గ్రంథమందలి వేంకటాచార్యులు, లక్ష్మణా చార్యులు వీరికి అగ్రజులు అభినవ పోతన బిరుదాంకితులైన వరదాచార్యులు అనుజులు

వీరు సంగీత సాహిత్యాలలో దిట్ట హరికథకులుగా రాణించారు కొంతకాలం ప్రైవేట్ ఉపా

---

4 మలయశ్రీ 'కరీంనగర్ జిల్లా రచయితల చరిత్ర' 1981, పుట 47 ఈ పద్యం నా 'క జి ర చ ' రచనా సందర్భంలో నేను వారింటికి వెళ్లినపుడు అవధాని గారు స్వయంగా వినిపించింది



ధ్యాయులుగా పనిచేశారు పలు చిరుకావ్యాలే కాక 'రైతు రామాయణము' అను మహాకావ్యాన్ని రచించారు చాల కాలంగా పోతురెడ్డిపేటలో వ్యవసాయం చూస్తూ కవితా వ్యవసాయం చేస్తూ కాలం గడిపారు వీరి రైతురామాయణ కావ్యానికి 1983లో రాష్ట్ర సాహిత్య అకాడెమీ పురస్కారం లభించింది 1992 సంవత్సరంలో ఉత్తమ కావ్య నిర్మాతగా తెలుగు విశ్వవిద్యాలయం హైదరాబాదు వారిచే విశిష్ట సన్మానం పొందారు వీరి పుత్రులలో జనార్దన జగన్మోహన దామోదరాచార్యులు ముప్వురు అధ్యాపకులు కవులు

జగన్నాథా చార్యులు రచనలు ∘ ముద్రితములు 1 అభ్యుదయ గేయాలు 1951, 2 శ్రీవ్రత గీతి (తమిళానువాదం గేయాలు), 3 రైతురామాయణము - 1981 (పద్యకావ్యం)

అముద్రితములు ∘ 1 శ్రీనివాస అష్టోత్తర శతి, 2 ఆది వరాహ శతకము, 3 తెలుగుబాబు గీత శతి

గోలకొండ కవుల సంచికలో 'కార్పాస లక్ష్మీనాటకము' ఒక్కటి మాత్రమే జగన్నాథాచార్యుల రచనగా పేర్కొనబడింది 'తెలుగు సాహిత్య కోశం'లో రైతురామాయణ కావ్యం, కార్పాసలక్ష్మి నాటకంతో పాటు జనగణపతి శతకం, గోదాదేవి చరిత్రం పద్యకావ్యం, శ్రీ బాలాజీ శతకం మొత్తం అయిదు గ్రంథాల పేర్లు ఈ కవి రచించినట్లుగా తెలిపారు [3] ఒక్క రైతురామాయణము తప్ప ముద్రిత కృతులేవీ వారి వద్ద లేవు కార్పాసలక్ష్మి మొదటి రచన అముద్రితం, వ్రాత ప్రతికూడ పోయింది ఇది సాంఘికం, గ్రామీణేతివృత్తం కలనాటకం [4]

శ్రీవ్రత గీతి ∘ తమిళానువాద గేయకావ్యం గోదాదేవి అను నామాంతరం గల అండాళ్‌దేవి పాశురాలకిది ఆంధ్రానువాదం మార్గశిర మాసంలో ముప్పది రోజులు తమిళ పాశురాలు శ్రీవైష్ణవులిండ్లలో చదువుతారు స్త్రీల సౌకర్యార్థం ఆచార్యులు వీటిని గేయకావ్యంగా తెనిగించి సోదరులైన వరదాచార్యుల సతీమణి వైదేహి గారికి అంకితం చేశారు కృతి ముద్రితం కాని ప్రతి అలభ్యం (శ్రీవ్రత గీతి అచ్చుప్రతి 1971 పు 1/32 క్రౌన్ 36 ఇది అనుకోకుండా శతావధాని కృష్ణమాచార్యగారి నేనున్న ఇంట్లోనే ఫిబ్రవరి 97న లభించింది) జగన్నాథాచార్యుల ఆంధ్రానువాదం సరళ గ్రాంధికంలో సాగింది ఇవి తమిళ శీర్షికలతో ఉన్న 30 పాటలు మొదట కొన్ని పద్యాలున్నవి గేయాల నడక ఇది - 'ఓంగి' పు 5,

" కొండెత్తున బెరిగి జగము గొలిచిన యుత్తముని బాడి,
కొండాడుచు వ్రతము చాటి కూడి మనము జలకమాడ
చెఱుపులేక దేశమెల్ల వఱుపులేక నెలకు మూడు
చఱచి కురియు జడివానలు పెరిగి యొరుగు వరి చేలును "

ఇందులో గోపాల బాలకృష్ణునిపై కన్నెల ముగ్ధభక్తి, అంతకు మించి పల్లెపట్టుల చక్కదనాల వర్ణనలున్నాయి

సోషలిస్టు గేయాలు, తెలంగాణా పోరాటం (1947 52) కాలంలో పుట్టిన తిరుగుబాటు పాటలు

**రైతు రామాయణము** ఇది 500 పుటల మహాకావ్యం దాదాపు మూడువేల పద్యాలు కలది ఆశ్వాసాలు ఆరు 1981లో ముద్రితం పి వి గారికి అంకితం

---

1 'ఈనాడు' దినపత్రిక ప్రత్యేక సంచిక - డిసెంబర్ 1993,

2 గో క సం 1934 కవి నం 247, కవిపరిచయం 377 పుట

3 తె సా కోశం తెలుగు అకాడెమీ హైద్రాబాద్ వారి ప్రచురణ, 1986, పుట 331

4 1990 లో ఆచార్యుల వారిని వారి కుమారులింట హుజూరాబాదులో కలుసుకొని మాట్లాడాను దీనిలోని ఒక సీసపద్యం గో క సంచిక, పుట 230 లో ఉంది

డా॥ డింగరి నరహరి ఆచార్యగారు ఈ కావ్యంపై పరిశోధనా వ్యాసం వ్రాసి ఉస్మానియా విశ్వ విద్యాలయం నుండి డా॥డి రామాచార్యగారు కాకతీయ విశ్వవిద్యాలయంలో ఇదే కావ్యంపై పరిశోధన గ్రంథం రచించి డాక్టర్ డిగ్రీలు పొందారు రామాచార్యులు 1987లో జగన్నాథాచార్యుల రైతు రామాయణ కావ్య విశేషాలను వివరించే వ్యాస సంపుటిని సైతం రచించి ప్రచురించారు మలయశ్రీ కవి సంపాదకత్వంతో ఎస్సెలెన్ బాబు ప్రచురణకర్తగా వెలువబడిన కరీంనగర్ జిల్లా కవుల కవితల సంకలనం 'తరంగిణి' వానమామలై కవి సోదరులకు అంకితం కావించబడింది [5] అందులో కృతిపతియైన జగన్నాథాచార్యులను సంపాదకులిట్లా ప్రస్తుతించారు

వచ్చియురాని భావముల వారక సంస్కృతపున్ సమాసముల్
గుచ్చియు దర్భపాకముగ గూర్చు కవిత్వ విచిత్ర వేళలన్
అచ్చపు తెల్గుకైత యిదిరా యన తీయనరంటి పండులన్
విచ్చి కరాన బెట్టినటు వేడ్కరచించితి సత్ప్రబంధమున్ (తరంగణి) 1973, పు 1

ఈ కావ్యముద్రణకు ముందుదీవిషయం రైతు రామాయణం ముద్రణ పొందుటకు పూర్వమే పలు సాహితీ సభల్లో కావ్యకర్త కవితాగానం చేయడంతో దానికి జనవ్యాప్తి కలిగింది [6]

డా॥ దాశరథిగారు ఈ కావ్యాన్నీ విధంగా అభినందించారు "ఈ మహాకావ్యంలో - శిశు, శిక్షణ, కల్యాణ, కృషి, నిర్బంధ, విజయ కాండలున్నాయి ఈ ఆరు కాండలలో తెలంగాణా పల్లె జీవితం అద్భుతంగా చిత్రించడం జరిగింది పల్లె అనగానే కవిగారి కలం విల్లువలె మారి పువుటమ్ముల జల్లు కురుస్తుంది భారత మాత పల్లెలో ఉంటుందన్న మహాత్ముని మాటను కవితా రూపమున తెలిపిన కవీశ్వరుడు మా జగ్గన్న" [7] ఈ కవికి గ్రామీణ జీవితాన్ని వర్ణించాలనే ఉత్కంఠ ఈ కావ్యనిర్మాణానికి ప్రధాన హేతువు తెలం గాణా రైతాంగపోరాటం కథకు ఉపాఖ్యానమై బలంచేకూర్చింది రామాయణ గాథ అంతస్సూత్రంగా ఉంది

**కథా సంగ్రహం** ఈ కావ్యనాయకుని తండ్రి సాగరుడు ఆతనికి ఇరువురు భార్యలు వేయి దేవతల మ్రొక్కుల ఫలితంగా వారికి ఇద్దరు పుత్రులు కలిగారు రామలక్ష్మణులు ఇరువురూ సమాన రూపశీల వయోబల సంపన్నులు, స్నేహశీలురు యువకులై వివాహితులైనారు రైతు రాముని భార్య లక్ష్మి సీత ఊరి కామందు పాపారావు రావణుడు వాని విధవ సోదరి సుందరి శూర్పణక ఆమె లక్ష్మణుని కామించి తిరస్కరింపబడి కసిపూని అన్నకు పురెక్కించింది అతడు లక్ష్మిని బందీ కావించాడు

ఇందులో ధర్మారావు అనే వ్యక్తి సుగ్రీవుడు హనుమంతు రాయబారమున్నది

నాడు స్వతంత్రభారత ప్రజారాజ్యంలో విలీనంకాక నైజాం స్వేచ్ఛగా ముస్లిం రాజ్యంగా ఉండాలని నిజాం అన్నాడు ఆగష్టు 1947 నుండి సెప్టెంబర్ 1948 వరకు రజాకార్లు చెలరేగి తెలంగాణాలో కావించిన అలజడికి పాపారావు సహకరించాడు ప్రజల్లో తిరుగుబాటు ఆరంభమైంది పదూళ్ళ ప్రజలు ఏకమై పాపారావు పై దండెత్తారు ఇంతలో ఢిల్లీ సైనిక చర్యతో నిజాం గద్దె దిగిపోయాడు నైజాం విముక్తమై హైదరాబాద్ రాష్ట్రమైంది రైతు రాముడు జయంపొందాడు సీత చెరతొలగింది ఆ గ్రామ ప్రజలకు పాపారావు పీడ విరగడైంది ఇది జగన్నాథాచార్యుల రైతు రామాయణ కథా సారాంశం

కవి అచ్చ తెలుగని సంస్కృత పదాలను పరిహరించక, కృతక పదాలను సృజించక, జాను

---

5 వానమామలై జగన్నాథ వరదాచార్య మహాకవి ద్వయానికి అంకితం

6 'సారస్వతీజ్యోతి' త్రైమాసిక సాహిత్య పత్రిక, కరీంనగర్ - ప్రథమసంచిక ఫిబ్రవరి 1954లోనూ 'రైతురామాయణ' పద్యాలు ప్రచురింపబడినవి

తెలుగని జై కొట్టక, జనం భాషలోతేట తెలుగులో పల్లెటూరివారి నుడి కారంతో వ్రాసిన కావ్యం రైతురామాయణం ఇందులో వస్తాడు, తెస్తాడు వంటి వ్యవహారిక పదాలను, (అప్పకవి దృష్టిలో ఇవి గ్రామ్యాలు) సుస్తీ, మస్తు, ముస్తాబు వంటి ఉర్దూ పదాలను మాత్రమే కాక, మాండలిక పదాలను కవి నిరభ్యంతరంగా ప్రయోగించారు కథ రామాయణాన్ని అనుసరించినా కథా కాలం వర్తమాన యుగానిది, గ్రామీణుల జీవితాలది అది భారత స్వాతంత్ర్యానికి ముందువెనుక సాగిన తెలంగాణా రైతాంగ పోరాటకాలానిది [8]

అంత్యానుప్రాసతో అంత్యంత మనోహరంగా సాగిన వీరి పల్లెటూళ్ళ వర్ణన చూడండి

గీ పంట లక్ష్మికి తొలియాట పట్టు, బక్కకాపు జనముల పాలి బంగారు గట్టు,
కదుపు మొత్తాల పురికట్టు, కాటకాలు కరువులరి కట్టు, పెరటి కల్పకవు చెట్టు,
పట్టణముల యాయువు పట్టు పల్లెపట్టు, అదియె లేక నగర జీవి యాట కట్టు!

ఇంకా పాడి తప్పని యాలు, నేనాడు గూడయాడి తప్పని కాపురా, లాద మరచి,
గాడి తప్పని బండి చక్రాలు, కొంగ్రసూటి తప్పని మేటి నాగేటి చాలు

స్త్రీలు పచ్చ చేమంతి పూదోట పసిడి కోట, పడుచు పరువాల పాల మీగడల తేట,
చిలిపి సిగ్గు సింగారాల జిలుగు మూట, పల్లె చెలియొర్తు జను వరి పంపునాట!

వీరి వర్ణనలో పొలం కాగితం, నీరు-సిరా, హలం-కలం, నాటు మొక్కలు అక్షరాలు, రైతు కవి, నాగటిచాళ్ళు వ్రాతపంక్తులు, శ్రామికులు-పరిష్కర్తలు, పంటలు-కావ్యఫలాలుగా, అవతారికలోని ఓ పద్యంలో రూపుదాల్చాయి ఈ రూపకాలంకారం కవి మహోన్నత భావుకతకు నిదర్శనం

పల్లె జీవితాలలో శ్రమజలాలు నులివెచ్చ స్నానాలు, జొన్నంబలి జల పానాలు, కావిజిడ్డు ముతకపంచెలు, గులకరాల పాన్పులు సర్వసామాన్య విషయాలను అసాధారణ పరిశీలనా ధిషణతో సహజ సుందర కవితలుగా మలిచారు కవి వారి నివాసాలు జీవితాలు ఇలాగట

కాపు రాజుల చక్కని కాపురాలు, పచ్చ పొదలు, పూదోటలు, ఫలవనాలు,
పాల కావడుల్, తరుగని పంట నిధులు, ఊట చెలమలు, కృషిలక్ష్మికాట వనులు!

నాయకుని తండ్రి

ఎట్టి సమస్యయందును జలించని గుండె బలంబు, పూని చే
పట్టిన యెట్టి యేపనియు బంతముతో సిగపుచ్చు దీక్ష, యే
గుట్టలు గట్లు వచ్చి తలగూలిన నగ్గి తుపాను వెల్లువల్
నెట్టుక వచ్చినన్ దెనకి నేనెయటం చెదురించు దీక్షయున్

కథానాయకుడు రైతు రాముడు -

గంగా సాగర శాంత వీర రస సంగప్రోత్థ గంభీర స
ర్వాంగీణ స్ఫురదాకృతిన్ మెఱపు దీపార్చిస్సుగా వెల్గు మేల్
బంగార్బిడ్డడు రాముడొప్పె గుణ లావణ్యామృత శ్రీ నిధుల్
పొంగన్ ధీర ప్రశాంత వీరరస దీప్తుల్ దిక్తటిన్ దూకిరాన్

ఆశ్వాసాంత పద్యాల్లో తప్ప సంస్కృత పదాల దీర్ఘసమాసాలను ఈ కావ్యంలో కవి వాడలేదు అవీ తనకు సంస్కృత భాషా ప్రావీణ్యంలేక తెలుగునకు జైకొడుతున్నాడని పండితమ్మన్యులు అపవాదు

---

7 రైతు రామాయణము - 1981, పీఠిక 'కావ్యసుధ' నుండి

8 కవి దీనిని 1950 55 మధ్య రచించినా ముద్రణ పొందువరకు 1981 సవరిస్తూనే వచ్చారు

వేస్తారనే భయంతో వ్రాశామన్నారు పై పద్యం కావ్యనాయక వర్ణన కాబట్టి పురాణ రాముని స్తుతి పద్యాలకు సమఉజ్జీగా రచించినట్లున్నారు నాయిక సీత సౌందర్యం -

రతియో భారతియో పా,ర్వతియొ సరస్వతియొ యిందిరయొ శ్రీలతయో
సతియో సీతా సతియొ పా,లతి పేరే ముత్తియముల రవ్వల పేరో (ల ర, లకు యతి)
ఈ యమ్మాయి బలేచలాకి, పనిలోనే కాదు మేల్మాటలోన్
చాయల్ గాంచిన నించుమించుగను మా చాయల్ స్ఫురించున్ రస
స్థాయిం బెర్గిన గొప్పయింటి చిటి దొర్సానిన్ దలంపించు నీ
మాయా యక్షిణి పోకలున్ మెదలికల్ మర్యాదలున్ జూపులున్

ఈ జంట పరస్పర వీక్షణం, భాషణం, ప్రేమాంకురం, విరహం, వివాహం మూడు వందల పద్యాల ముచ్చటైన ప్రబంధం కాపు కన్నెనాయిక, యువ రైతు నాయకుడు, పల్లెపడుచులు చెలికత్తెలు, ఇది మనోహర సన్నివేశం సందర్భోచితంగా సమకాలీన సమస్యలైన బాల్యవివాహాల వరకట్నాల ఖండన, తెలుగు ఆచారాల వర్ణన రమ్యాతి రమ్యం కథా వర్ణనలో

జల జలరాలె పూలు వికచన్నవ పుష్పలతాంగి పచ్చ క
మ్మల యొడి నుండి శోభనపు ముత్తెపు సేసలనన్ హిమాంబువుల్
పల పల రాలె చల్లని యివమ్ములు జిమ్ముచు బిల్లగాడుపుల్
మెలమెల వీచెబో! జయము మీకని దెల్పు క్రియన్ రణంబునన్

గ్రామ భూస్వామి రావణుడు అతని బలగము రాక్షస సేన సీతమ్మ చెర, అంగద హనుమంతుల రాయబారాలు సైతమున్నవి రైతు రామాయణ గాధ సరేసరి నాటి రజాకార్ల సౌజన్యం ఎటువంటిదో చూడండి!

గృహదహనాలు దోపిడిలు స్త్రీ శిశు హత్యలు గోవధల్ సతీ
మహిళల మానభంగములమానుష ఘోర కిరాత కృత్యముల్
మహిగల హైందవ ప్రజల మారణ హోమము సేయు వ్యూహ ని
ర్వహణము లెన్నియంచు నుడువన్వశ మప్పటి యాదుంతముల్

ఇవన్నీ కవి కళ్ళార చూసి వ్రాసిన సత్యాంశాలు - నాటి నైజాం రాష్ట్ర ముస్లింల మతదురభిమాన ఘాతుకాలు వారికి సహకరించిన జమీందారులను నిరసిస్తూ రైతురామకథ రచించారు కవి

సీ కాపు కూలీల స్వకష్టార్జితం బెల్ల - దొరలు దొంగలు చుట్టి దోచుచుండ
ఆలు బిడ్డలు కూటి కంగలార్చుచు గంజి-నీళ్లపై పూటలు నెట్టు చుండ,

అడుగడుగున ప్రమాదాలు, వృత్తి పనివారల వెట్టి చాకిరి ఇవన్నీ చూస్తూ ఎట్లా ఊర్కుంటాడు, ప్రజల ప్రేమించే కవి ధర్మాన్ని కోరుకునే కవి? అందుకే నాడు,

చ కవుల కలాలు నాయక ప్రకాండుల గుండెబలాలు నేకమై
రగిలిచె విప్లవాగులను రైతులు కార్మికులొక్క పెట్టునన్ (రవిలిచె)
మొవులు పవుల్ నినాదముల ముందుకు సాగిరి రౌద్రమూర్తులై
దివి భువి యేకమైనదన దిక్కుల దట్టె ప్రజా ప్రవాహముల్

దున్నిన వానిదే పొలము - అన్న నినాదము ఏలికయౌమన రైతురాముడే యన్నిట భారత ప్రజల కన్నము ప్రాణము నిచ్చు తండ్రి, అను ఆకాంక్ష ఈ కవి కలానిది

ఈ రైతు రామాయణం ఆధునికాంధ్ర మహాఇతిహాసం ఇది జాతీయకావ్యం తెలంగాణా

రైతాంగపోరాట సజీవ చిత్రణ నిరంకుశ పాలకుల నిర్బంధాల నెదిరించి రైతుకూలీ శ్రామిక జనం విజయం పొందిన జాతి చరిత్ర తెలుగులో తెలంగాణా రైతు జీవితాన్ని రైతాంగ పోరాటాన్ని ఇంత రసోచితంగా ప్రతిభోపేతంగా రచించిన పద్యకావ్యం కానీ, గద్య రచన కానీ, అప్పటికీ ఇప్పటికి రాలేదు శివభారతం, రాణాప్రతాప చరిత్ర, గాంధీజీ ఆత్మకథ ఉత్తర భారత రాజకీయగాధలు మాలపల్లి నవల శాంతికి పట్టం కట్టి నాయకున్ని చంపివేసింది గోదాన్ రైతు జీవితమైనా అందులో బ్రతుకుకోసం ఆరాటం తప్ప పోరాటం లేదు పైగా దానితో కొంతకథ పట్టణంలో నడిచింది ఇది రైతు జీవితం - తెలంగాణ రైతాంగ విముక్తి పోరాటం విజయ నికేతనం పల్లెలో పుట్టి ఢిల్లిలో నినదించి నిజాంను పదవీచ్యుతుని చేసి ఆంధ్రదేశాన్ని ప్రజారాజ్యంలో విలీనం కావించిన తెలుగు జనజీవన గాధ చెట్టు కాండాన్ని నరికితే కొమ్మలు అవే వాడి ఎండి పోయినట్లు నైజాం ప్రభుత్వ పతనంతో వారికి వత్తాసుపలికిన గ్రామ రాజులు కోరలు తీసిన పాములయ్యారు ప్రయోజనకరమైన ఇతివృత్తంతో ప్రతిభావంతమైన రైతురామాయణ కావ్యం రచించిన జగన్నాధాచార్యులు ప్రజల కవి మహాకవి

**అభ్యుదయ గేయాలు** సిరిసిల్ల చతురాంధ్ర మహాసభ(1934)ఈ జిల్లాలో రాజకీయ చైతన్యాన్ని పెంచింది నైజాం రాజ్యం విముక్తి పొంది భారతదేశంలో విలీనం పొందిన 17 9 1948 తర్వాత కూడా ఇక్కడ సెప్టెంబర్ 1951 వరకు రైతాంగ పోరాటాలు సాగాయి [9] అప్పుడు రచించిన పాటల సంపుటి ఈ గేయాలు జిల్లా సోషలిస్టు పార్టీ ప్రచురించింది దాదాపు ముప్పై పాటలున్నాయి ఆ ప్రతి అలభ్యం ఒక జీర్ణపుస్తకం డా డింగరి నరహరిగారికి లభించిందన్నారు ఆచార్యులవారి అభ్యుదయ గేయాల బాణిని,వాణిని, 'సారస్వత జ్యోతి' [10] లోని ఈ క్రింది గేయం ద్వారా కొంతైనా తెలుసుకోవచ్చు

"రాముడెవడో? రాకాసెవడో!
ఏమని వ్రాయుదు నేమనిగీయుదు భూమిని బుట్టెడు పుట్టెడు గాధలు
రాముండెవడో రాకాసెవడో - భీముండెవడో బికారి యెవడో
శ్యామల శాద్వల సీమలలోనె - స్వర్గము గట్టెటి సాధువులారా
కూలిన క్రుంగిన గుడిసెలలోనే - కుస్తీలాడెటి రుస్తుము లారా
రాముడు మీకై రాడుసుమా ఆ భీముడు మీ యెడ లేడు సుమా
వారిని రమ్మని కోరెడిమేమే - వల్ల కాదనీ వదలు కొంటిమి
అందని పొందని యాశలతోనే ్రమందితిమయ్యా క్రగ్గితిమయ్యా
యెందరి కొరకని యెక్కడికొరకని అందుదురయ్యా ఆ దొరబిడ్డలు
కోమలములు మీయాశాంకురములు - కొండయంచునన్ బడి మిడికెడివే
మీ మంజుల మధురాశయములలో ప్రేమామృతములు వెల్లివిరిసిన
భీముని జామా రాముని ధీమా మీ ముని పోకడలకు వెలిసీమా
లేమిని కోరకు సామిని దూరకు - లేత మనోనాడుల దెగద్రెంచకు "
"మారుచున్నదీ ప్రపంచం మారనున్నదింకా కొంచెం "

9 రావెల నరసింహరాములు 'కరీంనగర్ జిల్లా స్వాతంత్రోద్యమ చరిత్ర' 1993, పుట 172
10 సారస్వతజ్యోతి త్రై సం కరీంనగరం 12 ఫిబ్రవరి 1954 పుట 84

అని వారు గళమెత్తి హరికథల్లో సాహిత్యోపన్యాసాల్లో మారుతున్న కాలాన్ని, మారుతున్న అవినీతిని తూర్పారబడుతూ గానం చేయడం ఆ తరంవారు ఈనాటికీ మరచిపోలేదు పద్యంగేయ రచన వారికి నల్లేరిపై బండి నడక అచ్చమైన ప్రజాకవి మహాకవి వానమామలై జగన్నాధాచార్యులు!

19) **గొట్టుముక్కల రాధాకృష్ణరావు - బుట్టారెడ్డి గూడెం** తా॥ హుజూరాబాద్,

జననం 1920 సుమారుగా - మరణం 1980 లో

రాధాకృష్ణరావుగారు ఆంధ్రాంగ్ల భాషలలో పండితులు ఉర్దూ ఆ కాలం నాటి విద్యామాధ్యమం ప్రభుత్వోపాధ్యాయులుగా కరీంనగర్, ఆదిలాబాద్, వరంగల్ జిల్లాలలో పనిచేసి వీరు ఉద్యోగ విరమణానంతరం హన్మకొండలో స్థిరపడ్డారు [1] రావుగారు లాక్షణిక పద్యకావ్య నిర్మాత గోలకొండ కవుల సంచిక నం 222లో వీరి పద్యాలు ప్రచురితం ఈ కవిగారి రచనలు ఇవి

1 రంగనాయక శతకము (ముద్రితం), 2 శ్రీశైల మల్లేశ్వర తారావళి (1950లో ముద్రితం), 3 ఋతు సంహారము (కాళిదాసు కావ్యానికి ఆంధ్రానువాదం), 4 సంపన్న గృహస్థుడు (ఖండకావ్యం)

చివరి రెండు కావ్యాలు అముద్రితాలు - అలభ్యాలు

**కవి వంశాదులు** శ్రీశైల మల్లికార్జున తారావళి చివరి 28వ, పద్యం ద్వారా కవి వివరాలు తెలుస్తున్నవి ఆ పద్యమిది

వర కౌండిన్యస గోత్ర జాతుడను గుర్వయ్యాంబమా పుత్రుడన్
ధర నద్వైత మతావలంబుడను రాధాకృష్ణనాముండ, దు
స్తర సంసార పయోధి తారకముగా తారావళిం గూర్చి సు
స్థిరమౌభక్తి చెలంగ నీ కొసగితిన్ శ్రీశైల మల్లేశ్వరా !

కవి జననీ జనకులు అంబమ్మ, గురువయ్య, అద్వైత విప్రుడు కౌండిన్య గోత్రం

**కావ్య విశేషాలు :** కవి మొదటి కృతి ఋతుసంహారాంధ్రానువాద కావ్యం

రెండవ కృతి **రంగనాయక శతకం** దీనిపై ముద్రిత సంవత్సరం లేదు కవి దీనిని 1950కి పూర్వమే ముద్రించినట్లు 'మల్లేశ్వరతారావళి' కృతిలో ఈ శతకాన్ని పేర్కొనడాన్ని బట్టి చెప్పవచ్చు రంగనాయక శతకము ప్రౌఢకవిత్వం కలది రంగనాయకా అని దీని మకుటం

శ్రీకర మంజు లేక్షణ వశీకృత లోకచయా! సమస్త జీ
వాకర,! సూర్యమండల నిరంతర కాంత విహార తత్పరా!
భీకర పాప దృక్ఛ్రవణ బృంద ఖగేశ్వర, చారుతప్త చా
మీకర నూతనాంబర, తమిన్ గొలుతున్ నిను రంగనాయకా!

భావం ఓ దేవా! శుభంకరమైన రమ్యవీక్షణములచేత సమస్త లోకాలను వశమొనరించుకొనిన వాడా సకల జీవులకు నిలయమైనవాడా సదా సూర్య మండల విహారం కావించు వాడా భయంకర సర్పసమూహాల పాలిటి గరుత్మంతుడా అందమైన నూతన కనకాంబరముల ధరించువాడా నిను ఆసక్తితో సేవింతును దృక్ఛ్రవణము = చూపులతో వినునది పాము, చామీకరము = స్వర్ణము పాపదృక్ఛ్రవణము రూపకాలంకారము కవి ప్రతిభను ప్రదర్శించేవి ఇటువంటి పద్యాలే రెండవ పద్యంలో హరి మహిమ ఉగ్గడింపబడింది! ఇలా

---

1 రాధాకృష్ణరావు గారి ముద్రిత పుస్తకాలతో పాటు, వీరిపేరుతో ఉన్న గో క సం గూడూరు గంగురామకృష్ణయ్య గారి వద్ద 1981లో చూశాను కవి వివరాలు సాహితీమిత్రులు కరీంనగర్ బి వి రామారావు, కె మల్లికార్జున్ గారలు తెలిపారు

వాకొన లేవు నీ మహిమ వారిజ గర్భ ముఖాఖిలామరా
నీకము, నాల్గు వేదములు, నిర్గుణ బోధక నైగమోక్తులున్,
ప్రాకటలోక వృత్తముల భంగి జెలంగు పురాణ పంక్తులున్
నాకగునే నుతింప నిను నందక సాయక రంగనాయకా !

దైవం నిర్గుణమని ప్రబోధించేవి నిగమాలని, లోక వ్యవహార భావాల ననుసరించేవి పురాణాలని వాకొనడం కవి గారి వేదాంత శాస్త్ర పరిజ్ఞానానికి నిదర్శనం

**శ్రీశైల మల్లేశ్వర తారావళి** ఇది తారావళి 27 పద్యాల సంఘాతం వరంగల్‌లోని శివభక్త సమాజం వారు, శ్రీశైల మల్లేశ్వరా! అను మకుట పద్యాలతో ఒక శతకం ప్రచురించే సంకల్పంతో కవుల నుండి ఒక్కొక్క పద్యాన్ని పంపుమన్నారట అప్పుడు రాధాకృష్ణకవి రెండు పద్యాలను పంపారు ఆ శతకం రాకపోవడంతో ఈ కవి తమ పాత పద్యాలకు తోడు మరికొన్ని పద్యాలు అదే మకుటంతో వ్రాసి తారావళిగా ప్రచురించారు ఈ విషయం కవిగారే ఈ కృతి 'తొలినుడిలో 16 1 1948 నాడు వ్రాసుకున్నారు దీనికి ఉదయ రాజు శేషగిరి రావు కవిగారి పీఠిక 25 5 1948 తేదితో ఉంది పుస్తక ప్రచురణ సంవత్సరం మాత్రం 1950గా పేర్కొనబడింది శ్రీశైల మల్లేశ్వర తారావళిలోని ఒక పద్యం చూడండి

సుర సంఘాతము పారు పత్తెమిడ నస్తోక ప్రపత్తిం బరా
బరిగా మౌనులు నీదు సంస్తవము సల్పం బూజ్య పీరస్థులై
హరియున్ బ్రహ్మయు ముచ్చటింప బహులోకారాధ్యతంజెంది సు
స్థిరకైలాసమునన్ వసించెదవుగా శ్రీశైల మల్లేశ్వరా - ప 27

ధూర్జటి 'శ్రీకాళహస్తీశ్వరా' శతకాన్ని తలపించే పద్యాలు మకుటం అంతే వృత్తాలు అవే ఇతి వృత్తం అదే శివ భక్తి వర్ణన "ఆ యీ కబ్బములు ప్రాచీన లాక్షణికుల శాసనములకు లోగినవి - గాని, యిప్పటి నవ్య కవిత్వమార్గములోనివి కావు" అని ఈ కృతిలో చెళ్ళపిల్ల వేంకటశాస్త్రిగారు వెలిబుచ్చిన అభిప్రాయం అక్షరాలా సత్యం

**ఋతు సంహారం :** ఆంధ్రానువాద కావ్యం అముద్రితం మృదు మధురమైన శైలితో రచించిన ఈ గీత పద్యాల కావ్యం పలువురు పండితుల ప్రశంసలు పొందింది కవి క్వాచిత్కంగానైనా ఆంధ్రీకరణలో స్వతంత్రత వహించారు 'వసంత ఋతువు' పేరుతో గో క సం లో ప్రచురింపబడిన రాధాకృష్ణరావుగారి తెలుగు ఋతుసంహారములోని అయిదు గీతాలలో మొదటిది చూపబడింది రెండవది ఇక్కడ చూపబడుతున్నది గో క సం 210 పుట నుండి

రమ్య దీర్ఘికాంబువులకు రత్న కాంచి, కావితతికి విలాసినీ గణములకును
సోమ రుచులకు పుష్పిత చూతములకు, నొసగు సౌభాగ్యమీవసంతోదయంబు

తర్వాతి మూడు పద్యాలు తరుణీమణుల అలంకారాల వర్ణనతత్సమ పదాలే అధికమైనా సుదీర్ఘ సమాసాలు లేకపోవడం ఈ అనువాద కావ్య సుగుణం సంపన్న గృహస్తు స్వతంత్ర రచన పద్య కృతి ఖండకావ్యం ఇది నవ్యభావాలతో అలరారుతున్నదని తారావళిలో చెప్పబడింది ఇది అలభ్యం

గొట్టిముక్కుల రాధాకృష్ణరావుగారు విద్వత్కవితావతంసులు ప్రసన్నశైలి, పదమాధుర్యం, భావలాలిత్యం వీరి కవనానికి సహజాలంకారాలు ఈ కవి పద్యాలు ఓ తరం కవితా ప్రతిభకు ఉదాహరణంగా నిలుస్తాయి

**20) దప్పురి సత్యనారాయణాచార్యులు - కోట్ల,** మం గంగాధర 1910 1985 సుమారు

గోలకొండ కవుల సంచికలో దప్పురి సత్యనారాణాచార్యులు అష్టావధాని - విద్యాన్, బిజవెంకి జన్మస్థలం, అని ఉంది అది అచార్యులు గారు బెజ్జంకి గ్రామ నృసింహాలయార్చకులుగా ఉన్నకాలం అంతకు అయిదేండ్లు పూర్వమే ఈ కవి 'రామాశ్వమేధ నాటకము' ముద్రితమైనా, చిత్రాంగద యక్షగానం

విరచితమైనా వీరి కృతుల పేర్లు ఆ సంచికలో లేవు[1] వీరు గంగాధర మండలంలోని కోట్ల నరసింహులపల్లె నివాసులు చారిత్రక పట్టణావశేషంగా మిగిలిన నందగిరి మట్టికోటకు ఈ గ్రామం సమీపంలో ఉంది ఆచార్యులు స్థానిక నృసింహాలయ పూజారులు వీరి పూర్వులది పోలాస గ్రామం సత్యనారాయణాచార్యులు హరిదాసు కవి ఇంచుమించు ఎనుబదేండ్ల జీవితకాలంలో అరువదేండ్లు రచనావ్యాసంగంతో జీవించారు - రాణించారు సత్యనారాయణాచార్యులు శ్రీవైష్ణవులు, హరితస గోత్రులు వారి వంశమూల పురుషుడు మహావిద్వాంసులైన నరసింహాచార్యులు[2] వీరి తండ్రి కేశవనాధుడు, తల్లి చూడమ్మ సత్యనారాయణాచార్యులు బహుగ్రంథకర్త[3] వీరి రచనల వివరాలు 'శ్రీరామ ధర్మస్వరూప వైభవము' కావ్యంలో ఈ విధంగా తెలియజేశారు

రామ కృపాకటాక్షమున వ్రాసితి రూపకముల్ త్రయంబురా
ట్సోముల సత్కథల్ మృదురసోచిత సర్వజనాదరంబు వెం
పై మహి కీరితిన్ వడయుభంగి పదొక్కటి వీధినాటికల్
భూమిలో మెప్పుపొందు గతి మెల్పగు నాలుగు యక్షగానముల్

రాముని దయచేత రాజచంద్రుల కథలు 3 రూపకములు (?), 11 వీధి నాటికలు, 4 యక్షగానాలు రచించారట అది వీధి భాగవతాలకు అత్యంతాదరం కల కాలం తర్వాతి పద్యంలో 10 హరికథలు, 1 నవల, అనేక భక్తి కీర్తనలు మంగళహారతులు రచించినట్లు తెలిపారు ఇవి మొత్తం 29 గ్రంధాలు పాటలు అదనం వీనిలో ముద్రితాముద్రిత లభ్యకృతుల వివరాలివి

యక్షగానాలు నాటకాలు 10 ఒక్కొక్క కావ్యం, నవల, హరికథ మొత్తము 13 రచనలు మాత్రమే రూపక సాహిత్యాన్ని గూర్చి తర్వాత, ప్రస్తుతం వీరి ఇతర సాహిత్య ప్రక్రియా రచనల పరిచయం చేయబడుతుంది

1 శ్రీరామ ధర్మ స్వరూప వైభవము - పద్యకావ్యం ముద్రితం

2 గజేంద్రమోక్షము - హరికథ అముద్రితం, 3 కర్మయోగి - నవల - అముద్రితం

1 **శ్రీరామధర్మ స్వరూప వైభవము** ఇది చంపూకావ్యం ఈ రామాయణ కథ కవి చివరి కృతి 1975 80 మధ్య ముద్రితం[4] ఆశ్వాసాలు రెండు పుటలు 110 కవి ఉభయ భాషాపండితులు వీరిది సలక్షణ కవిత్వం కవి శ్రీరామచంద్ర భక్తులు ముముక్షార్థులై జీవిత చరమాంకంలో ఈ భక్తి కావ్యరచనకు పూనుకున్నారు ప్రథమాశ్వాసంలో కవి వంశవర్ణన తర్వాత ఆదికవి వాల్మీకి చరిత్ర ఉంది ద్వితీయాశ్వాసం విశ్వామిత్ర యాగ సంరక్షణ కోసం దశరధుడు శ్రీ రాముని పంపిం చనెంచటంతో ముగిసింది దీనిని బట్టి కవి మరో రామాయణం వ్రాయనెంచారనుకోవచ్చు రచించినదింత మాత్రమే వీరి కథ మూల విధేయంగా సాగింది సంస్కృతకవులకు వందనమాచరించి కవి నుతించిన పూర్వాంధ్రకవులు వీరు

సురుచిర మాంధ్ర భారతము శోభిల సత్కృతి జల్పినట్టి భా
సుర బుధ నన్నయాదులను సూరన తిమ్మన పెద్దనార్యులన్
సరస కవీంద్ర ధూర్జటిని సారవచోకృతి రామ భూషణున్
హరి పద భక్తి యుక్తుని మహాత్ముని పోతన నాత్మగొల్చెచేదన్

1 గో క సం 1934 భవ దీపావళి ప్రచురణ దప్పూరి వారి 'రామాశ్వమేధం' శుక్లనామ సంవత్సరం 1929 పింగిలిరెడ్డి నెమిలికొండ తా జగిత్యాల వారు ముద్రించారు

2 దప్పూరి వారి "శ్రీరామ ధర్మ స్వరూపము వైభవము" ఆశ్వాసాంతగద్య

3 దప్పూరి వారి "శ్రీరామ ధర్మ స్వరూపము వైభవము" అవతారిక

4 1975లో ఈ వ్రాత ప్రతిని చూశాను ఇప్పుడు కనిపించిన ముద్రిత ప్రతిలో ముద్రణ సంవత్సరం లేదు పద్యాల సంఖ్యలేదు

ఆ తర్వాత వర్తమాన కవుల ప్రస్తుతించెద నన్నారే తప్ప, కుకవి నింద చేయలేదు అది కవి వినయం సుగుణం! వీరి కవిత్వానిది పురాణాలధోరణి కావ్యం భక్తి సంభరితం ఒక పద్యం - ద్వితీయశ్వాసాంత మాలినీ వృత్తం చూడండి

సురుచిర శుభ దాతా - సూర్యవంశ ప్రభూతా। సరసిజ దళనేత్రా సజ్జన వ్యూహ స్తోత్రా
పరమ సుఖవిలాసా పాప దైతేయ నాశా। వర శివ గుణధామా భక్త సంత్రాణ రామా!

"పెద్దరికంబుతో కవిత పెంపొదించుట కో" సం కాక, ఆత్మ పరిశుద్ధికి గుణవర్ణనంబు సేయ బూనుకున్నారు కవి "రామా నీవు మనుష్య మాత్రుడవా బ్రాజిల్లు విష్ణుండవో" అని ప్రశ్నిస్తూనే పురుషోత్తముడైన విష్ణ్వవతారామూర్తిగా భావించి సేవించారు ఈ క్రింది పద్యం కవి చిత్తవృత్తికి నిదర్శనం

ఒప్పులు తప్పులెన్ని గలవో యని సంశయమొంద, యీ కృతిన్
తప్పులు దిద్దుమంచు కవితల్లజులన్ బ్రతిమాలబోను, నే
మెప్పు వహింపగోరి పుడమిన్ దిరుగాడ, మదీయ నేరముల్
యొప్పులు జేయుమంచు మది (నిను) నోర్పున వేడెద జానకీపతీ!

**2 గజేంద్రమోక్షము** కవి పది హరికథలు రచించినా వానిలో ఏ ఒక్కటీ లభించలేదు వారి పుస్తకాలు చూస్తుండగా ఒకానొక వ్రాత ప్రతిలో ఒక విడి కాగితం కనిపించింది [5] 80వ పుటలో 'గజేంద్ర మోక్షణం కథ' అని శీర్షిక ఉంది 81వ పుటలో మాత్రమే వ్రాత ఉంది శ్రీ భాగవతము హరికథ అని పైన వ్రాసి కథారంభమైంది అది ఈ విధంగా ఉంది

శుకమహర్షి (కీర్తన - కల్యాణిరాగము, చతురస్ర గతి)
త్రికూటమను పర్వతము సుధాబ్ధిలో తేజరిల్లు కడు నిడువై
ప్రకటితమగు బంగరు వెండియినుముల కొమ్ములు మూడు గలవై
త్రికూటవిటపిలతా కుంజములు గంధర్వ విమానములు ధరియించు
నటననేకమణి ధాతు చిత్రితములయ్యి శృంగారముగ వెలయున్॥

వ॥ అప్పర్వత సమీపమున సాల లతాది లలిత పల్లవ మహీరుహంబులు శుకపికాది శారికా సముదయంబును నవరత్నాకరములును సిద్ధచారణ సంచారంబును నానాజంతు సంకులంబై విరాజిల్లు -

శా॥ అన్యాలోకన భీకరంబుడు జితాశానేకపానేకముల్
వన్యేభంబులు గొన్ని మత్తతనులై ప్రజ్యావిహారాశతో
ధన్యత్వంబున భూరి భూధర దరీ ద్వారంబునందుండి సా
జన్య క్రీడల నీరు గాలి (గ్రోలి?)

లభించిన దింత మాత్రమే - పది హరికథలు వారి కథాకాలక్షేప ప్రయోజనార్థం రచించి ఉంటారు అవి ఇతర హరిదాసులకు కూడా ఉపయోగపడి ఉంటాయి కాని అవి అప్పుడు అముద్రితాలు ఇపుడు అలభ్యాలు

**3 కర్మయోగి.** ఇది పౌరాణిక నవల భాష వ్యావహారిక పదస్పర్శ గల గ్రాంధికం కథ అంబరీశ చరిత్ర కవి వైష్ణవ మతాభిమానంతో ఏకాదశీ మహాత్మ్యవర్ణన గల ఈ భాగవత కథను వ్రాయనెంచుకొని యుంటారు ఇది 200 పుటల వ్రాతప్రతి కృత్యాది నాలుగు పద్యాల్లో ఉంది వీరి వచన శైలి ఇది

"ఓరీ విక్రమ సేనా! నీ స్వతంత్రమెంతకాలము నిలబెట్టుకుందువో చూచెదగాక అని ఆగ్రహావేశంతో పలికాడు మహారాజు" పు 91 అది సంభాషణ ఇదిగో వర్ణన

5 కవిగారి అచ్చు పుస్తకాలు వ్రాత ప్రతులు వారి దత్తపుత్రులైన మధుసూదనాచార్యుల గారి నుండి వేణుశ్రీ కవి తెచ్చి ఇచ్చారు 1991

"జింకలు దుప్పులు చమరీ మృగములు మొదలగు సాధు జంతువులు క్రూరమృగముల అరపులకు బెదరుచుండును, చిలుకలు గోరువంకలు కోయిలలు జంటలు జంటలుగా చెట్ల కొమ్మలపై మృదుఫలాలు భక్షిస్తూ కమ్మని గీతారావాలు చేయుచుండును పర్వతాగ్రాలపై క్రిందికి దూకుచున్న సెలయేరులు " ఇందులో సుమంతుని పుత్రుడు మంత్రి సుబుద్ధి క్షత్రియుడని ఆ రాజసేనలు భారతసేనను మించి పృథ్వీవిజయం కావించినాయనడం వంటి విశేషాంశాలున్నవి

కోట్ల సతెయ్యగారు అనే వ్యవహార నామవ్యాప్తిగల దప్పూరి సత్యనారాయణాచార్యులు కావ్యం, నవల, నాటకం, హరికథ, కీర్తన వంటి పంచ విధ ప్రక్రియల్లో ప్రసన్నశైలీ ద్రాక్షాపాక రామణీయకంగా రచనలు చేసి సమకాలీనుల ప్రశంసలనందుకున్న పండిత కవి

**21) ఆచి వేంకటాచార్యులు - ఆవునూరు** - తా॥ సిరిసిల్లా

జననం ఆనంద, 1914 మృతి 1985

వైదిక వాఙ్మయంలో చక్కని వైదుష్యం కలిగిన వేంకటాచార్యులు తెలుగులో రమణీయ భావాలతో కమనీయ కవితలు వెలయించిన కవిశిఖామణులు అంతా కవులముకామా అంతింతో పద్య సమితి నల్లగలేమా, అన్నట్లు ఏదో ఉబుసుపోక కవిత్వంవ్రాసే వారు కొల్లలు కాని ఎక్కువ కృషిచేసి తక్కువగా రచించి, వ్రాసిన ప్రతిపద్యం ముగ్ధమనోహర సజీవశిల్పంగా సృజించగల కొందరిలో వేంకటాచార్యులు ముందుంటారు వీరిది అమృతలేఖిని గోలకొండ కవులసంచికలో ఆచివేంకటాచార్యుల కవిత ప్రచురింపబడింది (కవి నం 286, కవిత పుట 297)

**వేంకటాచార్యుల రచనలు** 1 ఆండాళ్ బుఱ్ఱకథ అముద్రితం, అలభ్యం, 2 రాగమాల ఖండకావ్యం, 1973లో ముద్రితం, 3 మా ఊరు - పద్యకావ్యం, 1975లో ముద్రితం

**కవి పరిచయం.** కరీంనగర్ జిల్లా సిరిసిల్లా తాలుకాలోని ఆవునూరులో వేంకటాచార్యులు ఆనందనామ సంవత్సరం క్రీ శ 1914లో జన్మించారు వీరి తండ్రి ఆచి నరసింహాచార్యులు ఆచి వారిది పండిత వంశం గోలకొండ సంచిక కెక్కిన కవులు అయిదారుగురు సిరిసిల్ల ప్రాంతము వారే ఆవునూరువారే నలుగురున్నారు ఆ సంకలనంలో నం 5 ఈ పుస్తకంలోని నం 1 కవి ఆచి రాఘవాచార్యులు వీరి విద్యా గురువు ఆ సంచికలోని మిగితా సిరిసిల్ల ప్రాంతకవులు విద్యా గురువులుగానో కవితా మిత్రులుగానో వీరికి సంబంధం కలవారు కోరుట్ల శతావధాని కృష్ణమాచార్యులు గారి మేనకోడలి భర్త వేంకటాచార్యులు

వీరి వృత్తిని ప్రవృత్తిని కవితా శక్తిని గూర్చి నల్లాన్ చక్రవర్తుల వేదాంతాచార్య కవి 'రాగమాల' కావ్యపీఠికలో, వేషముచూడ ఛాందసము, చదివినది ద్రవిడాగమ శాస్త్రములు, ఈ రసవత్కవిత్వ పాటవము ఎట్లా పట్టుపడిందా అని ఆశ్చర్యాన్ని వ్యక్తపరిచారు [1]

**కావ్యపరిచయం** తెలుగులో పాటలు హారతులు, పద్యాలు వ్రాయడం వేంకటాచార్యులకు మొదటి నుండి అలవాటు

**1 ఆండాళ్ బుఱ్ఱకథ:** వైష్ణవాచార్యులలో హరిదాసులెక్కువ కాని వీరు నూతన కథా కథన ప్రక్రియ[2] అయిన బుఱ్ఱకథగా 'ఆండాళ్ చరిత్ర' రచించారు అది పేరునకు బుఱ్ఱ కథ కాని, గేయాలు పద్యాలు మృదుమధుర పదవిహితంగా లయబద్ధంగా ఉన్న రసవత్కావ్యమని దాన్ని చూసిన వారు చెప్పారు [3]

**2 రాగమాల** 1973లో ముద్రింపబడినా ఈ కావ్యం ఇంకా విడుదల కాలేదు మిత్రులకు తప్ప

---

1 అచి వేంకటాచార్యులు గారి 'మాఊరు' 1975లోని న చ వే గారి 'సుమనోంజలి' ప్రశంసా పద్యం

2 పరిశోధకులు కాకతీయుల కాలంనాటి జంగముకథలు వీనికి మాతృకలంటారు కాని, ఆధునిక బుఱ్ఱకథలు గత శతాబ్దిలో మరాఠీ ప్రాంతం నుండి దిగుమతి అయినట్లు చెప్పవచ్చు

3 సిరిశెనహళ్ నంబులాద్రి హరిదాసు గారు ఏప్రిల్ 1992లో కోరుట్లలో నాతో అన్నారు వీరు శతావధాని కృష్ణమాచార్యుల జ్యేష్ఠ పుత్రులు వీరి మేన వదిన భర్త ఆచి వేంకటాచార్యులు

వేంకటాచార్యుల కవితలు జనవ్యాప్తి కాలేదు అందుకు కవి ప్రయత్నించలేదు రాగమాలలో 20 పద్యకావ్యఖండికలు 50 పుటల్లో ఉన్నాయి గాంధీజీ నిర్యాణం, 15వ ఆగష్టు శీర్షికలనుబట్టి ఈ కావ్యంలో కొన్ని భాగాలు ఈ శతాబ్ది పూర్వార్ధంలోనివి ఉన్నాయనవచ్చు

"భావుకత పద గ్రధన పారీణత సప్రమాణంగా అలవరచుకున్న సరసాధ్వసంచారులు శ్రీ ఆచి వేంకటాచార్యులు సురభిళాత్మతో వీరు రచించిన ఈ 'రాగమాల' సురుచిర భావహేళ" అని ప్రశంసించారు డా సి నారాయణరెడ్డి గారు కావ్యపీఠికలో ధూపాటి వేంకటరమణచార్యులు, వేంకటాచార్యుల పద్యాలు 'అవి నిక్షేపాలు సీసాలలోపలి మాధ్వీ రసాలు' మొ వి విని మహదానందం చెంది అభినందించారని నల్లాన్ చక్రవర్తుల వేదాంతాచార్యులు వారి మున్నుడిలో తెలిపారు తొలి శీర్షిక 'ప్రభు' లోని తొలి పద్యం ఇది -

శ్రీకరముల్ మహాజన వశీకరముల్ మహనీయమోక్ష ల
క్ష్మీ కరముల్ త్రయా శిఖర శేఖరముల్ బహుళార్తి దైన చా
మీ కరముల్ మహోదయ సమీకరముల్ భవదీయ నిర్మల
శ్రీ కరుణావలోక రస శీకరముల్ గురిపించుమా ప్రభూ !

అదీ అంత్యానుప్రాస రామణీయకం , భక్తిరస పూరిత భావ ప్రవాహం ! అస్తి నాస్తి విచికిత్సలకు లోనైన ఈనాటి జనుల భావాల ప్రభావంగా కవి తన దైవాన్ని ఇట్లా వేడుకున్నారు

ఉన్నాడందురు లేవనందురు[4] నదేమో యున్నచో రూపమే
సున్నాయందురు సూక్ష్మమందు రిటు లీసున్ బెంచి నన్నెవ్వరే
మన్నన్ నాకవి యన్ని యెందులకు, దేవాధీశ ! నేనింక నీ
వున్నావందును, ఉండుమయ్య యిదె నేనున్నంత పర్యంతమున్

'రవీ' లో కవిత్వాన్ని గురించి

తొలి పూజార్థము నాంధ్ర సాహితికి నీ దోసిళ్ళతోచంపక
మ్ముల నర్ఘ్యోదక మిచ్చి యుత్పలములన్ బూజించితే మత్త కో
కిల గీతావళి నాలపించి యవి నిక్షేపాలు సీసాలలో
పలిమాధ్వీక రసాలు భక్తి మెయి నాస్వాదింపగా జేసితే

చంపకం, మత్తకోకిల, గీతం, సీసం పద్య ఛందస్సులు అర్థశ్లేషతో ప్రయోగించిన కవి ప్రతిభకు భావసంపదకు రసజ్ఞులు తలలూపక తప్పదు గాంధీ జయంతిలో

మూల కొదిగిన రాట్నాలు మూగ గొంతు, కలను సవరించి కూనరాగాలు దీసె
వెట్టి హరిజన వాడలో రొట్టె విరిగి, నేతిలో బడె నే (నీ) దిన జ్యోతులందు

కూనరాగాలుదీయు జాతీయం, రొట్టి విరిగి నేతిలోబడు సామెత పలుకు నుడికారాలు సామెతలు భాషకు సహజత్వాన్ని సౌందర్యాన్ని పెంచుతవి పస్పు పిట్టలు, పుండుచలి మొ॥ అపూర్వసజీవ సుందర పదబంధాలను ఈ కావ్యంలో కవి సమయోచితంగా ప్రయోగించారు

---

4 ఇక్కడ అందుకు పదం ధ్రుతాంతం కాదు నదేమో అనిరాదు అదేమో అని కవి విసంధినే పాటించి యుండవచ్చు ననటానికి ఇదే పద్యచతుర్థపాదంలోని ఉండుమయ్య విసంధి సాక్ష్యం పైగా మా ఊరు, జనవ్యవహారంలో 'మావూరు' అని ఉంది వ్యాకరణ పండితులు దాని నొప్పరు యడాగమంలో 'మా యూరు' అనే అంటున్నారు ఈ సంధి జనవ్యవహారానికి సహజంకాక, కవికి నచ్చక ఉభయతారకంగా 'మా ఊరు' అని తమ కావ్యనామాన్నే విసంధిలో ఉంచారేమో! అందురు'ను - సముచ్చయార్థకం !

'ధనుర్మాసం'లో "తెలవారంగనె పస్పులో మునిగి క్రొంగ్రొత్త చీరల
లావణ్యము గంపలన్ గొలువ, పేరంటా లకై పస్పు పిట్టల వోలెన్
జను చంద్రు గుంపులుగ వ్రీడా సజ్జిత స్వాంత నిర్మలులై నైదువరాండ్రు "
"నిలువెల్లన్ వణుకెత్తు పుండు చలిలో నీరాడి పూజారి పొం
గలి నైవేద్యము పెట్టె స్వామి గుడి గంటల్ కాహళుల్ మ్రోగిని
ర్మల నీహార కణాలు జల్ల " ఇట్లా మనోహరంగా వర్ణించారు కవి

హేమంత హేల - ప్రకృతి సౌందర్య లీలా చిత్రణ 'కాముని పున్నమి'లో కవి భావం మలయ సమీరంతో పోటీపడి విహాయస విహారం కావించి చక్కని చుక్కలకు నిండు చందురునితో చలువ పందిళ్ళు వేయించుకొన్నది !

"వలపు గాజుల చేతి చప్పట్ల తోడ, పల్లె పాటల జాతీయ పరిమళాలు
బంచి పెట్టుచు నింటింట వాడ వాడ,నాడుకొను పేద పడుచులయందములకు
చలువ పందిళ్ళ వేసె మా చందమామ !"

మా తెలుగు భాషకు మల్లె పూదండ ! ఇంతటి మనోహర కవితలు వెలయించిన 'కవితా వతంసునికి కలువపూదండ' వేయవలసిందే కదా !

ఇందలి గోదావరిపొంగు, గాంధీనెహ్రూజీల నిర్యాణాలు, అమ్మాయి శీర్షికలు కరుణ రసార్ద్రాలు 15వ, ఆగస్టు, కెప్టెన్ విజయరఘునందన్ సంస్కృతి, వీర రస ప్లావితాలు కర్పూర వసంతరాయలు, పోతన చరిత్రము కృతికర్తలైన డా॥ సి నా రె అభినవ పోతన వరదాచార్యుల ప్రస్తుతి కవి సౌమనస్యానికి సాహితీప్రియతకు నిదర్శనాలు కవి ఈ కావ్యంలో రైఫిల్ మోతల - రైలుబండి కూతల వర్ణించారు రైలుది 'అయోమయ' మార్గమని శ్లేషగర్భితంగా పలికిన ప్రతిభాశాలి ఈ కవి వీరి కవిత మాత్రం ద్రాక్షాసవ పాత్రం

3 **మా ఊరు** - 1975 ప్రచురణ దీని ముద్రణకు పూనుకున్న పి వి చారి - అవునూరి వేంకటాచారి అనే పేరుతో 1947 48 తెలంగాణా విమోచనోద్యమంలో పాల్గొన్నవారు [5]

**జననీ జన్మభూమిశ్చ** అన్నట్లు కవి స్వగ్రామాన్ని వర్ణించి వ్రాసిన కావ్యం "మా ఊరు" ఇది ఏకాశ్వాస ప్రబంధం పద్యాలు 160 గో క సం లోని వీరి రెండు పద్యాలూ నైజాం రాష్ట్రప్రశంసలే వీరి మావూరు కావ్యంలో నాయికా నాయకులు లేరు వ్యక్తుల పేర్లు రావు కాని చివరి 60 పద్యాల్లో ఆవూరికి మేలు చేసిన చాకలి వీరన్న వీర గాథ ఉంది ఇష్టదైవ గురు బంధుజన వందనమాచరించి సలక్షణంగా కావ్యారంభం కావించి కవి చెప్పిన కథారంభ పద్యమిది

మాదొక పల్లెకాదు పది మంది ధనాఢ్యుల పెద్ద బస్తియున్
గాదు - బజారులో మురికి కాల్వలు బాటలునొప్పు - మాట మ
ర్యాద - అమాయికత్వము విరాజిలు మా ప్రతి యింట పారిటీ
సోదెలు పిచ్చివేషములు సోకులు మచ్చుకు లేనె లేవు పో !

అవునూరి పరిసరాల, గుట్టమెట్టల, నదీతటాకాల, పంటపైరుల, పుర జనాల, ఈ కావ్యంలో కవి మనోజ్ఞంగా సహజసుందరంగా వర్ణించారు ఆ పద్యాలు శిల్ప విన్యాసంలో కరుణశ్రీని, భావగాంభీర్యంలో జాషువాను తలపింపజేస్తాయి వేంకటాచార్యులకు అభిమాన కవి భక్త పోతన భాగవతం ఈ కవి నిత్యపారాయణ గ్రంథం అనవచ్చు !

---

5 రేపాల నరసింహరాములు 'కరీంనగర్ జిల్లా స్వాతంత్ర్యోద్యమ చరిత్ర' 1993, పుట - 123, ఫోటో పుట 129

అవునూరికి కొంత దూరములో కొత్తగా ఓ గ్రామం వెలసిందట వారు గ్రామదేవతను నిల్పుకునే సందర్భాన మూడు రోజుల సంబరం మహాసంరంభంగా నిర్వహించారు చివరి దినం బలి బోనపు ముద్ద ఎగుర వేయగా, దానిని అవునూరి చాకలి వీరుడు గాలిలోనే అందుకొని పరుగెత్తుకొచ్చాడు అది నేల పడిన చోట శుభాలుంటాయని, లేకుంటే అరిష్టమని కొత్తపల్లె యువకులు కట్టెలు కత్తులతో వీరని వెంబడించారు వారు సమీపించినది చూసి తమ ఊరి పొలిమేరలోనికి బలి అన్నంముద్ద విసరి శత్రువుల దెబ్బలకు వీరన్న మరణించాడు ఇదీ సంగ్రహంగా ఆ కథ

ఒకసారి పెనువర్షం కురిసే సమయంలో చెర్లు నిండి తెగి ఊరికి ఏ ప్రమాదం వాటిల్లనున్నదో అని ఈ కవి భయపడగా, అట్లా జరుగదని పైకథను కవి గారి తండ్రి వినిపించినట్లుగా చెప్పబడింది

ఈ కావ్యంలోని ఏ పద్యాన్ని చూసినా అది ఒక ఆణిముత్యం సద్యోవికసిత ప్రసూనం కవి కలం భావానాబలం అనిదంపూర్వం ఆ ఊరిలో,

కవులున్నారు రసాత్త కావ్య రచనా గౌణేయులున్ సాహితీ
ధవులున్నారలుదాత్త వాఙ్మయ నియంతల్ నవ్య సంగీత స్వ
ర్భవులున్నారట శ్రావ్యకంఠ కలనాపూర్ణుల్ వచోలాస్యవై
భవులున్నారు సభాంగనార్హ వివిధోపన్యాస వాచస్పతుల్ - 22

వైశ్యుల ప్రశంస ఏరిలాభాల నార్జించు వారలైన, జోరులో కొల్లలో పిచ్చిబ్లాకులేక, విజ్ఞులై పుణ్యజనతా వివేకులైన, బేరులున్నారు చిన్నకుబేరులట్లు 26 అంతేనా మంచితోపాటు చెడును సైతం నర్మగర్భితంగానైనా చెప్పగల గుండె దిటవు ఈ కవికున్నది అటువంటిదీ క్రింది పద్యం

ఒక్కటి నచ్చ చెప్పి మరియొక్కటి జేయుచు నోటిలోని దొ
బుక్కను లాగజూచెడి ప్రబుద్ధులు వెంటను వెంట దిర్గి పెం
పెక్కెడు ప్రక్కపాములటు లేమరు పాటున గాటువేయు నా
టక్కరులుండవచ్చును - కడంకను జూచిన సందుగొందులన్ 80

కడంక వంటి జనవ్యవహారంలోలేని నిఘంటువులలోని పదాలు క్వాచిత్కంగా కనిపించినా, సజీవ భాషనే కవి స్వీకరించారు బుక్క = కబళం (కోస్తాలో బొక్క, అది తెలంగాణాలో బొమిక) వంటి మాండలిక పదాలు నిస్సంకోచంగా వీరు ప్రయోగించారు

నిండు గంగాళాల్లాంటి చెరువులు, ఆ రెంటి మధ్య నౌక విధంగానిలిచిన రాతి వంతెన పచ్చని పట్టు తివాచీలవంటి పైరులు, తలల వాల్చిన కంది జొన్న చేలు, నిపుణులైన వృత్తిపనివారలు, విద్వచ్ఛోభితులైన కవి పండితులు, న్యాయవేత్తలైన గ్రామాధికారులు, సుందరీమణులు మొ॥ వర్ణనలీ కావ్యంలో ఉన్నవి పురాణ సంప్రదాయ మార్గం నుండి పద్య కవితను నవీన సామాజికేతి వృత్తంతో రచించినధీశాలి వేంకటాచార్యులు ఈ స్థల చరిత్ర కావ్యంలోని అనుశ్రుత కథానాయకుడైన వీరన వర్ణన చూడండి

భుజముల వ్రేలాడు బోలెడు జంపాలు, నెగదీసి చక్కగ బిగియగ్రద్ద
పై గుడ్డ నడుమున పట్టగా బిగియించి, కమ్మూల దోవతి కాసె/కక్ష
పురి విచ్చి తలపాగనెరి బాగుగా జుట్టి, బ్రతుకుపై గల ప్రేమ/వధిలివెట్టి
తన రక్తనాళాల తళతళ లాడెడి, సాహసోదార్యాల సానబట్టి
ధైర్యమును మగ తనము నుదార గుణము, బంటులై తోడురా వెనువెంట రాగ
మల్ల జరచి యొకానొక మారు త్రోవ, విచ్చుకత్తుల వ్యూహానజొచ్చినాడు / AP /

ఇది ఏ పూర్వ ప్రముఖ ప్రబంధకవులకూ తీసిపోని పద్య శిల్పం - భావచిత్రం ! వ్రాసినవి చిరుత కావ్యాలైనా, మహాకావ్యకవుల సత్తా ఈ కవి గారిది ఆచి వేంకటాచార్యుల కవనం వారి 'మా ఊరు' సరోవర తామరస వర్ణనకు సరిపోజాలుతుంది ఆ పద్యం చూడండి

అరయగ మొగ్గయో పిడికిడంతయు! విచ్చిన పూవొ దోసెడా
పరిమళ పుష్పమధ్యమున బచ్చని కర్ణిక దాని చుట్టు కే
సరములు - వందలాది నును జాయల రేకులు వాని లోన నే
సురభి పరాగముల్ మధురశోభి మరందములుద్భవించెడున్ 57

కరీంనగర మండల సాహిత్యోద్యాన 'కవి కోకిల' ఆచివేంకటాచార్యులు! వేముగంటి నరసింహాచార్యులు ఆచి వారి కవిత్వాన్ని ఈ కావ్య ప్రవేశికలో బహుధాకొనియాడినారు ఇంతచక్కని కావ్యాన్ని కేవలం 500 ప్రతులు ముద్రించి కవి కనులముందు కానీ, తర్వాత కానీ, ఆవిష్కరించక పోవడం బాధాకరమైన విషయం

## 22) వటపురి వేంకట నృసింహాచార్యులు - కంది కటుకూరు - సిరిసిల్ల

గో క సం - సం 329 జననం 1890 సుమారు, మృతి 1965

ఇంటిపేరైన మత్రిపల్లిని సంస్కృతీకరించుకుని నృసింహాచార్యులు వటపురి' వారైనారని వినికిడి వాతూల అహోబల పండితుని నిజనామం గాలి ఓబయ్య అని 'అహోబల పండితీయ' ప్రస్తావనలో ఉంది అలాంటిదే ఇది విశ్వనాథ సత్యనారాయణగారి 'రామాయణ కల్పతరువు' కావ్యంచేత ప్రేరితులైన ఈ కవి 24 వేల పద్యాల్లో "సీతా చరిత్రము" అని రామకథను వ్రాయనెంచి దాదాపు ఎనిమిది వేల పద్యాలు వ్రాశారట [1] అందులో కేవలం మూడు ఆశ్వాసాలు 6, 7 వందల పద్యాలు మాత్రమే తొలి సంపుటిగా 1964లో 600 ప్రతులు ముద్రించగలిగారు అంతటితో మృత్యువు వారిని వరించింది వటపురి వేంకట నరసింహాచార్యుల కృతులు ఇవి -

1 సీతా చరిత్రము, 2 అహల్యాశాపహరణము, 3 కుశికాత్మజుని తపోభంగము, 4 భక్త కల్పద్రుమ పద్యములు, 5 భుజగ రాజీయము, 6 నామదేవుని పెండ్లి, 7 కీర్తనలు, 8 బలిచక్రవర్తి కథ, 9 సుధార్ణవము మొదలైనవి [2]

ఇన్నింటిలో ఒక్క 'సీతా చరిత్రము' మూడు ఆశ్వాసాల గ్రంథం మాత్రం ముద్రితం అందులో ఇతర రచనల వివరాలు లేవు కవి జన్మతేది కూడా లేదు

**కావ్య పరిచయం** కావ్య పీఠికలో శతావధాని కృష్ణమాచార్యులు అన్నారిలా "వీరు నాకు చిర పరిచితులైనను వీరి కవితా విలాస ప్రదర్శనము నూతనము చిన్న చిన్న పొత్తములు వ్రాసి మహాకవులమని పెద్దపెద్ద బిరుదములంట గట్టుకొన తంటాలు బడు స్వభావులు కాదు" వీరు

రామాయణము కాండములుగా విభజింపబడి ఉంది వీరు కావ్య ప్రబంధాల విధానంలో తమ ఇతిహాసాన్ని ఆశ్వాసాలుగానే విభజించారు అచ్చయిన మూడు భాగాల్లో 172, 201, 194=567 పద్యాలున్నాయి వీరి కవనం ధారాశుద్ధి శోభితం

శ్రీమన్మంగళ వైభవాస్పదము సంసేవ్యంబు విస్ఫార శో
భామాన్యంబఖిలైక మోహనము శుంభ త్పూత పూర్ణాంబుధి
వ్యామోదాద్భుత భాగ్యమందిరము నిర్వ్యామోహ సంపత్తి ని
స్సీమ ప్రాభవ సత్వపూరితములై చెన్నొందు వైకుంఠమున్ (1-1)

ఈ విధంగా కథారంభమై,

---

1 వాల్మీకి రామాయణంలో 24 వేల శ్లోకాలున్నాయంటారు వ్యాస భారతం లక్షశ్లోక సీమితమట

2 క జి ర చరిత్ర - 1981 పుట 228 లో చూపినవి

అనవరతంబు భవ్యతమమై రసపూరితమై మనోజ్ఞమై
ఘనతరమై చిరంతర సుఖాళిని గూర్చ నిదానమై సుధీ
జనసుత సామగాన సరస స్వన పూరితమై విశాలమై
దినకర చంద్ర తారకల దీప్తులకున్ జొరరాకభేద్యమై (1 3)

ఇట్లా సాగింది వీరి కవితా మకరంద ప్రవాహం పద్య రచనలో ప్రసన్నశైలి వర్ణనలలో ప్రబంధ నైపుణి, కథా గమనములో పురాణముల ధోరణి ఈ కవి కలానికున్న సుగుణాలు

ఈ కావ్యమున ఒక సీస పద్యం 50వ పుట, చరణాలు అద్యక్షరాలు చదివితే 'సమస్త జననీ వందే అవుతుంది ఇది చిత్ర కవితా విన్యాసము ఈ కృతి మూడు అశ్వాసాలు ముగ్గురు దాతల సహాయంవల్ల ముద్రణ పొందాయి కనుక ఆయా వదాన్యుల వంశ చరిత్రలు ఆయా కావ్యభాగాల ముందు ప్రత్యేకంగా కవి (20 30 పద్యాల్లో) రచించి కూర్చారు

"ఈ ద్వితీయాశ్వాసము విను సందర్భమున తొల్లిటి మహర్షుల యాశ్రమములు నా కనుల యెదుట సాక్షాత్కరించినట్లు తోచి ముగ్ధుడనైతిని ఈ కవి శ్రీ విశిష్టాద్వైత సంప్రదాయ గ్రంథముల మత్సమీప గ్రామములందెన్నియో మారులు కాలక్షేపము చేయగా వింటిని వాగ్విలసితమై వినుటకు శ్రోతృపేయమై, శయ్య శబ్ద స్ఫురణ బంధురమై సలక్షణ లక్షితమై యలరారుచున్నది' అని వానమామలై లక్ష్మణాచార్యులు కావ్యపీఠిక 'పండితాభిప్రాయం'లో ప్రశంసించారు ఈ సీతాచరిత్ర కావ్యాన్ని

వైకుంఠ వర్ణనలోని ఒక పద్యం ఇది (1 41 పుట)

అలరున్ తత్పురి మధ్యభాగమున దివ్యప్రాభవోపేతమై
విలసద్రత్న మణి ప్రకాశమయమై విస్తారమై సుందరో
జ్వలితంబై తపనీయ నిర్మిత చతుర్ద్వారంబులున్ గల్గిని
ర్మల గంధాన్విత బంధురంబు హరిసంబంధంబు సంస్థాయమున్

మున్యాశ్రమ వర్ణన (2-87 పుట) లో యాగ ధూమాన్ని జూచి మేఘాలనుకొని నెమిళ్లు లయబద్ధంగా నాట్యం చేశాయట మగనెమిళ్ళే పురివిప్పి ఆడాయనటం కవి సునిశిత ప్రకృతి పరిశీలనకు నిదర్శనం ఆడపిట్టలు అందుకు ఆనందించడం సహజం

చ సతత జపోప వాసముల సల్పి కృశించిన తాపసాళి కం
చిత కుతుకంబు గూర్పగ విశేష సుగంధము బూనియున్ సదా
గతుడు కిశోర రూపమును గైకొని మందముగా జరించు భా
సిత సవనాలయంబుల వసించెడి వారల మ్రోల నమ్రుడై

గాలి సదాగతుడు కిశోర రూపుడై అంటే, పిల్లగాలి, తపస్సులతో ఉపవాసాలతో కృశించిన మునులకు మలయ సమీరం చల్లగా మెల్లగా వీచి పరిచర్య చేసిందని సందర్భోచిత సరస వర్ణన

నాయిక వలపు తలపోత ఇలాగుంది (3 - 137)

శా సారాసార విచార తత్పరుడు విస్తార ప్రమోదుండు శృం
గారాకారుడు శౌరి నన్ను కృపతో కల్యాణి ప్రాణేశ్వరీ
నీరేజాక్షి మనోహరీ ప్రియసఖీ నీలాలకా యంచు నిం
పారన్ బిల్వగ నాలకింప గలనో మద్భాగ్యమెట్లున్నదో

కం హరితోడ గూడి వేడ్కన్, గరుడునిపై నెక్కి తిరుగ గలనో లేనో
హరి నర్మోక్తులు వినుచును, కరమానందాత్మనగుచు గ్రాలం గలనో

ఇంతవరకు పోతనగారి రుక్మిణి స్మృతిలో మెదిలింది కదా, ఇదుగో ఇక ప్రహ్లాద ప్రవేశం

సీ నారాయణుని పాద నళిన కైంకర్యంబు, సల్పగాలేని హస్తములవేల?
కమలాక్షు మోహనాకారంబు నిరతంబు దర్శింపలేని నేత్రముల వేల?

కవికి కవనాశక్తికి తోడు హరిభక్తి భాగవతానురక్తి అంత మిక్కుటంగా ఉంది శృంగార వర్ణనల సందర్భంలోను కవి ఔచిత్యాన్ని పోషించడం ముదావహం ద్వితీయాశ్వాసాంత మాలినీ వృత్తం ఇది

కుసుమశర సురూపా ఘోర సంతాప తాపా। అసమ సుగుణ జాలా అప్రతీతా సుశీలా
బిసరుహ సమనేత్రా విజ్ఞన స్తోత్ర పాత్రా। భసిత కలుషరాశీ బాలచంద్ర ప్రకాశీ

ఇందులో 8 పుటల ఇష్ట దేవతానుతులతోపాటు సుకవిస్తుతి, కుకవినిందా ఉంది అంకితం సీతాదేవికి సీతా జననము నుండి భూగర్భ ప్రవేశము వరకు వ్రాయనెంచిన మహాకావ్యం ఈ మూడాశ్వాసాల పుస్తక ముద్రణతో కవికి ఆయువు తీరింది అక్కడికే కావ్యం ఆగింది

శ్రేయాంశి బహువిఘ్నాని అపితు, యత్నీకృతే యదిన సిద్ధ్యతి కోత్ర దోష ? రసవన్మహాకావ్య నిర్మాణ సదాశయ (అసంపూర్ణ) సాధకులు వటపురి వేంకట నృసింహాచార్య కవి

### 23 వెలిచాల కేశవరావు - గుండి 1908 - 89



వెలిచాల కేశవరావుగారి జన్మస్థలం (తెలుగులో తొలిసారిగా కందపద్యాలు కనిపించిన పంపకవి తమ్ముడైన జినవల్లభుని శాసనం గల) కురిక్యాల తల్లిదండ్రులు రామక్క కృష్ణారావుగారలు తాత కొండన్న రావుగారు తమ పెత్తండ్రి కొండలరావు గుండి గోపాలరావుపేట గారింటికి బాల్యంలోనే దత్తు వెళ్లారు గుండి గ్రామం రామడుగు మండలంలో ఉంది వీరి జాతి వెలమవారు స్వర్ణగిరి గోత్రీకులు లక్ష్మీ సరస్వతులు కలిసి ఒకయింట ఉండవంటారు కాని, దానికి అపవాదం వీరి గృహం వీరు భూస్వాములు విద్యావైదుష్యాలు కలవారు కేశవరావుగారు కృతికర్త - కృతుల స్వీకర్త

వ్యాపారం వ్యవసాయం వీరికి ధనధాన్య సమృద్ధిని కలిగించాయి కేశవరావుగారిది నిరంతర సాహితీ వ్యాసంగం, అభ్యుదయ మార్గం భౌతికవాదం వీరి కలాన్ని కాలానికంటె ముందు నడిపించింది వీరివి సంఘ సంస్కారభావాలు రావుగారు ఆంధ్ర జాతీయ మహాసభను, ఆర్యసమాజ్‌ను అభిమానించారు కాంగ్రెసులో చేరారు ఫైజ్‌పూర్ సభల్లో గాంధీని చూశారు తెలంగాణా విముక్తి పోరాటకాలంలో వీరు కాకున్నా వీరి కుమారులు అందులో పాల్గొన్నారు స్వాతంత్ర్యం తరువాత గ్రామ సర్పంచ్‌గా గ్రామా భ్యుదయానికి పాటుపడ్డారు

రావుగారు యువకులలో యువకులు అరవై వయస్సులో ఇరవైనాటి ఉత్సాహం 1908 89 ఎనభైరెండేళ్ళ జీవితకాలంలో అరువదేండ్లకు మించిన కాలం సాహిత్యారాధనతో గడిపారు బంధుమిత్రుల యిండ్లలో ప్రత్యేక పర్వాలు జరిగిన సందర్భాలలో, ఇంకా సాహిత్యసభలలో వీరు స్వీయ కవితాగానం చేసేవారు కేశవరావు గారంటే జిల్లాలో మంచి గౌరవం కవులకు కళాకారులకు ఆర్థికసహాయం కావించారు ఇతరుల రచనలు చదివి సవరించేవారు పలు పుస్తకాలకు పీఠికలు వ్రాశారు నాలుగైదు కృతులను అంకితం పుచ్చుకొన్నారు అనేక రచనలు చేసినా ఈ శతాబ్ది ఉత్తరార్థంలోనే వీరి రచనలు పుస్తకాల రూపంలో వచ్చాయి అందుకు వీరు ఆలస్యంగా పూనుకోవడం కారణం ఆసక్తి చూపితే 1925 30 ప్రాంతం నుండే వీరి రచనలు పుస్తకాలుగా వచ్చేవి

రావుగారు 1927లో తమ వివాహాహ్వాన పత్రికపై శతావధాని పి ఆర్ శాస్త్రిగారిచే కొత్తగా పద్యాలు వ్రాయించి ముద్రింపించుకున్నారు 1934-35లో సహస్రావధాని జంధ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రిగారిచే 'ధర్మదేవత' కృష్ణార్జున సంవాదగీతారూపకమను పేర సంఘసంస్కరణాత్మక నాటకం వ్రాయించారు తమ జాతిలోని అంధాచారాల నిరసించడం దీని ప్రత్యేకత పరదా నిరసన, స్త్రీ విద్యా ప్రబోధం దీని

విశేషతలు ఎనిమిదివేల రూ॥ జిల్లా కలెక్టర్‌గారికి సమర్పించి 'కరీంనగర్ మండల చరిత్ర' జిల్లాలోని ప్రముఖ రచయితలతో వ్రాయించి 1981లో ప్రచురించారు మలయశ్రీగారిచే 'కరీంనగర్ జిల్లా రచయితల చరిత్ర' వ్రాయించి 320 పుటల గ్రంధాన్ని 1981లో స్వంత డబ్బుతో ముద్రించారు జిల్లా రచయితల సంఘానికి అధ్యక్షులుగా పనిచేశారు పై రెండు పుస్తకాలు అమ్మగా వచ్చిన ధనాన్ని జిల్లా రచయితల సంఘభవన నిర్మాణానికి వెచ్చించాలనుకున్న వారి కోరిక నెరవేరలేదు

**కేశవరావుగారి ముద్రిత పుస్తకాలు** 1 ఊహాలోకం - 64 గేయాలు 1972, 2 మిత్ర నీతి కంద పద్య శతకం 1975, 3 నేను నా జ్ఞాపకాలు, స్వీయ జీవితచరిత్ర 1977

**అముద్రిత రచనలు** 1 ఊహాలోకం - 2వ భాగం, 2 కుటుంబనీతి 2 భాగాలు పద్యకావ్యం, 3 గీతాతత్త్వ విచారం - వచనం, విమర్శ, 4 దైవ రహస్యాలు మొదలగునవి

**వీరు అంకితం పొంది కృతులివి -**

1 కవిసమ్రాట్ విశ్వనాధ సత్యనారాయణ గారి 'కేదారగౌళ' ఖండకావ్యం 1975
2 మలయశ్రీ గారి (నా) 'మంటల వర్షం' నవల 1982
3 కాలువ మల్లయ్య గారి 'కట్నం కధలు' 1983
4 కె రాఘునాధాచార్య గారి 'విజృంభణ' వచన కవితా సంపుటి 86

ఇవేకాక కేశవరావుగారికి వారి పెద్ద కుమారులైన డా వి కొండలరావుగారు కూడా ఒక పుస్తకాన్ని అంకితం కావించారు రెండవ పుత్రులు పి జగపతిరావుగారు కాంగ్రెసు నాయకులు వీరి సంతానం - బంధువులు విద్యావంతులు - పెద్ద ఉద్యోగస్తులు, రాజకీయ నాయకులు

**కవి సుతులు**

పి ఆర్ శాస్త్రిగారు కేశవరావుగారి వివాహపత్రిక 1927లో వ్రాసిన నాలుగు పద్యాల్లో ఒకటి

బాంధవ పుత్ర మిత్ర పరివార యుతంబుగ నేగుదెంచి వే
డ్కం దిలకించి పెండిలి విలాసము లందనివారదోగి యా
నందము నొంది దంపతుల నవ్యతరమ్మగు నట్టి దీవన
స్పందుల జేసి నేనిడు సపర్యలనంది ముదంబు గూర్పుడీ

కేశవరావుగారి పెద్ద కూతురు కల్యాణ సందర్భంలో ధూపాటి వేంకటరమణాచార్యులు సమర్పించిన 'ఆశీ కుసుమాంజలి' 1944, ఆరు పద్యాలతోపాటుగా, కన్యాదాత కేశవరావుగారికి సమర్పించిన పద్యం

చవి చూసినాడవు సార సారస్వతీ సాహిత్య సంపూర్ణ సౌష్టవంబు
గమనించినాడవు కమనీయ సుకవితా పరిపక్వ విశ్రుత పరిమళంబు
తిలకించిరాయించితివి పద్మనాయక వెలమవీర విహార విక్రమంబు
కనుల గాంచితి వాంధ్ర ఘనులు పాలించిన కోటలు గడులును కోవెలలును
నిన్ను మెచ్చి వ్రాయుటకాదు నిక్కముగను, సకల సౌభాగ్యములు గల్గి సదయుడవగు
నీకు నాయురారోగ్యముల్ నిత్యశుభము, లెలమి గల్గించుగాత సర్వేశ్వరుండు

విశ్వనాధ సత్యనారాయణగారు 'కేదార గౌళ' కావ్యాన్ని అంకితమిస్తూ చెప్పిన నాలుగు పద్యాల్లోనిది

ఒక కవి గొప్పవాడని పదూళ్లను నల్వురు చెప్పి కోగ, నీ
తికి నిలబడ్డవాడనియు దేశము మొత్తము మీద పెద్ద మ్రో
త కలుగ, నంకితమ్ముగను సత్కృతి యొక్కడు గైకొనంగ కో
రిక కలవాని, వాణి కబరీగత సూనముగా దలంచెదన్

ఇంకా కేశవరావు గారిని ప్రశంసించినవారు కటుకూరి వేంకటాచార్యులు, కోనేరుపల్లి నరసింహరాజు, ప్రజాకవి శిరోమణి చెన్నుపల్లి సుబ్బారావు రాజాపేట గుంటూరు, గట్టెపల్లి సత్యనారాయణ రాజు, కోట్ల సత్యనారాయణాచారి, డా॥ బి లక్ష్మయ్య తేలుకుంట మొదలగువారు

కేశవరావుగారు పలు కావ్యాలకు పీఠికలు వ్రాశారు అంబటి నరసింహరాజు ఆత్మకూరు వరంగల్ జిల్లా గారి విజయ విజయము యక్షగానమునకు వ్రాసిన పీఠిక మొదటిది ఆ ఒకే ఒక పద్యమిది

విజయ విజయ ప్రబంధంబు వీనులలర, వింటి కనుగొంటి రసశబ్ద విభవ పణితి
వ్యర్థ పద దూర గద్య పద్యార్థ పటిమ, చెలగు నీకృతి లక్ష్మీనృసింహరాజ

ఇంకా రావుగారు సుబ్బయాచారి కురిక్యాలగారి 'ఆంధ్రజ్యోతిష్య సర్వస్వము'నకు, సి డి వేంకటరాజు పెద్దపల్లిగారి 'తెలుగుబిడ్డ' శతకానికి, ఎన్ వేంకటాద్రి ఎలిగేడుగారి 'భక్తారామ సుమావళి' గేయ సంపుటి మొదలగు పుస్తకాలకు పద్య, గద్య పీఠికలు రచించారు

**కావ్య పరిచయం**

1 **ఊహాలోకం** 64, కవిగారి అరవై నాలుగవ ఏట 1972లో ప్రచురించిన 64 గేయాల సంపుటి ఇందలి భావాలనేకం 1950కి తర్వాతి కాలానివి కావున దీన్ని తర్వాతి గేయ ప్రకరణంలో సమీక్షించుట న్యాయం

2 **మిత్ర నీతి శతకం - 1975** ఇది వంద కంద పద్యాల నీతి శతకం మిత్రా అని మకుటం మిత్రుడు అంటే సూర్యుడు, స్నేహితుడు ఇది తోటి మానవుల మిత్రులుగా భావించిచెప్పిన నీతి పద్య శతకం కాంగ్రెసు నాయకులు జె చొక్కారావుగారికి అంకితం ఇందలి పద్యరీతి నీతులివి

శ్రీకరమై జనహితమై । ప్రాకటముగ నీతి ధర్మపథముల తీరుల్
లోకానుభవముతోడుత । మీకున్ వినిపింతు వినిన మేలగు మిత్రా 1
మన కన్ను మిడెడు భూమికి । మన మన్నంబిడగ వలయు మనుగడ దృష్టిన్
అనుదినము పేడ పెంటలు । తినిపించిన మనకు భుక్తి దీర్చును మిత్రా 2
ఘనులను కొన బడువారల । గుణముల్ నడవడులు గుర్తుకొని తూచినస
ద్గుణ దుర్గుణముల వెల్లడి । గననౌ, గురు లఘువుల పస గననౌ మిత్రా

ఇది మిత్ర, దైవ, మాతా పితృ, ప్రకృతి, నీతి, రాజకీయ పర్వములని ఆరు భాగాలుగా ఉంది మొత్తం పద్యాలు 22 + 20 + 16 + 16 + 59 + 8 = 141

3 **నేను - నా జ్ఞాపకాలు - 1977** ఇది కేశవరావుగారి స్వీయ చరిత్రం కవి జీవితం, కుటుంబ చరిత్ర వారి మూడు తరాల వ్యక్తుల పేర్లు వివరాలు మొదటిభాగం వచనం రావుగారి గ్రంథాల పరిచయంతోపాటు, వివిధ సందర్భాలలో వారు వ్రాసిన పద్య గేయ ఖండికలు రెండవ భాగంలోనే ఉన్నాయి ఈ గ్రంథం రెండు వందల పుటలు తమ మిత్రులకు కుటుంబ సభ్యులకు మాత్రమే అందించే తలంపుతో కేవలం 200 ప్రతులే ముద్రించారు కవి దీనిని 1977లో రచించారు ఇది కేశవరావుగారి కవితా జీవిత సమగ్ర సంగ్రహ పరిచయ పుస్తకం అందులోనివే ఈ దిగువ చూపు పద్యాలు 1950కి పూర్వం కేశవరావుగారు వివిధ సందర్భాల్లో వ్రాసిన పద్యాలు అనేకం వానిలో కొన్ని ఇక్కడ చూపబడుతున్నవి

**మాతృ స్మృతి - ప్రమాది - 1938**

సీ తల్లికి కడగొట్టు తనయునిపై ప్రేమ యనునుడి నిజముగా ననుభవించి
నోట మాటలు నేర్పు నాటగోలె త్వదీయ నామాక్షరమ్ముల ప్రేమనాడి
ఆయి! ఆయి! యటంచు నానంద మొందించు హాయిచే నలరి సహాయ మొంది
కలిమి లేములపైన గలిగెడు చింతకు వగవక మీ ధైర్య వాక్కులు విని

గీ బ్రతికిపెరిగితి మీ ప్రేమ బలముచేత, నిండె ముప్పది వత్సరాల్ నేటి తోడ,
అన్ని సుఖముల కాస్పదమైన మీరు, పరమ పదమును జేర నా ప్రాపు పోయె పు 79

**డా బి వెంకటరామారావు వెదిర** గారికి, కరీంనగర్‌లో 'వైద్యశాల' ప్రారంభించిన సమయంలో సమర్పించిన రెండు సీస పద్యాల కొన్ని పాదాలు వృష - 1940

సీ సుశ్రుత శారీర సూత్రాదుల పఠించి రోగ నిధానంబు రూఢి పరచి
ఓషధీ యనుపాన మూహచే చెప్పక యనుభవంబున బెట్టి యరసి యిచ్చి
సామాన్య జనులకు సాధ్యమై నీకిచ్చు ధరలుంచు నీ యౌషధముల కెపుడు
బీదల వ్యాధుల ప్రీతితో తిలకించు యుచితోషధుల వ్యాధులుడుపు చుండు
గీ ఒకరి చులకన జూడక నౌకరి చేత, బోవ కుండను నెల్లర భూత ప్రేమ
చూచి కీర్తి యార్జింపగ జూడ వలయు, ఇదియె నీ ముఖ్య ధర్మమ్ము హితము సుమ్మ
గీ వృష శుభాబ్దంబు నీకభివృద్ధి నొసగ, కార్తికమ్ము నీ కీప్సిత కాంక్ష లిడగ
కృష్ణ పక్షాష్టమియు భాగ్య తృష్ణ దీర్చ, సౌమ్యవారంబు శాంతియు సౌఖ్యమీయ,
రాణకెక్కుము వేంకట రామరాయ పు 82

**కె వి నర్సింగరావుగారికి - 1947 లో**

సీ విద్యార్థి దశనాడె వివిధ దేశంబుల, నున్న రాజ్యాంగాల యునికి తెలిసి
దేశకాలోచిత తీరులెరింగియు, పాలిత పీడిత ప్రజల జూచి
స్వాతంత్ర్య సాధనా సదుపాయ వంతులౌ, సాహసయువకుల సమితి గూర్చి
కాంగ్రేసు సంస్థ సంగ్రామ రంగంబున, ముఖ్యపాత్ర వహించి ముందు నడిచి
గీ ఏకధాటిగ సమర మనేక గతుల, నడిపి నైజాము రాజు దుర్వడత లుడిపి
క్రూర ఖాసిము రజ్విని కోరలూడ్చి, యతని శిష్యుల పొగరుల నడచినావు పు 83

కె వి గారిది గుండి సమీప గ్రామం రామడుగు వారు న్యాయవాది ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు మన ప్రధాని పి వి నరసింహారావుగారికి బంధువు

కరీంనగర్‌లో పద్మనాయక బాలికావసతి గృహ నిర్మాణ సందర్భంలో శంఖుస్థాపన చేయటానికి వచ్చిన జటా ప్రోలురాజా సురభి జగన్నాథ రాయలను వి కే రావుగారు పంచ పద్యరత్నాలతో సన్మానించారు వాటిలో ఒకటి 1949 50

శ్రీలొప్పారెడు రాజ్యమున్, బిరుదులుల్ చేకొన్న జట్‌ప్రోలు భూ
పాలాగ్రేసర పద్మనాయక కుల ప్రాధాన్యతన్ పెంచగా
మేలే యెప్పుడు జేయువారు సురభీ మీ వంశపున్ మాన్యులే
కాలానన్ గలరిప్డు మీరలటులే కావించుడీ సాయమున్

పద్మనాయక పత్రికకు రావుగారు వ్రాసిన పద్యాలు వారి కులాభిమానాన్ని మాత్రమే కాక అమేయ చారిత్రక పరిజ్ఞానాన్ని తెలియజేసేవిగా ఉన్నాయి గాంధీజీ మృతి, కస్తూరిబా స్మృతి, భారత జెండా, నూత్నవత్సరాది ఇట్లా అనేక సందర్భాల్లో విషయ విశ్లేషణ కావించే పద్య రచనలు చేశారు వైద్యం, క్రీడ, జ్యోతిష్యం, వాస్తు, రాజకీయం, సంఘ సేవ అది ఏదైనా కానీండి, సునాయాసంగా సవివరణాత్మక కవిత్వం వీరు వ్రాస్తారు వీరి భాషా పాండిత్యం వివిధ పౌరాణిక విజ్ఞానశాస్త్ర చారిత్రకాది విషయాల పరిజ్ఞానం అపారం అపూర్వం

వేదాంతంలో అమిత పరిశ్రమజేసి, రావుగారు చివరికి హేతువాదాన్ని ఆశ్రయించి భౌతికవాదిగా కనిపించేవారు శకున, ముహూర్త, జ్యోతిష్య ఫలాలను నిరసించేవారు కవితా ప్రారంభ దశలో 'గుండి

మందిర శ్రీ వేణుగోపబాల' అని పద్యాలు, 'గుండి గోపాలరావ్‌పేట గుడిన నుండి, ప్రజల సుమతుల జేయు గోపాలకృష్ణ' అనే మకుటంతో ఓ భక్తి శతకం రచించారు ఆ తర్వాత నార్ల వారి దారిలో 'వీ కె రావు హితోక్తులు వినిన మేలు' అని స్వీయనామాంకిత లోకనీతి శతకాన్ని ఆరంభించారు వీరి హేతువాద పద్యాలు హృద్యశైలీ సముపేతాలు ఆలోచనాత్మకాలు

నిత్య గీతాలు - నుండి

ఎందుకీ నాకు జన్మమెత్తించినావు, ఏమినాతోడ చేయించ నెంచి నావు
నన్నొక నిమిత్త మాత్రుగా నామ రూప, ధారిగా జేయుటేలనో దాని దెలుపు!

మరో శీర్షికలో -

ఓ దేవ! సర్వజీవోత్పన్న నినువేడు వారికే కష్టాలు వచ్చుటేల?
ఓ ముక్తి దాత! నిన్నోమెడు భక్తుల బాధలు మాన్పని వైఖరేల?
ఓ యీశ! నీ ప్రతిమోత్సవ విగ్రహ తస్కర బాధలు తప్పవేల?
ఓ స్వామి! నిన్ గొల్చుచున్నట్టి స్తుతమతుల్ వ్యాధులచే బాధపడుటలేల?
గుడులు గోపురముల్ కూలగొట్టువారు, నిత్య తస్కరుల్ హంతకుల్ నీతి దూరు
లెపుడు శిష్టుల బాధించుటేల చెపుమ? వింత గొల్చెడు నీ న్యాయ విధమదేల? పు 25

'సత్యాసత్య విచారము' పుట 51 లో

సీ ఈ విశ్వమునకొకే యీశ్వరుడైనచో వివిధ దేవధ్యాన విధమదేల?
ఈ సృష్టి స్థితి గతులీశ్వర కృతమైన ఏకత్వ భిన్నత్వమిల నికేల?
సర్వేశ్వరుడు దయా సహితుడే యైనచో సమతలేని ప్రపంచ జాతులేమి?
దుష్టశిక్షణ భావ శిష్టరక్షకుడైన జీవి జీవుల హింస చేయుటేమి?
గీ ఎవరి కర్మకు వారలే యిలను కర్త, లైన యేరీతి యీశ్వరు డవసరంబు?
పూర్వ జన్మల వల్లనే పుట్టి చావ, పరమ పురుషుని గొల్చెడు భావమేల?

కేశవరావుగారు కందుకూరి, గురజాడల ప్రేమించినవారు వీరిది త్రిపురనేని రామస్వామి చౌదరి కవితా మార్గం 'కుల విచారము'లో ఇట్లా తమ నిర్ణయాన్ని తెలిపారు పు 50

ఆవె బుద్ధి మంతులైన పూజ్య భావుల కిల, కులములేదు స్వపరములును లేవు
అజ్ఞులైన వారలల్ప స్వభావులు, కులధనాధికారములనె యెంత్రు

జ్ఞానపీఠ అవార్డులు పొందిన ఇద్దరు ప్రముఖాంధ్ర కవులను కేశవరావుగారు ప్రశంసించారు విశ్వనాథ సత్యనారాయణగారి 'కేదారగౌళ' కృతిలోని కేశవరావుగారి కృతజ్ఞతాపద్య ద్వయంలో ఒక్కటిది

'భ్రష్టయోగి' వి కవి జన్మ బడసినావు, నిత్య కవితా తపస్వివై నెగడినావు
నీ తపోరీతి సాగి యీ నిఖిల కావ్య, వీధి పూరితమైనది విశ్వనాథ పు 34

డా సి నారాయణరెడ్డి గారి కవితా శక్తినిట్లా కొనియాడారు

నోట వెల్వడునట్టి మాటలే పాటగా పాడి నుతులుగొన్న ప్రజ్ఞ కలదు
ప్రతిఘటించెడునట్టి పండిత కవులను ఒప్పించి మెప్పించు నోజ గలదు
బహు విషయ జ్ఞాన పటిమచే బోధించు గురుతరాచార్యత్వ గుణముగలదు
భాగ్యనగర ధీనిధుల చేప్రస్తుతిగొని, యువ యువతి విద్యార్థుల యూహ లెరిగి
వారి వారి భావనల కపార శక్తి, నెమ్మి ప్రోత్సాహ పరచెడు నిష్ఠ గలదు 34

కవిత్వాన్ని ప్రేమించి, కావ్యాలు నిరంతరం పఠించి రచించి, అన్యకవుల ప్రోత్సహించి, ప్రతిభగల కవుల ప్రశంసించిన ప్రశంసలందుకొన్న సంపూర్ణ సాహితీజీవనులు సార్థక జన్ములు వి కేశవరావుగారు

## 24 వెలమల రామగోపాలరావు - రేకొండ - కాలం 1820 - 1973

వెలమల రామగోపాలరావుగారు ఆస్తి అంతస్తుగల ఎల్లాపు కుటుంబంలో జన్మించారు స్వగ్రామం రేకొండ ఒకప్పుడున్ తరుగదింటన్ పాడియున్ పంటయున్ - అన్నట్లుగా వారి వ్యవసాయముండేది రావు గారికి కవితా వ్యాసంగం కవి మిత్రులతో సాహితీ కాలక్షేపంఇష్టంగా ఉండేది

గోపాలరావుగారి వరకు ఈ జిల్లాలో వచ్చిన సాహిత్యమంతా ఇంచుమించు సంప్రదాయబద్ధ కవిత్వము వాళ్ళకు పూర్వ కావ్యకవులాదర్శం వేంకట రాజన్న అవధాని, వెలిచాల కేశవరావుగారల వంటి ఒకరిద్దరు కవులు దీనిని అపవాదం సమకాలీనాంధ్ర ప్రముఖ కవుల నభిమానించి వారి నవ్యాంధ్ర కవితా మార్గాలననుసరించిన వారు వి రాం గోపాలరావుగారు

వీరు నాటి పత్రికలకు కవితలు వ్యాసాలు పంపించేవారు పాత పత్రికలో వ్రాత ప్రతులో వారు దాచుకొని ఉంటారు 'అటువంటివేవీ లేవు మేడపై వర్షంలో తడిసి చెడిపోయినా' యన్నారు రావుగారి కుటుంబ సభ్యులు [1] రాంగోపాలరావుగారికి ప్రముఖ కవి పండితులతో స్నేహ సంబంధాలుండేవి వారి డైరీలు నోటుబుక్కులు ఏవైనా దొరికి ఉంటే ఆ వివరాలు తెలిసేవి

ప్రఖ్యాత నవలా రచయిత గుడిపాటి వెంకటచలం (బెజవాడ) గారు కరీంనగర్‌లో ఉన్నకాలంలో రాంగోపాలరావుగారితో స్నేహం ఉండేదని కె వి రమణారెడ్డిగారు వ్రాసిన 'చలం' జీవితచరిత్రలో ఉంది

కవి కోకిల దువ్వూరి రామిరెడ్డి (1895 1947) నెల్లూరు, గారితో రాంగోపాలరావుగారికి స్నేహం ఉండేదని రెడ్డిగారి 'లేఖలు - ఉత్తరాలు'[2] పుస్తకంలోని లేఖల వలన తెలుస్తున్నది అందలి 40 ఉత్తరాలలో 31 ఇతరులు రాంరెడ్డిగారికి వ్రాసినవి కాగా, కేవలం తొమ్మిది మాత్రం రెడ్డిగారు వ్రాసినవి అందులో చివరి రెండు రేకొండ రాంగోపాలరావుగారికి వ్రాసినవే మొదటి లేఖ నెం 34, ఇది [3]

వెమ్మారెడ్డిపాళెం, 10 7 1943

మహారాజశ్రీ వి రాంగోపాలరావుగారికి, నమస్కారములు ఇచ్చట అందరు క్షేమం అచ్చట మీ క్షేమ సమాచారములు అప్పుడప్పుడు వ్రాయుచుండవలయును నేను వారము దినములనాడు మద్రాసు నుండి గ్రామం చేరితిని అప్పటికే మీ జాబు చేరి యుండినది ఆకేసు మీకు కోర్టులో అనుకూలమైనదని చదివి చాలా సంతోషించితిని

భార్యా వియోగము అందులోను నిండు యౌవనములో సహింపరానిది, కేవలము అనుభవైక వేద్యము 'ఓదార్పులు పుంటిపై నుప్పుగల్లు' అన్నట్లు నిష్ప్రయోజనములు ఒకవేళ దు ఖము నశింపగలదు నా రెండు సంవత్సరముల వరకు దు ఖము తీవ్రముగ నుండినది తర్వాత క్రమముగ సన్నగిల్లినది రెండవ పెండ్లి చేసుకోవడం గూడా దు ఖ శమానానికి ఒక హేతువు

మీరు సారస్వత వ్యాసంగం చేస్తూ ఉంటారని నా తలంపు నేను జూన్ నెల 'భారతి'లో పానశాలలో చేర్చుటకు తగిన 14 పద్యములను ప్రకటించితిని జూన్ నెల మొదలు 'కవి-రవి' అను కావ్యం ప్రకటిస్తున్నాను ఈ కావ్యం 'పలితకేశము'నకు పది దినముల ముందు వ్రాయబడినది వీలుంటే చదవండి నేను మా గ్రామములో పది దినములుండు సమయము చూసుకొని మీకు వ్రాసెదను మీరు కొన్ని దినములు కులాసాగా మా యింట కాలము గడుపవచ్చును హైదరాబాద్‌లో మన మిత్రులందరు క్షేమముగా నున్నారని తలంచెదను

ఇట్లు మిత్రుడు, దువ్వూరి రామిరెడ్డి

---

1 రేకొండలో అధ్యాపక మిత్రులు సంజీవరావు గారు నాకు తమయింట ఆతిథ్యమిచ్చి కీ శే రాంగోపాల్‌రావు గారింటికి తీసుకువెళ్లి వారి సతీపుత్రులు పరిచయం కావించారు

2 సంకలనకర్త - కె వి రమణారెడ్డి, నెల్లూరు, కవికోకిల గ్రంథమాల ప్రచురణ - 1961

3 మలయశ్రీ గారి 'తెలుగులో లేఖాసాహిత్యం' 1992 తెలుగు అకాడెమీ హైదరాబాద్ వారి ప్రచురణ - పుటలు 85, 86

తేది 11 9 46 నాడు రెడ్డిగారు వ్రాసిన రెండవ లేఖ నెం 38లో తమ అనారోగ్యాన్ని వివరించారు రావుగారి పునర్వివాహానికి అభినందనలు తెలిపారు

రాంగోపాలరావుగారు ద్వితీయ వివాహం కృష్ణా జిల్లాలోని కమ్మకులపు మల్లెల వారింటి కన్యతో జరిగింది రావుగారికి కోస్తా మండల కవి పండితులతో మైత్రి అంతకు పూర్వమునుండే ఉన్నట్లు పై లేఖల వలన తెలుస్తున్నది రాంగోపాలరావు గారి ఏకైక కవితారచన 'బాష్పాంజలి' 'గౌతమి' త్రైమాసిక సాహిత్య పత్రిక 1969లో కనిపించింది [4] ఇది వారి కవి మిత్రులు గార్ల పాటి రాఘవరెడ్డిగారి మృతికి వ్రాసిన సంతాప పద్యాలు రాఘవరెడ్డిగారిది వరంగల్లు ఆదర్శపాధ్యాయులుగా ఆర్య సమాజాభిమానిగా కవిగా వారికి మంచి పేరుండేది చివరి దశలో కరీంనగర్‌లో తమ కుమారులైన గార్లపాటి తిరుపతిరెడ్డి గారింటిలో గడిపారు రాఘవరెడ్డిగారి సాహితీమైత్రిని బట్టి నెమిలికొండ పింగళి లింబాద్రిరెడ్డిగారు తమ కుమార్తెను తిరుపతిరెడ్డిగారికిచ్చి పెళ్ళి చేశారు వీరిద్దరు గోలకొండ సంచికలోని కవులు నాటి వారి సాహిత్య మైత్రి అంత బలంగా ఉండేది అటువంటి కవి సోదరుని మరణానికి గోపాలరావు గారి సంతాప పద్య కవిత ఈ బాష్పాంజలి

"హృదయ సంతాప మించుక వదలుటెట్లు, ప్రతి నిమేషంబు నీ స్మృతి బాధ పెట్టు
అన్న రాఘవనిన్ విడనాడి నేడు, బ్రతుకెటుల ఈడ్చు జీవచ్ఛవంబు రీతి!
ఏనాడో ఒక పంచవింశతికి ముందే సుంత పూర్వాబ్దమం
దీనాలో మధురానురాగరసమెట్లే నింపి మన్నించితో
ఈ నాడున్ దత నిత్య నూతన కళా హేవాకమై వర్ధితా
నూ నాన్యోన్య హృదంత పర్యవసిత వ్యూఢంబుగా నిల్చెవో!
కూర్మి గోపన్న గోపయ్య గోపి యనుచు, పిలిచికొని నా హృదబ్జంబు నిలచి కొంటి
వయ్యో! అప్పుడె ఏడాది యయ్యె నీవు, మము వదలిపోయి, శూన్యంబు మాకు జగతి '

ఇదీ వారి పద్య కవితా ఝురి మాధురి లభించిన సాహిత్యం తక్కువైనా రామగోపాలరావు గారిది సంపూర్ణ సాహితీ హృదయం సత్తాగల సాహిత్యరూపం అని స్పష్టంగా చెప్పవచ్చు

**25 ఆచి వేంకటనరసింహాచార్య - ఆవునూరు కీలక - 1908-1981 - దుర్మతి**

ఆచి వేంకట నరసింహాచార్యుల స్వగ్రామం సిరిసిల్లా తాలూకాలోని ఆవునూరు వీరి తండ్రి సుప్రసిద్ధ సంస్కృత పండితులైన ఆచి రాఘవాచార్యులు, గో క సం నం 5 తల్లి సిరిసిల్ల వేంకటేశ్వ రాలయార్చకులైన చిగురాల నరసింహాచార్యుల దౌహిత్రి రత్నమాంబగారు ఆచివారు శ్రీవైష్ణవులు కౌండిన్య గోత్రీకులు [1] బాల్యంలో నరసింహాచార్యులు సంస్కృతాంధ్ర కావ్యనాటకాలంకార శాస్త్ర గ్రంథాలను తమ తండ్రికడనే అభ్యసించారు పదిర టి కృష్ణశాస్త్రి కవి (గో క సం నం 173) గారి స్నేహంతో ఆంధ్ర కవితా ప్రావీణ్యం సంపాదించుకున్నారు

పద్దెనిమిదవ యేట అక్షయ - 1926లో కోరుట్ల ఉభయ వేదాంత ద్వయవర్ధనీ సంస్కృత పాఠశాలలో అధ్యాపకులుగా చేరిన కాలంలో మొదటి అష్టావధానం చేశారు అక్కడున్నది పది మాసాల కాలమే అయినా సహోపాధ్యాయులు బంధువు అయిన శతావధాని సిరిశినహళ్ కృష్ణమాచార్యుల దృష్టి తెలుగు కవిత్వంవైపు మళ్ళించారు [2] పందొమ్మిదవ యేట సిరిసిల్ల సర్కారీ స్కూలులో చేరి హిందీ, ఉర్దూ, ఇంగ్లీషు భాషల నభ్యసించి ఏడవ తరగతిలో ఉత్తీర్ణులైనారు తరువాత నిర్మలలో శివశ్రీ అంబయ్య

---

4 'గౌతమి' 1969, సం గట్టిపల్లి సత్యనారాయణ రాజు, కరీంనగర్

1 'ఆదర్శ జీవనము' ఆచి వేంకటాచార్య స్వామి వారి స్మారక సంచిక 1985 నుండి కవి జీవిత విశేషాలు సాహిత్య వివరాలు గ్రహించబడినవి

సిద్ధాంతిగారింట సంస్కృతాధ్యాపకులుగా అయిదేండ్లు గడిపారు కవిగా, వక్తగా లబ్ధ ప్రతిష్ఠులైనప్పటికీ సంతృప్తి చెందక హైదరాబాద్ సీతారాంబాగ్‌లోని శ్రీ శఠగోపరామానుజాచార్య స్వామికి శిష్యులై సాంప్రదాయ గ్రంధాధ్యయనం కావించారు తదనంతరం శ్రీవైష్ణవుల గురువుగా పలువురు శిష్యులకు తిరుమంత్రార్థం బోధిస్తూ రామాయణ శ్రీభాష్యాది గ్రంధాల ప్రవచనం కావిస్తూ యజ్ఞయాగాదులు నిర్వహిస్తూ, వైభవంగా జీవించారు

వీరి కవిత నం 96 ' శ్రీ కర్మచంద్రోదయము' గో క సం లోని 86, 87 పుటలలో ప్రచురించబడింది సంస్కృతాంధ్ర భాషలలో విద్వత్కవిత్వరచనా సంపన్నులైనప్పటికి ఆచి వేంకట నరసింహాచార్యులు వ్రాసిన కవితలు తక్కువ వారికి వక్తగా పౌరాణికులుగా యాజ్ఞికులుగా కాలం గడిచింది గో క సం 1934లో ఆచి నరసింహాచార్యులుగారిని 'కవికేసరి కిశోర' 'అవధాన కుశల - అష్టావధాని' అని పేర్కొన్నారు కవి పరిచయం పుట 362 అక్షయ నుండి కేవలం పన్నెండు సంవత్సరాలు అంటే 1938 వరకు, శతానేకాష్టావధానాలు కావించి వదిలేశారట

**ఆ వే నృసింహాచార్యుల రచనలు** ఇవి వారి స్మారక సంచిక విషయసూచికలో పేర్కొన్నవి

1 అవధానములు, 2 శ్రీ సీతారామచంద్రస్వామి సుప్రభాతమ్ (సంస్కృతం)

3 ప్రపత్తి (సంస్కృతం) 4 శ్రీకర్మ చంద్రోదయము (పద్యాలు)

5 గీతాధర్మము (వచనము) వ్యాసం

ఇందు ఏవీ పుస్తకాలుగా రాలేదు ఈ రచనల వివరాలివి ఆచార్యులు చేసిన అవధానములెన్నో కాని 1926 అక్షయలో కోరుట్లలో నిర్వహించిన ప్రథమాష్టావధాన పద్యాలు మాత్రమే ఇందులో ప్రచురింపబడినవి మిగతావి అలభ్యాలు 2 ఆవునూరి సీతారామాలయ స్వామికి నిత్యసేవ కొరకు రచించిన 13 శ్లోకాల సుప్రభాత కావ్యం 3 ప్రపత్తి శ్రీరామచంద్ర సుత్తి పంచ శ్లోకాలు 4 గోలకొండ కవుల సంచికలో ప్రకటితమైన నాలుగు సీస పద్యాలు 5 శ్రీ సహజానంద గీతా సమాజము సిద్ధిపేట వారి మౌక్తికోత్సవ సంచికలో ముద్రింపబడిన మూడు పుటల వ్యాసం

పై విషయాలను బట్టి చూస్తే ఆచి నరసింహాచార్యులు కవితా వ్యవసాయము కావించినది తక్కువ వారి రచనలలో భద్రపరచుకొన్నవి మరీ తక్కువ అనుట స్పష్టం లభించినంతలో 'నిక్కమైన మంచి నీల మొకటి చాలు' అను వేమన నుడి ప్రకారం ఆచార్యుల వారి కవితా శక్తిని భావ ప్రశస్తిని గమనింపవచ్చు మచ్చునకు కొన్ని పద్యాలు చూడండి ఇష్టదైవ నుతి కోరుట్ల అష్టావధానం నుండి,

సిరియుర మున్వెవెలుంగ, తులసీ దళమాలికలోల లాడ, సుం
దర తర చేలముంగదుల, తాండవ మాడగ కుండలంబులున్,
కర కమలంబులం జెలగి కంబు సుదర్శనముల్ జ్వలింపగా
మెరయ కపోలముల్, యళుల మించలుకల్ నదలంగ వ్రాలితౌ
తిరుపతి వేంకటేశ్వర భవదీయ పదాబ్జములాశ్రయించెదన్

సిరియుర మందు వెల్గ అనవచ్చు కాని నన్నయగారి సుఖముండువలె ప్రధమావిభక్తి రూపం పండిత కవులు విలక్షణ ప్రయోగాలనభిలషిస్తారు కదా! అలాగే మించి అలుకల్ నదలంగ చివరి పాదంలోని 'తిరుపతి వేంకటేశ్వర'లోని గణభంగం లేఖక ప్రమాదం కవి ప్రయోగం 'తిరుపతి వేంకటేశ భవదీయ' అనే అయి ఉంటుంది దత్తపది యావ, గ్రీవ, జీవ, రావ (రామాయణపరం) చూడండి

కం యావన జాక్షుడు, మనసు, గ్రీవునితో లంకలో మృగేంద్రుని కరణిన్
జీవన హీనుని జేసెను, రావణునిన్ కదనరంగ రాజంబందున్

సమస్యాపూరణం చివరి పాదం సమస్య (భానుని ప్రభ )

---

2 కృష్ణమాచార్యుల 'స్వీయకవితానుజీవనం' 1986, పుట - 24

కం దానవుడయ్యును, కైతవ, దానవ రిపు రూపమొంది త్రాగి సుధాంబున్
హీనత జెందిన యా స్వ, ర్భానుని ప్రభ జూచి దివిని భానుడు వణకెన్
లోకవార్త పృచ్ఛకనామంతో కలిపి ఇట్లా చెప్పారు
పాటవ మొందునట్టి కవివర్యులు లౌకిక వార్త లెప్పుడున్
మాటలలోన జెప్పకను మంజుల పద్యములన్ రచింతురా
పాటి యొనర్ప ప్రప్రథమ భావము నందది సాధ్యమౌన? చొ
ల్లేటి నృసింహశర్మ! యవలీలగ జెప్పెద ముందు ముందుగన్
ముగ్గురితో పేకాడుతూ చెప్పినదీ క్రింది ముద్దు పద్యం
జాకి మణేల యియ్యది, నిజంబగు శక్తిని జూపు చుంటకై
ప్యాకనుబంచివేసితి, సభాసదులందరు సంతసిల్లగా
'చౌకము' రంగు జెప్పితిని, 'భా'! యిక యేటి జయంబు మీకు, నీ
యాకును వేసితిన్ ద్వరగ నాడుడు ప్రస్తుత యుక్తి యుక్తులై
భాగ్యనగరంలోని రెడ్డి హాస్టలు అష్టావధానంలోని చివరి పద్యం
సౌభాగ్య నగర వాసాఢ్యుల మ్రోలనా, అవధాన చాతురి యనెడి వారొ
ఎందరెందరొ చేరుచుందురీ పట్టణం, బందులో వీరొకరనెడి వారొ
ఎనిమిది నియమము లేక కాలముమదిన్, నిలుచునా యని యాత్మదలచువారొ
పల్లెటూరున నింత పాండితీవైభవం, బుండునా యని పల్కుచుండువారొ
యనెడి భీతిని మనమున గనగ నీక, పలు విధమ్ముల పల్కెడి ప్రజల మాన
సాంబుజంబులు వికసింప నలరి సభలొ, గెలుపు గొను శ్రీ నృకేసరి పలుకు సాని

దత్త పది కంద పద్య ద్వితీయపాదంలోని అఖండయతి, చివరి గీత తృతీయ పాదాంత తృతీయా విభక్తి 'లో' ప్రత్యయ హ్రస్వరూపం కవి విలక్షణ స్వేచ్ఛా ప్రయోగాలు అవధానిగారి ఇతర అవధాన పద్యాలు లేకున్నా వీరి అవధాన కవనాన్ని కని ప్రస్తుతించిన నాటి సాహితీవేత్తలు - రాజకీయ నాయకుల పద్యాలు భద్రపరచి పై సంచికలో ప్రచురించటం సంకలనకర్తలు కవికి చెల్లించుకొనిన అమూల్య బహుమానాలు

సురవరం ప్రతాపరెడ్డి ( 'గోలకొండ' పత్రిక సంపాదకులు) గారి అభినందన -
లేత ప్రాయమునందె ఖ్యాతి గాంచు మటంచు, పాండితికై బ్రహ్మవ్రాయవచ్చు
సంస్కృతాంధ్రము మాత చక్కని విజ్ఞాన, ముగ్గు పాలతొ(ను) బోసి యుండవచ్చు
నవ నవోన్మేషమౌ నవరసాలంకార, కవితా లతాంగి మిమ్ గలువ వచ్చు
పౌరాణగాథల ప్రౌఢిగ దెల్పెడు, ప్రాజ్ఞులేనని మిమ్ము బల్కవచ్చు
నట్లు గాకున్న మీకిట్లు నమిత సుగుణ, సంపద గలుగనేటికి, సరస విద్య
కవితయును నేర్పు జెందుట ఘనము గాదె, వేంకట నృసింహ దేశిక వినయ శీల
ఆదర్శ జీవనం పుట 5

హైదరాబాద్ గౌలీగూడ రామమందిరంలోని అవధానం చూసి బూర్గుల రామకృష్ణారావు ( ముఖ్యమంత్రి, హైదరాబాద్ స్టేట్) గారు చెప్పిన పద్యం ఆ జీ పుట - 6
బాల్యమందే యాంధ్ర భారతీ తల్లజ, ప్రేమించె మిమురూప ప్రియులటంచు
కౌమార దశయందె గైర్వాణ వాణీమ, తల్లిక మిమ్ (ము) సంతసిల్ల జేయ
సాలంకృతాకార సాహితియనునామ, మరసికామించె నాట్యంబు తోడ

యౌవన ప్రారంభమందే సు కవితామ, చర్చిక సుఖములమర్చుచుండె
వేంకటేశ్వరు కరుణ యీ విధము మిమ్ము వృద్ధి నొందించు చుండ వివేక మతులు,
భవ్య కౌండిన్య గోత్ర సంభవులు మీరు 'వేంకట నృసింహ శాస్త్రి' సువినయ ధుర్య

శ్రీకృష్ణ దేవరాయంధ్ర భాషా నిలయంలోని అష్టావధానంలో దుర్మార్గుల చారిత్రలు కూడా పఠనీయములే అనుభావసమర్థనతో ఆచి వేంకట నృసింహాచార్యవధాని చెప్పిన సీస పద్యగీతం చూడండి

నిజమునవి నీతి చరితల నేతలయ్యు, విష్ణు సంబంధ మహిమ సువిదిత మగుట
వారి వైభవముల తోడు వారి పనులు, భారతాది చారిత్రల ప్రకటమయ్యె
మరియు ముక్తియు కరతలామలకమయ్యె ఆ జీ పుట 7

ఆచార్య విరచిత సుప్రభాతంలోని ఒక శ్లోకం 6

ఇందింది దాశ్చ మకరంద రస ప్రలుబ్ధా , ఝంకుర్వతే వదన పద్మ నిషేవణాయ
బాలాతప ప్రవేశతే భవనాంగణేషు, శ్రీరామచంద్ర భగవన్ తవ సుప్రభాతం

వేదశాస్త్ర పండితులు సంస్కృత కవితా మండితులు అయిన ఆచి వేంకట నరసింహాచార్యుల ఆంధ్ర కవిత తత్సమ పద - దీర్ఘసమాస భూయిష్టం కాక అలతి ఆలతి మృదు మధుర లలిత పదాలతో భూషితమై తెలుగు తనంతో విలసిల్లడం విశేషం!

## 26 మామిడిపల్లి సాంబశివశర్మ - వేములవాడ 1920 - 1988

మామిడిపల్లి సాంబశివశర్మగారు వేములవాడ దేవస్థాన ఆస్థాన కవి వీరు ఆశుకవితాధార, అసాధారణ ధారణాశక్తిగల అష్టావధాని, సంస్కృతాంధ్రోభయ భాషల్లో సమానంగా కవిత్వం చెప్పిన విద్వత్కవి ఆయన ఆయిదు భాషలలో విద్వాంసులు సాహిత్యంతోపాటు సంగీతంలో దిట్ట నాటక రచయిత, దర్శకుడు, రంగస్థల నటుడు హరికథా రచయిత, హరిదాసు అన్నిటికి పైగా స్వాతంత్ర్య సమరయోధుడు ఇన్ని విశేషతలు ఒకే వ్యక్తిలో ఉండటం ఆ అన్నింటిలో రాణించడం అపూర్వ విషయం



**సాంబశివ శర్మగారి ముద్రిత రచనలు** [1]

1 ముక్తాహారము 1949, 2 మధుర ఝంకారము - 1949, 3 జయశ్రీ 1953, 4 లోభ సంహారము 1964, 92 5 భక్తి గీతములు 1966, 6 శ్రీరాజరాజేశ్వర సుప్రభాతం, 7 ద్విపద రామాయణము - బాలకాండము, 8 ద్విపద రామాయణము సుందరకాండము

**అలభ్య ముద్రిత రచనలు** 1 శ్రీ ముక్తేశ్వర సుప్రభాతం, 2 ఆదిశంకరాచార్య సుప్రభాతం, 3 వాసర సరస్వతీ సుప్రభాతం, 4 గౌరీ శంకర సుప్రభాతం - కరీంనగరం, 5 కుంజ విహారము పద్యకావ్యం, 6 దక్షయజ్ఞం బుఱ్ఱకథ

**అముద్రిత అలభ్య రచనలు** 1 భద్రావతి నాటకము, 2 త్యాగయ్య నాటకము, 3 శ్రీరాజరాజేశ్వర క్షేత్ర మహాత్మ్యం హరికథ, 4 తరిగొండ వేంగమాంబ హరికథ, 5 యాదగిరి నృసింహశతకం, 6 దీపావళి, 7 ముగ్గురు మరారీలు బుఱ్ఱ కథ

**ఇతర అముద్రిత రచనలు** 1 మల్లన్న సుప్రభాతం కొమురవెల్లి, 2 శ్రీరామచంద్ర - బెల్లంపల్లి, 3 శ్రీ నృసింహ బెజ్జంకి, 4 మహాకాళి - సికిందరాబాద్, 5 గంగా సుప్రభాతం
6-9 ద్విపద రామాయణము - అయోధ్య, అరణ్య, కిష్కింద యుద్ధకాండలు

1 సాంబశివ శర్మ గారి సాహిత్య వివరాలు - పుస్తకాలు వారి పుత్రులైన ఎం రాజన్న, ఎం ఏ గారు అందించారు

సాంబశివ శర్మగారి ముద్రితాముద్రిత లభ్యాలభ్య సంస్కృతాంధ్ర కావ్యాలు, ముద్దు ముద్దుగా ముప్పది వరకున్నాయి కావ్యం, ఖండకావ్యం, సుప్రభాతం, కీర్తన, నాటకం, బుఱ్ఱకథ వారు చేపట్టిన కవితా ప్రక్రియలు అపార పాండిత్యం కమనీయ కవిత్వం మాత్రమే కాదు, నిశిత పరిశీలన, కటు విమర్శ, ఈ కవి గుణాలు నిర్భీతి - నిష్పక్షపాతం సాంబకవిగారికి సహజాతాలు అధిక్షేప కవిత్వ సృజనలో శర్మగారిది అగ్రపీఠం

**కావ్య పరిచయం**

1 **ముక్తాహారము** ఖండకావ్యం 1949లో ముద్రితం 50 పుటలు ఇందలి కావ్య ఖండికలివి అంకితం, ఇష్టదేవతాప్రార్థన, శారదా నక్షత్రమాలిక, రామ నవరత్నమాల, సీత, భరతమాత, బాపడా, నారాయణదాసు, రమణకవి, మా దేవర, బాపూజీ, గేయాలు, మంగళ గీతికలు భక్తి భావ సంభరిత పౌరాణిక శీర్షికలతోపాటు, భరతమాత వీరి దేశభక్తికి, బాపూజీ రాజకీయాసక్తికి నిదర్శనాలు నారాయణదాసు హరికథా పితామహ 'ఆదిభట్ల' వారు రమణ కవి ధూపాటి వేంకటరమణాచార్యులు వారు కరీంనగర్ జిల్లా శాసనాల, పూర్వ కవుల, వెలుగునకు తెచ్చిన చారిత్రక పరిశోధకులు కవిగారి సమకాలీన విషయ స్పందన దీనితో స్పష్టం వీరి కవితా చందనం చందమిది,

వాణినుతి నానా క్లేశ సమన్వితంబయిన జన్మంబిచ్చి ప్రారబ్ధ సం
ధానంబున్ దగిలించి దానికి నవిద్యా బంధమున్గట్టి నీ
ధ్యానంబందున సంశయాత్మక మహాధ్వాంతచ్ఛటల్ జుట్టి యే
స్థానంబందున శాంతి నీయవు తటిద్దామోజ్జ్వలా శారదా పు 3

శివనుతి భక్తి క్రీత, భవాబ్ధి పోత, యభవా! భద్రేభ చర్మాంబరా!
ముక్తి ద్వార కవాట పాటవ కరా! ముగ్ధేందు చూడామణీ!
ముక్తా హారము లంచ మిచ్చెదను శంభోతస్కరాణాంపతీ!
రుక్తాపంబులు బాపి మాకునిక నారోగ్యంబు చేకూర్చవే

మా దేవరా - లోని ఒక పద్యం,

ఒజ్జలు లేని విద్దియ, నయోన్నతి లేని మహాధికారముల్,
గజ్జెలు లేని తాండవము, కాటుక లేని వధూటి నేత్రముల్,
మజ్జిగలేని భోజనము, మంజుల గంధములేని పూవు, నీ
పజ్జన లేని జీవితము వ్యర్థము లేమలవాడ యీశ్వరా!

పెమ్మయ సింగధీమణీ, పద్యాల తలపించినా ఛందశ్శిల్పాను సరణ తప్ప భావానుకరణ లేకపోవడం గమనార్హం బాపడా! లో స్వజాతి సోదరులనిట్లా హెచ్చరించారు

నీవు స్వధర్మమున్వదలి నిందల పాలయి పోవుచుంటివా?
దేవుడు గూడ నీ బ్రతుకు దిద్దగ లేడిక మేలు కొమ్ము, నిన్
బ్రోవగ జాలు వాడెవడు? పూర్వ మహర్షుల యంతరాత్మ లి
ప్డీవు జరించు దారిగని యేడ్చుచు నుండె గదోయి బాపడా!

సాంబశివ శర్మగారిది సంప్రదాయ మార్గం

2 **మధుర ఝంకారము - 1949** పుటలు 36 ఇది భక్తి కవితా సంపుటి

తెలుగు కవితలు శ్రీరామ శ్రీకృష్ణపరములుగా, సంస్కృత కవితలు శివ త్రయీదేవతా స్తుతులుగా ఉన్నాయి ఒక గేయం 12వ పుట

కమలము కువలయ కాంతుల నీనున్ కాళిందీ మహాస్రవంతీ
కమలము కువలయ కాంతుల నీనున్ ॥

వేళయిదే స్నానమునకు మనకున్, వేళాకోళము చాలు చాలునిక,
ప్రణయినీ ప్రియుల పరిరంభములన్, గనబఱచు లతా క్రాంత తట తరుల్ ॥క॥
పూదోటల కోయిల పాటలు నెమి, ళుల యాటలు చిలుకల మాటలు హం
సల నీటులు యెత్తగు కోటలు చ, క్కని బాటలు గల మధురాపురమిదె ॥క॥

3 **జయశ్రీ - ఖండ కావ్యం - 1953** పుటలు 50 ఇరవై పద్య శీర్షికలు, బొబ్బిలి పదము ద్విపద, చివర కొన్ని హారతులున్నవి శివ, రామ, మాదేవర వంటివి కాక సమకాలీనాలైన భారతమాత, పొట్టి శ్రీరాములు, మా ఊరి దివ్వెలా, కవన సంజీవని మొ॥ శీర్షికలున్నాయి ఇందలి కొన్ని పద్యాలివి

దురభిమాన పిశాచి నెత్తురులు బీల్వ, బుద్ధి చెడి యేడ్చుచున్నారు వృద్ధులిచట,
పెద్దలను దిట్టుచున్నారు పిన్నవారు, వల్లకీపాణి నతకల్ప వల్లి వాణి

గాన కవిత్వముల్ స్వయముగా చిగురించిన బాగటంచు వి
జ్ఞాన నిధుల్ వచింతురటు కాదని వాదములాడ జొచ్చినన్,
మానస మీసునం బడును, మంచితనంబు జెడున్, రుచించునే
పూనిక నేరుకొన్న పదపుంజము లేమల వాడ దేవరా!

సంగీత సాహిత్య కళలు జన్మత సంక్రమిస్తాయని కవి అభిప్రాయం
పొట్టి శ్రీరాములు గారి ఆత్మత్యాగ ప్రస్తుతి

అదిగో మ్రోగిన దాంధ్రవీణ కపట వ్యాపార పారీణతా
భ్యుదయంబున్ నిజ తంతు నాళముల నుద్బోధించె నాంధ్రీయతా
నదముప్పొంగె నశాంతి నిండె కలహోన్మాదంబు రేకెత్తె మి
న్నదరెన్ లోకము కంట నీర్విడిచె నార్యావర్తమే బెగ్గిలెన్

ఇందలి అలంకార భావసరణి కవితా ప్రౌఢిమకు నిదర్శనం

4 **లోభ సంహారము - 1964** తొలి ముద్రణ 1992 మలి ముద్రణ ఇది కేవలం 51 పద్యాల అధిక్షేప కావ్యం నిజమైన కళారాధకునికి ధనసంచయేచ్ఛకు పొత్తు కుదరదు సిరి తగినంత లేకపోతే 'గ్రాస వాసో దైన్యంబులు' వచ్చు కదా సరస్వతి ఉన్నా దానిని చూసి ప్రశంసించు వారేకాని, సాహి త్యారాధకుల పోషించువారు అరుదు దిన వెచ్చమేరాజు తీర్చగలడు? అని శ్రీనాథ మహాకవి కూడా నాడు వాపోయాడు ఈనాడీ కవి కూడా తన దారిద్ర్యానికి విచారిస్తూ అందుకు కారణం మనిషిలోని పిసినారితనంగా గుర్తించారు సమాజాన్ని సరిదిద్ది సౌజన్యవంతుల చేసే తలంపుతో ఈ 'లోభ సంహార' కావ్యాన్ని రచించారు ఈ కావ్యం, జాషువాకు ఫిరదౌసి వలె, సాంబశివశర్మగారికి కవిగా మంచి పేరు తెచ్చింది ఇందలి పద్యాలు, కవి హృదయవిదారక వ్యథతో తన కలాన్ని కన్నీటిలో ముంచి వ్రాశాడేమో ప్రతి పద్యం పాఠకుల యెదల హత్తుకొని రసార్ద్రం చేస్తుంది

దేశము సుభిక్ష మయ్యె నల్దెసల యందు, కల్మివాసనల్ గుప్పున గ్రమ్మ కొనియె
చెరువు లాన కట్టలును ప్రాజెక్టులెన్నొ, క్షామమును సీమ దాటించి సాగనంపె 2

అయితే ప్రయోజనమేముంది?

గుడిలో కాసుల నంట గూడదనుచుం గూర్చుండు నుద్యోగి, యం
గడిలో నుద్దెర బేరమాడరట, సర్కారున్ విచారింప లో
గడ రూల్సుల్ కొరగావు పామ్మనును, కుగ్రామంబు గాకుండియన్
చెడె, నీ రీతిగ నాడులేని గొడవల్ చేయెత్తుటన్ లోభమా! 5

కనక వర్షమ్ము మా గుడి కడప లోన, నెల్ల వేళల గురియు నదేమొ కాని
ఒక్క చినుకైన బడదు మా యొడలి మీద, కవుల కింతియ కాబోలు కలియుగాన 37

నగరే లోకులు, దూరరే పరులు, నిందల్ మోపరే దుర్జనుల్,
ఎగతాళిం బొనరింపరే విబుధు, లిస్సీలంబ్రసాదింపరే
పగవారల్, మగువల్ హసింపరె, సఖుల్ వంచింపరే, (బంధువుల్)
తగవుంబెట్టరె, పత్నులల్గరె, ప్రభుల్ దండింపరే లేమిలో - 35

సిరులు దాచుక యెంగిలచేత కాకి నుశ్శోయన లేని ధనికులు (13) చేతి మెతుకులెక్కడ రాలిపోతాయో అని భయం! ఓటులందు గెలిచి కవుల పండితుల గేలి సేయు లీడరుల్ (13) వ్యవసాయమ్ము లేని వారి భూముల మ్రింగు రైతులు (14) చేసిన యఘమ్ము సనుటకై శివుని గొల్చు పిసిని గొట్టులు (20) లంచము జేబు ఖర్చు నుపలాలన దావతు చిత్రయాత్ర యీ పంచవిధోపచారముల ప్రాపును గోరెడి భక్తకోటి (31) ధర్మమడుగంటి సత్యమ్ము దారి తప్పె, న్యాయమడవిలోబడియె నయమ్ము పెడియె, త్యాగము నశించె (17) లోభమా! లోకమెల్ల కల్లోల మాయె, పాపముల గాదెబోసి కాపాడనేల? (14) ఇట్లాంటివి ఈ కావ్యంలోని పద్యపాదాలు కవి భావాలు ఇంకా లోకాన్ని ఇట్లా వర్ణిస్తున్నాడు కవి

టక్కరి సీట్లు, వాని కడ డంబము జూపెడి సేట్లు, అంగడిన్
వెక్కస మైన రేట్లు, నిరుపేదలకే పలుపాట్లు, సేద్యముం
జక్కగ జేయువారికి మసాల కరెంటుల కోత లిట్లు, కా
ర్లెక్కి తిరుంగు పాలకుల ఇండ్ల కచేర్ల గెటౌట్లు దైవమా! 8

కవి సంబోధన ఈ పద్యాల్లో బహుముఖాలుగా సాగింది

హక్కులు భారతీయులవి యంచు స్వతంత్రత వచ్చెనంచు మా
ప్రక్కన బల్లెమైన పరదేశపు పాలన పోయెనంచు మా
యక్కర లెల్ల దీర్చి మము హాయిగ నుంచు ప్రభుత్వమింక చే
జిక్కెనటంచు నుబ్బితిమి, సీ! యవి స్వప్న సమంబులాయెబో - 45

కవి తీర్పు ఇది

సంఘమునకు వివేకలోచనము లేదు, రిక్తుల నశక్తులను మన్న రేడు లేడు
మారువడకున్న మనకు సేమంబు లేదు, ఖలులు నశియింపకున్న సౌఖ్యంబు లేదు 7

సమస్యా పరిష్కార సూచన ఏదైనా, సామాజిక విశ్లేషణ మాత్రం చక్కగా సూటిగా ఘాటుగా కావించారు సాంబశివ కవిగారు ఈ కావ్యంలో ఇది ప్రతిభావంతుడైన కవికే సాధ్యం అందుకే ఈ కావ్యానికి ఇంత వ్యాప్తి! ఈ కవి సంస్కృత కవితా పరిచయానికి ఇదే లోభ సంహార కావ్య 'ప్రస్తావన' లోని నాలుగు శ్లోకాల్లో ఒకటి చూపడుతున్నది

నైషా విషాద లహరీ నటరాగ గీతి , నేదం విచిత్ర ఘటనం నటనం జనానాం
నాసా కుకర్మ నిరతి ర్నృదు వాక్య రీతి , నాహం పవిర్నవ కవిర్నను యాపిలోభ

5 **భక్తి గీతములు - 1966** ముద్రణ 40 పుటలు ఇవి భజన కీర్తనలు 6 హారతులు శర్మగారి పాటలు కూడా పద్యాల వలె పద సౌందర్యం భావ సౌభాగ్యం కలిగి ఉన్నాయి వారు వాగ్గేయకారులు సంగీత కచేరీలు చేసి సన్మానాలందుకున్నవారు ఈ సంపుటిలో స్వతంత్ర గేయాలతోపాటు కొన్ని సినిమాపాటల అనుసరణలున్నవి

6 **శ్రీరాజరాజేశ్వర సుప్రభాతం** ముద్రితం వేములవాడ దేవస్థానం వారే కాక ఆకాశవాణి హైదరాబాద్ వారు కూడా దీనిని ప్రసారం చేస్తున్నారు సాంబశివ శర్మగారి సంస్కృతాంధ్ర భాషల కవితాశక్తి శివభక్తి, ఈ మేల్కొలుపు స్తుతి కావ్యంలో ఒకదానికొకటి మించినవి 'లేంబాళ వాటిక విభో తవ సుప్రభాతం' ఇందలి మకుటం

7 **ద్విపద రామాయణం** ముద్రితం 1965 తర్వాత హిందీలోని రాధేశ్యాం గేయ రామాయణానికి స్వేచ్ఛానువాదం సాంబశివ శర్మగారి ద్విపద రామాయణం వాల్మీకి రామాయణం లోవలె ఇందులోను ఆరుకాండలున్నాయి శర్మగారి తెలుగు రామాయణం కవిగారు స్వయంగా పలు సాహితీ సభల్లో కావ్యగానం చేయుట చేత చాల వ్యాప్తి పొందింది ఇందులోని కొంత భాగం కరీంనగర్ ప్రతిధ్వని పత్రిక ప్రచురించింది కవిగారి బహుళ ప్రయత్నంతో వదాన్యుల ఆర్థిక సహాయంతో బాల సుందర కాండలు మాత్రమే రెండు చిరు కావ్యాలుగా ప్రచురించబడ్డాయి మిగతా భాగం ఇంకా వెలుగు చూడలేదు కవి తమ ద్విపద రామాయణ ముద్రిత ప్రతులలో అచ్చుకు సహకరించిన కృతి పతులను అభినందించారీ విధంగా బాల కాండలో డా॥ యు పి ఎన్ రెడ్డిగారి ప్రశంస

కలరా యాంధ్రము నందునంబలె తెలంగాణాంబు నందిట్టి త్యా
గులు దామై కవి జేరబిల్చి మది సంకోచమ్ము పోనాడ ని
ర్మల భావంబున, నర్థమిత్తు మిటురమ్మా నీదు కావ్యంబు కా
వలె ముద్రింతు మటంచు గట్టి నుడులన్ భాషించు వైద్యుల్ విభుల్

సుందరకాండలో

శ్రీరఘువంశ రత్నమును సీతయు పంచ వటిన్వసింపగా
క్రూరుడు పంక్తికంఠుడటకుం జని సీతను దొంగిలింపగా
మారుతి లంకకేగి యట మైథిలి జాడను దీసి రామునిం
జేరిన సత్కథన్ వినుము శృత్యమరంబు వొలాస కృష్ణుడా!

ఈ కావ్యంలో వీరి ద్విపద కవిత, గేయ పాదాలవలె గానయోగ్యంగా ఉంది అనువాదం సహజసుందరం ఉదాహరణకు కొన్నిపంక్తులు చూడండి సుందరకాండ నుండి

సేమంబునకు నిక్క ప్రేమకు గీము । ధర్మంబునకు పాదు కర్మకున్నెలవు
పనిబూని యుపకారమును జేయువాడు । భజనలో నానంద పడుచుండు వాడు 11 పు
ఒక యోజనంబంత యొడలిని బెంచె। అరి భయంకర వికటాస్యముం దెరిచె
రణ ధీరుడొక్క పర్వత మంత బెరిగె । బల పతాకముమింట చలియింప దొగడె 31
కలవాడ పదితలల్గలవాడ వినర । కలవాడ శివభక్తి గలవాడ వినర 53
నెమ్మేను లంకలో నిలుచునే గాని । ఆత్మ ప్రవేశించునతనిలో ననుమ
మరలి వచ్చెడి వేళ మౌళి రత్నమును । గురుతుగా నిచ్చె గైకొని దీని గనుమ - 65

బాలకాండ

తరువుల గ్రొంగ్రొత్త దళములు విరిసె । సరయూ తరంగముల్ జావళుల్ బాడె
తోటలన్ మొగ్గ గుత్తులు నోళ్ళువిచ్చె । చిగురు పూబొదరిండ్ల చెలువముల్ హెచ్చె - 7

ఇది మంజరీ ద్విపద అయినా ఆది ప్రాసో, అంత్యప్రాసో, విధిగా పాటించబడింది వృత్యను ప్రాస ఈ కవికి ఇష్టం అనేకలర్థాలంకారాలు ఎడనెడ యమకం (కలవాడ) శ్లేష (అనుమ) వాడి శర్మగారు తమ కవితకు శోభను కూర్చారు చెప్పితే తప్ప ఇది అనువాద కావ్యమనిపించదు

కేవలం రెండు కాండములు ముద్రితమైన ఈ రామాయణం ఆరు కాండములు ఒకే ప్రతిగా ముద్రింపబడితే చక్కని గేయ కావ్యం జనానికి లభించేది కవి తమ కవితానైపుణినిట్లా సాహసంగా సత్యంగా చాటుకున్నారు

నా కవన ప్రబుద్ధ నలిన ప్రసరన్మకరంద బిందువుల్
నాక వన ప్రబుద్ధ నలిన ప్రసరన్మకరంద బిందువుల్

కాక మరే మగున్ విగత కల్మశ విజ్ఞమనోజ్ఞ భృంగముల్
మూకతలోన ముంచి రసమున్ గొనసేయవె, వేయునేటికిన్

అయితే మాత్రం ప్రయోజనం ? కావలసినదేమిటో సాంబశివ శర్మగారే చెప్పిన మరో అవధాన చాటువు తెలుపుతుంది ఈ విధంగా ఇది - నిరాశ్రయానశోభంతే - అను నీతి శాస్త్ర శ్లోకానువాదమైనా కవి ఆమోదించిన విషయం

పండితుల్ లతల్ వనితలు ప్రాపులేక, వన్నెకెక్కరు, మణిలేక వలయమునకు,
కాంతలేక పురుషునకు, కవులు లేక, రాజునకు రవంతయు కీర్తి రాదు నిజము !

సాంబశివ శర్మగారు రచించిన పద్యాలన్నీ సంఖ్యకు వేయి కాకపోవచ్చు అయినా సాహితీ మూల్యాన్ని బట్టి ఆయన మహాకవి

**27 గాలిపెల్లి సుబ్బయాచారి - కురిక్యాల,** మం గంగాధర 1910-1970 సుమారు

గాలిపల్లి సుబ్బయాచారి జన్మగ్రామం కురిక్యాల వీరు విశ్వబ్రాహ్మణ కులస్థులు తండ్రి నరసయ్య గారి రాజయ్య తల్లి ఈశ్వరాంబ వీరిది ప్రబోధక ఋషిగోత్రం విద్యాగురువు లక్ష్మీనరసయ్య పంతులు [1] వేదాంత గురువు దురిచేటి నరసింహాచార్యులు హసనాబాద [2]

**సుబ్బయాచారి రచనలు** 1 ఆంధ్ర జ్యోతిష సర్వస్వము ముద్రితం, 2 శ్రీభక్త విరోబా నాటకము ముద్రితం - 1948

**కవి పరిచయం** సుబ్బయాచారి "భాషా కవిత్వ పరిజ్ఞానమెక్కువలేనందున నింకను గ్రంథములు శోధించుచున్నవారు" అని తమ నాటకంలో సూత్రధారిచే చెప్పించుకున్నారు బాల కవినన్నారు కాని ఆయన వరకవి సర్వధారిలో ముద్రితమైన ఈ పుస్తకంలోని ఫోటోలో కవి ధ్యాస స్థితిలో కూర్చున్నారు అప్పటికి నలుబదేండ్ల వయస్సువారు అనుకోవచ్చు అంతకు పూర్వమే జ్యోతిష గ్రంధాన్ని రచించినారు గురువునాశ్రయించారు వీరి జీవిత కాలం సుమారుగా 1910 1970

**కావ్యపరిచయం** ఈ కవి విద్వాంసులు కారు వాస్తు జ్యోతిష్యాలు తెలిసినవారు శాస్త్రపండితులు లేని గ్రామాలలో వీటియందు మిత పరిజ్ఞానం కలవారితోనే జానపదుల అవసరాలు తీరేవి వీరికి ఆదరం ఆదాయం లభించేది సుబ్బయ్యాగారి జ్యోతిష గ్రంధం ఎక్కలదేవి లక్షణ భాగవతార్ కోరుట్ల గారి వద్ద లభించింది దీని పు 160 దీనికి వెలిచాల కేశవరావు గుండి గారు రచించిన పీరిక ఇది

"పాఠక మహాశయులారా! మణి దీపమును బోలు ఆంధ్రజ్యోతి(ష్య) సర్వస్వము అను గ్రంధము బ్రః॥శ్రీ సుబ్బయాఖ్యునిచే సర్వేశ్వరానుగ్రహంబున (సంస్కృతము నందు గల యీ జ్యోతిష శాస్త్రము) ఆంధ్రమునందు పద్యములుగా రచింపబడెను దీనిలో అనేకములగు భాషాకవిత్వ లోప ములుండవచ్చును అవి యన్నియుసైచి యొప్పులుగా గ్రహించి సవరించి యీ నూతన కవికి నుత్సాహము కల్గింతురని కోరుచున్నాను [3] కవి స్వీయ పరిచయ సీస పద్య గీతంలో ఇట్లన్నారు

మాధవీయాది సద్గ్రంధ మర్మమెరిగి, జూచి పెద్దలు జెప్పిన చొప్పుగాను
వ్రాయు చుంటిని మా తెన్గుభాషలోన, యాంధ్ర సోదరులకునిది యనుగటంచు - ప 5

ఈ కృతి అనేక గ్రంధాల సార సంగ్రహం పూర్వాంధ్ర గ్రంధాల పద్యాలను కూడా కవి కొన్నింటినిందులో చేర్చుకున్నారు [4] ఇది మొదటి భాగం రెండవ భాగం రాలేదు [4]

1 సుబ్బయాచారి గారి 'శ్రీభక్త విరోబా నాటక' చతుర్థాంకాంత గద్య
2 సుబ్బయాచారి గారి 'శ్రీభక్త విరోబానాటక' అవతారికా పద్యం పు 3

ఇందులో శకునాలు, గ్రహదోషాలు, వ్రతాలు, ముహూర్తాలు, జాతకాలు మొ॥ అంశాలు పద్యాల్లో వివరించబడ్డాయి పద్యాలకు భావాలు కూడా వ్రాశారు శ్లోకాలకు అనువాదం సరళంగా ఉంది కొన్ని పద్యాలు శైలీ రమ్యాలు ఈ పుస్తకానికి మరో మున్నుడి వ్రాసిన శతావధాని కృష్ణమాచార్య కొరుట్లగారి అభిప్రాయమిది "అవకాశము చిక్కనందున సాధ్యమైనంత వరకు చూడగలిగితిని ఇంకను కొన్ని భాషాకవిత్వ భావమున జూచువారికి పొరపాట్లు కనబడినను జ్యోతిష్యశాస్త్ర సంప్రదాయమున జేయవలసిన యుపకారమునకు కొరతలేదు"

**28) రామమూర్తి - మాదాపురం, తా॥ సిరిసిల్ల, 20వ శతాబ్ది పూర్వార్థం**

రామమూర్తిగారు వైదిక బ్రాహ్మణులు వీరి స్వగ్రామం మాదాపురం ఇది గన్నేరువరం గ్రామ సమీపంలో ఉంది మాదాపురం గృహనామం గాగిళ్ళాపురం స్వగ్రామం అని, 'క జి ర చరిత్ర' పుట 274లో ఉంది మూర్తిగారు పండితులు రామాయణ మందరం వ్రాసిన వావిలికొలను సుబ్బారావు (18 1947) గారితో వీరికి ఉత్తర ప్రత్యుత్తరాలు నడిచేవట ప్రత్యేక కావ్యాలు ఏవి రచించలేదు కాని, వీరు అప్పుడప్పుడు రసవత్కవితా ఖండికలు వెలయించేవారు రామమూర్తి గారి ఈ పద్యం చూడండి ఇది చిత్ర కవిత ఈ తేటగీతి పద్యంలోని నాలుగు చరణాల మొదటి అక్షరాలు కలిపిచదివితే ఈ జిల్లా మాజీ ఎం పి గారి పేరు వస్తుంది

రస రుహరి చిన్ని నిసువనదగువాడు, మారుకన్న మధురిమమ్మువాడు
పవి ధరించిన వాని పట్టి పోలినవాడు, తిరుమలన్న వెంట తిరుగువాడు (రమాపతి)

రమాపతి రావుగారి అన్న తిరుమలరావుగారు పవి వజ్రాయుధం దానిని ధరించినవాని పట్టి ఇంద్రనందనుడైన జయంతుడు ఇంతటి ప్రతిభా వ్యుత్పత్తులు గల కవి రామమూర్తిగారు

**29) జంగిడి నారాయణ - జమ్మికుంట తా॥ హుజూరాబాద్ - జననం 1920 సు**

జంగిడి నారాయణగారు హుజూరాబాద్ తాలూకాలోని జమ్మికుంట వాస్తవ్యులు కాపు కులజులు వీరు వరకవి అచలాద్వైత మతానుయాయులు వీరు తమగురువుగారైన అంకతి రాఘవయ్య చిదానంద రాజయోగి' గూడూరు, మం కమలాపురంగారిపై భక్తితో రెండు రచనలు చేశారు [1]

**నారాయణ కవి కృతుల పేర్లు -**

1 చిదానంద శతకము 1949 ముద్రణ, 2 చిదానంత జ్ఞానబోధ 1977 ముద్రణ

మొదటిది సీసపద్య అష్టోత్తర శతకం రెండవది ద్విపద కావ్యం కవి స్వీయ వివరాలేవీ తమ పుస్తకాలలో తెలుపుకొనలేదు 1969 శ్రావణ పూర్ణిమరోజు గురువుగారు కీర్తిశేషులైనారు ప్రస్తుతం వ్యాపార వృత్తిలో జంగిడి నారాయణగారు హన్మకొండలో ఉంటున్నారు వయస్సు 70-80 సం మధ్యగా ఉంటుంది (1992)

**కావ్యపరిచయం** చిదానంత శతకంలోని కవి స్వీయ పరిచయ పద్యం

సీ పరగనూటెనిమిది పద్యముల్ జెప్పితి జూసి తప్పొప్పుగా జేసి వినుడి
యతి ప్రాస లక్షణం మతినే నెరుగ మీ(దు) సుతునిగా జూడుడీ సుజనులారా
మతి మంతులేదేని మర్మమెరిగెద రన్న (గణభంగం) అతిపామరులు దీనినందలేరు
కారణంబగు జన్మ కడతేర జెప్పితిన్ నేరమెంచక దీని నేర్పు గనుడి

---

3 వి కె రావు గారి 'నేను - నా జ్ఞాపకాలు' 1977, 2వ భాగం పుట 99, ఈ వచనం తర్వాత మరో పద్యమున్నది 4 కవి గారు తమ కావ్య పీఠికలో పేర్కొన్నారు

1 అంకతి రాఘవయ్య 'చిదానంద రాజయోగి' గారు ఈ గ్రంధకర్త మలయశ్రీకి కూతురునిచ్చిన మామ

గీ గొప్ప వాడను గాను మా యప్ప లార, తప్పు లేకుండ జెప్పనాతరము గాదు
దేశి కేంద్రుడ రాఘవా! ఆశరహిత, దాస నారాయణుని బ్రోచుధన్య చరిత 3

వేదాంత విషయాల వివరణ, సుగుణ సంపత్తి ప్రశంసతో కూడిన ఈ చిదానంద శతకంపై ఈ జిల్లా కవులైన శేషప్ప, సిద్ధప్పల శతకాల ప్రభావం ఉంది

**చిదానంద జ్ఞాన బోధ** - ఇది కేవలం 30 పుటల 'మంజరీ ద్విపద' కావ్యం విషయం ఆచలాద్వైత విషయ ధర్మవివరణ మచ్చుకు కొన్ని పంక్తులు చూడండి

"ఎరుక సహజ వృత్తి యెరిగింతు నీకు, కనుపడి కనరాదు కావున నీవు
కనరాకనె పోని కనుగొన్ని బయలు, లేని దున్నట్లుండె లేకనే పోని
ఇంద్ర జాలము తీరుయిచటనే వుండు, మరి మహేంద్రుని జాల మాయమై పోవు
యింక తెలిపెద విను జంకును వదలి" పు 13, చివరి పద్యం
తెల్ల కరి నెక్కితంతలో తెలియ వచ్చె, కల్ల యయ్యేను సర్వంబు కలికి మిన్న
దేశికేంద్రుడ రాఘవా[1] ఆశరహిత, దాస నారాయణుని బ్రోచు ధన్య చరిత !

ఈ కవి మరో శతకం రచించారని తెలియవచ్చింది వీరు పండితులు కారు వరకవి కవి ఆశించినట్లు 'నేరమెంచక' భక్తజనం 'జన్మకడతేర' ఇటువంటి రచనలను ఆదరిస్తూనే ఉన్నారు

**30) రావుల దశరథం - హుజూరాబాద్, 1920-84**

రావుల దశరథంగారు హుజూరాబాద్ వాస్తవ్యులు విశ్వబ్రాహ్మణులు ప్రభుత్వ వ్యవసాయ నీటిపారుదల శాఖలో ఉద్యోగం చేశారు ఈ కవి ఫోటోగ్రాఫర్, సంగీత చిత్రలేఖనాది లలితకళల్లో ప్రావీణ్యం కలవారు స్వయంగా బుఱ్ఱ కథలు రచించి స్టేజీపై చెప్పేవారు తెలుగు సాహిత్యాభిమానం కల ధశరధంగారు వ్రాసిన ఏకైక పద్యకావ్యం "బాష్పాంజలి" 1950 సుమారుగా రచింపబడిన ఈ లఘుకావ్యం అముద్రితం అల్ప వయస్సులో మృతి చెందిన తమ కుమారుని స్మృతితో కవి ఈ కృతిని శోకోపశమనంగా వ్రాసుకున్నారు వీరి కవితపై పురాణకవుల పద్యాల ప్రభావముంది బాష్పాంజలి చదివితే రామాయణ యుద్ధకాండలో లక్ష్మణుని మూర్ఛ సందర్భంలోని శ్రీరాముని దు ఖం మదిలో మొదలుతుంది ఒక పద్యం చూడండి

బంధు సమూహంబు బరతెంచి నీతనూ భవుడేడనిన యేమి పలుకు వాడ
మిత్రులేతెంచి నీ పుత్రుడెచ్చటనని యడుగ నే నేమని నుడువువాడ
అగ్రజుడేడంచు అడలు చున్నట్టి నీ చిన్ని చెల్లెలికేమి చెప్పవాడ
నీ సహచరులు నన్ నీ జాడ లెరిగింప బ్రతిమాల నేనేమి పలుకువాడ
కంటి రెప్ప చందాన నిన్గాచి తుదకు, చేతులారంగ అడవి పాల్జేసుకొన్న
మంద భాగ్యుడు ఎట్లు నీ మరణవార్త, తెలుసుకొన జాలునో భువి తెలియనకట - 3

ఈ కరుణరస పూరిత పద్యకావ్యం 16 పుటలు 60 పద్యాలు-దాదాపు కవి స్వయంగా వ్రాసిన నోటు బుక్కు ఆయన కుమారుడైన రావుల పూల్లాచారి హుజూరాబాద్‌గారి వద్ద ఉంది దశరధంగారు వ్రాసిన బుఱ్ఱకథల ప్రతులు లభించలేదు

**31) తిరునగరి వేంకటేశ్వర్లు - నుస్తులాపురం, తా॥ కరీంనగర్, 1915-70 సుమారు**

వేంకటేశ్వర్లుగారు అధ్యాపకులు చాత్తాద వైష్ణవులు నుస్తులాపూర్ వాస్తవ్యులు [1] జర్నలిస్టు టి ననుమాసస్వామిగారు వేంకటేశ్వర్లుగారి కుమారులు స్వామిగారి 'వ్యాస సంపుటి' భాగ్యనగరంలో

1 1951లో మానకొండూరు మాధ్యమిక పాఠశాలలో వేంకటేశ్వర్లు గారు ఉపాధ్యాయులుగా ఉండగా చూశాను నేను అప్పుడు అదే పాఠశాలలో 6వ, తరగతి విద్యార్థిని

ఏడాది క్రితం ఆవిష్కరింపబడింది ఆ సందర్భంలో రచయిత ప్రసంగిస్తూ వారి తండ్రి రచయిత అని, వారి రచనలు గోలకొండ పత్రికలో వస్తుండేవని తండ్రి ప్రేరణవలననే స్ఫూర్తి పొంది తాను రచయిత కాగలిగానని అన్నారు ఆ వార్త దినపత్రికల్లో వచ్చింది వేంకటేశ్వర్లు కీర్తిశేషులు కాబట్టి వారి కనిష్ఠ సోదరులైన డి శ్రీనివాసరావుగారిని కరీంనగర్ దగ్గర రాంపురంలో కలుసుకొని సంప్రదించగా అన్నగారు గద్యపద్య రచనలు చేసేవారని చెప్పారు కాని, వారి ఏ రచననూ అందించలేకపోయారు అన్వేషించగా వారి పద్య కవిత ఒకటి మాత్రం లభించింది సారస్వత జ్యోతి త్రైమాసిక సాహిత్య సంచిక కరీంనగర్ - 12 ఫిబ్రవరి 1954లోని వీరి 'విద్యార్థి ప్రబోధము' రెండు సీస పద్యాలు అవి ఈ దిగువ చూపబడుతున్నవి

మీరెకా మున్ముందు మీసముల్దిప్పుడు, జాతీయతను నిల్పు జాణలౌట
మీరెకా మున్ముందు మీమాంసకులునయి, గ్రంథ శోధనకయి గడగు చుంట
మీరెకా మున్ముందు మిత్రత్వమును సల్పి సంఘ సంస్కరణలు సల్పుచుంట
మీరె కా మున్ముందు మేను చెమ్మటోడ్చి భరత మాతకు సేవ నెరపుచుంట
మీరె కద భావి సౌభాగ్య ధీరులగుట, మీరె కద దేశవృద్ధికాధారులగుట
మీరె కద సత్యహింసల తీరుదెలిసి, సంతసంబును నొందుటో సదయులార

రెండవ పద్యం నాలుగు పాదాల్లో వరుసగా కవులయి, తత్త్వవేత్తలై, విద్వద్వరేణ్యులై, గణిత శాస్త్రజ్ఞులై రాణించాలని ఆశిస్తూ చివరి గీతంలో ఇట్లా ప్రబోధించారు

కరడుగట్టిన భారత క్రౌర్యములను, మెదపి కదలించు చతురులు మీరె గాదె
భూత శోభను గలిగించి భూమి యందు, భేరి మ్రోగించు నేతలు మీరె గాదె

వీరు శేషాద్రి రమణకవుల 'నైజాం రాష్ట్ర ప్రశంస'1926 కావ్యాన్ని చదివినవారు భారత స్వాతంత్ర్య పోరాట కాలాన్ని చూసినవారు దేశం విముక్తి పొందిన ఆనందాన్ని అనుభవించినవారు కవి ఆశించినట్లుగా 'కరడు గట్టిన భారత క్రౌర్యములు' విదేశీపాలకులవి అంతరించాయి అన్ని రంగాల్లో భారతీయులు జాణలై రాణిస్తున్నారు

**32) పురుషోత్తమ దాసు (క్షీరం భూమగౌడు)** - రాయికల్ 1875 1950 సుమారు

పురుషోత్తమదాసు గౌడు విష్ణు భక్తుడు పద్యకవి మన వారికి కాళిదాసు, కబీరుదాసు, రామదాసు సుపరిచితులు ఆ దారిలోనే రామానుజ, నరసింహాది దాసోపనాములు వచ్చారు భూమగౌడు పురుషోత్తమ దాసు (సూరదాసు పరిచయం తక్కువ దేవదాసు కథ సినిమా ఆ కాలం వరకు రాలేదు) 1997 జనవరిలో రాయికల్‌లో కవి రాజకీయ నాయకులయిన వేముల పెరుమాళ్ళుగారింట ఈ కవి ప్రస్తావన వచ్చింది పెరుమాళ్ళుగారి మాతా మహులు (తల్లి తండ్రి) పురుషోత్తమదాసు కవి

ఒక అసంపూర్ణ సీసపద్య 'రావికంటి రామచంద్ర శతకము' మరికొన్ని చాటు పద్యాలు పురుషోత్తమ దాసు రచనలు ఆయన గౌడ వృత్తివారైనా వైద్యం చేసి రాణించారు విష్ణు భక్తిలో లీనమై కవిత్వం వెలయించారు పైగా భాగవతనటులు, ఈ గ్రంథంలోని తిరునగరి నరసింహదాసుచే మాధవ చరితం యక్షగానాన్ని రాయించిన వారిలో వీరు ముఖ్యులు వీరి పద్యాలు భగవన్నుతి, ఆచార సామాజిక నీతి ప్రభోధకాలుగా ఉన్నాయి ఇవి ఏక మకుట పద్యాలు (గీత పద్యం చివరి రెండు చరణాలు) 44 ఒక పద్యం చూడండి

సీ పుణ్యాత్ములుండేటి పురమె వైకుంఠము ప్రజల పోషించు భూపతియె విష్ణు,
పెనిమిటిన్ సేవించు పెండ్లామె శ్రీలక్ష్మి, గురువాజ్ఞ మెదలిన నరుడె దాసు,
తల్లిదండ్రులగాచు తనయుడె విబుధుడు, ధర్మరాజుని వాని తలపవచ్చు,
పక్షపాతములేక పంచాయతులొనర్చి, సత్యంబు పల్కిన సజ్జనుండు

గీ ఎంత కాలంబు బ్రతికినయింతెగాదె, భజన చేసెడివారికి పరమ సుఖము,
గజమునకు మోక్షమిచ్చిన ఖగపతే (తీ) ంద్ర, రాజరాజేంద్ర రావికల్ రామచంద్ర

ఊరి అధికారితో ఎందుకో వైరం వచ్చి ఊరు విడిచి పంతంతో 12 ఏండ్లు పారుగూళ్ళలో గడిపారట దాసు ఆయన అభిమానించిన పూర్వ కవుల పద్యాలు - పాటలు, తిరునామాలు, నటించిన నాటకాల భాగాలు వ్రాసి ఉంచుకున్న వ్రాత ప్రతులన్నుండి అతి జాగ్రత్తగా ఈ కవి రచించిన పద్యాలు గుర్తించి వేరు చేయడమైంది లభించిన వీరి అయిదారు చాటువుల్లో రెండు పద్యాలివి

ఆ వె ఆవులుద (?) పురములో ఆర్యవైశ్యవనిత, ఎలమిచుప్పనాతి ఎత్తుపండ్లు
మందులన్నితాగి ముందిస్తననియు (ను), బొంకుటాడె నేడు రంకులాడి

కం అవనిన్ కడుపాతకుడీ, భువినేలిన లక్ష్మరెడ్డి బూడిదయగునే
కవిగా వాని శపించితి, కవితిట్టును పాముకాటు కదలను భూమా ।

## 33 చెన్నమనేని జగన్నాథరావు, మల్యాల, మం చెందుర్తి

జననం - 1926 సుమారు, చదువు - సంస్కృత విశారద

జగన్నాథరావుగారు వెలమవారు నిరాడంబరులు సంస్కృతాంధ్ర భాషల పాండిత్యం కలవాడు నాటి కవిపండితుల సంగతులు ఉత్సాహంగా వివరిస్తారు వినేవారుంటే వీరు తెలుగులో మంచి కవి 1996లో కలిసినప్పుడు వారివి రెండు పద్యాలు వినిపించారు అందులో ఒకటి ఈ క్రింద చూపబడుతున్నది

1 నీచులవేడబోకు మపనిందకు పాత్రము గాకు మేదురా
లోచన నల్పబోకు కడులోభుల పంచన చేరబోకు పై
శాచగుణంబు వీడు కడు శాస్త్రము పొందియు తామసంబుకా
ల్రాచి నశింప జేసియు సలక్షణ సౌఖ్యము పొందు మానసా

శ్రీరామమేలుకొలుపు, ధర్మపురి శ్రీలక్ష్మీనృసింహ స్తవము, అను పేర్లతో వీరివి రెండు కృతులు ముద్రణ పొందినాయన్నారు సంగెం (కొరుట్ల మండలం) రామచంద్రరావుగారు కూడా తెలుగులో కవిత్వం చెప్పేవారన్నారు వీరు వారిని కానీ వీరి రచనలను కానీ చూడలేకపోయాను

## 2 యక్షగాన - వీధినాటక సాహిత్యం

పండిత కవుల పద్యకావ్యాలకన్నా ఈ జిల్లాలో ఈ అర్ధ శతాబ్దిలో అధిక జనాదరణ పొందినవి యక్షగానాలు వీధినాటకాలు వీనిని పరిమిత విద్యావంతులైన కవులే వ్రాశారు వారిలో పలువురు వరకవులు ఈ రచనల అవసరాన్ని వ్యాప్తిని చూసి విద్వాంసులు కూడా కొందరీ ప్రక్రియలో రచనలు కావించారు కాని, అవి సంఖ్యలో చాల తక్కువ

ఈ తరంలో ముఖ్యంగా భట్రాజులు యక్షగానరూపకాలను విరివిగా రచించారు తర్వాతి కాలంలో వివిధ వర్ణాలకు చెందిన నటులే ఈ నాటకాలను స్వయంగా వ్రాసుకున్నారు వీరిది శ్రుతపాండిత్యమైనా నటనానుభవంతో జనాసక్తిని బట్టి ప్రదర్శనానుకూలంగా యక్షగానాలు రచించి తద్వారా స్వప్రయోజనాన్ని ప్రజాదరాన్ని పొందగలిగారు విశేషమేమంటే ఇక్కడి యక్షగానాలు శతాధికం ఇంచుమించు రచింపబడినవన్నీ ప్రదర్శింపబడినవి అంతేకాక వానిలో అధిక శాతం ముద్రణ పొందినవి అదీ సికిందరాబాద్‌లోని ప్రముఖ పుస్తక ప్రచురణ సంస్థలచే ప్రచురించబడడం విశేషం ఈ యక్షగాన నాటకాలు ఒక్కొక్కటి పలు ముద్రణలు పొందాయి ఇప్పటికీ ముద్రింప విక్రయింపబడుతున్నాయి ఇది ఇక్కడి మరే విద్వత్కవి గ్రంథానికీ లభించని సత్కారం

మరో విషయం పండిత కవుల కావ్యాల్లో ముద్రణ పొందినవెన్ని? వానిని చదివిన వారెందరు? విన్నవారెందరు? అనే వివేచనకు పోతే ఆ ప్రశ్నలకన్నింటికీ 'చాల తక్కువ' అనేదే జవాబు కాని,

దేశీయరూపకాలైన ఈ యక్షగాన వీధినాటకాలు మాత్రం అధిక జనాదరణను బహుళ వ్యాప్తిని పొందాయి అవి అవిద్యావంతులు మితవిద్యావంతులైన జానపదులకు మాతృభాషను, పురాణ సాహిత్యాన్ని, నాట్యసంగీతాది కళలను అందించి అనురంజింపజేసి, అమోఘమైన సామాజిక ప్రయోజనాన్ని సాధించాయి ఈ కాలపు రూపక సాహిత్యం ముఖ్యంగా రెండురకాలు

1 యక్షగానాలు భాగోతాలు - వీధినాటకాలు 2 స్టేజి నాటకాలు

మూడవ స్థాయిలో చిరుతల పాటల నాటకాలు వచ్చాయి రచయితలను బట్టి ఇవి రెండు రకాలు 1 కవులు వ్రాసినవి 2 నటులుస్వయంగా రచించుకొని ప్రదర్శించినవి

వీటిని రచించిన కవులు కూడా రెండు రకాలు 1 పండిత కవులు 2 వర కవులు

ఈ దృశ్యరూపక గ్రంథాల రచనావ్యాప్తికి ముఖ్య కారణం పోషకుల ఉదార దృష్టి నాటి వారు కృతిని నిర్మింపజేయడం లేదా అంకితం పొందడం, పురాణాలలో చెప్పబడిన విధంగా సప్తసంతానాలలో ఒకటిగా పుణ్యకార్యంగా భావించేవారు కాబట్టి పద్య కావ్యాలవలెనే ఈ యక్షగానాలను ధనవంతులు తమ పేర అంకితంగా వ్రాయించుకొని తమ గ్రామనామాలను ఈ దేశి రూపక సాహిత్యంలో శాశ్వతం చేసుకున్నారు జయదేవ కవి అష్టపదులకు, త్యాగరాజు మొ॥ వాగ్గేయకారుల కీర్తనలకు, పాట చివరి పాదంలో కవి నామ ముద్ర ఉన్నట్లుగానే, ఈ యక్షగాన కవులు తమ పేర్లతో పాటుగా కృతిపతుల గ్రామ నామాల దైవాల పేర్లను ప్రతి గేయం చివర పేర్కొన్నారు

ఈ యక్షగాన ప్రదర్శనలకు నాడు ఇంత ఆదరం లభించడానికి మరో ప్రముఖ కారణం ఆ కాలం ఇదే నాటి ప్రధాన ప్రజావినోద కాలక్షేపసాధనం హరికథ, పురాణశ్రవణం, తోలుబొమ్మలాట, దొమ్మరాట, యక్షగానం ఇవే నాటి కాలక్షేప కళారూపాలు వీనిలో మొదటి రెండు విద్యావంతుల ఆదరం పొందేవి దొమ్మరాటలు చిన్నపాటి సర్కస్ విద్యలు తోలు బొమ్మలాటలు కించిద్భేదంతో యక్షగానాలే యక్షగానాలు నటులు ప్రదర్శిస్తే, తోలుబొమ్మలాటలు గాయనీ గాయకులు తెరచాటున పాడుతూ తెరముందు బొమ్మల దారాలను చేతివేళ్ళ ద్వారా కదిలిస్తూ నటింపజేస్తారు

ఈ జిల్లాలో సుమారు 1940 వరకు సినీహాళ్ళు చలనచిత్ర ప్రదర్శనలు జిల్లా కేంద్రంలోనే లేవు తాలూకా ప్రాంతాలకు 1950 తర్వాతే వాని విస్తరణ మారుమూల గ్రామాలకు అదీలేదు ఈ జిల్లాకు రేడియో వచ్చింది 1950 తర్వాతనే టీ వి 1970 తర్వాత కాబట్టి 1950కి పూర్వం యక్షగానాలు గ్రామీణులకు ప్రధాన వినోద కాలక్షేప సాధనంగా ఉండేవి అనటం సత్యాంశం అందుకే ఆ కాలంలో యక్షగానాల రచనలు ప్రదర్శనలు గ్రంథప్రచురణలు అధికమైనాయి ఈ జిల్లా యక్షగానాల కవుల రచనలను ముద్రిత సాహిత్యం ఒక భాగంగా, అముద్రిత అలభ్య యక్షగాన సాహిత్యకవుల పరిచయం రెండవ భాగంగా ఇక్కడ చూపబడుతున్నవి

**ముద్రిత యక్షగాన - వీధి నాటక సాహిత్యం కవులు**

1 అయ్యావారు వేంకట నరసయ్య పంతులు బూరుగుపల్లి

2 ధపూరి సత్యనారాయణాచార్యులు కోట్ల, నరసింహుల పల్లె

3 భట్టాంజనేయ కవి మోరెపల్లి,

4 భట్టు లక్ష్మయ్య నాచుపల్లి

5 పులికాంత గంగాధరయ్య కథలాపురం

6 ఎక్కలదేవి లక్ష్మణభాగవతార్ - కొరుట్ల

7 గాలిపల్లి సుబ్బయ్యచారి - కురిక్యాల

8 తిరునగరి నరసింహస్వామి రాయికల్

**అలబ్ధగ్రంథ యక్షగాన సాహిత్యం - కవులు**

1 నల్లగొండ రాజయ్య - కాళేశ్వరం

2 ఎఱ్ఱమరాజు మూర్తిరాజు కవి గర్జెపల్లి

3 సిద్ధప్ప వరకవి గుండారెడ్డి పల్లి

4 నారంభట్ల దుంపెటాద్రి దుంపెట

5 కాసు సింగమరాజు కోనేరుపల్లి
6 సాధనాపరులు లక్ష్మణస్వామి వల్భాపురం
7 నీలకంఠం లక్ష్మణరాజు మల్యాల
8 దాసరి గంగారాం కొరుట్ల

## యక్షగాన వీధినాటక ముద్రిత సాహిత్యం

### 1 అయ్యవారు వేంకటనరసయ్య పంతులు - బూరుగుపల్లి 20 శతాబ్ది పూర్వార్ధం

వేంకట నరసయ్య గారు ఆయన తమ్ముడు వేంకటయ్యగారు ఇద్దరూ నటులు, కవులు వీరి స్వగ్రామం గంగాధర వేములవాడ మార్గంలోని బోయినపల్లికి సమీపంలోని బూరుగుపల్లి వీరు చాత్తాద వైష్ణవులు పెరంబుదూరు వంశం వారు [1] కవి తండ్రి వేంకట నృసింహం మతగురువు పరవస్తు శ్రీనివాసాచార్యులు [2]

వీరికి ఒక నాటకం జట్టు ఉండేది వివిధ గ్రామాలలో వీధి నాటక ప్రదర్శన లిస్తూండేవారు నాటక కళను ఒక వృత్తిగా చేపట్టి దానితో తామేకాక మరికొందరు నటులకు జీవనోపాధిని కల్పించారు నటులుగా ఔత్సాహికులైన అన్ని కులాల వారు చేరినారు స్త్రీ పాత్రలను సైతం పురుషులే పోషించడం నాటి ప్రత్యేకత ప్రతి నటునికి ఆటపాటలలో ప్రావీణ్యం ఉండేది అలాంటి వారే రాణించేవారు స్ఫురద్రూపంతో పాటు చక్కని గాత్రం ఉండడం నాటి నటులకు తప్పనిసరి తొలితరం మన తెలుగు సినిమా నటీనటుల్లో ఎక్కువభాగం స్టేజీనటులు చక్కని గాయకులు అనేది గమనార్హం

అయ్యగారు వేంకటనర్సయ్య సోదరుల పుస్తకాలను కొన్నింటికి యక్షగానాలని ముద్రించినా ఇవన్నీ స్వదేశి నాటకాలే వీరి రచనలు ఇరువది వరకున్నాయి అవన్నీ సికింద్రాబాద్ కొండా శంకరయ్య అండ్ సన్స్, మల్లికార్జున పబ్లికేషన్స్ మొదలగు ప్రముఖ సంస్థలు అచ్చేశాయి ఈ యేబదరువదేండ్లుగా అవి అమ్మబడుతున్నాయి వీరి రచనలు ఇవి

1 ద్రౌపదీ స్వయంవరం 2 సుగుణావతి 3 శ్రీకృష్ణ లీలలు 4 మార్కండేయో పాఖ్యానము 5 సుందరకాండ 6 రుక్మాంగద 7 కనకతార 8 సత్యహరిశ్చంద్ర 9 బభ్రువాహన 10 కుచేలోపాఖ్యానము 11 నలదమయంతి 12 సభాపర్వము 13 డాంగేయోపాఖ్యానము 14 కిష్కింధకాండ 15 కుశలవ 16 భావనాఋషి చరిత్ర 17 శ్రీకృష్ణతులాభారము మొ॥నవి

వీరి నాటకాలలో కృష్ణలీలలు శుక్ల 1928 సం లో సుగుణావతి అంగీరస 1931లో మార్కండేయ యువ 1934లో విరచితమైనట్లు కవి వాటి చివరి పద్యాల్లో తెలుపుకున్నారు చాలా నాటకాల్లో రచనా కాలం తెలుపలేదు కృష్ణలీలలు నాటకంలో కవి స్వీయ పరిచయ సీస పద్యాన్ని వ్రాసుకున్నారు తర్వాతి నాటకాల్లో తమ పేరు తప్ప ఇతర వివరాల జోలికి పోలేదు వీరి నాటకాలకు అంక విభజన లేదు సుగుణావతి - గోపాలరావుపేట , కృష్ణలీలలు మర్లప్యాట, మార్కండేయ గరిశెకుర్తి, కనకతార చౌలమద్ది, శ్రీకృష్ణ తులాభారము స్తంభంపల్లి, స్వదేశీ సుందరకాండ తక్కళ్ళపల్లి, డాంగేయోపాఖ్యానము - మన్నాజిపురం నిజామాబాద్ జిల్లా, గ్రామ పెద్దలు కళాప్రియులు తమ గ్రామాల పేర చెప్పించుకున్నారు జగిత్యాల, మెట్‌పల్లి, సిరిసిల్ల, ఆర్మూర్ ప్రాంతాల్లో వీరి నాటక ప్రదర్శనలు జరిగాయి అన వచ్చు వీరి కవనశైలికి కొన్ని ఉదాహరణలు చూపబడుచున్నవి

సాహసమొప్ప దీనులను సాకుట మేలగు గాని ఇట్లు సం
దేహము నొంది స్వాశ్రితు యుధిష్ఠర భూప విడంగ జెల్లునే
బాహు బలాఢ్యులయ్యునిల పాండవులే యభయంబు నిచ్చియున్

---

1 స్వదేశీ సుగుణావతి నాటక గద్య 1989 - పుట 88, 2 కృష్ణలీలలు నాటకము 1988 పుట 1
3 సుందరాకాండ నాటకముద్రణ 1977 పుట 40
4 కనకతార నాటకము - 1983 పుట 42
5 మార్కండేయో పాఖ్యానము - 1988, పుట 8

శ్రీహరి భీతి వీడిరని ఛీ। యపకీర్తి దొలంగ శక్యమే (డాంగేయ 1988 పు 60)

ఇది డాంగేయోపాఖ్యానంలో నారదుడు ధర్మరాజుకు చెప్పిన హితవ్యాకం

శ్రీకృష్ణ తులాభారములో సత్యభామ పతిని నిందించుట। క్రింది పద్యం

గీ గీచిన గీటు దాటనని కేవలమున్ భవదీయ ప్రేమమున్
యాచన జేసితందు దగ నాధృతి జూపుచు పల్కినావు నీ
సూచన నమ్మి మోసగతి పోయితి నీగతి హాస్యపాత్రనై
దాచగ నేలనింక నిను తప్పు గదా ఇది విశ్వసించుటల్ (1983 పు 50)

పదాల వికృతి మాత్రమే కాక పాత్ర పోషణలోనూ ఔచిత్యాన్ని మరచి రసపోషణ కావించుటకు ఉదాహరణగా సుందరకాండలో మండోదరి రావణుల సంభాషణ ఘట్టాన్ని చూడవచ్చు

"మత్తకోకిల ఏమి యీ చెబుబుద్ధి నీకిపుడేల బుట్టెను రావణా
భూమిజా పతివ్రతంచును పూనితెల్వవె రావణా
కామ మోహిత చిత్త నీకిది కాదు ధర్మము రావణా
నీ మదిన్గల వాంఛ దీర్చగ నేను లేనటె రావణా

(మండోదరి తనలో) "ఆహా ఏమి వీని దుర్వ్యవసాయము ఇట్టి దుర్మార్గునకు నా తండ్రి యగు మయుండు నన్నిచ్చినదే తప్పు ఇచ్చినను వానితో సహవాసంబు జేయుటకు నేను వచ్చిందే ముప్పు "[3]

వీరు సందర్భోచితంగా గ్రామ్య భాషను సైతం ప్రయోగించారు కనకతారలో దొంగ మాటలు చూడండి "అమ్మోరు దయవలన ఈ కన్నెపడుచు నాకు చిక్కింది కానీ యియ్యాల్ల శుక్రవారముంది గాన మాయమ్మోరుకు దీన్ని బలిఇత్తం అబ్బ ఇదేమేడుత్తది యేమేడుత్తది వూకోయె వూకోయె చెవులు ఉడిగెలు బడుత్తు యీనాడేమో నిలబడితిని [4]

వీరి కవితా సారళ్యానికి నిదర్శనంగా ఒక పద్యం మార్కండేయలో వ్యాసుని మృకండుడు ఆహ్వానిందటం

కం మీ రాకడ ముదమాయెను, మీరా కడ మాకు శుభము మేలౌనిపుడున్
కారుణ్యము నిటు వచ్చిన కారణమెట్టిదొ వచింపగలుగు మహాత్మా ![5]

వీరి దర్వులు జన మనోరంజకాలు

తాళ జాలమె యశోదా ! నీ ! తనయునితో ధర మీదా
కేళికి నను రమ్మనెనే !నీ ! యేలికను యేననెనే ! వో
గోల నిన్ను విడననెనే ! యీ ! బాలున కిటుల దగునే [6]

సభావర్ణన దర్వు రూపకతాళం

ఎంతో చిత్రమూ భళి యీ సభాంతరంగమూ
ఎంతగ బ్రహ్మక్షత్రియ వీరులు వైశ్యులు శూద్రులు
సంతోషంబున నిచ్చట సభ గావించి యున్నారు ॥ఎం॥
పండితులును కవి గాయక భాగవతోత్తములు సుజన
మండలి యుక్తము యీ సభ నుండిరి బలుమోదంబున ॥ఎం॥

యతి ప్రాసలు ప్రాసయతులు వీరి గేయాలకు శోభను చేకూర్చాయి ఓ నలుబదేండ్ల కాలం వీధి నాటక రచన, ప్రదర్శనలతో కాలం గడిపిన కళాసాహిత్యారాధకులు బూరుగుపల్లి కవి సోదరులు వేంకటనర్సయ్య పంతులు 1950, చిన్న వేంకటయ్య పంతులు 1960 సుమారుగా వృద్ధాప్యంలో కీర్తి శేషులైనారని వీరి నాటకాల్లో నటించిన దండు రంగయ్య గారు అన్నారు [7]

2 భట్టాంజనేయ కవి - మోరేపల్లి, తా॥ జగిత్యాల 20వ శతాబ్ది పూర్వార్థం

అంజనేయ కవి తండ్రి నరసింహరాజు వారిది భోజరాజాన్వయ భట్టు కులం జగిత్యాల తాలూకాలోని మోరేపల్లి స్వగ్రామం[1] కవి శ్రీరామభక్తుడు, మహాపండితుడు, గుణవంతుడు అని స్వయంగా తమ నాటకంలో నట సూత్రధారుల ద్వారా చెప్పించుకున్నారు (బభృవాహన 6వ పుట) అంజనేయకవి యక్షగానాలు రచించలేదు వీరివి వీధి నాటకాలు జటిల పద ప్రయోగం కావించే ప్రౌఢ కవిగా అంజనేయులు గారి పేరు నాడు బహుళ ప్రచారంలో ఉండేది

**ఈ కవి రచనలు .** 1 బభృవాహన నాటకము[2] 2 ద్రౌపదీ స్వయంవరం[3] 3 శ్రీరామ మహోదయము[4] 4 ప్రభావతీ ప్రద్యుమ్నము 5 మయూరధ్వజ 6 రుక్మిణీ కల్యాణము 7 యయాతి చరిత్ర 8 రామదాసు 9 సైంధవ పరాభవము 10 ఉషాకన్య 11 రుక్మాంగద 12 శ్రీకృష్ణగారడి మొదలగు 17 నాటకాలు రచించారు

వీరి నాటకాలలో బభృవాహన చాలా పేరుపొందింది ఇది జైమిని భారతంలోని ధర్మజ హయమేధ గాధ యాగాశ్వ సంరక్షణకు ససైన్యంగా వెళ్ళిన అర్జునుడు దానిని బంధించిన బభృ వాహనునితో యుద్ధం చేస్తాడు అతడు రాణి చిత్రాంగద కుమారుడు అర్జును పుత్రుడే ఇందులో బభృవాహనుని పితృభక్తి వీరత్వంచక్కగా పోషింపబడినవి కర్ణపుత్రుడైన వృషకేతనుని వీర మరణానికి అర్జునుని విలాపం కరుణరస భరితం అర్జునుడు తన సతీసుతుల కలుసుకోవటంతో కధ సుఖాంతం కవి కవన శైలి చూడండి కథానాయకుడగు అర్జునుని వర్ణన 8వ పుట,

హరుని జయించి పాశుపత మంది పురంధరు పిరమెక్కి దు
ష్కరులగు కాలకేయముఖ కర్బరులం బరిమార్చి శూర భీ
ష్మ రవిజ ముఖ్యయోధులను సంగర మందు వధించి మించి ఈ
భరత మహీతలంబు పరిపాలన జేయునుచున్న పార్థుడన్

ఇది మహాభారత యుద్ధానంతర వర్ణన కవి కథా పరిజ్ఞానం స్పష్టం రవిజుడు - కర్ణుడు అంతమంది కురువీరులు భారత సంగ్రామమున మడియగా కేవలం భీష్మకర్ణ వీరద్వయాన్ని ప్రత్యేకంగా పేర్కొనడటం వారు మహావీరులనే కాక అర్జునుని చేత నిహతులైనవారు పార్థుడు మహీపాలకుడనటం ధర్మరాజు పట్టాభిషిక్తుడైనా జానపద కవుల దృష్టిలో పాండవులైదుగురు చక్రవర్తులే

కవి ఎడనెడ కొన్ని విశేష వృత్తాలను కూడా రచించారు 68వ పుట కవిరాజ విరాజితం

భరరల మంటలు భగ్గున వెళ్లినభంబున కంటక త్వత్కర భీ
కర నిశితంబులు గాలుచు కంఠము గ్రక్కున ద్రుంచ మహోగ్రమునన్
సరసర సర్వదిశల్ బెగడొందగ చక్కగ వచ్చెను ప్రాద్భుత మ
చ్చర వలమున్ సుర సన్నుత మిద్ది నిశాకర వంశజ కృష్ణ సఖా

దర్వు (పాట) ఆదితాళం - (రాగం చూపలేదు) పుట 52

వందనముల్ జనకా ! సంక్రందన నందన యిందుముఖా ॥వం॥

---

6 శ్రీకృష్ణలీలలు 1988, పుట 62

7 రంగయ్యగారు 1981లో బోయినపల్లి బస్టాండు దగ్గర వారి హోటల్లో కలిసి ముచ్చటించారు

1 బభ్రువాహన నాటకాంత గద్య పుట 28, శ్రీమల్లికార్జున పబ్లికేషన్స్ హైద్రాబాద్, 1976 ముద్రణ

2 ఈ నాటకాన్ని 'కరీంనగర్ మండల చరిత్ర' 1981 పుట 16లో గ స రాజు గారు పేర్కొన్నారు

3 ఈ రెండు నాటకాలు, నం 1, 2, 'కరీంగనర్ జిల్లా రచయితల చరిత్ర' 81, పు లోనివి

4 ఈ మూడవ నాటకంనుండి మిగతా 16 నాటకాల పేర్లు గోధూరు సుందరాచార్యులు 1992 ఏప్రిల్లో కోరుట్లలో తెలిపారు సుందరయ్యగారు నటులు అంజనేయులుగారి నాటకాలను సొంత నాటక సమాజంలో ప్రక్కజిల్లాల్లో కూడా ప్రదర్శనలిచ్చినారు

యిందు మీరలేతెంచుటచే మా డెందంబులు నుల్లసిల్లె పరమా
నంద వార్ధి దేలు చున్నమో యర । విందవైరి వంశ ప్రదీపా ॥వం॥
శారదాబ్జ చంద్రికాంబురుహడిం । డీర కాప్య నగ సురఘోటక నీ ।
హార హీర హరి సన్నిభయశ్వత । చ్చారు పాద నీరేజములకు ॥వం॥

పురకు 'పౌరి' అని, కృతి చేయుకు కృతి యిందు అని కొన్ని విలక్షణ పద ప్రయోగాలు తప్ప కవి తత్సమ పదాల నేర్పుగా బహుళంగా ప్రయోగించారు కథ ఇతిహాస కాలానిదైనా 'లాంగూర్ ఖాన్' అని ఒక హాస్య సైనిక పాత్రను ప్రవేశపెట్టడం సమకాలీన ఉర్దూ భాషా పాలకుల ప్రభావం

ఇది యక్షగాన వీధి భాగోతాలకు అనంతర కాలంలో వచ్చిన వీధి నాటకం మోరేపల్లి అంజనేయకవి విరచిత రూపకాలన్నే వీధినాటకాలే

3 **భట్టు లక్ష్మయ్య - నాచుపల్లి, మండలం - మల్యాల** కాలం 1880 1940 సుమారుగా

నీలకంఠం లక్ష్మణరాజు కవి గారి స్వస్థలం నాచుపల్లి ఇది జగిత్యాల తాలూకాలో కొండగట్టుకు సమీప గ్రామం వీరు నిరోష్ఠ్య శతకం రచించారట అది అలభ్యం జ్యోతిష్య పంచాంగ శాస్త్రముల సాంగోపాంగముగా నెరిగినవారు [1] వీరు 1940 సుమారుగా కీర్తిశేషులు

"ద్రౌపదీ స్వయం వరము" వీరి ఏకైక వీధి నాటకం [2]

ఈ నాటకంలోని రెండవ పద్యంలోని వివరాల బట్టి కవి విష్ణుభక్తుడు వీరి తండ్రి వెంకట నరసింహరాజు పరవస్తు శ్రీనివాసాచార్యులు దీక్షాగురువు [3] ఇంటి పేరు ఈ నాటకంలో ఎక్కడా పేర్కొనబడలేదు నాటక రచనా సంవత్సరం కూడా లేదు కొడిమ్యాల సమీపంలోని పోతవరం గ్రామాధికారులైన జోగినపల్లి వెలమవారు కీర్తి కాంక్షతో "ఈ నాటకమును" నాచుపల్లి భట్టు లక్ష్మణరాజుచే రచింపజేసి బూరుగుపల్లి వేంకట నృసింహయ్య గారి ప్రియానుజుండగు వేంకటాయ్య గారిచే నిర్దోషంబుగ పరిశోధింపజేసినారుఅని పేర్కొన్నారు [4]

భారత సభాపర్వంలోని మూలకథను అనుసరించే ఈ నాటక రచన సాగింది ఎనభై పుటల ఈ నాటకంలో అంకవిభజన లేదు పద్యాలు వచనాలు దర్వులు కీర్తనలు సంవాదాలు కందార్థాలు కల ఈ రూపకం పండిత కవి రచన కాక వరకవితగానే ఉంది

కవి రచనా పరిచయానికి ఒక పద్యం - 69వ పుట నుంచి,

సీ శ్రీకర రాజ రాజేంద్రులందరికిని, ద్రుపదుండు జేయు విన్నపములివియె
మత్స్య యంత్రమును నిర్మాణించి యున్నాము, జలమున ప్రతిరూపములను జూచి
పురుషార్థమున ధన్వు సరగున ధరి (యి) ంచి నొకపరి వేయు వేటునకు దాని
తెగవేయు నాతని మగతనంబుకు మెచ్చి । యిచ్చెద పుత్రు (త్రి) ని హెచ్చరికతో
తే గీ పూర్ణ చంద్రుని సరియన బోలు మోము, చక్కదనమెన్న విధికైన శక్యమగునె
యిట్టి కన్యకనిచ్చి పెంపెక్కు మీరు, కోరినంత ధనంబిత్తు కూరిమినను

గేయాలకు రాగ తాళాలు సూచింపబడినవి ఒక కీర్తన భాగం పుట 3

పాండురాజాత్మజులము । ధర్మజ భీమార్జున నకుల సహదేవ ॥ ॥పాండు॥
నిండు ధర్మమార్గమె శ్రేష్ఠంబని నిక్కంబుగ నెంచీ । సుగుణోద్దండత మది గాంచీ ।
చండతరంబగు శత్రుడయిన మా । యండ జేరి శరణన్న బ్రోచెదము

1 'కరీంనగర్ జిల్లా రచయితం చరిత్ర' - పుట 140
2 శ్రీమల్లికార్జున పబ్లికేషన్స్ - హైదరాబాద్ - 1988
3 'భట్టు లక్ష్మయ్యగారి ద్రౌపదీ స్వయంవర నాటకము' పుట 5, 4 ఇన్నర్ టైటిల్

శబ్ద సాధుత్వ విషయం వదలితే ఈ కవి పాటలు మాటలు శైలీ మనోరంజకంగా ఉన్నాయి

**4 ధపూరి సత్యనారాయణాచార్య - కోట్ల నర్సింహులపల్లె**

సత్యనారాయణాచార్యులు గోలకొండ సంచిక కెక్కినవి (నం 38) ఇంతకుముందు పద్య కావ్య కవులలో వీరి పరిచయం చేయబడింది వీరు లాక్షణిక కవి కావ్యం , హరికథ, యక్షగానం, వీధినాటకం, ప్రక్రియల్లో పలు రచనలు చేశారు శ్రీరామధర్మ స్వరూప వైభవము - అను పద్యకావ్యము, నిష్కామయోగి నవల కాక వీరు రచించిన నాటకాలు 10కి పైగా ఉన్నాయి ఇవి యక్షగానాలు స్వదేశీ నాటకాలు అని రెండు విధాలు వాటి వివరాలివి

**యక్షగానాలు** 1 చిత్రాంగద (అముద్రితం) 2 కీర్తిమాలిని పరిణయము (అసంపూర్ణము)

**వీధినాటకాలు** 1 రామాశ్యమేధము ముద్రితము, 2 అరిందమన భూపాలీయము (ఆముద్రితం), 3 భల్లాణ సత్యవ్రతము (ముద్రితము) 4 సంగీత పుత్రకామేష్టి (ముద్రితము), 5 ధాన్యమాలి (ముద్రితము), 6 శ్రీ వీరబ్రహ్మాభ్యుదయము (అసం), 7 శ్రీ సీతారామ జననము (ముద్రితం), 8 అంబరీషో పాఖ్యానము (ముద్రితం)

శ్రీరామ ధర్మ స్వరూప వైభవ కావ్యావతారికలో కవి తాను 3 రూపకములు,11 వీధినాటకములు 4 యక్షగానాలు రచించామన్నారు రూపకాలేవో తెలియదు కాని 2 వీధి భాగోతాలు 8 వీధి నాటకాలు పైవి 2 యక్షగానాలు 3 నాటకాలు అలభ్యాలు వాటి పేర్లు కూడా తెలియవు 10 హరికథలు రచించామన్నారు కాని వానిలో ఏ ఒక్కటీ లభించలేదు

**వీధి నాటకాల వివరాలు** అభినవ రామాశ్వమేధ నాటక ముద్రణ శుక్ల - 1920లో పింగళి లింబాద్రిరెడ్డి నెమిలి కొండ కరీంనగర్ జిల్లా గారు ప్రచురించారు దాని 'విభవ సం॥'లో పీఠికలో రచయిత తాము అంతకుముందు చిత్రాంగదా పరిణయ యక్షగానం వ్రాసి ప్రదర్శించినట్లు తెలిపారు అలభ్యంఅది ఆముద్రితం రామాశ్వమేధ వీధి నాటకం రెండవ కృతి ఇది కవి ముద్రిత పుస్తకాలలో మొదటిది నందగిరి సమీప గ్రామమైన బూరుగుపల్లి పై అంకితం కలది

రెండవ యక్షగానం 'కీర్తి మానీ పరిణయము' రాఘంపేట వైశ్యుల కోరికగా రచించబడింది అసంపూర్ణ లిఖిత ప్రతి దొరికింది ఇది కవి చిత్తు ప్రతో వ్రాసినదింతేనో తెలియదు భక్త సిరియాళ, కన్యకాపరమేశ్వరి వేరు ఈ కథ కల్పితం కావాలి అందలి ఒక కీర్తన

యేమని వర్ణింతు ఈ మహానగరము నేమని పొగడుదు హా
శ్రీ మహితమును విశేష వైభవము లే మందిరమును వీక్షించినను
ఆకాశంబునంటు సౌధంబులు ప్రాకటమగు మణిగోపురములు

**అరిందమ భూపాలీయము** 1930లో వ్రాసినా 67లో రావు రూపుల సిద్ధిపేట గ్రామ పెరిక కాపు రైతు పటేండ్ల కోరికగా తిరిగి పెంచి రాశారట ఇది పెరికవారి చరిత్ర వారు కార్తవీర్యార్జునుని సంతతి, అని, 'పేరుకల' పెరిక అని కవి అన్వయించారు (పరశురామ విజయంలో ఇదే పదాన్ని చెలుపూరు రాజయ్య కవి పరశురాముని భయానికి పిరికిన నగరాలు వదలి వెళ్ళి మారురూపాలతో వేరు వృత్తులతో జీవించిన క్షత్రియులే పెరికలన్నారు 1953లో పెఠిక = గోనెసంచి వీరు పెరిక శెట్లు ఎడ్ల పై జనుప సంచుల్లో ఉప్పు మొ॥ వస్తువులు తెచ్చి అమ్మేవారట పూర్వంలో మొదట బేపారులుగా పశుపోషకులుగా, తర్వాత రైతులుగా స్థిరపడ్డారు శూద్రజాతిలో పేర్కొనబడినా, వీరి వివాహాలలో మంగళ సూత్రం ఉంది కాని పుస్తె లేదు ఐరేని కుండలు లేవు శస్త్రపూజ ఉంది శైవులు గోత్రాలు శస్త్రశాల మల్లు, కటకం సిరిమల్లు, ఉంద్రు గొండమల్లు, అని వీరుల పరంగా ఉన్నాయి ఇంటిపేళల్లో అరసు = లక్కరుసు, రాజు = పోతరాజు, నాయుడు = ముట్నేని, శెట్టి = మేడిశెట్టి మొ వి ఉన్నాయి )

పరశురాముని సోదరి కాత్యాయనిని వీరగౌరి అని రాజయ్యగారు భోగవతీపురం సిద్ధభూపతి కుమారులు అయిదుగురు పెళ్ళి చేసుకోవటం ఇందలి కథ వీరి కులాచారాలను కవి చక్కగా గుర్తించారు వారి ఏ పుస్తకానికి లేని విధంగా అయిదు పుటల పీఠిక వ్రాశారు ఈ నాటకం అయిదు అంకాలు నాటకం అముద్రితం

వీర బ్రహ్మేంద్రస్వామి ఇది విశ్వబ్రాహ్మణ గురువు బ్రహ్మంగారి జీవిత చరిత్ర రామడుగులో విశ్వబ్రాహ్మణ శిల్పులు ప్రతి ఏటా ఈ నాటకాన్ని ప్రదర్శిస్తారు కవిగారి కళామిత్రులు బ్రహ్మంపాత్రధారి అయిన లక్ష్మీనర్సయ్య గారి కోరికగా దీనిని రచించారు అసంపూర్ణం నాందిలో రెండవ పద్యం

ధరణి నభంబు గాలి జల తత్త్వము వహ్నిరవీందు తారకల్
హరి పరమేష్ఠి శంకరులహర్నిశలున్ విబుధాదులున్ మహ
త్తర సవనాది కర్మల విధానములన్నియు లేనివేళ సు
స్థిరమయి నొప్పు బ్రహ్మము నుతింతు శుభోన్నతికై మనంబునన్

భల్లాణ చరిత్ర గౌడరాజు కథ శివభక్తి పరీక్ష భక్తి సిరియాళలో శిశు హత్య వలె ఇందులో స్త్రీ శీల పరీక్ష ప్రధానంగా ఉంది ముద్రితం తేదీ లేదు కాని, 1975లో ముద్రణ [1] అయిదు అంకాలు తిరిగి రంగాలుగా విభజింపబడ్డాయి సీతారామ జననము 5 అంకాలు గోపాలరావుపేట రెడ్డి వారికి అంకితం కథ సీతారామకల్యాణం వరకున్నది ముద్రితం తేదీ లేదు సంగీత పుత్రకామేష్టి ఇదీ వీధి నాటకమే అయిదంకాలు ఇది కుక్కల గూడూరు వారి పేర ప్రచురితం కథ శ్రీరామ జననం ధాన్యమాలి సీతాదేవి పూర్వజన్మ వృతాంతం నామపల్లి రెడ్లు దీనిని కృతి పుచ్చుకున్నారు ముద్రితం అంబరీషోపాఖ్యానము మూలకథ భాగవతం అష్టమాశ్వాసంలోనిది ఇది కవి తమ తొమ్మిదవ నాటకమని భాగవత కథను విస్తరించి వ్రాసినట్లు పీఠికలో చెప్పుకున్నారు గుళ్ళకోట ఎల్లాపు గంధె వారి కోరికగా వ్రాశారు

**కవితా పరిచయం** వీరి రామాశ్వమేధం భవభూతి ఉత్తర రామచరితను పోలి ఉంది ఇది అయిదంకాల వీధి నాటకం సీతాపరిత్యాగానికి కారణంగా అ వాల్మీకమైన రజకనింద, ఇందులో పేర్కొనబడింది కాని ఆ విషయ ప్రస్తావన తప్ప పాత్రలు లేవు రామాజ్ఞ చేత లక్ష్మణుడు సీతాదేవిని వనవాసంలో విడిచి కారణమును వినిపింప ఆయమ్మ విలాప పద్యమిది ద్వితీయాంకము పుట 23

సీ బాహుబలంబుచే పశుపతి చాపంబు ధరగూల్చె నా నిమిత్తంబుగా దె
స్వర్ణ కురంగ వేషము దాల్చెనా దైత్యు దండించె నా నిమిత్తంబు గాదె
వార్ధి శైలములచే బంధించి కపి చమూ దాటించె నా నిమిత్తంబుగాదె
సంగ్రామమున రాక్షసాధీశు పంక్తి కంధరు జంపె నా నిమిత్తంబు గాదె

గీ అట్టి శ్రీరామ భద్రుండు యమల సుగుణ, రాశి నాకొరకయ్యె ధరా తలమున
భూరిశ్రమనొందె కారుణ్య పూరితమున ,అట్టి కరుణా రసంబేడ నరిగె నొక్కొ

యుద్ధ సంవాద కీర్తన పద్యాలు తృతీయ రంగం పు 62, 63

లక్ష్మణుడు హయమును బట్టి తిరే దెలియక మాయనుజుని గూల్చిన వారల్।
హయంబు వీడుడు మీయపరాధంబులనిన క్షమించెదము ॥

కుశుడు మీ సహోదరుడు మడియుట గని మీరేల వచ్చినారు
ఈ సమయంబున వాని రీతి మిము జేనెదమని దలచండి ॥

---

1 రామడుగు గౌడులు ముద్రించారు వారికి ఈ నాటకం బ్రహ్మం పాత్రధారి రామడుగు లక్ష్మీనర్సయ్య పంతులు వ్రాతప్రతిలో నేర్పడం నేను చూశాను 1975లో

భరతుడు పారులమో వీరులమో, ధీరులమోసంగరమున దెలియు వృథా వా
చారూఢత్వం బేలను, పోరాటంబునకు నిలుడు భూమీస్థలినన్

ఈ నాటకం దర్వులు కీర్తనలు చిన్నవి పూర్వపద్య కావ్యాలలో వలె ఇందలి పద్యాలు హృద్యాలు సీతాదేవి పూర్వజన్మ వృత్తాంతము వర్ణింపబడింది రాముని పాత్ర స్వయం కృతాపరాధ పశ్చాత్తాప తప్త హృదయుడుగా తీర్చిదిద్దబడింది సీతాదేవి పాత్ర పోషణ కడు రమణీయం, కరుణరస భరితం సీతాదేవి భూ ప్రవేశం లేదు శ్రీరాముడు భార్యాపుత్రులను తోడ్కొని అయోధ్యానగరానికి వెళ్ళుటతో కథ సుఖాంతం కోట్ల సత్యనారాయణ కవి గారి నాటకాలు సలక్షణ దృశ్యకావ్యాలు

5 **పులికాంత గంగాధరయ్య - కథలాపురం తా॥ మెటుపల్లి,** జననం 1892 మృతి 1977లో

పులికాంత గంగాధరయ్య వీరశైవ మత జంగమకవి నటుడు, హరికథకుడు, పండితకవి అయిన గంగాధరయ్య గారి రచనలు అధిక జనాదరణ పొందాయి వీరిదో నాటక బృందం ఉండేది గంగాధరయ్య నాయక పాత్రధారిగా పలుగ్రామాల్లో నాటకాలు ప్రదర్శించారు కవి గారి తమ్ములు నడిపి రాజయ్య, చిన్నరాజయ్య అన్నగారి నాటకాల్లో నటించేవారు పెద్దరాజయ్య కవి పలు కీర్తనలు, హారతులు, శ్రీరామానుజ శతకాది పద్యకవితలేకాక గంగాధరయ్య రచించి ప్రదర్శించిన స్వదేశీ నాటకాలు దశాధికం అవి అన్నీ భాగ్యనగర ప్రముఖ ప్రచురణ సంస్థలచే ముద్రింపబడినాయి [1] గంగాధరయ్య నాటకాలు ఇవి

1 గయోపాఖ్యానము, 2 భక్త అంబరీష, 3 కుశలవ, 4 భక్త రామదాసు, 5 లక్ష్మణా పరిణయము, 6 సీమంతినీ పరిణయము, 7 రుక్మిణీ కల్యాణము, 8 శివకుమార నాటకము, 9 కూకద మహారాజు చరిత్ర, 10 హంసధ్వజ నాటకము, 11 విరాట్ విశ్వబ్రహ్మం చరిత్ర, 12 చిరుతొండ నాటకము

వీటిలో కుశలవ దూళూరు పేర, రామదాసు నిజామాబాద్ జిల్లా ఆర్మూరు తాలూకాలోని మంథని గ్రామాంకితముగా చెప్పబడినవి గయోపాఖ్యాన గద్య మిట్లుంది

'శ్రీ మత్కథలాపురి గంగాధరాఖ్య కవివరేణ్య
ప్రణీతంబైన గయోపాఖ్యాన మందలి చతుర్థాంకము"

చిరుతొండ నాటకాంత గద్యలో కవి వంశ వివరాలు ఇట్లా ఉన్నాయి " వ్యాఘ్ర కాంతాన్వయ సాగరా మృత కరుండును, వీరశైవ మతోద్భవుండును, సిద్ధరామయ్య ప్రియశిష్యుడును, చెన్నవీరయ్య పౌత్రుండును, నాగయాఖ్యలింగ మాంబాగ్ర తనూభవుండును నగు గంగాధరాఖ్య కవి వరునిచే రచింపబడిన " పుట 96 ఇంటి పేరు పులికాంతను సంస్కృతీకరించి వ్యాఘ్రకాంత అన్నారు ఇట్లే బూరుగుపల్లి కవులు తమ గ్రామ నామాన్ని సంస్కృతంలో 'శాల్మలీపురి' అని మార్చి వ్రాసుకున్నారు ఇది సర్వధారి సంవత్సర ఫాల్గుణ మాసంలో అంటే 1948 49లో రచించబడింది బూర్గుపల్లి నాటకాలకు తర్వాతవి గంగాధరయ్య నాటకాలు

భక్త సిరియాళ తమిళ శివభక్తుని కథే ఈ చిరుతొండ నంబి కథ శ్రీనాథుని హరవిలాసంలోనూ ఈ కథ ఉంది కవి వీర శైవుడు కనుక పాల్కురికి సోమన ద్విపద కావ్యాలు చదివి ఉంటారు భక్త సిరియాళుని తండ్రి చిరుతొండ నంబి శివుడు మాయాజంగము వేషధారియై వచ్చి కోరగా అతడు తన

---

1 గంగాధరయ్య గారి పెద్దకొడుకు నాగేంద్రయ్య గారు కథలాపురంలో, తే 22 7-1990 నాడు తమ తండ్రి వివరాలు తెలుపడంతోపాటు వారి రచనలు చూపారు నాడు నాటకాంకితానికి 116 రూ నాటక ప్రదర్శనకు 25రు ఇచ్చేవారట పుస్తక ప్రచురణ కర్తలు రచయితకు 10 ఉచిత ప్రతులు తప్ప డబ్బేమి ఇవ్వలేదట

కొడుకును కోసి భార్యచే వండించి అతిథికి భోజనం పెట్టించి ముక్తిపొందిన కాంచీపుర వైశ్యుడు ఆ శివభక్త శిఖామణి వేదాంత భావాన్ని కవి వర్ణించిన వైనమిది పుట 10,

సీ ధీమంత వినర యీ దేహంబిలను పంచ భూతమయంబైన బుర్రకాయ
కడుప్రేమతో దీని కాపాడుదామన్న, శతవత్సరంబులు మితియు గలదు
తలిదండ్రి సఖిసుతుల్ ధనధాన్యముల మీది భ్రాంతిచే ఈ కాలమంత గడిపి
అంత్యమందునను నేయడవినో గిరులందొ, నీరమందో లేక నిలయమందొ

గీ తనువులో నుండి ప్రాణముల్ తరలు వెనుక,కాటికేగాని గొరగాదు గవ్వకైన
గాన నికముక్తి ఫలితంబు గాంచగోరి,జంగ మార్చన జేయు హెచ్చరికబొడమె

ఎదను కుదుపు భావాలే కాక 'కాపాడుదామన్న' వంటి వ్యావహారిక పదరూపాలతో పాటు అను మానమును యేల' భాండ నింపితి (77వ పుట) వంటి వ్యాకరణ దోషాలున్నాయి అయినా కవి కథా కథనం ప్రేక్షకుల నాకట్టుకునేలా ఉంది సిరియాళుని ఆత్మబలిదాన నిర్ణయవాక్యాలివి 76వ పుట

"తండ్రీ నీవిట్లారాట మొందక నిరాటంకముగ నన్నా శరణాగ్రణి కొసంగి నీ వుత్తమ పద్ధతి నిల్పు కొమ్ము సుకీర్తి వంతుడవు గమ్ము నాకోసరమెంత మాత్రము ధావంతము నొందవలదు నేనా హరునింజేర బోయెదను ఇందుకేమి సందేహము లేదు" వ్యావహారిక పదాలు గమనార్హం

కవి వీరశైవుడైనా శివకేశవ భేదము గణింపక ఉభయమత గాథల రసవత్తర నాటకాలుగా రచించి జనరంజకంగా ప్రదర్శించి రాణించినారు

### 6 ఎక్కలేదేవి లక్ష్మణ భాగవతార్ - కోరుట్ల జననం - 1914



లక్ష్మణ కవి గారిది సంగీత సాహిత్య నాట్యాది లలితకళలు, రాజకీయ సాంఘికసేవలు పెనవేసుకొనిన విశిష్ట జీవితం ఎనుబదేండ్ల వయస్సులో ఇప్పటికీ పద్మశాలి కులం పెద్దగా సాహిత్యారాధకునిగా సత్కాలక్షేపం చేసే నిత్యోత్సాహి వారి నాయనమ్మ తాతయ్య గారలు లక్ష్మమ్మ నరసింహులు జననీజనకులు లక్ష్మమ్మ లింబయ్యగారలు ఎక్కలదేవి గృహనామం పృధ్వీఋషి గోత్రం చేనేత కులవృత్తి వారిది పెద్ద కుటుంబం భార్య గంగమ్మ లక్ష్మణ గారికి సంతానం కలుగలేదు వీధి బడి తర్వాత శతావధాని కృష్ణమాచార్యుల శిష్యరికంలో సంస్కృతాంధ్రాల నభ్యసించారు బట్టలు నేస్తూ పాటలు పాడేవారు తమ ఇరువదవయేట స్థానిక యువకులతో ఒక నాటక సమాజాన్ని నెలకొల్పి అనేక పౌరాణిక సాంఘిక నాటకాలు ప్రదర్శించారు ఆయన నాయక పాత్ర ధారి రూపం గాత్రం అభినయం నటుడుగా లక్ష్మణ గారికి మంచి పేరుతెచ్చాయి అప్పుడు ప్రచారంలో ఉన్న మోరెపల్లి ఆంజనేయులు, బూర్గుపల్లి వేంకటనరసయ్య, కథలాపురం గంగాధరయ్య నాటకాలతో పాటు తాము స్వయంగా కొన్ని నాటకాలు రచించి ప్రదర్శించారు నటన రచనలతో పాటు వాస్తు జ్యోతిష్యాల నేర్చారు హరికథలు కూడా చెప్పి రాణించారు [1]

లక్ష్మణ గారి నాటకాలు [2]

1 నవీన కాంతామతి, 2 సత్యవిరోధము, 3 భక్త మార్కండేయ, 4 హరిశ్చంద్ర, 5 సుభద్రా కల్యాణము, 6 ఉషాపరిణయము, 7 ప్రజారాజ్యము, 8 రామాయణము (బుఱ్ఱకథ) 9 శ్రీ నింబాద్రి లక్ష్మీనరసింహ స్వామి భజన కీర్తనలు - 24 పుటలు 1965 ముద్రణ వీటిలో మొదటి రెండు, చివరి

---

1 ఈ వివరాలు 'శ్రీ ఎక్కలదేవి లక్ష్మణ గారి షష్టిపూర్తి సన్మాన సంచిక' 1975లోని డా॥ అందె వేంకటరాజం గారి వ్యాసంలోనివి పు 1, 2, 3

మూడు పుస్తకాలు మాత్రం ముద్రితం ఎక్కలదేవి లక్ష్మణగారి షష్టిపూర్తి సంచికలో డా॥ అందె వేంకటరాజం గారు 'సాహిత్యసేవ' వ్యాసంలో హరిశ్చంద్ర లేదు గృహస్తి దేవాంగోపాఖ్యానము[3] అదనంగా ఉన్నవి లక్ష్మణ కవి గారికి అవన్నీ ఇప్పుడు అర్ధ విస్మృతులు చివరి భజన కీర్తనలు ఎవరూ పేర్కొననిది అచ్చుప్రతి కవి ఇంటనే లభించింది

ఈ కవి సుభద్రా పరిణయం చేమకూర వేంకటకవి విజయవిలాస ప్రబంధాన్ని అనుసరించింది

వీరి దర్వులు పాటలు అంత్యానుప్రాసలతో లయబద్ధమైన పదాల విరుపులతో హొయలుగులుకుతున్నాయి అర్జునుడు ఉలూచినిచూచి

ఎవరి దానవే గుణ శీల । నా యెదుట నిల్వబడు టేల ? ॥ఎవ॥
ధవళ నేత్రి నీదు పేరు నూరును । భవనము జనని జనకులెవ్వరో న
న్నెవరు దెచ్చితిరిచటకి నాతో । వచియించు వేగ యింతి బాగ ॥ఎవ॥
అదే అర్జునుడు మరోచోట చిత్రాంగదతో -
సుదతి మిటారి మదను కటారి ఎదుటజేరు మొకసారి
నీ యధర సుధ నొసగు భూరి క్రోలెద నుత్కంఠతో నారి

పదాన్వయలో కాస్త తికమక వెనుకముందులు, వ్యావహారిక పద ప్రయోగం నాటి నాటక కవులకు సహజం

నవీన కాంతామతి నాటకము అంతకుముందు ఇతర కవులు రచించిన కాంతామతి నాటకాలు ఉన్నవి కనుక, దీనికి నవీన కాంతామతి అని పేరు పెట్టారు గుర్తింపు కోసం న్యూ ఉడిపి హోటల్ అన్నట్లు ఇది జానపదగాథ రాజుల కాలం నాటిది ఇందలి నాయిక పడిన కష్టాలు చూపిన సాహసాలు పతిని వశీకరించుకున్న తీరు ప్రేక్షకుల నాకట్టుకుంటాయి కథ కొంత వరకు నలదమయంతిని పోలి ఉంటుంది 'సుగుణవతి' 'స్త్రీ సాహసం' అనే స్టేజి నాటకాలు కూడా ఇంచుమించు ఇలాంటి ఇతివృత్తం కలవే

సాధారణంగా పూర్వ నాటకారంభాల్లో నటీ సూత్రధారుల సంభాషణలుంటాయి ఈ నాటకంలో కవి నటిని మోహిని అనే పేరుతో ప్రవేశ పెట్టారు మోహిని ప్రవేశ దర్వు - పు 2

మార సమాన శరీరా । జో । హారులిదిగొనువిచార
కోరికతో నను స్వామీ । సభ । జేర బిలచు పని యేమి
మీరారూఢీగ నా । కది విన జేయుడి ॥మార॥
సేవకుని మాటలు ఉర్దూ పదాల మిశ్రమ భాష - పు 30
"సునో కాంతామతి అమ్మోడ్ బోత్ కష్టంలో వుంది బౌతామే రోతీహై నీకీ పార్థించి జెప్పి
నాకీ యిడిపించు అమ్మా నీకీ కాల్కి మొక్కుతా, అని యేడుస్తా వుంది
మహరాజుకీ జల్డి బోలోజీ పాపం"

ఈ నాటకంలో కథానాయకుడు ప్రతాపసింహుడు వేశ్యాలోలుడై పట్టపురాణి కాంతామతిని నిరాదరణపాలు చేసిన చూసి సహించక మంత్రి సుబుద్ధి కావించిన హితోపదేశం చూడండి

---

2 పై సంచికలోని కమరం శంకరయ్య కవి గారి 'శ్రీ లక్ష్మణగారి కళారాధనము' వ్యాసములో చూపినవి పుట 18

3 దేవాంగులు ఆర్మూరు తా॥ నిజామాబాద్ జిల్లాలో ఉన్న పద్మశాలీలలో ఒక తెగవారని, వారు చౌడేశ్వరి దేవతను ఆరాధిస్తారని కవిగారి కథనం

పెక్కులేమల దస్కరించిన వీరుడౌ నరకాసురుం
డక్కజంబుగ కృష్ణుచేత యమాలయంబున కేగడే ,
అక్కటా ! యపకీర్తి ధారుణి యందు నిల్వదె మీకునే
మ్రొక్కెదన్‌బర యోషితావళి పొంతబోకుడి నాయకా మత్త కోకిల పు 41

జనానికి తెలిసిన పూర్వగాధల దృష్టాంతాలతో ప్రస్తుత కధపై ప్రేక్షకులకు అవగాహనను కలిగించి ఆసక్తిని పెంచి ఆదరాన్ని పొందడం నాటక కవులు అనుసరించిన ఉత్తమ విధానం కావ్య కవుల్లోనూ ఈ పద్ధతి ఉంది ఆరంభ పద్యం శ్లోకం ఇది శార్దూలం అయిన తెలుగు పద్యంవలె యతి ప్రాసలు కూర్చబడ్డాయి

శ్రీ గౌరీ హృదయాబ్జ షట్చరణ రాజీవారి మౌళీశ్వరా
రాగద్వేష హరామరార్చితదయా రత్నాకరా శంకరా
భోగీభూషణ బాల భక్తవరదా పూర్ణేందు తుల్యాననా
యోగీ సన్నుత పాద పద్మయుగళా ఓంకారరూపా భవా !

ఇందులో కవి సందర్భోచితంగా ఇతర ప్రముఖ పూర్వ ప్రబంధాల పద్యాలు సైతం వాడుకున్నారు కాని వాటి వివరాలు పేర్కొనలేదు ఇది నైజాం రజాకార్ల అల్లర్లలో కవి బొంబాయి వెళ్ళిపోగా అక్కడి ప్రవాసాంధ్రమిత్రులు ప్రచురించిన నాటకం

సత్యవిరోధం నాటకం - ఇది సాంఘిక సంస్కార భావాలు కలది ఇందలి ఓ దురభ్యాసపరుడు మద్యపానాన్ని మెచ్చుకోవడం ఇట్లాగుంది (కల్లుముంత పాటలు అప్పటికి వ్యాప్తిలోనివే)

ఎంతో మధురమీ బ్రాండీ దీని కొంతా రుచి చూచీన కోరేద రండీ ॥ఎం॥
ఎంత వారైన దీన్నెంతో ప్రేమింతురు వింతగ ఇదిలేని దంతా వ్యర్థమందురు
ఇందులో నుంది కైలాసం దీన్ని కొందరు త్రాగవద్దని రెందుకోసం ?
ముందుగ చెప్టీలు[4] మూడేసుకున్న మన ముందర నే స్వర్గముండు నిక్కంబుగ ॥ఎం॥

ఆ తర్వాత సురాపాన నిరసన సరేసరి ! మరో పాట -

లంచగొండ్లను నమ్మరాదయ్యా యో చించ వీరికి కొంచెమైనను జ్ఞానమే దయ్యా
లంచముల కెగబడుచు దిరిగెడి లంగ గాడ్దుల లక్షణములు వ
చించెదను మనసుంచి వినుడిక అంచితముగ ప్రపంచమందున

కులసంఘ ముఖ్యునిగా నేనేత సంఘాధ్యక్షునిగా ఎన్నో యేండ్లు పనిచేసిన లక్ష్మణకవి చెప్పిన నైతిక సూక్తులివి శృంగార వర్ణనలో ఈ కవి ప్రబంధ కవుల బాటల్లో పయనించారు వీరి ఉషాకన్య నాటకంలో నాయకుడు అనిరుద్ధుడు నాయిక అందాన్ని ఇట్లా మెచ్చుకున్నాడట !

ఈ మంద యాన మొగంబు సుందర మిందు సమమందు
దీని యంద మేమందు పూర్ణేందు సమమందు ॥
పాలిండ్లు బంగరు గుండ్లు సొగసగు మల్లె పూచెండ్లు
యిలాటి యిల్లాండ్లు లేరు వెదక వెయ్యేండ్లు

వీరి హారతులు తత్సమ పదాలతో పౌరాణిక భక్తి భావాలతో మనోహరాలు
నవీనకాంతామతి నాటకాంత హారతి 81వ పుట

4 ఔన్సు గ్లాసులవలె బొంబాయిలో 'చప్టీ'లను కొలమాన పాత్రలు నాడు వ్యవహారంలో ఉండేవని లక్ష్మణకవి గారు చెప్పారు 1994

శ్రీ సత్యదేవ మంగళంబిదొ, శ్రిత జనావనార్కతుల్య మాధవ ॥శ్రీ॥
1 వాసుదేవ యోగి బృంద హృదయ ని । వాస వాసవాది దేవవందిత ।
భాసురాంగ నీ సరియెవ్వరిల దయ జేసి బ్రోవుమయ్య కేశవాచ్యుత ॥
2 ఇందిరేశ మందహాస శ్రీముచు । కుంద వరద కుందరదన గో
వింద దందశూక తల్ప గిరిధర । నంద నందనాసురేంద్ర భంజనా ॥
3 మీన రూప సామజేంద్ర రక్షణ । గానలోల గరళ కంఠ ప్రియసఖ
దీన కల్ప భూజ కాంచ నాంబరా । జ్ఞానమానసాఘకాననానల ॥

ఇందలి ప్రాసలు, ప్రాసయతులు రమ్యం ఛేకానుప్రాసలు యమకాలంకారాలు చివరి రూపకం గేయాన్ని శ్రవణోపేయం కావించాయి

ఇరువదేండ్ల వయస్సు నుండి ఓ ఇరువదేండ్లు నాటక ప్రదర్శన రచనలలో లీనమైన లక్ష్మణగారు తర్వాత నలుబదేండ్లుగా కళాసాహిత్య రంగాల నుండి విరమించుకుని సామాజిక రంగానికి సేవ చేస్తున్నారు వారి కృషికి నిదర్శనంగా చేనేత సంఘం, మార్కండేయ మందిరం, పద్మశాలి కల్యాణమండపం కొరుట్ల పట్టణానికి శోభాయమానంగా నిలిచాయి ఎక్కలదేవి లక్ష్మణగారి సార్థక జీవితానికి దర్పణంగా 1975లో వీరి షష్టిపూర్తి సన్మాన సంచిక ప్రచురింపబడింది 1997లో వీరి 'అమృతోత్సవ అభినందన సంచిక' వెలువడుతున్నది

**7 గాలిపల్లి సుబ్బయ్య చారి - కురిక్యాల**

వరకవి సుబ్బయ్యచారి గంగాధర మండలంలోని కురిక్యాల వాస్తవ్యులు ఆంధ్ర జ్యోతిష సరస్వమను పద్యకావ్యము రచించిన వీరి నాటకం పేరు 'భక్త విరోభా' ముద్రణ సర్వధారి 1948 స్వగ్రామమందలి ఔత్సాహిక నటబృందం ఈ నాటకాన్ని ప్రదర్శించడమే కాక ద్రవ్య సహాయమొనర్చి ముద్రింపజేశారు కవి వంశ వివరాలు చూపబడినవి ఇదే కవి మొదటి చివరి నాటకం "భాషాకవిత్వజ్ఞాన మెక్కువ లేనందున" అప్పటికి గ్రంథముల శోధించుచున్న "బాలకవి" నని ప్రస్తావన, పుట 3లో కవి చెప్పుకున్నారు పుస్తకంలోని ఛాయాచిత్రమును బట్టి కవి అప్పటికి యువ వయస్కులుగా చెప్పవచ్చు

విరోభా పండరి నాథ భక్తుడు ఇది మహారాష్ట్ర కథ ఆకాలంలో పద్మశాలీలు, స్వర్ణకారులు బ్రతుకుదెరువు కోసం మరారా దేశం వెళ్ళేవారు అట్లాగే కాక మహారాష్ట్ర జిల్లాలు కొన్ని నైజాం ప్రాంతంలో కలిసి ఉన్న కారణంగానూ ఈ కథలు తెలంగాణాలో వ్యాప్తి చెంది ఉంటాయి పైగా మరారా నటులు ఈ ప్రాంతంలో స్టేజీ నాటకా లాడేవారు సురభి నాటక సంస్థ మరాఠీ వారిదే హరికథ, బుర్రకథగానూ విరోభా కథ వ్యాప్తి కలది ఈ నాటకం నాలుగు అంకాలు కలది 76 పుటలు

**కవితా పరిచయం** ఈ నాటకంలోని పాటలకు పూర్వ నాటక దర్వుల బాణీలు చూపటంతోపాటు రాగతాళాలు సూచింపబడ్డవి ఒక పాట చూడండి

యాడ నున్నావో సద్గురు దేవా । యాడ నున్నావొనీ జాడదెలియాదాయె
వేడుకతో మిము జూడ గోరియు । వీడితిని నా యాత్మ్మలందరని ॥యాడ॥
నీ సేవకయ్యనే యాసించితిని విషయ । యాశలన్నిటి రోసియును నే
ధ్యాసతో జనుదెంచు చుంటిని ॥యాడ॥
ధ్యాసతో జనుదెంచు చుండ । దొంగ లార్గురి బట్టి చెంగూన బడగొట్టి
రంగు మీరగ మీదు సేవచె । లంగుగా జేయంగ గోరితి ॥ ॥

ఇది 'నేజూచినానే సద్గురు నాలో' అను బ్రహ్మంగారి భజన కీర్తన బాణీగేయం, ఈ నాటకంలో భక్తి యోగ వేదాంత విషయాల వర్ణనలు చక్కగా చేయబడినవి నాయక నాయికా వర్ణనలివి

ఉ ఎన్నగ కాంచనా పురపు ఏలిక యౌ కరణంబు బిడ్డయున్
సన్నుత గాత్రమున్ మిగులు చక్కదనంబును సచ్చరిత్రమున్
పున్నమ చంద్ర బింబమును బోలిన మోమును భాసమానమౌ
కన్నె పటంబు గాంచితిని గాంచుము నీవును వేయునేటికిన్ పు 15

సీ చెలియబంగరు బొమ్మలలిత సంపగి కొమ్మ నిద్దంపు సొగసుల ముద్దు గుమ్మ
చిలుకల కొలికి పూ విలుతు చేములికి లోకైక సౌందర్య మోహంపు కలికి 2

ఒక గీతం -

జనన మరణము లేనట్టి జపము యిదిగో,మంత్రముల యందు మేలైన మంత్రమిదిగో
ఆశ పాశాల దెగగోయు అస్త్రమిదిగో,తారకంబును బోధింతు తనయ లేరా ! పు 64

పూర్వాంధ్ర శాసనకవులు పద్యపాదాంత హలంత (న్ ల్) శబ్దాలను అజంతాలుగా (ను, లు) వ్రాసినట్లే యక్షగాన వీధి నాటక కవులు పద్యాంత హ్రస్వాక్షరాలను దీర్ఘాలుగా వ్రాసినారు అదిరాగం కోసం కవిమిత విద్యావంతులైనా అపరిమిత భక్తిభావంతో రాసిన వీధి నాటకం భక్తవిరోభా

## 8 తిరునగరి నరసింహ స్వామి- రాయికల్

నరసింహదాసుగారు చాత్తాద వైష్ణవులు రావికల్ నివాసి స్థానిక వేంకటేశ్వర కోవెల అర్చక స్వామి ఆయన భక్త కవి 'మాధవ చరితము' యక్షగానం నరసింహస్వామిగారి ఏకైక అముద్రిత రచన (దీని ప్రతి రాయికల్‌లో వేముల పెరుమాళ్ళుగారింట వారి తాత పురుషోత్తమదాసుగారి రచనలతో పాటు లభించింది దీని సాపు ప్రతి రాసి ఉంచుకున్నాను)

మాధవ చరితం కల్పిత కథ వైష్ణవ భక్తి గ్రంథం కాళహస్తి బ్రాహ్మడు మాధవ సోమయాజి యజ్ఞం చేయడం, అదే సమయంలో పరాంగనా వ్యామోహం పాలయి కొట్టుమిట్టాడటం, వ్రతభంగం కాకముందే విష్ణు భక్తుల కారణంగా కళ్ళు తెరచి సతీసమేతంగా తిరుపతికి వెళ్ళి శ్రీవేంకటేశ్వరుని వేడుకొనడం ఇందలి కథ కథ చిన్న వర్ణనలు మిన్న పుస్తకం చివరి పుటలు కొన్ని లేవు ఇది యక్షగానం దర్వులు పద్యాలు వచనాలు కూడా ఉన్నాయి దర్వులకు తాళసూచన ఉంది కాని రాగాలు పేర్కొనలేదు చెలికత్తెవాచా, మాధవునివాచా అని పాటలు మాటలు పాత్రల పరంగా ఉన్నాయి అని యిట్లు వర్ణించుటా అని సంధి వచనాలు సైతమున్నవి తెరచాటు దర్వు, పాత్ర స్వీయ పరిచయ దర్వులు కూడా ఉన్నాయి

ఒక పాత్ర ప్రవేశ దర్వు
శ్రీవేంకటేశుడ ద్వారకా ఘన - చిత్ర చరిత్రుడ నేనికా
దేవ దేవుడని దేవేంద్రాదులు భావములో సంభావింపందగు ॥

కథా నాయిక చంద్రరేఖ తెర వెడలుట
భూసురాంగన మణివె కొమ్మ। సంపూర్ణ చంద్ర హాసాను వినవె ముద్దుల గుమ్మ।

బ్రాహ్మల వాచా - పద్యం, భాష ప్రత్యేకం
కం యెల్లంభట్ల కుమారుడు, మల్లంభట్లకును వీరుడు మనుమడు వినరా
పుల్లంభట్లష వీణికి, పిల్లను యిస్సానషంచు పిలిచితె వచ్చెను (న్)

అటకు అష అనటం ఈ ప్రాంత మంధని, పొలాస బ్రాహ్మల్లో ఉంది గురజాడ (విజయనగరం) కన్యాశుల్కంలోనూ ఈ పలుకుబడి వాడబడింది యెల్లంభట్టు, వీణికి వారి పలుకుబడులు

ఇందులో వంటలు, అలంకారాలు, పూజా విధులు వివరంగా వర్ణించబడ్డాయి కొన్ని శబ్దరూపాలు సంధులు తప్పినా కవి ప్రజ్ఞ కలవారనడానికి ఆద్యంత యతి ప్రాసలతో అమరిన ఇందలి పాటలు నిదర్శనంగా నిలుస్తాయి తత్సమపదాల సరసన మాండలికాలను కవి నిస్సంకోచంగా ప్రయోగించారు నాద ప్రధానంగా సాగిన ఈ భక్తి గేయం చూడండి

శ్రీమద్వేంకట నాయకు పద సర సీరుహములకును స్వామిలికన్
ప్రేమతో నర్చన జేయుచున్నరిక ప్రియముతో గను మదు గగ గగ గగో ।
వారిజాక్షుని సౌందర్యంబును - వర్ణించుదమిక వినరయ్య
భూరి రత్నముల నందెలు పాదం - బులకు దాల్చెనదు గగ గగ గగో ॥

ఇందులో అంకాలు లేవు తెరవేసి తీస్తే స్థలం రంగం మార్పే ఇది ఈ ఇరువదవ శతాబ్ది తొలిపాదంలో వచ్చిన సలక్షణ యక్షగానం నాటకానికి ముందు నాంది ప్రస్తావనలు లేవు నటీ సూత్రధారులకు మారుగా లాంగూర్‌ఖాన్ అని ఒక ముస్లిం జవాన్ హాస్యపాత్ర ఉంది అతని ఉర్దూ మాటలతోనే కృతి కర్త తిరునగరి నరసింహస్వామిదాసు కృతి నిర్మాతలు కైరం భూమగౌడు, పెరుమాళ్ళ బాలరాజు మరిద్దరు రావికంటి వారు అని తెలిసింది

నన్నయ భారత 'శకుంతలోపాఖ్యానం'లోని 'నుతజల పూరితంబు' పద్యాన్ని అనుసరించిన నరసింహదాసుగారి ఈ సీస పద్య భావం చూడండి 'నూరు గోహత్యల సమం ఒక బ్రాహ్మణ హత్య నూరుగురు బ్రాహ్మల హత్యతో సమానం ఒక స్త్రీ హత్య, నూర్గురు స్త్రీల హత్యలకు సమానం ఒక శిశు హత్య, నూరు శిశు హత్యలకు సరి ఒక అబద్ధమట !'

రావికల్‌లో టి రాములు, బి ఎస్పి గారి తాత ఈ కవి కాబోలు అన్నారు ఆయన తండ్రి గోవిందయ్య ఈ యేడు మృతులు నరసింహదాసును గూర్చి తెలిసినవారు లేరు ఆయన మాత్రం రావికంటి గ్రామాన్ని వేంకటేశ్వరుని ఈ కృతి ద్వారా సాహిత్యంలో శాశ్వతం చేశారు

## అముద్రిత - అలభ్య యక్షగాన వీధి నాటకాలు

కొందరు కవుల యక్షగాన భాగోతాలు వీధినాటకాలు ఆ కాలంలో ప్రదర్శింపబడి బహుళ జనాదరణ పొందినా అవి అముద్రితాలుగానే మిగిలి క్రమంగా అంతరించి పోతున్నవి అటువంటి కవుల రచనల వివరాలు ఇక్కడ చూపబడుతున్నాయి

**1 నల్లగొండ రాజయ్య - కాళేశ్వరం 1931 మృతి**

రాజయ్యగారు సంస్కృతాంధ్ర పండితులు వీరు రచించిన యక్షగానాలు రెండు 1 రతీమన్మథ విలాసము 2 ఉషా పరిణయము, ఇవి ప్రదర్శింపబడినా ఇప్పుడు లేవు [1]

ఈ కవి తాత గారిది కూడా ఇదే పేరు వారు అనేక కీర్తనలు హారతులు రచించినవారు అవి సంస్కృత పద భూయిష్టంగా ఉన్నవి [2] ఈ యక్షగానాల ప్రతులు లభించలేదు

**2 ఎఱ్ఱమరాజు మూర్తి కవి - గర్జెపల్లి 1955లో కీర్తిశేషులు**

మూర్తికవి గారు భట్రాజు గర్జెపల్లి వాస్తవ్యులు వారు చక్కని యక్షగానాలు రచించారు మూర్తి కవి సోదరులైన లక్ష్మణ రాజు గారు కూడా కవి ఆయన అన్నగారికి యక్షగానాల రచనలో సహకరించేవారు - సహ రచయిత మూర్తి కవి పుత్రులు సుప్రసిద్ధ కవి గర్జెపల్లి సత్యనారాయణ గారు స్వయంగా తమ తండ్రి రచనలు వివరాలు తెలిపారు [3] కరీంనగర్ మండల చరిత్రలో వ్రాశారు [4]

మూర్తి రాజు గారి యక్షగానాలు

1 గౌరీ శంకర విలాసము, 2 దేవేంద్ర విలాసము, 3 శ్రీకృష్ణలీలలు, 4 మయూరధ్వజ చరిత్ర

వీరి నాటకాలు ఆ కాలంలో బహుళ జనాదరణ పొందినట్లు కవి పుత్రులు గ స రాజు గారు

---

1 కవి మిత్రులు మాడుగుల వేంకటేశ్వరశర్మ కాళేశ్వరం గారు ఈ కవి వివరాలు తెలిపారు
2 మలయశ్రీ 'కరీంనగర్ జిల్లా రచయితం చరిత్ర' 1981, పుట
3 నా 'కరీంగనర్ జిల్లా రచయితల చరిత్ర' 1981 రచనా సందర్భంలో,
4 కరీంనగర్ మండల చరిత్ర 1981, పుట

చెప్పారు గట్టెపల్లి సమీపంలో పెద్ద గట్టెపల్లిలో యక్షగాన ప్రదర్శనలు ఇప్పటికీ వున్నారు వారి పూర్వుల కాలంలో మూర్తి రాజు కవి నాటకాలు ప్రదర్శించేవారట ఇప్పుడు ఆ రచనల వ్రాత ప్రతులు కూడా లభించలేదు

**3 అనంతవరపు సిద్ధప్ప వరకవి - గుండారెడ్డి పల్లె**

బహుగ్రంధకర్త అయిన సిద్ధప్ప గారు నాటక రచనలోనూ తమ కలాన్ని నడిపించారు వారి 'హంసోహం వేదాంత రహస్యము' గ్రంథం చివరి పుటలోని కవి రచనల వివరాలలో ఈ దృశ్యరూపకాల పేర్లున్నవి * 1 అశోక సామ్రాజ్యము యక్షగానము 2 జీవనరేంద్ర - నాటకం, 3 కాకి హంసోపాఖ్యానం నాటకం ఆ రచనల ఇతర వివరాలు తెలియలేదు వీరి రచనల పరిచయం పద్య కవుల్లో చేయబడింది

**4 నారంభట్ల దుంపెటాద్రి - దుంపెట కథలాపురం మండలం**

జననం 1900 మరణం 1981

దుంపెటాద్రిగారు వైదిక బ్రాహ్మణులు పురోహితులు నటులు ఈ గ్రంథ చతుర్థ ప్రకరణంలోని యక్షగాన కవి చెర్లపల్లి కాశీనాధ శాస్త్రిగారి బంధుపరంపరలోని వారు దుంపెటాద్రి గారి తండ్రి మోనయ్య తాత రమణయ్య వీరి రచనలు ఇవి 1 పరకాల చరిత్ర యక్షగానం, 2 చెంచులక్ష్మి యక్షగానం, 3 జగన్మోహన చరిత్ర - హరికథ, 4 శతహారతీస్తవము (ఇవిఅన్ని అముద్రితాలు)

పరకాలుడు పన్నిద్దరు వైష్ణవ భక్తులలో ఒకరైన తిరుమంగైయాళ్వారు చెంచులక్ష్మి, నరసింహావతార ప్రహ్లాదరక్షణోత్తర గాథ కాశీమజిలీ కథలను ఆదర్శంగా తీసుకొని రచించిన కల్పిత గాథ జగన్మోహన చరిత్ర హారతులు దేవీదేవతల స్తుతి గీతాలు వంద, నాలుగవ పుస్తకం ఇవి సినిమా పాటల బాణీలో ఉన్నాయని కొన్ని గేయాల పంక్తులను పాడి వినిపించారు కవి గారి పుత్రులు నా లక్ష్మీనారాయణ కవి గారు 'కట్లకుంట'లో పై రచనల వ్రాతప్రతులు కూడా లభించలేదు

**5 కాసు సింగమరాజు - కోనేరుపల్లి**

సింగమరాజుగారు తెలుగు భాషా సాహిత్యాలంటే అభిమానం కల వ్యక్తి ఆంధ్ర సారస్వత పరిషత్తు హైద్రాబాద్ వారి తెలుగు పరీక్షలు (1948 50) మారుమూల గ్రామమైన కోనేరు పల్లిలో నడిపించారు వీరు పెక్కు భక్తి కీర్తనలు యక్షగాన నాటకాలు రచించారు యక్షగానాలు మూడు అవి అముద్రితం వారి ప్రక్కూరి చిందు భాగవతులు ఆడేవారట కవి స్వయంగా వారికి పాటలను రాగతాళాలతో నేర్పించేవారట వీరి యక్షగానాలలో ఒకటి తులసీదాసు వ్రాతప్రతులు వారి చిన్నకుమారునవి వద్ద ఉన్నాయని బంధువులు చెప్పారు[1] ఎంత ప్రయత్నించినా దొరకలేదు

**6 సాధనాసురుల లక్ష్మణ స్వామి - వల్భాపురం తా॥ హుజురాబాద్**

లక్ష్మణస్వామి 1981లో 65 ఏండ్ల వారు 1985 సుమారుగా కీర్తిశేషులైనారు వారు జాతికి సాధనాసురులు అది పద్మశాలీలకు దగ్గర కులం విప్రవినోదులు బ్రాహ్మణులకు వలె, సాధనా సురులు పద్మశాలీల యాచన చేసి జీవించేవారు వారి గారడీ ఇంద్రజాల విద్య ప్రేక్షకులను అబ్బురపరచేదిగా ఉంటుది సాధనలో అసురులు సాధనాసురులు అని అన్వయం

లక్ష్మణస్వామి ఆజానుబాహుడు మంచి గాయకుడు చక్కని నటుడు, వీరికో భాగోతపు జట్టుఉండేది అనేక గ్రామాల్లో యక్షగానాలు ప్రదర్శించి పేరు పొందారు - జీవించారు జీవిత

---

★ వాణీబుక్ డిపో, సిరిసిల్ల వారి ప్రచురణ - 1985 ద్వి ము

1 కవిగారి అన్న కుమారుడు కాసు సింగమరాజు, కరీంనగర్, దూరబంధువు డి హన్మంతరాజుగారలుపై విషయాలు తెలిపారు

2 ఈ కవి వివరాలు 1981లో తెల్పిన కవిమిత్రులు నర్సింహరామయ్యగారు, హిందీ పండిట్ వెల్కతుర్తి

చరమాంకంలో పక్షవాతంతో అశక్తులై పేదరికంలో ఆయన కన్ను మూశారు

లక్ష్మణ స్వామి గారి రచనలు 1 సారంగధర 2 బాలనాగమ్మ

పుస్తకాలు ముద్రితమైనవి మొదటి నాటకంలో సారంగధరుడుగా రెండవదానిలో మాయలఫకీరుగా స్వామి గారు అద్భుతంగా నటించేవారట వీరి పుస్తకాలు లభించలేదు [2]

**7 నీలకంఠ లక్ష్మీ నృసింహరాజు - మల్యాల**

వీరు 1960 వరకు జీవించారు లక్ష్మీనృసింహరాజు గారి వీధి నాటకాలు ఇవి

1 కిరాతార్జునీయం, 2 లవకుశ, 3 విరాటపర్వం, 4 అభిమన్యు విజయము, 5 నలదమయంతి వీరు నటులు, పండితులు, కవి, దర్శకులు నాటక ప్రదర్శనలతో అనేక గ్రామాలు తిరిగినారు పై నాటకాలు ప్రదర్శింపబడినవే అయినా అముద్రితాలు, ప్రస్తుతం అలభ్యాలు

**8 దాసరి గంగారాం - కోరుట్ల జననం - 1890 కీర్తిశేషులు**

దాసరి గంగారాంగారు కొంతకాలం బొంబాయిలో ఉండివచ్చినారు ప్రస్తుతం వారి సంతానం కూడా అటే స్థిరపడ్డారు ఆయన పద్మశాలి చేనేత వృత్తి మిత విద్యావంతుడే అయినా ఆయన నాటక ప్రదర్శనలపై ఆసక్తితో రెండు యక్షగానాలు రచించారు

1 గంగా కల్యాణము, 2 చిరుతొండనంబి కథ

గంగారాం రచనల విషయం విచిత్రంగా తెలిసింది ఈ పరిశోధన గ్రంధ రచన కావిస్తున్న కాలంలో ఒక రోజు 15-3 94 కోరుట్ల మండలంలోని మోహన్‌రావు పేటకు పెళ్ళికి వెళ్ళాను కాలక్షేపం కోసం ఆ రాత్రి చిన్నమెట్టుపల్లి వాళ్ళు ప్రదర్శిస్తున్న 'శశిరేఖా పరిణయము' యక్షగానం ఆ వూరిలో చూశాను మరునాడు ఉదయం నటుల కలుసుకొని వాళ్ళు అదే నాటకాల గూర్చి ఆరాతీయగా ఈ గంగాకల్యాణం పేరు తెలిసింది వచ్చి కోరుట్లలో ఎక్కలదేవి లక్ష్మణగారిని అడుగగా ఆ విషయం అవునని గంగారాంగారి ఈ రెండవ నాటకం పేరు కూడా తెలిపారు

ఆ నటుల వద్ద ఈ యక్షగాన ప్రతిలేదు వాళ్ళు పెద్దలు వ్రాసి ఉంచుకున్న పాత్రల పోర్షన్ నోటుబుక్కులను చూసి ఆడేవారట అదీ వాళ్ళ తండ్రుల కాలంలో ఇప్పుడు వీళ్ళు 40-45 ఏండ్ల వాళ్ళు అంటే పాతిక ముప్పై ఏండ్ల క్రితం ఈ నాటకం ఆడబడింది రచన 1950కి పూర్వపుది లక్ష్మణగారి కంటే ఓ పది ఇరవై ఏండ్లు గంగారాం పెద్దవారట అంటే గంగారాంగారు 1890 సుమారుగా జన్మించి 1960-65 మధ్య కీర్తిశేషులైనారు వీరి యక్షగానాలు అముద్రితాలు- అలభ్యాలు

## 3 వరకవులు - మధుర , వేదాంత గేయ సాహిత్యం

నాడే కాదు నేడు కూడా 'పండితులొక్క త్రోవ మరి పామరు లింకొక త్రోవ' బోవు వారై అన్ని విషయాల్లోనూ భిన్నంగా కనిపిస్తున్నారు కదా సాహిత్యరంగంలోనూ అంతే మార్గ కవిత్వాన్ని విద్యావంతులు ఆదరిస్తారు పరిమిత విద్యా పరిజ్ఞానం కలవాళ్ళు, అవిద్యావంతులు పద్యకవిత్వాన్ని చదువలేరు విని ఆనందించలేరు అందుకే మార్గ కవిత్వానికి ప్రత్యామ్నాయంగా వీరు దేశి కవిత్వాన్ని ఆదరించారు జానపద సాహిత్యం చదువురాని వారితోనే పుట్టి పెరిగి మౌఖిక వ్యాప్తి చెంది జీవించింది ఆ దినాల్లో దేశంలో అవిద్యావంతులైన గ్రామీణ శ్రామికులే అధికం కాబట్టి, దేశీయ - జానపద సాహిత్యాలు విరివిగా అభివృద్ధి చెందాయి

జనం విద్యా వివేకాలలో ఎంతగా వ్యత్యాసాలున్నా అందరూ పరస్పర సహకారాలతో కలిసి జీవించవలసిన వాళ్ళు అందుకే విద్వత్కవులను ప్రభువులే కాక జానపదులు కూడా ఆదరించారు పండిత కవులు కూడా మార్గ కవిత్వంతో పాటు మధుర కవితలను వెలయించారు స్తుతి గీతాలు, హారతులు, భజన కీర్తనలు వంటివి మధుర కవితలు విద్వాంసులు కాక సామాన్య చదువరులు కూడా తమ అనుభవ వేదాంత విషయాలను దేశి కవితలలో గ్రామీణ జనానికి అందించారు

మత విశ్వాసాలలోని సత్యాసత్యాలు ఎట్లాగున్నా ఈ దేశి కవితల ద్వారా వరకవులు జనానికి నీతిని వేదాంత భావాలను సన్నిహితంగా అందించగలిగారు పూర్వ కావ్యాలకంటే, తర్వాతి యక్షగాన వీధి నాటకాలకంటే, ఈ శతాబ్ది భక్తి తత్త్వాలే అధిక వ్యాప్తి జనాదరం పొందాయి వాటి స్వతంత్ర భావాలు పైగా పరిమాణంలో అవి చిన్నవిగా ఉండటం అందుకు కారణాలనుకోవచ్చు

ఈ 20వ శతాబ్ది పూర్వార్థ కాలపు మధుర - వేదాంత గేయముద్రిత సాహిత్య కవులు

1 రామసింహకవి, 2 పరమారాధ్యుల రాజయ్య, 3 అనంతవరం సిద్ధప్ప, 4 తొలుపునూరి శంకరయ్య, 5 కొండపాక నారాయణాచార్యులు 6 శివపురం విశ్వనాథయ్య, 7 మిట్టపల్లి రాజయ్యా ఇతర కవులు, 8 ఎర్రోజు బ్రహ్మయ్య, 9 పులికాంత గంగాధరయ్య, 10 మామిడిపల్లి సాంబశివశర్మ

**అముద్రిత సాహిత్య కవులు**

1 ఈలపంటి టక్కమరాజు, 2 దేవత వెంకటరాజము, 3 రాచూరి రాజన్న మరికొందరు

**ముద్రిత సాహిత్యం**

**1 రామసింహకవి - రాఘవపట్టణం 1857 - 1962**

వరకవి 'రామ సింహం' గారు సిఖ్ఖు మతస్థులు బహుగ్రంథకర్త వీరి పద్యకవితల పరిచయం ఇంతకు ముందు ఇదే గ్రంథంలో చేయబడింది ఈ కవిగారి అచ్చయిన గేయ కృతుల వివరాలివి

1 భజన కీర్తనలు 6 భాగాలు, 2 ముకుందమాల నారాయణమాల, 3 శ్రీమద్విరాట్ పోతులూరి బ్రహ్మం గారి మాలిక, 4 కలియుగ వర్ణాశ్రమ ధర్మములు 1922 5 దుష్ట ప్రపంచ వర్జనము, లంచగొండి ప్రపంచము 1924 25 రచన

ఈ కవి పద్యాలకంటే పాటలే బహుళ వ్యాప్తి పొందినవి భజన కీర్తనలు హారతులు భక్తి భావాలకు సంబంధించినవి సామాజిక విమర్శ 'కలియుగ వర్ణాశ్రమ ధర్మములు 'లో నాటి నిజాం సర్కారి నౌకర్ల లంచగొండి గుణ నింద 'దుష్ట ప్రపంచవర్జనము'లో పరాకాష్టనందుకున్నవి భజన కీర్తనలు కొన్ని సంపుటాలు కవి గారి మృత్యనంతరం కూడా వారి శిష్యులైన యాంసాని వెంకటయ్యా యాదవ్ తెలుకుంటగారు ముద్రించారు [1] వీరి హారతులు ఒకటి రెండు కంఠస్థం చేయని చదువరులు ఆ కాలంలో అరుదు భజన కీర్తనలు సంపుటి నంబరు లేని 1982 ముద్రణ ప్రతి 20 పుటలు రాగతాళాలు పేర్కొనబడ్డ ఈ కీర్తనల బాణీలు భక్తి భావాలు ఇట్లున్నాయి

"శ్రీ మహాగణ నాయకా - శ్రేయస్కర ఫలదాయకా
ఏ మాత్రము నన్నెడ బాయక నీ ప్రేమ జూపుము ప్రణామము లివిగో"
"శివనామము భజన జేతామా । సాంబ శివుని కన్నుల నాడ జూతామా ।
భవ వార్ధిలోనెంత పాపమగ్నుండైన । శివశివ యనగ మీ జిహ్వ పావనమౌను
స్థిరమానసంబు వహింతమా । మన । దురిత జాలముల నడంతమా
పరతత్వజ్ఞానుల పరమార్థమెరిగిన । గురు కటాక్షంబున పరమపావనమైన ॥"
"ఆత్మారామ ఆత్మారామ । అఖండ పద పరమాత్మారామా
ఆత్మానాత్మ వ్యాపక హేవి । శ్వాత్మక పరమ దయాగుణధామా ॥"

ఇట్లా భక్తి భావాలతో పాటు కుహనా భక్తిని విమర్శించారీ విధంగా కవి

"ఏక్తారలు మీటగనేమీ । గురు । ప్రోక్తములు జదువగ నేమీ
యుక్తిమాటలను నేర్చిననేమి । రక్తి వాక్యములు బలుకగనేమి

---

1 1972-73లో నేను ఎలిగేడులో ఉన్న కాలంలో యాంసాని వేంకటయ్యగారు వచ్చి 'రామసింహం' గారి ఒక భజన కీర్తనల సంపుటి వ్రాత ప్రతి సవరించుకొని వెళ్లారు

భక్తి మార్గమున మనసును నడిపే । శక్తి లేని శరడంబాచారులు"

అద్వైత మత ఖండన

"ధృవుడె బ్రహ్మైవాహమన్నాడా । నారద మునీంద్రుడే । శివోహం సోహమను మన్నాడా

అవిరళ ప్రజ్ఞాన నిధి ప్రహ్లాదుడే ఈశ్వరుడననె నా

ఎవరి వేదాంత మిది మూర్ఖా । ఎవరి యద్వైతమిది నీవలె"

కవికి దాసోహమను భావమే సమ్మతం

మరో 'భజన కీర్తనల' సంపుటి నం లేని 1975 ముద్రణ ప్రతి 17వ కీర్తన అందుకు నిదర్శనం చూడండి ఆట కల్యాణి

జీవ భోగంబులకె మిడికెదవూ నీకెంతమాత్రము-సిగ్గు కాదా శివుడననియెదవూ

చావు పుటుకలు కర్మఫలములు । జీవ గుణదోషములు తీరక

కావరమున శివోహమనగనె । కావురా అధమాధమా చీ॥

సోహమనగనె నిర్వికారుడవా జీవుడవు బ్రహ్మై వాహమనగనె నిరాకారుడవా

దేహబాధల కోర్వవాకలి । దాహములకే తాళజాలవు

మోహమగ్నక్రిమివి భగవ । ద్రోహమున కొప్పితివి ఛీఛీ ॥

బ్రహ్మవా బ్రహ్మాండనాధుడవా - పరమేశ్వరుడవా భక్తవరదుడవా సమర్థుడవా

బ్రహ్మ జనకుడవా దలంప పరాత్పరుడవా హరుడవా పర

బ్రహ్మవా సర్వస్వతంత్రుడవా విరాడ్ విశ్వంభరుడవా ॥

జీవన్మరణానంద పాత్రుడవూ నీవెంత జ్ఞానివి-కవి వయిన నొక ప్రకృతి మాతృడవూ

కవి యనగ పక్షియె నీకీ గర్వమెందుకు రామసింహము ।

ప్రవిమాలాత్మ స్థితి వహించి ప్రసన్నత్వంబున భజింపుము ॥

పూర్వ కవుల్లో మల్లికార్జున పండితారాధ్యులు, యధావాక్కుల అన్నమయ్య, త్యాగరాజు అద్వైత నింద ఈ విధంగానే కావించినవారు కాని, ఆదిశంకరాచార్య నుండి ఈ తరం అద్వైత గురువుల వరకు సోహం భక్తులే ఈ గేయంలో కవి ఎవరినీ కాక తననే హెచ్చరించుకోవడం విశేషం

"ఈ ప్రపంచ మెందులకు స్వామీ!

మౌనముగ నుండిన నీవు జేసే ప్రయోజనమేమీ ?

ఈ ప్రాణులను సృజియించి దుర్గుణములు ఘటించి

మహాప్రయాసకు లోను జేసి వ్యర్థముగ క్షోభింపజేయుట" ఎందులకయ్యా? అని ఇట్లా ప్రశ్నిస్తూనే, తిరిగి దాస భావంతో తాను అపరాధినని కాపాడుమని కరుణామయుడని దైవాన్ని వేడుకున్నాడు ఇంకా జనాన్ని ఇట్లా మేల్కొలిపాడు

"లేరా లేరా జీవా లేరా లేరా । ఈరోత నిద్రేల పారాయణము వేళా। లేవరా। జీవా లేరా"

మాయా నిద్రలో మగ్నమైతివి । మదన క్రీడల కలలు గంటివి

చేయ దగనివి చేసితివి పనుల్ చేయదగినవి చేయవైతివి ।

హేయములే నీ కిష్టమాయెను। హిత విచారము లేకపోయెను

శ్రేయమునుగొని జెందితివి భ్రమ। చెడ్డ చెరుపునుమా। జీవా తెలివీ నొందుమా"

**ముకుందమాల నారాయణమాల - 1979 మొదటి ముద్రణ - చిరుపుస్తకం**

"ముకుంద గోవింద మురారే హే మురళీధర వినుత మురారే

వైకుంఠ పద ద్వారకా నిలయ నిర్వికార సాకార కేశవా హరి॥

అని శ్రీకృష్ణ లీలలను ప్రస్తుతిస్తూ దాసునిగా ఆత్మ నివేదన కావించే ఈ ముకుందమాల నక్షత్ర (27) గేయ (చరణం నాలుగు పాదాలు) మాల, ఇందలి వేదాంత భావాలు ఆలోచనీయాత్మకాలు

17 నీరూపంబుల నెవడెరుగూ అది నిగమాగమములలో మరుగూ
నారూపముగా నేను నేనీ నానా రూపములం దేరూపము శ్రీ॥
23 విత్తు ముందో వృక్షము ముందో మరి వెలది ముందో పురుషుడు ముందో
ఉత్తబయలు విశ్వోత్పత్తికి నీ సత్తగాక సం శయమేమున్నది॥
24 రాళ్ళకు మ్రొక్కిన భక్తి జెడున్ తిరు నాళ్ళకు దిరిగిన శక్తి జెడున్
ఒళ్ళెక్కాలకై యోగసాధనలు ఒళ్ళుజెడును మొద లున్న తెలివి జెడు॥
25 బయలే ఈ నీరూపంబనియూ దగ మిడుకుదు రొరులనగను వినియూ
క్రియల కందనిది - కేవల నీవి స్మయ స్వరూపమది మాకు దెలియునా॥
26 సాధనాంతరంబులు కల్లా నిను సాధించేదనుట బుడిల్లా
బాధలుగల వ్రత బోధలు మతముల - శోధలేల నీదయా ధనమెగతి ॥

నారాయణమాల నారాయణ సుత్తి పల్లవితో సాగేది ఇది 34 చరణాల 34×34 = 136 పంక్తుల గేయం తొహరాధాటి ఆది తాళం సకల చరాచర విశ్వమయుడు సకల మునిదేవ సంస్తుతి నందిన సర్వోన్నతుడని దేవుని స్తుతికావించుతూ, కవి తోటి నరులకు భక్తి ప్రబోధం కావించాడు

11 నీ కృప గలిగిన వారలు ఘనులే నిను వర్ణింప సమర్థుల్
నీ కృప గలుగని జనులు నిన్ను గననేర రభాగ్యులు వ్యర్థుల్॥
28 యోగిని గాను తపస్వినిగాను విరాగిని గాను ముకుందా
త్యాగిని గాను భజింప నేర నీదయా ధనమె గోవిందా॥
32 రామసింహ తవదాస దాస పారాయణ మీ పదమూ
పామరుడు భజించిన భక్తుడగున్ బ్రహ్మానంద ప్రదమూ॥

(దీనిది 'రామరామ రఘురామ పరాత్పర రావణసంహార రణధీరా' అను భజన పాట నడక)

శ్రీ మద్విరాట్ పోతులూరి వీరబ్రహ్మంగారి మాలిక భక్తిస్తుతిగేయ మాలిక చిరుస్తుతి కృతి కలియుగ వర్ణాశ్రమ ధర్మవములు 1922 దుందుభి సం లో వెలువడిన కవితా దుందుభి !

1 కలియుగ వర్ణాశ్రమ ధర్మములన్ - దెలిపెద నొకవింతా
కలజాతులు సంకరమైనవి పశు-వులవలె జగమంతా
ఇలలో తమ తమ కుల మర్యాదలు దెలియక కొందరు తెలిసికొందరును
దొలగి చెడ్డనడకలలో వడిబడి ఖలులై మతభ్రష్టులైరి హరి హరి॥

ఇందులో కవి నిందించని కులం లేదు మార్పు - విచ్చలవిడి ప్రవర్తనలను ఒప్పని సనాతన సంప్రదాయ వాది - ఈ కవి ఆయనది అనాచారాలను దురాచారాలను ఒప్పని సంస్కార హృదయం

ఆంగ్ల నాగరికతను అనుసరించిన వారిని ఇట్లా వెక్కిరించాడు

5 బూట్లే విడువరు కొదువ నేమమూ భుక్తపానములలో
నోట్లో సిగరెటెప్పుడిడువరి స్పేట్లాటలు కలలో
కోట్లట కపులట గులాబందులట పంట్లోన్బిర్జిన్ పాయజామలట
బూట్లు లవండర్ పౌడర్ డ్యాంపూల్ తిట్లు ఘనతగల తెలివితేటలు ॥

నిందా రూపంగానైనా ఇందు వర్ణించిన వస్తువులు, వ్యక్తుల ప్రవర్తనలు ఆచారాలు, నాటి నైజాందేశ సాంఘిక స్థితి గతులను స్పష్టంగా చూపగల సజీవ సాక్ష్యాలు ఈ విమర్శ బహుజనులకు తలకంటకంగా ఉంటుందని కవికి తెల్సు అందుకే ఇట్లా సమర్థించుకున్నారు

74 లోకనింద గాదిది వినుడార్యులు లోకహితార్థముగా
ప్రాకటముగ తెలియంబలికి తీయుగ ఫలము యధార్థముగా
లోకులు హితమాలోచించిక యిది లోక నిందయని లొల్లిబెట్టినను[1] (1 అల్లరి)
నాకది బ్రహ్మానందంబే పలు గాకులందునా కాకులందునా
జగద్ధిత ధర్మ బోధకుడనై మీ చెరుపులు తెలిపి మేల్కొలిపిన వాడను మీకు శత్రువును కానునాపై క్రోధము వలదు (75) అనీ అన్నారు మీరు నన్నేమన్నా మీకు వందనాలు నిజం పలికితే నిష్ఠూరమా? జారులు చోరులు చంద్రుని తిడితే నరకమే సంప్రాప్తి అని తనను సమర్థించుకొన్నారు (76)

రోయుడ నాచారములను బలముగ - వ్రాయుడు వ్యాసములా
చేయుడు తమ తమ ధర్మరక్షణద్రోయుడు దోషములా (7) అని హితోపదేశం చేశాడు

"దుష్ట ప్రపంచ వర్ణనము" లంచకొండి తనాన్ని ఖండించింది
ఎంత దుష్ట ప్రపంచము ఛీ యింత ఘనమా లంచము ?
కొంత కాలము గోప్యముండెని దెంత పాపమొ యిపుడు నిర్భయ
మంతటను మామూళ్ళు లంచా లంతకంతకు మించి పోయెను ॥ఎం॥

అప్పుడే కాదు ఇప్పుడూ లంచాంది పైచేయే కదా అది విశ్వవ్యాప్తి ! కవి మాతృభాష పంజాబి ఆకాలపు జిల్లా ప్రజల భాష తెలుగు అయినా నైజాం రాజభాష ఉర్దూ అందుకే వీరి కవిత్వంలో హిందుస్తానీ పదాలు సైతం చోటు చేసుకున్నాయి

6 అవోజీ బైఠోయని -క్యాదేవోగే బోలో యనీ
క్యావొ తుందేతెసో బస్‌బస్ దేవొతొ దస్‌బీస్‌దేవో
లావొ జల్దీ నహీతో జావో బాహెరురో బడో అట॥ ఎంత ॥

రండి కూర్చోండి ఏమిస్తారో చెప్పండి ఏమిటి, మీరిచ్చేది చాలు ఇస్తే పదో ఇరవయో ఇవ్వండి త్వరగా తెండి లేకపోతె పొండి రండి బయటకు నడవండి అంటారట !

ఆ విదేశీ ముస్లిం రాజుల కాలంలోనే కాదు ఈ స్వదేశీ ప్రజాస్వామ్యపాలనలోనూ అంతే కద మామూళ్లు పదుల నుండి వందలు వేలు అయినై - అంతే తేడా !

2 బాదుషా ఫర్మానలూ మర్యాదకే కానూనులూ
వాదియైనను లంచమే ప్రతివాది యైనను లంచమే అది
లేదనే బీదలకు న్యాయములేదనే సిద్ధాంతమైనది॥

ప్రభుత్వ శాసనాలు పకడ్బందీగా ధర్మరక్షణ కోసమని చేయబడుతాయి ప్రజలు విద్యావంతులు ధనవంతులు స్వార్థ ప్రయోజనం కోసం చక్కగా వాటినుండి తప్పించుకోవడానికి అనేకమైన ప్రక్కదారులుండనే ఉంటాయి అవి జనానికి తెలియకున్నా డబ్బు పుచ్చుకుని అబద్ధాలు చెప్పించి అధర్మాల గెలిపించే పెద్ద పెద్ద న్యాయవాదులుంటారు కోర్టు వ్యవహారాల్లో పేదలకు న్యాయం నేతిబీరకాయ చందం ఇది కవి అనుభవంతో చెప్పిన సత్యం సాక్ష్యం సమాజాన్ని పరిశీలిస్తే, ఇప్పటికి సజీవంగా ప్రత్యక్షం ఈ 111 గేయాల పుస్తకాన్ని కవి తేరాసౌ చౌంతీస్ ఫసిలీలో రచించారు అంటే 1334 ఫసిలీ, అది 1925 ఇస్వీ-క్రీస్తుశకం [1]

రామసింహ కవి కలానికి వాడి ఎక్కువ ఆయన ధర్మవీరుడు కలాన్ని నడిపించి, గళాన్ని వినిపించి అధర్మపరులపై ధర్మపోరాటం సాగించి జడిపించిన కవి సింహం రామసింహం జీవితంలో దాదాపు సగభాగం కాలం అంధత్వంతో ఉన్నా ఆయన కలం గళం ఆగిపోలేదు, మూగది కాలేదు ఆయన ప్రతిభా పాండిత్యాలు చిత్తశుద్ధి ఉన్న వరకవి

2 పరమారాధ్యుల రాజయ్య - చెలువూరు, తా॥ హుజూరాబాద్

రాజయ్యగారు వీరశైవ మతస్థులు జంగమ బ్రహ్మణులు* ఈ వరకవి పద్య గేయ కావ్యాలు వ్రాశారు హరిదాసు వీరి పద్యకృతులు పరిచయం చేయబడినవి రాజయ్యగారి గేయ పుస్తకాలు ఇవి

1 శ్రీ చంద్రశేఖర భజన కీర్తనలు అక్షయ 1926లో ముద్రితం, 2 గౌరమ్మ పాటలు ముద్రితం తేదీ లభించలేదు

**చంద్రశేఖర భజన కీర్తనలు** ఇవి శివపరమైన పాటలు ఇందులోని సరస్వతీ స్తుతి కీర్తన నాడు ఈ జిల్లాలోని హరిదాసులు తమ కథా కథనానికి ముందు విధిగా పాడేవారు రూపక తాళంలోని ఆ కృతి ఇదిగో చదవండి

"నీలవేణి లోక జనని నిర్మాలాంగి బ్రహ్మరాణి
పాలు మాలి మొక్కెద నాపాలి దైవ మీవె తల్లి॥
తల వాకిట మెలగెడి యో। పొలతుక నన్నేలవె శ్రీ
కలుముల జవరాలికి కో। డలివని నిను బలుకుదు రిల॥
పలుకుల వెలదిరో నీవునా । పలుకులలో నిక జేరియు
పలికించవె మృదు వాక్కుల । బలు మధురము లొలుకగనిక ॥
కలకాలంబును రాజయ । కవి హృదయంబున జేరియు
సలలితముగ శబ్దంబులు । సవరించవె భువనేశ్వరి ॥"

ఇందలి 6వ, కీర్తన మానస సంబోధనది చూడండి

"వినవే వో మనసా । నా మనవి గైకొనవే వో మనసా ।
తన మాన ధనమూలు తగను శాశ్వతమాని । యనక శంకర పాద వనజాములేవేళ ।
అనయమును భజియింపుచును పావనము గలిగిన మోక్షపధ సా
ధనము జేయుట సౌఖ్యమును నీ వనుభవింతువు నిశ్చయంబుగ ॥"

**గౌరమ్మ పాటలు** - తెలంగాణాలో దసరాకు ముందు పితృ అమావాస్య నుండి దుర్గాష్టమి వరకు తొమ్మిది రోజులు స్త్రీలు ఆడుకునేవి బతుకమ్మపాటలు ఇందులోనిదే ఒక లాలిపాట ఇది,

లాలి శ్రీ సాంబ లాలీ పరమేశ । లాలి మా యయ్య లాలీ,
లాలి జగదీశ లాలీ - గౌరీశ । లాలి సర్వేశ లాలీ ॥
భల్లాణ రాయనింట యిక నీవు । చల్లమా, దేవమ్మకూ,
నెల్లాండ్ల బాలుడావై జగముల । నేలితివి యే వేళల ॥

'స్త్రీల పాటలు' పుస్తకంలో లాలిపాట 'శ్రీరామ రామలాలీ' అని విష్ణుపరంగా ఉన్నది ప్రసిద్ధం ఇది శివపరం రాజయ్య కవి గారికి వీరి కవితలకు ఈ శతాబ్ది పూర్వ భాగంలో అధిక జన గౌరవాదరాలుండేవి వారికి చివరి దశలో కొన్నేండ్లు చూపుమందగించినా కవితా వ్యాసంగం మాత్రం ఆగలేదు శిష్య సంచారమూ చేసేవారు

3 **సిద్ధప్ప వరకవి - గుండారెడ్డిపల్లి** వరకవి అనంతవరం సిద్ధప్ప రాజయోగి గారి జ్ఞాన బోధ పద్యాలు, అద్వైత భక్తి తత్వాలు చాలా వ్యాప్తి పొందాయి వీరి గేయ కృతులివి 1 శ్రీవర్ణమాల కందార్థములు, 2 జగదీశ్వర శతకము ఇవి 1930 కి పూర్వమే ముద్రితం తొలిముద్రణ ప్రతులు లభించలేదు మరి ముద్రణలలో తొలి ముద్రణల కాలాన్ని పేర్కొనలేదు

---

1 1334 + 10 9 590 = 10 9-1924, 25, ఫసిలీకి 590 సం॥ 9 నె॥ 10 దినాలు కలిపితే ఇస్వీ

* లింగ బ్రహ్మణుడ నని కవి కావ్యాంతగద్యలలో చెప్పుకున్నారు

**శ్రీ వర్ణమాల కందార్థములు** - 1981 ద్వి ము ప్రతి తెలుగు అక్షరాల వరుస క్రమంలో శ్రీ ఓం నమశ్శివాయతో సహా అక్షరానికొక కందార్థం ఉంది కందపద్యం చివరి పాదం తత్వగేయంగా మారేది కందార్థం ఇది పద్యగేయం అనొచ్చు ఈ కావ్యరంభ కందార్థమిది

శ్రీధర నీపద యుగములు, పాదుగ మది యందు నిలిపి ప్రార్థింతు మదిన్,
బాధలు బాపియు దీనుల, కాధారము జూపి బ్రోవు అంబుజా నేత్రా ॥
భజియింతు నిన్ ఆత్మా చరిత్రా । రాదూ నీ దరి జేర హితాత్ములకు జన్మ
మోదా మలరగ నిన్నూ మురియూచూ సుతియింతు ॥అం॥

ప్రతి అక్షరానితో పద్యగేయం ఉన్నా ఈ క్రిందివి గమనార్హం రు కుజంకు, ఞకు ఇది, ఢకు మూఢ, రకు కుటిలము, ణకు జణ జణ, ళకు - తళ తళ, క్షకు లక్షణము పై పద్యాల ఆరంభ పదాలు అక్షరాలు కవి నియామానికి అపవాదాలే ఇందులో కొన్ని వాడుకలోలేని పదాలు, వ్యాకరణ విరుద్ధ పదరూపాలూ ఉన్నాయి అవంతే - వారు వరకవులు

ఇదే పుస్తకంలో శ్రీ వర్ణమాల కందార్థాలకు అనుబంధముగా 'సువర్ణమాల భగవస్తుతి' గేయం అక్షరానుక్రమంలో ఉంది శంకరాచార్య 'భజగోవిందం' స్తోత్ర శైలిలో ఇది అరవై చరణాల గేయం

శ్రీహరి హరి ఓం జీవాక్షరముల ధ్యానము చేయర మూఢమతే
శాశ్వితముగా నీ జన్మ ఫల ప్రతి సారము తెలియర మందమతే ఇలా సాగింది

**జగదీశ్వర శతకం** - ద్వి ము 1985 సిరిసిల్ల ప్రచురణ ప్రతి 'హంసోహం వేదాంతరహస్యము జగదీశ్వర శతకము' అని ఈ కృతి నామం సిద్ధప్పగారి జగదీశ్వర శతకం, జన ప్రచారంలో ఉన్న 'రామ రామ "నారాయణ' గేయ శతకాలవంటిది దీనిని చక్కగా పాడుకొనవచ్చు ఈ వందగేయాల్లో కొన్ని ఇవి

1 శ్రీ గణా నాధునకునూ । అర్ఘ్యార్ల । జపమాచరించి మదిలో
జోకతో హరి హరులను । భజియింతు । జ్యోతి శ్రీజగదీశ్వరా ॥
3 నీ దాస దాసులకునూ । దాసుడను । నీ వాడనంటి దేవా
నీ దయా రసము గ్రోలి । శతకంబు । లిఖియించితిని ఈశ్వరా ॥
8 తల్లిదండ్రులు నెవ్వరూ । సతి సుతుల్ । దార పుత్రులు నెవ్వరు
కల్ల బంధువు లెల్లరు । గలిగిరిల । కలిమాయ జగదీశ్వరా ॥
21 కంటిలో నున్న పాప । రూపంబు । గనలేని మానవుండు
కొంటె కాయల గూడియు । వాదించ । శూరుడవు జగదీశ్వరా ॥
96 మతమేమి నిన్ను వేడ । ఆత్మ స । మ్మతము కావలె నవనిలో
వ్రతమేది నిన్ను వేడ । కోరికల్ । గతము కావలె ఈశ్వరా ॥

'శిద్దప్ప వరకవి జ్ఞాన బోధిని' 2వ, భాగము 8,9 పుటల్లో సరస్వతీదేవి దండకం ఉన్నా గణభంగాలున్నాయి దాని శైలి వర్ణమాల వంటిదే వేదాంత గురువుగా, రాజయోగిగా, నీతి బోధకుడుగా, ఆయుర్వేద వైద్యుడుగా సిద్ధప్ప వరకవి పేరు కృతులు ఆ కాలంలో అధిక జనాదరం పొందినవి వీరి పుస్తకాలు వీధి బడుల పార్య గ్రంధాలుగా కూడా ఉపయోగించబడ్డాయి 1995 కార్తీక పూర్ణిమ రోజున (నవంబర్ 20) వీరి యింటి వెనుక జిల్లా నాయకులతో సిద్ధప్పగారి శిలావిగ్రహ ఆవిష్కరణ జరిగింది

## 4 తొలుపునూరి శంకరయ్య -గూడూరు, మం కమలాపూర్

శంకరయ్య గారు వైశ్యులు స్వగ్రామం అంబాల దగ్గర గూడూరు వ్యాపారం వ్యవసాయం జీవనోపాధిగా కలవీరు అచలాద్వైత మతాభిమాని స్థానిక చిదానంద రాజయోగి అంకతిరాఘవయ్యగారి శిష్యులు 1969 శ్రావణ పూర్ణిమ నాడు గురువు గారు కీర్తిశేషులైన తర్వాత శంకరయ్యగారు ఆ అచల గురు పీఠాన్ని

అధిష్ఠించారు వీరు 1975 సుమారుగా గతించారు

శంకరయ్యగారు వరకవి వీరు అచలాద్వైత వేదాంత ప్రీతితో కొన్ని తత్వగేయాలు రచించి 1934లో ప్రచురించారు దాని పేరు శ్రీ అఖండ పరిపూర్ణ తత్వమాల" ఈ పుస్తకంలో చివరి హారతులతో కలుపుకొని 95 పాటలున్నాయి మచ్చుకు ఒక గేయం

మరువాక మది నుంచుడీ గురువాక్యము । తరుచుగ సేవించుడీ
మరువాక మదినుంచి తడవు సేయక మీరు । మురియుచు స్మరణాలో ముమ్మారు జేయుచు ॥
జ్ఞానా జ్ఞానము గాదండి గురువాక్యము । జ్ఞానులకే తెలుసండి
జ్ఞాన జ్ఞానము గాక ఘనమైన పదవిలో । జ్ఞాన తీతంబాని గనిరి మహాత్ములు ॥
మంత్రా తంత్రము గాదండి - గురువాక్యము । యంత్రా జపములు గావండి
మంత్రాతంత్రము గాక యంత్రాజపములుగాక । యింతింత యనరాక ఇమిడి యున్నాదండి ॥
ధరలో రంగా గురుడండి భక్తుల బ్రోచ । దలచి చేరెను వినండి
అరయగ అంకతి రాఘవదాసుకు । మరుగును తెల్పగ మమతాలు విడెనండి ॥

కరీంనగర్ జిల్లాలోని హుజూరాబాద్ పెద్దపల్లి తాలుకాలలో వరంగల్ జిల్లాలోని హన్మకొండ, పర్కాల ప్రాంతాల్లో వీరి పాటలు వ్యాప్తిపొందాయి సౌమ్య స్వభావ సరళ కవిత్వ అచల భక్త కవి తొలుపునూరి శంకరయ్యగారు

## 5 కొండపాక నారాయణాచార్యులు - దేశాయిపేట, తా॥ హుజూరాబాద్

నారాయణాచార్యులు విశ్వబ్రాహ్మణ వరకవి 'గోలకొండ కవుల సంచిక నం 322లో ఈ కవి పద్యాలు ప్రకటిస్తూ 'బ్రహ్మానంద లీలాకరము' అముద్రిత కృతిగా పేర్కొన్నారు కవి మృతి 1336 ఫసిలీగా పేర్కొన్నారు అంటే క్రీ శ 1926లో వారు కీర్తిశేషులు [1] 1934లో గో క స ప్రచురితం 1934 వరకే కవి దీనిని ముద్రించారు ఈ భక్తి కీర్తనల అచ్చు పుస్తకం లభించలేదు కాని, కవి స్వయంగా వ్రాసుకున్న కావ్య ప్రతిలోని రెండు పత్రాలు లభించాయి [2] ఈ కవి పాటలు నిత్యదాసర్లు కడీవాద్యంపై కమనీయంగా గానంచేసే వారని మిత్రులు ఎన్ వెంకటరాజం, ఎం ఏ గారు చెప్పారు లభించిన కవి వ్రాత కాగితాలలో దేవీ స్తోత్ర కీర్తనలున్నాయి పదాలే తప్ప పాదాలు చదువ వీలు కాలేదు

గో క సం లోని ఈ కవి పద్యాలు చక్కగా ఉన్నాయి కాని, ఈ పాటలు వరకవితగానే ఉన్నాయి కవి చిత్తు ప్రతి కాబోలు అచ్చుప్రతి దొరికితే వీరిగేయాల స్థాయి గ్రహింప వీలయ్యేది

ఇవి వీరి కవితా శకలాలు

1 యిదిగో మంగళ మమ్మ శంకరు గుమ్మ, యిదిగొ మంగళ మని ముదంబున,
వదలకను మాయందు నీకృప, మెదలకుంచుమ వుదర మందున ॥
2 కామాక్షి (యేకాంబ్ర నాధుని దేవి)[3] మంగళం
3 బ్రంహ్మామ నిత్య భవతె మంగళం । శృంగార మహిమాంతరంగ శోభిత భక్త,
మంగళ ప్రద కారుణిక భవ బంధ విశ్వకాళాంగ ॥
4 మంగాళ మనరే రామ (రమా) మణికి రంగాణి (ని) (ర) మణికి ॥
రంగ తు (శు) బాంగ విహంగ తురంగుని పొంగూచు గూడి

---

1 ఫసిలీకి 10 రో॥ 9నె॥ 590 సం లు జమ చేస్తే క్రీస్తు శకం వస్తుంది
2 కవి గ్రామ సమీప గ్రామమైన ఘనముక్కుల వాస్తవ్యులు కోరుట్ల మండలంలోని ఐలాపూర్‌లో తెలుగు పండితులుగా ఉద్యోగం చేస్తున్న ఎన్ వెంకట్రాజం గారు సేకరించి ఇచ్చారు
3 ఏకామ్రనాథుడు - కంచి కామాక్షి దేవాలయ దైవం

మిత విద్య, శ్రుత పాండిత్యం, వేదాంత భక్తి భావాలు ఈ మధుర కవుల్లో అధికం, నాడు అవే జానపద జనంలో భక్తి భావాన్ని సాహిత్యాన్ని ప్రచారం చేశాయి ఈ కవి కృతుల్లో లేఖక దోషాలున్నాయి చక్కగా పరిష్కరించి ప్రచురిస్తే కవి భావాలేవో తెలిసి వచ్చేవి

6 **శివపురము విశ్వనాథము – కోరుట్ల** సుమారు 80వ, ఏట 1972లో కీర్తిశేషులు

శివపురం విశ్వనాథయ్యగారు 60,70 ఏండ్లకు పూర్వం 'వరంగల్ నుండి వచ్చి కోరుట్లలో స్థిరపడ్డారు వీరి తండ్రి లింగయారాధ్యులు వారి పూర్వులు మూడు తరాలకు పూర్వం గోదావరి మండలంలోని శివపురం అగ్రహారంలో ఉండేవారట వీరు ఆరాధ్య బ్రాహ్మణులు కౌండిన్యస గోత్రులు విశ్వనాథయ్య గారు మాత్రం అచలాద్వైత మత దీక్ష వహించి 'సదానంద స్వామి'గా వేదాంత గురువులైనారు వీరి గురువు హైదరాబాద్‌లోని భూమానందంగారు

విశ్వనాథం గారు పండిత కవి పండిన తత్వబోధకులు నిండు సౌజన్యశాంతరూపం కలవారు వీరికి శిష్యపరంపర అధికం కరీంనగర్ జిల్లాలోని రుద్రంగి, పత్తిపాక, కొరుట్ల తదితర గ్రామాలందే కాక, మహారాష్ట్రలోని పూనా, బొంబాయి పట్టణాల్లోనూ వీరి శిష్యప్రశిష్యులు కవులుగా అచలవేదాంత గురువులుగా పలువురు ఉన్నారు

కొరుట్ల 'పూర్ణానంద' మిట్టపల్లి రాజయ్య కవి' శివనాథయ్య శిష్యరికంలో ఎదిగిన వ్యక్తి రాజయ్యగారి శిష్యులైన వేములవాడ శ్రీకరానంద పిన్నంశెట్టి చిన్నయ్యగారు విశ్వనాథ గురువుల దయా వీక్షణాలకు పాత్రులైన వారే విశ్వనాథయ్య పేరుతో పుస్తకాలేవీ లేవు కాని, వీరి శిష్యప్రశిష్యుల గ్రంథాల్లో మాత్రం వీరి కీర్తనలున్నవి ఆ పుస్తకాలివి

1 శ్రీగురు భజన కీర్తనలు[1] మిట్టపల్లి రాజయ్య 1940 సు, 2 శ్రీ కందార్థమాల - అలభ్యం 3 శ్రీ గురుగీత పీలుఖానా శంకర రావు 1958, 4 పరిపూర్ణ బోధ మంజరి - పి చెన్నయ్య, 1965

శివనాథయ్యగారు తాము రచించిన కీర్తనలకు స్వీయనామ ముద్ర ఉంచుకునేవారు కారట దానిని బట్టి పై సంపుటాలలోని కర్తపేరు లేని తత్వకీర్తనలు ఇంచుమించుగా వీరివే అనవచ్చు శిష్యుల కీర్తనలు కూడా చాలవరకు విశ్వనాథం గారు సవరించేవారట [2]

తమ తండ్రి కందార్థాలు వ్రాయడం పాడడం తాను స్వయంగా చూసినట్లు విశ్వనాథయ్యగారి కూతురు అన్నపూర్ణగారు తెలిపారు [3] ఈ పుస్తకాలలో 1,2,4 విశ్వనాథయ్యగారు ప్రచురించినవే మొదటిది మూడు ముద్రణలు పొందింది విశ్వనాథయ్య కందార్థాలు ఎక్కువగా వ్రాసేవారని వారి కూతురు అన్నా, ఆ కవితల పుస్తకం లభించలేదు పాటలు మాత్రం లభించినవి

'శ్రీగురుగీత'లో శ్రీ గురు భజన కీర్తనలు 128 పుట నుండి 140 పుట వరకు ఉన్నాయి వానిలో మొదటి ఆరు విశ్వనాథం గారివి

"స్వామీ చరణ కమలా । జాయ్ గురు స్వామి చరణ కమలా
భూమానందం బుధజన బృందం బొందితో కైలాసం పరేశం - పు 129"
"శరణు గురువర శరణు ప్రభువర శరణు శరణు
పరమ భక్తా పాలనా పతితా పావనా ॥శ॥ పు 130"

---

1 రాజగంగమ్మ, కోరుట్ల గారు ఈ పుస్తకాన్ని ఇచ్చారు

2 విశ్వనాథయ్యగారి జీవిత వివరాలు, కవిత విషయాలు, వారి భార్య రాజ్యలక్ష్మమ్మ గారు కోరుట్లలో నాతో 1992 93లో స్వయంగా చెప్పారు

3 అన్నపూర్ణమ్మ గారు జిల్లా ప్రజా పరిషత్ బాలికల సెకండరీ పాఠశాల, కోరుట్ల జిల్లా కరీంనగర్‌లో హిందీ పండిత్‌గా ఉద్యోగం చేస్తున్నారు 1994

'పరిపూర్ణ బోధమంజరి'లో 61 పుట నుండి విశ్వనాథం గారి నాలుగు చక్కని కీర్తనలున్నాయి

1 పరిపూర్ణ భావం గురుడై పరికించెను దేహం ।
పరగ భూమి ఘన రథమై నెట్టగ । పరమాకాశము గొడుగై పట్టగ
సూర్య చంద్రులటు గీరలు నుండగ ।ఆర్యవేదములు అశ్వములమరగ ॥పరి॥

2 ఆరు శాస్త్రములు పగ్గము వేసుక । యెరుక మేరువను ధనస్సు దీసుక
కరుణా శేషుడు నారై చెలగగ । అరయ చుక్కలను పగ్గములమరగ ॥

3 పరమ సాగరము తూణీరంబై । భక్తి భావ సంకల్ప శూన్యరథ
సారథియౌ విధి కృతము జూడ ఘన । సారా సార స్థిర విచారము ॥

4 యిరుసు ప్రభుండై నీ తల మందున । నీరజాల నంధకార తేజుల
బార ద్రోలి భూమేశుని కడ సం । సార సార స్థిర సారవిచారము

ఇందలి కవితా ప్రతిభ ఉన్నతంగా ఉన్నా, కొన్ని గ్రామ్య పదరూపాలు దుస్సంధులు పండితుల ఇబ్బంది పాలు చేస్తాయి 3వ, కీర్తన 62వ పుట

గురుని భజించవె మనసా । నిన్ను । దరి జేర్చు భారంబు వానిదె సరసా

1 కరుణించి రక్షించువాడు । వున్న । కరతలామలక మోక్షముపైన వీడు ॥
పరిపూర్ణమును జూపరేడు । వున్న । ఘోర కర్మములన్ని గూల్చు నీతోడు ॥

2 తిన్నాగ పూదోటలోన । వున్న । కన్నె పిల్ల మంచి కనుసైగ గొన నా
వెన్నతీరున కరగ కన్న । అను । మన్న సత్యము దెలియా సత్యమె సున్నా

3 అంగ రహితమే కైలాసం । ప్రాణ । లింగము పైనుండు ప్రభునిదె వాసం
దొంగా గురువుల బడితె మోసం । యిష్ట । లింగయని పిలువు యిదె చిద్విలాసం

ఇది కవి బోధనా సారాంశం "శ్రీమతే రామానుజాయ నమ " అను 4వ, గేయం లింగధారి అయిన ఈ కవి మతసామరస్య ధోరణికి నిదర్శనం వేదాంత విషయాలు వర్ణిస్తూనే కవి ఇందులో చక్కని కవితా విన్యాసం చూపించారు

చ ॥ వేయి రేకుల కమల స్వస్థానం । సద్గురు స్థానం
కాయ మాయో పాయ పరి పూర్ణం । సుగుణ నిధానం
హాయిగా నాడులలో పెద్ద । నాడి నట్ట నడుమ నాట్యము
నాడు పూవుబోణితో । సయ్యాటలాడు చున్నమేటివి ॥ శ్రీమతే ॥

చర॥ పండు వెన్నెల బయలులో కళలూ । పరతత్వ పలుకులు ।
యెండమావుల జలములకు తడలూ । నీ మేను చమటలు ।
దండిగా భూమండలంబులు । నిండు ప్రేమను గదియ నీవా
ఖండ ఖండమురాక వెలిగెడు । పండితుండై నట్టి స్వామివి ॥శ్రీమతే॥

'శ్రీగురు భజన కీర్తనలు' పుస్తకంలో విశ్వనాథ 'సదానంద స్వామి' గారివి పది పాటల వరకున్నాయి 36వ, పుటలో 'యాలరాగం ఏకతాళం'[1] పేర ఉన్న ఈ క్రింది పాట గూఢ వేదాంత చమత్కార భావ గర్భితం ఒక విధంగా పొడుపు కథల వంటివి దీని చరణాలు విప్పండి చేతనైతే జవాబులు చెప్పండి !

1 యెక్కరాని మేడా మీదా చక్కనీ దొక పిల్లున్నాది ।
యెక్కిచూతా మంటూ పాయినోళ్లు । ఓ గురువారేణ్య యెక్కడా లేనోళ్లయి పోయినారే ॥ఓ॥

2 గొడ్డురాలి కడుపూనందు దొడ్డవాడు కొడుకు బుట్టి ।
బిడ్డలాగని బిడ్డా నిచ్చునూ । ఓ గురువ రేణ్య ।బిడ్డలాగని కొడుకే ముట్టేను ॥

3 చిన్న నాడు చీరె లేదు పెద్దనాడు పెండ్లి లేదు ।
కొడుకు బుట్టి కోక గట్టేను । ఓ గురువరేణ్య! కోక గట్టిన కొడుకే ముట్టేను ॥
4 బంతులాడు బంతి పువ్వా యెంతో మోదామై యున్నాది ।
వింత ముత్యపు చిప్ప నిండేనూ । ఓ గురువరేణ్య । అంత చిప్ప నంటి యుండేను ॥
5 వూరులేని పాటి మీద యేరు లేని గరిక మొలిచే । (యేరు = వేరు)
నోరులేని లేగ మేసేనూ ఓ గురువరేణ్య । నీరు నిండి నిబిడమాయెను ॥
6 నిమ్మ కాయల కమ్మనయ్యి అమ్మకొడుకుల తల్లీనయ్యి
నిమ్మకాయల రెండూనడిగేనూ - ఓ గురువరేణ్య । కొమ్మ కొడుకుల కిల్లాలయ్యేను ॥
7 చెందురూని యెత్తుకొని చీమ ముద్దాడినదాయె
డెందమున భూమానందమును । ఓ గురువరేణ్య । అందునా సానందామొందేను ॥

ఇందులో మొదటిది ముక్తి కాంత, మూడవది మేక చివరిది గురుశిష్య సంబంధం ఇట్లే మిగతావాటికి అర్థాలుండవచ్చు 5వది ఘోరం! ఇవి బూతు భావం ధ్వనించే వేదాంత విషయ కవితలు దైవపరమైన శృంగారం మధుర భక్తి కదా! ఆత్మపరమాత్మల అంటే జీవుడు దేవునితో సంయోగం సమైక్యం చెందడమే ముక్తి! అని ఆర్యోక్తి విశ్వనాధం కవి గారు తాము అచలాద్వైతి కావడమే కాక పలువురను ఆ మతమందు నడిపించి కవితలు వ్రాయించిన వారు

## 7 మిట్టపల్లి రాజయ్య - రాజయోగి - కోరుట్ల, 75వ, ఏట1986లో కీర్తిశేషులు

మిట్టపల్లి రాజయ్య రాజయోగి సాత్త్విక జీవనం గడిపిన ఆచలాద్వైతి ఆయన శాఖాహారి వేదాంత కవితా విహారి సాధు జీవనం గడిపి సద్బ్రాహ్మణుడుగా ప్రశస్తినందిన రాజయ్యగారు 1910 సుమారుగా పద్మశాలి కులంలో జన్మించారు కులవృత్తి చేనేత - ప్రవృత్తి నీతి బోధ ఆయన మాటకు క్రియ సాక్షి అన్నట్లు మెదలిన సంయమి ఆచల వేదాంతాన్ని అభిమానించి స్థానిక ఆరాధ్య విప్రగురు సత్తములైన శివపురం విశ్వనాధం గారి శిష్యులై 'పూర్ణానంద స్వామి'గా రూపొందారు

వేదాంత నీతి ప్రబోధకాలైన తత్త్వ కీర్తనలు, పద్యాలు పూర్ణానంద మిట్టపల్లి రాజయ్యగారు రచించారు ఈ రాజయోగి శిష్యులు పలువురు కవులు వారిలో శ్రీకరానంద పిన్నంశెట్టి చెన్నయ వేములవాడగారు ప్రముఖులు రాజయోగి రాజయ్య గారి కీర్తనలు పద్యాలతోపాటు శిష్యుల పాటలు కూడా చేర్చి 'శ్రీగురు భజన కీర్తనలు'గా ప్రచురించారు [1] ఇది సదానంద విశ్వనాధయ్య కొరుట్లగారి ప్రచురణమట [2] ఈ పుస్తకం 3వ, ముద్రణ 1970లో, తొలిముద్రణ 1940 సుమారుగా జరిగింది 90 పుటల ఈ గ్రంథం మొదట 7 పుటలు పూజాధ్యాన శ్లోకాలు చివర 11 పుటలు చందాదారుల పట్టిక 72 పుటలు కవితలు ఇందులో సగ భాగానికి మించి రాజయ్యగారి కవితలున్నాయి కొన్ని వీరి గురువు విశ్వనాధయ్యగారివి మరికొన్ని వారి వీరి శిష్యులవి పాటలకు రాగ తాళాలు సూచింపబడినవి

బిలహరి - ఆది, 15వ, పుట పాట
వున్నది పరిపూర్ణమురా । దాని గన్న జన్మ మోక్షమురా
అన్న విన్న గురుడన్న మాటనే । నన్న సున్న । ప్రత్యేక్షము గనుగొన ॥
పరిపూర్ణంబొకటున్నది లోనిది యెరుకను మరగెరిగించి ।
నా పూర్వ జన్మార్జిత విశేషంబునూ సర్వమునటు వదలించి ।
దీవించ (హ) స్త మస్తకము నుంచి కరుణించి మనసుంచి ।
మానరు (వు?) లటు వివరించి తెలియగన । వున్నది పరిపూర్ణమురా ॥

---

1 ఏల అనునది ఒక జానపద గేయ ఛందం కాని, కవి ఇక్కడ రాగంగా పేర్కొన్నారు ఏకతాళం పల్లెల్లో, భాగోతపు పాటల్లో సర్వసామాన్యం (247 పుట)

అయిదు చరణాలలో ఈ గేయం 4వది

వేదంబులు నాల్గారు శాస్త్రములు ఎదకి విసుకుటింతియె గాని । (వెదకి విసుగు)
చదివిన గర్వము విదళించక వాదింతురెంతొ వింతది పూని ।
శుద్దులు గని యజమాని వద్దికి గా వద్దనుచూ ।
మానవులటు వివరించి తెలియగన । వున్నది పరిపూర్ణమురా

18వ పుటలో ఉర్దూ పాట ఉంది

ఖాలీ కర్లేపరిపూరణమే తేరి హమారీ వజాతు క్యాహై అని సాగింది వీరి హిందుస్తానీ కవిత

సావేరి రాగం ఆది తాళంలో 22వ పుటలో ఈ అచలాద్వైత వేదాంత తత్వ గేయముంది

1 వారీ । పరిపూర్ణ బోధ సరి కోరి । మరి జూచిన లేదిక దారీ ।
మీరందరు గురునికి జేరీ । సారె సారెకును నన్నుతించు మీ ।
సారము తెలిసిన వారికె మోక్షము ॥

2 కాదూ । సాంఖ్యము యిది యనుకొనరాదూ
షణ్ముఖిశాంభవి యన రాదు । యేది గాదు నిదానమైన యా ।
బోధ విన్న యమ బాధ తొలంగును ॥

7 యేరా । ధర కోరుట్ల మందిరమునరా । శివపురము విశ్వనాధమురా ।
మిటపల్లి రాజమున కిదెరా । సార విచారము సంపూర్ణము యది ।
పారగ తెల్పెను యిది నిజవస్తువు

రాజయ్య కవి పద్యాలు కూడా రచించారు కాని, అవి ఛందో విధేయాలు కావు

దేశిక మీరు మాకు వుపదేశము లిచ్చి తరింపజేయగా
కాశికి బోవ నేల ఘన కరుణ కటాక్షము గలుగునంతదు
రాశలు మాని గర్వము నశించెను మీ యొక నామ మహత్యమున్నా
వశమౌనె యెంచ నరనాయక శివపుర విశ్వనాధయా
వున్నది లేదటంచు లేకున్నది యెప్పుడు వున్నదంచు మీ
రన్న విధంబు మాకు నిజమున్నది కాని మరేమి లేదునే
నన్నది ఆత్మ యెచ్చటికి నరుగునొ గాని యదొక్క సంగతి
తిన్నగ దెల్పి బ్రోవు త్రిపురాంతక శివపుర విశ్వనాధయా

ఈ భావాలు ఆ వేదాంతం నచ్చిన గురుశిష్యులూ మెచ్చినవి వానిలో విమర్శకుల జోక్యం అనవసరం కాని, భాషా ఛందస్సుల గురించి ఆక్షేపణలు వస్తాయి కదా వారికి కవి సమాధానమిది

యేది దెలిసితె జన్మ రాదయ్యా । జనులార మనకు । యేది దెలిసితె జన్మ రాదయ్యా
యేది దెలిసితె జన్మరాదొ యాదారి గనుగొని యున్న గురువుల
పాద తీర్థ ప్రసాదములు గ్రోల ధరందున యెరుక లేదు ॥యేది ॥ పు 54
తప్పులుండిన దిద్దవలెనయ్యా । శబ్దార్థ చంద్రిక । యర్థముల్ గని చెప్పలేదయ్యా
అప్పకవి యాంధ్రములు సంస్కృత గొప్పశాస్త్ర పురాణవేదము
లొప్పితంబై యున్నవాటి నొకప్పుడైనను దెల్యనైతిని ॥

---

1 ముఖ పత్రంలేని ఈ అపురూప పుస్తకాన్ని కోరుట్ల భక్తురాలు రాజగంగమ్మ గారు ఇచ్చారు మరో ప్రతి లభించలేదు, మూడవ ముద్రణ పొందినా

2 శివనాధయ్య గారి భార్య రాజ్యలక్ష్మమ్మ అన్నారు

పాద తీర్థం, బీరకాయల (పీచు) చిక్కు, అంగడిబేరం, పాచితీగె వతు, కట్టెబొమ్మలకు పూజ మొ॥ జనజీవితంలోని నానుడులనీ కవి ప్రయోగించారు

ఈ భజన కీర్తనల సంకలనంలో సిరిపురం విశ్వనాథం, మిట్టపల్లి రాజయ్య గార్లతోపాటు వారి శిష్యబక్త బృందవిరచిత, తత్త్వగీతాలు కూడా ఉన్నాయి వారి పేర్లు ఇవి

లక్ష్మీపతి పుట 21, వజ్యల లింగయ్య పత్తిపాక పుట 27, కోటగిరి రాధకృష్ణుడు 29, మంచె రాజయ్య 41, మచ్చపెద్దులు కోరుట్ల 43, 64, యాగము మల్లయ్య - పత్తిపాక పు 30, 76, గంగారాము రుద్రంగి పు 40, అల్లె హనుమయ్య 46, కొత్త గంగాధర్ 63, కటుకం రామయ్య పెగడపల్లి 70, మొదలైన వారు

మచ్చ పెద్దులు గారి కీర్తనలు చాల వ్యాప్తిలో ఉన్నవి

"ఎంత చక్కని గురుడు దొరికేనే ,మిటపల్లి రాజయ్యార్య మద్గురు
డెంత చక్కని గురుడు దొరికేనే "

బాస గంగారాంగారి అచల తత్త్వం ఇది

"ఆటలాడెంచెడి వాన్ని జూడు నీలోనిలిచి నాడు । నాతోడు । నీ తోడు ।
అతగాడు । మనవాడు । వున్నడు యిక యెన్నడు । మరి చిన్నయు గాకున్నడు మరి ।
అన్నోడు । విన్నోడు । తిన్నోడు । వాడెనయ్యా "

కోటగిరి రాధాకృష్ణుడు । 'యేమిాలేదోయీ "అని పరిపూర్ణ తత్త్వాన్ని 'ఆనందభైరవి, ఆది తాళంలో ఇట్లా విశదీకరించాడు

"సత్తూగాదోయీ యీ చిత్తమందు చిత్తూలేదోయీ ।
సత్తు చిత్తుల సందు సమరాన మెలిగీన । వుత్తాపరమే కాని దూత్తేరి నీతోడు "

లక్ష్మీపతి గారి గేయం యదుకుల కాంభోజిరాగం ఆట తాళంలో ఈ విధంగా ఉంది

"తెలియాని దమ్మా సద్గురు పదము వెల లేని దమ్మా
తెలియ జెప్పిన మతి తెలివికి వేరయ్యి । తెలువుల సందున తేటబడక యుండు '

21వ పుటలోని ఈ తత్త్వగేయాన్ని। కందార్థాలని ముద్రించడం పొరపాటు కందార్థం రానురాను కందార్థంగా ఉచ్చరించబడుతున్నది మిట్టపల్లి రాజయ్య రాజయోగి సహవాసులు మిత్రులు ఇట్లా కోరుట్ల, వేములవాడ, జగిత్యాల, బొంబాయి ప్రాంతాలలో, అచల వేదాంతాన్ని దేశి కవితను బాగా వ్యాప్తి చేశారు

**8 వరకవి ఎర్రోజు బ్రహ్మయ్య - పెద్ద కలువల, మృతి - 1950 , 65 ఏళ్ల వయస్సు**

ఎర్రోజు బ్రహ్మయ్యగారు పుట్టంధులు విశ్వబ్రాహ్మణులు పెద్దపల్లి తాలూకాలోని పెద్దకలువల గ్రామ వాస్తవ్యులు వీరి ఏకైక ముద్రిత కృతి - "జీవ బ్రహ్మైక్య సంధానము "

మరో రెండు అముద్రిత కావ్యాలున్నాయట ఇది 1930 మొ ముద్రణ - 1985 రెం ముద్రణ [1]

పద్యాలు గేయాలు వ్రాసినా బ్రహ్మయ గారిది వరకవిత జీవ బ్రహ్మైక్య సంధానము భక్తి కీర్తనల సంపుటి అందులోనే ' శ్రీమహాలక్ష్మి శతకము' అనే పేరుతో వంద సీసపద్యాలున్నాయి

దీనిని ఓరుగల్లులో రెండవ పర్యాయం 200 ప్రతులే ముద్రించారు పెద్ద కలువల గ్రామానికి తాలూకా ఆసఫ్‌నగర్ అని అందులో ఉంది ముస్లిం పాలకుల కాలంలో పెద్దపల్లి ఆ పేరుతో పిలువ బడి యుండవచ్చు జీవ బ్రహ్మైక్య సంధానంలోని ఒక కీర్తన 3వ, పుట

---

1 ఈ అపురూప పుస్తక ప్రతి నివ్వడంతో పాటు కవిగారి వివరాలు తెలిపిన వారు, వారి బంధువు సత్యనారాయణ, బి ఓ ఎల్ అల్గునూరు

యాల మరచీ యూరకుంటి వయ్య మాపాలిదైవమా జగదీశ (ఏల)
బాల శశి మకుట జాలమేల మునిలోల బ్రోవుమో పరమేశ ॥
దిక్కు నీవె యని మ్రొక్కగ మొరవిన వెక్కడి కరినమొ జగదీశ
నిక్కముగ నిను నమ్మినవారల చిక్కుల ద్రోయుము పరమేశ ॥

ప్రాసలు, యతులు, ప్రాసయతులు, అంత్యప్రాసలు చక్కగా అమిరాయి అవి కవి కవితలకు వన్నెతెచ్చాయి ఈ పుస్తకంలో వివిధ దేవతల స్తుతులు నీరాజనాలు పది వరకున్నవి

తెలంగాణాకు ప్రత్యేకమైన గౌరమ్మ (స్త్రీల) పాట ఒకటి ఇది పు 62
శ్రీలక్ష్మి లోక జననీ । గౌరమ్మ । సిరులిచ్చి బ్రోవుపూని । గౌరమ్మ ।
నీల నీరద వేణి నీర జోదరు రాణి ,బాల చంద్రానన పద్మ సంభవుని సతి
కాల కందరుని రాణీ గౌరమ్మ,కాత్యాయని గుణమణీ - గౌరమ్మ

ఒక హారతి పు 64
మంగళ మిదె శార్వాణి మద షట్పద నిభవేణి । అంగ జాంతకుని రాణి అంబా కిసలయ పాణి ॥
దిక్కు నీవె కన్నతల్లి దీన మానవ కల్పవల్లి । గ్రక్కున దయారసముజల్లి కాపుము సాధ్వీమాతల్లి ॥
గాసిల జేయకు సుమ్మ దాసుల పెన్నిధాన మమ్మ । భాసుర పర శివుని కొమ్మ పాలితామయ పైడి బొమ్మ ॥
వేదమాత గాయత్రి ఆదరించు గిరిపుత్రి । నీదయగను వేద గాత్రి నిఖిల మౌని జనస్తోత్రి ॥

వీరి పాటలు శైలీ ప్రసన్నత కలవి కనులున్న గ్రుడ్డి వారికంటె ఈ కవి అంధులైనా అక్షర సాక్షి కవికి నయనాల కంటె ముఖ్యం జ్ఞాన చక్షువు అలతి భాషాదోషాలున్నా క్షంతవ్యాలు ఈ వరకవి సహజ కవిత భక్తజన మనోరంజని

## 9 పులికాంత గంగాధరయ్య - కథలాపురం

ఈ ప్రకరణంలోని యక్షగాన కవులలో ఈ కవి పరిచయం చేయబడింది బహుగ్రంథకర్తయైన గంగాధరయ్యగారు కొన్ని విడికీర్తనలు కూడా వ్రాశారు [1] తాము వీరశైవ జంగమ మతస్థులైనా వైష్ణవ స్తుతులు సైతం వ్రాసి మత సామరస్యం పాటించారు

కీర్తన - ఏకతాళం
శివ కేశవ నామామృతమెంతో - స్థిరమై యున్నది గదె మనసా
భవ రోగములకు పరమౌషధమిది పానము సేయవె వో మనసా
శివుడే కేశవుడను కేశవుడే శివుడను వేద వాక్యము
శివస్య హృదయం విష్ణో విష్ణుస్య హృదయం శివయన ఘనమూ॥

ఏక తాళంలోనే ఉన్న ఈ క్రింది వేదాంత - వైరాగ్య భావ ప్రబోధ గేయం చూడండి
యెందుకురా యీ సంసారం మరు । పొంద జేయునిది నిస్సారం
మంద బుద్ధులను మరి యజ్ఞానుల । నెంద రెందరినొ క్రిందు పరచునది ॥యె॥
కూట సాక్ష్యములు బల్కియునూ స। త్కూటమి గోరక వెల్కియునూ
సూటిగ నేనే సూనృతోక్తి నని । మాటి మాటికీలాటిగ వదరేవు ॥యె॥
నీ యంతట నీ వుండిననూఉండ । నీయదు నిన్నొక చోటుననూ
పాయకెన్నియొ యుపాయములల్లుచు । జేయరాని పని జేయించును గద ॥యె॥

(వాక్యాది పద యకారం తెలుగుపదానికి నాటి వ్యావహారిక ప్రయోగం చెల్లపిళ్ళ వేంకటశాస్త్రిగారు ఇలాగే రాసేవారు) కవి సంస్కృతాంధ్ర భాషల పాండిత్యం కలవారైనా సజీవ వ్యావహారిక భాషాపదాలు

---

1 ఈ కవి పుత్రులైన నాగేంద్రయ్యగారు కథలాపురంలో తమ తండ్రిగారి అముద్రిత రచనలు చూపడంతోపాటు కొన్ని కీర్తనలు వినిపించారు **తేది 22 7 1990**

నిస్సంకోచంగా ప్రయోగించారు జంపెతాళంలో కవి ప్రతిభకు నిదర్శనంగా ఉన్నది ఈ క్రింద చూపిన హారతి

సరసిజ దళ నయన మంగళం । కరుణామృత సా
గర మునీశ ప్రణుత మంగళం ॥సర॥
విరి శర ధర గురు నర కేసరి తరిధర ధర ధర కరి
వర వరద రఘువర మురాసుర హర సురవర నుతాంఘ్రి ॥స॥
దితి సుతా సమూహ భంజనం । సకలాత్మక సం । తత నుత చరణ విద్వజ్జనం ॥దితి॥
క్షితి నుత సతి పతివిగత దురిత తప ప్ర । ణుత సతత సుమతి పతి సంస్తుత పద ।
శత ధృతి పితడు పతి ధృత హిత ॥స॥

ఈ ప్రాంతపు రామసింహ కవి హారతులు సంస్కృత పద భూయిష్టంగా నాలుక తిరగకుండా ఉండేవి అవే ఈ కవి ఈ హారతి రచనకు ప్రేరణ అయి ఉంటాయి అయినా వీరి భాష సరళం శైలి ప్రసన్నం అలతి భాషా దోషాలు గణనీయాలు కావు అప్పుడు రాజ భాష పరభాష ఉన్నత విద్యాలయాలు లేని, శిష్ట కవుల ఆదరణకు నోచుకోని, ఈ వర యక్షగాన - మధుర గేయకవుల సాహితీ కృషి సంస్తుతి పాత్రం

**10 మామిడిపల్లి సాంబశివ శర్మ - వేములవాడ**

ఉభయ కవి మిత్రులు లాక్షణిక పద్య కవి అయిన సాంబశివ శర్మగారు సంగీత ప్రధానాలైన పలు భక్తి గేయాలను, సుప్రభాతాలను రచించారు వీరి పాటలు కొన్ని పద్యాల కంటె ప్రౌఢంగా ఉన్నాయి వీరిపద్య కవితా కావ్య పరిచయం చేయబడింది వీరి రచనలలో అనువాద ద్విపద రామాయణం, లోభ సంహారము మాత్రమే సంపూర్ణ ద్విపద పద్య కావ్యాలు మిగతా ఖండ కృతులన్నీ, పద్య గేయ సంపుటులు

వీరి గేయాలు కల కావ్యాలివి

1 ముక్తా హారము - 1949 ముద్రణ 2 మధుర ఝుంకారము 1949 ముద్రణము
3 జయశ్రీ 1953 ముద్రణ 4 భక్తి గీతాలు 1966 ముద్రణ

**ముక్తాహారములో** 11 పద్య శీర్షికల తర్వత కొన్ని గేయాలు మంగళహారతులున్నాయి **మధుర ఝుంకారము** సంపూర్ణ గేయ కావ్యం ఇది 36 పుటలు కలది ఇందులో హారతులు కీర్తనలున్నాయి ఇవి శివరామకృష్ణ భక్తి గేయాలు **శ్రీ రాజరాజేశ్వర సుప్రభాతమ్** 1958 రచన **భక్తి గీతాలు** 1966 సం ముద్రణ 40 పుటలు ఇందులోని పాటలు భజన కీర్తనలు కొన్ని సినిమా పాటల జాణీలవి కొన్ని స్వతంత్ర గేయాలు రాజేశ్వర సుప్రభాతం నుండి భూపాల రాగ గీత భాగం చూడండి

మేలు కోవయ్య శ్రీరాజ రాజేశ్వరా । మేలుకొమ్మా గిరిజా హృదయేశ్వరా
మేలుకో కైలాస వాస కామేశ్వరా । మేలుకో సంగీతలోల విశ్వేశ్వరా॥
కలభ కుంభ స్తన ఘన జఘనములతో । చలదు త్పలేక్ష ణోజ్జ్వల కపోలములతో
ధవళ శ్రవణ యుగ్మ తాటంక తతులతో । ఫాల తలములందు వ్రాలు ముంగురులతో

వీరి గీతాలు ఎక్కువగా సంస్కృత పద భూయిష్టంగా ఉన్నాయి

1 బి వి రామారావు గారి సంపాదకత్వంలో కరీంనగర్ నుండి వెలువడిన త్రైమాసిక సాహిత్య పత్రిక తేది 12 ఫిబ్రవరి 1954 పు 11 (253 పుట పాదపీఠిక)

అతసీ నీలోత్పల జంబూ ఫలహరీ। నీల జలధర శ్యామహరీ
సిత కమల మరాళ మృణాళ సుధా। సింధు సుధాంశు సదాంగ హరా
వీరు తమ సంస్కృత కవితలను విడిగా కాక తెలుగు ఖండ కావ్యాలలోనే ప్రచురించారు

పద్యాన్ని కూడా పాటగా నడిపించే ప్రతిభ శర్మగారిది ఉదాహరణానికి 'సారస్వత జ్యోతి' లోని ఈ కవిత చూడవచ్చు[1] మంజరీ ద్విపద

వాయింపరా తెల్గు వజ్రాల వీణ । మ్రోయింపరా తెల్గు ముత్యాల వీణ
మొరయింపరా తెల్గు వరహాల వీణ । పలికింపరా తెల్గు బంగారు వీణ
మీటరా నీ తెల్గు మెఱుగు తంతువుల । మ్రోళ్ళు చిగిర్చగా రాళ్ళు చెమర్చ
నీళ్ళు పుష్పించగా నింగి ఫలించ పాడరా నీ తెల్గు భావార్ద్ర గీతి ।
చూడరా నీ తెల్గు సుకుమార మూర్తి సరిగమ పదనిస స్వరరాశి యందు।
మెరిపింపరా తెల్గు మెరపు పసందు। (1954)

సంగీత సాహిత్యాల్లో, సంస్కృతాంధ్ర భాషల్లో మార్గదేశి కవిత్వంలో సవ్యసాచి సాంబశివ కవి!

## అముద్రిత మదుర సాహిత్య కవులు

**1 ఈలపంటి టక్కమరాజు - కాట్నెపల్లి (కొత్తపల్లి)** జీవితకాలం సుమారుగా 1880 1980

టక్కమరాజు గారు భట్టురాజు మధుర గేయకవిగా వారి పేరు చాల వ్యాప్తిలో ఉంది ఇంచుమించు నూరేండ్లు జీవించిన వీరు గతించి పదేండ్లు దాటింది రాజుగారు ఎన్నో కీర్తనలు రచించినా అందులో ఏ ఒక్కటీ ముద్రింపబడలేదు కవి అముద్రిత కవితలు వారి కూతురి కొడుకు వద్ద కలవట టక్కమరాజు గారి గేయాలు కూచిపూడి వారి తరంగాలవలె నాట్యానుకూలమైన బాణీలలో ఉన్నవి భజన కీర్తనలుగా వీటికి ఆ కాలంలో చాల వ్యాప్తి ఉండేది రాజుగారి దశావతార కీర్తన ఆరంభమిట్లుంది

రారా నిను నమ్మితిరా యదు వీరా దేవకీ వసుదేవ కుమారా
భాసుర కౌస్తుభ మణి హారా రారా దేవర వారి దశావతారము లెన్నగ॥
వాదా - జలనిధి లోపల జొరలేదా సోమకుని త్రుంచితివి కాదా
స్మరణోల్లాస సదాత్మ వినోదా వేదంబుల నలినోద్భవునకు ము
న్నాదరించు మీనావతార । యిటు రారా ॥

విద్యా వైదుష్య కవతా నైపుణ్యాలు సమస్థాయిలో ఉన్న టక్కమరాజుగారి కీర్తనలు ముద్రింపబడితే సరస సాహిత్య సంగీత ప్రియులైన భక్తజనానికి విందుగా ఉండేవి [1]

ఆ కాలంలో ఈ జిల్లాలో భట్రాజులు ఆశుకవితతో సాహితీ సంచార యాత్ర కావించేవారు వారిలో కొందరు భక్తిగేయ కవులు వీరు నారాయణరాజు కృష్ణమరాజు, ఎఱ్ఱమరాజు నర్సింహరాజు ప్రెగడపల్లి, పుల్లమరాజు - ఓదెల జొన్నల మల్యాల, గూడూరి నరసింహరాజు - ఉప్పర మల్యాల, దేవరాజు నరసింహరాజు కప్పారావు పేట [2]

**2 దేవత వెంకటరాజము - రేకొండ** మం॥ చిగురు మామిడి

దేవత వేంకటరాజంగారు పద్మశాలి కులస్తులు వీరు అచ్చంగా మధుర గేయ కవితలు

---

1 కవి గారి దౌహిత్రులకు రెండు లేఖలు వ్రాసిన జవాబు లేదు ఈ వివరాలు చెప్పి పాట వినిపించిన కవి మిత్రులు ఎన్ హన్మంతరాజు ధీకొండ - జిల్లా పరిషత్ సెకండరీ పాఠశాల, వెదిరలో తెలుగు పండితులు - 94

2 ఈ వివరాలు నా 'క జి రచయితల చరిత్ర' రచనా కాలంలో 1981 సేకరించి ఇచ్చినవారు పి కేశవరావు గారు గుండి

వెలయించిన వరకవి వీరి కృతులేవీ ప్రచురింపబడలేదు ఈ వరకవి 50 వరకు మంగళ హారతులు రచించారు 'సత్యనారాయణ వ్రత కల్పము' అనే పేరుతో హరికథను వ్రాశారు గజేంద్రమోక్షం పేరుతో మరో హరికథ వ్రాశారన్నారు వారి పుత్రులు చి॥ శ్రీనివాస్

వీరి రచనలు అముద్రితాలు రేకొండ గ్రామంలోని కవిగారిగృహంలో దొరికిన చిత్తు కాగితాలలోనిది ఈ క్రింది హారతి [1] వీరి వ్రాత ప్రతులు ముద్రణకోసం వేరే జిల్లాకు వెళ్ళాయి

1 హారతిదిగో క్షీరా పారా వారా కన్యా । చారు తర సుకుమారే మణిగారే సుగుణ విహారే
నిరతమూ మేరు గిరిధర ధీరే శూరే । పారావారా నిభగంభీరే జగదాధారే శూరే
కుంద ముకుళ రదనే పూర్ణేందు సదృశవదనే । బ్రహ్మానంద రూపా బృందా వందితే -

2 శుభనీరాజ యామి యదు వీరా మురారి విరోధి మురహర గిరిధారీ
అంతే వాసి సంతాప హరణా నిరంతాయ
స్వాంతా యనంతా దురంతాఘ చింతా నికృంత రిపౌఘ కృతాంత స్వరూప వేదాంత [2]

కవి సంస్కృతం నేర్చుకోలేదు అంతా శ్రుత పాండిత్యం భాషా గుణ దోషాల ప్రసక్తికి పోక ఆ నాదానికి ముగ్ధులై వీరి హారతులు ఆ కాలపు భక్తజనం ఆసక్తితో పాడుకునేవారు [3] కవి కుమారుడు శ్రీనివాస్ తండ్రిగారి రచనలను సేకరించి ముద్రించే ప్రయత్నంలో ఉన్నారు

**3 దమ్మయగారి రాజన్న - గుండి** మం॥ రామడుగు 1985

రాజన్న కాపు కులస్థులు ఇంటిపేరు రాచూరి వారు ఆయుర్వేద వైద్యులుగా జీవితం గడిపిన రాజన్నగారు సాత్విక ప్రవృత్తి కలవారు మిత మృదు భాషి వీరికి శ్రీరామునిపై అపరిమిత భక్తి

వీరికి ఆంధ్ర సాహిత్య పరిచయం అంతంత మాత్రమే హిందీ పరీక్షలు మాత్రం ఆగ్రాలో చదివి ఉత్తీర్ణులైనారు తులసీదాసు 'రామచరితమానస్' చదివి ముగ్ధులై దానిని 'శ్రీరామ నామమహాత్మ్యం' పేరుతో అనువదించారు [1] ఇది సంపూర్ణ గేయకావ్యం అనువాదం మూలాన్ని అనుసరించినా సంగ్రహించబడింది ఈ కావ్యం అముద్రితం రాచూరి రాజన్నగారి హిందీ రామాయణాంధ్రానువాద గేయ కావ్యారంభం ఇట్లాగుంది

శ్రీరామ నామ మెంతో మధురం । రమణీయమైన మాధుర్యం
రామనామముతో సమానమైనది । రానే రాదిక లేనే లేదిల ॥
ఇంత తీపి యనరాదు । ఎంతెంతో ఏమనరాదు
ఎంతో మంది భుజియించియు యీరుచి । ఇంతని తెలిపినవారు లేరిక॥[1]

కవి 1985 సుమారుగా వృద్ధాప్యంలో కీర్తిశేషులైనారు

**4 కెక్కెర్ల మల్లన్నగౌడు - మంథని** 1860 1960 సుమారు

మల్లగౌడు ఇంచుమించు నూరేండ్లు బ్రతికిన పూర్ణాయుష్కులు సాత్విక భక్తిభావంతో తత్త్వ గేయాలు రచించేవారు వాటిలో కొన్ని ఇప్పటికీ ఆ పట్టణ వృద్ధులు పాడుకుంటారు మహాకవి గంగారాజేశ్వరరావుగారి శిష్యుడు కవి, తాటికొండ రాజుగౌడుగారు వినిపించిన పాట ఇది

---

1 రేకొండలో ఆతిథ్యమిచ్చి కవిపుత్రునితో పరిచయంకలిగించిన అధ్యాపక మిత్రులు సంజీవరావు గారు

2 కవి అన్న కుమారులు, కవియు అయిన దేవతవేంకటరాములు సిరిసిల్ల గారు 1981లో గంభీర్ రావుపేటలో ఈ హారతి వినిపించారు 1981

3 1973లో ఎలిగేడులో మోతుకూరి సాంబయ్య కనుకుల సాన్నాయి కళాకారుడు పాడగా దే వే గారి ఒక హారతిని విన్నాను అందులో 'రేకొండ' గ్రామాన్ని కవి 'రాత్రిగోత్ర' మన్నారు

1 ఈ కావ్యాన్ని నేను గుండిలో ఉన్న 1974 75 కాలంలో చదివాను

మానజాలనే కొల్లారపురాధమ్మ తల్లిని మరువజాలనే
మాన జాలనెందుకన్న మా మీదనెంతో ప్రేమ
వాసిగాను లింగయాత్రలు సంగతిగను చూపించిన తల్లి ॥
తినక పెట్టునే తిన్నంక యెంతొ ధీర జెప్పునే
కల్లగాదునాదు మాట కామధేనువు వంటిది తల్లి ॥

వీరు చాల భజన పాటలు వ్రాసినారట ఈతని తమ్ముడు కూడా సాధుజీవితం గడిపిన కవి అని తెలిసింది ఆయన రచించిన పాటలోని కొంత భాగం చూడండి

కారణమనియెటి కాయముజూచి కాముని పండుగ యనిమదిరోసి
కారడవులలో ఆకులు మేసి వేగమె పెద్దలు వెళ్ళిరి కాశికి !
జాజిరి జాజిరి జాజిరి జాజిరి
ఎక్కువ గుణములకెవ్వరు సాటి, మక్కువ గుణములకెవ్వరు సాటి
మరుగని బత్తెకు మందే సాటి, నీకులమొకటా నాకులమొకటా

ఇది పాల్కురికి సోమనాథుని వీరశైవ భక్తి కాలం నాటి బాణీ మంతెనలో పాటల రామక్క, వెలిశేటి వీరమ్మ ఈ కవి సోదరుల పాటలు పాడుతారట సేకరిస్తే ప్రచురిస్తే అదో అపూర్వ పూర్వ సాహితీ గ్రంథం

**5 గడ్డం మచ్చదాసు - మంగమ్మపల్లె** మం మానకొండూరు 1980 వరకే కీర్తి శేషులు

వీరు 'కొండగట్టు హనుమాన్ మంగళహారతులు' వ్రాసి ప్రచురించారు ప్రతి లభించలేదు కరీంనగర్ జిల్లా రచయిత చరిత్ర - పు 280

**6 రాజమహ్మద్ - వెంకటాయపల్లి** తా॥ మల్యాల, మృతి - 1950లో

రాజమహ్మద్‌గారు ఉర్దూ మాతృభాష అయినా తెలుగును చక్కగా నేర్చుకున్నారు

"తెలుగులో చాల పాటలు కీర్తనలు వ్రాశారు కరువులపై కాలాలపై, రోగాలపై కొత్త వత్సరాలపై వీరు వ్రాసిన పాటలు చాల వ్యాప్తి పొందినవి" క జి ర చరిత్ర పు 22 ఈ కవితో ప్రత్యేక పరిచయం కలిగిన డా॥ పింగళి లింబాద్రి రెడ్డి నెమిలికొండగారు1981లో వీరి వివరాలు తెలిపారు

**7 ముకుందం - కోళ్ళమద్ది** తా॥ సిరిసిల్ల, జననం 1910 మరణం 1981 85 మధ్య ముకుందంగారు అనేక హారతులు భజన కీర్తనలు రచించారు అవి అముద్రితాలు కాని, అవి చక్కని శైలీ పద భావసంపద కలవని వినికిడి [4] క జి ర చ పుట 147 ఈ జానపదకవి వివరాలు దేవత వేంకట రాములు కవిగారు తెలిపారు రచనలు సేకరించలేకపోయా(రు)ను

**8 తిరువేంగళం - వెలిచాల** మం॥ కొత్తపల్లి

వీరు భక్తి పాటలు పద్యాలు రచించారు క జి ర చ పుట 23

**9 పెరుమాళ్ళయ్య - మానాకొండూరు** వీరు పద్య గేయ కవి క జి ర చ పు 23

**10 గుడిపాటి పాపిరెడ్డి - జూలపల్లి** జననం 1920 కీర్తిశేషులు క జి ర చ పు 149

పాపిరెడ్డిగారు మధుర గేయ కవితలు వ్రాశారు వీరి దసరా గడలపాట బహుళ ప్రచారం పొందింది ఆ పాట ఆరంభమిది ఇది ద్విపద

శ్రీలిచ్చి పాలించు శ్రీలక్ష్మి ధవుడు । వ్రాలిచ్చి కాపాడు వారిజోద్భవుడు
ఆలమందలు వాహనాలు మీకమర । మేలైన నిలువుటద్దాలు మీ కలర

ఈ కవులందరూ ఇప్పుడు కీర్తిశేషులైనారు పండిత కవులకంటె మిన్నగా ఇటువంటి జానపద

వర మధుర గేయ కవులే నాడు సామాన్య జనులకు అందుబాటులో ఉండి, వారికి అవసరమైన సాహిత్యాన్ని అందించి ఆదర పాత్రులయ్యారు ఇంకా ఆ కాలంలో ఇటువంటి వారెందరో !

## వచన వాఙ్మయం

వెయ్యేండ్ల కరీంనగర్ జిల్లా తెలుగు సాహిత్య చరిత్రలో ఈ 20వ, శతాబ్ది ఆరంభం వరకు పద్య కావ్యాలే తప్ప వచన రచనలు లేవు మధ్యకాలంలో వేములవాడ సోమనాధసూరి వసుచరిత్ర వ్యాఖ్యానం ఒక్కటి మాత్రమే గణన కెక్కిన వచన గ్రంథం

అయినా జన వ్యవహారంలో గద్యం ఉంది శిలాశాసనాలు, చంపూ కావ్యాల్లోని వచనాలు యక్షగాన వీధి నాటకాల్లోని సంధి వచనాలు సంభాషణలు, ఆశ్వాసాంత గద్యలు ఇక్కడి ప్రాచీనాంధ్ర వచన రచనకు మచ్చు తునకలు

ఈ అర్ధ శతాబ్ది (1901 1950) కాలంలోనూ పద్యకావ్యాలు, యక్షగానాలు, మధుర కవితలదే ఇక్కడ పై చేయిగా ఉంది అప్పుడు నైజాం రాజభాష ఉర్దూ పాఠశాలల్లో ఉర్దూ మాధ్యమంలోనే విద్యాబోధన జరుగుతున్నా, అవి స్వదేశ స్వభాషాభిమానాలు పునరుజ్జీవనం పొందుతున్న రోజులు

ఆ కాలపు వచన రచయితలు వీరు 1 వజ్జల రాజారాంశర్మ ఘనాపారి, 2 రాజ వైద్య పింగళి లింబాద్రి రెడ్డి, 3 చేనేత పితామహ గుంటుక నరసయ్య పంతులు, 4 బహునూతుల సీతారామనాయుడు, 5 వాసం వెంకట్రాజు

### I వజ్జల రాజారాంశర్మ ఘనాపారి, మంథని

రాజారాం శర్మగారు సంస్కృతాంధ్ర భాషల్లో పండితులు సంఘ సంస్కార దృక్పథం కలవారు కందుకూరి వీరేశలింగంగారి ప్రభావంతో కాబోలు "పునర్వివాహ శాస్త్రం" అను వచన పుస్తక రచనచేసి 1920లో ప్రచురించారు ఈ విషయం "Censes of India, Andhra Pradesh - 1971,లోని Town Study of Manthani విభాగంలో 165 పేజీలో ఉంది వీరిని గురించిన ఇతర వివరాలు తెలియలేదు ఆ గ్రంథం లభించలేదు

### 2 రాజవైద్య డాక్టర్ పింగళి లింబాద్రిరెడ్డి - నెమిలికొండ - 1900 1993



లలిత కళా సంగీత - సాహిత్య వ్యవసాయ వైద్య - రాజకీయాది అనేక రంగాల అపూర్వ సంగమం పింగళి లింబాద్రి రెడ్డిగారి జీవితం వీరికి సాహిత్యమందే అత్యంతాభిమానం కొన్ని పద్యాలు, గేయాలు రచించినా వచన రచనలో వీరిది గణనీయ స్థానం నిరంతర పరిశోధన సత్యాన్వేషణ రచన వీరి ప్రత్యేకతలు వృద్ధుల నుండి పిల్లల వరకు వారి వారి స్థాయిని బట్టి కలుపుగోలుగా మెదిలేవారు వారిచే గౌరవింప, ప్రేమింపబడేవారు వందల్లో ఒక్కరుగా, చుక్కల్లో చంద్రుడుగా, స్ఫురద్రూపంతో హుందాతనంతో కనిపించేవారు రెడ్డిగారు సజీవ విజ్ఞాన భాండాగారం దాదాపు తమ డెబ్బదేండ్ల జీవితకాలాన్ని కళా సాహిత్య వైద్య వ్యవసాయరంగాలకు అంకితం చేశారు వైద్య పారిభాషిక పదకోశం కూరుస్తూ తమ తొంబది మూడవ యేట కేవలం నాలుగైదు రోజులు అస్వస్థతతో ఉండి కన్ను మూశారు

**జననం - జీవితం** 1900 సం కార్తీక పూర్ణిమనాడు లింబాద్రిరెడ్డిగారు నెమిలికొండలోని ఓ సంపన్న రెడ్డి కుటుంబంలో జన్మించారు తల్లిదండ్రి చంద్రమ్మ, నర్సింహారెడ్డిగారలు ఏకైక పుత్రులు కావడంతో అల్లారు ముద్దుగా పెరుగుటూ కరీంనగర్‌లో మిడిల్ క్లాసు వరకు విద్యాభ్యాసం కావించారు తరవాత ఉత్తరప్రదేశ్ 'రాజవైద్య' డిగ్రీ గ్రహించారు మొదటి నుండి కళాసాహిత్య, వైద్య, రాజకీయరంగాల నభిమానించారు కొన్నాళ్ళు ఓ నాటక సంస్థను నడిపించారు సినిమాల్లోనూ నటించారు పుస్తక

ప్రచురణ సంస్థను స్థాపించారు మాడపాటి, సురవరం, డా॥ జయసూర్య, హయగ్రీవాచారి, దేవులపల్లి రామానుజరావు, ఒద్దిరాజు సోదరులు పి వి నరసింహారావు మొదలగు ప్రముఖులతో సన్నిహితంగా మెదిలారు ఆంధ్ర మహాసభ గ్రంధాలయోద్యమాలతో పాల్గొన్నారు కాంగ్రెసును అభిమానించి జాతీయోద్యమంలో చేరి, దేశ విముక్తికోసం పాటుపడ్డారు స్వగ్రామంలో విజ్ఞాన ప్రచారిణీ గ్రంధమాల స్థాపించి 21 పుస్తకాలు (1922 44) ప్రచురించారు వానిలో కొన్ని ఇవి

మాడపాటి హన్మంతరావు రుద్రమదేవి, ఒద్దిరాజు సోదరులు భ్రమర, వీరావేశము, శౌర్యశక్తి, దువ్వూరి లవకుశ, పూతలపట్టు కీరవాణి మాధవీయం, పాతూరి అంజయ్య శకుంతల, కోట్ల సత్యనారాయణాచార్య రామాశ్వమేధము మొదలగునవి

రెడ్డిగారి రచనలు 1920 40 మధ్య 1 విషములు తచ్చికిత్సలు, 2 గృహ వైద్యం

1975 92 మధ్య ఇవి -

1 సేద్యం వైద్యం , మొదటి భాగం, 2 సేద్యం వైద్యం, రెండవ భాగం

3 ఆరోగ్యం సౌభాగ్యం తెలుగు అకాడమీ ప్రచురణ

4 నిండా నూరేండ్లు జీవించాలంటే బుక్‌లెట్ (పై పుస్తకాలు అచ్చయినవి)

**అముద్రితాలు** 1 మాయ (నవల), 2 స్వీయ చరిత్ర, 3 వైద్య పారిభాషిక పదకోశం, 4 వస్తు గుణదీపిక, 5 సప్తధాతులవణ చికిత్స

రెడ్డిగారు ఉర్దూ సంస్కృతాంధ్ర భాషలలో పండితులు ఆంగ్ల హిందీ భాషలు తెలుసు

గోలకొండ కవుల సంచికలో వీరి గేయ కవిత 'కోకిలాలాపం' ఉంది తెలంగాణాలో అప్పటికి (1934) గేయరచన అపురూపం కరీంనగర్ జిల్లాలో ఇదే మొట్టమొదటి ఆధునిక గేయం రామసింహ కవి గేయాలున్నా అవి భక్తి కీర్తనల నుండి ఎదిగి వచ్చినవి - సామాజిక విమర్శలు లింబారెడ్డిగారి కవిత ప్రకృతి వర్ణన ముత్యాలసరాలు ఛందస్సులో ఉంది సారస్వత జ్యోతి 54 సంచికలో వీరిదో కథ ఉంది గోలకొండ, కాకతీయ, తెలుగు అప్పటి పత్రికలు రెడ్డిగారి వైద్య రచనలు ప్రచురించాయి

**పుస్తకాల వివరాలు విషములు తచ్చికిత్సలు'** వైద్య గ్రంధం విష జంతువుల సరీసృపాల కాట్లు, విష పదార్థాల వలన ఏర్పడే ప్రమాదాల లక్షణాలు వానిని నివారించడానికి అనుసరించవలసిన పద్ధతులు, వాడవలసిన ఔషధాలు ఈ గ్రంధంలో ఉన్నాయి [1] తమ పుస్తక ప్రచురణ సంస్థ 'విజ్ఞాన ప్రచారిణీ గ్రంధమాల' ద్వారా ఈ పుస్తకాన్ని ప్రచురించారు అప్పటికి విజ్ఞాన చంద్రికా గ్రంధమాల, ఆంధ్ర ప్రచారిణీ గ్రంధమాల తెలుగు పుస్తకాలను ప్రచురించేవి ఆ రెండు పేర్ల సమైక్య రూపమే వీరి విజ్ఞాన ప్రచారిణీ గ్రంధమాల

గృహవైద్యం పై శీర్షికతో చిట్కా వైద్య విషయాలు కొన్ని పత్రికలో ప్రచురితమైనా అవి పుస్తక రూపంలో వచ్చీరాకముందే వారి ప్రచురణ సంస్థ నిలిచిపోయింది

రజాకార్ల అల్లరి పోలీస్ యాక్షన్‌ల కాలం (1947 - 48) నుండి గ్రామ రాజకీయాల కారణంగా రెడ్డిగారి కలం మూగపోయింది [2] 1976 నుండి తిరిగి సాహిత్యరంగంలో విజృంభించారు ఆ మధ్యకాలంలో వ్యవసాయం, ఉచిత వైద్య సేవతో కాలం గడిపారు వారికి పంటచేలు, ఫల వృక్షాలు ఆ తరవాత కాలంలో వచ్చిన సేద్యం వైద్యం అపురూప గ్రంధం వందల కూరగాయలు, ఆకుకూరలు మొదటి భాగంగా ప్రచురించారు పువ్వు కూరలు - దుంపలు రెండవ భాగం వచ్చింది పండ్లు రసాలు

---

1 ఈ పుస్తకం అచ్చుప్రతిని కొన్నేండ్లక్రితం నేను చూసినా ఈ వ్యాసరచనా కాలంలో చూడలేకపోయాను

2 1975 84 మధ్యకాలంలో 8 ఏండ్లు ఉద్యోగం కారణంగా నేను రెడ్డి గారి నెమిలికొండలో ఉండడం జరిగింది నా స్నేహమే వారి రచనా పునరుజ్జీవనానికి కారణమని రెడ్డిగారనేవారు

మూడవభాగం, పచ్చళ్ళు ఊరగాయలు నాలుగవ భాగంగా కూర్చారు అవి రచయితకు మంచిపేరు తేవడంతోపాటు ప్రజల్లో ఆయుర్వేదం పై అభిమానాన్ని పెంచాయి

మొక్కల ఫలపుష్పాదుల రూప గుణదోషములు, పోషక విలువలు, వాడవలసిన విధానాలతో పాటు వాటిని సాగు చేయు పద్ధతులు చీడపీడల నివారణ మార్గాలు వివరించడం వీరి రచనలో వైశిష్ట్యం వీరి ఈ పుస్తకాలు వైద్యులకు వ్యవసాయదారులకే కాక సామాన్య విద్యావంతులకు కూడా ఉపయుక్తాలు ప్రతి శీర్షికా పదానికి సంస్కృత, హిందీ, ఉర్దూ, అరబ్బీ, లాటిన్, ఇంగ్లీషు మొదలగు నామాలు సూచించారు చరక సుశ్రుత సంహితల శ్లోకాలు ప్రమాణంగా ఉదహరించారు ఆధునిక విజ్ఞానశాస్త్రకారుల అభిప్రాయాలను కూడా తెలిపారు ఆయుర్వేద వైద్యాన్ని అల్లోపతి వైద్యంతోనేకాక హోమియో యునానీ ఔషధ చికిత్సా విధానంతోనూ పోల్చి వివరించారు

ఈ మొదటి రెండు పుస్తకాలను కరీంనగర్ జిల్లా కలెక్టర్‌గారు ప్రచురించారు

మూడవ పుస్తకం **'ఆరోగ్యం-సౌభాగ్యం'** రోగ నిరోధక ఆహార విహారాలను వివరిస్తూ అందుకు తీసుకోవలసిన జాగ్రత్తలను గూర్చి సూచనలిస్తూ రచింపబడింది ఇది 1992లో తెలుగు అకాడమీ హైదరాబాద్‌వారు జనరంజక గ్రంధమాలలో ప్రచురించారు

**నిండ నూరేండ్లు బ్రతకాలంటే** (ప్రివెన్షన్ ఈజ్ బెటర్ దేన్ క్యూర్) అనే సూత్రంతో శారీరకారోగ్యానికి దార్ఢ్యతకు తీసుకోవల్సిన ముందు జాగ్రత్తలను సూచిస్తూ రచించారు ఇదే రెడ్డిగారి చివరి రచన బుక్‌లెట్

రెడ్డిగారి అముద్రిత **'స్వీయచరిత్ర'**[3] వారి సుదీర్ఘ జీవిత యాత్రలోని సాహిత్య రాజకీయ లలితకళల వైద్య వ్యవసాయాది విషయాలతో కూడి ఉంది **"వైద్య పారిభాషిక పద నిఘంటువు"** తెలుగు సాంకేతిక పదాలకు సమానార్థకాలైన నాలుగైదు భాషల పదాలు ఉన్నాయి [4] ఇది డాక్టర్లకు, వైద్య విద్యార్థులకు చాల ఉపకరించే గ్రంధం

బహుముఖ ప్రజ్ఞాశాలి అయిన లింబాద్రి రెడ్డిగారు ఆంధ్రభాషాభిమానంతోపాటు, ఆంధ్రజాత్యభిమానం, కళాసాహిత్యాభిమానం కలవారు మరో విచిత్ర విషయమేమంటే రెడ్డిగారు స్వర్ణకారక విద్యను సాధించాలనే సంకల్పంతో సాధుసన్యాసుల సాంగత్యంతో ఏండ్ల తరబడి కొండగుహల్లో గడిపారు వనమూలికల సేకరణకు ఆటవికుల స్నేహంతో అడవుల్లో సంచరించారు వాదభ్రష్టో రసశ్రేష్ట అని ఆయుర్వేద వైద్యులుగా రూపొందారు

రెడ్డిగారిని గురించి ప్రముఖుల అభిప్రాయాలిట్లున్నవి

దాశరథిగారి అభిప్రాయం "ఏక వేదిక నుండి డా లింబాద్రిరెడ్డిగారి ఈ గ్రంధం మరియు నా కవితా సంపుటి 'ధ్వజమెత్తిన ప్రజ' అవిష్కరించబడ్డాయి ఇది అదృష్టం అలనాడు స్వాతంత్ర్య సమర పోరాటంలో కూడా కలిసిమెలసి సాహిత్యంగా శారీరకంగా పోరాడిన వారమే "విజ్ఞాన ప్రచారిణీ" విజ్ఞాన భాండార మనదగిన వీరి గ్రంధాన్ని ప్రతి అక్షరాస్యుడు చదువుకొని దైనందిన జీవితంలో లాభపడవచ్చును [5] 1182, హైదరాబాద్

దేవులపల్లి రామానుజరావుగారి అభిప్రాయం "ఈ గ్రంధమాల సంపాదకులు డాక్టర్ లింబాద్రిరెడ్డిగారు బహుముఖమైన ప్రతిభగల వయోవృద్ధులు వ్యవసాయము, వైద్యములో వారు ప్రవీణులే కాక తెలంగాణా సాహిత్య రంగములో సుప్రసిద్ధులు తెలంగాణాలో వారు పాల్గొనని జాతీయోద్యమమే లేదనినచో అతిశయోక్తి కాజాలదు సుమారొక అర్ధ శతాబ్దికి పైగా వారు దేశసేవ

---

3 కవి గారి మిత్రులైన మలయశ్రీ చంజర్ల 505 469 గారి వద్ద ఉంది

4 కవిగారి ఏకైక పుత్రులైన పి నర్సింహారెడ్డి, రిటైర్డ్ ఎస్ పి నెమిలికొండ గారి వద్ద ఉంది

5 డా॥ పి ఎల్ రెడ్డి గారి 'సేద్యం - వైద్యం' మొ భా ద్వితీయ ముద్రణ పీఠిక నుండి

భాషాసేవ చేస్తూ ఉపయోగకరమైన జీవితాన్ని గడుపుతున్నారు [6]

ఇంకా ప్రొఫెసర్ డా॥ సి నారాయణరెడ్డి, ఆచార్య డా॥ బి రామరాజు, కవి జె బాపురెడ్డి, వి కేశవరావు, గీట్ల జనార్ధనరెడ్డి అద్దూరు రామచంద్రారెడ్డి అడిషనల్ డైరెక్టర్ ఆఫ్ అగ్రికల్చర్ ఆంధ్రప్రదేశ్ ఇండియన్ మెడిసన్ విజయవాడ ప్రశంసలు వీరి 'సేద్యం వైద్యం' గ్రంధం తొలి రెండు భాగాల మలి ముద్రణ గ్రంధంలో ఉన్నాయి

ప్రముఖ గేయకవి కాళోజి హన్మకొండ, ప్రొ జి ఎస్ రెడ్డి తిరుపతి మొ॥ లగు ప్రముఖులు రెడ్డిగారికి మిత్రులు పద్యకవి గార్ల పాటి రాఘవరెడ్డి వరంగల్లుగారితో ఏర్పడిన సాహిత్యమైత్రిని బట్టి వారితో వియ్యమందారు లింబాద్రిరెడ్డిగారు సంపూర్ణ సాహిత్యమూర్తి వివిధ రంగాలలో సమాజ సేవ కావించి తరించిన సార్థక ధన్యజీవి మాన్య పురుషుడు డా॥ పి ఎల్ రెడ్డి గారు

**3 'చేనేత పితామహ' గుంటక నరసయ్య - గోపాల పురం,** మ బెజ్జంకి 1903 - 1989



సామాన్యుడుగా పుట్టి స్వయంకృషితో సమాజసేవతో అంచెలంచెలుగా పైకెదిగి మాన్యుడైన విశిష్ట వ్యక్తి గుంటక నరసయ్య పంతులుగారు వారు లచ్చంగా గాంధేయవాది వేషంలో దేశీయత, భావంలో జాతీయత, భాషలో నమ్రత మనస్సులో స్వచ్ఛత కలవారు స్వకుల పద్మశాలి సంఘోద్ధరణ, నాణ్యమైన చేనేత వస్త్రోత్పత్తి వ్యాప్తి కావించడానికి తమ ఎనభై ఏడేండ్ల జీవితంలో అరవై యేండ్లకాలం అహర్నిశలు కృషిచేశారు

సరళగ్రాంధిక భాషలో తెలుగు వచన రచనలు వెలయించారు వీరి రచనల పేర్లివి

1 విచిత్ర జగతి - 1936, 2 భృగ్వాదుల ప్రభావము 1937, 3 భావలింగశతక వ్యాఖ్యానం 1975, 4 సంక్షిప్త పద్మశాలి వంశచరిత్ర 1977, 5 భృగ్వాదులు (స ప వ చరిత్ర) 1980

"పద్మశాలి" పత్రికకు సహాయ సంపాదకులుగా, 'నేత మాస పత్రికకు 1953 సంపాదకులుగా, 'పద్మజ్యోతి' మాసపత్రికకు 1981 ప్రోత్సాహకులుగా - పలు పత్రికలకు రచయితగా పనిచేశారు

**జన్మవంశాదికాలు** నరసయ్యగారు పద్మశాలి కులజులు కరీంనగర్ సమీపంలోని గోపాలపురం స్వస్థలం హుస్నాబాద్ తాలూకాలోని అక్కన్నపేట భూస్వాముల కోరికగా వీరి తండ్రి రాజయ్యగారు చేనేత వస్త్రాలు తయారుచేసి ఇవ్వడానికి సకుటుంబంగా మకాం మార్చారు అక్కడే పంతులుగారు 1903లో జన్మించారు తల్లి సాయమ్మ నరసయ్యగారికి ఒక అన్న, ఒక తమ్ముడు, ఆరుగురు అక్కలు ఇద్దరు చెల్లెళ్ళు సామాన్య ఆర్థిక స్తోమతకల కుటుంబం సంపాదనకంటే సంతానమే భాగ్యమని భావించే కాలం అప్పుడు ప్రభుత్వ పాఠశాలలు తక్కువ. అక్కన్నపేటలో అక్షరాభ్యాసమేని లేక ఆటపాటలతో పనిపాటలతో నరసయ్యగారి బాల్య కౌమారాలు గడిచాయి ఓ భూస్వామి పిల్లలకు చదువు చెప్పవచ్చిన పంతులు వద్ద పదమూడవ యేట అక్షరాలు దిద్దాడు అదీ నాలుగైదు మాసాలే అంతలో విషజ్వరాలు వ్యాపించి తాను జ్వరంపాలై చదువు నిలచిపోయింది కరువు వ్యాపించింది తండ్రి మరణించారు

అన్నలతోపాటు బ్రతుకు తెరువుకోసం మేనమామల నివాస స్థలమైన మహారాష్ట్రలోని అహ్మద్ నగర్ 1918లో వెళ్ళాడు నేత పని చేస్తూనే స్వయంగా దొరికిన ప్రతి పుస్తకాన్ని చదువుకోసాగాడు ఈ ప్రాంతం నుండి వెళ్ళిన కళాకారుల తెలుగు యక్షగాన నాటకాలు చూసేవాడు అట్లా వీరి విద్యావికాసం జరిగింది ఉచిత వయోజన పాఠశాల నారంభించాడు తమ జాతి భృగు వంశ చరిత్ర హరికథ

6 రెడ్డిగారు అంకితం పొందిన మలయశ్రీ 'పల్లె సీమ' గేయకావ్యం పీఠిక నుండి 1978

చెప్పసాగాడు, భారతం పురాణం కాలక్షేపం కావించి విద్యను పెంచుకుంటూ జనానికి పంచాడు ఇదంతా మహారాష్ట్రలో ప్రవాసాంధ్రులకు కావించిన తెలుగు భాషా సేవ, అప్పుడు నేత కార్మికులుగా పద్మశాలీలే మహారాష్ట్రలో ఉన్నారు కనుక ఆ ప్రయోజనం ఎక్కువగా వారికే దక్కింది [1]

**జాతి సేవ** పంతులుగారు 1920లో గాంధిగారి దేశభక్తి ఆదర్శాలకు కట్టుబడి ఖద్దరు ధరించారు స్వజాత్యున్నతికి చేనేత పరిశ్రమాభివృద్ధికి కృషిచేయనారంభించారు పూనా, బొంబాయి, షోలాపూర్ మొ॥ నగరాల్లో హరికథా కాలక్షేపం చేస్తూ కులప్రశస్తిని చాటడమే కాక అంధ విశ్వాసాలను, కులపెద్దల కుచ్చితాలను ఖండిస్తూ ఉత్తమ గుణ ప్రబోధం కావించేవారు

**తప్పిపోయిన సన్యాసం** భగవద్గీత పంతులుగారికి 1926 నుండి నిత్యపారాయణ గ్రంథం అయన హిమాలయాలకు వెళ్ళి తపశ్చర్యలో కాలం గడపాలనుకున్నారు కాని కులపెద్దల కోరికగా ఆ ప్రయత్నాన్ని విరమించుకొని స్వజాతి కులవృత్తి సేవాభివృద్ధులకే జీవితాన్ని అంకితం చేశారు 'మానవసేవయే మాధవసేవ' అనే వివేకానందస్వామి సూక్తి పంతులుగారికి ఆదర్శం త్రికరణ శుద్ధిగా సత్యసంధతతో మెదలాలనే గాంధీజీ ప్రబోధం ప్రేరణ మహారాష్ట్రలో ఉన్న కాలంలోనే వీరి నాలుగు గ్రంథాల్లోని మొదటి రెండు పుస్తకాలు రచించి వదాన్యుల సహకారంతో బెజవాడలో ముద్రించారు 1945 నుండి వీరి సేవాకార్యక్రమాలు నైజాం తెలంగాణా ప్రాంతానికి విస్తరించాయి సభలు సంఘాలు నీతి ప్రబోధం జాతి సంస్కారం వీరి కార్యక్రమాలు

**పుస్తక పరిచయం**

**1 విచిత్ర జగతి** 1936 ముద్రణ ఇది స్వజాత్యుద్ధరణం కోసం రచించపబడిన పుస్తకం ప్రతి లభించలేదు కాని దీని గురించిన ప్రకటన వీరి రెండవ పుస్తకమైన 'భృగ్వాదుల ప్రభావము' ముఖ పత్రం 4వ పుటపై ఇట్లుంది 'ఇందు ఇప్పుడు ప్రపంచమందున్న విద్యాధికులు, విద్యావిహీనులు చేయు విచిత్ర చర్యలు బహుచక్కగా వివరింపబడ హిందువుల శ్రేష్టత్వము ఋజువు చేయబడినది ఎల్లరు చదువదగిన గ్రంథము' వెల- 2 అణాలు

**2 భృగ్వాదుల ప్రభావము** 1937 ముద్రణ 180 పుటలు 6 ప్రకరణాలు ఈ వచన పుస్తకంలోని 40 పుటలు పద్మశాలి పత్రికా సంపాదకులైనతాడిపర్తి శ్రీరాములు మంగళగిరి గారు సవరించినట్లు పీఠికలో ఉంది కాబట్టి పంతులుగారి రచనా విన్యాసావలోకనానికి తర్వాతి భాగంలోని ఒక ఘట్టం చూపబడుతున్నది

" ప్రశ్న మీరనునట్లు పురాణములు సత్యగ్రంథములేయైన శ్రీ దయానంద సరస్వతులవారేల ఖండన జేసిరి?

ఉత్తరువు వారు పురాణముల ఖండన జేయలేదు పురాణములలో నిటీవల గలిపించిన దోషముల ఖండన జేసినారు కావలసిన విమర్శించి చూడుము ఇప్పుడు మనము కూడా అందులోని సత్య విషయములనే యొప్పుకొనుచున్నాము అదిగాక సృష్ట్యాదులు వంశాదులు, గోత్రము, ప్రవర, సూత్రము, శాఖ వీనిలో కల్పితము జేయుటకు గూడ నెవరికి సాధ్యముగాదు అవి వేదోక్తమగుటచే

---

1 పంతులుగారు కరీంనగర్ వారని మొదట తెలియజేసి సంక్షిప్త వివరాలు అందిచ్చినవారు గోపాల్‌పూర్ వాస్తవ్యులైన వాసం శివనారాయణ, తెలుగు లెక్చరర్ కరీంనగర్ గారు
పంతులుగారి జీవితవిశేషాలు తెలుపటంతో పాటు వారి 'భృగువంశాదులు' గ్రంథాన్ని, అమృతోత్సవ సంచికను ఇచ్చినవారు ఎక్కలదేవి లక్ష్మణ కోరుట్ల గారు అమృతొత్సవ సంచికలోని ప్రముఖుల వ్యాసాలు, గుంటక వారి స్వీయపరిచయం వ్రాయడానికి అమితంగా తోడ్పడ్డాయి రచయిత

మార్చుట కెవరికిని వీలుగాదు ఇప్పటికి మనము గూడ నా వేదాభిప్రాయము ననుసరించియే నడుపవలయును" భృప్ర పుట 45

భృగుమహర్షి తమ కుల మూల పురుషునిగా మ ర్కండేయుని కులదైవంగా అతని పుత్రుడైన భావనర్షి సంతానమే తామని పద్మశాలీయులు భావిస్తారు ఆ విషయాలన్నీ పురాణ గాథలతోసహా నరసయ్య పంతులుగారు ఆరు ప్రకరణాల్లో వివరించారు ఆరవది 'కర్తవ్యం' ప్రబోధం 137 నుండి

ఇందులో బీద గురువులను 'దాంబికుల మోసముల' నీచ స్వార్థ వర్యల ఖండిస్తూ (166) తమ జాతికి 'అభిమాన హీనత్వము, ప్రజ్ఞారాహిత్యము, దుర్బలత్వము, దురాచారము, దారిద్ర్యము, సోమరితనము, గతిహీనము పశుప్రాయము మొదలగు చెరుపులకు వీరి బోధలు పుట్టినిల్లు (168) అని అన్నారు వీరు మంత్ర తంత్రాల చిల్లర దేవతల పూజల ఖండించారు కులపెద్దల కుటిల చేష్టలను ఖండించి ఎదిరించాలన్నాడు కూనపులి మొదలగు ఉపకులాల పెత్తనాలు నిరసించాడు విద్య విలువను (177) ప్రబోధించాడు

గుంటుక నరసయ్య పంతులుగారి ఈ గ్రంథం ముగింపు "కందుకూరి వీరేశలింగం పంతులుగారి 'స్వీయచరిత్ర లోని తుది విన్నప ప్రసంగాన్ని తలపించే సంఘహిత వాక్యాలు కొన్ని ఇవి

"కుల మహాశయులారా! సోదర సోదరులారా! నేమిమ్ము చాల వరకు నొప్పించితిని, చాల కష్టపెట్టితిని ఎంత కష్టమైన ఇక మనము కన్నులు మూయుట తగదని కడపటికొక సారి వేడుకొనెదను ప్రపంచమందు బాగుపడ గూడదని యెవరు తలంతురు? ఎవరును తలంపరు లేక బాగుపడుడు అనిన యెవరొప్పుకొనరు అందరొప్పుకొందురు మొదట మనము మేలుకోవలె మెలుకొని మనను బట్టుకొనిన దుష్టములఖండింపవలె తరవాత విద్యాబుద్ధులు సంపాదింపవలె మన మంచి చెరుపులు మన చేతిలో నున్నవి ఇంతవరకు దుర్దశను తెచ్చిపెట్టుకొన్నది మనమే ఇక యుత్తమదశ బొందువారము మనమే అంతకుగల సామర్థ్యము మనలోనే యున్నది పద్మశాలీయుల హృదయములందు నిండిపోయిన అజ్ఞానమును తొలగించి వారి యంత కరణములందు సుజ్ఞానమను వెలుతురును గిలిపింపు మనియు, వారి పూర్వ ఘనత ఇప్పటి హీనత గోచరమగునట్లు జేసి ఉద్ధరింపుమనియు ఆపదోద్ధారకుడగు భగవంతుని ప్రార్థించెదను 1937 ఆ దేవుడేమి చేసెనో తెలియదు కాని, ఈ రచయిత మాత్రం మహారాష్ట్రలో ఉంటూనే నైజాం ప్రాంతంలో తెలంగాణాలో పలు సభలు ఏర్పాటుచేసి పద్మశాలి జాతిని మేల్కొలిపారు ఆంధ్ర కోస్తా రాయలసీమల పద్మశాలీయుల ఏకవేదికకు తెచ్చారు అఖిలభారత పద్మశాలి సంఘ సభలకు అధ్యక్షత వహించారు హైదరాబాద్‌కు మకాం మార్చారు హైకో ఆప్కో చేనేత సంఘాల అభ్యున్నతికి కృషిచేశారు కొండా లక్ష్మణ్ బాపూజీని తమకు తోడు చేసుకున్నారు

భావలింగ శతక వ్యాఖ్య దాదాపు 200 ఏండ్ల క్రితం పల్నాడు సీమలోని చెర్లగుడిపాడు గ్రామానికి చెందిన పద్మశాలి కవయిత్రి దార్లసుందరమ్మ గారు 'పాపభయ విభంగ భావలింగ' అనే మకుటంతో ఆలవెలది పద్యశతకాన్ని రచించారు దాన్ని మొదట కొండవీటి వెంకటకవి ముద్రించారు తర్వాత వరంగల్లు శైవులు రచయిత్రి పేరు లేక ముద్రించారు దానికి పంతులుగారు విచారించి స్వయంగా ప్రతిపద్యానికి తాత్పర్యం వ్రాసి 'భావలింగ' శతకాన్ని 75లో రచయిత్రి పేరుతో సహాముద్రించారు

ఆయన భాగ్యనగరంలోని రాజమహల్లాలో పద్మశాలి భవనం నిర్మించారు నల్లకుంట శంకర మఠం వెనుకగా 200 గృహాల పద్మశాలినగర్ నిర్మాణానికి కారకులైనారు సికింద్రాబాద్ ఇతర జిల్లాలలోని అనేక పద్మశాలి - చేనేత సంఘ భవనాలు - సభా భవనాలు కల్యాణమంటపాలు అనేక మార్కండేయ మందిరాలు, విద్యార్థి వసతి గృహాలు పంతులు గారి ప్రోత్సాహ సహకారాలతో రూపొందాయి

సాధుసంతుల కవి పండితుల సన్మానాలు కావించారు ఇట్లా పంతులుగారి సేవ ఆంధ్రప్రదేశ్ పద్మశాలి జాతి అభ్యున్నతికి ఎంతగానో తోడ్పడింది స్వగ్రామమైన గోపాలపురంలో స్వంత డబ్బు డిపాజిట్‌గా చెల్లించి జిల్లా పరిషత్ వారి గ్రాంటుతో పాఠశాల భవనాన్ని నిర్మింపజేశారు కరీంనగర్ జిల్లా పద్మశాలి భవన్‌ను విద్యార్థి హాస్టల్‌ను ప్రత్యేక శ్రద్ధతో రూపొందింపజేశారు తమ షష్ఠి పూర్తి సన్మాన నిధిని పేద విద్యార్థుల సంక్షేమ నిధికి సమర్పించారు

1975లో సికింద్రాబాద్ శ్రైమామతీ నాట్యకళా సమితి వారు పంతులుగారిని ఉత్తమ సంఘ సేవకునిగా ఘనంగా సన్మానించి ప్రత్యేక సంచిక వెలువరించారు 1964లో పంతులు గారి షష్ఠిపూర్తి సన్మానోత్సవ ప్రత్యేక సంచికను ముఖ్య అతిథిగా వచ్చిన ఉత్తర ప్రదేశ్ గవర్నర్ బూర్గుల రామకృష్ణ రావు గారు ఆవిష్కరించారు 1986లో పంతులు గారి అమృతోత్సవ సంచికను (80 ఏండ్లు సహస్ర చంద్ర దర్శనం పూర్తిచేసిన సందర్భమున వెలువరించిన సన్మాన సంచిక) ఆంధ్రప్రదేశ్ గవర్నర్ కుముద్‌బెన్ జోషి గారు ఆవిష్కరించారు బెజవాడ గోపాలరెడ్డి, దామోదరం సంజీవయ్య మొ॥ ప్రముఖులు వీరి సభలకు వచ్చారు కాటూరి, సివి సుబ్బన్న అవధాని వీరి సాహిత్య కవి సమ్మేళన సభలలో సన్మానితులు అనేకులు ప్రముఖ పీఠాధిపతులు ప్రత్యేకంగా వీరి ఆరాధనలందుకున్నారు

ఇట్లా గుంటక నరసయ్య పంతులు గారి ప్రజాహిత కార్యక్రమాలు చూస్తే వారు వామన రూపం నుండి క్రమంగా త్రివిక్రమావతారానికి ఎదిగిన వైనం తెలిసి వస్తుంది

పంతులు గారి అమృతోత్సవ సంచికలోని అభినందనలతో కూడిన ప్రకటనలు ఆదిలాబాద్ నుండి నెల్లూరు వరకు, శ్రీకాకుళం నుండి అనంతపురం వరకు ఉన్నాయి ఇంకా బెంగళూరు బొంబాయి ప్రాంతాల అభిమానులు అందించినవి ఉన్నాయి ఇది పంతులు గారి ప్రత్యేక వ్యక్తిత్వానికి లోకప్రియతకు నిదర్శనం ' చేనేత పితామహ' గుంటక నరసయ్య పంతులు గారి రచనలు కరీంనగర్ జిల్లా తొలితరం సంఘ సంస్కార వచన సాహిత్యం ఆంధ్రప్రదేశ్ పద్మశాలి వారికి అవి తలమానికాలు

**4 బహూనూతుల సీతారామనాయుడు - హుజూరాబాద్**

జననం ప్లవంగ 1906 , మృతి 1967

సీతారామనాయుడు గారిది హుజూరాబాద్ వీరి పూర్వులు బొబ్బిలి ప్రాంతపు తెలగాలు యుద్ధ వీరులు కాబట్టి నాయుడు నామధారులు ఈ జిల్లాలో వీరికి ఎల్లాపులతో వివాహ బాంధవ్యాలున్నవి

నాయుడు గారు ఆ కాలంలో ఫస్టుగ్రేడు ప్లీడర్‌గా పనిచేశారు న్యాయవాదిగా తాలూకా కేంద్రమైన హుజూరాబాద్‌కు చుట్టూ పది గ్రామాల్లో మంచి పేరు సంపాదించుకున్నారు వీరు భారత స్వాతంత్ర్య తెలంగాణా విముక్తి జాతీయోద్యమాలలో క్రియాశీల పాత్ర నిర్వహించిన రాజకీయనాయకులు ఆ తర్వాత హుజూరాబాద్ మేజర్ గ్రామ పంచాయితీకి సర్పంచ్‌గా ఎన్నికోబడి పట్టణాభివృద్ధి కార్యక్రమాలతో ప్రజాభిమానం చూరగొన్నారు వీరు రాష్ట్ర స్థాయి కాంగ్రెసు పెద్దలతో గుర్తింపు పొందినారు

నాయుడు గారికి సాహిత్యం అభిమాన విషయం వచన రచనలు, వచన కవితలు రచించారు వీరి వ్యాసాలు కవితలు నాటి ప్రముఖ దిన వార పత్రికలలో ప్రచురింపబడినవి [1] చమత్కార సంభాషణ

1 నాయుడుగారి కూతురు కమల గారు, అమె చిన్న తమ్ముడు తండ్రిగారి వివరాలు చెప్పి, పేపర్ కట్స్ చూపారు కాని రచనలు మాత్రం లభించలేదు అధ్యాపక మిత్రులు శ్రీహరి, బి ఎస్సి, బి ఇడి , హుజూరాబాద్ గారు నాయుడుగారి కుటుంబ సభ్యులతో పరిచయం కావించారు

2 వేంకటప్పయ్య నాయుడు గారిని నేను కలుసుకోలేకపోయాను

- హాస్యం వీరి రచనలకు సహజాలంకారాలు రంగస్థలంపై తాను స్వయంగా రచించిన ఏక పాత్రలు నటిస్తూ, వ్యంగ్యభావ గర్భిత సునిశిత హాస్య భాషణంతో శ్రోతల-ప్రేక్షకుల కడుపుబ్బ నవ్వించడంతోపాటు కర్తవ్యాన్ని ఆలోచింప జేసేవారు ఉర్దూ భాషలో విద్యాభ్యాసం కావించినా ఆంగ్లభాష నేర్చినా తెలుగు సాహిత్యమంటే సీతారామా నాయుడు గారికి అత్యంతాభిమానం

నాయుడు గారి ముద్రిత రచనలు 1 ఇల్లందు కుంట రామాయణము 2 జాతీయ వాదం (గేయ కావ్యం), 3 కొత్త కొండ దేవస్థాన చరిత్ర (20 పుటలు వచనం)

ఇప్పుడు ఈ కృతులు అలభ్యాలు మొదటిది అధిక జనవ్యాప్తి పొందిన 'ఇల్లంతకుంట రామాయణ' యక్షగానమో వేరే రచనమో తెలియదు ఇది వచన రచన కానోపు ఎందుకంటే నాయుడు గారు యక్షగాన రచయిత అని, వారు కానీ వారిని తెలిసినవారు కానీ అనలేదు రెండవది గేయ కావ్యం ముద్రణ తేది తెలియకున్నా పుస్తకం పేరునుబట్టి భారత స్వాతంత్ర్యానికి పూర్వపు తెలంగాణా ఆంధ్రమహాసభల కాలపుదని (1921 50) చెప్పవచ్చు 1934 సిరిసిల్ల చతుర్థాంధ్ర మహాసభల నుండి ఈ జిల్లాలో రాజకీయ చైతన్యం ప్రసరించింది కావున వీరి జాతీయ వాద గేయ కావ్యం 1935 45 మధ్యకాలంలో విరచితం ముద్రితం అనుకోవడం అసంగతం కాదు చివరిది స్థల దేవాలయ చరిత్ర కొత్తకొండ దేవస్థానం వారు ముద్రించారు

సీతారామ నాయుడు గారికి 'హాస్యకళా ప్రపూర్ణ' అను బిరుదు ఇవ్వబడింది ధ్వన్యనుకరణ సామ్రాట్ నేరెళ్ళ వేణు మాధవ్ గారు నాయుడు గారి 'బుడబుక్కల పాత్ర' అభినయాన్ని విని ఆ మాటలు వ్రాసుకొని వెళ్ళారని నాయుడు గారి కూతురు రాజకీయనాయకురాలు సుంకరకమల చెప్పారు తమ అన్న వెంకటప్పయ్య నాయుడు బి డి ఓ స్టేషన్ ఘన్‌పూర్ గారికి నాన్నగారి వివరాలు తనకంటె ఎక్కువ తెలుసని నాయుడు గారి సోదరుని చిన్న కుమారుడు వెంకటేశ్వర్లు తెలిపారు [2]

సీతారామానాయుడు గారి జాతీయాభిమానం, దేశసేవ, సాహిత్య సృజన , నటన మొ॥ బహుముఖ ప్రజ్ఞలను 'ఆంధ్ర ప్రభ' పత్రిక (తేది 16 11 1964) ప్రశంసించింది సార్థక జీవనులైన సీతారామనాయుడు గారి మృతికి 1967 ప్రముఖ సాహితీవేత్తలతోపాటు అప్పటి ఆంధ్ర ప్రదేశ్ మంత్రులైన జె వి నర్సింగారావు, మర్రి చెన్నారెడ్డి వంటి ప్రముఖ కాంగ్రెసు రాజకీయనాయకులు సానుభూతి సందేశాలు పంపించారు

వీరి పాటలు శైలీ ప్రసన్నత కలవి కనులున్న గుడ్డివారికంటెఈ కవి అంధులైనా అక్షరసాక్షి కవికి కనులకంటే ముఖ్యం జ్ఞాన చక్షువు అలతి భాషాదోషాలున్నా క్షంతవ్యాలు ఈ వరకవి సహజకవిత భక్త జన మనోరంజని

5. **వాసం వెంకట్రాజు (వెంకట్రాజయ్య)** - గోపాలపురం, మం బెజ్జంకి, కాలం 1912 81

వెంకట్రాజంగారు పద్మశాలి చేనేత, వైద్యం, కుల పౌరోహిత్యం వృత్తులుగా జీవించి చివరి దశలో కరీంనగర్ గణేశ్‌నగర్‌కు మకాం మార్చారు ఆయన తండ్రి కొండయ్య కొడుకు (శరభయ్య) కొడుకు శివనారాయణ, ఎం ఏ కవిగారి వద్ద ఈ తాతగారు రచించిన ఒక వచన పుస్తకం వ్రాతప్రతి ఉంది ఈ పుస్తకం పేరు "త్రిగుణాత్మక ప్రభావ లక్షణము" రిజిస్టర్ సైజులో 24 పుటలు సోదర సోదరీ మణులారా ! అని ఆరంభమై, స్వకుల పురోహితుడు, అను మాటతో సమాప్తమైన ఈ లేఖా రూప కృతి కవి తలంపులో గ్రంథమే అనడానికి ఇందలి 24 పుటలోని రచయిత మాటలను బట్టి తెలుసుకోవచ్చు



"ఎందరో భక్తులు వ్రాసినవి మనము చదువుచున్నాము కాని, లక్షణములను తనంతట తానే గ్రహించలేని వారు సామాన్య జనులు వీటిని చిన్న పొత్తముల రూపమున నున్నచో సులభముగా గ్రహించెదరను భావముతో నిజానిజాలను, రహస్య విషయములను గూడ తెలియజేయు పద్యములలో శబ్దార్థములతో సూచనలు పూర్వులే వ్రాసి యున్నారు వాటిని సాధారణ జనుల వాడుక భాషలో వివరించి ప్రచార మొనర్చుటయే యీ గ్రంధ లక్ష్యము "

ఆర్యసమాజ ప్రభావంతో విరచితమైన ఈ ప్రసంగ వ్యాసలేఖా రూప పుస్తకంలో గుణలక్షణములు, గణములు, ప్రారబ్ధ కర్మఫలితాలు, నవగ్రహ సంచార ఫలితాలు, పాతివ్రత్యమహత్వం, విద్య విలువ, నరజన్మవైశిష్ట్యం, ఆచారాల ప్రాశస్త్యం మొ॥ విషయాలు సోదాహరణ సహితంగా సంగ్రహంగా వివరించబడినవి

కవి తమ ప్రబోధ ప్రవచనానికి బలకరంగా వేమన పద్యాలు, భగవద్గీత, నీతి శాస్త్రం శ్లోకాలను ఉదహరించారు కర్తృత్వం తెలియని మకుటంతో ఒక సీస పద్యముంది ఇదే మకుటంతో 'రామతారకదశరథరాజ తనయ' మరో పద్యం రావికల్ పురుషోత్తమ దాసు వ్రాత ప్రతిలో కనిపించింది కవి పేరు తెలియని నాలుగైదు పద్యాల్లో రెండు చూడండి

1 తప్పులేకుండ నుండిన దైవసముడు, దైవభక్తుల నిందించి తగవుదలప
తర తరంబులకును ఘోరనరకమౌను, తానె గుడువంగ దెలియును దైవమహిమ

2 ఒకరి మేలు గూర్చి యోర్వలేక నరుడు, వేయిజేయు తానె వెతలు గుడుచు
కడకు చింతజేయ గలుగదు లాభంబు, వాడుకొనెడి జనుల చూడుడయ్య

వీరు కవి కాదు అల్పుడెపుడు పల్కు పద్యం - మొదటి రెండు చరణాలు మార్చినవి 'గంగానది పారు' అని గణభంగంతో రాసుకోవడం అందుకు సాక్ష్యం వాసం వెంకటరాజంగారి ఈ వచన రచన ఇంచుమించు ఈ శతాబ్ది నడిమి కాలానిది వీరు నిజాం వ్యతిరేక ఉద్యమాల్లో పాల్గొన్న సాహసి సంఘ సంస్కారభావ సౌజన్యశీలి

## సాహితీ సమాలోకనం

**చరిత్ర** భారత దేశ చరిత్రలో ఈ ఇరువదవ శతాబ్ది పూర్వార్ధం అత్యంత ప్రాధాన్యత కలిగిన కాలం 1911లో ఆంగ్ల పాలకుల భారత రాజధాని కలకత్తా నుండి ఢిల్లీకి మారింది అంతకు ఆరేండ్లు ముందుగనే 1905లో బెంగాళ్ విభజన సంవత్సరంలోనే, కరీంనగర్ జిల్లా కేంద్రం వెలిగందుల నుండి కరీంనగర్‌కు మార్చబడింది [1] అంతకుపూర్వం కరీంనగర్ 'అరిపిరాల' అనే చిన్న గ్రామం [2] రెండవ అరికేసరి ధారపయ్యకు దానమిచ్చిన 'అరిపణపల్లి' ఇదేనేమో [3]

1 కరీంనగరం మండల చరిత్ర - 1981, ఈనాడు ప్రత్యేక సంచిక - 1993
2 ధూపాటి వేంకటరమణాచార్యుల వ్యాసం సారస్వత జ్యోతి 1954
3 పి పి పరబ్రహ్మ శాస్త్రి Inscriptions of Karimnagar Dist 1974 P No 1 P 3
4 డా జె పి రమణయ్య Temples of South India
5 మొదటి ఆంధ్ర మహాసభ 3 మార్చి 1930 జోగిపేట, అధ్యక్షులు - సురవరం ప్రతాపరెడ్డి
రెండవ ఆంధ్ర మహాసభ డిసెంబర్ 1931 దేవరకొండ, అధ్యక్షులు బూర్గుల రామకృష్ణ రావు
మూడవ ఆంధ్ర మహాసభ 1934 - ఖమ్మం - ఆ పులిజాల హన్మంతరావు
నాల్గవది సిరిసిల్ల, అయిదవది మహబూబ్‌నగర్, ఆరవది నిజామాబాద్‌లో జరిగాయి

1897లో కరీంనగర్ జిల్లాలో ఉన్న 9 తాలూకాల్లోని మూడు తాలూకాలు ఈ జిల్లా కేంద్రం మారిన 1905 సం లో పొరుగు జిల్లాలకు (అదిలాబాద్ మెదకు) మారాయి అవి చెన్నూరు, లక్షెట్టి పేట, సిద్దిపేట ఇప్పుడు వరంగల్ జిల్లాలో ఉన్న పర్కాల 1905 నుండి 1953 వరకుకరీంనగర్ జిల్లాలోనే ఉండేది [4]

తిలకు, గాంధీ, భగత్‌సింగ్, సుభాశ్చంద్రబోసు మొ॥ ప్రముఖుల స్వాతంత్ర్య పోరాటాలు ఈ కాలానివే గాంధీజీ సహాయనిరాకరణ సత్యాగ్రహ ప్రభావాలు, జాతీయాభిమాన సంఘ సంస్కరణ భావాలు తెలంగాణాపై బాగా ప్రసరించాయి

అల్లూరి సీతారామరాజు తీవ్రవాద పోరాటం కోస్తా ప్రాంతానిది కోస్తా రాయలసీయల్లో జరిగినటువంటి తిరుగుబాటు ఉద్యమాలు ఈ జిల్లాలో లేవు కొమరం భీం గిరిజన పోరాటం 1940 అదిలాబాద్ జిల్లాది బోసు ఆజాద్‌హిందూ ఫౌజ్‌లోనూ కోస్తాంధ్రవాళ్లు ఒకరిద్దరు చేరినారు కాని ఇటువాళ్లు లేరు గాంధీజీ సత్యాగ్రహ పోరాటంలో మాత్రం ఇక్కడివాళ్లు పాల్గొన్నారు

1922లో హైద్రాబాద్ ఆంధ్ర జన కేంద్ర సంఘం ఏర్పడి 1928లో ఆంధ్రమహాసభగా మారింది అది క్రమంగా రాజకీయ ప్రాధాన్యతను సంతరించుకుంది 1935 సెప్టెంబర్ 6న, మాడపాటి హన్మంతరావు గారి అధ్యక్షతన సిరిసిల్లలో జరిగిన చతుర్థాంధ్రమహాసభ ఈ జిల్లా రాజకీయచైతన్యానికి చాల దోహదం చేసింది [5] 1944 భువనగిరి ఆంధ్రమహాసభ కమ్యూనిస్టు కాంగ్రెసు రెండు భాగాలుగా విడిపోయింది కాంగ్రెసు విభాగం జాతీయాంధ్ర మహాసభగా పేరు మార్చుకుంది అంతకు ముందే 1937లో స్టేట్ కాంగ్రెసు ఏర్పడి ఉంది కాంగ్రెసు ఉభయసంస్థల్లో కరీంనగర్ ప్రముఖులనేకులు చెరారు కమ్యూనిస్టు సంస్థకు మూల నాయకులుగా కరీంనగర్ జిల్లా పోల్కంపల్లి నర్సింగారావు, బద్దం ఎల్లారెడ్డిగారలు నిలిచారు

నైజాం జాతీయోద్యమం అటు ఢిల్లీ బ్రిటిష్ ప్రభుత్వానికి, ఇటు హైదరాబాద్ ముస్లిం ప్రభుత్వానికి వ్యతిరేకంగా నడిచింది

1901లో హైద్రాబాద్‌లో శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయ గ్రంధాలయ స్థాపన జరిగింది 1911లో విజయవాడ గ్రంధాలయం మొదలైంది ఆ వరుసలో 1922 - హుజూరాబాద్, 1923 మంథని, కరీంనగర్, 1924-వేములవాడ, 1925 సిరిసిల్ల పోలంపల్లి, 1926-కోరుట్ల, మహదేవపురం, జమ్మికుంట, తోటపల్లి, నెమిలికొండ, రేకొండ, మానాకొండూరు, పెద్దఎల్లి, బెజ్జంకి, రుద్రంగి, కానిపర్తి దాదాపు 20 గ్రంధాలయాలు స్థాపించబడి దేశభక్తిని, ఆంధ్రసాహిత్యానురక్తిని వ్యాప్తి చేశాయి [6]

1918లో ఉస్మానియా విశ్వవిద్యాలయం రూపొందింది [7] హైద్రాబాద్‌లో మొదటిసారిగా 1922లో మోటారు వాహనాల సౌకర్యాలు, 1923లో విద్యుచ్ఛక్తి తంతి శాఖలు, (1928లో కాజీపేట, బెంగళూరులకు తంతి సంబంధాలు) 1935లో విమానసౌకర్యం ఏర్పడ్డాయి [8]

---

6 రేపాల నర్సింహరాములు 'సజీవ కిరణాలు' 1993 పు 16 18

7 1926లో ఆంధ్ర విశ్వవిద్యాలయం విశాఖపట్టణంలో ఏర్పడింది ఆంధ్రప్రదేశ్‌లోని మిగతా విశ్వవిద్యాలయలన్నీ 1950 తర్వాతనే

8 దేవులపల్లి రామానుజరావు "యాభై సంవత్సరాల జ్ఞాపకాలు" 1929 79 ము 1981 పు 34

9 సజీవ కిరణాలు, యాభై సంవత్సరాల జ్ఞాపకాలు

10 జె గౌతమరావు, ముల్కనూరు కిషన్‌రెడ్డి, వి కొండలరావు, కటంగూరి ప్రకాశరెడ్డి, వందలమంది ఇందులో భాగస్వాములు

1929లో కాజీపేట నుండి బలార్షా నాగపూర్‌లకు ఏర్పడిన రైలుమార్గం కరీంనగర్ జిల్లాలోని ఉప్పల, జమ్మికుంట, పెద్దపల్లి, రామగుండంల మీదుగా వెళ్లింది

1929లోనె మెటుపల్లి, ఖాదీ సంఘం ఏర్పడింది తెలుగు, గోలకొండ, శోభ మొ॥ తెలంగాణా పత్రికలు ఈ కాలపువే

1922లో ఇనుగుర్తి పుస్తక ప్రచురణకు జోడీగా కరీంనగర్ నెమిలికొండలో డా పి లింబాద్రి రెడ్డి గారు విజ్ఞాన ప్రచారిణీ గ్రంధమాల స్థాపించి 1940 వరకు 21 గ్రంధాల ప్రచురించారు

1934 'గోలకొండ కవుల సంచిక'లో నలుబదికి పైగా ఇక్కడి కవులు కవితలున్నవి

1943లో హైదరాబాద్‌లో 'ఆంధ్ర సాహిత్య పరిషత్తు' ఏర్పడింది అది తెలంగాణా భాషా సంస్కృతుల పరిరక్షణ కోసం చాల కృషి చేసింది [9] దాని ప్రభావం ఈ జిల్లాపై ప్రసరించి ఇక్కడ పరిషత్తు పరీక్షలు పలుచోట్ల నిర్వహించారు

15వ, ఆగష్టు 1947న భారతదేశానికి స్వాతంత్ర్యం లభించినా అప్పుడు తెలంగాణా మాత్రం నిజాం నిరంకుశ ఇస్లామీ మత సంస్థాన పాలనలోనే ఉంది రాజాకార్లు అనబడే ముస్లిం మత దురభిమానుల హిందూ ద్వేష విధ్వంసకాండ ఆ కాలంలో చెలరేగింది ఆ భయంతో ఆస్తి పరపతి కలవాళ్ళు ఇళ్లు వాకిళ్లు వదలి దూర ప్రాంతాలకు వెళ్లి తలదాచుకున్నారు

ఉత్సాహం ఉద్రేకం కల తెలంగాణా వీరయువకులు నైజాం విముక్తికోసం సరిహద్దులు దాటి, చాందా విజయవాడ ప్రాంతాల్లో సాయుధ పోరాట శిక్షణ పొంది నిజాం సైన్యాల నెదుర్కునే సన్నాహాలు కావించారు [10] కొన్ని పోలీస్ స్టేషన్‌లపై నిజాం ప్రభుత్వోద్యోగులపై గెరిల్లా పోరాటాలు సాగించారు

1948 మార్చి 14న మాందాపురం గుట్టలపై పోరాట దళ సభ్యులకు నిజాం సైనికులకు జరిగిన పోరాటంలో అనభేరి ప్రభాకర రావు, సింగిరెడ్డి భూపతిరెడ్డి, దామోదర్‌రెడ్డి దళనాయకులతో సహా మరో తొమ్మిది మంది మరణించారు [11]

అప్పటి స్వతంత్ర భారత హోంమంత్రి వల్లభభాయి పటేల్ గారి సైనిక చర్య (13 సెప్టెంబర్ 1948)తో 17 సెప్టెంబర్ 1948 నాడు హైదారాబాద్ నిజాం భారత ప్రభుత్వానికి లొంగిపోయి నైజాం రాష్ట్రం విముక్తి పొందింది

రాష్ట్ర విముక్తి స్వచ్ఛంద సేనలు కొన్ని 1951 వరకు (అమృతలాల్ శుక్లా సిరిసిల్ల, మురళి గట్టెపలి, శ్యాంసుందర్‌సింగ్ పెద్దపల్లి, దామోదర్‌రావు-గుండి, జి మల్లేశం అంతకపేట మొ॥వారు)కమ్యూనిస్టు భావాలతో భూస్వామ్య వ్యతిరేకపోరాటం సాగించాయి

1952 జనరల్ ఎన్నికలతో హైదరాబాద్ రాష్ట్రంలో ప్రజాస్వామ్య ప్రభుత్వం నెలకొంది అయినా అప్పుడు కోస్తా ప్రాంతం మద్రాసు రాష్ట్రంలో, రాయలసీమ ప్రాంతం మైసూరు రాష్ట్రంలో, తెలంగాణా హైద్రాబాద్ రాష్ట్రంలో కలిసి ఉండేవి అప్పుడు హైద్రరాబాద్ స్టేట్‌లో కర్ణాటక మహారాష్ట్ర (మైసూరు బొంబాయి) జిల్లాలు కూడా కొన్ని ఉండేవి మూడు ముక్కలుగా విడిపోయి కొన్ని వందలేండ్లుగా వేర్వేరు పాలనల కింది ఉన్న తెలుగువాళ్ల తెలుగునేల, ఇప్పటి ఆంధ్రప్రదేశ్‌గా ఏర్పడడానికి మరికొన్ని ఏండ్లు ఆగక ఉద్యమాలు సాగించక తప్పలేదు (అక్టోబరు 1, 1953లో కర్నూలు రాజధానిగా ఆంధ్రరాష్ట్రం

11 రేపాల నరసింహరాములు 'సజీవ కిరణాలు" 1993

12 ఆంధ్రరాష్ట్రం కోస్తా రాయలసీమ కలయిక 1953లో ఏర్పడింది 1956 ఫస్టు నవంబర్‌న ఆంధ్రప్రదేశ్ అవతరణతో తెలంగాణా ఆంధ్రరాష్ట్రంలో కలిసింది

ఏర్పడింది అనంతరం 1956 నవంబర్ 1న హైద్రరాబాద్ కేంద్రంగా ఇప్పటి మన ఆంధ్రప్రదేశ్ అవతరించింది )[12]

**జిల్లా సామాజిక చరిత్ర** 1918లో హైదరాబాద్‌లో ఉస్మానియా విశ్వవిద్యాలయ స్థాపన జరిగినా 1950వరకు కరీంనగర్ పట్టణంలో ఉన్నవి కేవలం మూడే ఉన్నత పాఠశాలలు అవి ప్రభుత్వోన్నత బాలుర పాఠశాల, ప్ర ఉ బాలికల పాఠశాల, మిషన్ హైస్కూల్ ఒక్క కాలేజి కూడా లేదప్పుడు ఇప్పటి ఎస్ ఆర్ ఆర్ డిగ్రీ కళాశాల పి యు సి క్లాసులతో 1956లో ఆరంభమైంది జిల్లా కేంద్రంలో 3 సినిమా టాకీసులు మాత్రం వచ్చాయి

సర్కారీ ఉర్దూ పాఠశాలలు కూడా అధికభాగం ఈ అర్ధ శతాబ్ది కాలంలోనే ప్రారంభించబడ్డాయి బస్సు రైలు సౌకర్యాలతోపాటు ఇదే కాలంలో ముద్రణ యంత్రాలు వచ్చాయి

**సాహిత్య చరిత్ర** ఈ కాలంలో ఈ జిల్లా కవుల రచనలు అచ్చు పుస్తకాల రూపంలో 1922 నుండి వచ్చాయి

ఈ అర్ధ శతాబ్ది కాలంలో కరీంనగర్ జిల్లాలో మార్గ దేశి కవితా రచనలు పోటిపడి వచ్చాయి ఆంధ్ర ప్రాంతానికి సమ ఉజ్జీలనదగిన పద్యకావ్యాలు అప్పుడు ఇక్కడ రచింపబడినా ముద్రణ పొందినవి తక్కువ ఈ కాల ప్రముఖ కవుల పుస్తకాలనేకాలు 1950 తర్వాతనే ముద్రణ పొంది వ్యాప్తి చెందాయి కానీ, యక్షగాన సాహిత్యం మాత్రం అదే కాలంలో హైదరాబాద్ ప్రముఖ సంస్థలచే ప్రచురింపబడింది

కోస్తాలోవలె నవల నాటకం భావకవిత అభ్యుదయ కవితల వికాసం మాత్రం ఆ కాలంలో ఈ జిల్లాలో అంతగా లేదు ఆంగ్లభాషా సంపర్కం లేకపోవడం, ఉర్దూ విద్యామాధ్యమం కావడం నిజాం ప్రభుత్వ దమన నీతి అందుకు కారణాలనవచ్చు అప్పటి కవులు కూడా తమ రచనలలో నిజాం ప్రభు భక్తిని చాటుకునేవారు

ఈ కాలంలో ఈ జిల్లా నుండి వెళ్లి బొంబాయి రాష్ట్రంలో నేత కార్మికులుగా వున్న ప్రవాసాంధ్రులు మాతృభాషాభిమానంతోపాటు సాహిత్యాభిమానం చూపడం విశేషం

పూర్వ యుగాలలో వలె బ్రాహ్మణులో భట్టుమూర్తులో కాక ఈ కాలంలో నానా జాతుల వారు విద్యావంతులై తెలుగు గ్రంధాలు రచించడం ఒక గొప్ప మార్పు ఇది ఈ అర్ధ శతాబ్ది సాహిత్య సంక్షిప్త చరిత్ర ఇక బహుముఖాల ప్రతిభతో అనేక ప్రక్రియలలో పుంఖానుపుంఖంగా తెలుగు రచనలు వెలువడిన ఈ ఇరువదవ శతాబ్ది ఉత్తరార్థ సాహిత్యాన్ని చూద్దాం

# కరీంనగర్ జిల్లా తెలుగు సాహిత్య చరిత్ర

## మూడవ బాగం

## VI. ఇరువదవ శతాబ్ది ఉత్తరార్ధ సాహిత్యం : 1951 - 1995

### (సంక్షిప్త పరిచయం)

ఈ నలుబదైదేండ్ల కాలంలోనే తెలంగాణాలో తెలుగు సాహిత్యం వివిధ ప్రక్రియల్లో అధిక వికాసం పొందింది ఈ కాలంలోనే కరీంనగర్ జిల్లాలో తెలుగు పుస్తకాల రాశివాసి పెరిగింది రాష్ట్రస్థాయి గౌరవం పొందిన ప్రముఖ రచనలు సైతం ఇక్కడ వెలువడ్డాయి

చరిత్ర 15వ ఆగష్టు 1947 నాడు భారతదేశం స్వాతంత్ర్యాన్ని పొందినా తెలంగాణా నైజాం స్వేచ్ఛ పొందిన దినం 17 సెప్టెంబర్ 1948 అంత వరకు రాజ భాషగా ఉన్న ఉర్దూ స్థానంలో క్రమంగా ఇంగ్లీషు చోటు చేసుకుంది పాఠశాలల్లో ఉర్దూ మాధ్యమానికి బదులు తెలంగాణాలో తెలుగు మ ధ్యమంలో విద్యాబోధన ఆరంభమైంది

1953 అక్టోబర్ ఒకటిన ఆంధ్ర రాష్ట్రం ఏర్పడి కోస్తారాయలసీమ ప్రాంతాలేకమైనాయి దానిలో తెలంగాణా భాగస్వామ్యం లేకున్నా ఆనంద స్పందన మాత్రం పొందింది ఆ ఊపుతో ముందు చూపుతో ఇక్కడి రాజకీయనాయకులు, పత్రికాధిపతులు రచయితలు - కవులు విద్యార్థులు భాషా ప్రయుక్త విశాలాంధ్ర రాష్ట్ర సాధన కోసం పోరాడే స్ఫూర్తిని పొందారు ప్రాంతాలు పరిపాలనలు వేరైనా, భాషా సంస్కృతులు పురాచరిత్ర ఒక్కటైన కారణంగా తెలుగు మాట్లాడేవారి మధ్య సరిహద్దులు తొలగించి ఏక రాష్ట్రం సాధించడానికి సాగించిన ఉద్యమంలో ఆంధ్ర రాష్ట్రాంధ్రుల వలెనే తెలంగాణా పౌరులు రచయితలు కూడా ప్రముఖ పాత్ర నిర్వహించారు 1వ, నవంబర్ 1956న భాషా ప్రాతిపదికగా నేటి మన ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రం అవతరించింది

భాష తెలుగు విద్యా బోధన మాధ్యమంగానే కాక క్రమంగా ప్రభుత్వ భాషగానూ గుర్తింపు గౌరవం పొందింది ఆంధ్ర సారస్వత పరిషత్తుకు తోడుగా సాహిత్య అకాడెమీ 1956, తెలుగు అకాడెమీ 1968, తెలుగు విశ్వవిద్యాలయం 1983 తర్వాత క్రమంగా ఏర్పడి సాహిత్య వ్యాప్తికి కృషి చేశాయి - చేస్తున్నాయి పలు విద్యాలయాలు, కళాశాలలు, విశ్వవిద్యాలయాలు విద్యావ్యాప్తి కావిస్తున్నాయి తెలుగు దిన వార మాస పత్రికలు కొత్తగా వచ్చి సాహిత్య వ్యాప్తితోపాటు రచయితలకు ప్రోత్సాహాన్నిస్తున్నాయి పుస్తక ప్రచురణ సంస్థలు - విక్రయశాలలు ఈ సాహిత్యోద్యమంలో ప్రముఖ పాత్ర నిర్వహిస్తున్నాయి సినిమా రేడియో టెలివిజన్‌లు కూడా తెలుగు సాహిత్యవ్యాప్తికి తమవంతు సహకారాన్ని అందిస్తున్నాయి

కరీంనగర్ సాహిత్యం దేశ స్వాతంత్ర్యం తర్వాత రాష్ట్రంలోని ఇతర ప్రాంతాల్లో వలెనే ఈ జిల్లాలోనూ తెలుగు సాహిత్యం సృజన - ముద్రణ రంగాల్లో అమితంగా పురోగమించింది

1953లో ఈ జిల్లాలో కరీంనగర్ నుండి 'చైతన్యం' అనే సాహిత్య మాసపత్రిక 1955లో జగిత్యాల తాలూకా కేంద్రం నుండి 'జ్యోత్స్న' పేరుతో ఓ సాహిత్య మాస పత్రిక, 1954లో జిల్లా కేంద్రమైన కరీంనగరం పట్టణం నుండి 'సారస్వత జ్యోతి' త్రైమాసిక సాహిత్య పత్రిక వెలువడ్డాయి ఇవి కొన్ని సంచికలే వెలువడినా ఈ జిల్లా సాహిత్య ధిషణను ప్రోత్సహించాయి - ప్రదర్శించాయి

ఆ తర్వాత విద్యుల్లత గౌతమి జయంతి సత్యార్థి సాహిత్య పత్రికలు తెలుగు సాహిత్యవ్యాప్తికి అమితంగా కృషి చేశాయి విటిలో సారస్వత జ్యోతి విద్యుల్లత, జయంతి రాష్ట్రస్థాయి పత్రికలు మిగితావి గౌతమి, సత్యార్థి జిల్లా రచనలను మాత్రమే ప్రచురించే నియమం కలవి

ఈ ప్రాంతపు రాజకీయ సామాజిక సమాచార పత్రికలైన చిత్రిక రచ్చబండ జీవగడ్డ నవత మానేరు టైమ్స్, మంటలు కోల్‌బెల్టు, అభినందన మొ॥వి కూడా అడపాదడపా యథోచితంగా ఇక్కడి రచయితల కథలు, కవితలు, వ్యాసాలు కవుల పుస్తకాల పరిచయాలు ప్రచురిస్తూ తెలుగు సాహిత్యానికి ప్రోత్సాహాన్ని అందించాయి

'కరీంనగర్ జిల్లా తెలుగు సాహిత్య చరిత్ర అనే ఈ పరిశోధన వ్యాసం పరిధి చాల పెద్దది అయినా ఇంతవరకు క్రీ శ 950 నుండి 1950 వరకు వచ్చిన ఇక్కడి సాహిత్యాన్ని 5 అధ్యాయాల్లో వీలైనంత వివరంగా పొందుపరచడం జరిగింది ఆ వెయ్యేండ్ల రచయితలకంటె ఇక్కడి ఈ నలుబదైదేండ్ల కాలంలోని రచయితలు ఎన్నోరెట్లు ఎక్కువ అందుకే వీలైనంత ఎక్కువ మంది రచయితల - రచనల పరిచయం ఈ ఆరవ అధ్యాయంలో సంగ్రహంగా చేయబడుతున్నది ఏడవ అధ్యాయంలో జానపద సాహిత్యం, పత్రికలు అభినందన సంచికలు మొదలైనవి ఉన్నాయి

ఈ జిల్లా కవులు రచయితలు రాష్ట్రస్థాయి జాతీయ స్థాయి బహుమతులు పొందిన వారిని ముందుగా చూసి తెలుగు సాహిత్యంలో పరిశోధనలు కావించి డాక్టరేట్ ఎం ఫిల్, పట్టాలు పొందిన వారిని పరిచయం చేసుకొని ఆ తర్వాత వివిధ ప్రక్రియల వారీగా ఈ జిల్లా సాహిత్యాన్ని చూద్దాం

## విశిష్టసాహితీ బహుమతి విజేతలు

1 డా సి నారాయణ రెడ్డి - ఎం ఏ , పిహెచ్ డి హన్మాజిపేట
ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడెమీ బహుమతి 'ఋతుచక్రం' గేయకావ్యానికి 1965
కేంద్ర సాహిత్య అకాడెమీ బహుమతి 'మంటలు - మానవుడు' గేయసంపుటికి - 1974
గౌరవ డి లిట్ - మీరట్ యూనివర్సిటీ యు పి - 1976
పద్మశ్రీ - భారత ప్రభుత్వము వారిచే - 1977,
కళాప్రపూర్ణ ఆంధ్ర విశ్వవిద్యలయం వాల్తేరు - 1978
గౌరవ డి లిట్ నాగార్జున విశ్వవిద్యాలయం, గుంటూరు - 1984
గౌరవ డి లిట్ కాకతీయ విశ్వవిద్యాలయం, వరంగల్ 1980
భారతీయ భాషాపరిషత్ కలకత్తా వారి పురస్కారం 'విశ్వంభర గేయ కావ్యానికి - 1979 80,
కుమరన్ అసాన్ అవార్డు త్రివేంద్రం, 'విశ్వంభర కు 1979-80,
సోవియట్ లాండ్ నెహ్రూ అవార్డు (ఏ కెటగిరీ) - 1982,
హార్మోనీ అవార్డ్ - న్యూఢిల్లీ - 1987 శ్రీరాజలక్ష్మి ఫౌండేషన్ అవార్డ్ - మద్రాసు 1988
భారతీయ జ్ఞానపీఠ బహుమతి 1988, పద్మభూషణ్ - న్యూఢిల్లీ 1989

2 గట్టెపల్లి సత్యనారాయణ రాజు -ఎం ఏ, బి ఇడి , గట్టెపల్లి
ఆంధ్ర ప్రదేశ్ అవతరణోత్సవ సందర్భంగా 1956లో ప్రభుత్వం వారు నిర్వహించిన కవితల

పోటీలో గ స రాజు గారి పూజ కవితకు ద్వితీయ బహుమతి లభించింది ప్రథమ బహుమతి దాశరధి గారిని వరించింది

3 డా పి యశోదా తిరుమల్‌రెడ్డి ఎం ఏ , పిహెచ్ డి అన్నారం
ఉస్మానియా యూనివర్శిటీ తెలుగు ప్రొఫెసర్ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ అధికార భాషా సంఘాధ్యక్షురాలు, బహుగ్రంధ రచయిత్రి అయిన యశోదారెడ్డి గారు పొందిన సాహిత్య బహుమతుల వివరాలు తెలియలేదు కాని, వారు 1976లో ఆగ్రా విశ్వవిద్యాలయం నుండి డి లిట్ గౌరవ డాక్టరేట్ పట్టాను అందుకున్నారు సుశీలా సి నారాయణరెడ్డి గారి స్మారక సాహిత్య బహుమతిని పొందారు

4 డా జె బాపురెడ్డి ఎం ఏ ఐ ఏ ఎస్ , సిరికొండ
ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడెమీ బహుమతి, బాపురెడ్డి గేయాలు - 1971
మైకేల్ మధుసూదన్ అవార్డు 1987
గౌరవ డాక్టరేట్ ప్రపంచకవుల మహాసభలో - 1989, మొరాకో
ఆనరరీ డాక్టర్ ఇన్ హ్యూమానిటీస్ - 1988
తెలుగు విశ్వవిద్యాలయ బహుమతి పురస్కారం, ఆధునిక కవితకు - 1989-90

5 ముద్దసాని రాంరెడ్డి ఎం ఏ , ఊటూరు
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ 1972 73 పోటీ రచన 'సురవరం ప్రతాపరెడ్డి జీవిత చరిత్ర' గ్రంధానికి ఏకైక ప్రథమ బహుమతి డా ఎల్లూరి శివారెడ్డి గారితోపాటు వీరికి సగం లభించింది

తెలుగు అకాడెమీ పోటీ బహుమతి 'ఆధునిక రాజ్యాంగానికి అరవిందుని తోడ్పాటు' - 1985
తెలుగు విశ్వవిద్యాలయం హైద్రాబాద్ వారిచే 'జీవిత చరిత్రల రచయిత'గా ప్రత్యేక గౌరవ పురస్కారం 1993 ఉత్తమ అనువాద రచయితగా 'నేషనల్‌బుక్‌ట్రస్టు', న్యూఢిల్లీవారిబహుమతి పురస్కారం 1997

6 తాడిగిరి పోతరాజు - ఎం ఏ ఎం ఇడి , పంచవటి - హుజూరాబాద్
ఆంధ్రపత్రిక వీక్లీ నవలల పోటీలో మొదటి బహుమతి వీరి మట్టి బొమ్మలు' నవలకు 1966లో లభించింది ఇంకా వీరి 'గాజుల కిటికి' మరోకథ కూడా ప్రముఖ సచిత్రవార పత్రికల పోటీల్లో బహుమతులు పొందాయి

7 మలయశ్రీ ఎం ఏ , ఎం ఓ ఎల్ , చంజర్ల
శాంతి పథము - నాటకము 1974 ఆంధ్ర ప్రదేశ్ ఇంటర్ మీడియెట్ బోర్డ్ తెలుగు అకాడెమీ ఆధ్వర్యంలో నిర్వహించిన పాఠ్యగ్రంధాల పోటీ బహుమతి పొందినది ఇది శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం తిరుపతి వారిచే ప్రచురింపబడి 1975-78 మధ్యకాలంలో ఆం ప్ర ఇంటర్ మీడియట్ తెలుగు ఫైనల్ విద్యార్థులకు పాఠ్య గ్రంధంగా ఉంది
"తిరుగుబాటు నవల 1982 'విశాలాంధ్ర' విజయవాడ వారి నవలల పోటీలో ద్వితీయ బహుమతి పొందినది
సహచరి నవల 1983

'రచ్చబండ' వారపత్రిక జమ్మికుంట వారి రాష్ట్రస్థాయి పోటీలో ద్వితీయ బహుమతి పొందింది
కాకతీయుల కాలంనాటి సామాజిక జీవితం 1988 89 తెలుగు విశ్వవిద్యాలయం హైద్రాబాద్ వారి 'చరిత్ర - సంస్కృతి విభాగ గ్రంధరచన పోటీలో ప్రధమ బహుమతి పొందినది హైద్రాబాద్ బుక్‌ట్రస్టు ప్రచురణ
డా బి ఆర్ అంబేడ్కర్ - 1991 రాష్ట్ర వయోజన విద్యాశాఖ వారి బహుమతి పొందిన పుస్తకం అప్పుడు ప్రముఖ కవి కరుణశ్రీగారితో పాటు మరికొందరు రచయితలు ఈ బహుమతులందుకున్నారు

8 సురమౌళి - బి ఏ , ఎల్ ఎల్ బి , విలాసాగర్
లేఖా రచన కలిసి బ్రతుకుదాం" సహకారోద్యమ పుస్తకానికి వయోజన సాహిత్యంలో భాగంగా కేంద్ర ప్రభుత్వ బహుమతి లభించింది
"సాంఘిక విప్లవ సారధి డాక్టర్ బి ఆర్ అంబేడ్కర్' గ్రంధానికి తెలుగు విశ్వవిద్యాలయం హైద్రాబాద్ 1992లో ఉత్తమ అనువాద బహుమతి నిచ్చారు

9 కాల్వ రాజేంద్ర - కాలువ శ్రీరాంపురం
వీరి 'దామర పువ్వు' నవలకు 1975లో 'ఆంధ్రజ్యోతి సచిత్రవార పత్రిక వారి 'నవలా ప్రియదర్శిని' పోటీ బహుమతి లభించింది

10 సరిపల్లి కృష్ణారెడ్డి - కరీంనగర్
ఈ రచయిత 'ఉప్పెన' నవల ఆంధ్రజ్యోతి' సచిత్ర వార పత్రిక పోటీలో బహుమతి పొందింది

11 దశరథ్ - మహదేవపురం
శతాబ్దాల నిశ్శబ్దం 1979, వెదురు పొదలు నినదించాయి - 1981, పై రెండు నవలలు 'విశాలాంధ్ర' విజయవాడ వారి నవలల పోటీలో వరుసగా తృతీయ బహుమతులు అందుకున్నాయి

12 డా॥ తిరుమల శ్రీనివాసాచార్య - ఎం ఏ , పిహెచ్ డి నారాయణపురం
నారాయణ రెడ్డి సాహితీ మూర్తి - అను వీరి సమీక్షా గ్రంధానికి 1982లో ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడెమీ బహుమతి లభించింది

13 వానమామలై జగన్నాథాచార్యులు, పోతురెడ్డిపేట
వీరి 'రైతు రామాయణము' పద్యకావ్యం 1985లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ బహుమతి పొందింది తెలుగు విశ్వవిద్యాలయం వారిచే వీరికి పద్యకవిగా 1992లో ప్రత్యేక గౌరవ పురస్కారం లభించింది

14 సుద్దాల అశోక్ - ఎం ఏ , బి ఇడి , మెట్టుపల్లి (సుద్దాల - భువనగిరి)
అశోక్ గారి 'వెలుగు రేఖలు' నవలకు విశాలాంధ్ర విజయవాడ వారిచే 1984 నవలల పోటీలో ద్వితీయ బహుమతి లభించింది

15 వడ్డేపల్లి కృష్ణ - ఎం ఏ సిరిసిల్ల
ఒక కథ - ఆంధ్రజ్యోతి వారపత్రిక ఉగాది పోటీ బహుమతి - 1987
హాలాహలం వచన కవితా సంపుటికి దేవులపల్లి కృష్ణశాస్త్రి అవార్డు లభించింది - 1987

చిరుగజ్జెలు బాలగేయ సంపుటి 1993లో తెలుగు విశ్వవిద్యాలయం వారి బాలసాహిత్య ఉత్తమ రచనా అవార్డును స్వీకరించింది

వడ్డెపల్లి కృష్ణ గేయాలు సాహిత్య గౌతమి కరీంనగర్ వారి డా సి నా రె బహుమతి 1996లో అందుకొన్నది

16 డా రావికంటి వసునందన్ - ఎం ఏ , పిహెచ్ డి , కమాన్‌పురం
భారతం (భరతుడు నాయకుడుగా సాగిన రామాయణ పద్య కావ్యం)
1984లో దేవులపల్లి కృష్ణశాస్త్రి అవార్డు పొందింది

17 శ్రీ గాదె శంకర కవి - పి ఓ ఎల్ ,మోహన్‌రావుపేట, కోరుట్ల
'ఆత్మావిష్కరణం' అను వీరి గేయ సంపుటికి 1989లో దేవులపల్లి కృష్ణశాస్త్రి స్మారక అవార్డు లభించింది

18 ప్రతిభారాణి - బి ఎస్సీ, బి ఇడి - మంథని "నైతిక ఆధ్యాత్మికవిద్యబోధనావసము" ఎన్ సి ఇ ఆర్ టి జాతీయ బహుమతి -1990

19 ఎన్ లలితా కుమారి హుజూరాబాద్ ఎన్ సి ఇ ఆర్ టి
'విద్యాబోధనద్వారావిద్యార్థుల్లోనైతిక విలువపెంపొందించుట"వ్యాసానికి ఎన్ సి ఇ ఆర్ టి ఢిల్లీ వారి జాతీయ బహుమతి 1990లో లభించింది వీరికి ఇస్రత్ సుల్తానాకు ఒకే వ్యాసానికి బహుమతి వచ్చింది

20 ఇస్రత్ సుల్తానా ఎం ఏ , బి ఎస్సి ,ఎం ఇడి , కరీంనగర్ (మంథని)
' విద్యాబోధన ద్వారావిద్యార్థుల్లోనైతిక విలువ పెంపొందించుట" 1990 జాతీయ బహుమతి

21 దూడం నాంపల్లి - బి ఓ ఎల్ ఎం ఏ , సిరిసిల్ల
'పాండవ జననం' హరికథ 1989 90 సం లో తె వి విద్యాలయం, హైద్రాబాద్ వారి ప్రత్యేక బహుమతి పొందింది జీమూతవాహనుడు పద్యకావ్యానికి జాతీయ సాహిత్య పరిషత్ సిద్ధిపెట వారి సన్మాన పురస్కారం లభించింది

22 డా కాలువ మల్లయ్య - ఎం ఏ , ఎం ఎస్సి,, తేలుకుంట
చతుర మాస పత్రికలో ప్రచురితమైన వీరి నవల 'భూమి పుత్రుడు' గ్రామీణ జీవిత చిత్రణకు తె వి విద్యాలయం వారి 'ఏటుకూరి వెంకటనర్సయ్య స్మారక బహుమతి 1991 92 లో పొందినది ' ఊరంటే " అముద్రిత నవల - వ్రాత ప్రతికి రసరంజని విశాఖ వారి బహుమతి లభించింది 'సాంబయ్య చదువు"నవల1995లో 'చతుర' బహుమతి పొందింది 1997లో రావిశాస్త్రి అవార్డు వీరిని వరించింది ఇంకా 10 కథల వరకు వివిధ పత్రికల బహుమతులు పొందాయి

23 వజ్జల శివకుమార్ వేములవాడ, వీరి గోగుపువ్వు' కవితాసంపుటి 1995లో ఫ్రీవర్స్‌ఫ్రంట్, హైదరాబాద్ వారిఅవార్డుగెలుచుకుంది

24 ఆడెపులక్ష్మీపతి - 'జీవన్మృతులు' కథ 'విపుల'లోప్రథమబహుమతి - 1995, తిర్యగ్రేఖ' కథ'సాహిత్య నేత్రం పోటీలో ద్వితీయబహుమతి పొందాయి

26 డా అనుమాన్ల భూమయ్య ఎం ఏ ఎం ఫిల్ ,పిహెచ్ డి , వెదురుగట్ట కాకతీయ యూనివర్సిటీ ప్రొఫెసర్,వీరి రెండు పుస్తకాలు బహుమతులు పొందాయి 1 ఆరునదుల వెలుగు పద్యకావ్యం -

1996 తె వి వి బహుమానం 2 అగ్నివృక్షం పద్యకావ్యం- 1997 సాహిత్యగౌతమి సి నా రె అవార్డు-కరీంనగర్

27 డా ముదుగంటి సుజాతారెడ్డి ఎం ఏ పిహెచ్ డి పొత్కపల్లి
వీరి 'తెలుగులో నవలా వికాసం వచన రచనకు 1992లో తెలుగు విశ్వవిద్యాలయం వారిచే ఉత్తమ విమర్శ గ్రంధ బహుమతి లభించింది

28 సిరిశెనహళ్ కృష్ణమాచార్య శతావధాని -కోరుట్ల శ్రీవైష్ణవ దేవస్థాన వేదాంత ధర్మ సాహిత్య సంస్థలచే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారిచే అనేక గౌరవ సన్మానాలందిన కృష్ణమాచార్యులకు వారు కీర్తిశేషులైన తర్వాత అదే సంవత్సరం 1992 లో అవధాన కవిత్వానికి' గుర్తింపుగా తెలుగు విశ్వవిద్యాలయం వారు ప్రత్యేక గౌరవ సన్మాన బహుమాన ప్రదానం చేశారు

29 జూకంటి జగన్నాథం సిరిసిల్లా - వీరి 'పాతాళ గరిగె'కవితా సంపుటికి 1995లో కరీంనగర్ సాహిత్య గౌతమి సినారె అవార్డు లభించింది

30 డా అందెవెంకటరాజము ఎం ఏ పిహెచ్ డి కోరుట్ల
అవధాన కవిత్వానికి తెలుగు విశ్వవిద్యాలయ సన్మానం బహుమతిఅందుకున్నారు

31 బి ఎస్ రాములు జగిత్యాల
హేతువాద రచయితగా తె వి వి బహుమతి, దాశరధిరంగాచార్య అవార్డు పొందారు

## వివిధ సాహితీ ప్రక్రియలలో బహుమతులు - అవార్డులు పొందిన రచయితల పట్టిక

| | |
|---|---|
| అవధాన కవిత్వం -2 | శతావధాని ఎస్ కృష్ణమాచార్య, డా అందె వేంకటరాజము |
| పద్య కావ్యం - 5 | వానమామలై జగన్నాథాచార్యులు, రావికంటి వసునందన్, దూడం నాంపల్లి, డా అనుమాన్ల భూమయ్య |
| (వచన) గేయ కవిత 7 | డా సి నారాయణరెడ్డి, జె బాపురెడ్డి, వడ్డేపల్లి కృష్ణ, శ్రీ గాదె శంకరకవి వజ్జల శివకుమార్, జూకంటి జగన్నాథం డా అనుమాన్లభూమయ్య |
| నాటకం -1 | మలయశ్రీ |
| జీవిత చరిత్ర -1 | ముద్దసాని రాంరెడ్డి |
| రాజకీయ చరిత్ర -1 | ముద్దసాని రాంరెడ్డి |
| సాంఘిక చరిత్ర -1 | మలయశ్రీ |
| నవలలు -5 | తాడిగిరి పోతరాజు, దశరధ్ సరిపల్లి కృష్ణారెడ్డి మలయశ్రీ, సుద్దాల అశోక్, కాలువ మల్లయ్య |
| సాహితీ సమీక్ష -1 | డా తిరుమల శ్రీనివాసాచార్య |
| నవలా సమీక్ష 1 | డా ముదుగంటి సుజాతారెడ్డి |
| పయోజన విద్య -2 | సురమౌళి, మలయశ్రీ |
| బాల సాహిత్యం 1 | వడ్డేపల్లి కృష్ణ |
| హరికథ -1 | దూడం నాంపల్లి |

కథ -4 తాడిగిరి పోతరాజు, వడ్డేపల్లి కృష్ణ కాలువ మల్లయ్య అడెపు లక్ష్మిపతి మొ॥వారు
అనువాదం 2 సురమౌళి, ముద్దసాని రాంరెడ్డి
వ్యాసం 3 ప్రతిభారాణి, లలితా కుమారి, ఇస్రత్ సుల్తానా, మొ॥వారు

ఇట్లాగేపై వివరాలను బట్టి వివిధ సాహితీ సంస్థల నుండి గౌరవ పురస్కారాలు ఉత్తమ రచనల పోటీ బహుమతులను గెలుచుకొన్న వారిని విడివిడిగా వింగడించి చూడవచ్చు ఇవి ఈ జిల్లా రచయితలు రాష్ట్ర జాతీయ స్థాయిలో అందుకొన్న విజయాలు ఇంకా ఏయే సాహితీ ప్రక్రియలపై ఇక్కడి వారు ఆసక్తి కనబరచారనే అంశాన్ని ఇది తెలియజేస్తుంది

## తెలుగు సాహిత్యంలో పిహెచ్ డి - ఎం ఫిల్ పట్టా గ్రహీతలు

1 డా సి నారాయణ రెడ్డి - హన్మాజిపేట
"ఆధునికాంధ్ర కవిత్వము సంప్రదాయములు, ప్రయోగములు" పిహెచ్ డి 1962 ఉస్మానియా విశ్వవిద్యాలయం ఈ గ్రంథం మూడు ముద్రణలు పొందినది బృహద్గ్రంథం

2 డా॥ యశోదా తిరుమల్ రెడ్డి - అన్నారం
"తెలుగులో హరివంశములు" పిహెచ్ డి 1968 ఉస్మానియా ము 1873 పు 840

3 డా ఎం సుజాతారెడ్డి పొత్కపల్లి
"మనువసుచరిత్రల తులనాత్మక పరిశీలన" పిహెచ్ డి 1977, ఉస్మానియా ము 1981

4 డా తిరుమల శ్రీనివాసాచార్యులు - నారాయణపురం
'తెలుగులో గేయనాటికలు" పిహెచ్ డి 1978 ఉస్మా ము 1988

5 డా కె సుమతి - కాల్వశ్రీరాంపురం
'తెలుగు జానపద కథలు" పిహెచ్ డి 1979 ఉస్మా ముద్రితం
అంబేద్కర్ డిగ్రీ కళాశాల - బాగ్‌లింగంపల్లి హైదరాబాద్‌లో వీరు ప్రిన్సిపాల్

6 డా పి సరస్వతి - నాచుపల్లి
'జానపద సాహిత్యంలో పిల్లలపాటలు" పిహెచ్ డి 1980 ఉస్మానియా అంబేద్కర్ డిగ్రీ కళాశాల బాగ్‌లింగంపల్లి హైదరాబాద్‌లో తెలుగు ఉపన్యాసకురాలు

7 డా॥ గోపులింగారెడ్డి - అల్లునూరు
"తెలంగాణా శ్రామిక గేయాలు" ఎం ఫిల్ 1976 ఉస్మానియా,
"తెలంగాణా శ్రామిక గేయాలు' పిహెచ్ డి 1980 ము 1982 వీరు కరీంనగర్ డిగ్రీ కాలేజి తెలుగు ఉపన్యాసకులు, వ్యాస గేయ రచయిత

8 డా అనుమాన్ల భూమయ్య వెదురుగట్టు
"కొరవి గోపరాజు కవిత్వం పరిశీలన" ఎం ఫిల్ 1976 కాకతీయ ముద్రితం
"నాయని సుబ్బారావు కృతులు" పిహెచ్ డి 1980 కాకతీయ - ముద్రితం

9 డా బి లక్ష్మయ్య - తెలుకుంట
"వసురాయకవి వాఙ్మయ జీవిత విశేష సంచిక' ఎం ఫిల్ 1978 కాకతీయ,
"తెలుగులో ప్రబంధ వర్ణనలు ' పిహెచ్ డి 1980 కాకతీయ

10 డా కె రాజన్న శాస్త్రి - ధర్మపురి
"ధ్వని - మనుచరిత్ర" పిహెచ్ డి 1980 ఉస్మానియా ము 1988 పు 460

11 డా గుండి వేంకటాచార్యులు వేములవాడ
"రంగనాథ - వాల్మీకి రామాయణముల తులనాత్మక పరిశీలనము' పిహెచ్ డి 1980 ఉస్మానియా ము 1987 పుటలు 600 వీరు సైన్స్ అండ్ ఆర్ట్స్ డిగ్రీ కళాశాల కామారెడ్డిలో తెలుగు ఉపన్యాసకులుగా పనిచేసి ఉద్యోగ విరమణ పొందారు మంచివక్త

12 డా బి వేంకటేశం - కరీంనగర్
భారత పాశ్చాత్య సాహిత్య దర్శనం ఆనందవర్ధనుడు అరిస్టాటిల్" పిహెచ్ డి 1982 ఉస్మానియా లెక్చరర్

13 డా ఆర్ కమల - మంథని
"విశ్వనాథ నర్తనశాల - ఒక పరిశీలన" పిహెచ్ డి 1982 ఉస్మానియా ఈ పరిశోధన గ్రంథాన్ని తెలుగు అకాడెమీ హైదరాబాద్ వారు 1991లో 'విశ్వనాథ వారి నాటకములు - ఒక పరిశీలన" అనే పేరుతో ముద్రించారు పు 330 తెలుగు ఉపన్యాసకురాలు

14 డా వి తిరుపతయ్య - ధర్మారం
"అడవి బాపిరాజు రచనలు" పిహెచ్ డి 1982 ఉస్మానియా, జమ్మికుంట ఖమ్మం డిగ్రీ కాలేజీ తెలుగు ఉపన్యాసకులు

15 డా అందె వేంకటరాజము - కోరుట్ల
"వానమామలై వరదాచార్యుల వారి కృతులు - అనుశీలన" పిహెచ్ డి 1983 కాకతీయ ము 1986 పు 1000 పైన వీరు డిగ్రీ కళాశాల తెలుగు ఉపన్యాసకులు

16 డా చిలుక మఠ్ఠి వేంకట రమణాచార్యులు (శుకశ్రీ) - రుద్రంగి, "భువన విజయ కవుల శృంగార రస నిర్వహణ" పిహెచ్ డి 1983 కాకతీయ మంథని డిగ్రీ కాలేజి ఆంధ్రోపన్యాసకులుగా పదవీ విరమణం పొందారు

17 డా కాండూరి వేంగళాచారి - వేములవాడ
'సంస్కృతమునందు అనూదితములైన తెలుగు ప్రబంధములు' పిహెచ్ డి ఉస్మానియా నల్గొండ జిల్లా సూర్యపేట వాస్తవ్యులైన వీరు వేములవాడ సంస్కృత డిగ్రీ కళాశాలలో ఉపన్యాసకులు ఇక్కడే స్థిరపడినారు

18 డా బి దామోదర్‌రావు - గూడెం
"తెలుగు జానపదుల సామెతలు" ఎం ఫిల్ 1978 ఉస్మా ము 1986
"తెలుగు సామెతలు- జానపద సంస్కృతి" పిహెచ్ డి 1985 ఉస్మా ము 1996

19 డా వి మధుసూదన్ - ధర్మారం, ఉపన్యాసకులు, కథా రచయిత
"తెలుగులో ఏకాంకికా పరిశీలన" ఎం ఫిల్ 1982 కాకతీయ
"తెలుగులో ఏకాంకికా వికాసం" పిహెచ్ డి 1986 ఉస్మానియా

20 డా సి డి జయవీరరాజు - పెద్దపల్లి
"తెలుగులో ఋతుకావ్యములు" పిహెచ్ డి 1986 ఉస్మానియా, ము 1989 పు 272

21 డా వఝ్ఝారి ఆంజనేయరాజు - కోనేరుపల్లి, జూలపల్లి మండలం ప్ర ని సికింద్రాబాద్
'చొక్కనాథ చరిత్రము సమగ్రపరిశీలన" పిహెచ్ డి 1989 ఉస్మా ము 1993 పు 330

22 డా పెరుమాళ్ళాచారి - సిరిసిల్ల తాలూకా ప్ర ని హైదరాబాద్ గడ్వేసర్‌లో సైన్సు అధ్యాపకులు
'తెలుగులో విన్నపములు" పిహెచ్ డి 1989, ఉస్మా ము 1996

23 డా॥ రావికంటి వసునందన్ కమాన్‌పురం
"సి నా రె భూమిక - సమగ్ర పరిశీలన" ఎం ఫిల్ - 1982 ఉస్మా ము 1984
"ఆధునికాంధ్ర కవిత్వంలో మానవతావాదం - విశ్వంభర విలక్షణత ' పిహెచ్ డి ఉస్మా ము 1990 పు 160

24 డా సంగనభట్ల నరసయ్య - ధర్మపురి
తెలుగు దేశిచ్ఛందస్సు ' పిహెచ్ డి ఉస్మానియా 1991 ముద్రితం డిగ్రీ పొందిన తేది గంథంలో లేదు స్థానిక సంస్కృతాంధ్ర డిగ్రీ కళాశాల ప్రిన్స్‌పాల్

25 డా వజ్జల రంగాచార్య - కరీంనగర్
'పుట్టపర్తి నారాయణాచార్యుల కృతులు - శివతాండవం" పిహెచ్ డి కాకతీయ - 1991లో ముద్రితం డిగ్రీ పొందిన తేది తెలియలేదు

26 డా మచ్చ హరిదాసు - గునుకుల కొండాపురం, కరీంనగర్
'తెలుగులో యాత్రా చరిత్రలు" పిహెచ్ డి 1990 ఉస్మా ము 1992, పు 610

27 డా జి లక్ష్మణరావు - పెగడపల్లి
వేయి పడగలు - సమగ్ర పరిశీలన పిహెచ్ డి 1990 కాకతీయ

28 డా టి కిషన్‌రావు ఎం ఏ పిహెచ్ డి , జీలుగుల జన్మతేది 29-11-1950
'ప్రాచీనాంధ్రకావ్యాల్లో జానపద విజ్ఞానం" పిహెచ్ డి , ఉస్మానియా 1991
టి కిషన్‌రావు గారు ఉస్మానియా విశ్వవిద్యాలయంలో తెలుగు రీడర్ వీరి కవితలు, పరిశోధనాత్మ వ్యాసాలు ప్రముఖ పత్రికల్లో ప్రచురింపబడ్డాయి

29 డా నలిమెల భాస్కర్ - నారాయణపురం సిరిసిల్ల
"తెలుగు సామెతలు - ద్రావిడ భాషలతో తులనాత్మక పరిశీలన' ఎం ఫిల్ 1985 ఉస్మా
తెలుగు మలయాళ సామెతల తులనాత్మక పరిశీలన' పిహెచ్ డి 1991 ఉస్మా

30 డా డింగరి నరహరి ఆచార్య మల్లాపురం, సిరిసిల్ల
'రైతురామాయణం - పరిశీలన" పిహెచ్ డి 1991, ఉస్మా తెలుగు ఉపన్యాసకులు

31 డా టి వి రాంనరసయ్య, వెదురుగట్ట, సుల్తానాబాద్
"తెలుగు సామెతల్లో సంఘచిత్రణ' ఎం ఫిల్ 1977 ఉస్మా ము 1980
'తెలుగు సామెతలు - సమగ్ర పరిశీలన" పిహెచ్ డి ఉస్మా ముద్రణ 1996
వీరు చెన్నూరు ప్రభుత్వ డిగ్రీ కాలేజి ప్రిన్స్‌పాల్

32 డా ఐ స్వామిరెడ్డి - గాగిల్లా పురం
'కరీంనగర్ జిల్లా జానపద కథా గేయాలు ' పిహెచ్ డి ఉస్మానియా తెలుగు ఉపన్యాసకులు
వీరు పద్య గేయకవులు డిగ్రీ పొందిన సంవత్సరం తెలియలేదు

33 డా కాలువ మల్లయ్య తెలుకుంట సుల్తానాబాద్
'తెలుగులో ప్రగతిశీల కథా సాహిత్యం పిహెచ్ డి 1993 ఉస్మానియా
34 డా టి శ్రీరంగ స్వామి - పర్లపల్లి, మం చిగురుమామిడి
విశ్వనాధ వారి కృష్ణకావ్యాలు ' పిహెచ్ డి 1993 కాకతీయ ము 1994
35 డా డి రామాచార్య -కనిగర్తి హుజూరాబాద్
'వానమామలై జగన్నాధాచార్యుల రైతు రామాయణము పరిశీలన ' పిహెచ్ డి 1994
కాకతీయ ము 1996 పు 272 కోరుట్ల జూ॥ కాలేజీలో తెలుగు ఉపన్యాసకులు
36 డా మలయశ్రీ, చంజర్ల
'కరీంనగర్ జిల్లా తెలుగు సాహిత్య చరిత్ర" పిహెచ్ డి 1995 ఉస్మా ము 1997
37 డా టి లక్ష్మినారాయణ (రఘువర్మ) జగిత్యాల
"కుందుర్తి కవితా దృక్పథం "నాలోని నాదాలు" ఎం ఫిల్ ఉస్మా 1989 ము 91
'కుందుర్తి రచనలు - సమగ్ర పరిశీలన' పిహెచ్ డి 1995 ఉస్మా వీరు కవి చిత్రలేఖకులు
38 డా పిహెచ్ సత్యంరాజు తిమ్మాపూర్ అధ్యాపకులు
"కరీంనగర్ జిల్లా బంధుత్వ ప్రదర్శక గేయాలు ' 1989 ఎం ఫిల్ ఉస్మా ము 1990
"తెలంగాణా బంధుత్వ ప్రదర్శక గేయాలు' పిహెచ్ డి ఉస్మా 1995
39 డా కె సత్యనారాయణ కరీంనగర్
'తెలంగాణా (స్త్రీల) బంధుత్వ గేయాలు" కాకతీయ 1996
చొప్పదండి జూ కాలేజీ తెలుగు లెక్చరర్
40 డా ఎస్ రవీందర్ - కరీంనగర్
"డా సి నారాయణరెడ్డి గారి గేయ కావ్యాలు" పిహెచ్ డి 96 తె వి వి హైదరాబాద్ వీరు
అభ్యుదయకవి ఎస్ కె పిళ్ళేగారి పుత్రులు గేయకవి
41 డా ఎలిగేటి మల్లికార్జున్ (గుండి) గోపాల్ రావు పేట జ 1968
"అధిక్షేపాత్మక నవలగా అప్పన్నసర్దార్" ఎం ఫిల్ 1963 హైదరాబాద్ కేంద్ర విశ్వవిద్యాలయం
"చిరంజీవి రచనలు పరిశీలన" పిహెచ్ డి 1996 హై సెంట్రల్ యూనివర్శిటి పిహెచ్ డి
డిగ్రీలు పొందిన వారు

## పిహెచ్ డి లో చేరిన వారు

1 మాదాడి నారాయణరెడ్డి కరీంనగర్ (బెజ్జంకి సమీప గ్రామం)
'ఆదిలాబాద్ జిల్లా జానపద గేయాలు" ఉస్మానియా
కరీంనగర్ డిగ్రీ కాలేజి తెలుగు ఉపన్యాసకులు
2 చొప్పకట్ల చంద్రమౌళి వేములవాడ, గేయ - కథా రచయిత
"తెలుగు సాహిత్యంలో ప్రతీకలు - పరిశీలన" ఉస్మానియా
3 గట్టు గణపతి గుంజెపడుగు లెక్చరర్ పద్యకవి
"జక్కన విక్రమార్క చరిత్ర పరిశీలనము ఉస్మా

4 కె ప్రవీణ్‌రావు కోహెడ,
"కుందావజ్జల గోపాలకృష్ణకవి శ్రీకృష్ణజన్మఖండము" కరీంనగర్ ఆర్ట్స్ అండ్ కామర్స్ జూ॥ కళాశాల ఉపన్యాసకులు వీరు బెనారస్ విశ్వవిద్యాలయంలో పరిశోధన కావిస్తున్నారు
5 భాగవతుల జనార్దన శర్మ - వల్బాపురం - తెలుగు లెక్చరర్,
'కరీంనగర్ జిల్లాగ్రామ నామాలు" - కాకతీయ
6 కాంచన పల్లి గోవర్ధన్‌రాజు జూలపల్లి
పరిశోధనాంశం తెలియలేదు కాని, వీరు ఉస్మానియా విశ్వవిద్యాలయంలో పిహెచ్ డి పరిశోధన కావిస్తున్నారు 1980లో వీరు జమ్మికుంట డిగ్రీ కాలేజి విద్యార్థిగా ఉండగా వీరిదోపద్యగేయ సంకలనం 'భావ మంజరి ముద్రణ పొందింది
7 ఎస్ అంజయ్య - కరీంనగర్
"తెలుగు నవల - జాతీయోద్యమం హైదరాబాద్ కేంద్ర విశ్వవిద్యాలయం
8. ఇమ్మడోజు భద్రయ్య (విశ్వకవి) - మల్లారం
ఉత్పల గారి "ఈజంటనగరాలు హేమంత శిశిరాలు" ఎం ఫిల్ ఉస్మా 1989
"నవ్య కవిత్వంలో భావ కవిత్వం - విశ్లేషణ" ఉస్మానియా పిహెచ్ డి
9 వడ్డేపల్లి కృష్ణ - సిరిసిల్ల గేయకవి,
"తెలుగులో లలిత గేయాలు" ఉస్మానియా
10 కలవకుంట రామకృష్ణ మెట్‌పల్లి
"పాటిబండ మాధవశర్మ రచనలు" ఉస్మా బేతవోలు రామబ్రహ్మం గారి 'కొత్త గోదావరి" కావ్య పరిశీలన కావించి ఎం ఫిల్ డిగ్రీ పొందారు
11 తత్వాది ప్రమోద్ కుమార్ - తక్కళ్ళపల్లి పద్యగేయకవి
"తెలుగు (పద్య కవిత) ఛందోవికాసం" ఉస్మానియా
తిరుపతి వేంకటకవుల పాండవోద్యోగము నాటక పరిశీలనపై ఎం ఫిల్ డిగ్రీ పొందారు
12 మామిడిపల్లి రాజన్న వేములవాడ
"వేముల వాడ క్షేత్ర సంబంధ సాహిత్యం" కాకతీయ ప్రముఖ కవి మామిడిపల్లి సాంబశివశర్మ గారి పుత్రులు కరీంనగర్ సంస్కృత పాఠశాలలో అధ్యాపకులు
13 వకుళాభరణం కృష్ణమోహన్‌రావు - హుజూరాబాద్
"వృత్తికార్మికుల పనిపాటలు ఒక పరిశీలన" ఉస్మానియా
14 పత్తిపాకమోహన్ - ఎం ఏ, సిరిసిల్ల, వచనగేయకవి
"తెలుగు గజల్స్" పిహెచ్ డి, ఉస్మానియా
15 ఎన్ రాజేశం - వేములవాడ, తెలుగు లెక్చరర్
"కరీంనగర్ జిల్లా జానపదగేయాల్లో సామాజిక జీవితం" అను అంశంపై పరిశోధన చేసి ఉస్మానియా నుండి 1980లో వీరు ఎం ఫిల్ డిగ్రీ పొందారు

## ఎం.ఫిల్ లో చేరినవారు

1 గజేందర్ రెడ్డి - జవాహర్ పేట
"డా జె బాపురెడ్డి రచనలు"
సుల్తానా బాద్ ప్రభుత్వ జూనియర్ కళాశాల ఆంధ్రోపన్యాసకులు వీరు గేయకవి

2 ఎస్ ఎస్ రాజు తంగళ్ళపల్లి
'విశ్వనాథ సత్యనారాయణ గారి వ్యాస సాహిత్య పరిశీలనం '
హుస్నాబాద్ జూ॥ కళాశాల తెలుగు లెక్చరర్ గేయ, కథా వ్యాస రచయిత
3 వాసం శివనారాయణ కరీంనగర్, "కరీంనగర్ జిల్లా శతక సాహిత్యం" కాకతీయ
4 వాసాల వెంకటేశ్వర్లు ఎం ఏ ,మెట్‌పల్లి 1997లో కాకతీయ యూనివర్సిటిఎం ఫిల్ లో చేరారు

వీరిలో సం 4 నుండి 7 వరకు కల నలుగురి వివరాలు తెలుగు పరిశోధన - 6 ఫిబ్రవరి ఏప్రిల్ 1989 సంచికలోనివి మిగితా వారి వివరాలు రచయితలు స్వయంగా తెలిపినవి

పై పరిశోధక గ్రంథరచయితలలో 41 మంది పిహెచ్ డి 16 గురు ఎం ఫిల్ పట్టా గ్రహీతలు ఈ జిల్లా పరిశోధకుల దృష్టి రామాయణ భారత భాగవతాల దిక్కు పోలేదు మొదటి పిహెచ్ డి డిగ్రీ గ్రహీతలైన డా సి నారాయణరెడ్డి గారు 'ఆధునికాంధ్ర కవిత్వ విశ్లేషణ' కావించారు రెండవ వారైన డా యశోదా రెడ్డి పూర్వ కావ్యాల్లోని హరివంశముల పరిశీలన కు పూనుకుంటే మూడవ వారైన డా సుజాతారెడ్డి తొలి ప్రబంధాలైన మనువసు చరిత్రల తులనాత్మక సమాలోకనం' కావించారు నాలుగవ వారైన శ్రీనివాసాచార్య 'గేయనాటికలు' తీసుకున్నారు 5,6,7 జానపద కథ, బాలసాహిత్య శ్రామిక గేయాల తీసుకున్నారు మొదటి నలుగురైదుగురు రెడ్లు కావడం ఒక విశేషం

దాదాపు 40 మంది పరిశోధకులలో ఓ పది మంది జానపద సాహిత్యాంశాలనే ఎన్నుకున్నారు ఆధునిక సాహిత్యం పైన అధిక సంఖ్యాకుల దృష్టి కేంద్రీకరింపబడింది పూర్వ సాహిత్య పరిశీలన కావించినవారు కేవలం అయిదారుగురే

ఆధునిక సాహిత్యంలో పద్య కావ్యం, గేయకవిత, నవల, కథ నాటకం, నాటిక, ఏకాంకిక అంశాలపై జానపద సాహిత్యంలో గేయం, సామెతలు కథలు పరిశోధనకు తీసుకోబడ్డాయి ఇతర భాషలతో తెలుగు సాహిత్య తులనాత్మక పరిశీలన కావించిన వారు ముగ్గురు కావ్యాలంకార ఛందశ్శాస్త్రాల పరిశీలకులు ముగ్గురే

ఈ జిల్లా పూర్వకావ్యకవులైన మడికి సింగన్న చరికొండ ధర్మన, రాజలింగకవి సాహిత్యంపై ఇతర ప్రాంతాల వారు పరిశోధనగ్రంథాలు వెలయించారు కాని, ఈ జిల్లావారు అందుకు పూనుకోలేదు

ఆధునిక యుగ కవులలోనూ డా సి నారాయణరెడ్డి, వానమామలై జగన్నాథాచార్యులు, డా జె బాపురెడ్డి, కాలువ మల్లయ్య సాహిత్యాలపై పరిశోధనలు సాగినవి గత శతాబ్ది కవి కుందావజ్జల గోపాలకృష్ణయ్య కృతులపైకె ప్రవీణ్‌రావుగారు బెనారస్ యునివర్శిటీలో పరిశోధన కావిస్తున్నారు

ఇక్కడి యక్షగాన సాహిత్యం, కావ్య శతక -నవలా గేయ వచన రచనలు పిహెచ్ డి పరిశోధనాంశాలుగా పరిగణనకు తగి ఉన్నాయి ఈ జిల్లాలో పిహెచ్ డి ఎం ఫిల్ పరిశోధనలకు అర్హమైన ఓ పదిమంది సాహిత్యకారులైనా ఉన్నారు ఇక్కడి శతకాలు శతాధికం యక్షగాన వీధి నాటకాలు ప్రచుర వ్యాప్తి కలవి అర్థ శతాధికం

క్రమంగా ఈ కరీంనగర్ జిల్లా సాహిత్యం కూడా విశ్వవిద్యాలయాల పరిశోధనలలో సముచిత స్థానం గౌరవం పొందుతుందని ఆశించవచ్చు ఈ పరిశోధకుల ఇతర రచనల పరిచయం ప్రక్రియాపరంగా తర్వాతి ప్రకరణాల్లో చేయబడుతుంది

# I. పద్య సాహిత్యం

వెయ్యేండ్ల సుదీర్ఘ చరిత్ర మన తెలుగు పద్యానికున్నది పద్యం కావ్య గౌరవ జీవితం గడిపింది రాజసభా సన్మాన గౌరవం, ప్రజాదరణ పొందింది అంతటి గత ఘనతగల పద్యకవిత ఈ ఇరువదవ శతాబ్దం ఉత్తరార్ధంలో క్రమ క్రమంగా కనుమరుగై పోతున్నది ముందు వచ్చిన చెవులకంటె వెనుకవచ్చిన కొమ్ములు వాడి అన్నట్లుగా వచన రచనలు, వచన కవితలు పద్యాన్ని వెనుకకు నెట్టాయి అయినా దాని విలువ దానిది ఈ జిల్లాలో గత వెయ్యేండ్ల కాలం కంటె ఈ శతాబ్దంలోనే పండితులు పరిశోధకులు పద్యకవులు ఎక్కువ పద్య కావ్యాలు కూడా ఈ కాలంలోనే అధిక సంఖ్యలో వచ్చాయి ఈ శతాబ్ది పూర్వార్ధ కవుల కావ్యాలు కూడా అనేకం ఉత్తరార్ధంలోనే ముద్రణ పొందాయి

ఈ కాలపు పద్య సాహిత్యం 1 ఖండ కావ్యాలు 2 కావ్యాలు 3 శతకాలు, 4 చిత్ర బంధ కవితలు, 5 అవధానాలు అనే అయిదు విభాగాల్లో వింగడించి వివరింపబడుతున్నది

## ఖండకావ్యాలు

అంతా కవులము కామా, అంతింతో పద్య సమితి సల్లగలేమా? అని పండితుల్లో పలువురు భక్తికో రక్తికో భుక్తికో అప్పుడప్పుడు ఏవో కొన్ని పద్యాలు వ్రాస్తూనే ఉంటారు తాత్కాలిక సామాజిక ప్రయోజనాన్ని ఆత్మసంతృప్తిని ఆశించి రచించిన ఈ పద్యాలు భద్రపరచుకొనే కవులు అరుదు కవులో అభిమాన శ్రోతలో భద్రపరచుకొన్నవి పుస్తకంగా ముద్రించడం మరీ తక్కువ అందుకే అనేక కవుల పద్య కవితలు మనకు అందకుండా పోతున్నాయి రచనా శక్తితోపాటుగా, ప్రచురణయందు శ్రద్ధ చూపిన ఈ జిల్లా కవుల పద్య ఖండికల సంపుటాలు 20 వరకు వచ్చాయి ఈ అర్ధ శతాబ్ది ఖండకావ్య కవులు వీరు

1 డా॥ సి నారాయణరెడ్డి, 2 సేనాపతి రామాచార్య, 3 గజ్జెపల్లి సత్యనారాయణ రాజు 4 డా॥ అందె వేంకటరాజము 5 న చ వేదాంతా చార్యులు, 6 మలయశ్రీ, 7 జె బాపురెడ్డి, 8 పార్వెళ్ళ గోపాలకృష్ణ 9 రావికంటి వసునందన్, 10 మహ్మదలీ, 11 ఎరబాటి ఉమాపతి రావు, 12 కాకర్ల కృష్ణమూర్తి, 13 కె మల్లికార్జున్, 14 దూడం నాంపల్లి, 15 వెంగళ రామకృష్ణ

వీరిలో సేనాపతి, గ స రాజు, మహ్మదలీ, ఎరబాటి కీర్తిశేషులు ఒక్క న చ వే గారు తప్ప మిగతా వారందరూ పద్యాలతో పాటు గేయాలుకూడా వ్రాస్తున్నారు వీరిలో కొందరు పద్యరచన పూర్తిగా వదలివేసి, కేవలం గేయకవితలను మాత్రమే రచిస్తూ రాణిస్తున్నారు ఈ కాలపు కవుల ఖండకావ్యాల వివరాలివి

### 1 డా॥ సి నారాయణరెడ్డి - హనుమాజి పేట, జననం 1929

ప్రొఫెసర్ - వైస్ చాన్సలర్ పద్మభూషణ్-జ్ఞానపీఠ అవార్డు గ్రహీత డా॥ సి నారాయణరెడ్డిగారు బహుగ్రంధకర్త ప్రఖ్యాత గేయకవి వారు ఎం ఏ మొదటి సంవత్సరంలో ఉండగా 1953 అక్టోబర్‌లో వారి మొదటి పుస్తకం 'జలపాతం' ఖండకావ్యం అచ్చయింది అందలి 30 శీర్షికలలో గేయాలే ఎక్కువ అయినా కొన్ని పద్య కవితా ఖండికలున్నాయి ఈ కవితలు అప్పుడప్పుడు హృదయ తంత్రికల నుండి పెకలి వచ్చిన రాగ మాలికలే" అని కవి తమ కావ్య పీఠిక 'అవతరణం' లో చెప్పుకున్నారు అవి 1948 తర్వాత రచింపబడినవే

ఈ కావ్యాన్ని నారాయణరెడ్డి గారు తమకంటె ఇంచుక పెద్ద, కవి మిత్రులైన దాశరథి గారికి అంకితమిచ్చారు ఈ అంకిత పద్యాలు కవి హృదయ విపంచిక మధుర నిక్వాణాలు హృద్యభావసముపేతాలు

నేను నవీన భావ కవినే సుమి । ఐనను ఆద్య పద్య సం
తానము లందు అంకితమొనర్చి తి నీకృతి? హార్ద వేదనా
గాన తరంగ శీకర వికస్వర సుస్వర కావ్యధార ప
ద్యానకు నవ్యగీతమున కంతరమున్ గనునా మహాకవీ

దాశరథీ మనొజ్ఞకవితా శరధీ । అని అతని కవితను ప్రస్తుతించి తమ స్నేహాన్ని ఇలా బలపరిచారు

కలకాలమ్ములు నీవు నేనిటులె స్నిగ్ధ స్నేహ బంధాల బ
ద్ధులమై యుందము, ఏక గీతి నిరుగొంతుల్ విప్పి విన్పింత మాం
ధ్రుల చైతన్య విపంచి కాహళులు విద్యున్నాదముల్ సేయగా
జల పాతమ్ములవోలె దూకుదము విశ్వక్సాహితీ శృంగముల్

హార్దవేదనా గాన తరంగ శీకరాలు చంద్రికా పేశల కావ్య ఖండం విశ్వక్సాహితీ శృంగముల్ సి నా రె నవ్య భావప్రయోగాలు దానికి కారణం - "నవీన భావకవి 'నని చెప్పినారు దాశరథి తనకు అభిమానకవి అని మాత్రమే కాదు అనురాగమూర్తి అని అనడానికి ఈక్రింది పద్యం సాక్ష్యంగా ఉంది

నా తరుణ కావ్యలతికలానాడు పైకి ప్రాకలేక దిక్కులు సూడ నీ కరాలు
సాచి లేత రేకులకు కెంజాయలద్ది మించు పందిళ్లపైకి ప్రాకించి నావు

కవి తరుణ వయస్కుడు, తొలికవిత కాబట్టి వలపు తలపులు భావ లాలిత్య పరితపన సహజం 'మరీ చికలు' శీర్షికలోని ఒక పద్యమిది

"చలువ వెన్నెలలో మంద మలయ వాయు, వీచికలలోన విహరింప వెడలిపోతి,
చలువ వెన్నెల వేడిగా, మలయ మృదుల, వాయువులు వాడిగా హృది కోయ దొడగె"

ఆ యుగ ధర్మంగా భావకవుల ఊహా ప్రేయసి ప్రణయ భావాలు చేరగా, వానికి తోడుగా ప్రబంధ కవుల విరహవర్ణనలు చోటు చేసుకున్నాయిందులో మొదటిది చూసింది రెండవది చదివింది నైజాం విముక్తి పోరాటంలో ఈ కవి పాల్గొనకున్నా చూశారు విద్యార్థిగా రజాకార్ల దురంతాలు, తెలంగాణా రైతాంగ పోరాట గాథలు కవి కన్నవి విన్నవి క్వాచిత్కంగానైనా వారి కవితలో చోటుచేసుకున్నాయి అందుకే ఉదయ ధ్వజం' శీర్షికలో అన్నారీవిధంగా

కరకు రాచరికమ్మును తరిమివేయ, శ్రామికులు లేవనెత్తిన క్రాంతి వైజ
యంతి పోలిక, నైజి కాంధ్యమ్మడంచు, ప్రాగ్ధరణి సాగె ఉదయ సూర్య ధ్వజమ్ము

సామ్యవాద భావాలను అప్పుడే కాదు ఆ తర్వాతి ఒకటి రెండు గేయ కావ్యాల్లోను రెడ్డి గారు బలపరిచారు 1952లో ఆంధ్రప్రదేశ్‌లో కమ్యూనిష్టు పార్టీ బలంగానే ఉండేది 1955 మధ్యంతర ఎన్నికల్లో అది దెబ్బతిన్నది ఈ కవి భావాలు క్రమంగా సామ్యవాదం నుండి మానవతావాదం వైపు మళ్లాయి ఈ ఒక్క జలపాతంతో నారాయణరెడ్డి గారు పద్యకవితను ఆపి వేశారు లేకపోతే చక్కని పద్య కావ్యాలు వారి కలం నుండి జాలువారేవి అదే మేలు చేసింది తదేక దీక్షతో గేయ కవితా తపస్సు సాగించి, పరిణతి సాధించి, బహుకావ్యాలు రచించి ఉన్నతోన్నత శిఖరాలనధిరోహించ

గలిగారు డా సి నా రె గారి ఇతర రచనల పరిచయం గేయ/గేయనాటిక/వ్యాస ప్రకంణాల్లో చేయబడుతుంది

## 2 సేనాపతి రామాచార్య - పెద్దపల్లి, 1979లో 67 ఏండ్ల వయసులో మృతి

రామాచార్యుల పూర్వులు మహారాష్ట్రలోని చాందా చాముర్శి కొదమగుళ్ల ప్రాంతీయులు వీరు చెన్నూరులో జన్మించినా అత్తవారిల్లు కమాన్‌పూర్ కావటంతో కరీంనగర్‌తో సంబంధం ఏర్పడింది చెన్నూరు కూడా మొదట ఈ జిల్లాలోనిదే వీరు ఇంటర్ ట్రేండ్ టీచర్ కరీంనగర్ జిల్లాలోని మాధ్యమిక ఉన్నత పారశాలల్లో ప్రధానోపాధ్యాయులుగా మంధిని జమ్మికుంట మొ పట్టణాల్లో పనిచేశారు పెద్దపల్లిలో స్థిరపడ్డారు వీరి పుత్రులు దత్తాచార్య హిందీ కవి

ఉర్దూ భాషలో విద్యాభ్యాసం కావించినా, ఆంగ్లభాషా బోధకులుగా ఉద్యోగం చేసినా, తెలుగు భాషా సాహిత్యాలపై రామాచార్య గారికి ఎనలేని అభిమానం ఉండేది సాహిత్యారాధన కవితాసాధన వారిని ప్రౌఢ పద్యకవిగా మార్చాయి రామాచార్యగారి ముద్రిత రచనలు -

1 అక్కడక్కడ - 1953 ముద్రణ 2 మనసా - (మనసాచే-శ్లోకీ అనువాదం) 3 ఇతో భ్రష్టులుతతో భ్రష్టులు (తేదిలేదు) 4 అదొకటి - ఇదొకటి - 1956 5 అనంగనంగ - 1959

ఆచార్య గారిది సలక్షణ అధిక్షేప కవిత కందం వీరికి వశవర్తిని వీరు రచించినవన్నీ ఖండ కావ్యాలు విమర్శ అధికం వీరి పుస్తకాల పేర్లే కాక, వాని శీర్షికల పేర్లు సైతం వినూత్న మైనవి వీరి పద్యాల శిల్పానికి, విశృంఖల భావ సంపదకు పరితులు ముగ్ధులు కాక తప్పదు వీరి కవనంలోని వ్యంగ్య హాస్యం, నీతి ప్రబోధకమైనది

**కావ్య సమీక్ష -**

అక్కడక్కడ 80 పుటల 37 శీర్షికల ఖండకావ్యం ఈ కావ్యానికి మాడపాటి హన్మంతరావు, సురవరం ప్రతాపరెడ్డి, దాశరధి ఆచార్య లక్ష్మీనిరంజనం ఉదయరాజు శేషగిరి రావు, వానమామలై, చెలమచర్ల మొ ప్రముఖుల పీరికలున్నవి 'వందన పుష్పాంజలి' - 3వ పుట

కారకులౌచు సర్వ సహకార విచార పరంపరా విధిన్
వారికి వీరు వీరలకు వారు సహాయము జేయునట్టి వ్యా
పార కృషి ప్రధాన ధనవంతులు సైతము జేతులెత్తి నిం
గోరిన నిత్తువా? చిదురు కొందువ? నవ్వెదవా? పరాత్పరా ప 4

'కవితా సామ్రాజ్యము' శీర్షికలోనివి 12 పద్యాలు

'కవి చౌడప్ప గారు' శీర్షికలో చౌడప్ప "పెద్దనవలె కృతిజెప్పిన పెద్దనవలె, నల్ప కవుల పెద్దనవలెనా? ఎద్దనవలె మొద్దనవలె గ్రద్దనవలె, కృష్ణరాయ రాజనరేంద్రా" అన్న పద్యానికి ఈ కవి ఆ కవినిట్లా ప్రశ్నించారు

తెలుగున భాషా యోషిత మునుపటి వలె గాద? గొడ్డు వోయినదా? పె
ద్దనకును సమానస్కంధుల గన బోదా? ముసలి దయెన? కవి చౌడప్పా ప 3

చుక్కల వంటి కవులు లేనిది కవి చంద్రులకెక్కడి ఖ్యాతి? అని వీరి ప్రశ్న ఇంకా పెద్దన పెద్దకవి కావచ్చును కాని, తిక్కన వచ్చి నేను 'మహాభారత' కవిని వచ్చినానంటే పరిస్థితి ఎట్లా ఉంటుందని కవి మరో ప్రశ్న అస్పృశ్యతను కవి పలు శీర్షికలలో నిరసించారు 'ఇది మోసమా?'లో - సగర సంతతి కానీ, ముప్పది మూడు కోట్ల సుర పుంగవులలో ఏ ఒక్కరు కానీ ఈ అంటరాని తనాన్ని

మాయించలేదు కదా అని విచారించారు ఇంకా త్రిమతాచార్యుల నిట్లా అన్నారు - 35వ పుట 3వ పద్యంలో

వరుసగ ముగ్గురై వికట వాద వివాద సమస్యలన్ జగ
ద్గురువులు గారు తీర్చి తుదకుం గడజాతి సమస్యనేకమై
చఱచిన వారు గాని యొక సంగతి వారి కళంకమై చనన్
హరిజన సంఘశుద్ధికి దయామయుడే చనె నీ మహాత్ముడై

విమర్శ ఉన్నా కవి దైవభక్తికి లోటు లేదు ఈ ఖండ కావ్యంలో గర్భిని బాధలు మూర్ఖుల చర్యలు, వేమన కవన చాతురి ప్రశంస జయపతాక మొదలైన రసవత్తర శీర్షికలతో ఆలోచనాత్మక పద్యాలున్నాయి ఈ ఖండ కావ్యానికి ముందుగా మనసా పురుషార్థిమన్యులు ఈ కవి రచించినట్లు పుస్తకం లోపలి ముఖ పత్రంలో పేర్కొన్నారు మనసా అనేది మరాఠీ కవితా పుస్తకానువాదమని దత్తాచార్య చెప్పారు అది లభించలేదు పురుషార్థింమన్యులు పద్యాలు ఇతర కృతుల్లో చేర్చబడినాయి

ఇతో భ్రష్టులు - తతోభ్రష్టులు - (పండితమ్మన్యులు) దీనికి వానమామలై కవి సోదర త్రయం, విశ్వనాథ సత్యనారాయణ, దాశరథి, సి నారాయణరెడ్డి పీఠికలున్నవి విశ్వనాథ మకాం కరీంనగర్ అని చెప్పకోవడం, సి నారాయణరెడ్డి ఎం ఏ అని వ్రాసుకోవడాన్నిబట్టి ఈ పుస్తకం 1956లో వెలువడి ఉండవచ్చు

"వీరి కందములు మురుపు నడక గల సొగసు కత్తియ మరియు గడుసుబారిన జాణ ' అని విశ్వనాథగారు అన్నారు దాశరథి గారు జయదేవుని శ్లోకాన్ని కింన కుర్వంతి భూలోకే పాపిన పండితా అపి 'ని స్మరించి, ' ప్రపంచంలో గల ప్రచ్ఛన్న రాక్షసుల్ని గుర్తెరుగడానికి యీ కావ్యం ఎంతో ఉపయోగపడుతుంది అని ప్రశంసించారు ఈ కావ్యంలోనివన్నీ కంద పద్యాలే పద్య భావాలే కాక శీర్షికలు సైతం పరితులకు గిలిగింతలు కలిగించేవిగా ఎలా ఉన్నాయో చూడండి

బహుళ జాడ్యులు - జాడ్య బాహుళ్యులు, స్వార్థపారంగతులు పారంగత స్వార్థులు, ప్రముఖ మూర్ఖులు - మూర్ఖ ప్రముఖులు, శూన్యసాధకులు - సాధనా శూన్యులు, ఆదర్శశుష్కులు శుష్కాదర్శకులు

జనకుని సయితము సాధా, రణుడని గనుగొనిన ఉత్తర ప్రజ్ఞకు సత్
జనులందఱు మెచ్చు కొనెద, రని యనుకొనినట్టి వాడనర్థమును గొనున్ పు 10
సారాయిన్నేనొక యా, హారముగా గొనెడివాడ నైనను భ్రష్టా
చారమనే గొనలేదని, భారపడిన త్రాగుబోతు వదరుటది యగున్ పు 23
పొమ్మనినను నేనా నీ, యమ్మకొ యయ్యలకొ పూర్వమందేదో చు
ట్ట మ్మని కూర్చుండుట సహ, జమ్ము పరాన్న వ్రత ప్రసంగ రతులకున్ పు 32

మంథిని వేంకటరాజన్న అవధాని గారి అభిప్రాయం ప్రకారం "ఈ కావ్యం పాత్రమయి యుండగలదు " అది నిజం

అదొకటి ఇదొకటి ఏక మకుట శీర్షికా వాటిక అన్నారు కవి పు 22 ఇందులోనివన్నీ కంద పద్యాలే మకుటాలు లేవు ఇది శతకం కాదు పుటకొక శీర్షిక శీర్షికకు ఆరెనిమిది పద్యాలు చివరి పుటలలో మూడేసి పద్యాల శీర్షికలున్నాయి ఇవన్నీ లౌకిక రీతి నీతులు, తమిళ భాషలోని

తిరుక్కురళ్ నీతి పద్య గ్రంథంలో ఇటువంటి శీర్షికా సంవిధానం ఉంది కొన్ని పద్యాలు 'వాస్తవికము' లోనివి చూడండి

పురుషార్థివి నీకేమని మురిపించి ప్రయుక్తి మంత్ర పూర్వకముగ నిం
గొరిగెడి వారున్నారని, మఱవకుమా! పాప వర్తమానయుగమునన్,
పిరికి యతండని తెలిసిన, తరుణమునన్ భార్య కూడ తప తపతలపై
జఱచుటకును జంక దనునది, మఱవకుమా! పాప వర్తమానయుగమునన్

'మరపు' నుండి

చిరకాలము లంచములకు మఱగిన తెఱచాటు దొంగ మహనీయుండై
దొరగారు వెనుకటి యది, మఱచున యది సాగకున్న మండిపడి చనున్

'ఇది లోకము' నుండి

కను గలిపిన వారస్త్రీ మణికిన్ లోబడని నీకు మగతనమే లే
దని నిన్ను నపుంసకుడని, యనినన్ మేల్కొనిన వాడవని తేటపడున్

ఇట్లా ఇవో వందా యాభై పసందైన కంద పద్యనీతులు!

అనంగనంగ ఇది మూడు పద్య కథల సంపుటి ఆ కథా త్రయము పేర్లివి 1 ఒక నాస్తికుడు 2 ఒక తత్త్వక్షుధితుడు 3 ఒక శివ భక్త శిఖామణి

ఈ మూడుకథలు 77 పుటలలో వర్ణితం మొదటిది పెద్దది రెండవది చిన్నది కథలు భక్తి నీతి లోకరీతి ప్రబోధకాలు రెండవది ఉపనిషత్కధనట మొదటిది నాస్తికునికి గుణపాఠం కలిగి ఆస్తికుడైన ఇతి వృత్తం మూడవది శివభక్తి గాథ కథా వివరాలకు పోక కవి వర్ణనా ప్రౌఢికి నిదర్శనంగా కొన్ని పద్యాలు మాత్రం చూపబడుతున్నవి హిమ వత్పర్యత వర్ణన,

భళిరే! యిచ్చోటి హిమా, చల భవ్యలలాట తిలక సంకాశ మహో
జ్జ్వల హృదయంగమ దృశ్య స్థల మయి ప్రేక్షక విభాజ్య ధనమయి యుండెన్ పు 4

విభావరీ ప్రభావము - 19వ, పుట

అలరారగ నేకాంత, స్థలమున భక్తులకు సంఘ సంస్కర్తల క
వ్వల పరిశోధకులకు రా, త్రులు భక్తికి భావమట్లు తోడ్పడు చుండున్ ప 106
లలిత వయో దంపతులకు, చిలుకలకొలుకులకు దీర్ఘ శృంగార మహో
త్సల రాసులగుటకీ రా, త్రులు చీరెకు రవికలట్లు దోడ్పడు చుండున్ 107

ఊహా శక్తి ఉక్తి వైచిత్రి, ఉపమారూపక దృష్టాంతోత్ప్రేక్షాద్యలంకార ప్రయోగ దృష్టి, నూత్న పద ప్రయోగ దక్షత ఈ కవికి పుష్కలం వ్యావహారికాంధ్ర శబ్దాలను ఉర్దూ పదాలను స్వేచ్ఛగా వాడారు న, ణలకు వలెనే ర, ఱలను సైతం ఈ కవి ప్రాసల్లో ప్రయోగించారు

కవి విశ్వాసం లేదా కావ్యఫల శృతి అనదగినది మూడవ కథ చివరి ఈ క్రింది ఆటవెలది పద్యం

పూర్వ జన్మపాప పుణ్యముల కొలంది, కష్ట సుఖములెల్ల గలుగు చుండు
అఖిల చేతనులకు బ్రారబ్ధమనివార్య, మని పినాకి కథసమాప్తి జేసె

ఇది శంకర ప్రోక్త జనకోపాఖ్యానం దూర్వాసోముని శిష్యులకు చెప్పినది సుమతి శతక నీతులు కవి చౌడప్ప కందాల నడక, తెనాలి రామకృష్ణుని ఉక్తి వికటత్వం కలగలుపుగా కల లాక్షణిక, నూత్న భావసంపన్నులైన సేనాపతి రామాచార్యగారి పద్యకృతులు డాక్టరేట్ పరిశోధనకు

సమర్థాలు

### 3 గట్టెపల్లి సత్యనారాయణ రాజు - ఎం ఏ బి ఇడి 1929 - 1987

సత్యనారాయణ రాజు గారి స్వగ్రామం సుల్తానాబాద్ సమీపంలోని గట్టెపల్లి ఇంటిపేరు ఎఱ్ఱమరాజు వారు వీరి తండ్రి మూర్తి రాజు యక్షగానకవి సత్యనారాయణ రాజు గారు ప్రభుత్వోన్నత పాఠశాలల్లో ఉపాధ్యాయులుగా, బేసిక్ ట్రైనింగ్ స్కూల్ మాస్టరుగా, జూనియర్ కాలేజి ప్రిన్సిపాల్‌గా పనిచేసి అరవైయేళ్లు నిండకముందే అనారోగ్యంతో అకాలమరణం చెందారు సత్యనారాయణరాజుగారు సరస కవితా విశారదులు వీరి రచనలు ఇవి

1 కల స్వనం - ఖండ కావ్య సంపుటి 1956, 2 స్వప్న ఫలము - పద్యకావ్యము 1965 3 రంగ ప్రభూ శతకము అముద్రితం

కలస్వనము 1956లో తెలంగాణా రచయితల సంఘం హైదరాబాద్ వారు ముద్రించిన 32 శీర్షికల 80 పుటల పుస్తకమిది ఇందులో కొన్ని గేయాలున్నా పద్యఖండికలే అధికం ఆంధ్ర ప్రదేశ్ అవతరణ సందర్భంలో మనరాష్ట్ర ప్రభుత్వంవారు నిర్వహించిన కవితల పోటీలో ద్వితీయ బహుమతిని అందుకున్న వీరి పూజ' కవిత కూడా ఈ సంపుటిలో ఉంది ఇందలి శీర్షికలు - అంకితం, అంజలులు, ఒకమాట ఓ కవీ పూజ, శుభోదయము ఆంధ్రావతరణము అంతర్వాణి, వోటు - అభ్యర్థి, అస్పృశ్యతా నివారణము, మహాత్ముడు పద్మిని, గీతానుతి నా పాట నాబ్రతుకు తండ్రి ఆవేదన, నా మామ రాయప్రోలు, సురవరం ప్రతాపరెడ్డి ఇట్లా - దేశ, ప్రకృతి సమాజ సాహిత్య పరాలుగానే కాక స్వంత అనుభవాలు అనుభూతులు కూడా ఇందులో పద్య కవితానిబద్ధమైనాయి

ఈ కవిలో ఆర్ద్రత అధికం పదలాలిత్యం శయ్యాసౌభాగ్యం భావ సౌందర్యం గ స రాజు గారి కవితకున్న సహజాలంకారాలు ఆంధ్ర మాతకు ఈ ఖండకావ్యాన్ని అంకితం కావిస్తూ కవి మూడు పద్యాలు చెప్పారు అందులో ఒకటిది,



ఓనవ రాగ విస్ఫుట మహోదయ శీల, మదీయ భావ నో
ద్యానము నందు కొంజిగురు టాకుల రాకలెరింగి యిత్తు నీ
కానుక మవ్వపుం దెలుగు కావ్యముగా సవరించి నీయశో
గానము నందిదొక్క గమకంబయి నిల్చిననే కృతార్థుడన్

1956 నవంబర్ 1 ముక్కోటి ఆంధ్రులు ఒక్కటైన దినం ఆంధ్ర ప్రదేశ్ అవతరించిన ఆ శుభసందర్భాన వెలువడింది ఈ కావ్యం 'అంజలులు' గురువులకు సమర్పించి 'ఒకమాట'లో ఈ రీతిగా అనుకున్నారు

చేతునో లేదొ మధురస సృష్టి నేను, మొలచునో లేదొ భావ కౌముదులు మొదలు
పూయునో లేదొ నా తప పుణ్యలతలు, ఎటులయిన నేమి వ్యవసాయమే నొనర్తు

తర్వాతి పద్యంలో "నాది స్వతంత్ర వృత్తి యయిన న్విడ నాడను ప్రాజ్ఞనస్సుమా మోదము క్రొత్త దనాలనే కొసరు కుందును" అని తమ కవితా స్వభావాల్ని చెప్పుకున్నారు అందులోని 22వ, శీర్షిక 'సంవిక్త' సమైక్యాంధ్రేతి వృత్త సంగీత రూపకం కవి ఆశయం ఇది

కొత్త దనాలనే కొసరు కొందురు కొందరు, కొందరున్ బురా
వృత్తములందు మోహమును వీడరు, రెంటి సమన్వయించినీ
రెత్తద తెన్గుతోట చివురింపగ నేటి రసజ్ఞలోకమీ

మెత్తని పైరులోని రుచి మెచ్చిన మోడ్పు, కృతజ్ఞతాంజలులల్

ప్రతిభా వ్యుత్పత్తి పుష్కలంగా గలిగిన కొత్త పాతల మేలు కలయిక గ స రాజు గారి పద్య గేయ మధుర కవిత!

**4 డా॥ అందె వేంకటరాజము - కోరుట్ల, జననం 14-10-1933 శ్రీముఖ**

అందె వేంకటరాజము గారి స్వగ్రామము కోరుట్ల తెలుగులో బి ఓ ఎల్, ఎం ఏ పట్టభద్రులైన వీరు 'వానమామలై వరదాచార్యుల కృతులు - అనుశీలన' అను అంశంపై కాకతీయ విశ్వవిద్యాలయం నుండి 1983లో డాక్టరేట్ డిగ్రీ పొందారు ప్రాథమిక సెకండరీ పాఠశాలల ఉపాధ్యాయులుగా తెలుగుపండిత్‌గా నిజామాబాద్, కరీంనగర్ జిల్లాలలో పనిచేసిన వీరు పదోన్నతి పొంది కోరుట్ల జూనియర్ డిగ్రీ కాలేజీల తెలుగు ఉపన్యాసకులుగా పనిచేసి 1992లో ఉద్యోగ విరమణ పొందారు వేంకట రాజం గారు అచ్చమైన సంప్రదాయవాది సలక్షణ పద్యకవి గేయాలు కూడా రచించినా పద్యరచనలోనే వీరికి ఆసక్తి మెండు అయిదారు కావ్యాలు రచించడంతోపాటు డెబ్బదికి పైగా అష్టావధానాలు చేశారు భారతీ సాహిత్య సమితి కోరుట్లకు అధ్యక్షులుగా సాహిత్య సభలు, కవి పండిత సన్మానాలు నిర్వహిస్తున్నారు సాహిత్యం వలెనే వాస్తు జ్యోతిష్యాలలో ప్రజ్ఞ కలవారై రాణిస్తున్నారు

అందె వేంకటరాజం గారి రచనలు 1 నవోదయము - ఖండకావ్యము - 1961, 2 మణి మంజూష - ఖండకావ్యము 1971, 3 మానస వీణ - ఖండకావ్యము - 1993

ఇంకా భారత రాణి, భువనవిజయము, మాధవ వర్మ నాటికలు, ఈశ్వర శతకము, నా అంతరంగ తరంగాలు, అవధాన పద్య మంజరి, పిహెచ్ డి - గ్రంథం, వీరి ముద్రిత కృతులు

కావ్య పరిచయము

**నవోదయం** శీర్షికలు 48 పుటలు 141 ఇది కవిగారి తొలికృతి, పద్యగేయ మిశ్రిత కవితా సంపుటి గేయాలున్నా ఇందులో పద్యాలే ఎక్కువ డా॥ పల్లా దుర్గయ్యగారు ఈ కృతి పీఠికలో కవి ప్రతిభను ప్రశంసించారు తమ గురుదేవులైన 'అభినవ పోతన' వానమామలై వరదాచార్యులకు ఈ కావ్యాంకితం కావిస్తూ కవి, వారిని ఇట్లా ప్రస్తుతించారు

శ్రీవాణీ చరణాంబు జాత యుగళీ సేవా పరాయత్త చి
త్తా! విశ్వప్రియ రమ్య కావ్యరచనా తాత్పర్య! ధీరోచిరా
శీ విచ్ఛిన్న తమిస్ర! సత్కవి కులశ్రేష్ఠా! నిరాలోపవే (నిరాటోప?)
షా! విద్వన్నికరాభివంద్య! వరదాచార్యా! నమస్కారముల్

ఈ పద్యంలోని చివరి 'ముల్' ప్రత్యయం తప్ప మిగితా పదాలన్నీ సంస్కృతమే తెలుగులోనూ వీరు చక్కగా వ్రాస్తారు 'ఉపాధ్యాయుడు'లోని ఒక పద్యం చూడండి

ఓనమాలు మొదలు ఉన్నతోద్యోగాల, వరకు నెవని చలువ వలన గాంచి
రట్టి పంతులన నిరాకరింతు రదేమొ, తల్లిచన్ను గ్రుద్దు తనయులట్లు
యోగ్యత ఒక చక్కని భావుకత శైలీ రామణీయకత కలగేయం
కవిత యొక యొయ్యారి
కవిత యొక సుకుమార భావన, కల్పనామయ రమ్యలోకము
శాస్త్రకారుడు త్రచ్చి వెతబడు సహృదయులకదె రమ్యలోకము

కవి దైవ భక్తి కల వారైనా దైవనుతి శీర్షికలు ఇందులో తక్కువ ఆంధ్రావతరణము వీరభోజ్యము గ్రామ రాజ్యము దేశభక్తి కవితలు మబ్బు గాలి, చందమామ సెలయెరు పిపీలిక సందె మొ॥ప్రకృతి సంబంధ శీర్షికలు, నిరాశ శూన్యగృహము అవరోధాలు, పరితాపం వంటివి మనస్సంబంధ శీర్షికలు, చిట్టితండ్రి, వృద్ధుడు, గొల్ల, దారిద్ర్యం మొ॥వి సమాజపరమైన కవితలు నవోదయంలో వున్నాయి 'మేము లో నవనాగరికతను నిరసిస్తూ 'ఉపాధ్యాయుడు'లో గురువుల ప్రస్తుతించారు కవి భావ ప్రౌఢిమకు ఈ కావ్యం సజీవోదాహరణం ఈత చెట్టులోని ఈ కంద పద్యభావ శ్లేష చూడండి

నిలువెల్ల గంటకంబులె, నిలువగ నీడయును లేదు నీవైఖరిలో
కు లెరింగి మరిగి చత్తురు, బలు కన్నులు గలిగి నూత బడు చందమునన్

**మణి మంజూష** శీర్షికలు 34 పుటలు 120

ఋతు విలాసాలు, పర్వదినాలు, వియోగబాధ, అహంకారము, మానవ జన్మ, దేశభక్తి మొ॥వి ఇందలి శీర్షికలు వారి భాష నిర్దుష్టమై భావ వ్యక్తీకరణ దక్షమైజాతీయమై యింపులు నింపుచున్నది ' ' అని డా॥ దివాకర్ల వేంకటావధాని గారు, వేంకటరాజం కవితా ప్రతిభ ఇంకా ఇంకా వికసించాలని నా ఆకాంక్ష" అని డా॥ సి నారాయణ రెడ్డి గారు కావ్య పీఠికలలో అన్నారు వానమామలై వరదాచార్యులభిప్రాయపడినట్లు వీరి పద్యాలది ప్రబంధ కవుల శిల్పం మచ్చునకు ఒకటి రెండు పద్యాలు ఇది 'అధిక ధరలు' లోనిది



భువి తపి యించగా నధిక మూల్య దవానల మేర్చి భారతా
టవి దహియింపగా గటకటా! చెలరేగెను వర్తకానిలం
బవశములై ప్రజామృగము లార్తి మెయిన్ గద దల్లడిల్లు సం
భవమొకొ ఎట్టులేనమృత వర్షము ప్రాణుల రక్షణార్థమై

ఇందలి రూపకాలంకారం కవి ప్రతిభకు నిదర్శనం

వస్తువుల ధరలు తగ్గడమో ప్రజల ఆదాయము పెరగడమో ఆ అమృత వృష్టి అది ఎప్పటికి సాధ్యమో! రాధాకృష్ణ జయంతి' లో డా॥ సర్వేపల్లి వారినిలా వర్ణించారు

మానస మున్నతోన్నత హిమాలయశృంగము, తత్త్వబోధనా
నూనవచో విలాసములహో! పరగాంగ సుధాప్రవాహముల్
మానిత సద్గుణాచ్ఛ మణి మండిత శీలము సాగరమ్ము, మా
వాని యుదాత్త జీవితము భారత జాతికి జీవమన్నిటన్

"రావయ్యొ ఓ గాంధి దేవా రావయ్య దివ్య ప్రభావా!" "మానవజన్మ ఇది మానవ జన్మ - పదిలము సుమ్మా కడు పదిలము సుమ్మా" ఇవి వీరి పాటల పల్లవులు

**మానసవీణ** ముద్రణ 1993 పుటలు 120 ఇందలి 48 శీర్షికలలో పద్యఖండికల కంటె గేయాలే ఎక్కువ ఆంధ్ర ప్రశస్తి, విమోచనము, శాంతానంద, స్వతంత్రభారతము, చేనేతవైభవము దేశభక్తి గురుభక్తి సమకాలీన కవులపై అనురాగ ప్రదర్శనం ఈ మానస వీణ నిక్వాణాలు

కరీంనగర్ జిల్లా కవి మిత్రుడు 'మహ్మదలీ కవి' అకాల మృత్యువునకు వీరు విరచించిన సంతాప సానుభూతి కవితలోని ఒక పద్యం ఇది

మాతృభాష ఉరుదుమహితాంధ్ర సాహితి, శుష్కమైన కొలువు సుకవనమ్ము

అబ్బెనెటుల మహమదలికి సద్యోగంబు, పూర్వజన్మ పుణ్యములను గాక

అలీకవి ఆంధ్రసాహితీ ప్రియులైనా పూర్వపునర్జన్మల నొప్పని అచ్చమైన ముస్లిం అయినా ఈ కవి గారు తమ హిందూ సంప్రదాయ రీతిలోనే వారిని ప్రస్తుతించారు ఎవరి విశ్వాసం - అభిరుచి వారిది! జాతీయ సమైక్యత' నిట్లా ఆకాంక్షించారు

అందరి ఆత్మలొక్కటియె అందరి సౌఖ్యము దు ఖమొక్కటే
అందరి రక్తమొక్కటియె అందరి ప్రాణము మానమొక్కటే
అందరి నవ్వు ఏడ్పొకటె అందరి పుట్టుక చావులొక్కటే
ఎందులకీ విభేదములు? ఎక్కువ తక్కువ లేల జాతిలో?

ఏమిటి జవాబు? అజ్ఞానం స్వార్థం! మన దేశంలో ఈ ప్రపంచంలో నీతులు చెప్పేవారు లేక కాదు, ఆచరించేవారు లేక కదా ఈ సామాజిక సంక్షోభాలు అప్పుడప్పుడు పత్రికలకు సభలకు రేడియో ప్రసారాలకు వ్రాసినవీ కవితలు అర్థానుస్వారాన్ని పూర్తిగా వదిలేయడం, పదాలు విసంధిగా వాడడం పద్య శీర్షికలకంటె గేయ శీర్షికలు పెరగడం ఈ కవి నవోదయానికి 1961 మానసవీణకు 1993 వచ్చిన మార్పులు

ఈ పుస్తక ముద్రణకు ముప్పదివేల రూపాయల వరకు చందాదారుల లిస్టు ప్రచురించబడింది అంతటి ప్రజాదరణ పొందడంఈ కవి సుకృతి విశేషం

## 5 నల్లాన్ చక్రవర్తుల వేదాంతాచార్యులు - మద్దికుంట, తా ॥ సిరిసిల్ల

ఉభయ భాషాపండితులు రసవదాంధ్ర కవితా విశారదులైన న చ వేదాంతాచార్యులు ఎం ఓ ఎల్ (మాస్టర్ ఇన్ ఓరియంటర్ లర్నింగ్) పట్టభద్రులు, కరీంనగర్ జిల్లా పరిషత్ సెకండరీ పాఠశాలల్లో ప్రథమశ్రేణి ఆంధ్రోపాధ్యాయులుగా ఉద్యోగం చేసి ఇటీవలే 1990 సుమారుగా పదవీ విరమణ పొందారు

శుద్ధ సంప్రదాయవాది విశిష్టాద్వైత మత వేది అయిన వేదాంతాచార్యుల హృదయం బహుసున్నితం అందుకే వీరి కవిత రసార్ద్రంగా అవతరించింది వేదాంతాచార్యులు మహాకావ్య రచనా సమర్థులు కాని వీరు రచించి ప్రచురించినవి కేవలం రెండే రెండు ఖండ కావ్యాలు అవీ కావాలని ముద్రణకోసం కాక అనేక సందర్భాల్లో వ్రాసిన పద్య ఖండికల సంపుటాలు వీరి ముద్రిత రచనలు

1 వనమాల ఖండకావ్యము - 1964 (నవోదయ సమితి ముస్తాబాద్ ప్రచురణ - 600 ప్రతులు) 2 ముక్తా ప్రవాళము - ఖండకావ్యము 1984 (సాహితీ మిత్రమండలి ముస్తాబాద్ 750 ప్రతులు)

కావ్యపరిచయము



వనమాల విద్వత్కవిగా భక్తి భావ సంపన్నులుగా ఆచార్యుల వారికి మంచి పేరు తెచ్చింది ఇందులోని పుటలు 72 శీర్షికలు 114 ఇవి - ప్రార్థనాదికము, ఉపసూక్తము, గోదాదేవి, కల్యాణ సీత ఆర్తి ప్రబంధము మొదలైనవి అందులో ప్రధాని నెహ్రూ స్మృతి, భారత చైనా యుద్ధం తప్ప మిగిలినవన్నీ భక్తి భావాలు అందులో వేదాంతాచార్యులది శ్రీ వైష్ణవ భక్తి

నా యెద గూడు కట్టు కరుణామయ యీ కమనీయ కావ్యమం
దాయత భావముల్‌సహృదయాధృతి నం జన నౌచితీ గుణ
ప్రాయములై రసాకృతిని రంజిలుచున్ సదసద్వివేక స
చ్ఛ్రేయ ఉదార భావులగు శిష్టుల యాత్మలకెక్కుగా వుతన్ పు 7

చివరి పాదంలోని విసంధి శ్రేయోదార అని గుణ సంధిగా కాక శ్రేయముదార అని ఉత్వసంధి అని కవి భావం కాబోలు కవి ప్రతిభా వ్యుత్పత్తులకు నిదర్శనంగా రూపొందిన ఉషస్సూక్తంలోని మొదటి పద్యం - వేగుచుక్కను కవి వర్ణించిన తీరు చూడండి

రమణీయ నందనా రామమ్ములో నప్సరస లాడనెగిరిన గచ్చకాయ (యతి)
వైజయంతపు మేడ బౌలోమి యాడుచో చెదరి పడ్డట్టి పచ్చీసు గవ్వ
అమరావతీ వీధి నాడు జయంతుండు గొట్టగా దొరలిన గోలికాయ
కాలపూరుషుడుత్సుకత ద్రిప్పు బొంగర మ్మున తళ్కులీనెడి పూవు గుర్తు
తులువ చీకటి ముచ్చుల చిలుకు మార్చ, బొడుపుమల చరియల పల్లె బోయ పడతి
రివ్వు మన నొడిసెల ద్రిప్పి రువ్వు రాయి యన బొడిచె వేగు జుక్క విహాయసమున పు 8

విషయ సూచికలో తప్పిన వీర సైనికుని 'హిమాలయం నుండి లేఖ' శీర్షిక లోనిదీ పద్యం

ప్రతి జీవుండెట నో జనించి యెచటో ప్రాల్మాలు నీ జీవితం
బు తలాతోకయులేక బుచ్చి చనిపో బుణ్యంబొ శ్రేయంబొకో
బ్రతుకన్నన్ దిని త్రావి త్రేన్పుటయొ! వీర స్వర్గదంబైన యీ
క్రతుభూమిన్ దన దేశరక్షణకునై ప్రాణంబు లీయన్ వలెన్ పు 27

'ఆశ్వీయుజం' దేవి నవరాత్రుల వర్ణన, కల్యాణసీత' విష్ణు చిత్తుని ప్రబంధానుసరణ, 'ఆర్తి ప్రబంధం' స్వీయభక్తి నివేదన సత్యమానినీ సంస్కరణం' హరికథగా వ్యాప్తి కలది అంజనేయుడు కృష్ణుని శ్రీరామునిగా చూడనెంచగా ఎన్ని ప్రయత్నాలతోనూ సత్యభామ సీతగా మారకపోవడం, కొంగు కొప్పు మార్చినంతలోనే రుక్మిణి సీతగా కన్పించడం అందలి కథ

ముక్తా ప్రవాళము 1984 ఇది 15 పద్య కవితల 50 పుటల ఖండకావ్యం

ఇందులో వర్షాగమనము' ప్రకృతి వర్ణన వీరగల్లులు' దేశభక్తి పద్యాలు 'అమృతభారతి' సంస్కృత భాషా ప్రశంస, 'మహితాత్ముడు' గాంధీ మహాత్ముడు మిగిలిన శీర్షికలన్నీ భక్తి సంబంధ కవితలు 'సుమనోభావన' ఆరు పద్యాలు కవి కోమల హృదయానికి ప్రతిబింబాలు

నచ్చని వారు ముక్తియె ఘనంబని లోయెదలోన నెప్పుడున్
మెచ్చినవారు పొందు కరుణించునొ యేమొ పరాత్పరుండు - నా
పచ్చి యెడందలో మధుర భావనలూటలు చావలేదునే
నిచ్చెద జుంటితేనియ - సుహృత్తతి కుత్తుక బంటి గ్రోలగన్ 1

కొమ్మల రెమ్మలన్ననల గోలుకు వచ్చిన పూవు బిందె దా
నిమ్మను జూడ నా యెడద నెవ్వగ గ్రుంగెడు - జవ్వనాన పా
దమ్మిడు నంగకమ్ములను దాచగ నోచని పేదరాలి వ
స్త్రమ్మున రంధ్ర జాలకములన్ గృశియించెడి శీల సంస్కృతిన్ - 5 (యతి ర, ల)

'కృత్యాది' లోనూ కవి తమ కవితాకాంక్షనిట్లా తెలుపుకున్నారు

కం ఇది - సాహితీ కుటీరపు, మృదు మధుర పదార్థ భావ హిత నవనీతో
పద - దైవ నివేదిత మియ్యది చదువరికిత్తు సహృదయార్పణ మనుచున్ - పు 6

నిలువెల్ల దైవభక్తితో నిండిన ఈ కవితాచార్యులు గోహింస'కు కారణాలనిలా నిష్కాక్షికంగా వెల్లడించారు

తె గీ యాగములపేర నతిధి మర్యాద పేర స్వర్గ కాముల హింసలు సాగె నాడు,

ఎగుమతికి జర్మమనుచును నెఱచి తినగ, భోగ కాముల గోహింససాగు నేడు

వేదాంత భావంతోకాక జనక చక్రవర్తిని జన్మములుద్ధరించినవా? రంతిదేవునికి కూడా యజ్ఞఫలం కాక దానగుణం ముక్తిని ప్రసాదించినది, కావున యజ్ఞఫలాలపై ఆసక్తితగదని కవి సహేతుక సమీక్ష కావించారు జీవరక్షాబంధములో స్వాతంత్ర్యయోధుల 'అభినందనము' అభినందనీయం

'అమృతభిక్ష' వకుళాభరణ యోగి (నమ్మాళ్వారు) వైష్ణవభక్తి కవితలు ఈ కావ్యంలో సగానికి మించిన భక్తిపద్యాలు మరో భాగవతాన్ని చదివిన తృప్తినిస్తాయి 'అమృతభిక్ష'లోని ఈ అపురూప పద్య శైలీభావ విన్యాసం చూడండి

ప్రణయమ్ములో నీవు నిగమ వల్లరీ సుమగలన్మధువు
అణుజీవ హృద్గుహాంతరము నందు భాసిలు శాసకుడవు
ప్రణతార్తి హరణమ్ము నెలవు భక్త హృత్కమల హంసమవు
ఘృణి మండలంబన్న లక్ష్మియెడదలో వెల్గు వెల్గువవు

ఇది మధ్యాక్కర 2 ఇంద్ర గణాలు + 1 సూర్యగణం + 2 ఇం గ +1 సూ గ = 6 గ ప్రతిపాదంలో ఉంటాయి ప్రతిభావ్యుత్పత్తులు - ఐహికాముష్మిక నీతి ప్రీతులు కల కలకూజితాలు వేదాంతాచార్యుల కవితా కళా ఖండాలు

## 6 మలయశ్రీ - చంజర్ల , జననం 1940

కరీంనగర్ జిల్లా పరిషత్ సెకండరీ పాఠశాలల్లో ఆంధ్ర భాషాధ్యాపకులుగా ఉద్యోగం చేస్తూ మలయశ్రీ (ఎస్ మల్లయ్య) గారు తెలుగు సాహిత్యంలోని వివిధ ప్రక్రియలలో రచించిన 60కి పైగా పుస్తకాలు ప్రచురించబడ్డాయి ముద్రణలో వీరి కావ్యసుందరి ఖండకావ్యం మొదటి పుస్తకం ఇది 1968లో వెలువడిన 50 పుటల 14 శీర్షికల సంపుటి అన్నీ పద్య ఖండికలే దేశభక్తి, ప్రకృతి పరిశీలన, మనోవిశ్లేషణ కవి స్వీకరించిన అంశాలు తిరుపతి వేంకటకవుల 'శ్రవణానందం' కావ్యంలోని అంకిత పద్యం 'ఎందర జూపెనేని వరియింపదు మా కవితా కుమారి' ప్రేరణతో వీరువ్రాసిన అంకిత పద్యాలు మూటిలో ఒకటిది

తగు వారెవ్వరు దీనికంచు నొక సత్కావ్యానురాగున్ ఘనున్
సుగుణున్ మాన్యు రసాత్ముజూచితిని శ్రీశున్ వేణుగోపాలనిన్
తగనాతండును సమ్మతించె ముదమాత్మన్ బొంగ నాకోర్కెతా
నగివంచెన్ దలనాదుకన్యకయు ఆ నామంబు విన్నంతనే

మాతృశ్రీలో 'అమ్మ నిజమ్ము నమ్ము ముగురమ్మల మూలపుటమ్మ తమ్ముడా'' అని ప్రస్తుతించాడు 'ఆంధ్రశ్రీ'లో కవి భావన ఇట్లా సాగింది

తొలికాలంపు చరిత్రలన్ వినిన నేదోరీతిగా చిత్తము
త్తల మొందున్ మెయిరోమముల్ నిలుచు చైతన్యంబు స్పందించు వె
న్నెలలే కన్నుల వెల్గు గుండె కదలున్ స్నిగ్ధార్ద్రభావాలతో
కలగా మానసమూగిపోవు నిదియే కాలంపు సంబంధమో!

శిల్పశ్రీలో పూర్వశిల్పుల నిట్లా సంభావించారు
శిలలను చెక్కి చెక్కి యర చేతుల నెత్తురులొల్కెనేమొ నీ
వలనకదా పురాతనపు భారత సంస్కృతి నిల్చెనేటికిన్
ఫలితము నాడు పొందితొ యుపాయనముల్ గొనుమోయి శిల్పిమా
తలపుల నీవు నిల్చిన నుదారత రాల్చెడు కంటిముత్యముల్!
భావనవ్యత ఈ కవి కవితలలోని ప్రత్యేకత చందమామ శీర్షికలోని నలభై గీతాల్లో ఒకటిది
మా ప్రబంధాల నున్నట్టి మహిళలెల్ల, మోహమున ముగ్గి నీ శీతమునకు నలిగి
తిట్టి పోసిరి నాలుక తీటవాయ చల్లదనమె నీ దోషమా చందమామ!

'బాల్యం శీర్షిక పద్యాలు మధురమైనవి మరపురానివి శ్మశానం పద్యాలు పదునాలుగు సీసాలు, జాషువా గారి ఇచ్చోట ఏ సత్కవీంద్రుని పద్యాన్ని తలపించేవి ఏది రా కనిపించ దేదిరా ప్రగతి వాదాలలో తప్ప లేదురా జగతి! అని గేయంగా ఆలాపించిన ఈ కవి లోక విమర్శ కవిత కూడా ద్విపద ఈ అచ్చమైన సరళ సరస పద్య కవితల సంపుటి మలయశ్రీ కావ్యసుందరి ప్రముఖ కావ్యకర్తలైన వానమామలై జగన్నాథ వరదాచార్య సోదరుల పీఠికలతో వెలువడింది

### 7 డా॥ జె. బాపురెడ్డి - సిరికొండ, జననం - 1936

లబ్ధ ప్రతిష్ఠులైన గేయకవి జె బాపురెడ్డి గారు వీరు కరీంనగర్ జిల్లా తా॥ సిరిసిల్లా సిరికొండ లోని కర్షక కుటుంబంలో 1936లో జన్మించారు విద్యార్థి దశనుండి వీరు సాహిత్య వ్యాసంగం కలవారు ఎకనామిక్స్‌లో ఎం ఏ డిగ్రీ పొంది ప్రముఖ కవిగా ఐ ఏ ఎస్ ఆఫీసర్‌గా ద్విపాత్రాభినయం చేస్తూ ప్రపంచ కళా సంస్కృతుల అకాడమీ వారిచే మొరాకో సభలో 1989లో గౌరవ డాక్టరేట్ డిగ్రీచే సన్మానితులైనారు

గేయ, వచన గేయ, సంగీతనాటికా, వ్యాస ప్రక్రియలో పలు గ్రంథాలు వెలువరించిన బాపురెడ్డి గారి ఏకైక పద్య కృతి బాపురెడ్డి గారి పద్య కావ్యాలు' ఇది ఖండ కావ్యం

1969 మొదటి ముద్రణలో 25 శీర్షికలున్న ఈ పపుస్తకం మలి ముద్రణ 1973 నాటికి 31 శీర్షికలకు పెరిగింది [1] మూడవ ముద్రణ 1986లో 47 శీర్షికలతో వెలువడింది కవి తాము తర్వాత వ్రాసే పద్యగేయ ఖండికలను మలిముద్రణలలో మొదటి సంపుటాలలోనే చేర్చి ప్రచురించే నియమం పెట్టుకున్నారు "సౌందర్యారాధన, విశ్వజనీనత, సర్వమానవ సౌభ్రాత్రం అంతస్సూత్రంగా అల్లుకొన్న భావపుష్పమాలలు ఈ కావ్య ఖండికలు" ఇవి కవి గారి మాటలే కావ్య పీఠికలోనివి తొలి శీర్షిక 'కవితా ప్రస్థానము' (రెండవ శీర్షిక)లో

ఆదిత్యాంశువులే గణమ్ములు, సమస్తామ్నాయముల్ శాస్త్రముల్
పాదమ్ముల్, గ్రహముల్ ఉపగ్రహములే ప్రాసల్ యతుల్, మానవ
ద్యోదౌత్యాశయ సర్వ దిగ్విజయ సందోహమ్ములే భావముల్
నాద బ్రహ్మమె శైలియై వెలుగు నా నక్షత్ర కావ్యాలకున్

ఆ కవితా ధార పర్వత ఝరీ వేగం కలది కవి భావోద్వేగం చుక్కల తాకేది వ్యాకరణ సూత్రముల కొన్ని మారులు కవి ఉద్దేశ్యపూర్వకంగా ఉల్లంఘించారు ఈ పుస్తకంలో దేశవిదేశ

---

1 సుఖేలా నికేతన్ ఇర్రం మంజిల్ కాలనీ హైద్రాబాద్ - 4 ప్రచురణ

ప్రకృతి వర్ణనలున్నాయి నూతన వ్యక్తుల స్నేహబంధాల విశేషాలు మహనీయుల గుణ వర్ణనలున్నాయి దైవ భక్తి శీర్షికలు లేకున్నా ఇందులో దేశభక్తి మిక్కుటం 'స్వప్నజగత్తు లో నిరాశా పవనములందు నలిగి ఆరెడి బ్రతుకు దివ్వెల మాటి మాటికి వెలుగు మని కవి కోరుకున్నారు

మలయ సమీరమన్న మధు మాసములన్న పికంబులన్నవె
న్నెలలు మొయిళ్లు తారకలు నిర్ఝరులన్నను తన్మయుండనై -
పాడెద వేయిసారులిదె పాటను ఆడెద కోటి భంగులన్
వింత రసామృత పానమత్తుడై - అన్నారీ 'ఆనందయోగి' (22, 23, 24 పు)

అయినా ప్రభుత్వోన్నతోద్యోగిగా ప్రజల యోగక్షేమాలనాకాంక్షించారు

మన్నును దున్ను కర్షక కుమారులు, ఆగని మిల్లు ఫ్యాక్టరీ
మున్నగు వానిలోన శ్రమమున్ వడపిండుడువారు, క్లార్కులౌ
అన్నయ లందరున్ ప్రజలటంచు ఎరుంగుదు, వారి బాధలే
మున్నవొవారి భావి ఎటులున్నదొ కూడ ఎరుంగుదున్ అని,

శ్రమదోపిడి గాళ్ల,స్వార్థ యుద్ధోన్మాదుల, దురాచారుల నిరసించి నిశిత కవితలు వ్రాయుతాము కలికి చిరునవ్వులకు భాష్యాలు ప్రకృతి సౌందర్య కావ్యాలు వ్రాస్తామన్నారు (పు 10)

నేతాజీని స్మరిస్తూ ఉత్తమపురుషులో అన్నారీ విధంగా,
చచ్చితినె లేదు బ్రతికిన జాడ గలదు, బ్రతికి తినె, లేదు చచ్చిన వార్త కలదు
బ్రతికి వచ్చిన వీర సుభాసు నేను, చచ్చి బ్రతికిన జీవనాశయము నేను - (పుట 62)
దేశభక్తి దేశ ప్రగతి వర్ణనలు ఈ కవిగారి కిష్టం కవి బాణి' (పుట 85 - 1971) ఇది
ఒకటే రాష్ట్రము నేడు భారతము యుద్ధోన్మాదులన్ కూల్చగన్
ఒకటే మాట విరోధి సైన్య సమర వ్యూహమ్ములన్ చీల్చుటన్
ఒకటే శక్తి సమైక్య భారత జన జ్యోతీందిరా మూర్తిమన్
ఇక ఈ దిగ్విజయోత్సవ ప్రభలు దీపించున్ జగద్వీధులన్
నవరససరస భావ పద్య రచనా విశారదులైన బాపురెడ్డి గారు నవభారత వైతాళిక కవి

## 8 పార్వెళ్ళ గోపాలకృష్ణ - ఎం ఏ చాకుంట

గోపాలకృష్ణ గారు చాకుంట గ్రామ పురోహిత కుటుంబంలో జన్మించారు కాకతీయులకు మొదటి కల్యాణి చాళుక్యుల కాలం నాటి చొప్పదండి శాసనంలోని పార్వెళ్ల నారాయణయ్య వీరి వంశమూల పురుషుడై ఉంటారు గోపాలకృష్ణ తెలుగులో ఎం ఏ పట్టభద్రులు ఉపాధ్యాయులుగా కాలేజీ తెలుగు ఉపన్యాసకులుగా పనిచేసి ఉద్యోగవిరమణ పొందారు సంస్కృతాంధ్ర సాహిత్యవేది అయిన వీరు సంప్రదాయ వాది - అష్టావధాని

ఈ కవి గారి ముద్రిత కావ్యాలు రెండు 1 వాసంతి (ఖండకావ్యం) 1969 ముద్రణ 48 పుటలు 2 పంచము ఖాంజనేయము - భక్తికావ్యం

వాసంతి ఇందలి పద్య ఖండికలన్నీ భక్తి పూరితమైనవే ఒకటి రెండు మాత్రమే లోక విమర్శకు సంబంధించినవి వానిలోనూ అంతస్సూత్రంగా నీతికి తోడు దైవ భక్తి ప్రవహించింది సుప్రభాతము, ప్రార్థన, సౌమ్యవసంతము, అభిలాష, త్రిమూర్తులు, ప్రణయాంజలి, రిరంస మొ॥వి ఇందలి శీర్షికలు మొదటి 20 పుటలలో 14 శీర్షికలుండగా చివరి 28 పుటలు 'చంద్రశేఖరా' పద్యాలున్నవి 'అభిలాష లో కవి ప్రబోధమిది

పిరికి తనంబు బోవిడిచి పేద తనంబును రూపు మాపి ని
బ్బరమగు పూనికం గొని విపర్యయ భావములంగమించి ని
ష్ఠురత నధర్మముం గెడపి డొంకల త్రిప్పుల చక్కజేసి యు
ర్వరను సముద్ధరింపగను వాంఛను బెంచ సముద్యమింపుమా

రిరంస'లో శృంగార రసం పొంగి ప్రవహించింది మిల మిలలాడు కాంతులు సుమించెడి మోము, చీకటి డాగిన కురులు కాటుక పిట్టలుగా కనులు ముఖము కావలిగానున్న చెలితో వెన్నెలలు నిండిన జగాన మలయానిల సుఖస్పర్శన, యోగ సమాధి నందుట ఈ కవి వాంఛ।

ఈ పద్యాలపై కరుణశ్రీ గారి ఉదయశ్రీ ప్రణయ భావ వర్ణనల ప్రభావం కనిపించుతుంది ఆత్మార్పణ పద్యాల్లోనూ కరుణశ్రీ ముద్రపడింది 'అద్వైతం దైవ నుతి విచికిత్స దైవాన్ని గూర్చిన ఆలోచన విపరీతము జనుల ప్రవర్తనగని కవి బాధ

'కవితా మీమాంస లో అతిలోక వైభవము నవభావము కలది సత్కవితగా కవి భావన 'నిష్ఠుర సత్యం'లో పెరిగే ధరలు, రేషన్ షాపుల ముందరి క్యూలు కుటిల రాజకీయాలు రైతులపాట్లు వర్ణించబడ్డవి చాటుపద్య మన దగినదినేటి విద్యార్థులను వర్ణించిన వీరి పద్యం మరపురానిది ఇది

బాలుర విద్యలో సగముపాలు నలంకరణంబునందు సా
బాలు రణంబునందు, నొకపాలు కృపా వరులౌ గురు ప్రసా
దాలు, మరొక్కపాలు సరదాలు, వృథాలపనాలు నింక నో
పాలు పరీక్షలో మిగులు పాలు నకళ్ళది యేమి వింతయో పు 18

చివరి 15వ శీర్షిక మకుట నియమం ఉంటే శతకమే అయినా చంద్రశేఖరా మకుటం కల పద్యాలు 100 ఉంటాయి ఇవి మొత్తం 139 వృత్త పద్యాలు కవి తమ ఇష్టదైవమైన శివుని సమస్త చరాచర శక్తి ప్రదుడ వంటూనే వివిధ ప్రశ్నలు వేయక మానలేదు చేసితి హేయమౌ పనులు అనటం వైష్ణవ కవులవలె వినయోక్తి వీరు అద్వైతి ఇలా అనడం ఆదిశంకరాచార్య 'శివానందలహరి' లోనూ ఉంది

కవులగు వారు కల్పనలుగా రచియించి పురాణ వాఙ్మయం
బవితథ వృత్తినిల్పిరని యందురు కొందఱెఱుంగలేకవే
దవివృతియే పురాణములు తత్పరతం భజియించు నేర్పువా
స్తవముగ గావలెన్ సమభిషంగ మెరుంగమి చంద్రశేఖరా పు 25

భక్తి మిక్కుటమైనా జీవిత ధర్మానురక్తి లోక విమర్శలతోపాటు దురన్యాయాల ఖండన పార్వెల్ల గోపాల కృష్ణకవి గారి కవితా సుగుణాలు

## 9 రావికంటి వసునందన్ - కమాన్‌పురం

భాగ్యనగర డా అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయములో రీడర్‌గా పనిచేస్తున్న ఆర్ వసునందన్ గారి స్వగ్రామం కరీంనగర్ జిల్లా పెద్దపల్లి తాలూకాలోని కమాన్‌పూర్ వసునందన్ గారు విద్యార్థి దశ నుండి రచనా వ్యాసంగం కలవారు మొదట ప్రౌఢ వచన ప్రబంధాలు రచించారు పిదప పద్యగేయ కావ్యాలు వ్యాస సంపుటాలు పరిశోధనా గ్రంధాలు మొత్తం 12 పుస్తకాలు వీరివి ముద్రణ పొందాయి

వసునందన్ గారి ఏకైక ముద్రిత ఖండకావ్యం వేణీసంగమం - 1975 పు 50

ఈ పద్య గేయ కృతిలో ప్రామాణిక కవితలతోపాటుగా పారమార్థిక నీతి బోధపద్యాలున్నవి మచ్చునకు ఒకటి రెండు ఈ క్రింద చూపబడుతున్నవి

మానవ మానవ మానవి, హీనములగు అల్పకావ్య హేలల? మేలా
మానవ భావము వీడుట మానిసికిన్ మాయలన్య మాన్యములగునే
పాపపు చింతలంగరిగి పాటల గంధుల వాంఛనల్లి, తా
నేపును రూపు మాసివడె హేయపు వ్యాధిని నీదు ఆత్మలో
నేపగిదిన్ భజించునొకొ - ఎక్కటి తేజము, దివ్య ధామమున్
పాప వినాశమైన తొలి పావన రూపము పట్ల నెయ్యమున్

'కంసధ్వంసి' శ్రీకృష్ణ వర్ణన

తమ్ముల నేలు కన్నులును, తమ్ముల జిమ్మెడు వింటిగెంటును
న్బొమ్మలు, చిన్ని నెన్నుదురు పున్నమ చందురుసాము నెన్నగన్
తుమ్మెద రొమ్ము జిమ్ము కచతోయద పంక్తి స్రవించు జెక్కులన్
కమ్మని పాలు, బాలుగను కన్నుల పున్నెములెన్న సన్నమే

పూర్వ ప్రబంధ కవుల మార్గంలో పయనించిన నవీన కవి వసునందన్ గారు వీరి ఇతర రచనల పరిచయం తర్వాతి అధ్యాయాలలో చేయబడుతుంది

**10 మహ్మదలీ కవి - ఎం ఏ , గట్టు బూతుకూరు, జననం - 15 అక్టోబర్ 1942 మృతి 13 జనవరి 1984**

మహ్మదలీగారు అతి సామాన్య కుటుంబంలో పుట్టి అసామాన్య కృషితో కవిగా విద్యావేత్తగా, ప్రభుత్వాధికారిగా స్నేహశీలిగా రాణించి, ప్రతిభతో పద్యకావ్యాలు వెలయించి అల్పాయుష్కులుగా 42 ఏండ్లకే లంగ్స్ క్యాన్సర్‌తో కన్ను మూశారు

కరీంనగర్‌లో 7వ, తరగతి చదువుతున్న కాలం 1953లోనే 'నా భేరి' పేర ఒక పద్య కావ్యాన్ని రచించి గురు భక్తితో భూమయ్య గారికిఅంకితమిచ్చారు [1] కాలేజీ చదువులో విశ్వనాథ వారి శిష్యరికం వీరికి లభించింది తెలంగాణా - కరీంనగర్‌లోని ప్రముఖ కవిపండితులంటే అలీగారికి అభిమానం తెలుగు సాహిత్య మందలి అభిమానంతో పి యు సి , బి ఏ ల్లో తెలుగు సాహిత్యం ఐచ్ఛిక విషయంగా తీసుకొని అర్థశాస్త్రంలో ఎం ఏ పట్టభద్రులై ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ సహకార శాఖలో డిప్యూటీ జాయింట్ రిజిస్ట్రార్ పదవి చేపట్టారు మచ్చలేని జీవితం, డంబమెరుగని సౌమ్య వ్యక్తిత్వం కలవారు మహ్మదలీ! ఆయన అజాత శత్రువు! మహ్మదలీ కవి అచ్చయిన రచనలు అరు పుస్తకాలు అందులో నాభేరి, మమత, ప్రవాసి, కథా కావ్యాలు మిగితా మూడు ఖండకావ్యాలు 1 హృదయ మాధురి - ముక్తకాలు - 1962, 2 అణిముత్యాలు - ఖండకావ్యం - 1973, 3 వేదనా సౌరభము ముక్తకాలు 1980

హృదయమాధురి పద్యముక్తకాలు ఇది కాలేజీ విద్యార్థిగా రచించినది అణిముత్యాలు పద్య కావ్య ఖండికలు ఉద్యోగిగా రచించిన కూర్చిన మరో ముక్తక సంపుటి వేదనా సౌరభం వీరు అచ్చంగా పద్యకవి

హృదయమాధురి ఇందులో నూరు పద్యాలున్నవి కాని, ఇది శతకం కాదు ఈ కావ్యాంకితం కావిస్తూ రాచకొండ నర్సింగరావుపై చెప్పిన పద్యాల్లో మొదటిది ఇది

---

కరీంనగర్‌లోని మల్టి పర్పస్ హైస్కూల్ 1957లో నేను 10వ తరగతిలో ఉండగా మహ్మదలి 9వ తరగతిలో ఉండేవారు ఆయన నిరాయాసంగా పద్యాలు వ్రాస్తుంటే నేను ఆశ్చర్యపడేవాడిని నేను 1960 తర్వాతనే ఛందస్సును చూసింది పద్యాలు వ్రాసింది

నీవు నెలబాలుడవు నీల నీరదుడవు లలిత దరహాసమొలుకు గులాబి నీవు
వెన్నెలయు నీటి చినుకు తావియును నేను చిన్ని చెలికాడ ఓనరసింహరాయ!

ఈ కావ్యంలోని పద్యాలన్నీ కవి హృదయ వేదనలు కరుణరస భరిత మృదు భావనా మాధురులు

రాళ్లె రతనాలటంచు జాగ్రత్త తోడ, కాచి కాపాడి కాపాడి వేచి యుంటి
నేడు నౌర నీపాదాల తోడ ప్రభువ! నేనెఱుగను రత్న శిలా ప్రతాన ఫణితి - 46

అనేక లోక పరలోక భావ మాలికల చివరి పద్యమిది

హృది పరిక్లాంత మైనది ఈ మనుష్య జన్మమున ప్రభూ! ఇదిగో మసలితి నిపుడు
నీ దృశా సుగంధ పునీతమౌ దిగంత, పవన పరిరంభ పులకిత ప్రసవ మగుచు

ఇవి భావకవుల - భక్తి కవుల తలపించే పద్య మౌక్తికాలు

**ఆణిముత్యాలు** - ఈ కృతి 1973 లో కేవలం 500 ప్రతులు ముద్రితం (మునవ్వర్ స్వీయ ప్రచురణ) కవి నిజమత ప్రీతితో మహ్మద్ ప్రవక్తకు అంకితమొనర్చిన ఈ ఖండకావ్యంలో 39 పద్యకవితలున్నాయి పుటలు 66 కృతి మొదటి 'ప్రార్థన' చివరి అంజలి తప్ప ఇందులో శీర్షికలన్నీ ప్రకృతి పరమైనవే ఆగస్టు పదునైదు, జన్మభూమి భారతనారి దేశభక్తి కవితలు పోచంపాడ్ తెలుగు నేల రాష్ట్ర సంబంధమైనవి వేదన పరితాపం వినతి సూర్యోదయం, చంద్రుడు, తరంగం వసంతం కోకిల మొ॥వి ఇతర కవితలు ప్రగతి మానవతాసుగతిని ఆకాంక్షించడం ఈ కవి ప్రత్యేకత అందుకు ఉదాహరణలుగా ఒకటి రెండు పద్యాలిక్కడ చూపబడుతున్నవి "హిమాలయము" లోని ఒక పద్యం -



పిచ్చియ కాక యంచనలు వేసి ప్రణాళికలన్ రచింపగా
నుచ్చ్రత కల్గునా, మనిషి కుండనిచో నభిలాష దేశమున్
పచ్చగ నుంచుకోర్కె ప్రతిభారత పౌరుడు గల్గి, దానికై
ముచ్చెమటోడ్చునట్లొసగుమో హిమశైలమ! శక్తి యుక్తులన్ పు 5

"తరంగము" నుండి

జడ హృదయాలు నన్ను గని స్పందన జెందుత, స్తబ్దజాతిలో
కడకొను గాక చేతనత కర్కశ మానసులార్ద్రులౌత, సం
దడి కలిగించుగాత సడి తాలిమిలేని సమాజమందు పె
క్కిడుములెదుర్కొనన్ గలుగ నిచ్చుత, సాహసమున్ మనస్సునన్ పు 33

ఉమర్ అలీషా వంటి రసవత్కవి మహ్మదలీ!

## II ఎరబాటి ఉమాపతి రావు - వెన్నంపలి; తా పెద్దపల్లి 1910-1996

ఉమాపతిరావుగారు స్వస్థలం వెన్నంపల్లి వీరు 1910లో నియోగి కుటుంబంలో జన్మించారు మల్హణ చరిత్ర రచించిన ఎడపాటి ఎఱ్ఱాప్రగడ వీరి వంశపూర్వులు కాబోలు రామగిరి రాజ్యకాలంలో వీరి పూర్వులు వాసిగన్న కరుణపు మంత్రులు నేడు ఆ పరిసర గ్రామాల్లో వీరి వంశీకులు భూస్వాములు విద్యావంతులు రావుగారు సంస్కృతాంధ్రభాషా పండితులు వేదాంత మార్గాను యాయులైన సరస కవులు ఏబదేండ్లుగా దేవ్యారాధనతో భక్తి కావ్యాలు రచిస్తూ ప్రచురిస్తున్నారు ఈ శతాబ్ది పూర్వార్థ కవులైనా వీరి కృతుల ముద్రణ కాలాన్ని బట్టి ఈ ఉత్తరార్థంలో పరిచయం చేయడమైనది

కరీంనగర్ వాస్తవ్యులైనా రైలుమార్గ సౌకర్యం, బంధు సంబంధాలను బట్టి వరంగల్‌తోనే వీరికి సంబంధమెక్కువ కరీంనగర్ కవులకు వీరు అంతగా పరిచయం లేరు 1 ఉమాపతి రావు గారి ముద్రిత రచనలు ఇవి 1 రాధాస్వామి యోగము - 1974, 2 పుష్పాంజలి 1978 3 పరాశక్తి 1981, 4 భద్రకాళియోగము - 1985, 5 ఆత్మాంజలి - 1993

రావుగారివి చిరుకావ్యాలు పద్యకవితలు వారు శక్త్యారాధకులు హనుమకొండ భద్రకాళి భక్తులు

**పుస్తకాల పరిచయం**

రాధస్వామి యోగము రాధకు కృష్ణుడు బోధించిన వేదాంతసారం

“ఎరుగుదును రాధ! నిన్నునీ గురుడు పంపె,
అతనికిన్నాకు భేదమావంత లేదు
ఎందు నీవేగ గురురూప మందెయుండు,
ననుడు పైకేగి రాధతా హరుసీమూని - వ 9

ఇది “గురుర్‌బ్రహ్మ గురుర్విష్ణు “శ్లోక భావమనవచ్చు ఈ ఖండ కావ్యంలో కావ్యనామశీర్షిక 18 పద్యాలు, రెండవది గురుదేవుని మధుర స్మృతి 9 పద్యాలు, మొత్తం 27 పద్యాలు, 6 పుటలు

పుష్పాంజలి రావు గారి కృతులలో ఇదే పెద్దది పు 34 ఇది దేవీ స్తుతి కావ్యం పుష్పాంజలి, జగదంబ, కామ సంజీవనము మహాత్మ్యము, భద్రకాళిక పూజ సతి అను శీర్షికలున్నా అన్నింటి సారం ఒక్కటే అది ఆ పరాశక్తి భద్రకాళి నుతి

ఉన్నది కన్పడదెన్నడు కన్నది కనినట్లు వ్రాయ కల మాడదు, లే
కున్నను భాసించును, అది యెన్నగ నీమాయ, మనుపవే జగదంబా పు 26
శ్రీయున్ బార్వతి వాణి చక్రధర విశ్వేశాబ్జ సం భూతులే
మాయాతీతనఖండ శక్తియని సంభావించి పూజింతురో
శ్రేయ ప్రాప్తికి నేమహాజనని తా సృష్టించు లోకాదికం
బా యుత్కృష్ట మహాత్మ్యమీవు జగదంబా భద్ర కాళీశ్వరీ పు 22

ఈ పద్యం మొదటి చరణంలో త్రిమాతలను పేర్కొనిన వరుసలోనే వారి పతులైన త్రిమూర్తులను పేర్కొనడం జరిగింది ఈ క్రమాలంకార, పద ప్రయోగ నైపుణి, కవి పాండితికి నిదర్శనం ఈ కృతిలో కవి నుతి పురాణ గాథల ఉదాహృతితో దేవ స్తుతి నిండి ఉన్నది

---

కరీంనగర్ జిల్లా రచయితల చరిత్ర - 1981లో ఉమాపతిరావు గారి ఒక పుస్తకము పుష్పాంజలిని మాత్రం పరిచయం చేశాను అతికష్టంగా ఈకవి విలాసం తెలుసుకొని ఇతర వివరాల కోసం 25-11-93 నాడు పెద్దపల్లి నటరాజ్ టాకీసు ముందున్న రావుగారి గృహానికి వెళ్లాను పసిమిరంగు మసక కళ్లు బక్కపలుచని వంగిన శరీరం నిరాడంబర జీవితం, నిస్తులభక్తి సాహిత్యానురక్తికల వయోవృద్ధులైన ఉమాపతి రావు గారు అత్యంతానురాగంతో ఆహ్వానించారు వారి శ్రీమతి లాజవంతి ‘భర్తకు తగిన ఇల్లాలు’ పతి కవితలను చూసి ఎందుకండీ ఈ పద్యాలు ఎవరికి కావాలి? అనేవారట అందుకు జవాబుగా ఈకవి గారు ఎవరో వస్తారే నా రచనల కోసం అనేవారట ఇదుగో వచ్చారు చూడు అని నన్ను భార్యకు చూపి ఆనందించిన భక్తకవి ఉమాపతిరావు గారు వారికి సంతానంలేదు కావ్య సంతానంతప్ప దత్తపుత్రుడు ప్రసాద్ అడ్వకేట్, కోడలు డాక్టరేట్ కోసం పరిశోధనా గ్రంథం రచిస్తున్న విద్యావతి కవి గారి అముద్రిత వ్రాతప్రతి ‘ఆత్మాంజలి’ ఇతర రచనలు తీసుకొని సానంద సాశ్రు నయనాలతో వెనుదిరిగి వచ్చాను ఈ డిగ్రీ రచనానంతరం వెళ్ళేసరికి ఆదంపతులిద్దరూ కీర్తి శేషులు!

పరాశక్తి ఇది 32 వృత్త పద్యాలదేవీ స్తోత్రం

సృష్టి పరిణామ క్రమమును వ్యాఖ్యానించుచు తొలిస్పందము శబ్ద బ్రహ్మమనియు దానికివర్ణమేతొలి సర్వసృష్టియనియు వ్యాఖ్యానించినారు కుండలినీ తత్త్వమును చెప్పి పరమేశ్వరిని మాయతీతముగా నిరూపించియున్నారు ఒకానొక్కెడ మాండూక్య కఠోపనిషత్తులు దేవి తత్త్వమునెట్లు వ్యాఖ్యానించినవో చక్కగా అన్వయించినారు ఈ విషయముల విస్తృతి చూసినచో వేద వేదాంతములను దేవీ తంత్రములను చక్కగా నెరిగిన వారు మాత్రమే తెలియజేయగల అంశములుగా గోచరించుచున్నది'

శ్రీ సోహంబును భద్రకాళిగని యర్చింపన్ తలంపయ్యె అని మొదటి పద్యంలోనే చక్రసంచార సద్రూపనిరూపణం శ్రీసూక్తులు సిగమాంతార్థముల ప్రసక్తి తెచ్చారు కవి రెండవ పద్యంలోని యోగవర్ణనమిది

యమనియసనాదులను న(అ) ష్ట విధాంగములన్ ధరించి స
క్రమముగ నూర్ధ్వగామియయి కంజ భవాండములెల్ల దాటి స
ర్వము మది నుండి త్రోలి కడు భక్తి పరాంబ పదాంబు జాతముల్
తమిగను చందు నుందువు సదా! పరతత్వము దెల్పు హంసికా

ఈ యోగ యమనియమాదులు పతంజలి యోగశాస్త్రంలో వర్ణించబడినవే దేవిని యోగ రూపిణిగా వర్ణించటం ఈ కవి భక్తి భావనా విశేషం

అది యేతత్త్వమొ యేమనన్ వలెనొ సత్యంబవ్యయం బద్వయం
బది విశ్వంబునకాశ్రయంబుగన మోక్షార్థంబు త్రైగుణ్య సం
పదలిచ్చోటికి జేరబోవు భువన ప్రఖ్యాతమౌ తల్లి భ
ద్రదమై వెల్గుట భద్రకాళి యను పేరన్ బిల్తునో హంసికా పు 15

చక్కని వేదాంతం చక్కని కవిత్వం ఉమాపతిరావు గారి సాధనా సంపత్తులు

భద్రకాళీ యోగము 10 పుటలు 50 పద్యాలు

ఉ శ్రీ పరతత్త్వ నిర్మల విశిష్ట పవిత్ర చరిత్ర నెన్న భా
షాపతి శంకరాచ్యుతులె జాలరనన్ మముబోంట్ల శక్యమా
ఔపనిషత్ప్రకీర్తిత పరాంబ మహత్తరశక్తి, భద్రకా
ళీ పద వాచ్యమజ్జనని డెందమునందు వసించుగావుతన్ 6 ప 1

అన్నెము పున్నెము తెలియని నరులకు క్షుద్రతాంత్రికాధములుప్రచ్ఛన్నతతో గూర్చిన విపత్తుల భద్రకాళి తొలగిస్తుందట 4

సంతుమతము పక్కి జనని నుపాసించియభ్యసించినట్టి యాత్మ విద్య,
గురు కటాక్షమునను గురుతెరిగిన దాని, విశ్వశాంతి కొరకు విశదపరతు - 2

పూర్వ వేదాంత సిద్ధాంతాలను స్వేచ్ఛగా ప్రతిభావంతంగా భద్రకాళికి అన్వయిస్తూ చెప్పినదీ భద్రకాళీ యోగము పదకొండవ పుటలో కవి హృదయము పేర చెప్పిన అయిదు వృత్త పద్యాల్లో నాలుగవదిట్టున్నది

చ రసమయి పైన రాధవుగ రమ్యసుధారస మొల్కబోసి సం
తసమున కాళివై వివిధ తంత్రములన్ బ్రకటించి చూపి, నీ
రసపడు వేళ దుర్గగ శరంబుల శత్రుల గీటడంచి, సా
హసమిడి బ్రోచినట్టి జగదంబ నమస్సులు భద్రకాళికా

ఆత్మాంజలి 1990 రచన, ముద్రణ పొందింది

ఇది సైతం దేవీస్తుత్యాత్మక భక్తికృతి చిరుకావ్యం పద్యాలు 40

ఆ వె పురుషుడనగ నాత్మ భూర్భువర్ స్వర్లోక, జీవరాశి గల్గుచేతనంబు
ప్రకృతి యనగ సకల వస్తు సంతాన బీ, జములవెలువరించు జనని యగును ప 3

ఆ దేవి అంశలే త్రిమాతలుగా ఆమెయే త్రిమూర్తుల శాసకురాలిగా కవి ఆరాధించారు

కం గుణమయ్యు నిర్గుణంబై, యణువయ్యును బ్రహ్మమయ్యు నఖిలంబయ్యున్
ఋణమయ్యు ధనమునయ్యును, క్షణమయ్యుయుగంబునయ్యు కాళిక యగుతా! ప 10

హరుని (శివు) తమో గుణం రుద్రుడు, రజోగుణం శంకరుడు, సత్యగుణం శివుడు అతని చిద్రూపం అంబ 14 దృక్కు, లక్ష్మి, దృశ్యం పార్వతి శబ్దం సరస్వతి - ప 15

ఇటువంటి వేదాంత భావ వివరణల దేవీస్తుతికావ్యం ఆత్మాంజలి

రాధాస్వామి సత్సంగ మత ప్రీతి, కాళికాభక్తి, ఉమాపతిరావు గారి ఖండకృతుల ఆకృతుల ధరించాయి ఉమాపతిరావు గారి వేదాంత కవిత్వం ఒక జీవిత కాల సాధనా ఫలితం

## 12 కాకర్ల కృష్ణమూర్తి - బి ఓ ఎల్ ధర్మపురి - జ 4-4-1943

కృష్ణమూర్తి ధర్మపురి వారు సుప్రసిద్ధ సంస్కృత పండితులు, నటనావతంసులైన కాకర్ల లక్ష్మీకాంత శాస్త్రి గారికి వీరు పుత్రులు మూర్తిగారు తెలుగులో బి ఓ ఎల్ హిందీలో సాహిత్య విశారద సాహిత్య సుధాకర్ పరీక్షలయందుత్తీర్ణులై మంచిర్యాలలో ఆంధ్ర భాషోపాధ్యాయులుగా ప్రభుత్వోద్యోగం చేస్తున్నారు వీరు వైద్య పురాణ ప్రవచన, నాటక కళలలో ఆసక్తి కల పద్యకవులు వీరి ముద్రిత కృతులివి

1 ధర్మపురి లక్ష్మీనరసింహ స్వామి సుప్రభాతం తెలుగు, 2 ధర్మపురి లక్ష్మీనరసింహ శతకము 3 మూర్తిశ్రీ ఖండకావ్యం 1984, 4 భజగోవిందం - పద్య గేయానువాదం - 1984

అముద్రితములు కచదేవయాని నాటకము, గేయరామాయణము, భద్రాద్రి రామశతకము, చిలిపిచేష్టలు (ఖండకావ్యం)

మూర్తిశ్రీ ఈ ఖండకావ్యం శీర్షికలు 16, పుటలు 60 ఇష్ట దేవతాసుతులు కృష్ణనీతి కందాలు మనపురుషార్థములు, బాలురు బడి పంతులు, ఓరుగల్లు, తెలంగాణా మొదలైన దైవభక్తి, దేశభక్తి పద్యాలతోపాటు తామున్న 'నెన్నెల' గ్రామాన్ని మిత్రుడు కీ శే అజీజ్ గారిని స్మరించుకున్నారు ఈ సంపుటిలో వీలైనన్ని స్వీయ చాటు పద్యాలను ముద్రించడం ఓ ప్రత్యేకత ఇంకా 'ప్రేయసి' శీర్షిక పద్యాలు శృంగార రసప్లావితాలు - నేటి రాజకీయాల ఘాటుగానే విమర్శించారు కవి పద్యశైలి భావ గమకాన్ని గమనాన్ని గ్రహించుటకు కొన్ని ఉదాహరణలు -

శ్రీ కర శిల్ప సంపదకు చెప్పకొనందగు ఓరుగల్లు, యా
కాకతి రాజకీర్తి మది కంధర మేక శిలాపురంబు ఏ
రూకల లెక్కబెట్టగల రూపములా కళలెంచి చూడ, భూ
లోక నివాసులింత ఘనులుండిరొ! నమ్మగ జాల నామదిన్ పు 6

శ్రీ తెలగాణము భారత, జాతికె తలమానికంబు జనవినుతమునన్
నీతిని శాంతిని దాంతిని, చేతోమోదముగ నిల్పు శ్రేష్ఠతమంబున్ - పు 17

మడిమిడియని గుడిలోనికి, తడిబట్టలతోడబోయి తామే ఘనతో
బడసిన రీతిని యెంతురు, జడమే దైవంబొ? జీవజాలమొ కృష్ణా - 43

విష్ణుభక్తులు శివునితోనే రామగాధను చెప్పించినట్లు ఈ కృష్ణ కవి గారు కృష్ణనీతిగా శివయను రెండక్షరములు అని శ్రీ కృష్ణశతకంలోని హరియను రెండక్షరములు పద్యాన్ని మార్చి వ్రాశారు పు 36 కులమత భేదంబులు యిల పాటించుట యనర్థము - 38 అంటూనే వీరు ప్రపంచ పాలకుడులో భావిపౌరులైన విద్యార్థులను పూర్వ సంస్కృతి విడనాడి పుడమిలోన బ్రతుకులేలనో బాలుడా భ్రాంతి తోడ' 56 అన్నారు సమాశ్వాసము పేర శ్రీకృష్ణరాయబారానంతరపు ధర్మజ కృష్ణుల సంభాషణగా సాగిన 22 పద్యాలు కవి భారత గాధాప్రీతికి నిదర్శనం వీరి చాటువులలో ఒకటి చూడండి

పెదవి గదల్పక చదివిన, చదువది యొక్కింత విషయ సంగత మగునీ
మది కెక్కును వదరిన గతి చదివినచో మరపు గలుగు, జనదటు శిష్యా

వీరి 'భజగోవిందం ఆదిశంకారాచార్యుల వారి శిష్యుల కవితా చరణాలకు అనువాదం ప్రతి శ్లోకం - గేయం తెలుగులో మాత్రా నిబద్ధ గేయంగానూ పద్యంగానూ రెండురూపాల్లో మలిచారు భాషా ఛందో విషయాల్లో కొంత స్వేచ్ఛ కనిపించినా కృష్ణమూర్తి గారి కవనం హృదయ స్పర్శి

## 13 కె మల్లికార్జున్ - ఎం ఏ , బి ఇడి , నగునూర్ జ 1932

కందులమల్లికార్జున్ హైదరాబాద్‌లో కాలేజీ చదువుల కాలంలో తెలంగాణా రచయితల సంఘం సాహచర్యంలో ఎదిగిన కవి సి నా రె వీరు మొదట గేయ నాటికలు రచించారు తర్వాత ఉపాధ్యాయ జీవితంలో వ్యవసాయంపై శ్రద్ధ చూపి సాహిత్య వ్యాసంగాన్ని కొంత వరకు అశ్రద్ధ చేశారు సెకండరీ పాఠశాల ప్రధానోపాధ్యాయులుగా స్కూల్సిన్‌స్పెక్టర్‌గా పనిచేసి పదవి విరమణ పొందారు అడపాదడపా సాహిత్య సభల్లో పాల్గొని పద్యగేయ కవితలు వినిపిస్తూనే వున్నారు

వీరి ముద్రిత కృతులు

1 ఓటరయ్య శతకం 1992, 2 విపంచి ఖండకావ్యం - 1993

విపంచి పద్య ఖండికల సంపుటి ఏప్రిల్ 1993 ముద్రణ

ఇందులోని 18 పద్య కవితల శీర్షికలివి 1 నుతి, 2 కవితాగృహము, 3 అహింసాపుత్రుడు, 4 రససమ్రాట్, 5 విపంచి, 6 వృక్షవిలాపము, 7 మూగవీణ జీవితము 8 తపోభంగము, 9 శిల్పసందేశము, 10 శిధిలవల్లకి, 11 కళామూర్తి, 12 ఏకలవ్యుడు 13 ఎఱ్ఱాప్రెగడ, 14 పరితాపము 15 శిల్పి, 16 మెరపు, 17 గాంధీసూక్తులు, 18 అక్షర జ్యోతి

ఇందలి కవితలు ఒకటి రెండు తప్ప తక్కినవన్నీ కవిగారి విద్యార్థి దశలోనివి కొన్ని పత్రికలలో ప్రచురితమైనవి కొన్ని సాహితీ సభలలో కవిచే చదువబడినవి

ఇందులో శిల్పాన్ని గురించినవి మూడు, కావ్యనామమైన వీణను గురించినవి మూడు, గాంధీని నుతించిన శీర్షికలు రెండున్నవి 'వృక్ష విలాపము' కరుణశ్రీ పుష్పవిలాపమునకు అనుకృతి 'జీవితం' దువ్వూరి 'పానశాల' ప్రభావజనిత పద్యం



కవి సనామప్రీతి 'శివ' భక్తి ఇది

శిరమున గంగ దాల్చితివి శ్రీశివ కౌగిట నుంచి పార్వతిన్
ఉరమున పొంగుతాపము మహోన్నత మోహముసేద దీరగా,
కరమను శక్తి నీసిగ నగంబున రంగుగ పొంగులెత్తుని
ర్ఝ రిణిగ పారు నీరమున సాంబశివా ననుముంచి తేల్చరా పు 3

ఏకలవ్యుని పక్షాన నిలచి కవి ఇట్లా ఓదార్చారు

ఎంతటివాడొ ద్రోణుడది యెక్కడి ధర్మపు రాజ నీతియో
ఇంతటి స్వార్థుడైనను ఇసీయను దానినె కొల్లగొట్టగా
కొంత గురుత్వమైన నొసగుండని ద్రోణుడు చేయలేదుర
వ్వంతయు, ధర్మబోధ తనయా! తన ఈసుయొ? పక్షపాతమో? - పు 20

అది రాజనీతి కాదు - రాజాశ్రిత గురువులు సాగించిన కునీతి అన్నారు కవిత్రయంలో నన్నయను కాదు తిక్కనను కాదు ఎర్రాప్రెగడ' ను ఈ కవి ఒక ప్రత్యేక శీర్షికలో ప్రస్తుతించారు

'శిల్ప సందేశం లో కళాఖండాల వర్ణన కళాకారుల అభినందన సరి కాని, మనదేశంలో శిల్పకళకు ప్రేరణ మతం ఈ మతాలు కావించిన మంచి కంటె చెడు మారణ హోమం ఎక్కువని తెలిపారు

గతము నిశామయంబను వికార ప్రభావములాడియున్ నవీ (ప్రలాపము)
నతకయి రూపుమార్చి భువనాలకు ముక్తి నొసంగు దివ్యమౌ
మతమిది యొక్కటే యనుచు మానవులెందరొ యుద్యమించు చున్
మతముల సృష్టి చేయుచు దుమారము లేపిరి స్వార్థ బుద్ధితో

వీరి మూగ వీణ, తపోభంగము పద్యాలు ఉదయశ్రీ ప్రణయ భావాల తలపిస్తాయి గాంధీ సూక్తులలోని ఒక పద్యమిది

నాడు ప్రజల ప్రభుత నమ్మని దేశాధి, నేతలంత గాంధి నీసడించి
నేడు గాంధి గారి నీతులు వల్లించు కాలమేగు దెంచె కలియుగాన పు 28

'మూఢ బుద్ధి దురాచారాల ముక్తి కొరకు సంఘ సంస్కారమునకు కాసంత చదువు'' మని అ విద్యావంతులైన వయోజనుల హెచ్చరించిన నవకవితోపాధ్యాయులు కందుల మల్లికార్జున్ గారు

## 14 దూడం నాంపల్లి, పొత్తూరు - సిరిసిల్లా
## 15 వేంగళ రామకృష్ణ - వడ్లూరు బేగం పేట - సిరిసిల్ల

ఈ ఇరువురు కవి మిత్రులు ' నాంపల్లి రామకృష్ణ కవులు' జంట కవిత్వం చెప్పలేదు కాని ఇరువురి పద్యకవితలతో 'ద్వయీనాదం' అనే ఖండ కావ్యాన్ని మే 1993లో వెలువరించారు [1]

దూడం నాంపల్లి గారు 1944లో వడ్లూరి బేగంపేటలో జన్మించారు వీరి స్వస్థలం పొత్తూరు రామకృష్ణ కవి 1947లో అదే బేగంపేటలో జన్మించారు ఇరువురు అనంతర కాలంలో సిరిసిల్లలో స్థిరనివాసాలు ఏర్పరచుకొన్నారు నాంపల్లి గారు జి ప సెకండరీ పాఠశాల ఆంధ్రోపాధ్యాయులు రామకృష్ణగారు ప్రభుత్వ పశు సంవర్ధక శాఖోద్యోగి

నాంపల్లి గారు ఒక శతకం రెండు హరికథలు, ఒక పద్యకావ్యం, ఒక యక్షగానం, రచించారు వీరి కావ్యానికి జాతీయ సాహిత్య పరిషత్ సిద్ధిపేట వారి స్వర్ణ సాహితీ పురస్కారాన్ని, పాండవ జననం హరికథకు తెలుగు విశ్వవిద్యాలయం హైదరాబాద్ వారి ఉత్తమ కృతి బహుమానాన్ని అందుకున్నారు పాండవుల అజ్ఞాతవాస యక్షగానం ఇటీవలే ముద్రితం డా సి నా రె గారికి అంకితంగా ఒక గేయ సంపుటి 'అభినందన చందనం' ముద్రణలో ఉన్నవి

---

కొరుట్ల భారతీ సాహితీ సమితి వారు ఇంతకు పూర్వమే వా వరదాచార్య, దాశరధి సి నా రె కవితలతో త్రయీనాదం సంకలనం వెలువరించారు

రామకృష్ణ గారి సత్యనారాయణ శతకం మొదటి కృతి ఈ ద్వయినాదం రెండవ కృతి కర్షకాభ్యుదయము అముద్రిత పద్యకావ్యం

ద్వయీనాదం ఖండ కావ్యంలో అంకితంతో సహా 20 కవితలు 45 పుటలందున్నవి వాటిలో 14 శీర్షికలు నాంపల్లి గారివి 9 కవితలు రామకృష్ణ గారివి

నాంపల్లి గారి కవితలలో ముందరి కాళ్ల బంధం ఆకారేఖ గేయాలు మిగితా పన్నెండులో నన్నయసన్నుతి ప్రాంజలి పోతన ప్రశంస ప్రశంసాప్రవాళం కరీంనగర్ జిల్లా సాహిత్య సేవామూర్తి బి వి రామారావు గారికి షష్టిపూర్తి అభినందన పద్యాలు కవుల పరమైనది మిగిలిన శీర్షికలు రైతు పొంగలి పరిమితసంతానం మధ్యాహ్నభోజన పథకం మొ॥వి సామాజికాలు నన్నయ భట్టును భారతావతారికా పద్య పదాలతో నుతించడం విశేషం ఆ ఏడు పద్యాల్లో అయిదవదిది



సారమతిన్ తెలుంగులు ప్రసన్న కథా కలితార్థ యుక్తిలో
నారసిమేల్ భళా! యనుచు నక్షర రమ్యత నాదరించి నా
నారుచిరార్థ సూక్తి నిధి నన్నయభట్టుని ప్రస్తుతించుచున్
పారణ సేయరే తెలుగుభారత కావ్యము నెల్లవేళలన్

తెలుగు వెలుగు కవి ఆంధ్ర భాషాభిమానం వెల్లివిరిసిన కవిత
వేమ వేద మనగ వెల్లివిరిసిన అను భాషితాల ఆంధ్ర భాషనాది
'దేశ భాషలందు తెలుగు లెస్స యటంచు ప్రతిథిగొన్న తెలుగు భాషనాది! పు 9, అన్నారు
రైతు ను గూర్చిన చక్కని పన్నెండు పద్యాల్లో చివరి శేషప్రశ్న ఇది,
' ఎండవానకోర్చి పండించు నిరుపేద రైతుకేల ఆదరమ్మునాస్తి?
లాయిలాస లేక లాభాలు గడియించు, వణిజుకేల గౌరవమ్ముజాస్తి?"

అన్యద్భుక్తం అన్యధ్వాంతం వేదికపై కట్నాలు కులమత భేదాలు వలదని ఇంట తద్భిన్నంగా మెదిలే దొంగనాయకుని వింత కథ పు 13 14 కలియుగ కల్పవృక్షము' తాళ వృక్ష వర్ణన వేటూరి వారి వ్యాసం ఈ కవితకు ప్రేరణ కావచ్చు తమిళ పొంగలి పండుగ' పేరుతో ఆంధ్ర 'సంక్రాంతి' లక్ష్మినిట్లా ఆహ్వానించారు కవి

పంట చేలలోనెల కొన్న భాగ్యలక్ష్మి, గృహమునందున నివసించు గేహ లక్ష్మి
కవుల నాల్కల నర్తించు కవన లక్ష్మి, కదలి రావమ్మ! అమ్మ! సంక్రమణ లక్ష్మి! పు 39
పద్యకవనంలో చేయితిరిగిన కవి దూడం నాంపల్లి గారు

వేంగళ రామకృష్ణ గారు సామాజిక కవితలు వ్రాసినా ప్రధానంగా భక్తకవి వీరి అయిదు కవితలలో మొదటిది శ్రీ వేంకటేశ్వర స్తుతి చివరిది సత్యనారాయణ స్వామి వ్రతకథా దండకం మిగిలిన శీర్షికలివి గోమాత కరుణశ్రీ లోని హంసవిలాపం వంటి కరుణామయ కవిత స్వతంత్ర భారతం మనదేశ వర్ణన

పేరునకు తగినట్లే రామకృష్ణ' కవికి విష్ణుభక్తి 'వి శిష్టంగా జతపడింది పోతన భాగవత పద్యాల తలపించేవి వి రామకృష్ణ కవి వేంకటేశ్వర నుతి పద్యాలు మకుటం ధూర్జటి 'శ్రీకాళహస్తీరా!'కు సమానం



ఏ పుణ్యంబున మానవాకృతిగ నన్నీ ధాత్రి బుట్టించితో
నీ పాదార్చన చేయుచున్ సతతమున్ నీ రూపముంజూచుచున్
నీపై నిర్మల చిత్తమున్ నిలుపుచున్ నిన్నే మదిం గొల్తు ని
ర్లేపా! మోక్ష పదంబు జూపగదవే! శ్రీ వేంకటాద్రీశ్వరా పు 1

రాగమయి' రాధ మధుర బాధ ఇది ఇంచుమించు 50 పద్యాల లఘు కావ్యం అందులోని ఒక పద్యమిది,

పున్నమి వెన్నెలల్ విరియ బూసెడి నీ నగు మోము జూడ గూ
ర్చున్నది యాలతాంగి మనసొప్పక నీ పయి భ్రాంతి దీర కిం
కెన్ని దినాలకైన సరె యేలగ వచ్చెద వంచు జూచుచున్,
చిన్ని గులాబి మొక్కవికసించుట తుమ్మెద కోసమే గదా పు 22 (మొగ్గ)

ఇందలి మొదటి పాదంలోని ఉపమ, లతాంగి పదంలోని రూపకం చివరి అందమైన అర్థాంతర న్యాసం కవి భావుకతకు నిదర్శనాలు స్వతంత్ర భారతిని ప్రశంసిస్తూనే దేశంలోని కల్లోలాలకు అభిశంసిస్తూ కవి దేశాన్ని ఇట్లా ప్రశ్నిస్తున్నారు

స్వాతంత్ర్యంబు లభించె నెవ్వరికి? హింసాకాండ సిద్ధాంత ని
ర్మాతృప్రాభవ యుక్త మానవులకా? ద్రవ్యార్జనాసక్తి చే
మాతృద్రోహమొనర్చునాయకులకా? మాముందు రాజెంత భూ
నేతృత్వంబున యంచు బల్కెడి జనానీకానికా? భారతీ! పు 17

నిరాయాస కవనం నిర్మల భావాలు వేంగళ రామకృష్ణ కవి గారివి

## పద్య కావ్యాలు

చాటువులు, శతకాలు ఖండ కృతులు మొదలైన పద్యకావ్య ప్రక్రియలన్నింటిలో కథా కావ్యాలకే గౌరవమెక్కువ కథా కల్పన వర్ణనా ప్రాగల్భ్యం, రస నిర్వహణ, పాత్రౌచిత్య పోషణ నీతి ప్రబోధం అన్నీ చక్కగా పొసగితేనే అది కావ్యం ప్రతిభా వ్యుత్పత్తులు పుష్కలంగా ఉన్నకవులకే సత్కావ్య రచన సాధ్యం తెలుగులో మరే సాహితీ ప్రక్రియకు లేని వ్యాప్తి గౌరవం వెయ్యేండ్లుగా పద్యకావ్యానికి లభించింది ఖండ కావ్యాలు ఈ ఇరువదవ శతాబ్దిలోనే వచ్చినవి ఖండ కావ్యం ఉపాహారం వంటిది, కథా కావ్యం విందు భోజనం!

ఇప్పుడు కారణాలేవైనా పద్య కవితల ఆదరం కొంత సన్నగిల్లిన మాట నిజం అయినా పద్య కావ్యాలంటే ప్రేమ ఉన్న కవులు - పాఠకులు లేకపోలేదు విద్యాలయాల్లో పద్యకవితలు, పద్యకావ్యాలు కావ్య భాగాలు పాఠ్యాంశాలుగా ఉంటున్నవి అందుకే పూర్వ కావ్య ప్రబంధాల పునర్ముద్రణలతో పాటుగా నవీన కవుల పద్యకావ్యాలు కూడా ప్రచురింపబడుతున్నవి

అయితే కొన్ని పద్య కావ్యాలు ఇతివృత్తం విషయంలో కొంత అపవాదు పాలు అవుతున్నవి

"ఆంధ్ర సంస్కృత కవులలో పెక్కురు గ్రంథములందలి యేక భాగ పరిచయమున మహాకవి వతంసులుగ కన్పింతురు తుదముట్ట చదివితిమా ఉన్న గౌరవము పోవును దీనికి ప్రధాన కారణము కవులలో నూటికి తొంబది తొమ్మిది మందికి గ్రంథము యొక్క సమిష్టి మీద దృష్టి యుండదు" (కవి కర్ణరసాయనం వ్యాసం దిగుమర్తి సీతారామస్వామి, భారతి సం 26, సంచిక 11)

ఈ విమర్శ పూర్వ కావ్యాల గురించి చేసింది పూర్వ కవులు ముఖ్యంగా మధ్యయుగం రచయితలు కథకు మించి కవనానికి విలువిచ్చారు ఈనాటి కవులకు పాండిత్య బలం కన్నా కథా కల్పనాశక్తి, అధికమనడం అతిశయోక్తి కాదు ఇందుకు కారణం సాహిత్య పరిచయం ఇంకా విదేశి కథా సాహిత్యాన్ని గూర్చి తెలుసుకునే అవకాశం లభించడం చిన్నవో పెద్దవో అనువాదాలు అనుసరణలు స్వతంత్ర కావ్యాలు స్తోత్రాదులు పద్య రచనలన్నీ ఈ ప్రకరణంలో పరిచయం చేయబడుతున్నవి శతకాలు తర్వాతి ప్రకరణంలో చూపబడుతాయి ఈ శతాబ్ది ఉత్తరార్థ పద్యకావ్య కవులు వీరు

1 మహ్మదలీ కవి 2 సిరిసెనగండ్ల శ్రీనివాసాచార్యులు 3 మునుగోటి లక్ష్మణశర్మ
4 వేదాంతం కాశీనాధం, 5 గట్టిపల్లి సత్యనారాయణ రాజు 6 దేవత వేంకట రాములు
7 చిట్యాల బాల దాసకవి 8 కొమ్మెర లింగమూర్తి, 9 రామక రామశర్మ
10 పి హైమవతి 11 మనోహర స్వామి, 12 వాసాల మఠ్ఠిపద్మనాభ శాస్త్రి
13 మలయశ్రీ, 14 డా రావికంటి వసునందన్ 15 రామక విశ్వనాధ శాస్త్రి
16 తోపుచెర్ల రంగారావు, 17 గంగా రాజేశ్వర రావు, 18 పార్వెళ్ల గోపాలకృష్ణ
19 దూడం నాంపల్లి, 20 అనంతశ్రీ 21 పాలెపు రాజేశ్వర శర్మ 22 కె రఘునాధాచార్య,
23 నేరెళ్ల శ్రీనివాసాచార్య 24 డా॥ అనుమాండ్ల భూమయ్య 25 ఎరబాటి బాపురావు
ఈ కవుల - కావ్యాల పరిచయం వరుసగా చేయబడుతున్నది

## 1 మహ్మదలీ కవి, ఎం ఏ 1942 - 1984

మహ్మదలీ కవి పరిచయం ఖండకావ్య ప్రకరణంలో చేయబడింది ఈ కవి కధా కావ్యాలు 1 నాభేరి, 2 మమత, 3 ప్రవాసి

కావ్య పరిచయం

నాబెరి - 1953 రచన కవి విద్యార్థి దశలో వ్రాసింది జాషువా గారి కాందిశీకుని ప్రేరణ ఈ చిరుకావ్యంపై ఉంది ఆకావ్యంలో వలెనె దీనిలోనూ గతకాలానికి వర్తమాన కాలానికి మానవ జాతి ప్రవర్తనలో వచ్చిన పరివర్తన వర్ణింపబడింది పద్యాలు సరళం

మమత 1962 రచన ముద్రణ 1962 పుటలు 106 అయిదు శీర్షికలలో దాదాపు 420 పద్యాలున్నాయి కథ చారిత్రకం మొగల్ చక్రవర్తి హుమాయూన్ కాలపు కథ జయశంకర్ ప్రసాద్ హిందీ కావ్యం దీనికి మాతృక

రోహితాశ్వదుర్గాధిపతి మంత్రి కూతురు మమత ఆమె వితంతువు బౌద్ధ సన్యాసిని రోహితాశ్వుడు హుమాయూన్‌కు విధేయుడు పఠాన్ వీరుడైన షేర్షా దాడిలో పై దుర్గాధిపతి సైన్యంగా మరణించాడు పాదుషా కూడా ఓడి అడవుల పాలయ్యాడు ప్రాణాపాయంలో ఉన్న రాజును మమత కాపాడింది హుమాయూన్ తన జీవితావసాన కాలంలో ఆ సన్యాసిని కుటీరం కలచోట ఆమె ఉపకృతికి కృతజ్ఞతగా ఒక సౌధం నిర్మించాలని చెప్పాడు ఆ మాట మంత్రి ద్వారా విని అక్బర్ పాదుషా తమ తండ్రి చరమవాంఛను తీర్చాడు కాని, అప్పటికే మమత మరణించింది ఇదీకథ కృత్యాది పద్యం ఇది

విధిచే నోటమి చెంది తేజముడుగన్ వేవెల్గు పర్వెత్తె తా
కుధరావాస మొనర్చ పశ్చిమమునకున్ క్రొక్కావి నిండెన్ నిశా
వధులన్ సాంధ్య తపస్వినీ హృదయ భావ స్నిగ్ధ రాగ ప్రభా
విధమై యాయమ నాశ్రయించినటు కావిందాలిచెన్ సూర్యుడున్

నాయిక వేదన, తండ్రి ఓదార్పు, కూతురు మాతృపితృసేవాసక్తి ప్రధమాశ్వాసంలో వర్ణితం ద్వితీయాశ్వాసంలో షేర్షా యుద్ధం

నాశన హేతుకంబగు రణంబధికార రిరంస చేత భూ
మీశులు దానవత్వగుణ హిండితులై యొనరింతు రుద్ధతిన్,
దేశహితంబు కంటె గురుతింపగ వారల స్వార్థ భావసం
కాశమె కన్పడున్ ప్రజల గాచుట యన్నది రిక్త భావమే

రాచరికాన్ని నిరసించడం కవి నవీన భావం అహింసా శాంతి ప్రబోధం యుద్ధ విముఖత ఎన్నియొ రాజ్యముల్ సమసె యిహంబున వారల పేరులున్నవో - వంటి ఇందలి కొన్ని పద్యాలు పోతన జాషువా కవుల పద్యాలను తలపునకు తెస్తాయి ధన మదాంధుల పాలనకంటె 'సామాన్యుడు పాలకుండయిన మంచికి వంచనలుండ వెప్పుడున్' 33వ, పుట కవి ఆకాంక్ష ఇది

నీతి నిజాయితిన్ విడిచి నిర్మల వర్తనమాని స్వార్థులై
నేతలె యుండినన్ ప్రజలు నీచపథమ్మున బోక యుందురే
జాతికి చేటు వాటిలదె సల్పవలెన్ జన సేవ పాలకుల్
రాతిరియుం బవల్ తమదు లాభ గుణంబులు మాని యెప్పుడున్ - 41

ఈ పద్యంలో రలయోరభేద యతి వాడబడింది ఈ భాగంలో ఋతు యుద్ధ వర్ణనలు అలంకారాలు రమ్యంగా ఉన్నాయి తృతీయాశ్వాసం శేర్షా విజయాలు

చతుర్థం కాశీకాపుర బౌద్ధారామ వర్ణన, ఆటవిక స్త్రీల వర్ణనలున్నాయి ఆటవికులే నాగరికులకంటే మేలు అని అన్నారు కవి ఇక్కడ మమత వర్ణన కంకంటిపాప రాజుగారి సీతాదేవి వర్ణనను పోలినది పంచమాశ్వాసం శరదృతు వర్ణన

తల్లీ నన్ను నిరాశ్రయున్ విమత హస్త గ్రస్త సర్వస్వు నా
పల్లీలా విధికిన్ వశంబయిన దౌర్భాగ్యున్ నిరాధారునిన్
డిల్లై పర్విడు కాందిశీకు విడువన్ రేవల్ ధృతి స్థైర్యముల్
కల్లోలంబుగ నున్నవాని గరుణన్ గాపాడ ప్రార్థించెదన్ - 96

ఆ సన్యాసిని - మమత ఆశ్రయం పొంది వెళ్లిన కొంత కాలానికి పాదుషా తిరిగి యుద్ధ విజేతయై ఢిల్లీ పీఠాన్ని అధిష్టించి గతించాడు అక్బర్ చక్రవర్తి మమత పర్ణశాల కలచోట అష్టకోణ స్మృతి భవన నిర్మాణం కావించాడు దానిపై వ్రాయించిన మాటలివి

సప్త దేశమ్ము లేలిన చక్రవర్తి, విశ్రమించె హుమాయునవ్విభుని కొడుకు
అక్బరుండు నిర్మించె స్మృత్యర్థమిచట, భవన మని దానిపై రాతి వ్రాత కలదు

మూలం వేరైనా ఇది జాషువా ఫిరదౌసి కావ్యం ముగింపును తలపించే కథ మహ్మదలీ కవి తెలుగు సాహితీ ప్రియతను కవన చాతురిని వర్ణనా సంయమనాన్ని ఈ 'మమత' కావ్యం తెలియజేస్తుంది

'భష్టలోకోద్ధరణ మహా వ్యధిత చిత్తు నొక 'ప్రవాసిని సృజయించె' అన్నారు డా అందె వెంకట రాజము గారు తమ 'మానసవీణ లోని 'కవిచంద్రుడు మహ్మదలీ, శీర్షికన 63వ పుటలో ప్రవాసి కావ్యం లభించలేదు ఇది 1985 సుమారుగా ముద్రితం

మహ్మదలీ కవిగారి కవిత చల్లని తెల్లని చంద్రిక నిజం!

## 2 సిరుశెనగండ్ల శ్రీనివాసాచార్యులు - గుమ్లాపురం

కరీంనగర్ జిల్లా గుమ్లాపురం వాస్తవ్యుడైన శ్రీనివాసాచార్యులు బి ఓ ఎల్ పట్టభద్రులై మెదకు జిల్లాలో తెలుగు పండితులుగా పనిచేసి 1980 సుమారుగా కీర్తిశేషులైనారు వీరి ముద్రిత పద్యకావ్యాలు రెండు

1 మెతుకు సీమ - 1962, 2 కూచన పల్లి క్షేత్ర మాహాత్మ్యం 89

'మెతుకు సీమ' పీఠికలో శ్రీనివాసాచార్యులు అంతకు ముందు కొన్ని హరికథలు రచించినట్లు అవి ఆ ప్రాంతంలో వ్యాప్తి పొందినట్లు, దేవులపల్లి రామానుజరావు గారు అన్నారు

మెతుకు సీమ కావ్యంలో కవి జన్మస్థాన ప్రస్తావన లేదు 'మెదకు మండల సాహిత్య చరిత్ర లో వీరి నివాసము జన్మస్థానము మెదకు అని వ్రాశారు [1] కవి సైతంతమ మెతుకు సీమ కావ్యంలో 'మేటి జోదుల కిరువు మా మెతుకు సీమ' అనే అన్నారు

కవి గారి స్వస్థలం కరీంనగర్ జిల్లాలో చొప్పదండి సమీపంలోని గుమ్లాపురం వారి అన్నగారు జగన్నాథాచార్యులు పౌరాణికులు అది వీరి తాత గారి పేరే [2] మరో అన్న తిరుమలాచార్యులు హరిదాసు జగన్నాథాచార్యుల కుమారుడు శ్రీమన్నారాయణ ఎం ఏ నిజామాబాద్‌లో ఉపాధ్యాయులు కవి (ఆచార్య శ్రీశ్రీ) మెతుకు సీమ రచయిత శ్రీనివాసాచార్యులు తమ చిన్నాన్న అని చెప్పినారు [3] సిరిశెనహళ్ కృష్ణమాచార్య శతావధాని కొరుట్ల గారు వీరి 'మెతుకుసీమ కావ్యాభినందనములో ఇట్లా అన్నారు

సిరులలరార సత్కవులచే తొలినుండియు పెంపు జెందు మా
సిరుసన గండ్ల వంశమున జేరిన ధీనిధి శ్రీనివాస వి
ద్వరు డరుదైన పూర్వచరితంబును దెల్పెడి చిన్నకావ్యమున్
స్థిర మతి వ్రాసె నా మెతుకు సీమను ప్రేమను జూడగల్గితిన్, ప 1 పు 11

కృష్ణమాచార్యుల గృహనామం మారిన వైనం, వారి వంశమూల పురుషుడు ఆరుతరాలకు పూర్వుడైన వరదమయ్యం గారు కరీంనగర్ జిల్లా మంధని వాస్తవ్యులని ఈ పుస్తకంలోని ఈ శతాబ్ది పూర్వార్ధకవుల విభాగంలో కృష్ణమాచార్యుల శీర్షికలో వివరింపబడింది శ్రీనివాసాచార్యులు కరీంనగర్ జిల్లావారే ఉద్యోగ ధర్మంగా వెళ్లి మెదకులో స్థిరపడ్డారు ఇందుకు ఆధారం వీరి 'మెతుకు సీమ' కావ్యంలోనే ఉంది ఈ కావ్యం 16వ, పుటలో కవి 'నివేదనము' అను తొలిపలుకును "మా పూర్వులీ సీమ వారే యగుట' ఈ సీమ మా మెతుకు సీమయే ' అని ఆరంభించారు అంటే కవి గారి జన్మస్థలం మెదకు కాదన్నట్లే కదా వీరి పూర్వులు అంటే మంధని వరదమయ్య గారి పూర్వులు మెదకు మండలం వారన్నమాట అది వీరి ఇంటి పేరును బట్టి ఊహించడం సిరుసెనగండ్ల గ్రామం మెదకు జిల్లాలోని సిద్ధిపేటకు సమీపంలో ఉంది

కావ్య పరిచయం మెతుకు సీమ కావ్యం పంచఖండాలుగా వంద పుటల విస్తృతి కలది శ్రీనివాసాచార్యుల పద్యశైలి ఈ శతాబ్ది భావకవుల శబ్దలాలిత్య భావ మాధుర్యాలు కలది వీరి కవితలో జాతీయభక్తి భావాలు పుష్కలం వర్ణనలు మాత్రం ప్రబంధకవుల పంక్తిలోనివి శృంగార వర్ణనలో ఈ కవి శ్రీనాథుని వీధి నాటక చాటు పద్యాల అడుగు జాడలననుసరించారు

మెదకు, సిద్ధిపేట, గజవెల్లి, నర్సాపురం, జోగిపేట, సంగారెడ్డి, జహీరాబాదు నారాయణఖేడు తాలూకా పట్టణాల వర్ణన ఈ కావ్యంలోని ప్రథమ ఖండంలో ఉంది మెదకు పారశాలలు దుర్గం, కొండాపురం వర్ణన ద్వితీయ ఖండంలో ఉన్నాయి

తృతీయ ఖండంలో మెదకు పట్టణం - మండలంలోని వివిధ దేవీ దేవతా క్షేత్రాల వర్ణనలతోపాటు మెదకు చర్చి విద్యాలయ వైద్యశాలల వర్ణించారు చతుర్థంలో గరుడగంగ - సర్పయాగం పౌరాణిక

---

1 మల్యాల దేవి ప్రసాద్ మెదకు మండల సాహిత్య చరిత్ర 1969, పు 208

2 సిరుసనగండ్ల శ్రీనివాసాచార్యులు 'మెతుకుసీమ గురుస్తుతిపద్యం పు 20

3 1991 ఏప్రిల్‌లో కొరుట్లలో శతావధాని కృష్ణమాచార్య గారి ఇంటిలో నాకు కలిశారు

కథ మంజీరానది నిజాంసాగర్ పోచారం ప్రశస్తి ఉన్నవి పంచమ ఖండంలో ఈ కాలపు ప్రజాభ్యుదయ వర్ణనముంది

ముట్టినదెల్ల ముత్యం పట్టినదెల్ల బంగారం అన్నట్లు శ్రీనివాసాచార్యులు ప్రతిపద్యం రమణీయంగా రచించారు ఇందలి ప్రతిభావం వర్ణన పరితుల హృదయాల్లో నిలిచిపోయేదిగా ఉంది ఈ దేశభక్తి కావ్యరచనకు శేషాద్రిరమణకవుల 'నైజాం రాష్ట్ర ప్రశంస' 1926 ప్రేరణ అయి ఉంటుంది మెదకు సీమ కావ్యంలో గీత సీస పద్యాలే అధికంగా ఉన్నాయి 'మెతుకు సీమ'లోని కొన్ని పద్యాలివి జహీరాబాద్‌ను గురించి - 48

ఆంధ్ర భాషీయ రాష్ట్రాన కవిధి యగుచు, నున్న తాలూక గావున యూరిలోని
జనులు మూడు భాషల నిట జదువు చుంద్రు, తెలుగు కన్నడ మరరీల దెల్లముగను పు 48
కొండాపురము-
ఇపుడు గాదది రెండు వేలేండ్ల క్రింద, బౌద్ధ ధర్మము విరివిగా ప్రబలియున్న
కాలమందున మృద్భాండ కారుడిట హి, రణ్మయంబుల జేసె నా మృన్మయముల పు 61
క్రైస్తవాంగనల వర్ణన
విరిసిన మల్లె పందిరులా? విచ్చిన లేత గులాబి మొగ్గలో?
మెరసెడి హేమవల్లికలా? మేలగు బాల రసాలకేతకీ
సురభిత పుష్ప గుచ్ఛములా? సుందర మంజుల మందహాసనం
భరితము లైన వారి ముఖ పద్మము లేరికి గావు హృద్యముల్ పు 79

నిజాం సాగరం వర్ణనలో- అది రెండామడల వైశాల్యం గలిగి నిండు జలంతో జలనిధిలా ఉండి, రెండు లక్షల ముప్పది రెండు వేల యెకరాల మాగాణికి పంట నీరిస్తుంది అయినా, (పు 92)

నోముకున్నమ్మ బూరెలు నోచుకున్న, యతివ దిని పోయె నన్న సామెత విధాన
వెలసి యీ మండలమునందు వేడ్కతోడ- బొరుగు మండలమునకును దరలు చుండు

అన్నారు స్థానిక జానపద గాథలు, పురాణ కథలు, పూర్వ చారిత్రక, నేటి ప్రజాస్వామ్య ప్రభుత్వ విషయాలు వీరి రచనలో చోటుచేసుకున్నాయి కవి భావాభినివేశం కావ్యారంభంలోనే ఇట్లా ప్రకటించబడింది

కాకతి రాజుల కాలాన వెలసిన, శిల్పసంపదలతో చెలువుమీరి
బహుళ సంపదలతో బరిథ విల్లుచురెడ్డి, రాజుల కాలాన తేజమొంది
నిజకళా ద్యుతులతో నెగడుచు నైజాము పరిపాలనంబున బ్రగతిగాంచి
అతులిత సౌభాగ్య మలరగదేశీయ, ప్రభువులు సేవింప బ్రణుతి వడసి
అలరుచున్నట్టి తెలగాణమందు మిగుల,భాగ్యభోగ్యోపలబ్ధికి యోగ్యమగుచు
నమర పుర సీమకుద్దియై యలరుచుండు, మేటి జోదులకిరువు మా మెదకు సీమ!

ఇది ఒక స్థలచరిత్ర ప్రజా చరిత, దేశభక్తి కావ్యం సిరిసెనగండ్ల శ్రీనివాసాచార్యులు కీర్తి శేషులైనా రసవదాంధ్రకవితా సౌధంలో మెదకు సీమ చిత్రాన్ని రమణీయంగా చిత్రించి/అలంకరించి శాశ్వత కీర్తి చేకూర్చుకున్నారు

## 3 మునుగోటి లక్ష్మణ శర్మ - కల్వకోట - వయసు 80 సం పైన 1994లో కీర్తిశేషులు

సంస్కృతాంధ్ర కవులు వాస్తు జ్యోతిష్య పండితులు గ్రామ పురోహితులు అయిన లక్ష్మణశర్మ గారు కవి తాత గారు హనుమచ్ఛర్మ తండ్రి అంజయ్య గారని కవి కావ్యావతారికలో తెలుపుకున్నారు కవి స్మార్తులు కనుక శైవ వైష్ణవ భేదం పాటించకుండా ఉభయ మత ధర్మ ప్రీతిలో పద్య కావ్య రచన చేశారు

లక్ష్మణ శర్మ గారి ముద్రిత కృతులు 1 శ్రీ సత్యనారాయణ వ్రత మహాత్మ్యము (కావ్యం) 1963
2 కాళికా శతకము 1970 3 శ్రీ వాసర సరస్వతీ సుప్రభాతమ్ (సంస్కృతం) 1981

కావ్య పరిచయం సత్యనారాయణ వ్రత మహాత్మ్యం అయిదు ఆశ్వాసాల 340 పద్య గద్యాల సలక్షణ చంపూ కావ్యం ఇది సత్యదేవునకు అంకితం విశేష వృత్తాలతో పాటు ఎడనెడ తొహరలు ఉండటం ఈ కావ్య ప్రత్యేకత హరిదాసులకు ఇది ఉపయుక్తంగా ఉండాలనే సంకల్పంతో కవి గారు అవి రచించి ఉండవచ్చు స్కాంద పురాణాంతర్గతములని కవి ఇందులో మూడు కథలు వర్ణించారు ఇది సూతుడు శౌనకాది మునులకు వినిపించినట్లున్నది

ఇష్టదేవతా స్తుతి కవి వంశ వర్ణన తర్వాత లక్ష్మణ శర్మగారు పూర్వకవుల పేర్లు స్మరించారు ఈ కావ్యంలోని పద్యాల శైలి భాగవతాన్ని తలపించేదిగా ఉంది

నీరధి పాత్ర, కజ్జలము నీల నగంబును, బత్రముర్వి మం
దార సుశాఖ లేఖిని, ముదంబున నెల్లను గూర్చి శ్రద్ధతో
భారతి సత్యదేవుని ప్రభావము వ్రాసియు వ్రాసి వేసటన్
భూరిగ జెందె నైన దుద ముట్టక యుండెను దన్మహాత్మ్యమున్ 2-49

ప్రధమాశ్వాసం - విష్ణువు నారదునకు సత్యదేవ వ్రత మహత్వము వివరించడమున్నది ఆశ్వాసాంతాల్లో మాలినీ వృత్తాలు కవి పరిచయ గద్యలు పూర్వ ప్రబంధాల ఫక్కీలో ఉన్నవి

ద్వితీయాశ్వాసం ఒక పేద భిక్షుక బ్రాహ్మణుడు ఈ వ్రతమాచరించి దారిద్ర్య బాధా విముక్తి పొందిన కథ బిచ్చమెత్తటం ఎంత దయనీయమో చూడండి

ఒక్కతె వెక్కిరించు మఱి యొక్కతె ముక్కును మూతి త్రిప్పు వే
రొక్కతె నిక్కి చూచు నిక యొక్కతె వచ్చితివా యటంచనున్,
ఒక్కతె నవ్వు ఫక్కుమని యొక్కతె వేయుగవాటమున్, మరిం
కొక్కతె లేదు పొమ్మనగ నొక్కతె తెచ్చియుబెట్టు ముష్టియున్ - 2 24

మనుజుల కేడు జానెల దేహము యాచనకు వెళ్ళుటచే అయిదు జానలయి, బిచ్చమడుగు వేళ మూడయి, లేదు పొమ్మనిన మాటవినినంత శూన్యమగునట - 2-26 ఇటువంటి వర్ణనలే పాఠకులనాకట్టుకునేవి, కవి ప్రతిభకు పట్టం కట్టేవి

మూడు నాలుగు ఆశ్వాసాలలో వ్రతనియమం తప్పి నిర్ధనులై వ్రతమాచరించి తిరిగి ధనికులైన వైశ్యులకథ ఉంది వాటిలో పుర, స్త్రీ వివాహ గర్భిణి, పుత్రజననం మొ॥ వర్ణనలున్నవి వ్యాపార వర్ణన అతి సహజంగా ఉంది కొన్ని పద్యాలు భాగవత పద్యాల శైలిలో అలరారుతున్నవి

కుంద కుట్మలములు గోయ గోరని వారు, కూలి పనులు సేయ గోరవలసె (3 53)
వినుడిటు విప్రుండు చనుదెంచి యున్నాడ, పరగను ద్రాక్షాది తరువులార (4 41)

వై పద్యాలు నరకాసురవధ, గోపికా గీతలను అనుసరించినాయనడం స్పష్టం, పంచమాశ్వాసం వేట వర్ణన గోపకుల సత్యవ్రత ప్రసాదం తృణీకరించిన రాజు సకల సంపదలు కోల్పోయి, తిరిగి ఆ ప్రసాదం స్వీకరించి పూర్వపుటైశ్వర్యాలను పొందుట ఇందు వర్ణితం

ఒక తొహరా భాగం -

చక్కగ నిపుడే గోపకుల కడకు జని గొనియు బ్రసాదంబు

మెక్కి గృహంబును జేరగ గలిగెను - మిక్కిలి సంతోషంబు - (5-32)

ఆశ్వాసాంత పంచ చామరం 83

పురందరాది దేవ మౌని పూజ్యపాద సారసా, నిరంకుశ ప్రతాప వీర నీలమేఘవర్ణ మం

దరోద్ధరా పరోపకార దైవతాగ్రణీ మహా, కరీంద్రపోష దేవ దేవ కంబుకంఠ మాధవా!

వీరి శతక పరిచయం తర్వాత చేయబడుతుంది సలక్షణ సంప్రదాయభక్త కవి మునుగోటి లక్ష్మణశర్మ గారు

## 4 వేదాంతం కాశీనాథం - వేములవాడ 1921 - 1988

వేదాంతం కాశీనాథం గారిది వేములవాడ బి ఓ ఎల్ పట్టభద్రులై జిల్లా ప్రభుత్వోన్నత పాఠశాలల్లో తెలుగు పండితులుగా పనిచేసి ఉద్యోగ విరమణ పొందారు కాశీనాథం గాని జన్మతేది 16 5 1921, మృతి 19 9 1988 వీరి తండ్రి రావుల లక్ష్మిరాజయ్య గారు సంగీత విద్వాంసులు వారే కాశీనాథం గారికి తొలి విద్యాగురువు (తండ్రి కొడుకుల గృహనామాలు వేరుగా నుండటం పైన గమనించవచ్చు ఇది పొసగని విషయం ఇందుకు సరైన సమాధానం ఒక్కటే రావుల వారింటి కాశీనాథం గారు వేదాంతం వారింటికి దత్తువెళ్లి ఉంటారు) వీరు సరస పద్యగేయ కవి, శివభక్తులు, రంగస్థల నటులు, వారిల్లు ఒక భజన మందిరం [1] కాశీనాథం గారి ముద్రిత కృతులు-

1 గొడ గూచి పద్య కావ్యం - 1965 ముద్రణ

2, 3 - భజ గోవిందం, ముకుందమాల అనువాద లఘు కావ్యాలు

4 శ్రీరుద్ర స్తోత్రము నమక చమక పద్యానువాదము - 1987

5 శ్రీరాజరాజేశ్వర స్వామి భజనమాల - గేయాలు - 1992

అముద్రిత రచనలు - వేములవాడ భీమకవి, శ్రీరామ పాదుక, నాటకాలు, గోసేవ - కాళిదాస కృతికనుకృతి, వలపుటీల ఖండకావ్యం, గేయమాల, కథలు - గాథలు

గొడగూచి కావ్య పరిచయం

కాశీనాథం గారు 28వ, ఏట ఉపాధ్యాయ వృత్తితోపాటు కలం చేపట్టారు - 1960 సుమారుగా విరచితమైన ఈ కావ్యం 1964లో విశ్వనాథ, గార్లపాటి, గంగా రాజేశ్వర రావు, వానమామలై మొ కవి ప్రముఖుల మెప్పు లందుకొని 1965లో పుస్తకరూపం ధరించింది ఇది బసవ పురాణాంతర్గత శివభక్తురాలైన బాలిక కథ ఈ కావ్యం కొన్ని కథా సంబంధ శీర్షికలతో ఏకాశ్వాసంగా 46 పుటలలో ముద్రింపబడింది పద్య సంఖ్యలేదు కాని ఇంచుమించు 220

---

వేములవాడలోని 7 1 99 నం గల కవి గారి గృహం ఒక దేవాలయం, సాహితీ సదనం వేదాంతం కాశీనాథం గారి సతీమణి లక్ష్మీబాయి దైవ భక్తి పరురాలు భర్త యందలి గౌరవంతో వారి ముద్రితా ముద్రిత రచనలు కాపాడుతున్నారు కవి పండితులంటే ఆమె చూపే ఆదరం అపూర్వం

కథ ప్రఖ్యాతమైనది శివభక్తుల ప్రచారంలో కలది ఒక శివాలయ పూజారి కూతురు గొడగూచి (కన్నడ ప్రాంతం కాబోలు) తండ్రిలేని రోజు శివపూజావేళ పాలు త్రాగుమని పట్టుబడితే ఆ బాలిక మూఢభక్తికి సంతసించి హరుడు ప్రత్యక్షమై పాలు త్రాగి వెళ్తాడు ఆ ఖాళీ పాత్ర చూసి, కారణమడిగి బాలిక చెప్పిన సమాధానం నమ్మక ఆ పిల్ల శివునికి నివేదించిన క్షీరాన్ని త్రాగి అపచారం కావించినదని భావించి తండ్రి కఠినంగా దండిస్తాడు శంకరుడు అడ్డుకుంటాడు ఇదీ కథ మచ్చునకు ఈ కావ్యం నుండి కొన్ని పద్యాలు చూపబడుతున్నవి



ఎన్నడు లేని విఘ్నమిట యీ దినమందున గట్టెనయ్యయో
పిన్నవటంచు నీకు మృదు ప్రేమల జెప్పితి నెన్ని మారులో
పున్నెము నైనలోదలచి భోగపతిన్ శివ పూజసేయకే
వన్నెలు దిద్ది బొంకులను వల్లెలు వేసితివెంత జాణవే పు 33
అది గొడగూచి తండ్రి పూజారి మనోవేదన కావ్యం చివరి పద్యమిది
మూఢ భక్తికి శంభుడు ముక్తి నిడిన బాల గొడ గూచి గాథను భక్తి నెపరు
జదివి విన్నను గాంతురు శంభు కృపను శాశ్వతైశ్వర్య సాయుజ్య కాంతి సుఖము పు 46
కవి భావాలు సహజసుందరాలు పదాలు సరళ మనోజ్ఞాలు బాల పాలపలుకుల చూడండి
పాలు చల్లారు శంకరా! పల్కు మనుచు అఱచు కోపించు వాపోవు ఆరడించు
కోర జాచును, హరుజూచు, కోరముందు జరిపి యెలుగెత్తి పిలుచును తరినెరింగి
తటతటని నేల గాళ్లను దాక జేసి వేసటను జెందు కుప్పించు వ్రేళ్ల విరుచు
నివ్వెరను బోవు జీవుడు నీల్గు రీతి నేల బడు పొర్లుచును లేచి యేడ్చు మరల పు 17

పాల్కురికి సోమన మూల కావ్యాన్ని కథలోనే కాక శైలిలోను జాను తెలుగు పదప్రయోగంలోను వేదాంతం వారుచక్కగా అనుసరించారు 13 14 శతాబ్దుల వీరశైవ భక్తి కాల రచనను ఈ కవి శివభక్తితో పద్యకవితానురక్తిగల (1950-60) కాలంలో రచించి ప్రచురించారు గొడ గూచి సరళ సుందర భక్తి కావ్యం కాశీనాథం గారు సంగీత సాహిత్యాల ఆరాధించిన పద్యగేయ భక్తకవి

వలపుటీల పద్యగేయ ఖండకావ్యం శ్రీ రాజరాజేశ్వర శతకం ముద్రణ పొందితే ఈ కవి పద్య కవితా విన్యాసం మరింత వ్యాప్తి పొందుతుంది భజగోవింద ముకుందమాలలు చిరు కావ్యాలైనా వాని ప్రతి గేయ భాగాన్ని తిరిగి గేయ పద్యాల్లో సరళ సుందరంగా మలిచారు

శ్రీ రుద్ర స్తోత్రము యజుర్వేద సంహితాంతర్గత నమక చమక మను శతరుద్రీయ భాగానికి పద్యానువాదం
ముత్తెముల హారముల దివ్య మోహనాంగు చంద్ర ధరు(ను) గంగాధర జతగ నుమను
సరస కల్ప ద్రుమ చ్ఛాయ శాంతు ధ్యాన మగ్నుడా సుఖాసీనుని మదిని దలతు 2 23

సరసకవి కాశీనాథం గారి శివభక్తికి వారి కావ్యం శతకం భజన కీర్తనలు నిదర్శనం శ్రీ రుద్రస్తోత్రం యజుర్వేద సంహిత చతుర్థకాండాంతర్గత సప్తానువాకాల పద్యానువాదంతో కవి గారి గృహనామం వేదాంతం సార్థకం!

## 5 గట్టెపల్లి సత్యనారాయణ రాజు - గట్టెపల్లి, కరీంనగర్ - జ 1927, కీర్తిశేషులు

**కవి పరిచయం ఖండకావ్య కవుల్లో ఉంది'**

ఎఱ్ఱమరాజు సత్యనారాయణ రాజు గారు కవిగా లబ్ధప్రతిష్ఠులు
సప్న ఫలం (1966) రాజుగారి ముద్రిత పద్యకావ్యం

---

గ స రాజుగారి ముద్రితాముద్రిత గ్రంథప్రతులు వీరి సతీమణి వెంకటరమణ గారివద్ద మంకమ్మతోట లిటిల్ ఫ్లవర్ స్కూల్ రోడ్‌లోని వారి గృహములో ఉన్నవి ఆమె పతిభక్తి సాహిత్యానురక్తి తులలేనివి

ఇది ఉపాధ్యాయుడు కథానాయకుడుగా సాగిన కల్పిత కథ ఓ ఉపాధ్యాయుడు (కావ్యకర్తేకాబోలు) ఓ రాత్రి ఓ మంచి కల కంటాడు అందులో అతడు అప్సరోభామినుల చేత దేవలోకం తీసుకుపోబడతాడు వారు శృంగార కార్యకలాపాలతొ అతనిపైకి రాగా, కాదని దూరంగా పరుగెత్తి దేవ గురువైన బృహస్పతిని చేరుతాడు అతని నీతి బోధ విలువైనది ఇతడు ఆదర్శోపాధ్యాయుడు అక్కడ నుండి స్వర్గాధిపతి దేవేంద్రుని సభకు పిలుపువచ్చి వెళ్లి సన్మానితుడై తిరిగి భూలోకం వస్తాడు ఇదీ కథ సమకాలీనేతి వృత్తం రాజుగారు బేసిక్ ట్రేనింగ్ స్కూల్ టీచర్‌గా ఉన్నకాలంలో ఆదర్శోపాధ్యాయ లక్షణాలను తెలుపటానికి ఈ కావ్యం' రచింపబడింది అయినా కావ్య లక్షణాలు వర్ణనలు చక్కగా ఉన్నాయి ఒక పద్యం చూడండి పు 5

ఒక శ్రామికుని పొలంతుక యప్పుదెచ్చిన, వరినూకలతనికి వార్చి యిచ్చె
ఒక కాపువనిత యేదో యింత మగనికి ముక్కయంబలి గాచి పోసితనిసె
ఒక యల్పవేతనోద్యోగి ప్రేయసి యిచ్చె సజ్జరొట్టెను నాన్చి చప్పరించి
ఒక బిచ్చగత్తె తిట్లకు నోర్చి తెచ్చిన యెంగిలి మెతుకులందించె పతికి
కలిగినంతలో నింత బిడ్డలకు పెట్టి చాలి చాలని యట్టుల చలిదొ పులిదొ
తాముదిని యంతలో దృప్తి దనయు చుంద్రు పేద యిల్లాంద్రు నిశలందు ప్రియుల గూడి

కవికి గ్రామీణ జీవితము ప్రత్యక్షానుభవము కాబట్టి పై సహజ వర్ణన ధనికుల భోగవిలాసాలు తెలియని వారు కారు వాటినిలా వర్ణించారు

కమ్మని భోజనంబు, నును కప్పురపుందములమ్ము పట్టువ
స్త్రమ్ములు, తూగుటుయ్యేలల తల్పములున్నత సౌధముల్ విలా
సమ్ములు గల్గివారికి నిశల్ పవలన్న విభెదమేమి? సౌ
ఖ్యమ్ములె నోచి పుట్టిరి గదా సిరిబొందిన భోగలాలసుల్

ఇందలి అర్థాంతరన్యాసాలంకారం రమణీయం ఈ పద్యం అల్లసాని పెద్దన్న వినుకొండ వల్లభుని చాటువుల తలపించుతుంది (నిరుపహతి స్థలంబు కప్పుర భోగివంటకము )

చిలుకలకు గొన్ని ముద్దులు జిలికెడి పలుకులను నేర్పి చిరునవ్వులమొ గ్గల కింత సిగ్గు సూపి
(పు 1) చదువులు నేర్పు పంతులయ్యలకు,

నాలుగు రాళ్ల ముప్పది దినమ్ములు చాకిరి సేయ చేతిలో
రాలును, త్రోవయందె యెదురయ్యెద రప్పుల వాళ్లు, వారికే
చాలదు జీత మింకెటుల సాగును జీవన యాత్ర, సంఘమున్
జాలి వహింప, దీ మనుజ జాతికి జేసిన సేవ యింతయే పు 6

కావ్యారంభం సంధ్యావర్ణనతో ఆ వెంటనే పేద జీవితాల వర్ణన, తర్వాత కావ్యనాయకుడైన అధ్యాపకుని జీవిత చిత్రణ - పల్లెటూరు ఆ తర్వాత స్వప్నం-శృంగార వర్ణన ఇట్లా కథ రసోచిత ఘట్టాలతో రమ్యంగా కూర్చబడింది ఇందులో పూర్వ కావ్యాల ప్రసిద్ధ పద్యాల అనుసరణలు కొన్ని కనిపిస్తాయి

లవలీ లుంగ లవంగ మంజులలతా లంకారముల్ - పు 12, పోతన భాగవతం
అక్కట ఎట్లు నాప్రియ వయస్యలలో మొగమెత్త జాలుదున్ పు 13, సూరన కళాపూర్ణోదయం
ఎవ్వతెవీవు పూర్ణ శరదిందు నిభాస్య మద ప్రవృత్తి మై
క్రొవ్వెననివ్విధిన్ గవయుగోరి పు 13, పెద్దన మనుచరిత్ర

అందరుగూడి సుందరు లోల యోలయనుచు - పు 20 భట్టుమూర్తి - వసుచరిత్ర

ఈ కావ్యంలో అప్సరోభామినితో ఉపాధ్యాయునికి జరిగిన సంభాషణ మనుచరిత్రలోని వరూధినీ ప్రవరాఖ్య ఘట్టాన్ని పోలినది ఆమె కామశాస్త్ర ప్రసంగాలు సరేసరి ఇతని నీతి వాక్యాలు మరపు రానివి

తరుణీ ఎంతటి బేల వేనొక యుపాధ్యాయుండనై సంఘ సం
స్కరణాసక్త పవిత్ర జీవనము కాంక్షింతు
ఈ వలవేమి పిచ్చి? ఇది యెట్టి విచిత్రపు లోక మయ్యరే
దేవత లేన మీరు? పు 15 అని నిగ్రహంతో తప్పుకున్నాడు కనుకనే తర్వాత దేవగురువుతో ఇట్లా ప్రశంసింపబడ్డాడు నాయకుడు

ఇయ్యది దేవలోకము సుమీ! యుచితానుచితంబులన్నియున్
దియ్యగదోచు నిందు, విజితేంద్రియుడేని యొకప్పుడల్పుడై
ఇయ్యెడ సంచరించియవహేళన పాలగు నట్లు గాక నీ
నెయ్యము దేవతా ప్రకృతినే నిరసించిన దబ్బురంబుగన్ పు 23

వృత్తి సామ్యంచేత బృహస్పతి భూలోక గురువును తమ్మునిగా సంభావించి నీతి బోధ కావించాడు అధ్యాపకులాదర్శ గుణములతో నిత్య చైతన్యమూర్తులై విద్యార్థులకు క్రొత్త విజ్ఞానాన్ని అందించాలని పంతుళ్ల చులకన జేయువారు జాతి ప్రగతి నిరోధకులు అన్నాడు పు 25 ఈ దేవ గురు బోధ ఈ కావ్యంలో ముఖ్యఘట్టం

ఆ తర్వాత దేవేంద్రుడు నాయకుని సన్మానించడం కవి ఆకాంక్ష కొసమెరుపు ఇది
నీ నియంతృత్వమున కిన్ని నీళ్లు పోయు సమయ మరుదెంచినది ప్రజాస్వామ్యమందు
నింద్రులుండరు మున్ముందు నీవు గూడ నెన్నికైననే స్వర్గమ్మునేలవలయు! పు 40
ఫల శ్రుతి అనదగిన పద్యం
ఏ జగంబున నైన మరేయుగంబు, నందునైన బూజార్హుడధ్యాపకుండు
వానివైశిష్ట్యమున్ గనలేని యట్టి, జాతికిన్ బతనంబు నిశ్చయము సుమ్ము పు 24

ఈ కావ్యంలో శృంగారం శృతిమించినా, నాయకుని ప్రవర్తన కొంత వికటించినా అతని మనోనిగ్రహం - ఆదర్శం, దేవగురు బోధ దీనిని ఉత్తమ కథా కావ్యంగా రూపొందించాయి మన సాహిత్యంలో అధ్యాపక నాయక కావ్యాలరుదు ఒక ఉపాధ్యాయకవి ఉపాధ్యాయ జీవితాన్ని కావ్యంగా మలిచి ఉపాధ్యాయ సంఘనాయకులైన రాఘవాచార్యులకు కృతి ఇవ్వటం సముచిత కార్యం భువికి దివికి చక్కని లంకె వేసిన సామాజిక కావ్యం స్వప్నఫలం రాజుగారు రసవత్కవి!

## 6 దేవత వేంకటరాములు, రేకొండ, సిరిసిల్ల; జన్మతేది ॥ 2 1942

దేవత వేంకటరాములు గారి జన్మస్థలం హుజూరాబాద్ తాలూకాలోని రేకొండ బి ఓ ఎల్ పట్టభద్రులై ప్రభుత్వోపాధ్యాయులుగా సిరిసిల్ల పట్టణమందు స్థిరపడినారు కవిత్వం జ్యోతిష్యం వేంకటరామకవి గారికి అభిమాన విషయాలు

ఈ కవి ముద్రిత కృతులు - 1 జానకీ పతి శతకము - పద్యాలు
2 శ్రీరామనామ గేయామృతము - గేయాలు, 3 నీతి కౌముది కందాలు
4 విద్యార్థి వివేక చంద్రిక - సీసాలు 1975, 5 శ్రీరామ సుప్రభాతము - తేటగీతులు
6 భృగువంశోపాఖ్యానము పద్యకావ్యం 1991 (పద్మశాలి చరిత్ర - 1971)

కావ్య పరిచయం రాములు గారు సహజకవి కవి తమ కవితాశక్తిని ఉన్నత విద్యార్జన, భాషా సాహిత్యాల అధ్యయన బోధనలతో వన్నె పెట్టుకున్నారు వీరి చిరుకృతులన్నీ భక్తి భావ ప్రబోధకాలు విద్యార్థి వివేక చంద్రిక' మాత్రం నీతి ప్రబోధక సీసపద్య నక్షత్రమాల ఇందులో బాలబాలికలకు క్రమశిక్షణ ఆరోగ్యపరిరక్షణ, వినయ విధేయతలు భక్తి ప్రవత్తులు కలిగి యుండవలెనని హితోపదేశం చేయబడింది విద్య విలువను చాటే ఈ క్రింది పద్యం నం 26, చూడండి

విద్యచేమానవుల్ విజ్ఞానమున ప్రభుత్వోద్యోగులై ముదమొందవచ్చు
విద్యచేమానవుల్ విజ్ఞానమున సదా క్షితిపతి సభలందు గెలువవచ్చు
విద్యచేమానవుల్ విజ్ఞానమున యశశ్చంద్రికల్ దిశలందు చల్లవచ్చు
విద్యచేమానవుల్ విజ్ఞానమున భోగ భాగ్యంబులిలలోన బడయువచ్చు
అదియునుంగాక విద్యచే నద్భుతముగ, వివిధ విధులను నూతన విషయములను
ధృతి బలోత్సాహములను సాధింపవచ్చు, నంచు సమ్మతించండి విద్యార్థులార

రాజులు లేని కాలంలో భూపతుల సభావిజయాల ప్రస్తావన పూర్వ కావ్యాల వర్ణనల విధేయత సమ్మతించండి పదం వ్యావహారికం ఈ పద్యాలు విద్యార్థులకు ఉపయుక్తాలు నీతికౌముదివి నీతి పద్యాలు

భృగు వంశోపాఖ్యానము డా సి వి సుబ్బన్న శతావధాని, వేముగంటి నరసింహాచార్యులు అష్టావధాని టి శ్రీహరి శర్మ, దూడం నాంపల్లి ప్రభృత కవుల ప్రశంసలతో ఈ కావ్యం 1991లో తిరుమల తిరుపతి దేవస్థాన ఆర్థిక సహాయంతో వెలువడింది కాని ఈ కవి ఇదే కావ్యాన్ని 'పద్మశాలి వంశ చరిత్రము పేర 1971లో ముద్రించారు [1] పేరు మార్చినా మొదటి ముద్రణ ప్రస్తావన లేదు కావ్యం చివరి పద్మశాలి కుల గోత్రనామాల పట్టిక మాత్రం మొదటి ముద్రణలో ఉన్నది ద్వితీయ ముద్రణలో వదిలివేయబడింది

కవి తమ పద్మశాలి కుల పురాణోక్తగాధను ఇందులో మూడు ఆశ్వాసాల్లో రసోచితంగా పూర్వ ప్రబంధాలశైలిలో చంపూకావ్యంగా రచించారు గద్యపద్యాల సంఖ్య 351 శ్రీకారం కావ్యాదిలో ఉంచి, ఆశ్వాసాంత గద్యలతో విష్ణుమూర్తికి అంకితంగా, కవి పీఠిక షష్ఠ్యంతాలతో సహా పూర్వ పురాణకావ్యాల మార్గంలో ఈ కావ్యరచన సాగింది కవి కవన శైలి ప్రసన్నమైనదిగా పూర్వ కవుల రచనల తలపించేదిగా ఉంది మచ్చునకు కొన్ని పద్యాలు



శ్రీరమ్యంబగు నైమిషాటవిముని శ్రేష్ఠాళికిన్ యోగ్యమై
ఆరోగ్యావహమై ప్రసూన ఫల పత్రానేక వృక్షోన్నతా
కారంబై యధిక ప్రశాంతత వివేక జ్ఞాన సారస్వతా
ధారంబై విలసిల్లుచుండును, సదాధాత్రిం బ్రశస్తంబుగన్ 1 3
అది మునివన వర్ణన ఇది స్వకుల ప్రశస్తి ప్రసక్తి
ప్రాణుల కింపు గూర్చు భృగు వంశజు లద్భుత లీల వస్త్రని
ర్మాణము జేయుచున్ క్రతువులం బొనరించుచు ఫాలలోచనున్
ధ్యానము సల్పుచున్ బహువిధాల జగద్ధితులై వివేక వి
జ్ఞాన దయా సమేతులయి సద్యశ మొందుచు నుందురిమ్మహిన్ 1-13
మార్కండేయు వర్ణన

---

1 కరీంనగర్ జిల్లా రచయిత చరిత్ర 1981, పుట 150

జలక మాడి చెంగావి వల్కలము దాల్చి నుదుటి పైన విభూతిని పదిల పరచి
విమల రుద్రాక్ష మాల కంఠమున దాల్చి ముని కుమారులతో గూడి మోదమొదవ - 2-5
బిల్ల గోళ్లు, తన్నుబిల్లు, కుందెన గుడి, చిడుగుడప్పడాలు చిట్టపొట్ల కాయ
బంతి మున్నుగాగల ముఖ్యమైనట్టి వివిధ క్రీడలాడుచుండె 2 6
ఆడుచు శివకీర్తనలను, బాడుచు సద్వర్తనమున వసుధామరులన్
వేడుచు ముని జనులకు గడు వేడుక గలిగించుచుండె వినయముతోడన్ - 2-7

మొదటి పద్యం సంప్రదాయం రెండవది కవి స్వంతం, మూడవది ప్రహ్లాదునికి అనుకృతి కవి వర్ణనల్లో అనేకాలంకారాలు సహజ సుందరంగా కనిపిస్తాయి స్త్రీల అందాలవర్ణించిన అందమైన ఈ క్రమాలంకార పదబంధాల చూడండి

శంపాలతలు, వారిజంబులు, ముకురముల్-గాత్రముల్ నేత్రముల్, గండయుగము
భ్రమరముల్, స్వర్ణకుంభములు, పల్లవములు నెఱికురుల్ కుచములు, కరతలములు
సామజమ్ములు, శరాసనములు శంఖముల్-గమనముల్ కనుబొమ్మల్ కంధరములు
పడగముల్, మంజుచంపకములు, కుందములధర, నాసికములు, రచన చయము
కలిత సౌందర్యమున వారజలజ నేత్ర లధిక భోగ భాగ్యములచే నలరు చుండి
నృత్య గీతాది విద్యలన్నేర్చి పెక్కు, బిరుదములు వహియించి రప్పురమునందు 2-101

కధా కధన విధానమిది

పిదిప భావజముని నిజసదనమునకు నేగి తంతు బీజములచే నింపుమీఱ
తంతువులను గడించుచు ధరణియందు, మేటియై వస్త్రములను నిర్మించుచుండె 3 60

పూర్వకవుల పద్యానుసణమున్నా దేవత వేంకటరాములు గారి కవిత్వం ధారాస్పద పదశయ్యా భావరమ్యత కలది

## 7 చిట్యాల బాలదాస కవి - ఆవునూరు, సిరిసిల్ల - జననం - 1930 సుమారు

చిట్యాల బాలదాసు గారు వరకవి దైవ భక్తులు సత్సాంగత్యము సాహిత్యసేవ వీరి నిత్యకృత్యాలు వీరు బాల్యమందు పాఠశాల విద్యనభ్యసించే అవకాశం కలుగని పేద కుటుంబంలో జన్మించి, బొంబాయి ప్రాంతానికి చేనేత కార్మికుడుగా వెళ్లారు స్వయంకృషితో రాత్రిపూట చదువు నేర్చుకొని సముచిత విద్యాపాండిత్యాలు సముపార్జించుకొని విశ్రాంతి కాలాన్ని పద్యగేయ రచనా వ్యాసంగంతో సద్వినియోగపరచుకున్నారు ఈ కవి జన్మస్థలం ఆవునూరు యువదశలో బొంబాయిలో ఉన్న కాలంలోనే వీరి పుస్తకాలు దశాధికంగా ముద్రింపబడినవి ప్రస్తుతం సిరిసిల్లలో స్థిరనివాస మేర్పరచుకొని 'వాణీ గ్రంధమాల' అనే పుస్తకప్రచురణ సంస్థను స్థాపించి, వారివి ఇతర మిత్రులవి పలు పుస్తకాలు ముద్రించారు వేములవాడలో వాణీ పుస్తక విక్రయశాలను నడుపుతున్నారు ఇరువది పుస్తకాల వరకు బాలదాసకవి గారివి ముద్రణ పొందినట్లు వీరి 'మానవవికాసమంజరి' 1986 పుస్తక ముఖపత్రంపై ఉంది అందులో అయిదారు పద్యకృతులు, మిగిలినవి గేయాలు - భజనలు భక్తి రచనలేకాక సమకాలీన సామాజిక సంఘటనలను ఇతివృత్తాలుగా గ్రహించడం వీరి గేయ కృతుల ప్రత్యేకత బాలదాస కవి ముద్రిత పద్య రచనలు ఇవి -

1 భారతీస్తవము - 1968 ద్వి ము 1987, 2 ఆదినారాయణ శతకము - 1968, 1981,
3 విభువిలాపము - 1973, ఎనిమిదవ పుస్తకము, 4 శ్రీరమావల్లభ శతకము - 1974 పదకొండవ పుస్తకం, 5 మహాత్మాగాంధి జీవిత సారము - 1977, పదునాలుగవ పుస్తకం

అముద్రిత పద్యకృతులు విఘ్నేశ్వర చరిత్ర, బాలదాసీయము

కావ్య పరిచయం - బాలదాసు గారి శతకాలు విష్ణుభక్తి కలవి భారతీ స్తవము - ఇది శారదావర్ణన 35 సీస పద్యాల సంపుటి

కావ్యారంభంలో "నాబంధు ప్రియులార న్యాయవర్తనులార వినరయ్య నాయొక్క విన్నపంబు' అని రెండు సీసమాలికలలో కవి స్వీయ జీవిత పరిచయం కావించుకున్నారు ఇది కవి తొలికృతి అనటానికి నిదర్శనం కవినని నన్ను లోకము పొగడుటెకాని, క్ష్మాతలంబున నొక గ్రంథమైన ముద్రింపబడలేదు ' అని కవి దేవితో చెప్పుకోవడం కవిత్వం చెప్పుట కొఱవితో తనదు శిరము గోకినపగిది" అనీ అన్నారు

భారతీ నీమేను బంగారమునకన్న, సుందర మొప్పును సురుచిరాంగి - ప 8
నీకు మూలము లేదు నిత్య శుద్ధాత్మవు, చంద్రబింబానన శరణు నీకు - పు 5
భవదీయ కరుణను బడసినచో సద్య శమును వహింపనె శాశ్వతముగ - పు 11
సందేహరహితులై యెందరో కవులునిన్ బ్రార్థించు చుండి కృతార్థులైరి - ప 35
మేటి దానవంచు బాటించి నిన్ను నే, వేడుచుంటి నెపుడు వేడ్కమీర
అవు నూరి నిలయ! ఆనంద హృదయ! హి రణ్య గుర్భురాణి - భ్రమర వేణి! ప 28
విభువిలాసము స్మృతి కావ్యము 60 పుటలు

కవి గారి భార్య రుక్మిణీదేవి 1972లో మరణించగా, ప్రియా వియోగశోక భారం 1973లో ఈ కావ్యరూపం ధరించింది ఇందలి మొదటి 20 పుటలు పీఠికలు ఇష్టదేవతానుతులు కావ్యభాగం 40 పుటలు ఇందులో 61 సీస పద్యాలున్నవి కావ్యం చివర నాలుగైదు పాటలున్నవి

మొదటి 12 పద్యాల్లో కవి తమ బాల్య వివాహ సంసార జీవితాల కష్టసుఖాలను వర్ణించారు తర్వాత 16 పద్యాల్లో సతీసమేతంగా కవి చేసిన దక్షిణ భారత యాత్రల వివరాలు పొందుపరిచారు ఆ తర్వాత భాగంలో సతీమరణం, పతి వేదన, వర్ణింపబడినవి కవి కవన శైలిలో ఒక ముఖ్యమైన పద్యం చూపబడుతున్నది

అనవిని వైద్యుని నపుడు రప్పించియు, జూపించగా జూచి తాపె పడియు
నడుములో పోటిది బిడియమెందుకు మందు రెండుపూటలిడగ నుండదింక
నని మందు నొసగిన నరగంటలోపల, నడుమునొప్పి తొలగి 'నాకుమంట'
లనుచు నీవు నిలిచి యాయాసబడుచుండ, నొకని టెక్సీకి బంపి యొకని వైద్యు
నింటికి బంపియు నికనే తిరిగి చూచు, నంతలో గూర్చుండ యత్నమపుడు
చేసిపడిపోవునంతలో శీఘ్రముగను, అయ్యోపడిపోయితివ యంచు హస్తములతొ
లేవ నెత్తగా శబ్దంబు లేక నీవు, కండ్లు మూసితి వికనాదు కరములందు - ప 34

ఆ తర్వాతి సతీసంస్మరణ సంసార బాధలు పిల్లల శోకం ఈ 'విభువిలాప కావ్యం'లో ఎదనుకదిలించే ఘట్టాలు కావ్యం చివర 'ఇంద్రాది దేవతలకు కవి చేసిన విన్నపం కరుణ రసభరితం ఇందలి యాత్రల వర్ణన రమణీయం ఆదర్శ దాంపత్య చిత్రణమ్మీ విభువిలాపం

గాంధీ జీవిత సారం - 1977 ఇది 14 పుటల చిన్న పుస్తకం దీనిలో గాంధీ జీవితం పద్యాలు, కొన్ని భక్తి పాటలు, మరికొన్ని లోకవిమర్శ పద్యాలున్నాయి విద్యాంసులే నిత్యోద్యోగ వ్యాసంగాల్లో పడి కావ్య రచనకు దూరంగా, రచించిన కృతులు ముద్రించుట భారంగా, భావించే కాలమిది

స్వయంకృషితో సాధించుకొన్న మిత విద్యాపరిజ్ఞానంతోనే అపరిమిత సాహిత్యానురక్తితో అనుభవ సత్యాలను అక్షరబద్ధం చేస్తూ ఉదారుల సహాయంతో స్వీయార్జిత ద్రవ్యంతో వాటిని ప్రచురిస్తూ, సాహితీలోకానికి అందిస్తున్న బాలదాసకవి కృషి ప్రయత్నాలు మహాకవులకే మార్గదర్శకాలు

## 8. కొమ్మెర లింగమూర్తి - కరీంనగర్, జననం 1910 మరణం 1985 సుమారు

లింగమూర్తి గారి జన్మస్థలం చెన్నూరు తర్వాతి కాలంలో కరీంనగర్‌లోనే స్థిరనివాసం ఏర్పరచుకున్నారు వీరు దైవభక్తి కల సౌజన్య మూర్తి పద్యగేయ కవి అధ్యాపకులు

మూర్తి గారి ముద్రిత పద్య రచనలు

1 గాంధీ ప్రభోధము 2 గీతార్థ చంద్రిక 3 భాస్కర పంచవింశతి, 4 విశ్వసామ్రాజ్యము

ఇంకా మంగళహారతులు, శని నవగ్రహ స్తోత్రములు బతుకమ్మ పాటలు మొ॥వి

తమ అభిరుచిని బట్టికాక జనం నాడిని గుర్తించి కలం నడిపించిన కవి లింగమూర్తి గారు అధ్యాపకులుగా ఉద్యోగ విరమణ కావించిన తర్వాత వృద్ధాప్యంలో రచనా వ్యాసంగాన్నే వృత్తిగా స్వీకరించారు తమ రచనలు చిరు పుస్తకాలుగా అచ్చువేసి స్కూళ్లకు ఊళ్లకు వెళ్లి పిల్లలకు పెద్దలకు వినిపించి అమ్ముకునేవారు

గాంధీ ప్రబోధము 1969 బాపూజీని విష్ణువతారమూర్తిగా వర్ణించిన జీవిత చరిత్ర పద్యకావ్యం ఈ కావ్యం కరీంనగర్ జిల్లా కలెక్టర్ శ్రీ మాల కొండయ్య ఐ ఏ ఎస్ గారికి అంకితం ఇవ్వబడింది డిగ్రీ కాలేజీ ప్రిన్స్‌పాల్, ఐ వి చలపతిరావు, వేముగంటి నరసింహాచార్యుల పీఠికలున్నాయి

ఇది చంపూకావ్యం మచ్చుకు రెండు పద్యాలివి భారతదేశ స్వరూప వర్ణన గాంధిజీ వర్ణన -

భారతమాత శీతనగ పంక్తి కిరీటముగా ధరించి భా
గీరధి సింధు హారములు గ్రీవమునందునప్రక్క దాల్చి శృం
గార కటి ప్రదేశమున కాంచన వింధ్యనగంబు దీర్చి మం
జీర రవంబుతో నిలిచె సేతు పదంబులు నీట గడ్గుచున్

దివ్య రూపంబు నుండి యీ దివ్యవాణి వెడలుచున్నది ప్రతివేళ విశ్వమందు
శుద్ధ సాత్విక రూపంబు సుకృత యశము బ్రహ్మతేజంబుగా నుండె సమ్ముదంబు (యతి)

గీతార్థ చంద్రిక భగవద్గీతకు కవి వివరణ పద్యాల్లో సాగింది

మిగిలిన పుస్తకాలు సామాన్య చదవరులైన గృహిణులకు గృహస్తులకు పూజార్థం ఉపయోగపడే సంగ్రహ రచనలు బతుకమ్మపాటలు తెలంగాణా స్త్రీలకు ప్రియాతి ప్రియమైనవి

విశ్వ సామ్రాజ్యము 1983, దివ్యలోక సంచారం అనుపేరుతో లింగమూర్తికవి గారు వ్రాయనెంచిన కావ్యంలోని మూడు భాగాలలో ఈ 'విశ్వసామ్రాజ్యం' మొదటిది మిగిలిన రెండు భాగాలు వ్రాసినట్లు లేదు ఇది చంపూ కావ్యం మూలం సామవేదంలోని కథ అన్నారు కవి

ఇది ఇంద్రుని రాజధాని 'అమరావతి'లో జరిగిన గాథ సురాసుర యద్ధానంతరం విజయ దర్పంతో దేవసేనాని రణసింహుడు యజ్ఞభోక్త అగ్నిదేవుడు సురగురువును చులకనగా చేసి మాట్లాడారు మౌనంగాలేచి వెళ్లి బృహస్పతి వారికి గుణపాఠం చెప్పటానికి 'యక్షము అనే మహాకాయాన్ని సృష్టిస్తాడు ఆ శక్తిరూపం మహోత్పాతాలు కలిగిస్తుంది దాన్నిశాంతింపజేయుటానికి వెళ్లి సురసేనాని అగ్నివాయు దేవతలు గర్వభంగం చెందగా వారి భార్యల వేడుకోలుతో బృహస్పతి యక్షాన్ని శాంతింపజేసి గర్వంపనికిరాదని నీతి ప్రసంగం చేస్తాడు ఇదీకథ!

ఈ కావ్యంలో నందన వన వర్ణన మనోహరంగా ఉంది దేవ పత్నుల వినతి కాళీయమర్దనంలోని నాగపత్నుల తలపింపజేస్తుంది పద్యాలు గద్యాలు సరసాలు, రసోచితాలు

ఈ కవి సమకాలీన విషయాలను విద్య-వృత్తి విద్య-సైన్య శిక్షణ మొ॥ వాటి అవసరాలను సమయోచితంగా ఈ దేవలోక కథలో ఉద్బోధించారు పు 9 వెమ్మయ సింగధీమణి పద్యాల తలపించే ఈ కవి పద్యం చూడండి

కవులకు కావ్యమందు నిజకాంతకు కోరిక భర్తయందు మా
ధవునకు భక్తులందు, నెరదాతకు దానము ధర్మమందు, సా
ధువునకు యాత్రలందు, యవధూతకు శ్రీగురుపూజలందు, యి
ట్లెవరికి వారె కోరుదురదేది శుభంబొ సమంచితంబుగాన్

సురగురువు పలికిన ఆణి ముత్యంలాంటి చివరి వాక్యం చూడండి - "మనం ఇతరలోకాల వారికి ఆదర్శప్రాయంగా ఉండాలంటే (మన) సద్గుణ సంపత్తి ఇతర లోకాలవారు గౌరవించే విధంగా మన జీవితాన్ని దిద్దుకోవాలి' పు 51 కావ్య ప్రయోజనాన్ని గుర్తించి విశ్వశ్రేయము నాకాంక్షించి సాహిత్యాన్ని ఆరాధించి కమ్మని కవిత్వాన్ని వెలయించిన కవి గంగ కొమ్మెర లింగమూర్తి గారు

## 9 రామక రామశర్మ - మన్నెంపల్లి, కీర్తిశేషులు

రామ శర్మ గారి స్వగ్రామం మానకొండూరుకు మూడు నాలుగు మైళ్ల దూరంలో ఉన్న మన్నెంపల్లి పౌరోహిత్యం పురాణ గ్రంథ పఠనంతో కాలం గడిపిన వీరు, షష్టిపూర్తి వయస్సులో దైవభక్తి ప్రాబల్యంవల్ల మూడు శతకాల వంటి స్తుతి కావ్యాలు రచించి ప్రచురించారు ఇవి శతకాల వంటివే అయినా పద్యాలకు మకుట నియమంలేదు కవి వానిని శతకాలనలేదు ఆ కృతులలో ఒకటి వృత్త పద్యాలది రెండు కందాలవి రామశర్మ గారి పుస్తకాల వేర్లివి

1 రామ రాఘవ స్తవము, 2 రామతత్త్వ చింతనము, 3 శ్రీమదాంజనేయస్తుతి

కావ్య పరిచయము -

రామ రాఘవ స్తవము ఇది 1975లో ముద్రితం ఇందులో 'రా రా స్తవము' 125 కంద పద్యాలు ప్రథమ భాగంగానూ, 'రామతత్త్వ చింతనము' అనుపేరు 71 వృత్తాలు ద్వితీయ భాగంగాను, 'మనసా అనే శీర్షిక వృత్తాలు 16తో కలిపి 212 పద్యాలను ఒకే పుస్తకంలో ముద్రించారు

కవి వయోజ్ఞాన వృద్ధులు భక్తి ప్రపత్తులతో వ్రాసిన వీరి పద్యాలు సరళంగా ఉన్నాయి కవి పూర్వ భక్తి కావ్యాల భాగాలను కొన్ని సందర్భాల్లో అనుసరించారు కూడా వీరి కవన విన్యాసమిది

ఆకారమె లేదను శృతి, యాకైతవమేల జేయ యిచ్ఛ జనించెన్,
నీకే లాభమ్మిలలో, చేకూరెను దెలుపు సృష్టి జేయగరామా 81

కవి అచంచల భక్తికి నిదర్శనంగా రూపుగొన్న కృతిలోని అనేక పద్యాల్లో ఇదొకటి

శ్రీరామాశ్రిత పారిజాత కరుణా సింధూ రఘూత్తంసమా
సారంబింతయు లేని ఘోరమగు సంసారంబు దాటింపగా
దారిం జూపిన నీవె జూపవలె నీదాసుండ నేమొక్కెదన్
రారా రక్షణజేసి గొప్ప బిరుదున్ రక్షించుకో రాఘవా



కవి భావ చమత్కృతి ఈ చివరి పద్యంలో చక్కగా ఉంది

నా దేహంబనునంత నవ్వె ననలుండత్యంత మాశ్చర్యమున్
నాదీ భార్యయటన్న నవ్వెను మదిన్ కాముండు నచ్చెర్వునన్
నాదీ గేహము పుత్ర సంపదలనన్దానవ్వె మృత్యుండులోన్ (యతి)
వాదంబుల్ విడి గాంచుమీ సకలమున్ బ్రహ్మంబుగా మానసా!
ఇది వారి మానస బోధ వైర్యాగ్య వైఖరి వేమన పద్యానుసరన
శ్రీమదాంజనేయస్తుతి ఇది 1979 ప్రచురణ
ఇందులో మొత్తం 112 కందాలున్నాయి శైలి ఇట్లుంది
రాముని ప్రియ దూతవు శ్రీ రాముని మదిలోన విడక రాత్రింబగలుల్,
రామ జపంబును సేయుచు కామము క్రోధము జయించు ఘనుడవు హనుమా 6

ఈ కృతిలో హనుమస్తుత్యాత్మక పద్యాలేకాక సిందూర పూజా ఫలితం శనిదేవత ఆంజనేయ సంభాషణ - 19 సువర్చలాజననం - 10 మారుతి సూర్యుని వద్ద విద్య నేర్చుకొనుట మొదలైన శీర్షికలున్నవి శివుడే హనుమంతుడని ఫలశ్రుతి

ఇందలి పద్యాలు ముక్తకాలు కావు అవి కథా సంబంధాలు భక్తితో ఈ కావ్యాలను వ్రాసి స్వయంగా ముద్రించుకున్న ఈ కవి తమ పుస్తకాలకు మూల్యం వేయలేదు అమూల్యంగా పంచిపెట్టారు కవి 1980 సుమారుగా కీర్తిశేషులైనారు అచ్చమైన ముముక్షాసక్తికల భక్త కవి రామశర్మ గారు

## 23 పొన్నూరు హైమవతి - కరీంనగర్, జన్మ తేది 1 2 1940

కరీంనగర్ జిల్లాలో ఉన్నత విద్యావంతులున్నా రచయిత్రులు తక్కువ కవయిత్రులు మరీ తక్కువ ఈ కాలంలో పద్యకవిత్వం వ్రాసి దాన్ని పుస్తకరూపంలో ప్రచురించిన వారిలో హైమవతి గారు అగ్రగణ్యురాలు పి హైమవతి గారు ఆమె భర్త సుబ్బరాయశాస్త్రి గారు ఇద్దరూ తెలుగు పండితులు మొదట గుంటూరు జిల్లాలోని పొన్నూరు వీరి స్వస్థలమైనా శాస్త్రిగారు సి ఎస్ ఐ ఉన్నత పాఠశాల కరీంనగర్‌లో ఉద్యోగిగా వచ్చి ఇక్కడే స్థిరపడ్డారు గృహిణిగా ఉంటూనే స్వయంకృషితో భర్త ప్రోత్సాహంతో హిందీ పరీక్షలిచ్చి పెద్దపల్లిలో హిందీపండిట్‌గా కొన్నాళ్ళు పనిచేసి, తెలుగు పరీక్షలిచ్చి డిగ్రీలు పొంది కరీంనగర్ శిశుమందిర్ పాఠశాలలో తెలుగు పండిత్‌గా చేశారు ప్రస్తుతం (97) హుజూరాబాద్ శిశుమందిర్ ఉన్నత పాఠశాలలో అధ్యాపకురాలు

ఇంటి-బడి వాతావరణం, విశ్వహిందూ పరిషత్సమావేశాలు, శిశుమందిర్ పాఠశాలల విద్యా సాంస్కృతి కోత్సవాలు ఆమెను కవయిత్రిగా రూపొందడానికి దోహదం చేశాయి ఈ రచయిత్రి గారి ముద్రిత పుస్తకాలు మూడు 1 తెలుగు పట్టి, 2 జ్ఞాన కిరణాలు నాటికలు, 3 అబల కాదు సబల పాటలు

కావ్య పరిచయం హైమవతి గారి 'తెలుగు పట్టి' ఆటవెలది పద్య సంపుటి ఇందులో 'తేనెలొలుకు చిట్టి తెలుగుపట్టి' అనే మకుటంతో 119 పద్యాలున్నాయి ఇది అచ్చంగా శతకం, కవయిత్రి ఎందుకో ఆ పేరుతో తమ కావ్యాన్ని పిలువలేదు

ఈ పద్యాలన్నీ తెలుగు సంస్కృత జాతీయాలతో సూక్తులతో వాటి భావాలతో ఒక్కొక్కటి కొక్కొక్క పద్యంగా వ్రాయబడినవి ఇది మన ఆంధ్ర సాహిత్యంలో అపూర్వ ప్రయోజనాత్మక ప్రయోగం

ఈ ఏకోనవింశత్యుత్తర శత పద్యాలకుతోడుగా కవయిత్రి ఈ కృతిలో 'ప్రత్యక్ష దైవములు' అను శీర్షికతో 'మాతృ దేవోభవ' అను పేర మొదటి మకుటంతోనే 12 పద్యాలు 'పితృదేవో భవ' అని

10 'ఆచార్య దేవోభవ అని 13 నీతి పద్యాలు వ్రాశారు ఈ 35 ఆటవెలదుల మొదటి వాటితో కలిపితే మొత్తము 154 పద్యాలు మూడవ శీర్షిక 'వీడ్కోలు లో 'బడిని వదలుచున్న బాలలార' అనే వేరే మకుటంతో మరి 25 పద్యాలున్నవి కవయిత్రి కవన పరిచయానికి కొన్ని పద్యాలు చూడండి

1 'పరోపకారార్థ మిదం శరీరం, సూక్తి పద్యం,
పరుల బాధ లోన పాలుపంచుకొనుచు, చేతనైన మేలు సేయుమయ్య
మేలు సేయు కొఱకె మేనిచ్చె దేవుడు, తేనె లొలుకు చిట్టి తెలుగు పట్టి!

4 ధన మూల మిదం జగత్
ధనము లేకయున్న తనవారు లేరన్న ధనములేక యున్న చదువు సున్న
ధనముకన్న మిన్న ధరణియందుండునా ॥ తే ॥



51 ఈనగాచి నక్కల పాలు చేసినట్లు
చిన్న నాటి నుండి చెలిమి చక్కన జేసి చెడ్డ వానితోడ చేరవలదు,
చక్క చేసి పాలము నక్కకిచ్చిన యట్లు ॥ తేనె॥

## 11 ఎన్ మనోహర స్వామి - హుస్నాబాద్,

మనోహర స్వామి గారు నాటి హుస్నాబాద్ బ్లాకులో ప్రాథమిక పాఠశాలల్లో ఉపాధ్యాయులుగా పనిచేసి అల్పవయస్కులుగానే కీర్తి శేషులైనారు 1958 60 కాలంలోనే వీరు పద్యాలు, కథలు వ్రాసినారు పద్య కవులలో వీరికి కరుణశ్రీ, దువ్వూరి రామిరెడ్డి అభిమానం నవలా రచయితలలో శరచ్చంద్రుడంటే చెప్పరాని ఆరాధన [1]

' కరీంనగర్ జిల్లా రచయితల చరిత్ర ' 1981 పుట 165లో ఈ కవిని గురించి ఈ విధంగా పేర్కొన్నారు "ఉమర్‌ఖయ్యాం రెండు గుణాల్లో మద్యపానప్రియత వీరిని చాలా ఆకర్షించి మధు స్రవంతి' పద్యకావ్యాన్ని వ్రాసి ముద్రించారు కానీ స్త్రీల స్వభావాన్ని నిందిస్తుంటారు వీరి రెండు కథలు ఆంధ్ర భూమిలో వచ్చినై మరికొన్ని కవితలు ప్రచురితాలు 'అందని గమ్యం - అంతులేని పయనం' అనే నవల వ్రాశారు "

అముద్రిత నవల, ముద్రిత 'మధు స్రవంతి' పద్య కావ్యం ఏ ఒక్కదాని ప్రతీ లభించలేదు

వీరి 'మధు స్రవంతి' పద్యాలు దువ్వూరి రామిరెడ్డి పానశాలను తలపిస్తాయి కాని, అవి వేనికీ అనువాదాలు కావు కవి స్వతంత్ర భావాలు తెలుగు సాహిత్యంలో రాణించగలిగీ అర్థాంతరంగా అదృశ్యమై పోయిన మధుర కవి మనోహరస్వామి

## 12 వాసాలమర్రి పద్మనాభశాస్త్రి - కొత్తపల్లి జ 1935

పద్మనాభశాస్త్రి గారి జన్మస్థలం కరీంనగర్ సమీపంలోని కొత్తపల్లి ఎం ఏ , బి ఇడి విద్యార్హతలు గలిగిన వీరు అధ్యాపకులుగా ప్రభుత్వోద్యోగం చేశారు శాస్త్రి గారి సాత్విక భక్తి కవిత్వం వైపులాగింది వీరు రెండు గ్రంథాలు రచించి ప్రచురించారు అవి రెండూ అనువాద పద్య కావ్యాలే అవి ఇవి

1 హనుమాన్ చాలీసా - ముద్రితం, 2 శ్రీమదాంధ్ర భగవద్గీత - 1979

---

1960లో మనోహరస్వామి గారు నాకు పరిచయం - 70లో తిరిగి కలిశారు 1980 85 మధ్య మరణించారు వీరి భార్యాపుత్రులు శోకభారంతో కాబోలు కవిరచనలను భద్రపరుచలేదు హుస్నాబాద్‌లో రజనిశ్రీ గారు ఎంత ప్రయత్నించినా స్వామి గారి రచనలు సంపాదించలేకపోయారు

కావ్య పరిచయం హనుమాన్ చాలీసా, హిందీ కృతికి పద్యానువాద కావ్యం చాలా కాలమైంది ముద్రించి ప్రతి లభించలేదు

శ్రీమదాంధ్ర భగవద్గీత పెద్ద కావ్యం భగవద్గీత శ్లోకాలన్నింటినీ గీతా మహాత్మ్యంతో సహా ప్రతి శ్లోకాన్ని ఒక తేటగీతి పద్యంలో తెలుగు చేశారు పద్మనాభశాస్త్రి గారు పైగా వారే వచనంలో పద్యాలకు భావాలను కూడా సమకూర్చారు శ్లోకపద్య సంఖ్య తప్ప ఎక్కడా మూల శ్లోకాన్ని పేర్కొనకపోవటం ఈ అనువాద కావ్య విశేషత మచ్చునకు కొన్ని పద్యాలు - పైవి అధ్యాయం క్రిందిది శ్లోకం

4 12 మానవులు నెల్ల తమదు కర్మముల ఫలము శీఘ్రగతి నందు చుందురు క్షితిని నేడు
కర్మఫలముల గోరెడు కామ కర్మ, లర్థిగావింత్రు దేవతారాధనములు

6 29 సర్వజంతు సమూహమున్ సమగతులను, చూడగలిగిన యోగి, తాజూచు సర్వ
భూతములనెల్ల తనలోన భూతగణము లందు తనరూపులందు నీ వరయుపార్థ

13-17 బ్రహ్మ యవిభక్త మనియు విభక్త మనియు, భూతముల దా భరించుచు, భూతములను
లయము జేయగ నోపుచు లయమొనర్చి తిరిగి సృష్టింప గలదని తెలుసుకొనుము

ఇదీ వారి అనువాద వైఖరి ఇది 300 పుటల పెద్ద పుస్తకం "వీరు భగవద్గీతాంధ్రానువాదము, గీతాపరమార్థమును గీర్వాణవాణి పరిచయ భాగ్యములేని యాంధ్రులకు అందుబాటులో నుంచుటకు ప్రయత్నించి సఫలీకృత మనోరథులైనారు' అని కావ్య పీఠికలో వానమామలై వరదాచార్యులన్నుడులక్షర సత్యాలు

## 13 మలయశ్రీ - చంజర్ల

మలయశ్రీ కవి విరచిత గ్రంథాలు పద్య గేయ నవలా నాటకాది ప్రక్రియల్లో 60 వచ్చాయి 'కావ్య సుందరి' ఖండకావ్య పరిచయం ముందే చేయబడింది ఈ కవి ముద్రిత పద్య కావ్యాలు ఇవి -

1 ధర్మశ్రీ - 1960 రచన, 2 యక్షసందేశం - 1984, 3 ధర్మపదం - 1991, 4 నీతిశాస్త్రం 1997

అముద్రిత కృతులు - 'సురభి పద్యగేయ మిశ్రిత కావ్యం

కావ్య పరిచయం

ధర్మశ్రీ 1960లో రచింపబడిన ఈ కావ్యం అశోకుని కళింగ సమరం బౌద్ధ ధర్మ ప్రచారం ఇతివృత్తంగా కలది దీనిలోని కొన్ని పద్యాలు కొలనూరు ఉన్నత పాఠశాల వార్షిక సంచిక 'సరసి' 1964లోను, ఈ కవి ఖండకావ్యం 'కావ్య సుందరి' 1968లోనూ ప్రచురింపబడినవి 1975-78 సం లో ఆంధ్రప్రదేశ్ ఇంటర్మీడియట్ తెలుగు ఫైనల్ విద్యార్థులకు పాఠ్యపుస్తకంగా ఉన్న వీరి 'శాంతిపథము' నాటకంలోనూ ఈ ధర్మశ్రీలోని కొన్ని పద్యాలు కవి వాడుకున్నారు శృంగార వీర కరుణ శాంత రసాలు చక్కగా పోషింపబడిన ఈ పద్యకావ్యం మన దేశ ప్రధాని మాన్యశ్రీ పి వి నరసింహారావు గారికి అంకితంగా ముద్రణలో ఉంది - 1997

యక్ష సందేశం - కాళిదాసు 'మేఘదూతం' కావ్యాన్ని యథాతథంగా ప్రతిశ్లోకాన్ని ఒక పద్యంగా అనువదించారు మూలకావ్యం వలె ఇదీ రెండు భాగాలుగా ఉంది ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు బోయినపల్లి వేంకటరామారావు తోటపల్లి గారికి అంకితం కావించిన ఈ కావ్యం 1984లో వెలువడింది వీరి అనువాద వైఖరి తెలుపడానికి రెండు మూడు పద్యాలు ఈ దిగువ

చూపబడుతున్నవి మేఘ సందేశం ప్రథమ సర్గములోని ధూమజ్యోతిస్సలిల మరుతాం 5వ శ్లోకానువాదాంధ్ర పద్యం ఇది

నీరదములేడ నిర్జీవ నీరసములు, వార్త లెక్కడ ప్రాణి సంవాహకములు
కాని మోహార్తు డతడు మేఘంబునడిగె, కామి యగు వాడు నిక్కంబు కానగలడె?

సంతప్తానాం త్వమసి శరణం 7వ శ్లోకానువాద పద్యమిది

తప్తుల కీవె దిక్కుజలదా! ధననాథుని క్రోధ శాప సం
తప్తుడ, నా వియోగ వ్యధ తన్వికి జెప్పిన నీవు నాకు సం
తృప్తి, పురీ వనస్థ హర దివ్య జటాలయ బాల చంద్ర సం
వ్యాప్త ప్రభా విభాసితమునౌ ఆలకాపురి నీవు పోవలెన్

ద్వితీయ సర్గలోని ఆలోకేతే నిపతతి పురా" 24వ, శ్లోకం భావ పద్యం చూడండి

పాలతి కనిపించు నీకు బలిపూజలందు, కానిచో నన్ను చిత్రించు ధ్యానమందు
శారికల పంజరంబుల సరస జేరి ప్రభుని తలతురే యని గాని ప్రశ్నలిడుచు

యథామూల భావానువాదమైన ఈ యక్షసందేశ పద్య కావ్యాన్ని 'అభినవ కాళిదాస బిరుదాంకితులైన శతావధాని సిరిశెనహళ్ కృష్ణమాచార్య కొరుట్లగారు బహుధా అభినందించారు

ధర్మపదం త్రిపిటకముల తర్వాత అత్యంత గౌరవాదర ప్రచారంలో ఉన్న బౌద్ధ మతనీతి గ్రంథం ధమ్మపదం దీనికర్త గౌతమ బుద్ధుడనే వాడుక ఇది ప్రాకృత భాషా రూపమైన పాలీ భాషలో రచింపబడింది దీని 26 వర్గలలో మొదటి 3 వర్గల శ్లోకాలను (ప్రాకృత పద్యాన్ని గాథా అంటారు) సరళమైన తెలుగు పద్యాలుగా (1991) మలిచారు కవి ఉదాహరణకు రెండు పద్యాలివి

(దీనిని డా నండూరి కృష్ణమాచార్య, బొజ్జాతారకం, గజ్జెలమల్లారెడ్డి మొ॥ వారు అనువదించినట్లు ఈ మధ్య 1997లో తెలిసింది )

1 యమక వర్గం - 2వ, పద్యం

మనసు మూలమ్ము సకల ధర్మములకెల్ల, అంతయు మనోమయము శ్రేష్ఠమైన దిదియె
భాషణమ్ము ప్రసన్నత్రన్ పనులు చేయ, విడని నీడగ సుఖములు వెంబడించు

5 బాలవర్గం - 3వ పద్యం

తనపుత్రుడు తనధనమని, యనుకొని భ్రమ చెందుటనగ నజ్ఞానమగున్,
తన తనువె తనది కాదన, తనయుడెచట? ధనమదెచట? తాయోచింపన్!

సురభి పద్య గేయ సమ్మిశ్రిత రైతు కవిత 'గోవిలాప' నీతి కావ్యం ఆర్థిక సహాయానికి హైదరాబాద్ 'సాహిత్య అకాడెమీ' కి వెళ్లి అది తెలుగు విశ్వవిద్యాలయంలో సంవిలీనమైన సందర్భంలో అదృశ్యమై అజ్ఞాతవాసం చేస్తున్నది

నీతిశాస్త్రం అను సంస్కృత సంగ్రహ శ్లోక సంపుటి ఒకటి ఆంధ్రప్రదేశంలో పూర్వకాలం నుండి అధిక జనవ్యాప్తిలో ఉంది దానిలోని కాల దోషం పట్టిన భావాల శ్లోకాలు వదలి, నేటి వారికి ఉపయుక్తాలుగా ఉండే, ఎనభై శ్లోకాల నెన్నుకొని కవి ఈ అనువాదం కావించారు సాహితీ ప్రియులు శ్రీ తిరుమల రాజగంగారాం కోరుట్లగారు ఈ కావ్యాన్నిఅంకితం పొంది ముద్రించారు పద్య కవిత్వంతోనే దాదాపు ముప్పదేండ్ల క్రితం సాహితీరంగంలో ప్రవేశించిన ఈ కవి యుగధర్మాన్ని అనుసరించి పద్యరచనకు స్వస్తి చెప్పి వచన - గేయ రచనలు కావిస్తున్నారు

## 14 డా రావికంటి వసునందన్ - కమాన్‌పురం

కరీంనగర్ జిల్లా కమాన్‌పురం వాస్తవ్యులైన డా రావికంటి వసునందన్ గారు హైద్రాబాద్ సార్వత్రిక విశ్వవిద్యాలయంలో తెలుగు రీడర్‌గా పనిచేస్తున్నారు

వచన పద్య, గేయ గ్రంథాలు వీరిని పదికి పైగా ముద్రితమైనవి వేణి సంగమం ఖండకావ్యం తర్వాత వసునందన్ గారు 'భారతం పేర రామాయణ కథను నిర్వచన పద్య కావ్యంగా రచించి 1980లో ప్రచురించారు ఇది భరతుడు కావ్యనాయకుడుగా నడిచిన రామాయణ కథ కాబట్టి కవి దీనికి భారతం అని నామకరణం చేశారు 165 పుటలు 621 పద్యాలు కల ఈ కావ్యం కవి ప్రతిభకు దర్పణంగా ఉంది మచ్చునకు కొన్ని పద్యాలు ప 201



రాక్షస దుష్ట శక్తుల నిరస్తము జేయగ నేగు శౌరి స
ల్లక్షణ లక్ష్య శంఖ ఘన రావ మనందగు రామ కీర్తనన్
రూక్ష మహా ప్రతాప రవిరోచిరుదగ్ర సుదర్శనాకృతిన్
పక్ష యుగమ్ము బూను ఖగపాలుడనన్ భరతుండు సాగినన్
పల్లెల పట్టణమ్ములను పావన దైవ విశేష సీమలన్
భిల్లుల పల్లెలన్ ప్రజయవీయస లక్షణ యుక్త రామ భూ
వల్లభుగా గనిష్ఠయుతు బద్మ కులాప్త కులాప్త బాంధవున్
సల్లలితాత్ము శ్రీ భరతు సాదృతి గాంచె సహస్రవీక్షలన్ 206
కన్నుల తళతళ వెన్నెల, పున్నమలుదయించ మేని పుత్తడి వన్నెల్
మిన్నుల మెరపులు రాయగ, నన్ని సొగసులొలికి లేడి యాడి నటించెన్ 423

తెలుగులో ప్రచుర ప్రచారంలో ఉన్న పద్యాలతోపాటు ఈ కవి సంస్కృత ఛందాలైన అత్యుష్టి, అనుష్టుప్, బృహతి మొదలైన వానిని ఈ భారత నామక రామాయణ కావ్యం ద్వారా కొత్తగా తెలుగు కవిత్వంలో ప్రవేశపెట్టారు వచనం పద్యం గేయం సమాన ప్రతిభతో వ్రాయగల కవి వతంసులు డా రావికంటి వసునందన్

## 15 రామక విశ్వనాథ శాస్త్రి - బొమ్మెనపల్లి - జననం 1-6-1940

రామక విశ్వనాథ శాస్త్రి గారు బి ఏ బి ఓ ఎల్ పట్టభద్రులు చిగురు మామిడి మండలంలోని బొమ్మెనపల్లి వాస్తవ్యులు కరీంనగర్ జిల్లాలో సెకండరీ పాఠశాలల ఆంధ్రోపాధ్యాయులుగా ఉద్యోగం చేస్తున్నారు వీరు జిల్లా 'సారస్వత జ్యోతి' మిత్రమండలికి కార్యదర్శిగా పనిచేశారు పలుసాహిత్య సభలలో పాల్గొని కవితా గానం చేశారు శాస్త్రి గారు సరస కవులు

నిద్రాస్తవం, నీతిశాస్త్రం మొ॥వి ఈ కవి అముద్రిత రచనలు

వీరి ఏకైక ముద్రిత కావ్యం శ్రీ వేంకటేశ్వర స్తవము (తత్త్వదర్శిని) 1984లో వెలువడింది ఇందలివి సీస పద్యాలు అవి అష్టోత్తర శతం మకుట నియమం లేదు పద్య సంఖ్య లేదు వేర్వేరు శీర్షికల క్రింద విరచితం భక్తినివేదన, భగవత్తత్వ పరిశీలన సంప్రదాయ వివరణ ఇందలి ప్రధానాంశాలు కావ్య వివరాలు

యజ్ఞ యాగాదుల నాదరమ్మున జేసి నిన్నుపొందగరాదు నన్నుతాంగ - అంటూనే
పరమాత్మనీ దివ్య భజన మాలినవాడు మనిషియై పుట్టిన ఘనత యేమి? - అన్నారు కవి
జపతప యాగ వ్రతాదులకంటే, భక్తి-భజనలనే కవి బలపరిచారనుకోవచ్చు

పశ్చాత్తాపము - శీర్షికలో
ఎన్నెన్ని జన్మల నెత్తి యుంటినొ కాని, నీ పాద సేవలు నేరనైతి
ఎన్నెన్ని విద్యలు నిట్టె నేర్చిన గాని, నీ నామముల బాడ నేరనైతి
నిన్ను తెలియగ లేనిచో నన్నిసున్న కవి దైవ భక్తి ఆత్మనివేదన ప్రతి పద్యంలోనూ కనిపిస్తుంది
రసరూప గంధముల్ పొసగ విత్తుకె కాని, భూమికి సంబంధమేమి లేదు,
దొడ్డ సన్నము లెల్ల తోచు దారమునకే, ప్రత్తికి దోసమ్ము పరగలేదు
మంచి చెడ్డలు రెండు మానసమ్ముకె కాని, ఆత్మకు వాని బంధమ్ము లేదు
రాత్రిందివమ్ములు ప్రాణి కోటికె కాని, కాలమ్మునకు బాధకలుగబోదు
జనన మరణములవి దేహమునకె కాని, జీవి కేలాటి బంధమ్ము జెలగ బోదు
గహన వేదాంతాన్ని ఇట్లా సరళంగా చెప్పగల నేర్పు విశ్వనాథశాస్త్రి గారిది
కవి భావనా శక్తికి నిదర్శనమైన మరో పద్యమిది
కాలమా! నన్ను నీ కన్నవానిగ జూచి, జనహితమ్మును గూర్చు మనసు నిమ్ము,
ఆహారమా! నన్ను ఆత్మపుత్రుగ జూచి, భూత హితము గూర్చు బుద్ధినిమ్ము,
విద్యలారా! మిమ్ము వినయంబుతోగొల్చు నందరితో స్నేహమందనిమ్ము,
ధైర్యమా! నన్నెప్డు దయతోడ జూచుచు, దైన్య జీవుల బ్రోచు దారిజూపు
మతము మతమున మానవ హితము గూర్చు, మానవత్వము బెంపు సుజ్ఞాన మిమ్ము -

ఈ ఒక పద్యం చాలు కవి సౌజన్యం తెలుపడానికి, సత్కవుల సరసన ఈ కవిని నిలపడానికి! సరస భక్త కవి రామక విశ్వనాథ శాస్త్రి గారు

## 16 తోపుచెర్ల రంగారావు - ఎం ఏ, బ్రాహ్మణపల్లి; జననం 1-4-1953

తోపుచెర్ల రంగారావు గారి స్వగ్రామం మహదేవపురం మండలంలోని బ్రాహ్మణపల్లి వీరిది వ్యవసాయ కుటుంబం గ్రామీణ జీవితం సామాజిక పరిస్థితులు రావు గారిని కవిని చేశాయి పూర్వకాల సాహిత్య ప్రీతితో పద్య కవిత్వంలోనే పరిశ్రమచేసికథా కావ్య రచన కావించే స్థాయికి ఎదిగారు సాహిత్యాభిరుచితో తెలుగులో ఎం ఏ కాకతీయ యూనివర్సిటీలో చదివారు

రంగనీతి శతకం, లక్ష్మణ పరీక్ష, ఆత్మవిలాపము, వేశ్య వీరి పద్యకావ్యాలు, మంటలు గేయ సంపుటి వీరి అముద్రిత రచనలు వీరి 'కన్నీటి కథ' ముద్రిత పద్యకావ్యం, 1984లో వెలువడింది

డా॥ దాశరథి, డా సి నా రె, డా బోయి భీమన్న, డా ఇరివెంటి కృష్ణమూర్తి, గీట్ల, వెలిచాల, దత్తాచార్య, బి వి రామారావు గారల పీఠికలతో వెలువడిన ఈ పద్య కావ్యం ఎం ఎల్ ఏ జగపతిరావు వెలిచాల గారికి అంకితం కావించబడింది ముఖచిత్రం ఆగాచార్య వేశారు

ఇది ఒక ఆధునిక వేశ్య కథ ఆమె జీవిత నేపథ్యంలో గ్రామీణ పేద రైతు జీవిత చిత్రణ, ఆడపిల్లల పెళ్లిల్లు అవస్థలు, అత్తింటి ఆరళ్లు, నాగరిక ఉద్యోగ పర్వంలోని లంచాలు, యువతులపట్ల అధికారుల లజ్జాహీన ప్రవర్తనలు వర్ణించబడినవి కథా కథనంలోనే కాక కవితా కల్పనలోనూ కవి కలం సహజంగా సాగింది కావ్యారంభంలో "మగువ పుట్టుకె పాపంబు మరియు నందకత్తె యగుట మరింత "దోషము స్త్రీలది నేరము లేని కష్టభారము - అన్నారు కవి

పవలు రేయియనక ప్రాణాలు పిండుచు, వాంఛ దీర్చుకొనెడు వారె కాని
మాదు గోడు వినెడు మనుజులెవ్వరు లేరు, స్వార్థపరులు గారె జగతి జనులు పు 2

సందర్భాన్ని బట్టి సన్నివేశ వర్ణనలకు ఉదాహరణలు

సాధింపులు మొదలాయెను, బాధింపగ జొచ్చి రత్త భర్తయు మిగులన్
బాధా కరమైనను యా బాధల భరియించి యక్క పడియుండెనటన్ పు 18
తుంటరి ఆఫీసరు న న్నింటిర్వ్యూ జేసి తనదు యింటికి పిలిచెన్
ఒంటరి దానిగ కనుగొని కొంటెగ నావైపు జూచి కోరిక తెలిపెన్ పు 27

విద్య - నాగరికత ఎంత పెరిగినా స్త్రీ జీవితం కత్తుల పంజరంలో పక్షి చందం క్రూరమృగాల మధ్య జింక విధానం కవి ఆకాంక్ష కావ్యం చివరి పద్యంలో ఉంది ఈ విధంగా మగువ మనుగడ కీనాటి మన సమాజ మందు మాన్యత గావలె నన్న యపుడు పౌరులందు విశాల దృక్పధము వలయు మార్పు యువతకు నేనిచ్చు తీర్పు చివర పు 40

రంగారావు గారు సంఘ సంస్కార దృష్టిగల సహజకవి

## 17 గంగా రాజేశ్వరరావు - మంథని; జ. 1919

గంగారాజేశ్వరరావు గారు మంథని వాస్తవ్యులు ఈ శతాబ్ది పూర్వార్ధ కవులలో ప్రముఖులైన గంగా లక్ష్మణరాయ కవి వీరి జనకులు పరీక్షిచ్చరిత్ర కావ్యం చివర కవి తమ వంశ వృక్షాన్ని ఎనిమిది తరాల వారి వివరాలు చూపారు అందులో ఈ కవి గారిది అయిదవ తరం తండ్రి మరణించిన వత్సరంలోనే ఈ కుమారుని జననం తండ్రి గారి రచనలను తప్ప వారిని రాజేశ్వరరావు గారు చూసి ఎరుగరు రాజేశ్వరరావుగారు తెలుగు ఎం ఏ చదివి, బి ఇడి పూర్తి చేశారు ఉన్నత పాఠశాలోపాధ్యాయులుగా ప్రభుత్వోద్యోగం చేసి విరమణ పొంది విశ్రాంతి కాలాన్ని సాహిత్య వ్యాసంగంతో గడుపుతున్నారు 'గంగా గ్రంధమాల' అను ప్రచురణ సంస్థను స్థాపించి, తమ పెన్షను డబ్బుతో తమ తండ్రి గారు రచించిన 'రత్నకాంత నాటకమును' స్వీయ రచనలను కొన్ని ముద్రించుకున్నారు మరికొన్ని ముద్రించే ప్రయత్నంలో ఉన్నారు

రాజేశ్వరరావు సంస్కృతాంధ్రములందు చక్కని పండితులు సరసకవి మూర్ధన్యులు తరువుల తిరస ఫలభార గురుతగాంచు - అన్నట్లు వినయ గుణ భూషితులు రాష్ట్రంలోనే ప్రముఖకవులుగా రాణించగల కవిత్వ సత్తా గల వీరు ఈ జిల్లా కవులకే పలువురికి తెలియరు శర్మగారు మరుగున ఉన్న మాణిక్యం - వీరు నటులు - మహాకవి వతంసులు!

రాజేశ్వరరావు గారి ముద్రిత రచనలు 1 రుక్మిణీ కల్యాణము, 2 పార్వతీ విజయము,
3 పరీక్షిచ్చరితము ఇవి మూడు పద్యకావ్యాలు ఇంకా -
4 గంగా రూపకము నాటికలు, 5 ఆత్మబోధశతకము, 6 భగవద్గీతాగానము
ముద్రణలో ఉన్నది రగడ రామాయణము

కావ్య పరిచయము

రుక్మిణీ కళ్యాణం - ఇది చంపూకావ్యం 43 పుటలు కావ్యం మధ్య అనుబంధ సూచికలతో పాటు, కావ్యం చివర 26 తొహరలు - కీర్తనలు రాగతాళాలతో సూచింపబడినవి ఈ విలక్షణతకు కారణం ఏమిటా? అని కవిని ప్రశ్నిస్తే, మొదట హరికథగా వ్రాసిన ఈ కృతిని ఆ తర్వాత వారు కావ్యంగా మార్చినట్లు చెప్పారు ఈ గ్రంధంలోనే మునుగోటి వారి 'సత్యనారాయణ వ్రత మహాత్మ్యం'లో ఇట్లాగే తొహరలున్నా అవి కథ మధ్యలోనే ఉన్నాయి రాజేశ్వరరావు గారు కావ్యాంతంలో ఉంచారు ఇందలి కథ భాగవత మూలకథను అనుసరించి సాగింది

ఈ కథలో విహగ రాయబారం కాక విప్రరాయబారమే ఉంది ఆ ద్విజుని శ్రీకృష్ణనుతి నాచన సోముని ఉత్తర హరివంశము'లోని జనార్దనుని తలపింప జేస్తుంది ఈ కావ్యంలో విశేష వృత్తాలతోపాటు ద్విపద భాగాలున్నాయి ద్విపదలు రంగనాథ రామాయణాన్ని అనుసరించినా శృంగార కల్యాణ ఘట్టాల్లో ఈ కవి పోతన భాగవత దశమస్కంధాన్ని అనుసరించక పోవడం విశేషం ద్విపద తెలుగు దనం ఇది - పు 39

ధ్వజ పతాకములు భవంతులపైన - విజయ చిహ్నములుగా వెలుగులీనంగ
పన్నీటి కలయంపి పరిమళింపంగ - వెన్నెలలను మించి వెలసెడి మంచి
ముత్యాల ముగ్గులు మంగిళ్ల మెఱయ - నిత్యమంగళ మద్ది నెలకొన్నదనగ
పచ్చని తోరణబంధ జాలములు  హెచ్చుగా వాకిళ్ల యింపినుమడింప
ఎనుపు కుంకుమ కడపల వెలిగింప  పసిడి పూదొట్టెల వరుసలు మీర

పంచ చామరం, మత్తకోకిల, స్రగ్విణి, భుజంగ ప్రయాతం, మధ్యాక్కర మొ॥ అరుదైన పద్యాలతోపాటు పద్య గర్భ పద్య చిత్రబంధ కవిత్వం చెప్పి తను ఛంద ప్రావీణ్యాన్ని చూపారు



గీతగర్భ చంపకమాల  19, చూడండి,

దరహసి తాననా 'వికచ తామర సాక్ష పవిత్రగాత్ర' యో
పరమ దయాకరా 'వరద వారిజ సన్నిభ వర్ణ దేహ' శ్రీ
హరి గరుడ ధ్వజా 'ముని జనావన పావన మోక్షదాత' హే
ముర నరకాంతకా 'విబుధ పూజిత రాగదె వేగ బ్రోవ'నన్

ఇది వరుసగా చదివితే చంపకం, నాలుగు పాదాలు మూడవ నగణం నుంచి చివర గురువు వదలి చదివితే గీత పద్యం అవుతుంది కవి యథోచితంగా శబ్దారాలంకారాలు వాడినారు యమకాలంకారానికి ఒక ఉదాహరణ

ఆల మందలుగొని యడివికేగుటకాదు, ఆలమందల రిపు నడచు స్థలము
కోలలు గొని యాడు కోలాటమది కాదు, కోలలు గొని శత్రు గూల్చు తలము

1 ఆల మందలు, 2 ఆలమందు ఆల, 3 కోలలు, 4 కోలలు - బాణాలు పాలుపెరుగు బ్రామి  పద్యం చిలకమర్తి గయోపాఖ్యానంలోని 'అల్లుడా రమ్మని' సీసపద్యానికి శిల్పంలో భావంలో సమ ఉజ్జీ ఈ కవికి అప్రయత్నంగా సజీవ భావాలు సహజవాక్యాలు ఛందంలో అందంగా ఒదిగి పోతుంటాయి సహజ రమణీయ కావ్యం వీరి 'రుక్మిణీ కల్యాణం'

పార్వతీ విజయము  1987 ముద్రణ పుటలు 140

ఇది సతీవియోగ గౌరిజనన గిరిజా కల్యాణ ములనే మూడు ఖండములతో 631 గద్యపద్యాలు గల చంపూ ప్రబంధం కథ హరవిలాస శివపురాణాదుల నుండి గ్రహించబడింది వర్ణనలు కవి సొంతం కావ్యారంభ దేవతాస్తుతులు కవి భక్తికి, సంస్కృతాంధ్ర పూర్వకవుల నుతి కవి వినయానికి సాక్ష్యాలుగా ఉన్నాయి ఈ కావ్య నిర్మాణ హేతువును కవి ఈ విధంగా చెప్పుకున్నారు

భార్య కున్మాద జాడ్యంబు పట్టు కొనియె, నౌషధంబుల సేవయు వ్యర్థమయ్యె - 1-12
శైవ పంచాక్షరియె నాకు శరణమయ్యె, నైన చిత్తంబు శాంతింప నట్టి వ్యధలు - 1-13

అంతులేని దు ఖభారంతో కవి శివధ్యానంతో కాలం గడుపగా ఒకానొక దినమున సాంబుడు

కవి స్వప్నంలో సాక్షాత్కరించి శాంభవి కరుణతో నీ భార్య రుగ్మత పోతుంది (1 23)పార్వతీ విజయ గాథ రచించుమన్నారట అందుకే కవి ఈ గ్రంథాన్ని శివునకే అంకితమిచ్చారు

ఈ కావ్యంలోని దక్షాధ్వర సందర్భంలోని వీరభద్ర విజృంభణ కొంత శృతి మించింది పు 36 పార్వతి శివుని గూర్చి తపస్సునకు వెళ్లుచుండగా తల్లి మేనక తలపోత పోతన సత్యాభామా యుద్ధ వర్ణనలోని బొమ్మపెండ్లిళ్లకు పద్యాన్ని పోలింది చూడండి

కస్తూరి కుంకుమాగురు చందనాదుల, బోనాడి బాడిద పూతు వెట్లు?
జలతారు పట్టు వస్త్రములను విడనాడి నార చీరలు కట్టనేర్తువెట్లు?
హాటక నవరత్నహారాలు విడిచి రుద్రాక్షమాలికలను దాల్తువెట్లు?
ఘన చంచరీకాల గాదను నీలంపు గురులను జడలుగా గూరుతెట్లు?
షడ్రసోపేతమైన భోజనము మాని కందమూలఫలంబుల గడుపుదెట్లు?
హంసతూలికా తల్పంపు హాయి మఱచి కటిక నేలను బవళింప గడగుటెట్లు? 2 138

సమకాలీన సామాజిక విషయాలు పరితుల మనస్సుల నాకట్టుకుంటాయి అటువంటిదొకటిది
ఈడును జోడును బెండ్లికి జూడవలయు నది గుదురని చోటుల నరయన్
గోడెను నెద్దును బండికి జోడుం గట్టిన విధంబు జొప్పడుసుమ్మీ, 3 234

ఈ కవి వర్ణనలు మనోహరాలు! నాయికను వర్ణిస్తూ ఆమె మోము సౌందర్యకాంతుల గనలేక చంద్రుడుక్రుంగిపోతాడు ఆమె నేత్రాలు కాగోరి పద్మాలు నీట నిలిచి ఒంటికాలి తపస్సు చేస్తాయి ఆమె తీపి మాటలు రామచిలుకలకే పలుకులు నేర్పుతాయన్నారు 2 43

ఇంకా అంత్యానుప్రాసాలంకారంలో ఇట్లావర్ణించారు
నడువనేర్చెను హంసలా నడకలు గని, నవ్వనేర్చెను బువ్వులా నవ్వుల గని
యాడ నేర్చెను నెమిళులాయాటలుగని, పాడ నేర్చెను బికములా పాటలు విని 2 44

ఈ త్ర్యక్షర ప్రాస యమకాలంకారాలు చూడండి
మానవతుల నొప్పింపకు మా నవకుసుమములువారిమనసు లవిసుమా
మానవ జన్మంబెత్తితి మానవ యికనైననీ యమానుష క్రియలన్ 2 253

శివ పార్వతుల కల్యాణం సవైదికం- వధూవరులకుబంధువులు కట్నంబులు చదివించడం కూడా కని వదల్లేదు పార్వతీ పరమేశ్వరులకుకుమార స్వామి జన్మించి తారకాసురసంహారంకావించి సురనరలోకాలకు శుభం చేకూర్చారని కథను సుఖాంతంగా ముగించారు కవి

పరీక్షిత్ చరితము ఇది మహాకావ్యం 1987లో ముద్రితం ఇది మరో సంగ్రహ భాగవతం, తత్త్వ జ్ఞాన భక్తి వైరాగ్య ఖండములను చతుర్విభాగాలతో దాదాపు 800 పద్యగద్యాలుకల ఈ గ్రంథంలో 259 కంద పద్యాలున్నాయి కవి గారు ఈ కావ్యంలో 44 రకాలపద్యాలనువాడారు జాత్యుపజాతి పద్యాలేకాక బంధ చిత్ర కవితా విన్యాసాలున్నాయి ఛందస్సులో ఇన్ని అపూర్వ చిత్రాలు కావించినవారు ఆంధ్ర సాహితీలోకంలోనే అరుదు కవి మొదట ఈ కావ్యాన్ని హరికథా ప్రబంధంగా రచించారట తర్వాత వానమామలై వరదాచార్యుల సూచనమేరకుకావ్యంగా మార్చారట కవికి ఈ కార్యంలో సహకరించినవారు డా శుకశ్రీ పార్వెల్ల గోపాలకృష్ణకవి గారలని కావ్య పీఠికలో

పేర్కొన్నారు వారు ఈ కృతిని ప్రబంధమన్నారు కాని నిజానికి ఇది భక్తి కావ్యం, పురాణాల ధోరణి రచన వాల్మీకి రామాయణమే ఇతర రామాయణాలన్నింటికీ మూలమైనట్లు సంస్కృత భాగవతమే శర్మగారి పరీక్షిత్ చరిత్రకు మూలం కథను కవి స్వీయ అభీష్టం మేరకు సంగ్రహించుకున్నారు ఇందలి కథా వివరమిట్లున్నది

తత్త్వ ఖండం - భారత యుద్ధానంతరం ధర్మజు విచారం పరీక్షిత్తు జననం, కృష్ణ నిర్యాణం పరీక్షిత్తు పట్టాభిషేకం, కలి పురుష నిగ్రహం మృగయాఖేటనం శృంగి శాపం, ప్రాయోపవేశం

జ్ఞాన అజామీలోపాఖ్యానం, భక్తి ధృవ ప్రహ్లాద చరిత్రలు

వైరాగ్య శ్రీ కృష్ణ లీలలు, పరీక్షిత్తు మరణం,జనమేజయ సర్పయాగ పరిసమాప్తితో కావ్యం ముగింపు ఈ కావ్యాంకితం ఒక ప్రత్యేక 'ఉదాహరణప్రబంధం', అందలి సార్వవిభక్తిపద్యమిది

ఏ హరి సృష్టి పాలన లయేశ్వరుడో యతనిన్ దలంచెద
న్నేహరి చేత దుష్ట వధ యేర్పడునో నుతులిత్తు వానికై
యేహరి వల్ల రక్షణములభిందునొ, వానికి నిత్తు మత్కృతి
న్నేహరి యందు భక్తిదృఢ మయ్యెడు గృష్ణ ముకుంద మాధవా, 1-32

ఇందలి హరి-లయేశ్వరుడు, అతనిన్ హరిచేత, వానికై వల్ల వలనన్, వానికిన్, అందు మాధవా అనేవి విభక్తి ప్రత్యయాలు రెండవ నాలుగవ పాదాల మొదటి పదాలు పోతన 'అన్నిష్ట సఖి వంటి అచ్ద్విత్వసందులు! ఇందలి కళికోత్కళికలు మృదుపద మధుర భావ శ్రుతిలయల సౌందర్య శోభితాలు శ్రీకృష్ణుని నిర్యాణానికి ధర్మరాజు విలాపం ఇట్లున్నది

కం వీడితివా భువి? మము విడ, నాడితివా? బొమ్మలాట లాడించుచు నీ
వాడితివా నాటకమిటు?, పాడితివా యపుడె భరత వాక్యము? కృష్ణా! 197

వేదాంత వర్ణన మత్తకోకిల, 2 23

కర్మ సృష్టికి కారణంబగు గర్మ రక్షణ మూలమా
కర్మహేతువు నాటకమునకు గర్మరూపమె సర్వమున్,
గర్మ వృక్షపు పండ్లు కోరక కర్మలన్నొరించు చో
గర్మ బుద్ధుడు గాడు జీవుడు కర్మకంతకు సాక్షియౌ

ఇందులోనే తైత్తిరియోపనిషత్తులోని రెండు పక్షుల - జీవుని దేవుని సంబంధాన్ని వివరించే పద్యాల్లో ఒకటి ఇది

ఒక వృక్షంబున రెండు పక్షులు క్రమంబొప్పారు నవ్వానిలో
నొక పక్షీంద్రుడు సాక్షిమాత్రుడయి కూర్చుండంగ బేరాసతో
నొక పక్షీంద్రుడు మెక్కగా దొడగు నొండొక్కంటినిన్ దాని జి
క్కు కొను న్గర్మల బంధమందున విముక్తుండౌట యెట్లో కదా 2-42

ఇదే సన్నివేశ పద్యాలు 'శతావధాని కృష్ణమాచార్య' కృతి(రత్నమాల)లోనూ ఉన్నాయి

ధృవ చరిత్రలోని మధుర గతి రగడ 3-12

నారాయణ దానవ సంహారీ శ్రీరమణీ పూజిత గిరిధారీ
మార జనక హరి మాధవ శౌరీ - కూరిమి బ్రోవుము కుంజ విహారీ

ప్రహ్లాద చరిత్రలో మేలన గీతము 3-165

బాల కులము వేడ లేము బాలకృష్ణ! నిన్ను బాల కడలి యిల్లు నీకు, బాపరేడు పాన్పు,
చాలురా! యుపేక్ష తాళ జాలమింక పీత చేల వేగరారా! కావ శ్రితజన పరి రక్ష!

కథను తప్ప పోతన ప్రసిద్ధ భాగవత పద్యాలను ఈ ఘట్టంలో రావుగారు ఏమాత్రం అనుకరించలేదు అది కవి తన వ్యక్తిత్వాన్ని కాపాడుకోవడం పైగా పోతన్న కంటె మిన్నగా రచించ లేవనే వినయ ప్రదర్శనమూ కావచ్చును ఈ కావ్యాంతంలో కొన్ని చిత్రకవితా బంధ పద్యాలున్నవి అందులో ఇది కంద గర్భ తేటగీతము చూడండి -

నిగమ శిరములున్ సహితము పొగడుటకును, బోలమనుచు మూగ వడియె భో! గిశయన!
ఖగ తురగ నీ సుగుణముల జగమున నుతి, గొల్వ నిక వశమ నరులకున్! దెలుపు

ఇది గీత పద్యం రెండవ నాలుగవ పాదాల చివరి నాలుగేసి అక్షరాలు వదలి చదివితే అది కంద పద్యం! వీరి కావ్యం భాగవతసార భక్తి యోగం అనడానికి ఇందలి అనేక పద్యాల ఉదహరించవచ్చు వానిలో ఒకటిది

చర్విత చర్వణంబులు నశాశ్వతముల్ సుఖభోగముల్గోనం
బర్విడ నేల? నా విషయ వాంఛలు దీరవె? జంతుజన్మలన్,
గర్వము మాని నీమనము గంస విరోధి పదంబు జేర్చి సు
జ్ఞానపు దీప కాంతి భవ గాఢ తమస్సును దాటగా వలెన్ 4 224

వీరి కావ్యాలన్నీ దైవ భక్తి సంభరితాలు రూపకాలు, సామాజిక వైషయికాలు గంగా రాజేశ్వర కవి కలం ప్రభ రెండంచుల ఖడ్గం ఆధునిక విద్యా పాండిత్యం పురా కవుల కవిత్వ ప్రాభవం కలిగిన గంగా రాజేశ్వర రావు మహాకవి కవిత కమనీయ సుస్వాదురస గంగా ప్రవాహం

## 18 పార్వెళ్ల గోపాలకృష్ణ - ఎం ఏ చాకుంట - జన్మతేది 3-7-1937

గోపాలకృష్ణ గారు తెలుగు ఉపన్యాసకులుగా పనిచేసి ఉద్యోగ విరమణ పొందారు వీరు అష్టావధాని వీరి ముద్రిత రచనలు రెండు వాటిలో 1 వాసంతి (ఖండకావ్యం) - 1969 పరిచయం చేయబడింది 2 పంచముఖాంజనేయము (పద్యకావ్యం) 1985 పరియం ఇప్పుడు చేయబడుతుంది

నానార్థ మంజూష విషమ ప్రపంచము, వర్ణవిలాపము, వేణూదయము, కార్తీక మాహాత్మ్యము సౌందర్యలహరి - శివానందలహరి (ఆంధ్రానువాద) కావ్యాలు వీరి ఇతర అముద్రిత కృతులు

**పంచముఖాంజనేయము** ఇది భక్తి కావ్యం మెదకు పట్టణమందలి మారుతి మహాత్మ్యాలు ఆవిర్భావం, ఉత్సవాలు ఖండత్రయ విభాగాలుగా వివరించిన చంపూకావ్యం పుటలు 100

ఇందలి ఉపశీర్షికలలో స్థల చరిత్ర హనుమజ్జీవిత చరిత్ర మహిమలు, పూజాదికములు - వాటి ఫలాలు వివరంగా వర్ణించబడ్డాయి సామాజిక విమర్శ అదనంగా చోటు చేసుకుంది కవి కవన నైపుణిని కవి మిత్రులు ప్రముఖ కవులు కావ్య పీఠికలలో ప్రశంసించారు

ఆ ఆలయం రెండువందలేండ్ల క్రితం ప్రతిష్ఠాపితమైనదట పు 12 హనుమంతుని వర్ణన -

కొలచిన వారికి కొంగు బంగారము, తలచినవారికి తలపుపంట
సేవించువారికి సేవధి భక్తియై పొగడెడి వారికి పుట్ట తేనె
భజియించువారికి బంగారు కొండయు, పూజించువారికి పుడుకు తొడుగు
నమ్మిన వారికి నారాయణుండును, దిక్కు గావని వారి దిక్కునంచు
అష్ట సిద్ధులు నవ విధులమర జేయు, రామ భక్తుని మహిమంబు రామచంద్రు

డెరిగి నట్లుగ నితరుల కెరుగ వశమె యనుచు లోలోన నర్చించు ననుదినంబు - పు 16

మరో పద్యం వృత్త్యను ప్రాసాలంకారం కలది

కం నేమమ్మున నీ నామము నామనమున నెమ్మినమ్మి నాననుమా న
మ్మా మామ మామ మానున మామి మనమ్ము నను నమ్ము మను మనుమన్నా

కవి భావనావైదగ్ధికి ఉదాహరణగా ఒక పద్యం పు 17



గంగాభవాని యుద్వేగంబులోగొను ధూర్జటి జడల సందోహమనగ
మిన్నేటి తమ్ముల నున్న తేనియగ్రోల, నరిగెడు కోట్ల బంభరములనగ
శివమూర్థమునవొప్పు శేఫాలికాసుమ నిర్మాల్యమది నింగి నిండె ననగ
హరుడావులించ నవ్వరహాల ధూమంబు లంబరమున గదలాడె ననగ
దేవ వనితలంగోద్వర్త నావసరము నన్నలుగు గమ్మ కస్తురి చెన్ను మీఱు
నట్టి స్వస్థని నురువుల తెట్టలనగ నల్ల మబ్బులాకసమున నల్లుకొనియె

ఇది ఆంజనేయ చరిత్ర మాత్రమే కాదు మెదకు మండల స్థల చరిత్ర కూడా ఆయా శీర్షికలు వర్ణనలు కవి గారి వేద పురాణాల భక్తికి పాండిత్యశక్తికి నిదర్శనంగా ఉన్నాయి

మరో విధంగా 'పంచముఖాంజనేయం' సామాజిక చరిత్ర అనొచ్చు ఎందుకంటే ఇందులో కల్లబొల్లి కబుర్ల రాజకీయ నాయకుల - పు 51, గుడిలోని దొంగల దోపిడి డాక్టర్ల - 55 56 తమ విద్యను మరచిన విప్రుల 51 నిరసించారు ఉలుకని పలుకని హనుమని మందలించాడు 52

జాతిని గురించి ఈకవి భావాలీ విధంగా ఉన్నాయి నీతి యొకడె కాని జాతి యొక్కడు (టి) కాదు సృష్టినీమంబును నష్టపరుప - 57 అన్నారు చేతి వేళ్లన్నీ ఒకే తీరుండవు అట్లే జాతులు కూడా అని సమర్థించారు తమ వాదాన్ని ఇంకా రెండు చేతులొకే విధపువైనా వాని విధులు వేర్వేరు కదా, అన్నారు 57 అందరు ఒక విద్య నేర్చిన ఒక వృత్తి చేసిన సరిపోదని 'ఒకడు భటుడు మరొక్కడు ఉడుకుజాపు ప్రభువుగా నుండుటే సృష్టి ఫక్కి' అని ప్రబోధించారు ఇది కుల విభాగాల సమర్థన।

ఇందలి పూజా విధులు స్తోత్రాదులు అంజనేయ కథా వివరాలు కవి ప్రతిభా ప్రదర్శనకు చిత్ర పటాలు ఇది కవి వేడికోలు

శ్రీ రఘు వీర పదాంబుజ, సారమరంద ప్రలోభ సరఘాయిత హృ
త్సారస హనుమంతా, భవ తీరము జేర్చంగదయ్య తేజమెసంగన్ - 86

ప్రౌఢ భక్తి ప్రబంధం, స్థల దైవత చరిత్రం గోపాలకృష్ణ గారి పంచముఖాంజనేయం।

ఈ కాలంలో ఈ మండలంలోని పద్య కవితా రచనా విశారదులైన కవులు నలుగురైదుగురిలో గణనీయులు పార్వెళ్ళ గోపాలకృష్ణ కవి

## 19 దూడం నాంపల్లి - బి ఓ ఎల్ సిరిసిల్ల, జన్మతేది 20-5-44

స్వయం కృషితో విద్యావంతులై తెలుగు భాషాబోధకులు - సరసపద్యకవి అయిన దూడం నాంపల్లిగారి పరిచయం ఖండకావ్య విభాగంలో చేయబడింది

వీరి ఏకైక ముద్రిత పద్య కావ్యం జీమూతవాహనుడు' 1986లో కేశవ పంతుల నరసింహశాస్త్రి గారి చక్కని పీఠికతో వెలువడింది [1]

---

1 కృష్ణమిశ్రునిప్రబోధ చంద్రోదయం-నంది మల్లయ్య ఘంటసింగయ్యల ప్రబోధచంద్రోదయ కావ్యం ఇంకా కాళిదాసు శాకుంతలం జయదేవుని ప్రసన్నరాఘవం మురారి అనర్ఘ రాఘవం నాటకాలు తెలుగులో కావ్యాలుగానే అనువదింపబడ్డాయి

కావ్య పరిచయం సంస్కృత నాటకాలు తెలుగులో కావ్యాలుగానె అనువాదం పొందాయి అవి నాటకాలుగా ఆంధ్రీకరణ పొందినది వీరేశలింగం గారి కాలం నుండే దూడం నాంపల్లి గారు హర్షచక్రవర్తి విరిచిత 'నాగానంద నాటకాన్ని పూర్వాంధ్ర కవులవలె పద్యకావ్యంగా తెలుగు చేశారు జీమూత వాహనుడు ఈ నాటక - కావ్య కథానాయకుడు నాటకంలోని అంకాలనుబట్టి అధ్యాయాలుగాకాక కవి మేఘ సందేశంలోవలె పూర్తి కథను పూర్వోత్తర భాగాలుగా 126 114 మొత్తము 240 పద్యాల్లో అనువదించారు

దైవ స్తుత్యనంతరం కృతిపతి కుంట భాస్కర రెడ్డి గారిని సంబోధిస్తూ

అవధారు మిత్ర రత్నమ భవదభ్యర్థన గణించి పద్య కృతిగనే

ప్రవచించెద అల జీమూ త వాహను చరిత్ర మంకితంబుగ నీకున్ 1-2

అని పూర్వ కవుల మార్గంలో సూతుడు శౌనకాదులకు వినిపించినట్లుగా కథారంభం కావించారు కృతి పతి ప్రశంస 29 పద్యాల్లో ఉంది

కాంచన పుర వర్ణన 1 3 నాయక వర్ణన, ఖేచర వల్లభుడైన జీమూత కేతువు సుతుడైన జీమూతవాహనుని రాజ్యపట్టాభిషిక్తుని చేసి వాన ప్రస్థాశ్రమాన్ని స్వీకరించి వనానికి వెళ్లడం 1-5 మంత్రి వారించినా వినక నాయకుడు మాతాపితరుల సేవకు మలయాద్రికి చేరటం (7 15) వనవర్ణన (24 25) నాయిక మలయవతిని చూసి వలపుగొని వసు చరిత్రలోవలె మిత్రునితో నాయికా సౌందర్య వర్ణన చేయటం నాయికా నాయకుల పరిచయాలు వలపులు విరహాలు సంప్రదింపులు వివాహంతో పథమాశ్వాస సమాప్తి నాయిక వలపు ఫలించక పూర్వం దేవి పూజ చేయగా చెలికత్తె పలికిన వాక్కులివి

మొక్కగ చేతులుకోసెడు మొక్కలి దైవమ్ము గలదె మ్రొక్కిన వరమున్

నిక్కము దీర్పని వేల్పును గ్రక్కున విడువంగ వలయుగదె మలయవతీ (1 35)

ఇది అక్కరకు రాని చుట్టము' అను సుమతి శతక పద్యాన్ని అనుసరించినది

ద్వితీయ భాగంలో నాగులవైర గాథ నాగ మాత విలాపం, కరుణరస భరితం (20-28) ఒక పద్యం చూడండి

నా జీవ రత్నమా! నా ప్రాణ మిత్రమా నా ప్రేమ పాత్రమా! నా కుమార

నా కంటి దీపమా! నాయింటి దైవమా నా వంశ వర్ధనా నా తనూజ

నా పెన్నిధానమా నా సన్నిధానమా నా పంచప్రాణమా నా సుపుత్ర

నా పాలి భాగ్యమా నా నోముల ఫలమ్మ, నావరమ్ముల పంటనాదు కూన

రార యనుపమ గుణ ధుర్య రార తనయ, చెంప గిల్లిన పాల్గారు చిన్ని కుఱ్ఱ

బొల్లి గద్దకు బువ్వగా బుచ్చి నిన్ను, చనగ నాకెట్లు మనసొప్పు శంఖ చూడ! 1 20

నాగ కుమారునికి మారుగా నాయకుడు గురుత్మంతునికి ఆహారంగా వెళ్తానంటాడు అప్పుడు నాగుడు ఇట్లా అన్నాడు

నా తల్లి కడుపు కోతను నీ తల్లికి నంటగట్టి నింద ్యడ నగుచున్

భూతలమున నెటుమనుదును, నాతల వ్రాతన్ భరించి నలయక నేనున్

నా చావు నేను చచ్చెద ఈ చాయల నిలువకుండ నెచ్చటి కైనన్ -

వెళ్లుమని పలికి తల్లితోపాటు గుడికి పూజ కోసం వెళ్లాడు

అదే అదనుగా జీమూత వాహనుడు అత్తగారు కులాచారం ప్రకారం కొత్త అల్లునికి పంపిన కొత్త బట్టలు వేసుకొని గిరిశిఖరం చేరుకొని గరుడునికి బలియై తన జన్మధన్యమైందని భావిస్తాడు జరిగిన పొరపాటు తెలిసి దైవానుగ్రహం లభించి చివరికి కథ సుఖాంతమౌతుంది

ఈ కథ హర్షవర్ధనుని నాగానంద నాటకానికి యథామూల సరళపద్యానువాదం ఇందులోని రసపోషణ 'తెలుగు జాతీయాలు' పాఠకులను ఆకట్టుకుంటాయి కథలో జీమూత వాహనుడు నాగుడు అభేదంగా చూపబడుతారు మూలనాటకంలో వలెనే నాగుడు సర్పమో మానవ రూపమో తెలియదు కావ్యనాయకుడు ఖేచరుడు-గంధర్వుడు

మంగళాశాసనం కవి మనస్సుకు దర్పణంగా ఇట్లున్నది

నెలకు మూడు వానలు కురిసి పాడిపంటలతో రైతాంగం వర్ధిల్లాలి కవుల కావ్యాలు వెలగాలి కులమత భేదాలు తొలగి ప్రజలు అన్యోన్యమైత్రితో మెలగాలి బడుగు వర్గాలను ప్రభుత్వం ఆదుకొని పైకి తేవాలి దేశం నిత్య కల్యాణం పచ్చతోరణంగా ఉండాలి ఇది ఈ కవి నవీన జాతీయదృష్టి

ఇందలి కథ పాతదే వర్ణనలది ప్రబంధశైలి కవికి పద్య రచనలో చక్కగా చేయితిరిగింది పరోపకార పరాయణత్వాన్ని చాటి చెప్పే కావ్యం జీమూత వాహనుడు గేయ వచన గేయ కవితలు ఆదరం పొందుతున్న కాలంలో పద్యాలతో చక్కని నీతి కావ్యాన్ని సంప్రదాయ పద్ధతిలో వ్రాసిన సరస సాహస కవి దూడం నాంపల్లి గారు

## 20 'అనంతశ్రీ' కాకుత్థ్సం అనంతయ్య - జగిత్యాల మృతి 1997

2 జగిత్యాల శ్రీ వేణుగోపాల కృతి కదంబము 1989 సుందిళ్ల నారసింహ చతుశ్శతిని ఏనాడో రచించినా ముద్రించక 1 ధర్మపురి లక్ష్మీనృసింహ శతిగా 'ప్రార్థనాస్తబకము నాల్గు భాగముల మచ్చు పద్యముల కూర్చి చిన్నిపొత్తాన్ని అమూల్యంగా 1985లో ప్రచురించారు రెండవది పైకృతి 89 సం ప్రచురణ

కవిది ధర్మపురి జన్మస్థానం నివాసం జగిత్యాల - హిందీ పండితులుగా ప్రభుత్వోద్యోగం చేశారు తెలుగులో చక్కని ప్రజ్ఞ గలకవి వీరికి శేషప్ప బంధువు వీరిది కృష్ణ శతకకర్త నరసింహదాసు వంశం ఈ కవిత ఆనువంశికమైనా ఇది వీరి అనవరత సాధనాఫలితం వీరు ప్రబంధ పరమేశ్వరుడు-భక్త రామదాసు

సకలము నీవొసంగినదె, సందియమిందిసుమంతలేదు మే
మకట, రవంత యేనియు సమర్పణ సేయము, లోభముండి కో
రికలు మహోఘనంబులు, తరించు నుపాయము తోచెనొండు - మా
వికచ మనస్సుమంబు లరవింద దళేక్షణ! నీ కొసంగుటే - (సమర్పణం)
జయగీతి పాడవే మనసా జయగీతి నిలపాడవే
జయ గీతి నిలపాడి జగ్త్యాల శ్రీ యలర / జయహారతిన్నివ్వవే మనసా॥

కృతి సమర్పణ తర్వాత కావ్య అవతారిక మొదటి భాగం సీస పద్య శతకం (108 పద్యాలు) ద్వితీయ భాగం 41 శీర్షికలు, ఆలయ చరిత్ర, దేవస్థానాచార్య వంశ ప్రశంస, కృష్ణశతక కవి ప్రస్తావనాదుల మూడవ భాగంగా, 140 పుటల్లో ఈ కావ్యం ముద్రించబడింది పరితులకు అనేక శీర్షికలతో ఈ కృతి కదంబం కర్ణాటక కదంబ పాకంలాగుంటుంది కాని ఇందులో ఉంది తమిళ వైష్ణవభక్తి ఆంధ్రదేశ భాషా కవితాను రక్తి! ఏ పద్యం చూసినా పోతపోసిన సుందర సువర్ణ విగ్రహమే కావల్సింది చదివే నిగ్రహం చదివితే ఆనందో (ఆంధ్రో) బ్రహ్మ! అనంతశ్రీ కవి బ్రహ్మగా సాక్షాత్కరిస్తారు

స్వామీ ఈ కృతికన్యకు మీ భాషణ భూషణములను కూడా అందించండి - అని నన్ను కోరినారు హిందీ పండితుడు రచించిన ఈ తెనుగు కృతిని వెల్‌డన్ అని ఆంగ్లంలో శ్లాఘిస్తే సరిపోతుందా? ఏమో! విజ్ఞులు సరిపెట్టుకుంటారనే ఆశ స్వామి సుందర చైతన్యానంద ధవళేశ్వరం గారి ఈ పీఠిక మాటను పాఠకులూ అంగీకరిస్తారు కర్తృ పరిచయం ఋారుగుపల్లి నరహరి జగిత్యాల గారు సహజ సుందరంగా కావించారు శ్రీచిన జియ్యరు స్వామి గుంటూరు గారి ఆశీస్సులున్నవి

అనంత భక్తి పారవశ్యంతో ఆంధ్ర కవితా తపస్సుతో అనంతశ్రీ ప్రవహింజేసిన మధురభక్తి భావ కవితా గోదావరీ నదీ సుమధుర రసాన్ని మనమూ కొన్ని దోసిళ్ల త్రాగి ఆనందించవచ్చు

స్వాచార్య ప్రణుతి

తిరు మంత్రమ్ము ద్వయమ్ము, శ్రీచరమమున్ దివ్యోపదేశమ్ము స
త్సరణిన్ తిర్వడిగళ్లతో, నభయహస్తాశీర్వచస్సిద్ధితో
తిరుమంత్రార్థ విశిష్ట తత్త్వవిధులన్ తీర్థ ప్రసాదంబులన్
గరుణించెన్ నిజధర్మదీప్తి మదివెల్గన్, ముక్తినారాయణా

శ్రీహరి శరణాష్టకము నుండి సంస్కృతానువాదం

ఇహమున వేరు వేరుగ మహేశుడు సూర్యుడు శక్తి విఘ్నరా
జిహపర దైవముల్ యని వచింతురు కొందరదేమొ? కాని నీ
మహిమలవన్ని రూపముల మాకు స్ఫురించును సర్వధా మహా
మహుడవు, కావునన్, సకల మాన్యశరణ్యుడ వీవె శ్రీహరీ

ఇందులో విషయ సూచికతోపాటు పద్య ఛందో వివరముల సంఖ్య శీర్షికలు వాటిలోని పద్య సంఖ్య పేర్కొనబడినవి 'ఈ జిల్లా కవులు కొంక్రొత్త పోకడలకు దారులు చూపువారు అన్నాడు విశ్వనాథ సత్యనారాయణగారు సేనాపతి రామాచార్యగారి ఒకొనొక కృతి ముందుమాటలో 1950-60 మధ్య కరీంనగర్‌లో వెలువడిన మేడిచర్ల ఆంజనేయమూర్తి గారి చిత్రశ్రీ భారత కథలో, (కరుణశ్రీ గారి విజయశ్రీ వంటి కావ్యం) తీగెలు బల్బులు అని విషయసూచికను కావ్య శీర్షికలను విచిత్రంగా పేర్కొనటం జరిగింది డా సి నా రె మాకందాలు తెలుగు గజల్లు డా రావికంటి సంస్కృత ఛందాలను తెలుగులో నూతనంగా వ్రాశారు డా తిరుమలశ్రీ తెలుగు రుబాయతులు రాశారు

ఇందులో వేణుగోపాల ప్రార్థన నక్షత్రమాలిక (2 24) జగిత్యాల శ్రీ వేణుగోపాల సీసపద్య శతకము (28-108) ప్రత్యేక పద్యకృతులు -

భక్తమందార జగ్త్యాల పరమపురుష, పాహి శ్రీ వేణుగోపాల స్వామి పాహి మకుటం
సంపూర్ణ వైష్ణవ భక్తికల సరసాంధ్రకవి అనంతశ్రీ గారు

## 21 పాలెపు రాజేశ్వర శర్మ ఎం.ఏ , బి ఎస్సీ,, కోరుట్ల - జననం 30 మే 1960

రాజేశ్వర శర్మ గారు విద్యార్థి దశనుండి సాహిత్యాభిరుచి కలవారు బి ఎస్సీ చదివి గ్రామ పురోహితులుగా ఉంటూ తెలుగు పద్యకృతులు రెండు రచించి ప్రచురించిన తర్వాత తెలుగు ఐచ్ఛికంగా ఎం ఏ ఉత్తీర్ణులయ్యారు రాజేశ్వర శర్మగారి రచనలు

1 శ్రీ శంకర శతకము - 1982, 2 భావలహరి దేవి స్తుతి పద్య కావ్యం 1990

కావ్య పరిచయము 'భావలహరి' వంద పద్యాల దేవీ స్తోత్ర కావ్యం ఇందులో కథలేదు పద్యాలన్నీ శతకంలోవలె ముక్తకాలు వానికి మకుటం లేదు పైగా ఇందలి పద్యాలు మొదటి

ఏబది తరళాలు తర్వాతి ఏబది అశ్వగతి వృత్తాలు కాబట్టి ఇది శతక పద్య సీమితమైనప్పటికి శతకం కాదు స్తోత్ర కావ్యం

రాజేశ్వర కవి ఆరాధ్యదేవతకు పేరు లేదు 'ముగురమ్మలకు మూలపుటమ్మ ఆమెను దుర్గ కాళి అని కవి అనలేదు అంకిత పద్యాలైదింటిలో నామరహితంగా 'జనని తల్లి అని మాత్రమే సంబోధించారు స్తోత్ర పద్యాల్లో ఈశ్వరీ జగదీశ్వరీ మొదటి పుట సంబోధనల బట్టి పార్వతి అనుకుందామంటే, 10 11వ పుటల్లో శారదా, సరస్వతీ అని, 16, 17 పుటల్లో కమలా, సాగర రాజసుతా! అని కవి పేర్కొన్నారు అంటే ఆమె త్రిమాతలకు అతీతమైన మూల శక్తి స్వరూపిణి కవి వర్ణనలో ఈ దేవి త్రిమూర్తులకు శాసకురాలు ఆరాధ్య దేవత! ఇది 'ఆది పరాశక్తి' స్తుతి కావ్యం మచ్చుకు ఈ కావ్యం నుండి రెండు పద్యాలు -



జనని నీదర హాస కౌముది స్వాంత నీరధి సోకగా
ఘన తరమ్మగు భావవీచిక క్రమరీతి చెలంగి నీ
యనఘ పాద వితర్ది చేరువ యయ్యె, నట్టి తరంగమున్
మనగ నిమ్ము భవత్పదమ్ముల మక్కువన్ జగదీశ్వరీ
యోగివి నీవని యోగుల యోగము నీవనిత
ద్యోగుల బ్రోచెడి భారము నూనితి నీ వని నే
యోగ మెరుంగక బూనితి నుర్విని కావ్య కృతో
ద్యోగము కీర్తి కరమ్మగు యోగము హే కమలా - పు 16

ఎనమండుగురు పండిత కవుల పీఠికలతోపాటు, వైదిక బ్రాహ్మణ సంఘాధ్యక్షులైన బల్యపల్లి రాజగోపాల్ రావు మెటుపల్లి గారి శుభాకాంక్షలు, శ్రీ శంకరాచార్య శృంగేరి శారదా పీఠాధిపతి గారి ఆశీస్సులు ఈ పుస్తకానికి అలంకారాలుగా ఉన్నాయి

డా డింగరి రామాచార్య ఆంధ్రోపన్యాసకులు తమ "అభినందన"లో "సంకీర్తన ప్రక్రియలోనే కాక శతక ప్రక్రియలో ఆద్యుడై అన్నమాచార్య 'శ్రీ వేంకటేశ్వర శతకమును' రచించి తదనంతర కవులకు మార్గదర్శకుడైనాడు' అన్నారు అన్నమయ్య 15వ, శతాబ్ది వారు కాని 13వ శతాబ్దిలోని ప్రఖ్యాత శివకవి పాల్కురికి సోమనాథుని 'బసవేశ్వర శతకము' తెలుగులో మొదటిదని సాహితీ చరిత్ర కారులందరూ వాకృచ్చిన నిర్వివాదాంశం సోమనకు పూర్వపు యథావాక్కుల అన్నమయ్య 'సర్వేశ్వర శతకం' శతాధిక పద్య సంపుటి అంతకు మొదటి మల్లికార్జున పండితారాధ్యుల 'శివతత్త్వసారము' శతక సదృశ సహస్రపద్య కావ్యం అందలి 'శివా' మకుటకంద పద్యాలే కొన్ని శతకాలవుతాయి శతకం పుట్టుకకు వ్యాప్తికి కారణమైన వారు శివకవులనేది చారిత్రక సత్యం బుద్ధిపూర్వకంగానో అనాలోచితంగానో అనంతకాలపు వైష్ణవ కవిని తెలుగులో శతక రచనకు ఆద్యులని రామాచార్యులు అనటం అసంగతం చరిత్రను వక్రీకరించుట భావ్యం కాదు కదా!

కవి ఈ కావ్యంలో "ప్రతి పద్యం ఏదో ఒక విశిష్టత కలిగి ఉండాలనే ప్రయత్నం చేసినాడు" అని కంజెర్ల రామాచార్య, ఎం ఏ సంస్కృతాంధ్రోభయ భాషల కవి గోవిందారం గారు 'సాహితీ స్పందన'లో వెలిబుచ్చిన అభిప్రాయము చాలా వరకు యధార్థం రాజేశ్వర శర్మ గారి మొదటి కృతి శతకం రెండవది స్తోత్రం మూడవ కథా కావ్యం "ఆదిశంకరాచార్య జీవిత చరిత్ర' రచనలో ఉంది

## 22 కె రామునాథాచార్య, బి ఓ ఎల్ తడకొండ, జన్మతేది 31-8-1965

కల్వకుంట రఘునాథాచార్యుల స్వగ్రామం గంగాధర మండలంలోని తడగొండ కరీంనగర్‌లో ప్రైవేట్ ఉన్నత పాఠశాలలో తెలుగు పండితులుగా ఉద్యోగం చేస్తూ రఘునాథా చార్యులు సాహితీ వ్యాసంగం సత్కాలక్షేప సాధనంగా స్వీకరించారు ఈకవి పద్య గేయ రచనలో సిద్ధహస్తులు వీరిది వచన కవిత నుండి పద్యరచనకు మారిన అరుదైన విధానం ఈ కవి రచనలు ముద్రితములివి -

1 మనసానంద మంగళ హారతులు - 1950, 2 విజృంభణ వచన కవితా సంపుటి - 1984 3 శ్రీ శ్రీనివాసోదాహరణము - 1990, 4 సుప్రభాతం గేయ కావ్యం 1992

అముద్రిత రచనలు మరి నాలుగు వీరి ఉదాహరణ కావ్యం చివర ఉదాహరించబడ్డవి

కావ్య పరిచయం - రఘునాథా చార్యుల పద్యశైలి పురాణ కావ్యకవుల రీతిలోనిది మన సాహిత్యంలో ఉదాహరణ వాఙ్మయం అరుదైన పూర్వయుగ స్తుతికవితా ప్రక్రియ శివకవులు ముఖ్యంగా పాల్కురికి సోమనకాలంనుండి ఇది వ్యాప్తిలోనికి వచ్చింది ఆ తర్వాత వైష్ణవ భక్తకవులు కూడా కొన్ని ఉదాహరణ స్తుతి ప్రబంధాలు రచించారు వచన - గేయకవితల వ్యాప్తి కల ఈ కాలంలో కవి ఈ పద్య కవిత వ్రాయడమేమిటి? అనే వారికి కవి జవాబు ఈ కావ్యం 'తొలిపలుకు'లోనే లభిస్తుంది 'ఈనాటి సమాజంలో పద్యాలు వ్రాసే వాళ్ల సంఖ్య చాలా తక్కువనే చెప్పవచ్చు ఇలా ఒకటో రెండో తరాలు పోతే మన ప్రాచీన కవిత్వం కేవలం మ్యూజియాలలో పెట్టుకోవడానికి ఉపయోగ పడుతుంది అలా కాకూడదు అందుకే కొందరిలోనైనా పద్య కవిత్వంపై అభిమానం కల్గించటానికే నేను ఈ మార్గాన్ని ఎంచుకున్నాను ' అన్నారు ఇది మంచి పనే కాని, పద్య కవితా ప్రీతితోనా, లేకపోతే భక్తి భావాల వ్యాప్తికోసమా? కవి ఈ రచన చేసింది జాషువా వంటి కవులు పద్యకవితనే అభిమానించినా స్తుతి ప్రబంధాలు రచించలేదు కదా! ఈ కవిగారి పద్య కవితా సక్తికి మతం ఆలంబనంగా ఉంది అనేది స్పష్టం అది తప్పుకాదు అభిరుచిని పట్టి ఆచరణలు

ఉదాహరణ ప్రబంధంలో మార్గ కవిత్వపు పద్యాలు, దేశి కవితా రూపాలైన కళికోత్కళికలు ఉంటాయి ఒక్కొక విభక్తికి ఒక స్తుతి పద్యం వ్రాసి ప్రతి పద్యం వెంట ఒక కళిక మరో ఉత్కళిక కూర్చి, అష్ట దళాల చివర సాప్తవిభక్తిక స్తుతి పద్యం రచించి, చివరన కవి నామాంకిత పద్యం చేరిస్తే అది ఉదాహరణ కావ్యం రఘునాథాచార్యుల రచన సలక్షణమైనది కృత్యాది ప్రథమ దళ పద్యం

శ్రీకరుడున్ షుభంకరుడు చిన్మయ రూపుడు భక్తలోకర
క్షాకరుడున్ యశోధరు డఖండుడు సద్గుణ సంవిధానుడున్
నాక నివాస వంద్యుడఘనాశను డుజ్జ్వల భూషణుండు సు
శ్లోకుడు శ్రీనివాసుడు యశోన్నతి గూర్చుచు మమ్ము బ్రోచుతన్



కళిక వృషభ శైలమునందు వెలసిన విహిత కలియుగ కల్ప భూజము
వృషభ వాహనుడాది ప్రముఖుల వినుతులను చేకొన్న తేజము

సప్తమదళ ఉత్కళిక

క్రమునందు - నమ్రునందు, నిర్మలాత్మ చర్మనందు
సత్యునందు-నిత్యునందు, శిష్టగుణ వి-శిష్టునందు

ఉదాహరణ కృతిలో కేవలం తొమ్మిది పద్యాలు పద్నాలుగు గేయాలుంటాయి ఈ చిరుకావ్యానికి

కృతిసతి చకిలం అగయ్య కరీంనగర్ గారిని కవి ఇరవై మూడు పద్యాల్లో ప్రబంధ శైలిలో చక్కగా వర్ణించారు వ ాన్యులతోనే కదా కావ్య వ్యాప్తి కవికి తృప్తి

ఈ జిల్లాలో ఈ శతాబ్దలో గంగారాజేశ్వర రావు గారు తమ పరీక్షిచ్చరితము' 1987 కావ్యానికి షష్ట్యంతాలతో కాక ఒక ప్రత్యేక ఉదాహరణ రమ్య ప్రబంధం విష్ణుమూర్తి పేరనే విరచించారు అందులో సంబోధనా - ప్రథమా విభక్తితో అష్టమదళం కూడా ఉంది కవి గణపతి రామచంద్రరావుగారు 'అభినవ పోతన' వానమామలై వరదాచార్యుల ప్రశంసగా మరో ఉదాహరణాన్ని రచించారు గట్టు గణపతిగారు' లక్ష్మి వేంకటేశ్వరోదాహరణం, (అముద్రితం) రచించినట్లు తెలిపారు

డా సి నారాయణరెడ్డి గారు అన్నట్లు "రఘునాథాచార్యులు ఉభయ ఛందోరీతుల్లో చేయిదిరిగిన కవి వేముగంటి నరసింహాచార్యులు అభిప్రాయ పడినట్లు ఇది "చక్కని భక్తిరస భరిత కృతి" రఘునాథాచార్యులు ఇంతవరకు వేరే పద్య కావ్యాలు వ్రాయకున్నా వీరి వివిధ పద్యఖండికలు పలు సాహిత్య సంచికల్లో వచ్చాయి

మంచు ముత్తెముల హేమంతమ్ము పాడెడు చలిపాట స్వాగతమ్ములను వినుచు - అని 'సంక్రాంతి ని 'స్రవంతి'లో ఆహ్వానించారు [1] కవి 'స్వాకాంక్ష' ఇది -

భారత స్వర్ణ సౌధపు కవాటములం బెకిలించి శాంతికే
దారములందు స్వగ్రస హృదమ్ముల బారగ జేసి భీకరా
కారముదాల్చిమానవుల కమ్మని జీవితముల్గ్రసించు హిం
సారజనీ చరులందునుము క్షత్రియ పౌరులు నేడుగావలెన్ [2]

భక్తి స్తోత్రాలేకాదు ప్రకృతి వర్ణనలు సామాజిక విషయాలు చక్కగా వ్రాయగల సత్తా ఉన్న పద్యకవి కె రఘునాథాచార్యులు

## 23 నేరెళ్ళ శ్రీనివాసాచార్య, బి ఏ ఎల్ ధర్మపురి, జ 13-2-1966

ధర్మపురి వాస్తవ్యులు స్థానిక వేంకటేశ్వరాలయార్చకులు అయిన నేరెళ్ళ శ్రీనివాసాచార్యులు సంస్కృత భాషలో పట్టభద్రులై పుర్వాంధ్ర సాహిత్యాభిమానంతో పద్య కవితా సాధన చేస్తున్నారు వీరి రచనలు - శ్రీవాణీవైభవము 1992 ముద్రణ, శేషప్ప చరిత్రము, శ్రీ తిరుపతి వేంకటేశ్వర స్వామీ శతకము అముద్రితములు ఈ మధ్య (1997) వీరి నృసింహస్తుతి గేయాల క్యాసెట్టు వెలువడింది

కావ్య విశేషాలు శ్రీవాణీ వైభవం స్తుతి కావ్యం దీనిని శేషప్ప సాహిత్య మిత్ర మండలి ధర్మపురి వారు ముద్రించారు ఇది పన్నెండు పుటల చిరుపొత్తం పద్య సంఖ్య లేదు దాదాపు నలభై పద్యాలుంటాయి సంప్రదాయ రీతిలో సాగిన ఈ కవన విన్యాసంతో కవి సంస్కృత భాషా పాండిత్యాన్ని కాక తెలుగు పలుకు ప్రీతినే ప్రదర్శించారు అందలి ఒక పద్యం - 5వ, పుట నుండి

బంగారు హారాలు సింగార మొలికించు, నీ కంఠమందు నేనిడగ లేను,
రంగారు వన్నెల తొంగారు నీలేత, నడుము కొడ్యాణమ్ము దొడుగలేను

---

1 'స్రవంతి సాహిత్య మాసపత్రిక - జనవరి, 1992 ద భా హిందీ ప్రచార సభ-హైదరాబాద్ పు 30

2 శ్రీముఖి ప్రథమ సంచిక మే 93 తె పం శిక్షణ కళాశాల, ఆంధ్ర సారస్వత పరిషత్ - హైద్రాబాద్ పు 3

పొంగారు నీమేని సొంపులకింపారు పట్టువస్త్రము నేను చుట్టలేను
చెంగారు కెంజాయ జేపెట్టు నీనును కాళ్ళకు గజ్జెలుకట్టలేను
ఏది యిచ్చెద నన్నను నేది సాధ్వి లేదు నా కడ సంపద నీదు మెడన
భక్తితో వేతు వాక్పుష్ప భవ్యమాల, నందు కోతల్లి భారతీ! అధిక ప్రీతి
అది కవిభక్తి ఆకాంక్ష ఇది!
జన్మ జన్మల కైనను చల్లనైన తెలివి నిచ్చునీ నామంబు తలచు భాగ్య
మంద జేయుము భారతీమాత! నాకు బహుళ భాషాక లావణ్య పదమయూఖ! పు 9

ఈ కవికి శారదా భక్తికి తోడు నూతన పదప్రయోగాసక్తి ఉంది డా సి నారాయణరెడ్డి గారు ఈ కావ్య పీఠికలో అభిప్రాయపడినట్లుగా ఇది కవి ఆరంభరచన కృషి పట్టుదల కల ఈ కవి కుమారుని రసరమ్య పద్యకావ్యాలు ఆంధ్రసాహిత్య రంగాన్ని అలంకరించగలవని ఆశించవచ్చు

**24 డా అనుమాండ్ల భూమయ్య, ఎం ఏ ఎం ఫిల్ పిహెచ్ డి వెదురుగట్ట జ 19-9-1951**

డా అనుమాన్ల భూమయ్యగారు కాకతీయ విశ్వవిద్యాలయంలో తెలుగు ప్రొఫెసర్ వీరు ఎం ఫిల్, పిహెచ్ డి పరిశోధన గ్రంథాలు రెండు కాక మరో నాలుగు సాహిత్య విశ్లేషణ వ్యాస గ్రంథాలు వెలువరించారు - 1984 నుండి 92 వరకు వాటికి భిన్నంగా విచిత్రంగా భక్తిభావ పద్యకృతులు 1994, 95లో వరుసగా రెండు వచ్చాయి అవి 1 వేయినదుల వెలుగు, 2 వెలుగు నగల హంస దేవి స్తుత్యాత్మకాలైన ఈ రెండు కావ్యాలు తేటగీతి ఆటవెలది పద్యాల్లో విరచితాలు

ప్రతి కృతీ సుమారు 250 పద్యాలు కలది (సంఖ్య వేయలేదు) రెంటిలోనూ వర్ణ్యవస్తువొకటే కథనమేవేరు 'వేయినదుల వెలుగులో ప్రధానంగా స్తోత్ర సాహిత్యానికి ఆకృష్టుడైన కవి వెలుగు నగల హంసలో వైదిక సాహిత్యానికి ఆకర్షితుడైన కవి కనపడతాడు ఇది కచ్చితమైన ఎదుగుదల' ' రామబ్రహ్మంగారి అభిప్రాయం రెండవ కావ్య పీఠిక చంక్రమణం"లో కవి తనను గూర్చి



ఒక పదము తల్లి, తండ్రివేరొక్క పదము,
వారి అక్షరమౌ ప్రేమ ఫలితమేమొ,
నేను సంధి రూపముగ జన్మించినాను,
దేవి! నీ హాసమును సమృద్ధిగవహించి
ఆ దేవి
సూర్యచంద్రులతో నీవు చూచెదీవు (?)
వేదముల నోళ్ళతోడ దీవించె దీవు
విశ్వహృదయమ్ముతో బాధవినెద వీవు
దేవలోకమ్మె శిరసైన దేవి! నతులు,

కవి నిరాయాసంగా తమ భావ ప్రకటనను ఛందోబంధాల్లోనే స్వేచ్ఛగా ఎలా వెలువరించారో ఈ క్రింది పద్యాన్ని చదివితే తెలిసిపోతుంది

చెట్టునెక్కితి కనరావు, గుట్ట నెక్కి - తి, కనరావు, శాస్త్రములను తిరుగవేసి
తి, కనరావు, స్తోత్రముల నుతించితి కన రావు, అమ్మా! యంటిని కంటి దేవి! నిన్ను,

ఎంతో సాధన ఉంటే తప్ప వ్యర్థపదరహితంగా ఇంత చక్కని పద్య రచన సాధ్యం కాదు 'కంటి దేవి'లో శ్లేష ఉందేమో -

(డా నండూరి రామకృష్ణమాచార్యుల 'పన్నీటి జల్లు' పద్యాలు దశాబ్దాల క్రితమే ఇలా వచ్చాయి లౌకిక భావాలతో కవి సమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారు తమ గిరికుమారుని ప్రేమ గీతాల'లో పద్య పాదాలు, పాద భాగాలు రిక్తంగా వదలి నూత్న విన్యాసం చూపారు మంథని వేంకటరాజన్న అవధాని గారు తమ తేట గీతాలను వచనకవితలుగా వ్రాసిన వైనాన్ని ఇదే గ్రంథంలో ఈ శతాబ్ది పద్య కవుల విభాగంలో చూడవచ్చు అదే విధంగా 'వెంపో' గారు 'అధిక్షేపణ'లో కందాలను వచన కవితలుగానే రాశారు ఛందో విధేయ పద్యాల పాదాల మధ్య పద విసంధులు కరుణశ్రీ, జె బాపురెడ్డి గారల కవ్యాల్లోనూ చూడవచ్చు కవులు నిరంకుశులు, పాతలోనే కొత్తను వెదికే ప్రయత్నాలు సాగిస్తూ సాధిస్తూనే ఉంటారు!)

డా వి భూమయ్యగారి 'వేయినదుల వెలుగు' కావ్యానికి తెలుగు విశ్వవిద్యాలయం వారి ఉత్తమ పద్యకావ్య పురస్కారం లభించింది ఇది వచన కవితా యుగం - మతాతీత మానవతా సమతా మార్గం అని విద్వల్లోకం కవి పండితులు విప్లవ బావుటాలెగురవేస్తున్నారు - బాకా లూదుతున్నారు అయినా స్థిర సంకల్పం కల కవులకు అవి ప్రతిబంధకాలు కావు కదా! అభిరుచుల అనుభుతులు అనేక రకాలు

డా భూమయ్యగారు భక్తి తాదాత్మ్యంతో ఈ పద్య కృతులు రచించారు సంప్రదాయ పండిత లోకంతో సెభాసనిపించుకొన్నారు ఆత్మనివేదన రూపంలోనైనా స్వార్థ ధూర్త కుయుక్తి వరులకు చురకలంటించారు తమ ఆరాధనా కార్య వైఫల్య సాఫల్యాలను సరసంగా వర్ణించుకున్నారు తాము అర్చారూపవిగ్రహంగా ఆ దేవిని స్తుతించినా - ఆమె యోగమాయగా - ముక్తి కాంతగా కవి వర్ణనలతో స్పష్టమౌతున్నది ఈ కవి సంప్రదాయ సాత్త్విక వైదిక సాహిత్య పథయాత్రికులు వీరు ఈ కరీంనగర్ జిల్లా చివరితరం సంప్రదాయ కవుల్లో విద్వద్వరేణ్యులు మాన్యులు!

పద్యమే మావియైదేవి! బ్రతుకు గనగ, కోకిలలు వచ్చి పాటలు గ్రుమ్మరించె,
చిలుకలిటె వచ్చి ఫలముల పలుకరించె పథికుడొకరసానందుడై పరిమళించె!
ఆ పథికుడు మరెవరో కాదు ఈ కవిగారే!

## 25 ఎరబాటి బాపురావు - గంగారం, మం కాల్వ శ్రీరాంపురం

బాపురావుగారు 1923 రుధిరోద్గారిలో పెద్దపల్లి తాలూకాలోని మంగపేటలో జన్మించారు మంథనిలో మాధ్యమిక విద్య ముగించి హైదరాబాద్‌లో 1944లో హెచ్ ఎస్ సి లో ఉత్తీర్ణులయ్యారు ఉద్యోగం చేయక వ్యవసాయం వృత్తిగా సొంత భూములున్న గంగారంలో నివసిస్తున్నారు 1942 క్విట్ ఇండియా స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొన్నారు అనంతరం 48-62 మధ్య కాలంలో తాలుకా కాంగ్రెస్ కార్యదర్శిగా పనిచేశారు

అది ఉర్దూ మీడియంలో విద్యాబోధన కావించే కాలమైనా తెలుగు భాషపై అభిమానముండేది మంథని కవి పండితుల సాహచర్యం బాపురావు గారిలోని కవిని మేల్కొల్పింది మద్దూరి సత్యనారాయణ మూర్తిగారు మంథనిలో వీరికి 'భగవద్గీత' ఆంధ్రానువాదానికి ప్రేరణ కల్పించిన విద్యా గురువు వీరి వరుస అన్న ఉమాపతిరావు, వేంకట రాజన్న అవధానిగారలు సహకరించారు ఒకటిన్నర అధ్యాయాలు అనువదించి వదలివేసిన ఆ రచనను 40 ఏండ్ల తర్వాత ఈ జిల్లా వాస్తవ్యులు ప్రముఖ సంస్కృత కవి అయిన శ్రీభాష్యం విజయసారథిగారి ప్రోత్సాహంతో (1983

నుండి) తిరిగి ఆరంభించి - పూర్తి చేసి శ్రీమద్భగవద్గీత పద్య కావ్యము అనే పేరుతో 1995లో ముద్రించారు దీనికి విజయసారధి గారితో పాటు వానమామలై జగన్నాధాచార్యులు, ఆచార్య పేర్వారం జగన్నాధం ప్రభృతుల ప్రశంసా పీఠికలున్నవి

మహాకావ్య కవి గంగా రాజేశ్వరరావుగారు ఇలా మెచ్చుకున్నారు

కవియ తా వినిపించె షట్క ప్రధమము
మిగుల షట్క ద్వయంబు నే మిగుల శ్రద్ధ
జదివితిని మహాత్మ్యము గూడ వదలకుండ,
వార్ధకపు శక్తి హీనత వదలి చనియె

ఈ అనువాదంలో పదిరకాల ప్రముఖ పద్యాలు వాడబడినవి సాధారణంగా శ్లోకానికి ఒక పద్యం చొప్పున రచించినా కొన్ని పద్యాల్లో రెండు మూడు మూల శ్లోకాల భావాలు కూడా సంగ్రహించి కూర్చబడ్డాయి అందుకే నేమో కవి దీన్ని సమగ్ర స్వేచ్ఛానువాదము అని గ్రంధ ముఖ పత్రం మీద స్పష్టంగా పేర్కొన్నారు

వాసాంసి జీర్ణాని (2 2) శ్లోక అనువాద పద్యం ఇది

ఆ వె పాత బట్ట విడిచి వైచి వినూతన, వస్త్ర ధారణమున ప్రముదమందు
కరణి ముదిసినట్టి కాయంబు విడనాడి క్రొత్త దేహమాత్మ గొనుచునుండు

క్లిష్ట భావ వివరణకూడ ఎంత స్పష్టంగా రాశారో చూడండి

గీ ప్రకృతి యందున్న పురుషుడు, ప్రకృతి జన్య మైన గుణ సంగుడై తాను మంచి చెడ్డ
జన్మలెత్తుచు ప్రకృతి సంజనిత గుణము, అనుభ వించుచునున్నవాడవనియందు శ్లో 13 21

గీతా మాహాత్మ్య పద్యం

తొలిపుట్టువు పాపంబులు, మలి పుట్టువునందు గుడుచు మనుజుడు వానిన్
దొలగించు కొనగ గీతను, చెలియా చదువంగ వలయు చిత్తము నిలువన్ - 3

భారతాంధ్రీకరణములో తిక్కన వదలివేసిన (అది ఎందుకనేది వేరే విషయం) ఉపనిషత్సం హితయైన గీతను అనువదించి జనులకందించి పాపకార్య మగ్నులను సన్మార్గ గాముల చేయుటకు సంకల్పించి, ఈ అనువాదం కావించి ప్రచురించిన భక్త కవి ఎరబాటి బాపురావుగారు

## శతక సాహిత్యం

తెలుగులో ఏ సాహితీ ప్రక్రియకు లభించని ఆదరణ వ్యాప్తి పద్యశతకాలకు లభించింది కరీంనగర్ జిల్లాలోనూ శతాధిక శతకాలు వెలువడ్డాయి 13-19 శతాబ్దాల మధ్య ఈ జిల్లా శతకాలు పదికి మించవు ఈ ఇరువదవ శతాబ్దిలో వీటి సంఖ్య విపరీతంగా పెరిగింది ఇంచుమించు ఓ వంద శతకాలు వచ్చాయి ఇంకా శతక రచన కావిస్తున్న వాళ్లున్నారు పాతవో కొత్తవో ఇప్పటికీ అప్పుడప్పుడు శతకాలు ముద్రణ పొందుతూనే ఉన్నవి శతకాల కవుల సంక్షిప్త పరిచయం ఈ విభాగంలో చేయబడుతున్నది

పూర్వయుగం - క్రీ శ 1300-1900 వరకు

1 శరభాంక కవి 14వ, శతాబ్ది వేములవాడ 1 శరభాంకలింగ శతకము
2 వెలిగందల నారయ - 15వ శతాబ్ది, వెలిగందుల 1 నారాయణ శతకము
3 శేషాచలదాసు శేషప్ప 17వ శతాబ్ది, ధర్మపురి 1 నరసింహ 2 నరహరి 3 నృకేసరి శతకములు
4 కాకుత్థం నరసింహదాసు 19 శతాబ్ది ధర్మపురి, 1 శ్రీకృష్ణ శతకము

5 పరవస్తు మునినాథకవి 19వ శతాబ్ది, కేశవపట్టణము 1 లలితా, 2 లక్ష్మి, 3 పరవస్తు శతకాలు

6 జైశెట్టి రాజయ్య - 19వ శతాబ్ది, జగిత్యాల - 1 శ్రీ రాజరాజేశ్వర శతకము

ఈ పది శతకాలు ఈ శతాబ్దికి పూర్వకాలానివి అవన్నీ ముద్రితాలు వాటి పరిచయం ఇంతకుముందు చేయబడింది

## ఇరువదవశతాబ్ది పూర్వార్ధ (1901-1950) శతకాలు

7 ముడుంబ రామానుజా చార్యులు - అంబాల, గో క సం కవి

1 శ్రీ వేంకటేశ్వర శతకము - అలభ్యం

8 అచ్యుత రాజు - బండలింగాపురం, గో క సం కవి

1 బంధ గర్భ పద్య శతకం, 2 అనంత శతకం - ముద్రితాలు అయినా అలభ్యాలు

9 పరమారాధ్యుల రాజయ్య - చెలుపూరు,

1 కంచి కామాక్షి, 2 చంద్రశేఖర శతకాలు - 1926

10 రామసింహ కవి - రాఘవపట్టణం గో క సం కవి

1 విశ్వకర్మ శతకము 1927, 2 విశ్వకర్మ శతక మండనము 1928

3 శ్రీరామ లక్ష్మణ ప్రబోధము - ముద్రితం

11 అనంతవరం సిద్దప్ప గుండారెడ్డిపల్లి, గో క సం కవి

1 జ్ఞానబోధిని (పద్య), 2 జగదీశ్వర (గేయ) శతకాలు - ముద్రితం

12 నీలకంఠం లక్ష్మణరాజు - నాచుపల్లి, 1 నిరోష్ఠ్య శతకము - పేరు తెలియలేదు

13 దివిలె భట్టు నరసింహరాజు - శనిగరం, 1 సుందరగిరి వేంకటేశ్వర శతకము 1929

14 ఎదులాపురం బ్రహ్మానంద వేంకట నరసింహాచార్యులు - మొగిలిపాలెం,

1 కంచి కామాక్షి శతకము 1931

15 చిలుకమర్రి వేంకట నృసింహాచార్యులు - మక్తా నారాయణపురం

1 వేణుగోపాల శతకము అముద్రితం - అలభ్యం గో క సం కవి

16 ఐలినేని గోపాలరావు - మోడెపల్లి గో క సం కవి

1 శ్రీరామ, 2 రామ రాఘవ శతకాలు - ముద్రితం

17 చక్రవర్తి నరసింహరాజు - సిరిసిల్ల, 1 సిరిశాల శతకము - ముద్రితం, అలభ్యం

18 గొట్టిముక్కుల రాధాకృష్ణరావు బుట్టారెడ్డిగూడెం, గో క సం కవి

1 రంగనాయక శతకము, 2 శ్రీశైల మల్లేశ్వరతారావళి

19 టి కృష్ణశాస్త్రి - పదిరె గో క సం కవి 1 శ్రీరామచంద్ర (అముద్రితం - అలభ్యం)

20 డింగరి నరసింహాచార్యులు - మల్లాపురం సిరిసిల్ల,

1 నామపలి నృకేసరి శతకము - అముద్రితం డా॥ డింగరి నరహరి ఆచార్య గారి తండ్రి గారైన డి నరసింహాచార్యులు 1965 సుమారుగా కీర్తిశేషులు వీరి అముద్రిత విష్ణుభక్తి శతకం పైది వేములవాడ సమీపంలోని నాంపల్లి నరసింహ దైవంపై వ్రాయబడింది మచ్చుకు అందులోని ఒక పద్యం

సార విచార ఘోర భవ సాగర బంధ విదూర ధీర దు
ర్వార సురారి గర్వవినివారణ శూర రమా విహార శృం

గార శరీర ప్రోజ్వలిత కౌస్తుభహార గభీర భక్త మం
దార వికార దూర దయదల్చుము నామపలీ నృకేసరీ!

21 శతావధాని ఎస్ కృష్ణమాచార్య కోరుట్ల, 1 శతవిధబంధ కవిత్వ శతకం (ము 97)
2 గీతాచార్య మత ప్రభావశతకము ముద్రితం 1940 అలభ్యం 3 గాంధీ తాత నీతి శతకము 1972
22 జంగిడి నారాయణ జమ్మికుంట, 1 చిదానంద శతకము - 1949 ముద్రితం
23 ఆధి నరసింహాచార్యులు - అవునూరు గో క సం కవి
1 గోపురీశ్వర శతకము అముద్రితం
24 మామిడిపల్లి సాంబశివ శర్మ వేములవాడ, 1 మాదేవర శతకము - 1949
25 మందా రాజయ్య కిషన్‌దాసు ఎల్లారెడ్డిపేట, 1 శ్రీరాజరాజేశ్వర శతకము
2 సత్యశ్రీ ఖండకావ్యము ఈ కవి పుస్తకాలు రెండు ముద్రితాలు - అలభ్యాలు
26 ఆధి రాఘవాచార్య అవునూరు, గో క సం కవి 1 ఆధ్యాత్మ తారావళి అముద్రితం
27 పులికాంత గంగాధరయ్య కథలాపురం, వీరు యక్షగాన కవి
1 శంభో 2 రమేశ శతకాలు - అముద్రితములు
28 మూర్తి రాజు - గట్టెపల్లి, వీరు యక్షగాన కవి గ సత్యనారాయణరాజు గారి జనకులు
1 చెన్నకేశవ శతకము - అముద్రితం అలభ్యం

ఈ శతాబ్ది పూర్వార్ధంలో ఓ ఇరవై మంది కవులు ముప్పై శతకాల వరకు రచించారు వాటిలో అధిక భాగం అముద్రితాలు అలభ్యాలు

## ఇరువదవ శతాబ్ది ఉత్తరార్ధ (1951975) శతకాలు

29 ఎర్రోజు బ్రహ్మయ్య - పెద్దకలువల, 1 మహాదేవి శతకము - 1955, 85 మ
ఇది సీసపద్య శతకం కవి గారు పుట్టంధులు సరళమైన భాషలో, భక్తి భావాలలో ఈ శతకాన్ని రచించారు కవి పరిచయం పద్య కావ్యకవుల్లో చేయబడింది

## 30 'కలన' కనపర్తి లక్ష్మీనరసయ్య - సిరిసిల్ల (హన్మాజిపేట)

'వాస్తవాలు' - 1958 కనపర్తి గృహనామంతో కవిగా వ్యాప్తిలో ఉన్న లక్ష్మినరసయ్యగారు డా సి నా రె గారి స్వగ్రామమైన హన్మాజిపేట వాస్తవ్యులు పద్య గేయ రచనలో సిద్ధహస్తులైన క ల న ఈ 'వస్తవాలు' కృతి తర్వాత గేయరచననే చేపట్టారు ఇది విమర్శనాత్మక శతకం

1 యుద్ధమన్న భయము యుద్ధమన్న క్షయము, యుద్ధకాంక్ష హీన బుద్ధి బుట్టు
యుద్ధమన్నను నవ యుగ నాశనమ్మెయౌ, యుద్ధమన్న తలపువలదు కలన 83

2 దైవ సృష్టి కల్ల దైవ భావము కల్ల, సృష్టి సేత కల్ల స్రష్ట కల్ల
మనుషులూహాజేసి మలచిన వివియెల్ల, క్రమముగాను వ్రేళ్ళు బ్రాకె కలన 58

విశ్వ మానవతావాద శాంతి భావాలు గల ఈ నాస్తిక భావ శతకంలో సంప్రదాయబద్ధంగా 116 పద్యాలుండడం ఓ విశేషం! ప్రముఖ నాస్తికులు లవణం విజయవాడ గారు ఈ కృతికి పీఠిక వ్రాశారు

## 31 ఆత్మానందస్వామి - మొగులుపాలెం

శ్రీవీరభోగవసంతరాయ శతకము - 1959 లో అచ్చయింది
ఈ భక్తి శతకాన్ని రామసింహకవి సవరించారు ధూళిపాల శ్రీరామమూర్తి గారు పీఠిక వ్రాశారు

## 32 కవి గణపతి రామచంద్ర రావు - ఇబ్రహీంపట్టణం

రామచంద్రరావు జన్మసంవత్సరం 1940 రావుగారు ప్రౌఢకవి వీరి ముద్రిత శతకాలు మూడు

1 శ్రీనివాసార్థ శతకము 1963, 2 శ్రీ సంతోషిమాత శతకము - 1990, 3 శ్రీమద్వానమామలై వరదాచార్యోదాహరణము - 1993, 4 శ్రీ ఇందు పురీశ్వర వేంకటేశ్వర శతకము - 1990



మొదటి అర్థ శతకంలోని 50 పద్యాల్లో ఎనిమిదవది చూడండి

పూదేనె జిలికించు పుష్పమై నీవున్న భృంగమైనేనింక జంగలేతు
పక్వమైన రసాల ఫలమవై నీవున్న, గండు పికమ్మనైగారవింతు
విమలంపు సరసిలో గమలమై నీవున్న, రవిగ జుంబింతు నీ రాజితాంఘ్రి
మెఱసెడు తారవై మింటిలో నీవున్న శశి సమాఖ్యుండనై సాగివత్తు
మోహినీరూప! నీరూపమోహ మందు, జిక్కితిని రాగదే స్వామి యొక్కసారి,
మదన కోటి ప్రకాశ నిర్మల నివాస, శిష్ట హృద్వాస జగదీశ శ్రీనివాస!

మొదటి శ్రీనివాసార్థ శతకం నిర్మల వారు 1973లో ప్రచురిస్తే వీరి రెండవ కృతి శ్రీ సంతోషిమాత శతకాన్ని 1990లో నిజామాబాద్ వారు వెలువరించారు ఈ కవి రచన మీద చూపిన శ్రద్ధ ముద్రణ మీద చూపకపోవడం అందుకు కారణం ఈ మధ్య కేరళ నుండి అయ్యప్ప, మహారాష్ట్ర నుండి సాయిబాబా, సంతోషిమాత, ఆంధ్రప్రదేశ్ భక్తుల అభిమానాలు చూరగొంటున్నారు అందులో అయ్యప్ప పురుషులదైవం అయినట్లే సంతోషిమాత కేవలం స్త్రీల దేవత!

ఇంతవరకు శతకాలకు కవులు ఎవరూ చేపట్టని ద్విపద ఛందస్సును స్వీకరించి స్త్రీలకు గానయోగ్యంగా ఈ 'సంతోషిమాత' శతకాన్ని కవి రచించడం విశేషం తేట గీతులుగా కన్పించే ఈ శతకం ద్విపదలు చతుష్పాద పద్యాలు మొదటిదిది

శ్రీ జగజ్జననివి చిద్విలాసినివి, సూత ప్రసూతవు, సుపథగామినివి,
నిన్ను నమ్మితినమ్మ నన్నేలు మమ్మ! శ్రీద సంతోష రూపాదేవి మాత!

కవి సాంప్రదాయ ధర్మప్రీతి, వర్ణాశ్రమ ధర్మనిరతితో స్వేచ్ఛగా వ్యావహారిక-మాండలిక పదాల ప్రయోగించారు సకల దేవతామూర్తుల మూల రూపంగా సమైక్యావతారంగా 'సంతోషమాత'ను పొగిడారు

మూడవ శతకం "ఇందు పురీశ్వరవేంకటేశ్వరా" - మకుటంతో చంపకోత్పలాలలో వ్రాసినది

కరీంనగర్ జిల్లా మెట్‌పల్లి తాలూకాలోని ఇబ్రాహీంపట్టం వారైన కవిగణపతి రామచంద్రరావు గారు చదివినది మెట్రిక్ వరకు నిరంతర సాహితీ వ్యాసంగంతో విద్వత్కవితా మండితులై ఈ జిల్లాలోనే కాక మెదక్, నిజామాబాద్, ఆదిలాబాద్ జిల్లాల్లోనూ ప్రముఖ కవి పండితుల ప్రశంసలందుకున్నారు వీరి అముద్రిత శతకాలు ఓ పది ఉన్నాయి కవి గణపతి గారు ప్రౌఢకవి చిత్రకవితా విశారదులు

## 33. కలకుంట కృష్ణమాచార్యులు ఎం ఏ , విద్వాన్ - పూడూరు (మెట్టుపల్లి)

1 రంగనాథ శతకము 1965, 66, 2 అంజనేయ శతకము - 1969,
3 నల్లగొండ శ్రీనరసింహస్తవము ము, 4 శ్రీచౌడేశ్వరీ స్తోత్రము 1985
4 శ్రీవాసర సరస్వతీ గద్యమ్ 1996 6 శ్రీకృష్ణ త్రిశతి - 1996

మెట్‌పల్లి ఖాదీ భాండార్‌లో ఉద్యోగిగా ఉన్న కాలంలో వీరు భక్తితో మొదటి రెండు శతకాలు

రచించారు వారి శ్రీవైష్ణవభక్తి రాముని, స్వగ్రామానికి సమీపంలో ఉన్న కొండగట్టు క్షేత్రం అంజనేయుని స్తుతింపజేసినవి

రంగనాధ శతకం 1965 66లో రెండు ముద్రణలు పొందింది ఇది ఆటవెలది పద్యాలది

ప్రణత భక్తి కరము ప్రాకారనిలయంబు, ప్రణవ గోపురమ్ము పాపహారము
నీ పురంబునెన్న నిత్యవిభూతియే రక్షకుండ వీవె రంగనాధ 14

ఇందలి సాంఘిక నీతులు సాంప్రదాయ భావ శోభితాలు రెండవది గీత శతకం

దాంతుడే గాని పరమవేదాంతి గాని పరుల కొరకు గావించు సత్పథమునందు
తాను నడువ ప్రయత్నింప దగును ముందు ఆర్త రక్షక కొండగట్టాంజనేయ! 45

ఈ కవి రచించిన మరి మూడు వచన పుస్తకాలు మరికొన్ని అనువాదాలు ప్రచురించబడినవి

నల్లగొండ శ్రీ నరసింహ స్తవము ఇది నలబై కందాల చిరుకృతి కరీంనగర్ జిల్లాలో జమ్మికుంట దగ్గర ఒకటి బెజ్జంకి దగ్గర ఒకటి రెండు ఇల్లంత కుంట రామాలయాలు ఉన్నట్లే తిమ్మాపూర్ మండలంలో ఒకటి కొడిమ్యాల మండలంలో ఒకటి రెండు నల్లగొండలున్నాయి రెండూ నృసింహక్షేత్రాలే కవి గారి స్వస్థలం పూడూరు కొడిమ్యాల సమీప గ్రామం 'నరసింహ అని ఈ కంద పద్యాలమకుటం ఈ మండల కందాల్లో దైవస్తుతి ఉంది 40వది ఫలశృతితేటగీతి కవి పరిచయం తర్వాతి ఆటవెలది ఇది ఆముదాల వలస లో ముద్రితం తేదీ లేదు కవి ఉద్యోగ కాలానిది అనొచ్చు

శ్రీ చౌడేశ్వరీ స్తోత్రము 1985 నంద్యాల ముద్రణ నందవర దేవి చౌడేశ్వరి దేవాలయచరిత్ర అనుశ్రుత కథ పదిపుటల్లో చక్కని వచనంలో రాశారు ఆతర్వాత నందవరవాసి పరమేశి (?) నతులు నీకు అమ్మ చౌడేశ్వరీ దేవి ఆదుకొమ్ము - అని రెండు రకాల మకుటాలతో 50 60 (నంబర్లులేవు) శత పద్యాల్లో దేవీ స్తోత్రం కావించారు

"సకల పాపంబు ప్రారబ్ద సంచితములు భస్మమొనరించి పీడల బారద్రోలి,

జన్మమునకింత సుఖశాంతి జయములిమ్ము - అని కవి వేడుకున్నారు శ్రీ వాసర సరస్వతీ గద్యమ్, 1996 ఇది చిరుపొత్తం మన తెలుగులో సింహగిరి వచనాలు శ్రీ వేంకటేశ్వర వచనాలు తొలి మలి తరం విన్నప రచనలు, ఇవి గద్యాలైనా గానయోగ్యాలట అలాంటిదే కృష్ణమాచార్యుల సరస్వతీ గద్యం నిజానికి 'శరణు బసవన గద్య' మొ వి పాల్కురికి సోమన వీరశైవ కాలానివి కె కృష్ణమాచార్యుల సరస్వతీ గద్యం వచనానికి దండకానికి మధ్యగా శైలీ రమ్యంగా ఆద్యంతప్రాస శోభితంగా ఈతరం వారికి వినూత్నంగా ఉంది ఇది భక్తి భావ బంధురం

శ్రీ కృష్ణసుభాషిత త్రిశతి 1996 కవిగారు తమ ఇష్టదైవానికి, స్వీయ నామానికి సరిపడే విధంగా 'కలియుగంబునందు కావు కృష్ణ' అనే మకుటంతో 300 ఆటవెలదులు రచించి తమ షష్ట్యబ్ది పూర్ణోత్సవపు కానుకగా పాఠకులకు అందిచ్చారు కావు, అంటే కాజాలవు, అని కాక కాపాడుమనే కవి భావం ఇందులో పౌరాణిక ధర్మాలతో పాటుగా లౌకిక విమర్శ నీతి ప్రబోధం ఉన్నాయి పద్యాల నడక కొంతవరకు వేమనది సాహిత్యాన్ని గూర్చి ఆచార్యులవారి అభిప్రాయం చూడండి -

కవితయన్న జనుల కంటికి చూపుగా నిలువ వలెను మేలు కలుగవలెను
అల్ప భావరచనలారుద్రపురుగులు కలియుగంబునందు కావు కృష్ణ

మంచి కావ్యమొకటి మానవ శ్రేయస్సు కూర్చగలను నేడు కుప్పలుగను
కానవచ్చు కొన్ని కాగితాల్ ఖర్చురా ॥కలి ॥
పుస్తకాలు జదువ బుద్ధి వికాసము, జనుల జదువలోక జ్ఞాన మబ్బు
నిన్ను జదివిలోన నీ జ్యోతి నెరుగ (గు)రా ॥ కలి ॥ త్రిశతి పు 28

ప్రొఫెసర్ ఎల్లూరి శివారెడ్డి ప్రముఖ కవి వేముగంటి నరసింహాచార్యుల ప్రశంసలతో వెలువడిన ఈ త్రిశతికి భాగవతుల లక్ష్మణాచార్యులు, ఎం ఏ గారు వ్రాసిన అభినందన పద్య దశకంలో చివరిది ఇది వీరు భాగ్యనగరంలో ఉంటున్నా కరీంనగర్ జిల్లావారే

దేవి కృపా విశేషమును తేట మనంబున నాటునట్లుగా
మావిని జేరి మంద్రమున మంత్రములో మన భృంగరాజముల్
పూవుల జుంటితేనియల పూత మహోత్త పదార్థ శోభ ప
ల్లావుల నింప కృష్ణ శతి ధర్మ సుభాషితముల్ సుధాకృతుల్ - 1995

కె కృష్ణమాచార్యుల వచన రచనల పరిచయం తర్వాత చేయబడుతుంది

## 34 కందాడై శ్రీరంగ శరకోపాచార్య, మామిడిపల్లి (శ్రీరామానుజకూటం) తా సిరిసిల్ల

వీరి శతకాలు రెండు ముద్రింపబడినవి (ఈ శతకాలు కేశవ పట్టణం శేషమర పూజారి కీ శే స్వామి జియ్యరు భార్య శాంతమ్మగారి వద్ద లభించాయి ఆమె పిల్లలోకాచార్యుల తల్లి - 1991)

1 మామిడిపల్లి రాఘవ శతకం 1967, 2 మానస శతకమ్ 1967

ఈ కవి రామభక్తులు వీరి కవిత సలక్షణమైనది కవి వివరాలు తెలియలేదు

రాఘవ శతకం ఏ కోత్తర శతిలో ఒక పద్యమిది

రామ రఘూత్తమా పరశురామ మదాపహ నిత్యసత్య సం
గ్రామ పరాంతకా సతత రాక్షస గర్వ విశోధ మౌనిరాట్
క్షేమద మంగళాయ సువిశేష కృపాన్విత దీనబంధు నీ
వేమహి మమ్ము నేల గల వేలుపు మామిడి పల్లి రాఘవా 101

దీనిని బాబ్సాహేబుపేట - వావిలాల చీటి గోవిందరావు గారు ముద్రించారు

ఆత్మ సంబోధనగా చెప్పిన 109 నీతిపద్యాలు కలది మానస శతకం దీని పద్యాలివి - 2

శ్రీగల భాగ్యశాలి యతసీ కుసుమాభవికాస గాత్రుడ
త్యాగమ శీర్షి వందితుడహర్పతి తేజుడనాది బాంధవుం
డీ ఘనశైల మందిరు డహీన వరామలతల్పు డీశుడున్
బాగుగ నిన్ను నేలను నపాయము రాదిక నీకుమానసా! - 1

నీచుల వేడ బోకు యపనింకుకు పాత్రము గాకు మేదురా
లోచన సల్ప రాకు కడులోభుల పంచనుజేర బోకు పై
శాచ గుణంబువీడి కడుశాంతము బొందియు తామసంబు కా
ల్రాచి నశింపజేసి సుకరంబు వహింపుము నీవు మానసా - 2

ఈ శతకానికి శతావధాని కృష్ణమాచార్యులు కొరుట్ల గారు 1960లో ప్రసాదించిన ప్రశంసా పద్యాలైదున్నవి

## 35 చిట్యాల బాలదాసు - అవునూరు

1 ఆదినారాయణ శతకము 1968, 1981, ము 2

2 శ్రీరమావల్లభ శతకము - 1974, 3 భారతీస్తవము 1968, 87 సీస పద్యార్థ శతకం

బొంబాయిలో కార్మికులుగా జీవితం గడుపుతూనే సాహిత్యసేవలో చేరిన బాలదాసకవి తెలుగు గద్య పద్య గేయ ప్రక్రియల్లో ఓ ఇరువది పుస్తకాలు రచించి ప్రచురించారు పైవి రెండు సీస పద్య భక్తి శతకములు ఆదినారాయణ శతకం చివర రామాయణ గాధను వర్ణించినారు కాబట్టి శ్రీరమావల్లభ శతకంలో ఉత్తర రామాయణ గాధను సంగ్రహంగా చేర్చారు

ఆదినారాయణ శతకము నుండి ఒక పద్యం

విశ్వేశ నీకథల్ విన్నమాత్రంబున - దాసీసుతుడు ధాత తనయుడయ్యె (నారదుడు)
పరమాత్మ నీభక్తి పారవశ్యంబున - దైత్యనందనుడు సద్భక్తుడయ్యె (ప్రహ్లాదుడు)
శేషశయన నీదు స్నేహితుడైనట్టి - దారిద్ర్య విప్రుడు ధనికుడయ్యె (కుచేలుడు)
చదువునించుక లేక శబరుడు నీదివ్య - కరుణ చేతను గొప్ప కవియునయ్యె (వాల్మీకి)
చక్రి నిన్నునమ్మి స్మరియించు భక్తుల కీప్సి తార్థ చయములిత్తువయ్య
అవునూరి సదన ఆదినారాయణ! బాలదాసపోష భవ వినాశ! - 18

రెండవ శతకంలోని పద్యాల శైలి - భావాలు ఇటువంటివే

**36 పార్వెళ్ళ గోపాలకృష్ణ - చాకుంట,** చంద్రశేఖరా 'మకుట శత పద్యాలు వీరి వాసంతి' ఖండకావ్యం చివర శీర్షికలో వున్నాయి

## 37 మునుగోటి లక్ష్మణశర్మ - కల్వకోట కీర్తి శేషులు

1 కాళికా శతకము - 1970

వయోజ్ఞాన వృద్ధులు, విద్వత్కవులైన లక్ష్మణశర్మ గారి దేవి భక్తి స్తోత్ర పద్య కావ్యం కాళికాశతకం కవిది అనాయాస కవనం ప్రవాహధార అందలి ఒక పద్యం చూడండి

మరకత పుష్యరాగ మణి మండిత హేమకిరీట హార భా
సుర కనకాంగదాద్యఖిల శోభన భూషణ భూషితాంగ సుం
దరి! త్రిజగన్నియామకి! కదంబ వనాంతర వాసినీ, మహా
పరమ దయాకరీ దివిజ వందిత పాద సరోజ! కాళికా! - పు 2

కవి తమ వైదిక జన్మను ఇట్లా వివరించుకున్నారు

పుడమిని వైదికుండునయి పుట్టగ రాదొక వేళ పుట్టిన
ప్పుడును సుకర్మ నిష్ఠ పరిపూర్ణుడు కావలె, కాకయున్నయ
ప్పుడు కడు భాగ్య సంపదల పూర్ణుడు గావలె, కాకయున్నకా
రడవినిర్మానుగా జనన మందిన మేలు గదమ్మ కాళికా - పు 21

## 38 ఎస్ కె పిళ్ళై - కరీంనగర్

1 హేప్రభో శతకము - 1970, 2 చిత్రంపు పోకడల్ త్రిశతి - 1993

సందినేని కొమురయ్య పిళ్ళై గారు 1935లో జన్మించి 1992లో గతాయువులైనారు స్వగ్రామం నందిమేడారం దగ్గరి గోపాలపురం ప్రభుత్వోపాధ్యాయులుగా పనిచేస్తున్న కాలంలో కరీంనగర్

కాశ్మీరి గడ్డలో భవన నిర్మాణం కావించుకున్నారు తెలంగాణా రైతాంగ పోరాట కాలంలో విద్యార్థిగా సామ్యవాద భావాలకు లోనైన వీరు ఆమరణ పర్యంతం ప్రగతిశీల భావాలతోనే జీవించారు, పలు పద్యగేయ కృతులు వెలయించారు హేప్రభో శతకం సీస పద్యాలది

రాజకీయ విమర్శతో పాటు ఈ శతకంలో కొన్ని సాంప్రదాయక భావాల బలపరచడమున్నది 'అవినీతి ఖండన' నీతి బోధ ఏ శతకంలోనా తప్పనిదే అంతర్జాతీయ విధ్వంసక చర్యల రూపుమాపి మానవజాతి పురోభివృద్ధి సాధనకోసం, ప్రజా సంఘటిత నైతిక పోరాటమే ఏకైక శరణ్యమని ఈ శతకంలో కవి ఉద్బోధ కవి కవితాశైలి భావ పరిచయానికి ఒక పద్యం -

మిల్లు కార్మికులను కొల్లగొట్టక యెట్లు కోట్ల డబ్బునెవండు కూడబెట్టు
అన్యుల భూముల నపహరింపక యెట్లు భూస్వాములైరొక్కొ పుడమిపైన
అంతులేనట్టి యత్యాచారములు లేక, ఆస్తి పాస్తులనెవ్వడాక్రమించె
శ్రామిక రక్తాల ఛాయలై ధనికులు ఐశ్వర్య మొదవగ నవతరించి
కష్టజీవుల పాలిటి కాలయములు 'వారి కష్టార్జితము ద్రోయువారు గాదె,
ధర్మ సంస్థాపనంబెట్లు ధరణి మీద, సంభవించును హేప్రభో శాశ్వతముగ? 5

చిత్రంపు పోకడల్ త్రిశతి ఇవి తేటగీతి పంచపాదులు నాలుగు పద్యాల్లో కవి భావాలు పూర్తి చేసి అదనంగా అయిదవ పాదంలో "ఎంత చిత్రంపు పోకడల్ ఎస్కె పిళ్లె' అని మకుటాన్ని ఉంచారు ఈ శతకంలోని వ్యావహారిక పదాలు జనవ్యాప్తిలోని సామెతలు మానవతావాద భావాలు, పరితులను ఆకట్టుకునే విధంగా ఉన్నాయి ఈ మూడు వందల పద్యాల నుండి మచ్చుకు మూడు పద్యాలివి

2 మాతృభాషపై మన వారి మమత తగ్గి పరులబాసపై యెందుకో ప్రేమ పెరిగె
అల్ల రుచిమెండు పొరిగింటి పుల్లకూర - ఇంటి యిల్లాలి వంటకంబింపు కాదు,
ఎంత చిత్రంపు పోకడల్ ఎస్కె పిళ్ళె

193 పెట్టనమ్మ పెట్టక పాయె, పెట్టుముండ కేమిరోగము వచ్చెనో యీ దినమని
పెట్టి పోసెడు వారికే తిట్లువచ్చు - కాతగల చెట్టుకే కదా రాతి దెబ్బ ॥

34 నాటి సమర యోధుల మెచ్చు నోటితోనె నేటి సమర వీరులదించు మాటలేల?
ధర్మ పోరాటమార్గాల మర్మమెరుగ - తిరుగబడక సమస్యలు తీరె నెచట ॥
ప్రజల సమస్యలు పట్టించుకొని ప్రజల భాషలో వ్రాసిన ప్రజాకవి ఎస్ కె పిళ్లె గారు

## 39 వి ఎల్ ఎన్ శాస్త్రి - కరీంనగర్, జననం 1929

వి ఎల్ ఎన్ శాస్త్రిగా పిలువబడు వీరి పూర్తి పేరు వేమూరి లక్ష్మీనరహరి శాస్త్రి కోస్తాంధ్ర కృష్ణామండలం జన్మస్థలమైనా అధ్యాపకులుగాచేరి ఈ జిల్లాలోనే ప్రధానోపాధ్యాయులుగా జిల్లా విద్యాశాఖాధికారిగా పనిచేసి ఉద్యోగ విరమణపొంది కరీంనగర్‌లో స్థిరపడ్డారు శాస్త్రిగారు సంస్కృతాంధ్రాంగ్ల భాషలలో పండితులు 1 తెలుగులో కవులు శ్రీలక్ష్మీనరసింహాశతకము, మరో ఖండకావ్య సంపుటి వీరి అముద్రిత కృతులు ముద్రిత కావ్యం భర్తృహరి సుభాషితములు 1971 భర్తృహరి సుభాషిత త్రిశతి శృంగార వైరాగ్యనీతి శతక త్రయం చాల వ్యాప్తి కలది దీనికి ఎలకూచి బాల సరస్వతి, పుష్పగిరి తిమ్మన ఏనుగు లక్ష్మణ కవి మొదలగు కవుల అనువాదాలు వచ్చినవి లక్ష్మణకవి వలె లక్ష్మీనరహరి కవి గారును సంస్కృత త్రిశతిలోని కేవలం నీతి శతకాన్ని మాత్రమే

అనువదించినారు వీరి అనువాదం ఎక ఛంద పద్యాలు కావు మకుట నియమంలేదు-మూలనామాన్ని బట్టి పద్యసంఖ్యనుబట్టి వీరు కావించిన అనువాద పద్యాలు కొన్ని చూపబడుతున్నవి ఇది ముక్తక కావ్యం మకర ముఖాంతరస్థమగు

నక్ర కరాళ దంష్ట్ర నణంగిన రత్నము సంగ్రహింప వ్యో
మాక్రమ దూర్మి సంకుల మహాబ్ధి దరింప బ్రసూన మాలికా
ప్రక్రియ మౌళిపై గుపిత పన్నగమున్ ధరియింప సాధ్యమౌ
నేక్రియనై నెఱుంగ నగునే యిల మూర్ఖుని చిత్తవృత్తముల్
ఆకాశంబున నుండి
భ్రష్టము గాదె గంగ మును భర్గ జటా పటలంబునందు త్రై
విష్టప భూమి వీడి యటు పిమ్మట గర్కశ శైలరాసులన్
కష్టమరు ప్రదేశముల, క్షార జలంబుల, సర్పభూములన్
భ్రష్ట వివేకులౌనరుల భంగము లీయిల వేయి భంగులౌ

వీరి అనువాదం మూల విధేయంగా పూర్వకవుల పద్ధతిలో సలక్షణంగా ఉంది

గణితంలో పట్టభద్రులైన వి ఎల్ ఎన్ శాస్త్రి గారు ఆంధ్ర సాహిత్య రంగ భద్ర పీఠికపైననూ ఉపనిష్టులైనారు వీరు ప్రౌఢాంధ్రకవి వర్యులు

## 40 తత్త్వాది కృష్ణశర్మ - తక్కళ్ళపల్లి,

1 శ్రీ వేంకటరమణ శతకము 1971 2 శ్రీరామ చంద్రార్థ శతకము 1971

కృష్ణశర్మ గారు కధలాపూర్ మండలంలో తక్కళ్లపల్లి గ్రామ పురోహితులు సాహిత్యారాధన సత్కాలక్షేప సాధనంగా భావించిన వీరు నిరంతర గ్రంధపరనశీలురు సామ్యులు విద్వత్కవితా వతంసులు యక్షగానకవి గంగాధరయ్య వద్ద పద్య ఛందస్సు నేర్చుకున్న కృష్ణశర్మ గారు మరో శతక కవి నారంభట్ల లక్ష్మీనారాయణ శర్మ గారికి కవితా మార్గదర్శకులైనారు



వీరి రచనలలో పై రెండు శతకాలు మాత్రం ముద్రణ పొందినవి వేంకటరమణ శతకం 'అష్టోత్తర శత కంద బృందం' అన్నారు కవి

శ్రీకర వాఙ్మధుర సుధా శీకర! పద్మావతీ వశీకర! సౌభా
గ్యాకర! దుష్ట సురద్విష భీకర! తక్కళ్లపల్లి వేంకటరమణా! 1

అని ఎంతో భక్తితో స్వగ్రామ దైవాన్ని ఆరాధించే వీరు మారిన సామాజిక పరిస్థితులకు ఇట్లా వేదనపడుతున్నారు

బడిలోపలి పంతుళ్ళును - గడిలోపలి దొరలు పూజ గావించెడినీ
గుడిలోపలి పూజారులు విడువక పేకాడు చుంద్రు వేంకటరమణా! 37

ఈ కవి సచ్ఛీల ప్రేమికులేకాక చిత్ర కవితా విశారదులు కూడా ఈ శతకంలోని 'చతుర్విధ కంద విన్యాసం చూడండి

నీరేజ నేత్ర గ్రావ సు - ధీరా సుమ బాణ రూప దితి సుత శమనా
కారుణ్య హృదయ జలధి గ భీరా యమునా విహార వేంకటరమణా

1 నేరేజ పత్ర, 2 సుమబాణ 3 కారుణ్య, 4 యమునా

పైన చూపిన పదాలతో ఆరంభించి వరుసగా మిగితా పద్యమంతా చదువుతూ పోతే నాలుగు కంద పద్యాలు అవుతాయి అర్థం చెడదు యతి గణ ప్రాసలకు భంగం ఉండదు పద్యం లోని ఏ ఒక్క పదమూ మిగులదు దీనిలోని నాలుగవ పద్యం చూడండి

యమునా విహార వేంకట రమణా నీరేజపత్ర గ్రావ సుధీరా

సుమ బాణ రూప దితిసుత శమనా కారుణ్య హృదయ జలధి గభీరా!

కృష్ణశర్మ గారి శ్రీరామచంద్రార్థ శతకము' సైతం మొదటి వేంకటరమణ శతకంతోపాటు 1971లోనే ముద్రణ పొందింది ఇది కవి గారి తొలికృతి - ఇందలివి సీస పద్యాలు ఈ అర్ధ శతకంలో దైవనుతి రూపవర్ణన-భక్తి సేవా విధుల వర్ణనలే అధికం - 27 47 అచ్చతెలుగు పద్యాలు 40 నుండి నాలుగు పద్యాల్లో సంగ్రహరామాయణం ఉంది 30వ, పద్యం దశావతార వర్ణన

ఈ శతక పద్యమకుటం

"భావజ విలాస తక్కళ్ళపల్లి వాస, రమ్య సాకేత నగరేంద్ర రామచంద్ర!'

పద్యాలన్నీ పాదాంత సమాపక క్రియలతోగాన యోగ్యంగా ఉన్నాయి కవి కవన శైలికి కొన్ని కవితా చరణాలు చూపబడుతున్నవి

నటియింపజేయు నా నాల్కరంగమునందు నిరతమ్ము నీనామ నృత్య సతిని,

స్థాపింప జేయు నా స్వాంత సరోవర మందు నీ చరణార విందయుగళి

అచ్చ తెలుగునకు మచ్చు చరణాలు

వేలుపు తొలివేల్పు పిండు గూడియు మిత్తి, లేనిమందునకు పాలేరు ద్రచ్చ

తరిగోల తరిగొండ తనరార నొనరించి తరితాడు గాలి మేతరిని జేసి - 31

ఇందులో ఏ పద్యాన్ని చూసినా శైలీ ప్రసన్నత, భావ మాధుర్యం కానవస్తాయి ఈ ఆరంభార్ధ శతకంలోనూ కవి తమ చిత్ర కవితా విన్యాసం చూపించారు 52వ సీసపద్యం బంధకవిత మొదటి నాలుగు సీస పాదాల మధ్య మత్తేభ' పద్యాన్ని, ఎత్తుగీతం గర్భంలో కందపద్యాన్ని కవి అద్భుతంగా ఎట్లా నిబద్ధం చేశారో చూడండి

సీ ప్ర । వర సుశ్లోక కృపావలోక శ్రిత కల్ప శ్రీ క దైత్యాంత కా। శృతినుత

కు । ధర భృత్తల్లజ కోమలాంఘ్రి జలజా, తద్వంద్వ చాపాయుధా । సురేంద్ర

త్రి । పుర హర్తృస్తుత దేవదేవధవళాం, భోజాత పత్రేక్షణా । జనేశ

ప్ర । ఖర బాణైక సుబాహు సంహరణ భ, క్షత్రవ్రాత రక్షాచణా । త్రిధామ

గీ మురహర సుమాయుధ జనక శరధి శయన శరధి శోష సద్గుణ గణ క్ష్మావర మణి

దురిత హరణ మందర గోత్ర ధర రఘువర, వననిధి గభీర । గజరాజ వరద సదయ

ఈ పద్య సీస పాదాల్లో ఆద్యక్షరాలు చివరి పదాలు వదలి అర్ధగీతల మధ్య భాగాలను వరుసగా చదివితే అది మత్తేభ విక్రీడితం చరణాల మధ్య కామాలు సీసపద్య యతి విరుపులు

గీత పద్యం చివరి పాదం మధ్య గీత వరకు చదివితే పై భాగం కందపద్యం మత్తేభం స్పష్టం కందం చూడండి

మురహర సుమాయుధ జనక, శరధి శయన శరధి శోష సద్గుణ గణ క్ష్మా

వర మణి దురిత హరణ మం, దర గోత్ర ధర రఘువర వననిధి గభీరా!

ప్రసన్న కవితా విశారదులు ప్రౌఢ చిత్ర కవితల్లజులు తత్స్వాది కష్ణశర్మ గారు

## 41 మేన అంబాజీ - చంద్రంపేట, సిరిసిల్ల, నివాసం బొంబాయి

1 రుక్మిణీశ్వర శతకము - ముద్రితం

2 కేశవ శతకము - 1972, 3 నానార్థ శబ్ద కౌముది 1972

అంబాజీ గారు వస్త్రనిర్మాణ కార్మికులుగా మహారాష్ట్ర బొంబాయిలో ఉంటూ మాతృభాషా సాహిత్యాల నభిమానిస్తూ స్వయంకృషితో పాండిత్యాన్ని సముపార్జించుకొని పద్యకవితలు వెలయించారు

అంబాజీస్వకుల మహారాష్ట్ర ప్రవాసాంధ్రులకు మాతృభాషా సాహిత్య భక్తి భావాల వ్యాప్తికి చాలా కృషి చేశారు - చేస్తున్నారు అంబాజీ కేశవ శతక పీఠికలో అంతకు పూర్వమే రుక్మిణీశ్వర శతకం రచించినట్లున్నది దాసరి శంకరయ్య గారి శ్రీరామ శతకం చివరి పేజీలో సరస్వతీ బుక్ డిపో వర్లి బొంబాయి - 13 వారి పుస్తకాల లిస్టులో మేన అంబాజీ రచనలుగా రుక్మిణీశ్వర కేశవ శతకద్వయం పేర్లు కనిపించాయి మొదటి శతక ప్రతి లభించలేదు కేశవ శతకం నుండి ఒక పద్యం

కలుష వ్రాత లతాలవిత్రమయి మోక్షప్రాప్తికిన్ మూలమై
పలు రోగంబుల కౌషధంబయి ఘన ప్రావీణ్యమై రుచ్యమై
కల కాలంబు సుఖప్రదంబయి మహాకల్యాణముల్ గూర్చుచున్
విలసిల్లున్ గద నీదు నామ జపమీ పృధ్వీస్థలిన్ గేశవా 43

ఇటువంటి సుందర భక్తి భావాల పద్య పుష్పమాల కేశవ శతకం ఇందులో జపమాలలోని పూసలవలె నూటా ఎనిమిది పద్యాలున్నాయి మూడవకృతి వీరి పాండిత్యానికి నిదర్శనం

## 42 వెలిచాల కేశవరావు - గుండి 1 మిత్రనీతి శతకము - 1973

ఈ శతాబ్ది పూర్వార్థ కవులలో పరిచయం చేయబడింది

## 43 దాసరి శంకరయ్య నిమ్మపల్లి తా ॥ సిరిసిల్ల

1 లక్ష్మణాగ్రజ శతకము - ముద్రితం, అలభ్యం 2 శ్రీరామ శతకము 1973

కవి దాసరి శంకరయ్య గారు నిమ్మపల్లి వాస్తవ్యులు లక్ష్మమ్మరాజయ్య గారల పుత్రులు జనవరి 1941లో జన్మించిన వీరు ప్రాథమిక విద్యతో చదువు చాలించి జీవనోపాధికోసం బొంబాయి వెళ్లారు బట్టల మిల్లులో కార్మికులుగా ఉంటూనే జ్యోతిష్య పౌరోహిత్య కవిత్వ మార్గాల్లో పయనించి వాసిగాంచారు

లక్ష్మణాగ్రజ శతకము చంపకోత్పల మాలికలదని ఆ పద్యాలు 'కంచర్ల గోపన్న వ్రాసిన దాశరధీ శతకములోని పద్యముల బోలి, చదివిన కొలది చవులూరించు చుండును" అని గంగుల నారాయణగారు దాసరి శంకరయ్య గారి శ్రీరామ శతక పీఠికలో అన్నారు

శ్రీరామ శతకము - ఇది భక్తిభావాల కంద పద్యశతకం

అందులో 40 పద్యాల్లో సంక్షేపరామాయణం 10 పద్యాలు దశావతార వర్ణనలున్నాయి మిగితావి నుతి పద్యాలు ఈ శతకం సుమతి శతకం కంటె శ్రీకృష్ణ శతకాన్ని ఎక్కువగా అనుసరించింది భావాల్లో భక్తిలో కంద ఛందశ్శిల్పంలో నరసింహ, దాశరధి శతకాల ప్రభావం సైతం ఈ కృతిపై పడింది "సుందర విగ్రహ దశరధ । నందన రఘువంశతిలక నయగుణ నిధి గో । విందా దావన భంజన । వందనములు గొనుము భక్తవత్సలరామా"-103 '

వండెడు వానిని, వైద్యుని । మండలపరిపాలు, గవిని, మాంత్రికు, నిలలో
కొండెములు పలుకు వానిని । ఖండిత మాడంగ జనిన గండమురామా - 93

ఇట్లా ఈ శతకపద్యాల్లో అనేకం పూర్వకవుల పద్యాలవలె కంఠస్థం చేసుకునేశయ్యా సౌభాగ్యం భావ సౌకుమార్యం కలవిగా ఉన్నాయి

## 44 ముకిరాల రాదాకిషన్ - బి ఓ ఎల్ మెట్టుపల్లి జ 17-4-1934

రాధాకిషన్ గారు నిజామాబాద్ జిల్లాలో తెలుగు పండితులుగా ప్రభుత్వోద్యోగం చేసి విశ్రాంతి పొంది ప్రస్తుతం జన్మస్థలమైన కరీంనగర్ జిల్లా మెట్టుపల్లిలో ఉంటున్నారు

వీరు రచించి ప్రచురించినది ఒకే ఒక శతకం 1 శ్రీరామ శతకము - 1974

శ్రీకారాదితో 108 పద్యాలతో ప్రచురణ పొందిన సలక్షణమైన ఈ కందపద్య శతకం భావాలు భక్త జనానికి కొన్ని మ్రింగుడుపడకుండా ఉన్నాయి

మతములను మత్తు మందులు మతి మంతుల చెఱచి పెంచు మాలిన్యములన్
మత మౌఢ్య మంతరించిన నతమతులిత శాంతి వెలసి జయమగు రామా 4
ఎప్పుడు కులము నశించునొ ఎప్పుడు సంకుచిత వాద మెల్లను జనునో
అప్పుడె భూవలయంబున చప్పుడు లేనట్టి శాంతి సమకొను రామా - 10

గాంధీ సత్యాహింసల 90 అభ్యుదయ కవుల 26 ముప్పాళరంగ నాయకమ్మ వాదాన్ని 30 మెచ్చే వీరు పావన రామా నిన్నేజీవితమున్నంత వరకు 'సేవింతునయా' 107 అంటున్నారు

## 45 దేవత వేంకటరాములు, డి ఓ ఎల్ సిరిసిల్ల,

1 జానకీ పతి శతకము 1975

వేంకటరాములు గారు తెలుగు పండితులు - పద్య కావ్య కవులు వీరి జానకీ పతి శతకం 108 చంపకోత్పల పద్యసుమ మాలిక స్వీయ నీతివాక్యాలకంటె పూర్వకావ్య-ధర్మశాస్త్ర నీతులు-ఆచార సూక్తులు ఇందులో అధికం కవి రామాయణ సన్నివేశాల అనేకం స్పృశించారు

నిరతము తల్లిదండ్రులను నిర్మల చిత్తముతోడ గొల్చి స
త్పురుషుల సేవజేసి యతిథుల్ దరి జేరిన నాదరించి స
త్కరుణ నహింసయున్ క్షమయు ధర్మము సత్యము జ్ఞానమున్ సదా
మరువగరాదు మానవులు మంగళ విగ్రహ జానకీ పతీ! - 45

## 46 తిరునారాయణ పురం లక్ష్మణ స్వామి - ఎల్కతుర్తి

లక్షణస్వామి గారు నైజాం కాలంలో ప్రభుత్వోపాధ్యాయులుగా పనిచేశారు ఆంధ్రప్రదేశ్ అవతరణ తర్వాత ఉద్యోగ విరమణపొంది 1965-70 సుమారుగా కీర్తిశేషులైనారు కవి కాలం తెలువలేదు కవి గురుమూర్తి మాత్రం మనవాళ జియ్యరు

స్వామి గారి ఏకైక కృతి - హరిశతకము - ము 1973

కవి హరిభక్తి ఈ శతకాన్ని వ్రాయించింది కాని దీని అచ్చుప్రతి వారు చూసుకోలేక పోయారు కవి తనూజులైన తారామనోహర్ కృష్ణమూర్తి గారలు తండ్రిపై గల అభిమానంతో ఈ 'హరిశతకాన్ని' 73లో ప్రచురించారు అలంపురి బ్రహ్మానందం జూ॥ లెక్చరర్, సర్దార్‌పటేల్ రోడ్, సికిందరాబాద్ గారు ఈ శతకాన్ని పరిష్కరించి పీఠిక వ్రాశారు భగవదంకితంగా విరచితమైన ఈ హరిశతకంలో 108 కంద పద్యాలున్నాయి ఈ శతకంలోని రెండు పద్యాలివి

చక్కెర మధువుల కన్నను, మిక్కిలి నీనామ మధురమే మించుటచే
మక్కువతో గ్రోలెదనో చక్కెర విలుకాని తండ్రి స్మరింయింతు హరీ - 79

యమునికి నేనిక జడియను కమల మనోహరుని కరుణ గలుగు కతమునన్
మమ కార మేమెు కానీ, కమలాధిప నిన్నెయెపుడు కాంక్షింతు హరీ 84

కవి పెద్ద పండితులు కారు సరళ రచన సంప్రదాయ భక్తి భావాలు హరిభక్తి-గురుభక్తి కలది టి లక్ష్మణ స్వామి గారి హరిశతకం

## 47 డా॥ బి లక్ష్మయ్య, ఎం ఏ, పిహెచ్ డి, తేలుకుంట

1 శంకరప్ప శతకము 1976

లక్ష్మయ్యగారి స్వగ్రామం తేలుకుంట తెలుగులో బి ఓ ఎల్, ఎం ఏ ఎం ఫిల్ పిహెచ్ డి పట్టాలు పొందిన వీరు తెలుగు ఉపన్యాసకులు కరీంనగర్ వావిలాలపల్లిలో స్థిరనివాసం ఏర్పరచుకున్నారు వీరు తెలుగు పండితులుగా పనిచేసే కాలపు ఆరంభ రచన ఈ శంకరప్ప శతకం

ఇయ్యది శంకరప్పయే గాక సర్వ విధ సంకీర్ణ సంఘము నందలి వంకర టింకరప్పలును వెఱ్ఱి వెంగళప్పలును మతినుండిన చెవుడు చౌడప్పలును గూడు గట్టిన గువ్వప్పలును బుద్ధితో వినదగినట్టిది అన్నారు కావ్య పీఠికలో సమీక్షకులు



ఇందలి పద్యాలు సరళం - భావాలు లోకరీతులు

ఉన్నమాట బలుక నులుకును నొక్కడు అన్నమాట బలుక నలుక వొడము
క్రొత్తమాట ఎలుక కోపంబు వచ్చురా, శ్రద్ధతోడ వినుము శంకరప్ప! 13
అందుకున్న కాళ్లు నందిన సిగ బట్టు వారికెప్పుడైన వచ్చు హాని
ఒకరీతి నుండ చిక్కడెవ్వరికిని ॥ 44

ఈశ్వరా! దయజూపి యిట్టి వింత జనుల మార్చవయ్యా - అని కవి వేడుకోలు

## 48 ఎల్ నారాయణ - ఉపాధ్యాయులు 1 రామ రామ శతకము - 1976

నారాయణ గారి గ్రామనామం కూడా పుస్తకంలో లేదు ఈ కవి హుజూరాబాద్ తాలుకా వారు వా జగన్నాథాచార్యుల పీఠికతో ఇది వెలువడింది 'రామా' అను పదం ఈ పద్యశతక మకుటం ఓ పద్యం చూడండి

మంద మతిని దరి జేరితి, అందమ్మౌ బోధ జేసి యలరిన శ్రీశ్రీ
నందూ భాయి గురునడుగు, కెందమ్ముల గొల్తు భక్తి గీల్కొన రామా

## 49 బోజనపల్లి రామస్వామి - పెద్దపల్లి - 1898 - 1977

రామస్వామి గారు చాత్తాద శ్రీవైష్ణవులు తల్లిదండ్రులు లక్ష్మీ రామానుజులు పినతండ్రి లక్ష్మణస్వామి స్వగ్రామం బొమ్మనపల్లి ఆయుర్వేద వైద్యులుగా పెద్దపల్లిలో స్థిరపడ్డారు బాల్యంనాడే ఇంటిలో అలవడిన విష్ణుభక్తి కారణంగా వీరు భాగవతం పఠించేవారు (పై విషయాలు కవి శ్రీరంగ శతకం పీఠికలోనివి) కవి గారి భక్తి కవిత్వం వైపు దారి తీసింది వీరి రచనలు రెండు భక్తి శతకాలు-

1 శ్రీరంగ శతకము - 1975 సుమారుగా ముద్రితం, 2 శ్రీలింగ శతకము - అముద్రితం

వీరు శతకములో మొదట గణపతిని హర విధాతల స్తుతించిరి వైష్ణవులయ్యు సమబుద్ధి గలిగిన వీరి సహనము ప్రశంసనీయము వీరు తమ ఆచార్యులను లెస్సగా నుతి చేసిరి వీరి శతకము ద్వారా తమ భక్తి ప్రపత్తులను చాటుకొని శ్రీరంగనికి అంతరంగులై యొప్పిరి ' అన్నారు వానమామలై వరదాచార్యులు ముద్రిత శతక పీఠికలో

గణపతి నుతికే వరదాచార్యులు అంతగా కవి మత సామరస్యధోరణిని ప్రశంసించారు రంగ శతకం తర్వాత ఈ కవి వ్రాసిన లింగశతకం చూస్తే మరెంతగా అభినందించేవారో గణపతి శైవులకు ప్రియం వైష్ణవులు గణపతికి మారుగా విశ్వక్సేన స్తుతి కావిస్తారు కావ్యాల-వ్రత పూజా కార్యక్రమాల ఆరంభంలో రామస్వామి గారి గురువు బక్కయశాస్త్రి గారు వానమామలై కవి సోదరుల జనకులు

తాను పెద్ద పండితుడ కానని భక్తి చేత ఈ శతకరచన కావించానని, దీనిని సంస్కరించినవారు మల్లా వజ్జల బాలకృష్ణరావు గారని శ్రీరంగ శతక పీఠికలో కవి వినయంగా మనవి చేసుకున్నారు

కావ్య పరిచయము

శ్రీరంగ శతకం తమిళనాడులోని శ్రీరంగనాధుని స్తుతి కాదు ఇది మహారాష్ట్రలోని పాండురంగని స్తవం కరీంనగర్ జిల్లా నుండి షోలాపూర్ భీమండి, పూనా, బొంబాయి మొ మహారాష్ట్ర ప్రాంతాలకు వెళ్లిన పద్మశాలీలలో పలువురు కవులై శతక రచన కావించారు వారిలో ఎవరూ స్పృశించని పండరినాధుని స్తుతిశతకం రామస్వామి గారు రచించడం విశేషం

ఈ కవి రెండు శతకాలు కంద పద్యాలవే

పండరి పురమున నుండియు । పండిత పామరుల బ్రోవ పాతకహరణా
అండై నిలిచిన వాడవు । దండమాయా నీకు నిదిగొ దండము రంగా పు 2

అని వెంటనే ఇట్లన్నారు

కావేరీ తీరంబున । దేవేరినిగూడి నీవు దివ్యాకృతితో
ఆవేదనగల భక్తుల । కావగ రావయ్య కరుణ గలుగన్ రంగా పు 2

శ్రీకృష్ణ నరసింహ శతకాల శైలీ భావాలతో సాగిన ఈ శతకం సరళమైనది

అడుగను మడి మాన్యంబులు । నడుగను ధనకనక వాహనాది సిరులనే
నడుగను భోగంబుల నీ । యడుగులె నాశరణమంటి యచ్యుతరంగా పు 23

అందులో పద్య సంఖ్యగానీ ముద్రణ సంవత్సరం కాని లేవు

శ్రీలింగ శతకం - ఇందలి పద్యాలు శివభక్తి పూర్ణాలు (9 2-91 నాడు కవి కుమారులు వేంకటేశ్వర స్వామిగారు పెద్దపల్లిలో లింగ శతకం వ్రాత ప్రతి చూపారు)

1 శ్రీ కైలాస గిరీశా । లోకైక శరణ్యలోక లోకా తీతా
కాకోదర హార హరా । పాకారి ప్రముఖ వినుత పావనలింగా

6 శివ నీ నామ మహాత్మ్యము । భవభయ రోగముల బాపు భవ్య గుణాఢ్యా
స్తవ నీయలోక పాలక । శివ మంగళ నామ దేవ శ్రీకర లింగా

ఈ శతకంపై శ్రీ కృష్ణ శతక ముద్ర స్పష్టం అందలి 'హరియను రెండక్షరములు' వలె ఇందులో హర యను రెండక్షరములు' అనే పద్యం 53 ఉంది 'కఫవాత పైత్యములచే నీ స్మరణ చేయలేనేమో అనే దాశరథి శతక పద్యభావం రామస్వామి గారి రెండు శతకాల్లోనూ ఉంది రంగ శతకంలో ప్రముఖ వైష్ణవ పుణ్య క్షేత్రాలను వలెనే లింగ శతకంలో ద్వాదశ లింగ దివ్యక్షేత్రాలను పన్నెండు పద్యాల్లో వర్ణించారు కవి

## 50 ఎస్ వేంకట్రాది, ఎం ఏ ఎలిగేడు, 1. వేంకటాద్రి శతకము - 1977

వేంకటాద్రి బి ఓ ఎల్, ఎం ఏ చదివినవారు తెలుగు పండితులుగా ఉద్యోగం జన్మ గ్రామం ఎలిగేడు కరీంనగర్ శివాజీనగర్ స్వంత భవనంలో ప్రస్తుత నివాసం

భజన కీర్తన బుఱ్ఱకథ, నాటిక మొ ప్రక్రియలలో అయిదారు పుస్తకాలు రచించిన ఈ కవిగారి నీతి పద్యాలు నూటాపదారు వేంకటాద్రి శతకం ఇది స్వీయ నామ ముద్ర మకుటంగా వెలువడినా తిరుపతి వేంకటేశ్వరుని రెండు సీస పద్యాల్లో నుతించి ఆటవెలది తేటగీతాలతో నీతిబోధనా రంభించారు ఇందులో సామాజిక నీతుల రాజకీయ విమర్శలతోపాటు ఆరోగ్య విషయాలు ఎక్కువగా ఉన్నవి

భూత వైద్యమంచు పాత మాటల తోడి, రోగి చెరను బడును రొక్కమొడుచు
భూతమన్న గతము పుట్టుక భూతమ్ము, వేరె భూత మేది వేంకటాద్రి - 35
మారె నిత్యముగను మానవు నైఘంటి కార్థములును మారె నభిరుచులును
వేదములను మార్చి వేయరే మీదట, విబుధులెల్ల గూడి వేంకటాద్రి - 86

## 51 టి లక్ష్మీనరసింహ స్వామి, బి ఏ మోహన్‌రావుపేట, 1 శ్రీరామచంద్రార్ధ శతకము - 1978

కొరుట్ల మండలంలోని మోహనరావుపేట జన్మగ్రామమైన ఈ కవి ఉద్యోగం కారణంగా ఆదిలాబాద్ జిల్లా నిర్మల్‌లో ఉంటూ స్థానిక రామచంద్ర భక్తితో ఈ అర్ధ శతకాన్ని రచించారు ఇది డా అందె వేంకటరాజం గారి పీఠికతో వెలువడింది దీనిలోని మొదటి పద్యమిది

శ్రీహరి స్తోత్రము చేతము కందోయి, చేసిన పాపాలు మాసిపోవ
విశ్వరూపుని కథ విందము జనులార, బుద్ధి వికాసంబు పొందుచుండ
లక్ష్మీప్రియుని భక్తరక్షణ చూతము, భక్తి హెచ్చి మనకు ముక్తి దొరుక
కమలాక్షుని యశమ్ము గమనించుదము రండు బ్రతుకునందున కీర్తిబాట తెలియ
కానరారండి మీ రంత కౌతుకమున, అనుచు భక్తుల బిలిచెద గనుము కరుణ
సాధుజనపాల ! శ్రీలోల ! సత్యశీల, వినుత లోకేశ ! నిర్మలవేంకటేశ !

## 52 పి హైమవతి - బి ఓ ఎల్ కరీంనగర్

1 తెలుగుపట్టి - 1980 ఈ 'బాలనీతిశతక' పరిచయం పద్యకావ్యాల్లో చేయబడింది

## 53 పోతుగంటి, కోరుట్ల , జన్మతేది 2-1-1952, 1 భూమగౌడ శతకము - 1980

భూమగౌడు గారికి చదువు మితం అయినా కొరుట్ల వాతావరణం వీరిని కవిగా మార్చింది తన పేరుతో ఈ శతకాన్నీ రచించారు ఇందలి పద్యాలు ఆటవెలదులు నూటా పన్నెండు భక్తి పద్యాలు మొక్కుబడిగా మూడో నాలుగో మిగిలావన్నీ సామాజిక నీతులే

కష్టమేమి లేక కన్నవారిని తిట్టి, కడుపు నింపువాడు కరినుడయ్య
కుక్క కుండ పగుల గొట్టి తిన్నవిధాన, పోతుగంటి వాడ - భూమగౌడ, 14
హీన జనుల కెన్ని హితవులు చెప్పిన, హీనమైన పనులు మానలేరు,
కాకిపిల్ల రంగు కడిగిన బోవునా? పోతుగంటి వాడ భూమగౌడ, 32

## 54 నారంభట్ల లక్ష్మీనారాయణ శర్మ - బి ఓ ఎల్ దుంపెట, మం కథలా పురం



1 దుంపెట నారసింహ శతకము - 1980

లక్ష్మీనారాయణ గారు బి ఓ ఎల్ పట్టభద్రులై ఆంధ్రభాషో పాధ్యాయులుగా ప్రభుత్వోదోగం చేస్తున్నారు జన్మదినం బహుధాన్య మాఘ శు ॥ వసంత పంచమి 25-1-1939 బుధవారం లక్ష్మీనారాయణ గారు సంస్కృతాంధ్ర భాషలలో పండితులు - కవి వీరు సంగీత సాహిత్య

విశారదులే కాక రంగ స్థల నటులు అముద్రిత పద్యగేయ వచన కృతులు అయిదారుగల వీరి ముద్రిత కృతులు సంస్కృతంలో దుంపెట శ్రీనారసింహ శ్రీ వేణుగోపాల సుప్రభాతం ఆంధ్రకృతి శ్రీ దుంపెట నారసింహ శతకము దుంపెట క్షేత్ర చరిత్ర వీరి అముద్రిత వచన గ్రంథం

స్థానిక కులదైవ భక్తి స్తోత్ర కృతి వీరి శతక కావ్యం ఈ సీస పద్య భక్తి శతకం పలువురు కవి పండితుల ప్రశంసావాక్యాలతో పద్యాలతోపాటు ప్రచురింపబడింది కవి ఇందులో భక్తి భావాలతో పాటు బంధ గర్భ పద్యకవితా చిత్రాలు చూపినారు మొదటి పద్యం సప్త దళబంధసీసం 99 పద్మబంధం

ఈ శతక పద్యాలలో చిత్ర కవితా విన్యాసం కల మరి రెండు పద్యాలు 97 98 ఇట చూపబడుతున్నవి కంద కోరక గర్భ సీసము ఇది

సీ శ్రీ సువర్ణసుచేల! యో 'సురవరనర కేసరివై బుట్టి కినుక తోడ
ఖరనఖాళి హిరణ్య కశిపుని దునిమిన 'హే'శ్రిత వరదా! మహేంద్ర వినుత
కరుణార్ద్రలోచన ! తరమే నినుగొని యాడగ వేదములకైన సుగుణ నిలయ
వనధి శయన ! 'కరివరద! సరోరుహ పద ! కాళియ దరదా! పద్మనాభ!

గీ క్రమ కౌస్తుభ మణిభూష ! కంధి శోష సలలిత మృదు మధుర భాష ! సాధుపోష
అసుర గజసింహ విధ్వంసితా శ్రితాంహ ఘోరతర రంహ ! దుంపెట నారసింహ

ఈ సీస పద్యంలో దాగి ఉన్న కంద పద్యం పైన కామాల మధ్య చూపబడినది చూడండి

కం సుర వర నరకేసరివై, హిరణ్య కశిపుని దునిమినహే శ్రితవరదా
తరమే నిను గొని యాడగ, కరి వరద సరోరుహ పద కాళియ దరదా!
ఈ కందం కోరకం (పూ మొగ్గ) చిత్ర బంధంగా వ్రాసి చూపబడింది - పుట 50
మరొక పద్యం మత్తకోకిల గర్భసీసము - సీస గర్భమత్తకోకిల !

సీ మోహ పాశముతోడ గేహమె మోక్షమంచును నమ్మియున్-నాదు మనమునందు
స్నేహ భావము తోడ నీపద సేవసేయక పోయితిన్ - హిరణ్యాక్షహరణ
ద్రోహి యంచును నన్ను దూరకతోయజాంబక గావరా - శ్రిత పారిజాత
ఐహికాది సుఖంబులంత్యము నందు మోక్షము నిమ్మురా - వేగ గరుడగమన !

గీ శంఖ చక్ర గదా ఖడ్గ శార్ఙ్గ పద్మ, కీలిత చతుర్భుజాదండ కీర్తి శౌండ ॥ అసుర ॥

ఈ సీస పద్యం మొదటి నాలుగు చరణాలు మధ్య గీతల చివరి భాగాలు వదలి పై భాగాలను మాత్రమే చదివితే అది మత్తకోకిల వృత్త పద్యం భక్తి భావ విలాసాలు, చిత్రబంధ విన్యాసాలు లక్ష్మీనారాయణ శర్మగారి కవిత్వంలోని ప్రత్యేకతలు

## 55. సి డి. వేంకటరాజు - పెద్దపల్లి కీర్తిశేషులు. I తెలుగు బిడ్డ శతకము - 1981

ఈ కవి కోనేరుపల్లిలో భట్రాజు కులమున రంగ మాంబా ధర్మరాజు దంపతులులకు 1920లో జన్మించారు ప్రభుత్వ ఉపాధ్యాయులై 1977లో పదవీ విరమణ పొంది పెద్దపల్లిలో స్థిరనివాసం ఏర్పరచుకున్నారు పలు గేయాలు, బుఱ్ఱకథలు, దేశభక్తి గీతాలు రచించిన వీరు విద్యార్థులకు నీతి ప్రబోధం చేస్తూ రచించి ప్రచురించిన శతకం తెలుగు బిడ్డ 'తెలిసికొనుము దొడ్డ తెలుగు బిడ్డ' అనే మకుటంలో 161 ఆటవెలది పద్యాలు ఈ శతకంలో ఉన్నాయి



బడికి పోయి చదువు పండిత జ్ఞానము గుడికిపోయి శాంతి కూర్చు కొనుము
బడికి గుడికి పోక పాడి తప్పకు సుమీ ॥ తె ॥ 7
ఈశ్వరుండనినను యేసు క్రీస్తనినను అల్లయనిన అంతరాత్మ వెలుగు
దేవు డొక్కడోయి జీవులందరికిని ॥ తె ॥ 10

## 56 పాలెపు రాజేశ్వర శర్మ - ఎం ఏ బి ఎస్సీ, కోరుట్ల,

1 శంకరశతకము - 1982

రాజేశ్వరశర్మ గారు చదివినది సైన్సు విద్యనైనా జన్మస్థల వంశ పరిసరాల ప్రభావంవల్ల ఈ యువ కవి భక్తి భావాలతో గీత పద్యాలతో ఈ శంకరశతకం రచించారు ఛాపలహరి వీరి రెండవ పద్య కృతి

సత్కవిత్వ గంగాజల సముదయముల, నీ పదములభిషేకింతు నేను గాన
నిలువు మయ్య నా కండ బునీత హృదయ, భవ తిమిర పూష! శంకర! భక్త పోష - 37

ఇందులో శివశక్తి ప్రశంస, శివపురాణ గాధల ప్రసక్తి, సామాజిక విమర్శగల భావాలున్నాయి పద్యాలు రుద్రాక్షమాలలోని బీజాల వలె నూటెనిమిది

## 57 దూడం నాంపల్లి - బి ఓ ఎల్ సిరిసిల్ల 1 శిష్య ద్విశతి - 1982

సహజకవి నాంపల్లి గారు స్వయంకృషితో పాండిత్యం సము పార్జించుకొని తెలుగు పండితులుగా ప్రభుత్వోద్యోగం చేస్తూ కవిత్వవ్యాసంగం కావిస్తూ రాణిస్తున్నారు కావ్యం హరికధా ప్రక్రియలలో అయిదారు పుస్తకాలు ప్రచురించిన వీరి తొలి కృతి ‘ శిష్య ద్విశతి ’ నాంపల్లి గారు మొదట కొన్నాళ్లు ఆరోగ్యశాఖలో పనిచేశారు కాబట్టి, ఆ రంగంలోని గుట్టు రట్టుచేస్తూ కొన్ని ఆరోగ్యసూత్రాలు తమ సామాజిక నీతిబోధ సూక్తులకుతోడుగా ఈ ద్విశతిలో శిష్యులకు ఉపకరించే విధంగా పొందు పరిచారు అందమైన యీ రెండువందల కందాల్లో సాహిత్య సామాజిక రంగాల అంతరంగ కపట నాటకాలను కూడ బహిరంగం కావించారు మచ్చుకు రెండు పద్యాలు

కవి యేమొ టెంపరేచర్ దవిలి విమర్శించువాడె ధర్మామీటర్
భువి పబ్లిషరే డాక్టరు - అవుదురు పాఠకులె రోగులనగన్ శిష్యా 48
మైకుంటె చాలు కొందరు లైకెంతోచేసి మాటలాడుదు రందున్
మైకముతో ఏదేదొఅ -వాకు చవాకులను మేటి వక్తలు శిష్యా 56

## 58 ‘విశ్వ’ భద్ర కవి - ఎం ఏ - మల్లాపురం, 1 భద్రనారసింహ శతకము - 1982

‘విశ్వ’ కవి (ఇమ్మడోజు భదయ్య) ధర్మపురి లక్ష్మీనరసింహ స్వామిపై భక్తితో ఈ శతకం రచించారు శేషప్ప కవి విరచితాలైన నరసింహ నృకేసరి శతకాలు విశాలాంధ్ర వ్యాప్తి పొందాయి కొంత కాలానికి ముందు వేమూరి లక్ష్మీనరహరి శాస్త్రిగారు ఒక లక్ష్మీనారసింహ శతకము వ్రాసినట్లు వారి భర్తృహరి సుభాషితములు నీతి శతకంలో అముద్రిత రచనగా పేర్కొనబడింది ధర్మపురి కవులు వి రామయ్య, కె కృష్ణమూర్తి నృసింహ శతకాలు రాశారు ఈ యువకవి ధర్మపురి ఓరియంటల్ కళాశాలలో విద్యార్థిగా ఉన్నదశలో ఈ శతక రచనకు ప్రేరణ కల్గినట్లుంది ఇదీ శేషప్ప నరసింహ శతకం వలె రెండు తేటగీతి పాదాల మకుటంతో సీస పద్యాల్లో వ్రాయబడింది

శ్రీశశ్రీమురహర శివబ్రహ్మ సురవర పూజిత రిపునాశ భువన వినుత
దేవ దేశాధీశ దేవారి దానవ దుర్జాతి నాశక దురితనాశ
వైకుంఠవాస శ్రీవత్స మంగళరూప భక్త మండల పాల భాసురాంగ

మధు సూదన ముకుంద మాధవ మహితాత్మ సర్వలోకేశ్వరా శరణు శరణు
వారి జోదర భూధర భారదూర శుద్ధ సద్గతి ధామ విశుద్ధ భీమ
'భవ్య శ్రీలోల నరసింహ భక్తపాల ధర్మపురివాస! గౌతమీ తట నివాస!'

## 59 సి డి. జయవీర రాజు - ఎం ఏ , పిహెచ్ డి - పెద్దపల్లి జన్మ 29-1-1949

1 చారుచర్య నీతి శతకము 1982, 2 కొండగట్టు హనుమభక్తి శతకము - 1989

పెద్దపల్లి వాస్తవ్యులైన సి డి వేంకటరాజు కవి గారు వీరి జనకులు జయవీర రాజు 'తెలుగులో ఋతు కావ్యాలు' అను అంశంపై పరిశోధన గ్రంధం రచించి డాక్టర్ పట్టా పుచ్చుకొన్నారు హన్మకొండలో ఆంధ్రోపన్యాసకులుగా ప్రభుత్వోగం చేస్తున్నారు వీరి అన్న మారుతీరాజు ఆంగ్లోపన్యాసకులు హిందీ రచయిత

చారుచర్య ఇది విద్యార్థుల కోసం చెప్పిన నీతి శతకం
బ్రతుక లేనివాడు బడిపంతుడెట్లౌను, బ్రతుక నెవడు నీకు బాట చూపె
బ్రతుకు దిద్దినతని భావ్యమ మఱచుట? చారుచర్య యిదియె సజ్జనులకు - 20

ఇందలి నీతులకు పౌరాణికోదాహరణములు సమయోచితంగా చూపబడినవి భావాలు చాలా వరకు పురాతన సంప్రదాయ రీతిలో ఉన్నవి

శ్రీ కొండగట్టు హనుమ భక్తి శతకం 108 పద్యములు
భక్త జనులగాచు భగవంతుడవు నీవు, పరమ యోగి హృదయ పాలకుడవు
నిఖిల భువనపాల నిగమాంత సంచార! కొండగట్టు హనుమ ! అండ నిలుమ!

ఇటువంటివి కవి భావాలు (ఈ కవి శతకాలను వారి సోదరి రత్న ఇచ్చారు వీరి పిహెచ్ డి గ్రంధాన్ని మా బంధువు డా ఎం మురళయ్య (కనుకుల) ఇచ్చారు )

## 60 కాకర్ల కృష్ణమూర్తి - బి.ఓ ఎల్ ధర్మపురి జ. 4-4-1943

కృష్ణమూర్తి గారిది ధర్మపురి బి ఓ ఎల్ పట్టభద్రులైన వీరు మంచిర్యాలలో తెలుగు పండితులుగా ప్రభుత్వోద్యోగం చేస్తున్నారు ప్రముఖ రంగస్థల నటులు కవి లక్ష్మికాంత శాస్త్రిగారికి వీరు పుత్రులు

'శ్రీ లక్ష్మీ నరహరి శతకం' వీరి ముద్రిత కృతి ఈ కవి భద్రాద్రిరామ శతకం అముద్రితం ఇవి 1981కి పూర్వ రచనలు ముద్రిత శతక ప్రతి లభించలేదు విన్నంతలో లక్ష్మినరసింహ శతకం కందపద్య శతకమని భక్తి కంటె సంప్రదాయిక సామాజిక నీతు లెక్కువని తెలసింది వీరి ఖండ కావ్య పరిచయం చేయబడింది

## 61 టి రామానుజస్వామి - ఎచ్ ఎస్ సి , ఎస్ జి బి టి పర్లపల్లి 1920 జననం

1 శ్రీరామ శతకము - 1984 ఈ జిల్లాలోని పర్లపల్లి స్వగ్రామం విశ్రాంతోపాధ్యాయులు సంగీత జ్యోతిష్యాలలో ప్రవేశమున్నది ప్రస్తుతం హన్మకొండలో నివాసం వీరి శ్రీరామ శతకం భక్తిభావాలలో శేషప్ప నరసింహ శతకాన్ని పోలినది కవి డా శ్రీరంగస్వామి వీరి పుత్రులు మచ్చుకు ఒక పద్యం

సీ అర్థ పంచక జ్ఞాన మమరి యుండిన గదా, జ్ఞానమాత్మకు గల్గు మానకెపుడు
ఆకార త్రయనిష్టయాత్మ కుండిన గదా, అన్యదేవతలందు నాసవదలు
నవవిధ సంబంధమువదలినట్టైన, ఇతరాంతరంబుల యిష్టముడుగు
తత్త్వత్రయంబాత్మ తరచి చూచినగదా, మంత్రాంతరంబుల మాని బ్రతుకు

భువిని నీయర్థముల యొక్క భోగ్యతెరిగి, చేతి నిష్ఠల నున్నట్టి చేతనులను
దయను రక్షింతు వట తండ్రి ధర్మమూర్తి అందు కొనవయ్య శ్రీరామ వందనములు పు 18

## 62 గజెల్లి శివరాజం - ఊటుపల్లి తా॥ మెట్టుపల్లి జ॥ 1937

శివరాజంగారిది మెట్టుపల్లి తాలూకాలోని ఊటుపల్లి స్వయంకృషిలో సాధించిన పాండిత్యంతో ఆరేడు పుస్తకాలు రచించారు ఈ కవి ముద్రిత శతకాలు రెండు

1 వేణుగోపాల శతకము - 1975 2 హనుమాన్ శతకము - 1982

మొదటిది సీస పద్య ఏకోత్తరశతి "బాల రవిభాసగోపికాలోల లీల
శీల గుణజాల! వేణు గోపాలబాల!" అని మకుటం ఇది భక్తి సంభరితం

శ్రీ హనుమాన్ శతకము - కంద పద్యాలది
నీనామ ముచ్చరించిన, వానికి కడు భక్తి ముక్తి వరలున్ సిరులున్
రానేరవు దురవస్థలు, దానవకుల కాననాగ్ని దయగను హనుమా - 3

అని హనుమన్నామ మహత్త్వాన్ని కొని యాడుతు శ్రీరామనామ స్మరణమను భవతరణ మార్గం జూసినందుకు అభినందించారు

వీరి ఇతర కృతుల పరిచయం ఆయా సాహితీ ప్రక్రియా విభాగాల్లో ఉంది

## 63 గంటిడి గంగారాం, బి ఏ - కోరుట్ల 1923 - 1994

1 పూర్ణరామ శతకము - 1985

గంటిడి గంగారాం పాండువాలా పూర్వులు ఔత్తరాహులు మాతృభాష హిందీ

గంగారాం హేతువాది కవన వ్యాసంగం ఏమాత్రం లేని వీరు వేమన కవి పద్యాలపై కల అభిమానంతో 1986లో మలయశ్రీ కవితో పరిచయం కలిగించుకొని ఛందస్సు నేర్చుకొని ఆటవెలది పద్యాలతో 'పూర్ణరామశతకమును' కొన్ని మాసాలలో రచించి 1986 లోనే ముద్రించుకున్నారు "వినుడి పూర్ణరాము విమలనీతి" అని వీరి శతక పద్య మకుటం కవి గంగారాము - అతని భార్య అన్నపూర్ణ అందుకే అది 'పూర్ణరామ' శతకం అయింది

ఇందలి నీతులన్నీ సామాజికాలు - నీతి రీతి - బోధన విమర్శ ఇందలి విషయాలు
మొగ్గ పుష్పమగును పుష్పంబు రాలియు, మట్టిలోన కలిసి మాయ మగును
మనిషి బ్రతుకు రీతి కనిన నింతేనయ, వినుడి పూర్ణరాము విమల నీతి 2
అన్ని నీతులెరిగి యా ధర్మజుండోడె, జూదమందు సతిని సోదరులను
వ్యసన పరుని బ్రతుకు వ్యర్థమై పోవురా, వి॥ 31
అమ్మ నాన్న ప్రేమ యన్న దమ్ముల ప్రేమ, విడిచి పెట్టి భార్య వెంట వెళ్లి
అత్తయింట దాసుడై యుంటనీచమ్ము ॥ వి ॥ ప 26



ఈ శతకం శతావధాని కృష్ణమాచార్యుల ఆశీస్సులతో వెలువడింది

## 64 వేంగళ రామకృష్ణ - సిరిసిల్ల, జననం 5-8-1937

1 సత్యనారాయణ శతకము - 1989 రామకృష్ణ గారి స్వస్థలం వడ్లూరి బేంగంపేట నివాస స్థలం సిరిసిల్ల ప్రభుత్వ పశుసంవర్ధక శాఖోద్యోగి దూడంనాంపల్లి గారితో కలిసి 'ద్వయీ నాదం' ఖండ కావ్యం 1993లో ప్రచురించిన వీరి మరో స్వంత రచన 'శ్రీసత్యనారాయణ భక్తి శతకం - 1989లో వెలువడింది

ఎన్నో యేండ్లు గతించె నిప్పటికి మాయింట న్వసింపంగ శ్రీ
మన్నారాయణ! నీదు విగ్రహము సౌమ్యాకారమై భక్త సం
పన్నంబై కులదైవమై ప్రతిదినంబారాధ్యమై యొప్పగా
జెన్నొందన్ భజియింతు జిత్తమున నిన్ శ్రీ సత్యనారాయణా 4
పశ్చాత్తాపము జెందమన్మథుడు నీపై బాలు వర్షింపనీ,
దుశ్చిత్తుల్ నిరతంబు పన్నిన కుయుక్తుల్ పన్ననీ, వేగజ్యో
తిశ్చక్రమ్ము మహోగ్ర కల్పమయి ధాత్రిన్ గూలినన్ గూలనీ
నిశ్చింతన్ మదిలోన నిన్ను దలతున్ శ్రీ సత్యనారాయణా 10

ధూర్జటి కాళహస్తీశ్వర శతక మకుటాన్ని భక్తి భావాలను తలపించే శైలీ ప్రసన్నతగల రామకృష్ణ గారి సత్యనారాయణ శతక పద్యాలు నూటాఎనిమిది

## 65 కె రామయ్య ఎం ఓ ఎల్ - ధర్మపురి - 1981లో 45 సం వయస్సు

రామయ్యగారు ఎస్ ఎల్ ఎన్ కళాశాల ధర్మపురిలో ఆంధ్రోపన్యాసకులు పదవీ విరమణ పొందారు వీరు సంస్కృతాంధ్ర భాషలలో కవి వ్రాసినది తక్కువ 'శ్రీధర్మపురి శ్రీహరి శతకం' వీరి భక్తి రచన

వీరి శతకంలోని ఒక పద్యమిది నిరంతర సంస్కృతాంధ్ర గ్రంథ పఠన శీలురు

శ్రీ కరుణాలవాల! భవ సింధు తితీర్షక భక్త తారకా
నాక పతీంద్ర వంద్య చరణాంబుజ రంజిత లోక పావనా
భీకర దైత్య కంటక విభేదన దారుణ చక్రహస్తకా
శ్రీకర 'పాహిమా' మని భజించెద ధర్మపురీ నృకేసరీ!

ఈ శతక మకుటం ధర్మపురి శేషప్ప నృకేసరి శతకంలోనిది మరికొన్ని భక్తి రచనలు చేసినా అవి అముద్రితాలు

## 66 'అనంతశ్రీ' కాకుత్థ్సం అనంత స్వామి - హిందీ విద్వాన్ - జగిత్యాల కీ శేషులు

1 శ్రీ ధర్మపురీ లక్ష్మీనారసింహచతుశ్శతి - 1989

కవి తమ ఇష్టదైవమైన గోదావరిఖని సమీపంలోని 'సుందిల్ల నరసింహస్వామి' చతుశ్శతిని రచించి ఏలనోదానిని తమ జన్మగ్రామదైవమైన ధర్మపురి నరసింహునిపేర మార్చారు ఈ కృతి ఇంకా ముద్రణ పొందలేదు అందలి కొన్ని పద్యాలు ఏర్చి కూర్చిన విష్ణుదేవ ప్రార్థనా స్తబకం ఈ చతుశ్శతి చిరు సంపుటి అనేక హరినామ సంబోధనలతో ఉన్న ఈ పద్యాల్లో ఆ శతకాల పద్యమకుటాలేవో గుర్తింప వీలు కాకుండా ఉంది వీరి పద్యాలు చూడండి

బహుకాలంబు పరాకులయ్యె, బహుశా ప్రారబ్ధమో, నేలకో
బహు సంఖ్యాకము దేవతాగణము, లబ్బా! యింద్రజాలంబు, నీ
బహురూపాత్మక నామ సంస్మరణముల్, బాహుళ్య సందర్శనల్
స్పృహణీయంబగుచుండుటే దురితమో? శ్రీరంగ ధామ ప్రభో! పు 3 ప 7
స్తోమ ప్రీత పరాత్పరా శుభకరా, సూర్యేందు కోటి ప్రభా
స్థేమోత్సాహద, భక్తి యోగమయ హృత్సీమద్యుతే, హే పరం
ధామా, శిష్టజనావనా! కవి 'యనంత శ్రీ' మనోరంజనా!
శ్రీ మీనాద్యఖిలావతార విభవ శ్రీ తత్త్వ మూర్తీశ్వరా! పు 2 ప 12

ఈ కవి - కావ్య పరిచయం పద్యకావ్య విభాగంలో చేయబడింది

## 67 వేముల పెరుమాళ్ళు - రాయికల్, 1 లోగుట్టు చతుశ్శతి - 1989

పెరుమాళ్లుగారు చతుర వచోనిధి చక్కని వక్త వీరు రాజకీయ రంగంలో రాటుదేలి ఓడిన ఎం ఎల్ ఏ గెలిచిన మండలాధ్యక్షులు వీరు తమ రాజకీయ జీవితానుభవాలను సామాజిక స్థితిగతులను విశ్లేషించి 'లోగుట్టు పెరుమాళ్ల కెరుక' అనే ధోరణిలో 50 శీర్షికలతో కుడి ఎడమగా సరిపోయే రీతిగా 400 ఆటవెలది పద్యాలను రచించి 'లోగుట్టు బయట పెట్టారు 1989లో ఇందులో రాజకీయ - సామాజిక పరిస్థితుల పరిశీలన - హితోపదేశ సూక్తులున్నాయి

మచ్చుకు ఇందుండి రెండు పద్యాలు చూడండి



ఒక వ్యవస్థ స్థిర పడక మునుపే పాత,
దానిని తొలగించ తగద దెపుడు
తుగ్లకయ్య పనులు తూతుల తెచ్చును
మరువ రానిది పెరుమాళ్ల మాట
శాసన సభలోన శాంతి భద్రతలను
మంత్రి భంగపరచి మైకు విరిచి
గంతు లేయనింక కాపాడు వారేరి?, మరువరానిది పెరుమాళ్ల - ప్రశ్న!

## 68 ఎనుగంటి వేణుగోపాల్ బి ఎస్సి. జగిత్యాల; 1 వేణుగాన శతకము - 1990

ఎనుగంటి రాజమల్లయ్య గారు సదాచారవంతులు సాహిత్యారాధకులు విశ్రాంతోపాధ్యాయులు వారి పుత్రుడైన వేణుగోపాల్ ఈ భక్తిభావ బాల నీతి శతక రచన కావించారు ఇందులో భక్తి కంటె లోక నీతులు - మానవ ధర్మానురక్తి ఎక్కువ ఇవి ఆటవెలది పద్యాలు మచ్చునకు రెండు

కుల మతములు మదిని కుళ్లను రేపును, మతము వీడి జనుల హితము గోరు
మంచి మనసె కాద, మహిలోన నిల్చును, వినుడు వేణుమాట విజ్ఞులార! - 56
కష్ట కాలమందు నష్టంబు లెదురైన, ధర్మమెపుడు నీవు దప్పబోకు,
నీదు ధర్మమెపుడు నిన్ను గాపాడును ॥ వి ॥ - 63

దైవ నుతిలేదు అధిక సంతానం మత్తు, జూదం మొ॥ దుర్గుణాలు వలదని సుగుణాలను ప్రబోధించిన ఈ శతక నామం 'వేణు కవి గానమేమో!

## 69 ఎం గోపాల కృష్ణ శర్మ - అంబాల,

1 శ్రీ రామ అష్టోత్తర శతకము - ము సం లేదు ఇది సీస పద్యశతకం భావాలు భక్తి ప్రదాలు

రామాయటంచును వేమారు పఠియింప, భవభయంబెల్లను బాసిపోదె
దాశరథేయంచు దలచినవేగమే, దారిద్ర్యదేవత తరలిపోదె,
యినకులేశుని పయిన్ మనమునిల్పిన యెడ, యీప్సితార్థంబులు యీయకున్నె
నారసింహాయంచు నాల్కతో నొకసారి, పల్కిన గ్రహములు పారిపోవె
నహహా నీ మహిమంబెన్న నాతరంబె, పవన సుతనుత రఘు వీర పరమ పురుష
రమ్య కమలాపుర నివాస రామచంద్ర, దయతొ రక్షింపవయ్య యో ధర్మహృదయ 5

## 70 పరాంకుశం మురళీధర స్వామి - ఏం ఏ కొడిమ్యాల జన్మతేది 2-10-1942

1 శ్రీ సత్యదేవ శతకము 1990

'జయశ్రీ కలంపేరుతో రచనలు వెలయించే పరాంకుశం మురళీధర స్వామి గారి స్వగ్రామం కొడిమ్యాల ఎం ఏ బి ఓ ఎల్ చదివిన వీరు జిల్లా సెకండరీ పాఠశాలల్లో ఆంధ్రభాషోపాధ్యాయులు పండిత కవులైన వీరు విద్యార్థుల కోసం వైష్ణవభక్తుల కోసం అయిదారు రచనలు చేసి రెండు పుస్తకాలు ప్రచురించారు వీరి ముద్రిత పుస్తకాలు సత్యదేవ శతకం శ్రీహనుమద్ధ్యానం

'నిత్యభక్తార్తిహర పాహి సత్యదేవ మకుటంతో సాగిన వీరి శతకంలో 116 తేటగీతులున్నాయి ఉదాహరణకు ఒక పద్యమిది

శ్రీ నిలయ దేవుడున్నాడొ లేనె లేడొ, ధ్యానమొనరింప దెలియును జ్ఞానికెపుడు,
అద్దమెదుటున్న రూపంబు నడుగ నేల? ॥ నిత్య ॥ 2

భక్తి భావాల పద్య సంపుటి మురళీధర స్వామి గారి సత్యదేవ శతకం

## 71 కె మల్లికార్జున్ ఎం ఎ , బి ఇడి నగునూరు జన్మ 8-10-1932

1 ఓటరయ్య శతకము - 1992, 2 అముద్రిత శతకం - 'మనసుపాట', 3 విపంచి ఖండకావ్యం ముద్రితం

కందుల మల్లికార్జున్ గారు నగునూరులో సంపన్న వ్యవసాయ కుటుంబంలో జన్మించారు భాగ్యనగరంలో ఏం ఏ చదివి, బి ఇడి చేసి ఈ జిల్లాలో అధ్యాపకులుగా పనిచేసి విరమణ పొందారు డా సి నారాయణరెడ్డి, గట్టెపల్లి సత్యనారాయణరాజు గారితోపాటు వీరు తెలంగాణా రచయితల సంఘంలో పాలుగొన్నవారు సంగీత నాటికలు, గేయాలు పద్యఖండికలు వీరి ఇతర కృతులు ఓటరయ్య శతకం వీరి ఇటీవలి రచన 1992లో ముద్రితం

ఆశయాలు మంచి ఆదర్శములు మంచి రాజకీయ పార్టిరాక మంచి
పైన మేడిపండు లోన లోపాలురా ఓటు కోటి జేయు ఓ టరయ్య - పు 9

ఇందులో రాజకీయ - పౌర రీతినీతులేకాక 'ఓటు'తో సంబంధంలేని సామాజిక హితోక్తులు కూడా ఉన్నాయి

ఆడపిల్ల తండ్రి అగచాట్లు లెక్కింప - వశము కాదు దిద్ద వలయు దీని
రక్కసి కట్నమ్ము రక్తమ్ము త్రాగురా - పు 17

"మల్లనార్య వినుము మనసు పాట ' అని రెండో శతకమకుటం, అది అముద్రితం

## 72 అనంతవరం మాణిక్య లింగము; గుండారెడ్డిపల్లి

సిద్ధప్ప వరకవి కుమారులైన మాణిక్య లింగం గారు అధ్యాపక వృత్తిలో ఉన్నారు సాహిత్యాభిమానంతో కవితలు రాస్తున్నారు వీరి ముద్రిత కృతులు రెండు



2 శాంతికరణాలు (గేయాలు) 2 వయోజన మంజరి - శతకం 1992

కవి పుస్తకముఖ పత్రంపై పద్యకావ్యం అన్నా, ఇది అచ్చంగా గీత పద్యశతకం "భారతీయ వయోజన పౌరులార! ' అని ఇందలి మకుటం కానయితే కుటుంబ నియంత్రణ, ఆరోగ్యం పరిశుభ్రత, నీతిపథము అని కొన్ని శీర్షికలున్నవి ఇవి సరళమైన పద్యనీతులు ముఖ్యంగా విద్యా ఆరోగ్య నీతి సంబంధమైనవి వాటిలో ఒక పద్యం ఇది

ధనము వచ్చును పోవును ధాత్రిలోన కష్టసుఖములు చిగురించి కడకు తొలగు
చదువు నేర్చిన మీలోన నొదిగి యుండు, భారతీయ వయోజన పాపలార!

## 73 డా॥ వద్లూరి ఆంజనేయరాజు, ఎం ఏ , పిహెచ్ డి , పరియం లలిత గేయ కవుల్లో ఉంది

ఆంజనేయరాజు గారు కరీంనగర్ జిల్లా వారు హైదరాబాదులో అధ్యాపకులు పద్యగేయ కావ్య రచయిత వీరి మూడవ పుస్తకం 'శ్రీ సత్యసాయి శతకము' 1992లో వచ్చింది డా వి కొండలరావు డా జి వి సుబ్రహ్మణ్యం గారల పీరికలతో వెలువడిన ఈ శతకాన్ని పుట్టపర్తి బాబా స్వయంగా స్వీకరించి ఆశీర్వదించారని కవి కధనం ఇది సంపూర్ణ భక్తి శతకం సాయి స్తోత్రం 118 ఆట వెలదులు దృష్టాంతాలు బాగున్నాయి

అజుడవనిన నీవె - అచ్యుతుడన నీవె । హరుడవనిన నీవె ఆత్మనీవె
అంతరాత్మ నీవె అఖిలాత్మ నీవయా । సత్యవాక్యమిదియు (యె) సత్యసాయి 82

## 74 జి.వి కృష్ణమూర్తి, బి ఎస్సి., బి ఇడి , ముస్తాబాద్; జ 1940

ముస్తాబాద్ వాస్తవ్యులు జిల్లా పరిషత్ సెకండరీ పాఠశాలల్లో ఉపాధ్యాయులైన కృష్ణమూర్తి గారు సౌమ్యులు, సంగీత ప్రియులు, సాహిత్యారాధకులు వీరి 'వేంకటేశ్వరా శతకము' 1994లో ముద్రణ పొందినది ఈ భక్తి శతకంలో భక్త కవిగా వీరి భావాలు పలు కోణాల్లో పయనించాయి అందలి ఒక పద్యం చూడండి నం 51

నీవొక చిత్రకారుడవు, నీదగు విశ్వపు చిత్ర మందునన్
భావములెన్నియో గలవు, పామరుడైనటువంటి నాకిటన్
ఏవిధి నేర్వవచ్చు సకలేశ్వర! నీ చిఱు కుంచెదాగు సం
భావిత మోహరంజిత విభాసుర రేఖలు వేంకటేశ్వరా!

## 75 వాసం శివనారాయణ, ఎం ఏ , కరీంనగర్

శివనారాయణ జన్మస్థలం గోపాలపురం కరీంనగర్‌లో స్థిరనివాసముంటున్నారు ఎం ఫిల్ లో చేరిన నారాయణ గారు మహతి కాలేజి ప్రిన్సిపాల్ కె వి సుబ్బారావు గారితో కలిసి జంట కవిత్వంలో సబ్బి సాంబశివ శతకం' రచించి ఆగాచార్యగారి అందమైన ముఖ చిత్రతో 1993లో ముద్రించారు శ్రీకారాదితో ఇష్టదేవతా నుతులతో సలక్షణంగా 116 ఆటవెలది పద్యాల్లో రచింపబడిన ఈ శతకంలో మకుటం 'సాంబదేవ' 'దైవభక్తి సామాజిక నీతి వర్ణనలతో ఉన్న ఈ శతకంలోని 110 వ పద్యంలో కవి హృదయం ఇది



శర్వుదయను గోరి శతకంబు వ్రాసితి,
పరుల రుచుల తోడ బనియులేదు,
బిరుదు వెంచుకోళ్ల బ్రీతి యేమియుగావు,
చంద్రచూడు కరుణ చాలునాకు

ఇందలి సగం పద్యాలు మకుట పద రహితాలు

## 76 సేనాపతి దత్తాచార్య - హిందీ విద్వాన్; కరీంనగర్ జన్మతేది 5 4 40

దత్తాచార్య గారు సేనాపతి రామాచార్య కవిగారి పుత్రులు, కరీంనగర్ స్వస్థలం వీరు హిందీ పండిత్ హిందీ కవి హిందీలో హితపథ్ పరిమళ్ కావ్యాలు రచించి ప్రచురించిన వీరు మాతృభాషా సాహిత్య మందలి ప్రేమతో తెలుగులో సైతం 'మనోబోధ' నీతి శతకాన్ని 1993లో వెలువరించారు

వేమన రీతి ప్రతిపద్యం రెండు పాదాల్లో ఒక నీతిని చెప్పి మూడవ పాదంలో దృష్టాంతమో అర్థాంతరన్యాసమో నిలిపి నాలుగవ పాదంలో మకుటాన్ని ఉంచారు



శుభము చేయ నరుడు క్షోభనొందుచునుండు
జగమునందు దుష్ట జనుల వలన
పండ్ల మావి కెపుడు బండల దెబ్బలే
మనమ వినుమ నాదు మంచి మాట 101
సూదిరంధ్ర మదిగొ చూడండి యనిబల్క చెల్ల గలదె యెందు జల్లెడకును
తప్పు లెన్నువారు తమతప్పు లెరుగరు - 108

## 77 డా॥ అందె వేంకటరాజము, ఎం ఏ, బి ఓ ఎల్, పిహెచ్ డి , కోరుట్ల

1 ఈశ్వర శతకము - 1993 లాక్షణిక ప్రౌఢకవి అందె వేంకటరాజము గారు దాదాపు ఇరువదేండ్ల క్రితం రచించిన ఈశ్వరశతకం 1993లో ముద్రితమైనది ఇది భక్తి శతకం

వేదాలే యిద మిత్థ మంచు బలుకన్ వెన్కాడు, శాస్త్రాలు బల్
వాదాలే యొక తీర్పునొప్పవు బృహద్ వ్యాఖ్యన్ పురాణాల పల్
భేదాలే నిను జెప్పబోవుచు మహా విభ్రాంతిలో ముంచు నీ
పాదాలే గతి మూఢ చిత్తుడనెటుల్ వర్ణింతునో యీశ్వరా

'భాస్కరా' శతక మకుటాన్ని పోలిన ఈ మకుటం నాలుగు రకాల ప్రముఖ వృత్త పద్యాల రచనకు వీలైనది మకుటం వేరైనా ఈ పద్యాలు కాళహస్తి శతకాన్ని పోలినవి

## 78 డా॥ వఝల రంగాచార్య - ఎం ఏ , పిహెచ్ డి కరీంనగర్ జ. 1950

రంగాచార్య గారి జన్మస్థలం ఖమ్మం జిల్లాలోని పాత పాల్వంచ కరీంనగర్ బిషప్ సాలమన్ జూ॥ కాలేజీలో ఆంధ్రోపన్యాసకులైన వీరు ఇక్కడే స్థిర నివాసం ఏర్పరచుకున్నారు సరస్వతీ పుత్ర పుట్టపర్తి నారాయణచార్యుల కృతులపై పరిశోధన కావించి కాకతీయ విశ్వ విద్యాలయం నుండి వీరు పిహెచ్ డి పట్టాని గ్రహించారు అనంతరం రంగాచార్యులు ఈ రెండు శతకాలను రచించి ప్రచురించారు 1 శత పుష్కర - 1992, 2 భార్గవీ 1993

శతపుష్కర ఇది నిర్మకుట పద్య శతకమని కవి గారు మనవి' లో తెలిపారు సర్వవ్యాపియైన నానారూప పరమాత్మను ఏకరూప మకుట పరిధిలో వర్ణించడం సరిపోదని ఈ కవి భావన ఇందులో చంపకోత్పలాలు నూటా ఒక్కటి ఈ విష్ణుభక్తి శతకంలో సంప్రదాయ భావాలకు తోడు కవిగారి నూతన సామాజిక వర్ణనలు అందంగా కనిపిస్తాయి ఉదాహరణకొక పద్యం



పిచ్చుక పంట చేలబడి పీచుగడించని జొన్న పాట్టలో
విచ్చెడి విత్తునై పడెడి వేసటగా నిను జుట్టుచుంటి, పై
పెచ్చు పాలమ్ము కాపు విధి పెట్టిన పంజర బంధనమ్ములో
జొచ్చితిగా ప్రమాదమున, జూడ్కులనన్ విడిపింపరా ప్రభూ - 91

భార్గవీ ఇది భార్గవీ అను మకుటంతో సాగిన లక్ష్మీ స్తుతి శతకం

ఆచార్య పేర్వారం జగన్నాథం, గీట్ల జనార్దన్‌రెడ్డి గారల పీఠికలతో వెలువడిన ఈ శతక పద్య కృతి కరీంనగర్ జిల్లా వాస్తవ్యులు ప్రముఖ సంస్కృత కవి అయిన శ్రీ భాష్యం విజయ సారధి వరంగల్ విశ్వేశ్వర సంస్కృతాంధ్ర కళాశాల సంస్కృతోపన్యాసకులు గారికి అంకితం కావించబడింది ఇందలి కవి రచన సాఫీగా ఉంది మచ్చుకొక పద్యం

శతమీ జిహ్వకు తేనెలూరినటు పూజా ద్రవ్య సంఘంబటుల్
శత పత్రమ్ముల రేకుటట్లు పునుగున్ జవ్వాది గంధంబటుల్
జతగా నేసిన పట్టు వస్త్రములు భక్ష్యామోద కాహార మ
ట్లు తరింపన్ నవ హేమ తారకము నట్లూహించెదన్ భార్గవీ 100

భక్తి పూర్ణ పద్యకృతులతో పాటు, డా వి రంగాచార్య కవి గారు సామాజిక భావాలతో వచన గేయాలు సైతం వ్రాశారు

## 79 గంగారాజేశ్వరరావు ఎం ఏ , బి ఇడి మంథని

రాజేశ్వరావుగారు సంపూర్ణ సాహిత్య మూర్తి ఎనుబదేండ్ల వయస్సులోనూ నిరంతరం కవితా వ్యాసంగం కావిస్తున్న ధన్యులు వీరి పద్యకావ్యాల పరిచయం చేయబడింది గేయకావ్యాలు నాటికలే కాక మరి రెండు ఈ దిగువ చూపిన శతకాలు వీరివి ముద్రణ పొందినవి

1 శ్రీ వేణుగోపాల శతకము 2 ఆత్మబోధ శతకము

ఈ రెండు కృతులూ ఒకే పుస్తకంగా 1994 లో వెలువడినవి పురాణగాధల దశావతారాల, హరి మహిమల ఉగ్గడించే వేణుగోపాల శతకం తేట గీతాలది అందలి కవి నీతి ప్రబోధక పద్యాల్లో ఒకటిది

గాలమున గ్రుచ్చబడు మాంసఖండముకయి, - యాసపడి ప్రాణములను మత్స్యంబు వీడు,
ఆశ దు ఖకరంబు నిరాశ సుఖము, వేణుగోపాల పొనూరు ప్రేమగంగ!

పొనూరు గోదావరి తీరాన సూరారం ప్రక్కన ఉన్న గ్రామం అక్కడ వేణుగోపాల ఆలయముంది ముస్లింల ఏలుబడి కాలంలో చంద్రధ్వజులు అక్కడి విగ్రహాలు పెకలించి స్థానిక శివానంద మహర్షి , కాళ్ళు నరికి, ఆయన ఆవును చంపి వండుకు తిన్నారట 'ఆ పంగు (కుంటి) మహర్షి పేరనే ఆశ్రమం పంగూరు క్రమంగా పొనూరు అయిందని ఈ విషయాలు ఆ రుషి వంశపు పంగునూరి రామన్న మంథని గారు చెప్పారని, ఆ ఆలయ ఉత్సవాల పునరుద్ధరించిన తాటికొండ రాజగౌడు రాజేశ్వరకవి శిష్యకవి వ్రాసినారు పొనూరు స్వామిస్తుతి కావ్యమే రావుగారి ఈ శతకం కవి వీటిని ఆటగీతాలు అనటం సరసం సత్యం ఇదే కవి రచించిన మేలన గీతాలు మరో చోట చూపబడినవి

ఆత్మబోధ శతకము - 112 పద్యాలు! ఇది ఆత్మతత్త్వ వివరణ పూర్వ ఉపనిషత్ వాక్య భావాలు స్వీకరించబడినవి రాజేశ్వర రావుగారు పరమభక్త విద్వత్కవి

14 బ్రహ్మనేను సుమ్మి బ్రహ్మవు నీవును, దృశ్య మెల్ల బ్రహ్మదృక్కు బ్రహ్మ
బ్రహ్మగాని దొకటి బ్రహ్మండ మందులే, దాత్మ బోధను విను మమృత గంగ

100 ఏనుగాను దేహమింద్రియ ప్రాణము లరయ మనసు బుద్ధి యహము గాను
నట్టివానికెల్ల నాధారమౌదునే, నాత్మ బోధను విను మమృత గంగ

వీరి కవిత్వానికి శైలీ ప్రసన్నతకంటె అర్థగాంభీర్యం అధికం ఈ రెండు శతకాలకు చివరన 'వేదాంత ఎఱుకత' (సమాసం?!) వైదిక గహనవేదాంతానికి జానపద తత్త్వాల లాక్షణిక పదాల వివరణ రచన ఉంది ఇది 26 పుటలు ఈ పుస్తకానికి కాకుటూరి సుబ్రహ్మణ్యం రేవెళ్ళ మురళీ ధర శర్మగారల పీఠికలున్నవి గ్రంథ ముద్రణకు ద్రవ్యదాత యెలిశెట్టి మహదేవు గారు

శ్రీలందించెడి భాగ్యశాలివి కదా శ్రీవేణుగోపాలనీ లీలల్ కావ్యమునందు నిల్పిన ఘనున్ లీలా విలాసంబుతో లాలించందగు, గ్రంథముద్రణకునై లాలిత్య భావంబుతో - శ్రీలందించిన భాగ్యశాలిని గృపన్ శ్రీలిచ్చి రక్షించుమా - అని పద్యాల్లో కవిగారికి ఆశీస్సులందించారు, కొల్లారం సీతారామశర్మగారు

ఆత్మబోధ శతకాన్ని చదివి అమేయాత్మానందంతో చెప్పాల రామకృష్ణారావు గారు 'నా కనిర్వచనీయమైన యనుభూతి కలిగి సర్వావయవమ్ముల పులకింప జేసి నాలోన నీ విశ్వ సృష్టి విశ్వ సృష్టిలో నేను నైక్యమ్ము చెందినాను" అని యభినందించి నేటి పద్యకవితా దుస్థితికి వారు వాపోయారు

## 80 అరుట్ల రంగాచార్య, బి ఓ ఎల్ - మోతె, జన్మ తేది 6-3-1942

1 సోదర శతకము 1995

రంగాచార్యులు కరీంనగర్ పట్టణ ప్రభుత్వోన్నత పాఠశాలలో ప్రథమశ్రేణి తెలుగు పండితులు రామడుగు మండలంలోని మోతె వీరి స్వగ్రామం వీరు సంప్రదాయ కవి - అష్టావధాని వీరికి సాహిత్యాసక్తి ఎక్కువే అయినా కవితా వ్యాసంగం తక్కువ వీరు రెండు శతకాలను రచించారు వాటిలో శ్రీరామశతకం అసంపూర్ణంగా ఉంది దేశభక్తి ధర్మానురక్తితో వీరు రచించిన రెండవ కృతి సోదర' శతకం



పసి హృదయాలపైన కడు భారము వేయక నాట పాటలన్
పస గల విద్యలన్ గఱపు, వక్ర పథంబులు మాని నేటియ
భ్యసనపు క్రొత్త పద్ధతులవారిగ వెల్వడె, వాని నీవు మా
నసమున నుంచుకొంచు తగ నవ్య పథమ్మున జెప్పు సోదరా - 21

ఉపాధ్యాయ సోదరులనే కాక దేశ పౌరులనందరిని సంబోధిస్తూ వివిధ సామాజిక సత్ప్రవర్తనా హితోక్తులతో ఈ శతక రచన సాగింది

## 81 సముద్రాల వేణుగోపాలచార్య, బి ఓ ఎల్ (సం), గంగాదర జ 1955

వేణుగోపాలాచార్యులు అధ్యాపకులు, దైవభక్తి, ధర్మ ప్రబోధక సాహిత్యాభిమానం కలవారు వీరివి రెండు కృతులు అచ్చయినవి



1 శ్రీ వేంకటేశ్వర శతకము - 1992, 2 భావి పౌర శతకము - 1995

మొదటిది భక్తిశతకం శ్రీ సప్తగిరి వేంకటేశ్వర శతకం 108 తేటగీతి పద్యాలది "వేంకటేశ్వర మముబ్రోవ వేగరమ్ము' అని దీని మకుటం రెండవది భావి పౌరులైన విద్యార్థులకు లౌకిక పారలౌకిక నీతి ప్రబోధం కోసం రచించబడింది ఇవి 108 ఆటవెలది పద్యాలు "భరత జాతిని కావుమా భావి పౌర' అని ఇందలి మకుటం

పంతము రక్కసి భేదాలు మనకు వలదు 107, తనను మసి జేయు శత్రువే తామసంబు - 27, నాది నీదను భావమేనాడు వలదు - 56 మొ॥ నీతి సూక్తులున్నవి సామ్యవాద సిద్ధాంత సరళిలోన (64) సాగుమంటూనే వర్గ పోరాటమే వేనాడు వలదు (67) అన్నారు మాతృ దేశభక్తిని జాతిసమైక్యతను, విశ్వమానవ రీతిని నీతిగా చాటిన ఆచార్యుల అభిమానం ఇది

17 మతము భాషయు జాతిని - మరచిపోయి, మానవత్వము నేనాడు మాన మనుచు
విశ్వమానవాళికి కనువిప్పు కలుగు, భరత జాతిని గావుమా భావిపౌర!

శతకానికి నల్లాన్ చక్రవర్తుల వేదాంతా చార్యులు, అష్టావధాని టి శ్రీహరిశర్మ, ఆంధ్రోపాధ్యాయులు కవి ఎస్ వి ఎల్ ఎన్ ఆచార్యగారల ముందుమాటలున్నవి ఆధునికతను అభిమానిస్తూనే (ఖండిస్తూ) సంప్రదాయాన్ని ప్రేమిస్తున్న కవి సముద్రాల వేణుగోపాలా చార్యులు

## 82 కలువ కుంట రామకృష్ణ, ఎం ఏ , ఎం పిల్, మెట్టుపల్లి

రామకృష్ణ గారు ప్రముఖ భక్తకవి కలకుంట్ల కృష్ణమాచార్యులు గారి కనిష్ట పుత్రులు ఎం ఏ (తెలుగు) లో ఉస్మానియా గోల్డ్‌మెడలిస్టు వీరు వచన గేయాలు పద్యాలు రాస్తుంటారు వీరి ఏకైక ముద్రిత భక్తి కావ్యం శ్రీ వాసర సరస్వతీ శతకము 1995 లో వెలువడింది రామకృష్ణది సంప్రదాయ రచన వాగీశ్వరీ దేవి భక్తి ఈ 125 పద్యాల్లో నిండుగా ఉంది ఇందలి మకుటం "వందనములందుకొను మమ్మ వాసరాంబ' చివరి రెండు పద్యాలు మకుట రహితాలు అనుబంధంలో ఎనిమిదివృత్త పద్యాలు దేవీస్తుత్యాత్మకంగా రాశారు ఇందులో కవి సరస్వతీ కటాక్షం పొందిన పూర్వ మహాకవుల స్మరించారు బాసర క్షేత్ర దేవి మహిమలను వివరించారు



పచ్చి దొంగను వల్మీక భవుని జేయు (వాల్మీకి)
పిచ్చి గొల్లని విభుదేంద్రు వినుతుజేయు (కాళిదాసు)
అచ్చెరువు గొల్పు నీ మహిమాతిశయము "వంద॥
యంత్రజీవన మందు నీ మంత్రములను
మరచి, భౌతికతయె నిండె మనసునందు
ఒక్క పరిదల్తు నా బుద్ధి చక్క జేయు ॥వంద॥

ఈ కృతిని ఆచార్యులు జి వి సుబ్రహ్మణ్యం ఎన్ గోపి ఎస్వీ రామారావు ఇ శివారెడ్డి డా కె వెంకటరెడ్డి, శ్రీ వేముగంటి కవిగారి జనకులు శ్రీ కృష్ణమాచార్య ప్రభృతులు అభినందించారు

## 83 నాగుల చిన్నయ్య - మెట్టుపల్లి అధ్యాపకులు

1 సత్యవాణి నీతిశతకము - జనవరి 1997 ఆదర్శోపధ్యాయులు, హాస్యసంభాషణాచతురులు నటులు, నమ్రస్వభావులు అయిన ఎన్ చిన్నయ్యగారి ఏకైక బాలనీతిశతకం 1997 అధ్యాపక దినోత్సవం (5 సెప్టెంబర్) నాడు మెట్టుపల్లిలో ఆవిష్కరింప బడింది

బాల్యదశలో మృతి చెందిన చిన్నారి శిష్యురాలు సుమలత స్మృతిగా 'సుమన' మకుటంలో 116 ఆటవెలది పద్యాల్లో ఈ శతక రచన కావించారు అంది ఒక పద్యం చూడండి

పండితుండు గాదు పరియింప వేదాలు,
కాకి కూయగానె కోకిలానె?
మంచిచెడులు తెలియమాన్యుడౌధరలోన
విమలమైన మాట వినుమ సుమన- 11

## అముద్రిత శతక సాహిత్యం :

1 వేంకట రాజన్న అవధాని - మంథని 1 లక్ష్మీశతకం

2 వానమామలై జగన్నాథాచార్యులు - పోతురెడ్డి పేట

1 శ్రీనివాస అష్టోత్తర శతి, 2 ఆది వరాహశతకము,
3 జనగణపతి శతకము, 4 తెలుగు బాబు నీతి శతకము

వీటిలో ఒకటో రెండో అచ్చయినా కవి గారు ఆ వివరాలు చెప్పలేకపోయారు

3 గఱ్ఱెపల్లి సత్యనారాయణ రాజు కరీంనగర్, 1 రంగనాధశతకం

4 కొమ్మెర లింగమూర్తి - కరీంనగర్ 1 రాజేశ్వర శతకం

5 వేదాంతం కాశీనాథం వేముల వాడ1 శ్రీ రాజరాజేశ్వర శతకం

పై అయిదుగురు కీర్తిశేషులు

6 మల్లాపజ్జల రామచంద్ర శర్మ బి ఓ ఎల్, పెద్దపల్లి 1 యాదగిరి నృకేసరి శతకం

7 కె వి రాజు బి ఓ ఎల్ తిమ్మాపూరు వయస్సు 60 సం దాదాపు

రాచబాట శతకం, (మరో ఖండకావ్యం, గయోపాఖ్యాన నాటకం రచించారు )

తరంగిణి' 1973 కవితా సంకలనంలో ప్రచురితమైన కాసు వేంకటరాజుగారి 'రాచబాట' 10 పద్యాల్లోని ఇవి రెండు

గైడు లేని చదువు కానరాదీనాడు కాపి కొట్టువాడు ఘనుడు నేడు
ఇట్టి చదువు జాతికెంతయో కీడురా - రాచబాట కేవిరాజు మాట
చదువు రాని వాడు పదవిపై కూర్చున్న - జ్ఞానవంతుల కవ మానమగును
వెలుగు తోడి పొత్తు కలియు చీకటి కెట్లు రాచ॥

8 కొండ్లె గాలిరెడ్డి - బి ఓ ఎల్ అంతకపేట తెలుగు పండితులు, వీరి వీరభద్రతారావళి' 1961 లో ముద్రితం మకుటం వీరభద్రుడా' వృషభ విలాపం' వీరి అముద్రిత పద్య కృతి

9 ఏ శంకరాచారి బి ఓ ఎల్ కొత్తపల్లి వెదిర సెకండరీ పాఠశాలలో తెలుగు పండితులుగా పనిచేస్తూ 1982 సుమారుగా 40 ఏండ్ల వయస్సులో కీర్తిశేషులైనారు

1 దేశమాత శతకం 2 భారతీ శతకం ఈ రెండూ వీరిని అముద్రితాలు

దీపపుం భాతి వెలుంగు గాక మన భారతదేశము విశ్వమందునన్, అని వీరి దేశమాత శతక మకుటం 'పూలమాల' పేరుతో గేయ సంపుటి వేయాలనుకున్నారు కాని ఏ కృతినీ ప్రచురించకనే వెళ్లిపోయారు (క జి ర చరిత్ర 1981 పుట 78)

10 జి దేవయాచారి బి ఏ, బి ఇడి చెప్యాల 1997లో విశ్రాంతి పొందిన అధ్యాపకులు రాజేశ్వర శతకం, భారతం పద్యకావ్యం, ఈ కవి గారి అముద్రితరచనలు "శ్రేయంబెయ్యది గాంచలేము గదరా శ్రీ రాజరాజేశ్వరా! శతక పద్యమకుటం

11 మహావాది రాజమణి - ఎం ఏ బి ఓ ఎల్ మంథని - కీర్తి శేషులు

మంథని బాలకోన్నత పాఠశాలలో తెలుగు పండితులుగా పనిచేస్తూ వీరు ఏబదేళ్ల వయసులో 1985లో కీర్తిశేషులైనారు 'శ్రీరామచంద్ర శతకం' ఈ కవయిత్రి అముద్రిత సీసపద్య కృతి అందలి ఒక పద్యం చూడండి

పాదాల పూజింప పారిజాతము లేదు - కన్నలువలె నీకు కాన్కలిత్తు
గళమెత్తి పాడగా గాత్రమాధురి లేదు - సరిగమ పదనిస స్వరము లెరుగ
నల్లని రాలలో నవరసాలొలికించ శక్తి గలిగిన శిల్పవ్యక్తిగాను
చక్కగా నీరూపుచిక్కించు కొనుటకు - గుంచె పట్టుట నాకు గురుతు లేదు
ఏమి బ్రతుకు జీవమేరీతి గడుపుదు - కాచి బ్రోచ దగిన కర్త వీవె,
దేవ దేవ నాకు దిక్కగు మేవేళ రాజరాజ వినుత రామచంద్ర!

(ఈ పద్యం క జి ర చరిత్ర - పుట 218 నుండి స్వీకృతం)

12 తిరునగరి సత్యనారాయణ - బి ఓ ఎల్ 1981లో 28 ఏండ్ల వయస్సు వీరి స్వగ్రామం వావిలాల - తెలుగు పండితులు

"నాగుల మల్లేశ శతకం" మరి రెండునాటకాలు వీరి అముద్రిత రచనలు

13 ఎం లక్ష్మణరావు విద్వాన్, డిప్ ఓ ఎల్ కాళేశ్వరం వీరు ఉద్యోగ కారణంగా చెన్నూరులో ఉంటున్నారు

"శ్రీద కాళేశ యామ్య కాశీనివాస" అనుమకుటం గల తేటగీతి పద్యాలతో కాళేశ్వర శతకం వ్రాశారు 'ముక్తీశ్వర మాహాత్మ్యం' అనే పద్య కావ్యాన్ని కూడా రచించినట్లు వినికిడి



14 రావికంటి రామయ్య గుప్త - మంథని, అధ్యాపకులు వరకవి రామయ్య గుప్త గారి "రావికంటి" "గౌతమేశ్వర" శతక ద్వయంలో ఒకటవది ముద్రితం అందలి రెండు పద్యాలివి

ఎప్పుడైన అడుగు ఇప్పుడే అంటారు చెప్పులరిగేదాక త్రిప్పుతారు
ఎల్లె(ం)బీలలోను ఎండమావుల్లెరా - కల్లగాదు రావి కంటి మాట
కాళ్లు గడిగినాడు కన్యనిచ్చారంట ఇల్లు కడిగి నేడు ఇవ్వవలెను
అల్లునలుక దీర్చ అజుకైన తరమౌన కల్లగాదు॥

ఈ జిల్లాలోని శతక పద్యాల్లో వ్యావహారిక భాషా ప్రయోగం వేదాంత భావ ప్రచారకులైన వరకవుల్లో ఉంది అధ్యాపకులైన సామాజిక నీతి పద్య శతక కవుల్లో వ్యావహారిక భాషను ప్రయోగించిన వారిలో రామయ్య గుప్త మొదటివారు ఎస్ కె పిళ్లె రెండవ వారు

15 బి అచ్యుతరాజు - ఎం ఓ ఎల్ బొప్పారం తా॥ సిరిసిల్ల విశ్రాంత ఆంధ్ర భాషా పండితులు

కరీంనగర్ జిల్లా సెకండరీ పాఠశాలల్లో ఆంధ్రోపాధ్యాయులుగా పనిచేసిన అచ్యుతరాజు ఆ తర్వాత హైద్రాబాద్‌కు మారినారు వీరు పద్య గేయకవి ప్రభుత్వం వారి ఒకానొక మొదటి వాచక నిర్మాణంలో వీరు సహరచయితగా పనిచేసినట్లు జ్ఞాపకం

వీరి పద్య కృతులేవి ప్రత్యేకంగా రాలేదు కాని 'మందారమాల' ఖండ కావ్యంలోగేయాలతోపాటు వీరి పద్యాలు కూడా ఉన్నాయి అందులో శతం కాకున్నా శతక పద్యాల బాణిలో ఉన్నవి వీరి 'రసలింగ పద్యాలు' మచ్చుకు అందుండి ఓ రెండు

ప్రజల కవుల మనుచు ప్రకటించు కొనునట్టి వారిలోన పలుకువాసి లేదు
చెక్క భజన పరుల జేర్చిన జాలునే - రంగ రంగ మార భంగలింగ
సభలయందు కవుల సత్కారముల గాంచి - కాకవీశ్వరుండు కాలుచుండు
కోకిలమ్మ ఘనత కాకమ్మ కబ్బునే - రంగ లింగ

16 కొలుగూరి గోపాలరావు - బి ఓ ఎల్ కొరుట్ల వయస్సు 50 సుమారు, అధ్యాపకులు

1 కాలువ నరసింహస్వామి, 2 తెలుగువీర వీరి అముద్రిత శతకాలు

17 ఎన్ హన్మంత రాజు - బి ఓ ఎల్ దీకొండ - నివాసం కరీంనగర్, జననం 1943

రాజు గారు ఉన్నత శ్రేణి తెలుగు పండితులుగా ప్రభుత్వోద్యోగం చేశారు వీరు కవి రంగస్థల నటులు బుఱ్ఱకథలు చెప్పుతారు వీరి అముద్రిత రచనలు నాలుగు శతకాలు అవి ఇవి

1 గొడిశాల ఈశ్వర శతకము - ఇది వృత్తపద్య త్రిశతి 'ఈశ్వరా' అని మకుటం

2 హనుమచ్ఛతకము - కంద పద్య త్రిశతి ఒక పద్యం,

మగువల మాటల నమ్మకు, తగనమ్మిన దశరథుండు తన ప్రియ సుతునిన్
పగబూని పంపె నడవికి, మగవాడైనను సతికిల మాన్యుడె హనుమా

3 శిరిడీ సాయి బాబా శతకము - 108 సీస పద్యాలు

పద్య మకుటం "సచ్చిదానంత గురు శిర్డి సాయినాథ!"

4 సాయీ నీతి శతకము కంద పద్యాలు
అరచేత వెన్న యుండగ ధరనెయ్యి కొఱకు దిరుగ దగునా భ్రమయౌ
పరమాత్ముడెలోనుండగ, పరుగిడు మూఢుని విధంగ బరగడె సాయీ
ఇంకా భాను చరిత్రము' పద్యకావ్యం 'విద్యార్థులు - క్రమశిక్షణ' బుర్రకథ, శారద కథలు వీరి ఇతర రచనలు ఇవి అన్నీ అముద్రితాలు రాజు గారి కలంపేరు 'హనుమశ్రీ'।

18 గట్టుగణపతి ఎం ఏ , గుంజెపడుగు - మంథని 1 లక్ష్మీనాథ నారాయణ శతకము

19 మునుగోటి కృష్ణమూర్తి ఎం ఏ , బి ఇడి వేములవాడ

కృష్ణమూర్తి గారు విశ్రాంతాంగ్లోపాధ్యాయులు సంస్కృతాంధ్రములలో చిక్కని పండితులు తెలుగులో చక్కని కవి 1954 నాటి కరీంనగర్ 'సారస్వత జ్యోతి' త్రైమాసిక పత్రికలో వీరి 'అంకు కల్వ' పద్యాలున్నవి ఆగష్టు 54 అదే సంచికలో సి నారాయణ రెడ్డి గారు కరీంనగర్ జిల్లా సాహిత్యం' అను వ్యాసంలో మునుగోటి వారిని చక్కని కవిగా పేర్కొన్నారు వీరు పలు సాహితీ సభలలో పాల్గొంటూ పలు పద్యకావ్య ఖండికలు రచించినా వాటిని క్రోడీకరించి ప్రచురించే శ్రద్ధ చూపలేదు

అరువదేండ్ల వయస్సులో 'తెలుగువారు నేల వెలుగువారు' అనే మకుటంతో వీరు తెలంగాణా కళాసాహిత్యరంగాల ప్రముఖులను ఒక్కొక్క పద్యంలో వర్ణిస్తూ ఆటవెలదులలో త్రిశతిని రచించారు

అంకుకల్వ'లోని ఒక పద్యంలోని అర్థభావ శైలీ రమ్యత చూడండి
కలువ యిదేమి యాగడమె కమ్మని జీవిత మందు చింత ని
ప్పుల రగిలించి ప్రేమ విరబూసిన మానస పుష్పవాటి బొ
గ్గుల నలుకన్ కళామయుడు గూడ కళంకితుడయ్యె నీ చరి
త్రలు గని రోజురోజు కళ తగ్గెడు చుక్కల వెక్కిరింపులన్ (క జి ర చరిత్ర పు 284)

20 బల్యాపల్లి సుధాకర రావు ఎం ఏ దామరాజు పల్లి

ధర్మపురి ఓరియంటల్ కాలేజీలో తెలుగు ఉపన్యాసకులు వీరి 'కనక సోమేశ్వర శతకము' సీస పద్యాలది ముద్రణలో ఉంది ఈ కవి కవనం సరళం - భక్తి పూరితం

ఇంకా పద్యకవుల వరకవుల అముద్రిత శతకాలు ఓ పది వరకు తర్వాతి వివరణలలో కానవస్తాయి

**అముద్రిత పద్య (ఖండ -కావ్య) కవులు - సాహిత్యం**

1 గీట్ల జనార్దన్ రెడ్డి ఎం ఏ ఎల్ ఎల్ బి , గోదావరిఖని, వయసు 60 సుమారు

జనార్దన్ రెడ్డి గారు గోదావరిఖని సర్పంచుగా ఉంటున్నారు మొదట ఉపాధ్యాయులుగా పనిచేసి తర్వాత రాజకీయాల్లో ప్రవేశించారు ఎం ఎల్ ఏ గా పోటీ చేశారు ఎం ఎల్ సి గా గెలిచారు కొన్నాళ్లు క్రాంతి' పత్రికను నడిపారు సాహితీవేత్తగా, సవిమర్శక వక్తగా వీరికి జిల్లాలో మంచి పేరుంది వీరు ఆంధ్రాంగ్ల భాషలలో రచయిత తెలుగులో పద్యగేయకవి గద్య రచనలో పానుగంటి 'సాక్షి' వ్యాసాలవంటి రచనలు చేశారు వీరి రచనలు పుస్తకరూపంలో రాలేదు ఇతరుల పుస్తకాలకు వ్రాసిన పీఠికలు అప్పుడప్పుడు సంచికలలో ప్రచురితమైన కవితలు వీరి కవన ప్రదర్శకాలు వీరి ఒక పద్యం - (క జి ర చ 81, పుట - 123 నుండి,)

ఉ॥ చేసిన సీత పెడిలిని జేయు సమర్థుడగా నెవారలో
వ్రాసిన కావ్యమే మరల వ్రాయుతలంపును లేదు, తింటకై
గ్రాసము లేక కట్టుకొనగా నొక గుడ్డయు లేక నెప్పుడా
యాసము జెందు చుండెడి జనాళిని శీర్షికగా గ్రహించెదన్

మరొక పద్యం డా॥ వి రంగాచార్య భార్గవీ శతక పీఠిక నుండి 1993

శా॥ బంగారానికి తావి యబ్బెననగా - పంపాసరస్సీమలో
రంగత్తుంగ తరంగ సంఘములు తారా జువ్వలై లేవగా
సంగీతమ్మున సాహితీ జగమునన్ సత్కారముల్ పొందు మా
రంగాచార్యుల భార్గవిన్ దలచి సంరంభమ్ముగా సాగెదన్

2 చెప్యాల రాం కిషన్ రావు, మేడిపల్లి వయస్సు 60 సుమారు

రామకిషన్ రావు గారు ప్రౌఢకవి వీరు వానమామలై లక్ష్మణాచార్యుల శిష్యులు అభినవ పోతన వరదాచార్యులచే 'కవిశేఖర' బిరుదాన్ని పొందినవారు వరదాచార్యుల షష్టిపూర్తి అభినందన సంచిక 1973లో చెప్యాల గారి పద్యాలున్నవి వీరి పద్యకృతులను 'మధుర విపంచి ఖండకావ్యంగా ప్రచురించే సన్నాహంలో ఉన్నారు గంగా రాజేశ్వర రావు గారి 'పార్వతీ విజయము' కావ్యంలోని చెప్యాల గారి 'శుభాభిశంస' పంచరత్నాల్లో మొదటి రెండు పద్యాలిక్కడ చూపబడుతున్నవి

శ్రీమన్మంత్ర పురీ పురాతన ధరా సీమంతినీ గౌతమీ
సీమంతోజ్జ్వల మౌక్తిక స్ఫుట తట క్షేత్ర స్ఫురత్యాశ సు
త్రామా వాస సువాసనాద్రు సుమనో రాజన్మహా భూసుర
గ్రామ బ్రాహ్మ్య యశోభిరామ సుమహ క్రాంతిన్ విలోకించెదన్

చివరి పదాన్ని వదలి మొత్తం పద్యమంతా ఒకే ఒక సంస్కృత సమాసం!

మంత్ర కూటమా! ధిషణ సమాన విబుధ విప్రసురవాటమా! మోక్ష విపుల సౌధ
మణి కవాటమా! యుపనిషన్మంత్ర రిపుకు, మత మృగా ఖేటమా! నిన్ను మరచి పోను

కవి సంప్రదాయ మార్గ కవితాలక్షణ విదులేకాక, వైదిక మత మందు ప్రగాఢమైన విశ్వాసం కలవారని 'గౌతమి' సెప్టె - 69 లోని వారి 'వర్షమా శీర్షికలోని ఈ పద్యాన్ని బట్టి చెప్పవచ్చు

దేవతలన్ మఖంబులను తృప్తుల జేసిన మానవుల్, ప్రియం
భావుకులై సురల్ బహు శుభంబుల నిత్తురు మర్త్య కోటికిన్
గావున యజ్ఞముల్ విడువగా దగదెన్నడు, యజ్ఞసంభవం
బైవరులుం బయోధర మటంచు వచింపదె తాను గీతయున్ ప - 7, పుట 4

వీరు ఓరుగల్లు 'పోతన కవి' చతుశ్శతాబ్ది ఉత్సవాల్లో ఇరువదేండ్ల క్రితం చదివి పండిత ప్రశంసలందిన పద్యాల్లో ఒకటి కాకతీయ నందీశ్వర విగ్రహ శిల్పవిన్యాస వర్ణన కలది చూడండి

అచ్చమునంది కున్నటులె ఆ మెడ గంటలు మట్టు కొమ్ములున్
కుచ్చులతోకయున్ కలిగి గోపురమో యను మూపురంబుతో
నచ్చెరువొంద జేయ కనులందున కాటుక డాగి యుండగన్
వచ్చెనొ యోరుగల్లునకు పండగ నాంధ్రుల శిల్ప సస్యముల్

3 డా॥ శుకశ్రీ (చిలుకమర్రి వేంకటరమణాచార్యులు) ఎం ఏ , పిహెచ్ డి ,రుద్రంగి

వేములవాడ తాలూకా రుద్రంగి వాస్తవ్యులైన 'శుకశ్రీ' గారు తెలుగు పండితులుగా ఉపన్యాసకులుగా పనిచేసి 1990 సుమారుగా ఉద్యోగ విరమణ పొందారు వీరు పండిత కవి వీరి అనేక పద్యఖండికలు సాహిత్య వ్యాసాలు వివిధ సాహితీ సంచికలలో పత్రికలలో ప్రచురితమైనా ఇంకా పుస్తక రూపం ధరించలేదు మచ్చుకు వీరిదొక పద్యం-

పరమ విపుండు నీకు నిరపాయ వినశ్వర భోగ భాగ్య నా
యురధిక శక్తులుజ్జ్వల మహోన్నత కీర్తుల గూర్చి యిట్టి ని

ర్భరతర గౌరవంబికను రంజిలగా మజి యిచ్చి ప్రోచు నం
చరుదగు నీదు నుత్సవమునందు సమాహిత కాంక్ష సేయుచున్
(శ్రీ ఎక్కలదేవి లక్ష్మణ గారి షష్టిపూర్తి సన్మాన సంచిక 1976 పుట 34 నుండి)

గంగా రాజేశ్వర కవి 'గంగా రూపకాలు' 1988లోని 16వ పుటలో డా శుకశ్రీ కవి గారు 'సన్మానాక్షరాక్షత సుమాంజలి' పది పద్యాలు 'శ్రీగంగా రాజేశ్వర నమోస్తు' లోని పది అక్షరాలతో ఆరంభించబడినవి అందులోని అయిదవదిది

జేజే ధ్యానము మంత్రకూట జనరాశీ భూత కంఠోద్గతో
తేజస్ఫార విచారకారక రసాంధీ భూత సానంద భా
వాజేయ స్థితి నీదు కావ్యసుధ లక్ష్య ప్రాగ్రమార్గాను మో
దాజీవానుభవంబు సత్కవి కులాహార్యా! సుధీగ్రామణీ!

4 వకుళాభరణం మంగయ్య ఎం ఏ , బి ఇడి - కరీంనగర్, వ 65

మంగయ్య గారు ఆంగ్లోపాధ్యాయులు, ఎం ఇ ఓ గా పనిచేసి ఉద్యోగ విరమణ పొందారు వీరు కవి రచయిత, నటులు నటశిక్షకులు 'వాణీస్తవము' శత పద్య కావ్యాన్ని రచించి సంస్కృతంలోని మార్చారు దానిని శతావధాని కృష్ణమాచార్య సవరించారు కృతి అముద్రితం వీరి కవితాధార పురాణ కవుల పద్యశైలిని అనుసరించి ఉంది వీరి కవన పరిచయానికి 'గౌతమి' జూలై 1969 త్రైమాసిక సాహిత్య పత్రిక, పుట 40లోని పద్యాల్లో మొదటిది చూడండి

నింపుము తండ్రి నీదు కమనీయ మహాద్భుత నామ మీ హృదిన్
బెంపుము నీదు ప్రేమలత పేద కుటీరము పైన ప్రాకగా
ముంపుము నీ దయా మధుర మోహన వాహిని నీదులాడగా
సొంపు వెలార్చు నీ మృదు వచో విభవమ్మొలయింపరా ప్రభూ!

5 నందగిరి అనంతరాజశర్మ - ఎం ఏ వేములవాడ

శర్మగారు స్థానిక శ్రీ రాజరాజేశ్వర సంస్కృత కళాశాలలో ఉపన్యాసకులు ఈ మధ్యే పదవీ విరమణ పొందారు సంస్కృతాంధ్ర సాహిత్య విశారదులైన వీరు మృదుభాషి మితంగానైనా రసపుష్టిగల పద్య సృష్టి కావించారు మామిడి పల్లి సాంబశివశర్మ గారిని వీరు వర్ణించిన పద్యం ఒకటి చూడండి

సీ కమనీయగళమెత్తి గానమొనర్చుచో, మధురకోకిలగీతి మరువజేయు
గంభీరభావార్థ కవిత విన్పించుచో, రసికుల హర్షవారాశి ముంచు
హరికథన్ జెప్పుచో నభినయ సౌరభ్య సువచస్సుధ గ్రోల శ్రోతలకిడు
అవధానవేళ మేధార్క దీధితులచే, జనమనోనయ వికాసమును గూర్చు

గీ పండితుడు కవి పౌరాణికుండు నటుడు, కథకుడవధాని భక్తుడు గాయకుండు
వక్త మామిడిపల్లి సాంబశివునంత, వాడు వెదకిన దొరుకునె వసుధలోన!

6 కె ముత్తయ్య బి ఏ , బి ఓ ఎల్ , తంగళ్లపల్లి జ 1938

ముత్తయ్య గారు ప్రౌఢ పద్యగేయ కవి - చిత్రలేఖకులు నఖ చిత్ర నిర్మాణంలో వీరిది ప్రత్యేక ప్రతిభ వీరు కరీంనగర్ జిల్లా పరిషత్ సెకండరీ పాఠశాలలో ప్రథమశ్రేణి తెలుగు పండితులు

కర్ణ, భీష్మ మొ॥ పద్య ప్రబంధాలను, రాధాకృష్ణ, రవీంద్ర - గేయకావ్యాలను రచించారు ఇంకా ఏవీ ముద్రించలేదు వీరి రచనలను పత్రికలకు పంపించరు, సాహితీ సభలలో కనిపించరు - సాహిత్యారాధన విడువరు వీరిదో విలక్షణమైన మనస్తత్వం

7 డి వి మురళీ మోహనాచార్యులు - బి ఓ ఎల్ ఎం ఏ మెట్టుపల్లి
జననం 1941 ఉద్యోగం ఆంధ్రభాషోపాధ్యాయులు జన్మస్థలం పాలాస

కవి నటులు హరిదాసు అయిన ధపూరి వేంకట మురళీ మోహనాచార్యులు కొన్ని నాటికలు పద్యగేయ కవితలు కావ్యాలు వ్రాశారు ఒక్క జలగలు' నాటిక తప్ప మరే రచన కానీ పుస్తక రూపంలో రాలేదు కాని వారి పద్య ఖండికలను ఒక ఖండకావ్యంగా 'కవన కల్హారము (1997) పేరుతో ముద్రిస్తున్నారు



రాష్ట్ర ఉత్తమోపాధ్యాయులుగా ప్రభుత్వ సన్మానం పొందిన వీరు ఆకాశవాణి హైదరాబాద్‌లో తమ వాణిని వినిపించడమే కాక, ఢిల్లీ సాంస్కృతికోత్సవాలలోనూ తమ హరికథాగానం చేసి వచ్చారు నారంభట్ల లక్ష్మీనారాయణ శర్మ 'దుంపెట' గారి 'లక్ష్మీనారసింహ శతకము' లో వీరి 'శుభాశంసనము' పద్యాల్లో (1977) చక్కని క్రమాలంకార సీస పద్యముంది

శతావధాని ఎన్ కృష్ణమాచార్య గారికి 8 12 90 నాడు కొరుట్లలో ఘన జరిగిన సన్మానంలో కవి గారు సమర్పించిన 'అభినందన చందన పద్యత్రయంలో ద్వితీయ పద్యం ఇది

ఆ చంద్రార్కము నిల్చు సత్కృతుల హో! యత్యద్భుతంబుల్ గనన్
క్ష్మాచక్రంబున యావదాంధ్రజగతిన్ శశ్వద్యశశ్చంద్రికల్
ప్రాచుర్యంబయి విస్తరించె, తమదౌ పాండిత్య ప్రజ్ఞాలస
ద్వాచాప్రౌఢి, వధానముల్ బుధవరుల్ పల్మారు కొండాడగన్

8 చింతకింది భీమయ్య కొరుట్ల - కీర్తిశేషులు

భీమయ్య గారు అధ్యాపకులు సాహిత్యారాధకులు హైదరాబాద్ రాష్ట్రముఖ్యమంత్రిగా బూర్గుల రామకృష్ణ రావు గారు హుస్నాబాద్ వచ్చిన సందర్భంలో భీమయ్య గారు చదివిన స్వాగతపద్యాలు విని వారు వీరిని అభినవ భీమకవిగా ప్రశంసించారు వేముల వాడ భీమకవి ఈ మండలం వాడగునో కాదో కాని కొరుట్ల భీమకవి మాత్రం అచ్చంగా స్థానికుడు కాని వీరి పేరు కవిగా అంత వ్యాప్తిలోలేదు వ్రాసినవి అచ్చువేసుకోకపోవడమే అందుకు బలమైన కారణం

భీమయ్య గారు పద్య గేయకవి వీరి కవితా పరిచయానికి 'విద్యుజ్జ్యోతి' ప్రభుత్వ ప్రాతిపదిక ఉపాధ్యాయ శిక్షణాలయం కరీంనగర్ వారి 1958 వార్షిక సంచికలోని కవితలు చూపబడుతున్నవి ఈ సంచిక సంపాదకులు భీమయ్య గారే వీరి కృతి 'సమర్పణము' పద్యాలు చూడండి

సీ దేశాన ప్రజలకు దిండికి దొరుకక, పిల్లలతో దల్లడిల్లు చుండ
జదువ నేర్చిన వారు స్వయముగా జీవించు, తెరవుగానగ లేక దిరుగుచుండ
స్వయము పోషకమను స్వావలంబనలేమి, బహు నిరుద్యోగము ప్రబలు చుండ
గృహ పరిశ్రమలకు గొంత స్థానములేమి, ఆర్థిక పతనమై యడలుచుండ

ఆ వె వడుకు నేత తోట పనులు వడ్రంగము - గుమ్మరమును మరియు గమ్మరమును
ఇట్టి పనులలోన నేపని జేయని - స్థితి నడంగి జనులు దిరుగు చుండ

గీ పైని లోపాల దీర్చు నవీన విద్య - బ్రతుకు తెరువు జూపెడి ప్రాతిపదిక విద్య
తాము సూచించినట్టి యాదర్శములను, నేర్పుచున్నారు శిక్షణానిలయములను

మరో పద్యంలో తమ శిక్షణాలయ సాహిత్య సంచికను గాంధీజీకి అంకితమిచ్చారు

ఈ సంచికలో వీరివే రెండు గేయాలు బేసిక్ విద్య - 38 పుట వర్షఋతువు 59వ పుటల్లో ఉన్నాయి బేసిక్ విద్య' మాత్రాఛందో మాధురిని చూడండి

భరతదేశపు భవ్యవిద్యను - మరచిపోవక తెలుసుకొనదగు, వేదకాలము నాటి విద్యయె విద్య విశ్వమునన్ / గురువు శిష్యులు కలిసి ప్రేమను - కూడియుండియు సాముదాయక, జీవితముచే విద్య నేర్చిరి చింత లేకింతన్

ఈ 19 చరణాల ముత్యాల సరాల గేయం 13వ చరణంలో మత, విభేదము తొలగి సంఘము మారినూత్న సమాజమందున పేద ధనికపు కష్ట సుఖములభేదరహితమగున్ అనే ఆకాంక్షను తెలిపారు కవి వర్షఋతువు - గీతపాదాలు విరిచి వ్రాసినట్లుగా ఇంచుమించు 12 మాత్రల పాదాలలో సాగిన ప్రబంధ వర్ణనల ననుసరించిన గేయం రసవత్కవితా విహారులు కొరుట్ల భీమకవి।

9 కందాళై చిక్కుడుకాయల రంగాచార్యులు బండలింగాపురం

సంస్కృత పండితులైన రంగాచార్యులు ఓడియంటల్ స్కూళ్ళ ఇన్స్పెక్టర్‌గా ప్రభుత్వోద్యోగం చేశారు ఉద్యోగ విరమణానంతరం విశిష్టాద్వైత మతవేదాంత, సాహిత్యక్రతుకలాపాలతో, ప్రవచనాలతో, కాలక్షేపం చేస్తున్నారు ప్రస్తుత నివాసం భాగ్యనగరం సంస్కృతంలో కొన్ని నాటికలు, తెలుగులో 'కృప అనే వేదాంత వ్యాస పుస్తకాన్ని రచించారు

ప్రపంచ బాలల సంవత్సరంలో రచించిన వీరి పద్యాల్లోని ఒక పద్యం 'కరీంనగర్ జిల్లా కవుల పరిచయ గ్రంథం' పుట 52 నుండి చూపబడుతున్నది

బాలురె పౌర వృద్ధులయి బాలురె నాయకులౌ సుధీమణుల్
బాలుర పెంపకమ్ము పరిపాటియు గల్గుట నాడు, ఎట్టిదో
ఏల వికార విప్లవము లిప్పుడు వారుణజేయ బాలురే
లీల యటంతలంపు నవలీలగ జేయుట ఇప్పుడే కదా।

10 విష్ణుదాస సాంబశివరావు - మెట్రిక్, గుండేడు, మం కమలాపూర్ - జననం 1935

సాంబశివరావు గారు గోలకొండ కవుల సంచికలోని విష్ణుదాస గిరిధర కవి గారి దత్తపుత్రులు వరంగల్ జిల్లా పరకాల తాలూకాలోని చల్లగరిగె వీరి జన్మస్థలం అది 56కు పూర్వం కరీంనగర్ జిల్లాలోనిదే ప్రముఖ కవి విష్ణుదాస లక్ష్మీకాంతరావు గారు సాంబశివరావు గారి కన్న తండ్రి లక్ష్మీ కాంతరావు గారు గార్లపాటి రాఘవ రెడ్డి గారితో కలిసి కొన్నాళ్లు జంట కవిత్వం చెప్పినవారు

వీరి తాత శ్రీధరరావు పండితులు తండ్రి, పెద్ద తండ్రి గిరిధర రావు గారలు కవులు ఇక సాంబశివరావు గారు "సాహిత్యమంటే ప్రాణం కవులంటే ఎనలేని గౌరవం కవితా గోష్టికి ఎంత దూరమైనా ఎంత ప్రయాసకైనా ఓర్పు వహించి వెళ్లగలను" అన్నారు, తమ 23 3 94 లేఖలో

రావుగారు 1959 నుండి గుండేడు గ్రామ సర్పంచుగా ఉన్నారు వివిధ సందర్భాల్లో వీరు వ్రాసి గానం చేసి ప్రచురించిన పద్యాలు గేయాలు అనేకం ఇంకా అవి పుస్తకరూపంలో రాలేదు సాంబశివరావు గారి పద్యాలు కొన్ని ఇట చూపబడుతున్నది హుజూరాబాద్ సమితి అధ్యక్షులైన పి జనార్ధనరావు గారికి 8 2 69నాడు సన్మానసభలో చదివిన పద్యాల్లో చివరిది



పరిపాటి వంశ సంభవ, పరిపాటిది సలుపుచుంట పరులకుపకృతుల్
పరికింప నీకు గావున, నరవరుడంచనగనౌ జనార్ధన నిన్నున్
రాష్ట్రమంత్రి కె వి నారాయణ రెడ్డి గారి పర్యటన సందర్భంలో
ఉన్నది పాల నిచ్చుటకు నున్నది సిద్ధము తల్లి త్రాగలే
కున్నను దోసమేరిది, సముజ్వల భారత మాత సంపదల్
గ్రన్నన నిచ్చి బ్రోచుటకు గాచియె యున్నది, గాని యట్టి సం

పన్నత నొంద కందరము బాధల నందుట చిత్రమయ్యెడిన్
మన ప్రధాని పి వి నరసింహారావు గారు 1976 77లో
కవి గారి గుండేడు గ్రామాన్ని సందర్శించినప్పుడు చదివిన పద్యాల్లో ఒకటి
పదవులు వచ్చుదాక నొక భంగి చరించుచు, వచ్చినంత సం
పదలకు నాసజెంది తమ వైభవ మొక్కటి కోరుచున్ జనా
పదలను కంటితో గనని వారలనేకులు, నీవలెన్ ప్రజా
భ్యుదయము జేయనౌననెడు పుణ్యులు మాత్రము కొందరేయిలన్।

1968, 77 కరువు పద్యాలు తక్షణ రక్షణ కోసం అధికారులకు సమర్పించినవి, గంగిరెద్దు భిక్షుకుల సమస్య, వినుర విష్ణుదాసువినుతి విహితమగును "మకుట నీతిమాల గీతపద్య మండలం, వేంకటేశ్వర సీసాలు వీరి పద్య కవితలు నేటి పోరాట కవులకు మార్గదర్శక కవితాపంక్తులు వీరివి 1969 నాటి జై తెలంగాణా గేయాల్లోనే ఎలా ఉన్నాయో చూడండి

తెలంగాణా సోదరుడా - తెలిసి కొంటివా నేటికి,
కరి మ్రింగిన వెలగపండు - వలె మిగిలెన నీ దుస్థితి
జంటిల్‌మెన్ ఒప్పందం - మంట కలిసి పోతుంటే,
పోచంపాడానకట్ట - పని జరుగక నిలిచి యుంటె
కూడు లేక గూడులేక - పని దొరికెడు జాడలేక, స్థితి జెడి ముల్కీలెందరొ
బ్రతుక లేక చస్తుంటే - చూసి చూడనట్లు చేసి - మోసగించినదెవరో॥
భాగ్య నగరమున మనదౌ -ర్భాగ్యమ్మున వచ్చి చేరి పన్నెండేడుల క్రిందట పన్నినట్టి కుట్రలోని
దగాకోరు బడాచోరు - దద్దన్నల పెద్దన్నల, బుద్ధిలేని తన మెట్టిదొ - పెద్దన్నల బుద్ధెట్టిదొ

ముందుకొచ్చి మాట్లాడక - మూగగ భయపడుతున్నవాణ్ణి, నూరుకోట్ల లెక్కలోని - తీరు చిక్కు నివ్వనోణ్ణి - (ఆ కాలపు ఆవేశపు ఈ గేయాన్ని అనుమతిలేక ప్రచురిస్తున్నందుకు కవిగారు నన్ను మన్నించాలని మనవి) ఈ అంగీరస ఉగాది 4 4 92 జిల్లా కవి సమ్మేళనం - కళాభారతి, కరీంనగర్‌లో -

అగ్రజాతి వారలను, అహంభావపూరితులను, పునాదితో పెకిలించి, సమాధి చేయు ఈ ఉగాది

అంగీరస అక్షరోజ్జ్వల వత్సరం అని ఆకాంక్షించారు ఇంకా 'అక్షర ఉజ్జ్వల సమితి కరీంనగర్ 1992లో ప్రచురించిన 'ఉజ్జ్వల గేయాలు' పు 8, 9 లో వీరు

హలం పట్టి దున్నేటోడా! అన్నపాన మిచ్చేటోడా!
కనులు తెరిచి కలం పట్టుకో - ఓ కూలోడా!
పలక బట్టి చదువు నేర్చుకో ఓ కూలోడా! - అని ఉన్నతంగా ఉద్బోధించారు

ప్రజా ప్రతినిధిగా జీవిస్తూ గ్రామీణుల కష్టసుఖాలకు స్పందిస్తూ ప్రజాభ్యుదయం కోసం శ్రమిస్తూ కలం నడిపిస్తున్న సాహస సత్కవి సాంబశివరావు గారు

11 కలకుంట్ల నరసింహాచార్యులు - బి ఓ ఎల్ (సం) కోరుట్ల 1933-1993

నరసింహాచార్యులు ఉభయ వేదాంత సంస్కృత పాఠశాల కొరుట్లలో విద్యాభ్యాసం కావించినవారు సేనాపతి నరసింహాచార్య, శతావధాని కృష్ణమాచార్యుల శిష్యరికం నెరపిన వారు శ్రీ రాజరాజేశ్వర సంస్కృత పాఠశాల వేములవాడలో ప్రధానోపాధ్యాయులుగా పనిచేసి ఉద్యోగ విరమణానంతరం కీర్తిశేషులైనారు

నరసింహాచార్యులు చక్కని వక్త వేదాంత విషయాలు వీరికి కరతలామలకాలు వీరు శ్రీవైష్ణవులైనా కలకుంట్ల శాస్త్రులు అను పేరుతోనే వ్యవహరింపబడేవారు ఆచార్యులు సంస్కృత భాషలో చక్కని కవి తెలుగులోనూ మితంగానైనా పద్యరచన కావించారు వేదాంత వ్యాసాలు అశీ పద్య శ్లోకాలు తప్ప వీరి రచనలు ముద్రింపబడలేదు 'కరీంనగరం జిల్లా కవుల పరిచయ గ్రంథం' 1979, పుట 42 లో నరసింహాచార్యుల జాబిల్లి జాడ' లోని పద్యాల నుండి ఒకటి ఇట చూపబడుతున్నది

తరులు గిరులును ఝురులు ఖేచరులు మునులు, చలువ రాల్లేవు సౌధాల సరణి లేదు
చూచితిమి మేము లోకమే శూన్యమనిరి, తెలుపు నీలోక మేడనో కలువరేడ

12 మల్లావజ్జల రామచంద్ర శర్మ బి ఓ ఎల్ పెద్దపల్లి,

రామచంద్ర శర్మగారి స్వస్థలం పెద్దపల్లి వయస్సు దాదాపుక 60 సం జిల్లా పరిషత్ సెకండరీ పాఠశాలల్లో ఆంధ్రభాషోపాధ్యాయులుగా పనిచేసి ప్రస్తుతం విశ్రాంతి కాలాన్ని సాహిత్య పౌరోహిత్య వ్యాసంగాలతో గడుపుతున్నారు శర్మగారు అసాధారణ ప్రజ్ఞకలవారు సంగీత సాహిత్య మర్మజ్ఞులు, నటులు కవి, వాస్తు జ్యోతిష్యాలు తెలిసిన వారు వీరి అముద్రిక పద్య కృతులు,

1 యాదగిరి నరసింహ శతకం 2 అమ్మ, 3 వియోగి, 4 మత్తకోకిల రామాయణం, మరికొన్ని నాటికలు కూడా విద్యార్థుల ప్రదర్శనలకోసం వ్రాశారు ఇంకా మాధవరావు బలరామదాసు గారి 'రామగిరి మహాత్మ్యం' ప్రబంధానికి వాఖ్యానం రచించారు

వీరి రామాయణంలోని ఒక పద్యం

గండ శైలములన్ని దాటుచు గల్గలా ప్రవహించుచున్
దండియౌ సరయూ నదీ సతి తాను సోయగ మొప్పగన్
నిండి పారును నివ్వనంబును నింపి రాముని కీర్తులన్
పండు వెన్నెల గాచునట్టుల పాలు నొల్కిన రీతిగన్ (క జి ర చ పు 61)

'వియోగి ఏకాశ్వాస పద్య కావ్యంలోని పది పద్యాలు కవితానికేతన్ కరీంనగర్‌వారు మలయశ్రీ సంపాద కత్వములో 1973లో వెలువరించిన తరంగిణి' కవితా సంకలనంలో ప్రచురించారు వాటిలో 6వ, పద్యమిది

కమ్మని మందమారుతము గమ్మను నీ విరజాజి వాతమున్
ఝుమ్మను తేటి పాటమది ఝుమ్మను నీ ప్రణయంపు మోత, వాహ్!
గమ్మతు గొల్పుచున్నయవి, కమ్మని నీయధరామృతంబునో
కొమ్మరొ! లేక యున్న నివి కొమ్మకు బోసిన నీరునైచనున్ పు 9

వీరి వరుస అన్నగారు మల్లావజ్జల రాజలింగశాస్త్రి పెద్ద పల్లి గ్రామ పురోహితులు కూడా ప్రౌఢపద్య కవి వారిదొక పద్యం 'క జి ర చరిత్ర' పు 53 లోనిది ఇట చూపబడుతున్నది

శ్రీ కల్యాణ నికేతనంబును సునిశ్చింతైక దీక్షా తప
స్సాకల్యార్య మునీశ పాలితము నిస్సంకోచ నిర్వైర ని
శ్శోకాటవ్య మృగంబు నిర్మల పయశ్శోభీ స్రవంతీ నయ
స్తోకానంద మయంబు నైమిశమనన్ జెన్నారు నుర్వీస్థలిన్

13 తిగుళ్ల శ్రీహరిశర్మ ఎం ఏ, బి ఓ ఎల్ చీర్లవంచ జన్మ తేది 4 6 1951

శ్రీహరిశర్మ గారు వేములవాడ సంస్కృత కళాశాల ప్రధానాచార్యులు సంస్కృత పండితులైనా వీరు ఆంధ్రభాషాభిమాని అష్టావధాని తెలుగులో పద్యగేయ కవి వీరి రచనలు అముద్రితాలు శర్మగారి కవితా పరిచయానికి ఒకటి రెండు పద్యాలు

శ్రీ హరి శర్మ గారు తమ ప్రశ్నకు అదేపద్యం పూరణంతో జవాబిచ్చిన మామిడిపల్లి సాంబశివశర్మ గారిని అభినుతించిన పద్యమిది

నా కవనము మీ కవనము నాక వనము కాకవనము నవ్యత జనగన్
మీ కవన పవన ధాటికి నాకవనం బేల నిలుచునయ సాంబ కవీ!

బి వి రామారావు గారు 1979లో ప్రచురించిన 'కరీంనగరం జిల్లా కవుల పరిచయ గ్రంథం' పుట 54 లోని శ్రీహరిగారి మరో పద్యం చూడండి

శుక పిక శారికా మధు రసోజ్జ్వల గానము విన్న నాకు నిం
చుకయును సంతసానమది చొక్కక యున్నది, మానవాళిలో
నొక యినుమంత యైన గురియోరిమి సత్తెము గానరామిచే
నిక యెటులీ యుగాది మనకిచ్చును మోదము కైతలల్లన్

ఆధునిక భావాల సంప్రదాయ కవి తిగుళ్ల శ్రీహరిశర్మ గారు

14 గంజి అంజయ్య - పి యు సి కరీంనగర్ , జననం - 1944

అంజయ్య గారు వ్యాపారం వృత్తిగా జీవిస్తున్న సాహిత్యాభిమాని పుస్తకాలేవీ ప్రచురించకున్నా వీరు అప్పుడప్పుడు కొన్ని పద్య గేయ కవితలు వ్రాశారు

'కరీంనగర్ జిల్లా కవుల పరిచయ గ్రంథం' 1979 పుట 2 లో 'అద్వైత మూర్తి' పద్య కవిత ఉంది

వీరు ప్రముఖ కవి గజ్జెపల్లి సత్యనారాయణ రాజు గారికి శిష్యులు రాజు గారి సంపాదకత్వంలో వెలువడిన 'గౌతమి' త్రైమాసిక పత్రిక - జూన్, 69లోని 'అద్వైతగీతి' అయిదు పద్యాల్లో మొదటిది

సరస శృంగార మూర్తి నా స్వాంతమందు, మధుర మోహన భావనా మందిరంబు
లలిత మంజుల ప్రణయార్ద్రలతలతోడ కట్టుకొని వేచి యున్నాను కలయ రమ్మ

'గౌతమి' సెప్టెంబర్, 69 సంచిక, పుట 54లో మహాత్ముడు' వచన గేయముంది

15 నారోజు కృష్ణమాచార్యులు - బొమ్మెనపల్లి జన్మదినం 15 8 1942

అడిట్ డిపార్ట్‌మెంట్‌లో ఉద్యోగం చేస్తున్న కృష్ణమాచార్యులు పద్య గేయ కవితలు వ్రాశారు వీరి 'ఈశ్వర శతకం' అముద్రితం మరి కొన్ని చాటువులు నాటికలు రచించారు క జి కవుల పరిచయగ్రంథం పుట 9లో 'భరత ప్రేమ' శీర్షికన వీరు వ్రాసిన మాతృదేశభక్తి చాటే పద్యాల్లో ఒకటిది

ఈ రమణీయమైన మహినెంచెద స్వర్గము కంటె గొప్పగా
యేరుల పుణ్యతీర్థమని యేర్పడి స్నానములాచరించెదన్
భారత మాత దివ్య భువి ప్రాంతపు కొండల వన్యభూమిలో
నారయనాది నాది యని యాడెద పాడెద నెమ్మనంబునన్

ఈ మధ్య దైవ భక్తి వైపు వారి దృష్టి సారించారు

16 జనమంచి కైలాస శర్మ ఎం ఏ , బి ఇడి , జగిత్యాల - జ 1940

కైలాసపతి వ్యవహారనామంకల వీరు సెకండరీ పాఠశాలల్లో ఆంగ్లోపాధ్యాయులుగా పనిచేసి తర్వాత జూ॥ కళాశాలలో ఆంధ్రోపన్యాసకులుగా ప్రభుత్వోద్యోగం చేస్తున్నారు తెలుగు సాహిత్యమంటే వీరికి అభిమానం వీరు అడపాదడపా పద్యగేయకవితలు వ్రాస్తుంటారు అష్టావధానాల్లో పృచ్ఛకులుగా తరచు పాల్గొంటూ ఉంటారు కొరుట్ల వారి 'బాల రసాలము' 1975లోని కైలాస శర్మ గారి లోక అలోకన' ఆవేదనమిది

"పిలక జుట్టులు దీసి ఫేషన్ల క్రాపులు, దోవతుత్తరియాల దొరల సూటు
చేతుల దిననాపి చెంచాల దినవేసి, ఉంచు విస్తరి దీసి ఉంచి ప్లేట్లు

వేద పఠనమాని వెత్రి యింగ్లీషూని, క్లబ్బు సారా సీస కలిసి డ్యాన్సు
ఇంటి భోజనమాపి ఇడ్లీలు తినరేగి , పూటకూళ్లను మేసి బుద్ధి పులసి
ఉన్నదని లేని దని లేక ఓంనమశ్శి - వాయ యంచు త్రిశంకుని స్వర్గమొంది
పూర్ణనవ్యత్వ సంస్కార బుద్ధిదలగి వ్యసన మందుచు నున్నారు బ్రహ్మరతులు"

17 గట్టుగణపతి - ఎం ఏ ఎం ఓ ఎల్ గుంజెపడగ, తా॥ మంధని

గణపతిగారు తెలుగు ఉపన్యాసకులు వీరు సంస్కృతాంధ్ర పండితులు ప్రౌఢకవి

గణపతి గారి అముద్రిత రచనలు 1 లక్ష్మీవేంకటేశ్వరోదాహరణం 2 సంక్రాంతి లక్ష్మి ఖండకావ్యం 3 లక్ష్మీనాధ నారాయణ శతకము, వీరి అముద్రిత శతకంలోని ఒక పద్యమిది

ప్రాతస్సూర్య కర ప్రసార ప్రధమ స్పర్శా విశేషశ్లిషా
స్పీతాబ్జాంగణ భృంగ ఝుంకృతి ల సద్విస్తార తారాపధా
న్వీతం బున్నగు తమ్మిచెర్వు తమకున్ విఖ్యాత సంగీత సం
ప్రీతిం గూర్చును మంత్రకూటపుర లక్ష్మీనాధ నారాయణా

మరొక పద్యం - బి లక్ష్మయ్య గారి 'శంకరప్ప శతకము' 1976నకు ఈ కవి పీఠికలోనిది

అనఘ లక్ష్మయ్య కృతి కీర్తి యాటవెలది అంగ శృంగార భంగీ తరంగితాంత
రంగ సర్వాంగ శోభా దిగంగనాంగ, ణమున వర్తించునర్తించు నాడు నాడు

18 మాడుగుల వేంకటేశ్వర శర్మ, బి ఓ ఎల్ కాళేశ్వరం

కాళేశ్వరంలోని ముక్తీశ్వరాలయార్చక వంశమువారైన వేంకటేశ్వరశర్మ గారు జిల్లా పరిషత్ సెకండరీ పాఠశాల మహదేవ పురంలో ప్రథమశ్రేణి తెలుగు పండితులుగా పనిచేశారు సంప్రదాయ సాహిత్య ప్రేమికులైన వీరు కొన్ని పద్యాలు పాటలు రచించారు వీరిదొక కందం చూడండి

ముక్తీశ్వరుడని నినునే, భక్తిని నెర నమ్మియుంటి పరమశివుడనీ
యుక్తాయుక్త విచారము శక్తిని దయ సేయుమయ్య శశిధర మకుటా! (క జి ర చ పు 60)

19 పి రామానుజాచార్యులు - పి ఓ ఎల్ ఆవునూరు వ 65 సం

రామానుజాచార్యుల స్వగ్రామం ఆవునూరు కవి పండితుల నిలయం వీరు జిల్లా పరిషత్ సెకండరీ పాఠశాలల్లో తెలుగు పండితులుగా పనిచేశారు ఆసక్తి కలవారికి ఉచితంగా సంస్కృత భాషను నేర్పుతున్నారు వీరి 'వేంకటేశ్వర శతకం' అముద్రితం కొన్ని భక్తి కవితలు వ్రాశారు ఈ కవి 'గోదాదేవి' పెంపుడుతండ్రిని వర్ణించిన పద్యం ఇట్లుంది (క జి ర చ పు 65)

విష్ణు చిత్తులు పెరుమాండ్ల వేడుకొనుచు, పూలతో మాలలల్లుచు పురములోన
కాపురంబును జేయుచు కరుణ తోడ, పెంచు చుండిరాండాళును ప్రేమ మీర

20 ఎస్ మధుసూదనాచార్యులు ఎం ఏ ఎలిగేడు వయస్సు 60 పైన

మధుసూదనాచార్యులు తెలుగు పండితులుగా లెక్చరర్‌గా పనిచేసి ఉద్యోగ విరమణానంతరం స్వగ్రామమైన ఎలిగేడులో విద్యార్థులకు సంస్కృత భాషా బోధన కావించారు తర్వాత కరీంనగర్‌కు మకాం మార్చారు వీరు పద్యకవి దేశహితాన్ని కోరే వీరి కవనం చూడండి

ఏబది యైదుకోట్ల జనమేర్పడ భారత భూమి భాగమం
దీవిధి దు ఖపున్ ఫలితమేర్పడె గాదె ప్రభుత్వ వర్గముల్
భావన జేసి భావి జన భాగ్యము సిద్ధిలునట్లు యోజనల్
పావన భారతంబునకు భవ్యకుటుంబ నిరోధ పద్ధతుల్

ఇది 1973 నాటి 'తరంగణి కవితా సంకలనంలో పద్యం పు 13

అప్పుడు మనదేశ జనాభా 55 కోట్లు ఇప్పుడో 90 కోట్లపైన ఎన్ని నీతులు వల్లించినా చట్టాలు చేసినా - జనం అవిద్య మతమౌఢ్యం ప్రభుత్వం వారి అలసత్వం మేధావుల నిర్లిప్తత జనాభా పెరుగుదలకు దేశదుస్థితికి ప్రధాన కారణాలు

21 కల్వకోట నారాయణ రావు - గరిశకుర్తి - వయస్సు 65 సుమారు

నారాయణరావు గారు వ్యవసాయం వృత్తిగా కవిత్వం ప్రవృత్తిగా కలవారు వేంకటేశ్వర స్తుతి పద్యాలు, భక్తి పాటలు రచించారు కొడుకులకు హితవు నందించిన కవి గారి ఈ కందం చూడండి

గోపీ కృష్ణా వేంకన - మాపటి భోజనము చేసి మంచిగ చదువన్
కోపంబు రాదు బావుకు - పాపాయిలు బాగ చదివి ప్యాసగుడయ్యా (క జి ర చరిత్ర పు 71)

22 ఆర్ గుండయ్య - ఎం ఏ, బి ఓ ఎల్ ధర్మపురి వయస్సు 55 సం

కవినటులు అయిన గుండయ్య గారు రొట్టె విశ్వనాథ శాస్త్రి కవి గారి సోదరులు ఇద్దరూ కవులు వీరి తండ్రి రొట్టె చంద్రశేఖర శాస్త్రిగారు సంస్కృతకవి ఆర్ గుండయ్యగారు ఒగిత్యాల ఓల్డ్ హైస్కూల్లో తెలుగు పండితులు సమస్యాపూరణం సంప్రదాయ కవిత్వం వీరికి ఇష్టం ఒక పద్యం గాంధీజీని గూర్చి వ్రాసినది ఇది (క జి ర చరిత్ర పు 186)

కులమత భేదమే మనల కూలగ ద్రోయుగదా యటంచు నీ
వల మన నేతలందరిక యైక్యత నొంద జగాలదాటి యే
కలతలు లేక యందరిని గల్పితి, వీవు విదేశ పాలనా
కలిత రహస్యముల్ మదిని గాంచి జయించదలంచినాడవో

23 ఆర్ సత్తయ్య - జి ఓ ఎల్ గుండారం, మ బెజ్జంకి వ 50

సత్తెయ్య గారు ఆంధ్ర భాషోపాధ్యాయులు చందమామ కథలను కొన్నింటిని పద్యాల్లో మార్చారు కొన్ని ప్రసిద్ధ శ్లోకాలను అనువదించారు వీరిది ఒక శ్లోకానువాదం చూడండి

మూల శ్లోకము॥ అసహాయ సమర్థోపి తేజస్వీ కింకరిష్యతి।
నిర్వాతే జ్వలితో వహ్ని స్వయమేవ వినశ్యతి॥

అనువాదం కందపద్యం

దండి పరాక్రముడైనను, భండనమున గెలుచునెట్లు బాసటలేకన్
మండెడు వహ్నికి వాయువు అండగ లేకున్న నద్ది యారదె నరుడా!

24 పాకరాజమౌళి - బి ఓ ఎల్, కరీంనగర్ వయస్సు - 47 సం లు

రాజమౌళి ప్రభుత్వ సెకండరీ పాఠశాల మొలంగూరులో క్లర్కుగా ఉండి, సాహిత్యాభిమానం వల్ల తెలుగు పరీక్షలు ప్యాసై వరంగల్ జిల్లాలో తెలుగు పండితులుగా పనిచేస్తున్నారు సంప్రదాయవాది పద్య కవిత్వం వీరికి ఇష్టం

'తరంగిణి' 1973 పు 10-11, లో 'బాపూజీ' శీర్షికలోని వీరి పద్యాల్లో ఒకటిది

తలచుట తాతనే మదిని దాల్చుట లేదు తదీయ సూక్తులన్
నిలుచుట నామమాత్రముకె నీతిగ నేతలు సత్యసంధులై
ఎలిమి ప్రజాహితంబు మది నెంచరు, వీడరు స్వార్థ భావముల్
తలచుట గాంధిపేరు తమ దంభపు భక్తిని చాటనే కదా!

25 బొప్పాపురం మంగయ్య అధ్యాపకులు, పెద్దపల్లి 1980కి ముందే కీర్తిశేషులు

మంగయ్య గారి రచనల వివరాలు తెలియలేదు కాని, సి డి వేంకటరాజు గారి తెలుగు బిడ్డ 1981 శతకంలో వీరిదొక పద్యమున్నది అది ఇది

నీ తెలుంగు బిడ్డ నీ తెలుంగు గడ్డ, నీ తెరుంగ జేయు నీతెరంగు
విజ్ఞుడైతి వోయి వేంకటరాట్కవి, సుతల సుతుల నీతి మతుల జేసి

26 నాదమునుల రామరత్నయ్య - బి ఓ ఎల్ హుజూరాబాద్

వీరు స్థానిక ప్రభుత్వోన్నత పాఠశాలలో ఆంధ్ర భాషోపాధ్యాయులుగా పనిచేసి ఉద్యోగ విరమణానంతరం కొంతకాలానికి 1990 సుమారుగా కీర్తిశేషులైనారు వీరికి మతాచారాల ప్రీతి జాస్తి పద్యకవిత్వమంటే అభిమానం వీరు భక్తి పద్యాలు వ్రాశారు ఇది రామరత్నయ్య గారి శారదా నుతి పద్యం

వాణికి నక్షధామ శుకవారిజ పాణికి పద్మనేత్రకున్
వాణికి భృంగ సంగ సమ వారిద వేణికి బ్రహ్మరాణికిన్
వాణికి పద్మ సంభవుని వాక్పరి పాలన రమ్య శీలకున్
వాణికి నేను నెప్పుడు నవారిత భక్తి దలంచి వేడెదన్ (ని)

27 సింహాచలం నారాయణ స్వామి - బి ఓ ఎల్, పాతగూడూరు

నందిమేడారం జి ప సెకండరీ పాఠశాలలో తెలుగు పండితులైన నారాయణ స్వామి గారు భక్తిభావాలతో కొన్ని పద్యాలు రచించారు వైష్ణవులైన వీరి హరి నుతి పద్యం చూడండి

ఏమియు కోరనంచు మదినెంచుక నున్నటు వాని నన్ను ము
న్నేమియులేని వాని గతి నెందుకు జేసితివయ్య మాధవా!
నేమము నీవు దప్పినను నీమము నేనును దప్పకుందునా?
వామనరూపయోవరద! వందిత చంద్రకళాధరా ప్రభూ! (క జి ర చ పు 167)

28 ఎస్ కేశవ స్వామి బి ఓ ఎల్ ఎలిగేడు ప్రస్తుత నివాసం కరీంనగర్

వీధిబడి పంతులుగా కాలం గడుపుతూనే విద్యార్జన కావించి పరీక్షలిచ్చి పట్టాలు పొంది ప్రభుత్వోద్యోగులైన స్వామి గారు ప్రథమశ్రేణి ఆంధ్ర భాషోపాధ్యాయులు తీరికవేళల్లో వీరు పద్యాలు గేయాలు రచిస్తుంటారు వీరి రచనలు అముద్రితం 'తరంగిణి' 73, పుట 18లోని వీరి 'అన్నదాత' పద్యాల్లో కర్షక ప్రశంస ఉన్నతంగా ఉంది ఆ మూడు పద్యాల్లో చివరిది సీసం మొదటి రెండు గీతాలివి

కోడి కూతతో లేచి ముల్కోలగొనుచు హలమునకు గిత్తలను పూన్చి పొలము జేరి
దున్నియును పంటలను పెంచుదన్న! దాత-లందు కడుమిన్నవన్న - ఓ అన్నదాత!
తినుట కన్నము లేకున్న జనత తినగ - పంచి పెట్టుదు వన్నమున్ బహుశ్రమపడ
జాతిపితవీవు! నీదగు ఖ్యాతి కీర్తి - నిలుచు నాకసంబున రవి నిలుచు వరకు

29 శేషం సుప్రసన్నాచార్యులు ఎం ఏ, హుస్నాబాద్

శేషం వారిది పండిత వంశం సుప్రసన్నాచార్యులు కాలేజీ విద్యార్థిగా ఉన్నకాలంలోనే 'రాగఝరి' పేర ఒకగేయ సంపుటిని 1976లో ప్రచురించారు అధ్యాపకులుగా ఉద్యోగ మందున్న వీరు పద్యకవితలు కూడా వెలయిస్తున్నారు

మచ్చుకు ఒక పద్యం కొండేపూడి సుబ్బారావు గారు విశాఖ నుండి 1991లో ప్రచురించిన 'ప్రసన్నభారతి' 141 పుటలో శేషం సుప్రసన్న గారి పద్యాలున్నాయి అందులో పూర్వకవుల ప్రశస్తి 20 పంక్తుల 'న్న' ప్రాసోత్పల మాలిక ప్రశస్త వర్ణన చివరి పద్యమిది

కోరను రాజ్యసంపదల కోరను రత్న విభూషణావళుల్
కోరను ధాన్యరాసులను కోరను తీయని పాయసాన్నముల్
కోరను భూవిరాళములు కోర నిరంతర గౌరవాదులన్
కోరితి కోటి విద్యలను కోరిక తీర్చు ప్రసన్న భారతీ!

30 సముద్రాల సీతారామాచార్యులు - బి ఓ ఎల్ కోరుట్ల వ 58 సం

వీరు వక్త పద్యకవి మెట్టుపల్లి జూ॥ కళాశాలలో తెలుగు పండితులు

31 చెన్నమనేని సుందరీ బాయి - మారుపాక 62

ఈమె ప్రముఖ కవి, వి కేశవరావు గుండి గారి పెద్ద కూతురు చెన్నమనేని గోపాలరావు (బుద్ధచరిత్ర రచయిత ) మారుపాక గారి సతీమణి తండ్రి గారి ప్రోత్సాహంతో సుందరమ్మ గారు ఆంధ్ర సాహిత్య పరిషత్తు పరీక్షలిచ్చారు మితంగానైనా తెలుగులో పద్యాలు వ్రాశారు వీరి వివాహానికి దూపాటి వేంకటరమణాచార్యులు స్వయంగా వెళ్ళి పద్యాశీస్సులందించారు

వీరిదొక పద్యం క జి ర చ 215, పుట నుండి -

సీత శ్రీరాముని ప్రీతిగా భర్తగా, పొంది బాధలను తానందినట్లు
దమయంతి నలభూవు ధవునిగా జేకొని, కష్టాల భరియింప గలిగినట్లు
సుమతితా పతికిని సుఖము నారోగ్యము చెందుటకై సేవ చేసినట్లు
సత్యవంతుని భార్య సావిత్రి యమునితో పోరి ప్రాణేశుని పొందినట్లు
తల్లి గారింటి వారల నెల్ల వదలి - మధ్య వచ్చిన భర్తను మగిడటంచు
తిట్టి కొట్టి హింసించిన తిరుగబడక - భర్త బాగోగులకు పాటు పడగ వలయు

ఈ జిల్లా మొదటి కవయిత్రి ఆనందమాంబ గారు రెండవ స్థానం సుందరీబాయి గారిది మంథని రాజమణి, కరీంనగర్ హైమవతి గారల పద్యాలు చూపబడినవి మంథని అవధానుల సుమతి గారి పద్యాలు ఏదో సంచికలో కనిపించాయి

మరొక కవయిత్రి గో క సం లోని వి గిరిధర రావు గారి భార్య మధురాబాయి గారు 1920 40 మధ్యకాలంలో కొన్ని భక్తి కీర్తనలు మంగళహారతులు వ్రాసినట్లు వారి పుత్రులు వి సాంబశివరావు గుండేడు సర్పంచ్ గారు ఈ మధ్య తెలిపారు

ఇతరులు

ఇంకా పలువురు తమ కవితలు పుస్తకాలుగా ముద్రించకున్నా పద్యాలు వ్రాసే వారు ఉన్నారు వారిలో కొందరి పేర్లివి -

1 డా కొరిడె రాజన్న శాస్త్రి రీడర్ ధర్మపురి
2 డా తిరుమలశ్రీనివాసాచార్య రీడర్ నారాయణపురం
3 గోలి పద్మారెడ్డి ఎం ఏ కరీంనగర్, ఆర్ట్స అండ్ కామర్స్ జూనియర్ కాలేజి ప్రిన్స్‌పాల్
4 పి వెంకటేశ్వర్లు కోరుట్ల
5 డా ఐ స్వామిరెడ్డి, ఎం ఏ , పిహెచ్ డి గాగిల్లాపురం
6 ఆచార్య శ్రీశ్రీ - గుమ్లాపూర్, అధ్యాపకులు నిజామాబాద్
7 కె పాపేశ్వరశర, బి ఓ ఎల్ కొండాపురం, (జిన్నారం)
8 కీ శే డాక్టర్ ఎస్ కె (కొహెడ) కరీంనగర్
9 రామశర్మ - బి ఓ ఎల్ మారాకొండూర్ అధ్యాపకులు
10 జి రాములు - సిరిసిల్ల మొ॥వారు
11 డా జి లక్ష్మణరావు - లెక్చరర్ (కరీంనగర్) ప్రెగడపల్లి
12 మాడుగుల భాస్కరశర్మ ఎం ఏ కాళేశ్వరం అధ్యాపకులు

## చిత్ర కవిత – ఆశుబంధగర్భకవిత్వ పద్యసాహిత్యం

ఆశు కవిత కవి అభ్యాస పాటవాన్ని బట్టి రాణిస్తుంది ప్రతి వ్యక్తి కొంతైనా కవితా వాసన కలిగి ఉన్నట్టే ప్రతి కవీ ఎంతో కొంత ఆశుకవితా ధోరణి కలిగి ఉంటాడు

అవధాన కవిత్వాన్ని ఆశుకవితగా భావించవచ్చు చిత్రబంధ పద్యాలు, పద్యగర్భ పద్యాలు కవి సాధనను బట్టి సమకూరే అంశాలు ఇవన్నీ కవితా కసరత్తులు ఆలంకారికులు చిత్రకవిత్వాన్ని

అధమకవిత్వ మని (మూడవ తరగతి) అన్నారు అయినా ఇవి పాఠకులను లేదా శ్రోతలను అలరిస్తాయి కవులకు ఖ్యాతిని గౌరవాన్ని సమకూర్చుతాయి ఈ చిత్ర కవితా రంగంలోనూ కరీంనగర్ జిల్లా కవులు రాణించారు

**అవధాన కవిత్వం**

అష్టావధాన శతావధాన సహస్రావధానాలని ఇవి వ్యాప్తిలో ఉన్నాయి సహస్రావధానం చేసిన వారు ఇక్కడ లేరు శతావధానంలో నాటికీ నేటికీ ఒక్క కొరుట్ల కృష్ణమాచార్యుల పేరే ఈ జిల్లాలో వినవస్తున్నది అష్టావధానులు చెప్పుకోదగినంతగా ఉన్నారు

అవధాన కవుల వివరాలు ఈ 20వ, శతాబ్దికి పూర్వం అవధానాల - అవధానుల ప్రసక్తి ఈ జిల్లాలో లేదు ఒక్క చరికొండ ధర్మన - ధర్మపురి, చిత్రభారతం'లో శతలేఖిన్యవధాన ప్రసక్తి ప్రశంస ఉంది గోలకొండ కవుల సంచిక - 1934 లో ఈ క్రింది వారి పేర్లు అవధానులుగా కనిపించాయి

1 ధపూరి సత్యనారాయణాచార్యులు - కోట్ల, నం 38, అష్టావధాని
2 నెమిలికొండ శ్రీరంగాచార్య శాస్త్రి జాగీర్ నారాయణపురం, నం 65, అష్టావధాని,
3 ఆఛి వేంకట నృసింహాచార్యులు - ఆవునూరు, నం 96 అష్టావధాని,
4 నేరెళ్ల వేంకటరంగాచార్యులు - బండలింగాపురం, నం 110, శతావధాని
5 సిరిశెనహళ్ కృష్ణమాచార్యులు కొరుట్ల, నం 171 అష్టావధాని (తర్వాత - శతావధాని)
6 టి కృష్ణశాస్త్రి పదిరె నం 173 అష్టావధాని
7 పులుగోటి ఆనందమాంబ కొడిమ్యాల, నం 279 అష్టావధాని

తర్వాతి కాలంలోని అష్టావధానులు ఈ 20వ శతాబ్ది ఉత్తరార్ధం వారు

1 మామిడిపల్లి సాంబశివశర్మ వేముల వాడ 14/15 అవధానాలు చేశారు
2 డా॥ అందె వేంకటరాజము - కొరుట్ల 60కి పైన అవధానాలు చేశారు 97 మే లో 76
3 తిగుళ్ల శ్రీహరిశర్మ - చీర్లవంచ, 10 20 మధ్య అవధానాలు చేశారు 97 ఏప్రిల్‌లో 92
4 పార్వెళ్ల గోపాలకృష్ణ చాకుంట, 5-10 మధ్య అవధానాలు చేశారు 97లో 15
5 అరుట్ల రంగాచార్య మోతె దాదాపు 5-10 అవధానాలు చేశారు

గో క సం లోని ఇక్కడి అవధానుల పేర్లు అంతగా జనవ్యాప్తిలో లేవు ఆనందమాంబగారు ఒకటో రెండో అవధానాలు చేశారు నేరెళ్ల వేంకట రంగాచార్యులు సంగీతంలో అవధాని అని, సాహిత్యంలో అవధానాలు చేయలేదని వారి బంధువులు తెలిపారు ఆఛి వేంకట నృసింహాచార్యులు పలు అష్టావధానాలు సమర్థవంతంగా నిర్వహించినా వారి యువదశ 1926-38 మధ్య కాలంలోనే ఆ తర్వాత అవధానాల వదలివేసి వేదాంత ధర్మబోధకులైనారు వారి మొదటి కొరుట్ల 1926 అవధానం ఒక్కటి మాత్రమే వారి సంస్మరణ సన్మాన సంచిక 'ఆదర్శ జీవనము' 1985లో ప్రచురించబడింది వారి తక్కిన అవధానాల సాహిత్యం భద్రపరుచబడలేదు

సిరిశినహళ్ కృష్ణమాచార్యులు కొరుట్ల గారు 40 వరకు అష్టావధానాలు 4, 5 సంస్కృతాంధ్ర శతావధానాలు చేశామన్నారు ఈ విషయం వారి 'స్వీయకవితాను జీవనం' లోనూ వ్రాసుకున్నారు వారి 'కొరువుట్ల జయతాల" - (కొరుట్ల జగిత్యాల) శతావధానాలు రెండు మాత్రం 1930లో పుస్తకరూపంలో వచ్చాయి కృష్ణమాచార్యులు వారి యువ దశలోనే అవధానాలు చేశారు 1929 నాటి వారి 'కళాశాలాభ్యుదయము' కావ్యంలో ఇట్లా వ్రాసుకున్నారు

అనఘంబైన శతావధాన సమయంబందొ సమావేశముం
గని హేయంబగు వాని నైన గడు సింగారమ్ముగా నెంచు నా

మనమందెవ జనించెగాన జన సమ్మాన్యాత్మ సత్కీర్తనం
బును పెంపొందగ జేతు మానసమునన్ మోదంబు చేకూరగన్ 1-6

అని అవధానాలను విడిచి కావ్యరచనకు పూనుకున్నారు వారి జననం 1905కాబట్టి ఇది కవి తమ 25వ, ఏట తీసుకున్న నిర్ణయం అనుకోవచ్చు

స్థానిక అవధానులకంటే ఆంధ్ర ప్రాంతమునుండి కవితా సంచారముగా ఇటువచ్చిన సహస్రావధాని జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి సి వి సుబ్బన్న అవధాని వంటి వారి అవధానాలు కని, తిరుపతి వేంకట కవుల, కొప్పరపు కవుల వంటి వారి అవధానాల గూర్చి విని, ఇక్కడి వారిలో అవధాన కవిత్వంపై ఆసక్తి జనించి ఆ రంగంలో సాధన చేయించింది, అనే మాట వాస్తవం మాడుగుల నాగఫణి భూషణ శర్మ, మేడసాని మోహన్ గారల సహస్రావధానాలు ఈ 96లోనూ ఆంధ్రప్రదేశ్ సంప్రదాయ సాహితీలోకంలో సంచలన వార్తలైనాయి కదా

ఈ 20వ శతాబ్ది ఉత్తరార్థవధానులలో మామిడిపల్లి సాంబశివ శర్మ గారు కీర్తిశేషులు మిగితా నలుగురు ఇప్పటికీ అవకాశాన్ని బట్టి అవధానాలు చేస్తూనే ఉన్నారు వీరిలో డా అందె, పార్వెళ్ల గోపాలకృష్ణ పద్య కావ్యకర్తలు తిగుళ్ల శ్రీహరిశర్మ గారు ఆధునిక భావసంపన్నులు ఆరుట్ల రంగాచార్య భక్తి భావ సంభూషితులు

డా॥ అందె వేంకటరాజము గారు తమ అష్టావధానాలను అరువదిని 'అవధాన పద్యమంజరి' పేర 1996లో ఒక పుస్తకంగా ప్రచురించారు

అవధాన పద్య కవితా కళలో సైతం కరీంనగర్ జిల్లా కవులు స్థానికంగానే కాక పొరుగు జిల్లాల్లోనూ గౌరవ సన్మానాలు పొందుతున్నారు

చిత్రబంధ గర్భ పద్య కవిత్వం

ఒక బొమ్మ (రేఖాచిత్రం)లో పద్య పాదాల అక్షరాల, రేఖల - గడుల మధ్య ఇమిడిస్తూ ఆరోహణ అవరోహణక్రమంగా బొమ్మను బట్టి చదివి భావం కుదిరేవిధంగా వ్రాయబడేవి బంధ కవితలు ఒక పద్యంతో మరో పద్యం ఇమిడిస్తూ యతిగణ ప్రాసలు భావాలు తప్పిపోకుండా సరిగా వ్రాస్తే అది పద్య గర్భ పద్యకవిత్వం

ఈ చిత్రకవిత్వంలో మధ్యయుగపు గణపవరపు వేంకటకవి పేరు మన సాహిత్యంలో ప్రచురంగా వినవస్తుంది ఈ జిల్లాలోని చిత్రబంధ గర్భ పద్య కవితా విన్యాసాలు చూపిన కవులు అయిదారుగురున్నారు వారిపేర్లు ఇవి

1 భట్టు అచ్యుతరాజు - బండలింగాపురం, 2 శతావధాని ఎస్ కృష్ణమాచార్యులు కొరుట్ల
3 గంగా రాజేశ్వర రావు - మంథని, 4 తత్త్వాది కృష్ణశర్మ - తక్కళ్ల పల్లి మం కథలాపురం,
5 నారంభట్ల లక్ష్మీనారాయణ - దుంపెట, మం కథలాపురం

మెట్టుపల్లి తాలూకాలోని బండలింగాపురం రాజాశ్రితులు అచ్యుతరాజుగారు వీరికి 'చిత్ర ప్రబంధాంత కేసరి' అను బిరుదం ఉన్నట్టు 'బంధగర్భశతకము' జగన్మోహినీ నాటకం, అనంతశతకం అను కృతులు రచించినట్లు గఱ్ఱెపల్లి సత్యనారాయణ రాజు గారు కరీంనగర్ మండల చరిత్ర పుట - 15లో పేర్కొన్నారు అనంత శతకంలోనే బంధగర్భ పద్యాలు కొన్ని ఉండవచ్చును ఎందుకంటే

అదే బండలింగాపుర రాజాస్థాన పండితులైన గోవిందుల నరసింహాచార్లు గారి దౌహిత్రులు సిరిశెనహల్ కృష్ణమాచార్యులు కొంతకాలం మాతామహులింట నివసించినవారు వీరికి అచ్యుతరాజుతో పరిచయం ఉంది అచ్యుతరాజు నాలుగైదు చిత్రబంధ పద్యాలు వ్రాస్తే అది జనం గొప్పగా చెప్పుకోవటం చూసి తాము ఒక్క మాసంలో 'చిత్రబంధ పద్యశతకం' రచించినట్లు చెప్పారు గ స రాజు గారిది శ్రుత వాక్యం శతావధాని గారిది సమకాలీన సమాచారం

ఏది ఏమైనా అచ్యుత రాజు గారి బంధకవిత్వం కృష్ణమాచార్యుల చిత్రబంధపద్య శతక రచనకు ప్రేరణ అని ఒప్పుకోక తప్పదు అయితే శతావధాని గారి తాత సింగరాచార్యులు మోర్తాడు జిల్లా నిజామాబాద్‌లో 'ఖడ్గ చక్ర బంధములు' వ్రాసి ఘన సన్మానములందిన వారని కృష్ణమాచార్యులు స్వీయకవితాను జీవనం పుట 47లో తెలిపారు ఆచార్యుల చిత్రబంధ పద్య శతకం అపూర్వ కవితా ఎంవిధాన విన్యాస శోభితం దీనిని కవి 1939లో తమ యిష్టదైవమైన నంబులాద్రి - నిమ్మనపల్లి తా॥ పెద్దపల్లి స్వామి స్తుత్యాత్మకంగా రచించారు అది ఇప్పటికీ అముద్రితం దాని వ్రాత ప్రతి కొరుట్లలో కవిగారి గృహంలో ఉంది దీనిని కృష్ణమాచార్యుల పుత్రులు ఎస్ సంమత్కుమాచార్యులు మెట్టుపల్లిలో ముద్రిస్తున్నారు - జూన్ 1997

గంగారాజేశ్వర రావు గారిది అపూర్వ చిత్ర కవితా విన్యాసం వీరి పరీక్షిచ్చరిత్రం కావ్యం చివర 159 160 పుటలలో మాలా, పచ్చీసు గర్భ పద్య విన్యాసాలు చూడవచ్చు వీరి అముద్రిత రగడ రామాయణంలోనూ అత్యంత పద్య గర్భ పద్యాలు సుందరంగా రూపొందించారు తత్పాది కృష్ణశర్మ గారు నారంభట్ల లక్ష్మినారాయణ గారలు కొన్ని చిత్రబంధ గర్భపద్యాలు తమ శతకాలలో వ్రాసిన విషయం ఇంతకు పూర్వం ఇదే గ్రంథంలో చూపడమైంది

ఇది కరీంనగర్ జిల్లా పద్య కవుల - సాహిత్య చరిత్ర ఇంచుమించు వెయ్యేండ్లు రాజ- ప్రజా సమ్మాన భాజనమైన పద్య కవిత ఆదరం ఈనాడు క్రమక్రమంగా సన్నగిల్లిపోతున్నది క్రమంగా అది అదృశ్యమైనా కావచ్చు కాల ప్రభావమట్లున్నది అయితే ఇక్కడ పద్య కవితాభిమానం తక్కువగాలేదు గత వైభవ చిహ్నంగా పాండిత్య ప్రదర్శనకు నిదర్శనంగా పద్యకవిత్వం ప్రస్తుతకాలంలోనూ విద్యార్థుల పండితుల పరిశోధకుల, రసజ్ఞుల అలరిస్తూనే ఉంది

## 2. యక్షగానాలు, హరికథలు, బుఱ్ఱ కథలు, మధుర వేదాంత కవితలు

ఈ జిల్లాలో రెండు శతాబ్దాల క్రితం ఆరంభమై ఈ ఇరువదవ శతాబ్ది పూర్వార్థంలో విపరీత జనాదరణ పొందిన యక్షగానాల రచన - ప్రదర్శన ఉత్తరార్థంలో తగ్గిపోయింది పట్టణ ప్రాంతాల్లో సినిమాల ప్రభావం పెరిగింది దేశ స్వాతంత్ర్యం, ఆంధ్రదేశ అవతరణ కారణంగా ఆధునిక స్టేజినాటకాలు, సినిమాలు విద్యావంతుల దృష్టినాకర్షించాయి గ్రామీణ ప్రాంతాల్లో యక్షగాన-వీధి నాటకాలను ప్రదర్శించినా అవి ఇంతకు పూర్వ కాల కవులు రచించినవే ఈ కాలపు యక్షగాన కవుల పుస్తకాలు పదికి మించవు

1950-55 ప్రాంతాలలో చిరుతల రామాయణ భారతములు అనే పేర ఆరుబయట ప్రదర్శించే కొత్తరకం వీధినాటకాలు వచ్చాయి ఈ ప్రాంతంలో గజవెల్లి విధుమౌళి చంద్రమౌళి శాస్త్రులు వ్రాసిన చిరుతల నాటకాలు వ్యాప్తి పొందాయి ఈ ప్రాంతకవులవి కేవలం రెండే రెండు చిరుతల నాటక పుస్తకాలు లభించాయి

(ఒక విషయం ఈ శతాబ్ది పూర్వార్థ యక్షగాన కవుల రచనల వివరాలు మరిన్ని లభించాయి అయ్యవారు వెంకటనరసయ్య పంతులుగారి 18 నాటకాల పేర్లు అంబారిపేట పులి రాజయ్యగారి వ్రాత పుస్తకంలో లభించాయి వాటిలో మూడు 1936, 38,46లో ముద్రితం కథలాపురం గంగాధరయ్య గారి రచనలు 34 నాటకాల పేర్లు వారి కుమారుడు ఇచ్చాడు అందులో 10 మాత్రమే ముద్రణ పొందాయి శతకాలు నాలుగు రమేశ శంభో మహేశ ఉమామహేశ్వర )

సుప్రసిద్ధ యక్షగాన కవి వెర్వీరాల భాగయ్య సికిందరాబాదు గారిచే ఈ జిల్లా సాహిత్యాభిమానులు వదాన్యులైన గుండేటి రాజన్న భూమయ్య సంగెం గారు 'సారంగధర నాటకము 1976లో అత్తెల్లి భద్రయ్య చల్లూరు గారు 'రంభా రంపాల నాటకము' 1986లో వ్రాయించారు (ఈ రంపాల రమాపాల కావచ్చునేమో!) భాగయ్య గారు ఇక్కడి ఒకటి రెండు వీధి నాటకాలు పరిష్కరించారు ఈ కాలంలో ఈ జిల్లాలో యక్షగాన కవులు పది మంది వరకున్నారు వారి రచనల వివరాలు వరుసగా ఇక్కడ చూపబడుతున్నవి

### 1 చాత్తాద వేంకటనరసయ్య - కరీంనగర్ - బొంబాయి

వేంకట నరసయ్య గారు కరీంనగర్ జిల్లా వారు చక్కని మధుర కవి బొంబాయిలో 1950-60 మధ్యకాలంలో వీరి రచనలకు మంచి ఆదరణ ఉండేదని ఆడెపు గురువదాసు కవి సిరిసిల్ల గారు తెలిపారు వారి పుస్తకాలేవీ లభించలేదు గురువదాసు గారు చెప్పిన కవి రచనల వివరాలివి

1 నీతి ప్రసూనం, (పద్యాలు,భజన కీర్తనలు) - 1955 ము

2 పరశురామ విజయము,(యక్షగానము) 1960 ము

వేంకట నరసయ్య గారి కవితా పరిచయానికి ఓ రెండు కీర్తనల భాగాలు చూపబడుతున్నవి

ద్విసహస్ర రసన శాయి సముద్ర గంభీర కుసుమ కోమల కో టి సుందరా - దేవ
యసమాన బల కంబు కంధరా!

ఎగురకు ఎగురకు మొగోడవని నాకెరుకే ఉందోయీ - పెద్దయ్యా ! ఎరుకే ఉందోయి
ఎగిరి క్రిందబడు మంటి ముద్ద - మళ్ళెగుర జాలదోయి

## 2 బండాయి లక్ష్మీరాజం, పొత్తూరు - అనుపురం

లక్ష్మీరాజం గారు కవి, హరిదాసు వీరు గౌడ కులస్థులు వీరి రచనలు

1 పురుషోత్తమ శతకము - 1967లో ముద్రితం 2 శ్రీసత్యానంద శతకము అముద్రితం 3 బ్రహ్మంగారి నాటకము - అముద్రితం

## 3 మార్గం హరిపెల్లి - హన్మాజిపేట 62 లో మృతి

హరిపెల్లి గారు బొంబాయిలో చేనేత కార్మికులు రచయిత వీరి రచనలు ఇవి

1 ఆత్మైక తత్త్వములు, 2 వేంకటేశ్వర భజన కీర్తనలు 3 గుణసుందరి నాటకము, 4 రత్నపాలో పాఖ్యాన నాటకము

వీటిలో ఏవి ఏకాలంలో ముద్రితములనే విషయం స్పష్టంగా తెలియలేదు హరిపెల్లి తనకు అత్యంత సన్నిహితుడని అతని స్నేహస్మృతిగా తన కుమారునికి (వయసు 16 సం॥ 92లో) హరిపెల్లి అని పేరు పెట్టుకున్నామన్నారు ఆడెపు గురువదాసు గారు సరళము సరసము భక్తిపూరితము హరిపెల్లి గారి కవిత।

ఆత్మైక తత్త్వము 60 కీర్తనలు నడక ఇది

నా గతి ఏమౌనో గద శ్రీమన్నారాయణ దేవా

యేగతి యౌనో తెలియదు గద నీకృప సద్గతి త్రోవా

వే భ కీర్తనలు దాదాపు 50

ఇక్కడుండే మొక్కెదను నీవెక్కడుంటివో వేంకటేశ - మక్కువతొ కవి దాహంతో మార్గాయాసంతో ఈ వేడికోలు గీతం, రచించారు గుణసుందరి నాటకంలోని ఒక పాట చరణం

చిన్నబోయి యున్నవె తరుణీ - నే నన్నమాట నిజము తేట

## 4. పులికాంత పెద్దరాజయ్య - కథలాపురం మృతి:1991

సుప్రసిద్ధ యక్షగానకవి పులికాంత గంగాధరయ్య పెదరాజయ్యగారికి అన్న చిన్నరాజయ్య, అప్పయ్య, వీరికి అనుజులు పెదరాజయ్యగారు అగ్రజునితోపాటు నాటి నాటకాల్లో నటించారు వీరు కవి అనే విషయం, కోరుట్ల 'భారతీ సాహిత్య సమితి' వారు ప్రచురించి 'బాల రసాలు'లోని వీరి సీసపద్యాల పట్టి తెలిసింది వీరి కవిత్వాన్ని గూర్చి పెద్దగా ప్రచారం లేదు (ఒక సారి వెళ్ళి12 5 1996 విచారించగా చిన్న రాజయ్యగారి కుమారులు విద్యాసాగర్ వీరి ముద్రితా ముద్రిత రచనలు చూపారు) సూర్యుని ముందు దివిటీ వలె వీరి ప్రతిభ అన్నగారి వాసి ముందు వ్యాప్తికానట్లుంది రాజయ్య గారు మంచి (వర) కవి వీరి ముద్రిత రచనలివి -

1 దేవాంగనాటకము 1961 36+7=43 పాత్రలు (పద్మశాలి పురాణం)

2 భద్రావతి కల్యాణ నాటకము - 1975 (భావనా రుషి కల్యాణ కథ)

3 భల్లన నాటకము(అము) ఇది అంబారిపేటలో పులి రాజయ్య గారింట ఉంది

4 భక్త విప్రనారాయణ నాటకము (అముద్రితము) 5 రాహూజన్ నాటకము - (ఇది వంజరి వారి చరిత్ర అముద్రితం) 4,5 వ్రాత ప్రతులు కవిగారి ఇంటిలోనివి

ఇతరాలు రచనలు -

1 హనుమంత శతకము 1961 ముద్రణ 101 కందాలు హనుంతా మకుటం
2 శ్రీ వాసర సరస్వతీ శతకము (అముద్రితము) 101 సీస పద్యాలు ముకుటం ఇది అరిమద విదార వాసర పుర విహార శ్రీ సరస్వతీ జగదంబ చిన్మయాంబ ఇందులో సరస్వతీ దండకం కూడా ఉంది
3 స్మృతి పద్యాలు - తమ్ముడు అప్పయ్య మృతికి వ్రాసిన 40 సీసాల స్మృతికావ్యం
4 సీమంతినీ పరిణయము అన్నగారి నాటకాన్ని అనుసరించిన ఉయ్యాల పాట
5 జ్ఞానానంద భజన కీర్తనలు, 6 శివప్రార్థనావిధి మేలు కొలుపులు
7 చౌడేశ్వరీ దండకం, 8 కోలాటం పాటలు భజనకీర్తనలు
9 కేదారేశ్వర వ్రతకల్పం - మంగళహారతులు ముద్రితం

రాజయ్యగారి సరస్వతీ శతకం ఆదిలాబాద్ కోవెల శ్రీనివాసాచార్య డాక్టరేట్ పరిశోధనలో చోటుపొందింది ధర్మపురి శేషప్ప నరహరి శతకం వ్రాత ప్రతి వీరింట ఉంది పరిశోధకులకు పాఠభేదాలకు పద్య సంఖ్యకు పనికి రావచ్చు భక్తి విషయాలే కాక వీరు శాస్త్రీజీమృతి, భారత స్వాతంత్ర్యం మున్నగు సమకాలీన అంశాలపై కూడా పద్యాలు రచించారు వీరి పద్యాలు సరళం పాటల్లో సంస్కృతం పాలు ఎక్కువే కవి వీరశైవ సంప్రదాయం వారు పాల్కురికి సోమన నడకలోని ఒక మేలుకొలుపు చరణం చూడండి

శరణు శరణు పురాతనులకును - శరణు శైవ గ్రామ నిధులకు
శరణు పాప విదూరులకు - శరణుల కెల్లా - శివ శివ శరణు శరణు - 13వ ది

రాజయ్య గారి నాటకాలు వీధినాటకాలు, యక్షగానాలకు అనంతర కాలపువి, అన్నగారి సాహచర్యం, స్వీయ నటనానుభవం వీరి రూపకాలను ప్రదర్శన యోగ్యం చేశాయి

## 5 ఆడెపు గురువదాసు - బాపుపేట - ఆసిఫ్‌నగర్ ప్ర.నివాసం - సిరిసిల్ల

గురువదాసు గారు కొన్నేండ్లు బొంబాయిలో చేనేతకార్మికులుగా గడిపి వచ్చి సిరిసిల్లాలో స్థిరనివాసం ఏర్పరచుకున్నారు మితవిద్యను స్వయం కృషితో పెంచుకొని భక్తి కీర్తనలు, పద్య శతకాలు, యక్షగానాలు రచించారు అచల వేదాంత గురువుగా శాశ్వతానంద స్వామి పేరుతో రాణిస్తున్నారు అరువదేండ్లు దాటిన వీరు నిత్యోత్సాహి సాహిత్యజీవి కవి పండితలంటే, అభిమానం, ఈప్రకరణంలోని 2-4 వరకు గల ముగ్గురు ప్రవాసాంధ్ర కవుల వివరాలు వీరే తెలియజేశారు గురువదాసు గారి రచనలు –

1 రేణుకాంబ భజన కీర్తనలు - 1966 ముద్రణ,
2 శరణానంద భజన కీర్తనలు - 1966
3 రాజలింగేశ్వర శతకము - ము సం వేసి లేదు, 66 సు
4 కామమ్మ కథ - యక్షగానము - 1971
5 కొండలరాయ చరిత్ర - 1972



6 శ్రీ పరమ శివ భక్తి వినోదిని ముద్రితం ౧౦

7 వజ్రేశ్వరి భజన కీర్తనలు అముద్రితం

ఈ కవి రచనలు వర కవితగా ఉన్నా చాల వరకు నిర్దోషాలు కవి వ్యావహారిక గ్రామీణ భాషా పదాలు స్వేచ్ఛగా ప్రయోగించారు రాజలింగేశ్వర శతకంలోని ఒక పద్యం ఇది

సీ శ్రీ గౌరి ప్రాణేశ స్థిత చిత్త ఫణి భూష హిమశైల నిలయేశ విధివినాశ
త్రిపురాధి పతినాశ అపురూప సర్వేశ, కృపజూడు మాయీశ తపసివేశ

గీ వాసుకీ భూష వేములవాడ వాస రాజలింగేశ గురువాస రక్షితేశ అని ఉన్న శతకమకుటాన్ని
వాసుకి విభూష వేముల వాడ వాస, రాజ రాజేశ భక్త విభ్రాజి తేశ - అని మార్చుకున్నారు

ఆ వె మాటలాడ నేర్చు మమకారమును గూర్చు, పూటబత్తెమిచ్చి బ్రోచునట్టి
పలుకుజెలికి మించు పరమాత్మ లేరంచు తలచి కవిత వ్రాయదలచి తిపుడు

కామమ్మ కథ యక్షగానంలోని ఒక పాట

నామాల వెంకన్ని నేమాల వెంకన్ని - నామూల మంత్రాలు విన్నారా - మీరు
నామాయ తంత్రాలు కన్నారా
కామినీ మోహినీ కయ్యాల శంఖినీ ధూమ్రమాల దుర్గినీ దుందుమ్మ మర్గినీ
సామినీ సాక్కిని శోధించి మహిషినీ ఏ మూల కామూల నేమించి బంధింతు -

శ్రీ ప శి భక్త వినోదినిలో 14వ, పాట ఇట్లుంది

వింటేనే వినుమన్నాడు సద్గురు బోధ వినకుంటె జనుమన్నాడు
వింటెనే వినుమానె - వినకుంటె జనుమానె
జంట బాయక యింటి లోపల వొంటిగుండు ఘంటనాదం॥

**కొండల రాయచరిత్ర (యక్షగానము)**

ఈ కవి యక్షగాన వీధి నాటకాలకు మధ్యగల భేదాలను సూక్ష్మంగా గ్రహించారు ఈ యక్షగానంలో పాత్రలకు కీర్తనలు దరువులు - పద్యాలు తప్ప వచన సంభాషణలు లేవు సంధి వచనాలున్నా అవి మంత్రి వేషధారి పలుకవలసిందే తప్ప పాత్రలకు సరిపడవు అవి కథా సందర్భాలను వివరించేవి ఇందులో సాధారణ పద్యాలతో పాటు సుగంధి, మత్తకోకిల తరళం, పంచచామరం - పు 39, మొదలైన విశేషవృత్తాలు, శోకావళి మొ॥ దరువులు, పాత్రల ప్రవేశపు తెరచాటు పాటలు, స్వీయ పరిచయ పద్యాలు, పైగా కందార్థాలవలె ఇతర పద్యార్థాలున్నాయి ఈ చంపకమాలార్థము జుల్వతాళములోనిది చూడండి - పు 8

సఖివిను పద్మశాలికుల చంద్రుడు ఆడెపు లక్ష్మణాఖ్యునీ
సఖియగు గోపమాంబకును సంతతి యందు తృతీయపుత్రుడే
సుకవియు గుర్వదాసు మరి శోధన జేసి కృతించె నుర్విలో
సకల జనంబులున్ జదివి॥ దర్వు॥ సంతోషముతో నాటలాడా - భవ
చింతా ధావంతములు వీడా వింతగు తాలుక సిరిసిల సుభాన్ నగరమందు శాంతమున నివాసమయి శంభుని గూర్చి స్మరించి వ్రాసె ॥సం॥

ఈ కవి నాటక నాంది ప్రస్తావనలో నటీ సూత్రధారులను కాక రంభను ప్రవేశపెట్టి కవి - కథా పరిచయం కావించారు

కొండలరాయుడు ఈ మండల వెలమ వీరుడు ఇది బుడిగె జంగము కథగా చాల వ్యాప్తిలో ఉంది అదే ఈ కవి రచనమున కాధారమన్నారు ఈ యక్షగాన కథలో చారిత్రక విషయాల అనుమానాలు ఉన్నా, ఇది రసోచిత కథాగమనం గల వీరగాథ అనడానికి ఎటువంటి విప్రతిపత్తి లేదు సరస సౌమ్య భావాల వరకవి ఆడెపు గురువదాసు గారు ఈ కవి యక్షగాన నాటకాలను హైదరాబాద్‌లోని శిద్దేశ్వర పబ్లికేషన్స్ వారు ప్రచురించారు

## 6 కనపర్తి రత్నయాచారి - తాటిపెల్లి మం మల్యాల

రత్నయ అనే పేరు యక్షగాన రచయిత'గా' క జి ర చరిత్ర - 81, పుట 237లో ఉంది వివరాలు సేకరించగా రత్నయాచారి 1970 సుమారుగా కీర్తి శేషులైనట్లు తెలిసింది

వీరు సతీ అనసూయ యక్షగానం రచించారు ఇది అముద్రితమైనా పలు ప్రదర్శనలు పొందినది

వీరే కాక వీరి తమ్ములు కనపర్తి బ్రహ్మయ్య గారు కూడా కొన్ని భజన కీర్తనలు రచించారట ఎంత ప్రయత్నించినా ఈ విశ్వ బ్రాహ్మణ కవి సోదరుల రచనలు చూసే వీలు కలుగలేదు

(తాటిపల్లి నివాసి బాలగేయకవి మేడిపల్లి రామచంద్రం గారు అదే గ్రామ వాస్తవ్యులు కోరుట్లలో పి ఎం పి గా ప్రాక్టీసు చేస్తున్నడా అబ్దుల్లా గారి ద్వారా ఎన్ని సార్లు చెప్పి పంపినా జవాబు వ్రాస్తానన్న బ్రహ్మయాచారి గారు వృద్ధాప్యం కారణంగా కాబోలు ఏ వివరములు అందించలేక పోయారు )

## 7 పుల్లి రాజయ్య సిద్దాంతి అంబారి పేట మృతి 1991.

1 నీలవర్ణోపాఖ్యానము 2 సతీతులసి నాటకము ముద్రితములు

రత్నమాల నాటకము - 1973 ముద్రణ, 4 - 5 ప్రభవ - 1987 శుక్ల - 1989 పంచాంగములు ముద్రింపబడినవి అముద్రిత రచనలు ఇవి

1 శ్రీ ఓంకారేశ్వర వ్రతకల్పము కల్యాణ మంగళహారతులు (అము)

2 శ్రీ సత్యనారాయణ నాటకము - (అసంపూర్ణం)

3 అనుభవ సార పద్యాలు - కందాలు 56 మకుటరహితాలు

4 శతకం(అసం) మకుటం "అంతరాత్మకు తెల్పు హరెమురారె" ఛందం?

5 ఇత్తెగ వేయుడు - అత్తెగ మింగుడు డ్రామా (అసం 2 పుటలేవిరచితం)

పుల్లి రాజయ్య గారు బొంబాయిలో 30ఏండ్లుండి స్వగ్రామానికి వచ్చిన తర్వాత 15 ఏండ్లకు కీర్తిశేషులైనట్లు ఆయన భార్య బుచ్చమ్మగారు (11-5 1996) చెప్పారు ఈ వర కవి స్వయంకృషితో విద్యనార్జించిన నేత కార్మికుడు వీరి పుస్తకాలు ముఖ్యంగా నాటకాలు బొంబాయిలో ఉన్న కాలంలోనే కొండా శంకరయ్య సికింద్రాబాద్ వారు ప్రచురించారు వీరి రత్నమాల సినిమా అనుసరణ నాటకంలో ఈ జిల్లా వారు బొంబాయి నివాసులు కవులైన చిట్యాల బాలదాస కవి - ఆవునూరు, బండారి లక్ష్మీరాజం - పొత్తూరు, దాసరి శంకరయ్య- నిమ్మపల్లి, కొక్కుల లింగయ్య- మామిడిపెల్లి, మేన అంబాజీ - చంద్రంపేట, ఇంకా వంగరి గంగారాం కవి దూలూరు, ఆడెపు గురువదాసు గారల పీఠికలున్నాయి

ఈ నాటకం బొంబాయిలో తెలుగు వారిచే (తెలంగాణా కరీంనగర్) ప్రదర్శితమైంది ఈ కవి

గారిని గూర్చి మేన అంబాజీ గారి అభిప్రాయం ఈతని కన్నె కవిత ఇప్పటి వరకు లలిత సాహితీ రమ్యతారీతులను సమగ్రముగా గుబురుకొనకున్నను శాస్త్ర రమణీయకతను విడిచిలేదు అక్షర సత్యం ఈనాటకంలోని ఒక పద్యం పు 17

గీ పుత్రకులు లేనివారికి పుడమి యందు । గతియు మోక్షము లేవని ఘనముగాను
వేద శాస్త్రముల్ తెలిసిన వెలదిగాన। సంతువడయుటకై నేడు చింతగలిగె

ఇందలి పాటలు కొన్ని పూర్వ నాటకాల దర్వులను, సినిమాగేయాలను అనుసరించాయి

'ఏడు కొండల వాడా ఎక్కడున్నావయ్యా' రేడియో లలిత గీతం బాణీలోని ఈ పాట చూడండి



ఆట తాళం భీంప్లాస్ రాగం పు 72

చక్కని అయోధ్య స్వామి దశరథరామ
యెక్కాడున్నావయ్యా। యెటు జూడ ॥చక్క॥
మక్కువతో సీత। మమకారములోఎడి
ధిక్కరించితివేమొ। దీనజనముని పాల॥చక్క॥

ఈ నాటకంలో సందర్భోచితంగా పూర్వ శ్లోకాలూ వాడబడ్డాయి ఈ జిల్లా సంప్రదాయ కుటుంబాల పండితులకే సాధ్యంకాని సాహసంతో పంచాగ గణనం చేసి నిర్మించి ముద్రించి సిద్ధాంతి అయినారు పుల్లిరాజయ్య గారు

## 8 వేముల లక్ష్మీరాజం - తిప్పాయపల్లి

లక్ష్మీరాజం గారు రచించిన 'కనకతార' చిరుతల నాటకము మల్లికార్జున పబ్లికేషన్స్ హైదరాబాద్ వారు 1976లో ప్రచురించారు ఇది ఈ జిల్లాలోని మొదటి చిరుతల నాటకం కనక తారకథ యక్షగాన వీధినాటకాలుగా స్టేజీ డ్రామా సినిమాలుగా విఖ్యాతమైనది

చిరుతల నాటకంలోని పాటలు కించిత్‌లయభేదము తప్ప అచ్చంగా యక్షగానాల దర్వుల పోలి ఉంటాయి నిజానికి ఇవి కథాత్మక భజనల పాటలు ఈ నాటకంలో పద్యాలు తక్కువ పాత్రలకు వచన సంభాషణలు కూడా ఉన్నాయి క్రూరుడైన తమ్ముడు, రాజైన స్వంత సోదరుని చంపి వదినను వారి పుత్రుని పుత్రికను హింసించుతాడు ఈ యువరాజు పెరిగి పినతండ్రిని చంపి పట్టాభిషిక్తుడౌటతో కథా పరిసమాప్తి వనంలో పసివారలైన తారా కనకసేనుల పరితాపం

శ్రీనాథా సింధుశయన - గానలోల గావవేల
దీనులమై యుంటిమీ కడు ॥ యోదేవ దేవ॥
దీనజనావన కడతేర్పు - తల్లిని దండ్రిని మాయొక్క
దైవమవు నీవనియును నిక - యుల్లములో నమ్మితి మయ్యా ॥ పు 39

పాండిత్య బలంతో కాక అభ్యాస పాటవం చేత లక్ష్మీరాజం గారు ఈజనరంజక చిరుతల నాటకాన్ని రచించారు తెలుగులోనిఈ కథకు మూలంఆంగ్లంలోని షేక్స్‌పియర్ 'హామ్లెట్' కావచ్చు

## 9. బింగి భూమేశ్వర దాసు - పోతారం అంబారిపేట, తా॥ మెట్‌పల్లి

'శ్రీ ఆత్మలింగనాటకము - 1982 ముద్రణ ఈ నాటకంతో పాటు భూమేశ్వర దాసు మరో రచన లొంక రామేశ్వర భజనలు అంబారిపేట పుల్లి రాజయ్య సిద్ధాంతి ఇంట లభించింది

మరునాడు వారి ఊరికి వెళ్ళగా రోడ్డువద్ద హోటల్‌లో విచారించితే కవి ఏడాది క్రితమే (1995లో) మరణించినట్లు తెలిసింది విచారంతో వారింటికి వెళ్లకే వెనుదిరిగాను

ప్రతులకు బొంబాయి వర్లి చిట్యాల బాలదాసు కవి అడ్రస్సే ఉంది మొదటి ముద్రణ కేవలం 200 ప్రతులే ముద్రించారు ఈ పోతారం కొండపైన 'లొంకరామేశ్వర స్వామి ఆలయమున్నది ఆలయం ముందు భాగాన పెనుశిల సందునుండి సదా స్వచ్ఛమైన నీరు ప్రవహిస్తుంది ప్రతి శివరాత్రి అక్కడ జాతర జరుగుతున్నది ఇది భూకైలాస్ కథ రావణుడు నాయకుడుగా రచన సాగింది గోకర్ణక్షేత్ర శివలింగ ప్రతిష్ఠ గాథ పాటలు పద్యాలతో పాటు రూపకము అనే పేర ఓ దర్వు వచనం ఉండడం కొత్త విధానం కవి పండితుడ కానని మొదలే చెప్పుకున్నారు ఒక పద్యం పు 10

సాధుపుంగవ వినగదే నాదు గాథ! వసుధ శృంగార వనముపై వాంఛ గలిగి! నేడు
జూడనే వచ్చితీ జోడు గలిసె! నన్ను - ప్రేమించి పెళ్లాడు సన్నుతాంగి!

ఇది ఏ పద్యం? కవి చమత్కృతి కాదు అచ్చు వేసిన వారి గారడి మొదటి మూడు పాదాల చివరి పదాల వరుసగా తర్వాతి పాదాల మొదట చేరిస్తే సరి అది తేటగీతి

ఒక పాట చరణం- కైలాసవాసా నన్ను - కరుణించరావా దేవా
పాల నేత్రుడవంచు - ప్రణుతింతు నన్ను గాంచు/ అఖిలంబు కెల్ల నీవు ఇక చాల బ్రోవవేలా॥

ఈ నాటకాన్ని పోతారం గ్రామ పద్మశాలీలు ముద్రించారు

## 10 సముద్రాల వేంకటనృసింహాఖ్యుడు - (ఎస్ వెంకటనరసయ్య) తక్కళపల్లి మం మల్యాల

అధ్యాపకులుగా పనిచేసి ఉద్యోగ విరమణ పొందిన వేంకటనరసయ్య గారు కీర్తిశేషులు వీరి రచన సతిరేణుక స్వయంవర నాటకము' 1986లో ముద్రింపబడింది రేణుక జమదగ్ని భార్య పరశురాముని తల్లి ఇది ఎల్లమ కథగా జానపదులలో వ్యాప్తి కలది స్వయంపరగాథ నూతనం కొడిమ్యాల వాస్తవ్యులైన సొన్నాయిల నరసయ్య ఈ నాటకం నేర్పిన పంతులుగారి కావ్యగద్యం ఉంది చలిగంటిపై అంకితంగల ఈ నాటకం పరిష్కర్త అంబారిపేట పుల్లిరాజయ్య సిద్ధాంతి ఈ నాటకం అయిదంకాలు కలది రచన సామాన్య స్థాయిలో ఉంది ఆరంభ పద్యం చూడండి

శ్రీ లక్ష్మీప్రియ వల్లభ, శ్రీలా కరుణాలవాల శ్రితజన పాలా
నాలోన నిన్ను నమ్మితి, పాలిత చలిగంటి పొరి పరమాత్మ హరీ!

## 11 బండ నారాయణదాసు - వడ్లూరు, మం బెజ్జంకి

నారాయణ గారు రచించిన 'చిరుతల అల్లీరాణి చరిత్రము' అనే నాటకాన్ని రామకృష్ణ బుక్‌డిపో హైదరాబాద్ వారు 1987లో ప్రచురించారు వీరు వైశ్యకుల వరకవి

జైమినీ భారతంలోని రాణీ ప్రమీల కథ అల్లిరాణి చరిత్రగా జానపదుల్లో బహుళ ప్రచారంలో ఉంది సుప్రసిద్ధ యక్షగాన కథానాయకుడు బభ్రువాహనుడు ఈ ప్రమీల అల్లిరాణి కుమారుడే ధర్మరాజు హయమేధ దిగ్విజయ యాత్రా సందర్భంలో యాగాశ్వరక్షణకు ససైన్యంగా వెళ్లిన అర్జునుడు అల్లిరాణిని ప్రేమించి పెళ్లాడడం ఈ నాటక కథా వస్తువు శ్రీకృష్ణపాత్ర సైతముంది

నారాయణ దాసుగారి జానపద రూపకం చిరుతల నాటక ప్రక్రియలో ఈ జిల్లాలో వెలువడిన రచనలలో రెండవది చివరిది ఈ నాటకంలో యక్షగానాల్లో వలె దర్వులు, వాదాలు పద్యాలు

కందార్థాలున్నాయి వీధి నాటకాలలోవలె పాత్రలు తమ పాటనో పద్యాన్నో తిరిగి వచనంలో చెప్పడమున్నది పాటలకు వంతపాడటం కూడా ఉంటుంది

నాయికా ప్రథమ దర్శనంలోని అర్జునుని దర్వు - పు 25
అదుగదుగో అల్లిరాణియు యుదక మధ్యమున యొప్పుచునున్నది
నన్ను రమ్మనుచు నవ్వు మొగంబున - కన్ను సైగలను జేయుచున్నది
మోహనాంగి యాముద్దుల చిలుకా - సాహసంబుగల చక్కని మొలుకా
నీటి నుండి యిచ్చోటికి రావే - యేటికి నాతో కలహము పోవే
రావా రావారమణిలలామా రాకున్నను నేనోర్వనె లేమా
నేనే వచ్చియు నిన్ను గలిసెదా - నీలాలకయిదె నీటిలో దూకెద -

ఇందులో తందనాన పాటలు తక్కువ దర్వులు వాదాలు పద్యాలు ఎక్కువ సాదా సీదా రచన ఈ అల్లిరాణి చిరుతల నాటకం

## 12 మోర మల్లేశం - గట్ల మల్యాల

మల్లేశం గారి 'అల్లీరాణి యక్షగాన' నాటకాన్ని శ్రీ మల్లికార్జున పబ్లికేషన్స్ హైదరాబాద్ వారు 1989లో ప్రచురించారు రచయిత ఇతర - రచనల వివరాలు తెలియవు కథ సుప్రసిద్ధమైనది పూర్వ యక్షగానాలను కవి చక్కగా ఆకళింపు చేసుకున్నారు గురువదాసు వలె వీరు కూడా రంభా ప్రవేశంతో నాటకారంభం కావించారు పాత్రలకు కొన్ని వచనాలు కూడా ఇందులో ఉన్నాయి

కవి కవన వైఖరి ఇది రంభ ప్రవేశం - దర్వు - ఆదితాళం పు 4
అంబుజాక్షి వినవే నన్ను - రంభయందురే చెలియా
జంభ భేది సభలో నాట్యము - జేయు దాననే చెలియా
ముని వరులు నను జూచినంతలో - మోహమొందెదరో చెలియా
మనసిజా కేళిలో దివిజుల - మదిని దీర్తునే చెలియా
ద్విపద బలరామ వాక్యం - పు 8
వినరోరి ద్వారకా విషదంబుగాను, కనరోరి నాపూర్వ కథ విన్నవింతు

ఇది యక్షగానాల్లో సర్వసాధారణం ద్వారకా అంటే ద్వారాపాలకా అని వారి భావం

అట్లాగే పై రంభ గేయంలో జంభభేది - చేయుదాన యతి పొసగదు అన్ని పాదాల్లో యతి వాడిన ఈ కవి జెంభ అని జన వ్యవహార రూపంలో వ్రాసి ఉండవచ్చు మోర మల్లేశంగారి రచన వర కవితకే సన్నిహితం

## 13 దూడం నాంపల్లి - సిరిసిల్ల

పద్య కావ్య కవులలో వీరి పరిచయం చేయబడింది శకుంతల, పాండవ జననం హరికథలుగా రచించిన వీరు 'పాండవ అజ్ఞాతవాసం అను వీధి నాటకాన్ని రచించి 1994 ఏప్రిల్‌లో ప్రచురించారు కవి పద్యగేయరచనలో సిద్ధహస్తులు మదన కామరాజు, ధర్మాంగద - చిరుతల నాటకాలు, జగదేకవీరుని కథ - వీధి నాటకం రచించినట్లు వీరి ఈ కృతి చివరిపుట అముద్రిత రచనలలో ఉంది

ఇంకా మామిడిపల్లి సాంబశివ శర్మ గారి నాటకాలతో పాటు దేవత వేంకటరాములు పద్య కావ్యకవి గారి 'సావిత్రి నాటకము', వాసాల నరసయ్యా అభ్యుదయ గేయకవి గారి 'సౌగంధికాపరణము' ఈ జిల్లా అముద్రిత వీధి నాటకాలు

## హరికథలు

వైష్ణవ భక్తులు వీటిని వ్యాప్తిలోనికి తెచ్చినట్లు ఆ పేరును బట్టి చెప్పవచ్చు హరికథలు హరికథలే - భాగవతాల వలె తర్వాత హరకథలూ, ప్రక్రియను బట్టి హరికథలు భాగోతాలైనవి

హరికథ స్వభావాన్ని డా॥తూమాటి దొణప్ప గారు ఇట్లా వివరించారు

"ఆచరణ దృష్టిలో తెలుగు వారి హరికథ పురాణ ప్రవచన పద్ధతికి తొలిబిడ్డ రచనా ఫక్కికలో యక్షగానానికి సైదోడు, ఉత్తర భారత భూముల్లోని కీర్తనా సంప్రదాయానికి దూర దాక్షిణాత్య సీమలలోని సంగీతోపన్యాస సరళికీ సరితోడు ఏక నట సమాశ్రయమైన ఈ కళామూర్తి ప్రయోగ రీత్యా బుర్రకథకూ భామాకలాపానికి, యక్షగానపరంగా చూస్తే ఇతర ప్రజా ప్రబోధ కళారూపాలేవి సరిసాటికి నిలువలేని మేటి ప్రచార కళారూపం హరికథ - దూడం నాంపల్లి గారి పాండవ జననము'హరికథా పుస్తక పీఠిక 'అభినందనము' 4-7-1990 నుండి స్వీకృతం

ఇది దేశి సాహిత్య కళా రూపాలను మార్చి తనలో చేర్చుకొని, స్వంతం చేసుకొని, స్వతంత్రంగా నిలిచిన మార్గ కవితా ప్రక్రియ అని చెప్పవచ్చు అందుకే పాటలు పద్యాలు హరికథలో తప్పనిసరిగా ఉంటున్నాయి

పురాణ ప్రవచన కాలక్షేపాలు చాలముందుకాలం నుండి ఉన్నా ఈ హరికథా (ఏకపాత్రాభినయ కథా కథన) సాహిత్యం ఈ శతాబ్దిదే ఇది 19వ శతాబ్ది ఉత్తరార్ధంలో పుట్టి ఈ 20వ శతాబ్ది పూర్వార్ధంలో వర్ధిల్లి ఇప్పటికీ ఆలయోత్సవాలలో ఆకాశవాణి ప్రసారాలలో సముచితంగా ఆదరింపబడుతున్నది ఈ కరీంనగర్ జిల్లాలో హరి కథా కథనము ఎప్పటిదైనా హరికథా రచన మాత్రం ఈ శతాబ్ది ప్రథమపాదంలోనే జరిగింది

1 గంగా లక్ష్మణరావు - మంథని గారి'కుచేలోపాఖ్యానం ఇక్కడి మొదటి హరికథ లక్ష్మణరావు గారి మృతి 1919లో అంటే ఈ హరికథా రచన అంతకుముందే 1916-18 మధ్య జరిగి ఉంటుంది అది వ్రాత ప్రతిగానే అజ్ఞాత వాసం చేసి1988లో కవిగారి రత్నకాంత నాటకము'తో పాటుగా వారి పుత్రులు గంగా రాజేశ్వర రావు గారిచే ప్రచురించబడింది అది పద్య గద్య కీర్తనలతో ప్రశస్త హస్తవాసిగల రచన

2 శతావధానిఎస్ కృష్ణమాచార్యులు - కొరుట్ల గారు 1930-40 మధ్య కాలంలో నాలుగైదు హరికథలు వ్రాసినట్లు వారి 'స్వీయ కవితాను జీవనము' 1987లో ఉంది కాని, అవి అముద్రితాలు అలభ్యాలు

3 ధపూరి సత్యనారాయణ కవి - కోట్ల గారు భాగవత గజేంద్రమోక్షణంతో పాటు మరికొన్ని హరికథలు రచించినట్లు వారి పద్యకావ్యంలో తెలిపారు అవి ఇప్పుడు లేవు కోట్ల సత్తయ్య గారు స్వయంగా హరికథలు చెప్పినవారు

4 డి వేంకటాద్రి హరిదాసు - కోట్ల సత్యనారాయణ గారి తమ్ముడు డి వేంకటాద్రి పాలాసగారు 1956 ప్రాంతంలో 'శివలీలలు' పేర ఓ హరికథను రచించారని వారి పుత్రులు డి వి మురళీమోహనాచార్య మెట్‌పల్లి గారు తెలిపారు వారు జగిత్యాల వైశ్యుల కోరికగా స్కాంద పురాణాంతర్గత సంభవ, రేవా, కాశీఖండములలోని అంశాలకు ఇతర పురాణాలలోని హరగాధల

జోడించి ఆశువుగా 'శివలీలలు' రచించి వారం రోజులు కథా కాలక్షేపం చేశారట (ఈ విషయం వివరించారు వేంకటాద్రి గారు మెట్‌పల్లిలో 22-4-94) ఆ హరికథా కావ్య వ్రాత ప్రతిని కూడా చూపించారు వీరు చక్కని గాయకులు నటులు

5 మామిడిపల్లి సాంబశివశర్మ వేములవాడ శర్మ గారు శ్రీరాజరాజేశ్వర క్షేత్ర మహాత్మ్యం, తరిగొండ వేంగమాంబ' అను రెండు హరికథలు వ్రాసినట్లు వారి పుత్రులురాజన్న గారు తెలిపారు అవి అముద్రితాలు ఎంత వెదికినా వాటి వ్రాత ప్రతులు లభించలేదు

6 మెతుకు సీమకావ్యకర్త సిరిసెననగండ్ల శ్రీనివాసాచార్యులు గుమ్లాపూర్ గారు మొదట కొన్ని హరికథలు రచించినట్లు, ఆ కావ్య పీఠికలో ఉంది కాని, వాటి పేర్లయినా తెలుపలేదు

7 మునుగోటి లక్ష్మణశర్మ - కల్వకోట గారి 'సత్యనారాయణ వ్రత మహాత్మ్యం

8 గంగారాజేశ్వర రావు గారి పద్య కావ్యాలు హరికథలుగా రచించి తర్వాత వాటిని కావ్యాలుగా మార్చినట్లు విదితం

ఈ జిల్లాలో ఓ పది మంది కవులు హరికథలు రచించినా నాటికి నేటికి ముద్రణ పొందినవి ఈ క్రింది నలుగురు కవుల ఐదు హరికథలు మాత్రమే ఆ వివరాలివి

1 గంగా లక్ష్మణరావు, మంథని, కుచేలోపాఖ్యానము, 1988

2 గజెల్లి శివరాజము, ఊటుపల్లి, భృగు వంశము, 1972

3 దూడం నాంపల్లి, సిరిసిల్ల 1 శకుంతల, 1985, 2 పాండవ జననం 1991

4 నేరెళ్ల శ్రీరంగాచార్యులు, గోధూరు, శ్రీగోదాచరితము 1988

గంగాలక్ష్మణకవి గారి హరికథ ఈ శతాబ్ది పూర్వార్ధ సాహిత్యంలో పరిచయం చేయబడింది వీరు నాటక కర్త తర్వాతి ఇద్దరు పద్యకావ్య కర్తలు

## 2 గజెల్లి శివరాజము - భృగు వంశము 1972 ముద్రితం

భృగుమహర్షి బ్రహ్మ పుత్రుడు అతనికి ధాత విధాత అను పుత్రులు శ్రీదేవి అను పుత్రిక జన్మించారు విధాతకు నియతి యందు మృకండుడు ఇతనికి మరుద్వతి యందు మార్కండేయుడు వరుసగా కుమారులు, మార్కండేయుని పుత్రుడైన భావన ఋషి దేవతలకు వస్త్ర నిర్మాణం కావించినవాడు మార్కండేయ పురాణంలోని ఈ భృగు మృకండ మార్కండేయ భావనా ఋషులను పద్మశాలీయులు తమ వంశమూల పురుషులగా భావించి ఆరాధిస్తారు వీరికి సంబంధించిన పురాణగాధలే ఈ హరికథా శ్రవ్య కావ్యంలో వర్ణించబడినవి

ఈ 60 పుటలరచనభృగు, మార్కండేయ, భావనా ఋషి చరిత్రలుగా మూడు భాగాలుగా ఉంది

ఇందలి పద్యాలు రసోచితంగా వచనాలు సరళంగా ఉన్నవి కీర్తనలకు రాగతాళాలు సూచింపబడినవి హరికథలలో సర్వసాధారణమైన తొహరలు అనుమాత్రా నిబద్ధ గేయాలు మాత్రం ఇందులో తక్కువ ఇందలి ఒక పద్యమిది అవతారిక-పు 2



నిగములు లాది శాస్త్రముల నేర్చిన పండిత వర్యులార నే
దగ భృగువంశమున్ రచన ధాత్రిని సల్పితి దప్పులెంచగా
దగణితశీల సీత కొఱ కంబుధి గట్టెడి వానరేంద్రులన్
ఒగిదగ గాంచి యాయుడుత యోపినభంగి శ్రమించ లేదొకో

తమ జాతి ప్రశస్తిని చాటడానికి 'ఉడుతాభక్తి గజెల్లి శివరాజం కవి గారుఈ హరికథా రచన కావించారు

## 3 దూడం నాంపల్లి - 1 శకుంతల 2 పాండవ జననం

నాంపల్లి గారు సెకండరీ పాఠశాల ప్రధానాంధ్రభాషోపాధ్యాయులు పద్య కావ్య నిర్మాత చిన్ననాడు భాగవతాలు ప్రదర్శించారు - హరికథలు విన్నారు బొంబాయికి కార్మికుడుగా వెళ్లి హరిదాసుగా స్థిరపడిన, కవిగారి బాల్యమిత్రులైన బండారి లక్ష్మీరాజం గారి కోరికగా ఈరెండు హరికథలను రచించామన్నారు నాంపెల్లిగారు

శకుంతల - 1988, ఈ హరికథలోని ఇతివృత్తం నన్నయ్య భారతాన్నికాక కాళిదాసు నాటకాన్ని అనుసరించింది కణ్వాశ్రమంలో శకుంతలా పరిణయానికి ముందు దుష్యంత మహారాజుకు రాక్షసులతో ఒక యుద్ధాన్ని సైతం జతపరిచారు కవి శకుంతల జననం పరిణయం పునస్సమాగమం అని ఈ పుస్తకం మూడు భాగాల్లో ఉంది వర్ణనలు విస్తారంగా ఉన్నా కొన్నిచోట్ల కథ వేగంగా పరుగెత్తింది కవి సంగీత పరిజ్ఞానం కవిత్వానికి వన్నె కూర్చింది మంజరులు అనే పేరుతో మంజరీ ద్విపదలను కాక కవి తొహరలను వ్రాశారు ధపూరి వేంకటాద్రి గారి 'శివలీలలు' లోనూ ఇదే విధానం పాటించబడింది

అని నిందించి శకుంతలా నోరాడలేక తలవంచి,
వెనుదిరిగెను ముద్రిక లేనందుకు ఘనముగా విచారించి 52 పు
కన్నవారికిని కొన్నవారికిని వన్నె తెచ్చుపని చేసితివమ్మా - ఇదీ గేయాల నడక
ఒక పద్యం - స్త్రీ వర్ణన
గ్రహరాజ తేజమో రాజీవ నేత్రమో, సొన్నంపు గుసుమంపుసన్నదనమొ
శ్వేతోత్పలమ్ములో సిత పయోజమ్ములో, మత్స్యమ్ములో గంధమాదనములా
స్వర్ణభాండమ్ములో చక్రవాకమ్ములో, కుంభికుంభమ్ములో గోత్రమణులా
గాండీవ మధ్యమో గజవైరిమధ్యమో, పిడికిలి మట్టమో విష్ణు పదమొ
అనగనొప్పు తరుణియాస్య మమల నేత్ర - గుబ్బలాడిని దనుమధ్య గోర్కెతీర
గ్రుచ్చి కవుగిలించుకు ముద్దు గుల్కసురత కేళిదేలని మజ్జన్మ మేలయేల!
ఇందలి క్రమాలంకారం గమనార్హం

సాధారణంగా హరికథలు భక్తి రసోపేతాలు ఈ శాకుంతలం శృంగార రసప్రధాన కథా ప్రబంధం
పాండవ జననం - 1991 ముద్రణ 1989సం లో తెలుగు విశ్వవిద్యాలయం హైదరాబాద్ వారి హరికథా రచనల పోటీల్లో నాంపల్లి గారి ఈ రచన ప్రథమ బహుమతిని గెలుచుకుంది దానికి తోడు తిరుపతి దేవస్థానం వారి ఆర్థిక సహాయముతో ముద్రణ పొందింది ఇందలి ఒక పాట -

| | |
|---|---|
| పల్లవి॥ | హరికథా మృతము నవరస భరితము దురితవారణము భవ భయహరణము |
| అను పల్లవి॥ | హరిని గొలిచి నంతగలుగు పుణ్యము హరికథను వినిన గలుగు యథార్థము॥ |
| చరణము॥ | శ్రవణ కీర్త నార్చాత్మ నివేదన సఖ్య స్మృతి నతి దాస్య పద భజన |
| | నవ విధమ్ములగు భక్తి మార్గముల నారాయణు గొల్చిన నయంబగును॥ |

ఇందలి కథ మహా భారతం ఆది పర్వంలోనిది కవి మార్పులు చేయలేదు ఇది మూల విధేయ సంక్షిప్త రచన శకుంతల ముందుగా ముద్రణ పొందినా పాండవ జననం వీరి మొదటి రసవద్రచన

### 4 నేరెళ్ల శ్రీరంగాచార్యులు-బి ఓ ఎల్ , గోధూరు వ 58 సం లు

శ్రీరంగాచార్యులు ప్రభుత్వోపాధ్యాయులు కవి, నటులు, హరికధకులు వీరి భక్తి సంగీతాలు కవితా రచనకు ప్రేరేపించాయి వైష్ణవులకు ప్రీతి పాత్రమైన ఆండాళ్ చరిత్రను వీరు 'శ్రీ గోదా చరితము' - హరికధ'గా రచించి 1987లో ముద్రించారు 'పాశుపతము' పేరుతో రచించిన కిరాతార్జునీయం వీరి అముద్రిత హరికధ - సంకీర్తన సుధార్ణవము - 1992 30పు వైష్ణవ భక్తి ప్రపత్తితో రచించిన స్తుతులు మేలుకొలుపులు పవళింపుసేవ - శ్రీవేణుగోపాల దండకం మొ॥ ఇందులో ఉన్నవి ఇందలి పాటలకు రాగతాళాలు సూచించారు

శ్రీగోదా చరితము 34 పుటల రచన కవనం సంప్రదాయరీతితో సాగినా ఛందోభంగాలు పాఠకులు మనస్సులకు పానకంలో పుడకలు రచయితవరకవి కారు ఆంధ్రభాషా పండితులు ఈ అశ్రద్ధకు కారణం తెలియదు విషయ ప్రశస్తి కవి గారి సంగీత పరిజ్ఞానం ఈకధను ఆద్యంతం చదివిస్తాయి ఇందలి తౌహరల లయ విన్యాసం చూడండి



అప్ప చూచునను భయమున దండలు విప్పి బుట్టలో బెట్టు
అప్పరమాత్మకు హారములిడగను ఆచార్యుల కైబెట్టు పు 1
విష్ణు చిత్తులత్యంత ప్రీతినా విష్ణుమయిని నర్చించె
విష్ణు దేవుడత్యంత ప్రీతినా విష్ణు చిత్తు గమనించె పు 17

చివరగా హారతి

మంగళమని పాడరే - అంగనలారా - గోధూరు పురమందున ముదమున వెలసిన
కోరిక వరము లొసగి సదయతో శ్రీ రంగదాసుని హృదయ కమలము నందు నిలిచి
వాదులాడక పదము పదమున మధురత జేకూర్చు తల్లికి॥

'మాణిక్యం గట్టి పెరియాళ్వారు తమిళ కవితలకు వీరి ఆంధ్రానువాదం ఇది 32 భక్తి గేయాల అముద్రిత కృతి

## బుఱ్ఱ కధలు

కాకతి కాలంలోని 'జంగమ కథలు ' ఈబుఱ్ఱ కధలకు మూలం " ఆధునిక కాలంలో ఈ శతాబ్ది పూర్వార్ధ రాజకీయపోరాట కాలంలో మరాఠా సంప్రదాయం నుండి వచ్చి వ్యాప్తి పొందిన ఈ బుఱ్ఱ కథలు అత్యంత ప్రజాదరణపొందినవి

ఈ శతాబ్ది తొలితరంలో కమరం వేంకటరామానుజ కవి పలు బుఱ్ఱ కధలు రచించినవారు ఆ తర్వాత ఆఛివేంకటాచార్యుల ఆండాళ్‌చరిత్ర' బుఱ్ఱ కధ బహువిఖ్యాతమైనది

ఆ వరుసలో ఇక్కడ పౌరాణిక,రాజకీయ, విద్యాలయ విద్యార్థి నీతి ప్రదాలైన బుఱ్ఱ కధలు కొన్ని ఇక్కడి కవులు అధ్యాపకులు రచించారు ముద్రణ పొందిన రచనల వివరాలు ఈ క్రింద చూపబడుతున్నవి

### 1. సుంకెె కిష్టయ్య - ఎలిగేడు 1987 సుమారుగా కీర్తిశేషులు

కిష్టయ్య గారు కవి కారు కవితాభిమానం వారిని కలం పట్టించింది వద్దంటే పెళ్ళి అను బుఱ్ఱ కధను రచించి 1956లో ముద్రించారు వరకట్న నిషేధం ఇందలి ఇతివృత్తం తర్వాత మరే రచనలూ చేయలేదు వీరి తమ్ముడు ఎస్ వేంకటాద్రిగారు మాత్రం అన్నగారి స్ఫూర్తిలో కవిగా మారి పలు రచనలు వెలయించారు

## 2 కొత్త రాజిరెడ్డి - సైదాపూర్ , తా॥ హుజూరాబాద్

రాజిరెడ్డి గారు రాజకీయ సాహిత్య రంగాలలో సమానాసక్తి కల చతురులు

వీరు 1969 బంగ్లా విజయంతర్వాత కాబోలు ఇందిరా విజయము అను బుఱ్ఱకథను రచించి ఈ జిల్లా రాష్ట్ర, దేశ అగ్రశ్రేణి కాంగ్రెసు నాయకులైన శ్రీ పి వి నరసింహారావు గారికి వారి స్వగ్రామమైన వంగరలో అంకితమిచ్చారు ఆకృతి ముద్రితమో అముద్రితమో తెలియలేదు

1984 సుమారుగా విశాఖ తెలుగు మహానాడు సభలలో రాజన్న రాగాలు అను గేయ సంపుటిని అప్పటి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రముఖ్యమంత్రి శ్రీ ఎన్ టి రామారావు గారిచే ఆవిష్కరింపజేశారు తెలుగు దేశం పార్టీ-నేత ప్రస్తుతి ఈ గేయాల సారం

తెలుగు దేశం మొదటి గెలుపులో వీరు ఎం ఎల్ ఏ అయినారు రాజిరెడ్డి గారు క్రియాశీల రాజకీయకార్యకర్త 1985లో కరీంగర్ కళాభారతిలో డా సినారాయణరెడ్డి గారి అధ్యక్షతన రాజిరెడ్డి గారి షష్టిపూర్తి ఉత్సవం జరిగింది తర్వాత కొద్ది కాలానికే వీరు కీర్తిశేషులైనారు

రాజిరెడ్డి గారు పుట్టింది పెరిగింది గ్రామాల్లో పల్లెటూరి జీవితాలు కష్టసుఖాలు వీరికి తెలుసు జానపద గేయ బాణీలు వీరికి చాల చక్కగా పట్టుపడ్డాయి సాహితీ సభలలో వీరి పాటలు శ్రోతలను రంజింపచేసేవి

## 3 ఎస్ వేంకటాద్రి - ఎం ఏ , కరీంనగర్

వేంకటాద్రి గారు పద్యశతక గేయ, నాటక కవి అధ్యాపకులు ఆరేడు పుస్తకాలు తమవి ప్రచురించారు అశోకధర్మ చక్రము అను బుఱ్ఱ కథ వీరి భక్తారామదాసుమాళి అను భజన పాటల సంపుటిలో ఒక భాగంగా 1974లో ప్రచురించబడింది

ఇది అశోకచక్రవర్తి కళింగ సమరానంతరబౌద్ధమత ప్రచార గాథ అయినా హిందూ పురాణ సంప్రదాయ పద్ధతిలోనే కథారంభం కావించబడింది

ఆదిశక్తి ఓంకార స్వరూపిణి అంబా జగదంబా!

వేద వేద విఘ్నేశ్వర బ్రోవ వేడుకొందు దేవా-

వంతకుల సంభాషణల్లో హాస్యం పోషించబడింది సందర్భాన్ని కల్పించుకొని దేశనేతల - పుట 4, వీరనారీ మణుల - పు 5 స్మరించారు పాట కాని పద్యం కానీ లేకుండా 8 9,10 మూడు పుటల ఇందలి సంభాషణలు శ్రోతల సహనానికి పరీక్ష అశోకుని రాజ్యపాలనను వర్ణించారు పు 11 కళింగ యుద్ధానికి ముందు ఆ దేశవర్ణన యిట్లా సాగింది

సముద్రం తీరం సారభూమి గదరా తందానా అమర వీరులకు ఆటపట్టు గదరా తందానా

చక్కని పాడి పంటలతో వారుతం, పెక్కు వృత్తులకు పేరు గాంచి నారు ॥

కవి నటులు గాయకులు కాబట్టి ఇందలి గేయాలు భావాలు లయబద్ధంగా సరళంగా సహజంగా పరుగుదీశాయి రాజ ధర్మం - పు 21 మతవాదాలు - పు 25 బుద్ధచరిత్ర - 29 34 ధర్మచక్రవర్ణన పు 36, తో కథ సంపూర్ణం

## 4 గంగా సీతారామశర్మ - మంథని వ 67సు 1996లో కీర్తిశేషులు

గోలకొండ కవుల సంచికలోని గంగా లక్ష్మణరావు గారి అన్నగారైన గంగారామ సిద్ధాంతి కుమారులు సీతారామశర్మ గారు వీరు స్ఫురద్రూపి ఎన్ జి టి అధ్యాపకులుగా చిత్రలేఖనోపాధ్యా

యులుగా తెలంగాణా ప్రాంతంలో ప్రభుత్వోద్యోగం చేసి విరమణ పొంది మంథనిలో ఉన్నారు (ఈ విషయసేకరణకు వెళ్ళినప్పుడు ఆనందంగా ఆహ్వానించి నవ్వుతూ ముచ్చటించి ఆప్యాయంగా ఆతిధ్యమిచ్చారు డిగ్రీ వచ్చిన తర్వాత వెళ్ళేసరికి కీర్తి శేషులు! ఈఫొటో వారి శ్రీమతి ఇచ్చారు)

బాల్యంనుండి పండిత సాంగత్యం కవితాభిమానం కల సీతారామ శర్మ గారికి దైవభక్తి జాస్తి మంథని కవుల కవితలు, భజన సంఘాలు వీరిని ఆకట్టుకున్నాయి సంగీతానురక్తి సాహిత్యాసక్తి భక్తి వైపు వీరి కలాన్ని నడిపించాయి

శర్మ గారి గణపతి చరిత్ర' అను బుఱ్ఱకథ 1984లో వెలువడింది ఆ తర్వాత 'మహాదేవి చరిత్ర' అను బుఱ్ఱ కథను రచించారు ఈ గణపతి చరిత్ర 17 7 87 27 8 87 తేదీలలో ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రం నుండి గ్రామీణ స్త్రీల కార్యక్రమంలో పట్టాభి బృందం చెప్పగా ప్రసారం చేయబడింది సిద్ధి వినాయక వ్రత విధానం - మహాత్మ్యం, నందికేశ విజయం, గణేశ జనన గాథలు, శమంతకమణి కథ ఋషిపత్నుల నీలాప నిందలు, గజాసురవధ, భూప్రదక్షిణ విజయం, కుమార జననం, ఇందలి భాగాలు కవి గారి పురాణ గాథల పరిజ్ఞానం ఈ రచనకు చక్కగా ఉపకరించింది వీరి కవిత్వ శైలి చూడండి



భరత ఖండమున కుత్తర భాగము - తందానా తందాన తందన
పుణ్యభూమి యగు ఆర్యావర్తము ॥ "
పక్వమైన ఫల వృక్షంబులతో - ॥ "
విందామయా నేడు విందా మయా
విఘ్నేశు చరితంబు విందామయా - పు 3

గేయాలు సరళంగా యతి లయ శోభితంగా ఉన్నాయి ఇందులో పాటలేతప్ప పద్యాలు లేవు మితంగా సంధి వచనాలున్నావంతకుల సంభాషణలు లేనే లేవు కథ పురాణ ప్రవచన ధోరణిలో గేయ కథా గానంగా ఉంది కథకుడు సందర్భాన్ని బట్టి వంతకులతో సంభాషనలు సాగించవల్సి ఉంటుంది సరళ భక్తి కవిత్వం సౌజన్య వ్యక్తిత్వం గంగా సీతారామశర్మ గారికి అలంకారాలు

### 5 పద్మావతీ శర్మ - కరీంనగర్ జ.1965

పద్మావతి గారి భర్త శర్మ గారు కరీంనగర్ పట్టణంలో ఘంటసాల అభిమాన సంగీత సాహిత్య సంస్థను ఏర్పరచి సమర్థవంతంగా పదేండ్లుగా ఏటేటా సభలు పాటల పోటీలు నిర్వహిస్తున్నారు వీరిది ప్రకాశం జిల్లాలోని అద్దంకి శర్మ గారి ఉద్యోగం కారణంగా పద్మావతిగారు కరీంనగర్‌లోనే ఉంటున్నారు భర్త కార్యక్రమాలకు యధోచితంగా సహకరిస్తున్నారు

ఆమె రచించి 1985లో ప్రచురించిన బుఱ్ఱకథ "అమరగాయకుడు ఘంటసాల' ఇది 8 పుటల చిరుపొత్తం దీనికి నాలుగు పీఠికలున్నవి పద్మావతి గారి రచన సరళంగా వ్యావహారిక భాషలో ఉంది

"సంగీత నిధి శ్రీ ఘంటసాల గాథాలకించరండీ
పందొమ్మిదొందల ఇరువది రెండవ సంవత్సరమునందు
చవటపల్లి అను గ్రామమునందు జన్మించిన వారు
చిన్న తనముననె సంగీతమ్ము మొదలు పెట్టినారు'

యతులో ప్రాసలో విధిగా వాడితే బాగుండేది చవటపల్లి - చవుటిపల్లి!

## 6 వేంసాని వేంకటయ్య యాదవ - తెలుకుంట వ 70 సుమారు

వేంకటయ్యగారు చదివింది తక్కువైనా స్వయం కృషితో విద్యాభివృద్ధి కావించుకున్నారు ప్రైవేటు టీచరుగా బ్రాంచ్ పోస్ట్‌మాస్టర్‌గా జీవితాన్ని గడుపుతూ కవన వ్యాసంగం కావించారు వీరు బుర్ర కథలు వ్రాయలేదు కాని జానపద సాహిత్య కలా రూపాలైన ఒగ్గు కథలు ఉయ్యాల పాటలు రచించారు కీ శే వరకవి రామసింహం గారి రచనలు వీరు పట్టుదలతో ప్రచురించారు

వేంకటయ్య గారి ముద్రిత పుస్తకాలివి

1 కరువు గాథ భక్తి కీర్తనలు - 1970 2 యాదవ అజ్ఞాన విజ్ఞాన ఒగ్గు కథ - 1979

3 కలియుగ నడవడి - ఉయ్యాల పాట మరియు మూఢనమ్మకాల నిర్మూలన ఒగ్గు కథ 1991

మొదటిది నాటి సామాజిక స్థితిగతి వివరణ అందులో కొన్ని భక్తి పాటలు జానపద తత్త్వాల వంటివి ఉన్నాయి యాదవ అజ్ఞాన విజ్ఞాన ఒగ్గు కథ నేత గీత పత్రికల వలె తమ జాతి ఉద్ధరణకోసం వ్రాయబడింది ఇందులో గొల్లల జాతులు 12 అని, వారిని యాచించే జాతులు 6 అని, 9,41 పుటలలో వివరాలిచ్చారు పల్లెల్లో పెద్దలు గొల్లలనెట్లా దోస్తున్నది వివరించారు యాదవ కృష్ణునిపూజిస్తూనే నేడు వీరిని వెడ్డివారని గేలిచేస్తున్నారని వాపోయారు తాగటం, చిల్లర దేవతల పూజలు మూఢనమ్మకాల ఉచ్చుల్లో బడి తమ జాతి ఎట్లా దిగజారిపోయింది తెలిపారు శంకరదేవుని పరంపరలో 12వ, వాడైన రామ దేవుడు తమ జాత్యున్నతికి పాటుబడిన విషయం వివరించారు ఇది జాతి అభ్యున్నతిని కాంక్షించి చేసిన రచన

ఎఱుకల సాని నోదెవలె, శివము తూలుట కూడా చక్కని జానపద సాహిత్య ప్రక్రియ గొల్ల సుద్దులు కూడా అటువంటివే ఈ పుస్తకం 18వ పుటలో శివంతూలడం ఉంది చూడండి

"ఓహోయి హోయి ఓంబర ఓంబర ఓలింగ తల్లి నీలవ్వ తండ్రి ఆదిరెడ్డి తాత దచ్చరొండ అమ్మ ముద్దెర గన్నె, అత్తముదుపసాని, మామ మన్నె బోయెడు, మ్యానమామలు కలింగ గంగ రాజులారా! మీ పాద పాదాన పది వెయిల శరణు, హంసల కాసరాల, ఆది కొమురెల్లి, చందమామ గుండు, చక్కని అయిలోని, పుట్టుదాముదాని పుణ్యాదిగడ్డ, పుట్టు పోదన్న మీ పాదపాదాన పదివెయిల శరణు '

మూడవ పుస్తకంలో మొదటి ఉయ్యాల పాట5 పుటలు శ్రీ సరస్వతి దలతు ఉయ్యాలో అంటూ లక్ష్మీగౌరీ గంగలస్మరించి యుగ ధర్మాలు వివరించారు ఆతర్వాత -

కలియుగ వింతలు ఉయ్యాలో / కనలేము వినలేము ఉయ్యాలో
సత్యమన్నది లేదు ఉయ్యాలో / హత్యలేమెండాయె ఉయ్యాలో
అన్యాయమంతటను ఉయ్యాలో / అలుముకొనె జగమంత ఉయ్యాలో
దుష్టులే ఘనమైరి ఉయ్యాలో / శిష్టులే కరువైరి ఉయ్యాలో
కామక్రోధాదులు ఉయ్యాలో / క్రమముగా హెచ్చాయె ఉయ్యాలో
నీతి తప్పెను జగము ఉయ్యాలో / భీతియనునని లేదు ఉయ్యాలో
పరమాత్ముని స్మరణ ఉయ్యాలో / మరచిపోయిరి జనులు ఉయ్యాలో

ఇట్లా వివరిస్తూ జనంలో నీతి ధర్మం పెరగాలని ఉద్బోధించినారు అంధవిశ్వాసాల నిరసించారు 6 నుండి 34 పుటలు ఒగ్గు కథ కొడుకు కోసం ఎదురు చూపులతో ఏడుగురు బిడ్డల కని ఇంటి నిండ పిల్లలతో కుంటి పెళ్లాంతో సతమతమైన సామాన్య గృహస్తుని గాథ ఇది అతగాడు

కొడుకు కావాలనే కోర్కెతో మంత్రగాళ్ళ శివసత్తులు, బాబాల ఆశ్రయించి విఫల మనోరధుడైన వైనం వర్ణించబడింది రామరామ, తందానా వంత పదాలతో సాగే ఈ జానపద గేయకధ స్థాయి ఎట్లున్నా కవి ఆశయం మాత్రం ఆదర్శ ప్రాయమైంది మద్యపానం, అధిక సంతానం, అంధవిశ్వాసాల నిరసించి జాతి అభ్యుదయాన్ని కాంక్షించే కవి వేంకటయ్య గారు

పాఠశాలల్లో గ్రామ యువజన సంఘాల్లో ప్రదర్శనార్ధం ఇంకా బుఱ్ఱకథలు వ్రాసినవారు పలువురున్నారు కటుకం సంగయ్య, మలయశ్రీ, సి డి వేంకటరాజు, మురళీమోహనాచార్య, నారంభట్ల లక్ష్మీనారాయణ శర్మ వారిలో కొందరు మానకొండూరు వాస్తవ్యులు వాసమూర్తి, రామకృష్ణ వ్రాసుకున్న బుఱ్ఱకథలు రేడియో ప్రసారం పొందినవి

**ఒగ్గు కథలుః-** వేంసాని వేంకటయ్యగారి తర్వాత, ఈ మధ్య హన్మాజిపేట మిద్దెరాములు ఒగ్గుకధలు జోరుగా చెప్పుతూ రాష్ట్రఖ్యాతి పొందారు వారి వన్నీ స్వయంకల్పిత ఆశుగాధలు అయినా గ్రంధస్థం కాలేదు

మలయశ్రీ 1980 సుమారుగా రచించిన మూడు ఒగ్గుకధలు వల్లంపట్ల సత్యనారాయణ హిందీ పండిత్ గారు ఆకాశవాణి హైద్రాబాద్ ఏ కేంద్రం గ్రామసీమలు కార్యక్రమంలో చెప్పారు ఆ వరుసలో సత్యనారాయణ బృందం వారి మిత్రులు మరికొన్ని ఒగ్గు కథలు వ్రాసి ప్రచారం చేశారు

రాజకీయ ప్రచార సాధనంగా ఈ మధ్య బుఱ్ఱ కథలు, ఒగ్గు కధల వినియోగం తగ్గినా, వయోజన విద్యా ప్రచార కార్యక్రమాల్లో మాత్రం వీటికి పునరుజ్జీవం కలిగింది ఈ సందర్భంగా 1990-92 మధ్య పలువురు నూతన కవులు అవసరం మేరకు ప్రచార గేయాలు, గేయ కథలు రచించి చక్కగా వినియోగించుకున్నారు

## మధుర వేదాంత కవితలు :

సాధారణంగా ఏ భాషలోనైనా మార్గ కవిత్వానికి సమాంతరంగా దేశి కవితా ప్రవాహం ముందుకు సాగుతూనే ఉంటుంది మన ఆంధ్ర భాషా సాహిత్యంలోనూ అంతే జరిగింది దేశి కవితలకు జానపద వాఙ్మయం మూలం గ్రామ దేవతల కొలువులు, జానపదులజీవితాల్లోని సుఖ దు ఖాలు వీటిలోని విషయాలు, నాగరికుల - విద్యావంతుల వేద పురాణేతిహాసాలు మత ధర్మాలు - గాథలు సైతం వీటిలో చోటు చేసుకున్నాయి

దైవ స్తుత్యాత్మకాలైన భజన కీర్తనలు, మేలుకొలుపులు, సుప్రభాతాలు, హారతులు, దండకాలు మొ॥వి మధుర కవితలుగా పేర్కొనబడుతున్నవి ఇవి ముఖ్యంగా మిత విద్యావంతులైన జానపదకవులు సృష్టించినవే అనంతర కాలంలో వాటి జనాదరణను చూసి పండిత కవులు కూడా కొందరు మధుర కవితలను వ్రాసిన వారున్నారు దైవభక్తి రచనలనే కాక జానపద కవుల సామాజిక గేయాల సైతం ఇదే విభాగంలో చూపడం జరిగింది

పద్య కవితకంటె గేయ కవిత్వం ప్రాచీనమైనదని అంగీకరించక తప్పదు అయితే మార్గ కవిత్వం వలె గ్రంధస్థం కాలేరు కనుక ప్రాచీన దేశి కవితలు లభిస్తూలేవు జానపదుల మౌఖిక ప్రచారంలో మిగిలి ఉన్న గేయసాహిత్యాన్ని మన పురాసాహిత్య సంపదగా భద్రపరచే ప్రయత్నాలు సాగుతున్నవి

ఈ జిల్లాలోని ఈతరం కవులు సృజించిన మధుర వేదాంత గేయసాహిత్యాన్ని ఈ క్రింద చూడవచ్చు ఈ కవులు ఇంచుమించు పాతికవరకున్నారు

## 1 బాలె గంగారం - రుద్రంగి తా వేములవాడ

బాలె గంగారాం అచలబోధ సిద్ధాంత పీఠ సంప్రదాయకులగు శ్రీరత్నానంద స్వామి గారు వీరు సాత్విక జీవనం గడుపుతూ శిష్యులకు తరణోపాయంగా ఆత్మముక్తి మార్గాన్ని చూపిన గురుమూర్తి భక్తులు సులభంగా పాడుకునేటట్లుగా 'శ్రీఅచలానంద కీర్తనలు ' పేర 50 వరకు తత్వ గేయాలు రచించి 1959లో ప్రచురించారు ఈ 70 పుటల పుస్తకం 1959 64 70,77,81,89లలో ఆరు ముద్రణలు పొంది పదివేల ప్రతులు జనవ్యాప్తి పొందినవి [2] ఇది అసాధారణ విషయం ఈ జిల్లా మరే రచయిత పుస్తకాలు కాని ఇన్ని ముద్రణలు పొందలేదు

ఇందులో అచలానంద గురువరంపరా ధ్యాన శ్లోకాలు, శ్రీ శివరామ దీక్షిత చూర్ణికలు 4 పుటలు, సంస్కృతం ఇవి ఈ కవి విరచితాలు కావు 11వ పుట నుండి భజన కీర్తనలున్నవి నాటి హిందీ తెలుగు సినిమాపాటల మాదిరి వ్రాసినవి వీటిలో ఎక్కువ కొన్నిస్వతంత్ర భక్తి తత్వాలు కూడా ఉన్నవి 'ఛోటీ బహిన్‌లో'ని, భయ్యమెరి, పాట బాణీది మొదటిది

"శ్రీ గణేశా శివ గౌరి తనయ మమ్ము బ్రోవరా

శ్రీ గణేశా సొగసైన నీ నిజరూపము జూపురా

శ్రీ గణేశా బాగూగ మా మొరలు వినవేరా "

'ఆత్మబంధువు'లోని, చదువురాని వాడినని, పాట మాదిరి - 5వ ది

"గురుని సేవ జేసి పూర్ణ బోధ తెలుసుకో

గురు కరుణ చేత జనన మరణ జడుపు దీర్చుకో "

స్వంత బాణీకి ఉదాహరణ - 31వ, పాట- పుట - 37

"అక్కరుండె మ్రొక్కుతున్నాను - గురుదేవ నీవె - దిక్కు యని మది నమ్ముకున్నాను,

అక్కరుండె మ్రొక్కుచును, చక్కగా నా కరములెత్తి, నిక్కముగా నీ చెరణములపై, మక్కువతొ నా శిరము మోపి"

ఇందులో కొన్ని ఇతరకవుల ప్రముఖ భజన కీర్తనలను అనుసరించిన పాటలు కూడా ఉన్నవి చివర కొన్ని పద్యాల పేర 50 కవితలున్నవి వానిలో రెండవది

నీతి నడకలు జెప్పె తాతలెందరో, కలరు గాత దప్పించేటి తాత లెవరు

చాతగాని నాడు భీతిల్ల బోకురా, తనయ వినుర బాలె గంగారామా॥

చివరగా గురు స్తుతి,, పండరికృష్ణ హారతులున్నవి

సాత్విక స్వభావంతో సంప్రదాయ భక్తి కీర్తనలు రచించిన వరకవి శ్రీరత్నానంద బాలెగంగా రాము గారు వీరి పాటలకు లభించిన వ్యాప్తి ఆదరణ అరుదైన కవి జన సన్మానం

## 2 తమ్మడి సైమన్ - విలాసాగరం; జననం 1880 సుమారు మృతి - 1959

రెవరెండ్ సైమన్ గారు 1880-90 మధ్యకాలంలో జన్మించి 19 10 1959న మృతి చెందారు వీరి 'క్రైస్తవ భక్తి గీతములు అను 42 పాటల సంపుటి 1985లో ద్వితీయ ముద్రణ పొందింది

1930-40 మధ్యకాలంలోప్రచురితమైన దీని తొలిముద్రణలో ఇన్ని పాటలు లేవట "రెవరెండు టి సైమన్ గారు 'ఎ' గ్రేడు ఇవాంజలిస్టు 1909లోడిస్ట్రిక్ట్ సినాడ్ ఏజంట్‌గా నియుక్తులయ్యారు

1926లోజగిత్యాలను కేంద్రంగా చేసుకొని సూపరింటెండింగ్ ఇవాంజలిస్ట్‌గా పనిచేశారు 1932లో 1926లో పాస్టర్‌గా అభిషిక్తులయ్యారు పాస్టరుగా, సువార్తీకుడిగా, సంకీర్తనా కారుడిగా - మరణం వరకు వారు అమోఘమైన సేవ చేశారు '' 'బిషఫ్ జి బి దేవ సహాయం కరీంనగర్, మెదక్ జిల్లాలో క్రీస్తు భక్తుల్లో బహుళ ప్రచారమందున్న సైమన్ గారి పాటలు చిన్నవి సరళమైనవి

కుమారి దేవసాల తమ్మడి సైమన్ గారి కుమార్తె, కరీంనగర్‌మిషన్ అస్పత్రిలో నర్సింగ్ సూపరింటెండెంట్ ఆమె తండ్రి గారి ఈ పాటలు సేకరించి ఆ ప్ర క్రైస్తవ సమాజం హైదరాబాద్ వారిచే ప్రచురింప చేశారు ఏసు బోధనలు,మహిమలు, బైబిలు కొత్త-పాత నిబంధనలలోని కథలు, ఈ కీర్తనలలోని విషయాలు భక్తి ప్రధానంగా ఉన్న ఈ కీర్తనలు భక్తుల ఉపయోగార్థం రచింపబడినవి ఇవి భక్తి గీతములు, మనుజావతారుడు, శ్రమల పాటలు, అభినయ గీతములు అను నాలుగు విభాగాలుగా ఉన్నాయి



పుట 10లోని ఒక పాట 1-2
పరిశుద్ధ నీ నామం - పరలోక రాజ్యములో నీకు
మరి మహిమ పరచ బడున్ - యెహోవా పుత్రుడ యేసయ్య॥
యేసయ్య పాదములు -1 4
యేసయ్యా పాదములు ఎందుకనీగొలువరయ్య । సందేహ మేల నయ్య॥
గాలివాన సముద్రమును - గద్దించి నిలుపలేదా - గడగడ వణకలేదా
అందూర మహిమలెల్ల ఆకు కొమ్మలతో- అప్పుడే మారలేదా
భయ్యాన పరుగులెత్తి - దయ్యంపు గుంపులన్ని / అయ్యా నీ వాక్కువిని - అదిరిమొక్కలేదా
పుట్టంధుని కండ్లు ముట్టగనే తెరువలేదా - మురిపెముతో చూడలేదా-
చేలంబు చెంగుముట్ట - చెలియరక్తము గట్ల - చెంతను జేరలేదా--

ఇట్లా బైబిల్ గాథల స్పృశిస్తూ సాగిన వీరి క్రైస్తవ భక్తి కీర్తనలపై 'దేశి భక్తి తత్వాల' ప్రభావం సైతం పడింది అందుకు నిదర్శనంగా 5వ, పాటను చూడవచ్చు

కోరదేమి చేతును - నా దుర్మనసు మారదేమి చేతును- ఈ దుర్మనస్సు కుదుర దేమి సేతును
ప్రభు యేసు నాథుని - పాదాంబుజము కడ / ప్రార్థన నాలింప - పరుగెత్తుటకు నింక

సైమన్ గారు జిల్లాలో తొలితరం క్రైస్తవ కవి తర్వాతి కాలంలోనూ ఈ జిల్లాల్లో ఒకరిద్దరే తప్ప వ్రాసిన కవులు లేరు తమ్మడి సైమన్ గారు వీరికి మార్గదర్శి

### 3 పిన్నంశెట్టి చెన్నయ్య రాజయోగి - కోరుట్ల వేములవాడ జ 1917

చెన్నయ్య గారి జన్మగ్రామం కొరుట్ల ప్రస్తుత నివాసము వేములవాడ వీరు తమ 12 ఏండ్ల ప్రాయంలో ఒక నాటక సమాజం స్థాపించారు యువవయస్సులోనటుడుగా రాణించారు

బొంబాయికి చేనేత కార్మికుడుగా వెళ్లి అక్కడ ప్రవాసాంధ్ర కార్మికులకు 12 భజనమండలులు స్థాపించారు బీడీల వ్యాపారంచేశారు 1940లో 23 ఏండ్ల వయస్సులో అచలగురు దీక్షను పొందారు వీరి గురువు కొరుట్ల వాసి మిట్టపల్లి రాజయ్య రాజయోగిగారు ఆ తర్వాత చెన్నయ్య గారు శ్రీకరానంద స్వామిగా గురు పీఠాన్ని అధిష్టించారు వీరు చదువుకున్నది తక్కువ స్వయంకృషితో కళాసాహిత్యరంగాలలో సాధించినది ఎక్కువ వీరి రచనలివి

1 పూర్ణానంద తత్త్వ భజనమాల, 2 పరిపూర్ణ బోధ మంజరి - 1965 3 హరిహర హనుమాన్ భజన కీర్తనలు, 4 సహకార గేయములు - జెండా పాట

1979లో వెలువడిన శ్రీకరానంద షష్టిపూర్తి సన్మాన మహోత్సవ సంచికలో వీరి జీవిత సాహిత్య విశేషాలు వివరాలు ఉన్నవి చెన్నయ గారు 1936 56 మధ్య బొంబాయిలో ఉన్నకాలంలోనే ఎక్కువ రచనలు చేశారు మొదటి పుస్తకం తత్త్వభజనమాల, పైసపాట, జండాపాట,మజ్దూర్ సంఘ పోరాటగేయాలు ఆ కాలానివే క్యాతం వేంకటారాజం గారు రచించి ప్రచురించిన శ్రీకరానంద భజనమాలను పరిష్కరించడమే కాక అందలి ప్రతి పాటకు ముందు ఒక పద్యాన్నిచెన్నయ్య గారు రచించారు

చెన్నయ గారి భజన కీర్తనల పుస్తకాలు లభించలేదు కాని, పరిపూర్ణ బోధ మంజరి కనిపించింది దీనిలో ఆచలవేదాంత సంబంధ పూజావిధుల శ్లోకాలను క్లోడీకరించి వాటికి అనువాద పద్యాలు స్వయంగావీరు రచించారు అచలవేదాంత కవులు తమకు గురువులైన కొరుట్ల విశ్వనాథయ్య మిట్టపల్లి రాజయ్య గారల భక్తి కీర్తనల కొన్నింటికి ఇందులో చేర్చారు చివరి ఒక తత్త్వగేయం మాత్రం చెన్నయ్య గారిది ఉన్నది అది ఇది - పు 17



శాంతమూర్తి నాదు గురుదేవుడు - సతతాము మిటపల్లి రాజయ్యార్యుడు॥
పంతములకు పుట్టినిల్లై - యెంతోవింతలు జేసె యెరుకను
యింతలోన దీని పరమ శాంతిని చేకూర్చె -
రెండార్ల భావము దెలిపినాడు /పండితులకే యిది పట్టుబడునన్నాడు
ఖండ ఖండముగాక అంతట నిండియున్నదదిగొ చూడని
యెండమావుల వంటి యెరుక యెండబోదని తెలిపె

వీరి జెండా పాట -జన గణ' మన జాతీయ గేయము నడక కలది చేనేత సంఘ సభల్లో ఇప్పటికీ పాడబడుతున్నది చెన్నయ గారి పైస పాట బహుళ ప్రచారం పొందింది అందులోని ఒకటి రెండు చరణాలివి

పైస నిన్ను వర్ణించి చూడ పరమాత్మ స్వరూపంబూ కలిగె నా యందు విచారంబూ
వేశ్యయయ్యి విషయాదులున్ననూ దాసి యయ్యి దశ దిశలు తిరిగినను
ముసలి రూపమున మూల్గుచున్ననూ, పాసు పండ్లతో రుచుల చూసినను
కాసులుంటెనే వారికందరు దాసులు నిక్కంబూ కలిగె నా యందు విచారంబూ

వీరి పద్యాలు ఛందోవిధేయాలుగా కాక వరకవితలు గానే ఉన్నవి "అధ్యాత్మికం, కళాత్మకం, లౌకికం ముప్పేట ముచ్చటైన హారం " చెన్నయ గారి జీవితం - సాహిత్యం!

## 4 నేరెళ్ల వేంకటాచార్యులు - సిరిసిల్ల జ.22 4.1918

నేరెళ్ల వేంకటాచార్యులు సిరిసిల్లాలో పేరెన్నిక గన్న ఆయుర్వేద వైద్యులు జ్యోతిష్యంలో ప్రజ్ఞగలవీరు సంగీత సాహిత్యాల్లో కూడా ప్రవీణులు ఉత్తమశ్రేణి రంగస్థల నటులు వీరికి 1967లో ఆంధ్రప్రదేశ్ సంగీతనాటక అకాడమీ వారి సన్మాన పురస్కారం లభించింది వీరు కవి అగుటకు ప్రేరణ సిరిసిల్ల సాహితీ క్షేత్రమే కాక, వీరి బావమరిది ప్రముఖ కవి వేముగంటి

నరసింహచార్యులు సిద్ధిపేట గారి సహవాసం అని చెప్పవచ్చు నేరెళ్ల వారివి చిరుకృతులు నటనకు కవిత్వానికి ఒకవిధంగా మంగళం పాడి ప్రస్తుతం వైద్య వృత్తిలో రాణించి జీవనయాత్ర సాగిస్తున్నారు మనస్సంబంధ వేదాంత వచన రచనలు ప్రచురించే తలంపులో ఉన్నారు

వేంకటాచార్యుల రచనలు 1 శ్రీవేంకటేశ్వర భజనామృతము - 1946, 2 శ్రీశాల వేంకటేశ్వర సుప్రభాతము ము రాక్షస సం॥, 3 హారతి పళ్లెరము 1961, 34 పు

వేంకటేశ్వర భజనామృతం కవి గారి తొలికృతి 44 చిన్నపుటలు ఇందలి ఆరంభ పద్యం

శ్రీలనొసంగి బ్రోచుహరి శ్రీరమణీమణి కింపు మీరగా
లీలల జూపుచుండ, సతి లేనగ వొందెను భక్తకోటి జె
జేలనుచుండ వారి దయ జేయగ దీసిన రామభద్రునే
పాలన చేయుమంచు మది ప్రస్తుతి చేతునభీష్ట సిద్ధికై

రాగ తాళ సూచితాలైన వీరి గేయాలు చక్కగా భక్తులు పాడుకోవడానికి అనుకూలంగా ఉన్నాయి ఒక గేయమిది

వాసుదేవ దయరాదా నా దోషమెంచ మరియాదా
ఆసించితి మీ దర్శనమునకై - శేష శయన కృపరాదా!
అఘమును బాపర జగదీశ, హర ఖగవాహన కరి రక్షా
సమయము దేవాసుమనోభావా, కమల మన ప్రియరావా
కర్మ బంధముల విడచేయుమురా నిర్మల హృదయస్వరూపా

రెండవకృతి తెలుగు గేయ స్తుతి కావ్యం 14 చరణాలు సుప్రభాత గేయం, శ్రీ వేంకటేశ్వర దండకం, మేలుకొలుపు మంగళహారతి గేయాలు ఇందలి కవితలు మొత్తం ఎనిమిది పుటలు సుప్రభాతంలోని ఒక చరణం

అదిగొ పూర్వాచల శృంగమందిప్పుడే విధిగన్ ప్రవేశించె కమల బాంధవుడు
వికసించె తామరల్ విశ్వసరస్సులన్, శుక పికమ్ముల నినాదమ్ములే దశదిశల్
నిండిపోయెను స్వామి నిద్రమేల్కొనగా, శ్రీశాల పట్టణ పతి శ్రీనివాసా
శ్రీ వేంకటేశ్వరా యిదే సుప్రభాతం - చ 6, పు 4

శ్రీ ఆంజనేయ కాళికా దండకాలు ఈ ప్రాంతంలో వ్యాప్తిలో ఉన్నా ఇక్కడ దండకాలు వ్రాసినవారు తక్కువ గర్రెపల్లి సత్యనారాయణ రాజు, గంగారాజేశ్వర్ రావు గారలు దండకాలు రచించినా ముద్రణ - వ్యాప్తి పొందలేదు నేరెళ్ల వారి దండకం ఇట్లుంది,

శ్రీ వేంకటేశా మహాపాప నాశా అనంత ప్రకాశా దయాసన్నివేశా సదా నిన్ను సేవించు దీనాళి దైన్యమ్ము పోకార్చి కాపాడ శ్రీశాలలో లక్ష్మితోముగ్ధ సుస్నిగ్ధ సౌందర్య రేఖా విలాస ప్రసన్నుండవైనిల్చి లోకావన స్ఫూర్తిమంతుండవై తావకాత్యంత శక్తిన్ ప్రశంసించు సాధు వ్రతాచారులన్ తృప్తులన్ చేయుచున్నావు ఇది రెండు పుటలు 'ఆరతి పళ్లెరం' మంగళహారతుల సంపుటి సరస సంగీత సాహిత్య వైద్య వేదాంత ప్రియులు నేరెళ్ల వేంకటాచార్యులు

**5 గుంటుక గంగదాసు - గంభీర్‌పూర్ మం కథలాపురం వ 60-సుమారు**

గంగాదాసు గారి ముద్రిత కృతి - శ్రీ పరమానందభజనమాల 1967

అముద్రితం కందార్థములు (1997లో)

గంగాదాసు గారికి విద్యమితం సాహిత్యారాధన అమితం ప్రస్తుతం స్వగ్రామంలోనే

ఉన్నారు నేత మిల్లు కార్మికులుగా ముంబాయిలో ఉన్న కాలంలో పై భజన మాల రచన ముద్రణ కావించారు ముఖ పత్రం మీది కవి విలాసం చూడండి

నివాసం, గంభీరిపురము తా॥మెటుపల్లి, జి॥ కరీంనగర్ ఆం ప్ర ఉపనివాసం, వర్లి-బి-డి-డి చాల్ నం 112 రూం నం 59 బొంబాయి నం 18

వీరి పుస్తకంలో మొదట వివిధ దేవీ దేవతల స్తుతులుగా - భక్తులకు గుణబోధలుగా 36 పాటలున్నాయి ప్రతి పాట చివర ఒక పద్యముంది పాటలకు రాగతాళాల సూచన ఉంది తర్వాత హారతులు,29 కందార్థాలు, 24 ఏక మకుట గీత పద్యాలున్నాయి అన్నిటి సారం ఒక్కటే భక్తి! ద్వైతంగా దేవతారాధనలు కనిపించినా పారమ్యం అద్వైతం - సోహం

మచ్చునకు కొన్ని చరణాలు -



ఈశ్వరా జగదీశ్వరా - నీ నామమేరుచి ॥ కృష్ణా నన్ను బ్రోవరారా!
పంచాక్షరి పారాయణ జేసితె - పాపము దొలగునె వోమనసా ॥
రండీ గురుని భజన జేతాము

ఈ భక్తి ప్రపత్తులతో ఎవరికే బాధాలేదు కాని ఈ ఆవేశం చూడండి

ముండకొడుకా మురిసెందుకురా - మదమెక్కినీవు
దండిగ వాదించ బోకుమురా ! పు 21

ఆత్మవత్సర్వ భూతాని అనే సూక్తి ఏడపోతుందో ఈ భక్తులకు!

పైపాట "లుబ్ధమత పాషాణ దుర్బుద్ధి" అని పేర్కొన్నారు ఆ చరణం రామసింహకవిగారిది గురు శిష్య సంవాదం 'లోని ఒక కందార్థం చదవండి పు 46

కం వినుశిష్యుడ నే దెలిపెద । అనుమానమునుంచబోకు అనుదినమందున్
పనిబూని ఆత్మనుండియు। కనుగొనరా భూతమూలు॥ దర్వు ॥ కదలీ వచ్చెనురా ।

చివరి శీర్షిక । పు 54

ఆ నేను బుట్టక ముందు నేనులేకనె యుంటి ! నేను బుట్టి వెనుకివన్ని బుట్టె
నేనన్న దానిని నెరిగి మరచితె చాలు। ధరణిలోన గంగదాస వినరా।

కవి వీటిని ఆటవెలదులన్నారు గీతాల పొత్తూ ఉంది గణభంగాలు ఉన్నాయంటే వరకవులకు అవి సహజం దీని పరిష్కర్త అంబారిపేట పుల్లిరాజయ్య సిద్ధాంతి

సరళ భక్తి కవితా సౌమ్యమనస్కులు గంగదాస కవి

## 6. వేముసాని వేంకటయ్య - తెలుకుంట

వేంకటయ్యగారు అచ్చంగా జానపద కవి స్వయంకృషితో సాధించుకున్న విద్యను గ్రామీణ శ్రామిక బాలబాలికలకు బోధిస్తూ సార్థకం చేసుకున్నారు జానపదుల అంధవిశ్వాసాల నిర్మూలనకు గేయ కవితలు వెలయించారు తనకు అభిమాన కవి అయినరామసింహం గారి రచనలు ప్రజా సహకారంతో ప్రచురించారు వీరు ఒగ్గు కథలు, పాటలు రచించారు

వేంకటయ్యగారి కరువు గాధ భజన కీర్తనలు 1970లో ముద్రింపబడింది ఇది 21 పాటల 30 పుటల గేయ సంపుటి ఇందులో మొదటి నాలుగు భక్తి పాటలు అయిదవది ఉయ్యాలఫాట సర్వజిత్ సంవత్సరపు కరువు వర్ణన ఆరవ కీర్తనలో సర్వధారి, విరోధి, వికృతి కాటకాలను

ప్రజాస్వామ్య పాలనను వర్ణించారు తర్వాతి పాటలలో శార్వరి - పు 8, క్రోధి - 10, పరాభవ 11,12, కీలక 14 సౌమ్య - 15 సంవత్సరాలలోఈ జిల్లాలో చెలరేగిన కరువు పరిస్థితులను దయనీయంగా వర్ణించారు వీటిలో క్రమంగా కాలాన్ని కాటకాన్ని బట్టి, నాటి మారిన పెరిగిన, పరిస్థితుల వస్తువుల ధరల వివరాలు సాంఘిక చరిత్ర కారులకు అమూల్యాంశాలు తర్వాతి సగభాగం భక్తి పాటలు, సౌమ్యవత్యర కాటక కాల వర్ణనలలోని కొన్ని చరణాలు చూడండి

అనుము లొక క్వింటల్‌కు ఎనుబది - శనగలకు నూటిరువదీ
మినుములకు ఒక వంద రూకలు వినము పులువలు అరువదీ
కొన జాలయ్యయో - ఘనమైన ఈ ధరల్ -
ఉల్లిగడ్డలు ఏ బద్దైదు - ఎల్లిగడ్డలు నూరటా
అల్లమునకు నూరటా - బెల్లమున కదే ధరా
మొక్క జొన్నలు పచ్చజొన్నల - కొక్కటే ధర ఎనుబదీ
ఎక్కడిదొ ధర వడ్లు ఎనుబది చక్కెరిన్నూ టరువదీ -
నూటికట ధర కిచిడి వడ్లు - నూన్నెకైదువందలూ
మేటిధర కందులకు పెసలకు - నూట యిరువది రూకలూ -
చొప్పకట్టలు నూటి కరువది - ఉప్పుధర పదహారటా
చెప్పతరమా బండి గడ్డికి గొప్పధర కదనూరటా -
ఆరువందలు పసుపు, మిర్చికి - ఐదువందల పైననూ
దొరుకవిట ధనియాలు నూటా అరువదింటి కైననూ -
దండుగొక కిలోలవంగములకు, రెండు వందల ఏబదీ
రెండువందలు పసిడి, చింత, పండు నూటా ఏబదీ -
తులము వెండికి ఆరురూకలు - కిలో నెయ్యికి ఎనిమిది



ఇలా వ్రాస్తూపోతే ఇందులో సగం పుస్తకాన్ని ఉటంకించవలసిందే "ఎన్నని వ్రాయుదు - కొన్ని కొన్ని చేతనైనవి విన్నవించగ బూనితి' అని కవి స్వయంగా చెప్పుకున్నారు - పు 17

ఈ కవి వర్ణించిన కరువులు 1950-70 మధ్యకాలపువి గత శతాబ్ది ఉత్తరభాగ కాటకాలను ఈజిల్లా కవి జైశెట్టి రాజయ్య జగిత్యాల గారు వర్ణించారు ఈ శతాబ్ది కాటకాలను వివరంగా వర్ణించినది వేముసాని వేంకటయ్యగారు ఒక్కరే

వీరి భజన కీర్తనలు భక్తి భావ సంభరితాలు
శ్రీమహేశ్వర నీదునామము, నా మదిని స్మరింతురా
క్షేమమొసగియు లేమి భాపవ, దేమి నిను నుతియింతురా - పు 17
శ్రీహరి నామము దలువుమురన్న - దేహము జూచుక మురువకురన్న
ద్రోహపు పనులను జేయకురన్న - మహాకామివై బొరలకు రన్న
మోహములోబడి తిరుగకురో రన్నో చిన్నన్నా - నీ
దేహము మాత్రమనిత్యమురో రన్నో చిన్నన్నా పు 25

ఇది 'రోజులు మారాయి' సినిమాలోని 'ఏరువాక సాగారో' పాట బాణీది సమాజ విమర్శ తక్కువదిగా లేదు

చదువులు రానివారె సభకు పూజ్యులౌట - ఇదె నీకు మెప్పైతె
అది మిక్కిలి ముప్పేర - అదుపులో నుంచుమురా - శ్రీరామా
వంచించెడి ప్రభువు లిల - లంచాలను దీసికొని - పంచాయతులను జెప్పె
కొంచెగాళ్లను పరిశీలించుటకు రావేమిరా - శ్రీరామా
అంటె కొంటోడందురు - అనకుంటె కష్టాలె - కంటెందుకనివుంటె (కంటు = వైరం)
తంటేమి బెట్టెదవురా - వింటావా వినలేదారా - శ్రీరామా పు 23 (తంటా = తగాదా)

కరువు కాటకాలకు, సామాజిక దుర్గుణాలకు బాధపడి వాటిని వర్ణించి, ప్రజారక్షణకు దుష్టశిక్షణకు భక్తకవి కనుక భగవంతుని సహాయాన్ని అర్థించారు వరకవి వేంసాని వేంకటయ్యగారు

## 7 చిప్ప బ్రహ్మానంద రాజయోగి - రుద్రంగి

బ్రహ్మానంద[2] చిప్పగంగారాము రాజయోగి మల్లమాంబల పుత్రుడు చి బ్రహ్మానందకవి వీరికి అచల వేదాంత భక్తి బాల్యం నుండే అలవడింది ప్రాథమిక పాఠశాల విద్యానంతరం చేనేత వృత్తి స్వీకరించి తండ్రిగారి శిష్యులైన శ్రద్ధానంద బైరి అంబయ్యార్య రాజయోగి శిష్యుడుగా వీరు అచలాద్వైత దీక్ష పొందారు తర్వాత కొంత కాలానికి దేహ అనారోగ్యం కారణంగా హైద్రాబాదుకు వెళ్లి ఒక అనాథాశ్రమంలో చికిత్స నిమిత్తం ఉంటున్నారు ఈ చికిత్సా కాలంలో వీరు రచించి న బ్రహ్మానంద నిరసనము అను పుస్తకము 1973లో వెలువడింది

ఇందులో కందార్థ దర్వులు, గీతార్థ దర్వులు, సీస పద్యాలు ఉన్నాయి అచలవేదాంతం, గురు పూజ, శిష్యభక్తి వివరణలతో ఉన్న ఈ పుస్తకం పేరు మింగుడు పడదు ఆ నిరసనం దేనిని? ఎవరు? ఎందుకు? చేసింది తెలియదు ఒక గీతార్థ దర్వు పు 17

గీ దేహ మనియెడు దివ్వెలో తెలివి వత్తి, యింద్రి యాదులు నూనెగా హెచ్చరించి
పరమ గురుమూర్తి మంత్రాన బ్రజ్వలింప, జేసితివి యాత్మయను జ్యోతి శ్రీయుతముగ ॥ దర్వు ॥
దీపామును జూడుమా - గురువర నా సంతాపము బాపుమా
తాప త్రయాదులను - దవిలి వెలిగెడు మాయ
రూపము విడిచి య-రూపము గల తండ్రీ ॥ దీ ॥ 21

ఇందలి కందార్థ దర్వులు 305 అనేకానుమానాలు ప్రకటిస్తూనే ఈ కవి అచల వేదాంతాన్ని బలపరిచారు

కం ఎరుక ప్రపంచములోబడి, నరులందరు చెడిరి మాయ నాటక మిదియం
చెరుగక సద్గురు వర్యుల, చరణంబుల జేరి నిలువ జాలక నుమ్మీ॥
యెరుకను మాయాజాలమునమ్మీ - యెరుక జగముల నేను మీరలెరుకొయంచల
యెరిగించి మీకొక్క దరితెల్పి నేనిల్వ జాలక సుమ్మీ - యెరుకవ సుధమాయాజాలము నమ్మీ 2

చివరి కందార్థం - పు - 82
పూర్ణంబనబడు యాపరి, పూర్ణములో గురువు శిష్య బుధులున్ దోచి
నిర్ణయము యేమిమనదని, నిర్ణయమే లేమి యనుచు - నెరిగిపోయిరామా
ఆవలిమాట యేమో తెలియదయా

## 8 చిట్యాల బాలదాస కవి - అవునూరు; సిరిసిల్ల

బాలదాస వరకవి స్వస్థలం అవునూరు ప్రస్తుతం నివాసం సిరిసిల్ల బొంబాయిలో చేనేత కార్మికులుగా కొంతకాలమున్నారు స్వయంకృషితో విద్యనార్జించి పద్యగద్య గేయ పుస్తకాలు

రచించారు ఒక ప్రచురణ సంస్థను స్థాపించి బొంబాయిలో తమవి ఇతర కవులవి పలుపుస్తకాలు ప్రచురించారు ప్రస్తుతం వేములవాడలో శ్రీవాణి పుస్తక విక్రయశాలను నడుపుతున్నారు

వీరివి రెండు పద్యశతకాలు, రెండు అర్ధశతకాలు, ఒకపద్య కావ్యం వచన రచనలతోపాటు ప్రచురిత మధుర కవితా కృతులివి

1 శ్రీ భక్తానంద భజనమాల, 2 శ్రీ సత్యానంద భజనామృతము, 3 శ్రీ బాసర సరస్వతి భజన కీర్తనలు, 4 శ్రో త్రానంద మంగళ హారతలు, 5 పరిధావి కఱవు పరిస్థితులు, 6 పద్మశాలీయ పరివర్తన పాటలు, 7 శ్రీ గాంధి జీవిత సార విషాదగేయము - 1977 ము , 8 ఆంధ్రలో అగ్నితుఫాను బతుకమ్మపాట - 1978, 9 భీవండి దహనకాండ బతుకమ్మ పాట - 1985 ము 10 శ్రీ ధర్మచంద్రిక సక్కుబాయి బతుకమ్మపాట, 11 దుబాయి మస్కట్ ప్రవాసాంధ్రుల దుర్భర చిక్కులు 12 విఘ్నేశ్వర భజన కీర్తనలు [3]

కొరుట్ల, సిరిసిల్ల, ప్రాంతాల ప్రవాసాంధ్రులు బొంబాయిలో ఆచల వేదాంతాన్ని చాలా అభిమానించారు - అనుసరించారు - ప్రచారం చేశారు బాలదాస కవి వేదాంతాసక్తి అక్కడిదే

గురు దైవభక్తి రచనలతో పాటు ఈ కవి సామాజిక సంక్షోభసంఘటనలకు ప్రతిస్పందించి కలం నడిపించినారనటానికి సాక్ష్యం వీరి బతుకమ్మ పాటలు జాత్యున్నతిని ఆకాంక్షించే సంఘ సంస్కార దృష్టికూడా వీరి కవితల్లో చోటుచేసుకోవడం విశేషం



వీరి ఎనిమిదవ పుస్తకంలోని కొన్ని పంక్తులు

శ్రీహరి సృష్టిలో ఉయ్యాలో చిద్విలాసంబైన ఉయ్యాలో
నవఖండ పృథ్విలో ఉయ్యాలో నాణ్యత గని నట్టి ఉయ్యాలో
భారతావని యందు ఉయ్యాలో ప్రభవాన్వితంబైన ఉయ్యాలో
ఆంధ్ర దేశమ్మున ఉయ్యాలో యింద్రవైభవముతో ఉయ్యాలో
విలసిల్లి భువిలోన ఉయ్యాలో వినుతి కెక్కినయట్టి ఉయ్యాలో

గాంధిజీ జీవిత పుస్తకం గేయమన్నా వరకవితగా సీసగీత పద్యాలే - కొన్ని పంక్తులివి -

భారతీయ పవిత్ర బాస వేనములెల్ల - విడనాడి యాంగ్లేయ విద్య నేర్చి - పు 11
భక్తి జ్ఞానం బన్న వదియామడేగెడి - మూర్ఖులకు ప్రబోధ మోదమగునె - పు 12
పొలతుల వలె పెక్కు పురుష సింహంబులు - వెర్రగా కేశముల్ బెంచు చుంద్రి
పడతులు ధరియించు బహువర్ణ వస్త్రముల్ - పురుషులు వాడుచు పొంగుచుంద్రి - పు 13
తిరుగు చున్నారు యిదియేమి ముదిపెమందు - కాల మీ రీతి మారుట గాంచు చుండ
గొర్రె దాటుడు జనమయ్యె గొంకులేక - వెర్రలాజ్ఞను మితి మీరి పేలుచుంద్రి - పు 14

"జోహార్లు జోహార్లు జోహార్లు - మన రాష్ట్ర నేతకు జోహార్లు" మాదిరిగా ఇందలి గేయాలున్నవి ఈ పుస్తకం పరిధి కేవలం 14 పుటలు

మానవ వికాస మంజరి, అను వీరి వచన గ్రంథం 1986 లో గీతాసార గేయం ఉంది పాండిత్యాన్ని కాక ప్రజాహితాన్ని ఆక్రాంక్షించి రచనలు కావించిన సహృదయము బాలదాసకవి ఆ వేదాంతం వారు మెచ్చినది, దానిని నచ్చిన వారలకే ఆయన పంచినది ఇరువదికి పైగా తమ పుస్తకాలు ప్రచురించిన బాలదాసకవి అముద్రిత రచనలు దశాధికం వాటిలో నాలుగైదు మధుర కవితా పుస్తకాలు కావడం విశేషం

### 9 నూతి చంద్రయ్య - కమాన్‌పురం - 1910-1982 వీరి జీవిత కాలం

నూతి చంద్రయ్య గారిది కమాన్‌పురం వీరిది అచల గురుపీఠం ఈ వరకవి కవితలు వీరి శిష్యులు - బెల్లంపల్లి భక్తులు 1986లో పుస్తకంగా తెచ్చారు దానిపేరు పరతత్వ బోధామృత కీర్తనలు పు 34 ఇందులో గురు భజనలు, మానసబోధనలు, దైవనుతి పద్యాలు కందార్థాలు ఉన్నాయి వీరి కవితా భాగాలు కొన్ని ఇటు చూపబడుతున్నవి

రుణము దీర్ప తరమా - రూఢిగ గురువరేణ్య మీ ॥ రు ॥

అనవరతము మీ మృదుపద యుగళము, నాశ్రయించి కడు ధన్యుడనైతిని

తనయుని వలె నన్నును వీక్షించి, దారుణమగు కలుషముల నడంచి

కనికరమున యీ బాలుని గాంచీ గారవమున బోధించిన మీ ॥ పు 3

మాయా సంసార మిది సోదరా - పు 11

పదవే పోదాము నారీ - పు 13 మొ॥ సినిమా పాటల బాణీలవి ఒక కందార్థం చూడండి

పట్టితి గురుపదములనే, నెట్టితి ప్రారబ్ధపలము నిర్మల మతితో

గట్టిగ సద్గురు కృపతో, ముట్టితి కైవల్యపదవి ముక్తాసంగుడనై - భ్రమలం దొక్కి

భక్తి యుక్తుడనై వట్టిదీ సంసార వాంఛలో బడికానూ దిట్టరినై నేను దిరిగేదా గురువాజ్ఞా ॥

ఈ కవి భావ తీవ్రత భక్తుల నాకర్షించేదిగా ఉంది శైలీప్రసన్నత గేయాలను గానయోగ్యంగా చేసింది ఈ వరకవితా సంపుటిలో చివరన కొన్ని మంగళ హారతులున్నాయి వీరు ఇంకా నాలుగు పుస్తకాలు రచించినట్లు తెలిసింది వాటి వివరాలు మాత్రం తెలియలేదు

### 10 సేనాపతి బాష్యకాచార్యులు బి ఏ, ఎం ఓ.ఎల్ కోరుట్ల నిజామాబాద్.

భాష్యకాచార్యుల జన్మస్థలం కోరుట్ల తెలుగు పండితులుగా నిజామాబాద్‌లో స్థిరపడినారు కాబట్టి వీరి రచనల పరిచయం సంగ్రహంగా చేయబడుతున్నది వీరు పద్యగేయ రచనల్లో పేరుగల కవి

వీరి ముద్రితా ముద్రిత రచనల వివరాలు 1 ఉపాధ్యాయుడు - బుఱ్ఱకథ 1965

2 ఉపాధ్యాయుడు - పద్యకవిత - 1986 చిన్నది 20 పద్యాలకులోపు వృత్తి ధర్మాన్ని బట్టేకాక, అధ్యాపక పాత్ర ప్రాధాన్యతను - పవిత్రతను ప్రస్తుతిస్తూ బాధ్యతలను గుర్తు చేస్తూ ఈ రచన ఉంది

3 విద్యార్థి గేయములు - 1987 దేశభక్తి సద్గుణానురక్తి ప్రబోధంతో ఈ గేయాలున్నాయి పాఠశాలల వివిధ పర్వదినాల్లో ఇవి గాన యోగ్యాలు

4 మధుర మంగళ హారతులు - 1988 ఇది సినిమా పాటల బాణీల్లో రచించిన 30 భక్తిపాటల సంపుటి శ్రీ వేంకటేశ్వర, లింబాద్రి స్తుతిగేయాలు జాస్తి శివభక్తి ప్రదాలు నాస్తి కవి శ్రీ వైష్ణవులు

అముద్రితాలు -

1 భాష్యకాకార శతకము - 2 కవితా రసాలము - (పద్య కవితా సంపుటి ఖండకావ్యం)

3 నీలయ్య పాట ఇది చమత్కార గేయం కరీంనగర్ జిల్లా సిరిసిల్ల జానపద గాయకులు సుద్దాల బాలయ్యగారు పాడే నందారే పాట వలె ఉంది నీలయ్య పాటలో నిజామాబాద్ జిల్లా ఊళ్ళ పేర్లన్నీ చోటు చేసుకున్నాయి వీరి కవితా శైలి ఇది

ఉపకార గుణాలయవై - 'గుణసుందరి సినిమా పాట బాణీలాగా

జయహారతి శ్రీనివాస । దయనుజూపరా శ్రీశా
వరదాయక సకలలోక । వరమీయర మంగళముగ ॥
దేఖ్తెరీ సన్‌సార్‌కి హాలత్ - 'నాస్తిక్' హిందీ చిత్రం పాట బాణీలో -
జేజేలంచును హారతి నిత్తుము
అందుకొనుము శ్రీశా - మమ్ము బ్రోవువెంకటేశా! నీ దయను శ్రీనివాసా!
దైవ భక్తి లోకరక్తి మేళవింపు సేనాపతి వారి కవిత్వమార్గం

**II 'సచ్చిదానంద స్వామి' - జిమ్మికుంట; జ 1935 సం**

సచ్చిదానంద స్వామిగా స్టేషన్ జిమ్మికుంటలో గీతాశ్రమంలో సాధు జీవితం నడుపుతున్న సుంకర వెంకటనరసయ్యగారి జన్మగ్రామం కుందనపల్లి బి ఏ , బి ఇడి చదివి అధ్యాపకులుగా ఉద్యోగం చేసి, జిమ్మికుంటలో స్థిరపడ్డారు ఆంధ్రాంగ్ల హిందీ సంస్కృత భాషలలో వీరికి మంచి ప్రావీణ్యముంది పదహారేండ్ల నవయువ దశలోనే అచలాద్వైత వేదాంత దీక్ష పొందారు వీరి గురువు కుందనపల్లి వెంకయ్య గారు వారు గూడూరి 'చిదానంద' అంకతి రాఘవయ్య గారికి శిష్యులు అచల వేదాంత గురుపీఠాన్ని అధిష్ఠించిన తర్వాత సచ్చిదానంద స్వామిగారు శ్రీ గణేశానంద మహారాజ్ హరిద్వార్ స్వామిచే 1983లో సన్యాసదీక్ష గ్రహించారు తర్వాత పుట్టపర్తి సాయిబాబా భక్తులయ్యారు అద్వైత సిద్ధాంత వ్యాప్తి, భగవద్గీతా ప్రవచనాలు ధ్యేయంగా ఆశ్రమ కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు

ఆంగ్లంలో చక్కగా ఉపన్యసించగల వీరు తెలుగులో పద్య గద్య గేయ రచనలు వెలయించారు

1 దేవుని జాడ, 2 బ్రహ్మ విద్యా భాండాగారము, వీరి వచన రచనలు 3 బ్రహ్మానుభూతి అధ్యాత్మిక శ్లోక సంకలనం, 4 శ్రీకృష్ణార్జున గీతా సంవాదం నాటకం వీరి మధుర వేదాంత గేయ సంపుటాలు రెండు ముద్రితాలు అవి - 1 భజనామృతము - భక్తభాండాగారము 2 గీతాగానము

కవిగారి మాటలోనే చెప్పాలంటే భజనామృతము "ఇందుభక్తి జ్ఞాన, వైరాగ్య భావములతో కూడిన భజన కీర్తనలు గలవు పాటలు చాలా వరకు సినిమా పాటల తరజులో నున్నవి కీర్తనలు పాటలు చదువరాని వారు కేవలము భావములను గ్రహించుటకైనను వీనిని చదివి తీరవలయును' ' గీతాగానము వివరాలు - "ఇది ఒక మాదిరి బుర్ర కథను బోలియుండును మంగళహారతి తప్ప మిగతా భాగమంతా ఒకేదాటి ఇది గానము చేయునపుడు కృష్ణ కృష్ణ, రామ రామ, యనుటకు సహాయకులను ఏర్పాటు చేసుకొనవలెను ' ఇది భగవద్గీతకు గేయ రూపం

సచ్చిదానంత స్వామీజీ సంగీత పరిజ్ఞానం కలవారు హార్మోనియం వాయిస్తారు ముప్పదేండ్లుగా వీరు తోడి రాగంలో పాడుకునే ప్రార్థనా గీతం భాగమిది

మహాదేవ దేవా - మముా బ్రోవరావా! దరీ దాపు లేని నావ - చుక్కాని కావా?
మహామోహజాలం ఎటూ తెలియ జాలం! ఈ సృష్టిమూలం - తెలుపవేల జాలం

'మనసే కోవెలగా సినిమాపాట తరహాలో యమన్‌రాగం ఆదితాళంలో వీరు రచించిన ఈ గేయం చూడండి



చపలము మనసు గదా - నిలుపుట నెరుగు నెద
మోక్షము నడ్డునిది - దృఢ వడినట్టి మది ॥
గాలిని బోలినదీ మనసు - నిలుపు విధము నీకే తెలుసు
తల వంచి మనసుంచి - వేడితి తెలుపుము వివరించి

వీరి రెండు పుస్తకాలు 1978కి పూర్వం ముద్రితములని వీరి 'గీతాసంవాద నాటకము' చివరి పుట వివరాలను బట్టి చెప్పవచ్చు ప్రతులు లభించలేదు మొదటి పుస్తకం రెండవ ముద్రిత ప్రతి భక్త భాండాగారం వచనం అదనంగా చేర్చి 96లో వచ్చింది

దీనిలో సినిమా బాణీలవి 46 పాటలున్నవి వీటికి మొదటి చివర ధ్యాన్య శ్లోకాలు పూజాస్తోత్రాలు మంత్రాలు పూర్వ ప్రసిద్ధ రచనలు చేర్చబడ్డాయి చివర పది పుటల్లో సాయి సందేశ సూక్తులున్నాయి ఇది శ్రీ పుట్టపర్తి బాబాకు అంకితం చేయబడింది

పద్య రచనలో ఈ స్వామి సిద్ధహస్తులు అందుకు నిదర్శనం వీరి శ్రీకృష్ణార్జున గీతాసంవాద నాటకంలోని పద్యాలు అందలి ఒక పద్యం

గీ కామమును క్రోధ లోభ దుష్కర్మ లెపుడు । ఘోర నారక మార్గాన కూల ద్రోయు
ఆసురీ వృత్తి ఫలమిది అరసి చూడ । దైవ సంపత్తియే మంచి దారి జూపు పు 20

వేదాంత గురువులుగా జీవించిన - రాణించుతున్న ఈ జిల్లా స్వాములలో సచ్చిదానంద స్వామిని బోలిన విద్యావేత్తలు లేరు

## 12 దురిశెట్టి ఈశ్వరయ్య - సంగెం మం బెజ్జంకి

ఈశ్వరయ్య గారు సంగెం వాస్తవ్యులు ఆ గ్రామం మానేరు జలాశయంలో మునిగిపోయింది ప్రస్తుతం వీరు ఎల్ ఎం డి కాలనీలో ఉంటున్నారు ఈ భక్తి కవి ప్రపంచ జ్ఞాన బోధామృతము అను పుస్తకాన్ని 1979లో ప్రచురించారు ఇందులో 200 కండార్థాలున్నవి మరికొన్ని భజన కీర్తనలు పాటలు కూడా వీరు రచించారు [4]

వీరి దొక కందార్థం -
ముచ్చట దీరగ ముగ్గురు, అచ్చంబైనట్టి పుత్రులంతే చాలు (న్)
పిచ్చేర అధిక పిల్లలు, మచ్చికగా కలిగి యున్న - మరియు నష్టమురా
ఆపైన నీకేల యిష్టమురా - ముచ్చటా అనుకుంటే వచ్చాను ఆపదలు
అచ్చమాపదకన్న - మెచ్చి వోపికగుండు, మరియు కష్టమురా - ఆపైన నీకేల యిష్టమురా ॥
వీరిది ఒక పాట -
నిన్నే మంటిని చలి జ్వరమా - నన్ను - మన్నింపకున్న నా తరమా
ఝుల్లు ఝుల్లూ మని వొల్లు వనుకు చుండె - కాళ్లు చేతులు చాల కీళ్లు బీకుచునుండె
తలనేమో తబల వాయించే - నాదు - నడుమేమో నాట్యంబు జేసె
ఇటువంటి స్నేహంబు యెన్నాడెరుగను సుమ్మి - తటకూన నన్నిడువు దయనీకుమొక్కెద ॥

వేదాంత విషయాలతోపాటు వర్తమాన సామాజిక విషయాలు ఈ కవి కవనంలో చోటు చేసుకోవడం విశేషం సుగుణం దురిశేటి ఈశ్వరయ్య గారు వరకవి

## 13 గజెల్లి శివరాజం - ఊటుపల్లి జ. 1937

గజెల్లి శివరాజం గారు స్వయంకృషితో సంస్కృతాంధ్రాలు నేర్చుకొని భక్తి రచనలు వెలయించారు భృగువంశము హరికథ, వేణుగోపాలశతకముతో పాటు వీరు రచించి ప్రచురించిన మధుర కవితా పుస్తకాలు రెండు 1 శ్రీహరి భక్త భజన నీరాజనములు - కీర్తనలు, 2 బ్రహ్మానంద కందార్థ దర్పులు ము 1982 మొదటిది కవి గారి మొదటి కృతి ప్రతి లభించలేదు

రెండవది అచలవేదాంత కందార్థాలు 126 కలది పుటలు - 32 చివరగా మంగళహారతి గేయముంది ఇందులో గురుశిష్యసంవాదంగా భక్తి యోగ వేదాంత విషయాలు వివరింపబడినవి

ఎనుబది నాలుగు లక్షల జీవులని పెద్దలు పలికిన మాట కాని, లోకంలో కోట్ల జీవరాసులన్నవి దీని రహస్యమమిటో తెలుపండి సామీ అని శిష్యుడు ప్రశ్నింపగా (క 98) గురువు గారి సమాధానమిది క 99

బాలక వినరా యెనుబది, నాలుగు అనుమాటలెల్ల న్యాయము చూడన్
ఏ లీల యక్కరంబుల, మూలము పదునారు వాని లీల గనుగొనరా
చెప్పగరాని - వేల పదములు రా మూలంబు పదునైదు - మేలనచేపెక్కు
ఏలగలిగెనొ జీవు - లాలాగె నని దెలియు ॥ లీల ॥
125వ, కందార్థంలో కవి పరిచయమిట్టున్నది
శివరాజ నామధేయుడ, భవదోష విమోచనముకు భగవంతునినే
భువిదలచ గోరి వ్రాసితి, కవి నను గర్వంబు గాదు - కరుణ జూతురుగా -

## 14. దేవత వేంకటరాములు - సిరిసిల్ల

దేవత వేంకటరాములుగారు పద్యకావ్య - శతక కవి పరిచయం చేయబడింది వీరి భక్తి గేయ సంపుటి "శ్రీరామ నామ గేయామృతము 1983లో వెలువడింది ఇది సిరిసిల్ల శ్రీమలయాళ సద్గురు గీతాశ్రమ వాసి రచయిత శ్రీ గుజ్జెల భూమయ్యగారికి అంకితం ఈ శ్రీరామనామ గేయామృతం ఒకే గేయం అకారాదిగా హపర్యంతం అక్షరానుక్రమంలో అక్షరానికొక గేయ చరణం ఒకే బాణీలో ఉన్న పెద్దపాట మచ్చుకు అందలి కొన్ని చరణాలు

శ్రీ రఘు రామ వంశాంబుధి సోమా సీతామనోభి రామా
ఘోర నిశాచర గణ భీమా సద్గుణ ధామా శ్రీ రామా -
అరవిందానన పురందరా - ద్యమ రార్చిత చరణ సరోజా
పరంధామా! నిను ధ్యానించెద - నను పాలింపుము శ్రీరామా -
ఆపద్బాంధవ గేయముతో ని న్నభి వర్ణింపదలంచి
తాపస నుత! యీ పొత్తము వ్రాసితి దాశరథీ శ్రీరామా -

ఇందులో కొన్ని అక్షరాలకు రెండు మూడు గేయ చరణాలు సైతమున్నవి యతి ప్రాసల నియమాన్ని విధిగా పాటించక కవి దీన్ని కేవలం లయ ప్రధానంగా రచించారు పద్య కవితలోనే కాక గేయ కవితలోను తమ సమర్థతను దేవత వేంకటరాములు గారు ఈ భక్తి స్తోత్రవర్ణమాల చిరుకృతి ద్వారా నిరూపించుకున్నారు

**15 పిట్టల నారాయణ - చొప్పదండి మరి ఇద్దరు కవులు - చామన్‌పల్లి**

పిట్టల నారాయణ గారు వరకవి భక్తి కీర్తనలు రచించారు వీరి రచనలు

1 బ్రహ్మంగారి భజన కీర్తనలు, 2 సద్గురు సంకీర్తనలు - 1983

మొదటిది నారాయణ గారి కృతి రెండవదానికి మరియిద్దరు రచయితలు వడ్లకొండ రాజగౌడు దూడం కోటయ్య చామన పల్లి, గారలు కవితా రచనలో భాగస్వాములు - సహరచయితలు అయినా అందులో ఎవరిదేగేయమో నామసూచన లేదు ఈ ముగ్గురు భక్త కవులు శ్రీకరానంద పిన్నంచెట్టి చెన్నయ రాజయోగి గారి శిష్యులు

బ్రహ్మం గారి భజన కీర్తనలు 50 పుటల 40 పాటల సంపుటి ఇందలి పాటలు చాలా వరకు సినిమా పాటల బాణీలో ఉన్నవి 14వ గేయం - దేవీ శ్రీదేవీ, పాట మాదిరిది ఇది

దేవా గురు దేవ - భవభయ హర నను పాలింపరావా।

దీవ జనావన దీనోద్ధారక దీన దయాళో దీన శరణ్యా ॥ దే ॥

దాసోహంబని నీదరిజేరితి - దయజూడుము ఈ దాసుని మొరవిని

పతితుల సహితంబేలు దొరవని సతతంబుగ నీ స్మరణలొ నుంటిని ॥

సన్నజాజికి గున్నమామిడి మాదిరిది 10వ పాట

సద్గురు బ్రహ్మం సత్యానందం సర్వాంతర్యామి

మద్గురు వర నిను మరువలేక ఓ మహాత్మయను చుంటి ఆ ఓ

స్వతంత్ర కీర్తనల్లో ఒకటి - 26వ, పాట పల్లవి

మనసానీ లెక్క జూస్తె మంట బుట్టుకొస్తది, వినయము నీకేలలేదు వీరబ్రహ్మ గురు నెరుగవు ॥

ఆశలెల్ల గోసి వేసి దోషమెల్ల తీసివేసి, అసమాన బ్రహ్మ బోధ ఆత్మాలోన నిలుపవేమి

శ్రీకరానంద భక్త త్రయ విరచిత సద్గురు కీర్తనలు 50, పు 70 ఈ కృతిలో సినిమా గేయాల అనుకృతులతోపాటు జానపద గీతాల, పూర్వప్రసిద్ధ తత్త్వకీర్తనల అనుసరణ గేయాలున్నవి

అందలి కొన్ని పాటల పంక్తులు చూడండి

గురుని వాక్యము బట్టియును - గురుపాదములను చేపట్టియును

మనము అరమరలేక గురుని స్మరియించవలె నండి

ఆ పరమ దయాళుని కరుణ నిరతంబు బొందండి పాట ॥

కరానంద దేవ నన్ను కరుణ జూడవా నిరాకారమైన నిజ పదవి దెలుపవా ॥

శరణాగత శుభకర వరదాయక మిమ్ము - శరణార్థినంటి నన్ను చేరి బ్రోవుము కీర్తన 12

వేదాంత బోధనైనా ఎంత కటు శబ్దాలతో చేశారో ఈ 16వ, పాటలో చూడండి

ముండకొడుక లావు నిక్కి నీల్గకు ఆ - దండ ధరుని బాధలో జిక్కి మూల్గకు

కొండెములు జెప్పి మంది కొంపలన్ని ముంచే కొరకు,

దండి వాడనంచు నీవు లండు మార్గములలో బడకు ॥

ఈ భక్త కవుల ఆచలవేదాంత ఆనంద తన్మయమిట్లుంది పా 14

ఎంతని తెలుపుదు సంతోషంబున గంతులు వేయకు గంగమ్మ
మంతనమున నీ అంతు తెలుసుకో - యింత మూర్ఖమా దొంతమ్మ
బీర కాయల చిక్కు సుమీ యిది యేరికి దెలియదు యెల్లమ్మ
సారములేని సంసారముతో పరితపించకు పాపమ్మా
అంతట నిండిన అచల స్వభావం అంతు తెలుసుకో అన్నమ్మా
అంత్యంబున ఆరాట పడకుము చింత వదలుకో చిన్నమ్మా!
వీరు నమ్మిన సిద్ధాంతాలను నిర్భయంగా చెప్పిన భక్త, కవులు

## 16. కలువకుంట కృష్ణమాచార్య, ఎం ఏ పూడూరు (మెట్‌పల్లి)

కొడిమ్యాల మండలంలోని పూడూరులో జన్మించి, ఖాదీ బోర్డులో ఇన్‌స్పెక్టర్‌గా ఉద్యోగం చేసి మెట్టుపల్లి పట్టణంలో జ్యోతిష్యం చెప్తూ రాణిస్తున్నారు కృష్ణమాచార్యులు వీరు మూడు శతకాలు మరికొన్ని భక్తి రచనలు అనువాదాలు కావించారు దశాధిక గ్రంథకర్త వీరి మధుర కవితా పుస్తకాలివి 1 స్తోత్రమంజరి, 2 భజగోవిందం - భజయతి రాజం, 3 హనుమాన్ చాలీసా, 4 సంక్షేపరామాయణము, 5 శ్రీవాసర సరస్వతీ గద్యమ్

స్తోత్రమంజరి సంస్కృత ధ్యాన పూజా శ్లోకాల సంకలిత సంపుటం

భజగోవింద గేయం ఆదిశంకరాచార్య విరచిత మోహ ముద్గర ద్వాదశ (12+12) మంజరి గేయం దీన్ని పలువురు అనువదించారు శంకర అద్వైత రచనను అనుసరిస్తూ అదే ఛందంలో విశిష్టాద్వైత ప్రబోధంతో సాలగ్రామ వడుగ నంబి రంగాచార్యులచే రచించబడింది యతి రాజస్తోత్రం ఇవి 36 గేయాలు దీని అనువాద శైలి చూడండి

మూలం భజయతి రాజం భజయతి రాజం - భజయతి రాజం భవభీరో ॥
శ్రీరంగేశ జయాశ్రయకేతు । శ్రితజన సంరక్షణ జీవాతు
భవ భయ జలధేరేషహి సేతు । పద్మానేతుః ప్రణతో హేతు ॥

అనువాదం యతి రాజాయని యతిరాజా యని - మతి దలపుము సంసృతి భీరూ ॥
శ్రీరంగని జయ చిహ్నకేతువు । శ్రితులను రక్షించెటి జీవాతువు
భవ సింధువునకు భద్రసేతువు । పద్మాసఖుని ప్రణుతికి హేతువు ॥

హనుమాన్ చాలీసా హిందీలో ప్రఖ్యాతం దానికి గానయోగ్యగేయానువాదం కృష్ణమాచార్య రచన

సంక్షేప రామాయణం వాల్మీకి రామాయణం ప్రథమ సర్గలో ఉంది ఇది బ్రహ్మ ఆదేశంతో నారదుడు వాల్మీకికి ఉపదేశించిన దని, ఇదే రామాయణ రచనకు మూలమని పండిత జన శ్రుతి ఇది 100 (శ్లోకాలు) గేయాల్లో ఉంది ఇందులో శ్రీరాముని జన్మబాల్య వివాహాదులు లేవు అరణ్యవాస గమనంతోనే కథారంభం కథ సువిదితం రావణవధ - రామ పట్టాభిషేకానంతరం ఆ మహారాజు ఇలా పాలన కావించుతాడట కృతయుగంవలె ధర్మపాలన అశ్వమేధాలు చేస్తాడు ప్రజా సుఖాల చూస్తాడు ఇంకా -

గోసువర్ణ భూదానము కోట్లకొలది చేసి - విప్రుల సంతుష్టి పరచి విజయమంద గల్గు ॥ 95
అసంఖ్యాక రాజవంశమటనట స్థాపించు స్వధర్మముల నిల్పు ప్రజల చాతుర్వర్ణముల ॥ 96
పదునొకండు వేల యేండ్లు పరిపాలన జేసి - విష్ణుతుల్యుడై రాముడు వైకుంఠము చేరు ॥ 97

శ్రీవాసర సరస్వతీ గద్యం శ్రీవేంకటేశ్వర వచనాల వంటి ప్రపత్తి రచన ప్రాచీన ప్రకియారూపాన్ని వినూత్న విధానంతో పద్య గ్రంధి వచనంలో, దండకమని భ్రమించేలా వాసిగల ఈ రచన చేశారు కృష్ణమాచార్యులు

## 17 రేగుంట సాయన్న, కోరుట్ల జననం - 1924

రేగుంట సాయన్న గారు వ్యాపారం వృత్తిగా దైవభక్తి ప్రవృత్తిగా సామాజిక సత్సంబంధాలతో కుటుంబ జీవనం సాగిస్తున్నారు ఆధ్యాత్మిక గ్రంథాలపఠనం వీరి విద్యను పెంచింది భజనలు కవిని చేశాయి సాయన్న గారి భక్తి గేయాలు రెండు పుస్తకాలుగా వచ్చాయి

1 పరమార్థ భజన కీర్తనలు - ము 1984, 2 గురుదేవ భజనమాల - ము 1991

వీరు సినీగీతాలను ఎక్కువగా అనుసరించలేదు పూర్వ భజన కీర్తనల వేదాంత తత్త్వాల ప్రేరణతో రచించిన వీరి కీర్తనలు సరళంగా భక్తిభావ సంభరితంగా ఉన్నాయి

పరమార్థ భజన కీర్తనలు 67 చివర కందార్థాలున్నవి వివిధ దేవీ దేవతలతోపాటు మార్కండేయుని సాయిబాబాను వీరు స్మరించారు

భజియింతునే భారతాంబా - భక్తి నెరిగించవే శారదాంబా
భజియింతునే నాదు భావంబు లోనమ్మి! భారతీయుల గన్న బలశాలినీ నిన్ను పు 6

ఈ కవి సరస్వతిని భరతదేశాన్ని అభేదంగా భావించారు

లోక జ్ఞానము దెలియరా లోకములోని పోకడలను మానరా
నీకు దెలియని పుణ్యపురుషులు లోక మందున నుందురనియు
నీకు దెలిసి నపుడె ఒకరి - నీతి గందువు ఖ్యాతి జెందెవు ॥ పు 2

మంచివాళ్లను గుర్తించుమంటూనే చెడ్డ వాళ్లున్నారు జాగ్రత్త అని ఇట్లా హెచ్చరించారు

మనుషుల మర్మంబు దెలియారు - ఘనులైనవారు - మనసు నెరిగి మాటలాడరు పు 14
కమ్మని మాటల చేత రమ్మని మోసము చేతురు అట్టి వారిని నమ్మబోకు మని చెప్పారు
ఇంటిలోనే జేరి యుంటివి - ఓ మాయామనసా - కంటికి కానరాక యుంటివి
మంటి బొమ్మగ జేసి నన్ను మాయలో బడవేసి నీవు
అంటి యంటక నుండి నాలో ఆటలెన్నో ఆడుచుంటివి పు 10

అట్లా ఇందలి అనేక గేయాలు పూర్వ ప్రసిద్ధ తత్త్వకీర్తనలవలె ఉన్నాయి

గురుదేవ భజన మాల ఈ కవి గారి రెండవ కృతి దీనిలో 45 భజన కీర్తనలున్నవి మొదటి సంపుటిలో దైవనుతులెక్కువ దీనిలో గురుస్తుతి పాటలెక్కువ వీరి గురు స్థానీయులు మార్కండేయుడు, షిరిడి పుట్టపర్తి సాయిబాబాలు, గోవిందగిరి స్వామి శ్రీకరానంద చెన్నయ్య

గురుని చెంతకు చేరుము, గురుని సేవ చేయుము, అని ప్రబోధించే వీరు గురుబోధ నిలా తెలియజేస్తున్నారు

మాట లల్లి మంత్రములు చేసిరి - ఆటకొరకె తంత్రములు చూపిరి
కూటి కొరకె యంత్రములు గట్టిరి బాటలాయెకుతంత్రుల కెన్నో -

గుణములన్ని బంధించుమన్నడు - గుర్తులన్ని సాధించుమన్నడు
గురిని నిలిపి గుర్తెరుగు మన్నడు గుణము కుదిరితె ఘనుడవన్నడు పు 24

వీరిది ఆధ్యాత్మిక వాదం అయినా విగ్రహారాధన మానరు సామాన్యులకు అది ఓ పట్టాన అర్థం కాదు సత్యసాయి సందర్శనానంతరం వీరు వ్రాసిన నీతి కీర్తనలోని ఒక చరణం

షష్టిపూర్తి జూచియున్నాము దేవుండవీవని ఇష్టపూర్తిగ నమ్ముచున్నాము
సృష్టిలోన ఇంతదండి, శ్రేష్టులను గనలేదటంచు
పట్టి చెప్పగవచ్చు నీ నరి గట్టి ధీరులు లేరులేరని పు 34

అదల సిద్ధాంత రాజయోగి మిట్టపల్లి రాజయ్య గారిని స్మరిస్తూ

రాముడే నీముందు నిలిచేను షిరిడి సాయి రాముడే నీప్రక్కవెలసేను
స్వాములందున స్వామివయ్య, గ్రామమునకే మేటివయ్య
నేమమును పాటించు భక్తుల, ప్రేమగలిగిన గురుడవైతివి పు 36

ఇది కోరుట్ల వాగు ప్రక్కనగల సజీవ దృశ్యం సమయోచిత వర్ణన కవి ప్రతిభకు నిదర్శనం కవి శక్తికి పట్టం కట్టే లోగుట్టును బయటపెట్టే ఈ పాటను చూడండి

నా దేహమన్నవారు ఏ దేశమేగినారు / దేహంబు నీది గాదు దేశాన నిలువబోదూ
ధర్మంబు నడువకున్న కర్మంబు దప్పదన్న / సర్వంబు దెలిసియున్న గర్వంబు విడువుమన్న
లక్షాధికారులైన భిక్షంబు నెత్తి యున్న / రక్షకుని దలువకున్న మోక్షంబు నీకు సున్న పు 37

ఇది నాటి సంసారం' సినిమాలో రేలంగి 'నగుబాటుకదా యెటులో' పాట నడకది
రేగుంట సాయన్న గారిది భక్తి భావపూర్ణ సరస కవిత!

## 18 గూడూరి బాలరాజ కవి - హనుమాజిపేట తా వేములవాడ

బాలరాజు గారిది డా॥ సి నారాయణరెడ్డి గారి స్వగ్రామమైన హన్మాజిపేట వీరు బొంబాయిలో వస్త్రనిర్మాణ కార్మికులుగా ఉంటున్నారు వీరు రచించినది ఒక గేయ పుస్తకం అది భీవండి కష్టజీవుల చరిత్ర" - ము 1985, పు 36 ఇందులో ఈ కవి రచించిన కొన్ని పద్యాలు సైతమున్నవి ఇది 85లో చిట్యాల బాలదాసకవి గారి శ్రీవాణి బుక్‌డిపో బొంబాయి ద్వారా ప్రచురితమైనా దీని పీఠిక దాసరి శంకరయ్య గారు 1972లో రచించారు

ఇందులోని భీ క జీవుల చరిత్రము 1972 రచన భీమండి అగ్నిప్రమాదం, అత్తకోడండ్ర వాదము స్థానిక వరాలదేవి హారతి, మొ గేయాలు తర్వాత రచించనవి

'నందమయా గురుడ నందమయా' వీర బ్రహ్మం గారి పాట బాణీలో విరచితమైన మొదటి రెండు గేయాలు 12 + 6 = 18 పుటలు లయకొంత కుంటువడినా భాషా ప్రావీణ్యం లేకున్నా ఈ గేయాలు సామాజిక విషయాల వర్ణన కారణంగా విలువైనవి

విన్నారయా మీరు విన్నారయా / భీవండి వివరములు విన్నారయా -
పొట్టకు దినుచోట భోజనపు వసతులు / ఎట్టకేలకు దెలుపు చుంటినయా
ఎన్నసౌద్యంబుగా జొన్నరొట్టెలు జేసి / అన్నతినుమని చేతికిస్తారయా -
బంకబియ్యము దెచ్చి బావి నీళ్లతొ వండి / బాగున్నదని తినుమంటారయా

బొంబాయి కార్మికుల పూట కూటింటి బాధలు, వారి చేష్టలు వివరంగా వర్ణించారు కవి ఆ వండి పెట్టే వారు అక్కడి మహారాష్ట్ర వనితలు కారు వారు ఇక్కడి నుండి అక్కడికి పనికై వెళ్లిన తోటి కార్మికుల ధర్మపత్నులు అక్కడి వసతి అసౌకర్యాలు, పనిలోని బాధలు, అప్పులు వడ్డీలు, వీరి సతులు కొత్తగా నేర్చిన వన్నె చిన్నెలు ఇందులోని విషయాలు రెండవ పాట సాధారణ సంవత్సరం 1970లో జరిగిన భీవండి అగ్నిప్రమాద వర్ణన సజీవ దృశ్యం శివసేన ఊరేగింపు సందర్భంగా హిందూ ముస్లింల ఘర్షణ ఘటిల్లి మంటలులేచాయి ఇళ్లు కాల్చి, మేడలు దోచి, స్త్రీల చెరచి పురుషుల చంపిన ఆకల్లోలం భయానకమైనది ప్రవాసాంధ్రులు ఆస్తులువదలి రైళ్లెక్కి తెలంగాణకు తిరిగి వచ్చారు ఈ విషయాలు వర్ణిస్తూ, బాలరాజు గారు, సర్కారు వారు సహాయంగా జనానికి పంచుమని ఇచ్చిన బియ్యము, డబ్బు దాచుకొని ధనికులైన పెద్దల దొంగబుద్ధిని ఛీకొట్టారు

అత్తా కోడలు గేయం - జానపద గీతం వంటిది

అ యింటిలోని పనులు జేయు ఓసికోడలా / నీకంటి నిద్ర కమ్మిజేయు ఓసి కోడలా
కో వంట పనులు గింట పనులు అత్తగారు / నావల్ల గాదు మళ్లీ అనకు అత్తగారు
ఇది మూడు పుటల సంవాద గేయం చివర కవి తీర్పు ఇట్లుంది
గీ చదువు నేర్చిన స్త్రీలంత చాల మంది, ఇంటి పనులందు శ్రద్ధ వహించ బోరు
చదువు స్త్రీలకు నేర్పించ చాల వరకు, వలదు వలదయ్య మీకిక వందనంబు

## 19 మచ్చ వీరయ్య - కరీంనగర్ - జ. 1923

మచ్చ వీరయ్య గారి జన్మగ్రామం బావుపేట ప్రస్తుత నివాసం కరీంనగర్ పట్టణంలోని పద్మానగర్ ప్రాథమిక పాఠశాల విద్యానంతరం చేనేత వృత్తితో జీవించిన వీరికి వాస్తు జ్యోతిష్యాలలో ప్రవేశముంది 'తెలుగులో యాత్రా చరిత్రలు' అనే అంశంపై డాక్టర్ పట్టా పుచ్చుకున్న మచ్చ హరిదాసు గారు వీరి పుత్రులు తాడ్వాయి శబరిమాత శిష్యులైన వీరయ్యగారు కొన్ని భక్తి రచనలు చేశారు వీరి ఏకైక పుస్తకం భక్తి తత్వ ప్రకాశిక' 1987లో వెలువడింది ఇది పద్య గేయ సంపుటి - పు 106



ఈ పొత్తంలో రామశతకం, కందార్థ దర్వులు, లక్ష్మీ వేంకటేశ్వర సరస్వతీ శివస్తోత్ర సీస పద్యాలు, మొదటి 30 పుటలు - తర్వాత రాగతాళ సూచనలతో భజనపాటలున్నవి

కృష్ణ శతకాన్ని అనుసరించిన వీరి రామశతకంలోని ఒక పద్యం

కం బూటకము వ్రాయలేదిట, పూటలు గడిపినను యేమి పుణ్యమువచ్చున్
చోటెరుగ కుంటె యెట్లా, నాటికి? నీ పాదములనె నమ్మితిరామా! 4

ఇందులో భక్తితోపాటు లోక విమర్శ కూడా ఉంది వ్యావహారిక పదాలను కవి యధేచ్ఛగా ప్రయోగించారు వీరి స్తోత్ర పద్యాల శైలి శేషప్ప నరసింహ శతకానిది

సీ భక్తుల బాకిలో బహునాళ్లు పడియుండ, ఇంత లేకున్నవా యిందువదన
అడిగి అడిగి భక్తుడాయాస పడుచుండ, మొండితనమికేల మోహనాంగ
జీతమిచ్చేదాక ప్రీతితో బిలిచినా, యేతీరు వనిజెప్ప చేతునయ్య
పుద్దెర జేసి నీవద్ది కడుగవచ్చి, రద్దిపాలయితినీ రాజలింగ

గీ నీదు సంసార కృత్యంలో నిండిపోయి ఉండి లేకుండి ఉన్నవా మొండివయ్యి
దీన జన పోష (క) మహేశ దివ్యమూర్తి - నాగభూషణ ముక్కంటి నన్నుబ్రోవు, పు 24

భజన కీర్తనలు వంద వరకున్నాయి వాటి కొన్ని చరణాలు -

శివ రామా యనుచు పలుకండీ - మదిలోన నెప్పుడు / మరువాకా స్మరణ చేయండీ
ధనమూ తనవెంట రాదండీ - దుర్గుణములన్నీ / విడిచీయు స్మరణ చేయండీ - పు 32

ఇందులో వివిధ దేవీ దేవతలు హారతులతోపాటు గూఢ వేదాంత తత్వాలు సైతం ఉన్నాయి వానిలో బహుళ వ్యాప్తి పొందిన ఒక తత్వ గేయారంభ పంక్తులివి

కలువ బోదము వస్తారమ్మా - మీరు / కలిసేటి వారంతా రాండ్రి మాయమ్మా
గరికా బీకినా మంచిదమ్మా హరికి / తోడై కలవా మెఱనే కన్నుల లోనా వురికి రాండ్రమ్మా ॥ పు 50

ఇంతవరకు ఈ జిల్లాలోని తత్వ కవులలో ఎక్కువమంది తాము గురు పీఠంలో ఉండి రచనలు చేసనవారు వీరయ్యగారు శిష్యులుగానే తమ కవితలు వెలయించారు వీరి గురుమూర్తి ఒక స్త్రీ యోగిని రామదాసు భజన కీర్తనలను భక్తిలో అనుసరించిన వీరు ప్రపంచనడవడి విమర్శలో బ్రహ్మంగారిని అనుకరించారు అయినా కాలజ్ఞాన మహిమలు కాక లోకం పోకడలను వివరించారు

గోముఖ వ్యాఘ్రాల్ తిరుగుచున్నవి గోవిందా హరినీవె హరీ - దీనుల బ్రోవగ రావె హరీ!
ప్రాణాల్ పీల్చుక తింటరయా ప్రజలలోనె కలిసుంటరయా

భాషా దోషాలు ఛందో భంగాలు కొన్ని ఉన్నా మచ్చ వీరయ్య గారు స్వచ్ఛమైన భక్తితో ఈ పద్యాలు పాటలు వ్రాసిన వరకవి

## 20 టి సుజాతా దేవి, ఉపాధ్యాయురాలు - సిరిసిల్ల

ఈ కవయిత్రి రచించిన శ్రీ శివరామ కృష్ణ భజనకీర్తనలు అను పుస్తకాన్ని ' శ్రీ సిద్ధేశ్వర పబ్లికేషన్స్ హైదరాబాద్' వారు 1987లో ప్రచురించారు ఈ పుస్తకంలో పేర్కొన్న రచయిత్రి పేరు ఊరు ఉద్యోగ విషయాలు తప్ప మరే వివరాలు తెలిసిరాలేదు ఈ భజన కీర్తనలు పుట కొక్కటిగా 22 ఉన్నాయి సుజాత గారిది సరళమైన రచన వీరి కవితా విధానమిది -

శ్రీ రుక్మిణీలోల కృష్ణయదుబాల - శ్రితజనావన పాల భామినీలోల
శ్రీమంతుడవు నీవు దేవకీ బాల కామితార్థములిమ్ము కాంచన చేల
శ్రీ కృష్ణ శ్రీ కృష్ణ వసుదేవ కృష్ణ, శ్రితజనావన కృష్ణ కోరితిని తృష్ణ - పు 4
ఇలపై వెలసిన లక్ష్మీరమణా - అలుగుట తగునా అరవిందనయనా
పిలచి పిలచి నేనలసి పోతిరా - పలుకరింపరా జగదభిరామా - పు 9

మధుర వేదాంత కవితలు జానపదులకు స్త్రీలకు ప్రియమైనవి మంగళహారతులు, ఉయ్యాల పాటలు, భజనకీర్తనలు పాడే స్త్రీలు అధికమే అయినా ఈ జిల్లాలో మధుర కవితలు వెలయించిన కవయిత్రులు అరుదు సుజాత గారు మధుర కవితా ప్రక్రియలో తెలియవచ్చినంతలో తొలి కృతి రచయిత్రి గో క సం కవి విష్ణుదాస గిరిధర రావు గారి ధర్మపత్ని మధుర బాయమ్మ గారు 1950 సుమారుగా కొన్ని హారతులు కీర్తనలు వ్రాసినా అవి వెలుగు చూడలేదు సుజాత గారు పురుష దేవతలనే తప్ప స్త్రీ దేవతా మూర్తులను స్తుతించకపోవడం విచిత్రం ఈ పాటల పేటికలో

శివరామకృష్ణుల కీర్తనలతోపాటు ఆంజనేయ స్తుతి గీతాలు సైతం నాలుగు (7, 11 19 24 పు ) ఉన్నవి ఈ గేయాలు భక్తులకు భక్తురాండ్రకు గానయోగ్యాలు

## 21 గోశికొండ మురారి పంతులు - సిరిసిల్ల జ 1 8 1944

మురారి గారి జన్మ స్థలం హుజూరాబాద్ తాలూకాలోని రామాపురం స్థిరనివాసం సిరిసిల్లా డిగ్రీలు లేని చదువు సంగీత సాహిత్య జ్యోతిష్యాలలో అభిరుచిగల వీరు పౌరోహిత్యం జీవనోపాధిగా చేపట్టుకున్నారు మురారి గారు రంగస్థల నటులు వీరి ముద్రిత కృతులు అయిదు

1 నీరాజన రత్న హారము, 2 పూజా పుష్పము, 3 దైవారాధన - 1984, 4 సూక్తి సుధ - 1993 5 భక్త సూరదాసు చరిత్ర 1995

మొదటిది మంగళ హారతులు పుస్తకం లభించలేదు రెండవ పుస్తకం పూజార్థం ఉపకరించే పూర్వ శ్లోకాల తాత్పర్య సహిత సంకలనం

దైవారాదన - 110 పుటలు మొదటి 44 పుటలు పీఠికలు ధ్యాన శ్లోకాదులు చివరి 30 పుటల్లో నీతి సూక్తులు స్వజాతి గోత్ర వివరాలున్నాయి మధ్య 44 86 పుటలు భజన కీర్తనలు పద్యాలు

నేడు జన వ్యవహారంలో ఉన్న వివిధ దేవీ దేవతల సుతులు - హారతులు వీరి పాటలు వీటిలో కొన్ని సినిమా పాటల తరజువి వీరి దశావతార హారతి చూడండి పు 84



హారతి గొనుమో నారాయణా! శ్రీ / హరి నిను వేడెద నారాయణా ! జయ ॥
దీనుల బ్రోచెడి దైవము నీవని, పూనుకొంటి నీ పాద పూజకై
కామితార్థముల గలిగించుమని ప్రేమతోడ నిను వేడుచుండి హరి ॥
కృతా యుగంబున మత్స్య కూర్మముల క్షితిలోకిటి నరసింహాకృతులను
కుతుకము తోడ ధరించి దుష్టులను, హతమొనరించిన పతిత పావన

వీరి మిగతా గేయాలు సరళాలు యతి శ్రుతి చక్కగా పొసగిన కవిత మురారి గారిది వీరి పద్యాలు సైతం సలక్షణాలు - ఆధునిక భావ విలసితాలు శ్రీ వేంకటేశ్వర సత్యసాయి స్తుతి పద్యాలు భక్తి భావ సంభరితాలు

'యధార్థములు' శీర్షికలోని పది సీస పద్యాలు కవి హృదయాన్ని ప్రదర్శించేవిగా ప్రతిభావంతంగా ఉన్నాయి పు 53 - 57 'కాలమే సర్వత్రకదలాడు చుండును - కాలమే సర్వత్ర కలిమి జేయు' అని ఆరంభించి, 'కాలమును వృధా చేయకో గడియ యైన' అని హితబోధ కావించి రెండవ పద్యంలో ఇలా హెచ్చరిస్తున్నారు

సీ కులమతాలను గూర్చి కలహించు వారిని, వెలివేయుడో న్యాయవేత్తలార
వరకట్న మనియెడి వదరు బోతులనెల్ల, నెదిరించు చుండుడో సదయులార
మాంత్రిక తాంత్రిక మాయమాటల వారి, నదుపులో బెట్టుడి అన్నలార
మిట్ట వేదాంతుల గుట్టు బైటపరచి, గుణపారమీయుడో - అనఘులార!

గీ సత్యమును ధర్మమును నీతి సహనములను, సాత్త్వి కాహార నియమముల్ సల్పుచుండి
మంచి తనమును భువి యందు గాంచుచుండి, మన్ననలతోడ మెలగుడో మాన్యులార!

ఈ శీర్షికలో స్త్రీల గౌరవాదరాలతో చూడాలని, సాంఘిక అవినీతి రూపుమాపాలని దేశంలో ఇన్ని పార్టీలు అనర్థదాయకమని ఉగ్రవాదంతో అగ్రరాజ్యాల అదుపు తప్పిన పనులవలన దేశమాత విలపిస్తుందని, యువత మేల్కొని కన్నతల్లి కన్నీరు తుడిచి దేశపురోగతి సాధించాలని కోరుకున్నారు కవి వీరి సంఘ సంస్కార భావాలను ప్రశంసింపక తప్పదు

సూక్తి సుధ - ఏక ఛందంలో గేయనీతి ముక్తక చతుష్పాదుల 40 పు పుస్తకం

శ్రీ కల్యాణ గుణాఢ్యులు, మాన్యులు - చెప్పిన మహితోక్తులు వినరా

ప్రాకటముగ పరమాత్ముని నిరతము - శక్తి మీర స్మరియించుమురా!

ఇందలి లౌకిక పారలౌకిక రీతి నీతులు జన మనోరంజకాలు పైగేయానికి "రామ రామ రఘురామ పరాత్పర రావణ సంహార" గేయం ప్రేరణ అనుకోవచ్చు

భక్తసూరదాసు చరిత్ర - 1995లో వెలువడిన గేయ కావ్యం

ఇది 16 మాత్రలతో చతురస్ర గతిలో సాగిన 100 గేయాల 400 పాదాల కథా కావ్యం సూరదాసు ఔత్తరాహుడు కృష్ణ భక్తుడు పుట్టంధుడు! ఆయన పాటలు మీరాబాయి కీర్తనలకు సమానమైన విలువ కలవి మధురా నగరంలో జన్మించిన ఈ బాలున్ని తల్లిదండ్రి ఈసడించుకుంటే ఇల్లు వదలివెళ్లి భక్తి గాయకుడై అవంతిరాజు ఆదరణపొంది కృష్ణదర్శన లాలసతో మరణించినట్లు ఇందలి కథ నిజానికి అక్బర్ కాలపు వాడని ప్రతీతి ఆ ప్రసక్తి ఇందులో లేదు ఈ మధుర భక్తకవి సూరదాసు కబీరు దాసుకంటె తర్వాతి వాడు మన త్యాగరాజు, రామదాసులకంటె ముందుకాలం వాడు వల్లభాచార్యులకు సమకాలికుడు

దీన దయాళుడు దేవదేవుడు దివ్యమైన కాంతుల నిచ్చెన్

కోటి సూర్య ప్రకాశమానుడై గోపాలుని తా దర్శించెన్ పు 12

కంటి నీటితో స్వామి పాదములు - కడిగి యభిషేకము చేసెన్

కరుణామయుని రూపము చూచి - పరవశించి తామైమరచెన్ పు 13

అక్కడక్కడ ఒకటి రెండు మాత్రలు ఎక్కువ తక్కువలయినా అవి రాగాల్లో ఒదిగిపోయేలా రచన సాఫీగా సాగింది

ఈ పుస్తకం చివర 'నాలోని ఆంతరంగికములు' 'నా అభిమతము' పేర కవి తమ ఇష్టాల్ని వ్యక్తపరిచారు చిట్ట చివర 'మహితోక్తులు' పేర రాసిన గేయాలు ఆద్యంత్య ప్రాసలతో సామాజిక హితవులతో శ్రావ్యంగా భవ్యంగా ఉన్నాయి అది ఎక్కడి అనుబంధమో కాని ఈ కృతికి నెల్లూరు జిల్లా బుచ్చిరెడ్డి పాలెం" (అది దువ్వూరి రామిరెడ్డి గారి స్వగ్రామం) ముగ్గురు కవుల పీఠికలున్నవి సరస సలక్షణ పద్య గేయ కవి మురారి పంతులు గారు

## 22 గంగా రాజేశ్వర రావు. ఎం ఏ , బి ఇడి. మంథని వ 76

గంగా రాజేశ్వరరావు గారు పద్యగేయ రచనల్లో సిద్ధిపొందిన మధుర కవి - మహాకవి వీరి గేయకృతులివి

1 శ్రీమద్భగవద్గీతాగానము 1990, 2 గంగారామాయణము - రగడ కావ్యం - అముద్రితం భగవద్గీతలోని అష్టాదశ సర్గలను వీరు మాత్రాఛందస్సులో ఆంధ్రానువాదం కావించి వివిధ

గతుల గేయాలుగా గానం చేశారు ఇది గేయ కావ్యమైనా గ్రాంధిక భాష వేదాంత విషయ వర్ణనతో అచ్చమైన మార్గకవిత్వం అనవచ్చు కృతి సమర్పణం కృత్యారంభ ప్రార్థనాదులు కూడా గేయాలే వీరికి పద్య కవిత్వంలో వలెనే గేయ కవితలోనూ సంస్కృతాంధ్ర పదాలు ఎంతటి వశవర్తులో చూడండి మ్రొక్కులు - పు 2

అంబనీకు వేలు మ్రొక్కులు, గ్రహియింపుము జగ
దంబ! భక్త జనుల మ్రొక్కులు - వెలిగింపు పృధుని
తంబ! ప్రభల నన్ని దిక్కులు -

వివిధ ఇష్టదేవతానమస్కారములు సరేసరి కావ్య ప్రస్తుతులైన గీతా ధ్యాన ప్రసిద్ధ పూర్వ శ్లోకాలు వీరికి గేయ పాదాల్లో ఎంత వినయంగా ఒదిగినాయో చూడండి

భగవద్గీతా భవద్వేషిణీ భజింతునద్వైతామృత వర్షిణి
భగవతి యష్టాదశాధ్యాయనీ భక్త జన క్షేమ సంధాయినీ
భగవంతుడు నారాయణుండు నరవరుండైన పార్థుని నిమిత్తముగ
నిగమ శిరంబుల ద్రచ్చి గ్రహించెను నిను నవనీతంబును శుభదాయిని

కృత్యాది 16 పుటలు వీరి గీతా కావ్యగానమంతా వివిధ మాత్రల గతి భేదంతో సాగింది అందుకు అనుకూలంగా కవి ప్రతి అధ్యాయంలోనూ భావసంబంధం కల శ్లోకాలను ఒక్కొక్క విభాగంగా గేయగతి భేదం కోసం విభజించుకున్నారు

ప్రథమాధ్యాయం - 21-23 శ్లోకాల అనువాద గేయమిది 14 మా ॥
రెండు సేనల నడుమ నా యీ దండిరథమును నిల్పుమచ్యుత
భండనమునకు నుత్సహించెడు వారి నీక్షించెదను ముందుగ
కౌరవులు ధూర్తులకు బ్రియమును గలుగ జేయుట కొఱకునాతో
బోరనువ్విళ్లూరు నీ యరి వీరుల బరీక్షింప నిమ్మిక -
దశమాధ్యాయం - శ్లో - 1-3 10 మాత్రల గేయం
ప్రేమ పాత్రుడవు నీ ప్రియము గోరియ మరల
బల్కెద మహాభుజా పరమ వచనము విను - పు 42

ఈ గీతాగానం మహత్తరమైన ఆధునిక కాల సంప్రదాయ కవిత్వ గేయ మహాకావ్యం ఇది కవిశేఖర చెప్యాల రామకృష్ణరావు గారికి అంకితం కావించబడింది

గంగా రామాయణం శర్మగారి మరో రమ్యనవ్య కావ్యం

ఇది సంపూర్ణ రగడ కావ్యం - రగడలు ప్రాచీన దేశి కవితలు కంద గర్భ హరిగతి రగడతో కావ్యారంభం కావించి, ఉత్సాహవృత్త గర్భ తురగవల్గన రగడతో శ్రీరామునిలా వేడుకున్నారు

శ్యామ భవము దాట నీదు స్మరణ భవ్య నావరా । మ
కోమల మృదు పాదసేవ - గూర్చు విమల భక్తిరా । మ
తామరస సునేత్ర నాకు - దాపు ప్రాపు నీవరా । మ
రామ భద్ర రాక్షసాంత - రార నన్ను బ్రోవరా । మ

ఈ చరణాల చివరి 'మ'ల కలిపి చదివితే రగడ, విడిచి చదివితే ఉత్సాహవత్త పద్యం!

వృషభగతి హయ ప్రచార, హరిణగతి, ద్విరద గతి, మధురగతి, విజయభద్ర, హరిగతి, మయూరగతి ఇట్లా అనేక రగడ భేదాలతో గంగా రాజేశ్వర కవి తమ రామాయణ రచన కావించారు లక్షణకర్తలు తప్ప ఇన్ని రకాల రగడలను తమ కావ్యంలో ప్రయోగించిన కవులు లేరు రగడలతోనే ఒక సంపూర్ణ కావ్య రచన కావించిన కవి నభూతోనభవిష్యతి!

ప్రతిభా పాండిత్యాలు కవన కల్పనా పాటవాలు, పుష్కలంగా గల కవి వరేణ్యులు గంగా రాజేశ్వరరావుగారు ఈ రామాయణం అముద్రితం

రాజేశ్వరరావుగారి కావ్యాలు చాలా కాలం అముద్రితంగా ఉండి సంప్రదాయకవిత్వ, విద్యా వైదుష్యాల ప్రచారం అంతగాలేని ఈ ఇరువదవ శతాబ్ది ఉత్తరార్థంలో వెలువడిన కారణంగా ఈ కవి పేరు వ్యాప్తి కాలేదు ఆయన విద్వత్కవి - మహాకవి

## 23 నురువు రాజమల్లయ్య - తిప్పాపురము మం॥ వేములవాడ

రాజమల్లయ్యగారి పాటల పుస్తకం 'జీవితబాట' పేరుతో 1990లో అచ్చుపొందింది దీనికి డా సి నా రె పీఠిక 1988ది ఇందులోని పాటలు 51 అందులో లలితగీతాలుగాక, తత్త్వాలుగా భక్తి పాటలే ఎక్కువ కవికి పెద్ద చదువు లేదు కవిత్వం రాయాలనే తపన మాత్రం ఉంది

"ఇందలి గేయములలో నీతి, రీతి, ప్రవర్తన మొదలగు వివిధ విషయములు వర్ణించడంలో రచయిత భావన రంజకముగా నున్నది" వఝల సాంబశివశర్మగారి పీఠిక, శర్మగారు ఈ కవి భక్తి భావాల ప్రస్తావించలేదు కవిగారు హరిజనులైనా (కావ్యాంత గద్యలో ఉంది కులం పేరు) అంబేద్కర్ ప్రసక్తి తెలేదు అభిరుచులు రకరకాలు

పిలచిన పలికేవు స్వామి - శిలగామారిన వేమి? పు 5

వచ్చిన ఫలమేది మనసా - మూడు నాళ్ళ ముచ్చటాయె మనసా! పు 34

ఇలాంటి భక్తి పాటల్లో కొన్ని దేశభక్తి గీతాలున్నాయి

దేశం ఇది మన దేశం - స్వతంత్ర భారతదేశం

గాంధి తాత చాచానెహ్రూ - ఇందిర గాంధి ఏలిన దేశం - అఖండ భారతదేశం పు 39

వరకట్నం, కులభేదం, నిరసనం, ప్రకృతి వర్ణనల పాటలున్నా ప్రేమపాటలు లేక పోవడం ఓ విశేషం పద ప్రయోగంలో భావ ప్రకటనలో ఈకవిగారిది ప్రారంభ దశ కావ్యం చివర ఓ చమత్కారం - కథ కాసి(శి)లో! కలం జేబులో - అట!!

## 24. పరాంకుశం మురళీధర స్వామి - ఎం ఏ , కొడిమ్యాల.

మురళీధర స్వామి తెలుగులో బి ఓ ఎల్, ఎం ఏ విద్యార్హతలు సాధించిన ఆంధ్రభాషో పాధ్యాయులు వీరు భక్తి రచనలు చేస్తుంటారు పద్యం గేయం రెండూ వీరికి ఇష్టమే స్వామి గారి రచనలు 3 1 శ్రీశతకం (పరిచయం చేయబడింది ) 2 శ్రీహనుమద్గానం ఈ గేయ కృతి 1991లో వెలువడింది కవి ఈ కావ్యాన్ని అకాల మరణం పొందిన తమ ప్రియతనూజుడు శ్రీనివాస్ బి ఏ 1967-1990 గారికి అంకితమిచ్చారు

కొండగట్టు హనుమాన్ భజన కీర్తనలు, గొండగట్టు క్షేత్ర మహిమవచనం, అంజనేయదండకం, హనుమాన్ చాలీసా లతో ఈ పుస్తకం ఇంచుమించు ముప్పది పుటలున్నది చివరి దండకం చాలీసా పూర్వ కవుల రచనలు వీరి భజన గీతాలు అయిదు, హారతి గేయాలు నాలుగు మొత్తం తొమ్మిది పాటలు వీరివి 13 పుటలనాక్రమించాయి స్వామి గారి గేయాలు గాన యోగ్యమైన శైలిలో ఉన్నాయి

శ్రీ యంజని పవన పుత్ర శ్రీరామ ప్రేమ పాత్ర
ఆదుకోర నీదు భక్తులన్ ఓ ఆంజనేయ
అందుకో నమస్సుమాంజలిన్ - శ్రీ ఆంజనేయ ॥
పుట్టినపుడె సూర్యుని గని - పట్టిమ్రింగ బోవగనే
కొట్టెను దేవేంద్రుడు నిను - గట్టిగ మూర్ఛిల్లగను
దీవించిరి దేవతలంతా - ఓ ఆంజనేయ
సేవించిరి నిను హనుమంతా - శ్రీ ఆంజనేయ పు 1
మరో గేయం పల్లవి పు 13

శ్రీ కొండ గట్టువాసా - చేకొను దండములీశా నాకండ నెపుడు నుండన్ నామనసు వేడుచుండెన్

సంప్రదాయ భక్త కవి మురళీధర స్వామి గారు

## 25 రాంపల్లి చంద్రమౌళి, బి ఏ మంథిని

చంద్రమౌళి గారు కరీంనగర్ జిల్లా విద్యాశాఖాధికారి కార్యాలయములో కార్యనిర్వహణ ఆధికారిగా ప్రభుత్వోద్యోగంలో ఉన్నారు వీరు సాహిత్యాభిమాని - గేయకవి

మంథిని అయ్యప్ప భక్త బృందం ఈ మధ్య "శ్రీ అయ్యప్ప స్వామి భజనావళి" అనే పుస్తకాన్ని ప్రచురించారు మొదటి ముద్రణ తేది లేదు కాని, ప్రతులు 2500 అని ఉంది రెండవ ముద్రణలో 5 వేల కాపీలు వేసి శబరిమలైలో విక్రయించారట దీని ప్రచురణకర్త సత్యనారాయణ భండారి స్వామి, కూర్పు-రచన గొబ్బూరి రాములు స్వామి అని పుస్తక ముఖపత్రంపై ఉంది ఇది వివిధ కవుల గేయ సంకలనంగా ప్రకాశకుల పీఠికలో ఉంది

ఈ సంకలనంలో చంద్రమౌళి గారు రచించిన పాటలకు వారు స్వయంగా పుస్తకంలో గుర్తులుపెట్టి ఇచ్చారు వీటిలో ఎక్కువగా సినిమా పాటల మాదిరిలో ఉన్నాయి పుస్తకారంభ వినాయకస్తుతి గీతాలు రెండూ చంద్రమౌళి గారివే వీరి ఆంజనేయ రామ సంస్తుతులు 7 8 9, 10 పుటల్లో ఉన్నాయి అయ్యప్ప భజన పాటలు అధికం

ఓహో బస్తీ దొరసాని - మాదిరి పాట (పుట 17) ఇది,
శబరీ కొండకు రారండీ - శరణం వేడగ రారండీ
స్వామీ అయ్యప్ప దేవుని గాంచగ రారండీ
మరో పాట పు 45 ఇది ఆరాధనలో రఫీ పాడిన 'నా మది నిన్ను పిలిచింది గానమై పాట బాణీది
మణి కంఠా నీ చరణాలె ప్రాణమై - మాకు మిగిలెరా మా ప్రాణమై
చెరగని నామం నీదేనని - మా తరగని సంపద నీవే ననీ
నీ సన్నిధిలో నిలిచాము దేవా - మాపెన్నిధివై మము గానరా

ఈ పుస్తక గేయాల్లో జి రాములు స్వామి - 44, చింతక్రింద ప్రమోద్ వరంగల్ - 33 తాను 47 రచించినట్లు ఆర్ చంద్రమౌళి గారు చెప్పారు ఇంకా ఇతరకవుల పాటలు ఉండవచ్చు వాటి వివరాలు తెలియవు ఈ పాటలన్నీ భక్త జన ప్రచారంలో ఉన్నవి

## 26 పొన్నూరు హైమవతి - బి ఓ ఎల్ కరీంనగర్

తెలుగుపట్టి పద్యశతకకావ్యం, జ్ఞానకిరణాలు, నాటికలు ఈ కవయిత్రిగారి రచనలు మూడవ పుస్తకం 'స్త్రీ అబలకాదు సబల 1992లో వెలువడింది ఇది ఉయ్యాల పాటల సంపుటి ఇందులో మహిషాసురవధ, సీతమ్మ అపనింద, నరకాసురకథ, వరలక్ష్మి - సంతోషిమాత వ్రత కథలు, రాణిరుద్రమ, ఝాన్సీరాణి, స్త్రీ ప్రబోధం, అక్షరోజ్జ్వల వయోజన విద్య - మొత్తం 9 పాటలు 20 పుటల్లో ఉన్నాయి

తెలంగాణాలో కామునిపున్నమి, బతుకమ్మ పండుగ పాటలు చాలా వ్యాప్తిలో ఉన్నవి కాముని పాటలు స్త్రీ పురుషులు పాడుకునేవి వేర్వేరుగా ఉన్నాయి బతుకమ్మ పాటలు మాత్రం కేవలం స్త్రీలవి అయినా వీటిని చాల వరకు కవులే వ్రాశారు ఈ కవయిత్రి ఈ స్త్రీల పాటలు వ్రాయడం ఎంతో ఔచిత్యం

హైమవతిగారి జన్మస్థలం గుంటూరు జిల్లా అయినా నలుబదేండ్లుగా తెలంగాణా కరీంనగర్‌లో ఉంటున్న కారణంగా ఇక్కడివారై ఈ ప్రాంత ఆచార వ్యవహారాలు చక్కగా తెలుసుకున్నారు ఇక్కడి పాటలు పాడుకున్నారు ఇక్కడి పలుకుబడి నేర్చుకున్నారు అందుకే ఈ పాటలు బాగా కుదిరాయి కోస్తాంధ్రలో సంక్రాంతి గొబ్బెమ్మ పాటలు తప్ప, దుర్గాష్టమి గౌరమ్మ పాటలు లేవు

బతుకమ్మ బతుకమ్మ ఉయ్యాలో - బంగారు బతుకమ్మ ఉయ్యాలో
రాక్షసుల వంశాన ఉయ్యాలో - రాజు పుట్టిండమ్మ ఉయ్యాలో -

ఇవి మహిషాసుర వధ గేయారంభ పాదాలు బతుకమ్మ అంటే గౌరమ్మ దేవి నవరాత్రుల వేడుక ఈ పండుగ, దుర్గాదేవి మహిషుని వధించిన కథలో పుస్తకారంభం కావించడం బాగుంది సీతమ్మ కష్టాలు స్త్రీ దేవతల వ్రతాలు తెలుగుపడతులకు ప్రియమైనవి ఝాన్సీ, రుద్రమలు వీరనారీమణులు

ముఖ్యంగా నరకాసుర వధలోని సత్యభామ పుత్రత్యాగ సన్నివేశం రచయిత్రి అపూర్వకల్పన ఉన్నతాదర్శ ప్రదర్శన శ్రీ కృష్ణునితోపాటు కదనరంగానికి వెళ్లిన సత్యభామ గురిచూసి బాణాన్ని నరకాసురునిపైకి వదలింది అది వాని గుండెలో కుచ్చింది - అప్పుడు -

అమ్మా యని అరచి - అల్లాడిపోయాడు/ ఆ పిలుపు నాలించి - అసత్య అదిరింది
వెన్ను తట్టినయట్లు వెనుక జన్మయుమెదిలె/ భూదేవి తానంచు - బుద్ధికే తోచింది
కనుల ముందర జూడ - కన్న కొడుకే నిలిచి / కన్న తల్లికి గుండె - కదలి పోయిందమ్మ
ఏమిరా నా కొడుక - ఎంత చేస్తివి తండ్రి / నా కొడుక నా కొడుక - నాకేది దారింక
ఒడిలోన జేర్చింది ఓదార్చసాగింది / సూత్రధారియు లేచి - చూచె నా దృశ్యంబు
ఓ దేవి నా దేవి - ఊరుకోవె సత్య / కొడుకు కావాలంటె - కోరుకో నరకున్ని
నీ తృప్తి కోసంబు - నీకిచ్చివేస్తాను / ఇంతలోనే సత్య - ఎంతయో యోచించె
కన్న పుత్రుని కన్న ఎన్న ప్రజలేమిన్న / లోక కంటకు డితడు - లోకానతగడంచు
వింతగా తాలేచి - విల్లంబులందిచ్చె / పాపాత్ముడీతండు - పరిమార్చి వేయుడి
దుష్టాత్ముడీతండు - దునుముడీ మీరింక / నరక బాధల నుండి నా ప్రజల గాచుడి పు 7, 8

అని ధర్మనిర్ణయం చేయగా కృష్ణుడు నరకుని వధించాడట! ధర్మ రక్షణ, దేశరక్షణ, స్త్రీజన చైతన్యం - వరకట్న నిరసన, వయోజన విద్యావ్యాప్తి వీరి పాటలలోని విషయాలు కవయిత్రి ఎన్నుకున్న శీర్షికలన్నీ స్త్రీజన సంబంధమైనవి కావటం విశేషం హైమవతి గారి ఈ కృతి ఆకృతిలో చిన్నదైనా ఆదర్శంలో మిన్నది

## 27 వేదాంతం కాశీనాథం, బి ఓ.ఎల్ - వేములవాడ. 1921 - 1988

కాశీనాథం గారు ఆంధ్ర భాషోపాధ్యాయులు పద్య గేయ కావ్య కవి ఈ సంప్రదాయ కవి భక్తి రచనలతోపాటు జానపదగేయాలు కూడా రచించారు భజగోవింద ముకుందమాల సంస్కృత కావ్యాలను పద్య గేయోభయరూపాల్లో తెలుగు జేశారు నమక చమక వేదాంత గ్రంధానువాదం కావించారు వీరి భజన పాటలను 'వేముల వాడ శ్రీ రాజరాజేశ్వర స్వామి భజనమాల 'పేరుతో కవి కీర్తిశేషులైన తర్వాత వారి సతీసుతులు 1992 లో ప్రచురించారు కవి సంగీత సాహిత్యాలలో ధిషణ కలవారు కనుక వారి మధుర భక్తి కీర్తనలకు స్వయంగా రాగ తాళాలు సూచించారు వంద వ్రాయనెంచినా డెబ్బది కీర్తనలు మాత్రమే పూర్తి చేయగలిగారు

గంగం గణపతి నమో నమో గాన విషారద నమో నమో - పు 1
శంభో శంకర గౌరీశా సాంబసదాశివ విశ్వేశా - పు 14
రామనామం శ్రీరామనామం, సీతారాముల శృంగార నామం - పు 38
ఇటువంటివి వీరి పాటల పల్లవులు - ఇక భావాలు చూడండి
భూపాల రాగం, ఏకతాళంలో మేలు కొలుపు - పు 24
లాలిపాటల దేలి జోల పాటల సోలి/ మా యమ్మ పార్వతీ మధుర గీతాలతో
మత్తెక్కి నిదురించు మహదేవ సాంబ / మేలుకో సర్వేశా మేలుకో విశ్వేశా
వేములవాడలో విహరించు రాజేశా
కవి ఆశయం - ఆదేశం ఇది - యమన్ కల్యాణి ఆదితాళం - పు 18
శివుని గొల్వరా జీవా - చింతల బడి చెడి పోవకురా
ఆశల బెంచి అలజడి పంచి, ఆరాటమ్మున నీల్గకురా
హాని కరమౌ చేష్టల చేతను అన్యుల హింసల ముంపకురా -

దైవ భక్తి సుగుణ సంపత్తితో భవసాగరాన్ని తరించుచున్నారు వేదాంతం కాశీనాథం గారి ఈ భజనమాల భక్తులకు ముఖ్యంగా భజనాసక్తి పరులకు అమూల్యరత్నపేటిక!

## 28 డా రావికంటి వసునందన్, ఎం ఏ పిహెచ్ డి. కమాన్‌పురం

వసునందన్ గారు ఆంధ్ర ప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయం తెలుగు శాఖలో రీడర్ వీరు పద్యగద్య గేయాది ప్రక్రియల్లో దశాధిక గ్రంథ కర్త వసునందన్ గారి మధుర గేయ కవితా సంపుటి 'శ్రీరామ చరితామృతమ్' బాలకాండ, 1992లో వెలువడింది ఇది సినీగాయనీ గాయకులచే పాడించిన రామకథ క్యాసెట్టుకు పుస్తకం రూపం ఇందులో కేవలం పదకొండు పాటలున్నాయి అవి అన్నీ సంప్రదాయబద్ధంగా రాగతాళనిబద్ధాలు

పా 1 వరగుణధాముడు ధరలో ఎవరో అనుచునారదుని అడిగెవాల్మీకి
బలమూ తేజము భవ్యవిక్రమము - సత్యము ధర్మము సహనశీలము
వరవిద్యామతి పరమ దయాగతి కలిసి వెలుగొందు ఘన తరుడెవరో

రెండవ పాట రఘువంశ వర్ణన ఇది రాగేశ్వరి రాగమన్నారు అది భాగేశ్వరేమో అని అనుమానం మూడవ పాట దశరధుడు సంతానం కోసం పరితపించడం నాలుగవది పుత్రకామేష్టి అయిదవది శ్రీరామజననం ఆరవది లాలిపాట

పా 7 బాల రామ చంద్ర లక్ష్మణాదుల సౌందర్య వర్ణన -
ఏమి కన్నుల విందు ఎంత మంచి పసందు । రామ చక్కని రాకుమార లీలల యందు॥
అంద చందములొలుకు ఆటపాటల వేళ। అలుపు సొలుపులు లేని చదువు సంధ్యల వేళ
నిండు జాబిలికళలు నేల మీదికి దించు। ముద్దుమోముల లీలల ముగ్ధ మోహన హేల

పా 8 విశ్వామిత్రుని కోరిక,
రాక్షసవధకై రాముని కోరిన, కోరిక పిడుగై గుండెను చీల్చెను
గడగడ వణికెడి కాయముతో దశ, రధుడు వివశుడై రాజసముడిగెను

తాటక వధ, సీతారాముల కళ్యాణం, పరశురామ గర్వభంగంలతో పదకొండు పాటలు పదునాల్గు పుటలు కలది ఈ రామాయణ గేయ బాలకాండం

ఆనంద వైభోగమే - సీతారాముల కల్యాణమే! పు 11 అని భక్తులు పాడుకుని విని ఆనందించే విధంగా డా రావికంటి వసునందన్ గారు ఈ గేయాలు రచించారు ఆంధ్ర ప్రదేశ్ వైశ్య సంఘం సహకారంతో వీరి సంపూర్ణ గేయ రామాయణం రానున్నదన్నారు

## 29 రమణానంద మహర్షి - కోరుట్ల

దళిత కుటుంబంలో పుట్టి సామాన్య పారశాల విద్యను (తెలుగు మెట్రిక్, హిందీ విశారద) పొందినా వేదాంత గ్రంధ పఠనంతో అంచెలంచెలుగా దైవభక్తిని పెంచుకుని 1976లో గీతాచార్యులుగా మారిన పసుల కొండయ్య గారు సన్యాసాశ్రమ స్వీకారానంతరం 1991 నుండి రమణానంద స్వామిగా వ్యవహరింపబడుతున్నారు వీరి ముద్రిత పుస్తకాలు రెండు 1 రమణానంద యోగామృత తరంగిణి వచనం - 1992, 2 రమణానంద భజనామృతము - 1993 పు 40

వీరి భజనామృత కృతి 27 భక్తి పాటల సంపుటి దానిలోని కొన్ని చరణాలివి
నిత్యము గోపాల యనుమన్నా। నీవు జేసినట్టి పాపము నశించునో యన్నా - పు 2
ఎంతో నామము శ్రీహరి నామము చింతనజేయవె ఓ మనసా
స్వాంతమందు శ్రీకాంతుని దలచిన భ్రాంతి దొలగునె ఓ మనసా పు 4
రామా రక్షించి మమ్మేలు సీతాపతి
అందుకొనవయ్యా శ్రీరామ మా హారతి - పు 15
గుండెలలో నెలకొన్న బ్రహ్మాండ నాయకుడు వాడు
అండనుండి ప్రతివారి గండములు బాపినవాడు పు 17
ఇది అన్నమయ్య కొండలలో, కీర్తనకు అనుసరణ అనేది స్పష్టం



గ్రోలవే రామరసం 'పిబరే - హిందీ గేయానువాదం - పు 24

యోగ షట్చక్రముల పాట పు 25 29

ఇందలి చివరి పాట హారతి చివరి చరణం (పు 40) ఇది

దుష్ట శిక్షణాకై శిష్టా రక్షాణకై - యుగ యుగ మందు అవతారించితివి నీవు

భకితో రమణానందుడు నినువేడగా - అందుకొనుమయ్య గోవింద మా హారతి।

ఇందులో కృష్ణ భక్తి గీతా లెక్కువ ఈ స్వామివారిని భక్తి కవిని చేసింది ఆ కవిత్వం వరకవుల సరసనే నిలిచింది

## 30 కాకర్ల లక్ష్మీకాంత శాస్త్రి - ధర్మపురి - 1910 -85

కాకర్ల లక్ష్మీకాంత శాస్త్రి గారు ధర్మపురి వాస్తవ్యులు వీరు సంస్కృత విద్వాంసులు, పురాణ ప్రవచన చక్రవర్తి, నటనా ధురీణులు, ఆశుకవి ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం వారు వీరిని రెండుమార్లు పురాణ ప్రవక్తగా ఒక మారు ఉత్తమ నటునిగా సన్మానించారు వివిధ గ్రామ పట్టణాల పౌర సన్మానాలు అనేకం పొందారు శాస్త్రిగారు 175 మారులు భాగవత సప్తాహాలు, అనేక రామాయణ భారతాది పురాణ ప్రవచనాలు చేసినవారు ఇరువది నాటకాలలో ప్రధాన పాత్రలు ధరించారు [5]

వీరు పురాణ ప్రవచన సందర్భాలలో ఆశువుగా పాడిన మంగళ హారతులు భక్త జన వ్యాప్తి పొందాయి వానిలో కేవలం 10 హారతుల 16 పుటల సంపుటి 'శ్రీ కాకర్ల లక్ష్మీకాంత శాస్త్రి - మంగళహారతులు అను పేర 1984లో ప్రచురించబడింది ఈ హారతులు తెలుగులో ముద్రణ పొందినా, తెలుగు పాటలుగా కనిపించినా ఇవి సంస్కృత కవితలు వివిధ దేవీ దేవతా స్తుత్యాత్మకాలు వీనిలో కేవలం రెండు మాత్రం తెలుగు భాషలో రచింపబడినవి అవి ఇవి

సత్యనారాయణ హారతి - పుట 7

శ్రీ సత్యనారాయణ నీరాజనమున్, గొను శ్రిత జన శుభకర

నిత్య నిరంజన నిరుపమా సంస్తుత్య, స్తుత్య భృత్యుకోటి పూజిత ప్రభో॥

యెవరి కెట్టి బాధలున్న సత్య, వ్రతము నాచరించినంతనే దొల

గించి యఖండ సుఖంబిహ పరముల, నందింతు నారదా యని నుడివిన

మహాలక్ష్మీ - నీరాజనం పు 11

మంగళ మిదె గొనుమా మాతా - మంగళదాయినీ మహాలక్ష్మీ జయ॥

అంగజారి ముఖ, అఖిలలోకముని - న్నభినుతింతురభీష్ట సిద్ధికై

ఆశ్రితేష్ట వరదాయనివనినే - నను దిన మర్చించి భక్తి నిడు

వీరి హారతులలో స్థానిక నృసింహదేవునిపై వ్రాసినవి అధికం తెలుగు సినిమా పాటల బాణీలలో సంస్కృతంలో వ్రాసిన వీరి గేయాలశైలి రమణీయం సంగీత సాహిత్యాలు వీరికి కరతలామలకాలు

1955 అక్టోబర్ 21-24 తేదీలలో హైదరాబాదులో జరిగిన 19వ ఆంధ్ర నాటక కళాపరిషత్తు వారి వార్షిక మహాసభలో మంత్రులు మహా కవులు రచయితలు మాత్రమే కాక భానుమతి శాంతారాం,

బందా మొ॥ సినీ నాటక నట ప్రముఖులు పాల్గొన్న సభలో, ఘంటసాల, రేలంగి శాంతకుమారి, పీసపాటి, తాపీ ధర్మారావు, వేమూరి రామారావు గారలతోపాటు కె లక్ష్మీకాంత శాస్త్రి గారు పొందిన సన్మానం జిల్లాకే గర్వకారణం (నాటి ఆహ్వాన కార్యక్రమ పత్రం వీరి ద్వితీయ పుత్రులు దత్తాత్రేయ శర్మగారు చూపారు 1994)

ఉచిత సంస్కృత బోధనతో, పురాణ ప్రవచనాలతో పద్య నాటక ప్రదర్శనలతో సంపూర్ణ జీవితాన్ని జన ప్రయోజనకరంగా వ్యయించి సంతృప్తిగా జీవించిన కాకర్ల లక్ష్మీకాంతశాస్త్రి గారు ధన్యులు - మాన్యులు!

## 31 రేగళ్ల మురళీధర శర్మ - బి ఓ.ఎల్ మంథని జ 1933

## 32 రేగళ్ల చంద్రశేఖర శాస్త్రి - ఎం ఏ ఎం ఇడి మంథని 1936

మురళీధర శర్మగారు ఆంధ్ర భాషా పండితులుగా జి ప సెకండరీ పాఠశాలలల్లో ఉద్యోగం చేసిన కవి శర్మ గారి అనుజన్ములు చంద్రశేఖరశాస్త్రి గారు ప్రభుత్వ విద్యాశాఖలో చిత్రలేఖనోపాధ్యాయులు

ఈ కవి సోదరులు సౌమ్యులు, సాహితీ ప్రియులు దైవ భక్తులు వీరి భజన కీర్తనల దేశభక్తి గేయాల సంపుటి గీత మాలికా కృతులు అను పేరుతో 1993లో వెలువడింది

దీనిలో రాగతాళ సూచితాలైన126 పాటలున్నాయి ఈ కవి ద్వయంలో ఎవరే పాట వ్రాసింది సూచింపబడింది గ్రంథారంభంలోని 'మంథని స్థల చరిత్ర వ్యాసం, గ్రంథం చివర యజుర్వేదం నలుబదవ మండలం చివరి 'ఈశవ్యాసోపనిషత్తు' గేయానువాదం మురళీధర శర్మ గారి రచనలు ఈ గేయ సంపుటికి స్థానిక దేవాలయాలు దేవీ దేవతామూర్తుల చాయా చిత్రాలతోపాటు చంద్రశేఖర శాస్త్రి గారు చిత్రించిన శివ గణేశ సరస్వతీ చిత్రపటాలు ప్రత్యేకాకర్షణలు



జయ జయ జయ జగదీశా - ఈశా
జయ జయ పశుపతి - పార్వతి రమణా॥
జయ శిలేశ్వర - జయ సిద్ధేశ్వర
జయ భిక్షేశ్వర - జయ ఓంకార
జయ గౌతమీ - గౌతమేశ్వరా
జయ గంగాధర - జయ మంగళకర॥ పు 64

ఇట్లా మురళీధర శర్మ గారి పాటలు స్థానిక దేవతల భక్తి స్తుతులతో సాగినవి



దర్శన మీయగరాదా - దయ రాదా నా పైన దేవా
భక్త కుచేలుని బ్రోచిన దేవా భద్ర కరిని బ్రతికించిన దేవా
ప్రహ్లాదుని గాపాడిన దేవా - ధృవుని మింట వెలిగించిన దేవా పు 114

ఇది చంద్రశేఖర శాస్త్రి గారి కవన శైలి

దేవతల నుతులతో పాటు గీతా ప్రశంస, సాయి భజనలు, అయ్యప్ప స్తుతికీర్తనలు ఇందులో ఉన్నాయి ఈ కవి సోదరులు భక్తిగేయాలేకాక దేశ భక్తిని ప్రబోధించే పాటలు సైతం రచించి ఇందులో చేర్చారు ఇవి విద్యార్థినీ, విద్యార్థులకు పాఠశాలల ఉత్సవాలలో పాడుకోవడానికి అనువైనవి

రేగళ్ల కవి సోదరుల కవితలపై రామదాసు భజనల త్యాగరాజు కృతుల బ్రహ్మంగారి తత్త్వ కీర్తనల ప్రభావం ఉంది కొన్ని పాటలు సినీగీతాల అనుసరించాయి స్వచ్ఛందంగాను సరస గేయరచన కావించారు ఈ కవులు తమ కవితలతో పాటు తమ బంధు మిత్రుల రచనలను కూడా కొన్నింటినీ సంపుటిలో చేర్చి సాహిత్యాభిమానులకు మేలు చేశారు

ఇందలి ఇతర గేయ కవుల వివరాలివి

గట్టు మదుసూదన్ గారి శక్తి సంస్తుతి 48వ కీర్తన 95వ పుటలో ఉంది

సువర్ణ పద్మనాభయ్య గారి షరిడీ సాయి బాబా భజనలు నం 57,58 59 ఈ పుస్తకంలోని 103, 105 పుటల్లో ఉన్నవి

గట్టు సీతమ్మ గారి పార్వతి నుతి హారతి నం 21, 98, పు 69,152 ఉన్నాయి ఈమె ప్రముఖ విద్యావేత్త ముద్దు రామకృష్ణయ్య గారి సోదరి రేగళ్ళ కవి సోదరులకు పెత్తల్లి కూతురు రేవెళ్ల సోదరుల సంగీత గురువు కొండ పలుకల శ్రీనివాసాచార్య గారి శ్రీరామ మంగళ హారతి నం 101 పుట 155లో ఉంది

సంగీత సాహిత్య ప్రియులు దైవ-దేశ భక్తి ప్రపూర్ణులు అయిన రేగళ్ల వారి కృతి కదంబాన్ని పలువురు కవి పండితులు తమ పీఠికలలో ప్రశంసించారు డా సుకశ్రీ గంగారాజేశ్వర కవి జానమద్ది హనుమచ్ఛాస్త్రి ఎం ఏ కడప మొ॥ వారితోపాటు గోదావరిఖని తెలుగు లెక్చరర్ ఏడమ్‌గారు ఇంకా చక్రవర్తుల లక్ష్మీనర్సమ్మ, ఎం ఏ భద్రాచలం గారు పద్యాలో ఈ గేయకవుల ప్రశంసించారు

## 33 కన్నోజు నర్సయ్య గారి పాపయాచారి, హుస్నాబాద్

పాపయ్య గారు విశ్వబ్రాహ్మణ వరకవి బ్రహ్మంగారి భక్తులు వీరు రచించిన 'శ్రీపోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వాముల వారి లీలా మహాత్మ్యము' 1959లో వెలువడింది ఈ సంపుటి పుటలు 80

ఇది చిరుతల భజన పాటలవంటి గేయ సంపుటి దర్వులు వచనాలు ఉన్నవి ఇందులో వరకవితగా పద్యాలున్నా అవి చాల తక్కువ పాటలే ఎక్కుగా ఉన్నాయి

ఉదా॥ శ్రీ గణాధిప శివ తనయ మమ్ము బ్రోవు మయ్య
పార్వతి సుపుత్ర ఇట్టి పదములందు తప్పులున్న
నొప్పుగ భావించి మమ్ము తప్పకుండ బ్రోవు మయ్య॥
కరములందు చిరుతలుండ కాళ్ల యందు గజ్జెలుండ
కంఠధ్వనుల వెంట మిము కలకాలము గొలిచెదాము॥

## 34 బోయిని లక్షన్, సిరిసిల్ల జననం 30 6 1930

అధ్యాపకులుగా పనిచేసిన వీరు కాలేజి విద్యను సంగ్రహించామన్నారు సంప్రదాయ సాహిత్యాభిమానం కల వీరు 'శ్రీమదాంధ్ర గేయ రామాయణము' బాలకాండమును రచించి ప్రచురించారు - 1990 సుమారుగా వీరి రామాయణ గేయాల బాణి ఇట్లున్నది

శ్రీ దశరథ నందన చరితము దె, ల్పెద దాక్షాయణి వినవే
మోదముతో ప్రఖ్యాతి వహించిన, ముర దను జాంతకుడతడే
కోసల దేశమునంద యోధ్యయను, గొప్ప పట్టణము గలదు
భాసమానమౌ యమరావతి వలె, ప్రకాశించుచు నుండున్ -

ఈకవి తెలుగు భాషావ్యాకరణాలు తెలిసినవారు ఇది లయ యతి ప్రాసలు పొంది పొసగిన కావ్యం వీరి అముద్రిత కృతులివి - అయోధ్యాకాండము ప్రబోధలహరి, శివధను ప్రాప్తి గేయమాలిక, శ్రీశాల శ్రీ వేంకటేశ్వర స్తవ నవరత్నమాలిక

### 35 పన్నాటి నారాయణ ఎస్సెస్సి ఆరవెల్లి- మం॥ పెగడపల్లి

నారాయణగారి "సత్యనారాణస్వామి" భక్తి గీతాలు 1996లో వెలువడింది వీరు శ్రీ వరకవి (పరాంకుశం మురళీధర స్వామి) గారికి కవితా శిష్యులు ఆరుట్ల రంగాచార్య, డి వి మురళీమోహనాచార్య గారల పీఠికతో వెలువడిన ఈ కవితా సంపుటిలో 26 పాటలున్నవి మరొకటి మంగళహారతి ఇంకొకటి గురునుతి ఇవన్నీ సినిమా పాటల బాణీలవి కవి జననం 1970లో వారు అనుసరించిన సినిమా పాటలు మాత్రం 1955-65 మధ్యకాలానివి

స్థానిక సత్యనారాయణ మందిర దైవ భక్తుల భజన కోసం ఇవి కూర్చబడ్డాయి ఇవి అన్నీ సత్యనారాయణ శ్రీరామ నామ వర్ణనలుగా ఉన్నాయి రచన సరళం - కవిత ప్రారంభ దశలోనిది

సినిమా పాటలకేమి కాని 'సాంఖ్యా మనస్క బోధామృతం'లోని 'బండి కట్ట వలెరా' పాట నడకగల ఈ గేయం చూడండి

శ్రీహరి యనవలెరా శ్రీపతి పూజకుజనవలెరా
శ్రీహరి యనుచును, శ్రీశుపదములకు దోసిలొగ్గినను దోషరహితమౌ

### 36 తాటికొండ రాజగౌడు - మంథని; వయస్సు - 50 సం సుమారు

రాజగౌడు గారు గంగారాజేశ్వర రావు గారికి శిష్యులు చదువు మితమే అయినా అపరిమితమైన దైవభక్తి కావ్యపరనం గౌడుగారిని కవిని చేశాయి గంగా వారి "వేణుగోపాల - ఆత్మబోధ" శతకాలకు ముందు 'పౌనూరు దేవాలయ' చరిత్రను గౌడుగారు వ్యాసంగా వ్రాశారు వీరు పద్య - గేయ కవి పై సంపుటిలోనే వీరివి రెండు పాటలున్నవి

వీరి గురు నుతి చూడండి - ఆదితాళం - కాంభోజిరాగం

వందనములు గురు రాజేశ్వర యా - వరదమూర్తులు మీరు గదా
పొందుగ మీ పాదములు నమ్మినా - సందేహంబులు దీర్చితిరి గదా
సంతసమున మీ చెంతకు జేరిన - సంసారపు చింతలు బోవు గదా
శాంత స్వరూపులు సద్గుణ ధాములు - సత్యసంధులు మీరు గదా

పోవు, పోవునుకు హ్రస్వరూపం కాని, వ్యతిరేకార్థకం కూడా పోవునుగా - అంటే ఏపేచీ లేదు అంత్యప్రాస విషయం వేరు దైవ భక్తి విధానం ఇది - ఏకతాళం - తోడిరాగం

నను బ్రోవ రావేలరా - వేణు గోపాలా ॥నను॥
నన్ను బ్రోవ రార నవనీత చోరా నిన్నె నమ్మినార నీల మేఘశ్యామ
మాధవ శౌరి మధుసూదన హరి - రాదా నీ దయ రాధా ప్రియవర ॥నను॥

రాజగౌడు గారి "భక్తి కీర్తనల సంపుటి" ఒకటి ముద్రణలో ఉంది "గౌడ రామాయణము" (పద్యకావ్యం) రచనలో ఉంది

## 37 ఎ పి రాజయ్య, జగిత్యాల

వేల్పుల పెద్ది రాజయ్య గారిది జగిత్యాల జననం 1940 సుమారు బాల్యం నుండి సాహిత్యాభిమాని సాంఘిక రచనలు చేసేవారు పోలీసుశాఖ ఉద్యోగంలో చేరి వీరు భక్తి భావాలకు లోనయ్యారు ప్రస్తుతం వీరు సి ఐ (సర్కిల్ ఇన్స్పెక్టర్) ఈ జిల్లాలో పొరుగుజిల్లాల్లో 130 శివరామకృష్ణ భజన మండలులు స్థాపించారు స్వయంగా భజన పాటలు రచించారు రాజయ్యగారి రచనల వివరాలు తెలుపలేదు కాని, వీరి "ద్వాదశ వినాయక భజన కీర్తనలు'2 1997 సెప్టెంబర్ 5వ, తేదీన జగిత్యాల్లో ఆవిష్కరించబడింది సేకరించి చేర్చిన ప్రార్థనా శ్లోకాల తర్వాత వీరివి గణపతి స్తుత్యాత్మకాలుగా పన్నెండు పాటలున్నాయి అవి పాత సినిమా పాటల బాణీలో ఉన్నాయి రచన సరళం

ఇంకా మేడిశెట్టి రామచంద్రం తాటిపల్లి, మం మల్యాల గారిది ఒక మంగళ హారతుల సంపుటి వెలువడింది ధర్మపురి శ్యామసుందర శాస్త్రి గారి సోదరి జయప్రద గారు కొన్ని భక్తి గేయాలు హారతులు రచించారు అవి అచ్చు కాలేదు మంచాల రాజేశం, కనగర్తి తా॥సిరిసిల్లగారు చాల పాటలు రచించి సభల్లో చదువుతున్నారు అవి సామాజిక విషయాలవైనా వేదాంత కీర్తనల బాణీలో ఉన్నాయి ఇట్లా పలువురు ఈ జిల్లా ప్రముఖ - అజ్ఞాత కవులు మధుర కవితలు రచిస్తూ ప్రచురిస్తూ ప్రజల సాంప్రదాయక అవసరాలు తీరుస్తూ ఆదరణ పొందుతున్నారు

## పాద పీఠికలు

1 వినుకొండవల్లభా మాత్యుని క్రీడాభిరామంలో వర్ణించబడినవి

2 శ్రీవాణి బుక్‌డిపో సిరిసిల్ల వారు 1989లో ప్రచురించిన 6వ ముద్రణ నుండి

3 చివరి మూడు పుస్తకాలు 1985 పూర్వం ముద్రింపబడినవని గూడూరి బాలరాజు కవి గారు "భీవండి కష్ట జీవుల చరిత్ర" పుస్తకము వెనుక పుట వివరాలను బట్టి చెప్పవచ్చు కవి వద్ద పై పుస్తకాల ప్రతులు ఇప్పుడు లేవు

4 నెమిలికొండలో నందయ్యగారు పైపుస్తక ప్రతి చూపడంతోపాటు చలిజ్వరంపాట పాడి వినిపించారు 1981లో

5 ఈ కవి గారి పుత్రులు కవి అయిన కాకర్ల కృష్ణమూర్తి గారి పీఠిక

# 3. గేయ సాహిత్యం

పద్యమంటే తలనొప్పి పాటంటే ఇష్టం బాల బాలికలకు స్త్రీలకు జానపదులకు నాగరికులకూ అంతే పద్యం కొందరిది పాట అందరిది!

మానవునికి మాట రావటంలోనే పాట పుట్టింది నిజానికి పాటతోనే మాట పుట్టిందేమో! పదం అనే శబ్దానికి పాట మాట అనే రెండు అర్థాలుండటం గమనార్హం పాట మాట సంబంధం అంత బలీయమైనది మాట ఎంత ప్రాచీనమైనదో పాటా అంతే, వేల సంవత్సరాల క్రితం పుట్టింది [1]

విద్యా వ్యాప్తి లిపి వ్రాత వచ్చిన తర్వాత , రాజుల నాగరిక కాలంలో పద్యం పుట్టింది విద్యాబోధన లేని ఆదిమ ఆటవిక సంచార గ్రామీణ కాలాల్లోనే మాటలతో పాటు పాటలూ పుట్టినవి కానయితే అవి జానపద సాహిత్యంగా మౌఖిక ప్రచారంలోనే ఉండిపోయినవి

నన్నయ భారతాంధ్రీకరణంతో తెలుగులో పద్యకావ్య యుగం ఆరంభమైనట్లు గేయ ప్రబంధాలు అంతముందుగా అవతరించలేదు [2] దేశి సాహిత్యంపై ఆ కాలంలోని పండితులకు చిన్నచూపు ఉండటమే అందుకు కారణం పాలకురికి సోమనాధుని[3] కాలంలో గేయ కవితలు ప్రజాదరణలో ఉన్నట్టు ఆయన రచనల ద్వారా తెలుస్తున్నది [4] అంతకు ముందు నన్నె చోడ కవి జాజరపాటలు పేర్కొన్నాడు

కృష్ణమాచార్యుల 'సింహగిరి వచనాలు' గేయాలుగా గానం చేయబడేవట అవే తెలుగు తొలిగేయ ప్రబంధాలు అనవచ్చు నిజానికి తెలుగులో మొదటి వాగ్గేయకారుడు తాళ్లపాక అన్నమాచార్యులు ఆ తర్వాత తాళ్లపాక పెద్ద తిరుమలాచార్యుని 'శ్రీ వేంకటేశ్వర వచనాలు' భద్రాచల రామదాసు భజన కీర్తనలు, క్షేత్రయ్య శృంగార పదాలు, త్యాగయ్య భక్తి కృతులు వచ్చినవి వారు వాగ్గేయకారులు మరో వైపు 16,17 శతాబ్దుల నుండి యక్షగాన వీధి నాటకాలు పాటలను ప్రచారంలోకి తెచ్చాయి ఇదంతా మధుర కవితా ప్రసక్తి అనుకోవచ్చు

ఆధునిక గేయ కవితలు మాత్రం ఈ ఇరువదవ శతాబ్ది ఆరంభంలోనే పుట్టి క్రమంగా శిష్టజనాదరణ సైతం పొంది వ్యాప్తిలోనికి వచ్చాయి ఆధునిక కవితలకు ఆద్యులైన గురజాడ అప్పారావు గారి ముత్యాల సరాలు' గేయ సంపుటి 1910లో వెలువడింది విప్లవ కవి శ్రీ శ్రీ గారి మహా ప్రస్థానం' 1950లో వచ్చింది దానిలో 1933 నుండి 49 వరకు వ్రాసిన కవితలు ఉన్నాయి విశ్వనాథ కిన్నెరసాని పాటలు, నండూరి సుబ్బారావు 'ఎంకి పాటలు' ఈ కాలానివే కరీంనగర్ జిల్లా ఆధునిక గేయ సాహిత్యంపై గురజాడ నండూరి, శ్రీ శ్రీ ప్రభావం ఉంది

జానపద గేయాలే ఆధునిక గేయ సాహిత్యానికి మూలం అని ఒప్పుకోక తప్పదు కరీంనగర్ జిల్లాలో జానపదగేయ సాహిత్యం పుష్కలంగా ఉంది ఇక్కడి శ్రామిక గీతాలు, ఉయ్యాల పాటలు బాల గీతాలు, భిక్షుక గేయాలు సేకరిస్తే బండ్లకెత్తవచ్చు పుణ్య క్షేత్ర గేయాల్లో, వేములవాడ, ధర్మపురి, ఇల్లంతకుంట యాత్రిక గీతాలు ప్రధానంగా కన్పిస్తున్నవి ఈ పల్లె పాటల కాలాన్ని నిర్ణయించలేం చారిత్రక గేయాల్లో కాకతి రెండవ ప్రోలరాజు కల్యాణి కర్ణాటక చాళుక్య చక్రవర్తికి సామంతుడుగా మంథని గుండరాజుపై దండెత్తి ఓడించి తలఖండించిన వీరగీతం సుమారు క్రీ శ 1140 కాలానిది ఇప్పటికీ జన వ్యాప్తిల్లో ఉంది [5] గోల్కొండ నవాబుల కాలపు బల్గూరి కొండలరావు వీరగాథ ఇప్పటికీ భిక్షుకులు పాడుతున్న జానపద కథా గేయం

మధుర కవితలైన హారతులు, భజన గీతాలు ఆధునిక విప్లవ గీతాలు ఎన్నికల పాటలు అనేకం జానపద మౌఖిక సాహిత్యం వివరణ తర్వాతి అధ్యాయంలో ఉంది ఆధునిక లిఖిత గేయ సాహిత్య వివరాలను మాత్రం ఈ విభాగంలో పొందుపరచడం జరిగింది

ఇక్కడి ఆధునిక గేయకవుల్లో మొదట పేర్కొనవలసిన వ్యక్తి పండిత రామసింహకవి వీరి 'కలియుగ వర్ణాశ్రమ ధర్మములు' దుష్ట ప్రపంచ వర్ణనము బలమైన సాంఘిక విమర్శా గేయాలు 1920 సుమారుగా విరచితమైన ఈ దీర్ఘగేయాలు వేనికి అనుసరణలు కావు యక్షగానం పాటల ఊపులో ఉర్దూ పాటల బాణీలో వచ్చినట్లున్నవి తెలియవచ్చినంతలో మొదటి ఆధునిక గేయం డా పి లింబాద్రి రెడ్డి గారి 'కోకిలాలాపం' 1934 గోలకొండ కవుల సంచికలోనిది వానమామలై జగన్నాథాచార్యుల సోషలిస్టు గేయాలు 1950 సుమారుగా వచ్చాయి

తెలంగాణా రైతాంగ పోరాటం 1948లో కలంపట్టి నేటి వరకు ఉద్యమగేయాలు వ్రాసిన ప్రజాకవి జి మల్లేశం గారు అంతకంపేట వ్యాస్తవ్యులు 1950 తర్వాత 1953-54లో ఈ జిల్లా నుండి వెలువడిన చైతన్యం, జ్యోత్స్న, సారస్వత జ్యోతి, సాహిత్య పత్రికల్లో గేయ కవితలు కన్పిస్తున్నాయి అవి తర్వాత చూపబడుతాయి ఈ గేయ సాహిత్యాన్ని ప్రక్రియా భేదాన్ని బట్టి మాత్రాఛందం, లలిత గేయం, వచనకవిత, మినీ కవితగా విభజించవచ్చు ప్రచురణ పొందిన సాహిత్య, పుస్తకాల బట్టి 1 గేయ కథా కావ్యాలు 2 గేయ సంపుటాలు - ఖండకావ్యాలు, 3 సంకలనాలు సంచికలు, అని మూడు విభాగాలు, లలిత గీతాలు, వచన మినీ కవితలు ప్రత్యేకంగా చూపబడుతున్నవి పుస్తక ప్రచురణ కాలాన్ని బట్టి కవుల వరుస కూర్చబడింది

## గేయ కథా కావ్యాలు

మాత్రా ఛందస్సులో వచన కవితా ప్రక్రియలోనూ కథా కావ్యాలు వ్రాయడం ఈ యుగ ప్రత్యేకత జానపద కథా గేయాలు - బుడిగె జంగాల బుఱ్ఱకథలు, నిత్య దాసర్ల చిటివీణ పాటలు, స్త్రీల ఉయ్యాల పాటలు, పంబలీల దేవీ దేవతా కొలువులు, మందెచ్చుల వారి బొమ్మల కొలువు కథా గేయాలు మొ॥ ఈ జిల్లాలో ఉన్నాయి యక్షగానాల పాటలూ వ్యాప్తిలో ఉన్నాయి అయినా శిష్ట సాహిత్యంగా గేయకథా పుస్తకాలు మాత్రం ఈ శతాబ్దివే అదీ 1950 తర్వాతనే వచ్చాయి ఈ జిల్లాలోని నవ్య గేయకథా కావ్య నిర్మాతలు వీరు

1 డా సి నారాయణ రెడ్డి 2 డా మలయశ్రీ, 3 మరింగంటి అనంతాచార్య 4 డా డింగరి నరహరి ఆచార్య 5 కనపర్తి 6 వడ్డేపల్లికృష్ణ, 7 డా రావికంటి వసునందన్, 8 తులసి జగన్మోహన్ 9 ఎస్ కె పిళ్ళె 10 కల్వకుంట రఘునాధాచార్యులు, 11 యెన్నం సత్యం 12 అల్లె శంకర్ 13 వి వెంకటేశ్వర్లు, 14 ఎక్కలదేవి లక్ష్మణ కవి, 15 కె ఆత్మారాం

ఇక వీరి కావ్యాల వివరాలు చూడండి

### I డా॥సి నారాయణ రెడ్డి, ఎం ఏ పిహెచ్ డి హన్మాజిపేజ - జ 1929

సింగిరెడ్డి నారాయణ రెడ్డి గారిది కరీంనగర్ జిల్లా సిరిసిల్లా తాలూకాలోని హన్మాజిపేట ఈ గేయకవి సమ్రాట్ సాహిత్యం ఊపిరిగా కవిత్వం జీవనంగా కల విశిష్ట వ్యక్తి వీరి మాటలే పాటలుగా ఉంటాయి పాటలు ప్రబంధ వర్ణనలతో వినూత్న పదభావ ప్రయోగ విన్యాసాలతో శ్రోతల అలరిస్తాయి

విద్యార్థి దశలో ఉర్దూ మాధ్యమముగా చదువుకుంటూనే తెలుగులో కవిత్వ రచన ప్రారంభించారు

వీరు ఈ జిల్లాలో తెలుగు ఎం ఏ చదివిన మొదటి వ్యక్తి పిహెచ్ డి పరిశోధనలోనూ వీరే మొదటి వారు (ఎం ఏ 1953 పిహెచ్ డి1962) ఎం ఏ చదువుతూనే కవి సమ్మేళనాల్లో పాల్గొని జనాదరం పొందారు కావ్యాలు వెలయించారు 1953 నుండి ప్రతియేటా ఓ పుస్తకాన్ని తప్పక ప్రచురిస్తున్నారు

పద్యం చక్కగా వ్రాయగలిగి, గేయాన్ని అభిమానించి, గేయ కావ్యాల రచించారు మాత్రాఛందో గేయాలు వచన కవితలు వీరి ఆరాధనతో అందలాలెక్కాయి మాకందాలు, ప్రపంచవదులు, గజల్లు మొదలయిన వినూత్న గేయాలు రచించడంతోపాటు మినీ కవితలను సౌధామినీలుగా సృష్టిచేశారు మూడు దశాబ్దులలో మూడు వేలను దాటిన వీరి సినీ గేయాలు[6] వీరి కవనశక్తికి నిదర్శనం నలుబదేండ్ల సాహిత్య జీవితంలో మేబదికి మించి వీరి పుస్తకాలు వచ్చాయి వానిలో అనేకం పునర్ముద్రితాలైనవి [7] కొన్ని మూడవ ముద్రణ పొందాయి (హైద్రాబాద్ అనుపమా ప్రింటర్స్ వద్ద చూశాను 1996) గేయకావ్యాలు, సంపుటాలు, అనువాదాలు వ్యాసాలు, గేయ నాటికలు మొ॥ పలు ప్రక్రియల్లో వీరి రచనలు తెలుగు సాహితీరంగాన్ని సుసంపన్నం చేశాయి [8]

రాష్ట్రకేంద్ర సాహిత్య అకాడెమీ బహుమతులనే కాక అనేక జాతీయ అంతర్జాతీయ బహుమతులతో పాటు నారాయణరెడ్డి గారు భారత ప్రభుత్వం వారిచే ప్రతిష్ఠాత్మకమైన పద్మభూషణ్ బిరుదు పొందారు ఈ దేశ సాహిత్య చరిత్రలోనే ఉన్నతమైన జ్ఞానపీఠ బహుమతిని 1989లో అందుకున్నారు

ఉస్మానియా విశ్వవిద్యాలయ విద్యార్థి, అదే యునివర్సిటీలో అధ్యాపకులుగా రీడర్గా ప్రొఫెసర్గా పనిచేశారు అధికార భాషా సంఘాధ్యక్షులుగా, భాగ్యనగర సార్వత్రిక విశ్వవిద్యాలయ, తెలుగు విశ్వవిద్యాలయ కులపతిగా ఉన్నత పదవుల నిర్వహించిన వీరు ప్రస్తుతం (1993) ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ భాషా సాంస్కృతిక సలహాదారుగా గౌరవనీయమైన హోదాలో ఉన్నారు 1997 ఆగస్టులో రాజ్యసభ మెంబర్ అయినారు

సాహిత్య సభలకు వీరు ఒక అలంకారం రెడ్డి గారు చక్కగా కవితలు వ్రాయడమే కాక వాటిని కమ్మగా వినిపిస్తారు వేల జనాన్ని ఆకట్టుకునే మంచి వక్త వీరి వ్యాఖ్యానం రమ్యాతి రమ్యం రెడ్డి గారి కవిత పత్రికలకు అలంకారం ఆకాశవాణి వీరి లలిత గీతాలను వందలు ప్రసారం చేసింది సినీగీతాలు సరేసరి వీరి పీఠికలు కావ్యాలకు అర్హతాపత్రాలు వేల పుస్తకాలకు పీఠికలు వ్రాసి ఉంటారు దాదాపు ఓ వంద పుస్తకాలను అంకితం పుచ్చుకున్నారు [9] కవిత్వాన్ని ప్రేమించి సృజించి, కవిగా విశ్వయాత్ర కావించి ఇంతగా జనాదరణం పొందిన కవులు ఈ జిల్లాలో - రాష్ట్రంలోనే కాదు, మన దేశంలోనే అరుదు వీరి కవితలు అనేకం ఇతర భాషల్లోనికి అనువదింపబడినవి డా॥సి నా రె అంతర్జాతీయ కవి వీరి కవిత్వంపై పలు పిహెచ్ డి పరిశోధన గ్రంథాలు వెలువడ్డాయి-వెలువడుతున్నాయి డాక్టర్ సి నారాయణ రెడ్డి గారి గేయ కావ్యాలు ఇక్కడ పరిచయం చేయబడుతున్నవి అవి ఇవి

1 విశ్వ గీతి 1954 ముద్రణ, 2 నాగార్జున సాగరం 1955, 3 స్వప్న భంగం - 1957, 4 కర్పూర వసంతరాయలు 1957, 5 విశ్వనాథ నాయకుడు 1959, 6 ఋతు చక్రం - 1964, 7 జాతి రత్నం 1967, 8 భూమిక 1977, 9 విశ్వంభర - 1980, 10 మట్టీ, మనిషి, ఆకాశం - 97

ఉన్నత పాఠశాల విద్యార్థి దశ 1948 నుండే కవితలు రచించిన నారాయణరెడ్డి గారి గేయాలు ‘పూలపాటలు’ అనే గేయ సంకలనంలో 1952లో మొట్ట మొదట వెలుగు చూశాయి [5] 1953లో జలపాతం - ఖండకావ్యం ‘నవ్వని పువ్వు’ గేయనాటికా సంపుటి వచ్చాయి 1954 విశ్వగీతి నుండి

గేయ కావ్యాల - గేయ సంపుటాల ప్రచురణ ఆరంభమైంది విశ్వగీతి భూమిక కావ్యాలను సుదీర్ఘగీతి కావ్యాలు అనే ప్రత్యేక విభాగంలో చూపారు డా తిరుమల శ్రీనివాసాచార్య 6 కథలేకున్నా ఏక వస్తుకములు కాబట్టి ఖండకావ్యంవలె వివిధ రకాల గేయాల సంపుటులు కావు కాబట్టి వాటిని ఈ కావ్య విభాగంలోనే చేర్చడం జరిగింది నారాయణ రెడ్డి గారి (గేయ సంపుటాలు వచనకవితలతోనూ) గేయ కావ్యాలుమాత్రాఛందస్సులో ఉండడం ఓ ప్రత్యేకత విశ్వంభర దీనికి అపవాదం అది వచన కవితా మహాకావ్యం

1 విశ్వగీతి ఇది మాత్రా ఛందస్సులో సాగిన 125 చరణాల ఆధునిక భావగేయ కావ్యం త్రిస్ర చతురస్ర, ఖండ గతుల్లో పద్యాలుగా చదువుకోవచ్చు పాటలుగా పాడుకోవచ్చు

ప్రతిభావ్యుత్పత్తులు పుష్కలంగా కలిగిన ఛందోరీతులు క్షుణ్ణంగా తెలిసిన ఈ కవి పదప్రయోగ నైపుణి శైలీరామణీయత భావోద్వేగం ఈ కావ్యంలో చక్కగా సమ్మేళనం పొందాయి లలిత ప్రకృతి వర్ణనల ప్రణయగీతాల నాలపించే రెడ్డి గారు ఈ కావ్యంలో స్పష్టంగా సామ్యవాదాన్ని అభిమానించారు - స్వాగతం పలికారు

డా॥ తిరుమలశ్రీ గారి మాటల్లో "సంఘ సంస్కరణాభిలాషయే, సమ సమాజ నిర్మాణాశయమే నారాయణరెడ్డిని ఈ కావ్య రచనకు పురికొల్పినది ఈ రచనకు ప్రాణమూ పరమార్థమూ అవి ఈ కావ్యం అభ్యుదయ దృక్పథంతో సాగింది" నా రె - సా మూర్తి పు - 154

మార్గ సాహిత్యాన్ని స్పర్శించి, మన ఘనుల దుర్మార్గాలను ఖండించి, సామాన్యజన అభ్యుదయాన్ని ఆకాంక్షించి వీరి కలం ఈ కావ్యమైదానంలో జననాశ్వంలా పరుగుతీసింది అంతర్జాతీయ కల్లోలాల సైతం పరామర్శించి, ధరాపతుల ధనాన్వితుల దారుణ హింసల నవతాయువతా ద్వేషాల ఖండించి కళాప్రియులూ కార్మికులూ కర్షకులూ మానవతావాదులూ ఆనందించగల నవ సమ సమాజాన్ని ఆహ్వానించారు కవి చివరగా -

ఆయుధాలు అణుగోళా, లంతిమ వాయువు పీల్చెను
మానవత్వము జయించెను, శాంతి తంత్రి నినదించెను
శ్రమకూ కళకూ ఫలితం, సమరీతిగ లభియించెను

అది 1954 నాటి కవి వాణి ఈ 1994 నాటి కల్లోల సమాజబాణి మనం చూస్తున్నదే

2 నాగార్జున సాగరం - ఇది చారిత్రక గేయ కావ్యం ఇక్ష్వాకుల కాలంలో విజయపురి నాగార్జున కొండ బౌద్ధారామంలో జరిగిన ఒకానొక ప్రేమ సంఘటనగా వర్ణించినా ఇందలి కథ పాత్రలు కల్పితం

ఈ కావ్య కథానాయకుడు పద్మదేవుడు శిల్పిచిత్రలేఖకుడు మురళీ వాద్య నిపుణుడు నాయిక శాంతిశ్రీ ఆశ్రమ విశ్వవిద్యాలయ విద్యార్థిని - గాయని వారి ప్రణయం కథా వస్తువు కాని, వీరిని బౌద్ధ గురువు అడ్డుకోవడం, నియమబద్ధురాలైన నాయిక సన్యాస దీక్ష గ్రహించడం ఈ కథలోని మలుపులు నాయకుడు గురుదేవుని నిందించడం, వారి చర్చ ఇందలి ప్రధాన ఘట్టం

మత పాకములు దప్ప - ఇతరాంశములు మీకు
ఆస్వాదనీయమ్ములైనట్టు కన్పడవు పద్మదేవుడు
ఎల్ల జీవకోటులపై - చల్లుము ప్రేమామృతము
ప్రత్యేక ప్రాణిపైన - పనికిరాదు మమత్వమ్ము - బౌద్ధ గురువు

ఈ అయిదు ఆశ్వాసాల గేయకావ్యంలో రెడ్డి గారు శృంగార కరుణ రసాల కమనీయంగా

రసార్ద్రంగా ప్రవహింపజేశారు దీనికి ముందు తల్లావజ్ఝల విశ్వనాథ పుట్టపర్తి వంటి వారి గేయ కావ్యాలున్నా ఇది వినూత్న చారిత్రక సంపూర్ణ గేయ కథా కావ్యం

రాళ్లపల్లి అనంత కృష్ణ శర్మ వంటి సాహితీ విమర్శకుని పుట్టపర్తి నారాయణాచార్యుల వంటి కవితల్లజుని ప్రశంసలు ఈ కావ్యం గొప్పతనానికి నిదర్శనం (నా సా రెం ము 1961 పీఠికలు) ఈ కథ విషాదాంతం నాయకుడు విశ్వవిద్యాలయాన్ని విడిచి కృష్ణాజలాల నాగార్జునసాగరం మీదుగా నడిచిపోతుంటే నాయిక ఖిన్నురాలై చూస్తుంటుంది మతం కంటే మానవత్వం సన్యాసం కంటే సహజ సంసార జీవితం ప్రధానమని కవి ఆశయం ఈ కావ్యంలో కనిపిస్తుంది

3 స్వప్నభంగం - పది మాత్రల ఏకచ్ఛందంలో నడిచిన 47 పుటల ఈ గేయ కావ్యం శృంగార రసప్రాధాన్యతతో పాటు, చక్కని హితోపదేశం కలిగి రసజ్ఞుల మనస్సులనలరిస్తుంది ఇందులో కవి కల కన్నాడు కలలో ఇంద్రలోకం చేరుకున్నాడు ఈ దేవ లోకంలో అచ్చర లేమల విచ్చలవిడి కామకేళికి వెరగుపడి వెగటుపొంది, తన భూలోక గ్రామీణ జీవితం సతీపతుల దాంపత్య బంధం మేలనుకుంటూ మేల్కొన్నాడు ఈ కథ చిన్నది అయినా వర్ణనలకు వీలున్న సన్నివేశాలు కలది కవి సదాశయంతో అది భలే అనిపించుకొన్నది ' ఈ కావ్యంలో శృంగారం ఎక్కువైందని ఆ కాలంలో విమర్శ వచ్చింది" అన్నారు డా ఎన్ గోపి [7] ఆ మాట అసత్యం కాదు

నేను గడచిన గడియ లోన మెయినిండ చు
ట్టిన వల్వలెగిసి పో, యెను మందు తెరలట్లు - పు 3
ఒక నాట్యకత్తె రొ మ్ముల కుదింపు వంటి లహ
రిక వీవ చూపులరరే తునా తునకలయె - పు 10

ఇంకా రంభోర్వసుల విజృంభణములు (పు 13 21) అతివేల శృంగార వర్ణనమే అది కవి గారి నిండు యౌవన త్రిదశావస్థ! అందుకే ఈ ప్రణయ కావ్య పరికల్పన పుట 21 నుండి - ఇంద్రసభ, అచ్చరల నృత్యం - పోటీ వర్ణనలు కవి కవన శక్తికి గీటురాళ్ళు 26వ పుట శృంగారం 30 అమరావతి, 33 - నందనోద్యాన వర్ణనలు రసికులకు విందుభోజనాలు

స్వర్గ స్వాప్నిక భ్రమల నిరసించి సత్యానికి సౌశీల్యానికి సంసార జీవితానికి విలువిచ్చిన నీతి ప్రబోధకావ్యం సి నా రె గారి స్వప్నభంగం

4 కర్పూర వసంతరాయలు కొండవీటి రెడ్డి రాజేంద్రునిపై ఈ రెడ్డి కవీంద్రుడు వ్రాసిన చారిత్రక గేయ కావ్యం - 'కర్పూర వసంతరాయలు' వసంతోత్సవాల ప్రియుడైన కొమరగిరి రెడ్డికి కర్పూర వసంతరాయలు' అనేది బిరుదనామం ఆయన శ్రీనాథ మహాకవికి ఆశ్రయమిచ్చినవాడు స్వయంగా సంస్కృతంలో నాట్యశాస్త్ర వ్యాఖ్యాన గ్రంథం 'వసంతరాజీయం' పేర రచించిన కళా సాహిత్యవైదుష్య సంపన్నుడు

లకుమ అనే నర్తకి ప్రేమలో మునిగి, రాజు దేశ పాలనను ఉపేక్షిస్తాడు ఆ చక్రవర్తికి మంత్రి బావ మరది అయిన కాటయవేముని హిత వాక్యాలు అతని చెవికెక్కవు రాణి, లకుమతో సంభాషిస్తుంది రాజ్యక్షేమాన్ని కాంక్షించి లకుమ ఆత్మత్యాగం చేస్తుంది ఇది స్థూలంగా ఈ కావ్య కథ శృంగార కరుణ రసాలు ఈ కావ్యంలో అద్భుతంగా పోషించబడినవి ఇందులో కొమరగిరి రెడ్డి, రాణి, నర్తకి లకుమ, మంత్రి కాటయ పాత్రల పోషణ అతి రమణీయాలు స్మరణీయాలు లకుమ నృత్యంలో అష్టవిధ శృంగార నాయికల రమ్యంగా చిత్రించారు అదే వీరి తర్వాతి 'క్షేత్రయ్య సినిమా పాటకు ఉపకరించిందనవచ్చు

'జయ జయ సమగ్రాంధ్ర సర్వం సహాభార సంభరణ శేషాహిరూపా అని వంది మాగధుల స్తుతిపాఠాలతో ఆరంభమైన ఈ కావ్య గేయాలు వివిధ గతులతో గమకాలతో మృదు మధుర పద బంధాలతో గంభీర గంగా ప్రవాహంగా సాగాయి

మల్లంపల్లి సోమశేఖర శర్మ గారి ఆంగ్ల పుస్తకం రెడ్డి రాజుల చరిత్ర లోని అంశం వీరి ఈ కావ్య కథకు బీజం నారాయణరెడ్డి గారు కవితలు కావ్యాలు ఎన్ని వ్రాసినా కర్పూర వసంతరాయలు వీరికి కవిగా ఎనలేని కీర్తి తెచ్చిపెట్టింది ఇది ముచ్చటగా మూడు ముద్రణలు పొందినది

5 విశ్వనాదనాయుకుడు 'కథాత్మకంగా నేను రాసిన కావ్యాల్లో ఇది మూడవది కాగా శృంగార స్పర్శ లేకుండా వ్రాసిన వాటిలో మొట్టమొదటిది అన్నారు కవి పీఠికలో ఈ కావ్యం తంజావూరు ఆంధ్రరాజుల చరిత్ర అనే పేరుతో ఒకానొక పూర్వకవి వ్యావహారిక భాషలో వ్రాసిన పుస్తకాన్ని కీ శే వేటూరి ప్రభాకర శాస్త్రి గారు పరిష్కరించి ప్రకటించగా దాని నుండి రెడ్డి గారు తమ కావ్య వస్తువును తీసుకున్నామన్నారు శ్రీ కురుగంటి సీతారామయ్య గారి తంజాపుర నాయక రాజుల చరిత్రలో కూడా ఈ కథా ప్రసక్తి ఉందట దీన్ని బట్టి చూస్తే సంపత్ రాఘవాచార్య గారి విశ్వనాధనాయకుడు పద్య కావ్యంకంటే నారాయణరెడ్డి గారి గేయకావ్యం మొదటిది కాని ఎందుకో రెడ్డిగారి కావ్యానికి అంత వ్యాప్తి రాలేదు ఇది సినీ నటులు గుమ్మడి గారికి అంకితం కావించబడింది

శ్రీ కృష్ణదేవరాయల కాలపు ఈ కథ ఈనాడు జనవ్యాప్తి పొందినదే ఆరు ఖండాలలో త్రిస్ర మిస్ర గతులతో సాగిన రెడ్డి గారి ఈ గేయ కావ్యంలో కృష్ణదేవరాయల నాగమనాయక విశ్వనాధ నాయక పాత్రలు చక్కగా మలుచబడినవి రాజద్రోహి అయిన తండ్రి నెదిరించిన విశ్వనాధ నాయకుని రాజభక్తి దేశభక్తి అతని ధీరోదాత్తుని చేసినవి తండ్రి కొడుకుల యుద్ధం మధ్య విశ్వనాధ నాయకుని తల్లి మల్లమ పాత్ర మరపురానిది యుద్ధం లేకనే కథ ముగియడం విశేషం ఇందులోని వర్ణనలు ప్రబంధాల తలపించేవిగా ఉన్నాయి

"నాగమా! నీ వెంతలో ఎంతటి కటు స్థితి తెచ్చుకొంటివి?
గత చరిత్ర సుధా పథమ్మున గరళమును పొంగించుకొంటివి పు 76
నీ కుమారుని కీర్తి జాబిలి రేకలై తెలిపాలనుర్వుల
వాకలై నీ నొసల నిల్చిన వండు మచ్చను కడిగి వేసెను" పు 77

ఇటువంటి చక్కని భాష చక్కని భావాలు కల కావ్యం విశ్వనాధనాయకుడు

6 ఋతు చక్రం - వాల్మీకి వ్యాస కాళిదాసుల నుండి మన భారత సాహిత్యంలో ఋతువుల శోభను వర్ణించడముంది తెలుగులో నన్నయ్య నన్నెచోడ మహాకవులు సైతం ఋతు వర్ణనలు కావించినవారే నారాయణరెడ్డిగారు జన్మస్థలాభిమానంతో గ్రామీణ నేపధ్యంలో, ఆత్మనాయక ప్రకృతి వర్ణనాత్మక కావ్యంగా ఈ ఋతు చక్రాన్ని సహజ సుందరంగా రసప్లుతంగా రచించారు దీనిని రాజకీయ సాహిత్య మేధావి అయిన డా బెజవాడ గోపాలరెడ్డి గారికి సమర్పించారు (బె గో రె గారు కీర్తి శేషులైన దినం దీన్ని ముద్రణకు సరి చూడటం ఓ అవిస్మృత జ్ఞాపకం 9 3 97) 'యువ'లో మొదట ప్రచురితమైన ఈ కావ్యం డా బి రామరాజు గారి ముందుమాటతో వట్టికోట ఆళ్వారు స్వామి దేశోద్ధారక గ్రంథమాల పుస్తకంగా వెలువడింది వసంత ఋతువుతో కావ్యారంభం-

చిగురు చిగురున రాగ శీకరములొలికింది / ఆకునాకున మరకతాకృతులు పలికింది

పూవు పూవున మధువు పులకింత నొనరించి / వచ్చె కుసుమాస్త్ర భాస్వంతము వసంతమ్ము
గ్రీష్మం యుక్షగానములోని రాక్షసునట్లు హుమ్మని వచ్చె గ్రీష్మము
కోటి దివిటీల్ భగ్గుమన జనకోటి గుండెలు దిగ్గురనగా
వర్షర్తువు అవి గవిగో మబ్బులు, ఆత్మోర స్థిత భాస్వత్
చంచలా ప్రియములు, రమేశ్వర గాత్ర సవర్ణములు
పెళపెళ ఉరుములతో జల్లు / వాకిలి నిండా రేగు పండ్ల వంటి వడగండ్లు

పాయి రాజుటకే యెంతో పురాణం రాయల ఆముక్త మాల్యద వంటి వర్ణన గ్రానమ్మేలేని పేద ఆసాముల గతి యేమి? ఇది కవి నవీన భావం ఇందలి ఆరు ఖండాలలో పల్లెటూళ్ల ప్రకృతి వర్ణనలనే కాక తెలుగు వారి పైరుపంటల మాండలిక మృదు మధుర పదాలతో రాశి పోశారు

7 జాతి రత్నం - ఇది నెహ్రూ జీవిత చరిత్ర అంతేకాదు భారత స్వాతంత్ర్య సంగ్రామ సంగ్రహ చరిత్ర ప్రముఖ పోరాట సంఘటనలకు జాతినేత బహుముఖ ప్రతిభకు ఇది కవితా రూపం దీనికి 'బాపు చిత్రాలు మరింత శోభ చేకూర్చాయి పాకాల రాజమన్నారు కావ్యనాయకుని, కవి గారి విశిష్టతలను ప్రత్యేకంగా ప్రశంసించారు మున్నుడిలో జవాహర్ 'జాతి రత్నం'! అది విశ్వకవి రవీంద్రుని వాణి నెహ్రూజీ సమాధిపై అర్పించిన ఓ గులాబీతో కథ చెప్పించారు కవి దాని రేకుల్లో కథా సంఘటనలను దర్శించారు

అదిగదిగో శాంతి వనము అదిగో సమతా సదనము
ఒదిగి యున్నదా వనమున ఒక శతాబ్ది జీవధనము
ఉభయ ధ్రువములు కలిపిన అభినవ కణ్వాశ్రమమది
భువన చరిత్రకు ఊపిరి పోసిన విద్యాలయమది -

పరుసవేది సోకితే ఇనుము బంగారమౌతుందో కాదో కాని ప్రతిభావంతుడైన కవి చేతిలో పడితే చరిత్ర - జీవిత చరిత్ర అది ఏదైనా కవిత్వమౌతుంది ఆద్యంత్యప్రాసలు, యతులు, ప్రసన్నశైలి గంభీర భావాలు సముచితోపమానాలు నారాయణరెడ్డి గారి కవన ప్రత్యేకతలు ఇందులో మాత్రా ఛందంతోపాటు వచన కవితలు కూడా ఉన్నాయి ఇందలి సైమన్ కమిషన్ వర్ణన మరుపురాని వీర రసఘట్టం

8 భూమిక - ఇది వచన కవన కావ్యం అధ్యాయాలు పద్దెనిమిది పుటలు - 82 ఇది మానవుని నాయకునిగా చేసి మానవత్వానికి పట్టంకట్టిన మన ప్రపంచ మానవ జీవన మనోహర భాష్యం సాంఘిక చారిత్రక క్రమ పురోగమన చిత్రం



సృష్టికి ఆవేశం ఒక భూమిక దృష్టికి ఆలోచన ఒక భూమిక
రీతికి సాగిన అడుగే భూమిక - గీతికి మ్రోగిన తలపే భూమిక
అది ఆరంభం ముగింపు ఇది
ఆ మనిషే పల్లవి ఈ గీతికి - ఆరిపోని పరిణామ జ్యోతికి
ఆ చైతన్యమె ఆకృతి ఈకృతికి అది భూమిక సకల జీవ సంస్కృతికి

ఆది ఉందా ఈ జగత్తుకు? అనే ప్రశ్నతో కావ్యారంభం కావించిన రెడ్డిగారు ఎన్నో విషయాలు చర్చించారు ఆది అనాది, అది అపౌరుషేయం, అజ్ఞేయం, అనుభవనీయం అంటూ, వేదాల్ని జ్ఞాన పథాలంటూనే జానపదం అని ఒప్పుకోవడం విశేషం! అది కవి ధిషణకు నిదర్శనం

ద్వితీయ ఖండికలో వాల్మీకి రామాయణం 'మానినీ మాన హింసాభిశంసన' మన్నారు

భీరువుల రణ వీరచణులుగ చేయడానికి పుట్టిన భగవద్గీత వాసుదేవుని వచనమా? వ్యాసుని రచనమా? అని కవి సహేతుక సంశయానికి లోనయ్యారు

నాలుగవ ప్రకరణంలో కాళిదాసుని కావ్య ప్రసక్తి అయిదులో నాటకరంగ కవి ప్రస్తుతి ఆరులో కవితాస్తుతి, పోతన ప్రసక్తి ఏడులో వేమన్న వేలనీతుల నుతి ఎనిమిదిలో అసహాయుల కన్నీటి పక్షం వహించి నవకవితల సమీక్షించారు తొమ్మిదిలో ప్రకృతి విశ్లేషణ కావించారు పదిలో భారతదేశ పరిధి దాటి విశ్వ విలోకనం కావించారు

నేను ప్రకృతి ప్రకృతి నేనుగ నిలిచి పోతే ఏక వచనం శక్తులన్నీ ప్రవృత్తులన్నీ సంఘటిస్తె అనేక వచనం అంటూ లింకన్ మార్క్స్ మహాత్ముని స్మరించారు

ఇట్లా పద్దెనిమిది పర్వాల్లో జాతీయ అంతర్జాతీయ సాహిత్య వేదాంత సామాజిక రాజకీయ అంశాలనెన్నో చర్చించారు మనిషి చైతన్య పురోగామి కావలసెన అగత్యాన్ని ఆదర్శాన్ని ఈ 'భూమిక కావ్య సందేశంగా అందించారు కవి

9 విశ్వంభర - కవికి అఖిల భారత ఖ్యాతితోపాటు అంతర్జాతీయ ఖ్యాతి తెచ్చిన మహాకావ్యం విశ్వంభర ఇది వచన కవితలో వ్రాయబడింది భూమిక కావ్య భావాలు విశ్వంభరలో సంపూర్ణ వికాసం పొందాయి విశ్వమానవ చారిత్రక సాంస్కృతిక తాత్త్విక వైజ్ఞానిక సాహిత్య జీవన పురోగమనాన్ని సక్రమంగా కళాత్మకంగా ఈ కావ్యంలో పొందుపరచారు (డా॥ రావికంటి వసునందన్‌గారు భూమిక విశ్వంభర కావ్యాలపై ఎం ఫిల్, పిహెచ్ డి పరిశోధన గ్రంథాలు రచించారు )

కుందుర్తి తెలంగాణా సివి నరబలి, జాబాలి కావ్యాల తర్వాత వచన కవితలో ఒక సంపూర్ణ కావ్యం ఇదే ఇందులోని ఇజం పక్షపాతంలేని నిజం కవి అభిమానించి ప్రబోధించిన మానవతావాదం ఈ కావ్యాన్ని బహుజన ప్రియం కావించింది

ఈ కావ్యం అయిదు భాగాలు ఈ కావ్యానికి నిజంగానే ఈ అయిదు పంచభూతాలు పంచేంద్రియాలూ ' అన్నారు డా తిరుమల శ్రీనివాసాచార్య (నారాయణరెడ్డి సాహిత్యమూర్తి) ఈ కావ్య భావాలు కవి పూర్వ కవితాఖండికలలో అక్కడక్కడ కనిపించినవే అయినా వాటికి సమగ్రరూపం విశ్వంభర ఈ కావ్యానికి మానవుడే నాయకుడని మనిషి కథే ఇతివృత్తమని విశాల విశ్వంభర రంగస్థలమని ఈ కథకు నేపథ్యం వికృతి అని మనిషి ధరించే వివిధ భూమికలకు మూల ధాతువులు మనశ్శక్తులు అన్నారు కవి కావ్య పీఠికలో ప్రకృతి - మానవ సంబంధమైన ఈ విషయాలు అందరి మనస్సుల్లో మెదిలేవే, అయితే విశ్వ మానవుని నాయకుని చేసి ఓ కావ్యం వ్రాయాలనుకునే భావం రావటం విచిత్రం, దాన్ని ఆరంభించి కృత కృత్యులు కావటం వినూత్నం దాన్ని సి నా రె సమర్థవంతంగా సాధించారు ఈ కావ్యంలోని భాష భావాలేకాక కథనమూ నవ్యంగా ఉంది

మనస్సుకు తొడుగు మనిషి, మనిషికి ఉడుపు జగతి
ఇది విశ్వంభరా తత్వం, ఇదే అనంత జీవిత సత్యం - వి పు 10
విస్తరించాడు మనషి విశ్వాన్ని ఆత్మీకరించుకుని
అవతరించాడు మనిషి, ఆకాశాన్ని పిడికిలించుకుని వి పు 19

భూమికలో విశ్వ విశిష్ట వ్యక్తుల పేర్లు కనిపిస్తే, విశ్వంభరలో వారి చర్యల ప్రస్తావన మాత్రమే ప్రతీకాత్మకంగా సాగింది గుహ నుండి మహలు దాకా అమ్ముల నుండి అణ్వస్త్రాల దాకా

పెంపొందించిన మానవ సంస్కృతికి మూలహేతువు మనిషిలో వికసించిన విజ్ఞాన ధాతువు అన్నారు - పు 81

మూల తత్త్వం ఒక్కటైతే ముసుగులెందుకిన్ని? అని అన్ని మతాల నిలదీశారు - పు 79

ఈ విశ్వజనీన మానవతావాద కావ్యం కవికి పేరుతోపాటు నాలుగైదు అవార్డులు తెచ్చిపెట్టింది మట్టీమనిషి ఆకాశం సంప్రదాయాన్ని వదులుకోని నవ్య భావ స్ఫూర్తి డా సి నా రె గారి కవితా విరాణ్మూర్తి!

**2. డా॥ మలయశ్రీ, ఎం ఏ ఎం ఓ ఎల్ పిహెచ్ డి చంజర్ల - జ 1940**

నవల నాటకం, చరిత్ర, జీవిత చరిత్ర, పద్య కావ్యాలు, గేయకావ్యాలు, బాల సాహిత్యం, వయోజన విద్యా పుస్తకాలు మొదలైన పలు ప్రక్రియల్లో మలయశ్రీ గారివి 60 పుస్తకాలకుపైగా వచ్చాయి ఈ కవిది హేతువాద దృష్టి మానవతావాద స్ఫూర్తి

వీరి గేయ కావ్యాలివి 1 అమృతమూర్తి - 1969, 2 పల్లెసీమ - 1978

3 అత్రిమతం 1984, 4 రాగ శిఖ - 1991 5 స్వప్నం - 1992

కావ్య పరిచయం -

1 **అమృతమూర్తి** - ఇది గాంధిజీ శతజయంతి కానుక నిజానికిది గేయ సంపుటి ఈ గేయాలన్నీ బాపూజీ చుట్టు పరిభ్రమించాయి కాబట్టి దీనికి కావ్యం అనవచ్చు

నీతపనలు నాతపనల ఓత ప్రోతమ్మయ్యెను / బాపూ నీ భావాకృతి - ప్రతిరూపమె యీ నాకృతి!

అని కావ్యారంభం కావించిన ఈ కవి,

విశ్వ మానవ సౌభ్రాత్రం వీరత్వాలను కోరేది నా తత్త్వం అని చెప్పుకున్నారు

హరి యట వ్యాసుండు మున్ను విరచించెను భారతమ్ము
అంటరాని నీచకులము, లను ప్రసక్తి యందున్నది
నరుడవు నీవయినందున, హరిజనులని వారలనని
స్థిరకీర్తిని పొందినావు, హరిగా సుతినందినావు అన్నారు

గాంధిజీ స్వభావ చిత్రణతో పాటు శాంతి క్రాంతి భావాలు కవి ఈ కావ్యంలో పొందుపరిచారు ఈ గేయకృతి డా కేతవరపు రామకోటిశాస్త్రి, డా కోవెల సుప్రసన్నాచార్య గారల పీఠికలతో వెలువడింది

2 పల్లెసీమ 78లో వెలువడిన సంవత్సరమే ఈ మాండలిక జానపద గేయకావ్యం మరో ముద్రణ పొందింది తెలంగాణా కరీంనగర్ మాండలిక భాషలో వచ్చిన ఏకైక గేయ కథా కావ్యమిది నండూరి 'ఎంకిపాటలు' తర్వాత మాండలిక భాషలో జానపద గేయాల బాణీలో మన రాష్ట్రంలో చాలా పాటలు పుస్తకాలు వచ్చాయి కాని వాటిలో ప్రజాదరణ పొంది నిలిచి ఉన్నవి తక్కువ అందుకు కారణం డా సి నా రె గారి మాటల్లో - "ఒక మాండలికం నాడిని పట్టుకోవడం అంత సుకరం కాదు యాస బాషలో పాటలు వ్రాయడం ఎంత కష్టమో - కత్తి మీది సామో అనుభవజ్ఞులకే తెలుస్తుంది మలయశ్రీ గారు చాలా వరకు ఆసాములో సఫలులైనారు " (కావ్య పీఠిక నుండి ) ఈ కృతిని అంకితం పొందిన డా పి లింబాద్రి రెడ్డిగారిని అభినందిస్తూ దేవులపల్లి రామానుజరావు గారు కవిని కావ్యాన్ని ఈ విధంగా మెచ్చుకున్నారు "ఈ పల్లెసీమ గేయకవితా సంపుటి ఇందులోని పాటలన్నీ తెలంగాణా మాండలికములో రచితమైనవి రసార్ద్ర హృదయులకు

అహ్లాదకరమైన యీ పాటలు మంచి శైలిలో పాడుటకు అనువుగా రచితమైనవి ఇంత చక్కని పాటలు వ్రాసన మలయశ్రీ గారికి నా అభినందనలు ఈ గేయకావ్యానికి సుస్వాగతము పీఠిక

ఈ కావ్యంలోని 55 పాటల్లో పలు గేయాలు జనాదరణ పొంది సభల్లో నాటకాల్లో పాడుకోవటంతోపాటు క్యాసెట్లుగానూ వచ్చాయి ఎంకి పాటల వలె కాక ఇందులో కథ సైతమున్నది గ్రామీణ జీవిత చిత్రణ సహజ సుందరంగా కావించబడింది



"వెన్న కారం రాసుకున్న జొన్నరొట్టె తింటె గాని
పచ్చికంకులు తంపి నుంచి యెచ్చ యెచ్చగా తింటె గాని
బుగ్గలేగిన మక్క ప్యాలాల్ బుక్కనింద నమిలితేను
పట్టుపాలు దొరగాచి పట్టినన్ని తాగితేను
పల్లెటూరి పసను తెలిసేవు - పట్నాన వున్నా
పల్లెనే మల మల్ల తలిసేవు "
"పెళ్లి చేసు కుందామంటే కళ్లనూ తేలేసి చూస్తవ్
యెల్లి పోతానంటె నేమో కళ్లనిండా నీల్లు దెస్తవ్
పరుల కంట పడితె గండము ఓరయ్యాన - న్నొదిలి పోర నీకు దండము '
"ముద్దబంతీ పువ్వ, ముద్దుగా నువు నవ్వ
పిచ్చిగా మనసైతదే, నీతోనే, సచ్చివో బుద్దపుతదే
నువు నవ్వితే మనసు జువు జువ్వు మంటిది / నువ్వుంటివా ఉడుకు బువ్వతిన్నట్టైద్ది
తిట్టినా యేదొ తిన బెట్టినట్టుంటదే / కొట్టినా పెయికి జోకొట్టినట్టుంటదే "
'భావా బంగారు కొండా / బతుకర నిను జూడ కుండా
"బండోడ రాందాసు పట్నం బోతున్నావా? / ఓ బండిరామదాసూ పని వుంది జరసైసు
పనికెల్లి మా ఆయనె పట్నంల్నె ఉంటండు / ఒక మాట జెత్తీవా మొక్కుతా దేవునని - '
ఇట్లాంటివి ఈ 'పల్లెసీమ కావ్య గేయాల బాణీలు సరసభావాలు

3 అత్రిమతం - వచన గేయ కావ్యం ఇది అత్రి అనసూయల పౌరాణిక గాథకు నూతన భాష్యం ఈ కావ్య రచనకు ప్రోత్సహించి కృతిని స్వీకరించిన ప్రముఖ ఆర్కియాలజిస్టు అడ్వొకేటు రాకూరు రాజారాంసింగ్ పెద్దపల్లి గారి మాటలు చూడండి

Atrimatam which he published, is the result of our discussion He has preferred free verse style and posed the problem in a dramatic diction The message is nearly behind the myth of Dattatreya is neatly brought out by the poet Some times in a philosophical mood and some times in a humorous way I congratulate him on the production of Atrimatam probably first of its kind in Telugu Literature 1-1-1983 అత్రి మూడు కానివాడు అంటే త్రిమతాల కతీతుడని, ఆయన భార్య అనసూయ అంటే అసూయలేనిది, ఆమె పతిభక్తి భర్త గారి భౌతిక వాద భావ ప్రచారమని, అందుకే త్రిమూర్తులు ఆమెను పరీక్షించి, ఓడి, పసివాళ్లుగా నీళ్లపాలు తాగారని నారదుని ఉక్కుశనిగెలు ఉడికించడం అతని జటిల ప్రశ్నలకు జవాబులీయడం అని, ఇందులో పౌరాణిక గాథకు నూతన భాష్యం చెప్పబడింది

అది ఆర్యావర్త భారత మహీతలం / అది హిమాలయ పర్వత సమీపారణ్య స్థలం!
ఉత్తుంగ గిరి శిఖరాల నుండి జారి / ఉన్మత్త వన వృక్షాల మధ్యకు చేరి
నిరంతరం అలల కరాలు చాస్తూ గలగలాప్రవహిస్తూ
సాగర సంగమానికి పరుగులెత్తే గంగాఝరీ
పరిసర ప్రశాంత ప్రదేశం అది / ఆ సింగారాల కోనలో ఉంది,
అంగార తేజస్వి అయిన అత్రి మహాముని ఆశ్రమం
ఇది ఈ కవి వచన కవితాధార ఇది 6 విభాగాలు 16 పుటల చిరుకావ్యం

ఈ అత్రిమతం - అనసూయ కావ్య పీఠికలో మలయశ్రీ ఆ తర్వాత “వసిష్ట కులం అరుంధతి’ “గౌతమ న్యాయం అహల్య” వ్రాయనున్నట్లు తెలిసినా అవి రాలేదింకా మహాకవులు వానమామలై జగన్నాథాచార్యులు (1990) డా నండూరి రామకృష్ణమాచార్య (1996) ఈ కావ్యాన్ని ప్రశంసించారు

4 స్వప్నం ఇది పది మాత్రల చరణాలతో ఏకచ్ఛందంలో నడిచిన గేయకావ్యం 1963 వసంతంలో కవి ఓరాత్రి కన్న కలకిది అక్షర రూపం జాషువా స్వప్నకథ చంద్రలోక సంచారం చేసింది సి నా రె గారి స్వప్నభంగం 1956 గ స రాజు గారి స్వప్న ఫలం 1965, ఇంద్రలోక సంచారం చేసిన శృంగార - నీతి కావ్యాలు

ఈ మలయశ్రీ ‘స్వప్నం” భూలోక కథ కవి తన కవితాభిమాని అయిన ఓ ధనిక యువకుని ఆహ్వానంపై వెళ్లి పసందైన విందుకుడిచి ఆనందించడం సగ భాగం అక్కడే ఒంటరిగా వాహ్యాళికి వెళ్లి జడివానలో కూలే కొంపలో కూలీజనాన్ని చూసి విచారించి తన కవితను ధనికుల మనోరంజనం కోసం కాక దళితుల సంక్షేమం కోసం రచించాలని నిర్ణయం తీసుకోవడం రెండవ భాగం కవి కుమారుడు ఎస్ హర్షవర్ధన్ అల్లుడు టి వి సాల్మన్ రాజు ఆంధ్రాంగ్ల పీఠికలతో వెలువడిన ఈ కావ్యం, ప్రముఖ జీవిత చరిత్రల రచయిత ముద్దసాని రాంరెడ్డిగారికి అంకితం కావించబడింది

‘నేనెక్కడి సామాన్యుడ - ఈనాడీ చిత్రమేమి
ఇంతటి శ్రీమంతునితో ఇంతగాఢ స్నేహమేమి?” పు 22
“విద్యా విజ్ఞాన ముండి విత్తముకై ఆశ చెంది
కలవారికి దాసుడనై కాలమ్మును గడుపుచుంటి -
కాదది సరియైన దారి ఈదిన మిప్పటి నుండియె
ఈ దీనుల బాధలు మార్చే దీక్షను పొందవలయు -” పు 30 అదీ ఈ కవి ఆశయం

5 రాగశిఖ - ఇది వివిధ గతుల్లో సాగిన అయిదు ఆశ్వాసాల మాత్రాఛందో గేయ కావ్యం ఇతివృత్తం సాంఘికం 1969 70లో విరచితమైన ఈ కావ్యం 1992లో ముద్రింపబడింది

ఓ విద్యావంతుడైన యువకుడు సహచరి విద్యావతియైన మేన మరదలిని కాదని, మరో గిరిజన యువతి ప్రేమలో పడుతాడు మరదలు విరాగిని అవుతుంది అవాంతర పరిస్థితుల్లో ప్రేయసి ఆత్మహత్య చేసుకోగా నాయకుడు వియోగ విషాదం పాలౌతాడు అత్త కోరికగా మరదలు బావ చెంతకు వెళుతుంది అతడు జడివానలో పెనుబాధలో నేలపై పడి ఉన్నాడు ఆమె మసక వెన్నెల్లో అతని చెంత అడవిలో నిలిచింది

“అతడు క్రమముగ కోలుకొనునో - కథముగింపుగ ఛేసి చనునో
ఏ దినంబున ఏమి జరుగునొ లేదు భావికి సమాధానము”

అని కవి ఈ శృంగార కావ్యాన్ని ముగించారు కూచిపూడి వారి ఉషా పరిణయ నాటకు ప్రదర్శన, తెలుగు కవి సమ్మేళనం, ఇందులో సన్నివేశాలకను కూలంగా చిత్రితమైనవి ఈ కావ్యాన్ని అంకితం పుచ్చుకొన్న జ్ఞాన పీఠ బహుమతి గ్రహీత డా సి నారాయణరెడ్డి గారి అభిప్రాయం సాంఘిక నేపథ్యంలో సుకుమార ప్రణయం ఊపిరిగా ఈ గేయ కృతిని రచించాడు మలయశ్రీ మాత్రా ఛందస్సులోని రకరకాల గతులతో విరుపులతో లలితలలిత పదాల దొంతరలతో హృదయంగమ వర్ణనలతో సాగిపోయిన ఈ కావ్యం కవిగా మలయశ్రీని మరొక పై మెట్టుపై కూర్చోపెడుతుంది పద్య రచనలో చేయితిరిగిన మలయశ్రీ గేయ రచనలో స్థాయి కలిగిన కృతిని సంతరించి నందుకు నా హార్దిక అభినందన 23 1 1992

మహాకవి ఉత్పల సత్యనారాయణాచార్య గారి అభినందన ఇట్లుంది మలయశ్రీ లబ్ధ ప్రతిష్ఠుడైన గొప్పకవి బహుగ్రంథకర్త సాహిత్యంలో వివిధ ప్రక్రియలు చేపట్టి అన్నిటిలోను సిద్ధహస్తుడనిపించుకొన్న కవి వతంసుడు ఈయన రచించిన ఈ రాగశిఖ ప్రేమ కావ్యమే కాక శ్రుతి మధురమైన గేయ కావ్యం కూడా మలయశ్రీ దర్శనంలో తత్త్వ ద్రష్ట వర్ణనంలో శబ్ద స్రష్ట అనిపించుకొన్న ఘట్టాలు ఈ కావ్యంలో అనేకమున్నాయి శబ్దార్థాలు చక్కగా పొంది పొసగిన రసమయ కావ్యమిది అనాకులమైన భాష అగమ్యంకాని అర్థబోధ, కటుత్వంలేని కమ్మని శైలి గల ఈ కావ్యం చూడగానే చదివింప జేస్తుంది ఆనందింపజేస్తుంది హృదయాన్ని రసార్ద్రం చేస్తుంది ' ఇంకా ఈ కావ్యానికి శిలాక్షరి డా॥ తంగిరాల వేంకటనారాయణశాస్త్రి అభినవ పోతన వానమామలై వరదాచార్యులు శతావధాని ఎస్ కృష్ణమాచార్యుల అభినందనల పీఠికలున్నవి

ఇది శృంగార కావ్యమైనా ఔచిత్య పోషణ ఈ కవి ప్రత్యేకత

వేణు గోపాలుడే వేసటను శయనించ / నాతి సీఎము ప్రక్క గీత మన శయనించు
వనలోల పడు మీన ములలోన కనిపించు / అలజడులు కనిపించు చెలికి చెలువుని వలన
గాలిలోపల పూల, ధూళి లోపల మద మ / రాళిలోపల ప్రేమ రాగమ్ములే నించు
వరి పైరుపై వాన పడినట్లుగా / విరి కన్నెపై భ్రమర మున్నట్లుగా
చెలియ ప్రక్కన చెలువు డమరె / చెలియ బుగ్గలను నును సిగ్గు కొమరె

ఈ కవి రచించిన పద్య గేయ మిశ్రిత కావ్యం 'గోమాత (సురభి) పదేండ్ల క్రితం ఆ ప్ర సాహిత్య ఆకాడెమీ ముద్రణ సహాయానికి వెళ్లి తిరిగి రాలేదు

### 3 మరింగంటి అనంతాచార్య - బి ఓ.ఎల్., గూడెం తా॥ సిరిసిల్ల

అనంతాచార్య గారు నిజామాబాద్ జిల్లాలో తెలుగు పండితులుగా ప్రభుత్వోద్యోగం చేసి కరీంనగర్‌కు మారినారు వీరు సాహిత్యాభిమాని పుత్రోదయము అను వీరి గేయ కావ్యం 1974లో వెలువడింది ఇది అల్లసాని పెద్దన స్వారోచిష మనుసంభవ (మను చరిత్ర) ప్రబంధానికి సంక్షేప గేయ కావ్యం

'ఉన్న కావ్యము ననువదించుట, ఉన్నతంబౌ, కాకపో, నా
కున్న ప్రేమను వెల్లడించితి, కావె ప్రేమలా పలురకమ్ములు

అని ఈ కవి శ్రీనివాసుని కీవిధంగా కావ్యాన్ని సమర్పించారు

'తెలని చల్లని నవ్వుల మొల్లలు, చల్లెటి నల్లని శ్రీశుని గొలిచెద
చక్కని చిక్కని చెక్కర పొంగలి మెక్కెటి స్వామికి కావ్యము నిచ్చెద

డా దివాకర్ల డా సి నా రె కె వి అప్పలచార్య పీఠికలతో వెలువడిన ఈ కావ్యం మూడు అశ్వాసాలు 482 గేయాలు కలది కవి గారి కవనశైలి తెలియడానికి ఒకటి రెండు పద్యాల అనువాద గేయాలు ఇట చూపబడుతున్నవి మనుచరిత్ర కధారంభ 'వరుణా ద్వీపవతీ' పద్యం ఈ కావ్యంలో 5 గేయాలైంది 20 పంక్తులు 'ఆపు రిబాయకుండు పద్యం 12 పంక్తులు ఆరు చరణాల్లో ఇది

ఆ అరుణాస్పద పురమున అత్యున్నతమౌ బ్రాహ్మణ
వంశీయుడు ప్రవరాఖ్యుడు వివిధ యజ్ఞములకు కర్త
అధ్యయనము జేయునతడు అధ్యాపన తత్పరుండు
వన్నెల కాతడు సోముడు కన్నుల కాతడు కాముడు
అతిధి సేవచేసి వారి నాదరించు గుణధాముడు '

వరూధిని 'ఎందే డెందము కందళించు ' పద్యభావం చూడండి -

ఎందు డెందము కందలించునొ ఎందు నివృతిజెంది నిలుచునొ
ఇంద్రియంబులు దేనితో సుఖ - మొందునో అతి యేను బ్రహ్మము, 2-138

ఫలశ్రుతిలో స్వరోచి, రఘు రామున్ని మరపిస్తూ రాజ్యపాలన చేశాడన్నారు కవి కాని ఇది శ్రీరామునికంటె చాలా పూర్వకధ ఇటువంటి కాల విపర్యాసాలు పురాణ కావ్యాల్లో అంతగా పట్టించుకోరు నైషధంలో కర్ణుని ప్రసక్తిని చూడవచ్చు ప్రౌఢ మను చరిత్ర పద్య ప్రబంధం చదువలేని వారిని అలరించగలది అనంతాచార్య గారి 'పుత్రోదయ' గేయ కావ్యం

**4. డా॥ డి నరహరి ఆచార్య - ఎం ఏ పిహెచ్ డి., మల్లారం తా॥ సిరిసిల్ల జననం 1948**

డింగరి నరహరి ఆచార్య గారు సాహిత్యాభిమాని పద్యగేయ కవి వ్యాసరచయిత కరీంనగర్ జిల్లాలో తెలుగు లెక్చరర్‌గా పనిచేస్తున్నారు కరీంనగర్ ప్రస్తుత నివాసం "సుభద్రా పరిణయము ' అను వీరి గేయకావ్యం 1975లో ముద్రణ పొందింది ఇది యమక చక్రవర్తి చేమకూర వేంకటకవి 'విజయ విలాస పద్య ప్రబంధానికి గేయ రూపం ప్రధమ భాగం నాయకీ నాయకుల సమాగమం 128 గేయాలు, ద్వితీయ భాగం పరిణయం 216 గేయాలు ఉన్నవి కావ్యమంతా 12 మాత్రల పాదాల మాత్రాఛందంలో ఉంది ఈ కావ్యంపై మహాకవుల అభిప్రాయాలు ఇట్లున్నాయి

"నరహరి గారి శైలి చాలా రమణీయమైనది - వీరి లేఖిని నుండి ఇటువంటి ఉత్తమ రచనలను ఆశిస్తున్నాను" దాశరథి, మద్రాసు "మీ రచనా ప్రతిభ ఇతోధిక పక్వతను సంతరించుకోవాలి" డా సి నారాయణరెడ్డి, హైదరాబాద్ చేమకూర వేంకటకవి అడుగుజాడల్లో నడిచిన ఈ కావ్యంలో కవి సొంత ముద్ర ఉందని మెచ్చుకున్నారు చెన్నూరు నుండి వా వరదాచార్యులు నరహరి గారి కావ్యం సరళ సరస రచన ఇది కవి మొదటి కృతి కధారంభం ఇది -

అందాలకు నిలయమైన, ఇంద్ర ప్రస్థమ్మునందు
ధర్మరాజు పాలనతో ధర్మము వెలుగొందు చుండె - 1 11



పురాణ నీతి బాపని సొమ్మెవడు దిన్న పాపపు లోకమును జేరు,
ఆకటా వాడట్టుచేసి, నాకమునకు బాసినాడు - 1-13
కథ పరుగు నాగ సుందరి యులూచిని, భాగస్వామిని జేనెను
మణిపుర రాజకుమారీ, మణి చిత్రాంగద నేలెను 1-35

తాళ్లపాక తిమ్మక్కగారి రచనలో వలె ఇందులోనూ చిలుక రాయబారముంది విరహ వివాహ సంభోగ వర్ణనలు మితంగా హితంగా ఉన్నాయి సుభద్రార్జునుల కళ్యాణానికి బలరాముడు కుపితుడైనా కృష్ణుని మాటలవలన శాంతించాడు ఇక్కడ యుద్ధం లేకుండా కధను సుఖాంతం చేయడం విశేషం అభిమన్యు జననంతో ఈ కావ్యం కథ సమాప్తం అయింది

సరసకవి నరహరి గారు అప్పుడప్పుడు సామాజిక కవితలు కథలు సాహిత్య వ్యాసాలు వ్రాస్తున్నారు

## 5 కనపర్తి (లక్ష్మీ నరసయ్య) బి ఏ బి ఇడి సిరిసిల్ల

1 పరాజిత 1976 2 మధుఝరి (అముద్రితం)

ఈ గేయ కావ్యాలు దీపశిఖ గేయ సంపుటి వాస్తవాలు పద్య శతకం కనపర్తి గారి ముద్రిత పుస్తకాలు పరాజిత - హిందీలో వాసనదత్త అను గోవింద వల్లభ్ పంత్ గారి కథను చదివి 1958లో దీనిని రచించినా 1976లో ముద్రించామన్నారు రచయిత

ఇందులో వాసపదత్త అనే వేశ్య ఉపగుప్తుడనే బౌద్ధ సాధును ప్రేమించి తిరస్కరించబడిన పరాజిత ఈ వాసవదత్త స్వప్నవాసవ దత్త కాదు ఈ ఉపగుప్తుడు అశోకుని గురువుకాడు ఇవి కల్పిత పాత్రలు ఈ అయిదు ఆశ్వాసాల విషాదాంత శృంగార గేయకావ్యంపై డా సి నా రె అభిప్రాయమిది

శృంగారంలో వసంతిల్లి, కరుణంతో శిశిరిల్లిన ఈ కథను కనపర్తి కమనీయంగా మలచుకున్నాడు భిన్న భిన్న గేయగతుల్లో కథా సన్నివేశాలను కన్నులముందు కదిలించాడు లలిత భావుకత సరళ పద గ్రథనం ఔచిత్య పోషణం ఈ కృతికి వాసి తెచ్చే గుణాలు ఈ గుణాలు కనపర్తి కవితలో వేయి కిరణాలుగా వికసించాలని ఆశిస్తూ ఆశీర్వదిస్తున్నాను " ఈ కృతికి వా వరదాచార్యుల సుదీర్ఘ పీఠిక 18 పుటల్లో ఉంది నాయికా వర్ణన పు 6

ఆమె సౌందర్యమును అభివర్ణనము సేయ / అలవికాదనిపించు ఆహ్లాద మనిపించు
ఆమె కెనయగురూప మవని లేదనిపించు / ఆమె యౌవనశోభ ఆచ్చరల మరిపించు
ఆమె సుషమా మూర్తి నాలింగనము సేయ / పరితపింతురు ధరే శ్వరులు పోటీలుపడి
ఆమె సౌందర్యమును నారాధనము సేయ / నరుగు దెంతురు ధనిక వరులు కోటీశ్వరులు!

ఇంతవరకు ఔచిత్య పోషకమే ఇక అంగాంగ సౌందర్యవర్ణన 2 పుటలు అంతటి సౌందర్య రాగిణి ఓ బౌద్ధ సన్యాసిని చూసి మోహంలో మున్గింది అతడు ఆమె జీవితానికి జాలిపడి నిరసించాడు పు 16 ఆమె వరూధినిలా కామశాస్త్ర ప్రసంగం ఆరంభించింది అతడు ప్రవరుని వంటి సంసారి కాడు జితేంద్రియుడు బౌద్ధ సన్యాసి

'సరి మంచి దొకనాడు చను డెంతు నీకడకు
కరుణామయుడు నిన్ను కరుణించు నానాడు " అని వెళ్ళాడు పు 26

ద్వితీయాశ్వాసం - ఉపగుప్తుని చంపబోయే సింహాన్ని బాణంతీసి కూల్చిన వేటగాని హింసను వలదని మందలించి దానికి పరిచర్య చేస్తాడు నాటకీయంగా వచ్చిన వాననదత్త 'రక్షించే వారిని భక్షించే ఆ క్రూరమృగ రక్షణ కూడదన్నా అతడు వినడు జీవకారుణ్యంతో

ఓ భిక్షు నాలొక నోపికయె నశియించె / ఓ ప్రభూ! నా ప్రేమ కప్రమటు జ్వలియించె
నీ కోసమైవేచి నాకన్ను గవపూచె / నీతనూ స్పర్శకై నాతనువు శుష్కించె (51) ఆమె వినతి

తృతీయలో - ఆమె ఎన్నో మార్లు సాశ్రు నయనాలతో ప్రియునికై వెచింది 59

అతడు రాలేదు కోరని మంత్రి సుతుడు వచ్చి కామంతో పైగొనగా కత్తితో పొడిచి చంపేంది

చతుర్థం రాజసభలో నేరాన్ని అంగీకరించి చిత్రహింసను మరణాన్ని శిక్షగా భరించింది

పంచమ ఆ సుకుమారి రాజవేశ్య కన్నులు పెరికి ముక్కు చేతులు నరికి కురూపిగా వదిలారు ఆమె సంపదలు ఆరాధకులు ఎవరూ అక్కరకురాక జనం ఛీ అని చీదరించుకున్నవేళ ఉపగుప్తుని చల్లని కరస్పర్శ ఆమె శిరాన్ని తాకింది

"స్వామి ఉపగుప్తులా? యేమిగొన వచ్చితిరి ' పు 95

'సిద్ధార్థ ముని కరుణ సిద్ధించు ననె నతడు" పు 96

శరీర సౌందర్యం కంటె మిన్నదయిన ఆత్మ సౌందర్యాన్ని అతడు భిక్షగా కోరాడు - "ప్రభూ!" అని ఆమె ప్రాణాలు విడిచింది అతడు వెలవెలబోతూ కన్నీరు విడిచాడు ఈ కథా నీతి ఏమిటి? ఈ జీవిత పరమార్థం ఏమిటి? అనే ప్రశ్నలు వేసుకోకపోతే ఈ కావ్యం కమ్మగా చదివిస్తుంది సి నా రె గారి 'నాగార్జున సాగరం' ఒరవడిలో వచ్చిన కావ్యమిది కథలోని అనుసరణ మార్పు గమనింపవచ్చు రెండూ బౌద్ధయుగ గాథలే

మధుఝరి స్థానిక 'చిత్రిక' వారపత్రికలో ప్రచురితమైన ఈ కవితలు మాత్రాఛందోగేయాలు మధుర భావ శ్రుతిలయాన్వితాలు ఉమర్‌ఖయ్యాం రుబాయతుల తలపించినా స్వచ్ఛంద భావసమువేతాలు

**6 వడ్డేపల్లి కృష్ణ - ఎం ఏ , సిరిసిల్ల** 1 వసంతోదయం - 1978

అచ్చమైన లలిత గేయ కవి కృష్ణగారు ప్రస్తుతం భాగ్యనగరంలో పోస్టల్ శాఖలో ఉద్యోగి వీరివి అయిదారు గేయకవితా పుస్తకాలు వచ్చాయి ఈ 'వసంతోదయం కావ్య కథను డా సి నా రె మాటల్లో విందాం "ఈ కావ్యంలో కథ యెంత? దాని పరిధి యెంత? ఒక చదరంత కానీ భావుకుడైన కవి చేతిలో పడితే అదే అవుతుంది చదలంత పల్లెటూరి దొరబాబు పట్నంలో చదువుతున్నాడు సెలవుల్లో ఇంటికి వస్తాడు ఓ పిల్లని చూస్తాడు శీలహరణం, ఋతు చక్రపరివర్తనం మళ్లీ వస్తాడు మరో పిల్లను చూస్తాడు, పసి బాబును చూస్తాడు, ఆ పిల్ల మొదటి పిల్ల చెల్లి ఆ బాబు తన బాబు పశ్చాత్తాపం తండ్రికి ఎదురు తిరుగుడు సుఖాంతం ఈ కథను యాభై ఏడు పేజీల్లో మలచుకున్నాడు కృష్ణ ఈ కావ్యం 'చెరకు వింటి వాని వర్ణనతో మొదలై గున్నమామిడి పైన పికము' పాడిన మంగళగీతంలో ముగుస్తుంది వసంత ఋతువు శృంగార పోషకం ఇందులో ఉన్నది శృంగారమే అందుకే ఈ ఆద్యంతాలు ఔచితీమంతాలు "

పద్మశ్రీ బోయి భీమన్నగారు ఈ 'కావ్య రూపాన్ని పరిధిని, శైలిని ప్రశంసించారు

"ఆచారం పేర మిగుల అత్యాచారాల జరుపు
హీన చిత్తుల కంటె నా హీన జాతి వాడె నయం"
' దొర తనమ్ము నేల కొరిగి దొర్లిపోవు కాలమ్మున
పాత వాసనల పట్టుకు ప్రాకులాడుటేల యింక"

ఇటువంటివి ఈ కావ్యంలోని బలమైన కవితా వాక్యాలు ఆ మొదటి పడుచుకు అన్యాయం చేయాలనే ఆలోచనతోకాక, తుంటరి వయస్సు వల్లనే ఇంత జరిగిందని నాయక శీల సమర్థన తన

సహజ సౌందర్యలాలసతోనే రెండవ యువతిని చేరినా ఆమె చేతుల్లో తన కొడుకును చూసి ఈ అపర దుష్యంతుడు మొదటి యువతి మరణానికి పశ్చాత్తాప తప్తుడై తన తండ్రి నెదిరించి ఆమెను పెళ్లి చేసుకుంటాడు ఇందులో ప్రబంధ ఫక్కీ వర్ణనలు శృంగార ఘట్టాలు వివరంగా ఉన్నాయి నాయిక ఫోటో ఆశకు అర్ధరాత్రి ఒంటరిగా వెళ్లడం కథ కోసం లేదా ఆమె అమాయిక అయ్యుండాలి

'మానవతకు పట్టం కట్టిన కవి ఆదర్శాన్ని మెచ్చుకుంటూ వా వరదాచార్యులు దీనికి పది పేజీల పీఠిక సమకూర్చారు

విజేత వన్నిట గడుసరి విశేష ఊహల సొగసరి అద్భుత ప్రతిభాకేసరి - అమోఘ దర్శక దాసరి! - అని వి కృష్ణ గారు దీనిని ఎసీ దర్శక చక్రవర్తి దాసరి నారాయణ రావు గారికి కృతి ఇచ్చారు

## 7 డా॥ రావికంటి వసునందన్, ఎం ఏ పిహెచ్ డి కమాన్‌పురం

రావికంటి వసునందన్ గారు ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయంలో తెలుగు రీడర్ వీరు విద్యార్థి దశనుండి రచయిత హిందూ జాతీయాభిమానంతో మొదట గ్రాంథిక భాషలో గద్య కావ్యాలు రచించేవారు పద్యకావ్యాలు వ్రాశారు ఆధునిక భావాలతో గేయ కావ్యాలు కూడా రచించి సవ్యసాచి ననిపించుకన్నారు ఇవి వసునందన్ గారి గేయ కావ్యాలు -

1 బలి ముద్రితం 2 త్రయి 1982లో ముద్రింపబడింది

ఈ త్రయి 67 పుటల వచన కవితా కావ్యంలో ఆది ఆధి కావల్సింది అనే మూడు ప్రకరణాలున్నాయి అనాదితో ఆరంభమైన కవితలతో దూత దైవ విశ్లేషణ కావించారు ఆధి 14 కవితల్లో మానవ మనస్తత్వ విశ్లేషణ కావించి కావలసింది ఒకే ఒక కవితలో మూడు పుటల్లో సూచించారు

ఆధి మనోవ్యాధి ఆది విశ్వసృష్టికి మూలకారణం ఆదిని గురించి సరియైన నిర్ణయం ఏర్పరచుకుని ఆధిని తొలగించుకొని 'మనిషి మనిషిగా జీవించడమే కావలసింది అని తీర్మానించారు

'వేద వాక్కుల వంటివి ఈ త్రయి లో ఉన్నాయి ఇది లఘు కావ్యమైనా గురుభావ కలది ' అన్నారు కావ్య పీఠికలో డా దాశరథి గారు రెండవ వాక్యానికి ఆక్షేపణ లేదు కాని, మొదటి మాటను అవుననడానికే పాఠకుని మనస్సు తటపటాయిస్తుంది ఎందుకంటే ఈ కవి భావాలు వేద విధేయంగా ఉన్నాయనలేము చూడండి ఈ భావాలు అనాది 2 పు 5-6

అనాది మనాది[1] ఉన్నవాడెవ్వడు? 1 మన+ఆది
చూసిన వాడెవ్వడు? తిరిగి చెప్పిన వాడెవ్వడు?
ఆ మనాదే ఉంటే మనకు పనికి రాని వాడే!
ఎన్నో జన్మాలంట! ఎందుకీ, ఎరుకలేని సోది!
నెత్తిన మట్టికొట్టుకొని కుత్తుకబంటినీటిలో మునిగేదాకా
రూపమేరాదే, పాపం! ఆ తేజో మూర్తికి!
తినడు కునుకడు, బెదరడు బెదిరించడు వాడేం మనిషి?
ఏమిటి వానికి గుర్తింపు? ఏదీ వాని బ్రతుకు? ఇక్కడి నుంచే -

ఆది 1 పుట 7

అందరూ వేదాల కుప్పలేనట సత్యపరాక్రమ లేనట పుణ్యమూర్తులేనట
అంటున్నది, తూర్పు

అన్ని జలచరాలేనట చెట్లేనట కోతులేనట / అంటున్నది పడమర
ఎవ్వరేమన్నా? పొడుచుకు వస్తూ, ఉడుకునెత్తురుతో నేలను తడి వేయటం
మనసుకూ మెదడుకూ, పాదరసంలా పాకే,
అతి వేగమైన, అతివేల మైన ముడి పదార్థం,
ఇహ పరాల చిక్కుముడి వేసే ఉమ్మడి పదార్థం కామం
గుణ గణాల గణాచారి, కామం / దాని 'శివాలు' సహస్రాలు ఆది పు 30

ఇట్లా మనిషిని మనుస్సును సుగుణదుర్గుణాలను వాని ప్రభావాలను తనదైన నూతన బాణీలో వివరించారు కవి ఉపమానాలు ప్రతీకలు కొన్ని పరితుని ఆలోచనకు పని కల్పించేలా ఉన్నాయి మత పరిజ్ఞానంతోపాటు వ్యంగ్యం విమర్శ చక్కగా కవితా నిబద్ధమైనాయి

ఏమి దేశం ఇది? హోమాగ్నితో, బ్రహ్మగారి లోటస్ స్టేట్‌లోనే
పొగ చూరజేసిన మహోజ్జ్వల దేశం పు 57 ఇక 'కావలసింది - లో
జంతువు నుంచి రాడు, జంతువు కాడు / మనిషిగానే పుడతాడు, మనిషి - పు 64
పరలోక మున్నదా, దైవత్వమున్నదా / ఎందుకు సూది కో సం సోది సోదరా! పు 65
వద్దు దేవుడు వాని, దొంగ భక్తులు మనకు, / వద్దు వేదాలుపనిషణ్మార్గ వాదాలు
వద్దు సంఘాలు సంస్థలు రాజకీయాలు, / మానవత్వము లేని, మనిషికీ కథ లేల? పు 67

మనసును మతాన్ని, ప్రకృతిని విశ్లేషించి చూసిన నవ్య వచన కవితా కావ్యం 'త్వయి' ఈ కావ్యనామానికి ఈ కవితాగానం కొంత వికటమే సంప్రదాయ పద్య గద్య కావ్యాలు రచించిన వసునందన్ కలం సృష్టి ఇది అంటే నమ్మలేనంతనవీన భావ సంచయంకలది ఈ త్రయి కావ్యం 'బలి లభించలేదు

## 8 తులసి జగన్‌మోహనరావు, ఎం ఏ బి ఓ.ఎల్ మెట్టుపల్లి జ 30-4-49

1 ప్రణయ వీచికలు - 1983 తులసి జగన్మోహన్ గారి జన్మస్థలం రాయకల్ నివాస గ్రామం మెట్టుపల్లి ప్రస్తుతము ఎల్ ఐ సి వృత్తిగా ఖమ్మంలో ఉంటున్నారు రచనా వ్యాసంగంతో 74 నుండి రాణిస్తున్న వీరి కవితలు కథలు పత్రికల్లో చాలా వచ్చాయి 3 నవలలు, 1 గేయ కావ్యం ప్రచురణ పొందాయి శృంగార రస వచనగేయ కావ్యం వీరి 'ప్రణయ వీచికలు డా సి నారాయణరెడ్డి గారికి అంకితంగా 1983లో వెలువడింది

ఈ పుస్తకానికి తొలి ఆకర్షణ 'వ పా ' కు సరస నిలిచేవిధంగా 'హాజ' కుంచె చిత్రించిన అందమైన ముఖచిత్రం రెండవది కవర్ వెనకవైపున ఉన్న రచయిత స్ఫురద్రూప ఛాయాచిత్రం మూడవది డా సి నా రె కృతి పొందడం కావ్యం 'ముందుమాట' ను చదివితే ఈ కవి 'తులసి' చక్కని ఆధునిక భావకులుగా కనిపిస్తారు కావ్యం చదివితే కవి 'ప్రణయ భావ వీచికలు' చలం 'ప్రేమలేఖలు'ను 'మ్యూజింగ్స్' ను తలపునకు తెస్తాయి ఇందులో కావ్య నాయికకు అనేక నామాలు వారు వేర్వేరు యువతులా? అని, పాఠకులు భ్రమించే వీలుంది కవి ప్రణయతమకాన్ని బట్టి చూస్తే ఒకే తరుణికి అన్ని విశేషణాలు మాత్రమే అనక తప్పదు ఈ కావ్యంలో కథలేదు కవిత ఉంది కథనం కథా వస్తువు కంటె అందంగా ఊహాలోకంలో విహరింపజేస్తుంది ఇది భావ కవుల పద్ధతిలో ప్రేయసి ఆరాధనతో స్మరణతో నిండిన విరహ శృంగార సరస కావ్యం ఇందలి కొన్ని కవితా పంక్తులు -

' ఈ వేళ, భాషలేని భావాలతో స్వర్గ స్వప్నాలు అలవోకగా - నా మది తలుపు తడుతున్నాయి"

పాండిత్యాన్ని ప్రశ్నిస్తూ వినువీధి ఎత్తుకు ఎదిగి నిలబడ్డ అసామాన్య సమాసం నీ సౌందర్యం '
'కర్పూర జ్వాలల్లా వెలిగే నీ కళ్లలోంచి కురిసే శరచ్చంద్ర జ్యోత్స్నలో నన్ను స్నాతుణ్ణి చేయి సఖీ! '
' ఎందుకిలా ఆశ్చర్యపోతావ్ ? నీ సౌందర్యం కార్చిచ్చులోదూకి శలభంలా మాడి పోతే నేం?"
ఓ - యుగానికి సరిపడా ఆనందోద్వేగాన్ని చావుకు ముందు క్షణాన్ని చవి చూశాక -"

పోను పోను ఈ కావ్యం ప్రబంధ నాయికా సౌందర్య వర్ణనలలో పడింది ఈ ప్రేమ తపస్వి ప్రేమయజ్ఞాన్ని నిర్వహించి అవభృత స్నానం చేయనెంచారు కృతి స్వీకర్త అభిప్రాయం - ' వస్తువు కేమి గాని రచనలో కవిత్వం మెరుపులున్నాయి ఓ కోరిక - తులసి ముందు ముందు మానవీయ సమస్యల్ని తీసుకొని సముజ్వల చైతన్యాత్మక కవితలు వ్రాయాలని " సరస శృంగార భావలహరుల కావ్యం జగన్‌మోహన్ గారి ప్రణయ వీచికలు"। మత్తకాశిని వెన్నెల జాలు 'ప్రణయ లేఖలు' వీరి అముద్రిత వచన కవితా కావ్యాలన్నారు కవి చివరిది ఖండ కావ్య సంపుటి

## 9 ఎస్. కొమురయ్య పిళ్లె - కరీంనగరం

1 అమ్మ - 1984 ఈ కవి పరిచయం పద్య కావ్యాల్లో చేయబడింది

"అమ్మ అనగానే మొదట స్ఫురణకు వచ్చేది రాజకీయార్థం అలాగే జిల్లెల్ల మూడి అమ్మ ప్రమాదమూ ఉంది కవికి సామాజిక అవగాహన చాలా అవసరం శబ్దం మీద అధికారం రాజకీయ విజ్ఞతతో వుండాలి 'వస్తు' వెంత నిర్దుష్టంగా వుండాలో రూపం' కూడా అంత స్పష్టంగా వుండాలి మెలికలు గజిబిజి రచనా లక్ష్యాన్నే దెబ్బతీస్తాయి అలా చూస్తే పిళ్లె గారి కవితలో నిజాయితీ నూరుపాళ్లు వుంది మిగతా కావ్య లక్షణాలు ప్రజాపరంగా పెరుగుతాయనే పూర్తిగా నమ్మకం వుంది అందుకు వారిని మనసారా అభినందిస్తూ ఈ మాటల ద్వారా ప్రోత్సహిస్తున్నాను" - జ్వాలాముఖిగారి పీఠిక

అమ్మ అను రెండక్షరములు, కమ్మని మధురామృతములు
అమ్మలేని జన్మలేదు, కమ్మని పలుకసలె లేదు
చందమామ వెన్నెల్లో, ఆడించును పాడించును
బుదుగరించ బువ్వపెట్టి, కులాసాగ తినిపించును
ఇలా సాగే ఈ 21 పేజీల గేయంలో అమ్మ సేవను వర్ణించారు
అమ్మ నాన్నలిద్దరేను, బతికి వుంటె కడసారిగ
కాపుదాపు సరిగవుండి, సంసారము చక్కబడును

అమ్మముందు చచ్చెనా ఇల్లు నరకం నాన్నపోయెనా తీరని దు ఖం అంటూ కన్నవాళ్లను సరిగా చూసే వారి జన్మమే మేలన్నారు తాగుబోతు భర్తను, గడుసు భార్యను నిందించారు

'అమ్మ శీర్షికతో ఈ పుస్తకం వెలువడినా విషయం శాఖాచంక్రమణం చేసింది - సామాజిక విషయాల నెన్నో స్పృశించింది పుట్టుకతో వచ్చిన బుద్ధి పుడకతో కాని పోదనడం సరికాదని - వాల్మీకి వేమనలను దృష్టాంతంగా చూపారు - పు 6

' తప్పిదాల సరిదిద్దుక, దుర్గుణాల విడిచి పెట్టి సద్గుణాలు ఆదరించి, మహాత్ములనిపించు కొనాలన్నారు" పు 7, పునర్జన్మల, మృతకర్మల ఆత్మవాదం, మత విశ్వాసాలు అబద్ధాలన్నారు పు 9

ప్రపంచ యుద్ధాల - ఐక్యరాజ్య సమితిని పరామర్శించి, సామ్యవాదం మెచ్చి తిరిగి మత సమైక్యతను ఆకాంక్షించి - చివరకు మాతాపితృ సంస్మరణతోనే కావ్యం ముగింపు చేశారు

పిళ్ళె గారు అధ్యాపకులు - సామ్యవాదాభిమాన కవి కీర్తిశేషులు

## 10 కల్వకుంట రఘునాధాచార్యులు - బి ఓ ఎల్ తడకొండ

కరీంనగర్‌లోని ఉన్నత పాఠశాలలో తెలుగు భాషాపండితులుగా పనిచేస్తున్న రఘునాధాచార్యులు ముప్పదేండ్ల యువకవి వీరు పద్యగేయ రచనలో మంచి ప్రావీణ్యం కలవారు రఘునాధ కవి గేయ కావ్యాలు రెండు -

1 విజృంభన వచన గేయ సంపుటి 1976, 2 సుప్రభాతం - గేయ కావ్యం - 1991

సుప్రభాతం - మాత్రాఛందస్సులో సాగిన ఈ గేయాలు మానవ సమాజ విమర్శ ప్రధానంగా సాగాయి కవి సమాజానికి అడవిని ప్రతీకగా తీసుకున్నారు ఆర్థిక రాజకీయ మతవైషమ్యాల సమీక్షిస్తూ విమర్శిస్తూ ఆదర్శ సమాజాన్ని ఆకాంక్షించారు గేయాలు లయబద్ధంగా భావాలు స్ఫూర్తిదాయకంగా భాష సలక్షణంగా ఉన్నాయి అడవికి సుప్రభాతం రావాలని కోరుతూ కావ్యాన్ని ముగించారు ప్రభాతం కావల్సింది మానవ సమాజానికి, ఆరణ్యానికి కావల్సింది వసంతం లేదా వర్షం! ఈ సుప్రభాతం కరీంనగర్ జిల్లాలో వెలువడిన గేయ కథా కావ్యాల్లో చివరిది ఓ పదేండ్ల కాలంలో ఇది తప్ప ఇక్కడి మరే కవి, మరో గేయ కథాకావ్యం రచించక పోవడం గమనార్హం

## 11 ఎన్నం సత్యం, బి ఏ జననం 1960 సిరిసిల్ల

ఎన్నం సత్యం సిరిసిల్లాతాలూకాలోని ఎల్లారెడ్డిపేటలో జన్మించారు యువకుడుగా జీవిక కోసం ముంబాయిలోనే కాక గల్ఫ్‌కు కూడా వెళ్ళి వచ్చి సిరిసిల్లలో టేలర్‌గా ఉన్నారు ఆధునిక సాహిత్యాఇన్న విశ్వవిజ్ఞాన శాస్త్ర గ్రంధాల్ని విపరీతంగా చదివి నూతన కోణంలో కవితా సృజన వ్యాసంగంతో సత్కాలక్షేపం చేస్తున్నారు వీరి ముద్రిత పుస్తకాలు రెండు



1 సుదీర్ఘ జ్ఞాపకం 1996

2 శిలాఘోష - 1997

ఇవిరెండు వచన కవితల కావ్యాలు

ఏదో టెక్నికల్ డిప్లొమా డిగ్రీపొందిన వీరి సాహిత్యాభిమానం అచ్చెరువు గొలిపేదిగా ఉంది

సుదీర్ఘ జ్ఞాపకం 12 చాప్టర్లు, 44 పుటలు సైన్సును కవిత్వీకరించడం కష్టం కాని, అది వీరికి సుకరమైంది సంప్రదాయకవులు దీని జోలికి పోరు - చదువలేరు చదివినా అర్థం కాదు - జీర్ణించుకోలేరు అభ్యుదయవాదులైన ఆధునిక కవుల దృష్టి ఈ కోణంలో ఎవరిదీపోక పోవడం విచిత్రం అదే సత్యం కవిత్వవిశేష తత్త్వం సత్త్వం

"ప్రేలుడుతో మొదలైన విశ్వం ప్రేలిపోతూనే ఉంది
కాంతుల్ని విరజిమ్ముతూకాలుతూనే ఉంది । శబ్దతరంగాలు ఉన్నా ।
వినేందుకు చెవులు లేవు । వెలుగులు విస్తరిస్తున్నా ।చూసేందుకు కళ్ళులేవు ।
ఆలోచనల అంచనాలే ఆయుధాలు । గణితజ్యోస్యాలే గతి తర్కగమనాలు ।
హైడ్రోజన్ మేఘాన్ని ఎర్రి (వెఱ్ఱి) కుక్కకరచిందో । తలలేనే అరచిందో।
ఎందుకో కోటానుకోట్ల ముక్కలై ప్రేలింది । నిప్పులెగజల్లినరాక్షసుడే ।
పరమాణువులో దాగిన ప్రచండ శక్తి । పాలపుంత చుక్కలచీర కట్టింది ।
శంకావర్త గెలాక్సీ పాము మెలికలు చుట్టింది - '

ఇదిఈ కవినవ్య కవితా గమనం భువన విషయ గమకం! ఈ వ్యక్తి విశ్వఖగోళ శాస్త్రపరిజ్ఞానానికి ఆశ్చర్యపడక తప్పదు గెలాక్సీ గ్రహ, జల జీవ మానవ ఆవిర్భావ వికాసాలను ఎంత చక్కగా వివరించారో పురాణ్‌ఖురాన్ మార్గాల్లో కాదు నవీన శాస్త్ర పద్ధతిలోచరిత్రకు పూర్వ అనంతర కాలాల విశ్వ మానవ సంస్కృతి గురించి వీరి వివరణలుచదువుతుంటేడా సి నా రె విశ్వంభర గుర్తుకు రాక మానదు కాని రెండి మార్గం గమ్యం వేరు చివరి అధ్యాయం ఇది -

"ఆహారం నపుంసకమై । రంగుల్ని సింగారించుకుంది । ఓజోన్ కడుపులో కాలుష్యం కత్తులు । పుట్టి రక్త దాహానికి । ప్రేలనున్న ఆటంకు సూర్యుళ్ళు । మట్టిని మల్టీనేషన్ చేసి । మనిషిని వ్యాపారంగామార్చి । ఇప్పుడు నదీ ప్రవాహానికి అడ్డంగా పడుకున్న ప్రాజెక్టు వాడు ।పవర్‌వాడు । నేనేమో ప్రతినిత్యం ఎర్ర ఎర్రగా । వికసిస్తున్న నెత్తురు పుష్పాన్ని

మనంఎక్కడి నుండి వచ్చామో తెలుసుకోక పోతే ఎక్కడ ఉన్నామో, ఎక్కడికి వెళ్ళాలో తెలియదు అన్న చరిత్రకారుడి వాక్యం ఆదర్శంగా ఈ కావ్యావిష్కరణ కావించారు సత్యం

శిలాఘోష - రెండవ పుస్తకం ఇందులో సత్యంగారు స్వయంగా వేసిన రేఖాచిత్రాలు ప్రత్యేక ఆకర్షణ ఇది పూర్వయుగ శిలాజాల నుండి మానవ జాతి వికాసాన్ని నాగరికతా విధ్వంసాన్ని క్లుప్తంగా పటుత్వంగా వ్యక్తీకరించారు ఈ రెండు సంపుటాలు ఆధునిక వచనాకవితారాధకులను తీవ్రంగాఆలోచింప చేశాయి ప్రముఖ కవి పండితుల పత్రికల అభినందనలను అందుకొన్నాయి సత్యం గారి కలం నుండి మరిన్ని రాగలవనే ఆశ ఉంది అది విద్వల్లోకానికి ప్రయోజనం ఇలాంటి రచనలు ఇతిహాసం చీకటి మాటున దాగివున్న కటు సత్యాలతో ' కవి కర్మకు సార్థక్యం

## 12 అల్లెశంకర్, రుద్రంగి మం చెందుర్తిమల్యాల జ. 1951

ఇంటర్‌లో చదువాపి సొంతూరి రుద్రంగిలో ప్రైవేటుపాఠశాలను నడుపుకుంటూ జీవిస్తున్న అల్లె శంకర్ గారికి తెలుగుసాహిత్యమంటే అభిమానం అందులో జానపదులంటే వారి పాటలంటే మరీ అభిమానం సమాజంలోని కుళ్ళును ముఖ్యంగా జనం నైతిక భ్రష్టతను తొలగించాలనే సత్సంకల్పంతో "కోతి గీతాలు" అనే కవితాపుస్తకాన్ని వ్రాసి 1997 వేరు ప్రచురించారు ఈ కృతిని తమ అభిమాన కవితల్లజులైన డా సి నారాయణరెడ్డి గారికి అంకితమిచ్చారు

మనిషి సక్కనోడె కాని గుణము వంకరున్నదీ
గుణం గూనివోయినంక । కూరిమి ఏమున్నదీ॥

ఈ పల్లవితో మనసు వంకర తనాన్ని ఎత్తిచూపి ఎద్దేవా చేయడానికి 220 చరణాలు (నాలుగు చిన్నపాదాలు) రచించారు మనిషికి మంచిని ఉద్బోధ చేయడానికిమరో 72 చరణాలు రాశారు దీని పల్లవి - అనుపల్లవి ఇట్లుంది



సక్కనైన మనిషిలోన। సక్కనిగుణమున్నదీ
బడాయిలకేమి కాని । బాటవేయుమన్నదీ।

ఈ గేయాలు మాండలిక భాషలో జానపద గేయాల బాణీలో సామాన్య చదువరులకు కూడా చక్కగా పాడుకునే రీతిలో ఉన్నాయి నీతిబోధ వేమన మార్గానిది

శంకర్ గారివి గేయ శతక - వ్యాస పుస్తకాలు మరో నాలుగైదు అముద్రితాలు

**13 వి వెంకటేశ్వర్లు, బి ఎస్సి, కోరుట్ల వ 30 సుమారు**

ఉత్సాహం ఆలోచనా తీవ్రత, సౌమ్యప్రవర్తన కలవెంకటేశ్వర్లు ఓ దినం కనిపించి సామ్యవాదిగా మాట్లాడారు ప్రేమకవితలు తెచ్చి చూపారు అవే 'అశ్రుగీతి'। ఆరాధనా వియోగ ప్రణయకావ్యంగా 1997లో ముద్రించారు ఇది వీరి ప్రేయసి స్మరణతో నలభైపుటల్లో నలభై కవితలసంపుటి శబ్దాల పొందిక భావ సంయమనం, నవ్య రీతిలో భావ వ్యక్తీకరణ ఈ కావ్యంలో పరితలను ఆకట్టుకుంటాయి ఎక్కడా అతి కానీ, అశ్లీలత కానీలేవు ఈ పుస్తకాన్ని డా సి నారాయణరెడ్డిగారు ఇట్లా మెచ్చుకున్నారు "ఈ కవితా సంపుటి నిండా ప్రణయ సంబంధమైన ఆర్ద్ర స్పందనలే ఉన్నాయి ఆ అభివ్యక్తిలో అనుకోలేనంత వాడి ఉంది అడుగడుగునా ఆత్మ సమర్పణముంది 'నిశ్శబ్దంగానే జాబిల్లి చీకటిని చీలుస్తుంది' అనే పంక్తిని చదివినప్పుడు వెంకటేశ్వర్లు కవితా పరిధి కొత్త గొంతును తొడుక్కుంది



చినుకుచినుకుముత్యమై మువ్వమువ్వసవ్వడై
అడుగు అడుగునృత్యమై" అన్నప్పుడు
వెంకటేశ్వర్లులోని లలితగేయకవి తల ఊపుతూనిల బడుతాడు
డా॥ మలయశ్రీ తన పీఠికలో అన్నట్లుగా ఈ యువకవి స్వీయ
కవితాముద్ర మరో సంపుటిలో స్ఫుటంగా రూపొందుతుందనే నా విశ్వాసం"
డా జె బాపురెడ్డి గారి ప్రశంసావాక్యాలతో ఈ కావ్యం వెలువడింది

**14 ఎక్కల దేవి లక్ష్మణ కవి, కోరుట్ల వయస్సు 83 సం**

లక్ష్మణగారు యక్షగాన మధురకవితల కవి వీరివి 5, 6 పుస్తకాలు వచ్చాయి ఈ మధ్యవింతలోకం 97 అనుపేరుతో ఓ చిరు గేయ పుస్తకాన్ని రచించారు దీన్ని కరీంనగర్ నవ్యసాహిత్య పరిషత్ ప్రచురించింది

"ఎవరికేమనితెలుపుమందురు - ఎవరువిందురొ ఏమనందురొ
అవనివింతగ మారుచున్నది అంతులేని విచిత్ర జగమిది"

అని, ఎన్నో కోణాల్లో సామాజిక విమర్శతో ఈ గేయాల రచన సాగింది కోరింది మంచి తనాన్ని జనం అభ్యుదయాన్ని ఇది ఈ జిల్లా యువకవులకు కనువిప్పు కాగలదని ఆకాంక్ష

**15 కె ఆత్మారాం, బి ఏ హిందీవిద్వాన్ గోవిందుపల్లె - జగిత్యాల వ 61**

ఆత్మారాం గారు హిందీ అధ్యాపకులుగా ప్రభుత్వోద్యోగం చేసినవారు విశ్రాంతి కాలాన్ని సాహిత్యారాధనతో సార్థకం చేసుకుంటున్నారు యువదశలో లేనిది అకస్మాత్తుగా అరువదేండ్ల వయస్సులో హిందీలో తెలుగులోనూ కవిగా మారినారు హిందీ గేయాల్లో "ఆత్మదర్శన్" పేరుతో ఓ కవితా సంపుటి 1996లో వెలువరించారు అవి కబీరు దోహాలను అనుసరించాయి 1997లో 'లోకం పోకడ" పేరుతో వీరి తెలుగు గేయాల పుస్తకం వచ్చింది నాలుగేసి చిన్న పాదాల గేయపద్యాల ముక్తక నీతి ప్రబోధ శతక కావ్యమిది చివరి పాదంలో మకుటంగా స్వీయనామ ముద్ర ఉంది



చివర్లో విద్యార్థి యువజన ప్రబోధకాలుగా కొన్ని పాటలున్నవి ఆత్మారాం గారి కవిత్వం మహాకవుల సరసన నిలువకున్నా, వారి ఆశయం మాత్రం మాననీయం అని చెప్పకోక తప్పదు

## గేయ సంపుటాలు

1950కి కొంత ముందు పుట్టినా ఆధునిక గేయాలు వచన కవితలు కరీంనగర్ జిల్లాలో ఆ తర్వాతి కాలంలోనే వ్యాప్తికి వచ్చాయి గేయ కావ్యాలు వ్రాసిన కవులు ఇంచుమించు పది అయినా గేయ రచన కావించినవారు రెండు వందలకు మించి ఉన్నారు వారిలో పలువురు తమ కవితలను సంపుటాలుగా ముద్రించుకున్నారు పత్రికలలో ఆకాశవాణిలో ప్రచురణ ప్రసారం పొందిన కవితా రచయితలు అనేకులు కవి సమ్మేళనాలలో పాల్గొనే గేయకవితా రచయితలు లెక్కకు చిక్కనంత మంది నవయువతరం పద్యాలకంటే వచన గేయకవితలనే ఎక్కువగా రాస్తున్నారు చదవడానికి కథలను ఇష్టపడినా ఈ జిల్లాలో కథారచయితలకంటే ఈ వచన కవులదే పైచేయిగా ఉంది గేయకవితా రచయితల ప్రచురణ పొందిన కవితా సంపుటాల పరిచయం ఇక్క డ చేయబడుతున్నది గేయసంకలనాల ప్రత్యేక సంచికల పరిచయం దీని తర్వాత చేయబడుతుంది

ఈ గేయ సంపుటాలలో లలితగేయం - విప్లవగీతం వచన కవిత మినీకవిత మొ॥ ప్రక్రియా భేదాలను కూడా విడిగా చూపడం జరుగుతున్నది తమ వచన కవితలు మాత్రాఛందోబద్ధ గేయాలు సంపుటాలుగా ప్రచురించిన వారి సంఖ్య ఏబదికి మించి ఉంది కాబట్టి ముందుగా వారి పేర్లు పేర్కొనక, వరుసగా ఆయా కవుల కవితా సంపుటాల పరిచయం మాత్రమే చేయబడుతున్నది

**1 డా॥ సి నారాయణరెడ్డి** - మాత్రాఛందస్సులో గేయకావ్యాలు ఖండ కావ్యాలు రచించిన నారాయణరెడ్డి గారు వచన కవితలను కూడా రచించి కవితా సంపుటాలు ప్రచురించి అత్యున్నత గౌరవ పీఠాన్ని అలంకరించారు రెడ్డి గారి కవితా సంపుటాల పేర్లివి

| | | | | |
|---|---|---|---|---|
| 1 | జలపాతం | | 1953 | పద్య గేయ సంపుటి |
| 2 | నారాయణరెడ్డి గేయాలు | | 1955 | మాత్రాఛందోనిబద్ధాలు |
| 3 | దివ్వెల మువ్వలు | | 1959 | మాత్రాఛందోనిబద్ధాలు |
| 4 | సమదర్శనం | | 1960 | గేయ శతకం (మా ఛ) |
| 5 | అక్షరాల గవాక్షాలు | | 1965 | వచన - మా ఛ |
| 6 | మధ్యతరగతి మందహాసం | | 1968 | |
| 7 | గాంధీయం | | 1969 | గాంధీ సూక్తులకు వచన కవితారూపం |
| 8 | మరోహరివిల్లు | | 1969 | వచన కవితలు, మాత్రాఛందోగేయాలు |
| 9 | మంటలూ మానవుడు | | 1970 | వ క |
| 10 | ముఖాముఖి | | 1971 | వ క, మా ఛ |
| 11 | మనిషీ చిలక | | 1972 | మా ఛ |
| 12 | ఉదయం నా హృదయం | | 1973 | |
| 13 | మార్పు నా తీర్పు | | 1974 | |
| 14 | శిఖరాలూ లోయలు | - | 1974 | ఖలీల్ జీబ్రాల్ బోధలకు వ క (అనువాదం) |
| 15 | తేజస్సు నా తపస్సు | - | 1975 | వ క మా ఛ కవితలు |
| 16 | ఇంటిపేరు చైతన్యం | - | 1976 | వ క, మా ఛ కవితలు |
| 17 | మథనం | - | 1978 | వ క మా ఛ కవితలు |
| 18 | మృత్యువు నుంచి | - | 1979 | వ క, మా ఛ కవితలు |
| 19 | ముత్యాల కోకిల | - | 1979 | సరోజనీదేవి ఆంగ్ల కవితలకు అనువాదం |

20 రెక్కలు - 1982 వ క , మా ఛ గజల్లు - రుబాయీలు
21 ప్రపంచపదులు - 1991 నూతన గేయ కవితలు
22 నిరంతరం 1991 వ క మా ఛ
23 ఆరోహణ 1991 వ క మా ఛ
24 దృక్పథం - 1994 వచన కవితలు
25 కలం సాక్షిగా - 1995 వచన కవితలు
26 భూగోళమంత మనిషి బొమ్మ - 1996 వచన కవితలు
27 మట్టి మనిషి ఆకాశం - 1997 వచన కవితలు

నారాయణరెడ్డి గారి గేయకవిత్వానిది నలుబదేండ్ల వయస్సు ఏబదిని దాటిన వీరి పుస్తకాలు కవిగా రచయితగా పరిశోధకుడుగా వీరి కీర్తిని ఉన్నత శిఖరాలకు చేర్చాయి 'ఋతు చక్రం' గేయ కథా కావ్యం ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ బహుమతిని తెస్తే, వీరి వచనా గేయసంపుటి మంటలూ మానవుడు' 1971లో కేంద్ర సాహిత్య అకాడెమీ బహుమతిని గెలుచుకున్నది ప్రతిష్ఠాత్మకమైన జ్ఞానపీఠ బహుమతి రెడ్డిగారికి 1989లో వరించడానికి వీరి 16 ఏండ్ల సాహిత్య కృషిని దృష్టిలో ఉంచుకున్నామన్నారు న్యాయనిర్ణేతలు 1989-16=1973 నుండి వెలువడిన వీరి సాహిత్యంలో భూమిక, విశ్వంభర మాత్రమే కావ్యాలు అందుచేత ఈ కవితా సంపుటాలదే ఆ బహుమతి పొందడంలో ప్రముఖస్థానం అని ఒప్పుకోక తప్పదు

నారాయణరెడ్డి గారు వివిధ సందర్భాలలో ఆత్మావలోకనాను భూతులను సమాజ సంఘటనలకు ప్రతిస్పందనలను వివిధ పత్రికలలో ప్రచురించేవారు అటువంటి వాటిని సంకలనపరచి ఇంచుమించు ఏటా ఓ కవితా సంపుటిగా ప్రచురించారు వీరి రచనలలో కొన్ని అనువాదాలు అనుసృజనలు మరికొన్ని స్వతంత్ర భావాలు కలవి వీరు ఏమి వ్రాసినారనేది వీరి కవితలను చదివి కాదు వీరి పుస్తకాల పేర్లు చూసి చెప్పవచ్చు

జలపాతం అక్షరాలగవాక్షాలు, మధ్యతరగతి మందహాసం మరోహరివిల్లు,
మంటలూ మానవుడు - ముఖాముఖి, ఉదయం నా హృదయం - మార్పు నా తీర్పు,
తేజస్సు నా తపస్సు - ఇంటి పేరు చైతన్యం, మృత్యువు నుంచి - మధనం - నిరంతరం
ఆరోహణ - కలం సాక్షిగా

పుస్తకం పేరు దాని అంతర్యాన్నే కాక, కవి కళాత్మక ఆశయాన్ని కూడా తెలియజేస్తుంది, పిల్ల ముద్దు పిలుపు ముద్దు - అన్నట్లు అందమైన కవితలు వ్రాయడంతోపాటు వాటికి ఆకర్షణీయమైన శీర్షికలు సార్థకనామాలనుంచడం అవసరం అది అందరివలన కాదు సి నా రె గారు ఇందులో సిద్ధహస్తులు మాత్రాఛందో గేయ రచన వీరికి నల్లేటిపై బండినడక వచన కవితలు జలపాతం నుండే వ్రాయసాగారు యుద్ధోన్మాదాన్ని మారుణాయుధాల నిరసిస్తూ అన్నారిలా,

అమృతం పండించే అణుబీజాల నుండి విషపూరిత మృత్యు సస్యాలను మొలిపిస్తున్న
శాస్త్రజ్ఞులారా! పరమాణువులరగిల్చి చరిత్రను పొగ చూరనీయకండి - "జలపాతం"
'యువ ప్రగతి' శీర్షికలో సమతను ఆకాంక్షిస్తూ ఇట్లా చెప్పారు
భూరి వృక్షం జారి పడ్డపుడే, లేత మొక్క పైకి లేస్తుంది
పసిడి మేడ ప్రక్క కొరిగినపుడే, అడుగు గుడిసె నడువ నేరుస్తుంది

ఆంధ్ర రాష్ట్రావతరణకు కవి పొందిన ఆనందం ఇది
సెందూరం వోలె తెలుగు సీమ నేడు విలసించెను
మందారం వోలె తెలుగు మాట నేడు వికసించెను జలపాతం'

శృంగార భావ గేయాలతోపాటు మత దురభిమానరహిత మానవతా భావ ప్రీతి 'నారాయణరెడ్డి గేయాలు' లో తొలి నుండీ ఉంది

మతాలకై మరణించు ఆమాయకు లెవరుండబోరు
గతానికై విలపించే మృత భావులు కానివారు నా గేయాలు

కవి కవితను గురించి ఇట్లా నిర్వచించారు -

పరులబాధ తన బాధగ పంచుకొన్నవాడే కవి / పరుల సుఖంలో శిరస్సుపై కెత్తినవాడే కవి
పచ్చపూలు గచ్చపొదలు, జిల్లేడులు పల్లేరులు / కవికలం సోకితేనె కల్పవృక్షాలవుతాయి నా గే

కవి తనను గూర్చి

నా చుట్టు భ్రమించెడు అం ధలోకమును వెల్గించగ
బ్రతుకును కర్పమువలె అ, ర్పణసేయుట ప్రియమునాకు 'దివ్వెల మువ్వలు"
నేను దానవుని నైతము నిర్జించిన మానవుడను
కాని మానవుని జయించ లేని లోని మానవుడను 'అ గవాక్షాలు'
చెమటను తడిసిన మట్టిని శ్రీగంధముగా ధరింతు
ఊర్పుల నొదిగిన స్వరమును ఓంకారముగా స్మరింతు
నేను కన్నీళ్లనూ నిట్టూర్పులనూ క్షుధనూ వ్యధనూ మృతినీ వికృతినీ
బహిష్కరించిన మానవుణ్ని, మహోజ్జ్వల చైతన్య వారసుణ్ని 'మార్పునా తీర్పు'

ఉపమానాలు సార్థకంగా వినూత్నంగా ప్రయోగించడం వీరి ప్రత్యేకత,

చేదు జ్ఞాపకాలతవ్వి అరుస్తున్నాయి పొగ గొట్టాల్లా వికవిక నవ్వి
గానుగెద్దులా అస్తమానం తిరగడమేనా? సానరాయిలో రోజంతా అరగడమేనా? అ గ"
బురుదలోన బ్రతికెడు కు, మ్మరి పురుగులు గూడ నేడు
తుమ్మెదలై గులాబీలతో, వియ్యమ్మందుకొనెను 'అ గ'

వీరి కథనంలో భావుకత ఎక్కువ నవ్యతపై కవికి మక్కువ

ఎవరికళ్లూ నడవని చోట, ఎవరి కాళ్లూ చూడనిచోట
ఇక్కడ - ఈ బురదలో దిగిన మడిమల గుర్తులు, ఎవరి సంతకాలో -
కడుపు నింపుకుంటున్నది ఎడారి, ఒంటెల అడుగుల్ని జుర్రుకుంటూ -
ఆకాశంలో చుక్కల వర్షనలో,
బుసకొట్టే నిప్పులకూ ఎంత నల్లనిది ఈ పలక?
పండు వెన్నెల్లో ఉతికేసినా, నలుపు విరిగి పోనిది
ఏమీ బీజాక్షరాలో ఇవి?
పట్ట పగటితో తుది చేసినా రాత్రికి పొడుచుకొస్తాయి - 'మధనం"
ఎండను మేస్తున్నది - వెన్నెలను తాగుతుంది
గాలిని కపళకుంటుంది - గగనంలో పడుకుంటుంది 'తేజస్సు నా తపస్సు'

అచ్చమైన జీవితం, అనుకరణలోలేదు, ప్రతి ఘటనలో ఉంది
నిజమైన వ్యక్తిత్వం భజనలోలేదు, సృజనలో ఉంది - ముఖాముఖి"
వెదురెందుకు అరవాలి విరిచేస్తుంటే
విరువందే వేణువౌతుందా అది? 'మృత్యువు నుంచి"
తలలూపే బసవన్నలు కావద్దు
తాండవించే నందికేశ్వరులు కావాలి మంటలూ మానవుడూ'
ఆద్యంత ప్రాస క్రీడలు రెడ్డి గారికి ఇష్టం -
అశక్తులకు, స్వశక్తులకు, విద్వేష కర్దమ లిప్తులకు,
లేదు సుగతి, లేదు ప్రగతి, లేనేలేదు లవలేశ ద్యుతి 'మరో హరివిల్లు"
ఈ కవి ఆశావాది -
ఎన్నిసార్లు చెక్కితే ఓ శిల్పం, ఎన్ని సార్లు తీర్చితే ఓ చిత్రం - "నడక నా తల్లి"
ఏదీ ఎవరెస్టు అంద లేదని నిట్టూరిస్తే ఎదగలేవు బోడిగుట్ట ఎత్తైనా 'ఇంటిపేరు చైతన్యం"
ఎదిగిపో, ఆకాశం నెత్తిలోకి 'రెక్కలు" కవి ఆకాంక్ష -
అహింసావాణి మహాత్మా! ఆయుధ పాణి సుభాష్!
పరీక్షించాను మీ ఇద్దర్నీ, చరిత్ర పొరల్ని తప్పుకొని,
ఇద్దరూ కావాలి, ఇద్దరూ రావాలి నడక నా తల్లి'
ఏ ఒక్క నొసటనో పొద్దు పొడవద్దు, ఏ ఒక్క నోటికో ముద్ద దొరకొద్దు
అన్ని నొసళ్ళకూ కావాలి పొద్దు, అన్ని నోళ్ళకూ అందాలి ముద్ద 'మంటలూ మానవుడు"
దేహాన్ని కలుపుకునే గుండెతో, దేశాన్ని కలుపుకొండి
పంచేంద్రియాల పరిష్వంగంలో, ప్రపంచాన్నే పొదుగుకొండి 'ఇంటిపేరు చైతన్యం"
రేపటి ఉదయం నాలో, లోపల గుసగుసలాడెను
మనిషీ నీ భవిష్యత్తు మహోజ్వలంగా ఉందని "నారె గేయాలు"
ఇక నేను వరించేది, ఏ యెల్లలు లేని నవత,
ఇక నేను ధరించేది, ఏ ఎల్లలు లేని కవిత "ఇంటి పేరు చైతన్యం"
శిశిరం నుండి వసంతానికి, చీకటి నుండి ప్రభాతానికి
నిరాశ నుండి ఆశా శిఖరానికి, అశ్రు జలధి నుండి ఆనందతీరానికి
నడిపించే మార్పు, నేనిచ్చే తీర్పు - 'మార్పు నా తీర్పు"

పూర్వ కవుల కావ్యాల కవితాత్మలను వర్తమాన సమాజాన్ని చక్కగా అధ్యయనం చేసి చక్కని ప్రతిభా వ్యుత్పత్తులు సమభాగాల్లో కలిగిన కవి డా సి నారాయణరెడ్డి గారు

గురజాడ జాషువా, శ్రీశ్రీ కవుల కవితల అభిమానించి కొంతవరకు అనుసరించారు కూడా వేదోపనిషత్తుల సూక్తుల కూడా స్వీకరించారు దేశ విదేశ సంఘర్షణలకు సమస్యలకు స్పందించారు - సందేశాలనందించారు నవీన భావ ప్రేమికులైన నారాయణరెడ్డి గారి కలానికి సంప్రదాయ పద ప్రయోగాలు ఉపమానాలు ఉదాహరణలు జాస్తి అనడానికి వీరి కవితల్లోని అనేక పంక్తులు నిదర్శనంగా ఉన్నాయి అటువంటి వాటిలో ఒకటి -

నక్కి ఉంది నాస్తిలోనే అస్తి, కంగారూ కడుపులోని శిశువులా
దాగి వుంది మృతిలోనే ప్రహృతి, కర్రను కాల్చిపుట్టే చిచ్చులా -

మృత్యువు నుంచి సంపుటిలోని పై కవిత ఆస్తిక్యాన్ని పునర్జన్మలను ఎలపరచడమే అది వారి సంప్రదాయ ప్రీతి ఈ మే నెలలో ఒక సుప్రభాతాన (31 5 97) ఫిల్మ్‌నగర్‌లోని వారింట కలుసుకున్నప్పుడు వారి మావూరు మాట్లాడింది పుస్తకాన్ని ఆప్యాయంగా ఇస్తూ మాట్లాడిన మాటల్లో మతం కేవలం విశ్వాసం దానితో మానసిక తృప్తి ఉన్నారే తప్ప మత ఛాందసవాదిగా కన్పించలేదు జటిల పదప్రయోగంతో భావగాంభీర్యం సమకూర్చడం వీరి కవనానికి మరో ప్రత్యేకత మత జాతి సమైక్యతా మానవతావాద భావాలు వీరి కవితల్లో కొల్లలు

అసంఖ్యాక పత్రాలు ఒకే నీరజం అనేక భాషా ప్రాంతాలు ఒకే భారతం
రంగురంగుల రత్నాలు ఒకే దండ రక రకాల రాష్ట్రాలు ఒకే జెండా మార్పు నా తీర్పు

భాషలో భావంలోనేకాక ఛందస్సులోనూ బంధాల ఛేదించుకోవాలని స్వేచ్ఛనాకాంక్షించినారు కవి భావస్వేచ్ఛతోపాటు ధైర్యాన్ని వీరు అభిమానించారు ప్రబోధించారు

రాసుకొండి మృత్యువు చిరునామా కేరాఫ్ పిరికితనం, పిన్‌కోడ్ సున్నా సున్నా సున్నా
వ్యర్థం కవిత్వాన్ని అరెస్టు చేసే ప్రయత్నం
వారంటు చేసిన మరుక్షణం, పారిపోతుంది అడవుల్లోకి
పాటల్ని తూటాలుగా తొడుక్కొని రెక్కలు

ఈ కవి మొదట సామ్యవాద భావాల ప్రభావంలో ఉన్నారనడానికి జలపాతం, విశ్వగీతి సమదర్శనంలోని కవితలు నిదర్శనం తర్వాత ఆ భావం నుండి తప్పుకుని మానవతావాద ప్రీతితో కవితలు వ్రాసున్నట్లు కవిగారు స్వయంగా వారి ఆధునికాంధ్ర కవిత్వం - సంప్రదాయం ప్రయోగం గ్రంథంలో చెప్పుకున్నారు రాశి పెరిగినా వాసికి విలువిచ్చిన కవి డా॥ సి నా రె అందుకు నిదర్శనం 'అక్షరాల గవాక్షాలు' లోని ఈ గేయం

ఎందుకయ్యా, బండ్ల కొలదిగ ఎదకదల్చని కావ్యరాసులు?
జాతి నాడులలోన పారెడు గీతి యొక్కటి చాలదా మరి!

సి నారాయణరెడ్డి గారి 29-7-97 జన్మదినోత్సవం నాడు వారి మట్టీ మనిషీ - ఆకాశం' కవితా పుస్తకాన్ని 'రవీంద్రభారతి'లో ముఖ్యమంత్రి నారా చంద్రబాబు నాయుడుగారు ఆవిష్కరించారు!

'భాషేనేను తెచ్చుకున్న తీయని వరం' 'కవిత్వం నా చిరునామా' 'అమృతం పంచిపెడుతున్నాను రండి' అంటూ కలంలో సిరా ఇంకే వరకు కాదు కాదు ఇలపై వపువు రాలేవరకు కవిత్వం వ్రాస్తానన్న సంపూర్ణ సాహిత్యమూర్తి డా సి నారాయణరెడ్డి గారు ఆయన మహాకవి!

## 2 గట్టెపల్లి సత్యనారాయణ రాజు - ఏం ఏ బి ఇడి కరీంనగర్

సత్యనారాయణ రాజుగారి పరిచయం పద్యకావ్య కవుల్లో చేయబడింది పద్య రచనలో నిపుణులైన రాజుగారు గేయ రచనలోనూ సిద్ధహస్తులు వీరు ఎక్కువగా మాత్రాఛందో గేయాలు రచించినా మితంగానైనా వచన కవితలు రచించారు 1956లో వెలువడిన గ స రాజు గారి 'కలస్వనము ఖండ కావ్య సంపుటిలో కొన్ని గేయాలున్నవి వానిలో 'పూజ' శీర్షిక గేయంలోని కొన్ని చరణాలివి

కనుము కనుము రసాల పల్లవ కలితతోరణ మింటి కొక్కటి
వినుము వినుమిదె తెలుగు గొనముల విజయనాదము పూర్వదిక్తటి
తెలుగు జనములు తెలుగు మనములు తెలుగు దినములు మధుప వనములు

తెలుగు వనములు తెలుగు వనములు తెలుగు వనములు గొనబుధనములు
లలిత లలిత చళుక్య చంచల్లాంఛనములు స్ఫురించె నదుగో
పిలుపు పిలుపున కాకతీయోజ్వల చరిత్ర ధ్వనించె నదుగో
పలుకు పలుకున రెడ్డి నాయక కలరవమ్ములు కలరవమ్ములు
మలుపు మలుపున విజయనగర సకల కలాకిలికించితమ్ములు
మేలు మేలమరావతి శిల్పాల పాల పయస్సు లూరెను
జాలు జాలుగ నోరుగల్పురి రాల మధుర పయస్సుగారెను
మూలమూలల శ్రీనగపు విద్యాలయాల యశస్సునిండెను
లీల లీలల పానుగంటి శివాలయం తపస్సుబండెను

లలిత పదాలు మధుర భావాలు ఆద్యంత్య ప్రాసలు విధిగా పాటించినా యతులు రాజుగారి గేయాలకు శోభను కూర్చిన అలంకారాలు 'గౌతమి' సాహిత్యం, మాస పత్రిక సంపాదకులైన వీరి ఒక వచన కవిత 'తమసో గమయ' శీర్షికతో మలయశ్రీ సంపాదకత్వాన వెలువడిన 'సత్యార్థి' సాహిత్య మాసపత్రిక, అక్టోబర్ 1977 సంచిక మొదటి పుటలో ఉంది తమసో మా గమయ, అని ప్రచుర వ్యాప్తిలో ఉన్న పూర్వ వేదాంత ధర్మసూక్తి వెలుగు కంటే చీకటే విశాలం శాశ్వతం అనే వినూత్న భావంకలది రాజు గారి గేయం ఆ తర్వాత ఇష్టాలాపంలో ఈ గేయం వ్రాయడం పొరపాటే అని అన్నారు ప్రతిభగల పద్యగేయ కవి కీ శే గట్టిపల్లి సత్యనారాయణ రాజుగారు

### 3 వెలిచాల కేశవరావు - గుండి.

కీ శే కేశవరావు గారు విద్వత్కవి బహుగ్రంథ కర్త వీరివి కేవలం మూడు పుస్తకాలు ముద్రణ పొందాయి 1 ఊహాలోకం 64 గేయసంపుటి 1972 ఈ కవి పద్య కావ్య పరిచయం చేయబడింది

**ఊహాలోకం - 64** కవి తమ 64 ఏండ్ల వయస్సులో ప్రచురించిన 64 గేయాల సంపుటి

రావు గారు హేతువాది వేదాంత రాజకీయ పరిజ్ఞానం పుష్కలంగా కలవారు వీరి భావాలు వృద్ధుల యువకుల సమానంగా ఆకట్టుకుంటాయి - ఆలోచింపజేస్తాయి కాలానికి ముందు నడిచిన వీరి కవితలు సంప్రదాయ పండితులకు కంపరాన్ని, నవతా భావ ప్రేమికులైన యువకులకు ఆనందాన్ని కలిగిస్తాయి వీరిపై నాస్తిక సామ్యవాద భావాల ప్రభావం ఎక్కువ

'వేదాంతము' ను గూర్చి ఇలా అన్నారు
యెందులకీ వేదాంతము శ్రుతుల స్మృతుల రాద్ధాంతము,
'యదృశ్యతి తన్నశ్యతి' అనంతము అయోమయము,
ఈశ్వరు రూపెరుక పడదు, స్వర్గ సుఖము బోధపడదు,
నిరాకార నిరంజన మట, సాకారాపేక్ష వృధ యట,
యజ్ఞహింస కొప్పుకొనుట, ఇతరహింస తప్పనుటా?
అనాసక్తి నిష్కామము, ఆచరణకు బహుదూరము!
సర్వజీవ సమభావము క్రియాశూన్య పదజాలము

దేవుడు'లో రకరకాల నిర్వచనాలిస్తూ 'యద్భావంతద్భవతి' అన్నారు 'నమ్మకు' మంటూ -
మంత్రములను తంత్రములను మహిలో నమ్మకు నమ్మకు
దేవుడనెడి వాని కొరకు దేవులాడి పరుగులిడకు,
నీ యాత్మయె నీ కృషియే నీ దేవుడుగా తలంపు - అన్నారు

విషయాలను విమర్శించడమేకాక తన ప్రతిపాదనలు చూపడం ఈ కవి సుగుణం జ్యోతిష్య శాస్త్రం తెలిసీ దాన్ని కాదన్నారు విద్యావంతులు కూడా ఈ మూఢ విశ్వాసాలకు లోను కావడం విడ్డూరం అజ్ఞానుల మాట వదలినా ఈ అస్తవ్యస్త కష్ట భూయిష్ట 'సృష్టి' ని గూర్చి

ఈశ్వరా ఈ సృష్టినెందుకొనరించావు? భిన్నత్వ మేర్పరచి పెంపొంద జేసావు
ఒకరు దు ఖించగా వొకరు సంతోషించ, ప్రతి నిమిషమున చావు బ్రతుకులుంచగ నేల?
మనుషులందరి నొక్క మాదిరిగ నుంచకను ఒకరికొకరి కసూయలుండు నట్లుంచావు
కోటీశ్వరులు మంచికూడు తిన నరుగదు తినగోరు నరులకు తిండియే దొరుకదు
దీన జనముల బ్రతుకు దిన దిన గండము, ఈ నీదు లీలలకు ఎందరో బలియయిరి
ప్రళయాల - విలయాలు వ్యాధులు మరణాలు ఏలంటూ నీ నీతి తగదందు అన్నారు
'ఏవి' హిందూమత గ్రంథాలు అనేదొక కవితా శీర్షిక కన్న తలిదండ్రులు దైవ సమానులని మరోటి
ఈ జీవితం 'చక్రభ్రమణం అని ఆశలు కోరికలు' ఇవే జీవితాలను శాసిస్తాయని వివరించారు

పచ్చిస్వార్థ పరులు పుత్రి కొకబుద్ధి వంచన-మోసము ఇట్లా ఎన్నెన్నో విషయాలు వీరికి కవితా వస్తువులు ఎవరి హృదయమెటువంటిది? ఏది మంచి ఏది చెడ్డ? తెలిపే యంత్రము' ను మన శాస్త్రజ్ఞులు సృష్టించరే! అని పరితపన చెందారు 'అంతనాయకులే మనకంతా వినాయకులే వత్సరానికొకసారి ఆ గజపతి పూజలు ఏడాది పొడుగునా ఈ జనపతుల పూజలు వాడే విఘ్నాలు కలిగించడుకాని వీళ్లు మాత్రం నిత్య విఘ్నేశ్వరు లట!

'స్వేచ్ఛ' కు విలువిస్తూనే హద్దులు విధించారు కేశవరావు గారు క్రాంతదర్శి శాంతి కాముకులు అభ్యుదయ పథగాములకు అవశ్యపఠనీయాలు ఆమోద యోగ్యాలు, వి కే రావుగారి గేయాలు నవ్య భావాలు

## 4 జె. బాపురెడ్డి, ఎం ఏ ఐ ఏ ఎస్ సిరికొండ

బాపురెడ్డి గారు భావుకులైన పద్యగేయకవి ఎం ఏ ఎకనామిక్స్ చదివినవీరు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వరంగంలో ఆర్ డి ఓ కలెక్టర్ పి ఏ టు సి ఎం మొదలైన వివిధ హోదాలలో ఉన్నతోద్యోగాలు నిర్వహించారు పద్య గేయ కావ్యాలు, గేయనాటికా సంపుటులు వ్యాస సంపుటులు మొత్తం వీరివి 20 పుస్తకాలు వచ్చాయి వాటిలో మూడునాలుగు ఆంగ్ల కవితా సంపుటాలు వీరి రచనలు కొన్ని హిందీ ఇంగ్లీషు భాషలలోనికి అనువాదం పొందాయి బాపురెడ్డి గారి గేయ కవితా సంపుటాలు ఇవి

1 బాపురెడ్డి గద్య కావ్యాలు - 1971, 75 వచన కవితలు,
2 అనంత సత్యాలు - 1979 86 వ క
3 బాపురెడ్డి గేయకావ్యాలు - 1968 70 గేయాలు
4 నాదవేదాలు - 1981, గేయాలు, 5 శ్రీకార శిఖరం - 1985, గేయాలు,
6 ప్రేమారామం - 1986, గేయాలు
7 మన చేతుల్లోనే ఉంది - 1986 వ క
8 నాదేశం నవ్వుతోంది - 1986 గేయాలు
9 పంచబాణ సంచా - 1989, వ క
10 రంగు రంగుల చీకట్లు - 1990 ,
11 ప్రణయ ప్రణవం - ముద్రితం
12 కాలం మాయాజాలం - 1995



వచన కవితలను ఈ కవి గద్య కావ్యాలని పేర్కొన్నారు

"ఆధునికాంధ్ర కవిత్వంలో భావుకులైన ప్రౌఢ కవుల్లో శ్రీ జె బాపురెడ్డిగారు ప్రథమశ్రేణిలోని వారు, అణువు నుండి అనంతం దాకా అనుభూతి ప్రణవంతో ప్రకృతి తత్త్వాన్ని ఉల్లేఖింపగల ఉపజ్ఞరెడ్డి గారిది వాస్తవాన్ని దర్శనంగా మార్చి దర్శనాన్ని హృదయస్పర్శనంగా చెప్పే భావ చిత్రాలు, పద శిల్పాలు వీరి కవితా విహంగానికి రెండు రెక్కలు " అనంత సత్యాలు ముఖ పత్రం చివరి పుట నుండి

నలుబదేండ్లుగా నిరంతరం రచనా వ్యాసంగం కావించుతూ రాణించడమేకాక వ్రాసిన ప్రతి రచననూ కళా సాహిత్య రాజకీయ, విజ్ఞాన శాస్త్రరంగాల్లోని ప్రముఖులకు అంకితమిస్తూ అందంగా వాటిని అచ్చులోకి తెచ్చారు అవి మన రాష్ట్ర ప్రముఖ పండితులు కవుల - సాహితీ సమీక్షకుల పాఠకుల ప్రశంసలందుకున్నాయి వీరి రచనలు కొన్ని రెండు మూడు ముద్రణలు సైతం పొందాయి ఉద్యోగ కారణంగానో, సాహిత్య సభలకో విదేశ సంచారం కావించిన సందర్భాల్లోనూ వీరి సాహిత్యం మూగపోలేదు వీరి కలానికి విశ్రాంతిలేదు

1971లో 'బాపురెడ్డి గేయాలు' కవితా సంపుటి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ వారి ఆధునిక ఉత్తమ కవితా బహుమతిని పొందితే, 1990లో వీరి 'రంగురంగుల చీకట్లు' వచన కవితా సంపుటి తెలుగు విశ్వవిద్యాలయం హైదరాబాద్ వారిచే ఉత్తమ కవితా పుస్తక గౌరవ పురస్కారాన్ని అందుకొంది బాపురెడ్డి గారి కావ్యాలు పునర్ముద్రణలు పొందినప్పుడల్లా, తమ తర్వాతి రచనలను ఆయా ప్రక్రియల వారిగా మొదటి పుస్తకాల్లోనే చేరుస్తామన్నారు, అట్లాగే చేర్చారు కూడా కాని దానికి అపవాదంగా మరికొన్ని గేయ వచన కవితా సంపుటాలు ప్రచురించక తప్పలేదు

కవితా పరిచయం

బాపురెడ్డి గద్యకావ్యాలు 27 శీర్షికలతో 1971లో వెలువడిన ఈ సంపుటి 43 శీర్షికలతో 1974లో మలి ముద్రణ పొందింది ఈ 154 పుటల పుస్తకానికి డా బోయి భీమన్నగారు 32 పుటల కవిత్వ సమీక్షా ప్రశంసా పత్రం సమకూర్చారు ఈ గ్రంథం డా బెజవాడ గోపాలరెడ్డి గారికి అంకితం

విశాఖలేఖ - పు 1 ఏకాంతంలో వేదాంతం 5 నీరవ రవాలు - 7 సంతాన శాస్త్రం - 8 అంతరిక్షపర్వం 9, ఎకనామిక్స్ సుందరి - 10, పిల్లల మత్రితో ఇంటర్వ్యూ 11, విదేశీయాత్ర 16 నుండి 27 వరకు 12 శీర్షికలు వేటికవే సాటి

'ఒకపుట' కవిత చాలు వీరి ఆశు వచన కవితా ప్రతిభ చాటడానికి

'జననం ఒక పుట, మరణం ఒకపుట, మానవ జీవన పత్రాలకు
దినం ఒక పుట, రాత్రి ఒకపుట రాలిపోయే కాల వట పత్రాలకు
దేశం ఒక పుట, కాలం ఒకపుట, అనంత సృష్టి తాళ పత్రానికి
ఊహము ఒకపుట, వాస్తవము ఒకపుట, చూడగలిగిన మానవ నేత్రానికి" - పు 16

పుస్తక ముద్రణ సందర్భంలో పుటల కూర్పులో ఒకపుట మిగిలితే ఇది అప్పటికప్పుడు కవి ప్రెస్‌లో వ్రాసి ఇచ్చిన కవిత అన్నారు ఈ సంపుటిలోని కొన్ని కవితా పంక్తులు చూడండి

ఆధునికాసురుడు

నెత్తిమీద వాడికి కళ్లుంటాయి నేరుగా చూడలేనంటాయి,
ఒంటి నిండా వాడికి పళ్లుంటాయి, ఒంటిగా చిక్కినవాణ్ని కొరుక్కుతింటాయి - పు 17

'తాగిన సత్యం' లోని కిటుకు

తాగేది మనిషికాదు అతని మనస్సు తప్పేది మనిషి మతి కాదు అతని అహంకృతి
మద్యపానం నిజానికి మనిషిని మార్చలేదు అతని బాధలను తీర్చలేదు' పు 61
కవి జిజిగీష
ఎలా బ్రతకాలన్న చింత ఏనాడో వీడింది నన్ను
ఎలా చావాలన్నబాధ ఇంకా పీడిస్తోంది నన్ను 71
లండన్ ద్వీపం
'పరాన్న భుక్కు మరేది దిక్కు తీరని చిక్కు దేవునికి మొక్కు' 87
'కొండల్లాంటి రాకాసి బండల్లాంటి బకాసురుని కండల్లాంటి సౌధాలతో నిండిన (దట) లండన్ 85
'మార్క్సు మహాశయుడు మహా సామ్రాజ్యాలకు
చరమ గీతం వ్రాసిన సంధ్యాచల శిఖరం - చరిత్రను వడపోసి తీసిన సారం రష్యా
అంతరిక్ష పర్వం'లోని ఆశయం
చేతులు జనరక్తంతో తడిపి కాళ్లు చంద్రలోకం మీద పెడితే
అస్పృశ్యగ్రహాలను స్పృశించి అస్పృశ్యులని అనాథులను బహిష్కరిస్తే
చర్విత చర్వణమే అవుతుంది మానవ చరిత్ర 41
రసజ్ఞునికి విజ్ఞప్తి
గాడిదమీద మూటలు మోయించినట్లు కవితలో మాటలు మోయించకు
బాల పల్లవ కోమల వాగ్దేవితో బస్కీలు తీయించకు కుస్తీలు పట్టించకు

బాపురెడ్డి గారు రసవత్కవి కవిత్వం కోసమే కాకుండా చరిత్రకోసం సైతం చదవాల్సిన కవితలు ఈ కృతిలో ఉన్నాయి

అనంత సత్యాలు - 135 పుటలు ఇందలి కవితల్లో కవి తాత్త్వికచింతన అధికంగా కనబడుతుంది అయినా సామాజిక స్థితిగతి విశ్లేషణ ఈ కవితల్లో నిండుగా ఉంది ఏది సత్యం, చుక్కలను చూడండి, నరులే నక్షత్రాలు, జీవితం మహాకావ్యం, అమ్మచేతి బొమ్మనేను మట్టిలోపుట్టిన అక్షరాన్ని త్రయీ జీవనం ఆనందం అందరిదీ నిస్సహాయుడు దేవుడు, చరిత్ర చితాభస్మం ప్రగతిచేతి పద్యాలు వ్రాయిస్తా తిమిర తాండవం తీరంలేని తెలుగు ప్రగతి - ఇట్లాంటి శీర్షికలతో వినూత్న భావాలలో విహరించి కవి చివరగా తమ ఆకాంక్ష నిలా తెలిపారు ఇందులో -

మన ఊళ్లల్లో కలలు పండుతున్నాయి, మన బీళ్లలో బ్రతుకుబాటలు మొలుస్తున్నాయి
కత్తులతో పరీక్షలు వ్రాసిన విద్యార్థులు, ఇప్పుడు కలాలతో వ్రాస్తున్నారు,
సమ్మెలను ఉత్పత్తి చేసిన ఫ్యాక్టరీలు, ఇప్పుడు సరుకుల్ని సృష్టిస్తున్నాయి
మన ఆస్పత్రుల్లో యమ బాధ తగ్గుతోంది, బాధ మీద బతుకు నెగ్గుతోంది
తెలుగు తల్లి మెడలో మళ్ళీ మల్లెపూల దండ విరుస్తున్నది
తెలుగు జాతి చరిత్రలో తిరిగి, వెలుగు వానకురుస్తున్నది
ఎక్కడ? ఎప్పుడు? అనే ప్రశ్నలేదు అది కవి దృష్టి కవితా సృష్టి - ఆనందానుభూతి!

"కవితా వస్తువులు కవితా సత్యాలు అనంతం నా పరిమిత జీవ చైతన్యానికీ భావ చైతన్యానికీ అందిన కొన్ని సత్యచిత్రాలను రసానుభూతులను మీకందిస్తున్నాను' అన్నారు కవి అమెరికా తెలుగు వారికి కృతినందిస్తూ ఈ కావ్య పీఠికలో

మన చేతుల్లోనే ఉంది 35 శీర్షికల కవితా సంపుటి దీన్ని భారత ప్రభుత్వ ప్రణాళికా సంఘ సభ్యులు కరీంనగర్ జిల్లా సిరిసిల్లా తాలూకాలోని మారుపాక గ్రామ వాస్తవ్యులైన ఆర్థిక శాస్త్రవేత్త సిహెచ్ హన్మంతరావుగారికి అంకితమిచ్చారు (వీరు సి పి ఐ ఎం ఎల్ ఏ సిహెచ్ రాజేశ్వరరావు గారికి సెస్ వేంకటేశ్వర రావుగారికి, బి జె పి ఎం ఎల్ ఏ విద్యాసాగర్‌రావు గారికీ సోదరులు )

ఆర్థిక సామాజిక నిత్యసత్యాలను భౌతిక వికాసాన్ని ప్రతిపాదించే వచన కవితా సంపుటి ఇది ' అని కవి గారి మాట అభినవ భగీరథ, కుక్కా కావ్య వస్తువు, విదేశ యాత్రలో స్వదేశ స్పందనం, అంబేద్కర్ శరణం గచ్ఛామి, భారతమాత, మొదలైనవి ఇందలి కవితలు

రంగురంగుల చీకట్లు 84 పుటలు 'కాలంవేసిన గాలం'లో చిక్కి, భూమిని ప్రేమిస్తూ, స్నేహితుల వియోగాన్ని స్మరిస్తూ పరితపిస్తూ ఆకలలేని కోకిలగా బొధపడని బాధలో - స్వాతంత్ర్య స్వాంతంతో కవి ఈ కవితలను వెలయించారు 'లోకంలో మానవ మస్తిష్కంలో అలుముకున్న కాలుష్యాలే ఈ రంగురంగుల చీకట్లుగా రూపుదిద్దుకొన్నవి ఔచిత్యం తెలిసిన కవి బాపురెడ్డి గారు కవితాత్మను తెలిసి దేశప్రయోజనాన్ని ఆకాంక్షించి వీరు కలాన్ని నడిపించారు

చివరి కవితా సంపుటాన్ని తమ జననీ జనకులకు అంకితంగా వెలువరించారు

బాపురెడ్డి గారి సాహితీ సమాలోకన పుస్తకాలు రెండు వెలువడ్డాయి ఒకటి జి రామమోహన రావుగారి బాపురెడ్డి కవితాత్మ' 1979 రెండు - కర్రా కార్తికేయ శర్మ గారు రచించిన 'బాపురెడ్డి సాహితీ సమాలోచనం 1990 రెడ్డి గారి సాహిత్యంపై ఎం ఫిల్ పరిశోధన వ్యాసాలు వచ్చాయి పిహెచ్ డి పరిశోధనలు రావల్సి ఉంది అందుకు సరిపోయేంత సాహిత్యాన్ని వీరు సృజించారు - ప్రచురించారు

గేయసాహిత్యంలో డా సి నారాయణరెడ్డి, డా జె బాపురెడ్డి కరీంనగర్ జిల్లాకు సూర్యచంద్రులు వీరు అఖిలాంధ్ర ప్రశస్తినందినవారు భారత జాతీయ స్థాయిలో గుర్తింపు పొందటమే కాక విశ్వవిహార యాత్రలు కావించి తెలుగు సాహిత్య సౌరభం ప్రవాసాంధ్రులకు వెదజల్లివచ్చినవారు

శ్రీ బాపురెడ్డి గారు ఆధునికాంధ్ర సాహిత్యాకాశంలో ప్రకాశిస్తున్న ఒక ఉజ్జ్వల తార పద్యంలోనూ, గేయంలోనూ, వచన కవితలోనూ, సిద్ధహస్తులు శ్రవ్య దృశ్య కావ్య ప్రక్రియలు నిర్వహించుటంలో నవ్య సాచులు రెడ్డిగారు ఏ ప్రక్రియను చేపట్టినా వట్టి వాస్తవాన్ని వాచ్యంగా చెప్పే పద్ధతి వారికి లేదు ఆత్మలో నుండి అనుభూతిని తోడుకొని, తాత్త్విక పరివేషంతో కాంతి మంతం చేసి భావనా పక్షాలతో సాహితీ విహాయసంలో ఎగురవేసి, భావ చిత్రాలనందించే పదబంధాలతో నవ్యోక్తులకు అలవరుస్తూ కవితను అభివ్యక్తీకరించే విశిష్ట వ్యక్తిత్వం వారిది" - రావూరి 'బాపురెడ్డి కవితాత్మ' గ్రంథ పీఠిక నుండి బాపురెడ్డి గారి కవిత జనహిత జీవన స్రోతస్విని

## 5 ఎస్ కె పిళ్లై - కరీంనగరం

వీరి పరిచయం చేయబడింది పిళ్ళైగారి గేయ పుస్తకాలివి

1 అందాలు చందాలు - 1963, 2 ఎగుడు దిగుడు సమాజం, 3 భుజం భుజం కలిపి (1982), 4 బాలెంత గండి (ఉయ్యాలపాట), 5 నిరక్షరాస్యతా నిర్మూలన (తుమ్మెదపాట)

హే ప్రభూ శతకం త్రిశతి, అమ్మ, వీరి ఇతర పద్య గేయ కృతులు

అందాలు చందాలు - ఇది చిన్న పాటల పుస్తకం కవి ప్రారంభ రచన

ఎగుడు దిగుడు సమాజం - ఇది ఖండకావ్యం దీనిలో పద్య గేయ కవితలున్నాయి ఇందులో కవి ఆశయం ఎరుపంటే ఎందుకు భయం? అనే కవిత ద్వారా వ్యక్తమౌతుంది మాత్రాఛందంలో సాగే చిరుపద్యాల్లాంటి వీరి ఇందలి కవితలు పాటలుగా పాడుకోవచ్చు రాగం లేక లయబద్ధంగా వచన కవితలుగా చదువుకోవచ్చు

భుజం భుజం కలిపి - 1992 జనం పాటలు

పిల్లే గారి కవితలకు సామ్యవాదం ఊపిరి కవి 1949 తెలంగాణా రైతాంగ పోరాటం నుండి స్ఫూర్తి పొందిన వ్యక్తి వీరికి శ్రీశ్రీ అంటే అభిమానం సాయుధ పోరాటం సామ్యవాద సాధనం తప్పనిసరి అని భావించారు వీరి కవితల్లో దేశ-విదేశ రాజకీయ సంఘటనల పరామర్శ ఉంటుంది ఇది మొదటి పాట -



భుజం భుజం కలిపినడు గళం గళం కలిపి పాడు
బలం బలం మనకె బలం జయం జయం మనకె జయం
ఈ పీడిత జన సౌఖ్యం చిరవాంఛిత సంకల్పం
పాత వ్యవస్థకు నాశం సాధించుటె మన ధ్యేయం
పెటీ బూర్జువా నడకల రివిజనిజం పెను ఛాయల
దరి చేరక వెనుదీయక ధర్మయుద్ధ మొనరిద్దాం
త్యాగాలకు వెరవ కుండ భోగాలకు భ్రమ చెందక
సమతను సాధింపనడు మానవతె మార్క్సిజం

వీరి వచన కవితకు ఒక ఉదాహరణ -

ఇది నా కలం ఇది నాగళం నా మది కింపైంది నవ్యప్రగతి పథం భూ నభోంతరాలు నిండిన ప్రభంజనంవలె నా కలం ఉరుకుతుంది, నా గళం ఉరుముతుంది ధన స్వామ్య వర్గ దోపిడీలకు, అనురక్తి కట్టించు మురాల నరహంతకుల నవీన భావ విరోధుల వర్ణించగా లేదు నాకలం, ప్రశంసించగా లేదు నాగళం నా కలం వ్రాసేది నా గళం పాడేది అంతర్జాతీయ శ్రామిక గీతం సత్యార్థి జనవరి - 78 నుండి

ఇంచుమించుగా ఇందలి 46 పుటల కవితలన్నీ ఇంతే సామాజిక రాజకీయ సమతా సమాజ సాధన ఈ కవి రచనల పరమార్థంగా ఉంటుంది వరదల బీభత్సాలను, వయోజన విద్యా ఉద్యమాన్ని వర్ణించిన చిన్నారి బుక్‌లెట్‌లు చివరి రెండు గేయ రచనలు 1 బాలెంతగండి, 2 నిరక్షరాస్యతా నిర్మూలన

ఉపాధ్యాయులుగా పనిచేసి ఉద్యోగ విరమణ పొందిన వీరు అరువదేండ్ల వయస్సులో కీర్తి శేషులైనారు జీవిత కాలమంతా ప్రజాసాహిత్యం సృజించి ప్రచురించారు వీరి కుమారులు రవీందర్, నరేందర్ సురేందర్‌లు కూడా వచన కవితలు రచిస్తున్నారు

### 6 డా తిరుమల శ్రీనివాసాచార్యులు - ఎం ఏ పిహెచ్ డి నారాయణపురం, - సిరిసిల్ల జి 1938

శ్రీనివాసాచార్యులు కరీంనగర్ డిగ్రీ కాలేజి తెలుగు లెక్చరర్‌గా పనిచేశారు ప్రస్తుతం సికింద్రాబాద్ సర్దార్ పటేల్ కళాశాలలో ఆంధ్రభాషోపన్యాసకులు వీరు భాగ్యనగర 'యువ భారతి పుస్తక ప్రచురణ సంస్థ ఉపాధ్యక్షులు పద్య గేయకవి, స్నేహశీలి!

శ్రీనివాసాచార్య ముద్రిత గేయ రచనలు -

1 ఉదయరాగం - 1969, పద్యగేయ సంపుటి, 2 జీవన స్వరాలు 1971 గేయ ఖండికలు

3 కిరణాలూ - కెరటాలు, 1977 వచన గేయ సంపుటి, 4 తెలుగు రుబాయీలు 1988
5 గంగాతరంగాలు - 1992 లలిత గీతాలు, 6 దీపాల చూపులు - 1993 రుబాయీలు
కవితా పరిచయం –

ఉదయరాగం 17 శీర్షికలలో కవీ, వెలిగించు దీపాలు, మనోమధనం మా బాపూ మరచిపోకు విషవలయం, ఎంతకాలం ఏమౌతుంది, ధ్రువాలు, అశ్రుగీతి, గురజాడ శిల్పీ గేయ కవితలు నాలుగే పద్య కవితలు ఒక విధంగా దీన్ని గేయ సంపుటి అనొచ్చు

ఇందలి కవితలన్నీ మాత్రాఛందస్సువి 'పరాధీన జాతి దాస్య బంధాలకు వజ్రధార పతిత జీవతతికి కలంభగవంతుని నవనిలయం' అని కవి శక్తిని కర్తవ్యాన్ని వివరంగా ఏడు పుటల కవితతో మనోమధనంలో, మహదాశయ నవమార్గం వెదకుచు మనస్సు తపస్సు చేస్తుంది, అంటూ - భావికి ఉజ్వల జీవం పోయగా ప్రాణం పందెం వేస్తున్నదని చెప్పుకున్నారు పదవి సుందరి వలచినంతనె, ప్రజాకోటిని మరవ కూడదు - అని ప్రజానేతల హెచ్చరించారు

'స్వార్థమ్మును పోనిమ్మని సహనం శాంతిస్తున్నది సహనం కోపించినచో, దహనం కాకేమున్నది '
అన్యాయాల దమన నీతిని నిరసిస్తూ ఈ కవి
' బక్క చిక్కినవాడు బండెడు బరువు మోయుట ఎంత కాలం?" అని ప్రశ్నించారు
ఇంకా - "దీనుల గొంతులు నులిమి వేయగా ద్వేషం పండక ఏమౌతుంది?" అని
"స్వార్థమ్మెదిరించువారు ప్రాణభయం లేనివారు
నెత్తుట తడసినను వారు, తత్తరపడు వారు కారు '
అని సాహసికుల అభినందిస్తూ స్వార్థులను బుద్ధిమార్చుకొనవల్సిందిగా హితబోధకావించారు

ఈ కవికి శ్రామిక జన ప్రేమ ఉంది దేశభక్తి ఉంది దైవ భక్తి ఉంది దైవభక్తి కవితలు ఇందులో లేకపోవడం ఓ విశేషం

'అశ్రుగీతి' మన రాష్ట్రపతి జాకీర్ హుసేన్ మరణానికి సంతాప కవిత మూఢ విశ్వాసాల నెదిరించి, దేశికవితను వెలయించినందుకు గురజాడపై వీరికి అభిమానం శిల్పిని పది పుటల్లో వర్ణించిన శ్రీనివాసాచార్య చివరగా ఇట్లా ప్రస్తుతించారు

ఓ శిల్పీ నీ ప్రతిభకు ఊడిగాలు చేస్తా - నీ
ఘనతను చాటించి మధుర కావ్యాలను వ్రాస్తా!

ఈ కవి గాయకులు కనుక వీరి కవితలు లయబద్ధంగా రూపొందాయి

వేముగంటి నరసింహాచార్యుల కవితల పొత్తుతో ప్రచురించిన జీవన స్వరాలు లోని వీరి తొమ్మిది కవితల్లోనూ వచన కవితావాసన స్వల్పం

హైదరాబాదు పట్టణంలా, అన్యాయం అంగలు వేస్తుంటే
బొంబాయి నగరంలా వంచన, అంబరాలు స్పృశిస్తుంటే
చెన్నపట్టణంలా ద్వేషం, వన్నెలు దిద్దుకుంటుంటే
వెన్నలాంటి నాడెందం, విలవిల లాడెను నేస్తం! అని వాపోయారు ఇంకా 'పచ్చదనం కోసం' 'సొంత గొంతుకను' కోరుకున్నారు

తెలుగు రుబాయీలు – గజళ్ళు, రుబాయీలు ఉర్దూ గేయ రూపాలు

గజళ్ళు డా సి నా రె వ్రాశారు రుబాయీలు డా తిరుమల శ్రీనివాసాచార్య వ్రాశారు డా

దాశరథి గారి తెలుగు రూబాయీలు ఉమర్ ఖయాం పార్సీ రూబాయీలకు అనువాదం శ్రీనివాసాచార్య గారివి స్వతంత్ర కవితలు రుబాయి నాలుగు పాదాల పద్యం గణనియతి యతి ప్రాసలుండవు కాని 1 2 3 పాదాలకు అంత్యప్రాస ఉంటుంది ఈ ప్రక్రియలో శ్రీనివాసాచార్యులవి రెండు సంపుటాలు వచ్చాయి

**దీపాల చూపులు'** సినీ నటుడు డా అక్కినేని నాగేశ్వరరావు గారికి అంకితంగా వెలువడింది మనకు జన్మనిచ్చింది మాతృమూర్తి సత్యం అని సత్యం మాతా పితా జ్ఞానం అనే నీతి శాస్త్ర శ్లోకభావానువాదంతో ఆరంభమైన ఈ ముక్తక కావ్యంలో వేదాంత రాజకీయ రీతి నీతి గేయ పద్యాలు 300 వరకున్నాయి వాటిలో విమర్శ ఉంది వినోదం ఉంది జాతికి నీతిబోధ కావించడం ప్రధాన లక్ష్యంగా వీరి కవిత సాగింది



తుపాకులను నమిలారు స్వేచ్ఛాసుధకోసం
తుఫానులను తాగారు స్వేచ్ఛా సుధ కోసం
అందుకున్న అమృతాన్ని భావి తరం ప్రజలకు
భద్రపరచి అందించు లేకుంటే మోసం పు 5

విప్లవానికి ఈ కవి ఇచ్చిన నిర్వచనం
నదులు జలాలివ్వడమే విప్లవం తరులు ఫలాలివ్వటమే విప్లవం
విప్లవం మంటే - నిప్పులు కక్కుటా?, ధరణి ధాన్యమివ్వటమే విప్లవం 7

నాలుగు పాదాలకూ ఆది అంత్యప్రాసలు కూర్చిన గేయాలు కూడా అందులో కొన్నైనా ఉన్నాయి కవి తమ తత్వాన్ని తెలుపుకున్న అటువంటిదో రుబాయి ఇది

ఈ దేశం పాటలోని వాదం నేను ఈ దేశం పరమాత్మకు వేదం నేను
ఈ దేశం కవనమూర్తి పాదం నేను ఈదేశం పూపున ఆమోదం నేను 31

నీతి నిజాయితీని, శాంతి సహజీవనాన్ని కోరుకున్న కవితాసంపుటి దీపాల చూపులు

ఏదో సరదాకో సంపాదనకో కాక సాహిత్యాన్ని జీవిత పరమార్థంగా సమాజ శ్రేయస్సు నాకాంక్షించి వెలయిస్తున్న కవి డా॥ శ్రీనివాసాచార్యులు వీరి పాటలు - వచన రచనల పరిచయం తర్వాత చేయబడుతుంది

## 7 మలయశ్రీ - ఎం ఏ ఎం ఓ.ఎల్ చంజర్ల - జ 1940

మలయశ్రీ కవి - రచయిత వీరి పుస్తకాలు బహు ప్రక్రియల్లో 60కి పైగా అచ్చయినాయి గేయంలో కథా కావ్యాలతోపాటు వీరు ఖండకావ్య సంపుటాలు సైతం వెలువరించారు

ఈ కవి గేయ సంపుటాలు 1 అమృత మూర్తి - 1969, 2 కలం కలకలం - 1981, (వచన కవితలు) 3 కొరడాదెబ్బలు - 1982, (మినీ కవితలు) అము - 1 ప్రపపంచశాంతికై, 2 నవలోకం

అమృతమూర్తి లోనివి మాత్రాఛందంలో సాగిన గేయాలు అన్నీ ఏకవైషయికాలు గనుక 'గేయకావ్యాలు' లో పరిచయం చేయటం జరిగింది 'కొరడాదెబ్బలు' మినీకవితలు కలం కలకలం - పూర్తిగా వచన కవితా సంపుటి 50 పుటలు

"తర తరాల అంతరాల తిరగలిలో నలిగి నలిగి / నిరంతరం బానిసత్వ బానిసలై కలగి కలగి
కులమతాల పక్షపాత ఉచ్చులో బిర్రబిగిసి / కుటిల రాజకీయ మురా రొచ్చుల్లో అణగి మునిగి
అవమానం అన్యాయం అక్రమాల దురి ంతాల / తాకిడిలో రాపిడిలో వేపుడులో తూలికాలి

చదువు తెలివి తెగువ లేక చచ్చు బ్రతుకు శ్రమజీవుల / ఆవేదన ఆక్రందన ఆలోచన ఆవేశం
మలయశ్రీ ‘కలకలకలం’ ఇది ముఖచిత్ర గేయం
మత్తేభ శార్దూలాలు విహరించే మహాశబ్దారణ్యం కాదిది
చంపకోత్పలాల పన్నీటి పరిమళాల సాహితీనందనం కాదిది
వనమయూరాల ఆటవెలదుల నృత్తాలు లేవు మత్తకోకిలల తేటగీతాలూ కావు,
వివిధ గతుల్లో విన్పించే వికల మనస్కుల, ఆక్రందనలకు స్పందనలు - వారి
ఆర్తనాదాలకు ప్రతిధ్వనులు ‘నవకవిత’
నిప్పుకణాన్ని నేను నిజమైన విద్యుదగ్నిశకలాన్ని
నాలో జీవం ఉన్నంత వరకు జ్వలిస్తూనే ఉంటాను
నాలోని వేడితో మీకు జవాన్నిస్తూనే ఉంటాను ‘ నిప్పుకణం”
ప్రకృతికి ప్రాణం పోస్తున్న అమృతమూర్తి స్త్రీ అంటే అంగీకరిస్తాను,
సృష్టిని విలయం కావిస్తున్న విషభాండం స్త్రీ అంటే అంగీకరించను ‘స్త్రీలు
ప్రగతి కన్పిస్తున్నది ప్రజానాయకుల తీయని ప్రసంగాల్లో
ప్రజల తోస్తున్నది బాధల పద్మవ్యూహంలో ఆదర్శాలనే అందని మ్రాని పండ్లకోసం
ఆశగా చూస్తున్నది జనం మనం “నా కలకలం ”
సమత సహజీవనం మన ధ్యేయం అవి సాధించితేనే ప్రశాంతి -
శాంతికోసం క్రాంతి క్రాంతితోనే శాంతి అశాంతికోసం క్రాంతి!

ఇలా 36 శీర్షికల్లో ఎన్నో విషయాల విశ్లేషణ కావించారు అముద్రిత వచన కవితా సంపుటాలు రెండు ప్రపంచ శాంతికై' ఇది డి శ్రీహరిరాజు బి ఏ బి ఇడి గారి 'క్వెస్ట్ టు వరల్డ్ పీస్' అను ఆంగ్ల పుస్తక గేయాలకు అనువాదం

'నవలోకం' - స్వీయకవితలు దీన్ని హిందీ ఇంగ్లషు అనువాదాలతో సహా త్రిభాషా కవితా సంపుటిగా ప్రచురించాలని కవి సంకల్పం స్వార్థాన్ని సంకుచిత కుచ్చిత స్వభావాల నిరసిస్తూ సామ్యవాద సాధనకు మార్గాలు సూచించారు ఈ కవి భౌతిక వాది - విజ్ఞాన శాస్త్రవేది

**8 చొప్పకట్ల చంద్రమౌళి, ఎం ఏ బి ఇడి వేములవాడ జ 1938**

జిల్లా పరిషత్ సెకండరీ పాఠశాలోపాధ్యాయులుగా పనిచేసిన చంద్రమౌళి గారు ప్రభుత్వ జూనియర్ కళాశాల సిరిసిల్లలో ఆంధ్రభాషోపన్యాసకులుగా రిటైర్ అయినారు వీరు విద్యార్థి దశనుండి సాహిత్యాభిమాని కవి పండితుల చెలిమిలో నిరంతర కవితా సాధన చేసినవారు సంగీత నాటక రంగాలపై సైతం వీరికి ఆసక్తి ఉంది

వీరి వచన కవితా సంపుటి 'సమతా దీపాలు' 1971లో వెలువడింది దీనిలో 29 వచన కవితలున్నాయి ‘ సూటిగా చెప్పడం, తప్పులను వేలెత్తి చూడంతో బాటు, ఎదుటి వారికి అవకాశం ఇవ్వకుండా తన తప్పును కూడా ఒప్పుకోవడం అతనిలో కనిపిస్తుంది ఇతని కవితల్లో అస్పష్టత కనిపించదు సూటిగా భావ చిత్రాలను విసురుతుంటాడు ” చొ చ అభినందన సంచికలో నగుబోతు చంద్రమౌళి వ్యాసం నుండి - “పట్టపగలే చీకటి రాజ్యం చేస్తుంది - మట్టి దీపాలైనా సరే పెట్టండి” అని కవి తామే ఈ నూనె దీపాలను - కరెంటు కామెంట్రీ కవితా దీపాలను వెలిగించి వెలువరించారు

సమతా దీపాలు చంద్రుని నివేదిక బరువులేని గురుత్వం వెలుగులేదు వ్యాకరణ సుందరి దొంగను పట్టుకొండి ఒకే భారత హృదయం తాజానిర్వచనాలు వంటివి ఇందలి శీర్షికలు

'ప్రియా! మన సంధికి వైకల్పికమూ విభాషలూ' చెప్పి గ్రంధి వేయకు మన సాహచర్య సంధిలో సదభిప్రాయం గుణం, ఏకాభిప్రాయం మమకార వృద్ధి' - అని వీరి 'వ్యాకరణ సుందరి' పండితులు మాత్రమే వ్రాయగల చదివి అర్థం చేసుకోగల ప్రౌఢ చమత్కార కవిత డా సి నా రె మంటలు మానవుడు లోని వ్యాకరణ కవిత, జె బాపురెడ్డి గారి ఎకనామిక్స్ సుందరి ఇటువంటివే ఇవి ప్రజ్ఞాపాటవాలుగల కవులు మాత్రమే వ్రాయగలవి కవి ఉపాధ్యాయుడు కనుక విద్యాలయాల కవితలు చక్కగా వ్రాయగలిగారు



'కరువుకు మారు పేరీనాడు గురుపు
బరువుకు తూకం కానిది ఆతని పరువు'
తాను సింహాసన మెక్కించిన శిష్యుడు
తన పారశాలను నాలుకపై కొరుకుతున్నాడు
మందు తూటాలను గుండెలపై విసురుతున్నాడు"

సరళ భాష సహజ వాక్యాలు సునిశిత విషయ విశ్లేషణ, సున్నిత విమర్శ చొప్పకట్ల గారి కవితా గుణాలు సూటి - ఘాటు తనాలు ఉన్నా వీరి వాణి పాఠకుల నొప్పింపదు - ఒప్పిస్తుంది

పలు కవితలు కథలు - వ్యాసాలు వ్రాసిన వీరు 'వేములవాడ చరిత్ర' వచనంలో రచించారు జిల్లాలో చక్కని పేరున్న చంద్రమౌళి గారు అరసం సభ్యులు! వేములవాడ సిరిసిల్ల ప్రాంత యువ కవులకు వీరు సహకార వృక్షం! వారికి కవితా మార్గదర్శి!

## 9 వడ్డేపల్లి కృష్ణ - ఎం ఏ సిరిసిల్ల - జ. విరోధి

కృష్ణ పుట్టింది పెరిగింది చదివింది కవిగా కలంచేపట్టింది సిరిసిల్లలో పోస్టల్ ఉద్యోగిగా కరీంనగర్ జిల్లాలో పనిచేసిన వీరు ప్రస్తుతం హైదరాబాద్ జనరల్ పోస్టాఫీసులో ఉన్నతోద్యోగిగా ఉన్నారు పాట అంటే కృష్ణగారికి ప్రాణం 1971లో తొలిపాటల సంపుటి వెలువరించిన వీరి వచన కవితా సంపుటాలు 73 నుంచి వచ్చాయి ఇంతవరకు వడ్డేపల్లి గారివి పది పుస్తకాలు వచ్చాయి

వీరి కవితా సంపుటాలు - 1 యువ స్వరాలు - 1973, 2 అంతర్మథనం - 1973
3 హాలాహలం 1987, 4 మనసా - తెలుసా - 1990

యువ స్వరాలు' సిరిసిల్లా ప్రాంతంలోని అయిదుగురు కవుల వచన కవితల సంకలనం తర్వాతి రెండు వచన కవితా సంపుటాలు ఇందులో 'హాలాహలం' పుస్తకానికి 1990లో 'దేవులపల్లి కృష్ణశాస్త్రి అవార్డు' ఆంధ్రమహిళాసభ భాగ్యనగరం వారు ప్రదానం చేశారు చివరి కృతి వచన గేయ కవితా ముక్తక నీతి కావ్యం

కవితా పరిచయం

అంతర్మథనం లో సామాజిక స్వరూప చిత్రణ చక్కగా ఉంది ఇందులో వివిధ శీర్షికల కవితలున్నాయి 'నీళ్లు - ప్రజలు' పుట - 37

"నీటిలో పుట్టిన విద్యుత్తుకు నీరంటే గిట్టదు
అందుకే అది షాక్ కొడుతుంది, అలాగే
ప్రజల ఓట్లతో ప్రభుత్వపు సీట్లలో నిలిచిన నాయకులకు

ప్రజలంటే గిట్టదు అని సత్యం చెప్పి ఛీ కొట్టారు కవి
డబ్బులేందే ఉద్యోగం రాదు అటు వివాహంకాదు ' 28
స్టార్వేషన్ అణచలేకున్నా స్టార్వార్పై మోజు
మంచి నీరు కరువైనా మహానాడుపై మోజు '

ఇట్లా ప్రపంచ - దేశ రీతి రివాజుల చూపించారు 'లయం' - పు 28లో 'విద్యాలయంలో విద్య,వైద్యాలయంలో వైద్యం కార్యాలయంలో కార్యం, న్యాయాలయంలో న్యాయం నామరూపాలు లేకుండా లయమవుతోంది అందుకే భవిష్యత్తును తలచుకుంటే భయమవుతోంది'' అన్నారు ఎందుకంటే అందుకు కారణాలు ఇవి

రాజ్యం వీర భోజ్యం అది నాటి మాట, స్వరాజ్యం కలవారి భోజ్యం ఇది నేటి పాట
ఔను మరి - ఇది ప్రజాస్వామ్యం అందుకే అంతటా మ్యాం మ్యాం !'' పు 20

హాలా హలం 'లో అచ్చంగా సామాజిక కవితలున్నాయి ప్రణయగీతాలు, ప్రకృతి వర్ణనలు లేకపోవడం విశేషం ఈ పుస్తకం సినీజంట కృష్ణ విజయనిర్మల' గారలకు అంకితంగా డా దాశరథి, డా సి నా రె ఆత్రేయ, ఆరుద్ర గారల పీఠికలతో వెలువడింది అంతర్మథనం కంటె హలాహలంలో ప్రజాకవిగా కృష్ణ చాలా ఎత్తుకు ఎదిగారు ఈ 72 పుటల పుస్తకంలోని వచన కవితలు పాఠకులను ఆకట్టుకొని ఆలోచింపజేసేవిగా వివిధ శీర్షికలతో ఉన్నాయి

' అది అర్ధరాత్రి, అందరినీ శోక సాగరంలో ముంచెత్తిన వ్యర్థరాత్రి,
పగలంతా చెమటోడ్చి, ఒడలెరుగక నిద్రిస్తున్న శ్రామికులకు
తెల్లవారితే తమ బ్రతుకులు, తెల్లారుననే విషయం తెలువని రాత్రి పు 1

ఇది భోపాల్ విషవాయు దుర్ఘటన వర్ణన ''అడవి మృగాలకంటే నగర మృగాలు సదా వేటాడే ప్రమాద ప్రవృత్తి కల వన్నారు - పు 7 ఆచరణ లేని బడాయి కవుల నిరసించారు - పు 40, మతం వ్యాధి మహాభయంకరమైనదని ఇట్లా హృదయస్పర్శిగా చెప్పారు - 46

' క్షయ వ్యాధి సోకితే, ఇంటిల్లిపాది అంటుకొంటుంది
కలరా సోకితే గ్రామంగ్రామమే అంటుకుంటుంది కాని
మతం వ్యాధి సోకితే, దేశం దేశమే అంటుకుంటుంది ''
''ఎందుకు ఎదలో వేదన చింతలు తొక్కెను నేడు
ఎందుకు నా కళ్లల్లో ఎరుపు మెరుపు మెరసె చూడు '' ఎందుకంటే
''ఎటు చూసిన విషపూరిత కుటిల రాజకీయాలే'' - పు 50 అందుకే -
'ప్రజా సముద్రుడు నిర్నిద్రంగా, విప్లవించే విప్లవ గీతాలు
' సహనం సన్నగిల్లి శాంతి సముద్రుడే రుద్రుడై ఉప్పొంగి వస్తే, ఉప్పెనలా ముంచేస్తే,
ఏ తీరమూ ఎదురునిలవదు ఏ అధికారమూ నిలిచి సాగదు'' - 53

విషయ విశ్లేషణతోపాటు రాగల పరిణామాలను కూడా స్పష్టంగా విప్పి చెప్పడం ఈ కవితల ప్రత్యేకత, చివరి కవిత శ్రీశ్రీ సంస్మృతి

ఆంధ్ర ప్రభలోనో జ్యోతిలోనో ప్రకటితమైన వీరి చిత్రసూక్తి కవితలు మనసా - తెలుసా'గా రూపొందింది ఇది ఈ కవిగారి మనసుకు అతిగా నచ్చిన రచన పాఠకుల ఎదలో నిలిచిపోయే విలువైన ముక్తక (మౌక్తికా)లు ఇందులో అనేకం ఉన్నాయి మచ్చునకు రెండు

ఆశరేకెత్తించ వివిధ సంస్థలపేర అవార్డులుంటాయి మనసా!
సృజన పరులను మరచి సుముహూర్తమున అవియె భజన పరులను చేరు తెలుసా!
మఱ్ఱి ఎంతగ పైకి పెరిగినా ఊడలతొ మట్టి తల్లికి మొక్కు మనసా!
తన నీడలో మఱ్ఱి ఏ యితర చెట్టును తలయెత్త నీయదని తెలుసా!

సంప్రదాయాన్ని వీడకున్నా సామ్యవాదాన్ని కోరుకున్నా మమతా మానవత్వాలు సమతా సాధన కావించడానికి బలంగా కలం నడిపిస్తున్న - కవితలు వెలయిస్తున్న మంచి మనసున్న వారు వడ్డేపల్లి కృష్ణ సినీ కవి

## 10 బల్మూరి కమలా మనోహర రావు, బి ఏ బి ఇడి. 7 2 12బి మంకమ్మతోట కరీంనగర్

కమలా మనోహరరావుగారి జన్మ గ్రామము కరీంనగర్ సమీపంలోని మోదుంపురం

రావు గారు 1950 నుండి రచనలు చేస్తున్నా అవి పత్రికల్లో కనిపిస్తున్నా, సాహితీ సమావేశాల్లో వినిపిస్తున్నా వీరి ఒకే ఒక గేయ కవితా సంపుటి 'మేధానాటకం 1974లో ప్రచురించారు "వేలూరి సహజానంద గారు ఎవరెవరు' పుస్తకంలో ఈతని పరిచయం చేసిరి ' 1960, 1954లోనే సి నా రె వీరిని రచయితగా 'సారస్వత జ్యోతిలో పేర్కొన్నారు వ్యాసంలో మేధానాటకంలో ఎక్కడా ముద్రణ సంవత్సరం లేదు అందులోని చివరి కవిత కందుకూరి వీరేశలింగం గారి 105వ జయంతిది అది 1974 వ్యక్తితో పరిచయం ఉన్నా పైన పేర్కొన్న వివరాలు వారి పుస్తకం అట్టపైవి

ఓ కవితా కన్యకా
నీ యొడిలో నిద్రానిమగ్నుడినై కమ్మని కలలు కంటున్నాను
నాస్మరించేది సుకవి లోకాలను, విస్మరించేది జీవిత శోకాలను
అధిగమించేది పవనాంధోలోకాలను, విశ్రమించేది స్వర్ణోకాలను
నా మేధానాటకంలో, కాలం బలిపీఠం ముందు
కామాంధుల బలి, ధనాంధులనులి, మదాంధుల వెలి
ఇంతటితో నిష్క్రమణం - ప్రథమాంకం సమాప్తి "



నాలుగంకాల ఈ 'మేధానాటకం చిద్విలాస శీర్షికలో
"తీరీ తీరని సందేహాలు అందీ అందని సమాధానాలు
అన్నియును సశేషాలు ఇంతటితో నిష్క్రమణం " అంటూ
"ఈ నా నాటకం ధ్యేయం చమత్కారాల ఆవిష్కరణ
అవినీత్యధర్మాల బహిష్కరణ సంఘాల సంస్కరణ
నవ నవోన్మేష శాలినీ ప్రతిభావ్యుత్పత్తుల సంపుటీకరణ
చెదిరిన భావాల సేకరణ వశీకరణ సమీకరణ
ఇంతటితో ఇది అంకం సర్వమేవ సంపూర్ణం "

తర్వాత 'మా భాషామాధుర్యం', విశ్వకవి, కందుకూరి, జవహరుని మరణం, 26 జనవరి, వంటి శీర్షికలు భావనా పరాలుగా మరికొన్ని కవితలున్నాయి శూన్యాన్ని అభిమానిస్తూ ఆరాధిస్తూ అదే సర్వస్వం అంతిమ లక్ష్యమని ఓ గేయముంది (55 57 పుటలు)

"కూతలన్నీ గానాలైతే వ్రాతలన్నీ కవనాలైతే/ వాయసానికి కోకిలమ్మకు తారతమ్యం దేనికి? ' 52

ఇంతటి సరళ సహజ సుందర భాషభావం కల వీరి 'బాధానుభవం చివరి గీతంలో పదశైలీభావ వైఖరి చూడండి

నరవాహనారోహనోద్యోగుల, ఉపక్రమణ హరవాహనారోహనోద్యోగానికి
ఖరవాహనానుభవం కానీ కలిగితే, కడలేని సంతోషం ఎనలేని ఆనందం '
అందుకనే బ్రతికి చచ్చేబాధలు పడేవాడి కన్న చచ్చేట్లు బాధలు పడి బ్రతుకు బాటనుపడిన వాడే నయమంటారు డా॥ సి నా రె గారి అభిప్రాయం (పుస్తక పీఠికలో) ఇలా ఉంది

'కమలా మనోహర రావు గారు రచనా శిల్పంకంటే భావావిష్కరణకు ప్రాధాన్య మిస్తున్నకవి అలాగే గాఢాను భూతుల కంటె గమ్మత్తైన అభిప్రాయాల మీద మోజున్నకవి "

రావు గారి మనస్సులో వచస్సులో తెనాలి రామలింగకవి వేమన జతగా చేరి ఈ ఆధునిక కవితా నాటకం ఆడించారనుకోవచ్చు ప్రతిభకు తగిన కవితా సృష్టి చేయని కవి కమలా మనోహర రావు గారు తొందర అశ్రద్ధలేకపోతే ఆసక్తిని కార్యరూపంలో పెడితే మనోహర మహాకావ్యాలు వెలయించగలిగే వారు కమలా మనోహర రావుగారు

**II కనపర్తి - హనుమాజీపేట, సిరిసిల్ల జ 1936**

కనపర్తి' కవి గృహనామం ఇంటిపేరు కలంవేరుగా 1950 నుండి కవితా వ్యవసాయం సాగిస్తున్న కవి కనపర్తి లక్ష్మీనరసయ్య గారు వీరిని మూడు కవిత పుస్తకాలు ముద్రణ పొందాయి

కనపర్తి గారు 1958లో కలన 'పేరుతో వాస్తవాలు' అనే పద్యశతకం రచించారు ఆ తర్వాత వీరి కవితా సంపుటి దీపశిఖ 1974లో వెలువడింది ఇది డా సి నారాయణరెడ్డి గారికి అంకితం ఇవ్వబడింది మూడవది పరాజిత గేయకావ్యం

"మానవత్వపు మనుగడ కోసం మనిషి చేసే పురోగమనమనేది విశ్వశ్రేయస్సు ఈ మహాసందేశాన్నే కవితలో చెప్పాడు కనపర్తి అతని ఉక్తిలో శక్తి అది అశక్తి కవితకొక రక్తిని ప్రసాదించింది విశ్వజనీనతను సంతరించింది" అన్నారు డా జి వి సుబ్రహ్మణ్యం గారు పుస్తక సమీక్షలో ఇందలివన్నీ మత్రాఛందోగేయాలు కావడం ఓ విశేషం



'మానవుడా! మానవుడా! మాంద్యమునిక వదులుకొనుము
మానవతా ప్రాంగణాన మహస్సులను నింపుకొనుము"
అలా కావ్యారంభం హెచ్చరిక ఇలాగుంది
"గత చరిత్ర నొక్కసారి కనులముందు నిలుపుకొనుము
కాలానికి నాగరికత కట్టిన గోరీల గనుము" ఆకాంక్ష ఇది –
'యుద్ధభయము వాపి యెటుల ఉద్ధరింతువో ప్రాణుల
మాలిన్యము కడిగి యెపుడు మార్చెదరో భువిని దివిగ"
బ్రతుకుల విలువలు - లో 10వ పుట

'గుళ్లను రాళ్లను కొలిచే గ్రుడ్డివాళ్లు ప్రభులైతే / సజీవ మానవ శక్తికి సరియగుమూల్యము దొరకదు
రారాజుల జీవితాలు గ్రంథాలుగ ప్రచురిస్తే / క్షుద్రుల బ్రతుకుల విలువలు ముద్రణకే చాల లేదు"

40 పుట "అతడు కృష్ణుడు ప్రతిభలందున, అతడు బుద్ధుడు తత్వదృష్టిని, అతడశోకుడు పాలనమ్మున, అతడు యుగపతియే "ఈ ముత్యాల సరాలు గేయాలు నెహ్రూజీ ప్రశంస

మొదటి భాగంలోని కవితలన్నీ సామాజికాలు - రెండవ భాగం లోనివి ఆత్మాశ్రయంగా ఉన్నాయి "ఇంకా ఎంతో ఉజ్వల భవిష్యత్తు ఉన్న కనగర్తి రచనలు అభ్యుదయ పథంలో అమరంగా సాగుతూనే వెలుగుబాటలను సృష్టించాలి అని ఆశిస్తున్నాను" డా జి వి సుబ్రమణ్యం

కాని ఆకాంక్ష సిరిసిల్ల ప్రాంతపు ఎందరో అభ్యుదయ యువకవులకు మార్గదర్శి కనపర్తి గారు ఆయన హేతువాది ఆధునిక కవిత్వవేది

## 12 పురాణం రామచంద్ర - వేములవాడ నివాసం కరీంనగర్

రామచంద్రగారు విద్యార్థి కాలం నుండి కవి సాహిత్యాభిమాని ప్రముఖ దినపత్రికకు విలేఖరిగా పనిచేసిన వీరు కరీంనగర్ నుండి 'చిత్రిక వార పత్రికను నడిపారు

వచన రచన వచన కవిత్వంలపై వీరికి అభిమానం జాస్తి వీరి ఏకైక వచన కవితా సంపుటి 27 వసంతాలు 1974లో వచ్చింది ఇది 27 కవితలు 70 పుటలు పుటల సంఖ్య వేయలేదు కవితా శీర్షికలకు తలకట్లు అని నూతన నామంపెట్టారు

కవి మిత్రమా గంజాయి మత్తుకలవాటు పడిన వాళ్లు, నిజాన్ని నువ్వు చెప్పితే నమ్ముతారా?
అడగకుండానే ఇచ్చే సలహా బూడిదలో పోసిన పన్నీరు కాదా?
నిరక్షరాస్యత తొలగి పోలేదు, నీ అక్షర సత్యాలు ఎవరు చదవాలి?

లంచాల - వంచనల నిరసన 2 ఆగరువత్తిలాంటి దీ జీవితం 3, నాల్గవ కవితలో - కులమత వర్గాల క్రిమికీటక నిలయమై ప్రగతిని తిని శతాబ్దాలుగా శాసిస్తూ బ్రతుకుతున్న మంత్రాల మర్రి ఈ సమాజం అని నిందాత్మక విశ్లేషణలు కావించారు ఇజాల సరిహద్దుల సంకుచిత కవుల విమర్శ 5 తల్లి సంస్కృతిని కాదని విదేశ నాగరికతా వ్యామోహాన్ని వెక్కిరించడం మరో కవిత ఈ 27 కవి వయసు - సంవత్సరాలు అవి వసంతాలన్నా గ్రీష్మాతపాలు, కన్నీటి జడివాన జల్లులు ఇందులో ఉన్నాయి

వంగిన వాడి వీపు పైనే బరువులెత్తుతారు వీళ్లు
పరుగెత్తువాడినే వెన్నాడి తరుమును తోడేళ్లు
స్వరాజ్యమ్ము వెలిసి ప్రజాస్వామ్యము వర్ధిల్లాలను
ఇరవై ఆరేళ్లబాట ఈనాడది నీళ్ల మూట - 15

సామాజిక దుస్థితికి కవి హృదయం పొందిన అలజడి, పరిస్థితులను మార్చుకోవాలనే పరితపన ఈ కవితల్లో కనిపిస్తాయి తాను నమ్మిన నిజాన్ని నిర్భయంగా చెప్పిన కవి పురాణం రామచంద్రగారు

## 13 డా రావికంటి వసునందన్, ఎం ఏ పిహెచ్ డి కమాన్‌పురం జ 1949

వసునందన్ గారు డా అంబేద్కర్ సార్వత్రిక విశ్వ విద్యాలయంలో తెలుగు రీడర్‌గా పనిచేస్తున్నారు తెలుగు సాహిత్యాభిమానంతో వీరు రచించిన గద్య పద్య గేయ కావ్యాలు దశాధికంగా వెలువడ్డాయి వీరి వచన గేయ సంపుటాలు రెండు ముద్రణ పొందాయి అవి ఇవి 1 వేణీ సంగమం - 1975, 2 సాధన - 1981

వేణీ సంగమంలో మాత్రాఛందోబద్ధగేయాలున్నాయి అందులో ఒకటి కవి స్వీయ వర్ణన కవిత్వపరంగా కావించుకొన్నది చూడండి

ఉషాసుందరి కంటికోనల, పద్మినీ కర కుట్మలంబుల
మలయ పవన తరంగడోలిక నుదయమందితి నేను కవిని!
నా శరీరము దయా రూపము, నాదు ప్రాణము, ప్రేమ ధామము
నా సుకవచము శాంతి తేజము, నాదు నీడయె సమతభావము

సాధన సంపుటిలో కవి సామాజిక దృష్టి విశాలమైంది - తీవ్రమైంది ఇందలివి వచన కవితలు వానిలో కొన్ని కవితల భాగాలివి

"వాన కురిసే మబ్బు, పంట పండే నేల,
వంట వండే నిప్పు, గుండె గుండెకు ప్రాణం ఇచ్చే వృక్షం - అమ్మ "
"నిజానికి ఇవ్వటమే జీవితం, కావాలనుకోవడం మరణం
మరణాన్ని వరించేజీవితం, మాతృ యౌవన వనకురారం" -పు 33
"సృష్టి రెంటి చుట్టే తిరుగుతున్నది అనాదిగా పడతి, పైస!
ధర్మ మోక్షాలకు 'కవిరాత' అక్కర్లేదు" పు 50
రాజకీయం, వృద్ధవేశ్య, దాని శరీరం పరవళ్లు తొక్కదు,
కానీ దాని వాసన, జాతి సారాన్నే పీల్చి వేస్తుంది
ఎక్కడ కండ ఉన్నదో, అక్కడ జలగలా పట్టేస్తుంది ఆదాహం తీరేది కాదు
రాజకీయం మహాస్త్రమే, కాని దారి తప్పితే శస్త్ర చికిత్స తప్పదు - పు 28

సంప్రదాయ భావాలతో ఎదిగి, ఆధునిక ఆలోచనలలో ఒదిగి, ఆదర్శాలను పొదిగి కవితలు వ్రాస్తున్న కవి డా రావికంటి వసునందన్ గారు

## 14 జక్కని వెంకటరాజం, సిరిసిల్ల జ. 1947

జక్కని వెంకటరాజం చక్కటి కవనశక్తి కల వ్యక్తి వీరు జన్మపట్టణమైన సిరిసిల్లలో 'సెస్' విద్యుచ్ఛాఖలో ఉద్యోగం చేస్తున్నారు వెంకటరాజం గారి ఏకైక వచనకవితా సంపుటి అర్ధరాత్రి సూర్యుడు అందమైన ముఖచిత్రంలో 1976లో వెలువడింది 1 యువస్వరాలు - 1973 గేయ సంకలనంలోని సిరిసిల్లా అయిదుగురు కవులలో వీరొకరు

అర్ధరాత్రి సూర్యుడులో వివిధ శీర్షికలున్నా అన్నిటిగమ్యం ఒక్కటే అన్నట్లుగా అవినీతి నిరసన సమసమాజసాధన కోసం కవి కలం వడిగా వాడిగా పరుగుతీసింది



కవిగారి 'మనసు తిరగబడింది' ఎందుకంటే -
"మనసులోన బడబాగ్ని, మండి ప్రజ్వరిల్లుతోంది
గుండె మంటల్ని చల్లార్చే ఫైరింజన్లు కరువయ్యాయి
గుడిలో మ్రోగుతున్న గంటలు, రాళ్లమీద ద్వేషాగ్ని, రగిల్చాయి
రాళ్లను నమ్మిన సగటు మనిషి గుండె, రాయైపోయింది "
అందుకే ఈ కవి అర్ధరాత్రి సూర్యుడిని ఉదయింపజేశారీ విధంగా
'అర్ధరాత్రి సూర్యుడుదయించాడు, అఖిలలోకానికి వెలుగునందించాడు
అందరూ కళ్లు తెరవండి! మనకోసం, మన చీకటి బ్రతుకుల్ని వెలిగించడం కోసం
చీకటిలో సూర్యుడుదయించాడు, చేతనా కేతనాన్ని ప్రతిష్ఠించాడు
మనల్ని దోచుకు తింటున్న దళారి, దగుల్బాజీ వర్గాల
పనిపట్టడానికి, మన వీపులు తట్టడానికి, అర్ధరాత్రి సూర్యుడుదయించాడు "

ఆధునిక కవులకు సామాజిక కల్లోలాలే కవితా వస్తువులు ఇది యుగధర్మం ఉద్బోధతాము నమ్మిన సిద్ధాంతాల బట్టి, ఆశయాలు వ్యక్తి ఆలోచనా సరణిని బట్టి ఉంటాయి వేంకటరాజం గారు సగటు జనం పక్షం నిలిచిన అభ్యుదయ కవి

## 15 అలిశెట్టి ప్రభాకర్ - జగిత్యాల 1954 - 93

అలిశెట్టి ప్రభాకర్ చిత్రలేఖకులు - ఛాయాచిత్ర గ్రాహకులు సామ్యప్రవర్తన చిరునవ్వు అలంకారంగా గల ఈ యువకునిది తీవ్రవాద మార్గం అందుకే వామపక్ష సామ్యవాద విప్లవ భావాలతో వచన - మినీ కవితలు రచించారు ఫోటోగ్రఫీ వృత్తిగా స్వస్థలమైన జగిత్యాల నుండి కరీంనగర్ మారి, ఆ తర్వాత హైదరాబాద్‌కు చేరినారు ప్రభాకర్ పదేండ్లు విరసం సభ్యులు నిరంతర కవితా వ్యాసంగం, అవిరామ ఆలోచనలతో ఆయన తీవ్ర అనారోగ్యానికి లోనై 1993లో 35 40 ఏండ్ల నడిమి యువవయస్సులో అకాలమృత్యువు వాతపడ్డారు కవి మిత్రులు డాక్టర్లు, లాయర్లు పత్రికా విలేఖరులు ప్రభాకర్ గారికి చివరి దశలో హార్దికంగా ఆర్థికంగా ఎంతగానో సహకరించారు ఒక్క శ్రీశ్రీకి తప్ప మరే వామపక్ష సిద్ధాంత ప్రేమికుడైన తెలుగుకవికి ఇంతటి ప్రజాస్పందన - జనాదరణ, కనిపించలేదు లభించలేదు అనటం యధార్థం

"మరణం నా చివరి చరణం కాదు ' అని తుది శ్వాసవీడే సమయంలోనూ తనదైనబాణీలో ప్రజాకవితావాణి వినిపించిన అచ్చమైన స్వచ్ఛమైన ప్రజాపోరాటకవి అలిశెట్టి ప్రభాకర్ గారు

వీరి పుస్తకాలు - 1 చురకలు - 76, 89, 2 ఎర్రపావురాలు 78, 3 మంటల జెండాలు 1983 4 రక్తరేఖ - 83, 89, 5 సంక్షోభగీతం 1990, 6 సిటీ లైఫ్ - 1992 6 మరణం నా చివరి శాసనం కాదు - 1994

ప్రభాకర్ గారివి మినీకవితలు అందులో కార్టూన్ కవితలు అధికం వారి కవితలకు వారే చిత్రాలగీసి, ప్రచురించారు విరసం సభల సందర్భాల్లో వాటిని ప్రదర్శించారు వీరి వ్యంగ్య భావ-రేఖా బాణాలు సూటిగా పాఠకుల గుండెలకు తాకేవి అవి నవ్వించినా నొవ్వు కలిగించినా ఆలోచింపజేయడం వాటి అంతస్సూత్రం వీరి రచనలలో చురకలు, రక్తరేఖ, సిటీలైఫ్ మినీకవితా సంపుటాలు మిగతా వానిలో వచన కవితలెక్కువ

ఎర్ర పావురాలు ముద్రణ సంవత్సరం లేకున్నా శివారెడ్డిగారి పీఠికను బట్టి 77-78లో వెలువడిందనుకోవచ్చు పుటలు - 50 ఇది వ్యాపార మిత్రుల ప్రకటనల పుటలతో సహా వెలువడింది ట్రీట్‌మెంట్, నిరోహ్మమాటం, కళ్లుతెరవండి తేడా జాగ్రత్త న్యాయస్థానం ఆశయం ఇందలి శీర్షికలు ఇందలి ఒకానొక కవిత 'మురికి చిత్రం' చూడండి

బూరుగు చెక్కల్లాంటి బొక్కలకు, ప్లాస్టిక్ కవర్ ప్యాకింగ్ వంటి దేహం (బొక్క - బొమిక)
పెంటకుప్పలా స్ఫురించే ఆనెత్తి కింద రెండు గుహల్లో వెలుగలేని దీపాలు కళ్లు
అడవిలాంటి మహానగరాల్లో ఇలాటి వాళ్లకి లెక్కలేనన్ని చెట్లు ఇళ్లు
ఒక చిన్న నలు చదరపు అల్యూమినియం బిళ్లకోసం (ఆనాటి ఐదు పైసల నాణెం)
కళ్లు చేతుల్లోనే జోడ్పించి ప్రాధేయపడుతాడు
ఏమీ అనలేక, కడుపులో లుంగ చుట్టుకు పడుకున్న పేగుల్ని తిడతాడు
మరో కవిత 'ప్రశ్న' ఇది
సున్నితమైన ఎన్నో పూలను మేము మోస్తున్నామని విర్రవీగే కొమ్మలారా!
మిమ్మల్ని అనుక్షణం కంటికి రెప్పలా కాపాడుతూ నీకండగా ఉండేది ఎవరు? కాండం
అది కూడా అలాగే అపార్థం చేసుకుంటే అహంభావం పెంచుకుంటే -
ఎన్నాళ్లనుంచో మీకోసమే త్యాగం చేస్తూ
అజ్ఞాత వాసం గావిస్తూ అడుగుననే పడి ఉన్న వేళ్ల మాటేమిటి?

ఇలా ఈదేశ సామాజిక 'వ్యత్యాసాలను' చూపుతూ నిర్మోహమాటంగా శస్త్రచికిత్స' చేయాలని 'సామాన్యు'నికి హెచ్చరిక చేస్తాయీ కవి కవితలు

'ఎర్రపావురాలు ఎగరేయటానికి ముందే సమాజానికి 'చురకలు -1976 అంటించిన ప్రభాకర్ గారు 1983లో మంటల జెండాలు ఎర్రరంగువి కాబోలు ఎగరేశారు ఇవి అక్షరాలా అరుణ పారావతాల పక్షాల రెపరెపలే దీనిలో మినీ కవితలే ఎక్కువ 'అంతర్ఘోష' 'పెత్తందార్లు' 'అంతుచూద్దాం' లాంటి కొన్ని కవితలు కాస్త పెద్దవి అవి కవి భావ ప్రతీకలుగా ఎగిసిన పతాకాలు

రక్తరేఖ - 1989 విప్లవ సాహిత్యంలో అరుదైన కవితల అందమైన పుస్తకం ఇందులోని అరవై శీర్షికలకు కవి అర్థవంతమైన రేఖా చిత్రాలు అందించారు ఇవన్నీ కవి పూర్వ సంపుటాల్లోని మినీ కవితలే

సంక్షోభగీతం - 1990 ప్రచురణ, దీనికి ఇన్నర్ టైటిల్ లేదు విషయ సూచిక లేదు 24 పుటల వచన కవితలు నువ్ క్షమార్హుడివి కాదు' 'లెటస్‌గో' అంటూ 'జ్వలించే అక్షరం తో వీరుడితో కరచాలనం బాటలుగా ఉన్నాయి 'సూర్యుడునా ముఖచిత్రం' అని చెప్పారిందులో ప్రభాకరుడు

వరవర రావుగారి పీఠికలోని మాటలు ఈతరపు పోరాటకవులకు కళాకారులకు కార్యకర్తలకు వెలుగు బాటలుగా ఉన్నాయి 'ముఖచిత్రం'లో ఆయన ఈ పుస్తకానికి 'సంగ్రామగీతం అంటే బాగుంటుందన్నారు

మరణం నా చివర చరణం కాదు - ప్రభాకర్ గారి కవితా సంపుటిని కవి మరణానంతరం జంట నగరాల విప్లవ రచయితల సంఘం 1994 జనవరిలో ప్రచురించింది ప్రభాకర్ పుస్తకాలలో ఇదే పెద్దది డెమ్మీ 75 పుటలు గెటప్ కూడా బాగుంది దీనిలో ప్రభాకర్ గారి చివరి కవితలతో పాటు పాత-పూర్వ సంకలనాలలో ముద్రితమైన కవితలను కూడా కొన్నింటిని ఏరికూర్చారు

వరవరరావు గారు ఈ కవి మృత్యువార్త విని స్పందించి వ్రాసిన కవిత పుస్తకం మొదట కవి మరణ సన్నివేశాన్ని చూసి నిశ్శబ్దవేదనతో వ్రాసిన ఆశారాజు కవిత కృతిచివర పాఠకుల గుండెలను పిండుతాయి



మరణం నా చివరి కవితాచరణం కాదు
మౌనం నా చితాభస్మం కాదు
నిర్విరామంగా నిత్యనూతనంగా
కాలం అంచున చిగురించే నెత్తుటి ఊహను నేను
కలల ఉపరి తలమ్మీద కదలాడే కాంతి పుంజం నేను
కన్నీళ్లకి కర్తవ్యాన్ని నిర్దేశించే దిక్సూచిని నేను అంటూ

ఇంకా - ఈ కవి అగ్నిపద్యం, దగ్ధగీతం, అక్షరక్షిపణి, అడవి, కడలి, మానవ సమూహాల సంఘర్షణల తనకు ఉపమానాలుగా చెప్పుకున్నారు ఆకలి నేపథ్యంల్లో అక్షర ఆయుధంగా కవితలున్నాయి చివరగా కొన్ని కవి చిత్రించి కవితావ్యాఖ్యలు వ్రాసిన రేఖా చిత్రాలు, ఛాయా చిత్రాలు ఉన్నాయి రాజకీయ నాయకుల, సినీనటుల, సాహిత్యకారులను వీరు విమర్శించిన తీరు సూటిగా మహోఘాటుగా ఉంది

క్షుధార్తుల అశ్రు ధారలు- బాధితుల కృధాగ్ని కీలలు ప్రభాకర్ గారి వచన కవితలు అవి తుపాకీ తూటాలు, ప్రజా పోరాటకారులను ముందుకు నడిపించే ఆశలమూటలు, అభ్యుదయ కవితాభిమానులకు గుండెలు పులకరించే పాటలు - తిరుగుబాటు బాటలు

ప్రభాకర్ గారిమినీకవితల పరిచయం తర్వాత చేయబడుతుంది

## 16 తుమ్మల దాదారెడ్డి - వెల్ది

దాదారెడ్డి గారు శ్రీశ్రీ అభిమానం కలకవి వీరు తీవ్రవాదంతో వచన కవితలు వ్రాశారు కాలక్షేప కథలు వ్రాస్తే అవి మద్రాసు కథాంజలి లో ప్రచురణ పొందాయి వీరి సాహిత్య సామాజిక సమీక్షా వ్యాసాలు జమ్మికుంట రచ్చబండ పక్షపత్రికలో వచ్చాయి దాదారెడ్డి గారు వెల్ది గ్రామ సర్పంచ్‌గా పనిచేశారు రాజకీయాలు వదలి ప్రభుత్వం ఆరోగ్య శాఖలో పనిచేశారు తర్వాత వ్యవసాయ వ్యాపార రంగాల్లో చేరారు వీరి మరోప్రపంచం వచనకవితా సంపుటి 1978లో వచ్చింది

దాశరథి రంగాచార్య, మలయశ్రీ, నవీన్, బి వి రామారావు మొ॥ రచయితల రాజకీయ నాయకుల వక్తలుగా ఆహ్వానించి, ముద్దసాని రాంరెడ్డి గారి అధ్యక్షతన వీరి పుస్తకావిష్కరణ సభ (వారి స్వగ్రామమయిన వెల్దిలో) జరిపించారు ఈకవి కలానికి వాడి ఎక్కువ మచ్చునకు

కాల్చే అరుపులు కడుపులు, కరువైపోయిన మెతుకులు

నిలువెల్లా అన్యాయానికి, బలియైపోయిన బ్రతుకులు

అవినీతి అయ పాదాల క్రింద అణగిన ఆరని చూపులు నిరుద్యోగుల పాట్లు ఉద్యోగుల అగచాట్లు, ఇవి నా జీవనకడలిలో, వినిపిస్తున్న హోరులు చైతన్యజ్యోతి మే 79, పు 18

జీవితం ఒక క్రొవ్వత్తి, వెలిగి మలిగేకాలంలో / రెపరెపలాడే మనసు

కాలుతూ కాంతిని వెదజల్లి, కాంతిని నిలుపువాడే మనిషి 'సత్యార్థి నవంబర్ - 79

వివిధ పత్రికలలో వెలువడిన కవితల సంపుటీకరణమే దాదారెడ్డి గారి మరో ప్రపంచం" సదాలోచనతో చక్కగా వ్రాయగలిగి కవిగా ఎదగనున్న కాలంలో కలాన్ని ఆపి దాదారెడ్డి గారు అన్యాయం చేసుకున్నారు వీరి మరో కవితా సంపుటి వేదనే నా వేదం' మధ్యలోనే ఆగిపోయింది వీరి కూతురు 'రేఖ' కాలేజీ విద్యార్థిని చక్కని వచన కవితలు వ్రాస్తున్నారు

## 17 వాసాల నరసయ్య - చొలమద్ది జ.1942

వాసాల నరసయ్య గారు తపాలాశాఖలో పోస్ట్‌మాస్టర్ ఉద్యోగి వీరికి తెలుగు సాహిత్యమంటే అభిమానం కవితలు, కథలు, ఇతర వచన రచనలు పుస్తకాలుగా వెలువరించాయి వీరి కథలు కవితలు వ్యాసాలు వివిధ పత్రికలలో ప్రచురించబడినవి ఆకాశవాణి నుండి ప్రసారం చేయబడినవి ఆంధ్రరాష్ట్రంలోనే కాక, పలు ఇతర రాష్ట్రాల బహుభాషా కవి సమ్మేళణాల్లోనూ వీరు పాల్గొన్నారు

వీరి ముద్రిత పుస్తకాలు ఏడు వాటిలో మూడు కవితా సంపుటాలు

1 కర్షకుడా! కార్మికుడా! - 1978, 2 ఈ దేశం - 1978, 3 గమ్యం - 1989

ఇతర రచనలు 1 తపాల ప్రపంచం, 2 ఇడి ఉద్యోగులు 3 తపాలా చార్జీలు, 4 సమాజానికి సంకెళ్లు - కథలు వీరి కవితా పుస్తకాలలో రెండు వచన కవితా సంపుటాలు వాటిలో కొన్ని మినీ కవితలు కూడా ఉన్నాయి మొదటి సంపుటి మాత్రాఛందోగేయాలది, "బాగా చదవటం అంతకు రెట్టింపుగా అనారోగ్యాన్ని సైతం లెక్కించకుండా ఆలోచించడం, తక్కువగా వ్రాయడం "తమ స్వభావంగా వారి 6-12-1993 లేఖలో పేర్కొన్నారు

**కవితా పరిచయం కర్షకుడా - కార్మికుడా!** 42 పుటల 21 గేయాల సంపుటి కవి తమ మాతృమూర్తికి దీనిని అంకితం చేశారు

లెమ్ములెమ్ము కర్షకుడా, రమ్ము రమ్ము కార్మికుడా!
నేడు నీదె లెమ్ము లెమ్ము, రేపు నీదె రమ్ము రమ్ము
పగలు రేయి తినకుండా పనిచేసే మీకింక
పస్తులుండ పనేలేదు, వస్తున్నది మంచిరోజు -

ఇట్లా సాగిన శైలీ భావాలతో ఈ కవి, భార్య కంటె తల్లిని మిన్న అని భావించి అభినుతించారు అంబేద్కర్‌ను సంస్మరిస్తూ ఇలా అన్నారు పు 13

"మరల నీవొకసారి, మనదేశమున బుట్టు, మతిలేని కులతత్త్వ, మౌఢ్యమును పొగొట్టు"

పునర్జన్మ విశ్వాసంతో ఒక కవిత ఉంది - 15, మత ప్రీతిని మరో కవితలో చాటుకున్నారు "మతమన్నది నేడు నేల మట్టమైమ్మె పోతున్నది మానవత్వమందులకే, మంటగలిసిపోత్నుది'

పాప - 14, ఓ ప్రియతమ - 17, చిలుకమ్మ - 31 సంక్రాంతి - 27 పోచంపాడు 29 మొ॥ ఇందలి ఇతర కవితలు ప్రజా సేవకు ఈ కవి ఇచ్చిన నిర్వచనం ఇది ' ప్రజాసేవ అనుకుంటూ బయలుదేరు పనిదొంగలు - ప్రజాధనం కొల్లగొట్టి మజా చేయుగజదొంగలు' - 26 వివిధ అంశాలను స్వీయ భావాలలో వ్యాఖ్యానించిన కవితా సంపుటి ఈ గేయకృతి

ఈ దేశం 60 చిరుపుటలలో 54 వచనవితలు ఈ పుస్తకంలో ఉన్నాయి తొలికృతినాటికంటే ఈ మలికృతినాటికి కవి దృష్టిలో తీక్షత, భావాల్లో నవ్యత చోటుచేసుకున్నవి

మొదటి కవిత నాదేశం

ఈ నా దేశం ఒక దేహం అయితే, కులతత్వం ఒక కుష్టువ్యాధి మత తత్వం ఒక మహమ్మారి, అస్పృశ్యత ఒక అల్సర్ జబ్బు, పక్షపాతం ఓ పక్షవాతం

ఏఒక్క జబ్బుకైనా, దేహారోగ్యం, చెడుతుంది, ఇన్ని జబ్బులుంటే, ఇక నాదేశం ఏమౌతుంగ్ని

చివరి కవిత "ఈ దేశంలో ఇదేం న్యాయమో
కష్టించి పనిచేసేవానికి, కడుపయినా నిండదు
శ్రమకు ధిగిన కూలి, చేతికైనా అందదు , అందుకే
దరిద్రునికి ఆకలిరోగం, ధనవంతునికి అజీర్తిరోగం!"

వీరి మినీకవితలు ఉక్తి చమత్కారంతో కొత్త నిర్వచనాలతో ఉన్నాయి సమాజ దుస్థితిని ఎన్నో విధాలుగా వర్ణించిన ఈ కవి 'ఓటు నోటును పొడవాలని' క 8, రైలు పట్టాలుగా సమాంతరంగా తోడుగా జోడుగా ఉంటూనే గమ్యం చేరుకోవాలని ఆకాక్షించారు క-11

గమ్యం లో మినీ కవితలే ఎక్కువ 'నాదేశం లో విషయ సూచిక సైతం ఇచ్చి నరసయ్య గారు మిగితా రెండు పుస్తకాలకు ముద్రిత సంవత్సరాలు కూడా వేయలేదు

అంబుధిని 'అంతరంగానికి' సామ్యంగాతేవడం 1
గుండెను చెట్టుతో పోల్చడం -పు 2
బ్రతుకు ఎడారి పయనంలో, కాసంతసేద తీర్చే ఆశలే
ఒయాసిస్సులు - పు 40 - వంటి అందమైన భావాలు



ఈ సంపుటిలో చోటు చేసుకున్నాయి సామాజిక పరిస్థితుల, వ్యక్తుల స్వభావాల వర్ణనలు ఇందలి కవితా వస్తువులు

బీడువారిన మెదళ్ల బీళ్లు దున్నేస్తాను / వర్ణ జాడ్యం, మత మౌఢ్యం వర్గతత్వం
ఆరాచకత్వం అన్యాయం అమానుషత్వం/ పిచ్చి మొక్కల్ని ముళ్ళపొదల్ని-పెకిలించేస్తాను 13
అని ఉద్వేగంగా ఈ కవి శాంతంగానూ, హితము చెప్పగలరు
కలలు కమ్మగా ఉంటాయని కళ్లుమూసుకొని పడుకుంటే
కాలం గాలం అవుతుంది! నీ బ్రతుకే తెల్లారిపోతుంది! 49

అరిగిన మాటల్నుంచి మెరుగుల్ని ఎగరేశారు వాసాల ఇందులో శబ్ద చమత్కారంతోపాటు ప్రస్తుత వ్యవస్థా తిరస్కారముంది డా సి నా రె 'వీరి కవితల్లో స్పష్టత సరళత చమత్కారం మంచిలక్షణాలుగా కనపడుతై దృష్టి సమాజ సంక్షేమం టి యల్ కాంతారావు, భారతి లో -

కవికి కావల్సిన పరిశ్రమ పట్టుదల సహృదయత సామాజిక దృష్టి వాసాల నర్సయ్య గారిలో ఉన్నాయి అందుకే వారి రచనలు పరితృమనోరంజకంగానే కాక ప్రజోపయోగంగానూ రూపొందుతున్నాయి

## 18 పసుపులేటి జయంత్ కుమార్, బి ఎస్సి. ఎం ఏ (లిట్)- సిరిసిల్ల- జ.1954

సిరిసిల్లా వాస్తవ్యులైన జయంత్ కుమార్ ఇంగ్లీషులో లెక్చరర్ తెలుగులో కవితలు కథలు వ్రాయడం ఇష్టం వీరి కవితా సంపుటి చైతన్యం 1979లో వెలువడింది ఈ సంపుటిలో కవితలకు నంబర్లు లేవు 70 పుటలు కవితా పరిచయం -

పొగ చూరిన మాయింటి కప్పు మాపై నిలిచిన
వర్తమాన దృశ్యం ।వెల్ల వేసినట్టు నిగనిగలాడే।
ఆ ఎదురింటి గోడ - గాలికి - వానకు నిలదొక్కుకున్న।
ఆ పక్కింటి కప్పు । మాలోని కలలకు ।భవిష్యద్దర్శనం - పు 4

"స్నిగ్ధ మంజుల స్నేహలత అది సృష్టిలో అతి మధురమైనది' అంటూ కలల సాహిత్యాన్ని తునాతునకలు చేయా"లన్నారు 'కలగాపులగం' శీర్షిక పుట 36లో



కవనం చెప్పాలని నేను, కవిత ఒకటి అల్లాను
అల్లాను కొలిచినాను,ఏసూ అని పిలచినాను
భగవాన్ అన్నాను అందులో అరసం భావాలు కొన్ని,
విరసం భావాలు కొన్ని సంప్రదాయాలు కొన్ని
అధునాతన అలవాట్లు కొన్ని అడిగింది నా అంతరంగం
నీ కవనంలో ప్రజాస్వామ్య ప్రగతి మార్గం ఏదని?
నీ అక్షరాల వేళ్ళ విరగ్గొట్టాలి నీకవనాలకు క్రమం లేదు
అసలేది నీకు గమ్యం? నీదంతా కలగా పులగం (అని)

"ఈనాడు" యువతకు సవారిగా మారి, కళామ తల్లికి నిప్పింటించారు - 70 అంటూనే 'పల్లెటూరు నవ్వుతుంది - ప్రగతి పాట పాడుతుంది ! - అని ఆనంద గీతాలాపన చేశారు అప్పుడప్పుడు అలవోకగా, అవసరార్థంగానూ వ్రాసుకున్న కవితల సంపుటి ఈ చైతన్యం

జయంత్ కుమార్ గారి కవితలు కథలు వివిధ పత్రికల్లో వచ్చాయి

## 19. బైరి నరసయ్య ఎం.ఏ , బి ఓ.ఎల్ కోరుట్ల జ 1951

బైరి నరసయ్య గారు తెలుగు భాషోపాధ్యాయులు నటన, కవన రంగాల్లో ఆసక్తి కలవారు - గాయకులు వీరి ముద్రిత కవితా సంపుటాలు నాలుగు వాటి పేర్ల వివరాలివి

1 రస స్రవంతి - 79 2 మణిమయూఖాలు 80, 3 కీర్తిసౌరభాలు, 4 అందెల రవళి

మొదటి మూడు కవితా పుస్తకాల 500 ప్రతుల చొప్పున ముద్రింపబడ్డాయి రసస్రవంతిలో పరిదేవనము నుండి నీరాజనం వరకు అరవై శీర్షికలు ఇవి మాత్రాఛందంలో సాగిన గేయాలు

అణువణువులో సదా అలరించు జగదీశ / గుండె తలుపు తెరచి కూర్చుంటి నీ కొరకు పు 1

రమ్యమైన నాదేశము రత్నమ్ముల భోషాణము / అన్నపూర్ణ నాదేశము ఎన్నిటికో ఆదర్శము 3

ఆంధ్రభాష అన్నిరంగాల్లో ఆంగ్లభాషను అధ కరించి అభినయిస్తున్నదని ఆనందం

నా గుండియ టెంకాయను నైవేద్యముగా నొనర్చి

మాతృభాష మయూఖముల మహినింపెద దిగంతముల

అక్రమాల డొక్క చీల్చి అణచుటకై నాసత్తువ, విరివిగ వినియోగించెద విప్లవాగ్ని రగిలించెద 6

పూజ్య బాపూజీ ఆకాంక్షించిన రాజ్యం నెలకొనాలన్నది ఈ కవి ఆశయం (54)

మణిమయూఖాలు మత్రాఛందోగేయ ముక్తక కావ్యం ముకుటం ఉండి ఉంటే గేయశతకం అయ్యుండేది ఇవి 12 మాత్రల నాలుగేసి పాదాల 128 నీతి గేయాలు చెప్పిన నీతికి దృష్టాంతం వేమన పద్యాల్లోవలె చూపబడింది

సరుకు లేని ఆచార్యులు । సద్విద్యను బోధించరు
దీపములో చమురు లేక । దీప్తులు వెద జల్ల గలదె? - 4
కష్టమ్ములు వచ్చినపుడు । కనిపించును సుఖము విలువ
చీకటిలోనే శోభిలు । రాకా చంద్రుని వెన్నెల - 94

ఇందులో పాత కవి సమయాలతోపాటు కొన్ని కొత్త ఉపమలు సైతం వాడబడ్డాయి జ్యోతిష్కులు బల్లుల వంటి వారట - 99

ఆస్తికుని సదాశయములు । నాస్తికు డెపుడొప్పుకొనడు
చీకటి వెలుగుల కెప్పుడు । చేకూరదు స్నేహితమ్ము 100 సరే కాని, ఈ క్రమాలంకారంలో ఆస్తిక సదాశమాలు చీకటి కావటం కవిగారు గ్రహించనట్లున్నారు అస్తి - నాస్తి వాటి విచికిత్సల కంటే సత్ప్రవర్తన ముఖ్యం అదే బుద్ధ బుధ వాణి

అరచేతిని అడ్డుపెట్టి। ఆపలేరు సూర్యకాంతి
ప్రజా విప్లవాలనెపుడు। ప్రభుత్వబల మణచలేదు - 95 ఇది ఆస్తిక సదాశయ ప్రజాపోరాటం।

కవిత్వమెలా వుండాలి - 6 దేవుడున్నాడు - 7, దేశమెటుపోతోంది - 24, మొ॥ వాటితోపాటు పండుగలు 19, నిరుద్యోగి - 22, వాంఛ - 3, ధరలు - 16, మొ॥వి ఇందలి శీర్షికలు 'గోగులు' అనే మొదటి కవితలో-



కాషాయాంబరాలు । కట్టుకొని ధర్మాన్ని స్థాపించు। యతి రాజుల రీతి
నాస్తికత్వం నడుం విరుగగొట్టి। ఆస్తికత్వం నింపడానికి।
భక్తులడవిలో పుట్టినట్లు । భగవత్పతాకాలు పట్టినట్లు
పేదల నెత్తురుతో కట్టుకొన్న ధనవంతుల మేడల మెడలు।
విరవడానికి । అడవిలో విప్లవకారులు। ఎర్రజెండాలతో।
ఆయత్తమైనట్లు । కనబడుతున్నాయి । మోదుగు చెట్లు '
కాపీ చదువుల రౌడీ ఫోజుల విద్యార్థుల, లంచాల కాగితాలు
తినే కంచరి గాడిదల, పరువును కోరడం తప్ప బరువు మోయలేని నాయకుల నిరసన ఇందులో ఉంది

వీరి అందెల రవళి బడి పిల్లల ప్రదర్శనలకోసం వ్రాసిన చిన్నారి గేయనాటికలు

## 20 కె రాజశర్మ బి ఓ ఎల్ - వేములవాడ జ 1939

రాజశర్మ గారు వేములవాడ వాస్తవ్యులు ప్రభుత్వ ఆంధ్రభాషోపాధ్యాయులు వీరు పద్యగేయాల కవి సంగీత మర్మజ్ఞులు - హరిదాసు వీరి హరికథలు ఆకాశవాణి నుండి ప్రసారం చేయబడ్డవి శర్మగారి ఖండకావ్య సంపుటి తాండవం 1980లో అచ్చు పొందింది

'వ్యథిత హృదయం పలుకతలచినప్పుడల్లా కలం రాయకుండా నిలువ లేకపోయింది మనసు తపించినప్పుడు భక్తిగాని, విరక్తిగాని అక్షరాలై ఆకృతి దాల్చాయి మనస్విత మన్ను కఱచి స్వార్థపిశాచాల స్వైర విహారం నా వెన్నుచరిస్తే మూఢత్వాన్ని పదే పదే ఆరాధిస్తున్న అమాయకలోకం నన్ను ప్రశ్నించునట్లు తోస్తే వివశుణ్ణయి పలికిన పలుకులే ఈ పుస్తకంలో ప్రత్యక్షమయ్యే నా పద్య గేయాలు" అన్నారు కవి తమ కావ్య పీఠికలో



వీరి కవితా శైలి ఇది 'తాండవ"

కొండలదిరెను దెసల గుండెలదిరెను బుసల
చండనాగులు చెదరి యటు జార నిటు జార ॥తాం॥ పు 1
ఖండేందు ధర సుప్ర చండ ఢమరు ధ్వనియ
జాండమ్మునొకసారి - యట్టిటొ నటుజేయ
వియదభ్ర గర్భాలు - వెలికి సంతత ధార
లుర్విపై బర్వవన, రాసులిందుర్వ ॥తాండ॥ పు 3

ఇందలి శివ తాండవం' ఒక ప్రౌఢ గేయ వర్ణనాత్మక కావ్యం దీనికి ప్రేరణ పుట్టపర్తి వారి శివతాండవం అనవచ్చు కవితా భావుకత పౌరాణిక ఖండికల్లో కనిపించినా కవి హృదయ స్పందన ఆధునిక భావ ఖండికల్లో వినిపిస్తున్నది

తపస్సిద్ధి 12-29 సుభద్రార్జునుల కల్యాణం అద్వైతం - 30 38, గోపికల కృష్ణారాధన తెలుగు కళామతల్లి (49) వంచిత(54) చక్కని సరళమైన పద్య కవితలు

'కథ కంచికి'లో ఈ భక్త కవి లోక విలోకనానికి శైలీ విన్యాసానికి నవకవులూ మెచ్చుకోక తప్పదు - చూడండి కొన్నిపంక్తులు

బ్రతుకుటెడారిలో ఆశావిహంగం / రెక్కలు విరిగి నేల రాలిపడింది/
చేరరాని దూరంలో/ చేరే కోరిక లారి/ అందని తీరంలో పడింది పక్షి /
రెక్క విరిగిన పక్షి బిక్కు బిక్కుమంటు చూస్తోంది/
అన్నివైపుల ఒయాసిస్సులు / తీరని దాహంతో పక్షి కథ - ప్రాణం - మాత్రం కంచికి
చివరగా 'ఎర్రబావుటాలు'!

ఎందుకో ఆటలతోనైనా 'ఊరూవాడా అదే మాటంటున్నారు' 'ఈ శుభ సమయం మన కోసమే వీక్షిస్తున్నది' రండి పోదాం జెండానెత్తి అని కవి అన్నారు

రాజశర్మ గారు ముఖ్యంగా 'పద్యకవి, గేయకవి, ఏమందునా? అనే మీమాంస ఉండగా మరోచిక్కు పచ్చి పడింది అయన సాంప్రదాయకమా? విప్లవవాదా! బసవనీదు భక్తి బ్రాహ్మ్యంబుతో పొత్తు వదలలేను, అనేవిధానం మధ్యేమార్గం కె రాజ శర్మగారు సరస పద్యగేయ కవి వర్యులు

## 21 దూలం రామమూర్తి - ఎం కాం కరీంనగర్ కామర్స్ లెక్చరర్

ఈకవి హృదయ వీణ - 1980లో వెలువడింది

ఇందులో కొన్ని స్వతంత్ర గేయాలు మరికొన్ని రవీంద్రుని గేయాలనువాదాలు ఇంకా హిందీ ఉర్దూ నుంచి అనువదించిన కవితలున్నవి రచన సరళం పుటల సంఖ్య లేదు చిన్న సంపుటి

వాస్తవం - కోయిల స్వరంలో ।కోమటి స్ఫురణలో

మత్తెక్కిన మది । కొండంత దూరాన్ని । గుండెతో కొలుస్తుంది -

మరో వాడి గేయం

నేనొక నివురు కప్పిన నిప్పు 'నైతే'ను నాపై కాలిడిన వారిని । కాల్చేస్తా మాడ్చేస్తా

నా జోలికి రాకుండా । ప్రక్కకు తప్పుకుపోతే నాలోనేను కాలిపోయి । బూడిద నౌతాను కాబట్టి

ఓ మనిషీ! జాగ్రత్త

మనిషి మనసొక కీకారణ్యమైతే మనిషి ఒక క్రూర మృగమై
దారి తెన్ను ఏదీ లేక అదీ ఇదీ అంతా నాదేనని
భ్రమపడి తుదకు తనేదో తెలుసుకోలేని అజ్ఞానిగా
తిరుగుతాడు తాడులేని బొంగరమై -

ఇట్లా ఎన్నో సరిగమల స్వర గమకాలు రామమూర్తి గారి కవితా భావాలు వీరు నిర్మల డిగ్రీ కాలేజీలో ఉండగా 'స్వర్ణ' సాహితీ సంస్థను నడిపించి 'స్వర్ణ సరిగమలు' కవితా సంకలనాన్ని ప్రచురించారు ఆదిలాబాద్ కరీంనగర్‌లలో పనిచేసిన వీరు వరంగల్ జిల్లా నర్సంపేట డిగ్రీ కాలేజీలో ఉన్నారు రామ్మూర్తి గారి శ్రీమతి శ్రీకళ - కళావతి, ఎం ఏ హిస్టరీ ప్యాసయి తెలుగులో వచనకవితలు వ్రాస్తున్నారు ఆమె విప్లవకవి అలిశెట్టి ప్రభాకర్ గారి సోదరి

సంప్రదాయభావాలున్న ఆధునిక భావకవి దూలం రామమూర్తి గారు

## 22 జి అశోక్, లింగన్నపేట, తా॥ సిరిసిల్ల

అశోక్ ఇంటర్ విద్యార్థిగా కామారెడ్డిలో ఉండగా 'నాంది' అను పేరుతో (1980) సుమారుగా ఒక కవితా సంపుటాన్ని ముద్రించుకున్నారు సుమారు 30 పుటలున్న ఈ పుస్తకంలోనివన్నీ వచన కవితలు కంట్రోలు కవితలో 'ఎన్నాళ్ళిలా?' అంటూ, ఇలా తీర్మానించారు

"అప్పటికి ఇప్పటికి పేదలకు కన్నీల్లే । ఎప్పుడే మయినను పెద్దలకు పన్నీళ్ళే-"

మరో చోట కవిగారి ప్రశ్న ఇది -

నీవు లేనే లేవంటున్నారు మరి నీవేమంటావ్ భగవాన్!"

## 23 తిరునగరి వేదాంత సూరి - బి ఏ , కరీంనగర్ జ 1955

'సూరి' కలంపేరుతో రచనలు చేసే తిరునగరి వేదాంతసూరి గారి 'జన్మస్థలం నుస్తులాపురం తండ్రి రామస్వామి గారు ఆధ్యాపకులు కరీంనగర్‌లో స్థిరపడినారు ఇప్పుడు పత్రికారంగంలో హైదరాబాద్‌లో ఉద్యోగం చేస్తున్నారు వేదాంత సూరి

సూరి కవితలను 'భావ వీచికలు పేరుతో ఒక సంపుటిగా 1981లో సరస్వతీ బాలానంద సమితి కరీంనగర్ వారు ముద్రించారు ఇది 30 పుటల వచన కవితల పుస్తకం అంకితం ప్రేయసికి!

వీరి కవితల శైలీభావ విన్యాస పరిచయానికి కొన్ని కవితల పంక్తులు ఇట చూపబడుతున్నవి

"ప్రపంచంలో, మనుషులు మంచివారు
అనుకున్నంత, పరమమూర్ఖత్వం మరొకటి లేదు ' పు 7
"కన్నీటి ధారలు - కరిగిపోతున్నాయి, ఎదలోని బాధలు పెరిగిపోతున్నాయి
మదిలోని బాధలు - ఎవరితో చెప్పాలి, కవితగా అల్లుతూ - కాలమే గడపాలి పు 28
'పెళ్లి - చేసుకుంటే నష్టం, చేసుకోకుంటే కష్టం
మగాడు - పెరుగుతే నష్టం - పెరుగకపోతే కష్టం
ఆడది పెళ్లి చేస్తే నష్టం చేయకపోతే కష్టం
పిల్లలు - పుడితే నష్టం పుట్టకపోతే కష్టం ' పు 19

రాజకీయపు ఖజానాలో అన్యాయపు నాణాలు అక్రమంగా పెంచుతూ ప్రజలతో నాటకాలాడుతున్న వైనం దగాకోరు' శీర్షికలో, వారిని గజదొంగలుగా వర్ణించారీ కవి ఇవి కవి ఆరంభ రచనలు మరో పుస్తకం వచ్చి ఉంటే వేదాంతసూరి గారి కవిత్వం స్థిరత తెలిసి వచ్చేది సూరి సాహిత్యాభిమాని

## 24 తోట మహదేవ్ - సిరిసిల్ల

మహదేవ్ గారు అచ్చంగా ఈనాటి ప్రజాపోరాటాల నుండి పుట్టిన కవి ఏమాత్రం రాజీ లేని కలం వీరిది సామాజిక అన్యాయాల అసమానతల చీల్చి చెండాడం తోట మహదేవ్ కవిత్వం బాట వీరు ఒక వచన కవితా పత్రిక - బులిటెన్, కూడా నడిపారు తమ వచన కవితలను మినీ కవితలను ఈ క్రింది రెండు సంపుటాలుగా ప్రచురించారు

1 గుండె మండుతోంది - 1981, 2 సంకెళ్లు - 1983

మొదటి సంపుటిలో ఏ రెండు మూడో ఒక పేజీ వచన కవితలు మిగితావి మినీ కవితలు తర్వాత చూద్దాం రెండవది సంకెళ్లు వచన కవితా సంపుటి ఇది సిరిసిల్లా పోరాటంలో అమరులైన కామ్రేడ్స్‌కి అంకితం దీనికి హెచ్చార్కె పీఠిక ఉందిలా (4 పుటలు)

"ప్రిఫిక్స్ సఫిక్స్ ఏమీ లేకుండానే తన సంకలనానికి సంకెళ్లు' అని పేరు పెట్టిన తోట మహదేవ్ కవితలు సమాజాన్ని పట్టి పలారుస్తున్న సంకెళ్ల యధాతద రూపాన్ని, వాటిని తెగ్గొట్టవలసిన ఆవస్యకతను, తెగ్గొట్టగలమనే ప్రజల ఆత్మ విశ్వాసాన్ని అవి తెగుతున్న చప్పుళ్లను రకరకాలుగా చిత్రీకరించాయి "

"గుండెలో కసుక్కున, గడ్డ పార దిగేసినట్లు, కళ్లలో ఒక్కసారే, సూదితో పొడచినట్లు
బ్రతికుండగానే, మొద్దుపై, కాళ్లు చేయల్ని, ఏక్ దమ్‌న నరికేసినట్లు
మట్టి, బురద, గాలిపై ఆలోచనాత్మక కవితలు రాస్తూ
బ్యారెక్ నుండి, బాయినెట్‌లోకి । చూపుల్ని దట్టిస్తుంటే ।
నిశ్శబ్దంలో ఆవిర్లు । ఆకాశానికి ఎగిరిపోతుంటే । మనం బద్ధలవుతుంది ।
చూపుడు వ్రేల్లు । సరిహద్దును । కాపలా కాసే సైనికులౌతాయి
చెట్ల కొమ్మలు । పిల్ల రెమ్మలు । దప్పుపాటకు తలతావుతాయి ।

గాలి గీతాలతో గొంతులు కలుపుతాయి" ఇది మూడు పుటలు - ఇలా తలను తొలిచే సజీవ భావాల 108 పుటల ఈ పుస్తకం చదవాలంటే చాల ఓపిక ధైర్యం అవసరం నేటి తిరుగు బాటు కవులు భావంలో తీవ్రతనేకాదు, నాటి వేదాంతకవుల వలె భాషలోనూ స్వేచ్ఛను ప్రదర్శిస్తున్నారు వారిది భాషా ప్రావీణ్యం లేక, వీరిది, విశృంఖలత భాష తెలిసినా - తెలియకపోయినా



గుడిసెలు । కదలుతున్నాయి । గుడిసెల్లో
గుడిసె శిఖరాల్లో ఉన్న । తాటాకులు ।
ఈటెలై యుద్ధ రంగంలో ప్రవేశిస్తున్నాయి - పు 55
స్వేచ్ఛ । భూమి గుండెలో । నిద్రపోతుంది
తళుక్కున మెరుస్తూ । తర తరాలకు వెన్ను తడుతుంది
ఇనుప గొలుసుల్లో । గొంతులింకి । బండనెరికల్లో ।
రక్తం గోదారిలో కలిసి కాళ్లు చేతులిరిగినా
వేడిని వేగాని నేర్చుకుంటుంది! 77
108 పుట చివరి పంక్తులు
పాటంటే అవయవాల నెత్తురు ముద్ద / పాటంటే అక్షరాల విముక్తి సైన్యం

అయినా తోట కవితలు పాటలు కావు - మాటలు తూటాలు అచ్చంగా నేటి ప్రజాపోరాటాల చిత్రీకరణ మహదేవ్ గారి కలం బాట వారి కవిత కన్నీటి నెత్తుటి ఊట!

## 25 డా॥ బి దామోదరరావు - గూడెం నివాసం కరీంనగర్

దామోదర్‌రావు గారు సాహిత్యాభిమాని, గేయాలు, వచన కవితలు, వ్యాసాలు వ్రాశారు ఎం ఏ విద్యార్థిగా ఉన్నకాలం నుండీ సాహిత్య సంస్థలతో వీరికి సంబంధం ఉంది జానపద సామెతలు' అన్న అంశంపై తెలుగులో ఎం ఫిల్, పిహెచ్ డి డిగ్రీలు పొందిన వీరు (1997లో చెన్నూరు) కరీంనగర్‌లో ఆంధ్రోపన్యాసకులుగా ఉంటూ క జిల్లా సాహిత్య గౌతమి సంస్థలో కార్యదర్శిగా అధ్యక్షులుగా క్రియాశీల పాత్ర నిర్వహిస్తున్నారు ఇంకా వీరు 'ఆంధ్ర ప్రభ'కు సాహిత్య విలేఖరి కూడా

"నా కవిత సమత" 1981 (కౌమోదకి - కలంపేరు) డా సి నా రె, డా నాయని కృష్ణకుమారి గారల అమూల్యాభిప్రాయాలతో వెలువడింది 'సుధామ' అభినందించారు



"నా కవిత నందనవనంలో సుందర ప్రతిమ కాదు,
శ్రమైక జీవుల కర్మజల బిందువు,
శాంతి సమతల సింధువు ' పు 1
కార్మిక కర్షక సోదరుల కల్యాణం కోరేది,
నా కవిత సమత! అంటూ -
తూర్పు ప్రభవిస్తుంది సూర్యుడు ప్రభవిస్తాడు,
మంచి మానవత గెలుస్తుంది - పు 2
ఊడ్చేయండి గద్దె నుండి - ఊడ్చేయండి మనమధ్య నుండి
అధికారం ఎంతదైనా - అనుభవం పెద్దదైనా
అవినీతికి చుట్టమైతే అన్యాయమే అతని చట్టమైతే - 4
అని ఆశిస్తూ హెచ్చరిస్తూ తనను, తన కలాన్ని ఇలా వర్ణించుకున్నారు రావుగారు
అహంకారం ప్రదర్శిస్తే । ఆస్థాన కవినైనా చీదరిస్తాను
మమకారం పంచిస్తే । మామూలు మనిషినైనా ఆదరిస్తాను - 5

కాల్పనిక కవుల - 7, మతాచార పర్వాల - 10 నగర జీవితపు దగా కోరుతనాల 12 ఇలా సామాజిక రాజకీయ రంగాల విమర్శలతో వీరి కలం వీర విహారం చేసింది శ్రామికుల పక్షంగా విప్లవ పతాకాన్నెత్తారు కాని తర్వాతి కాలంలో వీరు ఈ వేడి భావాల్లో లేరు

వీరి మరో ముద్రిత రచన - సింగిడి (కథల సంపుటి)

## 26 డా కాలువ మల్లయ్య (కాలువశ్రీ) ఎం ఎస్సి. ఎం ఏ పిహెచ్ డి తెలుకుంట జ 1952

కాలువ మల్లయ్య గారి జన్మస్థలం జూలపల్లి మండలంలోని తేలుకుంట శ్రామిక కుటుంబంలో పుట్టిన వీరు ఉన్నత విద్యనార్జించి ఎఫ్ సి ఐ రామగుండంలో సీనియర్ కెమిస్ట్ ఆఫీసర్గా ఉద్యోగం చేస్తున్నారు కవితలు తక్కువ, కథలు ఎక్కువగా 300 పైగా వ్రాశారు రెండు నవలలు ముద్రణ పొందాయి వివిధ పత్రికల బహుమతులు పొందారు వీరి కవితలకు 1984లో రాయప్రోలు, కుందుర్తి అవార్డులు వచ్చాయి కథాసాహిత్యంపై తెలుగు సాహిత్యంలో డాక్టరేట్ డిగ్రీ సాధించుకున్నారు వీరి గేయవచన కవితా సంపుటాలివి

1 కవితా సౌరభం - 1982, 2 కవితా ఝరి - 1983

కవితా సౌరభం ఈ యువకవిలో భావతీవ్రత రచనా శిల్పాన్నిమించింది పేద రైతును వర్ణిస్తూ - 10 గమ్యంలో

నీలాంటి వాళ్లను ఉద్ధరించుట కొరకు / అన్నాలొస్తున్నారు ఓరన్నా నర్సన్నా

సంఘాపన్నల నీవు త్వరగా జేరుకుంటే / నీ కష్టాలే తీరునురోరన్నా నరుసన్నా - అన్నారు

12 'నాదేశం'లో మురికి వాడల్లో స్వర్గాన్ని చూపుతున్న మన దేశదైన్యాన్ని నిరసించారు మరో గేయంలో - 'ఓరోరి పోలీసోడా ఓ పొట్టకూటివాడా! మాకన్న నీదు బ్రతుకు మహాఘోరమాయె కదరా'' అని జాలి చూపారు

19 - ఈ మన బూటకపు సోషలిజంలో పేదలను నిరుపేదలుగా ధనవంతులను కోటీశ్వరులుగా మారుస్తూ - అధికార దాహంతో సీట్లకోసం నోట్ల కట్టలు పంచేవారిని తూలనాడడం ఉంది శ్రీశ్రీ నడక గేయాలు 'మిథ్య', 'దీనులారా' ఉన్నాయి ఈ కవి కవితా భావసుమాల సౌరభాలు ఘాటుగా ఉన్నాయి అని ఒప్పుకోక తప్పదు వాటికి ఓ గమ్యం ఉండటం హర్షనీయం

కవితా ఝరి - నిజంగా నిఖిలలోకం హర్షం వహిస్తుందా? అని శ్రీశ్రీ ఆశించిన హర్షం లోకంలో నిండాలని 'కాలువ' కలం పరుగుతీసింది ఈ సంపుటిలో 'ఆశియాడ్ను' విశ్లేషించింది ఇట్లా -

మింగమెతుకు లేకున్నామీసాలకు సంపెంగ నూనె

రాచుకొని తిరిగేటి ఘనమైన సంస్కృతి మాది,

అప్పుచేసి పప్పుకూడు ఆడంబరంగా తినుకుంటూ

డంబాలతో బ్రతుకునట్టి మాదండి సంస్కృతి మాది

ఆ కలానికి గరగర ధ్వనేతప్ప మెత్తదనం లేదనిపిస్తుంది రాయాలని ఉంది దేశభక్తి గీతం కాని -

కడుపు నిండా కూడు పెట్టలేక, ఒంటి నిండా గుడ్డ నివ్వలేక,

రత్నాల్లాంటి బిడ్డలను రాళ్ల పాలు జేస్తున్న

నాదేశ పౌరుల స్థితిని చూస్తూ ఏమి రాయాలంటారు ఈ కవి

అన్నదాత - సాలెన్నల అగచాట్ల పరామర్శించారు గుళ్లకు వెళ్ళే దొంగభక్తుల, ఎన్నికల్లోని జిత్తులతతంగాల, సమసమాజ సాధన పేరుతో చేసే అరాచకాలను నిందించారు

ఈ 48 పుటల 25 శీర్షికలలో కుల సంఘాల, మత మౌఢ్యాల మూఢనమ్మకాల నిరసన ఉంది

రచయితలు ధనాశతో కాల్పనిక సాహిత్య మైకంలో పడిపోక శ్రమజీవుల పక్షంగా నిలిచి చైతన్యం కలిగించే రచనలు చేయాలన్నారు సామాజిక స్పృహకల కవి కాలువ మల్లయ్య గారు

## 27 ఎస్ హర్షవర్ధన్, బి కాం బి ఇడి చంజర్ల 25-6-1963

1 ప్రభాతం 1982, 2 ఆకాశయానం 1991

ప్రభాతం వచన కవితల - కథల చిన్నపుస్తకం 40 పుటలు సుప్రసిద్ధ నవలా రచయిత్రి లతగారు ముందు మాటలో ఇట్లన్నారు "చిరంజీవి హరవర్ధన్ రాసిన ప్రభాతం అనే పుస్తకంలో కవితా ఖండికలు, రెండు మూడు స్కెచెస్ చదివాను వాళ్ల నాన్న కంటె ఇతనే బాగా రాస్తున్నట్లు నాకు తోస్తున్నది" విజయవాడ 22 6 1982 ఈ బాబు తన కృతిని తల్లిదండ్రులైన భారతి - మలయశ్రీ' లకు అంకితమిచ్చారు రచయిత ప్రస్తుతం కోడిమ్యాల మండలంలో అధ్యాపకులు 97

1 "కవిత వ్రాయాలని ఉంది, వ్రాసే మ్యాటర్ కూడా ఉంది, మెటిరియల్ కూడా ఉంది, వ్రాసే కిటుకు మాత్రం దొరకడం లేదు" అని ఆరంభించి,

2 "పదేళ్ల క్రితం సరిగా ఇదే రోజు ఇన్విజిలేషన్ స్ట్రిక్టనే నెపంతో మా కాలేజి ప్రిన్సిపాల్‌ను కొట్టిన రోజు, ఈ రోజే పేపర్ వార్త ఆనాడు అతన్ని కొట్టిన వారిలో ఒకడు ఇంజనీయరై కట్టిన ప్రాజెక్టు కూలిందని మరొకడు డాక్టరై చేసిన ఆపరేషన్ ఫేలయి జైలు కెళ్ళాడనీ" ముగింపు

7 'మావూరు' కవితలో గ్రామాల్లో జరిగే అన్యాయాల దౌర్జన్యాల అలజడుల హత్యల, వాటిని అడ్డుకునే నెపంతో క్యాంపు వేసిన పోలీసువాళ్ళ అక్రమాల సజీవ చిత్రణ ఉంది

మంచి స్నేహితులు - 3, మంత్రిగారొచ్చినప్పటి గుడి దగ్గరి బిచ్చగాళ్ళు -4, దీపావళి బాణ్ణసంచా దుబారా వ్యయాలు 5, ఎల్లోరా అందాలు 4, వేర్వేరు శీర్షికల్లో చూపారు

10 మన నాయకులు'లో

'ఎన్నోసార్లు ఎన్నికలు జరిగినా ఎందరో సీట్లు మారినా మార్చినా
ఏం చేశారీ నాయకులు జనానికి?" - అని ప్రశ్నించి,
ఎక్కడేం దొరుకుతుందా అని ఎదురుచూస్తూ
ఎత్తులకు పై ఎత్తులు వేస్తూ" ఉన్నారని తానే జవాబు చెప్పారు

ఇవి పది అచ్చంగా వచన కవితలు ఇరవై పుటల్లో ఉన్నాయి

ఈ పదేండ్లలో ఈకవి కుమారుడు మళ్లీ కవితలు వ్రాయకపోవడం వింత వచన రచనలు మాత్రం వచ్చాయి

## 28 ఏ మాణిక్యలింగం - గుండారెడ్డిపల్లి, 15-10-1955 అధ్యాపకులు

1 శాంతి కిరణాలు - 1982, మరో పద్య కృతి

మాణిక్యలింగం వరకవి సిద్ధప్పగారి పుత్రులు 1882లో ఇంటర్ విద్యార్థిగా ఉండగా వీరిది "శాంతికిరణాలు" అనే కవితాసంపుటి వచ్చింది దీనిలో 15 వచన కవితలు, ఒక పాట ఉన్నాయి అవన్నీ దేశ ప్రకృతిని మానవ ప్రకృతిని వర్ణించేవి - నీతి బోధ కావించేవి సంక్రాంతి పర్వవర్ణన, బాపూజీకి జోహార్లు, కుటుంబ నియంత్రణ మొ॥ కవితలున్నాయి 'నీవునేను' శీర్షిక ఇది –

"నీవు నేను జీవిత పరమానందంలో/ భావి భావనాతరంగాలలో
ఆద్యంతం ఒకే పథంలో నడవాలని ఆకాంక్షిస్తున్నాను
కులమతాలను కులద్రోసి/ గుణజ్ఞానేంద్రియాల నేస్తం అందాలని,

నిరవధిక శ్రమకు పాత్రత వహించి/ నీవు నేను ఈ కాలాన్ని దాటాలని/ నేను ఆశిస్తున్నాను "

వీరి అన్నగారు మహారాజలింగం (1940-70) కూడా కవి అనే విషయం ఈ కృతి అంకితం పుటలో కవి ఉటంకించారు మాణిక్య లింగంగారు ప్రస్తుతం సొంతూరిలో అధ్యాపకులు

## 29 ఆసాని రాంరెడ్డి - తంగళ్లపల్లి - 505 405

రాంరెడ్డి గారు ప్రభుత్వ ఉద్యోగి కొన్ని కవితలు నాటికలు రచించి ప్రచురించారు

లోకాలోకనం' 1983 వీరి ముద్రిత కవితా సంపుటి 23 శీర్షికలు, 76 పేజీలు 2 వేల ప్రతులు గేయాలు మాత్రాఛందో నిబద్ధాలు 'వైవిధ్యం' తో ఇలా ఆరంభం

"లవణ కర్పూరములు పోల్చిన లీలనవి యొక రూపునుండును
ఎరిగి జిహ్వాలు తెలుపు వరకును । ఏది ఏమిటొ తెలియకుండును ।
వేమన 'ఉప్పుకప్పురంబు పద్యం భావం ఈ గేయంగా మారింది
'వనిని వెలసిన మూలికలు జీ। వనములో పచ్చగనెయుండును
ప్రాణములు దీయునవి, సంజీ । వని సమమ్ములు సైతముండును'
పై పద్యంలోని 'పురుషులందు పుణ్యపురుషులు వేరయా' పంక్తి రూపం మారింది

బ్రతికి ఉన్నప్పుడు వ్యక్తిని ప్రేమగ చూడటం ముఖ్యం, చనిపోయిన వానికి పాలరాతి సమాధికట్టినా, దాని చుట్టు గులాబిపాదులు పెంచినా వ్యర్థమన్నారు 'అంతిమవరం 'లో

'నాటక మిదియని నామది। నాటితివదియే నిజమా?
చేతకాని తనము నీది । యాతన నా కనుట నిజమా పు 55

ప్రత్యక్ష దైవములో 'అమ్మ'ను ప్రశంసించారు ఇలా కవి కలం కన్ను వివిధ భావవర్ణ జాతి నీతి చిత్రాలను గీసింది ఈ కృతికి శీలా వీర్రాజు గారు వేసిన ముఖచిత్రం భావనాత్మకంగా ఉంది

## 30 'రాఖీ' - గొల్లపల్లి రాంకిషన్, బి ఎస్సి, ధర్మపురి జ. 2-5-62

రామకిషన్ గారు ఆదిలాబాద్ జిల్లాలో ప్రభుత్వోద్యోగి వచన కవితలు వ్రాస్తారు చమత్కారం - వ్యంగ్య హాస్యం ఈ కవికి సహజగుణాలు

1983లో తెలుగు దేశం పార్టీ మన రాష్ట్ర పరిపాలన సాగిస్తున్న కాలంలో మన ముఖ్యమంత్రి ఎన్ టి రామారావు గారికి అంకితంగా రాఖీ ఇదీ తెలుగుదేశం అనీ పేరుతో 30 పుటల ఓ కవితా సంపుటిని వెలువరించారు కవిగారికి 'అన్న గారిపై అభిమానం అయినా ఈ కవితలు ఆ పార్టీ ప్రచారానికి సంబంధించినవి మాత్రం కాకపోవడం విశేషం నిర్వచనాలు, నిరర్థకాలు వాస్తవాలు ఇందలి శీర్షికలు

అప్పిచ్చువాడె అసలైన వైద్యుడు/ చెప్పులపై చిత్తమున్న సిసలైన భక్తుడు
టూషన్లు చెప్పువాడె నిజమైన టీచరు/ఇలలోని నిజమిదిర వినుకోర బ్రదర్ -
సిగ్గు విడిచిన వాడు సినీస్టారు / బుద్ధిలేని వాడు విద్యా మినిష్టరు
ఒకరిద్దరినైన చంపువాడె డాక్టరు పు 1
అక్కరకు రాని చదువు, కైపెక్కించలేని మధువు
నచ్చినచ్చని వధువు, నిక్కముగ ఒక్కతీరె గదరా బ్రదర్ -3
శంకుస్థాపన జరిగి నేటికి పదో ఉగాది/ఫాక్టరీ స్థాపనకు వెలనె నేడె పునాది
పాతికేళ్ల పిదప ప్రక్కనే మంత్రి గారి సమాధి
పాడెయ్యర చరమ గీతం ఫాక్టరీకి బ్రదర్ 5

రాఖీ ఈ వ్యంగ్య వచన కవితా సంపుటంలో సినీరాజకీయ కళాసాహిత్య సామాజిక రంగాలను సున్నితంగా సునిశితంగా విమర్శించారు నిరుద్యోగానికి అవినీతికి వ్యధ చెందారు వరకట్నాల నిరసించారు నిరుద్యోగానికి ప్రేమకు స్నేహానికి తగిన నిర్వచనాలిచ్చారు అటు అమ్మగారి ఇరవై సూత్రాల పథకాన్ని ఇటు అన్నగారి తెలుగుదేశాన్నీ మెచ్చుకున్నారు ప్రజా ఉద్యమాల బలపరచారు భావ సమైక్యత, కవిత్వ పటుత్వం కొంత లోపించినా కవి ఆలోచనావైఖరి ఆదర్శకాంక్ష ప్రశంసనీయంగా ఉన్నాయి ఇది వేమన శతకం బాణీలో రూపొందిన గేయశతకం

## 31 నమిలి కొండ జగన్నాథవరావు - పూడూరు 15-5-45

జగన్నాథవరావు 'జమారా' గారు ప్రభుత్వ విద్యుచ్ఛాఖలో వైర్‌మెన్‌గా ఉద్యోగం చేస్తూ సాహిత్యాభిమానంతో జీవిస్తున్నారు వీరి వచన కవితలు వివిధ పత్రికలలో సాహితీ సంచికలలో ప్రచురించ బడినవి కొన్ని కథలు కూడా వ్రాశారు 'సృజన చైతన్య సాహితీ సమాఖ్య'ను బోయిన పల్లిలో స్థాపించి 1985లో వివిధ కవుల రచనలతో పరిమళ కవితా కుసుమాలు' అనే వచన కవితా సంకలనం వెలువరించారు వరంగల్ సాహితీరంగంలో పేరు పొందిన కవి నమిలికొండ బాలకిషన్‌రావు వీరికి అన్నగారు జగన్నాథవరావు గారి గేయ కవితా సంపుటాలు రెండు -

1 నా అంతరంగ తరంగాలు 1983, 2 అక్షర కవితా మాలిక 1990

నా అంతరంగ తరంగాలు - వివిధ శీర్షికల వచన కవితల ఖండకావ్యం అక్షర కవితామాలిక అ నుండి ఱ వరకు ప్రతి అక్షరానికో నీతి కవిత వేదాంత కవుల రచనల రీతిలో సాగింది ఇది వయోజన విద్యార్థులు పఠించడం కోసం వ్రాయబడినదని కవి భావం కాని భాష భావాలు చూస్తే నిజానికిది సామాజిక నీతి కావ్యం

అ - అమ్మ కమ్మనైననది, అని ఆరంభమైన ఈ కవితా మాలికలో
ఆ ఆడదంటే ఆదిశక్తి / ఆడదంటే అనురాగానికి మారుపేరు / ఆడదంటే ఆత్మీయతకు అప్పురాలు!
ఆమెను శృంగార వనితగా అందాల భరిణగా అనుకోగూడదు
కామాంధులకామె కాళికాదేవి / మంచివాళ్లకామె ఉన్నతురాలు
ఇ - ఇంటి పెద్ద, కంటి రెప్ప
ఎ - ఎవరికి ఎవరు ఏమౌతారు? అనే వేదాంత ధోరణిలో పడబోకు, మనిషి సంఘజీవి అని
మరువకు, ఈ ప్రపంచమంతా మనమంతా మానవ సంబంధాలతో జీవిస్తేనే మంచిదనీ,
అది మన మంచికే అని గుర్తుంచుకో! అన్నారు

ఈ కవి 'భావ చిత్రాలు' కవిత చూడండి 'చిరుతరగలు - 1985

భా వం నిండిన హృదయంతో కవిత వ్రాస్తాను
వ - రహాల ఊహలతో చిత్రాలు గీస్తాను
చి - న్న కవిత యిది అయినా భావాలు నిండిన
త్రా గినా తరగని తీపి రుచుల సమ్మేళనం
లు చ్ఛా కుతంత్రాలు లేని హృదయంతో
'భావ - చిత్రాలు' లిఖిస్తూ మీ ముందుంచుతున్నాను
ఇజాల బంధాల్లో పడని సాదా సీదా కవి జగన్నాథవ రావు గారు

## 32 డా॥ వెలిచాల కొండలరావు - ఎం కాం గుండి.

కొండలరావు వెలిచాల గారి స్వగ్రామం రామడుగు సమీపంలోని గుండి పితామహులు కురిక్యాల వారు వీరి తండ్రి సుప్రసిద్ధ కవి కేశవరావు గారు విశ్వనాధ సత్యనారాయణగారు కరీంనగర్‌లో ప్రిన్స్‌పాల్‌గా ఉన్న కాలంలో అదే కాలేజీలో కొండలరావుగారు కామర్స్ లెక్చరర్‌గా ఉన్నారు జగిత్యాల కరీంనగర్, హైద్రాబాద్ సిటీ కాలేజీల ప్రిన్సిపాల్‌గా పనిచేశారు డి పి ఐ జాయింట్ డైరెక్టర్‌గా తెలుగు అకాడెమీ డైరెక్టర్‌గా పదవులు నిర్వహించి ఉద్యోగ విరమణ పొందారు

వీరు ఆంగ్లాంధ్ర ఉర్దూ భాషలలో పండితులు రచయితలు విద్యావేత్త వక్త వీరికి రచనాభిమానం ఉందని ఆంగ్లంలో రచనలు చేస్తారని సాహితీ మిత్రులకు తెలుసు కాని, ఒకేసారి వీరి 10 వచన కవితా పుస్తకాలు తెలుగులో వచ్చి సాహిత్యాభిమానులకు ఆశ్చర్యపరిచాయి అంత గుప్త రచనా వ్యాసంగం వీరిది ఆ దశ పుస్తకావిష్కరణోత్సవం హైదరాబాద్‌లో ఒకసారి (1984) విద్వద్వరేణ్యుల సభలో సాహితీపర్వంగా సాగింది వీరి కృతులివి

1 నాదేశం, 2 విశ్వాత్మ, 3 ఎర్ర గన్నేర్లు 4 వస్తువులు సముద్రాలు, 5 ఒకపువ్వు పూచింది 6 కావ్యం, 7 భాష, భావం, సహజత, సంస్కారం 8 ఠాగూర్ 'గీతాంజలి' అనువాదం 9 శాఖోపరి, 10 గీతాంజలి 'గీతాంజలి'

21 జూలై 1992 నాడు కరీంనగర్ జిల్లా ప్రజా పరిషత్ కళాభవన్ ఆవరణలలో జరిగిన డా॥ కొండల రావు గారి షష్టిపూర్తి ఉత్సవాల్లో వారివి మరో మూడు కవితా పుస్తకాలు ఆవిష్కరింపబడ్డాయి అభినందన సంచిక కూడా వెలువడింది ఆ గ్రంథత్రయం పేర్లివి

1 అన్వేషణ, 2 పాపం గాంధి, 3 మరి రారేమి ఇటు వెరుగు ఈ పదమూడు తెలుగు కవితా సంపుటాలు కాక మరి తొమ్మిది ఆంగ్ల పుస్తకాలు ఒక ఉర్దూ కవితా సంకలనం వీరిచే విరచితాలు తెలుగులో సాహిత్య విమర్శ పుస్తకాలు సైతం వచ్చాయి

ఆంగ్ల పుస్తకాల్లో వేమన పద్యాల అనువాదం దేవరకొండ బాలగంగాధర తిలక్ కవితలు ఉండడం కవి అభ్యుదయ ఆధునిక కవితాభిరుచికి నిదర్శనం తెలుగు రచనలన్నీ వచన కవితలు కావడం మరో విశేషం అందులో రవీంద్రుని గీతాంజలి అనువాదం, గీతాంజలిపై భాష్యంలాంటి మరో గీతాంజలి నామక గ్రంథం ఉండడం కవికి విశ్వకవిపై ఉన్న అభిమానానికి తార్కాణంగా చెప్పుకోవచ్చు ఈ కవితలు భాషాధిషణను చూపటానికో కవితా కసరత్తులు చేయడానికో వ్రాయలేదు వీటిలో కవిగారి వివిధ భావాలు - ఆలోచనలు - ఆశలు ఆశయాలు - ఆదర్శాలు సరళంగా సూటిగా చెప్పబడ్డాయి డొంక తిరుగుడు వాక్య విన్యాసం కానీ, క్లిష్ట పదబంధాలుకానీ, కష్టంగా అర్థమయ్యే ప్రతీకలు కాని వీటిలో లేవు

ఇక భాషకోసం చూసే వారికి, రావు గారి కవితల్లో అనేక నూతన పద ప్రయోగాలు కనిపిస్తాయి అవి వ్యావహారికాలు కూడా కాని వినూతనాలు ఛందస్సుకు వస్తే వచన కవితలే ముక్త ఛందం దానిని వీరు మరింత స్వేచ్ఛగా పరుగెత్తించారు అదే దారిలో స్వచ్ఛందంగా సాగిన కొన్ని సీస పద్యాలు కూడా ఉన్నాయి మచ్చుకు వీరి పుస్తకాల నుండి కొన్ని కవితా ఖండికల భాగాలు ఇట చూపబడుతున్నవి

ఒక కవి మరణించెనా, ఒక మహాకవి గతించెనా,
ఒక యుగమే అస్తమించెనా, ఒక మహాప్రస్థానమే ముగిసెనా

'శ్రీశ్రీ' నీ కొకడ వొకడవే, నవకవితా యుగానికి

అనిర్వచనీయ నిర్వచనలు - విశ్వాత్మ పు 21

అగ్గిపుల్లా కుక్కపిల్లా కావేవీ కవిత కనర్హం అన్నారు శ్రీశ్రీ కొండలరావు గారు తమ పెంపుడు కుక్క 'జుగ్నూ' పై 'విశ్వాత్మ' ఆరంభంలోనే పది పుటల కవిత వ్రాశారు

'గాలి విస్తరి'ని వర్ణిస్తూ - 15 పుటల కవితలో 'స్త్రీల' పక్షం వహించి ఇట్లా అన్నారు

ఓ స్త్రీ! ఓ గృహిణీ! ఓ భారతీయ సతీమణి!

అంతే నీవింకంతే, నీవర్పిత మయితివి 'ఖర్మ' సిద్ధాంతానికి,

మగవాడి అమానుష్యానికి, నీవు నామముండి అనామికవి

అర్థం పోయి అక్షరంగా మిగిలిన శబ్దానివి, ఉత్తరం లేని ఉట్టి కవరువి

వ్యక్తిత్వ మెరుగని నోచుకోలేని వ్యక్తివి పు 46

వీరి కృతులలో బంధుమిత్రుల స్నేహ స్మృతి కవితలున్నాయి కొన్నిసార్లు వీరి భావుకత ఎంత ఉద్వేగంగా పయనించిందో ఈ సానుభూతి కవితను చూడండి

ఒక మనస్సు పది మనస్సులై ప్రవహించే,

ఒక నది పలు నదులై పాయలై ప్రవహించినట్లు

ఒక మనిషి పది మనుషులై పగిలె, పగిలిన అద్దమటు,

ఒక జీవితమర్థం కోల్పోయి నిరర్థకమయి మిగిలె, శబ్దమే నిశ్శబ్దమటు,

ఒక జీవి, నీరయి, నీరవ మయి మిగిలె, నెత్తురే స్వేదమటు, ఖేదమటు, నిరాశయే ఆశయమటు, ఆశ్రయమటు, ఒక గమ్యమగమ్యమై మిగిలె - విశ్వాత్మ - పు 49 ఇది ఒక మిత్రుని పుత్ర వియోగానికి వ్రాసిన విషాద కవిత వీరి 'వసువులు సముద్రాలు' సంపుటిలోని మరో కవిత ఇది

ఎన్నిఫైళ్ళు, మరెన్ని ఫైలు, ఎన్నెన్ని ఫైళ్లు/ కొన్ని, మరికొన్ని ఫైళ్ళు అన్నీఫైళ్లే

గీతలు, రాతలు, చేవ్రాతలు/ ఎంత మంది జీవితాలివి, కొన్ని అలాంటివే,

వట్టితాలు, గతాలు, కాగితాలు - పు 33

"కవిగా శ్రీ కొండలరావుగారు రహస్యమయతలో ఉన్న రమణీయతను భగ్నం చేయకుండా రహస్యదర్శన లబ్ధిపొందిన వాస్తవికతా తత్త్వవేత్త, తన అంతర్‌బహిర్ అభివ్యక్తుల మధ్య అపశ్రుతిలోని అద్వైతి" అన్నారు గుంటూరి శేషేంద్ర శర్మ గారు ఈ కావ్య పరిచయంలో

రావుగారి 'పాపం గాంధి' సంపుటిలో మాత్రం కొన్ని జానపదబాణీ గేయాలున్నాయి

అక్కో అక్కో అక్కో - ఎన్నో చెప్పిరక్కో / ఎన్నని చేసీ రక్కో - ఎన్నని చెప్పేదక్కో

హక్కూ నీకని రక్కో - భూమి పుత్రనిరక్కో / ఎవరికి వచ్చేనక్కో ఎవరికి దక్కేనక్కో - ఇది 6 8=3 పుటలు

సింగపురికెళ్లామె సిరిసిరి మువ్వా / సింగారమె చూశామె సిరిసిమ్వా - ఇది 14-20, 7 పుటలు

ఇది కవి గారు సింగపూర్‌లో చూసిన విశేషాల వర్ణన దీన్ని కవితా వ్యాసం అనొచ్చు

బతుకమ్మ బతుకమ్మ భగ్గుమానె/ నా తనువంత మనసంత సిగ్గుమానె - 3 పుటలు

బతుకమ్మ పండుగ కాకతీయుల కాలంనాడు పుట్టి తెలంగాణాలో దేవీ నవరాత్రుల పూలపూజగా పరమానందంగా నిర్వహింపబడుతున్న స్త్రీల పర్వం మరి కొన్ని చరణాలు చూడండి

తరతరాలవి అవీ ఉయ్యాలో, తారల్ల నాటివి ఉయ్యాలో

మనసులే మల్లెలై ఉయ్యాలో, మల్లెల మాలలయి ఉయ్యాలో

ఎన్నెన్ని వ్రాసితీ ఉయ్యాలో ఎన్ని రాత్రులు పోయె
కన్నీరె కడలాయె ఉయ్యాలో మున్నీరె మూటాయె
నా దేహమే ఉనికి హారతిగ అర్పించి, నీకడకె నేనొత్తు నా కడకి రాకున్న - 24-26

అక్కడక్కడ గుండెల్లో నిలిచే భావాలు వీరి పాటల్లో ఉన్నాయి పట్టణ వాసపు నవ నాగరికపు కవి తమ బాల్యపు పల్లె జీవితాన్ని మరచిపోలేదు నాడు కళ్లముందు కన్పించిన దృశ్యాలు విన్న మాటలు మనసులో ముద్రపడి నేడు ముద్దు మురిపాల స్త్రీల పాటలుగా రూపొందాయి నేటి సామాజిక స్థితి గతులు సైతం అందులో సవిమర్శకంగా చోటుచేసుకున్నాయి ప్రకృతి వర్ణన, పరమేశు వర్ణన మానవ ప్రకృతి వర్ణనలతోపాటు తాము అధ్యాపకులు కనుక విద్యార్థుల మరచిపోలేదు పల్లెల పలుకుబడులను ఇంకా పనిపాటలతో జీవించే శ్రామికుల, వారి బాధల భాషల నాయకుల బాసల వివరించారు 'పాపం గాంధీ' కృతి మొదటి శీర్షికలో

ఎక్కడున్నావో గాంధి తాతా, ఎంత పాపపు కాలమొచ్చే
నిన్నె చంపిరి నిమిషమాగక అన్ని చంపిరి నీతివిలువలు
హాస్యమాయె నీదు జోస్యము నాశమాయె నీదు వాక్యము

రావు గారి 'విశ్వాత్మ' పీఠికలో జస్టిస్ ఆవుల సాంబశివరావు గారు అన్నమాటలివి ' వచన కవితతోపాటు, గేయకవిత ప్రచారంలోకి రావాలి కవులందరికి ఈ సూచనచేసే సాహసం నాకు లేదు కొండలరావు గారికి చొరవ తీసుకొని చేస్తున్నాను ఆయనలో నాకు ఆశ ఉంది ప్రజల మధ్యకు వెళ్ల గలడని, వాళ్లమాట పలుక గలడని, వాళ్ల మనసు తెలుసుకోగలడని" ఆ సూచన తర్వాతే ఈ పాటలు వ్రాశారేమో! మరి రారేమి ఇటు వెరగు లో - శ్రీవేంకటేశ్వరుని,

దైవమువో శిలవో తెలియదు/ తెలియున దొక్కటే, నీదు తేజము, నీదు ఓజస్సు
నిక్కమువలె, నిత్యము వలె, సద్గుణమువలె పు 67

థాయిలాండులో-

బుద్ధుడు పుట్టాడు మాలో/ కాని సకల వైభవ సౌరభమయి వెలిగాడు నీలో
ఎదిగాడు ఆకాశానికి అంటినన్ని అడుగులు / చాలవు అందుకొనుటకు కనుల నిచ్చెనలు 44

ఒకరాజు దిగె' 1983 - 84 నాటి మనరాష్ట్ర కథ - కవిత ఇట్లాంటి రచనలే చరిత్రకు సాక్ష్యాలుగా ఉంటాయి వీరి తండ్రి స్మృతి కవిత హృదయాన్ని కదలించేది భాష, సంస్కృతి, నాగరికతలపై ఈ కవి విసుర్లు హాస్యంగా పైకి కనిపించినా ఆలోచింప జేసేవిగా ఉన్నాయి కవిగా పేరు పెద్దగా వ్యాప్తి కాకున్నా కవిత్వమంటే వీరికి ఎనలేని ప్రేమ అని వీరి రచనల వల్ల తెలుస్తున్నది ఎన్నాళ్లాయె ఏమీ వ్రాయక - అని ఒక కవితలో విచారిస్తూ - ఇక రోజుకొక కవితనైనా వ్రాస్తానని ప్రతిన తీసుకున్నారు మరో కవితలో పూలపై పేరు పేరున కవితలు వ్రాశారు - శిల్పాలను సైతం వదలలేదు చూసిన ప్రదేశాలను సినిమాలను కూడ కవితా నిబద్ధం చేశారు మనసుకు హత్తుకున్నప్పుడు

'మరి రారేమి ఇటు వెరుగు అని పట్టణవాసుల పల్లెటూరి అందాల ఆరోగ్య ఆనందాల జీవితాల అనుభవానికి రమ్మనే ఆహ్వాన వచన గీతం ఆలోచనామృతం! పల్లెల వాళ్లు పట్టణాలకు వలస పోవడం ఆగాలని, రద్దీ పట్టణ జీవితాలనుండి విముక్తి పొంది నాగరికులు తమ గ్రామాలకు తిరిగి తరలి రావాలని కవి గారి సదాకాంక్ష!

శెలవు! మరి శలవు! మిత్రులారా! నా మిత్రులారా!
కలిసెద మెచ్చటో దూర దూరాల ఊహల కెరటాలపైన,



ఉవ్వెత్తు ఊహల ఊపుపైన
విశ్వవిపంచిక మీటిన రాగమటు, సరాగమటు
జీవితపు అలల తీరాన కలల పధాన,
కలిసెదము, విరహవీచికల విశ్వపు విడిదిలోన, శలవు!
మరిశెలవు 31
కవి ఆశయం - విశ్వాత్మ, పు 30
ఎన్ని బాధలో నావెయౌ బాధలు అన్నియు నాలో మిగిల్చి, ఒక్క గానొక్క కొర్కె, నాదేశము కొఱకు
నే సేవ చేయు కోర్కె నాలో మిగిల్చి, నన్ను మన్నించినను చాలు, ఇంకేమీ నాకువలదు

నిరంతరం అధికార పదవీ బాధ్యతలతో తలమునకై ఉంటున్నా తనువంతా తపనగా తలపులన్నీ కవితగా కలం కదనం సాగిస్తూ కవిత్వ విజయం సాధిస్తున్న సాహిత్యయోధులు డా వి కె రావు గారు

## 33 గులాబీల మల్లారెడ్డి, అడ్వకేట్ పోతారం మం॥ హుస్నాబాద్

గులాబీల మల్లారెడ్డి గారు కరీంనగర్‌లో అడ్వకేట్ వారు స్వగ్రామంలో సర్పంచుగా కూడా ఎన్నికయ్యారు రాజకీయాలంటే - సాహిత్యమంటే ఆసక్తి అంతకు మించి గ్రామీణ కర్షక - శ్రామిక జనమంటే అభిమానం వీరి రచనలతో ఒక కథా సంపుటి, ఒక కవితా సంపుటి వచ్చాయి కవితా సంపుటి పల్లె పొలిమేరల్లోకి 1984లో ప్రచురించబడింది

ఇందలి 31 వచన గేయాల్లో మొదటిది పుస్తక శీర్షిక చివరిది - ఇది నాదేశం గాథ

అనేక కార్మిక సంఘాలతోనూ పౌరహక్కుల ఉద్యమ సంబంధంతోనూ ఉన్న మల్లారెడ్డి గారి తండ్రి లింగారెడ్డి గారు తెలంగాణా నైజాం కాలపు పోలీస్ యాక్షన్ - 1948, కాలంలో క్రూరంగా హింసింపబడిన వ్యక్తి అతనికే ఈసుతుని ఈ కృతి అంకితం అప్పటి ఇప్పటి గ్రామీణ సామాజిక రాజకీయ విషయాలు ఈ కవి కలానికి ఆలోచనను ఆవేశాన్ని కలిగించాయి - రగిలించాయి

నావాళ్లంతా । నాగళ్లకు సిలవ వేయబడి । తరతరాలుగా । నెత్తురుని । నెత్తురుకంటె అమూల్యమైన చెమటని । సమాజంకోసం ధారపోస్తున్నప్పుడు । నేనొక్కడిని స్వార్థంతో। క్యాంపస్ పొలిమేరల్లో । నగర ఉద్యాన వనాల్లో । శాసన సభల్లో । సాంస్కృతిక సమావేశాల్లో కోర్టు దర్బారుల్లో। పుచ్చు విత్తనాల్లాంటి వాగ్దానాలతో । చెదలు పట్టిన చేతులతో । శవంలాంటి మనిషిలా బతుకలేను। అందుకే పల్లె పొలిమేరల్లోకి వెలుతున్నాను । నన్నక్కడే నావాళ్లతో । నాగళ్లకు సిలువ వేసినా సరే । కంకర కొడుతున్న వాళ్లతో । కాంక్రీటు చేసినా సరే । అక్కడే కోయిలనై । ఇష్టమొచ్చిన కొత్త గానం చేస్తాను ।

ఇది ఈ కవి సంపుటీకరించిన కవితా విన్యాసం - కవి ఆశయం 'నా దేశం గాథ' మరో విడి పుస్తకమన్నారు ఆ అముద్రిత ప్రతిలోని రెండు పుటలే ఇందులో చేర్చారు ఇది మన సమాజ వర్తమాననరుల నటనా ప్రవృత్తులకు ప్రతిబింబం

ఈ ముద్రిత కావ్యంలో రకరకాల భావాలు, అభ్యుదయ భావుకుల స్మృతి ప్రభావాలుండడమూ సరే, కాని కాలేజి విద్యార్థిగా వ్రాసిన యువతుల వర్ణనల కవితలు సైతం చేర్చబడ్డాయి ఎబౌట్ మై బెటర్ హాఫ్, అని 'సహచరి' తో తన జీవిత కథా - వ్యథా చెప్పుకోవడం, ఇతర స్త్రీల సంబంధ రచనలు కావ్య శీర్షికకు సంబంధం లేనివి 'సర్వాంతర్యామితో మనవి' చేసుకోవడం కూడా ఉంది

ఈ కవి వచన కవితా రచనలోనే కాదు వాగ్బాణాలు విసరడంలోనూ నేర్పరి అడ్వొకేట్ కార్యభార నిర్వహణతో వీరు ఈ మధ్య కవితా వ్యాసంగానికి కొంత దూరంగా ఉంటున్నారు

## 34 రేగుల పాటి కిషన్‌రావు, ఎం ఏ బి ఇడి చింతలరానం

కిషన్‌రావు గారు గేయకవి కథా రచయిత వీరి నవలలు కవితా పుస్తకాలు పదికిపైగా వచ్చాయి పాటల సంపుటాలుకాక వీరు తమ అభ్యుదయ కవితలను ఒక చిన్న సంపుటిగా ప్రచురించారు

అది "కవితా పుష్పాలు" 1984లో ముద్రితం పుటలు 22

'తెలుగు పాట వీణ మీటి । పరవశించి పాడుదాం

మయూరాలు మరాళాలు । మేను మరచి యాడగ" ఇదీ నడక

"పాత జీవితం మరచే విధముగా నూతన ధ్యేయం కలిగే విధముగ" వీణానాదం ఉండాలట

'బ్రతుకు విలువలు' ఓ వచన కవిత అగ్నిపుల్లపైనా ఓ కవిత - 9వ, పుటలో మరొకటీ ఉంది

"బొగ్గులాకాక నిప్పులా ఉండాలన్నారు మనిషి' - 12

'కొవ్వొత్తిలా కరిగిపోతూ వెలుగివ్వాలి అని ఆకాంక్ష 13 నాయకుని నటుడూ దగాకోరన్నారు దోపిడీ జీవుల సాలెపురుగులతో పోల్చారు - 18, తన ధ్యేయం 'దీపం అని ఓర్వలేని పురుగుల కాల్చగలదని, గబ్బిలాలతో ప్రయోజనం ఉండదన్నాడు 12

9వ పుట - "ప్రతిభ ఏది లేని వాళ్లు । ప్రగతి పనులు చేయలేరు

పెంపు వారు పొందలేక । చింతలతో బ్రతుకుతారు"

చివరి సూక్తంలో

"లోకంలో నిలిచియున్న । శోకమంత తొలగునట్లు / లోకమంత సంతోషం । నిండిపొంగి పోవునట్లు"

ఉండాలి కవిత అని కోరుకున్నారు

## 35 డా॥ శ్రీరంగస్వామి, బి కాం., ఎం ఏ పిహెచ్ డి పర్లపల్లి - జ తే 16-7-1950

తిరుక్కోవెలూరి శ్రీరంగస్వామి గారిది కరీంనగర్ జిల్లాలోని పర్లపల్లి గ్రామం రిటైర్డు ఉపాధ్యాయులు పద్యకవి శ్రీరామానుజస్వామి వీరి తండ్రి ప్రభుత్వ ఆరోగ్యశాఖలో ఉద్యోగిగా శ్రీరంగస్వామి హన్మకొండలో ఉంటున్నారు కవితా వ్యాసంగం అంతకుమించి సాహితీ సంస్థల సంబంధం కారణంగా వీరు సాహితీ ప్రియులకు చేరువయ్యారు పుస్తక సమీక్షలతో సాహితీ వేత్తలకు సన్నిహిత మయ్యారు శ్రీరంగస్వామి వచన రచనలు - వచన కవితలు అయిదారు పుస్తకాల రూపంలో వచ్చాయి వీరి కవితా సంపుటాలు నాలుగు 1 మధుర - 1984, 2 శిఖరం, 3 మానవ సంచరరే 4 నిరంతరం 1996 ఇంకా ప్రభవ నుండి ఈశ్వరవరకు అయిదు కవితా సంకలనాలకు వీరు సంపాదకులు

వీరి ఏ పుస్తకంలోనూ ముద్రణ సంవత్సరం లేదు 'మధుర పుస్తక ప్రకాశకుల ముందుమాట 'ప్రకాశకీయం' తేదీని బట్టి పుస్తక ప్రచురణ సంవత్సరం లభించింది మిగితా పుస్తకాల వరుస ఆయా సంపుటాల చివరి పుటల కవి రచనల పట్టిక ద్వారా తెలిసింది మధురలోని కవితలకు 1970-83 సం రచనా కాలాలు ఉటంకించబడ్డా మిగితా కృతుల కవితలకు అవీలేవు చివరి కృతికి రచనల తేదీలు ముద్రణా సంవత్సరం ఉన్నాయి

మధురలో 30 కవితలు, 30 పుటల్లో ఉన్నాయి వాటిలో పదైనా మినీ కవితలు ఈ కవిగారికి దేశమంటే - సాహిత్యమంటే అభిమానం దీనులంటే ప్రేమ సాధారణంగా వచన కవితా సంపుటాలకు భిన్నంగా ఇందలి మొదటి కవిత నీరాజనం!

నీ ఒడిలోనను చేర్చుకుంటావని, నిన్ను ఆశిస్తూ / నీ పాదాలపై వాలాను, ఓ భగవాన్!
నిన్నే దేవేశునిగా నమ్ముకున్న / నీ భృత్యుని కోర్కెఎప్పుడు తీరుస్తావ్ భగవాన్!
భిక్షుకులంటే ఈ కవికి జాలి! వారి సానుభూతితో మూడు కవితలున్నాయి

ఊహాసుందరి - 6 మధురానుబంధం - 4, లవ్ ఎట్ ఫస్ట్ సైట్ - 8, అనుక్షణికం- 9, మొ॥ ప్రేమకవితలున్నాయి ఇంటర్వ్యూ -7, నాదేశం - 19 ప్రేయసి 10 కొన్ని సామాజిక విమర్శలు ఈ సంపుటిలో మంచి కవిత్వం ఏది? అని వివరించిన కవితలు అయిదారున్నాయి పురుష స్వామ్యాన్ని నిందించారీ విధంగా



ముండ మోసిన బ్రహ్మచారులం, మేం మాకు
వృద్ధ కన్యలవసరం లేదు, టీనేజ్, కన్యలేకావాలి
మా పురుషత్వం మీకనవసరం! 24
ఒక మినీ కవిత - ఏడంతస్తుల మేడ - పు 25
కాశ్మీరంలో కామునితో రమించి,
సింహళంలో రావణ కాష్టంలో తగిలేయ్
మరొకటి చివరిది - పుట 30

ఈ సాహిత్యం, ఈ సంస్థ, మీ అందరిదీ కాని/ ఈసంస్థ పదవి నాకు మాత్రమే పరిమితం!

కొన్ని గ్రాంధిక క్రియా పదరూపాలు దారి తీసెను - పు 3 'అస్పష్టసందిగ్ధభావాలు తప్పకున్నా ఈ కవితలు సాఫీగా చదివిస్తాయి కవి ఆశయాన్ని తెలుపుతాయి

శిఖరంలో విషయసూచిక ఉంది, 22 కవితలున్నాయి జడత్వాన్ని కౌగిలించుకొని నిద్రిస్తున్న జనాన్ని మేల్కోల్పడానికి 'నా గుండె నిరంతరం నవ జీవ చైతన్యానికి పదం పాడుతూ, పయనిస్తుంది" అని 'హిమజ్వాల' పు 8తో ఆరంభించి రెండవ 'వందేమాతరం' భావకవితలో దేశానికి 'కైమోడ్పు' కావించారు

మాబడి- ఇది జారిన ఇటుకలతో, కూలిన గోడలతో / ఊరి మధ్యలో,
తప్పిపోయిన ప్రయాణికుడులా / అంతర్ఘోషతో, జాలిగా చూస్తుంది మా బడి పు 1

ఇది సహజ వర్ణన మాత్రమే కాక సమాజ స్థితికి ప్రభుత్వ ప్రగతికి ప్రతిబింబం అనొచ్చు ఇంటర్వ్యూల, ఉత్సవాల వెక్కిరించారు దేశ దైన్యాన్ని సజీవ చిత్రీకరణకావించారు

'ప్రకటన' - 28, రాజకీయ విమర్శ ఇట్లుంది
నిన్న మొన్నటి వరకు, ఓట్లకు, నోట్లకు పోట్లాడిన నవ నిర్మాత లేరి? వాళ్లు !
సందుల్లో గొందుల్లో, బ్రాందీ షాపుల్లో / సుఖాల బురదల్లో పోట్లాడు కుంటున్నారు
సీట్ల సర్దుబాట్లల్లో, కుమ్ములాడుకుంటున్నారు

మానస సంచరరే 28 పుటలు మేకవన్నె పులుల వర్ణన మొదటి కవిత భగవంతుడు అంతరాత్మలోనే ఉన్నాడనే బోధ మధ్యకవిత దేశంలోని కపట నటనకూ, దగుల్బాజీతనాలకూ "స్వార్థంపోసుకున్న బందీలో, జీవం పోసుకున్నవిగ్రహంగా, రోదిస్తున్నాను మౌనంగా " అంటూ కవి "మౌన గీతం" చివరిది ఏ ఇజాలు భేషజాలు లేకుండా సహృదయతతో సమాజాన్ని బాగు చేయాలనే పరితపన కల కవి శ్రీరంగస్వామి నిరంతర కవన వ్యాసంగం సాగిస్తున్న ఈ కవిగారు 1988 95 మధ్య వ్రాసిన దాదాపు 30 ఆత్మాశ్రయ సామాజిక వచనకవితల సంపుటి "నిరంతరం"!

## 36 రామభోజ - (బి రాములు) - బి ఏ పాలాస జ తే 17-5-45

రామభోజ కలంపేరుతో కవితా వ్యవసాయం సాగిస్తున్న బి రాములు గారిది కాకతీయుల కాలం నాటి చారిత్రక పట్టణం అయిన పాలవాస అది జగిత్యాల సమీప గ్రామం అది కవి పండితులకు నిలయం విద్యావంతుల కుటుంబంలో జన్మించిన రాములు కవి గారు పోస్టల్‌శాఖలో ఉద్యోగం చేస్తూ సాహిత్యారాధనతో కవితలు వ్యాసాలు వ్రాస్తున్నారు సాహితీసభలు కవితా గానాలు వీరికి అత్యంత ప్రియాలు త్రివేణి' సాహిత్య సంస్థను స్థాపించి

85లో 'చిరుతరగలు కవితా సంకలనాన్ని ప్రచురించారు పత్రికలలో పలుపుస్తకాలు సమీక్షించారు వీరి పుస్తకాలు నాలుగు ఈ దిగువ పేర్కొన్నవి

1. నవపల్లవాలు 2 శింజనీ శింజానము 3 మా, నవలోకం - 1985 4 రాగఝరి ఇందులో మూడు పుస్తకాలు లలిత గీత సంపుటాలు

మానవలోకం మాత్రమే వచన కవితా సంపుటి 'నవలోకం మొదటి కవిత
'అహర్నిశలు శ్రమించి ఆవేశాన్ని పెంచి అనుభూతుల్ని ప్రత్యక్షానుభూతుల్ని
దర్శించి హర్షించి। తపస్సు కావించి ఉషస్సు గాంచి
నాకై నేను నిర్మించుకొన్న । నవలోకం నాకవిలోకం
కుల మతాల కతీతం ఈ లోకం/ కుటిల రాజకీయాలకెంతో దూరం
ఎల్లలు లేనిది ఈలోకం/ ఎల్లరికి స్వాగత గీతిక ఈ లోకం
మమతల పందిరి / నిరంతర వసంతం ఈ లోకం నా పాలిటి నవలోకం
కవి అభిమతం ఇది ఇది వారి కవితా స్వభావమే -
"పలుగు రాలను కరిగించేది/ మండే గుండెలలో పన్నీరు చిలికించేది
బడుగు వర్గాల బాధలను బాపేది/ మోడు వారిన జీవితాలను మొగ్గపూయించేది "
'సమతా కుటుంబం మరో శీర్షిక స్వాగత గీతికలో
' విప్లవాలు ముద్రించినపుడే విశ్వశాంతి నిద్రలేస్తుంది
సామ్యవాదం స్వాగతించినపుడే, ధనస్వామ్యం నడ్డి విరుగుతుంది '

శిలలా పడివుండడం కన్నా దెబ్బలు తిని శిల్పంగా మారటం మేలని వీరి కవితలోనే కాదు, రేగులపాటి కిషన్‌రావుగారి కవితలోనూ ఉంది అలాగే అగ్గిపుల్ల శ్రీశ్రీ కవితా ఉంది పు 15

క్రాంతి - సంక్రాంతి' దాటి 'నీతి-నేతియుగం'లో ముగింపు 'సమాధానం'తో రామభోజ సామాజిక బాధ్యతతో ఈ వచన కవితలు వ్రాశారు

## 37 కల్వకుంట రఘునాథాచార్య, బి ఓ ఎల్ తడగొండ జ. తేది 31-8-65

వీరి పుస్తకాలు మూడు ముద్రణ పొందాయి వాటిలో ఒకటి గేయ కథాకావ్యం మరొకటి పద్య కావ్యం ఉదాహరణ ప్రబంధం వచన గేయ కవితా సంపుటి ఇది

1 విజృంభణ - 34 శీర్షికలలో 1986లో వెలువడింది పద్యగేయ రచనల్లో సిద్ధ హస్తుడైన యువకవి రఘునాథ్ విజృంభణ - వచన కవిత్వ మాత్రాఛందోగేయాల కలగలుపు

ఓ కవీ విజృంభించు - మొదటి కవిత ఎందుకోసం? అంటే -
"దోపిడీలు దొరతనాలు, హత్యలు చోరత్వాలు
కులమతాల పట్టింపులు, కుళ్లు రాజకీయ కుతంత్రములు

దక్షయజ్ఞసంభారము, తక్షక విష సంఘాతము
ప్రళయలాస్య విన్యాసము ప్రగతి కార్య విస్ఫోటముల,
మాయించడానికి - ఇంకా,
భూకంపం పుట్టించ, నవనాకం సృష్టించ
విజృంభించు కవీ - అని ఈ కవి ఉద్బోధ

రెండవ కవిత కవి 'హృదయం' "వర్తమాన సంక్షుభిత సమాజ సందర్శనావేదనతో అనుక్షణం రగులుతున్న అగ్నికణం" అందుకే - ఆధునిక మానవుని 'నీవు నాగరికునివా అనాగరికునివా?' అని ప్రశ్నించారు -3 'ప్లీజ్ నన్ను కాపాడండి' 5లో నిరుద్యోగిగా అర్థించారు స్వార్థం - 6ను నిరసించి సగటు మనిషిని సమీక్షించాడు - 15 గుణపారం - 34లో -

నేనొక జ్వాలగ మారీ నిరంతరం జ్వలిస్తాను/ దేహమునాహుతి జేసి, దేవేంద్రుని జయిస్తాను,
కాకోళం మ్రింగి నేను, కమ్మని సుధ పంచుతాను
నవ్వుతు మరణిస్తాను మరణిస్తూ బ్రతుకుతాను అన్నారు

ఆదర్శవాదం సంప్రదాయభావముద్రలో ఉన్నా, ఈ కవి గారి ప్రగతిశీల భావాలు కవితాశైలి పరితులను ఆకట్టుకుంటాయి పుటల సంఖ్యవేయని ఈ 'విజృంభణ'కు పది వరకు పీరికలున్నాయి భాషాధిషణకల అభ్యుదయ భావాలు కలిగిన యువకవి కె రఘునాధాచార్యులు

## 38 శ్రీగాదె శంకర కవి – బి ఓ ఎల్ మోహనరావుపేట

శంకరకవి జన్మస్థలం మోహనరావుపేట కొరుట్ల బాలుర సెకండరీ పాఠశాలలో తెలుగు పండితులుగా ఉన్నారు వీరికి సాహిత్యారాధన జాస్తి ఇంకా సంగీతంలో ప్రవేశం గృహవాస్తు శాస్త్రంలో ప్రజ్ఞ ఉంది వీరు పద్య గేయకవి వీరి కృతులు మూడు

1 సంధ్యాసుందరి - 1971, 2 ఆత్మావిష్కరణం 1987 3 పరశురామ ప్రతీక్షణం - 1997 (ముద్రణలో ఉంది ) మొదటి రెండు పద్య గేయ శీర్షికల మిశ్రిత ఖండకావ్యాలు మూడవది 'దినకర్' హిందీ కావ్యానికి ఆంధ్ర గేయానువాదం

సంధ్యా సుందరిలో గేయాలున్నా, పద్యాలు పూర్వ కవుల శైలిలో చాలా చక్కగా ఉన్నాయి

**ఆత్మావిష్కరణం** - ఈ కవికి 1989లో దేవులపల్లి అవార్డు తెచ్చింది ఇందులో 19 కవితలున్నాయి వానిలో 4 5 పద్యకవితలు మిగితావన్ని మాత్రాఛందో గేయాలు వచన కవితలు లేవు నేను, నేను కవిత, నేను - నీవు మొ ఇందలి శీర్షికల 'నా కన్నులలో నిలచిన శ్రీశ్రీ' పు 22, అని అభినందించిన ఈ కవి 'విప్లవ కవిపోతన' పు - 38 అనీ అభినందించారు

నేను పవినైన నిర్జించు, బలముగల కవి కులము / లోన ఏ పూర్వపు, ఙ్యానవా జనించితిని
కారు చీకటుల కడ, గండ్లు పడు తమ్ములను / వెలిగింప సూర్యకిరణములను ధరియించితిని

పవి ఇంద్రుని వజ్రాయుధం ఈ పదాన్ని శ్రీశ్రీ కూడ ఖడ్గ సృష్టిలో ప్రయోగించారు కారు చీకటులు, తమ్ములులోని శ్లేష శ్రీగాదె కవి ప్రతిభకు నిదర్శనం ముక్కు సూటిగా పోయే ఈ కవిని అహంభావి అని అనుకున్నా, తన వర్తనముగని జనం ఏడ్చినా నవ్వినా లెక్కచేయనన్న శ్రీగాదె కవి స్వభావం ఆకాంక్ష ఇది

అసుర గుణమున్న ప్రభు, నైన నిరసింతు, భా/సుర గుణములున్న భి, క్షువునైన పూజింతు
విత్తమునకన్న రస, చిత్తమన్నను మంచి, పాత్ర మన్నను ఎదకు, హత్తుకొనకాంక్షింతు పు 4

ఇంకా మున్ముందు నా పున ర్జన్మమ్ము కలదేని / అప్పుడును కవి, నై కలము పట్టెదను అని ప్రతిన చేశారు అంతటిది శ్రీగాదె కవి గారి ఆంధ్రభాషా కవితాభిమానం

'అశ్రుగంగ' శీర్షికలో కవితమ మాతృమూర్తిని గంగను స్మరిస్తూ ఇట్లా అన్నారు - పద్యంలో

ఉ అమ్మ భవత్సుధామధురమైన పయస్సును నోచలేక కా
యమ్ము కృశించి వామనుడనైతిని - చూడవె నాడె నీదు క్షీ
రమ్మును గ్రోలియుండిన విరాజిత విశ్వ విరాట్ సుస్వరూ
పమ్మును దాల్చకుందునె అపార కృపారస దివ్యవాహినీ!

'మహా మహితాత్ముడు బాపూజీ గేయం నిరసనలు మానండి - నవయువకలోకానికి ఉద్బోధ ప్రజల్లో కృద్ధత నశించాలి బుద్ధుడు హసించాలి అని ఆశించారు కవి రైతు ప్రేమ దీపసుందరి వర్ణన, వసంతం ప్రశంస మొ॥ అంశాల వర్ణనలతో కూడిన చక్కని గేయకవితలు ఈ సంపుటిలో ఉన్నాయి

పరశురామ ప్రతీక్షణం - దినకర్ హిందీలో చైనా భారతయుద్ధకాలం 1961లో వ్రాసిన వీరరసకావ్యం పరశురాంకీ ప్రతీక్షా ఈ కవి దానిని వివిధ బాణీల మాత్రాఛంద కవితలలో అనువదించారు

ఈ కావ్యానికి ప్రముఖ హిందీ రచయిత 'భీమసేన్ నిర్మల్' సుదీర్ఘ పీఠిక సమకూర్చి "పరశురామ ప్రతీక్షణం అనువాదం అనటంకంటె పునస్సృష్టి అంటే బాగుంటుంది' అని ప్రశంసించారు విదేశ దౌర్జన్యయుద్ధకాలంలో వీర ప్రబోధంగా వ్రాయబడ్డ 'పరశురాంకీ ప్రతీక్షా' కావ్యాన్ని శ్రీగాదె శంకరకవి ముప్పదేండ్ల తర్వాత మన స్వదేశీయుల కోసం తెనుగులోకి తెచ్చారు (అచ్చుకు వెళ్ళి ఇంకా వెలుగు చూడలేదు)



కవి - కావ్య 'నీతి' ఇది

పౌరుషాగ్ని మండునంత వరకె సుగుణములు హసించు
ఎట ఖడ్గము మెరయునో అచ్చటనె పుణ్యములు వసించు
వీరత కలుగని చోట ఉదార కర్మములు లయించు
శూరత వెలుగని చోట కఠోర స్వార్థము జయించు

భరత సైనికునికి కవికి సంభాషణగా సాగిన ఈ అయిదు ఖండాల వీరరసకావ్యం ప్రధానంగా దేశంలోని దగుల్బాజీ తనాన్ని నిరసిస్తూ, జాతికి జవసత్వాల ధైర్య సాహసాల, అవసరాన్ని ప్రబోధిస్తూ వీర జవానులకు ప్రశంసలందిస్తూ సాగింది జ్ఞానపీఠ అకాడమీ డైరెక్టరు ఇలపావులూరి పాండు రంగరావుగారు కూర్చిన పదిపుటల పీఠిక ఈ కావ్యానికి - కవికి, అమూల్యాలంకారం - అర్హతాపత్రం శ్రీగాదె శంకరకవి భావావేశం రసతన్మయత్వంకల కవన రచనా విశారదులు!

## 39 టి కృష్ణమూర్తి యాదవ్ - కొత్తపల్లి మం భీమదేవర పల్లి

1 తొక్కుడుబండ - 1988 (వచన కవితా సంపుటి)

"భాషలో, యాసలో, ఊహలో, ఊపిరిలో ఈ కవిలోని బాహ్య అంతర ప్రపంచాలన్నింటిలో ఒక సామాన్యుడే కనిపిస్తాడు ఈ సంపుటి పుటల మధ్య, కవితా చరణాలమధ్య కవిజీవితం తపన నిశ్శబ్దంగా రెపరెపలాడుతున్నాయి సామాన్యుడి ఉచ్ఛ్వాస నిశ్వాసాల్ని అక్షరాల్లోకి చేసిన అనువాదమే ఈ కవితలు" పుస్తకం చివరిపుట

కృష్ణమూర్తిగారు హుజూరాబాద్ తాలూకాలో తెలుగు అక్షరాలు, కమ్యూనిస్టు తొలిపాఠాలు

బాల్యయువదశల్లో నేర్చుకున్నారు ఉద్యోగిగా వెళ్ళి ఆర్మూర్ నిజామాబాద్ పట్టణాల్లో కవిగా మారినారు - 1970 దేవరాజు మహరాజు ప్రోత్సాహంతో, కె శివారెడ్డి ముందు మాటతో, శీలావీర్రాజు ముఖ చిత్రంతో వీరి 'తొక్కుడు బండ కవితా సంపుటి 88లో వచ్చింది పు 68

తెలంగాణా కరీంనగర్ మాండలిక భాషలో కవితలు - కథలు పాటల పుస్తకాలు వచ్చాయి ఒక వచన కవితా సంపుటి పూర్తి మాండలికంలో రావటంలో ఇక్కడ ఇదే మొదటిది కవి ఎక్కడా నాగరికపు టెక్కుకు పోలేదు పల్లె కూలినాలి జనం మాటలను - పని పాటులను వారి భావాల్లోనే చిత్రించారు ఇందలి కవితలన్నీ సమ కాలీన సజీవ విషయాలు పని పాటలు చేసి పంట కల్లంలో బుక్కెడు గింజలడిగి దొరచెప్పుకాలితన్ను తిన్న మాదిగ స్త్రీ 'తొక్కుడు బండ' దొరసానితో తన వేదన చెప్పుకోవడం ఇందలి మొదటి కవిత

అంగడికి ఉదయం బండికి వచ్చి తమ సరుకులమ్ముకుని అవసరమైనవి కొనుక్కుని సాయంత్రం బండికి తిరిగి వెళ్ళే లంబాడీల బ్రతుకుల నిట్లా నిర్వచించారు కవి

"రైలు ఎంతో దూరం పోతది గని, అల్లు తండ దాటి పోరు ' పు 57 మారుతున్న నేటి సామాజిక పరిస్థితిని గూర్చిన వీరి చిత్రణ మిది



'ఇప్పుడు మా వూరి దొరోనికి / గడి వుంది గని/
పాడుబడ్డ గుడోలె వుంది,
దొరున్నడు గని / దొరతనం లేదు ' పు 52
కవి ఆశయం కోసం' చివరి కవితలో ఉంది
"గుల్లె దేవుడు లేడంటే కోపం
బల్లె సదువులు/బతకడానికి పనికి రావంటె/ కోపం
మతం పేరిట/ మనసులను ఏకం సేయటం/ మూఢ నమ్మకమంటె/ కోపం
గాలిలెక్క/ లీల్లలెక్క/ భూమి అందరికి/ సెందాలంటె/ కోపం
అందుకే కవి ఇట్లా హెచ్చరించారు
" కృష్ణ జీవుల/ ఎగురుతున్న జెండను/ కిందికి దించాలనుకునేటోల్లకు
రేపటికి/ కాడుతయారైతంది " పు 65 కృష్ణమూర్తి గారి కలం బలం కలది

## 40 వేముల ప్రభాకర గౌడు - బి ఏ రాయికల్ - 1951 జననం

రాయికల్ ప్రభాకర్ గారి జన్మ గ్రామం ప్రభుత్వం ప్రజా సహకారశాఖ - మార్క్ ఫెడ్‌లో ఉద్యోగాలు చేశారు రాష్ట్ర మత్స్య శాఖలో పనిచేస్తూ హైదరాబాద్ వనస్థలిపురంలో ఉంటున్నారు

1 మనోనేత్రం 1989 వచన కవితా సంపుటి ముద్రిత రచనలు కార్మిక గీత 1987, అభిద 88, మరి రెండు నవలలు

మనోనేత్రం వికలాంగుల సమస్యలు చిత్రించిన వినూత్న విషయ కవితల సంపుటి 44 పేజీల ఈ పుస్తకంలో 22 పేజీలు పెద్దల అభిప్రాయలు ఆక్రమించాయి మిగితా 22 పుటల్లో 30 కవితలున్నాయి మొదటి గేయం ఇతిహాసం నుండి సైన్సు విజయానిది -

"రాతిని నాతిగా చేసింది, / అహల్యకు ముక్తి నిచ్చింది రామపాదం సృష్టికి ప్రతిసృష్టియై నిలిచింది,
వికలాంగులకు శక్తి నిచ్చింది జైపూర్ పాదం
సాటి మనిషికి మూత్రపిండ దానం చేసి బ్రతికించే వాడొకడైతే,

స్వార్థం కోసం పసిపిల్లల నెత్తుకు వచ్చి కాళ్లు చేతులు విరిచి
కళ్లు పెరికి బిచ్చ మెత్తించి పొట్టనింపుకునే వాడు మరొకడు
అంధులెవరో ఇట్లా వివరించారు
దృష్టిలేని వారు కాదు దూరదృష్టి లేని వారు/కళ్లుండీ వాస్తవాన్ని చూడలేని గర్వాంధులు
ధనాంధులు మదాంధులు కామాంధులు అధికారాంధులు
అంధులంటే వీరే మరి కళ్లు లేని వారు కాదు / కులంపేర మతంపేర కలహించే మరు గుజ్జులు
మాట్లాడే మధుర భాష పోట్లాటకు వాడువారు/ ప్రాంతీయ భ్రాంతిలో జాతి మేలు మరచేవారు
వరకట్నం మత్తులోన - నరహంతకులైన వారు/ఉన్న దేవతలు చాలక - సతీ మాతల్ని సృష్టించి
అంధ విశ్వాసాల బొందలో కూలిన వారు/అంధులంటే వీళ్లేమరి కళ్లులేని వారు కాదు

ఇది వచన కవితే మాత్రలు కలిస్తే అది యాదృచ్ఛికం నాట్య మయూరి సుధాచంద్ర' కృత్రిమ పాదం ధరించిన ఆత్మస్థైర్యాన్ని మెచ్చుకుని, హాస్పిటల్స్‌లోని డాక్టర్ల అజాగ్రత్తల, జైలు గోడల్లోని అధికారుల కిరాతక చర్యల నిరసించి, అధిక సంతును వలదన్నారు బోదెకాలుతో మరణించిన తల్లిని స్మరించారు రుషులకంటె సైంటిస్టులే గొప్పవారనే ప్రశంస 35 ఉంది అంధులకు అక్షరాలు సృష్టించిన లూయీబ్రైల్ కు జోహార్లు అర్పిస్తూ, వికలాంగులైన క్రీడాకారుల ప్రతిభ 'పారాలంపిక్స్'లో చూపారు చివరగా -

నా పాట నీ మనో నేత్రాన్ని తెరిపించ / నా మాటలే దాని చూపులై ప్రసరించ
చూడరా దేశాన్ని నీ జన్మ స్థానాన్ని/ చూడరా నీ జాతి నిండు సౌందర్యాన్ని,

అని దేశవైభవాన్ని కళ్ళ ముందు నిలిపి వర్తమానానికి నడిపించారు కవిత్వం నడక మాత్రా ఛందస్సుకు మారింది

హరిజనుల స్థితి చూడు గిరిజనుల గతి చూడు/అట్టడుగు వర్గాల ఆర్తనాదం విను
ప్రగతి రథముకు అడ్డుపడుశక్తులను చూడు/ స్వార్థ పరులను జరిపి సవ్యంగ నడిపించు -

వ్రాసేది 'వికలాంగులకు మనోస్థైర్యం కలిగించే (సైన్సు విజయాల) సానుభూతి కవితలే అయినా సామాజిక అంగవైకల్యాలకు అక్షర శస్త్ర చికిత్సను ఇందులో జోడించడం వేముల గారు చేసిన గొప్ప పని అది కావ్యానికి అందాన్ని కూర్చింది జనానికి కర్తవ్యాన్ని ప్రబోధించింది

ఈ కృతి స్వీకర్త రాజకీయ నాయకులు వి జగపతి రావు గారు

## 41 చైతన్య ప్రకాశ్ - కొండాపురం

చైతన్య ప్రకాశ్ 1989లో కాలేజీ విద్యార్థిగా ఉండగా 'కనువిప్పు' అనే కవితా సంకలనాన్ని ప్రచురించారని కవి దూడం రామ్మూర్తి, కరింనగర్‌గారు తెలిపారు ఆ పుస్తకం దొరుకలేదు

## 42 రెసారె హుస్నాబాద్

ఆర్ సహదేవరెడ్డి గారి కవితలు విరసం సిటీ యునిట్ 1988లో రక్త చలన సంగీతం పేర ఒక సంపుటిగా ప్రచురించారు 48 పుటల ఈ పుస్తకంలో మొదటి 31 పుటలు సహదేవ్ కవితలు మిగితా పుటల్లో పాతికేళ్ళ వయస్సులోనే సిరిసిల్లా ప్రాంతంలో పోలీసుల ఎన్‌కౌంటర్లో అసువులు బాసి పోరాటపు బాటల్లో అమరుడై నిలిచిన ఈ విప్లవ కవి స్మృత్యభిమానంతో ఇతరులు రాసినవి చిలీ విప్లవ కవి 'విక్టర్ హారా' గేయ శీర్షిక ఈ పుస్తకం పేరు

కరీంనగర్ జిల్లా పి డి ఎస్ యు నాయకుడు, తన గొంతు వెదక్కుంటూ, కవిగా ఇప్పుడిప్పుడే 'రెక్క విప్పుతున్న విహంగం' కామ్రేడ్ సహదేవ్, కల్లోలిత ప్రాంతం'లో కదలిక కోసం నిలబడి - కదన రంగంలో కవిత్వాన్ని ఆవాహన చేశాడు పేద కుటుంబంలో పుట్టి ఇంటర్ మీడియెట్‌తోనే చదువు ఆపేయాల్సి వచ్చినా - చూపు విశాల ప్రపంచం మీద, "చదువంటే ప్రజలు సుమా" అన్న మాటల మీద నిలిపాడు కాబట్టే - బాడుగ బండి లాగుతూ సైతం కవిత్వాన్ని, సాహిత్యాన్ని పలవరించాడు-" పుస్తకం ముందు మాట నుండి "విప్లవ రచయిత కామ్రేడ్ సహదేవ్‌ను మే 25న (1988) అరెస్టు చేసి, రెండు రోజులు చిత్రహింసలు పెట్టి 28న కాల్చి చంపారు కరీంనగర్ జిల్లా ధర్మారం వద్ద జరిగిన ఎదురు కాల్పుల్లో మరణించాడని పోలీసులు రొటీన్ కట్టు కథలల్లి దిన పత్రికల్లో ప్రకటించారు

విద్యార్థి నాయకుడుగా వుంటూ పీడిత ప్రజల విముక్తి కోసం కలం పట్టిన కవి విప్లవ కవిత్వ రచనతోపాటు కార్యాచరణకూ పూనుకున్నాడు ‘రిసారె’ అనే పేరుతో అనేక పాటల్నీ, వచన కవితల్నీ రాసాడు కరీంనగర్ సాహిత్యోద్యమాన్ని పునరుజ్జీవింప జేసేందుకు ఎంతో కృషి చేశాడు ‘నూతన సాహితి'ని (హుస్నాబాద్) ప్రారంభించడంలో అతని పాత్ర ఉంది - పు 5

రెసారె రచనలు రాసి ఉంచుకున్న డైరీ పోలీసుల పరమైంది ఈ కవితలు జనం నుంచి బహుకష్టంగా సేకరించి ప్రచురించినవి ఇందలి మొదటి కవిత వసంతం' విజయవాడ విరసం మహాసభ కవి సమ్మేళనంలో చదివింది పోరాట వీరుల్లో అమరులకు శ్రద్ధాంజలి, పోరులో ఉన్నవారికి ప్రోత్సాహాన్ని అందించడం పెట్టుబడిదారీ పాలన ఖండన, రానున్న సామ్యవాద వ్యవస్థకు ఆహ్వానం ఈ కవితల సారాంశం స్త్రీల పక్షంగా ఇందులో రెండు మూడు కవితలున్నాయి పాటల్లో పాతబాణీలను సొంతం చేసుకున్నారు

విద్యార్థి వీరలెమ్మురా - కృష్ణ అల్లూరి సీతారామరాజు' సినిమాలో ఘంటసాల పాడిన శ్రీశ్రీ గేయం బాణీది పు 11 ఇదేనా మన సమాజం - ఎన్ టి ఆర్ వరకట్నం' లోని ‘ఇదేనా మన సంప్రదాయమిదేనా' దారిలోనిది పు 24 ‘ఆకలే కవికి కవితలు' 24 పుట పాటది ఈ టెలివిజన్‌లు రాకముందు మన ఆకాశవాణిలో వినిపించిన లలిత గీతం నడక వీరి వచన కవిత మచ్చుకు కొంత -

వాడు మహా దుర్బలుడు/ మహాబలశాలి ననుకుంటాడు
క్షణం క్షణం వాడిలో భయం/ పిల్లిని చూసి పెద్దపులనుకుంటాడు
తన నీడను చూసి తాను జడుసుకుంటాడు
సనాతన సాంప్రదాయాల రక్షణ కోసం/ అనాది శ్రీనాధులను రక్షించుట కోసం
భూస్వామ్య పాలక వర్గ ప్రయోజనాన్ని కాపాడుట కోసం
సామ్రాజ్యవాద దోపిడి ప్రయోజనాలను నిలుపుటకోసం
శాంతి భద్రతల పేరిట పోలీస్ క్యాంపులను పెడుతున్నాడు
రైతు నడ్డి మీద గొడ్డలి వేటేస్తుంటాడు / కార్మికుని పొట్టలో క్షుద్బాధ లేపుతాడు
వాడు ఊరూరు గాలిస్తున్నాడు / దొరికినోల్లనల్లా కాల్చేస్తున్నాడు - పు 30, 31

ఈ యువకవి జాన పద గేయ బాణీ ఇది -

"తూరుపు కొండల్లో - ఊరల్లా, సూర్యుడు పొడిసిండే ఊరల్లా,
కరీంనగర్ పోరుల్లో - అన్నాలూ, ప్రతిఘటన బాటల్లో అన్నాలూ,

దొంగ ఎదురు కాల్పుల్లో - అన్నాలూ, నేల కొరిగిన వీరులే ఊరల్లా పు 14
"గాలిని కాల్చితే గాయం కాదు - అన్నల చంపితె పోరు ఆగదు
అంతిమ విజయం అన్నల దంటీవా సహదేవరెడ్డి
ఆకలి పోరు - ఆగదంటివా - సహదేవరెడ్డి పి రాములు పు 37
రెసారె ఆశయం - పు 18 (1987)
"రాజ్యహింస నెదుర్కొంటూ, ప్రజలను చైతన్య పరుస్తూ
ఈ ఊపిరి కొనసాగేదాకా సామ్యవాద దరిచేరసాగుదాం -"

## 43 వేణుశ్రీ - నందగిరి, కోట్ల నివాసం కరీంనగర్ జ. 4-2-54

వేణుశ్రీ ఎస్ వేణుగోపాలాచారి కరీంనగర్ సి ఎస్ ఐ ఉన్నత పాఠశాలలో ఆంధ్రోపాధ్యాయులు సాహిత్యాభిమాని వర్ణాంతర వివాహం చేసుకున్న ఆధునిక వాది వీరు అభ్యుదయ కవి

వీరి ముద్రిత కవితా సంపుటి 1 స్వేచ్ఛ - 1990 ఇది 19 వచన కవితల పుస్తకం

' ఈ కవి శ్రీనాధుడు, శ్రీశ్రీ కానీ కాడట నడి సంద్రంలో జనం పడవను ఒడ్డుకు చేర్చే నావికుడట (పేజి 10) వరకట్నాల నిషేధించాడు 13, 16 నాడు నేడు 20-21 ఆటవిక దశకు ఆధునిక కాలానికి నాగరికత పెరిగినా మానవత పెరుగనందుకు మంచి మనిషిగా వాపోయాడు ఏది కులం - 20 అంటూ అనుచిత కులభేదాల నిరసించాడు నాకు దేవుడు లేడు - 3 అని నాస్తికత్వాన్ని నిర్భీతిగా చాటుకున్నాడు అశ్లీల క్షుద్రసాహిత్యాన్ని - 21 తూలనాడారు సామ్యవాద ప్రయోజనాన్ని అడుగడుగునా చాటి చెప్పాడు హక్కుల కోసం పోరాడే వారిని అణచే ప్రభుత్వాలు పరోక్షంగా ఆ పోరాటలకు ఊపిరి పోస్తున్నాయానే నిజం 'నిజం - 28, కవితలో చివరగా తీర్మానించాడు ఇలా ఎన్నో భావబాణాలు ఈ చిరుపుస్తక తూణీరంలో ఉన్నాయి' ఇవి ఆ పుస్తకానికి మలయశ్రీ (నేను) సమకూర్చిన పీఠికలోని వాక్యాలు

"సమతా మమతలను పెంచి జాతి కక్షల రూపు త్రెంచి, గగన వీధి యందు గళమెత్తి పాడగా' తన మార్గంలోకి ఆహ్వానిస్తున్నాడు వేణుశ్రీ" అన్నారు డా॥ వి రంగాచార్య

నేనొక వింత వాదిని, అని పంతానికి రాను
నేను నిరాశ్రయున్ని కాని - నా ఆశయాలకు ఆశ్రమముంది
నాకు మాతృప్రేమ తెల్వదు కాని - భారతమాత ఒడిలో నిద్రిస్తాను
నాకు మనస్సనేది లేదు, అది న్యాయాలకు బలౌతున్న, అన్నా చెల్లెళ్లకిచ్చాను
నేనెవరిది మ్రింగను, నేనెవరికి లొంగను పు 3
విషాద భారతిని - పోతన సరస్వతిని వలెనే ఓదార్చారీ కవి - 6, 7
"ఓ సూకరమా మా రాజకీయ భవనాలతో నీవు నివసించరాదా?
బురదలేని ఆపవిత్రత నాకెందుకంటావా?
అక్కడ నీవు తోక ముడిస్తే చాలు, వాళ్లూ నీవూ ఒకటే-
నీ ఒంటికే బురద కాని, వాళ్ల మనసుల నిండా బురదే" 8
"స్వతంత్ర్య రాజ్యంలో - సంతోషంలేకున్నా, సమాధానాలున్నాయి
తినడానికి తిండి లేకున్నా - తిరగడానికి ఊర్లున్నాయి
కట్టడానికి గుడ్డలేకున్నా - కనడానికి పెళ్లాం ఉంది



ఉద్యోగం లేకున్నా - ఉద్యమాలున్నాయి
ప్రగతి పథం లేకున్నా పార్టీలెన్నో ఉన్నాయి
జ్ఞానమున్నవాడికి నాలుగు గోడలేనోయి గతి " 12
యువతే దేశ భవిత 17 19, 3 పుటల కవిత

సమకాలీన సమాజంలో కులాల పేరిటా, మతాలపేరిటా జరుగుతున్న అరాజకాలను చూసినప్పుడు కవి హృదయంతో కలిగిన కల్లోలం ఈ కవితా సంపుటిలో చాల చోట్ల కన్పిస్తున్నది మనిషి భవిష్యత్తు ఉజ్వలంగా వుండాలనే ఆరాటం కూడా ఈ కవితల్లో అగుపిస్తున్నది" అని డా సి నారాయణ రెడ్డిగారు అభిప్రాయపడ్డారు

చివరికి 'నిజం' 27 28 'కొంగ ఎంగ్రి కథ'తో 'జాగ్రత్త' అని హెచ్చరించారు సమాజానికి సమతా సహజీవన వాదాన్ని ప్రబోధించారు వేణుశ్రీ కవి

### 44 నమిలికొండ నాగేశ్వరరావు - పూడూరు కరీంనగర్, జ 12-1-49

నాగేశ్వర రావు గారి కవితా సంపుటి 'కలం కన్నీళ్లు - 1991లో ప్రచురణ పొందింది డా సి నా రె , మలయశ్రీ, డా దామోదరరావు, పీఠికలున్నాయి

"నిజానికి ఈ కవి మిత్రుని కలం కార్చిన కన్నీళ్లు ప్రధానంగా సమకాలీన సామాజిక స్పందనతో, ఆత్మ పరిశీలనతో, భావుకతతో, దేశభక్తి ప్రబోధాత్మక సందేశాలతో జీవితానుభవమూ భావుకతా పెనవేసుకొని వున్నాయి " అన్నారు కల్వకోట విజయనరసింహరావు అడ్వొకేట్

' నిరాశా నిస్పృహలతో నేను వేగ లేకున్నాను/ మంచి, మానవత్వం సాధించ లేకున్నాను
అసలు నేను మనిషిగా జీవించలేకున్నాను " పు 13
"ఆకలి రాజ్యంలో వుండలేను / అనాధల ఆక్రందనలు వినలేను
నీ ఒడిలో పెరగలేను / చావుకై పికిరి వాడిని కాలేను" - 'కసి' పు 15
పోలికేక 22వ పుటలో
' గతం, నా బద్ధ శత్రువు / వర్తమానం నా ఆప్త మిత్రువు
భవిష్యత్తు నా అంగ రక్ష / నా నాంది నవతకు మేలు కొలుపు ఇది ఈ కవి అనుభవాల అనుభూతుల భావి భావాల వచన కవితల సంపుటి

### 45 రుద్రవరం ఎల్లయ్య బి ఏ బి ఇడి హుస్నాబాద్

రుద్రవరం ఎల్లయ్యగారి జన్మ తేది - 5 ఆగస్టు 1940 జన్మ గ్రామం రాయికల్ మం సైదాపూర్ వీరు అధ్యాపకులు వీరి ముద్రిత రచనలు -

1 రిజర్వేషన్ లెందుకు? - 1991 పు 26 2 పావురాలు - 1995 పు 50

దళిత జాతిలో జన్మించి బహుకష్టంగా విద్యావంతులైన రుద్రవరం గారికి సహజంగానే దళిత జాతులపై అభిమానం ఏర్పడింది అదే మొదటి పుస్తకాన్ని రాయించింది అంబేద్కరా' భారత దేశపురా చరిత్ర, ఆర్యుల పుట్టుపుర్వోత్తరాలు, వర్ణవిభేదాలు ఆధునిక చరిత్రకారుల పద్ధతిలో వివరించి, హరిజనుల స్థితిగతులు వినిపించి "ఉండవలె రిజర్వేషన్లంబేద్కరా" అని ముగించారు

పావురాలు కొన్ని పర్వాలుగా విరచితమైన వచన గేయ సంపుటి సామాజిక అన్యాయాల, అసమానతల, కల్లోలాల కవితమదైన ఆలోచన - ఆవేదన - ఆదర్శ సందేశాలతో ఈ కవితలు రాశారు ఇవి వచన కవితలైనా నాలుగేసి పంక్తుల్లో పద్యాలుగా ఉండటం విశేషం యతి ప్రాసల విషయం పట్టించుకోలేదు సాదా సీదా రచన

ఎవ్వరి వాడను కాను / ఎల్లరు నా వారే
కలిమి బలిమి లేదు / కలదు సత్య మొక్కటే
దేనినైన నమ్మువారు ఆ నాటి వారు
సత్యం తెలుసుకొనువారు నేటి వారు
చాల సత్యములను 'పావురాలు' జేసి
వదలు చున్నాను విశ్వతీరాల దాక!
కవి ఆకాంక్ష శాంతి - సమత మానవత

వీరి జాతీయ సమైక్యత వ్యాసం రాష్ట్రస్థాయి బహుమతి నందుకున్నది ఏ పోటీ ఏ సంవత్సరం అనే వివరాలు తెలియలేదు రుద్రవరం ఎల్లయ్యగారి అముద్రిత పుస్తకాలు మరో మూడున్నవి

## 46 జాగిరి శ్రీనివాస్, బి ఏ కరీంనగర్ జ. 20-6-72

జాగిరి శ్రీనివాస్ శ్రామిక కుటుంబం నుండి నిరుద్యోగిగా నేటి సమాజాన్ని అధ్యయనం చేస్తూ ఆధునిక దృష్టితో కవితలు వ్రాస్తున్నారు నాలుగైదేండ్లుగా సాహితీసమావేశాల్లో పాల్గొంటూ కవితలు వినిపిస్తున్నారు 'చాచా నెహ్రూ బాలానంద సంఘం ఏర్పరచి మిత్రుల ఉదారుల తోడ్పాటుతో విద్యార్థులకు ప్రోత్సాహక కార్యక్రమాలు, కళాసాహితీ క్రీడారంగాల ప్రముఖులకు సన్మానాలు సభలు నిర్వహిస్తున్నారు

శ్రీనివాస్ వచన కవితా సంపుటి 'క్రాంతిపూలు' 1992లో వెలువడింది 40 కవితలతో 30 పుటల్లో పీడిత జన పక్షంగా వెలువరించిన ఈ పుస్తకానికి ప్రముఖ కవులు కాళోజీ ప్రభృతులు అభినందనలు ఆశీస్సులందించారు

క్రాంతి పూలు' పూయించడానికి ఈ కవి అక్షరతపన ఇట్లుంది
"పూలమొగ్గల్లో అగ్నిని చూస్తున్నాను / కొమ్మకొమ్మల్లో ఆకుల కత్తులు నూరుతున్నాను
వ్రేళ్ల నుండి ఉద్యమాన్ని వెలికి తీసుకొస్తాను వెలుగుపూలకోసం
అణగారిన జనాన్ని పోరాటానికి సన్నద్ధంచేసి
విజయ తిలకం దిద్దుతున్నాను / విప్లవాగ్ని సుమహారాలు వేస్తున్నాను

పాటల్లో వేట సాగుతుంది, వేటబాటల్లో పాట మ్రోగుతుంది - ఆరంభకవితే ఇంతవాడి పాటలను ఇంతగా అభిమానించినా ఈ కవి పాటలు వ్రాయలేదు వచన కవితలే వ్రాశారు

మొదటి పుటలోని మరో కవితలో -
కులమతాల రక్కసిని కూల్చాలని / వరకట్న పిశాచాల పీడవదిల్చాలని
బాల్య వివాహాలు రద్దు చేయాలని / కుటిల రాజకీయాలను బలిచేయాలని
మతకలహాల మైల తుడిచేయాలని / మారణాయుధాల ఆటలు ఆపివేయాలని
దోపిడీల మురాల దగా కోరుచెలగాటాలు / దుర్మార్గపు నాటకాలు మాపి వేయాలని
భూస్వాముల మదం దించాలని / అధికారుల పెత్తనాల అణచాలని - ఉందన్నారు

కన్నీటి భారతం -3, ఎక్కడి గొంగడి అక్కడ - 6, న్యాయదేవత - 10, పెత్తందారీ విపణి విధానం 12, మంత్రి వాసన - 16, దేశంలో దొంగలు పడ్డారు 23, కాలం కన్నీటి పుస్తకం - 32 మొ॥ కవితల్లో నేటి కల్లోల సమాజాన్ని వర్ణించారు నూతన పరిపాలన - 28, సాధన - 30 కోసం విజయకేతనం ఎగరేయ వస్తున్నాం - 26 అంటూ 'తాను' ఎవరో 'నేను' కవితలో చెప్పుకున్నారు

## 47 రంగు సత్యనారాయణ - పర్లపల్లి జ 15-1-61

1 రగిలే గుండెలు - 1993, 2 మట్టి స్పర్శ - 1997

సత్యనారాయణ గారి జన్మస్థలం పర్లపల్లి ఓ ఫ్యాక్టరీలో కార్మిక ఉద్యోగిగా ప్రస్తుతం హైదరాబాద్ జగద్గిరి గుట్టలో ఉంటున్నారు సామాజిక కల్లోలాలు వీరిని కలం పట్టించాయి బాల్య జీవితం అమ్మానాన్నల అనురాగ స్మృతులు, కన్నకలలు, అందిన బ్రతుకు, పొందిన అనుభవాలు, అన్యాయాలు, ఆవేదనలు వీరికి కవితా వస్తువులైనాయి

1993లో ర స నా గారి రగిలే గుండెలు కవితా సంపుటి వచ్చింది ఇందులోని 66 పుటల్లోని వన్నీ వచనకవితలే కవి తమ అమ్మకూ, అలిశెట్టి ప్రభాకర్‌కూ ఈ కావ్యాన్ని అంకితం కావించారు



అనాధ పసిబిడ్డను అక్కున చేర్చుకుని
లాలించేవి పోషించేవి ఆ రెండు చేతులే
మట్టి పారల్ని చదును చేసి పంటను పండించేవి -
మొక్కను నాటి మానయ్యే వరకు కాపాడేవి
మమతను పంచి మనిషిని యెదపైకి - పొదవుకునేవి -
చనుపాలు త్రాగించి, ఉగ్గు బువ్వను తినిపించేవి
అని ఆ రెండు ప్రకృతిలాంటి అమ్మచేతులకు
అనురాగంతో మొక్కారు కవి మొదటి కవితలో

రగిలే గుండెలు రెండవ కవిత ఇది కవి, ఘర్మజలం కార్చి శ్రమ చేస్తున్న కార్మికులపై సాగుతున్న ఫ్యాక్టరీ దోపిడిని ఎదిరించడానికి వ్రాసింది

పశువుల్ని దొడ్లోకి తోలినట్లు, పక్షుల్ని గూట్లోకి నెట్టినట్లు
ఒకే ఒక సైరన్‌కూతతో మనల్ని, ఊపిరాడని వెలుతురురాని
కొండ గుహల్లాంటి కంపెనీలోనికి పంపుతాడు
కారం మెతుకులు తిన్నా, నీళ్లతో ఆకలిని చల్లార్చుకున్నా
శక్తిని కోల్పోతూ చిక్కుతున్నా, వాడికేమీ పట్టనట్లే ఉంటాడు
ఉత్పత్తిని ఎంత చేస్తున్నప్పటికీ, వాడికింకెక్కడో వెలితిగానే ఉంటుంది
మన ప్రతి మాటను తూటాగా భావించి భయంతో మనల్ని మాట్లాడుకోనివ్వడు పు 2

ప్రశ్నించడమే నేరమా! 11, కవితలో ఎదుటి వారి ప్రశ్నను గొంతులోనే నొక్కచూసినా చివరికి అదే గెలుస్తుందని కవి ఆశ మతం 13 ను గురించి ఈ కవి భావాలు ఆలోచనాత్మకంగా ఉన్నాయి

మతం, ఆమాటెత్తితే చాలు, గత చరిత్రంతా గుర్తుకొస్తుంది
ఖతం చేయబడ్డ తలలెన్నో , ఆహుతైన ఆస్తి విలువెంతో
మానవత్వాన్ని చంపే ఆయుధం మతం, రాక్షసత్వాన్ని మేల్కొల్పే
పంటను పాడు చేసే చీడ వంటిది మతం -
విశ్వమంతామతం నీడలోనే ఉంది, అది అంటువ్యాధిలా
ప్రజల్ని రోగగ్రస్తుల్ని చేస్తున్నా, బలుస్తామనే భావన కలిగిస్తుంది

మతాన్ని ఎంతగానో వ్యతిరేకించిన సత్యనారాయణ గారు దేవుని జోలికి మాత్రం పోలేదు ఈ కులవ్యవస్థని, స్వతంత్ర భారతాన్ని, స్వార్థ రాజకీయాల్ని స్పృశించారు 'బతుకుల'లో పు 88.

ఊళ్ళె బతుకు తెరువు లేక గీ పట్నంల కొచ్చి బతుకుడుగావట్టె
మనస్సంతా పల్లెమీదికే గుంజవట్టె గిక్కడింత అన్యాయమని నాకేమెరుక
పక్కపొంటోడు సత్తున్నా సూడరాయె, పైసకే పానమిత్తరాయె

బాల్యస్మృతులు, భవిష్యత్తు ఆశలు, వర్తమాన పరిస్థితి పరామర్శ ఇందలి కవితా వస్తువులు

మట్టి స్పర్శ 30 పుటల వచన కవితా సంపుటి 27 ఏప్రిల్ 97 నెలనెలా వెన్నెలా' మాసబ్ ట్యాంక్, జి వి కృష్ణారావుగారి గృహంలో జయశ్రీ గారి అధ్యక్షతలో జరిగిన సమావేశంలో డా॥ మలయశ్రీ ఈ పుస్తకాన్ని ఆవిష్కరించారు జ్వాలాముఖి గారు సమీక్షించారు హైదరాబాద్ కవులు సాహిత్యాభిమానులు హెచ్చార్కె, మొ॥ వారు పాల్గొన్నారు సత్యనారాయణ గారిలో పోరాట పటిమ ఉంది ఆ కార్మిక ఉద్యమ అనుభవాలను కవిత్వీకరించే తపన దీక్ష ఉన్నాయి సొంతూరి స్మృతులనుంచి అంతర్జాతీయ బాధితుల సమస్యల వరకు అక్షరరూపంలో చిత్రించిన రంగురంగుల జీవన కవన చిత్రం ఈ మట్టి స్పర్శ!

పెద్ద చదువుకాని పదవికాని లేదు - సాహిత్య రాజకీయ సంఘాలతో పొత్తులేదు పత్రికల రేడియోలు టి వి ల సినిమాల అండలేదు కార్మికుడుగా జీవిస్తూ తోటి కష్టజీవుల బాగును ఆశిస్తూ తమ అనుభవాలను ఆలోచనలను కవితానిబద్ధం చేస్తున్నారీ యువకవి

## 48 జూకంటి జగన్నాథం - సిరిసిల్లా

జె జగన్నాథం గారు సిరిసిల్లాలో 'సెస్ ఉద్యోగి చాలా నాళ్లుగా కవితలు, కథలు వ్రాస్తున్నారు సాహిత్యాభిమానంతో జీవిస్తున్నారు వీరి వచన కవితా సంపుటి 'పాతాళ గరిగె' 1993లో వెలువడింది ఇది 1993 జూలై 29న 'సాహిత్య గౌతమి కరీంనగర్ వారి 'డా సి నా రె అవార్డును గెలుచుకుంది

72 పుటల వివిధ శీర్షికల కవితల ఈ సంపుటిలో దేశవిదేశ పరిస్థితులు సమీక్షించబడ్డాయి కవి తమ భావాలకు ప్రతీకలను బలంగా ఉపయోగించుకున్నారు తమ తండ్రి దుర్గయ్య గారికి కృతిని సమర్పించారు "సంధికాలం" - పు 1, లో

ఇందలి సమస్త విలువలు నశిస్తాయి / పెట్టుబడి అన్ని రంగాలను, ఇనుప కౌగిలిలోకి
లాక్కొని బుజ్జగిస్తున్నప్పుడు, సమస్త విలువలూ నశించిపోతాయి
భూమి విలువను కోల్పోయి వృత్తుల పునాదులు కదలిపోతాయి,
చలనం - స్థితినే ప్రశ్నిస్తున్నప్పుడు, డబ్బు ముందు చేతులు కట్టుకొని నిలబడాల్సిన దీనహీన స్థితికి క్రమక్రమంగా/ ఒక పథకం ప్రకారం, వృత్తులన్నీ కాజేయబడ్డాయి

"అగ్ని పర్వతం మీంచి "
అడవి పులుగు గొంతెత్తి అరుస్తున్న / అమావాస్య ముందరి తెల్లారే వెన్నెల్లో
ప్రేలే అగ్ని పర్వతం మీంచి నావారి కోసం / నేనీ గీతాన్ని సంధిస్తున్నాను - 5
"దూరం"లో ఆశల ఆశయాల వ్యక్తుల మధ్య ఉండే అంతరం చూపబడింది - 7
తుచ్ఛమైన వాంఛ అధికారమై రాజ్యమేలుతున్నప్పుడు
త్యాగం కూడా రాజద్రోహమే అన్నారు - 11

"నిజాన్ని నేను చెప్పుతాను" అనే ధైర్యం ఈ కవి గారిది జాతీయ అంతర్జాతీయ సమస్యల సమీక్షే కాక బాల్య జీవితాన్ని సాహితీ మిత్రుల - అలిశెట్టి సంస్మరణలతో పాటు స్వీయ మనోస్థితిని తమ కవితల్లో వివరించారీ కవి మారిన పల్లెల చిత్రిస్తూ -

ఇప్పుడు ఊరు ఎలా వుంది?
రాత్రి అందరి ముందే, కొడుకును తీసుకుపోయిన డిజిల్ జీపు
తెల్లారే సరికి గుర్తు తెలియని శవమైతే, బాహాటంగా పెదవి విప్పటానికి
కడుపు నిండా ఏడవడానికి జంకుతున్న తండ్రి లాగుంది - 70
పునరావాసం -లో శ్రామిక జనం జీవనాల వర్ణించారు - 72

భావంలో భాషలో స్వేచ్ఛను వరించిన జగన్నాథం గారు స్వేచ్ఛా జీవనానికి తన పాత్రను ఆత్మస్థైర్యంతో ఇట్లా ప్రకటిస్తున్నారు

నన్నెవరూ ఆపలేరు / నేల గర్భాన్ని చీల్చుకు వస్తున్న మొక్కను
ఏ మోసాలు, ఏ కుట్రలు, ఏ దశలు, ఏ కక్షలు
ఏ సంగ్రామాలూ, ఏ తుపాకి గుళ్లూ, నన్ను ఓడించలేవు
ఏ ప్రభుత్వాలూ, ఏ చట్టాలూ, ఏ నీతులూ, ఏ గోతులూ
ఏ సాక్ష్యాలూ, ఏ కోర్టులూ, ఏ జైళ్లూ, ఏ సంకెళ్లూ
నన్ను బంధించలేవు నేను ఉదయాకాశాన్ని తొలికోడి కూతని
అనంతమైన ఆశని అనంతకోటి విశ్వాసాన్ని
నేను శ్రమను పరిశ్రమను, నన్నెవరూ ఆపలేరు మాపలేరు
నేను నేల గరిమనాభిని పెకిలించుకు వస్తున్న / మహాసంక్షోభాన్ని, మహా సంగ్రామాన్ని - 37

ఆవేశం ఊపుతో ఆలోచనాత్మకమైన ముందు చూపుతో అధునాతన మార్గంలో కలాన్ని నడిపిస్తున్న కవి జూకంటి జగన్నాథం గారు

## 49 వఝుల శివకుమార్ - వేములవాడ

శివకుమార్ గారి జన్మస్థలం వేములవాడ పది పది హేనేండ్లుగా వీరు కవితా వ్యవసాయం సాగిస్తున్నారు ఉద్యోగ రీత్యా ఇప్పుడు లైబ్రేరియన్‌గా ఎఫ్ సి ఐ - రామగుండంలో ఉంటున్నారు

మిత్రులతో కలసి 'లయ' కవితా సంకలనాన్ని ప్రచురించిన శివకుమార్ తమ కవితలను ఒక సంపుటిగా గోగుపువ్వు' పేరుతో జనవరి 1994లో ప్రచురించారు దీనికి జూలై 1994లో 'ఫ్రీవర్స్ ఫ్రంట్ హైదరాబాద్' వారి అవార్డు లభించింది ఈ సంపుటి 74 పుటలు కవితలకు శీర్షికలున్నా నంబర్లు లేవు వాటిని వ్రాసిన తేదీలున్నా విషయ సూచిక కూడా లేదు 'విలాసం' తప్ప కవి వివరాలు మరేవీ లేవు



శివకుమార్‌లో ఆలోచన, అనుభూతి పాలు ఎక్కువ ఉపమలు, దృష్టాంతాలు విరివిగా వాడుతూ ధ్వని గర్భితంగా తమ కవితలను చిక్కగా వ్రాశారు భాషలో స్వేచ్ఛ, మాండలికం మీద ప్రేమ ఈ కవి గారి కవితల్లో కనిపిస్తున్నది

"పల్లె మెల్లో పగడాల దండ గోగుపువ్వు /పొద్దుని గుల్లల కెత్తి, ఊరుని నిద్దరలేపుతున్న
జేయారం పాలగుండె గోగుపువ్వు / తోట ఒడిమీద తొడిమల్ని మిగుల్చుకొని
పిందెనీ కాయని పట్నాని కందించి/ వెలవెల బోతున్న వేడి నిట్టూర్పు గోగుపువ్వు" - 10

గని గుండెల్లో కార్మికుడు ఈ కవికి 'విషయవలయాల్లో కనలి గుండెలోతుల్ని స్పృశిస్తూ బతుక్కి అర్థమౌతున్న, రూపురేఖ దిద్దే చిత్రకారుడు' 13

డిసెంబర్ - 6' శీర్షికలో కవి అయోధ్య' సంఘటనకు కారణం మన ప్రభుత్వపు దొంగ సెక్యులర్, విధానమని బాధతో అలాంటివి 'పునరావృతం కాకుండా ఉక్కు పిడికిలి బిగించారు

58 స్టార్ టి వి ప్రభావాన్ని నిరసిస్తూ, వ్రాసిన కవిత ఉంది

'కళ్లప్పగించడం వరకే, అప్పగించాక చూపులు నీతో / సంబంధాలు తెంపేసుకుంటాయ్

నువ్వో పెంపుడు కుక్కవై, చొంగకారుస్తూ పడుకుంటావ్,

మెదడెక్కడో రాలి పడి, తల మాత్రం మొండెం మీద కదల్తుంటుంది' - 51

బాల్యం 37 నేల తల్లి 30 అమ్మ 46 చక్కని అనుభూతి కవితలు ఇంకా ఈ సంపుటిలో

"భ్రమావరణంలో గుండె తాళం చెవులు పాగొట్టుకొని

మూట గట్టిన శూన్యాలు చెరిపించుకొంటున్న / కరచాలనం వెంపర్లాట వృథా" - 63

"వీరు ఒక్కడే! వాడికి విశ్వపరివ్యాప్తంగా / వినిపించే గొంతుకలు కోటి

కాలాన్ని కరవాలం చేసి, కాలం అంచుమీద / యుద్ధ గీతాలల్లే వారికి బాహువులు వేయి' 61

ఇట్లా క్లిష్టంగా - స్పష్టంగానూ వీరి కవితలు కనిపిస్తాయి

పల్లెల్లో పూటకొక్కటిగా రాలుతున్న శవాల చూపించారు నగరాల్లో పేవుమెంట్ల మీది ఆకారాల పేగు తీగల తంబూరా శ్రుతులతో 'గోదావరి' హోరు - పోరు పాటగా వినిపించారు లెనిన్ కమ్యూనిజం సంఘటనల తలచి, నేటి డంకెల్ 'ఢిల్లీలీల' వివరించారు ఆ ఒప్పందాన్ని నిరసించారు

వఝుల శివకుమార్ గారికి వచన కవితపై బడుగు వర్గంపై - అంటే, శ్రామికులపై - స్త్రీలపై సానుభూతి ఉంది అనుభవాల భావాల కవితల చురకత్తుల, అనుభూతుల సానపై పదను పెట్టుకున్న పురోగమనవాది శివకుమార్ గారు

## 50 ఆకుల గంగాధర్ - జగిత్యాల

1 దళిత భారతి - 1994, 2 యుద్ధ లేఖ - 1997

గంగాధర్ ఇంచుమించు ముప్పదేళ్ల యువకవి ఆయన చిరు తరగతి ప్రభుత్వోద్యోగి వీరు 'దళిత భారతి పేర 1994లో తమ కవితల నొక సంపుటిగా ప్రచురించారు అందులో స్వీయ పరిచయ వివరాలేవి లేవు 34 పుటల ఈ పుస్తకంలో పుటకు రెండు మూడు వచనకవితలున్నాయి శీర్షికలు భావాలు వేర్వేరుగా ఉన్నా అన్నింటి ఆంతర్యం పుస్తకం పేరుతో ఉన్న మొదటి కవిత 'దళిత భారతి'లో ప్రతిబించింది అది ఇది

"దళిత భారతిలో, కాటికి పోయే కులాలన్నీ, కుస్తీలు పడుతున్నాయి

కూటికి లేని శ్రామికుని శక్తి, ఆధునికం వైపు తీసుకుపోతుంటే

కోటికి పడగలెత్తేవాడు, కోతలెన్నో కూస్తుంటే -

జాతి జీవనాడులన్నీ కలాలు పట్టి, కులాల కుస్తి పోరాటంలో

పాలాలు దాటి తారు రోడ్లెక్కినయి /

జాతిగా జాతులుగా, అణచబడిన అణగబడిన



అనాద జీవన రేఖలయి ప్రశ్నిస్తు, శోధిస్తు, రోదిస్తున్నవారిని చూచి
ఒక్కటిగా చేస్తుంటే సమానమని గుళ్లో కాలుమోపనీయనివాడు
ముందు వరుసలోకి వస్తుండు కూనిరాగం తీస్తుండు -
కాని బలి అవుతున్నది దళితులే 'లాంగ్‌మార్చ్ ప్లాగ్ మార్చ్ ఆశయంతో చివరికి తమ త్యాగ ఫలంగా విజయం సాధించుకునేది వీళ్లే - పేద శ్రామికులే "

ఆలోచనీయ కవితా నిర్వచనాలున్నాయి కొన్ని ఈ సంపుటిలో
' ఓనాటి యుగాంతరాల, తాతల గుర్తులు
ఈనాడు కులాల కుట్రలై వెనుకబడిన ప్రతిభా పోరాటాల్లో
రగిలే రిజర్వేషన్, జీవన మరణ గుర్తులు!''

'జన జీవితంపై పడే లారీ కర్రల మోత హక్కుల రాజ్యాంగంపై పడే రక్తపు ధార'' -11 వర్తమాన రాజకీయ చిత్రాలు మరికొన్ని ఉన్నాయి ఈ ప్రజాస్వామ్యాన్ని విమర్శించి (34) బానిస విముక్తి గళాలు స్వేచ్ఛా సమతల కోసం నాదాలు చేస్తాయన్నారు (29)

ఈ పుస్తకం ఆంధ్ర ప్రదేశ్ దళిత రచయితల కళాకారుల, మేధావుల, ఐక్యతవేదిత తరపున 'విశాల సాహిత్య అకాడమీ జగిత్యాల వారు ప్రచురించారు రాష్ట్ర దళిత సాహితీ వేత్తల ముందు మాటలు ఈ కవి - కవితాస్వభావ స్వరూప సమీక్షలుగా ఉన్నాయి ఒక ఆశయంతో వ్రాస్తున్న కవి ఆకుల గంగాధర్ గారు

యుద్ధలేఖ దళిత పోరాట సుదీర్ఘకవిత డా॥ మలయశ్రీ, ఆం ప్ర 'దరకమే' అధ్యక్షులు బి ఎస్ రాముల పీఠికలతో వెలువడుతున్నది ఇది ఈ కవి 'దళిత భారతి'కి బలమైన అనుబంధం

## 51 పవన్ కుమార్ రాజు 'నూతన్' మృతి - 1992 వ 35 సం సుమారు

'నూతన్ కలం పేరుతో రచయితగా, వేణు వేణన్న పిలుపులతో విప్లవ కార్యకర్తగా రాణించిన పవన్‌కుమార్ రాజు ఎల్లారెడ్డిపేట మండలంలోని రాచర్ల తిమ్మాపూర్‌లో పుట్టారు కామారెడ్డిలో ఇంటర్ చదువుతున్న కాలంలో ప్రజా కవిగా కలం చేపట్టారు సిరిసిల్లా భూస్వామ్య వ్యతిరేక పోరాట స్పందనతో సమాజంలో అడుగుపెట్టారు 1980 నాటికి కరీంనగర్ జిల్లా సి పి ఎం (ఎల్) సభ్యునిగా ఎదిగారు "1979, 87లో రెండుసార్లు అరెస్టయి జైలు పాలయ్యారు గోండు భాషను నేర్చుకొని, పాటలు రాసి ఆదివాసి ప్రజలతో మమేకమై 'వేణన్న'గా పేరొందాడు ప్రజలే సర్వస్వమని నమ్మిన వ్యక్తిగా, ఏనాడూ ఇంటి ముఖం చూడలేదు ''నూతన్ రచన'' వెదురు వనాల గానం 1993 పుస్తకానికి సుధాకిరణ్ వ్రాసిన పీఠిక నుండి (రచయిత జీవిత విశేషాలు కూడా అందులోనివే) 1985లో ఒకసారి జగిత్యాల ప్రాంతంలో వేణును పోలీసులు కాల్చి వేసినట్లుగా తప్పుడు వార్త ప్రచారమైనా నిజానికి 25 జూన్ 1992 నాడు రాత్రి మంచిర్యాల పట్టణంలో ఓ కార్మికుని ఇంట నిద్రిస్తుండగా పోలీసుల ఎన్‌కౌంటర్‌లో రాజు మరణించారు

పవన్ కుమార్ 'నూతన్' రచనలను విప్లవ రచయితల సంఘం సిటీయూనిట్‌వారు 'వెదురు వనాల గానం' పేరుతో 1993 జనవరిలో ముద్రించారు 110 పుటల ఈ సంపుటంలో నూతన్ గారి కవితలతోపాటు 'అడవి తల్లి' ఒగ్గు కథ మరి రెండు కథలు, కాలుష్యపురక్కసి అనే వ్యాసం ఉన్నాయి నూతన్ వచన కవితలు తక్కువ, పాటలెక్కువ వ్రాశారు ప్రభుత్వ వైఖరికి నిరసన, సామ్యవాద సాధనకు ప్రజల సంఘటిత పరచడం, అమర విప్లవవీరులకు లాల్ సలాంలు అందించి కృతజ్ఞత చాటు కోవడం వీరి గేయాల కవితల సారాంశం

ఎర్రా చిన్ని కోయిలో ఎర్రాచిన్ని కోయిలో
ఈ చిన్ని పాటపాడి అన్నకు వినిపించవే - ఎర్రా చిన్న కోయిలో
దొంగ ఎదురు కాల్పుల్లో - కనుమూసిన కరీంనగర్ పోరాటపు బిడ్డడే
మా యన్నముత్తన్నకు - ఈ తమ్ముల ఎర్రెర్రని దండాలని చెప్పవే - ॥ఎర్రా॥ పు 1
చింతిల్ల బోకూ ఓ పోరు జేసే కామ్రేడా/ రంజిల్ల బోకూ ఓ పోరు జేసే కామ్రేడా ॥చి॥
తీరం చేరే దాకా నావను నడిపిస్తమని / పోరాటమె మార్గమని తియ్యని మాటలు చెప్పి
నట్ట నడి సంద్రాన నావను వదిలేసిరని ॥చి॥ పు 3

వీరి పాటల్లో స్థానిక, రాష్ట్ర - దేశ సమస్యల నుండి అంతర్జాతీయ వ్యవహారాల వరకు చోటు చేసుకున్నాయి మన రాజకీయ నాయకుల విమర్శచేసే సందర్భాల్లో వారి పేర్లు పేర్కొనడానికి వెనుదీయ లేదు మతాన్ని ధన స్వామ్యాన్ని నిరసించి వీరు సామ్యవాదాన్ని కోరుకున్నారు అరుణ పతాకం నీడలో తుపాకి చేతబట్టి, పల్లె ప్రజల పోరాటపు బాటల్లో పయనించి పోలీసుల కాల్పుల్లో కన్నుమూసిన తెలంగాణా కమ్యూనిస్టు యువకుల పేర్లు వీరి పాటల్లో పదుల సంఖ్యలో చోటు చేసుకున్నాయి ఒక ఆవేశంతో ఉద్యమంలో చేరి, ఒక ఆశయంలో ఆలోచనతో జీవించి దానికే బలైన ఈ యువ కవి ఆకాంక్ష ఇది వచన కవితల భాగాలు

దోపిడి కొండల్ని పిండి చేస్తున్న / పోరాట ప్రజల ఎర్రెర్రని గుండెల్ని చూస్తూ
వర్గ కసిని మరింత పెంచుకొని విజృంభించు/ తటస్థ మార్గానికి తిలోదకాలిచ్చి
ఊగిసలాటలను ఉలుకుపలుకూ లేకుండా అంతంచేసి
ధర్మ సందేహాల్ని సక్రమంగా నివృత్తి చేసి కొని
వర్గ పోరాటాన్ని విశాల ప్రాంతాలకు విస్తరింపచెయ్ - పు 104
విప్లవోద్యమ సంరక్షణకై, సుత్తివై కత్తివై కదలిరానేస్తం!
ప్రతిఘటనా పోరు బరిలో దూకిన ఓ నేస్తం
పోరాటంలో విజయం నిన్ను వరించేది ఖాయం,
ఈ దోపిడి వ్యవస్థ అవుతుంది మటుమాయం 106

## 52 ఎం ఎస్ ఆర్ - 22 జూన్ 1969 - 13 సెప్టెంబర్ 1992

ఎం ఎస్ శ్రీనివాస రావు గారు 'కరుణాకర్ - ప్రభాకర్' పేర్లతో విప్లవకారుడుగా ఉన్నకాలంలో వ్యవహరింపబడేవారు గోదావరిఖని ప్రాంతంలో జన్మించిన శ్రీనివాసరావు హైదరాబాద్ వాసవి ఇంజనీరింగ్ కళాశాల విద్యార్థిగా ఉన్నకాలంలో విప్లవోద్యమ సంపూర్ణకార్యకర్తగా చదువు వదలి కార్మికులకు అండగా వెళ్లారు 22 ఏళ్ల తరుణ వయస్సులో పటాను చెరువు ప్రాంతాన పోలీసు ఎన్‌కౌంటర్‌లో అసువులు బాశారు

శ్రీనివాసరావు కవి, రచయిత, వీరి రచనలు, పత్రికలలో ప్రచురణ పొందాయి డైరీలో నిద్రిస్తున్న వాటిని సేకరించి, విరసం జంటనగరాల యూనిట్ ఎం ఎస్ ఆర్ పేరుతో కాగడాగా వెలిగిన క్షణం పేరుతో 1992 నవంబర్‌లో ప్రచురించింది 150 పుటల ఈ సంపుటిలో శ్రీనివాసరావు వ్యక్తిత్వ కవిత్వ స్వరూపాల సమగ్ర చిత్రణ ఉంది భగత్‌సింగ్, సర్దార్ హాష్మీ, సాల్వదార్ దాలీ, శ్రీశ్రీ, మొ॥ వారుఎం ఎస్ కు అభిమానులు డైరీలోని అంశాలు ఆయన సున్నిత మనస్సును ఆర్ద్ర కళాహృదయాన్ని తెలియజేస్తున్నవి అక్రమాలను చూసి సహించలేకపోవడమే మనిషిని తిరుగుబాటుకు ప్రేరేపిస్తుంది

ఎం ఎస్ ఆర్ వచన కవితలు, కథలు, సమీక్షలు ప్రముఖ రచయితలతో ఇంటర్వ్యూలు మొ॥వి ఈ పుస్తకంలో ఉన్నాయి కొన్ని సినిమాల సమీక్షలూ వ్రాసుకున్నారు నేత పనివారల ఇంటర్వ్యూ విలువైన సమాచారం ఆంధ్రాంగ్ల భాషల్లో చక్కని ప్రవేశం, విషయాలను నిదానంగా సూక్ష్మ పరిశీలన చేసే పరిజ్ఞానం సహనం ఈ యువ విప్లవ కవికున్నవి

ఎం ఎస్ ఆర్ కవితా చరణాలు స్టెన్‌గన్ బుల్లెట్స్' ఒకటి చూడండి

"మీ తలలన్నీ నా ఉక్కుపాదం కింద చీమలని విర్రవీగావు
మా నెత్తుటి లిపి రాస్తున్న వాళ్ల మీద కుట్ర కేసు బనాయించావు
మా రక్తంలో చలనం మొదలయింది
మా తలల అస్తిత్వం కోసం పోరాడుతున్న వాళ్లను ఎన్‌కౌంటర్ చేశావు
ఇప్పుడు నీ మీదకు గురిపెట్టిన తుపాకిలో
బుల్లెట్స్ అయ్యారు అమర వీరులు పు 7 (అరుణ తార మే జూన్ - 1990)

ఎం ఎస్ ఆర్, మరియు నూతన్‌ల ఈ రెండు అపురూప కవితా సంపుటాలను అందిచ్చిన సాహితీ మిత్రులు ఆనంద్ గారు ఈ ఇద్దరు విప్లవ కవుల పేర్లతో పాటు మరో పోరాట పాటల కవి ధర్మయ్య 'సుధ' పేరు ఈనాడు 93 కరీంనగర్ ప్రత్యేక సంచిక' పు 6లో కనిపించాయి కి శే ధర్మయ్య గారి పాటలు మారుపేర్లతో, పేర్లు లేక కూడా జననాట్యమండలి విప్లవ కవితా సంపుటాలలో వచ్చినవి ఆ కవి వివరాలు ఇంతకు మించి తెలియరాలేదు

## 53 తిరునగరి శ్రీనివాస స్వామి - బి ఏ ఎల్ గుమ్లాపూర్ మం కోరుట్ల

శ్రీనివాస స్వామి గారు కోరుట్లలోని ప్రైవేటు పాఠశాలలో అధ్యాపకులు వీరు సాహిత్యాభిమాని గేయాలు వచన కవితలు రచిస్తుంటారు డా అందె వేంకటరాజం గారికి అంకితమిస్తూ శ్రీనివాసస్వామి 1994 జూన్‌లో ఆలోకనం పేర తమ కవితలను ఒక పుస్తకంగా ప్రచురించారు దీనికి డా॥ సి నా రె, డా జి వి సుబ్రహ్మణ్యం గారల ముందుమాటలున్నవి ఈ కవి మాత్రాఛందో గేయాల శైలి ప్రసన్నంగా ఉంది



అమ్మ కన్నుల కాంతియందున, అమృతకరుడే కానవచ్చును
అమ్మ ఇచ్చెడి గరళమైనా, అమృతమై ప్రాణమ్ములిచ్చును 27
'నా కవిత పుట్టింది' విశ్వనాథ వారి కిన్నెరసానిలా నడిచింది
అల్లనల్లన సాగు, పిల్లతెమ్మెర సోకి /
మెల్ల మెల్లగ నూగు, పైరు పచ్చల తాకి
ఉల్లమంతా సిరుల, జల్లులో తడువంగ / హృదయమంతా విరుల, వెల్లువలు సాగంగ
పల్లె చల్లని ఒడిని పుట్టింది నా కవిత / పట్టణంలో అడుగు పెట్టింది నాకవిత - 36

ఇంకా అది రసహృదయాలకు పీఠమేసి, భావితరముకుబాట చూపి, కటికి పేదల కన్నీటిని తుడిచి, దుర్మార్గులను చూసి మండిపడి, మహనీయులకు మానవతకు తలవంచిందన్నారు

భీష్మించిన గ్రీష్మం 4, గేయానిది సైతం ఇదేలయ విన్యాసం

ఇందలి 18 శీర్షికలలో అంతర్మథనం అంతర్వేదనల మధ్య నాదేశం, హృదయస్పందన, అశ్రుధార, నిశ్శబ్దనిశీధి, వసంతం, వెన్నెల రేఖలు మొ॥ కవితలున్నాయి పాదరక్షలపై కూడా ఓ కవిత వ్రాసి కాదేదీ కవితకనర్హం అన్నసూక్తిని కూడా నిజం చేశారు వీరి అభిమాన కోరుట్ల కవి

డా అందె 'చీమ' పై 'చీపురు' పై కవితలు వ్రాస్తే వీరి దృష్టి చెప్పుల సేవపైకి మళ్లింది 'ఇప్పుడే తెలిసింది' - 23లో

అమాయకంగా తిరిగేవాన్ని ఈ లోకం అధ పాతాళానికి తొక్కేస్తుందని
నిజాన్ని బట్టబయలుచేసేవాడి తలను, నిర్దాక్షిణ్యంగా చెక్కేస్తుందని
నాకిప్పుడిపుడే తెలిసింది అంటున్నారు కవి

నిజానికిది జనానికి చాల పాత మాట - బాట! కవి ఆశయం "పునీత భారత జనని కీర్తి కిరీటాన్ని కబళించే కిరాతకుల దురాగతాల్ని అంతమొందించడానికి ప్రతివాడు గీతం పలికించాలని - రక్తారుణ కాంతిధారల్ని ప్రసరించాలని - పు 25' సంప్రదాయ మార్గంలో సమాజ సంస్కరణను కాంక్షిస్తున్న సరస - సౌమ్య కవి శ్రీనివాస స్వామిగారు

## 54 జి రాజేంద్ర, బి ఏ వేములవాడ జ. 2-4-1953

గరిశకుర్తి రాజేంద్రగారు తపాలాశాఖలో ఉద్యోగి వచన కవితలు బాలగేయాలు రేడియో నాటికలు వీరివి నాలుగు పుస్తకాలు వచ్చాయి

కవితాలత (వచన కవితా సంపుటి) - 1997 విషయ సూచిక శీర్షికలకు నంబర్లు, పుటల అంకెలు వేయని ఈ పుస్తకం సుమారు 50 పుటలు 40 పుటలు వివిధ కవితలు

ఆది కవి 'నన్నయ'కు వందనంతో ఆరంభమై అమ్మ' స్మృతిలో ముగిసింది ఇందులో అనుభూతి ప్రధానమైన కవితలే ఎక్కువ

కవి త్రిమూర్తుల కు నూతన నిర్వచనం చెప్పారు వారు రచయిత - సంపాదకుడు పాఠకుడు అట! తాను పనిచేసేది తపాలాశాఖ కాబట్టి కాబోలు 'ఉత్తరం' గురించి కూడా ఓ కవిత రాశాడు



కవి విన్నపం ఇది -
కవి గొంతు నులిమేయకండి/ రచయితను చంపేయకండి
కొత్తగా కలం పట్టిన వారిని/ ఆదిలోనే అణచేయకండి!
నిజమే! కసరుకాయలు / ఒగరుగానే ఉంటాయి
చిరుమొగ్గలు ముడుచుకొనే ఉంటాయి
చేయూతనిచ్చి /సేద దీర్చిండి!
ఏమో! ఇతడే రేపటి శ్రీశ్రీ కావచ్చు/ సినారె కావచ్చు/
జాషువా కావచ్చు/ యండమూరి కావచ్చు / ప్రాంతీయ భేదాలు / వదలి పెట్టండి
హితము మతమైన/ సాహిత్య మెక్కడున్నా
వెతికి (వెదకి) వెతికి తెండి/ కలకాలం రక్షించుకోండి
ఇంధులో కొన్ని మినీ కవితలు కూడా ఉన్నాయి 'మన దేశ ఘనత' ఇదిట!
కుంభకోణాలు / లీక్షేజీలు - ఇవే ఎల్‌కేజీ నుండి / పిల్లలకు నేర్పవలసిన పారాలు

## 55 డా॥ పి యశోదా రెడ్డి, ఎం ఏ (తె సం) పిహెచ్ డి అన్నారం

డా యశోదా తిరుమల్‌రెడ్డి గారి జన్మ స్థలం మహబూబ్‌నగర్‌లోని బిజినేపల్లి మెట్టిన గ్రామం కరీంనగర్ జిల్లా మానాకొండూరు మండలంలోని అన్నారం ఆమె 'తెలుగులో హరివంశములు' అను అంశంపై డాక్టరేట్ పట్టా పొందారు ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగు సాహిత్యంలో పిహెచ్ డి డిగ్రీ పొందిన స్త్రీలలో బహుశ వీరే మొదటివారు ఉ వి వి లో ప్రొఫెసర్‌గా ఆంధ్ర

ప్రదేశ్ అధికార భాషా సంఘాధ్యక్షులుగా రాణించిన పాకాల యశోదాదేవిగారు ఈ మీ చేతిలోని గ్రంధాన్ని (డా మలయశ్రీ - "కరీంనగర్ జిల్లా తెలుగు సాహిత్య చరిత్ర") అంకితం పొందారు

యశోదా రెడ్డి గారు కథా రచయిత్రి బహు పరిశోధనా వ్యాసాలు - సాహిత్య విమర్శనా గ్రంధాలు రచించారు అప్పుడప్పుడు కవి సమ్మేళనాలకు ఇంకా రేడియోలకు పత్రికలకు వారు వ్రాసిన వచన కవితలను ఈ మధ్యే రెండు సంపుటాలుగా ప్రచురించారు ఇన్నాళ్ళు పండిత రచయిత్రిగా బహుళ వ్యాప్తిలో ఉన్న వీరి పేరు వీటితో కవయిత్రి స్థానాన్నీ ఆక్రమించుకుంది వీరి కవితా సంపుటాల పేర్లు

1 ఉగాదికి ఊయల 1996 2 భావిక - 1996

ఉగాదికి ఊయల ఇందులో 17 కవితలు 84 పుటల్లో ఉన్నాయి అన్నీ ఉగాదులకు వ్రాసినవే దుందుభి క్రోధన, ప్రజోత్పత్తి తప్ప మిగితావి వత్సరాల పేర్లతో కాక శాంతి, విన్నపం, ఎత్తు కుర్చీ, బూచివాడు అనే పేర్లతో ఉన్నాయి అవి ఆయా కాలాల సామాజిక రాజకీయ విశేషాల వర్ణించిన కవితలు

ఆరంభకవిత ఉగాదిలో ఇలా ఆరంభమైంది కవయిత్రి కవనం

ఉగాదీ! నీవయస్సెంతో తెలియదు నాకు / కృతయుగపు తొలినాటి అరుణోదయం/
అన్నారు నీ నవోదయం / అదే నీ శుభోదయం / అందుకే /
కాలం పూచిన తొలి పువ్వు నీవు/ సృష్టి చూసిన తొలి వెలుగు నీవు
ప్రకృతి తొడిగిన తొలిమొగ్గ నీవు / విజ్ఞానం విరిసిన తొలి వెన్నెల నీవు
ఆద్యంతాలు లేవు కాలానికి/ అయినా / బుద్ధి జీవి లెక్కల గారడీలో చిక్కుపడి
చెప్పినట్లు నడుస్తుంది కాలం/ నిజానికి/ నడిచిందీ, నడిచేది, కాలం కాదుసుమా/ మనమే

ఇది పది పుటలు వివిధ విషయాల విశ్లేషణ యశోదగారు బహు సూక్ష్మంగా కావిస్తారు దానికి తోడు వ్యంగ్య విమర్శ! ఎత్తు కుర్చీ -లో స్వవిషయం నెపంతో అర్హతలేని వారూ ఉన్నత పదవులను ఆశించడాని ఎత్తి పొడిచారు చివరి కవిత 'మార్పు నవ్య భావ విలసితం

ఉన్నట్లుండి/ మా ఊరు నిలువెత్తు లేచింది /
రెండు చేతులా / పని సంపాదించింది/ మా పక్కింటి /కంపతారు/ చిగిర్చి/
ఎర్రపూలు పూసింది / మా ఊరి వెనుక / పాత గుండం - కమలాలను పూసింది/
జేగంట వాయించింది / (ఇక్కడికి సరే ఇక చూడండి )
మా ఊరి నడుమ / పెద్ద మఱ్ఱి/ ఊడలన్నీ భూమికి దింపుతూ/
దొరికినంత మేర తనదిగా / ముద్రవేసుకుని / వినయంగా చేతులు జోడిస్తూ ఉంది
(చివరికి ) అన్ని పార్టీలూ పైకి / నిగనిగా తళతళా మంటూ
విషాన్ని దాచిన / మారేడు కాయల్లా / మేడి పండు మేలిమితో మెరుస్తున్నాయి
దేన్ని పట్టుకోవడం దేన్ని జార విడవడం (ఇది కవయిత్రి ఉద్బోధ)
ఇక్కడ కావల్సింది / చదువూ సంస్కారం, వివేచనా/ శక్తికాదు / అందుకే /
కామరూపులైన / ఓ దివ్య శక్తీ / మా చేత ఓటును / మంచి పాత్రలో/
వేయించు మంటున్నాను
అదీ రచయిత / నిస్సహాయ అభ్యర్థన! ఒక సగటు పౌరురాలిగా -

2 బావిక 90 పుటలు 27 కవితలు స్త్రీ కౌలాలంపురం మిత్రునికి లేఖ మహిళా మండలి రాష్ట్రావతరణ రజతోత్సవం దేశమంటే సృష్టి రహస్యం మొ॥ ఇందలి కవితా శీర్షికలు

మొదటిది రచయితలు కాక రచయిత్రులు మాత్రమే వ్రాయజాలిన కవిత



ఇది కలా? నిజమా?/ అంతా ఇంద్ర జాలంలా ఉంది /
ఏమి వృద్ధి? ఏమి ప్రగతి?/ ఎంత బింకం? ఎంత పొంకం?/
బడిలో - గుడిలో / మడిలో మాన్యతలో / చదువులో శాస్త్రంలో/
సాహిత్యంలో - సమాలోచనంలో / నింగిలో - నీళ్ళలో /
అంగళ్ళలో - అయోధనంలో / కార్లలో బార్లలో /
చౌర్యంలో చమత్కారంలో / దొంగల్లో దోపిడీల్లో /
వంటలో వార్పులో / పరుగులో పందెంలో/
గెలుపులో కొలుపులో / అన్నిటా అందెల రవళి / గాజుల గలగల
పాపం పురుషయ్య! / బహుపరార్! నిద్రపోతున్నాడేమో?/
అమ్మమ్మో! కాదు కానేకాదు! / ఇంటా బయట చాకిరీకి - కీలు బొమ్మలా
ఎడ్డి తల్లి దొరికితే / తమాష చూస్తానంటూ విలాసాలు పోతున్నాడు

వెంట్రుకలున్న కొప్పు ఎటు పెట్టినా సింగారమే సత్తా కలవారు ఏది రాసినా అందమే! పద్యాలు రాయబూని ఆ గణయతిప్రాసల పితకలాటానికి వెరచి విరమించి ఈ వచన కవితలు రాసిన రచయిత్రిగారి భావం ఇలాగుంది

మహాకవుల నుండి మాటైనా నేర్వని పసరు కాయల వరకూ కలాల్లో సిరాలు నింపి వచన కవిత్వాన్ని గంపలకెత్తి గాదెలు నింపారు " ఉ ఉయ్యాల ముందుమాట అంతే కదా ఛందో బంధాలు తెగి వివిధ రంగాల వాళ్ళు, ఏ వ్యాసంగమూ లేని వాళ్ళు, వచన కవితలని రాయటంతో వస్తు వైవిధ్యం పెరిగినా దానితో కవిత్వపు రాశి పెరిగింది వాసి తరిగింది అనటం వాస్తవం రచయిత్రి ఆశయం భావికలోని ఒక మాట లో ఇలా ఉంది - ఏది ఎన్నెన్ని రూపాలు ధరిస్తూ ఏ మార్గంలో పయనించినా మనకు కావలసింది మాత్రం మన ఎదలను తట్టుతూ మేల్కొలిపే జాగృతి తద్వారా పంచే మనో వికాసం అదే అనిర్వచనీయమైన ఆనందలబ్ధి

## 56 సి ప్రభాకర్ - కోరుట్ల 10-6-34 నుండి 31-12-94

ప్రభాకర్ గారు సి పి ఐ నాయకులు మొదట పార్టీకి తర్వాత బీడీ కార్మికులకు సేవచేశారు 7వ తరగతి మాత్రమే చదివిన వీరికి తెలుగు హిందీ, ఉర్దూ, ఆంగ్ల భాషలలో చక్కని పరిచయం ఉంది సాహిత్యాభిమానం ఉంది వీరు మంచి వక్త అభ్యుదయ భావాలతో పద్య గేయ కవితలు వ్రాశారు 1954-56 మధ్య కాలంలో వీరు వ్రాసిన కవితలు నాటి పత్రికల్లో ప్రకటింప బడినాయి ప్రభాకర్ మరణానంతరం కోరుట్ల టౌన్ కమ్యూనిస్టు పార్టీవారు తాము నూతనంగా నిర్మించుకున్న సంఘ భవనానికి ప్రభాకర్ పేరు పెట్టారు అంతేకాక ప్రభాకర్ గారి 38 కవితలను సేకరించి అభ్యుదయం పేర ప్రకటించి కృతజ్ఞతలు చెల్లించుకున్నారు వీటిలో 3, 4 శీర్షికలు సలక్షణ పద్య కవితలు మిగితావి మాత్రాఛందోగేయాలు - గేయాలు, వచన కవితలు లేవు

"కార్మికవర్గ నాయకుడుగానే కాకుండా కవిగా కూడా తన అభ్యుదయ దృక్పథాన్ని వెలువరించిన సి ప్రభాకర్ నాకు చిరపరిచితుడు నేను రచనలు చేస్తున్న కాలం నుంచీ ప్రభాకరు రచనలు చేస్తుండేవాడు " డా సి నారాయణరెడ్డి, 17 12-96

ఊట్ల కొండయ్య కవిగారు కూడా రచయితను గ్రంథపీఠికలో ప్రశంసించారు ఈ కృతి సి పి ఐ నాయకులు, ఎం ఎల్ ఏ , సి హెచ్ రాజేశ్వరరావు సిరిసిల్ల గారికి అంకితం చేయబడింది ఇందుర్తి ఎం ఎల్ ఏ దేశిని చిన మల్లయ్య గారు ప్రభాకర్ 1949 నుండి 1988 వరకు అటు పార్టీకి రాష్ట్ర స్థాయిలో, ఇటు బీడీ కార్మికులకు జాతీయ స్థాయిలో చేసిన సేవలు వివరించారు



ప్రభాకర్ 84లో మాస్కో 88లో మలేషియా కూడా వెళ్ళి వచ్చారు

కవితా పరిచయం వీరి కవితలు అభ్యుదయ గీతాలు

విద్యార్థి సోదరా! / వీరయువక! లెమ్మురా

నిద్ర నుండి మేలు కొనర! నేడు శక్తి తెలుసుకొనర॥

1-5-54, ఆంధ్ర రాష్ట్రం అవతరించిన "మేల్కొలుపు" ఆరంభ కవిత

విశాలాంధ్ర మవతరించె నొహో

విజయధ్వనిమ్రోగె నింగినొహో॥ చివరి కవిత 26-10 1956,

ఇది నేటి ఆంధ్ర ప్రదేశ్ అవతరణ (56) ప్రభుత్వ ప్రకటన వినిన సంతోష ప్రకటన అనాలి మధ్యన కులమతాల నిరసన, నేతపనివారిపై, రైతులపైన సానుభూతి కవితలు ఓ రెండు ప్రేమకవితలు మరోకటి కోకిలపై ఉన్నవి భరతమాత తెలుగు తల్లి పదాలు వాడకం కవి గారి అప్పటి అభ్యుదయ భావ అపరిపక్వతకు నిదర్శనాలు -

మానవ కులం మాది/ మానవత్వమే/ మామతం

మాధర్మం సమత/ ఐక్యత ప్రేమ / ఆశయం అభివృద్ధి పు 11

ఇంతకు మనకు / వెతలేనా? / మన బ్రతుకంతా/ బాధల పాలేనా? పు 7

వీరి 'మత కుల ప్రవక్తలారా?' మరికొన్ని గేయాలపై శ్రీశ్రీ ప్రభావం ఉంది తెలంగాణా దగాపడిన తనాన్ని, అమెరికా దౌర్జన్యాన్నీ వర్ణించారు

కదలుతుంది/ కలవారిపైకి / కార్మికుల కర్షకుల దండు

కదలుతుంది /కలవారిపైకి /కడుపు మాడు వారి పిండు - పు 29

సాధించు యువకా/ హక్కులు / సాధించుమురా యువకా - 37, అని ఉద్బోధించారు కవితలు రాసిన మూడేళ్ళూ అభ్యుదయ మార్గంలో రచించి కడ దాకా ఒక ఆశయంతో శ్రామిక జన పక్షంగా సామ్యవాదం గమ్యంగా జీవించిన ఆదర్శ వ్యక్తి చిలువేరి ప్రభాకర్ గారు

## 57 ప్రతాప్ శ్రీనివాస్‌రావు (శ్రీ), మల్యాల తా॥ జగిత్యాల

శ్రీనివాసరావుగారు ఇంటర్ విద్యార్థిగా ఉండగా వెలువరించిన 20 పుటల 39 కవితల సంపుటి "శ్రీరచనలు", 'శ్రీ' శ్రీనివాసరావు గారి కలం పేరు ఈ పుస్తకానికి విషయాలు పుటల నంబర్లు, ముద్రణ సంవత్సరం ఏవీ లేవు - 1995 - 96 రచన అని వినికిడి (ఈ పుస్తకం క్యాసెట్ కవి గాయకులు డిండిగాల రవీందర్ వద్ద లభించింది)

"ప్రతి గేయం మధురభావ నిష్యంది" అని అష్టావధాని ఆరుట్ల రంగా చార్య, "శ్రీ రచనలు సరళ పదాల అనుసంధానమై గేయభావభాస్కర కాంతి పరితుల హృత్పద్మముల వికసింప జేయును" అని కవి విద్యాగురువు 'శ్రీవరకవి' పి మురళీస్వామి గారు ప్రశంసించారు నిజానికి ఇవి కవి గారి ఆరంభ కవితలు ఇంతకుముందు సాయిరాముని భజనకీర్తనలు, అక్షర ఉజ్వల వయోజన విద్యాగేయాలు కొన్ని ఈ కవి రచించినట్లు 'మీతో నామాట' మొదటి వాక్యంలో తెలిపారు

అంకితం బాసర సరస్వతీ రాణికి!

"కులమతాలను విడిచి పెట్టు లౌకికత్వం మన సంప్రదాయం' 5,17 శివరాతిరి గోవిందా గోపాలా! వీటి సమన్వయం కష్టం డా సి నా రె వేలూరి, తిక్కన, పి వి రాజీవ్‌ల ప్రశంసా కవితలున్నవి అమ్మపై రెండు జెండాపై ఒకటి అమ్మనాన్న గురువు త్రిమూర్తులని మరొకటి, మైత్రి, దాంపత్యం, ప్రేమ, ఉగాది, కార్మికుడు - ఇవి ఇలాంటివి ఈ కవి కవితలు - భావాలు

ఈ కవి కవిత్వాన్ని గూర్చి చెప్పిన శ్రీ' కవితా సూక్తులివి

కవిమదిలో / కవితల మధనం / జీవితాల కదనంగా /

పారిజాతాల నందనవనంగా/ కాలానికి అనుగుణంగా । ఉండాలట సంతోషం!

సాధనమున పనులు సమకూరు ధరలోన!

## 58 మేడి చంద్రయ్య ఎం ఏ చొప్పదండి జననం 25-9-1970

చంద్రయ్య గారు నవ యువకులు కాకతీయ విశ్వవిద్యాయలంలో ఎం ఏ తెలుగు ఫైనల్‌లో విద్యార్థిగా ఉన్న కాలంలోనే తమ కవితలను ఒక పుస్తకంగా సంపుటీకరించి ఆగాచార్య గారు గీసిన అందమైన ముఖచిత్రంతో ముద్రించారు

1 తప్పటడుగు మార్చి 1996, 30 పుటలు

విషయ సూచికలేని ఈ పుస్తకంలో ఓ ఇరవై వచన కవితలున్నాయి వీటిల్లో రాజకీయ విమర్శ ఉంది నీతి ప్రబోధం ఉంది ప్రకృతి, పర్వాల వర్ణన ఉంది ప్రేమ కవిత్వమూ ఉంది

భాష భావ ప్రకటన ఎం ఏ , విద్యార్థి స్థాయికి తగినట్లు లేవు అందుకేనేమో "తప్పటడుగులు వేస్తూ కవితా రంగం మీదికి ప్రవేశిస్తున్నాడు (కవి) ఇందుకు ఈయన నభినందిస్తున్నాను" అన్నారు డా ఏ భూమయ్యగారు ఇందలి 'ఎలా పూజించేది' కవి పరం, 'ప్రార్థన - పు 23, నాయక పరం వ్యంగ్యకవిత



"కులమతాలతో కలహించే ప్రజలున్న దేశం నాది

నీతి పాటల్ని నిరసించి/బూతు పాటల్ని కోరుతున్న ప్రజమాది

పార్టీ పిరాయింపులూ / పదవీ వ్యామోహాలూ

బంధుప్రీతి భజన పరులకు చోటూ/ అధిక జనాభా అప్పులు

కాస్త బ్లాక్‌మనీ, మరి కాస్త దర్పం ధనం/ చాలు మాకుతంత్రీ" 24

వరకట్నాల, దురభ్యాసాల నిరసించారు

"మెతుకు కరువై /బతుకు భారమై/ నిలువ నీడలేక

వెతలతో క్రుగ్గుతూ -" బతికే వారిని చూసి - ఈ కవికి

"కంచాన బుక్క ఎత్త బుద్ధి కాదు, మంచాన కునుకు తీయబుద్ధికాదు"

ఇదీ ఆర్ద్ర హృదయం అందమైన భావ ప్రకటనం పాఠశాల విద్యార్థి దశలో ఎస్ వెంకటాద్రి కవిగారి శిష్యరికం లభించిన చంద్రయ్య గారికి విశ్వ విద్యాలయంలో డా కాత్యాయని, డా పి జ్యోతి రీడర్ల తోడ్పాటు లభించింది స్థానిక మిత్రుల అభిమానం సరేసరి

మత సమైక్యతను బోధించి - (5) దారితప్పిన దేశాన్ని విమర్శించి (8) విద్యార్థులకు హితవు ఉపదేశించి (25), "ఎవరో ఏదో అనుకుంటారని భయపడకు నీ లక్ష్యం సిద్ధించువరకు ఆగకుండా పరుగిడు భయపడకు -"22 అన్నారు సాధన కొంత కొరవడినా సదాశయ భావ సంపన్న యువకవి మేడి చంద్రయ్యగారు

**59 వాసాల శౌరి ఎం ఏ బి ఓ ఎల్ (చౌలమద్ది) మెట్‌పల్లి జ 5-1-49**

శౌరిగారు ఆంధ్ర భాషోపాధ్యాయులు సౌమ్య హృదయులు దైవ భక్తి - దేశ భక్తి కలిగిన పద్య గేయ కవిత్వం వ్రాస్తున్నవారు వీరి ముద్రిత కృతి - 1 సమతాగీతాలు 1996 జనవరిలో వెలువడింది కవి వారి అన్న రచయిత అయిన వాసాలనరసయ్య గారికి ఈ పుస్తకాన్ని అంకిత మిచ్చారు

వాసరాంబ, సత్యసాయి స్తుతులతో ఆరంభమైన ఈ పొత్తం - జన్మ భూమి ద్రౌపది మొరతో ముగిసింది అన్నీ 31 కవితలు వాటిలో నాలుగైదు పద్య కవితలు మిగితావి మాత్రా ఛందోగేయాలు వచన కవితలు లేవు

'వాసాల శౌరి గారు నాకు అప్తమిత్రులు ప్రతిభా వ్యుత్పత్తులు గల సత్కవులు భారతీయ సంస్కృతిని జీర్ణించుకున్నవారు కావుననే వారి లేఖిని నుండి వెలువడిన ఈ కవితా ఖండికలలో సమతాభావము దేశభక్తి, స్వార్థ త్యాగము మాతృదేశ ప్రశస్తి సంస్కృత భాష ప్రాశస్త్యము గీతా ప్రాశస్త్యము, గురుశిష్య సంబంధము, దుర్వ్యసనలోలుర నిరాసనం, వయోజన విద్య, గ్రంథాలయ ప్రశస్తి మున్నగు సదుపదేశాంశములు వర్ణించబడినవి" డా కె రాజన్న శాస్త్రి గారి అభినందన' పీఠికనుండి సమతా గీతము శీర్షిక 3 (పుటలు సరిగా వేయలేదు)

"హిందూ ముస్లిం తేడాలెందుకు? మనలో మనకీ వైరాలెందుకు?
మన మందరమూ భారతీయులము, మనమందరమూ మానవులం"
కాలము బ్రహ్మ స్వరూపము అది ఆగదు ఎవరి కోసము
కాలానికే మానవుడు - కట్టుపడాలి నిజము - శీ 5

సంస్కృత భాష చక్కనైన భాష సిరులొలికే భాష, శిష్టజనుల భాష, అన్ని భాషలకు అమ్మవంటి భాష, అమరులు పలికిన భాష శీ 12 వందనమమ్మా గీతా మాతా - శీ 16



అంబేద్కర్ మహాశయా - అందుకొనుము జోహారులు శీ 23

ఈ సంపుటిలోని భావాల అన్నింటినీ సమన్వయ పరచడం కొంత కష్టం విద్యార్థులకు హితవు, సమాజము కర్తవ్యము, పత్రికలు ఐక్యరాజ్య సమితి మొ॥వి బాధ్యత తెలిసిన/ తెలిపిన కవితలు ఇందులో ఉన్నాయి

కలువకుంట కృష్ణమాచార్య కవి గారి అభిప్రాయం ఈ కృతికి సార్థకం 'వీరి కవితలలో శబ్దాలంకారాలు లేకున్నా ధారా శుద్ధి యున్నది భావ ప్రాధాన్యమున్నది తన భావాన్ని పటాటోపం లేకుండా సరళంగా హృద్యంగా పలువురు సులభంగా పఠించి ఆనందించుటకు అనువుగా నున్నది" - కావ్య పీఠిక

శౌరి గారి అగ్రపుత్రులు వి వేంకటేశ్వర్లు, ఎం ఏ గారు కూడా తండ్రి గారి సాహిత్యాభిమానానికి వారసులై చక్కని సామాజిక వచన కవితలు రాస్తున్నారు

**60 ఇమ్మడి సంపత్కుమార్, బి ఏ హెచ్ పి టి రాజాపురం తా॥ హుజూరాబాద్**

సంపత్కుమార్ హిందీ అధ్యాపకులు అంబేద్కర్, దళితవాద, భారత నాస్తిక సంఘాలలో క్రియాశీల కార్యకర్త

బి ఎస్ రాములు గారి సూచనతో వీరి కవితలు నా (మలయశ్రీ) పర్యవేక్షణలోనికి వచ్చినవి

ఆ భావాల వేడికి అరసమోవిరసమో తప్ప సరసం కవులు సంప్రదాయ భావులు తట్టుకోవడం కష్టం ఖబడ్దార్ వీరి వచన కవితా సంపుటి 95లో పూర్తయింది సొంత ప్రెస్సున్నా (ప్రగతి హుజూరాబాద్) ఇంకా వెలువడలేదు వస్తే - బస్తీమే సవాల్! తప్పదు త్వరలో వస్తుందని ఆశిద్దాం ఇమ్మడి సంపత్కుమార్ గారి మరో ముద్రిత వచన పుస్తకం బహుజన సమాజ్ పార్టీ - సిద్ధాంతం ఆచరణ 1996 ఇది ఉత్తర ప్రదేశ్ కాన్షీరాం ఎం పి రచనకు అనువాదం

## 61 వై ఎస్ రమేశ్ - హుజూరాబాద్

ఇంచుమించు ఇరవై (22 అట) యేండ్ల వయస్సు ఇంటర్ చదువు ఓ సైకిల్‌టాక్సీ షాపులో కూలీగా పనిచేస్తున్న నిత్య సాహిత్యోత్సాహి రమేశ్ ఎస్సి/దళిత వాద - నాస్తిక భావాల అభిమానం కల వై ఎస్ రమేశ్ కవితలు నిప్పు కన్నీళ్ళు - మంచు మంటలు ఈ యువకుని గుండె ఎంత ఆర్ద్రమో భావాలు అంత తీవ్రం ఆయనది సమాజ సమతాకాంక్ష ఈ యువకవి కవితలు (ఏబది వరకు) "కన్నీటి గాధలు ' పేరుతో పుస్తక రూపాన్ని ధరిస్తున్నవి ఈ యువకుని కవితలు కూడా బి ఎస్ ఆర్ సూచనతో డా మలయశ్రీ పర్యవేక్షణలో సంపుటీకరించబడినవి 1996

రమేశ్ గారికి కీ శే అలిశెట్టి ప్రభాకర్, కీ శే సాహు అభిమానకవులు నిరంతర సాహిత్య పరనం, సమాజ అధ్యయనం ఆర్ద్ర హృదయ సత్యశోధన కల రమేశ్ సంచలనాత్మక సాహిత్య సృష్టికర్త!

## 62 జె. బాలవర్ధిరాజు - బి ఎస్సి. మల్లారం వేములవాడ

## 63 నవనీత శోభారాణి - (బి ఏ) కొత్తగూడెం మల్లారం వేములవాడ

బాలవర్ధి రాజు గారిది డా సి నారాయణరెడ్డి గారి జన్మ గ్రామం సమీపంలోని మల్లారం ఆయన 31 ఏండ్ల యువకుడు హైదరాబాద్ బాలానగర్ 'బ్లేడ్స్' కంపనీలో ఉద్యోగం చేస్తూ జగద్గిరిగుట్టలో ఉంటున్నారు ఆయన భార్య నవనీత శోభారాణి జన్మస్థలం కొత్త గూడెం ఇద్దరు సాహిత్యాభిమానం కలవారు - కవులు అదేవారి పరిచయానికి వివాహానికి కారణమైంది

ఈ యువ జంట ఉమ్మడి కవితల సంపుటి "ప్రతిస్పందన' - 1997

నవనీత శోభారాణి చక్కని గాయని - చిత్రకారిణి ఈ మధ్య ప్రేమదేశం, భారతీయుడు తర్వాత తమిళం నుంచి తెలుగులోనికి డబ్ అయి హిట్టయిన "ప్రేమలేఖ" సినిమా చూశారా? చూస్తే - అచ్చంగా అదే ప్రేమకథ అయిదారేండ్ల క్రితం స్వయంగా అనుభవించిన వారు ఈ దంపతులు



ఇద్దరు తెలుగు కవితలు పత్రికలో వ్రాసేవారు ఎవరు ముందో ఎవరు వెనుకో కాని ఒకరికొకరు అభినందనల లేఖలు రాసుకున్నారు భావాలు పంచుకున్నారు అభిరుచులు తెలుపుకున్నారు ఒకరిపైఒకరు అభిమానాలు పెంచుకున్నారు - ప్రేమను పెంచుకున్నారు చూసుకోకుండానే ఫొటోలైనా, మాట నిలుపుకొని పెళ్ళి చేసుకున్నారు ఇప్పుడు వారికి ఇద్దరు అమ్మాయిలు అతనికి అప్పటికీ అదే ఉద్యోగం - లేజర్ బ్లేడ్స్ కంపనీ క్వాలిటీ కంట్రోలర్ ఆమె నర్స్ ట్రైనింగ్ చేసి గృహిణి

ఈ ఆదర్శదంపతులతో అనుకోని పరిచయమై ఒక పగలు వారింట గడిపాను ఇద్దరి కవితలు

చదివాను రాజు మంచి భావుకుడు శోభలో పండిన భావపరిపక్వత - వేదాంత లక్షణాలు చోటు చేసుకున్నాయి సానందంగా ఆశీర్వదించాను వారి సంపుటికి డా సి నారాయణరెడ్డి, డా జె బాపురెడ్డి, డా మలయశ్రీ, కె వి భాస్కరరావు చొప్పకట్ల చంద్రమౌళి మొ॥వారు పీఠికలు రాశారు అచ్చమైన ఆర్ద్రహృదయ కవితల సంపుటి 'ప్రతిస్పందన'

## 64 చెమన్

చెమన్ (సింగ్) వృత్తిరీత్యా డాక్టర్ ఆదిలాబాద్ జిల్లాలోని గోలేటి టౌన్‌షిప్‌లో ఉద్యోగధర్మంగా ఉంటున్నారు కాని, వారి జన్మస్థలం జూలపల్లి మండలంలోని కుమ్మరికుంట, ఆయన కాలేజీలో డిగ్రీ విద్యార్థిగా ఉన్నప్పటి నుండి కవితా వ్యవసాయం సాగిస్తున్నారు

చెమన్‌గారి తొలి వచనకవితా సంపుటి "ఎడారి స్వప్నం మధ్య" 1997లో వెలువడింది గోదావరి సాహిత్య వేదిక' ప్రచురించిన ఈ కవి - పుస్తకంపై వార్త' దినపత్రిక 8 జూలై 97 నాడు ఓ ప్రత్యేక సంపాదకీయం రాసి ప్రశంసలు కురిపించడం విశేషం

పుస్తక పీఠికలో నందిని సిధారెడ్డి గారు ఈ కవితల మెచ్చుకున్నారు విద్యావంతులైన యువకుల కరిగి పోతున్న కలల, చెదరి పోతున్న స్వప్నాల వర్ణనలతో ఈ కవితలు సాగాయి నేటి ఆర్థిక వ్యత్యాసాల, సామాజిక కల్లోలాలకు భావ చిత్రణమే ఈ కవితా సంపుటి విషయ విశ్లేషణ, ఆవేదన ఉన్నంతగా ఆశ ఆశయ సాధనకు ప్రజల కర్తవ్యోన్ముఖులచేసే సందేశం ప్రోత్సాహం ఈ కవితల్లో అంతగా కానరాలేదు అది రచయితలోపం కాదు కవితా దృక్పథాలు రకరకాలు సహృదయ వర్ధమాన రచయిత చెమన్

## 65 కె విజయనరసింహారావు - బి ఏ బి ఇడి ఎల్ ఎల్ బి గుండి, జ 1951

కల్వకోట విజయ నరసింహారావు గారు కరీంనగర్‌లో పేరున్న అడ్వొకేట్ శారదా నికేతన్ ఉన్నత పాఠశాల నిర్వాహకులు సాహిత్యాభిమాని వీరు క్రామేడ్ దంపతులు శకుంతలా దామోదర్ రావుగారల పుత్రుడు - స్వయంకృషితో విద్యనార్జించారు పై డిగ్రీలేకాక లైబ్రరీ సైన్సులోనూ డిప్లొమా సాధించారు

హైదరాబాద్‌లో ఉన్నకాలంలో విరసం అభిమాని విప్లవ రచయిత వరవరరావు గారు వీరికి తల్లితరపు బంధువు తర్వాత చారుమొజుందార్ మార్గాన్ని వదలి తరిమిల నాగిరెడ్డి గ్రూపులో చేరినారు జీవనాడి పత్రికా నిర్వహణలో వీరొక్కరు ఆ తర్వాత విప్లవ రాజకీయాలకు స్వస్తి చెప్పి, ప్రజా హక్కుల సంఘంలోను, పేదరిక నిర్మూలన సంఘంలోను పాలు పంచుకున్నారు క్రమలో ఇప్పుడు 'లోకసత్తా' అభిమానం చూపిస్తున్నారు

విజయనరసింహరావుగారు వచన కవితలు రాస్తుంటారు మంచివక్త వీరు దాదాపు 25 ఏండ్లుగా (1971 97) రాసిన కవితలను ఈ మధ్యే ఒక సంపుటి రూపంగా "వర్తమాన చిత్రం" పేరుతో వెలువరించారు 100 పుటలు వీరివి వచన కవితలు, కొన్ని పాటల బాణీ మాత్రాఛందో గేయాలు భాషపై అధికారం భావంపై పట్టు వీరు సాధించారు వీరి గేయాల అంతస్సారం సామాజిక కల్లోలాలకు, అసమానతలకు, అవినీతికి - వ్యధ చెందడం, ఖండించడం హితాన్ని బోధించడం విజయ్‌గారు తమ భావ ప్రచారంలో ఏమైనా



ఆక్షేపణలు పొందవచ్చు కాని, కవితా రచనలో మాత్రం ఈ పుస్తకం ద్వారా మంచి కవిగా విజయం పొందారు

## 66 అన్నవరం దేవేందర్ - బి ఏ పోతారం మం హుస్నాబాద్ వ 30 సుమారు



దేవేందర్ హుస్నాబాద్ మండల కార్యాలయంలో గుమస్తా వీరు వచన గేయ కవి పత్రికా విలేఖరి స్థానిక 'నూతన సాహితి' కార్యదర్శి ఓ పదేండ్లుగా వీరు కవితా రచన కావిస్తున్నారు వీరి భావాలు సాంఘిక విమర్శలుగా అభ్యుదయ భావాలతో ఉంటున్నాయి కామ్రేడ్ జి మల్లేశం గారి 1948 రైతాంగ పోరాటం పాటలను వీరు సంపుటీకరించారు ఇదే సంవత్సరం వీరి కవితలు పుస్తక రూపం ధరిస్తున్నవి

## కవితా సంకలనాలు :

ఈ జిల్లాలో 1950 తర్వాతనే వచన కవితా రచనలు వచ్చాయి కొందరు కవులు తమ కవితల పుస్తకాలుగా స్వయంగా ముద్రించుకుంటే మరికొందరు కవి మిత్రులు సమిష్టిగా తమ కవితలను సంకలనాలుగా ప్రచురించుకున్నారు మరికొందరు సాహిత్యాభిమానులు కవి మిత్రుల రచనలను సేకరించి కవితా సంకలనాలుగా సాహిత్య సంచికలుగానూ ప్రచురించారు ఈ కవుల కవితలు కొన్ని సంపుటాల కవితలకు తీసిపోనివి కూడా ఉన్నాయి కొన్నిసార్లు ఇవే ప్రత్యేక సంపుటాల కవితలకన్న మిన్నగానూ ఉన్నాయి ఇప్పుడు సంకలనాల కవితల కవుల పరిచయం చేయబడుతున్నది ముందుగా కవులు స్వయంగా వెలువరించుకున్న సంకలనాలు చూపి ఈ వరుసలోనే సంపాదకులు వెలువరించిన సంకలనాల పరిచయం చేయబడుతుంది

కవితా సంకలనాలు

ఈ జిల్లాలో స్వీయకవితా సంకలనాలు ఆరు పుస్తకాలు వెలువడ్డాయి

1 యువస్వరాలు - 1973, 2 కిరణాలు - 1977, 3 ఉదయరేఖలు - 1979 4 లయ - 1982, 5 ఖడ్గధార - 96, 6 సముద్రం - 97

## యువస్వరాలు 1973 - సిరిసిల్ల

సిరిసిల్ల యువకవి మిత్రులు అయిదుగురు ఈ సంపుటిలోని కవులు వారు కనపర్తి, వడ్డేపల్లి కృష్ణ, జక్కని వేంకటరాజం, కురిక్యాల లింగయ్య గోలికృష్ణహరి మొదటి ముగ్గురు కవుల పరిచయం ఇంతకుముందే పద్యగేయ సాహిత్య విభాగాల్లో చేయబడింది మిగితా ఇద్దరి కవితల పరిచయం ఇప్పుడు చేయబడుతున్నది

## 1 కురిక్యాల లింగయ్య - జ. 11 మే 1948

సాహిత్య చిత్రలేఖనాల్లో ప్రవేశమున్న లింగయ్య గారు వ్యాపారవృత్తిలో స్థిరపడ్డారు

"అవసరమైతే ఈ సమాజాన్ని, దేశాన్ని కూడా ఎదిరిస్తాను మంచికోసం ప్రయత్నిస్తాను ఆప్రయత్నానికి ప్రతీకగా రచనలు సాగిస్తాను" అని మున్నుడిలో ప్రతినచేసిన ఈ కవి గారి కవితలు ఈ సంకలనంలో నాలుగు ఉన్నాయి 72-77 అవి నేస్తం కవి - కవిత, ఓపిక, ఎదురు తిరగకేంచేస్తారు?

నేస్తం లేలే సుస్తీకి స్వస్తి చెప్పు / కుళ్లి పోతున్న యీ సంఘంలో
కుతంత్రాల కుక్కలన్నీ, కూడి మొరుగుతున్నాయి
ప్రక్కనున్నరాయి పట్టుకొని అటువిసరు, పౌరుషంతో కసరు -
ఎదురు తిరగకేం చేస్తారు ఈ కవిత శిల్పంలో సమాజ చిత్రంలో వీరి కవితలన్నింటిలో మిన్నగా ఉంది
నేతలంతా మేతకెగ పడుతున్నారు / జగతి గతి, జాగ్రత్త సుమా!
కూలి జనం, క్రుంగిపోయి, కడుపులెండి చస్తుంటే
లేశమైనా అమలు పరుచని, సోషలిజం నినాదాలతో / సొగసైన వాగ్దానాలతో
కవి -కవితలో 'కలం కదలనంటోంది, గళం మూగపోయింది' అన్నమాట ఈ కవి అక్షరాలా అమలు పరచారు సాహిత్యానికి స్వస్తిచెప్పి వస్త్ర వ్యాపారిగా రాణిస్తున్నారు

## 2 గోలికృష్ణహరి, పి యు సి జ 15 ఆగష్టు 1947

కృష్ణహరి గారు పోస్టల్ ఉద్యోగి ప్రస్తుతం జనరల్ పోస్టాఫీసు హైదరాబాద్ కార్యాలయంలో పనిచేస్తున్నారు వీరికి సంగీత సాహిత్యాలంటే అభిమానం

'చైతన్యపు పూల రథం కదలికదలి వస్తున్నది

ఎదఎదలో నవగీతం ఎగిసి ఎగిసి లేస్తున్నది'' అనే వీరి లలితగీతం 1975లో విన్న ఆకాశవాణి శ్రోతలు మరచిపోలేరు కృష్ణహరి గారి వచన కవితలు ఈ 'యువస్వరాలు'లో అయిదున్నాయి అవి నవ్వుతున్నావా పాపా, హృదయం సిగ్గుపడింది మళ్లీ తెల్లవారింది ఎడారి, వెలుగు పిలుపు వీరి కవితల భావాలివి -

''విజ్ఞానం విశృంఖలంగా, పెరిగిపోతున్న రోజుల్లో
పాత చట్టాల, నూతుల్లో దిగిపోయి, కూపస్థ మండూకంగా
ఆవరించిన అజ్ఞానపు, పంకిలంలో ఈదులాడే
మూర్ఖలోకాన్ని చూసి, నవ్వుతున్నావా పాపా!'' - 81
''దేశంలో న్యాయం లేకుండా పోయింది / ధర్మదేవత చూడలేకవాపోయింది
చూస్తూ ఏమీ చేయలేని నా అసమర్థతను / చూస్తూ హృదయం సిగ్గుపడింది'' - 83
నీకు శాంతి లేదు, ప్రశాంతి లేదు / సౌఖ్యైర్వం రాదు, చక్కని పరిమళం రాదు
అంతవరకు మళ్లీ తెల్లవారదు ''
'ఎడారిలో ఇక్కడికి ఎవరూ రారు ఇక్కడ నాకెవరూ లేరు
నేనొక్కడినే తప్ప, నా అంతర్మథనం తప్ప''

చక్కగా ఆలోచించగలిగి వ్రాయగలిగీ సమాజం చీకటిని తొలగించ 'వెలుగు' నాహ్వానించిన కృష్ణహరి గారి కలం కూడా విశ్రాంతిలోనే ఉంది

**కిరణాలు 1977 - ఎల్లా రెడ్డి పేట**

సిరిసిల్లా తాలూకాలోని కవి మిత్రులు నలుగురు ఎల్లారెడ్డిపేట నుండి ఈ వచన మినీ కవితా సంకలనాన్ని సి నా రె ఆరుద్ర పీఠికలతో ప్రచురించారు ఆ కవులు, వేముల సత్యనారాయణ నలిమెల భాస్కర్, రేగులపాటి కిషన్‌రావు, ఎర్రోజు సత్యం వీరిలో చివరి ఇద్దరి స్వీయ రచనలు పుస్తకాలుగా వచ్చాయి కాబట్టి మొదటి ఇద్దరి కవితల పరిచయం ఇక్కడ చేయబడుతున్నది

1 వేముల సత్యనారాయణ - ఎం ఏ బి ఇడి కిషన్‌దాసు ఎల్లారెడ్డిపేట అధ్యాపకులు

ఈ సంకలనంలోని 22 కవితల్లో సత్యనారాయణ గారివి అయిదు వాటి పేర్లు - మధ్య తరగతి ఉక్రోషం, ముల్లగ్ర, ఇదియే ప్రగతి, మరోజన్మ ఉంటే, కౌగిలించాలని ఉంది

ఈ కౌగిలించుకునేది అందని ఎండమావి ఆశాజ్యోతి నట! మరో జన్మ ఉంటే, మనిషిలా కాక ఉపయోగపడే వస్తువుగా, మస్తకమే నిస్తుల విస్ఫులింగములెగయజేసే పుస్తకంగా జన్మించాలని ఈ కవి గారి కోరిక ఇదియే ప్రగతి? కవిత ఆస్తికతో నాస్తికతో తెలువనిది మధ్యతరగతి ఉక్రోషం ఉన్నదే ముల్లగ్ర కవిత చూడండి ఓ కామాంధుని దురాక్రమణకు ఓ అబల వ్యతిరేకించి రోదించి ఓడి సొమ్మసిల్లి పడిపోయిందని మొదటి సగభాగం మిగితా సగంలోని కవి భావ తీవ్రత ఇది

'ఆ అరచింది ఎవరో కాదు, ఆ చెరచింది ఎవరినో కాదు
నీ తల్లిని నీ చెల్లిని నీస్వంత కూతురును యావత్తు స్త్రీ జాతిని,
ఇంకా చల్లగా కుక్కిన పేనులా కూర్చుంటావా? అఖ్‌త్థూ !'

2 డా నలిమెల బాస్కర్ - ఎం ఏ పిహెచ్ డి నారాయణపురం

ఈ సంపుటి వెలువడిన కాలంలో భాస్కర్, బి ఏ టీచర్, ఇప్పుడు తెలుగు సాహిత్యంలో ఎం ఏ, పిహెచ్ డి వీరు జూ॥కాలేజి లెక్చరర్ కవి కథా రచయిత 'కిరణాలు లో భాస్కర్ గారి కవితలు అరున్నాయి టర్న్'లో పేదలను, 'ధ్వని'లో పెత్తందార్ల మనస్తత్వాలను, 'భవితవ్యం'లో బండగా కామందును, రాతిగుండెలు' దొరలవని 'కనువిప్పు' శ్రామికులకు కలగాలని వీరి కవితల్లో వివరించారు 'రాతి గుండెలు లో పొలం నుండి రాతినిలేపలేని పాలేరును దొర -

'దొంగ కొడుకా! మాటకు మాట, మఱ్రబడుకుంటా ,
పట్నం బూటుకాలు, నర్సిమ్మని వీపు మీద నాట్యం చేసింది
ఇప్పుడు - రాయిలేపటం కాదు సమస్య! వాడు లేవటం లేదు "

ఉదయరేఖలు 1979 - జిల్లెల్ల

కళా నికేతన్ (వేములవాడ) జిల్లెల్ల శాఖ, 77 డిసెంబర్‌లో ఏర్పడి వెలుగు' తొలిసాహితీ సంచికను ప్రకటించి రెండేండ్లకు ఈ రెండవ కవితా సంకలనం ప్రచురించింది ఇందలి కవులు ఇద్దరు - ఆ ఇద్దరూ సమసమాజ నిర్మాణం తమ ధ్యేయమని నిర్మొహమాటంగా చెప్పుకున్నారు

1 తిరుమల నరసింహాచార్యులు - ఎం ఏ, బి ఇడి, జ 9-6-37, నారాయణపురం ప్రధానోపాధ్యాయులు వీరివి ఇందులో 19 కవితలున్నాయి వాటిలో కొన్ని గేయాలు

2 పోరండ్ల మురళీధర్ ఎం ఏ, జననం 10-6-37 జిల్లెల్ల అధ్యాపకులు వీరివి 15 అచ్చంగా వచన కవితలున్నాయి

ఈ కవితా సంపుటిని లబ్ధప్రతిష్టులైన అభ్యుదయ - సంప్రదాయవాద కవులు ప్రశంసించడం సాహిత్యప్రీతి వల్లనో బంధుత్వ మమకారం వల్లనో తెలియదు - కవుల ధ్యేయం ప్రశంసార్హం

1 టి నరసింహాచార్యులు - "వీరి కవితలన్నింటిలోనూ అభివృద్ధిని గురించిన ఆరాటమే కన్పిస్తుంది" అని పీఠికల్లో ఉన్నా అది సరికాదు ప్రకృతి పరిమళాలు, మధుమాసం, ఈ వర్షప్రహర్షం మొ॥ వి, నిరీక్షణ కృష్ణగీతం కవితానుభూతికోసం వ్రాసినవే సామ్యవాదానివి కావు

"శ్రమ జీవుల లోకంలో శక్తి పెంచి సహకరించు/మేడ వీడి నీడ వదలి బడుగు వారి బసకు చేరి అడుగులోన అడుగువేసి అడుగడుగున ఆదరించు/ ధనికవర్గ దళిత వర్గ తరతమాలు తొలగించగ సమతారుణ దీప్తులతో మమతను వెలిగించిపంచు/ - పదం భావం ఇలా చక్కగా అమరినాయి 'ఉన్మేషం' నవ భావోదయం నవరాగోదయం నవ గానోదయం నవతేజోమయం - కావాలనే ఈ

కవి, ఆర్ష సాంప్రదాయమ్మును సంస్కృతిగా వర్ణిస్తూ హర్షించగ రాగదే - అని సాంప్రదాయక మానవతా వసంతమును ఆహ్వానిస్తున్నారు గాంధీజీ పేరు ఈ కవితల్లో వినరాకపోవడం ఒక విశేషం సోషలిస్టు కమ్యూనిస్టు పదాలూ లేవు! గీతా భావాలు జల్లి - పుట 10, సంక్రాంతి లక్ష్మి 34 భరతమాత -2 వంటి పదప్రయోగాలు సంప్రదాయ వాసనోపేతాలు ఈ కవి గారికి శాంతి పరస్పర సహకారం, సమజీవనం వంటి ఆశలున్నాయి సమత కోసం ధనికులను వచ్చి / పేదలకు చేయూత నివ్వండనే భావం నరసింహాచార్యుల కవితల అంతస్సూత్రం

**2 పోరండ్ల మురళీధర్** దళితులు తెగబడి ఎదిరించి సమసమాజాన్ని సాధించుకొండనే ఉద్బోధ మురళీధర్ గారిది పెంచండి మంచి మనసును తుంచండి వంచకులను - 59, అంటూ వీరి భావోద్వేగం దూకుడు చూడండి

చంపండీ చంపండీ కొంపలార్చు స్వార్థపరుల/ అణచండీ అణచండీ బంధుప్రీతికలవారిని (పక్షపాతం?)
సమసమాజ సంగీతం స్వార్థపరుల చెవికెక్కదు/ అహింసా సత్యాలు ఆయుధాలు కానేరవు
న్యాయానికి ధర్మానికి నోచుకోదు మనవర్గం/ కుక్క కాటు కొక్కదెబ్బ చక్కనైన మార్గం (60)

'రేపటి వసంతం' అర్వదేండ్ల తర్వాత ఈ పర్వదినం? ఇది 'అక్షయ'లో వ్రాయలేదు ఎవరి షష్టి పూర్తి గీతమూ కాదు స్వతంత్రం వచ్చింది 15 ఆగష్టు 47 మరి ఏమిటా? అని ఆలోచిస్తే రష్యా విజయం 1917+ 60 =77లో ఈ కవిత వ్రాసి ఉంటారు - 79లో పుస్తకంలో వచ్చింది

పాతిక సంవత్సరాల నుండి నవోదయంలేని, నిరాశల తేరుపై కూర్చున్నాడు - 44 కనుకనే సామాజిక దుస్థితికి కారణాలన్వేషించి 'ఆధునిక భక్తుల' చూసి నివేదిక 60 సమర్పించి స్వార్థపరుల సంహారం - 60' చేయడానికి పూనుకున్నారు కవి

ధనిక వర్గం జిందాబాద్ / ఫ్యూడలిజం జిందాబాద్ అనే వారిని
కడుపు మంటలతో కుమిలే మేం/ కాళ్ల బేరములు ఇక సాగించం
పాపం బుద్ధిని మానండి - మా / కోపం రుచి ఇక చూడండీ - అన్నారు

కవి ముందుమాటలో చెప్పుకున్నారు 'ఏదో ఓ అనిర్వచన శక్తి ఉందని నమ్ముతానని కాని కనిపించని ఆ భగవంతునికోసం తపించడం కన్నా కనిపించే ఈ మానవులను సేవించడం మిన్న అని ఈ మార్గం ఎన్నుకున్నారు అధిక (ఆడ) సంతానం, సరిపోని ఆదాయం గూర్చి వీరి బాల్యకౌమార జీవితాన్ని గూర్చి చేసిన పరిచయం కఠినులకైనా కన్నీళ్లు తెప్పిస్తుంది అనుభవాలే మనిషికి ఆలోచనా కవాటాలు తెరుస్తాయి బాధితుడు అయితే భగవంతున్ని ఆశ్రయిస్తాడు లేదా తిరుగుబాటు బావుటా నెగురవేస్తాడు ఈ ఇద్దరు కవుల్లో ఆర్ద్ర హృదయం సౌమనస్యం ఉన్నాయి ఇజం కొంత కొరవడినా నిజాయితీ ఉందని నిస్సందేహంగా చెప్పవచ్చు

**లయ - 1982, వేములవాడ**

ఈ కవితా సంకలనంలో వేములవాడ యువగళాల నవభావాలు నాట్యమాడుతున్నాయి

'ఎక్కడ సమస్యలంటాయో అక్కడ సంఘర్షణ వుంటుంది అక్కడ కవిత్వం వుంటుంది ఆ సంఘర్షణలకి లయగా ఈ సంకలనం మీకందిస్తున్నాం" అన్నారు, ఈ పోయట్రీ ఫోరం పోరాట కవులు ఇందులో ఈ అయిదుగురి మినీ కవితలున్నాయి 1 జింబో, 2 పి ఎస్ రవీంద్ర, 3 వారాల ఆనంద్, 4 అలిశెట్టి ప్రభాకర్ 5 వజ్జల శివకుమార్ వీరందరూ సిరిసిల్లా తాలూకా వారు ఒక ప్రభాకర్‌ది జగిత్యాల వీరిలో ఒకరిద్దరు తప్ప మిగితా వాళ్ళు అప్పుడే కాదు ఇప్పటికీ అదే చూపుఅదే ఊపుతో కవితలు రాస్తున్నారు ఆనంద్ జంబో కథకులు కూడా అలిశెట్టి, వజ్జల కవుల కవితా సంపుటాలు వచ్చాయి మిగితా ముగ్గురి భావ లయలను వినండి

1 జింబో రాజేందర్ వేములవాడ వీరి వచన పుస్తకాలు వచ్చాయి

ప్రస్తుత నివాసం హైదరాబాద్‌లో న్యాయశాఖలో ఉద్యోగం ఈ సంకలనంలో వీరివి తొమ్మిది కవితలపైగా ఉన్నాయి మినీ కవితల వంటివే ఎక్కువ

బతుకు "నేచచ్చిపోతాననే కదూ నీ బాధ పిచ్చివాడా
ఈ వ్యవస్థలో మనం బతికింది తొమ్మిది మాసాలే'
ఎప్పుడది? తెల్పిందా మాతృగర్భంలో ఉండగా!

ఇసుకరేణువు - "నన్ను చూసి నవ్వుడల్లా / ఇసుక రేణువే గుర్తొస్తుంది కదూ? నేనే
నీపన్ను కింద చేరినప్పుడు, నీ కంట్లో కలకై నప్పుడు తెలుస్తుంది '
కంటికలక అంటే నేత్రరోగం అలా కాక ఈ కవి కంటిలో నలుసు అని భావించినట్లున్నారు

మరోకవిత "కొండనై బతకడం కన్న, బండనై బతకడమే మేలు ఇంక
ఇంటిముందు గద్దెగా, గోడ పునాది రాయిగా, ముక్కలు చేసి
తారుపోసి రోడుపై వేసి అణగ తొక్కినా బాధలేదు కాని -
నాకో ఆకారాన్నిచ్చి ఓ గుళ్లో బంధించినప్పుడే బాధ"

చివరి కవిత 10వ పుట

"ఒకప్పుడు నేను, పచ్చగా బతికిన చెట్టునే/ నువ్వనుకున్నట్లు ఇప్పుడు నేనేమీ చావలేదు
విప్లవ గీతానికి ప్రాణంపోసి - ఎర్రగా / బతుకుతున్న కాగితాన్ని నేను

2 పి ఎస్ రవీంద్ర - వేముల వాడ ఫొటోగ్రాఫర్ ప్రస్తుతం (97) ఆదిలాబాద్‌లో ప్రతికావిలేఖరిగా ఉంటున్నారు ఈ 'లయ లో వీరివి ఎనిమిది కవితలున్నాయి

బాధావృత్తం ఒక బిందువు ఆధారంగా, కేంద్రీకృతమైన అనంతాకాశ వైశాల్యం గల
వృత్తం,వృత్తపరిధి దాటలోని వృత్త లేఖిని
ఎంత ఎంత పెరిగినా తనతోపాటు వృత్తమూ పెరుగుతుంది

హెచ్చరిక గుండె గడియారం కొట్టు కుంటుంది / సహనం అలారం సమయం కాస్తుంది
ఆకలీ - నా కడుపును వేదిక చేయకు / నీ భీకర నృత్యాన్ని చూడలేని నా
చేతులు, రాళ్లు రువ్వుతాయ్

హృదయం వ్యవస్థలు
హృదయం క్యాసెట్‌కాదు రీ రికార్డింగ్ జరగడానికి,
హృదయం గ్రామ ఫోన్ రికార్డు / పగిలితే పగులుతుంది, కాని మార్చరాదు
వ్యవస్థ గ్రామఫోన్ రికార్డుకాదు, మార్పు తేవడానికి,
వ్యవస్థ క్యాసెట్ రీరికార్డింగ్ తప్పదు, మార్పు మానదు

**3 వారాల ఆనంద్ - బి ఎస్సి. ఎం ఏ వేములవాడ**

వీరు లైబ్రేరియన్ జర్నలిస్టు వీరివి తొమ్మిది కవితలున్నాయి

'కృతఘ్నత' భూమిలో ఎంత నిస్సహాయత /చెట్టులో ఎంత స్వార్థం
పుట్టుక భూమిలోంచే అయినా / ఆకాశాన్నంటాలనే తపన

'సెకండ్ల ముల్లు' గడియారంలో సన్నని సెకండ్ల ముల్లు, ప్రతిక్షణం కదుల్తూ
తెల్లవార్లూ చాకిరి చేస్తోంది, కాని
టైమెంత అంటే గంటలు నిమిషాలు ఈ వ్యవస్థలోనూ అంతే
'ఖనిజం' ఈ రోజు నేను గుండెల్ని చీల్చే బాకుని
బుల్లెట్‌ని వదిలే బారెల్ని, నేలను దున్నే నాగలిని
అక్షరాలు రాసే పాళీని, కాని
ఆ రోజు నేను నిస్తేజంగా నిరుపయోగంగా, నేలడుగున్న పడివున్న ఖనిజాన్ని

## ఖడ్గధార- 1995

వడ్డేపల్లి కృష్ణగారికి అంకితంగా వెలువడిన ఈ కవితా సంకలనంలోని సిరిసిల్లా నలుగురు యువకవల పేర్లివి

1 పత్తిపాక మోహన్ ఎం ఏ, సిరిసిల్ల జ 5 జనవరి 1992

ఇప్పుడు డా సి నారాయణరెడ్డిగారి 'తెలుగు గజళ్ళు పైపిహెచ్ డి పరిశోధనా గ్రంథ రచన కావిస్తున్న పి మోహన్ ఈ సంకలనం వెలువడిన కాలంలో ఎం ఏ ఫైనల్ విద్యార్థి వీరి సంపాదకత్వంలో ఉస్మానియా విశ్వవిద్యాలయంలో డా కసిరెడ్డి గారికి అంకితంగా'కవితాపాంచజన్యం'వెలువడింది 'మానేటి తరంగాలు' మరి రెండు అముద్రిత కవితా సంపుటాలు ఈ సంకలనంతో మోహన్ గారివి ఎనిమిది కవితలున్నాయి

"కొత్తసూర్యుడా! ఉదయించొద్దు
ఏ కొత్త కోర్కెల్ని మాలో రేకెత్తించొద్దు
మా మానాన మమ్మల్ని బతకనిస్తే చాలు-" పు 1

సాలీడు'పై జాలిచూపి, అమ్మ' శ్రమను సంస్తుతాచి, స్త్రీల అగచాట్లను స్మరించి, కర్ఫ్యూ ప్రజాస్వామ్య ఖద్దరుచొక్కాల విమర్శించారు చివరి ఖడ్గధారలో అన్నారిలా

నిన్నటి వరకు ఏరి వేయబడ్డ అక్షరాలు
తాటాకుల కట్టల కింద / అంగాంగాన్ని వర్ణించి అలసి పడుకున్న అక్షరాలు
నేడుబరిలో దిగి ప్రవహిస్తున్నాయి
అక్షరాలుఅభినవ వేదాలు అగ్ని పురాణాలు

2 ఎలగొండ రవి, బి ఏ, సిరిసిల్ల 30మే 1970 ప్రింటింగ్ ఉద్యోగి

కవిగారివి ఈ పుస్తకంలో మూడు కవితలూన్నయి

'జీవితం ఫియానోమెట్లమీద' భావిజీవన గానాలు పాడుతూ, ఎగుడు దిగుడు సమాజంలో తమ 'ఆశచావని' భావాల 'కవిత్వం ప్రవహిస్తోంది' అని తెలుపుకున్నారు చివరగా 'కొత్త ఉషోదయం కోసం' తొలి కిరణాలు నెమ్మది నెమ్మదిగా ఉద్యమిస్తున్నాయి అని అంగీకరించారు

3 కనపర్తి ప్రదీప్ కుమార్ బి ఎస్సి, సిరిసిల్ల జ 14 జనవరి1969

ప్రదీప్‌కుమార్ తండ్రిగారు ప్రముఖ కవి కనపర్తి వ్యాపారం వృత్తి - కవితా రచన ప్రవృత్తిగా జీవన యాత్ర సాగిస్తున్నారు

ఇందులో వీరివి నాలుగు కవితలున్నాయి

"ఈశోధన లెన్నాళ్ళని, ఆవేదన లెన్నాళ్ళని
జీవులమై శవాలవలె, బతుకులీడ్చుట లెన్నాళ్ళని "

'నగరం' నడిరాత్రిని వర్ణించి, ఏడు సంద్రాలావలి నేస్తాన్ని డాలర్ల మోజులో పడి ఒంటరివై పోక

తిరిగి రమ్మని బంధుప్రేమ'సందేశం పంపించి చివరికి తీవ్రవాదానికి కృషిని గూర్చి సామరస్య హితోపదేశం చేశారు

4 సామల మహేశ్ 20 జనవరి 59 సిరిసిల్లా, ఎలక్ట్రానిక్స్ డిప్లొమా పూర్తి చేసిన వీరు స్థానికబాలికల సెకండరీ పాఠశాలలో టి వి అండ్ రేడియో సాంకేతిక శాస్త్ర బోధనోపాధ్యాయులు మహేశ్ కలం పేరు 'విజిత ' వీరిని ఈ సంకలనంలో నాలుగు కవితలున్నాయి అవి 1 నింగి నిశి, 2 సత్యం శివం సుందరం, 3 నీడ, 4 బాపూ ఇదీ మన దేశం

'త్రేతాయుగంలో రావణుడొక్కడే

కలియుగంలో దేశమంతా రావణులే -' అని వాపోతూ వీరుదేశ దౌర్భాగ్యాన్ని దారిద్ర్యాన్ని గాంధీజీకి వివరించి

ఈ బాధనాది కాదుమా అమ్మది

మమ్మల్ని కన్న మా తల్లి 'భరత మాతది అన్నారు

ఈ నలుగురి కవుల్లో రాయలనే ఉత్సుకత ఉంది ఏదో సాధించాలనే తపన ఉంది తథాస్తు

సాధనమున పనులు సమకూరు ధరలోన!

'సముద్రం' వచనకవితా సంకలనం

1997లో సిరిసిల్లా నుంచి వెలువడిన ఈకవితా సంకలనంలో కవితా 'ఖడ్గధార'లోని పత్తిపాక మోహన్, యెలుగొండరవిగారల నాలుగు కవితలు ముందు వెనకలుగా ఉన్నాయి మిగితావి ముగ్గురు యువకవులు రాసినవి వారు 1 అన్నల్‌దాస్ కరుణాకర్ 2 దూడంకరుణాకర్ 3 చంద్ర అంజనేయులు నాకు దూడం నాంపల్లిగారి ద్వారా అందిన కవర్‌లేని ప్రతిలో ఈ కవుల వివరాలేవీ లేవు

1 అన్నల్‌దాస్ కరుణాకర్

"కన్నీళ్ళకే విలువివ్వని కసాయిలోకంలో / చిరునవ్వుల్ని అరువు తెచ్చుకోక / తప్పటం లేదు / ప్రతిదాన్ని కరెన్సితో వేలంవేసే / కలిమి పొరల పాడులోకంలో /కేవలం 'హలో అనే /అరథ స్నేహితుల్నిఅరువు తెచ్చుకోక తప్పటంలేదు " పు 4

అదివారి బాధ - ఇదుగో ఇది బోధ!

'కవిత ఒక యధార్థ చిత్రం

స్వాతి చినుకు కాదు కవిత / దగాపడ్డ

హృదయాన్ని చూసి / జాలిగా రాల్చిన అశ్రుకణం!" పు 9

2 దూడంమనోహర్ బి ఎస్సి జ 1973, ప్రముఖ పద్యకావ్యకవి దూడం నాంపల్లి గారి కుమారుడు మనోహర్ గారి కవితలు వివిధ సాహితీసంస్థల బహుమానాలు పొందాయి పలు పత్రికలు ప్రచురించాయి

అద్దంలో తన నీడను తానే శత్రువుగా భావించి దాడిచేసే పిచ్చుకనుక కవి తనతో పోల్చుకోవడం సరస సహజ వినూత్న భావన - పు 12

దగుల్బాజీవ్యవస్థలో- మానవత్వం దిక్కులేక దహించుకు పోతున్నదని ఆవేదన - 10

చెడుతో యుద్ధం చేయాలనే వీరు -

'ఎంప్లాయిమెంట్ దీపం చుట్టు నిరుద్యోగులు పురుగులుగా గిరికీలు కొడుతూ 'చితికి చతికిల బడుతున్నారు - కాలికూలి పోతున్నారు' - 15 అని వాపోతున్నారు

"ఈ జనం మధ్య నేనో చికారిని, అయినా తరగని ఆశే నా ఊపిరి!" 16 సంతోషం, ఆశ జీవించడానికి ముఖ్యం

3 చంద్రాంజనేయులు - ప్రజాకవి సిహెచ్ రాజలింగం గారికి బంధువో
'మా శ్రమకు జీవముంది ప్రాణముంది / కానీ - ఫలితంశూన్యం' - 17
కామాంధుల నిరసించారు - అవినీతిని పాతెయ్యాలని చూశారు 18
స్త్రీల బాధావిముక్తికి తిరుగబడుమని - 20,
"నా పేరు చరిత్రకెక్కాలని లేదు/నా తల నేల కూలినా పరవాలేదు
సామాన్యుడు / ఒక్క పూటైనా పస్తుండకుంటే చాలు " -21
ఇరవై ఏండ్ల క్రితం సిరిసిల్లా 'యువసాహితి' వారు ఈనాటి "మానేటి రచయితలు"

## మినీ కవితలు :

వచన కవితల్లో చిన్న వాటిని 'మినీ కవితలు' అని వ్యవహరిస్తున్నారు ఇవి ఎంత చిన్నగానైనా ఉండవచ్చు ఒక విధంగా ఇవి వచనా కవితా ద్విపదలు

చలం 'సుధ'లోని ఒక కవిత ఇది 'నేను బుద్ధుడినా? నలుడినేమో!' - రెండేపంక్తులు

కుందుర్తి ఆంజనేయులు గారు ఒకానొక పుస్తకానికి ముందుమాట వ్రాస్తూ ఈ క్రిందిమాట అన్నారు ఓ సాహితీ సమావేశంలో ఓ కవి తన మినీ కవితలు చదువుతూ - 'ప్రాణం - గాలి!' అని ముగించారట అంటే మొదటి పదం శీర్షిక రెండవ పదం 'కవిత' అన్నమాట!

వచన కవిత కూడా పద్యశీర్షికలవలె ఒకటి - రెండు కొన్ని పేజీల్లో ఉంటున్నవి అయిదారు పంక్తుల్లో ఉన్నవాటిని మినీ కవితలని అనవీలున్నా, కేవలం రెండేసి పంక్తులవే మినీ కవితలు అనాల్సి ఉంటుంది అవి రెండు వాక్యాలు కావచ్చు ఒకే వాక్యాని విరిచి కూడ వ్రాయవచ్చు వాటి లక్షణం అలాగే కనిపిస్తున్నది లక్ష్యాన్ని చూసి లక్షణాన్ని ఏర్పరచుకోవాలి ఎందుకంటే వీటికి ఛందశ్శాస్త్రాలు లేవు వచన కవితలే స్వేచ్ఛా విహంగాలు ఇక మినీ కవితలా జెట్‌లు రాకెట్‌లు! సావధానంగా ఆలోచిస్తే మన సామెతలకు ఈ మినీ కవితలకు సామ్యముందనిపిస్తుంది ఇంకా ఆలోకిస్తే వచన కవితల్లోని కొన్ని బలమైన పంక్తులే ఈ మినీ కవితల సృష్టికి మూలం అయ్యుంటుంది ఎందుకంటే వేమన పద్య చరణాలవలె, ఇవి వచన కవితల్లోని కొన్ని పదాలు పాదాలు మాత్రమే అనొచ్చు! ఈ మధ్య హాస్యవ్యంగ్య హేళనాపరంగా మినీ కవితలు పత్రికారంగంలో ప్రాచుర్యం పొందుతున్నాయి

ఈ జిల్లాలో మితంగానైనా మినీ కవితల పుస్తకాలు వచ్చాయి నిజానికి మరే జిల్లాలోనూ ఇంతకు మించి మినీ కవితల సంపుటాలు - సంకలనాలు వచ్చి ఉండవు ఈ జిల్లాలో మినీ కవితలు ఇంతగా చలామణి కావటానికి ప్రధాన కారణాలు రెండు ఒకటి - ఇక్కడి ఉద్యమ ప్రభావం రెండవది - యువకవులు ఈ నవకవితారూపాన్ని అతిగా అభిమానించడం డా సి నారాయణ రెడ్డి గారు కూడా సొధా 'మినీ'లనే పేర మినీ కవితలను వ్రాశారంటే ఈ మినీలకు ప్రజాదరణ ఎంతగా పెరిగిందో అర్థం చేసుకోవచ్చు

ఈ జిల్లా మినీ కవితా పుస్తకాల కవులు వీరు -

1 అలిశెట్టి ప్రభాకర్, 2 తోట మహదేవ్, 3 మలయశ్రీ, 4 విప్లవదత్ శుక్లా ఇంకా 'కిరణాలు' 'లయ' సంకలనాల కవులతోపాటు మినీ కవులు మరికొందరున్నారు వారు డా తిరుమల శ్రీనివాసాచార్య, వడ్డే పల్లి కృష్ణ, రామభోజ, జి రాజేంద్ర మొ॥ వారు

దాసరి తిరుపతయ్య, బి ఏ గోదావరిఖని గారు మాత్రం ఒక మినీ కవితా సంపుటాన్ని ప్రచురించుకున్నారని, కవి పిట్టల రవీందర్ గారు తెలిపారు 1981లో కాని అది లభించలేదు

## I అలిశెట్టి ప్రభాకర్ - జగిత్యాల 1954-1993

ప్రభాకర్ గారి కవితా సంపుటాలన్నింటిలో మినీ కవితలున్నాయి వీరి చురకలు - 1976, రక్తరేఖ 1983, సిటీలైఫ్ 1992 ముఖ్యంగా మినీ కవితా పుస్తకాలు, ఎర్రపావురాలు 1977 సంపుటి నుండి

దర్పణం - ఆశ / విత్తనం లేకుండా / పెరిగిన మొక్కయొక్క / శ్వాస,
నిరాశ / నాభిలేని ఊబిలో / దిగబడక ముందే పొందే / ప్రయాస

భయం బాంబుని / చూడగానే / బెంబేలు పడితే
అదెప్పుడూ / నీ గుండెల్లోనే / పేలుతుంది

న్యాయస్థానం - ఈతరాని / ఈతరాని / నిరుపేదలకు - ఈ చట్టం / ఎత్తయిన నీటి మట్టం

మంటల జెండాలు, నుండి

రెండు పరిశోధనలు
ఆశ / మనిషికి అనుక్షణం / ఊపిరిపోసే ఔషధం,
నిరాశ / చరమ దశ వరకూ బ్రతుకుని / చిత్రహింస చేసే ఆయుధం

చెమట వ్యాపారం
నీ శ్రమ ఫలం / నీ సమక్షంలోనే పాతిపెట్టబడ్డ / విత్తనం,
దాన్నే డబ్బు చెట్టుగా పెంచి / దక్కించుకున్నవాడిదే / పెత్తనం నా దృష్టిలో
అంతస్తూ ఐశ్వర్యం / శ్రామికుడి బిక్షం
నా దృష్టిలో ధన మదాంధుడే / అడుక్కుతినేవాడు

ప్రజలు - తుఫానుల్ని అరికట్టలేరేమో / తుపాకులైతే తరిమి కొట్టగలరు

చురకలు, సంపుటి నుండి -

ముచ్చటగా - ముచ్చటగా దేశాన్ని కొల్లగొట్టేది ముగ్గురే/ మినిష్టర్సు సినీస్టార్సు క్రికెట్ ప్లేర్స్

మధ్యవర్తి - సిగరెట్లకి క్యాన్సర్లకీ మధ్యవర్తి / పొగ

ఫినిష్ ఆస్తంతా అమ్మేస్తే పొడ్యూసరు / కాస్తంతా మైండుంటే డైరెక్టరు

కవలలు - సెక్స్ క్రైం కవలలు / కలిపి చదివితే నవలలు

ఫోను అది ఉన్నవారి కుక్క / ఉన్నచోటే మొరుగుతుంది

లేబిల్ - అన్యాయాల అక్రమాల లేబిల్ / కానిస్టేబుల్

స్లో గన్ కొందర్నే కాల్చగలదు - గన్ / ఎందర్నో మండిస్తుంది స్లోగన్

రక్త రేఖ - 1983, 89

సభ - ఆకలి/ అధ్యక్షతన/ ఖాళీ కడుపే/ ఒక బహిరంగ సభ నినదించే/ పేగులే, జనం

కళా పోషణ - తొంబై తొమ్మిది మంది/ చర్మాన్ని వొలిచి/ నూరో వాడొక్కడే
పరచుకునే తివాసీ/ ఈ దేశంలో/ కళాపోషణ

దొర - నువ్వు/ ఉరిమి చూసినప్పుడేమో/ ఊరంతా పాలేర్లే
వాళ్లే/ ఊరినించి తరిమికొడితే/ నీ బ్రతుకంతా పల్లేర్లే

రక్త రేఖలో మొదటి మూడు సంపుటాలలోని మినీ కవితలు చేర్చారు 60 పుటల్లో సగం వరకు మినీలు కాని వచన కవితలున్నాయి

సిటీలైఫ్ 1992 ఆంధ్రజ్యోతి డెయిలీ కాలం కవితలు ఆరేండ్లుగా ప్రచురింపబడిన వాటిలో ఇవి 418

413 రోజుకో/ వాగ్దానాల/ మృతశిశువుని/ ప్రసవించే ప్రభుత్వానికి
మంత్రులే మంత్ర సానులు

352 అసెంబ్లీలో/ పేలని, ఔట్లు, ప్రతిపక్షాల, ధర్నాలూ, వాకౌట్లు

290 గుడిసెలే/ మేడల్ని/ కడుతాయి, అయినా / మేడలే/ గుడిసెల్ని/ కొడుతాయి
244 పచ్చ నోటు/ ఊపితేనే గాని / కదలని రైలు
అన్నో/ ఆఫీసుల్లో/ మన బతుకు ఫైలు
159 ఆధునిక మనుష్యుడు/ అన్యమనస్కంగా, పీల్చేనశ్యం కాలుష్యం
26 బస్/ రైల్వే చార్జీలే/ కాదు, యిక్కడ, లారీ చార్జీలూ ఎక్కువే
165 ఎందుకురా కవీ/ గజిబిజి ఇమేజీ, అస్పష్ట కవిత్వంకన్న ఆల్జీబ్రా ఈజీ

ఈ సంపుటలో మినీ కవితల పరిధికి మించిన వచన కవితలు కూడా ఉన్నాయి కవి మరణానంతరం ప్రచురించిన 'మరణం నా చివరి చరణం కాదు' సంపుటి - 1994 లోనూ, చివర ప్రభాకర్ స్వయంగా చిత్రాలు వేసిన మినీకవితలను కొన్ని 'చిత్రవ్యాఖ్యలు'గా ఫొటో కవితలుగానూ ప్రచురించారు మినీ కవితను స్వచ్ఛందంగా స్వేచ్ఛగా ఎన్ని విధాలుగానో చిత్రించిన 'నిర్వచన' వచన కవితా శిల్పి అలిశెట్టి ప్రభాకర్ గారు!

## 3 తోటమహదేవ్ - సిరిసిల్ల

మహదేవ్ గారి పరిచయం గేయ సంపుటాల్లో చేయబడింది వీరి 'గుండెమండింది' 1981, వచన కవితా సంపుటిలో మినీ కవితలే ఎక్కువ వీటికి భావ తీవ్రతా ఎక్కువే

ప్రారంభోత్సవం ఇదో / కాకి / పేరంటమ్
వడ్డీ వ్యాపారి - మిత్తిని తిని / అసలు / దొంగలకు / దాచేవాడు
వ్రతం తాను చేసిన / పాపాలు / పక్కోళ్లకు / అంటుకోవాలనే / తాపత్రయం
డేర్ ఆకలి అయితే / మాత్రం / సందేహించేదిలేదు
అమాంతం / సూర్యున్నైనా మింగి / జీర్ణించుకుందాం
ప్రకృతి తలక్రింద / దిండు పెట్టుకుంటె / మొద్దు నిద్రపడుతుంది
తుపాకి పెట్టుకో / తట్టి లేపుతుంది
గుండె మనిషి / భయపడకుండ / స్టోర్‌లో పెట్టుకున్న ఆటంబాంబు
ఆకలి విప్లవానికి / ముందు / విజయశంఖం

## 4 మలయశ్రీ - ఎం ఏ ఎం ఓ.ఎల్

ఈ గ్రంథకర్త పరిచయం ముందే చేయబడింది వీరి ముద్రిత పుస్తకాలలో కొరడాదెబ్బలు 1982 అచ్చంగా మినీ కవితా సంపుటి మినీ కవితల ఒకటి రెండు పదాలను ఒక్కొక్కపంక్తిగా విరిచి వ్రాసే విధానాన్ని ఈ కవి అనుసరించలేదు ఏక వాక్య కవితలు కూడా వ్రాయలేదు ఈ సంపుటిలోని 202 మినీ కవితలలో ఇవి కొన్ని - చూడండి

3 జీవితం ఒక పోరాటం / సాహసముంటేనే జీవించటం
20 ఏమంటే ఏమవుతుంది అంతా ఉత్తదండుగ,
అనుకునే వాళ్లున్నంత కాలం రాజకీయ వినాయకులకు పండుగ
23 మనదేశ సంపదను చూసి విదేశీయులు ఆశ్చర్యపోయారు,
మనదేశ దారిద్ర్యాన్ని చూసి స్వదేశీయులు మూర్ఛపోతున్నారు
40 ఎవరు నిందించినా బెదరని వాడు వీరుడు/ ఇకవాడు జీవితంలో బాగుపడడు
61 వావ్ వాహ్ దొరగారు! వంది మాగధులు లేకుంటే దొరకారు
65 పల్లెల్లోని గాలి చాలు మన ఆరోగ్యం కాయడానికి,
పట్నాల్లోని ధూళి చాలు మన ప్రాణం తీయడానికి,

100 ఆనందం బ్రహ్మానందం! తాగర తాగు
అన్నీ ధ్వంసమైంతర్వాత యింత విషం తాగు
109 కథలు - కవితలు కాపీ చేసి రాసేవాడు / కక్కుడు గతికేవాడు

**4 విప్లవ దత్ శుక్లా - ఎం ఎస్సి, బి ఇడి హుజూరాబాద్ జ. 1965**

స్వాతంత్ర్య సమరయోధులు కమ్యూనిస్టు నాయకులైన అమృత లాల్ శుక్లా (సిరిసిల్ల) గారి కుమారులైన ఎస్ పి శుక్లా గారి కుమారుడు విప్లవ దత్ కవి ఫొటోగ్రాఫర్ చిత్రలేఖకులైన విప్లవ దత్‌గారు ప్రభుత్వ గురుకుల పాఠశాలలో ఉపాధ్యాయులు

వీరి మినీ కవితలు 'చెకుముకి రాళ్ళు' పేరుతో 1966లో (మద్రాసు లేబర్ స్టాచ్యూ ముఖ చిత్రంతో) అందమైన గెటప్‌లో వెలువడింది మచ్చుకు కొన్ని ఇవి



బడ్జెట్ - ఆకాశంలోని ధరలను అంతరిక్షంలోకి పంపె
బడా 'జెట్' బడ్జెట్!
జీవితం - 365 రోజులు, ఎప్పుడు చూసినా రాపిడి
360 కోణాలలో, ఎటు చూసినా దోపిడి
సినిమా నేటి మన, సినిమాలు, ఛీ 'నీలి'మాలు!

మరి కొందరు కవుల మినీకవితలు చూడండి

**డా॥ తిరుమల శ్రీనివాసాచార్యులు - నారాయణ పురం**

1 కమ్మని స్నేహం బంగారు నాణెం - బొమ్మా బొరుసూ రెండు సమానం
2 పల్లె ముగ్ధ పట్టణం ప్రౌఢ
3 లోచనం కన్ను - ఆలోచనం ప్రధానం

**వడ్డే పల్లి కృష్ణ - సిరిసిల్ల**

భూమిపై నిట్టనిలువుగా భుజము / నిలబడితే ఏర్పడేది లంబకోణం, పైరవీ కారులు /
ప్రభుత్వాధికారులు / కుమ్మక్కయితే ఎదురయ్యేది కుంభకోణం!

**దాసరి తిరుపతయ్య- గోదావరి ఖని**

అ ఆలు రాని వాళ్ళు సైతం అమాత్యులౌతున్నప్పుడు
బడిపంతులు కొలువుకు మాత్రం చదువుకున్నోళ్ళే ఎందుకు?

**ప్రతాప కిష్టయ్య - ఎం ఏ అధ్యాపకులు వేములవాడ**

జూదం ఉన్నవాడి వినోదం,
లేనివాడి జూదం జీవితంతో చెలగాటం

**ఎం డి అయూబ్‌ఖాన్ - సిరిసిల్ల**

అక్కపెల్లిన రగిలిన చిచ్చు చెక్కపెల్లికి సెగలెల్లిందట,
పులులన్నీ పారిపోతున్నాయట కనబడితే కాల్చేయండి

**రామబోజ - పాలాస**

చీకటి వాకిటిలో /చరించి / దానివలువ లూడదీస్తే
వెలుగు విలువ / తెలుసుకుంటాం/ భవితవ్యానికి బాటవేసుకుంటాం

**వారాల ఆనంద్ - ఎం ఏ వేములవాడ**

ఈ సమాజం అచ్చు తప్పులున్న ఒక పుస్తకం
ఇప్పుడు కావల్సింది తప్పొప్పుల పట్టిక

తయారు చేయడం కాదు దాన్ని సమూలంగా మార్చడం

ఇంకా గజభీంకార్ దేవరాజ్ తంగళ్ళపల్లి, వాసాలనరసయ్య, జగన్మాధవరావు శ్రీరంగ స్వామి మొ॥ వారలు మినీ కవితలు రాశారు

ఈ జిల్లాలో కీ శే అలిశెట్టి ప్రభాకర్ తోనే మినీ కవితలు వ్యాప్తి పదాల్లో శ్లేష, యమకాలు, ఉపమారూపక దృష్టాంతాది అర్థాలంకారాలు, ప్రజాదరణ సమకూర్చాయి అంతకు చాల కాలం ముందే సురమౌళి గారు హైదరాబాద్ ప్రభుత్వ న్యాయశాఖలో తెలుగు టైపిస్టుగా ఉంటున్న కాలంలో (1953 60) ఓ మినీ కవితా సృష్టికి అనుకోకుండా కారకులయ్యారు ఓసారి 'నవ్యసాహితీసమితి' వారి ఒక సైక్లోస్టైల్డు బులిటెన్‌ను స్టెన్సిల్ మీద టైప్‌చేస్తున్న సందర్భంలో ఓ పేజీలో నాలుగులైన్ల ఖాళీ స్థలాన్ని పూరించవల్సి వచ్చింది అప్పుడు ఇట్లా పూర్తి చేశారు

జగత్తులో నేడు సగం, దగా తినుట మానుకొంది దాశరథి

మానుకున్న అదే సగం, దగా చేయ పూనుకొంది - సురమౌళి!

ఈ చిరుకవితల గాలి బలంగానే వీస్తూ పాఠకులకు హృదయ స్పందన కలిగిస్తూ జనాదరణ పొందుతున్నది ఈ విషయాన్ని డా సి నారాయణరెడ్డి గారు ఓ మినీ కవితలో ఈ విధంగా చెప్పారు

కుర్రాళ్లొస్తున్నారు జాగ్రత్త కొత్త గొంతు లెగరేసుకుంటూ

పరమ వృద్ధులూ తప్పుకొండి, పాత కీర్తిని నెమరేసుకుంటూ - అని

ఎంత చెప్పినారు అనే దానికన్నా ఏమి చెప్పినారనేదే ముఖ్యం కదా!

"అల్పాక్షరములు ననల్పార్థ రచన కల్పించుటయె కాదె కవి వివేకంబు! పాల్కురికి సోమన

ఈనాడు కాలం చాల వేగంగా పరిగెడుతున్నది అంటే జనం బిజీగా ఉంటున్నారు ఈ యాంత్రిక యుగ ఉద్యోగాల జీవితంలో, రేడియో టెలివిజన్‌ల పోటీలో తీరిక దొరికేది తక్కువ చిక్కిన ఆ స్వల్ప విశ్రాంతి కాలాన్ని తమ ఆలోచనలతో వ్యంగ్యంతో సద్వినియోగం చేయిగలవి మినీ కవితలు

కొంత అర్థమందు కొంచెమై ఉండదా?

విత్తనంబు మఱ్ఱి వృక్షంబునకు ఎంత! - వేమన

## లలిత గీతాలు

పాటకు మాటకు అవినాభావ సంబంధమున్నది ఆదిమనివాసుల కాలంలో మాటతో పాటే పాటపుట్టి ఉంటుంది మన తెలుగులో పదం అంటే మాట పాట అనే అర్థాలు ఉన్నాయి! ఆటవిక జాతుల పర్వాలు వివాహాల సందర్భంలోని గ్రామీణ జీవితంలోని పాటలకును జానపద గీతాలుగా ప్రముఖ స్థానముంది పెళ్ళి పేరంటాలు, విందులు వినోదాలు పర్వదినాలు, సాంస్కృతిక కార్యకలాపాలు పాటలతోనే నిండుతనాన్ని సంతరించుకుంటున్నాయి నేటి నవనాగరిక యుగంలోనూ రేడియో సినిమా టెలివిజన్‌లు పాటలను బహుళ వ్యాప్తి కావిస్తున్నాయి సభలు సమావేశాలు పాటలతో రాణిస్తున్నాయి ఎన్నికలలో వాణిజ్య ప్రకటనలలో ప్రజాసంస్కరణ పోరాటాది ఉద్యమాల్లో పాటలు పాడుతున్నారు

మన తెలుగు దేశంలో మధ్యయుగంలో అన్నమయ్య, రామదాసు, త్యాగయ్య, క్షేత్రయ్య మొ॥ వాగ్గేయకారులు పాటలతోనే పేరు పొందారు అయితే నాడు భక్తిది ప్రథమస్థానం

ఈనాడు రక్తిది ప్రథమ స్థానం దైవభక్తి లేదని కాదు కాని, అంతకు మించి ఈ శతాబ్ది పూర్వార్థంలో దేశభక్తి చోటు చేసుకుంది భారత స్వాతంత్ర్య పోరాట కాలంలో పాటలు తుపాకి తూటాల కన్నమిన్నగా పనిచేశాయి దేశ స్వాతంత్రలబ్ధి తర్వాత దేశ ప్రగతి, జాతీయ సమైక్యత,

సాంఘిక సంస్కార గేయాలు వచ్చాయి జాతీయ నాయకులను ప్రజాస్వామ్య ప్రభుత్వాన్ని స్తుతించడంతోపాటు, సామ్యవాద సాధన కోసం విప్లవ గేయాలు రైతు కూలీ పాటలూ వచ్చాయి

కమ్యూనిజం ఊపులో తీవ్రవాద సాయుధ పోరాట గీతాలు ఒక వైపు వస్తుంటే, మరోవైపు భక్తి శృంగార భావ గేయాలు వస్తూనే ఉన్నాయి లోకోభిన్నరుచి జానపద గేయాలపై శ్రద్ధ పెరిగి వాటి సేకరణ ప్రచురణ కారణంగా పల్లె పాటలను అనుసరించే కవులు కూడా వచ్చారు

ఈ జిల్లా పాటల లలిత (విప్లవ) గీతాల సంపుటాల కవుల పరిచయం ఈ విభాగంలో చేయబడుతున్నది లలిత గీతం శాస్త్రీయసంగీత కీర్తనలకన్న భిన్నం - సరళం అయినా వీటికి సంగీత స్పర్శ ఎంతో కొంత ఉండనే ఉంటుంది ఇక జానపద గేయాల బాణీలో వచ్చిన ప్రేమపాటలు - దేశభక్తి గీతాలు పోరాట గేయాలు సైతం ఈ ప్రకరణంలోనే చేర్చబడినవి విషయాన్ని బట్టి విడివిడిగా కాక కవుల కవితా సంపుటాల ముద్రణాకాలాల బట్టి అవి వరుసగా చూపబడుతున్నవి

కరీంనగర్ జిల్లాలో ఆధునిక గేయం ఈ శతాబ్దం ప్రథమపాదం చివర్లో పుట్టింది

రాపుసింహకవి గారి 'కలియుగ వర్ణాశ్రమ ధర్మముల' దుష్టలంచగొండి, ప్రపంచ వర్ణనము' 1920 25 ప్రాంతంలో వచ్చిన మొదటి సామాజిక గేయాలు డా పింగలి లింబాద్రి రెడ్డిగారి 'కోకిలాలాపం' గోలకొండ కవుల సంచిక 1934లోని గేయం రెండవది ఇది గురజాడ ముత్యాల సరాలను ఛందస్సులో అనుసరించింది వానమామలై జగన్నాథాచార్యుల సోషలిస్టు గేయాలది కాలంపరంగా చూస్తే మూడవదశ ఇది 1950 ప్రాంతంలో వెలువడింది

భారత స్వాతంత్ర్యపోరాట గేయాలు ఇతర జిల్లాలవే ఇక్కడి శాంతి సత్యాగ్రహ వీరులు పాడుకున్నారు తప్ప, ఆ కాలంలో ఈ ప్రాంతంలో జాతీయ ఉద్యమ గీతాలు రచింపబడలేదు 1948 నిజాం వ్యతిరేక ప్రజా పోరాటకాలంలో మాత్రం కొన్ని పాటలు వచ్చాయి అప్పటి ఇక్కడి ఏకైక కవి మల్లేశం గారు ఒక్కరే

### I జి మల్లేశం - అంతకపేట - వ 70 సుమారు

గూడూరి మల్లేశం గారు కమ్యూనిస్టు దృక్పథంతో అప్పుడు ఆ తర్వాత, పలు పాటలు రచించారు అవన్నీ ఉద్యమగీతాలు జానపద - సినిమా బాణీల్లో రచింపబడిన ఈ పాటలు ప్రజా స్పందన కలిగించి రైతుకూలీ పోరాటాన్ని ఉధృతం చేశాయి ఆంధ్రప్రదేశ్ ఏర్పడడానికి ముందు ఆ తర్వాత భూస్వాముల దౌర్జన్యాలను, అధికారుల లంచగొండి తనాలను ఖండిస్తూ మల్లేశం గారు అనేక గేయాలు రచించారు వాటిని గానం చేసి జనచైతన్యం కలిగించారు వీరు జైలుకు (జాల్నా) వెళ్లి వచ్చిన స్వాతంత్ర్య సమరయోధులు [1] వీరి పాటలు అప్పుడు అధిక జనవ్యాప్తి పొందాయి కొన్ని పాటలు పట్టికోట ఆళ్వారు స్వామి పుస్తకంగా వేస్తామని తీసుకెళ్లారట

మల్లేశం గారు తమ పాటలు ప్రచురించలేదు కవి నోట ఇతర చోట్ల విన్న వీరి పాటల చరణాలు కొన్ని మాత్రం ఇట చూపడమౌతున్నది

జేబులో బొమ్మా జేజేల బొమ్మా/ జేబులో బొమ్మా!
మల్లంపల్లి గుడి పూజారికి / ఇనాం ఇచ్చిన తరి రెండెకరాల్
కోర్టుల నాకే వచ్చిందంటే / కొత్త కొండ శ్రీ వీర భద్రునికి
కోర మీసమును పెట్టెద నమ్మా/ జోడు ప్రభల కట్టించెద నమ్మా ॥జేబులో॥

---

1 రేపాల నరసింహరాములు 'సజీవ కిరణాలు 1993 పు 106

అక్కన్నపేట చొక్కారావు దొర 'రేకొండ' చెరువుకు ఓ రాత్రి గండి పెట్టిస్తే వ్రాసిన పాట శబ్దాలంకార శోభితంగా ఉంది

కూలి నాలి జనమందరు/కునుకు నిద్రనుండి లేచి
కూడిరి కుప్పలు తెప్పలు / కుంట గండి కూడ్చివేసి నారయా-
1970 సుమారుగా హన్మకొండ' సర్కార్ దవాఖానాముందు -
'లవకుశ' సినీగీతం బాణిలో వీరు పాడిన ఆశుగీతం -
సివిలు హాస్పిటలూ చరితమును తెలిపెదనండీ
హాస్పిటల్ సిబ్బందికి సంచలనం సృష్టించింది
1975 ఏమర్జెన్సీ కాలపు విమర్శన గేయం -
మారింది మారింది ఓ యిందిరమ్మ నీ
కాలమంత మారిందే ఓ యిందిరమ్మ



ఇది వీరిదే అన్నారు మిత్రులు నిజమా? అని అడిగితే వారు చిరునవ్వుతో మౌనంగా చూశారు

కరీంనగర్ జిల్లాలోని అసలు సిసలైన 1948 -52 ప్రజాపోరాటపు నాటి, ఏకైక ప్రజా కవి గూడూరి మల్లేశం గారు ఆయన పోరాటం కోసం పాటలు వ్రాయలేదు పోరాటమే ఆయనచేత పాటలు వ్రాయించింది అయిన సంపూర్ణ తిరుగుబాటు కవి - ప్రజా ఉద్యమకారుడు ప్రపంచ రాజకీయ చరిత్ర మల్లేశం గారికి కంఠస్థం ఆటుపోటులెన్ని ఎదురైనా నేటికీ తమ ఆశయం నెరవేరునని, ఈ వ్యవస్థ మారునని విశ్వసించే విశిష్టమైన వ్యక్తిత్వం మల్లేశం గారిది

పద్మశాలీల కత పరమాత్మునికె యెరుక/ రేయనక పగలనక పాటుబడి పనిచేస్తే
సనుగొకటి దిగ దాయెరా గిట్టింపు / రెండు రూకలు రావురా -

అని 1956 ప్రాంతంలో సిరిసిల్లా పట్టణంలో ఆయన గొంతు కాహళిగా మ్రోగింది

మల్లేశం గారు విశ్వాస పాత్రుడైన కార్యకర్త - నచ్చని విషయాలకు నియంతృత్వానికి తలవంచని స్వేచ్ఛావాది అందుకే ఓ పర్యాయం ఎన్నికలలో ఇండిపెండెంటుగా నిలిచిన కామ్రేడ్ అమృతలాల్ శుక్లా - సిరిసిల్ల గారికి సహాయంగా వెళ్లి ఇలా ప్రచారగీతం పాడారు

కాంగ్రెసు పెట్టెలో కాలనాగుంటుంది / కాటేసి అయిదేండ్లు మూలకు పంటుంది
ఓటు కాంగ్రెసు కొద్దురా - ఓరన్న / కమ్యూనిస్టుకు వద్దురా !

(ఆయన పాటల చిత్తు కాగితాలన్ని సరిచూసి సంపుటిగా కూర్చి 30 40 సుమారుగా 97లో ఇచ్చాను అన్నవరం దేవేందర్ 'నూతన సాహితీ అధ్యక్షులు' హుస్నాబాద్, కొమురయ్య సర్పంచ్ అంతక పేట గారలు వాటిని "మల్లేశం పోరాటం పాటలు" పేర ముద్రిస్తున్నారు ఈ కవి గుండె రంధ్రాలు పడి చికిత్సపొందుతున్నా అచంచల ఆత్మవిశ్వాసంతో హుస్నాబాద్‌లోని స్వీయగృహంలో మంచంపై ఉన్నారు సమసమాజ వాది గూడూరి మల్లేశం గారు స్నేహశీలి శ్రమజీవి - ప్రజా కవి దేవేందర్ గారి సంపాదకత్వంలో అతని సోదరుడు అన్నవరం శ్రీనివాస్ అందమైన ముఖచిత్రంలో ఆగస్టులో పుస్తకం వెలువడింది పుస్తకాన్ని చూసి మల్లేశంగారు ఆదరించారు 3 సెప్టెంబరును పుస్తకావిష్కరణ సభ పెట్టారు కాని, 19 ఆగస్టు నాడుక ఆయన మరణించారు 29-8-97 నాడు అంతకపేటలో విషాద వాతావరణంలో కరీంనగర్ జిల్లా అభ్యుదయ కాముల సమావేశంలో ఈ పుస్తకాన్ని డా మలయశ్రీ ఆవిష్కరించారు

ఈ జిల్లా లలిత గేయ కవులు

1 డా సి నారాయణరెడ్డి 2 ఎస్ రాజమల్లయ్య 3 డా జె బాపురెడ్డి
4 ఆడెపు రాజమల్లయ్య 5 నడిమెట్ల రామయ్య 6 వడ్డేపల్లి కృష్ణ
7 ఎన్ బాలరాజు 8 సిహెచ్ రాజలింగం 9 మలయశ్రీ
10 రామభోజ 11 అల్లం వీరయ్య 12 రేగులపాటి కిషన్‌రావు
13 ఎస్ కె పిళ్ళె 14 కొత్త రాజిరెడ్డి 15 శేషం సుప్రసన్నాచార్యులు
16 సుద్దాల అశోక్ (తేజ) 17 గుండేటి రమేశ్ 18 అల్లం నారాయణ
19 డా॥ వఢ్లూరి అంజనేయరాజు 20 టి వి సాల్మన్‌రాజు 21 డా తిరుమల శ్రీనివాసాచార్యులు
22 రాస భూమయ్య 23 కొండబత్తిని రవీందర్ 24 కె రాంలక్ష్మణ్

ఈ జిల్లాలో వెలువడిన పాటల సంకలనాలు రెండు - 1 అక్షర ఉజ్వల 2 దళిత పాటలు

1 డా సి నారాయణరెడ్డి - హనుమాజిపేట - ప్రస్తుత నివాసం హైదరాబాద్

నారాయణ రెడ్డి గారికి తెలుగు పాటకు మధ్య కల బంధం అనుబంధం అర్ధశతాబ్దిది వీరు ఎన్ని పాటలు వ్రాశారో సినిమా పాటలే మూడు వేలకు పై చిలుకు లలిత గీతాలకు లెక్కలేదు వీరి లలిత గేయ సంపుటాలివి

1 పూల పాటలు సంకలనం 1952, 2 నారాయణ రెడ్డి గేయాలు - 1955
3 పగలే వెన్నెల - సినిమా పాటలు - 1976, 4 తెలుగు గజల్లు - 1984
5 పాటలో ఏముంది నామాటలో ఏముంది (1962-74) - 1996

నారాయణరెడ్డి గారి పాటలను పరిచయం చేయడం సూర్యుని దివిటితో చూపడమే ప్రతి అక్షరాస్యుడు వీరి గేయాలను చదివే ఉంటాడు ఆబాలగోపాలం వీరి సినిమా పాటలను వినే ఉన్నారు

1 పూల పాటలు రాజశ్రీ కళాపీఠం సికింద్రాబాద్ వారి ప్రచురణ

ఈ సంకలనంలో వేర్వేరు కవుల 49 పాటల్లో నారాయణ రెడ్డి గారివి 13 పాటలున్నవి ఇవి శృంగార భావ ప్రకృతి వర్ణనల లలితగేయాలు

భావవీధులలోన పయనించి పయనించి / రాలిపోయిన హృదిని గాలించు నీపాట -
నిండు వానల నాడె యెండిపోయిన నాదు / తలపు తేరుల తుంపరలు జిమ్ము నీ పాట - ఆపవే
'కొసరు తెటులు'లో
క్రీగంట చూసేవు కిలకిలా నవ్వేవు / ప్రణయ మంత్రమ్మూద కనులెత్తి జేసేవు
కనులెత్తి గానీయకా, గైకోవె నాకానుకా -

ఇందలి మధుమాసం నామానసాన, నాజీవితానంద, చినుకులు పాటలు 'ఆకాశవాణి' ద్వారా ప్రసారం చేయబడ్డాయి

2 నారాయణ రెడ్డి గేయాలు - ముప్పది తొమ్మిది పాటల ఈ సంపుటి మూడు ముద్రణలు పొందింది దీనిలోని గేయాలు శృంగార రసోద్దీపకాలు లలిత భావాల మృదుపదాలలోనే కాక గంభీరపద విన్యాసంతోనూ రూపుదిద్దే కలం రెడ్డి గారిది

యౌవనము జీవిత, స్యందనాగ్ర పతాక / యౌవనము ప్రణయవనిలో వసంతునిరాక
మిసిమి జవ్వనముతొ, ఋక్కిసలాడు దంపతుల / కారు ఋతువులు అవ్వ, ర్వానంద హేతువులు -
ఆత్మాశ్రయ విరహ శృంగారంలో ప్రేయసి స్మరణలో -
నా మీద పడు నిరా శా మేఘముల జోప /కోమలీ నీపైట కొసలే సమర్థములు -

అప్పుడు సామ్యవాదం అభిమానం కూడా ఈ కవి గారికి ఉండేది పలాశపతాకను ధరించి, విలాసంగా నడిచివచ్చే విప్లవకారుని కోసం - గేయాలు రచించారు వీరత్వంతో వచ్చే సన్నివేశంలో సైతం 'విలాసం'గా అనటం ప్రాసకోసంకాదు అది సి నా రె గారి కవితాలాలిత్యలాస్యం

3 పగలే వెన్నెల ఇది 225 మేలిమి సినిమా పాటల పేటిక

1961 లో 'గులేబకావళి' సినిమాలో

'నన్ను దోచుకుందు వటే వన్నెల దొరసాని / కన్నులలో నిలుపు కొందు నిన్నే నా స్వామి

అనే మొదటి పాటతోనే జనం గుండెలను దోచుకున్నారు అంతకుముందే 1960లో 'ఆకాశవాణి' లో ప్రసారమైన వీరి 'రామప్ప' నాటికలోని 'ఈనల్లని రాలలో ఏ కన్నులు దాగెనో / ఈ బండల మాటనా ఏ గుండెలు మ్రోగెనో' పాట బహుళ ప్రచారం పొందింది అది తర్వాత అమర శిల్పి జక్కన'లో వచ్చింది

1961 ఆనాటి నుండి 1997 'ఓసే రాములమ్మ' వరకు వేల పాటలు వీరివి రసహృదయాల నలరించాయి జానపద బాణీలో గోగులు పూసె - 'మాయదారి నిన్నోడు - మొ॥ పాటలు జనాన్ని ఆకర్షించి వీరికి అధిక కీర్తిధనాన్ని తెచ్చిపెట్టాయి కొన్ని పాటలు అతివేల శృంగారానివనే విమర్శ ఉంది అయితే అటువంటి వారికి 'సి నా రె ' గారు స్వయంగా ఇచ్చిన సమాధానం ఇది "సిచ్‌యేషన్‌కి ఎవరైనా రాయాలి శ్రీశ్రీ అయినా రాయాలి సి నా రె అయినా రాయాలి అయితే రాయడంలో ఒక్కొక్కరికి ఓ బాణీ ఉంటుంది సాధ్యమయినంతవరకు కొంత రెచ్చగొడుతూ ఉన్నా, పచ్చిగా వుండకుండా రానే పద్ధతొకటుంది అది నా కలవడింది ఇప్పుడీ మధ్య అది కూడా మానేశాను "[1] సినీ మాయాలోకంలో కలంపట్టి మడికట్టుకు కూర్చోవడం కష్టం

4 తెలుగు గజల్లు ఉర్దూగేయం 'గజల్ ఛందస్సును గ్రహించి అదే బాణిలో రెడ్డిగారు రచించి స్వయంగా గానం చేసిన క్యాసెట్లు విడుదల చేయడమే కాక తెలుగుగజల్లు' పేర 35 గజల్లను ఒక పుస్తకంగా తెచ్చారు ఈ కృతిపై డా గోపి గారి అభిప్రాయం చూడండి 'తెలుగు గజళ్ల తెలుగు కవితా రంగంలో మంచి ప్రయోగం సామాజిక వస్తువుతో రాయడం తెలుగులో తొలిపయత్నం" ఉర్దూ గజల్లు శృంగార భావప్రాధాన్యతలో ఉన్నాయి డా రెడ్డి తెలుగుపాటను అత్యున్నత శిఖరాలకు తీసుకువెళ్ళి దానికి పండిత పామర జనగౌరవం చేకూర్చారు "మాటలో పాటలో హావభావాల్లో ఒక వింత లయను నిసర్గ రమ్యంగా కూర్చుకున్న విశిష్ట కవి సి నా రె ", డా గోపి

5 పాటలో ఏముంది - వారి సినీగీతాల పుట్టుపూర్వోత్తరాలు సందర్భోచితంగా సంగీత సాహిత్య విషయాల వివరణ కావించారు ఈ పుస్తకంలో ఆ కాలపు సినీ నిర్మాతల - దర్శకుల - కళాకారుల సాహిత్యంలో శాశ్వతం చేశారు ఇది మరో సంపుటి వెలువడుతుందని తెలిసింది

డా॥ తిరుమల శ్రీనివాసాచార్య గారి మాటల్లో "అతని శబ్దానికి పాతదనంలేదు పచ్చదనం తప్ప, పాటలెన్నో వైవిధ్యమంత, ఇందుకు కారణం అతని సహజగేయ కవితా ప్రవృత్తి సంగీత ప్రియత "[2]"డా సి నారాయణ రెడ్డి గారు సంపూర్ణ కవితా డా సి నా రె గేయకవి సమ్రాట్!

## 2 ఎస్ రాజమల్లయ్య, ఎం ఏ పదిరె తా॥ సిరిసిల్ల వ 54 సం లు

రాజమల్లయ్య గారు తెలుగు ఇంగ్లీషు భాషల్లో ఎం ఏ డిగ్రీలు పొంది ఇంగ్లీషు లెక్చరర్‌గా ప్రభుత్వోద్యోగం చేస్తున్నారు 1964 సుమారుగా 'మధుకణాలు' పేరుతో వీరిది ఓ లలిత గీత

1 డా ఎన్ గోపి నిలువెత్తు తెలుగు సంతకం సి నా రె వ్యక్తిత్వం 91 పు 89

2 డా తిరుమల శ్రీనివాసాచార్య "నారాయణరెడ్డి సాహితిమూర్తి" - 81 పు 336

సంపుటి వెలువడింది ఇది చిరు పొత్తం ఈ కృతిలో కవిగారు బుద్ధునికి నమస్సుమాలు అందిస్తూ గేయ రచనారంభం కావించారు ప్రేమ భాష్యము మోక్షపీయూషము వంటి గ్రాంధిక పదాలతోపాటు లెంకు, బమ్మదేవుడు వంటి గ్రామ్యపదాలను కూడా కవి ప్రయోగించారు దేశభక్తి ప్రకృతి వర్ణనలతో సాగిన ఈ గేయసంపుటి తర్వాత వీరు మరే రచనా కావించినట్లు తెలియలేదు

**3 డా జె. బాపురెడ్డి, ఎం ఏ ఐ ఏ ఎస్ సిరికొండ.**

పద్య, గద్య, గేయ, వచన కవితా ప్రక్రియలలో పలు పుస్తకాలు వెలయించిన బాపురెడ్డి గారు ప్రధానంగా పాటను అభిమానించిన కవి వీరి పాటలు దేశభక్తిని ప్రకటిస్తూ దేశ ప్రగతిని ప్రచారం చేస్తూ 'ఆకాశవాణి' లో అనేకం ప్రసారం చేయబడ్డాయి పుస్తకాలుగా వచ్చాయి వీరి గేయ సంపుటాలు 1 బాపురెడ్డి గేయాలు - 1968 70 2 నాద వేదాలు - 1981 3 శ్రీకార శిఖరం 1985 4 ప్రేమారామం 1986

1 బాపురెడ్డి గేయాలు' 1968లో మొదటి ముద్రణ పొంది 1970లో గేయాల సంఖ్య పెరిగి మలి ముద్రణ పొందిన ఈ పాటల సంపుటి 1971 లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ వారి బహుమతిని అందుకొన్నది ముచ్చటగా మూడవ ముద్రణ కూడా వెలువడిన ఈ పుస్తకం డా॥ బోయి భీమన్న గారికి కృతి ఇవ్వబడింది ఈ సంపుటిలోని కొన్ని పాటలను ఆంగ్లంలోనికి అనువదించి కవి గారు తమ 'ఇన్ క్వెస్ట్ ఆఫ్ హార్మొనీ' ఆంగ్ల కవితాసంపుటిలో చేర్చుకున్నారు

బాపురెడ్డి గేయాలు, మూడవ ముద్రణప్రతి 200 పుటల్లో దాదాపు వంద గేయాలున్నవి ఈ పాటలను మానసిక, సామాజిక, ప్రభుత్వపరమైనవిగా వింగడించవచ్చు విమర్శలు ఇంచుమించుగా లేవు

1 అబ్బానీ అమృత గళము, ఎన్నాళ్లకు విననాయెను
కోటి రాగ వీణలొకే, మాటు మీటినటులాయెను
2 నీ కన్నుల వెలుతురులో, నేకన్నుల తెరిచాను
కనుల తెరచి నేనిది భూలోక మనే మరచాను

ఇవి మొదటి రెండు పాటల పల్లవులు వీరి కొన్ని కవితా పంక్తులు ఇవి
నవ వసంతానివై అవతరించెదవంచు, నా బ్రతుకు తోట నిన్నాళ్లు పెంచితినే పు 5
అది ప్రేయసికై ప్రియుని ఆరాటం - ఇదో ప్రియునికై ప్రేయసి విరహం
కటికి నేల నడిచి నడిచి, కందిన నా పాదమ్ములు, ఎర్ర గులాబీలై పోయెను రా - పు 7
ప్రభుత్వ ప్రశంస ప్రణాళికల నినాదాల వంటి గేయాల బాణీలు ఇట్లున్నవి -
ఈ దేశం మన దేశం ఎంత మారి పోయెరా
ప్రజలు కన్న కలలెన్నో నిజాలు అయిపోయెరా 86
పాదుపో యమ్మ పొదుపు - మదుపో యయ్య మదుపు - 130
బంజరు భూములు పంచారు - బ్రతుకు బాట చూపించారు - 134
ఇందులో ప్రకృతి అందాలను వర్ణించే గేయాలుసైతమున్నాయి
ఓటమినీ కనునీడల కోటల దాటే కాలం/ జగద్గోళమున గాలులు - చలియించేదాక రాదు 81
శూన్యమనే కడలిని శోధిస్తున్నది కాలం - 184, అనే తాత్త్విక భావుకులైన కవి బాపురెడ్డి గారు
పుట్టినాను భరత జాతి పూర్ణత్యాగ ఫలమై
పెరిగినాను భరతమాత ప్రేమ రాగ ఫలమై అని ఆనందిస్తున్నారు!

ఈ సంపుటిలోని గురజాడ, లాల్ బహద్దూర్, ఇందిరాగాంధీ సంస్తుతులు, నెహ్రూజీ మరణ వార్తకు సంతాపం, దేశ విదేశ ప్రదేశాల సౌందర్య వర్ణనలు పరితులనాకట్టు కుంటాయి కొన్ని గేయాలు సుదీర్ఘాలుగా ఉండటం విశేషం

4 ప్రేమారామం - ప్రణయ భావ గేయ సంపుటి ఇందలి పాటలు ఇంచుమించు నలభై దీనిని డా బాపురెడ్డి గారు, జన్యుశాస్త్రవేత డా మీరాఖాన్ గారికి అంకితం కావించారు

నిన్ను చూసిన నాటి నుండి, నన్ను నేనే మరచిపోతి,

నిన్ను పొందిన నాటి నుండి, నన్ను నేనే కోలుపోతి పు 2

నీ దేవుడు ఎవరైనా, నా దేవివి నీవేలే

నీ లోకము ఏదైనా, నా లోకము నీవేలే - 3

శాస్త్రాలన్నీ చదివి సోహ మనుట నేర్చితి

నిన్ను చూడగానె దాసోహ మనుట నేర్చితి 8

పైట జారిపోతుంది - చెమట కారిపోతూంది

మామా నిను చూస్తుంటే - మనసు కరిగి పోతూంది - 65

ఈ మామ కోడలు సరసం కొస్తా జిల్లాలది సినిమా పాటలతో ఇటు వ్యాప్తి తెలంగాణాలో బావా మరదలు మేనరిక సంబంధాలే ఆచరణలో ఉన్నాయి

3 శ్రీకార శిఖరం అమెరికా లాస్ ఏంజెల్స్‌లోని వేంకటేశ్వరాలయ దైవానికి అంకితం ఇందలి వన్నీ శ్రీనివాస భక్తి గీతాలు

4 నాదవేదాలు ఈ పుస్తకం మలేశియా రాజధాని కౌలాలంపూర్‌లో అక్కడ ప్రవాసాంధ్రులకు అంకితం చేశారు ఇది 84 పాటల సంపుటి ఇందలి కొన్ని పాటలు ఆడియో క్యాసెట్లుగా వచ్చాయి ఈ పాటల్లో కవి వాణి ప్రణయం నుండి ప్రణవానికి దారి వెదక్కుంది కవితాత్మ భక్తి తాదాత్మ్యానికి ఈ చివర గీతం చివరి పంక్తులు నిదర్శనం

నను పిలువ వచ్చిన, నా మృత్యురాణీ, పయనమయ్యే ముందు పాటొకటి రాయనీ

పాటంటె మరేదొ పాట కదమ్మా, సోహమని నీకు దాసోహమను పాట!

బాపురెడ్డి గారు సరస శృంగార, దేశ-దైవ భక్తిగల కవిశిఖామణి!

## 4 అడెపు రాజమల్లయ్య - సదాశివునిపల్లె మం మానకొండూరు

1 గేయమాల 1969, 500 ప్రతులు, 2 స్నేహాంజలి - 1973, (కలం పేరు - శ్రీరాజ్)

గేయమాల గాంధీజి శతజయంతి కానుక దీనిలో 18 పుటల్లో 18 గేయాలున్నాయి

"నిన్నే కీర్తిస్తున్నారని , ప్రజలను పీడిస్తున్నారని

రూకలు జమ చేస్తున్నారని, బొజ్జలు పెంచేస్తున్నారని

బాపూ దు ఖిస్తున్నావా?' ఇది కవి వేతన పు 18

గాంధీ ప్రశంస పుట 1

ప్రతి హృదయ ఫలకంపై నీరూపు వెలిసింది, ప్రతి దేశభక్తునకు నీ ఘనత తెలిసింది

సత్య మార్గంఎన్న సరళమైన వాక్కు, సంజీవి మొక్కలా దేశాన్ని నిలిపింది

5వ గేయం "శ్రమజీవులు" లో కర్షక కార్మికులను దేశానికి వెన్నెముకలు అని ప్రశంసించారు ఇందులోని లేమి 13, క్షధాబాధ - 12 స్వప్నం 11 గేయాలు బాపు సంబంధం లేనివి

శ్రీరాజ్ అనే పేర 'స్నేహాంజలి' అనే శృంగార గేయ సంపుటి 35 పు 1973 చివర వచ్చింది అప్పటికి 1 గేయమాల 2 హృదయాంజలి, ప్రచురించబడినట్లు, సిందూరపు సౌందర్యం ఆదర్శ ప్రేమికులు, ప్రేమ పర్యవసానం గేయ కావ్యాలు రానున్నవని ఉంది

డా సి నారాయణ రెడ్డి గారి 'నాగార్జున సాగరం' లోని నాయికా నాయకులైన శాంతిశ్రీ పద్మదేవు'లకు కవి ఈ కావ్య సమర్పణం కావించారు

ఈ పాటలు మధుర గాయకులు పాడితే మైమరపిస్తాయని 'శశాంక' సద్భావాన్ని వెలిబుచ్చారు

ఇవి 30 పాటలు - కవి పేర్కొనకున్నా కొన్ని సినిమా గీతాల బాణీలవి అన్నీ శృంగార గేయాలే పాండిత్య ప్రకర్ష లేకున్నా కొన్ని తావుల మధుర బావాలు పరితులను ఆకట్టుకునేలా ఉన్నాయి

నీకన్నులు ఆనాడు కలువలయ్యి విరిసేను కాని నేడు అవిజూడ తారలయ్యి మెరెసేను 4

వెఱ్ఱితలల ఈ లోకం వేయి మాటలంటుంది, కూడి వీడి ఎటులున్న చూచి ఓర్వకుంటుంది

శ్రీరాజ్ - రాజమల్లయ్య గారు హైద్రాబాద్‌లో ఉద్యోగిగా ఉంటున్నారని తెలిసింది - (1981)

## 5 నడిమెట్ల రామయ్య - కరీంనగర్

రామయ్య గారిగేయ సంపుటి "జైజవాన్ జైకిసాన్' 1970లో అచ్చయింది పు 40

వీరు ఆదర్శ చేనేత కార్మికులు గాలి పాటలు పాడుకునే తాను మిత్రులప్రోత్సాహం వల్ల జానపదకవిత్వ ధోరణిలో ఈ పాటలు రచించినట్లు పుస్తక పీఠికలో తెలుపుకున్నారు ఈ కవి అంతగా చదువుకోలేదు గణపతి, భగవద్గీత, కృష్ణ మార్కండేయ మొ॥ దేవతల భజనంతోపాటు జవాన్‌ను జైకొడుతూ కొన్ని పాటలున్నాయి రైతు గీతాలు లేవు కొన్నిలౌకిక గేయాలలో కవి గారు సమాజాన్ని చక్కగా చిత్రీకరించారు రూపాయికోసం పాటలో పు 8

రూపాయి కోసం లోపాలనీ, లోనదలపకే ఓ మనసా,
లోపాములాచె లోకాలన్నీ, కాలకూటమే ఓ మనసా"

సంసారము శీర్షికలో - పు 9

"సంసారము సంకెళ్ళ గొలుసూ సద్గురును మదిలోన దలచూ" అన్నారు

"వ్యభిచారం" ను నిరసించారు "తిరుపతి గడ్డం" వ్యంగ్య గేయం

'అమ్మనాన్నను తిట్టి, పెండ్లామునుయొగబడి కొట్టి,
అన్నదమ్ముల జగడము బెట్టి, వ్యభిచారుల స్నేహము బట్టి
యెంకన్నకు గడ్డం ముడుపులు గడితే, పాపం పోవునా పుణ్యం వచ్చునా!"

కొంగ జపాలు చేస్తూ, కల్లుసారా తాగుతూ, పనిచేయక, అప్పులు చేసేవారిని - ఖద్దరు బట్టలువేసి, అత్తరు పూసి వోటర్లను మోసం చేసేవారినీ నిరసించారు - 14

ఈ శ్రామిక గేయం చూడండి -13

"చాలీ చాలని సంసారం చాకలి మంగలి బేరం
మున్నూటరవై యారు దినంబులు, మురికి బట్టల ఉతికినచాకలి
మాల్గుచొక దినము మూలకొరిగిన జగములో రోగము రాగా లాపన,
జగతి మేలుకోరూ! చాకలిదగ మోసము లేదూ "

ఒక శ్రామికుడే మరో శ్రామికుని బాధను అర్థం చేసుకోగలడు మొదటి భజనవల చూస్తే రామయ్య గారి పుస్తకాన్ని 'వేదాంత రచన'ల్లో చేర్చాల్సిందే కాని, పుస్తకం పేరు చివరి లౌకిక గేయాలను బట్టి ఇందులో చేర్చడమే భావ్యమనిపించింది

## 6 వడ్డేపల్లి కృష్ణ - ఎం ఏ సిరిసిల్ల

వడ్డేపల్లి కృష్ణగారు కావ్యం, ఖండకావ్యం, సంగీతరూపకం మొ॥ ప్రక్రియల్లో పుస్తకాలు వెలువరించినా అవి అన్నీ గేయ సంబంధమైనవే వీరు గేయాన్ని అభిమానించిన కవి డా సి నా రె డా జె బాపురెడ్డి గారల తర్వాత కృష్ణగారి లలితగేయాలే ఆకాశవాణిలో అధికంగా వినిపిస్తున్నాయి వీరు ముగ్గురు ఒకే జిల్లా వారు కావటమనేకాక, ఒకే తాలూకా సిరిసిల్లాకు చెందినవారు కృష్ణ గారి పాటలు పది వరకు సినిమాల్లో వచ్చాయి టెలివిజన్‌లో కూడా ప్రసారమైనాయి

వీరి లలితగేయ సంపుటాలు రెండు - మూడు

1 కనరా నీ దేశం - 1971, 2 రాగరథం - 1981 3 వడ్డె పల్లి కృష్ణ గేయాలు 1997

"భాషలో మెత్తదనం భావంలో కొత్తదనం కలిగిన కమ్మదనంవీరి కవితా గుణం" రాగరథం పరిచయం నుండి కృష్ణ హైదరాబాద్‌లో పోస్టల్ శాఖ ఉద్యోగిగా ఉన్నారు లలిత గీతాల పై డాక్టరేటు పరిశోధన గ్రంధరచన కావిస్తున్నారు

1 కనరా నీ దేశం - గీతాలను డా సి నారాయణరెడ్డి గారు ఇలా ప్రశంసించారు "నిద్రా అది కాదు ప్రగతికి ప్రతిబంధముద్ర - మాటలేమో తీపిరా, మనసేమో పాపిరా, - ఇవి ఈ కోయిల గుండెలో చిగురెత్తిన భావుకతకూ, గొంతులో స్వరమెత్తిన రాగాత్మకతకూ నిదర్శనాలు" పీఠిక

ఈ కృతి గీతాలలో దేశ భక్తి - నీతి ప్రబోధం అధికం

2 రాగరథం - డా దాశరథిగారి కవితా పీఠికతో ఇది సినీరంగ ప్రముఖ నేపథ్య గాయకులైన ఎస్ పి బాలసుబ్రహ్మణ్యం గారికి అంకితంగా వెలువడింది ఇది 104 పుటల్లో దాదాపు 100 పాటలు కలది ప్రగతి, ప్రకృతి, ప్రణయ, ప్రస్తుతి, ప్రబోధ పథాలని ఇందలి పాటలు అయిదు భాగాలుగా కూర్చబడ్డవి



ప్రగతి జగతిరథం జై కొడుతూ ప్రగతి పథంపై పోనీ
స్వార్థమ్మును కట్టనిమ్ము, శాశ్వత మౌ సమాధి
హద్దు లేక వ్యాపించే అవినీతిని అణచనీ - పు 3
మమకారంతో వెలిగే మంచి మతం కావాలి
మతమేదైనా కాని మనం హితం తేవాలి - 4
నలుగుతున్న హృదయాలకు నవశక్తులురావాలి
పేదరికం ధనిక తనం పేరుమాసి పోవాలి 5
ప్రకృతి కోయిలా నీవలా పాడితే, నామనసు నాట్యమే ఆడితే 27
తెల్లని విరి మల్లినోయి - చల్లని జాబిల్లినోయి - 32
వసంత మత్త కాశినీ - వయారిమధుర భాషిణీ - 33
ప్రణయ నా మదిలో నటియించే నవ్యభావ కవితా , నవరాగం పలికించే నా జీవన సరితా
రావే ఊహల ఊర్వశీ!రావే నా భావరాశీ! - 45
ప్రస్తుతి తేనెలొలుకు తెలుగుపాటపాడుకొందునోయీ
తెలుగు తల్లి ఒడిలోపల ఆడుకొందుపోయీ 6
నీ నామము మరువను రామా - నా జీవము నీవే శ్యామా - 77
ప్రబోధం కలల అలల కదలి పోవు మనసా
కలలు నిజము కావన్నది తెలుసా - 102

పాత అంతా రోత కాదని, కొత్త అంతా వింత కాదని
పాత కొత్తల మేలు కలయిక, పసిడి కవితకు ప్రాణమగునని
తెలుసుకోరా తెలుగు వాడా - తేజమున యిల వెలుగువాడా - 104

కృష్ణగారి కవితలు శృంగార రసం చిలికించినా, భక్తి సుధ నొలికించినా, నీతి చక్కెర పూత పూసినా వారి అంతరంగాన్ని పై చివరి గేయం వ్యక్తపరుస్తుంది

సరసలలిత గేయకవి వడ్డేపల్లి కృష్ణగారు!

### 7 ఎస్. బాలరాజు, బి ఏ వేములవాడ.

బాలరాజు గారి కలంపేరు 'రసస్రవంతి' వీరి విలాసం కవి మిత్రుడు 'కావ్యసుధ" బాకారం అని ఇచ్చారు వీరి పుస్తకంలో రసస్రవంతి గారి పాటల పుస్తకం రాగారాధన 1975లో పద్మశ్రీ బోయి భీమన్న పోతుకూచి సాంబశివరావు గారల పీఠికలతో వెలువడింది హైద్రాబాద్‌లో వెలువడిన ఈ పుస్తకం ఈ జిల్లాదనిపించదు కాని, టి శ్రీహరి శర్మ వేములవాడ గారు పుస్తక ముఖపత్రం నాలుగవ పుటలో చేసిన కవి పరిచయంలో 'పుట్టితిమంత్ర కూటమున పట్టితి శారదాంబ చరణమ్ము "అను ఉత్పలమాల పద్యం కనిపించి ఈ కవి మంథని వారని తెలిసింది ఈ రాగారాధన కావ్యావిర్భావానికి ప్రేరణ బోయిభీమన్న గారి 'రాగోదయం'కావ్యమని కవి చెప్పుకున్నారు ఈసంపుటిలో 36 పాటలున్నాయి సరస్వతీ ప్రార్థన ఇలా ఆరంభమైంది -

రమ్ము రమ్ము తల్లీ బ్రహ్మయ్య రాగవల్లీ, నా మదిలో విలసిల్లే రంజల్లు కల్పవల్లీ

ఈ కృతిలో భక్తి ఉంది స్త్రీ ఆరాధన ఉంది మరో విశేషమేమంటే ఈ కవి గారు ఆంగ్ల సాహిత్య సంప్రదాయరీతిలో చంద్రుని ఆమె అనే సంబోధించారు రాగావేదన, రాగాలాపన, తరంగమాల అంతరాంతరాలు -గేయకావ్యాలు కాబోలూ, మరో రెండు కంద గీతపద్య శతకాలు అముద్రితాలని కవి పేర్కొన్నారు రాగారాధన ఖండ కావ్య పీఠికలో కవి ఇట్లా అన్నారు

నన్ను విమర్శించు, నా కవితను దర్శించు - భావాలను స్పర్శించు, మది మెచ్చిన హర్షించు !

### 8 సిహెచ్ రాజలింగం - సిరిసిల్లా 60 సం పైన

రాజలింగం గారు నిజాం వ్యతిరేక పోరాటం - 1947-48, తెలంగాణారైతాంగ పోరాట కాలం 1948-52లో విద్యార్థిగా పాల్గొని స్ఫూర్తి పొందిన కవి ఉద్యమకాలంలో వీరి రచనలు రాలేదు కాని, ఆ తర్వాత అప్పుడప్పుడు కమ్యూనిస్టు సోషలిస్టు భావాల ప్రీతిలో వీరి పాటలు, బుర్రకథలు వచ్చాయి కొన్ని అనువాద రచనలు కూడా చేశారు

రాజలింగం గారి పుస్తకాలు - 1 నెహ్రూ స్మృతి, 2 లుమంబా గీతము, 3 కెప్టెన్ విజయ రఘునందన్ బుర్రకథ 4 అమరుడు సంజయ్‌గాంధి, 5 ఎన్నికల గేయాలు - అముద్రితం

ఇవి అచ్చయినవి ఇన్నింటిలో ఒక్కలు 'మంచాగీతం' ప్రతి లభించింది

రాజకీయాల్లో క్రియాశీల కార్యకర్త అయిన సిహెచ్ రాజలింగం గారు 'ప్రజా కవి'

### 9 మలయశ్రీ - ఎం ఏ ఎంఓ ఎల్ చంజర్ల

మలయశ్రీవి ఎలు ప్రక్రియల్లో పలు పుస్తకాలు వచ్చాయి ఆకాశవాణిలో కాని, దిన వార పత్రికల్లో కాని, అంతగా వీరి గళం వినిపించ కున్నా - కలం కనిపించకున్నా వీరు అచ్చమైన పద్య గేయకవి వీరి గేయాలు జనంలో చాల వ్యాప్తి పొందాయి ఈ కవిగారి అచ్చయిన సంపూర్ణ లలిత గేయ సంపుటాలివి

1 మల్లెలు మందారాలు - 1977, 2 పేదల పాటలు - 1978, 3 ఎన్నికల పాటలు 1979, 4 రైతుపాటలు 1981, 5 రాగవల్లరి 1991, 6 అక్షర జ్యోతి - 1991

1 మల్లెలు మందారాలు ఇది 55 గేయాల సంపుటి ఇందలినాలుగుపాటలు ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రం వారి లలిత, చైతన్య గీతాల్లో ప్రసారం కావించబడ్డాయి

మొదటి పాట ఆంధ్ర భాషా ప్రశంస

అమృతము మధురామృతము, ఆంధ్రభాషయే అమృతము
పలికిన ప్రతి పద మొక మధు కణమై, పలికిన ప్రతి పద మొక మృదు స్వనమై
అనిన రసవలనువినిన వీనులను, తనియించే తీయని మా తెనుగే ॥అ॥
ద్రవిడ మూల భాషన జనియించి, సంస్కృతమున సారమునుగ్రహించి
సరస సాహితీ సంగీతమ్ముల, సాటి లేని మన తేట తెల్గు నుడి ॥అ॥

మరోపాట 'మేల్కొలుపు' పు 10

మేల్కొనరా మేల్కనరా నిదుర మత్తు వదలీ కదలీ
నీ జీవిత కాలంలో నిదురలోనె సగము, మిగిత సగం కాలంలో మగత నిదుర సగము
ఆ సగమున అజ్ఞానం ఆంధత్వం అన్యాయం, సద్గుణాల శాతమెంత సరిగాయోచించుకో

వేదాంత ధోరణి ఇది

ఓ మానవ మృత శరీరమా, ఇదియే నీ తుది ప్రయాణమా
బ్రతికి నపుడు నీవేయే భావములందున్నావో
భవితవ్యము గూర్చి యెన్ని పసిడికలలు కన్నావో
స్వజనముకైతివిభారము - స్వగేహమునకే దూరము 50

2 పేదల పాటలు శ్రామికగీతాలు ఇవి ఇరవై

ఓ దొరో విను జెరా, వినవయ్యా మా దొరా!
నిను గోత్తే నను గోత్తే నెత్తురే వత్తాది
నువు పరుపులపండే దెందుకురో, నేను చాపల పండే దెందుకురో
నువు మేడల్లుండే దెందుకురో నేను గుడిసెల మిడికే దెండుకురో? పు 1
ఏం కాల మేం కాలము - ఇంకెంత కాలమీ కాని కలికాలము
కల్లు దుకనం పెట్టినోల్లు, కార్ల మీద పోతున్రు
సారా డిపోలు నడిపినోల్లు, సిన్మాహోల్లు కడుతున్రు 26

3 రైతు పాటలు ఇది చిన్న పుస్తకం 16 పాటలు ఒక గేయ భాగమిది,

విను విను విను విను రోరయ్యా - విను రైతుల గాథ - కనురైతుల భాధ!
పేద రైతులు కూలీలై ఫ్యాక్టర్లకు పోతున్రు / పెద్ద రైతులు బేపార్లై పట్నాల్నే ఉంటున్రు
ఏమిటయ్యా ఈ చోద్యం - ఎట్లా గయ్యా ఈ సేద్యం?
ఇట్లాగైతే ఎట్లాగా మరి నోట్లనె తిందామా! పు 3

4 ఎన్నికల పాటలు - ఇది మరి చిన్నది వ్యంగరచన ఇవి నేటి ఎన్నికల గుట్టురట్టు చేసేవి

5 రాగవల్లరి - 55 పాటల సంపుటి శతావధాని కోరుట్ల కృష్ణమాచార్యులకుఅంకితం చేయబడింది ప్రణయ భావానికి ఒక ఉదాహరణ,

కనులు కనులతో కలిసి కలిసి అలసి సొలసి
మనసులోన పెనవేసెను ఏదో అలజడి అలజడి అలజడి

ఏరాగమో ఇది మోహనలో ఆరంభం
ఏ తాళమో ఇది ఆదిలోనే సంరంభం! పు 11
ఈ పాట మోహనరాగం ఆదితాళంలో పాడుకోవాలి! జానపద బాణీల గేయాలిట్లున్నవి
తాగకు మొగడో తాగి వాగకు మొగడా, తాగి తాగి వచ్చి నన్ను తన్నకు మొగడా
శేనువాయె శెల్కవాయె, గొడ్డువాయె గోదవాయె నా మీది నగలు వోయె, నగువాట్ల బతుకాయె
తాగి తాగి నీయిల్లు తాకట్టుపాలాయె, తాగి తాగి నీ ఒల్లు దగ్గుదమ్ము పాలాయె
కల్లాయె సారాయె కడకు బీరు బ్రాందాయె బంగారమసోంటోనివి బైరాగివి కావడితివి - 30
అంటారాని వాళ్ళంటరా! మమ్మంటాకుండ మీ రుంటరా?
కండలు కరిగించి, బండలు పగిలించి/ గోడలు పెట్టిందెవరు? ఈ మేడలు కట్టిందెవరు?
ఎండా వానల ఎండీ నాని పని చేసి మేముతక్కువా?/ మేడల్లోనా నీడల్లోనా పండుకొనే మీరెక్కువా 33
సంఘ సంస్కార గేయాలు -
కులం పేర మతం పేర కొట్లాటలు వద్దు కులమత భేదాలు వదలి కూడి ఉంటె ముద్దు 42
ఏమై పోతుంది దేశమేమై పోతున్నది?
ఈ దేశం ఈ జనమింకేమి కానున్నది ఏమైకంలో ఉన్నది
చదువు లేదు తెలివిలేదు సద్భావనలేదు, చదువు కున్న వారి కేమొ సత్య దృష్టిలేదు
కూతలలోనే నరులు చేతల వానరులు, ప్రగల్భాలలో పులులు ప్రతాపాన పిల్లులు 54

6 అక్షర జ్యోతి - కరీంనగర్ జిల్లా నిరక్షరాస్యతా నిర్మూలన - వయోజన విద్యా వ్యాప్తి 'అక్షర ఉజ్వల' ఉద్యమ సందర్భంలో వ్రాసిన గేయాలు జిల్లా వయోజన విద్యాశాఖ వారు ఈ చిన్ని పుస్తకాన్ని ప్రచురించారు ఈ జిల్లా వారే కాక ఇరుగుపొరుగు జిల్లాల కళాకారులు గాయక బృందాలవారు కూడా ఈ పాటలను తమ ప్రదర్శనల్లో పాడుకున్నారు

అక్షర దీపం వెలిగించు, నిరక్షరాస్యతను తొలగించు
చీకటిమాసి - వెలుగులు పూసి
నరులు నరులుగా బతకాలి, నారీ మణులు ప్రకాశించాలి - 5
తెలివి కలిగించి విలువను పెంచి, బలము కూర్చునదివిద్య
విద్యయె మనకు వివేకం - విద్యవలదంటె అవివేకం! 24

ఇందలి కొన్ని జానపద బాణీల గేయాలున్నవి వీరి పాటలు కొన్ని మాండలిక పదాలవి దేశభక్తి తప్ప దైవ భక్తి లేకపోవడం, ప్రేమ భావాలున్నా అతివేల శృంగారం లేక పోవడం ఈ కవి కలం ప్రత్యేకత జీవనరక్తి మానవతా భావ దీప్తి మలయశ్రీ లలిత గీతాల సారం

**10 బి రాములు, బి ఏ పాలాస తా జగిత్యాల జ 17 5 45**

'రామ బోజ' కలంపేరుతో వ్రాసే బి రాములు గారిది పాలాన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం పోస్టల్ క్లర్క్‌గా వీరు కరీంనగంలో ఉంటున్నారు రామభోజ గారు అచ్చంగా లలితగేయకవి వీరి ముద్రితపుస్తకాలలో రెండు వచనకవితా సంపుటాలు - రెండు లలిత గీతాలివి

ఈ జిల్లాలోని మరోకవి మిత్రులు వాసాల నరసయ్య గారితో కలిసి వీరు 'చిరు తరగలు' అనే పేరుతో 1985లో జిల్లా కవుల మినీ కవితా సంకలనాన్ని వెలువరించారు రామభోజ గారు కవి మాత్రమే కాక చక్కని కావ్య సమీక్షకులు వివిధ పత్రికలలో వీరివి వందల పుస్తక సమీక్షలు వచ్చాయి బి రాములు పేరుతో వెలువడిన వీరి లలితగేయ సంపుటాల పేర్లివి

1 నవపల్లవాలు - 1980, 2 రాగ ఝరి - 1992

నవ పల్లవాలు ఇది కవిగారి మొదటి పుస్తకము 20 పుటలు 18 పాటలు,
ప్రకృతి, శృంగారం, దైవదేశభక్తి గేయాలు నవ పల్లవాలు
చిలకమ్మ చెప్పవే చెలియలందరు వినగ చెలికానిపేరు
కన్నె వయస్సులోని కలలన్ని పండెనని, ముదితలందరు వినగ మురిపించుపేరు 2
పల్లె పల్లెల పారి పాడింది పల్లవి తల్లిగోదావరిలో నిండె స్వర వల్లరి - 3
మల్లెలేమన్నవి, రాతిరమ్మన్నవి కొత్త భావాలను కొసరి వినమన్నవి 5
మదిలో కదిలే మాధవు తలపులు - మధుర స్వరాలై వీణ మీటినా - 7
తెలుగు నాడను వీణమీటి - పరవశించి పాడుదాం - 10 ఇవి వీరి కొన్ని పాటల పల్లవులు

జాతిపిత - 12, రామప్ప గుడి - 13, అంతరాలు - 14, నిత్యదీపావళి - 16 మొ వి ఈ సంపుటిలోని ఇతర కవితలు



2 రాగఝరి - 32 పుటలు 32 పాటలు
నమో నమో బాసరవాణి - మొదటి స్తుతి గీతం
అక్షరం ఒక విజ్ఞాన శాస్త్రం ఆకాశవాణి ప్రసారం చేసిన
ఈ గేయం వయోజన విద్యా ప్రోత్సాహం కోసం వ్రాసింది - 2
అలసిన ఈ తిమిరం, చాలించెను తన సమరం
నవశోభల ఈ ఉదయం, సాగించెను తన గమనం
చితికిన బతుకులలో, చిరుదివ్వెలు వెలిగెను
నిరాశా రేయిలో, ఆశారుణోదయ మాయెను - 3

గోదారిపాట, చెప్పవే చిలకమ్మ, మాధవు తలపులు మొ కొన్నిగేయాలు మొదటి సంపుటిలోనివి తిరిగి దీనిలోనూ ఉన్నాయి తల్లీ భారతి వందనం 27 ఈ పూట జాతీయతకై పాటొకటి పాడుదాం - 28 మొ దేశభక్తి గీతాలతోపాటు, బమ్మెర పోతన కవి ప్రస్తుతి గీతం - 15 అమర గాయకుడు ఘంటసాల స్మృతి గేయం సైతమున్నది ప్రేమ గీతాలే ఎక్కువ

కోటి గొంతులు ఏకమైతే, కొత్తరాగము మేళవించు
కులము మతము కూలిపోతే, సమత మమతల పరిమళించు 5
మతము మాట మనకొద్దు మత్తులోన ముంచురా
కుటిల రాజకీయాలొద్దు మమతే మనకు ముద్దురా - 6

ఇటువంటి కొత్తవాణితో పాటు సంప్రదాయ బాణీలో సాగిన ఈ కవి గారి భావగీతాలు 'నీ విధిని నీవాచరించ అందుకొందువు వందనం' - 7 వంటి నీతి ప్రబోధం కావించాయి రామ భోజ గారు లలిత లలితగేయకవి

## II. అల్లం వీరయ్య, ఎం ఏ బి ఇడి, గాజులపల్లె మం మంథని

అల్లం వీరయ్యగారు మంథని ప్రాథమికోన్నత పాఠశాలలో అధ్యాపకులు వీరు కొన్ని గేయాలు, కథలు వ్రాశారు వీరయ్య గారి విప్లవ గీతాలు "అల్లం వీరయ్య పాటలు" సంపుటిగా 'జననాట్యమండలి' యుగ ప్రచురణలు పేర ఆర్ కె పీఠికతో 'మా భూమి' నర్సింగారావు గారు 1981లో ప్రచురించారు

ఇందులో 15 పాటలు, 33 పుటల్లో ఉన్నాయి (కవి గారి వద్ద కూడా లేని ఈ పుస్తకం కరీంనగర్‌లో వారాల ఆనంద్‌గారి వద్ద లభించింది)

'ఆదిలోనే కరీంనగర్ పోరాటాలు ఎగరేసిన సాహితీ అరుణపతాక వీరయ్య గీతిక, 'ఎర్రజెండా'

పాట నుంచి 'ఎర్రమొగ్గలాలీ' దాకా అన్ని పాటలు నగ్జల్బరి వారసత్వంగా నింపిన ఎర్రమొగ్గలే అన్నారు ఆర్ కె ఈ మాటలు నిజమే అని వీరి పాటలు చెప్తాయి ఇంటి లక్షణం పందిరి చెప్పినట్లుగా 'అమర వీరులకు' కృతిని అంకితమిస్తూ వ్రాసిన వచన కవితలో రచయిత ఇలా అన్నారు " క్రామేడ్స్ మీ ఎర్రెర్రని త్యాగాల సాక్షిగా / మీరు మీటిన విప్లవరాగాల సాక్షిగా/ఈ మాటలు రాస్తున్నాను/ నెత్తుటి బాకీగా ఈ వ్యవస్థను/ మన పద్దు మీద చేరుస్తున్నా

ఈ పాటలు జానపద బాణీలవి, పోరాటం భావాలవి ఎన్నియ్యాలో కోల్ రాజన ఓ రాజన నేరియాలో, మొ॥ వంత పదాలు వీరు వాడుకున్నారు "రూపురూపులతల్లివోయమ్మా' 'అమ్మ సారంగధార ఎందుపోయె నాయనా" మొ పూర్వ గేయాల అనుసరణలున్నవి మంధని ప్రాంతపు రైతుకూలీల, బొగ్గగని కార్మికుల పోరాటాలు ఈ పాటలకు ఇతివృత్తాలు వీరి గేయాల స్వరూప స్వభావాలు ఇవి

అన్నలు అన్నాలెన్నియ్యాలో, మరి వెన్నెల కోనాలెన్నియ్యాలో
ఎన్నెల కోనాలెన్నియ్యాలో, మరి ఎలుగూ రవ్వాలెన్నియ్యాలో - పు 2
పొరుక పోడు గొట్టి, మరి రాళ్ల రప్పలేరి - బంజేరు దున్నిదోకి, తెల్లజొన్న వోసుకుంటె
ఎవ్వడు వాడెవ్వడు? నాది యనేటోడు - ఎవ్వడు వాడెవ్వడు? నాభూమి అనేటోడు - పు 17
నిన్న పోటువలెన్నో దిగి, ఎంప్లాయిమెంటు కాల్ దీసి
బాయి ట్రేనింగు జెయ్యబోతే, దొరలు బోళ్లు కడుగిబెట్టిరి,
ఎట్టి సాకిరి దప్పలే, బావయో బంగారయా అరువ సాకిరి దప్పలే, ధీరుడో గని కార్మికా పు 8
బాజాట్ల బండుండె, బండికి రెండెడ్లుండె - ఎర్రెర్రని తోవల్ల బండి సాగి దుమ్ము రేగ - పు 15

మాండలిక పదాలతో జానపద బాణీలతో రూపొందిన శ్రామికుల వర్తమాన గాథలు ఈ పాటలు ఇందులో వీరయ్యగారు, తిరుగుబాటు పోరాటం దారుల్లో పోలీసుల కాల్పుల్లో అసువులు వాసిన మిత్రుల సంస్మరించారు వీరి రెండు ప్రముఖ గేయాల పల్లవి - అనుపల్లవులివి

చెరబండరాజు చెరబండరాజు, మనసంత మానేరు మనసుకోనేరు
ఓ పక్క కన్నీరు ఓ పక్క పోరు, నవ్వితే మల్లెలు బతుకు పల్లేర్లు
మెదకు జిల్లా మేనలల్లా - ఎర్ర మొగ్గలాలీ, ఒదిగినట్టి వీరులారా - ఎ మొ లాలీ
ఏ గువ్వ మిమ్ముల పొదిగి నాదో ఎ మొ లాలీ
ఏ గూడు మిమ్ములదాచినాదో - ఎ మొ లాలీ

జానపద బాణీలో ఉన్న వీరి పాటలు జనాదరణ పొందాయి ఒకపాట నారాయణమూర్తి 'దండోరా' సినిమాలో వచ్చింది ఆంధ్రజ్యోతి దినపత్రిక ఆదివారం ప్రత్యేక అనుబంధ సంచికల్లో వీరివి నాలుగైదు కథలు వచ్చాయి వీరయ్య గారు ప్రస్తుతం రచనా వ్యాసంగానికి దూరంగా ఉన్నారు వీరి అన్నఅల్లంరాజయ్య గారుకథా నవలా రచయిత తమ్ముడు అల్లం నారాయణ గారు కూడ గేయకవి రచయిత జర్నలిస్టు

## 12 రేగుల పాటి కిషన్ రావు - చింతలరానా

కిషన్‌రావు ఎం ఏ బి ఇడి గారు ఇప్పుడు రుద్రంగి సెకండరీ పాఠశాలలో అధ్యాపకులు వీరు ఎల్లారెడ్డి పేటలో ఉండగా నవలలు, కథలు, పాటలు వ్రాసి ప్రచురించడం ఆరంభించారు

వీరి గేయ సంపుటాలు మూడు ముద్రణ పొందాయి

1 ప్రగతి పాటలు- 1982, 2 కొత్త పాటలు 1985 3 రవి బింబం

1 ప్రగతి పాటలు ఇవి పదహారు
శ్రీశ్రీకి కృతజ్ఞతలతో, 'సబ్బుబిళ్ల' 1, కుక్క - 18, ను గురించి కూడ పాటలు వ్రాశారు
పదండి పోదాం పదండి పోదాం, ప్రగతిపథమ్మున పదండిరా
అంతరాలు అక్రమాలు, అసలులేని నాకానికి
ఆనందము నిండియున్న అక్షయ మగు లోకానికి - 3
ప్రజల ప్రగతి కుపకరించు, పాట మనం పాడుదాం - 6
సోమరిగా మనుటకంటె మృతి చెందుట మేలందును- 11
బాలనీతి ప్రబోధ గేయాలతో పాటుగా ఈ సంపుటిలో జాతి ప్రబోధ యువగీతాలు సైతమ్మువి
ధర్మదేశం మనది యనుచును మురిసిపోయే తమ్ముడా!
దోపిడీలు సాగు దేశం ధర్మ దేశం యెట్లరా?
సమత లేని సమాజాన నివసించే తమ్ముడా!
అంతరాలను రూపుమాపగ ఉద్యమించర తమ్ముడా! - 12

లెమ్మ్మ లెమ్మ్మ సోదరా -9, కష్టాలకు కన్నీళ్లకు కారణాలు తెలుసుకొని అజ్ఞానం పిరికితనంవదలి తరతరాల అంతరాలు తొలగించి సమత సాధించడానికి, సాగుమన్నారు

ఎత్తండీ జెండా - 5, ఎందుకు శ్రమజీవులకే సంపద చెందాలని దోపిడీదారులు ధర్మంతో నడవాలని చెప్పటానికి శ్రమజీవుల విజయ సాధనకు మార్గంగా సుమతి పద్యభావంలో 'పాము చీమల' పద్య కథను గేయంగా మార్చి చూపారు

2 ప్రగతిపాటలు ఇరవై రెండు

బండగా బతకడం కంటె ఉలి దెబ్బలు సహించి శిల్పంగా మారటం గొప్ప - 11, చదువు గొప్పదా? ధనము గొప్పదా? - 19 లో, నచోరహార్యం - భర్తృహరి శ్లోక భావాన్ని సమర్థించారు
మేలు కొమ్ము, మేలు కొమ్ము, స్వార్థ బుద్ధి వదలుకొమ్ము
అంతరాలు వదలు కొమ్ము, ప్రేమించుట నేర్చుకొమ్ము - ఇదీ పాట నడక
3 రవి బింబం - 34 పుటలు
కలకాలం నిలుచునట్టి, కవిత వ్రాయదలచినాను కరినాత్ములగుండెలలో, కరుణ పెంచ దలచినాను 5
యువతరం నవతరం - ఈ దేశపు సంపత్తు - 17, ఏ పాట రాసినా మీకోసమే - 33
ఇందులో ఎలుక, బాలలం, మనజెండా, వందనం బాలగీతాలు

తాగొద్దు, మగువలం యువగీతాలు వసంతం, వర్షాకాలం ప్రకృతి వర్ణనలు ఆంగ్లానువాద గేయాలు నాలుగు ఉన్నాయి రేగులపాటి వారివి ప్రగతిశీల భావాలు ఈ మూడు సంపుటాలలోనూ బాలగేయాలున్నాయి కవి వీటిని బాలసాహిత్యం అనలేదు కొన్ని పాటల భావాలు యువచైతన్యానివి - వేరువేరుగా కూర్చితే ఇవి బాలగేయాలు, యువగీతాలు అని స్పష్టంగా రెండు సంపుటాలయ్యేవి సామ్యవాద ఆదర్శ భావాలను అభిమానించే కవి రేగులపాటికిషన్‌రావు గారు

## 13 ఎస్ కె పిళ్ళై - కరీంనగర్

కీ శే సందినేని కొమురయ్య పిళ్లై గారు (అధ్యాపకులు - ఉద్యోగ విరమణానంతరం 1993లోకీర్తి శేషులు) తెలంగాణా నిజాం వ్యతిరేక పోరాట కాలం నాటి రైతాంగ పోరాట పటిమకు, తర్వాతి శ్రామిక జన విముక్తి ఉద్యమ సామ్యవాద భావాలు మేళవించి జీవితం చివరి వరకు తమ సమతా కవితా మార్గాన్ని వదలలేదు

పిళ్ళే కమ్యూనిస్టు వచన కవితలు పాటలు పద్యాలు వ్రాశారు వీరి కవితలు పాటలుగానే ఉంటాయి పిళ్ళే గారు స్వయంగా పాడేవారు పాటలను అభిమానిస్తారు కాబట్టిపాటలనే ఎక్కువగా రచించారు వీరి మొదటి రెండు పుస్తకాల్లోనూ పాటల పోలిన గేయాలున్నాయి

1982లో వెలువరించిన భుజం భుజం కలిపి మాత్రం సంపూర్ణ గేయకృతి ఇది 46 పుటలు 29 పాటలు కలది

భుజం భుజం కలిపి నడు, గళం గళం కలిపి పాడు

ఈ పీడిత జన సౌఖ్యం సాధించుటె మన ధ్యేయం - 1

ఏదిరా భూమీ దున్నేవాడికే లేదురా భూమీ - 2

అంబలంత చేదాయెనా 3 గేయంలో పాలేరు పాట్లు వర్ణించారు

ఏం బతుకు బతికేది 5 కూలీ స్త్రీల బాధల వర్ణన, అప్పు తీర్చే మార్గమేదిరా - 9, పేదరైతుల యిక్కట్లు ఓట్ల పండుగ - 10, 11, మన ప్రజాస్వామ్యం విమర్శ, రివిజనిజం 12, తగదని పార్టీకి హెచ్చరిక

సామాజిక పరిస్థితులకు తీవ్ర ప్రతిస్పందన సామ్యవాద పాలన కోసం నిరీక్షణ, జన ఐక్యత - పోరాటాల కోసం ఉద్బోధ పిళ్లెగారి గేయాల ఆంతర్యం వీరు పల్లెలను ప్రేమించారు మహిళాభ్యుదయాన్ని కోరుకున్నారు శ్రామిక జనపక్షంగా తమ కలం నడిపించారు

ఇందలి 'గుగుమ్మడీ' 'సిరిమల్లె' చెట్టుకింద, 'చందమామ' జానపద గేయాలు అవి పేద రైతుల అప్పుల బాధను ఆడవారి అగచాట్లను మన ప్రజాస్వామ్యంఉత్తబూటకమని వివరించాయి

వీరి గేయాలపై శ్రీశ్రీ మహాప్రస్థాన గీతాల ముద్ర ఉంది ఇంకా జానపద పదాల ప్రభావం ఉంది కవి ధ్యేయం స్పష్టం

## 14 కొత్త రాజిరెడ్డి - సైదాపూర్

కొత్త రాజిరెడ్డి గారి స్వగ్రామం హుజూరాబాద్ తాలూకాలోని వెన్కపల్లి సైదాపురం వీరు రాజకీయ నాయకులు - ప్రజా కవి వీరు 62 వ ఏట 1985 సుమారుగా కీర్తిశేషులైనారు రెడ్డి గారు మొదట కాంగ్రెస్ అభిమాని 'ఇందిరా విజయం' బుర్రకథను రచించి పి వి నరసింహారావు గారికి ముఖ్యమంత్రిగా ఉన్నకాలంలో వారి స్వగ్రామమైన వంగరలో అంకితమిచ్చారు

ఆ తర్వాత తెలుగు దేశం పార్టీలో చేరి ఎం ఎల్ ఏ గా గెలుపొంది ఆ పార్టీ అభిమానంతో 'రాజన్నరాగాలు' అనే పేరుతో ఓ పాటల సంపుటిని రాసి, ముద్రించి తెలుగు దేశం 'విశాఖ' మహానాడు సభలో (1984) అప్పటి ముఖ్యమంత్రి ఎన్ టి రామారావు గారికి అంకితమిచ్చారు ఇవి తెలుగు దేశం పార్టీ సిద్ధాంతాల ప్రచార గేయాలు ఆ పార్టీఅధినేత ఎన్ టి ఆర్ సుగుణ సంపత్తిని అభివర్ణించిన గేయాలు కూడా కొన్ని ఇందులో ఉన్నాయి

ఇతర సందర్భాల్లో ప్రజా సమస్యలకు స్పందించి వీరు వ్రాసిన పాటలు జనంలో చాల వ్యాప్తి పొందాయి అవి వీరికి ప్రజాకవిగా పేరు తెచ్చాయి 'బండెనుక బండి కట్టి' పాట శైలిలో

'బస్సెనుక బస్సువచ్చె పదహారు బస్సులొచ్చె, ఏబస్సుల వత్తువ్ కొడుకో అని వీరు ఆర్ టి సి వారు పల్లెలకు నడిపించిన డొక్కు బస్సులను వర్ణిస్తూ వ్రాసిన వ్యంగ్య గేయాన్ని ఆ ప్రాంతం వారు ఇప్పటికీ పాడుకుంటారు

## 15 శేషం సుప్రసన్నాచార్యులు - హుస్నాబాద్

సుప్రసన్నాచార్యులు హుస్నాబాద్, వాస్తవ్యులు వీరు రేడియో అక్కయ్య తురగాజానికీ రాణి గారికి అంకితమిస్తూ రాగఝరి అను లలితగేయ సంపుటాన్ని 1986లో ప్రచురించారు

ఈపుస్తకం కవర్ వెనుక వైపు అముద్రిత పుస్తకాల పేర్లు చూపించారు కాని, ఎక్కడా కవి వయస్సు, చదువు మొ॥ వివరాలేవీ లేవు ఈ పాటలను సవరించి పీఠిక సమకూర్చిన ప్రముఖ కవి వేముగంటి నరసింహాచార్యులు సిద్ధిపేట గారు "సుప్రసన్నాచార్యులు యువకుడు, నవభావ ప్రవణుడైన భావుకుడు" అన్నారు అది పదేండ్ల క్రితపు మాట ఇప్పుడు కవి ముప్పదేండ్లు దాటిన వయసు వారై ఉంటారు ఈ కవి ఎం ఏ ఉత్తీర్ణులై అధ్యాపకులుగా పనిచేస్తున్నారని వినికిడి

రాగఝరి 21 పాటల సంపుటి ఇందలి గేయాలు నాలుగైదు ఆకాశవాణి హైద్రాబాద్‌వారి బాలానందంలో ముద్రణకు ముందే ప్రసారమైనట్లు తెలిపారు మాజీ ఎం ఎల్ ఏ బి లక్ష్మీకాంతారావు గారు ఈ పుస్తక సందేశంలో "దైవ భక్తి కంటె దేశభక్తి కంటే ప్రబోధం గొప్పది ఈ మూడింటినీ ఈ గేయాల్లో రంగరించి ప్రపంచానికిఅందివ్వడానికి ఆచార్యులు గారు ప్రయత్నించడం ఎంతైనా ముదావహం" అన్నారు

ఇందులో సరస్వతీస్తుతి గీతాలు మూడున్నాయి దేశభక్తిగీతం మాజాతిపాట, భరతమాతకు వందనం, నవగీతం, సంక్రాంతి, విజయదశిమి, శ్రమగీతం, అల్లూరి, మొ॥ పాటలున్నాయి

నమో నమో భారత మాత, సుందర భాగ్య విధాత -పు 11

శ్రీవాణి!మధుర సుధా స్వర వీణాపాణీ, రాగ రసాన్విత కల్యాణీ - పు 4

బాలలం భావి భారత పౌరులం కల్లా కపటం యెరుగని బాలలం - 13

ఇటువంటివి ఇందలి పాటల పల్లవులు

నవగీతం 10లో కులమతాలనిరసించారు ప్రబోధగీతం - 7లో 'ఎవరికేమౌతావు, చివరికేమౌతావు, నీ ఆత్మనడిగి తెలుసుకో జీవాత్మతో చర్చించుకో' అని వేదాంతంతో ఆరంభించి 'మద్యపాన నిషేధపు లోకాంత విషయంతో ముగించారు దైవభక్తి - దేశ భక్తి రసాన్ని పౌరులకు భావి పౌరులకు త్రాగించే ప్రయత్నం ఈ 'రాగఝరి'

కవి కవన శక్తిని ప్రశంసిస్తూనే జానకీరాణి గారు చేసిన సూచన ప్రతి లలితగేయకవీ గమనించ తగినది అది ఇది - "గేయ కవితలను సంగీత పరచడానికి అవసరమైన కొన్ని ముఖ్యాంశాలను రచయిత సంగీతజ్ఞుల నుండి తెలుసుకుంటే మంచిది చరణాల నిడివి, సమాసాల విరుపులు, సౌలభ్యంతో గాయకులు పదాలు పలకడానికి అనువైన లక్షణాలు వీరు తెలుసుకుంటే మున్ముందు రచనలకు ఉపకరించగలవు "

## 16 సుద్దాల అశోక్ - ఎం ఏ మేడిపల్లి మెట్టుపల్లి

అశోక్ (అశోక్ తేజ) గారి జన్మస్థలం భువనగిరి ప్రజాకవి సుద్దాల హన్మంతు గారు వీరికి తండ్రి ఉద్యోగ కారణంగా కరీంనగర్ వచ్చి మేడిపల్లిలో స్థిరపడ్డారు మెట్టుపల్లి మండలంలో అధ్యాపకులుగా ఉద్యోగంలో ఉన్నారు అశోక్ గారు ఉత్సాహం కలిగిన కవి - రచయిత గాయకుడు - నటుడు ప్రస్తుతం సినీరంగంలో గేయకవిగా రాణిస్తున్నారు (జూన్ ఈనాడు ఇంటర్వ్యూలో కరీంనగర్ పేరు తేలేదు వీరు కాని తర్వాతి సినీ పత్రికలో మెట్టుపల్లిని స్మరించారు )

వీరి 'బతుకు పాటలు' 1989లో వెలువడింది ఈ కృతిని కవి తమ మిత్రుడు శ్రీ గాదె శంకరకవి గారికి అంకితమిచ్చారు ఇది 108 పుటల 57 పాటల అందమైన పుస్తకం టి వి సంగీత దర్శకులు టి ఆర్ జయదేవ్ గారి పీఠిక ఉంది "ఈ సంపుటిలో" నానాజాతి గీతాలు ఉండవచ్చు అవి నన్ను తెలిపేవి కావు - రేడియో టి వి ఇంకా కొన్ని అనుభూతుల కోసం వ్రాసినవి ఇందులో నేనేమిటో నా ధ్యేయమేమిటో తెలిపే బతుకు పాటలూవున్నాయ్" అని కవి గారి ముందు మాట - కానీ, అవి ఏవో గుర్తించడం కష్టం ఈ గేయాల విషయ సూచికలో వాటి రచనా తేదీలు సైతం వ్రాశారు

టపటప మను చెమటబొట్లు, తాళాలై పడుతుంటే

కరిగి కండరాల నరాలే, స్వరాలు కడుతుంటే -పు 1



పాట పనితోపాటే పుట్టింది - పనితోపాటే జతకట్టింది
వీరికి శ్రమ జీవులపై జానపద కవితలపై అభిమానం ఉంది
'నాదేశం పూల కడలి నాహృదయం పాల కడలి
నా వేదం నా వాదం విశ్వమానవీయపథం''- 3
నరులను హీనులుగ దలచు దొరతనం సమాధిపైన
సాంఘిక భేదాలు లేని సంఘమును ప్రతిష్ట చేయ
కులమేరా మన చీడ - మతమేరా మనపీడ -5, అన్నారు

గూండాలచూసి జెండా జ్వలిస్తున్నది - 7, ప్రజాస్వామ్యం దుస్థితి - 12 -13 జనం సోకులపోకిరి కోతి తనాలు - 26 అడదాని పరిస్థితి - 28 నాజీల పోలిన నిజాముల తెల్లోని తెల్గు పాలనలోని తెలుగు గుడిసెల గోడు - 32, 35 ఈ బతుకు పాటలు ఇందులో కొన్ని శృంగార ప్రకృతి సంబంధ లలిత గేయాలు ఉన్నాయి సంఘ సంస్కర్తల, విప్లవకవుల రచయిత తలచే గేయం పెద్దవి శరత్, భగత్ అంబేద్కర్ గురజాడ దేవులపల్లి, శ్రీశ్రీ, చలంలను స్మరించారు, పేర్లులేకున్నా

నేను శాంతి దేవత గుడిలోన వెలుగు దీపాన్ని, విశ్వవీధి అంచుల్లోవిహరించే పావురాన్ని
పాట నా ప్రాణం పాట నా ధ్యానం, బ్రతుకు గాయాలను తెలుపు నాగానం - 90

అన్నారు అశోక్ గారు ఆధునిక లలిత వాగ్గేయకారులు మూడేండ్ల కాలంలో 30 40 సినీగేయాలు రాసి ముందుకు దూసుకు పోతున్నారు అశోక్ తేజగారు తథాస్తు! విజయోస్తు!!

## 17 గుండేటి రమేశ్ - చామన్‌పల్లి

జి రమేశ్ గారు ఉత్సాహంకల యువకవి ఓ భజన పాటల, సంపుటిని వెలువరించిన అనంతరం తమ లలిత గీతాలను యువశక్తి పేరుతో ఓ పుస్తకంగా 1989లో ప్రచురించారు ఇది 40 పాటలు - 22 పుటలు శ్రీ పరమహంస సచ్చిదానంద అవధూత, శ్రీ శబరీమాతాజీ ఆశీస్సులతో వచ్చిన ఈ చిన్నపాటల పేటిక స్వరాల గూర్చి కవి 'చిన్నమాట' లో ''సాంఘిక ఔన్నత్యం కోసం సమసమాజ నిర్మాణం కోసం నేనీపాటలు వ్రాయటం జరిగింది ' అన్నారు భావాల బాట ఇది

భరత మాతా వందనం జయ, ధరపునీతా వందనం
కరుణ జూపి వరములొసగే, పరమపావని వందనం మొ గే
భరతమాత పిలిచిందని యువశక్తిని నవశక్తిగా లేచి రమ్మన్నారు
వివేకానంద, అంబేద్కర్, నేతాజీ, ఇందిరమ్మలపై గేయాలున్నాయి

పేదలకు సహకరించాలని (7) మూఢనమ్మకాలనుండి, మేలుకొండని (8) భూస్వాముల ఆగడాలు అంతం చేయాలని (13) సంఘ విద్రోహుల వధించాలని (18) రకరకాల పోకడలతో సాగిన ఈ యువ శక్తి పాటలు ఈనాటి కవితా నదీ ప్రవాహానికి సెలయేరులు రమేశ్ గారి 'విద్యార్థి గీతాలు 1992 లోనూ కొన్నిలలిత గేయాలున్నవి ఆ తర్వాత ఆరుద్ర గారి కూనలమ్మ పదాల అనుసరణలో 'ఓ భాగ్యలక్ష్మి' మకుట గేయాలతో మరో పుస్తకం రచించారు రమేశ్‌గారు నిత్యోత్సాహ గేయకవి

సినీ పాటలముద్రలో వందేసి గేయాల సంపుటాలు అందమైన గెటప్‌లో ఈ మధ్య మరి రెండు వెలువడ్డాయి అవి - 1 అభ్యుదయ వర్షిణి - 1995, 2 ప్రియ వసంతం- 1996

## 18 అల్లం నారాయణ - ఎం.ఏ గాజులపల్లె - తా మంథని

అల్లం నారాయణ గారు విద్యార్థి కాలం నుండి సామ్యవాద ఉద్యమ రాజకీయాల్లో ఉత్సాహంగా పాల్గొన్న వ్యక్తి వీరికి తిరుగుబాటు పాటలు వ్రాయడం పాడటం అంటే ఇష్టం

కొన్నాళ్ళు విరసం సభ్యులు 'జీవగడ్డ' కరీంనగర్ దినపత్రికకు విలేఖరిగా పనిచేశారు 'ఆంధ్రజ్యోతి హైదరాబాద్ ప్రచురణాలయంలో సీనియర్ సబ్ఎడిటర్‌గా పనిచేస్తున్నారు

నారాయణ గారి కవితలు 1990లో జగిత్యాల పల్లె పాటలు, పేర ఓ సంపుటిగా ముద్రణ పొందాయి దీనిలో కొన్ని వచన కవితలు మరికొన్ని జానపద బాణీల ఉద్యమ గీతాలు ఉన్నాయి ఇటీవలి కాలంలో ఇంత స్పష్టంగా సామ్యవాద భావ పోరాట గీతాలు రాలేదు కవి వీటిని సజీవ విషయాలతో మాండలిక భాషలో వ్రాశారు ఎంత ప్రయత్నించినా పుస్తకం లభించలేదు

'జగిత్యాల పల్లె' సంపుటిలోని ఓ పాట 'ఎర్రసైన్యం' సినిమాలో 1994 ఉంది - చూడండి
పల్లెలెట్లా కదులుతున్నయంటే అరెవవ్వర వవ్వ
సిరిసిల్ల జగిత్యాల చిన్నమెట్టుపల్లి, మద్దునూరు లొద్దునూరు పండితవురము
పడిగిపల్లి గాసిల్ల వరంలో ॥పల్లె॥ (గాసిల్లవరం గాయిల్ల పురం?)
ఒకపల్లె వెంట పది పల్లెలు కదిలె, పల్లెలు రగిలి జిల్లాలు మండె
జిల్లల్లోన పల్లెల్లోన రాజుల నాటి రాపిడీలలో
పీకలు తీసే చీకటులాను, పరచుకున్న ఆ పరికికంపలో
ఏరి వేయగా కూల్చి వేయగా, ఎదరు నిలిచి పోరాడి గెలువగా
జగిత్యాలలో జగిత్యాల జేగంటలు మ్రోగె, లొత్తునూరు జనమెత్తిరి పిడికిలి
గాలికి పోయే గడ్డి పరకలే గడ్డపారలై తిరుగబడ్డయి ॥పల్లె॥
దళం దళముగా గళం విప్పుతు, పదం పదంగా కదం తొక్కుతు
ఎత్తు కొండలెగ వాకి యెక్కుతూ, పొంగె యేరు పదిలంగ దాటుతు
విషం దోమలు మెదడును తిన్న, మంచులొ చలికి ఎముకలు కొరికిన
ఎండకు యెండి - వానకు తడిసి, తిండిలేక మరి నిద్దుర రాక
అడుగు అడుగునా నెత్తుటి మడుగు, హరోంహర అని ముందుకు ఉరికి
తరాల దోపిడి సహించబోమని, సమైక్య విప్లవ శంఖమూదిరి ॥పల్లె॥

నారాయణ గారి పాటలకు పార్టీ సాహిత్యంలోప్రముఖ స్థానముంది వీరి కొన్ని స్కెచ్‌లు కూడా పత్రికలలో వచ్చాయి

## 19 డా॥ వడ్లూరి ఆంజనేయ రాజు

ఆంజనేయరాజుగారిది కరీంనగర్ జిల్లాలోని కోనేరుపల్లి హైదరాబాదులో తెలుగు అధ్యాపకులుగా ఉద్యోగం సంప్రదాయ కుటుంబంలో పుట్టి, సంస్కృతాంధ్ర సాహిత్యాలను చదివిన వి ఏ రాజుగారిది సంప్రదాయ దృష్టి వీరు పద్య గేయకవి రెండు శతకాలు రచించారు

వీరి లలితగేయ సంపుటి "మధుమురళి" 1990లో ముద్రితం ఇందులో పుటకొక్కటిగా 48 పాటలున్నాయి ఇవి భక్తిపాటలు అందులో కృష్ణ భక్తి గీతాలెక్కువ మరికొన్ని ప్రణయగీతాలు సామాజికమైనవి తక్కువ

కలలోన నా దేవి కనిపించినావే - పు 7, తలపులన్ని నీకై తెరచి ఉంచినాను - పు 36 మొ॥వి సినిమా పాటలను అనుకరించాయి

ఏమని పాడుదురా - గోపాలా - 15, రాడాయేనే మదనుడు - అబ్బ రాడాయేనే - 17
రారా ప్రియా సుందరా వేగి - రారా - 24, శృంగారమే ప్రాణము - 32 - ఇవి జావళీలు
బాల గోపాలుడమ్మా - యీ బిడ్డ లీలావినోదుడమ్మా - 48 (లాలి పాట!)

పడిచేయకే గాలి - 21, పాడవే గొంతెత్తి పాడవే కోయిలా -1 ఇవి మరికొన్ని రేడియోలలిత గీతాల స్మృతికి తెస్తాయి

మిగితా వాటిలో కొన్ని దేశభక్తి ప్రబోధాలు, మిగితావి ప్రణయ భావాలవి

ఈ లలిత గేయ సంపుటి డా ఆచార్య నాయనికృష్ణ కుమారి ఆచార్య ఎస్వీ రామారావు, డా వి సీతా కళ్యాణి, ఉస్మానియా తెలుగుశాఖ ప్రొఫెసర్ల రీడర్ల ప్రశంసావాక్యాలతో వెలువడింది ఇది చూస్తే మన విశ్వవిద్యాలయాలు పవిత్ర దేవాలయాలవలె భాషనే కాకభక్తినీ ఎంత అనురక్తిలో ప్రోత్సహిస్తున్నారో తెలుస్తుంది - సంతోషం!

ఆంజనేయ రాజుగారి ఆశయం ఇది - పు 33

అలనాటి వేదాలు - తొలినాటి వాదాలు (నాదాలు?)

విలయమై పోనీకుమా ప్రళయమే ఎదురౌ సుమా! పరమేశుడున్నాడు (మొ చరణం) జగదీశుపదసేవ (రె చ) పరమేశు పద పూజలో (మూ చ) సర్వస్వం అర్పించుకోవాలి

## 20 టి వి సాల్మన్ రాజు, బి ఏ కరీంనగర్ - హాస్టల్‌వార్డెన్ జ 19-6-59

సాల్మన్ గారు సంగీతం తెలిసిన వ్యక్తి, బుల్‌బుల్ సితార్, హార్మోనియం, తబలా, కాషియో వంటి పలు వాద్యాలు చక్కగా వాయించే నేర్పు ఉంది పాశ్చాత్య సంగీతంతో పాటు ప్రాచ్య హిందూస్థానీ - కర్ణాటక సంగీతాలు నేర్చుకున్నారు పుట్టిన మత హిత పథంలో ఈ కవి రచించిన ఏసుభక్తి గీతాల సంపుటి 'నవ్యకాంతి రేఖలు 1991 లో వెలువడింది ఇది 32 పాటల పుస్తకం

ఎప్పుడో 50-60 ఏండ్ల క్రితంరచించిన - 1985లో వెలువడిన ఈ జిల్లా తమ్మడిసైమన్ గారి క్రీస్తు భక్తిగీతములు' పాత బాణీ పాటలది ఈ నవ్యకాంతి రేఖలు కొత్త బాణీ పాటలు ఇది క్రైస్తవ గీతాల్లో ఒక మలుపు, ఇందలి ప్రభుభక్తి గీతాలు సాంప్రదాయిక ప్రీతిలో వ్రాసినవి ఆయా సందర్భాల్లో మిత్రులకు వ్రాసిన అభినందన గేయాలు లలిత గీతాలుగా ప్రత్యేకంగా చెప్పుకోదగినవి ఈ కవి భక్తి భావాలు ఇట్లున్నాయి

అపరంజని నే నర్పింతు దేవా అవని జనించిన రాజా - పు 11

కలిసి పాడుదాం యేసు జననము, కలిసి చాటుదాం యేసు నామము - 13

అంజలిదో అందుకో అబ్రహాము దేవా, సుమాంజలిదే స్వీకరించు ఇశ్రాయేలుదేవా

గమ పని - పమగ - గమపమ గా

సగమప - గమపని - మంనిని సా 15



అభినందన గీతాలు -

మురిపించే పందిరిలో పులకించే సందడిలో,

ముద్దుగ మీకిద్దరికి మనువాయె

హద్దులేక ఆ ప్రభుని నుతించ మనసాయె,

మాకు మనసాయె - మనకు మనసాయె - 28

ఓ మా ప్రియతమసౌందర్య సంఘమా!

అందుకొనుమా అందుకొనుమా, ఈ నూతనవత్సర శుభాకాంక్షలూ 36

## 21 డా॥ తిరుమల శ్రీనివాసాచార్యులు - నారాయణపురం

డా టి శ్రీనివాసాచార్యులు పద్యగేయ ఖండకావ్యాలు, గజల్లు ముక్తక గేయాలు,వ్యాసాలు - సమీక్షలు మాత్రమే కాక లలిత గీతాలను సైతం రచించారు వీరి లలితాగీతికా సంపుటి, 'గంగా తరంగాలు' 1992లో వెలువడింది ఇందులో సలక్షణంగా 108 పాటలున్నాయి

రాగ తాళాలు సూచించకున్నా ఈ గేయాలన్నీ శ్రుతిలయబద్ధంగా పల్లవి అనుపల్లవి చరణాలతో చక్కగా ఉన్నాయి డా॥ సి నా రె, డా॥ బోయి భీమన్న, డా॥ కరుణశ్రీ డా॥ జి వి సుబ్రహ్మణ్యం, కె వి రాఘవాచార్య, డా॥ ఎస్ వి రామారావు, ఉత్పల సత్యనారాయణచార్య, పాలగుమ్మి విశ్వనాథం, కె వి గోపాలం గారల పీఠికలతో సినీ దర్శకులు కె విశ్వనాథ్ గారికి అంకితంగా ఈకృతిని హైదరాబాద్ యువ భారతివారు ప్రచురించారు ఈ గేయాల్లో దైవభక్తి కళాసక్తి, నీతి - సాహిత్య ప్రీతి దోబూచూలాడుతున్నవి మొదటి గేయమిది

అభినందనం ఓ అమర తరంగిణి - అభివందనం ఓ అఖిల నదీ మణి॥
పాతక హారిణి భీతి నివారిణి పావన జీవనదాయిని
స్వర్గ విహారిణి భూ సంచారిణి పాతాళాంతర గామిని

సాంప్రదాయక పద్ధతిలోనే భాగీరథీనదీ వర్ణన కావించి భక్తిని చాటుకున్నా ఇందులోని పరోపకార గుణ ప్రశంస కవి సామాజిక దృష్టికి జనహితాకాంక్షకు నిదర్శనం

రెండవ గేయంలో స్వాగతం చెప్పినది ఎవరికో చూడండి

చ 2 యువ చేతనతో నవ భావనతో, శివ సుందరమౌ కళాలయంలో
ఉషస్సుకోసం తపస్సు చేసే, కృషి భాసురులకు రస సాధకులకు
స్వాగతం - సుమ స్వాగతం

మూడవ గేయం 'అంజలి - కుసుమాంజలి' రమ్య సృష్టికావించే లలిత కళా స్రష్టలకు నాలుగవది 'భారతమాత నుతి కొత్త పాతల మేలుకలయిక

చ 4 ధర్మకర్మ దీక్షా స్వేచ్ఛా మయ - దేశ భక్తి వరశోభితా
సత్యాహింసాశాంతి దయారతి - మానవతా సమన్వితా
భారతమాతా - సుత చరితా - వీర ధీర సముపేతా!

ఈ కవి గారికి దేశభక్తి అపారం

బంగారు కోశం ఇదేనా రంగారు దేశం ఇదేనా - గే
శ్రీ కరమగు భారతమిది శ్రీలుపండు నిలయమిది గే 5

జాతీయ సమైక్యతను ఆకాంక్షించారు

మతాలన్ని ఈ భారత మందిరమ్ములో, మణిదీపాలై వెల్గును మంజులమ్ము గా - గే 10
గగనంలా మన దేశం ఎంతో విపులం, కావాలి జన హృదయం మరీ విశాలం - గే 11

మత కల్లోలాలకు వ్యథ చెందారు జనం నీతిమాలిన వ్యవహారాలకు కవి ఆవేదన ఇది

ఏమౌతుంది ఈ దేశం - ఎటు పోతుంది మనదేశం
ఎక్కడ దాగెను సమైక్య భారత వీర జాతి సందేశం
చ 1 తోటి సోదరుల అనుబంధాలు తూటాలకు బలి అయితే
మత ద్వేషాగ్ని కీలల్లో బడి మల్లెలు మసి అయితే
చ 2 సరదాగా మన మంత్రివర్యులే బురద చిమ్ముకుంటె
పత్రికలన్నీ ఆ పన్నీటిని ప్రజలకు పంచేస్తే
చ 3 జ్ఞానామృతమును పంచే గురువును బానిస అంటుంటే
వీధులలోని దుమ్మంతా మన విద్యలముంచేస్తే
చ 4 కళల పేరుతో ఆడపడుచులను కాసుకు బలిచేస్తే
పచ్చి బూతులూ పిచ్చి కూతలూ విచ్చలవిడి అయితే

అందుకే తర్వాతి గేయంలో ఇలా హితవునందించారు

ఇంటిని వెలిగించాలి - ఈ - మంటిని వెలిగించాలి

ఇంటిని మంటిని రెంటిని చూసే - కంటిని సవరించాలి నీకంటిని గే 14

ఇల్లు తాను, మన్ను జనం, కన్ను ధర్మం దైవం ధ్వని గర్భితం ఈ గేయం,

ఈ సంపుటిలో సామాజిక ప్రయోజన గేయాలూ ఎక్కువే

కట్నాలెందుకురా వర కట్నాలెందుకు రా? గే 27

తాగితే తప్పవుతుంది - మద్యం, తాగితే ముప్పవుతుంది గే 28

పువ్వులు రెండు కొమ్మకు అందం పాపలిద్దరూ

గుండెలలో అక్షర దీపం నిలవండి - గే 30

వేదాంత దృష్టి ఉంది కొన్ని పాటల్లో -

మెచ్చుకో మెచ్చుకో మంచి తనం - ఇచ్చిపో ఇచ్చిపో ఉన్న ధనం

ఎన్నాళ్లీ తనువుపై వ్యామోహం - ఇప్పుడైనా కోరుకో కీర్తి దేహం

ఈ సంపుటిలో చివర ప్రణయం పేర 10 శృంగార గీతాలు పరమార్థం పేరుతో 9 భక్తి పాటలున్నాయి

కలలేకోరుకుంటాను ఆ కలలనే చేరుకుంటాను - 49

తిమిరానికి నేనురిని - దీపానికి ఊపిరిని - 50

అంటూ ఈ కవి 'ప్రభూనీ నీడలోనే ఉన్నానురా' అని దేవదేవునిస్మరణలోఈ కావ్యాన్ని ముగించారు భక్తి రక్తి భావాల మిశ్రమం శ్రీనివాసాచార్య గారి గంగా గానతరంగం

## 22 రాస భూమయ్య, బి ఏ ఎకిన్‌పూర్ మం కోరుట్ల

రాస భూమయ్య గారు స్వగ్రామంలో ఒక ప్రైవేటు పాఠశాలను నిర్వహిస్తూ సాహిత్య వ్యాసంగంతో కాలం గడుపుతున్నారు విద్య ఎవరి సొత్తు? అనే నాటిక రచించి ప్రచురించారు అక్షర ఉజ్వల కాలంలో వయోజన విద్యావ్యాప్తికి కొన్ని పాటలు రచించారు ఈయువ కవిది దళిత' దృక్పథం వీరి పాటలను అభ్యుదయ గీతాలు పేరుతో 1994లో ఒక పుస్తకంగా ప్రచురించుకున్నారు

ఆడదాన్నిరో నీతల్లినిరో - అనే స్త్రీల గేయంతో ఆరంభమైన 40 పుటల ఈ సంపుటిలో దళిత హరిజన అభ్యున్నతి కోరే గేయాలున్నాయి



దళిత వీర లేవరా నీ, జాతిని మేల్కొలుపురా

తర తరాల అస్పృశ్యతను అంతమొందించర

బోధించు సమీకరించు పోరుకిది మార్గమురా

అంబేద్కర్ సిద్ధాంతం - అదే నీకు ఊపిరిరా

ఎవడు వాడు ఎచటి వాడు - పూరి శంకరాచార్యుడు

పుడమితల్లి యందు చీడ - పురుగులా వెలిసెరా-

వేదాలు కావ్యాలు ఎవడు రచన చేసిండు

నాటి నుండి నేటి వరకు దళితునిదేరరచనరా -

ఈ కవికి భావతీవ్రత ఎక్కువ కవితా సాధన కొంత తక్కువ కటు సత్యాన్నైనా సున్నితంగా చెప్పవచ్చు కాని వీరికి ఉద్వేగం ఎక్కువ పై పాట విషయం వేరైనా బాణి అల్లూరి సీతారామరాజు సినిమాలోని శ్రీశ్రీ గేయం భరతవీరలేవరా అనేది స్పష్టం

ఈ కవి పార్టీ తత్వం తమకు లేదనే విషయాన్ని మాత్రం స్పష్టంగా చెప్పారు
మార్క్సిజం మాకు లేదు, కులం మతం అసలు లేదు
అంబేడ్కర్ ఇజం మాది, ఆశించిన సిద్ధాంతం - పు 16
ఈ సంపుటిలో అంబేడ్కర్ జీవిత కథా గేయం పెద్దది - 29 33
అక్కనేను చదువు కొంటనే అని వయోజన విద్యాగేయముంది - పు 36
అన్నపూర్ణవమ్మ నీవు దేశభక్తి గీతం, 38 వది
దళిత జాతి విముక్తికోసం వ్రాస్తున్న అభ్యుదయ కవి రాస భూమయ్య గారు

## 23 కొండబత్తిని రవీందర్ -బి ఏ , కోరుట్ల అధ్యాపకులు

రవీందర్ తండ్రి కొండబత్తిని గంగారాం గారు నిజామాబాద్ జిల్లాలో ఉపాధ్యాయులుగా పనిచేసి ఉద్యోగ విరమణానంతరం కోరుట్లలో ఉంటున్నారు గంగారాం గారు విద్యార్థుల కోసం చాల నీతి కథాగేయాలు రచించారు అవి ఆ ప్రాంతంలో చాలా వ్యాప్తి పొందాయి ఆయన కూర్చిన తెలుగు పర్యాయ పద నిఘంటువు' చాల ప్రయోజనకరమైనది అముద్రితంగా ఉంది

రవీందర్ సౌమ్యస్వభావి ఆదర్శం, సంప్రదాయం మేళవింపుగా కవితలు వెలయిస్తున్నారు జాతి నిన్ను చూచి సంతసించు అను మకుటంతో ఓ నీతి శతకం (అముద్రితం) రచించారు

సోపానం పేరుతో వీరి లలిత గీతాల సంపుటి 1996 మేలో వచ్చింది ఈ గ్రంథంలో 25 పాటలు 59 పుటల్లో అందంగా పొందుపరచబడ్డాయి



నా భారత దేశమా, తెలుగు పాట, దేశ రాష్ట్ర అభిమానాలవి ఓ రెండు ఏడు కొండలవాడి భక్తిని మిగతావి తనను తనకవితను తెలిపేవి, దేశ సమైక్యతను - ప్రగతిని ఆశించేవి ఓ రెండు మూడు విద్యార్థి గేయాలున్నవి

మత మౌఢ్యము (26 పుట) కులమత భేదాలెందుకు? (పు 19) అనే వీరు

'కులాలెన్ని ఉన్ననేమి కూడి ఉన్నఒక్కటిరా!
మతాలెన్ని ఉన్న నేమి మనుషులంతా ఒక్కటిరా!'' (21) అని సామరస్యాన్ని ప్రబోధించారు మతవాద శక్తులను మట్టిలో పాతాలనే (22) కవి ఆశయం శ్రమవిలువను గౌరవిస్తూ పేదవారిని ఆదరించే, అధికారుల దురంతాల సామాజిక అసమానతల వరకట్నాల నిరసించే ఈ కవి పల్లెల - రైతుల అభిమానించడం విశేషం సుగుణం!

పల్లె చల్లని తల్లి పిలిచింది - భవ్యబాటలు వేసి పిలిచింది
పల్లె పచ్చగ ఉంటె వెలుగంది పల్లెతోనే మిగుల సాగనంది - 7

రవీందర్‌గారు చెప్పేభావమేదైనా నిజాయితీగా చెప్పారు రచన సాఫీగా ఉంది ఈ గేయాలు గాన యోగ్యాలు

రవీందర్ కష్టజీవుల కన్నీరు తుడిచివేయడానికి పసిపాపల ఆకలిని పారద్రోలడానికి, దుండగుల తరుమడానికి, మత వాద శక్తులపాతడానికీ ఈ జగతి పరిణమించాలనీ, ఆ నూతన యుగం రావాలనితమ ఆశా హృదయాన్ని అభివ్యక్తం చేశారు - అని అభినందించారు డా తిరుమల శ్రీనివాసాచార్యగారు

## 24 కె రామలక్ష్మణ్ - జగిత్యాల వ 42 సం॥లు



'దళితపాటలు" - 1997 సెప్టెంబర్ కళ్ళేపల్లి రాంలక్ష్మణ్ జగిత్యాల మున్సిపల్ కార్యాలయంలో బిల్ కలెక్టర్‌గా ఉద్యోగం చేస్తున్నారు 'ఈ విద్యాలయాల్లో నేర్పబడుతున్నవి బానిస చదువులు" అనే వామపక్షభావ ప్రభావంతో ఇంటర్‌తో చదువాపి కొన్నాళ్ళు ఆ ఆశయాలతో గడిపారు తర్వాత జీవితంలో స్థిరపడ్డారు

రాం లక్ష్మణ్ పాటలు 'కరీంనగర్ జిల్లా ఆం ప్ర దళిత పాటలు సంకలన గ్రంధాల్లో వచ్చాయి ఆ సంపుటాలు వెలువరించిన బి ఎస్ రాములు గారి మార్గదర్శకత్వంలో రూపొందిన రాంలక్ష్మణ్ గారి ప్రస్తుత 'దళిత పాటలు' 70 పు సంపుటి ఇందులో 50 వరకు గేయాలున్నాయి బి ఎస్ గారి 18 పు పీఠికలో కవి ఎదిగిన తీరు ఈ పాటలు పుట్టిన సందర్భాలు జిల్లా అగ్రజాతి - అగ్రస్థాయి సీనియర్ కవులు జూనియర్‌లకు అంటే యువకవులకు ముఖ్యంగా దళిత బహుజనులకు చేయూతనిచ్చి పోత్సహించలేదని విమర్శించారు

రాంలక్ష్మణ్ పాటల్లో తీవ్రత ఎక్కువ కుల విమర్శలో మానవ జాతిని, చరిత్ర గమనాన్ని మూలంగా తీసుకోవడం కంటె ఎక్కువగా మన కల్పిత పురాణాలపై ఆధారపడ్డారు ఇది పాత పద్ధతి సంఘంలోని అధోజగత్సహోదరుల స్త్రీల వివిధ కష్టవృత్తుల దీనహీన జీవన దశల వివరిస్తూ వారికి ఓదార్పుగా ఈ పాటలు రాశారు ఇవి జనానికి జాగృతినే కాక ఉద్రేకాన్నీ రగించేలా ఉన్నాయి కవి 'దరకమే జిల్లా నాయకులు మాదిగ దండోరా' రాష్ట్రస్థాయి కార్యకర్త రామలక్ష్మణ్ కలానిది దళిత గళం ఆశించిన ఆశయ ప్రబోధమే కవి ధర్మం కదా!

## వివిధసంస్థలు - సంపాదకులు వెలువరించినవి కవితా సంకలనాలు

1 తరంగిణి - 1973 సంపాదకులు మలయశ్రీ, కరీంనగర్

2 బాలరసాలు 1975, సం - అందెవేంకటరాజము కోరుట్ల

3 పువ్వులు - 1979 సం ఆర్ బాలప్రసాద్ పెద్దపెల్లి

4 చైతన్యజ్యోతి - 1979 సం కేసరి శేషయ్య హుజూరాబాద్

5 వీణావాణి 1982 సం యామునాచార్యులు వీణవంక,

6 జనహిత - 1983 సం - ఎస్ కె పిళ్ళె, కరీంనగర్,

7 పరిమళిత కుసుమాలు - 1986, సం- ఎన్ జగన్మాధవరావు బోయినపల్లి

8 చిరుతరగలు - 1985 సం- రామభోజ, కరీంనగర్,

9 ఉదయకిరణాలు - 1990 సం- గోదావరి ఖని

ఇవి కేవలం కవితా సంకలనాలు తరంగణిలో పద్యశీర్షికలు తొలి తరగలుగాను గేయ శీర్షికలు మలితరగలుగానూ రెండు విభాగాలు బాలరసాలులో పద్య గేయ కవితలు కలగలుపుగా ఉన్నాయి మిగితా సంకలనాలన్నీ కేవలం వచన గేయ కవితలవి ఈ సంకలనాలలో స్వీయ కవితా పుస్తకాలు ప్రచురించుకున్న వారిని వదిలినా, కొత్త కవులు వంద వరకున్నారు

సాహితీ సంచికలు, సాహిత్య పత్రికలు, సమాచార పత్రికలు కూడా కవితలను ప్రచురించాయి

ఈ జిల్లాలో ఏ మారుమూల ప్రాంతంలో కవి సమ్మేళనం - సాహిత్య సభ జరిగినా నవయువ కవులు పెద్ద సంఖ్యలో పాల్గొంటున్నారు రాష్ట్రంలోని వివిధ సాహిత్య సంస్థల పోటీలలో ఈ జిల్లా యువకవులు పాల్గొని పలువురు బహుమతులందుకుంటున్నారు

## ఇక్కడి సాహిత్య సంచికలు

సుమాంజలి 1969 కరీంనగర్, ఉదయ రేఖలు 1979 వేములవాడ, సమైక్యవాణి, 1990 కరీంనగర్, సాహిత్యగౌతమి 1994 కరీంనగర్, మొ॥వి

ఇవి కథలు, వ్యాసాల కంటె ఎక్కువగా ఈ జిల్లా కవుల కవితలను ప్రచురించాయి కరీంనగర్ జిల్లా సాహిత్య పత్రికలు - చైతన్యం, సారస్వత జ్యోతి, జయంతి, విద్యుల్లత, గౌతమి, సత్యార్థి, దిక్సూచి, కవితలను ప్రచురించాయి వీటిలో కొన్ని పద్య కవితలను కూడా ప్రచురించినా, కొన్ని గేయాలను మాత్రమే ప్రచురించాయి దిక్సూచి కేవలం వచన కవితా పత్రిక

ప్రతి ధ్వని, చిత్రిక, జీవగడ్డ, నవత, మానేరు టైమ్స్, అభినందన, జనవాణి, మంటలు, కోల్‌బెల్ట్ మొ॥ వార్తా పత్రికలు, పాఠశాలల కళాశాలల వార్షికోత్సవ సంచికలు, ప్రముఖ వ్యక్తుల సాహితీ వేత్తల, కవుల అభినందన - స్మారక, షష్టిపూర్తి సంచికలు ఇక్కడి వారి కవితలను ప్రచురించాయి ఇంకా, కరీంనగర్ జిల్లా సాహిత్య పుస్తకాలు రెండు మూడు వెలువడ్డాయి

1 బి వి రామారావు గారి "కరీంనగర్ మండల సంగ్రహ సాహిత్య చరిత్ర" - 1959 ఇందులో కవులపేర్లు తప్ప కవితలు లేవు "కరీంనగర్ జిల్లా కవుల పరిచయ గ్రంధం" మొ భా 1979, 81

2 మలయశ్రీగారి "కరీంనగర్ జిల్లా రచయితల చరిత్ర" - 1981, పు 320

ఈ జిల్లా సాహిత్యాన్ని పత్రికల్లో వ్యాసాలుగా ప్రచురించినవారు దూపాటి వేంకట రమణాచార్యులు, సి నారాయణరెడ్డి గారల సారస్వత జ్యోతివ్యాసాలు', వేముల ప్రభాకర్ గౌడు గారి 'జనధర్మ'లోని కవుల పరిచయాలు, జి రాంరెడ్డి గారి 'ఆంధ్రభూమి' వ్యాసం, బి వి రామారావు, గర్రెపల్లి సత్యనారాయణరాజు, కవి గణపతి రామచంద్రరావు గారల 'కరీంనగర్ మండల చరిత్ర' వ్యాసాలు, ముఖ్యంగా ఈ జిల్లా కవుల '1954 81' పేర్కొన్నాయి 1997 లో డా గోపు లింగారెడ్డి గారు ఆంధ్రప్రభ దినపత్రికలో 'మానేటి కెరటాలు' పేరుతో ఈ జిల్లా కళా - సాహిత్యరంగ ప్రముఖుల పరిచయం చేస్తున్నారు దిన పత్రికల ప్రత్యేక సంచికల విలేఖరులు కూడా కొంత వరకు రాశారు

ఈ మధ్య గేయకవుల రాశి వాసి గణనీయంగా పెరిగింది ఈ శతాబ్ది పూర్వార్థంలో పుట్టినా, ఉత్తరార్థంలోనే ఇక్కడి గేయకవిత - వచన కవితా వికాసం జరిగింది ఆరంభ కాలంలోనే ఇక్కడ గేయకవిత ఎంతటి భావవ్యంజకంగా రసరంజకంగా వచ్చిందో తెలుపడానికి కొన్ని ఉదాహరణలు ఇట చూపబడుతున్నవి

1954 ఫిబ్రవరి 12 'సారస్వతజ్యోతి త్రైమాసిక పత్రికలో - పు 78, సిహెచ్ చంద్రమౌళి, వేములవాడ గారి 'శిలకాంత' వచన కవితా భాగం,

'వడిగా, వడివడిగా, నడిసుడిలో, నుడి జడిలో,
పడిపోయిన, విడిపోయిన, చెడిపోయిన, నిబిడాటవి,
గుడిలోపల, పడిపోయిన, కళాకాంత, శిలావింత,
ఆకారం, భయంకరం, నిటారంగా, పటారంగా, నిలుచున్నది " ఇది శ్రీశ్రీ ముద్ర కలది
ఇదే సంచిక 8వ, పుటలో కనపర్తి గారి 'సామ్యపథం ఇది,
'అనంత తమచ్ఛాయలో, అనన్యప్రస్థానం చేస్తున్న
మనుష్య మేధా శకలం, జల విద్యుత్ ప్రవాహాల
వెలుగు జాడలను కాంచెను గాఢాంధకారాగ్నిని, కాంతి జలంచల్లార్చెను
మానవ రక్తం పీల్చుటే, పరమావధి యగు మనిషీ,
సంకుచితపు రంగుపొరల, చీల్చి వేసుకొని చూడు
ముందటి వలె నీవిప్పుడు, మోస పుచ్చి బ్రతుక లేవు "

ఇదే సంచిక 84వ పుటలోని వానమామలై జగన్నాథాచార్యుల 'రాముడెవరో రాకాసెవడో' గేయం వారి పద్యకావ్య పరిచయంలో చూపబడింది. 'సారస్వత జ్యోతి' ఆగస్టు 54 సంచికలో - జె. బాపురెడ్డి గారి 'భిన్నత్వం' కవిత, సి. నారాయణ రెడ్డి గారి 'విశ్వగీతి' గేయ కావ్య సమీక్షలు ఉన్నాయి. అవి గేయకవితలు. గూడూరి శంకరం - సిరిసిల్ల గారి ప్రతిన చూడండి.

''ధరాగోళ సమరాగ్నులు అనవరతం జ్వలిస్తుంటే
సత్యాగ్రహ మేఘాన్నై వర్షిస్తా ననలంనై ...'' పు. 33.

వేదాంతం కాశీనాథం - వేములవాడ గారు తీయగా జానపద గీతాన్ని ఆలపించారు - పు. 45

"ఎన్నెల్లో నాలచ్చి ఏటిదరి కూకుంటె/ నీటుగా జతగూడి నీటిలో దాగుంట.."

ఇది నండూరి వారి 'ఎంకి పాటల' ప్రభావ సంజనితం!

జి. వెంకటరెడ్డి - మూడేపల్లి గారు శ్రామిక్ జనం కోసం వ్యధార్త కవితలు వ్రాశారు.

జగత్తులో సగం జనం, అన్నార్తులు అభాగ్యులు/ హక్కులు సాధింపలేక, ఆకటి కాహుతియౌదురు
పస్తులుండి పై వారితో, కుస్తీ పట్టంగ లేక/ చస్తున్నది సగం జనం, కాటకాల దాటలేక
కర్తవ్యోన్ముఖులు కాక, అంధకార బంధాల్లో / బందీలై పోయారు...

సలక్షణ పద్యకవి నల్లాన్ చక్రవర్తుల వేదాంతాచార్య, మద్దికుంట గారి ఆత్మవ్యధా గేయం ఇది,

మద్భావ వీధిలో మలగి విశ్వము నెల్ల / సర్వ సమముగ జూచు స్వచ్ఛమౌ ప్రణయము
భిన్న వ్యాఖ్యల తోడ వెలయించ చక్ర వ/ ర్తులె గాని యొకరైన చూచిరా నా హృది,
మద్భావ మర్థమే గాకున్న మౌనమున / తుది ముట్ట గాంచకయె తొందరగ ఖండింత్రు
కా పుణ్య వాగగ్ని గాల్చగా దలచెదరు / ఎట్టి కుత్సిత భావులెటు సంస్కరణ గలుగు. పు. 62

సంస్కృత భాషా కవివర్యులు డా కె. రాజన్నశాస్త్రి (ధర్మపురి) రీడర్ -సికింద్రాబాద్ గారు తెలుగులో పద్యాల్నే కాక సామాజిక స్పృహకల నీతిప్రబోధ గేయాలు కూడా రచించారనడానికి నిదర్శనం ఈ క్రింది కవిత (బి.వి. రామారావు గారు వెలువరించిన 'క జి.కవుల పరిచయగ్రంథం' లోనిది. నం. 53) చూడండి.

ఇదియా భారత సంస్కృతి? ఇది యేనా నాగరికత?
స్వార్థమె పరమార్థమంచు, వంచనయే జీవికగా,
మనుగడ సాగించెడు, ఓ నరుడా - పరజీవితాపహరుడా!
తర తరాల జాతి చరిత తిరుగ వేసి చూడరాద,
త్యాగమె పరమార్థమ్మని స్వార్థమునే బలిసేసిన,
మహనీయుల నెందరినో కన్నది మన దేశమని,
తెలియలేవ? తెలియరాద! నరుడా - పరజీవితాపహరుడా!

ఆధునిక కాలంలో విషయ వైవిధ్యంతో ఈ వచన గేయ కవితా ప్రభంజనం గట్టిగా వీస్తున్నది.

వి. లక్ష్మణ్ - కేశవపట్నం గారి ఇటీవలి అముద్రిత కవిత. ఇది ఒంగోలు కళాసంస్థ నుండి 'సావిత్రి స్మారక' కవితా పోటి బహుమతి పొందిన కవితలోని భాగం.

ఎం దాకో నా జీవిత గమ్యం, ఎన్నాళ్ళో నా జీవిత కాలం
తరాలు మారుతున్నాయి, మా తలరాత మారడం లేదు
రాజులు మారుతున్నారు, నా బానిసలకు విముక్తిలేదు.
మంచుతిన్నెలవలె, కరిగి పోతున్నవి నాకండలు

యంత్రం బేరింగులవలె, అరిగిపోతున్నవి నా ఎముకలు
చెక్కబడే కర్రతీరు, తరిగి పోతున్నది నా బ్రతుకు
పస్తులతో వెల్లబోస్తు మాడి పోతున్నది నా కడుపు,
నా ఆలోచనలు, పోరాటపు కెరటాలయినప్పుడు
నా కనుకొలుకుల నుండి రక్తపు బిందువులు రాలిపడ్డప్పుడు
నా కర్రను దివిటిగా మండిస్తాను - ముందు తరాలకు వెలుగును అందిస్తాను

ఎం త్రివేణి గారి పర్యవేక్షణ కవితా సందేశం పెద్దపల్లి

మనసు మలినమైనా మనసా అని /చెప్పేదానికి చేసేదానిక ఎంతో వ్యత్యాసమున్నా వాచా అని / చంచల మనస్తత్వంతో ఏహ్యంగా వ్యవహరిస్తున్నా/ - కర్మణా అని

మనసా వాచా కర్మణా అంటూ / వేదమంత్రాలను వల్లించడం ఏడుగులను తృణీకరించడం/ అని తెలిసినా - చెప్పేది వినక చేసేది గ్రహించక తాము చేసే తప్పులను తెలిసీ నిర్లక్ష్యం చేస్తే జరిగే పర్యవసానానికి విధిరాత' అని పేరు పెడతారు / నేస్తం! వీధిన పడితే విధిరాత కాదు నొసటి రాత అసలేకాదు/ నీ స్వయం కృతాపరాధం కాదా?-

ఉదయశ్రీ 'రొంపికుంట గారి వ్యాఖ్య అనాగరికులం'

జన ప్రవాహ సమతలంపై, వాగ్దానాల వంతెన కట్టి
జన సమూహ ఉపరితలంపై, గాలి మేడల ఇండ్లు కట్టి
అవసరానికి వాడుకొని, తీరాక జారుకొని
ఎంత చెట్టుకు అంత గాలని, గొంతెత్తి చెప్పేవింత మనుషులు వాళ్ళు
అంతా నిజమని నమ్మి మోసపోయే, అనాగరిక జనులం మనం

ఈ పై చివరి రెండు కవితలు 'ఎటునుంచి నరుక్కురావాలి' కర్నూలు కవితాసంకలనం 1993లోనివి పుటలు 54 18

'కెమెరా' ఖండేరావు మధుసూదనరావు బి కాం , తీగల గుట్టపల్లి జ 1945

కవితలు వ్రాయడ మంటే కలలు గనడమనుకోకు
కాగడాలు వెలిగించునది కర్మయోగమది
ధనికుల దంష్ట్రాల మధ్య దరిద్ర నారాయణుల బ్రతుకు
నీ హృదయం స్పందిస్తు - నీ కవితలు నినదిస్తే
నీ బ్రతుకే సాఫల్యం కవి కదియే కైవల్యం 'చిరుతరగలు" పు 28

మన దేశమాజీ ప్రధాని పి వి నరసింహారావు గారు కూడా ఒకనాటి రాత్రి అసెంబ్లీలో (భా స్వా రజతోత్సవం?)సుదీర్ఘ వచన కవిత చదివిన వైనం కొందరికైనా స్మృతిలో ఉండి ఉంటుంది

తమ వచన గేయ కవితలో రాణిస్తున్న వివిధ రంగాల కవులు వీరు -

### 1 పి వి రంగారావు, ఎం ఏ ఎల్ ఎల్ బి వంగర

రంగారావు గారు మన ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర మాజీ విద్యామంత్రి వీరు మన భారత మాజీ ప్రధాని పి వి నరసింహారావు గారి ప్రథమ పుత్రులు తండ్రి రచయిత, తనయుడు కవి రంగారావు గారు కవి అనే విషయం వారి సన్నిహిత మిత్రులకు మాత్రమే తెల్సు వీరు వచనకవితలు వ్రాశారు కరీంనగర్ సారస్వత జ్యోతి మిత్రమండలి వారి సమావేశంలో పది పన్నెండేండ్ల క్రితం రావు గారు చదివిన 'మాతృస్మృతి' కవిత శ్రోతలకు కన్నీళ్లు పెట్టించింది వీరి 'రక్త కిరీటం' వచన గేయ భాగం చూడండి



నేను గెలిచాను / జీవితంలో ఎన్నోసార్లు ఓడిపోయిన నేను-

గాయం మాని పోతుంటే మరోగాయం / అక్కడే తగిలి రక్తపు చారల తడి ఆరకముందే

ప్రవహిస్తున్న రక్తాన్ని చూస్తూనే / అనుకున్నాను నేను గెలిచాను

(క జి ర చరిత్ర - 81, పు 116జె పూర్తి కవిత రెండు పుటలు కరీంనగర్ 'గౌతమి త్రైమాసిక సాహిత్య పత్రిక సెప్టెంబర్ 1970 సంచికలో ఉంది

## 2 గీట్ల జనార్దన్ రెడ్డి, బి ఎస్సీ, బి ఇడి ఎల్ ఎల్ బి నాగారం

జనార్దన రెడ్డి గారు ప్రస్తుతం మంథనిలో ఉంటున్నారు గోదావరిఖని సర్పంచ్ 'వీరి పరిచయం అముద్రిత పద్యకవుల్లో ఉంది వీరు రాజకీయ సాహిత్య సమావేశాల్లో అధ్యక్షులుగానో వక్తగానో తరచు పాల్గొనే లబ్ధ ప్రతిష్ఠులు కవి సమ్మేళణాల్లో పాల్గొని స్వీయ పద్య గేయ కవితలు చదువుతుంటారు శ్రోతలకు ఆసక్తి కలిగించేవిగానే కాక ఆలోచనలకు పదును పెడుతాయి వీరి రచనలు వీరి రచనలన్నీ ప్రచురిస్తే 2 3 పెద్ద గ్రంథాలవుతాయి వీరికి ఆ విషయంలో శ్రద్ధలేదు వీరి సాహితీ మిత్రులు కూడా అందుకు పూను కోలేదు

వీరి ఒక కవిత శాంతి మంత్రం జపిస్తాను' - సమైక్యవాణి 1991 నుండి



భూగోళం ఉపరితలాన్ని బాగా పరిశీలిస్తే
భూమధ్య రేఖ ఈ మధ్య సన్న బడిందనిపిస్తున్నది
భూమాత మేఖల ప్రపంచ నేతల గుద్దులాటలో
జామాతలు పీల్చి పిప్పి చేసిన సంసారాల్లా చితికి పోతున్నది
భారత పవిత్ర ధరిత్రిని పదికాలాల పాటు
భవ్యంగా పాలించే సదుద్దేశం తీవ్రతతో
కోట్లు సంపాదించటానికి పాట్లు పడటం తప్పటం లేదు
ఓట్లు సంపాదించటానికి పంచేనోట్ల లెక్క తెలియటం లేదు
జండాలు మార్చటం తప్పని సరి అనుకునే వారికి
గూండాలు లేనిదే కథ సవ్యంగా సాగటం లేదు

పాతాళ హోమాల శపించి సమతా సౌధాల్ని నిర్మించి క్రాంతి మంత్రాన్ని రచించి శాంతి మంత్రం జపించడం ఈ కవితలో కవి గారి ఆకాంక్ష

## 3 డా ఎస్ కె ఆర్ ఎం పి డాక్టర్, కోహెడ (కీర్తిశేషులు)

ఎస్ కె మొహియొద్దీన్ గారి జన్మస్థలం కోహెడ కరీంనగర్‌లో సొంత ఆసుపత్రి నడుపుతూ పేరుగల వైద్యులుగా స్థిరపడ్డారు వైద్య వృత్తిని చేపట్టినా వీరికి ప్రజా సాహిత్యం, క్రియాశీల రాజకీయాలపై అభిరుచి ఎక్కువ నాస్తికవాది కమ్యూనిస్టు పద్య గేయ కవి

పదిహేనేండ్ల క్రితం 'యుగసారధి' అనుపత్రికను నడిపారు జిల్లాలో దాదాపు వంద వర్ణాంతర మతాంతర వివాహాలు జరిపించారు వామపక్ష సిద్ధాంతాల అభిమానం కల వీరు కోహెడ గ్రామ సర్పంచుగా హుస్నాబాద్ బ్లాకు ఉపాధ్యక్షులుగా పనిచేశారు అరువదేండ్లయినా రాకముందే 1989-90 లో కీర్తిశేషులైనారు

### 4 ముప్పాళ లక్ష్మణ్‌రావు, బి ఎస్సీ బి ఇడి బీర్‌పూర్

లక్ష్మణ్‌రావుగారిది సారంగాపూర్ మండలంలోని బీర్‌పూర్ మొదట కొంతకాలం ఎలిగేడు, రుద్రంగి, జి ప సెకండరీ పాఠశాలల్లో సైన్సు టీచర్‌గా పనిచేసిన వీరు కమ్యూనిస్టు పోరాటోద్యమ స్ఫూర్తితో ఉద్యోగం వదలి వెళ్ళారు ఆ తర్వాత లక్ష్మి, గణపతి పేర్లతో కొన్ని కథలు కవితలు వ్రాశారు 'తరంగిణి' 1973, కవితా సంకలనంలో ప్రచురింపబడిన లక్ష్మణ్‌రావు గారి కవిత 'నేరానికి శిక్ష పు 35-36 ఇది 'రామరామ' అనే వంత పదాలతో సాగే జానపద బాణి కథాగేయం

"ఏమని చెప్పుదు రామరామ, మా వూరి దొరకథ రామరామ
సచ్చెదాక సంపుతడు పచ్చి నెత్రు తాగుతాడు/ గుడ్ల గూబ మొకపోడు గుంట నక్క జిత్తులోడు
కత్తులేనూరిండు నెత్తుర్లె తాగిండు / పిల్లలను పెద్దలను పీన్గలను జేసిండు
ఎదిగిన దాన్నల్ల ఎంగిలేజేసిండు / పాలేరు మనుసులకు పానాలె లేవయ్య
కూలీ మనసులకు కాలేటి కడుపులె / ఏ కులం వారికైన ఎట్టి సేత తప్పదయ్య

ఇటువంటి దోపిడీ దొర ఓ దినం కందిశేన్ల గడ్డి కోసుకునే శెంద్రమ్మ మీదపడి దౌర్జన్యం చేస్తే, ఆ సంగతి తెల్సి ఆమె వాళ్ళు మాటుకాసి కుంటకొమ్ముకాడ, ఆ దొరిగారిని చంపి కసితీసుకోవడం ఈ కథ రావు గారు ఇప్పుడు 'పీపుల్స్‌వార్' లో నాయకులుగా ఉన్నారు

### 5 చీటి జగన్‌రావు, బి ఏ ఎల్ ఎల్ బి మల్లాపురం మం గంగాధర

గంగాధర మండలాధ్యక్షులైన జగన్‌రావు గారు సాహిత్య సమావేశాల్లో ఉత్సాహంగా పాల్గొంటూ ఉంటారు సందర్భాన్నిబట్టి తమ వచన కవితలు వినిపిస్తుంటారు వీరు మానవతావాది

### 6 మేఘరాజ్ జగన్నాథం, బి ఎస్సీ ఎల్ ఎల్ బి కరీంనగర్ జ 1944

జగన్నాథం గారు మున్సిఫ్ మెజిస్ట్రేట్‌గా ప్రస్తుతం కోస్తాంధ్రలో ఉన్నారు వీరు కరీంనగర్‌లో న్యాయవాదిగా ఉండగా సారస్వత జ్యోతి మిత్రమండలి 'వారి సభలకు తప్పకుండా వచ్చేవారు వీరు వచన గేయకవి

### 7 సజ్జన సత్యనారాయణ రావు, బి ఎస్సి ఎల్ ఎల్ బి కరీంనగర్ వ 45 సుమారు

సత్యనారాయణ గారి జన్మస్థలం మల్యాల సమీపపు రామన్నపేట ప్రస్తుత కరీంనగర్ సెషన్ కోర్టులో పబ్లిక్ ప్రాసిక్యూటర్ విద్యార్థి దశనుండి సాహిత్యాభిరుచికల వీరు అనేక కవితలు కథలు రచించినా ఇంకేవి పుస్తకాలుగా రాలేదు న్యాయవాద వృత్తి అనుభవాలను కథలుగా వ్రాసి ఒక పుస్తకంగా వెలువరిచే తలంపులో ఉన్నారు

### 8 కేసరి శేషయ్య, బి కాం ఎల్ ఎల్ బి హుజూరాబాద్ అడ్వొకేట్

శేషయ్య గారు సాహిత్యాభిమాని, వీరు 'చైతన్యజ్యోతి' అనే పేరుతో 1979లో జిల్లా కవుల కవితల సంకలనం వెలువరించారు అందలి వీరి కవిత చూడండి - 'బెస్ట్ సజెషన్' లోని కొంత భాగం ఇది

ఓ నేస్తం - ఉద్యోగానికై పెట్టావా అప్లికేషన్ / లేదా ఇంతవరకు దానిపై ఎలాంటి యాక్షన్?
వినడం లేదా ఎవ్వరూ నీ లా మెంటేషన్ / లేదా నీకు ఎవ్వరి కోపరేషన్?
అందుకే సంపాదించు మినిష్టర్ రికమండేషన్ / ఇక అడ్డురాదు నీకు ఎలాంటి కండిషన్! పు 32

## 9 డి కన్నయ్య, బి ఏ ఎల్ ఎల్ బి కరీంనగర్ అడ్వొకేట్

కన్నయ్యగారు సామాజిక అన్యాయాలను తీవ్రంగా ఖండిస్తూ వేడివేడి కవితలు వ్రాసేవారు నాస్తిక సంఘ సభలు జరిపారు

## 10 నెమిలికొండ బాలకిషన్‌రావు-అడ్వకేట్ పూడూరు (హన్మకొండ)

బాలకిషన్ రావు గారు కవి జగన్మాధవరావు గారికి అగ్రసోదరులు వరంగల్‌లో ఉంటూ కవిగా 'ప్రసారిక' సాహితీ పత్రిక సంపాదకులుగా సాహిత్య జీవనం గడుపుతున్నారు 'యువస్వరం' వీరి కవితా సంపుటి రావుగారి సాహిత్య - వ్యక్తిత్వ సమీక్షా గ్రంథం 'కవితా దర్పణం 'పేరుతో సాహితీ సమితి వరంగల్లు వారు 1985 లో వెలువరించారు

## 11 ఆవుల లక్ష్మిరాజం, బి ఎస్సి, ఎల్ ఎల్ బి తురకల మద్దికుంట

లక్ష్మిరాజం గారు కవి ఎస్ కె పిళ్లే గారి మేనల్లుడు ఈ యువ కవి గారి కలం పదేండ్ల క్రితం సామ్యవాద భావాలతో ఉద్రేకంగా ఎలాపరుగులు తీసిందో చూడండి

నా ఆశయం ప్రజ్వరిల్లి ప్రకోపిస్తే / నా గుండె మండే చింత నిప్పుక లెగిస్తే

నా రక్తం పొంగి పొరలి, ఈ నదీనదాలు విజృంభిస్తే / నీవు సాగిస్తున్న దొరతనం, నీవు సంపాదించుకున్న పెనుధనం / నీ స్వార్థపు రాజకీయాలు కృత్రిమ చట్టాలు

అట్టడుగునుండి, కదలి కూలి కాలిపోతాయి, కనలి కాలికూలిపోతాయి

నీకు మతి తప్పి నీ సతీసుతులకు గతి తప్పి /చనిపోయిన మీ శవాల, తిని నక్కలు కుక్కలు చీకి విడిచిన మీ యెముకలను వెదకి వెదకి నే కడుతాను/ మరో ప్రపంచానికి శల్యశిలా సోపానం

"క జి ర చరిత్ర, పు 133

అప్పుడు వీరి ఇలాంటి కవితలు పత్రికల్లో వచ్చేవి ఇప్పుడు తెలువదు మరి

## 12 పి ప్రబాకర్ రావు, బి ఏ ఎల్ ఎల్ బి మానకొండూరు

ప్రభాకర్ రావు న్యాయవాదిగా కరీంనగర్‌లో ఉంటున్నారు వీరు వచన గేయకవి 'చిరుఅరగలు' లో వీరి కవిత సగటు ఉద్యోగిగా మాసవ్యయ భారాల సమస్యల తోరణం

## 13 ఈద పురుషోత్తమరెడ్డి, ఎం బి బి ఎస్ గంగారం

డా రెడ్డి గారి స్వస్థలం పెద్దపల్లి తాలూకాలోని గంగారం వీరు హుస్నాబాద్‌లో మెడికల్ ఆఫీసర్ రెడ్డి గారు విద్యార్థి కాలం నాటి నుండి వ్రాసుకున్న కవితలన్ని అముద్రితంగా నోటు బుక్కుల్లో అజ్ఞాతవాసం చేస్తున్నవి

## 14 డా శేషగిరి రావు, కంటి వైద్య నిపుణులు - కరీంనగర్

రావు గారు భక్తి కవితలు రచించారు దైవభక్తి శాస్త్రీయ సంగీతానురక్తి, దీనజనసేవ వీరికి నచ్చిన అంశాలు

## 15 బండి రాధాకృష్ణ - ఎం ఏ (లిట్ ) వేములవాడ

రాధాకృష్ణ గారు ఇంగ్లీషు లెక్చరర్ తెలుగులో వీరి కవితలు కథలు పత్రికల్లో వచ్చాయి

**16 డా ఆర్ మాధవరావు - ఎం ఏ పిహెచ్ డి చింతలఠానా రుద్రంగి**

కరీంనగర్ జిల్లా లో అధ్యాపకులుగా పనిచేసిన వీరిప్పుడు వరంగల్ కాకతీయ విశ్వవిద్యాలయంలో హిందీ రీడర్ హిందీలో బహుగ్రంధకర్త మాధవరావు గారు తెలుగులో సైతం కవి వరంగల్ నుండ 1995లో తమ సంపాదకత్వంలో 'చిగుళ్ళు-శిఖరాలు" కవితా సంకలనం వెలువరించారు వేములవాడ ఉదయసాహితి' 71లో కవి' శీర్షికతో కనిపించిన వీరి వచనగేయంలో కొంతఇది

చిమ్మ చీకట్లో చెమ్మమీద దీపం పెట్టి/ వెలుగు రేఖలు రువ్వినావు బాధా కరంగా బాధోద్విగ్నంగా
కవితా సముద్రంలోకి జీవితం సబ్మరీ నేడు నింపినావు/ ఆశయాల చాటపెట్టి సాగిపోవు
సామాన్యుడవు/ ఆకాంక్షలు విత్తి ప్రగతి గతికి భిక్ష పెట్టితివి,
సామాన్యుడవో! సర్వ మాన్యుడవో

**17 అష్టావధాని తిగుళ్ల శ్రీహరిశర్మ - ఎం ఏ బి ఓ ఎల్ జ 1951 చీర్లవంచ**

శ్రీహరిశర్మ గారు సంస్కృతాంధ్రోభయ భాషాకవి వీరు వేములవాడ సంస్కృత కళాశాల ప్రిన్స్‌పాల్ శర్మగారు పద్యాలతో సమానంగా గేయాలు వ్రాస్తుంటారు సంప్రదాయపు వాతావరణం నుండి వచ్చిన ఈ కవి గారి భావాలు నవీన ధోరణిలో ఉండటం విశేషం

మాదేశ గ్రామాలన్నింటికి ఏలికను తానేనని భ్రమించే ఒక గ్రామ సింహముంది
దానిచూపెప్పుడూ పైదిక్కే ఉంటుంది
దాని భాషణం భషణమే అయినా/ అది మనవైపు చూసి మొరగదు
ఈశాన్యంవైపు చూసి నైరుతి వైపు మాటాడుతుంది
దేశం ఆకలితో అలమటిస్తున్నా అది మాత్రం/పొట్టపగిలి పొయ్యేలా పుష్టిగా తింటుంది
శునక మహాసభల్లో దానికి ప్రత్యేక గౌరవ స్థానముంది "క జి ర చరిత్ర పు 134"

**18 మామిడిపల్లి రాజన్న, ఎం ఎ వేములవాడ**

రాజన్నగారు ఆంధ్రభాషోపన్యాసకులు వీరు గేయకవి స్థానిక 'ఉదయసాహితి' సాహిత్యసంచిక చివరిపుటలోని కవితా భాగం చూడండి

అప్పు చక్రంలో తిరుగుతున్నవి కోరికలు /అపక్రమంలో ఎగురుతున్నవి గృహస్థుని శక్తితారికలు,
చీరెలు లేకుంటే ఇంటిది చారెడు మూతి పెడుతుంది/ ఏ బ్యాటరీ సప్లయి చేస్తుంది తనకు కరెంటు
ఏ ల్యాటరీ తీరుస్తుంది పెరిగిన తన ఎకౌంటు/ఏ జీవుడు తొలగిస్తాడీ చెర, ఏ జీవుడు వింటాడీమొర

**19 ఎం యాదగిరి రావు, ఎం ఎస్సి. హుజూరాబాద్ లెక్చరర్**

యాదగిరి రావు గారు నటులు గేయకవి సామాజిక విమర్శ కల వీరి గేయ లు చూడండి
వీధి వీధికి పంపు చూడగా బహుయింపు/ నీళ్లురాక చంపు - ఓ రాములమ్మ
వాడవాడకు లైటు - గడియ గడియకు ఔటు/ఇది యేమి గ్రహపాటు - ఓ రాములమ్మా
ఇది ఆరుద్ర కూనలమ్మ పదాల నడక

**20 కె మల్లికార్జున్, ఎం ఏ, బి ఇడి నగునూరు**

అధ్యాపకులుగా, ప్రధానోపాధ్యాయులుగా పనిచేసి ఉద్యోగ విరమణ పొందిన వీరు పద్యగేయకవి రెండు పుస్తకాలు ముద్రణ పొందినవి గేయనాటికలు ముద్రణలో ఉన్నవి

'అధ్యాపక జ్యోతి కరీంనగర్ సంపాదకులుగా వీరు ప్రచురించిన సులోచనాలు గేయాలు మరుపురానివి

## 21 వొటారికారి చిన్న రాజన్న, హిందీ విద్వాన్ కోరుట్ల

కోరుట్ల జూనియర్ కాలేజీ హైస్కూల్‌లో రాజన్న గారు హిందీ పండిత్ వీరు వివిధ సందర్భాలలో జానపదబాణీలో పలుగేయాలు రచించారు వాటిలో కొన్ని పత్రికల్లో వచ్చాయి వాలరసాలు' సంకలనంలోని వీరి కవిత పండుటాకు' నుండి కొంత చూడండి

పండుటాకు పడిపోవగ పచ్చనాకు పరిహసించు
నడుమంత్రపు పిందెవోలె పడిపోవుట కానకుండు
పడిపోవక ముందుతాను సుడిగాలికి గిలగిలమని
తన్నుకొనుచు తానట్లే తనువును చాలించగలదు '

## 22 వకుళాభరణం జగన్ మోహన్‌రావు, ఎం ఏ బి ఇడి

వీరి జన్మస్థలం సింగాపూర్ నివాసం హుజూరాబాద్ తెలుగుపండిత్ 1994లో సె పా ప్రధానోపాధ్యాయులు మారినారు వీరు గేయకవి నటులు కోరుట్లలో ఉండగా వీరి కుమారుడు కృష్ణమోహన్ నిర్వహించిన లలితకళోత్సవాల 'సుస్వర' సంచికకు సంపాదకబాధ్యత వహించారు

## 23 వానమామలై, జగన్మోహనాచారి, ఎం ఏ బి ఇడి ,

జగన్మోహనాచార్యులు హుజురాబాద్ బాలికల సెకండరీ పాఠశాలలో అధ్యాపకులు 'కరీంనగర్ జిల్లా రచయితల చరిత్ర' పు 98 99లోని వీరి కవితలు

1 పురుషునికి మాత, ప్రధమ గురువు పోషణ కర్త్రి స్త్రీ /పురుషుని జీవిత పరమావధి స్త్రీ
అలాంటి స్త్రీ పురుషుని ఆధిక్యం మాటున/మరుగు పడడం నిజంగా శోచనీయం
జాగృతం కావాలి స్త్రీ/సమజీవనం తేవాలి సహజీవనం సాగాలి
2 మా నిషాదం నుండి రామాయణం పుట్టింది
మా జీవన నిశీథంలో నుండి నవభారతం పుడుతుంది
పోతన లేఖిని నుండి భాగవతం పుట్టింది - దున్న
పోతన్నల రాజ్యం నుండి విప్లవం తప్పక పుడుతుంది

## 24 వానమామలై దామోదరాచార్యులు – బి ఓ ఎల్ పోతురెడ్డిపేట కీర్తిశేషులు

దామోదరాచార్యులు మొలంగూరు కేశవపట్టణం సెకండరీ పాఠశాలల్లో ఆంధ్ర భాషోపాధ్యాయులు రైతురామాయణ కర్త, వా జగన్నాథాచార్యుల పుత్రులు పై ఇద్దరు గేయకవులు

## 25. పిట్టల రవీందర్, బి ఏ డిప్లమా జర్నలిజం - వీణవంక జ. 1963

రవీందర్ గారు జర్నలిస్టు గోదావరిఖణి ప్రైవేట్ పాఠశాలలో ఉపాధ్యాయులైన వీరు కథలు, హాస్యనాటికలు, కవితలు వ్రాస్తుంటారు వీరి రచనలు పలు పత్రికలలో ప్రచురింపబడినవి వీరివి ఆధునిక అభ్యుదయభావాలు

## 26 'రాకుమార' రామంచకొమురయ్య, ఎం ఏ బి ఇడి హుస్నాబాద్

రాకుమార సింగరేణి గోదావరిఖని ఉన్నత పాఠశాలోపాధ్యాయులు సాంప్రదాయ మార్గంలో

వీరు కలం నడిపిస్తుంటారు వీరి వచన కవితలు పలుసంచికలలో పత్రికలలో ప్రచురింపబడినవి కొన్నింటికి సాహితీసంస్థల బహుమతులు కూడా వచ్చాయి

**27 కులకుంట్ల పెరుమాళ్ళాచార్యులు, డిప్ ఓ ఎల్ కోరుట్ల**

పెరుమాళ్ళాచార్య తెలుగు భాషోపాధ్యాయులుగా ప్రభుత్వోద్యోగం చేస్తూ మధ్యవయస్సులో పదేండ్లక్రితం మరణించారు వీరు పద్యగేయకవి మాత్రాఛందంలో నడిచిన వీరి గేయ కవిత 'గ్రామదేవత' వర్ణన 'బాలరసాలు' లో ఉంది వీరి పుత్రుడు రాధాకృష్ణ గేయకవి

**28 బి రామచంద్రం - బి ఓ ఎల్ వేములవాడ జ.1940 అధ్యాపకులు**

రామచంద్రం గారు వేములవాడ సాహితీమిత్రుల సాహచర్యంకలవారు విద్యార్థి కాలంలోనే లిఖిత మాసపత్రిక వెలువరించారు వీరు వచన గేయకవి పలు సాహితీ సమావేశాల్లో పాల్గొన్నారు

**29 రంగు దక్షిణామూర్తి, బి ఓ ఎల్ గంగిపెల్లి**

దక్షిణామూర్తి గారు హుస్నాబాద్ బాలికల సెకండరీ పాఠశాలలో తెలుగుపండితులు నిజాయితీలో నిక్కచ్చిగా మొదలుతారు ప్రకృతి వైద్య సాధన సాహిత్య సృజన వీరికి ప్రియం వీరు సామాజిక అవినీతిని ఖండిస్తూ వచన కవితలు వ్రాశారు

**30 వాలా సత్యనారాయణరావు, బి ఏ బి ఇడి గంగిపెల్లి**

రావు గారిది గంగిపెల్లి వీరు అధ్యాపకులుగా, డిప్యూటి ఇన్స్‌పెక్టర్‌గా ప్రభుత్వోద్యోగం చేసి విశ్రాంతి పొందారు వీరు సాహిత్యాభిమానం కలవారు సామాజిక స్పందనతో వచన గేయాలు రచించారు

**31 కృష్ణశ్రీ - వజ్జల కిష్టయ్య, ఎం ఏ ధర్మపురి నివాసం కరీంనగర్**

ప్రైవేట్ పాఠశాలలో ఉపాధ్యాయులు వీరు సంగీత సాహిత్యాలను సమంగా అభిమానిస్తారు వీరు గేయకవి వీరి గేయం ఒకటి 'మార్గదర్శి' 1993 సినిమాలో ఉంది

**32 వీర మల్లయ్య, ఎం ఏ సిరిసిల్ల**

వీరమల్లయ్య గారు అధ్యాపకులు - వచన గేయ కవితలు చాల వ్రాశారు అవి ముద్రితం

**33. పంజాల రాంనారాయణ, బి ఏ హుజూరాబాద్**

రాంనారాయణ గారు అధ్యాపకులు వీరు వచనగేయకవి 'చైతన్యజ్యోతి' 79 కవితా సంకలనంలోని వీరి కవిత 'పల్లెపిలుస్తున్నది' నాగరికులకు ప్రయోజనాత్మక సందేశం అందించింది

**34 కోయల్‌కార్ ప్రకాశ్ - బి ఎస్సీ, బి ఇడి హుజూరాబాద్**

ప్రకాశ్ గారు ఉప్పల్ జి ప సె పాఠశాలలో అధ్యాపకులు వీరి కవిత 'చైతన్యజ్యోతి' మొ॥ సంచికల్లో వచ్చాయి క జి ర చరిత్ర పు 116, డి లోని వీరి కవితాశకలం

"అన్యాయం అక్రమం అవినీతి దారిద్ర్యం/అలుముకున్న చీకట్లను తరిమి వేయగారండి
లంచగొండి వెధవలనూ దొంగవ్యాపారులనూ/సంఘవిద్రోహులనూ ఏరివేయగా రండి"

**35 కాంతారావు, పోలంపల్లి, ఉపాధ్యాయులు**

కాంతారావు గారు పద్యగేయ కవి వీరి గేయకవితలు పాటలు వీరి పద్యాలు 'పేకాట' తరంగిణి - కవితా సంకలనంలో ప్రచురితం 'జనహిత' కవితాసంకలనంలో 'పోలంపల్లి ప్రభాకర్‌రావు గారి స్మారక సంచిక'లోనూ వీరి లయాన్విత చారిత్రక కథాగేయాలున్నాయి

### 36 జి ఆర్ నరసయ్య, బి ఏ బి ఇడి జగిత్యాల వ 80 సం

గుండేటి రాజనరసయ్య గారు రిటైర్డ్ గెజిటెడ్ హెడ్‌మాస్టర్ భక్తి సంస్కృతికి సంబంధించిన పలు వచనరచనలు వెలువరించారు ఈ జిల్లాలో విరచితమైన ఏకైక 'పేరడీ' కవిత వీరిది చూడండి

ద్వేషమును ప్రేమించుమన్నా - స్వార్థమన్నది పెంచుమన్నా
వొట్టిమాటలు కట్టిపెట్టక యెట్టిమేల్ తలపెట్టకోయ్ -
పాడిపంటలు పొంగిపొర్లె దారిలో నువు అడ్డుపడవోయ్
అర్థమైనా గడ్డితింటూ - దుడ్లుబాగా కూడా బెట్టోయ్

### 37 గంటిడి చంద్రశేఖర్, బి ఎస్సీ బి ఇడి కోరుట్ల

ఆర్ టి సి జగిత్యాల డిపోలో క్లర్క్‌గా పనిచేసి, దానిని వదలి చంద్రశేఖర్‌గారు కథలాపూర్ మండలంలో ఉపాధ్యాయులుగా ఉన్నారు విద్యార్థి కాలం నాడు వ్రాసుకున్న వీరి కవితలు ఓ నోటుబుక్కు నిండుగా వున్నాయి

బాలరసాలు' లోని వీరి కవిత 'శివరాత్రి' జాగరణ వివరణ ఇది
తినడానికి తిండిలేక, ప్రతిదినం ఉపవాసముండే
పేదవాడు కట్టుకొన్న పుణ్యం, లెక్కించుట కెవరితరం, వాడికి ప్రతిరాత్రి శివరాత్రే -
మురికి గుంటల ప్రక్కన మూగే దోమల గుంపులో పడుకొని
ఆకాశంలోని చుక్కల లెక్కపెట్టే పేదవాడికి పత్రిరాత్రి శివరాత్రే,
తిన్నదంతా అరుగక ఆయాసంలో కదిలేవాడికి
ఈరోజు శివరాత్రి - ఉపవాసం ఉంటే ఒంటికెంతో మంచి

### 38 కె ఎస్. అనంతాచార్య, ఎం ఏ కరీంనగర్

అనంతాచార్య అధ్యాపకులు స్థానిక సమైక్యసాహితి ప్రధానకార్యదర్శి వీరు వచనకవితలు వ్రాస్తుంటారు అధ్యాపకులై వీరు అధ్యాపకులకిట్లా శుభ సందేశాన్ని అందిస్తున్నారు

సంస్కర్తల రాజ్యాంగ నిర్మాతల/నాయకులు సైంటిస్టుల నెందరినో సృష్టించి
జాతి నిర్మాతలై ఖ్యాత నిర్ణేతలై/విశ్వాంతరాళమంతటా విశ్వరూపాన్ని ప్రదర్శించు
ఓ అధ్యాపకా యశస్సు గాంచవోయి

### 39 ద్యావరిశెట్టి రాజేశం - బండలింగాపూర్ (మెట్టుపల్లి) జ. 25 6 38

రాజేశంగారు అధ్యాపకులు వచన గేయకవి 'చిరుతరగలు'లోని వీరి కవిత 'ఈ వ్యవస్థలో ' ఏం చేశారో ఇట్లా వివరించారు

ఈ వ్యవస్థను దూరితె, నీ అవస్థ తీరదు / ఈ వ్యవస్థలో, నీ వ్యక్తిత్వం మారదు
నీకలం హలంతో, దున్ని బాగు చేసెయ్ / సంస్కరణల సస్యాల్ని, సాగుచెయ్
అదేనోయ్ నీకు విక్టరీ, అప్పుడే నీకు హిస్టరీ!

### 40 బద్దం జగ్గారెడ్డి, బి ఏ బి ఓ ఎల్ కటికెనపల్లి జ 20 6 1939

జగ్గారెడ్డి గారి జన్మస్థలం ఖాసింపేట నివాస గ్రామం కట్టికెనపల్లి ఈ జిల్లాలోనే వి డి వో గా ప్రభుత్వోద్యోగం చేస్తూ, వ్యవసాయ కవితా వ్యవసాయ వ్యాసంగాలతో కాలక్షేపం చేస్తున్నారు వీరు గేయకవి ఆశాగీతి, ముక్తకాలు వీరి అముద్రిత కవితా సంపుటాలు కవి ఆశయం తెలియజేసే వీరి 'హలం కలం కవిత చూడండి

నా వృత్తి హలం నా ప్రవృత్తి కలం/ హలంతో పొలం వెన్నలా దున్నుతాను
యెండిన బీళ్ల నోళ్లకు సెలయేళ్ల నీళ్లు మళ్లిస్తాను/ వర్షంతో హర్షిస్తాను సౌభాగ్యం దర్శిస్తాను
దిన దిన ప్రవర్ధ మానంగా జన కల్యాణం ప్రదర్శిస్తాను/ కలం బలంతో కాలానికి కళ్లెం వేస్తాను
కాలుని కంఠంలో బల్లెం త్రోస్తాను/సమ సమాజ సౌధానికి వేసిన గొళ్లెం తీస్తాను
'క ఖ కవుల పరిచయ సంపుటం' కవి నం 3

**41 ప్రభాకర్, బి ఏ వేములవాడ**

ప్రభాకర్ గారు కరీంనగర్ డిగ్రీ కాలేజీలో యు డి సి శాస్త్రీయ సంగీత పరిజ్ఞానం కలవారు తబలా వాద్యనిపుణులు వీరు హాస్యరస వచన కవితలు వ్రాయడంలో చదవడంలో చతురులు

**42 వి పూర్ణచందర్ రావు, ఎం టెక్ ఇంజనీయర్ - గుండి జ 1943**

ప్రముఖ కవి వెలిచాల కేశవరావు గారి చతుర్థ పుత్రులు ప్రేంచందర్ రావు గారు కొంతకాలం అమెరికాలో ఉద్యోగం చేశారు ప్రస్తుతం హైద్రాబాద్‌లో నివాసం శాస్త్రీయ సంగీతం వినడమన్నా వచన కవితల రచనమన్నా రావు గారికి చాల ఇష్టం

**43 మంచికట్ల లక్ష్మీపతి, బి ఏ ఎలగందల్ జ 5 7 1946**

లక్ష్మీపతి గారుజగిత్యాలలో అకౌంటెంట్‌గా ఉద్యోగం చేస్తున్నారు వచన గేయకవి చిరుతరగలు' లో 'అంటరానితనం నిరసన వీరి కవిత

**44 మల్లావజ్జల చంద్రమౌళి - పెద్దపల్లి జ 22 ll 1940**

చంద్రమౌళిగారి స్వస్థలం పెద్దపల్లి సబ్‌ట్రెజరర్ అధికారిగా కరీంనగర్‌లో ఉద్యోగం వీరి వచన కవితలు పలు సాహిత్య సంచికల్లో పత్రికల్లో వచ్చాయి

**45 మాడిశెట్టి గోపాల్, ఎం ఏ కరీంనగర్**

గోపాల్ గారు ఎల్ ఐ సి ఉద్యోగి వీరు స్థానిక 'సమైక్యసాహితి' నిర్వాహక మిత్రబృందంలో ఒకరు వీరు సాహిత్యాభిమాని - నటులు - పత్రికా విలేఖరి - గేయకవి

**46 రేఖా - ధనాలకోట నాగేశ్వరరావు వర్మ, పెద్దపల్లి వ 55**

వర్మ గారు ఎలక్ట్రిసిటీ శాఖలో బిల్‌కలెక్టర్ వీరు వచన కవితలు వ్రాస్తుంటారు

**47 ఆకోజు రాజమౌళి - చెర్ల బూతుకూరు జ. 3 3 1948**

రాజమౌళిగారు ఇన్‌కంటాక్స్ ఆఫీసు కరీంనగర్‌లో యు డి సి గా ఉన్నారు వీరు గేయ రచన సాగిస్తుంటారు కవి సమ్మేళనాల్లో పాల్గొంటుంటారు ఈ మధ్య పారమార్థిక కవితలు రాస్తున్నారు

**48 కె మురళీ మనోహర రావు ఎం ఏ చేగుర్తి జ 17 6 64**

రావు గారు కరీంనగర్ ఎస్ బి హెచ్ లో క్లర్క్ వీరు వచన గేయ కవి 'చిరుతరగలు' లోని వీరి వచన కవిత 'కృషివలుడు' చూడండి

కృషీ వలుడను నేను, కాలంతో పాచికలాడే 'ధర్మరాజును' నేను
మట్టిని బంగారం చేసే మర్మయోగిని నేను/ లోక సంక్షేమ హోమానికి సమిధను నేను
ప్రభుత్వ కసాయి బుద్ధికి బలైపోతున్న మేకను నేను/ వర్తకుని వలలో చిక్కిన చేపను నేను
అందరికి కావలసిన వాణ్ణి కాని, ఎవరికీ కానివాణ్ణి నేను

## 49 పడాల రాజమౌళి - పోలంపల్లి హైదరాబాద్‌లో ఉద్యోగం

రాజమౌళి గారు హిమాయత్‌నగర్ సూపర్‌బజార్‌లో అకౌంటెంట్ వీరి కథలు - కవితలు పత్రికల్లో వచ్చాయి చిరుతరగలు లోని వీరి కవిత

చేతిలో రక్తం బొట్టు లేదు పిడికిలి బిగుసుకోవడంలేదు
గొంతులో తడి ఆరిపోతోంది కడుపు మాత్రం కాలిపోతుంది
అయినా 'విప్లవ' భావాలు విరజిమ్ముతున్నాయ్

## 50 బి అంకయ్య, బి ఏ తంగళ్ళపల్లి జ. 1939 రెవిన్యూ ఆఫీసర్

బండారు అంకయ్య గారు విద్యార్థి కాలం నుండి సాహిత్యాభిమాని రంగస్థల నటులు వీరి ప్రస్తుత నివాసం కరీంనగర్‌లో 'చైతన్య జ్యోతి 'లో తోట మాలులను ఎందుకోసం రండని పిలుస్తున్నారో చూడండి (ఇతర కవితా సంకలనాలలోనూ వీరి కవితలు కనిపించాయి )

హృదయ కవాటాలు తెరచి భావనా జల్లులు కురిసి
సాహితీ వనంలో అను దినం సాగుతోంది కృషీవలం
ఎన్నిపూలో మానవత్వపు మంచి మల్లెలు
పిచ్చిమొక్కల పెరికి వేయగ, విషపు విరులను తునిమివేయగ
కదలిరండి! కలంపట్టిన తోటమాటలు కదలిరండి!

## 51 రాపోలు రామచంద్రయ్య, ఎం ఏ కరీంనగర్

రామచంద్రయ్య గారి జన్మస్థలం వరంగల్ జిల్లా అయినా కరీంనగర్ పి జి సెంటర్‌లో ఉన్నతోద్యోగంలో ఉంటూ ఇక్కడే స్థిరపడ్డారు శ్రమజీవుల హరిజన గిరిజనుల సానుభూతి కవితలు వ్రాస్తూ వీరు ప్రభుత్వ నాయకులనిట్లా హెచ్చరించారు

పదవి భోగాలు, అనుభవించే దొరల జోలికి పోక/ స్వదేశ పీడిత భూస్వాముల, ధనాధీశుల
చాకిరి సేవలో, సగం చచ్చిబ్రతికి/ సామాన్యుని, సంతోషానికి, సంకెళ్ళు వేసి
పాలించే పాలన, ప్రజాస్వామ్యం కాదు

## 52 మదురవీందర్, బి కాం వేములవాడ జ 1961

రవీందర్‌గారు తెలుగు భాషాపండితులు కీ శే మధు మృత్యంజయం శర్మ గారి పుత్రులు లైబ్రరీ సైన్సు కోర్సులో డిప్లొమా పొంది రవీందర్ లైబ్రేరియన్‌గా ఉద్యోగం చేస్తున్నారు ఆధునిక భావాలతో వీరు ఆలోచనాత్మకమైన వచన కవితలు వ్రాశారు

నీ కేపిటలిజం కలర్ షూస్ క్రింది, నలిగిన గడ్డిపరకను సైతం
తేలిగ్గా తీసి పారెయ్యకు, అది తిరుగబడ్డనాడు
బల్లెంగా మారి ఎర్రదనం చిందిస్తుంది క జి ర చరిత్ర పు 136

## 53 కె వి సంతోష్‌బాబు, ఎం కాం కరీంనగర్ జ. 17 8 1953

సంతోష్‌బాబు ఎస్ బి హెచ్ కరీంనగర్‌లో క్యాషియర్ వీరు వచన గేయకవి వాయిసాప్ ఎమర్జెన్సీ జాతీయ గ్రంథంతో వీరికి స్థానం లభించింది 'చిరుతరగలు' లో మేధావుల నిట్లా మేలు కొలుపుతున్నారు

ఆకాశంలో ఆలోచనల ఆశా సౌధాల్ని నిర్మిస్తూ
ఊహల విహంగాలపై విహరించే మేధావీ ! మేలుకో!!
నేల విడిచిన సాము మానుకో! వాస్తవాల్ని వక్రీకరించడం వ్యర్థం

తెలుసుకో శ్రమజీవుల సేద బిందువుల కర్థం
కుక్కగొడుగుల్లాంటి జీవితాలు కొందరివైతే/కుక్కలు చింపిన విస్తర్ల బ్రతుకులు ఎందరివో
ఎవరి పక్షం వహిస్తావో, నీవే నిర్ణయించుకో/ సంకుచిత స్వార్థమా? సహజీవన సౌభాగ్యమా?

**54 ఎరబాటి రామచంద్రరావు, సుల్తానాబాద్ జ 7 10 1927**

రావు గారు పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసర్‌గా పనిచేసి ఉద్యోగం నుండి విశ్రాంతి పొందారు వీరు వచన గేయకవి అదిలాబాద్‌లో ఉండగా ఆ జి కవితా సంకలనం 'శైవలిని'లో ప్రచురితమైన వీరి 'అమ్మ' కవిత పాఠకుల హృదయాలను కదలించగలది

**55 విశ్వనాల శ్రీరాములు, ఎం ఏ మోహన్‌రావుపేట జ 1944**

శ్రీరాములు గారు కవి, నటులు స్వగ్రామంలో 'మానసిక విప్లవ సమితి' ని స్థాపించారు అభ్యుదయ భావ ప్రేమికులైన వీరి ఒక కవితా భాగం చూడండి

మన ప్రభుత్వం - ఖరీదైన క్యాపిటలిజం చొక్కాకు / మాసిన సామ్యవాదపు అతుకులు
అడ్రసులేని డ్రీం గర్ల్/ మన సోషలిజం సుందరాంగి!

**56 ప్రతిభారాణి, బి ఎస్సీ. బి ఇడి మంథని**

ప్రముఖ రచయిత వేంకటరాజన్న అవధానిగారి కూతురు ప్రతిభారాణి గారు మంథని యు పి ఎస్ ప్రధానోపాధ్యాయురాలుగా చాలా కాలం పనిచేసిన వీరు అదే పట్టణ జి ప సెకండరీ (బాలికల) పాఠశాలలో సైన్స్ టీచర్‌గా పనిచేస్తున్నారు వీరు వ్యాసరచన, వచన కవితా రచన వ్యాసంగం గలవారు సంప్రదాయ భావాలు, స్త్రీ హక్కుల ధర్మపోరాటం వీరిది

**57 కె మల్లీశ్వరి, ఎం ఏ బి ఇడి. పెద్దపల్లి**

పెద్దపల్లి మిషన్ హైస్కూల్లో వీరు ఉపాధ్యాయిణి వీరు వచన కవితలు వ్రాస్తారు 'పువ్వులు' బాల గేయ సంకలనంలోని వీరి కవిత చూడండి

ఇది అంతర్జాతీయ బాలల వేడుకల సంవత్సరం
ఈ వేడుకలెవ్వరి కోసం? ఈ ఆర్భాటం ఎవరికోసం?
ఉన్నవాడికి రోజూ పండగే లేని వాడికో!?
కడుపునిండ తిండి, కట్టుబట్ట, ఉండనీడ, రేవుపై ఆశలేక
దీనమైన చూపులతో అలమటించే ఈ బాలలకు (క జి ర చరిత్ర పు 222)

**58 కేసరి (పుప్పాల) భారతి, ఎం ఏ, హుజూరాబాద్**

భారతి గారు స్థానిక బాలికోన్నత పాఠశాలలో ఉపాధ్యాయురాలు కవి కె యాదగిరి రాజు గారి సతీమణి వీరు గేయ రచయిత్రి

"అర్థరాత్రి అవతరించె ఒక ప్రభుత్వం/ మరో రాత్రి అస్తమించె ఆ ప్రాభవం
జనం సహించలేదు - ప్రకృతి వికటత్వం/అయితే ఆవిర్భవించటం అంతరించటం -
ప్రకృతి సిద్ధాంతం" - 'చైతన్యజ్యోతి' - సంకలనం నుండి

**59 కె సుబాషిణి సంతోష్. వంగర జ. 17 12 1960**

సుభాషిణి గాని జన్మస్థలం మన ప్రధాని పి వి గారి స్వగ్రామమైన వంగర వీరి నివాసం కరీంనగర్‌లో వీరు వచన కవితలు వ్రాస్తున్నారు "పాతబడిన భావాలతో, రోతపుట్టించే మూఢ

నమ్మకాలతో చేతకాని అబలలా ఉండకు మగువా తెగువ చూపు' అని వీరు 'చిరుతరగలు' లోని కవితలో మహిళాలోకానికి ఉద్బోధకావించారు మానవతా సమవికసనతో దేశం పూదోటలా కళకళ లాడాలని ఆకాంక్షించారు

### 60 డి కళావతి, ఎం ఏ హిస్టరీ కరీంనగర్

కళావతి గారు విప్లవ కవి అలిశెట్టి ప్రభాకర్ గారి సోదరి గేయకవి దూలం రామమూర్తి గారి భార్య శ్రీకళ పేరుతో కళావతి గారి కవితలు ప్రచురణ పొందాయి

### 61 పి అనసూయాదేవి - కొత్తపేట తా॥ సుల్తానాబాద్

అనసూయాదేవి అధ్యాపకురాలు దేవరాజు నరసింహరాజు గారి కుమార్తె ఈమె పద్యాలు, గేయాలు రచించారు

### 62 చంద్రశ్రీ - భేతిగల్ ఉపాధ్యాయురాలు వీరు గేయాలు వ్రాశారు

### 63 జయప్రద - ధర్మపురి

జయప్రద గారు ఒంటరి జీవితంలో కవితా వ్యాసంగాన్ని తోడుగా స్వీకరించారు వీరి ఒక కవిత

ఓ మనిషి నీవెందుకు పుట్టావు/ పుట్టీ గిట్టి ఏం సాధిస్తావు? ఎవరిని ఉద్ధరిస్తావు,
మనిషి అంటే అర్థం తెలుసుకో - / మ అంటే మంచి, నీ అంటే నీతి షి అంటే శీలం
ఇవి ఉంటనే మనిషి, అవేవీ లేకపోతే పశువు - క జి ర చ - పు 222

### 64 పి వరలక్ష్మి, డిప్ ఓ ఎల్ ధర్మపురి

వరలక్ష్మిగారి మామ నారాయణ శర్మ గారు నిత్యాన్నదాన నియమవ్రతులు భర్త శంకరశర్మ గారు తెలుగు పండితులు ఈమె సంప్రదాయ గేయాలు, రెండు నవలలు వ్రాశారు అవి పదేండ్లుగా అముద్రితంగానే ఉండిపోయాయి ఆదర్శ గృహిణిగా స్థానిక శారదా మహిళా మండలి కార్యదర్శిగా కాలక్షేపం చేస్తూ తగిన ప్రోత్సాహం లేక రచనా వ్యాసంగానికి ఈ మధ్య దూరమయ్యారు

### 65 బాలమణి - బి ఓ ఎల్ ఉప్పల్

బాలమణి గారి జన్మస్థలం హైదరాబాద్ నివాస స్థలం హుజూరాబాద్ ఈమె వచనగేయ కవయిత్రి వీరు చిరుతరగలు' లో 'కర్మహక్కు' కుమారులకే తప్ప కుమార్తెలకెందుకుండకూడదని వేదవిధానాన్నే సవాలు చేశారు 'పరిమళిత కుసుమాలు'లో 'చిల్లర డబ్బుల కొరత'ను చిత్రంగా వ్యాఖ్యానించారు

### 66 మున్ననేని మాలతీ రాజేశ్వర రావు, తిమ్మాపురం, వయా - ఎల్ ఎం డి కాలనీ

మాలతి గారు వచన కవితలు వ్రాస్తుంటారు చిరుతరగలు' కవితలో కోడలునొక విధంగా కూతురు నొకవిధంగా చూసే స్త్రీల మానసిక స్వభావాల్లోని వ్యత్యాసాలను నిరసించారు

### 67 జ్యోతి - మెట్టుపల్లి

కొన్నాళ్ళక్రితం ఆంధ్రభూమి' సచిత్రవారపత్రికలో ప్రేమించి పెళ్ళికి నిరాకరించిన ప్రియుని దుయ్యబడుతున్న యువతిగా వచన కవిత వ్రాశారు విషయం ఏదైనా ఏమైనా ఆ కవితను చదివిన వారు ఈ తరం స్త్రీలు - యువతులు ఇంత ప్రతిభాన్విత కవిత్వం వెలువరిస్తున్నందుకు ముగ్ధులు కాకతప్పదు (జ్యోతి మంత్రి వాది-వారని, ఇంటర్ చదివి పత్రికా విలేఖరిగా పనిచేసి అర్థాంతరంగా ఆత్మహత్య చేసుకున్నారని తెలిసింది)

నవ యువకులవలెనే యువతులు కూడా పలువురు కవితా వ్యాసంగం సాగిస్తున్నారు కాని వీరి పేర్లు అంతగా వ్యాప్తిలోలేవు

## 68 కమాల్ కలీంనగరీ - కోరుట్ల నివాసం కరీంనగర్

కమాల్ కలం పేరు కల 'గాజియొద్దీన్ ' భారత జాతీయవాది ఉర్దూ మాతృభాష ఉర్దూ హిందీ తెలుగు భాషా సాహిత్యాల అభిమాని మానేర్‌టైమ్స్ అనే పత్రిక నడిపారు సత్యార్థి సాహిత్య మాసపత్రికకు పబ్లిషర్ 'సబ్‌రంగ్' అనుపేర వీరో హిందీ పుస్తకాన్ని ఆంధ్రానువాదం కావించారు 'కరీంనగర్ రచయితల చరిత్ర' పు 254 లో వీరి పరిచయం ఉర్దూ కవుల్లో చేయబడింది కరీంనగర్ కవుల పరిచయగ్రంథంలోని వీరి కవిత 'సత్యమేవ జయతే' చూడండి కవి నం 17



ఆదర్శ ప్రాయంగా బ్రతకాలనీ ఎన్నెన్నో కష్టాలు పడ్డాను నేను
నైతిక విలువలు పెంపొందించుటకై, ఎన్నెన్నో యత్నాలు చేశాను నేను
కాని, లోకులు పలుగాకులు, నాపైన ఎన్నో అభాండాలు వేశారు
నా ఆదర్శ జీవితాన్ని అప్రదిష్టపాలు చేశారు
దీనికి నా నిజాయితీయే కారణం కాని నేను
సత్యమే పలుకుతాను, సత్యం కొరకే జీవిస్తాను/సత్యం కొరకే నవ్వుతూ మరణిస్తాను

## 69 కొక్కుల బాస్కర్ - చెర్లబూతుకూరు తా॥ సుల్తానాబాద్

భాస్కర్ గారు కళా సాహిత్యాభిమాని వీరు 'ఆమె చరిత్ర' 'తూర్పు తెల్లవారింది' ఈ మధ్యనే ఓ బాలలచలనచిత్రం ఆరంభించి మధ్యలోనే నిలిపివేశారు వీరు గేయకవి - నటనా ప్రియులు

సనాతన సంప్రదాయాలను సమాధిచేస్తాం
ఆధునాతన ఆచారాలకు పునాది వేస్తాం - క జి ర చ పు 111

ప్రస్తుతం భాస్కర్‌గారు షోలాపూర్ నుండి 'పద్మపీఠం' అను కుల పత్రికను నడుపుతున్నారు

## 70 అప్సర్ - ఎం డి షర్ఫొద్దీన్, హుస్నాబాద్

అప్సర్ కథా రచయిత - గేయకవి వీరి కథలు కవితలు పత్రికల్లో వచ్చాయి సత్యార్థి మాసపత్రిక అక్టోబర్ 1987లోని వీరి కవిత 'వక్రరేఖలు' నుండి కొన్ని పంక్తులు ఇవి

అర్థంలేని గ్రహాల్ని అర్థం కాని ఫలితాల్ని నమ్మకుంటే
నక్షత్రాలు జీవితాలపై దండయాత్ర సాగిస్తాయి
ఓ మనిషీ! అరచేతి మలుపుపై వెలసిన
రేఖలపై ఎందుకింత తీవ్ర దృష్టి " క జి ర చ పు 106

## 71 బందే అలీ, కరీంనగర్

అలీ గారు మాతృభాష ఉర్దూ అయినా తెలుగులో చక్కని కవిత్వం వ్రాశారు 'గౌతమి' సాహిత్య త్రైమాసిక పత్రికల్లో వీరి కవితలు కనిపించాయి సెప్టెంబర్ 70, సంచికలోని వీరి 'భగవాన్' వినతి ఇది

మ్రొక్కులకు మోతాదు నీవు లేవని నేను/ మొక్కలేదెన్నడూ దేవుడా యని నేను
కోరలే దెన్నడూ యే కోరికా నేను/ మీర లేదెన్నడూ నీ శాసనం నేను
మా కోసమై భూమినే సృష్టించినావో/ భూమి కోసమే మమ్ము సృష్టించినావో
ఏ ప్రభువు యేలినా ప్రజల పాలకులు/ ఏ ప్రభువు మారినా ప్రజలు బాధితులు
ఈ కవిగారు మత సమైక్యతా వాది

## 72 గజ బీంకార్ దేవరాజు, తంగళ్లపల్లి

దేవరాజు గారు 1993లో తమ 35 ఏట మరణించారు వీరికి స్కూళ్ల చదువు తక్కువ ఊళ్ళ చదివింది ఎక్కువ సామ్యవాద భావాభిమానంతో బలమైన మినీకవితలు రచించారు ' కవితాఖడ్గం ఎత్తాను, కల్మశ హృదయాలను నరికేయడానికి కరీంనగర్ జిల్లాలో, విప్లవవిత్తనాలు మొలకెత్తి యుద్ధానికి సిద్ధంగా ఉన్నాయి దమ్ములుంటే రండి ఎదిరించడానికి ' అన్నారు

## 73 ఎం రాజనరేందర్, కరీంనగర్

అనుభూతి ప్రధానమైన ఈ యువకవికవిత 'సమైక్యవాణి' లోనిది

అంచెలంచెలుగా ఎదిగి ఓ నీటి బిందువు, నన్ను దాటేసింది/ నేను చూస్తున్నప్పుడు అదో నాక
మనుకున్నాను / కాదు భ్రమపడ్డాను, తర్వాత బాధపడ్డాను
నన్ను దాటేసింది ఆ నీటి చుక్క, నదిలో కలిసిపోయింది / పంచ భూతాల్లో ఇమిడి పోయింది
ఇంకా నాకు చుక్కగానే కనిపిస్తున్నది/ నా నీడ తప్ప యేనీడ యెరుగని
ఓనీటి చుక్క, ఓ అమృత బిందువు, ఓ ధృవతార/ నింగికి నేను ఎగిరి పోయే వరకు/ నా కండ్లలో
ఆమె మెరుస్తూనే ఉంటుంది

## 74 ఎం డి అయూబ్ ఖాన్, బి కాం సిరిసిల్ల

విద్యార్థి దశలో అయూబ్‌ఖాన్, విప్లవ గేయాలు రచించేవారు ఇప్పటి వివరాలు తెలియలేదు అప్పటి ఒక కవితా చరణం

అక్కపెల్లిన రగిలిన చిచ్చు? చెక్కపెల్లికి నెగడెల్లిందట
పులులన్నీ పారిపోతున్నాయట, కనబడితే కాల్చేయండి క జి ర చరిత్ర పు 144

## 75 ఎం డి శిరాజ్, హుజూరాబాద్

శిరాజ్ గారి తెలుగు కవిత 'చైతన్యజ్యోతి'లో మన 'ప్రజాస్వామ్యం' వర్ణన ఇట్లా సాగింది

ఏమిరాజ్యం? ఏమి పాలన?/ ఏమి స్వాతంత్ర్యోత్సవమ్మిది?
చదువుకొనుటకు బళ్లలేకా - చదువు కెళితే తిండిలేకా/ పల్లెటూళ్లో పేదపిల్లలు కూలి కెళ్ళారు॥
చదువుకొన్నా పనులు లేకా - పనులకెళితే కూలి చాలక
కడుపు మండే కష్ట జీవులు సమ్మెజేశారు
కడుపు నిండే కూలి ఇమ్మని - కలిసికట్టుగ అడిగినందుకు
డబ్బుతిని అధికార్లు వారిని జైళ్ల కంపారు

## 76 ఎస్ కుమారస్వామి, వీణవంక

వీణావాణి' 'చిరుతరగలు మొ॥ సాహిత్య సంచికల్లో వీరి కవితలున్నాయి వీరి 'హెచ్చరిక' ఇది

ప్రజాస్వామ్యమంటూ, ప్రజలను మోసగిస్తూ / అధికారం చేజిక్కించుకొని, అన్యాయాల్ని ఉపేక్షించే
ప్రజాపాలకులారా హత్యలతో అత్యాచారాలతో / ఆడుకోకండి మీ వేషాలిక కట్టి పెట్టండి

## 77 ఆర్ శరత్‌బాబు, హుజూరాబాద్

'చైతన్య జ్యోతి లోని శరత్‌బాబు గారి కవిత విద్యావంతులైన నిరుద్యోగుల పరిస్థితికి ప్రతిబింబంగా ఉంది ఈ విధంగా

విశ్వవిద్యాలయాల్లో నుండి కొత్త కొత్తగా వచ్చిన పట్టాలు

దారం తెగి గమ్యం చేరని గాలిపటాల్లా రైలు పట్టాల మీదపడి ఉన్నాయి

ఐనా ఒకే ఒక్క ఆశనాకింకా మిగిలి ఉంది/ ఈ దేశం నాగలి విశ్రమించకుండా -

**78 ఎం నారాయణశర్మ పెద్దపల్లి**

పండిత కవి మల్లావజ్జల రామచంద్ర శర్మ గారి పుత్రులు నారాయణశర్మ మృదంగవాద్యంలో డిప్లొమా సాధించి బి ఏ చదువుతున్నారు వీరు వచన కవితలు వ్రాస్తుంటారు నారాయణశర్మ గారి 'వేడి కన్నీళ్లు' కవితకు నల్లగొండ పట్టణ 'కృష్ణవేణి సాహిత్య సంస్థ' వారి పోటిలో 1984లో ఓ బహుమతి లభించింది ఇది వీరి 1993లో నూతన సంవత్సర స్వాగత కవిత

పరిమళించు సుమాన్నై ప్రభాసించు అరుణిమనై/ సరాగాల విపంచినై, సునాట్యాల మయూరినై

నవ వసంతం మోసుకురానా నీ మనస్సునై/ స్నేహకాంతులు తీసుకు రానా ఉషస్సునై

**79 మాడుగుల బాస్కర శర్మ - ఎం ఏ ఎం ఇడి కాళేశ్వరం**

జవాహర్‌నవోదయ విద్యాలయం మామునూరు వరంగల్‌జిల్లాలో హిందీ పి జి అధ్యాపకులు పద్యం గేయం వ్యాసం వీరి అభిమాన రచనా ప్రక్రియలు అమెరికా న్యూజెర్సీ - తెలుగు జ్యోతి, ఆస్ట్రేలియా - తెలుగు వెలుగు, ప్రవాసాంధ్రుల మాతృభాషా పత్రికలు వీరి రచనల ప్రచురించాయి జాతీయ హిందీ సదస్సుకు 1993లో వీరు ఆహ్వానించబడ్డారు మన పత్రికలలో ఆకాశవాణిలో వీరి కవితలు ప్రచురణ ప్రసారం పొందాయి

**80 ఆడెపు నారాయణ కవి - హన్మాజిపేట జ. 15 ఆగస్టు 1933**

1 ఆదిశేషుడు శేషన్, 2 అమరుడు అలిశెట్టి ప్రభాకర్, 3 చేనేత కార్మికుల కడగండ్లు వీరి అముద్రిత రచనలు 1997లో సిరిసిల్ల సిహెచ్ రాజలింగం గారితోపాటువీరిదో పాట 'జన్మభూమి కార్యక్రమ ప్రబోధ కవితాబులిటెన్‌గా ప్రచురించారు "కవిత్వం అభివృద్ధికి బలమైన సాధనం" అనే డా సి నారాయణ రెడ్డి గారు వీరి అభిమాన కవి అన్నారు

**81 చొప్పదండి విశ్వనాథం - సిరిసిల్ల, జ 1939 అధ్యాపకులు**

వీరు చాల కాలంగా గేయాలు - వచన కవితలు రాస్తున్నారు అనేకం పత్రికల్లో ప్రచురితం

**82 రాజూరి విశ్వనాథం గుప్త - సిరిసిల్ల జ 16-10-1929**

చదువు మిడిల్ క్లాస్, యువ దశలో వీరు1945 - 48 మధ్య, గోలకొండ, కృష్ణా పత్రికలకు విలేఖరి జయవాణి న్యూస్ పేపర్ ఏజెంట్‌గా 20 సం॥లు గడిపారు 1954 లో బాలభారతి, గేయములు, సుజాత, స్వరాజ్యకథ, కథానికలు "విశ్వం" అను కలం పేరుతో చిన్న పుస్తకాలుగా అచ్చు వేశారు నాటి పత్రికల్లో వీరి కథలు కవితలు వచ్చాయి 1997లో భాగ్య నగరం నుండి 'వైశ్యరత్న' అవార్డు పొందారు క జి ర చ లో వీరు పద్యకవులనే ఉంది పై విషయాలు రచయిత సె 97 లేఖలో స్వయంగా తెలిపారు

ఇంకా 'కరీంనగర్ జిల్లా రచయితల చరిత్ర' 1981 లోని గేయ కవులు వీరు —

**83 ఎం శ్రీనివాస్ - ఎం ఎస్సి, హుజూరాబాద్ సమీప గ్రామం**

నిప్పురవ్వలు' అను పేరుతో 1975 లో ఓ కవితాసంకలనం ప్రచురించారు బ్యాంక్ ఉద్యోగిఅని ఉంది వీరు ఎన్ శ్రీనివాస్, ఎం కాం కందుగుల, పత్రికా విలేఖరి కావచ్చును

**84 కానుగుల వెంకట రెడ్డి - మెట్‌పల్లి హుజూరాబాద్ (పెద్దపల్లి క్యాంపు)**

గేయాలు నాటికలు రాశారు ఇప్పటికి కవి సమ్మేళనాల్లో ఉత్సాహంగా పాల్గొంటున్నారు

**85 వేముగంటి రామారావు** - బి ఏ పరివేద హుస్నాబాద్ - 1967

వీరు కథారచయిత కవి వీరి రచనలు పత్రికలలో వచ్చాయి, ఆకాశవాణి ద్వారా ప్రసారం అయినాయి

**86 అలివేలు వెంకటరెడ్డి** - టేకుర్తి హుజూరాబాద్ అధ్యాపకులు

వచన కవితలు బాలగేయాలు రచించారు

**87 నెమిలి కొండ వరప్రసాద్** - బి ఓ ఎల్ ఎం ఏ వేములవాడ

నాడు వేముల వాడ సంస్కృత పాఠశాలలో ఉపాధ్యాయులు నేడు కరీంనగర్ సంస్కృత పాఠశాల ప్రధానోపాధ్యాయులు వీరు కవి వ్యాస రచయిత

**88 మున్ననేని రాజేశ్వరరావు**- బి కాం తిమ్మాపూర్

గేయాలు - నాటికలు రచించారు వీరు రంగస్థల, టి వి నటులు

**89 ఇనుకొండ నరసింహారెడ్డి**- బి ఎస్సి మల్లాపూర్ మం తిమ్మాపూర్

హైదరాబాద్‌లో లాబ్ టెక్నిషియన్‌గా ఉద్యోగం వచన గేయకవి

**90 డా జి వెంకటయ్య** - ఆర్ ఎం పి హుస్నాబాద్ కీర్తిశేషులు

వీరు నటులు గాయకులు ఎన్నికల సందర్భాల్లో పలు జానపద బాణీ ప్రచార గేయాలు రాసేవారు

**91 ఎలుముల రాంరెడ్డి** - ఎం కాం పూడూరు - సర్పంచ్

కాలేజీ కాలంలో కథలు కవితలు తర్వాతి కాలంలో దేశాభ్యుదయ గేయాలు రచించారు

**92 రంగా గుండయ్య** - ఎం ఏ బి ఓ ఎల్ ధర్మపురి

ఆదిలా బాద్‌లో తెలుగు అధ్యాపకులుగా (ప్రస్తుతం లెక్చరర్) ఉన్నారు ఆ జిల్లా కవుల కవితల సంపుటి 'శైవలిని'కి సంపాదకత్వం వహించారు వీరు వచన కవితా రచయిత

**93 వి శ్రీధర్ రావు**- బి ఏ షానగర్ కీర్తిశేషులు

గోలకొండ కవుల సంచిక మూడేపల్లి గోపాల రావుగారికి దౌహిత్రులు వీరు అధ్యాపకులు . అప్పుడప్పుడు కవితలు వ్రాసేవారు అల్ప వయస్సులోనే మృతి చెందారు

**94 ఎర్రోజు గోపాలస్వామి** - సహకారశాఖ అడిటర్ ప్రగతిశీల గేయరచయిత

**95 టి నవనీతరావు** - బి ఏ బి ఇడి జీలుగుల

జి ప సెకండరీ పాఠశాలల ప్రధానోపాధ్యాయులు సంప్రదాయ భావాల అభిమానంతో వీరువచన గేయకవితలు రచించారు

**96 నూరోజు ఆంజనేయులు** - బి ఓ ఎల్ బేతిగల్ టీచర్, గేయరచయిత

**97 ఆర్ గణపతి** - బి ఏ ఆంధ్రబ్యాంక్ ఉద్యోగి కరీంనగర్

కేరళ జన్మస్థలమైన కరీంనగర్‌లో స్థిరపడ్డారు వీరు వచన గేయకవి

**98 ఉమ్మెంతల వెంకటరెడ్డి** - ముంజం పల్లి

'విద్యుల్లత' పత్రికా సంపాదక మండలిలో వీరొకరం గేయాలు కథలు రాశారు

**99 కె మురళీ మనోహర రాజు**- ఎం ఏ బి ఓ ఎల్ కొడిమ్యాల

తెలుగు పండితులుగా ప్రభుత్వోద్యోగం చేసి రిటైర్ అయినారు వీరు పద్య గేయకవి

**100 రంగనాయకుల శ్రీనివాస్ - సిరిసిల్ల**

'రక్తపు చుక్కలు' కవితా సంకలనంలోనూ, ఇతర పత్రికలలోనూ వీరి కవితలు వచ్చాయి

**101 కొక్కుల ఆనంద్ - మల్యాల**

1975 సుమారుగా విశ్వనాథ అభిమానిగా సంప్రదాయ వాది అనిపించారు 81నాటికి శ్రీశ్రీ అభిమానిగా మారినారు నాడు వచన కవితలు వ్రాసేవారు జగిత్యాల్లో వ్యాపారంలో స్థిరపడిన వీరు ఇప్పుడు రచనలు చేస్తున్నట్లు లేరు

**102 కె దేవేందర్ - వేములవాడ**, సామ్యవాద కవితా రచయిత

**103 పవన్ కుమార్ - ఎ ఎం ఐ సిరిసిల్ల** వచన కవితారచయిత

వరంగల్లు ఈశ్వర' కవితాసంకలనంలో ఈ ఇద్దరి కవితలు కనిపించాయి

**104 అర్ క్యూబ్ (రెడ్డిరత్నాకర్ రెడ్డి) ఎం ఏ గంగిపెల్లి**

**105 శ్రీవీణ - పవర్ హౌజ్ కాలనీ - గోదావరి ఖని**

**106 డా తాడూరి జోగాచారి - ఎం కాం పిహెచ్ డి కాకతీయ ప్రొఫెసర్ జ. 1951**

జోగాచారి గారిది హుస్నాబాద్ మండలంలోని అంతకపేట వీరి కవిత డా ఆర్ మాధవరావు గారి సంపాదకత్వంలో హన్మకొండ నుండి వెలువడిన 'చిగుళ్ళు - శిఖరాలు' 95లో ఉంది ఇంకా - రజనిశ్రీ హుస్నాబాద్, అల్లాణినారాయణ, నవీన్ - మెట్టుపల్లి కేతిరి సుధాకర్ రెడ్డి హుజూరాబాద్, సదానందరావు - జమ్మికుంట, గట్లమధూకర్ మంథని, రామకృష్ణ-ధర్మపురి భూపతిరాజు, సత్యం రాజు, సుమనశ్రీ - కరీంనగర్ మొ॥ పలువురు కవితలు రాస్తున్నారు

కావ్యకర్తలైన గేయకవుల కవితలు కవితా సంకలనాల్లో, సంచికల్లో, పత్రికల్లో కనిపిస్తున్నా వారి పేర్లను ఈ శీర్షికలో స్పృశించలేదు ఎందరో గేయకవులు నాకు సన్నిహితులను కూడా విధిలేక వదలి వేయవలసి వచ్చినందుకు చింతిస్తున్నాను

ఇక సంస్థల గేయ సంకలనాల, క్యాసెట్టు కవుల పరిచయం చేయవలసి ఉంది

**గేయ సంకలనాలు** రెండు వచ్చాయి

**1 ఉజ్వల గేయాలు** - 1992 ఇది 'కరీంనగర్ జిల్లా వయోజన విద్యాశాఖ' వారు, 'అక్షరోజ్వల' నిరక్షరాస్యతా నిర్మూలన కార్యక్రమంలో భాగంగా ప్రచురించిన ప్రచార గేయ సంకలనం జిల్లా అక్షరోజ్వల అధ్యక్షులైన కలెక్టర్ గారి యాజమాన్యంలో స్థానిక 'సమతాసాహితి' సహకారంతో ఈ గేయ సంకలనం వెలువడింది విషయసూచిక గేయాలకు వరుస నంబర్లు కూడా సంపాదకులు వేయలేదు 40 పుటల్లో దాదాపు 35 గేయాలున్నాయి ఇందులో లబ్ధ ప్రతిష్టులైన కవులవి, ఔత్సాహికులైన అక్షర ఉజ్వల కార్యకర్తలవి ఒక్కొక్క గేయం మాత్రమే చేర్చడం విశేషం ఈ గేయాల్లో కొన్ని లలిత గీతాలు, కొన్ని జానపద బాణీ పాటలు - ఉన్నాయి

వీటిలో మలయశ్రీ గారి 'అక్షర దీపం వెలిగించు'
విష్ణుదాస సాంబశివ రావు గారి 'హలంపట్టి దున్నేటోడ'
డి వి మురళీమోహనాచార్యగారి 'ఏలి ముద్దరెన్నాళ్లురో'
రాస భూమయ్యగారి 'అక్షరం పిలుస్తున్నది' మొ॥ పాటలు ముద్రణకు ముందే అధిక జనవ్యాప్తి పొందినట్టివి

డా బి దామోదర రావు డా బి లక్ష్మణ్‌రావు, వేణుశ్రీ దాసరి గంగాధర్, పొన్నూరు హైమవతి గారల కవితలు ఉయ్యాల పాటలు

దూడం నాంపల్లి, సుద్దాల అశోక్, కేతిరి సుధాకర్ రెడ్డి, సిహెచ్ రమణాచార్య, తిప్పర్తి సత్యనారాయణ కల్వకుంట వేదాంతాచార్య, నంబి రాజేందర్ శర్మ, మార్గం లక్ష్మీరాజం గారలవి జానపదశైలి పాటలు

వకుళాభరణం జగన్మోహన్‌రావు, కె వెంకటరెడ్డి, నాగుల చిన్నయ్య, రుద్రమాణిక్యం జైన శ్రీనివాస్, శ్యాం రాధిక మొ॥ వారు ఈ సంకలనంలోని ఇతర కవులు

ఇది ప్రచార సాహిత్యమైనా ఈ సంకలనంలోని కొన్ని గేయాల కవితాశక్తి, కవుల ఆశయస్ఫూర్తి పాఠకులను శ్రోతలను ఆకట్టుకునేలా ఉన్నాయి

**2 దళిత పాటలు** - 1993 ఇది 'దళిత రచయితల కళాకారుల మేధావుల ఐక్యవేదిక కరీంనగర్ జిల్లా తరపున జగిత్యాల విశాల సాహిత్య అకాడమీ' వారు ప్రచురించిన పాటలపుస్తకం దళిత జనాభ్యుదయం ధ్యేయంగా వచ్చిన ఈ సంకలనంలోని 71 గేయాల్లో 6 ఇతర జిల్లాల కవులవి 65 ఈ జిల్లా కవులవి

ఇంతకు పూర్వమే స్వీయగేయ సంపుటాల ప్రచురణ పొందిన మలయశ్రీ - సుద్దాల అశోక్‌లవి 7+3 = 10 పాటలు తప్ప మిగితా 55 పాటలు కొత్త కవులవే

వీటిలో - కె రాంలక్ష్మణ్, జగిత్యాల 10 , డా ఆదినారాయణ, వేములవాడ - 9

ఆనంపల్లి తిరుపతి - 5 బొమ్మక వెంకటేశ్వర్లు - 4

గొట్టె లింగయ్య - 3, రుషి రమేశ్ - 3, మంతెన లింగయ్య - 3,

ఆరెంద నాగరాజ్ - 2 కస్తూరి అంజయ్య - 2 అల్లాణి నారాయణ - 2

మిగితా వాళ్లు ఒక్కొక్కపాట రచించారు ఈ పాటల అన్నింటి సారం ఇంచుమించు ఒక్కటే అది కులమతాలను, ధనికుల అగ్రజాతుల పెత్తనాన్ని నిరసించడం, ఎస్ సి , ఎస్ టి బి సి శ్రామిక దళితజనుల ఐక్యతను విజయాన్ని కోరుకోవడం ఇందులో తరతరాలుగా సాగివస్తున్న వర్ణాహంకారాన్ని, వర్గ దోపిడిని కవులు విమర్శించారు కొందరు అంబేద్కర్‌కు జోహారులర్పించారు మరికొందరు కులాల వారీగా శ్రమగీతాలాలపించారు పురుషాహంకారం నుండి స్త్రీ విముక్తిని కాంక్షించే గేయాలు కూడా కొన్ని ఇందులో ఉన్నాయి సాంఘిక చైతన్యం సమానత్వం మానవత్వం ఈ కవుల ప్రధాన ఆశయంగా ఉంది ఈ సంకలనం పాటల్లోని భావాలు కొన్ని శ్రుతిమించినా లయ కొంత శ్రుతి తప్పినా, ఈ నవయువ కవుల కవితల్లోని స్వాభిమానస్ఫూర్తి, సమరోత్సాహదీప్తి ఒక పక్షం వారికి కటుత్వంగాను మరొక పక్షం వారికి పటుత్వంగాను వినిపించే విధంగా ఉన్నాయి

ప్రశ్న చైతన్యానికి గుర్తు తరతరాలుగా అణగారి వెనుకబడిన దళిత జాతులు ఈనాడు న్యాయం కోసం, తమహక్కుల కోసం పోరాటానికి పూనుకుంటున్నాయి ఇది యుగధర్మం

## క్యాసెట్ కవులు ·

కరీంనగర్ జిల్లాలో వెలువడ్డన్ని ఆడియో క్యాసెట్లు మరే జిల్లాలోనూ వెలువడలేదంటే అతిశయోక్తి కాదు ఈ మూడేండ్లుగా ఓ ముప్పది క్యాసెట్ల వరకు వచ్చాయి అందులో జానపద గీతాలవి ఎక్కువ వాటిలో సేకరించిన పాటలకన్నా జానపద బాణీలలో కవులు వ్రాసుకున్నవి ఎక్కువ మరికొన్ని లలిత శృంగార గీతాలవి - శాస్త్రీయ సంగీత భక్తి పాటలవి కూడా ఉన్నాయి

డిండిగాల రవీందర్, ఎం ఎస్సి, మల్యాల గారు ఈ క్యాసెట్ల నిర్మాణానికి ఈ జిల్లాలో మొదటివారు ఆ వరుసలో గొల్లపల్లి రవీందర్, చిత్రకార్ ప్రభాకర్ కరీంనగర్, గుండేటి రమేశ్,

చామన పల్లి, బైరి నరసయ్య కోరుట్ల మొ వారి క్యాసెట్లు వచ్చాయి వీరంతా స్వయంగా పాటలు వ్రాసుకొని గానం చేశారు

డిండిగాల రవీందర్ గారివి12 క్యాసెట్లువచ్చాయి అందులో అయిదు భక్తిపాటలవి గుండేటి రమేశ్ గారివి 5,6 కాసెట్లు వచ్చాయి మిగితావి జానపద శైలిగేయాలు జానపద బాణీల్లో సుద్దాల బాలయ్య సిరిసిల్ల గారి పాటలు, మిద్దెరాములు హన్మాజీ పేట ఒగ్గుకథ బహుళ వ్యాప్తి పొందినవి

ఈ ఊపులో సిద్ధివినాయక, శ్రీరాజరాజేశ్వర, సాయిబాబా, స్వామి అయ్యప్ప, గీతమాలికా కృతులు మొ భక్తి పాటల క్యాసెట్లు వచ్చాయి వీటి గేయ రచయితలు డా సంగనభట్ల, నేరెళ్ల శ్రీనివాసాచార్య - ధర్మపురి, వి రాములు - రమేశ్ - వేములవాడ, పి రాజేశ్వర శర్మ - కోరుట్ల, ఆర్ చంద్రమౌళి సిహెచ్ ప్రవీణ్, ఆర్ మురళీధర శర్మ మంధని, మొ॥ వారు వీటిని ఈ జిల్లా గాయకులేకాక కొన్నింటిని భాగ్యనగర ప్రముఖ గాయనీ గాయకులు కూడా పాడారు

డా రావికంటి వసునందన్ గారు రామ పేరుతో ఆనంద్ గారి స్వరకల్పనలో సినీగాయనీ గాయకులతో రామాయణ కథా గేయకావ్యం క్యాసెట్లుగా రూపొందించారు వడ్డేపల్లి కృష్ణ గారి 'పుణ్యక్షేత్ర' గేయాలు కూడా సినీగాయనీ గాయకులు గానం చేశారు

రాజేశ్వర, సాయిబాబా క్యాసెట్లకు ధర్మపురి వాస్తవ్యులు నంది అవార్డు గ్రహీత లక్ష్మణసాయి గారు సంగీత దర్శకత్వం వహించారు

జగిత్యాల వరకవి కీ శే జైశెట్టి రాజయ్య గారి రాజేశ్వర భక్తి పాటలు పద్యాలు వారి మనుమల కృషితో కీ శే ఘంటసాల గారి కుమారులు విజయకుమార్ గారు గానం చేశారు

క్రైస్తవ భక్తి గీతాలను శ్రీమతి మేరీజ్యోతి, టి వి సాలమన్‌రాజు, కృపానందం మొ॥ వారు వెలువరించారు ఈ జిల్లా అక్షర ఉజ్జ్వల వారు వయోజన విద్యా ప్రచారం కోసం రెండు క్యాసెట్లు మనోజ్‌కుమార్ స్వరకల్పనలో రూపొందించారు ఆ పాటలకు రచయితల పేర్లు లేవు గాయకులు స్వయంగా కూర్చుకొన్నవి అవి ఆ మాత్రంగానే ఉన్నాయి

ఒక విశేషాంశ మేమంటే - ప్రజా ఉద్యమాలకు ఓ పదేండ్లుగా కరీంనగర్‌జిల్లాది పెట్టింది పేరు ఇక్కడి నుండి తిరుగుబాటు కవితలు కథలు కావ్యాలు గణనీయంగా వచ్చాయి కాని, విప్లవగీతాలతో ఏ ఒక్క క్యాసెట్టు కానీ ఇక్కడ ఇంతవరకు రూపొందింపబడలేదు

ఈ క్యాసెట్ల నిర్మాణం ఎక్కువగానే ఉన్నా, వీటిని రాష్ట్ర రాష్ట్రేతర ప్రముఖ క్యాసెట్ పంపిణీ సంస్థలు హక్కులు కొని విడుదల చేస్తున్నా, ఇక్కడి క్యాసెట్ నిర్మాతలైన కవి గాయకులు లేదా గాయక కవులు నష్టపోయారే తప్ప లాభపడలేదు

సినిమాల వలన నాటకాల వలనే సినీగీతాలపైన జనానికి కల మోజు కారణంగా వ్యాపారవేత్తల నుండి ఆశించిన ఫలిత ఈ కలందళం కళాకారులకు లభించటం లేదు

## గేయ సాహిత్య సమాలోకనం

తెలుగు పద్య కవిత్వం వెయ్యేండ్ల చరిత కలదైతే, ఆధునిక గేయం పుట్టి అంతా వందేండ్లు కూడా కాలేదు ఈ జిల్లాలోని గేయకవిత మహా అయితే అరువదేండ్లది సి నా రె గారితోనే 1953నుండి ఇక్కడ గేయ పుస్తకాల ముద్రణ ఆరంభమైంది ఈ నలుబది ఏండ్ల కాలంలో గేయ రచనాభిమానులు ఎంతగానో పెరిగారు ఛందస్సు బంధాలు సడలి కవితారంగంలో పలురంగాల విద్యావంతులు పాండిత్యం ప్రమేయం లేకుండా చేరుకున్నారు విషయవైవిధ్యం సమకూరడం, కవితా వ్యాప్తి కావడం వచన కవిత్వం వల్ల చేకూరిన లాభాలు వచన కవిత్వం పద్యకవిత్వాన్ని

తెరమరుగు చేస్తున్నమాట సత్యం కాని ఇదమిత్థంగా దీనికో ఛందస్సు అంటూ లేకపోవడంతో, వచనమే కదా స్వేచ్ఛగా వాక్యాలు విరిచి పదాలు పేర్చి వ్రాస్తే సరిపోతుంది అనే భావం వచన కవుల్లో బలపడింది దానితో భాషా స్వరూపం కవితా సౌందర్యం తెలియనివాళ్ల కూడా కలాలు పట్టడంతో నవ్య కవిత్వంలో కొంత అస్తవ్యస్త పరిస్థితి ఏర్పడింది అనగననగ రాగమతిశయిల్లుచు నుండు అన్నట్లుగా కాక, కొన్నిసార్లు ఇది దినదినం 'తీసి కట్టు నాగంభొట్టు అన్నట్లుగా ఉంటున్నది మాన్య సామాన్య, రచనలు ఏ సాహితీ ప్రక్రియలోనైనా ఏకాలంలోనైనా ఉన్నవే నాడందరు గొప్పకవులే అయితే పూర్వకావ్యాల్లో కుకవి నిందలెందుకుండేవి? నేడైనా అంతే

మానవతావాదం అంతర్జాతీయ దృక్పథం వచన కవితకు ఈ యుగ ప్రభావంగా చేరుకున్న సుగుణాలు సామ్యవాద భావాలు మనకు దేశ స్వాతంత్ర్యానికి ముందే సంక్రమించాయి వచన కవిత్వం ఆధునిక భావాలతోనే పుట్టింది - పెరిగింది ఈ ప్రక్రియలో పద్యకవిత్వంలో వలె భక్తి రచనలు లేవు అనొచ్చు! పద్యానికి వచన కవిత్వానికి మధ్యలో మాత్రాఛందోగేయ కవిత్వం వచ్చింది మాత్రాఛందం పద్య కవితకు సమాంతరంగా నడిచింది, రానురాను అది పద్యాన్ని వెనుకకు నెట్టింది అదే మార్గంలో మాత్రాఛందం కవిత్వాన్ని, వచన కవిత కనుమరుగుచేస్తున్నది అందుకు కారణం అవి ఒకదానికంటె మరొకటి రచనా సౌలభ్యాన్ని ఎక్కువగా కలిగి ఉండటమే

మాత్రాఛందోగేయం అదృశ్యం కాలేదు మరో మారు రూపంతో పాటగా అవతరించింది

మాత్రా ఛందస్సు కొత్తది కాదు పూర్వపద్యకావ్యాల్లోని రగడలు ద్విపదలు, యక్షగాన దర్వులు వేదాంత తత్వాలు, భజన కీర్తనలు దీనికి మాతృకలు

పల్లవి అనుపల్లవి చరణాలతో శాస్త్రీయ కృతుల మాదిరిగానే కొత్తరూపంలో లలిత శృంగార దేశభక్తి గీతంగానూ, సామ్యవాద విప్లవ గేయంగానూ అది కొత్తరూపాలు ధరించి ఈ రెండు రూపాల్లోనూ చక్కని చిక్కని భావాలతో గేయ కవిత్వం ఈ జిల్లాలో వచ్చింది - వస్తున్నది ఈ పాట ప్రభావంగా వచన కవిత వెలవెల పోతున్నది వచన కవితల పాఠకులకంటే రచయితలే ఎక్కువ సంఖ్యలో ఉన్నారు - అనే విమర్శ ఉంది ఇది ఈ ఒక్క జిల్లాకే పరిమితం కాదు రాష్ట్రమంతటా ఉన్న నేటి కవిత్వపరిస్థితి ఇదే

మాటతోపాటే పాట పద్యానికంటె ముందుగా పుట్టింది అవిద్యావంతులైన గ్రామీణుల్లో, ఆటవికులలోనూ పాటకు వ్యాప్తి ఆదరణ ఎక్కువ ఇది పండితులను పామరులను సమానంగా అలరిస్తుంది అందుకే పాట చిరంజీవి మాట ఉన్నంత కాలం పాట ఉంటుంది మిగితా కవితా ప్రక్రియలన్నింటికంటె పాటకు జనాదరణ అధికం అందుకే జానపదులకు సంస్కారాన్ని - విజ్ఞానాన్ని - రాజకీయాన్ని ప్రబోధించడానికి, మన ప్రభుత్వం వారు, పార్టీల వాళ్లు, జానపద గేయాలను ఎక్కువగా ఉపయోగిస్తున్నారు ఎన్నికల పాటలు పోరాటం పాటలు ఈ సందర్భంలో ముఖ్యంగా చెప్పుకోదగినవి

భవిషత్తు విషయం వదలి వర్తమాన స్థితిని పరిశీలిస్తే గేయ కవితలో మాత్రాఛందం, వచన కవిత, మినీ కవిత, లలితగేయం జానపద గీతం, విప్లవ గేయం అన్ని రకాలుగాను ఈ జిల్లా అగ్రగామిగా ఉంది ఇక్కడ గేయ ప్రక్రియల్లో గణనీయమైన కావ్యాలు వచ్చాయి జనుల జానపదుల గుండెల నలరించడంలో పాటు పత్రికల నలంకరించాయి రేడియో, టి వి , సినిమాల్లో వినిపించాయి రాష్ట్ర కేంద్ర అవార్డుల నందుకోవడంతో పాటు భారతదేశ అత్యున్నత గౌరవ సాహితీపురస్కారమైన జ్ఞానపీఠ బహుమతిని అందుకున్నవి ఇది కరీంనగర్ జిల్లా గేయకవితకు దక్కిన అపూర్వ సన్మానం

కవితా వస్తువును చూస్తే పద్యంలో వలె గేయ కవితలో అన్ని రకాల భక్తి విరక్తి, స్తుతి - అధిక్షేపభావాలు వచ్చాయి మాత్రాఛందం శృంగారం, దేశభక్తి, సంఘసంస్కార భావాలను ప్రచారం

చేసింది వచన కవితలు, మినీ కవితలు సంఘాన్ని, కులాన్ని మతాన్ని, ప్రభుత్వాన్ని విమర్శించాయి లలిత గేయాలు మాత్రం శృంగారం భావాలతో, ప్రభుత్వస్తుతితో నీతి ప్రబోధాలతో ఉన్నాయి

లలిత గీతాల ప్రసారం చేసే ఆకాశవాణి, టెలివిజన్ కేంద్రాల నిబంధనలు, వీటిని పాడుకునే గాయకుల సమావేశాల - పర్వాల అభిరుచులు, సినిమా నిర్మాతల నియమాలు కవుల కలాలను అలా నడిపించి ఉంటాయని ఒప్పుకోక తప్పదు

వచన కవితలు ప్రచురించే పత్రికలు కొంతవరకు రచయితలకు భావస్వేచ్ఛనిచ్చాయి కవులు స్వయంగా ప్రచురించుకున్న సంపుటాలే వారి మనోభావాలకు నిదర్శనంగా నిలిచాయి

కోస్తాంధ్రలో ఈ శతాబ్ది పూర్వార్థంలో వచ్చిన భావకవితా ప్రభావం ఈ జిల్లాలో రాలేదు తర్వాతి అభ్యుదయ విప్లవ భావాల ప్రభావం జాస్తిగా పడింది ఆ ప్రభావంతో అ ర సం , వి ర సం లలో ఇక్కడి కవులు చేరుకున్నారు విరసంది ఇప్పటికీ ఇక్కడ పైచేయిగా ఉంది సరస కవిత్వం ఎప్పుడూ ఉన్నదే అది నొప్పించని తానొవ్వని కాలక్షేప కవితా సంవిధానం కదా!

"ప్రతి యుగంలోనూ ఆయుగానికి ప్రాతినిధ్యం వహించే సాహిత్యం వుండగా విదేశీ ప్రభావాల వల్లనో పాత సాహిత్య యుగాలకు చెందిన రూపాల పునరుద్ధరణ వల్లనో కొంత ఇతర సాహిత్యం వుంటుంది భారతదేశపు ప్రత్యేక చారిత్రక పరిస్థితుల కారణంగా ఈ స్థితి తెలుగు సాహిత్యంలో మరీ ఎక్కువ అధివాస్తవిక ధోరణులూ, పురాణ కవిత్వ రీతులూ, భావకవితా రూపాలూ అభ్యుదయ కవితా యుగంతో పాటుగా ఒకే కాలంలో కనిపిస్తాయి"[1] అది నిజం

"బ్రిటిషు ఆంధ్రా జిల్లాల్లోని వైవిధ్య భరితమైన, విస్తృతమైన సాంద్రతరమైన సాహితీక్రమాన్ని అతి తక్కువ కాలంలో అందుకోవటమనే అత్యంత భారం తెలంగాణా కవులూ రచయితలూ మోయవలసి వచ్చింది"[2] కరీంనగర్ జిల్లా ఉత్తర తెలంగాణలోనిదే

భారతదేశ స్వాతంత్ర్య లబ్ధి వరకు ఈ దేశంలో ఆంగ్లభాష పెత్తనం ఉండేది తెలంగాణా ప్రాంతం నైజాం రాజ్యంలో ముస్లిం నవాబుల పాలనలో ఉండేది కాబట్టి ఇక్కడ ఉర్దూ ప్రాబల్యముంది దేశానికి స్వాతంత్ర్యం వచ్చింది 15 ఆగష్టు 1947 అయినా, హైదరాబాద్ స్టేటులో మాత్రం రజాకార్ల అల్లరుల కారణంగా మరో ఏడాది ఆలస్యంగా 17 సెప్టెంబరు 1948 నాడు విముక్తి లభించింది

అప్పుడు తెలుగు భాషకు ఆదరణ పెరిగి, తెలుగు కవులకు స్వేచ్ఛ లభించింది

1వ అక్టోబర్ 1953లో ఆంధ్రరాష్ట్రం రూపొందినప్పుడు అందులో తెలంగాణా పౌరులు భాగస్వాములు కారు కేవలం ప్రేక్షకులుగానే ఉండిపోయారు తెలంగాణా కవులు నూతన రాష్ట్రానికి అభినందనలందించారు విశాలాంధ్ర సాధనకు నాయకులతోపాటు ఉపక్రమించారు

1వ నవంబర్ 1956లో ఆంధ్రప్రదేశ్ అవతరించినప్పుడు మాత్రం ఇక్కడి తెలుగువారు కోస్తా రాయలసీమాంధ్ర సోదరులతో కలిసిపోయారు రాజధాని హైదరాబాద్ కూడా తెలంగాణా ప్రాంతానిది అయింది తెలుగు భాష రాజ భాషగా విద్యామాధ్యమంగా మారటంతో తెలుగు వర్ధిల్లింది తెలుగు సాహిత్యం అభివృద్ధి చెందింది క్రమంగా తెలంగాణా కవులు కోస్తాంధ్ర కవుల సాహిత్యంతో మమైక్యం చెంది రచనలు సాగించారు

కరీంనగర్ జిల్లాలో 1950కి పూర్వం ఆధునిక గేయ కవిత్వ వ్యాప్తి లేదు తర్వాతనైనా సిద్ధాంతాల బలంకంటే ప్రముఖ కవుల కావ్యాల ప్రభావం వల్లనే ఇక్కడి కవులురచనలు వెలువరించారనడానికి నిదర్శనాలున్నాయి జాషువా, కరుణశ్రీల ప్రభావం ఇక్కడి పద్య కవులపై ప్రసరించినట్లే, గేయకవిత్వంలో గురజాడ - ముత్యాల సరాలు, నండూరి - ఎంకిపాటలు, విశ్వనాథ - కిన్నెరసాని పాటలు ఇక్కడి వారి నాకర్షించాయి శ్రీశ్రీ మహా ప్రస్థానం వామపక్షీయులపై

చెరగని ముద్రవేసింది భావ కవిత్వాన్ని అభిమానించకున్నా ఇక్కడి కవులు అధివాస్తవిక ధోరణిని కొంత అనుసరించారు వచన కవిత్వ రచనలో పరాభి పిడేల్ రాగాలు, ఆరుద్ర - త్వమేవాహం శిల్పాన్ని ఇక్కడి నవ కవులు అనుసరించారు మరో వైపు సినిమాపాటల ప్రభావం ఉండనే ఉంది దేశ విదేశ రాజకీయ పరిస్థితుల ప్రతి స్పందనగానూ ఇక్కడి ఆధునిక కవిత్వం పరిణతి చెందింది సంప్రదాయ సామ్యవాద భావానుయాయులు ఇక్కడ సమానంగా ఉన్నారు భావకవిత్వం వలెనే అరాచకవాదం, దిగంబర కవిత్వం చేతనావర్తం సిద్ధాంతాలు ఈ జిల్లాలో ఆదరింపబడలేదు ఆదరించి అనుసరింపబడినవి పరస్పర విరుద్ధాలైన సాంప్రదాయ సామ్యవాద (అరసంవిరసం) మార్గాలు మాత్రమే సంప్రదాయ ప్రేమికుల్లోనూ ఇక్కడ పిడివాదులు తక్కువే కాని, సామ్యవాదంలో అనేక విభేదాలు విభాగాలు ఏర్పడి ఆయాశాఖల అభిమానించే కవులున్నారు డా ముదిగొండ వీరభద్రయ్య గారి మాటల్లో ' ప్రతి మహాసిద్ధాంతమూ స్వార్థ పరుల చేత భ్రష్టుపట్టించబడింది అందువల్ల ఆర్థిక వ్యవస్థ బాగు పడి పీడన అరికట్టబడినప్పుడే సిద్ధాంతాలు సంఘంపై ఎక్కువ ప్రభావాన్ని వేయగల్గుతాయి "[3]

ఆ పరిస్థితి ఏర్పడింతర్వాత ఈ సిద్ధాంతాల రాద్ధాంతాల అవసరం ఉండకపోవచ్చు మరో ప్రముఖమైన ప్రశ్న, కవికి కమిటిమెంట్ అవసరమా? కాదా? అనేది

"ఏ రాజకీయ ఇజాలకు నిబద్ధుడైనా వ్యక్తి జీవితం యొక్క విభిన్న కోణాలని చూడలేడు అందువల్ల సమగ్ర దృష్టి నశించి మానవుడు వికాసాన్ని పొందలేడు" దేవరకొండ బాలగంగాధరతిలక్[4]

అది స్థూల దృష్టికి సరిగానే తోచవచ్చు కాని సూక్ష్మంగా పరిశీలిస్తే ఏ ఇజం - సిద్ధాంతం లేని కవి రచనకు ఓ గమ్యం లేనట్లే ఆశయం అనేది స్థిరమై లేనప్పుడు ప్రబోధించే అంశం ఏముంటుంది? సాధించే ఫలితం ఏముంటుంది! కమిటిమెంట్ ఏ రచయితకైనా అవసరం

సంగీత చిత్రలేఖనాది కళాకారులవలెనే కవులు కూడా ఎవరేది కోరితే అది రచించుతా మనవచ్చు దాని వలన కవికి ఆదరం ఆర్జన పెరుగవచ్చు కాని, ఆ కవిని ఆదర్శ రచయితగా జనం భావించలేరు సౌందర్య సృష్టిలో ఉభయులూ సమానులే అయినా కళాకారులు భావాలు ప్రదర్శిస్తారు - కవి ప్రబోధిస్తాడు సాహిత్యానికి ఇతర కళలకంటె వ్యాప్తి, దాని ప్రభావం సమాజంపై జాస్తి ఏ రోటి దగ్గరిపాట ఆరోటి దగ్గర పాడే విధంగా, వాటంకొద్దీ ప్లేటు ఫిరాయింపు పద్ధతిలోకాకుండా ఓ నిర్దిష్ట సిద్ధాంతానికి కట్టుబడి రచించే రచయితలే సంఘంపై గొప్ప ప్రభావాన్ని వేస్తారు అటువంటి ధీశాలురే సమాజానికి ఆదర్శవ్యక్తులుగా ఎంచబడి సంస్తుతులందుకుంటారు

ఈ గేయ విభాగంలో ఈ జిల్లాలోని రకరకాల కవితా మార్గాలను - కవితలను కవుల పరంగా విలసిల్లిన సాహిత్యాన్ని స్థాలీపులాకంగా చూడడం జరిగింది సార గ్రహణం సమీక్ష సదీక్షణంకల పాఠకుల పని

"ఏది యెట్లున్నను ఎవరికి వారు అరలు కట్టుకొని ప్రయోగములు చేయు మనస్తత్వము ఈ దశాబ్దిలో చాల వరకం తరించి, అందరొక వేదిక మీద ఆసీనులై విభిన్న రీతులలో రచనలు చేసి మెప్పించుట ప్రత్యేకించి పేర్కొనదగినది ఈ లక్షణమును బట్టి చూచినచో ఈ కాలము కవిత్వము 'సమన్వయవాదము' నకు చెందినదేమో యనిపించును" డా సి నా రె 1961 [5]

అయినా సిద్ధాంత వైరుధ్యాలు ఈ జిల్లా గేయకవుల్లో సమాంతరంగా సాగివస్తున్నవి సమైక్యతా వాదులుగా కన్పించేవారు సాధారణంగా సంప్రదాయ భావాల వారే పరిస్థితుల ప్రాబల్యం వల్ల వేగం కొంత మందగించినా సామ్యవాద సిద్ధాంత ప్రేమికుల వేడి మాత్రం చల్లారలేదని ఇటీవల ఇక్కడ వెలువబడిన కవితా సంపుటాల పట్టి చెప్పవచ్చు

ఏ కవితా ప్రక్రియ ఉన్నతమైంది అనేదితెలువడానికి డా ఎన్ గోపి గారిఈ క్రిందిస్టేట్మెంట్ వినాలి "కవిత్వంలో అస్పష్టత, మార్మికత అంటూ కొంతకాలంగా అస్పష్టంగానే మార్మికంగానే చాలాచర్చ జరిగిపోయింది (కానీ జానకీ పేట అనుభవాన్ని దృష్టిలో ఉంచుకుంటే) అది ఎంత శుష్క చర్చో తెలుస్తుంది కవిత్వానికి నిర్వచనం చెప్పిన సభ అది ప్రజల మీద రాస్తే చాలదు ప్రజలకు అర్థమయ్యే రీతిలో, ప్రజల్ని కదిలించ గలిగే చైతన్యంతో రాసిందే అసలైన కవిత్వమని కవులు గుర్తించ గలిగేట్టు చేసిన సభ అది కవిత్వం క్రాస్ రోడ్స్‌లో వుంది అస్పష్టతలు సంక్లిష్టతలకు కాలం చెల్లి పోయింది ఇప్పుడు జనం పాడుకునే పాటలు కావాలి జనాన్ని కదిలించే కవిత్వం కావాలి" "ఉదయం" దినపత్రిక - 26-6 94 పు 3

జన మనోరంజక కాలక్షేప కవిత్వ సృష్టి ఎప్పుడూ ఉన్నదే అయినా, జన చైతన్యం కలిగించే రచనలే విలువైనవి ఈ మధ్య సామాజిక నైతిక మూల్యాల దిగాజార్చే వ్యాపార కవితా ప్రభావానికి గేయకవులు లోనవుతున్న ధోరణిమాత్రం సంభావ్యం కాదు కరీంనగర్ జిల్లాకవిత్వానికి కాద్దానా।

## పాదపీఠికలు

1 వెల్చేరు నారాయణ రావు గారి 'తెలుగులో కవితా విప్లవాల స్వరూపం' 1987 పీఠిక పుట 2
2 డా ఎన్ గోపి గారి 'నిలువెత్తు తెలుగు సంతకం సి నా రె వ్యక్తిత్వం' 1991 పు 5
3 ము వీ భ 'తెలుగు కవిత - సాంఘిక సిద్ధాంతాలు' 1990 పు 159
4 ఇజంలో యింప్రిజన్ అయితే యింగిత జ్ఞానం నశిస్తుంది ప్రిజమ్‌లాంటిది జీవితం, వేర్వేరు కోణాలను ప్రదర్శిస్తుంది - అమృతం కురిసిన రాత్రి పు 120
5 డా సి నా రె గారి 'ఆధునికాంధ్రకవిత్వము - సంప్రదాయము, ప్రయోగము' పు 652

---

*(ఈ గ్రంథం 3వ భాగం, 6వ అధ్యాయం, 3వ శీర్షిక 'గేయసాహిత్యం'లోని మొదటి 5, 6 పుటల పాదపీఠికలు పొరపాటున అక్కడ తప్పిపోయనవి ఇక్కడ చూపబడుతున్నవి )*

1 క్రీస్తుకాలపు శాతవాహన హాలుని గాథా సప్తశతిలో తెలుగు మాటలున్నాయి
2 నన్నయ్య భారతంలోని లయగ్రాహి మధ్యాక్కర తరువోజలు మొదటి పాటలే అంటారు
3 4 13వ శతాబ్ది పాల్కురికి సోమన్న పండితారాధ్య చరిత్ర బసవపురాణంలోని రచనల పేర్లు
5 కాకతి ప్రోలరాజు విజయగాధ "ఆగుండీగుండిత్తడిగుండు" అనే జాజిరి పాటగా ఈ ప్రాంతంలో వ్యాప్తిలో వుంది

డాక్టర్ సి నారాయణరెడ్డిగారి సాహిత్య వివరాలకు ఈ క్రింది రచనలు ఉపకరించాయి

1 తెలుగు విశ్వవిద్యాలయంవారు ప్రచురించిన 'ఏ ప్రొఫైల్' - 1990
2 రావూరిగారి 'వెన్నెల తెరచాప నారాయణరెడ్డి'
3 డా తిరుమల శ్రీనివాసాచార్యగారి 'నారాయణరెడ్డి సాహితీ మూర్తి' - 1981
4 డా ఎన్ గోపిగారి 'నిలువెత్తు తెలుగుసంతకం సినారె వ్యక్తిత్వం' - 1991

# 4. నవలా - కథా సాహిత్యం

తెలుగులో ఈనాడు అత్యంత జనాదరణ పొందుతున్న సాహిత్య రూపాలు కథలు, నవలలు ఈ జిల్లా నవలా సాహిత్య పరిచయం తర్వాత, కథా సాహిత్యాన్ని ఇదే ప్రకరణంలో చూడవచ్చు

## తెలుగు నవలా సాహిత్యం

తెలుగు నవల వయస్సు కేవలం వందేండ్లు అయినా ఇది ఈ వందేండ్ల కాలంలో దినదిన ప్రవర్ధమానమై ఇతర సాహితీ ప్రక్రియలైన కావ్యం ప్రబంధం నాటకం మొదలైన వాటి నన్నింటినీ వెనుకకు నెట్టి అధిక జనాదరణకు - వ్యాప్తికి నోచుకున్నది

నవల అచ్చంగా ఆంగ్ల భాషా సాహిత్యాల పరిచయం వలన తెలుగులో వచ్చిన నూతన ప్రక్రియ దీన్ని కన్నడ మరాఠీ భాషల్లో 'కాదంబరి' అని, తమిళంలో 'కదైనూల్' (అంటే - కథా పుస్తకం) అని, హిందీలో 'ఉపన్యాస్' అని కొత్తపేర్లు పెట్టుకున్నా - మనవాళ్లు మాత్రం 'నావెల్' అనే ఆంగ్లపదాన్ని చక్కగా నవల' అని మార్చి చేర్చుకున్నారు తెలుగులో మొదటి నవలా రచయిత కందుకూరి వీరేశలింగం పంతులు గారు తమ 'రాజశేఖర చరిత్ర' ను వచన ప్రబంధం అనే అన్నారు దీనిని మొదట సంస్కృత సాహిత్య మార్గంలో గద్యకావ్యం గానే మనవాళ్లు భావించినా, తర్వాతి వారు దీని ప్రత్యేకతను గుర్తించి 'నవల' అనే నామకరణం చేశారు

ఈ నూరేండ్ల కాలంలో కొన్ని వందల మంది రచయితలు - రచయిత్రులు, వేలకొలది నవలలు రచించారు ఇప్పుడు తెలుగు నవలా రచన ఒక వృత్తి, నవలా ప్రచురణ ఒక వ్యాపారం, నవలా పఠన ఒక వ్యాసంగంగా మారింది సీరియల్స్ పత్రికలకు ప్రత్యేక ఆకర్షణలైనాయి తొలితరంలో స్టేజినాటకాలు సినిమాలకెక్కినట్లుగా ఈ కాలంలో ఎన్నో నవలలు సినిమాలుగానూ వచ్చాయి కొన్ని నవలలు సినిమాల దృష్టితోనే వ్రాయబడుతున్నవి పౌరాణిక, జానపద, చారిత్రక, సాంఘికాది అనేక కథా వస్తువులతో నవలలు వచ్చాయి ఇతర భాషల నవలలు మన భాషలోనికి రావడమేకాక మన తెలుగు నవలలు కూడా పరభాషలలోనికి అనువాదం కావించబడుతున్నాయి ఈనాడు సామాన్య విద్యావంతుల్లో సైతం నవలా పఠనం ఒక వ్యసనంగా మారింది కాని, కొన్నేండ్లుగా కాలక్షేప సాధనాలైన అపరాధ పరిశోధక నవలలతోపాటు, చౌకబారు శృంగార నవలలు విపరీతంగా వస్తూ నవలల ఆదర్శాన్ని ప్రయోజనాన్ని దెబ్బతీస్తున్నాయి రచయిత్రుల ప్రేమకథాత్మక నవలలను వెనుకకు నెట్టి రచయితల మంత్ర తంత్రాల చేతబడి అభూతకల్పనల నవలలు ముందుకు వచ్చాయి వ్యాపార దృష్టి, విజ్ఞాన సాధనమైన నవలను కేవలం కాలక్షేప సాధనంగా మారుస్తున్నది అయినా సామాజిక స్పృహ బాధ్యత కల నవలలకు నాడూనేడు గౌరవం ఉండనే ఉంది

ఈ జిల్లాలో సాంఘిక నవలా రచనది అగ్రస్థానం ఈ శతాబ్ది పూర్వార్ధంలో ఇక్కడ నవలా రచన మితం ఉత్తరార్ధంలో మాత్రం ఆ పరిస్థితి మారింది 1956-94 మధ్యకాలంలో ఓ ఇరవై మంది రచయితలు అరువది వరకు నవలలు రచించారు నవలా రచనలో 1960-70 మధ్య చెలరేగిన రచయిత్రుల హోరుకానీ, 1970-85 మధ్య విజృంభించిన రచయితల మంత్ర తంత్రాల సైంటిఫిక్ ఫిక్షన్‌ల ఉప్పెనగానీ ఈ జిల్లాకు తాకలేదు ఇక్కడ కాలక్షేపానికి చదివించే ప్రేమకథల నవలలు కొన్ని వచ్చినా, వాటికి మించి సాంఘిక చైతన్య - శ్రామిక జన పోరాట గాథలు నవలలుగా రావటం ఈ కరీంనగర్ జిల్లా నవలా రచయితల ప్రత్యేకత

ఈశతాబ్ది పూర్వార్ధంలో ఈ జిల్లాలో ఆరేడుగురు రచయితలు నవలలు వ్రాసినట్లు వినవచ్చినా అవి అచ్చుకాలేదు ఆ వ్రాత ప్రతులు కూడా లభించలేదు కేవలం పేర్లు మాత్రం తెలిశాయి గోలకొండ కవుల సంచిక 1934'లో పేర్కొన్న నవలల రచయితలు ఇద్దరు

1 ముడుంబై రామానుజాచార్యులు - అంబాల

వీరు రచించినట్లు చూపిన నవలలు రెండు 1 కాదంబిని 2 ప్రేమచాంచల్యము

2 వేణుగోపాల రావు అవునూరు వీరి నవల 1 జౌహరాబాయి

ఈ పుస్తకాల వివరాలు తెలియవు అదే కాలంలో మరో ఇద్దరు రచయితలు నవలా రచన సాగించారు

1 వేంకటరాజన్న అవధాని - మంథని, అడ్వకేట్

స్వాతంత్రయోధులు ప్రముఖ కవి అయిన రాజన్న అవధాని గారు 1935 సుమారుగా తమ 'పతిపత్ని నవల ముద్రితమైందన్నారు ప్రతి ఎక్కడా లభించలేదు కథ వారి జ్ఞాపకంలో లేదు

2 రాజవైద్య డా పింగళి లింబాద్రి రెడ్డి నెమిలికొండ

రెడ్డిగారు వచన రచయిత వీరు ఓ బెంగాళి నవలను అనుసరిస్తూ 'మాయ' అనే నవలను సంగ్రహంగా రచించారు అముద్రితం దాని వ్రాత ప్రతి ఈ గ్రంధకర్త (మలయశ్రీ) వద్ద ఉంది

ఆ తర్వాత మరి ముగ్గురు రచయితలు నవలారచనకుపక్రమించారు

1 దప్పూరి సత్యనారాయణ - కోట్ల, నరసింహులపల్లె

పద్యకావ్యయక్షగానకవి అయిన సత్యనారాయణాచార్యులు భాగవతంలోని 'అంబరీషోపాఖ్యానం' కథను 'కర్మయోగి' పేరుతో గ్రాంధిక వచనంలో రచించారు ఇది అసంపూర్ణం దీని వ్రాత్రప్రతి కవి గారి పుత్రులైన మధుసూదనాచార్యుల వద్ద ఉంది

2 తుంగూరి శివరామశాస్త్రి - ధర్మపురి

సంస్కృత కవి పండితులైన శివరామశాస్త్రి గారు 'సాడేగ్యారా' అనే పేరుతో రసవత్తరమైన కథా సంవిధానంతో ఒక డిటెక్టివ్ నవల రచించారు ఇది అముద్రితం దీని వ్రాతప్రతి కూడా లభించలేదు (ఈ విషయం తెలిసింది డా కె రాజన్న శాస్త్రి గారు)

3 కాకుత్సం లక్ష్మీపతి జగిత్యాల,అధ్యాపకులు

లక్ష్మీపతి గారు 'నిర్బంధం' పేర ఓ నవలను, మరికొన్ని నాటికలను రచించినట్లు, వారి బంధువులు తెలిపారు ఆ నవల అముద్రితం, ఇప్పటికి ప్రతి అలభ్యం నవలా రచయిత శుకచంద్ర గారు వీరి పుత్రులు

ఈ ఇరువదవ శతాబ్ది ఉత్తరార్ధ నవలా రచయితలు - అనువాద నవలా రచయితలతో సహా

| | | |
|---|---|---|
| 1 జి రాములు | 2 తిరుపతి రావు | 3 ఎం వి నరసింహారెడ్డి |
| 4 తాడిగిరి పోతరాజు | 5 కర్నెచిరంజీవి | 6 ముద్దసాని రాంరెడ్డి |
| 7 అల్లం రాజయ్య | 8 రేగులపాటి కిషన్‌రావు | 9 ఆడెపు రాజేంద్ర |
| 10 సరిపల్లె కృష్ణారెడ్డి | 11 మలయశ్రీ | 12 దశరథ్ |
| 13 వేముల ప్రభాకర్ గౌడు | 14 శుకచంద్ర | 15 నరేంద్ర |
| 16 ఎం వి తిరుపతయ్య | 17 తులసీ జగన్మోహన్ | 18 ఎస్సెలెన్ బాబు |
| 19 బి ఎస్ రాములు | 20 సాహు | 21 సుద్దాల అశోక్ |
| 22 ఎస్ ఆర్ పవన్‌కుమార్ | 23 కె వి నరేందర్ | 24 కాలువ మల్లయ్య |
| 25 డా ముదుగంటి సుజాతారెడ్డి | | |

ఈ రచయితలలో కేవలం ఒకే ఒక నవల రచించి ప్రచురించిన వారు ఎగానికెక్కువ మంది వీరిలో ఎనిమిది మంది ప్రేమను మిగితావారు సాంఘిక సమస్యలను ఇతి వృత్తాలుగా గ్రహించారు వీటిలో సామాజిక అసమానతలను ఆర్థిక సమస్యలను చర్చిస్తూ శ్రమజీవుల బాధల గాధల కధలు ఎక్కువగా ఉండటం విశేషం హరిజన - గిరిజన కార్మిక - కర్షక జీవితాలు ఇక్కడి నవలా రచయితలకు కథా వస్తువులైనాయి ఒక్క సాహు నవల మాత్రం చారిత్రకం - గిరిజన పోరాట గాధ ఇక నవలా రచయితల - వారి రచనల సంగ్రహ పరిచయం చూడండి

**1 జి రాములు - సిరిసిల్ల వయస్సు 71 సం॥లు**

జి రాములుగారు83లో ఉద్యోగవిరమణ పొందిన అధ్యాపకులు సౌమ్యులు సంఘ సంస్కార హృదయులు తెలుగులో నవలా రచయిత పద్యగేయకవి వీరివి ఆరుపుస్తకాలు వచ్చాయి నవలలు మూడు



1 ఆత్మ ఘోష - 1945 2 పెరటి చెట్టు, 3 పిచ్చిశాయన్న 1956

ఆత్మ ఘోష మన దేశ స్వాతంత్ర్యమునకు మొదటి నిజాం కాల రచన పద్మశాలి కులం పెద్దల కుచ్చితాలు, కులం తప్పుతతంగాలు, వాటిని సహించని కథానాయకుడు ఇది సహించక తన సోదరీమణులతో సహా మతం మార్చుకోవడం ఇందలి ఇతివృత్తం సంఘునాయకులు సంస్కారబుద్ధితో స్వమతానికి రావలిసిందిగా కోరగా, కులంలోని సంకుచిత వెలివేత మొ దురాచారాలను నిర్మూలించి జాతిని కాపాడండని నాయకుడు హితవు చెప్పటంతో కథ ముగుస్తుంది ఇది కేవలం 16 పుటలు విడి పుస్తకంగా ముద్రింపబడిన పెద్ద కథ - చిన్న నవల!

పెరటి చెట్టు దీనిని వట్టి కోట ఆళ్వారు స్వామి ముద్రించారు 'తెలంగాణా రచయితల సంఘం' పక్షాన దాశరథి, సి నారాయణరెడ్డి గారల పీఠిక ఉంది ఇది గౌడుల కథ దున్నే వాడిదే భూమి' అనే నినాదం 1948 - 52 తెలంగాణా రైతాంగ పోరాటం కాలంనాడు పుట్టింది ఈ నవలలో రచయిత కొత్తగా 'గీచే వాడిదే చెట్టు' అనే స్లోగన్ తెచ్చారు - ఇచ్చారు

ఓ గౌడ యువకుడు తాడి చెట్ల కంట్రాక్టు వ్యాపారంలో పేదవాడైతే మామ కూతురును పంపించడు దొరలకు లంచం పెట్టి పెళ్ళి విలువను పంచాయితీలో ఏకరువు పెట్టి మామను ఒప్పించి భార్యను తీసుకు వచ్చుకుంటాడు తిరిగి కంట్రాక్టులో ధనికుడై మహారాష్ట్ర ప్రాంతంలో ఉంటాడు ఈ భార్య వైభవోపేతమైన జీవితాన్ని గడుపుతానని కలలు కంటుంది కాని, ఈ అనాగరిక స్త్రీ తన స్టేటస్‌కు సరిపోదని అక్కడే ఓ ఆధునిక యువతిని పెళ్ళిచేసుకుంటాడు కొడుకును తీసుకు వెళ్ళినా పినతల్లి నిరాదరణ కారణంగా వెళ్ళివస్తాడు ఆ యువతి తన ప్రియునితో లేచి పోతుంది కధానాయకుడు కంట్రాక్టులో నష్టపోతాడు కట్టుబట్టలతో తిరిగి సొంత ఇంటికి వస్తే కొడుకు భార్య తల్లి ఆదరిస్తారు

పెరటి చెట్టు భార్య! ఇందులో గ్రామపెత్తందార్ల లంచాల దోపిడి, కంట్రాక్టర్ల కుయుక్తులు చక్కగా వర్ణింపబడినవి తాము విన్న కధను నవలగా రాశామన్నారు రచయిత

పిచ్చిశాయన్న ఇందలి కథా నాయకుడు రెడ్డి చదువుకున్నవాడు అడుగడుగున సమాజంలోని అక్రమాలను ఎదిరించి 'యథార్థవాది లోక విరోధి' అని పిచ్చివాడని పేరు తెచ్చుకుంటాడు గ్రామనాయకుల, కాలేజీ విద్యార్థుల, కాంగ్రెసు నాయకుల, బస్సు డ్రైవర్ కండక్టర్ల కుబుద్ధుల వారి అలసత్వ స్వార్థాల ఖండించిన తీరు ప్రశంసార్హం విసిగి పిచ్చి బిచ్చగానిలా ఉన్నకాలంలో అతనిచే రక్షింపబడిన ఓ కాలేజీ యువతి అభిమానంతో ఆదరించి తీసుకెళ్తుంది ఆమె తండ్రి సినిమా

ప్రొడ్యూసర్ ఈ యువకుని ఆదర్శానికి మెచ్చి కూతురునిచ్చి పెళ్ళి చేస్తాడు ఈ యువదంపతులు తమ ఆశయాలకు అనుగుణమైన చలన చిత్రాలు తీసి జనానికి కనువిప్పు కలిగిస్తారు ఇదీ ఇందలి కథ

గోపగాని రాములుగారు ఆదర్శ ప్రబోధం లేని కేవలం కాలక్షేప రచనలు చేయలేదు వింతేమిటంటే వీరు డా సి నారాయణ రెడ్డి గారికి బాల్యంలో ప్రైవేటు మాస్టారుగా విద్యాబోధన కావించిన వారు (వీరి పుస్తకం ఒకటి అనుకోకుండా వి శివనారాయణ గారింట లభించి ఆశ్చర్యాన్ని కలిగించింది లేఖ వ్రాసి 6-7-97 రోజున సిరిసిల్లలో ఎన్నం సత్యం, దూడం నాంపల్లి కవి మిత్రులతో పాటుగా రాములు గారింటికి వెళ్ళి తృప్తిగా మాట్లాడాను ) వీరి ఇతర రచనల పరిచయం ఆయా ప్రక్రియా విభాగాల్లో చేయబడింది రాములుగారు కరీంనగర్ జిల్లా మొదటి సంఘ సంస్కారాత్మక నవలా రచయిత

**2 వి. తిరుపతి రావు, బి ఏ వేగురుపల్లి వ 65 సుమారు**

తిరుపతి రావు గారు అధ్యాపకులుగా పనిచేసి ఉద్యోగ విరమణ పొంది స్వగ్రామంలో వ్యవసాయం చూసుకుంటున్నారు వీరు విద్యార్థుల ప్రదర్శన కోసం కొన్ని నాటికలు రచించటంతోపాటు చాలాకాలం క్రితం ఓ నవల వ్రాసి ప్రచురించారు దాని పేరు 1 ప్రేమజ్యోతి - 1956లో ముద్రింపబడింది చిన్నపుస్తకం ఈ ప్రేమ కథ విశ్వనాథ వారి 'ఏకవీర' వలె ఉంటుంది అది విషాదాంతం, ఇది సుఖాంతం

ఓ వృద్ధుడు యువతిని పెళ్లాడి పశ్చాత్తాపంతో ఆమె మనస్సు తెలిసి, ఆమె ప్రియునికి తిరిగి పెళ్లి చేయడం ఇందలికథ తమిళంలో అఖిలన్ 'స్నేహిది' నవలాకథ ఇట్లాగే ఉండటం యాదృచ్ఛికం అది 60-70 మధ్య వచ్చింది వీరు వ్రాసింది ఇది ఒక్కటే నవల

**3 ఎం వి నరసింహారెడ్డి, ఎం ఏ బి ఇడి తక్కళ్లపల్లి మం మల్యాల జ 1941**

నరసింహారెడ్డి గారు రాష్ట్ర ఉత్తమ అధ్యాపక సన్మానమందుకొన్న వారు ప్రస్తుతం ధర్మపురి మండల విద్యాశాఖాధికారిగా పనిచేస్తూ జగిత్యాలలో ఉంటున్నారు వీరికి విద్యార్థి కాలం నుండి సాహిత్యాభిమానం మెండు ఆంగ్లంలో ఓ వ్యాకరణ పుస్తకం ప్రచురించారు తెలుగులో వచన కవితలు వ్యాసాలు రచించారు

వీరి నవల 1 ప్రేమ జీవుల ఆదర్శ త్యాగాలు - 1961 ముద్రణ



విద్యార్థి కాలంలోని రెడ్డి గారి ఈ రచన ఊహాలోకంలో విహరించింది ఈ కథలో ఓ యువకుడు నలుగురు యువతులను వేర్వేరుగా ప్రేమించి మోసగించి చివరికి మేన మరదలు చేత హత్యకు గురి అవుతాడు రచయిత నాయకుని అసాధారణ మనస్తత్వాన్ని సమర్థించారు అయినా పాఠకుల సానుభూతి నాయకునికి లభించలేదు దీనిలో జాతీయసేవా ఘట్టాలు సైతమున్నాయి ఈ నవలలోని కథా సంవిధానం కంటె రచనా విన్యాసం బాగుంది ఇందులో కొన్ని గేయాలు సైతమున్నవి అంత చిన్న వయస్సులో ఈ ప్రాంతంలో నవలా రచన వ్యాప్తిలో లేని ఆకాలంలో ఈ నవలా రచన కావించడం ఓ విశేషం - సాహసం రచయిత ఇందుకు అభినందనీయులు



**4 తాడిగిరి పోతరాజు - ఎం ఏ లిట్ బి ఇడి హుజూరాబాద్**

ప్రముఖ కథా రచయిత తాడిగిరి పోతరాజు గారి వ్యవహార నామం గ్యాబ్రియెల్ వీరు చాలా కాలం హుజూరాబాద్ ఉపాధ్యాయ శిక్షణ కేంద్రంలో అధ్యాపకులుగా పనిచేసి ఆ తర్వాత ఆంగ్లోపన్యాసకులైనారు పోతరాజు గారి నవలలు ఇవి

1 మట్టి బొమ్మలు - 1966, 2 ఎర్ర బుట్టా నవలిక లేదా పెద్ద కథ - 1970

రాజు గారి 'మట్టిబొమ్మలు' నవల 'ఆంధ్ర సచిత్ర వారపత్రిక' పోటీలో ప్రథమ బహుమతి అందుకొన్నది ఇది ఆదర్శ వంతుడై అగచాట్లపాలైన ఒక బీద ఉపాధ్యాయుని జీవిత చిత్రణ రాజు గారి రచన 'శరశ్చంద్రుని' తలపించేదిగా ఉంటుంది వీరిపై ఆంగ్లనవలల ప్రభావం ఉంది ఈ నవల వీరికి చాల పేరు తెచ్చింది కథ విషాదాంతం

ఎర్ర బుట్టా మన పోలీసుల లోగుట్టు చిట్టాలను విప్పినకథ ఇది 1970 సుమారుగా కరీంనగర్ విద్యుల్లత పత్రికలో ప్రచురింపబడింది, 1975 ఎమర్జెన్సీ కాలంలో రచయితకు ఇబ్బంది తెచ్చింది

తాడిగిరి పోతరాజు గారికి వామపక్ష సిద్ధాంతావగాహన - సానుభూతికల ప్రగతిశీల రచయితగా పాఠకులలో మంచి గుర్తింపు ఉంది వారు రాసింది తక్కువైనా సామాజిక బాధ్యత గుర్తించి రాశారు అందుకు తగిన గుర్తింపు పొందారు వీరు కథలు సైతం రాశారు

## 5 కర్నె చిరంజీవి - బి ఏ ఎల్ ఎల్ బి జమ్మికుంట

చిరంజీవి గారిది హుజూరాబాద్ వీరు ప్రముఖ పాత్రికేయులు ఇంచుమించు ఇరువదేండ్లుగా జమ్మికుంట నుండి 'రచ్చబండ' పేరుతో ఓ రాజకీయ వార పత్రికను నడిపిస్తున్నారు సాహిత్యమంటే చిరంజీవి గారికి అభిమానం ప్రముఖ పుస్తక ప్రచురణ సంస్థ 'ఎం ఎస్ కో' మద్రాసు వారు ప్రచురించిన నవలల్లో ఈ జిల్లా ఏకైక నవల వీరిదే అది - 1 అనురాగాలు - అనుబంధాలు 1971లో వెలువడింది మధ్య తరగతి కుటుంబ జీవితం దీని ఇతివృత్తం ప్రతి లభించలేదు

## 6 ముద్దసాని రాంరెడ్డి - ఎం ఏ డి జి ఊటూరు జ 1929

రాంరెడ్డి గారు పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసర్‌గా ప్రభుత్వోద్యోగం చేసి జీప్ ఆక్సిడెంటు కారణంగా వెన్నెముక దెబ్బతిని ఇరువదేండ్లుగా మంచం మీదే ఉంటున్నారు వీరు జీవిత చరిత్రల రచయితగా 1993లో తెలుగు విశ్వవిద్యాలయం వారి గౌరవసన్మానాన్ని అందుకున్నారు వీరి సురవరం, అరవింద రచనలు రాష్ట్ర సాహిత్య పరిషత్తు తెలుగు అకాడమీ పోటీలలో బహుమతులు పొందినవి వీరు ఆంధ్రాంగ్ల హిందీ ఉర్దూ భాషలలో విశేష ప్రజ్ఞకలవారు, నేషనల్ బుక్ ట్రస్టు ఢిల్లీ వారికి మూడు పుస్తకాలను అనువరించారు రెడ్డి గారు వచన రచయిత వీరు జీవిత చరిత్రలను తప్ప నవలలు రచించలేదు కాని, మూడు నవలలు అనువదించారు అవి ఇవి



1 లండన్‌తో ఒక రాత్రి - 1975 2 రాగ దర్బారి - 1986 3 గాలిమేడల కోలంబస్ - 1990

లండన్‌లో ఒక రాత్రి - ప్రముఖ ఉర్దూ రచయిత సజ్జాద్ జహీర్ 1935లో రచించిన 'లండన్‌కీ ఏక్‌రాత్' ఉర్దూ నవలకు తెలుగు సేత ఈ లండన్‌లో ఒక రాత్రి' మూల గ్రంధకర్త సజ్జాద్ జహీర్ 'బన్నేభాయి', అనువాద గ్రంధకర్త ఎం రాంరెడ్డి గారల ప్రత్యేక వ్యక్తిత్వాల రచనా విశిష్టతల డా దాశరథి గారు ఈ గ్రంథం ముందుమాటలో 'అక్షరతోరణం'గా అలంకరించారు ఈ తెలుగు నవలను 'విశాలాంధ్ర ప్రచురణాలయం విజయవాడ' వారు 1975లో ప్రచురించారు ఇందులో కథలేదు సమకాలీన సామాజిక విషయాల చర్చ ఉంది లండన్‌లో భారతీయ విద్యార్థులు ఓ రాత్రి విందు సందర్భంగా కావించిన కార్మిక సంఘాల జాతీయోద్యమాల సంభాషణలే ఈ నవల దీనిలో ప్రాక్పశ్చిమ సంస్కృతుల తేడాల చర్చ ఉంది ఆకర్షణ కోసం ప్రేమ విషయాల ప్రస్తావనలున్నవి రాంరెడ్డి గారి అనువాదం సహజసుందరంగా ఉండి ఆసక్తిగా చదివిస్తుంది

రాగ దర్బారి నేషనల్ బుక్ ట్రస్ట్ న్యూఢిల్లీ వారి కోరికగా రాగదర్బారీ హిందీ నవలను అదే పేరుతో తెలుగు చేశారు ఇందలి రాజకీయ విమర్శ రెడ్డి గారి వ్యంగ్య రచనా ప్రియతకు చక్కగా సరిపోయింది గాలి మేడల కొలంబస్ - ప్రముఖ పంజాబీ రచయిత నరేంద్ర లూథర్ గారి 'హవాయీ కోలంబస్'కు ఇది ఆంధ్రానువాదం హిందీ మాతృకకు అనువాదమైన ఆంగ్ల గ్రంథాన్ని రెడ్డి గారు తెలుగు చేశారు ఈ తెలుగు రచనను 'ఆంధ్ర ప్రభ' దిన పత్రిక 1990లో ధారావాహికంగా ప్రచురించింది

విషాదాన్ని సైతం చిరునవ్వుతో భరించగల గుండె నిబ్బరం కల విశిష్ట వ్యక్తిత్వం రాంరెడ్డి గారిది కాలం వికటించి అనారోగ్యం పాలుకాకపోతే వీరు మరెన్ని మంచి రచనలు వెలువరించేవారో!

**7 అల్లం రాజయ్య - ఎం ఏ గాజులపల్లె మం మంథని జ 1953**

అల్లం రాజయ్య గారు మంచిర్యాల ఏ సి సి సిమెంటు ఫ్యాక్టరీలో ఉద్యోగం చేస్తున్నారు వీరు సామ్యవాద కథానవలా రచయిత ఆంధ్ర ప్రదేశ్ విరసంతో సభ్యులు - క్రియాశీల కార్యకర్త వీరివి కథలు - నవలలు ఉద్యమ సాహిత్య పత్రికల్లో ప్రచురింపబడ్డాయి విడి పుస్తకాలుగానూ వచ్చాయి

సృజన వరంగల్, కరీంనగర్ బుక్ ట్రస్ట్, పి బి సి హైద్రాబాద్ వారు వీరి పుస్తకాలను ప్రచురించారు వీరి రచనలు వ్యాపార పత్రికలలో కనిపించవు కాలక్షేపం కోసం చదివే పాఠకులను అలరించవు అవి అగ్గిబరానీలు తుపాకి తూటాలు ఒక సిద్ధాంతం కోసం వ్రాసిన రచనలు వాటి నవలలు వివరాలివి

1 కొలిమంటుకున్నది 1976 - సృజన సీరియల్, 2 అగ్ని కణం 1982 'అరుణతార' సీరియల్ 3 ఊరు 1982, 4 ఊరేగింపు, 5 కొమరం భీము 1983, 'సాహు'తో కలిసి వ్రాసిన నవల

అల్లం రాజయ్య గారి నవలలన్ని గ్రామీణ వాతావరణం, శ్రామిక జనం స్థితి గతులను వర్ణిస్తాయి భూకామందుల దమననీతిని ఖండిస్తూ, వారిని ఎదిరించే సంఘటిత ప్రజాపోరాటాలను వర్ణిస్తాయి వాటిని బలపరుస్తాయి సభలు, ఊరేగింపులు, రహస్య సామాలోచనలు, ఎదురుదాడులు, పోలీసు స్టేషన్లు, కోర్టులు, అరుణపతాకాలు, విజయ నినాదాలు వీటిలో కనిపించే దృశ్యాలు వీరు పాత్రల సంభాషణల్లోనే కాక కథా కథనంలోనూ తెలంగాణా మాండలికాన్ని మంథని ప్రాంత గ్రామ్య భాషను పత్రికా వ్యావహారిక భాషతో కలిపివాడారు

ఊరు నవల "నాయెం కోసం, ధర్మం కోసం - కోటానుకోట్ల మట్టి మనుషుల కలల కోసం మనం అతారెలు పట్టక తప్పదు మనం దున్నిదోకి పంటల సాదిసవరచ్చెన శేసి దునియకంత తిండి పెట్టినోళ్లమే దొరల ఎండికంచాల కాన్నుంచి, పట్టు పరుపులదాకా ఎండికంచాలల్లో సాంబరేను బియ్యం నుంచి కోడికూరుదాక మనం సృష్టించినదే మనం సృష్టికర్తలమే వాడు మన ఒంట్లె నెత్తురు పీల్చుకొనే కొండంత పెరిగిండు ఇయ్యల్ల ఆడు మామూలు మనిషికాదు అన్ని ఓడియ్యాల్నంటే పాండవుల తీర్గ మనం అడవుల బట్టక తప్పదు గురినేర్వక తప్పదు లడాయి సేయక తప్పదు మనం కోట్ల మందిమి గనక్క నాయెం మన పక్కుంది గన్క పాండవుల తీర్గ సకల పుల్లెందుల బడ్డా, నేలకెంద రొరిగినా, నెత్తురెంత కారిన గెలిచి తీర్తం ' పుట 113

రాజయ్య గారి ఈ నవల 'ముందుమాట'లో విప్లవ రచయిత వరవర రావు గారు - ఒకప్పటి గ్రామ శాసనకర్తలైన భూస్వాములు ఇప్పుడు రాజ్యాంగ యంత్రమనే రాక్షసిని ఆశ్రయించారని, "భూమిపై దొరలపెత్తనం అత్యాచారాలతో ఆయుధాలతో తప్ప నిలువని స్థితి వచ్చింది కనుక తామూ సాయుధంగానే దున్నే వాడిదే భూమి చేయగలమని రైతాంగం గ్రహించింది కరీంనగర్ రైతాంగం ఆ రైతాంగ పోరాట ఆచరణను ఊళ్ళలో ఎట్లా నిర్వహిస్తున్నదో రాజయ్య నవల 'ఊరు' ఇంటి సంగతి గోడలు చెప్పినట్లుగా చెపుతుంది " అన్నారు ఇది ఒక రైతు కుటుంబ యువకుడు

వ్రాసిన కథకు కరణపింటి బాబు ఇచ్చిన కితాబు కాలం - మార్పు అనివార్యం ప్రజా పోరాట సామ్యవాద రచనల్లో పౌరాణిక ఉపమానాలు ఈ రచయితలు ఎందుకు తెస్తారో అర్థం కాదు రాజయ్య గారి నవలలు కథాశిల్పం కంటె కథన విషయ సిద్ధాంత ప్రాధాన్యం కలిగి ఒక వర్గం పాఠకులలో చాల ప్రచారం పొందాయి మిగితావి ఇలాగే ప్రజాపోరాట నవలలు

### 8 రేగులపాటి కిషన్‌రావు - ఎం ఏ బి ఇడి చింతలరానా జ 1946

రేగులపాటి కిషన్ రావు గారి స్వస్థలం, సిరిసిల్ల తాలూకాలోని రుద్రారం సమీప గ్రామం - చింతలరానా ఎల్లారెడ్డి పేటలో మాధ్యమిక పాఠశాలోపాధ్యాయులుగా చాలాకాలం పనిచేసిన వీరు ప్రస్తుతం రుద్రంగి సెకండరీ పాఠశాలోపాధ్యాయులుగా ఉన్నారు రావు గారికి వచన గేయకవిత వచన రచన ఇష్టం కవితలు, కథలు, నవలలు పుస్తకాలుగా ప్రచురించారు వీరిది హేతువాద దృష్టి సామ్యవాద సాధన ఆశయం వీరి నవలలను న్యూస్టుడెంట్స్ బుక్ సెంటర్ విజయవాడ వారు పంపిణీ చేశారు కిషన్‌రావు గారి నవలలు నాలుగు ముద్రణ పొందాయి

1 ఆమె వితంతువు కాదు 1976, 2 పతివ్రత ఎవరు? - వాణిశ్రీ - 1978, 3 సంఘర్షణ - 1981, 4 ప్రేమకు పెళ్ళెప్పుడు 1982



ఆమె వితంతువు కాదు భర్త మరణించినట్లు తెల్సి వితంతువుగా జీవించిన ఓ స్త్రీ తిరిగి అనుకోకుండా భర్తను కలుసుకున్న కథ పతివ్రత ఎవరు? వాణిశ్రీ రెండు నవలికలు, లేదా - పెద్ద కథలు సంఘర్షణ - 170 పుటలు ఇది రచయిత సామ్యవాద సాధనాశయంతో రూపొందించిన నవల, ఆరుద్ర గారు ఈ పుస్తకానికి అభిప్రాయం వ్రాస్తూ -నినాదాలతోకాక, కథాశిల్పం పరిణతి చెందనిదే ఎంత చక్కని అభ్యుదయ భావాలనైనా హృదయానికి హత్తుకునేలా చెప్పలేం అన్నారు ప్రేమకు పెళ్లెప్పుడు? లో పుస్తకం పేరుతో ఓ ప్రేమపెళ్ళి కథతోపాటు, మొద్దబ్బాయి అచ్చంగా చిలకమర్తి వారి గణపతికి ప్రతిసృష్టి హాస్యరచన కూడ ఉంది

కిషన్‌రావు గారి కథా కల్పన కంటె వారి ఆశయం చక్కనిది హాస్యం సునిశిత పరిశీలన సున్నిత వ్యంగ్యం వీరి రచనాగుణాలు

### 9 ఆడెపు రాజేంద్ర, బి ఇ. కాల్వశ్రీరాంపూర్

రాజేంద్ర గారు ఇంజనీర్‌గా హైదరాబాద్‌లో ఉంటున్నారు వీరు రచయితగా అంతగా ప్రచారానికి రాలేదు కరీంనగర్ మాండలిక భాషలో వీరు చక్కగా రచించిన 'దామర పువ్వు' అనే నవల 1976 సుమారుగా ఆంధ్రజ్యోతి వారపత్రికలోప్రచురింపబడింది ఈ ముగ్ధ ప్రణయగాథలో గ్రామీణ జీవిత చిత్రణ మనోహరంగా ఉంది చక్కగా వ్రాయగల సత్తా ఉండీ రాజేంద్ర గారి కలం ఎందుకో మూగపోయింది

### 10 సరిపెల్లి కృష్ణారెడ్డి - ఎం ఏ, బి ఇడి కరీంనగర్

కృష్ణారెడ్డి గారిది మెదకు జిల్లాలోని సిద్ధిపేట వీరు రచయిత డా జి లింగారెడ్డి గారికి బావమరిది వీరు కరీంనగర్‌లో స్థిరపడి ఇదే జిల్లాలో హాస్టల్ వార్డెన్‌గా ప్రభుత్వ ఉద్యోగం చేస్తున్నారు సరిపెల్లి వారి నవల 'ఉప్పెన' ఆంధ్రజ్యోతి వార పత్రికలో 1977-78 నవలాప్రియదర్శిని పోటీలో బహుమతి పొంది సీరియల్‌గా ప్రచురించబడింది దీనిని హైదరాబాద్ బుక్ ట్రస్టు వారు విడి పుస్తకంగా ప్రచురించారు

గ్రామీణ రైతు జీవిత చిత్రణ ఇందలి కథ ఇందులో 1948-50 నాటి రజాకార్ల దురంతాల

నెదుర్కొన్న ప్రజల సాహస పోరాటాలు, భూస్వామ్య వ్యవస్థపై రైతుకూలిల తిరుగుబాటు వర్ణించబడ్డాయి ఈ నవలలోని పాత్రలు సన్నివేశాలు వేరైనా ఇది మరో 'మా భూమి' చలనచిత్రం కథగా అనిపించుతుంది రచయిత దీనిలో తెలంగాణా మాండలిక భాషను ప్రయోగించారు కృష్ణారెడ్డి గారు మరో నవల రచించారు కాని, అది అముద్రితం

**II డా॥ మలయశ్రీ - ఎం ఏ ఎం ఓ ఎల్ చంజర్ల, జ. 1940**

కవి రచయిత అయిన మలయశ్రీ గారి కలం నుండి పదికి పైగా నవలలు వెలువడ్డాయి వాటి పేర్లు ప్రచురణ కాలాలు - ప్రచురణ సంస్థల వివరాలివి

1 కలవారి కష్టాలు 1978, నవయుగ - హైదరాబాద్, 2 తాగుబోతు - 1979, సత్యార్థి కరీంనగర్, 3 విచిత్ర ప్రేమ - 1979, సత్యార్థి - కరీంనగర్ 4 ఏం మగాళ్ళు? - 1979, రవి శంకర్ - తెనాలి, 5 వెన్నెల వాన - 1980, భాను పబ్లికేషన్స్ - విజయవాడ, 6 వింత బ్రతుకులు 1980, భాను పబ్లికేషన్సు, 7 మంటల వర్షం - 1982, విజ్ఞాన ప్రచారిణి గ్రంధమాల - నెమిలికొండ, 8 తిరుగుబాటు 1982, విశాలాంధ్ర విజయవాడ, 9 ఆజాద్ చంద్రశేఖర్ - 1982 అరుణా బుక్ హౌజ్, విజయవాడ డిస్ట్రిబ్యూటర్స్, 10 బ్రహ్మంగారి కథ - 1983, కరీంనగర్

సీరియల్స్ 1 సత్యాన్వేషి - 1977, 78 'సత్యార్థి' మాసపత్రిక 2 ఈ తరం ప్రేమకథ - 1980 'ఓరుగల్లు' వారపత్రిక, 3 పూజా పుష్పాలు - 1981 'ప్రతిరూపం' పక్ష పత్రిక, 4 వనవాసి - 1983 మనుగడ' వారపత్రిక 5 సహచరి 1983 'రచ్చబండ' వార పత్రిక

వీటిలో 'తిరుగుబాటు' నవల 'విశాలాంధ్ర' విజయవాడ వారి ఉత్తమ నవలల పోటీ 1982లో ద్వితీయ బహుమతిని గెలుచుకుంది ఆ సంవత్సరం మొదటి బహుమతి ఇవ్వలేదు

సహచరి నవల రచ్చబండ' వార పత్రిక జమ్మికుంట వారి రాష్ట్రస్థాయి పోటీలో ద్వితీయ బహుమతిని అందుకున్నది మలయశ్రీ గారు తమ నవలలకు ఇతివృత్తాలు సమకాలీన సాంఘిక సమస్యల సంఘటనల నుండి స్వీకరించారు వీనిలో - ఆజాద్ చంద్రశేఖర్ - భగత్ సింగ్ సహచరుని జీవిత పోరాట చరిత్ర దీనికి హిందీ ఇంగ్లీషుపుస్తకాలు ఆధారం బ్రహ్మం గారి కథ పోతులూరి వీరబ్రహ్మం గారి జీవిత చరిత్రలోని అభూతకల్పనలకు విలువీయకుండా, ఆయన మానవతా వాద స్వభావాన్ని ఉన్నతంగా చిత్రించిన జీవిత గాధ - నవల

కలవారి కష్టాలు ఇది ఓ విధంగా నేటి గ్రామ జీవన విషయ సంగ్రహ సర్వస్వం ఆచారాల పేర అంతస్తుల పేర అనవసరంగా ధనవంతులు స్వయంగా పెంచుకుంటున్నవి 'కలవారి కష్టాలు' అని అంతస్సూత్రం (ఇదే కథ నవీన్ గారి 'కాటేసిన కారిన్యం' నవల రెంటికీ మూలం ఓ యువతి నిజమైన విఫల ప్రేమకథ) తాగుబోతు - ఒక యువకునికి తల్లి, తండ్రి, ప్రేయసి - నుండి విపరీత ప్రవర్తలు ఎదురై బండబారిన గుండెతో మొండిగా నిలిచిన కథ

విచిత్ర ప్రేమ - అనుకోని సంఘటనలు తారసిల్లితే ప్రేమలు జీవితాలు ఎలా తారుమారైపోతాయో తెలిపే విచిత్ర జీవిత చిత్రణ ఇందులో సామ్యవాద పోరాటం - ప్రేమ విన్యాసాల సంఘటనలు ఉన్నాయి ఏం మగాళ్ళు - ఇది ఆడవాళ్ల ఆత్మ సంఘర్షణ పుట్టింటా మెట్టినింటా ఎదురైన సమస్యలకు జడియకుండా రెండిళ్లకూ దూరంగా ఉండి ఉద్యోగినిగా జీవిస్తూ ఉభయులనూ అవసరాల్లో ఆదుకొంటూ తానేమీ కోరని యువతి చరిత్ర వెన్నెలవాన - ప్రేమ పెళ్ళిల్లను వర్ణాంతర వివాహాలను సమర్థించే నవల రచయిత పాత్రల అభిరుచులనెపంగా లలితకళల చక్కగా వర్ణించారు వింత బ్రతుకులు - ఇది పెద్ద నవల 350 పుటలు ఒక అధ్యాపకుని గృహజీవితం ఆడపిల్లలు ఆశలు పెంచుకొని అడియాసల పాలుగాక పంతాలకు పోక అందివచ్చిన వైవాహిక జీవితాన్ని సుఖప్రదం చేసుకోవాలనే నేపథ్యంలో సాగిన సాంఘిక కథ

మంటల వర్షం - 1979 అమెరికా స్కైలాబ్ పతన సందర్భంలో డైరీగా వ్రాసి ఆ తర్వాత ముద్రించిన నవల అప్పటి జనతా ప్రభుత్వపు ఊగిసలాటను ప్రజల భయాందోళనలను, సైన్సు విషయాలను స్వకుటుంబ విషయాలతోపాటు ఆత్మకథాత్మకంగా రచించారు

తిరుగుబాటు ఇప్పటి గ్రామీణ హరిజనుల జీవిత చిత్రణ ఒక ఊరి వివిధ వర్గాల - వర్ణాల వారి స్వభావాల సమస్యలతో పాటు, అన్ని ఆకర్షణల వదిలించుకొని తనజాతి ఉన్నతికి పాటుపడిన ఒక దళిత యువకుని గాథ

సత్యాన్వేషి ఆస్తి నాస్తి విచికిత్స సజీవ పాత్రలు సంస్కృతీ సంప్రదాయాల సమాలోచనలు ఈ నవల ప్రత్యేకతలు ఈ తరం ప్రేమ కద - తన పెళ్ళిని వాయిదా వేసి తాను పుట్టిన కుటుంబం బరువు బాధ్యతలు మోస్తూ బయటి ప్రపంచపు సమస్యల ప్రభావాలను భరిస్తూ అనూహ్యంగా తన ప్రియుని పెళ్లాడిన ఉద్యోగిని కథ పూజాపుష్పాలు మన పురుష దైవాలకు స్త్రీల జీవితాలు పూజా కుసుమాలని కారణాలు ఏవైనా నేలరాలిన పూలు ధూళిపాలే కాని పూజకు పనికి రావని ఈ కథా సంవిధానం వనవాసి - నా అనువారు లేని యువకుడు ఊరువదలి అడవికి పోతే అదీ సమస్యలతోరణమే ఈ నవలా రచనకు ప్రేరణ ఇయర్‌నెస్ట్ హెమింగ్ వే ఆంగ్లనవల 'ద ఓల్డ్ మ్యాన్ అండ్ దసీ' ఈ సాంఘిక నవల నక్సలైట్సు పోలీసు ఆఫీసర్స్ ఘట్టంతో ముగిసింది సహచరి ఇది కోరిన ప్రేయసికి దూరమై, కోరని యువతిని పెళ్లాడిన ఒక ఆధునిక విద్యావంతుడైన యువకుని జీవిత గమనం

మలయశ్రీ నవలలు సాంఘిక ఇతివృత్తాలు ప్రగతి శీల భావాలు కలవి సునిశిత పరిశీలన మానసిక విశ్లేషణ సమస్యలకు పరిష్కారాలను అన్వేషించడం ఈ రచయిత స్వభావం

## 12 ఎం దశరథ్ - ఎస్ జి.టి ఉపాధ్యాయులు మహదేవపూర్

దశరథం గారు అధ్యాపకులు మహదేవపూర్ సమీప గ్రామంలో పుట్టి పెరిగిన వీరు దళిత జీవుల బాధలు కళ్లారాచూసి అవి తొలగి వారు మంచి స్థితికి చేరుకోవాలనే ఆశయంతో కలం పట్టారు నవలా రచయితగా మంచి పేరుకు వస్తున్న కాలంలోనే వీరు 40 ఏళ్ల మధ్య వయస్సులో 1985 సుమారుగా అర్ధాంతరంగా కీర్తిశేషులైనారు దశరథ్ గారి ముద్రిత నవలలు రెండు

1 శతాబ్దాల నిశ్శబ్దం - 1979, 2 వెదురు పొదలు నినదించాయి - 1981

శతాబ్దాల నిశ్శబ్దం - ఓ పల్లె హరిజనులు భుక్తి కోసం గ్రామ పెత్తందార్లతో కావించిన పోరాటం వెదురు పొదలు నినదించాయి భూమికోసం గిరిజనులు మైదాన ప్రాంత దురాక్రమణదారులతో వారికి మద్దతుగా నిలిచిన అధికారులతో సాగించిన పోరు ఇవి తెలంగాణా మాండలిక గ్రామ్య భాషలో ఉన్నాయి

ఈ రెండు నవలలు విశాలాంధ్ర విజయవాడ వారి పోటీలలో 79, 81 సంవత్సరాలలో తృతీయ బహుమతులు గెలుచుకున్నాయి దశరథ్ గారి మరో అముద్రిత నవల వ్రాత ప్రతి వారి సతీమణి వద్ద ఉంది ఆమె మహదేవపూర్ యు పి ఎస్ లో ఉద్యోగం చేస్తున్నారు

## 13 వేముల ప్రభాకర్ గౌడు - బి ఏ రాయికల్

ప్రభాకర్ గౌడ్ గారి పరిచయం గేయ సంపుటాల విభాగంలో చేయబడింది ప్రభాకర్ గారు కవి మాత్రమే కాదు - కథలు నవలలు కూడా రచించారు ప్రచురణ పొందిన వీరి నవలలు రెండు

విరాటుడు - అనువాదం నోబుల్ బహుమతి గ్రహీత స్టీఫెన్‌బగ్ ఆంగ్ల నవలను ప్రభాకర్ 'విరాటుడు' పేర ఆంధ్రీకరించారు ఇది 1979లో ముద్రణ పొందింది

అంతస్తులు - 'జనధర్మ' వరంగల్ వార పత్రికలో 1983లో సీరియల్‌గా ప్రచురింపబడిన ఈ సాంఘిక నవల విడి పుస్తకంగా రాలేదు మొదటి నవల లభించలేదు

**14 శుక చంద్ర - ఎం ఏ జగిత్యాల**

ఈ నవలా రచయిత పూర్తిపేరు కాకుత్థ్సం అనంతవేంకట శుకచంద్ర వీరు తెలుగులో ఎం ఏ పట్టా పొంది పోస్టల్ శాఖలో సబ్ పోస్ట్ మాస్టర్‌గా ఉద్యోగం చేస్తున్నారు శుకచంద్ర గారి నవల ఇదో ప్రేమకథ 1980లో అందమైన ముఖచిత్రంతో వెలువడింది ఇది రచయిత తొలినవల - ప్రేమకథ

**15 డా నరేంద్ర - ఎం ఏ నూకపల్లి మం మల్యాల**

బి నరేందర్ రావు గారు డైరీ రూపంగా వ్రాసిన 95 పుటల నవల దారితప్పిననది 1980 సుమారుగా వెలువడింది దీనిలో ఎక్కడా ముద్రణ సంవత్సరం కానీ కవి వివరాలు కానీ లేవు 1875 ఇండియా ఎమర్జెన్సీ ప్రస్తావన ఒకసారి 64వ పుటలో వచ్చింది ఈ నవల 29 నవంబర్ నుండి ఫిబ్రవరి 5 వరకు, మూడు నెలల నాలుగు రోజుల కథ



ఓ కాలేజీ విద్యార్థికి (అతనిది సున్నిత కవితా హృదయం) ఇంటాబయట ఎదురైన సంఘటనలు, ఎన్నో ఆలోచనలు ఇందలి ఇతివృత్తం ఇది చదివితే నవీన్ గారి 'అంపశయ్య' స్మృతిలో మెదలుతుంది 'చైతన్య ప్రవంతి' గా కాక కథనం సాఫీగా సాగింది

గుంటూరి శేషేంద్ర శర్మ గారి ముందు మాటతో వెలువడిన ఈ నవల డా వి కొండల్ రావు గారికి అంకితం చేయబడింది

**16 డా॥ ఎం వి తిరుపతయ్య, ఎం ఏ ధర్మారం**

ఎం వి తిరుపతయ్య గారు జమ్మికుంట కాలేజీలో చాల కాలం తెలుగు లెక్చరర్‌గా పనిచేసి, ఇప్పుడు ఖమ్మం డిగ్రీ కాలేజీలో ఉన్నారు వీరి అన్న ప్రకాశరావు గారు పద్యకవి తమ్ముడు డా మధుసూదనరావు గారు కథా రచయిత తిరుపతయ్య గారు కాలేజీ విద్యార్థిగా ఉన్నకాలంలో నవీన్, వరవర రావు గారలకు సహ విద్యార్థి వీరి సాహిత్యాభిమానం అప్పటిదే

వీరు కొన్ని కథలు బ్రతుకు పేరుతో ఒక నవల వ్రాశారు సామ్యవాద దృక్పథం వీరి ఓ కథలో పోలీసు అధికారులకు కనిపించి 1975లో వీరిని అరెస్టు చేశారు తర్వాత విడుదల పొందారు తిరుపతయ్య గారి ఏకైక నవల 1980లో వెలువడింది నవీన్ గారి 'చీకటి రోజులు' తిరుపతయ్యగారి ఎమర్జెన్సీ అరెస్టు కథే

**17. తులసి జగన్మోహన్ - ఎం ఏ బి ఓ.ఎల్ మెట్టుపల్లి, జ 1954**

తులసి జగన్మోహన్ గారు ఇండియన్ లైఫ్ ఇన్సూరెన్స్‌లో డైరెక్టు ఏజంటుగా పనిచేస్తున్నారు సాహిత్యాభిమానం వీరిని గేయ కవిగా, నవలా రచయితగా మార్చింది వీరి కథలు 200 వరకు వివిధ పత్రికల్లో వచ్చాయి అన్నారు (కలిసి మాట్లాడింది ఒకేమారు)

వీరి నవలలు 1 కన్నీరొలకని కన్నీళ్లు - 1980 2 టచ్‌మీనాట్ 1988, 3 మరో అసమర్థుడు - 1988, 4 పెదవి దాటని ప్రేమ జగన్మోహన్ గారు ఆరేడు నవలలు రచించారు పై నాలుగు నవలలు ప్రచురణ పొందినట్లు రచయిత స్వయంగా చెప్పారు వీరి నవలలు ప్రేమ కథలు

**18 డా ఎస్సెలెన్ బాబు - ఎం కాం., ఎం ఫిల్ పిహెచ్ డి, చంజర్ల మం మానకొండూరు జ. 1951**

డాక్టర్ సంగని లక్ష్మినారాయణ గారి సంక్షిప్త నామం, ఎస్ ఎల్ ఎన్ బాబు సూర్యాపేట, సిద్ధిపేట, జగిత్యాల, కరీంనగర్, సిరిసిల్ల కాలేజిల్లో కామర్స్ ఉపన్యాసకులుగా పనిచేసిన

వీరిప్పుడు హైదరాబాద్ ఖైరతాబాద్ ప్రభుత్వ డిగ్రీ కళాశాలలో ఉన్నారు రీడర్‌గా ఎస్సెలెన్ బాబు పది వరకు కథలు మూడు నవలలు రచించారు వీరి ముద్రిత నవలలు రెండు



1 నవత - 1981 2 విషవలయం - 1983

మొదటి నవల నవతను రచయిత తమ అన్నగారైన మలయశ్రీకి (నాకు) అంకితమిచ్చారు ఉదారభావంతో పరస్పర అవగాహనా సహకారంతో సామ్యవాద సమాజాన్ని సాధించుకోవాలనే ఆదర్శవాదం ఈ నవలలో ప్రతిపాదించబడింది ఈ రచనపై టాల్‌స్టాయ్ 'రెజరెక్షన్' ప్రభావమున్నది కథా సంవిధానంలో రచయితకు శరశ్చంద్ర చటర్జీ మార్గదర్శిగా తోస్తుంది ఈ నవల ప్రముఖ నవలా రచయిత్రి వాసి రెడ్డి సీతాదేవి గారి ప్రశంసాపూర్వక పీఠికలో వెలువడింది

విషవలయంలో నేటి కాలేజీల విద్యాస్థితి, విద్యార్థుల ప్రవర్తన, వర్ణింపబడ్డాయి అల్లరి విద్యార్థుల బెదిరింపులకు భయపడక కాపీ పరీక్షల దుస్థితిని ధైర్యంతో నివారించిన అధ్యాపకులు ఈ కథలో ఆదర్శ మూర్తులుగా కనిపిస్తారు 'ప్రేమ పక్షులు' ఈ రచయిత గారి అముద్రిత నవల

## 19 బి ఎస్ రాములు - హాస్టల్ వార్డెన్ జగిత్యాల

బి శ్రీరాములు గారు కథా రచయిత 1982లో ప్రథమ ముద్రణ పొందిన వీరి బతుకుపోరు నవలను హైదరాబాద్ బుక్ ట్రస్ట్‌వారు 1991లో రెండవసారి ముద్రించారు

ఇది బీడి కార్మికుల స్థితిగతి కథ సామాన్య కూలీ కుటుంబాల జీవితాల సజీవ చిత్రణ ఫ్యాక్టరీల యజమానులు పనివారల శ్రమదోపిడిని ఎట్లా కావిస్తున్నారో వివరించడంతోపాటు, కార్మికులు తమ హక్కుల సాధనకు యాజమాన్యంపై సమ్మె ప్రకటిస్తూ వాల్‌పోస్టర్స్ అంటించటంతో ఈ కథ ముగిసింది ఇది కరీంనగర్ మాండలిక భాషలో ఉంది బి ఎస్ గారి రెండవ నవల "దొంగలు' జగిత్యాల 'మంటలు' వారపత్రికలో 1983 లో కొంతభాగం సీరియల్‌గా ప్రచురించబడింది ఇంకా వీరివి అముద్రిత నవలలున్నాయి

ఈ రచయితవి మార్క్సిస్టు సిద్ధాంత చర్చా వ్యాసాల పుస్తకాలు వచ్చాయి వీరు, రాష్ట్ర దళిత రచయితల కళాకారుల (దరకమే) సంఘాధ్యక్షులు కరీంనగర్ జిల్లా 'దళిత పాటలు' 'ఆం ప్ర దళిత పాటలు' సంకలన గ్రంధాలకు సంపాదకత్వం వహించి 1993-96ల్లో ప్రచురించారు సామ్యవాద రచయిత బి ఎస్ రాములు గారు 'గబ్బిలం' మాసపత్రిక సంపాదకత్వం వహించారు (డా అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం బి ఏ తెలుగు సాహిత్య సమీక్షా దృష్టాంతాల్లో అల్లం రాజయ్య, బి ఎస్ రాములు గారల నవలలు పేర్కొనబడ్డాయి )

## 20 సాహు, మాణిక్యాపురం 2 అక్టో 1955 - 16 మార్చి 93

విప్లవ రచయిత శనిగరం వెంకటేశ్వర్లు గారి కలంపేరు సాహు వేంకటేశ్వర్లు గారికి విద్యార్థి కాలంలోనే ఉద్యమ రాజకీయాల అభిమానం ఏర్పడింది హుజూరాబాద్ జూ॥ కాలేజీ విద్యార్థిగా ఉన్న కాలంలో 'జన సాహితి' సంస్థ స్థాపనలో పాల్గొన్నారు 11 మే 75 రోజున ఈ సంస్థ ఆవిష్కరణ సభలోనే శ్రీశ్రీ "ఊగరా ఊగరా ఉరికొయ్యలందుకొని" అనే పాట రచించి పాడారు

1974 నుండి విప్లవ రాజకీయాల్లో చురుకుగా పాల్గొన్న వీరు 1976 అక్టోబర్‌లో 'మీసా' డెటెన్యూగా జైలు కెళ్లారు 77లో బెయిలుపై బయటకు వచ్చి హుస్నాబాద్ పరిసర గ్రామాల్లో పార్టీ కార్యకలాపాలు నిర్వహించారు 1976 నుండి 1989 వరకు ఐదున్నర సంవత్సరాలు జైలు

శిక్షననుభవించారు 1979లో ఆదిలాబాద్ అడవుల్లోకి వెళ్ళి గోండు గిరిజనుల చైతన్యానికి శ్రమించారు గోండు భాష నేర్చుకొని తమ తెలుగు పోరాట గీతాలను ఆ భాషలోకి మార్చారు గోండు జీవితాలను కథలుగా మలిచారు ప్రజా జీవితంలోకి వచ్చి 1993లో గుండె పోటుతో మృతి చెందారు

గోండు వీరుడు 'కొమరం భీము' హైద్రాబాద్ నిజాంతో పోరాడి 1940 అక్టోబరు 16న అమరుడైన చారిత్రక ఘట్టంపై పరిశోధన జరిపారు తాము సేకరించిన అంశాలను విరసం రచయిత అల్లం రాజయ్య గారితో కలిసి 'కొమరంభీం' నవలను రచించి 1983లో ప్రచురించారు దీనితో అల్లూరి సీతారామరాజు వంటి ఒక గిరిజన విముక్తి పోరాట వీరుని చరిత్ర వెలుగులోనికి వచ్చింది అల్లూరి మైదాన ప్రాంతం వ్యక్తి, అల్లూరి అనుచరులైన గాముగంటం మల్లుదొరలవలె భీం అచ్చంగా గిరిజనుడు స్వయంగా పోరాట వీరుడు నాయకుడు

ఆ తర్వాత 'కొమరం భీం' సినిమాగా కూడ వచ్చి కేంద్ర అవార్డును గెలుచుకుంది కొమరం భీం చరిత్ర న్యూస్‌రీల్‌గా కూడా వచ్చింది ఇప్పుడు ప్రభుత్వం వారు ప్రచురించి తెలుగు వాచకంలోనూ కొమరం భీం పాఠం ఉంది ఇదంతా సాహు కృషి ఫలితం 'సాహు వేకంటేశ్వర్లు గారి రచనలు కథలు కవితలు నవల రాశికి తక్కువైనా విప్లవ సాహిత్యంలో వాసి గలవి

## 21 సుద్దాల అశోక్, ఎం ఏ బి ఇడి మేడిపల్లి

తెలంగాణా రైతాంగ పోరాటకవి సుద్దాల హన్మంతు గారి పుత్రులు అశోక్ వీరి పరిచయం ఈ గ్రంధంలోని లలిత గీతాల శీర్షికలో ఉంది అశోక్ గారు కవి గాయకులు - నటులు వీరిదో పాటల పుస్తకం, మరో నవల ముద్రణ పొందాయి అశోక్ గారి నవల 'వెలుగురేఖలు విశాలాంధ్ర విజయవాడ వారి 1985 సం పోటీలో ద్వితీయ బహుమతిని పొంది అదే సంవత్సరము ప్రచురింప బడింది

ఇది గ్రామీణ జీవిత కథ పెద్ద జమీందారుల కాక మధ్యరకం భూస్వాముల వారి ఆశ్రితుల కుయుక్తులు - దోపిడి ఇందులో వర్ణించబడ్డాయి నేటి గ్రామీణ సామాన్య రైతుకుటుంబాల జీవిత సమస్యల నేపథ్యంలో రచయిత ఈ కథను తెలంగాణా మాండలిక భాషలో నడిపారు

## 22 ఎస్ ఆర్ పవన్ కుమార్ - గోదావరిఖని

పవన్ కుమార్ గోదావరిఖనిలో బొగ్గుగని ఉద్యోగిగా ఉన్నకాలంలో నల్లవజ్రం పేరుతో ఓ నవల వ్రాశారు 'కోల్‌బెల్ట్" కార్మికుల పత్రికలో 1986లో సీరియల్‌గా ప్రచురింపబడిన ఈ నవల 1987లో పుస్తకంగా వచ్చింది

బొగ్గుగని కార్మికుల జీవితాలను యధాతధంగా అందమైన తెలంగాణా మాండలిక భాషలో దయనీయంగా చిత్రించిన నవల నల్లవజ్రం ఓ గని కార్మికుడు బావి బదిలీ కోసం ప్రయత్నించి పడినపాట్లు, అధికారుల తతంగాలు ఇందలి కథ ఓటమితో చిత్రెత్తిన ఆ కార్మికుడు, వ్యక్తి సమస్యను సంఘ సమస్యగా మార్చి విప్లవించి, అధికారులపై విజయం సాధించడంతో కథ సమాప్తం - సుఖాంతం ఇందులో కాలనీ గని పరిసరాల - వ్యక్తుల స్వభావ చిత్రణ సహజంగా ఉంది కళ్లారా చూస్తే - అనుభవిస్తే - ఎంతో నిశితంగా ఆలోచిస్తే తప్ప ఇంత చక్కని రచనలు రూపొందజాలవు

ఈ పుస్తకం ముందు మాటలో ఎం వి సుబ్బారావు గారు "అసంఘటిత రైతాంగం బొగ్గుగనుల్లో చేరి సంఘటిత శక్తిగామారే పరిణామ క్రమాన్ని చిత్రించిన మొట్టమొదటి నవల ఈ నల్ల వజ్రం" అని ప్రశంసించారు పవన్ గారి స్వంత పేరు వేరే ఉండవచ్చునని, అతనికి బెజ్జంకి సమీప గ్రామమని, కొన్నాళ్లు మాత్రం గోదావరిఖనిలో ఉండి వెళ్లారని తెల్సింది కాని, ఇది ప్రముఖ కథా రచయిత రఘూత్తమ రెడ్డి గారి రచన అని ఈ మధ్య వినవచ్చింది

## 23 కె వి నరేందర్ - బి ఎస్సి, బి ఇడి చిల్వకోడూరు

వీరి రచనలు 1 మనోగీతం (కథల సంపుటి) - 2 బేబీ ఓ బేబీ (నవల) 1991 కె వి నరేందర్ గారు జగిత్యాల మండలంలో అధ్యాపకులు వీరు పాపులర్ కథా రచయిత వీరి కథలు అన్ని ప్రముఖ పత్రికల్లోనూ వచ్చాయి నరేందర్ గారు కథలనేకాక నవలలు కూడా వ్రాశారు వీరి 'బేబీ ఓ బేబీ' నవల 'ఉదయం' దినపత్రిక ఆదివారం సాహిత్యానుబంధంలో 1990 91లో 30 వారాల పాటు ధారావాహికంగా ప్రచురించబడి ప్రజాభిమానం చూరగొన్నది బేబీ ఒ బేబీ నవలను 'మధుపబ్లికేషన్స్' విజయవాడ సంస్థ, 1991 సెప్టెంబర్‌లో కాస్టిలీ గెటప్‌లో 290 పుటల పుస్తకంగా ప్రచురించింది

ఈ నవల కథా విషయం ప్రధానంగా టెస్ట్‌ట్యూబ్ బేబీ జననానికి సంబంధించింది వివాహానికి ముందే పెళ్లి కోసం మాతృత్వాన్ని కోల్పోయి, ఆ పెళ్లికి కూడా నోచుకోక, అందుకు కారణమైన వరునిపై కక్ష పెంచుకొని కసి తీర్చుకున్న ఓ యువతి విచిత్ర చర్యలు ఈ కథలోని సన్నివేశాలు అదర్శం మాట ఏమైనా పాఠకులకు ఉత్కంఠ పెంచుతూ డిటెక్టివ్ కథలా ఆసక్తిగా చదివించే ఈనాటి వ్యాపార ధోరణి నవల 'బేబీ ఓ బేబీ' నరేందర్ గారి భాష రచనాశైలి రమ్యమైనవి ఇందలి సైన్సు సమాచారం విలువైనది ఈ నవల రచయితకు పేరు చాల వ్యాప్తిలోనికి తెచ్చింది ప్రస్తుతం నరేందర్‌గారు ఈటి వి లో రచయితగా పని చేస్తున్నారు

## 24 డా కాలువ మల్లయ్య, ఎం ఎస్సి, ఎం ఏ పిహెచ్ డి తెలుకుంట

కాలువ మల్లయ్య గారి పరిచయం గేయకవుల్లో ఉంది కథా సాహిత్యంపై పిహెచ్ డి పట్టా పొందారు వీరు కవి కథా రచయిత 300 పైగా కథలు, 30 వ్యాసాలు వ్రాసిన వీరి నవలలు మూడు

రెండు కవితా సంపుటాలు, మూడు కథా సంపుటాలు ప్రచురించిన కాలువ మల్లయ్య గారివి రెండు నవలలు వచ్చాయి 1 భూమిపుత్రుడు, 2 సాంబయ్య చదువు 1991లో 'చతుర' మాస పత్రికలో ప్రచురణ పొందింది

భూమి పుత్రుడు ఈనాటి గ్రామీణ రైతు జీవితాల చిత్రణ వ్యవసాయాలు చెడి, కుటుంబాలు చితికి, బతుకు తెరువుకోసం గని కార్మికులుగా వలసపోతూ ఎదురౌతున్న ఆగచాట్లు ఇందులో వర్ణింపబడినవి ఈ నవలకు రైతు జీవిత చిత్రణకు గానుతెలుగు విశ్వవిద్యాలయం వారు1992 సం లో ఏటుకూరి వేంకట నరసయ్య గారి స్మారక బహుమతిని ఇచ్చారు

సాంబయ్య చదువు - నవల 'చతుర' పోటీల్లో ప్రత్యేక బహుమతిని పొందినది ఇది ఒక గ్రామీణవిద్యార్థి ప్రాథమిక - కాలేజీ జీవిత చిత్రణ 1975-80 మధ్య కాలపు సామాజిక కల్లోల పరిస్థితి వర్ణించ బడింది ఇది ఒక విధంగా రచయిత ఆత్మకథ హైస్కూల్లో కా మల్లయ్యగారు నా విద్యార్థి పి హెచ్ డి కోసం ఉస్మానియాలో ఇద్దరం ఒకేసారి చేరడం విచిత్రానుభవం వీరి ఊరంటే అముద్రిత నవలవిశాఖ బహుమతి పొందింది ఈ 97లో ప్రతిష్ఠాత్మక రావిశాస్త్రి అవార్డు వీరిని వరించింది ఇది కరీంనగర్ జిల్లా రచయితలకు గర్వకారణం

## 25 డా ముదుగంటి సుజాతా రెడ్డి, ఎం ఏ పిహెచ్ డి పొత్కపల్లి

డా సుజాతా రెడ్డి గారు హైదరాబాద్‌లోని రెడ్డి ఉమెన్స్ కాలేజీలో తెలుగు ఉపన్యాసకురాలు ఉస్మానియా విశ్వవిద్యాలయంలో సంస్కృత శాఖాధ్యక్షులుగా పనిచేసిన ప్రొ ఎం గోపాలరెడ్డి గారు వీరి భర్త సుజాత గారు 'మనువసు చరిత్రల తులనాత్మక పరిశీలన' కావించి తెలుగులో డాక్టరేట్ పట్టా పొందారు 'తెలుగు నవలానుశీలనం' 'వేమన - నాథ సంప్రదాయం', వీరి ఇతర రచనలు సంకెళ్లు తెగాయి పేరుతో వీరి తొలినవల 1994లో వెలువడింది

సామ్యవాదం కోసం సాయుధ పోరాటం అభిలషణీయం కాదని, శాంతి సౌమనస్యాలతోనే సమాజాన్ని మార్చుకోవాలనే ఆశయంతో వీరీ నవల రచించారు హరిజన కుటుంబంలో పుట్టి ఉన్నత విద్య నేర్చి కలెక్టరై, ఊరికి తనవారికి, మేలు చేసిన ఓ యువకుని జీవితం ఈ సంకెళ్లు తెగాయి ఆదర్శంలో ఈ నవల బోయి భీమన్న గారి నాటి ‘పాలేరు’ నాటక కథకు సమీపంగా ఉంది

సుజాత గారి మరో నవల ‘ప్రగతిపథం అముద్రితం తెలుగు నవలా రంగంలో ఓ నలుబదేండ్లుగా అతివలదే అగ్రస్థానమైనా కరీంనగర్ జిల్లా రచయిత్రులలో మొట్ట మొదటి నవల ప్రచురించిన నవలామణి సుజాత గారు

## 26 గూడూరి అమరావతి - అంతకపేట

అమరావతి గారు ఆత్మకథాత్మకంగా రచించిన సంచలనాత్మక నవల నేటి విప్లవ పోరాటం నేపథ్యంలో ‘కల్లోల నేత్రం’ ఆంధ్రజ్యోతి వీక్లీలో సీరియల్‌గా వస్తున్నది రచయిత్రి పెద్ద విద్య వతికారు కాని, సాహసం కల యువతి తీవ్రవాద మార్గంలో పయనించి తిరిగి ప్రజల్లోకి వచ్చి పోరాటం - సమాజం అనుభవాల కథగా మలచిన వారిలో అమరావతి ఆంధ్రప్రదేశ్‌లోనే మొదటి వారు కాగలరు ఇలాంటి వారి కవితలు వచ్చాయి,నవలలు రాలేదు.అందులో స్త్రీలు అరుదు ఈ నవల రెండవ భాగం కూడా కావచ్చు

## నవలా సాహిత్య సమాలోకనం

ఆంధ్ర ప్రదేశ్‌లో తెలుగు నవలల వయస్సు వందేండ్లు కరీంనగర్ జిల్లాలో నవల పుట్టి సుమారు యేబదేండ్లు అయింది ఇక్కడి నవలా రచయితలలో ఒకటి రెండు నవలలు వ్రాసిన వారే ఎక్కువ నవలా రచయిత్రులు ఇంచుమించులేరనవచ్చు డా సుజాతా రెడ్డి గారి ఒకే నవల ముద్రణ పొందింది ధర్మపురిలో వరలక్ష్మి శర్మ గారు నారాయణీయం మరో నవల వ్రాసినట్లు 1981లో చెప్పినా అవి అలాగే అముద్రితంగా ఉండిపోయినై 1980 సుమారుగా ఉమాదేవి అనే ఇంటర్ విద్యార్థిని కరీంనగర్‌లో ఒక సాంఘిక నవల రాశారు అచ్చు కాలేదు కవయిత్రి పి హైమవతి 1990 సుమారుగా ‘వికలాంగి’ (దేశమాత) అని ఒక నవల రాసినా అదీ అముద్రితమే 1970 సుమారుగా జగిత్యాల విద్యార్థులైన శ్రీకోట శ్రీరంగం,దాసరి రామస్వామి,భీమనాతి ప్రభాకర్ గారలు నవలలు కథలు రాసినట్లు వారి సహచరుడు బి ఎస్ రాములు చెప్పారు కాని, ప్రోత్సాహం కరువై అవీ వెలుగు చూడలేదు

ఈ జిల్లాలో నాలుగైదు నవలలు వ్రాసింది అల్లం రాజయ్యగారు ఇంకా రేగుల పాటి కిషన్‌రావుగారు పది నవలలు ఒక్క మలయశ్రీ గారివి మాత్రమే వెలువడ్డాయి డా॥ కాలువ మల్లయ్య గారివి ముద్రితాలు రెండు నవలలే అయినా వేగంగా ముందుకు వెళ్ళే సూచనలున్నాయి బి ఎస్ రాములు, కె వి నరేందర్ నవలారంగంలో ఇద్దరు చెరి ఒక కోణంలో ఇంకా రచించి రాణించవచ్చు అమరావతి నవల వెలువడితే అదో సాహితీ సంచలన అంశం

ఇన్ని పత్రికలు వెలువడుతున్నా ఇక్కడి ఏ ఒక్క రచయితకూ సీరియల్ నవలా రచయితగా డిమాండ్ రాలేదు అందుకు కారణం? అవి ఈ ప్రాంతీయులకు అందుబాటులో లేకపోవడమే, అందుకే ఇక్కడ నవలలు వ్రాసి ముద్రణ పొందని వారు, నవలలు వ్రాయగలిగి అందుకు పూసుకోని వారు సైతం ఉన్నారు

వచ్చిన నవలల్లో ఏ నాలుగైదో తప్ప కాలక్షేప నవలలు లేవు వీటిలో అధిక శాతం సామాజిక స్పృహ కలవి శ్రామిక - కర్షక జనపక్షపువి కావడం విశేషం విశాలాంధ్ర బహుమతి పొందిన నవలలు నాలుగు - (దశరథ్ - మలయశ్రీ - అశోక్) వార పత్రికల బహుమతులు పొందినవి

అయిదు (తాడిగిరి పోతరాజు సరిపెల్లి కృష్ణారెడ్డి, డా మలయశ్రీ డా కాలువ మల్లయ్య) ఇక్కడ కేవలం వ్యాపార దృష్టితో వచ్చిన నవలలు మాత్రం తక్కువ

ఈ సినిమాల - టెలివిజన్‌ల ప్రభావంగా నవలల భవిష్యత్తు ఆశాజనకంగా ఉందని చెప్పలేం అయినా దాని విలువ దానిది చిన్న కథకు మాత్రం మంచి కాలం స్థానం ఎప్పుడూ ఉండేలా ఉంది

నవలా రచనకు పద్యకావ్యం వలెనే రచనలో ప్రచురణలో రచయితకు ప్రయాస అధికం, ఫలితం స్వల్పం - అన్నట్లుగా ఉంది అయినా ఈ ప్రముఖ సాహితీ ప్రక్రియలో పలువురు రచయితలు ఇక్కడి వారు కృషి చేసినందుకు, రాష్ట్ర స్థాయిలో జిల్లాపేరు, తమపేరు నిలిపినందుకు నిలుపుకున్నందుకు అభినందించక తప్పదు

## కథా సాహిత్యం

తెలుగు కథ చాల పాతది మాటతోపాటుగా పాట పుట్టినట్లుగానే భాషతో పాటు కథ పుట్టింది లిపి లేని కాలంనాడే మౌఖిక జానపదాలుగా కథలు పుట్టి పెరిగాయి నిజానికి భాషలేని కాలంనాడే కథలు పుట్టి ఉంటాయి మాటలు లేకున్నా నాటి ఆదిమ నివాసులు వివిధ సంఘటనలను సంజ్ఞల ద్వారా పరస్పరం తెలుపుకొని ఉంటారు కదా అవి కథలే - మూకీ కథలు! జానపద సాహిత్యంలో కథలకు ప్రత్యేక స్థానముంది ఈనాటికీ మన గ్రామ సీమల్లో కథలు కుప్పలు గ్రామీణ వృద్ధులు పుక్కిటికతలు చెప్పటంలో దిట్టలు ఇప్పటికీ పిల్లలు కథలు వినడమంటే చెవికోసుకుంటారు చిలుక పలుకులతో చిట్టిపొట్టి కథలు చెప్పుకోవడంలోనూ చిన్నారులు నిపుణులు

తెలుగులో అమ్మమ్మ కథలు, తాతయ్య కథలు, పేదరాశి పెద్దమ్మ కథలు, మర్యాద రామన్న కథలు, తెనాలి రామలింగని కథలు, మంత్రాల మఱ్ఱి కథలు, మాయల పకీరు కథలు జనపదాల్లో పుట్టినవే అవి జాన పదాలే

పంచతంత్ర హితోపదేశ కథలు హంస వింశతి, శుక సప్తతి భోజరాజు కాళిదాసు కథలు, సింహాసన ద్వాత్రింశతి సాలభంజికల భట్టి విక్రమార్క కథలు సంస్కృత సాహిత్యం నుంచి వచ్చినవి అక్బర్ బీర్బల్ కథలు, అరేబియన్ నైట్స్ కథలు, సింద్‌బాద్ కథలు ఇతర భాషా సాహిత్యాల ప్రభావంతో అనంతర కాలంలో తెలుగు సాహిత్యంలోనికి వచ్చాయి

సంస్కృత సాహిత్యంలో వేదాల్లోను కథలున్నాయి పురాణాల్లోని మహిమల కథలు, ఇతి హాసాల్లోని రాజుల కథలు, ఉపనిషత్తుల్లోని వేదాంత కథలు ప్రముఖమైనవి జైన తీర్థంకర గాథలు, బౌద్ధ జాతక కథలు, ధమ్మపద అట్టకతలు విలువైన ప్రాకృత నీతి కథలు

మన తెలుగు నాడులో శాతవాహనాంధ్ర చక్రవర్తి హాలుడు సంకలనం చేసిన 'గాథా సప్తశతి' లో కథా బీజాలున్నట్లు పరిశీలకుల అభిప్రాయం ఆ కాలపు గుణాఢ్య పండితుని చేత పైశాచీభాషలో విరచితమైన 'బృహత్కథ' అనేకాద్భుత కథల మాలిక అనంతర కాల సంస్కృత కావ్య - రూపకాలెన్నింటికో అది మాతృక

సంస్కృతంలో దండి - దశకుమార చరిత్ర, బాణుని - కాదంబరి తప్ప మిగిలిన వన్నీ పద్యగాథలు తెలుగులోనూ అంతే నాటిశిష్ట సాహిత్యంలో కథలు కూడా కవిత్వంలోనే పద్య కావ్యాలుగా వచ్చాయి

దేశి సాహిత్యంలోనే కథలు గేయ - వచన జానపద మౌఖిక రూపాల్లో సమానంగా అభివృద్ధి వ్యాప్తి చెందాయి

తెలుగు వచన కథలు, 19వ, శతాబ్దిలోనే ఆంగ్ల భాషా సాహిత్య ప్రభావం వల్ల రచించబడి

అచ్చు పొందసాగాయి ఆధునిక తెలుగు కథ గురజాడ గారి 'దిద్దుబాటు' తో 1910లో ఆరంభమైంది ఈ ఇరువదవ శతాబ్ది పూర్వార్థంలో తెలుగు కథను మన రచయితలు ఎంతగానో అభివృద్ధి చేశారు

కరీంనగర్ జిల్లాలో మాత్రం కథ 1950 సుమారుగా పుట్టినా తర్వాతనే పెరిగింది

ఈ జిల్ల కథా సాహిత్యాన్ని కాలాన్ని బట్టి మూడు తరగతులుగా విభజించుకోవచ్చు

1 తొలితరం 1950-60, ఈ జిల్లా పత్రికలలోని కథలు

2 మలితరం - 1961 -80 రాష్ట్ర పత్రికలలోని కథలు

3 చివరి తరం 1981-95 కథా సంపుటాలు

1945లో జి రాములు - సిరిసిల్ల గారి 'ఆత్మఘోష' కథ విడి పుస్తకంగా వచ్చింది ఈ రచయిత పరిచయం నవలా రచయితల్లో వుంది

తొలితరం కథలు - రచయితలు ఇవి కరీంనగర్ జిల్లా సాహిత్య పత్రికలలో వచ్చినవి ఆ కాలంలోని ఇక్కడి కథల కథారచయితల వివరాలు ఇవి

'చైతన్యం' మాసపత్రిక మార్చి 1953 కరీంనగర్, సం జె బాపురెడ్డి

ఇందలి కథలు రచయితలు -

మాతృప్రేమ ఏ కనుకయ్య కరీంనగర్, పత్రికల పిచ్చి - జి చంద్రమౌళి విలాసాగర్, లంచానికి లంచం - ఆర్ సుధాకర్ -?, నవీన ప్రేమకు నాంది - సి భగవంతరావు - కోరెం,

'సారస్వత జ్యోతి' త్రైమాసిక పత్రిక ఫిబ్రవరి 1954 కరీంనగగర్ సం బి వి రామారావు పిట్ట బ్రతుకు - చెన్నమనేని, మారుపాక?, ఒకే మార్గం పింగళి లింబాద్రిరెడ్డి నెమిలికొండ

ఒట్టు చింతల నారాయణ, కరీంనగర్,

'సారస్వత జ్యోతి' ఆగస్టు 1954 చీకటి గొడుగులు - గూడూరి సీతారాం, సిరిసిల్ల, నెహ్రూ గదిలో పటేలు భూతం - జువ్వాడి గౌతమరావు, ఇరుకుల్ల

'జ్యోత్స్న' మాస పత్రిక - మార్చి 55, జగిత్యాల, సం- ఆర్ రామకృష్ణ

తమ్ముడు - సురమౌళి, విలాసాగర్, ఎవరి భార్య బి ఏ రాధాకృష్ణ ?

సాహితీ జీవనయాత్ర - బద్దం వెంకటరెడ్డి, మూడేపల్లి

వీరిలో గూడూరి సీతారాం, సురమౌళి తప్ప మిగితా వాళ్లు కథారచనకు సాహిత్య రంగానికి దూరమైనారు పింగళి లింబాద్రి రెడ్డి జువ్వాడి గౌతమరావు గారలు మాత్రం సాహిత్యాభిమానంతో వచన రచనలు చేశారు పై వారిలో పలువురు కీర్తిశేషులు

**1 జి సురమౌళి - బి ఏ , ఎల్ ఎల్ బి విలాసాగరం - జీవిత కాలం- 1935-1995**

గరిశకుర్తి సురమౌళి గారు ప్రముఖ జర్నలిస్టు సోషలిస్టు సిద్ధాంతాభిమాని, వీరు కథా రచయిత వ్యాసకర్త - అనువాదకులు - నాస్తికులు

వేములవాడలో ప్రాథమిక విద్య, కరీంనగర్‌లో మెట్రిక్ 1951లో ప్యాసై వేములవాడ మిడిల్ స్కూల్లో కొన్నాళ్లు అధ్యాపకులుగా పనిచేసి, హైద్రాబాద్ చేరి, ఆంధ్ర సారస్వత పరిషత్తులో గుమాస్తాగా పనిచేస్తూ, 52లో ప్రభుత్వ న్యాయశాఖలో టైపిస్టుగా చేరారు సాయం కళాశాలలో చేరి 1954లో ఇంటర్, ఎలెల్‌బి 1960లో పూర్తి చేశారు

క్లర్కుగా, టైపిస్టుగా ఉద్యోగాలు చేసిన వీరు 1984 నుండి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ శాసనసభా కార్యాలయంలో అనువాదకునిగా పనిచేస్తూ అప్పుడప్పుడు ఆకాశవాణిలో తెలుగు వార్తలు చదివేవారు వీరు ఆంధ్ర జనత, ఆంధ్రభూమి, బహుజన పత్రికలకు ఉప సంపాదకులుగా 'పంచాయత్' పత్రికకు సంపాదకులుగా పనిచేశారు వీరు సర్సంపేటలో కొన్నాళ్లు 1962-67

వరకు వరంగల్లులో న్యాయవాద వృత్తి సాగించినా అది అచ్చిరాలెదు సాహిత్యం, సోషలిజం పార్టీ అభిమానం వీరిని వకాలత్ వృత్తిలో స్థిరంగా ఉండనీయ లేదు లోహియా మరణంతో సోషలిస్టు పార్టీ రాష్ట్ర కార్యదర్శిగా తిరిగి హైదరాబాద్ చేరుకున్నారు

సురమౌళి గారు విద్యార్థి కాలం నుండే సాహిత్యాభిమాని వీరి కథలు వ్యాసాలు అనేకం విశ్వనాధ సత్యనారాయణ, పాలగుమ్మి పద్మరాజు, మాధవ పెద్ది గోఖలే మొ॥ ప్రముఖ కథా రచయితల పత్రికలలో 20 వరకు ప్రచురింపబడ్డాయి వానిలో కొన్ని

అంగుడి పొద్దు - వట్టికోట ఆళ్వారు స్వామి 'పరిసరాలు' కథా సంకలనం

మంకు - ఆంధ్ర పత్రిక, నర్సుల జీవితం - ఆంధ్రప్రభ

ఇప్పసార - పోలికేక రక్తపూజ - సాధన సమిత సంకలనం,

తమ్ముడు జ్యోత్స్న, అరటి తొక్క - మోసపోయిన మల్లమ్మ

భాగ్యనగర్ సారథి నేత మొ॥ పత్రికలలో వీరి కథలు అచ్చయినాయి రచయిత మాటల్లో "ఈ పత్రికలు ప్రముఖమైనవి కాకపోయినా వీటి సంపాదకులు మాత్రం ఉద్దండులు వీరందరూ తమ పత్రికల్లో నా కథలు అచ్చువేశారు వాటి కటింగులు నావద్ద లేవు వాటి పేర్లు నాకు గుర్తు రావు ఏమైతే నేమి మంచి కథా రచయితగా పేరు మాత్రం వచ్చింది!(సురమౌళి గారి లేఖ 2 3-94)

కథలో సంభాషణలు మాండలికంలో, వర్ణనలు వ్యావహారిక భాషలో వ్రాసే సురమౌళి గారు 1954 అలంపురం సాహిత్య సభల సందర్భంలోని విశ్వనాధ సత్యనారాయణ, సలహాలను పాటించి అప్పటి నుండి - పూర్తి మాండలికంలో కథలు రాస్తూ వచ్చారు (డా ననుమాస స్వామి వ్యాసం 'ఆంధ్రభూమి' దినపత్రిక - తేది ? 94)

సురమౌళి గారి కథా రచనకు ఎవరి ప్రేరణ లేదు సమాజాన్ని దర్శించిన కళ్ళే వీరి కలాన్ని నడిపించాయి సి నా రె కాళోజీ, ఆవుల సాంబశివ రావు, వరవరరావు పలువురు ప్రముఖ రచయితల, రాజకీయ నాయకుల సాహచర్యం లభించిన వీరు హింసావాదాన్ని నిరసించె సామ్యవాది వీరి వచన రచనల పరిచయం తర్వాత చేయబడుతుంది మానవతావాద స్ఫూర్తితో పాత్రల స్వభావాల సూక్ష్మంగా విశ్లేషణ కావిస్తూ సహజ సుందరంగా రచించిన సురమౌళి గారి కథలు సంపుటంగా వస్తే బాగుండేది (మే 97 లో సురమౌళి గారి కుమారుడు విప్లవదత్ తండ్రి గారి కథల సంకలనం తెస్తున్నటు తెలిపారు 94 మేలో సురమౌళి గారిని వారింట కలుసుకున్నా ఇంతకు మించి వివరాలు తెలిసి రాలేదు)

## 2 గూడూరి సీతారాం - ఇంటర్, సిరిసిల్ల - జ. 1936

గూడూరి సీతారాం గారికి సురమౌళి విద్యాగురువు మాత్రమే కాక కథా రచనలోనూ మార్గదర్శకులు కవి కనపర్తి గారు సహ విద్యార్థి, వీరంతా సి నా రె జన్మగ్రామ ప్రాంతీయులు - వారి అభిమానులు సీతారాం గారు 1951 నుండి 64 వరకు బ్లాక్ ప్రోగ్రెసివ్ అసిస్టెంట్‌గా ప్రభుత్వోద్యోగం చేసి, దానిని వదలి వస్త్ర వ్యాపారంలో స్థిరపడ్డారు



కథా రచయితగా వీరికి మంచి పేరుంది జ్యోతి, నేత, స్వతంత్ర మొ॥ పత్రికలలో వీరిని 70, 80 కథలు ప్రచురణ పొందినట్లు స్వయంగా చెప్పారు ఆ కథల ప్రతులు ఇప్పుడు వారి వద్ద లేదు

'సారస్వత జ్యోతి' ఆగష్టు - 1954 త్రైమాసిక సాహిత్య సంచికలో మాత్రం సీతారాం గారి 'చీకటి గొడుకులు' కథ కనిపించింది

**3 జె. గౌతమరావు - బి ఏ ఎల్ ఎల్ బి ఇరుకుల్ల - కరీంనగర్**

జువ్వాడి గౌతమరావు గారు సోషలిస్టు పార్టీ అభిమాని వీరు స్వాతంత్ర్య సమరయోధులు న్యాయవాది నెహ్రూ గదిలో పటేలు భూతం వీరి వ్యంగ్య రచన - గల్పిక చార్లెస్ డికెన్స్ 'క్రిస్టమస్ కోర్ల్' ఆధారంగా వీరీ కథను నాటి కాంగ్రెసు రాజకీయ నేపథ్యంగా మార్చి 15 డిసెంబర్ 1953లో రచించామన్నారు 'సారస్వతజ్యోతి' ఆగస్టు 54 సంచికలో ఇది ప్రచురించబడింది

గౌతమరావు గారు 'జయంతి' సాహిత్య పత్రికకు, 'జనశక్తి' సోషలిస్టు రాజకీయ పత్రికకు కొంతకాలం సంపాదకులుగా వ్యవహరించారు

ఈ కాలపువన్నీ సాంఘిక కథలు కొన్ని జానపద గాథలకు, ఇతర భాషా కథలకు అనుసరణలున్నవి ఇది ఈ ప్రాంత కథా రచనకు ఆరంభం మాత్రమే అభివృద్ధి తర్వాతి కాలంలో జరిగింది

**మలితరం కథా రచయితలు**

1 డా యశోదా తిరుమల్ రెడ్డి ఎం ఏ , పిహెచ్ డి , - అన్నారం
2 తాడిగిరి పోతరాజు, ఎం ఏ , లిట్ హుజూరాబాద్
3 ముప్పాళ నరసింహారావు, బి ఏ బీర్పూర్ 4 మలయశ్రీ ఎం ఏ , ఎం ఓ ఎల్ చంజర్ల,
5 కూతురి రాంరెడ్డి, బి ఏ కరీంనగర్, 6 ఎం వి తిరుపతయ్య - ఎం ఏ , ధర్మారం
7 చొప్పకట్ల చంద్రమౌళి ఎం ఏ, వేములవాడ, 8 పురాణం రామచంద్ర, వేములవాడ
9 అప్సర్ హుస్నాబాద్, 10 ఎస్సెలెన్‌బాబు, ఎం కాం , చంజర్ల,
11 ముప్పాళ లక్ష్మణ్‌రావు, బి ఎస్సి బి ఇడి బీర్పూర్,
12 ముదుగంటి పాపిరెడ్డి, బి కాం , ఎం ఏ విద్వాన్ - నామాపూర్,
13 ఎం మధుసూదన్ రావు ఎం ఏ , ధర్మారం

1960 నుండి పై రచయితల కథలు వివిధ పత్రికలలో వచ్చాయి వీరిలో డా యశోదా తిరుమల్ రెడ్డి, తాడిగిరి పోతరాజు గారల కథలు మాత్రమె సంపుటాలుగా వచ్చాయి మలయశ్రీ సరదా కథలు' పుస్తకంగా వచ్చినా అది బాల సాహిత్య కథా సంపుటి మొదటి ఇద్దరి కథల పరిచయం మాత్రమే ఇట చేయబడుతున్నది

**1 డా యశోదా రెడ్డి, ఎం ఏ , (తెలుగు - సంస్కృతం) పిహెచ్ డి అన్నారం జ 1929**

యశోదారెడ్డి గారు ఉస్మానియా యూనివర్శిటీ తెలుగు ప్రొఫెసర్‌గా ఉద్యోగం చేసినవారు ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ అధికార భాషాసంఘాధ్యక్షురాలిగా, అనేక భాషా సాహిత్య సంస్థల, సాహిత్య సంగీత నాటక, లలిత కళల అకాడెమీల సభ్యురాలిగా పదవీ బాధ్యతలను నిర్వహించారు వచన రచనలో వీరిది అందెవేసిన చేసి సంస్కృతాంధ్ర సాహిత్యాలలో పి జి డిగ్రీలు పొందిన వీరు చక్కని సాహిత్య విమర్శకురాలు

వీరు వచన వ్యాస రచనలేకాక అనేక కథలను రచించారు 1950-71 మధ్య ఊరబావి ముచ్చట్లు శీర్షికను ఆలిండియా రేడియో హైదరాబాద్ కేంద్రంలో వీరు ప్రవేశపెట్టారు మహలక్ష్మి ముచ్చట్లు పేర, ఆ తర్వాతి కాలంలో యశోదాదేవి గారి కథలు - గల్పికలు ఆకాశవాణి హైద్రాబాద్ కేంద్రం నుండి ప్రసారమైనాయి అవి తెలంగాణా మాండలిక భాషలో గ్రామీణులకు ప్రయోజనకరమైన కథా ప్రసంగాలు

కెమెరా చెప్పిన కథలు, కాలక్షేపానికి కబుర్లు, కాశీపట్నం, జహ్వాకోరుచి - శీర్షికలు వివిధ పత్రికలలో ప్రవేశపెట్టి వీరు నిర్వహించారు పలు పత్రికలలో ప్రచురింపబడిన వీరి 75 శీర్షికల కథలను ఒక సంకలనంగా తెచ్చే ప్రయత్నంలో ఉన్నారు వీరి ముద్రిత కథా సంపుటి మాత్రం ఒకటే

పూవూరి ముచ్చట్లు - 1973 ముద్రణ (సుధర్మా పబ్లికేషన్స్ - నారాయణగూడ) దీనిలో పది కథలున్నాయి 72 పుటల్లో, 16 పుటల్లో మాండలిక శబ్దాలకు అర్థాలు వివరణలు ఇచ్చినారు

ఆ పది కథల పేర్లివి - గంగరేగి చెట్టు, నాగి, మ్యానికరం, పీర్ల పండుగ, మొమ్మైకథ, జతగాళ్లు, జోగులయ్య, మా పంతులు ఎంకన్న, మురారి

రచయిత్రి ఈ కథల్లో తమ బాల్యజీవితాన్ని మధుర స్మృతులను, మరపురాని వ్యక్తులను సజీవ తెలంగాణా మాండలిక భాషలో సహజసుందరంగా వర్ణించారు ఈ కథల సంపుటి పీఠికలోని రచయిత్రి మాటలు విలువైనవి - "భాష జాతి కొక పైతృక ధనము ఆ భాండాగారములో జాతీయములు, పదబంధములు సామెతలు, నీతి వాక్యములు, సామ్యములు, స్త్రీ బాల వృద్ధుల నుడికారపు సొంపులు ఉపమానములు, అలంకారోక్తులు, విశేషోక్తులు, ప్రౌఢోక్తులు ఎన్నియో చేరి ఉండును ఆ విశిష్ట సంపత్తిని తాననుభవించి మఱికొంత చేర్చి భద్రముగా తన తరువాత తరముల కప్పగించుట జాతీయుని కనీస ధర్మము ఇప్పుడు తెలంగాణపు తెలుగు కూడ తదితర ప్రాంతములందు వలెనే తన నిజస్వరూపమును చాల వరకు పోగొట్టు కొని నామమాత్రావ శిష్టమైయున్నది కావున అమూల్యములైన ఆ పద బంధములు కాలగర్భములో కలిసిపోకుండునట్లుగా గ్రామీణ జన వ్యవహారమందున్న పద ప్రయోగములను కాపాడవలెననెడి తాపత్రయమే యీ కథల సంపుటికి కారణము " 'కేవలం పదముల పట్టికలుగా వీరు ఈ కథలే వ్రాయలేదు వీటిలో జన జీవనమున్నది పల్లెల పలుకు బడితోపాటు వ్యక్తుల స్వభావాల, ప్రకృతి సౌందర్యాల చిత్రణమున్నది గ్రామాల్లో వస్తున్న మార్పులను సైతం 'కొత్తబాట' మొ కథల్లో వివరించారు " డా పి యశోదా రెడ్డి గారి 'కథాచరిత్ర' ము 1989, ప్ర 95-100

యశోదారెడ్డి గారి కథన శైలికి 'మాపంతులు' కథ నుండి కొన్ని వాక్యాలు చూడండి -

"ఆ యాళ్ల పొద్దున నేను సాళ్లకే పోవద్దనుకున్న, పంతులు జెప్పిన గుణింతం కాకుర్తం, నాకింకా కంఠపారం రానేలేదు నేను పొయ్యేటప్పటికే మా పెబ్బ నరసింహచారి శ్రీ చుక్కల పట్టి సదువుకల మొదలు పెట్టి ఉంటడు ఇగ ఇప్పుడెంత ఉర్కి ఉర్కి ఎగపోసుకుంట బోయినా, నా పేరు చుక్కల్లనే జేర్తది నా కెట్లా బెత్తం దెబ్బలు దప్పవు ఈ దిక్కుమాలిన సాళ్లెకు వోయి, ఆ ఏక్‌సౌగ్యారా గాణితోన చెడీ దెబ్బలుదినే దానికంటె, ఇల్లుదాటి, వాయిళ్లదాపు నుండి మామిడి పంపుల్ల వడి ఊరిబాయి కాడ్కిపోయింది నయం ఆడ్కి బోతినంటే ఇర్గ బూసిన చింతలన్ని ఎక్కొచ్చు రెండు చేతులా చింత పువ్వు, చిగురు దిని, ఇంగా కీసలు నింపుకోవచ్చు, లకుముకి పిట్ట తీర్గ మోట చిమ్ముల కాణ్నుంచి కాన్‌చీటి గొట్టొచ్చు ఈతగోలీలకు పైసలన్న వొస్తవి" ఈ కథలో నాటి విద్యా విధానమేకాక, రాజకీయాల వారి రంతుకూడ రమ్యంగా చిత్రించబడింది యశోద గారిది సజీవ తెలంగాణా వ్యావహారిక గ్రామ్య భాష రచయిత్రి 'తెలుగునుడి కారపు సొంపును యాసముసుగు నుంచి తప్పించి ఆనందింపగలిగే ప్రాంతీయ భాషలో కథను సొగసుగా ముద్దులొలికేటట్లు వ్రాయగలిగినవారు ఈమె శైలి తేనె పెరలవంటి తెలుగు పదబంధాలతో సామెతలతో గూడి మానవ జీవన రీతులకు అద్దం పడ్తూ ఉంటుంది" (కథాచరిత్ర - పు 74) అని తమ రచనా స్వభావాన్ని గూర్చి స్వయంగా చెప్పుకున్నారు అది నిజం

## 2 తాడిగిరి పోతరాజు - ఎం ఏ (లిట్) - హుజూరాబాద్

పోతరాజు గారిది కోస్తాంధ్ర ప్రాంతమైనా చాల కాలంగా హుజూరాబాద్‌లోనే స్థిరపడ్డారు వీరి పరిచయం నవలా రచయితలలో చేయబడింది రాజు గారు చక్కని కథలు వ్రాశారు వ్రాసినవి రాశికి పదికి మించకున్నా అవి పది కాలాలపాటు నిలువగల వాసిగలవి వీరి కథలు 1960 65

మధ్య ప్రముఖ సచిత్రవార పత్రికలలో ప్రచురింపబడినవి గాజు కిటికి పేర 1966లో ఒక పుస్తకరూపంలో వీరి అయిదుకథలు వచ్చాయి వాటిలో రెండు కథలు రాష్ట్రస్థాయి పోటీలలో బహుమతులు గెలుచుకున్నవి వీరి కథల పై ఆంగ్ల కథల ప్రభావమున్నది అవి ముఖ్యంగా విద్యావంతులను అలరిస్తాయి ఆలోచింపజేస్తాయి

విప్లవ రచయితగా పోతరాజు గారికి ముద్రపడినా అది వారి వ్యక్తిత్వాన్ని బట్టి ఏర్పడిన అభిప్రాయం ఈ సంపుటిలోని కథలు మాత్రం సమాజంలోని చీకటి కోణాలను దర్శించాయి మానవ మనస్తత్వ విశ్లేషణ - పరిశీలన బహుసూక్ష్మంగా కావించాయి వాటి గమ్యం మానవతావాదం

ఒక నవల, ఈ కథా సంపుటి తర్వాత రాజు గారు 'ఎర్రమిట్ట' పేరుతో ఓ పెద్ద కథ, మరి ఒకటి రెండు కథలు తప్ప ఎక్కువ రాయలేదు వీరి కలంలో బలముంది కాని, ఆ తర్వాత అది ఎందుకోకాని కదలనంది అయినా మరుపు రాని కథా రచయిత గాబ్రియల్ టి పోతరాజు గారు

**ఈతరం కథలు**

పత్రికల్లో ప్రచురణ పొందిన - పొందని, తమ కథలను ఈ కాలంలోని పలువురు రచయితలు సంపుటాలుగా ప్రచురించుకొన్నారు ఆ కథా రచయితల - పుస్తకాల వివరాలివి

1 ఎస్ హర్షవర్ధన్ -1 ప్రభాతం - 1981
2 అల్లం రాజయ్య - 1 సృష్టికర్తలు - 1982, 2 భూమి 1982
3 కాలువ మల్లయ్య - 1 కట్నం కథలు 1983, 2 ఘర్మజాలానికి ఖరీదు కట్టే షరాబు 1991, 3 రాజుకోడి 1993
4 డా కె సుమతి - 'జానపద కథా స్రవంతి' 1984
5 రేగులపాటి కిషన్‌రావు - 1 ఈతరం కథలు - 1983, 2 స్వామీజీ కథలు - 84
6 సాహు - 1 అడవిలో వెన్నెల - 1985
7 గులాబీల మల్లారెడ్డి 1 జర్నలిస్టు - 1986
8 బి ఎస్ రాములు - 1 పాలు - 1991, మరో కథల సంపుటి - 97
9 కె వి నరేందర్ - 1 మనోగీతం 1991
10 వాసాల నరసయ్య - 1 సమాజానికి సంకెళ్ళు 1992
11 డా బి దామోదర రావు -1 సింగిడి 1993
12 డా ఎన్ భాస్కర్,1 నూరేండ్ల పది మంచి మలయాళ కథలు 1993 2 అద్దంతో గాంధారి - 1991
13 ఆడెపు లక్ష్మిరాజం, 14, బెజ్జారపు వినోద్‌కుమార్

ఇంకా వడ్డేపల్లి కృష్ణ - సిరిసిల్ల, వేముల ప్రభాకర గౌడు - రాయికల్, జూకంటి జగన్నాథం - సిరిసిల్ల, జింబో రాజేంద్ర - వేములవాడ, బుస్సా బాలచందర్ - తంగళ్ల పల్లి, పిట్టల రవీందర్ - గోదావరిఖని, తులసీ జగన్మోహన్ - మెట్టుపల్లి, వెల్మలరాంరెడ్డి పూడూరు మొ॥వారు ఇక్కడి ఈ కాలపు కథా రచయితలు

## కథా సంపుటాల వివరాలు

### 1 ఎస్ హర్షవర్ధన్ - బి కాం., బి ఇడి , చంజర్ల జ. 25-6-1963

రచయిత ప్రస్తుత నివాసం కరీంనగర్ వీరి పరిచయం గేయ సంపుటాల్లో ఉంది 1981లో వెలువడిన హర్షవర్ధన్ గారి 'ప్రభాతం' గేయ కథా సంపుటంలో నాలుగు సామాజిక కథలున్నాయి

1 కథ వ్రాయాలని ఉంది రచనలు చేయాలని ఉండి పనిభారంతో తీరిక లేక వ్రాయజాలక ఇల్లు పిల్లలతోనే సంతృప్తి పొందిన ఓ స్త్రీ మనోగత భావచిత్రణ



2 వరకట్న నిషేధం నేటి సామాజిక సమస్యకు కథారూప వివరణ

3 మహాసభ ఈ పేరుతో 'మంత్రిగారొచ్చారు అనే మరో పేరుతోనూ రెండు స్థానిక పత్రికల్లో వచ్చింది, మంత్రి గారి సభకు లారీలలో గ్రామీణ జనాన్ని పెద్ద ఎత్తున తెచ్చినా మంత్రి రాక ఆలస్యం కావటంతో క్రమంగా జనం జారుకుని నిర్వాహకులు మాత్రమే మిగిలినవైనం

4 నిరుద్యోగి లేఖ ఇది వర్తమాన భారత చరిత్రలోని నిరుద్యోగ పర్వం

విద్యార్థి దశలో ఉత్సాహంగా కలం నడిపించినా తర్వాతి కాలంలో విద్యార్థులకు కొన్ని విజ్ఞాన పుస్తకాలు తప్ప ఈ రచయిత కథలు వ్రాయలేదు

## 2 అల్లం రాజయ్య, ఎం ఏ గాజులపల్లె మండలం మంథని

రాజయ్య గారి పరిచయం నవలా రచయితల్లో చేయిబడింది వీరు నాలుగైదు నవలలు ఏబదికి పైగా కథలు రచించారు విప్లవ సాహిత్యంలో కథకులుగా రాజయ్య గారి పేరు వ్యాప్తిలో ఉ ఏ వీరి కథలన్నీ శ్రామిక జన పోరాటం ఇతివృత్తంగా కలవే అల్లం రాజయ్య గారి ముద్రిత కథా సంపుటాలు రెండు 1 భూమి 1982 2 సృష్టికర్తలు 1992

1 భూమి ఈ సంపుటిలోని 88 పుటల్లో అయిదు కథలున్నాయి అవి 1 భూమి 2 చేపలు 3 అడవి మనిషి 4 మార్పు 5 శత్రువు నేర్పిన పాఠం

ఈ కథలన్నీ గ్రామీణ వాతావరణం నేపథ్యంగా కలవి కరీంనగర్ జిల్లా మాండలికాన్ని కథా కథనంలోనే కాక పాత్రలకు కూడ వ్యావహారిక పదరూపాలతో కల గలుపుగా ప్రయోగించారు

భూమి' కథ కేవలం ఇద్దరి సంభాషణ ఎన్ని అడ్డంకులు వచ్చినా భూమికోసం పోరాటం ఆపమనే రైతు మాట కొసమెరుపు 'చేపలు' ఆస్తి దొరకుపోతే భరించవచ్చు కాని ఆలినే బలవంతంగా ఎత్తుకపోతే హెలెన్‌లా విలన్‌కులోబడక సీతమ్మలా రామునికోసం విలపిస్తూ ఎదురుచూస్తూనే ఉంటుంది ఈ కథా నాయకుడు రాముడు కాదు శ్రామికుడు అతని గుండె రాయికాలేదు రగిలింది తిరగబడింది చివరికి

'అడవి మనిషి' గిరిజనుడు కాదు పురజనుడే అతడో మారుమూలపల్లె పేదరైతు పోలీసులు అరెస్టు చేసి తీసుకెళ్లిన తన కొడుకును చూసిరావడానికి మొదటిసారి బస్సెక్కి బస్తీకి వెళ్లి తహసీల్ ఆఫీసు పోలీసుస్టేషన్, కోర్టు చుట్టూ తిరిగి నిరాశతో వెనుదిరిగి ఎస్తూ ఓ లారీలో నినాదాలు చేస్తూ వెళ్లుతున్న యువకుల్లో తన కొడుకును చూస్తాడు మార్పు గ్రామీణ భూకామందుల దౌర్జన్యాలకు రావల్సింది అదే అని సూచన 'శత్రువు నేర్పిన గుణపాఠం - తిరుగబడుమని

ఈ కథల్లో భూస్వాముల దౌర్జన్యాలు వారికి అధికారులు అందించే సహకారాలు, పోలీసుల అరెస్టులు లాకప్పులు, చిత్ర హింసలు, కోర్టులు, వాదనలు, ఉద్యమ విజృంభణలు పెత్తందార్లపై కక్షపెంచుకొని కసితో విప్లవించి శిక్షించి ప్రతీకారం తీర్చుకోవడం విషయాలు సన్నివేశాలు

2 సృష్టికర్తలు - లోని కథలు మూడు 104 పుటలు

ఎదురు తిరిగితే - గ్రామీణ హరిజన కూలీల దయనీయ జీవిత చిత్రణ బలంగా సాగింది

సృష్టికర్తలు శ్రామికులే వస్తూత్పత్తికావించేవారు ధనధాన్యాలకు వీరే సృష్టికర్తలు పెట్టుబడిదారుని ప్రతిరూపాయికి పనివాని రక్తం అంటుకొని ఉందనే నిజం తెలిపే కథ

సత్యం ఓ యువకుడు తుపాకి తయారుచేసి 1975 ఇందిరా ప్రధాని ఎమర్జెన్సీ కాలంలో జైలు పాలయిన యధార్థ సంఘటనకిది కథా రూపం నాటి రచయిత కథనం ఈనాటి మన దేశ కల్లోల పరిస్థితులకు సజీవ సాక్ష్యం - సత్యదర్పణం

సృజన అరుణ తార మొ॥ వామపక్ష పత్రికలలో, ఇతర ఉద్యమ కథా సంకలనాలలో వీరి కథలు ప్రచురణ పొందాయి రాజయ్య గారి కథలు కాళీపట్నం రామారావు గారి కథలవలె గుండెను పిండుతూ చదివిస్తాయి మెదడును కదిలించి మేధస్సును పదిపెడుతూ ఆలోచనల సుడిగుండంలో వదిలిపెడుతాయి గమ్యాన్ని ఎంచుకొవడం తీరాన్ని చేరుకోవడం పారకుల వంతు కాలక్షేప సాధనంగా సాహిత్య ప్రేమ పెంచుకున్న వారిని వీరి కథలు చదివించవు - రుచించవు రాజకీయ పరిజ్ఞానం సామ్యవాద సిద్ధాంత సానుభూతి కలవారినే ఈ కథలు ఆకట్టుకొంటాయి అల్లం రాజయ్యగారి కలం దళిత శ్రామిక జన పక్షపాతి

**3 డా కాలువ మల్లయ్య - ఎం ఎస్సి. ఎం ఏ తెలుకుంట జ 12-1-1953**

ఎఫ్ సి ఐ లో సీనియర్ కెమిస్ట్‌గా ఉద్యోగం చేస్తున్న కాలువ మల్లయ్య గారు తెలుగులో 'కథాసాహిత్యం' పై 1993లో పిహెచ్ డి డిగ్రీ పొందారు వీరి పరిచయం గేయ నవలా రచయితల్లో చేయబడింది వీరి కథలు 300 వరకు పత్రికల్లో వచ్చాయి ఆంధ్రభూమి 1991, ఆంధ్రప్రభ 1994 లో మయూరి, అన్నపూర్ణ మొ॥ పత్రికల్లో వీరి 10 కథలకు బహుమతులు సైతం లభించాయి వీరి కొన్ని కథలు 'కాలువశ్రీ' కలం పేరుతోనూ వచ్చాయి డా కాలువ మల్లయ్య గారి కథా సాహిత్యం మూడు సంపుటాలుగా ముద్రణ పొందింది వీరి కొన్ని కథలు హిందీ కన్నడ భాషల్లో అనువాదం పొందాయి రాష్ట్ర కథా సంకలనాల్లోనూ వచ్చాయి

1 కట్నం కథలు - 1983, 2 ఘర్మ జలానికి ఖరీదు కట్టే షరాబు 1991 3 రాజుకోడి 1993 4 కాలువ మల్లయ్య కథలు పేర మరో కథా సంపుటి 97లో వెలువడుతున్నది

1 కట్నం కథలు ఈ సంపుటి 158 పుటలు ఓ పదేండ్లుగా రచయిత వ్రాసిన 17 కథలు ఇందులో ఉన్నాయి పూర్వంలో కన్యాశుల్కం కొన్ని జాతులను వేధించిన సమస్య ఇప్పుడు వరశుల్కం అన్ని కులాలనూ బాధిస్తున్నది బాధ్యత గల కవి - రచయిత సామాజిక సమస్యలకు స్పందించి కలం నడిపిస్తారు అందుకు నిదర్శనం కాలువ మల్లయ్య గారి వరకట్నం కథలే ఇందులో సామాజిక రాజకీయ విమర్శవీ కొన్ని కథలున్నాయి చదువు తెలివి పదవి హోదా ఆదర్శ ప్రసంగాలు అన్నీ ఉండి, కట్నం లాలూచీని స్వార్థాన్ని, మన పెద్దలు - యువకులు, ఎందుకు విడనాడరని రచయిత ప్రశ్న పరితపన 'కృష్ణయ్య పెళ్లి' అనే కథలో ఓ అమాయక యువకుడు తన ప్రేయసిని దొంగచాటుగా పెళ్ళి చేసుకోనెంచి పెద్దల శిక్షకు గురి అవుతాడు నాడు శ్రీ కృష్ణుడు తనను ప్రేమించిన రుక్మిణిని బలిమిగా ఎత్తుకుపోయి పెళ్లాడితే అతడిని దేవుడని పూజిస్తున్నారు తాను అదే పనిచేస్తే తప్పని నిందించడం ఎందుకో - ఈ కథా నాయకునికి అర్థం కాదు! నిజానికి ఆ ప్రశ్నకు జవాబు చెప్పడం మన సమాజానికి చేతకాక పోవచ్చు, అంకితం వి కె రావు గారికి

2 ఘర్మ జలానికి ఖరీదు కట్టే షరాబు - 14 కథలు, ఇవి 1985-86 మధ్య కాలంలో వ్రాసినవి అవి ఇవి 1 తెల్లవారితే మళ్లీ శ్రమ - పేదల పాట్లు, 2 కిటుకు - విద్య, ఆర్జన లేని దరిద్రులంటే అందరికి చులకన అవే సాధించుకుంటే, సమాజం తప్పక గౌరవించుతుంది - అనే గ్రహింపు కథా ముగింపు 3 ఘర్మ జలానికి ఖరీదు కట్టే షరాబులు, స్వార్థులైన పెద్దలు కాదు, నిర్మల మనస్కులైన పిల్లలే అని 4 పరాధీన - స్త్రీ బ్రతుకు జీవితమంతా కుటుంబసేవ చేసినా, తరాలు మారినా ఓ చిన్న కోరిక కూడా తీరని అసంతృప్తితో ఆమె మరణం



భూకామందుల దౌర్జన్యాలు 'శ్రమ విలువ' గుర్తించని సోమరులు, దేశంలోని ఆకలి బాధల వాస్తవాలు ఇందలి కథావస్తువులు స్వార్థుల,

సంకుచితుల వితండవాదుల పలాయన వాదుల విమర్శ ఈ కథల్లో చక్కగా కావించారు రచయిత సమాజాన్ని ఎక్స్‌రే కళ్లతో చూశారు చిన్న విషయాన్నయినా కథగా మలిచే నేర్పు ఈ రచయితకు పట్టుబడింది ఈ సంపుటి డా కేతు విశ్వనాథరెడ్డి గారి పీఠికతో వెలువడంది

3 రాజుకోడి 25 కథలు 116 పుటలు ఈ సంపుటిలొని కథలు 1985 87 మధ్య కాలంలో వ్రాయబడ్డవి ఈ ఆధునిక భేతాల కథల ఆవిర్భావానికి ప్రేరణ మచిలీపట్టణ జనప్రభ' పత్రిక అయినా ఎక్కువ కథలను ప్రచురించింది కరీంనగర్ జీవగడ్డ దినపత్రిక అని రచయిత కృతజ్ఞతలు లో చెప్పుకున్నారు

భేతాళ కథలు మనకు తెలుసు అవన్నీ చిక్కుముడి విప్పడంతో ముగిసే నాటి జానపద గాథలు ఇందలివి ముడి విప్పరాని ఆధునిక జనాల సమస్యల బాధల తోరణాలు ఈ బేతాళుడు పూర్వగాథలోని వాడే చెట్టుకు వేలాడే శవం! ఎవరైనా కదిపితే మాట్లాడుతాడు ఎత్తుకుపోతుంటే కథలు చెప్పుతాడు ఆ వ్యక్తికి మౌన భంగం కాగానే మాయమై తిరిగి చెట్టుకొమ్మకు వేలాడుతాడు

ఈ కొత్త భేతాళునికి ఆధునిక సమాజ ప్రపంచ పరిజ్ఞానం జాస్తి పాత కథలో నాయకుడొక్కడే విక్రమార్కుడు ఇందులో కథకొక నాయకుడు నిరుద్యోగి నాయకుడు, వ్యాపారి లంచాల దేవుని కథతో ఆరంభమై ఈ సంపుటి రాజుకోడితో ముగిసింది సమాజ వ్యంగ్య విమర్శ ఈ కథల అంతస్సూత్రం ఇది ఆధునిక భేతాళ పంచవింశతి' దీనికి డా సి నా రె , రావూరి భరద్వాజ గారల ప్రసంశా వ్యాకాల ముందు మాటలున్నాయి ఆంధ్ర ప్రభ దినపత్రికలో 1990లో వరుసగా ప్రచురింప బడిన 'అవ్వతోడు గిది తెలంగాణా' మాండలిక భాషా స్కెచ్‌లు రచయితకు మంచిపేరు తెచ్చాయి కాలువ మల్లయ్య గారి కథలుక చిన్న పెద్దా వామపక్ష వ్యాపార పత్రికలన్నీ ప్రచురిస్తున్నాయి వీరు ప్రగతిశీల పారక జనం నాడి తెలిసిన కథా రచయిత

### 4 డా కె సుమతి – ఎం ఏ పిహెచ్ డి కాలువ శ్రీరాంపురం జ. 1940

డా॥ కాలువ సుమతి గారి పుట్టిల్లు వరంగల్ జిల్లాలోని వెలంపల్లి అత్తగారిల్లు కరీంనగర్ జిల్లా పెద్దపల్లి తాలూకాలోని కాలువ శ్రీరాంపురం భర్త డా॥ కాల్వరాజిరెడ్డి గారు హైదరాబాద్ అగ్రికల్చర్ యూనివర్శిటీలొ ప్రొఫెసర్‌గా పనిచేస్తూ కీర్తిశేషులైనారు సుమతి గారు బాగ్‌లింగంపల్లి డా॥ బి ఆర్ అంబేద్కర్ డిగ్రీ కాలేజీ ప్రిన్స్‌పాల్ నారాయణగూడా సొంత భవనంలో భర్త స్మృతి చిహ్నంగా 1994లో ఒక జూనియర్ కాలేజీని స్థాపించారు వీరు జానపద కథా సాహిత్యం' పై పరిశోధన చేసి డాక్టర్ పట్టా పుచ్చుకొన్నారు

కొన్ని సాహిత్యవ్యాసాలు రాయడం తప్ప సుమతి గారు వేరే రచనలేవీ చేయలేదు కాని, రచయితల - రచయిత్రులకంటే ఓ విలక్షణమైన సాహిత్య సేవ చేశారు అది జానపద కథా స్రవంతి సేకరణ - ప్రచురణ జానపదులతో కథలు చెప్పించి టేపుచేసి, తిరిగి వింటూ ఆ కథలను అదే మాండలిక భాషలో వ్రాసిన కథా సంకలనం వీరి జానపద కథా స్రవంతి ఈ పుస్తకాన్ని జానపద విజ్ఞాన భారతి - మైసూరు' వారు ప్రచురించారు 1984లో వెలువడిన ఈ 76 పుటల సంకలనంలో 14 కథలున్నాయి ఇవన్నీ జన వ్యాప్తిలో ఉన్న అచ్చమైన పల్లెటూళ్ల పుక్కిటి కథలు ఆ కథల్లో ఈ క్రింది మూడు కథలు కరీంనగర్ జిల్లావి

శాలశంకరి, 53 సం శ్రీరాంపురం 'స్నేహితుల ఉపాయం' 1975

మల్లయ్య 70 సం శ్రీరాంపురం ' అమాయకపు మల్లయ్య ' 1975

ప్రతాప రెడ్డి, 61 సం చిన్నరాతుపల్లి పోకంత పొట్టోడు ' 1975

మిగితా కథలు వరంగల్, మెదక్, మహబూబ్‌నగర్ నల్లగొండ జిల్లాలవి

గ్రామీణుల భావాలకు తెలంగాణా మాండలిక భాషకు ఈ కథలు అద్దం పడుతాయి కరీంనగర్ జిల్లా జానపద కథలు, ఓ మూడైనా డా॥ కె సుమతి గారి ఈ కథా స్రవంతితో వెలుగుచూశాయి

**5 రేగులపాటి కిషన్‌రావు, ఎం ఏ బి ఇడి చింతలరానా**

కిషన్ రావు గారి పరిచయం గేయ, నవలా విభాగాల్లో చేయబడింది వీరివి చిన్నవి పెద్దవి పది పుస్తకాల వరకు ముద్రణ పొందాయి కథా సంపుటాలు రెండు 16 22 పుటల్లో రెండేసి కథలు కలవి వచ్చాయి వాటి వివరాలు చూడండి

1 ఈ తరం కథలు - 1 ఈ తరం కథ 2 అతి తెలివి

పెద్దోళ్ల తమకు కలిగిన నష్టాన్ని పరస్పరం సహకరించుకొని పూరించుకుంటారు కాని, తమ వలన పేదోళ్లకు నష్టం కలిగినా పట్టించుకోరనేది 'ఈ తరం కథ' నాన్నా పులి, కథ వలె ఆరంభమై నీవు చెప్పిన విద్యయే నీరజాక్ష! అనే విధంగా ముగిసిన హాస్యకథ 'అతితెలివి'

2 సామీజి కథలు 1 స్వామీజీ కథ, 2 వెలుగు నీడలు

స్వామీజీ కథ అమాయక ప్రజల మోసగించి వారి బంగారునగలతో పారిపోబోతూ ఓ యువకుని సాహసం కారణంగా భంగపడిన దొంగ సన్యాసి కథ వెలుగు నీడలు - ముగ్గురు రిక్షావాళ్ల జీవితాల స్వగతం నవలికలుగా ముద్రించినా వీరి వాణిశ్రీ ప్రేమకు పెళ్లెప్పుడు? వంటి రచనలు పెద్ద కథలే కాలక్షేపం హితబోధ రేగులపాటి కిషన్‌రావు గారి కథల బాట

**6 సాహు - ఇంటర్, మాణిక్యాపూర్, 1955-93**

శనిగరం వెంకటేశ్వర్లు సామ్యవాద పోరాట ఉద్యమకారులు ప్రవాసంలో గిరిజనుల పల్లెల్లో నివసించారు 'సాహు' అనేపేరుతో ఆదివాసుల చైతన్యానికి శ్రమించారు కవితలు కథలు రచించారు (వీరి పరిచయం గేయ నవలా రచయితల్లో వివరంగా చేయబడింది) సాహు కథలు ప్రత్యేక సంపుటిగా రాలేదు కాని, 1985లో కరీంనగర్ బుక్ ట్రస్ట్ వారు ప్రచురించిన 'అడవిలో వెన్నెల' గిరిజన పోరాట కథా సంకలనంలో వీరివి పది కథలున్నాయి

సాహు కథలు 1 కన్నీటి కథ నీటి కథ, 2 పెళ్లి కావాలి, 3 కాయిదా, 4 ఐదు రూపాయల కథ, 5 భూమి కొరకు, 6 రక్తపింజెర 7 జెండా కథ, 8 ఆకలి, 9 మరడ్ తుడుంపాయనం 10 నిర్ణయం (ఈ వివరాలు సాహుస్మృతి తర్వాత సాహితీ పాత్రులు ప్రచురించిన పరిచయ కరపత్రంలోనివి 93)

వీటిలో రక్త పింజెర' పెద్ద కథ కొన్ని మరీ చిన్నవి అన్నీ గిరిజనుల దోపిడీ కావించే మైదానవాసుల, అటవీ శాఖ అధికారుల, ప్రభుత్వ నాయకుల విమర్శించేవి - ఆదివాసుల అభ్యుదయాన్ని ఆకాంక్షించేవి

ఈ కథా సంపుటికి 'కిసింగారు వెంతా' అని సాహు పీరిక సమకూర్చారు ఆ గోండీ మాటకు 'అడవి అంటుకున్నది' అని అర్థం ఈ కథల సారాన్ని 'శివసాగర్' కవితా పీరిక స్పష్టంగా వివరిస్తుంది

అడవిలో వెన్నెల, ఆలోచనల పర్వతాగ్రంమీద, నిటారుగా నిలబడింది
అది అడవిలోని ఊళ్లపై లేళ్లపై, సెలయేళ్లపై నేడు ప్రసరిస్తోంది
అది దిగ్బంధాల పెనుచలిలో, ఆశయాల ఉక్కు కవచం తొడుక్కుని
ట్రిగర్ మీద వేలితో, ఇప్పుడు నడుస్తోన్న చరిత్రకు, రేయింబవళ్లు
అది జనశక్తికి కత్తుల కవాతు నేర్పుతోంది, అది కాలానికి కాషన్ పలుకుతోంది



'సాహు'తో ఇంటర్వ్యూను బి ఎస్ రాములు (జగిత్యాల) గారు 1994లో ప్రచురించారు అది రచయిత ఆశలను - ఆశయాలను చాల వరకు తెలుపుతుంది 'ఉద్యమాభిమానుల్లో తప్ప జనవ్యాప్తిలో అంతగా లేని

'సాహు వెంకటేశ్వర్లు గారి కథలు, కవితలు ఒక సంపుటిగా తెచ్చే ప్రయత్నం హుజూరాబాద్ సాహితీ మిత్రులు కావిస్తున్నారు "సాహిత్యం ఉద్యమం కలగలిపి పోతపోసిన రూపం సాహు అన్నారు రచయిత తాడిగిరి పోతరాజు గారు సాహు మితభాషి క్రియాశీలి ఆయన ఆశయాన్ని ఆచరణలో పెట్టి ఆచరణలకు అక్షర రూపం సమకూర్చిన విశిష్ట వ్యక్తిత్వం కల రచయిత।

**7 గులాబీల మల్లారెడ్డి - బి ఎస్సీ. ఎల్ ఎల్ బి పోతారం - హుస్నాబాద్**

మల్లారెడ్డి గారు స్వగ్రామమైన పోతారం జె సర్పంచ్‌గా ఉంటూ కరీంనగర్‌లో న్యాయవాద వృత్తిని కొనసాగిస్తున్నారు వీరి పరిచయం గేయకవితా సంపుటాల్లో చేయబడింది

వీరి తొలి కవితా సంపుటిని తండ్రి లింగారెడ్డి గారికి, మలి కథా సంపుటి జర్నలిస్టు 1986ను తల్లి గారికి అంకితం ఇచ్చారు తల్లి ఫొటో ప్రచురించారు కాని పేరు చెప్పలేదు

ఈ కథలు కాలేజీ యూనివర్శిటీ విద్యార్థి జీవితంలో, న్యాయవాదిగా ఉంటున్న కాలంలోనూ వ్రాసినవి వీటిలో కొన్ని వరంగల్ కరీంనగర్ పత్రికల్లో వచ్చాయి

'కథా శిల్పం ఇలా ఉండాలని తెలియదు సాహిత్య గోష్ఠులలో పాల్గొనలేదు కనీసం పత్రికలలోనివి చదవలేదు" అనే ఈ రచయిత తమ కథలనిట్లా విశ్లేషణ కావించారు - "భూగోళంలో నివసిస్తున్న తమ మనుష్యులు మనుష్యులుగా ఎందుకు బతకలేకపోతున్నారు అర్థము కాని పరిస్థితి జవాబుగా కళ్ల వెంట కన్నీటిధారలు ఆ కన్నీటి ప్రతిబింబాలే ఈ కథలు గాథలు ఈ కథలలో 75 శాతం నిజముంది, 10 శాతం కల్పన ఉంది, 15 శాతం ఆశయాలున్నవి ' - కథల పుస్తక 'భూమిక' నుండి

'జర్నలిస్టు' సంపుటిలో 9 కథలు 58 పుటల్లో ఉన్నాయి మొదటి కథ 'జర్నలిస్టు' పంజాబ్ అలజడి చివరి కథ 'రాలిన స్వప్నం' పాకిస్తాన్‌లో విమానం హైజాకింగ్ క్యాంపస్‌లో వేపచెట్టు, 2, ఇదీ ఒక దేవత కథనే 4, ఎవరు కారకులు - 6, ఈ మూడు ప్రేమ కథలు లవ్‌లీ పేరెంట్స్ ప్రజాపోరాటాలు, పోలీసుల లాకప్పులు చిత్రహింసలు, న్యాయవాదులు ఆత్మవ్యధ చిత్రణ బంచరాయి -5, హరిజనులు బంజరు భూమిని ఆక్రమించడం యూనివర్శిటీ జిందాబాద్ -8, లో శిశుపాలరావు, జరాసంధరెడ్డి అనే ఇద్దరు విద్యార్థి నాయకులు పెత్తనం కోసం పోటీ పడి కక్షలు పెంచుకొని కల్లోలంరేపిన కథ చదువు కంచికి। క్లాసుమేట్ సుబ్బిగాడు- 7, లో విద్యలేని శ్రమ జీవుల ధైర్యం, చదువు ఆర్జన ఉన్న నాగరికుల సంకుచిత స్వభావాల చిత్రణ



ఈ కథలు రచయిత కాలక్షేపం కొసం వ్రాసినవి కావు పాఠకులు సరదా కోసం చదువలేరు నేటి కల్లోల ప్రపంచాన్ని చూసి, కరుణార్ద్ర హృదయంతో కన్నీటి సిరాతో కంపించే కలంతో ఈ కథలకు రూపమిచ్చారు రచయిత మంచి మనసు కలవారే మల్లారెడ్డి గారి హృదయవేదనను అర్థం చేసుకోగలుగుతారు వాస్తవ సంఘటనల కథా రచయిత గులాబీల మల్లారెడ్డి గారి ఆశయం శాంతి - సహజీవనం

**8. బి ఎస్ రాములు, జగిత్యాల - వార్డెన్**

బి ఎస్ రాములు గారు సామవాద సిద్ధాంతాభిమానంగల దళిత జన పక్ష రచయిత వీరిదో నవల, రెండు కథా సంపుటాలు, మరి కొన్ని వ్యాస పుస్తకాలు వచ్చాయి వీరి కథల పుస్తకాలివి

1 పాలు - 72, 2 బి ఎస్ రాములు కథలు - 1997

బేతి శ్రీరాములు గారి కథా సంపుటి 'పాలు' 1991లో 72 పుటలలో వెలువడింది పాలు, బడి, సహజాతాలు ఇందలి మూడు కథలు -

'ఈ మూడు కథల్లో బడుగు జీవుల జీవితం పోరాటం ఒక లక్ష్య సహిత పోరాటంలోకి మారిన క్రమం కనిపిస్తుంది అని జయధీర్ తిరుమల రావు గారు, "ఈ మూడు కథలు వేరైనా ఒకే వ్యక్తి కథగా, ఇల్లు బడి సమాజంగా విస్తరించాయి" అని మధురాంతకం రాజారాం గారు ఈ పుస్తక పీఠికల్లో అభిప్రాయపడ్డారు

1 పాలు - దొరింటి ఆడపని మనిషి దీన గాథ, ఆమె దొరకు చిక్కటి పాలు కాచి వెచ్చగా అందించినా ఇంట్లో జ్వరంతో పడి ఉన్న చిన్ని కొడుక్కు గుక్కెడుపాలు ఇవ్వలేక బాధపడుతుంది మంది పశువులకు పనిచేసి మనం పస్తులుండేకంటే వారి పశువులను మనమే పాలుకు పెంచుకొని పాలు తాగొచ్చుకదా, అనే పేద పిల్లవాని ప్రశ్న ఈ కథకు ఆయువుపట్టు 2 బడి - ఎవరు వద్దన్నా బెదరక హెడ్‌మాస్టర్ దుశ్చర్యలను పాఠశాలకు తనిఖీకి వచ్చిన అధికారికి తెల్పిన బాబు కథ ఈ రెండవది 3 సహజాతాలు - ఉద్యమ కారులైన ఇద్దరు హైస్కూలు విద్యార్థులు తమ ఉపాధ్యాయున్ని ఉద్యమాభిమానిగా మార్చిన కథ ఈ మూడింటిలో చివరిది బలమైనది ఆ విద్యార్థులు కాలేజీ వారయితే మరీ సహజంగా ఉండేది

ఈ మూడు కథల్లో మొదటి దానిలో సంఘాన్ని రెండవ దానిలో విద్యా సంస్థను, మూడవ దానిలో ప్రభుత్వ వ్యవస్థను బలంగా చిత్రించారు రచయిత చివరి కథలో పోలీసుల, తెల్లబట్టలవాళ్ల మనోచిత్రణ సహజంగా ఉంది లాకప్పు హింసలు కన్నీళ్లు తెప్పిస్తాయి అన్నింటికి తెగించి ఎదురునిలిచి ముందుకు నడిచే ఉద్యమకారుల గుండెదిటవు అబ్బురాన్ని కలిగిస్తుంది ఈ మూడు కథల్లో రచయిత ఆలోచన ఆశయ క్రమపరిణతి పాఠకులకు కనిపిస్తుంది సానుభూతి కలిగిస్తుంది వామపక్ష పోరాట కథా రచయిత బి ఎస్ రాములు గారు

'బి ఎస్ రాములు కథలు సంపుటిలో 15 కథలు ఉన్నాయి ఇంచుమించు ఇవన్నీ పత్రికల్లో ప్రచురణ పొందినవే ఇది అయిదు పుస్తకాల సముచ్చయ సంపుటి మొదటిది కథా సాహిత్య వ్యాసాలు చివరిది పీఠికలు అనుబంధాలు వగైరా మధ్య మూడు భాగాల్లో కథలున్నాయి "స్వాతంత్ర్యం అనంతరం భారత దేశంలో తెలుగు ప్రజల జీవితాల్లో సంస్కృతి మానవ సంబంధాల్లో వస్తున్న పరిణామక్రమ చిత్రణమే ఈ కథల ఇతివృత్తాలు '

### 9 కె వి నరేందర్, బి ఎస్సి, బి ఇడి చిల్వాకోడూరు

సారంగాపూర్ గొల్లపల్లి మండలంలో ఉపాధ్యాయులుగా పనిచేస్తున్న నరేందర్ గారు ఈనాటి పాపులర్ నవలా కథా రచయితల్లో ఒకరు వీరి పరిచయం నవలా విభాగంలో చేయబడింది నరేందర్ గారి కథలు ప్రముఖ సచిత్రవార మాస పత్రికలు ప్రచురిస్తున్నాయి వీరి కథా సంపుటి మౌనగీతం 1991లో వెలువడింది ఇందులో 30 కథలు 228 పుటల్లో ఉన్నాయి (జె వి పబ్లికేషన్స్ - విజయవాడ)

'ఇందులో నానా జాతి సమితి' కథలున్నాయి అందులో కొన్నయినా మిమ్మల్ని ఆకట్టుకుంటాయన్న నమ్మకం ఉంది అన్ని వీక్లీల్లో వచ్చిన కథల్ని ఏర్చికూర్చి కొన్నింటిని మనోగీతంగా మీ ముందు ఆలపిస్తున్నాను ' అని రచయిత ముందుమాటలో అన్నారు

"నరేందర్ మా స్థాయిలో ఉండగలడని ' హామీ ఇచ్చారు ఈనాటి ప్రఖ్యాత నావలిస్టు కొమ్మనాపల్లి గణపతిరావు గారు ఈ సంపుటి పీఠికలో



మూగవోయిననైటింగేల్, సైనికుని ఉత్తరం, ఆకురాలిన వసంతమై-, పేపర్‌లో ఆమె, మబ్బు పట్టిన రాత్రి నిదురించే తోటలోకి, మనోగీతం వీరి కథలు పాఠకులను హాయిగా చదివిస్తాయి, అలరిస్తాయి

ప్రేమించి పెళ్లాడి పెడసరం పెనిమిటిని వదలి వేసిన ఓ ఆధునికయువతి ఆ ప్రియుడు మరో భార్యతో కనిపించగా, మనస్సు రగిలి అతన్ని చిరునవ్వుతో పలకరించి, అతని నూతన సతిలో అనుమాన బీజాన్ని నాటి వారి కాపురాన్ని

చిందర వందరచేసి కసి తీర్చుకున్న కథ ఒకటి రేప్‌కు శిక్ష ఆ నేరం చేసిన యువకుని కొజ్జాని చేయటం అనే తీర్పు మరో కథ

ప్రియుడు ప్రేయసి గ్రీటింగ్ కార్డును చూసి "నాలుగు లక్షల సార్లు చదువుకొని కోట్లసార్లుజ్ఞాపకం చేసుకున్నారు నువ్వు కన్పించకపోయినా నీ అక్షరాల ఆలంబన చాలదూ సింధూ ఐలవ్‌యూ!' ఇది చివరి పుట వింతేమిటంటే ఈ కథలన్నీ నరేందర్ అవివాహిత దశలో వ్రాసినవి ఇప్పుడు పెళ్లయింది ఓ కొడుకు కూడా - నరేందర్ గారి భాషలలితం, భావం మృదులం శైలి ప్రసన్నం ఇతివృత్తం మధురం శృంగారం! విరహమైనా అది మధురమే!

**10 వాసాల నరసయ్య-** వీరి పరిచయం గేయ సంపుటాల కవుల్లో ఉంది

వి నరసయ్యగారి ముద్రిత కథా సంపుటి 1 సమాజానికి సంకెళ్లు 1992

ఇందులో 102 పుటల్లో 87 చిట్టి కథలున్నాయి

ఈ కథలు ఆనందం కలిగించడం కోసం కాక ఆలోచనలు రగిలించడం కోసం రచయిత రచించారు మన ఆచార వ్యవహారాలు తరతరాలుగా వారసత్వంగా వస్తున్న మన నమ్మకాలలోని అనుచితాల ఆంధవిశ్వాసాల లోపాలు ఎత్తి చూపించారు

ఇందులో తెలుగు వారి కల్లు వడింపునుండి బెంగాళీల నల్లకోడి వేట వరకు ఎన్నెన్నో చిట్టికథలు పాఠకుల ఆలోచనల తట్టి మేల్కొల్పుతాయి రచయిత ఉద్యోగ కారణంగానే కాక పోస్టల్ ఉద్యోగ సంఘ పదవి బాధ్యతలతోనూ దేశం నలుమూలల సంచరించి తాము కన్న విన్న విశేషాలు ఈ కథలుగా రూపొందించారు వాసాల నరసయ్య గారి కథలు సమాజానికి కనువిప్పు కలిగించి మూఢాచారాల 'సంకెళ్లు' తెంచుకోవడం కోసం ఉద్దేశింపబడ్డవి

**11 డా బి దామోదరరావు -** వీరి పరిచయం గేయకవుల్లో చేయబడింది

1993లో రావుగారి 'సింగిడి కథాసంపుటి వెలువడింది ఇది 58పుటలచిన్న కథల సంపుటి '

ఇందులో హరిజనుల అంటనీయని ఊరబాయి' 1970కథ మొదటిది అక్షర ఉజ్జ్వల ప్రచారం కోసం 1992లో వ్రాసిన 'దూప' కథ చివరిది వీరికి జానపదుల జీవితాల్లోని 'మూగ వేదనను అక్షర బద్ధం చేయాలన్న బలీయమైన కోరికే' ఈ కథలు (రచయిత పీఠిక) వీరుగ్రామీణుల జీవిత బాధలను వారి వ్యవహారంలోని మాండలిక గ్రామ్య భాషలోనే గాథలుగా మలిచారు కథా కథనమే కాక కొన్ని కథల పేర్లుకూడా ఎట్టి, చెదుదు, తుంపిళ్లు, సింగిడి దూప - అవే

ప్రముఖ నవలా రచయిత దాశరథి రంగాచార్యగారికి అంకితం ఇవ్వబడిన ఈ కథామాల - డా॥ మంజుశ్రీగారికి "వ్యథార్త జీవిత యధార్థ దృశ్యాలు", డా॥ పోరంకి దక్షిణామూర్తి గారికి 'సహజంగా బాగా ఉన్నాయి", బి ఎస్ రాములు గారికి "పల్లె జీవితాలు తళుక్కున మెరిసి ముప్ఫయిఏళ్ల సామాజిక సంబంధాలచరిత్రను పిడుకలు పిడుకలుగా సింగిడీలు పేరుస్తాయి ఈ కథలు ' డా॥ బి దామోదర్ రావు గారు గ్రామీణ జన దైన్యనివారణకోసం చైతన్యాన్ని కోరుతున్న కథా రచయితగా ఈ సంపుటిలో కనిపిస్తారు వీరి 'సింగిడి కరీంనగర్ జిల్లా ఉత్తమ వచన రచనగా 1992లో 'సాహిత్య గౌతమి' బహుమతిని అందుకున్నది

**12 డా ఎన్ బాస్కర్, ఎం ఏ పి హెచ్ డి ఎల్లారెడ్డిపేట**

నలిమెల భాస్కర్ అభ్యుదయగేయకవి - కథా రచయిత వీరుస్వయం కృషితో పదికిపైగా భారత భాషలను నేర్చుకున్నారు వీరు సిరిసిల్లా కరీంనగర్ జూనియర్ కాలేజీలో ఆంధ్రభాషోపన్యాసకులు

వీరు స్వయంగా కథలు రచించడం కాక ఇతర భాషలకథలను ఆంధ్రీకరించడం, తెలుగులోని మంచి కథలను ఇతర భాషలలోనికి మార్చి పత్రికలలో ప్రచురించడంవ్యాసంగంగాపెట్టుకున్నారు

తెలుగు మలయాళ సామెతలపై ఎం ఫిల్ తెలుగు ద్రావిడ సామెతల తులనాత్మక పరిశీలన కావించి పిహెచ్ డి పట్టాలు పొందిన వీరు ఇటీవల రెండు అనువాద కథా సంపుటాల్ని ప్రచురించారు 1 నూరేండ్ల పది మంచి మలయాళ కదలు - 1993 ముద్రణ పు 100 2 అద్దంలో గాంధారి - 1996 నయనం ప్రచురణలు సిరిసిల్ల - పు 128

మొదటిది ఓ సుప్రసిద్ధ కేరళ సాహితీ సంస్థ ఎంపిక చేసి ప్రచురించిన కథలు అవి మన తెలుగు వాతావరణానికి సరిపోకపోతే అంతగా నచ్చకపోతే ఆ నేరం ఆ రచయితలది - వాటిని ఎంపిక చేసిన వారిదే కాని అనువాదకులది మాత్రం కాదు నలిమెల భాస్కర్ గారి



ఈ పుస్తకానువాదం సహజ సుందరంగా ఉంది
అద్దంలో గాంధారి 12 అనువాద కథల సంపుటి
కన్నడం తమిళం మలయాళం, మరాఠీ, హిందీ బెంగాలీ
ఆరు భాషల నుండి రెండేసి మంచి కథలు ఎంపిక చేసుకుని
అనువదించి ఈ సంపుటిగా వెలువరించారు భాస్కర్
బహుభారత భాషా విశారదులనే కాక, ఈ కథల ఎంపికతో
వారి అభిరుచి కూడాఏమిటో తెలుస్తుంది

"ఆయా భాషల కథల్లోని విషయ (వస్తు) పరమైన సీరియస్‌నెస్‌నీ రూప (శిల్ప) పరమైన మెళుకువల్ని పారుబోకుండా అనువదించి మనకందించడంలో డా॥ భాస్కర్ సఫలుడయ్యాడనిచెప్పాలి ' ఆంధ్ర జ్యోతి దినపత్రిక 25-5-97

భాషా సాహిత్యాల వికాసం కోసం సంపూర్ణంగా శ్రమిస్తూ ఉదాత్తాశయంతో జాతీయ సమైక్యతను ఆకాంక్షిస్తున్న రచయిత డా ఎన్ భాస్కర్ గారు

**13 ఎం శ్రీనివాస రావు - 22 జూన్ 1969 - 3 సెప్టెంబర్ 92 గోదావరి ఖని**

ఎం ఎస్ ఆర్ , కరుణాకర్ ప్రభాకర్ వీరి మారు పేర్లు శ్రీనివాసరావు గారి రచనల సంపుటిని రాజధాని జంటనగరాల విరసం యూనిట్ కాగడాగా వెలిగిన క్షణం అను పేరుతో 1992లో ప్రచురించింది 150 పుటల ఈ పుస్తకంలో రావు గారి కవితలు, డైరీపుటలు లెఖలతో పాటుగా సినిమాల సమీక్షలు చీరాల చేనేత కార్మికుల జీవిత చిత్రణ మొ రచనలున్నాయి

67 నుండి 70 వరకు 4 పుటల్లో'కార్మికులతో కలిసి కథలు' పేర రెండు గల్పికలు, ఒక కథ ఉన్నాయి మొదటి గల్పిక 'గద్దర్' ను సాహితీవేత్త' - త్యాగశీలి' గా అభినందించే ఓ మాస్టారు మాట సాయం అందించలేనందుకు వ్యంగ్య నిరసన

రెండవది విడుదల స్త్రీ జన విముక్తి సానుభూతి రచన ఇది
' ఆయనచీటికి మాటికి తిడుతున్నాడండీ, ఆ మాత్రం ఏ భర్తయినా అంటాడమ్మా
ఆయన జుట్టు పట్టి నెత్తురు వచ్చేట్టు కొడుతున్నాడండీ,
ఆడదై పుట్టింతరువాత ఓర్పు సహనం ఉండాలమ్మా
ఆయన రాత్రి గొంతునులిమిచంపబోయాడండీ,
అంతా దేవుని మీద భారం వేయమ్మా వాణ్ణి తన్ని వాడింటి నుండివచ్చేసానండీ,
ఛీ! ఈ కాలం ఆడవాళ్లు మరీ బరితెగించి పోతున్నారు '

- మహిళా మార్గం - జూలై అక్టో 90

హసీనా మనదేశంలోని ఆకలిబాధల నిరుపేద ఆడపిల్లలను కొని వేశ్యలుగా అమ్మే ఘరానా నీచవర్తకుల నికృష్ట కామ ధనలాలసగల వర్తకుల వర్ణన "తిండికి గతి లేనోళ్లకి మతం ఏమిటి? సంప్రదాయం ఏమిటి?" 69 'పార్లమెంటరీ ప్రభుత్వాలూ, జైళ్లు, కోర్టులూ అన్నీదొరబాబుల

పక్షమే 71 అంటూ ఈ 20 ఏళ్ళయిువరచయిత స్త్రీల విముక్తి కోసం ఎంతగానో పరితపించారు తాను అమ్ముకున్న కూతురు క్షేమం తెల్సుకోవడానికికదిలే రైలు వెంట పరుగెడుతూ వేపార్ల పిలుస్తూ అంగలార్చిన ఓ పేద ముస్లింతల్లి వేదన ఈ కథ హసీనా వేశ్యా గృహానికి చెరక ముందే ఘరానా బేపారి రేపులో మరణించిందని ఆ తల్లికి తెలువదు ఇది కథ ముగింపు

ప్రపంచ దృశ్యం పేర అంతర్జాతీయ సినిమాల సమీక్ష పు 75 - 102 ఉంది

మా సూరే కండెలుగా - అనేది చీరాల చేనేత కార్మికుల ఇంటర్వ్యూలు పు 105 120 చదివితే ఒక సమస్యగా వేదన - సృజన సమానంగా కల ఉజ్వల భవిష్యత్తు కల రచయితను అర్థాంతరంగా కోల్పోయిన బాధ పాఠకులకు కలుగుతుంది ఎం ఎస్ ఆర్ దృష్టిలో "విప్లవ చిత్రాలనబడే వాటల్లోని కోపభరిత ఎర్రపేదరికం మార్క్సుకు తెలియనిది మావో ఊహించలేనిది' ఈ కవి జవిత చిత్రణ ఈ సంపుటి గేయకవుల్లో ఉంది

**14 రాజు - పవన్ కుమార్ రాజు 'నూతన్',** వేణు పరిచయంగేయ కవుల్లో ఉంది

ఈ రచయిత'నూతన్ విప్లవ పోరాట కార్యకర్త వేణన్న గా ప్రచారమైన పవన్ కుమార్ రాజు గారి 'వెదరురు వనాల గానం (పేరుతో) విరసం 1993లో ప్రచురించింది ఈ 110 పుటల సంపుటిలో పు 75 91లో రెండు కథలున్నని

పిరికి బాట ఇదిగ్రామీణ సన్నకారు రైతులు వ్యయసాయ కూలీలు, భూకామందులకు ప్రభుత్వ పాలనాయంత్రాంగ న్యాయరక్షణ వ్యవస్థకు వ్యతిరేకంగా సంఘాలు పెట్టుకొని, పోరాటం నాగించేవైనం ఈ రచయిత పుట్టింది పెరిగింది పోరుబాటలో నడిచింది గ్రామాల్లో కాబట్టి అయన కవితా కదా వస్తువులే కాక భాష కూడా పల్లె జనాంది మొదటి కథ మొదటి పుట చూడండి

'నీ యమ్మ ఈ లంజె కొడుకులు బలిసి నోళ్ల కంపెన్లకే కరెంటు ఇత్తరుగని యవుసం జేసెటోన్ని అండ్ల పేదోల్లకు కరెంటు ఇయ్యకుంట గోస పుచ్చుకోవట్రి రాంరెడ్డి పట్లా' ఇయ్యాల ఊళ్లెకు పోలీసులత్తరట మల్ల సంఘంల ఉన్నోళ్లను పట్టుకుపోతరట పోలీస్ పటేల్ ఆగం రాయుని తోని మాట్లాడంగిన్న ఇగో నేను జెప్పినట్లు ఎవలకు తెలువనియ్యకు జెర సుంకరోడు ఆదరబాదర బోయిండు గీ సంగతులు పొద్దుగాల సుంకరోడు జెప్పినప్పటి నుండి రాంరెడ్డి మనస్సు మనసుల లేదు ఇది వరకే తన్నులుదింటి మల్ల పట్టుకపోతే ఇగేమన్న బతుకుడంటనా కూలీలు పెంచడు జీతాలు పెంచడు పంచాయతులు మియ్యిమీరే తప్పు జేసుకునుడు నీయవ్వ సర్కరి కోర్టులు పోలీసులు ఎందుకున్నరనుకున్నార్రా అనుకుంట తన్నిన దెబ్బలు వాతలు ఇంకా మాననేలేదు " పు 75 ఇదంతా గతాన్ని నెమరు వేసుకోవడం అయినా ప్రస్తుతం వాల్లు తిరగబడడం వారి ఊరేగింపు చూసి దొర చౌదరి మేడలోపలికి జారుకోవడం, ఈ కథ

సాసంత్రం - స్వాతంత్ర్యం వచ్చెనని సభలే చేసి, సంబరపడగానే సరిపోదోయి' అన్నారేనాడో ఓ సినిమా కవి అది అందరికి అందాలి అదే కరువైందని ఆవేదన ఈ రచయితది జనానిది - మనది ఓ పల్లెటూరి బడి పంతులు స్వాతంత్ర్య దినం నాడు విద్యార్థులకు లడ్డూలు పంచాలనుకుంటే వారించి, చెక్కెర గోలీలు పంపిణీ చేయించి, డబ్బు పాదుపు పాటించిన - గుటకాయ స్వాహా చేసిన గ్రామ పెత్తందారు కథ నూతన్ గారి ఈ కథానిక చూడగలిగె వారికి సమాజంలోని సన్నివేశాలే కథా వస్తువులు అవి చదువరులను స్పందింపజేసి సత్యసాక్షాత్కారం కావిస్తాయి సరియైన,సమాజ సాధనకు పురికొల్పుతాయి

**15 ఆడెపు లక్ష్మీపతి- వీణవంక జ. 1955**

లక్ష్మీపతి గారు ఎఫ్ సి ఐ రామగుండం ఎరువుల కర్మాగారంలో ఉద్యోగి జననం పల్లెలో అయినా విద్యార్థి కాలం గోదావరిఖని కార్మికపట్టణంలో జరిగింది గ్రామీణ సంస్కృతి అంటే ఇష్టం దేశవిదేశ పుస్తకాలు బాగా చదివారు



1972లో కలం పట్టారు కథా రచనతో
75లో కొన్ని కవితలు కూడా రాశారు
77 నుండి వివిధ ప్రముఖ వార మాస
పత్రికలలో వీరివి 20 కథల వరకు అచ్చయినాయి
1995 లో విపుల పోటీలో వీరి 'జీవన్మృతుడు కథ ప్రథమ బహుమతి గెలుచుకుంది 'సాహిత్య నేత్రం' కథల పోటీలో వీరి 'తిర్యగ్రేఖ' ద్వితీయ బహుమతిని అందుకుంది వివిధ కథా సంకలనాలు వీరి కథలను అచ్చేశాయి 19 4-97 వార్త దిన పత్రిక సృష్టి పుటలో వీరి వ్యాసం 'లాటిన్ అమెరికా కథా శిల్పం' ప్రచురింపబడింది

కొన్నాళ్ళు పౌరహక్కుల సంఘంలో పని చేసిన లక్ష్మీపతి గారి ఆలోచనా పరిధిని పుస్తకాలే కాక ప్యాక్టరీ ట్రేనింగ్ కోసం వివిధ రాష్ట్రాల్లో సంచరించడం విశాలం చేశాయి

వీరి కథల్లో ఊక దంపుడు ప్రసంగాలుండవు పేలవపు సంభాషణలుండవు సంక్షిప్తంగా సన్నివేశాలు చక చక పరుగిడుతుంటాయి చైతన్య స్రవంతి కథాశిల్పం వీరికి ఇష్టంలాగుంది తాను చెప్పేకంటే ఎక్కువగా పాఠకుల ఆలోచనలకు పని కల్పించడం వీరి కథల ప్రత్యేకత ఈ టెక్నిక్ ఈ జిల్లాలో వీరికే సొంతం ఇజాల జోలిలేని, సాంఘిక క్లిష్ట సంఘటనల సున్నితంగా విశ్లేషించడం వీరి కథల్లో కానవచ్చే ప్రత్యేకత ఈ 97లో వీరి 15 కథల సంపుటి పుస్తక రూపం ధరించనుంది లక్ష్మీపతిగారి కలానికి చక్కని భవిష్యత్తు ఉందని ఖచ్చితంగా చెప్పవచ్చు

### 16 బెజ్జారపు వినోద్ కుమార్- ఎం ఏ కోరుట్ల వ 30 సుమారు

వినోద్‌కుమార్ విద్యార్థి కాలం నుండి సాహిత్యాసక్తి కల వ్యక్తి కాలేజీ కాలంలో కథా రచన ఆరంభించారు పల్లకి, మయూరి ఉదయం, ప్రభ మొ॥ ప్రముఖ పత్రికల్లో వీరివి 40 వరకు కథలు ముద్రణ పొందాయి మొదట్లో ప్రేమ కథలు రాసేవారు క్రమంగా వ్యక్తిలో తాత్త్వికత పెరిగి, సామాజిక సమస్యలవైపు దృష్టి సారించారు



కథాకల్పన,పాత్రపోషణ వినోద్ కథల్లోచక్కగా పకడ్బందీగా ఉంటాయి భాష లలితం సంభాషణలు సహజం వీరికి కథలు రాయాలనే ఉత్సాహం ఉన్నా ఈ మధ్య అంతగా శ్రద్ధ చూపించుతూ లేనట్లుంది వీరివి ఈ మధ్య రెండు అముద్రిత నవలలున్నాయి బెజ్జారపు వినోద్‌కుమార్ గారి ఒక్క కథా సంపుటమైనా వస్తే కథా సాహిత్యాభిమానులకు తృప్తిగా ఉంటుంది

వినోద్‌కుమార్ ఇప్పుడు కథలాపురం మండలంలో ఉపాధ్యాయులూ పని చేస్తున్నారు

ఈ జిల్లా డా యశోదారెడ్డి, సురమౌళి, గూడూరి సీతారాం పేరు పొందిన కథకులు తాడిగిరి పోతరాజు అల్లం రాజయ్య బి ఎస్ రాములు వామపక్ష సిద్ధాంత కథా రచయితలు

ఎక్కువ సంఖ్యలో కథలు వ్రాసిన వారు డా కాలువ మల్లయ్య, కె వి నరేందర్, తులసి జగన్మోహన్ బెజ్జారపు వినోద్‌కుమార్,ఈ మధ్యే ఆంధ్ర ప్రభలో డా కాలువ, డా డింగరి నరహరి ఆచార్య, జింబో కథలు గెలిచాయి తాడిగిరి పోతరాజు గారి మూడు కథలు, వేముల సత్యనారాయణ గారి రికార్డు డాన్సర్ వడ్డెపల్లి కృష్ణ గారి ఓ కథ ప్రముఖ పత్రికల బహుమతులు పొందాయి జూకంటి జగన్నాథం గారి రెండు మూడు కథలు పత్రికల్లో వచ్చాయి ఈ జిల్లాలో కవితలు వ్రాసే కవులు రెండువందల మించారు కథకులు ఓ ఇరువది వరకైనా ఉన్నారు ఇంకా కథా రచయితల సంఖ్య పెరిగే సూచనలు కనిపించుతున్నవి కథా రచయిత్రులు ఇంచుమించు లేరు

కథా రచనలో కరీంనగర్ జిల్లా రాష్ట్రంలో గణనీయ స్థానం పొందింది - ఇంకా ప్రముఖ స్థానం పొందే కాలం ముందున్నది

# 5. నాటక సాహిత్యం

సంస్కృత నాటకాలకు రెండు వేలేండ్ల చరిత్ర ఉన్నా తెలుగు నాటకం కేవలం నూరేండ్లది మన తెలుగులో మొదటి రూపకాలు యక్షగాన విధినాటకాలు తెలుగు తొలియక్షగానం కందుకూరి రుద్రకవి 'సుగ్రీవ విజయము' 16వ శతాబ్ది రచన కరీంనగర్ జిల్లాలో 17వ శతాబ్ది నుండి యక్షగానాలు రచించి ప్రదర్శించిన ఆధారాలున్నాయి 18, 19 శతాబ్దాల్లో యక్షగానాలు ఎక్కువగా వచ్చాయి ఈ జిల్లాలో 1960 వరకు యక్షగానాల రచన అధికంగా ఉంది

పందొమ్మిదవ శతాబ్ది చివరి పాదంలో కందుకూరి వీరేశలింగం పంతులుగారు అనువదించిన కాళిదాసు శాకున్తలం తెలుగులో మొదటి నాటకం గురజాడ అప్పారావు పంతులు గారు రచించిన కన్యాశుల్కం 1892 ఆధునిక తెలుగు నాటకాల్లో మొదటిది పద్యాలు లేకపోవడం వ్యావహారిక భాషను ప్రయోగించడం సామాజికేతి వృత్తాన్ని గ్రహించడం దీని ప్రత్యేకత అంతా పదిరువదేండ్ల తేడాతో వెలువడిన ఈ రెండు నాటకాలు తెలుగు రూపక సాహిత్యంలోని రెండు ప్రధాన శాఖలకు మార్గ దర్శకాలైనాయి (అది అనువాదం స్వతంత్రం సంప్రదాయం ఆధునికం పౌరాణికం - సాంఘికం, గ్రాంధికం వ్యావహారికం ఏదైనా అనుకోవచ్చు)

దశవిధ రూపకాల్లో[1] నాటకం ప్రకరణం, వీధి భాణం ప్రహసనం, మాత్రమే తెలుగు కవులనా కర్షింవాయి పౌరాణిక, చారిత్రక సాంఘిక పద్య నాటకాల రచన ప్రదర్శన కోస్తాంధ్రలో ఈ ఇరువదవ శతాబ్ది పూర్వార్ధంలో విస్తారంగా సాగింది ఈ శతాబ్ది ఆరంభం నుండి భారతదేశానికి స్వాతంత్రం రావటానికి పూర్వమే వివిధ కళా పరిషత్తులేర్పడి పోటీలు పెట్టి సాంఘిక నాటకాలను కోస్తారాయలసీమలలో ప్రోత్సహించాయి [2]

కరీంనగర్ జిల్లాలో రెండు వందలేండ్లుగా యక్షగాన వీధి నాటకాల రచన ప్రదర్శన విస్తారంగా సాగింది 1950 వరకు పద్య నాటకాలు కానీ, ఆధునిక వచన నాటకాలు కాని ఇక్కడ రాలేదు వర్తమాన కాలంలోనూ ఇక్కడి కవులు - రచయితలు నాటకాలను ఎక్కువగా రచించలేదు స్కూళ్లలో ఊళ్లలో విద్యార్థుల యువజనుల ప్రదర్శనల కోసం నాటికలు ఎక్కువ సంఖ్యలో రచింపబడ్డాయి నాటక ప్రదర్శనపై ఈ జిల్లాలో ఆసక్తి ఎక్కువగానే ఉన్నా రాష్ట్రవ్యాప్తి పొందిన తీరాంధ్ర ప్రముఖ రచయితల నాటకాలనే తీసుకున్నారు అయినా ఈ జిల్లాలో కొందరైనా నాటక రచన కావించిన వాళ్ళు లేక పోలేదు కరీంనగర్ జిల్లా నాటక రచయితలలో మొదటి వారు కీ శే గంగా లక్ష్మణరావు వారు రచించిన శ్రీకృష్ణదేవరాయ నాటకం ప్రతి అలభ్యం వారి 'రత్నకాంత' జానపద పద్యనాటకం 1918 నాటి రచన అది అసంపూర్ణంగా ఉంటే వారి పుత్రులు గంగా రాజేశ్వరరావు మంథని గారు పూర్తి చేసి 1985లో ప్రచురించారు

1920 నుండి 1970 వరకు కరీంనగర్ జిల్లాలో వీధినాటకాలు తప్ప స్టేటి నాటకాలు రాలేదు తర్వాతి కాలంలో ఈ జిల్లాలో వెలువడిన నాటకాల రచయితలు వీరు

1 మలయశ్రీ 2 ఎస్ వేంకటాద్రి 3 ఎన్ బుచ్చిరాజం 4 రాయ్ బాలప్రసాద్
5 సచ్చిదానంద స్వామి 6 ఎడ్మల రామచంద్రారెడ్డి 7 గంగా రాజేశ్వరరావు

**I మలయశ్రీ - ఎం ఏ ఎం ఓ ఎల్ చంజర్ల - 505 469**

తెలుగులో "కవిత, నవల, వ్యాసం లాంటి వివిధ సాహితీ ప్రక్రియల్లో 50 ఏళ్ళ వయస్సులోనే 50 కి పైగా రచనలు వెలువరించిన మలయశ్రీ బహుముఖ ప్రజ్ఞాశాలి - " డా॥ సి నా రే 'రాగశిఖ పీఠిక నుండి వీరు నాటక రచనలోనూ సిద్ధహస్తులు మలయశ్రీ కవి విరచిత ముద్రితా ముద్రిత నాటకాలు

1 శాంతి పథము 1974, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం తిరుపతి ప్రచురణ - 1975
2 ప్రజాకవి వేమన 1984 పన్నెండు సార్లు ప్రదర్శించబడిన నాటకం
3 శ్రీనాథ మహాకవి, 4 వరకట్నం, 5 ఒకే మట్టి బిడ్డలం, 6 సమతాపథం వివరి నాలుగు అముద్రితాలు

శాంతిపథము ఇది తెలుగు అకాడెమీ హైదరాబాద్ వారి పోటీలో ఉత్తమ నాటకంగా ఎన్నుకోబడి 1975 78 మధ్య కాలంలో ఆంధ్రప్రదేశ్ ఇంటర్ మీడియట్ తెలుగు ఫైనల్ విద్యార్థులకు పాఠ్య పుస్తకంగా నియమించబడింది

తొమ్మిది అంకాల, 144 పుటల ఈ నాటకం సిద్ధార్థ గౌతమ బుద్ధుని జీవితగాథ ఇతివృత్తంగా రచింపబడింది ప్రాచ్యనాటక లక్షణాలను పాటిస్తూనే, పాశ్చాత్య నాటక లక్షణాలను కూడా దృష్టియందుంచుకొని రచయిత ఈ నాటకాన్ని శాంతరస ప్రధానంగా మలిచారు శాంతం లేదా ధర్మవీరం అంగిరసంగా కల ఈ ప్రకరణ రూపకంలో శృంగార హాస్యకరుణాదులు అంగరసాలుగా పోషించబడ్డాయి పాత్రోచిత సంభాషణలు ఎందర్భోచిత సూక్తులు, పది పాటలు, ముప్పదియైదు పద్యాలు కలిగిన ఈ నాటకం పఠన పాఠన ప్రదర్శన యోగ్యమై ప్రముఖ సాహితీ విమర్శకుల ప్రశంసలందుకొన్నది స్వయంగా నటన, నాట్యం, రచన, దర్శకత్వం రంగాల్లో ప్రవేశం కల ఈ రచయిత నాటకాలు మనోరంజక దృశ్యకావ్యాలు

ప్రజాకవి వేమనలో మలయశ్రీ గారు స్వయంగా దర్శకత్వ బాధ్యతలు వహించి జిల్లాలోని ప్రముఖ కళాకారుల సమీకరించి తాను వేమనకవి పాత్ర ధరించి పన్నెండు చోట్ల ప్రదర్శించారు ఆంధ్రప్రదేశ్ జూనియర్ కాలేజీల లెక్చరర్ల సదస్సు సందర్భంగా కరీంనగర్ 'కళాభారతి'లోని ప్రదర్శన దీనికి అఖిలాంధ్ర ప్రసంశలు సమకూర్చింది

## 2 ఎస్ వేంకటాద్రి, ఎం ఏ బి ఓ ఎల్ ఎలిగేడు

సుంకె వేంకటాద్రి గారు పద్య గేయ రచయిత అధ్యాపకులు వీరి పరిచయం మధుర గేయ కవుల్లో చేయబడింది కవి-నటులు క్రమ గాయకులు అయిన వీరు విద్యార్థుల ప్రదర్శనార్థం కొన్ని ఏకపాత్రలు, ఒక నాటకం రచించారు

వీరి నాటకం 1 భరతాభ్యుదయం 1979లో ముద్రణ పొందింది

ఇది ఏడు అంకాల నాటకం నాంది పద్యముంది ప్రస్తావన ఆధునిక కాలేజీ ప్రేమ పెళ్లిల్ల విషయంతో ఉంది కొన్ని అంకాల రంగాలుగా విభజింపబడ్డాయి పద్యాలు పాటలున్నా పదికి మించలేదు శృంగార కావ్యమైనా హద్దును మీరలేదు ఇందలి కవితలకంటే సంభాషణలే ప్రేక్షకుల నాకట్టుకుంటాయి ఈ కథ నన్నయ భారతకథనే అనుసరించింది కళాదాసు అభిజ్ఞాన శాకున్తలంలోని దుర్వాసుని శాపం ఉన్నా, శకుంతల పుత్రజననం తర్వాతనే రాజసభకు వెళ్తుంది దుష్యంతుడు మొదట భార్యను గుర్తించకున్నా, అప్పుడే జాలరితెచ్చి ఇచ్చిన అంగుళీయకం వల్ల తెలుసుకుంటాడు మేనక వచ్చి కథను తెలుపుతుంది పూర్వాలంకారికుల నాటక లక్షణాలను కొంతవరకు పాటిస్తూ స్వేచ్ఛగా సరళంగా సాగిన ఈ నాటకం, ప్రదర్శనలో రక్తి కడుతుంది కట్టింది (1975లో పత్తిపాక సెకండరీ పాఠశాల విద్యార్థినీ విద్యార్థులు నాటకకర్త దర్శకత్వంలో ప్రదర్శించిన ఈ నాటకాన్నిఈ గ్రంథకర్త (నేను) చూశాడు )

## 3 ఎన్ బుచ్చిరాజం - లక్ష్మీపురం జగిత్యాల

బుచ్చిరాజం గారు శ్రామిక కుటుంబంవారు పెద్దగా చదువుకోలేదు వీరి ముద్రిత రచన ఒకే ఒక నాటకం 1 "వీరజ్యోతి" 1979, మొదటి భాగం 88 పుటలు

13 రంగాలు 3 గంటల ప్రదర్శన అవుతుంది రెండవ భాగం రాలేదు సినిమా ఫక్కీలో కథ సీరియల్ నవలవలె చకచక చదివిస్తుంది రెండు ధనిక బంధుకుంటుంబాలు మరో దొంగలముఠా మధ్య జరిగిన ఘర్షణ ఈ నాటక కథ గుఱ్రాలు కార్లు, ఫోన్లు కత్తులు, గుహలు, రాతి తలుపులు సారంగాలు ఈ కథలో ఉన్నాయి ఇది చదివితే షోలే హిందీ సినిమా జ్ఞప్తికి వస్తుంది (ఈ రచయిత పీరిక దయనీయంగా ఆసక్తిగా ఉంది వీరిది పేద దళిత కుటుంబం ఒకే మాసంలో తలిదండ్రులు మరణించగా 12 ఏండ్ల బుచ్చిరాజు బస్చార్జీలు కూడా లేక కాలి నడకన బోధన్‌వెళ్లి కూలి చేసిన డబ్బుల్తో బొంబాయి వెళ్లి, సౌరాష్ట్రచేరి, కొన్నేళ్లు పనిచేసి, తిరిగి సొంతూరుకి వచ్చి ఇల్లు ఇల్లాలు కలవాడయ్యారు కూతురును చదివిస్తూ ఓ గురువు వద్ద విద్యనేర్చుకున్నాడు )

భాష సాఫీగా ఉంది కొన్ని పాటలున్నాయి పద్యాలు లేవు యక్షగానాలు ఆడి సినిమాలు చూసి తామీ నాటకం రచించినట్లు రచయిత చెప్పారు

## 4 రాయ్ బాలప్రసాద్ - బి ఏ బి ఇడి పెద్దపల్లి - జ 1939

బాల ప్రసాద్ గారి స్వస్థలం వేములవాడ అధ్యాపకులుగా పనిచేస్తూ పెద్దపల్లిలో స్థిరపడ్డారు వచన గేయాలు-వ్యాసాలు - నాటికలు రచించారు విరు నటులు రామగిరి గుహాలయం వరకు రాతిమెట్లు కట్టించాలనే ఆశయంతో ధనసేకరణ ప్రయత్నంలో వీరు రామగిరి' నాటకం రచించి ప్రదర్శించి ప్రచురించారు 1 "రామగిరి పౌరాణిక - సాంఘిక నాటకం ' 1987 ముద్రణ

ఈ నాటకం మూడు అంకాలతో 30 డెమ్మీ పుటల్లో ఉంది

ఇతిహాస కాలంలో రాముడు చరించినాడని, కాళిదాసు మేఘ సందేశంలో పేర్కొనబడిందని, కాకతీయులు,రెడ్డిరాజులు నవాబులు,ఏలిందని చెప్పబడుతున్నది రామగిరి ఇంకా ఇది కవి మడికి సింగన నివసించినదీను ఈ రామగిరి పర్వత దుర్గం పెద్దపల్లి రైల్వేస్టేషన్‌కు 20 మైళ్ల దూరంలో ఉంది అక్కడి ప్రకృతి రమణీయకత కోటలు బురుజులు కోనేళ్లు దర్శకులను ఇప్పటికీ ఆకర్షిస్తాయి

సీతారామలక్ష్మణులు మతంగ ఆగస్త్యమునులు, ఓ కాపు దంపతుల జంట ఇంకా కాలేజీ యువకులు ఈ రామగిరి నాటక పాత్రలు రామగిరి వర్ణనతో ఈ నాటకం కథ నడుస్తుంది మధ్య మధ్య రామాయణ వనవాస సన్నివేశాలు వస్తవి సంభాషణలు బాగున్నాయి రైతుల భాష తెలంగాణా మాండలిక మైనా కోస్తాపదాలతో కలిసింది పాటలు మ రామచంద్రశర్మ గారివి వంద ప్రదర్శనలైనా జిల్లాలో ఇచ్చి డబ్బు సేకరించాలని రామాలయం సోపానాలు నిర్మించాలని రచయిత సంకల్పం రచయిత స్వయంగా రామునిగా నటించారు ఇందులో సీతగా 'లక్ష్మి రేకందార్, కాపుపడతిగా రజనిశ్రీ నటించారు (వీరు ఇద్దరూ మలయశ్రీ గారి వేమన నాటకంలోని వదిన దేవదాసి పాత్రధారులే కావడం విశేషం ) ఎందుకో కాని రామగిరి నాటకం ఒకే ఒక ప్రదర్శనతో నిలిచిపోయింది పౌరాణిక చారిత్రక విశేషాలు కల బాలప్రసాద్ గారి ఈ నాటకం చక్కగా చదువుకోవచ్చు - ప్రదర్శించుకోవచ్చు ఈ పుస్తకానికి రామగిరి ఖిల్లా - నాటక ప్రదర్శన ఛాయచిత్రాలు ప్రత్యేకార్షణ వీరి మరోనాటి 'దివంలో విహార యాత్ర' స్థానిక 'గౌతమి' లో ప్రచురింపబడింది



## 5 సచ్చిదానంద స్వామి - జమ్మికుంట జ 1936 సుమారు

'సచ్చిదానంద స్వామి'గా స్టేషన్ జమ్మికుంటలో సాధు జీవితం గడుపుతున్న సుంకర వేంకటనరసయ్య గారిది వావిలాల దగ్గర కుందనపల్లి వీరు బి ఏ , బి ఇడి అధ్యాపకులుగా

ప్రభుత్వోద్యోగం చేసినవారు వేదాంతాసక్తితో అద్వైత గురుపదం స్వీకరించారు స్వామిగారు పద్యగేయ కవి వీరు అనేక వేదాంత వ్యాసాలు వ్రాసారు పుస్తకాలుగా ప్రచురించారు సచ్చిదానంద స్వామి గారి నాటకం శ్రీకృష్ణార్జున గీతా సంవాదము' 1978లో 500 ప్రతులు ముద్రించబడింది పుటలు 26 వెల - అమూల్యము

నాలుగంకాల ఈ నాటకాన్ని నాటిక అనవచ్చు ఇందలి పాత్రలు నాలుగు - గురువు, శిష్యుడు కృష్ణుడు, అర్జునుడు గురువు శిష్యునకు వివరిస్తున్నట్లుగా భగవద్గీతలోని పద్దెనిమిది అధ్యాయాల సారాన్ని సంగ్రహించి, కృష్ణార్జున సంవాద రూప రూపకంగా ఇది కూర్చబడింది రచన సరళం ప్రార్థనా శ్లోకాలు తప్ప కథలో మూల శ్లోకం ఏ ఒక్కటి కానీ లేకపోవడం విశేషం కొన్ని లలిత గీతాలు మరికొన్ని పద్యాలు భక్తిభావాలతో కథానుకూలంగా రచించి జతచేశారు

ఈ నాటకాన్ని గూర్చి పుస్తక ప్రకాశకుల వివరణమిట్లుంది

శ్రీకృష్ణార్జున గీతా సంవాదమను నాటికను ప్రదర్శింప చేసిన కండ్లు పావనము కాగలవు భజనామృతమందలి కీర్తనలతో పాటలతో భజన చేసిన నాలుక పావనము కాగలదు గీతా జయంతి రోజు ఈ నాటకమును ప్రదర్శింపజేయుట సమయోచితముగా నుండును దీనిని నిత్యము చదువుటచే గీతాపారాయణము వల్ల గలుగు ఫలితమున్ను కలుగును"

## 6 ఎడ్మల రామచంద్రారెడ్డి - వెల్లుల్ల మెట్టుపల్లి

రామచంద్రారెడ్డి గారు సంఘ సంస్కరణాభిలాషతో వరకట్న పిశాచం" అను నాటకం రచించి 1988లో ముద్రించారు ఇది 24 పుటలు, 9 అంకాలు - ఆధునికం సాంఘికం

పద్యాలు పాటలు లేవు రచన సాఫీగా ఉంది కొన్ని సుదీర్ఘవచనాలున్నవి నాటకమని రచయిత పేర్కొన్నా ఇది నాటిక అనడానికి తగి ఉంది స్త్రీలు సబలలుగా మారాలని ఆస్తిహక్కు పొందాలని వారి పురుష దాస్యజీవితాలు మారాలని ఈ కవి గారి ఆశయం

## 7 గంగా రాజేశ్వరరావు - ఎం ఏ బి ఇడి మంథిని జ 1920

రాజేశ్వరరావు గారు రిటైర్డు ప్రభుత్వోపాధ్యాయులు పద్యరచనలో మహాకావ్య కవి వీరికి గేయరచన - చిత్రబంధ కవిత నల్లేటిపై బండి నడక ఈ పండిత కవి నాలుగు నాటికలు ఒక నాటకం 'గంగా రూపకాలు"గా 1988లో స్వయంగా 'గంగా తరంగిణి సమితి' మంథిని పక్షాన ప్రచురించారు

గంగా రూపకాలు పుస్తకంలో మొదట నాలుగు నాటికలు, చివర 94 పుటల్లో 'ఝాన్సీరాణి' చారిత్రక నాటకం ఉంది ఇది సంస్కృత రూపక నాంది ప్రవేశిక విష్కంభాది ప్రాచీనాలంకారిక లక్షణాలేవీ పాటించబడని సంపూర్ణ ఆధునిక వచన నాటకం రెండు మూడు పాటలు తప్ప పద్యాలు లేవు పాత్రోచితంగా హిందుస్థానీ ఆంగ్ల భాషా పదాలున్నాయి ఇందలి పాత్రలు 22 అందులో మూడు స్త్రీ పాత్రలు

ఈ వీర రస ప్రధాన నాటకంలో ఉపకథ రూపంగా సరస శృంగార, సన్నివేశం నుండి పుట్టిన సహజ సున్నిత హాస్యం పోషించబడింది ఝాన్సీ లక్ష్మీబాయి ప్రథమభారత స్వాతంత్ర్య సమరయోధురాలు

"కంపనీ వారికి పట్టుబడి బందిగా రంగూన్‌కు పంపబడక ఢిల్లీ పాదుషా బహదూర్‌షా తన వాగ్దాన ప్రకారం లక్ష్మీబాయికి సైన్య సహాయం చేసివుంటే - ఒక ఆడదాన్ని నేతృత్వం క్రింద పని చేయనని తాంత్యాతోపే భావించకుండా వుంటే - ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో లక్ష్మీబాయి సర్వసైన్యాధ్యక్షురాలై ఉంటే - ప్చ్! ఇట్లా ఈ రూపకం చదువుతుంటే మనకు అనిపిస్తుంది " అన్నారు ఈ గ్రంథ పీఠికలో శ్రీ జి వి ఎల్ ఎన్ విద్యాసాగర్ శర్మ, మధిర ఓచారిత్రక ప్రముఖ

ఘట్టాన్ని సునిశిత పరిశీలనతో మేలేర్చి రసోచితంగా ఓ ఆధునిక రసవత్తర నాటకంగా రూపొందించడం రాజేశ్వర కవిగారి ప్రతిభకు నిదర్శనం

దేశభక్తి ప్రబోధకమైన ఈ నాటకరాజం చదువుతున్నంత సేపు చక్కని చలన చిత్రాన్ని చూస్తున్నట్లు ఉంటుంది ప్రదర్శిస్తే ప్రేక్షకుల అంతరంగాలు ఆనంద తన్మయత్వంలో తలమునకలు కాక తప్పదు డా కె రామకోటి శాస్త్రి గారు "ఈ నాటకం సలక్షణంగా వ్రాయబడింది ఇది ముఖ్యంగా ఇంటరు, బి ఏ విద్యార్థులకు పాఠ్యంగా ఉండదగింది " అని తమ 'అభిలాష ను తెలిపారు పు 10 సాహితీ ధిషణతోపాటు సమయోచిత ప్రజ్ఞ ప్రదర్శించగల సాహితీకళా కుశలురు మహాకవి వత ంసులు గంగా రాజేశ్వరరావుగారు

**అముద్రిత నాటకాలు**

ఈ జిల్లాలోని అముద్రిత నాటకాలలో కొన్ని ప్రముఖమైనవి ఇవి

1920-60 మధ్య కాలములో రచింపబడిన నాటకాలు

1 కీ శే వానమామలై జగన్నాథాచార్యులు - పోతురెడ్డి వేట, 1 కార్పాసలక్ష్మి నాటకము

2 కీ శే మామిడిపల్లి సాంబశివ శర్మ వేములవాడ, 1 భద్రావతి నాటకము

3 కీ శే వేదాంతం కాశీనాథం - బి ఓ ఎల్ వేములవాడ

1 శ్రీరామ పాదుక - లేక భక్తభరతం, 2 లేములవాడ భీమకవి

పై ముప్వురు కవుల నాలుగు నాటకాలు అముద్రితం - అలభ్యం

1951 80 మధ్య కాలంలో వచ్చిన అముద్రిత నాటకాలు ఇవి

1 మల్లా వజ్జల రామచంద్రశర్మ బి ఓ ఎల్ పెద్దపల్లి, 1 లవకుశ

2 డా అందె వేంకటరాజము ఎం ఏ , పిహెచ్ డి కోరుట్ల, 1 దేశభక్తి

3 పోరండ్ల మురళీధర్ ఎం ఏ బి ఇడి జిల్లెళ్ల, 1 ప్రతిఫలం, 2 జాలిగుండెలు

4 డి ఆర్ కె రంగారావు బి ఎ బి ఇడి ధర్మపురి, 1 మట్టిలో మాణిక్యం

1990 సుమారుగా ప్రదర్శింపబడిన నాటకాలు

1 ఆర్ మనోహరరావు - ఎం ఎస్సి , బి ఇడి రాఘంపేట, 1 సమాజం మారాలి

2 రాస భూమయ్య, బి ఏ ఎకిన్‌పూర్, 1 మరోకర్ణుడు, 2 స్వేచ్ఛ

2 జి గంగాధర్, బి కాం, ఐలాపూర్, 1 ఎంగిలి మెతుకులు

ఈ జిల్లాలో పౌరాణిక నాటకాలు తక్కువ, సాంఘిక నాటకాల రచన ఎక్కువ కొన్ని చారిత్రక నాటకాలు వచ్చాయి సంస్కృతానువాదాలు కానీ, ఆలంకారిక లక్షణాల ననుసరించి రచింపబడినవి కానీ మరీ తక్కువ వ్యాపార దృష్టితో వ్రాసిన స్టేజీ నాటకాలు లేనేలేవు

వృత్తి నాటక సమాజాలు లేకపోవడం, సినిమాల ప్రభావం కారణంగా ఇప్పుడు నాటక రచన పూర్తిగా సన్నగిల్లింది ఔత్సాహిక యువకులు నాటికల ప్రదర్శనలతో సంతృప్తి పడుతున్నారు

## పాద పీఠికలు

1 ధనంజయుని - 'దశరూపకమ్ లో పేర్కొన్న దశవిధరూపకాలివి

శ్లో నాటకం ప్రకరణం భాణ ప్రహసనండిమ

వ్యాయోగ సమవకారౌ వీథ్యం కేహామృగా - ఇతి 1 5

1 నాటకం 2 ప్రకరణం 3 భానం, 4 ప్రహసనం, 5 డిమం 6 వ్యాయోగం, 7 సమవకారం, 8 వీధి, 9 అంకం, 10 ఈహామృగం

2 మహతి - రూపక సమీక్ష వ్యాసాలు' యువ భారతి హైదరాబాద్ వారి ప్రచురణ - 1972

## నాటికలు

నాటకాల రచన ప్రదర్శన వెనుకకు పట్టినా నాటికలు మాత్రం ఇప్పటికి ప్రచారంలో ఉన్నవి ఔత్సాహికులు ఉద్యమకారులు ప్రదర్శించే రంగస్థల ఆరుబయటి వీధిరూపక నాటికలుగానే కాక రేడియో టెలివిజన్ సినిమాల అంతర్నాటికలు గానూ ఇవి ఆదరింపబడుతున్నవి

సంస్కృత సాహిత్యంలో తొలి దృశ్యరూపక కావ్య లక్షణకర్త భరతముని తన నాట్యశాస్త్రమ్‌లో దశ విధ రూపకాలతో పాటు 'నాటి అనే పేరుతో నాటికను పేర్కొని లక్షణాలు చెప్పాడు [1] ధనంజయుడు 'దశరూపకమ్ లో నాటిక నాలుగంకాలు కలదిగా ధీరలలిత నృపుడు నాయకుడుగా శృంగారరస ప్రధానంగా ఉంటుందని వివరించారు [2] ఇంకా అంకాలు తగ్గి పాత్రలు మారి నాటికలలో అనేక భేదాలుంటాయన్నాడు [3] వివాహితుడైన రాజు మరో సౌందర్యవతియైన కన్యయందనురాగమునుపొంది విరహానల తప్తుడుకాగా కులీనయైన పట్టపురాణి జోక్యంతో వారిద్దరికి కల్యాణం కావడం నాటి నాటికల సాధారణేతి వృత్తం [4]

ఇక ఆధునిక నాటకము వలెనే నాటిక ప్రాచీన లకణముల పాటించుటలేదని, డా పి ఎస్ ఆర్ అప్పారావు గారు నేటి నాటికా లక్షణాలనిట్లా వివరించారు నాటిక ప్రదర్శనకాల పరిమితి సుమారు గంట ఇదియు ఏకనాయకము ఏక వస్తుకము కావలసినదే కాని, ఇందు రెండు మొదలు ఐదారు రంగములుండవచ్చును ఇతి వృత్తమున స్థల కాలైక్యములను విధిగా పాటింపనక్కరలేదు

"కాని ఆ తర్వాత వెలువడిన నాటిక నాటికల ఆ స్వరూపమే మారిపోయినది ఈనాడు నాటకమునకును నాటికకును అంతగా భేదము కనిపించుట లేదు అనగా ప్రదర్శనకు ఎక్కువ కాలము పట్టినచో నాటకమనియు తక్కువ కాలము పట్టినచో నాటిక యనియు సాధారణ సంకేతము లేర్పడినవి '[5]

సంస్కృతంలోని శ్రీహర్షుని రత్నావళీప్రియదర్శికలు నాటికలు కోరాడరామచంద్ర శాస్త్రి గారి మంజరీ మధుకరీయము తెలుగులో తొలి సలక్షణ నాటిక ఇప్పటి తెలుగు నాటికలు మాత్రం ఆంగ్లసాహిత్యంలోని వన్‌అక్ట్‌ప్లే లను అనుసరించి ఆవిర్భవించి పెంపుగాంచినవి హిందీలోని ఏకాంకికలు కూడా తెలుగు నాటికలకు కొంత వరకు మార్గదర్శకాలైనా తెలుగు ఏకాంకికలు ఒకేరంగము కలవిగా మాత్రం ఉంటూలేవు ప్రదర్శనా సౌలభ్యం కోసం మొత్తం నాటకాన్ని కూడ రంగాలు కాలాలు మారినా, ఒకే స్థలం సెట్టింగులో ప్రదర్శించడం కూడా తర్వాతి కాలంలో వచ్చింది కథ కథానికలకున్న సామ్యమే, నాటికలకు ఏకాంకికలకున్నది

ఏకపాత్రాభినయములు నాటకాలలోని ఒక పాత్ర ఒక ప్రముఖ కథా ఘట్టాన్ని ప్రద[illegible] చుట హరి కథలు బహుపాత్రాభినయములు ఏకపాత్రలు ఏకపాత్రాభినయములు ఆధునిక [illegible]లంలో పౌరాణిక, చారిత్రక, సాంఘిక విషయాలలో ఏకపాత్రలు బహుళంగా వచ్చినవి

స్కూళ్లలో విద్యార్థులు, ఊళ్లలో యువకులు, ప్రగతి ప్రచారం కోసం ప్రభుత్వం వారు, ప్రత్యర్థుల విమర్శకోసం రాజకీయ పార్టీల వారు ఈ జిల్లాలో నాటికా రచనలను ప్రదర్శనలను ప్రోత్సహిస్తున్నారు

ఇక్కడ ప్రదర్శింపబడిన నాటికలు సైతం ముద్రణ పొందినవి తక్కువ ముందుగా ముద్రిత నాటికల పరిచయం కావించి తదుపరి అముద్రిత నాటికల - రచయితల పేర్లు మాత్రం చూపబడుతున్నవి వీరు ఈ జిల్లా నాటికా రచయితలు

1 డా సి నారాయణరెడ్డి 2 డా అందె వెంకటరాజము 3 ఎన్ వేంకటాద్రి
4 సామ లక్ష్మారెడ్డి 5 డా రావికంటి వసునందన్ 6 గంగా రాజేశ్వరరావు
7 ఎడ్మల రామచంద్రారెడ్డి 8 డి వి మురళీ మోహనాచార్య 9 పి హైమవతి
10 రాస భూమయ్య 11 గరిశెకుర్తి రాజేంద్ర
వీరి నాటికా సాహిత్య పరిచయం వరుసగా ఈ దిగువ చేయబడుతున్నది

## 1 డా సి నారాయణరెడ్డి

రెడ్డి గారు గేయ వచన నాటికల రచనలో లబ్ధప్రతిష్టులు వీరి ముద్రిత నాటికల పుస్తకాలు - 1 రామప్ప 1960, 2 నారాయణరెడ్డి నాటికలు 1978 ఇవేకాక మరి నాలుగు నాటికలు వీరు రచించారు

**1 రామప్ప** కాకతి గణపతి దేవ చక్రవర్తి కాలంలో నిర్మింపబడిన వరంగల్ జిల్లా పాలంపేటలోని 'రామప్ప' దేవాలయం శిల్ప సౌందర్యానికి పేరెన్నికగన్నది ఆ ఆలయమంటప స్తంభకోణ మదనికామూర్తులు మైసూరు రాష్ట్రంలోని బేలూరు దేవాలయంలోని జక్కన చెక్కిన స్త్రీ మూర్తులకు సౌందర్యంలో పోటీకి నిలువ గలవి అయినా ఈ శిల్పి పేరైనా తెలియదు రామప్ప అని జానపద జన వ్యవహారం

రామప్ప దేవాలయ ప్రవేశ ద్వారానికి పశ్చిమ దిశగా ఉన్న నాగిని విగ్రహాన్ని ఆధారంగా చేసుకొని నారాయణరెడ్డి గారు ఈ నాటికను రసరమ్యంగా రచించారు ఇందులో ఏడు పాటలు ఒక పద్యం సైతం ఉన్నాయి ఇందలి 'ఈ నల్లని రాలలో' పాట యథాతథంగా 'అమరశిల్పి జక్కన' తెలుగు చలనచిత్రంలో వాడుకోబడింది ఈ రామప్ప నాటిక మొదట హైదరాబాద్, మద్రాసు రేడియో కేంద్రాలనుండి ప్రసారమై, అనంతరం హిందీ అనువాదం ద్వారా పన్నెండు భాషలలోనికి మారి మన దేశంలోని అఖిల భారత రూపక కార్యక్రమంలో అన్ని ఆకాశవాణి కేంద్రాల నుండి ఒకేసారి ప్రసారం చేయబడింది దీని తెలుగు ప్రసారానికి పాలగుమ్మి విశ్వనాథం గారి సంగీతం 'మంగళపల్లి బాలమురళీ కృష్ణ' గారి నాయకపాత్ర పోషణ రచనకు అదనపు శోభను చూకూర్చాయి

"హైద్రాబాద్ ఆకాశవాణి సంగీత రూపకాల్లో ఇంత ప్రశస్తి వహించిన సంగీతరూపకం మరొకటి లేదనే చెప్పాలి 'రామప్ప' నారాయణరెడ్డి కవితా శక్తికి కీర్తి పతాక" అన్న 'శశాంక' వాక్కులు ప్రత్యక్షర సత్యాలు "కళావిర్భూతికీ కళా విలసనానికీ ఉన్న అతి సూక్ష్మమైన సంబంధాన్ని నారాయణ రెడ్డి ఈ నాటికలో వ్యంగ్య స్ఫూర్తితో ప్రతిపాదించినాడు కళదైవాంశమనే భారతీయుల విశ్వాసానికి ఈ నాటిక ఒక కాణాచి"[7]

ఒక నవ్య సాహిత్యమూర్తి ఒక ప్రాచీన మహాశిల్పి కలా విన్యాసాన్ని అంతరంగాన్ని చారిత్రక నేపథ్యంలో ప్రశంసార్హంగా చిత్రించిన నాటిక 'రామప్ప'

**2. నారాయణరెడ్డి నాటికలు** - ఇందలి శీర్షికలు పది

ఈ నాటికలలో కొన్నింటిలో రెండు మూడు పాటలు, మరి కొన్నింటిలో బృంద గానాలు - నేపథ్య గీతాలూ ఉన్నాయి అయినా "గేయాలు నామ మాత్రంగా ఉన్నందువలన వీటిని వచన నాటికలనే చెప్పాలి"[8] ఈ నాటికల వివరాలివి

1 ఊర్మిళ రామాయణ పాత్ర లక్ష్మణ పత్ని పతి విధేయ ఈ నాటిక ఆమె స్వభావచిత్రణ 2 వరూధిని - పెద్దన గారి మనుచరిత్ర ప్రబంధ నాయిక శృంగార గాథ 3 మేఘమాధురి - ప్రకృతి

పరమ పురుషుల ప్రణయ వర్ణన 4 దీపలీల - దైవతత్త్వ నిరూపణ 5 నాగార్జున సాగరం, 6 కర్పూర వసంతరాయలు ఈ రెండు నాటికలు స్వీయగేయ కావ్యాలకు రూపక రూపాలు 7 విజయ సంక్రాంతి - 1971 నాటి బంగ్లాదేశ్ విముక్తి గాథ 8 రఘుపతి రాఘవ రాజారాం - గాంధీజీ వ్యక్తిత్వం చిత్రణ 9 కాళిదాసు పునరాగమనం - కాళిదాసు, మేఘసందేశ నాయికా నాయకులైన యక్షీయక్షులు ఇందలి పాత్రలు, భూలోక సమరోన్మాదం, ధనదాహం అంతరించేందుకు మేఘునితో శాంతి సుధను కురిపిస్తాడు - కాళిదాసు మహాకవి 10 హరి చరణదాసి మీరా - సుప్రసిద్ధ రాజస్థాన కృష్ణభక్తురాలి కథ

విషయాలు ప్రఖ్యాతమైనవైనా నవీన కల్పనలైనా వాటిని మనోహరంగా వర్ణచిత్రాలుగా మలిచేనేర్పు నారాయణరెడ్డి గారిది వీరి ఈ నాటికలన్నీ ఆకాశవాణి ద్వారా ప్రసారమైనవి

నారాయణరెడ్డిగారి ఇతర నాటికలు, 1 వసంతలక్ష్మి - పూలుగాలి ఇందలి పాత్రలు

2 భలే శిష్యులు - అలభ్యనాటిక, 3 సినీకవి - 1953లో రెడ్డిగారు ఎం ఏ , విద్యార్థిగా ఉన్న కాలం నాటి రచన 9 ఈ నాటిక ఆంధ్రాభ్యుదయోత్సవాల ప్రదర్శన సందర్భంలో సి నా రె మకరంద మూర్తి భావకవి పాత్రధరించి ఉత్తమ నటుని బహుమతి అందుకున్నారు 'చలనచిత్ర నిర్మాతల ఇష్టానుసారం పాటలు వ్రాయగలిగిన వాడే ఆరంగంలో రాణిస్తాడు అంగారాన్ని శృంగారాన్ని దేన్నయినా అతివేలంగా అందించగలవాడే సినిమా కవి' అని తేల్చారు ఈనాటిక 1953 నాటిది రెడ్డి గారి సినీరంగ కవన ప్రవేశం 1961 'గులేబకావళి కథ'తో ఈ 1997లో చూ సినా నారాయణరెడ్డి గారి మాటలు నిజమనక తప్పదు సినీ గీతాల - సంభాషణల నైతిక స్థాయి దినదినం దిగజారుతుండడం శోచనీయం

4 శిథిల శిల - 1953 వితంతు వివాహాలను ప్రోత్సహించే నాటిక హైద్రాబాద్ రెడ్డి హాస్టల్‌లో ప్రదర్శింపబడిన ఈ నాటికలో డా యశోదారెడ్డి గారు నటించామన్నారు నాటికలు రమ్యంగా రచించడంతో సరిపోదు అవి జనానికి చేరి ఆదరణ పొందడం విశేషం నారాయణరెడ్డి గారి నాటికలన్నీ శ్రవ్య దృశ్య కావ్యాలుగా జనవ్యాప్తి పొంది కవిగా వారి కీర్తిని ఇనుమడింపజేశాయి

### 3 డా. అందె వెంకటరాజము - కోరుట్ల

ఈ కవి పరిచయం పద్య ఖండ కావ్యాల్లో చేయబడింది వీరు పద్యగేయ కవిత్వంతోపాటు, అధ్యాపక వృత్తిలో ఉన్నవారు కాబట్టి విద్యార్థుల ప్రదర్శనలకోసం కొన్ని నాటికలను కూడా రచించారు వీరి నాటికల పుస్తకాలివి

1 భారతరాణి - 1971, 2 భువన విజయము - 1971, 3 మాధవవర్మ - 1993

**1 భారతరాణి** - ఇది ఆరునాటికల సంపుటి ఇందులో భారతరాణి, సమత గేయ నాటికలు మొదటి నాలుగు వచన నాటికలు 1 అభ్యుదయం - ప్రభుత్వ అభివృద్ధి పథకాల తోడ్పాటుతో గ్రామీణ రైతులు అభివృద్ధిని సాధించుకోవటం 2 విద్యార్థుల వరాలు - ఓ దుడుకు విద్యార్థి తపస్సునకు శంకరుడు ప్రత్యక్షమై కాపీ చదువులు మానుకొని చక్కగా చదువుకోవల్సిందిగా హితబోధ చేయడం 3 పల్లెసీమ - తర తమ భేదాలు మరచి అందరూ కలిసి మెలిసి ఉంటేనే మన గ్రామాలు స్వర్గసీమలు అవుతాయని ఇందులో కవి సందేశం 4 దోపిడి - ఈ రచయిత గారి 'దేశభక్తి' నాటకంలోని గొత్రెల దోపిడీకి వచ్చిన గ్రీకు సైనికులను భారత గోపాలురు ఎదిరించి పరుగెత్తించిన వైనం 5 భరతమాత - దేశభక్తిని, 6 సమత - మానవతను చాటి చెప్పే గేయనాటికలు

2 భువన విజయం - 40 పుటలు ఈ నాటిక శ్రీ కృష్ణదేవరాయ భవన విజయ సభాభవనంలో అష్టదిగ్గజ కవుల కవితాగోష్టి డా దివాకర్ల వేంకటావధాని ప్రభృత భాగ్యనగర ప్రముఖ కవులు బహు ప్రదర్శనలిచ్చిన 'భువన విజయం' ఈ రచనకు ప్రేరణ అనుకోవచ్చు విద్యార్థులతో ప్రదర్శింపజేసిన ఈ నాటిక పద్యాల్లో అయిదుసార్లు స్త్రీ వక్షోజవర్ణన లుండడం ఒక వింత

3 మాదవ వర్మ - 4 రంగాలు 32 డెమిపుటలు కథా పరిధిని, లేదా ప్రదర్శన కాలవ్యవధిని బట్టి దీనిని నాటిక అనే అనాలి కాని కవి గారు దీనిని నాటకమన్నారు

ఆరవ శతాబ్ది ఉత్తరార్థంలో విజయవాడను పాలించిన విష్ణు కుండిన ప్రభువు మాధవవర్మ ఒక మారు రథాన్ని వేగంగా నడిపించి ఒక పేద బాలుని మరణానికి కారకుడైన తన పుత్రునికి మరణదండన విధించిన ధర్మప్రభువని ప్రతీతి వేంకటరాజం ఈ నాటికను చక్కగా రచించారు పద్యాలు లేవు కాని కొన్ని పాటలున్నాయి సి నా రె గారి కర్పూర వసంతరాయలు' గేయకావ్యం వలె వందిమాగధ కైవారాలతో ప్రారంభమైన ఈ రూపకం పురోహితుని మంగళాశాసన వచనంతో పూర్తయింది ఆ రాజు ధర్మనిర్ణయానికి కనకవర్షం కురియటం, రాణి ప్రార్థనకు కనక దుర్గాదేవి, ఉరితీయబడి మరణించిన యువరాజు మంచనను పునర్జీవితుని చేయడం ఇందలి అద్భుత విషయాలు కథా సుఖాంతం

పాత్రోచిత వ్యావహారిక భాషలో చక్కని సంభాషణలతో సాగిన ఈ రూపకంలో ఆంధ్రనాటక పితామహ ధర్మవరం రామకృష్ణమాచార్యుల నాటకాలలోవలె సుదీర్ఘ వచనాలున్నవి కవి సద్ధర్మానురక్తితో ఈ చారిత్రక నాటిక రచించారు

## 4 ఎస్ వేంకటాద్రి - ఎం ఏ

వీరి రంగస్థల నటనానుభవం అభిమానం 'అభినయ రత్నమాల' అను ఏకాంకికల సంపుటిని రచింపజేసింది ఏకాంకిక ఆంగ్ల సాహిత్యంలోని 'వన్‌ఆక్ట్‌ప్లే' హిందీలోని ఏకాంకికల ప్రభావంగా ప్రభవించి తెలుగు 'ఏకపాత్రాభినయము' గా వ్యవహరింపబడుతున్నది [10] వేంకటాద్రి గారి ఈ సంపుటిలోని ఏకపాత్రలివి ఈ శీర్షికల నామవాచకాలకు కవి గారు విభక్తి ప్రత్యయాలు 'డు' లేకుండానే ప్రయోగించారు



1 నారద - శ్రీకృష్ణ తులాభార ఘట్టం, 2 నత్కీర - శివుని పద్యంలో తప్పుపట్టి శాపగ్రస్థుడై విలపించడం, 3 హరిశ్చంద్ర కాటికాపరి సన్నివేశం, 4 దుర్యోధన - మయసభా ఘట్టం, 5 కర్ణ - సూర్యునికి, కుంతికి వాగ్దానాలు చేసిన భారత యుద్ధ పర్వ సంఘటలన వర్ణన

వ్యావహారిక స్పర్శ గల సరళ గ్రాంధిక గద్యంలో ప్రదర్శన యోగ్యంగా సాగిన ఈ రచనలో సందర్భోచితంగా రచయిత కొన్ని గేయాలను పద్యాలను సైతం చేర్చారు

## 5 సామ లక్ష్మారెడ్డి, ఎస్ జి.టి , నార్లాపురం, మం గంగాధర జన్మతేది 4-7-1946

లక్ష్మారెడ్డి గారు అధ్యాపకులు, రంగస్థల నటులు విద్యార్థుల యువజనుల ప్రదర్శనలకోసం నీతిని ప్రీతిని సమకూర్చగల నాటికలను రచించి పలు గ్రామాల్లో ప్రదర్శించారు వాటిని 'కల్లువల్ల యిల్లు గుల్ల' పేరుతో 68 పుటల పుస్తకంగా 1980లో ప్రచురించారు ఈ సంపుటిలో ఒక నాటిక, మరి మూడు గేయనాటికలున్నాయి

1 కల్లువల్ల యిల్లు గుల్ల - ఇది 30 పుటల నాటిక ఒక గ్రామీణ హరిజన కుటుంబంలోని పాత్రలతో మద్యపాన వ్యసనం మనదేశంలో ఎంత తీవ్రంగా ఉందో చిత్రించారు దానివల్ల కలిగే అనర్థాలను సన్నివేశాల ద్వారా చూపి, చివరికి తాగకూడదని హితవు చెప్పారు ఈ సంపుటిలో ఇదొక్కటే వచన నాటిక లక్ష్మారెడ్డిగారి రచనలు మాండలిక భాషలో సహజంగా ఉన్నాయి

## 6 డా రావికంటి వసునందన్, ఎం ఏ పిహెచ్ డి కమాన్‌పురం

వీరి పరిచయం పద్యగేయ కవుల విభాగాల్లో చేయబడింది దశాధిక గ్రంధకర్త అయిన డా ఆర్ వసునందన్ గారి రేడియో రూపకం 'ప్రజావిజయం' 24-2 1987 నాడు ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రం నుండి ప్రసారం చేయబడి పుస్తకంగా వెలువడింది

పదహారు పుటల ఈ రేడియో నాటికలో ఇరువదికి పైగా పాత్రలున్నాయి నైజాం రెండో నవాబు 1800లో ఈస్టిండియా కంపెనితో చేసుకున్న ఒప్పందం నుండి సెప్టెంబర్ 1948 సైనికచర్య[11] హైద్రాబాద్ స్టేట్ విముక్తి వరకు ఇందలి కథ ఉంది నాటి వివిధ సన్నివేశాలు నేటి పాఠకులను శ్రోతలను మళ్లీ ఒకసారి పూర్వచరిత్ర కటు స్మృతులలో విహరింపజేసి ఉత్తేజపరుస్తాయి రూపకం మొదట చివర - బుఱ్ఱకథా దర్వులు తప్ప పాటలు పద్యాలు లేవు నేపధ్య కథనంతో ఇందలి కథా వేగం పెరిగింది ఇది ప్రయోజనకరమైన చారిత్రక నాటిక

## 7 గంగా రాజేశ్వరరావు, ఎం ఏ బి ఇడి మంథిని

రాజేశ్వరరావు గారి పరిచయం పద్యకావ్య నాటక ప్రకరణాలలో చేయబడింది పద్యగేయ కావ్యకర్తలైన రాజేశ్వర్ రావుగారు వ్యావహారిక వచనంలో సాంఘిక నాటికలను సైతం చక్కగా రచించారు వీరి నాటికల సంపుటి గంగా రూపకాలు' అనే పేరుతో 1998లో ముద్రణ పొందింది 224 పేజీల ఈ పుస్తకంలోని మొదటి 129 పుటలు మూడు నాటికలాక్రమించాయి తర్వాతి పుటల్లో-ఓ నాటకం ఉంది ఈ సంపుటిలోని నాటికలివి

1 మల్లెమాల, 2 రామరాజ్యం, 3 ఎన్నికలొస్తున్నాయి జాగ్రత్త

1 మల్లెమాల ఇది ఏకాంకిక అని రచయిత అన్నారు రంగాలు ముప్పది పుటల్లో ఉన్న ఈ నాటిక హరిజనాభ్యుదయంకోసం రచింపబడింది హరిజన దేవాలయ ప్రవేశంతో ఆరంభమైన ఈనాటిక హరిజన యువతిని ఓ బ్రాహ్మణ యువకుడు వెళ్లాడటంతో కథ సమాప్తమైంది ఇది గాంధేయ వాద ప్రభావంతో వచ్చిన నాటిక మంథిని ఉన్నత పాఠశాల విద్యార్థుల ప్రదర్శనకోసం వ్రాయబడింది

2 రామరాజ్యం - 4 రంగాలు 34 పుటలు

చదువుకున్న యువతీ యువకులు పెళ్లి ఉద్యోగాలంటూ బంధాల్లో పడిపోక గ్రామసీమల అభివృద్ధికి పూనుకోవటం అనే ఆదర్శవాదంతో ఈ నాటిక రూపొందింది వాళ్లు సన్యాసులు కాలేదుకాని ఆశయ సాధనకు ప్రాధాన్యతనిచ్చారు

3 ఎన్నికలొస్తున్నాయి - 55 పుటల ఈ నాటిక మూడు అంకాలుగా ప్రతి అంకం కొన్ని రంగాలుగా విభజింపబడింది మన ప్రజాస్వామ్యవాయకుల ఎన్నికల తతంగాల వర్ణన తెలంగాణా మాండలిక పదాలు వాడిన గ్రామ పెత్తందారు పాత్ర అఖిలాంధ్ర దేశానికి వారసునిగా చిత్రించారు రావుగారు యువతరానికి గ్రామసర్పంచు పదవి నొప్పగించడం మారుతున్న సమాజానికి సంకేతం ఇలాగే ఎన్నికలపై ఒక ప్రహసనం చిలకమర్తి గారిది ఉంది

సంప్రదాయ మార్గంలోనే సాంఘికాభ్యున్నతిని కాంక్షిస్తూ గంగా రాజేశ్వర రావు గారు ఈ నాటికలు రచించారు

## 8 ఎడ్మల రామచంద్రా రెడ్డి - వెల్లుల్ల - మం మెట్టుపల్లి

రామచంద్రారెడ్డి గారు జిల్లా కోపరేటివ్ సొసైటీ బ్యాంకులో అకౌంటెంట్‌గా ఉద్యోగం చేస్తున్నారు సంఘ సంస్కరణాభిలాషతో వీరు కలం చేపట్టి రంగస్థల ప్రదర్శనోపయుక్త రచనలు వ్రాసి వెలువరించారు వీరి ముద్రిత పుస్తకాలు రెండు

1 వరకట్న పిశాచము - నాటకం పరిచయం చేయబడింది

2 మనోదర్పణము - ఏకపాత్రల సంపుటి 1988లో ముద్రింపబడిన ఈ 34 పుటల సంపుటిలో అయిదు ఏకపాత్రాభినయ వచన రచనలున్నవి అవి ఇవి

1 భారతవిలాపము రామాయణేతిహాసంలోని ఘట్టం రామ వనవాసానంతరం అయోధ్యకు చేరిన భరతుని మనోవేదన 2 భారత వీర విలాపము - భారత వీరుల ప్రశంస ఏ నటుడైనా నటించే విధంగా రచయిత ఈ ఏకపాత్రను మలిచారు 3 అందమైన అర్ధాంగి ఆదర్శ ప్రేయసి ప్రేమికుల జంటను చూసి ఓర్వని పాపాత్ముల నింద 4 అంతరాత్మ ఇందులో రచయిత నేటి అల్లరి విద్యార్థుల, వరకట్నాల, స్వార్థం ముదిరిన సర్పంచుల, తాగుబోతుల పిల్లల పాలపాడినిసైతం అమ్ముకునే బడిపంతుళ్ళ లంచగొండి కులపుపెద్దల నిరసించారు 5 ఇంద్రధనుస్సు - ఆదర్శ ప్రేమికులు తమకు అడ్డంకులు కలిగించే దుష్టశక్తుల నెదిరించి ధైర్యంగా ఉన్నత ఉజ్జ్వల భవిష్యత్తును నిర్మించుకొనటం

ఈ అయిదింటిలో నాలుగు సాంఘికేతి వృత్తాలు భావిభవ్యతనాశించి భావనవ్యతలో శిష్టవ్యావహారిక భాషలో సహజ వర్ణనతో రెడ్డి గారు ఈ ఏకపాత్రలు రచించారు

## 9 డి వి మురళీమోహనాచార్య - ఎం ఏ , మెట్టుపల్లి 1941

దప్పూరి వేంకటమురళీమోహనాచార్యులు జన్మస్థలం పాలాస వీరు తెలుగు పండితులుగా ప్రభుత్వోద్యోగం చేస్తూ మెట్టుపల్లిలో స్థిరపడ్డారు సంగీతంలో ప్రావీణ్యంకల గాయకులు - నటులు , ఒక జలగలు మాత్రం వీరిది 1989లో పుస్తక రూపంగా వచ్చింది [12] పలు అముద్రిత రచనలున్నా 'కవన కల్హారం' పేరుతో ఒక ఖండకావ్యం ముద్రణలో ఉంది 1997

ఎనిమిది పురుషపాత్రలున్న జలగలు నాటికలో స్త్రీ పాత్ర లేదు దోపిడీదారులు జలగలని ప్రతీక ఓ పేద పనిమనిషి ముగ్గురు కూతుళ్లను దొరకొడుకు, శెట్టికొడుకు, పూజారి కొడుకు పెళ్లిచేసుకోవడం ఇందలి సంఘ సంస్కారం అదీ ఇందలి కథ సంవిధానం

పెత్తందారీ తనం అధిక సంతానం, కులవిభేదంలను రచయిత ఈ నాటికలో నిరసించారు

## 10 పి హైమవతి - బి ఓ ఎల్ భూషణ్ - కరీంనగర్ 1940

పొన్నూరు హైమవతి గారిది గుంటూరు జిల్లా కరీంనగర్ స్థిరనివాసం కరీంనగర్‌లో ఆంధ్ర సరస్వతీ శిశుమందిర్ పాఠశాలలో భాషోపాధ్యాయినిగా పని చేసిన వీరు ప్రస్తుతం హుజూరాబాద్‌లో ఉద్యోగం చేస్తున్నారు తెలుగు పట్టి 'అబలకాదు సబల' వీరి ఇతర రచనలు

ఈ రచయిత్రి వ్రాసిన తొమ్మిది నాటికల సంపుటి జ్ఞాన కిరణాలు' పేరుతో 1991లో వెలువడింది ఇది జిల్లా విద్యాశాఖాధికారి ఆనంద కిశోర్ గారికి అంకితం ఇవ్వబడింది [13]

ఇందలి నాటికలు, ప్రగతికి నిలయం విద్యాలయం, బాధ్యులెవరు? పొదుపు, వందేమాతరం, సమాజ స్వరూపం సోమరి, నకిలీ డాక్టర్, పసిడి బాల అమ్మ ఈ నాటికలన్నీ కరీంనగర్ శిశుమందిర్ విద్యార్థులచే ఇతర పాఠశాలల విద్యార్థులచేతనూ పలు ప్రదర్శనలందుకున్నవి వందేమాతరం ఒక్కటి తప్ప మిగిలిన ఎనిమిది బాలనాటికలే 'అమ్మ' ప్రేంచంద్ 'మా' కథకు నాటకీకరణ 'పసిడిబాల' కరుణశ్రీగారి 'తెలుగుబాల' శతక నీతిపద్యాల ఆధారంగా రచింపబడింది నకిలీ డాక్టరు సంపూర్ణ హాస్యనాటిక

సోమరి - 1977 బాలల అకెడెమీ రాష్ట్రస్థాయి పోటీలలోనూ, శ్రీ సరస్వతీ విద్యాపీఠ బాలల శిబిరంలోనూ బహుమతులందుకొన్నది బాధ్యులెవరు - 1971 హైదరాబాద్ రవీంద్రభారతిలో ప్రదర్శింపబడి రేడియో అన్నయ్య న్యాపతి రాఘవరావు గారి ప్రశంసలు పొందిన నాటిక ప్రగతికి నిలయం విద్యాలయం జిల్లా స్థాయిలో 3 బహుమతులు పొందగా, 'అమ్మ' జిల్లాస్థాయి

బహుమతినందుకోవడంతో పాటు హైదరాబాద్ హిందీ విశ్వవిద్యాలయంలో ప్రదర్శింపబడింది వందేమాతరం, 1977 సరస్వతీ శిశుమందిర్ ఆచార్య శిబిరం వార్షిక సంచికలో ముద్రణ పొందింది

హైమవతి గారు 1970 86 మధ్య రచించిన ఈ నవనాటికలు సెకండరీ పాఠశాలల బాలబాలికలకు ప్రదర్శన యోగ్యాలు - నీతి ప్రబోధకాలు

**11 రాస భూమయ్య - బి ఏ ఎకిన్‌పూర్ మం కోరుట్ల జ. 25-8-1963**

రాస భూమయ్య గారు స్వగ్రామంలో ఒక ప్రైవేటు పాఠశాల నడుపుకుంటున్నారు వీరు అంబేద్కర్ యువజన సంఘం మండల జాయింట్ కన్వీనర్ ప్రగతి శీల భావాలు కల ఈ యువకుడు కొన్ని పాటలు నాటికలు వ్రాశారు వీరి నాటిక విద్య ఎవరి సొత్తు? 1991లో ముద్రితం ఇంటర్ విద్యార్థిగా కవి ఇరవై పుటల్లో వ్రాసిన ఈ నాటిక 'ప్రారంభ రచన'గా ఉన్నా బోయి భీమన్న గారి 'పాలేరు' నాటకం వలె దళితజన విద్యావికాసాలు ఆశయంగా ఉన్నతాదర్శంతో ఉన్నది జాతి వివక్ష లేకుండా విద్య అందరికి ప్రయోజనకారి అని ఈ రచయిత సందేశం

**12 జి. రాజేంద్ర - బి ఏ కవి**

కథా రచయిత అయిన రాజేంద్రగారి రేడియో ప్రసారనాటికలు 95లో ఒక సంపుటిగా వచ్చాయి అవి అన్నీ చక్కని సంవిధానం జనప్రయోజనం కలవిగా ఉన్నాయి నాటికా సంపుటి పేరు "నిజాయితీకి నీరాజనం"

ఈ జిల్లా రచయితల నాటికలు కొన్ని ఎన్నో ప్రదర్శనలందుకొని ప్రశంసలుపొందినా, ఇతర జిల్లాల పోటీలకు వెళ్లి ఉత్తమరచనలుగా ప్రదర్శనలు పొంది ప్రశంసలందుకున్నా సంపుటాలుగా వెలువడలేదు అయా రచయితల పేర్లు మాత్రం చూపబడుతున్నవి

1 కీ శే కాకుత్థం లక్ష్మీపతి - జగిత్యాల, 2 తిరుపతిరావు బి ఓ ఎల్ వేగురుపల్లి, 3 కందాడై చిక్కుడుకాయల రంగాచార్యులు - విద్వాన్, వేదాంత శిరోమణి, బండలింగాపురం, 4 కానుగుల వెంకటరెడ్డి, వి డి ఓ హుజూరాబాద్, వీరు వ్యవసాయ శాఖోద్యోగి, కవి, 5 మలయశ్రీ - చంజర్ల, 6 డి ఆర్ కె రంగారావు, బి ఏ బి ఇడి ధర్మపురి, 7 మల్లావజ్జల రామచంద్రశర్మ - బి ఏ ఎల్ పెద్దపల్లి, 8 బి రాజరెడ్డి, బి ఏ, బి ఇడి - సాయంపేట 9 రావుల పుల్లా చారి - బి ఏ హుజూరాబాద్, 10 రాయ్‌బాల ప్రసాద్ బి ఏ బి ఇడి పెద్దపల్లి, 11 డా డింగరి నరహరి ఆచార్య మల్లారం, 12 ఆర్ పుల్లయ్య, ఎం ఏ, బి ఇడి వేములవాడ, 13 గోలి పద్మారెడ్డి, ఎం ఏ (ప్రిన్స్‌పాల్) కరీంనగర్, 14 రజనిశ్రీ, ఎం ఏ, బి ఇడి హుస్నాబాద్, 15 శ్రీరాముల సత్యనారాయణ బి ఏ, కరీంనగర్, 16 సుద్దాల అశోక్ - ఎం ఏ, బి ఇడి మేడిపల్లి, 17 కొక్కుల భాస్కర్, బి ఏ - కరీంనగర్, 18 ఈశ్వర గారి నరహరి శర్మ - వేములవాడ, 19 'సిద్ధార్థ' సత్యనారాయణ మెట్టుపల్లి, 20 ఆర్ మనోహరరావు, ఎం ఎస్సి, బి ఇడి రాఘవపేట, 21 వేణుశ్రీ ఎన్ వేణుగోపాలాచారి, బి ఓ ఎల్ కోట్ల, 22 ఎఱ్ఱమరాజు సత్యనారాయణ రాజు - గర్రెపల్లి, 23 పంజాల నారాయణ - టీచర్ - హుజూరాబాద్, 24 కేతిరి సుధాకర్ రెడ్డి - జూపాక

వీరిలో పలువురు నాలుగైదు నాటికలు వ్రాసినవారు పద్య గేయ కవులు సగం మంది రచయితలు ఇంచుమించు పదిహేనేండ్లకు పూర్వమే నాటికా రచయితలు 14 ఈ పదేండ్ల కాలంలో నాటికలు వ్రాస్తూ ప్రదర్శిస్తూ ముద్రించని వీరిలో కొందరినైనా లబ్ధ ప్రతిష్ఠుల పేర్కొనడం తప్పనిసరి

1 శ్రీరాముల సత్యనారాయణ - ప్రభుత్వోద్యోగి వీరి కాల చక్రం, పామరులు మొదలైన నాటికలు కరీంనగర్ కళాభారతిలో ప్రదర్శింపబడి బహుమతులందుకున్నాయి ఇతర ప్రాంతాల పోటీల్లోనూ పాల్గొన్నాయి కొన్ని బహుమతులందుకున్నాయి వీరి 'పామరులు' నాటిక ఆధారంగా

ప్రముఖ దర్శకులు బి ఎస్ నారాయణగారు కరీంనగర్ 'మార్గదర్శి చలనచిత్రం రూపొందించారు



2 రజనిశ్రీ - హుస్నాబాద్, అధ్యాపకులు వీరు స్త్రీ పాత్ర పోషణ, నాట్యంలో దిట్ట సమాజం మారాలి, నాకు చదువొచ్చింది మొదలైన నాటికలు వ్రాసి దర్శకత్వం వహించి ఈ జిల్లాలోనే కాక పొరుగు జిల్లాల్లోనూ పలుప్రదర్శనలిచ్చారు

3 కొక్కుల భాస్కర్ - మెట్‌పల్లి, కరీంనగర్ చలనచిత్రాల కథ స్క్రీన్‌ప్లేలు వ్రాసి జిల్లాలో చిత్రీకరణ ఆరంభించి మధ్య నిలిపివేశారు

4 సుద్దాల అశోక్ - సినిమా పాటలు రాస్తూ రాణిస్తున్నారు

5 సిద్ధార్థ - 'అఆఇఈ' నాటిక 1991 జిల్లా వయోజన విద్యా ప్రచార కార్యక్రమంలో భాగంగా శతాధిక ప్రదర్శనలు పొంది అభినందనలందుకొన్నది

ఇంకా ఎందరో ఉత్తమ నాటికా రచయితలు పైవారిలో ఉన్నా విధిలేని పరిస్థితులో వారి నాటికలు వివరాలు అందించలేక చింతిస్తున్నాను అవి అముద్రితాలనేకాక ముఖ్యంగా స్థలాభావం అందుకు కారణం

## పాద పీఠికలు

1 ప్రఖ్యాత స్త్వితరోవా నాటి సంజ్ఞాశ్రిత కావ్యే
స్త్రీ ప్రాయా చతురజ్కా లలితాభినయాత్మికా చైవ సువిహితాంగీ
భరతముని నాట్యశాస్త్రం' అధ్యాయం 8, శ్లో 109, 10

2 "తత్రవస్తు ప్రకరణాన్నాటకా న్నాయకో నృప 3 4 శ్లో
ప్రఖ్యాతో ధీరలలిత శృంగారోంగే సలక్షణ
స్త్రీ ప్రాయ చతురంకాది భేదకం యది చేష్యతే ॥ 44 దశరూపకమ్

3 ఏక ద్వ్యత్ర్యంక పాత్రాది భేదే నానంత రూపకా 45 శ్లో
కైశిక్యం గైశ్చతుర్భిశ్చ యుక్తాంకైరివ నాటికా ॥ -48 - దశరూపకమ్

4 ఈ వివరాలు ధనంజయుని దశరూపకానికి సరిపెల్లి విశ్వనాథశాస్త్రి గారి వ్యాఖ్యానం 1967 పు 49 50

5 డా తిరుమల శ్రీనివాసాచార్యుల తెలుగులో గేయనాటికలు 1988 పు 6

6 మహతి 1972లోని శశాంక గారి సంగీత రూపకాలు - యక్షగానాలు'

7 డా తిరుమల శ్రీనివాసాచార్య 'నారాయణరెడ్డి సాహితీమూర్తి - 1981 పు 245

8 డా తిరుమల శ్రీనివాసాచార్య నారాయణరెడ్డి సాహితీమూర్తి - 1981 పు 246

9 ఈ నాటికా ప్రదర్శన వివరాలు డా తిరుమల శ్రీనివాసాచార్య గారికి కీ శే డా ఇరివెంటి కృష్ణమూర్తి గారు తెలిపినవి

10 తెలుగులో బహుళ ప్రదర్శనలందిన, పలువురిచే రచింప-నటింపబడిన దుర్యోధన మయసభ, భార్గవరామ రావణబ్రహ్మ, చాణక్య, అల్లూరి సీతారామరాజు మొ॥ ఏకపాత్రాభినయాలు సాహితీకళా ప్రియులకు సుపరిచితాలు

11 భారతదేశానికి 15 ఆగస్టు 1947 నాడు స్వాతంత్ర్యం లభించింది హైద్రాబాద్ సంస్థానం నిజాం స్వతంత్ర భారతంలో చేరక, మొండికెత్తారు ఏడాదికాలం ముస్లిం రజాకార్ల దుండగాలు తెలంగాణా వీరుల విముక్తి, గెరిల్లా పోరాటాలుసాగాయి చివరికి కేంద్రం జోక్యంతో వల్లభబాయిపటేల్ సైనికచర్యతో 17-9-48 నాడు నిజాం లొంగి హైద్రాబాద్ విముక్తి పొందింది

12 శ్రీరామ బుక్ డిపో - విజయవాడ -2 వారి ప్రచురణ 1989

13 సమైక్య సాహితివారు కరీంనగర్ కళాభారతి భవనంలో ఏర్పరచిన ఈ గ్రంథ అంకితోత్సవ సభలో పుస్తక ఆవిష్కర్తగా నేను పాల్గొన్నాను

14 వీరి పేర్లు నాటికల వివరాలు 1981 నాటి నా 'కరీంనగర్ జిల్లా రచయితల చరిత్ర' లోనివి

## గేయ నాటికలు

గేయ నాటికలకు మూలం తెలుగు వారి ప్రాచీన రూపకాలైన యక్షగానాలు జక్కుల నృత్యగానాలు అయినా అధునిక గేయ రూపకాలు చాల వరకు ఆంగ్ల సాహిత్యంలోని ఒపెరా' ల నుండి స్ఫూర్తి పొందాయి కన్నడ ఫార్సీ ఇతర భాషా రూపకాలను కూడా అనుసరించాయి [1]

ప్రేరణ ఏదైనా ఈ కాలంలో గేయనాటిక స్పృశించని అంశం లేదు పౌరాణిక, చారిత్రక కళా సాహిత్య, రాజకీయాది సామాజిక అంశాలన్నీ గేయ నాటికలకు కథా వస్తువులే అయినాయి పశుపక్షులతో కూడిన నీతికథలు, అద్భుత విషయాలతో కూడిన జానపద గాథలు, సంగీత నృత్య గేయ రూపకాలుగా విద్యార్థులను చాల ఆకట్టుకొంటున్నాయి తెలుగు గేయనాటికల రచన ఈ ఇరువదవ శతాబ్ది తొలిపాదంలో 1920 30 మధ్యకాలంలో ఆరంభమైంది [2] ఇవి మొదట పద్య గేయ మిశ్రితంగానూ వచ్చాయి అటువంటి రచనలు కరీంనగర్ జిల్లాలో లేవు సంపూర్ణ గేయ నాటికలు మాత్రమే ఇక్కడి కవులు రచించారు కొన్నింటిలో ఇతర ప్రాంతాలలో వలె మితంగానైనా వచనాలున్నవి

డా సి నారాయణరెడ్డి గారు గేయనాటికా రచనలో ఉన్నత శిఖరాలనధిరోహించారు వారి మార్గంలో ఈ జిల్లాలో ఓ పది మంది కవులు గేయనాటికలు రచించి ప్రచురించారు వీరిలో ఏ ముగ్గురు నలుగురివో తప్ప మిగతా వారి పుస్తకాలు కారణాలేవైనా జిల్లా దాటి వ్యాప్తి కాలేదు

మరో విశేషం - 'తెలుగు గేయనాటికలు అనే అంశం మీద రాష్ట్ర స్థాయిలో సమగ్ర పరిశోధన కావించి పిహెచ్ డి సిద్ధాంత గ్రంతం రచించిన డా తిరుమల శ్రీనివాసాచార్యులది కరీంనగర్ జిల్లా

ఆట-పాట అంటే ఆనందించని దెవరు? యక్షగానాలు అంతరించి పోయినా నాటకాలు తెరమరుగవుతున్నా, నాటికలు - గేయనాటికలు మాత్రం జనాదరణ పొందుతునే ఉన్నవి నాటికల కన్నా గేయనాటికల ప్రదర్శన కొంత కష్టంతో కూడుకున్న కళ వీటికి నృత్య సంగీతాలు మితంగానైనా అవసరం అందుకే కదా వీటికి 'సంగీత నృత్యగేయ రూపకాలు అని పండిత జన వ్యవహారం స్వయంగా ప్రదర్శించేవాళ్లు తమ అవసరం కోసం, ప్రదర్శించలేకున్నా ప్రదర్శకులకోసం ఈ గేయ నాటికలు రచింపబడుతున్నవి పత్రికా ప్రచురణ రేడియో టి వి ల ప్రసారాలు గేయనాటికలకు కొంతైనా ప్రోత్సాహాన్నిస్తున్నవి కరీంనగర్ జిల్లా కవులకు గేయనాటికా రచనలో సముచితమైన స్థానం ఉంది, లభించింది ఈ జిల్లా గేయనాటికా కర్తలు వీరు -

| | | |
|---|---|---|
| 1 డా సి నారాయణరెడ్డి | 2 జి రాములు | 3 డా జె బాపురెడ్డి |
| 4 వడ్డేపల్లి కృష్ణ | 5 సామ లక్ష్మారెడ్డి | 6 ఎస్ వేంకటాద్రి |
| 7 ఇమ్మడోజు భద్రయ్య | 8 బైరి నరసయ్య | 9 కందుల మల్లికార్జున్ |

ఇక వీరి రచనల వివరాలు చూడండి

**1 డా సి నారాయణరెడ్డి** - వీరి పరిచయం చేయబడింది 1920-30 కాలం నుండే ఆధునికగేయనాటికల రచన ఆరంభమైంది "1947కు ముందు తెలుగులోగేయ నృత్యనాటికలు ఎన్నో వచ్చాయి 1947 తర్వాత గేయనాటికా కర్తలలో చెప్పుకోదగినవాడు సి నారాయణరెడ్డి ఆయన నవ్విన పువ్వు, రామప్ప వంటివి సరళములై ప్రదర్శనకు కూడా ఎంతో తగి ఉన్న రచనలు "[3]

సి నా రె గారి గేయనాటికా సంపుటాలు -

1 నవ్వనిపువ్వు - 1953 2 అజంతా సుందరి - 1955

3 వెన్నెలవాడ - 1959 4 తరతరాల తెలుగు వెలుగు - 1975

**1 నవ్వని పువ్వు** - ఇది నారాయణరెడ్డి గారి ముద్రిత కృతులలో రెండవది గేయనాటికలలో మొదటిది కవి గారికిది చేకూర్చింది అద్వితీయకీర్తి, దీనిలోని గేయనాటికలు నాలుగు అవి, నవ్వని పువ్వు, వలపులరేడు, దగ్ధశాంతి భిన్న స్వరాలు

నవ్వని పువ్వు మధుపం గంధవహుడు, మొగ్గ పువ్వు తీగ పాత్రలుగా నడచిన ఈ గేయనాటిక ఆకాశవాణి ప్రసారంతో రంగస్థల ప్రదర్శనలతో, కవిగారి స్వీయ గానాలతో అధిక వ్యాప్తి పొందింది

మచ్చుకు ఇందలి కొన్ని గేయపంక్తులు

చివురుటాకులలోన, రవల రేకులలోన/ మంచుముత్యాలుంచి మంచి మధువుల నించి
ఉదయ భానుకరాల, సుధలు జారేవేళ/ ప్రకృతి లక్ష్మీ దివ్య, పాద పూజలు చేసి
ఎన్ని నోములు నోచి, ఎన్ని బాములు సైచి/ నిను గనె నీతల్లి, నిండు మమతల వెల్లి

"నాలుగు పాత్రల మధ్య నలిగిపోకుండా జాగ్రత్తగా మొగ్గను కాపాడి నవ్వని పువ్వును సార్థకం చేసినాడు ఈ నాటికలో కవి పాత్ర ప్రబోధానికి ప్రతీకాత్మకంగా కల్పించబడింది' [4]

ఈ రూపకంలోని మొగ్గ 'ముగ్ధ' కన్యా జీవితానికి ప్రతీక

వలపుల రేడు రేయి కలువ, భావన సవతుల పోరాటం, ప్రియుని స్వంతం చేసుకునే ఆరాటం ఈ నాటికలోని ఇతివృత్తం ఇది సరస శృంగార శ్రవణ గేయ నాటిక

దగ్ధశాంతి - శాంతి, మానవుడు, దానవత, అపరిచిత కంఠాలు పాత్రలుగా సాగిన నాటిక "శాంతిని నిర్మూలించే దానవ శక్తుల విజృంభణాన్ని మానవుడెదుర్కొనలేని వివత్కర పరిస్థితి ఈ నాటికలోని ఇతివృత్తం' డా తిరుమల శ్రీనివాసాచార్య

సమర ఘోష సమర ఘోష, దానవతా వికటహేష
చీకటి గుండెల జ్వలియించే కోష్ణ రుధిర పిపాస
దారుణ సామ్రాజ్యాంధుల, ఆరని మారణ దురాశ లను

నిరసిస్తూ కవి గారు ఈ నాటికలో విశ్వశాంతిని కోరుకున్నారు

భిన్నస్వరాలు - ఇందలి పాత్రలు - కళాజీవి, ప్రణయిని, అనాథ, లోకం

ఒక కళా జీవి క్షణికాలైన అల్పకామినీ సుఖాల నాశింపక 'శ్రమజీవుల మ్రోడు బ్రతుకులను' చిత్రించడమే తన కళాప్రయోజనమని గ్రహించి అందుకు పూనుకోవడమే ఈ నాటిక కథ

**2 అజంతా సుందరి** ఇది అజంతాసుందరి, సుగాత్రి, ఋతువుల రాణి అను మూడు నాటికల సంపుటి

అజంతా సుందరి - శిల్పి, శైల బాల రెండే పాత్రలు ఒక శిల్పికి తాను శిల్పించిన ప్రతిమా సుందరి స్వప్నంలో సాక్షాత్కరించగా మోహపరవశుడుకాగా ఆమె కళా పారమ్య ప్రబోధం కావించి అతనికి అందకుండా పోవడం ఈ కాల్పనిక నాటికా కథ నిస్వార్థ కళాసేవ రచయిత ప్రబోధం

సుగాత్రి - పింగళి సూరనగారి కళా పూర్ణోదయ కావ్యంలోని ఓ ముగ్ధనాయిక ఇది మూల కథా విధేయంగా సాగిన ప్రణయగాథా రూపకం ప్రతిరచనలోనూ ఏదో ఓ చక్కని సందేశం అందించడం రెడ్డి గారి కవనానికున్న సుగుణం ఈ కావ్యంలోని నీతి ఇది

కాముకులు పరియింప, గా లేని కావ్యము, సహజ సౌందర్యమే, సర్వదా సేవ్యమ్ము

ఋతువుల రాణి - వసంత వర్ణన తర్వాత సినారె రచించిన 'ఋతు చక్రం' గేయ కావ్యానికిది బీజం తన ప్రేయసి వసంతాన్ని మాధవుడు శిశిరం నుండి కాపాడుకోవడం ఇందలి కథ

**3 వెన్నెలవాడ** - ఈ సంపుటిలో గతంలో ముద్రణ పొందిన నవ్వని పువ్వు, అజంతా సుందరి రెండు నాటికలతోపాటు మరి అయిదు నాటికలు - వెన్నలవాడ, దివ్వెల సంగీతం, సంక్రాంతి, గోకులవిహారం, మనిషి యంత్రం ఉన్నాయి

వెన్నెలవాడ - సి నా రె గేయనాటికల్లో నవ్వనిపువ్వు వలెనే బహుళ ప్రచారం పొందిన నాటిక వెన్నెలవాడ కలువలు, కలువరాణి, చంద్రుడు పాత్రలు మేఘుడు ప్రతినాయకుడు ఇది ప్రణయ శృంగార గాథ

దివ్వెల సంగీతం - ప్రియుడు, ప్రేయసి, తారలు, మట్టి దివ్వెలు ఇందలిపాత్రలు మంటి దీపాల, మింటి దీపాల దీపావళి 'పోటీ తగాదాల్లో ప్రబోధిస్తూ కవి ప్రేయసీ ప్రియుల యౌవన మన్మధరాగ దీపమాలను వెలిగిస్తూ కథను ముగించారు ఇందలి కవి సందేశం

ఆకాశమే అమావాస్య, చుక్కలే దివ్వియలు /ఆకృతులే వేరు వేరు, ఆత్మమాత్రమొక్కటే

సంక్రాంతి - సంప్రదాయ పర్వదిన సంరంభాల చిత్రణ

గోకుల విహారం - ఇది వ్రేపల్లె బృందావన బాలకృష్ణలీలలు

మనిషి - యంత్రం - దగ్ధశాంతిలో విశ్వశాంతిని ప్రబోధించినట్లే రెడ్డి గారు ఈ నాటికలో యాంత్రిక పురోగతిని అభినందిస్తూ మనిషి యంత్రానికి బానిస కాకూడదనే సందేశాన్ని అందించారు వీరి గేయనాటికల్లో కొన్నింటిలో వచనాలున్నా ఈ ఒక్క దానిలోనే వచన కవితా పంక్తులున్నవి

**4 తరతరాల తెలుగు తెలుగు** - ఇది 1975 ఉగాది ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా హైదరాబాద్ లాల్‌బహదూర్ స్టేడియం సాంస్కృతిక కళా ప్రాంగణంలో ప్రదర్శనార్థం ప్రత్యేకంగా రచింపబడిన నృత్యగేయనాటిక ఈ రచనకు ప్రేరణ-విద్యామంత్రి మండలి వేంకట కృష్ణారావు, సంగీతం, పి రాధాకృష్ణ, నృత్యం - నటరాజు రామకృష్ణ గారలు శంకరం బాడి సుందరాచారి గారి 'మా తెలుగు తల్లికి మల్లెపూదండ' పాట వలె ఈ రూపకం ఆంధ్రదేశ సంస్కృతిని స్మరించింది ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి గారి 'ఆంధ్రపురాణము' లోవలె తెలుగునాటి వివిధ చారిత్రక ఘట్టాల స్పృశిస్తూ సాగింది

ఇదే ఇదే తెలుగు నేల / నవ కాంతుల వెదజల్లు దీపమాల -

''ఈ వేళ సినిమారంగంలో అగ్రశ్రేణికి చెందిన ఆర్టిస్టుగా వన్నెకు రావడానికి నారాయణరెడ్డి వెనుక వ్రాసిన సంగీత రూపకాలే తగిన సాధన సంపత్తిని కూర్చి పెట్టినవని నిస్సందేహంగా చెప్పవచ్చు'' - శ్రీ శశాంక [5]

నారాయణరెడ్డి గారు రంగస్థల నాటకాలు వ్రాయలేదు వీరు ఆకాశవాణి ప్రసారాల కోసం రచించిన గేయనాటికలు - నాటికలు అటు శ్రవ్యనాటికలుగానూ ఇటు రంగస్థల నాటికలుగానూ చక్కగా రాణించాయి

**2 జి రాములు** - సిరిసిల్ల,రిటైర్డ్ అధ్యాపకులు (పరిచయం నవలా రచయితలలో ఉంది) మూడు నవలలు,బాలనీతి పద్యాలు గాంధీసూక్తులు పుస్తకాలుగా ప్రచురించిన జి రాములుగారు సంగీత గేయ రూపకం 'శాంతి పథము' 1958లో వెలువడింది పు 14

అశాంతిలోకము, ధనిక వర్గము, వైజ్ఞానికుడు, త్రిమూర్తులు, భారతమాత పాత్రలుగా గల ఈ గేయనాటికలో విశ్వశాంతి ఆకాంక్షించబడింది

అధికారులయొక - అవినీతులకున్
దోపిడి వర్గపు దోపిడీలకు
గురియై దు ఖము - కెరయైభువిలో
నలిగి పోయి నరకాన దొరలుతు
సుఖ మనుదానికి - ముఖమెట్లుందో -

దేశంలో మూడు వంతుల ప్రజలు ఆకలితో బాధపడుతున్నారని వేదనతో ఆరంభించి, దోపిడిదొంగల, యుద్ధోన్మాదుల రూపుమాపి శాంతిసౌఖ్యాలను స్థాపించండి అని ముగించారు

3 డా జె బాపురెడ్డి - పరిచయం పద్య గేయ కవుల్లో ఉంది

బాపురెడ్డి గారు పలు గేయనాటికలు రచించారు ఇంచుమించు అవన్నీ ఆకాశవాణి ద్వారా ప్రసారమైనాయి రెడ్డిగారి గేయనాటికా సంపుటాలు రెండు

1 రాకెట్టు రాయబారం - 1960 రచన, 66లో పుస్తక రూపం ధరించింది

2 బాపురెడ్డి గేయనాటికలు - 1970, 73, 86 మూడు ముద్రణలు పొందింది

పద్యాలు వచన కవితలు రచించిన బాపురెడ్డి గారు పలు లలిత గేయాలు సంగీత గేయనాటికలు కూడా రచించారు

"గేయ నాటికలు ఇటీవల చాలకాలంగా చాలా మంది రాస్తున్నారు శివశంకర శాస్త్రి తర్వాత దీన్ని బాగా సాధనచేసింది నారాయణరెడ్డి గారు ఆయన ఆ ప్రక్రియను చాలాకాలం క్రిందటనే వదలి వేసినట్లుంది దాన్ని మళ్లీ చేపట్టిన గౌరవం బాపురెడ్డిదే అని చెప్పవచ్చు" అన్నారు డా చేకూరి రామారావు గారు 'బాపురెడ్డి గేయనాటికలు పీఠికలో 1986 మూ ముద్రణ పు 14

కరీంనగర్ జిల్లాలో గేయనాటికల రచన డా సి నారాయణరెడ్డిగారిచే 1953లో ఆరంభమైంది 1959 తర్వాత వారి గేయ నాటికా రచన-ప్రచురణ లేదు [6] 1960లో జె బాపురెడ్డి గారి రాకెట్టు రాయబారం, 1964లో 'ఋతురాగం' వచ్చాయి అంటే నారాయణరెడ్డి గారు ఆపిన గేయనాటికా ప్రక్రియ బాపురెడ్డి గారు అందుకొని ముందుకు నడిపించారని చెప్పవచ్చు

1970లో 'బాపురెడ్డి గేయనాటికలు' సంపుటం వెలువడింది ఇది విస్తృత రూపం పొందుతూ 1973, 1986లో ద్వితీయ తృతీయ ముద్రణలకు నోచుకున్నది ఈ పుస్తకం సినీ నటులు గుమ్మడి వేంకటేశ్వరరావు గారికి 1970లో అంకితం చేశారు మొదటి ముద్రణలో మొదటి రాకెట్టు రాయబారం చేర్చారు మూడవ ముద్రణలో 1970 మొదటి ముద్రణ కంటే నాటికలు పెరిగాయి [7] 1986 ప్రతిలోని నాటికలు 14

ఈ నాటికల పేర్లివి 1 ఋతురాగం, 2 సాగర సౌధం, 3 భావిజీవులు, 4 విజయహేళ, 5 కళ్యాణయాత్ర, 6 రాకెట్టు రాయబారం, 7 చాచా నెహ్రూ, 8 ఎన్ జి వో 9 పిల్లల మంత్రితో ఇంటర్వ్యూ, 10 చేతనా కేతనం, 11 తక్కువే ఎక్కువ, 12 ప్రజావిజయం, 13 స్వాతంత్ర్యహేల, 14 సకల జన సంక్రాంతి

రాకెట్టు రాయబారం - 1950-60 మధ్య కాలంలో రష్యా అమెరికా వారల రాకెట్ల అంతరిక్ష సంచారం మొదలైంది 1969లో అమెరికా వారి అపోలో - 8 సోమనౌక చంద్రునిపై తొలిసారిగా మానవుని దించింది

బాపురెడ్డి గారు 1960లో ఈ రాకెట్టు రాయబారం నాటికను రచించారు రాకెట్టు - చంద్రకాంత ఇందలి పాత్రలు చంద్రగోళాన్ని చంద్రుడుగా భారతీయ సంప్రదాయంతో కాక, స్త్రీ మూర్తిగా భావించడం రెడ్డి గారి పాశ్చాత్యభావానుసరణం రాకెట్టు - చంద్రకాంత సంభాషణలే ఈ నాటిక ఈ నెపంగా కవి మానవుని ప్రకృతి విజయాలను వర్ణించారు అంతేకాక భారత ప్రజాస్వామ్య ప్రభుత్వాన్నీ అభినుతించారు

ఋతురాగం - డా సి నా రె గారి ఋతువులరాణి నాటికలో శిశిరవసంతాల ఘర్షణ, బాపురెడ్డి గారి ఈ నాటికలో షడృతువులూ పరస్పరం మాత్సర్యంతో ఆత్మస్తుతి పరనిందలతో కలహించుకోగా కాలపురుషుడు వారిని సమాధానపరచి అందరూ సమానమే అని చెప్పి ఏలుకుంటాడు

"లోకమునకు మీరందరు, ఏకరీతి ప్రియతములు
నా అనంత జీవన, గంగా చలత్తరంగాలు!" - పు 13

భావి జీవులు తక్కువే ఎక్కువ ఇవి కుటుంబ నియంత్రణ సందేశ నాటికలు, విజయహేల సకల జన సంక్రాంతి సంప్రదాయాన్నాదరించి ఎన్నుకోవలసింది, దేశ భావ్యభివృద్ధిని అని కవి వాణి

చేతనాకేతనం - మన ప్రధాని ఇందిరా గాంధి గారి 20 సూత్రాల ప్రగతి వర్ణన స్వాతంత్ర్య హేల 'అందరూ త్రికరణశుద్ధితో కలిసిపనిచేస్తే ఈ దేశ భవిష్యత్తు సముజ్జ్వల రూపం దిద్దుకుంటుంది అనే భావన ప్రజలలో కలిగించడమే ఈ రూపక లక్ష్యం" కవి ముందుమాట - పు 126 ప్రజా విజయం - దుష్టశక్తుల మట్టుపెట్టి దేశ ప్రగతి సాధించుకోవాలని కవి సందేశం ఇందులో ప్రజాశక్తికి పట్టంకట్టారు కవి

పిల్లల మర్రితో ఇంటర్వ్యూ - మహబూబ్‌నగర్‌కు రెండుమైళ్ల దూరంలో ఉన్న 450 సం పూర్వపు వటవృక్షంతో కవి సంభాషించిన వచన కవితా నాటిక

ఎన్ జి ఓ గుమస్తా ఆఫీసర్, గుమాస్తా భార్య పిల్లలు పాత్రలుగా ఓ సామాన్యోద్యోగి జీవిత స్థితిగతి వర్ణన

చాచా నెహ్రూ - ఆ నేత పుట్టిన రోజు పండుగ జవాహర్, పిల్లలు, గులాబీలు ఇందలి పాత్రలు

దేశ సమస్యల పరామర్శ, దేశాభివృద్ధి ఆకాంక్ష - ప్రశంస ఇందలి కథ

గులాబి - మాల పల్లి, మహాఢిల్లి ప్రణాళిక పథకామతల్లి

మార్పు చక్రము ఎంత లోగన, మాయలేమి మాయలే - పు 78

బాల బాలికలు రాల జూచి - మేము కంట కాల జూచి బెదరమండి

పథ మె ంతటి కఠినమైన, ప్రగతి యాత్ర మానమండి పు 79

బాధ్యతకల ఉన్నత ప్రభుత్వోద్యోగిగా అభ్యుదయ భావాల కవిగా ప్రజల సంక్షేమ కాంక్షిగా ప్రభుత్వ పథకాల ప్రచార సాధనం గానూ పరిపూర్ణ దేశభక్తితో బాపురెడ్డి గారి రచనలు వెలువడ్డాయి సంస్కృతి ప్రేమతో పర్వదినాలు, సరదా కోసం ప్రణయవృత్తాలు అదనంగా వచ్చాయి భావుకుడైన కవికి కాదేదీ కవిత కనర్హం కదా! వీరి గేయనాటికలో 'సాగరసౌధం' నాటికను 1975 ప్రపంచ తెలుగు మహాసభలో ప్రదర్శించిన 'గౌతమ బాలవిహార' నాగార్జునసాగర్ కళాకారులు భారత దేశమంతటా ఉత్తమ కళాఖండంగా దాన్ని ప్రదర్శిస్తూ ఉన్నారు [8] వీరి ఢిల్లీ ప్రదర్శనను చూసి 'దిటైమ్స్ ఆఫ్ ఇండియా' ఆంగ్లదిన పత్రిన బహుధా ప్రశంసించింది [9] 'ఋతురాగం' విశాఖ 'డిక్కి' సంగీత నేతృత్వంలో దేశవిదేశ ప్రేక్షకుల సమక్షంలో తిరుపతిలో ప్రదర్శింపబడి అభినందనలందుకొన్నది బాపురెడ్డి గారి ఈ గేయనాటికలు మాన్య ప్రజానాయకులకు, సామాన్య ప్రజలకు, సాహిత్యాభిమానులకు, ఆపాతమధురాలు - ఆలోచనామృతాలు అవి స్మరణీయాలు!

4 వడ్డేపల్లి కృష్ణ ఎం ఏ, సిరిసిల్ల

కృష్ణ గారి పరిచయం గేయకవుల విభాగంలో చేయబడింది వీరి గేయనాటికల సంపుటి 'వెలుగు మేడ 1976లో వచ్చింది ఇందులో వంద పుటల్లో తొమ్మిది నాటికలున్నాయి

గడ్డిపువ్వు, మూడుపువ్వులారుకాయలు, కవి కల్యాణం, కన్య - కట్నం, పూలకన్నెలు, ప్రణయోద్వేలము, వెలుగు, శాంతి సందేశం ఇందలి నాటికలు

నారాయణరెడ్డి గేయకవితా మార్గంలో బాపురెడ్డి గారి గేయనాటికలకు వారసుడుగా వడ్డేపల్లి కృష్ణ గారి నాటికలు వచ్చాయి ఈ నాటికలు కొన్ని రేడియో - ఆకాశవాణి దూరదర్శన్ హైద్రాబాద్ కేంద్రాల నుండి ప్రసారమైనాయి ఈ మధ్య 19 7 94 నాడు కృష్ణ గారి 'అండదండ'

సంగీతగేయ నృత్యనాటిక హైద్రాబాద్ టి వి కేంద్రం ప్రసారం చేసింది (అప్పటికి జెమిని ఇ టి వి లు లేవు)

గడ్డిపువ్వు, పూలకన్నెలు, ప్రణయోద్వేలము - ప్రకృతి పరమైన ప్రణయభావ గేయనాటికలు

కన్య-కట్నం, వరకట్న నిషేధ సత్సందేశ విషాదాంత నాటిక

మూడు పువ్వులారుకాయలు కుటుంబ నియంత్రణ అవశ్యకతలను ప్రబోధించేది

వెలుగు మేడ - ఈసు, సోమరి తనాల ధిక్కరించి 'స్వేయం ధర్మం నాలుగు గోడలుగ నిత్య జీవనం సత్యశాంతులుగ" కవి ఈ కవితాకాంతి సౌధ రూపక నిర్మాణం కావించి, గుణ విరోధుల తనదారికి మళ్లించారు

శాంతి సందేశం లోని పాత్రలు - భరతమాత, బాపూజి బాలలు, నాయకులు వేదాలు కాలేజీ విద్యార్థులు, మరో యువకవి ఇందులో సాంఘిక రాజకీయ సమస్యల పరిష్కారానికి గాంధీజీ మార్గమే శరణ్యమని కవి అందించిన సందేశం

కవికల్యాణం - ఋతువర్ణన కవి ఒక యువతి, ఆరుగురు ఋతుకన్యలు ఇందలి పాత్రలు కవి మానవ కన్యను పెళ్లాడక ప్రకృతి కాంతను తన కవన గానంతో వశీకరించుకొని ఆమె పుత్రికలైన ఋతుకన్యల చూసి శిశిర వసంతకాంతల పెళ్లాడుట కథ ఈ నాటికపై బాపురెడ్డిగారి ఋతురాగం' ప్రభావం ప్రసరించింది 'వడ్డేపల్లి కృష్ణ గారు కథను ప్రతిభావంతులుగా కల్పనా సుందరంగా నిర్మించి ఈకవి కళ్యాణము సంతరించినారు ' డా తిరుమల శ్రీనివాసాచార్య (తె గేయనాటకాలు, పు 290)

పూలకన్నెలు ఈ నాటికకు కరుణశ్రీ గారి 'పుష్పవిలాపం' కవిత మూలం వడ్డేపల్లి కృష్ణవన్నీ సాంఘిక నాటికలు, అది ప్రణయవృత్తాంతమైనా మరే వృత్తమైనా హితోపదేశం దేశాభ్యుదయాకాంక్ష వాటి అంతస్సూత్రాలు ప్రణయోద్వేలంలో - అన్నారీ విధంగా

"హద్దులు మీరక, బుద్ధులు వీడక / అంతా మసలిన, ఎంతో క్షేమం / లేకుంటే చెల రేగును ధూమం!

గడ్డిపువ్వులో 'కులవర్గాదుల కంటే గుణం ప్రధానం' అని రూపానికంటె హృదయానికి ప్రధాన్యత నిచ్చారు

5 సామలక్ష్మారెడ్డి - నారాయణపురం - అధ్యాపకులు

లక్ష్మారెడ్డిగారు కవి, నటులు గ్రామీణ స్త్రీ వేషధారణతో గడుసు నటన ప్రదర్శించేవారు

వీరి నాటికల సంపుటి 'కల్లువల్ల ఇల్లు గుల్ల' 1980లో మొదటిది మాత్రమే వచన నాటిక తక్కిన మూడు గేయనాటికలు అవి రైతేరాజు, సింహం కుందేలు, అత్తాకోడళ్లు

రైతే రాజులో కవి తాము పుట్టిన కర్షకజాతి కష్టసుఖాలను, సేద్యం పని పాటలను పదిగేయాల్లో చక్కగా వర్ణించారు దీనిలో కాడెద్దులకు కూడ ఓ పాట ఉంది

సింహము - కుందేలు, పిల్లల పాఠ్య పుస్తకాల్లోని కథ ఓ కుందేలు ఉపాయంగా సింహాన్ని పాత బావిలో దూకించి అపాయం నుండి తప్పించుకున్న కథ

అత్తాకోడల్లు - జానపద గేయనాటిక తెలుగు గ్రామీణ స్త్రీల జీవితాలను, వారి మనస్తత్వాలను కవి సహజంగా చిత్రించారీ నాటికలో ఇందులో ఈ జిల్లా మాండలిక భాషను సరసంగా ప్రయోగించారు కోడలు పెనిమిటితో చెప్పుకున్న తనపాట్లు చూడండి కుక్క ఇంట్లో జొచ్చి కుండ పగులగొట్టి వెళ్లిందట - అప్పుడామె నేలబడిన కూడును తీసి దాచుకుంటే దాని ఫలితం ఇది

పల్లెంల ఎత్తుకుంటి, నే తింటనానుకుంటి/ ఓ మూల బెట్టుకుంటి, ఏ ముంది చెప్పు కుంటె
మీ అవ్వ చేతికట్టె, నా యీపు పగులగొట్టె/ "నీ చేతికేమి బుట్టె, ఈ బువ్వకంత మట్టె"
అని యిట్ల మచ్చినట్లే, నను జచ్చె తట్టుకొట్టె

ఇందులోని సంవాద గేయాలు చాలా సహజంగా ఉన్నాయి
"లంజె అంటివి గాదె?" - "నువ్వా నేనా?"
"ముండ అంటివి గాదె?" - "మొదలే నేనా?"
"ఏమని చెప్పుదు ఎట్లని చెప్పుదు/ కొంటెదన్న మాటలన్నీ, వింటే మానం బోతాది.
"దుంకులాడి మాట లిన్నారా, పెంకలేగిన మక్క ప్యాలాలా!"

ఈ ప్రాంతంలో గ్రామీణులు తల్లిని అవ్వ అని, తండ్రిని అయ్య అని అనడం పూర్వంలో ఉండేది పెనిమిటిని బావా అంటారు ఈ కవి 'మామా' అనటం సినిమాల ప్రభావం తెలంగాణాకు మేనమామ కూతురే మేనరికం కోస్తాలో వలె అక్క కూతురుతో పెళ్లిల్లు లేవు జానపద భాషాభావాల కోసం సామ లక్ష్మారెడ్డిగారి గేయనాటికలు సరదాగా చదువుకోవచ్చు - చక్కగా ప్రదర్శించుకోవచ్చు

## 6 ఎస్ వేంకటాద్రి - ఎం ఏ బి ఓ ఎల్ ఎలిగేడ్

వేంకటాద్రి గారి పరిచయం ఈ పుస్తక గేయ, నాటక, శతక గేయ, విభాగాల్లో ఉంది అధ్యాపకులు, నటులు, గాయకులైన వీరు విద్యార్థులచే అనేక సాంస్కృతిక ప్రదర్శినలిప్పించారు అందుకోసం రచించిన కొన్ని గేయాలను రెండు సంగీత రూపకాలు, మరో ఉయ్యాలపాటతో కలిపి పల్లెపదాలు అను పేరుతో 1982లో ముద్రించారు 24 పుటల ఈ జానపద బాణీ గేయరూపక సంపుటి 83, 84ల్లో ద్వితీయ తృతీయ ముద్రణలు పొందింది 'పల్లె పదాలు' సంపుటిలోని రచనలు - 1 కర్షకులం - బృందగానం, 2 పల్లె పడుచు - నృత్యం పాట, 3 బతుకమ్మపండగ - గేయ నాటిక, 4 తిమ్మరుసు - ఉయ్యాలపాట, 5 జీవనబాట - జానపదగీతం, 6 దుబై పయనం గేయ రూపకం

ఇందలి రెండవ పాట శైలి చాల రమ్యంగా ఉంది
నీలి మోహనరంగ నీలి మేఘాలు / మేఘాన కృష్ణుడు - మెరియూచున్నాడు

బతుకమ్మ పండుగ - తెలంగాణాలో ప్రముఖమైన స్త్రీల పండుగ కొత్త చీరెలు కొనడం, గాజులు వేసుకోవడం, పూల వరుసలతో బతుకమ్మలు పేర్చుకోవడం బావామరదలు సంవాద గేయాలతో ఈ గేయనాటిక సరదాగా సాగింది

దుబై పయం - తెలుగువాళ్లు నిరుద్యోగులు అధికధనాశతో అరబ్ - గల్ఫ్ దేశాలకు వెళ్లటం తెలంగాణలో ఈమధ్య అధికమైంది ఓ కూలీ తన మిత్రులతో ఇంటివాళ్లతో ఇది ప్రయాణానికి ముందుకావించిన సంభాషణ అతడు పరదేశం వెళ్లిపోగా అత్తాకోడళ్ళ తగాదా, అతని ఉత్తరం రాగానే ఆ అత్తాకోడళ్లు వైరం మరచి ఆత్రంగా దాన్ని చదివించుకుంటూ వినటంతో ఈ గేయ నాటిక ముగిసింది వీరివి ప్రదర్శనాయోగ్య సరస నాటికలు

## 7 ఇమ్మడోజు భద్రయ్య - ఎం ఏ , బి ఎ ఎల్ ఎంఫిల్ మల్లాపురం జ. ॥ 8 1962

ఈ యువకవి కలం పేరు విశ్వ వీరు పద్యగేయ రచనల్లో చేయి తిరిగినవారు - నరసింహ శతక కర్త భద్రయ్యగారు తమ గేయనాటికలను విశ్వగేయనాటికలు' అనుపేర 1983లో ముద్రించారు అది 'కరీంనగర్ గాంధీ' బి వి రామారావు గారికి అంకితం చేయబడింది

ఈ సంపుటిలో 'నది- ఆనకట్ట' 'చంద్రలోక ప్రయాణము', 'చిలుక గోరెంక' అను మూడు గేయనాటికలున్నాయి ఈ పుస్తకం 70 పుటల్లో చివరి నాటిక పెద్దది 50 పుటలాక్రమించింది

జె బాపురెడ్డి గారి 'సాగరసౌధం', 'రాకెట్టు రాయబారం' విశ్వకవి గారి మొదటి రెండు నాటికలను ప్రేరణ అనవచ్చు 'నది-ఆనకట్ట'లను కవి సరస దంపతులుగా మలిచారు ఆనకట్ట చివరి గేయం ఈ నాటికాసారం

స్వార్ధము త్యజియించితినే, చక్కనైన బొమ్మ/ స్వర్గముగా జేయుదమీ జగతిని ఓ కొమ్మ!
ప్రేమైక జీవులమై రేయింబవళ్లు గూడ/ చిరమత్యున్నత కీర్తి, శిఖరంబున నుండెదము-పు 5

గ్రాంధిక పదాల స్పర్శ ఛందస్సు రాగం - మాత్రాబద్ధ గేయాల్లో గణయతి ప్రాస, అంత్యప్రాసల వచన కవితలు వాటిని వదలి స్వేచ్ఛగా సాగి వ్యావహారిక భాషను వారించాయి

అత్తామామలుగా, చంద్రిక-చంద్రుడు, తమలోకం చేరిన మానవులనాదరించి అతిథ్యమిచ్చి భూలోకానికి సాగనంపటం చంద్రలోక ప్రయాణం గేయనాటిక కథ చంద్రుడు మామ ఎందుకంటే 'చందమామ' కనుక అనుకోవాలి!

చిలుక-గోరింక - కల్పిత ప్రేమకథ కవి తాము విద్యార్థిగా ఉన్నకాలంలో నివసించిన ధర్మపురిని ఈ కథకు రంగస్థలంగా ఎంచుకున్నారు వర్ణ భేద నిరసన విశ్వమానవులంతా ఒక్కటే అను మానవతావాద సందేశాన్ని విశ్వకవి ఈనాటికలో అందించారు ఈ కవి గారికి డా సి నారాయణరెడ్డి గేయశైలిపై అభిమానమని వీరి ఏకవితను చదివినా తెలుస్తుంది మచ్చుకొకగేయం

అహో! శ్రీనార సింహ దేవాలయ సౌందర్యము/ వర్ణింపగ నాతరమే శ్రీ వరదుని చారిత్రము,
ఉన్నత గోపుర సౌందర్యోదిత హిమవన్నగమా?/ సుందర శ్రీ శోభిత నందన వనమా! పు 44

### 8 బైరి నర్సయ్య - ఎం ఏ బి ఓ ఎల్ కోరుట్ల - జ 1951

నరసయ్య గారు అంధ్రభాషోపాధ్యాయులు సరస గేయకవి వీరి కవితా సంపుటాలు మూడు వచ్చాయి విద్యార్థుల ప్రదర్శనార్థం పలు నాటికలు రచించిన వీరి గేయనాటికల సంపుటి అందెల రవళి 1989లో వెలువడింది ఏబది పుటల ఈ పుస్తకంలో-వరకట్నం, చదువు, పల్లె-పట్నం, నీతి నిజాయితి, అస్పృశ్యత శీర్షికలుగా అయిదు గేయనాటికలున్నాయి ఈ నాటికల కథా వివరాలు

1 వరకట్నం - అత్త కట్నం కోసం కోడలిని బాధిస్తుంది కొడుకు భార్యనిట్లా పలుకరించాడు

వాడిపోయిన మందారంలా - చెరగిపోయిన సిందూరంలా
ఎందుకు వున్నావే పిల్లా - ఎవరే మన్నారే పిల్లా పు 6

ఆ ఇల్లాలు తాను ఆయింటపడే బాధలు భర్తకు విన్నివించుకుంటుండగా అత్త వచ్చి కొడుకును తనపక్షం చేసుకుంటుందిట్లా

పెండ్లాం మాటలు వినకురో, కట్నం దొరకదు మనకురో
మాయలాడి నిన్నేమో సేత్తది, మనసుమార్చుటకు మందు పూస్తది - పు 7

కోడలు చివరికి ఉరివేసుకొని చనిపోగా ఓ యదార్థవాది ప్రవేశించి విషాద గీతం పాడుతూ హితోపదేశం చేస్తాడు

2 చదువు - తండ్రి, కొడుకు, దొర, బడిపంతులు ఇందలి పాత్రలు

అయ్య నేను బడికి పోతనే / బడికి పోని బతుకు రోతనే
బడికి పోయి బాగుపడతనే - ఓ అయ్యా / బతుకు దారి యెతుక్కుంటనే - పు 12

ఇది చదువు విలువను చాటి చెప్పేనాటిక దీనికి ప్రేరణ స్వాతంత్ర్య కాలంనాటి బోయి భీమన్న గారి 'పాలేరు' నాటకం అని భావించవచ్చు అది ఈ జిల్లాలో చాల వ్యాప్తి పొందిన నాటకం దానికిది సంక్షిప్త రూపంగా ఉంది

3 పల్లె - పట్నం, పల్లె పట్నం తమ గొప్పలను చాటుతూ వాదించుకోగా భారతమాత వచ్చి హితోపదేశం కావిస్తుంది గ్రామీణులు నగరవాసులు కలిసిమెలసి దేశాభివృద్ధిని సాధించుకోవాలని ఈనాటికలోని సందేశం

4 నీతి - నిజాయితి ఓ బాలునికి గాంధి తాతకు మధ్య జరిగిన సంభాషణ

5 అస్పృశ్యత అంటరాని తనాన్ని నిర్మూలించాలని కవి తపన

బ్రాహ్మణుడు, నాయకుడు, వైశ్యుడు, ఇద్దరు హరిజనులు, ఓ జాతీయవాది ఈ నాటికలోని పాత్రలు మొదటి ముగ్గురు చాతుర్వర్ణ వ్యవస్థలో అగ్రజాతులవారు శూద్రుల కవి వదిలారు జాతీయవాది వారి ప్రతినిధి కాబోలు పై జాతుల వారు తమ్ము అంటరాని వారంటుంటే దళితులు ఇందులో ఇలా అనుకుంటారు

మతం మార్చుకుంటాము, రంది లేక వుంటాము

పైసలతో పాటు మాకు, పరువు దక్కుతుందయ్యా -

అట్లా చేయవద్దని 'హిందువుగా జీవించు గర్వంగా భావించు' మని ఓ జాతీయవాది హితోపదేశం ఉంది కవి సందేశం ఇది,

కులం ఇనుప గోడలనే, కూల్చులకై కలిసిరండి / కుల భేదాలెన్నున్నా, భరత జాతి ఒక్కటే! పు 50

## 9 కందుల మల్లికార్జున్ - ఎం ఏ బి ఇడి నగునూరు జ 8 IO 32

కె మల్లికార్జున్ గారి పరిచయం పద్య ఖండ కావ్య శతక విభాగంల్లో చేయబడింది వీరు ప్రముఖ కవి డా సి నారాయణరెడ్డి గారికి సహ విద్యార్థిగా హైద్రాబాద్ నిజాం కాలేజీలో చదువుకునేకాలంలో పద్యాలు, గేయాలు 6 గేయనాటికలు రచించారు నాటి తెలంగాణా రచయితల సంఘంలో వీరు సభ్యులు

వట్టికోట ఆళ్వారుగారు ప్రచురించిన 'జీవనరంగం' సాహిత్య సంచికలో కె మల్లికార్జున్ సి నా రె గారల గేయనాటికలు పుస్తకం మొదటొకటి చివరగా ఒకటి అలంకారంగా ఉన్నాయి (దేశోద్ధారక గ్రంథమాల ప్రచురణ 1956)

సారస్వత జ్యోతి ఆగస్టు 1954 త్రైమాసిక పత్రికలో వీరి 'సంఘర్షణ గేయనాటిక ప్రచురించబడింది [10] మల్లికార్జున్ గారి గేయ రూపకాల పేర్లివి 1 సంఘర్షణ - 1954, 2 పారవశ్యం - 1955, 3 కరుణాలయం 1956, తర్వాత 4 'జమదగ్ని' కథతో కలిపి రచయిత ఒక సంపుటిగా ప్రచురిస్తున్నారు

సంఘర్షణలో లలిత కళల పోటి ఉంది పారవశ్యం ప్రకృతి వర్ణన కరుణాలయంలో శునశ్శేపుని బలిపశువుగా హరిశ్చంద్రుడు వరుణయాగం చేయగా విశ్వామిత్రుడు దాన్ని ఆపి బాలుని రక్షించుట కథ ఇది భాగవతంలో, దేవీ భాగవతంలోను ఉన్న కథ జమదగ్నిలో పెఱిక వారనబడు శెట్టిరైతుల మూలపురుషుడైన మలిశెట్టి కథ ఉంది పెరికలు పురగిరి క్షత్రియులమని కార్తవరాయుని సంతతివారమని చెప్పుకుంటారు (మల్లికార్జున్ గారిది అదే కులం) వీరి కవనపరిచయానికి 'సంఘర్షణ' నాటికలోని 'రసం' పాడిన భారత వాక్యం చూడండి

నిరుపేదల జీవన సాధనలో, నిరూపించి మీ సామర్థ్యం

చీకటి కుటిలో వెల్లుల నింపుచు, చేకూర్చండిక ఆనందం

అదే మీకు సార్థకత, ఆనందపు బ్రతుకు కథ -

అముద్రిత గేయనాటికలను పేర్కొన్నా, పత్రికలలో రచనలు సైతం ప్రచురణ పొందిన ఈ కవి, డా తిరుమలశ్రీ గారి గేయనాటికల పిహెచ్ డి పరిశోధనకు చిక్కక వారి గ్రంథానికెక్కలేదు

నారాయణరెడ్డి గారికి నచ్చిన కవి "మల్లికార్జున్" గారు ఈ జిల్లాలో తొలితరం గేయనాటికా రచయిత [11]

## గేయనాటికా సమాలోచనం

డా సి నారాయణరెడ్డి గారు ఇక్కడి గేయనాటికా కవులకు ప్రేరణ వారు అఖిలాంధ్ర గేయరూపక కర్తలకే మార్గదర్శి కరీంనగర్ జిల్లాలో ఓ పది మంది కవులైనా వారి మార్గంలో పయనించి చక్కని గేయనాటికలు రచించారు వీరు పౌరాణిక గాధలను విడిచారు సాంఘిక సమస్యలను రచనా వస్తువులుగా ఎన్నుకున్నారు కాలక్షేపంతో పాటు జాతికి ఎంతో కొంత చేతనైనంత నీతిని బోధించే ప్రయత్నం చేశారు

ఇప్పుడు ఈ ప్రక్రియలో ఇక్కడ ఎక్కువ మంది రచయితలు ప్రవేశిస్తూ లేరు ఇందులో రాణించడం కష్టం చక్కని కథా కల్పన, రచనానుభవం, కవితానైపుణ్యం ముప్పేటలా అల్లుకొని ఉంటే కాని విజయం సాధ్యం కాదు విద్యాలయాల ప్రదర్శనల, రేడియో, టెలివిజన్‌ల ప్రసారాల అవసరాలకైనా గేయ నాటికలు జీవించి ఉంటాయి

## పాదపీఠికలు

1 డా తిరుమల శ్రీనివాసాచార్య తెలుగులో గేయ న టికలు 1986 పిహెచ్ డి పరిశోధన గ్రంథంలో మొదటి 7 అధ్యాయాల్లో ఈ విషయాన్ని కూలంకషంగా చర్చించారు

2 తల్లావజ్ఝల శివశంకర స్వామి గారు సంగీత గేయనాటికా రచనలో ఆద్యులని డా శ్రీనివాసాచార్యగారు తెలుగులో గేయనాటికలు 8వ, ప్రకరణంలో తేల్చారు

3 మొదలి నాగభూషణ శర్మ గారి పాతిక సంవత్సరాల తెలుగు నాటకం వ్యాసం, "మహతి వ్యాససంకలనం యువభారతి ప్రచురణ 1972, పు 189

4 డా తిరుమల శ్రీనివాసాచార్యగారి 'నారాయణరెడ్డి సాహిత్యమూర్తి' 1981 పు 6

5 వ్యాసం 'సంగీత రూపకాలు - యక్షగానాలు మహతి 1972 పుట 203

6 1975లో ఒకేఒక నాటిక "తరతరాల తెలుగు వెలుగు మాత్రం ప్రపంచ తెలుగు సభల ప్రదర్శనార్థం రచించారు

7 1970 నాటి మొదటి ముద్రణలో 8 గేయనాటికలివి - ఋతురాగం సాగరసౌధం, భావిజీవులు విజయహేల కల్యాణయాత్ర రాకెట్టు రాయబారం, చాలా నెహ్రూ ఎన్ జి ఓ

8 కవిగారి 'బా రె గేయాలు 1986 పుస్తక పీఠిక 'సత్యసాహిత్య స్వరాలు' నుండి

9 Drama Critic, The times of India, New Delhi dt Nov, 20-1976

10 సంపాదకులు - బి వి రామారావు గారు కరీంనగర్ నుండి 1954 ఫిబ్రవరి, ఆగస్టు డిసెంబర్‌లో మూడే సంచికలు వెలువరించారు

11 ఇటీవలనే బి ఏ పూర్తి చేస్తున్న మల్లికార్జున్ 'మర్మస్పృక్కవిత్వం వ్రాయడంలో మంచి చురుకైన వాడు - అని సి నా రె వ్యాసంలో అన్నారు కరీంనగర్ 'సారస్వత జ్యోతి' 2వ, సంచిక ఆగస్టు - 1954

# 6. వయోజన విద్య - బాల సాహిత్యం

**వయోజనవిద్యాపుస్తకాలు** చిన్నవాడు చదువుకోజాలని పెద్దవారికి, వారి విరామ సమయాల్లో విద్య నేర్పించడం, మన ప్రభుత్వం అవశ్యకర్తవ్యంగా భావించింది నిరక్షరాస్యులకు విద్యనేర్పడం ప్రతి అక్షరాస్యుని కనీస బాధ్యత అనీ ప్రజలు గుర్తించారు వయోజనులకు నేర్పే చదువు వయోజన విద్య ఇందుకు ఉపయోగ పడేవి వయోజన విద్యా పుస్తకాలు అనియత విద్యా పథకం బడికి పోజాలని పేద కుటుంబాల పిల్లలకు చదువు నేర్పుటకు ఉద్దేశింపబడింది 'వయోజన విద్య' ఆ విద్యా వంతులైన యువ ప్రౌఢ వృద్ధ స్త్రీ పురుషులందరిది

ఇవి బడి పిల్లల పుస్తకాలకు భిన్నంగా ఉంటాయి పిల్లలకు అక్షర పరిజ్ఞానంతోపాటు విషయ పరిజ్ఞానం కలిగించవలసి ఉంటుంది పెద్దలకట్లాకాదు వీరు లోకానుభవం అనేక విషయాల పరిజ్ఞానం కలవారు కాబట్టి అక్షర జ్ఞానం కలిగించడం ముఖ్యం దానితోపాటు అత్యవసర విషయాల పరిజ్ఞానం కలిగించవల్సి ఉంటుంది దురభ్యాసాల మూఢవిశ్వాసాల నిరసన, సైన్సు పరిజ్ఞానం, జాతీయ సమైక్యత, దేశభక్తి, కుటుంబ సంక్షేమం వంటి సద్భావాలు కలిగించేవి - పెంపొందించేవి, అయిన పుస్తకాలు వారికి చదవడానికి అందించాలి

మన దేశానికి స్వాతంత్ర్యం లభించిన తర్వాతనే ఈ వయోజన విద్యకు అంకురార్పణ జరిగింది 1991లో భారత ప్రభుత్వం నిరక్షరాస్యతా నిర్మూలనకు యుద్ధ ప్రాతిపదికన గొప్ప ఉద్యమం చేపట్టింది సాధించిన ప్రగతి ఎంతైనా, దేశంలోని ప్రజలందరికీ చదువుపట్ల సదవగాహన, శ్రద్ధాసక్తులు ఏర్పడడం ఈ విషయంగా కలిగిన మంచిమార్పు

కరీంనగర్ జిల్లాలో కారణాలేవైనా ఈ రంగంలో పుస్తకాలు చాల తక్కువ సంఖ్యలో వచ్చాయి (ఇంతవరకు పలుసార్లు పరిచయం చేయబడిన రచయితల వివరాలు తెలుపక కేవలం నామమాత్ర పరిచయం చేయబడుచున్నది)

డా యశోదారెడ్డి గారు 1950-60 మధ్యకాలంలో ఊరబావి' ముచ్చట్లు అనే పేరుతో రేడియో ప్రసంగాలు చేశారు కాని, అవి పుస్తకరూపం ధరించలేదు

ఈ శాఖలో బహుమతి గ్రహీతలు ఇద్దరు

1 జి సురమౌళి - వయోజన విద్యా పుస్తకాల రచయితలలో కీ శే జి సురమౌళిగారి "కలిసి బ్రతుకుదాం" అను లేఖా సాహిత్య గ్రంథానికి 1970 సుమారుగా కేంద్ర ప్రభుత్వ బహుమతి లభించింది ఈ లేఖా వ్యాసాలు యువజనులకు సహకారోద్యమ పరిజ్ఞానము కలిగించడానికి రచింపబడినవి

2 మలయశ్రీ - వీరు భారత విప్లవవీరుల జీవితచరిత్రలు పది సంపుటాలలో రచించారు వీటి పరిచయం బాల సాహిత్యంలో చేయబడుతున్నది ఈ బాలీ బొమ్మల పుస్తకాలు యువజనులకు కూడా ఉపయుక్తమయ్యే విధంగా ఉన్నవి వీటిలో 'డా బాబా సాహెబ్ బి ఆర్ అంబేద్కర్' పుస్తకానికి రాష్ట్ర వయోజన విద్యా శాఖ వారి నుండి 1991లో ఉత్తమ వయోజన పుస్తక బహుమతి పురస్కారం లభించింది [1]

కేంద్ర ప్రభుత్వ ఆదేశం మేరకు ఆంధ్రప్రదేశ్‌లోని పదకొండు జిల్లాల్లో ఆరంభమైన 'అక్షరజ్యోతి వయోజన విద్యాకార్యక్రమంలో భాగంగా ఎస్ ఆర్ సి 'మానవ వనరులశాఖ - హైదరాబాద్ వారు వయోజన విద్యాపుస్తకాలు వ్రాయించడానికి 1992 ఆగస్టు సెప్టెంబర్‌లలో ఏర్పాటు చేసిన వర్క్‌షాపులో కరీంనగర్ జిల్లా రచయితలు ఈ క్రింది వారు పాల్గొన్నారు

1 డా జి లింగారెడ్డి, 2 డా బి దామోదర్ రావు 3 డా జి లక్ష్మణ్‌రావు, 4 కాలువ మల్లయ్య, 5 నరెడ్ల శ్రీనివాస్[2], 6 మలయశ్రీ వీరు ప్రతి ఒక్కరు రెంటికి తక్కువ, కాకుండా పుస్తకాలు వ్రాసి

ఇచ్చారు వాటిలో మలయశ్రీ గారి 1 'ఇరుగు పొరుగు 2 లెక్కా పక్కా' పుస్తకాలు ముద్రణ పొందాయి 3 డా॥ జి లింగారెడ్డి గారి బతుకమ్మ పండుగ కూడ 1993లో పై సంస్థ ప్రచురణంగా వెలువడింది మిగతా పుస్తకాలు వరుసగా వెలుగు చూడవచ్చు కరీంనగర్ జిల్లాలో నిరక్షరాస్యతా నిర్మూలన వయోజన విద్యా వ్యాప్తి అక్షర ఉజ్వల కార్యక్రమంలో ప్రచార సాధనంగా 'అక్షర ఉజ్వల' సమాచార పత్రిక వెలువడింది ఇది తర్వాత 'నవోదయం' పత్రికగా మారింది వార్తలతోపాటుగా ఇది జిల్లాలోని పలువురు రచయితల, నూతనంగా విద్యావంతులైన వయోజనుల రచనలను ప్రచురించుచున్నది ఈ పత్రిక రచనల్లో దీని సంపాదకులైన డా జి లక్ష్మణ్‌రావు గారి భారతం'[4] ఎస్ వేంకటాద్రి గారి 'గృహవైద్యం చిట్కాలు ప్రత్యకంగా పేర్కొనదగినవి

ఈ సందర్భంగా పలువురు పాటలు రచించారు ప్రచురితమైన వాటిలో 'మలయశ్రీ గారి 'అక్షరజ్యోతి' గేయ సంపుటి - 1991 సమైక్య సాహితి కరీంనగర్ వారి సమైక్య సహకారంతో జిల్లా వయోజన విద్యాశాఖవారు ప్రచురించిన ఉజ్వల గేయాలు' సంకలనం - 1992, ముఖ్యమైనవి

కీ శే ఎస్ కె పిళ్ళైగారు ఈ సందర్భంలో 'తుమ్మెద పాట' చిరుపుస్తకాన్ని ప్రచురించారు

గ్రామీణ నవోదయ గ్రంధాలయాల పుస్తకాల రచనకోసం జిల్లా 'అక్షర ఉజ్వల వయోజన విద్యా శాఖ వారు సైతం కరీంనగర్ జిల్లా రచయితల సదస్సు నెహ్రూ యువకేంద్రములో, రచయితల వర్క్‌షాప్ డైట్‌లో ఏర్పాటు చేశారు ఇందులో పాల్గొన రచయితలు వీరు మలయశ్రీ వేణుశ్రీ, డా జి లక్ష్మణరావు డా జి లింగారెడ్డి, డా జి దామోదర్‌రావు, డా డి నరహరి ఆచార్య, రాయ్ బాల ప్రసాద్ వి భూపతిరెడ్డి, అరుట్ల శ్రీరంగాచార్య, ఎస్ హర్షవర్ధన్ మొ॥వారు అధికారుల నిబంధనల[5] మేరకు 50 పుస్తకాల వరకు వీరురచించి నిర్వాహకులకు ఒప్పగించారు ఇది జరిగి ఏండ్లు గడిచినా ఆ పుస్తకాల ఎంపిక జరుగలేదు వాటిలో ఏ ఒక్కటీ ప్రచురింపబడలేదు

ఇక్కడ ఉన్నత విద్యావంతులైన రచయితలు పలువురు వయోజన విద్యా విజ్ఞానాల వికాసం కోసం ఉత్సాహంగా ఉదారంగా పలు పుస్తకాలు రచించారు రచించడానికి సిద్ధంగా ఉన్నారు పరిస్థితులు అనుకూలించక ఈ శాఖలో ఎక్కువ సంఖ్యలో పుస్తకాలు ఇప్పటికి రాలేదు

## బాల సాహిత్యం

జానపద వాఙ్మయంలో ఒక భాగంగా బాలసాహిత్యం కూడా పరిగణింపబడింది ప్రచారంలో ఉన్న బాలగేయాలు, కథలు, పొడుపుకథలు ఈ శతాబ్దిలో పరిశోధకుల కృషివల్ల చాల వరకు సేకరించి ప్రచురించడం జరుగుతున్నది ఇది మంచి పనే

బాల సాహిత్యం అంటే పిల్లల ప్రయోజనం కోసం, వారి విద్యా విజ్ఞానాల అభివృద్ధికోసం వినోదం కోసం అనుభవజ్ఞులైన కవులు - రచయితలు వ్రాసిన పుస్తకాలు అవి ఈ శీర్షికలో చూపబడుతున్నవి పిల్లలు తమ కోసం తాము వ్రాసుకొన్న తేనె చినుకులవంటి చిలుక పలుకులు కూడా బాల సాహిత్యమే - అయినా ఆటువంటివి తక్కువ, వాటిలో అప్పుడప్పుడు పత్రికలలో ప్రచురణ పొందినవి కొన్ని ఉన్నా పుస్తకాలుగా రాలేదు అందుకే పెద్దలు వ్రాసిన పిల్లల పుస్తకాల వరకే ఈ శీర్షిక పరిమితం చేయబడింది

బాల సాహిత్యంలో కవితలు, కథలు, చరిత్రలు, విజ్ఞాన విషయాలు, వ్యాసాలు ఇలా ఎన్నో విభాగాలున్నాయి ఈ జిల్లాలో వెలువడిన బాలసాహిత్యాన్ని బట్టి కొన్ని విభాగాల్లో ఆయా రచయితల పుస్తకాల నిక్కడ పేర్కొనడం జరిగింది అవి

1 కవితలు - పద్యాలు, గేయాలు, 2 కథలు - నవలలు, 3 చరిత్రలు - జీవిత చరిత్రలు, 4 సైన్సు - విజ్ఞాన పుస్తకాలు, 5 నాటికలు, 6 వ్యాసాలు, 7 సంకలనాలు

**I కవితలు-పద్యాలు** వేమన, సుమతి శతకాల పద్యాలు పిల్లలకు ఎంతగానో ఉపకరిస్తున్నాయి అవి భాషా బోధనకు విషయావగాహనకు ఎంతో చక్కగా పనికి వస్తున్నాయి అందుకే ప్రభుత్వ విద్యాలయాల పాఠ్య పుస్తకాల్లోనూ శతక పద్యాలు చోటు సంపాదించుకున్నాయి ఆ బాటలో ఈ జిల్లాలో పిల్లలకొరకు నీతి శతకాలు రచించి ప్రచురించిన వారు వీరు

1 దేవత వేంకటరాములు - 1 విద్యార్థి వివేక చంద్రిక, 2 దూడం నాంపల్లి - 1 శిష్య ద్విశతి, 3 శతావధాని కృష్ణమాచార్య - 1 గాంధి తాత నీతిశతకము, 4 సి డి వేంకటరాజు - 1 తెలుగు బిడ్డ శతకము, 5 పి హైమవతి - 1 తెలుగు పట్టి శతకము

**6 జి రాములు** - సిరిసిల్ల (పరిచయం నవలా రచయితలలో ఉంది విశ్రాంతోపధ్యాయులు జి రాములు గారు "బాలనీతి" పేర 56 ఆటవెలది పద్యాలను 1979లో పుస్తక రూపంలో వెలువరించారు మకుటం "తెలిసినడుచుకొనుము తెలుగు బాల" ఇవన్నీ విద్యార్థుల భవితవ్యాన్ని సరిదిద్దే నీతి సూక్తులు - సత్ప్రవర్తనా బోధలు ఆరోగ్య నియమాలు

వేమన పద్యాల ప్రేరణతో అంతర్జాతీయ బాలల సంవత్సరంలో ఈ రచన చేశామన్నారు వేమనవి పెద్దలకు సుద్దులు ఈ రామనవి బాల నీతులు ఈ చమత్కార శ్లేష పద్యం చూడండి - పీఠికలోనిది

వేముగంటిలోన వేముని కనుగొంటి, ననెడి యర్థమున్న - దది యధార్థ, మనగ వేముగంటి యందు వేమన వంటి, ప్రకృతి సిద్ధమైన ప్రతిభగంటి - ఇది తమ కవితను సరిచూసి ప్రోత్సహించిన వేముగంటి నరసింహా చార్యులు సిద్ధిపేటగారి ప్రశంస ఇందటి ఒక పద్యం ఇది - నకలు జేసి సర్టిఫికెటు పొందినవాడు - జ్ఞానహీనుడగును గాన భువిని - అట్టివాడు 'చెల్లనట్టి రూపాయి' రా - తెలిసి ॥ ప 9 రాములుగారి 'బాల నీతి' అర్ధ శతకం చాల ఉపయుక్త పద్యపుస్తకం

ఈ పుస్తకాల పరిచయం ఇంతకుముందే శతక సాహిత్యంలో చేయబడింది ఇవి విషయంలో కాని, భాషలో కాని, బాల సాహిత్య స్థాయికి కొంతవరకు మించి ఉన్నవి

అముద్రిత బాల నీతి శతకాలలో గణింపదగినవి -

1 కీ శే వానమామలై జగనాధాచార్యుల 'తెలుగు బాబు శతకము', 2 మలయశ్రీ - 'బాలనీతి శతకం' 3 కొండబత్తిని రవీందర్ - 'జాతి నీతి శతకం, 4 మంగళంపల్లి సత్తెయ్య - 'ముద్దు చెల్లి శతకము' మొదలైనవి

**గేయాలు** బాల గేయాలు చాలా మంది రచయితలు వ్రాస్తున్నారు పిల్లల స్థాయిని బట్టి భాష - భావాలు ఉంటూ, హాస్యం పేర అనౌచిత్యానికి పోనివి మాత్రం తక్కువ - అని సాహిత్య విమర్శకుల అభిప్రాయం కరీంనగర్ జిల్లాలో చక్కని బాలగేయాలు వ్రాసే కవులున్నారు ఇక్కడ స్వీయ బాలగేయ సంపుటాలు వెలువరించిన కవులు వీరు

మలయశ్రీ, ఎర్రోజు సత్యం, ఎన్ వేంకటాద్రి, రేగులపాటి కిషన్‌రావు, వడ్డేపల్లి కృష్ణ, మేడిపల్లి రామచంద్రం, ఖుర్షీదలీ బేతాబ్, గరిశెకుర్తి రాజేంద్ర, డా॥ ఎర్రోజు ఆదినారాయణ, మంగళంపల్లి సత్తయ్య, కె శ్రీహరి

**బాలగేయ సంకలనాలు** - పువ్వులు, బాల వికాస గేయాలు, అనే పేర్లతో రెండు వెలువడ్డాయి బాల గేయం రచయితల - పుస్తకాల వివరాలివి

**I మలయశ్రీ** పరిచయం చేయబడింది వీరి బాలగేయ ముద్రిత సంపుటాలు రెండు

1 రంగుల పిట్టలు, 2 బంగారు బొమ్మలు అముద్రితాలు రెండు తేనె చినుకులు, చుక్కల లోకం

రంగుల పిట్టలు - 1974, 75 రెండేండ్లలో ఇది మూడు ముద్రణలు పొందింది ఇది 55 పాటల 50 పుటల పిల్లల పాటల పుస్తకం

బడాయి పిల్లి, లడాయికెళ్లి / ఎలుకను చంపి, ఏనుగె అంది
పులినే తానని, పొంగిన పిల్లి / కుక్కను చూచి, ఒక్కటె పరుగు
బొమ్మల పెండ్లి, భోజనాలకు రండి
చొప్పబెండ్లు బండ్లు, ఇప్పపూలు తిండ్లు
చెట్నీలు లేవండి కట్నాలు తెండి –
పిల్లికి పిడికెడు బిచ్చం పెట్టని పిసినారింట్లో పెండ్లంట –
ఆచారాల అయ్యగారికి అన్నీ అపశకునాలే –
అమ్మమ్మ ముసలమ్మ, ఆరుగుమీదుంది
అద్దాల కళ్లతో బొంత కుడుతుంది –
వన్నెల జింక కనిపిస్తే, వదినమ్మా నువ్వేంజేస్తవ్ –
మా బావ మంచోడు, మంది మాటలను వింటాడు

మామ మాట కాదంటాడు – మొ॥ ఇందలి పాటలు చాల వ్యాప్తి పొందాయి డా దేవకి - అనంతపురం, డా ధనలక్ష్మి - గుంటూరు, తమ బాల సాహిత్య పరిశోధన గ్రంథాల్లో వీరి రంగుల పిట్టలులోని గేయాలను ఉదహరించారు డా మిరియాల రామకృష్ణగారు రాజమండ్రి "తెలుగులో నర్సరీ గేయాలు" అనే తమ వ్యాసంలో ఇందలి 'కారంకారం' బడాయిపిల్లి, పాటలను చూపారు [6]

బంగారు బొమ్మలు రంగుల పిట్టలు కన్న మరీ సరళమైన ఈ గేయ సంపుటి 1983లో ముద్రింపబడింది ఇది 50 గేయాల 50 పుటల సంపుటి ఆముద్రిత గేయ సంపుటాలు సాహిత్య అకాడెమి న్యూఢిల్లీవారి బాలసాహిత్య పుస్తకాల ప్రచురణకోసం రాయబడినవి ప్రముఖ చిత్రలేఖకులు ఆగాచార్య గీసిన బొమ్మలతో 'చుక్కల లోకం' అచ్చులో ఉంది

## 2 ఎర్రోజు సత్యం - బి ఏ బి ఓ ఎల్ చీర్లవంచ

ఎలారెడ్డి వేట సెకండరీ పాఠశాలలో సత్యంగారు అధ్యాపకులు వచన గేయం, బాలగేయం వీరికి నచ్చిన రచనలు సత్యం గారి బాల సాహిత్య రచనలు మూడు/నాలుగు పుస్తకాలు ముద్రణ పొందాయి

1 2 పిల్లల పాటలు - 2 భాగాలు, 3 బాల లోకం గేయాలు

4 సాహితీకిరణాలు - 1986, కవితలు, కథలు సూక్తులు

సత్యం గారి రచనలు 1980–86 మధ్య కాలంలో వెలువడ్డాయి ఉత్సాహానికి తగినంత శ్రద్ధ చూపి ఉంటే వీరి కవితలు మరీ బాగుండేవి వీరివి సరదా గేయాలు, వీటిలో నీతికంటే హాస్యం పాలు ఎక్కువ



బాలలలోకం మాదండి - భావి పౌరులం మేమండి
మంచి నడవడి నేర్చుకొని - మంచి పౌరులుగ ఎదిగెదము –
అమ్మ నాన్న చెప్పిన పనులు - ఆనందంతో చేస్తాను
పెద్దలు చెప్పిన మంచి మాటలను - శ్రద్ధతో నేను వింటాను –
ఒకటి రెండు అందాము ఓపికతో మనముందాము
మూడు నాలుగు అందాము - ముద్దుల నొలుకుతు ఉందాము –
బడికి పోయేదెందుకురా - చదువులు నేర్చేటందుకురా –
ఇట్లా సాగింది ఎర్రోజు సత్యం గారి బాలగేయ కవితా ప్రవాహం

**3 ఎస్ వేంకటాద్రి** - నాటక విభాగంలో వీరి పరిచయం చేయబడింది

1995లో వేంకటాద్రి గారికి రాష్ట్ర ఉత్తమోపాధ్యాయ సన్మాన పురస్కారం లభించింది

వీరు బాల గేయాలు, నాటికలు, రచించారు వీరి బాల సాహిత్యంలో 'బాలవిజ్ఞాన వినోదిని' 1982 ప్రముఖమైనది ఇది ఏడాది కాలంలో మూడు ముద్రణలు పొందడం విశేషం ఇది నవీన కాలపు 'పెద్ద బాలశిక్ష' ! భాషా బోధనతోపాటు పురాణ విషయాలు, సైన్సు సంగతులు 74 గేయాల్లో 80 పుటల్లో పొందుపరిచారు ఈ గేయాలు పిల్లలకు అనేక అత్యవసర విషయాలను కరతలామలకాలు చేస్తాయి గణనకు వీరు వ్రాసిన గేయం ఇది - పు 18

ఒక్కడు ఉంటె ఏకాకి ఇద్దరు కలిసి ఉండాలి
ముగ్గురు కూడినముచ్చేరా నల్వురు కలిసి నడవాలి
ఐదుగురుంటేనే తీర్పు, ఆర్వురె చక్రవర్తులట
తొమ్మండుగురు బ్రహ్మలట పదిమందిలొ పనిసాగదట

**4 రేగులపాటి కిషన్ రావు** - నవలా విభాగంలో వీరి పరిచయం చేయబడింది

కిషన్‌రావు గారిది హేతువాద దృష్టి, సరళ కవితా వృష్టి వీరు అధ్యాపకులు కాబట్టి పెద్దల రచనలతో పాటు పిల్లలకు కథలు కవితలు వ్రాశారు

వీరి కవితా సంపుటాలు నాలుగు 1 ప్రగతి పాటలు, 2 కొత్త పాటలు, 3 మల్లెమొగ్గలు - 86, 4 రవిబింబం 89, మొదటి మూడు ఇరవై పుటల చిరుపొత్తాలు చివరిది ముప్పది నాలుగు పుటలు వీరి ఏ పుస్తకం మీద కానీ బాల సాహిత్యమని పేర్కొనకున్నా, బాల గేయం లేని కవితా సంపుటి వీరిది లేదు ముఖ్యంగా 'మల్లెమొగ్గలు' 1986లో ఇవి ఎక్కువ

ఏపాట రాసినా మీకోసమే ఏ పాట పాడినా మీకోసమే - అని రవిబింబంలో అన్నారు

వీరి, ఎలుక, కోకిల, కుక్క, పులి రాజుపెళ్లి మొ॥ పాటలు పూర్తిగా పిల్లలవే అట్లాగే మల్లెమొగ్గలులో సగానికి మించి చక్కని భావంతో బాలగేయాలున్నాయి

1996లో వెలువడిన 1 పాడవేకోకిలా, 2 కలంబలం, 1997లో వచ్చిన మనధర్మం 'సజీవసత్యాలు' గేయసంపుటాలు కూడా పూర్తి బాలగేయాలవి కావు వీరిది అవిశ్రాంత కవనం

**5 వడ్డేపల్లి కృష్ణ** - వీరి పరిచయం గేయ విభాగంలో ఉంది

కృష్ణ గారు మధుర సినీ లలితగేయకవి వచన కవితలు గేయనాటికలు సైతం రచించారు ప్రచురించారు వీరి చిరుగజ్జెలు బాలగేయ సంపుటికి 1993 సం తెలుగు విశ్వవిద్యాలయం వారి బహుమతి లభించి, బాల సాహిత్య రంగంలోనూ వీరు గణనీయ స్థానం సంపాదించుకున్నారు కృష్ణ గారి 'చిరుగజ్జెలు' వంద పుటల వంద గేయాల పుస్తకం, వీరి బాల గేయాల నడక ఇది

1 తెలిసీ తెలియని భావి పౌరులం / విరిసీ విరయని పూలరేకులం

2 మనమంతా బంధువులం - మనవతా సింధువులం
భారత పద్మంలో ఉదయించిన / తీయని తేనియ బిందువులం

**6 మేడిశెట్టి రామచంద్రం - రిటైర్డ్ ఉపాధ్యాయులు తాటిపల్లి వ 60 సం లు,**

రామచంద్రంగారు 'అభినయ గేయాలు అను పిల్లల పాటల చిరు సంపుటిని 1988లో ప్రచురించారు ఇందులో బహుళ ప్రచారంలో ఉన్న పిల్లల కథలు సరళమైన భాషలో ఉన్నాయి పాటలుగా వీరు పెద్దలకు కొన్ని హారతులు కూడా రాశారు

**7 ఖుర్షీదలీ బేతాబ్ - పెద్దపల్లి వ 65 సం లు**

ఖుర్షీదలీ గారి కలం పేరు బేతాబ్ వీరు ఉర్దూలో ప్రముఖ కవి - నాటక రచయిత వీరి

జాతీయ పాదుపు' అనే తెలుగు నాటిక ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ బహుమతి నందుకుంది వీరు చక్కని బాలగేయాలు సైతం రచించారు 'పువ్వులు బాలకవితా సంకలనం 79 పు 25 లోని వీరి జాతీయ మొగ్గలు' గేయం చూడండి

పెందల కడనే లేవాలి - కాల కృత్యములు చేయాలి
స్నాన భోజనం చేసిన పిదప - వేళకు బడికి పోవాలి

## 8 గరిశకుర్తి రాజేంద్ర - బి ఏ వేములవాడ

జి రాజేంద్ర గారి జన్మస్థలం విలాసాగరం నాస్తిక రచయిత సురమౌళి అన్న శంకరశర్మగారి పుత్రులు వీరు సబ్ పోస్ట్ మాస్టర్‌గా ఉద్యోగం చేస్తున్న రాజేంద్ర కవితలు కథలు నాటికలు నాలుగు పుస్తకాలు వచ్చాయి హృదయాన్వేషణ కవితాలత కవితా సంపుటాలు, నీతికి నీరాజనం - నాటికలు బాలసాహిత్య బాలగేయమాల 1991, 48 పుటలు పాటలు 50 ను ఈ కృతిని రచయిత కీర్తిశేషులైన తమ సోదరి సంధ్యా రాణి కి సమర్పించారు రాజేంద్ర 'సంధ్య అనే కలంపేరుతో రచనలు చేసినట్లు 'కరీంనగర్ జిల్లా రచయితల చరిత్ర 1981లో ఉంది

భక్తి నీతి రంగరించి సింగారించినవీ బాలగేయాలు, సరస్వతి స్తుతిలో ఆరంభమైన ఈ సంపుటిలో మాబాబు చందమామ కుందేలు గడియారం వంటి వివిధ శీర్షికలతో పాటలున్నాయి

చదువుకో నాన్నా చదువుకో/చదువుకుని నీతెలివి పెంచుకో
పదుగురికి సాయపడుతూ / మా నాన్న మంచి పేరును తెచ్చుకో పు 15
టిక్కుటిక్కు గడియారం టైమును చెప్పే గడియారం
ఆగక నడిచే గడియారం అలసట తెలియని గడియారం పు 19

పొగబండి, గుర్రమెక్కుతా, బొమ్మలపెళ్లి, గారడివాడు - మొ॥ ఆనందం కలిగించే శీర్షికలతోపాటు చెట్లను నాటండి, స్నేహంవిలువ, ఆదర్శం చక్కని హితవును నేర్పే పాటలున్నాయి డా సి నా రె , చొ చంద్రమౌళి గారలు అభినందన - ఆదేశాలనందుకున్న రాజేంద్రగారి ఈ పుస్తకం, బాలసాహిత్యం కాబట్టి రంగుల ముఖచిత్రంతో ఆకర్షణీయంగా వస్తే బాగుండేది ఇది రచయితకు బాలసాహిత్యంలో తొలికృతి అయినా బాగుంది అనగా అనగా రాగం -!

## 9 డా॥ ఎర్రోజు ఆదినారాయణ - వేములవాడ

ఎర్రోజు ఆదినారాయణగారిది వేములవాడ ప్రైవేటు డాక్టర్‌గా వైద్యవృత్తిలో ఉంటూ పదేండ్లుగా కవితారచన సాగిస్తున్నారు పసివాళ్ళ మానసిక చికిత్సగా పసివాడి పలుకులుగా పసిడి పలుకుల పసి(వా)డి పలుకులు' అనే పేరుతో బాలగేయాల సంపుటాన్ని 1994లో ప్రచురించారు డా॥ సి నారాయణరెడ్డి సుసూక్తం"గా అభినందించిన ఈ కృతిని సంస్కృత కవులు పెండ్యాల అచ్యుతశర్మ, తిగుళ్ళ శ్రీహరి శర్మ, పతంగి అనంత రాజశర్మగారలు ఆశీర్వదించారు

ఇందులో 44 పుటల్లో 67 పాటలున్నాయి అంకితం కీర్తిశేషురాలైన తమ చిన్నారి కూతురు శిరీషకు చదువులతల్లి, వెంకన్న నుతులతో ప్రారంభమైన ఈ సంపుటిలో నీతి ప్రబోధక - ప్రకృతివర్ణనాత్మక గేయాలున్నాయి



బుడిబుడి నడకల - బుజ్జబ్బాయి/ గడబిడ చేయొద్దు
తడబడు అడుగుల - నడిచేటప్పుడు / తత్తర పాటొద్దూ -
అని నీతి చెప్పితే ఆ బాబు తక్కువ తిన్నాడా? ఎన్ని యక్షప్రశ్నలు!
ఆకాశంలో ఎన్ని చుక్కలో / లెక్క చెప్పవమ్మా,
చుక్కలలోన చక్కని చంద్రుడు/ ఎక్కడి వాడమ్మా? పు 3

చదువుకుంటె సహనమబ్బు / విద్య ఉంటె వినయమబ్బు - 13
దేవుణ్ణి పూజించెద - దేశాన్ని ప్రేమించెద
తల్లిదండ్రి సేవచేసి - ధన్యుడనయ్యెదనునేను - పు 4
ఒద్దొద్దు నాకొద్దు భేదభావాలొద్దు / నేడొద్దు రేపొద్దు కులమతాలసలొద్దు - 27
అందం అందం ఏమిటి అందం?/ మంచి మనసే మనిషికి అందం!

ఇలా మత హితం, జన హితం కలిగించే వెన్నముద్దలుగా చిన్నారి బాలబాలికలకు విందు భోజనంగా ఈ పాటల పుస్తకాన్ని అందించిన ఆదినారాయణగారు అభినందనీయులు

## 10 మంగళంపల్లి సత్తయ్య - బి ఓ ఎల్ సీతారాంపురం మం చిగురుమామిడి జ. 1938

ఎం సత్తెయ్య గారు ప్రథమశ్రేణి తెలుగు పండితులుగా పనిచేసి విశ్రాంతి పొందారు (సత్యం పదానికి వికృతి సత్తెం సత్తెం+అయ్య=సత్తెమయ్య, సత్తెయ్య అయినా జన వ్యవహారంలో ఎందుకో సత్తయ్య అనే ఉంది) ఉద్యోగ కాలంలో వీరు పద్యాలు గేయాలు వ్రాసేవారు 'గాంధి జీవిత కథ' ఓ పెద్ద అముద్రిత గేయం వీరి బాల గేయాలను 'స్వేచ్ఛాస్మృతి ' పేరుతో 1995లో ముద్రించారు సాయిశతకం, ముద్దుచెల్లె శతకం, వీరి అముద్రిత రచనలు

"స్వేచ్ఛా స్మృతి" డా వి వి గురునాథశర్మ, జి కిషన్‌రావు (రిటైర్డ్ - ప్ర ఉ ) ఎం ఏ ఖదీర్ జిల్లా పండిత పరిషత్తు కార్యదర్శి గారల, మరియు నాయకులు దేశిని చిన మల్లయ్య, చాడ వేంకటరెడ్డి, బొమ్మా వెంకన్న గారల ఇంకా కవి పండితుల మందుమాటలతో వెలువడింది

తొలి పలుకులో కవి విద్యార్థి దశలో తమకు భక్తి సాహిత్యానురక్తికి కారణమైన వారిని పేర్కొనడం జరిగింది వీరు స్మరించిన సద్గురు మదనానంద స్వామి' పేరు కొత్త,

విద్యాబోధన కాలంలో ప్రతి సంవత్సరం జాతీయ పర్వదినాల సందర్భంగా పాడుకోవడానికి తగినట్లుగా కవి ఈ రచనలు చేశామన్నారు ఈ కృతిలో 31 పాటలు మరికొన్ని 'చెల్లి' శతక పద్యాలున్నాయి 2 పంద్రా ఆగస్టు, 15 జ్ఞానజ్యోతి, సీటు విలువ 26 ప్రచలన గీతలు మొ॥ ఇందలి శీర్షికలు

స్వాతంత్ర్యదినము నేడనుచూ చాటి చెప్పరా
స్వాతంత్ర్య భరత మాతకుజై - జైయనియనరా - 4
ఎగిరింది ఎగిరింది ఎగిరింది జెండా/ ఈ రేడులోకాల తనకీర్తి నిండా - 9

జాతీయ పర్వదినాలే కాక జాతీయ నాయకుల సంస్మరణ గేయాలు ఇందులో ఉన్నవి విద్య నీతి మాత్రమే కాక క్రీడలు విలువలు, చాటే పాటలు ఉన్నవి

## 11 కె శ్రీహరి - బి ఏ ఇందుర్తి వ 34 అధ్యాపకులు

శ్రీహరిగారు అధ్యాపకులు విద్యార్థులకు నీతి ప్రీతి చేకూర్చే గేయాలు రచించి 'బాలల పాటలు' అనే పేర సంపుటాన్ని వెలువరిస్తున్నారు - 1996 దాదాపు 25 గానయోగ్యాలైన పాటలు ఇందులో నీతి ప్రబోధకాలుగా ఉన్నాయి వాతావరణ కాలుష్యనివారణ, ప్రకృతి పరిరక్షణ గేయాలు వీటిలో విలువైనవి విద్యార్థి విద్యార్జనాసక్తి కలిగించి, దేశభక్తిని పెంచుటకు దోహదపడే ఈ గేయ సంపుటి జనాదరణ పొందుతుందని ఆశించవచ్చు

డా సి నా రె , డా పి యశోదా రెడ్డి, డా జె బాపురెడ్డి గారలు కూడ కొన్ని బాలగేయాలు రచించారు

## కథలు - నవలలు

బాలగేయాల వలెనే పిల్లలకు కథలు వ్రాయడం కూడా చాల శ్రమతో కూడిన పని భాష-భావాలు వారికి అందుబాటుతో అభివృద్ధికి తోడ్పడేవిగా ఉండాలి అవి వ్రాయడానికి ఎంతో నేర్పు-ఓర్పు అవసరం అట్లా లేనివి ఆశలు రేకెత్తించి భ్రమల్లో ముంచి పసివాళ్ల మనస్సులను తప్పుదారి పట్టిస్తాయి అభూతకల్పనలు ఆసక్తిగా చదివిస్తూ బాల సాహిత్యంగా చలామణి అవుతున్నా అది సరికాదు చారిత్రక సంఘటనలతో కూర్చినవి, సాంఘిక నీతికథలు, పిల్లలకు చాల మేలు చేస్తాయి ఈ జిల్లాలో బాల కథా రచయితలు నలుగురైదుగురికి మంచిలేరు వారి వివరాలు చూడండి

### 1 డా యశోదారెడ్డి

గ్రామీణ జీవితాలను, పిల్లల మనస్సులను చక్కగా అవగాహన చేసుకున్న రచయిత్రి డా యశోదగారు 1960 సుమారుగా 1 నక్కబావ, 2 బడిపెద్ద 3 బూచిగాడు, అనే వీరి పిల్లల కథలు ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రం ప్రసారం చేసింది ఎచ్చెమ్మ కథలుగా బహుళ ప్రచారం పొందిన వీరి 'పేదరాశి పెద్దమ్మకథలు' పిల్లలకు విజ్ఞాన వినోదాలను అందించాయి ఇవి కూడా రేడియో ప్రసారాలే వీరి బాలకథా సాహిత్యం పుస్తకాల రూపంలో రాలేదు

### 2 డా సి నారాయణరెడ్డి

నారాయణరెడ్డి గారు గేయ కవి సమ్రాట్ వీరు బాలగేయాలు చాలా తక్కువగా వ్రాశారు కథలు వ్రాయలేదు కాని పిల్లల బొమ్మల పురాణ పుస్తకాలు మూడు వ్రాశారు డా దాశరథి గారు సహరచయితగా వీరు రచించిన 1 పిల్లల బొమ్మల భారతం, 2 పి బొ రామాయణం, 3 పి బొ భాగవతం[7] వ్యాప్తిలో ఉన్నాయి ఈ పుస్తకాలను సి నా రె సాహిత్య జీవిత చరిత్రలలో పేర్కొలేదు ఒక్క ఏ లక్ష్మీ రమణ గారు మాత్రం 'మహతి వ్యాసంలో సి నా రె రచనగా ఒక్క 'బొమ్మల భాగవతము' 1960ను పేర్కొన్నారు[8] అంతటి ఉద్గ్రంథాలను సంగ్రహంగా సరళంగా వ్రాయడం ప్రతిభైకసాధ్యం వీరి రచనలు యధామూల సరస మనోహరాలు కొండా శంకరయ్య అండ్ సన్స్ సికింద్రాబాద్ పబ్లిషర్స్ మల్లికార్జున పబ్లికేషన్స్ వారికి పుస్తకాలు హక్కులు 1977లో అమ్ముకున్నారు వీరి మొదటి ముద్రణ 1960-65 మధ్య అని లక్ష్మీ రమణగారిచ్చిన తేదీని బట్టి అనుకోవచ్చు

**3 మలయశ్రీ** బాలగేయాలు, పిల్లల కథలు, జీవిత చరిత్రలు, సైన్సు పుస్తకాలు, లోకవిజ్ఞానం పుస్తకాలు ఈ రచయిత పిల్లలకోసం రచించారు

వీరి బాల కథా సంపుటి 1 సరదా కథలు - 1982లో వెలువడింది 44 పుటల ఈ పుస్తకంలో 20 కథలున్నాయి రచయిత తాము విన్నవి, స్వయంగా కల్పించినవి ఈ బాలనీతి కథలు హాస్యానికి సంకేతంగా సరదా పదం చేర్చారు ఇవి ఏ పత్రికలలోనూ ముందుగా ప్రచురింపబడినవి ఆ తర్వాత 'బాలమందిరం' సం॥ రఘువీర సింగ్ బాలసాహిత్య మాస పత్రికతో ఈ కథలు కొన్ని ప్రచురింపబడ్డాయి

**4 వాసాల నరసయ్య** వీరు గేయకవి, వీరివి నాలుగైదు పుస్తకాలు ముద్రణ పొందాయి

పిల్లల కోసం నరసయ్యగారు రచించిన నీతి కథలు పదేండ్లుగా వివిధ వార మాసపత్రికలలో ప్రచురింపబడుతున్నవి కాని ఇంకా అవేవీ ప్రత్యేక పుస్తకంగా రాలేదు

**5 ఎర్రోజు సత్యం** సత్యం గారు ముఖ్యంగా బాలగేయ రచయిత వీరు 1986లో ప్రచురించిన తమ 'సాహితీ కిరణాలు' సంపుటిలో గేయాలతోపాటుగా కొన్ని బాల 'నీతికథలు'

కూడా చేర్చారు అవి 1 పాపం సుబ్బారావు, 2 బుద్ధి చెప్పిన పాలేరు, 3 మూర్ఖులు, 4 తాతగారు చెప్పిన మంచి మాటలు

**6 చాడ లక్ష్మినారాయణ, బి ఏ బి ఇడి - మానాకొండూరు జ 8-1-1932**

లక్ష్మీనారాయణగారు రిటైర్డ్ అధ్యాపకులు 'బాపుసారు' పేరుతో విద్యార్థులకు పరిచితులు స్కౌటు మాస్టర్‌గా ఆదర్శ ఉపాధ్యాయులుగా ఎంతో పేరుగడించారు వీరు రచయిత అనే విషయం అతిసన్నిహితులకు తప్ప వేరెవరికీ తెలియదు



వీరి కాశీయాత్ర అనే బాలనీతి కథల సంపుటి 1991లో వెలువడింది మరో నవల మూడు నాటకాలు ఒక ఏకాంకిక అముద్రిత రచనలుగా ఈ పుస్తకం చివర పేర్కొన్నారు

ఈ 24 పుటల సంపుటిలో 1 కాశీయాత్ర, 2 అపకారికి ఉపకారము, 3 నిజం, 4 ఎదురు తిరిగిన ఎప్రిల్ ఫూల్ 5 సమయస్ఫూర్తి, 6 తండ్రి మనస్సు, 7 ధాతృత్వం, 8 దీక్ష, 9 పరీక్ష అనే పేర్లతో తొమ్మిది చిట్టి కథలున్నాయి అవన్నీ నీతికథలు, మొదటి కథ తీర్థయాత్రలకంటే ఆపదల్లో ఉన్నవారిని ఆదుకోవడమే మిన్న అని, చివరిది మానవులు స్వార్థపూరితులని తెలిపేకథలు

## చరిత్రలు - జీవిత చరిత్రలు - సైన్సు, విజ్ఞాన పుస్తకాలు

ఈ జిల్లాలో పిల్లలకోసం రచింపబడిన దేశ చరిత్రలు ఇంతవరకు లేవు జీవిత చరిత్రలు ఇవి

**1 మలయశ్రీ** - ఈ రచయిత రచించిన ఓ పది మంది భారత విప్లవ వీరమూర్తుల చరిత్రలు ఒకే సంవత్సరం 1990లో బాలి బొమ్మలతో ప్రచురించబడ్డాయి ఆంధ్రప్రదేశ్‌లోనేకాక అఖిలభారత ప్రముఖ పట్టణాల్లోనూ పంపిణీ అయిన ఈపుస్తకాల పేర్లివి

1 బొమ్మల భగత్‌సింగ్, 2 బొమ్మల చంద్రశేఖర్ ఆజాద్, 3 బొమ్మల యశపాల్,
4 బొమ్మల భగవతీచరణ్, 5 బొమ్మల అల్లూరి సీతారామరాజు, 6 బొమ్మల సుభాశ్చంద్రబోసు,
7 బొమ్మల జయప్రకాశ్ నారాయణ, 8 బొమ్మల రాజారాం మోహన్‌రాయ్, 9 బొమ్మల డా బి ఆర్ అంబేద్కర్, 10 బొమ్మల యోగి వేమన ఇవి మలి ముద్రణలు కూడా పొందాయి

ఈ జీవిత చరిత్రలు ప్రచురించిన నవరత్నాబుక్ సెంటర్, విజయవాడ - 2, మలయశ్రీ గారి మరికొన్ని సైన్సు పుస్తకాలు కూడా 1990లోనే ప్రచురించారు

అవి 3 1 విశ్వంభర జన్మరహస్యం, 2 మన శరీరం - పరిరక్షణ, 3 మన ఆహారం - ఆరోగ్యం
ఈ రచయిత కూర్చిన జనరల్ నాలెడ్జ్ పుస్తకాలు 1983లో మూడువచ్చాయి

1 విజ్ఞానదర్శిని - వాహిని పబ్లికేషన్స్, విజయవాడ
2 లోక జ్ఞానం - మొదటిభాగం, భార్గవీప్రచురణ వి వాడ
3 లోక జ్ఞానం - రెండవ భాగం

ఇవన్నీ చందమామ సైజులో నూరేసి పుటల పుస్తకాలు ఇదే సంస్థ ఇదే సంవత్సరం ప్రచురించిన మరి యిద్దరు కరీంనగర్ రచయితల - పుస్తకాల పేర్లివి

**2 ఎస్ వేంకటాద్రి** ఎం ఏ , 1 మహాభయంకర మారణాస్త్రాలు - 1990

**3 ఎస్ హర్షవర్ధన్** - బి కాం వీరి పరిచయం గేయ - కథా రచయితల్లో ఉంది
1 ఆకాశయానం - 1990

**4 జైన శ్రీనివాస్** బి ఏ మునిమాణిక్యం శ్రీనివాస్‌గారు స్వగ్రామంలో స్వయంగా ఓ పాఠశాలను నడుపుతున్నారు విద్యార్థులకు ఉపయుక్తాలైన వివిధ రచనలు చేస్తున్నారు వీరి బాలగేయాలు కథలు వ్యాసాలు వివిధ పత్రికలలో అచ్చు పొందాయి వీరు ‘ విజ్ఞాన జ్యోతి’ అనే పేరుతో 1990లో ఒక సంగ్రహ బాల విజ్ఞాన పుస్తకాన్ని కూర్చి ప్రచురించారు 16 పుటల ఈ సంపుటి నాటి పెదబాలశిక్షను పోలినా నేటి విజ్ఞాన విషయాలు కూడా దీనిలో ఉన్నాయి

## నాటికలు

వట్టికోట ఆళ్వారు స్వామిగారు 1960 సుమారుగా ప్రచురించిన ‘చిరుగజ్జెలు బాల నాటికల సంపుటిలో డా పి యశోదారెడ్డి, డా సి నారాయణరెడ్డి గారల నాటికలు చెరి ఒకటి ఉన్నాయి ఆ తర్వాత దాదాపు ముప్పదేండ్లకు పి హైమవతిగారి ‘జ్ఞాన కిరణాలు’ బాల నాటికల సంపుటి 1991లో వచ్చింది ఈ పుస్తక పరిచయం ముందే చేయబడి ఉంది

ఇవి తప్ప ఈ జిల్లాలో పిల్లల నాటకాలు కానీ నాటికలు కానీరాలేదు

## వ్యాసాలు

వివిధ పత్రికలలో, సంచికలలో పిల్లల కోసం వ్రాసిన వ్యాసాల పరామర్శ వదలితే ఈ జిల్లాలో వెలువడిన ‘వ్యాస సంపుటి’ ఒకే ఒకటి అది ఇది

**1 రేగులపాటి కిషన్ రావు** 1 వ్యాస మంజరి[1] 1989 పుటలు -32

ఉద్యోగం చెట్లు పరీక్షలు వ్యవసాయం సూర్యుడు, నదులు, జనాభా, పుస్తకాలు, పంట విద్య ఇల్లు, చిరంజీవులు, సత్యం, క్రమశిక్షణ ఇందలి 14 వ్యాసాలు విద్యార్థులకు పరీక్షలకు కొన్ని, విజ్ఞానాన్ని అన్నీ ఉపకరించేలా ఉన్నాయి ఇవన్నీ మొదట ‘కథాంజలి మాసపత్రికలో ప్రచురించబడినవి (పుస్తక పీఠికలో ఉంది) వ్యాసాలు దేనికది విడిగా బాగున్నా సంపుటంగా ప్రచురించేటప్పుడు విషయక్రమాన్ని పాటించి ఉంటే బాగుండేది

## సంకలనాలు - పత్రికలు

బాలకవితా సంకలనాలు ఈ జిల్లాలో రెండే రెండు వెలువడ్డవి

**1 పువ్వులు - 1979** అంతర్జాతీయ బాలల దినోత్సవ సందర్భంగా అరుణోదయ కళానికేతన్ పెద్దపల్లి వారు స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్ పెద్దపల్లి శాఖ వారి సహాయంతో ఆర్ బాలప్రసాద్‌గారు సంపాదకులుగా (1979లో) వెలువరించారు ఇందలి 21 కవితలలో సగానికి పైగా ఈ జిల్లా కవులవే కాని వాటిలో పెద్దలకు వ్రాసిన వచన కవితలు అధికం ఇందులో పిల్లల స్థాయికి తగిన గేయాలు తక్కువగా ఉన్నాయి పిల్లల సంక్షేమానికి - అభివృద్ధికి, పెద్దలు ప్రభుత్వం తీసుకోవలసిన సూచనలు మాత్రం ఎక్కువగా ఉన్నవి

ఈ సంకలనంలో మలయశ్రీ, చొప్పకట్ల చంద్రమౌళి కె వి సంతోష్‌బాబు, గొట్టిపర్తి యాదగిరి వేల్పుగొండ రామచంద్రగౌడు, కె రాధాకిషన్ గారల గేయాలు బాలబాలికల స్థాయికి తగినట్లుగా ఉన్నాయి

**2 బాల వికాస గేయాలు - 1993**

కరీంనగర్ బాల వికాస సమితి వ్యవస్థాపకులు వి భూపతిరెడ్డి, ఎం ఏ , ఎల్ ఎల్ బి , ఎం ఇడి గారు, మలయశ్రీ గారి సంపాదకత్వంలో సంకలన పరచిన గేయ సంకలనం ఈ బాల వికాస

గేయాలు 32 పుటల ఈ పుస్తకంలో 100 గేయాలు విషయాల వారిగా వింగడించి పొందుపరచారు ఈ జిల్లా రచయితలవి జనం వ్యాప్తిలో ఉన్నవి ఇతర ప్రాంతాల కవుల పుస్తకాలలోనివి ఏర్చి ఈ సంకలనాన్ని కూర్చారు

బాలల అకాడెమి హైదరాబాద్ డైరెక్టర్ శారదా అశోకవర్ధన్ గారు ఈ సంకలనాన్ని - దీనిని కూర్చి ప్రచురించిన సత్సంకల్పాన్ని ఇట్లా ప్రశంసించారు "పిల్లలు ఎంతో ఉత్సాహంగా పాడుకోవడానికీ మళ్లీ మళ్లీ చదువుకొని ఆనందించడానికి, విజ్ఞానాన్ని పెంపొందించటానికి పనికి వచ్చే ఈ బాలగేయాల సంకలనం ఉపాధ్యాయులకు కరదీపికగా రూపొందించి కరీంనగర్ జిల్లాలోని అన్ని పాఠశాలలకు పంపేందుకు లక్ష్యంగా పెట్టుకోవటం ఎంతో హర్షించం విషయం"

ఇందులో డా సి నారాయణరెడ్డి, డా జె బాపురెడ్డి, మలయశ్రీ, ఎస్ వేంకటాద్రి, డా బి దామోదర్ రాదు, డా జి లక్ష్మణ్‌రావు, జి వి కృష్ణమూర్తి, పి భూపతిరెడ్డి, ఎ హరికిషన్ రావు, దూడం నాంపల్లి, సబ్బని లక్ష్మినారాయణ, బి రాంబాబు మొ॥వారల చక్కని గేయాలున్నాయి

**బాల సాహిత్య పత్రికలు**

1970 సుమారుగా ప్రభాకర్ గారు 1 విద్యార్థి' అను పత్రికను ప్రారంభించి ఆపుచేశారు

బి రాజవీరుగారు 2 బాలలోకం - మాసపత్రికను నడిపారు

3 బాలమందిరం - బి రఘువీర్‌సింగ్ కరీంనగర్ గారు ఉత్సాహంగా ఉన్నతస్థాయిలో 1991లో వెలువరించిన బాలమందిరం సచిత్ర మాసపత్రిక కేవలం రెండు సంచికలతోనే నిలిచిపోయింది

4 బాలవెన్నెల - సంపాదకులు - వి భూపతిరెడ్డి, కరీంనగర్

బాలవికాస సమితి ట్రస్ట్ తరపున రెడ్డి గారు ప్రచురిస్తున్న ఈ బాల త్రైమాసిక పత్రిక నాలుగేండ్లుగా నిరంతరంగా వెలువడుతున్నది పిల్లలకు పెద్దలు అందించిన విజ్ఞాన విషయాలతో పాటుగా, పిల్లల రచనలు కథలు, కవితలు, జోక్స్ మొ॥వి పత్రిక సగభాగంలో ప్రచురించడం వినూత్నప్రయోజనకరమైన ప్రయత్నం ఈ విధానాన్ని ఇప్పుడు రాష్ట్ర ప్రముఖ పత్రికలు కూడా 'పిల్లల రచన' పేజీ ఉంచి అనుసరిస్తున్నాయి దీనిని కుడ్య పత్రికగానూ వినియోగపరచుకోవచ్చు బాలలకు విద్యావిజ్ఞాన విషయాలు, సమావేశాల వివరాల ఇందులో పొందుపరచి సెకండరీ పాఠశాలల కన్నింటికి ఉచితంగా అందిస్తున్నారు

## బాల సాహిత్య సమాలోకనం

ఈ జిల్లా బాల సాహిత్యరంగంలో ప్రతిప్రక్రియలో ఒకరిద్దరు చేయితిరిగిన రచయితలున్నారు అయినా ఇంకా చాలామంది రచయితలు చక్కని వినోద విజ్ఞానాలనందించే పుస్తకాలు ఎక్కువ సంఖ్యలో వ్రాయవలసిన అవసరం ఎంతైనా ఉంది ఒక మంచి పుస్తకం మంచి మిత్రునికి సమానం అనే విషయం పిల్లల పట్ల నూటికి నూరుపాళ్ల నిజం

కిడ్డీ బ్యాంకులకంటె విలువైనవి పిల్లలకు బుక్ బ్యాంకులు ఆకలి రుచినెరుగదు అన్న సామెతగా అందుబాటులో మంచిపుస్తకాలు లభించకపోతే పిల్లలు అందుబాటులో ఉన్న చెత్త పుస్తకాలన్నీ చదివేస్తారు టి వి సినిమాల వెంట పడుతారు - దానితో చెడిపోయే అవకాశం ఎక్కువ ఉంది అందుకే పిల్లలకు మంచి పుస్తకాలు ఇంకా ఇంకా అందించాలి

## పాద పీఠికలు

1 అప్పుడు కరుణశ్రీ, మలయశ్రీ ప్రభృతుల తొమ్మిది పుస్తకాలు బహుమతి పొందాయి భాగ్యనగరం జూబిలి హాల్లో విద్యామంత్రి పి వి రంగారావు గారిచే తేది 8 9 1991 రోజున బహుమతుల ప్రదానోత్సవం జరిగింది

2 ఎన్ శ్రీనివాస్ - ఎం కాం స్వగ్రామం హుజూరాబాద్ తాలూకాలోని కందుగుల బ్యాంక్ ఉద్యోగిగా వీరు కరీంనగర్లో ఉంటున్నారు ఉదయం దినపత్రికకు వీరు సాంస్కృతిక విలేకరి కరీంనగర్ ఫిల్మ్ సొసైటి జిల్లా వినియోగదారుల సంఘంలో శ్రీనివాస్ గారు క్రియాశీల కార్యకర్త - వీరు అభ్యుదయ సాహిత్యాభిమాని

3 ఎస్ ఆర్ సి హైద్రాబాద్ ప్రచురణ ఆగస్టు 1993 కోడ్ నెం 0021 1 9 2వది 1997 ప్రచురణ

4 ఈ పత్రికలో సాధారణంగా రచయిత పేరు వేస్తూలేరు

5 జిల్లా కలెక్టర్ డి ఇ ఓ మరియు డైట్ ప్రిన్సిపాల్

6 తెలుగు' మాసపత్రిక - తెలుగు అకాడెమి హైద్రాబాద్ ప్రచురణ - ఏప్రిల్ 1992

7 బాలి బొమ్మలతో 1977 మల్లికార్జున ప్రచురణ పుస్తకాలు కనిపించాయి

8 'బాలసాహిత్యం వ్యాసం మహతి' 1992, పు 35

చరిత్రలు జీవిత చరిత్రలు

1 ఇదే పేర డా డింగిరి రామాచార్యగారి మరో వ్యాస సంపుటముంది అది తర్వాత 'వచనరచనలు' విభాగంలో చూపబడుతుంది

# 7. వచన సాహిత్యం

మనం నిత్య వ్యవహారంలో వచన భాషనే వాడుతున్నా తెలుగు సాహిత్య గ్రంథాల్లో మాత్రం మొదటి నుండీ పద్యానిదే పైచేయిగా ఉంది పద్యం పండితైక వేద్యం అయినా ఈ ఇరువదవ శతాబ్ది సగం కాలం వరకు అదే పరిస్థితి కొనసాగింది మన తెలుగు పూర్వకాలపు వచన రచన స్వరూపాన్ని తెలుసుకోవాలంటే రాతి శాసనాలను, నాటి చంపూ కావ్య ప్రబంధాల లోని గద్య భాగాలను చూడవలసిందే గత శతాబ్ది వరకు తెలుగులో వచనరచనలు బహుస్వల్పం

కృష్ణమాచార్య సింహగిరి వచనములు, తాళ్లపాక పెద తిరుమలాచార్యుల - శ్రీ వేంకటేశ్వర వచనములు, గద్యాలన్నా -గేయ ప్రబంధాలనుకున్నా, అవే తెలుగు తొలి వచనరచనలు వీరిద్దరూ వైష్ణవ భక్తులు 13 16 శతాబ్దాలవారు

అనంతకాలంలో ఏకామ్రనాథుని 'ప్రతాపరుద్రచరిత్ర', కాసెసర్వప్ప - సిద్ధేశ్వర చరిత్ర, స్థానాపతి రాయవాచకము' కళువె వీరరాజు 'వచన భారతము', ఏనుగుల వీరాస్వామి 'కాశీయాత్ర' మొ॥ వచన గ్రంథాలు విరచింపబడినా, అవి పదికి మించవు ఇవి 16-19 శతాబ్దాల మధ్య కాలపువి ఇంచుమించు అవన్నీ వ్యావహారిక తెలుగు భాషలో ఉండటం విశేషం

పందొమ్మిదవ శతాబ్దంలో పరవస్తు చిన్నయసూరి 'బాలవ్యాకరణం' లక్షణ గ్రంథాన్ని రచించి, దానికి లక్ష్యంగా 'నీతి చంద్రిక'ను రచించడంతో తెలుగులో గ్రాంధిక వచనం తప్ప, వ్యావహారిక భాష వాడకూడదనే వాదం పండితలోకంలో ప్రబలింది

నన్నయ్య వాడిన భాష తప్ప, తక్కిన దేశీయ భాష పద్యాల్లో వాడకూడదని 'దక్షవాటి కవి రాక్షసుడు' నియమం చేశాడని అప్పకవి నొక్కి చెప్పినట్లుగానే - చిన్నయ్య సూత్రీకరించిన గ్రాంధిక భాషను తప్ప, తదితరరూపంగా తెలుగు వచనం ఉండకూడదని మన పండితులు శాసించారు

గిడుగు రామమూర్తి, కందుకూరి వీరేశలింగం, గురజాడ అప్పారావు పంతుళ్ల కృషి ఫలితంగా వ్యావహారికాంధ్ర భాష క్రమంగా జనాదరం పొందింది

రానురాను పండితులచేత ఆదరింపబడి, ఆది ప్రభుత్వం వారిచే సైతం ప్రోత్సహింపబడుతున్నది

వార్తా పత్రికలు, పుస్తకప్రచురణ సంస్థలు, పరిషత్తులు-ఆకాడెమీలు, తెలుగు సాహిత్యవ్యాప్తికి, వ్యావహారిక భాషా ప్రచారానికి సముచిత పాత్ర నిర్వహించాయి మన దేశ-రాష్ట్ర స్వాతంత్ర్యానంతరం దేశభాషలకు గౌరవం పెరిగింది ఈనాడు ప్రభుత్వ భాషగా, విద్యాలయాలలో బోధనా మాధ్యమంగా తెలుగు సముచిత స్థానం పొందింది క్రమంగా సర్వేసర్వత్రా వ్యావహారికాంధ్ర భాష సమాదరింపబడు తున్నది మాండలిక భాషా విభేదాల అభిమానాల చర్చవదలితే ప్రముఖ పత్రికల భాషను ప్రామాణికంగా భావించి తెలుగు అకాడెమీ కూడా పాఠ్య గ్రంథాలలో వాడుతున్నది

పద్యం గౌరవింపబడుతూనే వెనుకకు వెళ్లింది వచన కవిత-గేయం పర్వదినపు వేడుకలవలె ప్రత్యేక సందర్భాల ప్రయోజనాలవి ఇప్పుడు తెలుగు వచనం, అదీ వ్యావహారికాంధ్ర భాష, ఇంటా బయటా అధిక జన వ్యాప్తి పొంది ప్రయోజనకారిగా ఉంది పద్యం పాయసం, గేయం పానకం, వచనం మంచినీరు!

తెలుగు వచన గ్రంథాలపై సమగ్ర పరిశోధన జరిపిన డా ఎం కులశేఖర్ రావుగారు నేటి తెలుగువచన ప్రస్థానాన్ని ఇట్లా వ్యాఖ్యానించారు "ఆధునిక యుగానికి పూర్వం తెలుగు ప్రయోజనం కేవలం కథా కావ్యాలకు మాత్రమే సీమితం అయి ఉండేది కాని, శ్రీ వీరేశలింగం గారు దాన్ని చేపట్టటంతో, నవల, వ్యాసం, విమర్శనము, జీవిత చరిత్రలు, సాహిత్య చరిత్ర, కథానిక, శాస్త్రరచన మున్నగు విభాగాలను వచనం అక్రమించింది "1 దీనికి అభినందిస్తూనే వీరు ఆధునిక

వచన రచనా ధోరణికి తమ ఆవేదనను వ్యక్తం చేశారీవిధంగా - వచన రచన వ్యావహారికంలో జరగడంలోని కొన్ని సాధన బాధకాలను చర్చించడం ఇచట అనుచితం కాదు భాషలోని లోతుపాతులు తెలిసిన వ్యుత్పన్నులు వ్యావహారిక భాషలో రచనలు చేసినా దానిలో ఉండే గాంభీర్యానికి విఘాతం కలుగదు కాని భాష వ్యావహారికమే కదా అని, అవ్యుత్పన్నులు, ఆ పండితులు రచనా వ్యాసంగానికి పూనుకుంటున్నారు దీనివల్ల రచనల్లో భాషకూ, భావానికీ, విఘాతం కలుగుతూ ఉన్నది మనం స్వాతంత్ర్యం రావడంతో స్వేచ్ఛను పొందినామని సంతోషించినా, భాషాపరంగా మరింత పారతంత్ర్యానికి గురి అయినాము ఈనాడు వెలువడే నవలల్లో కథానికల్లో, ఎంత ఇంగ్లీషు కలిపి వ్రాస్తే అంత గొప్ప అనుకుంటున్నారు రచయితలు ఎన్నో నవలల పేర్లు, కథలపేర్లు కూడా ఇంగ్లీషులోనే ఉన్నాయంటే, మనం ఎంత పారతంత్ర్యానికి గురి అయినామో తెలుస్తుంది ఈ పరిణామం ఏభాషకూ ఆరోగ్యప్రదంకాదు మన వారికి ఇంగ్లీషు మీద వ్యామోహం ఉంటే, ఇంగ్లీషు రచనలను చదవడం అదే భాషలో వ్రాయడం చేయవచ్చు కాని, భాషా సాంకర్యం మంచికి దారి తీస్తుంది అనడానికి ఆస్కారం లేదు ఇది వ్యావహారిక భాషలోని హేతువాద దృష్టిని అర్థం చేసుకోకపోవడం చేత వచ్చిన వికృతే పరిణామ మనడంలో సందేహం లేదు " (మహతి వ్యాసం నం 67, పుట 44)

భాషా చర్చ భావ ఘర్షణ అర్వాచీన కాలంలోనే కాదు అది ఎప్పుడూ ఉంది - ఉంటుంది మార్పు అని వార్యం మంచో చెడో, ప్రభావమేదైనా సజీవ భాష దేశకాల పరిస్థితులను బట్టి మారిపోతూనే ఉంటుంది కాని భాషకు ఒక స్పష్టమైన స్వరూపాన్ని కాపాడుకోవలసిన బాధ్యత ప్రజలపై ఉంది అవిద్యావంతులకంటె విద్యావంతులపై, అందులో సామాన్య చదువరులకంటే రచయితలపై ఈ బాధ్యత అధికంగా ఉంది అని అనక తప్పదు

ఈనాడు తెలుగు వచన రచనది రాకెట్ వేగం - దీనితో మంచినీటి కున్నంతటి ప్రయోజనం ఈ కరీంనగర్ జిల్లాలోని తెలుగు వచన రచనల పరిచయం ఈ అధ్యాయంలో చేయబడుతుంది నవల-కథ, నాటకం-నాటికల (ఈ గ్రంథంలోని ఆరవ అధ్యాయంలోని 5, 6, శీర్షికలు) పరిచయం ఇంతవరకే చేయడం జరిగింది ఇక మిగిలింది ఇతర వచన రచనల వివరణ

వచన రచనల విభాగం అతి విస్తృతం, చరిత్రలనే తీసుకుంటే దేశ, స్థల, సాంఘిక, సాహిత్య, కళా, రాజకీయ, క్రీడా జీవిత చరిత్రలని అవి ఎన్నో విషయ భేదాలతో ఉంటాయి ఈ శీర్షికలను ఈ జిల్లాలో వెలువడిన వచన రచనలను బట్టి, విషయ ప్రధానంగా కొన్ని అనుకూల విభాగాలుగా చేసి ఇందులో పరిచయం చేయడం జరుగుతున్నది అవి ఇవి

1 అనువాద గ్రంథాలు 2 భక్తి రచనలు 3 చరిత్రలు 4 సాహిత్య రచనలు
5 శాస్త్ర గ్రంథాలు - పార్య పుస్తకాలు 6 జీవిత చరిత్రలు - ఆత్మకథలు
7 వ్యాసాలు అభినందన సంచికలు 8 సూక్తులు ఇతర పుస్తకాలు

## అనువాద గ్రంథాలు

ఇతర భాషలోని ప్రముఖ గ్రంథాలకు ఆకర్షితులై వానిలోకొన్నింటిని అనువదించిన వారి పరిచయం ఈ విభాగంలో చేయబడుతున్నది ప్రముఖ అనువాద గ్రంథ రచయితలు వీరు

1 పి వి నరసింహరావు, 2 ముద్దసాని రాంరెడ్డి, 3 డా పి యశోదారెడ్డి,
4 జి సురమౌళి, 5 డా కె రాజన్నశాస్త్రి, 6 నూగూరి జనార్దన, 7 వి మల్లయ్య,
8 కటకం రాజలింగమార్య, 9 ఇమ్మడి సంవత్కుమార్, 10 డా మలయశ్రీ

**1 పి వి నరసింహారావు - బి ఎస్సి, ఎల్ ఎల్ బి వంగర జ 28 జూన్ 1921**

పాములపర్తి వేంకట నరసింహారావు గారు మన రాష్ట్ర ముఖ్యమంత్రిగా దేశ ప్రధానిగా లబ్ధ ప్రతిష్ఠులు అష్టభాషాకోవిదులుగా కవిగా రచయితగా వీరు పేరు పొందినవారు పి వి గా వీరు వ్యవహృతులు

పి వి గారు కవితలు కథలు వ్యాసాలు రచించినా ముఖ్యంగా అనువాద రచయితగానే వీరు పేరు వ్యాప్తిలో ఉంది వీరి స్వగ్రామం కరీంనగర్ జిల్లా హుజూరాబాద్ తాలూకాలోని 'వంగర' ఇప్పుడిది భీమదేవరపల్లి మండలంలో ఉంది పి వి బాల్యం - ప్రాధమిక విద్యాభ్యాసం వంగర, దాని సమీపంలోని వారి బంధువుల గ్రామాల్లో సాగినా, హైస్కూల్ కాలేజి విద్య వరంగల్‌లో ఆర్జించారు

వరంగల్‌లో ఇంటర్ మీడియట్ చదువుతున్న కాలం 1938లోనే వందేమాతరం ఉద్యమంలో పాల్గొని నిజాం సర్కారుచే దేశ బహిష్కార శిక్షపాలయ్యారు అలా బహిష్కృతులైన వారు 300 మంది విద్యార్థులు ప్రభుత్వానికి క్షమాపణ చెప్పి తిరిగి కాలేజీలో చేరిపోగా, పి వి మాత్రం అందుకు అంగీకరించక నాగపూర్‌లో ఇంటర్ 1938 పూర్తి చేశారు తర్వాత పూనాలో బి ఎస్సి గణితంలో చదివారు ఆ తర్వాత తిరిగి నాగపూర్‌లోనే ఎల్ ఎల్ బి లో బంగారుపతకం సాధించి స్వగ్రామానికి చేరుకున్నారు మహారాష్ట్రలో ఉన్నకాలంలో ప్రముఖ రాజకీయ నాయకుల కలుసుకోవటంతో పాటు హిందీ, మరాఠీ భాషలు నేర్చుకున్నారు ఆంగ్లంలో రచనలు చేశారు

హైదరాబాద్ చేరి 1946లో బూర్గుల రామకృష్ణారావు గారికి అసిస్టెంట్‌గా న్యాయవాద వృత్తి ఆరంభించారు 1947 ఆగస్టు 15 భారత దేశానికి స్వాతంత్ర్యం లభించినా హైద్రాబాద్ స్టేట్ నిజాం పాలనలోనే ఉండి రజాకార్ల అల్లరులు ఆరంభమైనాయి పి వి గారు స్వయంగా ఆరంభించిన 'లా' ప్రాక్టీసు మాని స్వగ్రామం చేరుకున్నారు రజాకార్ల అలజడికి సతీ సమేతంగా చందా క్యాంపునకు వెళ్లిపోయి రాష్ట్ర విముక్తి పోరాటకారులకు సహకరించారు [2]

13 సెప్టెంబర్ 1948న ఆరంభమైన కేంద్ర సైనిక చర్యతో నిజాం నవాబు భారత ప్రభుత్వానికి 17-8-1948నాడు లొంగి హైదరాబాద్ రాష్ట్రం విముక్తి పొందింది పి వి స్వరాష్ట్రం చేరుకుని 1949లో కాంగ్రెసులో చేరారు బూర్గులతో విభేదించి స్వామీ రామానంద వర్గంతో చేరారు ఖాదీ, హిందీ ప్రచార సభల కార్యక్రమాలకు తోడ్పడ్డారు

పి వి రాజకీయ జీవితం[3] 1952 జనరల్ అసెంబ్లీ ఎన్నికల్లో మొదటిసారి కరీంనగర్ నియోజకవర్గమునకు పోటీచేసి కమ్యూనిస్టు నాయకులైన బద్దం ఎల్లారెడ్డి చేతిలో ఓడిపోయారు 1954-56 మధ్యకాలములో ఆంధ్ర కాంగ్రెసు కమిటి కార్యదర్శిగా, 1957 నుండి 62 వరకు రాష్ట్ర కాంగ్రెస్ కమిటి ఉపాధ్యక్షులుగా పనిచేశారు 1957, 72 వరకు 57, 62, 67ల్లో మూడుసార్లు మంథిని నియోజక వర్గం నుండి ఎం ఎల్ ఏ గా గెలుపొందారు

1962లో నీలం సంజీవరెడ్డి గారు రెండవ పర్యాయం ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా పదవిని చేపట్టి ఏర్పాటుచేసిన మంత్రి మండలిలో సహాయమంత్రిగా పి వి గారికి న్యాయశాఖ, జైళ్లు, సమాచార పౌర సంబంధశాఖలు ఒప్పగించబడ్డాయి [4] 1967లో కాసు బ్రహ్మానందరెడ్డి గారి మంత్రి వర్గంలో పి వి గారు మార్చిలో సహాయమంత్రిగా న్యాయశాఖ, కోర్టులు, లెజిస్లేచర్, జైళ్లు, ధర్మకర్తృత్వ సంస్థల శాఖలను నిర్వహించారు అదే సంవత్సరంలో ఏప్రిల్‌లో మంత్రి వర్గ విస్తరణలో పి వి క్యాబినేట్ మంత్రి అయ్యారు అప్పుడు వీరికి వైద్య ఆరోగ్యశాఖలు ఇవ్వబడ్డాయి ఆ తర్వాత విద్యాశాఖను చేపట్టారు

జై తెలంగాణా ఉద్యమం కారణంగా బ్రహ్మానందరెడ్డిగారు పదవి నుండి దిగిపోగా తేది 25 సెప్టెంబర్ 1971 నాడు పి వి నరసింహారావు గారు మన రాష్ట్ర ముఖ్యమంత్రి అయ్యారు 1972 మార్చి అసెంబ్లి ఎన్నికల్లో హన్మకొండ నుండి పోటీ చేసి గెలుపొందినా, ప్రత్యేకాంధ్ర ఉద్యమఫలితంగా 17-1 1973 నాడు పి వి ముఖ్యమంత్రి పదవికి రాజీనామా చేసినారు వేంగళరావ్ గారు ముఖ్యమంత్రి అయ్యారు

పి వి 1975లో ఇందిరా గాంధి గారికి సహాయకులుగా కేంద్ర కాంగ్రెసు నలుగురు సెక్రటీల్లో ఒకరుగా ఉన్నారు 1977లో హన్మకొండ నియోజక వర్గం నుండి గెలిచి 'కేంద్ర ప్రభుత్వ' జనతా పార్టీ కాలంలో ప్రతిపక్ష సభ్యులుగా ఉన్నారు 1980 మధ్యంతర ఎన్నికల్లో విజయం సాధించి ఇందిరాగాంధి రెండవసారి ప్రధానిగా ఏర్పాటు చేసిన కేంద్ర ప్రభుత్వంలో మంత్రిగా పి వి విదేశాంగశాఖ నిర్వహించారు

1984 అక్టోబర్ 31 నాడు ఇందిరాగాంధి స్వగృహంలో దేశ విద్రోహులచే హత్య కావించబడ్డారు

1984 డిసెంబర్ ఎన్నికలలో హన్మకొండ నుండి పి వి గారు ఓడి జనతా అభ్యర్థి జంగారెడ్డి గారు గెలుపొందినా, మరో నియోజకవర్గం రాంటెక్ నుండి గెలుపొందారు

రాజీవ్ గాంధి ప్రభుత్వంలో పి వి రక్షణ శాఖ, మానవ వనరుల శాఖ, విద్యా సాంఘిక సంక్షేమం సాంస్కృతిక వ్యవహారాలశాఖల అమాత్యులుగా పనిచేశారు 1989లోనూ మహారాష్ట్ర రాంటెక్ నుండి గెలిచారు

21 5 91న కీ శే రాజీవ్ గాంధి గారు తమిళనాడులో హత్యకావించబడటంతో తేది 29 5 91నాడు, పి వి నరసింహరావు గారు కాంగ్రెసు అధ్యక్షులుగా ఎన్నుకోబడి 21 జూన్ - 1991 నాడు భారతదేశ నూతన ప్రధానిగా పదవికి వచ్చారు [5] నలభై యేండ్ల స్వతంత్ర భారత చరిత్రలో దక్షిణ భారతదేశం నుండి, హిందీ మాతృభాషకాని ప్రాంతాలనుండి ప్రధానమంత్రి అయిన ఏకైక వ్యక్తి పి వి నరసింహారావు గారు సంక్లిష్ట పరిస్థితులలో పదవిని చేపట్టి అయిదేండ్ల కాలాన్ని గడిపి సామర్థ్యంలో అపరచాణక్యుడని దేశ రాజనీతిజ్ఞుల ప్రశంసలందుకున్నారు మే 1996 లో ఎన్నికల్లో కాంగ్రెసు ఓడి ప్రధాని పదవి నుండి వైదొలిగారు

సాహిత్య రంగంలో పి వి సంప్రదాయ కుటుంబంలో పుట్టిన పి వి గారికి బాల్యం నుండి సాహిత్యంపై అభిమానం సహజంగానే ఏర్పడింది జానపద కళారూపాలు వీరిని ఆకర్షించేవి

హైస్కూలులో ఉన్నకాలంలో ప్రముఖ కవి కీ శే గార్లపాటి రాఘవరెడ్డి గారు పి వి గారికి విద్యా గురువుగా పద్యకవిత్వంపై ఆసక్తి కలిగించారు వీరి బంధువు నాగపూర్ సహ విద్యార్థి పాములపర్తి సదాశివరావు హన్మకొండ గారు చక్కని సాహిత్యాభిమాని తర్వాత కాలంలో వీరిద్దరు కలిసి 1948-52 మధ్యకాలంలో 'కాకతీయ పత్రిక'ను నడిపించారు [6] ప్రజాకవి కాళోజీ, బూర్గుల రామకృష్ణరావు, ప్రముఖ పాత్రికేయులు వచన రచయిత దేవులపల్లి రామానుజరావు గారలతో సాన్నిహిత్యం ఏర్పడింది ఇట్లా పి వి గారికి సాహిత్యాభిరుచి క్రమక్రమంగా అభివృద్ధి చెందింది

పి వి గారి జీవిత చరిత్ర వ్రాసిన ఎం ఎల్ నరసింహరావు గారు వీరి రచనలు నిట్లా పేర్కొన్నారు 'శ్రీ పి వి స్వయంగా ఎన్నో వృత్తాలు, ద్విపదలు గీతాలు వ్రాశారు భారతదేశ చరిత్రలో ప్రసిద్ధుడైన జయచంద్రుణ్ణి గురించి 'జయచంద్రాహైందవ ధ్వంసకా' అనే మకుటంతో ఆయన వ్రాసిన కవిత వరంగల్లులోని భజన మండలిలో బాగా ప్రచారం పొందింది మహాకవి గ్రే ఎలిజీని ఆయన తెలుగులో అనువదించారు 'యెధవ నాగన్న' అనే పేరుతో ఒక కథ వ్రాశారు గాదర్డ్ వేటల్స్ అనే పేరుతో శ్రీ పి వి కొన్ని భావ గీతాలు వ్రాశారు షేక్స్పియర్ నాటకాలకు తెలుగులో కథా సంగ్రహాలు వ్రాసినట్లు తెలుస్తున్నది ఆర్తి గీతికలు, అనే పేరుతో కొన్ని ద్విపదలు

వ్రాశారట కరినుకైనను నాగునే కంటి నీరు, అని వారు వ్రాసిన ఒక కవితా ఖండిక చాలా ప్రసిద్ధి పొందింది కాని ఇప్పుడది లభించలేదు '

పి వి గారి సాహితీ మిత్రులు పాములపర్తి సదాశివరావు గారి కథనం ఇది 'భావకవితా సంప్రదాయానికి చెందిన శైలి యొక్క ప్రభావం అధికంగా ఆనాడు ఆయన వ్రాసిన కవితలో కనిపిస్తుంది ప్రకృతిసిద్ధంగా ఆయన రసికుడే ప్రేమ, ప్రణయం, శృంగారం అనే ఊహాసుందరిని తలపోసి చక్కని రొమాంటిక్ వేదనతో ఖండ కావ్యాలు వ్రాసినట్లు జ్ఞాపకం అవి వ్రాసిన కాపీని ఎవరో మిత్రులు కొట్టేశారు కాగా ప్రబంధ శైలిలో వర్ణనలు, ఉపాలంభాలు కూడా కొద్ది కోజులు వ్రాసినారు" - జన ధర్మ హన్మకొండ ప్రత్యేక సంచిక 1971లోని వ్యాసం నుండి స్వీకృతం [7] అవి పి వి గారు రాష్ట్ర మంత్రిగా ఉన్నప్పటి మాటలు వారు ప్రధానమంత్రి పదవిలో ఉన్నప్పుడు ఆదిరాజు వేంకటేశ్వరరావు గారు ఇంటర్వ్యూ చేయగా 1992లో సదాశివరావు గారి కథనం ఇట్లున్నది "If I go to Delhi for a week or two weeks angage in a common field of discussion which is not politics, and certainly not congress We talk about certain books he has read and I might have read, and exchange views about modernism, orientalism and such objects "[8]

ఇంకా వారు తమ ప్రసంగాల్లో ఓ మారు గాంధీజీని గూర్చిన ప్రస్తావనంలో 'గాంధీజి అహింసను టాల్‌స్టాయ్‌నుండి, సత్యప్రాధాన్యతను నిర్భీతిని సోక్రటీస్ నుండి గ్రహించినట్లు పి వి గుర్తించారన్నారు

జ్ఞానపీఠ అవార్డు గ్రహీత అయిన హిందీ రచయిత్రి మహాదేవి వర్మ గారి పుస్తకాన్ని సమీక్షిస్తూ ఓ నూతన పరిశోధన వ్యాసాన్ని వ్రాశారు అందులో ప్రత్యేకంగా ఛాయావాదాన్ని గూర్చి ఇట్లా వివరించారన్నారు

"Rabindranath Tagore, defied Anglo-Saxon culture and upheld the culture of India in many of his books, that task has been resumed by Mahadevi Varma She is known to be a chayavada poetess And on that Chayavada poetess, P V has researched and put for ward thesis that Mayavada is wrong, and that true concern towards humanity, which is the chaya under which we live, is greater than many of the modern reformist ideas These foreign ideas do not enter the psyche of an Indian That what she wrote, and that is what p V also says" [9]

జ్ఞానపీఠ అవార్డు గ్రహీత కవి సమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారి రచనలను ముఖ్యంగా 'రామాయణ కల్పతరువు' మహాకావ్యాన్ని వేయిపడగలు నవలను తమ హిందీ అనువాద 'సహస్రఫణ్' పీఠికలో ఎంతో చక్కగా విశ్లేషణ కావించారు [9] (స్రవంతి - మాస పత్రిక, ఆగస్టు 1971, పి వి గారి హిందీ పీఠిక అనువాదం)

పి వి కుమార్తె సురభివాణీ దేవి[10] గారు తమ తండ్రి సాహిత్య ప్రతిభను ఇట్లా అభివర్ణించారు

'ఆయన ఏడు భాషలలో పండితులే కాదు (పి వి అష్టభాషా ప్రవీణులని ప్రచారంలో ఉంది) మంచి గాయకులు కూడా ఆయనకు ఫోటోగ్రఫీ అంటే సరదా ఆయన గనక రాజకీయ రంగంలో లేకుండా వుండుంటే ఆయనకున్న విద్వత్తు, మేధస్సు దృష్ట్యా ఖచ్చితంగా నోబెల్ బహుమతి సాధించి వుండేవారు " (స్వాతి సపరివార పత్రిక, తేది 4-10-1991)

పి వి గారి బహుభాషా పాండిత్యానికి రచనా వ్యాసంగానికి ఇంటి బయటా ప్రసంసలు లభించాయి వీరి రచనలు వివరాలు ఇవి

1 సహస్రఫణ్, 2 అబల 3 యయాతి, 4 నాపతి నాదైవం, 5 కథలు కవితలు వ్యాసాలు పీఠికలు

1 సహస్రఫణ్[10] కవి సమ్రాజ్ విశ్వనాథ సత్యనారాయణ గారి 'వేయిపడగలు' అనే తెలుగు బృహన్నవలకు హిందీ సంక్షేపానువాదం దీనికి 1971లో కేంద్ర సాహిత్య అకాడెమీ బహుమతి లభించింది

2 అబల - ప్రముఖ మరాఠీ రచయిత శ్రీహరినారాయణ్ ఆప్టే గారు రచించిన పణ్ లక్షాత్ - కోణ్ మేతో నవలకు నరసింహరావు గారి తెలుగునేత 'అబల నవల నేషనల్ బుక్ ట్రస్ట్ న్యూఢిల్లీ వారి కోరికగా పి వి గారు ఈ అనువాదం కావించారు

3 యయాతి[11] - జ్ఞానపీఠ పురస్కారం పొందిన వి ఎస్ కండేకర్ హిందీ నవల యయాతి'కి ఇది ఆంధ్రానువాదం

4 నా పతి నా దైవం[11] - శ్రీమతి లలితాశాస్త్రి మేరేపతి మేరే దేవ్' పేరుతో వ్రాసిన ఆత్మకథా పుస్తకానికి ఇది పి వి గారి ఆంధ్రానువాద పుస్తకం

5 కథలు - పి వి ఆంధ్రాంగ్ల భాషలలో కథారచయితగా మంచి పేరు తెచ్చుకున్నారు 1943లోని బెంగాల్ కరువుకాలంలో వీరు వ్రాసిన ఓ ఆంగ్లకథ పలువురు ప్రముఖ సాహితీవేత్తల ప్రశంసలందుకున్నది స్వాతంత్ర్యానంతరం హిందూ ముస్లింల మధ్య చెలరేగిన హింసాకాండను నిరసిస్తూ వీరు రచించిన 'బ్లూ సిల్క్ సారీ' కథ చాల చక్కనిది 1948 తెలంగాణా విముక్తి పోరాట కాలంలో ఆయుధాలు నిజాం సిపాయీల కంట పడకుండా దాచి విప్లవకారులకు అందించి సహాయపడిన 'రామక్క' అనే గ్రామీణ స్త్రీని గురించి వీరు వ్రాసిన తెలుగు కథ నాటి సమాజంపై మంచి ముద్రపడవేసింది

1945-52 మధ్య వరంగల్లు నుండి వెలువడిన 'కాకతీయ' పత్రికకు[12] తోడ్పడటంతో పాటు పి వి దాని సంపాదకులు తనకు మిత్రులైన పాములపర్తి సదాశివరావు గారితో కలిసి 'జయవిజయ' కలంపేరుతో వ్రాసిన పెక్కు కథలు వ్యాసాలు ప్రచురించారు [13] ఈ రచనలు ఇప్పుడు అందుబాటులో లేవు పి వి మొదట పద్యకవితలు వెలయించినట్లు వారి మిత్రులు పి సదాశివరావు గారు పేర్కొన్నారు ఈ మధ్య కవితా వ్యాసంగం వీరు కావించినట్లు లేదు కాని, భారత స్వాతంత్ర్య రజతోత్సవాల సందర్భంగా 14 ఆగస్టు 1972 అర్ధరాత్రి హైదరాబాద్ అసెంబ్లీలో ఒక సుదీర్ఘ వచన కవితను చదివి పి వి సభికుల ఆశ్చర్యంలో ముంచారు అప్పుడు వీరు ఈ రాష్ట్ర ముఖ్యమంత్రి ఆ కవితలోని కొన్ని చరణాలివి

"ఆ నిద్రాణ నిశీధిని మానిసి మేల్కొంచినాడు
ఒల్లు విరిచి కళ్లు తెరచి వోహో అని లేచినాడు
కటికి చీకటుల చిమ్మెడు కారడవిని పయనించు
నిజ జఠరాగ్ని జ్వాలలు నింగి నంట లేచినాడు
నేనొక చైతన్యోర్మిని, ఇది నా సంతత కర్మ
మరే హక్కులు లేవు నాకు
ని నిద్రాణ నిశీధి మహిత జాగృతి పుంజముగ
వెలుగుటయే నా తపస్సు, వెలిగించుట నా ప్రతిజ్ఞ"[14]



ఇందలి భాషా భావాల విలక్షణత గమనించవచ్చు రవీంద్రుని బెంగాళీ కవితల అనువాదాంధ్ర కవితలవలె కన్పించటం దీని ప్రత్యేకత అనొచ్చు

వ్యాసాలు పి వి వ్రాసిన వ్యాసాలు, విమర్శలు, సమీక్షలు అనేకం ఇవి పలు భాషల్లో ఉన్నాయి 1945 నుండే వీరి వ్యాసాలు వివిధ పత్రికలను అలంకరించాయి వీరి వ్యాసాలు క్రోడీకరింపబడితే రచయితగా వివిధ కళా సాహిత్య విజ్ఞానశాస్త్ర సామాజిక రాజకీయ రంగాలలో వీరు కావించిన సునిశిత పరిశీలన కావించిన విషయ విశ్లేషణ - జాతికి అందించిన సూచనలు తెలిసి వీరి బహుముఖ ప్రజ్ఞకు నిదర్శనంగా నిలిచేవి

రాజకీయ నాయకులుగా వీరు కావించిన ప్రసంగాలు అనేకం ప్రసంగాలు వ్యాసాలు కావు కాని, పి వి గారి ప్రసంగాలు చక్కని శైలిలో చలోక్తులతో సమయోచిత వివరణలతో ఉదాహరణలతో చక్కని సాహితీరూపాలుగా ఉంటాయి అందుకు దృష్టాంతాలు ఏ దినపత్రికను చూసినా కనిపిస్తాయి ముఖ్యంగా కరీంనగర్ శాతవాహన స్నాతకోత్తర అధ్యయన సంస్థ ప్రారంభోత్సవ సందర్భంగా విదేశాంగ మంత్రి హోదాలో విచ్చేసి పి వి గారు కావించిన ప్రసంగం - వ్యాసం అవశ్యపఠనీయం [15]

అనేక ప్రముఖ గ్రంధాలను వీరు సమీక్షిస్తూ ఆంధ్రాంగ్ల హిందీ భాషల్లో సమీక్షా వ్యాసాలు వ్రాశారు కవి సమ్రాట్ విశ్వనాధ సత్యనారాయణ గారి పుస్తకాల సమీక్ష వీరి సాహితీధిషణకు పట్టం కట్టేదిగా ఉంది [16]

పీఠికలు పి వి గారు జ్ఞానపీఠ బహుమతులు పొందిన పుస్తకాలను కొన్నిటిని అనువదించడంతోపాటు కొన్నింటికి చక్కని పీఠికలు సమకూర్చారు మహాదేవి వర్మ, పి ఎఫ్ కండేకర్, విశ్వనాధ సత్యనారాయణ మొ॥ వారల గ్రంధాలు పి వి గారి సమీక్షలకు నోచుకున్నాయి వీరి పీఠికలు అధికంగా ఇంగ్లీషు హిందీ భాషల్లో ఉన్నాయి తెలుగులోనూ పీఠికలు వ్రాశారు

ముఖ్యంగా మన ప్రధాని గారి స్వంత తమ్ముడు పి మనోహర రావు గారు రచించిన 'కైలాస దర్శనం' గ్రంధ పీఠిక చాల విలువైనది [17] అందలి కొన్ని భాగాలు ఇవి -

"వైదిక సంస్కృతి, జైన, బౌద్ధ సంస్కృతి, పౌరాణిక సంస్కృతి అనే మూడు శాఖలు కూడా భారతదేశానికి చెందినవే ఈ మూడు సంస్కృతులు కూడా విశ్వవ్యాప్తంగా ప్రభావం వేసినవి"

"గత రెండు శతాబ్దాలలో పాశ్చాత్య విద్వాంసుల, ఆధిక్యత, మన విజ్ఞాన విద్యారంగాలలో విరివిగా కొనసాగినది దివ్యాత్మల నుండి దివ్యసందేశాలు వస్తుంటాయని చెపితే, నిజమే కాబోలు ననుకొని విశ్వసించిన వారు అనేకులున్నారు (అనిబీసెంట్ - దివ్య జ్ఞాన సమాజం) తుదకు అదంతా బూటకమని కీ శే జిడ్డు కృష్ణమూర్తి గారు ఖండించిన విషయం సువిదితాంశమే "

"బౌద్ధ సంస్కృతీ విలోకనకు ఇతోధిక ప్రాధాన్యత నివ్వవలసివుంటుంది హైందవ మత సాంప్రదాయ ఆచార విహారాల వికాసక్రమంలో, బౌద్ధము కూడా యెంతో ప్రాధాన్యత కలిగి ఉంది"

"ఇతర రంగాలలో వలెనే, మత ఆధ్యాత్మిక వేదికలలో కూడా, మంచి చెడు అనే రెండు ధోరణులు యెదురౌతుంటవి అతీత శక్తులను గూర్చి, మహిమలను గూర్చి, స్వకపోలకల్పనలు కొన్ని కొనసాగుతుంటాయి "

"మన దీర్ఘకాలిక జాతీయత వికాస క్రమంలో, విభిన్న సాంప్రదాయాలకు చెందే అమూల్యరచనలు వెలువడ్డవి అలా జాతీయ పునరుజ్జీవనను సక్రియ సృజనశక్తిగా, సాధించుకొన్నప్పుడే మన ఆధునిక విజ్ఞాన శాస్త్ర వికాసాన్నీ, ప్రగతినీ, ప్రాచీన సంస్కృతితో సమన్వయపరుస్తూ ముందుకు సాగగలుగుతాము స్వాతంత్ర్యాన్ని స్వావలంబనను, శాంతిని, సహకారాన్ని బలపరచుకొన గలుగుతాము "

ఇట్లా విశ్వ సాహిత్య సంస్కృతీ సంప్రదాయాల చారిత్రకాంశాల పరామర్శిస్తూ బహుముఖ ప్రజ్ఞాపాటవాలతో రూపొందించిన ఈ పీఠికలో చివర నిష్పాక్షికంగా "ఈ పుస్తక సంపాదకత్వంలోనూ ముద్రణలోనూ కొన్ని లోపాలు కనిపిస్తున్నవి మరు ముద్రణలో వాటిని సంస్కరించుకోవలసి యుంటుంది " అన్న సత్యసంధత పి వి గారిది

ఆదిరాజు వేంకటేశ్వరరావు గారు పి వి 'జీవిత చరిత్ర'లో ఈ విధంగా అన్నారు

"He believes that our ancient philosophy, culture and classical music are much superor to modern innovation As such, P V is not a modernist He is anti-modernist, like Toqore" [18]

విజయవాడలో తేది 25 7 1971 నాడు దక్షిణ భారత హిందీప్రచార సభ హైదరాబాదు వారు కావించిన సన్మానసభలో పి వి గారు మాత్రం స్వయంగా తమను గూర్చి ఇట్లా చెప్పుకున్నారు

"నేను ఒక ప్రగతివాదిగా వేయి పడగలు అత్యుత్తమ గ్రంధమని అర్థం చేసుకున్నాను "[19] ఇదే ప్రసంగంలో "వారి రచనలన్నింటినీ వీలైనంతవరకు హిందీలో అనువాదం చేస్తాను ఇది నా కానుక"[20] కాని ఈ ఇతర అనువాద గ్రంధాలు వెలువడినట్లు లేదు పి వి అనువాదాలు ప్రధానంగా నేషనల్ బుక్ ట్రస్ట్‌వారు ప్రచురించారు

పి వి గారి అనువాదాన్ని గూర్చి ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధురాలు అరుణా ఆసఫలీ గారు "హి కెన్ అడ్రెస్ మీటింగ్స్ ఇన్ హిందీ ఐజ్ ఇఫ్ టు ది మానర్ బార్న్ ' అన్నారు అంతటి సహజత్వాన్ని వీరు పరభాషల్లో సాధించారు పి వి గారి ఒకానొక ప్రముఖ ప్రసంగాన్ని విని ఇందిరాగాంధి గారు మహాత్మాగాంధి బ్రతికి ఉండి ప్రసంగాన్ని వినుంటే ఎంతో సంతోషించేవారని ప్రశంసించారు అంతటి ధీశాలి పి వి

పి వి గారు కృతికర్త మాత్రమే కాదు వీరు కృతి భర్తకూడాను విశ్వనాధ సత్యనారాయణ గారి 'సాహిత్య సురభి' వ్యాస సంపుటి 1969లో, కొత్త రాజిరెడ్డి గారి 'ఇందిరా విజయం' బుర్రకథను 1973లో, వానమామలై జగన్నాథాచార్యుల 'రైతురామాయణము' కావ్యాన్ని 1980లోనూ, మరికొన్ని పుస్తకాలు కూడా వీరు అంకితం పొందారు

భారత కేంద్ర ప్రభుత్వంలో ఉన్నత పదవులధిష్టించిన వారిలో డా సర్వేపల్లి రాధాకృష్ణన్ గారి తర్వాత అంతటి మేధావిగా ప్రస్తుతులందుకున్నారు పి వి వీరి రువు రూ ఆంధ్రులు కావడం విశేషం ప్రధానమంత్రులలో నెహ్రూజీ తర్వాత రచయితగా పి వి నరసింహరావు గారి స్థానం గణనీయమైనది

పి వి గారి సాహిత్యమంతా సేకరించి ప్రచురించవలసిన అవసరం ఎంతైనా ఉంది పి వి జీవిత చరిత్రలు వ్రాసిన రచయితలు, వీరి జీవిత విశేషాలు రాజకీయ విషయాల వివరణకే ప్రాధాన్యమిచ్చారు మధ్య మధ్య వీరి రచనల గూర్చిన ప్రస్తావనలున్నాయే తప్ప వీరి సాహిత్య వివరాలకు ప్రత్యేక అధ్యాయాన్ని ఎవరూ కేటాయించలేదు ఆ మధ్య పి వి పుస్తకాల ఫోటోలు ప్రదర్శనలకు[21] వెళ్లినా ఆదిరాజు గారు వ్రాసిన ఆంగ్ల పుస్తకం ఒకటి తప్ప మరే పుస్తకం కనిపించలేదు రాజకీయాల్లో రాణించినా కళా-విజ్ఞాన-సాహిత్యాలలో అత్యంతాభిమానం కల రచయిత పి వి నరసింహారావుగారు

## 2 ముద్దసాని రాంరెడ్డి - ఎం ఏ డి.జి. ఊటూరు జ. 1928

ప్రముఖ జర్నలిస్టు అనువాద రచయిత, ఎం రాంరెడ్డి గారి పరిచయం నవలా విభాగంలో చేయబడింది రెడ్డిగారు ఆక్సిడెంటకులోనై ఉద్యోగాన్ని విరమించే వరకు ఆంధ్రప్రదేశ్‌లో పబ్లిక్

రిలేషన్స్ ఆఫీసర్‌గా పనిచేశారు అందుకే మొదట ఆ సంస్థకు కొన్ని చిన్న పుస్తకాలు రచించారు జీవిత చరిత్రల రచయితగా వీరికి నామవ్యాప్తి ఉద్యోగ విరమణ తర్వాతి విశ్రాంతి కాలాన్ని నేషనల్ బుక్ ట్రస్ట్' వారి గ్రంథాలను అనువదిస్తూ సార్థకం చేసుకున్నారు వీరివి ప్రధానంగా ఉర్దూ హిందీ ఆంగ్ల భాషాగ్రంథానువాదాలు వీటిలో నవలలు, జీవిత చరిత్రలు ఉన్నాయి

రాంరెడ్డి గారు ఆంధ్రీకరించిన పుస్తకాలు -

1 లండన్‌లో ఒక రాత్రి సజ్జాద్ జహీర్ ఉర్దూ నవల 'లండన్ కీ ఏకారాత్' కు వీరి అనువాదం విశాలాంధ్ర విజయవాడ ప్రచురణ 1975 ఈ పుస్తక పరిచయం నవలా విభాగంలో ఉంది

2 నర్మద శంకర్ - ఇది గుజరాతీ కవి సాహిత్య జీవిత చరిత్ర ఆంగ్ల మూల గ్రంథ రచయిత - గులాబ్‌దాస్ బ్రోకర్ కేంద్ర సాహిత్య అకాడెమీకి రాంరెడ్డి గారు తెలుగు చేసిన ఈ 80 పుటల పుస్తకం 1985లో ముద్రింపబడింది

3 రాగదర్బారి - శ్రీలాల్ శుక్లా గారి ప్రముఖ హిందీ వ్యంగ్యనవలకు ఇది ఆంధ్రానువాదం నేషనల్ బుక్ ట్రస్ట్, న్యూఢిల్లీ 1986 87లో ప్రచురించిన ఈ తెలుగు నవల 200 పుటలున్నది

4 ఇందిర జీవిత చరిత్ర ఈ అనువాద గ్రంథానికి మాతృక భారతదేశ ప్రధాని గారి స్వీయ చరిత్ర 'మైట్రుత్' ఆంగ్ల గ్రంథం పి వి జీ ద్వారా ప్రధానితో సంప్రదించి రాంరెడ్డి గారు అనువదించిన ఈ పుస్తకం 200 పుటలు ఈ పుస్తకాన్ని కేంద్ర సాహిత్య అకాడెమీ 1988-89లో ప్రచురించింది

5 గాలి మేడల కోలంబస్ పంజాబ్ రాష్ట్ర ప్రఖ్యాతాంగ్ల రచయిత నరేంద్రలూథర్, ఐ ఏ ఎస్ గారు ఉర్దూలో రచించిన 'హవాయీ కోలంబస్' హాస్యవ్యంగ్య విమర్శా గ్రంథాన్ని రెడ్డి గారు 1990లో అనువదించగా 'ఆంధ్రప్రభ' దినపత్రిక 'ఆదివారం' సాహిత్యానుబంధంలో 1991లో ప్రచురించింది ప్రతిభ కలిగిన నాలుగు భాషల రచయిత శ్రీ రాంరెడ్డి గారు నేషనల్ బుక్ ట్రస్టు ఢిల్లీవారి ఉత్తమ అనువాదకులుగా 1997 సం వీరికి అవార్డు ప్రకటించారు

**3 డా. యశోదారెడ్డి - ఎం ఏ పిహెచ్ డి అన్నారం, జ 1929**

యశోదారెడ్డి గారు సంస్కృతాంధ్రాంగ్ల భాషలలో విదుషీమణి రిటైర్డు తెలుగు ప్రొఫెసర్ అధికార భాషా సంఘాధ్యక్షురాలు వీరి పరిచయం కథా విభాగంలో ఉంది వీరు చేసినన్ని గ్రంథపరిష్కరణలు, పరిశీలనలు, వ్రాసినన్ని వ్యాసాలు-పుస్తకాలు, చేసినన్ని ప్రసంగాలు రచనలు ఏ ఇతర ప్రముఖ రచయిత్రికీ కూడా సాధ్యం కాలేదంటే అది అతిశయోక్తి కాదు

యశోదారెడ్డి గారి అనువాద పుస్తకాలు

1 హిందీ కవయిత్రులు - హిందీ పుస్తకానికి తెలుగుసేత, 2 చిత్రకళ - ప్రతీకవాదము - ఇంగ్లీషు గ్రంథానువాదం

3 నాకు తెలిసిన పి టి రెడ్డి - పి టి రెడ్డి యాజ్ ఐనో - రచయిత్రి భర్త ప్రముఖ చిత్రశిల్పకళా స్రష్ట పాకాల తిరుమలరెడ్డి గారి జీవితచరిత్ర

4 ప్రాక్టికల్ వేదాంతా ఆఫ్ స్వామీ వివేకానంద - అనే గ్రంథాన్ని అనువదిస్తున్నారు

వీరిపై మూడు పుస్తకాలు ప్రచురింపబడినవి [22]

**4 జి సురమౌళి - బి ఏ ఎల్ ఎల్ బి విలాసాగరం వ 60 సం సుమారు కీర్తిశేషులు**

సురమౌళి గారు లబ్ధ ప్రతిష్ఠులైన జర్నలిస్టు ప్రఖ్యాత కథా వ్యాస రచయిత వీరి పరిచయం ఈ తొలితరం కథా రచయితలలో ఉంది వీరు ప్రముఖ హిందీ ఇంగ్లీషు గ్రంథాలను తెలుగు చేశారు సురమౌళి గారి అనువాద రచనలు వివరాలివి

1 జయప్రకాశ్ ముఖాముఖి గాంధీ ప్రతిష్టాన్ ప్రచురణ 2 శ్రీసానే గురూజీ 'ఆలోచనా కుసుమాలు' 3 లోహియా దర్శనం నం 1 (మార్క్స్ గాంధీ సోషలిజం), 4 లోహియా "అనవద్య అతీత అమేయ వ్యక్తిత్వాలు' 5 లోహియా భాషా సమస్య తెలుగు అకాడెమీ ప్రచురణ, 6 లోహియా కులాల సమస్య తెలుగు అకాడెమీ ప్రచురణ 7 సాంఘిక విప్లవ రథసారథి బి ఆర్ అంబేద్కర్

ఇంకా స్వీయ విరచిత రాజకీయ గ్రంథాలు రెండున్నాయి మూలరచనలు వివరాలు ఇవి

జయప్రకాశ్ నారాయణ్ గారి 'ఫేస్ టు ఫేస్' ఆంగ్ల గ్రంథానువాదం సురమౌళి గారి ముఖాముఖి' సానె గురూజీ ఆలోచనా కుసుమాలు వారి హిందీ రచనలకు వీరి తెలుగుసేత

సురమౌళి గారు సోషలిస్టు పార్టీ అభిమాని అందుకే వారికి జయప్రకాశ్ నారాయణ్ రాంమనోహర్ లోహియా లంటే ఇష్టం అందుకే ఈ అనువాదాలు కావించారు

లోహియా మౌళిక ఆంగ్ల రచనల సంకలనం మార్క్స్ - గాంధీ - సోషలిజం లోని కొన్ని రచనల అనువాద సంకలనం వీరి లోహియాదర్శనం' నం 1

ఉన్ముక్త ఔర్ అసీమ్ వ్యక్తిత్వ్ రామ్, కృష్ణ్ శివ్, ఔర్, రామాయణ్‌మేళా' లోని లోహియా గారి హిందీ విమర్శన గ్రంథం సురమౌళిగారి 'అనవద్య అతీత అమేయ వ్యక్తిత్వాలు ఇవి రెండు లోహియా ట్రస్టువారు ప్రచురించారు శ్రీ మధులిమాయె రచించిన ఆంగ్లపుస్తకానువాదం సాంఘిక విప్లవ రథ సారథి డాక్టర్ బి ఆర్ అంబేద్కర్' దీనికి 1992లో ఆంధ్రప్రదేశ్ తెలుగు విశ్వవిద్యాలయం వారు ఉత్తమ అనువాద గ్రంథ బహుమతినిచ్చారు

సురమౌళి గారి రచనలు జనానికి అందుబాటులో లేవు వారి దగ్గర వాటి ప్రతులు కూడా లేవు [23] నాస్తిక వాదిగా నిజమైన సోషలిస్టుగా నిజాయితీగా జీవిస్తూ నమ్మిన సిద్ధాంతానికి కట్టుబడి ఉన్న విశిష్టవ్యక్తి - ఆదర్శ రచయిత సురమౌళి గారు వీరు అనువదించిన గ్రంథాలు భారత ప్రముఖ నాయకులవి కావటం విశేషం

### 5 డా కె రాజన్నశాస్త్రి - ఎం ఏ ఎం ఓ ఎల్ పిహెచ్ డి ధర్మపురి

కొరిడె రాజన్న శాస్త్రి గారు కరీంనగర్ జిల్లాలోని గోదావరి తీర ధర్మపురి వాస్తవ్యులు వీరు ఆంధ్ర విశ్వవిద్యాలయం నుండి సంస్కృతంలో ఎం ఏ, కు సమానమైన 'విద్యాప్రవీణ పట్టాను పొందిన పిదప ఉస్మానియా యునివర్సిటీ నుండి తెలుగులో ఎం ఏ , ఎం ఓ ఎల్ డిగ్రీలు పొందారు వీరు సంస్కృతాంధ్రాంగ్ల భాషల్లో విద్వాంసులు - కవివతంసులు వీరు కొంతకాలం కరీంనగర్ జిల్లా పరిషత్ సెకండరీ పాఠశాలల్లో ఆంధ్ర భాషోపాధ్యాయులుగా పనిచేశారు పిదప 1972 సర్దార్ పటేల్ కాలేజి సికింద్రాబాద్‌లో తెలుగు బాషోపన్యాసకులుగా, ఉస్మానియా యునివర్సిటీలో 1981-93 వరకు లెక్చరర్‌గా రీడర్‌గా పనిచేశారు 'మన రాష్ట్రములో ప్రస్తుతము సంస్కృతాలంకార శాస్త్రమును మథించి సాధికారముగా పాఠము చెప్పగల పండితులలో డా కె రాజన్నశాస్త్రి గారు మొదటి నలుగురైదుగురిలో ఒకరు" అన్నారు - ఆచార్య జి వి సుబ్రహ్మణ్యంగారు (డా కె రాజన్నశాస్త్రి గారి 'ధ్వని-మను చరిత్రము - 1988 పీఠిక నుండి)



శాస్త్రి గారి కవితా పుస్తకాలు సంస్కృతంలో వ్యాసాలు, తెలుగులోనూ ఇవే ఎక్కువగాను ఉన్నాయి వీరి ప్రసంగ వ్యాసాలు అనేకం ఆకాశవాణి ద్వారా ప్రసారమైనాయి కొన్ని వ్యాసాలు పత్రికల్లో వచ్చాయి

వీరు పరిష్కరించిన ధర్మసూరి 'సాహిత్య రత్నాకరం' అను అలంకార శాస్త్రగ్రంథాన్ని 'సాహిత్య అకాడెమీ' ఉస్మానియా విశ్వవిద్యాలయం హైదరాబాద్' వారు మూడు సంపుటాలుగా 1972, 74, 81 సం లలో ప్రచురించారు ఇది పిహెచ్ డి పట్టాకు సమానమైన సాహిత్యకృషి

'ధ్వని-మనుచరిత్రము' అను అంశంపై పిహెచ్ డి పరిశోధన గ్రంథం 1980లో సమర్పించి డిగ్రీ పొంది 1988లో ముద్రించారు రచనా వ్యాసంగాలేకాక పూరీ శంకరాచార్యులచే 'సాహిత్యరత్న' బిరుదాన్ని పొందారు సారస్వత జ్యోతి మిత్రమండలి హైద్రాబాద్ వారిచే 1992లో ఉత్తమ అధ్యాపకులుగా సన్మానాన్ని అందుకున్నారు 24 డా రాజన్న శాస్త్రిగారి ఆంధ్రానువాద గ్రంథం ఇది

1 శ్రీ విద్యాగద్య దేవీ భాగవతము - ఇది సంస్కృత పురాణ కావ్యానికి ఆంధ్ర వచనావాదం దీనిని శ్రీ విద్యాసేవా సమితి హైదరాబాద్ వారు 1975, 1984ల్లో రెండు పర్యాయాలు ముద్రించారు ఇది శాస్త్రిగారి ఉభయభాషా పాండిత్యానికి వేదాంత భావస్ఫూర్తికి నిదర్శనంగా ఉంది

ప్రచురణ పొందినవి, ప్రసారం చేయబడినవి, ప్రసంగించబడినవి మొత్తము రాజన్నశాస్త్రి గారి సాహిత్య వేదాంత వ్యాసాలు నలభై ఒక్కటి సంస్కృతాంధ్ర సాహిత్యాలతో శాస్త్రి గారు అసామాన్యసమాన ప్రతిభ కలవారు

### 6 నూగూరి జనార్దన - ఎం ఏ వేములవాడ జ 1935

జనార్దనగారు రిటైర్డు తెలుగు లెక్చరర్ ప్రస్తుతం సిరిసిల్లలో ఉంటున్నారు వీరు బహుభాషా పరిజ్ఞానం కలవారు తెలుగు హిందీ ఆంగ్ల, కన్నడ భాషల్లో వాస్తు శాస్త్రరచనలు కావించారు వీరి పద్యాలు గేయాలు వివిధ ప్రముఖ పత్రికల్లో ముద్రింపబడినవి వయోజన - పుస్తకాలు సైతం 5 6 రచించారు ఇంటర్, బి ఏ తెలుగు గైడులు రచించారు



జనార్దనగారి ముద్రిత రచనలు -

1 శ్రీలక్ష్మి సులభ వ్యాకరణము - 1984 పు 134

2 దివ్యకిరణాలు - 1978 పు 276

ఇది 'స్వామి భోళానాథ్ మహారాజ్' వారి "దైవీకిరణ్" హిందీ ఉపదేశ గ్రంథమునకు తెలుగుసేత

తెలుగులో ప్రఖ్యాతమైన గౌరువాస్తు పంచాంగంను 'వాస్తు సూక్తులు' పుస్తకాలను కన్నడ భాషల్లో అనువదించి ప్రచురించారు

మూడు భాషల్లో (తెలుగు హిందీ ఇంగ్లషు) 'సామెతలు 4 వేలు, నాలుగు భాషా పదాలు (తె హిం ఇం ఉర్దూ) నిఘంటువు' రచించారు 'ఆర్షాచార శాస్త్రీయత'ను వివరిస్తూ - బలపరుస్తూ మరో గ్రంథరచన సాగుతున్నది వీరు విద్వాసంపన్నులు శుద్ధ సంప్రదాయ రచనా వ్యాసంగ శీలురు అముద్రితాలు అయిదారు పుస్తకాలున్నవి - అవి శతకాలు - వాస్తు జ్యోతిష్య సంప్రదాయ రచనలు

### 7 వాసాల మల్లయ్య - ఎం ఏ ఎం ఇడి విద్వాన్ జగిత్యాల, జ, తేది 10 01 1940

వి మల్లయ్య గారు జిల్లా పరిషత్ సెకండరీ పాఠశాలల్లో మొదటి హిందీ పండితులు - పిదప ప్రధానోపాధ్యాయులు వీరు సాహిత్య నాటక క్రీడా రంగాలపై అభిమానం కలవారు రాధాస్వామి సత్సంగమతాభిమానం చేత వీరు కొన్ని హిందీ పుస్తకాలను అనువదించారు వాటి పేర్లివి

1 శివశబ్దమాల - మూలం - మహర్షి శివవ్రతలాల్ - (పద్యాలు) ము 1980 పు 45

2 దాతదయాల్ మహర్షి స్వీయ చరిత్ర (వచనం) ము 1981 - పు 20

3 ఆత్మతూకము పకీర్‌చంద్ మహరాజ్ - (వచనం) - ము 1981 పు 20

4 పకీర్‌బాబా మహిమాతీతుడు - ఐ సి శర్మ (వచనం) - ము 1984 పు 20

5 దయాళ్ ఆనంద్ చరితము (సంకలనం అనువాదం) వచనం ము 1990 పు 100

6 గురూపదేశములు 7 పంచ నామములు వ్యాఖ్య ముద్రణలో ఉన్నవి



ఇంకా రాకూర్ పద్మసింహ గహర్వార్, హుజూరాబాద్ గారు అనువదించిన యోగసవరణ - 1984 పు 54 పుస్తకాన్ని పరిష్కరించారు వి మల్లయ్య గారి అనువాదాలు మూల విధేయంగా సరళభాషలో భక్తి భావ ప్రబోధకంగా ఉన్నాయి

## 8 కటుకం రాజలింగమార్య - కోరుట్ల జ. 1942

సంస్కృతాంధ్రాంగ్ల హిందీ మరాఠీ భాషలు స్వయంకృషితో నేర్చిన రాజలింగంగారు హిందూమతాభిమానం కలవారు పద్మశాలి పురోహితులు వీరికి దయానందసరస్వతి అభిమానం వారిపై - ఆర్షధర్మంపై కల అభిమానంతో వీరు కొన్ని పుస్తకాలు అనువదించి ప్రచురించారు

1 వైదిక సత్యనారాయణ వ్రత కథ, 2 సంస్కార విధి - పంచమహాయజ్ఞవిధి

3 వైదిక నిత్యాగ్ని హోత్రవిధి మరియు యజ్ఞముల వలన లాభములు - 1996 పు 64

## 9 ఇమ్మడి సంపత్‌కుమార్ - వీరి పరిచయం గేయకావ్య భాగంలో ఉంది

సంపత్ దళితవాద రచయిత రాజకీయంగా బహుజన సమాజ్ పార్టీ అభిమాని అందుకే వీరు బహుజన సమాజ్ పార్టీ సిద్ధాంతం - ఆరచణ పేరుతో ఆపార్టీ వ్యవస్థాపకులు కాన్షీరాం - ఎం పి గారి మూల హిందీ గ్రంథాన్ని అనువదించి 1996లో ప్రచురించారు రచన సాఫీగా ఉంది నలభై పుటల ఈ పుస్తకంలో వివిధ శీర్షికల క్రింద భారత దేశ వర్ణాల పార్టీల పేర్కొని తమ పార్టీ ఆదర్శాన్ని దాని ఆవశ్యకతను వివరించారు ఆంధ్రప్రదేశ్‌లోని జిల్లాల వారీగా ఎస్ సి , ఎస్ టి జనాభా, అక్షరాస్యత మొ॥ వివరాలు తెలిపే పట్టిక ఇవ్వటం బాగుంది

## 10 డా మలయశ్రీ - పరిచయం చేయబడింది

వీరి కావించిన సంస్కృత కావ్యాల అనువాదాలు పద్యకావ్యాల్లో చూపబడినవి తెలుగు వచనాను వాదాలు రెండు

1 వజ్రసూచి - 1997 ఇది సంస్కృతంలో అశ్వఘోషుని 'వజ్రసూచీ' ధర్మశాస్త్రానికి (హిందూ వర్ణ వ్యవస్థను సహేతుకంగా ఖండించిన విమర్శన గ్రంథం) తెలుగుసేత దీని అనువాదానికి ప్రేరేపించిన టి రవిచంద్ గుంటూరు గారు 'మిళింద ప్రచురణ' గా వెలువరించారు

2 'మన రాజ్యాంగంలోని 17వ అధికరణాన్ని సవరించాలి' 1997 భారత నాస్తిక సంఘ ప్రధాన కార్యదర్శి, 'నాస్తిక యుగం' మాసపత్రిక సంపాదకులు జయగోపాల్‌గారి ఆంగ్ల వ్యాసానికిది ఆంధ్రానువాదం విశాఖ ప్రచురణ



3 పూర్వాంధ్ర శాతవాహనులు - రాకూర్ రాజారాంసింగ్ పెద్దపల్లి గారి ఆంగ్లవ్యాసానికి అనువాదం ఇది ఆర్కియాలజీ హైదరాబాద్ వారు ప్రచురించిన చారిత్రక వ్యాస సంకలనంలోని సింగ్ గారి వ్యాసానికి అనువాదం

## పాద పీఠికలు

1 తెలుగు వచన రచన వ్యాసం నం 67, మహతి 1972 పు 42

2 రేపాల నరసింహరాములు గారి సజీవ కిరణాలు కరీంనగర్ జిల్లా స్వాతంత్ర్యోద్యమచరిత్ర 1993 పు 155 3 ఈనాడు' కరీంనగర్ జిల్లా ప్రత్యేక సంచిక 1993

4 ఎం ఎల్ నరసింహరావు గారి "ప్రధానమంత్రి పి వి నరసింహరావు 1992 పు 57

5 కాంగ్రెసు ప్రధానుల వరుసలో అయిదవారు 1 జవహర్‌లాల్ నెహ్రూ 2 లాల్‌బహద్దూర్‌శాస్త్రి 3 ఇందిరాగాంధి, 4 రాజీవ్‌గాంధి 5 పి వి నరసింహరావు

6, 7 ప్రధాన మంత్రి పి వి నరసింహారావు - 1992 పు 27 28

8, 9 "The Right Prime Minister A political Biography of P V Narashima Rao" by Adiraju 1993 P 178

10 ఎం ఎల్ నరసింహరావు గారి ప్రధాని మంత్రి పి వి నరసింహరావు 1992 పు 51

11 శారదా అశోకవర్థన్ గారి జాతిరత్నం 1992 పి వి గారి జీవిత చరిత్రలో పు 20లో పేర్కొనబడినవి

12 శాతవాహన త్రైమాసిక సంచిక కరీంనగర్ - మే 1982 సం వి కొండలరావు

13 పత్రిక కాలం 1945-52 గా పేర్కొన్నారు అది మొదటి కొంతకాలం వ్రాతపత్రికగా నడిచింది

14 ఎం ఎల్ నరసింహరావు ప్రధానమంత్రి పి వి నరసింహరావు 1992 పు 80, 81

15 శాతవాహన త్రైమాసిక సంచిక కరీంనగర్ - మే 1982 సం వి కొండలరావు

16 స్రవంతి - 1971 ఆగస్టు సంచికలో చూడవచ్చు

17 కైలాస దర్శనం - 1986, పు 19 23, 18 The Right Prime Minister

19 స్రవంతి మాసపత్రిక ఆగస్టు - 1971 పు 77, 20 పై వ్యాసం పు 78

21 18 7 94 నాడు హైదరాబాద్ గాంధీ భవన్‌లో రాష్ట్ర ముఖ్యమంత్రి గారిచే ప్రారంభించబడింది

22 ఈ వివరాలు రచయిత్రి గారి 2 2 90న ప్రచురించబడిన 'బయోడాటా నుండి స్వీకృతం

23 ఈ విషయములు బహు శ్రమపడి సేకరించి రచయిత స్వయంగా తెలిపారు

24 ఇది బి వి రామారావుగారు స్థాపించిన సాజ్యో మిత్రమండలి కరీంనగర్‌కు అనుబంధ సంస్థ

## భక్తి రచనలు

సంస్కృతాంధ్ర సాహిత్యాల్లో పూర్వ కాలం నుండి దైవభక్తికి ప్రముఖ స్థానం ఉంది వివిధ దేవీ దేవతల మతాల వేదాంత విషయాల వివరించిన తెలుగు వచనరచనలు ఈ ప్రకరణంలో చూపబడుతున్నవి పండితులేకాక మితవిద్యావంతులైన వరకవులు కూడా వచనంలో భక్తి రచనలు కావించారు వీనిలో కొన్ని సంస్కృత గ్రంథానువాదాలు కూడా ఉన్నాయి కొన్ని స్వతంత్ర రచనలు పూర్వ సంప్రదాయాను సరణమే ఎక్కువ

## భక్తి-వేదాంత వచన గ్రంథ రచయితలు

1 రామ సింహకవి - రాఘవపట్టణం , 2 శీలప్ప రామకృష్ణశాస్త్రి - మంథిని
3 కలువకుంట కృష్ణమాచార్య - పూడూరు , 4 సచ్చిదానంద స్వామి జమ్మికుంట
5 శతావధాని కృష్ణమాచార్య - కోరుట్ల , 6 జి ఆర్ నరసయ్య - జగిత్యాల
7 గుజ్జెటి భూమయ్య - సిరిసిల్ల , 8 ఎంబేరు స్వామి - కొత్తపల్లి
9 కందుకూరి దేవకీనందనాచారి - పోరండ్ల , 10 తాడూరు కృష్ణమాచార్యులు 6 కొక్కెరకుంట
11 కటంగూరు రాఘవరెడ్డి - ఇల్లంతకుంట , 12 దయానంద స్వామి - గాగిల్లాపురం
13 సరస్వతి గోవిందరాజు కిషన్‌దాసు ఎల్లారెడ్డిపేట 14 సల్లాన్ చక్రవర్తుల వేదాంతచార్య మద్దికుంట, 15 నమిలికొండ రామాచార్య - గూడెం , 16 శ్యామసుందరశాస్త్రి - ధర్మపురి 17 కందాడై చిక్కుడుకాయల రంగాచార్య - బండలింగాపురం , 18 పరాంకుశం మనోహరస్వామి రేకొండ 19 లక్ష్మీకాంతరావు కరీంనగర్ , 20 రమణానంద మహర్షి కోరుట్ల, 21 బూర్ల పాపయ్య శాస్త్రి సిరిసిల్ల

### 1 రామసింహకవి -

వీరు యధార్థ భారత, రామాయణ, భాగవతాలను రచించారు ఈ పుస్తకాలు 1950-60 మధ్యకాలంలో ముద్రణ పొందాయి రామసింహకవి గారికి దైవభక్తి ఉన్నా అభూత కల్పనలు నచ్చవు అందుకే వీరు పై గ్రంథాలను తమకు నచ్చిన ధోరణిలో మార్చి వ్రాశారు 20వ శతాబ్ది పూర్వార్ధ వరకవుల్లో వీరి పరిచయం ఉంది



### 2 శీలప్ప రామకృష్ణశాస్త్రి - వకీలు జన్మస్థలం - మంథిని

రామకృష్ణశాస్త్రి గారి జన్మస్థలం మంథిని అయినా నివాసం ఆదిలాబాద్ జిల్లాలోని చెన్నూరులో

ఆర్ష విజ్ఞాన సర్వస్వం' అను పేరుతో 500 పుటల పుస్తకాన్ని వీరు 1950 సుమారుగా రచించి ప్రచురించారు ప్రాచీన మహర్షులు అందించిన వేదాంత భావాలను, ఆర్షవిజ్ఞానాన్ని శాస్త్రిగారు జాతీయ సంస్కృతీ పునరుజ్జీవనానికి సహాయపడే విధంగా ఈ గ్రంథ రచన కావించారు ఇది పూర్వ సంస్కృత శృతి స్మృతి పురాణేతిహాసాల వేదాంత తాత్విక వాస్తు మున్నగు విషయాల సంకలనం

శాస్త్రిగారి సంస్కృతాంధ్ర భాషా సాహిత్యాల పాండిత్యాన్ని డా దివాకర్ల వేంకటావధానిగారు కూలంకషంగా సమీక్షించి కావ్య పీఠికలో ప్రశంసించారు ఇంకా వానమామలై, కప్పగంతుల,

పంచాయితం మొ విద్వద్వ రేణ్యుల పీఠికలతో ఈ గ్రంథం వెలువడింది వేదాంత విషయ జిజ్ఞాసువులకు సంప్రదాయ విశ్వాసులకు ఈ పుస్తకం అత్యంతోపయుక్తమైనది

**3 కలువకుంట కృష్ణమాచార్య - పూడూరు ప్రస్తుత నివాసం మెట్టుపల్లి**



రంగనాధ శ్రీ ఆంజనేయ శ్రీ కృష్ణ త్రిశతి శతకత్రయకర్త కె కృష్ణమాచార్యులు సాత్త్వికభావ సంపన్నులైన వీరి వచన రచనలు మూడు పుస్తకాలు ముద్రణ పొందినవి

1 యధార్థ మానవత్వము 1956 పు 116, 2 స్త్రీ ధర్మప్రబోధిని 1961 పు 70
3 నీతి పథమున కుటుంబ నియంత్రణ - 1963 పు 40

వీరి యధార్థ మానవత్వము అనంతశయనం అయ్యంగారు, మాడపాటి హనుమంతరావు, చెలమచర్ల రంగాచార్యులు, జటావల్లభ పురుషోత్తము, శతవధాని కృష్ణమాచార్యులు మొ వారల ప్రశంసలు పొందినది కృష్ణమాచార్యుల షష్టిపూర్తి అభినందన సభలో (తేది - 2 96) మెట్టుపల్లి) ప్రొఫెసర్, డా ఏల్లూరి శివారెడ్డిగారు ఈ రచనను తమ గురువుగారు చాల అభినందించారని తమ ప్రసంగంలో అన్నారు

మనుస్మృత్యాదులనుండి మానవధర్మ శ్లోకాలను ప్రమాణంగా చూపుతూ వీరు వ్యాఖ్యాన రూపంగా వేదాంత సదాచార లౌకిక ధర్మ బోధకావించారు ఇది భగవద్గీతలోని కేవలం ఒకే ఒక శ్లోక భావ వివరణగా విరచితం ఇది పునర్ముద్రణ పొందినది

స్త్రీ ధర్మప్రబోధిని దీనిలో సగభాగము నాటికగా ఇరువురు స్త్రీల సంభాషణలో విద్య, భగవద్గీత వివాహము - పతిసేవ, మొ॥ అంశాలు చర్చించబడినవి కుటుంబము సత్ప్రవర్తన ఆరోగ్యరక్షణము, సంతానము, ప్రసూతి శిశుపోషణము, వితంతువులు-నియమములు మొ॥ అంశాలు సంప్రదాయ దృష్టితో చక్కగా వివరించబడినవి ఇది హిందీ పుస్తకానికి అనుసరణగా రచించినట్లు రచయిత తెలిపారు

నీతిపథమున కుటుంబ నియంత్రణ - ఇది వావిలాల గోపాలకృష్ణయ్యగారి పీఠికతో వెలువడింది పది శీర్షికలలో సృష్టి ధర్మాన్ని, వైవాహిక ధర్మాన్ని శారీరక లక్షణాలను వివరించారు సంతాన నిరోధానికి మనోనిగ్రహం బ్రహ్మచర్యం అవసరం అని తమ గ్రంథ పీఠికలో రచయిత నొక్కివక్కాణించారు ఆధునిక కృత్రిమ సాధనల శస్త్ర చికిత్సల నిరసించారు పు 15 కృష్ణమాచార్య గారిది సంప్రదాయాన్ని అభిమానించే లోకోపకారదృష్టి ఇది ప్రభుత్వం వారి 'కుటుంబ సంక్షేమ కార్యక్రమం' ప్రచారం కోసం రచింపబడింది

**4 సచ్చిదానంద స్వామి - బి ఏ , బి ఇడి జన్మస్థలం - కుందనపల్లి**

స్వామివారి పరిచయం చేయబడింది నాటిక - గేయ విభాగాల్లో పద్యగేయ కవితలతోపాటు వీరు వచన రచనలు కూడా వెలయించారు శ్రీకృష్ణార్జున గీతా సంవాదమను వీరి నాటిక ఇంతవరకు ఈ గ్రంథంలో పరిచయం చేయబడింది వీరి వచన రచనలు ఇవి

1 దేవుని జాడ - 1961, 2 బ్రహ్మ విద్యా భాండాగారము, 3 బ్రహ్మానుభూతి
4 వేదాంతోపన్యాసములు - 1983, 5 మోక్షసాధనము

స్వామిజీ సంస్కృతాంధ్రాంగ్ల భాషలలో పండితులు వీరి వేదాంత దృష్టికి పాండిత్యం వన్నెవెట్టింది దేవుని జాడ మానవుని దైవాన్వేషణ, చిరుపొత్తం బ్రహ్మవిద్యాభాండాగారం 'పూర్వుల సాహిత్య వేదాంత నీతి సూక్తుల సంకలనం' ఇది పెద్ద పుస్తకం బ్రహ్మానుభూతి జ్ఞానయోగ సమాధ్యవస్థల ఆనందానుభూతి వివరణ

వివిధ సందర్భాలలో వేదాంత సభలలో స్వామిగారు కావించిన 37 ప్రసంగావ్యాసాల సంపుటి వేదాంతోపన్యాసాలు ఇవి అన్నీ భక్తి ప్రాధాన్యతను, సత్ప్రవర్తనను, గురు శిష్య సంబంధాన్ని, మోక్ష సాధనను గురించి తెలియజేసే ప్రసంగ వ్యాసాల సంపుటి శ్లోక సహస్రానికి తెలుగుసేత మోక్ష సాధనం - పూర్వభక్తి గ్రంథాల్లోని వేయి ప్రముఖ శ్లోకాలను తెలుగులో తాత్పర్య వ్యాఖ్యాన సహితంగా వివరించిన గ్రంథం

**5 శతావధాని శిరిశెనహాళ్ కృష్ణమాచార్యులు** వీరి పద్యకావ్య పరిచయం ఇంతకు ముందు చేయబడింది వీరు సంస్కృత కావ్యాలకు వ్యాఖ్యానాలు, తమ సంస్కృత కావ్యాలకు ఆంధ్రానువదాలు సైతం వెలించారు

శృతి స్మృతి శ్రీసూక్తాది వేదాంత గ్రంథాలయందు దాహృతాలైన శ్లోకాల వాని భావాల సంగ్రహించి ఆస్తికతను, శ్రీ విశిష్టాద్వైతమత ప్రాధాన్యతను, సప్రమాణంగా నిరూపిస్తూ ఒక ధర్మశాస్త్ర గ్రంథంగా సులభంగా అర్థమయ్యేరీతిలో ఆచార్యులు 'శ్రీవిశిష్టాద్వైత మత సంగ్రహము' పుస్తక రచన కావించారు ఇది పు 62 కలది ముద్రణ 1972

**6 జి ఆర్ నరసయ్య - బి ఏ , బి ఇడి జగిత్యాల జ. 20 3 1915**

గుండేటి రాజనరసయ్యగారు గెజిటెడ్ హెడ్‌మాస్టర్‌గా ఉద్యోగంచేసి పదివీ విరమణానంతరం, భక్తి-నీతి వచన రచనలతో సత్కాలక్షేపం కావిస్తున్నారు వీరి పుస్తకాలు చిన్నవి - పెద్దవి పదిహేను వరకు వచ్చాయి అవి ఇవి

1 భగవన్నుతి, 2 భగవన్నామ సంకీర్తనము, 3 శ్రీ భావనాముని సంగ్రహచరితము
4 శ్రీభగవన్నామ మహిమ, 5 శ్రీ శివ పంచాక్షరీ మరియు నవగ్రహస్తోత్రమాల
6 శ్రీ శివలీలలు, 7 శ్రీ వినాయక చరిత్రం, 8 శ్రీ భక్తాంజనేయ సంగ్రహ చరిత్రం
9 శ్రీ కొండగట్టు క్షేత్ర మహిమ, 10 మనపండుగలు - 1975,
11 శ్రీ కొండగట్టు ఆంజనేయస్వామి క్షేత్ర చరిత్ర - 1976, 12 శ్రీ గాయత్రీ ఆరాధన - 1978
13 నిత్యపార్థనావళి - 1985, 14 భగవన్నామ స్మరణ మనకర్తవ్యము - 1991

12, 14 నంబర్లవి 24 పుటలు కొన్ని కేవలం ఎనిమిదేసి పుటల చిరుపుస్తకాలు మన పండుగలు మాత్రం డెబ్బది పుటలు వీరికి హిందూమతాభిమానం జాస్తి శైవం అభిమానం, మార్కండేయ వంశజులు - కొండగట్టు హనుమాన్ భక్తులు జి ఆర్ నరసయ్య గారు వివిధ పూర్వమత గ్రంథాల నుండి సంగ్రహించిన ధర్మ శ్లోకాలను భక్తి భావాలను - పూజా విధులను, తమ రచనల ద్వారా సంగ్రహ వివరణలతో సామాన్య జనానికి ప్రయోజనకరంగా అందిస్తున్నారు

భావనాముని చరిత్రం పద్మశాలి కుల పురాణం వీరి రచనలన్నీ భక్తి భావ సంభరితాలు

మన పండుగలు - 26 హిందూ పర్వదినాల వివరణ సురవరం, తిరుమల రామచంద్ర మొ॥ వారల పండుగల పుస్తకాలు వచ్చినా విద్యార్థులకు ఉపయోగపడే విధంగా వీరిది సరళభాషలో సంగ్రహంగా రచించాడు ఇవి మొదట ఆంధ్రభూమి, సప్తగిరి, శ్రీశైలప్రభ పత్రికలలో ప్రచురణ పొందాయి శ్రీశైల దేవస్థానం వారు శ్రీశైల ప్రభ రచయితగా జి ఆర్ నరసయ్యగారికి 76లో విశిష్ట సన్మానం కావించారు సౌమ్య స్వభావులు నిరాడంబర జీవనులైన జి ఆర్ నరసయ్య గారు భక్త రచయిత



### 7 గుజ్జెటి భూమయ్య - సిరిసిల్ల జ 1933

భూమయ్యగారు సాత్త్విక గుణ సంపన్నులు వేదాంత జిజ్ఞాసకలవారు శ్రీకృష్ణ భక్తులు వీరు తమ ముప్పదవ యేట 1962లో సిరిసిల్లలో 'శ్రీ మలయాళ సద్గురు గీతాశ్రమం' స్థాపించారు ఈ ఆదర్శ గ్రహస్థు నిత్యగీతాపారాయణ భజనలతో ముప్పదేండ్లుగా ఆశ్రమవాస జీవితం గడుపుతున్నారు పాండిత్య ప్రదర్శన కోసం కాక హిందూ ధర్మ ప్రచారం కోసం వీరు ఈ క్రింది గ్రంథ ద్వయాన్ని అనువదించి ప్రచురించారు



1 శ్రీ శుక సూక్తి సుధ - 1974, 2 సుభాషిత సుధావాహిని - 1993

శ్రీ శుక సూక్తి సుధ ఇది సంస్కృత భాగవత దశమస్కంధానువాదం 700 పుటల ఉద్గ్రంథం మూల గ్రంథం శ్లోకాలను 90 అధ్యాయాల 3726 శ్లోకాలను యథాతథంగా ప్రచురించి మధ్య మధ్య అధ్యాయాల వారిగా తెలుగు వచనంలో అనువదించారు రచయిత స్వీయ వ్యాఖ్యానం జోడించలేదు సంస్కృత భాగవత దశమస్కంధ పారాయణంచేసే వారికి ఈ తెలుగు వచన రచన అర్థగ్రహణకు సహకరిస్తుంది

సుభాషిత సుధావాహిని ఇది నీతి సూక్తుల సంపుటి డోంగరే మహరాజు హిందీలో వ్రాసిన 1120 భాగవత సూక్తులను భూమయ్య గారు తెలుగు చేసి ఈ పుస్తకంగా ప్రచురించారు ఇవి భక్త జనులకు జ్ఞాన పేటికలు ఈ సుభాషిత కృతిని భూమయ్య గారు తమ షష్టిపూర్తి ఉత్సవం (3 11 93) కానుకగా భక్తుల కోసం ప్రచురించారు

### 8 ఎంబేరు స్వామి - కొత్తపల్లి; వ 60 సుమారు

ఎంబేరు స్వామిగారు వైష్ణవ భక్తి సంపన్నులు వీరు శ్రీ విశిష్ట గ్రంథామృత సారము అను 200 పుటల పుస్తకాన్ని వచనంలో రచించి 1974లో ప్రచురించారు విష్ణుమూర్తి ప్రాధాన్యతను, గురు శిష్య భావ విధులను దైవపూజ విధానాలను వివరించిన ఈ గ్రంథంలో ఆలయాలను నిర్మించుట, దైవ విగ్రహాల ప్రతిష్ఠించుటలోని ఆంతర్యాలను చాల చక్కగా తెలిపారు ఈ గ్రంథ రచన సరళం సరసం

### 9 కందుకూరి దేవకీ నందనాచారి - పోరండ్ల

ఆశ్రమవాస జీవితం గడుపుతున్న దేవకీ నందనాచారి గారు సాత్త్విక గుణ విభూషితులు వేదాంత సాహిత్యాభిమానులు వీరికి శిష్యబలగమున్నది

'అనంత శాన్తానందామృత తత్త్వాదర్శ రామాయణమ్' పేర వీరు తెలుగులో వచన సంగ్రహ రామాయణాన్ని రచించారు ఈ పుస్తకం 60 పుటలు వీరికి భాషా పాండిత్యం తక్కువ, భక్తి తాదాత్మ్యం ఎక్కువ గహన వేదాంత తత్త్వాన్ని భక్తులకు కరతలామలకంగా అందించే ప్రయత్నంలో ఈ రామాయణ రచన వెలువడింది

### 10. తాడూరు కృష్ణమాచార్యులు - కొక్కెర కుంట - మం కొత్తపల్లి

కృష్ణమాచార్యులు 'వివాహ మనుసూత్ర ప్రయోగం' అను పేరుతో 1979లో 8 పుటల చిన్న పుస్తకాన్ని ప్రచురించారు శ్లోకాలు పూర్వపువైనా మధ్య మధ్య వచనాలు వీరివి ఇది పురోహితులకు ఉపకరించే పొత్తం బ్రాహ్మణేతర రచన కావడం విశేషం

## 11 కటంగూరు రాఘవరెడ్డి - ఇల్లంత కుంట - 1976లో కీర్తిశేషులు

రాఘవరెడ్డిగారు వైష్ణవభక్తులు భగవద్గీతపై కల భక్తితో దాని అష్టాదశాధ్యాయాలను తెలుగు చేసి గీతాసారము పేరుతో 1965 సుమారుగా ముద్రించారు వీరి రచన సరళంగా నలక్షణంగా మూల విధేయంగా ఉంది (క జి ర చరిత్ర 1981 పు 229)

రాఘవరెడ్డి గారికి ఈ గ్రంధానువాదంలో జమ్మికుంట సెకండరీ పాఠశాల ఆంధ్రభాషాపండితులు కీ శే నరసింహాచార్యులు సహకరించారని వినికిడి

## 12 దయానందగిరి స్వామి - గాగిల్లాపురం వ 75 సం లు 94 లో

దయానంద గిరి స్వామి గారు స్వగ్రామమైన గాగిల్లాపురంలో ఆధ్యాత్మ నిష్ఠాశ్రమం స్థాపించుకొని సాధు జీవితం గడుపుతున్నారు వీరి మొదటి పేరు మల్లారెడ్డి గారు సంసారం వదలి సన్యాస జీవితంలో ప్రవేశించారు సంస్కృతాంధ్ర భాషల్లో సముచిత పాండిత్యం కలిగిన వీరు అఖిలాంధ్ర సాధు పరిషత్తు' అధ్యక్షులుగా ఎన్నుకోబడ్డారు ప్రస్తుతం ఆ సంఘానికి గౌరవాధ్యక్షులు వేదాంత ప్రవచన ప్రసంగాలు - వ్యాసాలు వీరివి అనేకం పుస్తకరూపంలో రాకున్నా వీరి వ్యాసాలు పలు వేదాంత పత్రికలలో సంచికలలో ప్రచురింపబడినవి వీరి షష్టిపూర్తి సంచిక వెలువడింది ఈ 1994లో వీరి అధ్యాత్మిక జీవిత వజ్రోత్సవ సంచిక వెలువడనుంది



## 13 సరస్వతీ గోవిందరాజు - కిషన్‌దాసు ఎల్లారెడ్డి పేట

గోవిందరాజు గారి పరిచయం శతకకర్తల్లో చేయబడింది కొన్నాళ్లు జిల్లా రెవెన్యూశాఖలో ప్రభుత్వోద్యోగం చేసిన వీరు స్వంత ఆశ్రమంలో అధ్యాత్మిక సాధన - భోధనలతో కాలక్షేపం కావిస్తున్నారు ఎలారెడ్డి పేటలో వీరి ఆశ్రమము నుండి కొన్ని భక్తి పుస్తకాలు వెలువడ్డాయి పూర్వభక్తి గ్రంధాలకు భాగవతానికి సంక్షిప్త రూపాలు వ్యాఖ్యానాలు, వ్యాసాలు వీటిలో ఉన్నాయి వీరి రచనలకంటే ఇతర కవి పండితులు వ్రాసినవే ఎక్కువ గోవిందరాజు గారు వేదాంత పద్యగద్య రచయిత అనేది విశేషం

## 14 నల్లాన్ చక్రవర్తుల వేదాంతాచార్యులు - ఎం ఓ ఎల్ మద్దికుంట

నల్లాన్ చక్రవర్తుల వేదాంతాచార్యులు విద్వత్కవివరేణ్యులు వీరి పరిచయం పద్యసాహిత్య శీర్షికలలోని ఖండకావ్య విభాగంలో ఉంది పద్యరచనలోనేకాక వచన రచనలోనూ ఆచార్యులు సిద్ధహస్తులు 'కల్యాణ్‌సాధన్' హిందీ పత్రికలోని సంపాదకీయ వ్యాసాలను ఆచార్యుల తెలుగు చేశారు కళ్యాణ సాధన' అనే పేరుతో ఎల్లారెడ్డిపేట సరస్వతి గోవిందరాజు గారు 'సత్సంగ సదనం' పక్షాన వీటిని రెండు సంపుటాలుగా ప్రచురించారు ఆశ్రమపక్షాన వెలువడిన 'కల్యాణ సాధన సంపుటాలపై రచయిత వేదాంతాచార్యుల పేరులేదు ఇవి తమ స్వంత అనువాద రచనలుగా న చ వేదాంతాచార్యులు క జి ర చరిత్ర రచనా సందర్భం (1981)లో నాతో అన్నారు వేదాంతా చార్యుల భక్తికి భాషాశక్తికి ఇవి నిదర్శనంగా ఉన్నాయి

## 15 నమిలికొండ రామాచార్యులు - బి ఓ ఎల్ అవునూరు వ 63 సం॥

రామాచార్యులు జిల్లా పరిషత్ సెకండరీ పాఠశాలలో ఆంధ్రభాషోపాధ్యాయులుగా పనిచేశారు స్ఫుర ద్రూపం, సౌమ్యవర్తన, మిత హిత భాషణ రామాచార్యులకు సహజాతాలు వీరి జన్మ గ్రామం అవునూరు కవి పండితుల నిలయం వీరు 'అచట పుట్టిన చిగురు కొమ్మైన చేవ' అన్నట్లు సాహితీ

వ్యాసంగం కావించి పేరు పొందారు రామాచార్య గారు భక్త చరిత్రలు' పేరుతో 6 సంపుటాలు రచించారు భాగవత మహారాష్ట్ర విష్ణుభక్తుల ఈ జీవిత చరిత్రలు, ఎల్లారెడ్డిపేట 'సత్సంగ సదనం' వారు 1985 సుమారుగా ప్రచురించారు భాగవత వ్యాసాలు వీరి అముద్రిత రచన

## 16 ఎం శ్యామసుందరశాస్త్రి - బి ఓ ఎల్ విద్వాన్ ధర్మపురి - జ 17 10 1937

మధ్యాచారి శ్యామసుందర శాస్త్రి గారు ధర్మపురి సంస్కృత పాఠశాల ప్రధానోపాధ్యాయులు వీరు జాతీయ స్థాయిలో ఉత్తమ అధ్యాపకులుగా 1980లో సన్మానం పొందారు ఇవి వీరి ముద్రిత కృతులు 1 శేషప్ప త్రిశతి - 1979, 2 ధర్మపురీక్షేత్ర మహత్మ్యము నాడు - నేడు, 1970 3 మారుతి మహిమలు - 1982

శేషప్ప త్రిశతి - ధర్మపురి శేషాచలకవి శతకత్రయాన్ని శాస్త్రిగారు తమ సంపాదకత్వంలో ప్రచురించారు

ధర్మపురి క్షేత్ర మహత్మ్యం నాడు - నేడు ఇది 90 పుటల పుస్తకం 12 అధ్యాయాలు పూర్వతాళ పత్రప్రతి అనువాదం అన్నారు ధర్మపురి క్షేత్ర ప్రాధాన్యత వివరణ మొదటి మూడు ఆశ్వాసాలు 10 పుటలు చతుర్థాశ్వాసం ధర్మపురిలో వెలిసిన దేవతల, పుణ్యతీర్థముల వర్ణన పంచమాశ్వాసం పూజావిధులు - ఇవి 10 పుటలు ఆరవ అధ్యాయం శేషప్పనృసింహశతకం, 7, 8, 9 అధ్యాయాల్లో శేషప్ప జీవితం శతకపద్యాల సమీక్ష ఈ ఇరవై రెండు పుటల 43-65 వ్యాసం ఇందవరపు నరసింహరావు గారిది రచయిత ఈ వ్యాసానికి ఇందవరం వారి పేరు వేయకున్నా పీఠికలో కృతజ్ఞతలు తెలిపారు పైగా ఈ వ్యాసం ఇ న రావు గారి పేర యథాతథంగా 'స్రవంతి' మాస పత్రిక ఆగస్టు 1971లో ప్రచురింపబడింది పు 15-28 తర్వాత మూడు అధ్యాయాల్లో స్థానిక దేవాలయాల విద్యాలయాల విద్వాంసుల కళాకారులగూర్చి రచయిత తెలియజేశారు

మారుతి మహిమలు - ఇది 52 శీర్షికలు, 100 పుటల భక్తి రచన, శివవర ప్రసాదిగా రామభక్తుడుగా హనుమంతుడు హిందూ మతస్థులందరికీ ఆరాధ్యదైవం తెలుగు సీమలో ఆంజనేయుని విగ్రహం లేని గ్రామంలేదు

ధర్మపురి సకల దేవతల నిలయం మతదైవం, గ్రామదైవం, అనేకాక శ్యామసుందర శాస్త్రి గారికి ఆంజనేయుడు కులదైవం 'వీరింటిలో హనుమంతుని నిలువెత్తు ఇత్తడి ప్రతిమ నిత్యారాధనలతో శోభాయామానంగా ఉంది ఈ పుస్తకాన్ని రచయిత భక్తి తత్పరతతో రచించారు

పూర్వ కావ్య శ్లోకాల నుదహరిస్తూ ఈ పుస్తకంలో మారుతి జనన జీవన విశేషాలు మహిమలు వర్ణించబడినవి హనుమాన్ చాలీసా, దండకం, సహస్రనామాలు, పూర్వకవుల రచనలు రచయిత ఇందులో చేర్చారు అష్టాక్షరి, నక్షత్రమాల పద్యాల శాస్త్రి గారు రచించారు భక్తాంజనేయ వైభవము, భగవత్ మహాత్మ్యము, సంతోషిమాత వ్రత మహత్మ్యము శాస్త్రిగారి ఇతర ముద్రితా ముద్రితకృతులు వీరిని కలుసుకున్నా వీటి ప్రతులు లభించలేదు

## 17 కందాడై చిక్కుడుకాయల రంగాచార్యులు - బండలింగాపురం

రంగాచార్యులు సంస్కృతాంధ్ర భాషల్లో పండితులు శ్రీభాష్యాది గ్రంధ శ్రీ వైష్ణవ సాహిత్య పండితులు ఇరువైయైదు సంవత్సరాలు హైదరాబాదులో తెలుగుభాషోపాధ్యాయులుగా ఓరియంటల్ స్కూల్స్ ఇన్స్పెక్టర్‌గా ఉద్యోగం చేసి ఇరువదేండ్ల క్రితం విశ్రాంతి పొందారు

వీరి విశిష్టాద్వైత వేదాంతం - రామానుజాచార్యులు' వ్యాసం వనపర్తి రాజావారి బహుమతి పొందింది ఆంధ్రసారస్వత పరిషత్తు హైదరాబాద్ వారు వీరి రచనలను పాఠ్యాంశాలుగా ఉంచారు

వీరు సంస్కృతాంధ్రాలలో సుప్రభాతాలు, నాటికలు రచించారు వీరి వ్యాసాలు ఆకాశవాణి ప్రసారం పొందాయి సాహిత్య పత్రికలలో ప్రచురింపబడినాయి పుస్తకరూపంలో మాత్రం రాలేదు

కృప అనే ఒకే ఒక శ్రీవైష్ణవ భక్తి విషయాల చిరుపుస్తకం 1986లో ముద్రణ పొందింది దీనిని రంగాచార్యులు తమ గురువు గారైన ఎస్ కృష్ణమాచార్య శతావధాని కోరుట్ల గారికి అంకితం కావించారు భగవద్విషయానుభవం' వీరి అముద్రిత కృతి

## 18 పరాంకుశం మనోహరస్వామి - రేకొండ వ 65 సం లు

పి మనోహరస్వామి గారు ఆదర్శోపాధ్యాయులు జిల్లా ప్రభుత్వోన్నత పాఠశాలల్లో హిందీ పండితులుగా పనిచేసి పదవీ విరమణానంతరం కరీంనగర్ సమీపంలోని రాంపురంలో ఉంటున్నారు విశ్రాంతి కాలాన్ని గ్రంథ పఠనతో సద్వినియోగం చేసుకుంటున్నారు వైష్ణవభక్తితో వీరు 1984లో శ్రీ వైష్ణవ ముక్తి మార్గము అను గ్రంథాన్ని రచించి వెలువరించారు ఇందులో 108 శ్రీవైష్ణవ దివ్యక్షేత్రముల వర్ణన, శ్రీ సూక్తులు ఆళ్వారుల చరిత్రలు సంగ్రహంగా పొందుపరిచారు స్థలవిశేషాలు చక్కగా వివరించడంతోపాటు, ఆయా పుణ్యక్షేత్రాలయాల ఛాయా చిత్రాలుసైతం ముద్రించారు

ఈ గ్రంథ కూర్పులో సహకారం అందించి ప్రచురించినవారు అన్నమానేని శాంతానందరావు గారు పుస్తకాలు నడిగడ్డపాలెం విజయవాడ జియ్యరు స్వామి గారి ఆశ్రమానికి, భక్తజన సౌలభ్యం కోసం సమర్పించారు

## 19 లక్ష్మీకాంతరావు - కరీంనగర్

లక్ష్మీకాంత రావు గారు అరువదేండ్లు దాటినవారు వీరు విష్ణుభక్తితో తిరునారాయణ పురవైభవము అను 40 పుటల వచన పుస్తకాన్ని 1985లో రచించి ప్రచురించారు కర్ణాటకలోని మేల్కోటే గ్రామమే తిరునారాయణపురం అక్కడి చెలువరాజస్వామి కోవెల ముస్లిం దండయాత్రలతో కళావిహీనంకాగా రామానుజస్వామి గారు పునరుద్ధరించారు ఆ ఆలయంలో రామానుజుల విగ్రహం కూడా ఉంది తిరుపతి శ్రీరంగాలవలె వైష్ణవులకది ప్రధాన యాత్రా స్థలం

## 20 రమణానంద మహర్షి - కోరుట్ల జ 22 2 1940

భగవాన్ రమణానంద మహర్షి పేరుతో 'రమణానంద యోగామృత తరంగిణి' అను వచన గ్రంథం 1993లో వెలువడింది ఇది రూప్‌కారి 'చందమామ' సైజులో 180 పుటల పుస్తకం

వీరి వివరాలు వేదాంత కవులలో చూపబడినవి 'రమణానంద భజనామృతము' వీరి భజన కీర్తనల సంపుటి ఈ యోగామృత తరంగిణి యోగ సాధకుల ఉపయోగార్థం రచింపబడింది ఇందులో విషయ వివరాలు బాగున్నా, భాషాదోషాలు పరితుల బాధ పెడుతాయి రమణానంద మహర్షి ఆధ్యాత్మిక భావ సంపన్నులు, భగవద్గీతా ప్రచారకులు

## 21 బూర్ల పాపయ్యశాస్త్రి - సిరిసిల్ల వయస్సు 76 సం॥ 97లో

పాపయ్యశాస్త్రిగారు పద్మబ్రాహ్మలు సిరిసిల్లలోని పద్మశాలి పురోహితులందరికీ వీరే గురువు



జన్మస్థలం గునుకుల కొండాపురం చాలాకాలం క్రితమే వీరు సిరిసిల్లలో స్థిరపడ్డారు పాపయ్యగారు పెద్ద పండితులు కారు కాని, అక్కడ సిద్ధి వొక్క శుద్ధికలవారు

వీరి ముద్రిత రచనలు అయిదు పుస్తకాలు - ఇవి ప్రస్తుతం అలభ్యాలు వాటి పేర్లివి - 1 జ్యోతిష సూర్యోదయము 2 జ్యోతిష చంద్రోదయము 3 శుభోదయ మంగళ హారతులు, 4 ఆత్మానంద మంగళ హారతులు, 5 పుష్పాంజలి మంగళ హారతులు

కవి కాలాన్ని రచనల కాలాన్ని బట్టి ఈ కవి - రచయిత ఈ శతాబ్ది పూర్వార్ధంలో చేరాలి కాని ఆలస్యంగా వివరాలు తెలిసి ఇక్కడ చూపడం జరిగింది (ఈ సంప్రదాయ రచయిత పేరు తెలిపిన వాసం శివనారాయణ గారికి కోరగానే వారి వివరాలు వ్రాసి పంపినదూడం నాంపల్లి గారికి కృతజ్ఞతలు)

పద్య కావ్యాలకంటే వచన రచనలే అధికజన ప్రయోజనం తీర్చగలుగుతాయి అందులో పండితుల పరిశోధన గ్రంథాలకంటే, స్వచ్ఛందంగా వివిధ ఆశ్రమాలనుండి సాహితీ సంస్థలనుండి వెలువడిన భక్తి వేదాంత వచన రచనలే అధిక జనవ్యాప్తిని పొందాయి ఈ జిల్లాలో పద్యగేయ కావ్యాలవలె అధిక సంఖ్యలో కాకున్నా, మితంగానైనా జనహితంతో వచన రచనలు వెలువడడం అభినందనీయం

# చరిత్రలు

చరిత్రలు చాల విలువైన పుస్తకాలు ఇవి రచయితలు తమ జాతికి అందించే అమూల్యమైన కానుకలు గత చరిత్రల పఠనం వలన జనం స్ఫూర్తిని పొంది తమ వర్తమాన జీవన గమనాన్ని పరిదిద్దుకొని, ఉజ్జ్వల భవిష్యత్తును రూపొందించుకోగలుగుతారు గతాన్ని విస్మరిస్తే వర్తమానం గజిబిజి పాలవుతుంది, భవిష్యత్తు ప్రణాళిక సక్రమంగా రూపొందదు అందుకే చరిత్ర గ్రంథాల రచన-పఠన అత్యవసరం

చరిత్ర అంటే ఏమిటి?

"చరిత్ర అంటే నడక, నడవడి, కథ, ఉపాఖ్యానం, పురాణం, వర్ణన అని మన నిఘంటువులు చెబుతున్నాయి మనిషి మనుగడకు సంబంధించిన మంచీ చెడుల కలయికగా మానవాభ్యున్నతికోసం ముందుకు సాగుతున్న పయనాన్ని మనం ఈ చరిత్రగా భావించవచ్చు"[1]

ఈ రాణి ప్రేమ పురాణం, ఆ ముట్టడి కైన ఖర్చులు

తారీకులు దస్తావేజులు, ఇవి కావోయ్ చరిత్రకర్థం - శ్రీశ్రీ - మహాప్రస్థానం

"చరిత్ర జడజగత్తును గురించి కాని జీవజగత్తును గురించి కానీ పరిశీలించదు మానవ జగత్తుకే అది పరిమితం అంటే చరిత్ర కేవలం మానవునితో ముడిపడి ఉందన్నమాట "[2] "ఒకప్పుడు పదాలకు, కథా గేయాలకు, జానపద వీరగాథలకు పరిమితమైన చరిత్ర ఇప్పుడు విశ్వ జనీనమైన సర్వమానవస్థాయికి ఎదిగింది" [3]

చరిత్ర మతం చేతుల నుండి, రాజుల నుతుల నుండి, విడివడి దేశ ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక విషయ ప్రాధాన్యతలను సంతరించుకుంది గత చారిత్రక ఘట్టాలను విశ్లేషించి కార్యకారణ సంబంధాలను గ్రహించి, వర్తమాన చరిత్రను సక్రమ మార్గంలో నడిపేందుకు, భావి ప్రగతి సాధించుకునేందుకు సూచనలందిచ్చి సహకరిస్తుంది చరిత్ర గతాన్ని అభిమానించడమో - నిరసించడమో కాక, చరిత్రకారుడు సత్యసంధతతో - చిత్తశుద్ధితో, పురావస్తు - పూర్వగ్రంథాల ఉపయుక్త భాగాల ఆధారాలతో జాతిభవిష్యత్తు కోసం దేశ చరిత్ర నిర్మాణం కావించాలి

"చరిత్ర అధ్యయనం చేయటం అంటే కొత్త ప్రపంచంలోకి అడుగుపెట్టినట్లే, కూపస్థ మండూకం లాగా తానున్నదే లోకం అనుకోక, సంకుచితత్వం అనే చీకటిని పారద్రోలి, మానవుల అనుభవాల సారంతో విశాల దృక్పథం అనే వెలుగును వెదజల్లే దివ్య సాధనం చరిత్ర"[4] చరిత్ర రచనా శాస్త్రం, పు 21

చరిత్ర ఇంత విలువైనది కావుననే మన కవులు గత చరిత్రను అంత ఘనంగా నుతించారు కావ్యాల్లో చరిత్ర స్వల్పం అందుకే చరిత్ర పుస్తకాల రచన ప్రత్యేకంగా ఆరంభమైంది

పాశ్చాత్య దేశాల్లో 17వ శతాబ్దిలో చరిత్ర రచన ఆరంభమై 19వ శతాబ్దిలో వికసించినా మనదేశంలో మాత్రం ఈ 20వ శతాబ్దిలోనే చరిత్ర రచనవైపు పండితులు దృష్టి మళ్లింది సంస్కృత సాహిత్యంలో చరిత్ర కావ్యాలు చాలా పూర్వకాలపువైనా మన ఆంధ్రదేశ చరిత్రకు ఇంకా నూరేండ్లు నిండలేదు ఇప్పుడు ఉన్నత విద్యాలయాల్లోతప్పని సరిగాను, విశ్వవిద్యాలయాలలో ఐచ్ఛికంగాను రాష్ట్ర-దేశ ప్రపంచ చరిత్ర బోధింపబడుతున్నది కావ్యం రసజ్ఞులైన కొందరికి మాత్రమే ఆనందం కలిగించేది, చరిత్ర మాత్రం జాతి అందరిది

చరిత్రకు ఇంత ప్రాధాన్యత ఉన్నా మనకు చరిత్రకారులు చరిత్ర పాఠకులు తక్కువ చరిత్ర రచన కష్టసాధ్యం కావడం, పుస్తకపఠనం విజ్ఞానం కోసం అని కాక, కేవలం తాత్కాలిక కాలక్షేపం - ఆనందంకోసం, అనిభావించే సామాన్య చదువరులు ఎక్కువగా ఉండటం అందుకు ప్రధాన కారణాలు ఈ పరిస్థితి మారాలి మారుతుంది ఎన్నాళ్లు కాల్పనికలోకంలో విహరిస్తాం? యథార్థానికి విలువిచ్చే కాలం తప్పక వస్తుంది - వస్తున్నది!

చరిత్రలో విషయ ప్రాధాన్యతను బట్టి అనేక రకాలు - శాఖలు ఉన్నాయి అవి దేశ చరిత్ర స్థల చరిత్ర సాంఘిక చరిత్ర[2] మొ వి ఈ విభాగములో దేశ చరిత్రలు, స్థల చరిత్రలు, సాంఘిక చరిత్రలు, యాత్రా చరిత్రలు, సాంఘిక చరిత్రలు మాత్రం చూపబడుతున్నవి సాహిత్య చరిత్రలు జీవిత చరిత్రలు వేరే భాగంలో ఉన్నాయి

### దేశ చరిత్రలు

ఏదేశ చరిత్రను చూసినా - ఏమున్నది గర్వకారణం

నర జాతి చరిత్ర సమస్తం - పరపీడన పరాయణత్వం - శ్రీశ్రీ

గతమంతా ఉత్తదే అనుకోవడం మిధ్యావాదం గతకాలము మేలు వచ్చుకాలము కంటెన్ అనుకోవడం భ్రమావరణం ప్రమాదం మానవుని జీవన యాత్రలో ఎన్నో మజిలీలు, కొత్త మేడలో ఉంటున్నా తమ పాత గుడిసెను చూడాలనే ఆసక్తి వంటిదే గత చరిత్రావలోకనం కూడా ఆ పూరి పాకే ఈ భవనానికి పునాది అనటం సత్యం

మన తెలుగులో పాఠ్య గ్రంథాలకు వేరుగా చరిత్ర రచనలు తక్కువ ఈ పరిస్థితి ఇప్పుడు కొంతకాలంగా మారిపోతున్నది మన రచయితలు, చారిత్రక పరిశోధకులు, ఎన్నో వ్యయ ప్రయాసల కోర్చి దేశచరిత్రలు - జాతి జీవన - చరిత్రలు వ్రాస్తున్నారు సాహిత్యాభిమానులు, విద్యా సంస్థలు, ప్రభుత్వం వారు ఇందుకు తోడ్పడుతున్నారు కరీంనగర్ జిల్లాలో చరిత్ర రచనలు తక్కువ వచ్చిన వాటిలో వ్యాసాలెక్కువ

దూపాటి వేంకటరమణాచార్యులు[5] సారస్వత జ్యోతి త్రైమాసిక సంచిక 1954లో వెలువరించిన 'కరీంనగర్ మండల చరిత్ర' వ్యాసం మొదటిది నిజానికి శేషాద్రి రమణకవుల 'నైజాము రాష్ట్ర ప్రశంస' - 1923 పద్య గ్రంథమైనా అది తెలంగాణాలో చారిత్రకాభిమానాన్ని పెంచింది ఆ గ్రంథంలోని వేములవాడ, వెలిగందుల, రామగిరి, మొలంగూరు వర్ణనలు కరీంనగర్ రచయితలలో స్వస్థలాభిమానాన్ని చారిత్రక దృక్పథాన్ని పెంచాయి ఆ తర్వాత అప్పుడప్పుడు పత్రికలలో వ్యాసాలు ఒకటో అరో వస్తున్నా, ముఖ్యంగా పేర్కొనదగిన పుస్తకం 1981లో వెలువడిన కరీంనగర్ మండల చరిత్ర [6] 'కరీంనగర్ మండల చరిత్ర' వెలువడిన కాలంలోనే 1981లో వెలువడిన మలయశ్రీగారి 'కరీంనగర్ జిల్లా రచయితల చరిత్ర' గ్రంథారంభంలో ఈ జిల్లా చరిత్రను సంగ్రహంగా వివరించారు

ముఖ్యంగా ప్రత్యేక చరిత్ర పుస్తకాలు రెండు మాత్రమే వెలువడ్డాయి

**1. గొట్టిముక్కుల రాధాకృష్ణరావు, బి ఏ బి ఇడి బుట్టారెడ్డి గూడెం 1898-1980**

రాధాకృష్ణరావుగారు అధ్యాపకులు పద్య కావ్యకవి అముద్రిత నవలా రచయిత వీరు వచనంలో 'కాకతీయుల చరిత్ర' రచించినట్లు 'వరంగల్ జిల్లా రచయితల వాఙ్మయ సూచిక' 1987 పుట 31 లో ఉంది కాలం తెలుపబడలేదు వీరి మరో రచన 'భారత స్వాతంత్ర్య కధ' అలభ్యం పద్య కావ్యాల పరిచయం చేయబడింది

**2 నందనం కృపాకర్[7] - సైదాపూర్, నివాసం కరీంనగర్ 25-30 సం**

మధ్య వయస్సులో ఉన్న కృపాకర్ గారు 'ఇది మన భారతదేశం' అనే చరిత్ర 100 పుటల పుస్తకాన్ని 1993లో వెలువరించారు

రచయిత దీనిని దేశ చరిత్రగా రచించలేదు దేశంలోని నదుల పర్వతాల పుణ్యస్థలాల ప్రధాన నగరాల వర్ణన కావించారు చివరగా భారత మహనీయుల కొందరిని పరిచయం చేశారు దేశ చరిత్ర - రాజుల పరిపాలనలు కానీ, విదేశీయుల దండయాత్రలు కానీ, సాంఘిక చరిత్రకానీ ఇందులో లేదు ఇది ఒకరకంగా జనరల్ నాలెడ్జ్ పుస్తకం అనవచ్చు విద్యార్థుల కోసం రచించినట్లు రచయిత పేర్కొనలేదు నదీ పర్వతాల కొలతలు ఆధునిక విధానంలో సాగి వాటి ప్రాశస్త్య వర్ణనలలో పురాణ శ్లోకాలు ఉన్నాయి రచయిత సంప్రదాయ దృష్టిలో జాతీయాభిమానంతో ఈ పుస్తకాన్ని రచించారు 8

కృపాకర్ గారు ఈ పుస్తకం చివరగా విజయనగర రాజన్యుల, కాకతీయానంతరం ఓరుగల్లు పాలకుడైన కావయనాయుని సంగ్రహంగా వర్ణించారు ఈ రెండు రాజ్యాలు ముస్లిం పాలకుల దండయాత్రలను ధైర్యంగా ఎదిరించాయి చివరకి ముస్లిం పాలనలో చేరిపోయినవి ఈ చరిత్ర పుస్తకం పాక్షిక దృష్టితో రచింపబడినా దేశభక్తి కలది విషయక్రమం పాటించక, విషయసూచిక ముద్రించక రచయిత పాఠకులకు కొంత అసౌకర్యాన్ని కలిగించారు

ఈ ప్రాంతంలో సమగ్రమైన దేశ చరిత్రలు రాలేదు అవి రావలసిన అవసరం ఉంది

**స్థల చరిత్రలు**

స్థల చరిత్రలు దేశ చరిత్రలో భాగాలు 19వ శతాబ్దిలో ఆంగ్లేయులు కైఫీయత్తులు అనుపేరుతో కొన్ని గ్రామాల చరిత్రలు వ్రాశారు, వ్రాయించారు ప్రతి గ్రామానికి ఓ చరిత్ర ఉంటుంది కాని, మన కవులు పూర్వకావ్యాలలో పుణ్యతీర్థక్షేత్రాల - ఆలయాల, రాజధానుల మాత్రమే వర్ణించారు గుడి-గడి ఇవే ప్రాచీన కాలంలో ప్రాధాన్యత పొందినవి ఆధునిక కాలంలోనూ దేవాలయాల, చారిత్రక నగరాల గురించి వ్రాయడంలోనే మనవాళ్లు శ్రద్ధ చూపిస్తున్నారు ప్రకృతి సౌందర్య ప్రదేశాలు, పారిశ్రామిక కేంద్రాలు, మహానిర్మాణాలు కొత్తగా దర్శనీయ ప్రాంతాలైనాయి కరీంనగర్ జిల్లాలో వెలువడిన స్థల చరిత్రలు ముఖ్యంగా పుణ్యక్షేత్ర వర్ణనలు ఒక్క 'రామగిరి చరిత్ర' మాత్రమే చారిత్రక ప్రదేశ వర్ణన ఇక్కడి స్థల చరిత్రల వివరాలివి

వేములవాడ - లేములవాడ 'వేములవాడ చరిత్ర' లు రెండు వచ్చాయి

**1 డి హన్మంతరావు - మెట్టుపల్లి కీర్తిశేషులు**

హన్మంతరావు గారు జిల్లా పరిషత్ అధ్యక్షులుగా పనిచేశారు వీరు కాంగ్రెసు నాయకులు సాహిత్యాభిమాని వీరు తమ ఇష్టదైవమైన శ్రీ రాజరాజేశ్వరస్వామి వెలసిన 'వేములవాడ' చరిత్రను 1955 సుమారుగా రచించి ప్రచురించారు ఈ రచనలో కీ శే మధు మృత్యుంజయ శర్మ వేములవాడ గారి భాగస్వామ్యం ఉందని స్థానికులు చెప్తుతారు ఇప్పుడు హన్మంతరావు గారి పుస్తకం అలభ్యం

## 2 చొప్పకట్ల చంద్రమౌళి - ఎం ఏ బి ఇడి వేములవాడ

చంద్రమౌళిగారి పరిచయం గేయకవుల్లో చేయబడింది వీరు వేములవాడ చరిత్ర' అను పేరుతో చిన్నసైజు చంద్రమామలో సగం 20 పుటల పుస్తకాన్ని 1981లో ప్రచురించారు వేములవాడ సుప్రసిద్ధ స్థలం కాబట్టి యాత్రికుల ఉపయోగార్థం ఇది రచింపబడింది అయినా దేవదేవతల మహిమలతో కాక చారిత్రక విషయాల వివరణతో ఈ రచన సాగడం విశేషం ఈ ప్రాంతంపై శాతవాహన, ఇక్ష్వాకుల పాలనలు ఊహించబడ్డాయి రాష్ట్ర కూటుల సామంతులైన వేములవాడ చాళుక్యులు, స్థానిక ప్రభువులు తర్వాత కల్యాణి చాళుక్యుల, కాకతీయ చక్రవర్తుల, కుతుబ్‌షాహీ, అసఫ్‌జాహీపాలకుల పాలనలో ఈ ప్రాంతం ఉన్న వైనం సంగ్రహంగా వివరించబడింది ఇప్పుడు ప్రజాస్వామ్య పాలనలో ఉంది చివరగా రచయిత స్థానిక వివిధ కళారంగాల ప్రముఖుల పేర్కొన్నారు పుస్తకం చిన్నదైనా చారిత్రక విషయాల విలువలో మిన్నది

ధర్మపురి ధర్మపురి చరిత్రలు మూడు వచ్చాయి

## 1 కశోజ్జల సదాశివ శాస్త్రి - ధర్మపురి

శాస్త్రిగారు జన్మస్థలం మీద అభిమానంతో ఈ ధర్మపురి క్షేత్ర మహాత్మ్యము ను రచించారు ఇది సంస్కృత తాళపత్ర ప్రతి అనువాదం అన్నారు ఇది స్థలపురాణం వంద పుటలు కలది ఈ కథ నైమిశారణ్యంలోని మునులకు సూతుడు చెప్పినట్లుగా ఉంది శ్రీరాముడు ధర్మపురిలో శివలింగమును స్థాపించటం, అంజనేయ గరుత్మంతులు మంథాల నృసింహుని దర్శించటం ఇందలి విశేషాలు సందర్భవశంగా కొన్ని ఉపాఖ్యానాలు (కుబ్జ, సుధర్మ, సునంద, లక్ష్మణ - మొ॥) పురాణ ఘట్టాలు వర్ణింపబడినవి ఇది ధర్మపురి క్షేత్ర దేవతల మహిమల, పూజావ్రత దానాదుల వలన కలిగే ఫలితాల చాటే స్థల మహాత్మ్య వివరణ గ్రంథం

ఈ పుస్తకాన్ని సంక్షిప్తంగా ఆలయ పూజాదిక వివరాలతో దేవస్థానం వారు 1990 సుమారుగా పునర్ముద్రించారు కె సదాశివశాస్త్రిగారి మరో రచన "సంతోషిమాత చరిత్ర"

## 2 ఎం శ్యామసుందరశాస్త్రి

శ్యామసుందరశాస్త్రి గారి పుస్తకం 'ధర్మపురి క్షేత్ర మహాత్మ్యం-నాడు - నేడు , 1970 పరిచయం వచన భక్తి రచనల్లో చేయబడింది

## 3 పాలెపు వేంకటరాజశాస్త్రి - ధర్మపురి

వేంకటరాజశాస్త్రిగారు పై సంస్కృత తాళపత్ర ధర్మపురీ క్షేత్ర మహత్మ్యమ్ మూల గ్రంథానికి యధాతధానువాదం కావించారని తెలిసింది కృతి ముద్రితం అయినా ప్రతి లభించలేదు

**రామగిరి చరిత్ర**

1 ఎరబాటి బాపురావు - మంగపేట, 1978 సుమారుగా కీర్తి శేషులు, బాపురావు గారు పెద్దపల్లి తాలూకాలోని రామగిరి సమీపంలోని మంగపేట గ్రామం వారు వీరి పూర్వులు రామగిరి వారు

'రామగిరి' దుర్గ సామంత రాజ్య-పట్టణ చరిత్ర సంబంధంలోని వీలైనన్ని-పూర్వకావ్యాల - చరిత్రల ఆధారాలను సేకరించి రామగిరి చరిత్ర ను వీరు 1970లో రచించారు దీనిని ఆర్ బాలప్రసాద్ పెద్దపల్లి గారు 1982లో ప్రచురించారు ఇది 1/4 డెమ్మిసైజు 50 పుటలు పుస్తకం

రాముడు సంచరించిన చిత్రకూటం ఇదేనని, కాళిదాసు మేఘదూతంలో (మొదటి శ్లోకం - రామగిర్యాశ్రమేషు అని ముగుస్తుంది) వర్ణించిన రామగిరి ఇదేనని రచయిత పేర్కొన్నారు

శాతవాహనుల, కాకతీయుల, ముస్లింల పాలనల కాలాల్లో ఈ దుర్గం సంతరించుకున్న ప్రత్యేకతలను వివరించారు రచయిత సాంప్రదాయిక దృష్టి కలవారు అయినా పురాణ విషయాల వర్ణనలతోపాటు 'గోల్కొండ' నవాబుల కాలపు విశేషాలను చారిత్రక వివరాలతో వ్రాశారు పరిసర గ్రామాల కొన్నింటి చారిత్రక ప్రాధ్యాన్యతలను తెలిపారు ఇందలి మడికి సింగన భీమకవి జన్మస్థలాల నిర్ణయం చర్చకు తావిచ్చేవి ఇది ప్రత్యక్షర సత్యం అని రచయిత చెప్పుకోలేదు కూడా

"ఒక విషయముపై ముందెవరో యొకరూహించి పరిశోధించి ప్రచురించిననే గాని తచ్చరిత్ర వెలుగునకు వచ్చి యందరి దృష్టి నాకర్షించి రచనపై విమర్శలుత్పన్నమై తర్జన భర్జన లేర్పడి తుదకేదో నిజరూపము దాల్పవలయుననియే నా ధ్యేయం" అన్నారు

కరీంనగర్ జిల్లాలో వెలువడిన స్థల చరిత్రలలో ఇదే పెద్దది - ఉన్నంతలో సమగ్రమైనది

## శ్రీ కాళేశ్వర చరిత్ర

1 శ్రీ కాళేశ్వర ముక్తీశ్వర దేవస్థానం (మహదేవపూర్ మండలంలో కాళేశ్వరం ఉంది) వారు కాళేశ్వర క్షేత్ర మహత్త్యము ను ప్రచురించారు ఈ 12 పుటల పుస్తకానికి ముద్రణ తేది లేదు రచయిత పేరు లేదు స్థల పౌరాణిక చారిత్రక ప్రాధాన్యతల వివరణతోపాటు ఆలయ జీర్ణోద్ధరణ వివరాలు ఇందులో ప్రధానంగా చూపబడినవి

## కోటిలింగాల

### 1 వజ్జల రాధాకృష్ణ పరమహంస సిద్ధాంతి, మంథెన గారు

'శ్రీ కోటి లింగాల కోటేశ్వర - శ్రీ సిద్ధేశ్వర - జీడిగుండ మాహత్మ్యములు' అను 12 పుటల చిరు పుస్తకాన్ని ప్రచురించారు ముద్రణ కాలం తెలుపలేదు

సంస్కృత శ్లోకాలకు తెలుగు తాత్పర్యాలు వ్రాస్తూ కధా వివరణ కావించారు

రామసింహ మహరాజు కొడుకు రామేశ్వరుడు - ధౌత ఈ కధ చెప్పినట్లున్నది ధర్మపురి కోటిలింగాల మహిమలతో పాటు జీడికుంట వర్ణనమున్నది కోటిలింగాల ప్రాంతంలో సీతారాములు వనవాసకాలంలో కొన్నాళ్లు విహరించినట్లు, వేంగి ప్రభువు రాజరాజనరేంద్రుడు కోటిలింగాల, కొండగట్టు, నాంపల్లి, వేములవాడలలో శుద్ధుడైనట్లు చెప్పబడింది

కోటిలింగాల స్థలాన్ని రాకూర్ రాజారాం సింగ్ పెద్దపల్లి గారు 'కరీంనగర్ మండల చరిత్ర' 1981 పు 29లో ఇది శాతవాహన పూర్వాంధ్ర కోటనగరం పట్టం అని నిరూపించారు రాధాకృష్ణ పరమహంస సిద్ధాంతిగారిది భక్తి రచన స్థల మహత్మ్యం

## స్థల చరిత్రలు వ్యాసాలు

మంథని ఇవి రెండు వ్యాసాలు

### 1 వెంకటరాజన్న అవధాని - మంథని

అవధాని గారు రచించిన 'మంథెన ప్రాచీన వైభవము' వ్యాసం "సంగ్రహాంధ్ర విజ్ఞానకోశము' హైదరాబాద్ వారి 7వ సంపుటిలో ఉంది పు 101-105 - ము 1970

### 2 రేవెళ్ల మురళీధర శర్మ - బి ఓ.ఎల్ మంథని

శర్మగారు రచించిన 'మంథని చరిత్ర' పౌరాణిక చారిత్రక మూల్యాలు కలది దీనిని రచయిత తమ 'గీత మాలికాకృతులు' గేయ కావ్యారంభంలో 1992 లో ప్రచురించారు

**కొత్తకొండ**

1 వానమామలై కృష్ణమాచార్యులు బి ఓ ఎల్ గట్లనర్సింగాపూర్ కృష్ణమాచార్యులు రిటైర్డు ఆంధ్రభాషోపాధ్యాయులు వీరిది కవి పండిత వంశం వానమామలై, లక్ష్మణ జగన్నాథ వరదాచార్య మహా కవులకు అన్నగారైన వా వేంకటాచార్యులకు వీరు ప్రథమ పుత్రులు కృష్ణమాచార్యుల స్వస్థలం గట్ల నర్సింగాపురం ప్రస్తుతం నివాసం ముల్కనూరు ఆ గ్రామాలకు సమీపంలోని 'కొత్తకొండ వీరభద్ర క్షేత్రము ను వివరిస్తూ వీరి వ్యాసం 'సారస్వత జ్యోతి' త్రైమాసిక పత్రిక, ఫిబ్రవరి 1954 సంచికలో ముద్రణ పొందింది

**ఇతరములు**

**I బి వి రామారావు - తోటపల్లి కరీంనగర్**

వీటి అన్నింటికంటె విలక్షణమైన వ్యాసం బోయినపల్లి వేంకట రామారావు గారి కరీంనగర్ మండల దేవాలయాలు - సంక్షిప్త చరిత్ర 40 పుటలు ఇది 'కరీంనగర్ మండల చరిత్ర' 1981, నాలుగు వ్యాసాల్లో చివరిది దీనిలో రావు గారు కాళేశ్వరం, మంత్రకూటం, కొత్తకొండ, కొత్తగట్టు, రాయికల్, ఓదెల, ఇల్లంతకుంట, కొత్తకొండ, సుందరగిరి, నాంపల్లి, మొలంగూరు, గొడిశాల, కటుకూరు, బెజ్జంకి, వీణవంక, వెలిగందుల, నగునూరు, శనిగరం, శింగరయ్యఉగ్గం, నందిమేడారం, కరీంనగరం, కొత్తపల్లి, మారెడుపాక, చల్లూరు, ఎలిగేడు, ప్రతాపగిరి, పాలాస, గూడెం, సుందిళ్ల, కమాన్‌పూర్, పెద్దబొంకూరు, ధూళికట్ట, కోటిలింగాల, కురిక్యాల, కటికెనపల్లి, రామగిరి, నందగిరి, బిజిగిరి షరీఫ్-విజయగిరి, ఇన్నిప్రాచీన అర్వాచీన ఆలయాల చరిత్రలు పౌరాణిక - చారిత్రక ఆధారాలతో వివరించారు జనంవాడుకలోని విషయాలను తెలిపారు వీటిలో కొన్ని నేడు శిథిలాలయాలు మొలంగూరు, రామగిరి, వెలిగందుల, ప్రసిద్ధమైన కోటలు బొంకూరు, ధూళికట్ట కోటిలింగాల ఆంధ్ర శాతవాహనుల కేంద్రాలుగా పురావస్తుశాఖ వారి తవ్వకాలలో ప్రాముఖ్యతను సంతరించుకున్న ప్రదేశాలు ఇంకా కొన్ని ఆలయాల పేర్లు వదలినా వచ్చిన వానిలో సమగ్రమైన వ్యాసం రామారావు గారిదే మరో విశేషం - పై స్థల చరిత్రలన్నీ ఇంచుమించు స్థానికులు వ్రాసినవి ఇది అట్లా కాదు

కరీంనగర్ దేవాలయాల గురించి "టెంపుల్స్ ఆఫ్ సౌత్ ఇండియా - కరీంనగర్ డిస్ట్రిక్" అనే పేరుతో డా పి వి రమణయ్య, జగిత్యాల గారి పిహెచ్ డి సిద్ధాంత వ్యాస గ్రంథం చరిత్రశాఖలో వచ్చినా అది ఆంగ్ల భాషలో వెలువడింది

ఈ మండల దేవాలయాల - చారిత్రక ప్రదేశాల గురించి ఒక సమగ్రమైన ప్రామాణిక గ్రంథం రావలసిన అవసరం ఉంది పురావస్తు శాఖవారో స్వచ్ఛంద సంస్థలో చరిత్రాభిమానులో అందుకు పూనుకోవాలి

**సాంఘిక చరిత్రలు**

దేశమంటే మట్టి కాదోయ్ దేశమంటే మనుషులోయ్ - అన్నారు గురజాడ దేశ చరిత్ర అంటే ప్రజల చరిత్ర అనే భావం - ఈ కాలంలో జనాదరం పొందుతున్నది

పాలకుల యుద్ధాల భోగవిలాసాల వర్ణనలకంటే, ప్రజల జీవితాల్లోని కష్టసుఖాలు, ప్రగతిపథంలో వారు సాగుతూ పొందిన అనుభవాలు, అధిరోహించిన ఉన్నత స్థానాలు నిజమైన చరిత్ర అనే భావం ఆధునిక కాలంలో నెలకొన్నది నిజానికి ఈ భావమే జనానికి ప్రయోజనకరమైంది

మన తెలుగులో దేశ చరిత్రలకన్నా సాంఘిక చరిత్రలు - సంస్కృతి చరిత్రలు తక్కువ ఈ కోణంలో ఈ జిల్లాలో కేవలం నాలుగు పుస్తకాలు వచ్చాయి అవి ఇవి

1 ముద్దసాని రాంరెడ్డి - 'సమైక్యతా పథంలో తెలుగువారు' - 1983
2 డా ఎం సుజాతారెడ్డి 'ఆంధ్రుల సంస్కృతి - సాహిత్య చరిత్ర' 1989
3 మలయశ్రీ - 'కాకతీయుల కాలం నాటి సామాజిక జీవితం' 1989
4 వి శంకరశర్మ - 'జాతీయ జీవన స్రవంతిలో అదిలాబాద్ గిరిజనులు" - 1993
5 హరి అశోక్ - 'చారిత్రక యుగంలో మహిళ' 1993

**1 ఎం రాంరెడ్డి - ఎం ఏ ఊటూరు**

రాంరెడ్డిగారి పరిచయం నవలా రచయితలలో ఉంది రెడ్డి గారు కొంతకాలం 'రాష్ట్ర సమాచార సాంస్కృతిక వ్యవహారాల శాఖలో ఆఫీసర్‌గా పనిచేశారు ఆంధ్రాంగ్ల హిందూస్థానీ భాషా విశారదులు, సహజంగా రచయిత, జర్నలిస్టు అయిన వీరు తాము ఉద్యోగం చేసే ప్రభుత్వ శాఖకు ఉపయుక్తమైన కొన్ని పుస్తకాలు రచించారు ఈ కోణంలో వీరు ఆంధ్ర సమైక్యతా భావ ప్రచారం కోసం రచించిన 25 పుటల సాంఘిక చరిత్ర సమైక్యతా పథంలో తెలుగు వారు రాష్ట్ర పౌర సమాచార సాంస్కృతిక వ్యవహారాల శాఖ హైదరాబాద్ వారు ఈ చిన్న పుస్తకాన్ని 1984లో ప్రచురించారు

చారిత్రక, సాంస్కృతిక, సాహిత్య, విప్లవ రంగాలలో కోస్తాంధ్రులు, రాయలసీమవారు, తెలంగాణావారు ఎట్లా ప్రతిస్పందించి పరస్పర సహకారాన్ని ఏ విధంగా అందించుకున్నారో రచయిత ఇందులో వివరించారు కీ పూ 250 శాతవాహనుల కాలం నుండి భారతదేశ స్వాతంత్ర్య లబ్ధివరకు సంగ్రహంగా సాగిన ఈ రచన ఆంధ్రప్రదేశ్ అవతరణ 1956 ప్రస్తావనతో ముగిసింది రచయిత గారిది ప్రగతి శీల దృష్టి - స్నేహ భావ సృష్టి

**2 డా॥ ఎం సుజాతారెడ్డి** - వీరి ఆంధ్రుల సంస్కృతి - సాహిత్య చరిత్ర బి ఏ అనర్స్ పార్య గ్రంథం తెలుగు అకాడెమీ హైదరాబాద్ వారు ప్రచురించారు పార్య గ్రంథం ప్రభుత్వం వారి పార్య ప్రణాళిక ననుసరించి వ్రాయవలసి ఉంటుంది బి ఏ పార్య గ్రంథం కావటం ఈ గ్రంథ విశిష్టతకు నిదర్శనం డా సుజాత గారి ఈ రచనలో తెలుగువారి సంస్కృతి చరిత్రతోపాటు సాహిత్య చరిత్ర కూడా సంగ్రహంగా వివరించబడింది

**3 మలయశ్రీ** వీరి 'కాకతీయుల కాలం నాటి సామాజిక జీవితం' గ్రంథం తెలుగు విశ్వవిద్యాలయము హైదరాబాదు వారి 'చరిత్ర సంస్కృతి' విభాగం ఉత్తమ రచనల పోటీలో 1988 89 సం ప్రథమ బహుమతి పొందినది దీనిని హైదరాబాద్ బుక్ ట్రస్ట్ వారు 1990లో ప్రచురించారు తెలుగులో తొలి సాంఘిక చరిత్ర రచించిన కీ శే సురవరం ప్రతాపరెడ్డి గారికి ఈ పుస్తకం అంకితం ఇవ్వబడింది

210 పుటలు, 55 శీర్షికల ఈ సాంఘిక చరిత్రలో మొదటి 5 శీర్షికలలో కాకతీయ పాలకుల విశేషాలు, సామ్రాజ్య వివరాలు, కోటనగర వర్ణనలున్నవి మిగిలిన 50 శీర్షికలలో నాటి ప్రజల ఆచార వ్యవహారాలు, ఆహార విహారాలు, అలంకారాలు వస్త్రధారణవిధానాలు, ఆటపాటలు, మత విశ్వాసాలు, పర్వదినాలు, కళలు, క్రీడలు, విద్య, వైద్యం, సేద్యం మున్నగు విషయాలు సూక్ష్మ పరిశీలనలతో పూర్వకావ్యాల, శిల్పాల ఆధారాలతో వివరింపబడినవి

ఈ గ్రంథం పాఠకుల - పత్రికల సమీక్షకుల ప్రశంసలందుకున్నది

**4 వి శంకరశర్మ - ఎం ఏ శిక్షాశాస్త్రి, ధర్మపురి**

వామనభట్ల శంకరశర్మ గారు యువ రచయిత తెలుగు సంస్కృతాలతో ఎం ఏ డిగ్రీలు పొందారు ధర్మపురి స్వస్థలం ఆంధ్ర భాషోపాధ్యాయులుగా కొరుట్ల మండలంలోని మోహన్‌రావుపేట

సెకండరీ పాఠశాలలో ఉద్యోగం చేస్తున్నారు వీరు ఈ ఉద్యోగానికి మొదట కొంతకాలము ఆదిలాబాద్ జిల్లాలో ప్రముఖ దినపత్రికలకు విలేఖరిగా పనిచేశారు వీరి తెలుగు వ్యాసాలు పత్రికలలో ప్రచురించబడినవి, ఆకాశవాణి ద్వారా ప్రసారం చేయబడినవి శర్మ గారి ముద్రిత పుస్తకం ఒకటి

1 జాతీయజీవన స్రవంతిలో ఆదిలాబాద్ గిరిజనులు 1993 పు 60

ఈ గిరిజన జీవన చరిత్రలో రచయిత 17 శీర్షికలతో వీలైనంత ప్రామాణిక సమగ్ర సమాచారం అందించడానికి కృషి చేశారు భారతదేశ, ఆంధ్రప్రదేశ్ గిరిజన సంస్కృతుల వివరించి ఆదిలాబాద్ జిల్లా గిరిజనుల తెగల పేర్లు, జన సంఖ్య, వృత్తులు పండుగలు తెలిపారు



గోండు రాజుల సమాచారం ఉంది నైజాంతో తలపడిన కొమరంభీం వీరుని ప్రస్తావన ఉంది స్వాతంత్ర్యోద్యమంలో ఈ గిరిజనుల పాత్ర వివరిస్తూ, ప్రస్తుత ప్రజాస్వామ్య ప్రభుత్వంలో వీరి ప్రాతినిధ్యాన్ని పేర్కొన్నారు ప్రభుత్వం వారు అమలు వరుస్తున్న అభివృద్ధి కార్యక్రమాలతోపాటు, ఈ గిరిజనులకు సేవలందించిన వ్యక్తుల పేర్లు సైతం ఇచ్చారు

## 5 హరి అశోక్ - ఎల్ ఎల్ బి జగిత్యాల

హరి అశోక్‌గారు కథలు కవితలు వ్రాసే అలవాటు కలవారు మేడిపల్లి రెవిన్యూ కార్యాలయంలో ఉద్యోగం చేస్తున్నారు వీరి రచనలు పత్రికల్లో వస్తున్నవి వీరు ఇటీవలి వ్రాసిన పుస్తకం 'చారిత్రక యుగంలో మహిళ' అనే సాంఘిక చరిత్ర పుస్తకం భాగ్యనగరంలోని ఓసంస్థ ద్వారా 1993లో ప్రతిష్ఠాత్మక బహుమతిపొందింది రచయిత పుస్తకం అచ్చయిందన్నారు కాని ప్రతి వారి వద్ద లేదు వ్రాతప్రతి చూస్తే (దాదాపు 100 పుటలు) డా పి యశోదారెడ్డి కత్తిపద్మారావు గారల రచనలు స్మృతిలో మెదిలాయి



## యాత్రా చరిత్రలు

యాత్ర అంటే ప్రయాణం క్షైత్రయాత్ర - విజయయాత్ర - దండయాత్ర దేహయాత్ర అనే సమాసాలు ప్రత్యేక సందర్భాల్లో పూర్వ సంస్కృత సాహిత్య ప్రయోగాలు తెలుగులోనూ వ్యాప్తికి వచ్చాయి ఆదిమ మానవులు ఆటవిక సంచార జీవులు

మనదేశంలోనే కాక విదేశాల్లోనూ యాత్రలకెంతో ప్రాధాన్యమున్నది మెగస్తనీస్, పాహియాన్, హ్యూన్‌త్సాంగ్, మార్కోపోలో, అబ్దుల్ రజాక్ మొ॥ విదేశీయాత్రికుల వ్రాతలు మన దేశ పూర్వచరిత్ర రచనకు ఎంతగానో ఉపకరించాయి రాహుల్ సాంకృత్యాయన్ యాత్రల ప్రయోజనాన్ని వివరిస్తూ 'లోక సంచారి' అనేక ఓ ప్రత్యేక పుస్తకాన్నే హిందీభాషలో రచించారు

"తెలుగులో యాత్రా చరిత్రలు" అనే అంశంపై ఉస్మానియా విశ్వవిద్యాలయంలో 1990లో పిహెచ్ డి పరిశోధన కావించిన డా మచ్చ హరిదాసు, కరీంనగర్ గారు యాత్రల వలన కలిగే ప్రయోజనాలను ఇట్లా పేర్కొన్నారు "సాధారణ దృష్టితో చూసినట్లయితే యాత్రల వల్ల రెండు ప్రయోజనాలున్నాయి ఒకటి అనంతానంత ముఖాలుగా విలసిల్లే విచిత్ర సృష్టి సందర్శనం రెండు హృదయవైశాల్యం" (తె యా చ 1992 పు 114) మొదటిది ఆనందానికి ప్రకృతి సందర్శనం రెండు హృదయ వైశాల్యం మొదటి ఆనందానికి రెండవది విజ్ఞానానికి హేతువులు

చారిత్రక కాలాల్లోనే కాక పురాణాల పూర్వకాలంలోనూ మనవాళ్లు యాత్రలు చేసిన ఆధారాలున్నాయి ఋషులు రాజులు దూర ప్రదేశాల యాత్రలు కావిస్తే, సామాన్య గృహస్తులు శక్తి కొలది సమీప పుణ్య స్థలాల సందర్శించారు దేశాటనం విజ్ఞాన వికాసానికి కారణమౌతుంది

లౌకికానందంకంటె దైవభక్తికి - చిత్తశాంతికి అధిక ప్రాధాన్యమిచ్చిన మనపూర్వులు పుణ్యతీర్థ

దివ్యక్షేత్ర సందర్శనానికి అధిక ప్రాధ్యాన్యమిచ్చారు దూర ప్రదేశాలను, మహానదీ పర్వత సముద్ర ప్రాంతాలను శిల్పశోభాలంకృతాలైన దేవళాలను దర్శించి తృప్తి చెందారు

హిందువులే కాక జైనులు, బౌద్ధులు, క్రైస్తవులు, ముస్లింలు, యూదులు తమ తమ పుణ్యక్షేత్ర సందర్శన యాత్రలకు పిలుపులనిచ్చారు

తెలుగులో మద్రాసు నుండి కాశీకి 1830 31 వెళ్లివచ్చిన 'వెనుగుల వీరాస్వామి' కాశీయాత్ర చరిత్ర - 1938, మొదటి యాత్రా గ్రంథం (వీరాస్వామయ్య యాత్రలో వ్రాసిన జాబులను క్రోడీకరించి ఈ పుస్తకంగా ప్రచురించిన వారు కోమలేశ్వరం శ్రీనివాస పిళ్ళె) అప్పటి నుండి మనవాళ్లెందరో దేశ విదేశయాత్రా విశేషాలను గద్య పద్యరూపాలలో వ్రాసి ప్రచురించారు

ఆ వరుసలో ఈ జిల్లాలో ఈ శతాబ్దిలో ముగ్గురు రచయితలు ప్రముఖ యాత్రా చరిత్రలు రచించారు మరొకటి చిన్నవ్యాసం

1 డా సి నారాయణరెడ్డి గారి - విదేశ యాత్రలు, 1976 79, 81

2 పి వి మనోహరరావు గారి 'కైలాసదర్శనం - బ్రహ్మమానస సరోవర యాత్ర' - 1986

3 డా జి లింగారెడ్డి గారి - జానపద విజ్ఞానం - 'సేకరణ అనుభవాలు' - 1982

4 ఎస్ హర్షవర్ధన్ గారి నా కాశ్మీర యాత్ర'

## 1 డా సి నారాయణరెడ్డి

డా సి నా రె విదేశ యాత్రల అనుభవాలు ప్రత్యేక వ్యాసాలుగా వచ్చాయి అవి మూడు

1 ముచ్చటగా మూడు వారాలు మలేషియా తెలుగు వారితో

2 సోవియట్ రష్యాలో పదిరోజులు, 3 పాశ్చాత్యదేశాల్లో 50 రోజులు

ద్వితీయ ప్రపంచ తెలుగు మహాసభలు 1976లో మలేషియాలో జరగడానికి ముందుగా, ఆదేశ ఆంధ్ర సంఘం వారి ఆహ్వానాన్ని పురస్కరించుకొని డా సి నా రె డా దాశరధి మలేషియాకు వెళ్లివచ్చారు 30 జూన్ 76 నుండి 20 జూన్ 76 వరకు సాగిన ఈ యాత్ర విశేషాలుతో కూడిన డా సి నా రె వ్యాసం 'ఆంధ్రప్రభ' సచిత్రవార పత్రిక 8, 15 సెప్టెంబర్ 76 సంచికల్లో ప్రచురించబడింది ఈ వ్యాసంలో రెడ్డి గారి కళా హృదయం, కవితాత్మ, చూసిన సుందర ప్రదేశాలు, చేసిన స్నేహ ప్రసంగాలు, చారిత్రక వివరాలు, భాషా విశేషాలు పాఠకులను అలరిస్తాయి

సోవియట్ రష్యాలో పది రోజులు, 25 ఆగస్టు 1979 నుండి 4 సెప్టెంబర్ 79 వరకు రెడ్డిగారి రష్యా పర్యటనానుభవాలు, ఇండో-సోవియట్ కల్చరల్ సొసైటీ ఆంధ్రశాఖ, డా సి నా రె గారిని, డా గోర్కి గారిని రష్యా పర్యటనకు పంపింది డా రెడ్డిగారు తమ రష్యా పర్యటనను చారిత్రక సాంస్కృతిక సాహిత్య నేపధ్యంలో సుదీర్ఘ రష్యా పర్యటనను చారిత్రక సాంస్కృతిక వ్యాసంగా వ్రాశారు ఆంధ్రప్రభ వారపత్రికలో అయిదు సంచికలలో వచ్చిన ఈ వ్యాసాన్ని 'భారత సోవియట్ సాంస్కృతిక సంఘం' హైదరాబాద్ వారు 1980లో పుస్తకంగా ప్రచురించారు

అమెరికా, గ్రేటర్ చికాగో తెలుగు వారి ఆహ్వానాన్ని పురస్కరించుకొని నారాయణరెడ్డిగారు 1981లో అమెరికా వెళ్లారు అక్కడి నుండి కెనడాకు వెళ్లివచ్చారు యు కె ఆంధ్రుల ఆహ్వానంతో లండన్‌వెళ్లి బ్రిటన్‌లో రెండు వారాలున్నారు ప్యారిస్ చూసివచ్చారు - మే 1న వెళ్లిన రెడ్డిగారు 23 జూలై 81 నాడు తిరిగి ఇండియాకు చేరుకున్నారు

సి నా రె గారి ఈ పాశ్చాత్య దేశాలయాత్ర విశేషాలను కూడా ఆంధ్రప్రభ వారపత్రిక 19 ఆగస్టు నుండి సెప్టెంబర్ 23 వరకు ఆరు సంచికల్లో ప్రచురించింది ఆయా ప్రముఖ నగరాల్లో డా సి నా రె చేసిన ప్రసంగాలు వీరి భాషాధిషణకు గీటురాళ్లు వీరు వివిధ అంశాలపై చేసిన వ్యాఖ్యలు బహుముఖ ప్రజ్ఞకు నిదర్శనాలు ఒక కవిగా వీరి అనుభూతి ఎటువంటిదో 'న్యాషివెల్' లోని గీత రచయితల సంఘాన్ని గురించి తెలుపుతూ వీరు అనుకున్న ఈ మాటలు వ్యక్తం చేస్తాయి "న్యాష్‌వెల్‌లోని గీత రచయితల సంఘంలో 1100 మంది సభ్యులున్నారని చదివినపుడు

ఆశ్చర్యానందాలతో పొంగిపోయినాను మన దగ్గర గీత రచయితలు ఉన్నా సమైక్యమేది? అందుకు ప్రతీకగా నిలిచిన సంఘమేది? అని ప్రశ్నించుకుని మరుక్షణంలో కుంగిపోయినాను' 9

సి నా రె గారి విదేశీ యాత్రల వ్యాసాలన్నీ ఒక పుస్తకంగా వస్తే పాఠకులకు ఎంతో మేలయ్యేది

## 2 పి వి మనోహరరావు - వంగర జ 1935

పాముల పర్తి వేంకట మనోహరరావు గారు మన ప్రధాని పి వి నరసింహారావు గారికి స్వంత తమ్ముడు మనోహరరావు గారి జన్మస్థలం వంగర' గ్రామం అయినా ప్రస్తుతం హన్మకొండలో ఉంటున్నారు 19 జూలై నుండి 17 ఆగష్టు వరకు 30 రోజులు, రావు గారు 1983లో హిమాలయయాత్ర కావించారు తమ పర్యటనానుభవాలను 'కైలాసదర్శనం బ్రహమానవ సరోవరయాత్ర' పేరుతో 600 పుటల ఉద్గ్రంథంగా 1985లో ప్రచురించారు

ఈ పుస్తకం యాత్రా విశేషాలతో కూడినది రావు గారు తాము చూసిన ప్రదేశాల సౌందర్యాలను చారిత్రక విశేషాలను ఆధ్యాత్మిక ప్రాధాన్యతలను చక్కగా వివరించారు మధ్య మధ్య పూర్వ శ్లోకాలను పద్యాలను సందర్భోచితంగా జతపరచి వ్యాఖ్యానించారు

ఇది భారత ప్రభుత్వం వారి యాజమాన్యంలో సాగిన పుణ్యస్థల యాత్ర కైలాస పర్వతం మానవ సరోవరం భారతదేశ సంస్కృత సాహిత్యంలో శైవమతంలో, ప్రముఖ స్థానమాక్రమించినా, చారిత్రక కారణాలవల్ల ఆ హిమాలయ స్థలం టిబెట్ భూ భాగమై ప్రస్తుతం చైనాలో ఉంది ఉత్తరంగా దుర్గమ హిమాలయ పర్వతారోహణమేకాక విదేశంలోని మన పూర్వ పవిత్ర స్థల సందర్శన యాత్రలో పడిన ప్రయాస, పొందిన అనుభవాలు - ఆనందాలు, మనోహర రావు గారి సునిశిత పరిశీలన మనోహరకథనం వలన, పాఠకులకు ప్రత్యక్షానుభవం అయినాయి మార్గంలోని వివిధ పట్టణాల, గ్రామాల, ఆలయాల - మఠాల, పర్వతాల, నదులనేకాక కైలాస పర్వతాన్ని మానస సరోవరాన్ని రావుగారు చక్కగా వర్ణించారు

45 అధ్యాయాల్లో సాగిన ఈ వచన యాత్రా చరిత్ర చివరగా, విషయ సంబంధ వేదాంత సాహిత్య విశేషాంశాలతో కూడినవి ప్రముఖ పండితుల వ్యాసాలు ఆరు 86 పు చేర్చారు

వివిధ ఆధ్యాత్మిక పీఠాధిపతులు విశ్వవిద్యాలయాల భాషా పీఠాధిపతుల పీఠికలు 70 పుటలు ఈ గ్రంథానికి వర్ణచిత్రాలు అదనపు అలంకారం డా సి నా రె తమ 'అభినందన'లో రచయితను 'మీ కలంతో కెమెరా ఉంది' అన్నట్లు మనోహరరావు గారివి 'కెమెరా' కళ్లు చూసిన ప్రతి రమణీయ, భయాస్పద-దృశ్యాలను, సన్నివేశాలను సరళంగా సహజంగా సుందరంగా వర్ణించారు డైరీగా వ్రాసిన ఈ వ్యాసంలో డబ్బు ఖర్చు వివరాలు కూడా ఉన్నాయి ఇది రచయిత ఆత్మ కథాత్మక సామూహిక అపూర్వ యాత్రా చరిత్ర

మనోహరరావు గారు రచయిత కాదు పెద్ద పాండిత్యం లేదు అయినా వారి అచంచల దీక్షవల్ల ఈ గ్రంథం రూపొందింది ఈ రచన సమగ్రత్వానికి సూచనలిచ్చి తగిన సమాచారాలందించి, శ్లోకాల జతపరచిన పండితుల పేర్లు తమ పీఠికలో తెలిపి కృతజ్ఞతలు చెప్పుకున్నారు ఇది వీరి విశాల హృదయానికి నిదర్శనం ఈ పుస్తకానికి పి వి నరసింహారావు గారి పీఠిక సైతం ఉంది తెలుగులో లౌకిక, పారలౌకిక దృష్టిగల వారి నెవరినైనా స్థల వర్ణనలతో వేదాంత వివరణలతో అలరించగలది మనోహర రావు గారి హిమాలయ 'కైలాస దర్శనం బ్రాహ్మమానవ సరోవరయాత్ర"



## 3 డా గోపులింగారెడ్డి - ఎం ఏ పిహెచ్ డి అల్లునూరు

లింగారెడ్డి గారి ప్రస్తుత నివాసం కరీంనగర్, వీరు డిగ్రీ కాలేజీ తెలుగు లెక్చరర్ వీరికి జానపద సాహిత్యంపై అభినివేశంమెండు 'తెలంగాణా శ్రామిక గేయాలు' అను అంశంపై 1980లో డాక్టర్ పట్టా పొందారు వీరు తమ పరిశోధన కాలపు పర్యటనా ప్రయాసలను "జానపద విజ్ఞానం - సేకరణ అనుభవాలు" అను పేర 1982లో 150 పుటల పుస్తకంగా

ముద్రించారు ఇది పరిశోధనానుభవాల వివరాలైనా రచయిత తమ పరిశోధనలో భాగంగా వివిధ ప్రాంతాల్లో సంచరించిన సమాచారంతో కూడి ఉన్న విలక్షణ యాత్రా చరిత్ర ఇది భావి పరిశోధకులకు ఉపయుక్త గ్రంథం

4 ఎస్ హర్షవర్ధన్ చంజర్ల కరీంనగర్ జూనియర్ కాలేజీ విద్యార్థిగా ఉత్తర భారతదేశ యాత్ర చేసి తమ అనుభూతులను 'నా కాశ్మీరయాత్ర' పేరుతో వ్యాసంగా వ్రాసినట్లు వారి ప్రభాతం' - 81 పుస్తకం పీఠికలో తెలిపారు ఇది అముద్రితం

ప్రఖ్యాతకవి డా జె బాపురెడ్డి గారు తమ ఐరోపా దేశయాత్రా విశేషాలను అనుభూతులను 'బాపురెడ్డి గద్యకావ్యాలు' 1970లో చక్కగా వర్ణించారు అవి వచన కవితలు

బోయినపల్లి వేంకటరామారావుగారు 'భారత యాత్ర', పి వి నరసింహరావుగారు 'ప్రపంచయాత్ర' వస్తే - రచిస్తే ఎంతో బాగుండేవి

## సాహిత్య సమీక్షలు

భాష మానవుని భావ వ్యక్తీకరణ సాధనం 'సాహిత్యం' జాతికి విజ్ఞాన భాండాగారం, ఒక దేశ భాషా సాహిత్యం ఆ దేశ ప్రజలు సాగించిన పరిశ్రమకు, సాధించిన ప్రగతికి సజీవ సాక్ష్యం సిరి సంపదలకంటె కూడ విలువైనది ఈ వాఙ్మయం ఇది తరతరాలుగా పెద్దలనుండి పిన్నవారికి అందుతున్న అమూల్య నిధి

కావ్యాన్ని గురించి మన పూర్వాలంకారికులు, ఆధునిక పండితులు ఇచ్చిన నిర్వచనాలు వెలిబుచ్చిన అభిప్రాయాలు ఉత్తమ సాహిత్యాన్ని గురించే ధ్వనిరసాలంకార శబ్దార్థ సౌందర్యాలు నీతి ప్రబోధం లేని రచనలు సాహిత్యమే కాదన్నారు ఆ చర్చవేరు

ఏది ఉత్తమ సాహిత్యమో కాదో మొదట దాన్ని చదివితే కదా తెలిసేది వెలువడిన సాహిత్యమంతా చదువరులకందరికీ అందుబాటులో ఉండదు అటువంటిది వారికి కనీస పరిచయం కోసం, సాహిత్య భద్రతకోసం - సాహిత్య వివరణ రచనలు అవసరమౌతాయి కవుల చరిత్రలు, సాహిత్య వ్యాసాలు, కావ్య సమీక్షలు, గ్రంథ సూచికలు మొ॥ ఇట్లాంటివి రచనల బాగోగుల చర్చలు సాహిత్య విమర్శలు ఈ విభాగంలో సాహిత్య చరిత్రలు, విమర్శలు సమీక్షలు, వ్యాఖ్యానాలు, పీఠికలు మొ॥ వివరించబడుతున్నవి

మొదటి ఈ జిల్లాలో వెలువడిన సాహిత్య చరిత్రల గురించి తెలుసుకొందాం

## సాహిత్య చరిత్రలు

తెలుగు సాహిత్య చరిత్రలు విమర్శలు - సమీక్షలు - వ్యాసాలు - వ్యాఖ్యానాలు - పీఠికలు ఈ జిల్లాలో వచ్చిన సాహిత్య చరిత్రలు అయిదు పుస్తకాలు

1 డా పి యశోదారెడ్డి గారి 'ఆంధ్ర సాహిత్య వికాసము' మొ భా 1983 2 బి వి రామారావు గారి 1 కరీంనగర్ మండల సాహిత్య సంగ్రహ చరిత్ర - 1959

2 కరీంనగర్ జిల్లా కవుల పరిచయ సంచిక - 1979-81

3 మలయశ్రీ గారి 'కరీంనగర్ జిల్లా రచయితల చరిత్ర' - 1981

4 డా॥ ఎం గోపాల్‌రెడ్డి మరియు డా ఎం సుజాతారెడ్డి గారల "సంస్కృత వాఙ్మయ చరిత్ర" - 1986 (తెలుగు నవల)

5 టి శ్రీరంగస్వామి గారి - "వరంగల్ జిల్లా వాఙ్మయ సూచిక" - 1987

కరీంనగర్ జిల్లా సాహిత్యాన్ని గూర్చి పత్రికల్లో అప్పుడప్పుడు వ్యాసాలు మాత్రం వచ్చాయి దూపాటి వేంకటరమణాచార్యుల 'సారస్వత జ్యోతి' 1954లోని కరీంనగరం మండల సాహిత్య వ్యాసం మొదటిది స్రవంతి మాసపత్రికలోనూ మరో వ్యాసం వీరు వ్రాసినట్లు తెలిసింది అదే వరుసలో

1 సి నారాయణరెడ్డి గారి 'సారస్వత జ్యోతి వ్యాసం ఆగస్టు 1954

2 జి రాంరెడ్డి, ఏం ఏ చెప్పాల గారు 1976లో "ఆంధ్రభూమి దినపత్రికలో ప్రచురించిన వ్యాసం

3 వేముల ప్రభాకరగౌడు, రాయికల్ గారు 1980 సుమారుగా జనధర్మ' వరంగల్ పక్షపత్రికలో ప్రచురించిన కరీంనగర్ జిల్లా కవుల చరిత్రలు

4 గర్రెపల్లి సత్యనారాయణరాజు గారి 'కరీంనగర్ మండల చరిత్ర' 1981లోని 'కజి ప్రాచీన సాహిత్యం" వ్యాసం

5 'ఈనాడు దినపత్రిక 1993లో ప్రత్యేక సంచికలోని సాహిత్య విషయాలు

ఇవి ఈ జిల్లా కవుల సాహిత్య పరిచయం పాఠకులకు కలిగించాయి

ఇక్కడి రచయితల సాహిత్య చరిత్ర గ్రంథాల వివరాలు -

### 1 డా పి యశోదారెడ్డి - ఎం ఏ పిహెచ్ డి అన్నారం - జ 8 8 1929

డా యశోదారెడ్డి గారు రిటైర్డ్ ప్రొఫెసర్ వీరు బహుగ్రంథ రచయిత్రి అనేక సాహిత్య విమర్శ గ్రంథాలు - పరిశోధన వ్యాసాలు - పూర్వ కావ్య పరిష్కరణలు వీరి ప్రతిభకు గీటురాళ్లు వీరు రచించిన సాహిత్య చరిత్ర 'ఆంధ్ర సాహిత్య వికాసం మొదటి భాగం 1973లో పుస్తక రూపములో వెలువడింది ఇది వీరు సమగ్రాంధ్ర సాహిత్య చరిత్ర వ్రాసే సంకల్పంతో వచ్చినా మిగితా భాగాలు రాలేదు

### 2 బి వి రామారావు - తోటపల్లి వయస్సు 75 సం లు

బోయినిపల్లి వేంకటరామారావు గారు సర్వోదయ నాయకులు సారస్వత జ్యోతి సంపాదకులు, జిల్లా రచయితల సంఘ ప్రధాన కార్యదర్శి రామారావు గారు మంచి వక్త - బహు సమావేశకర్త సాహితీ వేత్త వీరి వ్యాసాలు అనేకం వీరు అఖిల భారత సంచారం కావించి - సన్మానాలందినవారు అఖిలాంధ్ర కవి పండితుల రాజకీయ ప్రముఖుల, సంఘసేవకుల సన్మానించినవారు జిల్లా సాహిత్య చరిత్ర వెలువడాలని వారి కోరిక సమగ్ర సాహిత్య చరిత్ర వెలువడుటానికి ఉపయుక్తంగా 'హు ఈజ్ హు' అనే విధానంలో జిల్లా కవుల పరిచయం సంకలన సంచిక 1980లో వెలువరించారు ఇందులో 63 మంది కవుల పరిచయం పుటకొక్కటిగా ఉంది రచయితల వివరాలు - పోటోలు ఒక్కొక్క కవిత ఇందులో పొందు పరిచారు



ఇది చిన్న పుస్తకమైనా ప్రయోజనంలో మిన్నది ఆ మాత్రపు ప్రయత్నం అంతకు పూర్వం ఈ జిల్లాలోనే చేసినవారు లేరు ఈ గ్రంథం మొదటి భాగం మాత్రమే రెండవ భాగం వెలువడలేదు కాబట్టి, జిల్లా రచయితల సమగ్ర సమాచారం ఇది అందించలేకపోయింది ఇదే కాక 1959 లోనే వీరు 'కరీంనగర్ మండల సాహిత్య సంగ్రహ చరిత్ర' అనే పేరుతో మరో చిన్న పుస్తకాన్ని ప్రచురించారు

## 3 మలయశ్రీ

మలయశ్రీ బహుగ్రంథకర్త వీరు కొన్నాళ్లు అధ్యాపకులుగా ఉన్నత పాఠశాల గుండిలో పని చేశారు ఆ కాలంలో ప్రముఖ కవి వి కేశవరావు గారితో సాహితీమైత్రి ఏర్పడింది అదే వీరి క జి రచయితల చరిత్ర' - 1981, ఆవిర్భావానికి దారి తీసింది

రావు గారు జిల్లా కలెక్టర్ గారికి పదివేల రూపాయల విరాళమిచ్చి 'కరీంనగర్ మండల చరిత్ర' ను జిల్లా ప్రముఖ రచయితలతో వ్రాయించారు అదే కాలంలో జిల్లా రచయితల చరిత్రను' కూడా వెలువరించాలనే కోరిక రావు గారికి కలిగింది అందుకు ఒకరిద్దరిని అంతకుముందు అర్థించి విఫల మనోరథులైనారు చివరికి మలయశ్రీ కవి కేశవరావు గారి కోరికను అంగీకరించి గ్రంథరచన - ముద్రణ పూర్తి చేశారు

'కరీంనగర్ జిల్లా రచయితల చరిత్ర' 320 పుటల పుస్తకం పూర్వకవుల, ఆధునిక రచయితల అందరి రచనల వివరాలు స్వయంగా జిల్లా అంతటా తిరిగి సేకరించి పొందుపరిచిన ఈ సమాచారం ఆయా సాహితీ విభాగాల అభిమానులకు అందుబాటులో ఉంది

ఈ గ్రంథంలో తెలుగు సాహిత్యంతోపాటు జిల్లాలోని సంస్కృతాంగ్ల హిందీ ఉర్దూ రచయితల సమాచారాన్ని కూడా వివరించడం జరిగింది

అప్పుడే కాదు ఇప్పటికీ ఈ జిల్లాలోనే కాదు ఇతర జిల్లాల్లోనూ - మెదకు, నల్గొండవంటి రెండు మూడు జిల్లాల సంగ్రహ సాహిత్య చరిత్రలు తప్ప, ఇటువంటి ఒక జిల్లా సమగ్ర సాహిత్య పరిచయ గ్రంథం వెలువడలేదు ఆ పుస్తకమే మలయశ్రీ గారి ఈ థీసిస్ గ్రంథ రచనకు మూలం మార్గదర్శకం అయింది

### 4 డా ముదుగంటి గోపాలరెడ్డి, ఎం ఏ పిహెచ్ డి పొత్కపల్లి జ 1936

### 5 డా సుజాతారెడ్డి, ఎం ఏ పిహెచ్ డి - పొత్కపల్లి జ 1942

డా గోపాలరెడ్డి గారు ఉస్మానియా విశ్వవిద్యాలయంలో సంస్కృత శాఖ ప్రొఫెసర్ వీరి సతీమణి డా సుజాతారెడ్డి గారు హైద్రాబాద్ రెడ్డి ఉమెన్స్ కాలేజీలో ఆంధ్ర భాషోపన్యాసకురాలు

సంస్కృతాంధ్ర సాహిత్యవేత్తలైన ఈ దంపతులు సంస్కృత సాహిత్య చరిత్ర తెలుగులో రచించి 900 పుటల ఉద్గ్రంథంగా 1986లో వెలువరించారు దేవులపల్లి రామానుజరావు గారికి అంకితం కావించబడిన దీనిని తెలుగు విశ్వవిద్యాలయం హైదరాబాద్ వారు ప్రచురించారు




ఈ గ్రంథం వైదిక వాఙ్మయం, లౌకిక వాఙ్మయం, విమర్శనాత్మకం అని మూడు అధ్యాయాలలో సాగిన సంగ్రహ సమగ్ర రచన డా సుజాతారెడ్డి గారి ఇతర పుస్తకాల పరిచయం చేయబడింది

ఇది తెలుగు విద్యార్థులకు జిజ్ఞాసువులకు నాలుగైదు వేలేండ్ల సంస్కృత సాహిత్యాన్ని గూర్చి చక్కని పరిచయం కలిగిస్తుంది ప్రొఫెసర్ గోపాలరెడ్డి, డా సుజాతారెడ్డి గారల సాహితీ దీక్షకి ఈ రచన పట్టం కట్టింది

### 6 టి శ్రీరంగస్వామి - ఎం ఏ , పిహెచ్ డి పర్లపల్లి జ. 16 6 1950

గేయకవులలో వీరి పరిచయం చేయబడింది ఉద్యోగకారణంగా హన్మకొండలో ఉంటున్న శ్రీరంగ స్వామి గారు 1987లో వరంగల్ జిల్లా రచయితల వాఙ్మయ సూచిక ను రచించి 94 పుటల పుస్తకంగా బాపు ముఖచిత్రంతో వెలువరించారు పీఠికలు 14 పుటలు 80 పుటలలో 300 కవుల వివరాలు వారి నామ, గ్రామ, జన్మస్థల రచనల పేర్లు మాత్రం చూపారు

క్రీ శ 1900 వరకు పూర్వ యుగంగానూ 1901 నుండి నవీనయుగంగానూ రచయితలను విభజించారు కొందరు కవులను వారు జీవించిన కాలాన్ని అనుసరించి కూర్చలేదు మల్లికార్జున

పండితారాధ్యులు, మారన, వెలిగందుల నారన మొ॥ కాకతి సామ్రాజ్యంలోని ఇతర మండలాల కవులను వరంగల్ వారుగా పేర్కొనడం జరిగింది ఇది భావ్యం కాదు దాశరథి వంటి కొందరు ప్రముఖ కవులు కూడా అనుబంధంలో చేరారు ఉపయుక్త గ్రంథ సూచిక తర్వాత సైతం మరికొందరు కవుల పేర్కొనడం జరిగింది రచయిత గారి అజాగ్రత్త వలన రచనలో కొన్ని పొరపాట్లు జరిగినా ఈ 'వాఙ్మయ సూచిక'తో ఆ జిల్లాకే కాక అఖిలాంధ్ర సాహిత్యాభిమానులకూ మేలు చేశారు

"దీనికి పూర్వం శ్రీమాన్ కోవెల సంపత్కుమారాచార్యులు గారు తలపెట్టిన 'మనకవులు, పండితులు, రచయితలు' అన్న నాలుగు భాగాల గ్రంథం తొలిభాగంతోనే ఆగిపోయింది (అది 'జనధర్మ'లో ప్రచురించిన 30 మందిలో 25 గురు కవుల పరిచయాలతో మొదటి సంచిక 1970లో వెలువడింది) గోలకొండ కవుల సంచికలో శ్రీ దూపాటి వేంకటరామాణాచార్యుల వారు సిద్ధం చేసిన కవి సూచిక ఈనాటి పరిశోధకులకు అత్యంత ప్రధానము అయిన ఆకర గ్రంథంగా ఉపయోగపడుతుంది శ్రీరంగస్వామి చేసిన కృషి భవిష్యత్తులో ఉత్తమ పరిశోధనకు ఉపకారం కాగలదని" అని గ్రంథ 'భూమిక'లో ఆచార్య కోవెల సుప్రసన్నాచార్యులు అన్నారు శ్రీ సురవరం ప్రతాపరెడ్డి గారి గ్రంథం 'గోలకొండ కవుల సంచిక'ను చూడ లేకపోవడం జరిగిందన్నారు రచయిత 'విజ్ఞాపన'లో ,ఇంకా ఈ పుస్తక విషయ సేకరణకు తాము పడిన పాట్లు దయనీయంగా వివరించారు రచయిత పీఠికలో చివరగా శ్రీరంగస్వామి గారు చేసిన సూచన విలువైనది - "జిల్లా కేంద్ర గ్రంథాలయాలలో ఆ జిల్లాకు సంబంధించిన ఒక విభాగమును ఏర్పరచి, అందులో ఆ జిల్లాకు సంబంధించిన గ్రంథాలను ఉంచినచో అందరికి ఉపయోగకరముగా ఉంటుంది" ఈ ఉచిత సలహా ఆచరణలోనికి వస్తే భావి పరిశోధకులకు ఇది అత్యంత ప్రయోజనకారి అవుతుంది

దేవులపల్లి రామానుజరావు ప్రజాకవి కాళోజీ, ప్రభృతుల పీఠికలతో వెలువడిన ఈ పుస్తకాన్ని తెలుగు విశ్వవిద్యాలయం వారి ఆర్థిక సహాయముతో 'శ్రీలేఖ సాహితి' వరంగల్లు సంస్థ ప్రచురించింది

## సాహిత్య విమర్శలు

'ఋషి కానివాడు కావ్యమును నిర్మించలేడు' అని పూర్వోక్తి రుషి అంటే సర్వద్రష్ట సమవర్తి శాంత స్వభావుడు అని భావం విశ్వశ్రేయ కావ్యం అనేదే నాటి ప్రధాన ధర్మం ఆ ఆశయం నాటికి నేటికీ ఆరాధనీయమే కాని రాను రాను జనానికి కనువిప్పు కలిగించడంకంటె ఎక్కువగా కాలక్షేప సాధనంగా సాహిత్యం మారుతూ వెలువడుతున్నది పూర్వకావ్యాల కుకవినిందల్లో ఈ వైనం మనం స్పష్టంగా తెలుసుకోవచ్చు అర్థార్జనాకాంక్ష సాహిత్యాన్ని దిగజార్చింది పుస్తక ముద్రణ విక్రయ వ్యాపారావకాశాల వల్ల ఈనాడిది మరీ పెరింగింది రచయిత స్వార్థానికో పరార్థానికో ఏదో వ్రాస్తాడు పసిపిల్లల వంటి పాఠకులు అయిందీ కానిదీ వివేచన లేకుండా చదువుతారు సాధారణంగా లోకంలో మంచికంటే చెడే త్వరగా ఆకర్షిస్తుంది - నచ్చుతుంది అటువంటి సమయంలో సమాజ హితైషులు వెలువడిన సాహిత్యంలోని బాగోగులు చర్చించవల్సి వచ్చింది అదే సాహిత్య విమర్శ విమర్శ సమీక్ష, సమాలోకం పదాలన్నీ ఇంచుమించు సమానార్థకాలు

ఇప్పటికంటే పూర్వంలోనే గ్రంథ విమర్శలెక్కువ ఇందుకు పూర్వ కాలం నాటి కావ్యాలంకారాది శాస్త్ర చర్చలు మనకు నిదర్శనంగా కనిపిస్తాయి అబ్బో! నాటి ఖండనలు, ఖండన మండనలు, ఖండన మండన ఖండనలు మామూలువి కావు మతము, శాస్త్రం అప్పుడు సాహిత్యాన్ని శాసించాయి తర్వాత గ్రాంధిక వ్యావహారిక భాషా వివాదాలు వచ్చాయి ఈనాడు మత వాదాలకంటె, రాజకీయ సిద్ధాంతాలు, సాహితీ ప్రక్రియా విభేదాల చర్చలు ఎక్కువగా కొనసాగుతున్నవి

అయితే ఈ విమర్శలు స్వార్థప్రయోజనం పక్షపాతంతో కూడి ఉండటం అనుచితం విమర్శ

అవసరమే అది రచయితను సరిదిద్దుతుంది పాఠకులకు మంచి సాహిత్యాన్ని ఎంచుకోవటంలో సహకరిస్తుంది అట్లాకాక పరుల మంచి పుస్తకాల్ని ఖండించి ఆవేశకావేశాలు చల్లార్చుకోవడం, తమ వారిదికదా అని చెత్త పుస్తకాల్ని కూడా ఉత్తమ రచనలని నెత్తి కెత్తుకోవడం, రెండూ నిష్ప్రయోజన కార్యాలే అవి పరవంచనలే కాక ఆత్మవంచన కూడా ఇది హేయం - అననుసరణీయం

'కవిత్వం హృదయసంబంధి - విమర్శనము మేధా సంబంధి" అన్నారు డా ఎస్ వి రామారావు గారు తమ పిహెచ్ డి పరిశోధన గ్రంథం 'తెలుగులో సాహిత్య విమర్శ'లో 10 ఇంకా "విమర్శకుని బాధ్యత మిగుల గురుతరమైనది రాగద్వేషముల కతీతులై నిష్పక్షపాతబుద్ధితో కావ్యతత్త్వ వివేచనకు పూనుకోవలయును అతని కుండవలసిన ప్రధాన లక్షణము సానుభూతి అనగా కనబడిన కావ్యమునెల్ల ప్రశంసించుటకాదు, పూర్వ సిద్ధాంతములకు లోబడక, స్వీయాభిప్రాయములకు తావివ్వక ఎదుటనున్న కావ్యమును విమర్శింపవలెను " అన్నారు పు 10 "పెక్కు గుణములున్నచోట స్వల్పములైన దోషములను పరిగణింపకూడదనియేకాని దోషములనే పేర్కొనకూడదని కాదు" అని ' విమర్శకుని పని రంధ్రాన్వేషణము కాదు" అను వాక్కును వక్కాణించారు పు 6 ఈ గ్రంథ పీఠిక ఆముఖం లో డా సి నారాయణరెడ్డి గారు ఇలా అన్నారు

"ఎదురైన ప్రతియోధుల తలలను తుత్తినియలు చేసే సైనికుడు కాడు విమర్శకుడు అలాగే అడ్డమైన వాళ్లను అతిశయోక్తులతో మంచెత్తే స్తోత్ర పాఠకుడూ కాడు విమర్శకుడు విమర్శకుడు న్యాయమూర్తిలాంటి వాడు అసలు విమర్శ అంటేనే గ్రీకు భాషలో సదసద్వివేచనం సమదర్శనం సత్యప్రకటనం విమర్శకునికి నయనయుగళం ఈ రెంటిలో ఏదిలోపించినా కొరత - కలత "

విమర్శకుడు స్థితి ప్రజ్ఞుడు కావల్సిన పనిలేదు సమదర్శి కావాలి సత్యస్పర్శి కావాలి దోషజ్ఞుడు అంటే పాండిత్య ప్రజ్ఞకలవాడు అనే అర్థం విమర్శకునికి కావ్య రచయితతో సమానమైన అంతకు మించిన విద్వత్తు ఉండటం అవసరం కవి - రచయిత కాని కేవలం విమర్శకులతో ప్రమాదం విద్వానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమం నహి వంధ్యావిజానాతి గుర్వీ ప్రసవవేదనం!

కరీంనగర్ జిల్లాలో సత్తాగల సాహితీ విమర్శ గ్రంథాలు వెలువడ్డాయి ఆ వివరాలివి -

1 డా పి యశోదారెడ్డి - ఎం ఏ , పిహెచ్ డి అన్నారం
2 డా ఎం సుజాతారెడ్డి ఎం ఏ , పిహెచ్ డి పొత్కపల్లి
3 జువ్వాడి గౌతమరావు బి ఏ , ఎల్ ఎల్ బి ఇరుకుల్ల
4 రేగులపాటి కిషన్‌రావు - ఎం ఏ , చింతలరానా
5 డా తిరుమల శ్రీనివాసాచార్య ఎం ఏ , పిహెచ్ డి నారాయణపురం
6 డా అనుమాన్ల భూమయ్య - ఎం ఏ , పిహెచ్ డి వెదురుగట్ట
7 మలయశ్రీ - ఎం ఏ , ఎం ఓ ఎల్ చంజర్ల
8 డా బి వెంకటేశం, ఎం ఏ , పిహెచ్ డి కరీంనగర్

## 1 డా పి యశోదారెడ్డి

సంస్కృతాంధ్ర భాషలలో ఎం ఏ డిగ్రీలు పొంది 'హరివంశాల తులనాత్మక పరిశీలన' చేసి డాక్టరేట్ పట్టా పొందిన ప్రముఖ విదుషీమణి డా యశోదారెడ్డి గారు వీరి సాహితీ విమర్శ రచనలు అనేకం వానిలో ముద్రిత గ్రంథాల పేర్లివి

1 పారిజాతాపహరణ పర్యాలోచనం - 1974, 2 పోతన కవితా సుధ 1983

3 భాగవత కావ్యకుసుమాలు - 1983, 4 కథా చరిత్ర - 1989,

5 భారతంలో స్త్రీ - 1990, 6 కావ్యానుశీలనం, సహరచన, 1965, 75

తెలుగు మొదటి ప్రబంధమైన అల్లసాని పెద్దన గారి 'మనుచరిత్ర'కు సమాంతరంగా వెలువడిన ముక్కు తిమ్మన పారిజాతాపహరణ ప్రబంధ పరిష్కరణ కావిస్తూ యశోదారెడ్డి గారు ఈ సమగ్ర సమీక్షా గ్రంథ పీఠికా వ్యాసం 'పర్యాలోచన' వ్రాశారు బమ్మెర పోతన గారి భాగవత కవితా విశ్లేషణ కావించి పోతన కవితాసుధ ప్రచురించారు

పోతన గారి భాగవత ఉపాఖ్యానాల వివరణ భాగవత కావ్య కుసుమాలు

కథా చరిత్ర ఇది తెలుగు సాహిత్యంలోని ఒక ప్రత్యేక ప్రక్రియపై కావించిన 100 పుటల సమగ్ర పరిశీలన ప్రాక్పశ్చిమ దేశాల కథా చర్చ కథ ప్రాణి పుట్టుకతోనే ఆవిర్భవించిందని రచయిత్రి కథా ప్రాచీనతను స్పష్టం చేశారు వివిధ భాషాకథల పుట్టుపుర్వోత్తరాలు భారతదేశ కథా ప్రాచీనతను, ఆంగ్లాంధ్ర కథల తులనాత్మక పరిశీలన, తెలుగు కథా స్వరూపం గమనం కథా - కథానికా సారూప్య విభేదాలు, ఇందులో సోదాహరణంగా చర్చింపబడినవి పౌరాణిక జానపద కథల పరామర్శ ఉంది ఆధునిక కథలో వస్తున్న మార్పులు చూపబడినా ఓ పాతికేళ్లకు పూర్వపు కథలనే రచయిత్రి సమీక్షకు ఎనుకున్నారు ఇటీవలి కథల జోలికి పోలేదు

బారతంలో స్త్రీ - 272 పుటల గ్రంథం

"భారత స్త్రీ పాత్రలన్నీ సామాన్యులకు తేరి పార చూడరాని ప్రాభవోన్నత స్థానంలో ఉండటంతో వారు ఆధారంగా సామాన్య గృహనీతి విద్యకు గురైన గృహిణి జీవితాన్ని నిర్ణయించడం కష్టసాధ్యమైంది" అని పీఠికలో అంటూ రచయిత్రి గారు, ఆంధ్ర మహాభారత పాత్రలను, ప్రధాన కథా గత స్త్రీ పాత్రలు, ప్రాసంగికేతి వృత్తంస్త్రీ పాత్రలు, ఆంధ్ర మహాభారత ధర్మకథా గత స్త్రీ పాత్రలుగా మూడు విభాగాలుగా విభజించి చర్చించారు కావ్యానుశీలనం - కావ్యాలంకార శాస్త్రం విద్యార్థులకు ఉపయుక్తం యశోదారెడ్డి గారి ఇతర సాహిత్య సమీక్షా గ్రంథాలు - ప్రబంధ వాఙ్మయము, ద్విపద వాఙ్మయములను ఆం ప్ర సాహిత్య అకాడెమీ, కళా స్రవంతి సంస్థలు ప్రచురించాయి

## 2 డా ఎం సుజాతారెడ్డి - ఏం ఏ పిహెచ్ డి

రచయిత్రి వివరాలు నవలా రచయితలలో చూపబడినవి సుజాత గారి సాహితీ విమర్శ పుస్తకాలు ఇవి

1 నాటక లక్షణములు - 1977, 2 కాదంబరీ పరిశీలనము - 1977
3 శ్రీనాథుని కవితా సౌందర్యము 1989, 4 తెలుగు నవలానుశీలనం - 1990
5 వేమన - నాథ సంప్రదాయం - 1993

నాటక లక్షణములు సంస్కృత దృశ్యకావ్యాలైన 'దశరూపక' లక్షణ వివరణ అలంకారశాస్త్రం నాటకలక్షణాలు ప్రత్యేకం ఇది కళాశాలల విద్యార్థులకు ఉపయుక్త గ్రంథం పు 190

కాదంబరి భట్టబాణుని ద్వాదశాధ్యాయాల గద్యకావ్యం సుజాత గారి పరిశీలనం - కాదంబరి కథాకల్పన, రస నిర్వహణ, పాత్రపోషణ, వర్ణనలపైచిత్ర, శబ్దాలంకార సౌందర్యాలను గురించి కావ్య సమగ్ర సమీక్షణం చివర బాణ సుతుని ప్రసక్తి ఉంది ఈ గ్రంథంలో డా సుజాత గారికి ఆమె భర్త ఉస్మానియా విశ్వవిద్యాలయ సంస్కృత శాఖ ప్రొఫెసర్ డా ఎం గోపాలరెడ్డి గారు సహ రచయిత

శ్రీనాథుని కవితా సౌందర్యంలో ఆ మహాకవి జీవిత వ్యక్తిత్వ సాహిత్య సంగ్రహ పరిచయాలతోపాటు, వారి కావ్యాల రూపచిత్రణ, కళా సౌందర్యం, శైలీ అలంకారాదుల వివరణ ఎనిమిది శీర్షికల్లో సాగింది నిరలంకార శబ్దార్థ సౌందర్యం వంటి వినూతన, భక్తి శృంగార భావశబలతా సౌందర్యం వంటి విశేష, వంటకాల ప్రీతివంటి సామాన్య - సాంఘిక చర్చలిందులో ఉన్నాయి పు 177

తెలుగు నవలానుజీవనం - పు 240, ఇది తెలుగు విశ్వవిద్యాలయం వారి బహుమతి పొందిన సాహిత్య విమర్శ సంస్కృత కథా సాహిత్యమే ఆంగ్ల నవలకు ప్రేరణ ఆంగ్ల నవలల ప్రేరణతోనే తెలుగు నవలలు వచ్చినా వీటిపై మన పూర్వ వచన కావ్యాల ప్రభావం ఉంది వీరేశలింగం గారి రాజశేఖర చరిత్రకంటే నరహరి గోపాలకృష్ణమ శెట్టి గారి 'శ్రీరంగరాయ చరిత్ర మొదటిదని, నవలకు కూడా రస సిద్ధాంతం అనువర్తింపజేయడం రచయిత్రి ఇందులో బలపరిచిన అంశాలు తెలుగులో ఆంగ్ల బెంగాళీ సాహిత్య సాంఘికోద్యమాల ప్రభావాల అంగీకరించారు 1950కి పూర్వ నవలల అధికంగా తర్వాతి నవలల మితంగా ఇందులో చర్చించారు

వేమన జీవితం - పద్యాలు అంతుచిక్కనివి వేమన వేదాంతం, నాథ్ అండ్ సంత్ సంప్రదాయానికి దగ్గిరిది అని రచయిత్రి ఈ చివరి పుస్తకంలో ప్రతిపాదించారు

## 3 జువ్వాడి గౌతమరావు

గౌతమరావు గారు 1948 నాటి నిజాం వ్యతిరేక తెలంగాణా విముక్తి పోరాటయోధులు సోషలిస్టు నాయకుల న్యాయవాది వృత్తిని వదిలేశారు సాహిత్యారాధకులైన వీరు 'జయంతి' పత్రికను 1958లో నడిపారు పలు వ్యాసాలు వ్రాశారు

కవి సమ్రాట్ విశ్వనాధ సత్యనారాయణ గారిపై వీరికి అత్యంతాభిమానం వీరి ' విశ్వనాధ కవితా వైభవము - 1974, అను సాహితీ సమీక్షా పుస్తకాన్ని యువ భారతి హైద్రాబాద్ వారు ప్రచురించారు విశ్వనాధ నవలల్లో వేయిపడగలు, కావ్యాల్లో రామాయణ కల్పతరువు వీరిని ఆకట్టుకొన్నాయి



విశ్వనాధ వారి సాహిత్యానికి సమీక్షాత్మక ప్రశంసా నీరాజనం జె గౌతమరావు గారి 'విశ్వనాధ కవితా వైభవము'

## 4 రేగులపాటి కిషన్‌రావు

కిషన్‌రావు గారు అధ్యాపకులు వీరు కథలు కవితలు నవలలు వ్రాశారు హేతువాద దృష్టితో రావు గారు 1979లో భాగవత విషసర్పం అను విమర్శ గ్రంధాన్ని రచించారు దీనిని న్యూ స్టూడెంట్స్ బుక్ సెంటర్ విజయవాడ వారు ప్రచురించారు ఇది భాగవత విమర్శ 336 పుటలు రంగనాయకమ్మ గారి 'రామాయణ విష వృక్షం' ఊపులో నాస్తికవాదం చూపులో వచ్చిన గ్రంధం ఇది ఇందులో దేవతలను పూర్వ మునులను కూడా పాత్రలుగా మలచి 'పేరడీ'గా చర్చ సాగించారు

ఒక పురాణ భక్తి కావ్యాన్ని నవ్య నాస్తిక దృక్పధంతో విశ్లేషించారు రచియత ధ్యేయం ఆస్తిక భావఖండన, హేతువాద భావ సమర్థన ఆ కోణంలో రావు గారు ఈ రచనలో తమ గమ్యం చేరుకోగలిగారు ఈ రచనాకాలంలో రచయిత 'బి ఏ పట్టభద్రులు తర్వాత ఎం ఏ డిగ్రీ పొందారు

## 5 డా తిరుమల శ్రీనివాసాచార్య.

శ్రీనివాసాచార్య గారు పద్యగేయం కావ్య కర్త వీరు 'తెలుగులో గేయనాటికలు' అను అంశంపై పిహెచ్ డి సిద్ధాంత గ్రంధం రచించారు ఒక పిహెచ్ డి పరిశోధన వ్యాసానికి సమతూకంగా వీరు నారాయణరెడ్డి - సాహితీమూర్తి' 1981, సమీక్షా పుస్తకాన్ని వెలువరించారు యువభారతి హైదరాబాద్ వారు ప్రచురించిన ఈ 400 పుటల గ్రంధం డా సి నా రె గారి సాహితీ సర్వస్యం వివిధ ప్రక్రియల వారీగా డా రెడ్డిగారి పుస్తకాలను సమీక్షిస్తూ కావ్య సౌందర్యాన్ని ప్రదర్శిస్తూ, పాఠకులకు రసానందం కల్గించారు రచయిత ఇది డా సి నారాయణరెడ్డి గారి బహుముఖ ప్రజ్ఞతో కూడిన కళాత్మ ఆవిష్కరణ - వారి సమగ్ర సాహితీ సందర్శన

## 6 డా అనుమాన్ల భూమయ్య

డా ఏ భూమయ్య గారు 'కాకతీయ విశ్వవిద్యాలయం' వరంగల్ తెలుగు శాఖలో రీడర్ ఇప్పుడు ప్రొఫెసర్ వీరు 'నాయని సుబ్బారావు కృతులు పరిశీలించి ఎం ఫిల్ కొరవి గోపరాజు సాహిత్య విశ్లేషణ' కావించి పిహెచ్ డి డిగ్రీలు పొంది వాటిని 1981 83లలో ప్రచురించారు తమ వ్యాసభారతి' ని 1988లో వెలువరించారు వీరి నవలా సాహిత్య సమీక్షా గ్రంథం 'వేయిపడగలు - ఆధునిక ఇతిహాసం పు 144 1984లో వెలువడింది కాకతీయ విశ్వవిద్యాలయం తెలుగు ప్రొఫెసర్ డా సుప్రసన్నాచార్య గారి 'కల్పవృక్షం - ఆధునికేతిహాసం వ్యాసం వీరి రచనకు ప్రేరణ అనుకోవచ్చు వేయిపడగలు నవలా పరిశీలన కావించిన జి లక్ష్మణ్ రావు కరీంనగర్ గారి పిహెచ్ డి గ్రంథానికి డా ఏ భూమయ్య గారు గైడ్‌గా వ్యవహరించారు డా భూమయ్యగారి 'వేయిపడగలు ఆధునిక ఇతిహాసం' కవి సమ్రాట్ గారి మహా నవలకు ప్రశంసాభాష్యం వీరి మరిరెండు సాహిత్య సమీక్షా గ్రంథాలివి

2 ఆద్యుడు కట్టమంచి - మే 1992 పు 96 ' వస్తు నవ్యత గల కావ్యాన్ని వ్రాసి అటు ఆధునిక కవుల్లోను కవిత్వతత్త్వ విచారమును వ్రాసి ఇటు ఆధునిక విమర్శకుల్లోనూ కట్టమంచి అద్యస్థానాన్ని అలంకరించారు అన్నారు మొదటి ప్రతిపాదన కొంతవరకు ఆక్షేపణీయం కాని, రెండవది సర్వజనామోద విషయం

3 మాలపల్లి అభ్యుదయ మహాకావ్యం డి 1992, పు 104 మాలపల్లి ఉన్నవ లక్ష్మీనారాయణగారి నవల అందులో సన్నివేశాను కూలంగా రచయిత వ్రాసిన గేయాలను సమీక్షిస్తూ డా ఏ భూమయ్యగారు అది మహా కావ్యమని నిర్ణయించడం వినూతన విశిష్ట పరిశీలనం, ఆనంద ప్రశంసనం

## 7 మలయశ్రీ

మలయశ్రీ వచన రచనల్లో సాహిత్య సమీక్షా గ్రంథం 'తెలుగులో లేఖా సాహిత్యం - 1990లో దీనిని 'తెలుగు అకాడెమీ, హైదరాబాద్' వారు జనరంజక గ్రంథావళి' నం 42 గా ముద్రించారు పు 132

ఇందులో లేఖల పుట్టు పూర్వోత్తరాలు, లేఖల ప్రయోజనాలు వివరాలతోపాటు, తెలుగులో అనువాద లేఖా సాహిత్యం, తెలుగు లేఖా గ్రంథాలు - సంపుటాల సమీక్షగా ఈ రచన సాగింది

డియర్ మలయమ్! నీ లేఖాసాహిత్యం రమణీయంగా ఉందోయ్ ఇలాంటి గ్రంథాలు చదువుటనాకెంతో నచ్చుతుంది మధ్య మధ్య నీ కామెంట్స్ చాల హృద్యంగా ఉన్నాయి నీ నాటకం, సాంఘిక చరిత్ర, లేఖా సాహిత్యం కలకాలం మనగలుగుతాయి -' ప్రముఖ రచయిత, ముద్దసాని రాంరెడ్డి గారి లేఖ తేది 10-4-96

ఆ లేఖా సంపుటాల రచయితలు బహురంగాల ప్రముఖులు కాబట్టి అనేక రంగాల స్పృశిస్తూ విశ్లేషిస్తూ సాగిన ఈ రచన పాఠకులకు ఆసక్తికరంగా రూపొందింది తెలుగులో లేఖా సాహిత్యంపై ఒకటి రెండు వ్యాసాలు వచ్చినా, లేఖా సాహిత్య సమీక్షాత్మంగా ఇదే మొదటి పుస్తకం కావడం దీని ప్రత్యేకత

## 8 వెంకటేశం, ఎం ఏ (త్రిబుల్) పిహెచ్ డి కరీంనగర్

బొద్దుల వేంకటేశంగారు తెలుగు, హిందీ, ఇంగ్లీషుల్లో ఎం ఏ డిగ్రీలు పొందారు స్కూల్ అసిస్టెంట్‌గా పనిచేసి ప్రస్తుతం లెక్చరర్‌గా ఉన్నారు 'అరిస్టాటిల్ - ఆనంద వర్ధన' ప్రాచ్య పాశ్చాత్య సాహిత్య దృక్పథాలపై పరిశీలన కావించి పిహెచ్ పి డిగ్రి పొందాలి అది అముద్రితం కవి, అదే ఊపులో మూడు సాహిత్య విమర్శ గ్రంథాలు రచించి ప్రచురించారు



1 అరిస్టాటిల్ కావ్యశాస్త్రము

2 గ్రీక్ - రోమన్ సాహిత్య శాస్త్రము - 1994, పు 300

3 సాహిత్యమూల్యాంకనం డబ్ల్యు బేసిల్ వర్స్‌ఫోర్డ్ 'జజ్‌మెంట్ ఇన్ లిటలేచర్' ఆంగ్లసేత గ్రంథానికి ఆచార్య రాంచంద్ర తివారీ కావించిన హిందీ అనువాద రచనను డా బి వెంకటేశం గారు తెలుగు సేత, 1996 పు 169 మొదట రెండు పుస్తకాలు వీరి పిహెచ్ డి రచన మాతృకగా

వెలువడిన ప్రాచ్య పాశ్చాత్య సాహిత్య దృక్పథాల తులనాత్మక వివరణ కావించిన సాహిత్య సమీక్షా గ్రంథాలు ఇవి సాహిత్య సమీక్షకులుగా రచయితకు మంచి పేరు తెచ్చాయి

## వ్యాఖ్యానాలు

పూర్వ కావ్యాలకు వ్యాఖ్యానాలు వెలువడుతున్నాయి సాధారణంగా సంస్కృతాది అన్యభాషా కావ్యాలకు వెలువడేవి ఆ భాషల పరిచయం లేని వారి కోసం టీకా టిప్పణులు ఆయా కావ్యాల భాషల్లోనే వెలువడేవి ప్రౌఢకావ్యాల విశేష భావాలను సామాన్య పాఠకులకు తెలుపడం కోసం ఈ వ్యాఖ్యానాలు వ్రాసే రచయితలు సాహిత్య కోవిదులు, భాషా పండితులు, బహుముఖ ప్రజ్ఞా సముపేతులు కావల్సి ఉంటుంది సత్తాతోపాటు సహృదయత విమర్శకునికి వలెనే వ్యాఖ్యాతకూ ముఖ్యం

మన తెలుగులో పలు చక్కని వ్యాఖ్యాన గ్రంథాలు వెలువడ్డాయి ఈ కరీంనగర్ జిల్లాలో భట్టుమూర్తి వసుచరిత్ర ప్రౌఢ ప్రబంధానికి వ్యాఖ్యానం వ్రాసిన సోమనాథ సూరి మొదటి వారు ఆ తర్వాత వ్యాఖ్యాన గ్రంథాలు అంతగా వెలువడిన సాక్ష్యాలు లేవు ఈ శతాబ్దిలో శతావధాని కృష్ణమాచార్య కోరుట్ల గారు తమ సంస్కృత కావ్యాలను తెలుగులో వ్యాఖ్యానాలతో సహా ప్రచురించారు

ఇక్కడి వ్యాఖ్యాన గ్రంథ రచయితలు నలుపురు

1 డా సి నారాయణరెడ్డి, 2 మల్లావజ్జల రామచంద్రశర్మ, 3 ముద్దసాని రాంరెడ్డి, 4 స్వామీ జగదీశ్వరానంద వీరి వ్యాఖ్యానాల వివరాలివి

### 1 డా సి నారాయణరెడ్డి

ప్రముఖ గేయకవి బహుగ్రంథ కర్త అయిన డా సి నారాయణరెడ్డి గారు పోతన భాగవత పద్యాలకు మందార మకరందాలు పేరుతో వ్యాఖ్యానం వ్రాశారు ఇవి 108 పద్యాలు ఈ పుస్తకాన్ని యువ భారతి హైదరాబాద్ ప్రచురణ సంస్థ లక్ష ప్రతులు వ్యాప్తి చేసే సంకల్పంతో మొదటి విడతగా 10 వేల ప్రతులు 1973లో ముద్రించారు 1969లో వెలువడిన విశ్వనాథ సత్యనారాయణ గారి 'సాహిత్య సురభి' ఈ రచనకు ప్రేరణ అనుకోవచ్చు పోతన పద్యాలు మందార మకరందాలు' సి నా రె గారి వ్యాఖ్యానాలు 'మాకంద రసాలు'!

### 2 మల్లావజ్జల రామచంద్రశర్మ - బి ఓ.ఎల్ పెద్దపల్లి

సంస్కృతాంధ్ర భాషా పండితులు, పద్య గేయకవి, నాటక కర్త అయిన శర్మ గారు ఈ శతాబ్ది పూర్వార్థంలో విరచితమైన 'రామగిరి మహాత్మ్యం' అను చంపూ ప్రబంధానికి చక్కని వ్యాఖ్యానం రచించారు ఇది 1981లో మూల గ్రంథ సహితంగా ముద్రింపబడింది పరిచయం ఏతత్కావ్య ప్రస్తావన సందర్భంలో చేయబడింది

### 3 ముద్దసాని రాంరెడ్డి - ఎం ఏ ఊటూరు

ప్రముఖ వచన రచయిత రాంరెడ్డి గారు 'వేమన' పద్యాల్లోని కొన్ని విశేష పద్యాలకు వ్యాఖ్యానం వ్రాశారు ఇవి 1985 సుమారుగా కరీంనగర్ 'చిత్రిక' వార పత్రికలో ప్రచురింపబడినవి ఇవి 50-100 మధ్య ఉంటాయి ప్రత్యేక పుస్తకంగా రాలేదు

### 4 స్వామీ జగదీశ్వరానంద - తక్కళ్ళపల్లి

జగదీశ్వరానంద (మొదటి పేరు రాజయ్యగారు) సంస్కృతాంధ్ర భాషల్లో పండితులు సాత్త్విక స్వభావులైన వీరికి వేదాంత జిజ్ఞాస అధికం వేదాంత ప్రబోధనాశయంతో బ్రహ్మచారిగా ఆశ్రమవాస జీవితం గడుపుతున్నారు

వీరి ముద్రిత వ్యాఖ్యాన పుస్తకం 1 వేదాంత జ్ఞాన రత్నములు, 136పు 1997లో వెలువడింది వివిధ శీర్షికలతో పూర్వ గ్రంథాల శ్లోకాలు దాదాపు 500 క్రోడీకరించి స్వీయసరళాంధ్ర తాత్పర్యాలతో ప్రచురించారు ఇది భక్తులకే కాక సంస్కృత సాహిత్యాభిరుచులకు ఉపకరిస్తుంది కాని, మూలశ్లోకాలు ఏయే గ్రంథాలవో సూచిస్తే బాగుండేది

## సమీక్షలు

సమీక్ష, విమర్శ పదాలు ఇంచుమించు సమానార్థకాలు సమీక్షకంటే విమర్శలో దోషప్రదర్శన రంధ్రాన్వేషణ - ఖండన, జాస్తి - అధికం అనే భావన జన వ్యాప్తిలో ఉంది కాని, అది సరికాదు విమర్శ సమీక్ష రెండూ కావ్య గుణ దోష వివరణలు మాత్రమే అవి సమాలోకనలు విమర్శ గ్రంధాల వివరాలు చూపబడ్డాయి కావ్య సమీక్షలు అని ప్రత్యేకంగా ఇక్కడ మళ్లీ పేర్కొనడం వివిధ పత్రికలలో ప్రచురితమౌతున్న పుస్తక సమీక్షల గురించి తెలుపడం కోసం మాత్రమే

ప్రముఖ రచయితలందరూ అప్పుడప్పుడూ తమకు నచ్చిన, పత్రికలవారు పంపిన గ్రంధ సమీక్షలు వ్రాస్తూనే ఉన్నారు

ముఖ్యంగా ఈ రంగంలో కవి 'రామభోజ' గారు కొన్ని వందల పుస్తకాలకు సమీక్షలు వ్రాశారు ఇవి పలు చిన్న పెద్ద సాహిత్య పత్రికల్లో ప్రచురణ పొందినా ముఖ్యంగా 'జాగృతి' పత్రికలో ఎక్కువగా వచ్చాయి బి ఎస్ రాములు జగిత్యాల, డా కె రాజన్నశాస్త్రి మొ॥ మరికొందరు కూడా గ్రంధ సమీక్షలు వ్రాశారు ఇవేవీ పుస్తకాలుగా రాలేదు కాబట్టి అందరి వివరాలు తెలిసిరాలేదు

## పీఠికలు

కవులు, రచయితలు తమ పుస్తకాలకు ప్రముఖ సాహితీవేత్తల ముందుమాటలను ప్రచురించుకోవడం ఆనవాయితీగా వస్తున్నది ఇది పూర్వ తాళపత్ర గ్రంధాలకు ఉన్నట్లు లేదు అచ్చు పుస్తకాలతోనే ఈ ఆచారం ప్రారంభమయినట్లుంది ఈ పీఠికలు రచయితను - రచనను గురించి పాఠకులకు పరిచయం చేస్తాయి రచయిత కృషిని, రచన స్థాయిని తెలుపుతాయి ఇవి రచనకు సర్టిఫికెట్ల వంటివి శ్రీశ్రీ 'మహాప్రస్థానం' గేయ సంపుటికి 'చెలం' వ్రాసిన పీఠికను 'సర్టిఫికెట్' అను పేరనే ముద్రించారు సాధారణంగా ఈ పీఠికలు కావ్య ప్రశంసలుగానే ఉంటున్నాయి విమర్శలను కావాలని ముద్రించి తమ కావ్యాలను రచయితలు కిందపరచుకోరుకదా! పీఠిక ఉద్దేశం కూడా రచయితకు ప్రోత్సాహాన్ని అందించడమే రచన గుణదోష సమీక్ష సమంగా కావించే పీఠికాకర్తలు - వాటిని యధాతధంగా ప్రచురించుకునే రచయితలు సుగుణవంతులు కాని, అటువంటివాళ్లు ఈ కాలంలో అరుదు

ఈ జిల్లాలో గ్రంధరచన - ప్రచురణ, అధికంగానే ఉంది ఏ కొందరో తప్ప రచయితలు తమ పుస్తకాలను ప్రముఖ రచయితల బంధుమిత్రుల - అధికారుల - నాయకుల ముందుమాటలతోనే ప్రచురిస్తున్నారు కొన్ని పుస్తకాలకు రచనకు మించి పీఠికలుండడం కూడా జరుగుతున్నది

పీఠికా రచయితలలో ఆంధ్రప్రదేశ్‌లోనే కాక, భారతదేశంలోనే డా సి నారాయణరెడ్డి గారు అగ్రగణ్యులు వీరు వ్రాసినన్ని పీఠికలు మరే రచయితా వ్రాసి ఉండరు వీరి పీఠికలు సహస్రాధికం పరిధిలో చిన్నవి రాశిలో - వాసిలో మిన్నవి అయిన డా సి నా రె గారి పీఠికలు నేటి పుస్తకాలకు అలంకారాలుగానే కాక అర్హతా పత్రాలుగానూ ఉంటున్నాయి

ఈ జిల్లాలో పలువురు కవి పండితులు స్థానిక - రాష్ట్ర రచయితల పుస్తకాలకు పీఠికలు రచిస్తున్నారు శతాధిక సంఖ్యలో ఉన్న ఈ పీఠికా కర్తల నందరిని పేర్కొనడం సాధ్యం కాని పని కాని కనీస విధిగా దశాధిక గ్రంధాలకు పీఠికలు సమకూర్చిన వారి పేర్లను మాత్రమే ఇక్కడ చూపడం జరుగుతున్నది వారు వీరు

డా సి నారాయణరెడ్డి, బి వి రామారావు, శతావధాని కృష్ణమాచార్య వానమామలై జగన్నాధాచార్యులు, వేంకటరాజన్న అవధాని, జె బాపురెడ్డి, డా మలయశ్రీ, డా అందె వేంకటరాజము, గీట్ల జనార్ధన్ రెడ్డి, బి ఎస్ రాములు, డి వి మురళీమోహనాచార్యులు, పార్వెల్ల గోపాలకృష్ణ

# వ్యాసాలు

సాహిత్య ప్రక్రియలన్నింటిలో రచయితకు ఎక్కువ స్వేచ్ఛ కలది వ్యాసం ఏదేని ఓ విషయాన్ని గురించి విపులీకరించి వ్రాస్తే అది వ్యాసం చెప్పితే ప్రసంగం వ్రాసి చదివితే ప్రసంగ వ్యాసం ఉపన్యాసాన్ని మౌఖిక వ్యాసం అనీ అనొచ్చు

రూపాన్ని బట్టి చిన్నగా ఉంటే సంగ్రహ వ్యాసం పెద్దదైతే సుదీర్ఘవ్యాసం దీని పరిధి ఎన్నుకున్న అంశాన్ని బట్టి, తీసుకున్న సమయాన్ని బట్టి ఉంటుంది వందల వేల పుటల్లో ఉండే పిహెచ్ డి థీసిస్ గ్రంథాలను సైతం మనవాళ్లు పరిశోధనా వ్యాసం అనడం గమనార్హం [11]

ఈ శీర్షికలో వ్యాస సంపుటాల పరిశీలన జరుగుతుంది మనకు కవుల వలెనే వ్యాస రచయితలెక్కువ ముద్రిత వ్యాస సంపుటాల కర్తలనే ఇక్కడ పరిచయం చేయడం సాధ్యం పత్రికలలో ప్రచురితమౌతున్న వ్యాసాలు విలువైనవైనా వాటి ప్రస్తావనకు పోవటం లేదు

ఈ జిల్లా వ్యాస సంపుటాల రచయితల వీరు

1 డా సి నారాయణరెడ్డి ఎం ఏ , పిహెచ్ డి హన్మాజిపేట
2 కొండలరావు వెలిచాల ఎం కాం గుండి
3 మచ్చ హరిదాసు ఏం ఏ కరీంనగర్
4 డా రావికంటి వసునందన్, ఎం ఏ , పిహెచ్ డి కమాన్‌పూర్
5 టి శ్రీరంగస్వామి - బి కాం, ఎం ఏ పర్లపల్లి
6 డింగరి రామాచార్య ఎం ఏ , కనగర్తి
7 డా అనుమాన్ల భూమయ్య, ఎం ఏ , పిహెచ్ డి వెదురుగట్ట
8 వేముల ప్రభాకర్ గౌడు, బి కాం రాయికల్
9 తిరునగరి ఉడయవర్లు, జర్నలిస్టు నుస్తులాపురం
10 జె బాపురెడ్డి, ఎం ఏ సిరికొండ
11 వి భూపతిరెడ్డి, ఎం ఏ ఎల్ ఎల్ బి , ఎం ఇడి కరీంనగర్
12 బి ఎస్ రాములు హాస్టల్ వార్డెన్ జగిత్యాల
13 దూడం నాంపల్లి అధ్యాపకులు సిరిసిల్ల

వీరి వ్యాస సంకలనాల వివరాలు చూడండి

**1 డా సి నారాయణరెడ్డి** - ప్రముఖ గేయకవి వీరి వ్యాస సంపుటాలు మూడు

1 వ్యాస వాహిని 1965 ముద్రణ, 2 మావూరు మాట్లాడింది - 1980, 1996, 3 సమీక్షణం 1991 వ్యాస వాహినిలో పది వ్యాసాలున్నాయి ఇవన్నీ సాహితీ సమీక్షలే నన్నెచోడునికవితాశక్తి ద్విపదలలో దివ్యకవిత, తిక్కన తీరుతెన్నులు, రంగనాథ రామాయణం, తెలుగు కావ్యాల్లో సాంఘిక జీవనం, భవిషత్తులో కవిత శబ్దశక్తి అర్థస్ఫూర్తి, నిత్యజీవితంలో వేమన, రవీంద్రుని కవిత్వంలో విశ్వజనీనత, ఎంకి - నాయుడు బావ

మావూరు మాట్లాడింది - లో కరీంనగర్ జిల్లా గ్రామ్య - మాండలిక పదాలను కొన్నింటిని సోదాహరణంగా వ్యాఖ్యానించారు ఈ ఆరు వ్యాసాలు మొదటి ఈనాడు పత్రికలో వచ్చినవి ఇది తొలినుడుగు, మలినుడుగులో తమ సినీ గీతాలారింటిలోని పల్లెవారి మాటల పరిశీలన కావించారు

సమీక్షణంలోనూ ఉన్న వ్యాసాలు పది - పు 92 ఇందులో సగం వరకు 'యువభారతి' సంకలనాల్లో ప్రచురణ పొందినవి అవి - పోతన, పున పరిశీలన, జాషువా కవితా వ్యక్తిత్వం, యెంకి పాటల్లోని కావ్యత్వం మలే భాషా పదజాలం, ఆశ్చర్యార్థకాల్లో ఆప్తస్మరణం, అచ్చుతప్పుల్లో మెచ్చు తునకలు, మాత్రాచ్ఛందస్సులు, సారసౌరభం, ఆముఖం, సి నా రె గారిది ఎక్స్‌రే దృష్టి వారి కలానికి పరుసవేది శక్తి ఉంది

రెడ్డి గారి వచనం కూడా కవిత్వం వలెనే ఉంటుంది ప్రాచీన ఆర్యాచీన సాహిత్య సామాజిక వివిధ సమీక్షలు వీరి వ్యాసాలు నవలల సృశించకపోవడం నారాయణరెడ్డి గారి కవితాశక్తికి నిదర్శనం

## 2 డా వి కొండలరావు - ఎం కాం గుండి

వి కొండల్ రావుగారు వచన గేయ రచయిత ఆంధ్రాంగ్ల ఉర్దూ భాషలలో పండితులు వీరు అనువాదాలు స్వతంత్ర్య రచనలుపై మూడు భాషలలో 20 పుస్తకాల వరకు వచ్చాయి గేయకృతులే పదమూడు గీతాంజలిని సైతం వీరు అనువదించారు వీరి పరిచయం గేయ కావ్య కవుల్లో ఉంది

వీరు ప్రధానంగా వ్యాస రచయిత వీరి వ్యాసాలు భాషాలంకార శాస్త్ర సాహిత్య రసభావశైలీ విశ్లేషతాత్మక చర్చారూపాలు వీరి వచనంపై విశ్వనాథ వారి శైలీ ముద్ర ఉంది మే 1982లో వి కె రావుగారు సంపాదకులుగా కరీంనగర్ పి జి అధ్యయన సంస్థ నుండి వెలువడిన 'శాతవాహన' సాహిత్య సంచికలో వీరి బాషా-బావం-సహజత-సంస్కారం పు 20, అనే వ్యాసముంది అదే పేరుతో ఓ వ్యాస సంపుటి తమ 'వివేకానంద పబ్లికేషన్స్ ద్వారా 1984లో వెలువరించారు

వీరి భాష - పరిభాష సాహిత్యం - సంస్కృతి వ్యాస సంపుటి తెలుగు అకాడెమీ గ్రంధావళి నం 35గా 1990లో వచ్చింది 33 శీర్షికలు 312 పుటల ఈ వ్యాసావళి గ్రంథం డా సి నా రె గారికి అంకితం ఇవ్వబడింది

తెలుగు పత్రిక తెలుగ మాధ్యమం రవీంద్రుడు, సంజీవదేవ్, గాలిబ్, విశ్వనాథ ఏది కవిత్వం? విమర్శా సాహిత్యం పూర్వకవుల దృక్పథాలు, ఎలక్ట్రానిక్ యుగంలో పుస్తకం, విశ్వకవి సమ్మేళనం పుస్తకాలు మాట్లాడుతాయి - ఇందలి వ్యాసాల శీర్షికలు

కొండలరావు గారి మరో వ్యాససంపుటి విద్య - విలువలు - సాంఘిక దృక్పధం ను తెలుగు అకాడెమీ 1990లో ప్రచురించింది 210 పుటల ఈ వ్యాసావళిలో అకాడమీ మాసపత్రిక తెలుగు' సంపాదకీయాలు సగానికి పైగా ఉన్నాయి మిగితావి విద్యాసంబంధమైనవి కావ్య సమీక్షలు ఒకటిరెండు అనువాదాలు కూడా ఉన్నాయి

ఈ వ్యాసాలు కొండలరావు వెలచాల గారి సాహిత్యాభిరుచికి, బహుముఖ భాషాసాహిత్య కళా సంస్కృతుల అవగాహనకు చక్కని ఉదాహరణలు



## 3 మచ్చ హరిదాసు - ఎం ఏ జ 1950

వీరి స్వగ్రామం గునుగుల కొండాపురం, ప్రస్తుత నివాసం కరీంనగర్

డా హరిదాసుగారు కరీంనగర్ జగిత్యాల డిగ్రీ కాలేజీలో తెలుగు లెక్చరర్ వీరు తెలుగు యాత్రా చరిత్రలు పరిశోధనాంశంగా పిహెచ్ డి చేశారు అంతకుముందుగా తథ్యము సుమతీ అనే పేర 1984లో 72 పుటల వ్యాస సంపుటి రచించి వెలువరించారు సుమతీశతక పరిశీలన కావించిన ఈ 'వ్యాస పంచమి'లోని శీర్షికలివి

1 సుమతి కర్తృత్వ చర్చ, 2 సుమతి పద్య సంఖ్య 56 కొత్త పద్యాలు 3 ప్రతుల వివరాలు - పార్య భేదచర్చ, 4 సుమతి కందం ఛంద శిల్పం 5 సుమతి నీతి కవితా రీతి

డా ఎన్ గోపి 'వేమన' పద్యాల పరిశీలన కావించిన దారిలోనే బహు విశేష కృషి ప్రయాసలకు పూనుకొని హరిదాసుగారు 'సుమతి' శతక పరిశీలన కావించారు

## 4 డా రావికంటి వసునందన్

వసునందన్ గారి పరిచయం పద్యగేయ కావ్య కవుల్లో ఉంది వీరి వ్యాస సంపుటి భావదీపికలు ఇందులో సాహిత్య సంబంధ వ్యాసాలున్నాయి అవి, వాల్మీకి రామాయణము, జయదేవుని అష్టపదులు సత్యాకృష్ణులు, ఏకవీర మొ॥ వి ముద్రణ కాలం తెలుపలేదు వీరి మరో ఎనిమిది వ్యాసాల ముద్రిత సంపుటి "అష్టాక్షరి"

## 5 టి శ్రీరంగ స్వామి

శ్రీరంగ స్వామి గారు గేయకవి వరంగల్ జిల్లా రచయితల వాఙ్మయ సూచిక, మరో రెండు సాహితీ ప్రముఖుల జీవిత చరిత్రలు వీరి వచన రచనలు, స్వామి గారి వ్యాస సంపుటి విపంచి 1986లో వెలువడింది ఇందులో ఎనిమిది సాహిత్య వ్యాసాలు 30 పుటల్లో ఉన్నాయి

## 6 డి రామాచార్య

కనపర్తి స్వగ్రామమైన రామాచార్యులు కొరుట్ల జూనియర్ కాలేజీలో తెలుగు ఉపన్యాసకులు వీరు 'వానమామలై జగన్నాథాచార్యుల' 'రైతు రామాయణము'' పద్యకావ్య పరిశీలన కావించి



1994లో కాకతీయ విశ్వవిద్యాలయము నుండి డాక్టర్ పట్టా పుచ్చుకున్నారు వీరు వచన గేయకవి రామాచార్యుల వ్యాస సంపుటి వ్యాస మంజరి 1986లో వెలువడింది ఇందలి వ్యాసాలు అయిదు వా జగన్నాథాచార్యుల సాహితీ జీవనం మొదటిది రెండవది నవ్యసాహిత్యంలో కర్షక జీవన చిత్రణము మిగతా మూడు రైతు రామాయణములోని వస్తు, వర్ణన, ధర్మోపదేశ చర్చలు రామాచార్యుల భాష శిష వ్యావహారికం ఈ 80 పుటల వ్యాస సంపుటి ఎం ఫిల్ పరిశోధనవలె వీరికి పిహెచ్ డి ప్రవేశార్హత కలిగించింది

## 7 డా అనుమాన్ల భూమయ్య, కాకతీయ వి వి తెలుగు రీడర్

వీరి పరిచయం ఇంతకుముందు పద్య కావ్య కవుల్లో సాహిత్య విమర్శ గ్రంథ రచయితలలో చేయబడింది డా భూమయ్య గారి వ్యాస సంపుటి 'వ్యాస భారతి' 1988లో వెలువడింది ఇది డా ఆచార్య వేర్వారం జగన్నాథం గారికి అంకితం ఇవ్వబడింది ఇందలి వ్యాసాలు ఆరు పుటలు 110 వ్యాసాల వరుస ఇది అధునిక తెలుగు కవిత్వంలో ఉద్యమాలు, నాయని భాగ్యనగర కోకిల విశ్వనాథ వారి గిరి కుమారుని ప్రేమగీతాలు', 'ప్రజల మనిషి' - కథానాయకుడు, వట్టికోట ఆళ్వారుస్వామి నవలలు, విద్వాన్ విశ్వం గారి 'పెన్నేటి పాట'లోని కరుణ రసపరిశీలన చివరిది గుంటూరి శేషేంద్ర శర్మ గారి 'ఆధునిక మహాభారతం లోని విప్లవ ధర్మ సమర్థన ఇవి రచయిత అభిరుచికి సూక్ష్మ పరిశీలనకు దర్పణాలుగా ఉన్నాయి

## 8 వేముల ప్రభాకర గౌడు - గేయ కవి, నవలా రచయిత

ప్రభాకర్ గారి వ్యాస సంపుటి 'గౌడనాడు' 1988లో వచ్చింది ఇందలి వ్యాసాలు మొదట గౌడ జన పత్రికలో ప్రచురణ పొందినవి ఇవి గీత కార్మికుల ప్రగతిని ఉద్దేశించి వ్రాయబడిన మేల్కొలుపు వ్యాసాలు

## 9 తిరునగరి ఉదయవర్లు

ఉదయవర్లు గారు భాగ్యనగరంలో ఓ ప్రఖ్యాత దినపత్రిక ఉప సంపాదకులు వీరు పద్యకవి కీ శే టి వేంకటేశ్వర్లు గారి పుత్రులు ఉదయవర్లు గారి 50 వ్యాసాల సంపుటి లోకాలోకనం 1988లో వెలువడింది ఇందులో 89వ సంవత్సరం పీఠిక కూడ ఉంది ఇవి 1975 85 మధ్యకాలంలో పత్రికలలో ప్రచురణ పొందిన శ్రామిక జన జీవన వివరణలు రచయిత సునిశిత పరిశీలనకు ఇవి సజీవ చిత్రాలు

## 10 జె. బాపురెడ్డి - జిల్లా కలెక్టర్

బాపురెడ్డిగారు ప్రముఖ పద్య గేయ కావ్యకవి బహుగ్రంథకకర్త వీరి ఆలోచనాత్మక వ్యాస సంపుటి మనసులోని మాట 1988లో ముద్రణ పొందింది ఈ వ్యాసాలు 100 పుటలు నాక్రమించాయి ఈ వ్యాసాలను విషయాన్ని బట్టి విభజన కావిస్తే, కవుల గురించి - నిత్యాధునికుడు తిక్కన, విశ్వజనీయకవి వేమన, త్యాగరాజు, స్మరణీయుడు కె ఆర్ రెడ్డి, నా దృష్టిలో శ్రీశ్రీ, కవిగా కుందుర్తి,

పీఠికా పీఠాధిపతి (బోయిన భీమన్న), కవిత చిరునామా సినారె అన్వేషణ, ఉద్యమించిన రాజనందిని (మందరపు వేంకటేశ్వర రావు గారి పద్యకావ్య సమీక్ష), సాహిత్యపరమైనవి - కవిత్వం ఎందుకు? వచన కవిత అనుభూతి ప్రధానాలు హృదయలేఖ, ఆత్మశ్రుతి 'మారుతున్న మన గ్రామీణ జీవితం - సామాజికం 'భౌతిక ఆధ్యాత్మికం' నవ్య వేదాంతం

బాపురెడ్డి గారు కవిత్వంలోనే కాదు వచన రచనలోనూ తమ ప్రతిభను ఈ వ్యాసాల ద్వారా నిరూపించుకుని సాహితీ సవ్యసాచిననిపించుకున్నారు సాహిత్యేతర రంగంలోని ఓ ఉన్నత ప్రభుత్వోద్యోగి ఇంతటి కవితాభినివేషం కలిగి ఉండడమేమిటి? నిజానికి వీరు కలెక్టర్ అయి కవి కాలేదు కవి, కలెక్టర్‌గా అయినారు అయినా ఏనాడూ రెడ్డి గారు సాహిత్యానికి, రచనా వ్యాసంగానికి దూరం కాలేదు

## 11 పి భూపతిరెడ్డి - కరీంనగర్

వావిలాల భూపతిరెడ్డి గారు ఎం ఏ , ఎల్ ఎల్ బి ఎం ఇడి పట్టాలు పుచ్చుకున్నారు వీరు కొత్తపల్లి జిల్లా పరిషత్తు బాలుర సెకండరీ పాఠశాలలో అధ్యాపకులు

బాల సాహిత్యంపై అభిమానం కల వీరు కరీంనగర్‌లో 'బాలవికాస సమితి సంస్థను 1992లో ఏర్పాటు చేసి ఏటా విద్యార్థులకు ప్రతిభా పాటవ పోటీలు నిర్వహించి బహుమతులిస్తున్నారు

'బాల వెన్నెల పేర ఇన్నేండ్లుగా విద్యార్థుల రచనలతో త్రైమాసిక పత్రికను వెలువరిస్తూ వారి విజ్ఞాన నైతిక సాహిత్య వికాసాలకు కృషి చేస్తున్నారు వీరి వ్యాస సంపుటాలు రెండు

1 విద్య 2 పిల్లల పెంపకం 1992లో వెలువడినవి ఒక్కొక్కటి 60 పుటలు ఈ వ్యాస సంపుటాలు పిల్లల విద్యాపోషణ విషయాల్లో పెద్దలు తీసుకోవలసిన జాగ్రత్తలను గూర్చి వివరించాయి ఈ రెండు పుస్తకాలను స్వయంగా ప్రచురించి జిల్లాలోని ఉన్నత పాఠశాలలన్నింటికీ రచయిత ఉచితంగా పంపిణీ చేయడం విశేషం ఇంకా బాలవికాస గేయాలు, బాల వికాస సూక్తులు వీరి ఇతర ప్రచురణలు

## 12 బి ఎస్ రాములు - జగిత్యాల

రాములు గారు కథా నవలా రచయిత సామ్యవాద సిద్ధాంత అభిమాని కాలక్షేపం కోసం వీరేదీ వ్రాయరు వీరిది ప్రజా ఉద్యమ స్ఫూర్తి ఇప్పుడు 'మార్క్సిజాన్ని' కులం కోణంలో పరిశీలిస్తూ రచనలు కావిస్తున్నారు వీరు 'రాష్ట్ర దళిత రచయితల - కళాకారుల ఐక్యవేదిక, స్థాపకులు - అధ్యక్షులు వీరి వ్యాసాలు ఆలోచనాత్మకాలు సాహిత్య సామాజిక స్థితి గతి విశ్లేషణాత్మకమైన వీరి వ్యాసాలకు తత్త్వ భూమికలు - అగ్రకులాధి పత్య నిరసన, దళిత జన సమున్నతి సాధన రాములు గారివి ప్రత్యేక వ్యాస సంకలనాలు ప్రచురించబడినవి అవి ఇవి

1 గతితర్కం అంబేద్కరిజం మార్క్సిజం' 1993 ఇందలి వ్యాస త్రయంలో శరత్ పాటిల్ భరత్ పతంకర్‌ల రెండు హిందీ వ్యాసాల అనువాదాలతో పాటు తమ వ్యాసం 'వాస్తవం ఒకటే దృక్పథాలు అనేకం' చేర్చి ప్రచురించారు భరత్ పతంకర్ వ్యాసానువాదంలో బి ఎస్ గారికి సహకరించినవారు నిజాం వేంకటేశ్వర్లు - సిరిసిల్లగారు వీరు ప్రగతిశీల భావాలు కలవారు ఉద్యమ సాహిత్యానికి చాల తోడ్పాటు అందించారు

2 'అంబేద్కరిజం సోషలిజం' 1994 ఇది అంబేద్కర్ ఆశయాలను బౌద్ధం, మార్క్సిజం మౌలిక సిద్ధాంతాలతో తులనాత్మక పరిశీలన కావిస్తూ రాములు గారు వ్రాసిన 5 వ్యాసాల 70 పుటల సంపుటి

రచయిత మతాన్నేకాక మార్క్సిజాన్ని విమర్శించారిందులో రచయిత దృక్పథం తెలియడానికి 'బౌద్ధం - సోషలిజం' మొదటి వ్యాసం 11వ పుటలోని ఈ వాక్యాలు చూడండి "అంబేద్కర్ పులిని చూసి గాంధి హరిజనోద్ధారకున్నని వాతలు పెట్టుకొన్నట్టుగా జానపద గేయ సాహిత్యంలో శూద్ర విప్లవాలు తెచ్చిన అభివృద్ధిని చూసి బ్రాహ్మణులు తమ పద్యాల్లో తెలుగుతనం, వగైరా వాతలు పెట్టుకోవడం అవసరం అయింది '

3 సాహు ఇంటర్వ్యూలు - 1994 పు 52

ఇది ప్రముఖ ప్రజా పోరాట రచయిత కీ శే సాహు 'శనిగరం వేంకటేశ్వర్లు' గారి స్మృతి పారితోషకంగా రాములు గారు తమ 'విశాల సాహిత్య అకాడెమీ జగిత్యాల పక్షాన ప్రచురించిన వ్యాస సంపుటి వివిధ రాష్ట్ర రచయితల 'సాహు స్మృతి'తో కూడిన ఉద్యమ సాహిత్య సమీక్షా వ్యాసాలతో కూడిన ఈ వ్యాస సంకలనం రాములు గారు తమ జిల్లా సాహితీ మిత్రులు 'సాహు గారికి స్నేహస్మృతిగా చెల్లించుకొన్న అక్షర బాష్పాంజలి ఇందలి సాహితీ సామాజిక సేనాని సాహు' మొదటి పదకొండు పుటల వ్యాసం రాములు గారి రచన సాహుతో బి ఎస్ రాములు కావించిన ఇంటర్యూ పు 12-41 ముప్పై పుటల్లో ఉంది ఇది మొదట 1992లో 'దళిత వాయిస్ లో ప్రచురణ పొందినది ఈ పుస్తకం పు 42-52లో 'ఆంధ్రప్రభ దినపత్రిక 5 4-93 ఇంటర్వ్యూ ఆవునూరి సమ్మయ్య - హుజూరాబాద్ గారు తీసుకొన్నది ఉంది ఇది ప్రశ్నోత్తర పద్ధతిలో కాక వ్యాసరూపంగా ఉండటం విశేషం ఇందులో సంప్రదాయ అరస విరస దిగంబర దళిత స్త్రీవాదుల గూర్చి 'సాహు' తమ అభిప్రాయాలు ఖచ్చితంగా నిర్మొహమాటంగా తెలిపారు ఆధునిక కవులకు వారిచ్చిన సందేశం విలువైనది - "రాయడం వరకే మా బాధ్యత అనటం బాధ్యతా రాహిత్యం - కాలానికి కాపు కాసేకవి, కాలంతో పాటు నడవాలి నడవలేని నాడు స్వాప్నిక జగత్తును గూర్చి రాస్తూ ప్రజల్లో గందరగోలాన్ని సృష్టించరాదు నూతన మానవున్ని (వ్యవస్థని?) నిర్మించే మహాయజ్ఞంలో (పోరాటం?) మీ వంతు పాత్రను కేవలం నినాదాల కవిత్వం రాసి, కనీసం మట్టి అయినా అంటకుండా వీరకవిగా, శూరకవిగా పోజులు కొట్టడం మానాలి" పు 47

ఇంకా రాములు గారి వ్యాసాలు అనేకం ఉద్యమ పత్రికల్లో వచ్చాయి ప్రముఖ సాహితీవేత్త కీ శే డా కేతవరపు రామకోటి శాస్త్రిగారితో వీరు కావించిన ఇంటర్యూ సైతం ప్రచురణ పొందింది భౌతిక మానవతా వాద రచయిత మలయశ్రీ గారితో కావించిన ఇంటర్వ్యూ మధ్యలోనే ఆగింది సామ్యవాద రాజకీయ సిద్ధాంత ప్రచార దళిత జనాభిమాన వ్యాస రచయిత బి ఎస్ రాములు గారు

**13 ' దూడం నాంపల్లి - సిరిసిల్ల** (పరిచయం పద్యకావ్య కవుల్లో ఉంది)

వీరి వ్యాస సంపుటి 'పంచామృతం' పు , ముద్రణ - 1996 ఇందులోని 5 వ్యాసాలు సాహిత్య సంబంధమైనవి ఇందులోని అయిదు సాహిత్య వ్యాసాల్లో 'పూర్వకావ్యాల్లో తెలుగు సూక్తం సామెతల సమీక్ష 'వరద గోదావరి' అడవి బాపిరాజు పాటకు 'తెలుగు పెళ్ళి పడుచుగా నూత్న విశ్లేషణ నన్నయ భారత సంబంధంలోనూ ఓ వ్యాసం ఉంది ఇవి రచయిత సాహితీ ధిషణకు గీటురాళ్ళుగా ఉన్నాయి

## వ్యాస సంకలనాలు

ఈ జిల్లా వ్యాస సంకలనం 'సాహితీ చైతన్య మూర్తులు' అనే పేరుతో ఒక్కటే వెలువడింది 68 పుటల ఈ సప్తవ్యాస సంకలనాన్ని 'సమతా సాహితీ కరీంనగర్' వారు 1990లో ప్రచురించారు ఎన్ గంగయాచారి గారు ఈ సంస్థ వ్యవస్థాపకులు - పోషకులు ఇవన్నీ ప్రసంగ వ్యాసాలు

ఇందలి వ్యాసకర్తలు - వ్యాసాలు

1 ఏ గజేందర్ రెడ్డి - గురజాడ సాహిత్యంలో సాంఘిక దృక్పథం

2 కేశబోయిన కాశీనాధ్ - శ్రీశ్రీ కవితల్లో ప్రతీకలు

3 డా జి లక్ష్మణ్‌రావు - విశ్వనాధ నవలలు మానవతా విలువలు

4 డి నరహరి ఆచార్య - రైతు రామాయణం - అభ్యుదయ భావం

5 డా వి రంగాచార్యులు - దాశరథి కవితా పరిధి

6 డా బి దామోదరరావు - నారాయణరెడ్డి కవిత్వంలో సౌందర్యం

7 త్రిపురారి సోమేశ్వర శర్మ సి నా రె వచనం - వికసించిన కుసుమం

కాశీనాధ్ సోమేశ్వర శర్మ గారలది కరీంనగర్ జిల్లా కాదు వీరందరూ తెలుగు లెక్చరర్లు కావడం విశేషం

ప్రత్యేకంగా సంపుటాలుగా రాకున్నా ఎక్కువ వ్యాసాలు ప్రచురణ పొందిన మరి ఇద్దరు వీరు

1 ప్రొఫెసర్ **డా పి యశోదారెడ్డి** - వీరి వ్యాసాలు అర్ధ శతాధికం వివిధ ప్రత్యేక సాహితీ సంచికలలో, విడిగా బుక్‌లెట్స్‌గా ముద్రణ పొందినవి అవన్నీ సాహిత్య పరిశోధన వ్యాసాలు కొన్ని ప్రసంగ వ్యాసాలు

2 రీడర్ **డా కె రాజన్న** శాస్త్రి - సంస్కృతాంధ్ర సాహిత్య కావ్యాలంకార సంబంధ వ్యాసాలు డా రాజన్న శాస్త్రి గారివి ఏబది వరకు ప్రచురణ పొందాయి వీనిలో అనేక, ప్రసంగ వ్యాసాలు సెమినార్‌లలో చదువబడినవి, ఆకాశవాణి ద్వారా ప్రసారం చేయబడినవి ఆంధ్రప్రదేశ్ రాజధాని భాగ్యనగర్ చతుశ్శతాబ్యుత్సవాల సందర్భంగా తెలుగు అకాడెమీ వారు 1991లో ప్రచురించిన 'హైదరాబాద్ నాలుగు శతాబ్దాల సాహిత్య వికాసం" అను పన్నెండు వ్యాసాల సంకలన గ్రంధంలో కరీంనగర్ జిల్లా నుండి ఏకైక వ్యాసం శాస్త్రి గారి 'తెలంగాణా అచ్చ తెలుగు కవులు' - పు 8-16

సమగ్రాంధ్ర విజ్ఞాన కోశంలో వ్యాసాలు వ్రాసిన గౌరవం కరీంనగర్ జిల్లాలోని ఈ క్రింది ఇద్దరు రచయితలకు దక్కింది

### 1 వేంకటరాజన్న అవధాని - అడ్వోకేట్ మంథని

రాజన్న అవధాని గారి మంథెన ప్రాచీన వైభవము' అను చారిత్రక వ్యాసం 'స వి కోశము హైదరాబాద్' వారి 7వ సంపుటిలో ఉంది ము 1970

### 2 డా సంగనబట్ల నరసయ్య - ప్రిన్స్‌పాల్ ధర్మపురి

వీరి 'వేములవాడ భీమకవి' వ్యాసం తె వి వి హైద్రాబాద్ వారి విజ్ఞాన సర్వస్వము' 2వ, సంపుటిలో ప్రచురింపబడింది ము 1986 పు 425, 26 ఎన్ సి ఇ ఆర్ టి ఢిల్లీ వారిచే వ్యాసరచనలో జాతీయ స్థాయి బహుమతి విజేతలు ఈ క్రింది రచయిత్రులు

### 1 ప్రతిభారాణి - బి ఎస్సి, బి ఇడి - మంథని



అధ్యాపకురాలు వేంకట రాజన్న అవధాని గారి కూతురు రచయిత్రి ప్రతిభారాణి గారి 'విద్యార్థులకు నైతిక - అధ్యాత్మిక శిక్షణ - బోధనావసరం' అనే వ్యాసానికి 1989 1990లో ఎన్ సి ఇ ఆర్ టి ఢిల్లీ వారి జాతీయ స్థాయి పోటీలో వెయ్యి రూపాయలు బహుమతి లభించింది చాల చక్కని వచన కవితలు వ్రాశారు

**2 ఎన్ లలితాకుమారి - బి ఎస్సి, బి ఇడి హుజూరాబాద్**

వీరు జమ్మికుంట సెకండరీ పాఠశాలలో ప్రధానోపధ్యాయురాలు 1990లో జిల్లా స్థాయిలో, 1992 93లో రాష్ట్ర స్థాయిలో ఉత్తమ అధ్యాపక అవార్డులు అందుకున్నారు 'విద్యాబోధన ద్వారా విద్యార్థులలో నైతిక విలువలను పెంపొందించుట' అనే వీరి వ్యాసానికి 1989-90 సం 1000/- బహుమతి లభించింది అప్పుడు వీరు మంథని బాలికల సె పాఠశాల ప్ర ఉ ఉన్నారు వీరు సాహిత్యాభిమానురాలు



**3 ఇష్రత్ సుల్తానా - బి ఎస్సి, ఎం ఏ (లిట్) ఎం ఇడి కరీంనగర్**

మంథని బాలికల సె పాఠశాలలో ఉపాధ్యాయురాలైన వీరు పై లలితాదేవి గారి వ్యాసానికి సహ రచయిత్రి ఇష్రత్ సుల్తానా మంచి కళాకారిణి సంస్కృతంలో పలు పరీక్షలు ప్యాసయ్యారు పై తెలుగు వ్యాసానికే కాక జాతీయ సాంస్కృతిక శిబిరంలో మంథిని బాలికలకు మార్గ దర్శకత్వం వహించి ఢిల్లీలో రాష్ట్రపతి చేతులమీదుగా ప్రథమ బహుమతి అందుకున్నారు గేయ రచన గానం సాంస్కృతిక ప్రదర్శనలు ఆమెకు ఇష్టం



**4 మలయశ్రీ -**

వీరి వ్యాసాలు ప్రత్యేక సంపుటాలుగా రాకున్నా పత్రికల్లో వచ్చాయి గౌతమి త్రైమాసిక సాహిత్య పత్రిక కరీంనగర్ వారి వీరి 'మనిషి-మార్పు' వ్యాసానికి ప్రథమ బహుమతి, కెప్టెన్ విజయ రఘునందన్ స్మారక పోటీలో 'మన సరిహద్దు సమస్యలు-పరిష్కారాలు' వ్యాసానికి ఏకైక పోటీ బహుమతి' 'అధ్యాపక జ్యోతి' కరీంనగర్ వారి జిల్లా ఉపాధ్యాయుల వ్యాసరచన పోటీలో 'మారుతున్న మన సమాజంలో ఉపాధ్యాయుల పాత్ర' రచనకు ద్వితీయ బహుమతి గెలుచుకున్నారు రేగులపాటి మాధవరావు పై 'అధ్యాపక జ్యోతి' పోటీలో తమ వ్యాసానికి ప్రథమ బహుమతి గెలుచుకున్నారు

**5 ఆర్ బాల ప్రసాద్ -**

పెద్దపల్లి గారు తమ వ్యాసానికి ఏదో ఒక ప్రముఖ పత్రికలో బహుమతి పొందినట్లు జ్ఞాపకం ఇంకా ఎందరో వ్యాసకర్తలు చేయితిరిగిన వారు ఈ జిల్లాలో ఉన్నారు వారిలో ముఖ్యంగా బి వేంకటరామారావు, డా జి లింగారెడ్డి, డా అందె వేంకటరాజము, డా కాలువ మల్లయ్య, డా డి నరహరి ఆచార్య మొ॥ వారు గణనీయులు ఈ మధ్య రుద్రవరం ఎల్లయ్య, హుస్నాబాద్‌గారి వ్యాసానికి 'అక్కినేని నాగార్జున అభినందన సంచిక'లో ప్రథమ బహుమతి లభించిందని వ్రాశారు ఎక్కువ సంఖ్యలో సాహిత్య వ్యాసాలు వ్రాసిన ఖ్యాతి డా కాలువ మల్లయ్య గారికి సంచలన వ్యాసరచయిత బి ఎస్ రాములుగారు

**శాస్త్ర గ్రంథాలు - పాఠ్య పుస్తకాలు**

ఈ జిల్లాలో కొందరు రచయితలు ప్రత్యేకాభిమానంతో శాస్త్ర గ్రంథాలు రచించారు ఎం ఫిల్, పిహెచ్ డి పరిశోధనలు కాని పుస్తకాలు ఇటు చూపబడుతున్నవి

ఇంతవరకు పరిచయం చేయబడిన, శీలప్ప రామకృష్ణశాస్త్రి మంథిని గారు "ఆర్ష విజ్ఞాన సరస్వం" సుబ్బయాచారి కురిక్యాల గారి "జ్యోతిష్య సర్వస్వం" డా పింగళి లింబాద్రి రెడ్డి నెమిలికొండ గారి 'సేద్యం వైద్యం , 'ఆరోగ్యం సౌభాగ్యం' పుస్తకాలు ఈ విభాగానికి చెందినవి

ఈ శతాబ్ది ఉత్తరార్ధంలో మరికొందరు రచయితలు శాస్త్ర  సాంకేతిక విషయాల పుస్తకాలు రచించారు వారి వివరాలు చూడండి

1 వాసాల నరసయ్య, చొలమద్ది గారు  గేయకవి కథా రచయిత నరసయ్య గారు పోస్టల్ ఉద్యోగి ఆ శాఖను గురించి పౌరులకు సమాచారం అందించడానికి వీరు మూడు పుస్తకాలు రచించారు అని 1 తపాలా ప్రపంచం, 2 ఇ డి ఉద్యోగులు, 3 సర్కిల్ పిన్‌కోడ్ బుక్

ఇక్కడి వారివి నాలుగు వ్యాకరణ పుస్తకాలు ఈ కాలంలో వచ్చాయి అవి ఇవి

## 1 ఎం వి నరసింహారెడ్డి - ఎం ఏ బి ఇడి. తక్కళ్లపల్లి

నరసింహారెడ్డి గారు నవలా రచయిత వీరు సెకండరీ పాఠశాలల విద్యార్థులకోసం 'ది ఇంగ్లీషు గ్రామర్' అనువేర ఆంగ్ల భాషా వ్యాకరణాన్ని తెలుగు వివరణలతో రచించి 1980 సుమారుగా ప్రచురించారు

## 2 నూగూరి జనార్దన - ఎం ఏ వేములవాడ జ 1935

జనార్దన్ గారు అగ్రహారం తా॥ సిరిసిల్ల డిగ్రీ కాలేజీలో తెలుగు ఉపన్యాసకులుగా పనిచేసినారు వీరి 'సులభ వ్యాకరణము' పేరుతో 1982లో సెకండరీ పాఠశాల విద్యార్థుల కోసం ఒక తెలుగు వ్యాకరణం రచించి ప్రచురించారు (ఇంకా  స్వామీ భోలానాథ్ మహరాజ్ గారి దైవీకిరణే' హిందీ పుస్తకాన్ని 'దివ్యకిరణాలు' పేరుతో తెలుగులో అనువాదం చేశారు ) వాస్తు జ్యోతిష గ్రంథాల హిందీ కన్నడ ఇంగ్లీషు భాషల్లో అనువదిస్తున్నారు

## 3 బైరి నరసయ్య - ఎం ఏ , బి ఓ.ఎల్ కోరుట్ల

వీరి పరిచయం గేయకవుల్లో ఉంది నరసయ్య గారు 'సరళ వ్యాకరణ' పేర విద్యార్థులకోసం ఒక తెలుగు వ్యాకరణ పుస్తకాన్ని రచించి 1991లో ప్రచురించారు

## 4 డా కె రాజన్న శాస్త్రి - ఎం ఏ ఎం ఓ ఎల్ విద్యాప్రవీణ పిహెచ్ డి ధర్మపురి

ప్రముఖ సంస్కృత కవి డా  కొరిడె రాజన్న శాస్త్రి గారు 'సంస్కృత పథ ప్రదర్శని అను వ్యాకరణాన్ని రచించారు పు 195 ఈ పుస్తకాన్ని ఉస్మానియా విశ్వవిద్యాలయ 'సురభారతీ సమితి' 1993లో ప్రచురించింది ఇందులో "సంస్కృత భాషలో నిర్దుష్టమైన జ్ఞానం కలగడానికి అవసరమైన వ్యాకరణాంశాలన్నీ చేర్చబడ్డాయి" అని ఈ పుస్తకాన్ని గురించి సు భా సమితి అధ్యక్షులు అల్లాడి కుప్పుస్వామి గారు పీఠికలో తెలిపారు

ఇందలి అయిదు శీర్షికలవి  1 సంస్కృత శబ్ద స్వరూప వివరణ, 2 సంస్కృత శబ్ద పరిచయము, 3 ధాతువుల పరిచయము, 4 సంస్కృత వాక్యనిర్మాణము, 5 సంధులు 6 సమాసములు, మొ వి

ఆంధ్ర వాగను శాసనుడు నన్నయభట్టు తెలుగు తొలి వ్యాకరణమైన 'ఆంధ్ర శబ్ద చింతామణి' ని నాడు సంస్కృతంలో వ్రాస్తే, నేడు డా కె రాజన్నశాస్త్రి గారు 'సంస్కృత వ్యాకరణం'ను తెలుగులో వ్రాశారు ఇది కాలంలో వచ్చిన మార్పు ప్రజల అవసరాలను బట్టి రచనలు వస్తాయి అని విశ్వసించడానికి ఇదో నిదర్శనం నాడు సంస్కృత పండితులు తెలుగు నేర్చుకొనడానికి అది - నేడు తెలుగు విద్యావంతులు సంస్కృతం నేర్చుకోవడానికి ఇది అంతే భేదం

## 5 డా ఎస్ జనార్దనాచారి - ఎమ్మెస్సి పిహెచ్ డి కరీంనగర్

విజ్ఞాన శాస్త్ర విషయాలు సరళ సుందరంగా రచించే నేర్పుకలవారు వ్యాసాలు 'తెలుగు' మొదలైన సంచికల్లో వచ్చాయి వీరు రచించిన పాఠ్య గ్రంథాలు తెలుగు అకాడెమీ ప్రచురించింది 'విశాలాంధ్ర' వారు ప్రచురించిన వీరి సైన్సు పుస్తకాలు రెండు

1 మానవుడు సూక్ష్మజీవులు 2 పర్యావరణ కాలుష్యం ప్రమాదాలు - 1991, 94, పు 44

ఇది నేడు ప్రపంచం ఎదుర్కొంటున్న సమస్య వాతావరణ, కాలుష్యం ఎందుకు కలుగుతున్నది, దాన్ని ఎలా నివారించుకోవాలి అనేది ఈ రచన పరమార్థం



విశ్వ బ్రాహ్మణ సిద్ధాంతి సత్యనారాయణ జూలపల్లి గారు 1990 సుమారుగా 1, 2 పంచాంగాలు రచించి ముద్రించారు పుల్లిరాజయ్య సిద్ధాంతి అంబారి పేటగారు పంచాంగాలు రాశారు పాపయ్య శాస్త్రి సిరిసిల్ల జ్యోతిష్య పుస్తకాలు రాశారు వా జగన్నాధాచార్యుల అల్లుడు కె నరసింహాచార్యుల తండ్రి కొదమగుళ్ళ ఆచార్యులు పొత్కపల్లి ఓదెలగారు సిద్ధాంతి అని తెలిసింది

ఇంకా ఒకరిద్దరు 'పంచాంగ' కర్తలున్నా వీరి పంచాంగాలు అంతగా జనవ్యాప్తి పొందలేదు

## పాఠ్య పుస్తకాలు

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ విద్యాలయాల, కళాశాలల విద్యార్థులకు కరీంనగర్ జిల్లా రచయితల రచనలు కొన్ని పాఠ్య గ్రంధాలుగా వచ్చాయి వాటి వివరాలివి

**1 డా సి నారాయణరెడ్డి** డా సి నారాయణరెడ్డి గారి 'ఆధునికాంధ్ర కవిత్వం - సంప్రదాయం ప్రయోగం' అను సాహిత్య విమర్శ గ్రంధం ఎం ఏ సాహిత్య విద్యార్థులకు పఠనీయగ్రంధమైంది రెడ్డి గారి 'తరతరాల తెలుగు వెలుగు , 'లోకాలోకనం' అనుగేయ కవితలు 1975 తర్వాత సెకండరీ పాఠశాలల తెలుగు వాచకాల్లో చేర్చుకోబడ్డవి వీరి 'విశ్వనాథ నాయకుడు' గేయ కావ్యం కూడా ఏదో తెలుగు పరీక్షకు పాఠ్య గ్రంధంగా నియామకం పొందినట్లు విదితం

**2 డా పి యశోదారెడ్డి** డా యశోదగారు ''టెక్స్ట్ బుక్స్ ఫార్ చిల్డ్రెన్'' పేర 1985లో 4, 5 తరగతులకు రచించిన తెలుగు వాచకాలను ఆం ప్ర ప్రభుత్వం వారు ప్రచురించారు

**3 మలయశ్రీ - చంజర్ల మం మానాకొండూరు** వీరి 'శాంతి పథము' నాటకము, ఆ ప్ర ఇంటర్ మీడియట్ ఫైనల్ విద్యార్థులకు తెలుగు ఉపవాచకం దీనిని శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము తిరుపతి వారు ప్రచురించారు 1975-78 మధ్య ఇది పాఠ్య గ్రంధంగా ఉంది

**4 బి అచ్యుత జానకీరామరాజు - ఎం ఓ ఎల్ బోప్పారం తా॥ సిరిసిల్ల**

1980 సుమారుగా ఆ ప్ర ప్రభుత్వం వారు ప్రచురించిన తెలుగు మొదటి వాచకం రచయితల్లో అచ్యుతరాజు గారొకరు

**5 డా తిరుమల శ్రీనివాసాచార్య** - ఆం ప్ర ప్రభుత్వం వారి సెకండరీ పాఠశాలల 9వ తరగతి తెలుగు వాచకం వీరు కూర్చారు ఇది 1987-95 మధ్య కాలంలో బోధింపబడింది

**6 డా ఎం సుజాత** - వీరి 'తెలుగు సంస్కృతి - సాహిత్య చరిత్ర' 1989 ఉస్మానియా యునివర్సిటి బి ఏ , ఆనర్స్ పాఠ్య గ్రంధం ఇది తె అకాడెమీ ప్రచురణ

**7 నేదుసూరి కనకయ్య - ఎం కాం ఎం ఫిల్ కరీంనగర్**

కనకయ్య గారు 'సెంట్ బిషప్ సాలమన్ జూనియర్ కళాశాల కరీంనగర్'లో కామర్స్ లెక్చరర్ బాల కార్మికుల స్థితిగతి పరిశీలించి ఎం ఫిల్ డిగ్రీ పొందిన వీరు 'హోటల్ కార్మికుల సమస్యలు' పై పిహెచ్ డి పరిశోధన వ్యాసం రచిస్తున్నారు

వీరు కాకతీయ విశ్వవిద్యాలయ పరిధిలోని ఇంటర్ విద్యార్థులకు తెలుగులో 'అర్థశాస్త్రము' ను 1993 రచించి వి వి వారి అనుమతితో ప్రచురించారు ఇది మరో వరంగల్ రచయిత గారితో కలిసి రూపొందించిన సహరచన

**8 సాంబమూర్తి - ఎం ఏ మహాదేవపురం**

గెజిటెడ్ ఇన్స్పెక్టర్ ఆఫ్ స్కూల్స్ వీరు 4వ తరగతి 'తెలుగు వాచకం' రచయిత

**9 డా ఎస్ జనార్దనాచారి - కరీంనగర్**

జనార్దానాచారి గారు డిగ్రీకే కాక స్నాతకోత్తర స్థాయి (ఎమ్మెసి) వరకు సైన్సు పుస్తకాలు రచించారు వాటిని తెలుగు అకాడెమీ ప్రచురించినది అని వీరి 'వాతావరణ కాలుష్యం ప్రమాదాలు' చివరి పుటలోని కవి పరిచయంలో తెలిపారు ఆ గ్రంథాల వివరాలు తెలువలేదు

## జీవిత చరిత్రలు - ఆత్మకథలు

మాన్యుల జీవిత చరిత్రలు సామాన్యులకు మార్గదర్శకంగా ఉంటాయి మహనీయుల జీవిత సంస్మరణ మనకు మంచి వ్యాసంగం - కనీస కర్తవ్యం

"జీవిత చరిత్ర ప్రపంచంలోని అన్ని పుస్తకాలకంటె విలువైన గ్రంథం ఉత్తమ ప్రయోజనకరమైన పరనానికి అది ఆదర్శనం" - కార్లయిల్

ప్రముఖ గ్రీకు చిత్రకారుడు ప్లూటార్క్ కీ శ ఒకటవ శతాబ్దిలో 46 మంది గ్రీకు రోమన్ ప్రముఖ వ్యక్తుల జీవితాలను 'సమాంతర రేఖలు పేర రచించారు మనదేశంలో సంస్కృతంలో భట్ట బాణుని 'హర్షచరితమ్' 6వ శతాబ్ది, ఆ చక్రవర్తి చరిత్రతో పాటుగా రచయిత జీవిత చరిత్రగా విరచితమైంది ఆధునిక కాలంలో వివిధ దేశాల్లో లెనిన్పై 80 వేల గ్రంథాలు వచ్చాయి అబ్రహం లింకన్ జీవిత చరిత్రలు ఇంగ్లీషులో 20 వేలు రచయిత టాల్స్టాయ్ జీవితంపై 23 వేల పుస్తకాలు, నాటకకర్త షేక్స్ పియర్పై 15 వేల గ్రంథాలు రచింపబడ్డాయి (జె నరేంద్రదేవ్ - 'విశ్వవిజ్ఞాన దర్శిని 1986 పు 317) భారతదేశంలో బుద్ధుడు, గాంధీ, బి ఆర్ అంబేద్కర్ జీవిత చరిత్రలు ఎక్కువ సంఖ్యలో వచ్చాయి

ఈ జిల్లాలో వెలువడిన జీవిత చరిత్రలు ప్రధానంగా సాహితీవేత్తలకు సంబంధించినవి అందులో సంఘ సంస్కరణాభిలాషులు రాజకీయవేత్తలు ఉండటం విశేషం సురమౌళి గారు మాత్రం సంఘ సంస్కర్త డా॥ అంబేద్కర్ జీవిత చరిత్రను అనువదించారు

మలయశ్రీ గారు భగత్సింగ్, అజాద్ చంద్రశేఖర్, సుభాస్, అల్లూరి, జయప్రకాశ్, అంబేద్కర్ మొ॥ విప్లవవీరుల జీవిత చరిత్రలు 10 వ్రాశారు అవి ఇంతకు ముందు బాల వయోజన విద్యా పుస్తకాలలో పరిచయం చేయబడినవి ఈ జిల్లా జీవిత చరిత్రల రచయితలు వీరు

1 ముద్దసాని రాంరెడ్డి, 2 జి సురమౌళి, 3 డా తిరుమల శ్రీనివాసాచార్య, 4 టి శ్రీరంగస్వామి వీరి రచనల వివరాలివి

**I ముద్దసాని రాంరెడ్డి - ఎం ఏ , జర్నలిస్టు ఊటూరు**

వీరి పరిచయం నవలా రచయితలలో చేయబడింది రెడ్డి గారు రచించిన జీవిత చరిత్రలివి

1 సురవరం ప్రతాపరెడ్డి, 1973, పు 174, 2 బూర్గుల రామకృష్ణారావు - 1980, పు 20

3 ఆధునిక రాజ్యాంగ తత్వానికి అరవిందుని తోడ్పాటు - 1985, పు 118

'ఆంధ్ర సారస్వత పరిషత్తు' హైదరాబాద్ వారు నిర్వహించిన సురవరం గారి జీవిత చరిత్రల పోటీలో ప్రథమ బహుమతి రాంరెడ్డి గారి 'సు ప్ర రెడ్డి పుస్తకానికి, డా ఎల్లూరి శివారెడ్డి గారి పుస్తకానికి చెరి సగం లభించింది సురవరం వారి సాహిత్య జీవిత-సంఘసేవ విషయాలు ఈ గ్రంథంలో వివరించబడ్డాయి

బూర్గుల రామకృష్ణరావు గారు బహుభాషావేత్త, ప్రముఖ పద్య కవి కాంగ్రెసు నాయకులు వీరు విముక్త హైద్రాబాద్ రాష్ట్ర ముఖ్యమంత్రిగా కేరళ రాష్ట్ర గవర్నర్‌గా పనిచేశారు రా కృ రావు గారి జీవితాన్ని రాంరెడ్డి గారు సంగ్రహంగా రచించగా రాష్ట్ర పౌర సంబంధ సమాచార శాఖవారు పుస్తకంగా ప్రచురించారు

అరవిందుని రాజకీయ అధ్యాత్మిక జీవిత నేపథ్యంలో రెడ్డి గారు రచించినది మూడవ పుస్తకం ఇది 'తెలుగు అకాడెమీ హైదరాబాద్' వారి పోటీ 1985లో బహుమతి పొందిన రచన దీనిని తెలుగు అకాడెమీ వారే ముద్రించారు

**2 జి సురమౌళి - బి ఏ ఎల్ ఎల్ బి జర్నలిస్టు విలాసాగర్ ని హైదరాబాద్ కీ శే**

ప్రముఖ జర్నలిస్టు, సోషలిస్టు భావ ప్రేమికులైన సురమౌళి గారు రాంమనోహర్‌లోహియా గారి రచనలను, జయప్రకాశ్ నారాయణగారి రచనలను మధులి మాయే రచించిన అంబేద్కర్ జీవిత చరిత్రను "విప్లవ రథసారథి బి ఆర్ అంబేద్కర్" పేరుతో ఆంధ్రీకరించి ఉత్తమ అనువాద గ్రంథ రచయితగా తె వి విద్యాలయం హైదరాబాద్ బహుమతిని 1992లో అందుకున్నారు

**3. డా తిరుమల శ్రీనివాసాచార్యులు - ఎం ఏ , పిహెచ్ డి నారాయణపురం తా॥ సిరిసిల్ల**

శ్రీనివాసాచార్యుల పరిచయం గేయ కావ్య కవుల్లో చేయబడింది

వీరు 'నారాయణరెడ్డి - సాహితీమూర్తి' అను గ్రంథాన్ని 1981లో రచించి ప్రచురించారు 384 పుటల ఈ ఉద్గ్రంథం నారాయణరెడ్డి గారి జీవితాన్ని సంగ్రహంగా, వారి సాహిత్యాన్ని సమగ్రంగా వివరించింది (డా సి నా రె సాహితీ జీవన చరిత్రలు మరిరెండు - డా రావూరి 'వెన్నెల తెరచాప' డా ఎన్ గోపి గారి 'నిలువెత్తు తెలుగు సంతకం - సి నా రె వ్యక్తిత్వం' అను పుస్తకాలు వచ్చాయి కాని, ఆ రచయితలు కరీంనగర్ జిల్లా వాస్తవ్యులు కారు ) డా తిరుమల శ్రీనివాసాచార్య గారి ఈ 'సాహితీ జీవన చరిత్ర' సాహితీ వేత్త డా సి నారాయణరెడ్డి గారికే కాక, సాహిత్యారాధకులైన తెలుగు పాఠకులకు అందించిన విలువైన పారితోషికం

**4 డా టి శ్రీరంగస్వామి - ఎం ఏ పర్లపల్లి ప్ర. నివాసం హన్మకొండ**

శ్రీ రంగస్వామి - సాహిత్యాభిమాని - కవి వీరివి కొన్ని కవితా సంపుటాలు ఒక వ్యాసం సంపుటి వచ్చాయి 'వరంగల్ జిల్లా రచయితల వాఙ్మయ సూచిక' సైతం వీరు రచించారు

వీరి కలం నుండి వెలువడిన జీవిత చరిత్రలు రెండు

1 కోవెల సుప్రసన్నాచార్యులు వాఙ్మయ జీవిత సూచిక, 1991, పు 40

2 దేవులపల్లి రామానుజరావు ఒక రేఖా చిత్రం, 1991, పు 22

ఇవి రెండు అఖిలాంధ్ర కీర్తినార్జించిన ఇద్దరు వరంగల్లు సాహితీమూర్తుల జీవిత - సాహిత్య సంగ్రహ పరిచయ పుస్తకాలు

మన ప్రధాని పి వి నరసింహరావు గారి జీవిత చరితలు ఆంధ్రాంగ్లాది బహుభాషల్లో వెలువడ్డాయి ఆ రచయితలు కరీంనగర్ జిల్లా వారుకారు

# ఆత్మకధలు

ఆత్మకధలు వ్యక్తుల స్వీయ చరిత్రలు ఆటో బయోగ్రఫీలు కళా సాహిత్య క్రీడా రాజకీయ విజ్ఞాన శాస్త్రాది రంగాల్లో విశేష కృషి కావించిన విశిష్ట వ్యక్తులు తమ జీవితంలోని ఆటుపోటులను చేసిన కృషిని, పొందిన అనుభవాలను అందిన అనుభూతులను, జయాపజయాలను, విజయ సాధనా విధానాలను తమ స్వీయ చరిత్రల్లో పొందుపరుస్తారు కాబట్టి ఇవి పాఠకులను ఆసక్తిగా చదివిస్తాయి ధైర్యాన్ని - కార్య దీక్షను - ఆదర్శాన్ని ప్రబోధిస్తాయి

ఈ జిల్లాలో వచ్చిన ఆత్మకధలు నాలుగు అవి అన్నీ రచయితలవి కావడం విశేషం వారు వీరు

1 వెలిచాల కేశవరావు గుండి, 2 సిరిశెనహల్ కృష్ణమాచార్య శతావధాని - కోరుట్ల

2 డా అందె వేంకటరాజము - కోరుట్ల 4 డా పింగళి లింబాద్రి రెడ్డి - నెమిలికొండ

వీరిలో డా అందె వేంకటరాజము గారు తప్ప మిగిలిన ముగ్గురు కీర్తిశేషులు వీరి గ్రంధాల వివరాలివి

**1 వి కేశవరావు** - వీరి పరిచయం పద్య గేయకవుల్లో ఉంది

కేశవ రావు గారు 'నేను - నా జ్ఞాపకాలు పేర తమ జీవిత చరిత్రను 1975లో కేవల్ల 200 ప్రతులు ముద్రించారు 200 పుటల ఈ పుస్తకంలో మొదటి 66 పుటల్లో తమ వంశ పూర్వుల బంధువుల వివరాలతోపాటు తమ జీవిత విశేషాలు కుటుంబ సభ్యుల చదువు - పదవుల వివరాలు పేర్కొన్నారు మిగిలిన 134 పుటలు కావ్య భాగం

ఇందులో రావు గారు తమ ముద్రితాముద్రిత రచనల నుండి కొన్ని పద్యాలు-గేయాలు పొందుపరిచారు వారు వ్రాసిన కృతులతోపాటు అంకితం పొందిన పుస్తకాల కవుల వివరాలున్నవి రావుగారు ఆయా సందర్భాలతో బంధు మిత్రులకు సాహితీ బాంధవులకు వ్రాసిన కవితలతోపాటు వీరికి ప్రశంసా పారితోషికంగా ఇతర కవి ప్రముఖులు వ్రాసి సమర్పించిన పద్యాలు సైతం ఇందులో ఉన్నాయి ఈ 'జీవిత చరిత్ర' రావు గారి సాహిత్యానురాగంతో పాటు వీరి చారిత్రక విషయ ప్రీతిని హేతువాద దృష్టిని తెలియజేస్తుంది

## 2 ఎస్ కృష్ణమాచార్య శతావదాని - కోరుట్ల

ఆచార్యుల పరిచయం 20వ శతాబ్ది పూర్వార్ధ పద్య కావ్య కవుల్లో చేయబడింది స్వీయ కవితాను జీవనమ్ అనే పేరుతో శతావధాని గారు తమ జీవిత చరిత్రను సమగ్రంగా రచించి [illegible] ప్రచురించారు 114 శీర్షికల 158 పుటల ఈ ఆత్మకధలో ఆచార్యుల కుటుంబ, బంధువుల వివరాలతోపాటు, వారి విద్యాభ్యాస, ఉద్యోగ, గ్రంధరచన, ప్రచురణ, పండిత సభల, సన్మానాల వివరాలు ఉన్నాయి మధ్య మధ్య తమ గ్రంధాల - కవితల పరిచయం కావించే సందర్భంలో కొన్ని పద్యాలను సైతం చూపారు ఇది కృష్ణమాచార్యుల పటిష్టమైన పాండిత్యాన్ని, సాహిత్యాభిమానాన్ని, శ్రీ విశిష్టాద్వైత మత ప్రవత్తిని చాటే గ్రంధం

## 3 డా అందె వేంకటరాజము - కోరుట్ల

వేంకటరాజము గారి పరిచయం పద్య, నాటికా విభాగాల్లో వచ్చింది వీరు తమ షష్టిపూర్తి కానుకగా తమ సాహిత్య జీవితానుభవాలను సాహితీ జీవన తరంగాలు అను పేరుతో 1994లో ప్రచురించారు ఇది 160 పుటల 60 శీర్షికల రచన మొదటి 46 పుటల్లో తమ జీవిత విశేషాలను వర్ణించారు ఇవి 16 శీర్షికలు మిగతా గ్రంధంలో వివిధ కవి పండిత గోష్టులు-చర్చలు, గ్రామీణ

పదాలతో గ్రాంధిక శబ్దాల తులనాత్మక పరిశీలన, సందర్భవశంగా పాఠ్య బోధనలో భాగంగా వీరు చదివి వినిపించిన శృంగార పద్యాలకు విద్యార్థినుల ఆక్షేపణ మొ॥ అనుభవాలను వివరించారు ఒక సామాన్య శ్రామిక చేనేత కుటుంబంలో పుట్టిన వ్యక్తి అంచెలంచెలుగా స్వయం కృషితో ఎదిగి సాహిత్యా రాధకుడుగా, సంప్రదాయకవిగా, అష్టావధానిగా ఎట్లా విజయం పొందింది ఈ గ్రంథం వివరిస్తుంది

## 4 డా పి లింబాద్రి రెడ్డి - నెమిలకొండ

రాజవైద్య, పి ఎల్ రెడ్డి గారు 'గోలకొండ కవుల సంచిక' కెక్కినకవి వీరు రచయిత, వైద్యులు, రాజకీయ సామాజిక సాహిత్య రంగాల్లో రాణించి తొంబదేండ్ల కాలం నిండు ఆరోగ్యంతో జీవించినవారు రెడ్డి గారు తమ జీవిత విశేషాలను 'ఆత్మకథ గా 80వ ఏట వ్రాసుకున్నారు ఈ అముద్రిత వ్రాతప్రతి ఈ గ్రంథకర్త మలయశ్రీ వద్ద ఉంది

## ఇతర పుస్తకాలు

కరీంనగర్ కవులు చిత్ర విచిత్రమైన రచనలు కూడా చేశారు డా సి నా రె గారి 'మాకందాలు', 'ప్రపంచపదులు , బల్మూరి కమలా మనోహర రావు గారి 'మేధానాటకం', మలయశ్రీ గారి 'అత్రిమతం, మానవ గీత', ఎస్ కె పిళ్లె గారి 'చిత్రంపు పోకడల్' అను వ్యావహారిక భాషా గీత పద్య త్రిశత మొ॥ పుస్తకాలు అందుకు నిదర్శనాలు ఈ జిల్లాలో వెలువడిన వచన రచనలను పైన ఏ విభాగంలోనూ పేర్కొనని వానిని ఇక్కడ మాపడం జరుగుతున్నది

## సూక్తులు

**1 మలయశ్రీ** కవి 1973లో సజీవ సత్యాలు పేర ఒక వచన నిర్వచనాల సంపుటాన్ని ప్రచురించారు సాధారణంగా సూక్తులు ప్రముఖ రచయితల - నాయకుల, గ్రంథాల ఉపన్యాసాల నుండి గ్రహించి సంకలనాలుగా ప్రచురించడం ఆనవాయితీగా ఉంది ఈ రచయిత సూక్తులు స్వీయ నిర్వచనాలు ఇవి ఆలోచనాత్మక అభ్యుదయ భావాలు, కొన్ని హాస్యరస సమ్మిళితాలు ఈ సంపుటిలోని సూక్తులు నూటా ఇరవై ఒక్కటి

**2 టి వి నారాయణ** సిరిసిల్ల 1 'సామెతల లోకం' 1996 పు 64

టి వి నాధాయణగారు సిరిసిల్ల వాస్తవ్యులు పత్రికావిలేఖరి ఈ రచయిత తెలుగు సామెతలపై ఉన్న ఆసక్తితో దాదాపు 500 సామెతలను ఏర్చి శీర్షికల వారీగా 'సామెతల లోకం ' సంకలనాన్ని కూర్చారు ఇందుకోసం వీరు సామెతల సంకలనాల సాయం తీసుకున్నట్లు తెలిపారు ఆట పాటలు, భోజనాలు, రాజకీయాలు ఇలా వింగడించిన ఈ సామెతల విభాగాలకు ఉపోద్ఘాతాలు రాశారు కొన్ని మొరటు పదాలవి - భావాలవి కూడా ఇందులో చోటు చేసుకున్నాయి సామెతల సర్వస్వం' గ్రంథాలు మలయాళంలో వలె ఇక్కడ రావాలని ఆకాంక్షించారు

ద్రవిడ భాషలో సామెతలపై తులనాత్మక పరిశీలన గ్రంథరచన కావించిన డా నలిమెల భాస్కర్ గారు నారాయణగారి గ్రంథ రచనలో సలహాలనందించారు ముందుమాట కూర్చారు మరో పీఠికాకర్త జూకంటి జగన్నాథం గారు 'నీళ్ళనీ పారబోసెటట్టులేదు పాలనీ తాగేటట్లు లేదు' అంటూ రచయితను - 'నలుగురిలో నారాయణ' అన్నట్లు కాకుండా వ్యక్తిత్వం నిలబెట్టుకునే రచనలు చేయాలన్నారు

"సామెతలు సామాజిక ఐతిహాసిక అనుభవాలు సంక్షిప్త స్వరూపాలు" - మాక్సిమ్ గోర్కీ

డిగ్రీల కోసం తప్ప మన విద్యావేత్తలు సామెతల దిక్కు పోలేదు టి వి నారాయణ గారి ఈ సంకలనం మరికొన్ని సామెతల పుస్తకాలు రావటానికి కారణం అవుతుందని ఆశిద్దాం

**3 ముదుగంటి పాపిరెడ్డి**, బి కాం , ఎం ఏ బి ఇడి , వాచస్పతి నామాపూర్ జ 1942 జిల్లా సెకండరీ పాఠశాలల గెజిటెడ్ హెడ్మాస్టర్ ఉద్యోగం పాపిరెడ్డిగారు సహృదయులు సాహితీ ప్రియులు అభ్యుదయ భావ సంపన్నులు వీరు కథా రచయిత వీరి స్వీయ నిర్వచనాల సంకలన పుస్తకం - అనుభవ సూక్తులు 262 ఇది 1997లో వచ్చింది రచయిత భావాలు అనేకం ఆలోచనీయాలు వినూతనాలు



**4 వి భూపతిరెడ్డి** - కరీంనగర్ గారి 'బాల వికాస సూక్తులు' సంకలన సంపుటి పరిచయం చేయబడింది

గేయ కవి నవలా రచయిత వేముల ప్రభాకర్ గౌడు రాయికల్ గారు శ్రీ వేముల అనే కలం పేరుతో అభిధ అనే పేరుతో ఓ చిరు పుస్తకం ప్రచురించారు ఆధునిక నవలా రచయితలు తమ కథా పాత్రలకు, యువతీ యువకులు తమ పిల్లలకు వినూత్నమైన పేర్లకోసం నిఘంటువుల నాశ్రయించే ప్రయాస కుండా ఈ నామకరణం సంపుటి సహకరిస్తుంది

## హేతువాద రచనలు రెండు

**1 బి మధు** - కమలాపూర్ వయస్సు 40 సుమారు



ముద్రిత పుస్తకం "సుఖం" మధు మితవిద్య కలిగిన వ్యక్తి అయినా విశ్వవిద్యాలయ స్కాలర్లకు మించిన సాహిత్యాసక్తి కలిగిన హేతువాది నాస్తిక భావ వ్యాప్తి కోసం వీరు రచించిన ప్రశ్నోత్తర మాలిక 'సుఖం' పు 70, 1993లో వెలువడింది పురాణాల మతాల మతాచారాల అవిశ్వాసం ఈ గ్రంథంలో ఉంది సృష్టిని గురించి మానవ శరీరాన్ని గురించి, సామాజిక రీతి నీతుల గురించి ఈ రచయిత విశ్లేషించి వెలువరించిన భావాలు సత్యసమ్మతాలు విజ్ఞాన ప్రదాలు అనుసరణీయాలు

**2 ఎస్ విక్రమాదిత్య** - 6వ, తరగతి, చంజర్ల ప్ర ని కోరుట్ల, జ 18-1-87 ఈ పదిన్నర వత్సరాల బాలుడు విచిత్రంగా ఓ హేతువాద వ్యాస రచన చేశారు (17-10-97) తాత (మలయశ్రీకి చూపాడు) తండ్రి హర్షవర్ధన్ ఇంటర్‌లో ఉండగా రచనలు చేస్తే ఇతడు 6వ, తరగతిలోనే రచన ఆరంభించాడు వారసత్వ ప్రభావం డెమ్మీ 1/16 సైజులో 16 పుటల్లో వెలువడిన ఈ చిరు పుస్తకం దేవుడెక్కడ? అనే ప్రశ్నతోసాగిన హేతువాద రచన



## వచన ప్రబంధాలు

1 రావికంటి వసునందన్ - కమాన్‌పూర్ డా వసునందన్ గారు పద్య గేయ కావ్యాలు వెలయించుటకు ముందే వచన రచనలు కావించారు వీరి వచనం గ్రాంధికం కథా వస్తువులు పౌరాణికం వీరి వచన ప్రబంధాలివి

**1 రతీ ప్రద్యుమ్నము** - 1971 పుటలు 1971, 2 గురుకులము 1978 పు 102 - 36

రతీ ప్రద్యుమ్నము పౌరాణిక కథా ప్రబంధము "రతీ ప్రద్యుమ్న" మను వచన కావ్యమును చదివిన తర్వాత ఎవరో వయసు పై బడిన మంచి దిట్టమైన ప్రతిభాశాలి వ్రాసినాడనుకున్నాను" - జి నారాయణరావు, ఐ ఏ ఎస్, ఖమ్మం గారు "ఇతని రతీ ప్రద్యుమ్నమును గాంచిన - అందలి

గద్యశైలి ఏ సముఖం వేంకట కృష్ణప్ప నాయకుడో, ఏ కళువె వీర రాజో వ్రాసియుండడు గదా యనిపించునంతటి భవ్య రీతిలో సాగినది " అని వానమామలై వరదాచార్యులు చెన్నూరు గారు అన్నారు పీఠికలలో ఇది పింగళి సూరన ప్రబంధానుసరణం

రెండవ వచన కావ్యం గురుకులం భారతంలోని కచదేవయాని కథ ఇంద్ర సభలోని బృహస్పతి ప్రసంగం, శుక్రాచార్యుని ఆశ్రమంలో కచుని గురుభక్తి నెపంగా రచయిత నేటి శిష్యుల ప్రవర్తనల నిరసించి, నాటి గురుశిష్యుల ఆదర్శ ప్రేమానుబంధాల అభినందిస్తూ అభివర్ణించారు "అతిచిన్న కథను ఆధారంగా పెట్టుకొని నేటి విద్యా విధానంలోని గుణదోషాలనూ, వాటి పరిష్కారాలనూ సూచించటానికి ఈ కృతిలో ప్రయత్నం జరిగింది ఇతడు వస్తువును దర్శించే వైఖరి విలక్షణమైనది" అన్నాడు డా కె వెంకటరామయ్య గారు కాకతీయ యునివర్సిటీ వైస్-చాన్స్‌లర్ "పౌరాణికమైన ఇతి వృత్తాన్ని ప్రత్యక్ష సమాజంలోని వాతావరణానికి ప్రతీకగా ప్రతిపాదించడం, ఆశ్రమంలోని సన్నివేశాలను, గురుకులంలోని వ్యక్తుల విభిన్న మనస్తత్వాలను, సంఘటనలను రసవత్తరంగా చిత్రించడం అపూర్వ రీతిలో ధర్మ సందేశాన్ని నర్మ గర్భంగా, వ్యంగ్య, ధోరణిలో లోకానికి అందించడం ఈ వచన కావ్యానికి వన్నెలు కూర్చిన గుణాలు" అన్నారు డా కె గోపాల కృష్ణారావు గారు, హైదరాబాద్

పై విద్యావేత్తల ఆశీస్సులే కాక ఉస్మానియా విశ్వవిద్యాలయ వైస్-ఛాన్స్‌లర్ ప్రొఫెసర్, జి రాంరెడ్డి గారి ఆంగ్ల పీఠిక, అభినవ పోతన వానమామలై వరదాచార్యుల ఇరువది పుటల ఆంధ్రభాషా పీఠిక ఈ కావ్యానికి అలంకారాలుగా ఉన్నాయి ఈ వచన ప్రబంధాన్ని సహర్షంగా అంకితం పొందిన డా సి నారాయణరెడ్డి గారి అభిప్రాయం ఇది - 'వసునందన్ ప్రజ్ఞా వైదుష్యాలకూ, వర్ణనా ప్రాగల్భ్యానికీ, పద్య గ్రథన ప్రభుతకూ ముగ్ధురు కాక తప్పదు, ఇతని భావాలతో ఏకీభవించని వారైనా!" గురుకులం వసునందన్ గారు ఎం ఏ తెలుగు సాయం కళాశాల విద్యార్థిగా వ్రాసిన వచన ప్రబంధం మొదటిది ఇంతకు ఏడేండ్లు మొదటిది ఈ జిల్లాలో పూర్వశైలిలో వచన కావ్య ప్రబంధాలు వ్రాసిన ఏకైక రచయిత డా రావికంటి వసునందన్

## చట్టం - న్యాయం

మానవుడు సంఘజీవి సహజీవనంలో సామరస్యం ప్రతివ్యక్తి కనీస ధర్మం అందుకే "ఒరులేయవి యొనరించిన " "తప్పులెన్నువారు " వంటి సామాజిక నీతులు మన కావ్యాల్లో విశేషంగా చోటు చేసుకున్నాయి మత సాహిత్యం తన పరిధిలో సామాజిక నైతిక ప్రబోధ బాధ్యతను నిర్వహించింది లౌకిక గ్రంథాలు పేరు వీటి ప్రబోధం పారలౌకిక దృష్టితో కాక, జీవితానుభవ నిత్య సత్యాలపై ఆధారపడి ఉంటున్నది దేశ పరిపాలనా రంగానికి ప్రజల కనీసావసరాలను సమకూర్చుతూ వారి శాంతి భద్రతలను పరిరక్షించవలసిన ప్రధానమైన బాధ్యత ఉంది రాచరిక పెట్టుబడిదారీ - వలస పాలనలు మనదేశంలో అంతరించి పోయాయి ఇప్పుడు స్వతంత్ర భారత ప్రజాస్వామ్య పాలనలో ఉన్నాం ఇదీ పెట్టుబడి దారీ - పెటీ బూర్జువా పాలనే అనే వామపక్షాలవారి వాదనల అలా ఉంచి ఆలోచిస్తే - మనకో రాజ్యాంగం ఉంది దాని ప్రకారం పరిపాలన సాగుతున్నది ఆ చట్టాల అమలు పరచ బడుతున్నాయి వాటి ప్రకారమే న్యాయరక్షణ కావించబడుతున్నది ఇది చాల ముఖ్యమైన అంశం ఎందుకంటే మతాలు కొందరివి రాజ్యాంగ చట్టం' దేశంలోని అందరిది న్యాయం - చట్టం పరిధిలోనూ వెలువడిన పుస్తకాలు ఇక్కడ చూపబడుతున్నవి ఇవి రాజకీయ పుస్తకాలు కావు ఈ విషయంలో ఇక్కడ గ్రంథ రచన కావించిన వ్యక్తి ఒకే ఒక్కరు ఆ రచయిత వివరాలు ఇవి

### 1. మంగారి రాజేందర్ - వేములవాడ. జ. 2 సెప్టెంబర్ 1956

రాజేంద్రగారు 'జింబో' పేరుతో కాలేజీ విద్యార్థి కాలం నుండి వచన - మినీ కవితలు, కథలు వ్రాసేవారు అడ్వొకేట్‌గా - మున్సిపల్ మెజిస్ట్రేట్‌గా పనిచేస్తూ కొన్ని న్యాయ - చట్ట సంబంధమైన రచనలు చేశారు వీరి పుస్తకాలు -

1 వినియోగదారుల చట్టం, 2 వీలునామా, 3 మోటారు వాహనాల ప్రమాదాలు -

నష్టపరిహారాలు, 4 వరకట్నం నిషేధ చట్టం, 5 మరణ వాఙ్మూలం - 96, 6 హిందూ వివాహాలు - విడాకులు 1996

మొదటి పుస్తకాన్ని ఆంధ్రప్రదేశ్ జ్యుడిషియల్ అకాడెమి ప్రచురించింది నాలుగవ అయిదవ పుస్తకాలు 'ఆంధ్రప్రదేశ్ పోలీస్ అకాడమి హైదరాబాద్' వారు వెలువరించారు ఆరవ పుస్తకం 'ఆసియా లా హౌజ్' హైదరాబాద్ 2 ప్రచురణ లా, జర్నలిజంలో ఉస్మానియా యునివర్సిటీ నుండి డిగ్రీలు పొందిన ఎం రాజేందర్ గారు న్యాయవాద వృత్తినుండి 1989లో జ్యుడిషియల్ సర్వీస్‌లో మ్యున్సిప్ మెజిస్ట్రేట్‌గా చేరారు ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ పోలీస్ అకాడెమిలో డెప్యూటేషన్‌పై ఉన్నారు

"వీరి రచనలు సామాన్యులు మొదలుకొని అందరి మన్ననలు పొందాయి న్యాయశాస్త్రం సామాన్యునికి కూడా అర్థం కావాలన్న ఉద్దేశ్యంతో వీరు రచనలు కొనసాగిస్తున్నారు" (మరణ వాంగ్మూలం - కవర్ చివరి పుట పరిచయం నుండి) రాజేందర్ గారి రచనలు చదివిన వారు పై అభిప్రాయంతో తప్పక ఏకీభవిస్తారు ఇలాంటి రచనలు పౌరులకు చాల అవసరం

# రాజకీయ గ్రంథాలు

పూర్వ సాహిత్యానికి మతం ప్రాతిపదిక అయినట్లే ఆధునిక సాహిత్యానికి రాజకీయం ప్రేరణ అయింది అది పారలౌకికం ఇది లౌకికం బాహ్య కల్లోలాలకు భరించలేకనే కదా మనిషి అంతర్ముఖుడయ్యేది! అందుకే మనవాళ్లు సంసారాన్ని సాగరం అన్నారు - అంటే ఇది సమస్యల తోరణం అన్నమాట' ఆర్ద్ర సున్నిత హృదయుడు, సామాజిక సంఘటనలకు తీవ్ర ప్రతిస్పందన కలవాడే కవి - రచయిత అవుతాడు బాధ్యతకల రచయిత సంఘంలోని సంక్షుభిత సంఘటనకు స్పందించకుండా, వాటిని సమీక్షించలేకుండా ఉండలేదు పరిస్థితులను సమీక్షించడమే కాక, తన రచనల్లో సమస్యలకు పరిష్కారాన్ని చూపడం - సంఘాన్ని మేల్కొల్పడం కూడా చేస్తాడు మన రాజుల కాలాన్ని వదలితే ముఖ్యంగా ముస్లింల పాలన నుండి ఈ రాజకీయ విమర్శ మన సాహిత్యంలో ప్రముఖంగా (ముఖ్యంగా శతకాల్లో) చోటు చేసుకుంది ఈ శతాబ్ది స్వాతంత్ర్య పోరాటం కాలం నుండి పర ప్రభుత్వ నిరసన అధికమైంది దేశ స్వాతంత్ర్యానంతరం ప్రజాస్వామ్య - సామ్యవాద భావాల మధ్య ఘర్షణ రాజకీయాల్లో వలెనే సాహిత్య రంగంలోనూ ఆరంభమైంది - అనివార్యంగా సాగివస్తున్నది తెలంగాణాలో 1947-48 నైజాం విముక్తి పోరాట కాలం నుండి సాహిత్యంలో రాజకీయాలు ప్రముఖ స్థానం ఆక్రమించాయి

1934 గోలకొండ కవుల సంచికలో నిజాం ప్రభువుల నిరసన లేక ప్రశంసలుండడం గమనార్హం! ప్రముఖ సంఘ సంస్కర్తలైన కందుకూరి గురజాడల వంటి మహారచయితలు కూడా 1910 ప్రాంతంలో ఆంగ్లేయ ప్రభుత్వాన్ని స్తుతించడమే జరిగింది 1950 తర్వాత మాత్రం మన ప్రభుత్వాల స్తుతి నిందలు కవుల రాతల్లో అధికమైనాయి అది పరాధీనతా భయం విధించిన సంకెళ్లు - ఇది దేశ స్వతంత్రం వలన లభించిన భావ ప్రకటన స్వేచ్ఛ అనీ అనుకోవచ్చు

ఈ జిల్లాలో శాంతి - క్రాంతి భావాలు సమంగా పోటీ పడుతున్నాయి తీవ్రవాద భావ రచనలు ఎక్కువగా కవిత్వంలో కథానవలా సాహిత్యంలో వచ్చాయి అవి పత్రికల చర్చలు తప్ప వచన పుస్తకాలుగా వచ్చినవి తక్కువ పత్రికల ప్రసక్తికి పోక పుస్తకాలుగా వచిన రాజకీయభావ భూమిక కల వచన రచనలను ఇక్కడ ఇప్పుడు పేర్కొనడం జరుగుతున్నది వీళ్లు కేవలం నలుగురు రచయితలు వీరి రచనల పరిచయం చేయబడుతున్నది

**1 జి రాములు - సిరిసిల్ల జ 1921**

వీరి రచన గాంధీ సూక్తులు'' 1948లో వచ్చింది గాంధీజీ హత్య 30 జనవరి 48లో నైజాం విముక్తి 17 సెప్టెంబర్ 1948లో ఆ మధ్య కాలంలో రజాకార్ల దుండగాల కల్లోల ముస్లిం నిరంకుశ పాలనలో ఈ జాతిపిత సూక్తుల పుస్తక ప్రచురణ రచయిత సాహసానికి నిదర్శనం

**2 శేషం రామస్వామి - కరీంనగర్**

రామస్వామి గారు ప్రాథమిక పాఠశాలోపాధ్యాయులు ఉత్తమ అధ్యాపకులుగా జాతీయ అవార్డు పొందిన వారు 1969 గాంధీజీ శతజయంతి కానుకగా "అహింసా జ్ఞానవాణి" అనే పుస్తకాన్ని 1970లో ప్రచురించారు 57 పుటల ఈ పుస్తకానికి 21 పుటలు ముందు మాటలున్నాయి కొన్ని నీతులు, పెద్దబాల శిక్షలో వలె భాషా - విజ్ఞాన విషయాలు ఇందులో రచయిత పొందుపరిచారు ఇది బాల సాహిత్యం వయోజన విద్యా పుస్తకం స్థాయిలోనిది కాని రచయిత అట్లా అనలేదు రామస్వామి గారు అహింసా ప్రీతిని, సంప్రదాయ నీతిని ఈ పుస్తకం ద్వారా ప్రచారం చేశారు మహాత్ముని సంక్షిప్త జీవితం, గాంధీ క్రీస్తు - వేమనల సూక్తులు, సామాన్య విశేష శీలసాధనలు మరికొన్ని శతక పద్యాలు కల ఈ పుస్తకం మొదటి పుటలో 'వందేమాతరం' చివరగా జనగణమన' జాతీయ గీతం భావాలతో సహా ఉన్నాయి

స్వామి గారు బాల బోధ, శ్రీ సీతారామ శిశు శిక్షణ కథలు, జ్యోతిష్యఫల ప్రకాశిని, కాలచక్రము తమ ఇతర రచనలుగా పుస్తకం చివర పేర్కొన్నారు అవి అముద్రితం - అలభ్యం రామస్వామి గారు మామ గారు చేర్యాల శ్రీరంగ కవి గొప్ప పండితులని వీరి కూతురు అల్లుడు అన్నారు

**3 బి ఎస్ రాములు - జగిత్యాల**

బి ఎస్ రాములుగారి పరిచయం నవలా కథా రచయితల విభాగాల్లో ఉంది

రాజకీయ భావ ఘర్షణ నేపథ్యంలో వెలువడిన వీరి ప్రముఖ గ్రంథం గతి తర్కతత్వ దర్శన భూమిక 1991 ప్రముఖుల పీఠికలతో సహా 1992లో వెలువడింది 212 పుటల ఈ రాజకీయ సాంఘిక సిద్ధాంత విషయ చర్చా పుస్తకాన్ని రచయిత 'సత్యశోధన - ఆత్మ విమర్శ'గా పేర్కొన్నారు

అగ్రజాతి హిందూమతం ఈ దేశంలో శ్రామిక కులాల వారిని, స్త్రీలను ఎదగకుండా అణచి వేస్తున్నది, దోపిడీ చేస్తున్నది, అని రాములు గారి వాదన - వేదన అది ఇంకా సాగనీయరాదని బోధన, ఈ రచన సారాంశం మార్క్సుకు భారత కులాల సమస్య దీని ప్రభావం తెలియలేదన్నారు రచయిత బ్రాహ్మణ కులాన్ని, పితృస్వామ్య వ్యవస్థను ఖండించారు సమసమాజ సాధనకు కమ్యూనిస్టు మానిఫెస్టో మరొకటి అవసరమన్నారు ఏకపక్ష వాదన అయినా వీరి రచన ఆలోచింపచేసేదిగా ఉంది వీరి తర్కంలో బలం ఉంది ఇది సిద్ధాంత చర్చా గ్రంథం



"ఈ పుస్తకం చదవడం వలన భారతీయ సమాజంలో జరగవలసిన అసలు సిసలైన మార్పు ఏది ఏ స్థాయిలో ఎలా జరగాలి అనే విషయాలపట్ల అవగాహనకు స్ఫూర్తి కలగకుండా వుండదు'

2 ప్రేమ అంటే ఏమిటి? - 1996, వివరాలివి ఈ 20 పు పుస్తకం సాంఘికమా రాజకీయమా అనేది స్పష్టంగా నిర్ణయించలేం తాత్త్విక రచన ఆలోచనాత్మకంగా చదిరిస్తుంది దీని ప్రచురణ కర్త 'గుండేటి గంగాధర్ - జగిత్యాల' (దీప్తి, పత్రిక సంపాదకులని వినికిడి) చాల విలువైన పీఠిక ఈ పుస్తకానికి రాశారు ఈ పుస్తకం మొదట కొ విల్సన్, కందుకూరి అంజయ్య, శ్రీవిరించి పుస్తకం చివర గురుకుల మిత్రా కంచ ఐలయ్య హైదరాబాద్ జి రామచంద్రరావు, నెల్లూరు, త్రిపురనేని మధుసూధనరావు - తిరుపతి గారల అభిప్రాయాల అభినందనల లేఖలున్నవి

### 4 సురమౌళి - విలాసాగర్ హైదరాబాద్

సురమౌళి గారు తొలితరం సోషలిస్టు కార్యకర్త ప్రముఖ జర్నలిస్టు వీరి కథల అనువాద రచనల పరిచయం చేయబడింది నేటి ఉగ్రవాద రాజకీయాల హింసావాదాన్ని ఖండిస్తూ వీరు 'హింసారాధన' పేరుతో 340 పుటల విమర్శ గ్రంథాన్ని రచించి 1992 డిసెంబర్‌లో ప్రచురించారు

ఉగ్రవాదం అంటే చాల వరకు నిష్కారణ క్రౌర్యమే తమ్ముతాము సంబాళించుకోవడానికి భీతావహులు దీనికి పాల్పడుతారు" ఏంగ్సిల్స్ 4 సెప్టెంబర్ 1870న మార్క్సు వ్రాసినలేఖ నుండి

"ఉగ్రవాదులు, విభిన్న రకాల కుట్రదారులు - విప్లవ మూల తత్వాన్నే మార్చే మాయావులు టెరరిస్టులు ఉగ్రవాదులు విప్లవంలో ప్రజా స్వామ్య వ్యతిరేకులు, తిరుగుబాటు కార్యక్రమం కాదు విప్లవం కార్యక్రమం " - కారల్ మార్క్స్

రచయిత తమ వాదనకు బలకరంగా పై వాక్యాలు మొదటి పుటలో చూపి, రెండవ పుటలో హింసను ఖండిస్తూ అహింసను బలపరుస్తూ గాంధీజీ పలికిన ఈ క్రింది హితోక్తులను చూపారు

"క్రౌర్యాన్ని పెంచేది పిరికితనమే "హింస పిరికితనం కంటే కూడా నీచమైనది ' 'హింస దుర్బలుల ఆయుధం, బలవంతుల ఆయుధం అహింస "

హింసారాధన నక్సలైట్లు విప్లవ పోరాటాలు చేస్తున్నారా? నక్సలైట్ల పట్ల భ్రమలు ప్రజాస్వామ్యం, భారతీయ సంస్కృతి - హింస, ఆయుధం లేని సమాజం అంటే అసమానతలులేని సమాజం, కాలం చెల్లిన కొన్ని సోషలిస్టు విశ్వాసాలు మొ॥ తొమ్మిది శీర్షికలలో భారతదేశ - పాశ్చాత్య పూర్వ అర్వాచీన గ్రంథాల వాక్యాలనుల్లేఖిస్తూ స్వీయాభిప్రాయాల్ని సురమౌళి గారు ఈ రచనలో స్పష్టంగా చెప్పారు తమ వాదానికి బలంగా ఉండే విధంగా దినపత్రికల వార్తలను వందల సంఖ్యలో చూపారు, ఫోటోలతోసహా ఇవి 1989-90 సంవత్సరాలవి



ఈ పుస్తకానికి ప్రొఫెసర్ సురవత్తు వేణుగోపాల రావు గారు ముందుమాట వ్రాస్తూ "సమాజంలో జనవృద్ధి, ఆర్థికలోపం మూఢవిశ్వాసాలు, స్వప్రయోజకత్వం మొ॥వి అధికార కాంక్షవలన మరింత విపరీతమవడం చూస్తున్నాం అందుచే అటు ఆదర్శాలు వదలకుండా ఇంటు హింసా ప్రవృత్తి అవలంబించకుండా సమాజ రక్షణకి, సమాజ పురోగమనానికి సమాంతర సేవ అవసరం" అని ఆశించారు

నేటి పాలక వర్గాలు కుత్సిత రాజకీయాల్లో మిళితమై పోయినవి సమాజం కిష్ట సమస్యలతో సంక్షుభితమై ఉంది - అని రచయిత అంగీకరిస్తూ, హింస వాటికి పరిష్కార మార్గం కాదు ఈ ఉగ్రవాదుల ఆదర్శమార్గంలో లేరు వీరి వల్ల ఆశయసాధన సాధ్యం కాదు, అని ఈ రచయిత ఇచ్చిన తీర్పు

ఈ పుస్తకానికి ప్రధాని పి వి నరసింహరావు గారి శుభాకాంక్షలు అందాయి దేశ ప్రధాని పి వి గారు, ఆంధ్రప్రదేశ్ పీపుల్స్ వార్ దళపతి ఎం ఎల్ రావు అలియాస్ గణపతి, ఈ గ్రంథకర్త సురమౌళి గారలు కరీంనగర్ జిల్లా వారు కావడం యాదృచ్ఛిక సంఘటన 'హింసారాధన' ఆలోచనీయాంశం

ఆంధ్ర కంటె, తెలంగాణాలో అందులో ఈ కరీంనగర్ జిల్లాలో సి పి ఎం ఎల్ ప్రభావం జాస్తిగా ఉంది దీని ఖండిస్తూనో అభినందిస్తూనో పలు రచనలు వచ్చేవి కాని అటు అన్నల భయం, ఇటు పోలీసుల భయం, అడకత్తెరలో జనం! అందుకే మేధావులు రచయితలు మౌనం

ఇవీ ఈ జిల్లా వచన రచనల తీరు తెన్నులు!

## పాద పీఠికలు

1 జె దుర్గా ప్రసాద్ గారి - 'చరిత్ర రచనా శాస్త్రం' ఎం ఏ చరిత్ర 1986, 92 పుట 1

2 3 జె దుర్గాప్రసాద్ చరిత్ర రచనా శాస్త్రం పు 6, పు 8

4 కల్హణుని 'కాశ్మీర రాజతరంగిణీ' - భట్టబాణుని 'శ్రీహర్షచరిత్రమ్'' మొ వి

5 దూపాటి వేంకటరమణాచార్యులది వారు ఉపాధ్యాయులుగా 1950కి ముందు కొన్నేండ్లు కరీంనగర్‌లో ఉన్నారు తర్వాత హన్మకొండలో స్థిరపడ్డారు వీరి జీవిత కాలం 1892-1975

6 రాజా రాంసింగ్ కవిగణపతి రామచంద్రరావు, గత్రెపల్లి సత్యనారాయణరాజు, బి వి రామారావు గారల వ్యాస సంకలనంగా 1981లో వెలువడింది

7 రచయిత ఈ పుస్తకంలో ఎక్కడకాని తమ జన్మతేది జన్మగ్రామం విద్య ఉద్యోగాది వివరాలు చెప్పుకోలేదు

8 కరీంనగర్‌ను ఈ రచయిత హిందూ మతాభిమానుల మార్గంలో 'కరినగర్' అనే పేర్కొన్నారు తమ విలాసంలో

9 డా తిరుమల శ్రీనివాసాచార్య గారి "నారాయణరెడ్డి సాహితీమూర్తి" 1981, పు 333

10 ఎస్ వి రామారావుగారి 'తెలుగులో సాహిత్య విమర్శ' 1974, 89 పు 3

11 సాధారణంగా 100 నుండి 1000 పుటల్లో ఉంటున్నాయి పిహెచ్ డి పుస్తకాలు

# కరీంనగర్ జిల్లా తెలుగు సాహిత్య చరిత్ర

## మూడవ భాగం

## VII. జానపద వాఙ్మయం, పత్రికలు, ప్రత్యేక అభినందన సంచికలు, ఇతరములు

### జానపద వాఙ్మయం

ఆదిమ మానవుల ఆటవిక దశలోనే భాష పుట్టింది భాష జానపదులతో పెరిగి పండితులతో వ్యాకరింపబడింది మాటతోపాటే పాట పుట్టింది ప్రపంచ మానవ జాతులు అనేకం కాబట్టి భాషలు అలాగే వేల సంఖ్యలో ఉన్నాయి ప్రతి భాషలోనూ శిష్ట సాహిత్యానికి సమాంతరంగా జానపద వాఙ్మయం కూడా వ్యాప్తిలో ఉంది అది జీవనది మనదేశంలో ఇటీవలి కాలం వరకు చదువుకున్న వారి సంఖ్య తక్కువ కాబట్టి, పండిత - శిష్ట జన సాహిత్యం కంటె పామర జానపద సాహిత్యమే ఎక్కువ ఇది శిష్ట మార్గ సాహిత్యం కంటే ఎంతో ప్రాచీనమైనది - బహుళ ప్రచారంలో కలది

జానపద సాహిత్యం గురించి కొన్ని విలువైన విషయాలు

"ప్రపంచ మందలి అతిప్రాచీన మానవ నిర్మిత సాహిత్యముగా పేరుగాంచిన వేదములలో ఛందస్సుల పేరులతో నిర్ణీత లక్షణములతో ఉపయోగింపబడిన వన్నచో అంతకుముందే ఈశాస్త్ర మభివృద్ధి పథమున నున్నదన్నమాట"[1]

"ఇతి హాసాలూ పురాణాలు మానవ జాతి బాల్య సృష్టిగా మార్క్సు పేర్కొన్నాడు భారత రామాయణ గాథలు మొదట జానపద గాథలుగానే ప్రసారమయ్యాయి "[2]

'కవిత్వానికి ఆదిమ రూపమైన 'పాట ను మన ప్రాచీనులు కవిత్వంగానూ సాహిత్యాంగానూ గుర్తించలేదు మీదు మిక్కిలి పద కవితలను హేయమైన కవిత్వంగా భావించినారు కానీ తమిళ, కన్నడ సాహిత్యకారులు పదాలను పాటలను కవిత్వంగా గుర్తించే విశాలత్వాన్ని చూపించినారు కనుక పద సాహిత్యం తమిళానికి దక్కింది మరి కొంత కన్నడానికి దక్కింది "[3]

'మార్గ సాహిత్య ప్రాబల్యమున మరుగున పడి అంతరించి పోవుచున్న మన ప్రాచీన దేశి సాహిత్యమునుద్ధరించవలసిన యావశ్యకత"[4] ఎంతైనా ఉన్నది

పాశ్చాత్య దేశాల్లో "19వ శతాబ్దంలో ప్రారంభమైన జానపద విజ్ఞాన అధ్యయనం నేడు ప్రపంచంలోని పలు ప్రాంతాల్లో అత్యంత శాస్త్రీయంగాను, ఆధునికంగాను సాగుతున్నది అమెరికా కాంగ్రెస్ గ్రంథాలయం వారు 40 వేల జానపద గేయాలను సేకరించారు "[5]

పాట, కథ, పొడుపు కథ, సామెత మొ రూపాలన్నీ జానపద వాఙ్మయంలోనివే చదువురాని గ్రామీణ జనం పాడుకునేవి, మాటల్లో వాడుకునేవి, మాత్రమే జానపద వాఙ్మయం ఆ రూపాల్లో విద్యావంతులు సృష్టించిన వాటిని కృతక జానపద సాహిత్యం అనవల్సి ఉంటుంది

తెలుగు పద్య కవిత వెయ్యేండ్ల క్రితం పుట్టింది తెలుగు భాష రెండు వేలేండ్ల నాటిది జానపద వాఙ్మయానికి ఇంచుమించు అంత వయస్సుంటుంది

కరీంనగర్ జిల్లాలో జానపద వాఙ్మయం అనేక రకాలుగా పుష్కలంగా ఉంది నిజానికి ఏ ప్రాంతంలోనైనా జానపద సాహిత్యం తక్కువగా ఉండదు సేకరించి భద్రపరచి క్రమబద్ధంగా ప్రచురిస్తే వెలుగు చూస్తుంది - వ్యాప్తి చెందుతుంది

'తెలంగాణా శ్రామిక గేయాలు' అనే అంశంపై పిహెచ్ డి పరిశోధన చేసి, జానపద సాహిత్య విజ్ఞాన రంగాల్లో విశేష కృషి చేసిన డా జి లింగారెడ్డిగారు ఈ జిల్లాలోని జానపద సాహిత్యరంగ కృషిని ఇట్లా వివరించారు [6]

"ఈ రంగంలో మొదట కృషి చేసిన వారు శ్రీ కనపర్తి శ్రీ గూడూరి వీరు సేకరించిన జానపద గేయాలన్ని 'త్రివేణి'7లో ప్రచురించారు డా సి నారాయణరెడ్డి కొన్ని జానపద గేయాలు సేకరించి ఆ బాణీల్లో కొన్ని సినిమా పాటలు రాశారు అవి బహుళ ప్రజాదరణ పొందాయి ఆ విధంగా కూడా వారు ఆ పాటల్ని ప్రచారంలోకి తెచ్చారు

ప్రజల మధ్య వున్న అమూల్యమైన ఈ సాహిత్యాన్ని శ్రీ వేంకట రామారావు శ్రీ మలయశ్రీ కొంత సేకరించారు మలయశ్రీ జానపద గేయాల బాణీలో చాలా పాటలు రాశారు 8

శ్రీ జి రాం రెడ్డి జానపద సాహిత్యాన్ని ఐచ్ఛికాంశంగా ఎంచుకుని9 జానపద గేయాల్ని సేకరించి వివిధ పత్రికలలో వ్యాసాలు ప్రచురించారు

డా గోపు లింగారెడ్డి మూడేళ్ల పాటు తెలంగాణా జిల్లాల్ని పర్యటించి వేయికి పైగా గేయాలు సేకరించారు వీరి సంపాదకత్వాన 'కరీంనగర్ జిల్లా జానపద గేయాలు సంకలనాన్ని శ్రీ త్యాగరాయ లలితకళా పరిషత్ ప్రచురించింది"

డా బి రామరాజు గారి పిహెచ్ డి పరిశోధన గ్రంథం 'జానపద వాఙ్మయ చరిత్ర 1960సు లోనూ ఈ జిల్లాపాటలు కొన్ని చోటు చేసుకున్నాయి సిరిసిల్ల వాస్తవ్యులైన కనపర్తి, గూడూరి సీతారాంలను రచయిత గ్రంథ పీఠికలో పేర్కొన్నారు

జానపద వాఙ్మయంలో వివిధ అంశాలపై విశ్వవిద్యాలయ పరిశోధనలు కావించిన ఈ జిల్లా వారు వీరు 10

1 డా గోపులింగారెడ్డి - 'తెలంగాణా శ్రామిక గేయాలు' వీరు 'కరీంనగర్ జిల్లా జానపద గేయాలు' సంకలనాన్ని ప్రచురించారు

2 డా కె సుమతి - 'జానపద కథలు' వీరే సేకరించిన 'జానపద కథా స్రమంతి లో క జి జానపద కథలు మూడున్నాయి



3 డా పి సరస్వతి - జానపద సాహిత్యంలో పిల్లల పాటలు'

4 డా బి దామోదర రావు 'తెలుగు సామెతలు సాంఘిక జీవితం'

5 డా ఎం వి రామనరసయ్య - 'తెలుగు సామెతలు - సమగ్ర పరిశీలన'

6 డా ఎన్ భాస్కర్ - 'తెలుగు సామెతలు ద్రవిడ భాషల సామెతలతో తులనాత్మక పరిశీలన'

7 -డా సంగన భట్ల నర్సయ్య - 'తెలుగులో దెశిచ్ఛందస్సులు'

8 డా జి స్వామిరెడ్డి 'కరీంనగర్ జిల్లా కథా గేయాలు

9 ఎన్ రాజేశం 'క జి జానపద గేయాల్లో సామాజిక జీవితం ఎం ఫిల్

10 డా సత్యంరాజు స్త్రీల బంధుత్వ గేయాలు ఎం ఫిల్, పిహెచ్ డి

కరీంనగర్ జిల్లా జానపద గేయ సాహిత్యం విస్తృతమైనది దేవీ దేవతలు కొలుపులు - పూనకాలు భిక్షుకగీతాలు, శ్రామిక గేయాలు, స్త్రీల పదాలు, పిల్లల పాటలు ఇక్కడ పుష్కలం

గాయక భిక్షుకులలో సాతాని జియ్యరులు, నిత్యదానర్లు, బుడిగె జంగాలు, బీరన్నలవారు, బుడుబుడుక్కలవారు, బాలసంతులు, రాజన్నలవాళ్లు, మందెచ్చులవాళ్లు, పగటి - గంటె - చిందు బాగోతులు, పంబలీలు - బైన్లవాళ్లు, బహురూపులు ఎన్నో జాతులవాళ్ళున్నారు వీరు తమ విచిత్ర వేషధారణలతో ప్రత్యేక వాద్య పరికరాలతో రకరకాల జానపద గీతాలు పాడుతూ గ్రామీణులకు కాలక్షేపం కావిస్తూ అదే వృత్తిగా జీవిస్తున్నారు

పంబలీలు 'క్రీడాభిరామం'లో పేర్కొనబడిన బవనీలు కాని ఆనాటి అక్కలు నేడు లేరు

శివసత్తులనే పేరుతో స్త్రీలు పురుషులు ఉండేవారు జోగినులు అట్లాంటివారే వీరు జానపదులు శైవులు దేవదాసీలు నాగరిక సమాజ సృష్టి - వీరు వైష్ణవ సంప్రదాయం నుండి వచ్చినా శివాలయాలలోనూ ఆశ్రయం పొందారు భిక్షుక గేయాలు దేవతల - దాతల నుతులు మరికొన్ని జానపద, చారిత్రక గేయ గాథలు

పురుషులు పాడుకునేవి శ్రామిక గేయాలు ఇవి లయ ప్రధానంగా, సాధారణంగా శృంగార - వీర రసాలతో ఉంటున్నవి

బాల గేయాలు చిన్నవి ఇవి ఆటల పాటలు వీటిలో హాస్యం పాలు ఎక్కువ ఇక్కడి స్త్రీల పాటలు లెక్కకు చిక్కవు పెండ్లి పాటలు, వ్రతాల గేయాలు, మంగళహారతులు మొ॥వి నాగరిక స్త్రీల వ్యాప్తిలోనివి పల్లె పడతులు పాడుకునేవి జానపద గీతాలు వడ్ల దంపుడు, పిండి విసురుడు, వరినాటు పైరుకోత గడ్డిమోత మొ॥ అన్ని పనుల్లోనూ గ్రామీణ స్త్రీలు తమ కోకిల కంఠాలెత్తి సామూహికంగా పాటలు పాడుతుంటారు అవి పాడే వారికి అలసట పోగొడుతూ వినే వారికి ఆనందాన్ని కలిగిస్తాయి జోల - లాలి పాటలు గ్రామీణ - నాగరిక స్త్రీలలోనూ వ్యాప్తిలో ఉన్నాయి (రేడియో - టేపురికార్డర్ ఖ్యాతివల్ల ఆధునిక స్త్రీల విద్యా వ్యాప్తి నవనాగరికత - నాజూకు తనాల వల్లనూ పాడే ఆసక్తి తగ్గి ఇవి క్రమంగాఅంతరించిపోతున్నవి )

ముఖ్యంగా తెలంగాణా కరీంనగర్ ప్రాంతంలో బతుకమ్మపండుగ సాయంత్రాలు కాముని పున్నమి రాత్రిళ్లు ఎన్నెన్ని పాటలో! ఇవి పని పాటలు కావు వినోద గీతులు ఇవి స్త్రీలవి, పురుషులవి బాలబాలికలవి వేర్వేరుగా ఉన్నాయి వాటికి ఎన్నెన్నో వంతపదాలున్నాయి!

ఉయ్యాలా, కోల్, వరలో, తుమ్మెద, కోయిలా, చెలియా చందమామ మొదలైన రకరకాలవి వాటి వంత పదాలు వీటి అవసరం పాటకు అంత్యప్రాసతో శోభను కూర్చడం, అయినా వీటి పుట్టుకను గూర్చి ఆలోచిస్తే అవి సార్థకాలు - ఎలాగంటే,

కథ చెప్పినా, పాట పాడినా ఒకరు 'ఊ' కొట్టేవారు అవసరం కదా లేకుంటే ఆ కథ కానీ పాట కానీ రంజుగా సాగదు - నిద్రపోతుంది అందుకే ఈ జానపద స్త్రీలు పాడే పాటల్లో,

" ఒక్కో మాసం నెలతన గర్భిని ఏమి కోరినాదీ - చెలియా!"

ఇది 'చెలి -సఖి - నెచ్చెలి కత్తెను' సంబోధించి చెప్పడం

ఎవరూ తోడు లేనప్పుడు పల్లె పడుచులు ఒంటరిగా పాడుకునే సమయాల్లో -

'నీలాల ఓ మేఘమాలా?' అనే 'మల్లీశ్వరి'లోని పాట వలె, 'చందమామయ్యా' అనే జానపదగీతం వలె, అందుబాటులో ఉన్న పశుపక్షుల, ప్రకృతి పరిసరాల - వస్తువుల సంబోధించుకోవడం పరిపాటి అనుకోవాలి అలాంటివే ఉయ్యాల, కోల్, తుమ్మెద పదాలు ఉయ్యాల తాను ఊగేది, కోల్ కోల తన చేతిలోనిది, తుమ్మెద, చిలుకలు, కోకిల, చందమామ, వెన్నెల రాచగుమ్మడి ప్రకృతిలోని మిత్రులు వరలో అంటే 'వరలు' ఒప్పు అని భావం బుర్ర కథల్లోని నాయనా, సై, భళాభలి, మేల్ ఊత పదాలు, అవి లయ - ఉత్సాహ ప్రదాయకాలు మాత్రమే కాక సందర్భాన్ని పట్టి అర్థవంతాలు

తందానా - మాత్రం - 'తనకు తాను 'తనుదాను' తందాన అని అద్వైత భావజన్యం

'తందానా తందానె తందనా తానే తందనానా' అని మన తెలుగు వారంటే, తందానా తానె నారాయణా - అని కన్నడిగుల బుడిగె కథల్లో పాడటం ఉంది ఓ రాచ గుమ్మడీ అనేది ప్రకృతి పరం గుమ్మడితీగె పువ్వు లేదా పండును సంబోధించడం

చింతలు పూసే చింతలు కాచే ఓ రాచ గుమ్మడీ

చింతలు దూసే వారెవరమ్మా ఓ రాచ గుమ్మడీ!

ఇట్లా గ్రామీణులు పాడుకుంటారు అయినా రాచగుమ్మడి రూపాంతరం చెంది గామ్యజనంలో 'లచ్చగుమ్మడి' అనీ అయింది 'గోగులు పూసే గోగులు కాసే ఓ లచ్చగుమ్మడీ అని డా సి నా రె గారి ఓ పాట 'ముత్యాల ముగ్గు' సినిమాలో ఉంది కదా! ఇలా రూపాంతరం చెందిన మరో వంత పదం 'చెమ్మకేలీలవో' అది అంబాడీ స్త్రీల హోళీ పాటలోనిది దాని మూల రూపం ఇది శ్యామ ఖేలేరే హోళీ" ఇంకా - డిల్లమ్మ డిల్లి తానె తందన గోగుపువ్వు - ఈ మధ్య రేడియో పాటగా గురిగింజగుమ్మడి' ఎన్నికల పాటగా గజ్జెలబోనాలే(రే) ' వంటివి వ్యాప్తిలో ఉన్నాయి వీటిలో కొన్ని కేవలం ఊతపదాలు, అంటే నాన్సెన్స్ రైమ్సు అర్థ రహితాలు - అవి కేవలం ధ్వని లయ శోభితాలు సహాయకాలు

జానపద గేయాలు సాధారణంగా సరళమైన పదాలతో లయ ప్రధానంగా పాడడానికి సరిపడి ఉంటాయి ప్రాసలు తప్పినా యతులు మాత్రం తప్పవు

ఉదా కుసుండు నాయిన్న వుయ్యాలో, కురిసిపీట మీద వుయ్యాలో
పండుకో నాయిన్న వుయ్యాలో, పట్టె మంచం మీద వుయ్యాలో

ఇక, రామలాలీ మేఘ శ్యామలాలీ, తామరస నయన దశరధ తనయ లాలీ - వంటివి జానపద గీతాలు కాక, పండిత కవులు వ్రాసిన మధుర కవితలు అనేది స్పష్టం!

చారిత్రక గేయాల్లో 'మంధెన గుండరాజు' జాజిరి పాట కాకతి రెండవ ప్రోలరాజు విజయ వర్ణన ఈ జిల్లాలో మొదటిది

బుడిగె జంగాలు, నిత్య దాసర్లు చెప్పే దీర్ఘకథా గేయాల్లో - బాలనాగమ్మ కథ ఎరుకల నాంచారి కథ, ముగ్గురు మరారీలు మొ॥వి ఇతర ప్రాంతాలవి సత్యవతి పాముకథ ఇక్కడి ధర్మపురితో సంబంధం కలది బల్మూరి కొండల రాయుని కథ ఇక్కడి జగిత్యాల తాలూకా కొండగట్టు ప్రాంతపుది బహుళ ప్రచారం పొందినది ఇది నైజాం కాలపు ఓ వెలమ వీరుని పోరాట గాథ దీనిలో వచ్చే చల్లూరు, మానాల, అర్వెల్లి గ్రామాలు ఇప్పటికీ ఉన్నవి కాని, ఈ కథ చారిత్రక కాలంపై పరిశోధన జరుగవలసి ఉంది

మరొకటి 'సర్వాయి పాపని కథ' దీనిపై వరంగల్లు డా కోవెల సుప్రసన్నాచార్య, డా పేర్వారం జగన్నాథం గారలు పరిశోధన చేసి మహబూబ్‌నగర్ గౌడ వీరుడుగా నిర్ధారణ కావించారు కాని, హుజురాబాద్ తాలూకా సైదాపూర్ సమీపంలోని ఆకునూరు - శ్రీరాంపూర్ పరిసరాల్లో సర్వాయిపేట గ్రామముంది అక్కడో చిన్న మట్టి కోట ఉంది మాందాపూర్ గట్ల మీద ఉత్తరం వైపు రాతికోట సర్వాయిపాపనిదిగా చెప్పబడుతున్నది ఈ కథ ఆ ప్రాంతపు జానపద కథకులు చెప్పుతారు ఈ ఇద్దరు పాపన్నలు వేరా? ఒక్కరేనా? పరిశోధన జరుగవలసి ఉంది "11

కథా గేయాలేకాక, స్త్రీల పాటలు ఈ జిల్లా ఊరూరికి కోకొల్లలు సేకరించే వారుంటే బండ్ల కెత్తవచ్చు మన మాండలిక భాషా - భావ సౌందర్యాలకు, గ్రామీణ జీవన స్థితిగతుల అవగాహనకు ఇవి సజీవ సాక్ష్యాలు ఈనాటి యాంత్రిక జీవన - సినిమా పాటల హోరులో ఈ పల్లె పాటలూ, అదృశ్యమౌతున్నవి పండుగ పాటలు కొంత వరకు జీవించి ఉన్నా, లాలిజోల పాటలు కనుమరుగవుతున్నవి యంత్రాల వ్యాప్తితో మోట, మగ్గం తగ్గి శ్రామిక గేయాలుకూడ అంతరించిపోతున్నవి ఔత్సాహికులు ఈ రంగంలో సత్వర ప్రయత్నం చేయకపోతే జానపద స్త్రీల - బాల సాహిత్యం అతి సమీపకాలంలో పూర్తిగా అంతరించిపోయే ప్రమాదం ఉంది జానపదం జనం పదం, కాపాడుకుంటే ఆనంద ప్రదం - శుభప్రదం

## కరీంనగర్ జిల్లా నుండి వెలువడిన సాహిత్య పత్రికలు

★1 చైతన్యం - సాహిత్యమాస పత్రిక కరీంనగర్ - జె బాపురెడ్డి 1953
★2 సారస్వత జ్యోతి, సా త్రైమాసిక - కరీంనగర్ బి వి రామారావు - 1954
★3 జ్యోత్స్న - సారస్వత మాసపత్రిక జగిత్యాల - ఆర్ రాధాకృష్ణ 1955
★4 జయంతి - సా మాసపత్రిక - హైదరాబాద్ - జె గౌతమరావు 1958
5 మానేర్ పక్ష పత్రిక - కరీంనగర్ - కమాల్ కరీంనగరీ - 1960-70
6 యుగసారధి - పక్షపత్రిక - కరీంనగర్ - డా ఎస్ కె 1960-70
7 విద్యుల్లత - వి సా మాసపత్రిక - కరీంనగర్ - విజయకుమార్ - 1969-70
★8 గౌతమి - సా త్రైమాసిక - కరీంనగర్ - గ సత్యనారాయణరాజు - 1969,70
★9 సత్యార్థి - సా మాసపత్రిక - కరీంనగర్ - మలయశ్రీ - 1977, 78
10 నవత - మాసపత్రిక కరీంనగర్ - చొక్కారెడ్డి - 1980
11 ప్రతిధ్వని - పక్ష - కరీంనగర్ పురాణం రామచంద్ర - 1970
12 చిత్రిక వారపత్రిక - కరీంనగర్ - పురాణం రామచంద్ర 1980
13 రచ్చబండ వారపత్రిక - జమ్మికుంట - కె చిరంజీవి - 1970
14 దీప్తి - గుండేటి గంగాధర్ - జగిత్యాల - 73
★15 సంఘమిత్ర - బి ఎస్ రాములు, జగిత్యాల - 77
★16 వెల్లువ - తోట మహదేవ్ - సిరిసిల్ల - 82 17 చాటింపు - బి బాలగంగాధర్ 83
18 మనుగడ - పక్ష - హుస్నాబాద్ - ఏ మాణిక్యలింగం
19 ప్రతిరూపం - పక్ష - కరీంనగర్ -, 20 జనవాణి - పక్ష- వేములవాడ సత్యంరాజు
21 జీవగడ్డ - దినపత్రిక - కరీంనగర్ - విజయకుమార్
22 మంటలు - వారపత్రిక - జగిత్యాల - సిహెచ్ ప్రభాకర్‌రావు
23 కోల్‌బెల్ట్ - గోదావరిఖని, 24 బొగ్గుపొరలు గోదావరిఖని -
★25 బాలలోకం - కరీంనగర్ - బి రాజవీరు
26 సూర్యశ్రీ - మాసపత్రిక - జగిత్యాల - గాలిపెల్లి జ్యోతిప్రకాశ్
27 అధ్యాపక జ్యోతి - మాస - కరీంనగర్ - ఎస్ టి యు
28 అధ్యాపక జ్వాల - మాస - కరీంనగర్ - ఏ పి టి ఎఫ్
29 గీటురాయి - కరీంనగర్ - బండగణపతిరెడ్డి
★30 బాలమందిరం - మాస - కరీంనగర్ రఘువీర్ సింగ్
31 అభినందన వారపత్రిక - కరీంనగర్ - నర్సింగరావు
32 బాలవెన్నెల - త్రైమాసిక - కరీంనగర్- వి భూపతిరెడ్డి
33 కరీంనగర్ (మానేర్) టైమ్స్ - వారపత్రిక - కరీంనగర్ - పొన్నం ప్రభాకర్
★34 దిక్సూచి - వచన కవితా సంచిక - సిరిసిల్ల
35 అక్షర ఉజ్వల - వారపత్రిక - కరీంనగర్ - జిల్లా కలెక్టర్
36 ఈనాడు దినపత్రిక - కరీంనగర్ - రామోజీరావు

★ ఈ గుర్తు కలవి సంపూర్ణ సాహిత్య పత్రికలు విద్యుల్లత విప్లవసాహితి దిక్సూచి వచన కవితల మాత్రమే ప్రచురించింది బాలమందిరం బాల వెన్నెల పిల్లల పత్రికలు అక్షర ఉజ్వల వయోజన విద్యా ప్రచారం కోసం వెలువడుతున్నది 1994 వీటిలో చాలవరకు ఆగిపోయినవి కొన్ని చిన్న పత్రికలు ఒక్కటో అరో వెలువడినా - ఆగినా వాటిపేర్లు అంతగా వ్యాప్తిలో లేవు మిగితావి వార్తా పత్రికలు, దానితో కొన్ని అప్పుడప్పుడు సాహిత్యాన్ని ప్రచురించాయి

## ప్రత్యేక అభినందన సంచికలు

1 అభినవపోతన వానమామలై వరదా చార్యుల షష్టి పూర్తి అభినందన సంచిక 1973, కోరుట్ల - సం అందె వేంకటరాజము

2 ఎక్కలదేవి లక్ష్మణ గారి షష్టి పూర్తి అభినందన సంచిక - 1975 కోరుట్ల - సం అందె వేంకటరాజము అమృతోత్సవ సంచిక 1997

3 శ్రీకరానంద పిన్నంశెట్టి చెన్నయ్య గారి షష్టిపూర్తి మహోత్సవ సన్మాన సంచిక, 1978 కోరుట్ల - వేములవాడ

4 చొప్పకట్ల చంద్రమౌళి అభినందన సంచిక 1979, వేములవాడ సం మధుమృత్యుంజయ శర్మ

5 శ్రీదయానంద స్వాములవారి షష్ట్యబ్ది పూర్తి మహోత్సవ మహాత్ముల దివ్యోపన్యాసములు సంచిక 1982 గాగిల్లాపురం

6 బోయిన పల్లి రామారావు గారి (షష్టిపూర్తి) అభినందన సంచిక - 1983

7 శ్రీ తిరుమల రాజగంగారాము గారి షష్టిపూర్తి సన్మాన సంచిక - 1984 కోరుట్ల సం

8 అచి వేంకట నరసింహాచార్యుల (అవునూరు) వారి స్మారక సంచిక 'ఆదర్శజీవనము' 1985

9 'సుస్వర' జిల్లా సినీ, జానపద పాటల పోటీల సందర్భ ప్రత్యేక సంచిక, 1989, కోరుట్ల, సం వి జగన్మోహనరావు

10 మలయశ్రీ షష్టిపూర్తి సంచిక - 1990 ప్రచురణ – కరీంనగర్ సాహితీమిత్రులు

11 రాష్ట్రస్థాయి జానపద కళోత్సవాలు 1990 కరీంనగర్ డా జి లింగారెడ్డి, డా బి వేంకటేశ్వర్లు

12 డా వి కొండలరావు షష్టిపూర్తి అభినందన సంచిక - 1992 కరీంనగర్

13 నిర్మాత కెకె రెడ్డి మరియు యువదర్శకులు కె ఋషేందర్ రెడ్డి సినీ జీవిత మహోత్సవ సంచిక - 1994 'శాతవాహన కళాస్రవంతి కరీంనగర్

14 "బాపురెడ్డి సాహితీ భారతి" - 1996 సం ప్రొ జి వి సుబ్రహ్మణ్యం డా జె బాపురెడ్డి గారి షష్ట్యబ్దిపూర్తి అభినందన సంచిక అయిదు వందలపుటల్లో ఆంధ్రాంగ్ల భాషా వ్యాసాలు కవితలు వర్ణఛాయాచిత్రాలతో సర్వాంగ సుందరంగా వెలువడిన ఈ సంచిక డా జె బాపురెడ్డి గారి సాహితీ సర్వస్వం

15 కలువకుంట కృష్ణమాచార్యుల ష పూ సంచిక 'ఆదర్శ దర్శనం' - 1997 మెట్టుపల్లి సం డా మలయశ్రీ డా డి రామాచార్య, కె రామకృష్ణ

16 డా అందె వేంకట రాజముగారి షష్టిపూర్తి సంచిక - 1997 కోరుట్ల

ఇంకా డా సి నారాయణ రెడ్డి గారి అభినందన సంచికలు, గుంటుక నరసయ్య పంతులు గారి షష్టిపూర్తి అమృతోత్సవ (సహస్ర చంద్రదర్శన) సంచికలు ప్రధాని పి వి గారి అభినందన సంచికలు హైదరాబాద్ నుండి వెలువడినవి

ఇవి ఆయావ్యక్తుల విశిష్ట జీవితాలను కళా సాహిత్య వేదాంత రాజకీయ సాంఘిక రంగాలలో వీరు చేసిన కృషిని గూర్చి వివరించే గేయపద్య వ్యాస సంకలనాలు

## పాద పీఠికలు

1 డా సంగనభట్ల నరసయ్య గారి "తెలుగులో దేశిచ్ఛందస్సులు ' - 1991, పు 4

2 డా జయధీర్ తిరుమలరావు గారి వ్యాసం "రాష్ట్రస్థాయి జానపద కళాత్సవాలు" కరంనగర్ సంచిక - 1990 పు 29

3 కాంచనపల్లి చిన వేంకటరామారావు గారి వ్యాసం 'నల్లగొండ మండల సర్వస్వము" మూసి పబ్లికేషన్స్ - ము 1986, పు 232

4 కొరాడ రామకృష్ణయ్య దక్షిణ దేశ భాషాసారస్వతములు ' పీఠిక

5 జె నరేంద్రదేవ్ - ' విశ్వవిజ్ఞానదర్శిని" - 1994, 86, పు 325

6 కరీంనగర్ జిల్లా జానపద గేయాలు - 1979 పు 157

7 డా బి రామరాజు గారు సంపాదకులుగా త్రివేణి' జా గే సంకలనం 1960లో వెలువడింది

8 మలయశ్రీ గారి పల్లెసీమ' క జి మాండలిక భాషా గేయ కథా కావ్యం 1982లో వచ్చింది

9 ఎం ఏ , తెలుగు సాహిత్యం - ఆఫ్షనల్ సబ్జెక్ట్

10 న 4, 5 6, 10 పరిశోధకులు కించిత్ భేదంతో 'సామెతలు' అనే అంశం ఎం ఫిల్ మరియు పిహెచ్ డి పరిశోధనలు కావించారు వీరిలో మొదటి అయిదుగురి థీసిస్ పుస్తకాలు ముద్రణ పొందాయి నం 7 డా సంగనభట్ల గారి గ్రంథం కూడా వచ్చింది నం 10 డా సత్యంరాజుగారి ఎం ఫిల్ పుస్తకం ముద్రణ అయింది

11 డా నాయని కృష్ణకుమారి గారి 'తెలుగు జానపద గేయ గాథలు' 1990లో ఈ రెండు కథలు లేవు

# సాహితీ బాంధవ్యం - విలేఖరులు - ఇతరములు :

కరీంనగర్ జిల్లా కవులు రచయితలు ఆదిలాబాద్, నిజామాబాద్, మెదకు, వరంగల్ ఖమ్మం మొ॥ ఇతర జిల్లాల్లో ఉద్యోగాది కారణాల వల్ల నివసిస్తూ ఆయా ప్రాంతాల సాహితీ వికాసానికి ఎంతగానో తోడ్పడుతున్నారు మహారాష్ట్ర - బొంబాయి ప్రాంతంలోని ఈ జిల్లా ప్రవాసాంధ్ర రచయితల పుస్తకాల పరిచయం ఇంతకు ముందు ఈ పుస్తకంలో చేయబడింది హైదరాబాద్‌లో ఈ జిల్లా రచయితలు లబ్ధ ప్రతిష్టులే ఇరువది మంది వరకున్నారు పలు సినిమాలకు కథలు కూర్చిన ప్రముఖ చలన చిత్ర దర్శకులు కీ శే బి ఎస్ నారాయణ మద్రాసుగారు కరీంనగర్ సమీపంలోని కొత్తపల్లి వాస్తవ్యులు ధర్మపురి వాస్తవ్యులు రంగా గుండయ్యగారు ఆదిలాబాద్‌లో 'శైవలిని' కవితా సంకలనం వెలువరించారు ఆచార్య శ్రీశ్రీ (శ్రీమన్నారాయణ) సేనాపతి భాష్యకాచార్యులు, కవి గణపతి రామచంద్రరావుగారలు నిజామాబాద్‌లో, డా టి శ్రీరంగస్వామి డా అనుమాన్ల భూమయ్య, అడ్వొకేట్ ఎన్ బాలకిషన్ రావు గారలు వరంగల్లో సాహిత్య వ్యాప్తికి కృషి చేస్తున్నారు ఇంకా ఎక్కడెక్కడ ఎందరెందరు సాహిత్యారాధకులు ఈ జిల్లా వారున్నారో

అట్లాగే ఇతర జిల్లాల సాహిత్యకారులు కూడా ఈ జిల్లాలో ఉండి వెళ్ళారు అలాంటివారిలో ఈ శతాబ్దిలో సహస్రావధాని జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి మొదటివారు వారి శతకమొకటి 1920 30 మధ్యకాలంలో ఈ జిల్లా వెదిర వారు ముద్రించారు ప్రముఖ కవులు చరిత్ర పరిశోధకులు శేషాద్రిరమణకవులలోని దూపాటి వేంకట రమణాచార్యులు 1940-50 సుమారుగా కరీంనగర్‌లో అధ్యాపకులుగా పనిచేశారు ఈ ప్రాంతపు పురాచరిత్ర సాహిత్యాలపై నాటి యువతరానికి అభిమానాన్నీ వారు పెంచారు కవి సమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారు 1956లో కరీంనగర్ కళాశాల ప్రిన్సిపాల్‌గా పనిచేశారు వారి రెండు ఖండకావ్యాలను (భ్రష్టయోగి, కేదార గౌళ) ఈ జిల్లా రచయితలు జువ్వాడి గౌతమరావుగారు, కీ శే వెలిచాల కేశవరావు గారలు అంకితం పొందారు విశ్వనాథ వారు రచించిన వంద పుస్తకాలలో దాదాపు 30 ఇక్కడ వారున్న కాలంలోనేక రచించినట్టు వారి పుత్రులు పావనిశాస్త్రి గారు కరీంనగర్ సభలో డిసెంబరు 94లో అన్నారు

ఉదయరాజు శేషగిరిరావు గారి 'మనోరమ' కావ్యం ఈ జిల్లా మంథనివారు ముద్రించారు మేడిచర్ల అంజనేయమూర్తి గారి 'చిత్రశ్రీ' భారత కావ్యం కరీంనగర్‌లో వారు అధ్యాపకులుగా ఉన్న కాలంలోనే రచించి ప్రచురించారు ప్రముఖ రచయిత చలం' కొన్నాళ్లు కరీంనగర్‌లో ఉన్నట్లు కె వి రమణారెడ్డి గారు రచించిన చలం జీవిత చరిత్రలో ఉంది పి వి గారి విద్యాగురువు కవి గార్ల పాటి రాఘవరెడ్డి వరంగల్ గారు తమ చివరికాలం కరీంనగర్‌లోనే గడిపారు

అభినవ పోతన వానమామలై వరదాచార్యులకు 1973లో కోరుట్ల భారతీ సాహిత్య సమితి వారు ఘనసన్మానోత్సవం జరపడమేకాక వారి షష్టిపూర్తి సంచికను కూడ వెలువరించారు వరదాచార్యుల 'వైశాలినీ పరిణయము' నాటకాన్ని పెద్దపల్లి సాహితీ మిత్రులు ప్రచురించారు వరకవి చెర్విరాల భాగయ్యకవి గారి రెండు పుస్తకాలు ఇక్కడి సంగెం, చల్లూరు వదాన్యులు ముద్రించారు

మహీధర నళినీ మోహనరావు గారి 'గ్రహణాలకథ' ను కరీంనగర్‌లోని పి జి సెంటర్ వారు వి. కొండలరావు గారి ఆధ్వర్యంలో ఆవిష్కరించారు

ఈ మధ్య ఇంజనీర్ తుమ్మల చంద్రమౌళి గారి 'వర్ణశ్రీ' కావ్య ప్రచురణ కరీంనగర్‌లో జరిగింది ఇంకా ధూళిపాల శ్రీరామమూర్తి, డా కోవెల సంపత్కుమారాచార్య, నవీన్, సుధామ, శాలివాహన

మొ॥ రచయిత లెందరో ఉద్యోగాల కారణంగా ఈ జిల్లాలో ఉండి వెళ్లారు ప్రముఖ నవలా రచయిత మల్లాది వేంకటకృష్ణమూర్తి గారి దూరం నవలలో కొంతభాగం కరీంనగర్‌లో రచించినట్లు అందులో అశోకలాడ్జి పేరుంది కథా రచయిత రఘోత్తమరెడ్డి గారు గోదావరిఖనిలో ఉంటున్నారు

శ్రీశ్రీగారు ఊగరా ఊగరా అనె విప్లవగితం ఈ జిల్లా హుజూరాబాద్ పట్టణ సభలో 1975 మే 11 ఎమర్జెన్సీ విధించబడిన రాత్రి ఆశువుగా పాడి - రచించినట్లు ఈనాడు - 93 ప్రత్యేక సంచికలో ఉంది పు 72 కరుణశ్రీ, కప్పగంతుల, ఖండవల్లి బోయిభీమన్న గుంటూరి శేషేంద్ర శర్మ వంటి ప్రముఖ రచయితలు కరీంనగర్ సారస్వత జ్యోతి' సన్మానాలందారు

డా ఎన్ గోపి, దేవీ ప్రియ కె శివారెడ్డి దర్భశయనం శ్రీనివాసాచార్య యార్లగడ్డ రాఘవరావు మొ॥వారు కరీంనగర్ సాహిత్య గౌతమి వారిచే డా సినారె కవితా పురస్కారాలు అందుకున్నారు

ఇట్లా కరీంనగర్ జిల్లా ఎందరికో సాహితీ మూర్తులకు ప్రోత్సాహాన్నిచ్చింది తాను వారితో స్ఫూర్తిని పొందింది

## విలేఖరులు

వార్త యందు జగము వర్తిల్లుచున్నది అదియలెని నాడ యఖిల జగము

అంధకార మగ్నులగుదురు గావున వార్తనిర్వహింప వలయు పతికి నన్నయ భారతం

వార్త ఆవశ్యకత అంత బలమైనది పై వార్త శబ్దార్థం గూఢచార' వ్యవస్థకు సంబంధించినది అయినా - లోక వార్త ప్రాధాన్యత తక్కువది కాదు దీని విలువ 'ఏయే దెశములన్ జరించితిరి ' అని పెద్దన మనుచరిత్రలో ప్రవరుడు జడదారిని అడిగిన సన్నివేశం తెల్పుతుంది పురాణకాలంలో త్రిలోక సంచారి నారదుడు ప్రముఖ వార్తా వాహకుడు ఈనాడు పత్రికలు విలేఖరులు ఈ పాత్ర నిర్వహించడం జరుగుచున్నది

లోక విజ్ఞాన పరిచయానికి సమాజ సంస్కరణకు కళా సాహిత్య వ్యాప్తికి వార్తా పత్రికలు ప్రధానమైన పాత్ర నిర్వహిస్తున్నవి

వార్తలు ప్రచురించేవారు, సేకరించేవారు సమాజాన్ని సాహిత్యాన్ని సందర్భాన్ని బట్టి జాతీయ - అంతర్జాలీయ సమస్త విషయాల్ని సమీక్షించెవారు సంపాదకులు - విలేఖరులు

ఈ జిల్లా పత్రికలు ఈ శతాబ్ది ఉత్తరార్ధానివి విలేఖరులు కొంత ముందు తరంలోనూ ఉన్నారిక్కడ దేశ స్వాతంత్ర్యానికి ముందునుండె వార్తాపత్రికలు చదవడం సమీక్షించడం ఇక్కడి చదువుకున్న వారిలో జాతీయోద్యమ కారులలో ఆరంభమైంది నాటినేటి ఈనాటి కొందరు ప్రముఖ విలేఖరులు వీరు

జి సురమౌళి విల సాగర్, హైదరాబాద్, పురాణం రామచంద్ర - వేములవాడ, కరీంనగర్, ఎన్ విజయకుమార్ కరీంనగర్, ఈశ్వర గారి నరహరి శర్మ వెములవాడ, ఆకాశవాణి జిల్లా విలేఖరి, వారాల ఆనంద్ 'ఈనాడు సిరిసిల్ల క న, ఎన్ శ్రీనివాస్ - ఉదయం' కందుగుల, క న, గంగుల అశోక్ - మెట్టుపల్లి, సిహెచ్ ప్రభాకర్‌రావు - ఇటిక్యాల, జగిత్యాల, పిట్టలరవీందర్ - గోదావరిఖని, నిజాం వేంకటేశం - సిరిసిల్ల, కరీంనగర్, కొండెల మారుతి మంథని, గోదావరిఖని, కొండా లక్ష్మణ్, అన్నవరం దేవేందర్ - హుస్నాబాద్, రంగారావు, భీంరెడ్డి - జగిత్యాల, మాగంటి భాస్కర్, కె వి చలం - సిరిసిల్ల, మధుసూదన్ - పెద్దపల్లి, సమ్మయ్య లక్ష్మణ్ హుజూరాబాద్, కుసుమరాంబాబు - సిరిసిల్ల, కోరుట్ల, రాంగోపాల్, బి వేణు - కోరుట్ల

ఇంకా ఎందరో ఈ సద్వృత్తిలో శ్రమిస్తున్నారు - రాణిస్తున్నారు సాహిత్యాన్ని శ్వాసిస్తున్న ఒక విధంగా శాసిస్తున్న ఈ జిల్లా విలేఖరుల అందరి పేర్లు సేకరించడం - పేర్కొనటం వీలు కాలేదు

## ఇతరములు

ఇక, అనేక సాహిత్య సాంస్కృతిక సంస్థలు కరీంనగరంలో, ఈ జిల్లాలోని పలు పట్టణాలలో గ్రామాలలో పనిచేస్తున్నవి అవి చేతనైనంత ఉదారంగా సేవాభావంతో శ్రమకోర్చి వ్యయభారాలు భరించి, సాహితీ సమావేశాలు, చర్చాగోష్ఠులు, కవి సమ్మేళనాలు, కలం యోధుల కార్ఖానాలుగా వర్క్‌షాపులు నిర్వహిస్తున్నాయి కవి పండితులు ఆహ్వానిస్తూ సన్మానిస్తూ ప్రత్యేక సంచికలు వెలువరిస్తూ సాహిత్యాభిమానాన్ని చాటుకుంటున్నాయి

ముఖ్యంగా కవులు - రచయితలు సొంత డబ్బుతో లేదా దాతల సహకారంతో తమ పుస్తకాలు ముద్రించుకుంటున్నారే తప్ప, ఈ జిల్లాలో ఏ ఒక్క పుస్తక ప్రచురణ సంస్థకానీ, సాహిత్య గ్రంథాల విక్రయశాల కానీ లేకపోవడం తీరని లోటుగా ఉంది ఇంకా సాహిత్య వ్యాపార రంగంలో ఈ జిల్లా వాసులు ప్రవేశించలేదు ఈ ప్రాంతం నుండి సాహిత్య పత్రికలు ప్రచురణ కూడా ఇప్పుడులేదు

## సారాంశం

## (కరీంనగర్ జిల్లా సాహిత్య విశేషాంశాలు)

తెలుగు కందపద్యం పుట్టుక కరీంనగర్ జిల్లాలో జరిగింది వేములవాడ చాళుక్యనృపతి రెండవ అరికేసరి ఆస్థాన పంపమహాకవి సోదరుడైన జినవల్లభుని కురిక్యాల శాసనంలో (క్రీ శ 946) మూడు కందాలున్నాయి మన తెలుగు సాహిత్యంలో ఇవే మొట్టమొదటి కందపద్యాలు

కన్నడ ఆదికవి పంపన భారతం 'విక్రమార్జున విజయం' కరీంనగర్ జిల్లా లేంబుల వాటిక (వేములవాడ)లో రచింపబడింది అతడు నన్నయభట్టుకంటె వందేండ్లు పూర్వుడు పదవ శతాబ్ది సంస్కృత మహాకవి సోమదేవ ప్రభు వేములవాడ నివాసి ఈ రాజాస్థాన కవి జైనుడు

వేములవాడ భీమకవిది (12వ, శతాబ్ది) ద్రాక్షారామ సమీప గ్రామం (వేములవాడ) అనటమే సమంజసం కరీంనగర్ జిల్లాలోని వేములవాడ శాసన నామం లేములవాడ 16, 17 శతాబ్దులవరకు దీనికి వేములవాడ పేరు వ్యాప్తిలో లేదు

కాకతి ప్రతాపరుద్రుని కాలపు శరభాంకుని శరభాంక లింగశతకము' ఈ జిల్లాలోని (వేములవాడ నివాసి) మొట్టమొదటి కావ్యం - శతకం,

వేములవాడ కల్యాణి చాళుక్యుల నుండి కాకతీయ యుగాంతం 13వ, శతాబ్ది వరకు, ఈ జిల్లాలో సంస్కృత కన్నడ ఆంధ్ర గద్యపద్య శాసన సాహిత్యం తప్ప ప్రత్యేక గ్రంధరచనలు కావించినట్లు ఆధారాలు లేవు సంస్కృతాంధ్ర పండితులు కవులు మాత్రమున్నారు

ఓరుగల్లు కాపయనాయకుని సామంతుడైన రామగిరి ముప్పభూపతి ఆస్థాన కవి మడికి సింగన నాలుగు ఉద్గ్రంథాలు రచించిన మహాకవి నీతి తారావళి రచించిన వెలిగందుల కందనామాత్యుడు సింగనకు మిత్రుడు - కృతి స్వీకర్త

భాగవత కవులలో బమ్మెరపోతన శిష్యుడు వెలిగందల నారయ జన్మస్థలం కరీంనగర్ జిల్లాలోని వెలిగందుల దుర్గ పట్టణం

పోతనదిగా చెప్పబడుతూ కర్తృత్వం తేలని 'నారాయణ శతకము' ఈ వెలిగందల నారన రచన అయి ఉంటుందనే విషయం ఈ గ్రంథంలో సోపపత్తికంగా నిరూపించబడింది

పదహారవ శతాబ్దం తొలి పాదంలోని చరికొండ ధర్మన 'చిత్రభారతం' కర్త, ఖమ్మం - ఓరుగల్లు ఏలిక సీతాపతి సామంతుడైన ఎనుములపల్లి పెద్దన ధర్మపురిగారి ఆస్థాన కవి ఈ ప్రబంధకావ్యం శ్రీకృష్ణదేవరాయల అష్టదిగ్గజ మహా కవుల కంటె ముందు కాలానిది

సోమనాధకవి వేములవాడ వసుచరిత్ర వాఖ్యానం వసుచరిత్ర వ్యాఖ్యాగ్రంధాలలో మొదటిది విలువలోనూ మొదటిది

కాకుత్సం శేషాచలదాసు (శేషప్ప) ధర్మపురిగారు మూడు నరసింహశతకాలు, ధర్మపురి రామాయణ యక్షగానం రచించి అఖిలాంధ్ర వ్యాప్తిగాంచినారు ఈ కవి 17 18 శతాబ్దాలకు మధ్యకాలంవాడు

అముద్రిత మహాకావ్యకర్త కుందావజ్జల గోపాలకృష్ణకవి ఈ జిల్లా ముల్కనూరు వాస్తవ్యులు శ్రీకృష్ణ జన్మఖండము సంవరణోపాఖ్యాన ప్రబంధం ఇతని కృతులు

బహుళ జనవ్యాప్తిలో ఉన్న 'శ్రీకృష్ణశతక కర్త నరసింహదాసు స్థల కాల వంశ నిర్ణయాలు ఇంతవరకు ఏ సాహిత్యకారుడూ చేయలేదు అతడు ధర్మపురి వాస్తవ్యుడు కాకుత్సం వంశంవాడు, శేషప్ప బంధువు 19వ శతాబ్ది మధ్యకాలం వాడని, ఆ కవి అముద్రిత యక్షగాన ప్రతి 'మైరావణ చరిత్ర ఆధారంతో ఈ వ్యాసంలో నిరూపించబడింది

19 వ శతాబ్ది చివరి వరకు ఈ జిల్లాలో పద్యకావ్యాలు, శతకాలు, యక్షగానాలు, తత్త్వ కీర్తనలు మాత్రమే రచించబడ్డాయి కోస్తాంధ్రలో వలె (కందుకూరి - గురజాడ ) నూతన సాహిత్య ప్రక్రియలు ఇక్కడ రాలేదు ఈ పూర్వయుగ లభ్య అలభ్య సాహిత్య కవులు ఈ జిల్లాలో సుమారు ఏబది వరకున్నారు

## ఇరువదవ శతాబ్ది పూర్వార్ధం

1920 సుమారుగా ఈ జిల్లా కవుల పుస్తకాల ముద్రణ ఆరంభమైంది

1950 కి పూర్వం ఇక్కడ ఈ క్రింది కవుల రచయితల రచనలు అచ్చుపొంది పుస్తకాలుగా వచ్చాయి

1 వానమామలై లక్ష్మణాచార్యులు - కుందనపల్లి పెద్దపల్లి, 2 రామసింహకవి - రాఘవ పట్టణం, జగిత్యాల, 3 అనంతవరం సిద్ధప్ప - గుండారెడ్డిపల్లి, శనిగరం, 4 పరమారాధ్యుల రాజయ్యకవి - చెలుపూరు హుజూరాబాద్, 5 శతావధాని కృష్ణమాచార్యులు - కోరుట్ల, మెట్‌పల్లి,, 6 ఆనంద మాంబ - కొడిమ్యాల, జగిత్యాల, 7 ధప్పూరి సత్యనారాయణ - కోట్ల, గంగాధర , 8 వెంకట రాజన్న అవధాని - మంథని, 9 గుంటుక నరసయ్య పంతులు - గోపాలపురం, 10 పింగిళి లింబాద్రిరెడ్డి - నెమిలికొండ, గంగాధర, 11 ఎక్కలదేవి లక్ష్మణకవి - కోరుట్ల, 12 జి రాములు సిరిసిల్ల

సుమారు పదిహేనుగురి రచనలు గ్రంధాలుగా ముద్రణ పొందాయి ఇంకా కొందరి యక్షగాన వీధినాటకాలు అచ్చయినా వాటి మొదటి ముద్రణ తేదీలు లభించలేదు

1934లో సురవరం ప్రతాపరెడ్డి గారు హైదరాబాద్‌నుండి ప్రచురించిన 'గోలకొండ కవుల' సంచికలో ఈ జిల్లా కవులు నలభై ఇద్దరు ఉన్నారు పూర్వకవులు అదనం

భారత స్వాతంత్ర్యం - నైజాం విముక్తికి ముందు ఇక్కడ వెలువడినదంతా సంప్రదాయ సాహిత్యమే మార్గ - దేశి రెండు రూపాల్లో ఆకాలంలో ఇక్కడి సాహిత్యం వచ్చింది కాని, దానిపై జాతీయోద్యమ ప్రభావం మాత్రం పడలేదు

ఈ అర్థ శతాబ్ది కవులు శతాధికం, 100-120 వరకున్నారు

## ఇరువదవ శతాబ్ది ఉత్తరార్ధం

పుంఖాను పుంఖంగా ఈ జిల్లాలో అనేక ప్రక్రియల్లో పూర్వ అర్వాచీన పద్యగేయ వచన పుస్తకాలు వెలువడింది ఈ 20వ శతాబ్ది మలి సగం కాలంలోనే

1990లో ఆరంభించిన ఈ గ్రంధరచన క్రీ శ 950 - 1995 కాలపరిమితి విధించుకున్నా (1995లో డాక్టర్ డిగ్రీ పొందినా) అచ్చుకాలంలో 1997 వరకు వెలువడిన రచనలను ఇందులో చేర్చాను

ఈ జిల్లావారు 40 మంది వరకు తెలుగు సాహిత్యంలో పిహెచ్ డి పట్టాలు పొందారు స్త్రీలు కేవలం అయిదుగురు

అత్యున్నత స్థానంలో ఉండి రచయితగా ప్రశస్తిపొందిన మాన్యవ్యక్తి మనదేశ మాజీ ప్రధాని శ్రీ పి వి నరసింహరావుగారు కరీంనగర్ జిల్లా 'వంగర' గ్రామ వాస్తవ్యులు

రాష్ట్ర రాష్ట్రేతర, దేశ విదేశ బహుమతులతో పాటు ప్రతిష్ఠాత్మకమైన పద్మభూషణ్ జ్ఞానపీఠ అవార్డుల గ్రహీత డా సి నారాయణరెడ్డి గారిది ఈ జిల్లా సిరిసిల్లా తాలూకాలోని హనుమాజీపేట, 50 పుస్తకాలతో రాశికి జిల్లాలో రెండవస్థానంలో ఉన్నా వాసికి వీరిది రాష్ట్రంలోనే ప్రథమ స్థానం

పద్య గద్య గేయ నవల నాటక బాలసాహిత్యాది పలు ప్రక్రియల్లో 60కి పైగా తమ పుస్తకాలను ముద్రణలో చూసిన డా మలయశ్రీ అధిక సంఖ్యలో పుస్తకాలు వెలువరించి ఈ జిల్లాలో ప్రథమ స్థానంలో ఉన్నారు

ఓ 20 పుస్తకాలు ముద్రణ పొందిన వారు - శతావధాని కృష్ణమాచార్యులు డా జె బాపురెడ్డి, డా వి కొండలరావు, చిట్యాల బాలదాసకవి

కేంద్ర సాహిత్య బహుమతులు పొందిన వారు -

శ్రీ పి వి , డా సి నా రె డా జె బాపురెడ్డి , శ్రీ జి సురమౌళి, శ్రీముద్దసాని రాంరెడ్డి ప్రభృతులు

రాష్ట్రస్థాయి సాహిత్య బహుమానాలు (రెండుకు మించి) పొందినవారు -

డా సి నారాయణరెడ్డి, డా మలయశ్రీ, వడ్డేపల్లి కృష్ణ, డా కాలువ మల్లయ్య డా రావికంటి వసునందన్ , బి ఎస్ రాములు మొ॥వారు

నవలా రంగంలో - తాడిగిరి పోతరాజు దశరథ్, మలయశ్రీ డా కాలువ మల్లయ్య గారలు బహుమతి గ్రహీతలు

పది నవలలు వ్రాసినది ఒక్క మలయశ్రీ గారు మాత్రమే నాలుగైదు నవలలతో విరసం సభ్యుడిగా పేరు వ్యాప్తి పొందిన రచయిత అల్లం రాజయ్యగారు రెండు మూడు నవలలే రచించి అత్యున్నత ఖ్యాతిని డా కాలువ మల్లయ్య గారు పొందగలిగారు బి ఎస్ రాములు గారిది దళిత వాదం

కథా సాహిత్యంలో - కీ శే జి సురమౌళి, తాడిగిరి పోతరాజు, బి ఎస్ రాములు, అల్లం రాజయ్య, కాలువ మల్లయ్య, ఆడెపులక్ష్మీపతి బెజ్జారపు వినోద్‌కుమార్, కె వి నరేందర్ లబ్ధ ప్రతిష్టులు

బాలసాహిత్యంలో - డా పి యశోదారెడ్డి, డా మలయశ్రీ, వడ్డేపల్లి కృష్ణ అగ్రగణ్యులు

ఆధునిక నాటక రచనలో - డా సి నారాయణరెడ్డి గారి 'రామప్ప', మలయశ్రీ గారి 'శాంతి పథము' బహుళవ్యాప్తి పొందాయి మరి ఇద్దరు ముగ్గురు నాటకాలు రచించినవారున్నారు చక్కని నాటికా రచయితలు పదిమంది వరకున్నారు వారిలో శ్రీరాముల సత్యనారాయణ, వడ్నాల కిషన్ 'విధాత' నాటిక రచయిత ముఖ్యులు

సాహిత్య విమర్శకులలో - డా సి నారాయణరెడ్డి, డా పి యశోదారెడ్డి, డా కొండలరావు వెలిచాల, డా తిరుమల శ్రీనివాసాచార్య, డా మలయశ్రీ, డా ఎం సుజాతా రెడ్డి మొ॥ వారు గణనీయులు

ముద్రిత పద్య కావ్య కవులు ఏబదికి మించి – శతక కవులు శతాధికం!

మహాకావ్యకవులు కీ శే శతావధాని కృష్ణమాచార్య కీ శే వానమామలై జగన్నాధా చార్యులు కీ శే మామిడి పల్లి సాంబశివశర్మ, గంగారాజేశ్వరరావు గారలు -

మధుర ఖండకావ్యకవులు – కీ శే సేనాపతి రామాచార్య కీ శే గజ్జెపల్లి సత్యనారాయణ కీ శే ఆఛి వేంకటాచార్యులు, నల్లాన్ చక్రవర్తుల వేదాంతాచార్యులు డా అందె వేంకటరాజము, కీ శే మహ్మదలీకవి పార్వెల్ల గోపాలకృష్ణశర్మ, డా అనుమాన్ల భూమయ్య మొ॥వారు

యక్షగాన మధుర వేదాంత తత్త్వ కీర్తనల సాహిత్యం ఈ జిల్లాలో పుష్కలంగా వచ్చింది అవధానులు ఉన్నారు అనువాద రచయితలూ ఉన్నారు

గేయ వచన కవితా కవులు ద్విశతాధికం

వీరిలో పలువురి కవితలకు పుస్తకాలకు గణనీయ బహుమతులు లభించాయి

మినీ కవితా రచనలో – కీ శే అలిశెట్టి ప్రభాకర్ తోట మహదేవ్ విప్లవ దత్ శుక్లా-

తిరుగుబాటు పాటల రచయితలు కీ శే జి మల్లేశం కీ శే సాహువెంకటేశ్వర్లు, శ్రీను పవన కుమార్‌రాజు అల్లం వీరయ్య నారాయణ కీ శే సహదేవరెడ్డి - ఇంకా అజ్ఞాత రచయితలు పీపుల్స్ వార్ దళపతి 'గణపతి గారిది కరీంనగర్

(ఈజిల్లా ఆధునిక సంస్కృత కవులలో కీ శే వానమామలై లక్ష్మణాచార్యులు కీ శే శతావధాని కృష్ణమాచార్యులు, డా కె రాజన్న శాస్త్రి, శ్రీ భాష్యం విజయ సారధి గారలు ప్రధమగణ్యులు - హిందీ రచయితలలో డా శంకరరావు వసంతరావ్ జోషి డా ఆర్ మాధవ రావు, సేనాపతి దత్తాచార్య విశిష్టులు ఉర్దూలో జాతీయస్థాయి పేరెన్నికగన్న కవులున్నారు )

సినిమాపాటల కవులు - డా సి నారాయణరెడ్డి, వడ్డేపల్లి కృష్ణ, సుద్దాల అశోక్ తేజ, భానూరి సత్యనారాయణ పేరు పొందారు

ఇలా కరీంనగర్ జిల్లా వెయ్యేండ్ల కాలపు 5 6 వందల కవుల - రచయితల వెల పుస్తకాల సాహిత్య పరిచయం సంగ్రహ సమీక్ష ఈ గ్రంధంలో కావించబడింది

## ఉపసంహారం

కొన్ని వేలేండ్ల మానవ నాగరికతా క్రమ వికసనంలో ఈ చివరి రెండు శతాబ్దాలు అత్యంత కీలకమైనవి ఇన్నేళ్ల విజ్ఞానం ఒక యెత్తు, ఈ ఇరువదవ శతాబ్ది మార్పు మరొక యెత్తు యాంత్రిక పురోగమంతో నూతన వైజ్ఞానిక విషయాల ఆవిష్కరణలతో మానవ జీవన సరణిలో అనూహ్యమైన పరివర్తన కలుగుతున్నది మనిషి జీవన ఆలోచనా వైఖరిలో అపారమైన మార్పు చోటు చేసుకుంటున్నది

వర్తమాన సమాజ ప్రభావం సాహిత్యంపై పడటం అనివార్యం జాతి, మత సంస్కృతి అతి మిత సామ్యవాద ప్రజాస్వామ్య మానవతా వాదాలు సమాజంలో వలెనే సాహిత్యంలోనూ కనిపిస్తున్నవి సంప్రదాయ యధాతథ వాదాలు ఒకవైపు దళితజన - స్త్రీ విముక్తి సమతావాదాలు మరో వైపు విజృంభిస్తున్నవి

దేశాలు వేరైనా ఈనాడు విద్యా వాణిజ్య క్రీడా ఉద్యోగ రాజకీయాది కారణాల వల్ల జనం చేరువౌతున్నారు, పరస్పరం భావాలు మార్చుకుంటున్నారు అయినా స్వార్థం సంకుచిత భావాలు సమసిపోలేదు సౌభ్రాత్రత చేరుకోలేదు అందుకే అనేక దేశాల్లో కారణాలేవైనా యుద్ధాలు జరుగుతూనే ఉన్నాయి దారిద్ర్యం పెరుగుతూనే ఉంది ఆకలి కేకలు - ఆరాటాలు పోరాటాలు, ఉన్నత విద్యలు నిరుద్యోగాలు దురుద్యోగాలు అనిశ్చిత పరిస్థితులు అసంతృప్త జీవితాలు నవ యువతరాన్ని సంక్షుభితపరుస్తున్నవి, వృద్ధ తరాన్ని స్తబ్ధుల చేస్తున్నవి భారత దేశం వీటికి అతీతం కాదు ఆ మాటకు వస్తే మన రాష్ట్రం - ఈ కరీంనగర్ జిల్లా ఆ బాటలోనే కొట్టుమిట్టాడుతూ ఉంది సమాజానికి ప్రతిబింబం సాహిత్యం కదా!

గతంలో మిత విద్య, నూనె దీపాలు తాళపత్రాలు, ఇనుపగంటం వ్రాతలు పురాతన కాలపు కవుల గౌరవించి, వారి కావ్యాలను పూరిగుడిసెల మన పూర్వులు కాపాడుకోగలిగారు ప్రస్తుతం ఉన్నత విద్యలు విద్యుద్దీపాలు, సన్నని నున్నని కాగితాలు, చక్కని కలాలు, అచ్చు యంత్రాలు, పుంఖాను పుంఖంగా అందమైన పుస్తకాలు వస్తున్నా, ఈ సిమెంట్ మేడల నవ నాగరికులకు సాహిత్యంపై శ్రద్ధ చూపే కోరిక - తీరిక ఉంటూలేదు పాతతరం వారు మైకుల్లో నీతులు బోధిస్తూనే ఉన్నా, అవి ఆధునికులు వింటూనే ఉన్నా ఏ మైకంలోనో వాటిని గాలికి వదిలి వేస్తున్నారు టైర్డ్‌విత్ ఆల్‌దీజ్ అన్నట్లుగా ఉంది, సాహిత్య సమాజ స్థితిగతి, సాహిత్య వికాసం ఈ జిల్లాలో పత్రికల ఉద్యోగులు తప్ప రచనను జీవనోపాధిగా స్వీకరించిన వ్యక్తి ఒక్కరు కూడా లేరు కేవలం ఇతర వృత్తుల ఔత్సాహికుల తీరికవేళల కృషి ఫలితమే ఇక్కడి ఈ సాహిత్య సృష్టి విశ్వ విద్యాలయాల డిగ్రీలు తీసుకొని భాషోపాధ్యాయురాండ్రుగా స్థిరపడినవారు కొందరు తప్ప ఏ ఒక్క మహిళ కానీ ఇక్కడ చక్కని కవయిత్రిగా - రచయిత్రిగా రూపొందలేకపోయారు

సామాజిక రాజకీయ రంగాల్లో వలె సాహిత్యరంగంలోనూ విలువలు మారి పోతున్నవి వాణిజ్య ధోరణి పెచ్చుపెరిగిపోతున్నది అధిక విద్యావంతుల ప్రయోజకులైరి, పూర్ణశుంఠలు సభా పూజ్యులైరి - అన్న శేషప్ప కవిగారి నాటి మాట ఈ నాటికీ నిజమనిపించుతున్నది

కాకి బంగారానికి తళుకెక్కువ, నాసి రకం వస్తువుకు ప్రచారం ఎక్కువ అనట్లు సత్తాకంటె చాకచక్యంతో పైకెగబాకే రచయితలు పెరిగిపోతున్నారు వ్యాపార దృష్టి ప్రబలమై పుస్తక ప్రచురణ సంస్థలు, ప్రసార సాధనాలు స్వార్థ ప్రయోజనం ఆశ్రితపక్షపాతంతో వ్యవహరిస్తున్నవి సాహిత్యమే కాక సాహిత్య సమీక్ష - విమర్శ కూడా సంకుచిత మురా తత్త్వంలో పడి పోతున్నది సాహిత్యం భవిష్యత్తు 'కాళరాత్రి - అంధయాత్ర' అన్నట్లుగా మారుతున్నది

ఒకనాటి నిశిద్ధ సాహిత్యమైన అతివేల శృంగారం, అపరాధ పరిశోధన హింస ప్రచుర ప్రచారంలో ఉన్నవి అతీంద్రియ శక్తులు అద్భుత గాధలు ఆదరించబడుతున్నవి సైన్సు ఫిక్షన్‌ల పేర అబద్ధాలు సైతం చలామణి అవుతున్నవి సాహిత్యానికి డబ్బు ఉబ్బు జబ్బుగా పట్టుకున్నవి సినిమాలు పత్రికలు వీటికి చాల వరకు కారణం అనక తప్పదు పద్యాలు, జాతి - నీతి గీతాలు కాక అంతాక్షరి, సరిగమలు, పాడుతా తీయగా, నవరాగం (సంగీతానికే కాక సినీ సాహిత్యానికి) పేర్లతో సినిమా పాటలు టి వి క్విజ్ కార్యక్రమాలపై నవతరానికి పెరుగుతున్న ఆసక్తి అందుకో ప్రబల నిదర్శనం విద్యార్థులకు గ్రంథాలయాలకంటె క్రికెట్ క్రీడలపట్ల టివి సినిమాల పట్ల మోజు పెరిగింది సాహిత్య పుస్తకాలకంటె పరీక్షల గైడులకు విలువ పెరిగింది జి కె పుస్తకాలు చదివేది విజ్ఞానం కోసం కాదు - ఎంట్రెన్స్ పరీక్షల కోసం

ఈ సాహిత్య గమనం ఎటు వైపు? ఇటువంటి పరిస్థితులలోనే 'గతకాలము మేలు వచ్చుకాలము కంటెన్ అనిపించేది 'ఏ గతి రచియించిరేని సరికాలపు వారలు మెచ్చరే కదా' అనే కాలం తిరిగి సంప్రాప్తించింది ఈ శతాబ్ది పూర్వార్ధంలోని కవుల స్వేచ్ఛ హరించుకు పోతున్నది సినీగీతాల కవులే మహాకవులు - పత్రికా విలేఖరులే మహా రచయితలు!

పత్రికల ప్రచురణ కర్తల నిబంధనలకు లోబడి రచయితలు వ్రాయవలసి వస్తున్నది పాటకు మ్యూజిక్ కూర్చడం పోయి, ట్యూన్ ఇస్తే దానికి సరిపడే పదాలు జతపరచి పాటలు తయారుచేసే వింతకాలం వచ్చింది సినిమా పోస్టర్లలోనూ సంగీత దర్శకుని పేరు కనిపిస్తుందే తప్ప సాహిత్య రచయిత పేరు ఉంటూలేదు అది వర్తమాన సాహిత్య దుస్థితి, కవియై పుట్టుటకన్న అనే దుర్గతి!

అయినా నిరాశపడే పనిలేదు కాలోచితం కర్మకరోతి విద్వాన్ 'కదిలేదీ కదిలించేదీ వెను నిద్దుర వదిలించేదీ మును ముందుకు నడిపించేది' అయిన సాహిత్యాన్ని ఉదాత్తాశయం కల కవులు, జాతి

ప్రయోజన దృష్ట్యా కొందరైనా అందించక మానరు అటువంటి సార్థరహిత జాతి హిత కాంక్షులైన సాహిత్యమూర్తులు మన దేశంలో, రాష్ట్రంలో వలెనే ఈ జిల్లాలోనూ ఉన్నారు

ఈ గ్రంధంలో ఈ జిల్లా వారిని 5 6 వందల కవుల సాహిత్యాన్ని పరిచయం చేశాను అందులో మహా రచయితలు పలువురు ఉన్నా నన్ను అమితంగా ఆకర్షించిన వారు నలుగురైదుగురు వీరు

1 ఎనభైయేండ్లు దాటిన వయస్సులోనూ కీర్తిశేషులయ్యేంత వరకు అచంచల భక్తి భావంతో పద్యకృతులు రచించిన ఎరబాటి ఉమాపతి రావు పెద్దపల్లి గారు

2 పెన్షన్ డబ్బుతో తమ రచనలు ప్రచురిస్తూ - రచిస్తూ సత్కాలక్షేపం చేస్తున్న వయోజ్ఞానవృద్ధులు గంగా రాజేశ్వరరావు మంథని గారు

3 జి రాములు సిరిసిల్ల, డా సి నా రె బాల్య గురువు నవలా రచయిత పద్యగేయకవి

4 వై ఎస్ రమేశ్ - హుజూరాబాద్ సైకిల్ టాక్సీలో ఉద్యోగి కూలిగా ఉంటూ దళిత జాత్యభిమానంతో శ్రామిక జనపక్షంగా ప్రతిభావంతమైన కవితలు రాస్తున్న యువకుడు

5 కళాధర్ బాబు వైద్య - జగిత్యాల వికలాంగుడైనా తనవంటి మరో దీనురాలిని పెళ్ళాడి ఓ పుత్రునికి తండ్రి అయి కొవ్వొత్తుల కుటీర పరిశ్రమ నడుపుతూ జీవిస్తూ తెలుగు సాహిత్యాభిమానంతో నైతిక బాధ్యతతో వచన కవితలు రచిస్తున్న ఆదర్శ వ్యక్తి

6 విక్రమాదిత్య - చంజర్ల గృహ వాతావరణంతో కాబోలు అనుకోకుండా అకస్మాత్తుగా హేతువాద వ్యాసరచనతో నన్నాశ్చర్యపరచిన పదేండ్ల బాలరచయిత నా పౌత్రుడు

ఇంత వరకు పూర్వ అధ్యాయాల్లో కరీంనగర్ జిల్లా వేయ్యేండ్ల సాహిత్యాన్ని వీలైనంత విపులంగా వివరించడం జరిగింది - మిత హిత సాహిత్య సమాలోకనం సైతం కావించబడింది ఇక్కడి ప్రతి రచయితను ఇందులో చేర్చే ప్రయత్నం చేయడంతోపాటు సూక్ష్మంలోనే మోక్షంగా విహంగావలోకనంగానైన వారి సాహిత్యాన్ని సమీక్షించడం జరిగింది అనుద్దేశ్య పూర్వకంగా ఏవైనా దొసగులు దొరలితే క్షంతవ్యాలు

'రాజు మరణించె ఒక చుక్కరాలిపోయె, కవియు మరణించె ఒక చుక్క గగనమెక్కె
రాజు జీవించె రాతి విగ్రహములందు, సుకవి జీవించె ప్రజల నాలుకల యందు' - జాషువా

నా నృషి కురుతే కావ్యం విశ్వశ్రేయ కావ్యం - కవి క్రాంత దర్శి - ఆశాజీవి కవి అంటే బ్రహ్మ - అపర సృష్టికర్త ! సమాజ శాసకులు నీతి ప్రబోధకులు నిస్వార్థ సేవా పరాయణులు సత్కవులు ఆ బాటలో కరీంనగర్ జిల్లా సాహిత్యం ఎంతో కొంత సాధ్యమైనంతగా ఈ జిల్లా - రాష్ట్ర దేశ విశ్వహితాకాంక్షతో వెలువడింది వెలువడుతున్నది వెలువడనున్నది అని నిస్సందేహంగా చెప్పవచ్చు

చిత్తశుద్ధి చేత చేసిన పుణ్యంబు - కొంచెమైన నదియు కొదువకాదు
విత్తనంబు మఱ్ఱి వృక్షంబునకునెంత? - విశ్వదాభిరామ వినుర వేమ

వాయింపరా తెల్గు వజ్రాల వీణ - మ్రోయింపరా తెల్గు ముత్యాల వీణ
మొరయింపరా తెల్గు వరహాల వీణ - పలికింపరా తెల్గు బంగారు వీణ
మీటరా నీ తెల్గు మెఱుగు తంతువులు - నాటరా హృదయాల నవ్యాంకురములు
మ్రోళ్లు చిగిర్చగా రాళ్లు చెమర్చ - నీళ్లు పుష్పించగా నింగి ఫలించ - మా సా శి శర్మ

ఆకులందున అణగి మణిగి కవిత కోకిల పలుక వలెనోయ్,
పలుకులను విని దేశమం దభిమానముల్ మొలకెత్తవలెనోయ్ - గురజాడ

**నాట్యం నా నడక, కవిత్వం నా చిరునామా, పాట నా ప్రాణం, పోరాటం నా ఊపిరి - అనే నినాదాలు, విధానాలు కల కరీంనగర్ మండలం కళలకు కాణాచి, సాహిత్యానికి సవ్యసాచి!**

## ఉపయుక్త గ్రంథ సూచిక

1 Inscriptions of A P Karim Nagar Dist
2 Temples of South Inida - Dr J V Ramanaiah
3 The write primeMinister P V N Rao - Adiraju Venkateshwar Rao

## సంస్కృతం - ఇతరములు

1 నాట్యశాస్త్రమ్ - భరతముని, 2 మేఘ దూతమ్ కాళిదాసు, 3 సంస్కృత సాహిత్యేతిహాస - ఆచార్య రామచంద్ర మిశ్ర 4 శ్రీమద్భాగవతమ్ - వ్యాసవిరచితమ్ 5 కన్నడ సాహిత్య చరితె 6 తిరు ఆండాళ్ పాశురంగళ్

## తెలుగు పుస్తకాలు

1 అప్పకవీయము కాకునూరి అప్పకవి,
2 ఆంధ్రకవి తరంగిణి 1, 3, 4 సం చాగంటి శేషయ్య
3 ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ ప్రచురణ
4 ఆంధ్ర యక్షగాన చరిత్ర డా ఎస్ వి జోగారావు
5 ఆంధ్ర వచన వాఙ్మయం - నిడుదవోలు వేంకటరావు,
6 ఆంధ్ర వాఙ్మయ చరిత్ర - డా దివాకర్ల వేంకటావధాని,
7 ఆంధ్ర సాహిత్య చరిత్ర - పింగళి (కాటూరి),
8 ఆధునికాంధ్ర కవిత్వం సంప్రదాయం, ప్రయోగం - డా సి నారాయణరెడ్డి
9 ఓరుగంటి చరిత్రము - తేరాల సత్యనారాయణ శర్మ,
10 కరీంనగర్ జిల్లా కవుల పరిచయ సంచిక - బి వి రామారావు,
11 కరీంనగర్ జిల్లా రచయితల చరిత్ర - మలయశ్రీ
12 కరీంనగర్ మండల చరిత్ర - 1981
13 కవి జనాశ్రయం మల్లియరేచన,
14 కాకతీయుల చరిత్ర - పి వి పరబ్రహ్మశాస్త్రి,
15 కాకతీయుల శాసనములు,
16 కాళహస్తీశ్వర శతకము ధూర్జటి,
17 కాళేశ్వర క్షేత్ర మహత్మ్యం - దేవస్థానం,
18 కాశీఖండము - శ్రీనాధుడు
19 గోలకొండ కవుల సంచిక - సురవరం ప్రతాపరెడ్డి,
20 చాటు పద్యమణి మంజరి - వేటూరి ప్రభాకరశాస్త్రి,
21 జాతి రత్నం - శారదా అశోక వర్ధన్,
22 జానపద కథా స్రవంతి - డా కె సుమతి,

